మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

## మొదటి సంపుటము

(ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ స్కంధములు)

బహు పాఠాంతర పరిష్కార విపుల పీఠికా సహితము

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

"కళాభవన్", సైఫాబాద్,

హైదరాబాదు-500 004

1983

# సమర్పణ

బమ్మెర పోతరాజకృత భాగవతము ప్రామాణిక ప్రతిని సిద్ధముచేసి ప్రకటించ వలెనని ౧౯౭౦ సంవత్సరము జూన్ నెలలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి నిర్ణయించి యందు కొఱకు శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారి అధ్యక్షతను డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, డాక్టర్ రామరాజు గార్లతో కూడిన ఒక సంపాదక సంఘమును ఏర్పాటుచేసి యుండెను. కొంత కృషి జరిగిన తరువాత పాఠాంతరాల నిర్ణయ సందర్భమున ఈ సంపాదక సంఘము శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారిని, శ్రీ తాపీ ధర్మారావు గారిని తమతో చేర్చుకొని వ్రాతప్రతిని సిద్ధము చేసినది. రెండు సంవత్సరాల కృషి ఫలితముగా సిద్ధమైన వ్రాతప్రతిని ముద్రించి ఆంధ్ర మహాజనులకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సమర్పించుచున్నది.

ఈ ప్రామాణిక ప్రతిని సిద్ధము చేయు కృషిలో ఇరువది యైదు మందికి పైగా విద్వాంసులు పాల్గొనినారు. అనుబంధములో ఆ విద్వాంసుల పట్టిక చేర్చబడినది. వీరందఱికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి కృతజ్ఞతలు సమర్పించుచున్నది. భాగవతము ఆంధ్ర మహా జనులకు అత్యంతాభిమానాస్పదమైన ఉద్గ్రంథము. దేశములోని వివిధ ప్రాంతాలలో భాగవతపు తాళపత్ర గ్రంథాలు అనేకము లభించుచున్నవి. రాజమహేంద్రవరములోని ఆంధ్ర దేశీయైతిహాసిక పరిశోధక మండలి, కాకినాడలోని ఆంధ్ర సాహిత్య పరిషత్తు, తంజావూరులోని సరస్వతీ మహల్ గ్రంథాలయము, హైద్రాబాదు నగరమందలి ఆంధ్ర సారస్వత పరిషత్తు, లక్ష్మణరాయ పరిశోధక మండలి, పెక్కు తాళపత్ర గ్రంథాలను సేకరించి భద్రపఱిచినవి. సంపాదక సంఘ మీ సంస్థల లోని గ్రంథాలతోపాటు మధుర సౌరాష్ట్ర సభలో స్వయముగా త్యాగరాజు గారు వ్రాసి పెట్టుకొని నారని ప్రఖ్యాతి గాంచిన ప్రతిని, మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారములో బ్రౌన్ దొరగారు వ్రాయించిన కాగితపు వ్రాతప్రతులను గూడ పరిశీలించినది. ఈ పరిశీలనలో సంపాదక సంఘముతో సహకరించిన విద్వాంసులు శ్రీ తిరుమల రామచంద్ర, శ్రీ కె. వెంకటాచార్యులు గార్లు. ఈ ఉభయులకు కృతజ్ఞతలు. మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారము నందలి ప్రతుల పరిశీలనలో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు స్వయముగా పాల్గొనినారు. సంపాదక సంఘపు కృషికి పూర్తిగా తోడ్పడి, తమ వద్ద నున్న తాళపత్ర గ్రంథాలను లభింప జేసిన ఆంధ్రదేశీయైతిహాసిక పరిశోధక మండలి, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, సరస్వతీ మహల్ గ్రంథాలయము, సౌరాష్ట్ర సభ, ఆంధ్ర సారస్వత పరిషత్తు, లక్ష్మణరాయ పరిశోధక మండలి, మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారము అను సంస్థలకు సాహిత్య అకాడమీ పక్షాన అనేక ధన్యవాదాలు. కాకినాడ, రాజమహేంద్ర వరములలోని ప్రతుల వివరాలను తెలిసికొనుటకు సహాయము చేసిన శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి గారికి, శ్రీ నేదునూరి గంగాధరం గారికి మా కృతజ్ఞతలు.

సంపాదక సంఘము మొత్తము రెండు నూర్ల తాళపత్ర గ్రంథాలను సంపాదించి, వానిని పరిశీలించి, అందులో ముప్పదికి పైగా ప్రతుల నెన్నుకొని, అందులో నుండి పాఠాంతరాలను సేకరించి, పాఠ నిర్ణయము గావించినది. మిక్కిలి శ్రమకోర్చి రెండు వేసవి కాలాలలో మధ్యాహ్న మంతయును కష్టపడి పనిచేసిన సంపాదక సంఘ సభ్యులైన శ్రీ రాయప్రోలు సుబ్బారావు, శ్రీ దివాకర్ల వేంకటావధాని, శ్రీ బి. రామరాజు, శ్రీ తాపీ ధర్మారావు, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గార్లకు అకాడమి పక్షాన అనేక కృతజ్ఞతాభివందనములు. ఈ గ్రంథము నింత చక్కగా ముద్రించిన శివాజీ ముద్రణాలయము వారికి ధన్యవాదాలు. మద్రాసు, తంజావూరులలోని తాళపత్ర గ్రంథాల పరిశీలన కొఱకు అనుమతి పొందుటకు సహాయపడిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖకు, అనుమతి నిచ్చిన మద్రాసు ప్రభుత్వ విద్యాశాఖకు కృతజ్ఞతలు సమర్పించుట నా కర్తవ్యమై యున్నది.

తాళపత్ర గ్రంథాలతోపాటు ఇప్పటి వఱకు అచ్చుపడియున్న భాగవత ప్రతుల నన్నింటిని సంపాదక సంఘము పరిశీలించినది. వానిలో శ్రీ పాలపర్తివారు వ్యాఖ్యానముతో ప్రకటించిన ప్రతి కూడ నున్నది. పాఠ నిర్ణయము గావించుటలో సంపాదక సంఘానికి డాక్టర్ గిడుగు సీతాపతి, శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు గార్ల సహకారము కూడ లభించినది. ఈ ఉభయులకు ననేక కృతజ్ఞతాభివందనములు.

ప్రామాణికాంధ్రభాగవత ప్రకటనకు అకాడమీ అధ్యక్షులైన డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి ప్రోత్సాహము ప్రధాన కారణము. రెండేండ్లకు పైగా, ఇరువదియైదు మంది విద్వాంసుల సహకారముతో జరిగిన యీ కృషిలో అడుగడుగున శ్రీ గోపాలరెడ్డిగారు ప్రత్యేక శ్రద్ధను తీసికొనినారు. ఈ కృషి ఫలితముగా, ఇప్పటి వఱకు ముద్రితమైన గ్రంథాలలో లేని కొన్ని వేల నూతన పాఠాంతరాలతో, విపులమైన పీఠికతో, ప్రామాణికాంధ్ర మహాభాగవతమును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఆంధ్ర మహాజనులకు సమర్పించుచున్నది.

"భాగవత పురాణ ఫలరసాస్వాదన
పదవి గనుఁడు రసిక భావవిదులు"

హైద్రాబాదు
క్రోధి : శ్రీరామ నవమి
(20-4-64)

**దేవులపల్లి రామానుజరావు**

# పీఠిక

**పురాణములు :**

వేదవాఙ్మయము వలెనే పురాణవాఙ్మయమును ప్రాచీన భారతీయ సంస్కృతికిఁ బట్టుఁ గొమ్మ యని చెప్పఁ దగినట్టిది. భారతమునకుఁ బంచమ వేదమని పేరున్నట్లే పురాణ సముదాయమునకును బంచమ వేదమను పేరున్నది. దీనినిబట్టి వేదముల సార మంతయుఁ దరువాతి కాలమునఁ బురాణరూపమునఁ బ్రపంచింపఁబడినదని యూహింప వచ్చును. కొంత కాలము క్రిందటి వఱకును బురాణములందుఁ బ్రతిపాదితమైన విషయ మంతయుఁ బుక్కిటి పురాణ మనియు, దాని కెట్టి చారిత్రక ప్రాధాన్యము నీయఁ బనిలేదనియు, నొక యభిప్రాయము ప్రబలియుండెను. కాని యిటీవలి పరిశోధనల వలన వాని విలువయుఁ బ్రాధాన్యమును బయల్పడుటచేఁ, బ్రాచీన భారతీయ చరిత్ర నిర్మాణమున కవి యపరిహార్యములైన సాధనము లని తెలియవచ్చినది. ప్రాచీన భారత దేశమందలి రాజకీయ మత సాంఘిక తత్త్వకళాఽసంస్కృతి చరిత్రల నెఱుంగుట కంతకంటెఁ బ్రశస్తతరమైన సాధనము మఱొకటి లేదని చెప్పుటలో నతిశయోక్తి లేదు. పురాణము లందలి వంశానుచరితములు చారిత్రకుల కెన్నియోవిధములఁ దోడ్పడఁజాలును. ప్రాచీన భారతదేశ చరిత్ర కారులు పురాణోక్త విషయములను బురావస్తు శాసన పరిశోధనల దృష్టితోఁ బరిశీలించి యవి చాలవఱకు సరియైనట్టివే యని యంగీకరించి యున్నారు. పూర్వ రాజవంశముల చరిత్రము సుమారు పండ్రెండు పురాణములలోఁ జెప్పఁబడియున్నది. మౌర్యవంశమును గూర్చి విష్ణు పురాణమందును, ఆదిమ గుప్తరాజులను గూర్చి వాయుపురాణమందును జెప్పఁబడిన విషయములు సర్వపరిశోధకుల యంగీకారమును బడసినవి. ఈ విధముగాఁ బరిశీలించినచోఁ బ్రాచీన భారతదేశ యథార్థ చరిత్ర నిర్మాణమునకుఁ బురాణ వాఙ్మయ మెంత యమూల్యమైన సాధనమో వేఱుగాఁ జెప్పవలసిన యవసర ముండదు.

సంస్కృతమునఁ బదునెనిమిది మహాపురాణములును బదునెనిమిది ఉపపురాణములునుగల వని సంప్రదాయమును బట్టి తెలియుచున్నది. వీనిలో మహాపురాణములకంటె నుపపురాణము లర్వాచీనములైనట్టివి. అవి వివిధమత శాఖలతోడి సంబంధమును, స్థానిక ప్రాధాన్యమును గలిగి నట్టివి. మహాపురాణములు పదునెన్మిదింటిని శివ విష్ణు దేవీ సంబంధమును బట్టి ప్రధానముగా మూఁడు తెఱఁగులుగా విభజింపవచ్చును. ఈ విభజనము కేవలము ప్రాధాన్య వ్యపదేశమును బట్టి చేయఁబడి నదే. ఏలయన నన్ని పురాణములందుఁ బై ముగ్గురు దేవతలకును సంబంధించిన వృత్తాంతములు కానవచ్చును. కాని కొన్ని పురాణములు శివునికో, విష్ణువునకో, దేవికో యధికప్రాధాన్య మొసంగుట వలన నవి యా దేవతకే సంబంధించినవను భ్రాంతి కలుగుచుండును. అది నిజముగా భ్రాంతియే. ఒక్కొక్క పురాణమునం దొక్కొక్క దేవతయే ప్రధానముగా స్తుతింపఁబడినను ఏ పురాణము గాని యన్యదేవతల నుపేక్షించుట కాని నిరసించుట కాని కనఁబడదు. ప్రతి పురాణమునందును

బురాణములు పదునెనిమిది యను విషయము చెప్పఁబడి యున్నది. దీనిని బట్టి యన్ని పురాణములు నొకే కాలమున నొకే ప్రదేశమున రచింపఁబడిన వనియు, నందుచేతనే ప్రతిపురాణము నందును పురాణములు పదునెనిమిది యని పేర్కొనుట కవకాశము గలిగెననియు భావింపరాదు. ఈ పదు నెనిమిది సంఖ్య బహుశః అవి వెలువడిన ప్రదేశముల వైవిధ్యమును బట్టి కలిగియుండవచ్చును. సాధారణముగా దేశమందలి ముఖ్య మత కేంద్రముల నుండి యవి వేఱువేఱుగా వెలువడియుండును. ముఖ్యములైన యాత్రాస్థలముల కా దినములలో బహుసంఖ్యాకులగు జను లరుగుచుండుటచే నా ప్రదేశములే పురాణముల ప్రచారమున కనువైన స్థలములుగా భావింపఁబడుచుండెను. ఆ యా పురాణములందుఁ గనిపించు నా యా యాత్రాస్థలముల వర్ణన విస్తృతిని బట్టి యా యా స్థలములం దా యా పురాణము లవతరించెనని యూహింపవచ్చును. ఉదాహరణమునకు గయామాహాత్మ్య మతి విస్తృతముగాఁ జెప్పఁబడిన పురాణము గయనుండి వెలువడి యుండుననియు, కాశీమాహాత్మ్యము విస్తృతముగాఁ జెప్పఁబడిన పురాణము కాశీనుండి వెలువడి యుండుననియు భావింపవచ్చును. ఇట్లే యితర పురాణము లవతరించిన స్థలములను గూడ నూహించుట కవకాశమున్నది.

"యస్మాత్ పురాహి అనతి ఇదం పురాణ" మ్మని వాయుపురాణమున పురాణశబ్దము నిర్వచింపఁబడియున్నది (అధ్యా. 1-203). అతి ప్రాచీనకాలము నుండియు జీవించి వచ్చుచుండు టచేఁ బురాణమున కా పేరు కలిగినదని దేని భావము. దీనినిబట్టి లిఖితరూపమును బొందుటకుఁ బూర్వ మతి ప్రాచీన కాలమునుండియుఁ బురాణశబ్దము వాడుకలో నుండెనని యూహింపవచ్చును. 'ప్రథమం సర్వశాస్త్రాణాం పురాణం బ్రహ్మణా స్మృతం, అనంతరంచ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిస్సృతాః' (1-60) అను వాయుపురాణమందలి శ్లోకము బ్రహ్మచే ప్రప్రథమమునఁ బురాణము స్మరింపఁబడె ననియుఁ, బిమ్మట నాతని ముఖములనుండి వేదములు వెలువడెననియుఁ జెప్పుచున్నది. దీనినిబట్టి మొట్టమొదట నొకే పురాణ ముండెననియు, నది వేదముల కంటెను బ్రాచీనతర మనియుఁ దెలియు చున్నది. వేదగతములైన యితిహాసములను బరిశీలించి చూడఁగా నవి యంతకుముందే ప్రచారమున నుండి వేదములు రూపొందిన సప్పుడందెడనెడ నుదాహరింపఁబడిన వని యూహించుట కవకాశము కలుగుచున్నది. దీనినిబట్టి వేదములకుఁ బూర్వమే పురాణములు రచితము లై యుండెనని చెప్పుటకు వీలులేక పోయినను అందలి కథేతిహాసములుమాత్ర మతిపురాణ కాలముననే ప్రచారమున నుండి, యప్పటినుండియు నవిచ్ఛిన్నముగా సాగివచ్చుచుండె నని చెప్పుటకు మాత్ర మభ్యంతరము లేదు.

పురాణోత్పత్తిని గూర్చి విష్ణుపురాణమున నింకొక విధముగాఁ జెప్పఁబడి యున్నది. దానినిబట్టి పురాణోత్పత్తికి బీజములు వేదము లందే కానవచ్చుచున్నవి. అందలి కథేతిహాసములును, ప్రార్థనాపూజా విధానములును బురాణరచయితలకు సర్గ ప్రతిసర్గ భాగములను గూర్చుటలో ననేక విధములఁ దోడ్పడి యుండును. ఈ భాగములకును బ్రపంచోత్పత్తికిని జాల సన్నిహితమైన సంబంధ మున్నది. ఋగ్వేదము నందలి విశ్వోత్పత్తికి సంబంధించిన ఋక్కుల ననుసరించియే యవి ప్రపంచింపఁబడి యుండును. అందుచేతనే మాక్డొనల్ ఋగ్వేదమునందలి విశ్వోత్పత్తికి సంబంధించిన ఋక్కులు భారతీయ తత్త్వశాస్త్రమునకే కాక పురాణములకును బీజము లయ్యెనని చెప్పి యున్నాఁడు (Hist. of Indian Literature. పుట 138.). వేదములందలి ఋక్కులే

కాని బ్రాహ్మణము లందలి కథేతిహాసములను బురాణముల వంటి విస్తారమైన వస్తువును సమకూర్చి యున్నవి. ఇవియే పురాణము లందలి వివిధములును విస్తృతములు నైన యంశములకు బీజము లయ్యె నని వీరు పండితులు నుడివియున్నారు. ఈ విధముగా నుపనిషద్యుగము నాటికి పురాణము లను పేరుగల ప్రత్యేక వాఙ్మయభాగము రూపొందియుండెనని చెప్పవచ్చును.

విష్ణుపురాణమందుఁ గల పురాణోత్పత్తికి సంబంధించిన శ్లోకములను బట్టి వ్యాసుఁడు పురాణ సంహితను గూర్చి తన శిష్యుఁడైన రోమహర్షణునికి బోధించె ననియు, రోమహర్షణుఁడు దానిని అగ్నివర్చుఁడు, మైత్రేయుఁడు, శాంశపాయనుఁడు, కాశ్యపుఁడు, సావర్ణి, అకృతవ్రణుఁడు మున్నగు తన శిష్యుల కుపదేశించె ననియు, రాజులు యజ్ఞము లొనరించు సమయమున వారు దానిని సభాసదులకు వినిపించుచుండిరనియు, నీ విధముగా వారే ప్రాచీన భారతీయ చరిత్ర నిర్మాతలని చెప్పఁదగిన వారనియుఁ దెలియుచున్నది. ఈ విషయమే కొలఁది మార్పుతో నగ్నిపురాణమునఁ గూడఁ దెల్పఁబడి యున్నది. ఇందు వ్యాసుఁడే పురాణ సంహితను దన శిష్యులార్గురి కుపదేశించినట్లు చెప్పఁబడినది. వీరిలో నలువురి పేర్లును విష్ణుపురాణమునఁ జెప్పఁబడిన రోమహర్షణుని శిష్యులలో నలువురి పేర్లును సమానములుగా నున్నవి. అట్లే బ్రహ్మాండ వాయు పురాణములలోఁ బేర్కొనఁబడిన రోమహర్షణుని శిష్యుల నామములు స్వల్ప భేదములతో సమానములుగనే యున్నవి. వీరిలో కాశ్యప సావర్ణి శాంశపాయనులు స్వతంత్రముగా పురాణ సంహితలను రచించి యుండి రనియు, రోమహర్షణునితోఁ గలిసి పూర్వసంహిత యని కూడఁ బేర్కొనఁబడు మూలసంహితను గల్పించి రనియుఁ దెలియుచున్నది. ఈ మూలసంహితయే మాతృకగా నందున్న విషయములకు మఱి కొన్ని విషయములు కూర్చుకొని తరువాత పురాణము లేర్పడి యుండునని భావింప వచ్చును. వీనిలో మొట్టమొదట రోమహర్షణ సంహితయుఁ దరువాతఁ గ్రమముగ కాశ్యప సావర్ణి శాంశపాయనుల సంహితలును వెలువడెనని చెప్పుదురు. దురదృష్టవశమున వీనిలో నేదియు నిప్పుడు లభించుట లేదు. కాని వానిలో ప్రక్రియానుషంగోపోద్ఘాతోపసంహారములను నాలుగు పాదము లుండెనని మాత్రము తెలియుచున్నది. ఈ చతుష్పాదము లిప్పటికిని వాయుబ్రహ్మాండ పురాణములలోఁ గానఁబడుచున్నవి. పురాణ రచయితలు తాము తమ గురువుల దగ్గఱ విన్న విషయములనే యథాతథముగ లిఖించి యుండక పోయినను గథాది విషయములలో నెక్కువ మార్పులు కలిగించి యుండరు. వారు వచ్చినచ్చట కొన్ని యధిక విషయములను జేర్చి పురాణములను విస్తృతములు గావించి యుందురు. "అనుశుశ్రుమ, స్మృతః, ఇతి నః శ్రుతమ్" మున్నగు పదములు వారు పురాణ సంప్రదాయమును గడు జాగరూకతతోఁ గొనసాగించి రనుటకు పరమ విషయమును వ్యక్తము చేయుచున్నవి.

పై దానినిబట్టి ప్రాచీన కాలమునఁ గూడ భారత దేశమున చారిత్రకులును చరిత్ర వాఙ్మయము నుండెడివని తెలియుచున్నది. ఈ చారిత్రకులకు వంశవిత్తులు, వంశవిత్తములు అను పేరులు నుండెడివి. వీరిలోఁ గొందఱు కొన్ని వంశముల చరిత్రల యందుఁ బ్రత్యేక పరిశ్రమ గావించుచుండిరి. సోమవంశవిత్తులనగా చంద్రవంశ చరిత్రయం దాఱితేఱిన వారని యర్థము. యజ్ఞములు జరుగు స్థలమందే కాక యితర స్థలములందును బురాణముల నుపదేశించుచుఁ

ప్రచారము గావించుచుండెడి వారికి సూతులని పేరు. ఈ సూతులు పృథుమహారాజు యజ్ఞవహ్ని నుండి పుట్టిన అయోనిజుఁడైన సూతుని వంశమునకుఁ జెందినవారు. వీరును ఋషులై వివిధ కాలములలో వివిధ స్థలము లందుఁ బురాణములను ప్రచారము కావించుచుండిరి.

అథర్వ వేదకాలము నాఁటికిఁ బురాణములు సామాన్య జనులకుఁ గాకపోయినను విద్వాంసులకుఁ బరిచితములైయే యుండెను. అందు నారదుని సంబోధించునట్లున్న యొక శ్లోకమేదో యొక పురాణమునుండి గ్రహింపఁబడినట్లు తెలియుచున్నది. ఛాందోగ్యోపనిషత్తు నందలి సప్తమ భాగమున నారదుఁడు తాను పురాణేతిహాసములను క్షుణ్ణముగాఁ బఠించినట్లు చెప్పియుండుటచే నుపనిషత్తుల కాలమునాఁటికి పురాణములు సుస్థిరమైన రూపముఁ దాల్చినట్లు భావింపవచ్చును. సూత్ర వాఙ్మయమున పురాణములనుండి పెక్కు శ్లోకము లెడనెడ నుదాహరింపఁ బడి యున్నవి. ఆపస్తంబ సూత్రము భవిష్య పురాణమునుండి యొక శ్లోకము నుదాహరించు చున్నది. మహాభారతము నందలి చివరి పర్వమునఁ బురాణ వాఙ్మయమే కాక పదునెనిమిది పురాణముల పేర్లు కూడఁ బేర్కొనఁ బడియున్నవి. క్రీ.పూ. 4 వ శతాబ్ది యందలి కౌటిల్యుఁ డర్థశాస్త్రమున రాజకుమారు లవశ్యము పఠింప వలసిన గ్రంథములలోఁ బురాణములను గూడఁ జేర్చియున్నాఁడు. అమరసింహుఁ డమరనిఘంటువునఁ బురాణము పంచలక్షణమని చెప్పి యున్నాఁడు. దీనిని బట్టి యమరసింహునికిఁ బూర్వమే పురాణములు ప్రచారము నుండెనని చెప్పవచ్చును. వేదవాఙ్మయమును బఠించుటయు నర్థము చేసికొనుటయు బహు క్లేశకరమగుట చేతను, అట్లు చేయుటకు సంపూర్ణ జీవిత కాలమైనను సరిపోక పోవుటచేతను, ఆత్మశాంతికై యేదైన మతగ్రంథములను బఠింపవలెనని కుతూహల పడుచుండెడి సామాన్య జనులకుఁ గథో పాఖ్యానముల ద్వారా వేదసారము నందింపఁ జాలిన వగుటచేఁ గ్రమముగాఁ బురాణేతిహాసములు ప్రచారము లోనికి వచ్చినవి. వానిని గ్రామములందు సామాన్యులకు వివరించి చెప్పుటకుఁ దగిన యత్నములు చేయఁబడియుండెను. అప్పుడప్పుడు విద్వాంసులు కూడఁ బురాణశ్రవణమునకై యరుగుచుండి రనుటకు హర్ష చరిత్రమున నొక యుదాహరణము లభించుచున్నది. అందు బాణుఁడు తన గ్రామమునందు చెప్పఁబడు వాయుపురాణము వినుటకై యరిగి యుండెనని తెల్పబడి యున్నది. పురాణములలో బహువిధములైన పూజా ప్రార్థనా విధానములు, చరిత్ర, భూగోళ విషయములు, యాత్రాస్థలములయు తీర్థక్షేత్రములయు వర్ణనము, ఖగోళ జ్యోతిశ్శాస్త్ర విషయములు, వేదాంత విషయములు, మోక్షప్రాప్తి కనువగు సాధనములు మున్నగు నంశము లెన్నో వివరింపఁ బడి యుండును. ఇవి సామాన్య మానవుల విజ్ఞాన పిపాసను దీర్చి వారికి బహువిధమైన జ్ఞాన సంపదను జూఱ యిచ్చుచుండును.

**పురాణముల కాలము :**

పురాణములు ప్రస్తుతమున్న రూపము నెప్పుడు పొందయుండెనో నిర్ణయించుట చాల కష్టము. మహాభారతమునఁ బదునెనిమిది పురాణముల నామములును బేర్కొనఁబడి యుండుటచే

నవి భారతమునకుఁ బూర్వమే రచింపఁబడెనని యనుమానించుట కవకాశమున్నది. కాని పురాణము లందలి విషయములను నిశితముగాఁ బరిశీలించినచో వానిలోఁ బెక్కు భారతము తరువాతనే రచింపఁబడినట్లు తెలియ వచ్చును. కొన్ని తత్పూర్వము రచింపఁబడిన రచింపఁబడి యుండవచ్చును. రాజవంశములను దదనుక్రమములను వర్ణించు సందర్భమునఁ బురాణము లప్పటికున్న జ్ఞానమునకుఁ బెక్కువిషయములను జేర్చియున్న వనుటలో సందేహము లేదు. అందుచే బ్రాహ్మణములయు నుపనిషత్తులయుఁ గాలమునుండి గుప్త రాజులకాలము వఱకును బురాణ రచనము కొనసాగుచునే యుండెనని భావింపవచ్చును. కొన్ని పురాణములు మహావీర గౌతమబుద్ధులకుఁ బూర్వమును, గొన్ని వారి తరువాతను రచింపఁబడె ననిచెప్పుట కాధారము లున్నవి. ఈ విధముగాఁ బురాణము లన్నియుఁ ప్రస్తుతరూపమున స్థిరపడుటకుఁ బెక్కు శతాబ్దుల కాలము పట్టియుండెనని తోఁచును. పురాణము లందలి ముఖ్యవిషయము లతి ప్రాచీన కాలముననే రూపొందినను అవి క్రమక్రమముగాఁ బలు శతాబ్దుల కాలములో విస్తరింపఁబడి యుండును. అందుచేఁ గొన్ని పురాణము లుపనిషత్తుల కాలమునను, గొన్ని సూత్రముల కాలమునను, గొన్ని యితిహాస కాలమునను, గొన్ని యితిహాసానంతర కాలమునను రచింపఁబడెనని చెప్పుట కవకాశమున్నది. కావునఁ బ్రతి పురాణము నందలి విషయములను పరిశీలించి, వానిని బాహ్యాంతరాధారములతోఁ బోల్చి చూచి, దాని రచనా కాలమును నిర్ణయింప వలయును.

క్రీ. పూ. 6 వ శతాబ్ది నుండియు సంకర్షణ వాసుదేవ తత్త్వము భారతదేశమునఁ బ్రచారమునకు వచ్చెను. పాణినియు పతంజలియు సాత్వతుల కుపాస్యుఁడైన వాసుదేవుని భగవత్స్వరూపునిఁగాఁ బేర్కొని యుండిరి. సాత్వతులు వాసుదేవ బలరాములను భగవన్మూర్తులుగా భావించిరని భాగవతము కూడఁ జెప్పుచున్నది. క్రీ. శ. రెండవ శతాబ్ది యందలి శిలప్పదికారమున వాసుదేవ సంకర్షణ తత్త్వవు ప్రసక్తి యున్నది. కాలక్రమమున బలదేవుఁడు విసర్జింపఁబడి వాసుదేవుఁడొక్కఁడే నారాయణ నిర్విశేషుఁడుగా భావింపఁబడుట సంభవించినది. భాగవతమున నెచ్చటనుఁ సంకర్షణ వాసుదేవ తత్త్వము యథాతథముగాఁ బ్రపంచింపఁబడి యుండలేదు. అందుచే వాసుదేవ సంకర్షణ తత్త్వ ప్రభావము సన్నగిల్లిన పిమ్మటను, వాసుదేవ తత్త్వము ప్రచారమునకు వచ్చిన పిమ్మటను భాగవతము రచింపఁ బడెనని యూహింప వచ్చును. ఈ కాలము కొంచె మించుమించుగా గుప్తరాజులు ప్రాభవమునకు వచ్చిన కాలముతో సరిపోవును. క్రీ. శ. రెండవ శతాబ్ది యందలి శిలప్పదికారమున విష్ణు పురాణము పేర్కొనఁబడి యుండుటచే నా పురాణ మంతకుఁ బూర్వమే రచితమై యుండెనని నిశ్చయింప వచ్చును. విషయ విస్తరణమున విష్ణుపురాణమునే యనుసరించు భాగవత పురాణము కూడ నా ప్రాంతముననే అనఁగా క్రీ. శ. రెండు మూఁడు శతాబ్దులలో రచింపఁబడి యుండును. గుప్తరాజులు విష్ణుని మూఁడవ యవతారమైన వరాహమును బూజించుచుఁ దమ్ముఁ బరమ భాగవతులని చెప్పుకొనుచుండిరని చరిత్రవలనఁ దెలియుచున్నది. భాగవతమున వరాహావతార విషయము సమగ్రముగాఁ జెప్పఁబడి యున్నది. గుప్తరాజులు స్మార్తులైనను భాగవత సిద్ధాంతములు తమ్మెక్కువగా నాకర్షించి యుండుటచే భాగవతమును పవిత్ర గ్రంథముగాఁ బరిగణించుచుండిరి. దీనినిబట్టి కూడ భాగవతము క్రీ. శ. రెండు మూఁడు శతాబ్దులలో రచింపఁబడి యుండెనని తలంప వచ్చును.

**పురాణ స్వరూపము :**

పురాణమునకుఁ బంచలక్షణ మనునది వివరణమే కాక పర్యాయపదము కూడను. సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము- అనునవి పంచ లక్షణములు. అన్ని పురాణములందు నీ యైదు లక్షణములు సంపూర్ణముగా గనిపింపక పోయినను, అంతు సాధారణముగా నీ విషయములే వివరింపఁబడుచుండును. చతుర్విధ పురుషార్థ సాధనమునకును, ధర్మాచరణ ప్రవృత్తి కలుగుటకును- వేదార్థవివరణాత్మక మైన పురాణము యొక్క లక్షణ పంచక జ్ఞాన మావశ్యకము. చతుర్వేదములను సాంగోపనిషత్కముగ నెఱింగియుఁ బురాణము నెఱుంగని వాఁడు వివేకి కానేరఁడు. అట్టి వానిని దనకు ఘాతచేయు వానిఁగా భావించి వేదమాత బెదరిపోవు నఁట. ఇతిహాస పురాణములచే వేదమును బెంపొందఁ జేయవలయునని బ్రహ్మాండ పురాణ ప్రక్రియా పాదమునఁ జెప్పఁబడియున్నది.

"పురాపి నవం పురాణ" మను నిర్వచనమును గొందఱు చెప్పుదురు. అనఁగాఁ గడచిన పెక్కు కల్పముల చరిత్రము తెల్పున దయ్యు నిత్యక్రొత్తగా నుండునది పురాణమని దీని యర్థము. ఇది మొదట శతకోటి ప్రవిస్తరమై యేకరూపమున నుండ, నింత గ్రంథమును బ్రజలు గ్రహింపలేరని విష్ణువు వ్యాసరూపము ధరించి, నాల్గు లక్షల గ్రంథముగా సంగ్రహించి పదునెన్మిదిగా విభజించెననియు, శతకోటి ప్రవిస్తరమైన మూలపురాణ మిప్పటికిని దేవలోకమున నున్నదనియు, బృహన్నారదీయము నుడువుచున్నది. విప్రులకు శ్రుతిస్మృతులు కన్నులనియు, పురాణము మూఁడవ కన్ననియు, నీమూఁడు కన్నులచేఁ జూడనేర్చినవాఁడు మహేశ్వరాంశజుఁ డనియు స్కాంద రేవా ఖండమునఁ జెప్పఁబడి యున్నది. వేదపురాణ ధర్మశాస్త్ర విద్యలు మూఁడును సర్వశాస్త్ర సిద్ధాంతము చేయ సమర్థములైనవి. పురాణము నెఱుంగనివాఁ డింకేమియు నెఱుంగఁ డనియు, నందుఁ గనఁబడని ధర్మమే లేదనియు, వేదములందలి విషయమే స్మృతులందును, నా రెండింటి యందలి విషయమే పురాణములందును గలదనియు, పురాణములు వేదపురుషుని యాత్మయనియుఁ బెద్దలు చెప్పుదురు.

జయమను పేరు భారతమునకే కాక పురాణములకును వర్తించును. య అనునది ఒకటికిని, జ అనునది ఎనిమిదికిని గుర్తులు. "అంకానాం వామతోగతిః" అను సిద్ధాంతము ననుసరించి యిది పదునెనిమిది పర్వములుగల భారతమును, పదునెనిమిది సంఖ్యగల పురాణములను సూచించును. జయవాచ్యమగు భారతముచేఁ గాని, పురాణములచేఁ గాని యుపజీవనము చేయుచు ధర్మ ప్రచారము కావించు మహానుభావుఁ డగ్ర పూజ్యుఁడై యలరారు నని పురాణములు చాటుచున్నవి. వేదమంత్రోక్తములైన దేవతల రూపములను, చరిత్రలను వ్యాఖ్యానించి, ఆయా దేవతల పూజా ప్రార్థనోపాసనాదులను విధించి, జీవుల చిత్తశుద్ధి సాధనమును విశేషముగను బురాణములు ప్రపంచించుచున్నవి. భౌతికవాదులైన హిరణ్యకశిపు ప్రభృతులకును, అధి దైవికాధ్యాత్మికవాదులగు ప్రహ్లాదాదులకును నడుమ జరిగిన సంఘర్షణము నానుగ దైవసంపదలను పేర సర్వత్ర నిరూపించి, యౌపనిషదమైన జ్ఞానవాదమును నెలకొల్పఁ జాలినవి పురాణములు. "యస్మిన్ జ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతి" అను నానుడి వేదముల యెడ వలెనే పురాణముల యెడను జక్కగా నను వర్తించును.

మతవిషయమునఁ బురాణములకుఁ గల ప్రాధాన్య మతిమాత్రమైనది. అవి యాస్తిక్యమునకు జీవాతువులు. అవి సందర్భానుగుణముగా నొక్కొక్క దేవతనే ప్రశంసించుచున్నట్లు కనిపించినను మొత్తముమీఁద దేవతలందఱికిని సమానత్వమునే చెప్పును. అవి యెడనెడఁ బ్రత్యేక దేవతలఁ గొల్వవలె నని బోధించినను అన్యదేవతారాధనమును నిరసింపవు. నీతిధర్మముల కవి నిధానములు. అవి మానవులకు మిత్రులవలెఁ గర్తవ్యాకర్తవ్యములను గథోపాఖ్యానముల ద్వారా బోధించును గావున లాక్షణికులు వానిని మిత్రసమ్మితములని వక్కాణించిరి. నీతి ధర్మములను, సర్గ ప్రతిసర్గాదులను మాత్రమే కాక పురాణములు మానవుల విజ్ఞానాభివృద్ధికిఁ గావలసిన సర్వ విషయములను బోధించును.

> మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వ చతుష్టయం
> అనాపలింగ కూస్కాని పురాణాని ప్రచక్షతే.

అను శ్లోకమునఁ బదునెనిమిది పురాణములు పేర్కొనఁ బడినవి. భద్వయం = భాగవతము, భవిష్యపురాణము; మద్వయం = మత్స్య పురాణము, మార్కండేయ పురాణము; బ్రత్రయం = బ్రహ్మ, బ్రహ్మవైవర్త, బ్రహ్మాండపురాణములు; వ చతుష్టయం = విష్ణు, వరాహ, వామన, వాయు పురాణములు; అ = అగ్ని; నా = నారదపురాణము; ప = పద్మపురాణము; లిం = లింగ పురాణము; గ = గరుడపురాణము; కూ = కూర్మపురాణము; స్కా = స్కాందపురాణము. ఇవి పదునెనిమిదియు మహాపురాణములు. ఇవికాక సనత్కుమార నారసింహా ద్యుపపురాణములును, గణేశమౌద్గల కాళీ కల్కా ద్యుపోప పురాణములును జాలఁ గలవు. మహాపురాణము లన్నియు వ్యాస కర్తృకము లనియే చెప్పబడుచున్నవి. ఇందలి భాష భావ గాంభీర్యమును బట్టి యచ్చటచ్చటఁ గొంత ప్రౌఢముగా నున్నను సాధారణముగా నతి సరళమును సహజమునై యొప్పారును. వీనియందు సామాన్యముగా ననుష్టుప్ఛందమే వాడఁబడుచుండును.

**భాగవత పురాణము :**

గీతా సహస్రనామ రామాయణ శబ్దములు నిరుపపదము లయ్యును భగవద్గీతా విష్ణుసహస్రనామ వాల్మీకి రామాయణములను సూచించు చున్నట్లే నిరుపపద మైన భాగవత శబ్దము శ్రీవిష్ణు భాగవతమునే సూచించుచున్నది. దీనిని సర్వమునిగణ సంసేవ్యమాన పదారవిందుఁ డైన శుక మహర్షి యధ్యయనము చేసి మోక్షశాస్త్రమును తలంపున ముముక్షు వైన పరీక్షిత్తునకు బోధించి యుండెను. దీనికి సర్వపురాణోత్కృష్టత్వమును, సర్వోపనిష త్తుల్యత్వమును జెప్పఁబడియున్నవి. ఇతర మహాపురాణములవలె నిదియు వ్యాసముని ప్రణీతమే యని పలువురి తలంపు. కాని కొంద ఱిది వ్యాసకృతము కాదనియు, గోపాల మతావలంబి యైన హేమాద్రియను రాజు ప్రీతికై తదాస్థాన పండితుఁ డైన వోపదేవుఁడు రచించి వ్యాసునిపేరఁ బ్రకటించె ననియుఁ జెప్పుచున్నారు. మఱికొందఱు దీనిని శుకమహర్షియే రచించె నని యభిప్రాయ పడుచున్నారు. ఇంకఁ గొందఱు దీనిని రచించిన వాఁడు కృష్ణద్వైపాయన వ్యాసుఁడు కాఁడనియు వ్యాసాపర నాముఁడైన యాధునికుఁ డనియు భావించుచున్నారు. కొంద ఱిది వ్యాస ప్రణీతమే యని యంగీకరించుచు నిది యష్టా

దశ మహాపురాణాంతర్గతము కాదనియు నుపపురాణములలోఁ బదునేడవ దనియు నుడువుచున్నారు. ఈ వాదము లన్నింటిలో బోపదేవకృత మను వాదమే కొంత యెక్కువ ప్రచారము గాంచినది. సిద్ధాంత చంద్రికలో నీ వాదము బలపఱచు వారు చూపు హేతువు లన్నియు సప్రమాణముగా ఖండింపఁ బడినవి. ప్రాచ్య పాశ్చాత్యపండితులు పలువు రివి బోపదేవ కృత మను వాదము నిలువఁ జాలదనియు, దీనిని రచించినవాఁడు వ్యాసుఁడే యనియు, దేవీభాగవతము కాక యిదియే యష్టాదశ మహాపురాణాంతర్గతమైన దనియు నిశ్చయించి యున్నారు.

ఒకప్పుడు హేమాద్రి యను విద్వత్ప్రభువు సభలోనున్న పండితులను జూచి మహాగ్రంథమగు భాగవతాధ్యాయ సంగ్రహార్థమును గ్రంథరూపమున నెవ్వరైనఁ జెప్పఁగలరా యని యడిగెనఁట! అంత సభలో నున్న బోపదేవుఁ డను పండితుఁడు లేచి రేపు చెప్పెద నని పల్కి శ్రీమద్భాగవత కథానుక్రమణికా ప్రతిపాదకమైన భాగవతాధ్యాయ సారాఖ్యమైన గ్రంథము రచించి హేమాద్రి కర్పించి తన మాట నిలఁబెట్టుకొనెనఁట! ''శ్రీమద్భాగవతాధ్యాయ సారోహ్యత్ర నిరూప్యతే, విదుషా బోపదేవేన మంత్రి హేమాద్రి తుష్టయే'' యనున దందలి మొదటి శ్లోకమఁట! ఆ గ్రంథమును దిలకించి మిక్కిలి ప్రీతుఁడైన తేని ప్రీణనముకై బోపదేవుఁడు భక్తి ముక్తాఫలము, భక్తిలహరి యను మఱి రెండు గ్రంథములను గూడ రచించి యతనిచే సమ్మానితుఁడయ్యె నఁట. ఈ కథను బురస్కరించుకొనియు, భాగవతమునందలి శైలి యితర పురాణములందలి శైలికంటె భిన్నముగా నుండుట గమనించియు నెవ్వరో భాగవతము బోపదేవ కృతమేకాని వ్యాసకృతము కాదను వాదమును వెల్వరించిరి. కాని యీ వాదము నిల్చునట్టిది కాదు.

**భాగవత రచనా సందర్భము :**

వ్యాసమహర్షి భాగవతమును రచించిన సందర్భము భాగవతారంభముననే చెప్పఁబడినది. వ్యాసుఁడు సర్వవర్ణాశ్రమములకును హితముచేయ సంకల్పించి వైదికకర్మములైన యజ్ఞము లెడతెగకుండ జరుగుటకై యేకాకారమై యున్న వేదమును ఋగ్యజుస్సామాథర్వములుగా విభజించి, స్త్రీ శూద్రులును ద్విజబంధువులును వేదములు విన నర్హులుకారు కావున వారి మేలునకై భారతాఖ్యానము రచించియు, భూతహితమునందుఁ దన హృదయము సంతసింపకున్న సరస్వతీనదతటమున నొంటరిగాఁ గూర్చుండి, హరికిని యోగివరులకును నభిలషితమైన భాగవత విధము పలుకనైతి నని విచారించుచుండ నారదుఁ డచ్చటి కరుదెంచి యిట్లేల వగచుచుంటి వని ప్రశ్నించెను. అంత వ్యాసుఁడు నారదుని త్రిలోకసంచార శీలతయు, సర్వజ్ఞతయుఁ బ్రశంసించి తన కొఱఁత యెట్టిదో వివరింపవలెనని ప్రార్థించెను. నారదుఁడు నీవు ధర్మము లన్నియుం జెప్పితివి. కాని విష్ణుకథలు చెప్పవైతివి. గుణము లెన్నక ధర్మములు చెప్పినంత మాత్రమున విష్ణుఁడు మెచ్చునా? హరిని నుతింపమియే నీకీ వంత కలుగుటకుఁ గారణమని తెల్పి, హరిసేవా మహత్త్వమును, హరి గుణస్తుతి మహత్త్వమును నెఱింగించి, తన పూర్వజన్మ వృత్తాంతము వివరించి, విష్ణుగుణ వర్ణనము చేయఁ బ్రేరేచి, యథేచ్ఛముగా నరిగెను. అంత వ్యాసుఁడు శమ్యాప్రాసమను నాశ్రమమున కరిగి, భక్తియుక్తమగు చిత్తమునఁ బరిపూర్ణుఁడైన యీశ్వరుని గాంచి, నారాయణ భక్తియోగము

కంటె ననర్థోపశమనము వేఱొండు లేదని నిశ్చయించి, భువనక్షేమంకరమైన భాగవతపురాణమును నిర్మించి, మోక్షార్థియైన శుకునిచేఁ జదివించెను. శుకయోగి తక్షక విషానలభీతి గంగనదుదు విరక్తచిత్తుఁ డై మునులతో సుపవిష్టుఁడై యున్న పరీక్షిన్నరేంద్రుఁడు తన్నడుగ నతని కా భాగవతపురాణము నుపదేశించెను.

**భాగవత మాహాత్మ్యము :**

నిగమ కల్పతరు గళితమైన ఫలము భాగవతము. వైకుంఠగతమైన దానిని నారదుఁడు గొనివచ్చి వ్యాసుని కొసంగెను. వ్యాసుఁడు దానిని శుకముఖ నిహిత మొనర్చెను. అమృత ద్రవ సమ్మితమై యది శుకముఖమునుండి భూమిపై రాలినది. తద్రస పానము వారికిఁ బరమానందాను భవము తథ్యము. అట్టి భాగవతము యొక్క మహిమ యింతింతని చెప్పరాదు. దాని మాహాత్మ్యము పద్మపురాణోత్తర ఖండమందలి మొదటి యా ఱధ్యాయములలోఁ జక్కగా వివరింపఁ బడినది. భాగవతము మోక్షశాస్త్రము; అది భగవద్రూపమైనది. కలియుగమున దానిని బఠించినను విన్నను తోడ్తో ముక్తి చేకూరునని చెప్పుదురు. శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు భాగవత కథను వినిపింప నారంభించు తఱి సురలమృత భాండముతో నయ్యెడ కరుదెంచి భాగవత కథామృతమును దమ కిచ్చి తాము తెచ్చిన యమృతభాండము నందలి యమృతమును బరీక్షిత్తున కిమ్మని శుకుని బ్రార్థించి రఁట. శుకుఁడు సుర లుత్తమ భక్తులు గారని తలంచి వారికి భాగవత కథాసుధ నొసంగుట కంగీకరింపఁడయ్యెనఁట! దీనినిబట్టి భాగవతము భక్తజనైక లభ్యమనియు నమృతాధిక ఫలప్రదమనియుఁ దెలియుచున్నది. భాగవత కథామృతమును గ్రోలి పరీక్షిన్మహారాజు మోక్ష సామ్రాజ్యము కొల్లగొనుట యెఱింగి బ్రహ్మ విస్మితుఁడై భాగవతసారము నన్య సాధనములతోఁ దూప నది యన్నిటికంటె గురుతరమై భాసిల్లెనఁట. అది చూచి బ్రహ్మసభాగతులైన ఋషులెల్లరు భాగవత మాహాత్మ్యము నెఱింగి రఁట! మున్ను సనకాదులు భాగవత మాహాత్మ్యము నారదుని కెఱింగించి యాతఁ డడుగ శ్రీమద్భాగవతము నాతని కుపదేశించిరి. దాని నేడు రోజులు భక్తిమై వినిన మోక్షము కరతలామలక మగును. వేదాంత శ్రవణ గీతా పారాయణములచేఁ గూడ లభింపని భక్తిజ్ఞాన వైరాగ్యములు భాగవత శ్రవణముచేఁ దప్పక లభించి ముక్తిమార్గముఁ జూపును. అందుచేతనే :

> నిగమములు వేయుఁజదివిన, సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్
> సుగమంబు భాగవత మను, నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా!

అని చెప్పఁబడినది.

**పోతన దేశకాలములు :**

భాగవతామృతము నాంధ్రలోకమున కందించిన వారిలో బమ్మెర పోతనామాత్యుఁ డగ్రేసరుఁడు. ఈతని దేశకాలములఁ గూర్చి చాలకాలము వాదోపవాదములు చెలరేగినవి. భాగవతమును 1848 లో ముద్రించిన పురాణం హయగ్రీవ శాస్త్రిగారు ప్రతిపాదింపగా నటుతరువాత వావిలి కొలను సుబ్బారావుగారు పోతనామాత్యుఁడు రాయలసీమలోని యొంటిమిట్టవాని యని ప్రబలముగా వాదించిరి. కొలుదొలుత వీరేశలింగం పంతులుగారు కూడ ఈ యభిప్రాయము వారేయైనను కవుల చరిత్రము ద్వితీయ ముద్రణమునాటికి తమ పూర్వాభిప్రాయమును మార్చుకొని పోతనామాత్యుఁ

దేకశిలానగరమని ప్రఖ్యాతి గాంచిన యోరుగల్లు (తెలంగాణము) వాఁడని నిర్ధరించిరి. అటుతరవాత కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారును, శేషాద్రిరమణ కవులును, పోతన జన్మగ్రామ మోరుగల్లుమండలములోని బమ్మెర యనియు, నాతఁడు భాగవతమున పేర్కొనిన యేకశిలా నగర మోరుగల్లే యనియు సహేతుకముగా నిరూపించి నిర్వివాదముగా పరిష్కరించిరి. భాగవతమును పూరించిన వెలిగందల నారయ, సింగన, గంగనలు కూడ తెలంగాణమువారే యని నిరూపించిరి. ఈ యా విషయములు పూర్వ ముద్రితములగు భాగవత పీఠికలందును, పత్రిక లందును, కవిచరిత్రము లందును, క్షుణ్ణముగా విమర్శింపఁబడి స్థాపితము లైనట్టివే. శ్రీ అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగా రీవాదము లన్నిటిని విమర్శించి ఓరుగల్లు మండలము జనగామ తాలూకాలోని బమ్మెరయే పోతన జన్మస్థలమని స్థాపించినారు. చాళుక్య గంగపెర్మాడి కుమార సోమేశ్వరుని యాజ్ఞచే చాళుక్య విక్రమ సం॥ ౪౭ కు సరియైన క్రీ. శ. 1124 లో వేయఁబడిన గుముడూరి శాసనమున పేర్కొనఁబడిన బమ్మరియే నేటి బమ్మెర యని నిరూపించినారు. కనుక పోతన పూర్వుల జన్మస్థలము బమ్మెర యనియు భాగవత రచనము జరిగినది యోరుగల్లులో ననియు నిశ్చయముగా తేలిపోయినది.

పోతన కాలము మాత్రము మిక్కిలి వివాదాస్పదమైనది. అది యానాటి పఱకును సునిశ్చితము కాదనియే మా యభిప్రాయము. సాహిత్యలోకమున వ్యాపించిన కథల ననుసరించి పోతనామాత్యుఁడు శ్రీనాథునకును సర్వజ్ఞ సింగభూపాలునకును సమకాలీనుఁడని కొందఱును, పదునేనవ శతాబ్ది యుత్తర భాగము వాఁడని మఱికొందఱును అభిప్రాయపడిరి. వీరేశలింగం పంతులుగారు పోతన పదునేనవ శతాబ్దపు పూర్వార్ధము వాఁడనిరి. చాగంటి శేషయ్యగారు (ఆంధ్ర కవి తరంగిణి, 6 వ సంపుటము) పోతనామాత్యుఁడు క్రీ.శ. 1450-1510 ప్రాంతము లందుండిన వాఁ డనిరి. మఱియును ప్రకృతము పోతనామాత్యుని పేరుతో ప్రచారమందున్న భోగినీదండకము, నారాయణ శతకము అతనివి కావేమో యని యనుమానించిరి. వీరభద్రవిజయము మాత్ర మాతని బాల్యకృతి కాఁబోలు ననిరి. శ్రీ అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పోతన కాలము క్రీ.శ. 1410-1470 అని నిర్ధరించినారు. శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు క్రీ.శ. 1400-1470 అని నిర్ణయించినారు (పోతన, పుట 18). సుప్రసిద్ధ చారిత్రకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు పోతన మునిమనుమలగు కేసన మల్లనకవుల దాక్షాయణీపరిణయమును పోతన విరచిత భోగినీ దండకమును నాధారముగా పోతన పదునైదవ శతాబ్ది యుత్తరార్ధము వాఁడనిరి (ఆంధ్ర మహా భాగవతోపన్యాసములు). ఇన్ని నిర్ణయములందు కొంత మెఱుఁగైనది పోతన పదునైదవ శతాబ్ది యుత్తరార్ధమునందున్న వాడనునదే యైనను పోతనకాలము తదితర కృతులు నిదమిత్థముగా తేల్చి చెప్పుట కిప్పటికి లభించిన చారిత్రక సామాగ్రి చాల దనియే మా యభిప్రాయము. వివరము లరయఁ గోరువారు తత్తద్విమర్శకుల రచనములు పరిశీలింతురు గాక.

**పోతన వంశము :**

పోతన దేశకాలాదులఁ గూర్చి తాను స్వయముగా నేమియు చెప్పుకొనకున్నను తన వంశ మును గూర్చియు తన్ను గూర్చియు కొలఁదిగా చెప్పుకొన్నాడు. పోతనగారిది కౌండిన్యగోత్రము; ఆపస్తంబ సూత్రము. వీరభద్ర విజయము ననుసరించి పోతనగారి వంశవృక్ష మీ తీరుగానున్నది.

మల్లయ

భీమయ

అన్నయ (భార్య గౌరమాంబ)

సోమన (భార్య మల్లమ)

రేచన అన్నయ ఎల్లన (భార్య మాచాంబిక) అయ్యలుప్రెగ్గడ మాదయనాగడు

కేసన (భార్య లక్ష్మమ్మ) మాధవుఁడు ఇమ్మడి నాగయ్య

కేసన

తిప్పన పోతన (భాగవతకర్త)

భాగవతము ననుసరించి పోతనగారి వంశవృక్ష మిట్లున్నది:

భీమన మంత్రి

అన్నయ (భార్య గౌరమాంబ)

సోమన మంత్రి (భార్య మల్లమ)

ఎల్లన (భార్య మాచమ)

కేసన (భార్య లక్కమాంబ)

తిప్పన పోతన (భాగవతకర్త)

వీరభద్ర విజయము రచించునాటికి పోతన తలిదండ్రులు సజీవులుగానే యుండిరి. కనుకనే తన తండ్రిని గూర్చి వీరభద్ర విజయమున నీ విధముగా చెప్పియున్నాఁడు:

ఉ. భూసుర వంద్యునిన్ సుగుణ భూషణు నాశ్రిత కల్పవృక్షముం
దాసజన ప్రసన్ను శివతత్త్వ మనోరథ కౌతుకోన్నతుం
గేసన మంత్రి సత్యనిధిఁ గీర్తి విశాలుఁ జిరాయు రున్నతుం
జేసి యుమామహేశ్వరులు చెన్నుగఁ గాతురు గాక సత్కృపన్.

భాగవత రచనము నాఁటికి పోతన తలిదండ్రులు జీవించి యుండరు. అందుచే భాగవతమున వంశ వర్ణనము చేసిన సీసపు ఎత్తుగీతిలో నిట్లు చెప్పియున్నాఁడు :

ఆ. వె. లలితమూర్తి బహు కళానిధి కేసన
దాన మాన నీతి ధనుఁడు ఘనుఁడు
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ
మనియె శైవశాస్త్ర మహిమ గనియె.

పోతనగారు తన తల్లిని అన్నను వీరభద్ర విజయ, భాగవతములందు మిక్కిలి భక్తితో కొనియాడినారు. లక్కసాని బహుమాన నివారిత దీనమానసగ్లాని యనియు, దాన ధర్మ మతి గౌరవ మంజులతా గభీరతా స్థాని యనియు, సదాశివ పాదయుగార్చనానుకంపా నయ వాగ్భవాని యనియు వర్ణింపఁబడినది. తిప్పన యీశ్వరసేవాకాముఁడఁట. వీరభద్ర విజయమున పోతన తన గురువును గూర్చి యీ విధముగా చెప్పినాఁడు:

ఆ. వె. వెలయు శంభుమూర్తి వీరమాహేశ్వరా
చారవిభుఁడు భక్తిపారగుండు
అనఘుఁ డివ్వటూరి యారాధ్య చంద్రుండు
సోమనాథసముఁడు సోమగురుఁడు.

ఆ గురుఁడే "మత్ప్రసాద దివ్యమహిమచే నెంతైనఁ, గవితఁ జెప్ప నేర్పు గలదు నీ" కని జంకు దీర్చెను. జనక శిక్షిత విహితాక్షరాభ్యాసుఁడైన పోతన వీరభద్ర ప్రసాదలబ్ద కవితాతిశయమునఁ బరగినట్లుగా చెప్పుకొనుటచేత పోతనవంశము వారును పోతనయు వీరశైవులని తెలియుచున్నది. భాగవతము రచించునాఁటికి పోతన తిక్కనగారి వలెనే హరిహరులకు భేదమెంచని యద్వైతిగా మాఱినాఁడు. పోతన శ్రీనాథునకు బావమఱఁది యనుట, చిదానంద యోగి పోతనకు రామమంత్ర మనుగ్రహించె ననుట, పోతన కుమారుఁడు మల్లనయనుట కల్పిత కథలు. కాని పోతనకు ప్రౌఢ సరస్వతి బిరుదాంచితుఁడైన కేసన యను కుమారుఁ డుండినట్లు గ్రంథాంతరముల వలన దెలియుచున్నది.

కేసన మల్లన అను సవతితల్లుల బిడ్డలు, జంట కవులు దాక్షాయణీ పరిణయమును రచించి గురిజాల మల్లన సోమయాజి కంకిత మిచ్చిరి. అందులో వారు పూర్వకవిస్తుతిలో పోతన తమ పూర్వుఁడని యీ విధముగా కీర్తించినారు:

చ. నెఱిగుఱిగల్గు నన్నయ మనీషిని దిక్కన శంభుదాసునిన్
బరువడి మత్పితామహుని బమ్మెరపోతన భాస్కరాహ్వయున్
వరకవి సార్వభౌముని నవారిత భక్తి నుతింతు మెప్పడున్
గురు కరుణాఢ్యు లంధ్రకవి కుంజరులం దగు భూతి శోభిలన్.

కృతిపతి యగు మల్లన సోమయాజి తమ్ముఁ గూర్చి యిట్లు పలికినట్లుగా చెప్పినారు:

సీ. శ్రీరామలింగాంఘ్రి సేవాపరప్రౌఢఁ గవితాచమత్కృతిఁ గాంచువారి
నప్పలమ్మయును పేరాంబయుఁ బ్రౌఢ సరస్వతికిని గన్న ప్రజ్ఞ వారి

కౌండిన్య గోత్ర విఖ్యాతి బమ్మెర భవ్య వంశాఢ్యులై సిరి వఱలువారి
నివటూరి ముక్తి నాగేశ సద్గురుభక్తి నాదిమశైవులై నట్టివారి

తే. కేసకవి మల్లకవి నామకీర్తిపరుల
మమ్ముఁ బిలిపించి మన్నించి మదిఁ దలంచి
ఘనత నుచితాసనంబున నునిచి వేడ్క
ఏనయ నయ వాక్యములచేత నెనయ బలికె.

పై పద్యమువలన పోతనకు ప్రౌఢ సరస్వతి యను పుత్రుఁడు కలిగినట్లును అతనికి అప్పలమ్మ, వీరాంబ యను నిరువురు భార్య లుండినట్లును, అప్పలమ్మకు కేసన్నయు, వీరాంబకు మల్లనయు జనించినట్లును తెలియుచున్నది. అజ్జరపు పేరయలింగ కవి తాను బమ్మెరవారి యింటి యాఁడుబిడ్డను పెండ్లాడినట్లు తన యొడయనంబి విలాసమున నిట్లు చెప్పినాఁడు :

ఉ. బమ్మెరవంశమందునను బ్రౌఢసరస్వతి పద్దు గాంచి తా
నెమ్మె దలిర్పఁ గేసన కవీశ్వరు లప్పమ నాము సాధ్వియం
దిమ్మహిఁ గూర్మిఁ గన్న సుత యెల్లమ యందును బేరయాఖ్యుఁడన్
సమ్మతిఁ గంటి వీరనరసమ్మను, గంగసమంత్రి యుగ్మమున్.

దాక్షాయణీపరిణయ కర్తలు పోతనకు కుమారుఁడుగా పేర్కొన్న ప్రౌఢ సరస్వతి బిరుద నామధారియే యొడయనంబివిలాసము వలన కేసన యని తెలియనగు చున్నాఁడు. దీని వలన పోతన తరువాతఁ గూడ బమ్మెరవారి వంశమందును వారి యాఁడుబిడ్డల వంశములందును కవిత్వ వ్యవసాయ మనుస్యూతముగా వచ్చుచుండిన దని తెలియుచున్నది.

**పోతన కృతులు :**

భాగవతముగాక పోతనగారి పేరితో ప్రచార మందున్నవి వీరభద్రవిజయము, భోగినీ దండకము, నారాయణశతకము అను మూఁడు కృతులు. వీనిలో వీరభద్రవిజయము భాగవత రచనము జరిగిన తరువాత వెలసిన కృతి యను కట్టుకథ యున్నది గాని యది నమ్మఁదగినది గాదు. వీరభద్ర విజయమందే యది పోతనగారి పిన్నతనపు రచనమనియు, అప్పటి కాతనికి వీరశైవము ముదిరియున్నట్లును నిదర్శనము లున్నవి. గురువైన యివటూరి సోమనారాధ్యుఁడు పోతనామాత్యుని-

ఆ. పిన్న వాఁడ ననియుఁ బెక్కు సత్కృతులను
వినని వాఁడ ననియు వెఱపు మాను
మత్ప్రసాద దివ్య మహిమచే నెంతైన
కవిత చెప్ప లావు గలదు నీకు.

అని ప్రోత్సహించుటయు, శ్రీనాథుని కాశీఖండమందలి ''శితికంఠునకును నెచ్చెలికాఁడు గాఁ డొకో యటమటీఁ డైన యా యక్షభర్త'' యను పద్యమున కనుకరణమైన వీరభద్రవిజయ మందలి ''నీలకంఠునకు నెచ్చెలి గాఁడొకో యటమటీఁ డైన యీ యంబుజాక్షు'' డను విష్ణు నిందాత్మక పద్యమును ఇందు కుదాహరణములు. వీరభద్రవిజయము ముద్రితప్రతిలోని చతుర్థా

శ్వాసమును, తనకు లభించిన వీరభద్ర విజయము తాళపత్ర ప్రతియందలి చతుర్థాశ్వాసమును భిన్నముగా నుండుటచే ముద్రిత చతుర్థాశ్వాసము పోతన కృతము కాదేమో యని మానవల్లి రామకృష్ణకవిగా రనుమానించుటయు (భారతి-రక్తాక్షి-ఆషాఢము), చాగంటి శేషయ్యగారు మానవల్లి వారి యనుమానమున కాస్పద మైన దక్షయజ్ఞ ధ్వంసకథను సమన్వయించుటయు విజ్ఞు లెఱుఁగుదురు. పోతన వీరభద్రవిజయమున కాధారములుగా వాయు, బ్రహ్మపురాణములు రెంటిని గ్రహించి నట్లు చాగంటివారు తీర్మానించినారు.

భోగినీదండకము పోతన విరచితమని చెప్పుటకు గ్రంథాంతమునఁ గల యీ పద్యమే కారణము.

ఉ. పండిత కీర్తనీయుఁ డగు బమ్మెర పోతన యాసుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదాన విహర్తకు రావు సింగభూ
మండల భర్తకున్ విమత మానవనాథ మదాపహర్తకున్.

శ్రీ చాగంటి శేషయ్యగారును మఱి కొందఱును భోగినీ దండకము పోతన కర్తృకము కాదేమో యని యనుమానించినారు. కాని యధిక సంఖ్యాకులు దండకపు శైలికిని భాగవతపు శైలికిని గల సామ్యము వలన నీ దండకము తప్పక పోతన విరచితమే యని యభిప్రాయపడినారు. భోగినీదండకము వ్రాయించుకొన్న సర్వజ్ఞసింగభూపాలుఁడు రాచకొండ రాజ్యమేలిన పద్మనాయక ప్రభువు. అతఁడు రావు సింగక్షమానాథ పౌత్రుఁడు, కుమారాన్న పోతావనీనాథసూనుఁడు, పోచమాంబా లసద్గర్భసంజాతుఁడు, మఱియు వసంతావనీనాథ సంసేవితాంచత్పదాంభోజుడు. ఈతఁడే ముమ్మడి సర్వజ్ఞ సింగభూపాలుఁడనియు, నీతని పరిపాలనము క్రీ. శ. 1430 నుండి 1470 వఱకు సాగిన దనియు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు నిర్ణయించినారు. భోగినీ దండకముగూడ పోతనగారి యౌవనపు రచనయనియే పండితుల యభిప్రాయము.

నారాయణ శతకము పోతన కర్తృక మని బంగూరి సుబ్బారావుగారు ప్రతిపాదించిరి. సాధారణముగా శతకమునందు కృతికర్తపేరు శతకాంతమున పద్యమునందుండును. దీనికి విరుద్ధముగా నారాయణ శతకమున పద్యమునఁ గాక గద్యమున నిది పోతన విరచిత మని కలదు. కనుకనే విమర్శకులు దీని నెవరో రచించి పోతన కంటఁ గట్టినట్లు భావించుచున్నారు. మీఁదు మిక్కిలి 97 వ పద్యము చివరి చరణము "కృపయుం బ్రాతుఁడనయ్య ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా" యని యుండుటచేత నిది కరీంనగర మండలమందలి ధర్మపురివాసుఁ డైన కవి యెవరో యచటి లక్ష్మీనారాయణ స్వామి పైఁ జెప్పిన శతకమని భావించుచున్నారు.

**శైథిల్య వృత్తాంతము :**

భాగవత రచనమును గూర్చియు దాని శైథిల్యమును గూర్చియు వింత వింత కథలు ప్రచారమందున్నవి. తనకు కృతి నంకిత మీయని కారణమున సర్వజ్ఞ సింగభూపాలుఁడు భాగవతమును పాతిపెట్టించె ననియు నందువలన నది యుత్సన్నమయ్యె ననియు నొక కట్టుకథ

కలదు. పోతన్నగారే దాఁచి దాఁచి తమ చరమదశలో వెలికిఁ దీసి కుమారునకిచ్చి సారస్వత నిక్షేపము నందిచ్చు నప్పటికే యది శిథిలమై యుండెననియు మఱియొక కథ కలదు. మొదటిదాని కన్న నిదికొంత మెఱుగుగా నున్న కథ. కాని అనుముల సుబ్రహ్మణ్య శాస్త్రిగారును, మల్లంపల్లి సోమశేఖర శర్మగారును భాగవత ముత్సన్నమగుటకు అప్పటి రాజకీయ పరిస్థితులే కారణములని చెప్పినది మఱికొంత సమంజసముగానున్నది. పోతన చరమదశ నాఁటికి రాచకొండ దేవరకొండ రాజ్యము లంతరించినవి. తెలంగాణ మధికభాగము బహ్మనీ సుల్తానుల వశమై పోయినవి. మఱికొంత గజపతుల చేతిలోఁ బడినది. నిజమైన కారణమేదో తెలియదుగాని పోతనగారి భాగవత మంతయు లభించలేదు. ప్రౌఢసరస్వతి యను బిరుదు వహించిన కేసన వంటి కుమారుఁడుండ, దాక్షాయణీ పరిణయకర్తలైన కేసన మల్లన వరులవంటి మనుమ లుండ, భాగవత శిథిల పూరణము లేదా శేషపూరణము నారయ, సింగన, గంగనల పాలఁ బడుట విచిత్రము.

శేషాద్రిరమణ కవు లీ విషయమై యిట్లు వ్రాసినారు. "ఏకారణము వలననైన నేమి పోతనామాత్యుఁడు రచించిన పండ్రెండు స్కంధముల భాగవతములోఁ గొంతభాగము జీర్ణించినవి. ద్వితీయ స్కంధములో 95 పద్యముల కావలిభాగము, తృతీయ స్కంధములో స్వల్పభాగములు, చతుర్థ స్కంధములోఁ గొంతభాగము, పంచమ, షష్ఠ, స్కంధములు, దశమ స్కంధము ఉత్తర భాగములోఁ గొంత భాగము, ఏకాదశ ద్వాదశ స్కంధములు పరుల రచనములతోఁ గూడుకొని యున్నవి. ఆయా భ్రష్టభాగముల నన్నింటిని పరులు పూర్తిచేసి రనియు నందలి కవిత పూర్తిగ పరులదే యనియు మేము విశ్వసింపఁజాలము."

**భాగవత పూరణము :**

***వెలిగందల నారయ :*** -భాగవతమును పూరించిన కవులలో వెలిగందల నారయ పోతన కతి సన్నిహితుఁడు. ద్వితీయ తృతీయ స్కంధము లందలి కొన్ని పద్యములును, "కాటుక నెఱయంగ" పద్యమాదిగా దశమ స్కంధోత్తర భాగమును, ఏకాదశ ద్వాదశ స్కంధములును రచించిన పుణ్యాత్ముఁడు నారయ. దశమ స్కంధాంత గద్య పోతన పేరితోనే వ్రాసినను ఏకాదశ ద్వాదశ స్కంధాంత గద్యములం దాతఁడు పోతనామాత్యునకు ప్రియశిష్యుఁడ నని చెప్పుకొన్నాడు. ఈతని చరిత్రము తెలిసికొనుటకు వే ఱాధారములు లేకున్నను పోతనామాత్యునకన్న నీతఁడు కనీసము ముప్పది సంవత్సరములు చిన్నవాఁ డైయుండునని భావింపవచ్చును. నారయ యనువాదము పోతన యనువాదము కంటె భిన్నముగా విశిష్టాద్వైత పరముగా నుండుటచే కాఁబోలు అద్వైతపరముగా ఏకాదశ ద్వాదశ స్కంధము లనువదించిన హరిభట్టు పద్యములును నారయ కవిత్వమును తరువాతి వారు కలిపివేసియుందురు. హరిభట్టు ఖమ్మంమెట్టులో ఇంచు మించుగా నారయకు సమకాలమం దున్నవాఁడు. నారయ పూర్వుల నివాసము కరీంనగర మండల మందలి వెలిగందల యగుటచే నాతనికి వెలిగందల యింటి పేరైనది.

***గంగన :-*** పంచమ స్కంధమును పూరించినవాఁడు బొప్పనామాత్య పుత్రుఁడు గంగనార్యుఁడు. స్కంధాంత గద్యమువలన నీతని గుఱించి యింతకన్న నెక్కుడు తెలియరాదు.

ఆద్యంతములం దీతఁడు శ్రీకృష్ణుని సంబోధించి వ్రాసినాఁడు. భాగవతమందలి తక్కిన స్కంధ ములవలెఁ గాక పంచమ స్కంధమున రెండాశ్వాసముల విభజన మున్నది. మేము పరిశీలించిన కొన్ని తాళపత్ర గ్రంథములం దీ విభజనము కానరాలేదు. కొన్నింటిలో స్కంధాంత గద్యములు కూడ పోతన పేరితో నుండుటేకాక ఆద్యంతము లందలి పద్యములు కూడ శ్రీరామచంద్ర పరముగా నున్నవి. దీనినిబట్టి పంచమ స్కంధమున కొంత పోతన కవిత్వ మున్నదనియు ఎక్కువ భాగము గంగన చేసిన శిథిల పూరణమనియు నూహింపవచ్చును.

***సింగన*** :-షష్ఠస్కంధమును రచించినవాఁడు ఏర్చూరి సింగయామాత్యుఁడు. శ్రీవత్స గోత్రుఁడైన కసువయ మంత్రికి ముమ్మడమ్మకు జ్యేష్ఠపుత్రుఁడు. భాగవతము నందాతఁడు పేర్కొన్న వంశావతార మిట్లున్నది.

ఎఱ్ఱన ప్రెగ్గడ (ఏర్చూరి శాసనుఁడు)
|
వీరన
|
ఆదెయామాత్యుఁడు (భార్య-పోలమాంబ)

కసువనామాత్యుఁడు (భార్య-ముమ్మడమ్మ) — వీరన మంత్రి — సింగయ

(కసువనామాత్యుని పుత్రులు:) సింగన (గ్రంథకర్త) — తెలగయ

ఏర్చూరు గ్రామము కూడ ఓరుగల్లు మండలములోనిదే. సింగన పూర్వకవి స్తుతిలో నొక పద్యమున ప్రత్యేకముగా పోతనను స్తుతించినాఁడు. షష్ఠస్కంధము శిథిలమై పోయినట్లు గాని యితర కారణములు గాని చెప్పక స్వతంత్ర కృతి యట్లే స్వప్నవృత్తాంతము షష్ఠ్యంతములు మున్నగునవి కూర్చినాఁడు. పోతనవలెనే తన తల్లిని గూర్చియు భాగవతమును గూర్చియు పద్యములు వ్రాసినాఁడు. ఈతఁడు కూడ శివ పూజా ధురంధరుఁడయ్యు శ్రీకృష్ణున కంకితముగా నీ షష్ఠస్కంధమును రచించినాఁడు. ఈతఁడు కూడ గంగయకు సమకాలీనుఁడనియే యూహింప వచ్చును. కొన్ని తాళపత్ర గ్రంథము లందలి షష్ఠస్కంధ గద్యములు పోతనామాత్యుని పేరితో నున్నవి.

షష్ఠస్కంధమును సింగయ కాక మఱికొందఱు కవులు గూడ రచించినారు. వరాహ పురాణము, ప్రబోధచంద్రోదయము మున్నగు గ్రంథములు రచించిన జంటకవులు నంది మల్లయ, ఘంట సింగయలు కూడ షష్ఠస్కంధమును రచించిరి. ఈ గ్రంథ మిప్పుడు లభించుట లేదు. కాని లక్షణ గ్రంథములలో కవుల షష్ఠమనియు శృంగార షష్ఠమనియు పేర్కొనఁబడినది. ఇటులే సర్వజ్ఞ రచించిన షష్ఠస్కంధము కూడ ప్రబంధరత్నావళిలో పేర్కొనఁబడినదే కాని

నేఁ డుపలభ్యము కాదు. ఏకాదశ ద్వాదశస్కంధములు రచించిన హరిభట్టు కూడ షష్ఠస్కంధమును రచించెను. ఈ గ్రంథ మముద్రిత మైనను దీని తాళపత్ర ప్రతులు లభించుచున్నవి. హరిభట్టు పదునాఱవ శతాబ్దము ప్రారంభ మందున్న గొప్ప పండిత కవి. ఖమ్మంమెట్టువాసి. మత్స్యపురాణము, వరాహపురాణము, ఉత్తర నారసింహపురాణము మున్నగునవి యీతని యితర కృతులు.

**భాగవతము - అనువాద పద్ధతి :**

ఆంధ్రభాష క్రీస్తుశకారంభము నుండియు జనవ్యవహారమున నుండె నని చెప్పుట కవకాశము లున్నను అందు ఉత్తమములైన కావ్యములు వెలువడుట క్రీ. శ. 11 వ శతాబ్ది నడుమ నుండియే. ఆంధ్ర వాఙ్మయ మందలి యాదికావ్యము మహాభారతము. ఆదియు నా కాలమున వెలువడిన యితర కావ్యములును పెక్కు సంస్కృతమునుండి యనువదింపఁబడి నట్టివే. అందుచేతనే యా యుగమును బలువు రనువాదయుగమని పేర్కొనియున్నారు. ఎఱ్ఱాప్రెగ్గడ యనంతరము కొన్ని స్వతంత్ర కావ్యములు రచింపఁబడినను అనువాదములుకూడ సాగుచునే యుండెను. ఇప్పటికిని సంస్కృతము, ఆంగ్లము, హిందీ, బెంగాలీ మున్నగు భాషలందలి గ్రంథముల కాంధ్రానువాదములు వెలువడుచునే యున్నవి. ఆంధ్రము నందలి యనువాద విధానమును ప్రధానముగా మూఁడు తెఱఁగులుగా విభజింపవచ్చును. అందు మొదటిది స్వతంత్రానువాదము లేక కథానువాదము. దీనికిఁ గవిత్రయము వారి భారతమే నిదర్శనము. ఆ మహాకవులు వ్యాస భారతమందలి కథను మాత్రము గ్రహించి అనవసరములని తోఁచిన భాగములను విడిచియు లేక తగ్గించియు, నవసరమని తోఁచిన చోట్లఁ గొన్ని నూత్న వర్ణనాదులను జొప్పించియు, ననుచితములని తోఁచిన సందర్భములం దన్యథా కల్పనలు కావించియు, హృద్యములైన భాగములను యథాతథముగా ననుసరించియు రచన సాగించి యనువాదమును గూడ నొక స్వతంత్ర కావ్యముగాఁ బ్రతిభాసింపఁ జేసిరి. ఆంధ్ర భారతమును సంస్కృత భారతముతోఁ బోల్చి చూచినచో నం దనువదించిన భాగముల కంటె యథేచ్ఛముగా రచన సాగించిన భాగములే యెక్కువగా గోచరించును. కాని కథా సూత్రము మాత్రము విచ్ఛిన్నము గాక రెండింట నేకరీతిగా సాగిపోవుచుండును. అందుచేతనే స్వతంత్రమైన యీ యనువాద విధానమును కథానువాద మనుట యుక్తముగా నుండును.

రెండవది భావానువాదము. దీనికి శ్రీనాథుని నైషధానువాదము నిదర్శనము. శ్రీనాథుఁడు కూడ నైషధమున నచ్చటచ్చట నూతనముగాఁ గల్పించిన పద్యభాగములు లేకపోలేదు; కాని యట్టి సందర్భములు చాల తక్కువ. ఆతఁడు ప్రతిశ్లోకమును జదివి, యందలి భావము జీర్ణము చేసికొని, యది యొక్కింతయుఁ జెదరి పోకుండ ననువాదమునఁ జక్కగా వ్యక్తము చేసియుండెను. ఆతఁడు తన యనువాదమునఁ గథకును భావములకును గూడ సమాన ప్రాధాన్య మొసంగెను. అందు మూలము నందలి పదము లన్నియు ననూదితములైనను గాకపోయినను కథా భావములు మాత్రము యథాతథముగా సాగివచ్చుచుండును. ఈ యనువాద విధాన మత్యంత స్వతంత్రమును గాదు; అత్యంత మూలవిధేయమును గాదు. ఇందు మూలానుసరణమును, అనువాదకుని ప్రతిభయు నెన్నగా గోచరించుచుండును.

మూఁడవది యథాతథానువాదము. దీనిని ఐదానువాదమని కూడ ననవచ్చును. దీని కాధునికుల నాటకాంధ్రీకరణములు తార్కాణములు. వీరు మూలమునందలి కథాభావములనే కాక పదములను గూడ సమగ్రముగా ననువదింప యత్నింతురు. మూలపదము లన్నియు సరిగా ననువాదమున కెక్కినవో లేదో చూతురే కాని వీరు మూలభావము స్పష్టముగా వ్యక్తమైనదా లేదా యని పరిశీలింపరు. ఇది సాధారణముగాఁ జెప్పినమాట. ఆధునిక కాలమునఁ గూడ నుత్తమములైన యనువాదములు కొన్ని లేకపోలేదు. కాని యట్టివి చాల తక్కువ. అందుచేతనే యాధునికుల యనువాదములు పెక్కు మూలము చూచినఁగాని సులభముగా నర్థముకావు.

ఆంధ్ర మహాభాగవతము శ్రీనాథయుగమున వెలసిన మహాకావ్యము. దీనికి మూలము వ్యాసరచితమైన సంస్కృత భాగవతము. పోతన దీని ననువదించు పట్లఁ గవిత్రయమువారి స్వతంత్ర విధానమును, సమకాలికుఁడైన శ్రీనాథుని భావానువాద విధానమును గూడ ననుసరించెను. అతని స్వతంత్రత సంకోచపఱచుట యందును, అన్యథా కల్పన మొనరించుట యందును గాక మూలమును బెంపొందించుట యందుఁ గాననగును. అతడుఁ సహజముగా మహాభక్తుఁడు కావునను, భాగవతము భక్తచరిత్రములకు నిధానము కావునను, భక్తులు భగవంతుని గుణమహిమానుభావవర్ణనములు కావించు సందర్భములు వచ్చినప్పు డతడు పరవశుఁడై మూలము నందలి భక్తిభావములకుఁ దన సొంత భావములను గూడ జతచేసి కొంత పెంపు చేకూర్చుచుండును. ఇట్టి భాగములందు మాత్రమే యతని స్వతంత్రత యెక్కువగా గోచరించుచుండును. అట్లే మూలమునఁ గ్లిష్టములైన తాత్త్వికవిషయములు చెప్పఁబడు నప్పుడతఁ డాక్లిష్టతను దొలఁగించుటకై వ్యాఖ్యానముల సాహాయ్యమున నట్టి భాగములను వివరణ రూపముగా ననువదించుచుండును. ఇట్టి భాగములు మూలవ్యాఖ్యానములు రెండింటికి ననువాదములని చెప్పఁదగినవి. ఇందు పోతన స్వతంత్రత కనఁబడదు కాని వ్యాఖ్యానము సాహాయ్యమున నతఁడు కావించిన పెంపు మాత్రము కనఁబడుచుండును. మిగిలిన చోట్ల నాతఁడు శ్రీనాథుని మార్గము ననుసరించి శ్లోకము లందలి విషయమును గాని భావములనుగాని విడువక యథోచితముగా ననువాదము కావించుకొని పోవుచుండును. అందుచే పోతన యనువాదము శ్రీనాథుని యనువాదమువలె మూలానుసారి యయ్యు నెడ నెడ కవిత్రయమువారి యనువాదము వలె స్వతంత్రమై యింపు నింపుచుండును.

శ్రీనాథుఁడు మహాపండితుఁడు. ఆతఁడు తననాఁటికిఁ బ్రసిద్ధములైన యుత్తమ సంస్కృతాంధ్ర కావ్యము లన్నింటిని గబళించిన వ్యుత్పత్తి గౌరవము కలవాఁడు. కాశీఖండాదుల ననువదించుపట్ల నతఁడు తన హృదయము నాకర్షించిన పూర్వకవుల యుదాత్తభావ సంపూర్ణములైన శ్లోకముల నెన్నిటినో సందర్భానుగుణముగా ననువదించి యందందుఁ జొప్పించినాఁడు. అందు కతఁడు కాశీఖండములో వింధ్యపర్వత గర్వ సంస్తంభన సందర్భమునఁ గావించిన మయూర సూర్యశతక శ్లోకానువాదములు నిదర్శనములు. పోతరాజును భాగవతమున నిట్టి యత్నము నొక్కచోఁ గావించినాఁడు. అతఁడు నరకాసుర సంహార ఘట్టమున సత్యభామ యుద్ధము నత్యంత మనోహరముగా వర్ణించియున్నాఁడు. ఈ భాగము సంస్కృత భాగవతమున లేదు. పోతన దానిని విష్ణుపురాణము నుండియో, నాచన సోమనాథుని యుత్తర హరివంశము నుండియో గ్రహించి

యింపుఁ జొప్పించినాఁడు. ఇట్లాతఁ డితర గ్రంథముల నుండి గ్రహించి యింపుఁ జొప్పించిన భాగ మిదొక్కటియే.

మూలము.

శ్లో. ఇంద్రేణ హృతఛత్రేణ హృతకుండల బంధునా
హృతామరాద్రిస్థానేన జ్ఞాపితో భౌమచేష్టితమ్ 10-59-2
సభార్యో గరుడారూఢః ప్రాగ్జ్యోతిషపురం యయౌ
గిరిదుర్గైశ్శస్త్రదుర్గై ర్జలాద్యనిల దుర్గమమ్. 59-3

నరకాసుర వధార్థమై భార్యతోఁ గూడ గరుడ వాహనారూఢుఁడై కృష్ణుఁడు ప్రాగ్జ్యోతిష పురమున కరిగెనని మాత్రము మూలమున నుండ పోతన కృష్ణుఁ డరుగుచుండ సత్యభామ తన్నుఁ గూడ యుద్ధమునకుఁ గొనిపొమ్మని యడుగుటయుఁ, గృష్ణుఁడు మొదట వారింపఁజూచియు నామె వచ్చెదనని పట్టు పట్టుటచే నామెను గూడఁ గొనిపోవుటయు, 7 (ఉత్తర. 151-156) పద్యములలో వర్ణించెను. సత్యభామ నరకాసురునితో యుద్ధము జేయుట మూలమున లేనే లేదు. దానిని పోతన (171 మొదలు 188 వఱకు) 17 పద్యములలో విస్తృతముగా వర్ణించెను. తరువాత 189, 190, 191 పద్యములలోఁ గల హరి నరకాసుర సంవాదము కూడా మూలమునఁ గానరాదు.

**పోతన స్వయముగాఁ బెంచిన భాగములు :**

(అ) హిరణ్యకశిపుః.

శ్లో. ప్రహ్లాద ! ఉచ్యతాం తాత స్వధీతం కించి దుత్తమమ్
కాలే నైతావ తాయుష్మన్ యదశిక్ష ద్గురోర్భవాన్. 7-5-22

ప్రహ్లాద ఉవాచ.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్. 5-23
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధా తన్మన్యే ఒధీతముత్తమమ్. 5-24

ఈ విధముగా మూలమున హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునిఁ దొడమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని యేమి చదివితి వని యడిగిన ప్రశ్నయు దానికిఁ బ్రహ్లాదుఁ డొసంగిన సమాధానమును జాల సంక్షిప్తములుగా నున్నవి. పోతన యా ప్రశ్నోత్తరములు రెండింటిని జాల పెంచి వ్రాసెను.

చోద్యంబయ్యెడి నింతకాల మరిగెన్. 7-163
నిన్ను న్మెచ్చరు నీతి పాఠ మహిమన్. 7-164

అను నవి ప్రశ్నయందలి భాగములు. ఇందు మొదటి పద్యము నందలి రెండు పాదములు మాత్రము మూలానుసారులుగా నున్నవి. మిగిలిన భాగమంతయుఁ బోతన పెంచి వ్రాసినదే.

అనిన గన్న తండ్రికిఁ బ్రియనందనుం డయిన ప్రహ్లాదుం డిట్లనియె. 7-165
చదివించిరి నను గురువులు 7-166

| | |
|---|---|
| తను హృద్భాషల సఖ్యమున్ | 7-167 |
| అంధేందూదయముల్ | 7-168 |
| కమలాక్షు నర్చించు కరములు కరములు | 7-169 |
| కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే | 7-170 |
| సంసారజీమూత సంఘంబు విచ్చునే | 7-171 |

ఈ సమాధానమున 167 వ పద్యమున కొక్కఁడానికే మూలమున నాకరమున్నది. ిగిలినదంతయుఁ బోతన కల్పితము.

(ఆ) హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని విద్యాభ్యాసమునకై చండామార్కుల కప్పగించెను. వారితర రాక్షసబాలకులతోఁ గూడఁ బ్రహ్లాదుని సెన్నగాఁ జదివించిరి. పిమ్మట.

శ్లో. ఏకదా సురరా ట్పుత్ర మంక మారోప్య పాండవ
పప్రచ్ఛ కథ్యతాం వత్స ! మన్యతే సాధు యద్భవాన్. 7-5-4

ప్రహ్లాద ఉవాచ.

తత్సాధు మన్యే ఽసురవర్య దేహినాం సదా సముద్విగ్నధియా మసద్గ్రహాత్
హిత్వాత్మపాతం గృహ మంధకూపం వనం గతో యద్ధరి మాశ్రయేత. 7-5-5

శ్రీ నారద ఉవాచ.

శ్లో. శ్రుత్వా పుత్రగిరో దైత్యః పరపక్షే సమాహితాః
జహాస బుద్ధి ర్బాలానాం భిద్యతే పరబుద్ధిభిః 7-5-6
సమ్యగ్విధార్యతాం బాలో గురు గేహే ద్విజాతిభిః
విష్ణుపక్షైః ప్రతిచ్ఛన్నై ర్న భిద్యే తాస్య ధీర్యథా 5-7
గృహ మానీత మాహూయ ప్రహ్లాదం దైత్య యాజకాః
ప్రశస్య శ్లక్ష్ణయా వాచా త మపృచ్ఛన్ హి సామభిః 5-8
వత్స ప్రహ్లాద భద్రం తే సత్యం కథయ మామృషా
బాలా నతి కుత స్తుభ్య మేష బుద్ధివిపర్యయః 5-9
బుద్ధిభేదః పరకృత ఉతాహో తే స్వతో ఽభవత్
భణ్యతాం శ్రోతుకామానాం గురూణాం కులనందన 5-10

ప్రహ్లాద ఉవాచ.

శ్లో. పర స్స్వశ్చేత్యసద్గ్రాహః పుంసాం యన్మాయయా కృతః
విమోహితధియాం దృష్టః తస్మై భగవతే నమః. 5-11
స యదానువ్రతః పుంసాం పశుబుద్ధి ర్విభిద్యతే
అన్య ఏష తథాన్యో ఽహ మితి భేదగతా సతీ. 5-12
స ఏష ఆత్మా స్వపరే త్యబుద్ధిభి ర్దురత్యయానుక్రమణో నిరూప్యతే
ముహ్యన్తి యద్వర్త్మని వేదవాదినో బ్రహ్మాదయో హ్యేష భినత్తి మే మతిమ్.5-13

యథా భ్రామ్య త్యయో బ్రహ్మన్ స్వయ మాకర్ష సన్నిధౌ
తథా మే భిద్యతే చేత శ్చక్రపాణే ర్యదృచ్ఛయా. 5-14

పై భాగమునకు పోతన చేసిన యనువాదము 136 వ పద్యము మొదలు 150వ పద్యము వరకు నున్నది. ఇందు—

మోదమునతోడ దైత్యపురం బున్నాఁడు 7-137
ఉత్సాహ ప్రభు మంత్ర శక్తి యుతమై 7-139
అనుదిన సంతోషణములు 7-140
ఎట్టాడిన నట్టాడుదురు 7-144
నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడిఁ గదా 7-145
సురలం దోలుటయో సురాధిపతులన్ స్రుక్కించుటో 7-146

అను పద్యములు పోతన కల్పించినవి. తరువాత హిరణ్యకశిపుఁడు విష్ణు పక్షములచేఁ బ్రహ్లాదుని బుద్ధి కలఁగకుండ నతనికి గురుగృహమున బోధన లెస్సగా జరుగుఁ గాక యని పల్కి వారినిఁ బంపివైచెను. అంత గురువు లతని నింటికిఁ గొనివచ్చి నీకీ బుద్ధివిపర్యయము పర ప్రబోధితమా లేక స్వయంకల్పితమా చెప్పు మని యడిగిరి. ప్రహ్లాదుఁడు :

అజ్ఞుల్ కొందఱు నేను దామనుచు 7-148
ఇను మయస్కాంత సన్నిధి 7-149
మందార మకరంద మాధుర్యమునఁ దేలు 7-150

అను పద్యములతో సమాధానము చెప్పెను. ఇందు మందార మకరందేత్యాది పద్యములు పోతన స్వకపోల కల్పితము. ఇచ్చట కథా సందర్భమునఁ గూడ మూలానువాదములకుఁ గొంత భేదమున్నది. మూలమున దేవయాజకులు ప్రహ్లాదు నింటికిఁ గొనివచ్చి నీకీ బుద్ధివిపర్యయ మెట్లు కల్గినదని యడుగఁగాఁ బ్రహ్లాదుఁడు వారికి పైరీతిగా సమాధానము చెప్పినట్లున్నది. అనువాదమున గురువులు ప్రహ్లాదు నింటికిఁ గొనిపోలేదు. అచ్చట నుండఁగనే తండ్రి చెప్పిన (145-146) మాటలు విని ప్రహ్లాదుఁడు పురోహితు నీక్షించి యీ మాటలు చెప్పినట్లున్నది. ''ఇనుమయస్కాంత సన్నిధి'' యను పద్యము మూల శ్లోకమునకు యథాతథమైన యనువాదము (7-5-14.).

(ఇ) నక్రము నుండి తన్ను రక్షింప గజేంద్రుఁడు చేసిన స్తోత్ర మాలించి యంబుజాసనాదు లూరకుండ విష్ణుఁడు భక్తుని రక్షింపఁ దలంచె నని చెప్పఁబడిన పిమ్మట మూలమున :

శ్లో. తం తద్వదార్త ముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్య దివిజైస్సహ సంస్తువద్భిః
ఛందోమయేన గరుడేన స ఊహ్యమాన
శ్చక్రాయుధో ఽభ్యగమ దాశు యతో గజేంద్రః. 8-3-31

సోంతస్సర స్యురుబలేన గృహీత ఆర్తో
దృష్ట్వా గరుత్మతి హరిం ఖ ఉపాత్తచక్రమ్

ఉత్క్షిప్య సాంబుజకరం గిర మాహ కృచ్ఛ్రా
న్నారాయణాఖిలగురో భగవ న్నమస్తే. 8-32

తం వీక్ష్య పీడిత మజ స్సహసావతీర్య
సగ్రాహ మాశుసరసః కృపయోజ్జహార
గ్రాహాద్విపాటిత ముఖా దరిణా గజేంద్రం
సంపశ్యతాం హరి రమూముచ దుస్రియాణామ్. 8-33

అని కలదు. పోతన యీ సందర్భమునఁ గావించిన పెం పెంత విస్తృతమో యంత సరసమై యున్నది.

| | |
|---|---|
| అల వైకుంఠపురంబులో | 8-95 |
| సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగమున్ | 8-96 |
| ఇట్లు భక్తజన పాలన పరాయణుండును | 8-97 |
| తనవెంటన్ సిరి లచ్చివెంట నవరోధవ్రాతమున్ | 8-98 |
| తదనంతరంబ | 8-99 |
| తన వెంచేయు పదంబుఁ బేర్కొ-నఁడు | 8-100 |
| అని వితర్కిం-పుచు | 8-101 |
| తాటంకా చలనంబుతో | 8-102 |
| అడిగెద నని | 8-103 |
| నిటలాలకము లంట నివుర జుం జుమ్మని | 8-104 |
| వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ | 8-105 |
| అయ్యవసరంబునఁ గుంజరేంద్ర పాలన పారవశ్యంబున | 8-108 |

ఈ పద్యము లన్నియు పోతన కల్పించినవే. ఇందు భగవంతుని భక్తరక్షణ పరాయణత మిక్కిలి యౌచిత్యశోభితముగా వర్ణింపఁబడినది. 108 వ గద్యము నందలి సరోవర్ణనము శ్లేషాలంకారముతోఁ గూడి బాణుని వచనమును దలపించుచున్నది.

(ఈ) వామనావతార ఘట్టమున పోతన పెంచిన భాగములు పెక్కు-గలవు.

1. బలిచక్రవర్తి స్వర్గముపై దాడివెడలిన సందర్భమున 15 వ అధ్యాయములో 11 మొదలు 22 వ శ్లోకము వఱకు స్వర్గవర్ణన మున్నది. పోతన యీ వర్ణనమును జాల పెంచి శబ్దార్థాలంకార యుతమైన యతిదీర్ఘ వచనము రచించెను. ఇందులోఁ గొంచె మించు మించుగా నంతయు నతఁడు కల్పించి వ్రాసినట్టిదే. కొన్ని తా. వ. ప్రతులలో నీ వచనమునకు స్వర్గ వర్ణన వచనము ప్రత్యేక శీర్షిక యున్నది.

2. బలిధాటి కాగలేక దివిజులు త్రివిష్టపము విడిచి తమతమ పొందుపట్టులకుం జన బలి స్వర్గమంతయు నాక్రమించి విశ్వవిజయుఁడై రాజ్యము చేయుచుండెను. తన కుమారుల పాటు చూచి యదితి వంతనొందుచుండఁ గశ్యపుఁ డామెకడ కరుదెంచి కుశల ప్రశ్నము గావించెను. ఆమె దైత్యులు తన కుమారుల వెడలనడిచి స్వర్గము నాక్రమించిన వృత్తాంతము తెల్పి వారిని

శాసించి దేవతల మరల స్వర్గమున స్థాపింపవలసిన దని ప్రార్థించెను. ఈ విషయము మూలమునఁ గూడ నున్నది (8-16. 14-17.). తెలుఁగు భాగవతమునందీ సందర్భమున :

అక్కా చెల్లెండ్రయ్యును 8-470

ఎండ కన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు పలుపంచలను జాలిఁబడియె నేడు 8-471

అను రెండమూలకము లైన పద్యము లున్నవి. ఇందు మొదటిదాన నదితి స్త్రీ స్వభావమును రెండవదాన దేవతల దైన్యమును సందర్భోచితముగా వర్ణింపఁబడినవి.

3. అదితి పయోభక్షణ వ్రతమాచరించిన పిమ్మట చతుర్భుజుఁ డైన నారాయణుఁడు ప్రత్యక్ష మయ్యెను. అదితి యతని స్తోత్రము చేసెను. ఈ స్తోత్రమైన పిమ్మట తెలుఁగున

అసురవరులు సురల నదలించి బెదరించి నాకమేలుచున్న నాఁటనుండి

కన్నకడుపు గాసఁ గంటఁ గూరుకురాదు కడుపుఁబొక్కు మాన్పి కావవయ్య. 8-484

అను పద్యమున్నది. ఈ భావము మూలమున లేదు. ఇది అదితి మాతృహృదయమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నది.

4. అదితి గర్భము ధరించిన పిమ్మట నా సంగతి యెఱింగి బ్రహ్మ గర్భస్థుఁ డైన నారాయణుని స్తుతించినట్లు మూలమున నున్నది (8-17. 24-27). బ్రహ్మ కావించిన స్తుతి తెలుఁగునఁ గూడ నున్నది. కాని యంతకు ముందు గర్భవర్ణనముతోఁ గూడిన యీ క్రింది పద్యములు చేర్చఁబడినవి. ఈ వర్ణన మమూలకమయ్యు సందర్భోచితమై మిక్కిలి రమణీయముగా నున్నది.

చలచలనై పిదపిదనై 8-493

నెలఁతకుఁ జూలై నెల రెన్నెలలై 8-494

మహితతర మేఘమాలా 8-495

తన కడుపున నొక యిరవున 8-496

అంత నక్కాంతా తిలకంబు క్రమక్రమంబున 8-497

నిలిపెన్ ఱెప్పల బృందమున్ 8-498

పెట్టుదురు నుదుట భూతిని 8-499

ఇవ్విధంబున 8-500

విశ్వగర్భుఁడు తనగర్భ వివరమందు 8-501

అట్లే వామనుఁడు తల్లియింట కుమార సముచితాలాపంబు లాడుచుఁ గ్రీడించు సమయమునఁ దనయు విలోకన పరిణామ పారవశ్యమున నదితి పల్కిన పల్కులు, చేసిన చేష్టలు పోతన రెండు మూఁడు పద్యములలో హృద్యముగా వర్ణించెను (8-513, 514, 515). వానికి సరియైన భావములు మూలమునఁ గానరావు.

5. వామనుఁ డనంతమున వెళ్ళిన పిమ్మట బలిచక్రవర్తిని జూడ నేగెనని సంస్కృత భాగవత మీ క్రింది శ్లోకమునఁ జెప్పుచున్నది.

శ్రుత్వాశ్వమేధై ర్యజమాన మూర్జితం బలిం భృగూణా ముపకల్పితై స్తతః

జగామ తత్రాఖిలసారసంభృతో భారేణ గాం సన్నమయన్ పదేపదే. 8-18-20

పోతన, దేశాంతర సమాగతులైన బ్రాహ్మణుల వలన బలివదాన్యతను గూర్చి విని, వామనుఁడు భిక్షార్థమై బలియింటి కరిగెనని (8-520-526) యాఱు పద్యములలో నా విషయమును జక్కఁగాఁ బెంచి వ్రాసెను.

6. వామనుఁడు త్రోవలో నర్మదానదిని దాఁటి తత్ప్రవాహమున కుత్తరతటమునఁ గల బలిమఖాంతర్వాటికను గాంచెనని పోతన యంత్యానుప్రాసముతోఁ గూడిన 'చండసూర్యాగ్ని వటుండు గాంచె' (531) నను పద్యము రచించెను. ఇది యమూలకమైనది. పోతన యంత్యానుప్రాసలతో రచించిన పద్యములు పెక్కౌతని స్వకపోల కల్పితములే.

7. సంస్కృత భాగవతము వామనుఁడు హయమేధవాటమును ప్రవేశించుటను

ఇత్థం సశిష్యేషు భృగుష్వనేకధా వితర్క్యమాణో భగవాన్ స వామనః
సదండఛత్రం సజలం కమండలుం వివేశ బిభ్ర ద్ధయమేధవాటమ్. 8-18-23

అని వర్ణించెను. పోతన వామనుఁడు హయమేధవాటమును జేరి చేసిన వినోదములను, వింత చేష్టలను, రాజును గాంచి చేయెత్తి యాశీర్వదించుటను గీ క్రింది పద్యములలో విపులముగా వర్ణించెను.

| | |
|---|---|
| చవులుగాఁ జెపుంకు సామగానంబులు | 8-536 మఱియును 537 |
| వెఱచుచు వంగుచు వ్రాలుచు | 8-538 |
| కొందఱితోఁ జర్చించును గొందఱితో జటలు సెప్పు | 8-539 |
| మఱియు ననేక విధంబుల నందఱకు | 8-540 |
| వెడ వెడ నడకలు నడచుచు | 8-541 |
| ఇట్లు దగ్గఱి మాయా భిక్షుకుండు | 8-542 |
| ఇతఁడే దానవ చక్రవర్తి | 8-543 |
| ఇట్లు కుశపవిత్రాక్షత యుతంబగు | 8-544 |
| స్వస్తి జగత్త్రయీ భువన శాసనకర్తకు | 8-545 |

8. బలి వామనుని "వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు, నీ కేమి కావలయునో తెలుపు" మని యడుగ వామనుఁడు చెప్పిన సమాధానము వ్యంగ్యపూరితమై యాతని భగవత్తత్త్వమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నది. "ఇది నాకు నెలవని యే రీతిఁ బలుకుదు" (8-552). ఇట్టి సందర్భములందు పోతన కావించు వ్యంగ్య రచన లద్భుతములై యత్యంత మనోహరముగా నుండును. అందుఁ బలితలకు సామాన్య విశేషార్థములు రెండును గోచరించు చుండును.

9. బలిని మూఁడడుగుల నేల యిమ్మని యడుగుచు వామనుఁడు రాజ్యమున్నప్పుడు పూజ్యులకును, యాచకులకును, భూసురులకును నొసంగనిచో నట్టి వాని జన్మధన గేహములు వ్యర్థములని పల్కి బలి వదాన్యతను బొగడుట (564, 565) మూలమునఁ గానరాదు.

10. శుక్రుఁడు వామనుని యథార్థ వృత్తాంత మెఱింగించి యాతనికి మూఁడడుగుల నేల యీవలదని బోధించి నప్పుడు బలిచక్రవర్తి సత్యపదవీ ప్రమాణ తత్పరుఁడై పలికిన పలుకులు మూలమునఁ గూడఁ గొన్ని యున్నవి ( 8-20-2-13 ). పోతన మూలము నందలి

భావములకు వన్నె చిన్నెలు గలిగించి యీ భాగమును యథేచ్ఛముగాఁ బెంచి వ్రాసెను (8-588-595). వీనిలో ఆదిన్ శ్రీసతి కొప్పుపై (591), ఎన్నఁడుం బరు వేఁడఁబోఁడఁట (595) అను పద్యము లుదాత్తభావ బంధురములై పోతన కవితా ప్రతిభను వేనోళ్ళఁ జాటుచున్నవి.

(ఉ) దశమ స్కంధము నందలి అష్టమాధ్యాయమున బలరామ కృష్ణుల బాలక్రీడలును (22-28), గోపికలు యశోదతోఁ జెప్పిన వారి చపలకృత్యములును (29-33) వర్ణింపఁబడినవి.

> కాలేన వ్రజతా తాత! గోకులే రామకేశవౌ
> జానుభ్యాం సహపాణిభ్యాం దమమాణౌ విజహ్రతుః.

ఇది వారి బాలక్రీడలను వర్ణించు మొదటి శ్లోకము.

> కృష్ణస్య గోప్యో రుచిరం వీక్ష్య కౌమారచాపలమ్
> శృణ్వంత్యాః కిల తన్మాతు రితి హోచు స్సమాగతాః.

అనునది వారి కౌమార చాపలమును వర్ణించు మొదటి శ్లోకము. పోతన యిచ్చటి పంద్రెండు శ్లోకములను జాల పెంచి బలరామకృష్ణుల క్రీడా విశేషములను సహజ మనోహరముగా వర్ణించెను (90-209-329). "తనువున నంటిన ధరణీపరాగంబు" (10-297) అను పద్యమున "ప్రౌఢ బాలకుండు శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును వేఱులేమి దెల్పవెలయునట్లు" అని శివకేశవుల యభేదమును లెస్సగా సూచించెను. "గోవల్లభుఁడ నేను గోవులు మీరని పడిఱంకె వైచుచు వంగి యాడు" (10-304) అను పద్యము కృష్ణుని మహత్త్వముతో పాటు సహజ బాలక్రీడా పరాయణత్వమును గూడఁ జక్కఁగా విశదీకరించుచున్నది. గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁ జేఁతలను యశోదాదేవితోఁ జెప్పు సందర్భమున పోతన సుమా రిరువదిరెండు పద్యములు వ్రాసినాఁడు. ఇందు పెక్కు కంద పద్యములు. మూలమున నట మూఁడు, నాలుగు శ్లోకము లున్నవి. ఇందు వెన్న దొంగిలించి భక్షించుట, పరిహాసము చేయుట, మేహనాదు లొనర్చుట మున్నగు కృత్యములు మాత్రము వర్ణింపఁబడినవి. పోతన వేలుపుల గోడపై నెంగిలిచేయుట, పిన్నదాని చన్నొడిసిపట్టి చీరుట, కెమ్మోవి కఱచుట, జలకమాడుచున్న యువతి వలువ దెచ్చుట, యొక చెలువను నాతో వచ్చెదవా యని యడుగుట, తన్ను మగనిగా గైకొనినచోఁ గొడుకులు కలిగెదరని పలుకుట, చూలగుటకు మూల మేదని యడుగుట, కాంతలను మంతనమునకుఁ జేరి పొంద నడుగుట, నిద్రించుచున్న తెఱవ వలువ వీడ్చి తేలుం గఱపించుట, తరుణి యొకతె పెరుఁగు ద్రచ్చుచుండగా వెనుకనుండి వచ్చి మగపోడుము లొనర్చుట మున్నగు శృంగార రసాను కూలము లైన ధూర్త కృత్యములు గూడ వర్ణించెను.

(ఊ) దశమస్కంధ మందలి 30 వ అధ్యాయమున గోపికలు కృష్ణునిఁ గానక వెదకుచుఁ బరవశలై చేసిన వింతచేష్టలు వర్ణింపఁబడినవి. పోతన మూలము నందలి భావములకు తన సొంత భావములను గూడఁ జేర్చి యీ భాగము నత్యంత మనోజ్ఞముగా వర్ణించినాఁడు. "నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు" (10-1010), "ఈ చరణంబులే యిందు నిభాసన సనకాది మునియోగ సరణి నొప్పె" (10-1029) మున్నగు పద్యము లీ ఘట్టము నందలివే.

(ఋ) రుక్మిణీ కల్యాణ కథా సందర్భమునఁ బోతన గావించిన యమూలక కల్పన లిటఁ బేర్కొనఁబడుచున్నవి.

1. మూలము, భీష్మకుని కైదుగురు కుమారులు నొక కుమార్తెయుఁ గలరని చెప్పి వెంటనే బంధువు లందఱును రుక్మిణిని కృష్ణుని కీయఁ దలంచుచుండఁ గృష్ణ విరోధియైన రుక్మి యామెను జైద్యున కీయఁ జూచెనని కల్యాణ కథారంభము కావించుచున్నది. పోతన యిట మూఁడు నాలుగు పద్యములలో రుక్మిణీ బాల్య యౌవనములను వర్ణించెను.

బాలేందు రేఖ దోఁచిన 10-1685

మఱియు దినదిన ప్రవర్ధమానయై 10-1686

పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు 1687 మఱియు 1688

దేవకీసుతుకోర్కి తీఁగెలు పీడంగ 10-1689

"పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయించు" నను పద్యము పూర్వ మాంధ్రదేశమున ధనికుల యిండ్ల వివాహోచిత వయస్కలైన కన్యలాచరించుచుండిన క్రీడా విశేషముల నెంతో సహజముగా వర్ణించుచున్నది. "దేవకీసుతు కోర్కి" యను సీసము కృష్ణప్రణయ రుక్మిణీ యౌవనారంభముల నుదాత్తగంభీరముగా విశదీకరించుచున్నది. మూలమునం దీ సందర్భమునఁ గృష్ణుని ప్రసక్తియే లేదు. బంధువు లందఱు రుక్మిణి నాతని కీయఁ దలంచుచుండి రను సూచన మాత్ర మున్నది. పోతన రుక్మిణీ యౌవనోదయముతో పాటు కృష్ణునికి రుక్మిణి యెడఁగల ప్రణయ భావోదయమునుగూడ వర్ణించుటయేగాక యతఁడా బాలారత్నమును దన కిల్లాలుగఁ జేకొనఁ దలంచుచుండెనని కూడఁ జెప్పియుండెను. ఇట్లు వధూవరుల కిరువురికిని బరస్పర ప్రేమాభిలాష లుదయించెనని వర్ణించుట యౌచిత్య భాసురముగా నున్నది.

2. అన్న తన్నుఁ జైద్యుని కీయఁ దలంచుట యెఱింగి రుక్మిణి ఖిన్నయై యాప్తుడైన బ్రాహ్మణు నొక్కనిఁ గృష్ణుని కడకుఁ బంపెనని సంస్కృత భాగవతమున నున్నది (10-56-26). పోతన, రుక్మిణీ బ్రాహ్మణు నొక్కనిఁ జీరి.

గర్వసంఘన్నుఁడు రుక్మి నేడు నన్నుఁ జైద్యున కిచ్చెదనంచు నున్నవాఁ
డెన్ని విధంబులం జని బుధేశ్వర చక్రికి విన్నవింపవే. 10-1695

అయ్యా కొడుకు విచారము లయ్యయి వారింపఁ జాలఁ డటు గాకుండన్
నెయ్యా మెఱిఁగించి చేరుము చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్. 10-1696

అని "కొన్ని రహస్య వచనంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకా నగరంబునకు" జనెనని రుక్మిణీ విప్రునికిం జెప్పిన విషయములు కూడ విపరించి యించుక పెంచి వ్రాసెను.

3. బ్రాహ్మణుఁడు రుక్మిణీ సందేశమును గృష్ణునికిఁ దెలుపు వృత్తాంతము మూలమున (53-38-45) 8 శ్లోకములలో వర్ణింపఁబడినది. పోతన యా భావములకుఁ దన సొంత భావములు కూడఁ జేర్చి యా సందేశమును మఱింత రసవంత మొనరించెను.

ఏ నీ గుణములు కర్ణేంద్రియములు సోఁక

... ... ... ... ... ... ...

ఏ నీ చరణ సేవ లే ప్రొద్దుఁ జేసిన భువనోన్నతత్వంబుఁ బొందఁ గలుగు
నే నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు

నట్టి నీయందు నాచిత్త మనవరతము నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణఁ జూడుము కంసారి ఖలవిదారి శ్రీయుతాకార మానినీ చిత్తచోర !

10-1701

ఈ పద్యమునందలి మొదటి రెండు పాదముల భావము మాత్రమే మూలమున నున్నది. మిగిలినది పోతన కల్పించి సీసమును జక్కగాఁ బూరించినాఁడు. అట్లే-

''ధన్యున్ లోకమనోఽభిరాము'' (1702) అను పద్యమందలి యుత్తరార్ధము ''కోరదే మును రమాకాంతాలలామంబు రాజన్యానేకపసింహ నావలననే జన్మించెనే మోహముల్'' కూడ పోతన కల్పించి వ్రాసినదే.

ప్రాణేశ నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమియేల 1708

అను సీసమునందలి భావమంతయు నమూలక మైనదే. ఇది రుక్మిణికి శ్రీకృష్ణు నెడఁ గల యనురాగ మెంత గాఢ మైనదో వ్యక్తము చేయుచున్నది.

బ్రాహ్మణుఁడు శ్రీకృష్ణునికి రుక్మిణి చెప్పిన సందేశము నెఱిఁగించిన పిమ్మటఁ దన మాటలు కూడఁ గొన్ని చెప్పెను. అవి రుక్మిణీ వర్ణన పూర్వకము లైనవి. ఇవి సందర్భోచితము లై రుక్మిణి రూప సౌష్ఠవమును రమ్యముగా విశదీకరించుచున్నవి.

పల్లవ వైభవాస్పదములు పదములు 1710
ఆ యెలనాఁగ నీకుఁ దగు 1711

4. తాను కృష్ణుని కడకుఁ బంపిన బ్రాహ్మణుఁడు తిరిగి రాకపోవుటకు శంకించి రుక్మిణి విచారించు సందర్భమునఁ గల - లగ్నంబెల్లి వివాహముం గదిసె (1723), ఘనుఁ డా భూసురుఁ డేగెనో (1724)-అను పద్యములు రెండు మాత్రమే మూలానుసారు లై యున్నవి. మిగిలిన యీ క్రింది పద్యము లన్నియు పోతన కల్పించి వ్రాసినవే.

పోఁడను బ్రాహ్మణుండు 1726
చెప్పదు తల్లికిం దలఁపుఁ జిక్కు 1727
తుడుపదు కన్నులన్ వెడలు తోయకణంబులు 1728
మృగనాభి యలదదు మృగరాజమధ్యమ 1729 మఱియును 1730
మలఁగున్ మెల్లని గాలికిన్ 1731

ఈ పద్యములు కృష్ణాగమనమును గూర్చి శంకించు రుక్మిణి విరహ వేదనాతిశయమును జక్కగా వర్ణించుచున్నవి.

5. వచ్చి తన యెదుట నిలిచిన బ్రాహ్మణుని జూచి రుక్మిణి సంతుష్టాంతరంగయై యన్యమైన ప్రియమేదియుఁ జేయనేరక యాతనికి నమస్కరించెనని మూలమున నున్నది (1-53-30).

పోతన యా భావమునే పెంచి ''జలజాతేక్షణుఁ దోడి తెచ్చితివి...సద్బంధు చింతామణీ'' (1735) అను కృతజ్ఞతా సూచకమైన చక్కని పద్యమును రచించెను.

6. రుక్మిణి పార్వతికి మ్రొక్కి తిరిగి వచ్చు సందర్భమున పోతన యొక వచనము వ్రాసెను (1744). ఇందు మొదట నాతఁడు వాడిన యుపమానము లన్నియు (ఇట్లు మేఘ మధ్యంబు వెలువడి వింసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగున...మద మరాళంబు భంగి) పోతన కల్పించి వ్రాసినవే.

7. కృష్ణుండు రుక్మిణిని రథముపై నెక్కించుకొని పోవుచుండ జరాసంధాదులు యదు వీరుల నెదిరించి బాణవర్షముఁ గురిపించిరి. బలభద్రప్రముఖులైన యదువీరులును వారిపై ననేక బాణపరంపరలు వరఁగించిరి. అప్పుడు జరాసంధాది రాజచక్రము పొందిన దుఃస్థితిని పోతన యొక వచనమున (1754) విపులముగా వర్ణించెను. ఈ వర్ణన మమూలకమైనట్టిదే.

8. జరాసంధాదులు కృష్ణునితోఁ బోరలేక తమతమ యిరవులకు మరలిన పిమ్మట రుక్మి సేనాసమేతుఁడై కృష్ణు నెదిరించెను. అప్పు డాతఁడు ''కుత్ర యాసి స్వసారం మే ముషిత్వా ధ్వాంక్ష వ ద్ధవిః'' (54-25) అని కృష్ణుని నిందించెను. పోతన యిచ్చట ''మా సరివాఁడవా మా పాపఁ గొనిపోవ నేపాటి గంవాఁడ వేదివంశ'' మిత్యాదిగాఁ గల వ్యంగ్యార్థము విస్తృతమైన సీస పద్యమును రచించెను (1762).

(ఋ) 1. కృష్ణుఁడు కుచేలునిఁ జూచి, లేచి, కౌఁగిలించుకొని తీసుకొని వచ్చెనని—

తం విలో క్యాచ్యుతో దూరాత్ ప్రియాపర్యంక మాస్థితః
సహ సోత్థాయ చాభ్యేత్య దోర్భ్యాం పర్యగ్రహీ న్ముదా. 10-80-18

అను శ్లోకము వివరించుచున్నది. పోతన యీ శ్లోకమునకు—

కని డాయం జను నంతఁ గృష్ణుఁడు 10-ఉ-976

అను పద్యమును వ్రాసెను. ఇందుఁ గుచేలుని వర్ణించు విశేషణము లన్నియుఁ బోతన కల్పించినవే.

2. కృష్ణుఁడు కుచేలునితో సల్లాప మొనరించుచు గురుప్రశంస చేయు సందర్భమునఁ దాము గురుపత్ని నియుక్తులై యింధనార్థ మడవి కరుగు నప్పుడు పెద్ద వర్షము కురియుట, చీఁకటి పడుట, సాందీపని తమ్ము వెదకుచు నడవి కరుదెంచుట మున్నగు విషయములు ప్రసక్తికిఁ దెచ్చెను. ఆ సందర్భమున మూలమందు—

ప్రవిష్టానాం మహారణ్య మపర్తౌ సుమహ ద్ద్విజ
వాతవర్ష మభూ త్తీవ్రం నిష్ఠురాః స్తనయిత్నవః 80-36

సూర్యశ్చాస్తంగత స్తావ త్తమసా చావృతా దిశః
నిమ్నం కూలం జలమయం న ప్రజ్ఞాయత కించన 80-37

వయం భృశం తత్ర మహానిలాంబుభి
ర్నిహన్యమానా ముహు రంబుసంప్లవే
దిశో విదంతోఽథ పరస్పరం వనే
గృహీతహస్తాః పరిబభ్రి మాతురాః 80-38

అని వర్షము, సూర్యాస్తమయము, కృష్ణ కుచేలురు పొందిన క్లేశము సంగ్రహముగా వర్ణింపఁబడినవి. పోతన–

ఘుమఘుమారావ సంకుల ఘోర జీమూత పటలసంఛన్నాగ్రభాగమగుచు 10-ఉ-995

అను సీసమున వర్షమును, నిజముగా వర్షము కురియుచున్నదా యనునట్లు చాల సహజముగా వర్ణించెను. "సూర్యశ్చాస్తంగత స్తాప" త్తను శ్లోకమును,

బయలుగొందియు బెనుమిట్టు పల్లములును 10-ఉ-996

అను పద్యముగా ననువదించి,

బిసబిస నెప్పుడు సుడుగక 10-ఉ-997

అను పద్యముతో వారు పడిన చలి బాధను వివరించెను.

తరువాత "ఉదితే రవౌ" అను మూల భాగమును,

తెలతెలవాఱిన వనముల ...... దిగ్వితానము నిండెన్ 10-ఉ-998

అను పద్యముగాఁ బెంచి యనువదించెను.

ఈ విధముగాఁ బోతన సందర్భానుగుణముగాఁ బెంచి వ్రాసిన ఘట్టములును, మూలమున నతి సంగ్రహముగా నున్న వానిని విస్తృతముగా వర్ణించిన ఘట్టములును పెక్కు గలవు. భాగవతారంభము నందలి శ్లేషాలంకారముతోఁ గూడిన దీర్ఘమైన నైమిశారణ్య వర్ణనము (1-39) పోతన స్వకపోల కల్పితమే. ఈ వర్ణనము పోతన వర్ణనా పాటవమును పాండిత్య విశేషమును వెల్లడించు బాణుని వచనములను దలపించు చున్నది. సముద్రమథన మందలి గంగావతరణ వర్ణనా వచనము కూడ నిట్టిదే.

## శ్రీధర వ్యాఖ్య ననుసరించి పెంచిన భాగములు :

భాగవతమునకు సుమారు ముప్పది నలుబది వ్యాఖ్యలున్నవఁట. వానిలో భాగవత భావార్థ దీపిక యను పేరుగల శ్రీధరాచార్యుని అద్వైత వ్యాఖ్యయు, భాగవత చంద్రికయను పేరుగల శ్రీ మద్వీరరాఘవాచార్యుని విశిష్టాద్వైత వ్యాఖ్యయు, విజయధ్వజీయమను పేరుగల శ్రీ మద్విజయధ్వజాచార్యుని ద్వైత వ్యాఖ్యయుఁ బ్రసిద్ధములైనవి. వీనిలో మరల శ్రీధరుని వ్యాఖ్యకే యధిక ప్రచార మున్నది. పోతన యీ వ్యాఖ్యనే యనుసరించి యద్వైత పరముగనే భాగవతము ననువదించెను. అతఁడు మూలముతోపాటు శ్రీధరాచార్యుని వ్యాఖ్యను గూడ నిశితముగాఁ బరిశీలించి మూలభాగము గూఢముగా నున్న చోట్ల నా వ్యాఖ్యాన వాక్యములను గూడఁ జక్కగా ననువదించెను. తత్త్వవిషయ వివరణముల సందర్భమున వ్యాఖ్యానుసరణము హెచ్చుగాఁ గనిపించును. ఈ కారణముచేఁ బోతన భాగవతమును శ్రద్ధతోఁ బఠించినచో మూల వ్యాఖ్యానములు రెండింటిని బఠించిన ట్లగును.

1. అర్జునుఁడు తన్ను వెంటనంటి వచ్చుచున్నాఁడని యెఱింగి ప్రాణపరీప్సువై యశ్వత్థామ శక్తి యున్నంతవఱకుఁ బరుగెత్తె నను సందర్భమున సంస్కృతములో "రుద్ర

భయాద్వ్యథాకః" (1-7-18) అని యున్నది. కః బ్రహ్మా మృగోభూత్వా సుతాం యద్ధు ముద్యతస్సన్ రుద్రస్య భయా ద్వ్యథా పలాయతేస్మ-అని శ్రీధరుని వ్యాఖ్య.

... శిశుహంత గావున నిజ ప్రాణేచ్ఛఁ బాఱెన్ వడిన్
మున్నా బ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింప నా
సన్నుండౌ హరుఁ జూచి పాఱుపగిదిన్ సర్వేంద్రియ భ్రాంతితోన్. 1-144

అని పోతన యనువాదము.

2. అశ్వత్థామను హింసింపవలదని ద్రౌపది కృష్ణార్జునులతో నుడువ నా మాటలు విని ధర్మజాదులు సంతోషించిరి. భీముఁడు మాత్రము కోపము నడఁచుకొనలేక యశ్వత్థామను జంపుటకై విజృంభించెను. ద్రౌపది యడ్డపడెను. ఆ సందర్భమున మూలమందు :

నిశమ్య భీమగదితం ద్రౌపద్యాశ్చ చతుర్భుజః
ఆలోక్య వదనం సఖ్యు రిద మాహ హస న్నివ. 1-7-52

అను శ్లోక మున్నది. ఇందలి చతుర్భుజః అను పదమును శ్రీధరాచార్యుఁడు—భీమే తం హంతుం ప్రవృత్తే, ద్రౌపద్యాం చానిచ్ఛంత్యాం సహసా త న్నివారణే ప్రవృత్తాయాం, ఉభయో స్సన్నివారణా యావిష్కృత చతుర్భుజః—అని వ్యాఖ్యానించెను.

పోతన వ్యాఖ్య ననుసరించి "అశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె. భీముని సంరంభంబు చూచి హరి చతుర్భుజుండయి రెండు చేతుల భీముని వారించి కడమ రెంటను ద్రుపద పుత్రికను దలంగించి నగుచు" అని వ్రాసెను.

3. సంతాన వాంఛతో వచ్చిన దితిని జూచి కశ్యపుఁ డప్పుడు సంధ్యాకాల మగుటచే నొక ముహూర్తమాగుమని చెప్పి హరుని గుణగణమును వర్ణించుచు "వయం వ్రతైర్య చ్చరణా పవిద్ధా మాశాస్మహే ఽజాం బత భుక్తభోగామ్ "(3-14-26) అని తెల్పినట్లు మూలమునఁ గలదు. అపవిద్ధాం అను పదమునకు నిర్మాల్య వ ద్దూరత స్త్యక్తాం—అని శ్రీధరుని వ్యాఖ్య. పోతన దీనిని "ఏమును సత్పురుషులైన విజ్ఞానవంతులును, భుక్తభోగం బై దూరతోన్యస్తంబైన పుష్పమాలిక యునుం బోలె నమ్మహాత్ముని చరణారవింద వందనాభిలాషిణి యైన యవిద్యాదేవి ననుసరించి వర్తింతు" మని యనువదించెను.

4. మూలమున సప్తావరణములు పంచభూతములు మున్నగునవి సంఖ్యామాత్రముచే సూచితము లై యుండఁ బోతన వానిని వ్యాఖ్యాన సాహాయ్యమునఁ బేర్లతో గూడ వివరించు చుండును.

అండకోశే శరీరేఽస్మిన్ సప్తావరణ సంయుతే. 2-1-25

పృథివ్యావరణం తతః అప్తేజో వాయ్వాకాశాహంకార మహత్తత్త్వాదీని సప్త - అని శ్రీధర వ్యాఖ్య. ధరణీ సలిల తేజస్సమీరణ గగనాహంకార మహత్తత్త్వంబు లనియెడు సప్తావరణంబుల చేత నావృతం బగు—అని పోతన. 2-16

5. పరిభ్రమం స్తత్ర న విందతే ఽర్థాన్
మాయామయే వాసనయా శయానః. 2-2-2
స్వప్నాన్ పశ్య న్నివ పరిభ్రమ న్నర్థాన్ న విందతి.
త త్తల్లోకం ప్రాప్తోఽపి నిరవద్యం సుఖం న లభత ఇత్యర్థః.

అని వ్యాఖ్య. నిద్రించు వాఁడు **కలలు గనుతెఱంగున** బరిభ్రమించుచు **నిరవద్యసుఖ లాభంబు** జెందఁడు అని యసువాదము. 2-20

6. తస్మా ద్భువో రంతర మున్న యేత న్నిరుద్ధసప్తాస్వయనో ఽనపేక్షః 2-2-21

అస్వయనము లనఁగాఁ ప్రాణమార్గములు. ఇవి యేడు. నిరుద్ధాణి ఇంద్రియాణి శ్రోత్రే నేత్రే నాసికే ముఖం చేతి ఏవం సప్త అస్వయనాని యేస సః అని శ్రీధరుఁ డా యేడింటిని వివరించెను.

పోతన ''దృక్కర్ణ నాసాస్యములు మూసి'' అని అనువదించెను. 2-29

7. యది ప్రయాస్య న్నృప పారమేష్ఠ్యం వైహాయసానా ముతయ ద్విహారమ్
అష్టాధిపత్యం గుణసన్నిపాతే సహైవ గచ్ఛే న్మన సేంద్రియైశ్చ. 2-2-22

ఈ శ్లోకము నందలి వైహాయసానాం అను పదమునకు ఖేచరాణాం సిద్ధానామ్ అనియు, అష్టాధిపత్యాని అను దానికి అణిమాద్యష్టైశ్వర్యాణి అనియు, గుణసన్నిపాతే అను దానికి గుణ సముదాయ రూపే బ్రహ్మాండే సర్వత్రేత్యర్థః అనియు శ్రీధరుఁడు వ్యాఖ్యానము చేసెను.

పోతన ''మఱియు దేహత్యాగ కాలంబున నింద్రియంబులతోడి సంగమంబు విడువని వాఁడు వానితోడన గుణసముదాయ రూపం బగు బ్రహ్మాండంబునందు ఖేచర సిద్ధ విహార యోగ్యంబును నణిమాది సకలైశ్వర్య సమేతంబు నైన పరమేష్ఠిపదంబుఁ జేరు'' (2-30) అని అనువదించెను.

8. కుంతి శ్రీకృష్ణుని స్తోత్రము చేయు సందర్భమున–
జన్మ కర్మ చ విశ్వాత్మ న్నజ స్యాకర్తు రాత్మనః
తిర్యఙ్నౄర్షి యాదస్సు త దత్యంతవిడంబనమ్. 1-8-31

అను శ్లోకము కలదు. తిర్యఙ్నౄర్షి యాదస్సు అను సమాసమును శ్రీధరుఁడు తిర్యక్షు వరాహాది రూపేణ, ఋషిషు వామనాది రూపేణ, యాదస్సు మత్స్యాది రూపేణ-అని వివరించెను. పోతన యతని ననుసరించి ''తిర్యగాది జీవుల యందు వరాహాది రూపంబులను (మనుష్యులందు రామాది రూపంబులను) ఋషులయందు వామనాది రూపంబులను జలచరంబులందు మత్స్యాది రూపంబులను నవతరించుట లోక విడంబనార్థంబు'' అని అనువదించెను.

9. నమః పరస్మై పురుషాయ భూయసే సదుద్భవస్థాననిరోధలీలయా
గృహీత శక్తిత్రితయాయ దేహినా మంతర్భవా యానుపలభ్యవర్త్మనే. 2-4-12

పరస్మై సర్వోత్తమాయ - తత్రహేతుః భూయసే అపరిమిత మహిమ్నే - అని శ్రీధర వ్యాఖ్య.

అనుపలభ్యవర్త్మనే - అపరిజ్ఞేయమార్గాయ - బ్రహ్మరుద్రాద్యగమ్య వైభవాయేత్యర్థః- అని భాగవత చంద్రిక.

పరుఁడై యీశ్వరుఁడై **మహామహిముఁడై** ప్రాదుర్భవ స్థాన సం
హరణ క్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గత జ్యోతియై
**పరమేష్ఠి ప్రముఖామరాధిపులకుం** బ్రాపింప రాకుండు దు
స్తర మార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్. 2-58

దీనిని బట్టి పోతన యచ్చటచ్చట భాగవత చంద్రిక యను విశిష్టాద్వైత వ్యాఖ్యను గూడ ననుసరించి నట్లు తెలియుచున్నది. ఇట్లే-

"బ్రహ్మవర్చస కామస్తు యజేత బ్రహ్మణస్పతిం" 2-3-2

అనుచో బ్రహ్మణస్పతిం అను దానికి శ్రీధరుఁడు వేదపతిం బ్రహ్మాణం అని అర్థము వ్రాసెను. భాగ. చం. బృహస్పతినని సూచించెను. పోతన భా. చం. నే యనుసరించెను.

10. స ఏష ఆత్మాత్మవతా మధీశ్వరః త్రయీమయో ధర్మమయ స్తపోమయః
గతవ్యళీకై రజశంకరాదిభి ర్వితర్క్యలింగో భగవాన్ ప్రసీదతు. 2-4-19

ఇందు త్రయీమయః - ధర్మమయః ఇత్యాదులు భగవంతునికి విశేషణములుగా నున్నవి. శ్రీధరుఁ డిచ్చట త్రయీమయత్వాది విశేషణైః తత్తన్మార్గైరుపాస్యత్వం వివక్షితమ్మని వ్యాఖ్యలో సూచించెను. దానిననుసరించి పోతన-

తపముల్ సేసిననో మనోనియతినో దాన వ్రతప్రీతినో 2-64

అను పద్యము రచించెను.

11. భూతై ర్మహద్భిః య ఇమాః పురోవిభుః నిర్మాయ శేతే యదమూషు పూరుషః
భుంక్తే గుణాన్ షోడశషోడశాత్మక స్సోలంకృషీష్ట భగవాన్ వచాంసిమే. 2-4-23

షోడశగుణాన్ అనుదానికి ఏకాదశేంద్రియ పంచతన్మాత్రరూపాన్ షోడశ గుణాన్ ప్రకాశయతి అని శ్రీధరుని వ్యాఖ్య.

షోడశాత్మకః మన ఆదిభి రేకాదశేంద్రియైః రూపాదిభిః పంచభిశ్చ మిళిత్వా షోడశభి రారబ్ధం యచ్ఛరీరం తదధిష్ఠాతాసన్ షోడశకళాః భుంక్తే అని భా. చం.

పంచభూతములందు బదునొకం డింద్రియములఁ బ్రకాశింపించి భూరి మహిమ-షోడశాత్మకుఁడన శోభిల్లి 2-65

అనునది పై దానికి పోతన కావించిన అనువాదము.

12. ద్రవ్యం కర్మ చ కాల శ్చ స్వభావో జీవ ఏవ చ
వాసుదేవా త్పరో బ్రహ్మ న్న చాన్యో ఒర్థోస్తి తత్త్వతః. 2-5-14

శ్రీధరుఁ డిందలి ద్రవ్యాది పదములందు ద్రవ్యం మహాభూతాని ఉపాదాన రూపాణి - కర్మ జన్మ నిమిత్తం-కాలః తత్క్షోభకః - స్వభావః తత్పరిణామ హేతుః - జీవో భోక్తా

అని వివరించెను. పోతన యీ వివరమును యథాతథముగా దన యనువాదమునఁ జొప్పించెను. "దేహంబునకు బ్రధానంబైన మహాభూతంబులును జన్మ నిమిత్తంబులైన కర్మంబులును, గర్మ క్షోభకంబైన కాలంబును, గాలపరిణామ హేతువైన స్వభావంబును, భోక్తయైన వాసుదేవుండ కా నెఱుంగుము (2-84).

13. దశమస్కంధ పూర్వభాగమున కాళీయుని పత్నులు శ్రీకృష్ణుని స్తుతించు సందర్భమున

నమోఽనంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే
నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే
నమః ప్రమాణమూలాయ కవయే శాస్త్రయోనయే
ప్రవృత్తాయ నివృత్తాయ నిగమాయ నమోనమః. 10-16-43-44

అను శ్లోకము లున్నవి.

అనంతాయ, అహంకారాపరిచ్ఛేదాత్. అతః సూక్ష్మాయ, అప్రత్యక్షత్వాత్. అత ఏవ కూటస్థాయ ఉపాధికృత వికారాభావాత్. అత ఏవ విపశ్చితే సర్వజ్ఞాయ, నానావాదానురోధాయ అస్తి నాస్తి సర్వజ్ఞః కించిజ్ఞః బద్ధః ముక్తః ఏకః అనేకః ఇత్యాదీన్ నానావాదాన్ అనురుణద్ధి మాయయా అనువర్తతే యస్తస్మై. కించ. వాచ్యవాచక శక్తయే అభిధానాభిధేయశక్తి నానాత్వేన ప్రతీయమానా యేత్యర్థః.

ప్రమాణ మూలాయ చక్షురాదీనాం చక్షురాది రూపాయ అత ఏవ కవయే స్వయం తన్నిరపేక్ష జ్ఞానాయ కుతః శాస్త్రయోనయే వేదాత్మక నిశ్వాసాయ - అనునది పై శ్లోకములకు శ్రీధరుఁడు కావించిన వ్యాఖ్య.

పోతన వీనిని

... ... ... ... ...
నెఱి ననంతుండవై ***దర్శనీయుఁడవిగాక*** సూక్ష్ముఁడవై *నిర్వికారమహిమఁ*
బరఁగి కూటస్థుఁడవు ***సమస్తంబు నెఱుఁగు*** నీకు మ్రొక్కెదను మాలింపు నిర్మలాత్మ.
10-679

వ. మఱియుఁ *గలండు లేఁడు సర్వంబు నెఱుంగు నించుక యెఱుంగు బద్ధుండు* ***విముక్తుండు నొకం డనేకుండు*** నను నివి మొదలుగాఁ గల వాదంబులు ***మాయ వలన నవరోధింపుదువు*** గాన నానావాదానురోధకుండవయ్యును ***అభిధానాభిధేయ శక్తిభేదంబుల వలన బహు ప్రభావ ప్రతీయమానుఁడవయ్యును చక్షురాది రూపంబుల వలన*** ప్రమాణ రూపకుండవయ్యును, ***నిరపేక్ష జ్ఞానంబు కలిమిం గవి*** వయ్యును ***వేదమయనిశ్వాసత్వంబువలన*** శాస్త్రయోని వయ్యును- ఇత్యాదిగా వ్యాఖ్యాన సాహాయ్యమును బెంచి యనువదించెను. 10-680

మూలమున సూచ్యమాత్రములుగా నున్న యొండు రెండు పదములను గ్రహించి వానికి విపులమైన వ్యాఖ్యానము లేకున్నను పోతన స్వీయముగా విపరించిన భాగములు కొన్ని గలవు. అట్టి వాని కైదుదాహరణము లొసంగఁబడును.

3. భీష్మ కృత కృష్ణస్తవమునఁ గల

స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞాం మృత మధికర్తు మవప్లుతో రథస్థః
ధృతరథచరణో ఒభ్యయాచ్చలద్గు ర్హరిరివ హంతు మిభం గతోత్తరీయః
శితవిశిఖహతో విశీర్ణదంశః క్షతజపరిప్లుత ఆతతాయినో మే 1-9-37
ప్రసభ మభిససార మద్వధార్థః స భవతు మేభగవాన్ గతి ర్ముకుందః 1-9-38

అను శ్లోకములను రెండింటిని పోతన ''కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి గగన భాగంబెల్లఁ గప్పికొనఁగ'' (1-222) ఇత్యాదిగాఁగల సీసపద్యముగా ననువదించెను. మూలము నందలి కొన్ని పదము లిందు విడువఁబడినవి. సూచ్య మాత్రములుగా నున్నవి కొన్ని వివరింపఁ బడినవి. "స్వనిగమ మపహాయ-మత్ప్రతిజ్ఞా మృతమధికర్తుం-శితవిశిఖహతో విశీర్ణ దంశః క్షతజ పరిప్లుత ఆతతాయినోమే''అను మూలమందలి వాక్యములలో-శ్రీకృష్ణుని ప్రతిజ్ఞాతిక్రమణమును భీష్ముని యతిలోక శౌర్యమును వ్యక్తము లగుచున్నవి. ఇవి శ్రీకృష్ణుని కించుక లాఘవమును జేకూర్చునట్టి వగుటచేఁ గాబోలు పోతన వానిని విడిచివైచెను. ''చలద్గుః'' అను పదమునకు-ఉదరస్థ సర్వభువన భారేణ ప్రతిపదం బహుశ శ్చలంతీ గౌః పృథివీ యస్మాత్తే నైవ సంరంభేణ" అని వ్యాఖ్యానము. పోతన దీని ననుసరించి "ఉఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేఁగున జగతి గదల'' అని మూలార్థము సుస్పష్ట మగునట్లుగా వర్ణించెను. అట్లే గతోత్తరీయః అను సమాసమును ''చక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ బైనున్న పచ్చని పటము జాఱ'' అని వివరించెను. (1-122)

3. తరవః కిం న జీవంతి భస్త్రాః కిం న శ్వసం త్యుత
న ఖాదంతి న మేహంతి కిం గ్రామ్యాః పశవో పరే. 2-3-18
శ్వవిడ్వరాహోష్ట్రఖరైః స్సంస్తుతః పురుషః పశుః
న యత్కర్ణపథోపేతః జాతు నామ గదాభృతః. 2-3-19

ఈ శ్లోకములు శుకుఁడు పరీక్షిత్తునకు భక్తియోగమే ముఖ్యమని చెప్పు ఘట్టములోనివి. పోతన యిందలి వాక్యములను జక్కగాఁ బెంచి యీ క్రింది సీసము రచించెను.

అలరు జొంపములతో నభ్రంకషంబులై బ్రదుకవే వనములఁ బాదపములు
ఖాదన మేహనాకాంక్షలఁ బశువులు జీవింపవే గ్రామ సీమలందు
నియతిమై నుచ్ఛ్వాస నిశ్శ్వాసపవనముల్ ప్రాపింపవే చర్మ భస్త్రికలును
గ్రామసూకర శునకశ్రేణు లింటింటఁ దిరుగవే దుర్యోగదీనవృత్తి
నుష్ట్ర ఖరములు మోవవే యురుభరములఁ
బుండరీకాక్షు నెఱుఁగని పురుష పశువు
లడవులందు నివాసములందుఁ బ్రాణ
విషయభర యుక్తితో నుంట విఫల మధిప. 2-49

ఇందలి శ్లోకమునకు శ్రీధరుఁడు - శ్వాదిభి స్సంస్తుతః పురుషో నిరూపితః యస్య కర్ణ పథం కదాచి దపి న గతం సః అవజ్ఞాస్పదత్వాత్, శ్వభిః కశ్మల విషయాసక్తత్వాత్,

విడ్వరాహైః గ్రామసూకరైః కంటకవ ద్దుఃఖవిషయత్వాత్, ఉష్ట్రైః ఖారవాహిత్వాత్, కాముకత్వాత్ పదాఘ్నంతీ మపి ప్రియాం త్యక్తు మసమర్థ త్వాచ్చ ఖరైః తుల్యా ఇత్యర్థః - అని వ్యాఖ్యానము వ్రాసెను. పోతన మొదటి శ్లోకమునందలి వాక్యములవలెనే వీనిని గూడ మార్చి అట్టి పురుష పశువులకు ఖరోష్ట్రాదులతోఁ గల సామ్యమును వ్యంగ్యముగా సూచించెను.

5. భూయో నమ స్సద్వృజినచ్ఛిదే సతా మిసంభవా యాఖిలసత్త్వమూర్తయే
పుంసాం పునః పారమహంస్య ఆశ్రమే వ్యవస్థితానా మనుమృగ్యదాశుషే. 2-4-13
నమో నమస్తే స్త్వృషభాయ సాత్వతాం విదూరకాష్ఠాయ ముహుః కుయోగినాం
నిరస్తసామ్యాతిశయేన రాధసా స్వధామని బ్రహ్మణి రంస్యతే నమః 2-4-14

వీనిని పోతన యథాతథముగా ననువదించెను.

"మఱియు సజ్జనదురిత సంహారకుండును, దుర్జననివారకుండును, సర్వరూపకుండును (అఖిల సత్త్వమూర్తయే అనుదానికి నిఖిలప్రాణి సంఘాత శరీరకాయ అని భా. చం. వ్యాఖ్య) పరమహంసాశ్రమ ప్రవర్తమాన మునిజన హృదయకమల కర్ణికా మధ్య ప్రదీపకుండును సాత్వత శ్రేష్ఠుండును— 2-59

పారమహంస్యాశ్రమ స్థితులైన పురుషుల కాత్మతత్త్వము నొసంగువాఁడని మూలమున నుండ పోతన యట్టివారి హృదయ కమలకర్ణికా ప్రదీపకుఁడని వివరించెను. పిమ్మట - నిఖిల కల్యాణ గుణగరిష్ఠుండును, బహుభక్తి యుక్తసులభుండును, భక్తిహీనజన దుర్లభుండును - అను నమూకములైన విశేషణములను జేర్చెను.

6. ప్రేషాం క్షిపంతం హరితోపలాద్రే స్సంధ్యాభ్రనీవే రురురుక్మమూర్ధ్నః
రత్నై ర్యథా రోషధిసౌమనస్యై ర్వనస్రజో వేణుభుజాంఘ్రిపాంఘ్రేః 3-8-24

ఇందు విష్ణువు మరకత శిలామయ పర్వతమువలె నున్నట్లు వర్ణింపఁబడి యున్నాడు. ఇం దుపమానములే కాని ఉపమేయములు పేర్కొనఁబడి యుండలేదు. శ్రీధరుఁడు వానిని వ్యాఖ్యానమున సూచించెను.

సంధ్యాభ్రః నీవీ పరిధానం యస్య తస్య శోభాం వితాంబరేణ క్షిపంతం. ఉరురుక్మ మూర్ధ్నః అనేక స్వర్ణ శిఖరస్య తస్య శోభాం స్వకిరీటైః క్షిపంతం, రత్నానివ ఉదధారామేఘాశ్చ; ఓషధయః ఔషధరూపాః, సౌమనస్యాని పుష్పసమూహాశ్చతాన్యేవ వనస్రగ్వనమాలా యస్యతస్య శోభాం స్వీయరత్నముక్తాదామ తులసీపుష్పదామ వనమాలాదిభిః క్షిపంతం, వేణవోభుజాయస్య, అంఘ్రిపా ఏవ అంఘ్రయోయస్య తస్య శోభాం భుజైరంఘ్రిభిశ్చ క్షిపంతం—

ఈ వ్యాఖ్యానము సాహాయ్యమున పోతన విష్ణువునకు మరకత పర్వతముతోఁ గల పోలిక నుపమానోపమేయముల రెండింటిని సూచించుచుఁ జక్కఁగా నిట్లు వివరించెను.

పరపీత కౌశేయ పరిధానకాంతి సంధ్యాంబుద రుచి నిచయంబుగాఁగ
కమనీయ నవహేమ కలిత కిరీటంబు రమణఁగాంచిన శిఖరంబుగాఁగ
లలితగతి నొప్పు మరకతాచాల విడంబి
తాత్మదేహంబు గలుగు మహాత్ము హరిని. 3-287

**పోతన సంగ్రహించిన భాగములు :**

భాగవతానువాద సందర్భమున పోతన మూలమును బెంచి వ్రాసిన ఘట్టములే యెక్కువ యైనను మూలమునందలి వాక్యములనో సన్నివేశములనో సంగ్రహించిన లేక విడిచిన పట్లు కూడఁ గొన్ని లేకపోలేదు. అట్టివాని సంఖ్య చాల తక్కువ.

1. అర్జునుఁడు పుత్రఘాతియగు నశ్వత్థామను పాశబద్ధుని గావించి ద్రౌపది కడకుఁ గొనివచ్చెను. అప్పుడు ద్రౌపది యాతనికి మ్రొక్కి,

ఉవాచ చాసహం త్యస్య బంధనానయనం సతీ
ముచ్యతాం ముచ్యతా మేష బ్రాహ్మణో నితరాం గురుః 1-7-43

అని యతని బంధించికొనివచ్చుట సహింపఁజాలక బ్రాహ్మణుఁడు పూజ్యుఁ డగుటచే నతని విడువవలె నని యర్జునునితోఁ జెప్పినట్లు మూలమున నున్నది. పోతన దీనిని తొలగించుటయే గాక యామె యర్జునునితోఁ జెప్పిన వాక్యములను గురుపుత్రునితోఁ జెప్పినట్లు వ్రాసియుండెను. ఇచ్చటి ప్రత్యక్ష వాక్య సంధానము మిక్కిలి సహజమై ద్రౌపది శీలమునకు మెఱుఁగులు దిద్దు చున్నది.

2. వామనావతార ఘట్టమున రాక్షసులు తమ రాజధాని నాక్రమింప దేవతలు బృహస్పతి యుపదేశము ననుసరించి యెందేని దాఁగియుండ నేగిరి. అప్పు డదితి తన కుమారులకుఁ గల్గిన దైన్యమును దలంచి దుఃఖించుచుండఁ గశ్యపుఁ డామెను జూడ నేగి కుశల సంప్రశ్నము కావించెను. మూలమున గశ్యపుఁ డడిగిన

''అ ప్యభద్రం నవిప్రాణాం భద్రే లోకేఽధునా గవామ్''

మున్నగు ప్రశ్నలన్నింటికి నదితి యీ క్రింది విధమున సమాధాన మొసంగినట్లు కలదు.

భద్రం ద్విజగవాం బ్రహ్మన్ ధర్మ స్యా స్య జనస్య చ
త్రివర్గస్య పరం క్షేత్రం గృహమేధిన్ గృహా ఇమే
అగ్నయోఽ తిథయో భృత్యా భిక్షవో యే చ లిప్సవః
సర్వం భగవతో బ్రహ్మ న్న నుధ్యానా న్న రిష్యతి
కో ను మే భగవన్ కామో న సంపద్యేత మానసః
యస్యా భవాన్ ప్రజాధ్యక్ష ఏవం ధర్మాన్ ప్రభాషతే 8-16-11-13

పోతన యీ సమాధానములన్నియు విడిచివైచి యామె వెంటనే

ప్రేమ యొకింతలేక దితిబిడ్డలు, బిడ్డలబిడ్డలున్ మహా
భీమ బలాఢ్యులై తనదు బిడ్డల నందఱఁ దోలి సాహసా
క్రామితవైరులయ్యు నమరావతి నేలుచునున్నవారు నీ
కేమని విన్నవింతు హృదయేశ్వర! మేలు దలంచి చూడవే! 8-469

అని తన మనోవేదన వెల్లడించినట్లు వ్రాసియుండెను. ఇట్లు కశ్యపుఁ డడిగిన సామాన్య ప్రశ్నల కించుకయు సమాధానము జెప్పక యదితి వెనువెంటనే తన గోడు చెప్పుకొన మొదలిడుట

యామె మనోవేదనాతిశయమును వెల్లడిచేయుచు సహజముగా నున్నది. సాధారణ పరిస్థితులలో నైనచో నామె యాతని ప్రశ్నల కన్నిటికి సమాధానము చెప్పియుండెడిదే.

3. కశ్యపుఁ డదితితో భగవత్సేవ కావించి బహు సౌభాగ్యముల నందు మని చెప్ప నామె యా సేవావిధానము మంత్రాచారములు తెలుపుమని యడిగెను. అప్పుడు కశ్యపుఁడు

ఏతన్మే భగవాన్ పృష్టః ప్రజాకామస్య పద్మజః
యదాహ తే ప్రవక్ష్యామి వ్రతం కేశవతోషణమ్. 8-16-24

అని సుమారు నలువది శ్లోకములలో పయోభక్షణ వ్రతాచరణ విధానమును మంత్రాదులను వివరించినట్లు మూలమున నున్నది. పోతన "ప్రజాపతి సతికిఁ బయోభక్షణంబను వ్రతం బుపదేశించి తత్కాలంబును దన్మంత్రంబును దద్విధానంబును దదుపవాస దాన భోజన ప్రకారంబులును నెఱింగించిన" అని యా భాగమునంతను బూర్తిగా సంగ్రహించెను. వ్రత విధాన మంత్రోపవాస భోజనాదుల వర్ణనము నీరసముగా నుండుటయే పోతన దాని నట్లు సంగ్రహించుటకుఁ గారణమై యుండును.

4. అదితి పయోభక్షణ వ్రత మాచరించి ప్రత్యక్షమైన విష్ణువును స్తుతించి తన కుమారుల బాధ తొలఁగింపవలె నని వేఁడుకొనెను. ఆ మాటలు విని విష్ణు వామె నోదార్చి తానామె కొడుకుగాఁ బుట్టుదు నని చెప్పెను. ఈ సందర్భము మూలమందు 17 వ యధ్యాయమున 8 శ్లోకములలో (11-18) విపులముగా వర్ణింపఁబడినది. పోతన దానిని మిక్కిలి సంగ్రహించి రెండు పద్యములలో వ్రాసెను. (నీ కొడంద్రుడును; బలిమిన్ దైత్యులఁ జంపరాదు 8-488-489).

5. భీష్మకృత స్తవమున మూలమందు రాజసూయ వృత్తాంతము తరువాత
క్షితిభర మవరోపితుం కురూణాం శ్వపన ఇ వాసృజ దక్ష వంశవహ్నిమ్
త మిమ మహ మనువ్రతార్తిహోంఘ్రిం హృది పరిరభ్య జహామి
మర్త్యనీడమ్ 1-9-42

పోతన యీ శ్లోకము ననువదింపక విడిచిపెట్టెను. ఇం దక్షవంశ వహ్నిని సృజించిన వాఁడు విష్ణువే యను నభిప్రాయము కలదు. అది తనకు రుచింపని కారణమున పోతన విడిచి యుండును.

6. రుక్మిణీ కల్యాణ ఘట్టమున కృష్ణుఁడు రుక్మిణిని రథముపై నిడికొని పోవుచుండగా రాజులందఱు తమ తమ నగరములకుఁ జనిన పిమ్మట రుక్మి కృష్ణుని వెనుకఁబడి పోవుచు నందఱు వినుచుండఁగా

అహత్వా సమరే కృష్ణ మప్రమోచ్య చ రుక్మిణీమ్
కుండినం న ప్రవేక్ష్యామి సత్య మేత ద్బ్రవీమి వః. 10-54-20

అని ప్రతిజ్ఞ పట్టినట్లు మూలమున నున్నది. రుక్మి యట్లు చేయఁజాలకపోవుటయే కాక యవమానము కూడఁ బొందవలసి వచ్చెను. అందుచే పోతన యీ ప్రతినను విడిచివైచి,

చక్రికి మ్రొక్కని జడుని యావలనున్న కనక కిరీటంబు గట్టిమోపు
మాధవార్పితముగా మనని మానవు సిరి పసదుర్గ చంద్రికా వైభవంబు
కైటభారి భజన గలిగియుండనివాఁడు గాలితోన నుండి కదలు శవము
కమలనాభు పదముఁ గనని వాని బ్రదుకు పసిఁడికాయలోని ప్రాణిబ్రదుకు. 2-51

2. నారదుఁడు బ్రహ్మను బ్రపంచప్రకార మడిగిన విషయములు జెప్పుటకు ముందు శుక మహర్షి గుర్వాది వందన మాచరించుచు :

భూతై ర్మహద్భిః య ఇమాః పురో విభు ర్నిర్మాయ శేతే య దమూషు పూరుషః
భుంక్తే గుణాన్ షోడశ షోడశాత్మకః సోఽలంకృషీష్ట భగవాన్ వచాంసి మే. 2-4-23

అని పరమేశ్వరుఁడు తన వాక్కుల నలంకరించుఁ గాక యని ప్రార్థించి యుండెను. ''సోఽలంకృషీష్ట భగవాన్ వచాంసి మే'' అను దానిని పోతన :

అట్టి భగవంతుఁ డవ్యయుం డచ్యుతుండు మానసోచిత వాక్పుష్ప మాలికలను
మంజునవరస మకరంద మహిమ యుట్టి శిష్టహృద్యావలీలఁ జేయుఁగాత. 2-68

అని యనువదించెను.

3. గోపికా గీతంలో నున్న :

విషజలాశయా ద్వ్యాళరాక్షసా ద్వర్షమారుతా ద్వైద్యుతానలాత్
వృషమయాత్మజా ద్విశ్వతోభయా ద్వృషభ తే వయం రక్షితా ముహుః. 10-31-3

అను శ్లోకమును పోతన :

విషజలంబువలన విషధరదానవు
వలన జాల వానవలన వహ్ని
వలన నున్నవానివలనను రక్షించి
కుసుమశరుని జాఱఁ గూల్పఁదగునె. 10-1037

అని తెనిఁగించెను. పై శ్లోకమునందలి భావ మీ పద్యమునందలి మొదటి మూఁడు పాదములలోనే వ్యక్తమైనది. చివరిపాదమును పోతన సొంతముగాఁ జేర్చినాఁడు. పెద్దపెద్ద యాపదల వలన రక్షించి చివరికి ''నంటినఁ గందు'' పూవుబాణములచే చచ్చునట్లు చేయుచున్నావా ? యని భావము. ఈ పెంపు భావగంభీరమై కడు రమ్యముగా నున్నది.

**పోతన యథామూలముగా ననువదించిన భాగములు :**

పైని సూచింపఁబడిన యుదాహరణములను బురస్కరించుకొని పోతన సర్వత్ర మూల భావమును పెంచుటో, మార్చుటో, సంగ్రహించుటో చేయుచుండునని భావింపరాదు. అతఁడు పెక్కు శ్లోకములను యథామూలముగా రచించి తన యనువాద కౌశలమును బ్రకటించెను. ఇందు కుదాహరణములు భాగవతమున నెచ్చటఁ జూచినను గానిపించును. కొన్ని యుదాహరణములు మాత్ర మిచ్చటఁ బ్రదర్శింపఁబడును.

1. జన్మైశ్వర్య శ్రుతశ్రీభి రేధమానమదః పుమాన్
నైవార్హత్యభిధాతుం వై త్వా మకించనగోచరమ్. 1-3-27

జననము నైశ్వర్యంబును, ధనమును విద్యయును గల మదచ్ఛన్నులకిం
చనగోచరుఁడగు నిన్నున్, వినుతింపఁగలేరు నిఖిల విబుధస్తుత్యా. 1-189

2. భారావతరణాయాన్యే భువో నావ ఇవోదధౌ
సీదంత్యా భూరిభారేణ జాతో హ్యాత్మభువార్థితః 1-8-35
జలరాశిలో మునింగెడు, కలముక్రియన్ భూరిభారాక్రాంత యగు నీ
యిలఁ గావ నజుఁడు గోరినఁ, గలిగితి వని కొంద ఱండ్రు గణనాతీతా. 1-194

3. శ్రియఃపతి ర్యజ్ఞపతిః ప్రజాపతి ర్ధియాంపతి ర్లోకపతి ర్ధరాపతిః
పతి ర్గతిశ్చాంధకవృష్ణిసాత్వతాం ప్రసీదతాం మే భగవాన్ సతాం గతిః. 2-4-20
శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్రజాపతియున్ బుద్ధిపతియు జగదధిపతియున్
భూపతియు యాదవశ్రేణీపతియున్ గతియునైన నిపుణు భజింతున్. 2-65

4. యథా భ్రామ్య త్యయో బ్రహ్మన్ స్వయ మాకర్ష సన్నిధౌ
తథా మే భిద్యతే చేత శ్చక్రపాణే ర్యదృచ్ఛయా. 7-5-14
ఇను మయస్కాంత సన్నిధినెట్లు భ్రాంతమగు హృషీకేశుసన్నిధి నావిధమునఁ
గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంత
మగుచు. 7-149

5. శరదుదాశయే సాధుజాత సత్సరసిజోదర శ్రీముషా దృశా
సురతనాథ తే ఽశుల్కదాసికా వరద నిఘ్నతో నేహ కిం వధః. 10-31-2
శారదకమలోదరరుచి చోరకమగు చూపువలన సుందర మిమ్ముం
గోరి వెలయిాని దాసుల ధీరత నొప్పించు టిది వధించుట గాదే. 10-1036

6. ఏతావ ద్బ్రాహ్మణా యోక్త్వా విరరామ మహామతిః
తం సంనిర్భర్త్స్య కుపితః స దీనో రాజసేవకః
కులాంగారస్య దుర్బుద్ధే శ్చతుర్థో ఽస్యోదితో దమః
దైతేయచందనవనే జాతో ఽయం కంటకద్రుమః
తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు దైత్యచం
దనవనమందుఁ గంటక యుత క్షితిజాతము భంగిఁ బుట్టినాఁడు. 7-153

పోతన మూలమునందలి యుపమానమును జక్కఁగా ననువదించెను. పై నున్న మొదటి శ్లోకమును పోతన "అనిన విని రోషించి రాజసేవకుండైన పురోహితుండు ప్రహ్లాదుం జూచి తిరస్కరించి యిట్లనియె" (7-151) అని తెనిఁగించెను. ఇచ్చట రాజసేవకః అను పదము సాభిప్రాయమైనది. ప్రహ్లాదోక్తములైన వాక్యములు పురోహితునికిఁ గోపము కలిగించుట కందలి యసామంజస్యము కంటె నాతని రాజసేవకత్వమే కారణము. అందుచే పోతన యా పదమును యథాతథముగ నుపయోగించుట యాతని మూలాభిప్రాయమర్మజ్ఞతను సూచించుచున్నది.

మూలమునందలి చక్కని యుపమానములు పెక్కింటిని పోతన రమ్యముగా ననువదించి తన యనువాద కౌశలమును బ్రదర్శించెను.

**మూల భిన్న రచనాభాగములు :**

పొరపాటుననో ఉద్దేశపూర్వకముగనో పోతన మూలమునకు భిన్నముగా రచన సాగించిన భాగములు కూడఁ గొన్ని కానవచ్చుచున్నవి. ఇట్టివి కలచోట్ల నథోదీపికలలో మూల భాగములు కూడ నొసంగఁబడినవి.

1. స ఏవ భూయో నిజవీర్యచోదితాం స్వజీవమాయాం ప్రకృతిం సిసృక్షతీమ్
అనామరూపాత్మని రూపనామనీ విధిత్సమానోఽ నుససార శాస్త్రకృత్. 1-10-22

సః అనామరూపే ఆత్మని రూపనామనీ విధాతు మిచ్ఛుః నిజవీర్యచోదితాం స్వాంశ భూతానాం జీవానాం మాయాం మోహినీ అతఏవ స్రష్టు మిచ్ఛంతీం ప్రకృతి మనుససార అధిష్ఠి తవాన్-అని శ్రీధరవ్యాఖ్య.

పోతన ''నిజాంశ భూతంబులైన జీవులకు మోహినియైన సృష్టి సేయ నిశ్చయించి'' అని సజీవమాయాం అను దానిని సృష్టికి విశేషణము కావించెను.

''ప్రకృతి మనుససార'' యని మూలమునం దుండ ''మాయానుసరణంబు సేయు నను వారును'' అని అనుసరించుటకు మాయను గర్మ కావించెను.

1. గోపై ర్మఖే ప్రతిహతే వ్రజవిప్లవాయ
దేవేఽభివర్షతి పశూన్ కృపయా రిరక్షుః
ధర్తోచ్ఛిలీంధ్ర మివ సప్తదినాని సప్త
వర్షో మహీధ్ర మనఘైకకరే సలీలమ్. 2-7-32

కృష్ణుఁడు పశులను రక్షించుటకై పర్వతము నేకకరమున లీలనా శిలీంధ్రమువలె (వర్షాసూత్పన్నం శిలీంధ్రకుసుమ మివ అని వ్యాఖ్య) ధరించునని యీ శ్లోకమునందలి యర్థము. కుక్కగొడుగు కడు తేలికైనది. మహాపర్వతమును గూడ కుక్కగొడుగును వలె నవలీలగా నెత్తె నని కవిభావము. పోతన ''శైలరాజ మచల చ్ఛత్రంబుగాఁ దాల్చి'' (2-187) అని శిలీంధ్రపద మునే తొలగించివైచెను.

3. య ఏతేన పుమా న్నిత్యం స్తుత్వం స్తోత్రేణ మాం భజేత్
త స్యాన్వహం ప్రసీదేయం సర్వకామవరేశ్వరః. 3-9-40

సర్వకామవరేశ్వరః అనగాఁ సర్వకామవరప్రదః అని వ్యాఖ్య.

పోతన యీ పదమును ''అవాప్త సకల కాముఁడ నగుచున్'' (3-327) అని యనువ దించెను. చూ. 3-350

4. ససర్జాగ్రేఽంధతామిస్ర మథ తామిస్ర మాదికృత్
మహామోహంచ మోహం చ తమ శ్చాజ్ఞానవృత్తయః. 3-12-2

బ్రహ్మ సృష్ట్యాది నంధతామిస్రము, తామిస్రము, మహామోహము, మోహము, తపస్సు అను అవిద్యావృత్తులను సృష్టించెనని దీని యర్థము.

తమో ఽవివేకో మోహ స్స్యా దంతఃకరణ విభ్రమః
మహామోహస్తు విజ్ఞేయో గ్రామ్యభోగసుఖైషణా
మరణం హ్యంధతామిస్రం తామిస్రః క్రోధ ఉచ్యతే
అవిద్యాపంచపర్వైషా ప్రాదుర్భూతా మహాత్మనః.

అని పాతంజలయోగ శాస్త్రమునఁ గూడ నవిద్యాపంచకము వివరింపఁబడి యున్నది. పోతన యనువాదమున వ్యాఖ్య యందును దీనియందును గల యర్థవివరణము ననుసరించెను. కాని వరుస మార్చెను.

పరమేష్ఠి యీ సృష్ట్యాది నహమ్మను దేహాభిమానబుద్ధి గల మోహంబును, అంగనా సంగమ స్రక్చందనాది భోగేచ్ఛలు గల మహామోహంబును, దత్ప్రతిఘాత జాతంబైన క్రోధంబు నందుఁ గలుగు తామిస్రంబును, దన్నాశంబునం దహమేవ మృతో ఽస్మి యను నంధ తామిస్రంబును, చిత్త విభ్రమంబు నను నవిద్యా పంచక మిశ్రంబుగా-అనునది పోతన అనువాదము (3-307). శ్రీధరుఁడు మూలము నందలి వరుసను దారుమాఱు చేసి వ్యాఖ్యానించెను. పోతన మోహముతో మొదలిడి చిత్తవిభ్రమముతో ముగించెను. చిత్తవిభ్రమ మను దాని నతఁడు తమస్సునకు బదులు వాడెను. తమః అనగా స్వరూపప్రకాశ మని శ్రీధర వ్యాఖ్యయు అవివేక మని పాతంజలమును జెప్పుచున్నవి.

మోహస్స్యాదంతఃకరణ విభ్రమః అని పాతంజలము. పోతన శ్రీధర వ్యాఖ్య ననుసరించి మోహమన అహమ్మను దేహాభిమాని బుద్ధియని వివరించి తమస్సనఁగాఁ జిత్తవిభ్రమ మని తెనిఁగించెను. ఇది పై రెండింటికి విరుద్ధము.

5. కాలో ఽయం పరమాణ్వాది ద్విపదార్ధాంత ఈరితః
నైవేశితుః ప్రభు ర్భూమ్న ఈశ్వరో ధామ మానినామ్. 3-11-38

మందిరార్థాది కర్మాభి మానశీలు రైన వారికి నాశ్రయం బగుటఁజేసి
యరయ హరి దద్గుణ వ్యతికరుఁడుగాన కాల మమ్మేటి కెన్నఁడుఁ గర్తకాదు.

3-362

అనునది పై శ్లోకమునకు పోతన కావించిన యనువాదము. ఇందు హరి దద్గుణ వ్యతికరుఁడు గాన అను కారణము పోతనకల్పితము. ఈశితుః, భూమ్నః అను వానిని అమ్మేటికి అనియు, ప్రభుః అను దానిని కర్త అనియు, ఈశ్వరః అను దానిని ఆశ్రయంబగుటఁ జేసి యనియు పోతన అనువదించెను.

6. ... ... ... ... ...
వయం ప్రతై ద్వచ్చరణాపవిద్ధా
మాశాస్మహే ఽజాం బత భుక్తభోగామ్ 3-14-26

చరణాపవిద్ధాం = చరణేన నిర్మాల్యవద్దూరత స్త్యక్తాం

అజాం = మాయాం - తన్మయీం విభూతిం - అని శ్రీధరవ్యాఖ్య. చరణాపవిద్ధాం అను దానిని పోతన చరణారవింద జనితయైన అనియు, అజారా అను దానిని అవిద్య ననియు ననువదించెను.

అమ్మహాత్ముని చరణారవింద జనితయైన అవిద్య ననుసరించి వర్తింతుము. 3-465

7. ఏవ ఆత్మపథోఽవ్యక్తో నష్టః కాలేన భూయసా
తం ప్రవర్తయితుం దేహ మిమం విద్ధి మయా ధృతమ్. - 3-24-37

నేను పూర్వ ముపదేశించిన సూక్ష్మమైన ఆత్మమార్గము బహుకాల విలంబముచే నష్టమైనది. దానిని తిరిగి ప్రవర్తింపఁ జేయుటకే నే నీ దేహము ధరించితి నని యెఱుంగుము అని దీని భావము. పోతన దీనిని

నేను సన్మునివేషంబు ధరియించు టెల్ల నా కొఱకుఁ గాదు
విను మహాత్ములైన మునులకుఁ బరమాత్మ గురు సద్వివేకంబు నరసిచూపు
తత్త్వబోధంబు కొఱకును దాల్పఁబడిన యంచిత వ్యక్తమార్గమైనట్టి దేహ
మని తలంపుము మత్పద ధ్యానభక్తి దీపనారాయణ మహిమంబు తేజరిల్ల. 3-850

అని యనువదించెను. ఇం దతఁడు మూలమును బాగుగా వివరించి వ్రాసెను. కాని ఆత్మపథః అను దానికి విశేషణమైన అవ్యక్తః (సూక్ష్మః) అను దానిని విడిచి "అంచితవ్యక్తమార్గమైనట్టి దేహమని తలంపు" మని దేహమున కంచితవ్యక్త మార్గమైనట్టి - అను విశేషమును గల్పించెను.

8. హృదయాన్మన ఉత్థితమ్
మనస శ్చంద్రమా జాతో బుద్ధి ర్బుద్ధే ర్గిరాం పతిః
అహంకార స్తతో రుద్ర శ్చిత్తం చైత్య స్తతోఽభవత్. 3-26-63

విను హృదయము వలనను మనమును, మనమునఁ దుహినకరుఁడు బుద్ధియుఁజిత్తం
బున బ్రహ్మయు క్షేత్రజ్ఞుండును గలిగిరి, యవ్విరాజుఁడున్ బూరుషతన్. 3-893

మొదటి రెండు పాదముల పఱకు ననువాదము సరిగా నున్నది. తరువాతి రెండు పాదములలో నది భిన్నమార్గము పట్టినది. బుద్ధే ర్గిరాం పతిః అను దానికిఁ జిత్తంబున బ్రహ్మయు అనునది అనువాదము. బుద్ధి చిత్తములు సమానములు కావు గదా. అహంకారము నుండి రుద్రుఁడు. చిత్తమును, చిత్తమునుండి క్షేత్రజ్ఞుఁడును గలిగి రను దానిని విడిచి పోతన చిత్తముననే బ్రహ్మయు క్షేత్రజ్ఞుఁడును గలిగి రని యనువదించెను.

9, ఏవం హరౌ భగవతి ప్రతిలబ్ధభావో భక్త్యాద్రవద్ధృదయ ఉత్పులకః ప్రమోదార్
ఔత్కంఠ్య బాష్పకలయా ముహు రర్ద్యమాన స్త చ్చాపి చిత్తబడిశం
శనకై ర్వియుంక్తే. 3-28-34

దుర్గ్రహస్య భగవతో గ్రహణే బడిశం మత్స్యబంధనమివ ఉపాయభూతం చిత్తం ధ్యేయా ద్వియుంక్తే తద్ధారణే శిథిలప్రయత్నో భవ తీ త్యర్థః - అని వ్యాఖ్య.

పోతన దీనిని "భగవత్స్వరూపమై భవగుణ గ్రాహక మగుచు మత్సంబంధ మనుకి రించి" (3-933) అని యనువదించెను. ఇందు బడిశము ప్రసక్తియే కనవచ్చుట లేదు. మత్సంబంధ మను చోట మత్స్యబంధమని యతఁడు వ్రాసియుండె నేమో యని సందేహము. దానిని బట్టి పాదము నంతను చిఱుమార్పుతో సవరింపవచ్చును.

తరువాతి శ్లోకము ననువాదము కూడ మూలానుసారిగా లేదు.

10. రూపభేదవిద స్తత్ర తత శ్చోభయతో దతః
తేషాం బహుపదా శ్శ్రేష్ఠా శ్చతుష్పాదా స్తతో ద్విపాత్ 3-29-31

...వెలయు శబ్దవిదులకంటెను మఱిరూపవేదులైన
వాయసాదులు శ్రేష్ఠముల్ వానికంటె పరుస బహుపాదు లుత్తముల్ వారికంటె
దలఁపఁ జతుష్పదు లధికులు, బలకొని మఱివారికంటె బాదద్వయముం
గల మనుజు లలఘుతము లిమ్ములవారలయందు వర్ణములు నా ల్గరయన్.

3-957, 958

రూపభేదవిదులైన కాకాదులకంటె నిరుపార్శ్వములందు దంతములుగల యశ్వాదులును, అపదములకంటె బహుపదములును, వానికంటె చతుష్పదములు, వాని కంటె ద్విపాత్తులును శ్రేష్ఠతనొందుదు రని శ్లోక తాత్పర్యము.

రూపభేదవిదః కాకాదయః ఉభయతో దకతాయేషాంతే అశ్వాదయః అపదేభ్య స్తేభ్యో బహుపదః. తేభ్యశ్చతుష్పాద ఇత్యర్థః-తతోద్విపాన్మనుష్యః అని వ్యాఖ్య.

పోతన "ఉభయతోదంతః" అను దానిని విడిచివైచెను. మూలశ్లోకమునఁ గూడ నన్వ యము పరిశీలింపఁదగియున్నది.

11. చలత్యశక్తోఽపి నిరాశ్రమోదకే. 3-30-22
నిర్గతః ఆశ్రమో విశ్రామస్థాన ముదకం చ యస్మిన్, అని వ్యాఖ్య.

ఇది తప్తవాలుకే, పథి అను దానికి విశేషణము.
పోతన ఆశ్రయ శూన్యమగు నీళ్ళ మునుఁగుచు లేచుచు (3-977) అని యనువదించెను.

12. ప్రహ్లాదునికి విరోధిశాస్త్రములు గఱపితి రని హిరణ్యకశిపుఁడు పురోహితుని నిందింప నాతఁడు

న మత్ప్రణీతం న పరప్రణీతం
సుతో వద త్యేష సురేంద్రశత్రో
నైసర్గికీయం మతి రస్య రాజన్
నియచ్ఛ మన్యుం కదదాస్స్మమానః. 7-5-28

అని పలికెను. ఇంద్రశత్రో ఇత్యనేన సహిబ్రాహ్మణేషు తవకోప ఉచిత ఇతి భావః (శ్రీధరవ్యాఖ్య) హేఇంద్రశత్రో ఇంద్రశత్రో స్తవ బ్రాహ్మణేష్వాగ్రహః అనుచితః-అవిషయత్వా

నితిభావః అని భాగ. చంద్రిక. దీనినిబట్టి యిందలి ఇంద్రశత్రో- అను సంబోధన మెంత సాభిప్రాయమో తెలియుచున్నది. పోతన దీని నుపేక్షించి

తప్పులిలేపు మా పంశ దానవనాథ 7-176

నీ పుత్రుని నిటువలెఁ జేయఁగ శత్రులమే చైత్యజలధి చంద్రమవింటే. 7-177

అని దానవనాథ! దైత్యజలధి చంద్రమ! అను సామాన్య సంబోధనలను వాడియుండెను.

13. స ఉత్తమశ్లోక పదారవిందయో
ర్నిషేవ యాకించన సంగలబ్ధయా
తన్వన్‌పరాం నిర్వృతి మాత్మనోముహు
ర్దుస్సంగదీనస్య మనశ్శమం వ్యధాత్ 7-4-43

అప్పటప్పటికి దుర్జనసంసర్గ నిమిత్తంబునఁ దనచిత్తం బన్యాయత్తంబు
గానీక నిజాయత్తంబు సేయుచు. 7-125

మన్సంగేన దీనస్య అన్యస్యాపి మనః శమం శాంతం వ్యధాత్ అను భావము అనువాదములోఁ గానరాదు.

**పంచమ స్కంధము - గంగన :**

పంచమ స్కంధము నాంధ్రీకరించిన వాఁడు బొప్పనామాత్య పుత్రుఁడైన గంగన ఈ స్కంధమునకు షష్ఠైకాదశ ద్వాదశ స్కంధముల వలె నితరానువాదము లెవ్వియుఁ గానరావు. గంగన పంచమస్కంధమును రెండాశ్వాసములుగా విభజించెను. ఇట్టి యాశ్వాస విభజన మొక్క పంచమ స్కంధమున మాత్రమే కలదు. ఈ స్కంధము మొదట గంగన దేవతా కవిస్తుతి పూర్వకమైన యవతారిక వ్రాసియుండలేదు.

గంగన కూడ శ్రీధరవ్యాఖ్య ననుసరించుచునే తన యనువాదము సాగించెను. ఇతఁడు పెక్కుచోట్ల మూలమును సన్నిహితముగా ననుసరించుటయే కాక యిందలి పదములనే యథాతథముగా వాడియుండెను. ఇతఁడు మూలభావములను పోతనవలె భక్తిభావభరితుఁడై పెంపొందించిన భాగము లంతగాఁ గానిపింపవు. సంగ్రహించిన భాగము లచ్చటచ్చటఁ గలవు. అట్లే మూలార్థమును న్యూనపరిచిన భాగములును, ఔచిత్యమునకై స్వతంత్రించి మార్చిన భాగములును గూడఁ గానిపించును.

సన్నిహితముగా ననుసరించిన భాగములు :

మహాత్మాంభులు విప్రవర్షే హ్యుత్తమ శ్లోక పాదయోః
ఛాయానిర్వృత చిత్తానాం న కుటుంబే స్పృహామతిః. 5-1-3

సంశయో౽యం మహాన్ బ్రహ్మన్ దారాగార సుతాదిషు
సక్తస్య యత్సిద్ధి రభూ త్కృష్ణేవ మతి రచ్యుతా. 5-1-4

ఉత్తమశ్లోకుండైన పుండరీకాక్షుని పాదచ్ఛాయం జేసి నిర్వృత చిత్తులైన మహాత్ములు కుటుంబంబు నందు నిస్పృహత చేయుదురు. (కాన ప్రియవ్రతునకు సంసారంబునందుఁ దగులంబు కలుగు టెట్లు ?)

దారాగార సుతాదులందుఁ దగులంబు గలవానికి నెట్లు సిద్ధి గలుగు ? శ్రీహరియం దస్ఖలితమతి యెట్లు కలుగు ? ఈ సంశయంబు తెలుపఁబడు ము. 5-1-4

2. సోచ త ద్రాశ్రమోపవన మతిరమణీయం వివిధ నిబిడ విటపి విటపాశ్లిష్టనికట పురట లతారూఢ స్థలవిహంగమ మిథున ప్రోచ్యమాన శ్రుతిభిః ప్రతిబోధ్యమాన సలిలకుక్కుట కారండవ బక కలహంసాదిభి ర్విచిత్ర ముపకూజితామల జలాశయ కమలాకారా ముపబభ్రామ. 5-2-4.

ఆ యప్సరోఽంగన చనుదెంచి రమణీయ వివిధ నిబిడ విటపి విటప సమాశ్లిష్ట సమీప సువర్ణ లతికారూఢ స్థలవిహంగమ మిథునోచ్చార్యమాణ షడ్జాదిస్వరంబులచే బోధ్యమాన సలిల కుక్కుట కారండవ బక కలహంసాది విచిత్ర కూజిత సంకులంబు లైన నిర్మలోదక కమలా కరంబులు గల తదాశ్రమోపవనంబున విహరింపుచు. 5-1-26

ఈ యనువాద మించుక మార్పుతో మూలమునకుఁ బ్రతిబింబముగా నున్నది.

నికటపురటలతాః—సన్నికృష్ట స్వర్ణవల్లరీః; ప్రోచ్య మానాభిః శ్రుతిభిః—ఉచ్చార్య మాణైః షడ్జాదిభిస్స్వరైః; అను నర్థములు శ్రీధరవ్యాఖ్య యందున్నవి. వానినే గంగన మార్పేమియు లేకుండ ననుసరించెను.

విడిచి పెట్టిన భాగములు :

జ్ఞానం విశుద్ధం పరమార్థ మేక మనంతరం త్వబహిర్బ్రహ్మసత్యం
ప్రత్యక్ప్రశాంతం భగవచ్ఛబ్ద సంజ్ఞం యద్వాసుదేవం కవయోవదంతి. 5-12-11

బాహ్యాభ్యంతరంబులఁ గలిగి స్వప్రకాశంబై భగవచ్ఛబ్ద వాచ్యంబు విశుద్ధంబుఁ బర మార్థంబు జ్ఞానరూపంబు నైన బ్రహ్మం బొకటియే సత్యంబు. జగ త్తసత్యంబగు. 5-1-161

జగ త్తసత్యంబనుటకు గంగన వివరణముగా వ్రాసిన వాక్యము. ''యద్వాసుదేవం కవయోవదంతి'' అనువాని నతఁడు విడిచివైచెను.

ఇతి తేషాం వృషలానాం రజ స్తమః ప్రకృతీనాం ధన మద రజ ఉత్సిక్తమనసాం ***భగవత్కలాయుక్తం వీరకులం కదర్థీ కృత్యోత్పథేన స్వైరంవిహరతాం హింసా విహారాణాం*** కర్మాతిదారుణం... 5-10-16

''పాపాత్ములకు దౌష్ట్యపరులును రాజసతామసకర్మ సంధానులగుచు విప్రవరు నట్లు హింసించు వృషలపతిని భృత్యవర్గంబులోఁ దలఁప్ వృత్తిఁ గూల్చి'' 5-1-134

పై మూలమునందలి కొన్ని భాగములను గంగన విడిచివైచెను.

పెంచిన భాగములు :

కాత్వం చికీర్షసిచ కిం మునివర్య శైలే మాయాపికాపి భగవత్పర
దేవతాయాః 5-2-8

సతి నీ వెవ్వతె వీ పర్వతమున కేమైనఁ గోరి వచ్చిన **వనదే**
***వతవో శారదవో రతిపతిపంపిన మాయివో తపస్సారమావో !*** 5-1-27

పై పద్యమున భిన్నాక్షరములు గల భాగమంతయుఁ గంగన పెంచి వ్రాసినదే.

సవా ఏతద్విష్ణు దత్తమహాద్భుతం యదసంభ్రమః శిరశ్ఛేద ఆపతితోఽపి...
భాగవత పరమహంసానామ్. 5-9-20

ఈ భాగమును గంగన విడిచివైచి

అచ్చట విప్రసూనుఁడు...... 5-1-137

మఱియు నా విప్రవరుండు చండికాగృహంబు వెలువడి క్రమ్మఱం జని కావలి యుండునెడ. 5-1-138

అనువాని నధికముగా వ్రాసెను. ఈ పెంపు పూర్వాపరకథలను గలుపుచు రమ్యముగా నున్నది.

మూలభిన్న సందర్భములు :

అగతతృషా భయాత్సహసై వోచ్చక్రామ 5-8-2
అపగతతృష యగుచు నది నుల్లంఘించునెడ 5-1-101

అగతతృషా యను దానికి నగతాతృట్ యస్యాః అని వ్యాఖ్య. దీని కపగత తృష యగుచు నన్నది కేవల విరుద్ధము.

పంచమస్కంధ ద్వితీయాధ్యాయమున ఆగ్నీధ్రుఁడు పూర్వచిత్తిని గాంచి

కాత్వం చికీర్షసి చ కిం మునివర్య శైలే
మాయాపికాపి భగవత్పర దేవతాయాః
విజ్యే బిభర్షి ధనుషీ సుహృదాత్మనోఽర్థే
కిం వా మృగాన్ మృగయసే విపినే ప్రమత్తాన్. 5-2-8

ఇత్యాదిగాఁ బెక్కు ప్రశ్నలడిగెను. ఈ శ్లోకము లన్నింట మునివర్య, సుహృత్, బ్రహ్మన్, సుభగ మున్నగు పుంలింగ సూచకములగు సంబోధనము లున్నవి.

మునివర్యే త్యాది పుంస్త్వేన సంబోధనాని జాడ్యానుకారార్థ మ్మని శ్రీధరుని వ్యాఖ్య.

గంగన యిచ్చట పుంస్త్వసూచక సంబోధనములను విడిచి సతి, అంగన, ఇంతి మున్నగు సంబోధనములనే వాడెను. మూల రచనయే రమ్యతరముగా నున్నది. మఱియు సంస్కృతమునఁ గల

విజ్యేబిభర్షి ధనుషీ సుహృదాత్మనోఽర్థే
కింవామృగాన్ మృగయసే విపినేప్రమత్తాన్

ఉత్తరార్ధమునకు శ్రీధరుఁడు "హేసుహృత్ సఖే ఏక్షే నిర్గుణే ధనుషీ బిభర్షి. కిమాత్మనోఽర్థే? తద్వై తాభ్యాం కిం కార్యమస్తి. కింవా ప్రమత్తాన్ అజితేంద్రియాన్ మృగతుల్యాన్ అస్మదాదీన్ మృగయసే. తాన్వశీకర్తుం ధనుషీ ధారయసీత్యర్థః. అని వ్యాఖ్యానము చేసెను. దీనిని గంగన

అంగజుఁ డెక్కుడించిన శరాసనమున్ ధరయించి యంత నా
యంగజు వేఁట మానవమృగావళిఁ జూచుచు నున్నవాఁడవో
రంగగు నీదు చెయ్యుల తెఱం గెఱుఁగంగ నిజంబుఁ బల్కుమా
యంగన నిన్నుఁ గన్గొనిన యంత ననంగుఁడు సంపడించెడున్. 5-1-28

అని యనువదించెను. మూలమున వ్యంగ్యముగా నున్న యర్థ మనువాదమున వాచ్యమైనది. పద్యమునందలి యమూలకమైన యుత్తరార్ధము దానిని మఱింత వాచ్య మొనర్చినది.

పండ్రెండవ యధ్యాయమున రహూగణుఁడు మునీంద్రుని

తస్మాద్భవంతం మమసంశయార్థం
ప్రక్ష్యామి పశ్చా దధునా సుబోధమ్
అధ్యాత్మ యోగ గ్రథితం త్వయోక్త
మాఖ్యాహి కౌతూహలం చేతసో మే. 5-12-3
యదాహ యోగేశ్వర దృశ్యమానం
క్రియాఫలం సద్వ్యవహార మూలమ్
న హ్యంజసా తత్త్వ విమర్శనాయ
భవా నముష్మిన్ భ్రమతే మనో మే. 5-12-4

అని యడిగెను. ఇందలి రెండవ శ్లోకము కూడ రహూగణుఁ డడిగినట్టిదే. తరువాత మునీంద్రుఁ డాతనికి తత్త్వము చెప్పెను. గంగన యిందలి మొదటి శ్లోకమును

విప్రవర్య నేను వేడ్కతో నా సంశ
యంబు లెల్ల నిన్ను నడిగి తెలియఁ
దలఁచియున్నవాఁడఁ దప్పక యెఱిఁగింపు
ముచితవృత్తిఁ దత్త్వయోగమెల్ల. 5-1-158

అని యనువదించెను. "నా సంశయములను తరువాత నడుగుదును. ఇప్పుడు నీచేఁ జెప్పఁబడిన యధ్యాత్మ యోగమును కుతూహలాయత్త చిత్తుఁడనైన నా కెఱిఁగింపు" మనునది మూల శ్లోకమునందలి యర్థము. అనువాద మించుక విరుద్ధముగా నున్నది. పిమ్మటఁ గల-అని యడిగిన యా రాజున కావిప్రుం డి ట్లనియె. 5-1-159

కానవచ్చిన ఫలములు కర్మమూల
ము లగుటను జేసి సంసారములను జిత్త
మెపుడు వర్తించుచుండఁగా నెఱుఁగ లేవు
తత్త్వయోగంబు మిగుల నిత్యం బటంచు. 5-1-160

అను వచనమును, పద్యమును మూలానుసారములుగ లేవు. ఈ పద్యము నందలి భావమును గూడ రహూగణుఁ డే మన్నాఁడని చెప్పినదాని ననువదించి తెల్పుచున్నట్లు మూలమం దున్నది. బ్రాహ్మణ ఉవాచ- అనునది యందుఁ దరువాత నున్నది.

వృషలరాజ భృత్యులు భరతునిఁ గాళిబలికిఁ గొంపోవు సందర్భమునఁ గాళి వృషలాధిపునిఁ దద్భృత్యవర్గముతోఁ గూడ సంహరించి క్రీడించె నని చెప్పిన పిమ్మట సంస్కృత భాగవతము ''ఏవ మేవ ఖలు మహదభిచారాతిక్రమః (అభిచార రూపాతిక్రమః-అపరాధః) కార్త్స్న్యే నాత్మని ఫలతి'' (5-10-19) అని చెప్పుచున్నది. గంగన దీనిని విడిచి

ధరలోన నెవ్వరేనియు ధరణీసురవరుల కెగ్గు దగఁ దలఁచిన వా
రరయఁగ చెడుదురు నిక్కము, హరి ధరణీసురవరేణ్యులందుండుటచేన్. 5-1-135

మూల మభిచారరూపాతిక్రమ ఫలమును నొక్కి చెప్ప ననువాదము బ్రాహ్మణుల కెగ్గుఁ దలఁచిన వారికిఁ గల్గు ఫలితములును వివరించి చెప్పుచున్నది.

ఔచిత్యమును బోషించిన భాగములు.

కావాత్మవృత్తి రదనాద్ధవిరంగ వాతి
విష్ణోః కరా స్యనిమిషో న్మకరౌ చ కర్ణౌ
ఉద్విగ్న మీనయుగళం ద్విజపంక్తి శోచి
రాసన్న భృంగనికరం సర ఇవ న్ముఖంతే. 5-2-14

కావాతవ లోకే ఆత్మనః దేహస్యవృత్తిః ఆహారః. అంగ హేసఖే అదనాచ్చర్వణాత్. హవిరితి తత్సంబంధి గంధః వాతి ఆగచ్ఛతీతి తాంబూలాభిప్రాయమ్.

యతః త్వం శ్రీవిష్ణోః కలాసి,

తవచకర్ణౌ శ్రీ విష్ణోరివానిమిషోన్మకరౌ. అనిమిషో నిద్రారహితత్వేన, అలుప్త దృష్టిత్వేన, రత్న నేత్రత్వేన నిమిషశూన్యౌ ఉత్లసంతౌ మకరౌ తదాకారే కుండలే యయోస్తౌ. కించ తవముఖం సరవత్ శరత్సర ఇవ అత్రాదంతత్వ మార్షమ్. ఉద్విగ్నం చంచలం మీనయుగళ మివ నేత్రద్వయం యస్మిన్. ద్విజాః దంతాఃతేషాం పంక్త్యా శోచి శోభా యస్మిన్. సరసితు ద్విజాః హంసాః. ఆసన్నోభృంగ నికర ఏవ కేశస్తోమః పరిమళలుబ్ధ భృంగస్తోమోవాయస్మిన్. అని శ్రీధరుని వ్యాఖ్య.

ఇందలి ''కావాత్మ వృత్తి రదనాద్ధవిరంగవాతి'' అను దానిని గంగన విడిచివైచెను. ''విష్ణోః కలాసి'' అను దానిని 37 వ పద్యమునఁ జెప్పెను. మిగిలిన దానిని

పటుతాటంకరథాంగ యుగ్మమునకుం బల్మాఱు భీతిల్లుచున్
నటనం బందెడు గండుమీనములతో నాసన్న నీలాల కో
త్కట భృంగావళితో ద్విజావళి లసత్కాంతిన్ విడంబించు మా
ఖటకాసారముఁ బోలి నెమ్మొగము దా రంజిల్లు నత్యున్నతిన్. 5-1-38

తాటంక రథాంగయుగ్మమునకు భయపడి (నేత్రములనెడి) గండుమీనములు సటసం బందుచు నున్న వను కల్పన యమూలకమై రమ్యముగా నున్నది.

మొత్తము మీఁద గంగన మూలమును సన్నిహితముగా ననుసరించుచు ననువాదము సాగించెను. రసపోషణమున నితరానువాదకుల వలెనే యితఁడును పోతన కీడు కాఁజాలడు.

**షష్ఠ స్కంధము- సింగయ :**

షష్ఠ స్కంధము ననువదించినవాఁడు కసువయామాత్య పుత్రుఁడైన సింగయ. ఇతఁడీ స్కంధము నారంభమున పోతనవలెనే దేవతాకవి స్తుతియు, స్వప్నవృత్తాంతమును, నిజవంశ వర్ణనమును, షష్ఠ్యంతములును రచించినాఁడు. ''బమ్మెర పోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్'' అను పద్యభాగము వలన నితనికి పోతనపైఁ గల భక్తి గౌరవములు వెల్లడియగు చున్నవి. స్వప్న వృత్తాంతమున నితఁడు దివ్యవాణి (జగన్మాత) తనకు స్వప్నమున సాక్షాత్కరించి ''నా చాటునఁ జాటుకార పదసాధు కవిత్వము చెప్పుమింపుగన్'' అని యానతిచ్చినట్లు వ్రాసి యున్నాఁడు. పోతనయెడ నీతనికిఁ గల భక్తి యితని రచనలోఁ గూడఁ గానిపించును. అతఁడు రచించిన భాగవత భాగమును బలుమార్లు చదివి యా రచనా విధానమును జీర్ణించుకొని యాతఁడట్లే వ్రాయుటకు యత్నించి కొంతవఱకుఁ గృతకృత్యుఁ డయ్యెను. పోతనవలె నితఁడును శ్రీధర వ్యాఖ్యనే యనుసరించి యనువాదము సాగించెను. షష్ఠ స్కంధము నితఁడు కాక మఱి ముప్వురు కూడ నాంధ్రీకరించి యున్నారు. వారి యనువాదములలో హరిభట్టు రచన యొక్కటే యిప్పుడు పూర్తిగా లభ్యమగుచున్నది.

యథామూలముగా ననువదించిన భాగములు :

అధునేహ మహాభాగ యథైవ నరకాన్నరః
నానోగ్రయాతనా న్నేయా త్తన్మే వ్యాఖ్యాతు మర్హసి. 1-6

కడిఁది వేదనలకుఁ గారణం బై యుండు
గుఱుతులేని నరక కూపరాశి
పొలుగాక నరుఁడు బ్రతికెడు మార్గంబు
పరమపుణ్య! తెలియఁ బలుకవయ్య. 6-41

నాశ్నతః పథ్యమేవాన్నం వ్యాధయోఽభిభవన్తి హి
ఏవం నియమకృద్రాజన్ శనైః క్షేమాయ కల్పతే. 1-12

హితమగుగల కుడుపు మఱి మ, గ్నితతులఁ బొదమంగ నీని విధమున సతి స
ద్వ్రతుఁ డైనవాఁడు నిర్మల, మతిచే నఘరాశినెల్ల మట్టము సేయున్. 6-49

తపసా బ్రహ్మచర్యేణ శమేనచ దమేనచ
త్యాగేన సత్య శౌచాభ్యాం యమేన నియమేనచ
దేహవాగ్బుద్ధిజం ధీరా ధర్మజ్ఞా శ్రద్ధయాన్వితాః
క్షిపన్తి త్వఘం మహదపి వేణుగుల్మ మివానలః. 1-13,14

తపమున బ్రహ్మచర్యమున దానమునన్ శమ సద్దమంబులన్
జపముల సత్య శౌచముల సన్నియమాది యమంబులన్ గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తను వాక్యజంపుఁ బా
పముఁ గుదెఁ ద్రుంతు రగ్ని శతపర్వ వనంబుల నేర్చుకైవడిన్. 6-50

పెంచిన భాగములు :

తస్మాత్పురైవాశ్విహ పాపనిష్కృతౌ
యతేత మృత్యో రవిపద్య తాత్మనా
దోషస్య దృష్ట్వా గురులాఘవం యథా
భిష క్చికిత్సేత రుజాం నిదానవత్. 1-8

కావునఁ గాలకింకర వికారము కానకమున్న మృత్యు దు
ర్భావన చిత్తమున్ వెడఁగుపాటును జెందకమున్న మేనిలో
జీవము వెల్గుచుండి తన చెల్వము తప్పక మున్న మున్నగాఁ
బాపనచిత్తుఁడై యఘముఁ బాయు తెఱం గొనరింపఁగాఁ దగున్ 1-44

కాలంబెడగని పాపము మూలముఁ జెఱుపంగవలయు ముసురోగములన్
దేలిన దోషము నెఱుఁగుచు వాలాయము దాని నడఁచు వైద్యునిభంగిన్. 6-45

కొన్ని చోట్ల నొకే శ్లోకమునకు రెండు విధములైన యనువాదములు కనిపించును.

కేచిత్కేవలయా భక్త్యా వాసుదేవ పరాయణాః
అఘం ధున్వన్తి కార్త్స్న్యేన నీహార మివ భాస్కరః. 1-15

కొందఱు పుణ్యవర్తనులు- 6-52
హరిభక్తిచేతఁ గొందఱు పరిపూర్తురు మొదలు ముట్టఁ బాపంబుల ని
ష్ఠురతర కరముల సూర్యుం డరుదుగఁ బెనుమంచు పించ మణఁచిన భంగిన్. 6-53

స ద్రీచీనో హ్యయం లోకే పంథాః క్షేమోఽకుతో భయః
సుశీలా సాధవో యత్ర నారాయణ పరాయణాః. 1-17

ఈ శ్లోకము మొదట నొక సీసపద్యమున విపులముగను దరువాత నొక తేటగీతిలో సంగ్రహముగను ననువదింపఁబడినది.

హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగనుండు వానికై వల్య మెవ్వనికిలేదు. 6-55
అరయ నెన్నఁడుఁ జేటులేనట్టి ముక్తివర్త్మమీ లోకమందు నెవ్వనికిఁగలదు.
సాధులును బుణ్యశీలురు సజ్జనులును హరిపరాయణ తత్పరు లగుటఁగాక. 6-56

సింగన యొక్కొక్కచోట్ల శ్లోకమునందలి యొక్కొక్క విశేషణము నొక్కొక్క పద్యముగాఁ బెంపుచేసి యనువదించుచుండును.

సర్వేచ నూత్నవయసః సర్వే చారుచతుర్భుజాః
ధనుర్నిషంగాసి గదా శంఖ చక్రాంబుజశ్రియః. 3-51

దిశో వితిమిరా లోకాః కుర్వంత స్స్వేన రోచిషా
కిమర్థం ధర్మరాజస్య కింకరా న్నో నిషేధథ. 1-36

ధనువులు నిషంగచయములు కనదంబుజ శంఖచక్ర ఖడ్గ గదా సా
ధనములు ధరియించిన మీ తనువులు లోకముల కద్భుతం బొనరించెన్. 6-78

శాంతంబు లైన మీ తనుకాంతులు జగములను దిశలఁగలిగిన బహుళ
ధ్వాంతములఁ బాఱఁదోలుచు సంతస మొనరించె నిపుడు సర్వంకషమై. 6-79

ఇట్లఖిల లోకానందకర కమ్రాకారులు నఖిల విభ్రాజమాన తేజో దుర్నిరీక్ష్యమాణులును నిఖిల ధర్మపాలురు నగు మీరు ధర్మపరిపాలుర మమ్ము నడ్డపెట్టం గతంబేమి. 6-80

శ్రీధర వ్యాఖ్య ననుసరించి పెంపుచేసిన భాగములు.

యథేహ దేవప్రవరా స్త్రైవిధ్య ముపలభ్యతే
భూతేషు గుణవైచిత్ర్యా త్తథాన్యత్రానుమీయతే. 1-46

హే దేవప్రవరాః ఇహజన్మని శాంత ఘోర మూఢత్వేన సుఖదుఃఖ మిశ్రత్వేనవా ధార్మికత్వాదినా వా త్రైవిధ్యం భూతేషు యథోపలభ్యతే తథాన్యత్ర జన్మాంతరేఽప్యనుమీయతే త్రైవిధ్యాన్యథానుపపత్త్యా కల్ప్యతే. శ్రీధర వ్యాఖ్య.

మఱియు వినుండు. జన్మంబు శాంత ఘోర మూఢగుణంబుల చేతనైనను, సుఖదుఃఖగుణంబులచేత నైనను, ధార్మికాది గుణంబులచేత నైనను సకల భూతంబులు త్రైవిధ్యంబు నే ప్రకారంబునం బొందు నా ప్రకారంబున జన్మాంతరంబునఁ బొందుచుండు. 6-87

పంచభిః కురుతే స్వార్థాన్ పంచ వేదాథ పంచభిః
ఏకస్తు షోడశేన త్రీన్ స్వయం సప్తదశోఽశ్నుతే. 1-50

పంచభిః కర్మేంద్రియైః స్వార్థానుపాదానాదీన్ పంచశబ్దాదీన్ వేద. పంచభిః జ్ఞానేంద్రియైః షోడశేన మనసాసహ సప్తదశః షోడశోపాధ్యంతర్గతోఽపి స్వయంత్వేక ఏవ. సర్వేంద్రియ విషయ ప్రతి సంధానాత్. త్రీన్ జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయాన్ ప్రాప్నోతి- శ్రీధర వ్యాఖ్య.

మఱియుఁ గర్మేంద్రియములచేతఁ గర్మంబులు చేయుచుండి జ్ఞానేంద్రియంబులచేతఁ బమ్మోవిషయంబులైన శబ్ద స్పర్శ రూపరసగంధంబుల నెఱుంగుచుండి పదియాఱవది యైన మనంబుతోఁ గూడి పదియేడవవాఁ డగుచుండి షోడశోపాధ్యంతర్గతుం డై యొక్కరుం డైన జీవుండు సర్వేంద్రియ విషయ ప్రతిసంధానంబు కొఱకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయంబులఁ బొందుచుండి... 6-87

కొన్ని చోట్ల నతఁ డష్టాలకము లైన వర్ణనలు కావించుచుండును.

ఏకదాసౌ వనం యాతః పితృసందేశ కృద్ద్విజః
ఆదాయ తత ఆవృత్తః ఫలపుష్ప సమిత్కుశాన్. 1-58

ఈ శ్లోకము ననుసరించుటకు ముందు సింగన యజామిళుని యౌవనమును వసంతమును (89-94) పద్యములలో విశదముగా వర్ణించెను. ఈ వర్ణన మమూలక మయ్యెను ముం దజామిళుఁడు చేయఁబోవు కార్యమును దృష్టియం దుంచుకొని చూచినచో మిక్కిలి యుచితముగా నున్నది. అట్లే

మత్తయా విశ్లథ న్నీవ్యా వ్యపేతం నిరపత్రపం
క్రీడంత మనుగాయంతం హసంత మన యాంతికే॥ 1-60

ఈ సందర్భమున సింగన (98-101) పద్యములలో రతిక్రీడను వర్ణించెను.

అజామిళుఁడు తాను జూచిన కాంత యెడ బద్ధచిత్తుఁడై మన్మథోద్దీపన మొందిన సందర్భమున మూలమందు, తామేవమనసాధ్యాయన్ స్వధర్మాద్విరరామహ (1-63) అని కలదు. ఆ భావమును సింగన

ఆ లీలావతి గండపాళికలపై హాసప్రసాదంబుపై
నాలోలాలక పంక్తిపై నాసలిపై నాకర్ణ దృగ్భూతిపై
హేలాపాది కుచ ద్వయోరు కటిపై నిచ్చల్ పిసాళింపఁగా
జాలిం బొందుచు నాత్మఁ గుందుచు మనోజాతానలోపేతుఁడై. 6-103

అని పెంచి వ్రాసెను. పిమ్మట

ఇతస్తత శ్చోపనిన్యే న్యాయతో ఒన్యాయతో ధనం
బిభ ర్తాస్యాః కుటుంబిన్యాః కుటుంబం మందధీ రయమ్. 1-66

అను శ్లోకమును

సముచిత శ్రుతిచర్చ చర్చింప నొల్లక సతికుచద్వయ చర్చచర్చచేయు 6-107

అను సీసపద్యముగా విపులీకరించి తెనిఁగించెను. మూలమునందలి "న్యాయతోఒన్యాయతోధనం" అను పదముల నతఁడు విడిచిపైచెను. మూల శ్లోకము సంగ్రహముగనే యున్నను ఆ దుష్టబ్రాహ్మణుని వర్తనమును జక్కఁగా వర్ణించుచున్నది.

కొన్నిచోట్ల సింగన యనువాదము మూలభావములను సరిగా వ్యక్తము చేయకుండుటయేకాక క్లిష్టాన్వయమై యున్నది.

...ఇతి దైహ్యస్య సాక్షిణః
ఏతై రథర్మో విజ్ఞాతః స్థానం దండస్య యుజ్యతే
సర్వే కర్మానురోధేన దండ మర్హంతి కారిణః 1-43

దేహధారికి సాక్షులై తెలుపుచుండు
దండనస్థాన విధము సద్ధర్మగతియుఁ
దగుల మీ రీ క్రమాను రోధనము చేసి
యఖిల కర్మలు దండార్హు లరయ నెపుడు. 6-84

మొత్తము మీఁద సింగన పోతననే యాదర్శముగా గ్రహించి యనువాదము సాగించెను. ఇతనికి మూలమును విస్తరించుట యందుఁ బ్రీతి మెండు.

## ఏకాదశ ద్వాదశ స్కంధములు - నారయ :

ఏకాదశ ద్వాదశ స్కంధములు రచించినవాఁడు వెలిగందల నారయ. ఇతఁడు గద్యలో పోతనామాత్య ప్రియశిష్యుఁడ నని చెప్పుకొని యున్నాఁడు. పూర్వులలో హరిభట్టును ఆధునికులలో శ్రీ సంపన్ముడుంబ సింగరాచార్యులుగారును, మిన్నికంటి గురునాథశర్మగారును గూడ నీ రెండు స్కంధములను దెనిఁగించియుండిరి. సంజీవరాయ కవియు, కోవూరి పట్టాభిరామయ్యగారును ఒక్క యేకాదశ స్కంధమును మాత్ర మనువదించిరి. ఇంతమంది యీ రెండు స్కంధములను అనువదింపఁ బూనుటకు నారయ రచన మూలానుసారముగాఁ గాక యతిసంగ్రహముగా నుండుటయు, అదియును శిథిలమై పోవుటయు ముఖ్యకారణములు. హరిభట్టు రచన ధారాశుద్ధి శోభితమై మనోహరముగా నుండుటచేఁ గొందఱు భాగవతమును వ్రాసికొనునప్పుడు నారయ రచనకు బదులుగా హరిభట్టు రచనను వ్రాసికొనుచుండిరి. అందుచేతనే కొన్ని తాళపత్ర ప్రతులు హరిభట్టు రచనతోఁ గూడియుండుట సంభవించినది. నారయ రచనలోఁ బెక్కుచోట్ల హరిభట్టు రచనయో దాని ననుసరించిన రచనయో కనవచ్చుచున్నది.

వెలిగందల నారయ్య పోతన శిష్యుఁడ నని చెప్పుకొన్నను అతనివలెఁ గాక మూలమును జాల సంగ్రహించియు గొన్ని చోట్లఁ గొన్ని యధ్యాయములు విడిచి వైచియు రచన సాగించెను. అందు మూలభిన్నములైన పట్టులును పెక్కు కానవచ్చును. అయ్యును పెక్కు తాళపత్ర ప్రతులలో పోతన రచన తరువాత నితని రచనమే చేర్పఁబడి యుండుట కితఁ డతని శిష్యుఁడగుటయే కారణమై యుండును.

1. ఏకాదశ స్కంధమందలి షష్ఠాధ్యాయము-శివుఁడు, బ్రహ్మ, ఇంద్రాది దేవతలు మొదలగు వారు కృష్ణుని దర్శించుటకై ద్వారక కరుగుటతో - నారంభించుచున్నది. వారు స్వర్గోద్యాన జాతములైన పూలమాలలతోఁ గృష్ణునిఁ బూజించి చిత్ర పదార్థములైన వాక్కులతో నతని స్తుతించిరి. ఈ స్తుతి యిచ్చట (7-27) 20 శ్లోకములలో నున్నది. నారయ యీ స్తుతి నంతను విడిచి,

కవి పరమేశుని యాదవ వంశోద్భవ పారిజాత వనరుహనేత్రున్
జనతామిత ఫలదాయకు వినుతించిరి వివిధము లగు వేదోక్తములన్. 11-84

అని యొక్క పద్యము వ్రాసెను. బ్రహ్మస్తుతిలోని

యదువంశేఽవతీర్ణస్య, భవతః పురుషోత్తమ
శరచ్ఛతం వ్యతీయాయ పంచవింశాధికం ప్రభో. 6-25

అను శ్లోకమును మాత్ర మతఁడు

అఖిలలోకేశ సర్వేశ యదుప! నీవు సుదయముంచుట భూభార ముడుప కొఱకుఁ
బంచవింశోత్తర శతాబ్ద పరిమితంబు నయ్యె విచ్చేయు వైకుంఠ
హర్మ్యమునకు 11-85

అని తెలిగించెను.

2. శివబ్రహ్మాదిదేవతలరిగిన పిమ్మట ద్వారకయందు దుర్నిమిత్తములు పొడగట్టెను. ఈ విషయము మూలమున

అథ తస్యాం మహోత్పాతాన్ ద్వారకాయాం సముత్థితాన్
విలోక్య భగవానాహ యదువృద్ధాన్ సమాగతాన్. 6-34
ఏతేవై సుమహోత్పాతా వ్యుత్తిష్ఠం తీహ సర్వతః
శాపస్య నః కుల స్యాసీ ద్బ్రాహ్మణేభ్యో దురత్యయః. 6-35

అని చెప్పఁబడినది. ఆ యుత్పాతములేవో యందుఁ దెలుపఁబడియుండలేదు. నారయ వాని నిట్లు వివరించెను.

కాకఘూకంబులు కనక సౌధములలోఁ బగలు వాపోయెడి బహువిధముల
నశ్వవాలములందు నసల ముద్భవమయ్యె నన్నంబు మొలచె మహాద్భుతముగ
శుకసారికలు రాత్రి సొగసె విస్వరముల జంతువు వేఱొక్క జంతువుఁ గనె
నొగిఁ జోరగృహముల నుల్కము లుదయించె బెరసెఁ గావిరి రవిబింబమపుడు. 11-87

3. ఉత్పాతములను జూచిన పిమ్మటఁ గృష్ణుఁడు యదువృద్ధులతోఁ జెప్పిన మాటలు మూలమున 5 శ్లోకములలో (5-35-39) నున్నవి. అతఁడు వారెచ్చటి కేగి యేమేమి చేయవలెనో వివరించెను. నారయ యా విషయము నంతను సంగ్రహించి యిట్లు చెప్పెను.

కాన నుత్పాతములు చాలఁ గానఁబడియె
నరయ నిందుండ వలవదు యదువులార
తడయ కిపుడ ప్రభాస తీర్థమున కరుగుఁ
డనుచు శ్రీకృష్ణుఁ డెంతయు నానతిచ్చె. 11-87

4. యాదవులు ద్వారకను విడిచి ప్రభాసతీర్థమునకు వెడలుటకు నిశ్చయించిన పిమ్మట నుద్ధవుఁడు వివిక్తమునఁ గృష్ణుని దర్శించి యాతని పాదములకు సమస్కరించి ప్రాంజలియై 8 శ్లోకములతో (6-43-49) స్తుతించెను.

దీనిని నారయ "దీనజన కల్పభూజ! సుధీనాయక మాకు నీవె దిక్కని పొగడెన్ ... దేవా నీవు యదుక్షయంబు గావించి చనిన నే యే విధంబున నిర్వహింతును. నీ సహచరులమై జరిపిన మజ్జన భోజన శయనాసనాది కృత్యంబులు మఱవ వచ్చునే" యని యతిసంగ్రహముగా ననువదించెను.

5. 7, 8, 9 అధ్యాయములందలి అవధూత యదు సంవాదమును, తదంతర్గతము లైన కపోత పింగళాదుల యితిహాసములను నారయ చాల సంగ్రహించి రచించెను.

6. 10 మొదలు 29 వ అధ్యాయము వఱకు నుద్ధవుఁ డడుగఁగా గృష్ణుఁ డతనికిఁ జెక్కాధ్యాత్మిక విషయముల నెఱింగించెను. వీనిలోఁ గొన్ని యధ్యాయములను నారయ విడిచివైచెను. కొన్నిటి నూరక స్పృశించి విడిచెను. కొన్నిటి నతిసంగ్రహముగా సూచించెను.

7. 30, 31 అధ్యాయములలో యాదవ ప్రళయమును కృష్ణ బలరాముల వైకుంఠ గమనమును వర్ణింపఁబడినవి. నారయ వీనిని గూడఁ జాల సంక్షేపించెను. కృష్ణ నిర్యాణానంతర మర్జునుఁడు మృతుల కూర్ధ్వ దైహికము లొనరించుటయు, వజ్రునిఁ బట్టాభిషిక్తు నొనరించుటయు సంస్కృత భాగవతమున నున్నను నారయ వానిని దెనిఁగించి యుండలేదు.

8. ద్వాదశ స్కంధమునుగూడ నారయ చాల సంక్షేపముగనే యనువదించెను. అందు భాగవత సారాంశమును జెప్పు 12 వ అధ్యాయము నొక దానిని మాత్రము పూర్తిగా విడిచివైచెను. మిగిలిన వానిని స్పృశించి వదలెను.

9. ఈ రెండు స్కంధములలో నొండు రెండు చోట్ల నాతఁడు మూలమునకు భిన్నముగాఁ గూడ రచన సాగించెను.

విప్రశాపానంతరము యదుకుమారులు భీతులై సాంబుని యుదరమును విప్పి యందయోమయమైన ముసలమును గాంచి రని మూలమునఁ గలదు.

తే తచ్ఛ్రుత్వాతి సంత్రస్తా విముచ్య సహసోదరం
సాంబస్య దదృశు స్తస్మిన్ ముసలం ఖ ల్వయస్మయమ్. 1-16

ఇందలి ఉదరం సహసా విముచ్య అను పదములను నారయ 'సాంబకుక్షి నిక్షిప్తచేల గ్రంథి విమోచనంబు సేయ సమయంబున' అని వివరించి తెనిఁగించెను.

తం చోపనీయ సదసి పరిమ్లాన ముఖశ్రియః
రాజ్ఞ ఆవేదయాం చక్రు స్సర్వయాదవ సన్నిధౌ 1-18

శ్రుత్వామోఘం విప్రశాపం దృష్ట్వా చ ముసలం నృప
విస్మితా భయ సంత్రస్తా బభూవు ర్ద్వారకౌకసః 1-19

తం చూర్ణయిత్వా ముసలం యదురాజ స్స ఆహుకః
సముద్రసలిలే ప్రాస్య ల్లోహం చా స్యావశేషితమ్. 1-20

కశ్చిన్మత్స్యోఽగ్రసీ ల్లోహం చూర్ణాని తరళై స్తతః
ఊహ్యమానాని వేలాయాం లగ్నా న్యాసన్ కిలైరకాః 1-21

మత్స్యో గృహీతో మత్స్యఘ్నై ర్జాలైరన్యై స్సహార్ణవే
తస్యోదరగతం లోహం స శల్యే లుబ్ధకోఽకరోత్. 1-32

భగవాన్ జ్ఞాతసర్వార్థ ఈశ్వరోఽపి త దన్యథా
కర్తుం నైచ్ఛ ద్విప్రశాపం కాలరూ ప్యన్వమోదత. 1-23

పై శ్లోకములలో యదుకుమారు లా ముసలమును గొనిపోయి రాజునకు (ఉగ్రసేనునకు) ఆ వృత్తాంతము నెఱింగించిరనియు, అమోఘమైన విప్రశాపమును ఆ ముసలమును గాంచి ద్వారకావాసులు మిక్కిలి భీతి చెందిరనియు, ఉగ్రసేనుఁ డా ముసలమును జూర్ణముచేయించి సముద్రోదకమునఁ బడవేసెననియు, మిగిలిన లోహమును గూడ నతఁ డట్లే కావించెననియుఁ జెప్పఁబడినది. రాజ్ఞే అను పదమునకు వ్యాఖ్యలో ఉగ్రసేనాయ నతు శ్రీకృష్ణాయ అని స్పష్టముగాఁ

జెప్పఁబడినది. నారయ దీనిని దెలిఁగించుచు యదుకుమారులు ముసలమును గొనిపోయి దేవకీనందను సన్నిధానముఁ బెట్టి యెఱింగించిరనియు, నతఁ డాత్మకల్పిత మాయా రూపంబని యెఱింగియు నెఱుంగని తెఱంగున వారలం జూచి యతినింద కావించినందుకు వారిని మందలించి ''సముద్ర తీరంబున నొక మహాపర్వతం బున్నది. అందుండు నత్యుచ్ఛ్రియ విశాల భీషణంబగు పాషాణంబున మీ భుజబలంబుచేత నీ ముసలంబు దివిచి దీని చూర్ణంబు సింధు కబంధంబులఁ గలిపి రండు పొం'' డని జగద్విభుం డైన కృష్ణుం డానతిచ్చెననియు, వారు నట్లు చేసి తల్కీలితం బైన లోహఖండంబును సాగరంబునఁ బడవై చిరనియు, దాని నొక్క ఝషంబు మ్రింగె ననియు రచించెను. ఉగ్రసేనుఁడు ముసలమును జూర్ణము చేయించి సముద్రములఁ బడవేసె నను సంర్భమున వ్యాఖ్యలో ''ఉగ్రసేనః సోఽపి శ్రీకృష్ణ మపృష్ట్వైవ ప్రాస్యత్'' అని చెప్పఁబడినది. నారయ తెలుఁగున నుగ్రసేనుని మాటయే యెత్తలేదు. ఉగ్రసేనుఁడే ముసలమును జూర్ణము చేయించి సముద్రజలములఁ బడవేసెనని మూలమున నుండ నారయ శ్రీకృష్ణుఁడు సముద్రతీర మందలి పర్వతము పైఁగల పాషాణమున దానిని జూర్ణము చేసి సముద్రజలములఁ బడవేయుఁ డని యదుకుమారులతోఁ జెప్పినట్లు రచించెను.

నారయ పోతన శిష్యుఁ డైనను అద్వైతమునకుఁ గాక విశిష్టాద్వైతమునకే ప్రాధాన్య మిచ్చుచుఁ దన యనువాదమును సాగించె ననుటకుఁ బెక్కు దృష్టాంతము లున్నవి. 11-107

**వస్తు సంవిధానము :**

పురాణమునకుఁ బంచలక్షణ మనునది నిర్వచనమే కాక పర్యాయపదము కూడ నై యున్నది. సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, వంశము, వంశానుచరితము అనునవైదును నా పంచలక్షణములు. సాధారణముగాఁ బురాణము లన్నింట నీ లక్షణపంచకము కానిపించుటచేఁ బూర్వులు దాని నా విధముగా నిర్వచించియుండిరి. భాగవత మా పురాణలక్షణ నిర్వచనమునకు లక్ష్యమైన మంచి యుదాహరణము. అందు ద్వితీయ స్కంధమునఁ బ్రపంచోద్భవ ప్రకారమును, నవమ స్కంధమున వంశ వంశానుచరితములును వర్ణింపఁబడియున్నవి. ఇతర స్కంధములందే యే మన్వంతరము లందు భగవంతుఁ డే యే యవతారముల నెత్తి యేయే కార్యము లాచరించెనో విపులముగాఁ జెప్పఁబడినది. మొత్తము మీఁద భాగవత మంతయు భగవంతుని యేకవింశ త్యవతారముల వర్ణనముతోఁ గూడినట్టిదే. ఆ యవతారములకు సంబంధించిన కథ లన్నియు సమాన విస్తృతికములుగా లేక యందు భగవంతుఁ డొనరించిన కార్యకలాపములను బట్టి కొన్ని యతివిస్తృతికములుగను గొన్ని యనతివిస్తృతికములుగను నున్నవి. రామకృష్ణావతారము లందలి చరిత్రయు లీలలును మిగిలిన యవతారముల వృత్తాంతముల కంటె నిందు విపులతరముగా వర్ణితములై యున్నవి. ఈ యవతార కథలందుఁ బ్రసక్తానుప్రసక్తముగాఁ గొన్ని యుపాఖ్యాన ములును జెప్పఁబడియున్నవి. దశమ స్కంధోత్తర భాగము నందలి వస్తువు ఉత్తర హరివంశ కథా వస్తువుతోఁ గొంచె మించుమించుగా నేకీభవించుచున్నది. మనకు సాధారణముగాఁ బరిచితములై యుండు దశావతారములలోని క్రమము సృష్టిపరిణామమున కనుగుణముగా నున్నదని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఏకవింశత్యవతారము లందలి వరుస దాని కించుక భిన్నముగా నున్నది. భాగవతము నందలి కథన మీ వరుసనే యనుసరించుచున్నది.

కావ్యారంభమునం దాశీర్వాదముకాని నమస్కారముకాని వస్తునిర్దేశముకాని చేయ వలయునని లాక్షణికులు చెప్పుదురు. సంస్కృత మహాకవులు పలువురీ నియమమును బాటించియే యుండిరి. తెలుఁగు కావ్యముల మొదట సాధారణముగా నాశీర్వాదమో నమస్కారమో కానఁబడు చుండును. కొన్నిటిలో వస్తునిర్దేశముగూడ గోచరించుట కలదు. కాని దానిని నిరూపించుటకుఁ గొంత కష్టపడవలయును. పోతరా జట్లుగాక యాంధ్ర భాగవతము నందలి యారంభ పద్యమున నమస్కారముతోపాటు వస్తునిర్దేశము గూడ నెంతో నిపుణముగా సంతరించియున్నాఁడు.

శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకున్.

ఈ పద్యమున మహానందాంగనా డింభకుఁడు చింతింపఁబడుచున్నాఁడు.

భాగవతము నందలి స్కంధములలోని కెల్లఁ గథా విషయముననే కాక రసవిషయమునఁ గూడ దశమ స్కంధము మహోదాత్తమైనది. మహానందాంగనాడింభకుఁ డైన శ్రీకృష్ణుని లీలా చరిత్రమే యందలి వస్తువు. ఈ కృష్ణుఁడు విష్ణుదేవుని యవతారమగుట యటుండ నొక విధముగాఁ బోతన కావ్యమునకుఁ గృతిభర్త. భగవంతుఁడు తమ తమ కృతుల భర్తలకు శ్రేయో దాయకుఁడగుఁ గాక యని యితరకవు లారంభ పద్యములం దాశీర్వాదము చెప్పుదురు. పోతన తన కృతిపతియే భగవంతుఁ డగుటచే నాతని స్మరణముతోనే కావ్యము నారంభించినాఁడు. నందాంగ నాడింభకుఁడను మాట భాగవతమునకుఁ బ్రాణమని చెప్పఁదగిన దశమ స్కంధము నందలి వృత్తాంతమును లెస్సగా సూచించుచున్నది. ఇంక నీ పద్యమునఁ గృష్ణుని వర్ణించుటకై పోతన వాడిన విశేషణముల యర్థమును బరిశీలించినచో నవి భాగవతము నందలి వస్తువు నంతటిని సంగ్రహముగా నెట్లు సూచించుచున్నవో తెలియవచ్చును. భగవంతుఁ డవతారమూర్తులు తాల్చుటకుఁ బ్రధానకారణము లోకరక్షణ పరాయణత్వము. అది లేనిచో నాతఁ డే వటపత్రముననో శేష తల్పముననో పవ్వళించి యాత్మారాముఁడై హాయిగాఁ గాలక్షేపము చేయవచ్చును. ఈ యవ తారములలో నాతఁడు చేసినపని యేమనఁగా భక్తులను రక్షించుట, వారికి బాధ కలిగించు దుష్టులను రాక్షసులను సంహరించుట. భాగవతము నందలి కథలన్నియు భగవంతుఁడు భక్తపాలన, దుష్ట దానవ సంహరణ కార్యము కొనసాగించిన ఘట్టములే. భక్తపాలన కళాసంరంభకుఁడు, దానవోద్రేక స్తంభకుఁడు నను విశేషణములు భాగవత కథ యందలి యర్ధాధిక భాగమును గర్భమునం దిముడ్చుకొన్నవి. భగవంతుఁడు "కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నానా కంజాతభవాండ కుంభకుఁడు". ఛాందోగ్యమునఁ జెప్పఁబడిన సృష్టిహేతువు నీ వాక్యము సమర్థించుచున్నది. భగవంతుఁడు లీలావలోకన మాత్రముననే బ్రహ్మాండము లన్నియు సృజించిన వాఁడు. ఇది పురాణ లక్షణములలో నొకటైన సర్గమున కుపలక్షకము. ఈ విధముగాఁ బోతన యారంభ నమస్కార పద్యము నందలి మూఁడు నాలుగు విశేషణములలోనే సృష్టికర్త మట్టికాయలో భవిష్యన్మహావృక్షము కాఁదగిన విత్తులనువలె భాగవత కథాంశ సర్వస్వమునకు బీజములను నిక్షేపించినాఁడు.

ఇతరకవులు కావ్యరచనా పరాయణు లగుట కర్థకామములఁ బొందవలె ననెడి వాంఛ కారణము. వారిలోఁ బలువురు వానిని వ్రాసి రాజులకును మహారాజులకును నంకితముచేసి పూర్ణకాములగుటయు నిజమే. అనఁగా వారు పొందినది క్షణభంగురమును దుర్గతిప్రాపకము నగు నైహికభోగ సౌఖ్యానుభూతి. మఱి పోతన కాంక్షించిన దది గాదు. పునర్జన్మము లేకుండ జననము సఫలము చేసికొనుటయు (జననంబున్ సఫలంబుచేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్) భవబంధ విమోచనము నొందుటయును (నేఁ బలికిన భవహరమగునట). ఆ యభిలాషమునే శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెద నని యాతఁడు తొలుఁదొల్తనే ప్రకటము చేసినాఁడు. భాగవత పఠన ప్రయోజనము కూడ శ్రీకైవల్యపదంబు నొందుటయే. తొలి వాక్యముననే యాతఁడు తన యభిలాషను బాఠకులు వాంఛింపఁదగిన ఫలశ్రుతిని గూడఁ జక్కగా సూచించినాఁడు.

భాగవతము నందలి ప్రధానకథ లన్నింటిలో భగవంతుని భక్తరక్షణ పరాయణత్వము ప్రకటిత మగుచున్నది. భక్తులకు దుష్టులవలనఁ గలుగు నాపదల నారసి దయాపయోధియైన యాతఁడు వారి నాపత్సముద్రమునుండి యుద్ధరించి దుష్టుల సుచితరీతి దండించుచుండును. భగవంతునిపై భక్తులు నించు భక్తివిశేషమున కది యీ లోకమునఁ గలుగు ప్రత్యక్షఫలము. అంతకంటె నుదాత్తమైనదియు నుత్తమభక్తజనైకసాధ్య మగునదియు నగు మోక్షరూపమైన పరోక్ష ఫలము తరువాత లభ్యమగును. భాగవతము పఠించువారికి వెనువెంటనే బుద్ధిగోచరమగు నుత్తమోపదేశ మిది. ఈ యుపదేశమును మెచ్చినవారు కొంచెమో గొప్పయో చిత్తము భక్తిమార్గమున హత్తింప యత్నింపకమానరు. కర్మజ్ఞాన భక్తిమార్గములు మూఁడును మోక్ష సామ్రాజ్యమును జేర్చునట్టివే యైనను వానిలో దేనినైన నెవ్వరైన నవలీలగా ననుసరింపఁ జాలుదు రని తలంపరాదు. అధికార తారతమ్యమును బట్టి మానవు లా మూఁడు త్రోవలలో నొక దానిని నిర్ణయించుకొనవలయును. ఆ మూఁడింటిలోఁ గర్మజ్ఞాన మార్గములకంటె భక్తిమార్గము తక్కువ క్లేశకరమైనది. పాండిత్య ప్రాకృతత్వములతో సంబంధము లేకుండ నెవ్వరైన నా మార్గము ననుసరించి యనాయాసముగా మోక్షము చూఱగొనవచ్చును. భాగవత మా భక్తిమార్గము యొక్క లక్ష్య లక్షణములను విపులముగా వర్ణించు నుత్తమమైన గ్రంథము. ఏకాదశ స్కంధమునను, ద్వితీయ స్కంధారంభమునను శుకయోగి పరీక్షిత్తునకు భక్తిప్రాధాన్యము వివరించు సందర్భమునను భక్తిమార్గము యొక్క ప్రాశస్త్యము చెప్పఁబడినది. ప్రహ్లాదాంబరీషాదుల చరిత్రములు భక్తిమార్గము మహత్త్వమునకు దృష్టాంతము లైనట్టివి. ఇట్లని భాగవతమున నితర మార్గముల ప్రసక్తియే లేదని తలంపరాదు. జ్ఞాన కర్మయోగముల వివరణముకూడ నం దచ్చటచ్చట దిఙ్మాత్రముగా గోచరించుచునే యుండును.

సృష్టిలోని సమస్త జీవరాసులలో మానవుని స్థాన మున్నతమైనది. ఆ యౌన్నత్యమునకు హేతు వితర జీవులకు లేని జ్ఞానమును దజ్జనితమైన యుక్తాయుక్త విచక్షణమును నాతని కుండుటయే. పుట్టి పెరిగిఁ విద్యాబుద్ధు లార్జించిన పిమ్మట సంసారముయొక్క హీనత్వమును భోగాదుల క్షణభంగురత్వమును గుర్తించి మోక్షలాభమునకుఁదగిన యత్నము లాచరించుటయే యితర జీవ దుర్లభమైన యాతని జ్ఞానవత్తకుఁ బరమ ప్రయోజనము. అట్టి యత్నము నొనరింపకుండుచో నాతనికిని, జ్ఞానరహితములై యాహార భయ నిద్రాదుల విషయమున నాతనితో సామ్యము వహించు

తిర్యగ్జంతువులకును భేదమే యుండదు. అందుచే జ్ఞానవంతుఁడైన ప్రతి మానవుఁడును, ముముక్షువై యుండుటకును, ముముక్షువైన ప్రతిమానవుఁడును సంసారబంధ విమోచనమునకును గాంక్షించు చుండును. సంసారము బహుళక్లేశ భరితమైనట్టిది. జ్ఞానవంతులైన పెద్ద లందుచేతనే దాని నగాధమైన చీఁకటి నూతితోడను నక్రగ్రాహపాఠీన భీకరమైన మహాసముద్రముతోడను బోల్చుచుందురు. మాయామయమైన యీ జగమున జనించినవారు బంధనశీలమైన సంసారమునఁ జిక్కుకొనుటలో నాశ్చర్యము లేదు. అట్లు చిక్కుకొనియు శిష్టులైన యుత్తములు తమ హీనస్థితిని గుర్తించి యీ సంసార బంధములనుండి తమ్ముద్ధరింపుమని పరమేశ్వరునిఁ బరిపరి విధములఁ బ్రార్థించుచుందురు. దయామయుఁడైన పరమేశ్వరుఁడు భక్తుల మొఱాలించి బంధములు సడలించి వారికి ముక్తిమార్గముఁ జూపును. సూక్ష్మముగాఁ బరిశీలించినచో నుత్తముల విషయమున నిహజీవితము, వారికిని వారిని బద్ధుల నొనరింపఁ జూచు సంసార బంధములకును జరుగు సంఘట్టనమే యని తోపఁకపోదు. ఇట్టి సంఘట్టనమే యన్యాపదేశముగా గజేంద్రమోక్షణ కథలో వర్ణింపఁబడినది. అందలి మడుఁగు సంసారమునకును నక్రము సంసారస్థ బంధజాలమునకును బ్రతినిధులు. గజేంద్రుఁడు ప్రమాద వశమున సంసారమునఁ జిక్కియు జ్ఞానవంతుఁడగుటచే భగవంతుని బ్రార్థించి యుద్ధరింపఁబడిన యుత్తమ జీవుఁడు. ఈ విషయమునే పోతన యీ ఘట్టము నందలి "ఊహకలంగి జీవనపు టోలమునం బడి"యను నుపమానముచేఁ జక్కఁగాఁ సూచించెను. ఇదియొక విధమైన మనోజ్ఞ కథారూపకము (Allegorical story). దీనిని జదివిన వారు సూచ్యమైయున్న యిందలి సంఘట్టనమును గ్రహించి బంధవిమోచనమునకు భగవంతుని వంక దృష్టి సారింపక మానరు.

ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు, అంబరీషుఁడు మున్నగువారు మహాభక్తులు. ఎన్ని కష్టములు కలిగినను వారు భక్తిమార్గము నుజ్జగింపక పరమేశ్వర పాదారవిందములనే యాశ్రయించి తరించిరి. కష్ట పరంపరలు కలిగిన కొలంది వారి భక్తి పరిణతమును బరిగాఢమునునై యగ్నితప్తమైన బంగారమువలె వెలింగెను. చివరకుఁ బరమేశ్వరుఁడు వారియండ నిల్చి వారిని బాధించినవారిని వేధించి, నిర్మలమైన భక్తి మార్గముయొక్క ప్రాశస్త్యముతోపాటు తన భక్తరక్షణ పరాయణత్వమును గూడఁ బ్రదర్శించెను. లోకమునఁ గూడ నొక్కొక్కప్పుడు భాగవతులకే పరమకష్టములు గలుగుచుండును. అవి వారి భక్తిని బరీక్షించి మఱింత పరిణతముగా నొనరించుట కేర్పడినట్టివే. అందుచేఁ దాత్కాలికాపతితములైన క్లేశములచే భక్తులు నిరాశాహతులు కాఁ గూడదు. అట్లుకాక స్థిర విశ్వాసముతో నిల్చినచో వారికి మోక్షము కరతలామలక మగును. ఈ కథలు సందిగ్ధ మానసులగు భక్తులకు సందేహము తొలఁగించి భక్తి యందలి నిష్ఠ నతిశయింపఁ జేయును. ఈ విధముగా భాగవతమునందలి పెక్కు కథలు మానవజీవితముతో సన్నిహిత సంబంధము కలవై వారి కుత్సాహ విశ్వాసములను జనింపఁజేయుటకుఁ దోడగుచుండును. అందుచేతనే యిందలి కథల కితర పురాణము లందలి కథలకంటె మానవ హృదయావర్జన శక్తి యెక్కువగా గోచరించుచున్నది.

భాగవత కథలు పెక్కు తిలోక వృత్తాంతములతోఁ గూడినట్టివి. అవి మర్త్యామర్త్య పాత్ర పరిమేళనముతోఁ గూడి యొక్కొక్కప్పుడు సహజత్వమునకు దవ్వుగా నుండును. అవి పఠితల హృదయము లందలి భక్తిభావమునువలెఁ దార్కికభావమును దృప్తినొందింపఁ జాలవు. నరసింహ

మూర్తి భక్తపాలక పరతంత్రుఁడై స్తంభమున నావిర్భవించె నని చదువునప్పుడు భక్తులు పులకితాంగులై తన్మయత్వమున నొడలు మఱవ నితరు లిట్టి దెప్పుడైన జరుగునా యని శంకాపంకిల మానసులై పెదవి విఱుచుచుందురు. ఇట్లైహికదృష్టి కసంబద్ధములుగాఁ దోఁచు విషయములు ప్రతి కథలోఁ గానిపించుచుండును. భగవద్లీలాస మయములైన కథలం దిట్టివి గోచరించుటలో నచ్చెరువు లేదు. అసలు మూలగ్రంథకర్త భావము భగవంతుని భక్తరక్షణ పరాయణత్వమును, భక్తిమార్గము యొక్క ప్రాశస్త్యమును నిరూపించుటయే కాని లోకసహజములైన సన్నివేశములతో సుందరములైన కథల నిర్మించుట కాదుగదా !

భాగవత కథలలోఁ గళకంటెఁ బ్రచార మెక్కువ. భక్తితత్త్వమును లోకమున వెల్లడించి ప్రజలను ముముక్షువులుగా నొనరింప యత్నించుట గ్రంథకర్త ప్రధానోద్దేశము. అందుచే భక్తి విషయమో భగవద్విషయమో వచ్చినప్పుడు కవి వారికిఁ గళాదృష్టితో కథలో నీవలసినంత కంటె నధికముగాఁ బ్రాధాన్య మొసంగుచుండును. అందుచే వానిముం దన్యవస్తువు లప్రధానములై మఱుఁగుపడిపోవుట సంభవించును. సంస్కృత భాగవతమునకంటెను బోతన భాగవతమున నీ పరిస్థితి మఱింత యధికముగా గోచరించును. దాని కాతఁడు భక్తి పారవశ్యమునఁ బ్రకటించు నావేశము కారణము. పైని పేర్కొనఁబడిన రెండు విషయముల నుపేక్షించి చూచినచో భాగవతము నందలి కథలు సర్వజనోత్సాహ జనకములై చదివినకొలదిఁ జదువవలెనను నుత్కంఠ కలిగించు చుండును. గజేంద్రమోక్షణ రుక్మిణీకల్యాణ ప్రహ్లాద వామన చరిత్రాదులాంధ్ర లోకమున నా బాలవృద్ధజనహృదయనిష్ఠితములై యుండుట కందలి యాధ్యాత్మికౌన్నత్యముతోపాటు కథా నిర్మాణ కౌశలము కూడఁ గొంతవఱకుఁ గారణమై యున్నది.

**పోతన భాగవత రచన :**

శ్రీ మహాభాగవతము పురాణము. మహాభారతము ఇతిహాసము. రామాయణము కావ్యము. ఇది ఛందోబద్ధమయిన సారస్వతమును పెద్దలు విభాగించిన సంప్రదాయము. కొందరు భాగవతమునకు బదులు దేవీభాగవతమును అష్టాదశ పురాణములలో ఒకటిగ లెక్కింతురు. ఇది వివాదాస్పదమైన విషయము. అయినను మహాభాగవతమునకు వచ్చిన వ్యాప్తి మఱొక పురాణమునకు రాలేదు. భాగవత వస్తువును గుఱించి మహాకవి పోతన విశ్వాసభావ మెట్టిదో చూతము.

'పరమార్థ భూతము, అధిక సుఖదము. సమస్త మయ్యును కాకయుండునది.'

'వేదకల్ప వృక్షమునుండి రాలినది. శుకమహాముని ముఖ సుధాధారలతో పాకమైనది.'

'ఈ భాగవత ఫల రసాస్వాదన పదవిని' రసికభావ విదులు పొందవచ్చును.

'ఇంకను ఇది శ్రీమంతము. మునిశ్రేష్ఠకృతము. విమల చిత్తములతో వినఁగోరువారి చిత్తములకు ఈశుఁడు చిక్కును.'

'ఇతర శాస్త్రముల వలన ఈశుఁడు చిక్కునా ?' చిక్కఁడని భావము.

'సత్యమ్ పరమ్ ధీమహి' అను గాయత్రీ ప్రారంభమున గాయత్రీ నామ బ్రహ్మరూపము ఎందు చెప్పఁబడునో అదియ భాగవతంబు.'

'నన్నయ తిక్కనాది కవులు-మున్ను భాగవతమును తెనిఁగించి యుండలేదు. దీనిని తెనిఁగించి నా జననంబును సఫలంబు చేసెదను. నా పురాకృత శుభాధిక్యము ఎట్టిదో కదా!'

'కొందఱికి తెనుఁగు గుణము, కొందఱికి సంస్కృతము గుణము. కొందఱికి రెండును అభిమతములు. నే నందఱిని మెప్పింతును' అని ప్రతిజ్ఞ.

భాగవతములో అలౌకికమయిన పరమార్థ విషయము వస్తువు. లోకవిషయ విలసితమై రస ప్రధానముగా పరిణతమగు ఇతివృత్తముకాదు. ఐనను కావ్యపురాణములకు సామాన్యధర్మము బొత్తిగా లేకపోలేదు. అది ఉపదేశము. అయినను, భాగవతపురాణము మనుచరిత్రవంటి కావ్యమనుట పొసఁగదు.

కాని, భాగవతము చదువునప్పుడు పండితులు, పామరులు, స్త్రీలు, పురుషులు వీనుల విందుగా విందురు. పులకించి పొంగిపోదురు. అంతరములు కదలించు ఇష్టార్థమేదో లేకపోయినచో అనుభావాదు లుత్పన్నములు కావు. కాఁగా భాగవతము పురాణమైనను కావ్యాదుల వలన కలుగు రసానుభూతిని ప్రసాదించుచున్నది.

కావ్యాదులలో నాయికా నాయకులు అవలంబనము. వారి యనురాగ వృత్తము అందు అభివర్ణిత మగును భాగవతములో కూడ నాయికా నాయకులున్నారు. వారు ప్రకృతిపురుషులు. అవతార రూపముగా ఉపలబ్ధమైన మహోత్సవ సన్నివేశమే ఇందు వర్ణింపఁబడినది. సాధారణముగా కావ్యములలో మానవ వృత్తమే ప్రతిబింబించును. భాగవతములో ఈశ్వరవాల్లభ్యము మానవ మండలములోనికి దిగివచ్చినది. ఆ విచిత్ర దర్శనము వలన వెల్లిగొన్న యానందము పుక్కిలింత లయినది.

ప్రకృతి నాయిక, సృష్ట్యాదినుండియు వియోగములో తపించుచున్నది. యుగయుగాంతరాలు గడచిపోయినవి. ఆ విరహోత్కంఠ పట్టరానిదిగా భారగించినది. ఆ పురుషుఁడు లోకములో సన్నిహితుఁ డైనాఁడు. అది మంచి సమయము కాదా! ప్రకృతి పురుషులు - ఆత్మ పరమాత్మలు కలిసికొన్నారు. అనంత మయిన విరహము అంతరించినది. ప్రాణిసాధారణమైన కామము దివ్య మయిన ప్రేమయోగముగా విపాకము చెందినది.

"సంభోగో నతిరిచ్యతే మానవిభవః యద్విప్రలంభోరసం" అదే లీల - భాగవత వస్తువు.

"యా వ్యాపారవతీ రసాన్ రసయితుం కాచిత్ కవీనాం నవా
దృష్టి ర్యా పరినిష్ఠితార్థ విషయోన్మేషాచ వైపశ్చితీ
తే ద్వే అప్యవలంబ్య విశ్వ మనిశం నిర్వర్ణయంతో వయం
శ్రాంతా, నైవ చ లబ్ధ మబ్ధిశయన! త్వద్భక్తితుల్యం సుఖమ్"

ఈ శ్లోకభావమును అభ్యాసించి, అస్ఖలితమైన లక్ష్యబుద్ధితో సారస్వత సవనము సలిపిన సత్కవు లెందఱో కానరారు.

ఈ శ్లోకము పోతన కవిదేమో అనిపించును. అట్లు కాదుగదా! అప్పటికి ఆనందవర్ధనుఁడు పుట్టి ఆఱునూఱేండ్లు గతించినవి. అయినను భాగవతానువాద ముహూర్తము మనసులో మెదలుచుండును.

**పోతన భాగవతము రచించిన పరిస్థితులు :**

అనాడు నిండుపున్నము. పోతన్న శిష్టగృహస్థు. ప్రాతరాహ్నికములు నిర్వర్తించెను. నిఖిల భువన ప్రధాన దేవతావందనము చేసెను. ఉమా రమా శారదలను సుమంత్ర పుష్పములతో పూజించెను. పూర్వ కవికుల పతులను వినుతించెను. వర్తమాన కవులకు ప్రియములు పలికెను. ఆ తన్మయావస్థలో మఱచిపోక భావికవులను బహూకరించెను. ఒక విశేషము, కుకవులు కనఁబడలేదు - పద్యపాషాణములు విసరికొట్టుటకు. సకల కవికులమును అభిజనముగా భావించి ప్రవర్తించిన కవులున్నారా ? పోతన పూర్ణసాత్త్వికుడు. సర్వసముఁడైన సత్కవి. ఋషి. కుకవినింద ఒక వికారవాచాటనము. కోమల మయిన కావ్యాయతనము వాకిట కుపిత కుర్కుర కర్దనము లాగున వినవచ్చును. భాగవతద్వారము ముందు ఇఁక చెప్పనక్కఱలేదు. దానిని పరిహరించిన మహాకవికి వందనము.

చంద్రోదయ మగుచున్నది. గోదావరికి పోయి స్నాతుఁడైనాఁడు. తీరమునందు శ్వేత సైకతము మీఁద పద్మాసనుఁడైనాఁడు. ధ్యాననిర్మగ్నుఁ డయినాఁడు. కన్నులు అర్ధనిమీలిత ములుగా ఉన్నవి. అప్పుడు మెఱుపువలె ప్రక్క పద్మాలయ మెఱయుచున్నది. మేఘమువలె శ్యామలమైన మూర్తి కిట్టెదుట కనఁబడినది. నవ్వులచే అమృతము చల్లుచున్నాడు చంద్రుఁడు. తీగయెక్కిన తమాల సాలతరువులాగున విల్లుభుజాన ప్రేలాడుచున్నది. ఇది మహాకవి దర్శనము. రానేమో చెప్పఁదలఁచుకొన్నాడు. ఇంతలో దర్శనమిచ్చిన శ్రీరామచంద్రుఁడే పలుకుల పళ్ళెము అందించి "శ్రీ మహాభాగవతము తెనిఁగించుము; నీ భవబంధములు తెగిపోవును'' అని భాషించి అదృశ్యమయినాఁడు. ఆ దేవతాదేశము పోతనార్యుని మేధామనీషా మండలముల నావహించినది. భాగవత తన్మయుఁడై పోయినాఁడు. పలికించు చోదకుఁడు భగవంతుఁడు. పలుకునది భాగవతము. అవిచల విశ్వాసముతో రచన ప్రారంభమై అమృతధారలాగున సాగినది.

**అప్పటి దేశకాల పరిస్థితులు :**

అప్పటి దేశకాల పరిస్థితు లెట్టివి ? సంక్రమించిన సారస్వత నిక్షేప మెట్టిది? ఈ విషయములు సంగ్రహముగా సమీక్షించుట శాఖాచంక్రమణము కాఁబోదు. దక్షిణాపథ చరిత్రలో ఏడవ శతాబ్దము అఖండ మహోదయము వంటిది. ఆకాఁడు సంస్కృతమే అధ్యయనాధ్యాపన ప్రయుక్తమైన విద్య. వేద వేదాంగ దర్శనాదుల సమీక్ష యిచట అంతగా ప్రసక్తము కాదు. పూర్వ మీమాంసా ప్రభావమే అధికముగా వ్యాప్తిలో నుండె నని భావింపవచ్చును. పూర్వ మీమాంస యనఁగా కర్మకాండ. మహర్షి జైమిని సూత్రములు దీని కాధారభూతములు. ఆ సూత్రాలను శబరస్వామి వ్యాఖ్యానించెను. అంతటితో నిలిచిపోయినది ఆ వ్యాసంగము. 8 వ శతాబ్దిలో కుమారిలభట్టు, ప్రాభాకర మిశ్రుఁడు, పూర్వ మీమాంసా దర్శనము నెత్తికొని శబరస్వామి వ్యాఖ్యకు వివరణములు వ్రాసి, వాని స్వరూప మహత్త్వములను ప్రదర్శించిరి. యజ్ఞయాగాది రూపమైన కర్మానుష్ఠానమే ప్రధానముగా నుండె ననుటకు హేతువులు కలవు.

ప్రాయే ణైవ హి మీమాంసా, లోకే లోకాయతీ కృతా
తామాస్తిక పథే కర్తు మయం యత్నః కృతో మయా

నాస్తికపర్యాయముగా వినియోగ మవుచున్న మీమాంసను ఆస్తిక నిష్ఠితముగా
రాను యత్నించితినని కుమారిలభట్టు పలికిన పలుకులు ఇవి. ఉత్తరదేశమునందు బౌద్ధము
వ్యాపించినను నాడు దక్షిణాపథమున దాని ప్రాబల్య మంతగా తాకలేదు. కాని శైవము
ప్రచారములో నుండెను. కుమారిలభట్టు వార్తికారంభమున శివధ్యానమునే చేసెను. రామాను
మార్గము విస్తరింప సాగెను. భక్తికూడ శైవ వైష్ణవము లను రెండు పాయ లయినది.
తమతమ మతములను బోధింప గ్రామగ్రామాలకు తిరుగుచుండిరి. ఈ భక్తుల బోధలు ప్రజ
ప్రవర్తమానము లాయెను. దేశభాషలు పొదివికొని పుష్పింపసాగెను. సూత్రములును
ములును వెనుకబడెను.

ఆచార్య శంకరులు 788 సంవత్సరములో జన్మించిరి. 820 లో సిద్ధిపొందిరి. అ
వారిది మహత్తర జీవితము. బ్రతికియున్నది ముప్పదిరెండేళ్లు. ఎనిమిదవ యేట
స్వీకారము. ఆసేతు హిమాలయ పర్యంతమును కాలినడకనే సంచారము. అపమార్గ
పోరాటము. ఇవికాక బ్రహ్మసూత్రములకు, ఉపనిషత్తులకు, భగవద్గీతకు భాష్యములు
నాలుగు మఠములను నిర్మించెను. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను ఉదాత్త స
ప్రకటించెను. ఇదే అద్వైతము. దృష్టమగు జగత్తు నిత్యముగాదు. అది మిథ్య. న
బ్రహ్మ నిష్ఠితము. ఈ మిథ్యావాదమును నిరీశ్వరవాదముగా భ్రమింపరాదు. ఆచార్య
సృష్టిలో నిరుపాధికమే పరమ ప్రమాణము; కాని సృష్టి స్థితి లయములకు హేతు వొకటి
దానినే ఆయన ఈశ్వర వాచకముగా అంగీకరించెను. అవతారాదులతో భాసిం
ఈశ్వరుడు. ఈ కార్య మంతయు మూడుపదుల సంవత్సరాలలో జరుగగలిగినవి.
రెండేండ్లలో శంకరులు నిర్వహించిరి. ఇట్టి మహాపురుషుడు మఱొకడు కానరాడు.

భారతీయ ధర్మ విజ్ఞానములో నిరీశ్వరవాదము లేకపోలేదు. సాంఖ్యము ని
వైయాకరణుల స్ఫోటసిద్ధి నిరీశ్వరమే. ఇవి చిరంతనములే. కాని వానిని పరిశీలించి
వైషమ్యములు దాచి, అబద్ధ సుబద్ధములను నిర్ణయించి, నిస్సంశయముగా సిద్ధాంతీ
9 వ శతాబ్దిని గాని జరుగలేదు.

"శంకరులు తమ అద్వైత ప్రచారములో శ్రీశైలమువద్ద కుమారిలభట్టును
వాదభిక్ష యర్థించిరి. కాని భట్టు ఆయనతో వాదమునకు సమ్మతింపక మండనమిశ్రుని
మండనమిశ్రుని భార్య కుమారిలభట్టు చెల్లెలు. ఆమె సరస్వతీదేవి అవతారము. శంకర
మిశ్రులకు వాదము జరిగెను. శాస్త్రోక్త నిర్ణేత్రిగా మండనమిశ్రుని భార్యను ఎన్నుకొనిరి.
శంకరులు గెలిచిరి. అనగా పూర్వమీమాంసా న్యాయము నిలువలేదు. అద్వైతమే సిద్ధా
నెగ్గినది. శంకరులు మండనమిశ్రునకు సన్యాసమిచ్చి, సురేశ్వరాచార్య నామధేయముతో
మఠమునకు అధిపతిగా నియమించెను. ఆయన భార్యను మంత్రముగ్ధనుచేసి శృంగేరిలో
దేవతగా సుప్రతిష్ఠితను గావించెను." ఈ ఐతిహ్యమును ప్రసిద్ధ చరిత్ర కారులు శ్రీ నీలక
గ్రంథమును రాయించినారు. శంకరవిజయమను గ్రంథములో మఱొక ప్రస్తావన కలదు. కుమ
సర్వ ప్రపంచ ప్రజ్ఞా పాండిత్యములతో జైనాచార్యులను నిర్ధూమధామము కావించె నట.
ఆయన జైన విద్యాంసుల కుమారిలభట్టును బహుళ దూషించిరి.

సుహావాదీ మహాన్ ఘోరః శ్రుతీనాం చాభిమానవాన్
జినానా మంతక స్సాక్షాత్, గురుద్వేష్టా ఽతిపాపవాన్

ఆ దూషణకృతి యందే

ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమంగళే
గ్రామేఽస్తికే మహానద్యా భట్టాచార్యః కుమారిలః
ఆంధ్రజాతిః త్రిత్రిరికః......

అని లిఖించిరి. కాఁగా అటు శ్రీశైలపు ప్రసక్తి వలనను, ఇటు జైనుల వ్రాఁతల వలనను కుమారిలభట్టు ఆంధ్రుఁడనుట స్పష్టము. తెలిసిన విషయ మేమన, జైనులతో ఘోర వివాదకక్ష, బౌద్ధులతో బండపోరాటము దినదినగండములుగా జరుగుచుండెను. అందుచేత సమాజము నిత్య సంఘర్షణతో సతమతమై అస్తిమిత సంకులము కాక తప్పలేదు.

జైనుల వైదికమతఖండనమును, తోడ్తో కర్మధర్మబద్ధముగాని శైవ జంగముల భక్తియోగ ప్రచారమును శంకరనిర్యాణము తరువాత తీవ్రమాయెను. సనాతన ధర్మమూలములు సక్కసాగెను. సమాజములో మతద్వేష మంకురించి, కుటుంబగర్భము చిల్లిపడెను.

ఉత్తర హిందూస్థానమునందు మహమ్మదీయ రాజ్యము గట్టిపడెను. మెల్ల మెల్లగా దక్షిణాపథము మీఁదికి తురకలదాడి ప్రారంభ మాయెను. పరాజయ పరాభవములకు వారు జంకలేదు. మొండి పట్టుదల విడువలేదు. తుదకు 1323 లో తెలంగాణము నాక్రమించిరి. కాకతీయ పతాక తల వ్రాల్చెను. తురక జెండా ఓరుగల్లు కోటమీఁది కెక్కెను.

**రాజకీయ పరిస్థితులు :**

కాకతీయసామ్రాజ్య పతనముతో రాజకీయ ధార్మిక సంక్షోభములకు గురియైనది ఒక్క తెలుఁగుదేశమే కాదు. దాదాపు దక్షిణాపథమున కంతటికిని ఆ దుర్దశ తప్పలేదు. ఏ పూర్వ పుణ్యముననో కొన్ని దశాబ్దములకు తెలుఁగునేలపై మరల స్వాతంత్ర్య వాయువులు వీచినవి. కాని తెలుఁగునేల యంతయును ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి రాలేదు. త్రిలింగ సామ్రాజ్యలక్ష్మి ధార్మిక సంక్షోభము నుండి బయటపడినను రాజకీయముగా నాలుగు ముక్కలై పోయెను. విజయనగరాధీశ్వరులు కొంత, కొండవీటి రెడ్లు కొంత, రాచకొండ వెలమలు కొంత, కటకపు గజపతులు మఱికొంత తెలుఁగు నేలను పంచుకొనిరి. ఈ నాలుగు రాజ్యములు కొంతకాల మహమహమికతో పెనఁగులాడినవి. అప్పుడే బహ్మనీరాజ్యము వీలైన భాగమెల్ల చేఁజిక్కించుకొని బలిసినది. ఈ యైదు రాజ్యములలో విజయనగర, బహ్మనీ, కళింగములు బలవత్తరములు. తెలుఁగు నేల అధిక భాగము నాక్రమించుకొని తెలుఁగు సంస్కృతికిని సాహిత్యమునకును దోహదము చేసిన సిసలైన తెలుఁగు రాజులు కొండవీటి రెడ్లును, రాచకొండ వెలమలును. వీరు పరస్పర యుద్ధములతో బలవత్తరుల నాశ్రయించుటతో సన్నగిల్లి చిట్ట చివరకు నామరూపములు లేకుండ ఆరిపోయిరి. దాదాపు ఆ కాలమున పుట్టినదే ఆంధ్ర భాగవత కల్పతరువు. క్రీ.శ. 1474 నాఁటికి రాచకొండ దేవరకొండ రాజ్యములు బహ్మనీరాజుల వశమైపోయినవి. తెలంగాణము తురకల దండయాత్రలతో, గ్రామ

దహనముతో, పీనుగుల పెంటగా, మహాశ్మశానముగా మాఱిపోయినది. పూర్వపు రాజకీయగ్లానియు ధర్మగ్లానియు మరల సంభవించినవి. ఆ మహాదహనమందో దేశక్షోభమందో భాగవతకల్పతరువు కొమ్మలు కొన్ని రాలిపోయినవనియు, కొన్ని వాడిపోయిన వనియు చారిత్రకుల యభిప్రాయము. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారును, శ్రీ అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారును అట్లే ఊహించిరి. పోతనకవి సమకాలీనముగా బహ్మనీరాజ్యమున అహమ్మదుషా అలావుద్దీన్ షాలును, విజయనగర రాజ్యమున ప్రౌఢదేవరాయ మల్లికార్జునరాయలును, కళింగదేశమున కపిలేశ్వర గజపతియును, రాచకొండలో కుమారాన్నపోత ముమ్మడి సింగమ నాయకులును, దేవరకొండలో లింగమనేడును పరిపాలించిరి. వెలమరాజ్య పతనముతో తెలంగాణము కొంతకాలము బహ్మనీలవశమున, కొంత కాలము ఖుతుబ్షాహీల వశమున, మఱికొంత కాలము అసఫ్జాహీలవశమున శతాబ్దముల తరబడి మాసి మఱుగుపడిన మాణిక్యమైనది.

హరిహర బుక్కరాయలను అన్నదమ్ములు కాకతీయ స్కంధావారము విచ్ఛిన్నము కాఁగా తుంగభద్రాతీరమందున్న కంపిలికి వెళ్ళిపోయిరి. తరువాత కంపిలి కూడ మహమ్మదీయుల వశమాయెను. నాయక సోదరు లిరువురును పట్టుపడిరి. తురకలు వారిని ఢిల్లీకి తెఱగొనిపోయి, అక్కడ బలవంతముగా ఇస్లాము మతములో కలిపిరి. కంపిలిలో విప్లవము రేగెను. మహమ్మదీయులు దాని నణపలేకపోయిరి. హరిహర బుక్క సోదరులను చెఱవిడిపించి ఆ విద్రోహము నాపుటకై కంపిలికి పంపిరి. అక్కడ విద్యాశంకరులు వారికి పునః హిందూమతమిచ్చి, విద్యానగర సామ్రాజ్య స్థాపకులుగా సిద్ధము చేసిరి.

1333 లో మాధవ సాయను లను సోదరులు విద్యాశంకరుల శుశ్రూషకై ఓరుగల్లు విడిచిపోయిరి. వా రసాధారణ ప్రజ్ఞాధురంధరులు. విద్యాశంకరు లా సోదరులకు కావలసిన విద్యాశిక్ష లిచ్చిరి. మాధవుఁడు విద్యారణ్యుఁ డను పేరుతో శృంగేరి పీఠము నధిరోహించెను. సాయనుఁడు వేదములకు భాష్యము వ్రాసెను. అటు రాజకీయముగా హరిహర బుక్కరాయలును, ఇటు ధర్మ సంస్థాపనోద్యమమునకు మాధవ సాయనులును సిద్ధమయిరి. తురకలతో పోరాడుటకు విజయనగర సామ్రాజ్యమునకు పునాదులు పడెను. యుగయుగాంతరములనుండి చిలుక చదువులుగానున్న వేదము లర్థవంతములుగా ప్రకాశించెను. నాస్తికవాదుల నెదుర్కొనుటకు కావలసిన విజ్ఞానబలము సమకూరెను.

**మతసారస్వతములు :**

అశాంతిరాశులతో, వ్యూహ ప్రతివ్యూహములతో, వాదోపవాదములతో దేశమును సమాజమును కూడ అవ్యవస్థితమైన క్లిష్టదశలో పడెను. ఇంతలో కొందఱు వైష్ణవభక్తులు సహ్యాద్రి ప్రాంతమునుండి వచ్చిరి. వీరంతను మహానుభావ పంథకు చెందిన క్రొత్తవైష్ణవులు, వైదికధర్మ ద్వేషులు. సంస్కృతము చదువుకొన్న వారినే వెలివేసి వేధించిన ఉన్మాదులు. జైనులు, బౌద్ధులు, జంగములు, హరిదాసులు నేల యీనినట్లు దేశమంతటను వ్యాపించిరి.

ఇక సారస్వత క్షేత్రములో శైవకవులు వేదములను వైదికాచారములను తిట్టిపోయుచుండిరి. ఓరుగల్లు క్రీడాభిరామధామముగా లోకాయతలాలసతో మునిఁగి తేలుచుండెను. ఏ

ప్రక్క చూచినను దురావేశము, దురభిమానము, దూషణ, దౌష్ట్యము, దుర్దాంతముగా చెలరేగి చిందులు త్రొక్కెను.

ఈ దుష్కాలములో పుట్టిపెరిగినవారు శ్రీనాథ పోతనార్యులు. శ్రీనాథుడు శృంగార కవిగా రాజాస్థాన సందర్శన మారంభించిన ఉద్దండ కవి. డిండిమభట్టు కంచుఢక్కను పగుల గొట్టించెను. రెడ్డిరాజుల ఆస్థానకవిగా మహాభోగము లనుభవించెను. అఖండ ధారాపాతమువంటి కవితతో సారస్వత క్షేత్రమును ముంచియెత్తెను. తుదకు సంకెళ్ళు పడి, నడివీథిలో దీర్ఘనిద్ర పోయెను.

పోతనామాత్యుడు పుణ్యశాలి. శైవుల యింటనే పుట్టెను. కాని వీరభద్ర పళ్ళెము లెత్తి ''హరోంహర'' యని ఊరేగుచున్న నాటి మతోద్వేగమునకు ఓపలేక పోయెను. వైష్ణవము స్వీకరించెను, మహాభాగవతమును తెనిగించి, మాతృభాషను మధుమయముచేసి, వైకుంఠములో హరి సంకీర్తన మాచరించుటకు తరలిపోయెను.

**రచనా బంధము :**

పోతనామాత్యుడు తాను సహజపాండిత్యుడనని చెప్పికొన్నాడు. సహజపాండిత్య మనగా చదువుసాధనలులేక గాలి మూటగట్టిన శ్రుతవాచాటనమని మనము భావించుచున్నాము. అది పొరపాటు. కర్ణునకు కుండలములవలె, కుశలవులకు జృంభకాస్త్రములవలె జన్మతో సంసిద్ధ మయిన పాండిత్యమని నమ్ముట న్యాయము. అనగా అది పూర్వ సుకృత సువాసన, జన్మాంతర బహుశాస్త్రాధ్యయన ఫలము. మన కాలములో రామకృష్ణ పరమహంసలో, రమణమహర్షిలో ఇట్టి విశేషము ప్రదర్శిత మయినది; నమ్మరాని ఆకాశపుష్ప మేమియు కాదు. పువ్వునకు పరిమళము పుట్టుకతోనే అంటివచ్చును. పైనుండి పూయ నక్కఱలేదు. అఖండమైన పాండిత్యమునకు ఆయన రచనా విన్యాసమే సాక్ష్యము. కథారంభములోనే నైమిశారణ్యవర్ణన ముప్పదిమూడు వాక్యాలలో విస్తరింపబడినది. ''మునుమైత్రి మందిరంబునుంబోలె మాధవ మన్మథ మహితంబై'' అని ఎత్తుకొన్నాడు. ధారాళమయిన స్వాదువచన ధారాసారము. తేనెలుతేరు పలుకుల భణితి. బాల్య రచనాబంధములోనే యిట్టి పాండిత్య ప్రకర్ష కనబడును. సమస్త లక్ష్మిని వాలకోద్భాసినిమ్మ'ని ఆరంభమై నిశ్శేషముగా నిర్వహణమగుటయే ఆ రచన. ఇట్టి రచనను బిగి సళ్ళిపోకుండ నడపుట సులభసాధ్యము కాదు. శబ్ద పారావారము పుక్కిటిలో నుండవలెను. శ్లిష్టోపమలు విసరుటకు సాదృశ్య సాధర్మ్యములు పిలిచిన పలుకునవిగా నుండవలెను. అనగా బహుగ్రంథ సందర్భ వైదుష్యము, అనేక వ్యాఖ్యా విజ్ఞాన వికాసము ఉపస్థితములుగా సద్యఃస్ఫురితములు కావలెను. దీనికి తోడు ప్రయోగ ప్రావీణ్యము కూడ అవసరము. గంగావతరణ ఘట్టములో 66 ముక్తపద గ్రస్తములు గుత్తికొన్నవి. అంతరాంతరములలో ఉపమాలంకారములు, శ్లిష్టపదబంధము, శ్లేషానుప్రాణితరీతి - ఇవి అన్నియు - గంగాదేవి వేణీబద్ధములయిన పాయల లాగున - అల్లుకొని అందాలు వెదజల్లుచున్నవి. కాగా, ఈ మహాకవి పాండిత్యమును శంకించుట ప్రగల్భమో, అవిధేయమో కాకమానదు. ఆయనకు పాండిత్యము పుట్టుకతోనే వచ్చినది. తాను తపస్సాధనతో సాధించినది కవితా కౌశలము. ఏమన ఆ మహానుభావునికి భగవత్సంకీర్తనమే ఇచ్ఛావరేణ్యము. పాండిత్యముతో కీర్తనరచన సాధ్యము కాదు. ఆత్మమంత్రపుష్పము సమర్పించుటకు రమ్యాక్షర

రచనా నైపుణి కావలయును. అది కవితకు వశ్యము. దీక్షా ప్రస్తావనలో ఈ విషయము ధ్వనించును.

కవిత, కవిత్వము, కావ్యము, సాహిత్యము, ఈ శబ్దాల నన్నింటిని మనము పర్యాయ పదాలుగా వాడుచున్నాము. కాని వీనిలో కొంత అంతరము పాటింపవచ్చును. కావ్యమనగా శబ్దములతో కవి సృజించిన రమ్య నిర్మాణము. దానిలో ఆస్వాదనీయముగా రుచించు ఇష్టార్థ ప్రతీతి కవిత. అది ప్రీతిస్ఫురితముగా నుండును. "ప్రీత్యాత్మాచ రసః." ఇష్టార్థరూపమయిన రసము నిలుచు నెలవులును, అనుభవించు తీరును ఒక్కటిగా ఉండవు. చెఱకుముక్కలను, కొబ్బరి తునుకలను చర్వణ చేసినకాని రుచి తగులదు. మామిడిపండ్లను కదళీఫలములను తోలు తీసివేసి గ్రసించవచ్చును. కాని పూలలోపలి తేనె అట్లు స్థూలముగా అందదు. భావము భ్రమరాయమాణముగా పుష్పగర్భము ప్రవేశించవలెను. మధుకణచయనము చేయవలె. అప్పుడు రసానందము అనుభూతికి వచ్చును. అది సహృదయ వేద్యము.

పురాణేతిహాసములు ఛాయాసాలముల వంటివి. కావ్యములు లలితలతల వంటివి. కొమ్మలు రెమ్మలు రెంటికి నున్నవి. అయినను రసోదయస్థానము పుష్పమే. కొమ్మలు రెమ్మలు కావు. భాగవతము కల్పతరువు వంటి దని మహాకవి సాభిప్రాయముగా పలికినాడు. కాగా, ఇందు రసాదికము ఫలప్రధానముగా సేవింపదగిన దని భావము. పైగా, ఇది కల్పతరువను విషయము విస్మరింపరాదు. ఇచ్ఛా నైజమునుబట్టి ఫలప్రసాదము కూడ రూపొందును. మనసు మేడిపండు మేలిమికోస మఱ్ఱాడుచుండగా మందారము మామిడిపండ్ల వాయన మీయదు.

శబ్దములతో రూపొందిన మహానిర్మాణము వాఙ్మయము. దీనిని (1) వేదశాస్త్రములు, (2) పురాణేతిహాసములు, (8) కావ్యనాటకములు అని వర్గీకరించినారు వేత్తలు. మొదటి వర్గములో శబ్దమహిమ, రెండవ దానిలో అర్థబలము, మూడవ దానిలో రసస్ఫూర్తి ప్రధానములుగా గుర్తించిరి. వేదశాస్త్రములు ప్రభువువలె శాసించును. పురాణములు మిత్రునివలె క్షేమ సహకారములు. కావ్యరూపకములు కాంతా సమ్మితముగా నుపదేశించి అభిరుచించును. తెనుగులో పురాణములు కూడ కావ్యఫణితిలోనే వన్నె కెక్కినవి.

కావ్యములు రసాత్మకములు. రసాస్వాదనము వలన ఆనందము ప్రాప్తించును. రసానందము బ్రహ్మానంద సహోదర మన్నారు లాక్షణికులు. ఈ భేదము నిట్లు భావింపదగును. కావ్యములలో కథ లౌకికము. పాత్రాదులు మర్త్యులు. చేతనాచేతనమయ మయిన వ్యాపార మంతయును ఆచరణము ఈ లోకమే. అనుభూతి కూడ జన్మాంతర విషయము కాదు. కాగా, కావ్యానందము బ్రహ్మానందము కాబోదని శంకించుట కవకాశమున్నది. దాని పరిశీలించిన పూర్వాచార్యులే-

"అత ఏవ అయం బ్రహ్మానంద ఏవ. ఇయాంస్తు విశేషః. బ్రహ్మానందః యోగగమ్యః అయంతు విభావాద్యనుసంధానగమ్య ఇతి." అని తేల్చుకొన్నారు. అదిగాక, భాగవతములో పాత్రలు మర్త్యులు కారు. వ్యాపారమును ఐహికము కాదు. కాగా భాగవత సేవనము వలన సిద్ధించునది బ్రహ్మానందమే. కావ్యరసాస్వాదనము సహృదయు లర్హులు. అట్లే భాగవత రసాను భవమునకు భక్తులు అధికారులు.

## కావ్యము - కవిత

కావ్యలక్షణములు బహుముఖములుగా వెలసినవి. అన్నియు సంస్కృత కావ్యములు లక్ష్యములుగా సాగినవే. తమిళ కన్నడములకు వలె మనకు దేశీయ ప్రముఖ కావ్యానుశాసనము లేదు.

శ్రీమద్రామాయణము ఆదికావ్యము. మహర్షి శోకమే తొలుదొల్త ఛందోబద్ధమైన శ్లోకముగా నవతరించినది. ఆ శోకముతో బ్రహ్మాండ మంతయు తన్మయ మయినది. చేతనాచేతన సమస్తమయిన జగత్తు ముసుగు తీసి కనబడ్డది. శోకమయ మైన ఆ విశ్వరూపమును చూచి, కవి

"అహో ! రాగవతీ సంధ్యా
జహాతి స్వయ మంబరమ్''

అనెను. అంతేకాదు. శోకప్రతిరూపమయిన ఆ ఛందస్సు శ్రోతల హృదయములను తాకి రసీభవించి, ఆస్వాద్యమయినది. ఆనంద మనుభూత మయినది. శోకము శ్లోక రూపముగా ఆనంద పర్యవసాయి యగుటయే రసోపనిషత్తు. అదే రామాయణము. అందులో కావ్యలక్షణము లిట్టివి అను నిరూపణలేదు. కాని, రామాయణము లక్ష్యముగా కావ్యలక్షణా లేర్పడ్డవి. కాళిదాసు రచనలు రాణించి, సహృదయ సమాజము నాకర్షించిన తరువాతనే కావ్యమీమాంస ప్రారంభమై దర్శన ప్రతిపత్తి నందుకొన్నది. ఈ మహాకవి నాల్గవ శతాబ్దికి తరువాతి వాడు కాడని పరిశోధకుల తీర్పు.

భరతముని నాట్యశాస్త్రములో మొట్టమొదట రసప్రస్తావన కనబడును. ఆ శాస్త్రము ప్రధానముగా నాట్యాభినయములకు సంబంధించినది. రామాయణము తరువాత రమణీయమయిన రచన కాళిదాసుది. ఆ మహాకవి కావ్యరూపకములను రెంటిని దక్షతతో నిర్వహించెను. 'వాగర్థ ప్రతిపత్తిని' పార్వతీ పరమేశ్వర బాంధవ స్థాయిలో లక్షించి ప్రస్తుతించెను. నాటకమును కాంత మైన చాక్షుష క్రతువని సంభావించెను. కాళిదాస మహాకవి పలుకులలోని ఉపమామహత్త్వము వలన కావ్యరసమును తజ్జన్యానందమును అలౌకికము లను స్ఫురణ భాసించెను. కాగా,

ఈ క్రింది పంక్తులను సమీకరింతము.

"నిషాద విద్ధాండజ దర్శనోత్థః
శ్లోకత్వ మాపద్యత యస్య శోకః.''

'పురురామ కథాం దివ్యాం, శోకబద్ధాం మనోరమాం' రామాయణము.

'విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రసనిష్పత్తిః'. నాట్యశాస్త్రము.

"కావ్యస్యాత్మా సఏవార్థః
తథా చాదికవేః పురా
క్రౌంచద్వంద్వ వియోగోత్థః
శోకః శ్లోకత్వ మాగతః." ధ్వన్యాలోకము.

క్రౌంచ మిథున దుర్వినియోగము మహర్షికి దర్శనమయినది. ఆయన శోకమయుడై నాడు. ఆ శోకవ్యగ్రత శ్లోకముగా నవతరించినది. శ్లోకము నాలించిన శ్రోతలలో విభావాను

భావ సంచార్యాదులు ఉద్బుద్ధము లయినవి. రతిస్థానములో వానికి స్థాయిచిక్కినది. రసీభవించినవి. ఆ రసాస్వాదనతో నానంద ముపలబ్ధ మయినది. "స ఏవార్థః కావ్యాత్మా."

భరతముని తర్వాత కావ్యలక్షణములను చర్చించినవారు దండి భామహులు (650-770). ఒకరు గుణములను ఒక రలంకారములును కావ్యమునకు ప్రధానము లనిరి. తర్క న్యాయములు నిరంకుశములుగా శాస్త్రలోకమును పాలించుచున్న కాలమది. గుణములు దోషపరిహారములని ఒక వివరణ. ఉత్కర్ష హేతువులని మఱొక నిరూపణ. రెండును నిలువలేదు. ఒక పురుషునికి ఔదార్యగుణము పుష్కలముగా ఉన్నది; అయితే నిర్ధని. గుణము దారిద్ర్యదోషమును పరిహరించునా ? ఔదార్యము నుత్కర్షించునా ? అట్లే అలంకారములును. శవమున కలంకారాలు పెట్టిన ప్రాణము వచ్చునా ? కులట సాలంకార అయినను కులాంగన కాఁజాలునా ?

ఆనందవర్ధనుఁడు (840-870) ధ్వనివాదమును విశిష్టముగా ప్రతిపాదించి, కావ్యచర్చను సర్వోన్నతస్థాయికి తెచ్చెను. నాట్యశాస్త్రములోని నిర్దేశమును సూక్ష్మ సుందరముగా సందర్శించెను. దాని విలసన విశేషములను, లోతుపాతులను, ప్రాణం అనుభూతిని లక్ష్యమందుంచుకొని ప్రకాశింపఁజేసెను. ఆ లక్షణమే కావ్య బృందావనములో పాదుకొని, పూచి, ఫలించి, ఆనంద వర్ధన మయినది. రసము అభివ్యంజితమే కాని భోగ్యము కాదని తెలినది. ధ్వనికూడ హ్లాద రామణీయకములను సమర్పించినప్పుడే కావ్యములో సుసంగతము కాఁజాలును.

'పూర్వవాకిట తోకయెత్తెను
శుక్ల సుందర కనక శాబము'

ఈ గీతపాదములలో నెంతెంత ధ్వనించుచున్నదనుట పొసఁగదా! ఎందుకన, ధ్వనివిశేషము మహాకవుల రచనలలోనే కాదు, సామాన్యజనుల సరససల్లాపములలో కూడ నిక్షేపముగా పొదివి పెట్టుకొని యున్నది. 'పెదగొన్న పెయ్యకు వేక తెలుస్తుందా' అంటారు. ఇందు వయసు వచ్చిన పశుపిల్ల ఉత్కంఠ ధ్వనించుచున్నది. ఇక్కడ పలుకుల పసి విసరుచున్న ధ్వనితో నోరూరుచున్నది. ఇదే కావ్యములో చమత్కారము. అదే ఆనంద సంధాయకము.

మొట్టమొదట మునిభరతునికి వేదారణ్యములో నాట్యమానస కాసారములో అష్టదళ పద్మములాగున దర్శన మిచ్చినది రసమండలము. తరువాత వేత్తలు నవరసాలను రచించిరి. నవగ్రహములు, నవరాత్రులు, నవరత్నాలు, నవనిధులు, ఇట్లే నవకము బహు సంపన్నముగా మన విజ్ఞానములో విలసిల్లినది. కాని అసలు రస మొక్కటే. అద్వైతము. "రసో వై సః, రసగ్ం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి; ఏతద్వై సత్త్వ స్వరూపం. తత్ సత్త్వమే వేదితం రసః." (రసః సారః, చిదానంద ప్రకాశః-దీపిక). ఈ ఆమ్నాయ సూక్తముల నన్నిటిని సమీక్షించి పండితరాయలు "వస్తుతస్తు, వక్ష్యమాణ శ్రుతిస్వారస్యేన రత్యాద్యవచ్ఛిన్నా, భగ్నావరణా, చిదేవ రసః" అని నిర్ధారణ చేసినారు.

కాఁబట్టి మహాకవి కాళిదాసు నిరీక్షించినది అర్థవాదము కాదు. జగత్తునకు పార్వతీ పరమేశ్వరులు మాతాపితలు. కావ్యమునకు వాగర్థములు జననీజనకులు. ఎంతో నిగూఢత యున్నది. నిజమే. పొదుగులో పాలు దండ్లను కోరుచున్నవా ? "లోకానాం స్థితి మాపహాం

త్యవివాహం స్త్రీ పుంస యోగోద్భవామ్'' అని నన్నయ భట్టారకుడు. ''శ్రీ గౌరీపల్లవపుట, యోగాశ్రయ మంజరీ సముజ్జ్వల మూర్తి'' అని తిక్కనసోమయాజి. అంతటను, యోగ శబ్దమే ప్రయుక్తము. ఈ స్థానములలో సంయోగమని వివక్షింపవచ్చునా ? చూపుల కందిన సౌందర్యము మనసులో మనన స్వరూపమును పొందవలెను. ఆ మనసులో మగ్నోన్మగ్నమయిన భావములు ప్రతిమలయి చూపులకు చిక్కవలెను. ఈ విచిత్ర వ్యాపారమును కావ్యము నిర్వహించినది.

కావ్యసృష్టిలో శిల్పమును కళయును కలిసియుండు నని తిక్కన సోమయాజి పలికెను. శిల్పము వాక్య రచనకు సంబంధించినది. కళ ప్రాణవిలసనమును పోషించునట్టిది. స్వాదు సరళములైన మృదుపదములను ఏర్చి తీర్చి వాక్యముగా దిద్దవచ్చును. పద్యపాదముల గతి గమకములు మెలపవచ్చును. శ్రవణలాలన మిచ్చు పదమైత్రిని కూడ పొందింపవచ్చును, కాని చూపులో పలుకులో ప్రసరించు చేతనచేష్టాదికమును సంతరించలేము. అది ప్రాణప్రసక్తము. దానితోనే ఆకర్షణ ప్రీణనములు సంభవములు. అదే కళాప్రతిష్ఠాపనము. పదలాలిత్యము వలన శ్రవణ తర్పణము జరుగును. అంతరంగమును హాయి ఆవరించును. కాని తొందరగా తేలిపోవును. పదబంధము శిథిలము కాకుండ, అర్థము చిందరవందర కాకుండ నయించి నిల్పు సూత్రమొకటి యున్నది. అదే భావము. చేతన స్థానములను చల్లగా సన్నగా సోకి, సున్నితముగా తరళీకరించి, తరంగించు కుశల శక్తి దాని సొమ్ము. దధిభాండములో కవ్వము తిరుగును. అది బానకు తాకకూడదు. ఎంతో సుతారమైన పని. దానితోనే గడ్డకట్టిన పెరుగు కుదిలి, పలుచబడి, నురుగులయి, నవ్వినట్లు పొంగులువాఱును. అఱచేతులలో చఱచినచో వెన్నవచ్చును గదా! కావ్యానుశీలనములో గూడ ఇట్టి కార్యమే పొడగట్టును - పొదుగువంటిది పదబంధము, పాలవంటిది ఇష్టార్థము. కవ్వమువంటిది భావన

కావ్యచర్చలో వక్రోక్తి జీవిత మని ఒక సిద్ధాంతమున్నది. వక్రోక్తి అనగా వంకర పలుకుబడి. మామూలు ధోరణి తప్పించి జరుపునట్టి భాషితము. పలువురు లాక్షణికులు వక్రోక్తితో కలిపి పర్యాయోక్తి, విశేషోక్తి, వ్యాజోక్తి, గూఢోక్తి, వివృతోక్తి, లోకోక్తి, ఛేకోక్తి, స్వభావోక్తి ఇత్యాద ఉక్తి వైచిత్ర్యములను అలంకారములుగా పాటించిరి. ధ్వన్యంతర్భాగములుగా కొంద అన్వయించిరి. వక్రోక్తి సహజముగా నవ్వు పుట్టించునదిగా ఉండును. ప్రణయకలహ కోపతాపాదులలోని ఉద్వేగమును మృదువుగా అపకర్షించును. అంతేకాని దానియందు కావ్యమునకు జీవితముగా నిలువఁగలిగినంత రమణీయతా సంపత్తి యున్నదనలేము. వక్రోక్తి ప్రధానముగా కొన్ని మంచి పద్యాలు చక్కగా లిఖింపవచ్చును. కాని సాంగమయిన కావ్యనిర్మాణమును ఏ మహాకవియును సాధింపలేడు. ఉక్తి చాతుర్యము మిక్కుటమైన వైరస్యము కలిగించును. కాని కేవలము శబ్దచిత్రముగా దీనిని లాఘవింపకూడదు. శ్రీకృష్ణుఁడు రుక్మిణితో విరసోక్తు లాడిన ఘట్టము చూడనగును.

ఔచిత్యము ప్రధానమన్న లాక్షణికుఁ డొక డున్నాఁడు. ఔచిత్యమునకు భంగము కలిగినచో రసానుభవమునకు విఘ్నము కలుగును. అంతేకాని కావ్యము దుష్టము కాదు. గుణాలంకారములును నష్టములు కావు. పైఁగా, ఇది పరోక్షముగా నిషేధ లక్షణము కావచ్చును. అందువలన

ఔచిత్య చర్చను మానవ చరితకు పరిమితము చేయుటయే సమంజసము. దివ్య శృంగారాదులలో దీని ప్రసక్తి రాకూడదు. కాఁగా కుమారసంభవములోని దివ్య శృంగారము నందు ఔచిత్య భంగము విచారించుట అస్థానకృతము. 11 వ శతాబ్ది లక్షణముతో ఏడెనిమి ది వందల యేండ్ల నాటి కావ్య రచనను కొలుచుట విమర్శ మర్యాదకూడ కాదు.

ఇక శయ్యాపాకములు. వీని లక్షణము గతానుగతికముగా పఠింపఁబడినది. రెంటికిని గల భేదము నిరూపించుటకు సౌరభపరిమళములను ఉదాహరించిరి. సౌరభ మనఁగా పుష్పాదుల సువాసన. పరిమళ మనఁగా అగరు కస్తూరి మిశ్రితమైన శ్రీచందన కబళములోని సుగంధము. భేదము అనుభవైక వేద్యము. కాని తీయని రెండు తెనుఁగు పద్యాలలోని శయ్యాపాకములను వేర్పఱించుట కష్టము. పాకములు కదళీ ద్రాక్షా నారికేళములకు నియతమై నిలిచిపోయినవి మన లక్షణ గ్రంథాలలో. తోలు తీసివేసి అరటిపండును తినవచ్చును. ద్రాక్షను చప్పరించవలెను. కొబ్బరి ముక్కలను నమలి నప్పుడు కాని చవిరాదు. ఈ మూఁడును నిసర్గఫలజన్యములే కాని వీనిలో పచన వ్యాపార మేమియు లేదు. పాకము అనుట సార్థకముకాదు. పైఁగా ఇవి మన భాషా రుచిని ప్రకటింపలేవు. ఏమన తెనుఁగు తేనెవలె స్నిగ్ధమయిన భాష. పండిన మామిడి పండ్లవంటివి మాటలు. అందుచేతనే పేరులేని ఏ రసజ్ఞుఁడో తేనెలో మాగిన తియ్యమామిడి పండన్నాడు. పోతనార్యుని పద్యరచన ఈ పాకములో రుచులు తీగెలు సాగుచు ఉండును. అనుభవింపవలసినదే కాని దాని చవిచూపించుటకు చప్పని మాటలు చాలవు.

చదువువారికిని వినువారికిని, అభీప్సితమైన అర్థము సందించు శబ్దబంధమే కావ్యము. అయితే, అందఱికిని ఇష్టమయిన పదార్థ మేమిటి ? కన్నులు కోరునది సౌందర్యము. కర్ణములకు ఇష్టము కలస్వనము. రసన కీప్సితము మాధుర్యము. హృదయమునకు కామిత మాప్యాయనము. వీని నన్నిటిని తీర్చి తనియించు ప్రభావము శబ్దమున కున్నది.

శబ్దార్థముల పుట్టుపూర్వోత్తరములను వాని ప్రయోజనమును మన పూర్వులు విచారించి నంత అగాధముగా అన్యజాతివేత్త లెవ్వరును విచారించిన జాడ కానరాదు. శాబ్దికుల మీమాంస ఎంత లోతుకు పోయినదో అంత విశాలముగా విస్తరించి స్ఫోట పరమావధిగా పూర్ణమయినది. తుదకు ఈశ్వరు డున్నా డనుటకు కూడ శబ్ద ప్రమాణమే ఆధారమన్నారు వారు. కాఁగా ప్రాచీన వేత్తలు శబ్దప్రక్రియా విజ్ఞానమును వినియోగించుకొని శాబ్దిక సిద్ధాంతము నంగీకరింపలేదు. కాని శబ్దమే సర్వజగదితిహాసమును అక్షయముగా ధారణచేసి నిలిపినది. భూతవర్తమాన భవిష్యత్తులను కలుపుచున్నది. కాలమున కతీతమై విహరించినది. విహరించుచున్నది. విహరింపఁగలదు.

ఈ శబ్దమున కిది అర్థము అను విషయము ఈశ్వరసంకేతమని అద్యవైయాకరణుల అనుశాసనము. 'శక్తం పదమ్' అన్నారు నైయాయికులు. సుప్తిఙాదేశ విశిష్టమయినదే శబ్దము. దాని అర్థము అభిధ లక్షణ అను రెండు ఆవరణములలో అనువృత్త మగుచుండును. ఆ శబ్దమే కావ్యములో సంప్రయుక్త మయినప్పుడు ఈ రెండు ఆవరణములను అతిక్రమించును. ''అభిధా లక్షణా వ్యాపార గమ్యయోః...అర్థయోః...ఉపరి రసాదిరూపః కశ్చిదర్థః కావ్యేసముపలభ్యతే స తు వ్యంగ్యార్థ ఏవ'' అని లాక్షణికులు మూఁడవ వృత్తి నంగీకరించిరి. ఆ శబ్దమును వ్యంజక

శబ్దమనియు, దాని అర్థమును వ్యంగ్యార్థమనియు సంకేతించినారు. ఇక, కావ్యమును, కావ్యము లోని శబ్దమును విచారించి, 'ఇక్షుఖండ స్థానీయం హి కావ్యం కల్పనీయం, తత్రరస నిష్యంద స్థానీయం వ్యంగ్యమ్. ఋజీష ప్రాయం వ్యంగ్యమ్' అన్నారు వ్యాఖ్యాతలు.

అయితే, ఈ శాస్త్రాధికరణ మంతయు సంస్కృత శబ్ద విషయము. శ్రుతిని రూపొందించిన భాష అది. దాని ఉత్పత్తి దైవికము. మహేశ్వరుండు తాండవ ప్రియుఁడు. ఒక ముహూర్తమందు నృత్తావసానమున తన ఢక్కను పదునాలుగు పర్యాయములు వాయించెను. ఆ నాదములో నుండి అణాది సంజ్ఞార్థములై పదునాల్గు సూత్రములు అభివ్యక్తము లాయెను. వానిని పాణినిముని అష్టాధ్యాయిగా గ్రథించెను. కాత్యాయనుఁడు వార్తికములను, పతంజలి మహాభాష్యమును విరచించి వ్యాకరణమును సమగ్రశాస్త్రముగా ప్రతిష్ఠించిరి. వారందఱును మునులు. వ్యాకరించినది గీర్వాణము. దేశభాషలు కావు.

ప్రపంచము ఖండఖండములుగా విభక్తమయినది. మానవులు జాతులుగా వేఱయినారు. ఒక్కొక్కజాతికి ఒక్కొక్క భాష అనుశ్రుతముగా, అవిచ్ఛిన్నముగా అంటి వచ్చుచున్నవి. మానవు లందఱును ఒకే జీవరాశిలోనివారే. ఆకార ప్రకారములలో భేదము లేదు. ఆహార విహారాది నిసర్గకర్మలు సమానములే. అయినను ఇన్ని భాష లెట్లు మొలకెత్తి, తీగెలు వాఱి, కొనలు సాగి, అల్లుకొని, పుష్పించినవో, తరువులుగా పెరిగినవో, కొమ్మలు రెమ్మలు సాచి, ఫలించినవో, ఈ కథ దుర్బోధమై ఆశ్చర్యము కలిగించుచున్నది.

**పోతన కవిత్వము :**

తెనుఁగు మన దేశభాష; జాతివాణి. ఇప్పుడు నాలుగుకోట్ల జనులకు మాతృభాష. పోతనామాత్యుని కాలములో నలువది లక్షల ప్రజలకైనను తల్లిపలుకుగా దైవారియుండును. జోలకు, లాలికి, నవ్వింపునకు, కవ్వింపునకు, తిట్టుకు, దీవనకు ఒడిగిఒప్పి, నిత్యనైమిత్తికములలో అనువర్తించినది. కథలో గాథలో పాటలో పదములో కానట బీసటగా నున్న బాస 11 వ శతాబ్దినాటికి నాగరక వీథుల కెక్కినది. కావ్యరచనలో అక్షరరమ్యత చూపి శోభించినది. రాజసభలలో విద్వాంసుల సమక్షమున వేషభాషల విన్యాసవాల్లభ్యములు ప్రదర్శించినది. పోతన మహాకవి భణితిలో, ''పతివ్రత యన ఇట్టట్టు చనక, మానిని యన లోతు చూపక, గరిత యన నడిచప్పుడు లేక, ముగుద యన బయలుపడక, ప్రమద యన క్రయ్యబాఱి, దైవంబన మనోరథంబు'' లిచ్చినది. ప్రతి పంక్తిలోను ఒక్కొక్క శృంగార ప్రతిమ సచేష్టితముగా లేచి నిలబడుచున్నది.

భాగవతములో భక్తిప్రకరణము ప్రదర్శిత మగుచున్నది. మానుషప్రాయ మయిన భగవల్లీలాకలాపము దీని కితివృత్తము. శాశ్వత సుందరమై, నిత్యమంగళ మయిన ప్రేమ రతి స్థాయి. ప్రేమ శృంగారములు రెండును సధర్మములు. శృంగారించిన దానిని ప్రేమింతుము. ప్రేమించిన దానిని శృంగారింతుము. ఇది లోకానుభవము. కామాధిష్ఠితమైన రతి కర్మయోగ నిష్ఠము. అకామవిపాకమయిన రతి జ్ఞాననిష్ఠము. అవ్యభిచారిణియైన ఆత్మరతి భక్తియోగ నిష్ఠము. సంయోగ వియోగములు సాలోక్య సాయుజ్యములుగా విపాకమగు యోగసిద్ధిని మనము భాగవతములో దర్శించి అనుభవింతుము. బ్రహ్మసూత్రములు భాగవత కంఠమున మంగళసూత్రము లయినవి.

పోతన మహాకవి రచనలో అటు శిల్పవైదుష్యమును, ఇటు కళాకౌశలమును ఉభయ తన్మయ పరిపాకము నందినవి. ఆయన శీలాది గుణగరిష్ఠతచేత నిర్మలుడు. సహజ పాండిత్యముచే సాంగసంపన్నుడు. భాగవత వ్రతసిద్ధిచే జీవన్ముక్తుడు. శ్రీరామ ప్రసాద కవితా ప్రభావముచే మహాకవీశ్వరుడు. తన్మయుడై భాగవతమును తెనిగించి చిన్మయమైన ఆనందమునుపొంది పంచి పెట్టిన పుణ్యరచయిత. ఆయన రచనలో దోషాలు వెదకి దోషులమైనాము. ఆరాధనకు మారుగా అపరాధము జరిగినది. ఆయన వాక్కులను ఆర్షప్రయోగముగా పరిగ్రహించి పరమ ప్రమాణముగా శిరసావహింపవలసినది.

తెనుఁగు దేవభాష కాదు. మహేశ్వరుని ఢక్కానాద జాతము కాదు. మన దేశభాష. ప్రవాహ సదృశ. కూపోదకము కాదు. పదానికి జనకంఠములు, అర్థానికి లోకసిద్ధి శరణ్యములు. అవి ఆధారముగా వ్యాకరణ నిర్మాణము జరుగును. వ్యాకరణము వల్లె వేసి, నిఘంటువులు కంఠపాఠము చేసిన పండితులు కవులగుదురా ? అయినారా ? సంధులు సళ్ళులేకుండ బిగించి, అరసున్నలు పొరపాటులేకుండ పెట్టి కట్టిన పద్యాలు సహృదయ హృద్యములయినవా ? పోతనార్యుని పాండిత్యమును శంకించువారు ఆయన రచనా విన్యాసములో వెదచల్లిన యజ్ఞాంత సన్నంతరూపములను పరిశీలించ వచ్చును. కవి సృష్టింపగల ప్రతిభా పటిష్ఠుడు. స్వతంత్రుఁడు. బ్రహ్మసృష్టి కంటె కవిసృష్టి రమణీయముగా భాసించును. అక్షర రమ్యముగా నిలువ జాలును. "అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః, యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తత" అన్నారు లక్షణవేత్తలు. అంతేకాదు పోతన మహాభక్తుడు. లౌకిక వ్యసనము లంటని నిశ్చలచిత్తుడు. శ్రీహరి నామస్మరణలో తన్మయుడైపోవు శుద్ధ సాత్త్వికుడు. ఆ నిర్వికల్పావస్థలో సర్వము విస్మృతమయి పోవును. యతుల యజనము, ప్రాసల ప్రదక్షిణము మాత్రము నిలుచునా !

ఈ మహాకవి పద్యాలలో తారతమ్యములు వెదకుట అహంకార మగు నేమో ! ఎందుకన, మహాభాగవతములోని పద్యాలు తెలుగువారి కంఠాలను ఎంత మురిపించినవో హృదయాలను అంత మఱపించినవి. కవితకు వన్నెరాసి ఇదేకదా ? పద్యము చదివి ముగించినను అందలి నాద మాధుర్యము కెరటాలు తరంగించినట్లు అలపాలసముగా వినఁబడుచునే యుండును. అయినను మచ్చుకు ముచ్చటకొలుపు ఈ రెండు పద్యాలు:

పెనిమిటి బిడ్డనీక్షణములు
వినుతింపఁగ ప్రేమ భావ విహ్వలమతియై
చనుమొనల పాలు గురియఁగ
కనుఁగొనలను జలములొలుకఁగా బెగ్గిలియెన్.

పాలిచ్చుచు పులకించి పరవశురాలగుచున్న బాలెంత మొగముతో యశోదాదేవి భాసించు చున్నది.

చేతుల తాళము పట్టుక
చేతోమోదంబుతోడ సిగముడి వీడన్
పాతరలాడుచు మెంటను
గీతము నారదుఁడు పాడె కృష్ణా యనుచున్.

ఒడలు తెలియకుండ ఆడుచు పాడుచున్న బ్రహ్మ మానసపుత్రుఁడు మన ముందు సాక్షాత్కరించు చున్నాఁడు. వాయించుచున్న తాళాలు, పాడుచున్న పాట, ఇప్పుడు కూడ వినఁబడుచునే యున్నవి.

> భక్త్యా త్వనన్య యాశక్య
> అహమేవం విధో౽ర్జున !
> జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన
> ప్రవేష్టుంచ పరంతప !

అందుచేత భాగవతము సాహిత్యభణితిలో ప్రీతిప్రతీయమానముగా విలసిల్లినది. ప్రకృతి పురుషుల లీలా నిర్వర్ణనము వైష్ణవ కవులకు మిక్కిలి అభీప్సితము. జయదేవునకు శ్రీకృష్ణుని ప్రకామగతి ఖేలనములే దర్శనము. రాధలేని కృష్ణుఁడు ఆయనకు కానరాడు. లీలాశుకునకు కృష్ణ కిశోరమే ఉపాస్యము. క్షేత్రయ్యకు మువ్వగోపాలుఁడు సాక్షాత్కారదేవత. ఏకం సత్ విప్రాః బహుధా వదంతి ! ఇంకొక విశేషము. భాగవతము శ్రీకృష్ణలీలతో అతిశయించినది. కాని రాధ స్మృతి అందెక్కడను తగులదు. చైతన్య వైష్ణవములో ఆమె ముఖ్యదేవత. పోతనకు ముందే ఆ మతము దక్షిణాపథమున ప్రచారమయినది గదా ! ఆచార్య శంకరుల ద్వాదశమంజరి పూచిన కల్పతరువే భాగవతము. దీనికి కూడ ద్వాదశ స్కంధము లున్నవి.

శ్రీవైష్ణవమునకు భాగవతము ప్రధానమైన ప్రమాణ గ్రంథము. చైతన్యస్వామి అవతరించిన తరువాత రాధాకృష్ణాద్వైతముగా వైష్ణవమై వర్ధిల్లి అధికాధికముగా వ్యాపించినది. జయదేవ గోస్వామి అత్యంత హృదయంగమమైన సాహిత్యమును సృష్టించి ఈ మతవ్యాప్తికి సహకారులైనారు. సంకీర్తనరూపముగా భారతభూమిలో ఆబాలగోపాలమును వైష్ణవ సంప్రదాయము అమృత వల్లివలె అల్లుకొని, కొమ్మలెత్తి, పూచినది. కాఁగా రాధాసంస్మరణమే లేని భాగవతము శ్రీకృష్ణ లీలకు సంపూర్ణ దర్శనము కాదేమో అను శంకకు అవకాశము కలదు. ఈ శంకాదృష్టితోనే మధుసూదన సరస్వతి శక్తిసంగములోనిదని తన వ్యాఖ్యలో

> 'కదాచిదాద్యా లలితా పుం రూపా కృష్ణవిగ్రహా
> లోకసంమోహనార్థాయ స్వరూపం బిభ్రతీ పరమ్'

అను శ్లోకము నుద్ధరించెను. ఈ మధుసూదన సరస్వతి 16 వ శతాబ్దిలో నున్న మహా పండితుఁడు. ద్వైతవాద ప్రతిక్షిప్తమయిన అద్వైతమును అప్రతిహతముగా మరల నిలుపఁబెట్టిన ప్రసిద్ధ వ్యాఖ్యాత.

జైన బౌద్ధమత సంఘాతము వలన కుదుళ్ళు సళ్ళిన వైదిక మత సదాచార పునరుద్ధరణకై మహాభారతము తెనిగింపబడె నను ఊహ కలదు. కాని, అనంతరము ఉద్రేకించిన శైవమతావేశమును గమనించినచో దానికి మహాభారతము కొంత కారణమా అనిపించును. అయితే, శైవము వైదికద్వేషముతో వేడిగాడ్పులు విసరినది. జనసామాన్యములో ఆవేశము ఎంత త్వరగా రేగునో అంత తొందరగా దిగిపోవును. స్తిమితమైన స్థితిలో కేవల ద్వేషాగ్రహములు ఎవరికిని రుచింపవు.

కాఁగా ద్వేషావేశ ధారాపాతము తరువాత శరత్కాల చంద్రోత్సవమువలె భక్తిగీతము ప్రజ నాకర్షించి ప్రీతిపాత్రమయినది.

భాగవతముపట్ల ఆంధ్రులకు ఏ కారణముచేతనో ధర్మభావనతో సరిసమానముగా నర్మబాంధవమును అల్లుకొన్నది. రుక్మిణీకల్యాణములు ఉల్లాసముగా ఊరూరను జరుగుచుండును. 'భామాకలాపము' వీథినాటక మయినది. రుక్మిణీదేవి తెనుగుసీమకు పెద్దకోడలు. అట్లే సత్యభామ చిన్న ఆడుబిడ్డ. అందువలననే ఆమె పేరు దేశములో చనవునకు చక్కఁదనమునకు సుతిమెత్తని సుద్దిగా సుమాకించినది. సత్యభామ యున్నచో చీకటింట దీపమక్కఱలేదఁట ! ఆమె మీఁది మమకారము తీరక ముక్కుతిమ్మన్న కమ్మనికావ్యమే రచించినాఁడు. పోతన మహాకవికి కూడ ఆమె యెడ పూర్ణాభిమానము. సత్యభామ సౌందర్యమును స్వాభిమానమును జోడించిన సోమనాథుని పద్య మొకటి యున్నది. దానిని అందఱు మెచ్చుకొనినారు మనవారు. కాని అందులో తెనుఁగువారింట పెరిగిన సత్యభామ సకలకళాపూర్ణముగా రూపణము కాలేదు. పోతన్న వేఱొక పద్యము వ్రాసి, ఆమె వీరశృంగార ప్రతిమను ప్రసాదించి పోయినాఁడు. ఆ రెండు పద్యములు పోల్చి చూడదగినవి.

అరిఁజూచున్ హరిఁజూచు సూచకములై యందంద మందార కే
సరమాలా మకరంద బిందు సలిలస్యందంబు లందంబులై
తొరఁగన్, పయ్యెద కొంగొకింత తొలఁగన్, తోడ్తో శరాసారమున్
దరహాసామృత పూరమున్ కురియుచున్ దన్వంగి హేలారతిన్ (నా. సో.)

పరుఁజూచున్ వరుఁజూచు నొంప నలరింపన్, రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో, వీరంబు శృంగారమున్
జరగన్, కన్నుల కెంపు సొంపు పరగన్, చండాస్త్రసందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచున్ చంద్రాస్య హేలాగతిన్ (బ. పో.)

సోమనాథుని పద్యములో 'మందారకేసర మాలా మకరంద బిందువులు' ఆయన చెప్పినట్లందముగానే యున్నవి. కాని శృంగార విభ్రమమందలి మృదుస్వేదమే కాని వీర సంభ్రమములో ఉత్పతిల్లు ముచ్చెమటలు స్ఫురించుట లేదు. పైట తొలఁగుట కూడ అటే మొగ్గుచున్నది. పద్యమంతయు వెదకిన శరాసారమను ఒక్క ముక్క తప్ప వీరమును స్ఫుటీకరించు విశేషణము మఱొకటి లేదు.

ఇక పోతన మహాకవి సత్య ప్రతిమను పరిశీలింపుఁడు, పరుఁడైన నరకుని నొంప చూచుచున్నది. రోషరక్తాతిశయముతో కలిసిపోయిన కనుబొమ్మలతో కన్నుల నిప్పులు కురియ చండాస్త్ర సందోహమును విసరుచున్నది.

వరుఁడైన శ్రీకృష్ణుని నలరింప చూచుచున్నది. అనురాగాతిశయముతో మందహాసము ప్రసరించుచు, కన్నులసొంపు శోభిల్లగా సరసాలోకము ప్రసారించుచున్నది. వ్యాఖ్యానమక్కఱలేదు.

తెనిఁగింపు వరుస ఎట్లున్నదో చూతము.

కాత్యాయని ! మహామాయే
మహాయోగి న్యధీశ్వరి !
నందగోప సుతం దేవి !
పతిం మే కురు తే నమః.

ఓకాత్యాయని ! భగవతి !
నీకున్ మ్రొక్కెదము నేము నేఁ డనుకంపన్
మా కిందఱకును వైశమ
శ్రీకృష్ణుఁడు మగఁడు గాఁగఁ జేయుము తల్లీ !

పోతన మహాకవి అనువాద సంవిధానము ఇంతకు ముందే వివరింపఁబడినది. ఆయన మూలమును సంనిహితముగా ననుసరించును. భక్త్యావేశము కలిగినపట్లు సొంత భావములను గ్రుమ్మరించును. ఆంధ్ర భాగవతమునకు అనన్యసాధ్యమైన యొక విశిష్టత చేకూర్చినది ఈ ఫక్కి. ఆ మహాకవి వాణికి జయము.

**పోతన అనుకరించిన పూర్వకవులు :**

పోతన భాగవతారంభమున వాల్మీకి వ్యాసులను, బాణ కాళిదాస మయూర భారవి మాఘులను, గవిత్రయమువారిని సంస్మరించి యున్నాఁడు. వారి రచనల నాతఁడు పలుమార్లు చదివి యానందించియుండును. అందుచే నతని భాగవతమున నెడనెడ వారి రచనల ప్రభావము గోచరించుచుండును. దశమస్కంధ పూర్వభాగమున గోపికలు శ్రీకృష్ణు నన్వేషించు సందర్భమున "పున్నాగ కానవే పున్నాగవందితు" నను సీసపద్యమున్నది. ఇది నన్నయ నలోపాఖ్యానము నందలి "సహకార మత్ప్రియ సహకారుఁ, బున్నాగ పున్నాగుఁ దిలక భూభువన తిలకు" నను పద్యమును బోలియున్నది. అట్లే యాదిపర్వ షష్ఠాశ్వాసమున ద్రోణుఁ డర్జున బంధితుఁడై కొని రాఁబడిన ద్రుపదునిఁ జూచి పలికిన "వీరెవ్వరయ్య ! ద్రుపదమహారాజులె" యను పద్యము యొక్క ఛాయలు దశమ స్కంధమున యశోద నవనీతచోరుఁడైన శ్రీకృష్ణునిఁ గూర్చి యన్న "వీరెవ్వరు శ్రీకృష్ణులు గారా ? యెన్నఁడును వెన్న గానరఁట కదా" యను పద్యమునందు గోచరించుచున్నవి.

తిక్కన ఉద్యోగపర్వము నందలి మూఁడవ యాశ్వాసమున శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని మందిరమున కరుగుచుండఁగా నిరుగెలంకుల రమ్యహర్మ్యతలంబులఁ బుష్పాక్షత ప్రకరంబులు చల్లుచు నిలఁబడిన యంగనాజనులు, "ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నుల పాలుఁ ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె" (ఉ. 3, 175.) ఇత్యాదిగాఁ దమలోఁ దలంచి రని వ్రాసెను. పోతన దశమ స్కంధమున "వీఁడటే రక్కసి విగతజీవగఁ జన్నుఁబాలు ద్రావిన మేటి బాలకుం" డను సీసమునఁ బై పద్యము ననుకరించినట్లు కానఁబడును.

ఎఱ్ఱన నృసింహ పురాణము నందలి కథ ప్రహ్లాద చరిత్రమే. భాగవతమునఁ గూడఁ బ్రహ్లాద చరిత్ర ముండుటచే దానిని రచించు నప్పుడు పోతన నృసింహ పురాణము ననుసరించిన

చోట్లు పెక్కు గోచరించును. పోతన భక్తిభావ బంధురుఁడు కావున నృసింహ పురాణమందలి పద్యముకుళములు పెక్కు భాగవతమున వికచప్రసూనములుగా విప్పారి పఠితల హృదయములకానందము సంధించుచున్నవి. "ఊషర బీజముల్ భసితయోగ్య ఘృతంబులు షండకన్యకాన్వేషణముల్ పయోధి గత వృష్టితతుల్" మున్నగు నృసింహ పురాణమునందలి పద్యములను "అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్" మున్నగు పద్యములతోఁ బోల్చి చూచిన నీ విషయము తేటతెల్లము కాఁగలదు. పద్యముల యెత్తుగడలలోఁ గూడ రెండింటఁ బెక్కు సంవాదములు గోచరించును.

పోతన భాగవతము నందలి "మందార మకరంద మాధుర్యమును గ్రోలు మధుపంబు వోవునే మదనములకు" నను పద్యము సర్వాంధ్రజన సుపరిచితమైనది. సరిగా నిట్టి భావమే శైవకవి సార్వభౌముఁడైన పాల్కురికి సోమనాథుని బసవపురాణ తృతీయాశ్వాసమునఁ గానవచ్చుచున్నది.

> క్షీరాబ్ధి లోపలఁ గ్రీడించు హంస
> గోరునే పడియల నీరు ద్రావంగఁ
> జూతఫలంబులఁ జుంబించు చిలుక
> బ్రాతి బూరుగుమ్రాని పండ్లు గన్గొనునె
> రాకామలజ్యోత్స్నఁ ద్రావు చకోర
> మాకాంక్ష సేయునే చీఁకటిఁ ద్రావ
> విరిదమ్మి వాసన విహరించు తేఁటి
> పరిగొని సుడియునే ప్రబ్బలి విరుల."

ఇట్టి భావముతోఁ గూడినదే యొక సీసపద్యము సోమనాథుని చతుర్వేదసారమునఁ గూడ నున్నది. "రాకామలజ్యోత్స్నఁ ద్రావ నిచ్చలు గొన్న." 153

దీనినిబట్టి పోతన శైవకవుల రచనలనుగూడ నాదరమునఁ జదివినట్లు స్పష్టమగుచున్నది.

భాస్కరరామాయణము నందును నాచనసోముని యుత్తర హరివంశమునందును అంత్యానుప్రాసములతోఁ గూడిన పద్యములు పెక్కు కనిపించును. సోముని యుత్తర హరివంశము నందలి నరకాసుర సంహారము, ఉషాపరిణయము మున్నగు కథలు భాగవతమందుఁ గూడ నున్నవి. మఱియు నాంధ్రవాఙ్మయమునఁ దొలుఁ దొల్త నంత్యానుప్రాసములు, శబ్దాలంకారములు మున్నగు వాని యందాసక్తి చూపి, నిరర్గళమైన ధారతోఁ గవిత్వము చెప్పి, తరువాతి కవుల యాదర గౌరవములకుఁ బాత్రుఁడైన మహాకవి నాచన సోమనాథుడు. పోతన కవిత్వమున నాతని కవిత్వముతోడి పోలికలు పెక్కు కనిపించును. అట్లే యంత్యానుప్రాసాదుల విషయమునఁ బోతన భాస్కరునిఁ గూడ నాదర్శముగా గ్రహించి యుండవచ్చును. "అరిఁ జూచున్ హరిఁ జూచు" "తంత్రీ వినోదంబు తడవు సైఁపనిప్రేళ్ళు" "చతురవచో విలాస గుణ సాగర" మున్నగు నుత్తర హరివంశము నందలి పద్యములను బోలిన పద్యములనే పోతన భాగవతమున నరకాసుర సంహార ఘట్టమునందు వ్రాయుట చూడ నతఁడు సోమన నెంత సన్నిహితముగా ననుసరించెనో తెలియ నగును. కథా విషయమునఁ గూడ పోతన

నరకాసుర సంహారము నందలి సత్యభామా యుద్ధ సందర్భము నుత్తర హరివంశము నుండియే గ్రహించియుండునని యిదివఱకుఁ జెప్పఁబడినది.

పోతన తనకుఁ బూర్వమం దుండిన పలువురు మహాకవుల ననుసరించినట్లే పోతన తరువాతి కవులలోఁ బలువు రాతని భాగవతమును బఠించి యత్యంత గౌరవముతో నాతని కవితా మార్గము ననుసరింప యత్నించిరి. అట్టి వారిలో అనంతామాత్యుఁడు, కొఱవి గోపరాజు, వెన్నెల కంటి సూరన మున్నగువారు ముఖ్యులు. ఆధునికులలోఁ బలువు రొక్క పోతన భాగవతమును మాత్రము క్షుణ్ణముగాఁ బఠించి ధారాళమైన కవిత్వము చెప్పిన వారున్నారు.

**పోతన వర్ణనములు :**

పోతన భాగవతమునఁ బద్యములందును గద్యములందును గూడఁ బెక్కు వర్ణనలు కావించియున్నాఁడు. ఆతని వర్ణనలు విశదములును సమగ్రములునై వర్ణ్యమును బఠితల మనో నేత్రముల ముందు సాక్షాత్కరింపఁ జేయుచుండును. గజేంద్రుని మకరమునుండి రక్షించుటకై విష్ణుఁ డరిగిన ఘట్టమును, అప్పు డాతని వెనుక "మొగులు పిఱుఁది మెఱుఁగుఁ దీవయుఁబోలెఁ" జనుచుండిన లక్ష్మీదేవి స్వరూపమును, వామనావతార ఘట్టమును "ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దానింతై" విశ్వరూపముఁ దాల్చి విజృంభించిన సందర్భమును, రుక్మిణి యౌవన తచ్చేష్టావర్ణనమును, శ్రీకృష్ణుని దుడుకుఁ జేఁతల వివరణమును, బఠికించిన నాతని వర్ణన పాటవము వ్యక్తమగును. దశమ స్కంధమున గో గోపకులయు గొల్లభామలయు, గుణచర్యాదులను వర్ణించుట పట్ల నాతఁడు గొల్లపల్లెల జీవితము నెంతో సహజ రమ్యముగా వర్ణించి యుండెను. గోపికా వస్త్రాప హరణమునకు ముందు వర్ష శరద్ధేమంతర్తువుల వర్ణన మున్నది. అట్లే కంసుని సంహరించుటకై కృష్ణుఁడు మథురానగరమునకు బలరామసహితుఁడై యరిగిన సందర్భమున సూర్యాస్తమయ చంద్రోదయ సూర్యోదయ వర్ణనము లున్నవి. ఈ ప్రకృతి వర్ణనము లాలంకారికములును, కవి సమయానుగుణములును, సహజములునై మిక్కిలి ప్రౌఢములుగా నున్నవి. పోతన వామనావతార ఘట్టమునకు ముందు స్వర్గవర్ణనమును, నవమ స్కంధమున గంగావతరణ వర్ణనమును, దశమ స్కంధమున రాసక్రీడాభివర్ణనమును దీర్ఘ వచనములలోఁ గావించెను. ఈ వచనము లాతని ప్రపంచ పరిశీలనమును, భావనా పాటవమును, పాండిత్య ప్రకర్షను బ్రకటించుచున్నవి. ఇవి కొన్నిచోట్ల శ్లేష విరోధాభాసాలంకారములతోఁ గూడి బాణుని కాదంబరీ వచనములను దలపించుచున్నవి.

**పాత్ర పోషణము :**

పోతన భాగవతమున వివిధ పాత్రలను విస్పష్ట రేఖలతోఁ దీర్చిదిద్ది తన పాత్ర పోషణ కౌశలమును బ్రదర్శించెను. పుత్త్రఘాతియగు నశ్వత్థామ నర్జునుఁ డవమానించు ఘట్టమున ద్రౌపది మాతృహృదయము నాతఁడెంతో నిపుణముగా వర్ణించెను. ప్రహ్లాదుఁడు, అంబరీషుఁడు, ధ్రువుఁడు మున్నగు మహాభక్తుల గుణస్వరూపముల నాతఁడు చిత్రించిన తెఱం గత్యంత శ్లాఘా పాత్రముగా నున్నది. భీష్మకృత శ్రీకృష్ణ స్తోత్రము పఠించునప్పుడా మహనీయుని భక్తియుఁ దత్త్వవేత్తృతయు వేయివిధముల వ్యక్తమగుచుండును. దశమస్కంధమున పోతన గోపికల భక్తిమయ శృంగారము నతిరమ్యముగ వర్ణించి యుండెను. హిరణ్యకశిపుఁడు, కంసుఁడు మున్నగు వారి దౌర్జన్యమును,

దుర్వాసుఁడు, శిశుపాలుఁడు మున్నగువారి దురహంకారమును ఆయా ఘట్టములం దాతఁడు చక్కఁగా నిరూపించెను. కుచేలుని సాధుత్వమును, నిర్లిప్తతయు, దేవకీవసుదేవులయు నందయశోదలయు వాత్సల్యమునుఁ, బలిచక్రవర్తి వీరవదాన్యతలునుఁ, శుకుని స్వామిహిత చింతనమును, సత్రాజిత్తు ధనలోభమును, రుక్మి మూర్ఖతను, జాంబవంతుని భక్తిని ఆతఁడు పఠితల హృదయములందు హత్తుకొనునట్లు ప్రదర్శించెను. ప్రతి ఘట్టమునందు నాతఁడు కృష్ణుని భక్తరక్షణ పరాయణతను, అతిలోక మహానుభావతను, దుష్టశిక్షణ దక్షతను సుస్పష్టముగాఁ దీర్చి దిద్దెను. భాగవతమును శ్రద్ధతోఁ బఠించువారి హృదయముల నుండి యాయా పాత్రల గుణస్వరూపము లెప్పుడును తొలఁగిపోక యందు సుస్థిరముగా నిల్చియుండుటయే పోతన వారిని చిత్రించుటయందుఁ జూపిన యపార నైపుణ్యమునకుఁ దార్కాణము.

**పోతన - రసపోషణము :**

భాగవతము భక్తిరస నిధానము. ఇందే ఘట్టమును బఠించినను ఆ రసము నాస్వాదించి పఠిత లానంద తన్మయులగుట కవకాశమున్నది. ఇందలి ప్రధాన రసము భక్తియేయైనను పోతన ఆయా కథా సందర్భములం దితర రసములను గూడఁ జక్కఁగాఁ బోషించి తన రస పోషణ పాటవమును బ్రకటించి యున్నాఁడు. భాగవతమున దశమ స్కంధమునకుఁ బ్రత్యేక స్థానమున్నది. శ్రీకృష్ణ గోపికావృత్తాంతమును వర్ణించు పట్ల పోతన శృంగారమును భక్తితో మిశ్రితము గావించి వాఙ్మయమునం దితరత్ర యెచ్చటను గోచరింపని యొక యపూర్వ రస వాతావరణమును గల్పించినాఁడు. స్థూల దృష్టికి గోపికలు శ్రీకృష్ణుని యెడఁ బ్రదర్శించిన భావము లౌకికమైన శృంగారమువలెనే గోచరించును. కాని సూక్ష్మముగాఁ బరిశీలించినప్పు డది లౌకికమును దైహికమునైన తుచ్ఛకామము కాక మోక్షరతితోఁ గూడిన యుజ్జ్వలశృంగారముగా గోచరించును. ఈ విషయమును 'భాగవతము-భక్తి'యను శీర్షికయందుఁ జూడఁదగును.

పోతన సహజముగా సాత్త్వికుఁ డైనను రసపోషణ పట్ల నావేశపరుఁడు. అతఁ డే రసము నైనను బొంగి పొరలునట్లు వర్ణించును. రుక్మిణీకల్యాణ ఘట్టమున హార్దమైన యను రాగముతో గూడిన శృంగార రసము వర్ణింపఁబడినది. నరకాసుర సంహార ఘట్టమున సత్యభామ యుద్ధము చేయు సందర్భమందుఁ బోతన వీరశృంగారముల సమ్మేళనము నతిలోక రమణీయముగా వర్ణించెను. ప్రథమ స్కంధమున నర్జునుఁడు శ్రీకృష్ణుని నిర్యాణమును ధర్మజుని కెఱింగించుపట్లఁ గరుణమును, శ్రీకృష్ణుఁడు కంసాదులను సంహరించుపట్ల వీరరౌద్రములును, నృసింహమూర్త్యా విర్భావ ఘట్టమున రౌద్రాద్భుతములును, కృష్ణుఁడు రుక్మిని బరాభవించు ఘట్టమున హాస్యబీభత్స ములును, కుంతీ భీష్మలును, దదితరులును శ్రీకృష్ణుని స్తుతించు పట్ల శాంతమును జక్కఁగాఁ బోషింపఁ బడినవి. ఈ విధముగాఁ బోతన భాగవతమున నాయా ఘట్టములం దాయా రసముల నపార కౌశలముతోఁ బోషించి పఠితలకు బ్రహ్మానంద సహోదరమైన రసానందమును బ్రసాదించి యున్నాఁడు.

**పోతన - వ్యంగ్య రచన :**

భాగవతమునఁ గొన్ని ఘట్టములందు దురహంకారులును గర్వితచిత్తులు నైన కృష్ణ విరోధులు కొందఱు శ్రీకృష్ణుని నిందించు ఘట్టములు వచ్చుచుండును. అట్టి వానిని గూడ భక్త

శిఖామణియైన పోతనయే రచింపవలసి యుండుటచే నాతఁ డట్టి పట్టుల నద్భుతమైన వ్యంగ్య విధానము నవలంబించి తన హృదయమునకెట్టి నొప్పియుఁ గలుగకుండ నూఱట కలిగించుకొనెను. అట్టి ఘట్టము లందలి పద్యములను బఠించుచో నందు స్తుతియు నిందయు రెండును సమానాంతరముగాఁ బ్రవహించుచున్నట్లు గోచరించును. అందు నిందాపక్షము దుర్జనులైన పాత్రలది; స్తుతిపక్షము కవియు భక్తుఁడు నైన పోతనది. ఈ పద్యములను రచించుటలోఁ బోతన చూపిన నేర్పనన్య సామాన్యమై పఠితల కానంద పారవశ్యము గలిగించుచుండును.

"ఎన్నఁడుం బరు వేఁడఁ బోఁడఁట" 8-595

"మా సరివాఁడవా మా పాపఁ గొనిపోవ" 10-1762

"లోకుల నడవడిలోని వారము గాము" 10-ఉ-232

మున్నగు పద్యము లట్టివి. ఈ పద్యములను జూచియే కాసుల పురుషోత్తముఁ డాంధ్ర నాయక శతకమునంతను వ్యాజస్తుతి పూర్వకముగా రచించి పేరుగాంచెను.

అక్రూరుఁడు కంసుని ప్రేరణచేఁ గృష్ణబలరాముల మథురకు రథముపైఁ గొనిపోవుచు, మార్గ మధ్యమున యమునానదిలో స్నానము చేసి, యందు శేషపర్యంక శాయియైన విష్ణునిఁ గాంచి స్తోత్రము గావించెను. కొంతసేపటి కా రూపము తిరోహితము కాఁగా నక్రూరుఁడు రథము కడ కరుదెంచెను. అప్పుడు కృష్ణుఁ డాతని గాంచి,

జలములు చేరువ నున్నవి తలపోయఁగ నీవు పోయి తడవయ్యె నదీ
జలమున నభమున ధరణిం గలుగని చోద్యములు నీకుఁ గానంబడెనే ? 10-1235

అని యడిగెను. అక్రూరుఁడు దానికి తాను జూచిన విషయ మేమియుఁ జెప్పక

నీలోన లేని చోద్యము లే లోకమునందుఁ జెప్ప రీశ్వర నీట
న్నేలన్నింగిని నున్న వె నీలోఁ జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా ! 10-1236

అని చెప్పి యూరకుండెను. ఈ సన్నివేశము వ్యంగ్య వైఖరితోఁ గూడి యత్యంత రమణీయముగా నున్నది.

**పోతన భావములు :**

సంస్కృతమున వ్యాసుఁడు వెల్లడించిన భావములనే పోతన పన్నె చిన్నెలు పెట్టి దెలుఁగున వ్యక్తము చేసినను గొన్నిచోట్ల సొంత భావములనుగూడఁ బ్రకటింపక పోలేదు. పోతన యనువాద విధాన మను భాగమున నతఁడు వహించిన స్వాతంత్ర్యము స్పష్టము చేయఁబడినది. ఆయా ఘట్టములయం దాతఁడు ప్రకటించిన భావములు ప్రౌఢములు సుదాత్తములు నౌచిత్య శోభితములు నై యతని యపూర్వ ప్రతిభా శక్తిని వెల్లడి చేయుచున్నవి.

"అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దాపల"

"ఆదిన్ శ్రీ సతి కొప్పుపై దనువుపై నంసోత్తరీయంబుపై"

"రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై"

"ఏలా బ్రహ్మపదంబు వేదములకున్ వీక్షింపఁగారాని"

"నిను హింసించిన పూతనాదులకు మున్ నీ మేటి సంకేతమిచ్చిన"

మున్నగు పద్యము లాతని భావప్రౌఢికిఁ దార్కాణములు. ఇట్టి భావనిర్భరములైన పద్యములు భాగవతమునఁ బ్రతి ఘట్టమునందును గోచరించును. గోపికాగీతలు, భ్రమరగీతలు మున్నగు ఘట్టములందలి పద్యములన్నియు నర్థగంభీరములై చదివిన కొలందిఁ జవులూరించుచుండును.

**భాగవతము - పోతన ఆత్మీయత :**

భాగవతమునఁ బురాణమున కుండవలసిన పంచలక్షణములు గోచరించును. భగవంతుని యేకవింశత్యవతారముల చరిత్ర మందుఁ జెప్పఁబడినది. ప్రసక్తానుప్రసక్తముగా నందు భగవంతుని భక్తితోఁ గొల్చి యాతని కరుణాకటాక్షములకుఁ బాత్రులైన భక్తుల చరిత్రలు కూడఁ దెల్పఁబడినవి. భాగవతము యొక్క యీ స్వభావమును జూడ నది కేవల పరాశ్రయ కవిత్వమే యనిపించును. కాని పోతన కూడ మహాభక్తుఁ డగుటచే నందు వర్ణింపఁబడిన భక్తులతోఁ దన కభేదాధ్యవసాయము కల్పించుకొని తద్ద్వారా తన భావములను గూడ వ్యక్తము చేయుచుండును. ఈ విధముగా నం దాతని యాత్మీయత పెక్కుచోట్లఁ బ్రత్యక్షమగుచుండును. ప్రహ్లాదాది చరిత్రలు పరిశీలించిన నీ విషయము తెల్లము కాఁజాలును. దశమ స్కంధమున భక్తి పరాకాష్ఠ పొందిన గోపికల వృత్తాంతము ప్రధానముగా వర్ణితమై యుండుటచే నందుఁ బ్రతి ఘట్టమునందును ఆ గోప గోపీజనముల రూపమునఁ బోతనయు మనకు సాక్షాత్కరించుచుండును. ఇంత యాత్మీయతతోఁ గూడియున్న కతముననే దశమ స్కంధము గీతికాప్రాయమై (Lyrical) పఠితలకుఁ బరమానందము సంధానించుచుండును.

**పోతన భాష :**

భాగవతారంభమునఁ బోతన-

కొందఱికిఁ దెనుఁగు గుణ మగుఁ గొందఱికిని సంస్కృతంబు గుణ మగు రెండున్
గొందఱికి గుణము లగు నే నందఱి మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్. 1-18

అని ప్రతిన చేసి యుండెను. భాగవత రచనను బరిశీలించి చూచిన నాతఁ డీ ప్రతిన యథాక్షరముగాఁ జెల్లించె నని తెలియవచ్చును. అతని రచనలో "అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్" వంటి సంస్కృత బహుళములైన పద్యములును, "నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు" వంటి సంస్కృతాంధ్ర సమసంఘటనము గల పద్యములును, "క్రొక్కారు మెఱుఁగు మేనులుఁ గ్రిక్కిఱిసిన చన్నుఁ గవలు" వంటి యచ్చ తెలుఁగు పదములతోఁ గూడిన పద్యములును గూడఁ గానవచ్చును. మొత్తము మీఁద నతని కవిత్వములో సంస్కృత పదముల సంఖ్యయే హెచ్చు.

నన్నయ తన కవిత్వమున నున్నవని చెప్పిన మూఁడు గుణములలో నక్షర రమ్యత యొకటి. ఆ యక్షర రమ్యతకు పోతన కవిత్వము పెట్టినది పేరు. అర్థమైనను గాకపోయినను అతని కవిత చెవులఁ బడినంతనే యెట్టి వానికైన నార్ద్రత కలిగించి యానందము చూఱ యిచ్చును. సంస్కృత పద బహుళమయ్యు నందు ప్రసాదగుణము సర్వతోముఖమై గోచరించును. దానికి సహజమైన మాధుర్యమును ధారాశుద్ధియుఁ దోడగుటచే నది మఱింత వన్నె కెక్కి పండితు లనక పామరులనక యెల్లవారికి హృదయావర్జక యై యింపెసలారును.

పోతన కలంకార ప్రీతి మెండు. అతఁ డుపమోత్ప్రేక్షా ద్యర్థాలంకారములనే కాక అనుప్రాసాది శబ్దాలంకారములను గూడ విరివిగా వాడుచుండును. అతని వర్ణన పద్యములలో

వృత్త్యనుప్రాసము లేని దెక్కడనో కాని యుండదు. ఆతని వచనములు వృత్త్యనుప్రాసములలోఁ గూడి ధ్వని సౌష్ఠవమున కాటపట్టులై చదివిన కొలంది చదువవలె నను సుత్సాహమును గలిగించు చుండును. "అడిగెద నని వడివడిఁ జను" నిత్యాది పద్యములకు వృత్త్యనుప్రాస మపూర్వ సౌందర్యము నాపాదించుచున్నది. పోతన పద్యములను జదువునప్పు డందలి ఛందస్సు లయను, అనుప్రాసాదులు మృదంగ ధ్వని సౌందర్యమును, మధురములు నర్థవంతములు నైన పదములు సాహిత్యమును గల్పింప నవి శ్రవణానందకరమైన పాటకచ్చేరీని వినుచున్న ట్లిట్టి దట్టిదని చెప్పరాని యానందమును గలిగించుచుండును. పోతన మూలమునందలి రమ్యములైన యుపమానము లెచ్చటను విడువక వానికి యథోచితముగా వన్నెకలిగించి తెనిఁగించి యుండెను. ''పాదద్వంద్వము నేలమోపి'' ''ఊహకలంగి జీవనపు టోలమునంబడి'' రాజీవాక్షునిచే నొక రాజీవము కరణి శైలరాజము మెఱసెన్" మున్నగు పద్యము లందలి యుపమానములు సహజములును నౌచిత్యశోభితములునై యందలి యర్థవిశేషమున కెంతో యుత్కర్ష కలిగించుచున్నవి. ఉపమాలంకారముల వలెనే రూప కోత్ప్రేక్షాతిశయోక్త్యాదులగు నితరాలంకారములను గూడ నతఁ డెంతో యందముగాఁ గూర్చి యర్థభావముల కెనలేని యింపు సంపాదించుచుండును. ''జ్యావల్లీ ధ్వని గర్జనంబుగ సురల్‌సారంగ యూథంబుగా" నిత్యాది పద్యము లిందుకుఁ దార్కాణములు.

పోతన కవిత్వమున నచ్చటచ్చట క్త్వార్థకేకార సంధులు, ద్రుతద్విత్వ సంధులు, షష్ఠీ కుపర్ణకము ముందు నగాగమరాహిత్యము, వికచకమల నేత్రి మున్నగు రూపములు, కొన్ని మిశ్ర సమాసములు, వైరి సమాసములు కానవచ్చును. రేఫ అకారముల కీతఁడు మైత్రి పాటించెనని కొందఱు లాక్షణికు లాక్షేపించిరి. స్వల్పసంఖ్యాకము లైన యిట్టి స్వతంత్ర ప్రయోగముల వలన నతని కవిత్వమున కెట్టి లాఘవమును జేకూరలేదు. పోతన వంటి మహాకవి వాడిన ప్రయోగ విశేషములను గ్రహించి వానిని సాధించు సూత్రములను వ్రాయకుండుట యా వ్యాకరణ కర్తల దోషమే యని చెప్పఁదగును. యతిప్రాసల విషయమున నాతఁడు కావించిన కొన్ని విశేష ప్రయోగములు స్థలాంతరమున నొసంగఁబడినవి. పోతన సత్త్వసంపన్నుఁ డైన మహాభక్తుడు; సహజపండితుఁడని చెప్పుకొన్నను నపారవ్యుత్పత్తి ప్రకటించిన పండితుఁడు; ప్రతిభాసంపన్నుఁ డైన మహాకవి. ఆతని కవిత్వమున నేవో నెరసు లున్నవని పరాఙ్ముఖత వహించుట రసనిధానమునకు దవ్వుగాఁ జని తజ్జన్యమైన యానందమును గోల్పోవుటయే.

**భాగవతము - భక్తి :**

పూర్వులు మానవులకు మోక్ష ప్రాప్తి సాధనములుగా జ్ఞాన కర్మ భక్తి మార్గములను నిర్దేశించిరి. ఇందు జ్ఞాన మార్గము పరిణతచిత్తులైన మహాయోగులకుఁ దప్ప సామాన్యులకు సాధ్యము గాదు. కర్మమార్గము కూడ జ్ఞానమార్గమువలెఁ గొందఱికి మాత్రమే సాధ్యమైనట్టిది. లింగ వర్ణాశ్రమ వయోభేదముల ననుసరించి మానవులు నిర్వహింప వలసిన కర్మకలాప మెంతయో శ్రుతి స్మృతి పురాణాదులందు విహితమై యున్నది. దానినంతను యథావిధిగా నాచరించుట దుష్కరమనియే చెప్పవచ్చును. కాఁగా పండితులనక పామరు లనక, స్త్రీలనక పురుషు లనక, వృద్ధు లనక బాలు రనక యెల్లరికి నందుబాటులో నుండి యనుసరణ యోగ్యమైనది భక్తిమార్గ మొక్కటే. భాగవతము జ్ఞాన కర్మ మార్గములు నిరసింపక పోయినను భక్తిమార్గమున కెక్కుడు ప్రాధాన్య మొసంగుచున్నది.

ఇందు వర్ణింపఁబడిన భక్తుల చరిత్రము లన్నింట భక్తి ప్రాధాన్యము చక్కఁగా వెల్లడింపఁబడి యున్నది.

భాగవతారంభమునందు నారదుఁడు వ్యాసునితో నతని మనసునందలి వగపునకు గారణము చెప్పుచు-

అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుక గాని విష్ణు కథ లేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁగాక నీకు నీ
కొంచెము వచ్చు బెల్ల హరిఁ గోరి నుతింపుమి నార్యపూజితా.

అని విష్ణుకథా గుణకథన ప్రభావము నెఱింగించెను. అట్లే తన పూర్వజన్మ వృత్తాంత మంతయుఁ దెల్పిన పిమ్మట నతఁడు-

యమనియమాది యోగముల నాత్మ నియంత్రిత మయ్యుఁ గామ రో
షములఁ బ్రచోదితంబ యగు శాంతి వహింపఁదు విష్ణు సేవచేఁ
గ్రమమున శాంతి గైకొనిన కైవడి

అని విష్ణుసేవా మహిమను వివరించెను. పై రెండు సందర్భములును గూడ భక్తిమహిమను జక్కఁగాఁ దేటతెల్లి మొనరించుచున్నవి. ద్వితీయ స్కంధమున శుకుఁడు పరీక్షిత్తునకు ముక్తిమార్గము నెఱింగించుచు "సంసార ప్రవిష్టుం డైన వానికిఁ దపోయోగాదు లైన మోక్ష మార్గంబులు పెక్కు గలవు. అందు భక్తిమార్గంబు కంటె సులభంబు లే" దనియు, "మున్ను బ్రహ్మ వేదములను ముమ్మాఱు ధర్మనయజ్ఞతతో బరామర్శించి మోక్షము తక్కిన మార్గముల వెంటలేదని నిర్వికారు డైన జనార్దను భక్తితోఁ జింతచేసె" ననియు స్పష్టముగాఁ జెప్పియుండెను. అట్లే తృతీయ స్కంధమున కపిలుఁడు దేవహూతికి భక్తియోగ భేదములు తెలిపి యాత్యంతిక భక్తియోగ విధానమును వివరించి "మనుజుం డొగి మత్ప్రతిమార్చనా విడంబనమున మూఢుఁ డై యుచిత భక్తిని నన్ను భజింపఁడేని నమ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చిన యట్టి వాఁడగున్" అని బోధించి యుండెను. ఈ విధముగా భాగవతమున నాయా సందర్భములందు భక్తియోగ ప్రాధాన్యము వాచ్యముగనే బహువిధముల విస్తరింపఁబడి యున్నది.

భక్తుల చరిత్రలు చెప్పునప్పుడు భాగవత మేదో ప్రసక్తి కల్పించి వారిచే భక్తిమహిమాను భావములు వివరింపఁ జేయుచుండును. ప్రహ్లాద చరిత్రమున హిరణ్యకశిపుఁడు కుమారునిఁ దొడలపైఁ గూర్చుండఁ బెట్టుకొని నీ వేమేమి చదివితివో చెప్పు మని యడుగఁ నతఁడు చదువులలో మర్మమెల్లఁ జదివితి నని చెప్పుచు భక్తి ప్రభావము నుగ్గడించెను. అతఁడు "తను హృద్భాషల సఖ్యమున్" అను పద్యమున నవవిధ భక్తుల నెఱింగించి యా తొమ్మిది భక్తిమార్గముల "సర్వాత్మున్ హరిన్ నమ్మి సజ్జనుఁ డై యుండుట భద్రమంచుఁ దలఁతు" నని చెప్పుటయే కాక "హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారములు" అంధేందూదయాదులవంటి వని స్పష్టముగాఁ జెప్పియై చెను. "కమలాక్షు నర్చించు కరములు కరములు" "కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే" "సంసారజీమూత సంఘంబు విచ్చునే" మున్నగు పద్యములలో భక్తిమహిమాతిశయము తెన్నగా

నిరూపింపబడినది. "విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే పాదయుగముతోడి పశువు గాక" యనునది ప్రహ్లాదుని యుద్దేశమే కాక భాగవత పరమార్థము కూడ నై యున్నది.

'పరానురక్తిరీశ్వరే' 'సాత్వస్మిన్ పరమప్రేమరూపా' అనునవి పూర్వులు భక్తికొసంగిన నిర్వచనములు. వీనిని బట్టి భక్తులకు భగవంతునెడఁ గల ప్రేమానురాగాది భావముల యతిశయమే భక్తియని తెలుచున్నది.ఇది భగవద్భాగవతులకుఁ గల సన్నిహిత సంబంధమునకు మాఱట రూపము. భగవద్విషయక మగు నీ భక్తి భావమాత్రమే యని కొందఱును, నవరసములలో సంతర్భవించి యున్నదని కొందఱును, అట్లుగాక దానికిఁ బ్రత్యేకముగా రసత్వమే కలదని కొందఱును జెప్పు చున్నారు. మధుసూదన సరస్వతి భక్తిరసాయన మను గ్రంథమున దీని స్వరూప స్వభావ తత్త్వములను జక్కఁగా వివరించెను.

ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావాహికతాం గతా
సర్వేశే మనసో వృత్తి ర్భక్తిరి త్యభిధీయతే

అని యాతఁడు భక్తి కొసంగిన నిర్వచనము. చిత్తద్రవ్యము స్వభావముచే లక్కవలెఁ గఠినమైన దనియు, నిప్పుసెగచే లక్కవలెఁ దాపకములకు కామక్రోధాది విషయములతోడి యోగముచే నది ద్రవ్యము నొందు ననియు, నాతఁ డింకొక శ్లోకమునఁ జెప్పియున్నాఁడు. భగవంతుని గుణరూపాది వర్ణనములను వినుటచేఁ గామక్రోధాదు లుద్దీపితములై భక్తుల చిత్తములకు ద్రవత్వము నాపాదించును. అట్లు ద్రుతమై ధారావాహికగా (అవిచ్ఛిన్నముగా) సర్వేశ్వరుని యందు వర్తించు మనస్సుయొక్క వృత్తియే భక్తి యని యాతని యభిప్రాయము. ద్రవత్వము నొందిన చిత్తమునఁ బ్రవేశించినఁ వస్త్వాకారము స్థిరముగా నుండిపోవును గాన స్థాయిభావ మను పేరఁ బరఁగుచున్నది. ఇది విభావానుభావ వ్యభిచారి భావములచేఁ బరిపోషము నొంది బ్రహ్మా నందాత్మకమైన రసమై సహృదయులకుఁ బారవశ్యము కలిగించుచున్నది.

భక్తిరసమునకు భగవంతుఁ డాలంబన విభావము. తులసీచందనాదు లుద్దీపన విభావములు. నేత్రభ్రూవిక్షేపాదు లనుభావములు. నిర్వేదాదులు వ్యభిచారి భావములు. ఈ విభావానుభావ సంచారి భావములు ద్రుతచిత్తమునఁ బ్రవేశించి స్థాయిత్వము నొందిన భగవదాకారతారూపమైన మానసవృత్తిని బోషించి పరమానంద సాక్షాత్కారాత్మకమైన భక్తిరసమును బ్రతీయమాన మొనరించును.

భగవంతునిపైఁ గల భక్తి వివిధ భావములలో వ్యక్తము చేయఁబడుచుండును. అందు శాంత దాస్య సఖ్య వాత్సల్య మాధుర్య భావములు ముఖ్యములైనవి. ఇం దేభావముతోఁ గూడిన భక్తి యైనను నిస్తారకమై యట్టిదే. శాంతభక్తి, తపోనిధులును వీతరాగులునై యుండు నారదాది మునీంద్రులందు గోచరించును. కుబ్జా హనుమదాదులు దాస్యభక్తిచేతను, సుగ్రీవార్జున కుచేలాదులు సఖ్యభక్తిచేతను, దేవకీ వసుదేవ యశోదా నందాదులు వాత్సల్యభక్తి చేతను, గోపికాదులు మాధుర్య భక్తిచేతను వరించియుండిరి. శరణాగతి రూపమైన భక్తికి నిధానములై ప్రహ్లాద ధ్రువ గజేంద్రాదు లుత్తమగతి బ్రాపించిరి. ఇదిగాక శత్రు భావముతో భగవంతునితోడి సంబంధము కల్పించుకొని తన్నిహతులై సద్గతి నొందిన వారును గలరు.

కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామధ్యాన గరిష్ఠుఁడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా !

మున్నగు పద్యము లిందుకుఁ దార్కాణములు. భాగవతమున నీ వివిధ
గూడిన భక్తియు లెస్సగా వివరింపఁబడినది. ఇందలి భక్తుల కథ లన్నియుఁ బైని
భావములలో నేదోయొక దానిని విస్పష్టము చేయుచునే యుండును.

భాగవతమున దశమ స్కంధ మొక యెత్తు, మిగిలిన స్కంధము లన్నియు
దీనికిట్టి ప్రత్యేక విశిష్టతను గలిగించిన దందుఁ బ్రపంచితమైన మధుర భక్తి. గోపికలిం
డైన కృష్ణుని నాత్మేశ్వరునిఁగా భావించి యనిర్వాచ్యమైన నిర్మలభక్తిని బ్రకటించిరి.

విషజలంబు వలన విషధర దానవు
వలన జాలవాన వలన వహ్ని
వలన నున్న వాని వలనను రక్షించి
కుసుమశరుని బారిఁ గూల్పఁ దగునె ?

మున్నగు పద్యములందుఁ గాననగు కుసుమశర ప్రస్తావము వలనను, ఇందలి
మిశ్రితమై యుండుటే కాక స్త్రీ పురుష సంబద్ధమైయుండుట చేతను, సామాన్యుల కి
కామముగానే గోచరింప వచ్చును. భక్తుఁడు పురుషుఁడై మధుర భక్తి ప్రదర్శించు
స్వరూప మెక్కువ నిర్మలముగా భాసించును. చైతన్యాదుల నిరతిశయమైన భక్తి య
భావముతోఁ గూడిన భక్తి శరీర సంయోగ మాత్రతర్పితమగు తుచ్ఛ కామమునకు స
కాదు. అది మోక్ష కామమునకు సంబంధించినది. భరతముని నాట్య శాస్త్రమున-

ధర్మకామోఽర్థకామశ్చ మోక్షకామస్తథైవచ
స్త్రీపుంసయోస్తు సంయోగో యః కామస్సతు సంస్మృతః

అని నాలుగు పురుషార్థములకును సంబంధించిన కామమును వర్ణించెను. మహా
అశ్వమేధ పర్వములో కామము తన్నుఁ గూర్చి చెప్పుకొనిన యీ క్రింది శ్లోకమును
నీ విషయము మఱింత స్పష్టముగా గోచరించును.

యో మాం ప్రయతతే హన్తుంమోక్ష మాస్థాయ పండితః
తస్య మోక్షరతిస్థస్య నృత్యామిచ హసామిచ.

మోక్షము నుద్దేశించి నన్ను (కామమును) జంపుటకు యత్నించు పండిత
మోక్షమున రతి కలదు కావున నట్టి వానిని జూచి నేను నవ్వుచు నాట్యమాడుచు
శ్లోకము నందలి యర్థము. ఈ మోక్షరతియే భరతుఁడు చెప్పిన మోక్షకామము.
ధించిన శృంగారమునకును లౌకికమైన శృంగారమునకును స్వర్గ మర్త్యములకున్న

మున్నది, బ్రహ్మభావనతోఁ దుల్యమని చెప్పఁదగిన యీ మోక్ష సంబంధి శృంగారమే భక్తి శృంగారము లేక మధురభక్తి యని చెప్పఁబడుచున్నది. దశమ స్కంధమునందు వర్ణితమైన గోపికా కృష్ణుల శృంగార మట్టి దివ్య శృంగారమే కాని స్త్రీపుంస సంయోగమునకు సంబంధించిన లౌకిక శృంగారము కాదు.

మధుసూదన సరస్వతి భక్తి రసాయనమున భాగవత ప్రథమ స్కంధములో నారదునిచే వర్ణింపఁబడిన యుపాయముల ననుసరించి భక్తి యొక్క పదునొకండు భూమికలను వివరించెను.*

ప్రథమం మహతాం సేవా తద్దయాపాత్రతా తతః
శ్రద్ధాథ తేషాం ధర్మేషు తతో హరిగుణ శ్రుతిః
తతో రత్యంకురోత్పత్తిః స్వరూపాధిగతి స్తతః
ప్రేమవృద్ధిః పరానందే త స్యాథస్ఫురణం తతః
భగవద్ధర్మ నిష్ఠాతః స్వస్మిం స్తద్గుణశాలితా
ప్రేమ్ణోఽథ పరాకాష్ఠే త్యుదితా భక్తి భూమికా.

ఈ పదునొకండింటికిని శాస్త్రీయోపాయములని పేరు. *ఇవి క్రమముగా నొకటి తరువాత నొకటి యలవడవలయును. ఇందు తుట్టతుదిది భగవత్ప్రేమ పరాకాష్ఠ. ఈ స్థితిలో భక్తుఁడు భగవద్విరహము స్వల్పకాల మేని సహింపఁ జాలఁడు. భగవద్దర్శన మొకసారి లభించిన పిమ్మటఁ దద్విరహ మనుభవించుట దుస్సహ మౌ ననుటలో నాశ్చర్యము లేదు. అప్పుడు కలుగు వియోగము ద్వారా భక్త్యాత్మకమగు ప్రేమ పరాకాష్ఠ నొంది ప్రకాశించును. భక్తి నిధానములైన గోపికలు శాస్త్రీయములైన యీ యేకాదశోపాయములను గ్రమముగాఁ బొంది ప్రేమ పరాకాష్ఠతోఁ గూడిన యుత్తమస్థితి ప్రాపించిరి. అందుచేతనే వారు భగవంతుఁ డైన కృష్ణుని విరహము నొక్క త్రుటి కాలమైన సహింపలేక పోయిరి. కృష్ణదర్శనము లేనిచో నొక్క నిమిషమైన వారికి యుగ ప్రాయమై కనఁబడుచుండెను.

నీ వడవిన్ బగల్ తిరుగ నీ కుటిలాలక లాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబు లై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నిండుగఁ జూడకుండ ల
క్ష్మీవర ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁడై.

మున్నగు పద్యము లీ విషయమును సూచించును. కృష్ణుఁడు కానరా నప్పుడు వనము నందలి వృక్షలతాదులను బేరుపేరు పెట్టి పిలిచి మీ రెచ్చటనైన మా మనోనాథుని జూచినారా యని వారు గద్గద భిన్నకంఠములతో నడుగుట వారి విరహోత్కంఠకు నిదర్శనము.

---

* ఉపాయాః ప్రథమ స్కంధే నారదే నోపవర్ణితాః
సంక్షేపాత్తా నహం వక్ష్యే భూమిభేద విభాగతః.

భక్తిరసా.

గోపికలీ క్రింది పద్యమునఁ గృష్ణుని పాదముల మహత్త్వము భావించిన క్రమము గూచినచో వారి భక్తి నైర్మల్యము విశద మగును.

ఈ చరణంబులే యిందునిభానన
సనకాది మునియోగ సరణి నొప్పు
నీ పాదతలములే యెలనాగ శ్రుతి వధూ
సీమంత వీధులఁ జెన్ను మిగులు
నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన
పాలేటి రాచూలి పట్టుఁగొమ్మ
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ
ముక్తికాంతా మనో మోహనములు

యీ యడుగుల రజమె యింతి బ్రహ్మాదాన
దివిజవరులు మౌళి దిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల లజ్జాత్ముఁ డేగిన
క్రమముఁ గనియు నతనిఁ గానరైరి.

కృష్ణుని పాదముల సౌందర్యమును వారు సాత్త్వికదృష్టితోనే కాని యైహిక దృష్టితోఁ జూడలే దని యందలి విశేషణములు చెప్పక చెప్పుచున్నవి. పరస్పర విరుద్ధము లైన భక్తి శృంగారములను మేళవించి యుచితముగాఁ బరిపోషించుట ప్రతిభైక సాధ్యమైన పని. దశమ స్కంధమున పోతరా జా కార్యము ననితర సామాన్యముగా నిర్వహించి వివిధస్కంధ ముక్తాశోభితమైన భాగవత హారమున దానిని దరళస్ఫూర్తి విడంబింపఁ జేసినాఁడు.

ధ్యానాభ్యాస వశీకృతేన మనసా తన్నిర్గుణం నిష్క్రియం
జ్యోతిః కించన యోగినో యది పరం పశ్యంతి పశ్యంతు తే
అస్మాకం తు త దేవలోచన చమత్కారాయ భూయ శ్చిరం
కాలిందీపులినేషు యత్కిమపి తన్నీలం మహో ధావతి.

మధుసూదన సరస్వతి - గూఢార్థదీపిక.
13 వ అధ్యాయము.

# అచ్చుప్రతులు — అపపాఠములు

భాగవతమును పరిష్కరించు సందర్భమున (క. చ. ట. త. ప. గ. జ. డ. ద. బ.) తాళపత్ర ప్రతులతోపాటు - ఈ క్రింది అచ్చు ప్రతులును సమీక్షితము లైనవి.

(1) శ్రీ పురాణం హయగ్రీవశాస్త్రిగారి ప్రతి (1855).

(2) శ్రీ పాలపర్తి నాగేశ్వరశాస్త్రిగారి టీకాసహిత ప్రతి (1887).

(3) శ్రీ మృగీస్థలం అయ్యమాచార్యులవారి సంగ్రహటిప్పణి గల వనపర్తి ప్రతి (1889)

(4) తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారిచే పరిష్కృతమైన వేమూరి వారి ప్రతి (1947 ముద్రణము).

(5) శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారిచే పరిశోధితమైన రాయలు అండు కో వారి ప్రతి(1954).

(6) శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగారి పరిష్కృతితోను, వారి లఘు టీకతోను ప్రకటితమైన వేంకట్రామ అండు కో వారి ప్రతి (1961).

(7) శ్రీ రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారిచే పరిష్కృతమైన వావిళ్ళ వారి ప్రతి. (1961)

(8) శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి సవరణలతోను, వారి లఘుటీకతోను వెలుపడిన రవీంద్ర పబ్లిషింగ్ హౌస్ వారి ప్రతి (1962).

ఈ ప్రతులలో, అందందు అపపాఠములు కొన్ని యగపడినవి. అవి యీ ప్రతిలో సవరింపఁబడినవి. ఆ యపపాఠము లెట్టివో, వానిని సవరించిన తీ రెట్టిదో, జిజ్ఞాసువులకు తెలియుటకై, కొన్ని యిందు చూపఁబడుచున్నవి.

**1. 'రక్షాకారంభకు'**

"లోకర, క్షైకారంభకు భక్తపాలనకళా సంరంభకున్" (1-1)

హ. వ్రాఁత ప్రతులు. రాయలు.

"రక్షాకారంభకు" - తం. వా. కల్లూరి. బులుసు.

ఈ 'రక్షాక' పాఠము తంజనగరంవారి సృష్టి. వారు తమ పీఠికలో ఇట్టు వ్రాసినారు:

"ఆరంభముననే హంసపాదము! మొట్ట మొదటి పద్యముననే యతి తప్పినది. ఈ తప్పు గ్రంథమున మఱెచ్చటనే నుండునేని వ్రాయసము గురునాథుని పయినో లేక కంపాసిటరు రామస్వామి మీఁదనో మోపవచ్చును. ఇట్లును గాదే! శోధకులకు దోషము వచ్చునని మహాకవికి యతి తెలియ దందమా! మొన్నటి తాతగారి కాగ్రహము వచ్చినను, నంతకంటె మునుపటి పోతనగారి నిగ్రహము దగదు. కాన 'రక్షాకారంభకు భక్తపాలనకళా సంరంభకున్' అని దిద్దకుండరాదు." (పు. 5)

'తాతగా' రనఁగా హయగ్రీవశాస్త్రిగారు. వారి ప్రతిలోని పాఠము తప్పని తంజనగరం వారు దిద్ది ముద్రించినారు. ఆ పాఠమే పిమ్మటి ముద్రణముల కెక్కినది.

విషయ మిట్లుండఁగా, కల్లూరివారు తమ పీఠికలో ఈ క్రింది విధముగా వ్రాసినారు:

''రక్షైకారంభకు - అని పెక్కుపాఠములు కన్పించుచున్నవి. ఇందు యతి తప్పినది. కాని చిరకాలమునుండి ప్రహతమైన పాఠ మగుటచే దీనిని గొందఱు దిద్దుట కొప్పుకొనరు. 'లోక రక్షాకారంభకున్' అని నేను దిద్దినాను.''

'రక్షైకారంభకు' అను పాఠమున యతి తప్పలేదు. అందున్నది అఖండయతి. పోతన పలుమాఱు వాడియున్నాఁడు. అఖండయతి తంజనగరం వారికి సమ్మతము కాదు. అందువలన ఇట్లే ఇంకను చాల తావులలో పాఠములను మార్చియున్నారు. (యతులను గూర్చిన విమర్శలో వివరములు తెలుపఁబడును.)

పరిష్కర్త, లేఖకుని ప్రమాదములను సవరింపవచ్చును గాని, కవి బుద్ధి పూర్వకముగాఁ జేసిన ప్రయోగములను - ఆతని మతమునకు విరుద్ధముగా దిద్దివేయరాదు. అది సంస్కరణ సంప్రదాయముకాదు. గ్రంథములను మార్చుట, ఆయా కవులను - భాషను అపకారము చేయుట యగును. గ్రంథమున నుండవలసినది గ్రంథకర్త భాషగాని, పరిష్కర్త భాష కాదు.

**2. 'కేతన'**

(i) ''లలితమూర్తి బహుకళా నిధి కేతన
... ... ... ... ... ...
తనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ
మనియె'' 1-22

(ii) ''బమ్మెర కేతయ లక్కసానికిన్'' 1-24

ఇది వా. ప్రతిలోను, దాని ననుసరించిన బులుసువారి ప్రతిలోను ఉన్న పాఠము. ఇందు పొరపాటున్నది.

లక్కసాని భర్త (= పోతన తండ్రి) 'కేసన' గాని, 'కేతన' కాఁడు. 'కేసన-కేసయ' అనియే తక్కిన ప్రతులలో నున్న పాఠము.

వావిళ్ళవారి 1922 ముద్రణములో 'కేసన'-'కేసయ' అని పాఠము సరిగానే యున్నది. అది 1961 ముద్రణములో మాఱి పోయినది. బులుసువారు గమనింపలేదు.

**3. 'విరటజా గర్భంబు'**

''సూక్ష్మకళుం దచ్యుతుఁ డయ్యెడన్ విరటజా గర్భంబు'' 1-183

అని వ్రాత ప్రతులలోను, హ. ప్రతిలోను పాఠము.

''విరటుచూలి గర్భంబు'' అని - తం. వా. రాయలు. బులుసు.

''అచ్యుతుఁ డ వ్విరాటతనయా గర్భంబు'' అని - కల్లూరి.

'విరటజా గర్భంబు' అను సమాసము దుష్టమని ఈ మార్పులు చేయఁబడినవి, కాని, అదే కవిపాఠము. అట్టి సమాసములు ఇంకను కలవు.

'మద్భుజాబలిమి' (6-391); 'ఒక్కనేత్రుఁడు' (8-605); 'వగాయత్తులు' (10. పూ. 989); 'దానవరాచూలు' (10. ఉ. 374) ఇత్యాదులు.

ఇవన్నియు మార్చఁబడినవి. మార్చుట సరికాదు. ఆ విధముగా సమాసములు కూర్చుట శివకవుల సంప్రదాయము. ఆ సంప్రదాయము భాగవతకవుల రచనలలో తఱచు కనఁబడుచున్నది. కావున వ్రాఁతప్రతులపాఠమే కవి పాఠము.

## 4. 'వినుము'

"వినుము శుకుఁడు వచ్చి విజ్ఞానపద్ధతి
నతని కెట్లు సూపె నతఁడు పిదపఁ
దన శరీర మే విధంబున వర్జించె
విప్రముఖ్య ! నాకు విస్తరింపు." 1-274

అచ్చు ప్రతులలోను, వ్రాఁతప్రతులలోను పాఠ మిట్లే యున్నది. 'వినుము' అను క్రియ పద్యమున సంగతపడుట లేదు. సరియైన పాఠ మేదో యింకను విచారింపవలసియున్నది.

## 5. 'మునులారా !'

"హరిపరాక్రమ మోపిన యంత గాక స
ర్వము వివరింప నెవ్వఁడు ప్రవర్తకుఁడౌ మునులార !" 1-449

తం. వా. రాయలు. బులుసు. కల్లూరి.

"ఎవ్వఁడు ప్రవర్తకుఁ డర్యములార !" (హ)

ఈ పాఠమే మూలానుసారి—

''అహం హి పృష్టోఽర్యమణో భవద్భిః'' 18-23

'హే అర్యమణః సూల్యాః త్రయీమూర్తయః' (వ్యా.)

## 6. 'అంగీకరించిన'

''గెఱ వ్రాసి మాయ నంగీకరించిన భంగి
వసనంబు గట్టక వచ్చువాఁడు'' 1-513

అచ్చు - వ్రాఁత ప్రతు లన్నిటిలోను, 'గెఱ' క్రింద శ. ర. లోను, సూ. ని. లోను గూడ పాఠ మిట్లే యున్నది.

కాని, 'మాయ *నంగీకరించని భంగి*' యని యుండుట సందర్భోచితము. శుకుఁడు మాయ నంగీకరింపనట్లే, వసనము నంగీకరింపలే దని యర్థము. ఆ మహర్షి - బుద్ధికి మాయావరణము, దేహమునకు వస్త్రావరణము లేనివాఁ డన్నమాట.

'గెఱవ్రాయుట' - యనఁగా, కుండలీకరించుట = సున్నచుట్టుట

'గెఱవ్రాసి = నిషేధించి' అని యర్థము.

### 7. 'అవస్థానము'

"ఉపాధి పరంపరాస్థానంబునం బ్రకృతిం బాసి యానందమయుండై......వాసుదేవ బ్రహ్మంబునందుఁ గలయు" 2-32

అచ్చుప్రతు లన్నిటిలోను ఇదే పాఠము. తాళ. ప్రతి - 'త' లో, - 'పరంపరావసా నంబున' అని పా.- అదే మూలానుసారి.

"తే నాత్మ నాత్మాన ముపైతి శాంత
మానంద మానందమయోఽవసానే." 2-31

'స్వయమపి ఆనందమయ బ్రహ్మప్రాప్త్యా ఆనందమయ స్సన్...అవసానే ఏవం పూర్వోక్త పృథివి ప్రభృతి కారణ ద్రవ్యరూప శరీర సంక్రమణావసానే సర్వాత్మకే బ్రహ్మణి వాసుదేవే శాంతిం యాతి.' (వ్యా.)

'అవస్థాన' పాఠము ప్రకృతార్థమునకు కేవలము విరుద్ధము.

### 8. 'మాయావిదుఁడు'

"మాయావిదుండైన యీశ్వరుండు దన మాయంజేసి" 2-86

వా. బులుసు. రాయలు.

"మాయా విభుండైన" (హ. తం. కల్లూరి.)

ఈశ్వరుఁడు 'మాయావిభుఁడే కాని, 'మాయావిదుఁడు' కాఁడు.

"కాలం కర్మస్వభావం చ మాయేశో మాయయా స్వయా" 5-21

'మాయేశః మాయాయాః...ప్రకృతేః ఈశః నియామకః' (వ్యా)

### 9. 'దివ్యజ్ఞాన'

"తమః ప్రధానంబై దివ్యజ్ఞాన క్రియాత్మకంబగు నహంకారంబు గలిగె" 2-86

హ. తం. వా. బులుసు. రాయలు. కల్లూరి.

"ద్రవ్యజ్ఞాన" అని వ్రా. ప్ర. పా. — ఇది సరియైనది.

"తమః ప్రధాన స్త్వభవ ద్ద్రవ్యజ్ఞాన క్రియాత్మకః" 5-23

అని మూలము.

### 10. 'రుచింబ్రజాపతి'

"ప్రకటరుచిం బ్రజాపతికిని స్వాయంభు
వుని కూఁతు రాకూతి యను లతాంగి కర్థి జన్మించి" 217

తం. వా. బులుసు. రాయలు.

"ప్రకటరుచిప్రజాపతికిని" అని. హ. కల్లూరి. పా. ఈ పాఠమే సరియైనది.

"జాతో రుచే రజనయ త్సుయమాన్ సుయజ్ఞః." 2-7-2

**11. 'హయసూనుండు'**

"హయసూనుండగు దానవుండు నిజమాయన్ గోపరాజిన్ గుహా
శ్రయయౌ న ట్లొనరించి." 2-182

హ. తం. వా. కల్లూరి-బులుసు. రాయలు.

"మయసూనుండగు దానవుండు నిజమాయన్."

అని తాళ. ప్రతి-'త' పాఠము. ఇందు యతి తప్పి యున్నది. అందువలన పరిష్కర్తలు 'హయసూనుం' డని మార్చిన ట్లున్నది. ఆ దానవుఁడు 'మయసూనుఁడే' గాని 'హయసూనుఁడు' కాఁడు.

"నందం చ మోక్ష్యతి భయా ద్వరుణస్య పాశా
ద్గోపాన్ బిలేషు పిహితాన్ మయసూనునా చ". 7-31

"మయసూనునా మయపుత్రేణ, మాయావినా" (వ్యా)

యతిభ్రంశము ప్రామాదిక మనుకొనుట యుచితముగాని, మూలమునకు విరుద్ధముగా - 'మయ' సూనుని 'హయ' సూనునిఁ జేయుట యుచితము గాదు.

**12. 'ఖేదాచార'**

"అనిలోలాత్మలు సూనృతేతరులు ఖేదాచార సంశీలు రు
ద్ధత పాషండ మతౌపధర్మ్యులు." 2-196

తం. వా. కల్లూరి. బులుసు.

"వేదాచార సంశీలురు" - అని 'హ' పా. - మూలానుసారి.

"దేవద్విషాం నిగమవర్త్మని నిష్ఠితానాం
పూర్భి ర్మయేన రచితాభి రదృశ్యతూర్భిః." 7-37

'నిగమవర్త్మని వేదమార్గే సత్కర్మానుష్ఠానాదౌ నిష్ఠితానాం నితరాం స్థితానాం' (వ్యా)

**13. 'సదసత్పూరుష'**

"శాశ్వతు సదత్పూరుషు, నీశ్వరు" 2-207

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"సదస త్తత్పరు అని. 'బ' వ్రా. ప్ర. పా.

"శుద్ధం సమం సదసతఃపర మాత్మతత్త్వమ్." 7-47

అని మూలము. - 'సదసతః పరం చేతనాచేతన విలక్షణం' అని వ్యాఖ్యాత చెప్పిన అర్థము. ఈ యర్థము పై రెండు పాఠములవలనను ఏర్పడుట లేదు.

కనుక 'సమం' అను మూలపదమును కైకొని, పాఠమును 'శాశ్వతు, సము, సదసత్పరు, నీశ్వరు' అని సవరించుట యుచితము. అర్థము సరిపడును. అంతకంటెను, 'శాశ్వతుని సదసతః పరు' అన్నచో, పోతన రచన కెక్కువ అనుగుణముగా నుండునేమో ?

**14. 'రమానాయకుండై'**

భూతేశ్వరుండైన సర్వేశ్వరుం డుత్పత్తిస్థితిలయ కారణం బైన తన మాయను విడిచి రమానాయకుం డై యేమే ప్రదేశంబుం శయనింబుసేసె.'' 2-222

తం. వా. కల్లూరి. బులుసు. రాయలు.

''మాయా నియామకుండై'' అని 'హ' పా.—

''స చాపి యత్ర పురుషో విశ్వస్థిత్యుద్భవా ప్యయః
ముక్త్వాత్మమాయాం మాయేశః శ్శేతే సర్వగుణాశ్రయః'' 8-10

'మాయేశః ప్రకృ త్యధీశః' (వ్యా.)

కాఁబట్టి 'హ' పాఠమే సరియైనది.

**15. 'పాదదర్శనావధి'**

''దేవదేవుండ నను నస్మదీయపాద
దర్శనావధి పో విపద్దశల కనఘ !'' 2-242

ఇది తం. పా.—

''అస్మదీయపాద, దర్శనం బవధి విపత్తిదశల కనఘ !''

అని—హ. వా. బులుసు. కల్లూరి. రాయలు ప్రతుల పా.—సమంజసము.

''బ్రహ్మన్ శ్రేయః పరిశ్రామః పుంసాం మద్దర్శనావధిః'' 9-21

''పుంసాం శ్రేయసాం ఫలానాం పరిశ్రామః సాధనప్రయాసః మద్దర్శన
మేవావధి ర్యస్య తథా అతోఽధికం శ్రమఫలం నా స్తీత్యర్థః'' (వ్యా.)

**16. 'వనముకు'**

''అకుటిలమతి బదరీవన
ముకు ననుఁ బొమ్మనుచు మొఱఁగి పోయిని నేనున్'' 3-141

అని వ్రాఁత ప్రతులలోను, 'హ' ప్రతిలోను పాఠము.

'వనముకు' అనుట బాలవ్యాకరణ సమ్మతము కాదని, తంజనగరం వారు.—'వన, మున కును బొమ్మనుచు' అని సవరించినారు. ఈ సవరణలో ప్రాసము తప్పినది.

'బదరీవని, కీఁక నీ వరుగుమని మొఱఁగి యేఁగిన నేనున్' అని తక్కినపరిష్కర్తల సవరణ.

'వనముకు' తప్పు కాదు. (చూ. ప్రౌఢ. శబ్ద. ౧౽) సవరణ అనవసరము.

**17. 'వానికి'**

''భువనపాలకుఁ డైన పవమానసఖుఁ డంత
రాత్మ నీశ్వరు నంశమైన వాని
తనయంబు ననుకూల మగుచు నిజస్థాన
మునఁ బ్రవేశించె న మ్మునిముఖమునం దుఁ

బరఁగ జీవుండు శబ్దము నుచ్చరించుఁ బ్ర
థ గ్భావములను'' 3-214

హ. తం. వా. కల్లూరి. బులుసు.

"ఈశ్వరు నంశమైన - వాణి కనయంబు" అని 'రాయలు' పా.—

ఈ పాఠమే సాధువు.—

"తస్యాగ్ని రాస్యం నిర్భిన్నం లోకపాలోఽవిశ త్పదం
వాచా స్వాంశేన వక్తవ్యం య యాసౌ ప్రతిపద్యతే.'' 6-12

వాణికి = వాక్కునకు, అని యర్థము. 'వానికి' అను పాఠము తప్పు.

## 18. 'యోగమహిమలు - యోగములు'

''యోగ విస్తారమహిమలు యోగములును" 3-254

హ. తం. వా. బులుసు. కల్లూరి. రాయలు.

''యోగవిస్తార మహిమలు యాగములును'' అని వ్రాఁత ప్రతుల పాఠము, సాధువు.

''యజ్ఞస్యచ వితానాని యోగస్యచ పథః ప్రభో !'' అని మూలము. 7-30

## 19. 'దక్షు న్ననురూప'

''దేవతా, వనదక్షు న్ననురూప కృత్యములు'' 3-267

ఇది తం. పాఠము. ఈ పాఠమున, 'దేవతావన దక్షుని యొక్క అనురూప కృత్యములు' అను నర్థ మేర్పడదు. కావున సరికాదు.

''దేవతా, వనరక్షాచణురూప కృత్యములు'' అని తక్కిన ప్రతు లన్నింటను పాఠము. సరియైనది.

'దేవతా = దేవతల యొక్క, అవన = ప్రీణనమునందును, రక్షా = రక్షణము నందును, చణు = సమర్థుఁ డైన వానియొక్క; రూప కృత్యములు' అని యర్థము.

## 20. 'స్తబ్ధరోమలోకంబు'

''నా, సారంధ్ర నిర్గత స్తబ్ధరోమ
లోకంబు మనము విలోకింప సంగుప్త
మాత్రమై యీ క్షణ మాత్రలోన
...గండశైలోపమంబు, సయ్యె'' 3-407

హ. తం. వా. కల్లూరి. రాయలు.

ఈ పాఠమును గుఱించి రాయలు ప్రతిలో 'ఫుట్‌నోటు' ఇట్లున్నది—

''ఇదే పూ. ము. పాఠము. కాని అర్థము లేనిది. 'పాకంబు' అని ఆనందవారి ముద్రణము. 'పరాహతోకః' అని మూలము. కాన 'తోకంబు' అను పాఠము సరిగాఁ దోఁచెడి. తోక, పాక శబ్దములు రెండును శిశు వను నర్థము నిచ్చును.''

''పాకంబు'' బులుసు వారి పాఠము. ఈ ప్రతిలో, మూలము ననుసరించి
అను పాఠము చేర్చబడినది.

## 21. 'క్రుధగ్ని'

''భవదాత్మజు లార్యుల కెగ్గుసేయ భూ
సురుల క్రుదగ్ని పాల్పడక శోభనమౌ హరిచేత పంచతన్''

ఇది 'వా' పా.—'క్రుధగ్ని' అని రాయలు, వ్రా. ప్ర. పాఠము. 'క్రు
తక్కిన ప్రతుల పా.—

క్రుదగ్ని, క్రుధాగ్ని సాధువులే కాని, 'క్రుధగ్ని' సాధువు కాదు.

## 22. 'పునీత'

ఈ క్రిందివి, హ. తం. ప్రతులలోని పాఠములు.—

I. ''కోరి పునీతులం జేయు వారలన్''

II. ''సద్యః పునీతాత్ములై''

III. ''ఎన్నం బునీతాకృతిన్''

IV. ''తీర్థములం నొప్పం బునీతము సేయం బూని''

తంజనగరం వారు 'పునీత' పాఠము నట్లే యుంచి, పీఠిక (పు. 37)లో
క్త ప్రత్యయాంతము — 'పునీతము' సాధువు కా'దని వ్రాసినారు. తక్కిన పరి
పాఠముల నన్నిటిని ఈ క్రింది విధముగా మార్చివేసినారు.

I. ''కోరి పవిత్రులం జేయువారలన్''

II. ''సద్యః పవిత్రాత్ములై''

III. ''ఎన్నం బవిత్రాకృతిన్''

IV. ''తీర్థములం బోలం బవిత్రము సేయంబూని''

ఇవి వా. రాయలు. కల్లూరి. బులుసు. ప్రతుల పాఠములు.

పునీత - శబ్దము మూలములో నున్నది.—

''తంత్వాం ద్విజాను పథపుణ్య రజః పునీతః
శ్రీవత్స లక్ష్మ కిమగా భగభాజన స్త్వమ్.
'కిం పునీతః పవిత్రీకురుతః' (వ్యా.)
''తథా పునీతా తనుభిః పదై స్తవ''
'పునీతా పవిత్రీ కృతా' (వ్యా.)

పునీత శబ్దము తప్పనరాదు. కావున కవి పాఠములను మార్చుట సరి

## 23. 'హరినారాయణు'

''హరినారాయణు పాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజింపు'' 3-827

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''మఱి నారాయణు పాదపద్మములు...'' అని 'హ.' పాఠము. ఇదే సరియైనది. పై పాఠమున అర్థము కుదురదు.

## 24. 'నాడి'

''పాదాం, బురుహంబుల వలన గతియు,
నరుదుగ నారెంటి వలన హరియును గలిగెన్'' 3-891

అని, అన్ని ముద్రణములలోను పాఠము. వ్రాఁత ప్రతులలో కొన్నిట ''నాడియుఁ గలిగెన్'' అని యున్నది.

బులుసువారు 'నాడి' పాఠమునే తీసికొని, అదే సాధుపాఠమనియు, యతిభంగమగు నన్న తలంపుతో పరిష్కర్త లా పాఠమును 'హరియును గలిగెన్' అని మార్చియుందు రనియు పీఠికలో వ్రాసినారు. (పు. XX)

'నాడి' పాఠమున యతి భంగము కాదు. అఖండ యతి కావచ్చును. కాని, అస లా పాఠము మూల విరుద్ధము.

''పాదౌచనిరభిద్యేతాం గతిస్తాభ్యాం తతోహరిః'' 26-60
'పాదౌ పాదేంద్రియాధిష్ఠానం. గతాఖ్యం పాదేంద్రియం.
తదధిదేవతా హరి రుపేంద్రః' (వ్యా.)
కాబట్టి 'హరి' పాఠమే - ఒప్పు.

## 25 'విచ్ఛిన్నసంచయుండు'

''నిజపరిజ్ఞాన విచ్ఛిన్న నిఖిల సంచ, యుండు'' 3-909

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''విచ్ఛిన్న నిఖిల సంశయుండు'' అని 'చ.' ప్రతి పాఠము.

ఇదే సరియైనది. జ్ఞానముచేత విచ్ఛిన్నమగునవి సంశయములుగాని 'సంచయములు' కావు (సంచయ = సమూహము.)

''ప్రాప్నోతిహి తతో ధీర స్స్వదృశాచ్ఛిన్న సంశయమ్'' 27-29

## 26. 'సాత్త్వికాది భేదములు'

భక్తి - ''తామస రాజస సాత్త్వికాది భేదంబులఁ ద్రి విధంబై యుండు'' 3-943

హ. తం. వా. కల్లూరి. రాయలు.

''తామస రాజస సాత్త్విక భేదంబులం ద్రి విధంబై యుండు'' అని బులుసువారి పాఠము. ఇదే సరియైనది.

భక్తి తామసము, రాజసము, సాత్త్వికము - అని మూడు విధములే. కావున 'ఆది' శబ్దమున కర్థము లేదు.

**27. 'శమమును దమమును'**

''శమమును దమమును, మొదలుగాఁ గల గుణంబులు సహించు'' 3-997

తం. వా. కల్హారి. రాయలు. బులుసు.

''శమదమ భగములు, మొదలుగాఁ గం...'' అని 'హ.' పా. - ఇదే మూలానుసారి.

"శమోదమో భగశ్చేతి యత్సంగా ద్యాతి సంక్షయమ్" 31-34

'భగ ఉన్నతిః' (వ్యా.)

**28. 'చారుమృత్కనక'**

"ఉమా తరుణీమణి గాంచెఁ జారు మృ
త్కనక కుశాజినాయస నికాయవినిర్మిత పాత్రసీమమున్
... ... ... యాగ ధామమున్." 4-82

హ. తం. వా. కల్హారి. రాయలు. బులుసు.

"దారు మృత్కనక..." అని చ. జ. డ. ప్రాఁతప్రతుల పాఠము. సరియైనది.

"మృ ద్దా ర్వయః కాంచన దర్భ చర్మభి
ర్నిసృష్ట భాండం యజనం సమావిశత్." 4-6

**29. 'కార్యంబుగాదు'**

"కుజను లగువారు మహాత్ముల నింపించుట కార్యంబు గాదు." 4-87

హ. తం. వా. కల్హారి. రాయలు. బులుసు.

''నిందించు టాశ్చర్యంబు గాదు'' అని చ. ట. త. డ. ప్రా. ప్ర. పా.

''నాశ్చర్య మేత ద్య ద సత్సు సర్వదా మహ ద్వినిందా'' 4-13

**30. 'పదాహతపాదధూళి'**

''సరభసవృత్తి స ట్లరుగు సైన్యపదాహత పాదధూళి ధూ
సరిత కుబేర దిక్తటము'' 4-113

హం. తం. వా. కల్హారి. రాయలు. బులుసు.

'పదహత పాదధూళి' అనుట సరికాదు.

'పదాహతి ధూతధూళిధూ, సరిత' అని క. చ. బ. ప్రతుల పాఠము. సరియైనది.

**31. 'తఱుఁగని నీడ'**

''పఱపును గల్గి యే పట్టునఁ దఱుఁగని నీడ శోభిల్లు నిర్ణీతమగుచు'' 4-137

హం. తం. వా. కల్హారి. రాయలు. బులుసు.

ఇది వటవృక్షవర్ణనము. ''పర్ణైశ్చ్యుతాచల చ్ఛాయః'' (6-32) అని మూలము. అచలచ్ఛాయ మనగా చలింపని నీడ గలది. - అని యర్థము. చెట్లనీడలు సూర్య గమనము ననుస

రించి చలించుచుండుట సహజము. ఆ చెట్టునీడ అట్లు చలింపక, నిర్ణీతమై నిశ్చలముగా నుండును. ఇది ఆ వృక్షమున కున్న మహిమ. చెట్టునీడ ఉదయమున పడమటికి, సాయమున తూర్పునకు ప్రసరించుచుండును. ఆ విధముగా తిరుగుట యుండును గాని, బావిలోని నీటివలె నీడకు తఱుఁగుట, పెరుఁగుట యుండదు. కాబట్టి పాఠము - 'ఏపట్టునఁ దిరుగని నీడ శోభిల్లు' అని యుండుట యుచితము.

## 32. 'భవ్యబాహువు'

''సవ్యజానువుమీఁద భవ్యబాహువు సాఁచి''. 4-140

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'భవ్యబాహువు' - ప్రకరణోచితము కాదు. ''సవ్యబాహువు సాఁచి'' అని క. చ. బ. ప్రతుల పా. సరియైనది.

''కృ త్వోరౌ దక్షిణే సవ్యం పాదపద్మం చ జానుని''. 6-38

''సవ్యం పాదపద్మం దక్షిణే ఊరౌ కృత్వా విన్యస్య సవ్యే జానుని చ సవ్యం బాహుం కృత్వా'' (వ్యా.)

## 33. 'ప్రయాజులు'

''పంకజలోచన నీవులేని య, ధ్వరము ప్రయాజులం గలిగి తద్దయు నొప్పక యున్న దయ్య.'' 4-189

తం. వా. కల్లూరి. రాయలు, బులుసు.

''ప్రయాజులు = యజ్ఞాంగములలోనివి యొకటి'' అని కల్లూరి వారి టీక.

''ప్రయాజులు = యాజకులు'' అని రాయలు టీక.

పై పాఠము, ఈ టీకలు సరియైనవి కావు.

''ప్రయాజలం గలిగి'' అని 'హ' పాఠము. సరియైనది.

అసలు శబ్దము 'ప్రయాజము' - దర్శపూర్ణ మాసాదులకు అంగమైన యోగభేదము (సూ. ని.)

''ప్రయాజః. A principal sacrifical ceremony'' (ఆప్టే)

''త్వా మృతేధీశ నాంగై ర్మఖ శ్శోభతే'' 73-6

'త్వాం వినా నః కేవలం ప్రయాజాదిభి రంగైః మఖో న శోభతే' (వ్యా.)

పోతన ప్రయాజమును చరిత్రామలలో చేర్చి 'ప్రయాజలు' అని వాడినాఁడు.

## 34. 'స్వభావము'

''ప్రకట స్వభావమున స
య్యకలంకుఁడు తృప్తిఁ బొంది యనె వత్సునితోన్. 4-206

ఇది వా. బులుసు. ప్రతుల పా.

"స్వభాగమున" అని - హ. తం. కల్లూరి రాయలు.

ఈ పాఠమే సరియైనది.

"భగవాన్ స్వేన భాగేన సర్వాత్మా సర్వభాగభుక్
దక్షం బభాష ఆభాష్య ప్రీయమాణ ఇవానఘ" 7-49

### 35. 'ఆనతిచ్చిన - విను'

"మా ముప్పురయందు నెవ్వండు వేఱుసేయకుండు వాఁడు కృతార్థుం డని యానతిచ్చిన దక్షుండు"

"విను విష్ణుదేవతాకం
బనఁగాఁ ద్రికపాలకలిత మగు నా యాగం
బున( దగ న వ్విష్ణుని పద
వనజంబులు పూజసేసి" 4-208

అచ్చుప్రతు లన్నిటను పాఠ మిట్లే యున్నది.

'ఆనతిచ్చిన - విను - పూజచేసి' అనుటలో అర్థము లేదు. 'విని' అని సవరించినఁ గాని అర్థము కుదురదు.

టి. జ. డ. ద. ప్రతులలో, "విని విష్ణుదేవతాకం, బనఁగా" అనియే పాఠము.

### 36. 'చంద్రధర'

"విను మఖిల భువన పరిపా
లనమునకై చంద్రధర కళా కలితుండై
వనజజునకు స్వాయంభువ
మను వపు డుదయించె" 4-216

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"చక్రధర కళా కలితుండై" అని క.చ.బ. ప్రతుల పాఠము. ఇదే సరియైనది. మనువు 'హరి కళాకలితుఁడు'గాని, 'హర' కళాకలితుఁడు కాఁడు.

"స్వాయంభువస్యాపి మనోర్హ రే రంశాంశజన్మనః". 8-7

'హరే రంశో బ్రహ్మా తస్య అంశాత్ దేహార్ధా జ్జన్మ యస్య' (వ్యా.)

### 37. 'దేహ శరీరధారణ'

"అతఁడు సనస్వదృష్టిని జరాచరదేహ శరీరధారణా
స్థితిగల యూశునందుఁ దన జీవితమున్ ఘటియించి" 4-273

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'దేహశరీర' అనుట తప్పు. దేహ మన్నను శరీర మన్నను అర్థమొకటే. - 'దేహి శరీరధారణాస్థితి' అనుట ఒప్పు.

"చరాచర స్యాఖిలం సత్త్వధామ్నః". 8-83

అని మూలము. 'అఖిలసత్త్వధామ్నః సర్వప్రాణి శరీరస్య' అని వ్యాఖ్య.

## 38. 'సోహమ్మమ'

"రూఢి సోహ మ్మమేతి ప్రరూఢ మగుచు
ఘనత కెక్కు నవిద్యయన్ గ్రంథి నీవు
ద్రెంచి వైచితి" 4-360

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'రూఢి సోహ మ్మమ యని ప్రరూఢ మగుచు'-(హ.)

ఈ 'సోహమ్' పాఠము సాధువుకాదు. 'అహమ్'-'మమ' అనుట అవిద్యగాని 'సోహమ్' అనుట అవిద్య కాదు; అది విద్యయే. – "శనకై రవిద్యా, గ్రంథిం విభేత్స్యపి మమాహమితి ప్రరూఢమ్" (11-30) అని మూలము.

కాఁబట్టి, పాఠము "రూఢిని నహమ్మమేతి ప్రరూఢ మగుచు" అని యుండవచ్చును.

## 39. 'దినాంత ప్రభాతవేళ'

I. "దినాంత ప్రభాతవేళ
నలఘుమతిఁ బూర్ణిమావాస్యలందు మఱియు" 4-383

తం. వా. రాయలు. బులుసు.

'దినాంత ప్రభాతవేళలు' - ద్వంద్వము. కాఁబట్టి 'వేళన్' అనుట సరికాదు.

II. "దినాంత ప్రభాతవేళ
లలఘుమతి దర్శపూర్ణిమలందు" (కల్లూరి)

ఇందు 'వేళలు' ప్రథమలో నున్నది. అర్థము సరిపడదు.

III. "దినాంత ప్రభాతవేళ
లను సినీవాలిపూర్ణిమ లందు" (హ.)

ఈ పాఠము సరియైనది. (ఇందు అఖండయతి.)

"ప్రయతః కీర్తయే త్ప్రాత స్సమవాయే ద్విజన్మనామ్
సాయం చ పుణ్యశ్లోకస్య ధ్రువస్య చరితం మహత్
పౌర్ణమాస్యాం సినీవాల్యాం" 12-48

## 40. 'మూఢుపగిది'

"జడునికైవడిఁ జీపచందమునను మూఢు
పగిది నున్మత్తునిభంగిఁ జెవిటి
వడువునను గానఁబడుచు" 4-389

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'మూఢుపగిది' అనుట మూలవిరుద్ధము.

''జడాంధబధిరోన్మత్తమూకాకృతి రతన్మతిః, లక్షితః' 13-10

''మూగపగిది'' (చ.); 'మూకు పగిది' (జ.)

ఈ రెండు పాఠములలో నేదో యొకటి గ్రహించుట యుచితము.

## 41. 'నిజరాజ్యమరసి'

''అరయ సునీథయు శోకా
తురయై తన సుతుఁడు తనువు దొరఁగినఁ దదనం
తరమునను యోగశక్తిం
బరువడి నిజరాజ్యమరసి పరిపాలించెన్'' 4-430

ఇది 'తం' పాఠము.

''నిజ తనయు తనువుఁ బరిపాలించెన్'' అని తక్కిన ప్రతుల పాఠము. ఇదే సరియైనది.

''పుత్రకళేబరం, సునీథా పాలయామాస
విద్యాయోగేన శోచతీ.'' 14-35

## 42. 'హస్తమునందె' - 'రమారమణీయ'

''అరయఁగ వైన్యుని దక్షిణ హస్తమునందె రమారమణీయ మనో
హర లలితాయుధ చిహ్నము లంఘ్రుల యందు సమగ్ర హలాంకుశ భా
స్వర ... ... ... రేఖలు వి,
స్ఫురగతి నొప్పఁ బితామహ ముఖ్యులు చూచి'' 4-439

తం. వా. కల్లూరి. రాయలు, బులుసు.

'హస్తమునందె' - 'రమారమణీయ' అనునవి అపపాఠములు.

''దక్షిణ హస్తమునందు - రమారమణీ సుమనో, హరు లలితాయుధ చిహ్నము పాదము లందు సమగ్ర...'' అని 'హ' పాఠము. సాధువు.

దక్షిణ హస్తమునందు - రమారమణీ మనోహరుని యాయుధమైన చక్రముయొక్క చిహ్నము, పాదములందు హలాంకుశాది రేఖలు నుండుట చూచి- అని యర్థము.

''వైన్యస్య దక్షిణే హస్తే దృష్ట్వా చిహ్నం గదాభృతః'' 15-9

'చిహ్నం రేఖాత్మకం చక్రం' (వ్యా.)

## 43. 'ధర్మార్థపరుఁడవై'

''సకల చరాచర సర్గంబు నిర్మించి
ధర్మార్థ పరుఁడవై తనరుదీశ'' 4-485

అచ్చు ప్రతు లన్నిటిలోను ఇదే పాఠము.

ఇది భూదేవి పృథువుతో నన్నమాట. పృథువు ధర్మపరుఁడే కాని అర్థపరుఁడు కాఁడు. - "ధర్మపరుండవై తసరు దీశ" అని వ్రాఁత ప్రతుల పాఠము. గ్రాహ్యము.

"కథంను మాం ధర్మపరో జిఘాంససి" 17-31



**44. 'ప్రపన్నము'**

1. "యజ్ఞాధి పతియైన యఖిలేశ్వరుఁడు గొన్ని
మతములఁ గలఁడు ధీమంతులార
యట్లైన మీరలు నందుకు విప్రతి
పత్తి గల్గుటను బ్రపన్న మరయఁ
గాదంటిరేని" 4-573

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"ప్రపన్నము = వాసుదేవుని శరణొందుట" అని కల్లూరి వారి టీక.

"ప్రపన్నము = సంగతము" అని బులుసు వారి టీక.

ఈ 'ప్రపన్న' పాఠము సాధువు కాదు. టీకలును సరిగాలేవు.

పాఠము, 'విప్రతిపత్తి గల్గుట నుపపన్న మరయఁ గాదంటిరేని' అని యుండినఁ గాని అర్థము సరిపడదు.

2. "ఇట్టి ప్రపంచరచిత, కర్మవైచిత్ర్యమమ్మేటి గలుగకున్న, నమర సతి తదుక్తులు బ్రపన్నములు గావు" 4-573

తం. వా. రాయలు. బులుసు.

"ప్రపన్నములు = సరిపడునవి, సంగతములగునవి" అని రాయలు. టీక.

"అమరనది తదీయోక్తులును బ్రపన్నములు గావు" అని 'హ.' పా.—"అమర నది తదీయోక్తులు నుపపన్నములుగావు" అని - క. చ. త. జ. ద. ప్రతుల పాఠము.

"అమరు నను తదుక్తు లుపపన్నములు కావు" అని కల్లూరి వారి, పా. — "ఉపపన్నములు = ఉపపత్తి సహములు, సరిపడునవి" అని వారి టీక.

ఈ పాఠమే, ఈ టీకయే సరియైనవి. పద్యమున రెండు తావులలోను ఉండవలసినది 'ఉపపన్న' శబ్దమేకాని, 'ప్రపన్న' శబ్దము కాదు.

ఆ క్రింది వచనములోనే. — "అదియునుం గాక యీ జగద్వైచిత్ర్యంబు గర్తయైన యీశ్వరుండు లేకున్నం గర్మవశంబునం జేసి యుపపన్నం బగు నంటిరేని" అని 'ఉపపన్న' శబ్ద ముపయోగింపఁబడి యున్నది.

"అస్తి యజ్ఞ పతిర్నామ కేషాంచి దర్హసత్తమాః" 21-26

అని మూలము.— 'పరమేశ్వరః కేషాంచి న్మతే తావద స్తి తథాపి విప్రతిపత్తే ర్న తత్సిద్ధి రి త్యాశంక్య జగద్వైచిత్ర్యాన్యథానుపపత్తిం ప్రమాణయతి' అని వ్యాఖ్య.

**45. 'ప్రసన్న వరదుఁడు'**

''తాఁ బ్రసన్న, వరదుఁడై యిచ్చు నభిమతావళుల నతఁడు'' 4-576

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"ప్రపన్న వరదుఁడై" అని ట. త. ద. ప్రతుల పాఠము.

ఇదే సరియైనది. 'ప్రపన్నులైన వారికి వరము లిచ్చువాఁ'డని యర్థము.

**46. 'యుక్తాసనము'**

''కోరి మడమలచే గుద పీడనము సేసి
పూని యుక్తాసనాసీనుఁ డగుచు'' 4-655

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

ఈ 'యుక్తాసన' పాఠము యుక్తముకాదు. మూలమున చెప్పఁబడినది 'ముక్తాసనము.'

''సంపీడ్య పాయుం పార్ష్ణిభ్యాం వాయు ముత్సారయన్ శనైః
నాభ్యాం కోష్ఠే ష్వవస్థాప్య హృదురః కంఠశీర్షణి'' 23-14

'పాయుం గుదం సంపీడ్యేతి ముక్తాసనం సూచితమ్' (వ్యా.)

**47. 'భగవద్వరుఁడు'**

''అనఘుఁడు భగవద్వరుండు నాఁ బృథుఁ డనఘా!'' 4-668

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''భగవత్తముండు'' అని హ. పాఠము. ఇదే మూలానుసారి.

''పృథు స్స భగవత్తమః'' 23-30

**48. 'ప్రాగ్దిశకు'**

''ప్రాగ్దిశ, కరిగెడు సమయమున నెదుర నంబుధి కంటెం బఱపగు నొకసరసి''4-690

హ. తం. కల్లూరి.

''పడమటి, కరిగెడు సమయమున'' అని వా. రాయలు. బులుసు. క. వ్రాఁతప్రతి పాఠము.

ప్రచేతసులు సరసిని చూచినది పడమటనే గాని తూర్పునఁగాదు.

''పశ్చిమ ప్రతీచీం ప్రయయు స్తపస్యా దృతచేతసః
సముద్ర ముపవిస్తీర్ణ మపశ్యన్ సుమహత్సరః'' 24-20

**49. 'దురంతాయ'-'దురన్తాయ'**

''స్వయంజ్యోతిషే దురంతాయ........నమోస్తు'' 4-702

తం. కల్లూరి.

''దురన్తాయ'' అని వా. హ. — ''దురంతాయ'' అని హ. రాయలు. బులుసు, పాఠము. ఇదే మూలము ననుసరించినది.

''దురంతా యాంతకాయచ'' 24-35

**50. 'అతఁడును'**

''అనవుడు సతనికి నతఁడును
ననఘా ! యీ యధ్వరంబులందును గృపమా
లిన నీచే విశసింపం
జని కూలిన పసులు వేల సంఖ్యలు'' 4-740

హం. తం. కల్లూరి. బులుసు.

''అతనికి సతఁ డను'' అని రాయలు. పా. - సరియైనది.

'అతఁడును' అను పాఠమున నర్థము కుదురదు.

**51. 'విజ్ఞాతుఁ డను సఖుఁడు'**

''పు, రంజనుం డను నొక రాజు గలఁడు''
అతనికి విజ్ఞాతుఁ డను పేరఁ దగిలి వి
జ్ఞాత చేష్టితుఁ డగు సఖుఁడు గలఁడు'' 4-742

ఇది హ. రాయలు. పాఠము.

''విజ్ఞాతుఁ డను పేరఁ దగిన యవిజ్ఞాత చేష్టితుఁడగు సఖుఁడు గలఁడు'' - అని తం. వా. కల్లూరి. బులుసు. ప్రతుల పాఠము.

'విజ్ఞాతుఁడను పేరుగల విజ్ఞాతచేష్టితుఁ డగు సఖుఁడు,' -

'విజ్ఞాతుఁ డను పేరుగల అవిజ్ఞాతచేష్టితుఁ డగు సఖుఁడు' అను పాఠములు రెండును సరియైనవి కావు.

'అతని కవిజ్ఞాతుఁ డను పేరఁ దగిలి వి
జ్ఞాత చేష్టితుఁ డగు సఖుఁడు గలఁడు'

అని యుండినఁ గాని సరియైన అర్థము కాదు.—

పద్యమున నన్యాపదేశముగాఁ జెప్పఁబడిన పురము-శరీరము. రాజు-జీవుఁడు అతఁడే పురంజనుఁడు. అతని సఖుఁడు-పరమాత్మ, పరమాత్మ నామరూప రహితుఁడు గావున, అవిజ్ఞాతుండు (విజ్ఞాతుఁడు కాఁడు)'.

సృష్టి వ్యాపారరూప చేష్టితమువలన నెఱుఁగఁబడుచున్నాఁడు; కనుక 'విజ్ఞాత చేష్టితుఁడు (అవిజ్ఞాతచేష్టితుఁడు కాఁడు).

ఈ విషయము, 853 వచనమున వివరింపఁబడి యున్నది-

''తస్యావిజ్ఞాతనా మాసీ త్సఖా విజ్ఞాతచేష్టితః'' 25-10

అని మూలము.

**52. 'ఏనెందు-గాఁగ'**

''ఇందీవరేక్షణ ! యేనెందు భవదీయ
తిలక విరహితము మలినయుతము
... ... ...

అత్యమర్ష యుతంబు నయిన ముఖము

... ... ...

గాఁగ నిట్లుంట కిపుడేమి కతము !'' 4-79

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''ఏనెందు - గాగ'' అను ఈ పాఠమున అర్థము కుదురదు.

"ఏనెందు-గాన' అని యుండనగును. 'నేనెప్పుడును చూడలే'దని యర్థము.

''వక్త్రం న తే వితిలకం మలినం విహర్షం, సంరంభ భీమ

మవిమృష్ట మపేతరాగమ్. పశ్యే'' 26-25

**53. 'శిథిలదవయవుఁడు'**

''నిజపురి వెడలం, దివురుచు నతఁడు శిథిలదవ,

యవుఁడును గంధర్వ గణ విహత శౌర్యుండున్'' 4-822

హ. తం. వా. కల్లూరి. రాయలు.

'శిథిలదవయవుఁడు' స్వతంత్రప్రయోగము. 'శిథిలావయవః'
అని మూలము.

''శిథిలావయవో యర్హి గంధర్వైర్హృత పౌరుషః'' 28-15

''శిథిలావయవుఁడు'' అని క.చ.జ. ప్రతుల పాఠము. ఈ పాఠమున ఛందస్సు సరిపడదు.

**54. 'టిట్టిభంబులు'**

"అందియలు డిండిమంబుల

చందమునం బాదపంకజంబుల యందు

న్నందంద మ్రోయుచును నా

డెందంబునఁ దగిలి సందడించెడిఁ దరుణీ !'' 5-31

తం. వా. బులుసు. రాయలు.

'తం' ప్రతిలో ఈ క్రింది పాఠాంతరములు చూపఁబడినవి.

I. ''అందియల వెలయు రత్నము

లందంబుగ లలితపదములన్ సుభగములై

యందంద మ్రోయుచును నా

డెందంబునఁ దగిలి సందడింపుచు నున్నన్."

'హ' ప్రతిలో ఈ పాఠమే యున్నది. (ఇందు రెండవపాదమున అఖండయతి.)

II. "అందియలు టిట్టిభంబుల"—

కల్లూరి వారు ఈ పాఠమునే తీసికొని, తమ పీఠిక (పు. ౧౩)లో.—

"అందియలు టిట్టిభంబుల, చందంబున..." అని నా పాఠము. మూలములో ''చరణ పంకజ తిత్తిరీణామ్'' అని నా పాఠమున కనుగుణముగా శ్లోక మున్నది'' అని వ్రాసినారు.

"వాచం పరం చరణపంకజ తి_త్తిరీణాం
బ్రహ్మ న్స్వరూపముఖరీం శృణువామ తుభ్యమ్." 2-11

"తుభ్యం తవ చరణ పంకజయో ర్నూపురయోః తి_త్తిరీణాం అంతర్గత రత్నానాం పరం కేవలం వాచం శృణుమః. కథం భూతాం అరూపాం అదృష్ట వక్తృకాం ముఖరీం అతి ప్రకటి తాంచ." (వ్యా.)

ఈ వ్యాఖ్యనుబట్టి చూడఁగా 'హ' ప్రతిలోని పాఠమే సరియైన దని తోఁచినది. అందలి 'సందడించుచు నున్నన్' అను భాగము మాత్రము—'సందడించెడిఁ దరుణీ!' అని సవరింపఁ బడినది.

## 55. 'ఎనుబది యిద్దఱు'

"తక్కిన యెనుబది యిద్దఱు కుమారులు పితృాదేశ కరులు నతివినీతులు మహాశ్రోత్రి యులుఁ గర్మనిష్ఠులు నయిన బ్రాహ్మణో_త్తములైరి" 5-64

హ. తం. కల్లూరి. బులుసు. రాయలు.

"యవీయాంస ఏకాశీతి ర్జాయంతే యే పితురాదేశ కరాః" 4-12

అని మూలము. కాఁబట్టి 'ఎనుబది యొక్కండ్రు కుమారులు' అని యుండఁదగును. ఈ విషయమే ఏకాదశ స్కంధమున నిట్లు చెప్పఁబడియున్నది:

"వారలలో నెనుబదియొక్కండ్రు కుమారులు నిత్యకర్మానుష్ఠాన
పరతంత్రులై విప్రత్వం బంగీకరించిరి." 11-35

## 56. 'నిద్రస్పృక్'

''భద్రసేన నిద్రస్పృ గ్విదర్భ కీకటులు" 5-64

అని తం.కల్లూరి.పా-తక్కిన ప్రతులతో, ''భద్రసేనేంద్రస్పృగ్విదర్భ కీకటులు"అని పా.

"భద్రసేన ఇంద్రస్పృ గ్విదర్భః కీకట ఇతి" 4-10

అని మూలము. కాబట్టి "నిద్రస్పృక్" తప్పు.

## 57. 'విద్వాంసుఁడవై'

"కడువేడ్క నీవు విద్వాం
సుఁడవై యుండియును మిగులఁ జోద్య మవిద్వాం
సుఁడుఁ బోలెను బలికెద వి
ప్పుడు మే లనవచ్చు" 5-152

హ. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"నీ వవిద్వాంసుఁడవై యుండియును... విద్వాంసుఁడుఁ
బోలెను బలి కెద విప్పుడు" — తం.

ఈ పాఠమే మూలానుగుణము, సందర్భోచితమును.

"అకోవిదః కోవిదవాద వాదాన్ వద స్యథో నాతివిదాం వరిష్ఠః
న సూరయో హి వ్యవహార మేవం. తత్త్వావమర్శేన సహామనంతి." 11-1

''అకోవిదః అవిద్వా నపి త్వం కోవిదానాం వాదాః ఉద్గ్రాహణికాః
ఉద్గ్రంథాః తుల్యాన్ వదసి." (వ్యా.)

## 58. 'చేడియలేదు'

"ఇందిరగాక సాటి యే, చేడియ లేదు చూరకులశేఖరు కన్యయ ముమ్మ
డమ్మకున్" 6-27

వ్రాఁత ప్రతులలోను, హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు. ప్రతులలోను పాఠ మిట్లే యున్నది, 'చేడియలేదు' అనునది అపపాఠము. వ్రాఁతలలో జరిగిన పొరపాటు. అది యట్లే అచ్చు ప్రతులలో చేరి నిలిచిపోయినది.

'ఇందిరగాక సాటి యేచేడియ లేరుచూరి కులశేఖరు' అని కవి పాఠము. ఏరుచూరి కుల శేఖరుఁడైన కనుపయ భార్య ముమ్మడమ్మకు సాటి ఇందిరగాక, ఏ చేడియలు? అని యన్వయము. ఆమెకు ఇందిరయే సాటిగాని, పెఱచేడియలు సాటి కారని భావము.

## 59. 'త్రికరణ మెఱుఁగక'

"కట్టా ! త్రికరణ మెఱుఁగక
పుట్టిన దురితముల నపుడ పొలియింపని యా
కట్టిఁడి" 6-43

హ. తం. వా. కల్లూరి. బులుసు. రాయలు.

త్రికరణములకు తెలియకుండ ఎట్టి కార్యమును పుట్టదు. కనుక ఈ పాఠము సరికాదు.

"త్రికరణములచేఁ బుట్టిన" అని వ్రా. ప్ర. పాఠము. సరియైనది.

"నచే దిహైవాపచితిం యథాంహసః కృతస్య కుర్యా న్మన ఉక్తి పాణిభిః" 1-7

'మన ఉక్తి పాణిభిః మనోవాక్కాయైః కృత స్యాంహసః తాపస్య త్రై
రేవ ఇహైవాపచితిం ప్రాయశ్చిత్తం యథా యథావత్ యో న కుర్యాత్' వ్యా.

## 60. 'మేని మలినంబు వోకుండ'

''ఇట్టి నరుఁడు పుణ్య మేరీతిఁ జేసిన
నది ఫలింప నేర దని తలంతు
సలిలమందు మేని మలినంబు వోకుండ
గజము క్రుంకువెట్టు గతియుఁ బోలె." 6-45

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''మలినంబు వోవంగ" అని 'హ' పాఠము.

ఏనుఁగు ఒంటి ముఱికి పోవునట్లు చాలసేపు స్నానము చేయును; కాని, నీటినుండి బయటికి వచ్చిన వెంటనే దుమ్ము చల్లుకొనును. కనుక దాని స్నానము వ్యర్థము. అట్లే మూఢుఁడు పాపము పోవుటకు పుణ్యము చేయును; కాని, వెనువెంటనే మరల పాపము చేయును. కనుక వాని పుణ్యమును వ్యర్థమే. - అని పద్యమున నున్న భావము.

గజము, స్నానమును - మ్లాలిన్యము పోవునట్లే చేయును గాని, పోకుండునట్లు చేయదు. కాఁబట్టి 'హ' పాఠమే సరియైనది.

> ''క్వచి న్నివర్తతే భద్రా త్క్వచి దాచరతే పునః
> ప్రాయశ్చిత్త మథోపార్థం మన్యే కుంజర శౌచవత్'' 1-10

## 61. 'దివిజులో భువిజులో'

> ''దివిజులో భువిజులో దేవతాప్రవరులో'' 6-77

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''దివ్యోపదివ్యులో దేవతాప్రవరులో'' అని - వ్రా. ప్ర. పా. - ఈ పాఠమే మూలమునకు సరివడినది.

> ''కిం దేవా ఉపదేవా వా యూయం కిం సిద్ధసత్తమాః'' 1-33

## 62. 'మిషము'

> ''పద్మనేత్రుఁడు వనస్పతుల నోషధిముఖ్య
> జాతంబు మిషము నూర్జంబుఁ గోరి, కల్పించె'' 6-197

ఇది 'తం' పాఠము. అసాధువు.

'జాతంబు నిషము' అని తక్కిన ప్రతుల పాఠము. - సాధువు.

''ఇషము = ఇష్టము; ఊర్జము = బలము'' అని కల్లూరివారి టీక.

''ఊర్జము = బలము'' అని బులుసువారి టీక.

ఈ టీకలు మూలార్థము ననుసరించినవి కావు.

> ''వనస్పతీ నోషధీశ్చ ససర్జోర్జ మిషం విభుః'' 4-8
> 'ఊర్జం భక్ష్యం. ఇష మన్నం' అని వ్యాఖ్య

## 63. 'ఆ ప్రజాసర్గ'

> ''ఆ ప్రజాసర్గ బృంహితం బైన జగము
> దక్షుఁ డీక్షించి మదిలోనఁ దాప మొంది'' 6-209

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

బృంహితము = నింపఁబడినది'' అని కల్లూరివారి టీక.

ప్రజాసర్గము బృంహితంబై యున్నచోఁ దక్షుఁడు తాప మొందవలసిన పనియుండదు, కనుక పాఠ మసందర్భము.

"త మబృంహిత మాలోక్య ప్రజాసర్గం ప్రజాపతిః" 4-20

'అబృంహితం అసంవృద్ధం' (వ్యా.)

మూలము ననుసరించి, పాఠము - 'అప్రజాసర్గబృంహితం బైన జగము' అని యుండుట యుచితము.

## 64. 'గర్తంబు' – 'గర్మంబు' : 'భర్తయు' - 'గర్తయు'

"అట్లైన నొక్కఁ మహాత్ముఁడు పురుషుండు
బహురూపములు గల భామ యొకతె
పుంశ్చలి గర్తంబుఁ బురణింప నుభయప్ర
వాహంబుగల నది వఱలఁ గదల" 6-225

వా. కల్లూరి. బులుసు.

"పుంశ్చలి గర్మంబు" (తం.)

"పుంశ్చలి భర్తయు" (రాయలు. చ.)

"పుంశ్చలి గర్తయు" (హ.)

ఈ పాఠములలో, ఏయొక్కదానితోను పద్యము సరిగా అన్వయించుటలేదు.

## 65. 'కాష్ఠబిలము'

"తనంతన తిరుగుఁ గాష్ఠబిలము దేటపడఁగ"

అని అచ్చుప్రతుల పాఠము.

"రాష్ట్రిబిలము" అని చ. వ్రాతప్రతి పాఠము.

ఈ పాఠములును సరియైనవికావు.

64, 65 పాఠములు రెండును, 224వ పద్యమునకు సంబంధించినవే. పద్యమునకు మూలమిది.

"తథైకపురుషం రాష్ట్రిం బిలం చాదృష్టనిర్గమం,
బహురూపాం స్త్రియం చాపి పుమాంసం పుంశ్చలీపతిమ్.
నదీ ముభయతో వాహాం పంచపంచాద్భుతం గృహమ్,
క్వచి ద్ధంసం చిత్రకథం క్షౌరపవ్యం స్వయంభ్రమిమ్,
కథం స్వపితు రాదేశ మవిద్వాంసో విపశ్చితః.
అనురూప మవిజ్ఞాయ హ్యహో సర్గం కరిష్యథః" 5-9

ఒక్క పురుషుఁడే గల రాష్ట్రము. ఇరువదియైదు అరలు గలదియు, మంగలి కత్తుల తోను- వజ్రాయుధములతోను నిర్మింపఁబడినదియు, ఎప్పుడును గిరగిర తిరుగుచుండునదియు నైన- ఒక యద్భుత గృహము. అందొక పుంశ్చలి; దాని భర్త. ఉభయ ప్రవాహములుగల నది; చిత్ర కథలుగల హంస. బయటికి పోవుటకు దారిలేని బిలము. వీని తత్త్వము తెలియని మీరు ప్రజా సర్గమెట్లు చేయఁగలరు ? అని యర్థము.

ఈ యర్థమునుబట్టి పద్యము సరిపఱుపవలసియున్నది.

### 66. 'దౌర్గుణ్య సంపన్న శ్రీ'

''పన్నొల్ పెట్టుక వింతబాగుల తఱిన్ వర్తించు దౌర్గుణ్య సంపన్న శ్రీయను బోలె''
6-231

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''స్త్రీయనుబోలె'' అని 'హ' పాఠము. సరియైనది.

''నానారూపాత్మనో బుద్ధి స్స్వైరిణీవ గుణాన్వితా'' 5-14

### 67. 'తెచ్చియిచ్చు'

''(విశ్వరూపుఁడు)- దుష్కర్ముఁడై యా యజ్ఞ భాగంబు రాక్షసప్రవరులకును,...... దివిజవరుల మొఱఁగి తెచ్చియిచ్చు; నది యెఱింగి యింద్రుఁ డతిభీతచిత్తుఁడై, తనకుఁగాని యతని తలలు ద్రుంచె'' 6-312

అన్ని ప్రతులలోను పాఠ మిట్లే యున్నది. 'తెచ్చియిచ్చె' అని యుండినఁగాని అర్థము సరిపడదు. 'ఇచ్చె' ననియే మూలము.

''స ఏవ హి దదౌ భాగం పరోక్ష మసురాన్ప్రతి'' 9-3

### 68. 'రాగిచేఁ గనుమించు'

''మును కాఁకరాగిచేఁ గను మించు మించులఁ
గఱకు మీసలు కచాగ్రములు మెఱయ'' 6-318

అన్ని ప్రతులలోను ఇదే పాఠము.

కల్లూరివారు, - ''కానరాగియొక్క సారముచే, రాగివన్నె యని యర్థము'' అన్నారు. 'కానరాగి' యన నేమో తెలియలేదు.

వారు. 'రాగిచే + కనుమించు' అని భావించి నట్లున్నది. ఆ పాఠమే సరియైన దికాదు.

''తప్తతామ్ర శిఖాశ్మశ్రుమ్'' అని మూలము. 9-14

'తప్తతామ్రవత్ శిఖా శ్మశ్రూణి చ యస్య తం' అని వ్యాఖ్య.

కాఁబట్టి పాఠము, 'కాఁకరాగి చేగను మించు' అని యుండుట యుచితము. కాఁగిన రాగియొక్క. చేగను = చేవను, మించు = అతిశయించు (కాఁచిన రాగివలె నెఱ్ఱనైన) అని యర్థమగును.

### 69. 'తంత్రమయము'-'తరణి'

''మెఱయ యంత్రమయంబైన మృగము భంగి
దారునిర్మితమైనట్టితరణి పోల్కి'' 6-415

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''తంత్రమయంబైన మృగము భంగి'' అని కల్లూరివారి పాఠము.

''యథా దారుమయీ నారీ యథా మంత్రమయో మృగః'' 12-10

అని మూలము. కాబట్టి పై పాఠములు మూలానుగుణములు కావు.

'యంత్రమయంబైన మృగము భంగి' – 'దారునిర్మితమైనట్టి తరుణి పోల్కి' అని యుండుట మూలమున కనుగుణము.

'మంత్రమయంబైన మృగముభంగి' అని యున్నను మూలభావము చెడదు గాని, 'దారు నిర్మితమైన తరణి పోల్కి' అనుటమాత్రము సరిపడదు.

## 70. 'ఈ లోకమరసి'

"ఒక్క దివ్యతేజ ముబ్బి వెడలి
లోకమెల్లఁ జూడ లోకులుసూడ నీ
లోక మరసి విష్ణులోను సొచ్చె" 6-431

హ. తం. వా. కల్హారి. రాయలు. బులుసు.

"లోకమెల్లనిండి లోకంబు సూడ నా, లోక మరిగి" (డ)
"లోకమెల్లజూడ లోకంబుచూడని, లోక మరిగి" (క)
ఈ పాఠమే మూలమునకు దగ్గఱగా నున్నది.
"పశ్యతాం సర్వలోకానా మలోకం సమపద్యత" 12-35
'అలోకం లోకాతీతం భగవంతమ్' (వ్యా.)

## 71. 'మహిమానుభవుల విభవుల'

"భగుఁడు సిద్ధిక యను భార్యకు మహిమాను
భవుల విభవులఁ దాఁ బడసె ముపుర" 6-504

హ. తం. వా. కల్హారి. రాయలు. బులుసు.

"మహిమాను ప్రభవ విభవ" (ట)
"సిద్ధి ర్భగస్య భా ర్యాంగ మహిమానం విభుం ప్రభుమ్" 18-2

'భగుఁడు సిద్ధికయందు - మహిమానుని, విభుని, ప్రభుని పడసెను' అని యర్థము. కాఁబట్టి, పాఠము-'మహిమానుఁ, బ్రభువును విభుని, దాఁ బడసె' అని యుండవచ్చును. 'ట' ప్రతి ఈ పాఠమునే సూచించుచున్నది. ఇందు క్రమము తప్పినను పేరులు సరిపడుచున్నవి.

పూర్వపాఠమున-విభుఁడు 'భవుఁడు' గాను ప్రభుఁడు 'విభవుఁడు' గాను మాఱియుండుటయే కాక, బహువచనమున నున్నవి. కనుక అది కేవల మపపాఠము.

## 72. 'ఖేతిగొలుపంగ'

"ఏ తలఁ పెఱుఁగక నిలిచిన
భూతంబులఁ జూచి ధాత పురుషుల మనముల్
ఖేతిగొలుపంగ యువతి
వ్రాతంబు సృజించెఁ బతులు వారల కరుదే ! 6-512

తం. వా. బులుసు.

"భూతంబులఁ జూచి యాత్మపురుషుల మనములే" అని హ. కల్లూరి. రాయలు. పాఠము.

"విలో క్యైకాంతభూతాని భూతా న్యాదౌ ప్రజాపతిః
స్త్రియం చక్రే స్వదేహార్ధం యయా పుంసాం మతి ర్హృతా" 18-30

'ఏకాంత భూతాని నిస్సంగాని మైథునేన సృష్టివృద్ధ్యర్థం స్వదేహార్ధ మేవ స్త్రియం చక్రే' (వ్యా.)

యువతులు పురుషుల మనసునకు ప్రీతిని గొలుపుదురుగాని భీతిని గొలుపరు. కావున 'భీతి' పాఠము సరికాదు.

'ఆత్మపురుషుల మనముల్' అను పాఠమున 'సృజించె' నను క్రియకు కర్తృపదములేదు. కనుక ఆ పాఠమును సరికాదు.

'ధాత పురుషులమనముల్, ప్రీతిగొలుపంగ యువతీ
వ్రాతము సృజియించె' - అని యుండుట సమంజసము.

## 73. 'ఓరేద్వకు' - 'ఏడ్గురఁ దునుకలుగా'

I. "వారేడ్గు రగుచుఁ గుయ్యోడ
నోరేద్వకుఁ దనుచుఁ ద్రుంచె" 6-522

హ. తం. రాయలు.

ఈ పాఠమున 'ఓ+ఏద్వకుఁడు=ఓరేద్వకుఁడు' అని సంబోధనపదముతో సంధి చేయఁబడినది. ఈ సంధి బాలవ్యాకరణ సమ్మతముకాదు. అందువలననే కాఁబోలు వా. కల్లూరి. బులుసు. ప్రతులలో, - "ఓరి యఱవ కనుచుఁ ద్రుంచె" అని పాఠము మార్చఁబడినది.

కాని, అట్లు మార్చనక్కఱలేదు, "పాతకులారని" (ఆము. 7.13) "ఎఱుఁగరె జైనులా రెన్నఁడు మీరు" (బసవ. పుట. 184) ఇత్యాదిగా ప్రయోగము లున్నవి. "పాతకులారని" అన్న చోట వేదంవారు "సంబోధనాంతరమునకు సంధి దుష్టము" అన్నారుగాని, పాఠమును మార్చలేదు. కవి పాఠమును మార్చుట సరికాదు. కనుక 'ఓరేద్వకుఁ' డను పాఠ మట్లే యుండనగును.

II. "త్రుంచె నొక్కొక్కని నా
శూరుం డేడ్గురఁ దునుకలు, గా" 6-522

హ. వా. కల్లూరి. రాయలు.

"శూరుం డేడేసి దునుక, గా" అని-ట. తం. ప్రతుల పాఠము.

"చకర్త సప్తధా గర్భం వజ్రేణ కనకప్రభమ్
రుదంతం సప్తధై కైకం మారోదీ రితి తాన్ పునః" 18-62

'మారోదీ త్యువలాలయ న్నివ తాన్ పునః సప్తధా చిచ్ఛేద'. (వ్యా.)

ముందు గర్భమును ఏడు తునకలుగాఁ ద్రుంచి, మరల నొక్కొక్క తునకను-ఏడేసి తునకలుగాఁ ద్రుంచినాఁ డని యర్థము.

కాఁబట్టి, 'ఏడేసి తునకగా' అను పాఠమే గ్రాహ్యము. కాని, ఏడేసి తునకలుగా - అని యుండుట యుచితము.

### 74. 'వెన్ననికి'

''హరి నుద్దేశించి క్రోధామలైన మేని పెంచి కోపం లొక్కటియైన వెన్ననికి లేని నిమిత్తం బున నతండు వ్యర్థుం డయ్యె'' 7-19

హ. తం. వా. కల్లూరి. రాయలు, బులుసు.

''వెన్నుఁడు = విష్ణువు'' అని రాయలు. బులుసు.- టీక

విషయము వేనునికి సంబంధించినది గాని, వెన్ననికి సంబంధించినది కాదు. కనుక 'వెన్ననికి' అను పాఠము తప్పు. 'వేనునికి' అని యుండవలెను.

''కథమోఽపిస వేనస్తే త్వంచానాం పురుషం ప్రతి'' 1-34

### 75. 'కైకేశి', కైకశి', 'కైకసి'

''కైకేశియను రాక్షసికి రావణ కుంభకర్ణు లయి సంభవించిన'' 7-24

అని హ. తం,— 'కైకశి' అని కల్లూరి.—

'కైకసి' అని వా. రాయలు. బులుసు.- అదే మూలానుసారి.

''తతస్తౌ రాక్షసౌ జాతౌ కైకస్యాం విశ్రవస్సుతౌ'' 1-46

### 76. 'భవదీయాదరలీల'

''భవదీయాదరలీల లోకముం సుత్పాదించి రక్షింప'' 7-312

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''భవదీయాదరలీన లోకముల...'' అని 'శ.' ప్రతిపాఠము. సరియైనది.

''యేనేదమాద పురుషాత్మగతం ససర్జ'' 8-45

'యేన తపసా ఆత్మని లీన మిదం విశ్వం ససర్జ స్పృష్టవాన్ భవానితి శేషః' (వ్యా.)

'ఆదరలీల' పాఠ మర్థరహితము.

### 77. 'అపరాధములును'

''అజ్ఞుండు సేసిన యపరాధములను జే
పట్టఁ డీశ్వరుఁడు; క్ష్మాపాళుఁ దగుటఁ
జేపట్టు నొకచోట'' 7-352

హ. తం. వా. రాయలు. బులుసు.

''చేసిన యారాధనములను'' - చ. జ. ద.

''చేసిన యారాధనముల'' - కల్లూరి. సరియైన పాఠము.

పద్యములోని విషయము ఆరాధనకు సంబంధించినది గాని, అపరాధములకు సంబంధించినది కాదు.

''మానం జనా దవిదుషః కరుణో వృణీతే'' 9-11

'మానం పూజాం' (వ్యా.)

## 78. 'నిజవిముక్త కాములు'

''దేవా!మునీంద్రులు నిజవిముక్త కాములై విజనస్థలంబులం దపంబు లాచరింతురు''

7-366

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'నిజ విముక్తకాము' అనఁగా అర్థమేమో యేర్పడుటలేదు.

''ప్రాయేణ దేవ మునయ స్త్వవిముక్త కామా
మౌనం చరంతి విజనే పరమార్థ నిష్ఠాః'' 9-44

అని తెలుఁగు లిపి ప్రతి పాఠము.

''మునయ స్స్వ విముక్తి కామాః'' అని నాగర లిపి పాఠము.

ఈ పాఠమును బట్టి, అనువాదము 'నిజవిముక్తి కాములై' అని యుండునేమో !

## 79. 'అంటి తడవ'

''దళితపాపుఁ డగుచుఁ దనలోకమున కేగె
నపుడు శౌరి కేల నంటి తడవ'' 8-121

ఇది తం. కల్లూరి. ప్రతుల పాఠము.

''కేల నంటి నడవ'' - రా. రాయలు. బులుసు.

''కేల నంట నడవ'' - హ.

పాఠము - 'అంటఁ దడవ' అని యుండనగును. ఇది యొక ప్రాంత పలుకుబడి. అంటఁగానే అని యర్థము. ఈ పలుకుబడిని పోతన మఱి రెండు మూఁడు తావులలోను వాడియున్నాఁడు.

I. ''కలిత నారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ
బూనఁ దడవ'' 4-348

II. ''తన హోమధేనువుఁ దడయక తప్పించి
యిష్టాన్నములు కురియింపఁ దడవ'' 9-437

(పూర్వపు అచ్చు ప్రతులలోను, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్న తాళపత్ర ప్రతి (D. 91) లోను ఈ పాఠమే యున్నది. కాని, పిమ్మట ముద్రణములలో-కురియింప-'నతఁడు' అనియు, కురియింపఁ 'దడవు' అనియు మార్పుల నందినది.)

III. ''సువతి మున్నుగన్న సుతుఁ గీర్తిమంతునిఁ
బుట్టఁదడవ కంసభూవరునకు'' 10. పూ. 46

ఈ 'తడవ' పలుకుబడిని పాల్కురికి సోమన, తిక్కన మొదలగు ప్రాచీనులును వాడియున్నారు.

(1) ''గప్పున మూఁడవ కన్నగ్గఁ దడవ'' (బసవ. పు. 45)
(2) ''నాలుక గోయం దడవ చచ్చుటయు'' (భా. కర్ణ. 2-214)
(3) ''విసుఁ డేసు బోవఁ దడవ'' (హరి. ఉ. 5-129)

'తడవె' అను రూపమును కనఁబడుచున్నది.

"ఇంటికి నేను జోఁదడవె" (కేయూర. 4-90)
"దినాంతం, బసుదడపె వెడలె గూబలు" (సిం. ద్వా. 10-44)

## 80. 'సోమకమలహితులు'

"ధరణి పాదములు, చిత్తము సోముఁ, డగ్ని ము
ఖంబు, గన్నులు సోమకమలహితులు" 8-154

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

ఈ పాఠమున, చిత్తముగాఁ జెప్పఁబడిన సోముఁడు, మరల కన్నుగాఁ జెప్పఁబడినాఁడు, కనుక పాఠము సరికాదు.

"అగ్ని ముఖంబును, గన్నులు కమలహితులు" అని 'హ' పాఠము. ఇందు కమల హితునకు బహువచనము చేర్పఁబడినది. మూలమున ఏకవచనమే యున్నది.

"సోమో మనో యస్య" 5-34
"య చ్చక్షు రాసీ త్తరణిః" 5-36

ఇది జగద్రూపియైన విరాట్పురుషుని వర్ణనము. జగత్తునకు సూర్యుఁడు కన్ను('జగచ్చక్షుః' అమ.) కనుక 'కన్నులు కమలహితుఁడు' అను సవరణతో 'హ' పాఠమును గ్రహించుటే యుచితము. 'ధరణి పాదములు' అనుట యెట్టిదో, 'కమలహితుఁడు కన్నులు' అనుటయు నట్టిదే.

## 81. 'సురనికర'

"కొలువుకూటంబున సురనికర పరివృతుండై...కొలువున్న విరోచననందనుంగని" 8-182

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

ఈ పాఠము తప్పు. బలి పరివృతుఁడైనది సురనికరముచేతఁ గాదు; అసుర నికరము చేత.

"వైరోచని మాసీనం గుప్తం చాసురయూథపైః" 6-29

అని మూలము. కాఁబట్టి, పాఠము - 'అసురనికర పరివృతుండై' అని యుండవలెను.

## 82. 'భూతద్రోహభయము'

"కామపురాధ్వర కాలగరాది భూ
తద్రోహ భయము చోద్యంబుగాదు" 8-226

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'ద్రోహభయము' అనుట సరికాదు. ఈశ్వరునకు కామపురాదుల భయమున్నట్లు చెప్పుట యుచితమును గాదు.

"భూతద్రోహిజయము" అని క. జ. డ. ద. ప్రతుల పాఠము.

ఇదే సరియైనది. 'దేవా ! నీవు, కామపురాది భూతద్రోహులను జయించుట - చోద్యము కాదు' అని యర్థము.

"కామాధ్వర త్రిపురకాలగరాద్యనేక
భూతద్రుహః క్షపయతః స్తుతయే న త త్తే" 7-32

'కామశ్చ త్రిపురాదయశ్చ యే, తే అనేకే భూతద్రుహ స్తాన్ క్షపయత స్సంహరత స్తే తత్కర్మ స్తుతయే న భవతి. అత్యల్ప మేత దిత్యర్థః' (వ్యా.)

## 83. 'ఖిన్నతరులు'

''అమరారాతుల బాణజాలముల పాలై పోయితే చెల్లరే
యమరాధీశ్వర యంచు భిన్నతరులై యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకు వణిగ్జనంబుల క్రియన్ దైత్యాధిప వ్యూహమ
ధ్యమునం జిక్కిరి వేల్పు లందఱు విపద్ధ్యానంబులం జేయుచున్.'' 8-368

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'ఖిన్నతనులై' అని 'హ' పా. — రెండును అపపాఠములే.

'భిన్నతరులై' అని పాఠము. 'భిన్నమైన - తరి (=ఓడ) గలవారై' అని యర్థము. 'భిన్న' వ్రాతఁలో 'ఖిన్న' గా మాఱినది. అది యట్లే ముద్రితమైనది. పరిష్కర్తల దృష్టిలో పడలేదు.

''అనాయకా శ్శత్రుబలై ర్విమర్దితా, వణిక్పృథా భిన్ననవా యథార్ణవే'' 11-25

'వణిజః భిన్నా నౌర్యేషాంతే. అత్రదీర్ఘాభావ ఆర్షః భిన్ననావ ఇత్యర్థః' (వ్యా.)

## 84. 'విషణ్ణుండైన'

''హతశేషులైన దైత్య దానవులు విషణ్ణుండైన బలిం దోడ్కొని పశ్చిమ శిఖరి శిఖరంబుఁ జేరిరి'' 8-383

ఇది తం. కల్లూరి. పా. ''విపన్నుం డైన బలిం దోడ్కొని'' అని హ. వా. రాయలు. బులుసు. ప్రతుల పాఠము. మూలానుసారి.

''బలిం విపన్న మాదాయ హ్యస్తం గిరి ముపాగమన్'' 11-46

కల్లూరి వారి ప్రతిలో - 'పశ్చిమ శిఖరంబుఁ జేరిరి' అని యున్నది. 'శిఖరి' ముద్రణములో జాఱిపోయి యుండును.

## 85. 'లోకకాల విచక్షణుండు'

''లోక కాల విచక్షణుం డగుటం జేసి దుఃఖపడక యుండె'' 8-383

హ. తం. కల్లూరి.

''లోకమునకు, కాలమునకుఁ గల సంబంధమును గూర్చిన వివేకము గలవాఁడు'' అని కల్లూరివారి టీక.

''లోకతత్త్వ విచక్షణుం డగుటంజేసి దుఃఖింపక యుండె'' అని వా. రాయలు. బులుసు.

ఇది మూలము ననుసరించిన పాఠము. -

''పరాజితోఽపి నాఖిద్య ల్లోకతత్త్వ విచక్షణః'' 11-48

**86. 'ఆద్యంతములకు'**

"అఖిల భావములకు నాత్మయు హేతువు
నైన యీశ్వరుఁడ వాద్యంతములకు
మధ్యంబు బహియును మఱి లోపలయు లేక
పూర్ణమై ... ... నైన బ్రహ్మంబు నీవ" 8-385

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'ఆద్యంతములకు, అనుట సరికాదు. 'ఆద్యంతములును' అని యుండినఁ గాని అర్థము సరిపడదు.

"ఆద్యంతా చాస్య య న్మధ్య మిద మన్య దహం బహిః
యస్యావ్యయస్య నైతాని తత్సత్యం బ్రహ్మచిద్భవాన్" 12-5

'యస్యచ అవ్యయస్య ఏతాని ఆద్యంతమధ్యాని న సంతి' (వ్యా)

**87. సంకల్ప ప్రభావంబులు'**

"త్రైలోక్యసర్గము లింద్రుడు కాముకులు సంకల్ప ప్రభావంబులన్" 8-391

హ. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"సంకల్ప ప్రభూతాత్మముల్" (తం.)

"సంకల్ప ప్రభూతార్థముల్" (చ. ట. త. జ. డ. ద.)

"కామినాం బహుమంతవ్యం సంకల్ప ప్రభవోదయమ్" 12-16

'సంకల్ప ప్రభవః కామః త స్యోదయో యస్మాత్' (వ్యా.)

మూలార్థమును సరిగా వ్యక్తము చేయు పాఠము లభింపలేదు.

**88. 'సముద్యద్భారమై'**

"పారావారముఁ ద్రచ్చుచో గిరి సముద్యద్భారమై కచ్ఛపా
కారుండైన రమేశు వర్తనము" 8-408

హ. వా. కల్లూరి. రాయలు. బులుసు.

ఈ పాఠమున యతి చెడినది. అర్థమును సరిపడుటలేదు.

"గిరిసముద్ధారార్థమై" అని "తం" పా. —

ఇందు యతి కుదిరినది గాని, అర్థము కుదురుట లేదు.

'గిరిసముద్వాహార్థమై' అన్నచో యతి, అర్థము - రెండును కుదురును - 'ఉద్వాహ' మనఁగా పై కెత్తుట.

"ఇతితేఽభిహిత స్తాత విక్రమ శ్శార్ఙ్గధన్వనః
సింధో ర్నిర్మథనే యేన ధృతః పృష్ఠే మహాచలః" 12-45

**89. 'మఱిలేక'**

''మఱిలే కర్థుల దాసుంబ్ సుజనులన్ మన్నింపుదే పైదలీ'' 8-463

ఇది కల్లూరి వారి పాఠము. వారు, ''మఱిలేక = తరువాత తరువాత యనుట లేక (తరువాత తరువాత యనకుండ)'' అని అర్థము కూడ వ్రాసినారు. కాని, ఈ పాఠము, అర్థము రెండును సరియైనవి కావు.

'మఱిలేక' అను పాఠము తప్పనియు, 'మఱలేక' అని యుండవలె ననియు తంజనగరం వారు తమ పీఠికలో తెల్పియున్నారు. తక్కిన ప్రతు లన్నింటను 'మఱలేక' అనియే పాఠము.

మఱలేక = అరమరలేక. (చూ. సూ. ని. 'మఱ'.)

**90. 'సాంగత్యముం బొంది'**

''జగదీశున్ హరి సేవసేయు మతండున్ సాంగత్యముం బొంది నీ
కగు నిష్టార్థము లెల్ల నిచ్చు'' 8-477

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''సంతుష్టమున్ బొంది'' అని 'ద' ప్రతి పా. —

'సాంగత్యము బొంది' అను పాఠ మనుచితము. 'సంతుష్టమున్ బొంది' అను పాఠమును 'సంతుష్టినిం బొంది' - అని సవరించి తీసికొనుట యుచితము.

''వ్రతం కేశవతోషణమ్'' (16-24) ''భగవాన్ పరితుష్టస్తే వర మాశు విధాస్యతి'' (16-60) అని మూలము.

**91. 'గజిబిజిఁ బడు'**

''గుజగుజలు పోవువారును
గజిబిజిఁ బడువారు'' 8-534

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'గజిబిజిపడు' శబ్ద పల్లవ క్రియ. కావున 'గజిబిజిఁ బడు' అనుట సాధువుకాదు.

సూర్యరాయనిఘంటువులో 'గజిబిజి పడువారు' అను పాఠముతోనే ఉదాహరింపఁ బడి యున్నది.

**92. 'సోలితివి'**

''సోలితివి పిశాచ రాక్షసుల రక్షింపన్'' 8-562

అచ్చు ప్రతు లన్నిటిలోను ఇదే పాఠము, కాని, 'రక్షించుటకు సోలితివి' అనుట యుచితము కాదు.

''చాలితి వీ రాక్షసులను సంరక్షింపన్'' అని 'జ' ప్రతిలో పాఠమున్నది. గ్రహింపఁదగినది.

**93. 'ఇంద్రము సేయన్'**

''ఎన్నఁడు నినుఁ బెట్టు మనుచు నీంద్రముసేయన్'' 8-565

హ. తం. వా. రాయలు. బులుసు.

'ఈంౘ్రము=బాధించుట' అని బులుసువారి టీక. 'ఈంౘ్రము' విశేష్యము. 'ఈంౘ్రము సేయు' క్రియ. కాఁబట్టి 'ఈంౘ్రము సేయన్=బాధింపను' అని చెప్పుట యుచితము.

''ఇంౘ్రము సేయన్'' అని కల్లూరి వారి పాఠము. –

''ఇంౘ్రము=సంకటపెట్టను. (ఇంట్రము-అను రూపమున్నది)'' అని వారి టీకా వివరణములు.

'ఇంౘ్రము' అను పదము లేదు. ఉన్నను అది విశేష్యముగాని క్రియ గాదు. కనుక 'ఇంౘ్రము=సంకట పెట్టను' అని చెప్పుట యొప్పదు.

'ఇంట్రము' అను పదమున్నది గాని, దానికిని 'ఇంౘ్రము'నకును సంబంధము లేదు. 'ఇంట్ర' మనఁగా 'ఇఱుకు'. ఆ యర్థము పద్యమున సరిపడదు.— 'ఈంౘ్రము సేయన్' అనునదే సరియైన పాఠము (చూ. శ. ర.)

## 94. 'కుచోపాస్తము'

''రమాకాంతా కుచోపాస్తమున్
విమల శ్రీకుచ శాత చూచుక తటీ విన్యస్తమున్ హస్తమున్'' 8-609

హ. తం. కల్లూరి. రాయలు. బులుసు.

''రమా... ...పాస్తమున్=లక్ష్మీదేవి యొక్క స్తనములందుండునది'' అని కల్లూరి వారి టీక.

'కుచోపాస్తము' - 'కుచచూచుక తటీ విన్యస్తము'
అనుటలో కుచ-శబ్దము పునరుక్తమగుచున్నది. కావున పాఠము సాధువు కాదు.
''కచోపాస్తమున్'' అని వ్రా. ప్ర. 'క' పాఠము. సముచితము.

## 95. 'దుర్బోధులము'

''అధిక దుర్బోధులము కుత్సితాత్మకులము'' 8-670

హ. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''దుర్యోనులము'' అని, చ. - ఐ. తం. ప్రతుల పాఠము. సాధువు.

''కస్మాద్వయం కుసృతయః ఖలయోనయస్తే
దాక్షిణ్యదృష్టి పదవీం భవతః ప్రణీతాః'' 23-7

## 96 'కారవెట్టి'

''వలలుఁ దారు నింక వచ్చి బాలరవేఁట
కాలు నేలు గలఁచి కారవెట్టి
మిడిసిపోవనీక మెడఁ బట్టుకొని యెదరు'' 8-694

తం. వా. కల్లూరి. బులుసు.

''కారవెట్టి=నిర్బంధములో పెట్టి (కార=చెఱ)'' - కల్లూరి.
''కారవెట్టి=బంధించి'' - బులుసు.

పద్యములో నున్నది 'కారవెట్టి' గాని (కారన్ + పెట్టి) = 'కారఁబెట్టి' కాదు. కనుక టీకలు సరిపడవు.

"తాఋవెట్టి" అని హ. రాయలు. ప్రతుల పాఠము.

'కారవెట్టి'-'తాఋవెట్టి' అను పాఠములు సాధువులు కావు. 'గారవెట్టి'అని యుండవలెను.

'గార వెట్టు' క్రియ, (శబ్దపల్లవము), 'చేపలకు మందుచల్లు' అని యర్థము. 'గార' యనఁగా, గారపప్పుతో తయారుచేయఁబడు మత్తుమందు (పొడి), జాలరులు ఆ పొడిని నీటిలోఁ జల్లుదురు. చేప లాపొడిని తిని, స్పృహ తప్పి, నీటిపైఁదేలి పడియుండును. జాలరులు పట్టుకొని బుట్టలో వేసికొందురు..

బ్రౌను ఇట్లు తెలిపియున్నాఁడు :

"గారపొడి (వైజయంతి. 2-140) A drugged paste used by fishermen to intoxicate fish."

సూ. ని. లో 'గార' క్రింద, ఈ పద్యము 'గారవెట్టి' అను పాఠముతో చూపఁబడి యున్నది.

## 97. 'పెరచేత'

"హవియందుకొని కూఁతు రగుఁ గాక యని వష
ట్కారంబు సెప్పుచుఁ గదిసివేల్వ
హోతపెడచేఁత నిల యను నువిదపుట్టె" 9-10

ఇది తం. కల్లూరి. పా. - 'పెడచేత' అని వా. రాయలు. బులుసు. పాలపర్తి. పా. - "హోతపెడచేతన్ = హోతయొక్క చేతి వెనుకటిభాగమందు - ఇల పుట్టెను" అని పాలపర్తి వారి టీక.

ఈ పాఠము, టీక ప్రామాదికములు, 'పెడచేఁత' అను పాఠమే సరియైనది. చేఁత = చేష్ట.

హోతయొక్క - పెడచేఁతన్ = విపరీత చేష్టచేత-అనఁగా, అతఁడు వషట్కారమును 'కొడు కగుఁ గాక' అని చెప్పక' 'కూఁతు రగుఁ గాక' అని చెప్పి వేల్చుటచేత-'ఇల యను నువిద పుట్టెను' అని యర్థము.

'హోతు స్తద్వ్యభిచారేణ క న్యేళా నామ సాఽభవత్.' 1-16

'పెడచేత' అనునది అచ్చు తప్పు. ఈ తప్పు, కవిరాజుమనోరంజనములో-ఈకథలోనే జరిగియున్నది.

"క. ...సంకల్ప వైపరీత్య మొదవినన్, హోతపెడచేతఁ బుట్టెను,
నాతి యిలా కన్య యనఁగ నవమోహినియై" 2-51

## 98. 'తాత'

"అనవుడు మా తాత వసిష్ఠుండు హోతృ వ్యభిచారం బెఱింగి మనువున కిట్లనియె" 9-13

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"అనవుడు వసిష్ఠుండు" - హ. పాలపర్తి. పా.

పై వాక్యమున వక్త శుకుడు. శుకునకు వసిష్ఠుడు ముత్తాత గాని 'తాత' కాడు.

"తన్నిశమ్య వచ స్తస్య భగవాన్ ప్రపితామహః
హోతు ర్వ్యతిక్రమం జ్ఞాత్వా బభాషే రవినందనమ్" 1-19

'ప్రపితామహో వసిష్ఠః' అని వ్యాఖ్య.

కాబట్టి పాఠము 'మా ముత్తాత వసిష్ఠుండు' అని యుండుట సమంజసము.

## 99. 'వరుఁ గని'

"కూఁతు నల్లునిఁ దోడుకొనిపోవు వేడుక
వచ్చి పుత్రికకుఁ బార్శ్వంబునందు
సూర్యతేజంబున సొంపారు వరుఁ గని
వీఁడెవ్వఁడో దీని విభుఁడు గాఁడు
చెల్లరే యని పుత్రి సేసిన ప్రియములు
మ్రొక్కులు నొల్లక మోము వాంచి" 9-62

హ. తం. వా. కల్లూరి. పాలపర్తి.- "వరున్=పురుషుని" అని పాలపర్తి వారి టీక.

"సొంపారు నరుఁగని" అని రాయలు. బులుసు. పా.

ఇది సుకన్యక కథ. ఆమె భర్త (చ్యవనుఁడు) ముసలివాఁడు. అశ్వినుల యనుగ్రహమున యౌవనమును పొందినాఁడు. ఆ సంగతి సుకన్యక తండ్రి (శర్యాతి) కి తెలియదు. అతఁ డొక నాఁడు కూఁతును చూడఁబోయి, ఆమె ప్రక్కనున్న సుందరాకారునిఁ జూచి, ఆమె శీలమును శంకించి పై విధముగా ననుకొన్నాఁడు. కనుక 'వరుఁ గని' యనుట సరికాదు. 'నరుఁగని' అనుటయే సరి.

"దదర్శ దుహితుః పార్శ్వే పురుషం సూర్యవర్చసమ్" 3-18

## 100. 'అబ్ధిం జొచ్చు'

"భువిఁ దూఱున్ భువిఁ దూఱు నబ్ధిఁ జొర నబ్ధిం జొచ్చు" 9-106

అని కొన్ని వ్రాఁతప్రతులలో పాఠము-

తంజనగరం వారు, - "ఇట యతి తప్పు. 'అబ్ధుల్ సొచ్చు' నని యుండవలయును (పీఠిక పు. 10) అని, 'అబ్ధుల్ సొచ్చు' పాఠమునే గ్రంథమున చేర్చినారు.

వారి సవరణవలన యతి తప్పు తొలఁగెనది; అర్థము చెడిపోయినది. ఇది అంబరీషుని వెంట నంటిన విష్ణు చక్రము కథ.—

అంబరీషుడు ఒక సముద్రములో దూరఁగా, చక్రము అనేక సముద్రములలో చొచ్చినట్లు చెప్పుటలో ఔచిత్య మేమున్నది? లేకపోయినను, తం. పాఠమునే తక్కిన ప్రతు లన్నియు కైకొన్నవి. 'అబ్ధుల్‌సొచ్చు' అను పాఠము కొన్ని వ్రాఁతప్రతులలోను, హ. ప్రతిలోనుగూడ ఉన్నది.

ఒక్క కల్లూరివారు మాత్రము, 'అబ్ధింజొచ్చు' అని ముద్రించినారు. నిజానికి ఇదే పోతన పాఠము. అయన యతి చెడుటనైనను సమ్మతించును గాని, అర్థము చెడుటకు సమ్మతింపడు.

## 101. 'ఇలపగరాజుల'

''ఖగరాజ రుచులు గల యిల
పగరాజుల నడఁచి యేలె బాహాశక్తిన్
సగరాజధీరు శూరున్
సగరున్ హతవిమతనగరుఁ జను వినుతింపన్'' 9-203

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''యిలఁ బగరాజుల'' సని పాలపర్తివారి పాఠము.

''ఖగరాజరుచులు=సూర్యచంద్రుల ప్రకాశములు, కల యిలన్=కలిగిన భూమిని. - సూర్యచంద్రుల కాంతి యెందాఁక వ్యాపించియుండునో అంతవఱకును గల భూమండలము నెల్లను ఏలెను.'' అని పాలపర్తివారి టీకాతాత్పర్యములు.

కల్లూరివారును ఈ యర్థమునే చెప్పినారు. కాని, 'యిలపగరాజుల' సను పాఠమును 'యిలఁ బగరాజుల' సని సవరింపలేదు.

''ఖగరాజరుచులుగల యల, పగరాజులు'' అని, 'హ' పా.

ఈ పాఠమున, ఖగరాజరుచులు - పగరాజుల కన్వయింపఁ బడినది. సారస్యమేమున్నది? 'ఖగరాజులు=సూర్యచంద్రులు' అనుటయును అంత సరసముగా లేదు.

''ఖగరాజరుచుల నిలఁగల, పగరాజుల నడఁచియేలె'' అనుట మేలేమో! 'ఇలఁగల పగ రాజులను, ఖగరాజరుచులన్=గరుత్మంతుని (లేక దేవేంద్రుని) దీప్తులతో (=తత్సదృశ పరాక్రమముతో). అడఁచి, ఏలెన్=రాజ్యమును పాలించెను' అని యర్థము చెప్పవచ్చును.

పరాక్రమమునకు గరుత్మంతుని పోలికగా చెప్పుట కలదు. ''ద్వి. వేగవిక్రమ కళా విస్ఫూర్తులందు, నా గరుడునికంటె నధికుఁడ వీవు'' (రంగ. రా. కిష్కిం. 1231)

## 102. 'అయోధ్యలోనఁ గలవారల'

''వరుస నయోధ్యలోనఁ గలవారల నాడెడు పిన్నవాండ్ర నా సరయువులోన వైచి'' 9-210

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

సరయువులో వేసినది - ఆడుకొను పిల్లకాయలనే కాని; అయోధ్యలో నున్నవారి నందఱిని కాదు.—

''సరయ్వాం క్రీడతో బాలాన్ ప్రాస్య దుద్వేజయన్ జనమ్'' 8-17

అని మూలము. కాఁబట్టి పై పాఠము సరికాదు.

''అయోధ్యలోనఁ గల వాడల వాడల పిన్నవాండ్ర'' (పాలపర్తి).

''అయోధ్యలోనఁ గల వాడల నాడెడు పిన్నవాండ్ర'' - అని క. ట. ప్రతుల పాఠము. ఇదియే మేల్తరము.

**103. 'సుద్దరాలు'**

"సీత ముద్దరాలు చిత్తవాక్కర్మంబు లందు" 9-354

హ. తం. రాయలు. బులుసు.

"సీత సుద్దరాలు" వా. కల్లూరి ("సుద్దరాలు=శుద్ధురాలు" అని కల్లూరివారి టీక.)

"సీత శుద్ధురాలు" అని పాలపర్తి. డ. ద. ప్రతుల పాఠము.

'ముద్దరా' అనఁగా-ముగ్ధ. ఎక్కువ తెలివితేటలు లేనిది. కనుక "చిత్తవాక్కర్మంబుల సీత ముద్దరాలు" అనుటలో అర్థౌచితి లేదు. 'సుద్దరా' అనఁగా 'శుద్ధురా' అని యర్థమగునేమో విచారింపవలసి యున్నది.

'శుద్ధురాలు' అను పాఠమున్నది గనుక, దానిని గ్రహించుటే మేలు.

**104. 'రాజయోగి సిద్ధుండు'**

"ఆ రాజయోగి సిద్ధుండై కలాప గ్రామంబున నున్నవాఁడు" 9-363

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

'ఆ రాజయోగి' అనుట అపపాఠము. 'ఆ రాజు యోగసిద్ధుండై" అని యుండఁదగును.

"యోఽసా వాస్తే యోగసిద్ధః కలాపగ్రామ మాశ్రితః" 12-6

**105. 'సత్యధృతి'**

"శతానందునికి ధనుర్వేద విశారదుండైన సత్యధృతి పుట్టె నతం డొక్కనాఁడు వనంబున నూర్వశిం గనిన నతనికి రేతఃపాతంబై" 9-657

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు. పాలపర్తి

ఈ పాఠమున పొరపా టున్నది. వనమునకుఁ బోయి ఊర్వశిం గనినవాఁడు సత్యధృతి కాఁడు. అతని కుమారుఁడు శరద్వంతుఁడు. అతని పే రీ పాఠమున లుప్తమైనది.

"శతానందునికి...సత్యధృతి పుట్టె; నతనికి శరద్వంతుండు పుట్టె; నతండొక్కనాఁడు వనంబున నూర్వశిం గని" అని ప్రాఁత ప్రతుల పాఠము.

"శతానంద స్తు గౌతమాత్
తస్య సత్యధృతిః పుత్రో ధనుర్వేద విశారదః
శరద్వాం స్తత్సుతో యస్మా దూర్వశీదర్శనా త్కిల
శర స్తంబేఽపత ద్రేతః" 21-36

**106. 'గంధర్వుల చేత'**

"చిత్రాంగదుండు గంధర్వులచేత నిహతుం డయ్యె" 9-668

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

చిత్రాంగదుఁడు పలువురు గంధర్వులచేత నిహతుఁడు కాలేదు. ఒక్కనిచేతనే. ఆ గంధర్వుని పేరును చిత్రాంగదుఁడే.

"విచిత్ర వీర్యోఽవరజో నామ్నా చిత్రాంగదో హతః" 22-20

'నామ్నా తత్సమాన నామ్నా చిత్రాంగదేన గంధర్వేణ యుద్ధే చిత్రాంగదః హతః' (వ్యా.)

కాబట్టి 'గంధర్వునిచేత' అని యుండుట యుచితము.

## 107. 'కులనాపకుండు'

''భోజకుల నాయకుం డైన పాపుండు కంసుండు'' (10. పూ. 24) ఇది 'తం' పా.-

''భోజకుల పాంసనుం డైన కంసుండు'' - వా. రాయలు. బులుసు.

''భోజకుల నాపకుండైన పాపుండు కంసుఁడు'' - కల్లూరి.

''భోజకులనాపకుండైన పాపపు కంసుండు'' - క.

''పాపో భోజానాం కులపాంసనః'' అని మూలము. 1-35

మూలమును బట్టి 'కులపాంసనుండైన' అను పాఠము సరియే కాని 'కులనాపకుండైన' అనునదే కవిపాఠముగా గ్రహించుట సమంజసము. ఎందువల్ల ననఁగా 'కులనాపకుఁ' డనుట లోకమున నెక్కువ వాడుకలో నున్నది. వాడుక పదముల నుపయోగించుట పోతన కిష్టము.

బ్రౌను, -''నాపకుడు. Destroyer, ruiner = నాశకుడు = నశింపచేశేవాడు. కుల నాపకుడు-The curse of his father's line'' అని చెప్పి, ఈ క్రింది ప్రయోగమును సూచించినాఁడు.

''నను రఘువీరపత్నిఁ గులనాపక ! పట్టఁదలంచెదు'' (రామాభ్యు. 5-184)

ఈ పాఠము, 1917 వావిళ్ళ ముద్రణములో-'కులనాశక' అని దిద్దఁబడినది.'కులనాపక' శబ్దము తప్పని పరిష్కర్తలు భావించియుందురు. అట్లు భావించువారిప్పటికిని కొంద ఱున్నారు. వారికొఱకు మఱిరెండు ప్రయోగము లిచ్చుచున్నాను.

''కులదీపకుఁడు పుట్టఁ గులము వర్ధిల్లుఁ
గులనాపకుఁడు పుట్టఁ గులమెల్ల ద్రుంగు''

వేటూరివారి ప్రతి. (బసవ. పు. ౨౦)

''ప్రల్లదులచేత వంశనాపకులచేత
... ... ...
కల్లరులచేత దర్పించుఁ గలియుగంబు'' (జైమిని. 8-212)

శ. ర. కర్త, ఈ పద్యమును 'బండగుఁడు' అను పదముక్రింద నిచ్చియు 'నాపక' శబ్దమును చెప్ప మఱచినాఁడు. శ. ర. లో లేదు గనుక సూ. ని. చెప్పలేదు.

## 108. 'సామరూపంబులగు'

''అని మఱియు సామరూపంబులగు పలుకులు పలికిన'' (10. పూ. 35)
వా. రాయలు. బులుసు.

''సామభేదంబులగు పలుకులు పలికిన'' - హ. తం. కల్లూరి.
ఈ పాఠమే సరియైనది.

''ఏవం స సామభి ర్భేదైః'' అని మూలము. 1-46

## 109. 'అనుమతింపఁబడు'

"నలినాక్ష!...గుణములయందును వెలుఁగ నీ వనుమతింపఁ బడుదువు"

(10. పూ. 97)

అన్ని ప్రతులలోను పాఠ మిట్లే యున్నది. సరికాదు.
మూలమున మాత్రము "గుణప్రకాశై రనుమీయతే భవాన్" అని ఉన్నది. 2-37

## 110. 'నొప్పించితి'

"తెంపరివై పొరింబొరిని దేవకి బిడ్డలఁ జిన్ని కుఱ్ఱలం
జంపితి వంత నైన నుపశాంతి వహింపక ఱాలమీఁద నొ
ప్పించితి విస్సిరో యిదియు వీరమె !" (10. పూ. 153)

ఇది తం. కల్లూరి. ప్రతుల పాఠము. ఇందు మూఁడవ పాదమున ప్రాసము తప్పినది.
"నొప్పింపఁగ నిస్సిరో" అని వా. రాయలు. బులుసు. పాఠము.
ఇది ప్రాసము కొరకు కల్పింపఁబడినది; అర్థములేనిది.
"రాల మీఁదన, న్నొంపితి విస్సిరో యిదియు వీరమె ?" అని 'హ' ప్రతి పాఠము

ఈ పాఠమున యతి తప్పియున్నదిగాని అర్థము సరిపడి యున్నది. 'నన్ = నన్ను, రాల మీఁదన్ = రాళ్ళ మీఁద వేసికొట్టి, నొంపితి = నొంచితి = నొంచితివి' అని యర్థము.

'నొంచు' అను క్రియ 'నొంపు' గా వాడఁబడినది. పోతన, యిట్లే 'దంచు'ను 'దంపు'గా వాడి యున్నాఁడు,

"సారథులం జంపియు సైంధవంబులం దంపియు" 6-370

ఇతర కవులలోను ఇట్టి ప్రయోగములున్నవి.—

"తనకుఁ జెవులు వానిఁ దులకింపు పలుకెంపు
పలుకెంపు లొలయు న వ్వోలుకు వాని" వసు. 3-46

తులకింపు = తులకించు = ప్రకాశించు.

"పుట్టుం గెంపున నింపు మీఱ రవి పెంపుం బెంపి" వసు. 4-55

పెంపి = పెంచి = పోఁగొట్టి.

శ. ర. "పెంపు = నాశముచేయు" అని చెప్పి, అందుకు ప్రమాణముగా, భాగవత పద్యమును,—"ఱాలమీఁద నన్, బెంపితి విస్సిరో యిదియు వీరమె" అను పాఠముతో నుదాహరించినది. కాని 'నాశము చేసితివి' అను నర్థము పద్యమున సరిపడదు. కంసుఁ డా బిడ్డను నాశము చేయలేదు. నేలఁ గొట్టినాఁడు. కావున "ఱాలమీఁద నన్నొంపితి" అను పాఠమే సందర్భమునకు సరిపడినది. కాని యతి సరిపడదు.

యతులు తప్పిన పద్యములు పోతనకు కొన్ని కలవు. కావున నిదియు నట్టిదే యని గ్రహించుట భావ్యముగాని, యతి సరిపడి యున్నను అర్థము సరిపడని పాఠమును గ్రహించుట భావ్యము కాదు.

**111. 'ఉరుకాయుఁడు'**

"కోణంబుల శంఖ చక్ర గదాధరుండైన యురుకాయుండును మీఁదుపేంద్రుండును... కాతురు" 10. పూ. 235

వా. రాయలు. బులుసు.

"ఉరగ శయనుండు" అని హ. కల్లూరి.

"ఉరుగాయుండును" అని తం. పాఠము. ఇదే సరియైనది.

"ఉరుగాయః. N. Vishnu, the Asvins, Soma and Indra" (ఆప్టే)

"శ్రీ ర్యత్ర రూపి ణ్యురుగాయపాదయోః
కరోతి మానం బహుధా విభూతిభిః" (ద్వి. స్కం. 9-13)

'ఉరుభి ర్మహర్భి ర్గీయత ఇ త్యురుగాయో భగవాన్' (వ్యా)

**112. 'ఎఱిఁగిన వారికిఁ దోఁతువు'**

"ఎఱిఁగినవారికిఁ దోఁతువు
నెఱిఁ బ్రకృతిం జేరి జగము నిర్మింపఁగ నా
తెఱఁగున రక్షింపఁగ నీ
తెఱఁగునఁ బ్రహరింప రుద్రుతెఱఁగున నీశా!" 10. పూ. 561

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"ఎఱుఁగని వారికిఁ దోఁపవు" - హ.

ఈ రెండు పాఠములలోను లోప మున్నది. 'ఎఱుఁగని వారికిఁ దోఁతువు' అని యుండినఁ గాని అర్థము సరిపడదు.

"అజానతాం త్వత్పదవీ మనాత్మ న్యాత్మాత్మనాభాసి వితత్య మాయామ్,
సృష్టా వివాహం జగతోవిధాన ఇవ త్వ మేషోంత ఇవ త్రినేత్రః" 14-19

'త్వత్పదవీం తవ స్వరూపం అజానతాం అనాత్మని ప్రకృతౌ స్థితః, ఆత్మైవత్వం ఆత్మనైవ స్వాతంత్ర్యేణ మాయాం వితత్య ఆభాసి, కథం జగతః సృష్టౌ అహ మివ బ్రహ్మేవ; విధానే పాలనే ఏష త్వ మివ; అంతే ప్రళయే త్రినేత్ర ఇవ.' (వ్యా.)

'దేవా! నీవు, నిన్నెఱుఁగని వారికి బ్రహ్మవలెను, విష్ణువవలెను, రుద్రునివలెను తోఁతువు' అని తాత్పర్యము.

**113. 'ఎఱిఁగిన వారి యెఱుంగమి'**

"ఎఱిఁగినవారి యెఱుంగమి
యెఱుఁగమె బహుభాష లేల యీశ్వర ! నీ పెం
పెఱుఁగ మనోవాక్కులకున్
గుఱిసేయం గొలఁదిగాదు" 10. పూ. 574

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"ఎఱిఁగినవార లెఱుఁగుదు
రెఱుఁగన్ బహుభాషలేల"— (హ.)

"ఎఱుఁగనివార మెఱిఁగియు
నెఱుఁగని బహుభాష వేల" —(గ.- వ్రా. ప్ర.)

"జానన్త ఏవ జానన్తు కిం బహూక్త్యా న మే ప్రభో
మనసో వపుషో వాచో వైభవం తవ గోచరమ్" 14-3

'కేచిత్తు వయం జానీమ ఇతి స్థితా స్తా నపహస న్నివాహ - జానన్త ఇతి
న తు మే మన ఆదీనాం-తవ వైభవం విషయ ఇతి.' (వ్యా.)

'ప్రభూ ! నీ పెంపును ఎఱిఁగినవా రెఱుఁగుదురు గాక. ఎందుకు పెక్కుమాటలు ?
నెఱుఁగను' - అని శ్లోక భావము.

ఈ భావమును తెలుపునది 'హ' పాఠము.

## 114. 'ఆత్మ - వల్లభుఁడు'

"అఖిల జంతువులకు నాత్మ వల్లభుఁ డైన
భంగి బిడ్డలు నిండ్లు బసిఁడి మొదలు
వస్తువు లెవ్వియు వల్లభంబులు గావు
సకలాత్మకుండైన జలజనేత్రుఁ
డఖిలజంతువులకు నాత్మ గావున ఘోష
వాసుల కెల్లను వల్లభత్వ
మునను మిక్కిలి యొప్పె" 10. పూ. 5

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు. పాలపర్తి.

'తం' - ప్రతిలో-"ఆత్మవల్లభమైనభంగి" అను పాఠాంతర మున్నట్లు తెలుపఁబడిన
అదే సరియైన పాఠము.

అఖిల జంతువులకును 'ఆత్మ' ప్రియ మనియు, కృష్ణుఁడు - ఆత్మస్వరూపుఁడు గావు
ఘోషవాసుల కెల్లను ప్రియమైనవాఁ డైనాఁ డనియు-పద్యమునను న్న అర్థము.

"సర్వేషా మేవ జన్తూనాం నృప స్వాత్మైవ వల్లభః
ఇతరేఽపత్యవిత్తాద్యా స్తద్వల్లభతయైవ హి" 14-

ఎల్ల ప్రాణులకును తమ ఆత్మయే ప్రియమైనది. ఆత్మప్రియత్వము చేతనే పుత్రవి
ములు ప్రియము లగుట అని యర్థము.

తెనుఁగున 'ఆత్మ - వల్లభము' అను సంప్రదాయము గాని, ఆత్మ - వల్లభుఁడు అను
సంప్రదాయము కాదు.

కాబట్టి 'ఆత్మవల్లభమైన భంగి' అను పాఠాంతరమే సరియైన పాఠము.

**115. 'వేఁటాడించెన్'**

''చేగ గల చెఱకు వింటను
బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం
యోగంబుచేసి మదనుఁడు
వేగిరమున విరహిజనుల వేఁటాడించెన్'' 10 పూ. 765

హ. తం. వా. కల్లూరి.

''వేఁటాడె నొగిన్''-రాయలు. బులుసు.

ఈ పాఠమే సరియైనది. మదనుఁడు తానే వేఁటాడును గాని, ఇతరులచేత ఆడించఁడు.

1922 - వావిళ్ళ ప్రతిలో - ''వేఁటాడె నొగిన్'' అనియే యున్నది.

**116. 'యానంబు'**

''కొంటివి మా హృదయంబులు
కొంటివి యానంబు లజ్జఁ గొంటివి'' 10 పూ. 820

వా. బులుసు.

"కొంటివి మానంబు" అని తక్కిన ప్రతుల పాఠము. సరియైనది.

1922 - వావిళ్ళ ముద్రణములో - 'మానంబు' అనియే యున్నది.

**117. 'రాజిల్లెడు చీరెలు'**

"రాజుల నెఱుఁగవు బలిమిని
రాజిల్లెడు చీర లీవు" 10 పూ. 822

హ. వా. రాయలు. బులుసు.

"బలిమిని రాజిల్లెదు, చీరలీవు" - తం. కల్లూరి. ద.

ఈ పాఠమే సరియైనది.

**118. 'దానవి చనుఁబాలు'**

"కన్నులు దెఱవని కడుఁ జిన్న పాపఁడై
దానవి చనుఁబాలు ద్రాగి చంపె" 10. పూ. 928

అన్ని ప్రతులలోను ఇదే పాఠము. ఇందు 'చంపె' నను క్రియకు కర్మలేదు. 'దానవిఁ జనుఁబాలు ద్రాగి చంపె' అని యుండఁదగును. చనుఁబాలు త్రాగి, దానవిని చంపెను - అని యర్థమగును.

**119. 'మూత్రంబులు స్రవింప'**

"మక్కుపం గ్రేపులం దలంచి తలారింపక తమకంబులం దమతమ యంత సంభారవంబులు సేయుచు నూధంబులు స్రవింపఁ బరువులిడు ధేనువులును" 10 పూ. 1195

తం. వా. బులుసు.

"మూత్రంబులు స్రవింప" (హ. కల్లూరి)

పొలములనుండి యావు లిండ్లకు పరువెత్తు నపుడు మూత్రములు స్రవించుట కలదు. ఆ విషయము చెప్పుట స్వభావ వర్ణనము మాత్రమే యగును. 'క్రేపులం దలంచి, ఊధంబులు స్రవింపఁ బరువులిడిన' వనుటలో, ధేనువులకు బిడ్డలమీఁదఁగల ప్రేమాతిశయము, క్షీరసమృద్ధియు ద్యోతకము లగును. కాఁబట్టి యీ పాఠమే గుణవంతము.

హరివంశములోని ఈ క్రింది పద్యము, ఈ సందర్భమున బఠింపఁదగినది.

"ప్రమదము లుల్లసిల్లఁ దనుపారఁగ నిద్రలువోయి పల్మఱున్
గమియ నెమర్చి మే పఱుగఁగాఁ బొరిఁ బెండలువెట్టి లేచి వ
త్సములఁ దలంచి పంచితిలి చన్నులఁ జేఁ పొదవంగఁ బెంపుతోఁ
గొమరుగఁ జారుహుంకృతుల గోవులు చెన్నువహించె మందలన్" పూ. 8-166

## 120. 'అభ్యంజ్యమానలై'

"అభ్యంజ్యమానలై జలకంబు లాడకయు" 10 పూ. 1246

హ. మృగీ. తం. కల్లూరి.

"అభ్యంజ్యమానలై = తల లంటుకొన్నవారై" (కల్లూరి.)

"అభ్యజ్యమానలై" - వా. రాయలు. బులుసు.

ఈ పాఠమే సాధువు.-

"అభ్యజ్యమానా అకృతోపమజ్జనాః" 41-26

## 121. 'కృతదృష్ట'

"నీవు రజోగుణంబున నఖిలంబును సృజించి కారణరూపంబునఁ దదనుప్రవిష్టుండవై కృతదృష్ట కార్యరూప ప్రపంచాకారంబున దీపించుచుండుదువు." 10. పూ. 1499

హ. తం. కల్లూరి.

"శ్రుతదృష్ట"-వా. రాయలు, బులుసు.

ఈ పాఠము మూలానుగుణము.-

"శ్రుత ప్రత్యక్ష గోచరమ్" (18-19) నాగర లిపి ప్రతి.

"శ్రుతి ప్రత్యక్ష గోచరమ్" అని తెలుగు లిపి పాఠము.

## 122. 'అసితాభ్ర'

"వా, తాయన రంధ్ర నిర్గ దసితాభ్ర మహాగరు ధూపధూమముల్ తోయదపంక్తులో యనుచు" 10. పూ. 1596

ఇది - 'హ' పాఠము.

"రంధ్ర నిర్గత సితాభ్ర"-తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

ఈ రెండును అపపాఠములే. 'రంధ్రనిర్గ దసితాభ' అని యుండవలె. 'అసితాభ = నల్లని కాంతిగల, మహాగరుధూప ధూమముల్' అని యర్థము.

## 123. 'రుక్మధర రుక్మనేత్రులు'

''ఇట్లు రుక్మి రుక్మధర రుక్మబాహు రుక్మకేశ రుక్మనేత్రు లను నేవురకుం జెలియలైన రుక్మిణీదేవి'' 10. పూ. 1690

తం. కల్లూరి.

''రుక్మరథ...రుక్మ నేత్రులను నేవురకున్''

వా. రాయలు. బులుసు. హ.

''రుక్మ్యగ్రజో రుక్మరథో రుక్మబాహు రనంతరః
రుక్మకేశో రుక్మమాలీ రుక్మిణ్యేషాం స్వసా సతీ'' 52-22

అని మూలము.

కాఁబట్టి, 'రుక్మధర' - తప్పు; 'రుక్మరథ' - ఒప్పు.

'రుక్మనేత్ర' పాఠము తప్పు: 'రుక్మమాలి' అని యుండుట యొప్పు.

పాఠము, - 'రుక్మి రుక్మరథ......రుక్మమాలు రను నేవురకున్' అని యుండనగునని ఫలితార్థము.

## 124. 'నిద్రవోవు'

''సంతోషి గాఁడేని శక్రుఁడైన నశించు
నిర్ధనుం డైనను నిద్రవోవు'' 10. పూ. 1698

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''నింద్రుఁ బోలు''—మృగీస్థలం, వ్రాఁత ప్రతులు.

బులుసువారు 'నిద్రవోవు' అను పాఠమును గ్రంథమున నుంచి, అడుగున,-''ఇది సరిగా నున్నట్లు తోచదు. 'నింద్రుఁ బోలు' అని యుండుటయే యుచితము. పెక్కు ప్రతులలో నీ పాఠమే కానవచ్చుచున్నది'' అని వ్రాసినారు.

''అసంతుష్టో సకృల్లోకా న్నాప్నో త్యపి సురేశ్వరః
అకించనోఽపి సంతుష్ట శ్శేతే సర్వాంగవిజ్వరః'' 52-32

అని మూలము.

''శేతే సుఖమా స్త ఇత్యర్థః, తదేవాహ - సర్వే ష్వంగేషు వాక్పాణ్యాదిషు విజ్వరః తాపరహితః'' అని వ్యాఖ్య.

'విజ్వరః' అను పదము ముఖ్యముగా గమనింపపలసినది. ఇందు కింకొక యుదాహరణ-

''యస్యాం స్వధుర మధ్యస్య పుమాం శ్చరతి విజ్వరః''

'విజ్వాఃర నిశ్చింతః' (వ్యా.)

'అకించనుఁడై నను, సంతుష్టుఁ డై యున్నచో- విజ్వరః సన్ శేతే=నిశ్చింతగా నిద్ర వోవును' అని మూలమున దున్న యర్థము. ఈ యర్థము 'నిద్రవోవు' అను పాఠమున సిద్ధింపదు. 'నిశ్చింతగా' అను నర్థ మందు లేదు, కనుక వ్యర్థము.

'ఇంద్రుఁ బోలు' ననుటలో మూలార్థస్ఫురణమున్నది. ఇది భావానువాదము. ఇంద్రునివలె సుఖముగా నుండునని భావము, నిర్ధనుండై నను నింద్రుఁబోలు' అను పాఠమున అఖండయతి.

**125. 'సుతకును'**

''కని జాంబవంతుఁడా మణిఁ
గొనిపోయి సమీపశైల గుహఁ జొచ్చి ముదం
బునఁ దన కూరిమి సుతకును
ఘనకేళీ కందుకంబుగాఁ జేసె'' 10. ఉ. 56

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు. మృగీస్థలం.

''సుతునకు''—అని వ్రాఁతప్రతుల పాఠము.

ఇది సరియైనది. జాంబవంతుఁ డా మణిని కందుకముగాఁ జేసినది అతని కుమారునికిఁ గాని, కూఁతునకు కాదు.

''సోఽపిచక్రే కుమారస్య మణిం క్రీడనకం బిలే'' 56-16

**126. 'బాలిక కెదుర'**

''హరి...గుహాంతరాళంబు సొచ్చి చని యక్కడ నొక్క బాలిక కెదుర వ్రేలం గట్టిన యమ్మణిశ్రేష్ఠంబుఁ గని'' 10. ఉ. 61

అచ్చుప్రతుల పాఠము.—

''బాలున కెదుర'' అని వ్రాఁతప్రతులు - ట. గ. పాఠము.

**127. 'బాలకడకు' - 'వానిదాది'**

''యదు, వల్లభుఁ డా బాల కడకు వచ్చిన గుండెల్
జల్లనఁగఁ జూచి కంపము
మొల్లంబుగ దాని దాది మొఱవెట్టె.'' 10. ఉ. 62

అని అచ్చు ప్రతులు -

''యదువల్లభుఁ డా శిశువుకడకు వచ్చిన... వాని దాది మొఱవెట్టె'' అని - క. చ. ఏ. వ. గ. జ ప్రతులు.

**128. 'స్వనముల కరణి'**

''ఘనఘోణి ఖురకోటి ఘట్టిత స్వనముల
కరణి నంభోనిధుల్ కలఁగి పొరలె'' 10. ఉ. 396

హ. మృగీస్థలం.

''ఘట్టితోదకముల కరణి'' - వా. రాయలు. బులుసు.

''ఘట్టిత సదముల కరణి'' - తం. కల్లూరి.

ఈ పాఠమే సరియైనది. 'సదముల కరణి=(చిన్న) మడుఁగులవలె' - అని యర్థము.

''సదము=(నీటి) మడువు'' (శ. ర.)

## 129. 'ఉడుగణమురాలె'

"పిడుగులగతి నుడుగణము రాలె' 10. ఉ. 396

హ. మృగీస్థలం. - ఈ పాఠమున యతి తప్పినది.

"పిడుగులగతి నుడుబృంద మెడలె"

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

ఇతి యతిరక్షణార్థము కల్పితమైన పాఠము.—

పై పాఠములోని మాటలనే - 'పిడుగులగతి రాలె నుడుగణంబు' అని మార్చుట సుఖమైన పరిష్కరణము.

## 130. 'ఆఁకగొనంగ'

"మురవిదారుఁడు తోడన తచ్ఛరావళి

న్నాఁకగొనాక ద్రుంచె" 10. ఉ. 432

ఇది హ. మృగీస్థలం. ప్రతుల పాఠము.

"ఆఁకగొనంగఁ ద్రుంచె" అని తక్కిన అచ్చుప్రతు లన్నిటిలోను పాఠము.

"ఆఁక = నిరోధము-అడ్డు" అని బులుసువారి టీక.

'మురారి, బాణుని శరావళిని—అడ్డుకొనఁగా ద్రుంచెను'-అనుటలో అర్థము లేదు.

ఆఁకగొనక = లెక్కసేయక, నిర్నిరోధముగా, త్రుంచెను'-అని కవ్యుద్దిష్టారము. 'కొనక' అను నర్థమున 'కొనాక' అని ప్రయోగింపఁ బడినది- ('మడాక' వలె.) ప్రయోగ విశేష మను కొనుట యుచితము గాని, పద్యభావమునకు విరుద్ధముగా 'కొనంగ' అని మార్చుట యుచితము కాదు.

## 131. 'తెలుపై'

"హలమునఁ, దివిచిన కాళింది ప్రయ్య దెలుపై నేఁడున్, భువి నుతికెక్కెను రాముని, ప్రవిమలతరమైన బాహు బలసూచకమై." 10. ఉ. 502

తం. వా. కల్లూరి, రాయలు. బులుసు. కొన్ని వ్రాఁత ప్రతులు.

యమున నలుపు గాని తెలుపుకాదు—"అద్యాపి దృశ్యతే రాజన్ యమునా కృష్ణ వర్త్మనా" అని మూలము, 65-33

కాఁబట్టి 'తెలుపై' అను పాఠము సరికాదు.

"కాళింది ప్రయ్యి తెఱపై "అని'హ'పా.-ఈ పాఠమునను అర్థము సరిగా నేర్పడుటలేదు.

"కాళింది ప్రయ్యి దెలియఁగ నేఁడున్"అని 'మృగీ' ప్రతిలోను, "కాళింది క్రయ్యి..." అని గ. డ. ప్రతులలోను పాఠము.

ప్రయ్యి = చీలిక, పాయ.-క్రయ్యి = కాలువ.

ఈ రెండర్థములును సరిపడునవే. కావున ఏ పాఠమైనను తీసికొన వచ్చును.

**132. 'విరథుం దగుచున్'**

''చాపముఁ జలంబునఁ ద్రుంచి హయాలిఁ జంపి సూ, తుం దెగ
టార్చి యంత విరథుం దగుచున్ వెసఁ జొచ్చి పట్టినన్.'' 10. ఉ. 564

అని తం. కల్లూరి. పా.-విరథుఁడైనవాఁడు పోయి శత్రువును పట్టుకొనుట అసంభవము. కనుక ఈ పాఠము సరికాదు.

'విరథుం డగుటన్' అని హ. మృగీ. ప్రతులలోను, 'విరథుం డగుడున్' అని వా. రాయలు. బులుసు. ప్రతులలోను పాఠము.

'శత్రువు విరథుఁడు కాఁగా - పోయి పట్టుకొన్నాఁ' డని యర్థము. కాఁబట్టి యీ రెండు పాఠములలో, ఏదయినను గ్రాహ్యమే.

**133. 'మదిరలు'**

''పటికంపుఁ గంబముల్ పవడంపుఁ జట్టెలు
మరకత రచితముల్ మదిర లమర'' 10. ఉ. 598

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు. మృగీ.

'మదిరలు' - తప్పు 'మదురులు' అనుట ఒప్పు.

1922 - వావిళ్ళ ప్రతిలో 'మదురు లమర' అని సరిగానే యున్నది. సూ. ని. లో 'మదురు' క్రింద; 'మదురు లమర' అను పాఠముతోనే చూపఁబడి యున్నది. శబ్దము 'మదురు' గాని 'మదిర' కాదు.

''మదురు or Coping, the cope or crown of a wall. గోడపై కప్పు.'' (బ్రౌణ్యము.)

**134 'కడఁకనేతేర'**

''జలజలోచను కడకు సుత్కలికతోడఁ
దనరు శిబికల నెక్కి నందనులుఁ దాముఁ
గడఁక నేతేరఁ బ్రతిహార జనులు వేత్ర
కలితులై'' 10. ఉ. 671

తం. కల్లూరి. మృగీ.—ఈ పాఠమున, మూఁడవ పాదమున యతిభంగము.

''జవము నేతేరఁ బ్రతిహార జనులు'' - హ.

ఈ పాఠమున యతి సరిపడియున్నది గాని, అర్థము సరిపడుట లేదు.

''కనఁగనేతేర'' అని తక్కిన ప్రతుల పాఠము. అన్ని విధముల సరిపడియున్నది.

**135. 'పీడుకొలుప'**

''నారదుని మాధవుఁడు స
త్కారంబున పీడుకొలుప నతఁడును హృదయాం
భోరుహమున'' 10. ఉ. 675

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు. మృగీ.—

ఈ పాఠమున యతి తప్పియున్నది.

"స, త్కారంబున వీడుకొన నతండును" —హ.

ఇందు యతి కుదిరినది గాని, అర్థము చెడినది. 'వీడుకొనుట' యనఁగా సెలవు తీసికొని వెళ్ళిపోవుట. పద్యమున సరిపడదు.

''అ థాదిశ త్ప్రయాణాయ భగవాన్ దేవకీసుతః'' 71-12

అని మూలము. 'ప్రయాణాయ ఆదిశత్' - అనఁగా - వీడ్కొల్పెను అనియే అర్థము. అందువలన పాఠము, 'స, త్కారంబున వీడ్కొలుప నతండును' అని సవరింపఁబడినది.

## 136. 'వారింప'

''కాంచన రత్నభూషణ నికాయముఁ దాల్చి సముజ్జ్వల ప్రభోదంచితమూర్తి నొప్పి పణిహారులు ముందటఁ గ్రందు వాయ వారింప సహోదరుల్ నృపవరేణ్యులు పార్శ్వములన్ భజింప నేతెంచెను" 10. ఉ. 819

తం. వా. రాయలు. మృగీ.

ఈ పాఠమున, మూఁడవ పాదమున ప్రాసము తప్పినది.

''క్రందు వాయ వా, రించి'' - బులుసు.

ఇందు ప్రాసము కుదిరినది; అర్థము తప్పినది.

''క్రందు వాయ వా, రించ'' - హ. కల్లూరి.

ఇదే కవి పాఠము. సలక్షణము - 'వారించ' అనుట తప్పనుకొని, పరిష్కర్తలు ఇద్ది, ఒకరు ప్రాసము చెఱిచినారు, ఇంకొకరు అర్థము చెఱిచినారు.

'వారించ' తప్పుకాదు; ఒప్పె. (చూ. ప్రౌఢ. క్రియా. ౧౬.)

## 137. 'రవి ప్రకాండ'

''సారథిమాట కాత్మ మో, దించి రవిప్రకాండరుచిదీపిత చాపముఁ దాల్చి''

10. ఉ. 874

హ. తం. కల్లూరి. రాయలు. బులుసు.

''ఆత్మ మోదించి యుదాత్తకాండరుచిదీపిత'' - హ. మృగీ.

ఈ పాఠమే అర్థవంతము. - 'రవిప్రకాండరుచి' అర్థము లేనిది.

## 138. 'ఓహో' - 'ఆహాకారములు'

''ఓహో యని భూతావలు
లాహాకారములు సేయ'' 10. ఉ. 889

హ. మృగీస్థలం.

''హాహా యని భూతావలు, లాహాకారములు సేయ''

తం. వా. కల్లూరి. రాయలు.

ఓహో! అహా! ఆశ్చర్యమును, ఆనందమును తెలుపు పదములు, ప్రకృత పద్యమున సరిపడవు. పద్యము భూతములకుఁ గలిగిన భయమును తెలుపునది.

భూతములు చేసినవి హాహాకారములుగాని 'ఆహాకారములు' కావు.

''హాహాకారో మహానాసీ ద్భూతానాం తత్ర పశ్యతామ్'' 77-16

కాఁబట్టి పాఠము - 'హాహాయని భూతావళి, హాహాకారములు సేయ' అని యుండుట సముచితము.

**139. 'అభియాతిని శత్రుని'**

''మురాంతకుండు......గదఁ గేలఁ ద్రిప్పి యభియాతిని శత్రుని ట్రేసె నుద్ధతిన్'' 10. ఉ. 892

తం. వా. రాయలు.

''అభియాతుని శత్రుని ట్రేసె'' అని హ. మృగీ. కల్లూరి.

'అభియాతి (అభియాతుఁడు)' అన్నను 'శత్రు' డన్నను అర్థ మొకటే. కాఁబట్టి, 'అభియాతిని - శత్రుని' అనుటలో పునరుక్తి యున్నది. మూలమున అట్లులేదు.

''ఇత్యుక్త్వా భగవాన్ సాల్వం గదయా భీమవేగయా
తతాడ జత్రౌ సంక్రుద్ధః'' 77-20

అని మూలము. ''కృష్ణుఁడు గదతో సాల్వుని జత్రుదేశమున కొట్టెను' అని యర్థము.

దీనినిబట్టి కవిరచన ''శత్రువుయొక్క జత్రువు ట్రేసె'' అను నర్థము నిచ్చునదిగా నుండవలెను. కనుక కవి పాఠము - ''అభియాతుని జత్రువు ట్రేసె'' అని యుండుననియు. అది వ్రాఁతలలో - 'అభియాతుని శత్రుని ట్రేసె' అని మాఱి యుండుననియు తోఁచుచున్నది.

అభియాతృ - శబ్దమున్నది. 'జత్రువు' అనఁగా మెడకొంకి (Collar bone.).

**140. 'మరుద్ధత'**

''అనయము దైవ మిట్లు సచరాచరజాలము నొక్కవేళ గూ
ర్చును నొకవేళఁ బాపును మరుద్ధత తూలతృణంబులుం బలెన్'' 10. ఉ. 1066

హ. మృగీ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''మరుత్...బలెన్ = గాలిచేత ఎగురఁగొట్టఁబడిన దూది పింజలవలె''

అని రాయలు టీక.

పై పాఠములో పొరపాటున్నది. టీక దానిని ననుసరించినదే కదా!

పాఠము - 'మరుద్ధతి తూలతృణంబులం బలెన్' అని యుండనగును. అప్పుడు— మరుత్ + హతి = గాలిదెబ్బ, తూల తృణములనువలె, దైవము సచరాచర జాలమును ఒకవేళ గూర్చును; ఒకవేళఁ బాపును అని యర్థ మగును. మూలమున నున్న యర్థమిదే.—

''వాయు ర్యథా ఘనానేకం తృణతూల రజాంసి వా
సంయో జ్యాక్షిపతే భూయ స్తథా భూతాని భూతకృత్'' , 82-45

**141.** **'భక్తి'**

"తరళాక్షులార ! మద్భక్తి చేతనులకుఁ
దనరు మోక్షానంద దాయకంబు
జపతపో్వ్రతదాన సత్కర్మముల భక్తి
గలుగంగ నేరదు" 10. ఉ. 1067

హ. మృగీ. కల్లూరి.- (ఈ పాఠము సరికాదు)

"ముక్తి గలుగంగనేరదు" అని తక్కిన ప్రతుల పాఠము. అదే సరియైనది.

"మయి భక్తిర్హి భూతానా మమృతత్వాయ కల్పతే" 82-46

**142.** **'ఉమాధినాథ చతురాస్యులు'**

"నీపద భక్తకోటితో
నరయ నుమాధినాథచతురాస్యులుఁ బోల రటందు వెప్పుడున్" 10. ఉ. 1181

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"రమాధినాథ చతురాస్యులు" - హ.

"రమాహినాథ చతురాస్యులు" - మృగీస్థలం.

ఈ పాఠమే సరియైనది.—

"యదా త్వైకాంతభక్తా న్మే నానంత శ్శ్రీ రజః ప్రియః" 86-33

**143.** **'సనందనుఁడు పృచ్ఛకుఁడు'**

"మున్నీ యర్థంబు శ్వేతద్వీప నివాసులైన సనక సనందనాది దివ్యయోగీంద్రులు ప్రశ్న సలిపిన వారలకు సనందనుండు చెప్పిన ప్రకారంబు నీ కెఱింగించెద" 10. ఉ. 1199

అన్ని ప్రతులలో ఇదే పాఠము. ఇందు, సనందనుఁడే ప్రశ్న సలిపి, సనందనుఁడే సమాధానము చెప్పిన ట్లున్నది. అది పాఠములోని పొరపాటు.

ప్రశ్న చేసినవారు శ్వేతద్వీప నివాసులైన యోగీంద్రులు ; సమాధానము చెప్పినవాఁడు సనందనుఁడు.

"ప్రవచనే ఏకం చక్రుః సనందనం ప్రతివక్తారం చక్రుః. అపరే సనకాదయ స్సర్వే శుశ్రూషవో బభూవు రితిశేషః" (8-11) వ్యాఖ్య.

కాఁబట్టి, పాఠము - 'శ్వేతద్వీప నివాసులైన దివ్యయోగీంద్రులు ప్రశ్నసలిపిన వారలకు సనందనుండు చెప్పిన ప్రకారంబు నీ కెఱింగించెద' అని యుండవలయును.

**144.** **'శకుఁడను దైత్యుని'**

"శకుఁ డను దైత్యుని తనయుఁడు
వృకుఁ డనువాఁ డొకఁడు" 10. ఉ. 1233

ప్రతు లన్నిటను పాఠ మిదే.—

"వృకోనా మాసురః పుత్ర శ్శకునేః పథి నారదమ్. దృష్ట్వా"
అని మూలము. 88-14

కాఁబట్టి, వృకుఁడు శకునికొడుకు గాని, శుకునికొడుకు కాఁడు. కవి పాఠము- 'శకుని యను దైత్యు తనయుఁడు' అని యుండి యుండును. అది వ్రాఁత ప్రతులలో పై విధముగా మాఱియుండును.

## 145. 'శరణ్యునిన్' - 'నేత్రునిన్'

''చని యచటం గనుంగొనిన సర్వశరణ్యునిఁ బుండరీక నే
త్రుని నిజధామవైభవ సమృద్ధికిఁ దన్మహనీయ మూర్తికిన్
మనమున మోద మంది'' 10. ఉ. 1313

అన్ని ప్రతులలోను ఇట్లే యున్నది. 'శరణ్యునిఁ బుండరీక' అని యుండుట సరికాదు. శరణ్యుని, నేత్రుని - అను నవి ద్వితీయాంతములు కావు; షష్ఠ్యంతములు. 'సర్వశరణ్యుని యొక్క, పుండరీక నేత్రుని యొక్క - ధామ సమృద్ధికి' అని యర్థము.

''ప్రశామ్య వైష్ణవం ధామ పార్థః పరమవిస్మితః'' 89-63

శరణ్యునిన్, నేత్రునిన్ - అను విభాగము పద్యార్థభంజకము.

కావున, పాఠము - 'శరణ్యుని పుండరీక నేత్రుని' అని యుండనగును.

రెండవ చరణమున - అప్పకవీయము ప్రకారము - యతిభంగము.

(చూ. యతులను గుఱించిన విమర్శ.)

## 146. 'చాలకుందురఁట'

''హరినామాంకితమైన గీత మొకమా టాలించి మూఢాత్ములున్
విరతిం బొందఁగఁ జాలకుంద రఁట యా విశ్వాత్ము నీక్షించుచున్
బరిరంభించుచు నంటుచు న్నగుచు సంభాషించుచు న్నుండు సుం
దరు లానందనిమగ్నలౌట కిలఁ జోద్యం బేమి భూవల్లభా!'' 10. ఉ. 1321

తం. కల్లూరి.

'మూఢులును విరతిని పొందఁ జాలకుందు రఁట' - 'సుందరు లానంద నిమగ్న లౌటకు చోద్యమేమి ?' అను వాక్యములకు అర్థమున పొందిక లేదు. కనుక ఈ పాఠము సరికాదు.

''విరతిం బొందఁగఁ జాలియుందు రఁట''

అని - హ. మృగీ. వా. రాయలు. బులుసు. ప్రతుల పాఠము.

ఇదే సరియైనది.- 'హరినామాంకితమైన గీతమును ఒకమా టాలించినంత మాత్రముననే- మూఢులును - విరతిని పొందఁజాలియుందు రఁట. నిరంతరమును కృష్ణునితోనే కలసిమెలసి యుండు సుందరు లానంద నిమగ్న లౌటకు చోద్యమేమి ?' అని యర్థము. ఇది మూలము ననుసరించినది.

''శ్రుతమాత్రోఽపి యః పుంసాం ప్రస హ్యాకర్ష తే మనః
ఉరుగాయోరుగీతోవా పశ్యంతీనాం చ కిం పునః'' 90-26

''యా స్తం పర్యచరన్ ప్రేమ్ణా పాదసంవాహనాదిభిః
జగద్గురుం భర్తృబుద్ధ్యా తాసాం కిం వర్ణ్యతే తపః'' 90-27

## 147. 'కారణంబైన' - 'జ్యోతిస్స్వరూపంబు'

''లస దుద్భవ స్థితి లయ కారణంబైన
దేహేంద్రియాదులఁ దిరముగాఁగఁ
జొనుపు నెప్పుడు పరంజ్యోతి స్స్వరూపంబు'' 11-57

ఇది తం. పాఠము. - ''పరంజ్యోతి స్వరూపంబు'' అని తక్కిన ప్రతుల పాఠము.

ఉద్భవస్థితిలయములకు కారణము పరమాత్మగాని, దేహేంద్రియాదులు కావు. కావున ''కారణంబైన దేహేంద్రియాదులన్'' అను పాఠము సరికాదు.

''పరంజ్యోతి స్స్వరూపంబు - దేహేంద్రియాదులఁ జొనుపు'' అను పాఠమున ఎట్లు చూచినను అన్వయము కుదురుట లేదు.

'ఇంద్రియాదులన్ = ఇంద్రియాదులను, చొనుపును' - అను పక్షమున, ఎక్కడ చొనుపును ? అను ప్రశ్నకు సమాధానము కనఁబడదు.

'ఇంద్రియాదులయందు - చొనుపును' అను పక్షమున, దేనిని చొనుపును ? అను ప్రశ్నకు సమాధానము కనఁబడదు.

పాఠ మీక్రింది విధముగా నున్నచో అర్థము సరిపడును.-

''లస దుద్భవ స్థితి లయ కారణం బయి
దేహేంద్రియాదులఁ దిరముగాఁగఁ
జొనుపు నెప్పుడు పరంజ్యోతి, స్వరూపంబు''

పరంజ్యోతి (కర్త), లస...కారణంబై, దేహేంద్రియాదులందు, స్వరూపంబున్ = తన రూపమును, అనఁగా తన తేజమును, చొనుపును-అని యర్థము. ఆ తేజమే పరతత్త్వమని భావము.

''దేహేంద్రియాసు హృదయాని చరంతి యేన
సంజీవితాని తవేహి పరం నరేంద్ర !'' 3-39

'విశ్వస్యస్థి త్యుద్భవప్రళయానాం హేతుః స్వయం చ అహేతుః
హేతురహితః స నారాయణ ఇతి. పరమేవ తత్త్వ మవేహి'' (వ్యా.)

## 148. 'అనలుండు చననిభంగి'

''జ్వాలల ననలుండుఁ జనని భంగి
నింద్రియంబులు నాత్మ నెనయవు'' 11-57

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

''జ్వాల లనలునందుఁ జనని పగిది''—హ.

ఈ పాఠమే సరియైనది-

''నైత న్మనో విశతి వా గుత చక్షు రాత్మా
ప్రాణేంద్రియాణి చ యథానల మర్చిష స్స్వాః'' 3-40

'వా గుత వా గపి చక్షుశ్చ ఆత్మా బుద్ధిశ్చ ప్రాణశ్చ క్రియాశక్త్యా న ప్రాప్నోతి. అన్యాని చేంద్రియాణి. యథా అనలం స్వాః స్వాంశభూతాః అర్చిషః విస్ఫులింగాదయః' (వ్యా.)

**149. లౌకికవర్జితంబులు**

"కర్మాకర్మ వికర్మ ప్రతిపాదకంబులగు శ్రుతివాదంబులు లౌకికవర్జితంబు లట్టి యామ్నాయంబులు సర్వేశ్వర స్వరూపంబులు" 11-60

హ. తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"కర్మాకర్మం వికర్మేతి వేదవాదో న లౌకికః" 3-47

"కర్మ విహితం. అకర్మ తద్విపరీతం నిషిద్ధం. వికర్మ విగతం కర్మ విహితా కరణం. ఏతత్ త్రయం వేదవాదః - వేదైకగమ్యం. న లౌకికః" (వ్యా.)

'కర్మాకర్మ వికర్మతత్త్వము వేదమునలన తెలిసికొనవలసినది. అది లౌకిక విషయము కాద'ని యర్థము.

కావున "శ్రుతివాదంబులు లౌకికవర్జితంబులు" అను పాఠము సరికాదు. 'కర్మాకర్మ వికర్మ విషయము వేదవాదము గాని లౌకికంబుగాదు' అని యుండుట యుచితము.

**150. 'మూలభిన్నానువాదము'**

"మృదులపక్వాన్న భోజనములను మాని
జీవహింసకుఁ జనువానిఁ జెందు నఘము
హరి నుతింపక స్త్రీలోలుఁ డైనవాఁడు
నరకవాసుండు నగుచుండు ననవరతము." 11-74

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"మృదుల పక్వాన్నములను దా మెసఁగఁగోరి" అని 'హ' పా.

'మృదుల...ములనుమాని' అను పాఠమున యతి సరిపడదన్న భావమున 'మెసగఁగోరి' అని మార్చినట్లున్నది. కాని మార్చ నక్కఱలేదు. (చూ. యతులను గుఱించిన విమర్శలో.)

యతిమాట యెట్లున్నను, అనువాదము మూలమునకు సరియైనదికాదు.

"యద్ఘ్రాణభక్షో విహిత స్సురాయా
స్తథాపశోరాలభనం నహింసా
ఏవం వ్యవాయః ప్రజయా నరత్యై
ఇమం విశుద్ధం నవిదు స్స్వ ధర్మమ్." 5-13, 14

'యస్మా త్సురాయాః ఘ్రాణభక్షః అవఘ్రాణం స ఏవవిహితః నతుపానం. పశో రప్యాలభన మేవ విహితం నతు హింసా - అయమర్థః. దేవతోద్దేశేన య త్పశుహననం తదాలభనం వ్యవాయోఽపి ప్రజయా నిమిత్తభూతయా నతు రత్యై.' (వ్యా).

యజ్ఞ సమయమున నైనను సుర నాఘ్రాణింప వలసినదే కాని, త్రాగరాదు; దేవతా ప్రీత్యర్థము పశువు నాలభింపఁ దగునే కాని, ఇతరత్ర హింస చేయరాదు; స్త్రీతోడి కూటమి సంతానార్థమే కాని, కేవల కామతృప్తికొఱకు చేయరాదు - అని యర్థము.

అనువాదములోని యర్థము దీనికి భిన్నము.

## 151. 'సువర్ణుఁడు'

''హరి...హంసుండు సువర్ణుండు వైకుంఠుండు...అను
దివ్య నామంబులం...గణుతింపంబడు'' 11-77

తం. వా. కల్లూరి. రాయలు. బులుసు.

"సుపర్ణుఁడు" అని. హ. పాఠము. సాధువు.

''హంస స్సుపర్ణో వైకుంఠః'' అని మూలము. 5-23

## 152. 'అజగరము' - 'జలధి గజములు'

అవధూత గురువులు ఇరువది నలుగురు. వారిని తెలుపునది యీ క్రింది వచనము.

''భూ గగ నానిల జల కృపీటభవ సోమ సూర్య కపోత తిలిప్స శలభ మధుమక్షి కాజగర ద్విరేఫ హరిణ పాఠీన పింగళకా కురర డింభక కుమారికా శరకృత్సర్ప లూతా సుపేశకృ త్సముదయంబులు మొదలగువాని గుణంబు లెఱింగికొని యోగీంద్రులు మెలఁగుచుందురు.'' 11-97

ఇది తం. కల్లూరి. ప్రతుల పాఠము.

ఈ పాఠమున గురువుల సంఖ్య ఇరువది మూఁడే యగుచున్నది. ఆ యిరువది మూఁటి లోను, తిలిప్స - అజగర శబ్దములు రెం డున్నవి. రెంటికిని 'కొండ చిలువ' అనియే యర్థము. కావున ఆ రెంటిలో ఒకటి తొలగింపఁబడవలె. అప్పుడు సంఖ్య ఇరువది రెండే యగును. కాఁబట్టి పాఠము సరికాదు.

గురువులలో నుండవలసిన జలధి, గజము పై పాఠమున లోపించినవి. ఆ రెంటిని చేర్చి అజగరమును తొలఁగించినఁ గాని పాఠము చక్కఁబడదు. తక్కిన ప్రతులలో పాఠము సరిగానే యున్నది.

''పృథివీ వాయు రాకాశ ఆపోఽగ్ని శ్చంద్రమా రవిః
కపోతోఽజగర స్సింధుః పతంగో మధుకృ ద్గజః
మధుహా హరిణో మీనః పింగళా కురరోఽర్భకః
కుమారీ శరకృ త్సర్ప ఊర్ణనాభి స్సుపేశకృత్
ఏతే మే గురవో రాజం శ్చతుర్వింశతి రాశ్రితాః'' 7-35

## 153. 'తురంగ'

''యాదవులు దమలోఁ దాము......యుద్ధంబునకుఁ జొచ్చి మునిశాప కారణంబున సత్తుంగంబులైన తురంగ సమూహంబుల బడలు పడంగఁ బొడచుచు వ్రేయుచుం దాఁకునప్పుడు వజ్రాయుధ సమానంబులైన యాయుధంబుల నొండొరులం దాఁకి ఖండనంబునం గడికండంబులై యొరలు కబంధంబులును'' 11-118

తం. వా. రాయలు. బులుసు.

''తురగ సమూహంబుల'' - కల్లూరి.

''తురంగ సమూహంబుల...దాఁకునప్పు డవియును వజ్రాయుధ సమానంబులై'' - హ.

ఈ 'తురంగ' - 'తురగ' పాఠములు రెండును ప్రామాదికములే. యాదవులు నశించినది 'తుంగ' పుల్లలతో పొడుచుకొని. కాని, తురంగములతో పొడుచుకొని కాదు. అసలు 'తురంగములతో పొడుచుకొనుట' యుండదు. ఈ పాఠములో 'తుంగ' మాటయే లేదు. అది లేక కథ యేమున్నది ?

మూలము చూచిననే కాని విషయ మవగతము కాదు గనుక ఉదహరించుచున్నాము.

"శరేషు హీయమానేషు, భజ్యమానేషు ధన్వసు,
శస్త్రేషు క్షీయమాణేషు, ముష్టిభి ర్జహ్రు రేరకాః" 30-20
"తా వజ్రకల్పా హ్యభవన్ పరిఘా ముష్టిభి ర్ధృతాః
జఘ్ను ర్ద్విషంతః కృష్ణేన వార్యమాణాస్తు తం చ తే" 30-21
"అథ తా వపి సంక్రుద్ధా వుద్యమ్య కురునందన
ఏరకా ముష్టి పరిఘౌ చరంతౌ జఘ్నతు ర్యుధి" 30-23
'ఏరకా ముష్టిరూపౌ పరిఘౌ వుద్యమ్య' (వ్యా.)

ఏరక - యనఁగా తుంగ. యాదవులు కొట్టుకొన్నది తుంగపుల్లలతోనే. ఆ పుల్లలు మునిశాప ప్రభావమున వజ్ర సమానములై వారి నాశనమునకు మూలమైనవి. కాఁబట్టి 'తురంగ' పాఠము మూల విరుద్ధము.

'తుంగ సమూహంబుల బడలు పడంగఁ బొడుచుచు ప్రేయుచుం దాఁకు నప్పు డవియును వజ్రాయుధ సమానంబులై తాఁకిన ఖండనంబునం గడికండంబులై యొఱగు కబంధంబులును ...' - ఇత్యాదిగా నుండుట యుచితము.

'తుంగ సమూహంబులన్ = తుంగపుల్లల మొత్తములతో' నని యర్థము. - 'తుంగ సమూహ' మనుట. 'తమ్మ ప్రోవు' అనుట వంటిది.
(భా. అశ్వమేధ 3-31)

**154. 'ఆపదలను'**

"చోర హుతాశన సర్ప సం
హతులను దప్పి నాఁకటను బంచత నొందెడు నట్టి జీవుఁ డా
పదలను గుంది పూర్వ మగు పాపఫలంబు భుజించు" 12-27

వా. కల్లూరి. బులుసు. రాములు.

ఇది తకార ప్రాసపద్యము. 'ఆపదలను' అనుటచేతఁ బ్రాసము తప్పినది. కనుక పాఠ మసాధువు.

"జీవుఁడా, వెతలను బూర్వకర్మఫలవేదన నొందుచుఁ గుందు" అని హ. తం. పాఠము ఇది ప్రాసమును సరిపఱుచుటకు కల్పింపఁబడిన పాఠము. కవి పాఠము, —'జీవుఁ డా, పతులను గుందె' అని యుండును. ఆపతులను - అని యన్నను 'ఆపదలను' అనియే అర్థము.

'ఆపతి' — ఆపత్తికి వికృతి. అట్లే, సంపత్తికి 'సంపతి' వికృతి. ఆపతి, సంపతి నిఘంటువులలో లేవు గాని, లోకమున ప్రసిద్ధముగా నున్నవి.

తిరుపతి యాత్రికులు - కొండయెక్కునప్పుడు - "ఆపతి మొక్కులవాడా! అడుగడుగు దండాలవాడా! యేడుకొండలవాడా! వెంకట్రమణా!" అని సంబోధించుచుందురు.

''హాయీ! వోయీ! ఆపతుల గాయీ'' — అని స్త్రీలుపాడు జోలపాట. పల్లెటూళ్ళలో, 'సంపతమ్మ' - 'సంపతిగాడు' అను పేరులున్నవి.

'సంపతి'కి కవిప్రయోగమును ఉన్నది.—

పలుకుటిల్లాలి నెమ్మోము బాఁపనయ్యె
పొడము నెల పయ్యె సంపతి పువ్వుఁబోడి
కాటప ట్టయ్యె నే వేల్పుమేటిచేత
నలరు నెత్తమ్మి యా కాఁక వెలుఁగు చెలఁగు" రామా. పీఠిక 17

ఇది 1895. కం. వీరేశలింగంగారి ప్రతి పాఠము—

ఈ పాఠము. 1917. వావిళ్ళ ముద్రణములలో,— 'సంపత్తి పువ్వుఁబోఁడి'గా మాఱిపోయినది. అది భాషాసంప్రదాయము తెలియని పరిష్కర్త చేసిన మార్పు.

'సంపత్తి' సంస్కృత శబ్దము. 'పువ్వుఁబోఁడి' తెనుఁగు. ఆ రెంటిని జోడించి, 'సంపత్తి పువ్వుఁబోడి' (=సంపత్కాంత) అని రూపకముచేయుట కంటె 'సంపతి పువ్వుఁబోడి' అనుటయే యుచితము.

అస లది అచ్చతెనుఁగు పద్యము. అందులో 'సంపత్తి' అను తత్సమ పదముండఁ దగదు. పరిష్కర్త అదియును గమనింపలేదు. కనుక మార్పు తప్పు.

'సంపతిల్లు' అను క్రియయును గలదు, ('సంపతి' నుండి పుట్టినదే.)

''వీనుల కమృతంపు సోనలై వర్తిల్లు
శారికాముఖసూక్తి సంపతిల్లు.'' విజ. 1-187

ఇది శ. ర. లో 'సంపతిల్లు' క్రింద ఉదాహృతమైయున్న పాఠము.

ఇందలి 'సంపతిల్లు' వేదంవారి- (1911) ముద్రణములో- 'సందడిల్లు'గా మాఱిపోయినది. అదియును, 'సంపతి' అపశబ్ద మన్న భావముతో - వారో - వారికి ముందటివారో-చేసిన మార్పే.

'ఆపతులను' అనునదే కవిపాఠమనియు, అది తప్పనుకొని 'ఆపదలను' అని యొకరును. 'ఆవెతలను' అని యొకరును పాఠమును మార్చినా రనియు సారాంశము.

## 155. 'అరిందముఁడు'

''శివస్వామియు వానికి నరిందముండును...ఉదయించి'' 12-8

అని హ. పాఠము.

''శివస్వాతియు వానికి సరెందముండును''

అని తం. వా. కల్లూరి. బులుసు.

రెండు పాఠములలోను పొరపా టున్నది.

''చరమో యత్ర శివస్వాతి రరిందమః, తస్యాపి గోమతిః పుత్రః'' అని మూలము. 1-26

'అరిందమః' అనునది శివస్వాతికి విశేషణము గాని, ప్రత్యేక నామముకాదు, శివస్వాతి యొక్క కుమారుఁ డని యర్థమును కాదు. 'అరిందముండైన శివస్వాతి' అని యర్థము.

కాఁబట్టి పై పాఠములు రెండును సరియైనవి కావు.

పూర్వపరిష్కర్తల దృష్టిలోపడక నిలిచియున్న యిట్టి యపపాఠము లింకను గలవు. ఈ ప్రతిలో ఆ యా తావులందో చూపఁబడి యున్నవి.

# కొన్ని యతులు - వాని గతులు

మహాకవి పోతన అఖండయతిని, 'ఉ - వు' యతిని, 'ఋ - రు' యతిని విరివిగా వాడి యున్నాఁడు. ఈ మూఁడుఁగు యతులును పూర్వగ్రంథములలో ఉన్నవేకాని పోతన క్రొత్తగా కల్పించినవి కావు. కాని, అప్పకవి అఖండయతిని ఒప్పలేదు; తక్కిన రెంటిని చెప్పలేదు. అందు వలన తంజనగరంవారు ఆ యతులు దుష్టము లన్నారు. అవి, పోతన రచనలోని శిథిల భాగములను పూరించిన వెలిగందల నారయవి గాని పోతనవి కా వన్నారు (పీఠిక. పు. 38). అదియొక తప్పు సిద్ధాంతము.

ఆ సిద్ధాంతముతోనే వారు తొట్టతొలి పద్యములోని అఖండయతిని మార్చివేయుట. అట్లే గ్రంథములోని యతులను గూడ కొన్నిటిని మార్చినారు. వారి ననుసరించి, పిమ్మటి పరిష్కర్తలు మఱికొన్నిటిని మార్చినారు. వారి వీరి చేయి సోకనివి కొలఁదిగా నిలిచియున్నవి. ఇవి-భాగవతము లోని యతులకు పట్టిన గతులు.

అప్పకవి ప్రాఁతనుబట్టి అంతకు పూర్వులైన మహాకవుల కృతులలోని యతులను దిద్దుటయే తప్పు. ఆ దిద్దుపాటులలోను పొరపాటు లున్నవి. అది విశేషము.

పోతన భాగములలోను, నారయ రచనలోను కొన్ని పద్యములలో యతులు తప్పి యున్నవి. కొన్ని సవరింపఁబడినవి; కొన్ని అట్లే యున్నవి. ఈ యంశము లన్నియు ఈ క్రింది పరామర్శలో తెల్లము కాఁగలవు.

**అఖండయతి :**

ఇంతకుముందటి పాఠవిమర్శలో అఖండయతులు కొన్ని చూపఁబడినవి. ఇంకను కొన్ని:-

1. ఎట్టివారి కిం, ''పొడవఁగఁ గానవచ్చు గురువుల్'' 3-256
   ఇది ప్రాఁతప్రతులందోను, 'తం' ప్రతిలోను ఉన్నపాఠము.
   ఎట్టివారి మేల్, ''వదలక కానవచ్చు గురులన్'' అని మార్పు. (వా.)
2. ''నరుఁడు నీ మాయ నెట్టైన నగుచునుండు'' 10 పూ. 558
   ఇది 'హ.' పాఠము — 'అరుద నీ మాయ' అని మార్పు. (తం. వా.)
3. క్రిం, ''దటి బాముల నేమి నోచితమ్మ ధరిత్రీ!'' 10 పూ. 1017
   (మార్పులేదు)
4. ''నడచెఁ గృష్ణుని రథము వెన్నంటి చెలఁగి'' 10. ఉ. 392
   'వెన్నడి చెలంగి' అని మార్పు. (తం. వా.)
   'వెన్నడి వలెనే 'వెన్నంటు' కూడ శబ్దపల్లవ క్రియయే. (ఏకపదమే) కావున మార్పు అనవసరము.
5. చెలు, ''పొలయఁగఁ బాటించి యుద్ధమున కిట్లనియెన్'' 10 ఉ. 661
   (మార్పులేదు)
6. సహదే, ''వుసిఁ బట్టముగట్టెఁ దన్న వోన్నతపదవిన్'' 10 ఉ. 740
   (మార్పులేదు)

7. సా, ''ల్వం బదియేను తూపుల సమోన్నత వక్షము గాఁడనేసినన్'' 10.ఉ. 853
ఇది హ. వా. పాఠము.
సా, 'ల్వం బదియేను బాణముల నున్నత వక్షము' అని మార్పు. (తం.)
ఈ మార్పున, అప్పకవీయము ప్రకారము - యతిభంగము.

8. పెం, ''పౌనరం గావించి బంధు బుధ యుతుఁడై'' 10.ఉ. 1037
ఇది 'హ' పా.—'బంధు యుక్తముగా' అని మార్పు (తం. వా.)

9. పుండరీకనే, ''త్రుని నిజధామ వైభవ సమున్నత తన్మహనీయ మూర్తికిన్.'10.ఉ.1313
ఇది 'హ'.పా.—'వైభవ సమృద్ధికి' అని మార్పు. (తం. వా.)
ఈ యతియు అప్పకవి ప్రకారము తప్పే.
అఖండయతి సుప్రసిద్ధము గావున, గ్రంథవిస్తర మెందు కని యుదాహరణము లెక్కువగా నియ్యలేదు.

'ఉ - వు' యతి :

1. అభిమత, ''మొప్పఁగఁ దగు సప్తతంతువులు గావింపన్'' 2-96
ఇది 'తం' పా.—''ఒప్పఁగ నా సప్తతంతు వొగిఁ గావింపన్'' అని మార్పు. (వా.)

2. వా, ''వున నీ వేకర్ తుంపు సజ్జనహితోద్యోగాను రక్తుండవై'' 3-665
ఇది వ్రాఁతప్రతుల పాఠము.
'సజ్జనహిత ప్రోద్యోగ రక్తుండవై' అని మార్పు. (తం. వా.)

3. హాహారవ, ''మొదవఁగ నిట్లనిరి మానవులుఁ ద్రిదశులు'' 4-100
ఇది హ. తం. పా.—
'హాహాధ్వని, వొదలఁగ' అని మార్పు. (వా.)

4. పొడ, ''వునుఁ బంచసప్తతి యోజనముల'' 4-137
ఇది వ్రాఁతప్రతిలోను, తం-ప్రతిలోను ఉన్న పాఠము.
పొడ, 'వొగిఁ బంచసప్తతి యోజనముల' అని మార్పు (వా)

5. కా, ''వున జలదాగమోదితపయోనివహంబు'' 4-499
వ్రాఁతప్రతి. తం. ప్రతి పాఠము.
ఒ, 'య్యన...పయః ప్రకరంబు' అని మార్పు. (వా.)

6. కా, ''వున నిలఁ బుణ్యతీర్థముల నొప్ప'' 4-929
వ్రాఁతప్రతి. తం. ప్రతి - పా.-
'పుణ్యతీర్థములఁ బోల' అని మార్పు. (వా.)

7. ''ఉర్వరఁ గల రేణువులకన్న దట్టమై'' 6-441
వ్రాత. హ. ప్రతుల పా.—
'భూస్థలిఁగల రేణువులకన్న' అని మార్పు (తం. వా.)

8. కా, "వునఁ దగి నర్జునుఁడు పవనోద్భవుఁ డేనును"
హ. తం. పాఠము.
కా, 'వున విజయుండునుం బవనపుత్రుఁడు నేనును' అని మార్పు. (వా.)

9. "సా, ల్వుం బవియేను బాణముం నున్నతపక్షము" 10.ఉ.853
ఇది 'తం' పాఠము. 'పడియేను తూపులనవోన్నత' అని మార్పు. (వా.)

10. మ, "హోగ్రుఁడై పట్టితెచ్చె సాల్వుండు గదఁగి"
మార్పులేదు. 10. ఉ. 896

11. "ఒనరింప మీఱి నవ్వుటయుఁ గ్రోధ" 10. ఉ. 1150
మార్పులేదు.

ఉకారము వాడుకలో 'వు' గా ఉచ్చరింపఁబడుటను బట్టి, 'ఉ-వు' లకు యతి కూర్పఁబడినది. ఇదియును కవు లంగీకరించినదే.

"ఒక్కని డించి పోవుటకు భీతిల్లి" (నవనాథ. పుట. 92)
"దే, వునకు ననుంగువాఁడ నని యుత్సుకతన్ నుతియింతు" (నృషాధిప-98)
కా,"వునఁ జందాలుఁడవౌదు సందియము లేదూహింప" (ధర్మఖండము 3-82)
(చూ. శ్రీ సంపత్కుమారాచార్యులుగారి 'తెలుగు ఛందోవికాసము.' పు. 161)

**'ఋ - రు' యతి :**

"దు. ష్కృతులం ద్రోతురు తాంచక్ర మహితాస్త్రుండట్టి" 10. ఉ. 1330
ఇది తం. వా. లోను. వ్రాఁతప్రతులలోను ఉన్న పాఠము.
"మహితాసింబట్టి" అని హ. ప్రతిలో మార్పు.
మార్పు అనవసరము. మహాకవుల ప్రయోగములున్నవి.
"క్రూరార్థ చంద్రాస్త్ర కృత్తోరుబాహులై" (భాస్క. యు. 1449)
"భృత్యుం డాతఁడు మూఁడు లోకములలో రూపింప సర్వేశ్వరా !" (స. శ.)

**'ఋ - ఉ' యతి :**

"మృదుల పక్వాన్న భోజనములను మాని" 11-74
ఇందు 'మృ - ము'లకు యతి చెల్లింపఁబడినది. అట్లు చెల్లింపరాదని కాఁబోలు 'హ' ప్రతిలో - "మృదుల పక్వాన్నములను దామెనఁగఁగోరి" అని మార్పుచేయఁబడినది.

మార్పు నక్కఱలేదు. ఋకార సహిత వర్ణమునకును, ఉత్వోత్వసహిత వర్ణములకును యతి చెల్లించుట కలదు.

"మృడుఁడా యపస్మారమును బడఁద్రొక్కి" పండి. వాద. పు. 683
"గృహధర్మ నిరతులు కొనియాడు భక్తిపూ, ర్వకముగా" భోజ. 3-27
(ఈ యతులను గూర్చిన వివరములకు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి 'భాషా పరిశోధన' చూడనగు.)

'ద్రు - దె' యతి :

"ద్రుహిణ తనూభవుండు చనుదెంచుట" 10. ఉ. 1266

"రు, ద్రుని యందలి సత్వగుణము దెలియుట కొఱకై" 10. ఉ. 1267

అప్పకవీయము ప్రకారము 'ద్రు - దె' లకు యతి చెల్లదు. అందువలన తంజనగరం వారు 'ద్రుహిణ' పాఠము సర్దే యుంచి, "కవి 'దృహిణ' శబ్దముగా భావించియుండు నన్నారు.

రెండవ పద్యపాఠమును "రు, ద్రునియందలి సత్వగుణ మెఱుంగుట కొఱకై" అని మార్చి యతిని సరిపెట్టినారు.

కాని, వారు త్రొక్కిన త్రోవ సరియైనది కాదు. 'పోతన ద్రుహిణ శబ్దమును 'దృహిణ' శబ్దముగా భ్రమించియుండు' ననుకొనుటకంటెను, ఆయన 'ద్రు - ద్రె' లకు యతిచెల్లింపవచ్చునని భావించియుండు ననుకొనుట సమంజసము. ఒకటికి రెండుమార్లు - ఆ యతిని ప్రయోగించి యుండుటయే అందుకు తార్కాణము.

'ద్రు - దె' లకు కూర్పఁబడిన మైత్రి సూటియైనది కాదు. కొంచెము డొంక తిరుగుడుగా అతుకు పెట్టఁబడిన దూరపు సంబంధము. ఎట్లనఁగా:

పోతన 'రు - ఋ' లకు యతి చెల్లించియున్నాఁడు. - 'ద్రుహిణతనూభవుండ్కు తన్న దృష్టికి' అన్నచో, ఆయన మతమున యతి సరిపడును, యతి విషయమున 'దృ' - 'దె' సజాతీయములు. కనుక 'ద్రు' తో 'దృ'కు మైత్రి చెల్లినప్పుడు 'దె' కు మాత్ర మెందుకు చెల్లదు ?

ఈ దృష్టితో కూర్చఁబడినదే 'ద్రు-దె' లకు మైత్రి. ఇదియొక అపూర్వ యతిగా భావించుట యుచితము గాని, పోతన ద్రుహిణ శబ్దము విషయమున భ్రమపడినాఁ డనుట గాని, ఆయన బుద్ధిపూర్వకముగా ప్రయోగించిన యతిని మార్చుటగాని యుచితముకాదు. విజ్ఞు లింకను విచారింతురు గాక.

ఇంతవఱకును చూపఁబడిన భాగవత యతు లన్నియు, ఆ కవుల మతము ననుసరించి సరియైనవే యనియు. పోతన రచనలోని యతులు, ఆయనగారు వాడినవే కాని ఇతర ప్రక్షిప్తములు కావనియు, పరిష్కర్తలు తమ యిష్టప్రకారము మార్చివేయుట పరిష్కరణ పద్ధతి కాదనియు సారాంశము.

## భాగవతము - వ్యావహారిక భాష

భాగవత కవులు వాడుక భాషను ధారాళముగా నుపయోగించుకొన్నారు. ఛందోబద్ధము కూడ చేసినారు. అది యా కవుల సంప్రదాయము. అది గమనింపక పరిష్కర్తలు పెక్కు తావులలో గ్రాంథికములోనికి మార్చినారు. గ్రంథవిస్తర భీతిచేత ఒకటి రెండు పట్టులు మాత్రమే యెత్తి చూపఁబడుచున్నవి.

1. "పొడువు కొంచమీఁవఁ బొడిచింది మొదలుగా" 10. పూ. 800

అని వ్రాఁత ప్రతులలోను. హ. ప్రతిలోను పాఠము.

'పొడుచుట మొదలుగా' అని సవరణ. (తం. వా.)

2. ''జాలముల నుండి ముత్యాల శాసలొలుక'' 10. ఉ. 667
అని వ్రాత ప్రతులు; హ. ప్రతి ('శాస' - యతిస్థానమున నున్నది.)
''సీమలందుండి ముత్యాల సేసలొలుక'' అని మార్పు. (తం. వా.)

3. ''చన్నుల జిలుఁగు కంచలల నడుమ'' (నఱుమ) 10. ఉ. 799
అన్ని ప్రతులలోను ఇట్లే యున్నది. 'కంచల'లోని 'చ' యతి స్థానమున నున్నది. 'కంచెల' గ్రాంథిక రూపము. పరిష్కర్తలు గుర్తింపలేదేమో ! దిద్దలేదు.

4. ''శరణంబులు నీ పదాబ్జ శావానిరతుల్'' 11-15
'నీదు దివ్యచరణంబులిలన్' అనియు, 'నీ పదాబ్జసంస్మరణంబుల్' అనియు మార్పులు. (తం. వా.)

ఇట్టివి చాల కలవు. ఇక్కడ చెప్పవచ్చినది, - పొడిచించె; శాసలు; కంచల; శావా- అనునవి సాధురూపము లని కాదు. అవి ఆ కవు లిష్టపడి వాడుకొన్న శబ్దము లనియు, వానిని మార్చరాదనియును. అంత మాత్రమే.

**యతిభ్రంశములు :**

ఈ క్రింది పద్యపాదములలో యతులు తప్పి యున్నవి. పరిష్కర్తలు కొన్ని సవరించి నారు; కాని ఆ సంస్కరణలవలనను ఆ లోపము తొలఁగలేదు.

1. మాల్యాంబరా - ''ఘరణలేపనముల నమరియుండి'' 10. పూ. 1716
2. బాహాబలా - ''వార్యుండై శితసాయకాలి నవి మాయం చేసినన్'' 10. ఉ. 560
3. ''హృద్వీథి సతతంబు నిలుపవలయు'' 11-44
'నినుపవలయు' అని సవరణ. (తం.) ఇందును యతి తప్పినది.
4. అం- ''తర్భావంబునను బోధమంతయు' అని మార్పు. (తం. వా.)
ఈ మార్పులోను యతి తప్పియే యున్నది.

ఈ ఛందోదోషములన్నియు ప్రమాద మూలకములు. మహాకవులకును ప్రమాదము లుండును. మఱియు వారొకొక్కచోట వ్యాకరణ నియమముల నుల్లంఘించుటయు నుండును. వారి ప్రయోగము లెట్టివైనను, అవి యట్లుండవలసినదే కాని, యితరులు మార్చరాదు. ఛందో భంగాది దోషములు సంస్కృత భాగవతమునను ఉన్నవి, కాని వానిని పరిష్కర్తలెవ్వరును సవరింపలేదు. ఈ యాంధ్రభాగవతమున పూర్వ పరిష్కర్తలు పెక్కు మార్పులు చేసియున్నారు; అవి యీ పరిష్కరణమున కొంతవఱకు చక్కఁబఱుపఁబడినవి. గుణదోషములకు సహృదయులైన విమర్శకులు ప్రమాణము.

''తం సంతః శ్రోతు మర్హంతి సదసద్వ్యక్తి హేతవః
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామి కాపి వా.''

**తాళపత్ర ప్రతులు :**

ఆంధ్రదేశమునందును ఆంధ్రదేశము బయటను భాగవతమునకు సంబంధించిన తాళపత్ర గ్రంథములు వందల సంఖ్యలో కలవు. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు నుండి 150, గౌతమీ గ్రంథాలయము రాజమంద్రి నుండి 14, ఆంధ్రేతిహాస పరిశోధక మండలినుండి 13, తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీనుండి 51, మధురనుండి 2, ఆంధ్రసారస్వత పరిషత్తు హైదరాబాదు నుండి 7, లక్ష్మణరాయ పరిశోధకమండలి హైదరాబాదునుండి 10, ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి 10, తాళపత్ర ప్రతుల సమాచారము వానికి సంబంధించిన వివరములు సేకరించితిమి. భాగవత పరిష్కరణమునకు వీనినుండి 26 ప్రతులు ఎన్నుకొంటిమి. ఈ ప్రతులు తెలంగాణము, రాయలసీమ, కోస్తాజిల్లాలు - అనగా తెలుగుదేశ మందలి ప్రధానమైన మూడు మండలములకు సంబంధించినవి. పరిష్కరణమునకు ఎక్కుడుగా నుపకరించినవి ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడ, గౌతమీ గ్రంథాలయము రాజమంద్రి, ఆంధ్రసారస్వత పరిషత్తు హైదరాబాదు వంటి సంస్థలవారి యమూల్య తాళపత్ర గ్రంథములు. తాళపత్ర గ్రంథములందలి పాఠములకు 'క, చ, ట, త, ప, గ, జ, డ, ద, బ, య, ర' అను సంకేతములను అధోజ్ఞాపిక లందిచ్చి యున్నాము. వీనితో య, ర సంకేతములు ప్రథమ స్కంధము ప్రారంభమునుండి 175 పద్యముల వఱకే వాడితిమి. పాఠభేదము లంతగా కానరాని యా రెండు తాళపత్ర గ్రంథములు తీసివైచి అటుపైని క, చ, ట, త, ప, గ, జ, డ, ద, బ యను సంకేతములే వాడితిమి. ఈ సంకేతము లేయే తాళపత్ర గ్రంథములకు ప్రాతినిధ్యము వహించునో వాని వివరములు దిగువ పేర్కొనఁబడినవి.

క. 1. నెం. 4163 కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. శ్రీ రామునింపై నున్న చక్కని ప్రతి. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు అనంతపురం మండలమున సేకరించినది. రాయలసీమ ప్రతి. ఇది భాగవతము ప్రారంభము నుండి సప్తమ స్కంధము 132 వ పద్యాంతము వఱకు సంప్రతింపఁబడినది.

2. నెం. 1203. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. ఇది జ్ఞాన విద్యుత్ప్రవాహినీ ఆంధ్రభాషానిలయం ఖమ్మం నుండి కాకినాడ చేరుకొన్నది. తెలంగాణము ప్రతి. దీనిలో షష్ఠ స్కంధము కూడ పోతనామాత్య విరచిత మనియే కలదు. అష్టమ స్కంధము చివర రాక్షసనామ సంవత్సర చైత్ర శు॥ ౧౩ మందవాసరం (క్రీ. శ. 31-3-1855) అని కలదు. దీనిని సప్తమ స్కంధము 133 వ పద్యమాదిగా అష్టమ స్కంధాంతము వఱకు సంప్రతించి యుంటిమి.

3. నెం. 4179. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. నెల్లూరి ప్రాంతము నుండి శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు పంపించినది. రాయలసీమ ప్రతి. నవమ స్కంధము ప్రారంభము నుండి ద్వాదశ స్కంధాంతము వఱకీ ప్రతి సంప్రతింపఁబడినది.

చ. 1. నెం. 1191. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. సంపూర్ణ ప్రతి. ఇందు ఏకాదశ ద్వాదశ స్కంధములు కూడ పోతన పేరుతోఁ గలవు. దశమ స్కంధము పూర్వభాగము చివర సౌమ్యనామ సంవత్సర ఆషాఢ శుద్ధ విదియ గురువారం (క్రీ. శ. 35-6-1789) అని కలదు. "యాదాళం చలమన్న కొమారుడు చిన్న

సుబ్బయ్యకు ఘట్టులో వుండే పబ్బతి వెంకట నార్గప్ప" వ్రాసియిచ్చినట్లు కలదు రాయలసీమ ప్రతి. దీనిని ప్రారంభము నుండి చివర వఱకు సంప్రతించి యుంటిమి.

ట. 1. నెం. 18. ఆంధ్ర సారస్వత పరిషత్తు హైద్రాబాదు వారిది. వనపర్తి సంస్థానాధీశ్వరు లిచ్చినది. తెలంగాణము ప్రతి. వనపర్తి రాజ్ఞి రాయకేసమ్మ దేశాయిగారికి ముంగర నర్సన్న శా. శ. ౧౭౫౪ నందన మార్గశిర బహుళ విదియ భానువారం క్రీ. శ. (9-12-1832) నాడు వ్రాసి యిచ్చినది. ఇది ప్రారంభము నుండి చతుర్థ స్కంధాంతము వఱకు సంప్రతింపఁ బడినది.

2. నెం. 15. ఆంధ్ర సారస్వత పరిషత్తు హైద్రాబాదు వారివి. పై నున్న నెం. 18 ప్రతికి సంబంధించినదే యీ ప్రతి. నవమ స్కంధాంతమున వ్రాయసకాడు ముంగర నర్సన్న శా. శ. ౧౭౫౫ విజయనామ సంవత్సర వైశాఖ బహుళ షష్ఠి భృగువారం (క్రీ. శ. 10-5-1833) నాటికి ముగించినట్లున్నది. దీనిని పంచమ స్కంధము ప్రారంభము నుండి నవమ స్కంధాంతము వఱకు సంప్రతించితిమి.

3. నెం. 1640. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. రంగనాథరావుగారు రాయలసీమ నుండి సంపాదించిన ప్రతి. దశమ స్కంధము ప్రారంభము నుండి ద్వాదశ స్కంధాంతము వఱకు సంప్రతింపఁ బడినది.

త. 1. నెం. 34. రాజమహేంద్రవరము గౌతమీ గ్రంథాలయము వారిది. పెద్దాపుర సంస్థానాధీశ్వరు లిచ్చినది. పంచమ స్కంధము చివర రాజావత్సవాయి జగన్నాథ రాజుగారి పుస్తకమని యున్నది. ప్రథమ స్కంధాంతమున ప్రమాదినామ సంవత్సర మాఘశుద్ధ విదియ ఆదివారం (క్రీ. శ. 2-2-1774) నాటికి గొట్టిముక్కల జగన్నాథ రాజుగారి ప్రతిని చూచి చిరువూరు గురువరాజు వ్రాసినట్లున్నది. ఇది గోదావరి మండలము ప్రతి. ప్రారంభమునుండి పంచమస్కంధాంతము వఱకు సంప్రతింపఁబడినది.

2. నెం. 4140. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారు సంపాదించినది. దీని పంచమ స్కంధమున నాశ్వాస విభజనము లేదు. షష్ఠ స్కంధము పోతనామాత్యుని పేరుతో నున్నది. షష్ఠ స్కంధము ప్రారంభము నుండి నవమ స్కంధాంతము వఱకు సంప్రతింపఁ బడినది.

3. నెం. 2538. కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిది. బద్దెవోలు గురవయ్యగారిచ్చినది. రంగనాథరావుగారు సంపాదించినది. వ్రాయసకాడు బద్దెవోలు గురవప్ప. షష్ఠ స్కంధము సర్వధారినామ సంవత్సర ఆశ్వయుజ బహుళ దశమి (క్రీ. శ. 2-11-1828) నాటికిని, ద్వాదశస్కంధము శా. శ. ౧౭౫౧ విరోధి పుష్యశుద్ధ పంచమి (క్రీ. శ. 30-12-1829) నాటికిని ముగిసినట్లున్నది. దీనిని దశమ స్కంధము ప్రారంభము నుండి ద్వాదశ స్కంధాంతము వఱకు సంప్రతించి యుంటిమి.

ప. నెం. 1638. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. రాయలసీమ ప్రతి. ద్వాదశ స్కంధాంత గద్యము పోతన పేరుతో నున్నది. చిట్టచివర 'స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౭౪౦ అగు నేటి బహుధాన్యనామ సంవత్సర మార్గశిర

బహుళ విదియ ఇందువాసరం (క్రీ.శ. 14-11-1818) వరకు కొఅపాటి భాస్కరయ్య వ్రాసిన భాగవతం ద్వాదశ స్కంధాలు' అని కలదు. ఇది దశమ స్కంధము ప్రారంభమునుండి ద్వాదశ స్కంధాంతము వఱకు సంప్రతింపఁబడినది.

గ నెంబరులేదు. కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తువారిది. వ్రాయసకాడు బండి గోపాలం. దశమ స్కంధము పూర్వభాగము చివర శుక్ల నామ సంవత్సర ఆశ్వీజశుద్ధ ద్వాదశి గురువార (క్రీ. శ. 12-10-1749) మనియు, ఉత్తరభాగము చివర శుక్ల నామ సంవత్సర పుష్య బహుళ తదియ ఆదివార (క్రీ. శ. 14-1-1750) మనియు కలదు. ఇది కోస్తా జిల్లాలకు సంబంధించిన ప్రతి. దశమ స్కంధము ప్రారంభము నుండి ద్వాదశ స్కంధాంతము వఱకు సంప్రతింపఁబడినది.

ఙ. 1. నెం. 1318, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది; రంగనాథరావుగారు సంపాదించినది. గ్రంథారంభమున దీని యజమాని పోలెపల్లె రామన్న యని కలదు. కోస్తా జిల్లాలకు సంబంధించిన ప్రతి. దీనిని ప్రారంభమునుండి సప్తమ స్కంధాంతము వఱకు సంప్రతించితిమి.

2. ప. సంకేతమునకు ప్రాతినిధ్యము వహించు నెం. 1638 ప్రతి స్థానమున అష్టమ స్కంధము ప్రారంభము నుండి నవమ స్కంధాంతము వఱకు సంప్రతింపఁబడినది.

3. నెం. 2728, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. దూపాటి వెంకట రమణాచార్యులుగారు ఎనమదల నుండి సంపాదించి పంపినది. తెలంగాణము ప్రతి. దశమ స్కంధము పూర్వోత్తర భాగములకై సంప్రతింపఁ బడినది.

4. 3456. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. దూపాటి వెంకటరమణాచార్యులుగారు తెలంగాణము (బమ్మెర ప్రాంతము) నుండి సేకరించి పంపించినది. ద్వాదశ స్కంధాంత గద్య పోతనామాత్యుని పేరుతో నున్నది. దీనిని ఏకాదశ ద్వాదశస్కంధములకై సంప్రతించితిమి.

చ. 1. నెం. 1533. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. చక్కని ప్రాచీన ప్రతి. కోస్తా జిల్లాలకు సంబంధించినది. ప్రారంభము నుండి నవమ స్కంధాంతము వఱకు సంప్రతింపఁ బడినది.

2. నెం. 1212. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది; జ్ఞాన విద్యుత్ప్రవాహినీ ఆంధ్ర భాషా నిలయము ఖమ్మం నుండి సంపాదించినది. తెలంగాణము ప్రతి. దశమస్కంధము పూర్వ భాగమున ప్రారంభము నుండి 530 పద్యముల వఱకు సంప్రతింపఁ బడినది.

3. నెం. 4200. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. తంజావూరు నుండి వచ్చినది. దక్షిణాదిప్రతి. దశమ స్కంధము పూర్వ భాగమున 531 నుండి 557 పద్యములవఱకు సంప్రతింపఁ బడినది.

4. నెం. 9, హైద్రాబాదు లక్ష్మణరాయ పరిశోధన మండలి వారిది. తెలంగాణము ప్రతి. దశమ స్కంధము పూర్వ భాగమున 558 నుండి 1258 పద్యములవఱకు సంప్రతింపఁ బడినది.

5. నెం. 4200. పైని పేర్కొన్న తంజావూరు ప్రతియే. 1259 నుండి 1578 పద్యము వఱకు సంప్రతింపఁబడినది.

6. నెం. 13. ఆంధ్ర సారస్వత పరిషత్తు హైద్రాబాదు వారిది. వనపర్తి సంస్థానాధీశ్వరు లిచ్చినది. తెలంగాణము ప్రతి. దశమ స్కంధము పూర్వ భాగమున 1579 పద్యము నుండి దశమస్కంధము ఉత్తర భాగాంతము వఱకు సంప్రతింపఁబడినది.

1. నెం. 19. ఆంధ్ర సారస్వత పరిషత్తు హైద్రాబాదు వారిది. వనపర్తి సంస్థానాధీశ్వరు లిచ్చినది. తెలంగాణము ప్రతి. ప్రారంభమునుండి తృతీయ స్కంధాంతము వఱకు సంప్రతింపఁబడినది.

2. నెం. 40. రాజమహేంద్రవరము గౌతమీ గ్రంథాలయము వారిది. పెద్దాపురం వత్స వాయి రాజు లిచ్చినవి. వత్సవాయి పత్తిపాటి వెంకటపతిరాజుగారికి రేమెళ్ళ పాపయ్య, ప్రమాది సంవత్సర కార్తిక శుద్ధ పంచమీ శుక్రవారం (క్రీ. శ. 8-11-1793) నాటికి వ్రాసిఇచ్చినది. కోస్తా జిల్లాల ప్రతి. దీనిలో పంచమ స్కంధాంత గద్యము పోతనా మాత్యుని పేరుతో నున్నది. దీనిని పంచమ స్కంధము ప్రారంభమునుండి నవమ స్కంధాంతము వఱకు సంప్రతించితిమి.

1. నెం. 4087. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. అనంతపురం మండలమునుండి మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తెచ్చినది. రాయలసీమ ప్రతి. ప్రారంభము నుండి యష్టమ స్కంధాంతము వఱకు సంప్రతింపఁబడినది.

2. నెం. 3941. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. దూపాటి సోదరులు తెలంగాణమునుండి సేకరించి పంపించినది. ఇందులో షష్ఠ స్కంధముకూడ పోతనామాత్య విరచితమని కలదు. అష్టమ స్కంధము చివర రాక్షసనామ సంవత్సర మాఘ బహుళ పంచమీ స్థిరవారం (క్రీ. శ. 27-2-1786) నాటికి రంగరాజు వెంకటసర్సు వ్రాసి నట్లున్నది. దీనిని నవమ స్కంధము కొఱకు మాత్రము సంప్రతించితిమి.

పై తాళపత్ర గ్రంథములు కాక వివిధ ముద్రిత ప్రతులను కూడ పరిశీలించి వానిలో కేవలము మూఁడింటిలోని పాఠాంతరములను మాత్రమే హ. తం. వా. సంకేతములతో నిధోజ్ఞాపికలం దిచ్చియున్నాము.

పురాణం హయగ్రీవశాస్త్రిగారి ప్రతి. 1855.

తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారి ప్రతి. 1905.

వావిళ్ళవారి ప్రతి. 1948.

## భాగవతము - ఇతర భాషలు

భారతదేశమున నితరదేశీయ భాషలందలి భాగవతములఁ గూర్చిన సమాచారమును శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తమ 'పోతన' కృతిలో విపులముగా నిచ్చియున్నారు. దాని సారాంశ మిది:

*తమిళము* :- పదునాఱవ శతాబ్దమున వరదరాజ అయ్యంగారు విశిష్టాద్వైత సంప్రదాయానుసారముగను, క్రీ. శ. 1700 ప్రాంతమున అరియప్ప పులవర్ అను నాతఁడు సంగ్రహముగను, క్రీ. శ. 19 వ శతాబ్దిలో కలంగుడి నటేశశాస్త్రిగారును భాగవతమును తమిళమున ననువదించిరి.

*కన్నడము* :- క్రీ. శ. 1530 ప్రాంతమున విఠలనాథు డను కవి విశిష్టాద్వైత సంప్రదాయానుసారముగా భామినీ షట్పదులందు సంగ్రహముగా భాగవతమును రచించెను.

*మలయాళము* :- సుప్రసిద్ధ ప్రాచీన మళయాళ కవి ఎజుతచ్చన్ భాగవతము పది స్కంధములు మాత్రము వ్రాసినట్లు కొందఱును, తద్భిన్నముగా మఱికొందఱును చెప్పుదురు. శేష భాగమును రచించినవారు పురయన్నూర్ నంబూద్రిపాదు, ప్రన్న సేరినంబి యను వారలు.

*మహారాష్ట్రము* :- మహాభక్తుఁడగు ఏకనాథుఁడు క్రీ. శ. 1580 ప్రాంతమున మహారాష్ట్రిమున చాల క్లుప్తముగా రచించెను.

*గుజరాతీ* :- రత్నేశ్వరుఁడను కవి (1560-1720) చాల సంగ్రహముగను, భలణుఁడును (1434-1514), ప్రేమానందుఁడును (1636-1734) దశమస్కంధమును, నకరురుఁడును (1500-1575) విష్ణుదాసుఁడును (1564-1632) కొన్ని యుపాఖ్యానములను భాషాంతరీకరించిరి.

*ఒరియా* :- జగన్నాథదాసుఁ డను భక్తకవి సమగ్ర భాగవతమును ఓఢ్రభాషలోని కనువదించెను. ఈతఁడు మన పోతనగారికి కొంచెము తరువాతివాఁడు.

*బెంగాలీ* :- పదునాఱవ శతాబ్దికి చెందిన మాలాధరదాసు అను కవీశ్వరుఁడు భాగవతానువాద మొనర్చెను.

*అస్సాము భాష* :- శంకరదేవుఁ డను మహాకవి (క్రీ.శ.15 వ శతాబ్ది) తొలుత సంపూర్ణ భాగవతమును పద్యకృతిగా రచించెను. ఈతఁడు కాక మఱి తొమ్మండుగురు కవులు వేఱువేఱు స్కంధములను రచించిరి.

*హిందీ* :- వల్లభ సంప్రదాయము ననుసరించి దశమ స్కంధమునకు శ్రీకృష్ణలీలలకు ప్రాధాన్య మొసఁగి వ్రాసిన గేయకృతి, మహాకవి సూరదాసకృత సూరసాగరము. ఇది భాగవతమున కనువాదము కాదు. పదునెనిమిదవ శతాబ్దమున నామూలాగ్రముగ గద్యానువాదము వెలయించినాఁడు సదాసుఖపాల్ అను రచయిత. కృష్ణలీల లాధారముగా హిందీలో పెక్కు రచనములు కలవు.

# సంపాదకత్వ నిర్వహణము

మాతృభాషా సారస్వతము మీఁది ప్రేమతో, మహాకవి పోతన కవిత్వముపట్ల గౌరవ ముతో ఈ బృహత్కార్యమును సంకల్పించి, సమస్త సాధన సామగ్రిని సమకూర్చి ఆంధ్రుల కందించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి వారికి మా అభినందనములు.

కార్యనిర్వహణమునందు అభినివేశముతో సహకరించిన విద్వత్పరిశీలకులకు మా కృతజ్ఞత.

పరిశీలనమందు శ్రద్ధతో సంతరించిన బహువిషయ వివిధ పాఠాంతర విశేషములు సాకల్య ముగా లిఖితములై ప్రత్యేక సంపుటములుగా సిద్ధము చేయఁబడి అకాడమీ భాండాగారమునఁ గలవు. భావిపరిశోధకుల కవి బహుధా ఉపకరించునని ఆశించుచున్నాము.

శ్రీ మహాభాగవతము వ్రాఁతప్రతులు 257 సంపాదించితిమి. వాని నన్నిటిని పరస్ప రము పోల్చి పరికించి 26 ప్రతులు వేఱుపఱచితిమి. వానిని 16 గురు పరిశీలకులతో ప్రతిపంక్తిగా చదివి భిన్నభిన్న పాఠములను సేకరించితిమి. ఈ విధముగా ఎత్తి వ్రాసిన పాఠములను దిరిగి శ్రద్ధతో పరిశీలించిన పిమ్మట పాఠస్వీకారము జరిగినది. మేము పరిగ్రహించిన పాఠములను, పరిశీలకులచే సంగ్రహింపఁబడిన సర్వపాఠాంతరములను, తుది నిర్ణయమునకు ముందు సమీకృత ముగా పునః పర్యాలోచనకు పెట్ట నిశ్చయించితిమి.

శ్రీ తాపీ ధర్మారావుగారిని, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారిని ఈ పర్యవేక్షణ కొఱకు ఆహ్వానించితిమి. సంపాదకులును నిర్ణాయకులును కలిసి తిరిగి భాగవతము ప్రతిపద సమగ్రముగా పరిశీలించిరి. అందు నిర్ణీతములయిన పాఠములు ముద్రణ కెక్కినవి. పాఠాంతరములును, వాని వివరములును ఆయా పుటలక్రింద నీయఁబడినవి. ఈ కార్యము 16-4-1962 తేదీని ప్రారంభమై 23-6-1963 తేదీని పూర్తి అయినది.

స్వీకరించి, నిర్ణయించిన వ్రాఁతప్రతుల పాఠములను పరిష్కార దృష్టితో మార్చుటకు పూనుకొనలేదు. వర్ణక్రమములోని స్ఖాలిత్యములను మాత్రము సవరించితిమి. అయితే ఒక్క విషయ మిక్కడ చెప్పక తప్పదు. వ్రాఁతప్రతులలో అఱసున్నలు లేవు. వచనాదులలో కొన్ని చోట్ల నిండుసున్నలు కానఁబడును. ద్రుత సంబంధమయిన-సరళాదేశము కానరాదు. రేఫభేద విషయము బహుళగ్రహణముగా ఉన్నది.

హయగ్రీవ శాస్త్రిగారు తమ ముద్రణములో తొలిసారిగా అఱసున్నలు కలిపిరి. కాని యథావిధిగా సర్వత్ర ఈ నియమము పాటించినట్లు లేదు. సరళాదేశములు కూడ అట్లే చూపట్టినవి. కాఁగా, వ్రాఁతప్రతులలో ఉన్నట్లు అఱసున్నలు వదలివేయుటా, హయగ్రీవ శాస్త్రిగారి ముద్రణము ననుసరించుటా లేక యథావిధిగా అంతటను పాటించుటా యను విషయమై సంపాదకులకు ఏకాభి ప్రాయము కుదురలేదు. తరువాత నిర్ణాయకులతో కూడ ఈ విషయమై సమగ్ర మీమాంస జరిగి నది. అధికాభిప్రాయము స్వీకృతమయినది.

ఇతర పరిష్కర్తలు పలుతావుల వ్రాతప్రతులలోని పాఠములను దిద్ది, మార్చిరి; మేమా పద్ధతి స్వీకరింపలేదు.

మహాకవి పోతన లిఖితము శిథిలమై పోఁగా పలువురు పూరించినట్లు పరంపరా సూక్తి ఉన్నది. ఈ విషయము లోతుగా పర్యాలోచించినప్పుడు మూలగ్రంథము పూర్తిగా నష్టమైనట్లు తోఁపదు. ఆయా భాగాలలో, నత్తగుల్లలలో ముత్తెపు చిప్పలవలె, పాఱుటాకులలో పారిజాతముల లాగున, మహాకవి అమృతవాణి చెవితాకి చిత్తమును చిగిరింపఁ జేయుచున్నది.

—సంపాదక వర్గము.

## భాగవత ప్రతుల పరిశీలనలో పాల్గొనిన పండితులు

1. ఆచార్య రాయప్రోలు సుబ్బారావు
2. డా॥ దివాకర్ల వేంకటావధాని M.A. (Hons); Ph.D
3. డా॥ బి. రామరాజు M.A.,Ph.D.
4. శ్రీ విద్యారత్న నిడదవోలు వెంకటరావు M.A.
5. డా॥ టి. వి. నారాయణశాస్త్రి M.A.,Ph.D.
6. శ్రీ యం. వెంకటేశ్వరరావు M.A.,L.T.
7. డా॥ అరిపిరాల విశ్వం M.A.,Ph.D.
8. డా॥ మాదిరాజు రంగారావు M.A.,Ph.D.
9. శ్రీ హెచ్. శివకుమార్ M.A.
10. శ్రీ శిరోమణి వేదాల తిరువెంగళాచార్యులు
11. శ్రీ మేడిచర్ల ఆంజనేయమూర్తి
12. శ్రీ యన్. యస్. సుందరేశ్వరరావు
13. శ్రీ కె. వెంకటాచారి M.A.
14. శ్రీ శిరోమణి నూకల సత్యనారాయణశాస్త్రి
15. శ్రీ యాదగిరిరెడ్డి B.A.
16. శ్రీ విద్యాసాగర శర్మ M.A.
17. శ్రీ కె. నాగేశ్వరరావు M.A.
18. శ్రీ ఆర్. మాధవరావు M.A.
19. శ్రీ కె. వెంకటాద్రి M.A.
20. శ్రీ మల్లెల నారాయణ B.O.L.
21. శ్రీ భాషా ప్రవీణ ఆర్. రామానందశాస్త్రి
22. శ్రీ ఎస్. సర్వేశ్వరరావు M.A.
23. శ్రీ ఎ. రమాపతిరావు M.A.
24. శ్రీమతి అహల్య M.A.
25. శ్రీమతి ఉషాకుమారి M.A.
26. శ్రీమతి సావిత్రి B.A.

# విషయసూచిక

## ప్రథమ స్కంధము



## ద్వితీయ స్కంధము

## తృతీయ స్కంధము



## చతుర్థ స్కంధము

## పంచమ స్కంధము

### ప్రథమాశ్వాసము



### ద్వితీయాశ్వాసము



## షష్ఠ స్కంధము

ఓమ్

# శ్రీమహాభాగవతము

## ప్రథమస్కంధము

ల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక[1]ర
రంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
స్తంభకుఁ [2]గేళిలోలవిలసద్దృగ్జాల సంభూతనా
జాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్. 1

న భక్తి ప్రమొక్కెద నవారిత తాండవ కేళికిన్ దయా
శూలికిన్ శిఖరిజాముఖపద్మ మయూఖమాలికిన్
శాంకమౌళికిఁ గపాలికి మన్మథ గర్వపర్వతో
కి నారదాది మునిముఖ్యమనస్సరసీరుహాళికిన్. 2

సేవ [4]సేసెద సమస్తచరాచర భూతసృష్టివి
భారతీహృదయసౌఖ్యవిధాతకు వేదరాశి [5]ని
దేవతానికరనేతకుఁ గల్మషజేతకున్ నత
స ధాతకున్ నిఖిలతాపసలోక [6]శుభప్రదాతకున్. 3

నిఖిలప్రధానదేవతా[8]వందనంబు సేసి 4

మొప్ప ప్రమొక్కెదు నద్రిసుతాహృదయానురాగసం
దోషభేదికిఁ బ్రపన్నవినోదికి విఘ్నవల్లికా
కి మంజువాదికి నశేషజగజ్జననందవేదికిన్
కఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్. 5

లంబు [9]నెన్నుదురు సోఁకఁగ ప్రమొక్కి నుతింతు సైకత
కిఁ జంచరీకచయసుందరవేణికి రక్షి [10]తానత
కిఁ దోయజాతభవ చిత్తవశీకరణైక [11]వాణికిన్
నక్షదామ శుక వారిజ పుస్తక రమ్యపాణికిన్. 6

---

క్షాకారంభకు (తం.వా.) 2. కారణైక విలసద్దృగ్జాల (క) కేళిలాలసలసద్దృగ్జాల సద్దృగ్జాత (ద) కేళిలాలస కళాదృగ్జాల (ప) 3. ప్రాలిన (ర. హ.) 4. జేసెద 5. నిర్ణేతకు (బ.) 6. సుఖ (ల.) 7. నిఖిలభువనప్రధాన (హ.తం.వా.) అఖిల వందనంబుఁజేసి (హ. తం. వా.) వందనంబుబుసేసి (ద) ప్రార్థనంబుచేసి (బ) (చ. ట. త. ప. తం. వా.) 10. తామర (హ.తం.వా.) 11. వైణికిన్ (తంజాపూరి

శా. పుట్టం [1]బుట్ట శరంబునన్ [2]మొలవ సంభోయానపాత్రంబు[3]నన్
నెట్టం గల్గను గాలిఁ గొల్వఁ[4]బురాణింపన్ దొరంకొంటి [5]మీఁ
దెట్టే వెంటఁ జరింతుఁ [6]దత్సరణి నాకీవమ్మ యో యమ్మ మేల్
[7]పట్టు న్మానకుమమ్మ నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ దయాంభోనిధీ. 7

ఉ. [8]అమ్మలఁగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలపె
ద్దమ్మ సురారులమ్మ కడు పాఱడిపుచ్చినయమ్మ [9]తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి [10]యీవుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్. 8

మ. హరికిన్ బట్టపు[11]దేవి [12]పున్నెములప్రో వర్థంబు [13]పెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీగిరిసుతల్ తోనాడు [14]పూఁబోఁడి తా
మరలం దుండెడి [15]ముద్దరాలు జగ[16]ముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములు వాపు తల్లి సిరియిచ్చున్ [17]నిత్యకల్యాణముల్. 9

వ. అని [18]యిష్టదేవతలం [19]జింతించి [20]దినకర కుమార ప్రముఖులం దలంచి ప్రథమ కవితా [21]విరచన విద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి హయగ్రీవ దనుజకర పరిమిళిత నిగమనివహవిభాగనిర్ణయనిపుణతాసముల్లాసుం డగు వ్యాసునకు మ్రొక్కి శ్రీమహా[22]భాగవతకథా సుధారసప్రయోగికి శుకయోగికి

1. బుట్టి (క. ద. బ.) 2. మొలువ (హ. ట. త.) 3. లోనెట్టన్ (హ) నన్మెట్టం గట్టను (క. ట.) నన్ మెట్టం గట్టిన (గ) 4. బరాణింపంగ దూకొట్టి (త) 5. మీఁ దెట్టీవెంట (హ) మీఁదెట్ట న్వెంట రచింతు (క) 6. తత్సరణి నీకీవమ్మ (గ) తద్రచన నీవీయమ్మ మాయమ్మ (త) 7. పట్టున్నాకగుదమ్మ (హ) పట్టున్నాకగుమమ్మ (వా) 8. అమ్మలగన్న (తం. వా.) 9. నిన్ను (జ. హ.) 10. యిచ్చుత (తం. వా.) 11. రాణి (ప. హ.) 12. పుణ్యముల (క. ర.) 13. పెన్గట్టు (చ) పు పెన్నిక్క (హ) పుఁ బెన్నిక్క (తం. వా.) 14. పూబోడి (డ. ద. బ.) 15. ముద్దురాలు (చ. గ) 16. మున్మేనించు (బ) 17. నిచ్చు (క.ఓ.బ.) 18. యిష్టదేవతా ముఖ్యులన్ (య) యిష్టదైవతముల (ర) 19. పూజించి (ద) స్తుతియించి (బ) 20. వినాయక కుమారక (ద) 21. విలాసాతిరేకిని వాల్మీకని (ర) 22. భాగవత సుధారచన (ప)

*ఈ క్రింది రెండు పద్యములు అచ్చుప్రతులలో నున్నవి; వ్రాఁతప్రతులలో లేవు. రెండవ పద్యము భారతమున కానవచ్చుచున్నది. (అరణ్య. 4-216)

ఉ. శారద నీరదేందుఘనసారపటీరమరాళమల్లికా
హారతుషార ఫేనరజతాచల కాశఫణీశకుందమం
దార సుధాపయోధి సితతామరసామరవాహినీశుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడుగల్గు భారతీ.

ఉ. అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ భా
వాంబర వీథివిశ్రుతవిహారి ననుం గృపఁజూడు భారతీ.

నమస్కరించి మృదుమధుర[1] వచనరచన పల్లవితస్థాణునకున్ బాణునకుం బ్రణమిల్లి కతిపయశ్లోక సమ్మోదితసూరు మయూరు నభినందించి [2]మహాకావ్య కరణకళావిలాసుం గాళిదాసుం గొనియాడి [3]కవికమలవిసరరవిం భారవిం బొగడి [4]విదళితాఘు మాఘు స్తుతియించి యాంధ్రకవితాగౌరవజనమనోహారి నన్నయ సూరిం గైవారంబుసేసి హరిహర చరణారవిందవందనాభిలాషిఁ దిక్కన మనీషిన్ భూషించి *భక్తి విశేషిత పరమేశ్వరుండగు ప్రబంధపరమేశ్వరుం బ్రణుతించి మఱియు నితర పూర్వకవి జనసంభావనంబు గావించి వర్తమాన కవులకుం బ్రియంబు వలికి భావికవుల బహూకరించి యుభయకావ్యకరణ దక్షుండనై. 10

ఉ. •ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముఁ [5]బాసి కాలుచే
సమ్మెట [6]వాటులం బడక సమ్మతి [7]శ్రీహరి [8]కిచ్చి చెప్పె [9]నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు [10]జగద్ధితంబుగన్. 11

తే. [11]చేతులారంగ శివునిఁ బూజింపఁడేని, నోరునొవ్వంగ హరికీర్తి [12]నుడువఁడేని
దయయు సత్యంబులోను[13]గాఁదలఁపఁడేనిఁ, గలుగనేటికిఁ దల్లులకడుపుచేటు. 12

వ. అని [14]మదీయ పూర్వజన్మసహస్రసంచితతపఃఫలంబున శ్రీమన్నారాయణ కథా ప్రపంచ [15]విరచనాకుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమోప రాగంబురాకఁ గని [16]సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్ర సముత్తుంగ [17]భంగ యగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయమంజుల [18]పులినతలమండప మధ్యంబున [19]మహేశ్వర ధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలిత లోచనుండనై యున్నయెడ. 13

---

1. వచనవర్గసల్లలిత (ట) వచనరచనవర్గాపవర్గ (త) 2. కావ్యకరణైక కళావిలాసు (క) కథావిలాసు (చ) 3. కవితకులకమలవనరవి (చ) కవివదనకమలరవి (హ) కవికమలవనరవి(త.జ.) కవికమలవనభారవిఁ (బ) కవికమలరవిఁ (తం. వా.) 4. విగతాఘు (చ) వినుత జనశ్లాఘు (డ)

* ఈ యధికపాఠము తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ నెం. 120 ప్రతిలోఁ గలదు.

• పై వచనము 'కరణ దక్షుండనై' యని యుత్తమ పురుషమున ముగియుచున్నది. ఈ పద్యమున "బమ్మెర పోతరాజొకఁడు" అని ప్రథమపురుషము కనఁబడుచున్నది. చూచిన వ్రాఁత ప్రతులన్నింటిలో నీపద్య మిచ్చటనే యుండుటచేత అట్లే యుంచఁబడినది.

5. వాసి (హ. తం. వా.) 6. పాటులం (క. గ. డ. ద. బ.) నాటులం (చ) వేటులం (హ) వ్రేటులం (వా) 7. తో (చ. ట. త. గ. జ.) 8. కిచ్చజెప్పి (త. జ.) కిచ్చెచెప్పి (గ. డ. బ.) 9. యా (చ. ట. గ. డ.) 10. జగత్ప్రసిద్ధిగన్ (త. ప. ద.) 11. చేతులలరంగ (చ.ట.ర.) 12. వొడువ (చ.గ.ర.) 13. దా (హ) 14. మఱియు (హ. తం. వా.) అని జనంబెన్న మదీయ (ద) 15. కవితా (డ) 16. మజ్జనకానుమతంబున (చ) 17. భంగకు (క. ట. త. గ.) గ్రుంకు (హ.) 18. మంటప మధ్యంబున (క) మంజుకపుళినశోభిత ప్రదేశంబున (హ) పులిన తలంబున (వా) 19. ఉమామహేశ్వర (ర).

సీ. మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిద చెంగట[1]నుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబు [2]పోలిక ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుతతమాల వసుమతీజముభంగి బలు[3]విల్లు మూఁపునఁ బరఁగువాఁడు
నీలనగాగ్ర సన్నిహితభానుని భంగి ఘనకిరీటము దలఁ గల్గువాఁడు

ఆ. పుండరీకయుగముఁబోలు కన్నులవాఁడు, వెడఁద యురమువాఁడు విపులభద్ర
మూర్తి[4]వాఁడురాజముఖ్యుఁడొక్కరుఁడునా, కన్నుఁగవకు[5]నెదురఁగానఁబడియె.

వ. ఏ నా రాజశేఖరునిం దేఱిచూచి భాషింప యత్నంబు సేయునెడ నతండు [6]దా రామభద్రుండ [7]మన్నామాంకితంబుగా [8]శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము [9]నీకు భవబంధంబులు దెగునని యానతిచ్చి తిరోహితుండయ్యె. అంత[10]నే సమున్మీలిత నయనుండనై వెఱఁగు[11]పడి చిత్తంబున. 15

క. పలికెడిది భాగవతమఁట, [12]పలికించువిభుండు రామభద్రుండఁట [13]నేఁ
బలికిన భవహరమగునఁట, పలికెద [14]వేఱొండుగాథఁ బలుకఁగ నేలా. 16

ఆ. భాగవతము [15]దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధ [16]జనులవలన విన్నంత కన్నంత, [17]తెలియ వచ్చినంత తేటపఱుతు. 17

క. [18]కొందఱికిఁ దెనుఁగు[19]గుణమగుఁ, గొందఱికిని సంస్కృతంబుగుణమగు రెండున్
గొందఱికి గుణములగు నే, నందఱి[20]మెప్పింతుఁ [21]గృతుల నయ్యైయెడలన్. 18

మ. ఒనరన్ నన్నయ తిక్కనాదికవు లీ యుర్విం బురాణావళుల్
తెనుఁగుల్ సేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
[22]తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిన్ [23]దెనింగించి నా
జననంబున్ సఫలంబు చేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్. 19

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా [24]శోభితమున్ [25]సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై. 20

1. సున్న (క.ట.ద.ర.) 2. పోలికి (డ) 3. విలు (హ) 4. యైన (హ) 5. నెదుట (క.గ.బ.ర.) 6. దాను రామచంద్రుండను (చ) నేనుశ్రీరామచంద్రుండను (త) 7. రామనామాంకితంబుగా (క.చ.ట.త.ప.గ.జ.డ.ద.) నాదు నామాంకింతబుగా (ర) 8. శ్రీమన్మహా (త.గ.ర.) 9. నీభవ (క.గ.) 10. నేనున్మీలిత (క.చ.) నేనున్మీలితుండనై (జ) సమున్మీలిత లోచనుండనై (ర) 11. పడిన (డ) పడిమదీయచిత్తంబున (క) 12. పలికించెడి విభుఁడు (బ. య.) పలికించెడివాఁడు (హ) 13. యేఁ (చ) 14. వేరొక్కగాథ (త.ప.గ.ర.) 15. తెలియఁబలుకుట (ర) 16. వరుల (జ) 17. తెలిసినంతవట్టు (జ) 18. కొందఱకు (జ) 19. ప్రియమగు (క) 20. మెచ్చింతు (గ) 21. శ్రుతుల (ట) 22. తెనుఁగుల్ శాయరు (క) 23. తెనుంగించి (య) 24. శోభనముల (చ) 25. సువస్తు (ట) సువర్ణ్య (జ.) సుమంత్ర (ద).

వ. ఇట్లు [1]భాసిల్లెడు [2]శ్రీమహాభాగవతపురాణ పారిజాతపాదప [3]సమాశ్రయంబున హరి కరుణావిశేషంబునఁ గృతార్థత్వంబు [4]సిద్ధించెనని బుద్ధినెఱింగి లేచి [5]మరలి కొన్ని దినంబులను నేకశిలానగరం[6]బునకుం జనుదెంచి యందు గురువృద్ధబుధ బంధు [7] జనానుజ్ఞాతుండనై. 21

—: గ్రంథకర్తృ వంశవర్ణనము :—

సీ. కౌండిన్యగోత్ర సంకలితుఁ డాపస్తంబసూత్రుండు పుణ్యుండు [8]సుభగుఁడైన
[9]భీమన మంత్రికిఁ బ్రియపుత్రుఁ డన్నయ కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్తు వరమునఁ [10]గనిన సోమనమంత్రి వల్లభ మల్లమ వారి తనయుఁ
డెల్లన యతనికి నిల్లాలు [11]మాచమ వారి పుత్రుఁడు వంశ వర్ధనుండు

ఆ. లలితమూర్తి బహుకళానిధి [12]కేసన, దానమాననీతిధనుఁడు ఘనుఁడు
తనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ, మనియె శైవశాస్త్రమతము గనియె. 22

క. నడవదు నిలయము వెలువడి, తడవదు పర[13]పురుష గుణము దనపతి[14]నొడువున్
[15]గడవదు వితరణ [16]కరుణలు, విడువదు లక్కాంబ విబుధ విసరము వొగడన్. 23

ఉ. మానిను లీడుగారు బహుమాన [17]నివారిత దీనమానస
గ్లానికి దానధర్మ మతిగౌరవ మంజులతాగభీరతా
స్థానికి [18]ముద్దసానికి సదాశివపాదయుగార్చనానుకం
పానయ వాగ్భవానికిని బమ్మెర [19]కేసయ లక్కసానికిన్. 24

క. [20]ఆమానిని కుదయించితి, మేమిరువుర మగ్రజాతుఁ డీశ్వర సేవా
కాముఁడు [21]తిప్పయ; పోతయ నామవ్యక్తుండ సాధునయయుక్తుండన్. 25

వ. అయిన నేను నా చిత్తంబునఁ బెన్నిధానంబునుం బోని [22]శ్రీరామచంద్రు సన్నిధానంబుఁ గల్పించుకొని.

---

1. రాజిల్లెడు (ర) 2. శ్రీమన్మహా (గ) 3. వనాశ్రయంబున (క. ట.) 4. సిద్ధించు (గ) 5. మఱియుం గొన్ని (క. ర.) 6. బునకేతెంచి (చ) 7. కవిజనాను...(ర) 8. శుభగుణుండు (ట) 9. భూమన మంత్రికి పుత్రుఁ డన్నయమంత్రి (ట.య.) భీమనమంత్రికి ప్రీతి నన్నయ పుట్టె (త) భీమన మంత్రికి ప్రియజు డన్నయ (ర) 10. గనియె (హ. తం. వా.) 11. మాచమ్మ (గ) మానమ (జ) 12. కేలన (వా) 13. పురుషగుణము (క.గ.జ.తం.) 14. నుడువున్ (తం.వా.) నొడువుల్ (ట. ప. గ.ర.) 15. కడువదు (జ.బ.ర.హ.) 16. గుణముల్ (క.ట.త.జ.) 17. సమానితదీన మానసుజ్ఞానికి (ట.గ.) సమానితధీసమాన సుజ్ఞానికి (య) 18. ముగ్ధసానికి (క) ముత్తసానికి (ట. ప. జ.) ముద్దు సానికి (తం. వా.) 19. కేతయ 20. ఆమిథునమునకుఁ బుట్టితి (క.థ.ద.బ.ర.హ.) 21. తిప్పన పోతన (తం.వా.) 22. శ్రీరామభద్రు (ర).

—: షష్ఠ్యంతములు :—

ఉ. హారికి నందగోకుల విహారికిఁ జక్రసమీరదైత్య సం
హారికి భక్త దుఃఖపరిహారికి గోపనితంబినీ మనో
హారికి [1]దుష్టసంప దపహారికి ఘోషకుటీ[2]పయోఘృతా
హారికి బాలకగ్రహమహాసురదుర్వనితా ప్రహారికిన్. 27

ఉ. శీలికి నీతిశాలికి వశీకృతశూలికి బాణహస్తని
ర్మూలికి ఘోరనీరదవిముక్తశిలాహత గోపగోపికా
పాలికి వర్ణధర్మ పరిపాలికి నర్జునభూజయుగ్మ సం
చాలికి మాలికిన్ విపుల చక్రనిరుద్ధ మరీచిమాలికిన్. 28

ఉ. క్షాంతకుఁ గాళియోరగ విశాల [3]ఫణోపరి[4]నర్తన క్రియా
రంతకు నుల్లసన్మగధరాజ చతుర్విధ ఘోర వాహినీ
హంతకు నింద్రనందననియంతకు సర్వచరాచరావళీ
మంతకు నిర్జితేంద్రియసమంచిత భక్తజనానుగంతకున్. 29

ఉ. న్యాయికి భూసురేంద్రమృతనందనదాయికి రుక్మిణీ మన
స్థ్సాయికి భూతసమ్మద విధాయికి సాధు[5]జనానురాగ సం
ధాయికిఁ బీతవస్త్ర పరిధాయికిఁ బద్మభవాండ భాండ ని
ర్మాయికి గోపికానివహమందిరయాయికి శేషశాయికిన్. 30

వ. సమర్పితంబుగా [6]నే నంధ్రభాషను రచియింపంబూనిన [7]శ్రీమహాభాగవతంబు
నకుం [8]బ్రారంభం బెట్టిదనిన.

అధ్యాయము—౧

సీ. విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వనివలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్త[9]నమునఁ గార్యములం దభిజ్ఞుఁడై తాన రాజగుచుఁ [10]జిత్తమునఁ జేసి
వేదంబు లజునకు [11]విదితముల్ గావించె నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావుల [12]నీటఁ గాచాదుల నన్యోన్యబుద్ధి దా నడరునట్లు

ఆ. [13]త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము, భంగిఁ దోఁచు [14]స్వప్రభానిరస్త
కుహకుఁ డెవ్వఁడతనిఁగోరి చింతించెద,ననఘు [15]విశ్వమయుని ననుదినంబు. 32

1. రత్నపుంజనవహారికి (ర) 2. పయోమృతా (ర) 3. ఫణావళి (జ.ఢ.ద.బ.య.ర.హ.తం.వా.) ఫణామణి (గ) 4. వర్తన (గ); నర్తక (డ) 5. గణానురాగ(త) 6. నేనాంధ్రంబున(క.చ.హ.తం.వా) 7. శ్రీమన్మహా(ట.ర.) 8. కథాక్రమంబెట్టిదనిన(బ) 9. నముల(క.జ.బ.) 10. చిత్తమునఁజూచి(త)చింతనముచేసి(ట) 11. విదితంబుగా నిచ్చె(ప) 12. నీళ్ళగా భ్రమయుచు(జ) 13. త్రిగుణబుద్ధియందు దీపించు (య) 14. నట్టి ప్రభునిరస్త (హ) 15. సత్యుఁబరుని (హ. వా.) నాద్యుఁ బరుని సత్యు (క. డ. బ.)

వ. ఇట్లు [1]"సత్యం పరం ధీమహి" యను గాయత్రీ ప్రారంభంబున గాయత్రీ నామ [2]బ్రహ్మరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసుర వధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతంబని పలుకుటం జేసి యీ పురాణంబు శ్రీ మహాభాగవతంబన నొప్పుచుండు. 33

సీ. శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ
వినఁగోరువారల విమలచిత్తంబులఁ జెచ్చెర నీశుండు చిక్కుఁ [3]గాక
యితర శాస్త్రంబుల నీశుండు చిక్కునె మంచివారలకు నిర్మత్సరులకుఁ
గపటనిర్ముక్తులై కాంక్ష[4]సేయక యిందుఁ దగిలియుండుట మహా[5]తత్త్వ[6]బుద్ధి

తే. పరఁగ నాధ్యాత్మికాది తాపత్రయంబు, నడఁచి [7]పరమార్థభూతమై యఖిల సుఖద
మైసమస్తంబుగాకయు [8]నయ్యునుండు, వస్తువెఱుగంగఁ [9]దగుభాగవతమునందు.

ఆ. వేదకల్పవృక్షవిగళితమై శుక, ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణ[10]ఫలరసాస్వాదన, పదవిఁ గనుఁడు రసిక[11]భావవిదులు. 35

—: నైమిశారణ్య వర్ణనము :—

క. పుణ్యంబై మునివల్లభ, గణ్యంబై కుసుమఫలనికాయోత్థిత సా
ద్గుణ్యమయి నైమిశాఖ్యా, రణ్యంబు నుతింపఁదగు నరణ్యంబులలోన్. 36

వ. మఱియును మధువైరి మందిరంబునుం బోలె మాధవీమన్మథ [12]సహితంబై బ్రహ్మగేహంబునుం బోలె శారదాన్వితంబై నీలగళసభానికేతనంబునుం బోలె వహ్నివరుణ సమీరణచంద్రరుద్రహైమవతీ కుబేర వృషభగాలవశాండిల్య పాశుపత [13]జటిపటలమండితంబై బలభేదిభవనంబునుం బోలె [14]నైరావతామృత రంభాగణికాభిరామంబై మురాసురుని నిలయంబునుంబోలె నున్మత్తరాక్షసవంశ సంకులంబై ధనదాగారంబునుం బోలె శంఖకుందముకుంద[15]సుందరంబై రఘురాము యుద్ధంబునుం బోలె నిరంతర[16]శరానలశిఖాబహుళంబై పరశురాము ఖండనంబునుం బోలె [17]నర్జునోద్భేదంబై దానవసంగ్రామంబునుంబోలె నరిష్ట జంభనికుంభశక్తియుక్తంబై కౌరవసంగరంబునుం బోలె ద్రోణార్జున కాంచన

1. సత్యం పరమితి యను గాయత్రీ (క. బ.) 2. బ్రహ్మస్వరూపంబై (హ. వా.) 3. గాని (చ) 4. సేయకయును (హ.వా.) 5. ధర్మబుద్ధి (క. ర.) 6. బుద్ధిఁ బరఁగ (హ. వా.) 7. పరమాత్మ (త.ద.) 8. నగుచునుండు (చ.ప.య.ర.హ.) 9. నగు (త.య.ఎ.) 10. ఫలరసమధురంబు (చ. గ. బ.) 11. భాగవతులు (గ. జ.) 12. మహితంబై (క. ద. బ. హ. తం.) మన్మథ హితంబై (వా) మాధవ మన్మథ మహితంబై (ర) 13. జటాపటల (గ. జ. ధ. ద. బ. ర.) 14. నైరావతామలక (గ) నైరావతామల (ద) 15. మందిరంబై (చ. త. ప. జ. ద. ర. హ.) 16. ఖరానల (ద) 17. మహాపారిజాతంబై (వ్రాతప్రతుల పాఠము)

స్యందనకదంబసమేతంబై కర్ణుకలహంబునుం బోలె మహోన్నతశల్య సహకారంబై సముద్రసేతుబంధనంబునుం బోలె నలనీలపనసాదిప్రదీపితంబై భర్గుభజనంబునుం బోలె [1]నానాశోకలేఖా కలితంబై [2]మరు కోదండంబునుం బోలెఁ బున్నాగశిలీముఖ భూషితంబై నరసింహరూపంబునుం బోలెఁ గేసర కరజ కాంతంబై నాట్యరంగంబునుం బోలె నటనటీసుషిరాన్వితంబై శైలజా నిటలంబునుం బోలెఁ జందనకర్పూర తిలకాలంకృతంబై వర్షాగమంబునుం బోలె నింద్రబాణాసన మేఘకరక కమనీయంబై నిగమంబునుం బోలె గాయత్రీ విరాజితంబై మహాకావ్యంబునుం బోలె [3]సరస మృదులతాకలితంబై వినతానిలయంబునుం బోలె సుపర్ణరుచిరంబై యమరావతీ పురంబునుం బోలె సుమనోలలితంబై [4]కైటభోద్యోగంబునుం బోలె మధుమానితంబై పురుషోత్తమ సేవనంబునుంబోలె నమృత ఫలదంబై [5]ధనంజయ సమీకంబునుంబోలె నభ్రంకష పరాగంబై వైకుంఠపురంబునుం బోలె [6]హరిఖడ్గపుండరీకవిలసితంబై నందఘోషంబునుం బోలెఁ గృష్ణసార సుందరంబై లంకానగరంబునుం బోలె రామమహిషీ వంచకసమేతంబై సుగ్రీవ సైన్యంబునుం బోలె గజ గవయశరభశోభితంబై [7]నారాయణ స్థానంబునుం బోలె నీలకంఠ హంసకౌశిక భారద్వాజతిత్తిరి భాసురంబై మహాభారతంబునుం బోలె నేకచక్ర బక కంక ధార్తరాష్ట్రి శకుని నకులసంచార సమ్మిళితంబై సూర్యరథంబునుం బోలె నురుతర ప్రవాహంబై జలదకాల సంధ్యాముహూర్తంబునుం బోలె బహువితతజాతి సౌమనస్యంబై యొప్పు నైమిశంబను [8]శ్రీవిష్ణుక్షేత్రంబునందు శౌనకాది మహామునులు స్వర్గలోక [9]గీయమానుండగు హరిం జేరుకొఱకు సహస్రవర్షంబు లనుష్ఠానకాలంబుగాఁగల సత్రసంజ్ఞికంబైన యాగంబు సేయుచుండి రందొక్కనాఁడు వారలు రేపకడ నిత్యనైమిత్తికహోమంబు లాచరించి సత్కృతుండై సుఖాసీనుండై యున్న సూతునిం జూచి. 37

—: శౌనకాది ఋషుల ప్రశ్న :—

కం. ఆతాపసు లిట్లనిరి వి, నీతున్ [10]విజ్ఞానఫణితనిఖిల పురాణ
వ్రాతున్ నుతహరిగుణ[11]సం, ఘాతున్ సూతున్ నితాంతకరుణోపేతున్. 38

1. నానాశ్లోకలేఖా పరిమితంబై (ట. జ.) నానాశాఖరేఖా కలితంబై (య) 2. మేరు (ట. త. బ. య.ర.హ.) 3. సరల (వా) 4. కైటభోద్యానంబును (త) 5. ఘన సమీరంబునుంబోలె (ట) 6. ఖడ్గపుండరీక (హ. తం. వా.) 7. నారాయణాస్థానంబు (గ. ద.) 8. వైష్ణవ క్షేత్రంబున (ద) 9. జేగీయ (గ. జ. ర.) 10. విజ్ఞానఫలిత (ట.గ.జ.ద.య) 11. సంఘాత నితాంతైకసూతు (ట)

మ. సమతం దొల్లి పురాణపంక్తు లితిహాసశ్రేణులుం ధర్మశా
స్త్రములున్ [1]నీవు పఠించి చెప్పితివి వేదవ్యాస ముఖ్యుల్, మునుల్,
[2]సుమతుల్ సూచిన వెన్ని యన్నియును దోఁచున్ నీమదిన్, దత్ప్రసా
దమునం జేసి యెఱుంగ నేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా! 39

క. గురువులు ప్రియశిష్యులకుం, బరమరహస్యములు దెలియఁబలుకుదు రచల
స్థిరకల్యాణం బెయ్యది, పురుషులకును నిశ్చయించి బోధింప తగన్. 40

క. మన్నాఁడవు చిరకాలము, గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్
విన్నాఁడవు వినఁదగినవి, యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్. 41

చ. అలసులు [3]మందబుద్ధియుతు లల్పతరాయువు లుగ్రరోగ సం
కలితులు మంద[4]భాగ్యులు సుకర్మములెయ్యవి సేయఁజాలరీ
కలియుగమందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు నేమిటం [5]బొడము నాత్మకు శాంతి మునీంద్ర చెప్పవే. 42

సీ. ఎవ్వని యవతారమెల్ల [6]భూతములకు సుఖమును వృద్ధియు సొరిదిఁజేయు
నెవ్వని శుభనామ మేప్రొద్దు నుడువంగ సంసారబంధంబు సమసిపోవు
నెవ్వని చరితంబు హృదయంబుఁ జేర్చిన భయమొంది మృత్యువు పరువువెట్టు
నెవ్వని పదనది నేపారుజలములు సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ

తే. దపసు లెవ్వనిపాదంబు దగిలి శాంతి, తెఱఁగు గాంచిరి వసుదేవదేవకులకు
నెవ్వఁ డుదయించెఁ దత్కథలెల్ల వినఁగ,నిచ్చపుట్టెడు నెఱిఁగింపు మిద్ధచరిత. 43

క. భూషణములు [7]వాణికి నఘ, పేషణములు మృత్యుచిత్త భీషణములు [8]హృ
త్తోషణములు గల్యాణ వి, శేషణములు హరిగుణోపచితభాషణముల్. 44

క. కలిదోష [9]నివారకమై, యలఘు యశుల్ వొగడునట్టి హరికథనము ని
ర్మలగతిఁ గో[10]రెడు పురుషుఁడు, వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు మహాత్మా!

ఆ. అనఘ విను రసజ్ఞులై వినువారికి, [11]మాటమాట కధికమధురమైన
యట్టి కృష్ణకథన మాకర్ణనముసేయఁ, దలఁపుగలదు మాకుఁ దనివిలేదు. 46

1. చాలనుపన్యసింపుదురు (హ) నీవ యుపన్యసింపుదువు (వా) 2. సుమతిం జేసిన (జ. ధ. ద. బ. హ.) 3. మందబుద్ధిబలులల్ప (ట. జ..తం. వా.) 4. భాగ్యులును గర్మము (క. ప. హ.) 5. బొరయు (త) బొదలు (జ) 6. లోకములకు (హ) 7. సెపులకు (హ) 8. హృత్పోషణములు (క. త.) 9. నివారణమై (హ. తం. వా.) 10. ఁగోరుచుఁ (హ) 11. మాటిమాటికధిక (క. చ. త. జ. బ. య. ర.)

మ. వరగోవింద కథాసుధారస మహా[1]వర్షోరుధారా పరం
పరలంగాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంతదురంత దుస్సహజనుస్సంభావితానేక దు
స్తర గంభీరకఠోరకల్మష కనద్దావానలం బాఱునే. 47

సీ. హరినామకథన దావానల జ్వాలలఁ గాలవే[2]ఘోరాఘ కాననములు
వైకుంఠదర్శన వాయుసంఘంబుచేఁ దొలఁగవే బహుదుఃఖ తోయదములు
కమలనాభధ్యాన [3]కంఠీరవంబుచేఁ గూలవే సంతాప కుంజరములు
నారాయణ[4]స్మరణ ప్రభాకరదీప్తిఁ దీఱవే షడ్వర్గ తిమిరతతులు

ఆ. నళిననయన భక్తి [5]నావచేఁగాక సం, సార జలధిదాఁటి చనఁగరాదు
వేయునేల మాకు విష్ణుప్రభావంబు, దెలుపవయ్య సూత! ధీసమేత! 48

వ. మఱియు కపటమానవుండును గూఢుండునైన మాధవుండు రామసహితుండై యతిమానుషంబులైన పరాక్రమంబులు సేసె నఁట! వాని వివరింపుము. కలియుగంబు రాఁగలదని వైష్ణవక్షేత్రంబున దీర్ఘ సత్రనిమిత్తంబున హరికథలు విన నెడగలిగి నిలిచితిమి. దైవయోగంబున 49

క. జలరాశి దాఁటఁగోరెడి, కలము జనుల్ గర్ణధారుఁ గాంచిన భంగిన్
గలిదోష హరణవాంఛా, కలితులమగు మేము నిన్నుఁ గంటిమి[6]సూతా! 50

క. చారుతరధర్మరాశికి, భారకుఁడగు కృష్ణుఁ డాత్మపదమునకేగన్
భారకుఁడు లేక యెవ్వనిఁ, [7]జేరెను ధర్మంబు బలుపుసెడి మునినాథా! 51

## అధ్యాయము - ౨

### —: సూతుండు నారాయణ కథాప్రశంస చేయుట :—

వ. అని యిట్లు మహనీయ గుణగరిష్ఠులయిన శౌనకాదిమునిశ్రేష్ఠు లడిగిన రోమహర్షణ పుత్రుండై యుగ్రశ్రవసుండను పేరనొప్పి నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుండు. 52

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిఁబో
వ [8]మహాభీతి నొహోకుమార యనుచున్ వ్యాసుండు సీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్కం[9]జేసె ము న్నట్టిభూ
తమయున్ [10]బ్రొక్కెద బాదరాయణిఁ [11]దపోధన్యాగ్రణిన్ ధీమణిన్. 53

1. వర్షోక్తి (వ్రాఁత ప్రతులన్నింటను) 2. మోహాంధ (గ) 3. కంఠీరవములచే (క. చ. ట. ప. గ. ద. హ.) 4. శ్రవణ (క.ట.ల.ద.బ.య.) 5. నావలేకున్న (క.ర.); నావచేగాని (ట) 6. సుమతీ (చ. జ. డ. ర.) సుమ్మీ (ట. గ. బ.) 7. జేరెడు (క); జేరును (ద) 8. మహాప్రీతి (గ.జ.థ.ద.హ.) 9. జేసియున్నట్టి (ల. య.) 10. గొల్చెద (హ) 11. తపోధ్యానాగ్రణిన్ (త. గ.)

సీ. కార్యవర్గంబును గారణసంఘంబు నధికరించి చరించు నాత్మతత్త్వ
మధ్యాత్మ మనఁబడు నట్టి యధ్యాత్మముఁ [1]దెలివిసేయఁగ జాలు దీపమగుచు
సకలవేదములకు సారాంశమై యసాధారణమగు ప్రభావ
[2]రాజకంబైన పురాణ[3]మర్మంబును గాఢసంసారాంధకారపటలి

తే. దాఁటఁగోరెడి వారికి దయదలిర్ప, నే తపోనిధి వివరించె నేర్పెసంగ
నట్టి శుకనామధేయు మహాత్మగేయు, విమలవిజ్ఞాన రమణీయు వేడ్కఁగొలుతు.

క. నారాయణునకు నరునకు, భారతికిని మ్రొక్కి వ్యాసు పదములకు నమ
స్కారముసేసి [4]వచింతు ను, దారగ్రంథంబు దళితతనుబంధంబున్. 55

వ. అని యిట్లు దేవతాగురు నమస్కారంబుచేసి యిట్లనియె. మునీంద్రులారా! నన్ను మీరలు నిఖిలలోకమంగళంబైన ప్రయోజనం బడిగితిరి. ఏమిటం గృష్ణసంప్రశ్నంబు సేయంబడు నెవ్విధంబున నాత్మ ప్రసన్నంబగు నిర్విఘ్నయు నిర్హేతుకయునైన హరిభక్తి యే రూపంబునంగలుగు నది పురుషులకుఁ [5]బరమధర్మంబగు. వాసుదేవునియందుఁ బ్రయోగింపంబడిన భక్తియోగంబు వైరాగ్యవిజ్ఞానంబులం బుట్టించు. నారాయణకథలవలన నెయ్యేధర్మంబులు దగుల వవి నిరర్థకంబులు. అపవర్గపర్యంతం[6]బైన ధర్మంబున కర్థంబు ఫలంబు గాదు. ధర్మంబునందవ్యభిచారియైన యర్థంబునకుఁ గామంబు ఫలంబుగాదు. విషయభోగంబైన కామంబున కింద్రియప్రీతి ఫలంబుగాదు. ఎంతదడవు జీవించు నంతియ కామంబునకు ఫలంబు. తత్త్వజిజ్ఞాసగలజీవునకుఁ గర్మములచేత నెయ్యది సుప్రసిద్ధంబదియు నర్థంబుగాదు. తత్త్వ[7]జిజ్ఞాస యనునది ధర్మజిజ్ఞాస. కొందఱు ధర్మంబె తత్త్వమని పలుకుదురు. తత్త్వవిదులు జ్ఞానమనుపేర నద్వయమైనయది తత్త్వమని యెఱుంగుదురు. ఆ తత్త్వంబౌపనిషదులచేతం బ్రహ్మమనియు హైరణ్యగర్భులచేతం బరమాత్మ యనియు సాత్వతులచేత భగవంతుండనియును బలుకంబడు. వేదాంతశ్రవణంబున గ్రహింపంబడి జ్ఞాన వైరాగ్యములతోడం గూడిన భక్తిచేతఁ దత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన యాత్మయందుఁ బరమాత్మం బొడగందురు. ధర్మంబునకు భక్తి ఫలంబు. పురుషులు వర్ణాశ్రమ ధర్మభేదంబులంజేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయె సిద్ధి. ఏకచిత్తంబున నిత్యంబును గోవిందు నాకర్ణింపను వర్ణింపను దగు. చక్రాయుధధ్యానమను ఖడ్గంబున వివేకవంతు లహంకారనిబద్ధంబైన

1. తెలియఁజేయఁగ (హ. తం. వా.) 2. రాజితంబైన (చ. ర.) 3. రాజంబును (హ) ధర్మంబును (ట. ద.) పురాణామృతంబును (చ. గ. జ. ద.) 4. రచింతు (క.బ.) 5. పరమార్థంబనిన (హ. తం.) 6. బాచరింపం దగిన యీ యధికధర్మంబునకు (చ. ట. ప. గ. హ.) 7. విజ్ఞానమనునది (క. చ. ట. గ. ద. బ.)

కర్మంబు ద్రుంచివైతురు.* (భగవంతునియందు శ్రద్ధయు, నపవర్గదంబగు తత్కథాశ్రవణాదులం దత్యంతాసక్తియు, పుణ్యతీర్థావగాహనమహత్సేవాదులచే సిద్ధించు) కర్మనిర్మూలన హేతువులైన కమలలోచను కథలం దెవ్వండు రతి సేయు, విననిచ్చగించు, వాని కితరంబు లెవ్వియు రుచి పుట్టింపనేరవు. పుణ్య శ్రవణకీర్తనుండైన కృష్ణుండు దన కథలు వినువారి హృదయంబులందు నిలిచి శుభంబు లాచరించు. అశుభంబులు నిరసించు. అశుభంబులు నష్టంబులయిన భాగవతశాస్త్ర సేవావిశేషంబున నిశ్చలభక్తి యుదయించు. భక్తిగలుగ రజస్త మోగుణ ప్రభూతంబులైన కామలోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్త్వ గుణంబునఁ బ్రసన్నంబగు. ప్రసన్న మనస్కుండైన ముక్తసంగుండగు. ముక్తసంగుండైన నీశ్వర తత్త్వజ్ఞానంబు [1]దీపించు. ఈశ్వరుండు గానంబడినఁ [2]జిజ్జడగ్రథన రూపంబైన యహంకారంబు భిన్నంబగు. అహంకారంబు భిన్నంబైన నసంభావనాది రూపంబులగు సంశయంబులు విచ్ఛిన్నంబులగు. సంశయ విచ్ఛేదంబైన ననారబ్ధఫలంబులైన కర్మంబులు నశించుం గావున. 56

క. గురుమతులు దపసు లంతః, కరణంబులు [3]శుద్ధిసేయు ఘనతరభక్తిన్
హరియందు సమర్పింతురు, పరమానందమున భిన్నభవబంధనులై. 57

తరల. పరమపూరుషుఁడొక్కఁ[4]డాద్యుఁడు పాలనోద్భవ నాశముల్
సొరిదిఁజేయ ముకుంద పద్మజశూలిసంజ్ఞలఁ బ్రాకృత
స్ఫురిత సత్త్వరజస్తమంబులఁ బొందు నందు [5]శుభస్థితుల్
హరి చరాచరకోటి కిచ్చు ననంత సత్త్వ నిరూఢుఁడై. 58

వ. మఱియు నొక విశేషంబు గలదు. కాష్ఠంబుకంటె ధూమంబు, ధూమంబుకంటెఁ ద్రయీమయంబైన వహ్నియెట్లు విశేషంబగు నట్లు తమోగుణంబుకంటె రజో గుణంబు, రజోగుణంబుకంటె బ్రహ్మప్రకాశకంబగు సత్త్వగుణంబు విశిష్టం బగు. తొల్లి మునులు సత్త్వమయుండని భగవంతు హరి నధోక్షజుం గొలిచిరి. కొందఱు సంసారమందలి మేలుకొఱకు నన్యుల సేవించుచుందురు. మోక్షార్థులైన వారలు ఘోరరూపులైన భూతపతుల విడిచి, దేవతాంతర నిందసేయక, శాంతులై నారాయణ[6]కథలయందే ప్రవర్తింతురు. కొందఱు రాజసతామసులై సిరియు నైశ్వర్యంబును బ్రజలనుం గోరి పితృభూతప్రజేశాదుల నారాధించు

*ఈ భాగము తాళపత్ర ప్రతులందు లేదు. సంస్కృత మూలమున నున్నది. ఇట్లు కుండలీకరింపఁబడు భాగము లన్నియు నిట్టివేయని గ్రహింపఁ దగును.

1. సిద్ధించు (క. చ. ట. ప. ర. హ.) 2. చిజ్జడ గ్రంథి (క. త. ప. ర.) 3. శుద్ధిసేయ (త.ప.హ.తం.వా.) 4. డాద్యుఁడు (హ. తం. వా.) 5. శుభంబులన్ (ర) 6. కథలనుభవింతురు (క) కళలనుభవింతురు (ట. య.)

దురు. మోక్షమిచ్చుటం జేసి నారాయణుండు సేవ్యుండు. వేద యాగ యోగ క్రియాజ్ఞానతపోగతి ధర్మంబులు వాసుదేవ పరంబులు. నిర్గుణుండైన పరమే శ్వరుండు గలుగుచు లేకుండుచు [1]గుణంబులతోఁ గూడిన తన మాయచేత నింతయు సృజియించి, గుణవంతుని చందంబున నిజ మాయావిలసితంబు లైన గుణంబులలోఁ బ్రవేశించి, విజ్ఞాన విజృంభితుండై వెలుంగు. అగ్ని యొక్కరుండయ్యుఁ బెక్కుమ్రాఁకులందు దేజరిల్లుచుఁ బెక్కండై తోఁచు తెఱంగున విశ్వాత్మకుండైన పురుషుం డొక్కఁడు, తనవలనం గలిగిన నిఖిల భూతంబులందు నంతర్యామి రూపంబున దీపించు. మనోభూత సూక్ష్మేంద్రి యంబులతోడంగూడి, గుణమయంబులైన భావంబులం దనచేత నిర్మితంబులైన భూతంబులందుఁ దగులువడక తద్గుణంబు లనుభవంబుసేయుచు లోకకర్తయైన యతండు దేవతిర్యఙ్మనుష్యాదిజాతులందు లీల నవతరించి లోకంబుల రక్షించు నని మఱియు సూతుఁ డిట్లనియె. 59

అధ్యాయము—౩

సీ. మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై చారుషోడశకళా సహితుఁడగుచుఁ
బంచమహాభూత భాసితుండై శుద్ధసత్త్వుఁడై సర్వాతిశాయి యగుచుఁ
జరణోరుభుజముఖ శ్రవణాక్షినాసా శిరములు నానా సహస్రములు వెలుఁగ
నంబరకేయూర హారకుండల కిరీటాదులు పెక్కువే లమరుచుండఁ

తే. బురుషరూపంబు ధరియించి పరుఁడనంతుఁ, డఖిలభువనైక[2]కర్తయై యలఘుగతిని
[3]మానితాపార జలరాశిమధ్యమునను, యోగనిద్రావిలాసియై యొప్పుచుండు. 60

—: భగవంతుని యేకవింశత్యవతారములు :—

వ. అది సకలావతారంబులకు మొదలిగనియైన శ్రీమన్నారాయణ దేవుని విరాజ మానంబైన దివ్యరూపంబు. దానిం బరమయోగీంద్రులు దర్శించుదురు. అప్పరమేశ్వరు నాభీకమలంబువలన సృష్టికర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మ యుదయించె. అతని యవయవ స్థానంబులయందు లోకవిస్తారంబులు గల్పింపం బడియె. మొదల సద్దేవుండు కౌమారాఖ్యసర్గంబు నాశ్రయించి [4]బ్రాహ్మణుండై దుశ్చరంబైన బ్రహ్మచర్యంబు చరియించె. రెండవ[5]మాఱు జగజ్జననంబు కొఱకు రసాతలగతయైన భూమినెత్తుచు, యజ్ఞేశుండై వరాహదేహంబుఁదాల్చె. మూఁడవతోయంబున నారదుండను దేవఋషియై కర్మనిర్మోచకంబైన వైష్ణవ

1. త్రిగుణంబుల (హ. తం. వా.) 2. వర్తన యత్నపుమర (చ. టి. వ.) వర్తన (తం. వా.)
3. మానితోదార (హ. వా.) 4. బ్రహ్మణ్యుండై (తం. వా.) 5. మాటు (క. ర.)

తంత్రంబు సెప్పె. నాలవపరి ధర్మభార్యాసర్గమునందు నరనారాయణాభిధానుండై దుష్కరంబైన తపంబు సేసె. పంచమావతారంబునం గపిలుండను సిద్ధేశుండై యాసురియను బ్రాహ్మణునకుఁ దత్త్వ[1]సంఘ నిర్ణయంబుగల సాంఖ్యంబు నుపదేశించె. ఆఱవ శరీరంబున ననసూయాదేవి యందు నత్రిమహామునికిఁ గుమారుండై యలర్కునికిఁ బ్రహ్లాదముఖ్యులకు నాత్మవిద్యఁ దెలిపె. ఏడవ విగ్రహంబున నాకూతియందు రుచికి జన్మించి యజ్ఞుండనఁ బ్రకాశమానుండై [2]యామాది దేవతలతోడంగూడి స్వాయంభువమన్వంతరంబు రక్షించె. అష్టమ మూర్తిని మేరుదేవియందు నాభికి జన్మించి యురుక్రముం డనం బ్రసిద్ధుండై విద్వజ్జనులకుఁ బరమహంస మార్గంబు ప్రకటించె. ఋషులచేతం గోరంబడి తొమ్మిదవ జన్మంబునఁ బృథుచక్రవర్తియై భూమిని ధేనువుం జేసి సమస్త వస్తువులం బిదికె. చాక్షుషమన్వంతర సంప్లవంబున దశమంబైన మీనావతారంబు నొంది మహీరూపమగు నావ నెక్కించి వైవస్వతమనువు నుద్ధరించె. సముద్ర మథనకాలంబునం బదునొకండవమాఱు కమఠాకృతిని మందరాచలంబు దన పృష్ఠకర్పరంబున నేర్పరియై నిలిపె. ధన్వంతరి యను పండ్రెండవ తనువున సురాసురమథ్యమాన క్షీరపాథోధి మధ్యభాగంబున నమృతకలశహస్తుండై [3]వెడలె. పదుమూఁడవదియైన మోహినీ వేషంబున నసురుల మోహితులం జేసి సురల నమృతాహారులం గావించె. పదునాలుగవదియైన నరసింహరూపంబునం గనకకశిపుని సంహరించె. పదియేనవది యైన కపటవామనావతారంబున [4]బలిని బదత్రయంబు యాచించి మూఁడు లోకముల నాక్రమించె. పదియాఱవది యైన భార్గవ[5]రామాకృతినిఁ గుపితభావంబు దాల్చి బ్రాహ్మణద్రోహులైన రాజుల నిరువదియొకమాఱు వధియించి భూమిని [6]క్షత్రియశూన్యంబు గావించె. పదియేడవదియైన వ్యాసగాత్రంబున [7]నల్పమతులైన పురుషులం గరుణించి వేద వృక్షంబునకు శాఖ లేర్పరించె. పదునెనిమిదవదైన రామాభిధానంబున దేవకార్యార్థంబు రాజత్వంబు నొంది, సముద్రనిగ్రహాది పరాక్రమంబు లాచరించె. ఏకోన వింశతి వింశతితమంబులైన రామకృష్ణావతారంబులచే యదువంశంబున సంభవించి విశ్వంభరాభరంబు నివారించె. కలియుగాద్యవసరంబున రాక్షస సమ్మోహనంబు కొఱకు [8]కీకటదేశంబున జినసుతుండై యేకవింశతితమంబైన బుద్ధ నామధేయంబునం దేజరిల్లు. యుగసంధియందు వసుంధరాధీశులు చోరప్రా

---

1. గ్రామ (తం. వా.) సంఖ్యా (హ. ప. గ. జ. ద. బ. య. ర.) 2. యమాది (చ. ట. త. ప. గ. జ. ద. బ. ర. హ.) 'యామాద్యైః సురగణైః' అని మూలము. 3. వెడలి వైద్యశాస్త్రంబుఁ గల్పించె (ద) ఆయుర్వేదంబుఁ గల్పించె(ట) 4. బలినడిగె (క. ట. జ. డ. ద. య.) బలినణఁచి (గ) బలినదిమి (య) 5. రామభావంబున (క) 6. నిఃక్షత్రంబు గావించె (తం. వా.) 7. తత్త్వమతులైన (ట. త. ప. ర. య.) 8. మధ్యగయా ప్రదేశంబున (క. చ. ట. ద. బ. య. హ. వా.)

యులై సంచరింప విష్ణుయశుండను విప్రునికి కల్కియను పేర నుద్భవింపం
గలండని యిట్లనియె. 61

**మ.** సరసిం బాసిన [1]వేయుకాలువల యోజన్ విష్ణునందైన శ్రీ
కర నానా ప్రకటావతారము లసంఖ్యాతంబు లుర్వీశులున్
సురలున్ [2]బ్రాహ్మణ సంయమీంద్రులు మహర్షుల్ విష్ణు[3]నంశాంశముల్
హరి కృష్ణుండు బలానుజన్ముఁ డెడలే దావిష్ణుఁడౌ నేర్పడన్, 62

క. భగవంతుండగు విష్ణువు, జగముల కెవ్వేళ రాక్షసవ్యథ గలుగున్
దగ నవ్వేళల [4]దయతో, యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్. 63

ఆ. అతిరహస్యమైన హరిజన్మకథనంబు, మనుజుఁ డెవ్వఁడేని మాపురేపుఁ
జాలభక్తితోడఁ జదివిన సంసార, దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు. 64

వ. వినుండు. [5]అరూపుండై చిదాత్మకుండై పరఁగు జీవునికిఁ బరమేశ్వరు మాయా గుణంబులైన మహదాదిరూపంబులచేత [6]నాత్మస్థానంబుగా స్థూలశరీరంబు విరచితంబైన, గగనంబునందుఁ బవనాశ్రిత మేఘసమూహంబును, గాలియందు బార్థివధూళిధూసరత్వంబును నేరీతి నట్లు ద్రష్టయగు నాత్మయందు దృశ్యత్వము బుద్ధిమంతులుగానివారిచేత నారోపింపంబడు. ఈ స్థూలరూపముకంటె నదృష్టగుణంబై యశ్రుతంబైన వస్తువగుటంజేసి వ్యక్తంబుగాక సూక్ష్మంబై కరచరణాదులులేక జీవునికి నొండొకరూపము విరచితమైయుండు. సూక్ష్మండై జీవుని వలన నుత్క్రాంతి గమనాగమనంబులం బునర్జన్మంబు దోఁచు. [7]ఎపుడీ స్థూలసూక్ష్మరూపంబులు రెండు విద్యంజేసి యాత్మకుఁ గల్పింపంబడె ననియెడి హేతువువలన స్వరూపసమ్యగ్ జ్ఞానంబునఁ బ్రతిషేధింపఁబడు నపుడ జీవుండు బ్రహ్మయగు. సమ్యగ్జ్ఞానంబ దర్శనంబు, విశారదుండైన యీశ్వరునిదై క్రీడించు నవిద్యయనంబడుచున్న మాయ యెప్పుడు విద్యారూపంబునం బరిణతయగు నప్పుడు జీవోపాధియైన స్థూలసూక్ష్మరూపంబు దహించి, కాష్ఠంబులేక తేజరిల్లు వహ్నిచందంబునఁదాన యుపరతయగు. అపుడు జీవుండు బ్రహ్మ

---

1. బాయు (క.గ.ద.బ.య.) బాఱు (హ. వా.) 2. బ్రాహ్మలు (క.చ.ట.త.). 3. నంశాంశజుల్ (హ.తం.వా.) 4. దడయక (హ.తం.వా) 5. ఏకరూపుఁడై యేకతనుండై యాత్మయనం బరఁగు (క) 6. ఆత్మాధార(హ) 7. అపుడీ స్థూలసూక్ష్మరూపంబులు రెండును స్వరూపసమ్యగ్ జ్ఞానంబున నిషేధింపంబడునని తెలియు నవిద్యంజేసి యాత్మకుఁ గల్పింపంబడియె ననియెడి హేతువువలన నపుడు జీవుండు బ్రహ్మదర్శనంబను జ్ఞానంబున కధికారియగునట్టి బ్రహ్మజ్ఞానమతివిశారదయై యీశ్వరునిదై క్రీడించునట్టి మతి ప్రకాశంబున నవిద్యయనంబడుచున్న మాయ యుపరతయై తాను విద్యారూపంబునం బరిణతయగు నప్పుడు జీవోపాధియైన స్థూలసూక్ష్మరూపంబు దహించి జీవుండు కాష్ఠంబులేక తేజరిల్లు వహ్నిచందంబునఁ దాన యుపరతుండై బ్రహ్మస్వరూపంబునుంబొంది (హ).

స్వరూపుండై పరమానందంబున విరాజమానుం డగు. ఇట్లు తత్త్వజ్ఞులు సెప్పుదు
రని సూతుం డిట్లనియె. 65

చ. జననములేక కర్మములజాడలఁ బోక సమస్తచిత్త వ
ర్తనుఁడగు చక్రికిన్ గవు లుదారపదంబుల జన్మకర్మముల్
వినుతులు సేయుచుండుదురు వేదరహస్యములందు నెందుఁ జూ
చిన మఱిలేవు జీవునికిఁ జెప్పినకైవడి జన్మకర్మముల్. 66

మ. భువనశ్రేణి నమోఘలీలుఁడగుచున్ బుట్టించు రక్షించు నం
తవిధింజేయు మునుంగఁడందు బహుభూతవ్రాతమం దాత్మతం
త్ర విహారస్థితుఁ[1]డై *షడింద్రియ సమస్తప్రీతియున్ దవ్వులన్
దివిభంగిన్గొనుఁ జిక్కఁ డింద్రియములన్ [2]ద్రిప్పున్ నిబంధించుచున్. 67

చ. జగదధినాథుఁడైన హరి సంతతలీలలు నామరూపముల్
దగిలి మనోవచోగతులఁ దార్కికచాతురి యెంతగల్గినన్
మిగిలి కుతర్కవాది దగ మేరలుచేసి యెఱుంగనేర్చునే
యగణిత నర్తనక్రమము నజ్ఞుఁడెఱింగి నుతింపనోపునే. 68

ఉ. ఇంచుక మాయలేక మది నెప్పుడు వాయని భక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరి దివ్యపదాంబుజ గంధరాశి సే
వించు నతం డెఱుంగు నరవిందభవాదులకైన దుర్లభో
దంచితమైన యా హరి యుదార మహాద్భుత కర్మమార్గముల్. 69

మ. హరిపాదద్వయభక్తి మీవలన నిట్లారూఢమై యుండునే
తిరుగంబాఱదు చిత్తవృత్తి హరిపై దీపించి మీ లోపలన్
ధరణీదేవతలార! మీరలు మహాధన్యుల్ సమస్తజ్ఞులున్
హరిచింతన్ మిముఁజెంద వెన్నఁడును [3]జన్మాంతరవ్యథాయోగముల్. 70

—: శ్రీమద్భాగవత రచనాది వృత్తాంతములు :—

సీ. పుణ్యకీర్తనుఁడైన భువనేశచరితంబు బ్రహ్మతుల్యంబైన భాగవతము
సకలపురాణరాజము దొల్లి లోకభద్రముగఁ బుణ్యముగ మోదముగఁ బ్రీతి
భగవంతుఁడగు వ్యాసభట్టారకుఁ డొనర్చి శుకుఁ డనియెడు తన సుతునిచేతఁ
జదివించె [4]నింతయు సకల వేదేతిహాసములోపలనెల్ల సారమైన

1. స్థితుఁ డౌషడింద్రియ (క. గ. జ.) 2. ద్రెంచున్ (ట. డ.) 3. జన్మాంతవ్యథా (క. ర.)
4. నెంతయు (గ); నంతయు (బ) షడ్వర్గికం జిఘ్రతి షడ్గుణేశః–అని మూలము· 1-3-36.

ఆ. యీ పురాణమెల్ల నెలమి నా శుకయోగి, గంగనడుమ[1]వచ్చి ఘనవిరక్తి
యొదవి మునులతోడ నుపవిష్టుఁడగు పరీ, క్షిన్నరేంద్రుఁ డడుగఁ జెప్పెవినుఁడు.

వ. కృష్ణుండు [2]ధర్మజ్ఞానాదులతోడం దనలోకంబునకుం జనినపిమ్మటం గలికాల దోషాంధకారంబున నష్టదర్శనులైన జనులకు నిప్పుడీ పురాణంబు గమలబంధుని భంగి నున్నది. నాఁ డందు భూరితేజుండై కీర్తించుచున్న విప్రఋషివలన నేఁ బఠించిన క్రమంబున నా మదికి గోచరించినంతయు వినుపించెద ననిన సూతునకు మునివరుండైన శౌనకుం డిట్లనియె. 72

అధ్యాయము—౪

శా. సూతా ! యే యుగ[3]వేళ నేమిటికి నెచ్చోటన్ మునిశ్రేష్ఠ నే
శ్రోతల్[4]గోరిరి యేమిహేతువునకై శోధించి లోకైకవి
ఖ్యాతిన్ వ్యాసుఁడు మున్ను భాగవతముం గల్పించెఁ దత్పుత్రుఁ డే
ప్రీతిన్ రాజున కీ పురాణకథఁ జెప్పెన్ జెప్పవే యంతయున్. 73

వ. బుధేంద్రా ! వ్యాసపుత్రుండైన శుకుండను మహాయోగి సమదర్శనుం డేకాంత మతి[5]మాయాశయనంబువలనం దెలిసినవాఁడు గూఢుండు మూఢునిక్రియ నుండు నిరస్తభేదుం డదియునుంగాక. 74

తరల. శుకుఁడు గోఁచియులేక పైఁజనఁ జూచి తోయములందు ల
జ్జకుఁ జలింపక చీరలొల్లక చల్లులాడెడి దేవక
న్యకలు "హా శుక" యంచు వెన్కఁ జనంగ వ్యాసునిఁ జూచి యం
శుకములన్ ధరియించి సిగ్గున స్రుక్కి రందఱు ధీనిధీ ! 75

వ. మఱియు నగ్నుండు దరుణుండునై చను తన కొడుకుం గని వస్త్రపరిధానం బొనరింపక, వస్త్రధారియు వృద్ధుండునైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవరమణులం గని వ్యాసుండు గారణం బడిగిన వారలు [6]నీ కొడు కిది సతి వీఁడు పురుషుండని భేదదృష్టి లేకయుండు. మఱియు నతండు నిర్వికల్పుండు గాన నీకు నతనికి [7]మహాంతరంబు గల దనిరి. అంత శుకుండు కురుజాంగల దేశంబులసొచ్చి హస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్లు జ్ఞాతుఁడయ్యె ? మఱియునున్మత్తుని క్రియ మూఢుని తెఱంగున జడునిభంగి నుండు నమ్మహా యోగికి రాజర్షియైన పరీక్షిన్మహారాజుతోడ సంవాదం బెట్లు సిద్ధించె ? బహుకాల

1. నిలిచి (క) 2. ధర్మజ్ఞానంబులతోడ (ద) 3. మందు (ట. గ. జ. ఢ.) 4. గోరినదేమి (క. చ. ట. త. ప.) 5. మాయాశయంబు (ట.ప.చ.) మాయా సంశయంబు (త) మాయాశయనంబునం దెలినవాఁడు (గ) 6. నీ పుత్రుఁడు స్త్రీపురుషులనెడు (హ. లం. వా.) 7. మహదంతరంబు (హ)

కథనీయంబైన శ్రీభాగవత నిగమవ్యాఖ్యాన మేరీతి సాగె? అయ్యోగిముఖ్యుండు గృహస్థుల గృహంబున గోవునుబిదికిన యంతతడవుగాని [1]నిలువ డండ్రు. అతండు గోదోహన మాత్రకాలంబు సంచరించిన స్థలంబులు [2]తీర్థంబులగు. పెద్దకాల మేకప్రదేశంబున నెట్లుండె? భాగవతోత్తముండైన జనపాలు జన్మకర్మంబు లే ప్రకారంబులు? వివరింపుము. 76

సీ. పాండవ వంశంబు బలము మానంబును వర్ధిల్ల [3]గడిమి నెవ్వాఁడు మనియెఁ
బరిపంథిరాజులు ధర్మాదిధనముల నర్పింతు రెవ్వని యంఘ్రియుగముఁ
గుంభజకర్ణాది[4] కురుభటవ్యూహంబు సొచ్చి చెండాడె నే శూరుతండ్రి
గాంగేయసైనికాక్రాంత గోవర్గంబు విడిపించి తెచ్చె నే వీరుతాత

ఆ. యట్టి గాఢకీర్తి యగు పరీక్షిన్మహారాజు విడువఁదగని రాజ్యలక్ష్మిఁ
బరిహరించి గంగఁ బ్రాయోపవిష్టుఁడై, యసువులుంత నేల యడఁగియుండెఁ? 77

ఉ. ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నఁడున్
జిత్తములందుఁ గోరరు హసించియు, [5]లోకులకెల్ల నర్థసం
పత్తియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదు రన్యరక్షణా
త్యుత్తమమైన మేను విభుఁడూరక యేల విరక్తిఁ బాసెనో. 78

క. [6]సారముల నెల్ల నెఱుఁగుదు, పారగుఁడవు భాషలందు బహువిధ కథనో
దారుఁడవు మాకు సర్వముఁ, బారము ముట్టంగఁ దెలియఁ బలుకు మహాత్మా? 79

—: వ్యాసుఁడు వ్యాకులచిత్తుఁడై చింతించుట :—

వ. అని యడిగిన శౌనకాది మునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియె. తృతీయంబైన ద్వాపరయుగంబు [7]దిరుగు సమయంబున నుపరిచరవసువు[8] వీర్యంబున జన్మించి వాసవి నాఁదగు సత్యవతియందుఁ బరాశరునికి హరికళంజేసి విజ్ఞానియైన [9]వేదవ్యాసుండు జన్మించి, యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీనదీజలంబుల స్నానాదికర్మంబులం దీర్చి శుచియై, పరులు లేనిచోట నొంటిఁ గూర్చుండి, సూర్యోదయమువేళ నతీతానాగత వర్తమానజ్ఞుండై యా ఋషి[10]వ్యక్తంబుగాని వేగంబుగల కాలంబునంజేసి యుగధర్మంబులకు భువి[11]సాంకర్యంబువొందు. యుగయుగంబుల భౌతికశరీరంబులకు[12]శక్తి సన్నమగు. పురుషులు నిస్సత్త్వులు

1. నిలువంబడండు (తం.వా.) 2. తీర్థంబులగునండ్రు (తం.వా.) 3. గలిమి (హ) 4. కురుబల (క. ట. య.) 5. లోకములెల్ల (హ) లోకులనెల్ల (గ) 6. సారములెల్ల నెరుంగుదు (క. గ. ర.) 7. తీరు (ర) 8. వీర్యంబువలన (చ.య.) 9. కృష్ణద్వైపాయనుండు(ర) 10. వ్యక్తంబుగానివేదంబులు గల కలికాలముంజేసి (య) 11. సంకరంబువొందు (క.చ.ట.గ.జ.ద.బ.య.ర) 12. శక్తిసంగమ మగు (క. త. గ. జ. ద.)

ధైర్యశూన్యులు [1]మందప్రజ్ఞు లల్పాయువులు దుర్బలులు నయ్యెదరని తన దివ్య దృష్టింజూచి సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయఁదలంచి, [2]నలుగురు హోత లచేత ననుష్ఠింపందగి ప్రజలకు శుద్ధికరంబులైన వైదికకర్మంబులగు యజ్ఞంబు లెడతెగకుండు కొఱకు, నేకంబైన వేదంబు ఋగ్యజుస్సామాథర్వణంబులను నాలుగు [3]నామంబుల విభాగించి, యితిహాస పురాణంబు లన్నియుఁ బంచమ వేదంబని పల్కె నందు.

సీ. పైలుండు ఋగ్వేద పఠనంబు దొరఁకొనె సామంబు జైమిని చదువుచుండె
యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ [4]దుది నథర్వము సుమంతుఁడు పఠించె
నఖిలపురాణేతిహాసముల్ మాతండ్రి రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ
దమతమవేద మా తపసులు భాగించి శిష్యసంఘములకుఁ జెప్పి రంత

గీ. శిష్యులెల్లరు నాత్మీయ శిష్యజనుల, కందు[5]బహుమార్గములుచెప్పి [6]యనుమతింపఁ
బెక్కుశాఖలుగలిగి యీ పృథివిలోన, నిగమ మొప్పారె భూసుర నివహమందు.

వ. ఇట్లు మేధాహీనులైన పురుషులచేత నట్టి వేదంబులు ధరియింపంబడుచున్నవి. మఱియు దీనవత్సలుండైన వ్యాసుండు స్త్రీశూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విన నర్హంబులు గావున, మూఢులకెల్ల మేలగునని భారతాఖ్యా నంబు చేసియు నమ్ముని, భూతహితమందుఁ దనహృదయము సంతసింపకున్న సరస్వతీతటంబున నొంటినుండి హేతువు వితర్కింపుచుఁదనలో నిట్లనియె. 82

సీ. వ్రతధారినై వేద వహ్ని గురుశ్రేణి మన్నింతు విహితకర్మములఁ గొఱఁత
పడకుండ నడపుదు భారతమిషమునఁ బలికితి వేదార్థ భావమెల్ల
మునుకొని స్త్రీశూద్ర ముఖరధర్మములందుఁ బెలిపితి నేఁజెల్ల దీనఁజేసి
యాత్మ సంతసమంద దాత్మలో నీశుండు సంతసింపకయున్న జాడదోఁచె

ఆ. హరికి యోగివరుల కభిలషితంబైన, భాగవత విధంబుఁ బలుకనైతి
మోసమయ్యెఁదెలివి మొనయదు మఱచితి,ననుచు వగచుచున్న యవసరమున. 83

—: వ్యాసుని కడకు నారదుఁడు వచ్చుట :—

సీ. తనచేతి వల్లకీతంత్రీచయంబున సతతనారాయణ శబ్దమొప్ప
నానన సంభూత హరిగీతరవసుధాధారల యోగీంద్రతతులు సొక్కఁ
గపిల జటాభార కాంతిపుంజంబుల దిశలు ప్రభాతదీధితి వహింపఁ
దనులగ్నతులసికాదామ గంధంబులు గగనాంతరాళంబుఁ గప్పికొనఁగ

1. మందమతులు దుఃఖార్ణవమగ్నులు (క. బ.) 2. హోత్రాదులగు ఋత్విక్చతుష్టయముచేత(హ) 3. నామంబుల నాలుగువేదంబుల ధర్మార్థకామమోక్షంబులు నాలుగువిచారించి (ర) 4. మహినథర్వణము సుమంతుఁజేరె(య) 5. బహుమార్గములఁద్రుంచి యనువచింప (హ. తం. వా). అనుపఠింప(త)

అ. వచ్చె మింటనుండి వాసవీనందను, కడకు మాటలాడఁ[1]గణఁకతోడ
భద్ర విమలకీర్తి పారగుఁ డారూఢ, నయవిశారదుండు నారదుండు. 84

క. కనియె న్నారదుఁ డంతన్, వినయైక విలాసు నిగమ విభజన విద్యా
జనితోల్లాసున్ భవదుఃఖ నిరాసున్ గురుమనోవికాసున్ వ్యాసున్. 85

వ. ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదునెఱింగి లేచి వ్యాసుండు విధివత్ క్రమం
బునం బూజించిన నతండు లేనగవు నెగడెడి మొగంబుతోడ విపంచికాతంత్రి
వ్రేల మీటుచు నిట్లనియె. 86

అధ్యాయము — ౫

ఉ. ధాతవు భారతశ్రుతివిధాతవు వేదపదార్థజాత వి
జ్ఞాతవు గామముఖ్యరిపుషట్కవిజేతవు బ్రహ్మతత్త్వ ని
ర్ణేతవు యోగినేతవు వినేతవు నీవు చలించి చెల్లరే
కాతరు కైవడిన్ వగవఁ గారణమేమి పరాశరాత్మజా ? 87

వ. అనినఁ బారాశర్యుం డిట్లనియె. 88

క. పుట్టితి వజుతనువునఁ జే, పట్టితివి పురాణపురుషు భజనము పదముల్
మెట్టితివి దిక్కులం దుది. ముట్టితివి మహాప్రబోధమున మునినాథా ! 89

వ. అదియునుంగాక నీవు సూర్యునిభంగి మూఁడులోకములం జరింతువు. వాయువు
పగిది నఖిల జనులలోన మెలంగుదువు. సర్వజ్ఞుండ వగుటంజేసి. 90

క. నీ కెఱుఁగరాని ధర్మము, లోకములనులేదు బహువిలోకివి [2]నీవున్
నాకొఱఁత యెట్టి దంతయు, నాకున్ వివరింపుమయ్య నారద ! కరుణన్. 91

వ. అనిన నారదుం డిట్లనియె. 92

ఉ. అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన [3]నిం
చించుకగాని విష్ణుకథలేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁగాక నీకు నే
కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా ! 93

మ. హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము [4]విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమైయుండ దయోగ్య [5]దుర్మదనదత్కాకోల గర్తాకృతిన్. 94

1. కరుణతోడ (క) గౌరవమున (చ) గారవమున (య) 2. వివిధ క్రమంబుల (హ. తం. వా.)
3. నీవించుకగాని (ట.) 4 విచిత్రార్థాన్వయంబైన (క.చ.ట.త.గ.డ.) 5. దుర్మలినవత్(హ.తం.వా.)

మ. అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
ప[1]పరిత్యాగము సేయుఁగావున హరిన్ భావించుచుం బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తింపుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా తత్త్వజ్ఞ ! చింతింపుమా. 95

వ. మునీంద్రా ! నిర్గతకర్మంబైన నిరుపాధికంబైన జ్ఞానంబు గలిగినను హరిభక్తి లేకున్న శోభితంబుగాదు. ఫలంబుగోరక కర్మమీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు. భక్తిహీనంబులైన జ్ఞానవాచా కర్మకౌశలంబులు నిరర్థకంబులు. కావున మహానుభావుండవు, [2]యథార్థదర్శనుండవు, సకలదిగంత ధవళ కీర్తివి, సత్యరతుండవు, ధృతవ్రతుండవు నగు నీవు నిఖిల బంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ వర్ణింపుము. హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వీక్షించి తద్వివక్షాకృతరూప నామంబులంజేసి పృథగ్దర్శనుండైన వాని మతి పెనుగాలి త్రిప్పునంబడి [3]తప్పంజను నావచందంబున నెలవు చేరనేరదు. కామ్యకర్మంబులందు రాగంబుగల ప్రాకృత జనులకు నియమించిన ధర్మంబులుసెప్పి [4]శాసకుండవగు [5]నీవు వగచుట తగదు. అది యెట్లనిన, వార లదియే ధర్మంబని కామ్యకర్మంబులు సేయుచుఁ దత్త్వజ్ఞానంబు మఱతురు. అది గావున [6]తత్త్వజ్ఞుండవై వ్యథావియోగంబు సేయుమని మఱియు నిట్లనియె. 96

చ. ఎఱిఁగెడువాఁడు కర్మచయ మెల్లను మాని హరిస్వరూపమున్
నెఱయ [7]నెఱింగి యవ్వలన నేరుపుచూపు గుణానురక్తుఁడై
తెఱకువలేక క్రుమ్మరుచు దేహ ధనా[8]ద్యభిలాషయుక్తుఁడై
యెఱుఁగని వానికిం దెలియ నీశ్వరులీల లెఱుంగఁ జెప్పవే. 97

చ. తనకులధర్మమున్ విడిచి దానవవైరి పదారవిందముల్
[9]పనివడి సేవసేసి పరిపాకము వొందక యెవ్వఁడేనిఁ జ
చ్చిన మఱుమేననైన నది సిద్ధివహించుఁ దదీయసేవఁ బా
సినఁ గులధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్నిమేనులన్. 98

వ. అది గావున నెఱుకగలవాఁడు హరిసేవకు యత్నంబు సేయందగు. కాలక్రమంబున సుఖదుఃఖంబులు ప్రాప్తంబులైనను హరిసేవ విడువందగదు. దానంజే

1. పరిత్యాజ్యము (ల. డ.) 2. వేదార్థ (క. ట.) 3. తప్పంబడు (హ) 4. శాంతుండవయిన (ట. ద. ర.) 5. నీ నడవడిచెగదు (క.చ.గ.జ.డ.ద.బ.య.ర.హ.తం.వా.) 6. తత్త్వప్రదుండవై (ట) (క.చ.వ.జ.బ.హ.తం.వా.) 7. నెఱుంగుఁదానుమది (హ. తం. వా.) 8. ద్యభిమానచిత్తుఁడై (ట) అభిమానయుక్తుఁడై (ద. ఖ.) 9. పనుపడ (త); పనివడ (ర)

[1]బ్రహ్మస్థావరపర్యంతంబు దిరుగుచున్న [2]జనులకు నెయ్యది పొందరా దట్టిమేలు సిద్ధించు (కొఱకు) హరిసేవ సేయవలయు. హరిసేవకుం డగువాఁడు [3]జననంబు నొందియు నన్యునిక్రియ సంసారంబునం జిక్కఁడు. క్రమ్మఱ హరిచరణస్మరణంబుఁ జేయుచు, భక్తిరస వశీకృతుండై విడువ నిచ్చగింపఁడు. మఱియును. 99

సీ. విష్ణుండు విశ్వంబు విష్ణునికంటెను వేఱేమియును లేదు విశ్వమునకు
భవవృద్ధి లయములా పరమేశుచేనగు నీ వెఱుంగుదు గాదె నీ ముఖమున
నెఱిఁగింపఁబడ్డది యేకదేశమున నీ భువనభద్రమునకై పుట్టినట్టి
హరికళాజాతుండ వని విచారింపుము కావున హరి[4]పరాక్రమములెల్ల

ఆ. వినుతి సేయు మీవు వినికియుఁ జదువును,దాన మతులనయముఁ దపము ధృతియుఁ
గలిమి కెల్ల ఫలము గాదె పుణ్యశ్లోకుఁ గమలనాభుఁ బొగడఁ గలిగెనేని. 100

—: నారదుని పూర్వజన్మ వృత్తాంతము :—

వ. మహాత్మా! నేను పూర్వ[5]కల్పంబునం దొల్లిటి జన్మంబున వేదవాదుల యింటి దాసికిం బుట్టి, పిన్ననాఁడు వారలచేఁ [6]బంపంబడి యొక వానకాలంబునఁ జాతుర్మాస్యంబున నేకస్థలనివాసంబు సేయ నిశ్చయించు యోగిజనులకుం బరిచర్య సేయుచు. 101

క. [7]ఓటమితో నెల్లప్పుడు, పాటవమునఁ బనులు సేసి బాలురతో నే
యాటలకుఁ బోక నొక జం, జాటంబును లేక భక్తి [9]సలుపుదు ననఘా! 102

క. మంగళ మనుచును వారల, యెంగిలి భక్షింతు వాన కెండకు నోడన్
ముంగల నిలుతును నియతిని, వెంగలిక్రియఁ జనుదు[10]నే వివేకముతోడన్. 103

వ. ఇట్లేను వర్షాకాల శరత్కాలంబులు సేవించితిని. వారును నాయందుం గృప సేసి రంత. 105

శా. వారల్ కృష్ణచరిత్రముల్ చదువఁగా వర్ణింపఁగాఁ బాడఁగా
నా రావంబు సుధారసప్రతిమమై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణ[11]మైన మది సంతోషించి నే నంతటన్
బ్రారంభించితి విష్ణుసేవ కితరప్రారంభ దూరుండనై. 105

1. యూర్ధ్వంబున బ్రహ్మపర్యంతంబు క్రిందఁ స్థావరపర్యంతంబు (హ. తం. వా.) 2. జీవులకు దుఃఖంబులట్లు సుఖంబులు ప్రాకృత కర్మాధీనంబులై సిద్ధించు (హ.వా.) 3. నిజధర్మంబునందియు సంసారంబునం జిక్కఁడు (క) నీచజన్మంబునొందియు...(త) 4. కథాక్రమములెల్ల (ద) 5. కర్మంబున(గ); కాలంబున (ప) 6. పంపువడి (ల) చెప్పంబడి (గ.ఢ.య.) పెంపంబడి (ర) 7. వాటముతో (క.ట.గ. జ. య.) పోటమితో (ల. ద. ర.) 8. కడకేనాటలకు (త. గ.) 9. సలిపితి (తి. వ.) 10. నురు వివేకము (ట. ప.) గురువివేకము (త) 11. మైమదిని (గ. య.)

వ. ఇట్లు హరిసేవా[1]రతింజేసి ప్రపంచాతీతుండనై బ్రహ్మరూపకుండనైన నా యందు స్థూలసూక్ష్మంబైన యీ శరీరంబు నిజమాయాకల్పితం బని యమ్మహాత్ములగు యోగిజనుల మూలంబున రజస్తమోగుణ పరిహారిణియైన భక్తి సంభవించె. అంతఁ జాతుర్మాస్యంబు నిండిన నయ్యోగిజనులు యాత్రసేయు వారలై యివ్విధంబున. 106

మ. అపచారంబులులేక నిత్యపరిచర్యా[2]భక్తి యుక్తుండనై
చపలత్వంబును మాని నేఁ గొలువఁగా సంప్రీతులై వారు ని
ష్కపటత్వంబున దీనవత్సలతతోఁ గారుణ్యసంయుక్తులై
యుపదేశించిరి నాకు నీశ్వరరహస్యోదార విజ్ఞానముల్. 107

వ. ఏనును వారి యుపదేశంబున వాసుదేవుని మాయానుభావంబు దెలిసితి. ఈశ్వరుని యందు సమర్పితంబైన కర్మంబు దాపత్రయంబు మాన్పు నౌషధంబగు. ఏ ద్రవ్యంబువలన నేరోగంబు జనియించె నాద్రవ్య మా రోగంబును మానుప నేరదు. ద్రవ్యాంతరంబుచేత నైన [3]చికిత్స మానుపనోపు. ఇవ్విధంబునఁ గర్మంబులు సంసారహేతుకంబులయ్యు నీశ్వరార్పితంబులై [4]తాము తమ్ముఁ జెఱుపు కొన నోపియుండు. ఈశ్వరునియందుఁ జేయఁబడు కర్మంబు విజ్ఞానహేతుకంబై యీశ్వర [5]సంతోషణంబును, భక్తియోగంబునుం బుట్టించు. ఈశ్వర శిక్షంజేసి, కర్మంబులు సేయువారలు గృష్ణగుణనామవర్ణన స్మరణంబులు సేయుదురు. ప్రణవపూర్వకంబులుగా వాసుదేవ ప్రద్యుమ్న సంకర్షణానిరుద్ధమూర్తి నామంబులు నాలుగు [6]భక్తిం బలికి నమస్కారంబుసేసి, మంత్రమూర్తియు శూన్యుండు నైన యజ్ఞపురుషునిం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుం డగు.

క. ఏ నివ్విధమునఁ జేయఁగ, దానవకులవైరి నాకుఁ [7]దనయందలి వి
జ్ఞానము నిచ్చెను మదను, ష్ఠానము నతఁడెఱుఁగు నీవు సలుపుము దీనిన్. 109

క. మునికులములోన మిక్కిలి, వినుకులు గలవాఁడ వీవు విభు కీర్తులు నీ
వనుదినముఁ బొగడ వినియెడి, జనములకును దుఃఖమెల్ల శాంతిం బొందున్. 110

1. మతింజేసి (హ) 2. యుక్తిభక్తుండనై (క. త.) 3. చికిత్సితంబు (హ) 4. తాముండమ్ము (హ. క. బ.) 5. సంతోషంబు (క. ర.) 6. అతిభక్తిన్ (క. బ. ర.) 7. తనయందతివిజ్ఞానము(హ) తన యందుల (తం)— "అదాన్మే జ్ఞానమైశ్వర్యం, స్వస్మిన్ భావంచ కేశవః"— అని మూలము.

అధ్యాయము — ౬

వ. ఇట్లు నారదు జన్మకర్మంబులు విని క్రమ్మఱ వ్యాసుం డిట్లనియె. 111

మ. విను మా భిక్షులు నీకు నిట్లు కరుణన్ విజ్ఞానముం జెప్పి పో
యిన బాల్యంబున వృద్ధభావమున నీ కేరీతి సంచారముల్
చనె నీ కిప్పుడు పూర్వకల్పమతి యే జాడం బ్రదీపించెఁ ద
త్తనువుం బాసినచంద మెట్లు చెపుమా దాసీసుతత్వంబుతోన్. 112

వ. అని యిట్లు వ్యాసుం డడిగిన నారదుం డిట్లనియె. దాసీపుత్రుండ నైన యేను భిక్షులవలన [1]హరివిజ్ఞానంబు గలిగియున్నంత. 113

సీ. [2]మమ్మ నేలినవారి మందిరంబునఁగల పనులెల్లఁ గ్రమమున భక్తిఁజేసి
తన పరాధీనతఁ [3]దలఁపదు సొలసితి నలసితి నాకొంటి ననుచు [4]వచ్చు
మాపును రేపును మాతల్లి మోహంబు సొంపార ముద్దాడు చుంచుదువ్వ
దేహంబు [5]నివురు మోదించుఁ గౌఁగిటఁ జేర్చు నర్మిలితో నిట్లు [6]నన్ను మనుప

ఆ. నేను [7]విడిచిపోక యింట నుండితినయ్య. మోహిఁగాక యెఱుక మోసపోక
మాఱుచింతలేక మౌనినై యేనేండ్ల, వాఁడ నగుచుఁ గొన్ని వాసరములు. 114

వ. అంత. 115

క. సదనము వెలువడి తెరువునఁ, జెదరక మాతల్లి రాత్రిఁ జీఁకటివేళన్
మొదవుం బిదుకఁగ నొకఫణి, పదభాగముఁ గఱచెఁ ద్రొక్కఁబడి మునినాథా!

క. నీలాయత భోగఫణా, వ్యాళానల విషమహోగ్ర వహ్నిజ్వాలా
మాలావినిపాతితయై, వ్రాలెన్ ననుఁ గన్నతల్లి వసుమతిమీఁదన్. 117

ఉ. తల్లి ధరిత్రిపై నొఱగి తల్లడ[8]పాటునుజెంది చిత్తమున్
బల్లటిలంగఁ బ్రాణములు వాసినఁ జూచి కలంగ కేను నా
యుల్లములోన మోహరుచి నొందక సంగమువాసె మేలు రా
జిల్లెనటంచు విష్ణుపదచింత [9]యొనర్పఁగ బుద్ధినేయుచున్. 118

వ. ఉత్తరాభిముఖుండనై యేను వెడలి. జనపదంబులును పురంబులును బట్టణంబులును గ్రామంబులును బల్లెలును మందలును మహోద్యానంబులును కిరాత పుళింద నివాసంబులును వనంబులును [10]చిత్రధాతు విచిత్రితంబులైన పర్వతంబులును

1. హరిజ్ఞానంబు (య) 2. మహితాత్ములగువారి మందిరంబుగల (య) 3. తలఁపక (చ.ర.) 4. వచ్చి (చ) 5. నివురుచుఁదివిచి (త.గ.) 6. నరసి నడవ (ద) నడప (య) 7. రాక (గ.జ.డ.) 8. పాటునఁజేసి (జ) 9. యొనర్పఁగ బుద్ధిఁ జేర్చుచున్ (వా) యొనర్చుచు బుద్ధిఁజేర్చుచున్ (భ) 10. విచిత్రపాదప చిత్రితంబులైన (క) చిత్రపథా విచిత్రితములైన (త).

సమదకరి కరవిదళిత[1] శాఖలుగల శాఖలును, [2]నివారిత పథికజన శ్రమాతిరేకంబులైన [3]తటాకంబులును, బహువిధ విహంగ నినద మనోహరంబులై వికచారవింద మకరంద పాన పరవశ పరిభ్రమ ద్భ్రమర సుందరంబులైన సరోవరంబులును, దాఁటి చనుచు క్షుత్పిపాసాసమేతుండనై [4]నదీహ్రదంబునఁ గ్రుంకులిడి శుచినై నీరుద్రావి గత శ్రముండనై. 119

క. సాలావృక కపి భల్లుక, కోలేభ లులాయ శల్య ఘూక శరభ శా
ర్దూల శశ గవయ ఖడ్గ, వ్యాళాజగరాది భయద వనమధ్యమునన్. 120

వ. దుస్తరంబైన [5]నల వేణు కీచక [6]గుల్మ లతా గహ్వరంబుల పొంత నొక రావి మ్రాను [7]దగ్గఱఁ గూర్చుండి యే విన్నచందంబున నా హృదయగతుం బరమాత్మ స్వరూపు హరిం జింతించితి. 121

శా. ఆనందాశ్రులు గన్నుల న్వెడల రోమాంచంబుతోఁ దత్పద
ధ్యానారూఢుఁడ నైన నా తలఁపులో న ద్దేవుఁడుం దోఁచె నే
నానందాబ్ధి గతుండనై యెఱుఁగలేనైతిన్ నను న్నీశ్వరున్
నానా శోకహమైన [8]యత్తనువు గాన న్నేర[9]క ట్లంతటన్. 122

వ. లేచి నిలుచుండి క్రమ్మఱ నద్దేవుని [10]దివ్యాకారంబుఁ జూడ నిచ్ఛించుచు హృదయంబున నిలుపుకొని యాతురుంబోలె చూచియుం గానక, నిర్మనుష్యంబైన వనంబునం జరియించుచున్న నను నుద్దేశించి వాగగోచరుండైన హరి గంభీర మధురంబులైన వచనంబుల శోకం బుపశమింపం జేయు చందంబున నిట్లనియె.

ఉ. ఏల కుమార! శోషిలఁగ నీ జననంబున నన్నుఁ గానఁగాఁ
జాలవు నీవు కామముఖ షట్కము నిర్దళితంబు సేసి ని
ర్మూలిత కర్ములైన మునిముఖ్యులు గాని [11]కుయోగి గానఁగాఁ
జాలఁడు నీదు[12]కోర్కి కొనసాగుటకై నిజమూర్తిఁ జూపితిన్. 124

క. నావలన కోర్కి యూరక, పోవదు విడిపించు దోషపుంజములను [13]మ
త్సేవం బుట్టును వైళమ, భావింపఁగ నాదుభక్తి బాలక! వింటే. 125

క. [14]నాయందుఁ గలుగు నీ మది, వాయదు జన్మాంతరముల బాలక! నీ వీ
కాయంబు విడిచి మీఁదట, మా యనుమతిఁ బుట్టఁగలవు మద్భృత్యుఁడవై. 126

---

1. శాఖలైన తరుశాఖలును (క.య) 2. సదా వారిపూరిత పరిజన (క)—పథికజన (చ) 3. తడాకంబులు (త.గ.) 4. మడుపులందు (క.బ.) 5. సాలవేణు (క); నీలవేణు (ర) 6. కుశ (ట.బ.); కాశ (గ.య.) 7. దగ్గరి (చ) చెంత (గ) 8. తత్తనువు (గ) 9. నేరకేనంతటన్ (క) 10. దివ్యావతారంబు (జ.డ.) 11. యయోగి (గ); 12. కోర్కె (బ).13. సత్సేవ (జ) 14. నాయందుల మతిగలిగిన (త) నాయందు భక్తికలిగిన (ద).

మ. విను మీ సృష్టి లయంబు నొంది యుగముల్ వెయ్యైన కాలంబు యా
మినియై పోయెడిఁ బోవఁగా [1]గలుగుఁజూ మీఁదం బునః సృష్టి యం
దు నిరూఢ స్మృతితోడఁ బుట్టెదవు నిర్దోషుండవై నా కృపా
ఘనతం జెందెదు శుద్ధసాత్త్వికులలో గణ్యుండవై యర్భకా! 127

వ. అని యిట్లాకాశంబు మూర్తియు, ఋగ్వేదాదికంబు నిశ్వాసంబునుగా నొప్పి సర్వ నియామకంబైన మహాభూతంబు వలికి యూరకున్న, నేనును మస్తకంబు వంచి మ్రొక్కి, తత్కారుణకు సంతసించి, మదము దిగనాడి, మత్సరంబు విడిచి, కామంబు జయించి, క్రోధంబు వర్జించి, లోభమోహంబులు వెడలనడిచి, సిగ్గు విడిచి, యనంతనామంబులు పఠియింపుచుఁ బరమభద్రంబులైన [2]తచ్చరిత్రంబులఁ జింతింపుచు, నిరంతర సంతుష్టుండనై (కృష్ణునిం బుద్ధి నిలిపి నిర్మలాంతఃకరణంబుతోడ విషయ విరక్తుండనై) కాలమున కెదురుచూచుచు భూమిం దిరుగుచునుండ నంతఁ గొంతకాలంబునకు మెఱుము మెఱసిన తెఱంగున, మృత్యువు దోఁచినం బంచభూత[3]మయంబై కర్మస్వరూపంబైన పూర్వదేహంబు విడిచి, హరికృపావశంబున శుద్ధసత్త్వమయంబైన భాగవత దేహంబు సొచ్చితిని. అంతం త్రైలోక్యంబు [4]సంహరించి ప్రళయకాల పయోరాశి మధ్యంబున *(శయనించు) నారాయణమూర్తియందు నిదురవోవ నిచ్ఛగించు బ్రహ్మ నిశ్వాసంబువెంట నతని లోపలం బ్రవేశించితిని. అంత సహస్రయుగ పరిమితంబైన కాలంబు చనిన లేచి లోకంబులు సృజియింప నుద్యోగించు బ్రహ్మ ప్రాణంబుల వలన మరీచి ముఖ్యులగు మునులు, నేనును జనియించితిమి. అందు నఖండిత బ్రహ్మచర్యుండనై యేను మూఁడులోకంబుల బహిరంతరంబులందు మహావిష్ణుని యనుగ్రహంబున నడ్డంబులేక యీశ్వర దత్తయై బ్రహ్మాభివ్యంజకంబులైన సప్తస్వరంబులు దనయంతన మ్రోయుచున్న [5]యీ వీణాలాపరతిం జేసి నారాయణ కథాగానంబు సేయుచుఁ జరియింపుచుండుదు. 128

ఆ. తీర్థపాదుఁడైన దేవుండు విష్ణుండు, దనచరిత్ర మేను దవిలి పాడఁ
జీరఁబడ్డవాని చెలువున నేతెంచి, ఘనుఁడు నా మనమునఁ గానవచ్చు. 129

క. విను మీ సంసారంబను, వననిధిలో [6]మునిఁగి కర్మవాంఛలచే వే
దనఁ బొందెడువానికి విష్ణుని, గుణవర్ణనము తెప్పసుమ్ము మునీంద్రా! 130

---

1. కలుగుఁ జుమ్మీమీఁద నా సృష్టి (హ) 2. సచ్చరిత్రంబుల (క.గ.జ.య.) 3. మయంబును (హ) మయంబైన (క). 4. ఉపసంహరించి (గ.ప.య.) సంచరించి (ప).

*ఏ తాళప్రతియందును లేదు.

5. వీణ కేల నుండఁగా (ల) 6. విషయభోగ వాంఛలచే (క.జ.త.గ.య.)

చ. యమ నియమాది యోగముల నాత్మ నియంత్రిత మయ్యుఁ గామ[1]రో
షములఁ బ్రచోదితంబ యగు శాంతి వహింపదు విష్ణుసేవచేఁ
గ్రమమున శాంతిఁ గైకొనిన కైవడి నాదుశరీర జన్మక
ర్మముల రహస్యమెల్ల మునిమండన! చెప్పితి నీవు కోరినన్. 131

వ. అని యిట్లు భగవంతుండగు నారదుండు వ్యాసమునీంద్రుని వీడ్కొని వీణ వాయింపుచు [2]యదృచ్ఛా మార్గంబునం జనియె నని సూతుం డిట్లనియె. 132

క. వాయించు వీణ నెప్పుడు, మ్రోయించు ముకుంద గీతములు జగములకున్
జేయించుఁ జెవులపండువు, మాయించు నఘాళి నిట్టి [3]మతి మఱి గలఁదే! 133

అధ్యాయము—౭

వ. అని నారదుం గొనియాడిన సూతునిం జూచి నారదుమాటలు విన్నవెనుక భగవంతుండైన బాదరాయణుం డేమి సేసెనని శౌనకుం డడిగిన సూతుం డిట్లనియె. [4]బ్రహ్మనదియైన సరస్వతి పశ్చిమతీరంబున ఋషులకు సత్రకర్మవర్ధనంబై బదరీ తరుషండమండితంబై (శమ్యాప్రాసంబని) ప్రసిద్ధంబగు నాశ్రమంబు గలదు. అందు జలంబులువార్చి కూర్చుండి వ్యాసుండు తనమదిఁ దిరంబుచేసి కొని భక్తియుక్తంబైన చిత్తంబునం బరిపూర్ణుండైన యీశ్వరుం గాంచి యీశ్వరాధీన మాయా [5]వృతంబైన జీవుని సంసారంబు గని జీవుండు మాయచేత మోహితుండై గుణవ్యతిరిక్తుండయ్యు మాయాసంగతిం దాను ద్రిగుణాత్మకుం డని యభిమానించుచుం ద్రిగుణత్వాభిమానంబునం గర్తయు భోక్తయు నను నసర్థంబు నొందు ననియు నయ్యనర్థంబునకు నారాయణ భక్తియోగంబు గాని యుపశమనంబు వేఱొకటి లేదనియును నిశ్చయించి. 134

మ. అవనీచక్రములోన నే పురుషుఁ డే యామ్నాయమున్ విన్న మా
ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పించఁగాఁ జాలు భ
క్తివిశేషంబు జనించు నట్టి భువన క్షేమంకరంబైన భా
గవతామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె నేర్పొప్పఁగన్. 135

వ. ఇట్లు భాగవతంబు నిర్మించి మోక్షార్థియైన శుకునిచేఁ జదివించె నని చెప్పిన విని శౌనకుండు, నిర్వాణతత్పరుండును సర్వోపేక్షకుండునైన శుకయోగి యేమిటికి భాగవతం బభ్యసించె ననవుఁడు సూతుం డిట్లనియె. 136

1. లోభములఁ బ్రచోదితంబగుచుఁ బ్రాణిపహింపఁడు (ట) 2. స్వేచ్ఛామార్గంబున (త) 3. మతమరి (హ.క.బ.) 4. బ్రహ్మదైవత్యయైన (తం). 5. కృతంబైన (క.ట.త.) ఈశ్వరకృత మాయాధీనంబైన (చ.ద). ఈశ్వరాధీనంబై మాయాకృతంబైన (గ.ద.)

క. ధీరులు నిరపేక్షులు నా, త్మారాములు నైన మునులు హరిభజనము ని
ష్కారణమ చేయుచుందురు, నారాయణుఁ డట్టివాఁడు నవ్యచరిత్రా! 137

క. హరిగుణవర్ణన రతుఁడై హరితత్పరుఁడైన బాదరాయణి శుభ త
త్పరతం బఠించెఁ ద్రిజగ, ద్వరమంగళమైన భాగవత నిగమంబున్. 138

క. నిగమములు *వేయుఁ జదివిన, సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవత మను, నిగమంబుఁ బఠింప ముక్తి[1]నివసనము బుధా! 139

—: అర్జునుఁడు పుత్రఘాతియగు నశ్వత్థామను అవమానించుట :—

వ. అని పలికి రాజర్షి యైన బరీక్షిన్మహారాజు జన్మకర్మ ముక్తులును, పాండవుల [2]మహాప్రస్థానంబును, కృష్ణకథోదయంబును జెప్పెద. కౌరవదృష్టద్యుమ్నాదుల యుద్ధంబున వీరులయినవారలు స్వర్గంబునకుం జనిన వెనుక, భీము గదాఘాతంబున దుర్యోధనుండు దొడలువిఱిగి కూలిన నశ్వత్థామ దుర్యోధనునకుం బ్రియంబు సేయువాఁడై నిదురవోవు ద్రౌపదీపుత్రుల శిరంబులు ఖండించి తెచ్చి సమర్పించె. అది క్రూరకర్మం బని లోకులు నిందింతురు. 140

ఉ. బాలుర చావు కర్ణములఁ బడ్డఁ గలంగి యలంగి యోరువం
జాలక బాష్పతోయకణజాలము చెక్కుల రాల నేడ్చు పాం
చాలతనూజ నేలఁబడి జాలిఁబడం గని యెత్తి మంజువా
చాలతఁ జూపుచుం జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనెన్. 141

మ. ధరణీశాత్మజ వీవు నీకు వగవన్ ధర్మంబె? తద్ద్రౌణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల, మద్గాండీవ నిర్ముక్త భీ
కర బాణంబుల నేఁడు వాని శిరమున్ ఖండించి నేఁ దెత్తుఁ ద
చ్ఛిరమున్ ద్రొక్కి జలంబులాడు మిచటన్ శీతాంశుబింబాననా. 142

వ. అని యొడంబఱచి తనకు మిత్రుండును సారథియు నైన హరి మేలనుచుండం గవచంబు దొడిగి గాండీవంబు ధరియించి కపిధ్వజుండై గురుసుతుని[3]వెంట రథంబు దోలించిన. 143

శా. తన్నుం జంపెదనంచు వచ్చు విజయుం దర్శించి తద్ద్రౌణి యా
పన్నుండై శిశుహంత గావున నిజప్రాణేచ్ఛఁ బాఱెన్ వడిన్
మున్నా బ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింప నా
సన్నుండౌ హరుఁ జూచి పాఱు పగిదిన్ సర్వేంద్రియ భ్రాంతితోన్. 144

* వేయుఁ జదివిన 1. నిచ్చ జనులకున్ (హ). 2. ప్రస్థానికము (ద.ర.) 3. వెంటనంట (క); మీఁద (త).

వ. ఇట్లోపినంత దూరంబును బరువిడి వెనుకఁజూచి, రథతురంగంబు లలయుట దెలిసి, నిలిచి ప్రాణరక్షణంబునకు నొండుపాయంబు లేదని నిశ్చయించి, జలంబుల వార్చి, ద్రోణనందనుండు సమాహితచిత్తుండై, ప్రయోగంబ కాని యుపసంహారంబు నేరకయుం బ్రాణ సంరక్షణార్థంబునకై పార్థునిమీఁద బ్రహ్మశిరో నామకాస్త్రంబు ప్రయోగించిన నది ప్రచండతేజంబున దిగంతరాళంబులు నిండి ప్రాణ భయంకరంబై తోఁచిన హరికి నర్జునుం డిట్లనియె. 145

సీ. పద్మలోచన ! కృష్ణ ! భక్తాభయప్రద ! వినుము సంసారాగ్ని వేఁగుచున్న
జనుల సంసారంబు సంహరింపఁగ నీవుదక్క నన్యులులేరు తలఁచి చూడ
సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు [1]ప్రకృతిపరుండవు పరమపురుష !
నీ ప్రబోధముచేత నీ మాయ నంతయు నణఁతువు నిశ్శ్రేయ సాత్మయందు

ఆ. మాయయందు మునిఁగి మనువారలకుఁ గృపఁ, జేసి ధర్మముఖ్యచిహ్నమైన
[2]శుభము సేయుచుందు సుజనుల నవనిలోఁ. గావఁ బుట్టుదువు జగన్నివాస! 146

క. ఇది యొక తేజము భూమియుఁ, జదలును దిక్కులును నిండి సర్వంకషమై
యెదురై వచ్చుచు నున్నది, విదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా ! 147

వ. అనిన హరి యిట్లనియె. 148

శా. జిహ్మత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు [3]ప్రాణేచ్ఛువై
బ్రహ్మాస్త్రం [4]బదె యేయ వచ్చె నిదె తద్బాణాగ్ని బీభత్స ! నీ
బ్రహ్మాస్త్రంబునఁ గాని దీని మరలింపన్ రాదు సంహార మీ
బ్రహ్మాపత్య మెఱుంగఁ డేయుము వడిన్ బ్రహ్మాస్త్రమున్ దీనిపై. 148

వ. అనిన నర్జునుండు జలంబులు వార్చి హరికిం బ్రదక్షిణంబు వచ్చి ద్రోణనందనుండేసిన బ్రహ్మాస్త్రంబుమీఁదఁ దన బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన. 150

మ. అవని వ్యోమములందు నిండి తమలో నా రెండు బ్రహ్మాస్త్రముల్
రవి వహ్ని ద్యుతిఁ బోరుచుం ద్రిభువన త్రాసంబు గావింపఁగా
వివశభ్రాంతి యుగాంతమో యని ప్రజల్ వీక్షింప నావేళ మా
ధవు నాజ్ఞన్ విజయుండు సేసె విశిఖ ద్వంద్వోపసంహారమున్. 151

వ. ఇట్లస్త్రద్వయంబు నుపసంహరించి ధనంజయుండు ద్రోణనందనుం గూడ నరిగి తత్తఱమి పట్టుకొని రోషారుణిత లోచనుండై యాజ్ఞికుండు రజ్జువునం బశువుం గట్టినచందంబున బంధించి శిబిరంబుకడకుం గొని చని హింసింతునని తిగిచినం జూచి హరి యిట్లనియె. 152

1. ప్రకృతికి నవ్వలి పరుఁడ వాద్యపురుషుండవగు నీవు బోధంబుచే మాయ (క) 2. సేయుదీవు (క.య.ర.తం.వా.) 3. ప్రాణేచ్ఛుఁడై (క) ప్రాణేచ్ఛపై (గ) 4. బదియేసె (ద).

ఉ. మాఱు పడంగలేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేఱని పిన్నపాపల [1]వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై
[2]పాఱుఁడె వీఁడు పాతకుఁడు ప్రాణభయంబున వెచ్చ నూర్చుచుం
బాఱెడి వీనిఁ గావకు కృపామతి నర్జున! పాపవర్జనా! 153

చ. వెఱచినవాని దైన్యమున వేఁదుఱు నొందినవాని నిద్ర మై
మఱచినవాని సౌఖ్యమున మద్యము ద్రావినవాని భగ్నుఁడై
పఱచినవాని సాధు జడభావము వానిని గావుమంచు వా
చఱచినవానిఁ గామినుల జంపుట ధర్మముగాదు ఫల్గునా! 154

శా. స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణాసంగంబు చాలించి య
న్య ప్రాణంబులచేత రక్షణము సేయన్ వాఁ డధోలోక దుః
ఖప్రాప్తుం డగు రాజదండమున సత్కల్యాణుఁడౌ నైన నీ
విప్రుం దండితుఁజేయు మేటికి మహావిభ్రాంతితోఁ నుండఁగన్. 155

వ. అని యివ్విధంబునఁ గృష్ణుఁ డానతిచ్చిన బ్రాహ్మణుండు (గృతాపరాధుండయిన వధ్యుండు గాఁడను ధర్మంబు దలంచి) చంపక +ద్రుపదరాజపుత్రికిం దన చేసిన ప్రతిజ్ఞం దలంచి బద్ధుండైన [3]గురునందనుం దోడ్కొని కృష్ణుండు సారథ్యంబు సేయ శిబిరంబుకడకు వచ్చి. 156

క. సురరాజసుతుఁడు సూపెను, దురవధి సుతశోకయుతకు ద్రుపదుని సుతకున్
బరిచలితాంగశ్రేణిం, బరుష మహాపాశబద్ధ పాణిన్ ద్రౌణిన్. 157

వ. ఇట్లర్జునుండు దెచ్చి చూపిన బాలవధ జనిత లజ్జా పరాఙ్ముఖుండైన గురుని కొడుకుం జూచి మ్రొక్కి (సుస్వభావయగు) ద్రౌపది యిట్లనియె. 158

మ. పరఁగన్ మా మగవార లందఱును మున్ బాణప్రయోగోపసం
హరణా ద్యాయుధవిద్య లన్నియును ద్రోణాచార్యునిచే నభ్యసిం
చిరి పుత్రాకృతి నున్న ద్రోణుఁడవు నీ చిత్తంబులో లేశమున్
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే! 159

క. భూసురుఁడవు బుద్ధి దయా, భాసురుఁడవు శుద్ధవీర భటసందోహా
గ్రేసరుఁడవు శిశుమారణ, మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ! 160

1. వధించి నిషిద్ధపు గ్రూరకర్ముఁడై (క.ఐ.హ.) 2. పాఱుఁడుగాఁడు (క) 3. సేయన్ వాఁడధోలోక దుఃఖ (హ) సేయంజూచువాఁ డంత్యలోక (తం)

+ ఈ వాక్యము మూలమున నీసందర్భమునఁ గాక కృష్ణుఁ డర్జును నశ్వత్థామను విడువవలదు: చంపుమని ప్రేరేచు సందర్భమున నున్నది. అట్లుండుటయే యుక్తము.

శా. ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతోఁ జీఁకటిన్
[1]భద్రాకారులఁ జిన్నపాపల రణ ప్రౌఢక్రియా హీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా! ఏ చేతు లెట్లాడెనో! 161

ఉ. అక్కట! పుత్రశోకజనితాకులభావ విషణ్ణచిత్తనై
పొక్కుచు నున్నభంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట [2]సహింపనిదై భవదీయమాత నేఁ
డెక్కడ [3]నిట్టిశోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో! 162

వ. అని కృష్ణార్జునులం జూచి యిట్లనియె. 163

ఉ. ద్రోణునితో శిఖిం[4]బడక ద్రోణకుటుంబిని యున్న దింట న
క్షీణ తనూజశోక వివశీకృతనై విలపించు భంగి నీ
ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంత పొక్కునో!
ప్రాణ వియుక్తుఁడైన, నతిపాపము బ్రాహ్మణహింస మానరే. 164

క. భూపాలకులకు విప్రులఁ, [5]గోపింపఁగఁ జేయఁదగదు కోపించినఁ ద
త్కోపానలంబు మొదలికి, భూపాలాటవులఁ గాల్చు భూకంపముగన్. 165

వ. అని యిట్లు ధర్మ్యంబును సకరుణంబును నిర్వ్యళీకంబును సమంజసంబును [6]శ్లాఘ్యంబునుంగా ద్రౌపది పలుకు పలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె. నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి. సమ్మతింపక భీముండిట్లనియె. 166

చ. కొడుకులఁ బట్టి చంపెనని కోపము నొందదు బాలఘాతకున్
విడువు మటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది వీఁడు విప్రుఁడే?
విడువఁగనేల? చంపుఁ డిటు వీనిని మీరలు చంపరేని నా
పిడికిటి పోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడుఁ డిందఱున్. 167

వ. అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె, భీముని సంరంభంబు సూచి హరి చతుర్భుజుండై రెండుచేతుల భీముని వారించి కడమ రెండుచేతుల ద్రుపద పుత్రికను దలంగం ద్రొబ్బి, నగుచు *భీమున కిట్లనియె. 168

1. భద్రాచారుల (క.చ.ట.జ.డ.య.) 2. సహింపఁగలేక తదీయ (ట) 3. నెట్టి శోకమున (క) పుత్రశోకమున (ట) 4. బడదు (చ.త.జ.బ.) 5. కోపింపంజంపఁ దగదు (గ.ర.) 6. శ్లాఘ్యంబునగు ద్రౌపదిపలుకులకు (హ); ద్రౌపది పలికిన కరుణ న్యాయ ధర్మసహితంబైన పలుకులకు (య).

*మూలమున నర్జునునితో నన్నట్లున్నది.

ఉ. అవ్వఁడు గాఁడు వీఁడు శిశుహంత దురాత్మకుఁ డాతతాయి హం
తవ్వుఁడు బ్రహ్మబంధుఁ డగు దప్పదు నిక్కము "బ్రాహ్మణో న హం
తవ్య" యటంచు వేదవిదితం బగుఁ గావున ధర్మదృష్టిఁ గ
ర్తవ్యము వీనిఁ గాచుట యథాస్థితిఁ జూడుము పాండవోత్తమా! 169

వ. అని సరసాలాపంబు లాడి పవననందను నొడంబఱచి యర్జునుం జూచి ద్రౌపదికి నాకు భీమసేనునకును సమ్మతంబుగ మున్ను నీ చేసిన ప్రతిజ్ఞయు సిద్ధించునట్లు నా పంపు సేయుమని నారాయణుం డానతిచ్చిన నర్జునుండు [1]తదనుమతంబున. 170

శా. విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుం డు ఘోరాసిచే
నశ్వత్థామ శిరోజముల్ దఱిఁగి చూడాంత ర్మహారత్నముం
శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని పాశవ్రాత బంధంబులం
విశ్వాసంబున నూడ్చి ద్రౌబ్బె శిబిరోర్వీభాగముం బాసిపోన్. 171

క. నిబ్బరపు బాలహంతయు, గొబ్బునఁ దేజంబు మఱియుఁ గోల్పడి నతుఁడై
ప్రబ్బిన చింతన్ విప్రుఁడు, సిబ్బితితో నొకలి గబ్బు నెడి వడిఁ జనియెన్. 172

ఆ. ధనము గొనుట యొండెఁ దలఁ గొఱుగుట యొండె, నాలయంబు వెడలనడుచు టొండెఁ
గాని చంపఁదగిన కర్మంబు సేసినఁ, జంపఁదగదు విప్రజాతిఁ బతికి. 173

అధ్యాయము – ౮

వ. ఇట్లశ్వత్థామం బ్రాణావశిష్టుం జేసి వెడలనడిచి పాండవులు పాంచాలీ సహితులై పుత్రులకు శోకించి మృతులైన బంధువులకెల్ల దహనాది[2]కృత్యంబులు జేసి జలప్రదానంబు సేయుకొఱకు స్త్రీల ముందల నిడుకొని గోవిందుండునుం దారును గంగకుం జని తిలోదకంబులు [3]నేసి క్రమ్మఱ విలపించి [4]హరిపాదపద్మజాత పవిత్రంబులైన భాగీరథీజలంబుల స్నాతులై యున్నయెడం బుత్రశోకాతురులైన గాంధారీ ధృతరాష్ట్రులను, గుంతీ ద్రౌపదులను జూచి మాధవుండు మునీంద్రులు దానునుం బంధుమరణ శోకాతురులైన వారల వగపు మానిచి మన్నించె నివ్విధంబున. 174

శా. పాంచాలీ కబరీ వికర్షణ మహాపాప క్షతాయుష్కులం
జంచద్గర్వుల ధార్తరాష్ట్రుల ననిం జంపించి గోవిందుఁ డీ
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకుఁ గల్పించెన్ మహాఖ్యాతిఁ జే
యించెన్ మూఁడు తురంగమేధములు దేవేంద్ర ప్రభావంబునన్. 175

1. నారాయణానుమతంబున (క.ఠ.) 2. క్రియలు (ట.డ.) 3. వోసి (క) 4. హరిపాద పద్మరాగపటలీ (క)

—: శ్రీకృష్ణుం డుత్తరా గర్భస్థుండగు పరీక్షితునిఁ దన చక్రంబుచే రక్షించుట :—

వ. అంత వాసుదేవుండు వ్యాసప్రముఖ భూసురపూజితుండై, యుద్ధవ సాత్యకులు గొలువ, ద్వారకాగమన ప్రయత్నంబునఁ బాండవుల వీడ్కొని, రథారోహణంబు సేయు సమయంబునఁ దత్తరపడుచు నుత్తర సనుదెంచి కల్యాణ[1]గుణోత్త రుండైన హరి కిట్లనియె. 176

మ. ఇదె కాలానల తుల్యమైన విశిఖం బేతెంచె దేవేశ! నేఁ
డుదరాంతర్గత [2]గర్భదాహమునకై [3]యుగ్రాకృతిన్ వచ్చుచు
న్నది దుర్లోక్యము మానుపన్ శరణ మన్యం బేమియుఁ లేదు నీ
పదపద్మంబులె కాని యొం డెఱుఁగ నీ [4]బాణాగ్ని వారింపవే. 177

క. దుర్భర బాణానలమున, గర్భములో నున్న శిశువు ఘన సంతాపా
విర్భావంబు[5]ను బొందెడి, నిర్భర కృపఁ[6] గావుమయ్య! నిఖిలస్తుత్యా! 178

క. చెల్లెలి కోడల నీ మే, నల్లుఁడు శత్రువులచేత హతుఁడయ్యెను సం
ఫుల్లారవిందలోచన!, భల్లాగ్ని నణంచి శిశువు బ్రతికింపఁగదే. 179

ఆ. గర్భమందుఁ గమలగర్భాండ శతములు, నిముడుకొన నటించు నీశ్వరేశ !
నీకు నొక్క మానినీ గర్భరక్షణ, మెంత [7]బరువు నిర్వహింతు గాక. 180

వ. అనిన నాశ్రితవత్సలుండైన పరమేశ్వరుండు సుభద్రకోడలి దీనాలాపంబు [8]లవధరించి, యిది ద్రోణనందనుండు లోకమంతయు నపాండవం [9]బయ్యెడు నని యేసిన దివ్యాస్త్రమని యెఱింగె. అంతఁ బాండవుల కభిముఖంబై, ద్రోణ నందను దివ్యాస్త్ర నిర్గత నిశిత మార్గణంబు డగ్గఱిన బెగ్గడిలక, వారును ప్రత్యస్త్రంబు లందుకొని పెనంగు సమయంబున 181

మ. తన సేవారతిచింత గాని పరచింతా లేశముఁ లేని స
జ్జనులం బాండుతనూజులఁ మనుపు వాత్సల్యంబుతో ద్రోణనం
దను బ్రహ్మాస్త్రము నడ్డపెట్టఁ బనిచెన్ దైత్యారి సర్వారి [10]సా
దని నిర్వక్రము రక్షితాఖిల సుధాంధశ్చక్రముం జక్రముఁ. 182

1. గుణాత్మకుండైన (హ. క. చ. త. ప.) 2. డింభ (చ. ద.) 3. యుగ్రంబునన్ (హ); యుగప్రభన్ (చ.జ.డ.); యుగ్రంబుగా (ట) 4. బాణంబు (క.త.జ.డ.) బాణానలం బాపవే (చ) 5. బునబొందెడి(చ.త.); బున గుందెడి (జ) 6. గావవయ్య (క.ద.) 7. తడవు (క.చ.ట.); భరము (త) 8. లాలించి (హ.తం.వా.) 9. బయ్యెడుమని (జ. డ. ద. బ. వా.) 10. సాధన నిర్వక్రము (హ)

మ. సకల ప్రాణి హృదంతరాళముల భాస్వజ్జ్యోతియై యుండు [1]సూ
క్ష్మకళుం డచ్యుతుఁ డయ్యెడన్ [2]విరటజా గర్భంబుఁ దాఁ జక్రహ
స్తకుఁడై వైష్ణవమాయఁ గప్పి కురుసంతానార్థియై యడ్డమై
ప్రకటస్ఫూర్తి నణంచె ద్రోణతనయ బ్రహ్మాస్త్రమున్ లీలతోన్. 183

వ. ఇట్లు ద్రోణతనయుం డేసిన ప్రతిక్రియా రహితంబైన, బ్రహ్మశిరం బనియెడి దివ్యాస్త్రంబు వైష్ణవతేజంబున నిరర్థకం బయ్యె. నిజమాయా విలసనమున సకల లోక సర్గస్థితి సంహారంబు లాచరించునట్టి హరికి, ధరణీసుర బాణ నివారణంబు విచిత్రంబుగాదు. తత్సమయంబున సంతసించి, పాండవ పాంచాల పుత్రికా సహితయై గొంతి, గమనోన్ముఖుండైన హరిం జేరవచ్చి యిట్లనియె. 184

—: కుంతీదేవి శ్రీకృష్ణుని స్తుతించుట :—

క. పురుషుం డాద్యుఁడు ప్రకృతికిఁ, బరుఁ డవ్యయుఁ డఖిల భూత బహిరంత[3]ర్భా
సురుఁడు నవలోకనీయుఁడు, పరమేశ్వరుఁడైన నీకుఁ [4]బ్రణుతు లగు హరీ! 185

వ. మఱియు జవనిక మఱువున నాట్యంబు సలుపు నటుని చందంబున, మాయా జవనికాంతరాళంబున నిలువంబడి, మహిమచేఁ బరమహంసలు, నివృత్తరాగ ద్వేషులు, నిర్మలాత్మలు నైన మునులకు నదృశ్యమానుండవై, పరిచ్ఛిన్నుండవు గాని నీవు మూఢదృక్కులు, గుటుంబవతులు నగు మాకు నెట్లు దర్శనీయుండ వయ్యెదు? శ్రీకృష్ణ! వాసుదేవ! దేవకీనందన! నందగోపకుమార! [5]గోవింద! పంకజనాభ! పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మసంకాశ చరణ! హృషీకేశ! భక్తియోగంబునం జేసి నమస్కరించెద నవధరింపుము. 186

సీ. తనయుల తోడనే దహ్యమానంబగు, జతుగృహంబందును జావకుండఁ
గురురాజు వెట్టించు ఘోరవిషంబుల మారుతపుత్రుండు మడియకుండ
ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీర లొలువంగ ద్రౌపదిమానంబు దలఁగకుండ
గాంగేయ కుంభజ కర్ణాది ఘనులచే నా బిడ్డ లనిలోన నలఁగకుండ

తే. విరటుపుత్రిక కడుపులో వెలయు చూలు, ద్రోణనందన శరవహ్నిఁ ద్రుంగకుండ
మఱియు రక్షించితివి పెక్కుమార్గములను, నిన్ను నేమని వర్ణింతు నీరజాక్ష! 187

1. సూక్ష్మకరుండు (హ) 2. విరటుచూల్ (తం.వా.) 3. భాసురుఁడును లోకనియుతుఁడున్(హ) భాసురుఁడును లోకనియంతయు (తం. వా.) 4. ప్రణమములు (క. ర.) 5. నందగోవింద, పరమ కల్యాణ (క.ర.)

మత్తకోకిల. బల్లిదుండగు కంసుచేతను బాధ నొందుచునున్న మీ
తల్లిఁ గాచిన భంగిఁ గాచితి ధార్తరాష్ట్రులచేత నేఁ
దల్లడంబునఁ జిక్కకుండఁగ దావకీన గుణవ్రజం
బెల్ల సంస్తుతి సేసి చెప్పఁగ నెంతదాన జగత్పతీ! 188

క. జననము నైశ్వర్యంబును, ధనమును విద్యయును గల మదచ్ఛన్నులకిం
చన గోచరుఁడగు నిన్నున్, వినుతింపఁగ లేరు నిఖిల విబుధస్తుత్యా! 189

వ. మఱియు భక్తధనుండును, నివృత్త ధర్మార్థ కామ విషయుండును, ఆత్మా రాముండును, రాగాది రహితుండును, కైవల్యదాన సమర్థుండును, కాలరూపకుండును, నియామకుండును, నాద్యంత శూన్యుండును, విభుండును, సర్వసముండును, సకలభూత నిగ్రహానుగ్రహకరుండునైన నిన్నుఁ దలంచి నమస్కరించెద నవధరింపుము. మనుష్యుల విడంబించు భవదీయ విలసనంబు నిర్ణయింప నెవ్వఁడు సమర్థుండు? నీకు బ్రియాప్రియులు లేరు; జన్మ కర్మ శూన్యుండవైన నీవు తిర్యగాది జీవులయందు వరాహాది రూపంబులను, మనుష్యులందు రామాది రూపంబులను, ఋషులయందు వామనాది రూపంబులను, జలచరంబులయందు మత్స్యాది రూపంబులను, నవతరించుట లోకవిడంబనార్థంబు గాని, జన్మ కర్మ సహితుండవగుటం గాదు. 190

ఉ. కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో
గోపిక త్రాటఁ గట్టిన [1]వికుంచిత సాంజన బాష్ప తోయధా
రా పరిపూర్ణ వక్త్రముఁ గరంబులఁ బ్రాముచు వెచ్చ నూర్చుచుం
బాపఁడవై [2]నటించుట కృపాపర! నా మదిఁ జోద్యమయ్యెడిన్. 191

క. మలయమునఁ జందనము క్రియ, వెలయఁగ ధర్మజునికీర్తి [3]వెలయించుటకై
యిలపై నభవుఁడు హరి యదు, కులమున నుదయించె నండ్రు గొంద ఱనంతా!

క. వసుదేవ దేవకులు దా, పసగతి గతభవమునందుఁ బ్రార్థించిన సం
తసమునఁ బుత్రత నొందితి, వసురుల మృతికంచుఁ గొంద ఱండ్రు మహాత్మా! 193

క. జలరాశి[4]లో మునింగెడి, కలము క్రియన్ భూరిభార [5]కర్శిత యగు నీ
యిలఁ గావ నజుఁడు గోరినఁ గలిగితి వని కొంద ఱండ్రు గణనాతీతా! 194

తే. మఱచి యజ్ఞాన కామ కర్మములఁ దిరుగు, వేదనాతురులకుఁ దన్నివృత్తిఁజేయ
శ్రవణచింతన వందనార్చనములిచ్చు, కొఱకు నుదయించి తండ్రు నిన్
గొందఱభవ!

1. నకుంచిత (హ) 2. త్రసించుట (క. ద. బ.) 3. వెలుగించుటకై (క. బ.) 4. లోన మెలంగెడు (హ); నడుమ మునిఁగెడు (తం. వా.) 5. కలితయునగు (హ.)

మ. నినుఁ జింతింపుచుఁ బాడుచుం బొగడుచు న్నీ దివ్య చారిత్రముల్
వినుచుం జూతురుగాక లోకు లితరాన్వేషంబులం జూతురే?
ఘన దుర్జన్మ పరంపరా హరణ దక్షంబై మహాయోగి వా
గ్వినుతంబైన భవత్పదాబ్జ యుగమున్ విశ్వేశ ! విశ్వంభరా ! 196

వ. దేవా ! నిరాశ్రయులమై భవదీయ చరణారవిందముల నాశ్రయించి నీ వారలమైన మమ్ము విడిచి విచ్చేయనేల? నీ సకరుణావలోకనంబుల నిత్యంబును జూడవేని యాదవ సహితులైన పాండవులు జీవునిం బాసిన యింద్రియంబుల చందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు. కల్యాణలక్షణ లక్షితంబులైన నీ యడుగులచేత నంకితంబైన [1]యీ ధరణీమండలంబు నీవు వాసిన శోభితంబు గాదు. నీ కృపా వీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు గుసుమ ఫల భరితంబులు, నోషధి తరు లతా గుల్మ నద నదీ నగ సాగర సమేతంబులునై యుండు. 197

ఉ. యాదవులందుఁ బాండుసుతులందు నధీశ్వర ! నాకు మోహవి
చ్ఛేదము సేయుమయ్య ! ఘనసింధువుఁ జేరెడి గంగభంగి నీ
పాదసరోజ చింతనముపై ననిశంబు మదీయబుద్ధి న
త్యాదరవృత్తితోఁ గదియు నట్లుగఁ జేయఁగదయ్య ! యీశ్వరా ! 198

శా. శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశ దహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా! నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ [2]ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ! 199

వ. అని యిట్లు సకల సంభాషణంబుల నుతియించు గొంతి మాటలకు నియ్యకొని, గోవిందుండు మాయా నిరూఢ మందహాస విశేషంబున మోహంబు నొందించి, రథారూఢుండై కరినగరంబునకు వచ్చి, కుంతీ సుభద్రాదులన్ వీడ్కొని, తన పురంబునకు విచ్చేయ గమకించి, ధర్మరాజుచేఁ గించిత్కాలంబు నిలువుమని ప్రార్థితుండై నిలిచె. అంత బంధువధ శోకాతురుండైన ధర్మజుండు నారాయణ వ్యాస ధౌమ్యాదులచేతఁ దెలుపంబడియుఁ దెలియక మోహితుండై నిర్వివేకంబున నిట్లనియె. 200

1. మదీయ ధరణీ (క. ర. హ. తం. వా.) "నేయం శోభిష్యతే ధాత్రీ" (మూలము)
2. త్రెంపవే (ద. ద)

మ. తన దేహంబునకై యనేక మృగసంతానంబుఁ జంపించు దు
ర్జను భంగిన్ గురు బాలక ద్విజ తనూజ భ్రాతృసంఘంబు ని
ట్లనిఁ జంపించిన పాపకర్మునకు రాజ్యాకాంక్షికిన్ నాకు హా
యన లక్షావధినైన ఘోర నరక వ్యాసంగము ల్మానునే? 201

వ. మఱియుఁ బ్రజా పరిపాలన పరుండైన రాజు ధర్మయుద్ధంబున శత్రువుల వధియించినఁ బాపంబు లేదని శాస్త్రవచనంబు గలదు. అయిన నది విజ్ఞానంబు కొఱకు సమర్థంబు గాదు. చతురంగంబుల ననేకాక్షౌహిణీ సంఖ్యాతంబులం జంపించితి. హతబంధులైన సతుల కేను జేసిన ద్రోహంబు దప్పించుకొన నేర్పు లేదు. గృహస్థాశ్రమ ధర్మంబులైన తురంగమేధాది యాగంబులచేతం బురుషుండు బ్రహ్మహత్యాది పాపంబులవలన విడివడి నిర్మలుండగునని నిగమంబులు నిగమించు. పంకంబునఁ బంకిలస్థలంబునకును. మద్యంబున మద్యభాండమునకును శుద్ధి సంభవింపని చందంబున, బుద్ధిపూర్వక జీవహింసనంబులైన యాగంబుల చేతం బురుషులకుఁ బాపబాహుళ్యంబ కాని పాపనిర్ముక్తి గాదని శంకించెద.

## అధ్యాయము - ౯

క. అని యిట్లు ధర్మసూనుఁడు, మొనసి నిరాహారభావమున దేవనదీ
తనయుఁడు గూలినచోటికిఁ, జనియెఁ బ్రజాద్రోహ పాపచలితాత్ముండై. 203

-: ధర్మరాజు శ్రీకృష్ణసహితుండై శరతల్పగతుండగు భీష్మునికడ కేగుట :-

వ. ఆ య్యవసరంబునం దక్కిన పాండవులును, ఫల్గునసహితుండైన పద్మలోచనుండును, కాంచన సమంచితంబులైన రథంబులెక్కి ధర్మజుం గూడి చన, నతండు గుహ్యక సహితుండైన కుబేరునిభంగి నొప్పె. ఇట్లు పాండవులు పరిజనులు గొలువఁ బద్మనాభ సహితులై కురుక్షేత్రంబున కేగి, దివంబునుండి నేలం గూలిన దేవత తెఱంగున[1] సంగ్రామ పతితుండైన గంగానందనునకు నమస్కరించిరి. అంత బృహదశ్వ భరద్వాజ పరశురామ గౌతమ పర్వత నారద బాదరాయణ కశ్యపాంగిరస కౌశిక ధౌమ్య సుదర్శన శుక వసిష్ఠాద్యనేక రాజర్షి దేవర్షి బ్రహ్మర్షులు శిష్యసమేతులై చనుదెంచినం జూచి సంతసించి దేశ కాల విభాగవేదియైన భీష్ముండు వారలకుం బూజనంబులు సేయించి. 204

క. మాయాంగీకృత దేహుం, డై యఖిలేశ్వరుఁడు మనుజుఁడై నాఁడని ప్ర
జ్ఞాయత చిత్తంబున గాం, గేయుఁడు పూజనము సేసెఁ గృష్ణున్ జిష్ణున్. 205

1. సంగ్రామరంగ నిపతితుండైన (చ. జ. డ. ద. బ.)

వ. మఱియుం గంగానందనుండు వినయ ప్రేమ సుందరులైన పాండునందనులం గూర్చుండ నియోగించి, మహానురాగ జనిత బాష్పసలిల సందోహ సమ్మిళిత లోచనుండై యిట్లనియె. 206

ఆ. ధరణిసురులు హరియు ధర్మంబు దిక్కుగాఁ, బ్రతుకఁదలఁచి మీరు బహువిధముల
సన్నలార! పడితి రాపత్పరంపర. లిట్టి చిత్రకర్మ మెందుఁగలదె! 207

ఉ. సంతస మింత లేదు మృగశాప వశంబునఁ బాండు భూవిభుం
డంతము నొంది యుండ మిము నర్భకులం గొనివచ్చి కాంక్షతో
[1]నింతటి వారిఁగాఁ బెనిచె నెన్నఁడు సౌఖ్యముపట్టు గాన దీ
కుంతి యనేక దుఃఖములఁ గుందుచు [2]నున్నది భాగ్యమెట్టిదో! 208

ఉ. వాయు వశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచుం
బాయుచు నుండుకై వడిఁ బ్రపంచము సర్వముఁ గాలతంత్రమై
పాయుచుఁ గూడుచుండు నొకభంగిఁ జరింపదు కాల మన్నియుం
జేయుచునుండుఁ గాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్. 209

ఉ. రాజఁట ధర్మజుండు సురరాజ సుతుండఁట ధన్వి శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లఁట సారథి సర్వభద్ర సం
యోజకుఁడైన చక్రి యఁట యుగ్ర గదాధరుఁడైన భీముఁ డ
య్యాజికిఁ దోడు వచ్చునఁట యాపద [3]గల్గుట యేమిచోద్యమో! 210

ఆ. ఈశ్వరుండు విష్ణుఁ డెవ్వేళ నెవ్వని, నేమిసేయుఁ బురుషుఁ డేమి యెఱుఁగు?
నతని మాయలకు మహాత్ములు విద్వాంసు,[4]లణఁగి మెలఁగుచుండు రంధులగుచు,

వ. కావున దైవతంత్రం బైన పనికి వగవం బనిలేదు. రక్షకులు లేని ప్రజల నుపేక్షింపక రక్షింపఁ బుండరీకాక్షుండు సాక్షాత్కరించిన నారాయణుండు తేజోనిరూఢుండు గాక, యాదవులందు గూఢుండై తన మాయచేత లోకంబులం మోహాతిరేకంబు నొందించును. అతని రహస్యప్రకారంబులు భగవంతుండైన [5]శివుం డెఱుంగు. మఱియు దేవర్షియగు నారదుండును, భగవంతుండగు కపిల మునియు నెఱుంగుదురు. మీరు కృష్ణుండు దేవకీపుత్రుండని మాతులేయుండని తలంచి దూత సచివ సారథి బంధు మిత్రప్రయోజనంబుల నియమించుదు రిన్నిటం గొఱంతలేదు. రాగాది శూన్యుండు, నిరహంకారుం, డద్వయుండు, సమదర్శ

1. ఇంతలు (క. చ. ట. త. బ. హ.); ఇంతల (తం. వా.) 2. నుండును (హ) నుండెను (బ) 3. గల్గట (ట) 4. అణఁగి యుండుచుందురు (క. బ. హ.) 5. పరమేశ్వరుం డెఱుంగు (య. హ. తం. వా.)

నుండు, సర్వాత్మకుండు నైన యీశ్వరునకు నతోన్నతభావ మతివైషమ్యంబు లెక్కడివి? లేవు. అయిన భక్తవత్సలుండు గావున, నేకాంత [1]భక్తులకు సులభుండై యుండు. 212

సీ. అతిభక్తి నెవ్వనియందుఁ జిత్తము జేర్చి యెవ్వనినామ మూహించి పొగడి
కాయంబు విడుచుచుఁ గామ కర్మాది నిర్మూలనుండై యోగి ముక్తినొందు
నట్టి సర్వేశ్వరుం డఖిల దేవోత్తముఁ డెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు
నందాఁక నిదె [2]మందహాసుఁడై వికసిత వదనారవిందుఁడై వచ్చి నేఁడు

తే. నాల్గుభుజములుఁ గమలాభనయనయుగము,నొప్పఁగన్నులముందట నున్నవాఁడు
మానవేశ్వర! నా భాగ్యమహిమఁజూడు, మేమి నేసితినో! పుణ్యమితనిఁగూర్చి.

వ. అని యిట్లు ధనంజయ సంప్రాపిత శరపంజరుండైన కురుకుంజరుని వచనంబులు వినయంబున నాకర్ణించి మును లందఱు వినుచునుండ ధర్మనందనుండు మందాకినీనందనువలన (నరజాతి సాధారణంబులగు ధర్మంబులును, వర్ణాశ్రమ ధర్మంబులును) రాగ వైరాగ్యోపాధులతోఁ గూడిన ప్రవృత్తి నివృత్తి ధర్మంబులును, దాన ధర్మంబులును, రాజధర్మంబులును, స్త్రీ ధర్మంబులును, శమ దమాదికంబులును, హరితోషణంబులగు ధర్మంబులును, ధర్మార్థ కామ మోక్షంబులును (నానా విధోపాఖ్యానేతిహాసంబులును) సంక్షేప విస్తార రూపంబుల నెఱింగె. అంత రథిక సహస్రంబులకు గమికాఁడైన భీష్ముండు స్వచ్ఛంద మరణులైన యోగీశ్వరులకు వాంఛితంబగు నుత్తరాయణంబు చనుదెంచిన నది దనకు మరణోచిత కాలంబని నిశ్చయించి. 214

శా. ఆలాపంబులు మాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ
గ్జాలంబుల్ హరిమోముపైఁ [3]బఱపి తత్కారుణ్యదృష్టిన్ విని
ర్మూలీభూత శరవ్యథా నిచయుఁడై మోదించి భీష్ముండు సం
శీలం బొప్ప నుతించెఁ గల్మష [4]గజశ్రేణీ హరిన్ శ్రీహరిన్. 215

వ. ఇట్లు పరమేశ్వరుండైన హరియందు నిష్కాముండై ధారణావతియైన బుద్ధిని సమర్పించి, పరమానందంబు నొంది, ప్రకృతివలన నైన సృష్టిపరంపరలఁ బరిహరించు తలంపున మందాకినీనందనుం డిట్లనియె. 216

1. భావులకు (క.ద.బ.) 2. మహాహర్షుఁడై (హ.తం.వా.) 3. నిలిపి (ట.ద.) 4. నగ (ద).

—: భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట :—

మ. త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింపఁ బ్రాభాత నీ
రజబంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెలాఁడు మది నావేశించు నెల్లప్పుడున్. 217

మ. హయ రింఖాముఖ ధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాత శ్రమతోయ బిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చువేడ్క నని నా శస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్. 218

మ. నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనా మధ్యమక్షోణిలోఁ
బరు లీక్షింప రథంబు నిల్పి [1]పర భూపాలావళిం జూపుచుం
బర భూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడు [2]మనః పద్మాసనాసీనుఁడై. 219

క. తనవారిఁ జంపఁ జాలక, వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని శంకన్
ఘన యోగవిద్యఁ బాపిన, మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్. 220

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి, గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న, జగముల వ్రేఁగున జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ, బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయక, మన్నింపు మని క్రీడి మఱలఁ దిగువఁ

తే. గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి, నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున! యనుచు మద్విశిఖవృష్టిఁ, [3]దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

మ. తనకున్ భృత్యుఁడు వీనిఁ గాచుట మహాధర్మంబు వొమ్మంచు న
ర్జునసారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోల [4]న్వడిఁ జూపి ఘోటకముల న్మోదించి [5]తాటింపుచున్
జనుల న్మోహము నొందఁజేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్, 222

క. పలుకుల నగవుల నడపుల, [6]నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి, కొలుకులు వదలించు ఘనునిఁ గొలిచెద మదిలోన్.

1. సమర ప్రారంభ పారీణతన్ (క. చ. త.) 2. సుహృత్ (హ) 3. ఁదెరల కేతెంచు (ద)
4. వడిఁ బూన్చి (హ. తం. వా.) 5. తాడింఁచుచున్ (క. తం. వా.)

ఆ. మునులు నృపులు సూడ మును ధర్మజుని సభా,మందిరమున యాగమండపమునఁ
జిత్రమహిమతోడఁ జెలువొందు జగదాది, దేవుఁ డమరు నాదు దృష్టియందు.

మ. ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో
లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై. 225

వ. అని యిట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్మయగు కృష్ణుని హృదయంబున నిలిపికొని నిశ్వాసంబులు మాని నిరుపాధికంబైన వాసుదేవ బ్రహ్మంబునందుం గలసిన భీష్మునిం జూచి సర్వజనులు దినావసానంబున విహంగంబు లూరక యుండు తెఱంగున నుండిరి. దేవ మానవ వాదితంబులై దుందుభి నినదంబులు మొరసె. సాధుజనకీర్తనంబులు మెఱసె. కుసుమవర్షంబులు గురిసె. మృతుండైన భీష్మునికి ధర్మజుండు పరలోక క్రియలు సేయించి *(ముహూర్త మాత్రంబు దుఃఖితుం డయ్యె. అంత నచ్చటి మునులుఁ గృష్ణునిఁ దమ హృదయంబుల నిలిపికొని సంతుష్టాంతరంగు లగుచుఁ దదీయ దివ్యనామంబులచే స్తుతియించి స్వాశ్రమంబులకుఁ జనిరి. పిదప నయ్యుధిష్ఠిరుండు)కృష్ణసహితుండై గజపురంబునకుం జని గాంధారీసహితుం డైన ధృతరాష్ట్రు నొడంబఱచి, వారి సమ్మతంబున వాసుదేవానుమోదితుండై, పితృపైతామహం బైన రాజ్యంబుగైకొని, ధర్మమార్గంబున బాలనంబు సేయుచుండె నని సూతుండు చెప్పిన విని శౌనకుం డిట్లనియె. 226

అధ్యాయము - ౧౦

ఆ. ధనము లపహరించి తనతోడఁ జెనకెడు, నాతతాయి జనుల నని వధించి
బంధుమరణ దుఃఖభరమున ధర్మజుఁ, డెట్లు రాజ్యలక్ష్మి నిచ్చగించె. 227

వ. అనిన సూతుం డిట్లనియె. 228

క. కురుసంతతికిఁ బరీక్షి, న్నరవరు సంకురము సేసి నారాయణుఁ డీ
ధరణీ రాజ్యమునకు [1]నీ, శ్వరుఁగా ధర్మజుని నిలిపి సంతోషించెన్. 229

వ. *(ఇట్లు జగంబు పరమేశ్వరాధీనంబుగాని స్వతంత్రంబుగా దనునది మొదలగు భీష్ముని వచనంబుల) హరి సంభాషణంబుల ధర్మనందనుండు ప్రవర్ధమాన విజ్ఞానుండును, [2]నివర్తిత శంకాకళంకుండును నై నారాయణాశ్రయుండైన

1. నీశ్వరు ధర్మజుఁగాఁగ (క-య) * తాళపత్ర ప్రతులలో లేదు. మూలములో నున్నది.
2. నివర్తిత చింతాశంకా (చ); నివర్తిత చిత్తశంకా (డ. ద. బ.)

యింద్రుండును బోలెఁ జతుస్సాగర వేలాలంకృతం బగు వసుంధరామండలంబు సహోదర సహాయుండై యేలుచుండె. 230

సీ. సంపూర్ణవృష్టిఁ బర్జన్యుండు గురియించు నిల యెల్లఁ గోర్కుల నీనుచుండు
గోవులు వర్షించు ఘోషభూములఁ బాలు ఫలవంతములు లతా పాదపములు
పండు సస్యములు దప్పక ఋతువులనెల్ల ధర్మమెల్లెడలను దనరి యుండు
దైవ భూతాత్మ తంత్రములగు రోగాది భయములు నెందవు ప్రజల కెందుఁ

ఆ. గురుకులోత్తముండు కుంతీతనూజుండు, దాన మాన ఘనుఁడు ధర్మజుండు
సత్యవాక్యధనుఁడు సకల మహీరాజ్య, విభవ భాజి యైన వేళయందు. 231

—: శ్రీకృష్ణుఁడు ద్వారకానగరమున కరుగుట :—

వ. అంతఁ గృష్ణుండు చుట్టాలకు శోకంబు లేకుండం జేయుకొఱకును, సుభద్రకుం బ్రియము [1]సేయుకొఱకును, గజపురంబునం గొన్ని నెలలుండి, ద్వారకానగరంబునకుం బ్రయాణంబు సేయందలంచి, ధర్మనందనునకుం గృతాభివందనుండగుచు నతనిచేనాలింగితుండై యామంత్రణంబు వడసి, కొందఱు దనకుం నమస్కరించినం గౌఁగిలించుకొని, కొందఱు దనుం గౌఁగిలింప నానందించుచు రథారోహణంబు సేయు నవసరంబున, సుభద్రయు ద్రౌపదియుఁ గుంతియు నుత్తరయు గాంధారియు ధృతరాష్ట్రుండును విదురుండును యుధిష్ఠిరుండును యుయుత్సుండును గృపాచార్యుండును నకులసహదేవులును వృకోదరుండును ధౌమ్యుండును(సత్సంగంబువలన ముక్తదుస్సంగుండగు బుధుండు సత్కృత్కల సంకీర్త్యమానంబై రుచికరంబగు నెవ్వని యశంబు నాకర్ణించి విడువనోపఁడట్టి) హరితోడి వియోగంబు సహింపక, దర్శన స్పర్శనాలాప శయనాసన భోజనంబులవలన నిమిషమాత్రంబును హరికి నెడలేనివారలైన పాండవులం గూడికొని, హరి మరలవలెనని కోరుచు హరి చనిన మార్గంబు చూచుచు, హరి విన్యస్తచిత్తులై లోచనంబుల బాష్పంబు లొలుక నంతనంత నిలువంబడిరి. అయ్యవసరంబున 232

సీ. కనకసౌధములపైఁ గౌరవకాంతలు గుసుమవర్షంబులు గోరి కురియ
మౌక్తికదామ సమంచిత ధవళాత పత్రంబు విజయుండు పట్టుచుండ
నుద్ధవ సాత్యకు లుత్సాహవంతులై రత్నభూషిత చామరములు వీవ
గగనాంతరాళంబు గప్పి కాహళభేరి పణవశంఖాది శబ్దములు మొరయ

ఆ. సకల విప్రజనులు సగుణనిర్గుణరూప, భద్రభాషణములు పలుకుచుండ
భువన మోహనుండు పుండరీకాక్షుండు, పుణ్యరాశి హస్తిపురము వెడలె. 233

1. సేయుచు (హ.)

వ. తత్సమయంబునం బౌరసుందరులు ప్రాసాద శిఖరభాగంబుల నిలిచి, గోపాల సుందరుని సందర్శించి, మార్గంబుల రెండుదెసలం గరారవిందంబులు సాచి యొండొరులకుం జూపుచుం దమలోనం, దొల్లిటం బ్రళయంబున గుణంబులం గూడక జీవులు లీనరూపంబులై యుండం బ్రపంచంబు ప్రవర్తింపని సమయంబునం బ్రపంచాత్మకుండు నద్వితీయుండు నగుచు మేలై దీపించు పురాణపురుషుం డీతం డనువారును, జీవులకు బ్రహ్మత్వంబు గలుగ లయంబు సిద్ధించుట యెట్లనువారును, జీవోపాధిభూతంబులైన సత్త్వాది శక్తులలయము జీవ లయ మను వారును, గ్రమ్మఱ నప్పరమేశ్వరుండు నిజ వీర్యప్రేరితయై నిజాంశభూతంబులైన జీవులకు [1]మోహినియైన సృష్టి సేయ నిశ్చయించి, నామరూపంబులు లేని జీవులందు నామరూపంబులు గల్పించు కొఱకు వేదంబుల నిర్మించి మాయానుసరణంబు సేయు ననువారును, నిర్మల భక్తిసముత్కంఠా విశేషంబుల నకుంఠితులై జితేంద్రియులగు విద్వాంసు లిమ్మహానుభావు నిజరూపంబు దర్శింతు రనువారును, యోగమార్గంబులం గాని దర్శింపరా దనువారునై మఱియు. 234

మ. రమణీ! దూరమువోయెఁ గృష్ణురథమున్ రాదింక వీక్షింప నీ
కమలాక్షుం బొడగానలేని దినముల్ గల్పంబులై తోఁచు గే
హములం దుండఁగనేల పోయి పరిచర్యల్ సేయుచున్ నెమ్మి నుం
దము రమ్మా! యనె నొక్క చంద్రముఖి గందర్పాశుగభ్రాంతయై. 235

మ. తరుణీ! యాదవరాజు గాఁడితఁడు వేదవ్యక్తుఁడై యొక్కఁడే
వరుసన్ లోకభవ స్థితి ప్రళయముల్ [2]వర్తింపఁగాఁజేయు దు
స్తర లీలారతుఁడైన యీశుఁ డితనిన్ దర్శించితిం బుణ్యభా
సుర నేనంచు నటించె నొక్కతె మహాశుద్ధాంతరంగంబునన్. 236

క. తామసగుణులగు రాజులు, భూమిం బ్రభవించి ప్రజలఁ బొలియింపఁగ స
త్త్వామలతనుఁడై యీతఁడు, భామిని! వారల వధించుఁ బ్రతికల్పమునన్. 237

సీ. ఈ యుత్తమశ్లోకుఁ డెలమి జన్మించిన యాదవ కులమెల్ల ననఘ మయ్యె
నీ పుణ్యవర్తనుఁ డేప్రొద్దు నుండిన మథురాపురము దొడ్డ మహిమ గనియె
నీ పూరుషశ్రేష్ఠు నీక్షించి భక్తితో ద్వారకావాసులు ధన్యులైరి
యీ మహాబలశాలి యెఱిఁగి [3]శాసింపఁగ నిష్కంటకం బయ్యె నిఖిలభువన

---

1. మోహిని యగుచు (హ. వా.)
స ఏవ భూయో నిజవీర్య చోదితాం, స్వజీవ మాయాం ప్రకృతిం సిసృక్షతీం
అనామ రూపాత్మని రూపనామనీ, విధివత్సమానోఽనుససార శాస్త్రకృత్. (10-22)

2. వర్తిల్లఁగా (చ. ద.) 3. శిక్షింపంగ (హ. తం. వా.)

తే. మీ జగన్మోహనాకృతి నిచ్చగించి, పంచశర భల్లజాల విభజ్యమాన
[1]వివశ మానసమై వల్లవీసమూహ, మితని యధరామృతము గ్రోలు నెల్ల ప్రొద్దు.

ఉ. ఈ కమలాక్షు నీ సుభగు నీ కరుణాంబుధిఁ బ్రాణనాథుఁగాఁ
జేకొని వేడ్కఁ గాఁపురము సేయుచునుండెడి రుక్మిణీముఖా
నేక పతివ్రతల్ నియతి నిర్మలమానసలై జగన్నుతా
స్తోక విశేష తీర్థములఁ దొల్లి టిబాముల నేమి నోఁచిరో! 239

వ. అని యిట్లు నానావిధంబులైన పురసుందరీ వచనంబు లాకర్ణించి కటాక్షించి నగుచు నగరంబు వెడలె. ధర్మజుండును హరికి రక్షకంబులై కొలిచి నడువం జతురంగంబులు బంపినఁ ద త్సేనాసమేతులై తన తోడి వియోగంబునకు నోర్వక దూరంబు వెనుతగిలిన కౌరవుల మరలించి, కురు జాంగల పాంచాల శూరసేన యామున భూములం గడిచి, బ్రహ్మావర్త కురుక్షేత్ర మత్స్య సారస్వత మరుధన్వ సౌవీ రాభీర విషయంబు లతిక్రమించి, తత్తద్దేశనివాసు లిచ్చిన కానుకలు గొనుచు నానర్త మండలంబు సొచ్చి పద్మబంధుండు పశ్చిమసింధు నిమగ్నుండైన సమయంబునఁ బరిశ్రాంతవాహుండై చని చని. 240

అధ్యాయము—౧౧

మ. జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్ర శృంగారకన్
గలహంసావృత హేమపద్మ పరిఘా కాసారకన్ దోరణా
వళి సంఛాదిత తారకన్ దరు లతా వర్గానువేలోదయ
త్ఫల పుష్పాంకుర కోరకన్ మణిమయ ప్రాకారకన్ ద్వారకన్. 241

వ. ఇట్లు తన ప్రియపురంబు డగ్గఱి. 242

మత్తకోకిల. అన్యసన్నుత సాహసుండు మురారి యొత్తె యదూత్తముల్
ధన్యులై వినఁ బాంచజన్యము దారితాఖిల జంతుచై
తన్యమున్ భువనైకమాన్యము దారుణస్వన భీత రా
జన్యమున్ బరిమూర్ఛితాఖిలశత్రు దానవసైన్యమున్. 243

శా. శంఖారావము వీనుల న్విని జనుల్ స్వర్ణాంబర ద్రవ్యముల్
[2]శంఖాతీతము గొంచు వచ్చిరి దిదృక్షా దర్పితోత్కంఠన
ప్రేంఖ ద్భక్తులు వంశ కాహళ మహాభేరీ గజాశ్వావళీ
రింఖారావము లుల్లసిల్ల దనుజారిం జూడ నాసక్తులై. 244

1. విమల మానసమగు (హ); విమల మానసమై (వా); విమల మానసులగు (క.చ.ట.ద.బ.)
2. సంఖ్యాతీతము (హ); శంఖాద్యంబుల (లం); సంఖాద్యంబుల (క.చ.); సంఖాతంబుల (ట.)

క. బంధులు పౌరులు దెచ్చిన, గంధేభ హయాదులైన కానుకలు దయా
సింధుఁడు గైకొనె నంబుజ, [1]బంధుఁడు గొను దత్త దీపపంక్తుల భంగిన్. 245

వ. ఇట్లాత్మారాముండు పూర్ణకాముండు నైన యప్పరమేశ్వరునికి నుపాయనంబు లిచ్చుచు నాగరులు వికసిత ముఖులై, గద్గద భాషణంబులతోడ డయ్యకుండ నడపు [2] నయ్యకు నెయ్యంపుఁ జూపుల నడ్డంబులేని బిడ్డలచందంబున మ్రొక్కి యిట్లనిరి. 246

శా. నీ పాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా! నీ సేవ సంసార సం
తాపధ్వంసిని యోఁగదా! సకల భద్రశ్రేణులం బ్రీతితో
నాపాదింతు గదా! [3] ప్రపన్నులకుఁ గాలాధీశ! కాలంబు ని
ర్వ్యాపారంబు గదయ్య! [4]చాలరుగదా! వర్ణింప బ్రహ్మాదులున్. 247

క. ఉన్నారము సౌఖ్యంబున, విన్నారము నీ ప్రతాప విక్రమ కథలన్
మన్నారము ధనికులమై, కన్నారము తావ కాంఘ్రికమలములు హరీ! 248

క. ఆరాటము మది నెఱుఁగము, పోరాటము లింద్ల కడలఁ బుట్టవు పురిలోఁ
జోరాటన మెగయదు నీ, దూరాటన మోర్వలేము తోయజనేత్రా! 249

ఉ. తండ్రులకెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ! నీవు మా
తండ్రివి తల్లివిం బతివి దైవమవున్ సఖివిన్ [5]గురుండ వే
తండ్రులు నీక్రియం బ్రజల ధన్యులఁజేసిరి? వేల్పులైన నో
తండ్రి! భవ న్ముఖాంబుజము ధన్యతఁ గానరు మా విధంబునన్. 250

క. చెచ్చెరఁ గరినగరికి నీ, విచ్చేసిన నిమిషమైన వెయ్యేం డ్లగు నీ
వెచ్చోటికి విచ్చేయక, మచ్చికతో నుండుమయ్య! మా నగరమునన్. 251

ఆ. అంధకారవైరి యపరాద్రి కవ్వలఁ, జనిన నంధమైన జగముభంగి
నిన్నుఁ గానకున్న నీరజలోచన! యంధతమస[6]మతుల మగుదుమయ్య! 252

వ. అని యిట్లు ప్రజ లాడెడి భక్తియుక్త మధుర మంజులాలాపంబులు గర్ణకలాపంబులుగా నవధరించి, సకరుణావలోకనంబులు వర్షించుచుం హర్షించుచుం దనరాక విని మహానురాగంబున సంరంభ వేగంబుల మజ్జన భోజన శయనాది కృత్యంబు లొల్లక, యుగ్రసే నాక్రూర వసుదేవ బలభద్ర ప్రద్యుమ్న [7]సాంబ

---

1. బంధున కిడినట్టి దీప (జ) 2. నల్లనయ్యకు (త) 3. ప్రసన్నులకు (చ. ట. త. జ.) 4. చాలరు నినున్ (హ. తం. వా.) 5. గురుండవున్ (డ) 6. యుతుల (జ. ట.) 7. సాంబసాత్యకి ప్రముఖ (చ. జ. డ. ద. బ.)

చారుదేష్ణ గద ప్రముఖయదుకుంజరులు గుంజర తురగ రథారూఢులై దిక్కుం జరసన్నిభం బైన యొక్క కుంజరంబు ముందట నిడుకొని సూత మాగధ నటన ర్తక గాయక వందిసందోహంబుల మంగళభాషణంబులును, భూసురాశీర్వాద వేదఘోషణంబులును, వీణా వేణు భేరీ పటహ శంఖ కాహళ ధ్వానంబులును, రథారూఢ విభూషణ భూషిత వారయువతీ గానంబులును నసమానంబులై చెలంగ నెదురుకొని, యథోచిత ప్రణామ నమస్కార పరిరంభ కరస్పర్శన సంభాషణ మందహాస సందర్శనాది విధానంబుల బహుమానంబులు సేసి, వారలుం దానును భుజగేంద్ర పాలితంబైన భోగవతీనగరంబు [1]చందంబున స్వసమానబల [2]యదు భోజ దాశార్హ కుకు రాంధక వృష్ణి వీర పాలితంబును, సకలకాలసంపద్య మానాంకుర పల్లవ కోరక కుట్మల కుసుమ ఫలమంజరి పుంజభార వినమిత లతా పాదపరాజ విరాజితోద్యాన మహోవనోపవనారామ భాసితంబును, వనాంతరాళ రసాల సాల శాఖాంకుర ఖాదన క్షుణ్ణ కషాయకంఠ కలకంఠ మిథున కోలాహల ఫలరసాస్వాద పరిపూర్ణ శారికా కీరకుల కలకల కహ్లారపుష్ప మకరందపాన పరవశ భృంగభృంగీ కదంబ ఝుంకార సరోవర కనకకమల మృదుల కాండఖండ స్వీకార మత్తవరాటాయత్త కలహంసనివహ క్రేంకారసహితంబును, మహోన్నత సౌధజాలరంధ్ర నిర్గత కర్పూరధూప ధూమపటల సందర్శన సంజాత జలధర భ్రాంతి విభ్రాంత సముద్ధూత పింఛ నర్తన ప్రవర్తమాన మత్తమయూర కేకారవ మహితంబును, నానారూప తోరణధ్వజ వైజయంతికానికాయ నిరుద్ధ తారకా గ్రహ ప్రకాశంబును, ముక్తాఫల విరచిత రంగవల్లికాలంకృత మందిరద్వార గేహళీ వేదికా ప్రదేశంబును, ఘనసార గంధసార కస్తూరికా సంవాసిత వణిగ్గేహ గేహళీనికర కనకగళంతికా వికీర్యమాణ సలిలధారా సంసిక్త విపణిమార్గంబును ప్రతినివాస బహిరంగణ సమర్పిత రసాలదండ ఫల కుసుమ గంధాక్షత ధూప దీప రత్నాంబరాది వివిధోపహారంబును, ప్రవాళ నీల మరకత వజ్ర వైడూర్య నిర్మిత గోపురాట్టాలకంబును, విభవవర్జిత మహేంద్రనగరాలకంబును నైన పురవరంబు ప్రవేశించి రాజమార్గంబున వచ్చు సమయంబున 253

మత్తకోకిల. కన్నులారంగ నిత్యమున్ హరిఁ గాంచుచుం మనువార [3]ల
యున్నవీన కుతూహలోత్సవయుక్తి నాగరకాంత ల
త్యున్నతోన్నత హర్మ్యరేఖలనుండి చూచిరి నిక్క చే
సన్నలం దమలోనఁ దద్విభు సౌకుమార్యము సూపుచున్. 254

1. చందంబున భూషితహార యువతీ సౌపీరపాలితంబై (త) 2. మధు (హ) 3. లై యున్న వారు (ద.)

సీ. కలుముల నీనెడి కలకంఠి యెలనాఁగ వర్తించు నెవ్వని వక్షమందు
జనదృక్చకోరక సంఘంబునకు సుధా పానీయపాత్ర మే భవ్యముఖము
సకల దిక్పాలక సమితికి నెవ్వని బాహుదండంబులు పట్టుఁగొమ్మ
లాశ్రితశ్రేణి కే యధిపతి పాద రాజీవయుగ్మంబులు చేరుగడలు

ఆ. భువనమోహనుండు పురుషభూషణుఁ డెవ్వఁ, డట్టి కృష్ణుఁ డరిగె హర్మ్యశిఖర
రాజమాన లగుచు రాజమార్గంబున, రాజముఖులు గుసుమరాజిఁ గురియ. 255

మ. జలజాతాక్షుఁడు సూత నొప్పె ధవళ చ్ఛత్రంబుతోఁ జామరం
బులతోఁ బుష్పపిశంగ చేలములతో భూషామణి స్ఫీతుఁడై
నలినీబాంధవుతో శశిద్వయముతో నక్షత్రసంఘంబుతో
బలభిచ్చాపముతోఁ దటిల్లతికతో భాసిల్లు మేఘాకృతిన్. 256

వ. ఇట్లు తల్లిదండ్రుల నివాసంబు సొచ్చి దేవకీ ప్రముఖలైన తల్లుల కేడ్వురకు మ్రొక్కిన. 257

క. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంకముల నునిచి చన్నులతుదిఁ బా
లొడ్డగిలఁ బ్రేమభరమున, [1]జడ్డువడం దడిపి రక్షిజలముల ననఘా! 258

వ. తదనంతరం బష్టోత్తరశతాధిక షోడశసహస్ర సౌవర్ణసౌధ కాంతంబైన శుద్ధాంతంబు సొచ్చి హరి తనమనంబున. 259

మ. ఒక [2]భామాభవనంబు మున్న సొర వేఱొక్కర్తు లోఁ గుందునో!
సుకరాలాపము లాడదో! సొలయునో! సుప్రీతి నీక్షింపదో!
వికలత్వంబున నుండునో! యనుచు నవ్వేళన్ వధూగేహముల్
ప్రకటాశ్చర్య విభూతిఁ జొచ్చె బహురూప వ్యక్తుఁడై భార్గవా! 260

వ. ఆ సమయంబున. 261

క. శిశువులఁ జంకలనిడి తను, కృశతలు విరహాగ్నిఁ దెలుప గృహగేహళులన్
రశనలు జాఱఁగ సిగ్గుల, శశిముఖు లెదురేగి రపుడు జలజాక్షునకున్. 262

మ. పతి నా యింటికి మున్న వచ్చె నిదె నా ప్రాణేశుఁ డస్మద్గృహా
గతుఁడయ్యెన్ మును సేరెఁ బో దొలుత మ త్కాంతుండు నాశాల కే
నితరాలభ్య [2]శుభంబు గంటి నని తా రింటింట నర్చించి ర
య్యతివల్ నూఱుఁ బదాఱువేలు నెనమం డ్రవ్వేళ నాత్మేశ్వరున్. 263

వ. వారలం జూచి హరి యిట్లనియె. 264

1. జడ్డుపడుచు (చ) 2. దేవీ (చ) 3. సుఖంబు (జ. ద. హ. తం. వా.)

మ. కొడుకుల్ భక్తివిధేయు లౌదురుగదా? కోడండ్రు మీ వాక్యముల్
[1]కడవం బాఱక యుందురా? విబుధ సత్కారంబు గావింతురా?
తొడవుల్ వస్త్రములం బదార్థ రస సందోహంబులుం జాలునా!
కడమల్ గావు గదా? భవన్నిలయముల్ గల్యాణ యుక్తంబులే? 265

సీ. తిలక మేటికి లేదు? తిలకినీతిలకమ! [2]పువ్వులు దుఱుమవా? పువ్వుఁబోణి!
కస్తూరి [3]యలఁదవా? కస్తూరికాగంధి! తొడవులు తొడవవా? తొడవు తొడవ!
కలహంసఁ [5]బెంపుదే? కలహంస గామిని! కీరంబుఁ [6]జదివింతె? కీరవాణి!
లతలఁ [7]బోషింతువా? లతికా [8]లలితదేహ! సరసి [9]నోలాడుదె? సరసిజాక్షి?

ఆ. మృగికి మేఁతలిడుదె? మృగశాబలోచన!, గురుల నాదరింతె? గురువివేక!
బంధుజనులఁ బ్రోతె? బంధుచింతామణి!, యనుచు సతుల నడిగె నచ్యుతుండు.

వ. అని యడిగిన వారలు హరిం బాసిన దినంబులందు శరీర సంస్కార కేళీవిహార హాస[10]మందిరగమన మహోత్సవ దర్శనంబు లొల్లని యిల్లాండ్రు గావున 267

మ. సిరి [11]చాంచల్యము తోడి దయ్యుఁ దనకుం [12]జిత్తేశ్వరుం డంచు నే
పురుషశ్రేష్ఠు వరించె నట్టి పరముం బుద్ధిం విలోకంబులం
గరయుగ్మంబులఁ గౌఁగిలించిరి సతుల్ గల్యాణ బాష్పంబు లా
భరణ శ్రేణులుగాఁ బ్రతిక్షణ నవప్రాప్తానురాగంబులం. 268

మత్తకోకిల. పంచబాణుని నీఱుచేసిన భర్గునిం దనవిల్లు వ
ర్జించి మూర్ఛిలఁ జేయఁజాలు విశేష హాస విలోకనో
దంచితాకృతు లయ్యుఁ గాంతలు దంభచేష్టల మాధవుం
సంచలింపఁగఁ జేయ నేమియుఁ జాలరైరి బుధోత్తమా! 269

వ. ఇవ్విధంబున సంగ విరహితుండైన కంసారి సంసారికైవడి విహరింప నజ్ఞాన విలోకులైన లోకులు లోకసామాన్య మనుష్యుండని తలంతురు. ఆత్మాశ్రయ యైన బుద్ధి యాత్మయందున్న యానందాదులతోడం గూడని తెఱంగున నీశ్వరుండు ప్రకృతితోడం గూడియు నా ప్రకృతిగుణంబులైన సుఖదుఃఖంబులఁ జెందక యుండు. పరస్పర సంఘర్షణంబులచే వేణువుల వలన వహ్నిఁబుట్టించి వనంబుల దహించు మహావాయువు చందంబున, భూమికి భారహేతువులై (యనేకాక్షౌహిణులతోడం బ్రవృద్ధతేజు లగు) రాజుల కన్యోన్య వైరంబులు

1. కడవంబాయక (ట. చ. బ.); కడవంజాలక (వా), 2. దురుముదా (క.ర.) 3. యలదుదా (క. ర.) 5. తొడవుదా (క.ర.) 5. కలహంసమున్నదే (హ) 6. చదువునే (హ.) 7. బోషింపుదా (ద.బ.) 8 లలితా రుచిరదేహ (హ) 9. యింకదుగడా (క.బ.) 10. వనమందిర (క) 11. వాత్సల్యము (క. చ. ట. త. ద. బ.) 12. జీవేశ్వరుండంచు (ద. ప. హ. తం. వా.)

గల్పించి, నిరాయుధుండై సంహారంబుసేసి, శాంతుండై పిదపం గొంతామధ్యం
బునఁ బ్రాకృత మనుష్యుండునుం బోలె, సంచరింపుచుండె నా సమయంబున, 270

క. [1]మతు లీశ్వరుని మహత్త్వము, మిత మెఱుఁగని భంగి నప్రమేయుఁడగు హరి
స్థితి నెఱుఁగక కాముకుఁడని, రతములు సలుపుదురు తిగిచి రమణులు[2]సుమతీ!

క. ఎల్లపుడును మా యిండ్లను, వల్లభుఁడు వసించు [3]నేమ వల్లభలము శ్రీ
వల్లభున కనుచు గోపీ, వల్లభుచే సతులు మమతవలఁ బడి రనఘా! 272

వ. అని చెప్పిన విని సూతునకు శౌనకుం డిట్లనియె. 273

అధ్యాయము—౮

—: ఉత్తరకు పరీక్షిత్తు జన్మించుట :—

సీ. గురునందనుండు సక్రోధుఁడై యేసిన బ్రహ్మశిరోనామ బాణ వహ్నిఁ
గంపించు సుత్తర గర్భంబు గ్రమ్మఱఁ బద్మలోచనుచేతఁ బ్రతికె నండ్రు
గర్భస్థుఁడగు బాలుఁ గంసారి యేరీతి బ్రతికించె? మృత్యువు భయము వాపి
జనియించి యతఁ డెన్ని సంవత్సరము లుండె? నెబ్భంగి వర్తించె నేమి సేసె?

ఆ. [4]వినుము శుకుఁడు వచ్చి విజ్ఞాన పద్ధతి, నతని కెట్లు సూపె నతఁడు పిదపఁ
దన శరీర మే విధంబున వర్జించె?, విప్రముఖ్య! నాకు విస్తరింపు. 274

వ. అనిన సూతుం డిట్లనియె. ధర్మనందనుండు చతుస్సముద్ర ముద్రితాఖిల జంబూ
ద్వీపరాజ్యంబు నార్జించియు, మిన్నుముట్టిన కీర్తి [5]నుపార్జించియు, నంగనా
తురంగ మాతంగ సుభట [6]కాంచనాది దివ్యసంపదలు సంపాదించియు, వీర
సోదర విప్ర విద్వజ్జన వినోదంబులం బ్రమోదించియు, వైభవంబు లలవ
రించియుఁ, గ్రతువు లాచరించియు, (దుష్టశిక్షణ, శిష్టరక్షణంబు లొనరించియు)
ముకుందచరణారవింద సేవారతుండై, సమస్త సంగంబులందు నభిలాషంబు
వర్జించి, యరిషడ్వర్గంబు [7]జయించి రాజ్యంబు సేయుచు, 275

తే. చందనాదుల నాఁకట స్రగ్గువాఁడు, దనివి నొందని కైవడి ధర్మసుతుఁడు
సంపదలు పెక్కు గలిగియుఁ జక్రిపాద, సేవనంబులఁ బరిపూర్తి నెందకుండె. 276

---

1. సుతులు (క) సతులు; (ట. త. ద.) యతులు (వా) 2. ప్రీతిఁ (హ) 3. నేము (క.బ.)
4. వినుము (హ. తం. వా.); వినుఁడు (ట. త.); వినుము (వినుఁడు) అను క్రియ అనన్వితముగా
నున్నది. 5. సంగ్రహించియు (హ) 6. కాంచన హానాదివ్య (క. చ. బ.) కాంచన స్యందనాది (ట)
7. నిర్జించి (క. చ. ట.)

వ. అంతం గొన్ని దినంబులకు నభిమన్యు కాంతాగర్భంబునందున్న డింభకుండు [1]దశమాస పరిచ్ఛేద్యుండై, గర్భాంతరాళంబున దురంతంబైన యశ్వత్థామ బాణానలంబున దందహ్యమానుండై తల్లడిల్లుచు. 277

ఉ. కుయ్యిడ శక్తిలే [2]దుదర గోళములోపల నున్న వాఁడ ది
క్కెయ్యది? [3]దా ననాథ నని యెప్పుడుఁ దల్లి గణింప విందు నేఁ
డి య్యిషువహ్ని వాయుటకు నెయ్యది మార్గము? నన్నుఁ గావ నే
యయ్య గలండు? గర్భ జనితాపద నెవ్వఁ డెఱుంగు దైవమా! 278

క. చిచ్చఱకోల వశంబునఁ, జచ్చి బహిర్గతుఁడఁ గాని సమయమునను దా
నుచ్చలిత గర్భవేదనఁ, జచ్చును మాతల్లి [4]ఘోర సంతాపమునన్. 279

క. చెచ్చెర బాణ జ్వాలలు, వచ్చిన విష్ణుండు గావవచ్చు ననుచుఁ దా
ముచ్చటలు సెప్ప సతులకు, నిచ్చలు మాయవ్వ నేఁడు నిజమయ్యెడినో! 280

శా. రాఁడా చూడ? సమస్త భూతములలో రాజిల్లువాఁ డిచ్చటన్
లేఁడా? పాఱుని [5]చిచ్చఱమ్ము దొలఁగన్ లీలాగతిన్ ద్రోచి నా
కీఁడా? నేఁ డభయప్రదాన మతఁ డూహింపన్ నతత్రాత మున్
గాఁడా? యెందఱిఁ గావఁ డీ యెడల మత్కర్మంబు దా నెట్టిదో! 281

వ. అని [6]గతాగత ప్రాణుండై శిశువు చింతించు సమయంబున. 282

సీ. మేఘంబు మీఁది క్రొమ్మెఱుఁగు కైవడి మేనిపై నున్న పచ్చని పటమువాఁడు
గండ భాగంబులఁ [7]గాంచన మణిమయ మకరకుండల కాంతి మలయువాఁడు
శరవహ్ని నడఁగించు సంరంభమునఁ జేసి కన్నుల నునుఁగెంపు గలుగువాఁడు
బాలార్క మండల ప్రతిమాన రత్న హాటక విరాజిత కిరీటంబువాఁడు

తే. గంకణాంగద వనమాలికా విరాజ, మానుఁ డసమానుఁ డంగుష్ఠమాత్రదేహుఁ
డొక్కగదఁ జేతఁదాల్చి నేత్రోత్సవముగ, విష్ణుఁ డావిర్భవించె న వ్వేళయందు.

వ. ఇట్లు భక్తపరాధీనుండైన పరమేశ్వరుం డావిర్భవించి, మంచు [8]విరియించు మార్తాండు చందంబున శిశువునకు దశదిశలం దన చేతి యఖండిత మహోల్కాజాల సన్నిభంబైన గదాదండంబు మండలాకారంబుగ జిఱజిఱం ద్రిప్పి, విప్రుని చిచ్చఱమ్ము వేఁడిమి పోఁడిమిఁ జెఱిచి, డింభకుని పరితాప విజృంభణంబు నివారించి, గర్భంబు కందకుండ రక్షించి యర్భకునికి నానందంబు గల్పించిన 284

1. పదియగునెల (క.ద.) 2. లేఁదొడల (హ) 3. నాకటంచునని (డ) 4. గర్భ (హ.తం.వా.)
5. చిచ్చరమ్ము (ఇ.ద.బ.) 6. కంఠగత (త) 7. గప్పిన (ద) 8. సమయించు (క.చ.త.ఇ.డ.ద.బ.)

మ. గదఁ జేఁ బట్టి పరిభ్రమించుచు గదాఘాతంబునన్ [1]దుర్భయ
ప్రదమై వచ్చు శరాగ్నిఁ దుత్తుమురుగా భంజించి రక్షించు నీ
సదయుం డెవ్వఁడొకో! యటంచు మదిలోఁ జర్చింపుచున్ శాబకుం
డెదురై చూడ నదృశ్యుఁడయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా! 285

వ. అంత ననుకూల శుభ గ్రహోదయంబును, [2]సర్వ గుణోత్తర ఫల సూచకంబు నైన మంచి లగ్నంబునం బాండవ వంశోద్ధారకుండైన కుమారుండు జన్మించిన ధర్మనందనుండు ధౌమ్యాది భూసురవర్గంబు రప్పించి, పుణ్యాహంబు సదివించి, జాతకర్మంబులు సేయించి, కుమారు జన్మమహోత్సవ కాలంబున భూసురులకు విభవాభిరామంబులైన గో భూ హిరణ్య హయానేక గ్రామంబులును [3]స్వాదు రుచి సంపన్నంబులైన యన్నంబులు నిడిన, వారలు ధర్మపుత్రున కిట్లనిరి. 286

చ. ప్రకటిత దైవయోగమునఁ [4]బౌరవసంతతి యంతరింపఁగా
వికలత నొందనీక ప్రభవిష్ణుఁడు కృష్ణుఁ డనుగ్రహించి శా
బకు బ్రతికించెఁ గావున నృపాలక [5]బాలకుఁ డింక శాత్రవాం
తకుఁ డగు [6]విష్ణురాతుఁ డన ధాత్రిఁ బ్రసిద్ధికి నెక్కుఁ బూజ్యుఁడై. 287

వ. అనిన భూదేవోత్తములకు నరదేవోత్తముం డిట్లనియె. 288

శా. ఓ పుణ్యాత్మకులార! నా పలుకు మీ రూహింపుఁడా మ్రొక్కెదన్
మా పెద్దల్ [7]చిరకీర్తులై సదయులై [8]మన్నారు రాజర్షులై
యీ పిన్నాతఁడు వారిఁ బోలెడిఁ గదా! యెల్లప్పుడున్ మాధవ
శ్రీపాదాంబుజ భక్తియుక్తుఁ డగుచున్ జీవించునే? చూడరే! 289

వ. అనిన విని నరేంద్రా! భవదీయ పౌత్రుండు మనుపుత్రుండైన యిక్ష్వాకు చందంబునం బ్రజల రక్షించు. (శ్రీరామచంద్రుని భంగి బ్రహ్మణ్యుండు సత్య ప్రతిజ్ఞుండు నగు)డేగ వెంటనంటిన బిట్టు భీతంబై వెనుకకు వచ్చిన కపోతంబు గాచిన శిబిచక్రవర్తిభంగి (శరణ్యుండును, వితరణ ఖనియు నగు). దుష్యంత సూనుండైన భరతు పగిది సోమాన్వయ జ్ఞాతివర్గంబులకు (యజ్వలకు) ననర్గళ కీర్తి విస్తరించుచు, ధనంజయ కార్తవీర్యుల కరణి [9]ధనుర్ధరాగ్రేసరుండగు. కీలి పోలిక [10]దుర్ధర్షుండగు. సముద్రుని తెఱంగున దుస్తరుండగు. మృగేంద్రుని కైవడి విక్రమశాలియగు. వసుమతిం బోలె నక్షయ క్షాంతి యుక్తుండగు. భానుని లాగు ప్రతాపవంతుం డగు. వాసుదేవు వడువున సర్వభూత హితుండగు. తల్లిదండ్రులమాడ్కి సహిష్ణుఁడగు. మఱియును 290

1. దుర్భరప్రదమై (క.బ); క్రూర శుక్రప్రదమై (హ. తం. వా.) 2. మహోత్తర (క.బ.తం) 3. సాదరరుచి (త. ద.) 4. పాండవ (త.ద.) 5. శాబకుఁడింక (హ) 6. విష్ణుదాసుఁడన (క.చ.ట.త.డ.బ.); 'విష్ణురాత ఇతి' అని మూలము (12-17), 7. శ్రుతకీర్తులై (హ.తం.వా.) 8. మన్నారుగా రాజులై (క.బ.) 9. ధనుర్ధరుండగు (ట. త. జ. డ. ద. బ.) 10 దుర్దముఁడగు (క.బ.)

సీ. సమదర్శనంబున జలజాతభవుఁ డనఁ బరమ ప్రసన్నత భర్గుఁ డనఁగ
నెల్లగుణంబుల నిందిరావిభుఁ డన నధిక ధర్మమున యయాతి యనఁగ
ధైర్యసంపద బలి దైత్యవల్లభుఁ డన నచ్యుతభక్తిఁ బ్రహ్లాదుఁ డనఁగ
రాజితోదారత రంతిదేవుం డన [1]నాశ్రిత మహిమ [2]హేమాద్రి యనఁగ

తే. యశము నార్జించుఁ, బెద్దల నాదరించు, నశ్వమేధంబు లొనరించు, నాత్మసుతుల
ఘనులఁ బుట్టించు, దండించు ఖలులఁ బట్టి. మానధనుఁడు నీమనుమండు మానవేంద్ర!

భుజంగ ప్రయాతము. హరించుం గలిప్రేరి తాఘంబు లెల్లన్
భరించున్ ధరన్ రామభద్రుండు వోలెన్
జరించున్ సదా వేదశాస్త్రాను వృత్తిన్
వరించున్ విశేషించి వైకుంఠు భక్తిన్. 292

వ. ఇట్లు పెక్కేండ్లు జీవించి, భూసుర కుమారక ప్రేరితంబైన తక్షక సర్ప విషాన లంబునం దనకు మరణంబని యెఱింగి, సంగవర్జితుండై, ముకుంద పాదారవింద భజనంబు సేయుచు శుకయోగీంద్రుని వలన నాత్మవిజ్ఞాన సంపన్నుండై, గంగా తటంబున శరీరంబువిడిచి, నిర్గత భయశోకంబైన లోకంబు ప్రవేశించును. అని జాతకఫలంబు సెప్పి లబ్ధకాములై భూసురులు చనిరి. అంత 293

క. తనతల్లి కడుపు లోపల, మును సూచిన విభుఁడు విశ్వమున నెల్లఁ గలం
డనుచుఁ బరీక్షింపఁగ జను, లనఘుఁ బరీక్షిన్నరేంద్రుఁ డండ్రు నరేంద్రా! 294

ఆ. కళలచేత రాజు క్రమమునఁ బరిపూర్ణుఁ, డైన భంగిఁ [3]దాత లనుదినంబుఁ
బోషణంబు సేయఁ బూర్ణుఁ డయ్యెను ధర్మ, పటల పాలకుండు బాలకుండు. 295

వ. మఱియు ధర్మజుండు బంధుసంహార దోషంబు వాయుకొఱకు నశ్వమేధ యాగంబు సేయం దలంచి, ప్రజలవలనం గరదండంబుల నుపార్జితంబైన విత్తంబు చాలక చిత్తంబునం జింతించునెడ, నచ్యుతప్రేరితులై భీమార్జునాదులు, దొల్లి మరుత్తుండను రాజు మఖంబుచేసి పరిత్యజించి నిక్షేపించిన సువర్ణ పాత్రాదికం బైన విత్త ముత్తర దిగ్భాగంబు వలన బలవంతులై తెచ్చిన, నా రాజసత్తముం డును సమాయత్త యజ్ఞోపకరణుండై, సకల బంధుసమేతంబుగఁ గృష్ణుని నాహ్వానంబు చేసి, పురుషోత్తము నుద్దేశించి మూఁడు జన్నంబులు గావించె. ( తదనంతరంబ కృష్ణుండు బంధు ప్రియంబు కొఱకుఁ గరినగరంబునం గొన్ని నెల లుండి, ధర్మపుత్రాదులచే నామంత్రణంబు వడసి, యాదవ సమేతుండై ధనంజయుండు తోడరా నిజనగరంబునకుఁ నిజయె. )

---

1. ఆశ్రయ (తం.వా.) 2. హిమాద్రి (చ.డ.తం.వా.) 3. దాదులకు దినంబు (క.చ.ట.డ.బ.)

అధ్యాయము — ౧౩

అంతకు మున్ను విదురుండు తీర్థయాత్రకుఁ జని, మైత్రేయు ముందటఁ గర్మ యోగ వ్రతాది విషయంబులైన ప్రశ్నలు గొన్ని చేసి, యతనివలన నాత్మ విజ్ఞానంబు దెలిసి కృతార్థుండై హస్తిపురంబునకు వచ్చిన. 296

క. బంధుఁడు వచ్చె నటంచును, గాంధారీవిభుఁడు మొదలుగా నందఱు సం
బంధములు నెఱపి ప్రీతి [1]న, మంథరగతిఁ జేసి రపుడు మన్నన లనఘా! 297

వ. అంత ధర్మనందనుండు విదురునికి మజ్జన భోజనాది సత్కారంబులు సేయించి సుఖాసీనుండై తనవార లందఱు విన నిట్లనియె. 298

సీ. ఏ వర్తనంబున నింత కాలము మీరు సంచరించితిరయ్య? జగతిలోన
నే తీర్థములు గంటి రెక్కడ నుంటిరి? భావింప మీవంటి భాగవతులు
దీర్థసంఘంబుల [2]ధిక్కరింతురుగదా! మీయందు విష్ణుండు మెఱయుకతన
మీరె తీర్థంబులు మీకంటె మిక్కిలి తీర్థంబు లున్నవే? తెలిసిచూడ

తే. వేరె తీర్థంబు లవనిపై వెదకనేల, మిమ్ముఁ బొడగని భాషించు మేలె చాలు
వార్తలేమండ్రు? లోకులు వసుధలోన, మీకు సర్వంబు నెఱిగెఁడి మేర గలదు. 299

మత్తకోకిల. తండ్రి సచ్చిన మీఁద మా పెదతండ్రి బిడ్డలు దొల్లి పె
క్కండ్రు సర్పవిషాగ్ని బాధల గాసిపెట్టఁగ మమ్ము ని
ల్లాండ్ర నంతముఁ బొందకుండఁగ లాలనంబున మీరు మా
తండ్రిభంగి సముద్ధరింతురు తద్విధంబు దలంతురే? 300

క. పక్షులు [3]తమ ఱెక్కలలోఁ, బక్షంబులురాని పిల్లపదువుల మమతన్
రక్షించినక్రియ మీరలు, పక్షీకరణంబు సేయ బ్రతికితిమి గదే! 301

క. మన్నారా? ద్వారకలో, నున్నారా? యదువు లంబుజోదరు కరుణన్
గన్నారా? లోకులచే, విన్నారా? మీరు వారి విధ మెట్టిదియో. 302

చ. అన విని ధర్మరాజునకు నా విదురుండు సమస్త లోకవ
ర్తనముఁ గ్రమంబుతోడ విశదంబుగఁ జెప్పి, యదుక్షయంబు సె
ప్పిన నతఁ డుగ్రశోకమున బెగ్గిలుచుండెడి నంచు నేమియున్
విను మని చెప్పఁ డయ్యె యదువీరుల నాశము భార్గవోత్తమా! 330

1. సమంథరలన్ (క. చ. ట. త. జ.) సమందగతిన్ (ద) 2. దివిరి వర్తింతురు (ద) తీర్థ సంఘములకు తీర్థమిత్తురు (ద) 3. తమతమ ఱెక్కల (క. చ. ట. త. జ.)

ఆ. మేలు చెప్పెనేని మేలండ్రు లోకులు, [1]చేటు చెప్పెనేని చెట్టయండ్రు
అంతమీఁద శూద్రుఁ డైన కతంబున, శిష్టమరణ మతఁడు సెప్పఁ డయ్యె. 304

వ. అది యెట్లనిన మాండవ్యమహాముని శాపంబునం దొల్లి యముండు శూద్రయోని యందు విదురుండై జన్మించియున్న నూఱుసంవత్సరంబు లర్యముండు యథా క్రమంబునం బాపకర్ముల దండించె. ఇట యుధిష్ఠిరుండు రాజ్యంబుఁ గైకొని లోకపాల సంకాశులైన తమ్ములుం దానును కులదీపకుండైన మనుమని ముద్దు సేయుచుఁ బెద్దకాలంబు మహావైభవంబున సుఖియై యుండె. 305

క. బాలాజన శాలా ధన, లీలా వనముఖ్య విభవ లీన మనీషా
లాలసులగు మానవులను, గాలము వంచించు దురవగాహము సుమతీ! 306

వ. అది నిమిత్తంబునం గాలగతి యెఱింగి విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 307

—: గాంధారీ ధృతరాష్ట్రులు దేహత్యాగము చేయుట :—

మ. కనకాగార కళత్ర మిత్ర సుత సంఘాతంబులన్ ముందటం
గని [2]ప్రాణేచ్ఛల నుండు జంతువుల నేకాలంబు దుర్లంఘ్యమై
యనివార్యస్థితిఁ జంపు నట్టి నిరుపాయం బైన కాలంబు వ
చ్చె నుపాంతంబున మాఱు దీనికి మదిన్ జింతింపు ధాత్రీశ్వరా! 308

శా. పుట్టంధుండవు, పెద్దవాఁడవు, మహాభోగంబులా లేవు, నీ
పట్టెల్లంజెడిపోయె, దుస్సహ జరాభారంబు పైఁ గప్పె, నీ
చుట్టా లెల్లను బోయి రాలు మగఁడున్ శోకంబునన్ మగ్నులై
కట్టా! దాయలపంచ నుండఁ దగవే, కౌరవ్యవంశాగ్రణీ! 309

క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి తదీయభార్యఁ, బాడవులకుం
గొట్టితిరి, వారు మనుపఁగ, [3]నెట్టైన భరింపవలెనె? యీ ప్రాణములన్. 310

క. బిడ్డలకు బుద్ధిసెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొం డిదె పైఁ
బడ్డాఁ డని భీముం డొఱ, గొడ్డెము లాడంగఁ గూడుఁ గుడిచెద వధిపా! 311

క. కనియెదవో బిడ్డల నిఁక, మనియెదవో తొంటికంటె మనుమలమాటల్
వినియెదవో యిచ్చెద ర, మ్మనియెదవో దానములకు నవనీసురులన్. 312

క. దేహము నిత్యము గాదని, మోహముఁ దెగఁ గోసి సిద్ధమునివర్తనుఁడై
గేహము వెలువడు నరుఁ డు, త్సాహముతోఁ జెందు ముక్తిసంపద ననఘా!

1. చెట్టయండ్రు కీడు చెప్పువాని (క.ఙ.ట.హ.తం.వా.) 2. ప్రాణేచ్ఛఁ జరించు జంతువుల (ఙ)
3. నెట్టును (ఙ) నెట్టన (ట.వా.)

వ. అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తిమార్గం బుపదేశించిన నతండు, ప్రజ్ఞాచక్షుండై సంసారంబు దిగనాడి, మోహపాశంబులవలన నూడి, విజ్ఞానమార్గంబునం గూడి, దుర్గమంబగు హిమవన్నగంబునకు నిర్గమించిన, 314

శా. అంధుండైన పతిన్ వరించి, పతిభావాసక్తి నేత్రద్వయీ
బంధాచ్ఛాదనమున్ ధరించి, నియమ ప్రఖ్యాతయై యున్న త
ద్గాంధార క్షితినాథు కూఁతురును యోగప్రీతి చిత్తంబులో
సంధిల్లం బతివెంట నేఁగె నుదయ త్సాధ్వీగుణారూఢయై. 315

చ. వెనుకకు రాక చొచ్చి రణవీరునికై వడి రాజదండనం
బునకు భయంబులేక వడిఁ బోయెడు ధీరునిభంగి నప్పు డా
వనిత దురంతమైన హిమవంతముపొంత వనాంతభూమికిం
బెనిమిటితోడ నించుకయు భీతివహింపక యేగెఁ బ్రీతితోన్. 316

వ. ఇట్లు విదురసహితులై గాంధారీధృతరాష్ట్రులు వనంబునకుం జనిన, మఱునాఁడు ధర్మనందనుండు ప్రభాతంబున సంధ్యావందనంబు చేసి, నిత్యహోమంబులు గావించి, బ్రాహ్మణోత్తములకు [1]గో హిరణ్య తిల వస్త్రాది దానంబు లిచ్చి, నమస్కరించి, గురువందనంబు కొఱకుఁ బూర్వప్రకారంబునం దండ్రి మందిరంబునకుం జని, యందు విదురసహితులైన తల్లిదండ్రులం గానక మంజుపీఠంబునం గూర్చున్న సంజయున కిట్లనియె. 317

సీ. మా తల్లిదండ్రులు మందిరంబున లేరు సంజయ! వా రెందుఁ [2]జనిరొ నేఁడు
ముందఱ గానఁడు ముసలి మా పెదతండ్రి, పుత్రశోకంబునఁ బొగులుఁ దల్లి
సౌజన్యనిధి ప్రాణసఖుఁడు మా పినతండ్రి, మందబుద్ధులమైన మమ్ము విడిచి
యెందుఁబోయిరొ? మువ్వురెఱిఁగింపు [3]గంగలోఁ దన యపరాధంబుఁదడవికొనుచు

ఆ. భార్యతోడఁ దండ్రి [4]పరితాపమునఁ బడుఁ, గపట మింత లేదు, కరుణ [5]గలదు
పాండు భూవిభుండు పరలోకగతుఁడైన, మమ్ముఁ బిన్నవాండ్ర మనిచె నతఁడు.

వ. అనిన సంజయుండు (దయాస్నేహంబుల నతికర్శితుండగుచు తన ప్రభువు పోయిన తెఱం గెఱుంగక కొంతదడ వూరకుండి) త ద్వియోగదుఃఖంబునఁ గన్నీరు కరతలంబునఁ దుడిచికొనుచు, బుద్ధిబలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు సేసి (తన భర్తృపాదంబుల మనంబున నెన్నుచు) ధర్మజున కిట్లనియె. 319

1. గో భూ హిరణ్య (త) 2. ననిరి (డ) 3. మాత్మలో (హ) 4. పరితాపమునుబొందు (హ) 5. గలఁడు (తం. వా.)

తే. అఖిలవార్తలు మున్ను నన్నడుగుచుండు, నడుగఁ డీ రేయి మీతండ్రి యవనినాథ!
మందిరములోన విదురుతో మంతనంబు, నిన్న యాడుచునుండెను నేఁడు లేఁడు.

వ. విదుర గాంధారీ ధృతరాష్ట్రులు నన్ను వంచించి యెందుఁ బోయిరో? (వారల నిశ్చయంబు లెట్టివో?) యెఱుంగనని సంజయుండు దుఃఖించు సమయంబునఁ దుంబురుసహితుండై నారదుండు వచ్చినఁ లేచి, నమస్కరించి, తమ్ములుం దానును నారదుం బూజించి కౌంతేయాగ్రజుం డిట్లనియె. 321

ఉ. అక్కట! తల్లిదండ్రులు గృహంబున లేరు, మహాత్మ! వారు నేఁ
డెక్కడ బోయిరో యెఱుఁగ, నెప్పుడు బిడ్డలపేరు గ్రుచ్చి తాఁ
బొక్కుచునుండుఁ దల్లి; యెటు వోయె నొకో! విపదంబురాశికిన్
నిక్కము గర్ణధారుఁడవు నీవు జగజ్జన [1]పారదర్శనా! 322

వ. అనిన విని సర్వజ్ఞుండైన నారదుండు ధర్మజున కిట్లనియె. (ఈశ్వరవశంబు విశ్వంబు. ఈశ్వరుండె భూతంబుల నొకటితో నొకటిఁ జేర్చు, నెడఁబాపు. సూచీభిన్న నాసికలందు రజ్జుప్రోతంబు లగుచుఁ గంఠరజ్జువులఁ గట్టంబడిన బలీవర్దంబులఁబోలెఁ గర్తవ్యాకర్తవ్య విధాయక వేదలక్షణ యగు వాక్తంత్రియందు వర్ణాశ్రమలక్షణంబులు గల నామంబులచే బద్ధులైన) లోకపాల సహితంబులై లోకంబు లీశ్వరాదేశంబు వహించు. క్రీడాసాధనంబులగు (నక్షకందుకాదుల) కెట్లు సంయోగ వియోగంబు లట్లు క్రీడించు నీశ్వరునికిం గ్రీడాసాధనంబులైన జంతువులకు సంయోగవియోగంబులు గలుగుచుండు. సమస్తజనంబును జీవరూపంబున ధ్రువంబును, దేహరూపంబున నధ్రువంబునై యుండు. మఱియు నొక్కపక్షంబున ధ్రువంబు నధ్రువంబుం గాకయుండు. శుద్ధబ్రహ్మరూపంబున ననిర్వచనీయంబుగ రెండునై యుండు. అజగరంబుచేత మ్రింగంబడిన పురుషుఁ డన్యుల రక్షింపలేని తెఱంగునఁ బంచభూతమయంబై కాలకర్మ గుణాధీనంబైన దేహంబు పరుల రక్షింప సమర్థంబుగాదు. కరంబులుగల జంతువులకుఁ గరంబులు లేని చతుష్పదాదు లాహారంబులగు. చరణంబులు గల ప్రాణులకు జరణంబులు లేని తృణాదులు భక్షణీయంబులగు. అధికజన్మంబులుగల (వ్యాఘ్రాదులకు) నల్ప జన్మంబుగల మృగాదులు భోజ్యంబులగు. సకల దేహిదేహంబులందు జీవుండు గలుగుటంజేసి జీవునికి జీవుండ జీవికయగు. అహస్త సహస్తాది రూపంబైన విశ్వమంతయు నీశ్వరుండుగాఁ దెలియుము. ఆతనికి వేఱు లేదు. నిజమాయా విశేషంబున మాయావియై జాతి భేద రహితుండైన యీశ్వరుండు బహుప్రకారంబుల భోగిభోగ్య రూపంబుల నంతరంగ బహిరంగంబుల దీపించు. (కాన

1. పాపవర్జనా (చ. డ.)

యనాథులు దీనులు నగు నాడు తల్లిదండ్రులు ననుం బాసి యే మయ్యెదరో? యెట్లు వర్తింతురో? యని వగవం బనిలేదు. అజ్ఞానమూలం బగు స్నేహం బున నైన మనోవ్యాకులత్వంబు పరిహరింపు మని మఱియు నిట్లనియె). 323

ఆ. అట్టి కాలరూపుఁ డఖిలాత్ముఁ డగు విష్ణుఁ, డసురనాశమునకు నవతరించి
దేవకృత్యమెల్లఁ దీర్చి చిక్కినపని, కెదురు సూచుచుండు [1]నిప్పు డధిప! 324

మత్తకోకిల. ఎంతకాలము గృష్ణుఁ డీశ్వరుఁ డిద్ధరిత్రిఁ జరించు, మీ
రంతకాలము నుండుఁ డందఱు, నవ్వలం బనిలేదు, వి
భ్రాంతి మానుము, కాలముం గడవంగ నెవ్వరు నోప, రీ
చింతయేల? నరేంద్రసత్తమ! చెప్పెదన్ విను మంతయున్. 325

వ. ధృతరాష్ట్రుఁడు గాంధారీ విదుర సహితుండై హిమవత్పర్వత దక్షిణభాగంబున నొక్క మునివనంబునకుం జని, తొల్లి సప్తఋషులకు సంతోషంబు సేయు కొఱకు, నాకాశగంగ యేడు ప్రవాహంబులై పాఱిన పుణ్యతీర్థంబున గృత స్నానుండై యథావిధి హోమ మొనరించి, జలభక్షణంబు గావించి, సకల కర్మంబులు విసర్జించి, విఘ్నంబులఁ జెందక, నిరాహారుండై, యుపశాంతాత్ముఁ డగుచు, పుత్రార్థదారైషణంబులు వర్జించి, విన్యస్తాసనుండై, ప్రాణంబులు నియమించి, మనస్సహితంబులైన చక్షురాదీంద్రియంబుల నాఱింటిని విషయం బులం బ్రవర్తింపనీక నివర్తించి, హరిభావనారూపం బగు ధారణా యోగంబుచే రజస్సత్త్వతమో రూపంబులగు మలంబుల మూఁటిని హరించి, మనంబు నహంకా రాస్పదంబైన స్థూలదేహంబువలనం బాపి, బుద్ధియందు నేకీకరణంబుచేసి, యట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన వియోగించి, క్షేత్రజ్ఞుని యందుఁ బొందించి, ద్రష్టృంశంబు వలన క్షేత్రజ్ఞునిం బాపి, మహాకాశంబుతోడ ఘటాకాశముం గలుపు కైవడి నాధారభూతంబైన బ్రహ్మమందుఁ గలిపి, లోపలి గుణక్షోభం బును, వెలుపలి యింద్రియవిక్షేపంబును లేక నిర్మూలిత మాయాగుణ వాసనుం డగుచు, నిరుద్ధంబులగు మనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి, యఖిలాహారంబు లను వర్జించి, కొఱడు చందంబున, 326

మ. ఉటజాంతస్థల వేదికన్ నియతుఁడై యున్నాఁడు నేఁ డాదిగా
నిటపై నేనవనాఁడు మేన్ విడువఁగా [2]నిజ్యాగ్ని యోగాగ్నిత
త్పటు దేహంబు దహింపఁ జూచి, నియమ ప్రఖ్యాత గాంధారి యి
ట్టటు వో నొల్లక, ప్రాణవల్లభునితో నగ్నిం బడుం భూవరా! 327

1. నెప్పుడధిప (క) 2. నేతెంచి దావాగ్ని (త. జ. డ.)

క. అంతట వారల మరణము, వింతయగుచుఁ జూడఁబడిన విదురుఁడు చింతా
సంతాప మొదవఁ బ్రీత, [1]స్వాంతుండై తీర్థములకుఁ జనియెడు నధిపా! 328

వ. అని విదురాదుల వృత్తాంతం బంతయు ధర్మనందనున కెఱింగించి తుంబురు సహితుండై నారదుండు [2]స్వర్గంబునకు నిర్గమించిన వెనుక, ధర్మజుండు భీమునిం జూచి యిట్లనియె. 329

అధ్యాయము—౧౪

—: ధర్మరాజు దుర్నిమిత్తంబులం గని చింతించుట :—

సీ. ఒక కాలమునఁ బండు నోషధీచయము వే ఱొకకాలమునఁ [3]బండకుండు నండ్రు
క్రోధంబు లోభంబుఁ గ్రూరత బొంకును దీపింప నరులు వర్తింతు రండ్రు
వ్యవహారములు మహావ్యాజయుక్తము లండ్రు సఖ్యంబు వంచనా సహితమండ్రు
మగలతో నిల్లాండ్రు మచ్చరించెద రండ్రు సుతులు దండ్రులఁ[4]దెగఁజూతురండ్రు

సీ. గురుల శిష్యులు దూషించి కూడ రండ్రు, శాస్త్రమార్గము లెవ్వియు జరుగ వండ్రు
న్యాయపద్ధతి బుధులైన నడవ రండ్రు, కాలగతి [5]వింతయై వచ్చెఁ గంటె నేఁడు.

మ. హరిఁ జూడన్ నరుఁ డేఁగినాఁడు నెల లేడయ్యెంగదా! రాఁడు కా
లరు లెవ్వారును, యాదవుల్ సమద లోలస్వాంతు [6]లీ వేళ సు
స్థిరులై యుండుదురా? మురారి సుఖియై సేమంబుతో నుండునా?
[7]యెరవై యున్నది చిత్త మీశ్వరకృతం బెట్లోకదే? మారుతీ! 331

క. మానసము గలఁగుచున్నది మానవు బహు దుర్నిమిత్త మర్యాదలు, స
న్మానవ దేహక్రీడలు, మాన విచారింప[8]నోపు మాధవుఁ [9]డనుజా! 332

క. మనవులు చెప్పక ముందఱ, మన దార ప్రాణ రాజ్య మాన శ్రీలన్
మనుపుదు నని [10]యా దేవుఁడు,మనమునఁదలపోసి మనిచె మనలం గరుణన్.333

క. నారదుఁ డాడిన కైవడిఁ గ్రూరపుఁ గాలంబు వచ్చెఁ గుంభిని మీఁదన్
ఘోరములగు నుత్పాతము. లారభటిం జూడఁబడియె ననిలజ! [11]కంటే. 334

1. దళితస్వాంతుండై (ద); హర్షశోకయుత స్తస్మాద్గంతా తీర్థనిషేవకః (13-62) 2. వియద్గమనంబున స్వర్గంబునకు (ట) 2. నెండియుండునండ్రు (చ. ద.) 4. దిగ (క. ద.) 5. యింతయై (క. ట.) 6. లీవేళ (త) 7. యెరయైయున్నది (హ); యిరవై యుండదు (చ. ట. త. జ. ద.) 8. ఁబోలు (చ. ద.) 9. ఁడకటా (హ. తం. వా.) 10. మాధవుఁడిట (తం. వా.) 11. వింటే (క. చ. జ. డ. ద. బ.)

సీ. [1]ఓతక నాముందు నొక సారమేయంబు మొఱుఁగుచు నున్నది మోర యెత్తి
యాదిత్యుఁ డుదయింప నభిముఖియై నక్క వాపోయె మంటలు [2]వాతఁ గలుగ
[3]మిక్కిలు చున్నవి [4]మెఱసి గవాదులు గర్దభాదులు దీర్చి క్రందుకొనియె
నుత్తమాశ్వములకు నుదయించెఁ గన్నీరు మత్తగజంబుల మదము లుడిగెఁ

ఆ. గాలుదూతభంగి గవిసెఁ గపోతము [5]మంద దగ్ని హోమ మందిరములఁ
జుట్టుఁ బొగలు దిశల నొరిది నాచ్ఛాదించెఁ, దరణి మాసెఁ[6]జూడు ధరణి గదలె.

క. వాతములు [7]విసరె రేణు, వ్రాతము లాకసముఁ గప్పె వడి [8]సుడిగొని ని
ర్ఘాతములు వడియె ఘనసం. ఘాతంబులు రక్తవర్ష కలితము లయ్యెన్. 336

క. గ్రహములు పోరాడెడి నా, గ్రహములు వినఁబడియె భూతకలకలముల, దు
స్సహములగుచు శిఖికీలా, వహములక్రియఁ దోఁచె గగన వసుధాంతరముల్.

క. దూడలు గుడువవు చన్నులు, దూడలకును గోవు లీవు దుగ్ధము, [9]లొడలం
బీడలు మానవు, [10]పశువులఁ, గూడవు వృషభములు దఱిపికుఱ్ఱల నెక్కన్. 338

క. కదలెడు వేల్పుల రూపులు, వదలెడుఁ గన్నీరు వానివలనం జెమటల్
బొదలెడిఁ బ్రతిమలు వెలిఁ జని, మెదలెడి నొక్కొక్క గుడిని మేదిని యందున్. 339

క. కాకంబులు వాపోయెడి, ఘూకంబులు నగరఁ బగలు గుంద్రలు గొలిపెన్
లోకంబులు విభ్రష్ట. శ్రీకంబుల గతి నశించి శిథిలము లయ్యెన్. 340

మ. యవ పద్మాంకుశ చాప చక్ర ఝష రేఖాలంకృతం బైన మా
ధవు పాదద్వయ [11]మింక ముట్టెడు పవిత్రత్వంబు నేఁ డాదిగా
నవనీకాంతకు లేదువో! [12]పలుమఱు న్నందంద వామాక్షి బా
హువు లాకంపము నొందుచుండు, నిల కే యుగ్రస్థితు ల్వచ్చునో! 341

వ. మఱియు మహోత్పాతంబులు పెక్కులు పుట్టుచున్నయవి. మురాంతకుని వృత్తాంతంబు వినరాదు. అని కుంతీసుతాగ్రజుండు భీమునితో విచారించు సమయంబున,

---

1. ఓడదు (హ); ఓడక ముందట (క.ట.ద.ల.) 2. వాంతిఁజేసి (క.చ.జ.ద.ప.) 3. మిక్కిలి యున్నది (హ) 4. గృధ్రాదులు (హ.తం.వా.); శస్త్రాః కుర్వంతి మాం సవ్యం పక్షిణం పశవోఽపరే (14-14); గవాదయో మాం సవ్యం వామం కుర్వంతి (వ్యాఖ్య) 5. మందవగ్నులెల్ల (క. ట. జ. బ.) 6. జూడ (క. ట. జ. బ.) 7. విసరి (హ.తం.వా.) 8. సురగొని (క) 9. బడవిన్ (క. చ. ట. డ.) 10. పసులకు (క. బ.) 11. మెట్టెడు (హ. తం. వా.) 12. మఱి మదీయాంగంబు (హ. తం. వా.)

—: అర్జునుండు ద్వారకనుండి వచ్చి కృష్ణ నిర్యాణమును దెలియఁ జెప్పుట :—

క. ఖేదమున నింద్రసూనుఁడు, యాదవపురినుండి వచ్చి, యగ్రజుఁ గని, త
త్పాదముల నయన సలిలో, త్పాదకుఁడై పడియె దీనుభంగి నరేంద్రా! 343

క. పల్లటిలిన యుల్లముతోఁ దల్లడపడుచున్న పిన్న తమ్మునిఁ గని వె
ల్వెల్లనగు మొగముతో జను, లెల్లను విన ధర్మపుత్త్రుఁ డిట్లని పలికెన్. 344

సీ. మాతామహుండైన మన శూరుఁ డున్నాఁడె? మంగళమే మన మాతులునకు?
మోదమే నలుగురు ముగురు మేనత్తల? కానందమే వారి యాత్మజులకు?
నక్రూర కృతవర్మ లాయుస్సమేతులే? [1]జీవితుఁడే యుగ్రసేన విభుఁడు
గల్యాణ యుక్తులే గద సారణాదులు మాధవు తమ్ములు మానధనులు?

తే. నందమే? మన సాత్యకి నందనునకు, భద్రమే? శంబరాసుర భంజనునకుఁ
గుశలమే? బాణదనుజేంద్రు కూఁతుపతికి, హర్షమే? పార్థ! ముసలికి హలికి బలికి.

వ. మఱియును నంధక మధు యదు భోజ దాశార్హ వృష్ణి సాత్వతు లనియెడి వంశంబుల వీరులును, హరి కుమారులైన సాంబ సుషేణ ప్రముఖులును, నారాయణానుచరులైన యుద్ధవాదులును, కృష్ణసహచరులైన సునంద[2]నందాదులును సుఖానందులే? యని యందఱ నడిగి, ధర్మజుండు గ్రమ్మఱ నిట్లనియె. 346

సీ. వైకుంఠవాసుల వడువున నెవ్వని బలమున నానంద భరితులగుచు
వెఱవక యాదవవీరులు వర్తింతు, రమరులు గొలువుండు నట్టి కొలువు
చవికె నాకర్షించి చరణసేవకులైన బంధు మిత్త్రాదుల [3]పదయుగమున
నెవ్వఁడు ద్రొక్కించె, నింద్రపీఠము మీఁద, వజ్రంబు ఝళిపించి వ్రాలువాని

తే. ప్రాణవల్లభ [4]కెంగేలఁ బాదుచేసి. యమృతజలములఁ బోషింప నలరు పారి
జాత మెవ్వఁడు కొనివచ్చి సత్యభామ, కిచ్చె, నట్టి మహాత్మున కిపుడు శుభమె?

శా. అన్నా! ఫల్గున! భక్తవత్సలుఁడు బ్రహ్మణ్యుండు గోవిందుఁ డా
పన్నానీక శరణ్యుఁ డీశుఁడు జగద్భద్రానుసంధాయి శ్రీ
మన్నవ్యాంబుజ పత్త్రనేత్రుఁడు సుధర్మామధ్య పీఠంబునం
దున్నాఁడా! బలభద్రుఁ గూడి, సుఖియై, యుత్సాహియై, ద్వారకన్. 348

క. ఆ రామ కేశవులకును, సారామలభక్తి సేవ సలుపుదువు గదా?
గారాములు సేయుదురా? పోరాముల బంధు లెల్లఁబ్రొద్దు జితారీ! 349

1. జీవించునె (క.ఐ.); 2. నందాదులు నని (హ); 3. పాదయుగము (హ.వా.); పదయుగముల (తం); 4. కెంగేలు పాదుచేసి (చ. ట. త. జ.)

శా. మున్నుగ్రాటవిలో వరాహమునకై ముక్కంటితోఁ బోరుచో
సన్నాహంబునఁ గాలకేయుల పడిం జక్కాడుచోఁ బ్రాభవ
స్కన్నుండై చనుకౌరవేంద్రు పనికై గంధర్వులం ద్రోలుచోఁ
గన్నీ రెన్నఁడుఁ దేవు తండ్రి! చెపుమా! కల్యాణమే? చక్రికిన్. 350

వ. అదియునుం గాక, 351

క. ఓడితివో శత్రువులకు, నాడితివో సాధు దూష ణాలాపంబుల్
గూడితివో పరసతులను, వీడితివో మానధనము వీరుల నడుమన్. 352

క. తప్పితివో? యిచ్చెద నని, చెప్పితివో? కపటసాక్షి; చేసిన మేలుం
[1]దెప్పితివో? శరణార్థుల, రొప్పితివో? ద్విజులఁ బసుల రోగుల సతులన్. 353

క. అడిచితివో? భూసురులను, గుడిచితివో? బాల వృద్ధ గురువులు వెలిగా
విడిచితివో? యాశ్రితులను, ముడిచితివో? పరుల విత్తములు లోభమునన్. 354

అధ్యాయము — ౧౫

వ. అని పలికినం గన్నీరు కరతలమునం దుడిచికొనుచు, గద్గదస్వరంబున మహా నిధిఁ గోలుపోయిన పేదచందంబున నిట్టూర్పుల నిగుడింపుచు, నర్జునుం డన్న కిట్లనియె. 355

క. మన సారథి, మన సచివుఁడు, మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుఁడున్
మన విభుఁడు, గురువు, దేవర మనలను దిగనాడి చనియె. మనుజాధీశా! 356

క. కంటకపు నృపులు సూడఁగ, మింటం గంపించు యంత్రమీనముఁ గోలన్
గెంటించి మనము వాలుం, గంటిం జేకొంటి మతని కరుణన కాదే? 357

క. దండి ననేకులతో నా, ఖండలుఁ డెదురైన గెలిచి ఖాండవ వనముం
జండార్చికి నర్పించిన, గాండీవము నిచ్చెఁ జక్రి గలుగుటఁ [2]గాదే? 358

క. దిక్కుల రాజుల నెల్లను, మక్కించి ధనంబు గొనుట, మయకృతసభ ము
న్నెక్కుట, జన్నము సేయుట, నిక్కము హరి మనకు దండ నిలిచినఁగాదే? 359

మ. ఇభజిద్వీర్య! [3]మఖాభిషిక్తమగు నీ యిల్లాలి ధమ్మిల్లమున్
సభలో శాత్రవు [4]లీడ్చినన్ ముడువ కా చంద్రాస్య దుఃఖింపఁగా
నభయం బిచ్చి ప్రతిజ్ఞచేసి భవదీయారాతికాంతా శిరో
జ భరశ్రీలు హరింపఁడే? విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్. 360

1. దప్పితివో (హ. తం. వా.) 2. నధిపా (హ. తం. వా.) 3. మహాభిషిక్త (హ. క. జ. బ.)
4. ఈడ్చి తెచ్చినపుడా (హ) ఈడ్వ విచ్చినపుడా (వా)

శా. వైరుల్ గట్టిన పుట్టముల్ విడువఁగా వారింప నా వల్లభుల్
రారీవేళ, నుపేక్షసేయఁ దగవే? రావే? నివారింపవే?
లేరే? త్రాతలు కృష్ణ! యంచు సభలో లీనాంగియై కుయ్యిడన్
గారుణ్యంబున భూరి వస్త్రకలితంగాఁ జేయఁడే? ద్రౌపదిన్. 361

సీ. దుర్వాసుఁ డొకనాఁడు దుర్యోధనుఁడు పంప పదివేల శిష్యులు భక్తిఁ గొలువఁ
జనుదెంచి మనము పాంచాలియుఁ గుడిచిన వెనుక నాహారంబు వేఁడుకొనినఁ
బెట్టెద ననవుడుఁ బెట్టకున్న శపింతు ననుచుఁ దోయావగాహమున కేగఁ
గడవల నన్నశాకములు దీఱుట చూచి పాంచాల పుత్రిక పర్ణశాల

తే. లోన [1]వెఱచిన, విచ్చేసి లోవిలోని, శిష్ట శాకాన్న లవము ప్రాశించి, తపసి
కోప ముడిగించి, పరిపూర్ణ కుక్షిఁజేసె, నిట్టి త్రైలోక్య సంతృప్తియొందుఁగలఁడు?

సీ. పందికై పోరాడ ఫాలాక్షుఁ డెవ్వని బలమున నా కిచ్చెఁ బాశుపతము!
నెవ్వని లావున నీ మేన దేవేంద్రు పీఠార్ధమున నుండు పెంపుఁ గంటిఁ!
గాలకేయ నివాత కవచాది దైత్యులఁ జంపితి నెవ్వని సంస్మరించి!
గోగ్రహణమునాఁడు కురుకులాంభోనిధిఁ గడచితి! నెవ్వని కరుణఁ జేసి

ఆ. కర్ణ సింధురాజ కౌరవేంద్రాదుల, తలల పాగలెల్లఁ [2]దడవి తెచ్చి
యే మహాత్ము బలిమి నిచ్చితి! విరటుని, పుత్రి యడుగ బొమ్మపొత్తికలకు. 363

మ. గురు భీష్మాదులు గూడి పన్నిన కురుక్షోణీశ చక్రంబులో
గురుశక్తిన్ రథయంతయై, వొగలపైఁ గూర్చుండి, యా మేటి నా
శరముల్ వాఱకమున్న వారల [3]బలోత్సాహాయు రుద్యోగ త
త్పరతల్ చూడ్కుల సంహరించె నమితోత్సాహంబు నాకిచ్చుచున్. 364

మ. అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గాని కైవడిఁ గృపాశ్వత్థామ గాంగేయ సూ
ర్యసుత ద్రోణ ధనుర్విముక్త బహు దివ్యాస్త్ర ప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగు మాధవు దయా దృష్టిన్ నరేంద్రోత్తమా! 365

చ. వసుమతి, దివ్యబాణముల వ్రక్కలువాపి, కొలంకుసేసి, నా
రసముల మాటుగాఁ బఱపి, రథ్యములన్ రిపులెల్లఁ జూడ, సా
హసమున *నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపునాఁడు నా
కసురవిరోధి భద్రగతి [4]సందయి వచ్చినఁగాదె? భూవరా! 366

1. దలఁచిన (వా. లం. వా.) 2. దరిగితెచ్చి (ట) 3. బలోత్సాహాతిరేకంబు సత్వరతన్ (హ); *నీరు పెట్టితి (?) 4. సద్దము (క. చ. ట. త. జ.)

సీ. చెలికాఁడ! రమ్మని చీరు నన్నొకవేళ మన్నించు నొకవేళ మఱఁది! యనుచు
బంధుభావంబునఁ బాటించు నొకవేళ దాతయై యొకవేళ దనము లిచ్చు
మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు బోద్ధయై యొకవేళ బుద్ధిసెప్పు
సారథ్య మొనరించుఁ జనవిచ్చు నొకవేళఁ గ్రీడించు నొకవేళ గేలిసేయు

తే. నొక్క శయ్యాసనంబున నుండుఁ, గన్న, తండ్రికైవడిఁ జేసినతప్పుఁ గాఁచు,
హస్తములువట్టి పొత్తున నారగించు, మనుజవల్లభ ? మాధవు మఱవరాదు. 367

క. విజయ! దనంజయ! హనుమద్ధ్వజ! ఫల్గున! పాండురాజతనయ! నర! మహేం
ద్రజ! మిత్రార్జున! యంచును, [1]భుజములు తలకడవ రాకపోకలఁ జీరున్. 368

క. వారిజగంధులు దమలో, వారింపఁగరాని ప్రేమ వాదము సేయన్
వారిజనేత్రుఁడు ననుఁ దగ, వారిండ్లకుఁ బనుపు నలుక వారింప నృపా! 369

క. నిచ్చలు లోపలి కాంతలు, మచ్చికఁ దనతోడ నాడు మాటలు నాకున్
ముచ్చటలు సెప్పు మెల్లన, విచ్చలవిడిఁ దొడలమీఁద విచ్చేసి నృపా! 370

చ. అటమటమయ్యె నా భజన మంతయు భూవర! నేఁడు చూడుమా
యిటువలె గారవించు జగదీశుఁడు గృష్ణుఁడు లేని పిమ్మటన్
బటుతర దేహలోభమునఁ బ్రాణము లున్నవి వెంటఁ బోక, నేఁ
గటకట! పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో! 371

శా. కాంతారంబున నొంటిఁ దోడుకొని రాఁగాఁ జూచి, గోవింద శు
ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మద రాగాయత్తులై తాఁకి, నా
చెంతన్ బోయలు మూఁగిపట్టికొన, సీమంతినీసంఘమున్
భ్రాంతిన్ భామిని భంగి నుంటి విడిపింపన్ లేక, ధాత్రీశ్వరా! 372

శా. ఆ తేరా రథికుండు నా హయము లా యస్త్రాసనం బా శర
వ్రాతం బన్యులఁ దొల్లిఁ [2]జంపును, దుదిన్ వ్యర్థంబులై [3]పోయె మ
చ్చేతోధీశుఁడు చక్రి లేమి, భసితక్షిప్తాజ్య మాయావి మా
యాతంత్రోషరభూమి బీజముల మర్యాద న్నిమేంబునన్. 373

మ. యదువీరుల్ మునినాథు శాపమునఁ గాలాధీనులై, యందఱున్
మదిరాపాన వివర్ధమాన మద సమ్మర్దోగ్ర రోషాంధులై,
కదనంబుల్ దమలోన ముష్టిహతులం గావించి [4]నీల్గైరి, న
ష్టదశం జిక్కిరి నల్గు రేవు రచటన్ సర్వంసహావల్లభా! 374

1. భుజములఁ దలకడవ (హ. తం. వా.) 2. జంపుదుఁ దుదిన్ (హ) 3. పోయెదాఁ జేతోధీశుఁడు (హ) 4. లేరైరి (హ.య.)

క. భూతములవలన నెప్పుడు, భూతములకు జన్మ మరణ పోషణములు ని
ర్ణీతములు సేయుచుండును, భూతమయుం డీశ్వరుండు [1]భూపవరేణ్యా! 375

క. బలములుగల మీనంబులు, బలవిరహిత మీనములను భక్షించుక్రియన్
బలవంతులైన యదువులు, బలరహితులఁ జంపి రహితభావముల నృపా! 376

మ. బలహీనాంగులకున్ బలాధికులకుం బ్రస్పర్ధి భావోద్యమం
బులు గల్పించి, వినాశము న్నెఱపి, యీ భూభారముం బాపి, ని
శ్చలబుద్ధిన్ గృతకార్యుఁడై చనియె నా సర్వేశ్వరుం డచ్యుతుం
డలఘుం డేమని చెప్పుదున్! భగవదీ యాయత్త ముర్వీశ్వరా! 377

వ. మఱియు దేశ కాలార్థ యుక్తంబులు, నంతఃకరణ సంతాపశమనంబులు నైన హరివచనంబులం దలంచి, చిత్తంబు పరాయత్తంబై యున్నది. అని యన్నకుం జెప్పి నిరుత్తరుండై, గోవింద చరణారవింద చింతామలబుద్ధియై, శోకంబు వర్జించి, సదా ధ్యాన భక్తివిశేషంబులం గామక్రోధాదుల జయించి, తొల్లి తన కుభయసేనామధ్యంబున ననంతుం డానతిచ్చిన గీతలు దలంచి, కాలకర్మ భోగాభినివేశంబులచేత నావృత్తంబైన విజ్ఞానంబు గ్రమ్మఱ నధిగమించి, శోక హేతు వహంకార మమకారాత్మకంబైన ద్వైతభ్రమం బనియును, ద్వైత భ్రమంబులకుఁ గారణంబు దేహంబనియును, దేహంబునకు బీజంబు లింగం బనియును, లింగంబునకు మూలంబు గుణంబు లనియును, గుణములకు నిదానము ప్రకృతియనియును, బ్రహ్మాహ మనియెడు జ్ఞానంబున లీనయై ప్రకృతి లేకుండు ననియు (ప్రకృతి యడంగుటయ నైర్గ్యుణం బనియును, నైర్గుణ్యంబువలనఁ గార్యలింగ నాశంబనియును, గార్యలింగ నాశంబున నసంభవం బగుననియును) ప్రకృతిం బాసి క్రమ్మఱ స్థూలశరీర ప్రాప్తుండు గాక పురుషుండు సమ్యగ్భో గంబున నుండుననియును, నిశ్చయించి, యర్జునుండు విరక్తుండై యూరకుండె. ధర్మజుండు [2]భగవదీయ మార్గంబు దెలిసి, యాదవుల నాశంబు విని, నారదు వచనంబు దలంచి, నిశ్చలచిత్తుండై స్వర్గగమనంబునకు యత్నంబు సేయుచుండె. ఆ సమయంబున, 378

క. యదువుల నాశము మాధవు, పదవియు విని కుంతి విమలభక్తిన్ భగవ
త్పదచింతా తత్పరయై, ముదమున సంసార మార్గమునకుం బాసెన్. 379

వ. ఇట్లు కంటకంబునం గంటకోన్మూలనంబు సేసి కంటకంబులు రెంటినిం బరిహరించు విన్నాణి తెఱంగున, యాదవరూప శరీరంబునం జేసి యీశ్వరుండు లోకకంటక

1. భూతశరణ్యా (హ. తం. వా.) 2. భవదీయ (హ)

శరీరంబులు సంహరించి నిజశరీరంబు విడిచె. సంహారమునకు నిజశరీర పర శరీరములు రెండు నీశ్వరునకు సమంబులు. నిజరూపంబున నుండుచు, రూపాంతరంబుల ధరించి క్రమ్మఱ నంతర్ధానంబు నొందు నటునికైవడి లీలాపరాయణుం డైన నారాయణుండు మీనకూర్మాది రూపంబులు ధరియించుం బరిహరించు నని చెప్పి మఱియు నిట్లనియె. 380

క. ఏ దినమున వైకుంఠుఁడు, మేదినిపైఁ దాల్చినట్టి మేను విడిచినాఁ
డా దినమున నశుభ ప్రతి, పాదకమగు కలియుగంబు ప్రాప్తంబయ్యెన్. 381

—:ధర్మరాజు పరీక్షిన్మహారాజునకు పట్టముగట్టి మహాప్రస్థానంబున కరుగుట:—

సీ. కలివర్తనంబునఁ గ్రౌర్య హింసాసత్య దంభ కౌటిల్యాద్యధర్మచయము
పురముల గృహముల భూములఁ దనలోనఁ గలుగుట దలపోసి కరిపురమున
మనుమని రాజుపై మనుమని దీవించి సింధుతోయ కణాభిషిక్తుఁ జేసి
యనిరుద్ధ నందనుండైన వజ్రునిఁ దెచ్చి మథురఁ బట్టముగట్టి మమతఁ బాసి

ఆ. కరులఁ [1]దురగములను గంకణాదికముల, మంత్రిజనుల బుధుల మానవతుల
నఖిలమైన ధనము నభిమన్యుసుతునకు, నప్పగించి బుద్ధి నాశ్రయించి. 382

వ. విరక్తుండైన ధర్మనందనుండు ప్రాజాపత్య మనియెడి యిష్టి గావించి, యగ్నుల నాత్మారోపణంబు సేసి, నిరహంకారుండును నిర్దళితాశేష బంధనుండు నై, సకలేంద్రియంబుల మానసంబున నణంచి, ప్రాణాధీన వృత్తియగు మానసంబును బ్రాణమందుఁ, బ్రాణము నపానమునందు, నుత్సర్గ సహితంబైన యపానము మృత్యువందును, మృత్యువును బంచభూతములకు నైక్యంబైన దేహంబునందును, దేహము గుణత్రయము నందును, గుణత్రయంబు నవిద్య యందును, సర్వారోపహేతువగు నవిద్యను జీవుని యందును, జీవుండైన తన్ను నవ్యయంబైన బ్రహ్మమందును లయింపం జేసి, బహి రంతరంగ వ్యాపారంబులు విడిచి, నారచీరలు ధరియించి, మౌనియు నిరాహారుండును ముక్తకేశుండును నై యున్మత్తపిశాచ బధిర జడుల చందంబున నిరపేక్షకత్వంబున. 383

క. చిత్తంబున బ్రహ్మము నా, వృత్తము గావించుకొనుచు విజ్ఞాన ధనా
యత్తులు దొల్లి వెలింగెడి, యుత్తర దిశ కేగె నిర్మలోద్యోగమునన్. 384

1. హరుల భటుల (లఁ. వా.)

సీ. అంత నాతని తమ్ము లనిల షుత్రాదులు గలిరాకచేఁ బాపకర్మ లగుచుఁ
జరియించు ప్రజల సంచారంబు లీక్షించి యఖిల ధర్మంబుల నాచరించి
వైకుంఠ చరణాబ్జ వర్తిత హృదయులై తద్భక్తి నిర్మలత్వమును జెంది
విషయ యుక్తులకుఁ బ్రవేశింపఁగా రాక నిర్ధూత కల్మష నిపుణ [1]మతులు

తే. బహుళ విజ్ఞానదావాగ్ని భసిత కర్మ. లైన యేకాంతులకు [2]లక్ష్యమై వెలుంగు
ముఖ్య నారాయణ స్థానమునకుఁ జనిరి, విగతరజ మైన యాత్మల విప్రవర్య!

వ. అంత విదురుండు ప్రభాసతీర్థంబున హరియందుఁ జిత్తంబు సేర్చి, శరీరంబు విడిచి, పితృవర్గంబుతోడ దండధరుం డగుటంజేసి నిజాధికార స్థానంబునకుం జనియె. ద్రుపదరాజ పుత్రియు పతులవలన ననపేక్షితయై వాసుదేవునందుఁ జిత్తంబు సేర్చి తత్పదంబు సేరె. ఇట్లు, 386

క. పాండవ కృష్ణుల యానము, పాండురమతి నెవ్వఁడైన బలికిన విన్నన్
ఖండిత భవుఁడై హరిదా, సుండై కైవల్యపదము సొచ్చు నరేంద్రా! 387

## అధ్యాయము—౧౬

వ. అంత నటం బరీక్షిత్కుమారుండు జాతకర్మవిదులైన భూసురోత్తమ శిక్షావశంబున మహాభాగవతుండై, ధరణీపాలనంబు సేయుచు, నుత్తరుని పుత్రిక నిరావతి యను మత్తకాశినిం బెండ్లియాడి, జనమేజయ ప్రముఖులైన నలువురు కొడుకుల నుత్పాదించి, గంగాతటంబునఁ గృపాచార్యుండు గురువై యుండ, యాగభాగంబులకు వచ్చిన దేవతల నీక్షించుచు, భూరి దక్షిణంబులుగా మూఁడశ్వమేధంబు లాచరించి, దిగ్విజయకాలంబున గోమిథునంబుఁ దన్నుచున్న శూద్రుండును, రాజచిహ్న ముద్రితుండు నగు కలిం బట్టి నిగ్రహించె. అని చెప్పిన శౌనకుండు పౌరాణికున కిట్లనియె. 388

—: పరీక్షిన్మహారాజు భూ ధర్మ దేవతల సంవాదం బాలించుట :—

క. భూవరరూపుఁడు శూద్రుఁడు, గోవుం దా నేల తన్నెఁ? గోరి పరీక్షి
ద్భూవరుఁడు దిశల గెలుచుచు, నేవిధిఁ గలి నిగ్రహించె? నెఱిఁగింపఁగదే.389

మ. అరవిందాక్ష పదారవింద మకరందాసక్తులై యున్న స
త్పురుషశ్రేష్ఠుల వృత్తముల్ వినక దుర్బుద్ధిన్ [3]విలంఘించి దు
ర్భర వార్తాకథన ప్రపంచములు గర్ణప్రాప్తముల్ సేసి వా
సరముల్ వ్యర్థతఁ [4]ద్రొబ్బుచుండఁ జన దీ సంసార మోహంబునన్. 390

1. మగుడు (హ) 2. లబ్ధ్యమై (ట) 3. విడంబించి (చ. ట.) 4. ద్రోచు (తం. వా.)

సీ. మనువు నిత్యముగాదు మరణంబు నిజమని యెఱిఁగి మోక్షస్థితి నిశ్చయించు
[1]నల్పాయువులము మా కన్య దుర్జన చరిత్రము లోలిఁ గర్ణ రంధ్రములఁ బెట్టి
బంగారు వంటి యీ బ్రతికెడు కాలంబు వోనాడఁగా నేల? పుణ్యచరిత!
మాధవ పదపద్మ మకరందపానంబు సేయింపవే! యేము సేయునట్టి

ఆ. సత్త్రియాగమునకు సన్మునీంద్రులు సీర, వాఁడె దండధరుఁడు వచ్చెఁ జూడు
చంపఁ దొకనినైన జన్న మయ్యేడు దాఁక, వినుచునుండుఁ దగిలి విష్ణుకథలు.

క. మందునకు మందబుద్ధికి, మందాయువునకు నిరర్థ [2]మార్గునకును గో
విందచరణారవిందమ, రందముఁ గొనఁ దెఱపిలేదు [3]రాత్రిం బవలుᳺ. 392

వ. అని శౌనకుండు పలికిన సూతుం డిట్లనియె. పరీక్షిన్నరేంద్రుండు నిజవాహినీ సందోహ సంరక్షితంబగు(కురుజాంగల)దేశంబునం (గలి ప్రవేశంబు నాకర్ణించి యుద్ధకుతూహలత) నంగీకరించి, యొక్కనాఁడు సముల్లాసంబున బాణాసనంబు గైకొని నీల నీరదనిభ తురంగ నివహ యోజితంబును, ఫలిత మనోరథంబు నైన రథంబు నారోహణంబుచేసి, మృగేంద్ర ధ్వజంబు వెలుంగ, రథ కరి తురంగ సుభట సంఘటిత చక్రంబు నిర్వక్రంబునం గొలువ, దిగ్విజయార్థంబు వెడలి పూర్వ దక్షిణ పశ్చిమోత్తర సముద్ర లగ్నంబులైన యిలావృత, రమ్యక, హిరణ్మయ, హరివర్ష, కింపురుష, భద్రాశ్వ. కేతుమాల, భారత వర్షంబులు, నుత్తరకురుదేశంబులును జయించి (పుష్కల ధనప్రదాన పూర్వికలగు సపర్యల నభ్యర్చితుండై)తత్తద్దేశ మంగళపాఠక సంఘాత జేగీయమాన పూర్వరాజ వృత్తాంతంబు లాకర్ణింపుచు, పాఠకపఠిత పద్యంబులందుఁ బాండవులకు భక్తవత్సలుండైన పుండరీకాక్షుం డాచరించిన సారథ్య సఖ్య సభాపతిత్వ సాచివ్య రచన వీరాసన దూతభావాది కర్మంబులు, నశ్వత్థామాస్త్రతేజంబు వలనఁ దను రక్షించుటయు, యాదవ పాండవుల స్నేహానుబంధంబును, వారలకుం గలిగిన భగవద్భక్తివిశేషంబును విని, యాశ్చర్యంబు నొందుచు, (వంది బృందంబులకు మహాధనంబులు, హారాంబరాభరణ సందోహంబులు నొసంగుచుఁ) బద్మనాభ పాదపద్మభజన పరతంత్ర పవిత్ర మానసుండై యుండె. అయ్యెడ వృషభ రూపంబున నేకపాదంబున సంచరించు ధర్మదేవుండు, దన సమీపంబున లేఁగ లేని లేఁగటి [4]కుఱ్ఱి చందంబున, హతప్రభయై నేత్రంబుల సలిలంబులు గురియుచు, గోరూపయై యున్న ధాత్రి కిట్లనియె. 393

1. నల్పాయులగు మాకు నట్టి (హ) 2.మార్గముల (హ.తం.వా.) 3.రాత్రిందివముల్ (తం.వా.)
4. కుఱ్ఱ (హ. క. బ.)

మ. నయనాంభః కణజాల మేల విడువన్? నా తల్లి! నీ మేను సా
మయమై యున్నది మోము వాడినది నీ మన్నించు చుట్టాలకున్
భయదుఃఖంబులు నేఁడు వొందవుగదా? బంధించి శూద్రుల్ పద
త్రయహీనన్ ననుఁ బట్టవత్తు రనియో? తాపంబు నీ కేటికిన్. 394

సీ. మఖములులేమి నమర్త్యుల కిటమీఁద మఖభాగములు లేక మాను ననియొ?
రమణులు రమణుల రక్షింప రనియొ? తత్పుత్రులఁ దండ్రులు ప్రోవరనియొ?
భారతి కుజనులఁ బ్రాపించు ననియొ? [1]సద్విప్రుల నృపులు సేవింప రనియొ?
కులిశహస్తుఁడు వాన గురియింపకుండఁగ బ్రజలు దుఃఖంబునఁబడుదు రనియొ?

ఆ. హీనవంశజాతు లేలెద రనియొ? రా, జ్యములు పాడిగలిగి జరగ వనియొ?
మనుజు లన్నపాన మైథున శయనాస, నాది కర్మసక్తు లగుదు రనియొ? 395

మ. జననీ! నీ భరమెల్ల డింపుటకునై చక్రాయుధుం డిన్ని హా
యనముల్ గేళి నరాకృతిన్ మెలఁగి నిత్యానందముం జేసి పో
యిన నే నింక ననాథనైతిఁ గుజనుం డెవ్వాఁడు శాసించునో?
పెనుదుఃఖంబులు నేమి [2]పొందు ననియో? భీతిల్లి చింతించుటల్. 396

క. దెప్పరమగు కాలముచే, నెప్పుడు [3]దేవతలకెల్ల నష్టంబగు నీ
యొప్పిదముఁ గృష్ణుఁ డరిగినఁ, దప్పెఁగదా! తల్లి! నీవు తల్లడపడఁగన్. 397

వ. అనిన భూదేవి యిట్లనియె. 398

క. ఈ లోకంబునఁ బూర్వము, నాలుగుపాదముల నీవు నడతువు నేఁ డా
శ్రీలలనేశుఁడు లేమిని, గాలముచే నీకు నొంటికా లయ్యెఁగదే! 399

వ. మఱియు సత్య శౌచ దయా క్షాంతి త్యాగ సంతోషార్జవంబులును, శమ దమ తపంబులును, సామ్యంబును, పరాపరాధసహనంబును, లాభంబుగలయెడ నుదాసీనుండై యుండుటయును, శాస్త్రవిచారంబును, విజ్ఞానవిరక్తులును, ఐశ్వర్య శౌర్య ప్రభా దక్షత్వంబులును, స్మృతియును, స్వాతంత్ర్యమును, కౌశల కాంతి ధైర్య మార్దవ ప్రతిభాతిశయ ప్రశ్రయ శీలంబులును,జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోబలంబులును, సౌభాగ్య గాంభీర్యంబులును, స్థైర్య శ్రద్ధా కీర్తిమాన గర్వాభావంబులు ననియెడి ముప్పదితొమ్మిది గుణంబులు నవియునుంగాక బ్రహ్మణ్యతా శరణ్యతాది మహాగుణ సమూహంబును, కృష్ణదేవుని యందు వర్తించుఁ గావున, 400

1. సద్విప్రులు నృపుల సేవింతురనియొ (తం.వా.) 2. పొందఁ గంటి ననియో (హం.తం.వా.)
3. దేవతలకైన (ద. తం.)

క. గణనాతీతములగు స, ద్గుణములు గల చక్రి సనిన ఘోరకలి ప్రే
రణమునఁ [1]బాపసమూహ,ప్రణయుతులగు జనులఁ జూచి వగచెదఁ దండ్రీ! 401

క. దేవతలకు ఋషులకుఁ బితృ, దేవతలకు నాకు నీకు ధీయుతులకు నా
నా వర్ణాశ్రమములకును, గోవులకును బాధ యనుచుఁ గుందెద ననఘా! 402

సీ. బ్రహ్మాదు లెవ్వని భద్రకటాక్ష వీక్షణము వాంఛింతురు సత్తపములఁ
[2]గమలాలయము మాని కమల యెవ్వని పాదకమలంబు సేవించుఁ గౌతుకమున
భవ్యచిత్తంబునఁ బరమయోగీంద్రులు నిలుపుదు రెవ్వని నియతితోడ
వేదంబు లెవ్వని విమలచారిత్రముల్ వినుతింపఁగా లేక వెగడు వడియె

ఆ. నట్టి వాసుదేవు నబ్జ వజ్రాంకుశ, చక్ర మీన శంఖ చాప కేతు
చిహ్నితంబులైన శ్రీచరణము లింక, సోఁకవనుచు వగపు సోఁకెనయ్య! 403

క. హరిపాదంబులు [3]సోఁకెడి, సిరికతమున నిఖిలభువన సేవ్యత్వముతో
స్థిరనైతి నిన్నిదినములు, హరి నా గర్వంబు మాన్పి యరిగె మహాత్మా! 404

క. లీలాకారము దాల్చెను, శ్రీలలనేశుండు ఖలుల శిక్షించి భవో
న్మూలనము సేయుకొఱకును, నాలుగుపాదముల [4]నిన్ను నడిపించుటకున్. 405

ఉ. ఆ మధురోక్తు లా నయము లా దరహాసము లా దయారసం
బా మురిపెంబు లా తగవు లా గమనక్రియ లా మనోహర
ప్రేమకరావలోకనము ప్రీతిఁ గనుంగొనలేమి మాధవున్
[5]గామిను లేల? నిర్దళితకర్ములు యోగులు వాయనేర్తు రే? 406

క. మెల్లన నాపై యాదవ, వల్లభుఁ డడుగిడఁగ మోహవశనై [6]నే రం
జిల్లఁగ రోమాంచముక్రియ, మొల్లములై మొలచు సస్యములు మార్గములన్. 407

వ. అని యిట్లు పూర్వవాహినియైన సరస్వతీతీరంబున ధర్మదేవుండును భూమియు వృషభ ధేను రూపంబుల భాషింప రాజఋషియైన పరీక్షి ద్భూవరుండు దగ్గఱియె. ఆ సమయంబున, 408

1. పాపము సేయుచు (హ. క. బ.) 2. కమలవనము (క.చ.ట.త.) 3. సోఁకిన (క. తం.)
4. నన్ను (హ.తం.క.చ.ట.) 5. నేమననేల యోగు లతి నిర్మల కర్ములు వాయనేర్తురె (డ. ద.)
6. మైరంజిల్లఁగ (బ.)

## అధ్యాయము - ౧౭

—: కలిపురుషుండు ధర్మదేవతను దన్నుట :—

శా. కైలాసాచల సన్నిభంబగు మహాగంభీర గోరాజముం
గాలక్రోధుఁడు దండహస్తుఁడు నృపాకారుండు క్రూరుండు జం
ఘాలుం డొక్కఁడు శూద్రుఁ డాసురగతిం గారుణ్య నిర్ముక్తుఁడై
నేలం గూలఁగ దన్నెఁ బంచితలఁగా నిర్ఘాతపాదాహతిన్. 409

శా. ఆలోలాంగక, నశ్రుతోయకణ జాలాక్షిన్, మహాంభారవన్
బాలారూఢ తృణావళీకబళ లోభవ్యాప్త జిహ్వాగ్ర, నాం
దోళస్వాంత, సజీవవత్స, నుదయ ద్దుఃఖాన్వితన్, ఘర్మ కీ
లాలాపూర్ణ శరీర, నా మొదవు నుల్లంఘించి తన్నెన్ వడిన్. 410

వ. ఇట్లు ధేనువృషభంబుల రెంటినిం గంటకుండై తన్నుచున్న రాజలక్షణ ముద్రితుండైన శూద్రునిం జూచి, సువర్ణ పరికర స్యందనారూఢుం డగు నభిమన్యునందనుండు గోదండంబు సగుణంబు సేసి మేఘగంభీర వచనంబుల నిట్లనియె. 411

శా. నిన్నుం గొమ్మలఁ జిమ్మెనో ? కదిసెనో ? [1]నిర్భీతివై గోవులం
దన్నం గారణమేమి ? మద్భుజ సనాథ క్షోణి నే వేళలం
దు న్నేరంబులు సేయరా దెఱుఁగవా ? ధూర్తత్వమున్ భూమిభృ
త్సన్నాహంబు నొనర్చె దెవ్వఁడవు ? నిన్ శాసించెదన్ దుర్మతీ ! 412

క. గాండీవియుఁ జక్రియు భూ, మండలి నెడఁబాసి చనిన మదమత్తుఁడవై
దండింపఁ దగనివారల, దండించెదు నీవ తగుదు దండనమునకున్. 413

వ. అని వృషభంబు నుద్దేశించి యిట్లనియె. 414

మ. కురుధాత్రీశ్వర బాహు వప్రయుగళీ గుప్త క్షమామండలిన్
బరికింపన్ భవదీయ నేత్రజనితాంభః శ్రేణి దక్కన్ జనుల్
దొరుఁగం [2]జూడ రధర్మసంజనిత జంతుశ్రేణి బాష్పంబులన్
గురుశక్తిన్ విదళింతుఁ జూడు మితనిన్ గోమూర్తి దేవోత్తమా! 415

కం. జాలిఁ బడనేల ? నా శర, జాలంబులపాలు సేసి చంపెద వీనిన్
భూలోకంబున నిను నే, నాలుగుపాదముల నిపుడ నడిపింతుఁ జుమీ! 416

1. నిర్భీతిమై (ద) జేయ (తం.వా.)

ఉ. వాచవియైన గడ్డి దిని వాహినులందు జలంబుఁ ద్రావఁగా
నీచరణంబు లెవ్వఁ డిటు నిర్దళితంబుగఁజేసె, వాఁడు దా
ఖేచరుఁడైన వాని మణికీలిత భూషణయుక్త బాహులన్
వేచని త్రుంచివైతు వినువీథికి నేఁగిన నేల డాఁగినన్. 417

వ. అని మఱియు గోరూపయైన భూదేవితో నిట్లనియె. 418

చ. అగణిత వైభవుండగు మురాంతకుఁ డెక్కడఁ బోయె ? నంచు నె
వ్వగల [1]నశించి నేత్రముల వారికణంబులు దేకుమమ్మ ! లో
బెగడకుమమ్మ ! మ ద్విశిఖబృందమునన్ వృషలులన్ వధింతు నా
మగఁటిమిఁ జూడు నీ వెఱపు మానఁగదమ్మ ! శుభప్రదాయినీ ! 419

క. సాధువులగు జంతువులకు, బాధలు గావించు ఖలుల భంజింపని రా
జాధము నాయు స్స్వర్గ, శ్రీ ధనములు వీటిపోవు సిద్ధము తల్లీ ! 420

క. దుష్టజన నిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబుఁ జేయఁగ నృపులన్
స్రష్ట విధించెఁ బురాణ, ద్రష్టలు సెప్పుదురు [2]పరమధర్మము సాధ్వీ ! 421

వ. అనిన ధర్మనందనపౌత్రునకు వృషభమూర్తి నున్న ధర్మదేవుం డిట్లనియె. 422

ఉ. క్రూరులఁ జంపి సాధువులకున్ విజయం [3]బొనరించునట్టి యా
పౌరవవంశజాతుఁడవు భాగ్యసమేతుఁడ వౌదు తొల్లి మీ
వా రిటువంటివా రవుట వారిజనేత్రుఁడు మెచ్చి [4]దౌత్య సం
చారము సేసెఁ గాదె ! నృపసత్తమ ! భక్తి [5]లతానుబద్ధుడై. 423

వ. నరేంద్రా ! మేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము. మావలన దుఃఖంబు నొందెడు పురుషుండులేఁడు. వాదివాక్యభేదంబుల యోగీశ్వరులు మోహితులై, భేదంబు నాచ్ఛాదించి,తమకు నాత్మ సుఖదుఃఖంబుల నిచ్చు ప్రభువని చెప్పుదురు. దైవజ్ఞులు గ్రహదేవతాదులకుఁ ప్రభుత్వంబు సంపాదింతురు. మీమాంసకులు గర్మంబునకుం బ్రాభవంబు ప్రకటింతురు. లోకాయతికులు స్వభావంబునకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు. ఇం దెవ్వరికిని సుఖదుఃఖప్రదానంబు సేయ విభుత్వంబు లేదు. పరులవలన దుఃఖంబువచ్చిన నధర్మంబు పరులు చేసిరని విచారింపవలదు. తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరునివలన సర్వము నగుచుండు. అనిన ధర్మదేవునికి ధర్మనందనపౌత్రుఁ డిట్లనియె. 424

1. గృశించి (తం. వా.) 2. పురుష (హ) 3. బొనరింతునంటివా (చ) 4. దూత సంచారము (క. చ. ర.) 5. లతా నిబద్ధుఁడై (ఐ. తం.)

ఆ. ధర్మమూర్తి వయ్య! ధర్మజ్ఞ! వృషరూప!, పరమధర్మ మీవు పలుకు త్రోవ
[1]పాపకర్మ సేయు పాపంబు సూచింపఁ, బాపకర్తఁ దేగు పథము వచ్చు. 425

వ. మఱియు దేవమాయవలన భూతంబుల వాఙ్మనంబులకు వధ్య ఘాతుక లక్షణ వృత్తి సులభంబునం దెలియరాదు. నీవు ధర్మదేవతవు. కృతయుగమునం దప శ్శౌచ దయా సత్యంబులు నాలుగును నీకుం బాదంబు లని చెప్పుదురు. (త్రేతాయుగంబునఁ బూర్వోక్త పాదచతుష్కంబునఁ గ్రమంబునం దప శ్శౌచ దయా సత్యంబులం దురీయపాదంబు క్షీణంబయ్యె. ద్వాపరంబునం బాదద్వయంబు నశించె. కలియుగంబునందు ని వ్వడువునన యిప్పుడు నీకుఁ) బాదత్రయంబు భగ్నంబయ్యె. అవశిష్టంబగు భవదీయ చతుర్థపాదంబు నధర్మంబు గల్యంతమున నిగ్రహింప గమనించు చున్నది. విను మదియునుంగాక. 426

మ. భరముం బాపి రమావిభుండు గరుణం బాదంబులం ద్రొక్కఁగా
స్థిరమై వేడుక నింతకాలము సుఖశ్రీ నొంది [2]భూదేవి త
చ్చరణస్పర్శము లేమి శూద్రకులజుల్ శాసింతు రంచు న్నిరం
తర శోకంబున నీరు గన్నుల నిడెన్ ధర్మజ్ఞ ! వీక్షించితే ? 427

—: పరీక్షిన్మహారాజు కలిని నిగ్రహించి ధర్మపరిపాలనంబు సేయుట :—

వ. అని యిట్లు ధర్మ భూదేవతల బుజ్జగించి మహారథుండైన విజయపౌత్రుండు గ్రొక్కాఱు మెఱుంగు చక్కఁదనంబు ధిక్కరించి, దిక్కులకు వెక్కసంబైన యడిదంబు బెడిదంబు ఝళిపించి, పాపహేతువైన కలి రూపుమాప నుద్యోగించిన, వాఁడు రాజరూపం బుడిగి, వాడిన మొగంబుతోడ భయవిహ్వలుండై హస్తంబు సాఁచి తత్పాదమూల విన్యస్తమస్తకుండై ప్రణామంబు సేసి, 428

క. కంపించె దేహమెల్లం, [2]జంపకు మో రాజతిలక ! శరణాగతు ర
క్షింపు మని తనకు మ్రొక్కినఁ, జంపక కలిఁ జూచి నగుచు జనపతి పలికెన్. 429

క. అర్జునకీర్తి సమేతుం, డర్జునపౌత్రుండు భయరసావృతజనులన్
[4]నిర్జితులఁ జంప నొల్లఁడు, దుర్జనభావంబు విడిచి తొలఁగు దురాత్మా ! 430

వ. నీవు పాపబంధుండవు. మదీయ బాహుపాలితంబైన మహీమండలంబున నిలువ వలదు. రాజదేహంబునందు వర్తించు నిన్ను నసత్య లోభ చౌర్య దౌర్జన్య

1. పాపకర్తఁ జేయు (హ); పాపకర్మచేయు (తం.వా.) ''య దధర్మ కృతస్థానం సూచకస్యాపి త ద్భవేత్'' (17-22) 2. యీ భూమి (హ) 3. జంపకువే (త) 4. నిర్జించి (క. చ. ట.)

దురాచార మాయా కలహ కపట కలు షాలక్ష్మ్యాదు లాశ్రయించు. (సత్య ధర్మంబులకు) నివాసంబగు బ్రహ్మావర్తదేశంబున యజ్ఞవిస్తారనిపుణు లైనవారు యజ్ఞేశ్వరుండైన హరిం గూర్చి యాగంబు సేయుచున్నవారు. యజించు వారలకు సుఖప్రదానంబు సేయుచు, సకల భూతాంతర్యామియై భగవంతుం డైన హరి జంగమస్థావరంబులకు నంతరంగ బహిరంగంబుల సంచరించు వాయువుచందంబున, నాత్మరూపంబు మనోరథంబు నిచ్చుం గావున నిం దుండ వలవ దనుచు దండహస్తుండైన జమునికైవడి మండలాగ్రంబు సాఁచిన రాజు నకుం గలి యిట్లనియె. 431

క. జగతీశ్వర! నీ యడిదము, ధగధగిత ప్రభలతోడఁ [1]దఱచుగ మెఱయన్
బెగడెం జిత్తము గుండెలు, వగిలెడి నిఁక నెందుఁ జొత్తు భావింపఁగదే! 432

వ. నరేంద్రా! నిను (నారోపిత శరశరాసునిఁగ) సర్వప్రదేశంబులందును విలోకింపుచు నున్నవాఁడ నే నెక్కడనుండుదు నాన తిమ్మనిన రాజన్యశేఖరుండు ప్రాణివధ స్త్రీ ద్యూత పానంబు లనియెడు నాలుగు స్థానంబు లిచ్చి, మఱియు నడిగిన సువర్ణమూలంబగు నసత్య మద కామ హింసా వైరంబు లనియెడు పంచప్రదేశంబుల నొసంగి, యితర స్థలంబుల స్పృశియింపకుండ నియమించె. ఇట్లు కలి నిగ్రహంబుచేసి, హీనంబులైన తపశ్శౌచ దయ లనియెడు మూఁడు పాదంబులు వృషభమూర్తియైన ధర్మదేవుని కిచ్చి, విశ్వంభరకు నిర్భరంబైన సంతోషంబు సంపాదించి, 433

క. గజనామధేయ పురమున, గజరిపుపీఠమున ఘనుఁడు గలిమర్దనుఁడున్
గజవైరి పరాక్రముఁడై, గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్. 434

అధ్యాయము—౧౯

వ. ఇట్లు కృష్ణుని యనుగ్రహంబున నశ్వత్థామ బాణపావకంబువలన బ్రతికి, పరీక్షిన్నరేంద్రుండు బ్రాహ్మణశాప ప్రాప్త తక్షకభయంబువలనఁ బ్రాణంబులు వోవునని యెఱింగి, సర్వసంగంబులు వర్జించి, శుకునకు శిష్యుండై, విజ్ఞానంబు గలిగి గంగాతరంగిణీ తీరంబునం గళేబరము విడిచె వినుఁడు. 435

క. హరివార్త లెఱుఁగువారికి, హరిపదములు దలఁచువారి కనవరతంబున్
హరికథలు వినెడివారికి, మరణాగత మోహసంభ్రమము లే దనఘా! 436

క. శుభచరితుఁడు హరి యరిగినఁ, బ్రభవించి ధరిత్రినెల్లఁ బ్రబ్బియుఁ గలి దా
నభిమన్యుసుతుని వేళను, బ్రభవింపక యణఁగియుండె భార్గవముఖ్యా! 437

1. తఱుచుగ మెఱవన్ (చ.)

వ. ఇవ్విధంబునఁ జతుస్సముద్ర ముద్రితాఖిల మహీమండల సామ్రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయుచు నభిమన్యుపుత్రుండు. 438

ఉ. చేసినఁగాని పాపములు సెందవు చేయఁదలంచి నంతటన్
జేసెద నన్నమాత్రమునఁ జెందుఁగదా! కలివేళ పుణ్యముల్
మోసము లేదటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిన్ మరంద ము
ల్లాసముతోడఁ గ్రోలి విరులం దెగఁజూడని తేఁటి కైవడిన్. 439

వ. మఱియుం బ్రమత్తులై యధీరులగు వారలయందు వృకంబుచందంబున నొదిగి [1]లాచుకొనయుండి చేష్టించుఁ గాని. ధీరులైనవారికిం గలివలని భయంబులేదవి కలి నంతంబు నొందింపఁడయ్యె. అనిన విని ఋషులు సూతున కిట్లనిరి. 440

సీ. పౌరాణికోత్తమ! బ్రదుకుము పెక్కేండ్లు తామరసాక్షుని ధవళయశము
మరణశీలురమైన మా కెఱింగించితి కల్పితంబగు క్రతుకర్మమందుఁ
బొగలచేఁ బొగిలి యబుద్ధచిత్తులమైన మము హరిపదపద్మ మధురసంబుఁ
ద్రావించితివి నీవు ధన్యుల మైతిమి [2]స్వర్గమేనియు నపవర్గమేని

తే. భాగవత[3]సంగలవభాగ్య ఫలముకీదె? ప్రకృతిగుణహీనుఁడగు చక్రిభద్రగుణము
లీశ కమలాసనాదులు నెఱుఁగలేరు, [4]వినియు వినఁజాలననియెడి వెఱ్ఱిగలఁడె?

క. శ్రీపంబులు ఖండిత సం, తాపంబులు గల్మషాంధతమస మహోద్య
ద్దీపంబులు [5]పాషండ దు, రాపంబులు విష్ణువందనాలాపంబుల్. 442

క. పావనములు దురితలతా, లావనములు నిత్యమంగళ ప్రాభవ సం
జీవనములు లక్ష్మీసం, భావనములు వాసుదేవ పదసేవనముల్. 443

ఆ. పరమభాగవతుఁడు పాండవపౌత్రుండు, శుకుని భాషణముల శుద్ధబుద్ధి
యై విరాజమానుఁడై ముక్తియగు విష్ణు, పాదమూల మెట్లు పడసె? ననఘ! 444

వ. మహాత్మా! విశిష్ట యోగనిష్ఠాకలితంబు, విష్ణుచరిత లలితంబు, పరమపుణ్యంబు, సకలకల్యాణగుణ గణ్యంబు, భాగవతజనా పేక్షితంబునైన పారీక్షితంబగు భాగవతాఖ్యానంబు వినిపింపు మనిన సూతుం డిట్లనియె. 445

క. మిముబోఁటి పెద్దవారలు, కమలాక్షుని చరిత మడుగఁగా జెప్పెడి భా
గ్యము గలిగె నేఁడు మా జ, న్మము సఫలంబయ్యె వృద్ధమాన్యుల మగుటన్.

క. కులహీనుఁడు నారాయణ, విలస త్కథనములు దగిలి వినిపించినఁ ద
త్కులహీనతఁ బాసి మహో, జ్జ్వల కులజత్వమును బొందు సన్మునులారా! 446

1. కాచుకొని (ద) 2. జన్మాంతరములేని స్వర్గమైన (క.చ.ట.ద.బ.) 3. సంఘ (హ) విష్ణుభక్తుల సంగంబు వెలకురాదు (క.తం.) 4. వినికి వినఁజాలమనియెడి (హ.తం.వా.క.చ.ట.త.గ.జ.చ.బ.) 5. జితదురితా (క.బ.)

సీ. ఎవ్వని గుణజాల మెన్న జిహ్వాలులేక నళినగర్భాదు లనంతుఁ డంద్రు
కోరెదు విబుధేంద్రకోటి నొల్లక లక్ష్మి [1]ప్రార్థించె నెవ్వని పాదరజము
బ్రహ్మ యెవ్వని పాదపద్మంబు గడిగిన జలము ధన్యత నిచ్చె జనుల కెల్ల
భగవంతుఁ డనియెడి భద్రశబ్దమునకు నెవ్వఁ డర్థాకృతి నేపుమిగులు

ఆ. నే మహాత్ము నాశ్రయించి శరీరాది, సంగకోటినెల్ల సంహరించి
ప్రాభవమున [2]మునులు పారమహంస్యంబు, నొంది తిరిగి రాకయుందు రెలమి,

చ. క్రమమున మింటికై యెగయుఁ గాక విహంగము మింటిదైన పా
రము గననేర్చునే? హరిపరాక్రమ మోపినయంత గాఁగ స
ర్వము వివరింప నెవ్వఁడు ప్రవర్తకుఁ [3]డర్యములార! నాదు చి
త్తమునకు నెంత గానఁబడెఁ దప్పక చెప్పెద మీకు నంతయున్. 449

—: పరీక్షిన్మహారాజు శృంగివలన శాపంబు నొందుట :—

క. వేదండ పురాధీశుఁడు, కోదండము చేతఁబట్టికొని గహనములో
వేదండాదుల నొకనాఁ, డే దండలఁ బోవనీక యెగచెన్ బలిమిన్. 450

క. ఒగ్గములు ద్రవ్వి పడుమని, మొగ్గెడు పెనుదెరల వలల నుగ్ర[4]మృగమ్ముల్
డగ్గఱినఁ జంపువేడుక, వెగ్గలమై చిత్తమందు వేఁటాడింపన్. 451

క. కోలముల గవయ వృక శా, ర్దూలములఁ దరక్షు ఖడ్గ [5]రోహిష హరి శుం
డాలముల శరభ చమర, వ్యాలముల వధించె విభుఁడు వడి నోలములన్. 452

క. [6]మృగయులు మెచ్చ నరేంద్రుఁడు, మృగరాజపరాక్రమమున మెఱసి హరించెన్
మృగధరమండలమునఁ గల, మృగ మొక్కటిఁ దక్క నన్యమృగముల నెల్లన్.

వ. ఇట్లు వాటంబైన వేఁట తమకంబున మృగంబుల వెంటం దగిలి బుభుక్షా
పిపాసలఁ బరిశ్రాంతుండై ధరణీకాంతుండు చల్లని నీటికొలంకులు గానక కలం
గెడు చిత్తంబుతోఁ జనిచని యొక్క తపోవనంబు గని యందు. 454

సీ. మెలఁగుటఁ జాలించి మీలితనేత్రుఁడై శాంతుఁడై కూర్చుండి జడతలేక
ప్రాణ మనో బుద్ధి పంచేంద్రియంబుల, బహిరంగవీథులఁ బాఱనీక
జాగరణాదిక స్థానత్రయము దాఁటి పరమమై యుండెడి పదము దెలిసి
బ్రహ్మభూతత్వ [7]సంప్రాప్త్యవిక్రియుఁ డయి యతిదీర్ఘజటలు దన్నావరింప.

---

1. వర్తించె నెవ్వని వక్షమందు (ట) 2. ఘనులు (చ.పి.జ.డ.ద.) 3. డయ్యామహాత్ములార (ట.); డార్యకులార నాదు (డ); డౌమునులార నాదు (తం. వా.) ''అహం హి పృష్టోఽర్యమణో భవద్భిః'' (మూ. 18.23). 4. నురలు మృగములన్, డగ్గఱిచంపెడు వేడుక (తం.వా.) 5. రోహిత (హ.తం.వా.) 6. మృగములనెల్ల (జ) 7. సంప్రాప్త విశ్రాంతుఁడై (హ); సంప్రాప్తి విక్రియుఁడయి.(వా) 'బ్రహ్మభూత మవిక్రియమ్' (18-26).

**తే.** నలఘు రురుచర్మధారియై యలరుచున్న, తపసిఁ బొడగని శోషిత తాలుఁడగుచు
నెండి తడిలేని కుత్తుక నెలుఁగు డింద, మందభాషల డగ్గఱి మనుజవిభుఁడు. 455

క. **తో**యములు దెమ్ము మా కీ, తోయము వేఁటాడువేళఁ దొల్లి పొడమ దీ
**తో**యముఁక్రియ జలదాహము, తోయమువారలును లేరు దుస్సహ మనఘా!

వ. అని భూవరుండు శమీకమహాముని సమాధినిష్ఠుండును హరిచింతాపరుండునై
యుండుట విచారింపక. 457

**ఉ.** కన్నులుమూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుత నున్నవాఁడు చే
సన్నలనైన రమ్మనఁడు సారజలంబులు దెచ్చి పోయఁ డే
మన్ననలైనఁ జేయఁడు సమగ్రఫలంబులు వెట్టఁ డింత సం
పన్నత నొందెనే? తన తపశ్చర ణాప్రతిమ ప్రభావముల్. 458

**ఆ.** వారిఁ గోరుచున్నవారికి శీతల, వారి నిడుట యెట్టివారికైన
వారితంబు గాని వలసినధర్మంబు, వారి యిడఁడు దాహవారి గాఁడు. 459

చ. అని మనుజేశ్వరుండు మృగయావసరాయత తోయదాహ సం
జనిత దురంతరోషమున సంయమి దన్నుఁ దిరస్కరించి పూ
జనములు సేయఁ డంచు మృతసర్పము నొక్కటి వింటికోపునన్
బనివడి తెచ్చి వైచె నటు బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్. 460

**వ.** ఇట్లు వృథా రోషదర్పంబున మునిమూఁపున గతాసువైన సర్పంబు నిడి, నరేశ్వరుండు దన పురంబునకుం జనియె. అంత సమీపవర్తులైన మునికుమారులు సూచి శమీకనందనుండైన శృంగికడకుం జని. 461

క. నర గంధగజ స్యందన, తురగంబుల నేలు రాజు తోయాతురుఁడై
పరగ నీ జనకునిమెడ, నురగముఁ దగిలించి పోయె నోడక తండ్రీ! 462

**వ.** అని పలికిన సమాన వయో రూప మునికుమార లీలాసంగియైన శృంగి శృంగంబులతోడి మూర్తి ధరియించినటు విజృంభించి రోషసంరంభంబున నదరిపడి (బల్యన్నంబుల భుజించి పుష్టంబులగు[1] నరిష్టంబులం బోలె బలిసియు, ద్వారంబులం గాచికొనియుండు సారమేయంబులపగిది దాసభూతులగు క్షత్రియాభాసు లెట్లు బ్రాహ్మణోత్తములచే స్వరక్షకులుగ నిరూపితులైరి ? అట్టివార లెట్లు తద్గృహంబుల భాండసహితంబగు నన్నంబు భుజింప నర్హులగుదురు? తత్కృతంబులైన ద్రోహంబు లెట్లు నిజస్వామిం జెందు నని మఱియు) నిట్లనియె. 463

1. పరపుష్టంబులం బోలి (హ. లం. వా.)

ఉ. ఆడఁడు దన్ను దూషణము, లాశ్రమవాసులఁగాని వైరులం
గూడఁడు, కందమూలములు కూడుగఁ దించు సమాధి [1]చిత్తుఁడై
వీడఁడు లోనిచూడ్కులను, విష్ణునిఁ దక్కఁ బరప్రపంచముం
జూడఁడు మద్గురుండు ఫణిఁ జుట్టఁగ నేటికి? రాచవానికిన్. 464

ఉ. హోము హిరణ్యదానములు పుచ్చుకొనంగ, ధనంబు లేమియుం
దేము, సవంచనంబులుగ దీవెన లిచ్చుచు వేసరింపఁగా
రాము, వనంబులన్ గృహవిరాములమై నివసింపఁ జెల్లరే!
పామును వైవఁగాఁ దగునె? బ్రహ్మమునీంద్రు భుజార్గళంబునన్. 465

క. పుతమిఁగల జనులు వొగడఁగఁ, గుడుతురు గట్టుదురు కాక కువలయపతులై
యతవుల [1]నిడుమలఁ బడియెడి, బడుగుల మెడ నిడఁగఁ దగునె? పన్నగశవమున్.

క. భగవంతుఁడు గోవిందుఁడు, జగతిం బెడఁబాసి చనిన శాసింపంగాఁ
[2]దగు వరులు లేమి దుర్జను, లెగసి మహాసాధుజనుల నేఁచెద రకటా! 467

క. బాలకులార! ధరిత్రీ, పాలకు శపియింతు ననుచు [3]బలువిడిని విలో
లాలకుఁడగు మునికుంజర, బాలకుఁ డరిగెం ద్రిలోకపాలకు లదరన్. 468

వ. ఇట్లు రోషించి కౌశికీనదికిం జని జలోపస్పర్శనంబు సేసి. 469

ఉ. ఓడక వింటికోపున మృతోరగముం గొనివచ్చి మాఱు మా
టాడకయున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి దుర్మద
క్రీడఁ జరించు రాజు హరకేశవు లడ్డిననైనఁ జచ్చుఁబో
యేడవనాఁడు తక్షకఫణీంద్ర విషానల హేతిసంహతిన్. 470

వ. అని శమీకమహామునికుమారుండైన శృంగి పరీక్షిన్నరేంద్రుని శపియించి, నిజా
శ్రమంబునకుఁ జనుదెంచి, కంఠలగ్న కాకోదర కళేబరుండైన తండ్రిం జూచి.

క. ఇయ్యెడ నీ కంఠమునకు, ని య్యురగశవంబు దెచ్చి యిటు చేర్చిన యా
యయ్య నిఁక నేమి సేయుదు? నెయ్యంబులు లేవు సుమ్ము నృపులకుఁ దండ్రీ! 472

శా. ప్రారంభంబున వేఁటవచ్చి ధరణీపాలుండు మా తండ్రిపై
నేరం బేమియు లేదు సర్పశవము న్నేఁ డుగ్రుఁడై వైచినాఁ
డీరీతిన్, ఫణి క్రమ్మఱన్ బ్రతుకునో! హింసించునో! కోఱలన్
రారే! తాపసులార! దీనిఁ దివరే! రక్షింపరే! మ్రొక్కెదన్. 473

1. నిష్ఠుఁడై (తం. వా.) 2. తగువారు (తం. వా.) 3. బలువడిని (తం. వా.)

వ. అని సర్పంబుఁ దిగుచు నేర్పులేక యెలుంగెత్తి విలపించుచున్న కుమారకు రోదన ధ్వని విని, యాంగిరసుఁడైన శమీకుండు సమాధిఁ జాలించి, మెల్లన గన్నులు దెఱచి, మూఁపున వ్రేలుచున్న మృతోరగంబు వీక్షించి తీసి పాఱవైచి కుమారకుం జూచి. 474

క. ఏకీడు నాచరింపము, లోకులకున్ మనము సర్వలోక సములమున్
శోకింపనేల? పుత్రక! కాకోదర మేల వచ్చెఁ? గంఠంబునకున్. 475

వ. అని యడిగిన తండ్రికిఁ గొడుకు రాజువచ్చి సర్పంబు వైచుటయుం దాను శపించుటయును వినిపించినఁ దండ్రి కొడుకు వలన సంతసింపక యిట్లనియె. 476

క. బెట్టిదమగు శాపమునకు, దట్టపు ద్రోహంబు గాదు ధరణీకాంతుం
గట్టా! యేల శపించితి?, పట్టీ! తక్షక విషాగ్ని పాలగు మనుచున్. 477

ఆ. తల్లికడుపులోన దగ్ధుఁడై క్రమ్మఱఁ, గమలనాభు కరుణఁ గలిగినాఁడు
బలిమి గలిగి ప్రజలఁ బాలింపుచున్నాఁడు, దిట్ట[1]వడుగ! రాజుఁ దిట్టఁ దగునె?

ఉ. కాపరిలేని గొఱ్ఱియలకైవడిఁ గంటక చోరకోటిచే
నేపఱియున్న దీ భువన మీశుఁడు కృష్ణుఁడు లేమి నిట్టిచో
భూ పరిపాలనంబు సమబుద్ధి నితం డొనరింపఁ జెల్లరే!
యీ పరిపాటి ద్రోహమున కిట్లు శపింపఁగనేల? బాలకా! 479

సీ. పాపంబు నీ చేతఁ బ్రాపించె మన కింక రాజు నశించిన రాజ్యమందు
బలవంతుఁ డగువాఁడు బలహీను పశు దార హయ సువర్ణాదుల నపహరించు
జార చోరాదులు సంచరింతురు ప్రజ కన్యోన్య కలహంబు లతిశయిల్లు
వైదికంబై యున్న వర్ణాశ్రమాచార ధర్మ మించుక లేక తప్పిపోవు

ఆ. నంతమీఁద లోకు లర్థ కామంబులఁ, దగిలి సంచరింప ధరణి నెల్ల
వర్ణ సంకరములు వచ్చును మర్కట, సారమేయ కులము మేరఁ బుత్ర! 480

ఉ. భారతవంశజుం బరమభాగవతున్ హయమేధయాజి నా
చారపరున్ మహానయ విశారదు రాజకులైకభూషణున్
నీరము గోరి నేఁడు మన నేలకువచ్చిన [2]భక్తి నర్థి స
త్కారము సేసి పంపఁ జనుఁ గాక! శపింపఁగ నీకు ధర్మమే? 481

క. భూపతికి నిరపరాధమ, శాపము దా నిచ్చె బుద్ధిచాపలమున మా
పాపఁడు వీఁ డొనరించిన, పాపము దొలఁగించు కృష్ణ! పరమేశ! హరీ! 482

1. పడుచ (జ. ద. వా.); పడుచు (లం); 2. యర్థిభక్తి (తం. వా.)

క. పొడిచినఁ దిట్టినఁ గొట్టినఁ, బడుచుందురు గాని పరమ భాగవతులు దా
రొడఁబడరు మాఱు సేయఁగఁ, గొడుకా! విభుఁ డెగ్గు సేయఁ గోరఁడు నీకున్.

క. [1]చెలఁగరు కలఁగరు సాధులు, మిళితములై పరులవలన మేలుం గీడున్
నెలకొనినసైన నాత్మకు, నొలయవు సుఖ దుఃఖ చయము [2]లుగ్రము లగుచున్.

వ. అని యిట్లు శమీక మహామునీంద్రుండు కొడుకు సేసిన పాపంబునకు సంతాపంబు నొందుచుండె. 484

అధ్యాయము - ౧౯

వ. అంత *(శమీక ప్రేషితుం డగు శిష్యుని వలన) నా మునికుమారకు శాపంబు విని యా యభిమన్యు పుత్త్రుండు (కామ క్రోధాది విషయాసక్తుఁడగు) తనకు (తక్షక విషాగ్ని) విరక్తిబీజం బగు ననుచుఁ గరినగరంబునకుం జని యేకాంతంబున, 485

—: పరీక్షిన్మహారాజు విప్రశాపంబు నెఱింగి ప్రాయోపవిష్టుం డగుట :—

ఉ. ఏటికి వేఁటఁ బోయితి? మునీంద్రుఁడు గాఢసమాధి నుండఁగా
నేటికిఁ దద్భుజాగ్రమున నేసితి సర్పశవంబుఁ దెచ్చి? [3]నే
డేటికిఁ బాప సాహసము లీక్రియఁ జేసితి? దైవయోగమున్
దాఁటఁగ రాదు వేగిరమ [4]తథ్యము గీడు జనించు ఘోరమై. 486

ఉ. పాము విషాగ్ని కీలలను బ్రాణము లేఁగిన నేఁగుఁ గాక యీ
భూమియు రాజ్యమున్ సతులు భోగముఁ బోయినఁ బోవుఁ గాక సౌ
దామినిఁ బోలు జీవనముఁ దథ్యముగాఁ దలపోసి యింక నే
నేమని మాఱు దిట్టుదు? మునీంద్రకుమారకు దుర్నివారకున్. 487

ఆ. రాజ ననుచుఁ బోయి రాజ్యగర్వంబున, వనము కొఱకు వారి వనము సొచ్చి
దందశూక శవముఁ దండ్రిపై వైచినఁ, బొలియఁ దిట్ట కేల పోవు? సుతుఁడు.

క. గోవులకున్ బ్రాహ్మణులకు, దేవతలకు నెల్లప్రొద్దుఁ దెంపునఁ గీడుం
గావించు పాప మానస, మే విధమునఁ బుట్టకుండ నే వారింతున్. 489

వ. అని వితర్కించె. 490

1. అలగరు (క.చ.ట.త.ప.జ.బ.) 2. యుగ్మము లగుచున్ (తం.వా.) *ఈ వాక్యము వ్రాఁత ప్రతులలోలేదు; మూలమునను లేదు. 3. నేనేటికిఁ (తం. వా.) 4. తాపమునేఁడు (త).

క. దామోదర పదభ_క్తిం, గామాదుల గెల్చినాఁడు గావునఁ గరుణన్
భూమీశుఁ దలుగఁ దయ్యెను, సామర్థ్యము గలిగి [1]దోషసంగిన్ శృంగిన్. 491

వ. అంత మునికుమారుండు శపించిన వృత్తాంత మంతయు నిట్లు వితర్కించి, తక్షక వ్యాళ విషానల జ్వాలా జాలంబునం దనకు సప్తమ దినంబున మరణం బని యెఱింగి, భూలోక స్వర్గలోక భోగంబులు హేయంబు లని తలంచి, రాజ్యంబు విసర్జించి, నిరశన దీక్షాకరణంబు సంకల్పించికొని, 492

మ. తులసీ సంయుత దైత్యజి త్పదరజ స్తోమంబు కంటెన్ మహో
జ్జ్వలమై దిక్పతిసంఘ సంయుత జన త్సౌభాగ్య [2]సంధాయియై
కలిదోషావళి నెల్లఁ [3]బాపు దివిష ద్గంగా ప్రవాహంబులో
పలికిం బోయి మరిష్యమాణుఁ డగుచుం బ్రాయోపవేశంబునన్. 493

క. చిత్తము గోవింద పదా, యత్తముఁ గావించి మౌనియై తనలో నే
తత్తఱము లేక భూవర, సత్తముఁడు వసించె [4]ముక్త సంగత్వమునన్. 494

వ. ఇట్లు పాండవ పౌత్రుండు ముకుంద చరణారవింద వందనానంద కందాయమాన మానసుండై విష్ణుపదీ తీరంబునం బ్రాయోపవేశంబున నుండుట విని (సకలలోక పావన మూర్తులు మహానుభావులు నగుచుఁ దీర్థంబునకుం దీర్థత్వంబు లొసంగ సమర్థులైన యత్రి, విశ్వామిత్ర, భృగు, వసిష్ఠ, పరాశర, (వ్యాస) భరద్వాజ, పరశురామ, దేవల, గౌతమ, మైత్రేయ, కణ్వ, కలశసంభవ, నారద, పర్వతాదు లైన బ్రహర్షి, దేవర్షి, రాజర్షి పుంగవులు, కాండఋషులైన యరుణాదులు, మఱియు నానాగోత్ర సంజాతులైన ఋషులును * (శిష్య ప్రశిష్యసమేతులై) యేతెంచిన వారలకు దండ ప్రణామంబులు నేసి కూర్చుండ నియోగించి. 495

క. క్రమ్మఱ నమ్మునివరులకు, సమ్మనుజేంద్రుండు మ్రొక్కి హర్షాశ్రుతతుల్
గ్రమ్మఁగ ముకుళితకరుఁడై, సమ్మతముగఁ జెప్పె నాత్మ సంచారంబున్. 496

ఉ. ఓపికలేక చచ్చిన మహోరగముం గొనివచ్చి కోపినై
తాపసు మూఁపుపై నిడిన దారుణచిత్తుఁడ మత్తుఁడన్ మహా
పాపుఁడ మీరు పాపతృణ పావకు లుత్తము లయ్యలార ! నా
పాపము వాయు మార్గముఁ గృపాపరులార ! విధించి చెప్పరే ! 497

1. రోష (ఉ) 2. సంపాదియై (ల.చ.త.జ.) 3. బాపెడి వియద్గంగా (జ. ద.) 4. ముక్తి (ల.ట.డ.) *హ. లం. వా. (తాళపత్ర ప్రతులలో లేదు; మూలమునను లేదు.)

ఉ. భూసురపాద రేణువులు పుణ్యులఁ జేయు నరేంద్రులన్ ధరి
త్రీసురులార! మీ చరణరేణు కణంబులు మేనుసోఁక నా
చేసిన పాప మంతయు నశించెఁ గృతార్థుఁడనైతి [1]నెద్ది నేఁ
జేసిన ముక్తి పద్ధతికిఁ జెచ్చెర బోవఁగవచ్చుఁ జెప్పరే. 498

క. భీకరతర సంసార, వ్యాకులతన్ విసిగి దేహవర్జనగతి నా
లోకించు నాకుఁ దక్షక, కాకోదర విషము ముక్తికారణ మయ్యెన్.

క. ఏపారు నహంకార, వ్యాపారమునందు మునిఁగి వర్తింపంగా
నాపాలిటి హరి భూసుర, శాప వ్యాజమున ముక్తసంగునిఁ జేసెన్. 500

మ. ఉరగాధీశ విషానలంబునకు మే నొప్పింతు శంకింప నీ
శ్వర సంకల్పము నేఁడు మానదు [2]భవిష్య జ్జన్మ జన్మంబులన్
హరి చింతా రతియున్ హరిప్రణుతి భాషాకర్ణనాసక్తియున్
హరి పాదాంబుజ సేవయున్ గలుగ మీ రర్థిన్ బ్రసాదింపరే. 501

క. చూడుఁడు నా కల్యాణము, పాడుఁడు గోవిందు మీఁది పాటలు దయతో
నాడుఁడు హరిభక్తుల కథ, లే డహములలోన ముక్తి కేఁగఁగ నిచటన్. 502

క, అమ్మా! నినుఁ జూచిన నరుఁ, బొమ్మా యని ముక్తికడకుఁ బుత్తు వఁట కృపన్
లెమ్మా నీ రూపముతో, రమ్మా నా కెదుర గంగ! రమ్యతరంగా! 503

వ. అని తనకు మీఁద నయ్యెడి జన్మాంతరంబులందైన సర్వజంతు సౌజన్యంబు సంధిల్లంగాక యని, గంగా తరంగిణీ దక్షిణ కూలంబునన్ బూర్వాగ్ర దర్భాసనంబున నుత్తరాభిముఖుండై యుపవేశించి, జనమేజయు రప్పించి రాజ్యభారంబు సమర్పించి, యత్నంబు సంసారబంధంబునకుఁ దప్పించి, చిత్తంబు హరికి నొప్పించి, పరమభాగవతుండైన పాండవ పౌత్రుండు ప్రాయోపవిష్టుండై యున్న సమయంబున. 504

క. ఒత్తిలి పొగడుచు సురలు వి, యత్తలమున నుండి మెచ్చి యలరుల వానల్
మొత్తములై కురిసిరి నృప, సత్తముపై భూరి భేరి శబ్దంబులతోన్. 505

వ. ఆ సమయంబున సభాసీనులైన ఋషు లిట్లనిరి. 506

మ. క్షితినాథోత్తమ! నీ చరిత్రము మహాచిత్రంబు మీ తాత లు
గ్ర తపోధన్యులు విష్ణుపార్శ్వ పదవిన్ గామించి రాజన్య శో
భిత కోటీర మణిప్రభాన్విత మహాపీఠంబు వర్జించి రు
న్నతులై నీవు మహోన్నతుండవుగదా! నారాయణధ్యాయివై. 507

1. నెద్దియున్ (హ) 2. భవిష్యజ్జన్మ కర్మంబులన్ (బ).

మ. వసుధాధీశ్వర! నీవు మర్త్యతనువున్ వర్జించి నిశ్శోకమై
వ్యసన చ్ఛేదకమై రజోరహితమై వర్తించు లోకంబు స
ర్వసమత్వంబునఁ జేరు నంతకు భవద్వాక్యంబులన్ వించు నే
దెసకుం బోవక చూచుచుండెదము నీ దివ్యప్రభావంబులన్. 508

వ. అని యిట్లు పక్షపాత శూన్యంబులును మహనీయ మాధుర్య గాంభీర్య సౌజన్య ధుర్యంబులును నైన భాషణంబు లాడుచు మూఁడులోకంబులకు నవ్వలి దైన సత్యలోకంబునందు మూర్తిమంతంబులై నెగడుచున్న నిగమంబుల చందంబునన్ దేజరిల్లుచున్న ఋషులం జూచి భూవరుండు నారాయణ కథాశ్రవణ కుతూహలుండై నమస్కరించి యిట్లనియె. 509

క. ఏడుదినంబుల ముక్తిం, గూడంగ నేరీతి వచ్చు గురు సంసార
క్రీడన మేక్రియ నెడతెగుఁ, జూడుఁడు మా తండ్రులార! శ్రుతివచనములన్. 510

శా. [1]ప్రాప్తానందులు బ్రహ్మబోధన కళాపారీణు లాత్మప్రభా
[2]లుప్తాజ్ఞానులు మీర లార్యులు దయాశత్వాభిరాముల్ మనో
గుప్తంబుల్ సకలార్థజాలములు మీకుం గానవచ్చుం గదా!
సప్తాహంబుల ముక్తి కేఁగెడు గతిన్ జర్చించి భాషింపరే. 511

వ. అని యుత్తరానందనుం డాడిన వచనంబులకు మును లందఱుఁ బ్రత్యుత్తరంబు విమర్శించు నెడ దైవయోగంబున. 512

—: శుకమహర్షి పరీక్షిన్మహారాజు నొద్ద కేతెంచుట :—

సీ. ప్రతినిమేషము పరబ్రహ్మంబు వీక్షించి మదిఁ జొక్కి వెలుపల మఱచువాఁడు
కమలంబు మీఁది భృంగములకై వడి మోముపైన నెఱపిన కేశపటలివాఁడు
[3]గిఱివ్రాసి మాయ [4]నంగీకరించనిభంగి వసనంబు గట్టక వచ్చువాఁడు
సంగి గాఁడని వెంటఁ జాటు ధూతములు నా బాలుర హాసశబ్దములవాఁడు

తే. మహిత పద జాను జంఘోరు మధ్య హస్త, బాహు వక్షో గళానన ఫాల కర్ణ
నాసికా గండమస్తక నయనయుగళుఁ డైన యవధూతమూర్తి వాఁడరుగుదెంచె.

ఉ. ఈరని లోకులం గినిసి యెగ్గులు వల్కనివాఁడు గోరికల్
గోరనివాఁడు గూటువలఁ గూడనివాఁడు వృథాప్రపంచమున్
జేరనివాఁడు దైవగతిఁ జేరిన లాభము సూచి తుష్టుఁడై
నేరనివాని చందమున నేర్పులు సూపెడువాఁడు వెండియున్. 514

1. ప్రాప్తుల్ పెద్దలు (చ. ట.) 2. లుప్తాజ్ఞాన మహాంధకారులు. 3. గిర (క.చ.ట.త.)
4. నంగీకరించిన భంగి (తం. వా.)

ఆ. అ మ్మహాత్ము [1]షోడశాబ్ది వయో రూప, గమన గుణ విలాస కౌశలముల
ముక్తికాంత సూచి మోహిత యగు నన, నితర కాంతలెల్ల నేమి చెప్ప! 515

ఆ. వెఱ్ఱితనము మాని విజ్ఞానమూర్తియై, బ్రహ్మభావమునను[2]బర్యటింప
వెఱ్ఱియనుచు [3]శుకుని వెంట నేతెంతురు, వెలఁదు లర్భకులును వెఱ్ఱు లగుచు. 516

వ. ఇట్లు వ్యాసనందనుం డైన శుకుం డరుగుదెంచిన నందలి మునీంద్రు లా మహాను భావుని ప్రభావంబు తెఱంగెఱుంగుదురు గావున నిజాసనంబులు విడిచి ప్రత్యుత్థానంబు సేసిరి. పాండవపౌత్రుండు నా యోగిజన శిఖామణికి నతిథిసత్కారంబు గావించి దండప్రణామంబు సేసి పూజించె. మఱియు గ్రహ నక్షత్రతారకా మధ్యంబునం దేజరిల్లు రాకాసుధాకరుండునుం బోలె బ్రహర్షి, దేవర్షి, రాజర్షి మధ్యంబునం గూర్చుండి విరాజమానుండైన శుకయోగీంద్రుం గనుంగొని. 517

ఉ. ఫాలము నేలమోపి భయభక్తులతోడ నమస్కరించి భూ
పాలకులోత్తముండు కరపద్మములన్ ముకుళించి నేఁడు నా
పాలిటి భాగ్య మెట్టిదియొ! పావనమూర్తివి పుణ్యకీర్తి వీ
వేళకు నీవువచ్చితి వివేక విభూషణ! దివ్యభాషణా! 518

మ. అవధూతోత్తమ! మంటి నేఁడు నిను డాయం గంటి నీవంటి వి
ప్రవరుల్ బేర్కొను నంతటన్ భసితమౌ పాపంబు నా బోఁటికిన్
భవదాలోకన భాషణార్చన పద ప్రక్షాళన స్పర్శనా
ది విధానంబుల ముక్తి చేపడుట చింతింపంగ నాశ్చర్యమే? 519

క. హరిచేతను దనుజేంద్రులు, ధర గ్రుగ్గెడుభంగి నీ పదస్పర్శముచే
గురు పాతకసంఘంబులు, [4]పొరిమాలుఁగదయ్య యోగిభూషణ! వింటే. 520

మ. ఎలమిన్ మేనమఱందియై సచివుఁడై యే మేటి మా తాతలన్
బలిమిన్ గాచి సముద్రముద్రిత ధరం బట్టంబు గట్టించె న
య్యలఘుం డీశుఁడు చక్రి రక్షకుఁడు నా కన్యుల్ విపద్రక్షకుల్
గలరే? వేఁడెద భక్తి నా గుణనిధిం గారుణ్య వారాన్నిధిన్. 521

సీ. అవ్యక్త మార్గుఁడ వైన నీ దర్శన మాఱడిఁ బోనేర దభిమతార్థ
సిద్ధి గావించుట సిద్ధంబు నేఁడెల్లి దేహంబు వర్జించు దేహధారి
కేమి చింతించిన నేమి జపించిన నేమి గావించిన నేమి వినిన
నేమి సేవించిన నెన్నఁడు సంసార పద్ధతిఁ బాసిన పదవి గలుగు

1. మందహాస (క.ట.డ.) 2. పరిణమింప (ద) 3. సుతుని (హ) 4. పొరిదూలు (హ).

తే. నుండుమనరాదు గురుఁడవు యోగివిభుఁడ, వరయ మొదవును బిదికిన యంత
తడవుగాని సొక దెస నుండవు కరుణతోఁడ,జెప్పవే తంఁడ్రి ముక్తికిఁ జేరుతెరువు.

వ. అని పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగె నని చెప్పి. 523

క. రాజీవపత్ర లోచన ! రాజేంద్ర కిరీటఘటిత రత్నమరీచి
భ్రాజిత పాదాంభోరుహ ! భూజనమందార ! నిత్య పుణ్యవిచారా ! 524

మాలిని. అనుపమ గుణహారా ! హన్యమానారివీరా !
జన వినుత విహారా ! జానకీ చిత్త చోరా !
దనుజ ఘనసమీరా ! దానవ శ్రీ విదారా !
ఘన [1]కలుషకఠోరా ! [2]కంధి గర్వాపహారా ! 525

గద్య. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర, కేసనమంత్రి పుత్త్ర, సహజ పాండిత్య, పోతనామాత్య ప్రణీతంబైన, శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు, నైమిశారణ్య వర్ణనంబును, శౌనకాదుల ప్రశ్నంబును, సూతుండు నారాయణావతార సూచనంబు సేయుటయు, వ్యాసచింతయు, నారదాగమనంబును, నారదుని పూర్వకల్ప వృత్తాంతంబును, పుత్రశోకాతురయైన ద్రుపద రాజనందన కర్జునుం డశ్వత్థామను దెచ్చి యొప్పగించి విడిపించుటయు, భీష్మ నిర్యాణంబును, ధర్మనందను రాజ్యాభిషేకంబును, గోవిందుని ద్వారకాగమనంబును, విరాటకన్యకా గర్భ పీడ్యమానుండైన యర్భకు నశ్వత్థామ బాణానలంబువలనం బాపి విష్ణుండు రక్షించుటయు, పరీక్షిజ్జన్మంబును, గాంధారీ ధృతరాష్ట్ర విదుర నిర్గమంబును, నారదుండు ధర్మజునికిఁ గాలసూచనంబు సేయుటయు, కృష్ణావతార విసర్జనంబు విని పాండవులు మహాపథంబునం జనుటయు, దిగ్విజయంబు సేయుచు నభిమన్యు పుత్రుండు శూద్రరాజ లక్షణుండగు కలి గర్వంబు సర్వంబు మాపి గో వృషాకారంబుల నున్న ధరణీ ధర్మదేవతల నుద్ధరించుటయు, శృంగిశాపభీతుండై యుత్తరానందనుండు గంగాతీరంబునం బ్రాయోపవేశంబున నుండి శుకదర్శనంబు సేసి మోక్షోపాయం బడుగుటయు, నను కథలుగల ప్రథమ స్కంధము సంపూర్ణము. 526

---

1. కలహ (చ. హ.) 2. కంసగర్వాపహారా! (జ).

ఓమ్

# శ్రీమహాభాగవతము

—●—

## ద్వితీయస్కంధము

క. శ్రీమద్భక్త చకోరక, సోమ! వివేకాభిరామ! సురవినుత గుణ
స్తోమ! నిరలంకృతాసుర, రామా సీమంతసీమ! రాఘవరామా!

### అధ్యాయము - ౧

వ. మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె. అట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

—: శుకుఁడు పరీక్షితునకు ముక్తి మార్గంబుఁ దెల్పుట :—

సీ. క్షితిపతి! నీ ప్రశ్న సిద్ధంబు మంచిది యాత్మవేత్తలు మెత్తు రఖిలశుభద
మాకర్ణనీయంబు లయుతసంఖ్యలు గల వందు ముఖ్యం బిది [1]యఖిలవరము
గృహములలోపల గృహమేధులగు నరు లాత్మతత్త్వము లేశమైన నెఱుఁగ
రంగనారతుల నిద్రాసక్తిఁ జను రాత్రి, పోవుఁ గుటుంబార్థబుద్ధి నహము

ఆ. పశు కళత్ర పుత్ర బాంధవ దేహాది, సంఘమెల్లఁ దమకు సత్యమనుచు
గాఁపురములు సేసి కడపటఁ జత్తురు, కనియుఁ గాన రంత్యకాలసరణి. 3

క. కావున సర్వాత్మకుఁడు మ, హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ డాకర్ణింపన్
సేవింపను వర్ణింపను, భావింపను భావ్యుఁ డభవభాజికి నధిపా! 4

ఆ. జనులకెల్ల శుభము సాంఖ్యయోగము దాని, వలన ధర్మనిష్ఠవలన నైన
నంత్యకాలమందు హరిచింతసేయుట, పుట్టువునకు ఫలము భూవరేంద్ర! 5

తే. అరసి నిర్గుణబ్రహ్మంబు నాశ్రయించి, విధి నిషేధ[2]ము లొల్లని విమలమతులు
సేయుచుందురు హరిగుణ చింతనములు, మానసంబుల [3]నెప్పుడు మానవేంద్ర!

---

1. యధికతరము (తం.వా.) 2. నివృత్తులై పెలయు మునులు (ఢ); నివృత్త సద్విమల మతులు (హ); నివృత్తి...(తం.వా.) 3. దలపుచు (క); దలఁచుచు (హ); నేప్రొద్దు (తం. వా.).

సీ. ద్వైపాయనుండు మా తండ్రి ద్వాపరవేళ బ్రహ్మసమ్మితమైన భాగవతము
పఠనంబు సేయించె బ్రహ్మతత్పరుఁడనై యుత్తమశ్లోక లీలోత్సవమున
నాకృష్ట చిత్తుండనై పఠించితి నీవు హరిపాద భక్తుండ వగుటఁజేసి
యెఱిఁగింతు వినవయ్య ! యీ భాగవతమున విష్ణుసేవాబుద్ధి విస్తరిల్లు

ఆ. మోక్షకామునకును మోక్షంబు సిద్ధించు, భవభయంబు లెల్లఁ బాసిపోవు
యోగి సంఘమునకు నుత్తమ వ్రతములు, వాసుదేవ నామవర్ణనములు. 7

తరల. హరి నెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁడై
పొరలుచుండెడి వెఱ్ఱి ముక్తికిఁ బోవనేర్చునె ? వాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు సత్య మా హరినామ సం
స్మరణ మొక్క ముహూర్తమాత్రము సాలు ముక్తిదమౌ నృపా ! 8

సీ. కౌరవేశ్వర ! తొల్లి ఖట్వాంగుఁడను విభుం డిల నేడుదీవుల నేలుచుండి
శక్రాది దివిజులు సంగ్రామభూముల నుగ్రదానవులకు నోడి వచ్చి
తమకుఁ దోడడిగిన ధరనుండి దివికేగి దానవవిభుల నందఱ వధింప
వరమిత్తు మనుచు దేవతలు సంభాషింప జీవితకాలంబు చెప్పుఁ డిదియ

ఆ. వరము నాకు నొండు వరమొల్ల ననవుఁడు, నాయు వొకముహూర్త మంతతడవు
గలదటంచుఁ బలుక గగనయానమున న,మ్మానవేశ్వరుండు మహికి వచ్చి, 9

క. గిరులం బోలెడి కరులను హరులం దన ప్రాణదయితలై మనియెడి సుం
దరులను హిత నరులను బుధ, వరులను వర్జించి గాఢ వైరాగ్యమునన్. 10

క. గోవిందనామ కీర్తనఁ, గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీవిభుఁడు మూఱగొనియెను, గైవల్యము దొల్లి రెండు గడియల లోనన్. 11

వ. వినుము నీకు నేడు దివసంబులకుం గాని జీవితాంతంబు గాదు. తావత్కాలం
బునకుం బారలౌకిక సాధనభూతంబగు పరమ కల్యాణంబు సంపాదింపవచ్చు.
అంత్యకాలంబు డగ్గఱిన బెగ్గడిలక దేహి దేహ పుత్ర కళత్రాది సందోహ జాలంబు
వలని మోహజాలంబు నిష్కామ కరవాలంబున నిర్మూలంబుసేసి,గేహంబువెడలి
పుణ్యతీర్థ జలావగాహం బొనర్చి, యేకాంత శుచిప్రదేశంబున విధివత్ప్రకారం
బునం గుశాజిన చేలంబుల తోడం గల్పితాసనుండై,మానసంబున *(నిఖిల జగ

1. మహోత్సవమున (వ్రాత ప్రతులన్నింట) *తాళపత్రములందు లేదు. స్వతః పవిత్రత్వేసతి నిఖిల జగత్పవిత్రీకరణ సమర్థమ్ (శ్రీధరీయ వ్యాఖ్యానము).

త్పవిత్రీకరణ సమర్థంబగు) అకారాది త్రివర్ణ కలితంబై బ్రహ్మబీజంబైన ప్రణవంబు సంస్మరింపుచు, వాయువుల జయించి, విషయంబుల వెంట నంటి గెంటి పాఱెడి యింద్రియంబుల బుద్ధిసారథియై మనో నామకంబులైన పగ్గంబుల బిగ్గం బట్టి మ్రొగ్గఁదిగిచి, దట్టంబులైన కర్మఘట్టంబుల నిట్టట్టు మెట్టెడు మనంబును శేముషీబలంబున నిరోధించి, భగవదాకారంబుతోడ బంధించి, నిర్విషయంబైన మనంబున భగవత్పాదాద్యవయవంబులు క్రమంబున ధ్యానంబు సేయుచు, రజస్తమో గుణంబులచేత నాక్షిప్తంబు విమూఢంబు నగు చిత్తంబునఁ ద ద్గుణంబులవలన నయ్యెడి మలంబులం ధారణావశంబునఁ బో నడిచి, నిర్మల చిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుం జను. ధారణానియమంబు గలుగ సుఖాత్మకంబగు విషయంబు నవలోకించు యోగికి భక్తిలక్షణంబైన యోగంబు వేగంబె సిద్ధించు. అనిన యోగీంద్రునకు నరేంద్రుం డిట్లనియె. 12

క. ధారణ యే క్రియ నిలుచును? ధారణ కే రూప? మెద్ది ధారణ యనఁగా ?
ధారణ పురుష మనోమల, మే రీతి హరించు ? నాకు నెఱిఁగింపఁ గదే. 13

వ. అనిన విని రాజునకు నవధూతవిభుం డిట్లనియె. 14

ఆ. పవనములు జయించి పరిహృత సంగుఁడై, యింద్రియముల గర్వమెల్ల మాపి
హరి విశాలరూపమందుఁ జిత్తము సేర్చి, నిలుపవలయు బుద్ధినెఱపి బుధుఁడు. 15

వ. వినుము. భగవంతుండైన హరి విరాడ్విగ్రహంబునందు భూత భవిష్య ద్వర్తమానంబైన విశ్వంబు విలోక్యమానం బగు. ధరణీ సలిల తేజ స్సమీరణ గగనాహంకార మహత్తత్త్వంబు లనియెడి సప్తావరణంబులచేత నావృతంబగు మహాండకోశంబైన శరీరంబునందు ధారణాశ్రయంబైన వైరాజపురుషుండు దేజరిల్లు. [1]అమ్మహాత్మునికిఁ బాదమూలంబు పాతాళంబు, పార్ష్ణిభాగ పాదాగ్ర భాగంబులు రసాతలంబు, గుల్ఫంబు మహాతలంబు, జంఘలు తలాతలంబు, జానుద్వయంబు సుతలంబు, ఊరువులు వితలాతలంబులు, జఘనంబు మహీతలంబు, నాభీ వివరంబు నభస్తలంబు, వక్షంబు గ్రహ తారకా ముఖర జ్యోతిస్సమూహ సమేతంబగు నక్షత్రలోకంబు, గ్రీవము మహర్లోకంబు, ముఖంబు జనలోకంబు, లలాటంబు తపోలోకంబు, శీర్షంబులు సత్యలోకంబు, బాహుదండంబు లింద్రాదులు, కర్ణంబులు దిశలు, శ్రవణేంద్రియంబు శబ్దంబు, నాసాపుటంబు లశ్వినీదేవతలు, ఘ్రాణేంద్రియంబు గంధంబు, వదనంబు వహ్ని, నేత్రంబు లంతరిక్షంబు, చక్షురింద్రియము సూర్యుండు, [2]రేయింబగళ్ళు ఱెప్పలు, భ్రూయుగ్మ విజృంభణంబు

1. నమ్మహావిష్ణువునకు (క. చ. త.); 2. రేవగళ్ళు (తం. వా.)

బ్రహ్మపదంబు, తాలువులు జలంబు, జిహ్వేంద్రియంబు రసంబు, భాషణంబులు సకలవేదంబులు, దంష్ట్రలు దండధరుండు, దంతంబులు పుత్రాది స్నేహకళలు, నగవులు జనోన్మాద కారిణియగు మాయ, కటాక్షంబులు దురంత సంసర్గంబులు, పెదవులు వ్రీడాలోభంబులు, స్తనంబులు ధర్మంబు, వెన్నుధర్మమార్గంబు, మేఢ్రంబు ప్రజాపతి, వృషణంబులు మిత్రావరుణులు, జఠరంబు సముద్రంబులు, శల్యసంఘంబులు గిరులు, నాడీ నివహంబులు నదులు, తనూరుహంబులు తరువులు, నిశ్వాసంబులు వాయువులు. *కాలంబు గమనంబు, కర్మంబులు నానావిధ జంతుసన్నివహ సంవృత సంసరణంబులు, శిరోజంబులు మేఘంబులు, కట్టుపుట్టంబులు సంధ్యలు, హృదయంబు ప్రధానంబు, సర్వవికారంబులకు నాశ్రయభూతంబైన మనము చంద్రుండు, చిత్తంబు మహత్తత్త్వంబు, అహంకారంబు రుద్రుండు, అశ్వాశ్వతర్యుష్ట్ర గజంబులు నఖంబులు, కటిప్రదేశంబు పశుమృగాదులు, విచిత్రంబులైన [1]యాలాపనైపుణంబులు పక్షులు, బుద్ధి మనువు, నివాసంబు పురుషుండు, షడ్జాదులయిన స్వరవిశేషంబులు గంధర్వ విద్యాధర సిద్ధ చారణాప్సర స్సమూహంబులు, స్మృతి ప్రహ్లాద ప్రముఖులు, వీర్యంబు దైత్య దానవానీకంబై యుండు. మఱియు నమ్మహావిభునకు ముఖంబు బ్రాహ్మణులు, భుజంబులు క్షత్త్రియులు, ఊరులు వైశ్యులు, చరణంబులు శూద్రులు, నామంబులు నానావిధంబులైన వసు రుద్రాది దేవతాభిధానంబులు, ద్రవ్యంబులు హవిర్భాగంబులు, కర్మంబులు యజ్ఞప్రయోగంబులు. ఇట్టి సర్వమయుండైన పరమేశ్వరుని విగ్రహంబున ముముక్షుండైన వాఁడు మనస్సంధానంబు సేయవలయునని చెప్పి వెండియు నిట్లనియె. 16

క. హరిమయము విశ్వమంతయు, హరి విశ్వమయుండు సంశయము పనిలే దా
హరిమయము గాని ద్రవ్యము, పరమాణువు లేదు వంశపావన! వింటే. 17

సీ. కలలోన జీవుండు కౌతూహలంబునఁ బెక్కు దేహంబులఁ బేరు వడసి
యింద్రియంబుల వెంట నెల్లవృత్తంబులు నీక్షించి మఱి తన్ను నెఱుఁగు కరణి
నఖిలాంతరాత్మకుఁ డగు పరమేశ్వరుఁ డఖిల జంతుల హృదయములనుండి
బుద్ధివృత్తులనెల్ల బోద్ధయై వీక్షించు బంధబద్ధుఁడు కాఁడు ప్రాభవమున,

తే. సత్యుఁ డానందబహుళ విజ్ఞానమూర్తి, యతని సేవింప నగుఁ గాక యన్యసేవఁ
గలుగ నేరవు కైవల్య గౌరవములు, పాయ దెన్నఁడు సంసార బంధ మధిప!

* ప్రాయంబు నిరవధికం బయిన కాలంబు (తం. వా.) అనంతవీర్యస్య వయఃకాలః తస్య గమనమ్ (వ్యాఖ్యా) 1. శిల్పనైపుణంబులు (హ)

అధ్యాయము—౨

మ. బహువర్షంబులు బ్రహ్మ దొల్లి జగ ముత్పాదింప విన్నాణి గా
క హరిప్రార్థన ధారణా వశమునం గాదే, యమూఢోల్లస
న్మహనీ యోజ్జ్వల బుద్ధియై భువన నిర్మాణ ప్రభావంబునన్
విహరించె న్నరనాథ! జంతునివహావిర్భావ నిర్ణేతయై. 19

వ. విను మూఢుండు శబ్దమయ వేదమార్గంబైన కర్మఫల బోధన ప్రకారంబున వ్యర్థంబులైన స్వర్గాది నానాలోక సుఖంబుల నిచ్ఛయించు. మాయామయ మార్గంబున వాసనామూలంబున (సుఖంబని తలంచి) నిద్రించువాఁడు కలలు గను తెఱంగునం బరిభ్రమించు.నిరవద్య సుఖలాభంబును జెందఁడు.తన్నిమిత్తంబున విద్వాంసుండు (నామ మాత్ర సారంబులగు) భోగ్యంబులలోన నెంతట దేహ నిర్వహణంబు సిద్ధించు నంతియ కైకొనుచు నప్రమత్తుండై సంసారంబు సుఖమని నిశ్చయింపక యొండు మార్గంబున సిద్ధి గలదని చూచి [2]పరిశ్రమంబు నొందకుండు. 20

సీ. కమనీయ భూమి భాగములు లేకున్నవే? పడియుండుటకు దూది పఱుపు లేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నవే? భోజన భాజన పుంజ మేల?
[3]వల్కలాశాజినావళులు లేకున్నవే? కట్ట దుకూల [4]సంఘాత మేల?
గొనకొని వసియింప గుహలు లేకున్నవే? ప్రాసాద సౌధాది పటల మేల?

తే. ఫల రసాదులు గురియవే? పాదపములు, స్వాదుజలముల నుండవే? సకలనదులుఁ
బొసఁగ భిక్షయుఁ బెట్టరే? పుణ్యసతులు, ధనమదాంధుల కొలువేల? తాపసులకు.

క. రక్షకులు లేనివారల, రక్షించెద ననుచుఁ జక్రి రాజై యుండన్
రక్షింపు మనుచు నొక నరు, నక్షముఁ బ్రార్థింపనేల? యాత్మజ్ఞునకున్. 22

వ. అని యిట్లు స్వతస్సిద్ధుండు, [5]ఆత్మయు, నిత్యుండును, సత్యుండును, భగవంతుండునైన వాసుదేవుని భజియించి తదీయ సేవానుభవానందంబున, సంసార హేతువగు నవిద్యచే బుద్ధిమంతుండు విడువంబడుం గావున. 23

1. నిరూఢిన్ లసత్ (హ); యమోఘోల్లసత్ (తం. వా.) 2. పరిభ్రమణంబు సేయుచుండు (తం. వా.) 3. వల్కలాజిన కుశావళులు (హ. తం. వా.) 4. సంఘంబులేల (హ. తం. వా.) 5. ఆత్మప్రియుండు సత్యుండును (హ).

మ. హరిఁ జింతింపక మత్తుఁడై విషయ చింతాయత్తుఁడై చిక్కి వా
సరముల్ ద్రొబ్బెడు వాఁడు కింకర గదాసంతాడితోరస్కుఁడై
ధరణీశోత్తమ! దండభృన్నివసన ద్వారోపకంఠోగ్ర వై
తరణీ వహ్నిశిఖా పరంపరలచే దగ్ధుండు గాకుండునే? 24

క. మొత్తుదురు గదల మంటల, కెత్తుదు రద్దంబు దేహ మింతింతలుగా
నొత్తుదు రసిపత్రికలను, హత్తుదురు కృతాంతభటులు హరి విరహితులన్. 25

వ. మఱియు హరి చరణకమల గంధ రసాస్వాదనం బెఱుంగని వారలు నిజ కర్మ బంధంబున దండధర ద్వార దేహళీ సమీప జాజ్వల్యమాన వైతరణీ తరంగిణీ దహన దారుణజ్వాలా జాల దందహ్యమాన దేహులం గూడి శిఖి శిఖావహ గాహంబుల నొందుచుండుదురు. మఱియు విజ్ఞానసంపన్నులై మను ప్రసన్ను లెంతయు మాయాపన్నులు గాక విన్నాణంబునం దమ తమ హృదయాంత రాళంబులం బ్రాదేశమాత్ర దివ్యదేహుండును, దిగిభరాజ శుండాదండ సంకాశ దీర్ఘ చతుర్బాహుండును, భోగైశ్వర్య ప్రదుండును, కంజాత శంఖచక్ర గదా ధరుండును, కందర్ప కోటి సమాన సుందరుండును, రాకా విరాజమాన రాజ మండల సన్నిభ వదనుండును, సౌభాగ్య సదనుండును, ప్రభాతకాల భాసమాన భాస్కరబింబ ప్రతివిరాజిత పద్మరాగ రత్నరాజి విరాజమాన కిరీట కుండలుం డును, శ్రీవత్స లక్షణ లక్షిత వక్షోమండలుండును, రమణీయ కౌస్తుభరత్న ఖచిత కంఠికాలంకృత కంధరుండును, నిరంతర పరిమళ మిళిత వనమాలికా బంధు రుండును, నానావిధ గంభీర హార కేయూర కటక కంకణ మేఖ లాంగుళీయక విభూషణవ్రాత సముజ్జ్వలుండును, నిటలతట విలంబమాన విమల స్నిగ్ధ నీల కుంచిత కుంతలుండును, తరుణ చంద్ర చంద్రికా ధవళ మందహాసుండును, పరి పూర్ణ కరుణావలోకన భ్రూభంగ సూచిత సుభగ సంతతానుగ్రహ లీలా విలా సుండును, మహాయోగిరాజ విలసిత హృదయ కమల కర్ణికామధ్య సంస్థాపిత చరణ కిసలయుండును, (సంతతానంద మయుండును), సహస్రకోటి సూర్య సంఘాత సన్నిభుండును, మహావిభుండు నైన పరమేశ్వరుని మనోధారణా వశంబున నిలిపికొని, తదీయ గుల్ఫ చరణ జాను జంఘాద్యవయవంబులు క్రమంబున నొకటి నొకటినిఁ బ్రతిక్షణంబును ధ్యానంబు సేయుచు నెంతకాలంబు నకుఁ బరిపూర్ణ నిశ్చల భక్తియోగంబు సిద్ధించు నంతకాలంబునుం దదీయ చింతాతత్పరులై యుండుదురు. అని మఱియు నిట్లనియె.

సీ. ఆసన్న మరణార్థి యైన యతీశుండు కాలదేశములను గాచికొనఁడు
తనువు విసర్జించు తలఁపు జనించిన భద్రాసనస్థుఁడై ప్రాణపవను
మనసుచేత జయించి మానసవేగంబు బుద్ధిచే భంగించి బుద్ధిఁ దెచ్చి
క్షేత్రజ్ఞుతోఁ గూర్చి క్షేత్రజ్ఞు నాత్మలోపలఁ జేర్చి యాత్మను బ్రహ్మమందుఁ

తే. గలిపి యొక్కటి గావించి గారవమున, శాంతితోఁ నిరూఢుఁడై సకలకార్య
నివహ మెల్లను దిగనాడి నిత్యసుఖము,వలయునని చూచు నటుమీఁద వసుమతీశ.

వ. వినుము పరమాత్మయైన బ్్రహ్మమునకుఁ దక్క కాల [1]దేవ సత్త్వ రజ స్తమో గుణాహంకార మహ త్తత్త్వ ప్రధానంబులకు సామర్థ్యంబు లేదు. కావునఁ బరమాత్మ వ్యతిరిక్తంబు లేదు. దేహాదులం దాత్మత్వంబు విసర్జించి, యన్య సౌహృదంబు మాని,పూజ్యంబైనహరిపదంబును(బ్రతిక్షణంబును)హృదయంబున నాలింగనంబుసేసి,వైష్ణవంబైన పరమ పదంబు(సర్వోత్తమం బని)సత్పురుషులు దెలియుదురు. ఇ వ్విధంబున విజ్ఞానదృగ్వీర్య జ్వలనంబున నిర్దగ్ధ విషయవాస నుండై క్రమంబున నిరపేక్షత్వంబున. 28

సీ. అంఘ్రిమూలమున మూలాధార చక్రంబుఁ బీడించి ప్రాణంబు బిగియఁ బట్టి
నాభితలముఁ జేర్చి నయముతో మెల్లన హృత్సరోజము మీఁది కెగయఁబట్టి
యటమీఁద నురమందు హత్తించి క్రమ్మఱఁ దాలు మూలమునకుఁ దఱిమి నిలిపి
మమతతో భ్రూయుగ మధ్యంబుఁ జేర్చి దృక్కర్ణ నాసాస్య మార్గములు మూసి

తే. యిచ్ఛలేని యోగి యొక్క ముహూర్తార్ధ, మింద్రియానుషంగ మింతలేక
ప్రాణములను బంచి బ్రహ్మరంధ్రము చించి,బ్రహ్మమందుఁ గలయుఁ బౌరవేంద్ర!

వ. మఱియు దేహత్యాగకాలంబున నింద్రియంబులతోడి సంగంబులు విడువనివాఁడు వానితోడన ( గుణసముదాయ రూపంబగు ) బ్రహ్మాండంబునందు ఖేచర సిద్ధ విహార యోగ్యంబు నణిమాది సకలైశ్వర్య సమేతంబునైన పరమేష్ఠిపదంబుఁ జేరు. విద్యాతపో యోగసమాధి భజనంబు సేయుచుఁ బవనాంతర్గత లింగశరీరు లైన యోగీశ్వరులకు బ్రహ్మాండ బహి రంతరాళంబులు గతియని చెప్పుదురు. ఏరికిని గర్మంబుల నట్టి గతిఁ బొంద శక్యంబుగాదు. యోగి యగువాఁడు బ్రహ్మలోకంబునకు నాకాశపథంబునం బోవుచు సుషుమ్నానాడివెంట నగ్ని యను దేవతం [2]జేరి జ్యోతిర్మయంబైన తేజంబున నిర్మలుండై యెందునుం

1. దేశ (హ.తం.క.బ.) 2. జేసి (హ) అగ్ని నధిదేవతం జేసి (తం.వా.) 'వైశ్వానరం యాతి (-24) వైశ్వానరం అగ్న్యభిమానినీం దేవతాం యాతి (వ్యాఖ్య).

వగులు వడక తారామండలంబు మీఁద సూర్యాది ధ్రువాంత పదంబులఁ గ్రమ
క్రమంబున నతిక్రమించి, హరి సంబంధంబైన శింశుమార చక్రంబుఁ జేరి
(యొంటరి యగుచు)పరమాణు భూతంబైన లింగశరీరంబుతోడ బ్రహ్మవిదులకు
నెలవైన మహర్లోకంబుఁ జొచ్చి మహాకల్ప కాలంబు క్రీడించుచుఁ గల్పాంతం
బున ననంత ముఖానల జ్వాలా జాల దందహ్యమానంబగు లోకత్రయంబు
నీక్షించుచుఁ, దన్నిమిత్త సంజాత దాహతాపంబు సహింపంజాలక,

సీ. ఇల మీఁద మనువు లీ రేడ్వురుఁ జనువేళ దివసమై యెచ్చోటఁ దిరుగుచుండు
మహనీయ సిద్ధ విమానసంఘము లెందు దినకరప్రభములై తేజరిల్లు
శోక జరా మృత్యు శోషణ భయ దుఃఖ నివహంబు లెందు జనింపకుండు
విష్ణుపద ధ్యాన విజ్ఞాన రహితుల శోకంబు లెందుండి చూడవచ్చు

ఆ. పరమ సిద్ధయోగి భాషణామృత మెందు, శ్రవణపర్వ మగుచు జరుగు చుండు
నట్టి బ్రహ్మలోకమందు వసించును, రాజవర్య! మఱల రాఁడు వాఁడు. 31

వ. మఱియు నొక్క విశేషంబు గలదు. పుణ్యాతిరేకంబున బ్రహ్మలోకగతు లైన
వారు కల్పాంతరంబునం బుణ్యతారతమ్యంబుల నధికార విశేషంబు నొందువార
లగుదురు. బ్రహ్మాది దేవతాభజనంబునం జనువారు(బ్రహ్మ జీవితకాలంబుదనుక)
బ్రహ్మలోకంబున వసియించి (ముక్తు లగుదురు). నారాయణ చరణకమల భక్తి
పరాయణత్వంబునఁ జనినవారు నిజేచ్ఛా వశంబున నిరర్గళగమనులై బ్రహ్మాం
డంబు భేదించి మహోన్నత వైష్ణవపదారూఢులై తేజరిల్లుదురు. ఈశ్వరాధిష్ఠితం
బైన ప్రకృతియంశంబున మహత్తత్త్వమగు. మహత్తత్త్వాంశంబున నహంకారం
బగు. అహంకారాంశంబున శబ్దతన్మాత్రం బగు. శబ్దతన్మాత్రాంశంబున గగన మగు.
గగనాంశంబున స్పర్శతన్మాత్రం బగు. స్పర్శ తన్మాత్రాంశంబున సమీరణం
బగు. సమీరణాంశంబున రూపతన్మాత్రం బగు. రూపతన్మాత్రాంశంబు వలనఁ దేజం
బగు. తేజోంశంబున రసతన్మాత్రం బగు. రసతన్మాత్రాంశంబు వలన జలం బగు.
జలాంశంబున గంధతన్మాత్రం బగు. గంధతన్మాత్రాంశంబునఁ బృథివి యగు.
వాని మేళనమునం జతుర్దశ భువనాత్మకంబైన విరాడ్రూపం బగు. ఆ రూపము
నకుఁ గోటియోజన విశాలంబైన యండకటాహంబు ప్రథమావరణంబైన పృథ్వి
యగు. దీనిఁ బంచాశత్కోటి విశాలం బని కొందఱు పలుకుదురు. అ య్యావర
ణంబు మీఁద సలిల తేజ స్సమీర గగనాహంకార మహత్తత్త్వంబు లనియెడి
యావరణంబులు క్రమంబున నొండొంటికి దశగుణోత్తరాధికంబులై యుండు.
అట్టి యేడింటి మీఁదఁ బ్రకృత్యావరణంబు మహావ్యాపకం బగు బ్రహ్మాండంబు

భేదించి, వైష్ణవ పదారోహణంబు సేయువాఁడు నిర్భయుండై, మెల్లన (లింగ దేహంబున)బృథివ్యాత్మకత్వంబు నొంది, యట్టి పృథివ్యాప్తకత్వంబున ఘ్రాణం బునం గంధంబును, జలాత్మకత్వంబున రసనేంద్రియంబున రసంబును, తేజో రూపకత్వంబున దర్శనంబున రూపంబును, సమీరణాత్మకత్వంబున దేహంబున స్పర్శనంబును, గగనాత్మకత్వంబున శ్రవణంబున శబ్దంబును నతిక్రమించి భూత సూక్ష్మేంద్రియ లయస్థానంబైన యహంకారావరణ సంప్రాప్తుండై, యందు మనోమయంబును దేవమయంబును నైన సాత్త్వికాహంకార గమనంబున మహత్తత్త్వంబు సొచ్చి గుణత్రయంబును లయించిన ప్రధానంబు నొంది, ప్రధానాత్మకత్వంబున దేహంబు నుపాధి[1]పరంపరావసానంబునం బ్రకృతిం దాపి యానందమయుండై యానందంబునం బరమాత్మ రూపంబైన వాసుదేవ బ్రహ్మ మందుఁ గలియు నని చెప్పి వెండియు నిట్లనియె. 32

ఆ. పరమ భాగవతులు పాటించు పథ మిది, యా పథమున యోగి యరిగె నేని మగుడి రాఁడు వాఁడు మఱి సంశయము లేదు, పల్వశతములైన కౌరవేంద్ర!

వ. వినుము. నీవడిగిన సద్యోముక్తియుఁ గ్రమముక్తియు ననియెడు నీ రెండుమార్గం బులు వేదగీతంబులందు వివరింపంబడియె. వీనిం దొల్లి భగవంతుండైన వాసు దేవుండు బ్రహ్మచేత నారాధితుండై చెప్పె. సంసార ప్రవిష్టుండైన వానికిఁ దపోయోగాదులైన మోక్షమార్గంబులు పెక్కు గలవు. అందు భక్తిమార్గంబు కంటె సులభంబు లేదు.

—: శుకుఁడు పరీక్షిత్తునకు భక్తిమార్గంబె ముఖ్యంబని తెలుపుట :—

మ. విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబు మువ్మాఱు [2]మ
ర్శనయజ్ఞత్వము దోఁప నంతయుఁ బరామర్శించి మోక్షంబు ద
క్కున [3]మార్గంబుల వెంట లేదనుచు భక్తిం జింతసేసెన్ జనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుఁ డగుచున్ దన్మార్గ నిర్ణేతయై. 35

సీ. అఖిలభూతములందు నాత్మరూపంబున నెవ్వండు హరి యుండు నెల్లప్రొద్దు
[4]బుద్ధ్యాది లక్షణంబులఁ గానఁబడును [5]మహానేవనీయుఁ డహర్నిశంబు
వందనీయుఁడు భక్తవాత్సల్య సంతత నియతుఁడై సతతంబు నియతబుద్ధి
నాత్మరూపకుఁ డగు హరి కథామృతములు గర్ణపుటంబులఁ గాంక్షదీరఁ

తే. గ్రోలుచుండెడి ధన్యులు గుటిల బహుళ,విషయ మలినీకృతాంగముల్ వేగ విడిచి
విష్ణుదేవుని చరణారవిందయుగము, కడకుఁ జనుదురు సిద్ధంబు కౌరవేంద్ర. 36

1. పరంపరావస్థానంబున (హ.తం.వా.) 2. నెమ్మనమందుం దలపోసి యంతయు (హ.తం.వా.)
3. మార్గంబున లేదటంచు (హ) 4. బుద్ధివిశేషణంబుల (క.చ.ట.జ.) 5. మహత్సేవనీయుఁడు (తం.వా.)

అధ్యాయము —౩

క. మానుషజన్మము నొందిన, మానవులకు లభ్యమానమరణులకు మహా
జ్ఞానులకుఁ జేయవలయు, విధానము నిగదింపఁబడియె ధరణీనాథా! 37

వ. వినుము. బ్రహ్మవర్చస కాముఁడైన వానికి *వేదవిధుండగు చతుర్ముఖుండును, నింద్రియపాటవ కామునికి నింద్రుండును, ప్రజాకామునకు దక్షాది ప్రజాపతులును, భోజనకామునకు నదితియు, స్వర్గకామునికి నాదిత్యులును, రాజ్యకామునికి విశ్వదేవతలును, దేశ ప్రజా సాధనకామునికి సాధ్యులును, శ్రీకామునికి దుర్గయు, తేజస్కామునకు నగ్నియు, ధనకామునకు వసువులును, వీర్యకామునకు వీర్యప్రదులగు రుద్రులును, నాయుష్కామునకు నశ్వినీదేవతలును, పుష్టికామునకు భూమియు, ప్రతిష్ఠాకామునికి లోకమాతలైన గగన భూదేవతలును, సౌందర్యకామునకు గంధర్వులును, కామినీకామునకప్సరసయగు నూర్వశియు, సర్వాధిపత్య కామునకు బ్రహ్మయు, కీర్తికామునకు యజ్ఞోపాధికుండగు విష్ణువును, విత్తసంచయ కామునకుం బ్రచేతసుండును, విద్యాకామునకు నుమావల్లభుండును, దాంపత్యప్రీతి కామునకు నుమాదేవియు, ధర్మార్థ కామునకు నుత్తమ శ్లోకుండగు విష్ణువును, సంతానకామునకుఁ బితృదేవతలును, రక్షాకామునకు యక్షులును, బలకామునకు మరుద్గణంబులును, రాజత్వకామునకు మనురూప దేవతలును, శత్రుమరణ కామునకుఁ గోణపాలకుండైన రాక్షసుండును, భోగ కామునకుఁ జంద్రుండును భజనీయు లగుదురు. మఱియు, 38

క. కామింపకయును సర్వము, గామించియునైన ముక్తిఁ గామించి తగన్
లో మించి పరమపురుషుని, నేమించి భజించుఁ దత్త్వనిపుణుం డధిపా! 39

మ. అమరేంద్రాదులఁ గొల్చుభంగి జనుఁడా యజ్ఞాక్షు సేవింపఁగా
విమలజ్ఞాన విరక్తి ముక్తు లొదవున్ వేయేల భూనాథ! త
త్కమలాధీశ కథా సుధారస నదీ కల్లోల[1]మాలా పరి
భ్రమ మెవ్వారికి నైనఁ గర్ణయుగళీ పర్వంబు గాకుండునే? 40

వ. అని రాజునకు శుకుండు సెప్పె నవిన విని శౌనకుండు సూతున కిట్లనియె. 41

---

*బ్రహ్మణస్పతిం (మూలము); బ్రహ్మణస్పతిం, బృహస్పతిం (శ్రీధరవ్యాఖ్యా); బ్రహ్మణస్పతిం వేదపతిం బ్రహ్మణం (మఱియొక వ్యాఖ్యా). 1. మాలావలీ (హ).

క. వర తాత్పర్యముతో నిటు, భరతాన్వయ విభుఁడు శుకుని పలుకులు విని స
త్వరతా యుతుఁడై శ్రేయ, స్కరతామతి నేమి యడిగె? గణుతింపఁగదే! 42

క. ఒప్పెడి హరికథ లెయ్యవి చెప్పెడినో యనుచు మాకుఁ జిత్తోత్కంఠల్
గుప్పలు గొనుచున్నవి రుచు, లుప్పతిల నీ్న మనోహరోక్తులు వినఁగన్. 43

వ. అనిని విని సూతుం డిట్లనియె. 44

క. తూలెడి కూఁకటితోడను, బాలురతో నాడుచుండి బాల్యమున మహీ
పాలుఁడు హరిచరణార్చన, [1]హేలల తోడుతను నుండె నెంతయు నియతిన్. 45

వ. అట్టి పరమ భాగవతుండైన పాండవేయునకు వాసుదేవ పరాయణుండైన
శుకుం డిట్లనియె. 46

సీ. వాసుదేవ శ్లోక వార్త లాలింపుచుఁ గాల మే పుణ్యుండు గడుపుచుండు
నతని యాయువు దక్క [2]నన్యుల యాయువు నుదయాస్తమయముల నుగ్రకరుఁడు
వంచించి కొనిపోవువాఁ డది యెఱుఁగక జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధ మనుచు,
నంగనా పుత్ర గేహారామ విత్తాది సంసార హేతుక సంగసుఖముఁ

తే. దగిలి వర్తింపఁ గాలము తఱి యెఱింగి, దండధర కింకరులు వచ్చి తాడనములు
నేసి కొనిపోవఁ బుణ్యంబు నేయనైతిఁ, బాపరతి నైతి నని బిట్టుఁ బలవరించు.

వ. అది గావున, 48

సీ. అలరు జొంపములతో నభ్రంకషంబులై బ్రతుకవే? వనములఁ బాదపములు
ఖాదన మేహనాకాంక్షలఁ బశువులు జీవింపవే? గ్రామ సీమలందు
నియతిమై నుచ్ఛ్వాస నిశ్శ్వాస పవనముల్ ప్రాపింపవే? చర్మభస్త్రికలును
గ్రామసూకర శునక శ్రేణు లింటింటఁ దిరుగవే! దుర్భోగ-దీనవృత్తి

తే. నుష్ట్రఖరములు మోయవే యురుభరములు. పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు
లడవులందు నివాసములందుఁ బ్రాణ,విషయ భర వృత్తితో నుంట విఫల మధిప!

సీ. విష్ణు కీర్తనములు వినని కర్ణంబులు కొండల బిలములు కువలయేశ!
చక్రి పద్యంబులు చదువని జిహ్వలు కప్పల జిహ్వలు కౌరవేంద్ర!
శ్రీమనోనాథు వీక్షింపని కన్నులు కేకి పింఛాక్షులు కీర్తిదయిత!
కమలాక్షు పూజకుఁ గాని హస్తంబులు శవము హస్తంబులు సత్యవచన!

1. హేలాలసుఁ డగుచునుండె (హ. తం. వా.) హేలాలస నియతినుండె (జ); 2. నన్యనరా
యువు (క. ట. త.)

ఆ. హరి పద తులసీదళామోదరతి లేని, ముక్కు పందిముక్కు మునిచరిత్ర !
గరుడగమను భజనగతి లేని పదములు, పాదపముల పాదపటల మనఘ ! 50

సీ. నారాయణుని దివ్య నామాక్షరములపైఁ గరఁగని మనములు గఠిన శిలలు
మురవైరి కథలకు ముదితాశ్రు రోమాంచ మిళితమై యుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యౌదల నున్న కనక కిరీటంబు గట్టె మోపు
మాధవార్పితముగా మనని మానవు సిరి వన దుర్గ చంద్రికా వైభవంబు

ఆ. కైటభారి భజన గలిగి యుండని వాఁడు, గాలిలోననుండి కదలు శవము
కమలనాభు పదము గనని వాని బ్రతుకు, [1]పసిఁడికాయలోని ప్రాణిబ్రతుకు. 51

## అధ్యాయము — ౪

వ. అని యిట్లు పలికిన వైయాసి వచనంబుల నౌత్తరేయుండు గందళిత హృదయుండై నిర్మలమతి విశేషంబున, 52

ఆ. సుతుల హితుల విడిచి చుట్టాల విడిచి యి, ల్లాలి విడిచి [2]పశు గృహాళి విడిచి
రాజు హృదయ మిడియె రాజీవనయనుపై, ధనము విడిచి జడ్డుఁదనము విడిచి.

వ. ఇట్లు మృత్యుభయము నిరసించి, ధర్మార్థకామంబులు సన్యసించి, పురుషోత్తము నందుఁ జిత్తంబు విన్యసించి, హరిలీలా లక్షణంబు లుపన్యసింపు మను తలంపున నరేంద్రుఁ డిట్లనియె. 54

క. సర్వాత్ము వాసుదేవుని, సర్వజ్ఞుఁడవైన నీవు సంస్తుతిసేయన్
సర్వభ్రాంతులు వదలె మ, హోర్వీసురవర్య ! మానసోత్సవ మగుచున్. 55

సీ. ఈశుండు హరి విష్ణుఁ డీ విశ్వమంతయుఁ బుట్టించు రక్షించుఁ బొలియఁజూచు
బహు శక్తియుతుఁ డగు భగవంతుఁ డవ్యయుఁ డాది నే శక్తుల నాశ్రయించి
బ్రహ్మ శక్రాది రూపముల వినోదించెఁ గ్రమముననో యేకకాలముననో
ప్రకృతిగుణంబులఁ బట్టి గ్రహించుట యేకత్వమున నుండు నీశ్వరుండు

ఆ. భిన్నమూర్తి యగుచుఁ బెక్కు విధంబుల, నేల యుండు నతని [3]కేమి వచ్చె
నుండకున్నఁ దాపసోత్తమ ! తెలుపవే !, వేడ్కతోడ నాకు వేదవేద్య ! 56

వ. అనిన నుత్తరానందను వచనంబులకు నిరుత్తరుండు గాక సదుత్తర ప్రదాన కుతూహలుండై లోకోత్తర గుణోత్తరుండైన తాపసోత్తముండు దన మనంబున.

1. పసిరికాయలోని (హ) 2. బహుబలాళి (హ. తం. వా.) 3. కేమిచిక్కె (క. చ. ట.)

మ. పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భవ స్థాన సం
హరణ క్రీడనుఁడై త్రిశక్తి యుతుఁడై యంతర్గత జ్యోతియై
పరమేష్ఠి ప్రముఖామరాధిపులకున్ [1]బ్రాపింప రాకుండు దు
స్తర మార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్. 58

వ. మఱియు సజ్జన దురిత సంహరణుండును, దుర్జన నివారకుండును, నఖిల సత్త్వ రూపకుండును, పరమహంసాశ్రమ ప్రవర్తమాన మునిజన హృదయ కమల కర్ణికా మధ్యదీపకుండును, సాత్వత శ్రేష్ఠుండును, పరమ భక్తియుక్త సులభుండును, భక్తిహీన జన దుర్లభుండును, నిరతిశయ నిరుపమ నిరవధిక ప్రకారుండును, నిజస్వరూప బ్రహ్మ విహారుండును నైన య ప్పరమేశ్వరునకు నమస్కరించెద. 59

ఉ. ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం
బే విభు లీల లద్భుతము లెవ్వని సంశ్రవణంబు సేయ దో
షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగు నట్టి నే
నా విభు నాశ్రయించెద నఘౌఘ [2]నివర్తను భద్రకీర్తనున్. 60

ఉ. ఏ పరమేశు పాదయుగ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరుల్
లోపలి బుద్ధిలో నుభయలోకము లందుల [3]సక్తిఁ బాసి యే
తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు రే
నా పరమేశు మ్రొక్కెద నఘౌఘ [3]నివర్తను భద్రకీర్తనున్. 61

చ. తపములు సేసియైన మఱి దానము లెన్నియుఁ జేసియైన నే
జపములు సేసియైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హే
యపదములై దురంత విప దంచిత రీతిగ నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘ ని[4]వర్తను భద్రకీర్తనున్. 62

మ. యవన వ్యాధ పుళింద హూణ [5]శక కంకాభీర చండాల సం
భవులుం దక్కిన పాపవర్తనులు నే భద్రాత్ము సేవించి భా
గవత శ్రేష్ఠుల డాసి శుద్ధతనులన్ గల్యాణులై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాదుమదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్. 63

1. భావింపరాకుండు (చ. ట.) 2,3,4. నివృత్తిదు భద్రకీర్తిదున్ (హ). 5. కష (తం. వా.) "కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా, ఆభీర కంకా యవనాః కషాదయః" (మూ. 4-18)

మ. తపముల్ నేసిననో మనోనియతినో దాన[1]వ్రతప్రీతినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుండౌ నని బ్రహ్మ రుద్ర ముఖరుల్ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుం డౌఁ గాక నా కెప్పుడున్. 64

క. శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్ర, జాపతియును బుద్ధిపతియు జగదధిపతియున్
భూపతియు యాదవ శ్రే, ణీపతియుం గతియు నైన నిపుణు భజింతున్. 65

మ. [2]అణువో కాక కడు న్మహా[3]విభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
[4]గుణియో నిర్గుణియో యటంచు విబుధుల్ గుంఠీభవ త్తత్త్వ మా
ర్గణులై యే విభు పాదపద్మ భజనోత్కర్షంబులన్ దత్త్వవీ
క్షణముం జేసెద రట్టి విష్ణుఁ బరమున్ సర్వాత్మ సేవించెదన్. 66

మ. జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకు మదిన్ సంధింప నూహించి యే
భగవంతుండు సరస్వతిం బనుప నా పద్మాస్య దా నవ్విభున్
మగనింగా వరియించి తద్భువన సామ్రాజ్యస్థితిన్ సృష్టిపా
రగుఁ జేసెన్ మును బ్రహ్మ నట్టి [5]ఘను నారంభింతు సేవింపఁగన్. 67

సీ. పూర్ణుఁ డయ్యును మహాభూత పంచక యోగమున మేనులను బురములు సృజించి
పురములలోనుండి పురుష భావంబున దీపించు [6]నెవ్వఁడు ధీరవృత్తిఁ
బంచభూతములను బదునొకం డింద్రియములఁ బ్రకాశింపించి భూరిమహిమ
షోడశాత్మకుఁ డన శోభిల్లి జీవత్వనృత్య వినోదంబు నెఱపుచుండు

తే. నట్టి భగవంతుఁ డవ్యయుఁ డచ్యుతుండు, మానసోదిత వాక్పుష్ప మాలికలను
మంజు నవరస మకరంద మహిమ లుట్ట, శిష్ట హృద్భావ లీలలఁ జేయుఁగాత. 68

ఉ. మానధనుల్ మహాత్ములు సమాధినిరూఢులు య న్ముఖాంబుజ
[7]ధ్యాన మరంద పానమున [8]నాత్మభయంబులఁ బాపి ముక్తులై
లూనత నొంద రట్టి మునిలోకశిఖామణికిన్ విశంకటా
జ్ఞాన తమో నభోమణికి *సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్. 69

వ. అని యిట్లు హరి గురు వందనంబు నేసి శుకయోగీంద్రుం డిట్లనియె. 70

1 వ్రతావృత్తినో (చ. ట. త.) 2. అణుఁడో (హ) 3. మహిముఁడో (చ) 4. గుణుఁడో నిర్గుణుఁడో (క.ట.జ.డ.) 5. గుణి (హ. తం. వా.) 6. నెపుడు నదీనవృత్తి (హ). 7. జ్ఞాన (హ) 8. జన్మభయంబుల (హ) * భగవతే వేదవ్యాసాయ వేధసే (మూలము).

మ. అవిరోధంబున నీవు న న్నడుగు నీ యర్థంబు మున్ బ్రహ్మ మా
ధవుచేతన్ విని నారదుం డడిగినన్ దథ్యంబుగాఁ జెప్పె మా
నవ లోకేశ్వర! నారదుండు వెనుకన్ నాకుం బ్రసాదించె సం
శ్రవణీయంబు మహాద్భుతంబు విను మా సందేహ [1]విచ్ఛేదమున్. 71

అధ్యాయము—౫

—: నారదుండు బ్రహ్మను ప్రపంచ ప్రకారం బడుగుట :—

వ. నారదుండు బ్రహ్మ కిట్లనియె. 72

మ. చతురాస్యుండవు వేల్పుపెద్దవు జగత్సర్గానుసంధాయి వీ
శ్రుతిసంఘాతము నీ ముఖాంబుజములన్ శోభిల్లు శబ్దార్థ సం
యుతమై సర్వము నీ కరామలకమై యుండుం గదా! భారతీ
సతి యిల్లాలఁట నీకు నో జనక! నా సందేహమున్ బాపవే! 73

శా. [2]ప్రారంభాది వివేక మెవ్వఁ [3]డొసఁగున్? బ్రారంభ సంపత్తి కా
ధారం బెయ్యది? యేమి హేతువు? [4]యదర్థం బే స్వరూపంబు సం
సారానుక్రమ మూర్ణనాభి పగిదిన్ [5]సాగింతు వెల్లప్పుడున్
[6]బారం బెన్నఁడు లేదు నీమనువు [7]దుష్ప్రాపంబు వాణీశ్వరా! 74

శా. నాకుం జూడఁగ నీవు రాజ వనుచున్నాఁడన్ యథార్థస్థితిన్
నీ కంటెం ఘనుఁ డొక్క రాజు గలఁడో నీ వింతకున్ రాజవో
నీ కే లాభము రాఁ దలంచి జగముల్ నిర్మించె దీ చేతనా
నీకం బెందు జనించు నుండు నణఁగున్ నిక్కంబు భాషింపుమా. 75

మ. సదస త్సంగతి నామ రూప గుణ దృశ్యంబైన విశ్వంబు నీ
హృదధీనంబు గదా! ఘనుల్ సములు నీ కెవ్వారునున్ లేరు నీ
పద మృత్యున్నత మిట్టి నీవు తపముల్ బ్రావీణ్య యుక్తుండవై
మది నే యీశ్వరుఁ గోరి చేసితివి త న్మార్గంబు సూచింపవే. 76

1. విచ్ఛేదివై (హ.తం.వా.) 2. ప్రారంభించు (తం.వ్రా.ప్ర. కొన్నింట). 3. డొసఁగెన్ (హ) 4. యథార్థం. (క.ద.) 5. సాగించె దొక్కప్పుడున్ (హ) 6. భారంబెన్నఁడు (వా) 7. దుష్ప్రాప్యంబు (త) దుష్ప్రాపంబు (ద).

శా. అంభోజాసన ! నీకు నీశుఁడు గలం డంచేనిఁ ద త్ప్రశమం
దంభోజాతభవాండ మే విభుని లీలాపాంగ సంభ్రాంతిచే
సంభూతంబగు వర్తమానమగు సంభన్నంబగుఁ ద ద్విభుఁ
సంభావింపఁగ వచ్చునే తలఁప నే చందంబు వాఁ డాకృతిఁ. 77

క. తోయజ సంభవ ! నా కీ, తోయము వివరింపు చాలఁ దోఁచిన నే నా
తోయము వారికి నన్యుల, తోయములం జెందకుండ ధ్రువ మెఱిఁగింతుఁ. 78

వ. దేవా ! భూత భవిష్య ద్వర్తమానంబులగు వ్యవహారంబులకు నీవ విభుండవు. నీ వెఱుంగని యర్థం బించుకయు లేదు. విశ్వప్రకారంబు వినిపింపు మనిన విని వికసితముఖుండై విరించి యిట్లనియె. 79

క. రారా ? బుధులు విరక్తులు, గారా ? యీరీతి నడుగఁగా నేరరు వి
స్మేరావహము భవ న్మత, మౌరా ! [1]నాపైడి ! మర్మ మడిగితి వత్సా ! 80

శా. నానా స్థావర జంగమ ప్రకరముల్ నాయంత నిర్మింప వి
న్నాణం బేమియు లేక తొట్రుపడఁగా నాకుఁ సమస్తాను సం
ధానారంభ విచక్షణత్వము మహోదారంబుగా నిచ్చె ము
న్నే నా యీశ్వరు నాజ్ఞఁ గాక జగము ల్నిర్మింప శక్తుండనే, 81

మ. అనఘా ! విశ్వమునెల్ల దీప్తముగఁ జేయఁ నే సమర్థుండనే ?
యిన చంద్రానల తారకాగ్రహ గణం బే రీతి నా రీతి నె
వ్వని దీప్తిం బ్రతిదీప్త మయ్యె భువనవ్రాతంబు, దద్దీప్తిచే
ననుదీప్తం బగు నట్టి యీశ్వరున కే నశ్రాంతముఁ మ్రొక్కెదఁ. 82

మ. వినుమా యీశ్వరు దృష్టిమార్గమున నావేశింప శంకించి సి
గ్గున సంకోచము నొందు మాయవలనం గుంఠీభవ త్ప్రజ్ఞచే
నను లోకేశ్వరుఁ డంచు [2]మ్రొక్కు మతిహీన వ్రాతముం జూచి నే
ననిశంబు న్నగి ధిక్కరింతు హరిమాయా కృత్యమంచుఁ సుతా ! 83

వ. మఱియు దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును, జన్మనిమిత్తంబులైన కర్మంబులును, కర్మక్షోభకంబైన కాలంబును, కాల పరిణామ హేతువైన స్వభావంబును, భోక్తయైన జీవుండును, వాసుదేవుండుగా నెఱుంగుము.

1. నాతోడి (హ); నా విభుని (వా); నా దయిన (జ) 2. మ్రొక్కులిడు (క.ట.త.జ.డ.ద.బ.)

వాసుదేవ వ్యతిరిక్తంబులేదు. సిద్ధంబు. (నారాయణ నియమ్యంబులు లోకంబులు). దేవతలు నారాయణ శరీర సంభూతులు. వేద యాగ తపో యోగ గతి విజ్ఞానంబులు నారాయణపరంబులు. (జ్ఞానసాధ్యం బగు ఫలంబు నారాయణాధీనంబు). కూటస్థుండు, సర్వాత్మకుండు, సర్వద్రష్టయు నైన యీశ్వరుని కటాక్ష విశేషంబున సృజియింపంబడి, ప్రేరితుండనై, సృజ్యంబైన ప్రపంచంబు సృజింపుచుండుదు. నిర్గుణుం డైన యీశ్వరుని వలన రజ స్సత్త్వతమో గుణంబులు ప్రభూతంబులై యుత్పత్తి స్థితి లయంబులకుఁ బాలుపడి, కార్య కారణ కర్తృత్వ భావంబులందు ద్రవ్యంబులైన మహాభూతంబులు, జ్ఞానమూర్తులైన దేవతలు, క్రియారూపంబులైన యింద్రియంబులు, నాశ్రయంబులుగా నిత్యముక్తుండయ్యును, మాయాసమన్వితుండైన జీవుని బంధించు. జీవులకు నావరణంబులై యుపాధిభూతంబులైన మూఁడు లింగంబులం జేసి పరులకు [1]లక్షితంబుగాక తనకు లక్షితంబైన తత్త్వంబుగల యీశ్వరుం డీ విధంబునం గ్రీడించుచుండు. 84

క. ఆ యీశుఁ డనంతుఁడు హరి, నాయకుఁ డీ భువనములకు నాకుఁ నీకుఁ
మాయకుఁ బ్రాణివ్రాతము, [2]కేయెడలఁ లేదు నీశ్వ రేతరము సుతా! 85

వ. వినుము మాయా[3]విభుం డైన యీశ్వరుండు దన మాయం జేసి దైవయోగంబునం బ్రాప్తంబులైన కాల [4]జీవాదృష్ట స్వభావంబులు వివిధంబులు సేయ నిశ్చయించి గైకొనియె. ఈశ్వరాధిష్ఠితంబైన మహత్తత్త్వంబు వలన (నగు కాలంబున గుణవ్యతికరంబును, స్వభావంబునఁ బరిణామంబును, జీవాదృష్టభూతంబైన కర్మంబున జన్మంబును నయ్యె. రజ స్సత్త్వంబులచే నుపబృంహితమై వికారంబు నొందిన మహత్తత్త్వంబు వలనం) దమఃప్రధానంబై [5]ద్రవ్య జ్ఞానక్రియాత్మకం బగు నహంకారంబు గలిగె. అదియు రూపాంతరంబు నొందుచు ద్రవ్య శక్తియైన తామసంబుఁ గ్రియాశక్తియైన రాజసంబు, జ్ఞాన శక్తియైన సాత్వికంబును నన మూఁడు విధంబు లయ్యె. అందు భూతాదియైన తామసాహంకారంబు వలన నభంబు గలిగె. నభంబునకు సూక్ష్మరూపంబు, ద్రష్టృ దృశ్యంబులకు బోధకం బైన శబ్దంబు గుణం బగు. నభంబు వలన వాయువు గలిగె. వాయువునకుఁ బరాన్వయంబున శబ్దంబు స్పర్శంబు నను రెండు గుణంబులు గలిగి యుండును. అది దేహంబునం దుండుటం జేసి ప్రాణరూపంబై యింద్రియ మన శ్శరీరపాటవంబు లైన యోజ స్సహో బలంబులకు హేతువై వర్తించు.

1. పరిక్షిప్తంబుగాక (క.బ) 2. కేయెడలఁ లేద (తం); కీయెడలఁ లేద (వా); కేయెడలఁ జూడ (క.బ) 3. విదుండైన (వా) 4. జీవాద్యవ్యక్త (చ. త. బ.) 5. దివ్యజ్ఞాన (తం. వా. హ.)

వాయువు వలన రూప స్పర్శ శబ్దంబు లనియెడి గుణంబులు మూఁటి తోడఁ దేజంబు గలిగె. తేజంబు వలన రసరూప స్పర్శ శబ్దంబు లనియెడు నాలుగు గుణంబులతోడ జలంబు గలిగె. జలంబు వలన గంధ రస రూప స్పర్శ శబ్దంబు లనియెడి గుణంబు లయిదింటితోడం బృథివి కలిగె. వైకారికంబైన సాత్త్వికాహంకారంబు వలనఁ జంద్ర దైవతం బైన మనంబు గలిగె. మఱియు దిక్కులు, వాయువు, అర్కుండు, ప్రచేతస్సు, అశ్వినులు, వహ్ని, ఇంద్రుండు, ఉపేంద్రుండు, మిత్రుండుఁ ప్రజాపతియు ననియెడి దశదేవతలు గలిగిరి. తైజసంబైన రాజసాహంకారంబు వలన దిగ్దైవతం బైన శ్రవణేంద్రియంబు, వాయుదైవతం బైన త్వగింద్రియంబు, సూర్యదైవతం బైన నయనేంద్రియంబు, ప్రచేతోదైవతం బైన రసనేంద్రియంబు, అశ్వినీదైవతం బైన ఘ్రాణేంద్రియంబు, వహ్నిదైవతం బైన వాగింద్రియంబు, ఇంద్రదైవతం బైన హస్తేంద్రియంబు, ఉపేంద్రదైవతం బైన పాదేంద్రియంబు, మిత్రదైవతం బైన గుదేంద్రియము, ప్రజాపతిదైవతం బైన గుహ్యేంద్రియంబు ననియెడి దశేంద్రియంబులును, బోధజన కాంతఃకరణైక భాగం బైన బుద్ధియుఁ, గ్రియాజన కాంతః కరణం బైన ప్రాణంబును గలిగె. ఇట్టి శ్రోత్రాదులగు దశేంద్రియంబులతోఁ గూడిన భూతేంద్రియ మనోగుణంబులు వేర్వేఱుగ (బ్రహ్మాండ శరీర నిర్మాణంబునం దసమర్థంబులగు నపుడు భగవచ్ఛక్తి ప్రేరితంబు లగుచు నేకీభవించి సమష్టి వ్యష్ట్యాత్మకత్వంబు నంగీకరించి) చేతనా చేతనంబులం గల్పించె. అట్టి యండంబు వర్షాయుత సహస్రాంతంబు దనుక జలంబునం దుండె. (కాల కర్మ స్వభావంబులం దగులువడక సమస్తమును జీవయుక్తముగఁ జేయు నీశ్వరుం డచేతనంబును సచేతనంబుగ నొనర్చె.) అంతఁ గాలకర్మ స్వభావ ప్రేరకుండైన పరమేశ్వరుండు జీవరూపంబున మహావరణ జలమధ్య స్థితం బైన బ్రహ్మాండంబులోను చొచ్చి సవిస్తరంబు గావించి * (యట్టి యండంబు భేదించి నిర్గమించె. ఎట్లంటేని,) 86

క. భువనాత్మకుఁ డా యీశుఁడు, భవనాకృతితోడ నుండు బ్రహ్మాండంబున్
వివరముతోఁ బదునాలుగు, వివరంబులుగా నొనర్చె విశదంబులుగన్. 87

మ. బహు పాదోరు భుజాన నేక్షణ శిరః ఫాల శ్రవో యుక్తుఁడై
విహరించున్ బహుదేహి దేహగతుఁడై విద్వాంసు లూహించి త
ద్బహురూ పావయవంబులన్ భువన సంపత్తిన్ విచారింతు రా
మహనీ యాద్భుతమూర్తి యోగిజన [1]హృన్మాన్యుండు మేధానిధీ! 88

1. హృన్మాన్యంబు (చ.త.జ.డ.ద.బ.) *తాళపత్ర ప్రతులందు లేదు, (మూలము.)

వ. వినుము చతుర్దశ లోకంబులందు మీఁది యేడు లోకంబులు, శ్రీ మహావిష్ణువునకుం గటిప్రదేశంబున నుండి యూర్ధ్వదేహ మనియును, గ్రింది యేడు లోకంబులు జఘనంబున నుండి యధోదేహ మనియునుం బలుకుదురు. ప్రపంచ శరీరకుం డగు భగవంతుని ముఖంబు వలన బ్రహ్మకులంబు, బాహువుల వలన క్షత్త్రియకులంబు, ఊరువుల వలన వైశ్యకులంబు, పాదంబు వలన శూద్రకులంబు జనియించె నని చెప్పుదురు. భూలోకంబు గటి ప్రదేశంబు, భువర్లోకంబు నాభి,సువర్లోకంబు హృదయంబు,మహర్లోకంబు వక్షంబు,జనలోకంబు గ్రీవంబు, తపోలోకంబు [1] స్తనద్వయంబు, సనాతనంబును బ్రహ్మ నివాసంబును నైన సత్యలోకంబు శిరంబు, కటిప్రదేశం బతలంబు, తొడలు వితలంబు, జానువులు సుతలంబు, జంఘలు దలాతలంబు, గుల్ఫంబులు మహాతలంబు, పాదాగ్రంబులు రసాతలంబు, పాదతలంబు పాతాళంబు నని ( లోకమయుంగా ) భావింతురు. కొందఱు మఱియుం బాదతలంబు వలన భూలోకంబును, నాభివలన భువర్లోకంబును, శిరంబు వలన స్వర్లోకంబును గలిగె నని లోకకల్పనంబు నెన్నుదురు.

## అధ్యాయము — ౬

పురుషోత్తముని ముఖంబు వలన సర్వజంతు వాచాజాలంబును దదధిష్ఠాత యగు వహ్నియు నుదయించె. చర్మ రక్త మాంస మేద శ్శల్య మజ్జా శుక్లంబులు సప్త ధాతువు లందురు. పక్షాంతరంబున రోమ త్వ జ్మాం సాస్థి స్నాయు మజ్జా ప్రాణంబులను సప్త ధాతువు లని యందురు. అందు రోమంబు లుష్ణిక్ఛందం బనియు, త్వక్కు ధాత్రీ ఛందం బనియు, మాంసంబు త్రిష్టుప్ఛందం బనియు, స్నాయు వనుష్టుప్ఛందం బనియు,అస్థి జగతీఛందంబనియు, మజ్జ పంక్తిచ్ఛందం బనియు, ప్రాణంబులు బృహతీ ఛందం బనియు నాదేశింతురు. హవ్య కవ్యామృతాన్నంబులకు మధురాది షడ్రసంబులకు రసనేంద్రియంబునకు రసాధీశ్వరుం డైన వరుణునికిని హరి రసనేంద్రియంబు జన్మస్థానంబు. సర్వప్రాణాదులకు వాయువునకు విష్ణు నాసికా వివరంబు నివాసంబు. సమీప దూర వ్యాపిగంధంబులకు నోషధులకు నశ్వినీ దేవతలకు భగవంతుని ఘ్రాణేంద్రియంబు నివాసంబు. దేవలోక సత్యలోకంబులకుఁ దేజంబునకు సూర్యునికి సకల చక్షువులకు లోకలోచను చక్షురింద్రియంబు స్థానంబు. దిశలకు నాకాశంబునకు శ్రుతి భూతంబులైన యంశంబులకు శబ్దంబులకు సర్వేశ్వరుని కర్ణేంద్రియంబు జన్మస్థానంబు.

---

1. లలాటంబు (క.బ.)

వస్తుసారంబులకు వర్ణనీయ సౌభాగ్యంబులకుం బరమపురుషుని గాత్రంబు భాజనంబు. స్పర్శంబునకు వాయువునకు సకల స్నిగ్ధంబులకు దివ్యదేహుని దేహేంద్రియంబు గేహంబు. యూప ప్రముఖ యజ్ఞోపకరణ సాధనంబులగు తరు గుల్మ లతాదులకుఁ బురుషోత్తముని రోమంబులు మూలంబులు. శిలా లోహంబులు సర్వమయుని నఖంబులు. మేఘజాలంబులు హృషీకేశుని కేశంబులు. మెఱుంగులు విశ్వేశ్వరుని శ్మశ్రువులు. భూర్భువస్స్వర్లోక రక్షకులైన లోకపాలకుల పరాక్రమంబులకు, భూరాది లోకంబుల క్షేమంబునకు, శరణంబునకు, నారాయణుని విక్రమంబులు నికేతనంబులు. సర్వకామంబులకు నుత్తమంబులైన వరంబులకుఁ దీర్ఘపాదుని పాదారవిందంబు లాస్పదంబులు. జలంబులకు, శుక్లంబునకు, పర్జన్యునకు, ప్రజాపతి సర్గంబునకు, సర్వేశ్వరుని మేఢ్రంబు సంభవ నిలయంబు. సంతానంబునకుఁ, గామాది పురుషార్థంబులకుఁ జిత్త సౌఖ్యరూపంబులగు నానందంబులకు, శరీరసౌఖ్యంబునకు నచ్యుతుని యుపస్థేంద్రియంబు స్థానంబు. యమునికి, మిత్రునికి, మలవిసర్గంబునకు భగవంతునిపాయ్వింద్రియంబు భవనంబు. హింసకు నిరృతికి మృత్యువునకు నిరయంబునకు నిఖిలరూపకుని గుదంబు నివాసంబు. పరాభవంబునకు నధర్మంబునకు నవిద్యకు ననంతుని పృష్ఠభాగంబు సదనంబు. నద నదీ నివహంబునకు నీశ్వరుని నాడీ సందోహంబు జన్మమందిరంబు. పర్వతంబులకు నధోక్షజుని శల్యంబులు జనక స్థలంబులు. ప్రధానంబునకు నన్నరసంబులకు సముద్రంబులకు భూతలయంబునకు బ్రహ్మాండగర్భుని యుదరంబు నివేశంబు. మనోవ్యాపార రూపంబగు లింగ శరీరంబునకు మహామహిముని హృదయంబు [1]సర్గభూమి యగు. మఱియు. 89

ఆ. నీలకంధరునకు నీకు నాకు సనత్కు-, మార ముఖ్య సుత సమాజమునకు
ధర్మ సత్త్వ బుద్ధి తత్త్వములకు నీశ్వ, రాత్మ వినుము పరమమైన నెలవు. 90

సీ. నర సురాసుర పితృ నాగ కుంజర మృగ గంధర్వ యక్ష రాక్షస మహీజ
సిద్ధ విద్యాధర జీమూత చారణ గ్రహ తార కాప్సరోగణ విహంగ
భూత తటి ద్వసు పుంజంబులును నీవు ముక్కంటియును మహామునులు నేను
సలిల నభస్స్థల చరములు మొదలైన వివిధ జీవులతోడి విశ్వమెల్ల

ఆ. విష్ణుమయము పుత్ర! వేయేల బ్రహ్మాండ, మతని జేనలోన నణఁగి యుండు
బుద్ధి నెఱుఁగరాదు భూత భవ ద్భవ్య, లోకమెల్ల విష్ణులోన నుండు. * 91

1. సత్యభూమి (క. త. ద. బ.) *ఈ 91 వ పద్యము తరువాత (తం) ప్రతిలో ఒక కంద పద్యమును ఒక వచనమును అధికముగా నున్నవి. ఇవి తాళపత్ర ప్రతులందు లేవు.

క. మండలములోన భాస్కరుఁ, డుండుచు[1]జగములకు దీప్తి నొసఁగెడి క్రియ బ్ర
హ్మాండములోపల నచ్యుతుఁ,డుండుచు బహిరంతరముల నొగి వెలిఁగించున్. 92

*ఉ. అట్టి యనంతశక్తి జగదాత్ముని నాభి సరోజమందు నేఁ
బుట్టి యజింపఁగా మనసు పుట్టిన యజ్ఞ పదార్థ జాతముల్
నెట్టన గానరామికిని నిర్మలమైన తదీయ రూపమున్
గట్టిగ బుద్ధిలో నిలిపి కంటి నుపాయము నామనంబునన్. 93

సీ. పశు యజ్ఞవాట యూప స్తంభ పాత్రా మృద్ఘట శరావ వసంత కాలములును
స్నేహౌషధీ బహు లోహ చాతుర్హోత్ర మత నామధేయ సన్మంత్రములును
సంకల్ప ఋగ్యజు స్సామ నియుక్త వషట్కార మంత్రాను చరణములును
[2]దక్షిణల్ దేవతా ద్యనుగత తంత్ర వ్రతోద్దేశ ధరణీసురోత్త మాదు

తే. లర్పణంబులు బోధాయనాది కర్మ సరణి మొదలగు యజ్ఞోపకరణ సమితి
యంతయును నమ్మహాత్ముని యవయవములు, గాఁగఁగల్పించి విధివత్ప్ర
కారమునను.

క. యజ్ఞాంగి యజ్ఞఫలదుఁడు, యజ్ఞేశుఁడు [3]యజ్ఞభోక్త యగు భగవంతున్
యజ్ఞపురుషుఁగా మానస, యజ్ఞముఁ గావించితిం ద దర్పణబుద్ధిన్, 95

క. అప్పుడు [4]బ్రాహ్మణు లెల్లం, దప్పక ననుఁ జూచి సముచిత క్రియు లగుచో
న ప్పరమేశున కభిమత, మొప్పఁగఁ దగు సప్తతంతువును గావింపన్. 96

చ. మనువులు దేవదానవులు మానవనాథులు మర్త్యకోటి దా
రనయము వారివారికిఁ బ్రియంబగు దేవతలన్ భజింపుచున్
ఘనతరనిష్ఠ యజ్ఞములు గైకొని చేసిరి తత్ఫలంబు ల
య్యనుపమ మూర్తి యజ్ఞమయుఁడైన రమావరునందుఁ జెందఁగన్. 97

క. సువ్యక్త [5]తంత్రరూపకుఁ, డవ్యక్తుఁ డనంతుఁ డభవుఁ డచ్యుతుఁ డీశుం
డవ్యయుఁడగు హరి సురగణ, సేవ్యుఁడు గ్రతుఫలదుఁడగుటఁ జేసిరి మఖముల్.

క. అగుణుం డగు పరమేశుఁడు, జగములు గల్పించు కొఱకుఁ జతురత మాయా
సగుణుండగుఁ గావున హరి, భగవంతుం డనఁగఁ బరఁగె భవ్యచరిత్రా ! 99

1. నాపరణపటలి (త. జ. ద. బ.) *ఇచ్చటినుండి వెలిగందల నారయ కవిత్వమని ముద్రిత ప్రతులలోఁ గలదు. క.త.బ. తాళపత్ర ప్రతులం దిట్లే కలదు. కాని చ.ట.త.జ.ద.ద. ప్రతులందిది లేదు. 2. దక్షిణ దేవతా ధ్యాన తదనుగత ధ్యాన తత్తన్మతి ధరణిసురలు. అని కొన్ని వ్రాఁతప్రతులు.— 3. యజ్ఞకర్త (హ. తం. వా.) 4. అప్పుడు బ్రహ్మలు దమలోఁ......లగుచు న్నప్పరమేశున (తం) 5. మంత్ర (క.చ.ట.త.)

క. విశ్వాత్ముఁడు విశ్వేశుఁడు, విశ్వమయుం డఖిలనేత విష్ణుం డజుఁ డీ
విశ్వములోఁ దా నుండును, విశ్వము దనలోనఁ జాల వెలుఁగుచు నుండన్. 100

చ. అతని నియుక్తిఁ జెంది సచరాచర భూతసమేత సృష్టి నే
వితతముగా సృజింతుఁ బ్రభవిష్ణుఁడు [1]విష్ణుఁడు ప్రోచుఁ బార్వతీ
పతి లయ మొందఁజేయు హరి పంకరుహోదరుఁ డాదిమూర్తి య
చ్యుతుఁడు త్రిశక్తియుక్తుఁ [2]డగుచుండు ని టింతకుఁ దాన మూలమై. 101

క. విను వత్స! నీవు న న్నడి, గిన ప్రశ్నకు నుత్తరంబు గేవల పరమం
బను బ్రహ్మం బీ యఖిలం, బున కగు నాధారహేతు భూతము సుమ్మీ! 102

క. హరి భగవంతుఁ డనంతుఁడు, గరుణాంబుధి సృష్టికార్య కారణ హేతు
స్ఫురణుం డ వ్విభుకంటెం, బరుఁ డన్యుఁడు లేఁడు తండ్రి! పరికింపంగన్. 103

సీ. ఇది యంతయును నిక్కమే బొంక నుత్కంఠ మతిఁ దద్గుణ ధ్యాన మహిమఁ జేసి
పరికింప నే నేమి పలికిన నది యెల్ల సత్యంబ యగు బుధస్తుత్య! వినుము
ధీయుక్త! [3]మామకేంద్రియములు మఱచియుఁ [4]బొరయ వసత్య విస్ఫురణ మెందు
నదిగాక మత్తను వామ్నాయ తుల్యంబు నమరేంద్ర వందనీయంబు నయ్యెఁ

తే. దవిలి [5]య ద్దేవదేవుని భవమహాబ్ధి, తారణంబును మంగళ కారణంబు
నఖిల సంపత్కరంబునై యలరు పాద, వనజమునకే నొనర్చెద వందనములు. 104

ఉ. ఆ నలినాక్షు నందనుఁడ నయ్యును యోగ వి
ద్యానిపుణుండ నయ్యును బదంపడి మ జ్జనన ప్రకారమే
యేను నెఱుంగ న వ్విభుని యిద్ధ మహత్త్వ మెఱుంగ నేర్తునే!
కానఁబడున్ రమేశ పరికల్పిత విశ్వము గొంతకొంతయున్. 105

మ. విను వే యేటికిఁ దాపసప్రవర! య విశ్వాత్ముఁ డీశుండు దాఁ
దన మాయా మహిమాంతముం దెలియఁగాఁ దథ్యంబు దాఁ జాలఁ డ
న్నను నేనైనను మీరలైన సురలైనన్ వామదేవుండునై
నను నిక్కం బెఱుఁగంగ జాలుదుమె! విజ్ఞాన క్రియాయుక్తులన్. 106

వ. అ మ్మహాత్ముం డైన పుండరీకాక్షుండు సర్వజ్ఞుం డంబేని, 107

1. జిష్ణుఁడు (క) 2. డగుచున్నతఁ డింతకు (ట) డగుచుండునునింతకు (తం.వా.) 3. మద్దశేంద్రియములు (చ) 4. బొరయవసత్పథ స్ఫురణమందు (ద.ప.హ.) 5. యే దేవ దేవుని (హ.క.బ.)

క. గగనము దన కడపలఁ దాఁ, దగ నెఱుఁగని కరణి విభుఁడు దా నెఱుఁగఁడనన్
గగన ప్రసవము లేదన, నగునే [1]సర్వజ్ఞతకును హాని దలంపన్. 108

చ. తలకొని య మ్మహాత్మకుఁడు దాల్చిన య య్యవతార కర్మముల్
వెలయఁగ నస్మదాదులము వేయు విధంబుల సన్నుతింతు మ
య్యలఘు ననంతునిం జిదచిదాత్మకు నాద్యు ననీశు నీశ్వరున్
దెలియఁగ నేర్తుమే! తవిలి దివ్యచరిత్రున కేను మ్రొక్కెదన్. 109

మ. పరమాత్ముం డజుఁ డీ జగంబు ప్రతికల్పంబదుఁ [2]గల్పించుఁ దాఁ
బరిరక్షించును ద్రుంచు నట్టి యనఘున్ బ్రహ్మాత్ము నిత్యున్ జగ
ద్భరితున్ గేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్ము నీ
శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని శశ్వన్మూర్తిఁ జింతించెదన్. 110

చ. సరసగతిన్ మునీంద్రులు ప్రసన్నశరీర హృషీక మానస
స్ఫురణ గలప్పు డవ్విభుని భూరికళా కలిత స్వరూపముం
దరమిడి చూతు రెప్పుడు కుతర్క తమోహతి చేత నజ్ఞతన్
బొరసిన యప్పు డవ్విభుని మూర్తిఁ గనుంగొనలేరు నారదా! 111

వ. అని వెండియు నిట్లను. అనఘా! ఇ మ్మహనీయ తేజోనిధి మొదలి యవతారంబు సహస్ర శీర్షాది యుక్తం బయి ప్రకృతి ప్రవర్తకం బగు నాది పురుష రూపంబగు. అందుఁ గాల స్వభావంబులను శక్తు లుదయించె. అందుఁ గార్య కారణ రూపంబైన ప్రకృతి జనించెఁ. బ్రకృతివలన మహత్తత్త్వంబును దాని వలన నహంకార త్రయంబును బుట్టె. అందు రాజసాహంకారంబువలన నింద్రియంబులును, సాత్త్వికాహంకారంబువలన నింద్రియ గుణప్రధానంబు లైన యధిదేవతలును, తామసాహంకారంబువలన భూతకారణంబులైన శబ్ద స్పర్శ రూపరస గంధ తన్మాత్రంబులును బొడమె. పంచతన్మాత్రంబులవలన గగనానిల వహ్ని సలిల ధరాదికమైన భూతపంచకంబు గలిగె. అందు జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబులును, కర్మేంద్రియంబులైన వాక్పాణి పాద పాయూపస్థలును, మనంబును జనియించె. అన్నింటి సంఘాతంబున విశ్వ రూపుండైన విరాట్పురుషుండు పుట్టె. ఆతనివలన స్వయంప్రకాశుం డైన స్వరాట్టు సంభవించె. అందుఁ జరాచర రూపంబుల స్థావర జంగమాత్మకం బైన

1. సర్వజ్ఞమునకు (క.తం.); సర్వజ్ఞ మనకు (డ) 2. కల్పించుచుం బరిరక్షింపుచుఁ ద్రుంపు చున్న యనఘున్ (హ) 3. బొరసిన గానలేరు పరిపూర్ణరుచి స్ఫుటమాయ నారదా (క.టి.)

జగత్తు గలిగె. అందు సత్త్వరజస్తమో (గుణాత్మకులమైన విష్ణుండును హిరణ్యగర్భుండనైన యేనును రుద్రుండును గలిగితిమి.) అందు సృష్టి జనన కారణుండైన చతుర్ముఖుండు పుట్ట, వానివలన దక్షాదులగు ప్రజాపతులు దొమ్మండ్రు గలిగిరి. అందు భవత్ప్రముఖులైన సనక సనందనాది యోగీంద్రులును, నాకలోక నివాసు లయిన వాసవాదులును, ఖగలోక పాలకు లగు గరుడాదులును, నృలోకపాలకు లగు మను మాంధాతృ ప్రభృతులును, రసాతలలోకపాలకు లగు ననంత వాసుకి ప్రభృతులును, గంధర్వ సిద్ధ విద్యాధర చారణ సాధ్య రక్షో యక్షోరగ నాగలోక పాలురును, మఱియు ఋషులును, పితృదేవతలును, దైత్య దానవ భూత ప్రేత పిశాచ కూశ్మాండ పశు మృగాదులు నుద్భవించిరి. ఇట్టి జగత్ప్రథమోద్భవంబు మహత్తత్త్వ సృష్టి యనంబడు. ద్వితీయంబండ సంస్థితం బనం దగు. తృతీయంబు సర్వభూతస్థం బన నొప్పు. అందైశ్వర్య తేజో బల సంపన్నులైన పురుషులు సర్వాత్ముండైన నారాయణుని యంశసంభవులుగా నెఱుంగుము. ఆ పుండరీకాక్షుని లీలావతారంబు లనంతంబులు. తత్కర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికి నలవి గాదు. ఐనను నాకుం దోచినంత నీ కెఱింగించెద. వినుము. 112

—: శ్రీమన్నారాయణుని లీలావతారంబుల యభివర్ణనము :—

ఉ. అన్య కథానులాపము లహర్నిశముం విసునట్టి సత్క్రియా
శూన్యములైన కర్ణముల సూరిజన స్తుత సర్వలోక స
మ్మాన్యములై తనర్చు హరి మంగళ దివ్యకథామృతంబు సౌ
జన్యతఁ గ్రోలుమయ్య! బుధసత్తమ! యే వివరించి చెప్పెదన్. 113

వ. అని పలికి నారదుం జూచి మఱియు నిట్లనియె. 114

అధ్యాయము — ౭

మ. కనకాక్షుండు భుజా విజృంభణమునన్ క్ష్మాచక్రముం జాపఁ జు
ట్టిన మాడ్కిన్ గొనిపోవ యజ్ఞమయ [1]దంష్ట్రి స్వాకృతిం దాల్చి య
ద్దనుజాధీశ్వరుఁ దాఁకి యడ్డినడుమన్ దంష్ట్రాహతిం ద్రుంప ధా
త్రిని గూలెన్ గులిశాహతిం బడు మహాద్రిం బోలి యత్యుగ్రతన్. 115

వ. మఱియును యజ్ఞావతారంబు విను మని యిట్లనియె. 116

1. దంష్ట్రిరూపమున్ (క. చ. ట. త. జ. ద. ద.)

సీ. [1]ప్రకటరుచి ప్రజాపతికిని స్వాయంభువుని కూఁతు రాకూతి యను లతాంగి
కర్థి జన్మించి సుయజ్ఞుండు నా నొప్పు నతఁడు దక్షిణ యను నతివయందు
సుయమ నామామర స్తోమంబుఁ బుట్టించి యింద్రుఁడై వెలసి యుపేంద్రలీల
నఖిల లోకంబుల యార్తి హరించిన నతని మాతామహుఁ డైన మనువు

తే. దన మనంబునఁ దచ్చరిత్రమున కలరి, పరమ పుణ్యుండు హరి యని పలికెఁ గాన
నంచిత జ్ఞాన నిధియై సుయజ్ఞుఁ డెలమి దాపసోత్తమ! హరి యవతార మయ్యె.

వ. అని చెప్పి కపిలుని యవతారంబు వినుమని యిట్లనియె. 118

చ. ధృతమతి దేవహూతికిని దివ్యవిభుం డగు కర్దమ ప్రజా
పతికిఁ బ్రమోదమొప్ప నవఖామలతోఁ గపిలుండు పుట్టి యే
గతి [2]హరిఁ బొందు నట్టి సుభగంబగు [3]సాంఖ్యము తల్లికిచ్చి దు
ష్కృతములు వాపి చూపె మునిసేవితమై తనరారు మోక్షముం. 119

వ. మఱియు దత్తాత్రేయావతారంబు వినుము. 120

సీ. తాపసోత్తముఁ డత్రి దనయుని గోరి రమేశు వేఁడిన హరి యేను నీకు
ననఘ! దత్తుఁడ నైతి నని పల్కు కతమున నతఁడు దత్తాత్రేయుఁడై జనించె
న మ్మహాత్ముని చరణాబ్జ పరాగ సందోహంబుచేఁ బూతదేహు లగుచు
హైహయ యదువంశు లైహి కాముష్మిక ఫలరూప మగు యోగబలము వడసి

తే. సంచిత జ్ఞాన [4]ఫల సుఖైశ్వర్య శక్తి, శౌర్యములు పొంది తమకీర్తి చదల వెలుఁగ
నిందు నందును వాసికి నెక్కి రట్టి, దివ్యతర మూర్తి విష్ణు నుతింపఁ దరమె! 121

వ. వెండియు సనకా ద్యవతారంబు వినుము. 122

సీ. అనఘాత్మ! నేను గల్పాదిని విశ్వంబు సృజియింపఁ దలఁచి యంచిత తపంబు
నర్థిఁ జేయుచు *'సన' యని పల్కుటయు నది గారణంబున సనాఖ్యలను గల స
సందన సనక సనత్కుమార సనత్సుజాతులు నల్వురు సంభవించి
మానసపుత్రులై మహి నుతికెక్కిరి పోయిన కల్పాంతమున [5]నశించి

తే. యట్టి యాత్మీయ తత్త్వంబు పుట్టఁజేసి, [6]సాంప్రదాయక భంగిని జగతినెల్ల
గలుగఁజేసిరి య వ్విష్ణుకళలఁ దనరి, నలువు రయ్యును నొక్కఁడె నయచరిత్ర!

1. ప్రకటరుచిం బ్రజాపతికి (తం. వా.) 2. హరి పొందునట్టి (తం.వా.) 3. సాంఖ్య ముపన్య సించి (హ) 4. ఫలసుఖైశ్వర్యలక్ష్మి (హ); సుఖబలైశ్వర్య శక్తి(త.జ.) *సనాత్స్వతపసః (మూలము) 5. పసించు (హ) 6. సంప్రదాయక (క. చ. ట.)

వ. మఱియు నరనారాయణావతారంబు వినుము. 124

క. గణుతింపఁగ నరనారా, యణులన ధర్మునకు నుదయ మందిరి దాక్షా
యణి యైన మూర్తివలనం, బ్రణుత గుణోత్తములు పరమ పావన మూర్తుల్.

క. అనఘులు బదరీ వనమున, వినుత తపోవృత్తి నుండ విబుధాధిపుఁడున్
మనమున నిజపద హానికి, ఘనముగఁ జింతించి దివిజ కాంతామణులన్. 126

క. రావించి తపోవిఘ్నము, గావింపుం డనుచుఁ బలుకఁ గడువేడుకతో
[1]భావభవానీకిను లనఁ, గా వనితలు సనిరి బదరికా వనమునకున్. 127

వ. అందు. 128

మ. నరనారాయణు లున్న చోటికి మరు న్నారీ సమూహంబు భా
స్వరలీలం జని రూప విభ్రమ కళా చాతుర్య మేపారఁగాఁ
బరిహాసోక్తుల నాట పాటలఁ జరింపం జూచి నిశ్చింతతన్
భరిత ధ్యాన తపః ప్రభావ నిరతిం బాటించి నిష్కాములై. 129

క. క్రోధము దపముల కెల్లను, బాధకమగు టెఱిఁగి దివిజభామలపై న
[2]మ్మేధానిధు లొక యింతయుఁ, గ్రోధము దేరైరి సత్త్వగుణ[3]యుతు లగుటన్.

క. నారాయణుఁ డప్పుడు దన, యూరువు వెసఁ జీఱ నందు నుదయించెను బెం
పారంగ నూర్వశీ ముఖ, నారీ జనకోటి దివిజనారులు మెచ్చన్. 131

క. ఊరువులందు జనించిన, కారణమున నూర్వశి యన ఘనతకు నెక్కెన్
వారల రూప విలాస వి, హారములకు నోడి రంత నమరీ జనముల్. 132

వ. అంతం దాము నరనారాయణుల తపోవిఘ్నంబు గావింపం బూని సేయు విలా
సంబులు (మానసిక సంకల్ప మాత్రంబున సృష్టిస్థితి సంహారంబు లొనర్పం
జాలు)న మ్మహాత్ములదెసం బనికిరాక కృతఘ్నునకుం జేయు నుపకృతులుం
బోలె నిష్ఫలంబులైన సిగ్గునం గుందుచు నూర్వశిం దమకు ముఖ్యురాలిగాఁ
గైకొని తమ వచ్చిన జాడనే మఱలి రంత. 133

క. కాముని దహించెఁ గ్రోధ మ, హామహిమను రుద్రుఁ డట్టి యతికోపము నా
ధీమతులు గెలిచి రనినం, గామము [4]గెల్పుటలు చెప్పఁగా నేమిటికిన్. 134

1. భావజు శరముల కెనయనగా (హ) 2. మేధాత్మకు (హ.తం.వా.) 3. యుక్తులరై (హ); సంగతులై (తం. వా.) 4. గెల్పుటకు (హ)

వ. అట్టి నరనారాయణావతారంబు జగత్పావనంబై విలసిల్లె. వెండియు ధ్రువావ తారంబు వివరించెద వినుము. 135

సీ. మానిత చరితుఁ డుత్తానపాదుం డను భూవరేణ్యునకు సత్పుత్రుఁ డనఁగ
నుదయించి మహిమఁ బెంపొంది బాల్యంబున జనకుని కడ నుండి సవతితల్లి
తను నాడు వాక్యాస్త్ర తతిఁ గుంది మహిత తపంబు గావించి కాయంబుతోడఁ
జని మింట ధ్రువపద స్థాయియై యట మీఁద నర్థి వర్తించు భృగ్వాది మునులు

తే. చతురగతిఁ గ్రింద వర్తించు సప్తఋషులు, పెంపు దీపింపఁ దన్ను నుతింపుచుండ
ధ్రువుఁడునా నొప్పి యవ్విష్ణుతుల్యుఁడగుచు,నున్నపుణ్యాత్ముఁడిప్పుడునున్నవాఁడు.

వ. పృథుని యవతారంబు వినుము. 137

ఉ. వేనుఁడు విప్రభాషణ [1]పవి ప్రహార చ్యుత భాగ్య పౌరుషుం
డై నిరయంబునం బడిన నాత్మతనూభవుఁడై పృథుండు నా
బూని జనించి త జ్జనకుఁ బున్నరకంబును [2]బాపె; మేదినిన్
ధేనువుఁ జేసి వస్తువితతిం బితికెన్ హరి సత్కళాంశుఁడై. 138

వ. అని మఱియు వృషభావతారంబు నెఱిఁగింతు వినుము. ఆగ్నీధ్రుం డను వానికి సుదేవివలన నాభి యను వాఁ డుదయించె. అతనికి మేరుదేవియందు హరి వృష భావతారంబు నొంది, జడస్వభావం బైన యోగంబు దాల్చి ప్రశాం తాంతః కరణుండును విముక్త సంగుండును నై, పరమ హంసాభిగమ్యంబైన పదం బిది యని మహర్షులు పలుకుచుండం జరించె. మఱియు హయగ్రీ వావతారంబు సెప్పెద వినుము. 139

చ. అనఘచరిత్ర ! మ న్మఖమునందు జనించె హయాన నాఖ్యతన్
వినుత సువర్ణ వర్ణుఁడును వేదమయుం డఖి లాంతరాత్మకుం
డనుపమ యజ్ఞపూరుషుఁడు నై భగవంతుఁడు ద త్సమస్త పా
వనమగు నాసికా శ్వసన వర్గములం దుదయించె వేదముల్. 140

వ. మఱియు మత్స్యావతారంబు వినుము. 141

1. పవిచ్యుత భాగ్యహీన (హ) 2. బాపి (తం. వా.)

సీ. ఘనుఁడు వైవస్వత మనువుకు దృష్టమై యరుదెంచినట్టి యుగాంత సమయ
మందు [1] విచిత్ర మత్స్యావతారము దాల్చి యఖిలావనీ మయం బగుచుఁ జాల
సర్వజీవులకు నాశ్రయభూతుఁ డగుచు నే కార్ణవం బైన తోయముల నడుమ
మ న్ముఖశ్లథ వేద మార్గంబులను జిక్కు పడకుండ శాఖ లేర్పడఁగఁ జేసి

తే. దివ్యు లర్థింప నా కర్థిఁ దెచ్చియిచ్చి, [2]మనువు నెక్కించి పెన్నావ వనధి నడుమ
మునుఁగ కుండఁగ నరసిన యనిమిషావ,తార మేరికి నుతియింపఁ దరమె? వత్స!

వ. మఱియుఁ గూర్మావతారంబు వినుము. 143

మ. అమృతోత్పాదన యత్నులై విబుధ దైత్యానీకముల్ మందరా
గము గవ్వంబుగఁ జేసి యబ్ధి దఱువంగాఁ గవ్వపుం గొండ వా
ర్ధి మునుంగన్ హరి గూర్మ రూపమున నద్రిం దాల్చెఁ ద త్పర్వత
భ్రమణ వ్యాజత వీఁపు తీట శమియింపం జేయఁగా నారదా ! 144

వ. వెండియు నృసింహావతారంబు వినుము. 145

మ. సురలోకంబుఁ గలంచి దేవసమితిన్ స్రుక్కించి యుద్య ద్గదా
ధరుఁడై వచ్చు నిశాచరుం గని కన ద్దంష్ట్రాకరాళాస్య వి
స్ఫురిత భ్రూకుటి[3]తో నృసింహగతి రక్షోరాజ వక్షంబు భీ
కర భాస్వ న్నఖరాజిఁ ద్రుంచెఁ ద్రిజగ త్కల్యాణ సంధాయియై. 146

వ. ఆదిమూలావతారంబు సెప్పెద వినుము. 147

మ. కరినాథుండు జలగ్రహ గ్రహణ దుఃఖాక్రాంతుఁడై [4]వేయి వ
త్సరముల్ [4]గుయ్యిడుచుండ వేల్పులకు విశ్వవ్యాప్తి లేకుండుటన్
హరి నీవే శరణంబు నా కనిన కుయ్యాలించి వేవేగ[6]వా
శ్చరముం ద్రుంచి కరీంద్రుఁ గాచె మహితోత్సాహంబునం దాపసా! 148

వ. మఱియును వామనావతారంబు వినుము. 149

సీ. యజ్ఞేశ్వరుం డగు హరి విష్ణుఁ డదితి సంతానంబునకు నెల్లఁ దమ్ముఁ డయ్యుఁ
బెంపారు గుణములఁ బెద్దయై వామన మూర్తితో బలిచక్రవర్తిఁ జేరి
త ద్భూమి మూఁడు పాదమ్ముల నడిగి పద త్రయంబునను జగత్త్రయంబు
వంచించి కొనియెను వాసవునకు రాజ్య మందింప నీశ్వరుఁ డయ్యు మొఱఁగి

1. ఔన్నత్య (క.ఐ.) 2. మనువు యెక్కిన పెన్నావ (చ.ట.ఛ.) 3. శ్రీనృసింహగతి (జ.డ.)
4. వేయు (హ) 5. గుయ్యిడుచుండ (హ) 6. కంచరమున్ (చ. ఐ.)

తే. యర్థి రూపంబు గై కొని యడుగవలసె, ధార్మికులసొమ్ము వినయోచితమునఁ గాని
[1]వెడఁగుఁదనమున నూరక విగ్రహించి,చలన మందింపరాదు నిశ్చయము పుత్ర!

చ. బలి నిజమౌళి న వ్వటుని పాదసరోరుహ భవ్యతీర్థ ము
త్కలిక ధరించి తన్నును జగత్త్రియముః హరి కిచ్చి కీర్తులః
నిలిపె వసుంధరాస్థలిని నిర్జరలోక విభుత్వ హానికిః
దలఁకక శుక్రు మాటలకుఁ దారక భూరి వదాన్య శీలుఁడై. 151

వ. మఱియు న వ్వరమేశ్వరుండు నారదా! హంసావతారంబునొంది యతిశయ భక్తి యోగంబున సంతుష్టాంతరంగుం డగుచు నీకు నాత్మతత్త్వ ప్రదీపకం బగు భాగవత మహాపురాణం బుపదేశించె. మన్వవతారంబు నొంది స్వకీయ తేజఃప్రభావంబున నప్రతిహతంబైన చక్రంబు ధరియించి దుష్టవర్తనులైన రాజుల దండింపుచు, శిష్టపరిపాలనంబు సేయుచు, నాత్మీయ కీర్తిచంద్రికలు సత్యలోకంబున వెలింగించె. మఱియు ధన్వంతరి యన నవతరించి తన నామస్మరణంబున భూజనంబులకు సకల రోగ నివారణము సేయుచు నాయుర్వేదంబు గల్పించె. వెండియు పరశురామావతారంబు వినుము. 152

మ. [2]ధరణీకంటకులైన హైహయ నరేంద్ర వ్రాతముః భూరి వి
స్ఫురి తోదార కుఠార ధారఁ గలనః ముయ్యేఁడుమాఱుల్ పోరిం
బోరి మర్దించి సమస్త భూతలము విప్రుల్ [3]వేఁడఁగా నిచ్చి [4]తాఁ.
జిరకీర్తిః జమదగ్నిరాముఁ డన మించెః దాపసేంద్రోత్తమా! 153

వ. మఱియు శ్రీరామావతారంబు సెప్పెద వినుము. 154

సీ. తోయజహిత వంశ దుగ్ధ పారావార రాకా విహార కైరవహితుండు
గమనీయ కోసల క్ష్మాభృ త్సుతాగర్భ శుక్తి సంపుట లస న్మౌక్తికంబు
నిజపాద సేవక వ్రజ దుఃఖ నిబిడాంధకార విస్ఫురిత పంకరుహ సఖుఁడు
దశరథేశ్వర కృతాధ్వర వాటికా ప్రాంగ [5]ణాకర దేవతానోకహంబు

తే. చటుల దానవ గహన వైశ్వానరుండు, రావణాటోప శైల పురందరుండు
నగుచు లోకోపకారార్థ మవతరించె, రాముఁడై చక్రి లోకాభిరాముఁ డగుచు.

1. వెఱగుతనమున (హ); వెడుగుదనమున (ద.ద.) 2. ధరణిన్ కంటకులైన (క.చ.ట.య.)
3. వేడినన్ నిచ్చి (క.ట.త.) 4. భాసుర కీర్తిన్......మించున్ (క) 5. ణాకార (చ.ట.త.బ.)

క. చిత్రముగ భరత లక్ష్మణ, శత్రుఘ్నుల కర్థి నగ్రజన్ముం డగుచున్
ధాత్రిన్ రాముఁడు వెలసెఁ బ, విత్రుఁడు దుర్భవలతా లవిత్రుండగుచున్. 156

వ. అంత. 157

సీ. కిసలయ ఖండేందు బిస కుంద పద్మాబ్జ పద ఫాల భుజరద పాణి నేత్రఁ
గాహళ కరభ చక్ర వియ త్పులిన శంఖ జంఘోరు కుచ మధ్య జఘన కంఠ
ముకుర చందన బింబ శుక గజ శ్రీకార గండ గంధోష్ఠ వా గ్గమన కర్ణఁ
జంప కేందు స్వర్ణ శంపా ధను ర్నీల నాసికాస్యాంగ దృక్ భ్రూ శిరోజ

తే. నలి సుధావర్త కుంతల హసనాభి, కలిత జనకావనీపాల కన్యకా ల
లామఁ [1]బరిణయమయ్యె లలాటనేత్ర, కార్ముక ధ్వంస ముంకువ గాఁగ నతఁడు.

వ. అంత. 159

క. రామున్ మేచక జలద, శ్యామున్ సుగుణాభిరాము సద్వైభవ సు
త్రామున్ దుష్ట నిశాట వి, రాముం బొమ్మనియెఁ బంక్తిరథుఁ డడవులకున్.160

వ. ఇట్లు పంచిన. 161

చ. అరుదుగ లక్ష్మణుండు జనకాత్మజయుం దనతోడ నేగుదే
నరిగి రఘూత్తముండు ముద మారఁగఁ జొచ్చెఁ దరక్షు సింహ సూ
కర కరి పుండరీక కపి ఖడ్గ కురంగ వృకాహి [2]భల్ల కా
సర ముఖ [3]వన్యసత్వచయ చండతరాటవి దండకాటవిన్. 162

క. ఆ వనమున వసియించి నృ, పావన నయశాలి యిచ్చె నభయములు జగ
త్పావన మునిసంతతికిఁ గృ, పావన నిధియైన రామభద్రుం డెలమిన్. 163

క. ఖరకర కుల జలనిధి హిమ, కరుఁడగు రఘురామ విభుఁడు గఱకఱితోడన్
ఖరుని వధించెను ఘన భీ,కర శరముల నిఖిల జనులు గర మరు దనఁగాన్.174

క. హరిసుతుఁ బరిచరుఁగాఁ గొని,హరిసుతుఁ దునుమాడి పనిచె హరిపురమునకున్
హరి[4]విభునకు హరిమధ్యను, హరిరాజ్యపదంబు నిచ్చె హరివిక్రముఁడై. 165

వ. అంత సీతానిమిత్తంబునం [5]ద్రిలోకకంటకుఁడగు దశకంఠుం దునుమాడుటకునై
కపిసేనా సమేతుండై చని దుర్గమంబైన సముద్రంబు తెరువు సూపకున్ననలిగి

1. బరిణీతుఁడయ్యె (హ) 2. భల్లు (హ) 3. సత్త్వవన్యచయ (హ) 4. వరునకు (క)
5. ముల్లోక కంటకుండగు (క.చ.ట.త.ద.బ.)

మ. వికట భ్రూకుటి ఫాలభాగుఁ డగుచున్ వీరుండు గ్రోధారుణాం
బకుఁడై చూచినయంత మాత్రమున నప్పాథోధి సంతప్తతో
యకణ గ్రాహ తిమింగిల ప్లవ ఝులీ వ్యాళ ప్రవాళోర్మి[1]కా
బక కారండవ చక్రముఖ్య జలసత్త్వ శ్రేణితో నింకినన్. 167

వ. ఆ య్యవసరంబున సముద్రుండు గరుణాసముద్రుం డగు శ్రీరామభద్రుని శర
ణంబు సొచ్చినం గరుణించి యెప్పటియట్ల నిలిపి, నలునిచే సేతువు బంధింపించి,
త న్మార్గంబునం జని, 168

మ. పురముల్ మూఁడును నొక్కబాణమున నిర్మూలంబు గావించు శం
కరు చందంబున నేర్చె రాఘవుఁడు లంకాపట్టణం బిద్ధ గో
పుర శాలాంగణ హర్మ్య రాజభవన ప్రోద్య త్ర్పతోళీ కవా
ట రథాశ్వ ద్విప శస్త్రమందిర నిశాట శ్రేణితో వ్రేల్మిడిన్. 169

క. రావణు నఖిలజగ ద్వి, ద్రావణుఁ బరిమార్చి నిలిపె రక్షోవిభుఁ గా
రావణు ననుజన్ముని నై, రావణ సితకీర్తి 'మెఱసి రాఘవుఁ డెలమిన్. 170

సీ. ధర్మసంరక్షకత్వ ప్రభావుం డయ్యు ధర్మవిధ్వంసకత్వమునఁ బొదలి
ఖర దండ నాభిముఖ్యము పొంద కుండియు ఖరదండ నాభిముఖ్యమున మెఱసి
పుణ్యజనావన స్ఫూర్తిఁ బెంపొందియుఁ బుణ్యజనాంతక స్ఫురణఁ దనరి
సంత తాశ్రిత విభీషణుఁడు గాకుండియు సంతతాశ్రిత విభీషణత నొప్పి

తే. మించి తనకీర్తిచేత వాసించె దిశలు, తరమె ? నుతియింప రాము నెవ్వరికినైనఁ
జారుతరమూర్తి నవనీశ చక్రవర్తిఁ, బ్రకట గుణసాంద్రు దశరథ రామచంద్రు.

వ. అట్టి రామావతారంబు జగత్పావనంబు నస్మ త్ర్పసాదకారణంబునై నుతికెక్కె.
ఇంక కృష్ణావతారంబు వివరించెద వినుము. 172

సీ. తాపసోత్తమ ! విను దైత్యాంశములఁ బుట్టి నరనాథు లతుల సేనాసమేతు
లగుచు ధర్మేతరులై ధాత్రిఁ బెక్కు బాధల నలంచుటఁ జేసి ! ధరణి వగలఁ
బొందుచు వాపోవ భూభార ముడుపుటకై హరి పరుఁడు నారాయణుండు
చెచ్చెరఁ [2]దన సితాసిత కేశయుగమున బలరామ కృష్ణ రూపములఁ దనరి

తే. యదుకులంబున లీలమై నుదయ మయ్యెఁ, భవ్యయశుఁడగు వసుదేవు భార్యలైన
రోహిణియు దేవకియునను రూపవతుల,యందు నున్మత్త దైత్యసంహారియగుచు.

1. భృద్బక కారండ రథాంగ (క) 2. తనమేని ధవళాసితపు కేశయుగమున (క. ట. త. ద.వ.బ.); తనమేని ఘనకృష్ణ ధవళకేశ (చ)

వ. ఇట్లు పుండరీకాక్షుం డగు నారాయణుండు సమస్త భూభార నివారణంబు సేయం దన మేని కేశద్వయంబు చాలునని యాత్మప్రభావంబు దెలుపు కొఱకు నిజకళా సంభవు లైన రామకృష్ణుల దేహవర్ణంబులు శ్వేత కృష్ణంబు లని నిర్దేశించు కొఱకు సితాసిత కేశద్వయ వ్యాజంబున రామ కృష్ణాఖ్యల నవతరించె. అందు భగవంతుండును సాక్షా ద్విష్ణుండును నైన కృష్ణుండు జనమార్గవర్తి యయ్యు నతిమానుష కర్మంబు లాచరించుటం జేసి కేవల పరమేశ్వరుం డయ్యె. అమ్మహాత్ముం డాచరించు కార్యంబులు లెక్కవెట్ట నెవ్వనికి నలవిగాదు. అయినను నాకు గోచరించి నంతయు నెఱింగించెద వినుము. 174

క. నూతన గరళస్తని యగు, పూతనఁ బురిటింటిలోనఁ బొత్తుల శిశువై
చేతనముల హరియించి ప, రేతనగరమునకు ననిచెఁ గృష్ణుఁడు పెలుచన్. 175

క. వికటముగ నిజపదాహతిఁ, బ్రకటముగా మూఁడునెలల బాలకుఁడై యా
శకట నిశాటుని నంతక, నికటస్థునిఁ జేసె భక్త నికరావనుఁడై. 176

క. ముద్దుల కొమరుని ప్రేతల, రద్దులకై తల్లి ఱోల రజ్జునఁ గట్టన్
బద్దులకు మిన్ను ముట్టిన, [1]మద్దుల వడిఁ గూల్చె జనసమాజము పొగడన్. 177

మ. [2]మదిఁ గృష్ణుండు యశోద బిడ్డఁ డని నమ్మం జాల యోగీంద్ర ! త
ద్వదనాంభోజములోఁ జరాచర సమస్త ప్రాణిజా తాటవీ
నద నద్యద్రి పయోధి యుక్తమగు నానాలోక జాలంబు భా
స్వ దనూనక్రియఁ జూపెఁ దల్లికి మహాశ్చర్యంబు వాటిల్లఁగన్. 178

చ. వర యమునానదీ [3]హ్రద నివాసకుఁడై నిజవక్త్రనిర్గత
స్ఫురిత విషాంబుపానమున భూజనులన్ మృతిఁ బొందఁజేయు భీ
కర గరళ ద్విజిహ్వుఁ డగు కాళియ పన్నగు [4]నా హ్రదంబుఁ జె
చ్చెర వెడలించి కాచె యదుసింహుఁడు గోపక గోగణంబులన్. 179

మ. [5]తనయా ! గోపకు లొక్కరాతిరిని నిద్రం జెందఁ గార్చిచ్చు వ
చ్చినఁ గృష్ణా ! మము నగ్ని పీడితుల రక్షింపం దగు గావవే !
యనినం గన్నులు మీరు మోడ్పుఁ డిదె దావాగ్నిన్ వెస న్నార్తు నే
నన వారట్ల యొనర్ప మ్రింగె శిఖిఁ బద్మాక్షుండు లీలాగతిన్. 180

1. మద్దులు వడ గూల్చె (హ) 2. మదిలో గృష్ణు డెశోద (చ. ట. త. జ. ద. బ.) 3. జల (క. ద. బ); నద (చ.ట.త.) 4. దన్నదంబు (ల.జ.) 5. తనయా యొక్క నిశందు గోపకులు (చ. ట. త. ద. చ. బ.)

క. మందుని గతి యమునాంబువు, లందు నిసిం గ్రుంకి బద్ధుఁడై చిక్కిన యా
నందుని వరుణుని [1]బంధన, మందు నివృత్తునిఁగఁ జేసె హరి సదయుండై. 181

మ. మయసూనుండు నిజానువర్తుల మహామాయన్ మహీభృద్గుహా
శ్రయులంగా నొనరించి [2]తత్పథము నీరంధ్రంబు గావించినన్
రయ మొప్పన్ గుటిలాసురాధమునిఁ బోరన్ ద్రుంచి గోపావళిన్
దయతోఁ గాచిన కృష్ణు సన్మహిమ మేత న్మాత్రమే? తాపసా! 182

క. దివిజేంద్ర ప్రీతిగ వ, ల్లవజను లేఁటేఁటఁ జేయు లాలిత సవనో
త్సవమున్ హరి [3]మాన్చిన గో, పవరులు గావింపకున్న బలరిపుఁ డలుకన్. 183

తే. మంద గొందలమంద నమందవృష్టి, గ్రందుకొనుఁడంచు నింద్రుండు మంద కంపె
జంఠ పవన సముద్ధూత చటులవిలయ, సమయ సంవర్తకాఖిల జలధరములు. 184

శా. సప్తస్కంధ శిఖాకలాప రుచిమత్సౌదామినీ వల్లికా
దీప్తోదగ్ర [4]ముహు ర్ముహు స్తనిత ధాత్రీభాగ నీరంధ్రమై
సప్తాశ్వస్ఫుర దిందుమండల నభ స్సంఛాది తాశాంతర
[5]వ్యాప్తాంభోద నిరర్గళ స్ఫుట శిలా వాఃపూర ధారాళమై. 185

వ. కురియు వానజల్లు పెల్లున రిమ్మలుగొని [6]సొమ్మలువోయి గోప గోకులం బాకులంబు నొంది కృష్ణ! కృష్ణ! రక్షింపు; రక్షింపు మని యార్తిం బొంది కుయ్యిడ న య్యఖండ కరుణారస సముద్రుండు భక్తజన సురద్రుముండు నగు పుండరీకాక్షుండు. 186

శా. సప్తాబ్దంబుల బాలుఁడై నిజ భుజాస్తంభంబునన్ లీలతో
సప్తాహంబులు శైల [7]రాజ మచల చ్ఛత్రంబుగాఁ దాల్చి సం
గుప్త ప్రాణులఁ జేసె మాధవుఁడు గో గోపాలక వ్రాతమున్
సప్తాంభోధి పరీత భూధరున కాశ్చర్యంబె! చింతింపఁగన్. 187

1. చేమృతి (జ) 2. హయసూనుండగు దానవుండు నిజమాయన్ గోపరాజిన్ గుహా, శ్రయ యౌనట్లొనరించి (హ.తం.వా.) (కాని మూలము; బిలేషు పిహితాన్ మయసూనునాచ.) 3. మాన్పిన (హ.తం.వా.) 4. మహాతమః పిహిత (చ.ట.డ.) 5. వ్యాప్తాంభోధర నిర్గమస్ఫుట (ట.త.జ.డ.); నిర్గత (ద) 6. సొమ్ములు వోయి సొమ్మసిలు (హ) 7. రాజముల సచ్ఛత్రంబుగా (హ); ధర్త్రోచ్ఛి లీంధ్రమివ సప్తదినాని (మూలము-7-32)

సీ. సాంద్ర శరచ్చంద్ర చంద్రికా ధవళిత విమల బృందావన వీథియందు
రాసకేళీ మహోల్లాసుఁడై యుత్ఫుల్ల జలజాక్షుఁ డొక నిశాసమయమునను
దనరారు మంద్ర మధ్యమ [1]తారముల నింపు దళుకొత్త రాగ భేదములఁ దనరి
ధైవత ఋషభ గాంధార నిషాద పంచమ షడ్జ మధ్యమస్వరము లోలిఁ

తే. గళలు జాతులు మూర్ఛనల్ గలుగ వేణు, నాళ వివరాంగుళీ న్యాస లాలసమున
మహితగతిఁ బాడె సవ్యక్త మధురముగను, బంకజాక్షుండు దారువు లంకురింప.

మ. హరి [2]వంశోద్గత మంజుల స్వర నినాదాహూతలై గోపసుం
దరు లేతేర ధనాధిపానుచర గంధర్వుండు గొంపోవఁ [3]ద
త్తరుణుల్ గుయ్యిడ శంఖచూడుని భుజాదర్పంబు మాయించి తాఁ
బరిరక్షించిన యట్టి కృష్ణుని నుతింపన్ శక్యమే యేరికిన్. 189

చ. నరక ముర ప్రలంబ యవన ద్విప ముష్టిక మల్ల కంస శం
బర శిశుపాల పంచజన పౌండ్రక [4]పల్వల దంతవక్త్ర వా
నర ఖర సాల్వ వత్స బక నాగ [5]విదూరథ రుక్మి కేశి ద
ర్దుర వృష ధేనుక ప్రముఖ దుష్ట నిశాటులఁ ద్రుంచె ప్రేల్మిడిన్. 190

వ. మఱియును, 191

మ. బల భీమార్జున ముఖ్య చాపధర రూప వ్యాజతం గ్రూరులన్
ఖలులన్ దుష్ట ధరాతలేశ్వరుల సంగ్రామైక పారీణ దో
ర్బల కేళిం దునుమాడి సర్వధరణీ భారంబు మాయించి సా
ధుల రక్షించిన యట్టి కృష్ణుని ననంతుం గొల్తు నెల్లప్పుడున్. 192

వ. అట్టి లోకోత్కృష్టుండైన కృష్ణుని యవతార మాహాత్మ్యం బెఱింగించితి. ఇంక
వ్యాసావతారంబు వినుము. 193

ఉ. ప్రత్యుగమందు సంకుచిత భావులు నల్పతరాయు[6]వుల్ సుదౌ
ర్గత్యగులైన మర్త్యుల కగమ్యములై స్వకృతంబు నిత్యముల్
సత్యము లైన వేద తరుశాఖల దా విభజించి నట్టి యా
సాత్యవతేయ మూర్తియయి జాతము నొందె హరి ప్రసన్నుఁడై. 194

వ. మఱియు బుద్ధావతారంబు వినుము. 195

1. తానముల (క); తారకల (హ) 2. వేణూద్గత (హ) 3. దత్తరపై (త) 4. పిప్పలి (హ)
5. విదూరక (హ) 6. లౌనసద్గతికులు (హ)

మ. [1]అతిలోలాత్ము ల[2]సూనృతోక్తులును [3]వేదాచార సంశీలు రు
ద్ధత పాషండ [4]మతౌపధర్మ్యులు జగత్సంహారు లైనట్టి యా
[5]దితి సంజాతు లధర్మవాసనల వర్తింపం దదాచార సం
హతి మాయించి హరించె దానవులఁ బద్మాక్షుండు బుద్ధాకృతిన్. 196

వ. మఱియుం గల్క్యవతారంబు వినుము. 197

మ. వనజాక్షస్తవ [6]శూన్యులన్ వషడితి స్వాహాస్వధా వాక్య శో
భన [7]రాహిత్యులు సూనృతేతరులునుం బాషండులు నైనన వి
ప్రనికాయంబును శూద్ర [8]భూవిభులునున్ బాటిల్లినన్ గల్కియై
జననం బంది యధర్మము న్నడఁచి సంస్థాపించు ధర్మం బిలన్. 198

వ. అని మఱియుఁ బితామహుండు నారదున కిట్లనియె. మునీంద్రా! పుండరీకాక్షుం డంగీకరించు లీలావతార కథావృత్తాంతంబు నే నీకు నెఱింగించు నింతకు మున్న హరి వరాహాద్యవతారంబు లంగీకరించి తత్ప్రయోజనంబులు దీర్చె. మన్వంతరావతారంబులు నంగీకరించినవియు, నంగీకరింపం గలయవియునై యున్నవి. వర్తమానంబున ధన్వంతరి పరశురామావతారంబులు దాల్చి యున్నవాఁడు. భావికాలంబున శ్రీరామా ద్యవతారంబుల నంగీకరింపం గలవాఁడు. ఆ మ్మహాత్ముండు సృష్ట్యాది కార్య భేదంబుల కొఱకు మాయా గుణావతారంబు నొందు. బహుశక్తి ధారణుండైన భగవంతుండు సర్గంబునం దపంబును, ఏనును, ఋషి గణంబులును, నవప్రజాపతులును నై యవతరించి విశ్వోత్పాదనంబు గావించు. ధర్మంబును, విష్ణుండును, యజ్ఞంబులును, మనువులును, ఇంద్రాది దేవగణంబును ధాత్రీపతులునై యవతరించి జగంబుల రక్షింపుచుండు. అధర్మంబును రుద్రుండును, మహోరగంబులును, రాక్షసానీకంబులు నై విలయంబు నొందించు. ఇత్తెఱంగునం బరమేశ్వరుండును, సర్వాత్మకుండు నైన హరి విశ్వోత్పత్తి స్థితిలయ హేతుభూతుండై విలసిల్లు. ధరణీరేణువులైన గణుతింప నలవియగుం గాని యమ్మహాత్ముని లీలావతారాద్భుత కర్మంబులు లెక్కవెట్ట నెవ్వనికి నశక్యంబై యుండు. నీకు సంక్షేపరూపంబున నుపన్యసించితి. సవిస్తరంబుగా నెఱింగింప నాకుం దరంబుగాదు. అన్యులం జెప్పనేల? వినుము. 199

1. అతిలోభాత్ముల (క. చ. జ.) 2. సూనృతేతరులు (చ. ట. త.) 3. ఖేదాచార (తం. వా.) 4. మతోపధర్మలు (డ. ద.) 5. దితిసంతానము (క. చ. ట. జ.) 6. శూన్యులై మఱి వషట్ (హ) 7. హీనుల్ గతినానృతోక్తిపరులై (హ) 8. భూపులు గలిన్ భాసిల్లినన్ (హ)

చ. అమరఁ ద్రివిక్రమస్ఫురణ నందిన య మ్మహితాత్ము పాద వే
గమున హతంబులైన త్రిజగంబుల కావల [1] నొప్పు సత్యలో
కము చలియించినం గరుణఁ గైకొని కాచి [2]ధరించు [3]పాదప
ద్మము తుదినున్న యప్రతిహతంబగు శక్తి గణింప శక్యమే! 200

మ. హరి మాయాబల మే నెఱుంగ నఁట శక్యంబే! సనందాది స
త్పురుష వ్రాతము కైన బుద్ధి నితరంబుల్ మాని సేవాధిక
స్ఫురణం ద చ్చరితానురాగ గుణ విస్ఫూర్తిన్ సహస్రాస్య సుం
దరతన్ బొల్పగు శేషుఁడు న్నెఱుఁగఁ డన్నన్ జెప్పలే రొండొరుల్. 201

చ. ఇతరము మాని తన్ను మది నెంతయు నమ్మి భజించువారి నా
శ్రిత జన సేవితాంఘ్రి సరసీరుహుఁ డైన సరోజనాభుఁ డం
చిత దయతోడ నిష్కపట చిత్తమునం గరుణించు నట్టి వా
రతుల దురంతమై తనరు న వ్విభు మాయఁ దరింతు రెప్పుడున్. 202

వ. మఱియును సంసారమగ్నులై దివసంబులు ద్రొబ్బ యంతంబున శునక సృగాల భక్ష్యంబు లైన కాయంబులందు మమత్వంబు సేయక భగవదర్పణంబు నేసిన పుణ్యాత్ములు గొందఱు గలరు, ఎఱింగింతు వినుము. ఏను నీ బ్రహ్మత్వంబునం జెందు రాజసంబు విడిచి య మ్మహాత్ము పాదారవిందంబుల భక్తినిష్ఠుండనై, శరణాగతత్వంబున భజించు నప్పుడు దెలియుదు. రాజసగుణుండనై తెలియఁజాల. శాస్త్రంబులు ప్రపంచింపక కేవల భక్తి జ్ఞానయోగంబున సేవింతు. మఱియు (సనకాదులగు) మీరును, భగవంతుండైన రుద్రుండును, దైత్యపతియైన ప్రహ్లాదుండును, స్వాయంభువ మనువును, అతని పత్నియగు శతరూపయు, దత్పుత్రులగు (ప్రియవ్రతోత్తానపాదులను)వారలును, దత్పుత్రికలు, ప్రాచీనబర్హియు, ఋభువును, వేనజనకుండగు నంగుండును, ధ్రువుండును గడవం జాలుదురు. వెండియు. 203

సీ. గాధి గయాదు లిక్ష్వాకు దిలీప మాం ధాతలు భీష్మ యయాతి సగర
రఘు ముచుకుం దైళ రంతిదే వోద్ధవ సారస్వ తోదంక భూరిషేణ
శ్రుతదేవ మారుతి శతధన్వ పిప్పల బలి విభీషణ శిబి పార్థ విదుర
లంబరీష పరాశ [4]రాలర్క దేవల సౌభరి మిథిలేశ్వ రాభిమన్యు

1. వెల్గు (తం. వా.) 2. ధరించె (తం) 3. పాదపద్మమునను నట్టి (తం) 4. 'రాలర్క మిథిలేశ్వరాను సౌభరి దేవ లాభిమన్యు' (వా); రాలర్క సౌభరి, దేవల మిథిలేశ్వరేంద్ర దత్తు (హ)

తే. లాష్టిషేణాదు లైన మహాత్మ లెలమిఁ, దవిలి య ద్దేవు భక్తిఁ జిత్తముల నిలిపి
త త్పరాయణ భక్తి దుర్దాంతమైన, విష్ణుమాయఁ దరింతురు విమలమతులు. 204

మ. అనఘా వీరల నెన్న నేమిటికిఁ ? దిర్య గ్జంతు సంతాన ప
క్షి [2]నిశాటాటవి కాఘజీవ నివహ స్త్రీ శూద్ర హూణాదులై
నను నారాయణ భక్తియోగ మహితానందాత్ములై రేని వా
రనయంబుం దరియింతు రవ్విభుని మాయావైభ వాంభోనిధిన్. 205

వ. కావున. 206

క. శశ్వ త్ప్రశాంతు [3]నభయుని, విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు విభు సంశుద్ధున్
శాశ్వతు[4]సము సదసత్పరు,నీశ్వరుఁ జిత్తమున నిలుపు మెపుడు మునీంద్రా!207

వ. అట్టైన న పుణ్యాత్ముల ననవద్యశీలుర నవిద్య లజ్జావనత వదనయై పొందం
జాలక వైముఖ్యంబునం దవ్వుదవ్వులఁ దలంగిపోవు మఱియు, 208

చ. హరిఁ బరమాత్మ నచ్యుతు ననంతునిఁ జిత్తములోఁ దలంచి సు
స్థిరత విశోక సౌఖ్యములఁ జెందిన ధీనిధు లన్య కృత్యముల్
మఱచియుఁ జేయ నొల్లరు తలంచిన నట్టిదయౌ సురేంద్రుఁడుం
బరువడి నుయ్యి [5]ద్రవ్వుచు నిపాన ఖనిత్రము మానుకై వడిన్. 209

ఉ. సర్వఫల ప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వశక్తుఁడున్
సర్వజగ త్ప్రసిద్ధుఁడును సర్వగతుం డగు చక్రపాణి యీ
సర్వశరీరులున్ విగమసంగతిఁ జెంది విశీర్యమాణులై
పర్వినచో నభంబుగతి బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్. 210

ఉ. కారణకార్య హేతువగు కంజదళాక్షుని కంటె నన్యు లె
వ్వారును లేరు తండ్రి ! భగవంతు ననంతుని విశ్వభావనో
దారుని సద్గుణావళు లుదాత్తమతిన్ గొనియాడకుండినన్
జేరవు చిత్తముల్ ప్రకృతిఁ జెందని నిర్గుణమైన బ్రహ్మమున్. 211

1. లార్ష్టి (హ. తం. వా.) 2. నిశాటాదిక సర్వజీవ నివహ (చ), నిశాటాటవికౌఘ (త)
3. సభవుని (హ) 4. సదసత్పూరుష (హ. తం. వా.) 5. ద్రవ్వనె పిపాసితుఁడై సలిలాభిలాషితన్ (క. చ. ట. త. తం. వా.)

మ. నిగమార్థ ప్రతిపాదక ప్రకటమై నిర్వాణ సంధాయిగా
భగవంతుండు రచింప భాగవత కల్పక్ష్మాజమై శాస్త్రరా
జి గరిష్ఠంబగు నీ పురాణకథ సంక్షేపంబుగాఁ జెప్పితిన్
జగతి న్నీవు రచించు దీని నతివిస్తారంబుగాఁ బుత్రకా ! 212

చ. పురుషభవంబు నొందుట యపూర్వము జన్మములందు నందు భూ
సురకులమందుఁ బుట్టు టతిచోద్యమ యిట్లగుటన్ మనుష్య ల
స్థిరమగు కార్యదుర్దశల చేత నశింపక విష్ణుసేవనా
పరతఁ దనర్చి నిత్యమగు భవ్యపదంబును నొందు టొప్పదే ! 213

మ. ఉపవాస వ్రత [1]శౌచ శీల మఖ సంధ్యోపాస నాగ్నిక్రియా
జప దానాధ్యయ నాది కర్మముల మోక్షప్రాప్తి సేకూర ద
చ్చపు భక్తిన్ హరిఁ బుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమా
ధిపుఁ బాపఘ్నుఁ బరేశు నచ్యుతుని నర్థిం గొల్వలేకుండినన్. 214

క. వనజాక్షు [2]మహిమ నిత్యము, వినుతింపుచు నొరులు వొగడ వినుచు న్మదిలో
ననుమోదింపుచు నుండెడి, జనములు ద న్మోహవశతఁ జనరు [3]మునీంద్రా! 215

క. అని వాణీశుఁడు నారద, మునివరునకుఁ జెప్పినట్టి ముఖ్యకథా సూ
చన [4]మతి భక్తిఁ బరీక్షి, జ్జనపాలునితోడ యోగిచంద్రుఁడు సెప్పెన్. 216

అధ్యాయము — ౮

—: పరీక్షితుఁడు శుకునిఁ బ్రపంచోద్భవాదికం బడుగుట :—

సీ. విను శుకయోగికి మనుజేశుఁ డిట్లను మునినాథ ! దేవదర్శనము గలుగఁ
నారదమునికిఁ బంకేరుహభవుఁ డెఱిఁగించిన తెఱఁగు సత్కృప దలిర్ప
గణుతింప సత్త్వాది గుణశూన్యుఁ డగు హరి కమలాక్షు లోకమంగళము లైన
కథలు నా కెఱిఁగింపఁ గైకొని నిస్సంగ మైన నా హృదయాబ్జమందుఁ గృష్ణ

తే. భవ్యచరితుని నాద్యంత భావశూన్యుఁ, జిన్మయాకారు ననఘు లక్ష్మీసమేతు
నిలిపి యస్థిర విభవంబు నిఖిల హేయ భాజనం బైన యీ కళేబరము విడుతు. 217

1. శ్రౌత (హ) 2. మాయ (క.బ.) 3. నరేంద్రా (హ) 4. మతిమెరయ (క)

వ. అదియునుంగాక యెవ్వండు శ్రద్ధా భక్తియుక్తుండై కృష్ణ గుణకీర్తనంబులు వినుచుం బలుకుచుండునట్టివాని హృదయపద్మంబునందుఁ గర్ణ రంధ్రమార్గంబునఁ బ్రవేశించి, కృష్ణుండు విశ్రమించి, సలిలగతంబైన కలుషంబును శరత్కాలంబు నివారించు చందంబున నాత్మగతంబయిన మాలిన్యంబు నపకర్షించుఁ గావున.

మ. భరితోదగ్ర నిదాఘతప్తుఁ డగు న ప్పాంథుం [1]డరణ్యాది సం
చరణ క్లేశ సముద్భవం బగు పిపాసం జెంది యాత్మీయ మం
దిరముం జేరి గతశ్రముం డగుచు నెందేనిం జనం బోని భం
గి రమాధీశు పదారవింద యుగ సంగీభూతుఁడై మానునే! 219

వ. అదియునుం గాక సకల భూతసంసర్గ శూన్యంబైన యాత్మకు భూతసంగమం బే ప్రకారంబునం గలిగె? అది నిర్నిమిత్తంబునం జేసియో, కర్మంబునం జేసియో యా క్రమంబు నా కెఱిఁగింపుము. 220

సీ. ఎవ్వని నాభియం దెల్ల లోకాంగ సంస్థాన కారణ పంకజంబు వొడమె
నం దుదయించి సర్వావయవ స్ఫూర్తిఁ దనరారునట్టి పితామహుండు
గణఁగి యెవ్వని యనుగ్రహమున నిఖిల భూతముల సృజించె నుత్కంఠతోడ
నట్టి విధాత యే యనువున సర్వేశు రూపంబు గనుఁగొనె రుచిర భంగి

తే. నా పరంజ్యోతియైన పద్మాక్షునకును. [2]నళినజునకుఁ బ్రతీక విన్యాస భావ
గతులవలనను భేదంబు గలదె చెపుమ?, యతి దయాసాంద్ర! యోగికులాబ్ధిచంద్ర!

వ. మఱియును భూతేశ్వరుండైన సర్వేశ్వరుం డుత్పత్తిస్థితి లయ కారణంబైన తన మాయను విడిచి [3]మాయా నియామకుండై యేయే ప్రదేశంబుల శయనంబు సేసె (నదియునుం గాక పురుషావయవంబులచేఁ బూర్వకాలంబున లోకపాల సమేతంబులైన లోకంబులు గల్పితంబులయ్యె ననియు లోకంబులు పురుషావయవంబు లనియుఁ జెప్పం బడియె). అదియునుంగాక మహాకల్పంబులును నవాంతర కల్పంబులును *(భూత భవిష్య ద్వర్తమాన కాలంబులును) స్థూల దేహాభిమానులై జనియించిన దేవ పితృ మనుష్యాదులకుం గలుగు నాయుః ప్రమాణంబును, (బృహత్సూక్ష్మ) కాలానువర్తనంబును నే యే కర్మంబులం జేసి జీవులే యే లోకంబుల నొందుదురు ? మఱియు నే యే కర్మంబులం జేసి [4]దేవాది శరీరంబులం బ్రాపింతురు ? అట్టి కర్మమార్గ ప్రకారంబున,

1. అరణ్యాను సం, చరణక్లేశ పిపాసపీడిత బుభుక్షంజెంది (క.ట.జ.ప.) 2. నళినజునకును బ్రీతివిన్యాసభావ (బ) 3. రమానాయకుండై (తం. వా.) 4. దేహాదికర్మ శరీరంబులం (హ)

[1](సత్త్వాది గుణంబుల) పరిణామంబులగు దేవాది రూపంబులం గోరు జీవులకు నేయే కర్మ సముదాయం బెట్టు సేయందగు? ఎవ్వనికి సర్పింపం దగు? అవి యెవ్వని చేత గ్రహింపంబడు? భూ పాతాళ కకు బ్వ్యోమ గ్రహ నక్షత్ర పర్వతంబులును, సరి త్సముద్ర ద్వీపంబులును, నే ప్రకారంబున సంభవించె? ఆ యా స్థానంబులం గల వారి సంభవంబు [2]లేలాటివి? బాహ్యాభ్యంతరంబులం గలుగు బ్రహ్మాండ ప్రమాణం బెంత? మహాత్ముల చరిత్రంబులెట్టివి? వర్ణాశ్రమ వినిశ్చయంబులును, ననుగతంబులై యాశ్చర్యావహంబులగు హరి యవతార చరిత్రంబులును, యుగంబులును, యుగప్రమాణంబులును, యుగధర్మంబులును, ప్రతియుగమందును మనుష్యుల కే యే ధర్మంబు లాచరణీయంబు (లగు నట్టి) సాధారణ ధర్మంబులును, విశేష ధర్మంబులును, జాతివిశేష ధర్మంబులును, రాజర్షి ధర్మంబులును, ఆపత్కాల జీవన సాధన భూతంబు లగు ధర్మంబులును, మహదాది తత్త్వంబుల సంఖ్యయును, సంఖ్యా లక్షణంబును, ఆ తత్త్వంబులకు హేతుభూత లక్షణంబులును, భగవ త్సమారాధన విధంబును, అష్టాంగ యోగ క్రమంబును, యోగీశ్వరుల యణిమా ద్యైశ్వర్య ప్రకారంబును, వారల యర్చిరాది గతులును, లింగ శరీర విలయంబును, ఋ గ్యజు స్సామాథర్వ వేదంబులును, ఉపవేదంబు లయిన యాయుర్వేదాదులును, ధర్మశాస్త్రంబులును, ఇతిహాస పురాణంబుల సంభవంబును, సర్వభూతంబుల యవాంతర ప్రళయంబును, స్థితి మహాప్రళయంబులును, నిష్టాపూర్తంబు లను యాగాది వైదిక కర్మజాలంబును, వాపీకూప తటాక దేవాలయాది నిర్మాణంబు లన్నదానం బారామప్రతిష్ఠ మొదలగు స్మార్తకర్మంబులును, కామ్యంబులైన యగ్నిహోత్రంబుల యనుష్ఠాన ప్రకారంబును, జీవసృష్టియును, ధర్మార్థకామంబులనియెడు త్రివర్గాచరణ ప్రకారంబును, మలినోపాధికపాషండ సంభవంబును, జీవాత్మ బంధ మోక్ష ప్రకారంబును, స్వరూపావస్థాన విధంబును, సర్వ స్వతంత్రుండైన యీశ్వరుం డాత్మమాయం జేసి సర్వ కర్మసాక్షి యై క్రీడించుటయును, మఱియు మాయ నెడం బాసి యుదాసీనగతి విభుండై క్రీడించు తెఱంగు మొదలగు సమస్తము క్రమంబున నాపన్నుండ నైన నాకు నెఱిఁగింపుము. బ్రాహ్మణ శాపంబున జేసి, శోక వ్యాకులిత చిత్తుండనై యనశన వ్రతుండ నైన నీవు వినుట యెట్లని సందేహింప వలవదు. త్వదీయ ముఖారవింద వినిస్స్రుతనారాయణ కథామృతపాన కుతూహలి నైన నాకు నింద్రియంబులు వశంబులైయుండు. అది గావున నే నడిగిన ప్రశ్నంబులకు నుత్తరంబులు

1. గుణవంతులై పరిణామాపేక్షులగు వారికి నెవ్వరియందు నేకర్మంబు లాచరింప వగు నెవ్వని చేత గ్రహింపబడు (క. చ. ట. త.) 2. లేలాగు కలుగు (తం. వా.)

సవిస్తరంబులుగా నానతిచ్చి కృతార్థునిఁ జేయఁ బరమేష్ఠితుల్యుండ వగు నీవ పూర్వ సంప్రదాయానురోధంబున నర్హుండ వగుదు వని విష్ణురాతుండైన పరీక్షిన్నరేంద్రుండు బ్రహ్మరాతుండైన శుకయోగి నడిగిన నతండు బ్రహ్మ నారద సంవాదంబును, నేక సంప్రదాయానుగతంబును, గతానుగతిక ప్రకారంబునునై తొల్లి సర్వేశ్వరుండు బ్రహ్మకల్పంబున బ్రహ్మ కుపదేశించిన భాగవత పురాణంబు వేదతుల్యంబు నీ కెఱింగింతు విను మని చెప్పె నని సూతుండు శౌనకాది మునులకుం జెప్పినట్లు శుక యోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 222

అధ్యాయము—౯

సీ. భూపాలకోత్తమ! భూత హితుండు సుజ్ఞాన స్వరూపకుం డైన యట్టి
ప్రాణికి దేహసంబంధ మెట్లగు నన్న మహి నొప్పు నీశ్వర మాయలేక
కలుగదు, నిద్రవోఁ గలలోనఁ దోఁచిన దేహబంధంబుల [1]తెఱఁగు వలెను
హరి యోగమాయా మహత్త్వంబునం బాంచభౌతిక దేహ సంబంధుఁ డగుచు

తే. నట్టి మాయాగుణంబుల నాత్మ యోలి, బాల్య కౌమార యౌవన భావములను
నర సుపర్వాది మూర్తులఁ బొరసి మేను,నాయ దిది యను సంసార మాయఁదగిలి.

వ. వర్తింపు చిట్లున్న జీవునికి భగవ ద్భక్తియోగంబున ముక్తి సంభవించుట యెట్లన్న నెప్పుడేని జీవుండు ప్రకృతి పురుషాతీత మయిన బ్రహ్మస్వరూపంబు నందు మహిత ధ్యాననిష్ఠుం డగు నప్పుడు విగత మోహుండై యహంకార మమకారాత్మకంబైన సంసరణంబు దొలంగి ముక్తుండై యుండు. మఱియు జీవేశ్వరులకు దేహసంబంధంబులు గానంబడుచుండు. అట్టి దేహధారియైన భగవంతునందు భక్తిం జేసి జీవుని ముక్తి యే తెఱంగునం గలుగు నని యడిగితివి. జీవుం డవిద్యా మహిమం జేసి కర్మానుగతం బైన మిథ్యారూప దేహ సంబంధుండు. భగవంతుండు నిజ యోగమాయా మహిమం జేసి [2]స్వేచ్ఛా పరికల్పిత చిద్ఘన లీలా విగ్రహుండు. కావున భగవంతుండైన యీశ్వరుండు స్వ భజనంబు ముక్తిసాధన జ్ఞానార్థంబు కల్పితం బని చతుర్ముఖునకుఁ దదీయ నిష్కపట తపశ్చర్యాది [3]సేవితుండై నిజజ్ఞానానందఘనమైన స్వరూపంబు చూపుచు నానతిచ్చె. అది గావున జీవునికి భగవద్భక్తి మోక్ష ప్రదాయకం బగు. ఇందుల కొక యితిహాసంబు గల దెఱింగింతు. ఆకర్ణింపుము. దాన భవదీయ సంశయ నివృత్తి యయ్యెడు నని శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. 224

1. తెరగుదోప (త) 2. స్వేచ్ఛాప్రాప్తలీలా (ప. త.) 3. విశేషంబైన (హ)

:— బ్రహ్మ తపంబునకు మెచ్చి శ్రీమన్నారాయణుండు వరం బిచ్చుట :—

సీ. హరి పాదభక్తి రహస్యోపదేష్టయు నఖిల దేవతలకు [1]నధివిభుండు
నైన విధాత గల్పాదియందును నిజాశ్రయ పద్మమున కధిష్ఠాన మరయ
సర్థించి జలముల నన్వేషణము సేసి నళినంబు మొదలు గానంగలేక
విసివి [2]క్రమ్మఱను ద ద్బిసరుహాసీనుఁడై సృష్టి నిర్మాణేచ్ఛఁ జిత్తమందుఁ

తే. జాల నూహించి [3]తత్పరిజ్ఞాన మహిమ, సరణి మనమునఁ దోఁపక జడను పడుచు
లోకజాలంబు పుట్టింప లేక మోహి, తాత్ముఁడై చింతనొందు న య్యవసరమున.

వ. జలమధ్యంబున నుండి యక్షర సమామ్నాయంబున స్పర్శంబులందు షోడశాక్షరంబు మఱియు నేకవింశాక్షరంబు నైన నీ యక్షర ద్వయంబు వలన నగుచు, మహాముని జన ధనంబైన తప యను శబ్దంబు రెండు మాఱు లుచ్చరింపంబడి వినంబడిన, నట్టి శబ్దంబు వలికిన పురుషుని వీక్షింపం గోరి నలుదిక్కులకుం జని వెదకి యెందునుం గానక మరలి నిజస్థానం బైన పద్మంబునం దాసీనుండై యొక్కించుక చింతించి యట్టి శబ్దంబు దన్నుఁ దపంబు సేయుమని నియమించుటగాఁ దలఁచి, ప్రాణాయామ పరాయణుండై, జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబుల జయించి యేకాగ్రచిత్తుండై, సకలలోక సంతాప హేతువైన తపంబు వేయి దివ్యవత్సరంబులు గావింప, నీశ్వరుండు ప్రసన్నుండై పొడచూపిన, నా కమలసంభవుండు దక్షణంబు రాజస, తామస మిశ్ర సత్త్వగుణాతీతంబును, శుద్ధ సత్త్వగుణావాసంబును, అకాల విక్రమంబును, సర్వలోకోన్నతంబును, సకల సురగణ స్తుత్యంబును, లోభ మోహ భయవిరహితంబును, అపునరావృత్తి మార్గంబును, అనంత తేజో విరాజితంబును నైన వైకుంఠపురంబుఁ బొడగని యందు. 226

సీ. సూర్య చంద్రానల స్ఫురణలఁ జొరనీక నిజ దీధితి స్ఫూర్తి నివ్వటిల్ల
దివ్య మణిప్రభా దీపిత సౌధ విమాన గోపుర హర్మ్య మంటపములు
ప్రసవ గుచ్ఛ స్వచ్ఛ ఫలిత కామిత ఫలసంతాన [4]పాదప సముదయములు
[5]కాంచన దండ సంగత మారు తోద్ధూత తరళ విచిత్ర కేతన చయములు

తే. వికచ కైరవ దర దరవింద గత మ, రందరస పాన [6]మోది తేందిందిర ప్రభూత మంజుల నినద ప్రబుద్ధ రాజ, హంస శోభిత వర కమలాకరములు. 227

1. నాదివిభుడు (ఠ. జ.) 2. క్రమ్మఱ పూర్వబిసరుహాసీనుఁడై (చ) 3. తత్త్వవిజ్ఞాన (హ)
4. సంతాన (జ) 5. కాంచన దండాంచ (చ) 6. మదవదిందిర.

సీ. వలనొప్పఁగా "నద్దైవం కేశవాత్పరం" బని పల్కు రాజ కీరావళియును
[1]మహిమ "సర్వం విష్ణుమయము జగత్తి"ని చదివెడు శారికా సముదయంబు
నేపారఁగా "జితం తే పుండరీకాక్ష!" యని లీలఁ బాడు పికావళియును
లలి మీఱఁగా [2]"మంగళం మధుసూదన" యని పల్కు కేకు లనారతంబు

తే. తవిలి [3]శ్రౌషడ్వష ట్స్వధేత్యాది శబ్ద, కలితముగ మ్రోయు మధుప నికాయములును
గలిగి యఖిలైక దివ్యమంగళ విలాస, మహిమఁ జెన్నొందు వైకుంఠమందిరంబు.

వ. మఱియుం బయోధరావళీ విభాసిత నభంబుం బోలె వెలుంగుచున్న య ద్దివ్య ధామంబునందు. 229

సీ. సలలి తేందీవర శ్యామాయమానోజ్జ్వలాంగులు నవ్య పీతాంబరులును
[4]ధవళారవింద సుందర పత్రనేత్రులు సుకుమార తనులు భాసుర వినూత్న
రత్న విభూషణ గ్రైవేయ కంకణహార కేయూర మంజీర ధరులు
నిత్య యౌవనులు వినిర్మల చరితులు [5]రోచిష్ణులును హరిరూప ధరులు

తే. నగు సునందుండు నందుండు నర్హణుండు, ప్రబలుఁడును మొదలగు నిజపార్శ్వ చరులు
మఱియు వైడూర్యవిద్రుమామలమృణాళ తుల్యగాత్రులుఁదను భక్తితో భజింప.

సీ. క్షాళి తాఖిల కల్మషవ్ర జామరసదీజనక కోమల పదాబ్జములవాని
నఖిల సంప త్కార ణాపాంగ లక్ష్మీ విలాసిత వక్షస్థ్సలంబు వానిఁ
బద్మమిత్రామిత్ర [6]భాసిత కరుణా తరంగిత చారు నేత్రములవాని
[7]భువన నిర్మాణ నైపుణ భవ్య నిజ జన్మ కారణ నాభి పంకజము వాని

తే. నహిహితాహిత శయన వాహములవాని, సేవి తామర తాపస శ్రేణివాని
నఖిల లోకంబులకు గురుం డైన వానిఁ [8]గాంచెఁ బరమేష్ఠి కన్నుల కఱవు దీఱ.

క. కమనీయ రూప రేఖా, రమణీయతఁ జాల నొప్పు రమణీమణి య
క్కమలాలయ దన మృదు కర, కమలంబుల విభుని పాద కమలము లొత్తన్. 232

1. మహిమ సర్వం విష్ణు మయమీ జగత్తని (తం); మహిమ జగద్విష్ణు మయమఖిలమ్మని (వా) 2. మంగళం భగవాన్ (?) వి, ష్ణోయనిపల్కు మయూరములును (చ. ద.); మంగళం భగవాన్ విష్ణు, వోయనిపల్కు మయూరములును (తం) 3. తవిలి వషడితి స్వాహాస్వధానుశబ్ద (చ.ఢ.ద.) 4. వరదరవింద సుందర (చ. ట. ఢ. ద. బ.) 5. రోచిష్ణు లంచితా రూఢయశులు (చ. ట.) 6. భాసురలోచను నళినసుందర వదనంబు వాని (హ); భాసిత పుష్పవ, న్నయనాభి నవవదనంబు వాని (త. జ.) 7. సృష్టికారణ విరించి ప్రభూతిస్థాన కమనీయనాభి పంకజమువాని (చ) 8. గాంచె నెనిమిది కన్నుం గరవుదీఱ (చ)

వ. వెండియు. 233

శా. శ్రీ కాంతాతిలకంబు రత్న రుచి రాజి ప్రేంఖిత స్వర్ణ డో
లా కేళిన్ [1]విలసిల్లి త త్కుచ భరాలం [2]కార ప్ర సగ్గంధ లో
భాకీర్ణ ప్రచర న్మధువ్రత మనో జ్ఞాలోల నాదంబు ల
స్తోకానుస్వర లీల నొప్పఁగ నిజేశున్ వేడ్కతోఁ బాడఁగన్. 234

వ. అట్టి నిత్యవిభూతియందు. 235

మ. సతత జ్ఞాన రమా యశో బల మహైశ్వర్యాది యుక్తుం జగ
త్పతి యజ్ఞేశు ననంతు నచ్యుతు దళ త్పంకేరుహాక్షుం శ్రియః
పతి నాద్యంత వికార దూరుఁ గరుణా పాథోనిధిన్ సాత్త్వతాం
పతి వర్ధిష్ణు సహిష్ణు విష్ణు గుణ విభ్రాజిష్ణు రోచిష్ణునిన్. 236

మ. దరహా సామృత పూరితాస్యు నిజభక్త త్రాణ పారా[3]యణు
న్నరుణాంభోరుహ పత్ర లోచనునిఁ [4]బీతావాసుఁ ద్రైలోక్యసుం
దరు మంజీర కిరీట కుండల ముఖోద్య ద్భూష యోగీశ్వరే
శ్వరు లక్ష్మీయుత వక్షుఁ జిన్మయు దయాసాంద్రున్ చతుర్బాహునిన్. 237

వ. మఱియు ( ననర్ఘ రత్నమయ సింహాసనాసీనుండు సునంద నంద కుముదాది సేవితుండు) ప్రకృతి పురుష మహ దహంకారంబులను చతుశ్శక్తులును,కర్మేంద్రియ జ్ఞానేంద్రియ మనో మహాభూతంబులను షోడశశక్తులును, పంచన్మాత్రలును, పరివేష్టింపఁ గోట్యర్క ప్రభావిభాసితుండును, స్వేత రాలభ్య స్వాభావిక సమస్తైశ్వ ర్యాతిశయుండును, (స్వ స్వరూపంబునం గ్రీడించు సర్వేశ్వరుండునైన) పరమపురుషుం బుండరీకాక్షు నారాయణుం జూచి సాంద్రానంద కందళిత హృదయారవిందుండు, రోమాంచ కంచుకిత శరీరుండు, నానంద బాష్పధారాసిక్త కపోలుండు నగుచు. 238

క. [5]వర పరమహంస గమ్యు, స్ఫురణం దనరారు పరమ పురుషుని పద పం
కరుహములకు నజుఁడు చతుశ్శిరములు సోఁకంగ నతులు సేసిన హరియున్. 239

1. విలసింప (హ) 2. కృత్రస్రగామోద (హ. వా.) 3. యణున్, వరుణాంభోరుహ (హ)
4. బీతాచ్ఛాదనున్ లోక (హ) 5. పరము ననంతు నగమ్యు (ట)

చ. ప్రియుఁడగు బొడ్డుతమ్మి తొలి [1]బిడ్డని, వేలుపు పెద్ద, భూత సం
చయములఁ బుట్టఁజేయు నిజ శాసనపాత్రు, నుపస్థితున్, మదిన్
దయ దళుకొత్తఁ బల్కెఁ బ్రమద [2]స్మిత చారు ముఖారవిందుఁడై
నయమునఁ బాణిపంకజమునన్ హరి యాతని దేహ మంటుచున్. 240

ఆ. కపట[3]మునుల కెంత కాలంబునకు నైన, సంతసింప నేను జలజగర్భ !
చిర తప స్సమాధిఁ జెంది విసర్గేచ్ఛ, మెలఁగు నిన్నుఁ బరిణమింతుఁ గాని. 241

తే. భద్ర మగుఁ గాక నీకు నో పద్మగర్భ! వరము నిపుడిత్తు నెఱిఁగింపు వాంఛితంబు
దేవదేవుఁడ నగు నస్మదీయ పాద, [4]దర్శనం బవధి విపత్తిదశల కనఘ! 242

చ. సరసిజగర్భ ! నీయెడఁ బ్రసన్నత నొంది మదీయ లోక మే
నిరవుగఁ జూపు టెల్లను సహేతుక భూరి దయాకటాక్ష వి
స్ఫురణను గాని నీదగు తపో విభవంబునఁ గాదు నీ తప
శ్చరణము నాదు వాక్యముల సంగతిఁ గాదె ! పయోరుహాసనా ! 243

క. తప మనఁగ [5]నాదుహృదయము, [7]దప మను తరువునకు ఫల వితానము నే నా
తపముననే జననస్థి, త్యుపసంహరణము లొనర్చుచుండుదుఁ దనయా ! 244

క. కావున మ ద్భక్తికిఁ దప, మే విధమున మూలధనమొ యిది నీ మది రా
జీవభవ! యెఱిఁగి తప మిటు, కావించుట విగత మోహకర్ముఁడ వింకన్. 245

క. అని యానతిచ్చి కమలజ, యెనయఁగ భవదీయ మాన సేప్సిత మే మై
నను నిత్తు వేఁడు మనినను, వనరుహసంభవుఁడు వికచ వదనుం డగుచున్. 246

వ. హరి వచనంబు లాత్మకుఁ బ్రియం బొనరింపఁ బయోజగర్భుఁ డో
పరమ[7]పదేశ ! యోగిజన భావన ! యీ నిఖి లోర్వియందు నీ
[8]వరయనియట్టి యర్థ మొక టైనను గల్గునె ? యైన నా మదిన్
బెరసిన కోర్కె దేవ ! వినుపింతు దయామతి చిత్తగింపవే. 247

1. బిడ్డఁడు......సంచయములఁ జేయు కర్త నిజశాసన పాత్రుఁడు ధాత మ్రొక్కెనన్ (హ. తం. వా.) 2. స్థిర (త) 3. మతుల (జ) 4. దర్శనావధిపో విపద్దశలకనఘ (ట. జ. తం.) ; దర్శన మడంచు నీవిపద్దశల ననఘ. 5. మత్స్వరూపము (తం. వా. క. బ.) 'తపోమే హృదయం సాక్షాత్' అని మూలము (9-23) 6. తపమన మద్రూప మనఘ ధర్మము తపమా (హ) 7. రమేశ (చ. త.) 8. వెరుగని......మొక టేనియు (క. చ. ట.)

వ. దేవా! సర్వ భూతాంతర్యామివై భగవంతుండవైన నీకు నమస్కరించి మదీయ వాంఛితంబు విన్నవించెద నవధరింపుము. అవ్యక్తరూపంబులై వెలుంగు భవదీయ స్థూల సూక్ష్మ రూపంబులును, నానా శక్త్యుపబృంహితంబు లైన బ్రహ్మాది రూపంబులును, నీయంత నీవే ధరియించి జగ దుత్పత్తి స్థితి లయంబులం దంతు కీటంబునుం బోలెం గావింపుచు నమోఘ సంకల్పుండవై లీలావిభూతిం గ్రీడించు మహిమంబు దెలియునట్టి పరిజ్ఞానంబుఁ గృపసేయుము. భవదీయ శాసనంబున జగన్నిర్మాణంబు గావించు నపుడు బ్రహ్మాభిమానంబునం జేసి యవశ్యంబును మహ దహంకారంబులు నా మదిం బొడముం గావునం ద త్పరిహారార్థంబు వేఁడెద. నన్నుం గృపాదృష్టి విలోకించి దయసేయు మని విన్నవించిన నాలించి పుండరీకాక్షుం డతని కిట్లనియె. 248

క. వారిజభవ! [1]శాస్త్రార్థ వి, చారజ్ఞానమును, భక్తి, సమధిక సాక్షా
త్కారము లను నీ మూఁడు ను, దారత నీ మనమునందు ధరియింప నగున్. 249

సీ. పరికింప మత్స్వరూప స్వభావములును [2]మహి తావతార కర్మములుఁ [3]దెలియు
తత్త్వవిజ్ఞానంబు దలకొని మ త్ప్రసాదమునఁ గల్గెడి నీకుఁ గమలగర్భ!
సృష్టి పూర్వమునఁ జర్చింప నే నొకరుండఁ గలిగియుండుదు వీతకర్మి నగుచు
సమధిక స్థూల సూక్ష్మ స్వరూపములఁ దత్కారణ ప్రకృతియుఁ దగ మ దంశ

ఆ. మందు లీనమైన నద్వితీయుండనై, యుండు నాకు నన్య మొకటి లేదు
సృష్టికాలమందు [4]సృష్టినాశంబున, జగము మత్స్వరూప మగును వత్స! 250

క. అరయఁగఁ గల్ప ప్రళయాం, తరము ననాద్యంత విరహిత క్రియతోడన్
బరిపూర్ణ నిత్య మహిమం, బరమాత్ముఁడనై సరోజభవ! యే నుందున్. 251

వ. అదియునుంగాక నీవు న న్నడిగిన యీ జగన్నిర్మాణ మాయా ప్రకారం బెఱింగింతు. లేని యర్థంబు శుక్తి రజత [5]భ్రాంతియుం బోలె నేమిటి మహిమం దోఁచి క్రమ్మఱం దోఁచక మాను నిదియె నా మాయా [6]విశేషం బని యెఱుం గుము. ఇదియునుం గాక లేని యర్థంబు దృశ్యం బగుటకుం, గల యర్థంబు దర్శనగోచరంబు గాకుండుటకును, ద్విచంద్రాదికంబును, తమః [7]ప్రభాసంబును దృష్టాంతంబులుగాఁ దెలియుము. ఏ ప్రకారంబున మహాభూతంబులు భౌతికంబు

1. శాస్త్రోక్త (చ. ట. జ. బ.) 2. మహిమావతార (హ. తం. వా.) 3. దెలియ (తం. వా.)
4. సృజ్యమానంబగు (తం. వా.); దృష్టమానంబగు (చ. త. డ. ద.) 5. భ్రాంతిని యేమిటి మహిమం దోఁచి (హ.) 6. విడంబనంబని (తం.) 7. ప్రభావంబును (క. బ.)

లైన ఘటపటాదులందుం బ్రవేశించి యుండు నా ప్రకారంబున నేను నీ భూత భౌతికంబులైన సర్వకార్యంబులందు,సత్త్వాది రూపంబులం బ్రవేశించియుండుదు. భౌతికంబులు భూతంబులయందుఁ గారణావస్థం బొందు చందంబున భూత భౌతి కంబులు గారణావస్థం బొందిన నాయందు నభివ్యక్తంబులై యుండవు. సర్వ దేశంబులయందు సర్వకాలంబులయందు నేది బోధితంబై యుండు, నట్టిదే పరబ్రహ్మ స్వరూపంబు. తత్త్వం బెఱుంగ నిచ్ఛయించిన మిముఁ బోఁటి వార లీ చెప్పినది మదీయ [1]తత్త్వాత్మకంబైన యర్థంబని యెఱుంగుదురు. ఈ యర్థం బుత్కృష్టం బైనయది. ఏకాగ్రచిత్తుండవై యాకర్ణించి భవదీయ చిత్తంబున ధరియించిన నీకు సర్గాది కర్మంబులందు మోహంబు చెందకుండెడి. అని భగవం తుండైన పరమేశ్వరుండు చతుర్ముఖున కాజ్ఞాపించి నిజలోకంబుతో నంతర్ధా నంబు నొందె. అని చెప్పి శుకుండు వెండియు నిట్లనియె. 252

సీ. అవనీశ బ్రహ్మ యి ట్లంతర్హితుండైనఁ బుండరీకాక్షుని బుద్ధి నిలిపి
యానందమును బొంది యంజలి గావించి తత్పరిగ్రహమునఁ దనదు బుద్ధి
గైకొని పూర్వప్రకారంబునను సమస్తప్రపంచం బెల్లఁ దగ సృజించి
మఱియొకనాఁడు ధర్మప్రవర్తకుఁ డౌచు నఖిల ప్రజాపతి యైన కమల

తే. గర్భుఁ డాత్మహితార్థమై కాక సకల, భువనహిత బుద్ధి నున్నత స్ఫురణ మెఱసి
మానితంబైన యమ నియమముల రెంటి, నాచరించెను సమ్మోదితాత్ముఁడగుచు.

వ. అ య్యవసరంబున, 254

క. ఆ నళినాసననందను, లైన సనందాది మునుల కగ్రేసరుఁడున్
మానుగఁ[2]బ్రియతముఁడును నగు, నా నారదుఁ డేఁగుదెంచె నబ్జజు కడకున్.255

క. చనుదెంచి తండ్రికిం బ్రియ, మొనరఁగ శుశ్రూషణంబు [3]లొనరిచి యతఁడున్
దనదెసఁ బ్రసన్నుఁ డగుటయుఁ, గని భగవ న్మాయఁ దెలియఁగా నుత్సుకుఁడై.

సీ. అవనీశ! నీవు న న్నడిగినపగిది నతఁడు దండ్రి నడుగఁ బితామహుండు
భగవంతుఁ డాశ్రిత పారిజాతము హరి గృపతోడఁ దన కెఱిఁగించినట్టి
లోకమంగళ చతుః[1]శ్లోక రూపంబును దశ లక్షణంబులఁ దనరు భాగ
వతము నారదున కున్నతిఁ జెప్పె నాతఁడు చారు సరస్వతీ తీరమునను

1. సర్వాత్మకంబైన (ట.త.జ.ద.బ.) 2. ప్రియతనుజుఁడు నగు (హ) 3. లొగిజేసినచో (హ)
4. శ్లోకమూలంబును (శ. ద.)

తే. హరిపద ధ్యాన పారీణుఁ డాత్మవేది, ప్రకట తేజస్వి యగు బాదరాయణునకుఁ
గోరి యెఱిఁగించె నమ్మహోదారుఁ డెలమి, నాకు నెఱిఁగించె నెఱిఁగింతు నీకు నేను.

వ. అదియుంగాక యిపుడు విరాట్పురుషునివలన నీ జగంబు లే విధంబున జని యించె, ననియెడి మొదలైన కొన్ని ప్రశ్నలు నన్నడిగితివి. ఏను నన్నింటికి నుత్తరం బగునట్లుగా నమ్మహాభాగవతం బుపన్యసించెద. ఆకర్ణింపుము. 258

## అధ్యాయము - ౧౦

వ. అ మ్మహాపురాణంబు చతుశ్శ్లోక రూపంబున దశ లక్షణంబుల సంకుచిత మార్గంబుల నొప్పు. అందు దస లక్షణంబు లెయ్యవి? యనిన సర్గంబును, విసర్గంబును, స్థానంబును, పోషణంబును, ఊతులును, మన్వంతరంబులును, ఈశాను చరితంబును, నిరోధంబును, ముక్తియు, నాశ్రయంబు ననం బది తెఱంగులయ్యె. [1]దశమవిశుద్ధ్యర్థంబు తక్కిన తొమ్మిది లక్షణంబులు సెప్పంబడె అవి యెట్టి వనిన,

తే. మహ దహంకార పంచ తన్మాత్ర గగన, పవన శిఖి తోయ భూ భూతపంచ కేంద్రి
య ప్రపంచంబు భగవంతునందు [2]నగుట, సర్గమందురు దీనిని జనవరేణ్య! 260

క. సరసిజగర్భుండు విరా, ట్పురుషునివలనం జనించి భూరితర చరా
చర భూతసృష్టిఁ జేయుట, పరువడిని విసర్గ మండ్రు భరతకులేశా! 261

క. లోకద్రోహి నరేంద్రా, నీకముఁ బరిమార్చి జగము [3]నెఱి నిల్పిన యా
వైకుంఠ [4]నాథు విజయం, బాకల్పస్థాన మయ్యె నవనీనాథా! 262

క. హరి సర్వేశుఁ డనంతుఁడు, నిరుపమ శుభమూర్తి చేయు నిజభక్త జనో
ద్ధరణము పోషణ మవనీ, వర! యూతు లనంగ గర్మవాసన లరయన్. 263

తే. జలజనాభ దయాకటాక్ష ప్రసాద, లబ్ధి నిఖిలైక లోక[5]పాలన విభూతి
మహిమఁ బొందిన వారి ధర్మములు విస్తరమునఁ బలుకుట మన్వంతరములు భూప!

క. వనజోదరు నవతార క, థనము దదీ యాను[6]వర్తి తతి చారిత్రం
బును విస్తరించి పలుకం, జను నవి యీశాను కథలు సౌజన్యనిధీ! 265

1. దశమాశ్రయ విశుద్ధ్యర్థంబు (తం. వా.) 2. గనుట (హ. తం. వా.) 3. నిలిపిన హరియా (క. బ.) 4. నాథకృత విజయాకల్పము స్థానమయ్యె (హ) 5. పాలక (హ. తం. హ.) 6. వృత్తిఁ దచ్చారిత్రంబును (హ. తం. వా.)

సీ. వసుమతీనాథ! సర్వస్వామియైన గో, విందుండు చిదచి దానందమూర్తి
[1]సలిలత స్వోపాధి శక్తిసమేతుఁడై తనరారు నాత్మీయ ధామమందు
ఫణిరాజ మృదుల తల్పంబుపై సుఖలీల యోగనిద్రారతి నున్న వేళ
నఖిల జీవులు నిజ వ్యాపార శూన్యులై యున్నత తేజంబు [2]లురలుకొనఁగ

తే. [3]జరగు నయ్యవస్థా విశేషంబు లెల్ల, విదిత మగునట్లు వలుకుట యది నిరోధ
మన నిది యవాంతర ప్రళయం బనంగఁ,బరఁగునిఁక ముక్తిగతి విను పార్థివేంద్ర.

సీ. జీవుండు భగవ త్కృపా వశంబునఁ జేసి దేహ ధర్మంబులై ధృతి ననేక
జన్మానుచరిత దృశ్యము లైన య జ్జరా మరణంబు లాత్మధర్మంబు లైన
ఘన పుణ్యపాప నికాయ నిర్మోచన స్థితి నొప్పి పూర్వసంచితము లైన
యపహత పాప్మవత్త్వా [4]ద్యష్టతద్గుణ వంతుఁడై తగ భగవ చ్ఛరీర

తే. భూతుఁడై పారతంత్ర్యాత్మ బుద్ధి నొప్పి, దివ్యమా ల్యానులేపన భవ్యగంధ
కలిత మంగళ దివ్యవిగ్రహవిశిష్టుఁ,డగుచు హరిరూపమొందుటే యనఘ!ముక్తి.

వ. మఱియు నుత్పత్తి స్థితి లయంబు లెందు నగుచుఁ బ్రకాశింపఁబడు నది యాశ్రయం బనంబడు. అదియ పరమాత్మ. బ్రహ్మశబ్ద వాచ్యంబు నదియ. ప్రత్యక్షానుభవంబున విదితంబు నేయుకొఱకు నాత్మ యాధ్యాత్మికాది విభాగంబు సెప్పంబడియె. అది యెట్లనిన నాత్మ యాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబులఁ ద్రివిధం బయ్యె. అందు నాధ్యాత్మికంబు చక్షురాది గోళ కాంతర్వర్తియై యెఱుంగంబడు. చక్షురాది కరణాభిమానియై ద్రష్టయైన జీవుండె యాధిదై వికుండనం దగు. చక్షురాద్యధిష్ఠా నాభిమాన దేవతయు, సూర్యాది తేజోవిగ్ర హుండు నగుచు నెవ్వని యందు నీ యుభయ విభాగంబునుం గలుగు నతండె యాధిభౌతికుండు, విరాడ్విగ్రహుండు నగుం గావున. ద్రష్టయు దృక్కు దృశ్యంబు ననందగు మూఁటి యందు నొకటి లేకున్న నొకటి గానరాదు. ఈ త్రితయంబు నెవ్వఁ డెఱుంగు నతండు సర్వలోకాశ్రయుండై యుండు. అతండె పరమాత్మయు. అ మ్మహాత్ముండు లీలార్థంబై జగత్సర్జనంబు నేయు తలంపున బ్రహ్మాండంబు నిర్భేదించి తనకు సుఖస్థానంబు నపేక్షించి మొదల శుద్ధంబు లగు జలంబుల సృజియించె. స్వతః పరిశుద్ధుండు గావున స్వ సృష్టం బగు నేకార్ణ వాకారం బైన జలరాశి యందు శయనంబు నేయుటం జేసి,

1. కమనీయ తరదీప్తి కమలా సమేతుడై (త. జ. వ. ప. బ.) 2. లురులుఁ గొనగ (హ)
3. జంగమస్థావరాది చేష్టాదులెల్ల (హ) 4. దృష్ట (హ. తం. వా.)

శ్లోకము. ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః
తా యద స్యాయనం పూర్వం తేన నారాయణ స్స్మృతః.

అను ప్రమాణము చొప్పున నారాయణ శబ్దవాచ్యుండు గావున నతని ప్రభావంబు వర్ణింప దుర్లభంబు. ఉపాదానభూతంబైన ద్రవ్యంబును, త్రివిధంబైన కర్మంబును, గళా కాష్ఠా ద్యుపాధి భిన్నంబైన కాలంబును, జ్ఞానాధికంబగు [1]జీవస్వభావంబును, భోక్తయగు జీవుండును, నెవ్వని యనుగ్రహంబునంజేసి వర్తింపుచుండు, నెవ్వని యుపేక్షంజేసి వర్తింపకుండు, నట్టి ప్రభావంబుగల సర్వేశ్వరుండు దా నేకమయ్యు ననేకంబు గాఁదలంచి యోగతల్పంబునం ప్రబుద్ధుండై యుండు. అట మీఁద స్వ సంకల్పంబునం జేసి తన హిరణ్మయం బైన విగ్రహంబు నధిదైవంబు నధ్యాత్మకంబు నధిభూతంబు నను సంజ్ఞాయుతంబైన త్రివిధంబుగా సృజియించె. 268

సీ. [2]అట్టి విరా డ్విగ్రహాంత రాకాశంబు వలన నోజ స్సహోబలము లయ్యెఁ
[3]బ్రాణంబు సూక్ష్మరూప క్రియాశక్తిచే జనియించి ముఖ్యాసు వనఁగఁ బరఁగె
వెలువడి చను జీవి వెనుకొని ప్రాణముల్ చనుచుండు నిజనాథు ననుసరించు
భటుల చందంబునఁ బాటిల్లు క్షుత్తును భూరి తృష్ణయు మఱి ముఖము వలనఁ

తే. దాలుజిహ్వాదికంబు లుద్భవము నొందె,నందు నుదయించె జిహ్వాయునందు రసము
లెల్లనుదయించి జిహ్వచే నెఱుఁగఁబడును, మొనసి పలుకఁ బేక్షించుముఖమువలన.

వ. (మఱియు) వాగింద్రియంబు పుట్టె. దానికి దేవత యగ్ని. (ఆ రెంటివలన భాషణంబు వొడమె. ఆ యగ్నికి మహాజల వ్యాప్తంబగు జగంబున నిరోధంబు గలుగుటంజేసి యా జలంబె ప్రతిబంధకం బయ్యె) దోదూయమానంబైన మహా వాయువువలన ఘ్రాణంబు పుట్టెం గావున వాయుదేవతాకం బైన ఘ్రాణేంద్రియంబు గంధగ్రహణ సమర్థం బయ్యె. (నిరాలోకం బగు నాత్మ నాత్మ యందుఁ జూడం గోరి) తేజంబువలన నాదిత్యదేవతాకంబై రూపగ్రాహకం బైన యక్షి యుగళంబు పుట్టె. ఋషిగణంబుచేత బోధితుం డగుచు భగవంతుండు దిగ్దేవతాకంబును శబ్దగ్రాహకంబును నైన శ్రోత్రేంద్రియంబు వుట్టించె. సర్జనంబు నేయు పురుషుని వలన మృదుత్వ కాఠిన్యంబులు, లఘుత్వ గురుత్వంబులు, నుష్ణత్వ

1. ప్రవృత్తకాలాది స్వభావంబును (క. చ. త. వ. బ.) 2. అట్టి విరాడ్విగ్రహంబందు గగన తేజః ప్రాణములు సర్వజంతురతుఁడు (క. టి. తం.) 3. నైనట్టి జీవుని ననుసరింపుచు నుండుఁ బంచి జీవుఁడు శరీరంబు వలన (ల. క. తం.)

శీతలత్వంబులునుం జేసెడు త్వగింద్రి యాధిష్ఠానంబగు చర్మంబు పుట్టె. దాని వలన రోమంబు లుదయించె. వానికి మహీరుహంబు లధిదేవత లయ్యె. అందు నధిగత స్పర్శ గుణుండును అంతర్బహిః ప్రదేశంబుల నావృతుండును నగు వాయువు వలన (బలవంతంబులు నింద్రదేవతాకంబులు నాదాన సమర్థంబులు నానా కర్మ కరణ దక్షంబులు నగు హస్తంబు లుదయించె.) స్వేచ్ఛా విషయగతి సమర్థుం డగు నీశ్వరునివలన విష్ణుదేవతాకంబు లగు పాదంబు లుదయించె. ప్రజా నందామృతార్థి యగు భగవంతుని వలనఁ బ్రజాపతి దేవతాకంబై స్త్రీ సంభో గాది కామ్యసుఖంబులు కార్యంబులుగాఁ గల శిశ్నోపస్థంబు లుదయించె. మిత్రుం డధిదైవతంబుగాఁ గలిగి భుక్తాన్నా ద్యసారాంశ త్యాగోపయోగం బగు పాయు వనెడి గుదం బుద్భవించె. దాని కృత్యం బుభయ మల మోచనంబు. దేహంబున నుండి దేహాంతరంబు జేరంగోరి పూర్వకాయంబు విడుచుటకు సాధనంబగు నాభి ద్వారంబు సంభవించె. అట్టి నాభియే ప్రాణాపాన బంధస్థానం బనంబడు. త ద్బంధ విశ్లేషంబె మృత్యు వగు. అదియు యూర్ధ్వాధో దేహ భేదకం బనియుం జెప్పంబడు. అన్నపానాది ధారణార్థంబుగ నాంత్ర కుక్షి నాడీనిచయంబులు గల్పింపఁబడియె. వానికి నదులు సముద్రంబులు నధిదేవతలయ్యె. (వాని వలనఁ) దుష్టి పుష్టులను నుదరభరిణ రస పరిణామంబులును గలిగియుండు. ఆత్మీయ మాయా చింతనం బొనర్చు నపుడు కామ సంకల్పాది స్థానంబగు హృదయంబు గలిగె. దానివలన మనంబును, చంద్రుండును, కాముండును, సంకల్పంబును నుదయించె. అంతమీఁద జగత్సర్జనంబు సేయు విరా డ్విగ్రహంబు వలన సప్త ధాతువులును, పృథివ్యప్తేజోమయంబు లైన సప్తప్రాణంబులును, వ్యోమాంబు వాయువులచే నుత్పన్నంబు లయి గుణాత్మకంబు లైన యింద్రియంబులును, నహంకార ప్రభవంబు లైన గుణంబులును, సర్వవికార స్వరూపంబగు మన స్సును, విజ్ఞానరూపిణి యగు బుద్ధియుఁ బుట్టు. వివిధంబగు నిది యంతయు సర్వేశ్వరుని స్థూల విగ్రహంబు. మఱియును, 270

క. వరుస బృథివ్యా ద్యష్టా, వరణావృతమై సమగ్ర వైభవములఁ బం
కరుహభవాండాతీత, స్ఫురణం జెలువొందు నతివిభూతి దలిర్పన్. 271

క. పొలుపగు సకల విలక్షణ, ములు [1]గలి గాద్యంత శూన్యమును నిత్యమునై
లలి సూక్ష్మమై మనో వా, క్కులకుం దలపోయఁగా నగోచర మగుచున్. 272

1. గలయాద్యంత (హ. తం. వా.)

సీ. అలఘు తేజోమయం బైన రూపం బిది క్షితినాథ నాచేతఁ జెప్పఁబడియె
మానిత స్థూల సూక్ష్మ స్వరూపంబుల [1]వలన నొప్పెడు భగవ త్స్వరూప
మ మ్మహాత్మకుని మాయా బలంబునఁజేసి దివ్యమునీంద్రులు దెలియలేరు
వసుధేశ వాచ్యమై వాచకంబై నామరూపముల్ క్రియలును రూఢిఁ దాల్చి

ఆ. యుండునట్టి యీశ్వరుండు నారాయణుం, డఖిలధృతి జగ న్నియంతయైన
చిన్మయాత్మకుండు సృజియించు నీ ప్రజా, పతుల ఋషులను బితృపతుల నపుడు.

వ. మఱియును, 274

సీ. సుర సిద్ధ సాధ్య కిన్నరవర చారణ గరుడ గంధర్వ రాక్షస పిశాచ
భూత బేతాళ కింపురుష కూశ్మాండ గుహ్యక డాకినీ యక్ష యాతుధాన
విద్యాధ రాప్సరో విషధర గ్రహ మాతృగణ వృక హరి ఘృష్టి ఖగ మృగాళి
భల్లూక రోహిత పశు వృక్ష యోనుల, వివిధ కర్మంబులు వెలయఁ బుట్టి

తే. జల నభో భూతలంబుల సంచరించు, జంతుచయముల సత్త్వ రజ స్తమోగు
ణములఁ దిర్య క్సురాసుర నర ధరాది, భావముల భిన్ను లగుదురు పౌరవేంద్ర!

మ. ఇరవొందన్ ద్రుహిణాత్మకుం డయి రమాధీశుండు విశ్వంబు సు
స్థిరతం జేసి హరిస్వరూపుఁ డయి రక్షించున్ సమస్త ప్రజో
త్కర సంహారము సేయు నప్పుడు హరాంతర్యామియై యింతయున్
హరియించున్ బవనుండు మేఘముల మాయంజేయు చందంబునన్. 276

క. ఈ పగిదిని విశ్వము సం, స్థాపించును మనుచు నణఁచు ధర్మాత్మకుఁడై
దీపిత తిర్య జ్నర సుర, రూపంబు[2]లు దానె తాల్చి రూఢి దలిర్పన్. 277

సీ. హరియందు నాకాశ మాకాశమున వాయు వనిలంబు వలన హుతాశనుండు
హవ్యవాహనునందు నంబువు లుదకంబు వలన వసుంధర గలిగె ధాత్రి
వలన బహు ప్రజావళి యుద్భవం బయ్యె నింతకు మూలమై యెసఁగునట్టి
నారాయణుఁడు చిదానంద స్వరూపకుం డవ్యయుఁ, డజరుఁ డనంతుఁ డాఢ్యుఁ

తే. డాది మధ్యాంత శూన్యుం డనాదినిధనుఁ, డతనివలనను సంభూత మైన యట్టి
సృష్టి హేతుప్రకార మీక్షించి తెలియఁ, జాల రెంతటి మునులైన జనవరేణ్య!

వ. అదియునుం గాక, 279

1. వలన నొప్పఁగల (వ. తం.) 2. దాల్చి హరిహరుం డజు డెలమిన్ (డ. ద.)

మ. ధరణీశోత్తమ! భూతసృష్టి నిటు సంస్థాపించి రక్షించు నా
హరి కర్తృత్వము నొల్లఁ డాత్మగత మాయారోపితంజేసి తా
నిరవద్యుండు నిరంజనుండు పరుఁడున్ నిష్కించనుం డాఢ్యుఁడున్
నిరపేక్షుండును నిష్కళంకుఁ డగుచున్ నిత్యత్వమున్ బొందెడిన్. 280

వ. బ్రహ్మసంబంధి యగు నీ కల్పప్రకారం బవాంతర కల్పంబుతోడి సంకుచిత ప్రకారంబున నెఱింగించితి. ఇట్టి బ్రహ్మకల్పంబున నొప్పు ప్రాకృత వైకృత కల్పప్రకారంబులును, తత్పరిమాణంబులును కాల కల్ప లక్షణంబులును, నవాంతర కల్ప మన్వంతరాది భేద విభాగ స్వరూపంబును, నతివిస్తారంబుగ ముందు నెఱింగింతు వినుము. అదియును బద్మకల్పం బనందగు. అని భగవంతుం డయిన శుకుండు పరీక్షిత్తునకుఁ జెప్పె. అని సూతుండు మహర్షులకు నెఱింగించిన, 281

క. విని శౌనకుండు సూతుం గనుఁగొని యిట్లనియె సూత! కరుణోపేతా!
జననుత గుణసంఘాతా! ఘన పుణ్యసమేత! విగతకలుషవ్రాతా! 282

వ. పరమ భాగవతోత్తముండైన విదురుండు బంధు మిత్ర జాలంబుల విడిచి, సకల భువన పావనంబులును కీర్తనీయంబులును నైన తీర్థంబులు నగణ్యంబులైన పుణ్యక్షేత్రంబులును దర్శించి, క్రమ్మఱ వచ్చి, కౌషారవియగు మైత్రేయుం గని, యతని వలన నధ్యాత్మబోధంబు వడసె నని వినంబడు. అది యంతయు నెఱింగింపు మనిన నతం డిట్లనియె. 283

క. విను మిపుడు మీరు నన్నడిగిన తెఱఁగున శుక మునీంద్రగేయుఁ బరీక్షి
జ్జనపతి యడిగిన నతఁడా, తని కెఱిఁగించిన విధంబుఁ దగ నెఱిఁగింతున్. 284

వ. సావధానులై వినుండు, 285

ఉ. రామ! గుణాభిరామ! దినరాజ కులాంబుధి సోమ! తోయద
శ్యామ! దశానన ప్రబల సైన్య విరామ! సురారి గోత్ర సు
త్రామ! సుబాహు బాహుబల దర్ప తమః పటు తీవ్ర ధామ! ని
ష్కామ! కుభృల్లలామ! గరకంఠ సతీ నుత నామ! రాఘవా!

క. అమరేంద్రసుత విదారణ! కమలాప్త తనూజ రాజ్యకారణ! భవ సం
తమస దినేశ్వర! రాజోత్తమ! దైవత సార్వభౌమ! దశరథరామా! 287

మాలిని. నిరుపమ గుణజలా! నిర్మలానంద లోలా!
దురిత ఘన సమీరా! దుష్ట దైత్య ప్రహారా!
శరధి మద విశోషా! చారు సద్భక్త పోషా!
సరసిజ దళనేత్రా! సజ్జన స్తోత్ర పాత్రా!. 288

గద్య. ఇది పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర, కేసన మంత్రి పుత్ర, సహజ పాండిత్య, పోతానామాత్య ప్రణీతంబైన శ్రీ మహాభాగవతం బను పురాణంబునం బరీక్షిత్తుతోడ శుకయోగి భాషించుటయు, భాగవత పురాణ వైభవంబును, ఖట్వాంగు మోక్షప్రకారంబును, ధారణా యోగ విషయంబైన మహావిష్ణుని శ్రీపాదాద్యవయవంబుల సర్వలోకంబు లున్న తెఱంగును, సత్పురుష వృత్తియు, మోక్ష వ్యతిరిక్త సర్వకామ్య ఫలప్రద దేవతా భజన ప్రకారంబును, మోక్ష ప్రదుండు శ్రీహరి యనుటయు, హరి భజన విరహితులైన జనులకును హేయతాపాదనంబును, రాజప్రశ్నంబును, శుకయోగి శ్రీహరి స్తోత్రంబు సేయుటయు, వాసుదేవ ప్రసాదంబునం జతుర్ముఖుండు బ్రహ్మాధిపత్యంబు వడయుటయు, శ్రీహరివలన బ్రహ్మ రుద్రాది లోక ప్రపంచంబు పుట్టుటయు, శ్రీమన్నారాయణ దివ్య లీలావతార పరంపరా వైభవ వృత్తాంత సూచనంబును, భాగవత వైభవంబును, పరీక్షిత్తు శుకయోగి నడిగిన ప్రపంచాది ప్రశ్నలును, అందు శ్రీహరి ప్రధానకర్త యని తద్వృత్తాంతంబు సెప్పుటయు, భగవద్భక్తి వైభవంబును, బ్రహ్మ తపశ్చరణంబునకుం బ్రసన్నుండై హరి వైకుంఠ నగరంబుతోడఁ బ్రసన్నుండైన, స్తోత్రంబు సేసి తత్ప్రసాదంబునం దన్మహిమ వినుటయు, వాసుదేవుం డానతిచ్చిన ప్రకారంబున బ్రహ్మ నారదునికి భాగవత పురాణ ప్రధాన దశ లక్షణంబు లుపన్యసించుటయు, నారాయణ వైభవంబును, జీవాది తత్త్వసృష్టియు, శ్రీహరి నిత్య విభూత్యాది వర్ణనంబును, గల్పప్రకారాది సూచనంబును, శౌనకుండు విదుర మైత్రేయ సంవాదంబు సెప్పుమని సూతు నడుగుటయు, నను కథలు గల ద్వితీయ స్కంధము సంపూర్ణము. 289

ఓమ్

# శ్రీ మహాభాగవతము

## తృతీయస్కంధము

క. శ్రీ మహిత వినుత దివిజ స్తోమ! యశస్సీమ! రాజసోమ! సుమేరు
స్థేమ, వినిర్జిత భార్గవరామ! దశానన విరామ! రఘుకులరామా! 1

అధ్యాయము - ౧

వ. మహనీయగుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్న రేంద్రునకు శుక యోగీంద్రుం డిట్లనియె. 2

—: విదురుండు తీర్థయాత్ర సేయుట :—

ఉ. పాండునృపాల నందనులు బాహుబలంబున ధార్తరాష్ట్రులన్
ఖండనభూమిలో గెలిచి పాండుర శారద చంద్ర చంద్రికా
ఖండయశః ప్రసూన [1]కలికావళిఁ గౌరవ రాజ్యలక్ష్మి నొం
డొండ యలంకరింపుచు జయోన్నతి రాజ్యము సేయుచుండఁగన్. 3

క. మనుజేంద్ర విదురుఁ డంతకు, మును వనమున కేఁగి యచట మునిజన గేయున్
వినుత తపో ధౌరేయున్, [2]ఘను ననుపమ గుణవిధేయుఁ గనె మైత్రేయున్. 4

క. కనుఁగొని తత్పాదంబులు, దన ఫాలము సోఁక మ్రొక్కి తగ ని ట్లనియెన్
మునివర్య! సకల జగత్పా, వనచరితుఁడు గృష్ణుఁ డఖిల వంద్యుం డెలమిన్. 5

క. మండిత తేజోనిధి యై, పాండవహితమతిని దూతభావంబున వే
దండపురి కేగి కురుకుల, మండనుఁ డగు ధార్త రాష్ట్రు మందిరమునకున్. 6

తే. చనఁగ నొల్లక మద్గృహంబునకు భక్త, వత్సలుం డగు కృష్ణుండు వచ్చు టేమి
కతము? నాకది యెఱిఁగింపు కరుణతోడ, ననుచు విదురుండు మైత్రేయునడిగె ననిన.

1. కలికాతతి (చ ట.త.) 2. అనుపమగుణ జనవిధేయు నమ్మైత్రేయున్ (జ. ద. తం.)

క. విని వెఱఁగంది పరీక్షి, న్మనుజవరేణ్యుండు విమలమతి నిస్తంద్రుఁ
మునికుల జలనిధి చంద్రుఁ, సునిశిత హరిభక్తిసాంద్రు శుకయోగీంద్రున్. 8

క. కని యిట్లనె మైత్రేయుని, ననఘుం డగు విదురుఁ డే రహస్యము లడిగెన్
ముని యేమి చెప్పె నేపగి, దిని దీర్థము లాడె నెచటఁ దిరుగుచు నుండెన్. 9

తే. [1]ఇన్ని దెలియంగ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపవే విమలాంతరంగ!
ఘనదయాపాంగ! హరిపాదకమలభృంగ!, మహితగుణసంగ! పాపతమఃపతంగ!

చ. అనవుఁడు బాదరాయణి [2]ధరాధిపుతో ననుఁ బూరువంశవ
ర్ధన! విను కష్టుఁడైన ధృతరాష్ట్ర నృపాలుఁడు పెంపుతో సుయో
ధన ముఖ [3]పుత్రులం గడు ముదంబునఁ బెంపుచుఁ బాండురాజు ద
ప్పిన పిదపన్ దదాత్మజులు పెల్కుఱి త న్నని చేర వచ్చినన్. 11

వ. ఇట్లు [4]వచ్చిన పాండవుల యెడ ననూయా నిమగ్నులై సుయోధనాదులు, 12

క. పెట్టిరి విషాన్న [5]మంటం, గట్టిరి ఘనపాశములను [6]గంగానదిలో
నెట్టిరి, రాజ్యము వెడలం, గొట్టిరి ధర్మంబు విడిచి కుటిలాత్మకులై. 13

క. క్రూరాత్ము లగుచు లాక్షా, గారంబున వారు నిద్రఁ గైకొని యుండన్
దారుణ శిఖి దరికొలిపిరి, మారణ కర్మముల [7]కప్రమత్తులు నగుచున్. 14

తే. సూరిజనగేయ మగు రాజసూయ యజ్ఞ, విలస దవభృథ[8]స్నాన పవిత్ర మైన
ద్రౌపదీ చారు వేణీభరంబు పట్టి, కొలువు [9]లోపల నీడ్చిరి కుత్సితమున. 15

క. కావున వారల కపకృతిఁ, గావింపని దొక దినంబు గలుగదు తమ జ
న్మావధి నిజనందనులను, వారి న య్యంధ నృపతి వలదనఁ డయ్యెన్. 16

తే. మాయజూదంబువన్ని దుర్మార్గవృత్తిఁ,బుడమిఁగొనియడవులకుఁబో నడువనచటఁ
దిరిగి వారలు సమయంబు దీర్చి యేఁగు, దెంచి తమ యంశ మడిగినఁ బంచి
[10]యిడక. 17

వ. ఉన్న యెడ, 18

---

1. ఇన్నియును దెలియఁగ నానతిచ్చి (తం.) 2. ధరాధిపు కిట్లను (తం) 3. పుత్రులన్నతి ముదంబున (క) 4. చేరవచ్చిన (ప. ద. తం.) 5. మంటంగట్టియు (హ) మింటంగట్టిరి (ట. త.) 6. గంగానదియం దొట్టిరి (క.చ.ద.బ.తం.) 7. అప్రమత్తులగుచున్ (హ) అప్రమత్తత వెలయన్ (తం. వా.) 8. సేక (హ.తం.వా.) 9. లోపలికీడ్చిరి (తం.వా.) 10. యీక (తం.వా.)

చ. సకల నియంత యైన హరి సర్వశరణ్యుఁడు మాధవుండు నే
వకనవకల్పకంబు భగవంతుఁ డసంతుఁ డనంతశక్తి నం
దకధరుఁ డబ్జలోచనుఁడు ధర్మతనూభవుచే నియుక్తుఁడై
యకుటిల భక్తి యోగమహితాత్మకుఁడై ధృతరాష్ట్రు పాలికిన్. 19

క. చని యచట భీష్మ గురు త, త్తనయ కృపాచార్య నిఖిల ధాత్రీపతులున్
విని యనుమోదింపఁగ ని, ట్లనియెన్ ధృతరాష్ట్రుతోడ నవనీనాథా! 20

క. కౌరవ పాండవు లిరువురు, నారయ [1]నీ కొక్క [2]సమమ యవనీవర! నీ
వేరీతి నైనఁ బాండుకు, మారుల పా లొసఁగి తేని మను సుభయంబున్. 21

క. అని ధర్మబోధమునఁ బలి, కిన మాటలు చెవుల నిడమి గృష్ణుఁడు విదురున్
ఘననీతిమంతుఁ బిలువం, బనిచినఁ జనుదెంచెఁ గురుసభాస్థలమునకున్. 22

వ. చనుదెంచి యచటి జనంబులచేత [3]నుపస్థితం బైన కార్యంబు [4]దెలుపఁబడిన
వాఁడై ధృతరాష్ట్రు నుద్దేశించి యి ట్లనియె. 23

మ. ధరణీనాయక! పాండు భూవిభుఁడు నీ తమ్ముండు, ప త్పుత్త్రిలన్
బరిరక్షించిన ధర్మముం దగవునుం బాటిల్లు, వంశంబు సు
స్థిర సౌభాగ్యోన్నతిఁ జెందు, శత్రుజయమున్ జేకూరు, గోపాల శే
ఖరు చిత్తంబును వచ్చు, నట్లగుట యోఁ గౌరవ్యవంశాగ్రణీ! 24

ఆ. వారి తండ్రి పాలు వారికి నొసగి నీ, పాలు సుతుల కెల్ల బంచియిచ్చి
చలము విడిచి ధర్మ మలవడ నీ బుద్ధిఁ, జొనుపవయ్య కులము మనుపవయ్య! 25

చ. వినుము నృపాల! నా పలుకు [5]వేయును నేల సమీరసూతి నీ
తనయుల పేరు విన్నఁ బదతాడితదుష్టభుజంగమంబు చా
డ్పునఁ గనలొందు నింతయును మున్ననుఁ జెప్పితిఁ గాదె వానిచే
తన భవదీయపుత్త్రులకుఁ దప్పదు మృత్యువ దెన్ని భంగులన్. 26

వ. అదియునుం గాక. 27

క. నీ పుత్త్రుల శౌర్యంబును, చాపాచార్యాపగాత్మజాత కృపభుజా
టోపంబును గర్ణుదురా, [6]లాపంబును నిజముగాఁ దలంతె మనమునన్. 28

1. నాకొక్క (ద) 2. రూప (చ.త.వా.) 3. ఉపక్రమితంబైన (క) 4. తెలిసినవాఁడై (తం.వా.)
5. వేయననేల (హ.) 6. లాపంబులు (తం. వా.)

వ. అ శ్లేని వినుము, 29

ఉ. ఏ పరమేశుచే జగము లీ సచరాచరకోటితో సము
ద్దీపిత మయ్యె నే విభుని దివ్యకళాంశజు లబ్జగర్భ గౌ
రీపతి ముఖ్య దేవముని బృందము లెవ్వఁ డనంతుఁ డచ్యుతుం
డా పురుషోత్తముండు గరుణాంబుధి గృష్ణుఁడు వో నరేశ్వరా! 30

ఉ. అట్టి జగన్నివాసుఁడు మురాసురభేది పరాపరుండు చే
పట్టి సఖుండు వియ్యమును బాంధవుఁడుణ్ గురుఁడున్ విభుండు నై
[1]యిట్టుల మైన ప్రేమమున నెప్పుడుఁ [2]దోడ్పడుచుండు వారలన్
జుట్టన ప్రేల నెవ్వరికిఁ జూపగ [3]వచ్చును బార్థివోత్తమా! 31

ఉ. కావునఁ బాండునందనులఁ [4]గాఱియపెట్టక రాజ్యభాగమున్
వావిరి నిచ్చి రాజ్యమును వంశముఁ బుత్త్రుల బంధువర్గమున్
గావుము కాక లోభియగు [5]కష్ట సుయోధను మాట వింటివే
భూవర! నీయుపేక్ష నగుఁ బో కులనాశము బంధునాశమున్. 32

తే. ఒకనికై యిట్లు కుల మెల్ల [6]నుక్కడంప, నెత్తుకొనఁ జూచె దిది నీతియే నృపాల!
వినుము నామాట నీ సుయోధనుని విడిచి, కులము రాజ్యంబుఁ దేజంబు నిలుపవయ్య.

క. అని యిట్లు దటిమి చెప్పిన, విని దుర్యోధనుఁడు రోషవివశుం [7]డయి తా
నిసతనయ శకుని దుశ్శా, సనుల నిరీక్షించి తామసంబునఁ బలికెన్. 34

క. దాసీపుత్త్రుని మీర లు, దాసీనుం జేయ కిటకుఁ [8]దగునె పిలువఁగా
నాసీనుండై ప్రేలెడు, గాసిలి చెడిపోవ వెడలఁ[9]గా నడువ రనా. 35

వ. అని యిట్లు దుర్యోధనుం డాడిన దురాలాపంబులు దనకు మనస్తాపంబు సేయం
గార్యంబు విచారించి ధైర్యం బవలంబించి యొండు పలుకనొల్లక శరశరాస
నంబులు విడిచి క్రోధంబు నడఁచి వనంబునకుం జని యందు, 35

సీ. విష్ణు స్వయంవ్యక్తవిమల భూములను బవిత్రంబు లగు హరిక్షేత్రములను
నెలకొని దేవతానిర్మిత హరిదివ్య భూముల గంగాది పుణ్యనదుల
సిద్ధ పురాణ ప్రసిద్ధ పుణ్యాశ్రమ స్థలముల నుపవన స్థలము లందు
గంధమాదన ముఖ క్ష్మాభృత్తటంబుల మంజుల గిరికుంజ పుంజములను

1. నిట్టలమైన (హ) 2. జొప్పడుచుండు (హ) 3. వచ్చునె పార్థివోత్తమా (తం.వా.) 4. గాసిల (క) 5. కష్టు (చ) 6. నుక్కడంప (క.త.తం.వా.) 7. డగుచున్నిన తనయ (తం) 8. దగరావింపఁగ (జ) 9. నడువరనన్ (హ), నడువఁ ఱికన్ (వా).

తే. వికచకైరవ పద్మహల్లక మరంద, [1]పానపరవశ మధుకర గానబుద్ధ
రాజహంస విలోల విరాజమాన, మగుచుఁ జెలువొందు పంకేరుహాకరముల. 37

క. [2]నరవర ఋష్యాశ్రమవన, సరి దుపవన నద పుళింద జనపద గిరి గ
హ్వర గోష్ఠ యజ్ఞశాలా, పురదేవాయతన పుణ్య భూముల యందున్. 38

క. కూరలు గాయలు నీళ్లా, హారముగాఁ గొనుచు నియమ మలవడఁగ నసం
స్కారశరీరుం డగుచు ను, దారత నవధూతవేషధరుఁడై వరుసన్. 39

క. [3]హర్షము గదురఁగ భారత, [4]వర్షమునం గలుగు పుణ్య వరతీర్థము లు
త్క[5]ర్షం జూచుచు విగతా, మర్షుండై సంచరించె మనుజవరేణ్యా! 40

వ. ఇట్లు సంచరించుచుం బ్రభాసతీర్థమునకు వచ్చు నప్పుడు, 41

చ. అరుగుచు దైత్యభేదన దయా పరిలబ్ధ సమస్తమేదినీ
భరణధురంధరుం డగుచుఁ బాండుసుతాగ్రజుఁ డొప్పుచుండ [6]న
త్తఱి విదురుండు తత్సరి దుదంచితసాల రసాల మాధవీ
కురువక మాలతీ వకుళ కుంజ లసత్తట మందు నున్నెడన్. 42

చ. నరవర వేణు జానలవినష్ట మహాటవి మాడ్కిఁ బాండు భూ
వర ధృతరాష్ట్ర సూను [7]లనివార్య నిరూఢ విరోధ మెత్తి యొం
డొరుల జయింపఁగోరి కదనోర్విఁ గురు[8]క్షితిపాలముఖ్యు లం
దఱు మృతు లౌటయున్ విని ఘనంబుగ శోకనిమగ్నచిత్తుఁడై. 43

ఉ. ఆ యెడఁ [9]గాలు దన్నక రయంబున నేగి సరస్వతీనదీ
తోయములందుఁ గ్రుంకి మునితుల్యుఁడు వే చనియెం దనూనపా
త్తోయరుహాప్త భార్గవ పృథుత్రిత [10]సోమసుదాసగోగ్ని భూ
వాయు యమాభిధానయుత వాహినులం దనురక్తిఁ గ్రుంకుచున్. 44

1. పానవశమత్త (జ. వ. తం.) 2. మఱియును ఋష్యాశ్రమ (క. చ. ట. తం. వా.) 3. హరుషము; 4. వరుషము. 5. ఉత్కరుషము గానంబడియె (ట. త. జ. వ.) 6 భూవరవిదురుండు తన్నికట వర్యతమాల (హ.వా.) 7. లనివారణఁ జాల విరోధమెత్తి (క. చ. తం.) 8. క్షితిపాదులెట్లన వ్వరుస వినష్టుఁ వౌట విని వావిరిశోక (హ) 9. కాలు నూడక (జ) కాలునిల్పక (డ) 10. సోమకుమార గోసుధా (చ. ట. త. జ. డ.); సోమ సుదాస శక్తిభృత్ (తం. వా.)

ఉ. వెండియుఁ బుణ్యభూములఁ బవిత్రసరిత్తులఁ జూచుచున్ రమా
మండనుఁ డుండు దివ్యరుచిమన్మణి చారుకవాట గేహళీ
మండిత సౌధగోపుర విమానము లున్నత భక్తిఁ జూచుచున్
నిండిన వేడ్కఁ గృష్ణ పద నీరజ చింతనుఁ డై క్రమంబునన్. 45

—: విదురుం డుద్ధవుం గని కృష్ణాదుల వృత్తాంతం బడుగుట :—

చ. చని చని తొంటి మత్స్య కురు జాంగల భూము లతిక్రమించి చ
య్యన యమునానదిం [1]గదిసి యచ్చట భాగవతున్ సరోజలో
చన [2]దృణభక్తు సద్గుణవిశారదు శాంతుని దేవమంత్రి శి
ష్యుని మహితప్రసిద్ధుఁ బరిశోషిత దోషుఁ బ్రబుద్ధు నుద్ధవున్. 46

క. కని యనురాగ వికాసము, దన మనమునఁ దొంగలింపఁ దగ గాఢాలిం
గన మాచరించి నెయ్యం, బునఁ గుశలప్రశ్న నేసి ముదమునఁ బలికెన్. 47

క. [3]హరిభక్తులు పుణ్యాత్ములు, దురితవిదూరులు విరోధి[4]దుర్దమబలులున్
గురుకులతిలకులు గుంతీ, వరసూనులు గుశలులే యవారిత భక్తిన్. 48

చ. హరి దన నాభిపంకరుహమందు జనించిన యట్టి భారతీ
శ్వరుఁ డతిశక్తి వేఁడ యదువంశమునన్ బలకృష్ణమూర్తు లై
పరఁగ జనించె భూభరము వాపిన [5]శూరులు రేవతీందిరా
వరు లట శూరసేనుని నివాసమునన్ సుఖమున్న వారలే? 49

చ. కురుకులు లాదరింపఁగ సఖుండును నాప్తుఁడు నై తనర్చి సో
దర తరుణీజనంబులను దత్సుతులం గడు గారవంబునన్
గరుణ దలిర్ప నాత్మజులకంటెఁ బ్రియోన్నతిఁ బ్రోచువాఁడు సు
స్థిరమతి నున్నవాఁడె వసుదేవుఁడు వృష్ణికుల ప్రదీపకా! 50

శా. కందర్పాంశమునం దనూజుఁ బడయం గామించి భూదేవతా
బృందంబున్ భజియించి తత్కరుణ [6]దీపింపన్ ప్రభావంబు పెం
పొందన్ రుక్మిణి గన్న నందనుఁడు ప్రద్యుమ్నుండు భాస్వచ్చమూ
సందోహంబులు దన్నుఁ గొల్వ మహితోత్సాహంబునన్ మించునే. 51

1. గడచి (హ) 2. నిజభక్తు (తం) 3. హరిభక్తుల పుణ్యాత్ముల దురిత విదూరుల విరోధి దుర్దమ బలులం గురుకుల తిలకుల కుంతీవరసూనుల సేమ మరసి వారిని భక్తిన్. వ. ఇట్లనియె (తం) వారని భక్తిన్ (చ) 4. దుర్దమహరులన్ (బ) 5. భవ్యులు (తం.వా.) 6. ‹దాపింఛ ప్రభావర్ధ (తం).

క. సరసిజలోచన కరుణా, పరిలబ్ధ సమస్త ధరణిపాలన మహిమం
బరమప్రీతి సుఖించునె, చిర విభవోదారుఁ డుగ్రసేనుఁడు జగతిన్. 52

చ. లలిత పతివ్రతామణి విలాసవతీతిలకంబు పార్వతీ
లలన గుమారుఁ [1]గన్నటు సులక్షణ జాంబవతీ లలామ ని
ర్మల గతిఁ గన్న పట్టి సుకుమారతనుండు విరోధిభంజనో
త్కలిక సుఖించునే గుణకదంబుఁడు సాంబుఁడు వృష్ణిపుంగవా! 53

క. హరిపద సేవకుఁ డరి భీ, కరుఁ డర్జును వలన మిగులఁ గార్ముక విద్యల్
[2]దిరముగఁ గఱచిన సాత్యకి, వరసుఖ విభవముల నున్న వాఁడె ధరిత్రిన్. 54

మ. జలజాతాంకుశ చక్ర చాప కులిశ చ్ఛత్రాది రేఖాంకితో
జ్జ్వల గోవింద పదాబ్జ లక్షిత విరాజన్మార్గ ధూళిచ్ఛటా
కలితాంగుండు విధూతకల్మషుఁడు నిష్కామైక ధన్యుండు స
త్కులజాతుం డన నొప్పు నట్టి ఘనుఁ డక్రూరుండు [3]భద్రాత్ముఁడే. 55

క. శ్రుతులును గ్రతు జాతము[4]లున్, మతిఁ దాల్చిన యట్టి వేదమాత గతిన్ శ్రీ
పతిఁ దన గర్భంబున ర, క్షితుఁ జేసిన గరిత దేవకీసతి సుఖమే. 56

వ. మఱియును, మహాత్మా! మహితోపాసకు లగు వారల కోర్కులు నిండింపం జాలిన భగవంతుండును, శబ్దశాస్త్రంబునకుం గారణం బని తన్ను నఖిల దేవతా జనంబు లగ్గింపం గల మేటి యగుటం జేసి మనోమయుండును, సకల జీవ చతుర్విధాంతఃకరణంబు లైన యే చిత్తాహంకారబుద్ధి మనంబులకుఁ గ్రమంబున వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధు లధిదైవతంబు లగుదు రట్టి చతుర్విధ తత్త్వంబులలోన [5]దుర్యం బయిన తత్త్వంబును, నైన యనిరుద్ధకుమారుండు సంతోషచిత్తుం డగునే యని, 57

మ. [6]ఇత రారాధన బుద్ధి మాని కమలాధీశుం బయోజాస నా
ర్చితుఁ [7]గృష్ణున్ నిజనాథుఁగా సతతమున్ సేవించు పుణ్యుల్ జగ
న్నుతు లధ్యాత్మవిదుల్ మహాభుజులు మాన్యుల్ ధర్మమార్గుల్ సము
న్నతి సత్యాత్మజ చారుదేష్ణ గదు లానందాత్మలే యుద్ధవా! 58

1. గన్నగతి లక్షణ (హ) 2. గఱచిన బలియుఁడు సాత్యకి (ట. త.) 3. జీవించునే (క. తం)
4. సమ్మతి (తం. వా.) 5. తుర్యంబైన తత్త్వంబు మనస్సు. తన్మనోమయుండు నైన (క. చ. తం.)
6. ఇతరారాధన మాని కృష్ణు (క.చ.తం.వా.) 7. భక్తిన్ (తం. వా.)

తే. క్రోధమాత్సర్యధనుఁడుసుయోధనుండు, పొలుచు నెవ్వనిసభఁజూచి కలుషమొదవి
మనములోన నసూయా నిమగ్నుఁడయ్యె, [1]నట్టిధర్మజుఁ డున్నాఁడె యనఘచరిత!

తే. ఘన గదాభ్యాస చిత్రసంగతుల మెఱసి, కురుకుమారుల భూరి సంగరములోన
హతులఁగావించి వెలసిన యట్టి జెట్టి, వాయుతనయుండు గుశలియై వఱలునయ్య!

చ. హరి కరుణాతరంగిత కటాక్ష నిరీక్షణ లబ్ధ శౌర్య వి
స్ఫురణఁ దనర్చి తన్ను నని బోయ [2]గతిం గిరిశుం డెదిర్చినన్
బరవస మొప్పఁగా గెలిచి పాశుపతాస్త్రము గొన్న శత్రు భీ
కరుఁడు ధనంజయుండు సుభగస్థితి మోదము నొందుచుండునే. 61

మ. తెఱఁగొప్పన్ జననీ వియోగమునఁ గుంతీ స్తన్యపానంబు సో
దర సంరక్షయుఁ గల్గి దేవవిభు వక్త్రస్థామృతంబుం ఖగే
శ్వరుఁ డర్థిం గయికొన్న మాడ్కిఁ గురువంశ శ్రేణి నిర్జించి త
ద్ధరణీరాజ్యము గొన్న మాద్రికొడుకుల్ ధన్యాత్ములే? యుద్ధవా! 62

తే. పాండు భూమీశ్వరుండు సంప్రాప్తమరణుఁ, డైన శిశువులఁ బ్రోచుటకై నిజేశుఁ
గూడి చనకున్న యట్టి యా కుంతిభోజ, తనయ జీవించునే నేఁడు? మనుచరిత్ర!

వ. అని వెండియు, 64

మ. [3]అనుసంభూతుఁడు పాండు భూవిభుఁడు నిర్యాణంబునుం బొంద నా
తని పుత్రుల్ దనుఁ జేరవచ్చినను [4]మధ్యస్థంబు వోఁదట్టి యె
గ్గొనరించెన్ [5]ధృతరాష్ట్ర భూమివిభుఁ డట్లూహింపఁగా నెగ్గు సే
సిన వాఁడే యగుఁ గాక మేలు గలదే చింతింపఁగా నుద్ధవా. 65

క. [6]అనుజుఁ డని యనక తగ నిజ, తనయులు నను వెడల నడువ దా నూరకయుం
డిన ధృతరాష్ట్రుఁడు నరకం, బునఁ బడు నా డైన దుఃఖమున ననఘాత్మా! 66

వ. అదియునుం గాక పరమశాంతుండ వైన నీ మనంబున దుఃఖంబు గర్తవ్యంబు
గాదంటేని, 67

క. నరలోక విడంబనమున, హరి పరమపరుండు మానవాకృతితో ని
ద్ధరఁ బుట్టి యాత్మమాయా, స్ఫురణన్ మోహింపఁ జేయు భూజనకోటిన్. 68

1. అట్టి ధర్మండు కుశలియే (జ) 2. గతిన్నభవుం డెదిర్చినన్ (తం) 3. అనుజాతుండగు (హ.వా.) 4. మాధ్యస్థ్యంబు (తం. వా.) 5. మదిఁ బాండు భూవిభునకు న్నూహింపఁగా (చ.ట.జ.ద.) 6. అనుజుండ ననక తన నిజ (త. జ. ద.); అనుజుఁడు వీఁడనకయ నిజ (తం. వా.)

ఉ. కావున న మ్మహాత్ముని వికార విదూరుని సర్వమోహ మా
యావిల మానసుండ నగు నప్పుడు సంస్మృతి దుఃఖి నౌదు న
ద్దేవుని సత్కృపా మహిమఁ [1]దేలిన వేళ సుఖింతు నేన కా
దా విధి [2]శంకర ప్రభృతు ల వ్విభు మాయఁ దరింప నేర్తురే. 69

వ. అయిన నమ్మహాత్ముని కరుణాతరంగి తాపాంగ పరిలబ్ధ విజ్ఞాన దీపాంకుర నిరస్త సమస్త దోషాంధకారుండ నగుటచే మదీయచిత్తంబు హరి[3]పదాయత్తంబై తన్మార్గంబు సతతంబు నిరీక్షింపుచు నుండు. మఱియును. 70

సీ. అట్టి సరోజాక్షుఁ డాత్మీయ పదభక్తు లడవుల నిడుమలు గుడుచుచుండ
దౌత్యంబు సేయఁ గొందఱు విరోధులు పట్టి బద్ధునిఁ జేయ సన్నద్ధులైన
బలహీను మాడ్కి [4]మార్పడఁగ లేఁ డసమర్థుఁ డని తలంచెద వేని యచ్యుతుండు
పరుల జయింప నోపక కాదు [5]విద్యాభిజన ధనమత్తులై జగతిఁ బెక్కు

తే. బాధలఁ [6]గలంచు దుష్ట భూపతుల నెల్ల, సైన్య యుక్తులుగా నని సంహరించు
కొఱకు సభలోన నప్పుడా కురుకుమారు, లాడు దుర్భాషణములకు నలుగఁడయ్యె.

మ. జననం బందుట లేని యీశ్వరుఁడు దా జన్మించు టెల్లన్ విరో
ధి నిరాసార్థము వీతకర్ముఁ డగు న ద్దేవుండు గర్మ ప్రవ
ర్తనుఁ డౌ టెల్ల జరాచర ప్రకట భూతశ్రేణులన్ గర్మ వ
ర్తనులం జేయఁ దలంచి కాక కలవే దైత్యారికిం గర్మముల్. 72

క. హరి నరుల కెల్లఁ బూజ్యుఁడు, హరిలీలా మనుజుఁడును గుణాతీతుఁడునై
పరఁగిన భవ కర్మంబులఁ, బొరయం డఁట హరికిఁ గర్మములు లీల లగున్. 73

క. మదిఁ దన శాసన మిది [7]నిజ, పదములు సేవించు లోకపాలాదుల పెం
పొదవింప యదుకులంబున, నుదయించెను భువిని బలసహోదరుఁ డగుచున్. 74

తే. చలన మందక భూరి సంసరణ తరణ, మైన సత్కీర్తి దిక్కుల [8]నతిశయిల్లి
మఱల సమమతియై యున్నవాఁడె కృష్ణుఁ, డనుచు నుద్ధవుని విదురుఁ డడుగుట
యును. 75

1. దేరిన (హ) 2. రుద్రముఖ్యులకు నవ్విభు మాయ ధరింప వచ్చునే (క.చ.జ.త.డ.ద.బ.) పరాయత్తంబై (హ. తం. వా.) 4. మార్పడలేఁడ యసమర్థుఁ డని (త. తం. వా.) 5. మిథ్యాభిజాత్య ధనంబుల (హ) 6. నలంచు (క.బ.) 7. తన (క.చ.ట.త.ఞ.డ.ద.బ.) 8. నతిశయిల్ల వరలసన్మతి (డ. బ.)

అధ్యాయము—౨

వ. అ య్యుద్ధవుండు ?

క. యదుకులనిధి యగు కృష్ణుని, పద జలజ వియోగ తాప భరమున మాటల్
ప్రిదులక హృదయం బెరియఁగఁ, బెదవులు[1]దడుపుచును వగలఁ బెంపఱియుండెన్.

క. అని చెప్పి బాదరాయణి మనుజేంద్రుని వలను చూచి మఱి యి ట్లనియెన్
విను మొకనాఁ డీ యుద్ధవుఁ, డనయము నై దేండ్ల బాలుఁడై యున్న తఱిన్.77

వ. మున్ను కృష్ణునిం గూడియాడు బాలకులలో నొక్క బాలునిఁ గృష్ణునిఁగా భావించి పరిచర్య సేయుచుండ గుణవతీమతల్లి యగు తల్లి చనుదెంచి యాఁకొంటి విది యేల రా వన్న యని పిలిచిన జననీ వాక్యంబులు గైకొనక యఖండ తేజోనిధి యైన పుండరీకాక్ష పాదారవింద సేవానురక్తిం జేసి యున్న యుద్ధవుండు నేఁడు కృష్ణవియోగ తాపంబున హరివార్త విదురునకుఁ జెప్పఁ జాలక [2]యుండుట యేమి విచిత్రం బని వెండియు ని ట్లనియె. అంత నుద్ధవుండు సరోజాక్ష పాదారవింద మకరంద సుధా జలనిధి నిమగ్న మానసుండై సముత్కంఠం జింతించి యొక్క ముహూర్త మాత్రంబునకు బాష్పజల పూరిత లోచనుండై గద్గదకంఠుం డగుచు. 79

క. ఘనముగ నెమ్మనమున [3]మించిన కృష్ణ వియోగ జనితశిఖి దరికొనఁగాఁ
గనుఁగవఁ బెడచే నొత్తుచుఁ, బెనుపొందిన దురిత శిఖరి భిదురున్ విదురున్.80

వ. కనుంగొని యి ట్లనియె. 81

క. యముఁ డను ఘన కాలభుజం, గమ పుంగవుఁ [4]డొడిసి పట్టఁగా యదు వంశో
త్తము చారిత్రము దక్కఁ గ, లము లే మని చెప్పుదును గలంగెడి మనమున్.82

సీ. మునిజన ముఖపద్మములు ముకుళింపఁగ ఖలజన లోచనోత్పలము లలరఁ
జార చోరుల కోర్కి సఫలత నొందంగ దానవ దర్పాంధ తమస మడర
వర యోగి జన చక్రవాకంబు [5]లడలంగఁ గలుషజనానురాగంబు పర్వ
భూరి [6]దోషానల స్ఫూర్తి వాటిల్లంగ నుదిత ధర్మక్రియ లుడిగి యణఁగ

1. పడవుచును (హ) 2. యొప్పఱియుండుట (లం. వా.) 3. ముంచిన (క.చ.త.జ.ద.బ.)
4. ఎదిరి పట్టగా (క.డ.); ఎదిగి...(చ.త.ద.); ఎగచి... (ట.తం.వా.) ఒదిగి...(హ) 5. లదరంగ (త) 6. దోషాగమ (హ. తం. వా.)

తే. [1]మానుషాకార రుచికోటి [2]మందపఱిచి, యనఘ యే మన నేర్తుఁ గృష్ణాభిధాన
లోక బాంధవుఁ డుత్తమశ్లోకమూర్తి, మించు తేజంబుతో నస్తమించె నయ్య.

వ. మఱియును. 84

క. హలకులిశ జలజరేఖా, లలిత శ్రీకృష్ణ పాదలక్షిత యై ని
ర్మలగతి నొప్పెడి ధరణీ, లలనామణి నేఁ డభాగ్య లక్షణ యయ్యెన్. 85

క. యాదవుల వలన రాజ్య, శ్రీ దొలఁగెను ధర్మగతి నశించెను భువి మ
ర్యాదలు దప్పె నధర్మో, త్పాదనమున దైత్యభేది దప్పిన పిదపన్. 86

వ. మఱియు లలిత నికషణ విరాజమాన మణిగణ కిరణ సుషమా విశేష విడంబిత విమల సలిలంబు లందుఁ బ్రతిఫలిత సంపూర్ణ చంద్రమండల రుచి నిరీక్షించి జలచర బుద్ధిం జేసి త జ్జల విలోలమీనంబు లనూన స్నేహంబునం దలంచు చందంబునఁ గృష్ణానుచరులైన యదువృష్టి కుమారు ల మ్మహనీయ మూర్తిం దమకు నగ్రేసరుం డని కాని లీలామానుషవిగ్రహుం డైన పరమాత్ముం డనికాని యెఱుంగక హరి మాయాజనితం బగు నసద్భావంబునం జేసి భోజన శయ నాస నానుగమనంబులం [3]జేరి సహోద రాది భావంబులం గూడి చరియింతురు. అ ద్దేవుని మాయాపయోనిధి నిమగ్నులు గాకుండ నబ్జభవాదుల కైనం దీరదు. సర్వగుణ గరిష్ఠులు సత్పురుష శ్రేష్ఠులునగు పరమ భాగవతులకుం దక్కం దక్కిన వారలకుం జెప్పనేల. అదియునుం గాక యభిజన విద్యా ధన బల గర్వ మదాంధీభూత చేతస్కు లైన శిశుపా లాది భూపాలకు ల మ్మహాత్మునిం బరతత్త్వం బని యెఱుంగక నిందించు దుర్భాషలు దలంచి మనస్తాపంబు నొందు చుండుదును. అని వెండియు, 87

మ. [4]అవితృప్తేక్షణ ధీ సమాహిత తపోవ్యాసంగు లై నట్టి భా
గవత [5]శ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖి లైక [6]జ్యోతిమైఁ జూపి [7]లో
క విలోకంబులు [8]నిర్దహించి కమలాకాంతుండు శాంతుండు మా
నవ రూపం బగు దేహముఁ వదలి యంతర్ధానుఁ డయ్యెం జుమీ. 88

1. మానితాకార (ద) 2. మరుగు పరచి (ట) 3. జేసి (క. జ. బ.) 4. అవితృప్తవ్రత (క. చ. ట. త. బ. తం.) 5. శ్రేణుల (క. చ. ట. జ. డ. ద. బ.) 6. ఖ్యాతిమై (క.త.డ.ద.బ.) 7. లోకవిశోకంబులు (హ. తం. వా.) 8. నిర్వహించి (క. చ. ద.)

సీ. [1]మర్త్యవికాసైక మానమై తనకును విస్మయ జనకమై వెలయు నట్టి
యాత్మీయ యోగ మాయాశక్తిఁ జేపట్టి చూపుచు నత్యంత సుభగుఁ డగుచు
భూషణంబులకును భూషణంబై [2]వివేకముల కెల్లను బరాకాష్ఠ యగుచు
సకల కళ్యాణ సంస్థానమై తేజరిల్లెడు నట్టి దివ్యమూర్తి

తే. తాన తనమూర్తి నిజశక్తిఁ దగ ధరింప, యమతనూభవు రాజసూయాధ్వరంబు
నందు నెవ్వని శుభమూర్తి [3]నఖిల జనులు,నిండు వేడుకఁ జూచి [4]వర్ణించి రెలమి.

క. ప్రకటముగఁ గమలభవ సృష్టికిఁ గారణ మి మ్మహాత్ముఁడే యనుచును ను
త్సుకులై తన్మూర్తిని దప్పక చూచిరి కాదె తత్సభా జను లెల్లన్. 90

వ. మఱియు శాంతోగ్ర రూపధరుండైన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ బరకృతాపరాధ నిపీడ్యమాన మానసుం డయ్యు ననుకంపాయత్త చిత్తుండై వర్తించు. పరాపరుండును, ప్రకృతికార్యం బయిన మహత్తత్త్వ రూపుండును, జనన విరహితుం డయ్యును దారువుల వలన ననలంబు దోఁచు చందంబున జననంబు నొందుచుండు. అట్టి సరోజనాభుని హాస రాస లీలానురాగ విలోకన ప్రతిలబ్ధమాన లైన గోపకామినులు దన్మూర్తి దర్శనానుషక్త మనీషలం గలిగి వర్తించిరి. అదియునుం గాక, 91

చ. దివిజుల కోర్కిదీర్ప వసుదేవుని యింట జనించి కంస దా
నవుఁడు [6]వధించునన్ భయమునం జని నందుని యింట నుంటకున్
యవన జరాసుతాదులకు నాజి నెదుర్పడ లేక సజ్జన
స్తవ మధురా పురిన్ విడిచి దాఁగుటకున్ మదిఁ జింత నొందుదున్. 92

వ. అదియునుంగాక, 93

సీ. కడఁగి పెక్కేడుములఁ గుడుచుచుఁ జిత్తముల్ గలఁగఁగ బంధనాగారములను
వనరిన దేవకీ వసుదేవులను డాయఁ జనుదెంచి భక్తివందన మొనర్చి
తలిదండ్రులార ! యేఁ గలుగంగ మీరలు గంసుచే నలజడిఁ గ్రాగుచుండఁ
[7]గణఁగి శత్రునిఁ జంపఁగా లేక చూచుచు నున్న నా తప్పుఁ బ్రసన్ను లగుచుఁ

తే. గావుఁ డని యానతిచ్చిన దేవదేవు, నద్భుతావహ మధురవాక్యములు దలఁచి
తలఁచినాచిత్తమునఁ [8]జాలఁ గలఁగుచుండుఁ, బృథులపాతకభూమిభృద్భిదురవిదుర!

1. మానవైక వికాస (హ. వా) 2. వివేకములకుఁ బరమోపకరణమగుచు (ద) 3. నర్థితోడ (హ) 4. వర్ణింపుచుండు (హ) 5. హరించు (క.బ.) 6. నొంచుచున్ (హ) 7. కడిఁది (క.బ.తం.) కడఁగి (చ. టి వా.) 8. బెట్ట గలఁగుచుండు (క. బ. తం. వా.)

క. విమలమతిఁ దలఁప నెవ్వని, బొమముడి మాత్రమున నిఖిల భూదేవీ భా
రము వాయు నట్టి హరిపద, కమల మరందంబు గ్రోలు ఘనుఁ డెవ్వాఁడో? 95

క. మంద ప్రజ్ఞుఁడనై గో, విందుని మురదైత్యహరుని విష్ణునిఁ బరమా
నందుని నంద తనూజుని, మందరధరుఁ జిత్తమందు మఱతునె యెందున్? 96

చ. అదియునుఁ గాక మీరు నృపు లందఱు చూడఁగ ధర్మసూతి పెం
పొదవిన రాజసూయ సవనోత్సవ మందును జన్మ మాదిగాఁ
బదపడి [1]యెగ్గొనర్చి శిశుపాలుఁడు యోగిజనంబు లిట్టి ద
ట్టి దని యెఱుంగ నోపని కడింది పదంబును బొందెనే కదా. 97

చ. కురునృప పాండు నందను లకుంఠితకేళిఁ జమూ సమేతులై
యరిది రణోర్వి నెవ్వని ముఖాంబురుహామృత మాత్మలోచనో
త్కరములఁ గ్రోలి పార్థ విశిఖ ప్రకరక్షత పూతగాత్రులై
గురుతర మోక్ష ధామమునకుం జని సౌఖ్యము నొందిరో కదా! 98

సీ. అట్టి సరోజాక్షుఁ డాద్యంత శూన్యుండు సుభగుండు త్రైలోక్య సుందరుండు
కమనీయ సాగర కన్యకా కుచ కుంకుమాంకిత విపుల బాహాంతరుండు
సకల దిక్పాల భాస్వత్కిరీట న్యస్త పద్మరాగారుణ పాదపీఠుఁ
డజుఁ డనంతుఁడు సమానాధిక విరహితుఁ డిద్ధ మూర్తిత్రయాధీశ్వరుండు

తే. నైన హరి యుగ్రసేనుని యఖిలరాజ్య,రుచిర సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టి
భృత్యభావంబు నొంది సంప్రీతి నతని, పనుపు సేయుట కెపుడు నా మనము గుందు.

వ. అని వెండియు నిట్లనియె, అనఘా! *(పరాత్పరుండు యోగీశ్వరేశ్వరుండు నగు కృష్ణుండు) భగవద్భక్తుండు పరమ భాగవతోత్తముఁడు నైన యుగ్రసేనుని సేవించుట యాశ్చర్యంబు గాదు. తన్ను హరియింపం దలంచి కుచంబుల విషంబు ధరించి స్తన్యపానంబు సేయించిన దుష్టచేతన యైన పూతనకుం, జన్నిచ్చి పెంచిన యశోదాదేవికి నైన నందరాని నిజపదంబు గారుణ్యచిత్తుండై యొసంగె ననిన నిజపద ధ్యానపరాయణు లగు వారల ననుసరించి సేవించుట చెప్ప నేల? అనిన నుద్ధవునికి విదురుం డిట్లనియె. భక్తవత్సలుండును గారుణ్య జలనిధియునై భాగవత జనుల ననుగ్రహించు పుండరీకాక్షుండు నిజదాస లోకంబున కొసంగు పరమపదంబు నుగ్రకర్ములైన రాక్షసుల కెట్లొసంగె నత్తెఱం గెఱిగింపు మనిన విదురునకు నుద్ధవుం డిట్లనియె. 100

1. యెగ్గొనర్చు (తం. వా.) * కొన్ని వ్రాఁతప్రతులలో లేదు.

మ. దనుజానీక మనేక వారములు దోర్దర్పంబు సంధిల్లఁగా
వినతాసూను భుజావరోహుఁ డగు న వ్విష్ణున్ సునాభాస్త్రుఁ దా
రనిలో మార్కొని పోకు పోకు హరి దైత్యారాతి యంచుం దదా
ననముం జూచుచుఁ గూలి మోక్షపదమున్ బ్రాపింతు రత్యున్నతిన్. 101

క. ధీరజనోత్తమ! నవ సిత, సారస నేత్రుఁ డగు కృష్ణు జననంబును ద
చ్చారిత్రము నెఱిఁగింతు ను, దారత నీ విపుడు వినుము త ద్విధ మెల్లన్. 102

చ. ధరణిభరంబు వాపుటకుఁ దామరసాసను ప్రార్థనన్ రమా
వరుఁ డల కంస బంధననివాసమునన్ వసుదేవ దేవకీ
వరులకు నుద్భవింప బలవంతుఁడు గంసుఁడు హింస సేయు
న్వెఱపున నర్ధరాత్రి సుతునిం గొని య వ్వసుదేవుఁ డిమ్ములన్. 103

క. నందుని మందకుఁ జని త, త్సుందరి తల్పమునఁ బరులు సూడక యుండన్
నందనుని నునిచి యానక, దుందుభి మఱలంగ నేగెఁ దొల్లిటి పురికిన్. 104

క. హరి యేకాదశ సంవ, త్సరములు నందవ్రజమునఁ దను హరి యని యె
వ్వరు నెఱుఁగ కుండ నా హల, ధరుతోఁ [1]గూడాడుచుండెఁ దద్దయుఁ బ్రీతిన్.

క. గోపాల వరుల కైనను, నాపోవఁగఁ దన సమంచితాకార మొగిన్
జూపని శ్రీపతి వేడుక, గోపాలురఁ గూడి కాచె గోవత్సములన్. 106

వ. అ య్యవసరంబునం గృష్ణుండు లీలా వినోదంబులు తోడి గోపాల బాలురకుం
జూపం దలంచి, 107

చ. వర యమునా నదీ సలిల వర్ధిత సౌరభ యుక్త పుష్ప మే
దుర మకరంద పాన [2]పరితోషిత భృంగ సురంగ మాధవీ
కురవక కుంద చందన నికుంజము లందు మయూర శారికా
పరభృత రాజకీర మృదు భాషల భంగిఁ జెలంగి పల్కుచున్. 108

ఉ. శ్రీ రమణీ మనోవిభుఁడు సింహ కిశోరముఁ బోలి లీలఁ గౌ
మార దశన్ రమా విమల మందిరముం బురుడించు గో తతిన్
వారక మేపుచుం దరళ వంశ రవ స్ఫుట మాధురీ సుధా
సారముచేత గోపజన సంఘములన్ ముదమందఁ జేయుచున్. 109

1. గ్రీడించుచుండె (తం.వా.) 2. పరితుష్ట మధువ్రత సంగ (హ); మధువ్రతయూథ (తం.వా.); పరితుష్టిత భృంగ సుసంగ (త)

వ. మఱియు, 110

మ. చిర కేళీరతి బాలకుల్ దృణములన్ సింహాది రూపంబులన్
గర మొప్పన్ విరచించి వాని మరలన్ ఖండించు చందంబునన్
గరుణాతీతులు కామరూపు లగు న క్కంస ప్రయుక్త క్షపా
చరులం గృష్ణుఁడు సంగర స్థలములన్ [1]జక్కాడె లీలాగతిన్. 111

చ. వర యమునా నదీ జల నివాస మహోరగ వి స్తృ తాస్య వి
స్ఫురిత విషానల ప్రభల సోఁకునఁ గ్రాఁగిన గోప గో ధనో
త్కరముల నెల్ల గాచి భుజగప్రవరు న్వెడలంగఁ దోలి త
త్సరి దమలాంబు పానమున సంతస మందఁగఁ జేసె గో తతిన్. 112

మ. దివిజాధీశు గుఱించి వానకొఱకై దీపింప సం దాది వ
ల్లవు లేఁచేఁట ననూన సంపదల నుల్లాసంబునం జేయు ను
త్సవముం గృష్ణుఁడు మాన్పి గోప గణముల్ సంప్రీతి నొందన్ శచీ
ధవు గర్వం [2]బణఁపన్ ధనవ్యయముగాఁ దాఁ జేసె గో యాగమున్. 113

చ. హరిహయుఁ డంత రోష వివశావిల మానసుఁడై సరోరుహో
దరు మహిమం బెఱుంగక మదం బడరంగ వలాహ కాది భీ
కర ఘనపంక్తిఁ బంపిన నఖండ శిలామయ భూరి వర్షముల్
గురిసె ననూన గర్జనల గోకుల మాకుల మంది [3]కుందఁగన్. 114

ఉ. ఆ తఱి మంద గొందలము నందఁగ వల్లవు లెల్లఁ [4]గృష్ణ యీ
చేతను లెల్ల నిట్టి జడిఁ జిందఱ వందఱలై [5]మనంబులన్
[6]గాతరులైరి నీవు గృపఁ గావు మహాత్మ! యనాథనాథ! ని
ర్ధూత కళంక! భక్తపరితోషణ భూషణ! పాపశోషణా! 115

మ. అని యి ట్లంగి విపన్నులై పలుకఁ గుయ్యాలించి కృష్ణుండు స
జ్జన వర్ధిష్ణుఁడు గోప గో నివహ రక్షా దక్షుఁడై దేవతా
జను లగ్గింపఁ గరాంబుజాతమున సచ్ఛత్రంబుగాఁ దాల్చె బో
రన గోవర్ధన శైలమున్ దట చర ద్రమ్యామరీ జాలమున్. 116

1. జెండాడె (హ. కొన్ని వ్రాఁత ప్రతులు) 2. బడపంగ నవ్యయముగా (తం. వా.) 3. భ్రమందగన్ (చ. డ. ద. తం. వా.); క్రందగన్ (క. జ. ట. బ.) 4. గృష్ణ కృష్ణేతి విభీత వాక్యముల (క. బ. తం.) 5. కలంగుచున్ (ప. బ.) 6. గాతరులై మముం గరుణఁ గావుము కావు మనాథనాథ (ద. బ. తం.)

వ. వెండియు, 117

సీ. శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమా సాంద్ర చంద్రాతపో జ్జ్వలిత మగుచు
వెలయు బృందాటవీ వీథి యం దొకనాఁడు రాసకేళీ మహోల్లాసుఁ డగుచు
రుచిర సౌభాగ్య తారుణ్య మనోరమ స్ఫూర్తిఁ జెన్నొందిన మూర్తి దనర
సలలిత ముఖచంద్ర [1]చంద్రికా తతి గోప నయనోత్పలముల కానంద మొసఁగ

తే. భవ్య చాతుర్య భంగిఁ ద్రిభంగి యగుచు, నబ్జనాభుండు సమ్మోద మతిశయిల్ల
లీలఁ బూరించు వర మురళీ నినాద, మర్థి వీతేర విని మోహితాత్మలగుచు. 118

చ. పతులు మఱందులుం సుతులు బావలు నత్తలు మామలుం సము
న్నతి వలదన్న మానక మనంబులఁ గృష్ణ పదాబ్జ సేవనా
న్వితరతి గోప కామినులు వే చనుదేర దయాపయోధి శో
భితగతి రాసకేళి సలిపెం దరుణీ నవ పుష్పచాపుఁడై. 119

అధ్యాయము — ౬

ఉ. రాముఁడు దాను గూడి మథురా పురికిం జని యందు వైభవో
ద్దామ నృపాసనంబున [2]ముదంబున నున్న దురాత్ముఁ గంసు దు
ష్టామరశత్రుఁ ద్రుంచి ముదమారఁగఁ దల్లిని దండ్రి నంచిత
శ్రీమహితాత్ముఁడై తనరఁ జేసె సరోరుహనాభుఁ డున్నతిన్. 120

మ. నలు వొప్పంగ షడంగయుక్త [3]మహితామ్నాయంబు చౌషష్టి వి
ద్యలు సాందీపనిచే నెఱింగెఁ జెలువొంద న్విన్న మాత్రంబు లో
పలనే లోకగురుండు దాన తనకున్ భావింప నన్యుల్ గురు
ల్గలరే లోక విడంబనార్థ మగు లీలల్ గావె యమ్మేటికిన్. 121

ఉ. [4]మించి ప్రభాస తీర్థమున మృత్యువశంబును బొంది పోయి యా
పంచజనోదరస్థుఁ డగు బాలుని దేశికనందనుం బ్రభో
దంచిత లీలఁ దెచ్చి గురుదక్షిణగా నతిభక్తి యుక్తి స
ర్పించె గురుండు చిత్తమునఁ బెంపెసలార మురారి వెండియున్. 122

1. చంద్రిక గోపికా (తం.); చంద్రికల్ గోపికా (వా). 2. సుదారత నున్న (హ); మదంబున నున్న (ట.వా.) 3. మహితామ్నాయాది నైర్మల్య విద్యలు (చ. ట. త. జ. ద. బ.) మహితామ్నాయైక నైర్మల్య విద్యలు (ద) 4. మంచి ప్రభాస తీర్థముల మధ్యములన్ మృతి బొంది (క. బ.) తీర్థ జలమధ్యములన్ మృతి బొంది (చ. ట. జ. ద. ద.)

సీ. ఘనుఁడు విదర్భేశుఁ డన నొప్పు భీష్మకు వర సుతామణి నవ వారిజాక్షిఁ
బద్మా సమాన రూపశ్రీ విభాసితఁ గమనీయ భూషణఁ గంబుకంఠిఁ
జతుర స్వయంవరోత్సవ సమాగత చైద్య సాల్వ మాగధ ముఖ జనవరేణ్య
[1]నికర సమావృతఁ బ్రకట సచ్చారిత్ర రుక్మిణి ననమాన [2]రుక్మకాంతి

తే. నమర గుప్తామృతము విహగాధి విభుఁడు, గొనిన కైవడి మనుజేంద్ర కోటిఁ దోలి
కమలనాభుండు నిజభుజాగర్వ మలరఁ, దెచ్చి వరియించె నతని నుతింపవశమె!

చ. [3]పరువడి పట్టి సప్త వృషభంబుల ముక్కులు [4]గుట్టఁ దద్బల
స్ఫురణ సహింపఁ జాలక నృపుల్ దలపడ్డ జయించి నగ్నజి
ద్ధరణిపు నందనన్ వికచ తామరసాక్షిఁ బ్రమోదియై స్వయం
వరమునఁ బెండ్లి యాడె గుణవంతుఁ డనంతుఁ డనంత శక్తితోన్. 124

మ. ప్రతివీర క్షయకారి [5]నా నెగడి సత్రాజి త్తనూజా హృదీ
ప్సితముం దీర్పఁ దలంచి నాకమునకున్ బెంపారఁగా నేగి [6]వ
ర్ణిత శౌర్యోన్నతిఁ బారిజాత మిలకున్ లీలాగతిం దెచ్చె ను
ద్ధతి దేవేంద్రు జయించి కృష్ణుఁ డన నేతన్మాత్రుఁడే చూడఁగన్. 125

సీ. మానితాఖిల జగన్మయ దేహమునఁ బొల్చు ధరణి దేవికిఁ బ్రియతనయుఁ డైన
నరక దానవుని సునాభాఖ్యఁ జెన్నొందు ఘన చక్రధారా విఖండితోత్త
మాంగునిఁ జేయ న య్యవనీ లలామంబు వేఁడినఁ దత్పౌత్రు విపుల రాజ్య
పదమున నిల్పి లోపలి [7]మందిరంబులఁ జిరముగ నరకుండు చెఱలఁ బెట్టి

తే. నట్టి కన్యలు నూటఁ బదాఱు వేలు, నార్త బంధువుఁ డైన పద్మాక్షుఁ జూచి
హర్ష బాష్పాంబు ధారా ప్రవర్ష మొదవఁ, బంచశర బాణ నిర్భిన్న భావలగుచు.

చ. లలిత తదీయ సుందర విలాస విమోహిత లైన వారి నిం
పొలసిన కోర్కెఁ దీర్చుటకు నొక్క ముహూర్తమునన్ వరించి క
న్యల లలితావరోధ భవనంబుల నందఱ కన్ని రూపులై
కలసి సుఖస్థితిం దనిపెఁ గాంతల భక్తి నితాంత చిత్తలన్. 127

1. నికట సమాకృష్ట (చ) 2. రుచిర (హ) 3. పరువడి భూరి (క. బ. తం.) 4. గుట్టి (క. త. డ. బ.) 5. మున్నువారి (హ); నాఁబరఁగి (తం. వా.) 6. వర్గిత (హ) 7. మందిరములక్కుఁ, జననందు నరకుఁడు చెరలఁ బెట్టి (క. చ. ట. జ.)

క. చతురతతో నం దొక్కొ_క, [1]యతివకుఁ బదురేసి సుతుల నాత్మసముల ను
న్నత భుజశక్తులఁ గాంచెను, వితతంబై కీర్తి దిశల వినుతికి నెక్కన్. 128

సీ. మథురాపురము చతుర్విధ బలౌఘములతో నావరించిన కాలయవన సాల్వ
మగధ భూపాలాది మనుజేంద్ర లోకంబు సైన్యయుక్తముగాఁగ సంహరించి
తన బాహు శక్తిఁ జిత్తముల నర్థించిన భీమ పార్థులకు నుద్దామ విజయ
మొసఁగి తద్వైరుల నుక్కణంగఁగఁ ద్రుంచి బాణ, శంబర, ముర, పల్వలాది

తే. దనుజ నాయక సేనా వితానములను, హలధరాది సమేతుఁడై హతులఁ జేసె
దంతవక్త్రాది దైత్యులు దన్ను నెదుర, ఖండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి.

వ. వెండియుం గృష్ణుండు గౌరవ పాండవ ఖండనమునకుం దోడ్పడి రాజన్యు లన్యోన్య మాత్సర్యోత్సాహ సమేతులై సైనిక పాదఘట్టనంబుల ధరాచక్రంబు గంపింప ననన్య సామాన్యంబులైన శంఖ భేరీ ప్రముఖ తూర్య ఘోషంబులు నింగి ప్రింగ దురంగమ రింఖా సముద్ధూత ధూళి పటల పరిచ్ఛన్న భాను మండలంబుగాఁ జనుదెంచి కురుక్షేత్రంబున మోహరించిన నుభయ పక్షబలంబులం దునుమాడి, నిఖిల రాజ్యవైభవ మదోన్మత్తుం డైన సుయోధనుండు కర్ణ శకుని దుశ్శాసనాదుల దుర్మంత్రంబున నిరంతరంబు గుంతీనందనుల కెగ్గుచేసిన దోషంబునం జేసి సంగరంబున భీము గదాఘాతంబునం దొడలు విఱిగి పుడమిం బడి గతాయుశ్శ్రీ విభవుండై యుండం జూచి పరితుష్ట చిత్తుండై, యపరిమిత బాహుబలోత్సాహులైన భీష్మ ద్రోణ భీమార్జునులచేత నిఖిల ధరాపతుల నష్టాదశాక్షౌహిణీ బలంబులతోడం దునిమించి, మఱియు స్వసమాన బలులయిన యదు వీరుల జయింప నెంత వారలకైనం దీర (కాన) మధుపాన మద విఘూర్ణిత తామ్ర విలోచనులై వర్తించు యాదవుల కన్యోన్య వైరంబు గల్పించి పోరించి యితరేతర కరాఘాతంబుల హతులై (వారు) దనుఁ గలసినం గాని భూ భారం బుడుగ దని చిత్తంబునం దలంచి, యంత ధర్మనందనుచే నిస్సపత్నం బగు రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయింపుచుండి, మర్త్యులకుం గర్తవ్యంబులైన ధర్మపథంబులు సూపుచు, బంధు మిత్రుల నెల్లం బరితోషంబు నొందింపుచుం, దత్పరోక్షంబున వారివంశం బుద్ధరింపం దలంచి యభిమన్యు వలన నుత్తరయందు గర్భంబు నిలిపి, గురుతనయ ప్రయుక్త మహిత బ్రహ్మాస్త్ర పాతంబునఁ దద్గర్భ దళనంబు గాకుండ నర్భకుని రక్షించి, నిజ పదారవింద సేవా రతుం డైన ధర్మజుచేఁ గీర్తి ప్రతాపంబులు నివ్వటిల్లం దురంగమేధంబులు మూఁడు సేయించి, వెండియు, 130

1. యతివకును పదేసి (హ)

సీ. వలనొప్ప లౌకిక వైదిక మార్గముల్ నడుపుచు ద్వారకానగర మందు
[1]నవిదితాత్మీయ మాయా ప్రభావమున నిస్సంగుఁడై యుండి సంసారి పగిదిఁ
జెంది కామంబుల[2]చేత విమోహితుం డై సుఖింపుచు ముదితాత్ముఁ డగుచు
నంచిత స్నిగ్ధ స్మితావలోకముల సుధా పరిపూర్ణ సల్లాపములను

తే. శ్రీ నికేతన మైన శరీరమునను, పాండునందన యదుకుల ప్రకరములను
లీలఁ గారుణ్య మొలయఁ బాలింపుచుండె, నార్త రక్షణ పరుఁడు నారాయణుండు,

సీ. సంపూర్ణ పూర్ణిమా చంద్ర చంద్రిక నొప్పు రమణీయ శారద రాత్రు లందు
సలలిత కాంచన స్తంభ సౌధోపరి చంద్రకాంతోపల స్థలము లందు
మహిత కరేణుకా మధ్య దిగ్గజముల గతిని సౌదామినీ లతల నడిమి
నీల మేఘంబుల లీల [3]ముక్తా మధ్య లాలిత శక్ర నీలముల భాతి

తే. సతత యౌవన సుందరీయుత విహారుఁ, డగుచు సతు లెంద ఱందఱ కన్ని రూప
ములను గ్రీడించెఁ బెక్కబ్దములు సెలంగి, నందనందనుఁ డభినవానంద లీల.

వ. అంత నొక్క నాఁడు, 133

చ. మునివరు లేగుదేర [4]యదు భోజ వరేణ్యులు గూడి ముట్టఁ బ
ల్కినఁ గన లొంది వారు దమకించి శపించినఁ గొన్ని మాసముల్
చను నెడ దైవ యోగముగ జాతరఁ బో సమకట్టి వేడుకల్
మనములఁ దొంగలింప గరిమన్ నిజ యానము లెక్కి యాదవుల్. 134

ఉ. కోరి ప్రభాస తీర్థమునకుం జని తన్నదిఁ గ్రుంకి నిర్మలో
దారత నందు దేవ ముని తర్పణముల్ పితృ తర్పణంబులున్
వారని భక్తిఁ జేసి నవ వత్సలతోఁ బొలుపారు గోవులన్
భూరి సదక్షిణాకముగ భూసుర కోటికి నిచ్చి వెండియున్. 135

క. అజిన పట రత్న కంబళ, రజత మహారజత తిల ధరా వర కన్యా
గజ తురగ రథములును స, ద్ద్విజ కోటికి నిచ్చి పెంపు దీపింపంగన్. 136

వ. ఇట్లు సఫలంబు లైన భూ దానంబు మొదలుగాఁ గల దానంబు లనూనంబుగా
భగవదర్పణ బుద్ధిం జేసి యనంతరంబు. 137

1. అవిరళాధ్యాత్మ (ట) 2. చే మోహితాత్ముఁడు నై (హ) 3. ముక్తాఫల, లలిత మధ్యస్థ నీలముల భాతి (హ. వా.) ముక్తామయు, క్తస్నిగ్ధ నీలరత్నముల భాతి (తం) 4. యదు ముఖ్యులు మూఁకలు గూడి ముట్టి పల్కిన (హ)

అధ్యాయము — ౪

తే. ఎసఁగు మోదంబు సంధిల్ల నిష్టమైన, రసిక మృదులాన్న మర్థిఁ బారణలు సేసి
మంజులాసవ రసపానమత్తులగుచుఁ, [1]గణఁగి యన్యోన్య హాస్యవాక్యములఁ
గలఁగి.

వ. తమలోన మదిరాపాన మద విఘూర్ణిత తామ్ర లోచనులై మత్సరంబుల
నొండొరులఁ బొడిచి సమస్త యాదవులు వేణుజాతానలంబునఁ దద్వంశ పరం
పరలు దహనంబు నొందు చందంబునం బొలిసిరి, అంతయునుం గనుంగొని
కృష్ణుం డప్పుడు, 139

క. చతురతతో నిజమాయా, గతిఁ జూచిఁ [2]లసద్వీలోల కల్లోల సమం
చిత విమల కమల సార, స్వత జలముల విహిత విధులు సలిపిన వాఁడై. 140

క. ఒక వృక్షమూల తలమున, నకలంక, గుణాభిరాముఁ డాసీనుండై
[3]యకుటిలమతి [4]బదరీ వన,మునకు నను౯ బొమ్మనుచు మొఱఁగి పోయిన నేను౯.

క. క్రమమున నిజ కుల సంహా, రము సేయఁ గణంగు పెఱిఁగి రమణీయ శ్రీ
రమణు చరణాబ్జ యుగ విర, హమునకు మది నోర్వ లేక యనుగమనుఁడనై.

క. హరి నరయుచుఁ జనిచని యొక, తరుమూల తలంబు నందుఁ దన దేహరుచు౯
[5]గిఱికొన నున్న మహాత్మునిఁ, బరునిఁ బ్రపన్నార్తి హరుని భక్తవిధేయు౯.

వ. మఱియును, 144

సీ. అస్మత్ప్రియస్వామి నచ్యుతుఁ బరు సత్త్వగుణ గరిష్ఠుని రజోగుణ విహీను
నురుచిర ద్వారకాపుర సమాశ్రయు ననాశ్రయు నీల నీరద శ్యామవర్ణు
దళదరవింద సుందర పత్రనేత్రు లక్ష్మీయుతుఁ బీత కౌశేయ వాసు
విలసిత వామాంక విన్యస్త దక్షిణ చరణారవిందు శశ్వత్ప్రకాశు

తే. ఘన చతుర్బాహు సుందరాకారు ధీరుఁ, జెన్నుగల లేఁత రావి పై వెన్నుమోపి
యున్న వీరాసనాసీనుఁ గన్న, తండ్రి నానంద పరిపూర్ణ దనుజహరుని.

మత్తకోకిల. కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగఁ గంటి నాశ్రిత రక్షకు౯
గంటి యోగిజనంబు డెందముఁ గంటిఁ జుట్టముఁ గంటి ము
క్కంటికిం గనరాని యెక్కటిఁ గంటిఁ దామరకంటిఁ జే
కొంటి ముక్తి నిధానముం దలకొంటి సౌఖ్యము లందఁగ౯. 146

1. గదఁగి (తం.వా.); గజఁగి (హ); అలఁగి (ట.జ.) 2. నటద్వీలోల (క.ట.భ.డ.) 3. అకుటిలగతి (క.జ.డ.) 4. బదరీవని, కిఁక నీ వరుగుమని మొఱఁగి యేఁగిన (వా) బదరీవన, మునకు బొమ్మనుచు మొఱఁగిపోయిన (తం) ఈ పాఠమున ప్రాస భంగ దోషమున్నది. 5. వరఁగఁగ నున్న (హ.తం.వా.)

వ. అయ్యవసరంబునం బరమ భాగవతోత్తముండు, మునిజన సత్తముండు, ద్వైపాయన సఖుండు, పరమ తపోధనుండు, నఘరూన్యుండు, నఖిలజన మాన్యుండు, బుధజన విధేయుండు నగు మైత్రేయుండు దీర్ఘాచరణంబు సేయుచుం జని చని,

మ. కనియెం దాపస పుంగవుం డఖిల లోకఖ్యాత వర్ధిష్ణు శో
భన భాస్వత్పరిపూర్ణ యౌవన కళా భ్రాజిష్ణు యోగీంద్ర హృ
ద్వన జాతైక చరిష్ణుఁ గౌస్తుభ ముఖోద్య ద్భూషణాలంకరి
ష్ణు నిలింపాహిత జిష్ణు విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణు రోచిష్ణునిన్. 148

క. తదనంతరంబ హరిఁ దన, [1]హృదయాబ్జము నందు ముకుళితేక్షణముల స
మ్మదమునఁ జూచుచు నానత, వదనుండై యుండె ముదము వఱలఁగ ననఘా!

వ. అంత డగ్గఱ నేతెంచి యున్న మైత్రేయుండు వినుచుండ దరహాస చంద్రికా సుందర వదనారవిందుండును, నానంద సుధానిష్యంద కందళిత హృదయుండును, భక్తానురక్త దయాసక్త విలోకనుండును నగు పుండరీకాక్షుఁడు నన్ను నిరీక్షించి యిట్లని యానతిచ్చె. పూర్వ భవంబున వసుబ్రహ్మలు సేయు సత్త్రియాగంబున వసువై భవదీయ హృదయంబున నితర పదార్థంబులు గోరక మదీయ పాదారవింద సేవఁ గావించితివి. కావునఁ దన్నిమిత్తంబున నేను నీ హృదయంబున వసియించి సమస్తంబునుం గనుగొందు. ఆత్మారాముండ నైన నన్ను నెవ్వ రేని సద సద్వివేకులై యెఱుంగం జాలరు; వారలకు నేను నగోచరుఁడనై యుందు. మత్పరిగ్రహంబు గల నీకు నీ జన్మంబె కాని పునర్భవంబు వొందకుండుటకు భవదీయ పూర్వజన్మ సుకృత విశేషంబు కతన నీ యాశ్రమంబున మత్పదారవింద సందర్శనంబు గలిగె. అదియునుం గాక పద్మకల్పంబునందు మన్నాభి పద్మ మధ్య నిషణ్ణుండైన పద్మసంభవునకు *(జన్మ మరణాది సంసృతి నివర్తకంబు నవిరతానశ్వర సౌఖ్య ప్రవర్తకంబు నగు) మన్మహత్త్వంబు దెలియంజేసి నట్టి దివ్యజ్ఞానంబు నీకు నెఱింగింతు నని యమ్మహనీయ తేజోనిధి యానతిచ్చిన సుధాసమాన సరసాలాపంబులు గర్ణ కలాపంబులై మనస్తాపంబులం బాపిన రోమాంచ కంచుకిత శరీరుండను, నానందబాష్పధారా సిక్త కపోలుండను, పరితోష సాగరాంత ర్నిమగ్న మానసుండను నై యంజలి పుటంబు నిటల తటంబున ఘటియించి యి ట్లంటి. 150

1. హృదయాంభోరుహము ముకుళితేక్షణముల (క. చ. తం.) * తాళపత్ర ప్రతులలో లేదు. మూలమునను లేదు.

క. పురుషోత్తమ ! నీ పద సర, సిరుహ [1]ధ్యానామృ తాభిషేక స్ఫురణన్
గర మొప్పిన నా చిత్త మి, తర వస్తువు లందు వాంఛఁ దగులునె యెందున్.

చ. జననము లేని నీవు భవసంగతి నొందుట కేమి కారణం
బనియును గాల సంహరుఁడవై జగముల్ [2]విలయించు నీవు పా
యని రిపుభీతికై సరిదుదంచిత దుర్గము నాశ్రయించు టె
ట్లనియును దేవ నామనము నందుఁ దలంతు సరోజలోచనా ! 152

వ. అదియునుం గాక, 153

క. శ్రీ రమణీశ్వర ! నీ వా, త్మారాముఁడ వయ్యు లీలఁ దరుణీ కోటిం
గోరి రమించితి వనియును, వారక యేఁ దలఁతు భక్తవత్సల ! కృష్ణా ! 154

క. పరతత్త్వజ్ఞులు [3]గరుణా, కర ! నీలోకావనైక ఘనతఁ దలఁపఁగా
నరసి నన్నుఁ [4]గాచు టెం తది, కరమరుదే దలఁచి చూడఁ గమలాధీశా ! 155

వ. దేవా ? నీ వఖండిత విజ్ఞాన రూపాంతః కరణుండ వయ్యును ముగ్ధ భావంబునం బ్రమత్తుని చందంబున విమోహి వైవడిం బ్రవర్తింపుచు నెందేనియు నొదిగి యుండుట దలంచి నా డెందంబు గుందుచుండు. అరవిందలోచన ! సురవందిత! ముకుంద ! ఇందిరాసుందరీ రమణ !సరస్వతీరమణునకుం గరుణించిన విజ్ఞానంబు ధరియించు శక్తి నాకుం గల దేనిఁ గృపసేయుము. భవదీయ శాసనంబు ధరియించి భూరి సంసార పారావారోత్తరణంబు సేయుదు నని విన్నవించి బహు భంగులం బ్రస్తుతించిన భగవంతుడును,[5]ప్రసన్న పారిజాతంబును నైన కృష్ణుండు పరతత్త్వ నిర్ణయంబు నెఱింగించిన, 156

క. సరసిజలోచన కరుణా, పరిలబ్ధ జ్ఞాన కలిత భావుఁడ నగుటన్
బరతత్త్వవేదినై త, చ్చరణ సరోజముల కెఱఁగి సమ్మతి తోడన్. 157

క. హరిపద జలరుహ విరహా, తుర ఘన దుర్దాంత దుఃఖ తోయధిఁ గడవన్
వెర వేది తిరుగ వలసెను, సరసిజభవ కల్ప విలయ సమయము [6]దాఁకన్. 158

వ. ఇట్లు దిరుగుచు, 159

---

1. ఘనసామృతాభిషేక (హ) 2. వెలయించు నీవు (నా) 3. కరుణా, కరనిను సంసారి వనుచు కఱక దలంపన్ (తం. వా. చ.) 4. గాచుపెల్లను, గడమపదు తలంచిచూడ (తం. వా.) 5. ప్రపన్న పారిజాతుండును (హ) 6. తుదగాన్ (చ. ద. డ.)

మ. నర నారాయణ తాపసాశ్రమ పదౌన్నత్యంబునం బొల్చు భా
సుర మందార రసాల సాల వకుళా శోకామ్ల పున్నాగ కే
సర జంబీర కదంబ నింబ కుట జాశ్వత్థ స్ఫుర న్మల్లికా
కరవీర క్షితి జాభిరామ బదరీ కాంతార సేవారతిన్. 160

క. చనుచున్న వాఁడ నని ప, ల్కిన పలుకుల కులికి కళవళించు విదురుం
డనుపమ శోకార్ణవమున, మునిఁగియు నిజ యోగ సత్వమునఁ దరియించెన్.

వ. ఇట్లు విదురుండు శోకపావకునిం దన వివేక జలంబుల నార్పి యుద్ధవున కిట్లనియె.

మ. అనఘా ? యుద్ధవ! నీకుఁ గృష్ణుఁ డసురేంద్రారాతి మన్నించి [1]చె
ప్పిన యధ్యాత్మ రహస్య తత్త్వ విమలాభిజ్ఞాన సారంబు బో
రన నన్నుం గరుణించి చెప్పినఁ గృతార్థత్వంబునుం బొందెదన్
విను పుణ్యాత్ములు శిష్యసంఘముల నుర్విం బ్రోవరే వెండియున్. 163

క. భగవద్భక్తులు సుజనులు, దగ వెఱిఁగి పరోపకార తాత్పర్య వివే
క గరిష్ఠులై చరింతురు, జగతిం [2]బెంపొంది వృష్ణి సత్తమ యెందున్. 164

క. అనవుడు నుద్ధవుఁ డ వ్విదు, రున కిట్లను నన ఘ మునివరుఁడు సాక్షి ద్వై
ష్ణ నిభుం డగు మైత్రేయుఁడు, దన మనమున మనుజగతి వదలఁ దలఁచి తగన్.

క. హరి మురభేదిఁ బరాపరుఁ, గరుణాకరుఁ దలఁచు నట్టి ఘనుఁ డమ్ముని కుం
జరు కడ కేగిన నాతఁడు, గర మర్థిం దెలుపు సాత్త్విక జ్ఞానంబున్. 166

వ. అని యుద్ధవుండు విదురుం గూడి చని చని, 167

ఉ. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు హల్లక ఫుల్ల పద్మ ని
ష్యంద మరంద పాన విలస న్మద భృంగఁ, జలత్తరంగ, మా
కంద లవంగ లుంగ లతికాచయ సంగ, సురాంగ నాశ్రితా
నందిత పుణ్య సంగ, యమునన్, భవ భంగ, శుభాంగ నిర్మలిన్. 168

క. కని డాయ నేగి మోదం, బునఁ దత్సరి దమల పులిన భూములఁ దగ నా
దినశేషము నివసించెను, వనజోదర పాదపద్మ వశమానసుఁడై. 169

క. మఱునాఁడు రేపకడ భా, సుర పుణ్యుఁడు ఘనుఁడు మధు నిషూదన చరణ
స్మరణ క్రీడా కలితుఁడు, దరియించెన్ [3]గలుష గహనదమునన్ యమునన్. 170

1. చెప్పిన యట్లా పరతత్త్వమార్గ (క) 2. బొగడొంది(తం.వా.) 3. కలుష దహన దమనన్ (హ) కలుష గహన దహనన్ (వా.) శబ్దాలంకారము ననుసరించి 'దమునన్' అనునదే కవి పాఠము. "దమున శ్శబ్దము సాంతము గాన 'దమునసన్' అని యుండఁదగు; అయినను వ్రాఁత ప్రతులందు దమునన్ అనియే కానిపించు చున్నది" (తం. ఫుట్ నోటు)

వ. ఇట్లుద్ధవుండు యమునానది నుత్తరించి బదరికాశ్రమంబునకుం జనియె. అనిన విని రాజేంద్రుండు యోగీంద్రున కిట్లనియె. 171

క. శౌరియు నతిరథ వరులు మ, హారథ సమరథులు యదు బలాధిపు లెల్లన్
పోరి మృతిఁ బొంద నుద్ధవుఁ, డే రీతిన్ బ్రతికె నాకు [1]నెఱిఁగింపు తగన్. 172

సీ. నావుడు రాజేంద్రునకు శుకయోగీంద్రుఁ [2]డిట్లను మును పరమేష్ఠిచేత
సంప్రార్థితుండైన జలరుహనాభుండు వసుమతిపై యదువంశ మందు
నుదయించి తనుఁ దాన మదిలోనఁ జింతించి తెలివొంది యాత్మీయ కుల వినాశ
మొనరించి తాను బంచోపనిషణ్మయ మగు దివ్య దేహంబు నందుఁ జెందఁ

తే. దలఁచి విజ్ఞాన తత్త్వంబు ధరణిమీఁద, దాల్చి జనకోటి కెఱిఁగింపఁ దగిన ధీరుఁ
డుద్ధవుఁడు దక్క నితరు లే నోప రితఁడు, నిర్జితేంద్రియుఁ డాత్మసన్నిభుఁ డటంచు.

క. క్షితిపై నిలిపిన కతమున, నతనికి మృతి దొరక దయ్యె నవనీశ ! రమా
పతి యభిమానము గల్గిన, యతిపుణ్యుఁడు చనియె బదరికాశ్రమమునకున్. 174

వ. అంత, 175

క. ఉద్ధవుఁ డరిగినఁ బిదప స, మిద్ధ పరిజ్ఞాను సుజనహితు మైత్రేయున్
వృద్ధజన సేవ్యుఁ దాపస వృద్ధశ్రవుఁ జూడఁగోరి విదురుఁడు గణఁకన్. 176

వ. యమునా నది దాఁటి కతిపయ ప్రయాణంబులఁ బుణ్యనదులు హరిక్షేత్రంబులు దర్శింపుచు నతి త్వరిత గమనంబున. 177

క. చనిచని ముందటఁ గనుఁగొనె, ఘనపాత తమః పతంగఁ గరుణాపాంగన్
గనదుత్తుంగ తరంగన్, జనవరనుత బహుళపుణ్య సంగన్ గంగన్. 178

క. అందు నరవింద సౌరభ, నందిత పవమాన ధూత నట దూర్మి తరి
స్పందిత కందళశీకర, సందోహ లసత్ప్రవాహ జల మజ్జనుఁడై. 179

సీ. ఘనసార రుచి వాలుకా సముదంచిత సైకత వేదికా స్థలము నందు
యమ నియమాది యోగాంగ క్రియా నిష్ఠఁ బూని పద్మాసనాసీనుఁ డగుచు
హరిపాద సరసీరుహ న్యస్త చిత్తుఁడై బాహ్యేంద్రియ వ్యాప్తిఁ బాఱఁ దోలి
సకల విద్వజ్జన స్తవనీయ సముచితాచార వ్రతోపవాసములఁ గ్రుస్సి

తే. యున్న పుణ్యాత్ము విగతవయోవికారు, వినుతసంచారు భువనపావనవిహారు
యోగిజనగేయు సత్తతి భాగధేయు, నాశ్రితవిధేయు మైత్రేయు నపుడు గాంచె.

1. ఎఱిగింపు శుకా (క. బ.) 2. డిట్లను మున్ను లోకేశుచేత (తం. వా.)

## అధ్యాయము — ౫

### —: విదుర మైత్రేయ సంవాదము :—

వ. ఇట్లు గనుంగొని యమ్మునీంద్రుని పాదంబులకుం బ్రణమిల్లి ముకుళిత హస్తుండై యిట్లనియె. మునీంద్రా! లోకంబున సకలజనంబులు మనంబులు ఘనంబు లగు సౌఖ్యంబు లందం దలంచి తత్ఫల ప్రాప్తి హేతువు లైన కర్మంబు లాచరించి దైవోపహతులై తత్కర్మంబులచేత నిష్ఫలారంభు లగుదురు. కర్మంబులు బంధకరంబులు, దుఃఖహేతువులుంగాని సౌఖ్యదాయకంబులై [1]పాపనిష్కృతిఁ జేయ నోపవు. అది యట్లుండె. భూరి దుఃఖానుసారం బైన సంసార చక్రంబునం బరిభ్రమింపుచుం గామ విమోహితులై పూర్వ కర్మానుగతంబులైన శరీరంబులు దాల్చుచుఁ జచ్చుచు మరలం బుట్టుచు నెంతకాలంబునకుం [2]బాపనిష్కృతిఁ గానక మాతృ యౌవన వన కుఠారులై జనియించి వర్తించు మూఢాత్మలం బశుప్రాయుల రక్షించుకొఱకుఁ గాదె నారాయణ పరాయణు లైన మీ వంటి పుణ్యాత్ములు లోకంబునం జరియించుట. అదియునుం గాక, 181

మ. అవివేకానుగత స్వకార్య జల[3]పూరా కీర్ణమై మిత్ర బం
ధు వధూ పుత్ర జల గ్రహోగ్రయుతమై [4]దుర్దాంత మై నట్టి దు
ర్భవ పాథోధిఁ దరించు వారె హరి సంబంధ క్రియా లోల భా
గవతానుగ్రహ నావ లేని యధముల్ [5]కల్యాణ సంధాయకా! 182

క. మునినాథచంద్ర! ననుఁ గై, కొని కాచు తలంపు బుద్ధిఁ [6]గూడిన యేనిన్
వినుము మ దీప్సిత మది నా, చనవునఁ గావింపు మయ్య సజ్జన తిలకా! 183

వ. అని వెండియు విదురుండు మైత్రేయుం జూచి మునీంద్రా! [7]త్రిగుణాత్మక మాయా నియంత యగు భగవంతుండు స్వతంత్రుం డగుచు నవతరించి యె య్యే యవతారంబు లందు నె య్యే కర్మంబు లాచరించె? *(నిష్క్రియుండగు నీశుండు) [8]మొదలఁ బ్రపంచంబు నే విధంబునం గల్పించె? ఏపగిదిం దీనిం బాలించె? *(మఱియు నీ విశ్వంబు) నాత్మీయ హృదయాకాశ గతముం జేసి నివృత్తవృత్తి యగుచు యోగమాయ యందు నెట్లు వసియించె? బ్రహ్మాండంబు నందు నే లీల వర్తించె? అందు బ్రహ్మాది రూపంబులం బొంది బహు ప్రకారంబుల

1. పాపనివృత్తి (హ) 2. పాప నిర్ముక్తి (హ) 3. వేలాకీర్ణమై (హ.తం.వా.) 4. దుర్దాంత సంసార (హ) 5. కారుణ్య (హ.తం.వా.) 6. గొనకొనినఁ దగన్ (హ) 7. త్రిపురుషాధీశ్వరుండైన (ద.ద.) 8. సృష్టిపూర్వంబున.

నెట్లు గ్రీడించె? భూసుర గో సురాదులఁ [1]బరిరక్షించుటకై మత్స్యాద్యవతారం
బులు ధరియించి యె య్యే ప్రయోజనంబులం దీర్చె? పయోరుహగర్భాండ
కటాహాంతర్గతంబులై *(లోకపాల సహితంబు లైన) లోకంబుల లోకాలోక
పర్యంతంబుల బహిర్భాగంబుల నెయ్యే తత్త్వభేదంబుల నే తెఱంగునం బుట్టించె?
అందుఁ బ్రతీతం బగు జీవకోటి యెవ్వనిం గొల్చి బ్రతుకు? జనులకుం గర్మ
నామ రూప భేదంబు లెట్లు నిర్దేశించె? ఇంతయు సవిస్తరంబుగా వివరింపుము.
ఉత్తమశ్లోక మౌళిమండనుండు యోగీశ్వరేశ్వరుండు నైన పుండరీకాక్షుని
చరిత్ర శ్రవణంబునం గాని జన్మ మరణాది సకల దుఃఖాకరంబులు, దుష్కర్మ
ప్రాప్తంబులు నగు భవ బంధంబులు దెగ వని వెండియు నిట్లనియె. 184

తరల. సతతముఁ సరసీరుహోదర సత్కథామృత పూరముఁ
శ్రుతి పుటాంజలి చేత నిమ్మల జుఱ్ఱియుం దనివోదు భా
రత కథామిష మూని విష్ణుఁ బరాశర ప్రియ సూతి స
న్మతి నుతించిన చోట సన్మునినాథ! నా మది నుబ్బుదున్. 185

క. ఇతర కథా [2]కర్ణనముల, నతిహేయత [3]నొందెఁ జిత్త మనఘాత్మ! రమా
పతి చరితామృత రతి సం, స్మృతి వేదన లెల్లఁ బాయఁ జేయు మునీంద్రా! 186

తే. భూరి విజ్ఞాన విదులగు నారదాది, నిర్మలాత్ముల కైన వర్ణింపరాని
హరికథామృతపానంబునందు విసివి,యొల్ల సను వాఁడె పో వెఱ్ఱిగొల్లఁడనఘ!

వ. అదియునుం గాక, 188

సీ. అరవిందనాభుని యపరావతారమై జనన మొందిన పరాశరసుతుండు
[4]మహినొప్పు వర్ణాశ్రమాచార ధర్మముల్ తవణింప లోక విడంబనములు
నగు గ్రామ్య కథలు పెక్కర్థిఁ గల్పించుచు హరికథా వర్ణన మందులోన
నించుకించుక గాని యేర్పడఁ జెప్పమి నంచిత విజ్ఞాన మాత్మ నిలువ

తే. కున్నఁ జింతించి మఱి నారదోపదిష్టుఁ, డగుచు హరివర్ణనామృత మాత్మఁగ్రోలి
విమల సుజ్ఞాననిధి యన వినుతికెక్కి, ధన్యుఁడయ్యెను లోకైక మాన్యుఁడగుచు.

వ. కావున, 190

క. సరసిరుహోదరు మంగళ, చరితామృత మాత్మఁ గ్రోలు జనుఁ డితర కథా
గరళము గ్రోలునె? హరి సం, స్మరణము జీవులకు నఖిల సౌఖ్యద మనఘా! 191

1. క్షేమంబుకొఱకై (హ) 2. వర్ణనముల (హ) 3. నొందు (జ. డ.) 4. చతుర వర్ణాశ్రమాచార (క. తం. వా.)

క. శ్రీ వనితాధిప నామక, థా విముఖుల కిహము పరము దవ్వే పిదపం
బోవుదురు నరకమునకున్, వావిరి నే వారిఁ జూచి వగతు మునీంద్రా! 192

క. ఏ నరుఁ డే నొక నిమిషం, బైన వృథావాద గతిని హరిపదకమల
ధ్యానానందుఁడు గాఁడే, నా నరునకు నాయు వల్ప మగు మునినాథా! 193

చ. మృదుగతి పువ్వుఁ దేనియ రమింపుచుఁ బానము సేయఁ బాఱు ష
ట్పదమును బోలి యార్తజన బాంధవు విశ్వభవ స్థితి వ్యయా
స్పద మహితావతారుఁ డగు పంకరుహోదరు నిత్యమంగళ
ప్రద గుణకీర్తనామృతముఁ బాయక గ్రోలెదఁ జెప్పవే దయన్. 194

క. అని విదురుఁడు మైత్రేయుం, డను మునినాయకుని నడిగెనని వేదవ్యా
సుని తనయుం డభిమన్యుని, తనయునికిం జెప్పి మఱియుఁ దగ నిట్లనియెన్.

వ. ఇట్లు విదురుండు మైత్రేయు నడిగిన నతం డతనిం గని యతి మృదు మధుర వచన రచనుండై యిట్లనియె. అనఘా! కృష్ణకథా శ్రవణ తత్పరుండవై నీవు న న్నడిగితివి గావున భద్రం బయ్యె. నీవు భగవద్భక్తుండవు గావున హరికథా సక్తుండ వగుట చిత్రంబుగాదు. అదియునుంగాక మాండవ్యుని శాపంబున సాత్యవతేయు వలన *(భ్రాతృక్షేత్రంబున) శూద్రయోనిం బుట్టి నట్టి ప్రజా సంయమనుండ వగు యముండవు, పరమజ్ఞాన సంపన్నుండవు. నారాయణునకుం బ్రియతముండవు. కావునఁ గృష్ణుఁడు నిర్యాణ కాలంబునం దన సన్నిధికిం జనిన నన్ను డాయం జీరి విజ్ఞానం బెల్ల నుపదేశించి నీకు నెఱింగింపు మని యాన తిచ్చుటం జేసి యవశ్యంబు నీకు నెఱింగింతు. దత్తావధానుండవై వినుము. 196

క. [1]వనజాక్ష యోగమాయా, జనితం బగు విశ్వ జనన సంస్థాన వినా
శనముల తెఱఁ గెఱిఁగింపుచు, ననఘా! విష్ణుని మహత్త్వ మభివర్ణింతున్. 197

సీ. సకల జీవుల కెల్లఁ బ్రకట దేహము నాత్మనాథుండు పరుఁడు నానావిధైక
మత్యుపలక్షణ మహితుండు నగు భగవంతుండు సృష్టిపూర్వంబు నందు
నాత్మీయ మాయా లయంబు నొందిన విశ్వ గర్భుఁడై తాన యెక్కటి వెలుంగు
పరమాత్ముఁ డభవుం డుపద్రష్ట యయ్యు [2]వస్త్వంతర పరిశూన్యుఁ డగుటఁ జేసి

తే. ద్రష్ట గాకుండు మాయా ప్రధానశక్తి, నతుల చిచ్ఛక్తి గలవాఁడు నగుచుఁ దన్ను
లేని వానిఁగఁ జిత్తంబులోనఁ దలఁచి, ద్రష్టయగుఁ దన భువన నిర్మాణ వాంఛ.

1. వనజాక్షు (చ. ట. త. జ. డ.) 2. మన్వంతర (హ)

తే. బుద్ధిఁ దోఁచిన నమ్మహాపురుష వరుఁడు, గార్య కారణ రూపమై ఘనత కెక్కి
భూరి మాయాభిధాన విస్ఫురిత శక్తి, వినుతి కెక్కిన యట్టి యవిద్య యందు. 199

క. పురుషాకృతి నాత్మాంశ, స్ఫురణన్ గల శక్తి నిలిపి పురుషోత్తముఁ డీ
శ్వరుఁ డభవుం డజుఁడు నిజో, దర సంస్థిత విశ్వ మపుడు దగఁ బుట్టించెన్. 200

సీ. ధృతిఁబూని కాలచోదితము నవ్యక్తంబు ప్రకృతియు నను పేళ్ళఁ బరఁగు మాయ
వలన మహత్తత్త్వ మెలమిఁ బుట్టించె మాయాంశకాలాది గుణాత్మకంబు
నైన మహత్తత్త్వ మచ్యుత దృగ్గోచర మగుచు విశ్వనిర్మాణ వాంఛ
నందుటఁ జేసి రూపాంతరంబును బొంది నట్టి మహత్తత్త్వమందు నోలిఁ

తే. గార్య కారణ [1]కర్త్రాత్మకత్వమైన, [2]మహిత భూతేంద్రియక మనోమయ మనంగఁ
దగు నహంకారతత్త్వ ముత్పన్నమయ్యెఁ, గోరి సత్త్వరజస్తమోగుణకమగుచు.

వ. వెండియు రూపాంతరంబులం బొందుచున్న సాత్త్వికాహంకారంబు వలన మనం
బును వైకారిక కార్యభూతంబులైన దేవతాగణంబులును సంభవించె. ఇంద్రియా
ధిష్ఠాతలైన వానివలన శబ్దంబు పూర్వంబునఁ బ్రకాశం బగుటంజేసి, జ్ఞానేంద్రి
యంబులైన త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబులును, కర్మేంద్రియంబులైన
వాక్పాణి పాద పాయూపస్థములును, తైజసాహంకారంబున నుత్పన్నంబయ్యె.
తామసాహంకారంబు వలన శబ్ద స్పర్శ రూప రస గంధంబు లుదయించె. అందు
శబ్దంబు నిజగుణంబైన శబ్దంబువలన నాకాశంబుఁ బుట్టించె. గగనంబు కాల
మాయాంశ యోగంబునం బుండరీకాక్షు నిరీక్షణంబున స్పర్శ తన్మాత్రంబు వలన
వాయువుం గలిగించె. పవనుండు నభోబలంబున రూపతన్మాత్రంబు వలన లోక
లోచనం బైన తేజంబు నుత్పాదించె. తేజంబు కాలమాయాంశ యోగంబున
నుత్తమ శ్లోకుని విలోకనంబునఁ బవమాన యుక్తం బగుచు రసతన్మాత్రంబు
వలన నంబువులఁ గలిగించె. సలిలంబు కాలమాయాంశ యోగంబునం బరమేశ్వ
రానుగ్రహంబుఁ గలిగి తేజోయుక్తంబై గంధ గుణంబు వలనఁ బృథివిఁ
గలిగించె. అందు గగనంబునకు శబ్దంబును, వాయువునకు శబ్ద స్పర్శంబులును,
దేజంబునకు శబ్దస్పర్శ రూపంబులును,సలిలంబునకు శబ్దస్పర్శరూపరసంబులును
పృథివికి శబ్ద స్పర్శ రూప రస గంధంబులును గుణంబులై యుండు. కాల
మాయాంశ లింగంబులం గలిగి మహదాద్యభిమానంబుల నొందిన దేవతలు విష్ణు
కళాకలితు లగుదురు. అట్టి మహదాది తత్త్వంబు లైక్యంబు చాలమిం బ్రపంచం

1. కర్తృత్వకల్పమైన (చ) 2. అలఘు భూతేంద్రియ మనోమయ మనంగ (చ)

బులు గల్పింప సమర్థంబులు గాక కృతాంజలులై యోగీశ్వ రేశ్వరుండైన నారాయణు నిట్లని స్తుతియించె. 202

దండకము. శ్రీనాథ నాథా! జగన్నాథ! నమ్రైకరక్ష విపక్ష! క్షమా భృత్సహస్రాక్ష! నీరేజ పత్రేక్షణా! దేవదేవా! భవద్దాస [1]వర్గానుతాపంబులం బాపఁగా నోపు దివ్యాతపత్రంబు నాఁ బొల్చు యుష్మత్పదాంభోజ మూలంబు పుణ్యాల వాలంబుగాఁ బొంది యోగీంద్రు లుద్దామ సంసార తాపంబులం [2]బాయఁగా మీఁటి వర్తింతు రో తండ్రి యీశా! సమస్తాఘ నిర్ణాశ! యీ విశ్వమం దెల్ల జీవుల్ భవోదగ్ర దుర్వార తాపత్రయాఖిల దావాగ్ని చేఁ గ్రాఁగి దుఃఖాబ్ధిలోఁ దోఁగి యే కర్మముల్ ధర్మముం బొందఁగాలేక సంసారచక్రంబు నందున్ బరిభ్రామ్యమాణాత్ములై యుందు ర మ్మూఢ చేతస్కులం జెప్పఁగా నేల? ఓ దేవ! విజ్ఞాన దీపాంకురంబైన మీ పాద పంకేరుహ చ్ఛాయఁ [3]బ్రాపింతు మజ్ఞాక్ష సన్మౌని సంఘంబు లై కాంతిక స్వాంతతం బేర్చి దుర్దాంత పాపౌఘ నిర్ణాశకాంబు ప్రవా హోత్థ గంగా నివాసంబు నా నొప్పు మీ పాద యుగ్మంబు, యుష్మ న్ముఖాంభోజ నీ డోద్గతం బైన వేదాండజ శ్రేణిచేతం గవేషించి సంప్రాప్తులై యుందు రో నాథ! వైరాగ్య శక్తిస్ఫుట జ్ఞాన బోధాత్ములై నట్టి ధీరో త్తముల్ నిత్య నైర్మల్య భవ్యాంతరంగంబులం దే పరంజ్యోతి పాదాబ్జ పీఠంబు గీలించి కైవల్య సంప్రాప్తులై రట్టి నిర్వాణమూర్తిం బ్రశంసింతు మింద్రాది వంద్యా!ముకుందా!సమస్తంబు గల్పింపఁబాలింపఁదూలింపఁగా బెక్కు దివ్యావతారంబులం బొందు నీ పాద పంకేరుహ ధ్యాన పారీణ సుస్వాంతులై యొప్పు భక్తాళికి న్మోక్షదం బైన మీ పాద కంజాతముల్ గొల్తు మీశా! రమాధీశ! పుత్రాంగనా మిత్ర సంబంధ బంధంబులం జెంది [4]నిత్యంబు దుష్టక్రియా లోలురై దేహ గేహంబులం దోలి వర్తించు దుర్మానవ శ్రేణులం దంతరాత్ముండవై యుండియుం దూరమై తోఁచు మీ పాద పద్మంబు లర్చింతు మో దేవ!బాహ్యేంద్రియ వ్యాప్తినుద్వృత్తులై నట్టి మూఢాత్మ లధ్యాత్మ తత్త్వ ప్రభావాఢ్యులై మీ పదాబ్జాత విన్యాస లక్ష్మీ కళావాసముం గన్న య య్యుత్తమ శ్లోకులం గానఁగా జాల ర ప్పుణ్యు లాదుష్టులం జూడఁగా నొల్ల రంభోధి రాట్కన్యకా కాంత!

1. వర్గోప తాపంబులన్ (క.డ.బ.) 2. బోవఁగా (క.బ.) 3. బ్రాపింతు రజ్ఞాక్ష (క.చ.టద.బ.); ప్రాపించు మజ్ఞాక్ష (హ) 4. సోహం మమేతి క్రియాలాపులై (క. బ.)

వేదాంత శుద్ధాంత సిద్ధాంత మై యొప్పు మీ సత్కథాపార చంచత్సుధా సార పూరంబులం గ్రోలి సౌఖ్యోన్నతిం సోలి ధీయుక్తులై క్రాలి తాపంబులం దోలి మోదంబులం దేలి సంపన్నులై మన్న[1]నిత్య ప్రపన్నుల్ మహోత్కంఠతం బేర్చి వైకుంఠధామంబు నల్పక్రియా లోలురై కొంత రద్దివ్య వాసైక సంప్రాప్తికిం గోరుచున్నార మో దేవ! వైరాగ్య విజ్ఞాన బోధాత్మ యోగక్రియారూఢి సంతర్బహిర్వ్యాప్తిఁ జాలించి శుద్ధాంత రంగంబు గావించి హృత్పద్మవాసుండవై [2]చిన్మయాకారమై యున్న నీ యున్నతానంత తేజో విలాసోల్ల సన్మూర్తిఁ జిత్తంబులం జేర్చి యానంద లోలాత్మతం బొల్చు యోగీశ్వర శ్రేణికిం దావకీనానుకంపాను లబ్ధ స్ఫుట జ్ఞానముం గల్గుటం జేసి [3]యాయాసముం జెందదో దేవతాచక్ర వర్తీ! సదానందమూర్తీ! జగద్గీత కీర్తీ! లసద్భూతవర్తీ! భవద్దాసులై నట్టి మమ్ముం జగత్కల్పనాసక్త చిత్తుండ వై నీవు త్రైగుణ్య విస్ఫూర్తిఁ బుట్టించినం బుట్టుటే కాక నీ భవ్య లీలానుమేయంబుగా సృష్టి నిర్మాణముం జేయ నే [4]మెంత వారౌదు మీ శక్తి యుక్తిన్ భవత్పూజఁ గావింతు మట్లుండె నీ [5]సత్కళాజాతులై నట్టి మమ్మెన్నఁగా నేల సధ్యాత్మతత్త్వంబవన్నం బరంజ్యోతి వన్నం బ్రపంచంబవన్న న్నధిష్ఠాత వన్నం సదాసాక్షి వన్నన్ గుణాతీత! నీవే కదా పద్మపత్రాక్ష! సత్త్వాది త్రైగుణ్య మూలంబు నా నొప్పు మాయా గుణంబందు నుద్య[6]న్మహత్తత్త్వమై నట్టి నీ వీర్యముం బెట్టుటంజేసి నీ వింతకుం గారణం బౌదు వాయాయి కాలంబులన్ నీకు సౌఖ్యంబు లే మెట్లు గావింతు మే రీతి సన్నంబు భక్షింతు మెబ్భంగి వర్తింతు మే నిల్కడ న్నుందు మే జీవ లోకంబె యాధారమై యుండి భోగంబులం బొందు[7]చున్నన్న యిక్కార్య సంధానులై నట్టి మాకుం జగత్కల్ప[8]నాసక్తికిం దేవ నీ శక్తి దోడ్పాటు గావించి విజ్ఞానముం జూపి గారుణ్య సంధాయివై మమ్ము రక్షింపు లక్ష్మీ మనః పల్వలక్రోడ! యోగీంద్ర చేత స్సరో హంస! దేవాది దేవా! నమస్తే! నమస్తే! నమస్తే! నమః. 203

1. నిత్యప్రసన్నుల్ (క.చ.త.జ.డ.బ.) 2. చిన్మయాకారత న్నున్న (తం) 3. యాయా ...లన్ లేదయో దేవతా (తం); యాయానముం జెందరో (హ) 4. మెంత వారమ్ము మచ్ఛక్తి ...బ. హ.) 5. జాతులమ్మైన (క. బ. హ.) 6. మహాతత్త్వ (తం. వా.) 7. చున్నన్న మేరీతి ...ంచు నిష్కార్య సంధానులై నట్టి (తం.) 8. శక్తికిన్ (హ. తం. వా.)

అధ్యాయము — ౬

సీ. అనినఁ బ్రసన్నుఁడై హరి మహదాదుల కన్యోన్య మిత్రత్వ మంద కున్న
కతమున నిఖిల జగత్కల్పనా శక్తి వొడమ కుండుట దన బుద్ధి నెఱిఁగి
కై కొని కాలవేగమున నుద్రేకంబు నొందిన [1]ప్రకృతితోఁ [2]బొంది నిజ బ
లము నిల్పి తా నురుక్రముఁ డన సప్త వింశతి తత్త్వముల యందు సమత నొక్క
తే. పరి ప్రవేశించి యాతత్త్వ భవ్యగుణము, నందుఁ జేష్టాను రూపంబు లలరఁ జెంది
*యొకటి నొక్కటి గలయకయుండి విశ్వరచన మెఱుఁగని యా తత్త్వనిచ
యమునకు. 204

వ. ఇట్లు విశ్వ నిర్మాణ నిపుణత్వంబు నెఱుంగఁ జూపుచు నన్నింటికి నన్యోన్యతం గల్పించి, తన యనుగ్రహంబునం బ్రేరితం బై కానంబడి క్రియాసామర్థ్యంబునఁ జెన్నొందిన తత్త్వ వితానంబు దేవ ప్రేరితం బై స్వకీయంబులగు నంశంబుల చేతం బుట్టించిన విరాడ్విగ్రహం బై (తత్త్వ వితతి) దమ యందుఁ జెందిన పుండరీకాక్షుని కళాంశంబున నొకటి కొకటికి నైక్యంబు వాటిల్లి పరిణతంబై రూపాంతరంబును జెందె. ఏ తత్త్వంబున నేనియుఁ జరాచరలోక పుంజంబులు నిండియుండు నా హిరణ్మయం బైన విరాడ్విగ్రహంబు నొందిన పురుషుండు సర్వజీవ సమేతుండై యుండె నంత. 205

క. జలములలోపల [3]నిమ్మల, [4]జలరుహ జాతాండ మందు సాహస్రాబ్దం
బులు నిలిచెఁ గార్యరూపా, [5]కలితం బగు న వ్విరాట్పుగర్భము వరుసన్. 207

తే. దైవకర్మాత్మశక్తి వితానములను, దగిలి తనచేతఁ [6]దను దాన దైవశక్తి
యగుచు వెలుఁగొందుచుం బ్రకారాంతరమునఁ, దనువు వితతంబుగాని చైతన్య
మొంది. 208

తే. రూపసంసక్తిఁ జేసి నిరూఢకర్మ, [7]శక్తియును వృత్తిభేద సంసక్తి దశ వి
ధములు గలిగిన ప్రాణరూపమును నాత్మ,శక్తి [8]భోక్తృత్వమగుచున్న శక్తిగలిగి.

క. త్రివిధం బగుచును నాధ్యాత్మ్య విభేదంబులను బాపి [9]మఱి యధిభూతా
త్మవిరాడ్రూపం బగునిది, వివిధ ప్రాణులకు నాత్మ [10]విధమై మఱియున్. 209

1. ప్రకృతిలో (చ. ట. డ. బ.) 2. నోలిబొంద, నిజయోగ బలమున నిలిపియు సప్తవింశతి తత్త్వములయందు సమత నొక్క (ట); "త్రయో వింశతి తత్త్వానాం గణం యుగప దావిశత్" అని మూలము (6-2) *ఒకటి నొకటిని (తం. వా.) 3. నిర్మల (క. ట. డ.) 4. జలరుహ జాతాండ ఘటము సాహస్రాబ్దంబులు (త. జ. డ. ద. బ.) 5. కలితంబై య వ్విరాజ (చ. ట. త. జ. డ.) 6. దా నేకదైవశక్తి (హ) 7. శక్తి యగుచుఁ గ్రియాదు రాసక్తి (తం) 8. బోధకర్త (హ. వా.) 9. మరియును బొలుపొందు విరాడ్రూపంబగు (క.చ.ట.త.గ.జ.ద.బ.) 10. వివిధరూపంబై (క.చ.ట.బ.)

క. జీవంబై పరమాత్మకుఁ, దావలమై యాదిమావతారం బగు న
ద్దేవుని గర్భంబున భూ,తావలి తోడం బ్రపంచ మర్థిం దోఁచెన్. 210

వ. ఇట్లు దోఁచిన విరాట్పురుషం డాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబు లను భేదంబులచేఁ బూర్వోక్త క్రమంబున వెలుఁగొందు ననుచు విదురునకు మైత్రేయుం డెఱింగించె. అని చెప్పి వెండియు ని ట్లనియె, 211

చ. హరి పరమాత్ముఁ డీశుఁ డజుఁ [1]డాఢ్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా
గరతనయా హృదీశుఁడు వికార విదూరుఁడు నిత్యమంగళా
కరుఁడు గృపాపయోనిధి యకల్మష చిత్తుఁడు సర్వశక్తి దా
మరస విలోచనుండు బుధమాన్య చరిత్ర పవిత్రుఁ డిమ్ములన్. 212

వ. ఇ త్తెఱంగున నీశుం డగు నధోక్షజుండు [2]మహ దాది తత్త్వంబుల మనంబుల ఘనంబు లగు తలంపులు దా నెఱింగి, యట్టి తత్త్వంబుల వివిధవృత్తి లాభము నకై స్వకీయ చిచ్ఛక్తిచే నిట్టు లొనర్తునని చింతించి, నిజకళా కలితం బగు విరాడ్విగ్రహంబు నందు నగ్నిప్రముఖం బగు [3]దేవతావళి కెల్ల నివాసం బగుచుఁ గానంబడిన వైరాజపురుషుని [4]యాస్యాద్యవయవంబుల వినిపింతు. దత్తావధా నుండవై వినుము, 213

సీ. సరనుత యా దివ్య పురుషోత్తముని పృథగ్భావంబు నొంది ముఖంబు వలన
భువన పాలకుఁ డైన పవమాన సఖుఁ డంత రాత్ముఁ డీశ్వరు నంశ మైన [5]వాణి
కనయంబు ననుకూల మగుచు నిజస్థానమునఁ బ్రవేశించిన ముఖము నందుఁ
బరఁగు జీవుండు శబ్దము నుచ్చరించుఁ బృథగ్భావము లగు నేత్రముల నినుఁడు

తే. చక్షురింద్రియ యుక్తుఁడై సరవిఁ జెంద, రూప విజ్ఞాన మహిమ నిరూఢి నొందు
మఱియుఁ జర్మములను బవమానుఁడీశ్వ,రాంశమైన త్వగింద్రియమందుఁ గూడి.

వ. నిజ నివాసంబు నాశ్రయించిన జీవుండు స్పర్శేంద్రియ గతుండగు. పృథగ్భావం బైన శ్రోత్రంబుల దిక్కు లచ్యుత కళాంశంబు లగు. శ్రవణేంద్రియ యుక్తంబులై నిజస్థానంబుల బొందిన జీవుండు శబ్ద జ్ఞాన గతుం డగు. మఱియుఁ దాలువు నిర్భిన్నంబైన లోకపాలుం డగు వరుణుం డందుఁ బ్రవేశించి రసనేంద్రియంబుచేఁ బ్రకాశించినం బ్రాణి రసంబులం గ్రహించె. పరమేశ్వరుని నాసికేంద్రియంబు పృథగ్భావంబు నొంది యాశ్వినేయాధిష్ఠానంబై ఘ్రాణాంశంబు నొందిన జంతువు

1. దాఢ్యుడు (తి.జ.చ.చ.బ.) 2. మహదాది భూతంబుల (చ.త.జ.బ.) 3. భూతావళి కెల్ల (క.చ.బ.) 4. యవతారంబు (క) 5. వాని (హ. లం. వా.)

గంధగ్రహణ సమర్థంబయ్యె. వెండియు భిన్నం బైన చర్మంబున నోషధులు పరమ పురుషాంశంబు లైన కేశంబులం గూడి నిజ నివాసంబు నొందిన జీవుండు కండూయమానుం డగు. భిన్న భూతం బైన మేఢ్రంబునం బ్రజాపతి రేతంబున నిజస్థానంబు నొందిన జీవుం డానందంబునుం బొందు. భిన్న భావం బైన గుదంబున మిత్రుఁ డచ్యుతాంశంబును బొంది పాయువుం గూడి నిజాధిష్ఠానంబు నొందిన జీవుండు విసర్గంబుఁ జెందు. వేఱు వేఱై న బాహువులం ద్రిదశాధీశ్వరుం డై న పురందరుండు క్రయ విక్రయాది శక్తియుక్తుఁ డగుచు నిజస్థానంబు నొందిన జీవుండు వానిచేత జీవికం బొందు. మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబు లై న విష్ణుండు స్వావాసంబుఁ గై కొని గతి శక్తిం బొందిన జీవుండు గమనాగమనార్హుం డయ్యె. వెండియు భిన్న భావం బైన హృదయంబు మనంబు తోడం గలసి నిజాధిష్ఠానంబునం జంద్రుండు ప్రవేశించిన జీవుండును శరీర సంకల్పాది రూపం బగు వికారంబునుం బొందు. భిన్న భావం బై న యహంకారంబున నహంకృతి యుక్తుం డై రుద్రుండు నిజస్థానంబుగా వసియించు.ఆ యహంకృతిచే శరీరి కర్తవ్యంబులు నడపు.బుద్ధి వాగీశ్వరావాసంబై హృదయంబు తోడం గలిసి నిజాధిష్ఠానంబున బోధాంశంబుచే వెలింగిన శరీరి బోద్ధవ్యతం బొందు. భిన్నం బైన చిత్తంబు బ్రహ్మావాసంబై చేతనాంశంబు నొందినఁ బ్రాణి విజ్ఞానంబునుం బొందు. ఆ విరాట్పురుషుని శీర్షంబున స్వర్గంబును, చరణంబుల వసుమతియును, నాభియందు గగనంబునుం గలిగె. సత్త్వాది గుణ పరిణామంబుల నమరు లై రి. ఊర్జిత సత్త్వగుణంబున న దేవతలు ద్రిదివంబునుం బొందిరి. రజోగుణంబున మనుజులును గవాదులును ధరణిం బొందిరి. తామసంబున భూతాదులై న రుద్రపార్షదులు ద్యావా పృథివ్యంతరం బగు వియత్తలంబునుం బొందిరి. ముఖంబు వలన నామ్నాయంబు లుత్పన్నంబు లయ్యె వెండియు. 215

క. ధరణీ దివిజులు [1]శ్రుతులును, నరవర య మ్మేటి ముఖమునం బొడముట భూ
మురుఁ డఖిల వర్ణములకుఁ, గురుఁడు న్ముఖ్యుండు నయ్యె గుణరత్ననిధీ! 216

క. ధర బ్రాహ్మణాదికము ద, స్కర బాధం బొందకుండఁ గై కొని కావన్
బురుషోత్తము బాహువులఁ, నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ! 217

క. గణుతింపఁగఁ గృషి గో ర, క్షణ వాణిజ్యాది కర్మ కలితంబుగ నా
గుణనిధి యూరువు లందుం, బ్రణుతింపఁగ వైశ్యజాతి ప్రభవం బయ్యెఁ. 218

1. ధరణి దురాగ్రహులగు (క.చ.బ.)

తే. తివిరి సేవక ధర్ములై దేవదేవు, పదములను శూద్ర సంతతు లుదయ మైరి
వీర లందఱు దమ తమ విహితకర్మ,మలరఁ జేయుచు జనకుండు నాత్మగురుఁడు.

క. అగు సర్వేశు [1]పరాపరు, జగదేక ప్రభుని పాద జలజాతంబుల్
దగిలి భజింతురు సతతము, నిగమోక్తిన్ భక్తియోగ నిపుణాత్మకులై. 220

తే. మహిమ దీపింపఁ గాల కర్మ స్వభావ,శక్తి సంయుక్తుఁ డగు పరమేశ్వరుని భూరి
యోగమాయా విజృంభణోద్యోగ మెవ్వఁ,డెఱిఁగి నుతియింపఁగానోపు నిద్ధచరిత!

ఉ. [2]అన్య కథానులాపము లహర్నిశముఁ బఠియించి చాల మా
లిన్యము నాత్మశోభనవిలీనత నొందు మదీయ జిహ్వ సౌ
జన్యము [3]నొందె నేఁడు హరిసద్గుణ దివ్య కథామృతంబు స
న్మాన్య చరిత్రమై నెగడు మద్గురు వాక్యపదంబుఁ జెందఁగన్. 222

మ. హరి నామాంకిత సత్కథామృత రసవ్యాలోలుఁ డై నట్టి స
త్పురుష శ్రేష్ఠుఁ డసత్కథా లవణవాః పూరంబు దాఁ గ్రోలునే?
వరమందార మరందపాన కుతుకస్వాంత ద్విరేఫంబు [4]స
త్వరమై పోవునె [5]చేఁతి వేములకుఁ దద్గంధాను మోదాత్మమై. 223

క. హరి మహిమము ద న్నాభీ, సరసిజ సంజాతుఁ డైన చతురాననుఁడున్
బరికించి యెఱుఁగ దనిన ని, తర మనుజులఁ జెప్ప నేల తత్త్వజ్ఞనిధీ! 224

తే. శ్రుతులు దమలోన వివరించి చూచి పుండ, రీక లోచను నుత్తమశ్లోక చరితు
నమరగణవంద్యమాన పాదాబ్జ యుగళు,వెదకి కనుఁగొనలే వండ్రు విమలమతులు.

క. *హరియున్ దన మాయాగతిఁ, బరికించియుఁ గానఁ డయ్యెఁ బరిమితి లేమిన్
మఱి మాయావిని మోహిని, చరితముఁ గనుఁగొందు రెట్లు చతురాస్యాదుల్.

క. ఆ దివిజాధీశుఁడు మహ, దాదులు దిక్పతులు పంకజాసనుఁడుం గౌ
రీ దయితుఁడు గనఁ జాలని, శ్రీ దేవుని పదయుగంబు చింతింతు మదిన్. 227

1. పరాత్పరు (తం. వా.) 2. అన్యక కథాలాపము (క.చ.ట.త.) 3. తోడఁగ్రోలు (హ)
4. నక్కరచే (ద) 5. చేఁదు వేములకు (హ); తీగవేములకు (ద. ఐ.) *ఈ పద్యము వ్రాఁత ప్రతు
లందు లేదు.

## అధ్యాయము—౭

క. అని మైత్రేయుం డవ్విదు, రున కెఱిఁగించిన తెఱంగు రుచిరముగా న
ర్జున పౌత్రునకుఁ బరాశర, ముని మనుమం డెఱుఁగఁ జెప్పె ముదము దలిర్పన్.

వ. వెండియు నిట్లనియె.

క. భూమీశ్వర! మైత్రేయ మ, హాముని విదురునకు నట్లు హరిశుభ గుణ లీ
లా మాహాత్మ్యముఁ జెప్పిన, నామైత్రేయునకు విదురుఁ డనియెన్ మఱియున్.

క. [1]అగుణుం డగు నీశ్వరునకు, జగదవనోద్భవ వినాశ సత్కర్మములుం
దగు [2]లీల లెట్లు లాతఁడు, సగుణుండై యుంట యెట్లు సౌజన్య నిధీ! 231

సీ. [3]అన, నర్భకుని గతి ననవుడు, మైత్రేయమునిఁ జూచి విదురుఁ డిట్లనియె మరల
బాలుఁడు క్రీడావిలోల మానసమున దీపించు లీలానురూపుఁ డగుచుఁ
[4]గానిచోఁ గామానుగతుఁడై రమించును నర్భకుఁ డర్థి వస్త్వంతరమున
నర్భ కాంతరమున నైనను బాలకేళీ సంగుఁ డగుచు నోలినిఁ జరించు

తే. [5]హరియు నెపుడు నివృత్తుఁడత్యంత తృప్తుఁ,డగుట వర్తించుటెట్లుక్రీడాదులందు
మఱియుఁద్రిగుణాత్మకంబైనమాయఁగూడి,యఖిలజగములుగల్పించెననుటయెట్లు?

సీ. అమ్మాయచేత నీ యఖిలంబు [6]సృజియించి పాలించి పొలియించి పరమపురుషుఁ
డనఘాత్మ! దేశకాలావస్థ లందును నితరుల యందు నహీన మైన
జ్ఞాన స్వభావంబుఁ బాని యా ప్రకృతితో నెబ్భంగిఁ గలసెఁ? దానేకమయ్యు
గోరి సమస్త శరీరంబు లందును జీవరూపమున వసించి యున్న

తే. [7]జీవునకు దుర్భగ క్లేశసిద్ధి యెట్టి, కర్మమున సంభవించెను? గడఁగి నాదు
చిత్త మజ్ఞాన దుర్గమస్థితిఁ గలంగి, [8]యధిక ఖేదంబు నొందెడు ననఘ చరిత!

వ. అది గావున సూరిజనోత్తముండ వైన నీవు మదీయ మానసిక సంశయంబులు
దొలగింప నర్హుండ వని విదురుండు మైత్రేయ మహామునీంద్రు నడిగె. అని
బాదరాయణ తనూభవుం డభిమన్యు నందనున కిట్లనియె. 234

1. అగుణునకు నిర్వికారికి (హ) 2. లీలలైన నాతఁడు (తం. వా.) 3. అని యర్భకునిగతి ననఘుని మైత్రేయ (హ) అని యర్భకునిగతి యనుకొని (వా) 4. గైకొని (చ. ట. త. జ. బ.) 5. దనుజ భేదనుఁడెట్లు స్వతంత్రవృత్తి వెలయ వర్తించె నే రీతి విక్రమించె (క. బ.) 6. ద్రుంచిన శశ్వత్త్రప్ప కాకఁ డీశ్వరుఁడు పరుఁడు (తం.) 7. జీవునికి వగు విభూతి ప్రసిద్ధియేమి (క.చ.ట.త.తం.) 8. అద్భుతంబునఁ బొందెడు (క.బ.తం.)

క. సరసిరుహోదర మంగళ, చరితామృత పాన కుతుక సంగంబున ని
ర్భరుఁడగు విదురునకు మునీ, శ్వరుఁడగు మైత్రేయుఁ డనియె సజ్జనతిలకా! 235

చ. వినుము [1]వితర్కవాదములు విష్ణుని ఫుల్లసరోజ పత్ర నే
త్రుని ఘనమాయ నెప్పుడు విరోధము నేయుఁ బరేశు నిత్యశో
భనయుతు బంధనాదిక విపద్దశలున్ [2]గృపణత్వ మెప్పుడే
ననయముఁ బొంద లేవు విభుఁ డాద్యుఁ డనంతుఁడు నిత్యుఁ డౌటచేన్. 236

వ. మఱియు. 237

చ. పురుషుడు నిద్రవోఁ గలలఁ బొందు సమస్త సుఖంబు లాత్మ సం
హరణ శిరో విఖండనము లాదిగ జీవునికిం బ్రబోధమం
దరయఁగఁ దోఁచుచున్న గతి నాదిఁ బరేశుఁడు బంధనాదులన్
బొరయక తక్కఁ బెట్ల నుచు బుద్ధిని సంశయ మందె దేనియున్. 238

వ. అవ్విధ మతనికిం గలుగనేర దది యెట్లంటేని. 239

చ. లలిత విలోల నిర్మల జల ప్రతిబింబిత పూర్ణ చంద్ర మం
డలము దదంబు చాలన విడంబన హేతువు నొందియున్ వియ
త్తలమునఁ గంప మొందని విధంబున సర్వ శరీర ధర్మముల్
గలిగి రమించు నీశునకుఁ గల్గఁగ నేరవు కర్మ బంధముల్. 240

వ. కావున జీవునకు విద్యా మహిమం జేసి కర్మ బంధనాదికంబు సంప్రాప్తం బగుం
గాని సర్వ భూతాంతర్యామి యైన యీశ్వరునకుఁ బ్రాప్తంబు గానేర దని
వెండియు. 241

చ. నరునకు నాత్మ దేహజ గుణంబులఁ బాపఁగ నోపుఁ బంకజో
దర చరణారవింద మహితస్ఫుట భక్తియ యింద్రియంబు లీ
శ్వర విషయంబు లైన మది సంచిత నిశ్చల తత్త్వమైనచో
సరసిజ నేత్రు కీర్తనమె చాలు విపద్దశలం జయింపఁగన్. 242

చ. హరి చరణారవింద యుగళార్చన సన్నుతి భక్తి యోగముల్
నిరతము గల్గువారె భవ నీరజగర్భుల కందరాని భా
సుర పద మందుఁ జేరుదురు సూరి జనస్తవనీయ! యట్టి స
త్పురుషుల పూర్వజన్మ ఫలమున్ గణుతింపఁ దరంబె యేరికిన్? 243

1. కుతర్క (చ.ద.) 2. గృపణత్వభావమున్ (క.బ.తం.) గృపణ స్వభావమున్ (ద.ద.)

వ. అని చెప్పిన విదురుండు మైత్రేయుం గనుంగొని ముకుళిత హస్తుండును వినమిత మస్తకుండు నగుచుం దన మనంబున శ్రీహరిం దలంపుచు వినయ యుక్త వచన రచనుండై యిట్లనియె. మునీంద్రా! భవదీయ వాక్యంబులచేత నా మనంబున నారాయణుండు లోకైక నాథుం డెట్లయ్యె ననియు, శరీరధారి యైన జీవునికిఁ గర్మబంధంబు లే రీతి సంభవించె ననియునుం బొడమిన సంశయంబు నేఁడు నివృత్తం బయ్యె. ఎట్లనిన లోకంబున కీశ్వరుండు హరి యనియు జీవుండు పరతంత్రుం డనియును దలంపుదు. నారాయణభక్తి ప్రభావంబు ప్రాణిగోచరం బైన యవిద్యకు [1]నాశనకారణం బనం దనరుచుండు. నారాయణుండు దనకు నాధారంబు లేక సమస్తంబునకుం దాన యాధారభూతుండై విశ్వంబు వొదివి యందు దా నుండు తెఱం గెట్లు? శరీరాభిమానంబును బొంది యెవ్వఁడు మూఢతముండై సంసార ప్రవర్తకుం డగు. నెవ్వండు భక్తిమార్గంబునఁ బరమాత్ముం డైన పుండరీకాక్షునిఁ జెందు. వీర లిద్దఱును *(సంశయ క్లేశంబులు లేమిం జేసి) సుఖానంద పరిపూర్ణులై యభివృద్ధి నొందు వారగుదురు. (ఎవ్వండు సుఖ దుఃఖాను సంధానంబుచే లోకానుగతుం డగుచుం బ్రమోద వేదనంబుల నొందు నతండు దుఃఖాశ్రయుం డగు.) నారాయణ భజనంబు సమస్త దుఃఖ వివారణం బగు నని భవదీయ చరణ సేవానిమిత్తంబునం గంటి. ప్రపంచంబు ప్రతీతి మాత్రంబు గలిగి యున్నది. అయిన నందుకుఁ గారణంబు లేకుండుటం జేసి [2]దెలియనివాఁడనై వర్తింతు. అని వెండియు.244

క. లలి నా మదిఁ దలఁపుదు సుమ, తులు గొనియాడంగఁ దగిన తోయజనాభుం
డలవడ నల్ప తపో [3]నిర, తుల తలపోఁతలకు మిగుల దుర్లభుఁ డంచున్.245

సీ. ఇంద్రియంబుల తోడ నెలమి నొప్పెడి మహదాదుల నితరేతరానుషంగ
ముగఁ జేసి వానియం దొగి విరా ద్దేహంబు పుట్టించి యందుఁ జేపట్టి తాను
[4]వసియించు నాతఁడు [5]వరల సహస్ర సంఖ్యాతంబు లగు మస్తకాంఘ్రి బాహు
కలిత సత్పురుషునిఁగా బ్రహ్మవాదులు పలుకుదు రా విరాట్ప్రభువునందు

తే. భువనజాలంబులలజడిఁబొరయకుండుఁబ్రాణదశకంబు[6]నింద్రియార్థములునింద్రి
యాధిదైవతములు గూడ ననఘ! త్రివిధ, మగుచు విప్రాదివర్ణము లయ్యెనందు.

క. ఇలఁ బుత్రపౌత్ర [7]సంపద, గలిగిన వంశములతోడఁ గడుఁ జోద్యముగా
లలిఁ బ్రజలే గతిఁ గలిగిరి? కలిగిన యా ప్రజలచే జగము లెట్లుండెన్? 247

1. నధిష్ఠానంబని వనరుచుండు (క.చ.డ.ద.తం.) 2. తెలిసిన వాడనై (ట.త.) 3. వృత్తుల పొంతకు చూడ (క) 4. వసియించె నతఁ డుత్సవమున సహస్ర (చ) 5. వసుస (తం. వా.)
6. సేంద్రియార్థములు (హ) 7. నప్తృల (తం)

క. చతురత దీపించు ప్రజా, పతులకుఁ బతి యనఁగ నెలయు పద్మాపతి యే
గతిఁ బుట్టించెను స్రష్టృ, ప్రతతులచే నవవిధ ప్రపంచము మఱియున్. 248

తే. వాని భేదంబులును మను వంశములును, మనుకులాధీశ్వరులును దన్మనుకులాను
చరితములు నేవిభూతి నే జాడ దీని, నింతయునుఁ బుట్టఁజేసె నా కెఱుఁగఁబలుకు.

క. [1]ధరణికిఁ గ్రిందట, మీఁదట [2]తరమిడి గల లోకములను [3]దత్తత్ స్థితులన్
వరుసలుఁ [4]బరిమాణంబులుఁ, [5]జిరకృప నెఱిఁగింపు నాకు సిద్ధచరిత్రా! 250

క. సుర తిర్యఙ్నర రాక్షస, గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ
శ్చర ముఖభవములు మునికుం, జర! గర్భ స్వేదజాండంబుల తెఱంగున్! 251

క. త్రిగుణ ప్రధానకంబులు, నగు నవతారములు పూర్ణమై వెలసిన యా
[6]జగదుత్పత్తి స్థితిలయ, నిగమముల విధంబు వాని నిలుకడలు దగన్. 252

క. చక్రాయుధ సౌందర్య ప, రాక్రమ ముఖ గుణములును ధరామరముఖ వ
ర్ణక్రమములు నాశ్రమ ధ, ర్మక్రియలును శీలవృత్త మతభావములున్. 253

తే. యోగ విస్తార మహిమలు, [7]యోగములును, జ్ఞాన మార్గంబులును, బరిజ్ఞాన సాధ
నములునై యొప్పు సాంఖ్యయోగములు, వికచ, జలజనయన![8]స్మృతంబు లౌ
శాస్త్రములును. 254

సీ. పాషండ [9]మార్గంబు ప్రతిలోమకుల విభాగములు జీవుల గుణ కర్మములును
పలుకుల గతులను గలగెడి ధర్మ మోక్షముల యందలి పరస్పరవిరోధ
ములు లేని సాధనములు భూమిపాలక నీతివార్తలు దండనీతి జాడ
యునుఁ బృథగ్భావంబులును విధానములునుఁ బితృమేధములును దత్పితృ విసర్గ

తే. గతులు దారాగ్రహంబులు గాలచక్ర, మున వసించిన నిలుకడలును దపంబు
దానములుఁ దత్ఫలంబులుఁ [10]దనరు ప్రబల, ధర్మములు ప్రజలొనరించు
కర్మములును. 255

చ. వదలక భూజనావళికి వచ్చు విపద్దశ ధర్మముల్ సరో
జదళ నిభాక్షుఁ డే గతిని సంతస మందెడు, నెట్టి వారిఁ బెం
పొదవఁగఁ గానవచ్చు, గురువుల్ ప్రియశిష్యులు గొల్వ వారు స
మ్మదమునఁ గోరు ధర్మములు మానుగ నెల్లెఱిఁగింతు రిమ్మలన్. 256

1. సరవిం గ్రిందన్ మీఁదన్ (హ. వా.) 2. ధరణికి (హ. వా.) 3. దగు నిలుకడలన్ (క)
4. బరిణామంబులు (హ. వా.) 5. నెఱిఁగింపఁ గదయ్యా నాకు సిద్ధచరిత్రా (తం. వా. త. జ.)
6. జగదుత్పాదన రక్షణ (క. తం.) 7. యోగములును (హ. తం. వా.) 8. కృతంబులౌ (హ. తం. వా.)
9. ధర్మంబు (హ. తం. వా.) 10. తగు ప్రవాస (క. చ. త.); తగు ప్రధాన (జ).

క. విలయాది భేదముల న, య్యలఘునిఁ బరమేశు నెవ్వ రంచిత భక్తిన్
గొలుతు [1]రదెవ్వనితో ను, త్కలికన్ సుఖియించు జీవతత్త్వము మఱియున్.257

క. గోవిందుని రూపంబున, జీవబ్రహ్మలకు నైక్యసిద్ధియు నెట్లో
భావన నుపనిషదర్థం, బై వెలసెడి జ్ఞాన మెట్టి దార్య స్తుత్యా! 258

తే. ఉచిత మగు నట్టి శిష్య ప్రయోజనములు. [2]సజ్జనులచేత విజ్ఞాన సాధనములు
నేమి వలుకంగఁబడువానినెల్ల మఱియుఁ,బొలుచువైరాగ్యమునఁ దగుపురుషభక్తి.

తే. ఇన్నియుం దెలియ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపు యజ్ఞ దానాది పుణ్య
ఫలము వేదంబు చదివిన ఫలము నార్త,జనులఁ గాచిన ఫలముతో సమము గావు.

క. అని విదురుఁడు మైత్రేయుని, వినయంబునఁ దెలియ నడుగు విధమెల్లను వ్యా
సుని సుతుఁ డభిమన్యుని నం, దనునకు నెఱిఁగించి మఱియుఁ దగ నిట్లనియెన్.

అధ్యాయము—౮

చ. ఇలఁ గల మానవావళికి నెల్ల నుతింప భజింప యోగ్యమై
వెలసిన పూరువంశము పవిత్రము సేయఁగఁ బుట్టి సద్గుణా
కలిత యశః ప్రసూన లతికాతతికిం బ్రతి వాసరంబు పెం
పలరఁగఁ బ్రోదివెట్టుదు గదయ్య ముకుంద కథామృతంబునన్. 262

తే. అల్పతర మైన సుఖముల నందుచున్న, జనులు దుఃఖంబు మాన్పంగఁ జాలు నట్టి
[3]పుండరీకాక్షు గుణ కథా[4]ప్రోత మైన, వితత నిగమార్థ మగు భాగవతము నీకు.

వ. ఎఱింగింతు విను మని యిట్లనియె, 264

సీ. అ మ్మహా భాగవతామ్నాయ మొకనాఁడు గైకొని పాతాళ లోక మందు
[5]సప్రతిహత బుద్ధియై వాసుదే వాఖ్యఁ బొలుచు సంకర్షణ మూర్తి దివ్య
పురుషుఁడు దనుఁదాను బుద్ధిలోఁ జూచుచు నలలిత ధ్యాన ముకుళిత నేత్రు,
డై సనందాఖ్యుద యార్థంబు గను విచ్చి చూచిన వారు సంస్తుతు లొనర్ప

తే. సమర గంగావగాహనులై మహేంద్ర, కన్య లార్ద్రి జటాబంధ కలిత లగుచు
భర్తృవాంఛానుబుద్ధి నప్పరమపురుషుఁ,గదియనేతెంచి తత్పాదకమల యుగము,

1. రెవ్వనిలో (తం.వా.) 2. సరస చారిత్ర విజ్ఞాన సాధనములు (చ) 3. పుండరీక విలోచన ప్రోక్తమైన (చ) "యదాహ సాక్షాద్భగవా నృషిభ్యః" అనియే మూలము (8-2) 4. ప్రోక్తమైన (హ) 5. నప్రతీక జ్ఞానియై (హ. తం. వా.)

క. సేవించి భక్తితో నా, నావిధ పూజోపహార నతి నుతులను నా
దేవుని హృదయము వడసిరి, యా వేళ సనందనాదు ల మ్మహితాత్ముల్. 266

మ. ఘన సాహస్ర కిరీటరత్న విలసత్కాంత ప్రసిద్ధ ప్రభా
జని తోదగ్ర రుచి ప్రకాశిత ఫణా సాహస్రుఁ [1]డౌ దేవతా
వన దీక్షచణు రూప కృత్యము లొగిన్ వాంఛన్ బ్రశంసించి వా
రనురాగ స్థలితోక్తు లొప్ప నడుగన్ హర్షించి యా దేవుఁడున్. 267

తే. భూరి నిగమార్థ సార విచార మగుచుఁ, దనరు నీ భాగవతము సాదరతఁ బలికె
నలినభవసూతియైన సనత్కుమార,కునకు నెఱిఁగించె సాంఖ్యాయనునకు నతఁడు.

క. [2]పరఁగ నతం డంతఁ బరా, శరునకు నుపదేశమిచ్చె సన్మతి నతఁడున్
సురగురున కొసఁగె నాతఁడు, గరమరుదుగ నాకుఁ జెప్పెఁ గైకొని యేనున్.

క. నీ కిప్పుడు వివరించెద, నాకర్ణింపుము సరోరుహాక్షుం డగు సు
శ్లోకుని చరితామృత పరి, షేకుఁడవై ముదము గదురఁ జెలఁగుము విదురా. 270

వ. ఇట్లు భగవత్ప్రోక్తంబును, ఋషి సంప్రదాయాగతంబును, పురుషోత్తమ స్తోత్రంబును, పరమ పవిత్రంబును, భవలతా లవిత్రంబును నైన భాగవత [3]కథా ప్రపంచంబు శ్రద్ధాళుండవు భక్తుండవు నగు నీకు నుపన్యసించెద. వినుము,

సీ. అనఘ! యేకోదకమై యున్న వేళ నంత ర్నిరుద్ధానల దారు వితతి
భాతిఁ జిచ్ఛక్తి సమేతుఁడై కపట నిద్రా లోలుఁ డగుచు నిమీలి తాక్షుఁ
డైన నారాయణుం డంబు మధ్యమున భాసుర సుధా ఫేన పాండుర శరీర
రుచులు సహస్ర శిరో రత్న రుచులతోఁ జెలిమి సేయఁగ నొప్పు శేష భోగ

తే. తల్పమునఁ బవ్వళించి యనల్ప తత్త్వ,దీప్తిఁ జెన్నొందఁగా నద్వితీయుఁడగుచు
[4]నభిరతుం డయ్యుఁగోర్కులయందుఁ బాసి,ప్రవిమలాకృతి నానందభరితుఁడగుచు.

తే. యోగమాయావిదూరుఁడై యుగసహస్ర,కాలపర్యంత మఖిలలోకములు మ్రింగి
పేర్చి మఱి కాల శక్త్యుపబృంహితమున,సమత సృష్టి క్రియా కలాపములఁదగిలి.

క. తన జఠరము లోపల దాఁ, చిన లోక నికాయముల సృజించుటకును సా
ధన మగు సూక్ష్మార్థము మన, సునఁ గని కాలానుగత రజోగుణ మంతన్. 274

1. దేవతావన రక్షాచణు (హ.వా.); దేవతావన దక్షున్ననురూప (తం) 2. ఎఱిఁగించిన నతఁడు పరాశరునకు (క.తం.) 3. కథా సూత్రంబు (చ) 4. అభినుతుండయ్యు (హ)

సీ. పుట్టించెఁ, దద్గుణంబునఁ బరమేశ్వరు నాభిదేశము నందు నళిననాళ
ముదయించె మఱి య ప్పయోరుహ ముకుళంబు గర్మబోధితమైన కాలమందుఁ
దన తేజమునఁ బ్రవృద్ధం బైన జలముచే జలజాప్త గతిఁ బ్రకాశంబు నొందఁ
జేసి లోకాశ్రయ స్థితి [1]సర్వగుణ విభాసిత గతినొప్పు రాజీవ మందు

తే. నిజకళా కలితాంశంబు నిలిపె దాని,వలన నామ్నాయమయుఁడును వర గుణుండు
నాత్మయోనియు నైన తోయజభవుండు, సరవిఁజతురాననుండు నా జనన మొందె.

తే. అతఁడు తత్పద్మ కర్ణిక యందు నిలిచి, వికచ లోచనుఁడై లోక వితతి దిశలు
నంబరంబును నిజ చతురాననములఁ,గలయఁ బరికించి చూచుచుఁ గమలభవుఁడు.

చ. అలఘు యుగాంత కాల పవనాహత సంచల దూర్మిజాల సం
కలిత జల ప్రభూత మగు కంజముఁ, ద ద్వనజాత కర్ణికా
తలమున నున్న తన్నుఁ, విశద క్రియఁ గల్గిన లోక తత్త్వముం
నలిఁ దెలియంగ నోపక మనంబునఁ జాల విచార మొందుచుం. 277

వ. ఇట్లు వితర్కించె. 273

ఉ. ఈ జల మందు నీ కమల మేగతి నుద్భవమయ్యె, నొంటి నే
నీ జలజాత పీఠమున నే గతి నుంటి, మదాఖ్య యెద్ది, నా
కీ జననంబు నొందుటకు నె య్యది హేతువు, బుద్ధిఁ జూడ నే
యోజ నెఱుంగ లే నని పయోరుహ గర్భుఁడు విస్మితాత్ముఁడై. 279

క. ఆ వనజ నాళ మూలం, బా వనములతో [2]న నర్థి నరయుట కొఱకై
యా వనజాత ప్రభవుం, డా వనరుహ నాళ వివర మం దభిముఖుఁడై. 280

మ. అతి గంభీర విశాల వారినిధి తోయాంత ర్నిమగ్నాంగుఁడై
చతురాస్యుం [3]డురు దివ్య వత్సర సహస్రం బబ్జ మూలంబు స
న్మతి నీక్షించియుఁ గానలేక భగవ న్మాయా మహత్త్వంబు వి
స్మృతిఁ గావింప విభీతుఁడై మఱలఁ జేరెం ద త్సరోజాతముం. 281

తే. అట్లు గ్రమ్మఱఁ జేరి య య్యబ్జపీఠ, మందు నష్టాంగ యోగ క్రియాను రక్తిఁ
బవను బంధించి మహిత తప స్సమాధి, నుండి శత వర్షములు చనుచుండ నంత.

ఆ. అట్టి యోగ జనిత మైన విజ్ఞానంబు, గలిగియుండి దానఁ గమలనయనుఁ
గానలేక హృదయ కమల కర్ణిక యందు, నున్న వానిఁ దన్నుఁ గన్న వాని.

1. గతి నొప్పు నా, శ్రీవరు నాభి రాజీవమందు (హ) 2. నరయ నర్థించి వెసన్ (క.చ.)
3. డొగి (తం. వా.)

మ. కనియె న్నిశ్చల భక్తి యోగ మహిమన్ గంజాతగర్భుండు శో
భన చారిత్రు జగత్పవిత్రు విలసత్పద్మా కళత్రున్ సుధా
శన ముఖ్య స్తుతి పాత్రు దానవ చమూ జైత్రున్ దళత్పద్మ నే
త్రు నవీ నోజ్జ్వల నీల మేఘ నిభ గాత్రున్ బక్షిరాట్పత్రునిన్. 284

వ. మఱియు, 285

చ. అలఘు ఫణాతపత్ర నిచయాగ్ర సమంచిత నూత్నరత్న ని
ర్మల రుచిచే యుగాంత తిమిరంబు నడంచి యకల్మషోల్లస
జ్జలములఁ జేసి యందు నవ సారస నాళ సితైక భోగముం
గలిగిన శేషతల్పమును గైకొని యున్న మహాత్ము నొక్కనిన్. 286

సీ. వర పీత కౌశేయ పరిధాన కాంతి సంధ్యాంబుద రుచి నిచయంబు గాఁగఁ
[1]గమనీయ హేమ సంకలిత కిరీటంబు రమణ కాంచన శిఖరంబు గాఁగ
మానిత మౌక్తిక మాలికా రుచి సాను పతిత నిర్ఝర పరంపరలు గాఁగఁ
జెలువొందు నవ తులసీ దామకములు లాలిత తట జౌషధీలతలు గాఁగఁ

తే. వర భుజంబులు నికటస్థ వంశములుగఁ, బదము లంగణ పాదప ప్రచయములుగ
లలిత గతి నొప్పు మరకతాచల విడంబి, తాత్మ దేహంబు గలుగు మహాత్ముహరిని.

వ. మఱియు నపరిచ్ఛిన్నంబును, నిరుపమానంబును, నిఖిల లోక సంగ్రహంబును, నతివిస్తార వర్తులాయామంబును నై, వివిధ విచిత్ర దివ్య మణి విభూషణంబుల నాత్మీయ నిర్మల ద్యుతి చేతం బ్రకాశంబు నొందం జేయు దివ్య దేహంబు దనర వివిధంబులగు కామంబు లభిలషించి విశుద్ధంబైన వేదోక్త మార్గంబున భజియించు పురుషశ్రేష్ఠులకుఁ గామధేను వనం దగిన పాదపద్మ యుగంబును; నళిక ఫలక లలిత రుచి నిచయంబులకు నోటుపడి కృపాపాత్రుండై చంద్రుండు బహు రూపంబులఁ బదసరోజంబుల నాశ్రయించె నన నొప్పు పద నఖంబులును; గమలా భూ కాంతలకు నుపధాన రూపంబు లనం దగి నీల కదళికా స్తంభంబుల డంబు విడంబించు నూరు యుగళంబును; గనక మణిమయ మేఖలా కలాపాభి రామంబు గదంబ కింజల్క శోభిత పీతాంబరాలంకృతంబునై విలసిల్లు కటి మండలంబును; శృంగార వాహినీ జలావర్తంబు నాఁ బొలుపొందు నాభీ వివరంబును; జఠరస్థ నిఖిల బ్రహ్మాండ ముహుర్ముహు రుద్భవ కృశీభూతం బనం దగు మధ్య భాగంబును; మహిత ముక్తాఫల మాలికా విరచిత రంగవల్లీ విరాజితంబు, నవ

1. జెలువారు హేమ (చ. ట. త.)

తులసీ దామ [1]కిసలయ తల్పంబుఁ, గుసుమ మాలికాలంకృతంబు, ఘనసార కస్తూరికా చందన విలిప్తంబుఁ, గౌస్తుభ రత్న ప్రదీప్తంబు, శ్రీవత్స లక్షణ లక్షితంబు నై యిందిరకుఁ గేళీ మందిరం బనం బొల్చు వక్షస్థలంబును; సుఖకేళీ సమారంభ పరిరంభ క్షీరాంభోధి రాట్కన్యకా కరాంభోజ కీలిత కనక మణి[2]కంకణ నికషంబులం బొలుపారు రేఖాత్రయ విరాజమాన కంబుకంధరంబును; సుమహి తానర్ఘ దివ్యమణి ప్రభా విభాసిత కేయూర కంకణముద్రి కాలంకృతంబు లైన బాహువులును; సకల లోకార్తి నివారక దరహాస చంద్రికా ధవళితంబు లై కర్ణ కుండల మండన మణి మరీచులు నర్తనంబులు సలుపం దనరి నిద్దంబులగు చెక్కుటద్దంబులును; పరిపక్వ బింబఫల ప్రవాళ పల్లవాధర శోణాయితంబును, నఖిల భువన పరిపాలనంబునకు నేన చాలుదు నని వివాదించు నయన యుగళంబు నకు సీమాస్తంభంబును, చంపక ప్రసూన రుచి విభాసంబును నగు నాసాదండం బును; గమల కుముదంబులకుం బెంపు సంపాదింపుచుఁ గరుణామృత తరంగి తాంగంబులై కర్ణాంత విశ్రాంతంబులై చెలువొందు నేత్రంబులును; సలలిత శ్రీకారంబునకు నక్షరత్వంబు సార్థకం బయ్యె ననం దగు కర్ణంబులును; నిజ చాపు చాపద్వయ రూపంబులం జూపట్టు భ్రూ యుగళంబును; నపర పక్షాష్టమీ శశాంక శంకాస్పద ఫాల ఫలకంబును: నీల గిరీంద్ర శృంగ సంగత బాల మార్తాండ మండల విడంబిత పద్మరాగ మణి ఖచిత కాంచన కిరీటంబుచేఁ బొలుపారి సూర్యేందు పవ నానల ప్రకాశంబులకు నవకాశంబు చూపక త్రిలోక వ్యాపక సమర్థంబు లగు తేజో విశేషంబులును; సంగర రంగంబుల దాన వానీకంబుల హరింపం జాలు సుదర్శనాది దివ్య సాధనంబులచే దురాసదంబగు దివ్య రూపంబునుం గలిగి మఱియు, 288

ఉ. హారకలాప పుష్ప నిచయంబులఁ జంచ దనర్ఘ రత్న కే
యూర కరాంగుళీయక మహోజ్జ్వల బాహు సహస్ర శాఖ [3]లో
ప్పారఁగఁ జూడనొప్పి భువనాత్మక లీల నదృష్టమూల వి
స్ఫారిత భోగ వేష్టిత విభాసిత చందన భూరుహాకృతిన్. 289

మ. విలసత్కుండలి రాజ సఖ్యమున నుర్వీభృ త్సమాఖ్యన్ సము
జ్జ్వలితోదార శిరో విభూషణ సహస్ర స్వర్ణ కూటంబులన్
సలిలావాసతఁ జారు కౌస్తుభ విరాజ ద్రత్న గర్భంబులన్
నలినాక్షుండు గనుంగొనంగఁ దగె మైనాకావనీభృద్గతిన్. 290

1. కిసలయా కల్పంబు (హ) 2. కంకణంబులం బొలుపారు (హ) 3. ల, న్నారయఁ జూడ. వ్రా. ప్ర. (తం. ఫుట్‌నోటు.)

క. వితతార్థ[1]జ్ఞాన జప, స్తుతి మకరంద ప్రహృష్ట ప్రతి జాత మధు
వ్రత గణ పరివృత శోభా, గత కీర్తి ప్రసవ మాలికలు గల వానిన్. 291

వ. కనుంగొని చతురాననుండు, 292

సీ. అనఘు సర్వేశ్వరు నాద్యంత శూన్యుని ధన్యుని జగదేక మాన్య చరితుఁ
దన్నాభి[2]సరసికోద్భవ సరోజంబును నప్పుల ననిలుని నంబరమును
మానిత భువన నిర్మాణ దృష్టిని బొడగనెఁ గాని యితరముఁ గానలేక
యాత్మీయ కర్మ బీజాంకురంబును రజో గుణ యుక్తుఁ డగుచు నకుంఠిత ప్ర

తే. జాభిసర్గాభిముఖత నవ్యక్త మార్గుఁ, డైన హరియందుఁ దన హృదయంబుఁ జేర్చి
య మ్మహాత్ముని బరము ననంతు నభవు, నజు నమేయుని నిట్లని యభినుతించె.

అధ్యాయము — ౯

సీ. నలినాక్ష! మాయాగుణ వ్యతికరమునఁ జేసి కార్యం బైన సృష్టి రూప
మునఁ బ్రకాశించు నీ ఘన రూప విభవంబు రూపింప దేహధారులకు దుర్వి
భావ్యంబు దలపోయ భగవంతుఁడవు నైన పద్మాక్ష నీ స్వరూపంబు కంటె
నన్య మొక్కటి సత్యమై బోధకం బైన యది లేదు కాన నీ యతుల దివ్య

తే. మయిన రూపంబు నాకుఁ బ్రత్యక్ష మయ్యెఁ, నదియుఁగాక వివేకోదయమునఁ జేసి
వరద నీ రూప మజ్ఞాన గురు తమోని, వారకం బయ్యె నాకు శశ్వత్ప్రదీప!

క. ఘన సత్పురుషానుగ్రహ, మునకై యమితావతార మూలం బగుచుం
తనరెడి నీ రూపము శో, భనమగు భవదీయ నాభిపద్మము వలనన్. 295

క. జననం బందిన నాచే, ననయము మొదలనె గృహీత మయ్యె జగత్పా
వన! నీదు స్వరూపము, ఘన రుచిరంబై స్వయం ప్రకాశక మగుటన్. 296

వ. మఱియు జ్ఞానానంద[3]పరిపూర్ణ మాత్రంబును, ననావృత ప్రకాశంబును, భేద రహితంబును, ప్రపంచ జనకంబును, భూతేంద్రియాత్మకంబును, నేకంబును నైన రూపంబు నొందియు నెందునుం బొడగాన నట్టి నిన్ను నాశ్రయించెద. అదియునుంగాక జగన్మంగళ స్వరూపధరుండ వై నీ యుపాసకుల మైన మా మంగళంబుల కొఱకు నిరంతర ధ్యానంబుచేత నీ దివ్యరూపంబునం గానం బడితివి. ఇట్టి నీవు నిరయభాక్కులై నిరీశ్వర వాదంబునం జేసి కుతర్కంబులు ప్రసంగించు భాగ్యరహితులచేత నాదృతుండవు గావు. మఱియునుం గొందఱు కృతార్థ

1. జ్ఞాని జన (హ) 2. నవసముద్భవ (ధ) 3. స్వరూప (ట)

లైన మహాత్ములు భవదీయ శ్రీ చరణారవింద కోశగంధంబు వేదమారుతానీతం బగుటం జేసి తమ తమ కర్ణ కుహరంబులచేతం [1]గ్రహించుదురు. వారల హృదయ కమలంబు లందు భక్తి పారతంత్ర్యంబున గృహీత పాదారవిందంబులు గలిగి ప్రకాశింతువు. అదియునుం గాక ప్రాణులకు [2]ద్రవ్యాగార సుహృన్నిమిత్తం బైన భయంబును దన్నాశ నిమిత్తం బైన శోకంబును, ద్రవ్యాది స్పృహయును దన్నిమిత్తం బైన పరిభవంబును (మఱియు నందుఁ దృష్ణయును, నది ప్రయాసంబున లబ్ధంబైన నార్తియు) దదీయం బైన వృథాగ్రహంబును, నీ శ్రీపాదారవిందంబు లందు వైముఖ్యం బెంత కాలంబు గలుగు నంత కాలంబును బ్రాప్తంబు లగుం గాని మానవాత్మ నాయకుండ వగు నిన్ను నాశ్రయించిన భయ నివృత్తి హేతువగు మోక్షంబు గలుగు. మఱియుం గొందఱు సకల పాపనివర్తకం బైన త్వదీయ నామస్మరణ కీర్తనంబు లందు విముఖులై కామ్యకర్మ ప్రావీణ్యంబునం జేసి నష్టమతులై యింద్రియ పరతంత్రులై యమంగళంబులైన కార్యంబులు నేయుచుందురు. దానం జేసి వాతాది త్రిధాతు మూలం బైన క్షుత్తృడాదుల చేతను, శీతోష్ణ వర్ష వాతాది దుఃఖంబుల చేతను, నతి దీర్ఘం బైన కామాగ్ని చేతను. నవిచ్ఛిన్నం బగు క్రోధంబుచేతను దహ్యమాను లగుదురు. వారలం గనిన నా చిత్తంబు గలంకం బొందు. జీవుండు భవదీయ మాయా పరిభ్రామ్యమాణుండై యాత్మ వేఱని యెప్పుడు దెలియు నంత కాలంబు నిరర్థకంబై దుస్తరం బైన సంసార సాగరంబు దరియింపం జాలకుండు. సన్మునీంద్రులైనను భవదీయ నామ స్మరణంబు మఱచి యితర విషయాసక్తులై రేని వారలు దివంబు లందు వృథాప్రయత్నులై సంచరింపుచు, రాత్రి నిద్రాసక్తులై స్వప్నగోచరం బైన బహు విధ సంపదలకు నానందింపుచు, శరీర పరిణామాది పీడలకు దుఃఖింపుచు, ప్రతిహతంబు లైన యుద్యోగంబుల భూలోకంబున సంసారులై వర్తింతురు. నిష్కామ ధర్ములై మిమ్ము భజియించు సత్పురుషుల కర్ణమార్గంబులం బ్రవేశించి భవదీయ భక్తి యోగ శోభితం బైన హృత్సరోజ కర్ణికా పీఠంబు వసియింపుదువు. అదియునుం గాక, 297

మ. వర యోగీంద్రులు యోగమార్గముల భావం బందు నే నీ మనో
హర రూపంబు [3]దలంచి [4]యే గుణగణ ధ్యానంబు గావింతు ర
ప్పురుష శ్రేష్ఠ పరిగ్రహంబునకు నై పొల్పారఁ దద్ధ్యాన గో
చరమూర్తిన్ ధరియింతు గాదె పరమోత్సాహుండవై మాధవా! 298

1. నాఘ్రాణించుచుందురు (తం.వా) 2. ద్రవ్యశరీర (క. చ.) 3. ధరించి (చ) 4. తద్గుణ (చ. ట. జ. ద.)

తే. అరయ నిష్కామధర్ములై నట్టి భక్తు, లందు నీవు ప్రసన్నుండ వైన రీతి
హృదయముల బద్ధకాములై యెనయు దేవ, గణము లందుఁ బ్రసన్నత గలుగ వీవు.

చ. అరయ సమస్త [1]భూత హృదయంబుల యందు వసించి యేకమై
[2]పరఁగిన యంతరాత్మ సఖిభావ సుధర్ముఁడవున్ బరా పరే
శ్వరుఁడవు నై తనర్చుచును సజ్జనదుర్లభ మైన యట్టి సు
స్థిరమగు సర్వభూత దయచేఁ బొడగానఁగ వత్తు వచ్యుతా! 300

మ. క్రతు దానోగ్ర తప స్సమాధి జప సత్కర్మాగ్ని హోత్రాఖిల
వ్రత చర్యాదుల నాదరింప వఖిల వ్యాపార పారాయణ
స్థితి నొప్పారెడి [3]నీ పదాబ్జ యుగళీ సేవాభిపూజా సమ
ర్పిత భద్రుం డగు వాని భంగి నసురారీ! దేవ చూడామణీ! 301

తే. తవిలి శశ్వత్స్వరూప చైతన్య భూరి, మహిమచేత నపాస్త సమస్త భేద
మోహుఁడ వఖిల విజ్ఞానములకు నాశ్ర, యుండవగు నీకు మ్రొక్కెదనో రమేశ!

క. జనన స్థితి విలయంబుల, కనయంబును హేతుభూత మగు మాయా లీ
లను జెంది నటన [4]సలిపెదు, వనఘాత్మక! నీ కొనర్తు నభివందనముల్! 303

సీ. అనఘాత్మ! మఱి భవ దవతార గుణకర్మ ఘన విడంబన హేతుకంబు లైన
రమణీయ మగు దాశరథి వసుదేవకుమారాది దివ్య నామంబు లోలి
వెలయంగ మనుజులు వివశాత్ములై యవసాన కాలంబున సంస్మరించి
జన్మ జన్మాంతర సంచిత దురితంబుఁ [5]బాచి కైవల్య సంప్రాప్తు లగుదు

తే. రట్టి దివ్యావతారంబు [6]లవధరించు, నజుఁడ వగు నీకు మ్రొక్కెద ననఘ చరిత!
[7]చిర శుభాకార నిత్య లక్ష్మీ విహార!, భక్తమందార! [8]దుర్భవ భయ విదూర!

తరల. జనన వృద్ధి వినాశ హేతుక సంగతిం గల యేను నీ
వును హరుండుఁ ద్రిశాఖలై మనువుల్ [9]మరీచి ముఖామరుల్
[10]ఒనర నం దుపశాఖలై చెలువొంద నింతకు మూలమై
యనయమున్ భువన ద్రుమాకృతి వైన నీ కిదె మ్రొక్కెదన్. 305

1. జీవ (హ) 2. పరఁగు సుహృత్త్రిక యానుగుణభాసిత (చ. తం. వా.) 3. పాదపద్మ (హ)
4. సలిపితి, వనఘాత్మక (క.చ.) 5. బాపి (హ) 6. అవతరించు (హ.తం.వా.) 7. శ్రీ శుభాకార (జ)
8. దుర్భర భవవిదూర (హ) 9. సురేంద్ర (ర.శ.) 10. దనర...భవదాత్మ దీనికి (హ.వా.)

మ. పురుషాధీశ! భవత్పదాబ్జ యుగళీ పూజాది కర్మక్రియా
పరతం జెందని మూఢచిత్తునిఁ బశుప్రాయుండ మనుష్యాధమున్
జరయు [1]న్నంతము నొందఁ జేయు నతి దక్షంబైన కాలంబు ద
ద్గురు కాలాత్మకుఁడ వైన నీకు మది సంతోషంబునన్ మ్రొక్కెదన్. 306

సీ. సర్వేశ! కల్పాంత సంస్థిత మగు జలజాత మం దేను సంజనన మంది
భవదీయ సుస్వరూపముఁ జూడ నర్థించి బహు వత్సరములు దపంబు నేసి
క్రతు కర్మములు పెక్కు గావించియును నినుఁ బొడగానఁగా లేక బుద్ధి భీతిఁ
బొందిన నాకు నిప్పుడును నిర్హేతుక కరుణచే నఖిల లోకైక వంద్య

తే. [2]మాన సతత ప్రసన్న కోమల ముఖాబ్జ, కలిత భవదీయ దివ్యమంగళ విలాస
మూర్తి దర్శింపఁ గలిగె భక్తార్తి హరణ,కరణ!తుభ్యం నమో [3]విశ్వభరణ!దేవ!

సీ. అమర తిర్య ఙ్మను ష్యాది చేతన యోను లందు నాత్మేచ్ఛచేఁ జెంది సట్టి
కమనీయ శుభమూర్తి గలవాఁడవై ధర్మ సేతు వనంగఁ బ్రఖ్యాతి నొంది
విషయ సుఖంబుల విడిచి సంతత నిజా నందానుభవ సమున్నతిఁ దనర్తు
వది గాన పురుషోత్త మాఖ్యఁ జెన్నొందుదు వట్టి ని న్నెప్పుడు నభినుతింతు

తే. నర్థి భవదీయ పాదంబు లాశ్రయింతు, మహిత భక్తిని నీకు నమస్కరింతు
[4]భక్తజనపోష పరితోష! పరమపురుష! ప్రవిమలాకార! సంసారభయవిదూర!

సీ. తలకొని పంచభూత ప్రవర్తక మైన భూరి మాయాగుణ స్ఫురణఁ జిక్కు
వడక లోకంబులు భవదీయ జఠరంబులో నిల్పి [5]ఘన సమాలోల చటుల
సర్వంకషోర్మి భీషణ వార్ధి నడుమను ఫణిరాజ భోగ తల్పంబు నందు
యోగనిద్రారతి నుండఁగ నొక కొంత కాలంబు చనఁగ మేల్కనిన వేళ

తే. నలఘు భవదీయ నాభితోయజమువలన,గణఁగి ముల్లోకములు[6]నుపకరణములుగఁ
బుట్టఁ జేసితి వతుల విభూతి మెఱసి, పుండరీకాక్ష! సంతత భువనరక్ష! 309

క. నిగమస్తుత లక్ష్మీపతి, జగదంతర్యామి వగుచు సర్గము నెల్లన్
దగు భవ దైశ్వర్యంబున, నగణిత సౌఖ్యానుభవము నందింతు గదే! 310

1. నాశము (హ. వా.) 2. మాన కోమల సతత నిర్మలముఖాబ్జ (జ) 3. యని యొరగె భక్తి (హ) యని మరలఁ బలుకు (తం. వా.) 4. భక్తజన పోషణ విభూష (ద) భక్తజనపోష భూషణ (చ.టి.జ.డ.బ.) 5. ఘనసముల్లోల పటల (క) 6. సోపకరణములుగ (హ.తం.వా.)

సీ. జలజాక్ష! యెట్టి విజ్ఞాన బలంబునఁ గల్పింతు వఖిల లోకంబు లోలి
నతజన ప్రియుఁడవు నా కట్టి విజ్ఞాన మర్థిమైఁ గృపసేయు మయ్య వరద!
సృష్టి నిర్మాణేచ్ఛఁ జెంది నా చిత్తంబు దత్కర్మ కౌశల[1]త్వమును గలిగి
యును గర్మవైషమ్యమును బొందుకతమున దురితంబుఁ బొరయక తొలఁగునట్టి

తే. వెరవు నా కెట్లు గలుగు న వ్విధము దలఁచి,కర్మవర్తను నను భవత్కారుణ మెఱసి
తగఁ గృతార్థునిఁ జేయవే నిగమవినుత! సత్కృపామూర్తి! యో దేవచక్రవర్తి!

చ. భవదుదర ప్రభూత మగు పద్మము నందు వసించి యున్న నే
నవిరళ తావకీన కలితాంశమునం దసరారు విశ్వమున్
దవిలి రచింపుచున్ బహు విధంబులఁ బల్కెడి వేద జాలముల్
శివతరమై ఫలింపఁ గృప సేయుము భక్తఫల ప్రదాయకా! 312

చ. అని యనుకంప దోఁప వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి చారు లో
చన సరసీరుహుం డగుచు సర్వజగత్పరికల్పనా రతిం
దనరిన నన్నుఁ బ్రోచుటకు దా నిటు సన్నిధి యైన యీశ్వరుం
డనయము నాదు దుఃఖము దయామతిఁ బాపెడు నంచు నమ్రుఁడై. 313

క. వనరుహ సంజాతుఁడు నె, మ్మనమున హర్షించె ననుచు మైత్రేయ మహా
ముని ఘనుఁడగు విదురునకున్,వినయంబున నెఱుఁగఁజెప్పి వెండియుఁ బలికెన్.

మ. వనజాత ప్రభవుండు కేవల తపోవ్యాసంగుఁడై పద్మలో
చను గోవిందు ననంతు [2]నాద్యుఁ దన వాక్శక్తి న్నుతింపన్ సుధా
శన వంద్యుండు ప్రసన్నుఁడై నిఖిల విశ్వస్థాప నాలోకనం
బునఁ జూచెన్ విలయ ప్రభూత బహు వాఃపూరంబులన్ వ్రేల్మిడిన్. 315

తే. అట్లు పొడగని యార్తుఁడై నట్టి పద్మ, భవుని వాంఛిత మాత్మఁ దీర్పంగ దలఁచి
యతని మోహ నివారకమైన యట్టి యమృతరసతుల్య మధురవాక్యముల ననియె.

చ. తలకొని నీ యొనర్చు పని దప్పి మదిం దలపోయు దుఃఖముం
దలఁగుము నాదు లీలకుఁ బ్రధాన గుణం బగు సృష్టి కల్పనం
బలవడఁ జేయు బుద్ధి హృదయంబునఁ జొన్పి తపస్సమాధి ని
ష్ఠల నుతి భక్తులన్ ననుఁ బ్రసన్నునిఁ జేయుము చెందు కోరికల్. 317

1. త్వమునఁ దగిలి ( క. చ. ఐ. తా. ) కౌశలిఁ దగిలియుండి ( వా. ) 2. నాద్యు ( క. చ. త. ఐ. )

క. నీ వొనరించు తపో వి, ద్యా విభవ విలోకనీయ మగు నీ సృష్టిన్
గావింపుము లోకంబుల, లో వెలిఁగెడి నన్నుఁ గందు లోకస్తుత్యా! 318

క. నా లోని జీవకోటులు, వాలాయము నీకుఁ గానవచ్చు నిపుడు నీ
వాలోకింపుము దారు వి, లోల హుతాశనుని కరణి లోకస్తుత్యా! 319

సీ. నలువొప్ప నఖిల జీవుల యందుఁ గల నన్నుఁ దెలిసి సేవింపుము నలినగర్భ!
భవదీయ దోషముల్ పాయును భూతేంద్రియాశయ విరహితమై విశుద్ధ
మైన జీవుని విమలాంతరాత్ముఁడ నైన నను నేకముగఁ జూచు నరుఁడు మోక్ష
పద మార్గవర్తియై భాసిల్లు బ్రహ్మాండ మందున వివిధ కర్మానురూప

తే. పద్ధతులఁ జేసి పెక్కు రూపముల నొందు, జీవ తతి రచియించు నీ చిత్తమిపుడు
మత్పదాంబుజయుగళంబు మరగియున్న,కతన రాజసగుణమునఁ గలుగ దఘము.

క. విను మదియుఁగాక ప్రాణుల, కనయము నెఱుఁగంగరాని [1]యనఘుఁడఁ దేజో
ధనుఁడఁ బరేశుఁడ నీచే, తను గానంబడితి నిదె పితామహ! కంటే? 321

వ. మఱియు భూతేంద్రియ గుణాత్మకుం డనియు, జగన్మయుం డనియు, నన్ను నీ చిత్తంబు నందుఁ దలంపుము. తామరసనాళ వివర పథంబు వెంటం జని జలంబు లోనం జూడంగోరు నట్టి మదీయ స్వరూపంబు, 322

క. నీకిప్పుడు గానంబడె, నాకులకును నురగపతి పినాకుల కైనన్
[2]వాక్రువ్వం దలపోయను, రాకుండు మదీయ రూప [3]రమ్యత్వంబుల్. 323

క. కావున మచ్చారిత్ర క, థా విలసిత మైన సుమహితస్తవము జగ
త్పావనము విగత సంశయ, భావుఁడవై బుద్ధి నిలువు పంకజజన్మా! 324

క. సగుణుఁడనై లీలార్థము, జగములఁ గల్పింపఁ దలఁచు చతురుని నన్నున్
నగుణునిగా నుతియించితి, [4]తగ సంతస మయ్యె నాకుఁ దామరసభవా! 325

క. ఈ మంజు స్తవరాజము, నీ మనమునఁ జింతఁ దక్క నిలుపుము భక్తిన్
ధీ మహిత! నీ మనంబునఁ, గామించిన కోర్కు లెల్లఁ గలుగుం జుమ్మీ. 326

క. అనుదినమును ద్రిజగ త్పా, వన మగు నీ మంగళ స్తవముఁ బఠియింపన్
వినినను జనులకు నేఁ బొడ, గనఁబడుదు *నవాప్త సకల కాముఁడ నగుచున్.

1. యనఘుడ తేజోధనుడ పరేశుఁడ (హ) 2. వాకొనఁగం (తం. వా.) 3. రమణీయంబుల్ (హ) 4. తగు (క. చ. జ.) *'సర్వకామ వరేశ్వరః' అని మూలము (9-40)

తే. వన తటా కోపనయన వివాహ దేవ, భవన నిర్మాణ భూ మ్యాది వివిధ దాన
జప తపో వ్రత యోగ యజ్ఞముల ఫలము, మామక స్తవ ఫలము సమంబుగాదు.

క. జీవావళిఁ [1]గల్పింపుచు, జీవావళి లోనఁ దగ వసింపుచుఁ బ్రియ వ
స్త్వావళి లోపలఁ బ్రియ వ,స్త్వావళి నై యుండు నన్ను ననిశముఁ బ్రీతిన్. 329

క. తలఁపుము మత్ప్రీతికి నై, కలిగించితి నిన్ను భువన కారణ నాలో
పల నణఁగి యేకమై ని, శ్చలగతి వసియించి యున్న జగముల నెల్లన్. 330

తే. తగ నహంకార మూలత త్త్వంబు నొంది,నీవు పుట్టింపు మనుచు రాజీవభవుఁడు
వినఁగ నానతి యిచ్చి య వ్విష్ణుఁడభవుఁ డంత నంతర్హితుండయ్యె ననఘ చరిత!

అధ్యాయము - ౧౦

క. అని చెప్పిన మైత్రేయునిఁ,గనుఁగొని విదురుండు వలికెఁ గడు ముద మొప్పన్
జననుత! నలినదళాక్షుఁడు, సనినం బద్మజుఁడు దేహ సంబంధమునన్. 332

క. మానస సంబంధంబును, బూనిన యీ సర్గ మెట్లు పుట్టించె దయాం
భోనిధివై నాకింతయు, మానుగ నెఱిఁగింపుము మయ్య మహిత విచారా! 333

వ. అనవుడు న మ్మునివరేణ్యుండు విదురున కిట్లనియె. పుండరీకాక్ష వరదాన ప్రభావంబునం బంకజాసనుండు శత దివ్య వత్సరంబులు భగవత్పరంబుగాఁ దపంబు గావించి తత్కాల వాయువుచేఁ గంపితం బగు నిజ నివాసంబైన పద్మంబును జలంబును గనుంగొని యాత్మీయ తపశ్శక్తిచేత నభివృద్ధిం బొందిన విద్యా బలంబున [2]వాయువు బంధించి తోయఁబుల తోడ నొక్క తోయంబు సమస్తంబునుం గ్రోలి యంత గగన వ్యాపి యగు జలంబును గనుంగొని. 334

ఉ. వారిజసంభవుండు బుధవంద్యుఁడు చిత్తమునం దలంచె దై
త్యారిఁ బయోవిహారి, సముదంచిత హారి, నతాఖిలామృతా
హారి, రమాసతీ హృదయహారి, నుదారి, విదూర భూరి సం
సారి, భవప్రహారి, విలసన్నుత సూరి, నఘారి, న య్యెడన్. 335

తే. అట్లు దలఁచి సరోజజుఁ డంబుజమును,గగన తలమునఁజూచి యా కమల కోశ
లీనమై యున్న లోక వితానములును, నొయ్యఁ బొడగని హరిచే నియుక్తుఁడైన.

1. గల్పించుచు (చ. జ. డ. తం. వా.) 2. వాయువుతోడఁ దోయంబు సమస్తంబునుం గ్రోలు (హ).

తే. వానిఁగాఁదనుఁ దలఁచి యవ్వనరుహంబు, లోపలికిఁబోయి మున్నందులోన నున్న
ముజ్జగంబులఁజూచి యిమ్మూల సృజించె,మఱి చతుర్దశ భువనముల్మహిమఁజేసి.

క. మఱియు సుధాశన తిర్య, జ్నర వివిధ స్థావరాది నానా సృష్టి
స్ఫురణ నజుం డొనరించెం, బరువడి నిష్కామ ధర్మ ఫల రూపమునన్. 338

వ. ఇట్లు భువనంబులఁ బద్మజుండు గల్పించె నని మైత్రేయుండు విదురున
కెఱింగించిన, 339

క. విదురుఁడు దురితావని భృ, ద్భిదురుడు మునివరునిఁ జూచి ప్రియము మనమునన్
గదుఁరగ నిట్లని పలికె న,తి దురంతం బైన విష్ణుదేవుని మహిమన్. 340

తే. అమరె భువనంబు లతని కాలాఖ్యతయును, గణుతి సేయు తదీయ లక్షణము లర్థి
నాకు నెఱిఁగింపుమయ్య వివేకచరిత! యనిన మైత్రేయుఁ డవ్విదురునకు ననియె.

సీ. ఆద్యంత శూన్యంబు సవ్యయంబును నగు తత్త్వ మింతకు నుపాదాన మగుట
గుణవిషయములు గైకొని కాలమును మహ దాది భూతములుఁ దన్నాశ్రయింపఁ
గాలానురూపంబుఁ గైకొని యీశుండు దన లీలకై దనుఁ దా సృజించెఁ
గర మొప్ప నఖిల లోకములందుఁ దా నుండుఁ దనలోన నఖిలంబుఁదనరుచుండుఁ

తే. గాన విశ్వమ్మునకుఁ గార్యకారణములు,దాన య మ్మహాపురుషుని తనువు వలనఁ
బాసి విశ్వంబు వెలియై ప్రభాస మొందె, మానితాచార! యీ వర్తమానసృష్టి.

క. తెఱఁగొప్ప నఖిల విశ్వముఁ, బురుషోత్తము మాయవలనఁ బుట్టుం బెరుఁగున్
విరతిం బొందుచు నుండుం, గర మర్థిన్ భూత భావి కాలము లందున్. 343

వ. అట్టి సర్గంబు నవవిధంబు. అందు [1]ప్రాకృత వైకృతంబులు గాలద్రవ్యగుణంబు
లను త్రివిధంబు లగు భేదంబులచేఁ బ్రతి సంక్రమంబు లగుచు నుండ, అందు
[2]మహత్తత్త్వంబు ప్రథమ సర్గంబు. అది నారాయణ సకాశంబున గుణ వైష
మ్యంబు నొందు. ద్రవ్యజ్ఞాన [3]క్రి యాత్మకం బైన యహంకార తత్త్వంబు
ద్వితీయ సర్గంబు. శబ్ద స్పర్శ రూప రస గంధంబు లను పంచ తన్మాత్ర ద్రవ్య
శక్తి యుక్తంబైన పృథి వ్యాది భూత సర్గంబు మూఁడవది యై యుండు.
[4]జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబులు,[5]గర్మేంద్రియంబు
లైన వాక్పాణి పాద పాయూపస్థలు నను దశ విధేంద్రియ జననంబు చతుర్థ

1. ప్రాకృత వైకృత భేదంబులు ... త్రివిధంబులకుఁ బ్రతి సంక్రమంబగు (క. బ. తం.)
2. మహాతత్త్వ గుణాశ్రయము (క. బ.) 3. క్రియోదయంబైన (క. చ. త. డ. ద. బ. తం.)
4. జ్ఞానయుక్తంబులైన (క) 5. కర్మకలాపంబులైన (క. చ. ట. ద.)

సర్గంబు. సాత్త్వికాహంకార జనితంబైన సుమనోగణ సర్గం బైదవ సర్గంబై యొప్పు. అది మనోమయంబై యుండు. జీవలోకంబునకు నబుద్ధి కృతంబులైన యావరణ విశేషంబులం జేయు తామస సర్గం బాఱవదై యుండు. ఇయ్యాఱు నీశ్వరునకు లీలార్థంబులైన ప్రాకృత సర్గంబు లయ్యె. ఇఁక వైకృత సర్గంబు నేడవది మొదలుగా గలుగునవి వినిపింతు వినుము. [1]పుష్పోత్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థోదుంబర పనస న్యగ్రోధాదు లయిన వనస్పతులును, పుష్పితంబులై ఫలపాకాంతంబులైన వ్రీహి యవ ముద్గాద్యోషధులును, నారోహణాసపేక్షంబులైన మాలతీ మల్లికాది లతలును, ద్వక్సారంబులైన వేణ్వాదులును, [2]కఠినీభూత మూలంబులుఁ, శిఖావిస్తృతంబులు న్నగు లతా విశేష రూపంబులైన వీరుధంబులును, పుష్పవంతంబులై ఫల ప్రాప్తంబు లగు చూతాది ద్రుమంబులును, నవ్యక్త చైతన్యంబు లూర్ధ్వ స్రోతంబులు నంతస్స్పర్శంబులు తమః ప్రాయంబులు నై స్థావరంబు లగు నీ యాఱు [3]నేడవ సర్గం బయ్యె. ఎనిమిదవ సర్గంబు తిర్యక్సర్గంబు. ఇది యిరువది యెనిమిది భేదంబులు గలిగి శ్వస్తనాది జ్ఞాన శూన్యంబులై, యాహారాది జ్ఞానమాత్ర నిష్ఠంబులై, ప్రాణంబు వలన నెఱుంగం దగిన వాని నెఱుంగుచు, హృదయంబున దీర్ఘానుసంధాన రహితంబులై వర్తించు ద్విశఫంబులు గల వృషభ మహిషాజ కృష్ణ సూకరోష్ట్ర గవయ రురు మేష ముఖర నవకంబును, నేకశఫంబు గల ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమర్యాది షట్కంబును, పంచనఖంబులు గల శునక సృగాల వృక వ్యాఘ్ర మార్జార శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధాముఖ భూచర ద్వాదశకంబును, మకరాది జల చరంబులును, గంక గృధ్ర బక శ్యేన భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూకాది ఖేచరంబులు నయ్యె. (అర్వాక్స్రోతంబై యేక విధంబగు) మానుష సర్గంబు రజో గుణ ప్రేరితంబై కర్మ కరణ దక్షంబై *దుఃఖంబందును సుఖంబు గోరు. ఇది తొమ్మిదవ సర్గం బనం దగు. ఈ త్రివిధ సర్గంబు వైకృతంబు లనం బడు. ఇంక దేవసర్గంబు వినుము. అదియు నెనిమిది తెఱంగులం గలిగి యుండు. అందు విబుధ పితృ సురాదులు మూఁడును, గంధర్వాప్సరస లొకటియు, యక్ష రక్షస్సు లేకంబును, భూత ప్రేత పిశాచంబు లొకటియు, సిద్ధ చారణ విద్యాధరు లేకంబును, గిన్నర కింపురుష లొకటియునుంగా దేవ సర్గం బయ్యె. ఇట్టి బ్రహ్మ నిర్మితంబు

1. అపుష్ప ఫలవంతంబులైన వనస్పతులను (క. ట. త.) 2. లతలు ముదిరి కాఠిన్యంబు నొంది యారోహణా యోగ్యంబులైన వీరుధంబులును (ద) 3. సప్తమ (క. చ. ట. త. జ. డ. ద.)

*"దుఃఖేచ సుఖమానినః" (మూ 10-25)

లైన దశ విధ సర్గంబులు నెఱింగించితి. ఇంక మనువులం దంతరంబుల నెఱిం గించెద. కల్పాదుల యందు నీ ప్రకారంబున స్వయంభూతుండును, నమోఘ సంకల్పుండును నగు పుండరీకాక్షుండు రజోగుణ యుక్తుండై స్రష్ట యగుచు స్వస్వరూపంబైన విశ్వంబు నాత్మీయ సామర్థ్యంబునం గల్పించె. అయ్యీశ్వరుని మాయా వ్యాపారంబులచే నీ సృష్టి యందు నద్యావర్తంబులం బడి భ్రమించు చున్న మహీరుహంబులం బోలె బూర్వాపరభావంబు లెఱుంగం బడకుండు. ఈ కల్పంబునం దుండు దేవాసురాదులు ప్రతి మన్వంతరంబు నందును నిట్ల నామరూపంబులచే నిర్దేశింపబడుదురు. మఱియు నిందొక విశేషంబు నెఱింగిం చెద. ఏమన్నను కౌమార సర్గం బనునది దేవ సర్గాంతర్భూతం బయ్యును ప్రాకృత వైకృ తోభయాత్మకంబై దేవత్వ మనుష్యత్వ పూజ్యం బైన సనత్కుమారాది సర్గం బనంబడె. అమోఘ సంకల్పుండైన పుండరీకాక్షుండు దనుఁ దాన యిట్లు విశ్వ భేదంబు గల్పించె. అని మైత్రేయుండు విదురునకుఁ జెప్పి కాల లక్షణం బెఱింగించు వాఁడై యిట్లనియె, 344

## అధ్యాయము - ౧౧

సీ. భువిఁ దన కార్యాంశమునకు నంతము నన్య వస్తు యోగంబు నే వలన లేక
ఘట పటాదిక జగత్కార్యంబునకు నిజ సమవాయ కారణత్వమునఁ బరఁగి
జాల సూర్య మరీచి సంగత గగనస్థ మగు త్రసరేణు షడంశ మరయఁ
బరమాణు వయ్యెఁ దత్పరమాణువం దర్క గతి యెంత తడవు దత్కాలమగును

తే. సూక్ష్మ కాలంబు విను మది సూర్యమండ, లంబు ద్వాదశ రాశ్యాత్మకం బనంగఁ
గలుగు జగమున నొకయేఁడు గడచి చనినఁగాల మెంతగు నది మహత్కాలమనఘ!

వ. అందుఁ బరమాణుద్వయం బొక్క యణు వగు. అణు త్రితయం బొక్క త్రస రేణువగు. అవి మూఁడు కూడ నొక్క త్రుటి యగు. ఆ త్రుటిశతం బొక్క వేధ యనం బరఁగు. అట్టి వేధలు మూఁడు గూడ నొక లవం బనం దగు. అవి మూఁడైన నొక్క నిమేషం బనం జను, నిమేష త్రయం బొక్క క్షణం బగు. తత్క్షణ పంచకం బొక్క కాష్ఠ యనం దగు. అవి పదియైన నొక్క లఘు వన నొప్పు.అట్టి లఘు పంచదశకం బొక్క నాడిక యనం బరఁగు,అట్టి నాడికాద్వయం బొక్క ముహూర్తం బయ్యె. అట్టి నాడిక [1]లారైన నేడైన మనుష్యులకు నొక్క ప్రహరం బగు. అదియ యామం బనం జను. [2]దివస పరిమాణ విజ్ఞేయం

1. ఏడున్నరైన (చ) 2. దివసమాన లక్షణంబగు నాడికా కల్పనం బెఱింగింతు (చ)

బగు *నాడికోన్మాన లక్షణం బెఱింగింతు. షట్పల తామ్రంబునం బాత్రంబు రచియించి, చతుర్మాష సువర్ణంబునం జతురంగుళాయామ శలాకంబు గల్పించి, దానం దత్పాత్రమూలంబున ఛిద్రంబు గల్పించి, తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్ర తోయంబు పరిపూర్ణము నొందు నంత కాలం బొక్క నాడిక యగు. యామంబులు నాలుగు సగ నొక్క పగలగు. రాత్రియు నిప్పగిదిని జరుగు. అట్టి యహర్నిశంబులు గూడ మర్త్యుల కొక దినం బగు. అవి పదియే నైన నొక్క పక్షంబగు. శుక్ల కృష్ణ నామంబులం బరఁగిన పక్షంబులు రెండుఁ గూడ నొక్క మాసం బగు. అది పితృదేవతలకు నొక్క దివసం బగు. దక్షిణోత్తర నామంబులం బరఁగిన యట్టి యయనంబులు రెండు గూడి ద్వాదశ మాసంబు లయిన యొక్క సంవత్సరం బగు. †అట్టి సంవత్సర శతంబు నరులకుం బరమాయు వై యుండు. కాలాత్మకుండును నీశ్వరుండును నైన సూర్యుండు గ్రహ నక్షత్ర తారా చక్రస్థుండై పరమాణ్వాది సంవత్సరాంతం బైన కాలంబునం జేసి ద్వాదశ రాశ్యాత్మకం బైన జగంబున సౌర బార్హస్పత్య సావన చాంద్ర నాక్షత్ర మాన భేదంబులం గానంబడుచున్న వాఁడై సంవత్సర పరీవత్స రేడావత్స రానువత్సర వత్సర నామంబుల సృజ్యమైన బీజాంకురముల శక్తిం గాలరూపం బైన స్వశక్తిచేత నభిముఖంబుగాఁ జేయుచుం, బురుషులకు నాయురాది వ్యయంబులం జేసి విషయాసక్తి నివర్తింపం జేయుచుం, గోరికలు గలవారికి యజ్ఞ ముఖంబులం జేసి గుణమయంబు లైన స్వర్గాది ఫలంబుల విస్తరింపం జేయుచు, గగనంబునం బరువు వెట్టు. వత్సర పంచక ప్రవర్తకుం డగు మార్తాండునకుం బూజ గావింపుము. అని మైత్రేయుండు పలికిన విదురుం డిట్లనియె, 346

క. నర పితృ సుర పరమాయుః పరిమాణము లెఱుఁగ నాకుఁ బలికితివి మునీ
శ్వర! యెఱిఁగింపు త్రిలోకో, పరిలోక విలోకనైక పదులగు వారిన్. 347

ఉ. పూనిన యోగసిద్ధి దగఁ బొందిన నేత్ర యుగంబునన్ బహి
ర్జ్ఞానము గల్గియుండి భువనంబులఁ జూచుచు నుండు వారికిన్
మానుగఁ గల్గు కాలగతి మా కెఱిఁగింపు మునీంద్ర! నావుడు
న్నా నయశాలి యవ్విదురు సాదరుఁడై తగఁ జూచి యిట్లనున్. 348

* ఉన్మానము = కొలపాత్ర. † ఆదిదేవతలకు నొక్క దివసంబు (తం. వా.)

సీ. జననుత కృతయుగ సంఖ్య నాలుగువేల దివ్య వర్షములు తదీయ సంధ్య
లెనుబది నూఱేండ్లును [1]నగుఁ ద్రేతయు నబ్ద త్రి సహస్రములును దదీయ సంధ్య
లాఱు నూఱేఁడులు నగు ద్వాపరము రెండు వేలు వత్సరములు వెలయు సంధ్య
లోలి నన్నూ ఱేండ్లు నొగిఁ గలియుగము సహస్రవర్షములు సంధ్యాంశ మరయ

తే. రెండునూఱేఁడులును నిల్చియుండుఁజువ్వె,యనఘ సంధ్యాంశమధ్యంబునందు ధర్మ
మతిశయించును సంధ్యాంశమందు ధర్మ,మల్పమై కానఁబడుచుండు ననుఘచరిత!

వ. మఱియు ధర్మదేవత కృతయుగంబున నాలుగు పాదంబులును, త్రేతయందు మూఁడు పాదంబులును, ద్వాపరంబునం బాద ద్వయంబును, గలియుగంబున నేకపాదంబును గలిగి సంచరించు. అట్లగుటంజేసి, 350

క. పాద విభేదంబున మ, ర్యాదలును దఱుఁగు నధర్మ మాకొలఁదినె యు
త్పాదిల్లి వృద్ధిఁ బొందు ధ, రాదివిజులు [2]పాపబుద్ధి రతు లగుదు రిలన్. 351

సీ. భూ ర్భువ స్స్వర్లోకముల కంటెఁ బొడువునఁ గడు నొప్పు సత్యలోకంబునందు
నుండు బ్రహ్మకుఁ జతుర్యుగ సహస్రము లేగ దివ మొక్కటియగు రాత్రియును నిట్ల
చన ధాత నిద్రవో జగము లణంగు మేల్కని చూడ మఱల లోకములు వుట్టుఁ
దద్దినంబునఁ జతుర్దశమను లగుదు రం దొక్కొక్క మనువున కొనర దివ్య

తే. యుగము లోలిని డెబ్బదియొక్కమాఱు,సనిన మనుకాల మయ్యెనమ్మనుకులంబు
సురలు మునులును సప్తర్షు లరయ భగవ,దంశమునఁబుట్టిపాలింతు రఖిలజగము.

క. హరి పితృ సుపర్వ తిర్యఙ్, నర రూపములన్ జనించి నయమున మన్వం
తరముల నిజ సత్త్వంబునఁ, బరిపాలించును జగంబు పౌరుష మొప్పన్. 353

క. క్రమమునఁ దై ్రవర్గిక స, ర్గము సెప్పంబడె సరోజగర్భుఁడు దివసాం
తమునఁ దమః పిహిత పరా, క్రముఁడై శయనించు నిద్ర గైకొని యంతన్.

సీ. ఆ రాత్రి భువన త్రయము దమః పిహిత మై భాను చంద్రులతో విలీన మైన
సర్వాత్ముఁ డగు హరిశక్తిరూపం బయి కణఁగి వెలుంగు సంకర్షణాగ్ని
భువనత్రయంబును దవిలి దహింప న య్యనల కీలలఁ బొడమిన మహోష్మ
లలమినఁ గమలి మహర్లోక వాసులు జన లోకమునకును జనుదు రపుడు

తే. విలయ సమయ సముత్కట విపుల చండ, వాత ధూ తోర్మిజాల దుర్వార వార్ధి
భువనములు ముంచునమ్మూఁడు భువనములను,దత్పయోరాశిమీఁదఁ బద్మావిభుండు.

1. విను త్రేత వత్సర (తం. వా.) 2. పాదబుద్ధి (తం. వా.)

ఉ. చారు పటీర హీర ఘనసార తుషార మరాళ చంద్రికా
పూర మృణాళహార పరిపూర్ణ సుధాకర కాశ మల్లికా
సార నిభాంగ శోభిత భుజంగమ తల్పము నందు యోగ ని
ద్రారతిఁ జెంది యుండు జఠర స్థితి భూ ర్భువరాది లోకుఁడై. 356

క. జనలోక నివాసకు ల, ర్థిని వినుతింపంగ నతుల దివ్య ప్రభచేఁ
దనరుచు మీలిత నిజలో, చనుఁడై వసియించు నతఁడు సముచిత లీలన్. 357

వ. ఇవ్విధంబున, 358

సీ. కైకొని బహు విధ గత్యుప లక్షి, తములై యహోరాత్ర తతులు జరుగ
శత వత్సరంబులు జనులకుఁ బరమాయు వైన రీతిని బంకజాసనునకుఁ
బరమాయు వగు శతాబ్దంబు లందుల సగ మరిగిన నదియుఁ బరార్ధ మండ్రు
గానఁ బూర్వార్ధంబు గడచుటఁ జేసి ద్వితీయ పరార్ధంబు దీని పేరు

తే. గడఁగి పూర్వ పరార్ధాది కాలమందు, బ్రహ్మకల్పాఖ్య నెంతయుఁ బరఁగు నందు
బ్రహ్మ యుదయించుటం జేసి బ్రహ్మకల్ప, మనియు శబ్దాత్మక బ్రహ్మమనియు
నెగడు. 359

క. విను మెన్నఁడు పంకజ నా, భుని నాభీ సరసియందు భువనాశ్రయ మై
తనరిన పద్మము వొడమును, ననఘా! యది పద్మకల్ప మన విలసిల్లున్. 360

వ. పూర్వ పరార్ధాదినిం గలిగిన [1]బ్రహ్మకల్పంబుఁ జెప్పితి. ఇంక ద్వితీయపరార్ధంబు మొదల నెన్నఁ డేని హరి సూకరాకారంబు దాల్చె నది వరాహకల్పం బనం దగు. అట్టి వరాహకల్పం బిపుడు వర్తమానం బగుచున్నది. వెండియు, 361

సీ. దీపింపఁ గాలస్వరూపుఁ డైనట్టి పద్మాక్షుఁ డనంతుఁ డనాదిపురుషుఁ
డఖిలఁ విశ్వాత్మకుఁ డగు నీశునకుఁ బర మాణ్వాది యుగ పరార్ధాంత మగుచు
జరుగు నీ కాలంబు చర్చింప నొక్క నిమేషకాలం బయి మెలఁగుచుండుఁ
గాన నీశ్వరునకుఁ గర్తగాఁ జాల దిక్కాలంబు విను మది గాక దేహ

తే. మందిరార్థాది కర్మాభిమాన శీలు, రైన వారికి నాశ్రయం బగుటఁజేసి
యరయు హరి దద్గుణ వ్యతికరుఁడు గాన, కాల మమ్మేటి కెన్నఁడుఁ గర్తగాదు.

వ. మఱియు షోడశ వికార యుక్తం బై పృథివ్యాది పంచభూత పరివృతంబై దశావరణంబులు గలిగి పంచాశ త్కోటి విస్తీర్ణం బై బ్రహ్మాండ కోశంబు దనరుచుండు. 363

1. పద్మకల్పంబు (క. ద.)

చ. హరి పరమాణు రూపమున నందు వసించి విరాజమానుఁ డై
సరి వెలుఁగొందు నిమ్మల ససంఖ్యము లైన మహాండ కోశముల్
నెఱిఁ దన యందు డింద నవనీరజ నేత్రుఁ డనంతుఁ డాద్యుఁడ
క్షరుఁడు పరాపరుం డఖిల కారణ కారణుఁ డప్రమేయుఁ డై. 364

క. నిరతిశ యోజ్జ్వల తేజః, స్ఫురణన్ దనరారు పరమ పురుషుని విష్ణుం
బురుషోత్తము వర్ణింపను, సరసిజభవ భవుల కైన శక్యమె చెపుమా! 365

అధ్యాయము — ౧౨

క. అని మైత్రేయుఁడు విదురుం, గనుఁగొని వెండియును బలికెఁ గాలాహ్వయుఁడై
తనరిన హరి మహిమల నే,వినిపించితి సృష్టి మహిమ విను మెఱిఁగింతున్. 366

వ. పరమేష్ఠి యీ సృష్ట్యాది [1]నహ మ్మను దేహాభిమానబుద్ధి గల మోహంబును, అంగనా సంగమ ప్రక్చందనాది గ్రామ్య భోగేచ్ఛలు గల మహా మోహంబును, దత్ప్రతిఘాత జాతంబైన క్రోధంబునందుఁ గలుగు తామిస్రంబును, దన్నాశంబు నందు అహ మేవ మృతోఽ స్మి యను నంధ తామిస్రంబును, చిత్త విభ్రమంబు నను నవిద్యా పంచక మిశ్రంబుగా సర్వ భూతావళిం బుట్టించి, యాత్మీయ చిత్తంబునం బాపసృష్టి గల్పించుటకుఁ బశ్చాత్తాపంబు నొంది భగవద్ధ్యానామృత పూతమానసుండై యూర్ధ్వరేతస్కులు పరమ పవిత్రులు నైన సనక సనందన సనత్కుమార సనత్సుజాతు లను మునుల నతి సత్త్వగుణ గరిష్ఠుల ధీర జనోత్తముల నార్యుల హరిప్రపన్నులనుం గా దివ్యదృష్టిఁ గల్పించి వారలం జూచి మీ మీ యంశంబులఁ బ్రజలం బుట్టించి ప్రపంచము వృద్ధిఁ బొందింపుం డనిన వారలు దద్వచనంబు లపహసింపుచుఁ బద్మజునిం గని మోక్షధర్ములు నారాయణపరాయణులు నై ప్రపంచ నిర్మాణంబునకుఁ బ్రతికూల వాక్యంబులు పలికిన, నుదయించిన క్రోధంబు బుద్ధిచే నిగ్రహింపంబడినను నరవింద సంభవుని భ్రూ మధ్యంబు వలనం గ్రోధ స్వరూపంబున నీలలోహితుండు నిఖిలసురాగ్రజుం డై యుదయించుచు (నాక్రందనం బొనరించె నంత)... 367

మ. జననం బందిన నీలలోహితుఁడు గంజాతాసనుం జూచి యి
ట్లను నో దేవ ! మదాఖ్య లెట్టివి [2]మదీయావాసముల్ పేఁక నా
కనయం బీ వెఱిఁగింపుమా యనుడు న య్యంభోజగర్భుండు లా
లనముం దోఁపఁ గుమార ! నీ జననవేళన్ రోదనం బిచ్చుటన్. 368

1. మూలమునందలి వరుస ఆంధ్రమున వ్యత్యస్తముగానున్నది. ససర్జాగ్రేఽధతామిస్ర మథతామిస్ర మాదికృత్ - మహా మోహంచ మోహంచ తమ శ్చాజ్ఞాన వృత్తయః (12-2) 2. మదీయావాస మెచ్చోట (క. చ. ట. త. జ. ద. లం.)

తే. రుద్రనామంబు నీకు నిరూఢ మయ్యెఁ, జంద్ర సూర్యానలానిల సలిల గగన
పృథివి ప్రాణ తపో హృదింద్రియములనఁగఁ,గలుగు నేకాదశస్థానములు వసింప.

వ. అని వెండియు మన్యు.మను, మహాకాల,మహత్.శివ.ఋతధ్వజ,ఉరురేతస్,భవ,
కాల, వామదేవ, ధృతవ్రతులను నేకాదశ నామంబులు గలిగి ధీ.వృత్తి,అశనా,
ఉమా, నియుత్, సర్పిః, ఇలా, అంబికా, ఇలావతీ, సుధా, దీక్షా, నామపత్నీ
సమేతుండవై, పూర్వ నియుక్తంబులైన నామంబులఁ దత్తన్నివాసంబుల వసి
యించి ప్రజలం గల్పింపు మని నిర్దేశించిన భగవంతుం డగు నీలలోహితుండు
విశ్వగురుండైన పితామహునిచేత నియుక్తుండై సత్త్వాకృతి స్వభావంబుల నాత్మ
సములైన ప్రజలం గల్పించె. 370

ఉ. రుద్రునిచేత నీ గతి నిరూఢమతిన్ సృజియింపఁబడ్డ యా
రుద్రగణంబు లోలి [1]నవరుద్ధత విశ్వము మింగ్రెన మ్మహో
పద్రవ శాంతికై యజుఁడు భర్గులఁ జూచి కుమారులార ! మీ
రౌద్ర విలోకనానల భరంబునఁ గ్రాఁగె సమస్త లోకముల్. 371

క. మీ సృష్టి చాలు నింకను, శ్రీ సత్తములార! వినుఁడు ధృతి మీరు దపో
వ్యాసంగ చిత్తులై చనుఁ, డా సన్మంగళము లగు దృఢంబుగ మీకున్. 372

మ. భగవంతున్ బురుషోత్తమున్ హరిఁ గృపా పాథోధి లక్ష్మీశ్వరున్
సుగుణ భ్రాజితు నచ్యుతుం బరుఁ బరంజ్యోతిన్ బ్రభున్ సర్వభూ
త గుహావాసు నధోక్షజున్ శ్రితజన త్రాణైక పారీణు నా
జగదాత్మున్ గనుచుందు రార్యులు దపశ్శక్తిన్ స్ఫుట జ్ఞానులై. 373

వ. అనిన విని, 374

ఉ. కైకొని యిట్లు పంకరుహ గర్భ నియంత్రితులైన రుద్రు లు
ద్రేకము దక్కి కానలకు ధీ యుతులై తప మాచరింప న
స్తోక చరిత్రు లేగిరి చతుర్ముఖుఁ డంతఁ బ్రపంచ కల్పనా
లోకనుఁడై సృజించె జనలోక శరణ్యుల ధీవరేణ్యులన్. 375

తే. వినుము భగవద్బలాన్విత వినుత గుణులు, భువన సంతాన హేతువిస్ఫురణకరులు
పద్మ సంభవ తుల్య ప్రభావ యుతులు, [2]పదుగురు సుతులు పుట్టిరి భవ్యయశులు.

1. అవరుద్ధత (హ. తం. వ. బ.); అవరుద్రత (క. త.) 2. పదురుకొడుకులు (క. తం. వా.)

సీ. అరవిందసంభవు నంగుష్ఠమున దక్షుఁ డూరువు వలనను నారదుండు
నాభిఁ బులహుఁడు గర్ణములఁ బులస్త్యుండు ద్వక్కున భృగువు హస్తమునఁ గ్రతువు
నాస్యంబు వలన న య్యంగిరసుఁడు ప్రాణమున వసిష్ఠుఁడు మనమున మరీచి
కన్నుల నత్రియుఁ గాఁ బుత్ర దశకంబు గలిగిరి వెండియు నళినగర్భు

తే. దక్షిణ స్తనము వలన ధర్మ మొదవె, వెన్ను వలన నుదయ మయ్యె విశ్వభయద
మైన మృత్యు వధర్మంబునంద కలిగె,నాత్మఁగాముండు జననము నందె మఱియు.

సీ. [1]భ్రూ యుగళంబునఁ గ్రోధంబు, నధరము నందు లోభంబు, నాస్యమున వాణి
యును మేఢ్రమందుఁ బయోధు లపానంబునందు నఘాశ్రయుఁ డైన నిఋతి
లాలిత చ్ఛాయ వలన దేవహూతి విభుండు గర్దముఁడును బుట్టి రంత
నబ్జజుం డాత్మదేహమున జనించిన భారతిఁ జూచి విభ్రాంతిఁ బొరసి

తే. పంచశర బాణ నిర్భిన్న భావుఁ డగుచుఁ, గూఁతురని పాపమునకు సంకోచపడక
కవయఁ గోరిన జనకునిఁ గని మరీచి, మొదలుగాఁగల యమ్ముని ముఖ్యు[2]లలిగి.

వ. ఇ ట్లనిరి. 379

ఉ. చాలుఁ బురే! సరోజభవ! సత్పథవృత్తిఁ దొలంగి కూఁతు ని
ట్లాలరివై రమింప హృదయంబునఁ గోరుట [3]ధర్మరీతియే?
బేలరి వైతి నీ తగవు పెద్దతనంబును మంటి పాలుగా
శీలము వోవఁ దట్టి యిటు సేసిన వారలు మున్ను గల్గిరే? 380

ఉ. నీవు మహానుభావుఁడ వనింద్య చరిత్రుఁడ విట్టి చోట రా
జీవభవుండు దా విధి నిషేధము లాత్మ నెఱుంగఁ డయ్యె నీ
భావభవ ప్రసూన శర బాధితుఁడై తన కూఁతుఁ బొందెఁ బో
వావి దలంపలే కనుచు వారక లోకులు ప్రువ్వఁ దిట్టరే? 381

క. పాపము దలఁపక నిమిషము, లోపలఁ జెడు సౌఖ్యములకు లోనైతివె యిం
తే పో ధారుణిఁ "గామాం, ధోఽపి న పశ్యతి" యనంగఁ దొల్లియు వినమే. 382

మ. అని యి ట్లంగి మునీంద్రు లాడిన కఠోరాలాపముల్ వీనులన్
విని లజ్జావనతాననుం డగుచు నా నీరేజగర్భుండు స
య్యన దేహంబు విసర్జనీయముగఁ జేయన్ దిక్కుల్ లేతెంచి త
త్తనువున్ గైకొనఁ బుట్టె దిక్కలితమై తామిస్ర [4]నీహారమున్. 383

1. భ్రూమధ్య తలమున (క. తం.) 2. లెటిఁగి (హ. తం. వా.) 3. ధర్మసంగతే (క. చ. ట. త. జ. ఢ. ద.) 4. నీహారముల్ (హ. తం. వా.)

వ. అంత, 384

చ. ఉడుగక పంకజాతభవుఁ డొండొక దేహము దాల్చి ధైర్యముం
విడువక [1]సృష్టిఁ బూర్వ సమవేతముగం సృజియించు నేర్పు దాఁ
బొడమమి కాత్మలోనఁ దలపోయుచు నుండఁ జతుర్ముఖంబులం
వెడలె ననూన రూపముల వేదము లంచిత [2]ధర్మయుక్తతం. 385

తే. మఱియు మఖములు మహిత కర్మములుఁ దంత్రములును నడవళ్ళు
నాశ్రమములుఁ దదీయ,
ముఖ చతుష్కము నందునఁ బొడమె ననిన, విని మునీంద్రునిఁ జూచి
య వ్విదురుఁ డనియె. 386

క. తోయజసంభవుఁ డప్పుడు, నే యే ముఖమండలమున నే యే సృష్టిం
ధీయుతుఁడై సృజియించెను, బాయక యి త్తెఱఁగు దెలియఁ బలుకుము నాకుం.

వ. అని యిట్లు విదురుం డడిగిన మైత్రేయుం డతనితో ని ట్లనియె. ఋగ్యజు స్సామాధర్వంబు లను వేదంబులును, హోతృకర్మంబులైన యప్రగీత మంత్ర స్తోత్రంబు లగు శస్త్రంబులును, అధ్వర్యు కర్మంబైన యిజ్యయు, సంప్రగీత స్తోత్రం బగు స్తుతియు, [3]గాతృ ప్రయోజ్యం బైన ఋక్సముదాయ రూపం బగు స్తోమంబును, ప్రాయశ్చిత్తం బగు బ్రహ్మ కర్మంబును, ఆయుర్వేద ధను ర్వేద గాంధర్వ వేదంబులను నుపవేదంబులును, విశ్వకర్మ శాస్త్రంబగు స్థాప త్యంబును, ప్రాగాది ముఖంబుల ను త్పన్నంబు లయ్యె. పంచమ వేదం బగు నితిహాస పురాణంబులు సర్వ ముఖంబులం గలిగె. మఱియుం గర్మ తంత్రంబు లైన షోడశ్యుక్థ్యములును, జయనాగ్నిష్టోమంబులును, ఆప్తోర్యామాతి రాత్రం బులును, వాజపేయ గో సవంబులును, ధర్మపాదంబులైన విద్యా దాన తప స్సత్యంబులును, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యత్యాశ్రమంబులును గలిగె. వీనికి నొక్కొక్కటికిం జతుర్విధంబులైన వృత్తులు గలిగియుండు. అందు సావిత్రం బను బ్రహ్మచర్యంబును, ఉపనయనం బాదిగా దివసత్రయంబు గాయత్రి జపించుట యను ప్రాజాపత్యంబును, వేదవ్రత చతుష్టయంబు వ్రతులు సంవత్సర పర్యంతంబుగా నాచరించుట యను బ్రాహ్మంబును, వేదగ్రహణాం తంబు నాచరింపఁదగు నైష్ఠికంబును అను బ్రహ్మచారి వృత్తి చతుష్టయంబును, అనిషిద్ధకృష్యాది వృత్తియగు వార్తయు, యజనాది కర్మోపయుక్తం బైన

1. సృష్టిఁబూర్వమున వే సృజియించిన నైపుణంబుదా (హ); సృజియించు నేర్పుదా (వా)
2. ధర్మయుక్తిమై (క. బ. తం.) 3. సామగానంబును సోమంబగు స్తోత్రంబును (క. చ. ట.)

యాజ్ఞాదిరూపం బగు సంచయంబును,పరుల యాచింపకుండు నయాచితం బను శాలీనంబును, క్షేత్ర పతిత కణిశకణ సంగ్రహణ రూపం బగు శిలోంఛంబును అను గృహస్థ వృత్తులు నాలుగును; అకృష్టపచ్యాహారు లగు వైఖానసులును, నూతన ఫలంబు లభ్యం బయినఁ బూర్వసంచిత పదార్థ త్యాగంబుగల వాలఖిల్యులును, ప్రాతః కాలంబున నే దిక్కు విలోకింతు ర ద్దిక్కునకుం జని యచ్చట లభించు పదార్థంబులన్ భుజించు నౌదుంబరులును, తమంత ఫలించి తరుపతితంబు లగు ఫలంబులం దినుచుండు ఫేనపులును అను చతుర్విధ వృత్తులుంగల వానప్రస్థులును;స్వాశ్రమ విహిత కర్మంబులం బ్రధానుం డగు కుటీచకుండును, గర్మం బుపసర్జనంబు చేసి జ్ఞాన ప్రధానుం డగు బహూదుండును, గేవల జ్ఞానాభ్యాస నిష్ఠుం డగు హంసుండును, బ్రాప్తం బైన పరబ్రహ్మ తత్త్వంబు గల నిష్క్రియుండును అను సన్న్యాసి చతుర్విధ వృత్తులును; మోక్షఫల ప్రదం బయి యాత్మానాత్మ వివేక విద్యారూపం బగు నాన్వీక్షకియు, స్వర్గాదిఫల ప్రదంబయి కర్మ విద్యారూప మగు త్రయియు, జీవనఫల ప్రధానం బయి కృష్యాది రూపం బగు వార్తయు, నర్థ సంపాదనైక ప్రయోజనం బగు దండనీతియు నను మోక్ష ధర్మ కామార్థంబులైన న్యాయ విద్యా చతుష్టయంబును; భూ ర్భువ స్సువ యను వ్యాహృతులును, పూర్వాది ముఖముల నుదయించె. మఱియు నతని హృదయాకాశంబు వలనం బ్రణవంబును, రోమంబుల వలన నుష్ణిక్ఛందంబును, ద్వగింద్రియంబు వలన గాయత్రీ చ్ఛందంబును, మాంసంబు వలనం ద్రిష్టుప్ఛందంబును, స్నాయువుల వలన ననుష్టుప్ఛందంబును, అస్థివలన జగతీ చ్ఛందంబును, మజ్జ వలన పంక్తి చ్ఛందంబును, ప్రాణంబు వలన బృహతీ చ్ఛందంబును, కకారాది పంచవర్గాత్మకం బైన (స్పర్శలవలన) జీవుండును, అకారాది స్వరాత్మకంబైన దేహంబును, నూష్మంబులను శ ష స హా ది వర్ణ చతుష్టయ రూపంబు లగు నింద్రియంబులును, నంతస్థలగు య ర ల వ లను వర్ణంబులును,షడ్జాది సప్త స్వరరూపంబు నాత్మబలంబునైన శబ్ద బ్రహ్మంబును చతుర్ముఖుని లీలా విశేషంబున నుత్పన్నం బయ్యె. వ్యక్తావ్యక్తంబు వైఖరీ ప్రణవాత్మకంబు నైన శబ్ద బ్రహ్మంబు వలనం బరమాత్మ యవ్యక్తాత్మకుం డగుటం జేసి పరిపూర్ణుండు, వ్యక్తాత్మకుం డగుటం జేసి యింద్రాది శక్త్యుపబృంహితుండునయి కానంబడు. పదంపడి యజుండు భూరివీర్యవంతులైన ఋషిగణంబుల సంతతి యవిస్తృతం బని దలంచి,పూర్వతను పరిగ్రహంబు చాలించి, యనిషిద్ధ కామాసక్తం బైన దేహాంతర పరిగ్రహంబు చేసి,నిత్యంబు ప్రజాసృష్టి యందు వ్యాసక్తుండ నైనను బ్రజ లభివృద్ధి వొందక యుండుట కేమి కారణం

బగు నని యచ్చెరువు నొంది తద్వృద్ధి యగు విధంబు నాలోచింపుచు దైవం బిచ్చట విఘాతుకంబు గాన తదానుకూల్యం బావశ్యకం బని దాని నెదురు చూచుచు యథోచిత కృత్యకరణ దక్షం డగుచు నుండ చతుర్ముఖుని దేహంబు ద్వివిధం బయిన నట్టి రూపద్వయ విభాగంబు స్వరాట్టగు స్వాయంభువ మనువు దన్మహిషి యగు శతరూప యను కన్యకయుంగా మిథునంబై జనియించె. అమ్మిథునంబు వలనం బ్రియవ్రతోత్తానపాదు లను పుత్రద్వయంబు, నాకూతి, దేవహూతి, ప్రసూతు లను కన్యకా త్రయంబునుం గలిగిరి. అందు నాకూతిని రుచిరునకు, దేవహూతిం గర్దమునకుఁ, బ్రసూతిన్ దక్షునకు నిచ్చె. వీరలవలనం గలుగు ప్రజా సంతతుల చేత జగంబు పరిపూర్ణంబు లయ్యె. 388

అధ్యాయము — ౧౨

—: స్వాయంభువ మనువు ప్రజావృద్ధి చేయుట :—

క. అని మైత్రేయుండు సెప్పిన, విని మనమున హర్ష మొదవ విదురుండు ముని నా
థునిఁ జూచి పలికెఁ గ్రమ్మఱ, వనజోదర పాదభక్తి వశమానసుఁడై. 389

క. ఘనుఁడు స్వయంభువునకుఁ బ్రియ, తనయుండు స్వాయంభువుండు దైతేయ విభే
దన సేవా చతురుండును, జనవినుతుం డాదిరాజ సత్తముఁ డౌటన్. 390

క. అతని చరిత్రం బవ్యా, హత సుఖదము నిఖిల మంగళావహము సమం
చితమును గావున బుధసే, విత! నాకెఱుఁగంగఁ [1]బలుకు విశ్వస్తుత్యా! 391

క. అదియునుఁ గాక ముకుందుని, పదకమల మరందపాన పరవశులై పెం
పొదవిన వారి చరిత్రము, సదమలమతి వినిన భవము సఫలము గాదే? 392

చ. అని విదురుండు వల్కిన దయాన్వితుఁడై మునినాథ చంద్రుఁ డి
ట్లను శ్రుతి శాస్త్ర పార కలితాత్మకుఁ డైన నరుండు పద్మలో
చన చరణారవింద యుగ సంగము గల్గిన సజ్జనుండు నొం
దిన ఫలమొందు భాగవత దివ్యకథా [2]శ్రవణుండు వేల్మిడిన్. 393

క. అని చెప్పి మునికులాగ్రణి, దనుజారి కథా సుధాప్లుత స్వాంతుండై
తనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానంద బాష్పములు జడిగురియన్.

1. బల్కవే (క. వ. చ.); జెప్పవే మునితిలకా (చ. ఓ. త. చ.) 2. శ్రవణానురక్తితోన్(హ.)

సీ. వినిపింప దొడఁగె నా ఘనుఁడు స్వాయంభువుఁ డంగనా యుక్తుఁడై యబ్జగర్భు
నకు మ్రొక్కి వినయవినమితో త్తమాంగుఁడై హస్తముల్ మొగిచి యిట్లనియెఁ బ్రీతి
[1]జీవ సంహతికి రాజీవసంభవ! నీవ జనన రక్షణ వినాశముల కరయ
హేతుభూతుఁడవు మాకెద్ది యాచరణీయ మైన కర్మము దాని నానతిమ్ము

తే. ఎట్టి కర్మంబు సేసిన నెసఁగు నీకు, నవహితం బైన సంతోష మాత్మజుండు
జనకునకు భక్తిఁ బరిచర్య సలిపి కీర్తి,నంది నుతి కెక్కి వర్తించు నందు నిందుఁ
†గాన నెఱిఁగింపు మట్టి సత్కార్మ మనఘ! 395

క. అని పలికిన స్వాయంభువ, మను మృదు భాషలకు నలరి మనమునఁ గమలా
సనుఁ డనురాగము ముప్పిరిఁ,గొనఁ బ్రియతముఁ డైన సుతునకును నిట్లనియెన్.

చ. మనుకొని తండ్రియాజ్ఞఁ దలమోచి నిజోచిత కృత్య మేమి పం
చినఁ దన [2]శక్తి చేత నెడసేయక చేయుట పుండరీక లో
చన పదసేవ సేయుట ప్రజాపరిపాలన శాలి యౌటయున్
[3]జనకునకున్ సుతుండు పరిచర్య లొనర్చుట సువ్వె పుత్రకా! 397

వ. కావున, 398

మ. వివరింపన్ హరి యజ్ఞమూర్తిఁ బరమున్ విష్ణున్ హృషీకేశుఁ గే
శవుఁ బద్మాక్షు గురించి జన్నములు శశ్వద్భక్తిఁ గావింపు మా
ధవుఁ డాత్మన్ బరితోషమొందు నతఁ డుద్య[4]త్ప్రీతిఁ గైకొన్న లో
క వితానంబులు తుష్టి నొందు ననఘా! కావింపుమా యజ్ఞముల్. 399

చ. అకుటిల భక్తిఁ గేశవ సమర్పణ బుద్ధిఁ గ్రతుక్రియల్ వొన
ర్పక విపరీతులై యుముకరాసులు దంచి ఫలంబు నందఁ గా
నక చెడు రీతి నూరక ధనవ్యయ మౌటయ కాని మోక్షదా
యక మగుచున్న తత్ఫలము నందరు విష్ణు పరాఙ్ముఖ క్రియుల్. 400

ఉ. కావున యజ్ఞముల్ హరి వికార విదూరు గుఱించి సేయు నీ
భావము సూనృత వ్రత శుభస్థితిఁ జెందెడు నీ కుమారులున్
నీవును నీ ధరాభరము నెమ్మి వహింపుము సజ్జనావళిన్
బ్రోవుము ధర్మమార్గమునఁ బుత్రక! దోష లతా లవిత్రకా! 401

1. జీవరాశులకు (క. బ.); జీవరాసులకు (తం. వా.) † ఈ యెదవ పాదమునకు బదులు తం. వా. లలో కావున నెఱింగింపు మట్టి సత్కార్మంబు అను వచనము కలదు. 2. శక్తి యుక్తి (క. బ. తం. వా.) 3. జననుతుఁడై (హ) 4. త్ప్రీతుఁడై యున్న (తం)

క. అనవుడు నతనికి నతఁ డీ, ట్లనియె [1]భవదీయమైన యానతి యెట్ల
ట్లొనరించెద నాకును నా, తనయులకు వసించి యుండఁ దగు నెల వెందున్.

తే. అరయ లేదు, విధాత! యీ యఖిల జంతు, జాతముల కెల్ల నాధారభూత మైన
ధరణి యిప్పుడు ఘన జలాంత ర్నిమగ్న, మైన కతమునఁ జోటులే[2]దంటిఁ దండ్రి.

క. కావున భూ మ్యుద్ధరణము, గావించు నుపాయ మిపుడు గైకొని నాకున్
దేవా! నీ వెఱిఁగింపుము, నావుడు పద్మజుఁడు దన మనంబునఁ దలఁచెన్. 404

—: శ్రీ యజ్ఞ వరాహావతార వర్ణనము :—

మ. జల మధ్యంబున లీనమైన ధరణీ చక్రంబు నే నేర్పునన్
నిలుపన్ వచ్చును బూర్వమందు జగముల్ నిర్మించు నాఁ డాది న
ప్పులఁ బుట్టించిన మీఁద న వ్వసుమతిన్ [3]బుట్టించితి న్నట్టి య
ప్పులలోఁ గ్రుంకి రసాతలాంతరమునుం బొందెన్ గదా పృథ్వియున్. 406

సీ. అఖిల జగత్కల్పనాటోపమునకుఁ బా ల్పడిన నా చేత నెబ్బంగి నిపుడు
దగిలి విశ్వంభరోద్ధరణంబు గావింప నగు నని సర్వ భూతాంతరాత్ముఁ
బురుషోత్తముని నవ పుండరీకాక్షు లక్ష్మీపతిఁ దన మనస్థ్సితునిఁ జేసి
తలపోయుచున్నఁ బద్మజు నాసికా వివరమ్ముల యజ్ఞ వరాహమూర్తి

తే. యర్థి నంగుష్ఠ మాత్ర దేహంబు తోడ, జనన మంది వియత్తల స్థాయి యగుచు
క్షణము లోపల భూరి [4]గజప్రమాణ, మయ్యె నచ్చటి జనముల కద్భుతముగ. 405

సీ. అంతఁ బ్రజాసర్గ మందు నియుక్తులై నట్టి మరీ చ్యాదులైన మునులు
మను కుమారకులు న మ్మను సహితంబుగ యజ్ఞ వరాహంబు నర్థిఁ జూచి
యిట్టి యాశ్చర్య మె ట్లైందేని గలదె నా సా రంధ్ర నిర్గత స్తబ్ధరోమ
[5]తోకంబు మనము విలోకింప నంగుష్ఠ మాత్రమై యీ క్షణ మాత్రలోన

తే. మహిమ దీపింప దంతి ప్రమాణమున మ, హోన్నతంబైన గండ శిలోపమంబు
నయ్యె ననుచు వితర్కించి రబ్జభవుఁడు, హర్ష మిగురొత్త నిట్లని యపుడు దలఁచె.

క. నా మనమునఁ గల దుఃఖ వి, రామము గావించు కొఱకు రాజీవాక్షుం
డీ మేర యజ్ఞ పోత్రి శ్రీమూర్తి వహించె నిది విచిత్రము దలఁపన్. 408

1. అఘనాశ నీదు యానతి (క.బ.); అని యెన్న ఘనాశ నీవు నానతి (తం) 2. లేదగుట (హ)
3. బుట్టించితిం బుత్ర (హ. వా.) 4. జగత్ప్రమాణ మయ్యె (హ) 5. లోకంబు (హ. తం.వా.)

వ. అని వితర్కించు సమయంబున సూకరాకారుం డైన భగవంతుండు, 409

తే. ప్రళయ జీమూత సంఘాత భయద భూరి, గర్జ నాటోప భిన్న దిగ్ఘనగభీర
రావ మడరింప నపుడు రాజీవభవుఁడు, మునులు నానందమును బొంది
రనఘచరిత! 410

వ. అంత మాయా మయ వరాహ ఘుర్ఘురారావంబు బ్రహ్మాండ కోటర పరిస్ఫోటనంబు గావింప విని జన స్తప స్సత్యలోక నివాసులైన మునులు, ఋగ్యజు స్సామ మంత్రంబుల వినుతించిరి. యజ్ఞ వరాహ రూప ధరుం డైన సర్వేశ్వరుండు సత్పురుష పాలన దయాపరుండు గావున ది గ్గజేంద్ర లీలా విలోలుండై. 411

సీ. కఠిన సటా చ్ఛటోత్కట జాతవాత నిర్ధూత జీమూత సంఘాతముగను
క్షుర నిభ సునిశిత ఖుర పుటాహత చల త్ఫణి రాజ దిగ్గజ ప్రచయముగను
చండ దంష్ట్రోత్థ వైశ్వానరార్చిః ప్రవద్రజత హేమాద్రి విస్రంభముగను
ఘోర గంభీర ఘుర్ఘుర భూరి నిస్వన పంకిలాఖిల వార్ధి సంకులముగఁ

తే. బొరలుఁ గెరలు నటించు నంబరము దెరల, రొప్పు నుప్పర మెగయును
గొప్పరించు
ముట్టె బిగియించు మస మస మూరుకొనుచు, నడరు సంరక్షిత క్షోణి
యజ్ఞఘోణి. 412

వ. మఱియు నయ్యజ్ఞ వరాహంబు, 413

సీ. తివిరి చతుర్దశ భువనంబులను దొంతు లొరగఁ గొమ్ముల జిమ్ము నొక్క మాటు
[1]పుత్తడి కొండ మూపుర మను నొఱగంట నొరకురా రాపాడు నొక్క మాటు
ఖురముల స ప్త [2]సాగరముల రొంపిగా నుంకించి మట్టాడు నొక్క మాటు
నాభీల వాల వాతాహతిచే మిన్ను [3]నొదవించు బయలుగా నొక్కమాటు

తే. [4]కన్నుఁగొనలను విస్ఫులింగములు చెదర,నురు భయంకరగతిఁదోఁచునొక్కమాటు
పరమ యోగీంద్ర జనసేవ్య భవ్యవిభవ, యోగ్యమై కానఁగా నగు నొక్కమాటు.

వ. ఇట్లు విహరింపుచుఁ బ్రాత ర్మధ్యందిన తృతీయ సవన రూపుండైన యజ్ఞ వరాహమూ ర్తి యగు సర్వేశ్వరుండు మహా ప్రళయంబు నందు యోగ నిద్రా వశుం డై యుండు నవసరంబున నుదకస్థం బైన భూమి రసాతల గతం బైన దాని నుద్ధరించుటకు సముద్రోదరంబు దరియం జొచ్చు వేగంబు నైరింపం జాలక సముద్రుం డూర్ము లను భుజంబు లెత్తి విశీర్ణహృదయుండై యార్తుని పగిది

1. పుత్తడి కొండ మూపురమును నొఱయంగ నుఱుకు రాపాడు నొక్కొక్కమాటు (హ)
2. సాగరముల రొంపిగా నుక్కించి (వా. హ.); సాగరమున సేతువు, లొసరొత్త (తం); సేతువు లొనరొత్త (క. ట. జ.); సేతువు లొనరెత్త (త) 3. నొదవించు బయలుగా (క. చ. ట. బ. తం.)
4. కన్నుఁగొనల (తం. వా.)

యజ్ఞ వరాహ! నన్ను రక్షింపు రక్షింపు మని యాక్రోశింప నిశిత కరాళ క్షుర తీక్ష్ణంబు లైన ఖురాగ్రంబుల జలంబులు విచ్ఛిన్నంబులు గావించి యపారం బైన రసాతలంబు ప్రవేశించి భూమిం బొడగను నవసరంబున. 415

క. శరనిధి లోన మహోగ్రా, మర కంటకుఁ డెదురఁ గాంచె మఖమయ గాత్రిన్
ఖుర విదళిత కుల గోత్రిన్, ధరణీ కళత్రిన్ గవేష ధాత్రిన్ పోత్రిన్. 416

వ. ఇట్లు పొడగని దైత్యుండు రోష భీషణాకారుండై, 417

మ. గద సారించి యసహ్య విక్రమ సమగ్ర స్ఫూర్తి[1]తో వ్రేయఁగా
నది దప్పించి వరాహమూర్తి నిజదంష్ట్రాగ్రాహతిన్ ద్రుంచెఁ బెం
పొదవన్ గ్రోధ మదాతిరేక బల శౌర్యోదార విస్తార సం
పదఁ బంచాస్యము సామజేంద్రుఁ జల మొప్పం ద్రుంచు చందంబునన్. 418

మ. దితిజాధీశుని నీ గతిం దునిమి యుద్వృత్తిన్ దదీయాంగ శో
ణిత పంకాంకిత [2]గండ తుండుఁ డగుచున్ విష్ణుండు దా నొప్పె వి
స్తృత సంధ్యాంబుద ధాతు చిత్రిత సముద్దీప్త క్షమాభృద్గతిన్
క్షితి దంష్ట్రాగ్రమునన్ ధరించి జలరాశిం బాసి యేతేరఁగన్. 418

తే. బాల శీతాంశు రేఖా విభాసమాన, ధవళ దంష్ట్రాగ్రమున నున్న ధరణి యొప్పె
హరికి నిత్యానపాయిని యైన లక్ష్మి, నెరయఁ బూసిన కస్తూరి [3]నికరమనగ.

—: యజ్ఞ వరాహ మూర్తిని బ్రహ్మాదులు స్తుతియించుట :—

వ. అట్టి యజ్ఞపోత్రి మూర్తిం జూచి కమలాసన ప్రముఖు లిట్లని స్తుతియించిరి,

సీ. దేవ! జితం జితం తే పరమేశ్వర! జిత యజ్ఞ భావన శ్రుతి శరీర
యనుచుఁ గారణ సూకరాకారుఁ డగు నీకు నతిభక్తి మ్రొక్కెద మయ్య వరద
భవదీయ రోమ కూపము లందు లీనంబు లయ్యుండు నంబుధు లట్టి యధ్వ
రాత్మక మై తనరారు నీ రూపంబు గానంగ రాదు [4]దుష్కర్మపరుల

తే. కట్టి నీకుఁ బ్రణామంబు లాచరింతు, మఖిల జగదేక కీర్తి! దయానువర్తి!
భవ్య చారిత్ర! పంకజ పత్రనేత్ర! చిర శుభాకార! యిందిరా చిత్తచోర! 422

వ. అని వెండియు నిట్లు స్తుతియించిరి, 423

1. చే వ్రేయుచో (హ). వ్రేసినన్ (క. చ. ట. జ. బ.) 2. గండభాగుఁడగుచున్ (హ.వా.)
3. నిగరమనగ (డ.ద.బ.) 4. దుష్కర్మతులకు (క.డ.ద.తం.)

సీ. త్వక్కున నఖిల వేదంబులు రోమంబు లందును బర్హిస్సు లక్షులందు
నాజ్యంబు పాదంబు లందుఁ జాతుర్హోత్ర కలితంబు లగు యజ్ఞ కర్మములును
స్రుక్కు తుండంబున స్రువము నాసికను [1]నిడాపాత్ర ముదర కోటరము నందు
[2]శ్రవణాస్య బిలములఁ జమసప్రాశిత్రముల్ [3]గళమున నిష్టి త్రికంబు జిహ్వఁ

తే. [4]దగుఁ బ్రవర్గ్యము నగ్ని హోత్రముల నీదు, చర్వణంబును, సభ్యాప సథ్యు లుత్త
మాంగ మసువులు చయనము లగుఁ గిటీశ, యనుచు నుతియించి రత్తఱి యజ్ఞవిభుని.

వ. వెండియు ముహుర్ముహు ర్భగవ దావిర్భావంబు దీక్షణీ యేష్టియగు. నీదు దంష్ట్రలు ప్రాయణీయం బను దీక్షానంత రేష్టియును, దయనీయం బను సమాప్తే ష్టియు, యుష్మద్రేతంబు సోమంబును, త్వదీయావస్థానంబు ప్రాతస్సవనాదులును, నీదు త్వఙ్మాంసాది సప్తధాతువులు అగ్నిష్టో మోక్థ్య షోడశీ వాజపేయాతి రాత్రాపోర్యామంబు లను సంస్థా భేదంబులును, ద్వాదశాహాది రూపంబులై బహుయాగ సంఘాతరూపంబు లగు సర్వసత్త్రంబులు భవదీయ శరీర సంధులు నగు. స సోమా సోమంబు లగు యజ్ఞ క్రతువులు నీవ. మఱియు యజన బంధనంబులచే నొప్పుచుందువు. అదియునుంగాక, 425

క. హవ రూపివి హవ నేతవు. హవ భోక్తవు నిఖిల హవ ఫలాధారుఁ డవున్
హవ రక్షకుండ వగు నీ, [5]కవితథమగు నుతు లొనర్తు మయ్య ముకుందా!

తే. సత్త్వగుణమున సద్భక్తి సంభవించు, భక్తియుతముగఁ జిత్తంబు భవ్యమగును
హృదయ పద్మంబునం దోలి నెఱుఁగఁబడిన, యట్టి నీకు నమస్కారమయ్య వరద!

మ. అరవిందోదర తావకీన సిత దంష్ట్రా గ్రావలగ్న క్షమా
ధర నద్యబ్ధినదాటవీయుత సమస్తక్ష్మా తలం బొప్పె భా
సుర కాసార జలావతీర్ణ మదవచ్ఛుండాల రాడ్దంత శే
ఖర సంసక్త [6]వినీల పంకజము రేఖం బొల్పు దీపింపఁగన్. 428

1. ని,దయుఁ బోత్రి యుదర కోటరము నందు 2. కర్ణ రంధ్రంబుల గ్రహపాత్ర (హ) చమసలు (క.ట.డ.బ.తం.) 3. గళమునందు నుపసత్తులును జిహ్వ (క.చ.ద.బ.తం.)

4. తే. దగుఁ బ్రవర్గ్య పాత్రయును దంతంబు లందుఁ, బ్రాయణీయోదయనులు శిరమున సవన
రూపమునఁ బంచప్రాణముల్ రూఢియగుచు, సభ్య మపసభ్యమును నగ్నిచయన మయ్యె.

వ. వెండియు ముఖంబు వలనఁ బ్రాశిత్రారణ్యగ్నిహోత్ర హవిర్భక్షణంబులును, నభివ్యక్తి దీక్షయు, రేతంబున సోమంబును, నవస్థానంబున సవనంబులును, ధాతువుల సప్తసంస్థలును, సంధుల సర్వ యాగంబులు నై యొప్పుచుండు. (పెక్కు వ్రాఁతప్రతులం దిట్లున్నది. తం.)

5. కవితతముగ (హ) 6. సపత్ర (క); సపంక (వా.)

వ. మఱియు, 429

మ. చతురామ్నాయ వపు ర్విశేష ధర! చంచత్సూకరాకార! నీ
సిత దంష్ట్రాగ్ర విలగ్న మైన ధర రాజిల్లన్ కులాద్రీంద్ర [1]రా
జిత సృంగోపరి లగ్న మేఘము గతిం జాలం దగెన్ సజ్జనాం
చిత హృత్పల్వల [2]కోల! భూ రమణ! లక్ష్మీనాథ! దేవోత్తమా! 430

సీ. సమధిక స్థావర జంగమాత్మక మైన వసుమతీ చక్ర మవక్ర లీల
నుద్ధరింపుము కరుణోపేత చిత్తుండ వగుచు నస్మన్మాత యయ్యె ధరణి
మాత యీ పెట్లని మదిఁ దలంచెద వేనిఁ జర్చింప మాకు విశ్వమున కీవు
జనకుఁడ వగుట యుష్మత్పత్ని భూదేవి యగుట మాకును దల్లియయ్యె నిపుడు

తే. ధరకు నీతోడఁగూడ వందన మొనర్తు,మరణియందును యాజ్ఞికుఁడగ్ని నిలుపు
కరణి మీ తేజ మీ ధరాకాంత యందు, నిలుప ధరణి పవిత్రయై నెగడుఁ గాన.

చ. తలఁప రసాతలాంతర గత క్షితిఁ గ్రమ్మఱ నిల్పినట్టి నీ
కలితన మెన్న విస్మయము గాదు సమస్త జగత్తు లోలిమైఁ
నలుగఁగఁ జేయు టద్భుతము గాక మహోన్నతి నీ వొనర్చు పెం
పలరిన కార్యముల్ నడుప నన్యులకుం దరమే రమేశ్వరా! 432

చ. సకల జగ న్నియామక విచక్షణ లీలఁ దనర్చు నట్టి సం
దక ధర! తావక స్ఫుర దుదారత మంత్ర సమర్థుఁ డైన యా
జ్ఞికుఁ డరణిన్ హుతాశనుని నిల్పిన కైవడి మన్నివాస మౌ
టకుఁ జలపోసి యీ క్షితి దృఢంబుగ నిల్పితివయ్య యీశ్వరా! 433

చ. [3]సలలిత వేదశాస్త్ర మయ సౌకరమూర్తిఁ దనర్చుచున్ రసా
తలమున నుండి వెల్వడు నుదారత మేను విదుర్పఁ దత్సటో
చ్ఛలిత శివాంబు బిందువుల [4]సాధు తపోజన సత్యలోక వా
సుల మగు మేము దోఁగి పరిశుద్ధి వహించితి మయ్య మాధవా! 434

ఉ. విశ్వభవ స్థితి ప్రళయ వేళల [5]యందు వికార సత్త్వమున్
విశ్వము నీవ యీ నిఖిల విశ్వము లోలి సృజింతు విందిరా
ధీశ్వర! యీశ! కేశవ! త్రయీమయ! దివ్యశరీర! దేవ! నీ
శాశ్వత లీల లిట్టి వని సన్నుతి సేయఁగ మాకు శక్యమే? 435

1. రా. జిత ...... గతిం జెల్వొందె విద్వజ్జనాంచిత (తం. వా.) 2. లోల (హ. వా.)
3. సలలిత లీల వేదమయ సౌకరమూర్తి (క. ట. చ. బ.) 4. సాధుజన స్తవ (క. చ. ట. త. ద.)
5. యందవికార తత్త్వతన్ (క. ట. త. డ. ద. బ.)

సీ. పంకజోదర నీ వపార కర్ముండవు భవదీయ కర్మాబ్ధి [1]పారమెద్ద
నెఱిఁగెద నని మది నిచ్చయించిన వాఁడు పరికింపఁగా మతిభ్రష్టు గాక
విజ్ఞాని యే చూడ విశ్వంబు నీ యోగ మాయా పయోనిధి మగ్నమౌట
దెలిసియుఁ దమ బుద్ధిఁ దెలియని మూఢుల నేమన నఖిల లోకేశ్వరేశ !

తే. దాస జనకోటి కతిసౌఖ్య దాయకములు, వితత కరుణా సుధా తరంగితములైన
నీ కటాక్షేక్షణములచే నెఱయ మమ్ముఁ, జూచి సుఖులను జేయవే సుభగ చరిత!

క. అని బ్రహ్మవాదు లగు స, న్ముని వర్యులు భక్తి యోగమున వినమితులై
మనమున మోదము ముప్పిరి, గొనఁ బొగడిరి ఖురవిదళిత గోత్రిన్ బోత్రిన్.

ఉ. అంతట లీలవోలె జగదాత్ముఁడు యజ్ఞ వరాహమూర్తి య
త్యంత గభీర భీషణ మహార్ణవతోయ సమూహమున్ ఖురా
క్రాంతముఁ జేసి క్రమ్మఱ ధరాతల మంబుల మీఁద నిల్పి వి
శ్రాంతి వహింపఁ జేసి గుణశాలి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 438

ఉ. మంగళ మైన యీ కథ సమంచిత భక్తిఁ బఠింప విన్న వా
రిం గరుణార్ద్ర దృష్టిఁ గని శ్రీహరి చాలఁ బ్రసన్నుఁ డౌను స
త్సంగతుఁ డైన విష్ణుఁడు ప్రసన్నుఁడు దా నగు నేని వారికిన్
మంగళముల్ లభించు ననుమానము లే దది గాక వెండియున్. 439

చ. హరి నిజ దాసకోటికి [2]గుహాశయుఁ డై రమియించు, నట్టి స
త్పురుషుల కిష్టవస్తు పరిపూర్ణ మనోరథ సిద్ధిగల్గు, సు
స్థిరమగుచున్న [3]మోక్ష మఱచేతిది యై చెలువారు నన్న న
స్థిరతర తుచ్ఛ [4]సౌఖ్యములు సేకురుటల్ మఱి చెప్ప నేటికిన్. 440

ఉ. కాన సరోజలోచను [5]జగత్ స్తవనీయ కథా సుధా రసం
బానిన యట్టి జిహ్వా [6]యసదన్య కథా లవణోదకంబులన్
బానము సేయఁ జూచునె సుపర్వ మహీజ మరంద పాన లా
భాను భవంబు నొందు మధుపంబునుఁ బోవునె వేఁప చెట్లకున్, 441

క. అని మైత్రేయ మునీంద్రుం, డనఘుఁడు విదురునకుఁ జెప్పి నట్టి తెఱం గ
ర్జున పౌత్రునకున్ వ్యాసుని, తనయుఁడు వినిపించి మఱియుఁ దగ నిట్లనియెన్.

1. పారమరయ (హ) పారమేద (వా.ట.డ.) 2. తదాశ్రయుఁడై (హ) 3. ముక్తియను సిద్ధముగా (హ) 4. వస్తువులు (క.బ.తం.) 5. జగద్ధితమైన (క.ట.జ.) 6. యితరానుకథా (క.బ.తం.)

## అధ్యాయము - ౧౪

క. అని చెప్పిన విని మైత్రే, యునిఁ గని విదురుండు వల్కె నుత్తమ మగు నా
దనుజ కులాంతకు చరితము, విని తనియదు నా మనంబు విమల చరిత్రా! 443

చ. సవన వరాహమూర్తి కథ సర్వము నీ దయ వింటి వెండియున్
వివరముగా వినం బలుకవే గుణసాంద్ర మునీంద్ర ! చంద్ర ! మా
ధవ గుణ కీర్తనామృత వితానము కర్ణపుటాంజలిన్ వెసన్
జవిగొన కేల మాను జనసంతతికిన్ భవతాప వేదనల్. 444

వ. కావున, 445

సీ. శ్రీహరి యజ్ఞవరాహ రూపముఁ దాల్చి మించి హిరణ్యాక్షుఁ ద్రుంచె ననుచు
నప్పుడు మునినాథ ! చెప్పితి నా తోడ న వ్వరాహంబు దంష్ట్రాగ్రమునను
ధరణి నెబ్భంగిని ధరియించె హరికి హిరణ్యాక్షు తోడ వైరమున కేమి
కారణ మసుర నే గతి సంహరించెఁ దా నింతయు నెఱిఁగింపు మిద్ధచరిత !

తే. అనిన మైత్రేయ ముని విదురునకు ననియె,హరికథా కర్ణనమునఁ బెంపారునీకు
జన్మ ఫల సిద్ధి యగుటకు సందియంబు, వలదు హరిమాయ విధికైన
వశమె తెలియ.

క. అనఘాత్మ ! నన్ను నీ వడి, గిన యీ కథ ధ్రువుఁడు విష్ణు కీర్తన పరతన్
దనరిన నారదు నడుగ న, తని కతఁ [1]డెఱిఁగింప హరికథా శ్రవణమునన్.

తే. దండధరుఁ బెల్చ డాకాలఁ దన్ని ధ్రువుఁడు,నిందు నందును వాసికి నెక్కె నట్టి
విష్ణు సంకీర్తనం బరవిందభవుడు, దివిజులకుఁ జెప్పె నది నీకుఁ దేట పఱుతు.

వ. ఆకర్ణింపుము. 449

### మైత్రేయుఁడు విదురునకు హిరణ్యాక్ష హిరణ్య కశిపుల జననమునకుఁ గారణం బైన వృత్తాంతం బెఱింగించుట

సీ. బలిసి దక్షప్రజాపతి తనూభవ దితి సంతాన వాంఛ [2]చిత్తమునఁ బొడమ
నొకనాఁడు పుష్పసాయక శర నిర్భిన్న భావయై విరహతాపమున వచ్చి
పతి సమాగమ వాంఛ ప్రభవింప నిజనాథు సన్నిధి నిలిచి యస్ఖలిత నియతి
నగ్నిజిహ్వుండును యజురధీశుండును నగు విష్ణుఁ దన చిత్తమందు నిలిపి

1. డెఱిఁగించె (క. బ.) 2. దాఁ జింతతోడ (హ.)

తే. తగఁ బయస్సున నగ్నిహోత్రంబు[1]చేసి, కమలహితుఁడ స్తశైల సంగతుఁడుగాఁగ
హోమ శాలాంగణమునఁ గూర్చున్న విభుఁ, గశ్యపునిఁ గాంచి [2]వినయ
వాక్యముల ననియె. 450

చ. గజవిభుఁ డుద్ధతి న్ననఁటికంబముల న్విదళించు లీలఁ జి
త్తజుఁడు ప్రసూనసాయక వితానముచేత మదియ చిత్తమున్
గజిబిజిచేసి పెన్ వగలఁ గాఱియవెట్టఁగ నాథ! నీ పదాం
బుజముల గాన వచ్చితిఁ బ్రభుత్వ మెలర్పఁగ నన్నుఁ గావవే! 451

వ. అదియునుం గాక నాతోడి సవతులెల్లను భవత్కృపా విశేషంబున గర్భాధానంబులు వడసి నిర్భరానందంబున నుండం జూచి శోక వ్యాకులిత చిత్తనై యున్న నన్ను రక్షించుట పరమ ధర్మంబు. నీవు విద్వాంసుండవు. నీ యెఱుంగని యర్థంబు గలదె? నీ వంటి [3]సత్పురుషు లార్తులైనవారి కోర్కులు వ్యర్థంబులు గాకుండం దీర్చుట [4]ధర్మం బని వెండియు నిట్లనియె. 452

క. పతిసన్మానము వడసిన, సతులకు నభిమత [5]ఫలార్ధ సంసిద్ధియు నూ
ర్జితయశముఁ గలిగి లోక, స్తుతమై చెలువారుచుండుఁ జువ్వె! మహాత్మా! 453

క. తన ధర్మపత్ని వలనను, మునుకొని తాఁ బుత్ర రూపమున నుదయించున్
విను [6]దీపముచే దీపిం, చిన దీపము రెండు [7]గాదె? శిఖి [8]యొక టయ్యున్. 454

క. కావున నీ యర్థము 'యా, త్మావై పుత్ర' యని వేదతతులం దోలిన్
వావిరిఁ బలుకఁగ వినవే! ధీవర! ననుఁ గావు మధికదీనం గరుణన్. 455

చ. వర కరుణామతిన్ దుహితృ వత్సలతం దనరారు నట్టి మ
ద్గురుఁ డొకనాఁడు మమ్ముఁ దన కూఁతుల నందఱఁ బిల్చి మీ మనో
హరు నెఱిఁగింపుఁ డిత్తుఁ గమలాననలార! యటన్న నందులోఁ
బురుషవరేణ్య! మేము పదుమువ్వుర మర్మిలి నిన్ వరింపమే. 456

క. దితి యీ గతిఁ గామ విమో, హితమతి బహు వచనముల హృదీశునిఁ బలుకన్
ధృతి గృపణఁ బతివ్రత నిజ, సతిఁగని కశ్యపుఁడు పలికె సల్లాపమునన్. 457

వ. నీవు సెప్పిన యట్ల పురుషులకు నంగనల వలన ధర్మార్ధ కామంబులు సిద్ధించు. కర్ణధారుండు నావచేతం బయోధిఁ గడుచు చందంబున గృహమేధి సర్వాశ్రమ

1. దేర్చి (క. చ. ట. జ. ద.) 2. విమల (హ. తం. వా.) 3. మహానుభావులైన సత్పురుషులు (క.తం.వా.) 4. పరమధర్మం బని (క.ట.తం.) 5. పదార్ధ (హ. వా.) 6. దీపమందుముట్టించిన, (క.చ.ట.త.తం.వా.) 7. గావె (తం.వా.క.చ.ట.త.) 8. యొకఁడయ్యున్ (తం).

వాసుల నరసి రక్షింపుచు నిజాశ్రమంబున వ్యసనార్ణవంబుఁ దరియించు. భార్య పురుషునందు నర్ధంబు. భార్యయందు సకల గృహకార్య భారంబునుం జేర్చి పురుషుండు [1]నిశ్చింతుండై సుఖియింపుచుండు. మఱియు నితరాశ్రమ దుర్జయంబు లైన యింద్రియ శత్రువర్గంబుల భార్యా సమేతుం డైన గృహస్థుండు దుర్గాధిపతి యైన రాజు శత్రుసంఘంబుల జయించు చందంబున లీలామాత్రంబునం జయించు. ఇట్టి కళత్రంబునకుం బ్రత్యుపకారంబు సేయ సకల గుణాభిరాము లగు సత్పురుషులు నూ ఱేండ్లకును జన్మాంతరంబులకు నైన సమర్థులు గా రనిన మముఁ బోటి వారల సేయ నోపుదురే? అయిన నీ మనంబునం గల దుఃఖంబు దక్కు మని యిట్లనియె, 458

తే. తరళలోచన! నీవు సంతాన వాంఛఁ జేసి వచ్చితి వౌఁ గుణశీల వర్త
నములు గల భార్య మనమున నమరు కోర్కెఁ, దవిలి తీర్చుట పతికిఁ గర్తవ్య
మరయ.

మ. తరుణీ! యొక్క ముహూర్త ముండు మిది సంధ్యాకాల మి క్కాలమం
దరయన్ భూతగణావృతుం డగుచుఁ గామారాతి లీలన్ వృషే
శ్వరయానంబున సంచరించుట నభావ్యం బయ్యె నీ యుగ్రవే
ళ రమింపంగ నిషిద్ధకర్మ మగు నేలా? ధర్మమున్ వీడఁగన్. 460

మ. అరవిందానన! వీఁడె నీ మఱఁది లీలాటోప రుద్ర క్షమా
చర ఝంఝానిల ధూత పాంసు పటల చ్ఛన్నుండు ధూమ్రైక దు
ర్భర విద్యోదిత కీర్ణ భీషణ జటా బద్ధుండు భస్మావలి
ప్త రుచిస్ఫార సువర్ణ [2]కర్ణుఁ డగుచున్ భాసిల్లు నత్యుగ్రుఁడై. 461

క. అనల సుధాకర రవి లో, చనములు వికసింపఁజేసి సమధికరోషం
బునఁ జూచుచున్న వాఁ డదె, వనితా! బంధుత్వ మరయ[3]వలవదె సుమ్మీ! 462

క. అతనికిఁ దలపోయ హితా, హితులును సన్మాన్యులును [4]విహీనులు నతిగ
ర్హితులును లే రీశుఁడు సమ, మతియును నిఖిలైక భూతమయుఁడై యుంటన్.

క. కావున మద్భ్రాతృ భవ, ద్దేవరుఁ డని తరుణి! నీ మదిం జూడకు మా
దేవాదిదేవుఁ డ్రిజగ, త్పావను నిఖిలైకనేత భగవంతు హరున్. 464

1. సన్న్యస్త భరుండై (క. ద.) 2. వర్ణుఁడును నై (త.తం.) 3. వలవదు సుమ్మీ (తం.వా.)
4. విహితులును (హ).

వ. ఏమును సత్పురుషు లైన [1]విజ్ఞానవంతులును భుక్తభోగం బై దూరతోన్యస్త మైన పుష్పమాలికయునుం బోలె నమ్మహాత్ముని చరణారవింద[2]జనిత యైన యవిద్య ననుసరించి వర్తింతుము. అదియునుం గాక, 465

సీ. ఎవ్వని కరుణ బ్రహ్మేంద్రాది దిక్పాలవరు లాత్మపద వైభవములఁ దనరి
రెవ్వని యాజ్ఞ వహించి వర్తించును విశ్వనేత్ర యగు నవిద్య యెపుడు
నెవ్వని మహిమంబు లిట్టి వట్టివి యని తర్కింపలేవు వేదంబు లైన
నెవ్వని సేవింతు రెల్లవారును సమా నాధిక రహితుఁ డై యలరు నెవ్వఁ

తే. డట్టి దేవునిఁ ద్రిపుర సంహారకరుని, నస్థిమాలాధరుండు భిక్షాశనుండు
భూతిలిప్తాంగుఁ డుగ్ర పరేతభూమి, వాసుఁ డని యపహసించెడి వారు మఱియు.

క. ధర శునకభోగ్యమును నిహ, పరదూరము నైన తను వు[3]పాదేయముగా
నెఱి నమ్మి వస్త్ర మాల్యా, భరణంబు లలంకరించు పామర జనులున్. 467

క. ఘన నిర్భాగ్యులుగా మదిఁ, గను మని యీ రీతిఁ బ్రియకుఁ గశ్యపుఁ డెఱింగిం
చిన దితి గ్రమ్మఱఁ బలికెను, మనసిజసాయక విభిన్న మానస యగుచున్. 468

క. మునుకొని లజ్జావనత వ,దన యై ప్రాణేశు కొంగుఁ దాలిమి దూలం
బెనఁగొనియె వారకామిని, యనువున వినిషిద్ధ కర్మమం దభిముఖి యై. 469

వ. ఇట్లు చేసిన భార్యానిర్బంధంబునకుం దొలంగనేరక యీశ్వరునకు నమస్కారంబు గావించి, యేకాంతంబున నిజకాంతా సంగమంబు దీర్చి, సంగమానంతరంబున వార్చి, స్నాతుం డై ప్రాణాయామంబు చేసి, విరజంబు సనాతనంబు నైన బ్రహ్మ గాయత్రి జపియించె నంత, 470

క. దితియును నిషిద్ధ కర్మ, స్థితికై మదిలోన సిగ్గు చిట్టాడఁగ నా
నతవదన యగుచు నా పశు, పతివలని భయంబు [4]దక్కి పరమప్రీతిన్. 471

1. విద్వాంసులును (క.తం.) 2. సేవిక యగు నవిద్యాదేవి (డ) వందనాభిలాషిణియైన విద్యాదేవి (తం) "వయం వ్రతైర్యచ్చరణాపవిద్ధా మాశాస్మహేఽజాం బతభుక్తభోగామ్" (మూలము) 14-26.
3. పాథేయముగా (హ.వా. పెక్కు వ్రాఁతప్రతులు) 4. గల్గి (తం.వా.)

† క. అర్భకులు లేని దగుటను, గర్భము నిజ నాథువలనఁ గమలానన కా
విర్భూత మైనఁ [1]గరము వి, నిర్భర పరితోష మాత్మ నెలకొన నుండెన్. 472

వ. అంతఁ గశ్యపుండు దత్కాల సముచిత సంధ్యా వందనంబులు దీర్చి, 473

క. [2]ఆ చెలికి గర్భచిహ్నము, దోఁచినఁ బరితోష మాత్మఁ దొడరఁగ నా మా
రీచుండు నిజ తలోదరిఁ, జూచి యకర్మమున కాత్మ స్రుక్కుచుఁ బలికెన్. 474

మ. సతి! నీ వేగతి నింద కోడక మనోజాతేషు కోదండ ని
ర్గత నారాచ పరంపరా హత విశీర్ణ స్వాంత వై పాపసం
గతి లజ్జా భయ ధర్మముల్ విడిచి దుష్కాలంబు నందే రమిం
చితి బల్మిన్ వెలయాలికై వడిని దుశ్శీల క్రియా లోలతన్. 475

క. *సతి! విను భూతగణ ప్రే, రితు లై [3]రుద్రానుచరులు పృథు శక్తిసమ
న్వితు లుగ్రకర్మ లతిశౌ,ర్యతములు భద్రానుభద్రులను నామములన్. 476

క. పరఁగిన దర్పోద్ధతు లి,ద్దఱు కొడుకులు నీకుఁ బుట్టి ధరణికి వ్రేఁగై
నిరతము బుధజన పీడా,పరులై వర్తింతు రాత్మబల గర్వమునన్. 477

తే. అట్టి దుష్కర్మలకును మహాత్ము లలిగి, విశ్వవిదుఁ డైన హరికిని విన్నవింప
నతఁడు గోపించి హరి కులిశాయుధమున, గిరులఁగూల్చిన గతి వారి ధరణిఁ
గూల్చు. 478

క. అని కశ్యపుఁ డెఱిఁగించిన, విని దితి భయ మంది చాల విహ్వలమతి యై
తన హృదయేశు ముఖాబ్జము, గనుఁగొని యిట్లనియె విగతకౌతుక యగుచున్.

---

† తం.వా. ప్రతులందు మూలానుసారముగా నీ భాగమున్నది.

వ. కశ్యపుం గనుగొని యిట్లనియె. సమస్త భూతపతి యైన పరమేశ్వరుండు నా చేసిన యపరాధంబు సహించి మద్గర్భ పరిపాలనంబు సేయుంగాక. రుద్రుండును, మహాత్ముండును స్వయంప్రకాశుండును, నలంఘ్యుండును, సకామజన ఫలప్రాపకుండును, నిష్కామజన మోక్ష ప్రదుండును, న్యస్త దండుండును, ధృత దండుండును, దుష్ట శిక్షకుండును, బరమాత్ముండును, జగదంతర్యామియు, నిర్గుణుండును, నిష్కాముండును, భక్తసులభుండును, భగవంతుండును నగు నప్పరమేశ్వరునకు నమస్కరించెద. మఱియు షడ్గుణైశ్వర్య సంపన్నుండును, జగద్భర్తయు, మహానుగ్రహ శీలుండును, నిర్దయ పరిపాల్యవధూ రక్షకుండును, సతీదేవి పతియు నైన యా సర్వేశ్వరుండు నన్ను రక్షించుం గాత మని సన్నుతించి. మూలము: నమః ప్రసీద తాద్భావో భగవానుర్వనుగ్రహః వ్యాధ స్యాప్యనుకంప్యానాం స్త్రీణాం దేవస్సతీపతిః (౩. ౧౪. ౩౬)

1. కర్మ వినిర్భర (హ. తం. వా.) 2. ఆ చెలువ గర్భచిహ్నము లేచినఁ బరితోష మాత్మ నేపారక (తం.) ఆ చెలికి (వా)

* ఈ పద్యము (హ) లో లేదు. మూలమున అభద్రావభద్రు లని యున్నది.

3. పుత్రానుచరులు (వ్రాత ప్రతులు)

చ. ధర సుజనాపరాధు లగు తామసచిత్తుల కెందు నాయువున్
సిరియు నశించి పోవు మృతి సేకుఱు శత్రులచేత నింత యా
నరయఁగ నిక్కువంబు భవ దాత్మజు లార్యుల కెగ్గు [1]సేయ భూ
సురుల క్రుధాగ్ని పొల్పడక శోభన మౌ హరి చేతి పంచతన్. 480

చ. అనవుడుఁ గశ్యపుండు గమలానన కిట్లను నింతి! నీవు చే
సిన విపరీత కర్మమునఁ జేకుఱె నిట్టి యవస్థ దీనికిన్
మనమునఁ దాప [2]మొందకుము మాధవు పాద సరోజయుగ్మ చిం
తనమును జేసియున్ నను ముదంబునఁ గొల్చుటఁ జేసియుం దగన్. 481

తే. రమణి! నీ సుతులందు హిరణ్యకశిపు, వలన నుదయించువారిలోపల ముకుంద
పద సరోజాత విన్యస్త భావుఁ డైన,దనయుఁ డుదయింపఁగలఁ డతిధార్మికుండు.

వ. మఱియును, 483

క. ఘన పుణ్యుఁడు నన్వయ పా, వనుఁ డగు నప్పుణ్యతముని వర కీర్తిలతల్
వనజ భవాండోదర మె, ల్లను నిండఁగఁ బర్వు బుధలలాముం డగుటన్. 484

తే. వామలోచన! వినుము దుర్వర్ణ హేమ, మగ్ని [3]పుటమునఁ బరిశుద్ధ మై వెలుంగు
నట్లు దుష్టాత్మ[4]సంభవుఁ డయ్యు వంశ, పావనుం డగు హరిపాద భక్తుఁ డౌట.

తే. అంచి తాష్టాంగ యోగ క్రియాకలాపు, లైన యోగీశ్వరులు న మ్మహానుభావు
[5]చతుర శీల స్వభావ విజ్ఞాన సరణిఁ,దాముఁ జరియింప నాత్మలఁ దలఁతు రెపుడు.

ఉ. ఆ మహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్తముండు ల
క్ష్మీ మహిళాధినాథుఁ దులసీదళదాముఁ బరేశు నాత్మ హృ
త్తామరసంబునందుఁ బ్రమదంబున నిల్పి తదన్య వస్తువుం
దా మదిలో హసించు హరి దాస్యవిహార వినిశ్చితాత్ముఁ డై. 487

†వ. అట్టి నీ పౌత్రుండు, 488

1. ఎగ్గుఁజేయ భూ, సురుల క్రుదగ్ని పొల్పడక శోభనమౌ హరిచేతి పంచతన్ (హ. వా.) (ఇదియే మూలానుసారి); కృదగ్ని (వా); సేసినన్, గరుణను వారు వారి మదిఁ గైకొని కావ నను గ్రహింపరే (తం) 2. మొందుటను (క. చ. తం.) 3. ముఖమున (ట. త. ద. బ.) 4. సంగతుఁడయ్యు (జ) 5. నతులశీల (హ. తం. వా.)

† ఈవచనము హ. లోను, కొన్ని తాళపత్ర ప్రతులలోను 486 వ పద్యమునకు ముందున్నది.

సీ. మహిత దేహాద్యభిమానంబు దిగనాడి [1]చిఱుతతనమున సుశీలుఁ డగుచుఁ
బరసమృద్ధికి నాత్మఁ బరితోష మందుచుఁ బరదుఃఖమునకుఁ దాపమును బొందు
నీ విశ్వమంతయు నే విభుమయ మని యెవ్వని కరుణచే నెఱుఁగ నయ్యె
నట్టి యీశ్వరునిఁ దా నాత్మసాక్షిగ మోద మడరంగఁ జూచు ననన్యదృష్టి

తే. నతినిదాఘోగ్ర సమయంబునందు నిఖిల,జంతుసంతాప మణఁగించు చంద్రుమాడ్కి-
నఖిల [2]జగముల దుఃఖంబు లపనయించు, రూఢి మీఱ నజాతవిరోధి యగుచు.

వ. మఱియు హరిధ్యాన నిష్ఠా గరిష్ఠుం డగు న మ్మహాభాగవతాగ్రగణ్యుండు.

క. విమలాంతరంగ బహిరం, గములను స్వేచ్ఛానురూప కలితుం డగు నా
కమలాక్షీశ్వరు కుండల,రమణీయ ముఖంబుఁ జూచుఁ బ్రమదం బెసఁగన్. 490

తే. మఱియు నీ విశ్వ మా హరిమయముగాఁగ, మనములోపలఁ దలఁచు న మ్మనువిభుండు
మను మహాత్ములలోన నీమనుమఁడధికుఁ, డనఁగ నుతికెక్కెననుచు గశ్యపుఁడు పలుక.

క. విని తన తనయులు మధుసూ,దనుచే హతు లగుదు రనుచుఁ దన మనుమఁడు స
జ్జననుత భాగవతుం డగు, ననుచు మదిం జాల దుఃఖహర్షము లొదవన్. 492

వ. ఉండునంత నా దితియుఁ గశ్యపు వీర్య సంభృతం బైన గర్భంబు దుర్భర తేజోభిరామంబును, నన్యతేజో విరామంబును, దినదిన ప్రవర్ధమానంబు నై నివ్వటిల్ల నిజోదర స్థితులైన కుమారు లమరదమనులై వర్తింపగల రని చింతింపుచు గర్భంబు శత వర్షంబులు ధరియించి యున్న యనంతరంబ. 493

అధ్యాయము—౧౫

ఉ. ఆ దితిగర్భమందు రుచిరాకృతితో నొకతేజ మన్య తే
జో దమ లీల వెల్వడి వసుంధరయున్ గగనంబు నిండి సం
ఛాదిత పద్మబాంధవ నిశాకర దీప్తులు గల్గి [3]సూచికా
భేద మహోగ్ర సంతమస భీషణ మైన భయాకులాత్మలై. 494

చ. అమరగణంబు లెల్లఁ గమలాసనుపాలికి నేగి తత్పదా
బ్జములకు మ్రొక్కి యంజలులు ఫాలములం గదియంగఁ జేర్చి చి
త్తముల భయంబు సంభ్రమముఁ దార్కొన నిట్లని విన్నవించి రో
యమరకులాగ్రగణ్య! దురితార్ణవ తారణ! సృష్టి కారణా! 495

1. చిరతరాలంపట శీలుఁడగుచు (తం. వా.) 'అలంపట శ్శీలధరః' అని మూలము (14. 49)
2. జనముల (క. చ. ట. త. వ.) 3. యన్యాదుర్భేద (హ)

ఉ. నీవు చరాచర ప్రచయ నేతవు ధాతవు సర్వ లోకపా
లావళి మౌళిభూషణుఁడ వంచితమూర్తివి దేవదేవ! వా
ణీవర! యీ యజాండమున నీవు నెఱుంగని యర్థ మున్నదే?
భావమునం దలంపుము విపన్నుల మమ్ము భవత్ప్రపన్నులన్. 496

వ. దేవా! [1]కార్యరూపం బగు చేతనాచేతనాత్మక ప్రపంచంబునకుఁ గారణుం డవైన నీచేత సమస్త భువనంబులును సృజియింపంబడె. నీవు సర్వభూతాత్మ భావ విదుండవు. లోకనాథ శిఖామణి భూతుండవు. విజ్ఞాన వీర్యుండవు. అవిద్యం జేసి యిట్టి స్రష్టృరూపంబు నొందితి. గృహీత రజో గుణుండవు. నీయందుఁ బ్రపంచంబు లీనం బై యుండు. సుపక్వ యోగంబు నొంది నిష్కాముల్తై ధ్యానంబున నిన్నరయుచు నిర్జిత శ్వాసేంద్రియాత్ములై భవత్ప్రసాదంబు వడసిన వారలకుం బరాభవంబు లెక్కడివి? ఎవ్వని వాగ్జాలంబుచేఁ బాశ బద్ధంబు లైన పశువుల చందంబున నిఖిల జీవులు వర్తింతు రట్టి నీకు నమస్కరించెదము. అహోరాత్ర విభాగాభావంబున లుప్తకర్మంబు లగు లోకంబులకు సేమంబు గావింపుము. శరణాగతుల మయిన మమ్ము నతిశయ కరుణారస పరిపూర్ణంబు లగు కటాక్షంబుల నీక్షించి రక్షింపుము. కశ్యపవీర్యంబు దితి గర్భంబున నుండి సకల దిగ్వలయంబు నాక్రమించి దారువందు వహ్నిచందంబున లీనం బై ప్రవృద్ధం బగుచున్న దని విన్నవించిన బృందారక సందోహంబులకు నానందంబు గందళింప నరవిందనందనుం డిట్లనియె, 497

—: సనక సనందనాదులు వైకుంఠమున కరుగుట :—

క. గీర్వాణులార! యుష్మ, త్పూర్వజు లాత్మీయ సుతులు పుణ్యులు విచర
న్నిర్వాణులు సనకాదులు, సర్వంకష శేముషీ విచక్షణు లెందున్. 498

క. వారలు నిస్పృహు లగుచు స, వారణ భువనంబు లెల్ల వడిఁ గ్రుమ్మరుచున్
ధీరు లొకనాఁడు భక్తిన్, శ్రీ రమణీశ్వర పదాబ్జ సేవానిరతిన్. 499

చ. చనిచని కాంచి రంత బుధసత్తము లంచిత నిత్య దివ్య శో
భన విభవాభిరామముఁ, బ్రసన్నజన స్తవనీయ నామమున్,
జననవిరామ, మార్యజన సన్నుత భూమము, భక్తలోక పా
లన గుణధామమున్, బురలలామముఁ, జారు వికుంఠ ధామమున్. 500

1. కార్యకారణ రూపం బగు (క. చ. ట. త. జ. డ. ద. బ.)

ఉ. ఆ మహనీయ పట్టణమునందు వసించెడువార లాత్మ ని
ష్కామఫలంబె సత్ఫలముగాఁ దలపోసి ముముక్షు ధర్ము లై
శ్రీ మహిళాధిపాంఘ్రి సరసీరుహ పూజ లొనర్చుచున్ మహో
ద్దామ తదీయ రూపములు దాల్చి సుఖించుచు నుందు రెప్పుడున్. 501

చ. విగత రజ స్తమో గుణుఁడు విశ్రుత చారు యశుండు శుద్ధ స
త్త్వగుణుఁ డజుం డనాది భగవంతుఁ డనంతుఁ డనంత శక్తియున్
నిగమచయాంతవేద్యుఁడు వినిశ్చల నిర్మల ధర్మ [1]మూర్తి యై
తగు హరి సేవఁ బెం పెసఁగుఁ ద న్నగరోపవనమ్ము లిమ్ములన్. 502

వ. మఱియుఁ గైవల్యంబు మూర్తీభవించిన తెఱంగునం బొలుపారుచు, నైశ్రేయ సనామంబున నభిరామం బై, సతతంబును సకలర్తు ధర్మంబులు గలిగి, యర్థి జనంబుల మనంబుల ఘనంబులుగ నీరిక లెత్తిన కోరికలు సారికెలు గొన నొసంగుచుఁ, గామ దోహన హితంబులుం, బుష్ప ఫల భరితంబులు నై తనర్చు సంతానవన సంతానంబులును, సమంచితవసంత సమయ సౌభాగ్యసంప దభి శోభిత వాసంతికా కుసుమవిసర పరిమళ మిళిత గళిత మకరంద లలితామోద ముదిత హృదయులై యఖండ తేజోనిధి యగు పుండరీకాక్షు చరిత్రంబు లుగ్గడింప లేక ఖండితజ్ఞాను లైనను, నిరతిశయ విషయసుఖానుభవ కారణం బగుట నిందిరా సుందరీ రమణు చరణసేవా విరమణకారి యగు నని తలంచి, తద్గంధ ప్రాపక గంధవహునిం దిరస్కరించి, నారాయణ భజన పరాయణు లై చరియించు సుందరీ యుక్తులైన వైమానికులును, వైమానిక మానసోత్సేకం బుగం బారావత హంస సారస శుక పిక చాతక తిత్తిరి మయూర రథాంగ ముఖ్య విహంగ కోలాహల విరామంబుగా నరవిందనయన కథాగానంబు లనూనంబుగా మొరయు మదవదిందిందిరసందోహకలిత పుష్పవల్లీమతల్లి కలును, నకుంఠితచరిత్రుం డైన వికుంఠనిలయుని కంఠంబునం దేజరిల్లు విలసిత తులసీదామంబుం గనుంగొని యీ తులసీమాల్యంబు హరిగళ విలగ్నంబై యుండు సౌభాగ్యంబు వడయుట కేమి తపంబు గావించెనో! యని బహూకరించు చందంబున నొప్పు చందన మందార కుం దారవింద పున్నాగ నాగ వకుళాశోక కురవ కోత్పల పారిజాతాది ప్రసూన మంజరులును, మంజరీ పుంజ రంజిత నికుంజంబులయందు నుత్తుంగ పీన కుచభా రాకంపిత మధ్యం బులు, కటి తట కనక మేఖలా కలాప నినదోపలాలిత నీల దుకూల శోభిత

1. మూర్తియు, న్నగ హరిపేర......అన్నగరోప (డ. తం. వా.)

పృథు నితంబభరాలసయాన హసిత కలహంస మయూరా గమనంబులు, నసమ శరకుసుమశర విలసితంబు నపహసించు నయనకమలంబులునుం గలిగిన సుందరీ సందోహంబులం దగిలి,కందర్ప కేళీవిహారంబుల నానందంబునొందక ముకుంద చరణారవింద సేవాపరిలబ్ధ మరకత వైడూర్య హేమమయ విమానారూఢులై హరిదాసులు విహరించు పుణ్య ప్రదేశంబులును, నిందిరా సుందరి త్రైలోక్య సౌందర్య ఖనియైన మనోహరమూర్తి ధరియించి రమణీయ రణిత మణి నూపుర చరణారవిందయై, నిజ హృదయేశ్వరుండైన సర్వేశ్వరుని మందిరంబు లోనం జాంచల్య దోష రాహిత్యంబున వర్తింపం గర కమల భ్రమణీకృత లీలాంబుజాతయై తన నీడ కాంచన స్ఫటికమయ కుడ్య ప్రదేశంబులం బ్రతిఫలింప శ్రీనికేతనుని నికేతనసమ్మార్జన కైంకర్యంబు పరమ ధర్మం బని తెలుపు చందంబునం జూపట్టుచు, నిజ వనంబునం దనరు సౌరభాభిరామంబులగు తులసీదళ దామంబుల నాత్మ నాయకుని చరణారవిందంబుల నర్చింపుచు, నొసటి మృగమదపు [1]టసలున మసలుకొని తుంపెసలాడు కురులును, లలిత తిలప్రసూన రుచిరాభ నాసను దనరు మోముఁదామర విమల సలిలంబులం బ్రతిబింబింప నిజ మనోనాయకు చేతం జుంబితం బగుటంగాఁ దలంచి, లజ్జావనత వదనయై యుండం జేయు ప్రవాళలతికాకులంబులైన కూలంబులు గల నడబావులును గలిగి, పుణ్యంబునకు శరణ్యంబు, ధర్మంబులకు నిర్మల స్థానంబు, సుకృత మూలంబునకు నాలవాలంబునై పొలుపొందుచుండు. 503

చ. హరివిముఖాత్ము లన్యవిషయాదృత చిత్తులుఁ బాపవర్తులున్
నిరయ నిపాత హేతువును నింద్య చరిత్రము నైన దుష్కథా
నిరతిఁ జరించు వారలును నేరరు పొందఁగ నిందిరా మనో
హర చరణారవింద భజనాత్మకు లుండెడు గొంది నారయన్. 504

వ. వెండియు, 505

చ. హరిఁ బరమేశుఁ గేశవు ననంతు భజింపఁగ ధర్మతత్త్వ ధీ
పరిణతి సాధనం బగు స్వభావముఁ దాల్చిన యట్టి మర్త్యు లా
సరసిజనేత్రు మాయను భృశంబుగ మోహితులై తదంఘ్రి పం
కరుహము లర్థిమైఁ గొలువఁ గానమిఁ బొందరు తత్పదంబునన్. 506

1. టసమున (హ. కొన్ని వ్రాత ప్రతులు)

చ. [1]మఱియు సరోరుహోదరుని మంగళ దివ్య కథానులాప ని
ర్భర పరితోష బాష్పకణ బంధుర చారు కపోల గద్గద
స్వర పులకీకృతాంగు లగువారును నిస్పృహచిత్తులు [2]న్నహం
కరణవిదూరు [3]లుందురు సుకర్ములు యుండెడు పుణ్య భూములన్. 507

వ. అందు, 508

మ. వర వైకుంఠము సారసాకరము, దివ్య స్వర్ణ శాలాంక గో
పుర హర్మ్యావృత మైన తద్భవన మంభోజంబు, తన్మంది రాం
తర విభ్రాజిత భోగి కర్ణిక, దదుద్య ద్భోగ పర్యంకమం
దిరవొందన్ వసియించు మాధవుఁడు దా నేపారు భృంగాకృతిన్. 509

వ. అంత, 510

మ. హరిచేఁ బాలిత మైన కాంచన విమానారూఢ మైనట్టి స
త్పురుషానీకముచేఁ దనర్చి విభవాపూర్ణ ప్రభావోన్నతిన్
గర మొప్పారు తదీయ ధామము జగత్కల్యాణ మూర్తుల్ మునీ
శ్వరు లర్థిన్ నిజ యోగభక్తిఁ బరితోష స్వాంతు లై చెచ్చెరన్. 511

వ. డాయం జని, 512

చ. మరకత రత్నతోరణ సమంచిత కుడ్య కవాట గేహళీ
విరచిత కక్ష్యషట్క మరవింద దళాక్ష విలోకనోత్సవా
దరమతి నన్యముం గనక దాఁటి యనంతర కక్ష్యయందు ని
ద్దఱను దదీయ పాలుర నుదార సమాన వయో విశేషులన్. 513

సీ. కాంచన నవరత్న కటకాంగుళీయక హార కేయూర మంజీర ధరులఁ
గమనీయ సౌరభాగత మత్త మధుకర కలిత సద్వనమాలికా విరాజి
తోర స్థలుల, గదాధారుల, ఘన చతుర్బాహుల, నున్నతోత్సాహ మతుల
నారూఢ రోషానలారుణితాక్షుల, భ్రూలతా కౌటిల్య ఫాలతలుల

తే. వేత్రదండాభిరాముల వెలయు నమ్మ, కుంద శుద్ధాంత మందిరాళింద భూమి
నున్నయిద్దఱ సనకాది యోగివరులు,చూచుచును వృద్ధులయ్యు నాసుభగమతులు.

క. ధీరతఁ బంచాబ్దముల కు, మారకులై కానఁ బడుచు మనమున శంకన్
గూరక చతురాత్మకు లని, వారిత గమనముల డాయ వచ్చిన నెమరన్. 516

1. మఱియు నెసంగు శ్రీరమణ మంగళ (ద) 2. లత్యహంకరణ (హ. తం. వా.) 3. లున్నగు సుకర్ములు నుండెడి పుణ్యావాసముల్ (క. చ. ట. త. జ. ద. ద.)

క. శ్రీ లలనేశ్వర దర్శన, లాలసులై యేగు బుధ లలాముల నతిదు
శ్శీలతఁ దద్వచన ప్రతి, కూల మతిన్ బోవకుండఁ [1]గుటిలాత్మకులై. 515

క. వారించిన వారలు బ్రం, దారకు లీక్షించుచుండ దారుణ పటు రో
షారుణితాంబకులై రొద, వారించుచు వారు నచటి వారును వినఁగన్. 517

వ. ఇట్లనిరి, 518

చ. పరము ననంతు భక్తపరిపాలు [2]సుహృత్తము నిష్టు నీశ్వరే
శ్వరు భజియింపఁ గోరి యనివారణ [3]నిం దరుదేర నిచ్చలున్
భరిత ముదాత్ములై కొలువఁ బాయక తద్భజనాంతరాయ త
త్పరమతి మాకు నిప్పు డరిపడ్డ దురాత్ముల నేఁడు గంటిరే ? 519

వ. అని మఱియు సనక సనందనాదులు జయవిజయులం జూచి యిట్లనిరి. మీ మనంబుల స్వామి హితార్థంబై నిష్కపట వర్తనులమైన మా బోఁటులఁ గుహక వృత్తిం గల యితర జనంబులు భవత్సదనంబు ప్రవేశింతురో యను శంకంజేసి కొందఱం బ్రవేశింపం జేయుటయుఁ, గొందఱ వారించుటయును దౌవారిక స్వభావం బని వారింపఁ దలంచితిరేని ప్రశాంత దివ్యమంగళ విగ్రహుండును, గత విగ్రహుండును, భగవంతుండును, విశ్వగర్భుండును నైన యీశ్వరుండు ప్రాప్యంబును, ప్రాపకంబును, ప్రాప్తియు నను భేదశూన్యుండు గావున, మహాకాశంబు నందు ఘట పటా ద్యాకాశంబులు వేఱులేక యేకంబై తోఁచు చందంబున విద్వాంసు లగు వార మ్మహాత్ముని సకలాత్మ భేదరహితునింగాఁ బొడగందురు. అదియునుం గాక లోకమందు రాజులు సాపరాధులైన కింకరజనంబుల నాజ్ఞాపించు చందంబున నీశ్వరుండు దండించునో యను భయంబునం జేసి వారించితిమని తలంచితి రేని భూసుర వేషధారులమైన మాకును, వైకుంఠ నాయకుండైన సర్వేశ్వరునకును భేదంబు లేకుండుటం జేసి శంక సేయం బనిలేదు. ఇట్లగుట యెఱుంగి మందబుద్ధులరై మమ్ము వారించిన యనుచితకర్ము లగు మీరలు మదీయ శాపార్హు లగుదురు గాన భూ లోకంబునం గామ క్రోధ లోభంబు లను శత్రువులు బాధింపం బుట్టుం డని పలికిన,

క. వారలు విని తమ మనముల, భూరి స్ఫుట చండ కాండ [4]పూగంబులచే
వారింప రాని భూసుర, దారుణ వాక్యముల కులికి తల్లడ పడుచున్. 521

1. కుపితాత్మకులై (క. చ. ట. త. డ. బ.) 2. సుహృత్తు నధీశు (డ) 3. నిద్దఱునేఁగి (క. త. బ. తం.) 4. పూరంబులచే (క. ట. త. జ. డ. ద. బ.)

క. పరితాపంబును బొందుచు, సరసిజలోచనుని భటులు సనకాది మునీ
శ్వరుల పదాంబుజములకు౯, గర మర్థిఁ బ్రొక్కి నిటల ఘటితాంజలులై. 522

వ. ఇట్లనిరి,

మ. వర యోగీశ్వరులార! మమ్ము మది నొవ్వ౯ మీర లిట్లన్న ని
ష్ఠురవాక్యంబుల కింక [1]మీ మనముల౯ శోకింపఁ గా [2]రాదు స
త్పురుష శ్రేణిఁ బరాభవించిన వృథాభూతాత్ముల౯ మమ్ము మా
దురితం బింతకుఁ దెచ్చె మీఁద శుభము౯ దూఁకొందు మే మారయ౯. 524

వ. అది యెట్లంటి రేని, 525

ఉ. మీ కరుణావలోకన సమేతులఁ గా మముఁ జేయఁ జిత్తముల్
దూఁకొనెనేని మా చనవుఁ ద్రోయక యీఁ దగు లోభ మోహముల్
గైకొని పుట్టుచోట నవకంజదళాక్షుని నామ విస్మృతి౯
బై కొనకుండఁ [3]జేయుట శుభం బగు మీఁది మదీయ జన్మముల్. 526

వ. అను సమయంబున, 527

మ. హరి సర్వేశుఁ డనంతుఁ డా కలకలం బాలించి, పద్మాలయా
సరసాలాప వినోద సౌఖ్య రచనల్ సాలించి, శుద్ధాంత మం
దిర మాణిక్యపు [4]గేహళుల్ నడచి, యేతెంచెం బ్రపన్నార్తి సం
హరుఁ డై నిత్య విభూతి శోభన కరుండై మానితాకారుఁ డై. 528

వ. మఱియును, 529

చ. శరనిధికన్యకామణియు సంభ్రమ మొప్పఁగఁ దోడ రా మనో
హర నిజ లీల మై పరమహంస మునీంద్ర గవేష పాదపం
కరుహముల౯ వినూత్న మణి కాంచన నూపుర మంజు ఘోషముల్
వరుసఁ జెలంగ నార్య జనవంద్యుఁడు యోగి జనైక సేవ్యుఁ డై. 530

చ. కర మణి హేమ కంకణ నికాయ ఝణంకృతు లుల్లసిల్ల న
చ్చర లిడు హంసపక్ష సితచామర గంధవహోచ్ఛల త్సుధా
కర రుచిరాతపత్ర సుభగ ప్రవిలంబిత హార వల్లరీ
సరసగళ త్తుషారకణ జాల విరాజిత మంగళాంగుఁ డై. 531

1. మా మనముల౯ (హ. తం. వా.) 2. వల్దు (క. త. జ. ద. బ.) 3. దానవె (తం.వా.)
4. కవాటముల్ (క. తఁ.)

వ. మఱియును, 532

సీ. నిఖిల మునీంద్ర వర్ణిత [1]సస్మిత ప్రసన్నాననాంబుజముచే నలరు వాఁడు
[2]విస్తృత స్నేహార్ద్ర వీక్షణ నిజభక్తజన గుహాశయుఁ డనఁ దనరు వాఁడు
మానిత శ్యామాయమాన వక్షమున నంచిత వైజయంతి రాజిల్లు వాఁడు
నత జనావన కృపామృత తరంగితము లై భాసిల్లు లోచనాబ్జముల వాఁడు

తే. నఖిల యోగీంద్ర జన సేవ్యుఁ డైనవాఁడు, సాధు జనముల రక్షింపఁజాలువాఁడు
భువనచూడా విభూషణభూరిమహిమ, మించి వైకుంఠపురము భూషించువాఁడు.

సీ. కటి విరాజిత పీత కౌశేయ శాటితో వితత కాంచీగుణ ద్యుతి నటింప
నాలంబి కంఠ హారావళి ప్రభలతోఁ గౌస్తుభ రోచులు గ్రందు కొనఁగ
నిజ కాంతి జిత తటిద్ధ్వజ కర్ణకుండల రుచులు గండద్యుతుల్ ప్రోదిసేయ
మహనీయ నవ రత్నమయ కిరీటప్రభా నిచయంబు దిక్కుల నిండఁ బర్వ

తే. వైనతేయాంస విన్యస్త వామహస్త, కలిత కేయూర వలయకంకణము లొప్ప
నన్య కరతల [3]భ్రమణీ కృతానుమోద, సుందరాకార లీలారవింద మమర. 534

వ. మఱియు చరణారవింద మంజు కింజల్క పుంజ ప్రభా రంజిత తులసీ మరంద బంధుర గంధానుబంధ సుగంధి గంధవహాస్వాదకలిత సేవాతత్పరులై చనుదెంచు యోగీంద్రులకు మానసానందకారియును, బహిఃకరణాంతఃకరణ పరితోష ప్రకీర్ణ రోమాంచ రుచిదాయకంబును, బ్రభాపూర్తి యుక్తంబు నగు మూర్తితోడ నిజ సౌందర్య వరకళా వినిర్జిత శ్రీ రమణీ సౌందర్య భాసమానుం డగుచుఁ బాదచారి యై యఖిల విశ్వగురుం డైన సర్వేశ్వరుండు వేంచేసె నప్పుడు, 535

చ. స్థిర శుభ లీల సల్లరుగుదెంచిన యవ్విభు విద్రుమారుణా
ధర నవ పల్లవ స్ఫురదుదంచిత కుందరుచి స్మితైక సుం
దర వదనారవిందము ముదంబునఁ దప్పక చూచియుఁ గా మునీ
శ్వరులు నిజాత్మలం దనివి సాలక వెండియుఁ జూచి రిమ్ములన్. 536

చ. సునిశిత భక్తిఁ దన్ముఖముఁ జూచిన చూడ్కులు ద్రిప్పలేకయుం
గనుఁగొని రెట్టకేలకు నకల్మష భక్త విధూత ఖేదముల్
మునిజన చిత్త మోదములు ముక్తినివాస కవాట భేదముల్
వినుత వినూత్న నూపురిత వేదము లమ్మహనీయు పాదముల్. 537

1. దర స్మిత, లాననాంబుజముచే (ద) 2. విశ్రుత (తం.వా.) 3. భ్రమరీ (క.చ.ట.త.జ.ద.బ.)

చ. కని నఖ పద్మరాగమణికాంతివిభాసిత పాద పద్మముల్
మనముల యందుఁ గీలొ్కలిపి లబ్ధ మనోరథ యుక్తులై పునః
పున రభివందనంబులు విభూతి దలిర్ప నొనర్చి యోగమా
ర్గ నిరత చిత్తులున్ వెదకి కానఁగ లేని మహానుభావునిన్. 538

క. మానసమున నిలిపిరి త, ద్ధ్యానాస్పదుఁ డైన వానిఁ దత్త్వజ్ఞులకున్
గాన నగు వాని భక్త జ, నానందకరైకమూర్తి నలరిన వానిన్. 539

వ. మఱియుఁ జక్షు రింద్రియ గ్రాహ్యం బగు దివ్య మంగళ విగ్రహంబు ధరియించి యున్న పురుషోత్తము నుదాత్త తేజోనిధిం జూచి సనకాదు లిట్లని స్తుతియించిరి.

—: సనకాదులు నారాయణుని స్తుతియించుట :—

చ. వనజదళాక్ష! భక్తజన వత్సల! దేవ! భవత్సుతుండు మ
జ్జనకుఁడు నైన పంకరుహజాతుఁడు మాకు రహస్య మొప్పఁ జె
ప్పిన భవదీయ మంగళ గభీర పరిగ్రహ విగ్రహంబు మే
మనయముఁ జూడఁ గంటిమి గృతార్థుల మై తగ మంటి మీశ్వరా! 541

సీ. దేవ! దుర్జనులకు భావింప హృదయ సంగతుఁడ వై యుండియుఁ గానఁబడవు
కడఁగి మీ దివ్య మంగళ విగ్రహంబునఁ జేసి సమంచి తాశ్రితుల నెల్లఁ
జేకొని సంప్రీత చిత్తులఁగాఁ జేయు దతిశయ కారుణ్యమతిఁ దనర్చి
కమలాక్ష! సర్వ లోక[1]కైక నాయక! [2]భవ త్సందర్శ నాఖిలాఘానుతాప

తే. విదిత దృఢభక్తి యోగ ప్రవీణు లగుచు, నర్థిమై వీతరాగు లైనట్టి యోగి
జన మనఃపంకజాత నిషణ్ణమూర్తి, వని యెఱుంగుదు రయ్యా నిన్నాత్మవిదులు.

క. యుక్తిం దలఁప భవ ద్వ్యతి, రిక్తము లైనట్టి యితర దృఢ కర్మంబుల్
యుక్తిదము లైన మీ పద, భక్తులు దత్కర్మములను బాటింప రిలన్. 543

ఉ. కావునఁ గీర్తనీయ గతకల్మష మంగళతీర్థకీర్తి సు
శ్రీవిభవ ప్రశస్త సుచరిత్రుఁడ వైన భవత్పదాబ్జ సే
వా విమలాంతరంగ బుధవర్గ మనర్గళ భంగి నన్యమున్
భావమునం దలంచునె? కృపాగుణ భూషణ! పాప శోషణా! 544

1. లోకప్రజాధిప (తం. వా.) 2. భవ దనుదర్శనాళి...(తం); భవ, దనుసరణాళి... (హం. వా.)

చ. పరమ తపో విధూత భవపాపుల మై చరియించు మాకు నేఁ
డరయ భవత్పదాశ్రితుల నల్గి శపించిన భూరి దుష్కృత
స్ఫురణ నసత్పథైక పరిభూతుల మై నిజ ధర్మహానిగా
నిరయము నొందఁగా [1]వలసె నేరము వెట్టక మమ్ముఁ గావవే? 545

చ. కర మనురక్తి షట్పదము క్రమసుగంధ మరంద వాంఛచేఁ
[2]దరమిడి శాతకంటకవృత స్ఫుట [3]నవ్యతర ప్రసూన మం
జరులను డాయు [4]పోల్కిని భృశం బగు విఘ్నములం జయించి మీ
చరణసరోజముల్ గొలువ సమ్మతి వచ్చితిమయ్య! కేశవా! 546

చ. అలరు భవత్పదాంబుజ యుగార్పిత మై [5]పొలుపొందు నట్టి యీ
తులసి పవిత్రమైన గతిఁ దోయజనాభ! భవత్కథా సుధా
కలితము లైన వాక్కుల నకల్మష యుక్తిని విన్నఁ గర్ణముల్
విలసితలీలమై భువిఁ బవిత్రము లై విలసిల్లు మాధవా! 547

చ. మహిత యశో విలాసగుణ మండన! సర్వ శరణ్య! యింద్రియ
స్పృహలకుఁ గానరాక యతసీకుసుమద్యుతి నొప్పుచున్న మీ
సహజ శరీర మిప్పుడు భృశంబుగఁ జూచి మదీయ [6]దృక్కులిం
దహహ! కృతార్థతం బొరసె నచ్యుత! మ్రొక్కెద మాదరింపవే! 548

అధ్యాయము—౧౬

క. అని సనకాదులు తత్పద, వనజములకు మ్రొక్కి భక్తివశ మానసులై
వినుతించిన గోవిందుఁడు, మునివరుల జూచి పలికె ముదితాత్ముండై. 549

వ. ఈ యిరువురు జయ విజయాభిధానంబులు గల మదీయ ద్వారపాలకులు. వీరు మిమ్ముం గైకొనక మదీయాజ్ఞాతిక్రమణులై చేసిన యపరాధంబునకుఁ దగిన దండంబు గావించితిరి. అదియు నాకు నభిమతం బయ్యె. అదియునుం గాక భృత్య వర్గంబు చేయు నపరాధంబు స్వామిదియ. కాన నీ తప్పునకు మాన నీయుండ నైన నన్ను మన్నించి ప్రసన్ను లగుదురు గాక యని వెండియు నిట్లనియె, 550

1. వలెనె (త) 2. తరచుగ (హ.) 3. నవ్యవర (ద.) 4. పోలిక (క. చ. ట. ద. బ.)
5. పెనుపొందు (క. చ. బ.) 6. నేత్రముల్, అహహ (క. ట. బ.); మదక్షి యుగ్మకం, బహహ (ద.)

చ. తనువునఁ బుట్టి నట్టి బెడిదం బగు కుష్ఠ మహా గదంబుచే
వనరి తదీయ చర్మము వివర్ణత నొందిన రీతి భృత్యు లొ
ప్పనిపని సేసినన్ విభులు బంధుర చారు యశఃబు పేరు పెం
పును జెడిపోయి దుర్యశము పొందుచు నుందురు [1]విష్టపంబులన్. 551

చ. అలవడ [2]నాకు మీవలన నబ్బిన తీర్థ సుకీర్తనీయ స
ల్లలిత వినిర్మలామృత విలాస యశో విభవాభిరామ మై
వెలయు వికుంఠనామ మపవిత్రమన శ్వపచాధమాది లో
కుల చెవిసోఁకఁ దత్క్షణమ కోరి [3]పునీతులఁ జేయు వారలన్. 552

తే. అట్టి నేను దలంప మీ యట్టి సాధు, జనుల కపకార మర్థిఁ జేసిన మదీయ
బాహు [4]సమునైన ద్రుంతు నుత్సాహలీల, నన్న నితరుల మీఁద్రోల నెన్ననేల?

క. ధరణిసురోత్తమసేవా, పరిలబ్ధం బైన యట్టి పాతక నాశం
కర నిఖిలభువన పూత, స్ఫురితాంఘ్రి సరోజ తోయములు గల నన్నున్. 554

క. అలఘుమతి విరక్తునిఁగాఁ, దలఁపక నిజ శుభ కటాక్ష దామక కలితా
ఖిల సంపద్వైభవ శ్రీ, లలనా రత్నం బురస్థ్సలంబును జెందెన్. 555

చ. క్రతువులు సేయుచో శిఖిముఖంబున వ్రేలుచునట్టి తద్ఘృత
ప్లుత చరు భక్షణన్ ముదముఁ బొందదు నిస్పృహ ధర్మమార్గ సం
గతుఁ డగు భూసురోత్తమ ముఖంబున వేడ్కన్ భుజించు న య్యవి
స్తృత కబళంబునన్ మనము తృప్తి వహించిన రీతి నిచ్చలున్. 556

సీ. సతతంబు నప్రతిహత యోగమాయా విభూతిచేఁ బ్రఖ్యాతిఁ బొందు నేను
నే మహీసురుల సమిద్ధ నిర్మల పాదనళిన రజో వితానములు భక్తి
హాటక నవరత్న కోటీరమునఁ దాల్తు నట్టి నా చరణాంబుజాంబువులను
దవిలి ధరించి [5]సద్యః పునీతాత్ము లై రర్థిఁ జంద్రావతంసాది దేవ

తే. చయములెవ్వాఁడు బ్రాహ్మణజనులు దమకు, నపకృతుల్సేసిరేని మాఱలుగఁ దలఁడు
విప్రులను నన్నుఁ గాఁగ భావించునతఁడు, ధర్మపద్ధతి నాప్రియతముఁడు వాఁడు.

1. లోకమందులన్ (క. చ. బ.) 2. మీకు నావలన (హ); నాకు మా వలన (నా)
3. పవిత్రుల (వా) 4. సముఁడైన (తం. వా) 5. సద్యః పవిత్రాత్ములై (వా)

ఉ. గోవితతిన్ ధరాదివిజ కోటిని నన్నును దీనవర్గమున్
వావిరి భేదబుద్ధిఁ గనువార లధోగతిఁ బొంద నందు నా
శీవిష రోష విస్ఫురణఁ జెంది కృతాంతభటుల్ మహోగ్ర గృ
ధ్రావళిఁ బోలి చంచువుల సంగము లుద్ధతి [1]నొంతు రెప్పుడున్. 558

చ. ధరణిసురోత్తముల్ బహువిధంబులఁ దమ్ముఁ బరాభవించినన్
దరహసితాస్యులై యతిముదంబున నిచ్చలు పూజ సేయుచున్
సరస వచో విలాసముల సన్నుతి సేయుచుఁ దండ్రి నాత్మజుల్
గర మనురక్తిఁ బిల్చుగతిఁ గైకొని పిల్చినవారు నా సముల్. 559

క. వినుఁ డయ్యనఘచరిత్రుల,కనయముఁ బ్రియతముఁడ నగుచు నమ్మాడు వోదున్
మును నన్ను భృగువు దన్నినఁ, గనలక పరితోష[2]యుక్తిఁ గైకొంటిఁ గదే!

సీ. పొలుచు [3]నా చిత్తమందుల యభిప్రాయంబు దెలియంగలేక యుద్వృత్తు లగుచు
గణఁగి మీ యానతిఁ గడచినఁ ద ద్దోషఫలము వీరలకు సంప్రాప్త మయ్యె
మునులార! నా చిత్తమున నున్నరీతియు నిట్టిద భూమిపైఁ బుట్టి వీర
లచిరకాలమున నా యంతికంబునకును నరుదెంచునట్లుగా ననుమతింప

తే. వలయునని యమ్ముకుందుఁడు వలుకుటయును, విని మనంబున సనకాది మునివరేణ్యు
ల మ్మహాత్ముని మృదుల భాషామృతంబుఁ,దవిలి క్రోలియు రోషసందష్టులగుచు.

సీ. మునివరుల్ దమ చిత్తములఁ దృప్తి బొందక పంకజాతాక్షుఁడు పలికినట్టి
పరిమిత బహుళార్థ దురవగాహములును విస్ఫుర దమృతతుల్య
మాధుర్య సుగుణ సమన్వితమ్ములు వినిర్గత శబ్దదోష నికాయములును
నైన వాక్యములకు నాత్మలఁ బరితోష మంది యి ట్లనిరి నెయ్యమున మనల

తే. నౌడయఁ డిప్పుడు సందించియో! తలంప,నర్థి నిందించియో! మత్కృతైక దండ
మునకు సంకోచ మందియో!యనుచు సంశ,యాత్ము లగుచు వివేకించి యంతలోన.

క. నళినాక్షుఁడు తమ దెసఁ గృప, గలిగిన భావంబు దెలిసి కౌతుక మొలయన్
బులకీకృతాంగులై యు, త్కలికన్ హర్షించి నిటలఘటితాంజలులై. 563

క. భరిత నిజ యోగమాయా, స్ఫురణం దనరారు నతివిభూతియు బలమున్
బరమోత్కర్షము గల యీ, శ్వరునకు ని ట్లనిరి మునులు సద్వినయమునన్.

1. నొంతురేపునన్ (జ. ద.); ఁజింతురెప్పుడున్ (తం. వా.) 2. వృత్తి (హ. వా.)
3. నా మానసాంభోజాత భావంబు (హ)

తే. పొలుపు దీపింప నిత్యవిభూతి నాయ,కుఁడవు భగవంతుఁడవు ననఘుఁడవు నీవు
మత్కృతం బిప్డు నీ కభిమత మటంటి,వీశ! భవదీయ చారిత్ర మెఱుఁగఁ దరమె?

ఉ. దేవ గణాళి కెల్లఁ [1]బరదేవతవై తనరారునట్టి వి
ప్రావళి కాత్మనాయకుఁడ వై పెనుపొందిన నీకు నీ ధరా
దేవత లెల్ల నెన్న నధిదేవత లై రఁట యెట్టి చోద్యమో!
దేవ! సమస్త పావన! సుధీజనభావన! విశ్వభావనా! 566

చ. కమల దళాక్ష! నీవలనఁ గల్గిన ధర్మము తావకావతా
రముల సురక్షితంబుగఁ దిరం బగు, నీశ్వర నిర్వికార త
త్త్వమునఁ దనర్చు ని న్నరయఁ దత్ఫలరూపము తత్ప్రధాన గో
ప్యము నని పల్కుచుందురు కృపామయలోచన! పాపమోచనా! 567

చ. మహిఁ దలపోయ నెవ్వని సమగ్ర పరిగ్రహముఁ లభింప ని
స్పృహ మతులై మునీశ్వరులు మృత్యు భయంబునఁ బాతు రట్టి స
న్మహిత వివేకశాలి! గుణమండన! నీ కిల నన్య సత్పరి
గ్రహ మది యెట్టి చోద్యము? జగత్పరిపాలన! నిత్యఖేలనా! 568

సీ. సతతంబు నర్థార్థిజన శిరోలంకార పదరేణువులు గల పద్మ [2]నేఁడు
జలజ కింజల్క నిష్యంద మరంద లోభాగత భ్రమర[3]నాయకుని పగిది
ధన్యజనార్పితోదంచిత తులసికా దామంబునకు నిజధామ మగుచు
భాసిల్లు భవదీయ పాదారవిందముల్ విలసిత భక్తి[4]సేవింపుచుండఁ

తే. గమలనయన కృపావలోకనము లొలయ, [5]నర్థిఁ జూడవు భాగవతానురక్తిఁ
జేసి భవదీయమహిమంబు చిత్ర మరయ, చిర శుభాకార! యిందిరాచిత్తచోర!

మ. చిర భాగ్యోదయ! దేవ దేవ! లలిత శ్రీవత్స లక్ష్మాంగ! యీ
వర విప్రానుపదైక పుణ్యరజ మే వర్ణింప నీ మేని కా
భరణం బంటివి సర్వలోకులకు విప్రశ్రేణిమాహాత్మ్య మీ
వెఱుఁగం జెప్పుటకై ధరించితి గదా! యెన్నన్ [6]బునీతాకృతిఁ. 570

వ. అదియునుం గాక, 571

1. పరదేవతవై (క); పరదేవతయై (చ. త. జ. ద. ద. బ.) 2. పద్మమునెడు (వా.) 'పద్మ యెపుడు' (?) 3. నాయకి విధమున (తం) 4. సేవించుచుండి కమల (వా) 5. నర్థిఁ బొడసూపు (హ. వా.) 6. బవిత్రాకృతిఁ.

సీ. ధర్మమూర్తివి జగత్కర్తవు నగు నీవు ప్రోవంగఁ దగువారిఁ బ్రోవ వేని
నవిరళ వేదోక్తమగు ధర్మమార్గ మసన్మార్గ మగుఁ గాన సత్త్వగుణ వి
శిష్టుఁడ వగుచు నీ జీవరాసుల నేమ మరసి రక్షించు నీదైన శక్తి
చేతను ధర్మఘాతుల దండించు నీకు నంచిత మైన నిగమధర్మ

తే. మార్గ నాశకరంబులు మదికి నింపు, గావు విప్రులయందు సత్కరుణ మెఱసి
ఘనతఁ బలికిన వినయవాక్యములునీకు,యుక్తమగుచుండు సతతంబు భక్తవరద!

వ. అట్లైనం బరులయెడ వినయంబులు వలికినం బ్రాభవహాని యగునని తలంచితివేని,

తే. విశ్వమున కెల్లఁ గర్తవు విశ్వనిధివి, విశ్వసంరక్షకుండ వై వెలయు నీకుఁ
గడఁగి ప్రాభవహాని యెక్కడిది? దలఁప, విషయములు నీకు లీలలై
వెలయుఁ [1]గాన. 574

తే. మునుల మగు మమ్ము నతిమోదమునను నీవు, సత్కరించుట [2]లెల్ల సజ్జన పరిగ్ర
హార్థమై యుండుఁగాదె! మహాత్మ! యొకటి,విన్నవించెద మీ జయవిజయులకును.

తే. అలిగి మేము శపించిన యంతకంటె, బెడిదమగు నాజ్ఞనేయ నభీష్ట మేనిఁ
జేయు మదిగాక సమధికశ్రీ దనర్పఁ, జేసి రక్షించెదేని రక్షింపు మీశ! 576

వ. అట్లైన మాకునుం బ్రియం బగుం గావున ననపరాధులు నతినిర్మలాంతః
కరణులు నైన వీరలకు ననృతంబులు వలికితి మేని మమ్మేనం జిత్తంబు కొలఁది
నాజ్ఞాపింపు మని కరకమలంబులు మొగిచి కృతాంజలులై యున్న మునులం
గరుణార్ద్రదృష్టిం గనుంగొని, 577

క. అనఘుఁడు భగవంతుం డి, ట్లనియెన్ మునులార! వీర లనయము భువికిన్
జని యచట నసురయోనిన్, జనియించి మహోగ్ర లోభసంగతు లగుచున్.

క. దేవ జనావళి కుపహతిఁ, గావింపుచు నిఖిలభువన కంటకవృత్తిన్
జీవింపుచు నాయెడ సం, భావిత వైరానుబంధభావులు నగుచున్. 579

క. ఆహవ ముఖమున నను నతి, సాహసమున నెదిరి పోరి చక్ర నిశితధా
రాహతిఁ దెగి వచ్చెద రు,త్సాహ మెలర్పంగ నాదు సన్నిధి కంతన్. 580

వ. అదియునుం గాక, 581

1. గాక (క. ఐ.) 2. లెల్లను జన (క-ఐ)

క. నను వైరంబున నైనను, మనమునఁ దలఁచుటను నా సమక్షమున మదా
నన మీక్షింపుచు నీల్గుట, ననఘాత్మకు లై వసింతు [1]రస్మజ్జగతిన్. 582

క. వినుఁ డిటమీఁద నిఁ కెన్నఁటి, కిని బుట్టువు లేదు వీరికిని మీరలు ప
ల్కిన యట్ల నాదు చిత్తము, నను దలఁతుం గాన మీ మనంబుల నింకన్. 583

ఉ. దీనికిఁ జింత దక్కుఁడు సుధీజన[2]పుంగవులార నావుడు
న్నా నళినాసనాత్మజు లనంతుని భావముఁ దా మెఱింగి పెం
పూనిన వేడ్కఁ దేలి తెలివొందిన చిత్తముల న్నుతించి రం
భోనిధిశాయి నార్తజన పోషణభూషణుఁ బాప శోషణున్. 584

వ. మఱియును, 585

ఉ. ఆ సనకాదు లంతఁ బులకాంకురముల్ ననలొత్త బాష్పధా
రా సుభగాక్షు లై మునిశరణ్యవరేణ్యు నగణ్యు దేవతా
గ్రేసరు దివ్యమంగళ శరీరముఁ జారు తదీయ ధామమున్
భాసురలీలఁ జూచి నవపద్మదళాక్షునకున్ వినమ్రులై. 586

క. తమ పలికిన భాషణములు, గమలోదరు [3]వాక్య సరణిగాఁ దలఁపుచు నె
య్యమునన్ వైష్ణవలక్ష్మిన్, బ్రమదంబునఁ బ్రస్తుతించి పరమేశ్వరుచేన్. 587

క. ఆమంత్రితు లై తగ నిజ, ధామములకుఁ జనిరి వారు దడయక లక్ష్మీ
ధాముఁడు జయ విజయుల నభి, రామంబుగఁ జూచి పలికె రయ మొప్పారన్.

క. మీ రసురయోనియం దని, వారితు లై జనన మంద వలసెను నే దు
ర్వార బలాఢ్యుఁడ నయ్యును, వారింపఁగ నోప విప్రవచనము లెందున్. 589

క. అదిగాన దనుజయోనిం, బదపడి జనియించి మ[4]ద్విపక్షుల రై మీ
మది నెపుడు నన్నె తలఁపుచు, వదలక నాచేతఁ జచ్చి వచ్చెద రిటకున్. 590

ఉ. పొంపని యానతిచ్చి హరి ఫుల్ల సరోరుహ పత్రనేత్రుఁ డా
ఖండల ముఖ్య దిగ్వర నికాయ కిరీట లస న్మణీ ప్రభా
మండిత పాదపీఠుఁడు రమా రమణీమణి తోడ నేగుదే
నిండినవేడ్కఁ నేఁగె నిజ [5]నిర్మల మందిర పుణ్యభూమికిన్. 591

1. రస్మత్పదవిన్ (తం.వా.); రస్మత్పదమున్ (క-బ) 2. పుంగవులన్నఁ బ్రీతుత్రై, యానతి (వా) 3. భాషణములుగా (వా) 4. విపక్షులు నై (హ) 5. నిర్మలపుణ్య నివాసభూమికిన్ (హ.వా)

వ. †అంత, 592

క. నిజ తేజోహానిగ జయ, విజయులు ధరఁ గూలి రపుడు విహ్వలు రగుచున్
త్రిజగముల సురవిమాన, వ్రజముల హాహారవంబు గ్రందుగఁ జెలఁగన్. 593

క. [1]వారలు వో దితిగర్భాగారంబున నున్న వారు గడఁగి తదీయో
దార ఘనతేజ మిపు డని, వారణ మీ తేజమెల్ల వమ్ముగఁ జేసెన్. 594

ఉ. ఇంతకు మూల మా హరి రమేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యముల్
వింతలె? సర్వభూత భవ వృద్ధి వినాశన హేతుభూతుఁ డా
ద్యంత వికార శూన్యుఁడు దయానిధి మీ యెడ మేలు సేయు నీ
చింత దొఱంగి వే చనుఁడు చేకుఱు మీకు మనోరథార్థముల్. 595

అధ్యాయము - ౧౭

క. అని వనజాసనుఁ డాడిన, విని తద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం
బున కేఁగిరి దితి నిజనాథుని మాటలు దలఁచి యపరితోషము తోడన్. 596

—: జయ విజయులు దితిగర్భంబున హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగాఁ బుట్టుట :—

తే. [2]ఇంతి తనసుతులు సురలఁగారింతురనుచు, దలఁపుచుండఁగ నంత వత్సరశతంబు
సనఁగ నటమీఁదఁ గనియెఁ గశ్యపునిదేవి, యఖిల లోకైక కంటకులైన సుతుల.

వ. అ య్యవసరంబున, 598

తే. ధరణి గంపించెఁ గులపర్వతములు వణఁకె,జలధులు గలంగెఁ దారకావళులుదుల్లె
గగన మగలెను మ్రొగ్గె దిక్కరులు దిశల, మిడుఁగుఱు లెగసెఁ బిడుగులు
పుడమిఁ [3]బడియె.

సీ. హోమానలంబుల ధూమంబు లడరెను బ్రతికూల వాయువుల్ బలసి వీచెఁ
దరువు లెల్లెడ విటతాటంబు లై కూలె గ్రహ తారకావళి కాంతి మాసె
బెరసి మొగుళ్ళు నెత్తురువాన గురిసెను మెఱుఁగులు దెసల మిర్మిట్లు గొలిపె
స్వర్భానుఁ డొగి నపర్వమున భానునిఁ బట్టెఁ గైకొని చిమ్మ చీకట్లు పర్వె

తే. మొనసి కుక్కలు మొఱిగెను మోరలెత్తి,పగలు నక్కలు వాపోయె ఖగము లార్త
రవము లిచ్చెను దేవతా ప్రతిమలొరగెఁ,గన్నులను నశ్రుకణములు గ్రందుకొనఁగ.

† ఈ వచనము జ.ద. లలో లేదు! 1.వారలె యా దితి (వా) 2. తన సుతులు సురల హరింతు
రనుచు నాత్మ (హ) 3. దొరగె (క-బ)

క. మొదవులు నెత్తురుఁ జీమునుఁ బిదికెను, గార్దభరవంబు భీషణ మయ్యెన్
మద ముడిగెఁ గరుల కటములఁ, బొదివెఁ దురంగముల వాలముల నిప్పులొగిన్.

క. గుహలు రౌద్ర లిచ్చెఁ బాప, గ్రహ మిత్రతఁ జెంది వక్రగతులను సౌమ్య
గ్రహములు వర్తించెను దు, స్సహ తేజో దితి తనూజ సంభవ వేళన్ 602

మ. భయద ప్రక్రియ నట్లు దోఁచిన మహోత్పాతంబు వీక్షించి సం
క్షయకాలం బని కాని సాధు హననోగ్ర క్రూర దేవాహితో
దయ సంక్షోభముగా నెఱుంగక సమస్త ప్రాణి[1]జాతంబు లు
ద్భయ మందెన్ సనకాది యోగిజనముల్ దక్కన్ బుధేంద్రోత్తమా! 603

వ. అట్లావిర్భవించిన యనంతరంబ, 604

మ. కులశైలాభ శరీరముల్ దనర రక్షోనాథు లత్యుగ్ర దో
ర్బల మొప్పన్ బదఘట్టనన్ ధర చలింపన్ రత్న కేయూర కుం
డల కాంచీ కట కాంగుళీయక కిరీట స్వర్ణమంజీర ని
ర్మల కాంతుల్ [2]దులకింప నాత్మరుచిచే మందీకృతార్కాంశులై. 605

వ. ఉన్న సమయంబునం గశ్యపుండు నిజ తనూభవులఁ జూడందలంచి దితి మంది
రంబునకుం జనుదెంచి సుతులం గనుంగొని వారలకు నామకరణంబులు సేయం
దలంచి, 606

చ. దితి జఠరంబునందుఁ దన తేజము ము న్నిడినట్టి పుత్రు న
ద్భుత చరితున్ హిరణ్యకశిపుం డనుపేరఁ బ్రసూతివేళ నా
దితి మునుఁ గన్న పట్టి రవితేజునిఁ గాంచనలోచనుండు నా
హితమతిఁ బేరు వెట్టి చనియె న్నిజ నిర్మల పుణ్యభూమికిన్. 607

వ. ఆ య్యవసరంబున నతుల తేజోవిరాజితుండైన హిరణ్యకశిపుండు హిరణ్య గర్భ
వరదాన గర్వంబునం దుర్వార పరిపంథి గర్వనిర్వాపణాఖర్వ భుజా విజృంభణం
బున నఖిల లోకపాలాదుల జయించి*(స్వవశం బొనర్చి)సంతుష్టాంత రంగుండై
*(యెందునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై) సుఖంబున నుండె.
తత్సోదరుండైన హిరణ్యాక్షుండు ప్రతిదివసంబును జండ వేదండ శుండాదండ
మండిత భుజాదండంబున గదాదండంబు ధరియించి తను నెదిరి కదనంబు సేయం

1. జాతంబు నుద్భయ మందెన్ (తం) సంఘాతముల్ భయమందెన్ (వా) 2. దులగింప (క.చ.ట. త. జ. డ. బ.); దుశగింప (ద) *వ్రాత ప్రతులలో లేవు.

జాలిన యరివీరునిం భూలోకంబునం గానక, దివంబునకుం దాడివెట్టి యందు సమర విముఖులైన బర్హిర్ముఖులం గనుంకొని వనజాసన వరప్రదానంబుఁ జింతించి హితులు చెలంగ నహితులు గలంగ మహితవై జయంతికాదామం బభిరామంబై వెలుంగం జరణంబుల మణి నూపురంబులు [1]మొరయ నిజ దేహ ద్యుతి దిక్కులం బిక్కటిలం జనుదెంచు వానిం గని భీతచిత్తులై దేవతా గణంబులు గరుడునిం గని పఱచు నురగంబులం బోలె నిజనివాసంబు లర్క కాంచన నివాసంబులుగ నొనర్చి యెక్కడికేనియుం జనిన, 608

ఉ. శౌర్యము వోవఁ దట్టి నిజ సాధనముల్ దిగనాడి విక్ర మౌ
దార్య పరాక్రమ క్రమము [2]దవ్వగ భీతిలి పాఱి రక్కటా!
[3]క్రౌర్యము దక్కె నాకు లని గైకొని యార్చి సుమేరు పర్వత
స్థైర్యుఁడు వార్ధిఁ జొచ్చె నతిదర్పిత భూరి భుజా విజృంభియై. 609

వ. ఇట్లు చొచ్చిన, 610

క. వరుణుని బలములు దనుజే, శ్వరు తేజముఁ దేఱి చూడఁజాలక శౌర్య
స్ఫురణము చెడి యెం దేనియుఁ, బఱచెం దజ్జలధి మధ్యభాగమునందున్. 611

క. అమరారి విపుల నిశ్వా, సములం బ్రభవించినట్టి జలనిధి కల్లో
లములను విపుల గదాదం, డమునం [4]బోనడఁచె నతి దృఢం బగు శక్తిన్. 612

చ. మఱియును న మ్మహాజలధి మధ్యమునన్ సురవైరి పెక్కు వ
త్సరములు గ్రీడ సల్పి రిపుసైన్యవిదారణ శౌర్య ఖేలనా
పరతఁ జరించి య వ్వరుణ పాలిత మైన లస ద్విభావరీ
పురమున కేగి యందుఁ బరిపూర్ణత నున్న పయోధినాథునిన్. 613

సీ. యాదోగణాధీశుఁ డగుచుఁ బాతాళ భువన పరిపాలుఁడై తనరుచున్న
వరుణునిఁ గనుఁగొని పరిహాసితోక్తుల ని ట్లను విశ్వమం దెన్నఁగలుగు
సకల లోకైక పాలకులలో నతిబలాధికుఁ డని జగము నుతింపఁదగిన
శూరుండ వీవు నీ పౌరుష మొప్పంగఁ గదనరంగమున న న్నెదిరి చూడు

తే. నీ భుజావిక్రమంబును బ్రాభవంబు, నణఁతు నని పల్కుటయు విని యబ్ధివిభుఁడు
పగఱజయమును,వృద్ధియు,బలము,నాత్మబలముఁదలపోసిదనుజుతోబవరమునకు.

1. మెఱయ (ట.జ.డ.ద.బ.) 2. దప్పఁగ (హ.తం వా.) 3. కార్యముఁ దప్పి (క.చ.ద. తం.వా.) 4. బోనడిచె (త)

క. సమయము గాదని తన చి త్తమునం గల రోషవహ్నిఁ దాలిమి యను [1]తో
యముచేఁ దగ నార్చుచు నుప, శమితోక్తులఁ బలికె దనుజస త్తముతోడన్. 615

చ. మనమున శాంతిఁ బూని నియమంబున సంగర ముజ్జగించి [2]యే
ననయము నున్న వాఁడ నిపు డాహవకేళిఁ జరింపరాదు నీ
ఘన భుజ విక్రమస్ఫురిత గాఢ విజృంభణమున్ జయింపఁ జా
లిన ప్రతివీరు లెవ్వరును లేరు ముకుందుఁడు దక్క [3]నెక్కుడన్. 616

చ. గొనకొని య మ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్న వాఁడు దా
ననిమొనఁ బెక్కుమాఱు లభియాతుల నోలి జయించి శక్తి పెం
పున నడిసన్న వీరుఁ డని భూజనకోటి [4]నుతించు నందు వే
చను మతఁ డిచ్చు నీకు నని సర్వము దీఱెడు నంతమీఁదటన్. 617

ఉ. నిందకు నోర్చి యాజిమొన నిల్వఁగ నోపక వీఁగి పాఱు నీ
పందల [5]వెంటఁ బడ్డ మగ పంతమె? సర్వ శరణ్యుఁ డైన గో
విందుఁడు దీర్చు నీ పని వివేకహీన! చనంగ నోపుదే
నందుల కేగు మాతఁ డమరారులఁ బోర జయించు నిచ్చలున్. 618

వ. అదియునుం గాక, 619

క. పురుషాకృతిఁ [6]బ్రతియుగమునఁ, బురుషోత్తముఁ డవతరించి భూరి భుజా వి
స్ఫురణన్ దుష్టనిశాటుల, హరియించుచునుండు మునిగణార్చితపదుఁ డై. 620

ఉ. కావున నా విభుం దొడరి కయ్యము దయ్య మెఱుంగఁజేసి ర
క్షోవర! నీ భుజాబలము సొంపఱి మేదినిఁ గూలి సారమే
యావళి కాశ్రయం బగుదు వప్పటి కిప్పుడ యేగుదేని నీ
చేవయు లావు నేర్పడును [7]జెప్పఁగ నేటికి మీఁది కార్యముల్. 621

1. తోయములన్ (హ.తం.వా.) 2. యే మనయము నున్న వారము (తం) నే మనయము..... (క.చ.ట.త.ద.బ.) 3. నిక్కడన్ (క.చ.త.జ.డ.ద.బ.) 4. నుతింపనందు (చ.ట.తి.జ.బ.) 5. వెంటబెట్టి (క.చ.ట.త.జ.ద.) వెంటనంట (ఉ) 6. యుగయుగమున (ద) 7. జెప్పఁగనే లటమీఁది (చ.డ.ద.బ.)

అధ్యాయము — ౧౯

చ. అని వరుణుండు వల్కిన దురాగ్రహ మెత్తి హిరణ్యలోచనుం
డనయము మానసంబున భయం బొక యింతయు లేక సంగరా
వని నెదిరింతు [1]నేఁ డమర వర్ధను దుష్ట విమర్దనుం జనా
ర్దను ననుచున్ వికుంఠనగర స్ఫుట సంచిత మార్గవర్తి యై. 622

క. చను నవసరమున నారద, ముని వరుఁ డెదు రేఁగుదెంచి ముదము దలిర్పన్
దనుజేంద్ర! యెందుఁ బోయెద,వని యడిగిన నారదునకు నతఁ డిట్లనియెన్. 623

చ. సరసిరుహాక్షునిం దొడరి సంగర మే నొనరించి యిందిరా
వరుని ననంతుఁ ద్రుంచి సురవైరి కులంబున కెల్ల మోదవి
స్ఫురణ ఘటింపఁ జేయుటకుఁ బూని వికుంఠ పథానువర్తి నై
యరిగెద నన్న నమ్ముని కులాగ్రణి [2]రక్కసితేని కిట్లనున్. 624

చ. గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు భూ
భరము [3]వహింప నాదికిటిభావము దాల్చి రసాతలంబునం
దిరవుగ నున్న వాఁ డచటి కేఁగఁగ నోపుదువేని నేఁగు మం
దరయఁగఁ గల్గు నీకు నసురాంతకుతోడి రణం బవశ్యమున్. 625

చ. అనవుడు దానవేంద్రుడు హుతాశను కైవడి మండి పద్మలో
చను నెదిరించు వేడుకలు సందడిగొల్ప ననల్ప తేజుఁ డై
ఘనగదఁ గేలఁ బూని త్రిజగ ద్భయదాకృతిఁ దాల్చి ప్రేల్మిడిన్
జనియె రసాతలంబునకుఁ జండభుజా బలదర్ప మేర్పడన్. 626

వ. చని జలమధ్యంబున, 627

క. దివిజారి యెదురఁ గాంచెను, నవిరళ దంష్ట్రాభిరాము నమరలలామున్
గువలయ భరణోద్దామున్, బవనమయ స్తబ్ధరోము జలదశ్యామున్. 628

వ. అయ్యవసరంబున సూకరాకారుం డైన హరియు, 629

క. వనజ రుచి సన్నిభము లగు, తన లోచనయుగళ దీప్తిఁ దనరఁ ద దాలో
కనముల దనుజాధీశుని, తనుకాంతి హరింపఁజేసెఁ దత్ క్షణమాత్రన్. 630

1. నే నమరవర్ధనుతో ననుచున్ రణార్థి యై చనియె వికుంఠ పుణ్య సరసస్ఫుట (జ) 2. దానవనాథు కిట్లనున్ (క. త. బ. తం.) దానవ నేత కిట్లనున్ (వా) 3. వహింపగా పురుషభావము దాల్చి (ట) వహింప యజ్ఞ కిటి భావము దాల్చి (డ) హరింపఁగా పురుష......(క. చ. త. జ. ద. బ.)

వ. మఱియు న య్యాదివరాహం బవార్య శౌర్యమున మాఱులేని విహారంబునఁ జరియించు నట్టి యెడ, 631

–: హిరణ్యాక్షుండు యజ్ఞవరాహం బగు హరి నెదిరించి యుద్ధము చేయుట :–

సీ. తుదమొదళ్ళకుఁ[1]జిక్కి తునిసిపాఱఁగ మోరఁ గులశైలములఁ జిమ్ముఁగొంతతడవు
బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులువోవఁ గొమ్ములఁ దాటించుఁ గొంతతడవు
జలధు లేడును బంకసంకులంబై యింక ఖురముల మట్టాడుఁ గొంతతడవు
నుడురాజు సూర్యుండు నొక్క మూలకుఁబోవఁగుఱుచవాలముఁ ద్రిప్పుఁగొంతతడవు

తే. గునియుఁ గుప్పించు లంఘించు గొప్పరించు, నెగయు ధరఁ ద్రవ్వుఁ బొఱియఁగా నేపుమిగిలి
దానవేంద్రుని గుండెలు దల్లడిల్ల, బంది మెల్లన రణపరిస్పంది యగుచు. 632

వ. మఱియును, 633

క. కనుఁగవ నిప్పులు రాలఁగ, సునిశిత [2]దంష్ట్రాగ్రయుత వసుంధరుఁ డగుచున్
దన కెదు రేతేరఁగఁ గని, వనచర మే రీతి నిపుడు వనచర మయ్యెన్? 634

క. అని యాశ్చర్య భయంబులు, దన మనమునఁ దొంగలింప దనుజాధిపుఁ డి
ట్లనియెన్ భీకర సూకర, తను వొంది చరించు దనుజ[3]దర్పాపహృతోన్. 635

క. ఘనసూకర! మూఢాత్మక! వనరుహసంభూతదత్త వర దానమునన్
గనిన రసాతలగత భువి, యనయంబును నా యధీనమై వర్తించున్. 636

క. గొనకొని నీ వీ ధరణిన్, గొనిపోకుము [4]విడువు కాక కొనిపోయెదవేన్
గొనియెద నీ ప్రాణముఁ గై, కొను నా వచనములు చలము గొన నేమిటికిన్.

క. మాయావి వగుచు నిప్పుడు, పాయక యీ పుడమి చోరభావముతో నీ
వీ యెడఁ [5]గొనిపోఁ, జూతునె?, యాయత భుజబలము చేత నణఁపక యనుచున్.

సీ. అవిరళ యోగ మాయాబలంబునఁజేసి యల్ప పౌరుషమున నలరు నిన్ను
నర్థి సంస్థాపించి యస్మత్సుహృద్భృత్య కులుల కెల్లను మోద మొలయఁ జేయఁ
జెలు వేది మద్గదా శీర్ణుఁడ వగు నిన్నుఁ గనుఁగొని దేవతాగణము లెల్ల
నిర్మూలు లై చాల నెఱి నశించెద రన్న విని యజ్ఞపోత్రియై వెలయుచున్న

1. జెక్కుఁ దునిసి (హ) జిక్కుఁ దునిసి (లం. వా. జ. ఢ. బ.) 2. దంష్ట్రాగ్రమున వసుంధర మొప్పన్ (ట) 3. దర్పహరునితోన్ (హ) 4. విడుము (హ. లం. వా.) 5. గొనిపోఁ జూతువె (తం. వా.) గొం పోయెద నా శత్రువులకు, ధీయుత మిత్రుండపోలె దెంపు తలిర్పన్ (ట. జ. ద. బ.)

తే. [1]హరి సరోజజ సురముని వసుల కెల్ల, వచ్చు దురవస్థ కాత్మలో వంత నొంది
[2]నిశిత దంష్ట్రాగ్ర లసిత యై నెగడు ధరణి, దేవితో నొప్పె నాదేవదేవుఁ డంత.

క. [3]సురరిపు వాక్యాంకుశముల, గురు కుపితస్వాంతుఁ డయ్యుఁ గొమరారె వసుం
ధరతోడ భీతి నొందిన, కరిణిం గల కరికులేంద్రు కరణిం బెలుచన్. 640

తే. నిశిత సిత దంతరోచులు నింగిఁ బర్వఁ, గంధి వెడలి భయంక రాకార లీల
నరుగు భీషణ మఖవరాహావతార, మొనరఁ దాల్చిన పద్మలోచనుని వెనుక. 641

క. కరి వెనుకఁ నక్రము, కరణిం జని దైత్యవిభుఁడు [4]గది సిట్లనియెన్
దురిత పయోనిధి తరికిన్, గిరికిన్ ఖురదళిత మేరుగిరికిన్ హరికిన్. 642

క. నిందకు రోయక లజ్జం, జెందక వంచనను రణము నేసి జయంబున్
బొందెద నని మదిఁ దలఁచుచుఁ, బందగతిన్ బాఱ బంటుపంతమె? నీకున్. 643

వ. అని యాక్షేపించిన పుండరీకాక్షుండు కోపోద్దీపిత మానసుం డై యంత, 644

క. తోయములమీఁద భూమి న, నాయాసత నిల్పి దాని కాధారముగాఁ
దోయజనాభుఁడు దన బల, మాయత మతిఁ బెట్టె సురలు హర్షము నొందన్.

తే. కుసుమముల వృష్టి బోరనఁ గురిసె నంత, విభవ మొప్పార దేవ దుందుభులు మొరసెఁ
గడఁక పీతెంచె గంధర్వ గానరవము, నందితము లయ్యె నప్సరోనర్తనములు.

వ. అ య్యవసరంబున న య్యజ్ఞవరాహమూర్తిధరుం డైన కమలలోచనుండు గనకకుండల కేయూర గ్రైవేయ కటంకాగుళీయక భూషణరోచులు నింగిఁ బర్వ సమరసన్నద్ధుం డై, 647

చ. ఘనగదఁ గేలఁ బూని మణికాంచన నవ్య విచిత్ర వర్మ మిం
పొనరఁగఁ దాల్చి దానవనియుక్త దురుక్త నిశాతబాణముల్
దన ఘనమర్మముల్ గలఁప దానవహంత నితాంత శౌర్యుఁ డై
కనలుచు వచ్చు న ద్దనుజుఁ గన్గొని [5]రోష విభీషణాకృతిన్. 648

1. హరి సరోభవ సురముని వరులకెల్ల (ట) హరి సరోజాతభవ ముఖామరుల కెల్ల (త.తం.వా.)
2. నిశిత దంష్ట్రాగ్ర కోటిక వసిత ధరణి (క.బ.) తనదు దంష్ట్రాగ్ర లసితమై తనరు ధరణి(హ)
3. వరబలయుత జలచరగణ, పరిపీడాకుల విలోలభావముతో వం
దురి చాల భీతినొందిన, కరిణిం గల కరికులేంద్రు కరణిం బెలుచన్.(క.చ.ట.త.జ.ద.బ.)
4. గదిసి యిటులనున్ (తం. వా.); గదియుచు బలుకున్ (జ) 5. రోషవిజృంభణాకృతిన్(క)

వ. ఒప్పియు నగుచు నిట్లనియె, 649

మ. వినరా! యోరి! యమంగళాచరణ! యుష్మద్వృత్తిన్ నను న్నీమది
న్ననయంబున్ వనగోచరం బగు మృగం బంచున్ దలం తౌర! నే
నెనయ న్వన్యమృగంబ నౌదు బలిమి న్నేతెంచు నీబోఁటి యీ
శునక శ్రేణి వధింతు నేఁ డనిమొనన్ సొంకోర్చి వర్తించినన్. 650

క. బలిమి గలదేని నాతోఁ, గలనను నెదిరించి పోరఁ గడఁగుము నీ కో
ర్కులు నేఁడు దీర్తు నూరక, తలపోయ వికత్థనములు దగదు దురాత్మా! 651

చ. విను మదిగాక సంగర వివేక విశారదు లైన యట్టి స
జ్జనములు మృత్యుపాశములఁ జాల నిబద్ధులు నయ్యు నీ వలెన్
గొనకొని యాత్మసంస్తుతులకు న్ముదమంద రిదేల? యీ విక
త్థనములు బంటుపంతములె? దైత్యకులాధమ! యెన్ని చూడఁగన్. 652

మ. ధృతిఁ బాతాళమునందు నీ వనెడి సందీప్తోగ్ర నిక్షేప మే
నతిదర్పంబునఁ గొందుఁ జూడు మిదె దేవారాతి! [1]న న్నెన్నెదా
గతలజ్జుం డన దాఁగియుండి రణముం గావింతు యుష్మద్గదా
వితత[2]ద్రావితుఁ డన్న న న్నెదురుమా! వే తీర్తు నీ కోరికల్. 653

ఉ. ఎన్నఁ బదాతియూథముల కెల్ల విభుండవు పోటుబంట వై
నన్ను రణోర్వి నేఁ డెదిరినన్ భవదీయ బలంబు నాయువున్
మిన్నక కొందుఁ జూడు మిదె మేరగ మేదిని పీతదైత్య మై
వన్నెకు నెక్కఁజేసెద నవార్య పరాక్రమ విక్రమంబునన్. 654

చ. నను నెదురంగఁ జాలిన ఘనంబగు శౌర్యము ధైర్యమున్ బలం
బును గలదేని నిల్వు రణభూమిని నీ హితు లైన వారికిన్
గనుఁగవ బాష్ప పూరములు గ్రమ్మఁగ మాన్పఁగ నోపుదేని చ
య్యనఁ [3]జనుదెమ్ము దానవకులాధమ! యూరక రజ్జు లేటికిన్. 655

క. నను నిట సంస్థాపించెద, నని పలికితి వంత వాఁడ వౌదువు [4]నీకున్
నెనరైన చుట్టములఁ బొడ,గని రా యిదె యమునిపురికిఁ గాఁపుర మరుగన్. 656

1. నన్నెన్నెదే (క. చ. ట. డ. ద. బ.) 2. ద్రావితు నన్నునేఁ డెదురుమా (హ. వా.)
3. జనుపొమ్ము (హ) జనఁ బొమ్ము (తం. వా) 4. లేనీ (చ. ద. బ.)

మ. అని యిబ్భంగి సరోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్ విడంబించి ప
లికిన హాసోక్తుల కుల్కి రోష మద సంగీభూత చేతస్కుఁడై
కనుఁగ్రేవన్ మిణుగుర్లు చాలఁ బొడమంగాఁ గిన్కమైఁ దోఁకఁద్రొ
క్కిన [1]కృష్ణోరగరాజు మాడ్కి మదిలోఁ గీడ్పాటు వాటిల్లఁగన్. 657

క. చలితేంద్రియుఁడై నిట్టూర్పులు నిగిడింపుచును బొమలు ముడివడ రోషా
కుల మానసుఁడై గదఁగొని, జలజోదరు కెదురు నడచె సాహసమొప్పన్. 658

మ. గద సారించి మదాసురేంద్రుఁడు సమగ్రక్రోధుఁడై మాధవుం
గుదియన్ వ్రేసిన వ్రేటు గైకొనక రక్షోహంత శౌర్యోన్నతిన్
గదఁ గేలన్ ధరియించి దానిఁ దునుకల్గావించినం దైత్యుఁడు
న్మదుఁడై యొండు గదన్ రమావిభుని భీమప్రక్రియన్ వ్రేసినన్. 659

చ. అది దనుఁ దాఁకకుండ [2]నసురారి గదారణ కోవిదక్రియా
స్పద కరలాఘవ క్రమము పైకొని చూపి విరోధి పేరురం
[3]బదయత వ్రేయ వాఁడు వివశాకులభావము నొంది యంతలో
మదిఁ దెలివొంది వ్రేసె రిపుమాన విమర్దను నా జనార్దనున్. 660

వ. ఇట్లు దలపడి యన్యోన్య జయకాంక్షల నితరేతర తుంగ తరంగ తాడితంబులగు దక్షిణోత్తర సముద్రంబుల రౌద్రంబునఁ, బరస్పర శుండాదండ ఘట్టిత మదాంధ గంధసింధుర యుగంబు చందంబున, రోష భీష ణాటోపంబులం దలపడు బెబ్బులుల గబ్బున, నతిదర్పాతిరేకంబున నెదిర్చి యంకెలువైచు మదవృష భంబుల రభసంబున, నసహ్య సింహపరాక్రమంబున, విక్రమించి పోరునెడ హిరణ్యాక్షుండు సవ్యమండల భ్రమణంబునం బరివేష్టించినం బుండరీకాక్షుండు దక్షిణమండల భ్రమణంబునం దిరిగి, విపక్షు వక్షం బశనిసంకాశం బగు గదా దండంబునం బగిల్చిన, వాఁడు దెప్పిఱి తెలివొంది దనుజ పరిపంథి ఫాలంబు నొంచిన, న మ్మేటివీరులు శోణిత సిక్తాంగులై పుష్పితాశోకంబులం బురుణింపుచుం బాయుచు డాయుచు వ్రేయుచు త్రోయుచు నొండొరుల రుధిరంబు లాఘ్రాణింపుచుఁ దిరస్కార పరిహాసోక్తు లిచ్చుచుఁ బోరు సమయంబున న మ్మహాబలుల సమరంబుఁ జూచు వేడ్కఁ బద్మసంభవుండు నిఖిల మునీంద్ర సిద్ధ సాధ్య దేవగణంబులతోడం జనుదెంచి ధరిత్రీనిమిత్తం బసురతోడం బోరుయజ్ఞ వరాహున కిట్లనియె, 661

1. క్రుద్ధోరగరాజు (త. జ. డ.) 2. దనుజారి (జ.డ.ద.బ.తం.) 3. బదరఁగ (హ.త.వా)

ఉ. అంచిత దివ్యమూర్తి! పరమాత్మక! యీ కలుషాత్ముఁ డైన న
క్తంచరుఁ డస్మదీయ వరగర్వమునన్ భువనంబు లెల్లఁ గా
రించు మదించు నిట్టి విపరీతచరిత్రునిఁ ద్రుంప కిట్లుపే
క్షించుట గాదు వీని బలిసేయు వసుంధరకున్ శుభం బగున్. 662

క. బాలుఁడు గరమున నుగ్ర, వ్యాళము ధరియించి యాడు వడువున రక్షః
పాలునిఁ ద్రుంపక యూరక, పాలార్చుట నీతియే? శుభప్రద! యింకన్. 663

వ. అదియునుం గాక, 664

మ. అనఘా! యీ యభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింపవే!
సనయంబున్ మఱి దైత్యవేళ యగు సంధ్యాకాల మేతెంచినన్
ఘనమాయాబలశాలియైన దనుజున్ ఖండింపఁగా రాదు కా
వున నీ వేళన త్రుంపు సజ్జన హితప్రోద్యోగ రక్తుండ వై. 665

అధ్యాయము - ౧౯

క. అని సరసిజగర్భుఁడు వ, ల్కిన వచనము లర్థి విని నిలింపులు గుంపుల్
గొని చూడ సస్మితానన, వనజము చెలువొంద 'నసురవరు కభిముఖుఁ డై. 666

తే. పుండరీకాక్షుఁ డయ్యును భూరిరోష, నిరతి దీపింప నరుణాబ్జ నేత్రుఁ డగుచు
ఘన గదాదండ మెత్తి రాక్షసుని హనువు, లుగ్రగతి మొత్తె వాఁడును నోసరించె.

క. పరువడి దితిసుతుఁ డతిభీ, కర గదఁ జేకొని చిత్రగతులం బద్మో
దరు డాసి చేతిగద సా, గరమునఁ బడ నడిచె బాహుగర్వ మెలర్పన్. 668

వ. అంత, 669

తే. హరి నిరాయుధుఁ డైన సురారి, సమర, ధర్మమాత్మను దలఁచి యుద్ధంబు గక్కి
నిలిచి చూచుచునుండెను నింగి యమర వరుల హా!హా రవంబుల భరితమయ్యె.

క. సరసిజనేత్రుఁడు దనుజే, శ్వరు సంగరధర్మమునకు సమధిక శౌర్య
స్ఫురణకుఁ దన చిత్తంబునఁ, గరమాశ్చర్యంబు నొంది కడఁక దలిర్పన్.671

మ. కుతలోద్ధర్త మనంబునం దలఁచె రక్షోరాడ్వధార్థంబుగా
దితిసంతాన కులాటవీ మహిత సందీప్త ప్రభాశుక్రమున్
సతతోద్యజ్జయశబ్ద సమ్ముఖర భాస్వచ్చక్రమున్ సంతతా
శ్రిత నిర్వక్రముఁ బాలిత ప్రకట ధాత్రీ చక్రమున్ జక్రమున్. 672

వ. అదియునుం బ్రచండ మార్తాండ మండల ప్రభాపటల విద్యోతమానంబును, పటు నట జ్జ్వాలి కాపాస్త సమస్త [1]కుపితారాతి బలాఖర్వ దుర్వార బాహాగ ర్వాంధకారంబును, నసహ్య కహ కహ నిన దాధరీకృత సాగర ఘోషంబును, సకల దేవతాగణ జేగీయమానంబును, ననంత తేజో విరాజితంబును నిజ ప్రభా పూరిత బ్రహ్మాండ కటాహంబును నై రయంబునం జనుదెంచి, దనుజారి దక్షిణ కర సరోజం బలంకరించిన, నా శుభాంగుండు రథాంగపాణియై దివంబున నమర గణంబులు జయజయ శబ్దంబులు వలుక నసురవిభున కెదురుగా నడచిన. 673

క. పొడగని దనుజుఁడు పెదవులఁ, దడుపుచుఁ బొలివోని బంటుతనమున బీరం
బుడుగక భీషణ గదఁ గొని, యడిచెన్ మఖమయ వరాహు నమితోత్సాహున్.

క. త్రిదశారి దన్ను వ్రేసిన, గదఁ బదమునఁ బోవఁ దన్నెఁ గమలాక్షుఁడు పెం
పొదవంగ మనమున మోదము, గదురఁగ లేనవ్వు వదనకమలముఁ[2]బొదువన్.

వ. ఇవ్విధంబున గద వోఁదన్ని యసురవిభుతో నిట్లనియె. 676

చ. ఘనగదఁ గేలఁబూని భుజగర్వ మెలర్పఁగ నన్ను సంగరా
వని నెదిరింతు రార! యనివారణ దైత్య కులేశ్వరాధమా!
యనవుడు వాఁడు [3]నుబ్బి గద నంబుజనాభుని వ్రేసె వ్రేసినం
దనుజవిరోధి పట్టికొనెఁ దార్క్ష్యుఁ డహీంద్రునిఁ బట్టు కైవడిన్. 677

క. దితిజుఁడు తన బల మప్రతి, హత తేజుం డగు సరోరుహాక్షుని శౌర్యో
న్నతి మీఁదఁ బెట్టకుండుట, మతి నెఱిఁగియు బెనఁగె దురభిమానము పేర్మిన్.

వ. అంత, 679

సీ. కాలానల జ్వల జ్జ్వాలా విలోల కరాళ మై పెనుపొందు శూలమంది
సురవైరి యజ్ఞసూకర రూపధరుఁ డైన వనజనాభుని మీఁద వైవ నదియు
సద్విజోత్తము మీఁదఁ జపలతఁ గావించు నభిచార [4]కర్మంబు నట్లు బెండు
పడి పరతేఁ గని పద్మోదరుఁడు దానిఁ జక్రధారాహతిఁ జండవిక్ర

తే. మమున నడుమన ఖండించె నమరభర్త, మహిత దంభోళిచే గరుత్మంతు పక్ష
మతిరయంబునఁ ద్రుంచిన గతిఁ జెలంగి, సురలు మోదింప నసురులు సొంపుడింప.

వ. అయ్యవసరంబున నయ్యసుర దన శూలంబు చక్రంబుచేత నిహతం బగుటం గని.

1. కుటిలారాతి (ట.తం.) 2. ద్రోపన్ (హ); ద్రోవన్ (ద); బొదవన్ (వా) 3. నవ్వి(ట.త.)
4. హోమంబు (చ.ట.త.జ.డ.ద.)

క. దితిజుఁడు రోషోద్ధతుఁడై, యతినిష్ఠుర ముష్టిఁ బొడిచె హరి నా లోకో
న్నతుఁ డొప్పె గుసుమమాలా, హతి దిగ్గజరాజుఁ బోలి యతి దర్పితుఁడై. 682

మ. హరిమీఁదన్ దితిసంభవుండు ఘన మాయాకోట్లు పుట్టించినన్
ధరణీచక్రము భూరి పాంసుపటల ధ్వాంతంబునం గప్పె భీ
కర పాషాణ పురీష మూత్ర ఘన దుర్గంధాస్థి రక్తావళుల్
గురిసెన్ మేఘము లభ్రవీథిని మహా క్షోభక్రియా లోల మై. 683

వ. మఱియును, 484

చ. తవిలి విముక్త కేశపరిధానము లుగ్రకరాళ దంతతా
లువులును రక్తలోచనములుం గల భూత పిశాచ ఢాకినీ
నివహము లంతరిక్షమున నిల్చి నిజాయుధపాణు లై మహా
రవముగ యక్ష దైత్య చతురంగ బలంబులఁ గూడి తోఁచినన్. 685

వ. అంత,

క. త్రిసవన పాదుం డగు నా, బిసరుహనేత్రుండు లోక భీకరముగ నా
యసురాధిపు మాయావిని, రసనకరం బైన శస్త్రరాజముఁ బనిచెన్. 687

క. ఆ చక్రభాను దీప్తి ధ, రా చక్రమునందు నిండి రయమున న మ్మా
యాచక్రము నణఁగించెను. నీచక్రముఁ దైన యామినీచరు నెదురన్. 688

వ. అంత నిక్కడ, 689

క. దితి తనవిభు వాక్యంబుల, గతి తప్పద యనుచుఁ దలఁపఁగాఁ జన్నుల శో
ణితధార లొలికె రక్షః, పతి యగు కనకాక్షు పతనభావము దోఁపన్. 690

వ. అయ్యవసరంబున నసురవిభుండు తన చేసిన మాయాశతంబులు గృతఘ్నునకుం గావించిన యుపకారంబులుం బోలె హరిమీఁదఁ బనిసేయక విఫలంబు లైనం బొలివోని బంటుతనంబునం బుండరీకాక్షుఁ జేరం జనుదెంచి బాహుయుగళంబు సాచి [1]పూఁచి పొడిచి రక్షోవైరి వక్షంబుఁ బీడించిన నయ్యధోక్షజుండు తప్పించుకొని తలంగినఁ జెలంగి దైత్యుండు నిష్ఠురం బగు ముష్టిం బొడిచిన నసురాంతకుండు మిసిమింతుఁడు గాక రోషభీషణాకారంబున వాసవుండు వృత్రాసురుం దెగటార్చిన చందంబున వజ్రివజ్రసన్నిభం బగు నఱచేతం గఱకు టసుర కటతటంబు చటులగతి వ్రేసిన, నా హిరణ్యాక్షుండు దిర్దిరం దిరిగి యుదస్త లోచనుండై సోలి యెట్టకేలకు నెదుర నిలువంబడె నంత, 691

1. యూఁచి (హ)

క. దిటచెడి లోఁబడె దైత్యుఁడు, సటికిన్ దంష్ట్రావిభిన్న శత్రుమహోర
స్ఫటికిన్ ఖర ఖుర పుటికిన్, [1]గటితట హత కమలజాండ ఘటికిన్ గిటికిన్.

వ. ఇట్లు లోఁబడిన, 693

మ. దివి నింద్రాదులు సంతసింప [2]హరి మొత్తెం గర్ణ మూలంబునన్
బవిసంకాశ కఠోర హస్తమున శంఖల్లీలమై [3]దాన దా
నవలోకేశుఁడు రక్తనేత్రుఁ డగుచున్ దైన్యంబు వాటిల్లఁగా
భువిమీఁదన్ [4]వడిఁ గూలె మారుత హతోన్మూలావనీజాకృతిన్. 694

క. బుకబుక నెత్తురు గ్రక్కుచు, వెడరూపము దాల్చి గ్రుడ్లు వెలి కుఱుక నిలం
బడి పండ్లు గీటుకొనుచున్, విడిచెం బ్రాణములు దైత్యవీరుం డంతన్. 695

తే. పడిన దనుజేశ్వరునిఁ జూచి పద్మసంభ, వాది దివిజులు వెఱఁగంది రాత్మలందు
నితఁడు వొందుట యెట్లొకో! యీ యవస్థ, నని తలంచుచు మఱియు నిట్ల
నిరి [5]వెసను. 696

మ. వర యోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్ మనోవీథి సు
స్థిరతన్ లింగశరీర భంగమునకై చింతింతు రా పంకజో
దరు పాదాహతిఁ ద న్ముఖాంబురుహమున్ దర్శింపుచున్ జచ్చె [6]దు
ర్భరితోత్తంసుని దైత్యవల్లభుని సౌభాగ్యంబు దా నెట్టిదో! 697

చ. సమమతి వీరు దైత్యకులశాసను పారిషదుల్ మునీంద్ర శా
పమున నికృష్ట జన్మమునఁ బైకొని పుట్టియు నేఁడు విష్ణుచే
సమయుటఁజేసి మీఁద నగు జన్మమునన్ జలజాక్షు నిత్య వా
సమున వసింతు రెన్నఁటికిఁ జావునుఁ బుట్టువు లేదు వీరికిన్. 698

క. అని వెఱఁగు నొంది [7]పావన, తను వొందినయట్టి వికచతామరసాక్షున్
[8]ముని యోగజన త్రిదశా, వన దక్షున్ దనుజ కరటివర హర్యక్షున్. 699

వ. కనుంగొని, 700

చ. వనజదళాక్ష! యీ జగతి వారల మర్మము నీ వెఱింగి యీ
సునఁ [9]బగఁ బట్టి నీ దివిజసూదనుఁ జంపితి గాన నింక శో
భన మగు నంచు హస్తములు ఫాలములం గదియించి యందఱున్
వినమితులై నుతించిరి వివేకవిశాలునిఁ బుణ్య శీలునిన్. 701

1. కటతట (ద) 2. హరి యుద్రేకం బనేకంబుగా (చ) 3. వ్రేయ (క. చ.) 4. బడిసోలె (ప. హ.) 5. వరుస (తం. వా.) 6. నిర్భరితోదాత్తుఁడు (క. బ.) 7. త్రిసవన (క. చ. జ.) 8. అనిమిషముని యోగిజనా, వన (క.చ.తం.) 9. వగబెట్టు (జ)

వ. అంత, 702

చ. సవనవరాహమూర్తి సురశాత్రవుఁ ద్రుంచినమీఁద భారతీ
ధవ ముఖ దేవతామునికదంబము దన్ను నుతించునట్టి సం
స్తవమున కాత్మలోనఁ బ్రమదంబును బొంది సమగ్ర మంగళో
త్సవము దలిర్ప నందఱఁ బ్రసాద విలోకన మొప్పఁ జూచుచున్. 703

చ. అరిగె వికుంఠధామమున క మ్మహితోత్సవ సూచకంబుగా
మొరసె సుపర్వదుందుభు లమోఘము లై ధరణీతలంబునన్
గురిసెఁ బ్రసూనవృష్టి శిఖికుండము లెల్లెడఁ దేజరిల్లె భా
స్కర శశి మండలంబులు నిజద్యుతితో వెలుఁగొందె నత్తఱిన్. 704

క. అని యీ పుణ్యచరిత్రము, వనరుహ సంభవుఁడు త్రిదివ వాసులకుం జె
ప్పిన యది మైత్రేయుఁడు విదు, రున కెఱిఁగించిన విధంబు రూఢము గాఁగన్.

క. శుకయోగి పరీక్షిత్తున, కకుటిలమతి నెఱుఁగఁ జెప్పె నని సూతుఁడు శౌ
నక ముఖ్యులైన మునివరు, లకుఁ దెలియఁగ జెప్పె మఱియు లాలన మొప్పన్.

వ. ఇ వ్విధంబున మైత్రేయుండు సెప్పిన విని విదురుండు సంతసిల్లె నని, 707

క. అనఘం బగు నీ చరితము, వినినఁ బఠించిన లభించు విశ్రుతకీర్తుల్
వనజోదరు పదభక్తియు, మునుకొని యిహ పర సుసౌఖ్యములు జనములకున్.

అధ్యాయము—౨౦

వ. అని చెప్పి వెండియు సూతుండు మహర్షుల కిట్లనియె. పరీక్షి న్నరేంద్రుఁడు శుకయోగీంద్రుం గనుంగొని మునీంద్రా! హిరణ్యాక్ష వధానంతరంబున వసుంధర సమస్థితిం బొందిన విధంబును, స్వాయంభువ మనువు తిర్యగ్జాతి జంతు సృష్టి నిమిత్తంబు లైన మార్గంబు లెన్ని సృజియించె? మహాభాగవతోత్తముం డైన విదురుండు కృష్ణునకు నపకారంబు దలంచిన పాపవర్తను లగు ధృతరాష్ట్రి పుత్రులం బాసి జనకుం డగు కృష్ణ ద్వైపాయనునకు సముం డగుచుఁ దన మనో వాక్కాయ కర్మంబులు గృష్ణునందు జేర్చి భాగవత జనోపాసకుం డై పుణ్య తీర్థ సేవా సమాలబ్ధ యశో విగతకల్మషుం డగుచు మైత్రేయ మహాముని నేమి ప్రశ్నల నడిగె? నవి యెల్లం దెలియ నాన తిమ్మనిన రాజేంద్రునకు శుక యోగీంద్రుం డిట్లనియె, 709

—: చతుర్ముఖుం డొనర్చు యక్షాది దేవతాగణ సృష్టిఁ దెలుపుట :—

సీ. విమలాత్ముఁ డైన యవ్విదురుండు మైత్రేయ మునివరుఁ జూచి యిట్లనియెఁ బ్రీతిఁ
జతురాత్మ! సకల ప్రజాపతి యైనట్టి జలజగర్భుఁడు ప్రజాసర్గమందు
మును ప్రజాపతులను బుట్టించి వెండియుఁ జిత్తమం దేమి సృజింపఁ దలఁచె
మును సృజించిన యట్టి [1]మును ల మ్మరీచ్యాదు లబ్జజు నాదేశ మాత్మ నిలిపి

తే. యర్థి నెట్లు సృజించిరి యఖిల జగము, మెఱసి మఱి వారు భార్యాసమేతులగుచు
నేమి సృజియించి రదిగాక కామినులను, బాసి యేమి సృజించి రా భద్రయశులు.

క. అందఱుఁ దమలో నైక్యముఁ, జెందినచో నేమి దగ సృజించిరి? కరుణా
కందళిత హృదయ! యిన్నియుఁ, బొందుగ [2]నెఱిగింపుమయ్య బుధనుత! నాకున్.

సీ. అనిన మునీంద్రుఁ డిట్లనియె జీవాదృష్ట[3]పరుఁడు మాయాయుక్త పురుషవరుఁడు
గాలాత్మకుఁడు నను కారణంబున నిర్వికారుఁ డైనట్టి జగన్నివాసుఁ
[4]డాది జాతక్షోభుఁ డయ్యె న మ్మేటి వలనను గుణత్రయంబును జనించె
నా గుణత్రయమునం దయ్యె మహత్తత్త్వ మది రజోగుణ హేతు వైన దాని

తే. యం దహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ బొడమె మఱి దానివలనఁ బ్రభూతమయ్యెఁ
బంచతన్మాత్ర లందు సంభవము నొందె, భూతపంచక మీ సృష్టిహేతు వగుచు. 712

వ. అవియును దమలోనఁ బ్రత్యేకంబుగ భువన నిర్మాణకర్మంబునకు సమర్థంబులు గాక యన్నింటి సంఘాతంబునఁ బాంచభౌతికం బైన హిరణ్మయాండంబు సృజియించె. అదియును జలాంతర్వర్తి యై వృద్ధిఁ బొందుచుండె నందు. 713

సీ. నారాయణాఖ్య నున్నతి నొప్పు బ్రహ్మంబు సాహస్ర దివ్యవర్షంబు లోలి
వసియించి యుండె నా వాసుదేవుని నాభియందు సహస్ర సూర్యప్రదీప్తి
దనరుచు సకల జీవనికాయయుత మగు పంకజాతంబు సంభవము నొందెఁ
[5]బొగడొంద నందులో భగవ దధిష్ఠితుఁ డగు స్వరాట్టగు చతురాననుండు

తే. జననమొందెను దత్పద్మసంభవుండు, [6]నామ రూప గుణాది సంజ్ఞాసమేతుఁ
డగుచు నిర్మాణ మొనరించె నఖిలజగము, వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు.

1. ఘనులు (చ.ట.త.జ.థ.ద.) 2. నెరుగింపవయ్య (చ.ట.డ.బ.) 3. వరుడు (క.చ.ట.థ)
4. డా దతిజాక్షోభుడైన యమ్మేటి (చ) 5. పొగడొంద (క. చ. ట. త. బ.); పరఁగంగ నందులో (హ.తం.వా.) 6. నామధేయాభిరూప (క.చ.త.జ.డ.బ.); నామధేయాదిరూప (ట.ద.)

సీ. తామిస్రమును నంధతామిస్రమును దమంబును మోహమును మహామోహనంబు
నను పంచమోహ రూపాత్మక మైన యవిద్యఁ బుట్టించి [1]యా వేధ తనకు
నది తమోమయ దేహ మని [2]మది రోసి త త్తనువు విసర్జించె ధాతృ ముక్త
[3]దేహంబు సతత క్షు త్తృష్ణల కావాసమును రాత్రిమయము నయ్యెను దలంప

తే. నందులో యక్షరక్షస్సు లన జనింప, వారి కప్పుడు క్షు త్తృషల్ వఱలఁగొంద
ఱా చతుర్ముఖు భక్షింత మనిరి కొంద, [4]ఱతని రక్షింపవలదని యాడి రంత. 715

వ. ఇట్లు పలుకుచు నతని భక్షించువార లై ధాతసన్నిధికిఁ జనిన నతండు భయ
విహ్వలుం డై యేను మీ జనకుండ. మీరలు మత్పుత్రులరు. నన్ను హింసింప
కుండనుచు "మా మా జక్షత రక్షత" యను శబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున
వారలకుం గ్రమంబున యక్ష రక్షో నామంబులు ప్రకటంబు లయ్యె. వెండియుఁ
బ్రభా విభాసితం బైన యొక్క కాయంబు ధరియించి సత్త్వగుణ గరిష్ఠులు
ప్రభావంతులు నగు దేవతల ముఖ్యు లగునట్లు సృజియించి తత్ప్రభామయ గాత్ర
విసర్జనంబు చేసె. అది యహోరూపం బై దేవతాళికి నాశ్రయం బయ్యె.
మఱియు జఘనంబువలన నతిలోలుపు లైన యసురులం బుట్టింప, వార లతి
కాముకు లగుటం జేసి య య్యజునిం జేరి మిథునకర్మ బపేక్షించిన, విరించి
నగుచు నిర్లజ్జు లైన యసురులు దన వెంట నంటి తగులం బఱచి, ప్రపన్నార్తి
హరుండు, భక్తజనానురూప సందర్శనుండు నైన నారాయణుం జేరి, తత్పాదంబు
లకుం బ్రణమిల్లి యిట్లనియె, 716

క. రక్షింపుము, రక్షింపు ము, పేక్షింపక వినుత నిఖిల బృందారక! వి
శ్వ క్షేమంకర! విను మిటు, దక్షత నీ యాజ్ఞ నేను దల నిడి వరుసన్. 717

తే. ఈ ప్రజాసృష్టి కల్పనం బేనొనర్ప, నందుఁ బాపాత్ము లైన యీ యసుర లిపుడు
నను రమింపఁగ డాయవచ్చినఁ గలంగి, యిటకు వచ్చితి ననుఁ గావు మిద్ధచరిత!

వ. అదియునుం గాక లోకంబువారలకుం గ్లేశంబు లొనరింపం గ్లేశంబునం బొందిన
వారల క్లేశంబు లపనయింపను నీవ కాక (యితరులు గలరే)అని స్తుతియించినఁ
బద్మజు కార్పణ్యం బెఱుంగ నవధరించి వివిక్తాధ్యాత్మ దర్శనుం డగుచు,కమల
సంభవ! భవ ద్ఘోర తనుత్యాగంబు సేయు మని యానతిచ్చిన నతండు నట్ల
చేసె అదియును, 719

1. యవ్వేళఁ దనకు (హ.వా.) 2. ధాత (హ.వా.) 3. మూర్తియు క్షు త్తృట్సముద్భవం
బగు రాత్రిమయ మయ్యె నప్పుడు మఱి దలంప (హ.) 4. అతని రక్షింపుఁడని తగనాడి రంత (హ);
అతని రక్షింత మని తగనాడి రంత (తం. వా.)

సీ. నవ్యకాంచన రణ న్మణినూపు రారావ విలసిత పాదారవిందయుగళ
కాంచీకలాప సంకలిత దుకూలవస్త్ర స్ఫార పులిన నితంబబింబ
రాజి తాన్యోన్య కర్కశ పీన కరికుంభ పృథు కుచభార కంపిత వలగ్న
మదిరా రసాస్వాద మదవిఘూర్ణిత చారు సిత నవవికచ రాజీవనయన

తే. యపర పక్షాష్టమీ శశాంకాభ నిటల, మదవ దళికుల రుచిరోపమాన చికుర
లలిత చంపక కుసుమ విలాస నాస, హాస లీలావలోకన యబ్జపాణి. 720

క. అనఁదగి సంధ్యారూపం, బున లలనారత్న మపుడు పుట్టిన దానిన్
గనుఁగొని దానవు లుపగూ, హన మొగిఁ గావించి పలికి రందఱుఁ దమలోన్.

క. ఈ సౌకుమార్య మీ వయ, సీ సౌందర్య క్రమంబు నీ ధైర్యంబు
[1]న్నీ సౌభాగ్య విశేషము, నే సతులకుఁ గలదు! చూడ నిది చిత్ర మగున్.722

చ. అని వెఱఁగంది య ద్దనుజు లందఱు నిట్లని రీ తలోదరిం
గని మన మంతనుండియును గాముకవృత్తిఁ జరింపుచుండఁగా
మనయెడ దీని చిత్తమున మక్కువ లేమికి నేమి హేతువో ?
యని బహుభంగులం బలికి రా ప్రమదాకృతి యైన సంధ్యతోన్. 723

క. ఓ కదళీ స్తంభోరువ ! యే కుల ? మే జాడదాన ? వెవ్వరి సుత ? వి
ప్లోకాంతంబున నిచ్చట, నే కారణమునఁ జరించె ? దెఱిఁగింపు తగన్. 724

క. భవదీయ చారురూప, ద్రవిణ [2]లస త్పుణ్యభూమిఁ దగు మోహమునన్
దవిలిన దుర్భగు లగు మముఁ, గవయవు పుష్పాస్త్ర బాధ ఘనమయ్యెఁ గదే!725

వ. [3]అని యంత, 726

సీ. గురు కుచభార సంకుచి తావలగ్నంబు దనరారు నాకాశతలము గాఁగ
లలిత పల్లవ పాణితలమునఁ జెన్నొందు చెందు [4]పత త్పతంగుండు గాఁగ
సలలిత నీల పేశల పృథు ధమ్మిల్ల బంధంబు ఘన తమఃపటలి గాఁగఁ
బ్రవిమలతర కాంత భావ విలోకన జాలంబు తారకాసమితి గాఁగఁ

తే. గడఁగి మైపూఁత సాంధ్య రాగంబు గాఁగ, నంగనాకృతి నొప్పు సంధ్యావధూటిఁ
గదిసి [5]మనముల మోహంబు గడలుకొనఁగ, నసుర లందఱుఁ గూడి యిట్లనిరి
మఱియు. 727

1. నీ సుగుణగణ విశేషము (ద) 2. లసత్పుణ్యభూమి (హ. తం. వా.) 3. మఱియుఁ దదీయ సౌందర్యం బగ్గడింప నలవి గాక చింతింపుచు (హ) 4. లసత్పతంగుండు గాఁగ (ద) 5. ఘనమగు(త)

క. వెలయఁగఁ బద్మం బేక, స్థలముననే యొప్పుఁ గాని [1]త్వ త్పదపద్మం
బిల బహుగతుల ననేక, స్థలములఁ దనరారుఁ గాదె! తరుణాబ్జముఖీ! 728

క. అని దనుజులు దమ మనముల, ననురాగము లుప్పతిల్ల నందఱు నా సం
ధ్యను బట్టికొనిరి వనజా,సనుఁ డప్పుడు హృదయమందు సంతస మందెన్. 729

క. సరసిజభవుఁ డ య్యెడఁ [2]దనుఁ, గర మాఘ్రాణింప నపుడు గంధర్వులు న
ప్సరసలు పుట్టిరి ధాతయుఁ, బరువడి నాత్మీయ తనువుఁ బాసిన నదియున్. 730

వ. చంద్రికారూపం బైనఁ దద్గాత్రంబు విశ్వావసు పురోగము లగు గంధర్వాప్సరో గణంబులు గైకొనిరి. వెండియుం గమలగర్భుండు తంద్రోన్మాద నిద్రారూపంబు లయిన శరీరంబులఁ దాల్చి పిశాచ గుహ్యక సిద్ధ భూతగణంబులం బుట్టించిన, వారలు దిగంబరులు ముక్తకేశులు నైనం జూచి, ధాత లోచనంబులు ముకుళించి త ద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు గైకొనిరి. వెండియు నజుండు దన్ను [3]నన్నవంతునింగాఁ జింతించి యదృశ్యదేహుం డగుచుఁ బితృ సాధ్య గణంబులం బుట్టించిన, వారలు దమ్ముం బుట్టించిన యదృశ్య శరీరంబునకుం గార్యం బగు దేవభావంబు గైకొనినం, ద త్కారణంబునం బితృ సాధ్యగణంబుల నుద్దేశించి శ్రాద్ధంబులు హవ్యకవ్యంబు లాచరింతురు. మఱియును, 731

సీ. సజ్జనస్తుత! విను చతురతఁ బంకజాసనుఁడు దిరోధానశక్తివలన
[4]నలి సిద్ధ విద్యాధరుల నోలిఁ బుట్టించి తవిలి వారికిఁ దిరోధాన నామ
ధేయ మైనట్టి యాదేహంబు నిచ్చెను వెండియు భారతీవిభుడు దనకుఁ
బ్రతిబింబ మగు శరీరమునఁ గిన్నరులఁ గింపురుషులఁ బుట్టింపఁ బూని వారు

తే. ధాతృ ప్రతిబింబ దేహముల్ దాల్చి వరుస, నిద్దఱిద్దఱు గవగూడి యింపులొదవ
బ్రహ్మపరమైన గీతముల్ పాడుచుండి, రంత పంకజసంభవుఁ డాత్మలోన. 732

క. తనసృష్టి వృద్ధిలేమికిఁ గనలుచు [5]శయనించి చింతఁ గరచరణాదుల్
గొనకొని కదలింపఁగ రా, లిన రోమము లుగ్ర కుండలివ్రజ మయ్యెన్. 733

క. వనజజుఁడు దన్నుఁ గృతకృ, త్యునిఁగా భావించి యాత్మఁ దుష్టి వహింపన్
మనమున నిఖిలజగ త్పా, వను లగు [6]మనులం ద్రిలోకవరుల సృజించెన్. 734

1. త్వన్ముఖ (హ) 2. దనకర (క. బ.) 3. ననంతునిగా (క. చ. ప. జ. ధ. వ. బ.)
4. నరసిద్ధ విబుధ కిన్నరులను బుట్టించి (హ. తం. వా.) 5. నిజ తనువు దలచి (ట. వ. జ. ద.)
6. బ్రహ్మణ్య ముఖ్యవరుల (క. చ. త. జ. ష. వ.)

సీ. పుట్టించి వారికిఁ బురుషరూపం బైన తనదేహ మిచ్చినఁ దగిలి వారిఁ
గనుఁగొని మున్ను పుట్టినవారు గూడి యా వనజసంభవున కిట్లనిరి దేవ!
యఖిల జగత్స్రష్ట వైన నీ చేతఁ గావింపంగఁబడిన యీ వితత సుకృత
[1]మాశ్చర్యకరము యజ్ఞాది క్రియాకాండ మీ మనుసర్గముం దీక్ష్యమయ్యెఁ

తే. దద్ధవిర్భాగములు మాకుఁ దవిలి జిహ్వ, లందు నాస్వాదనములు సేయంగఁగలిగె
ననుచు మనముల హర్షంబు లతిశయిల్ల, వినుతి సేసిరి భారతీ విభుఁడు మఱియు.

వ. వర తపో విద్యా యోగ సమాధియుక్తుం డగుచు ఋషివేష ధరుండును హృషీకాత్ముండును నై ఋషిగణంబులం బుట్టించి సమాధి యోగైశ్వర్య తపో విద్యా నిరక్తి యుక్తంబగు నాత్మీయ శరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొక్కనికి నిచ్చె. అని మైత్రేయుండు సెప్పిన విని విదురుండు పరమానందంబును బొంది గోవింద చరణారవిందంబులు మనంబునం దలంచి వెండియు మైత్రేయునిం జూచి యిట్లనియె, 736

## అధ్యాయము — ౨౧

సీ. [2]వరగుణ! స్వాయంభువ మను వంశం బిలఁ బరమ సమ్మతము దప్పదు తలంపఁ
గొనకొని తద్వంశమున మిథున క్రియఁ జేసి ప్రజావృద్ధిఁ జెప్పి తీవు
నదియునుఁ గాక స్వాయంభువ మనువుకుఁ బూని ప్రియవ్రత తోత్తానపాదు
లను నందనులు గల రంటివి వారు సప్తద్వీపవతి యైన ధాత్రినెల్ల

తే. ధర్మమార్గంబు లేమియుఁ దప్పకుండ. ననఘులై యెట్లు పాలించిరయ్య! వారి
చరిత మెల్లను సత్కృపానిరతమతిని, నెఱుఁగ వినుపింపు నాకు మునీంద్రచంద్ర!

వ. అదియునుం గాక తన్మనుపుత్రియు యోగలక్షణ సమేతయు నగు దేవహూతి యను కన్యకా రత్నంబును స్వాయంభువుండు గర్దమునకు నే విధంబునం బెండ్లి చేసె? ఆ దేవహూతియందు మహాయోగి యైన కర్దముండు ప్రజల నేలాగునం బుట్టించె? అదియునుం గాక కర్దముండు రుచి యను కన్యకను దక్ష ప్రజాపతికి నిచ్చె నని చెప్పితివి. ఆ రుచియందు నమ్మహాత్ముం డీ సృష్టి యేలాగునం బుట్టించె? అవి యన్నియుం దెలియ నానతీయ వలయు నని యడిగిన విదురునకు మైత్రేయుం డిట్లనియె, 738

1. ఆశ్చర్యకరమయ్యె నంతు యజ్ఞాది క్రి, యాకాంత మిదె నిశ్చయంబు నొందె (క.చ.ట.త.) నిశ్చయంబు నొందె (ఖ.త.ద.బ.) 2. మునినాథ! స్వాయంభువ మనువను వంశంబు (చ. ట. జ.)

—: కర్దముఁడు భగవ దనుజ్ఞ వడసి దేవహూతినిఁ బెండ్లియాడుట :—

క. విను మనఘ! కృతయుగంబున, మునినాథుం డైన కర్దముఁడు ప్రజల సృజిం
పను వనజసంభవునిచే, త న్నియుక్తుం డగుచు మది ముదము సంధిల్లన్. 739

తే. ధీరగుణుఁడు సరస్వతీ తీరమందుఁ, దవిలి పదివేలు దివ్య వత్సరము లోలిఁ
దపము సేయుచు నొకనాఁడు జపసమాధి, నుండి యేకాగ్ర చిత్తుఁడై యుండువేళ.

క. వరదుఁ బ్రసన్న మనోరథ, వరదాసుశీలు నమరవంద్యు రమేశున్
[1]దురితవిదూరు సుదర్శన, కరుఁ బూజించిన నతండు [2]గరుణాకరుఁడై. 741

వ. అంతరిక్షంబునం బ్రత్యక్షం బైన, 742

సీ. తరణి సుధాకర [3]కిరణ సమంచిత సరసీరుహోత్పల స్రగ్విలాసుఁ
గంకణ నూపుర గ్రైవేయ ముద్రికా హార కుండల కిరీ టాభిరాముఁ
గమనీయ సాగర కన్యకా కౌస్తుభ మణిభూష ణోద్భాసమాన వక్షు
సలలిత దరహాస చంద్రికా ధవళిత చారుసద్వర్ణ విరాజ త్కపోలు

తే. శంఖ చక్ర గదా పద్మ [4]చారుహస్తు, నళికులాలక రుచి భాస్వదళిక ఫలకుఁ
బీత కౌశేయ వాసుఁ గృపా తరంగి, తస్మితేక్షణుఁ బంకజోదరుని హరిని. 743

వ. మఱియు శబ్దబ్రహ్మ శరీరవంతుండు, సదాత్మకుండు, జ్ఞానైకవేద్యుండు, వైనతేయాంస విన్యస్త చరణారవిందుండు నైన గోవిందుం గనుంగొని సంజాత హర్షలహరీ పరవశుండు, లబ్ధమనోరథుండు నగుచు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి తదనంతరంబ, 744

క. ముకుళిత కరకమలుండై, యకుటిల సద్భక్తిఁ బరవశాత్మకుఁ డగుచున్
వికచాంభోరుహ లోచను, నకు ని ట్లనియెం బ దాననముఁ గనుఁగొనుచున్.

సీ. అబ్జాక్ష! సకలభూ తాంతరాత్ముఁడ వనఁ దనరుచుండెడి [5]నీదు దర్శనంబు
దలకొని సుకృత సత్ఫల భరితంబు లైనట్టి యనేక జన్మానుసరణిఁ
బ్రకట యోగక్రియాభ్యాస నిరూఢు లైనట్టి యోగీశ్వరు [6]లాత్మఁ గోరి
యెంతురు యోగీశ్వరేశ్వర! యే భవత్పాదార [7]విందముల్ పరఁగ నిపుడు

1. దురిత విదూరినిఁ గరుణా, కరు (క.బ) 2. కరుణా పరుఁడై (క. బ.) 3. కిరణోపరాంచిత (హ) 4. శార్ఙ్గ హస్తు (త) 5. భవద్దర్శనంబు (క. బ. లం.) 6. లాత్మ నిశ్చ, యింతురు (క. చ. ట. త. డ. బ.) లాత్మ నిచ్ఛయింపరు (ద) 7. సందర్శనంబు (క. చ. బ.)

తే. గంటి భవవార్ధి గడవంగఁ గంటి మంటిఁ, గడఁగి నా లోచనంబుల కలిమి నేఁడు
దవిలి సఫలత నొందె మాధవ! ముకుంద!, చిర దయాకార! నిత్య లక్ష్మీవిహార!

వ. అదియునుం గాక దేవా! భవదీయ మాయా విమోహితులై హతమేధస్కులై సంసార పారావారోత్తారకంబులైన భవదీయ పాదారవిందంబులు దుచ్ఛవృత్తి కాములై సేవించి నిరయ గతులైన వారికిం దత్కామ యోగ్యంబులగు మనోరథంబుల నిత్తువు. అట్టి సకాములైన వారి నిందించు నేనును, గృహమేధ ధేనువు, [1]నశేష మూలమును, త్రివర్గ కారణమును, సమాన శీలయు నైన భార్యం బరిణయంబు సేయ నపేక్షించి, కల్పతరు మూల సదృశంబులైన భవదీయ పాదారవిందంబులు సేవించితి. ఐన నొక్క విశేషంబు గలదు. విన్నవించెద నవధరింపుము. బ్రహ్మాత్మకుండ వైన నీదు వచస్తంతు నిబద్ధులై లోకులు కామహతులై రఁట. ఏనును వారల ననుసరించిన వాఁడ (నౌట) కాలాత్మకుండ వైన నీకు నభిమతం బగు నట్లుగాఁ గర్మమయం బైన భవదాజ్ఞా చక్రంబు ననుసరించుటకుఁ గాని, మదీయ కామంబు కొఱకుఁ గాదు. భవదీయ మాయావినిర్మితంబును, గాలాత్మక భూరివేగ సమాయుక్తంబును, నక్షరంబును నైన బ్రహ్మంబునందు భ్రమణశీలంబును, నధిమాస సమేత త్రయోదశ మాసారంబును, షష్ట్యుత్తర శత త్రయాహోరాత్రమయ పర్వంబును, ఋతు షట్కసమాకలిత నేమియుం, జాతుర్మాస్య త్రయ విరాజిత నాభియు, నపరిమిత క్షణలవాది పరికల్పిత పత్రశోభితంబును, గాలాత్మక భూరివేగ సమాయుక్తంబును నైన కాలచక్రంబు సకల జీవ నికాయాయు ర్గ్రసన తత్పరం బగుం గాని, కామాభిభూత జనానుగత పశుప్రాయు లగు లోకుల విడిచి భవపరితాప నివారణ కారణం బైన భవదీయ చరణాతపత్ర చ్ఛాయా సమాశ్రయులై తావకీన గుణకథన సుధాస్వాదన రుచిర లహరీ నిరసిత సకల దేహధర్ములైన భవ ద్భక్తజనాయుర్హరణ సమర్థంబు గాకుండు నని, 747

మ. అనఘా! యొక్కఁడ వయ్యు నాత్మకృత మాయాజాత సత్త్వాది శ
క్తి నికాయస్థితి నీ జగ జ్జనన వృద్ధి క్షోభ హేతు ప్రభా
వ నిరూఢిం దగు దూర్ణనాభిగతి విశ్వస్తుత్య! సర్వేశ! నీ
ఘన లీలా మహిమార్ణవంబు గడవంగా వచ్చునే? యేరికిన్. 748

వ. దేవా! శబ్దాది విషయ సుఖకరం బగు రూపంబు విస్తరింపం జేయు టెల్ల [2]నస్మ దనుగ్రహార్థంబు గాని నీ కొఱకుం గాదు. ఆత్మీయ మాయా పరివర్తిత లోక తంత్రంబు గలిగి మనోరథ సుధాప్రవర్షి వైన నీకు నమస్కరించెద. 749

1. నశేషమూలయుం ద్రివర్గ కారణయు(హ.తం.వా.) 2. అస్మదర్థంబుగాని(క.చ.ట.త.జ.డ.ద.)

వ. అని యి ట్భంగి నుతించినఁ విని సరోజాక్షుండు మోదంబునఁ
వినతానందన కంధరోపరి చర ద్విభ్రాజమానాంగుఁడు
న్ననురాగ స్మిత చంద్రికా కలిత శోభాలోకుఁడు నై మునీం
ద్రునిఁ గారుణ్య మెలర్పఁ జూచి పలికెఁ రోచిష్ణుఁ డై వేల్మిడిఁ.

క. మునివర! యే కోరిక నీ, మనమునఁ గావించి నను సమంచిత [1]భక్తిన్
నెనరునఁ బూజించితి నీ, కనయము నా కోర్కె సఫల మయ్యెడుఁ జూమీ

వ. అని యానతిచ్చి, ప్రజాపతి పుత్రుండు సమ్రాట్టును నైన స్వాయంభువ మ
బ్రహ్మావర్త దేశంబునందు సప్తార్ణవ మేఖలా మండిత మహీమండలంబు
లింపుచున్నవాఁడు. అమ్మహాత్ముం డపరదివసంబున నిందులకు శతరూప
భార్యా సమేతుం డై భర్తృకామ యగు కూఁతుం దోడ్కొని, భవదీయ
ధికిం జనుదెంచి, నీకు ననురూప వయశ్శీల సంకల్ప గుణాకర యైన తన
బరిణయంబు గావించు. భవదీయ మనోరథంబు సిద్ధించు. ననుం జిత్తంబున
రింపుచుండు నమ్మనుకన్యక నిను వరించి భవద్వీర్యంబు వలన నతి సౌ
వతులైన కన్యలం దొమ్మండ్రఁ గను. ఆ కన్యకా నవకంబునందు మునీం
పుత్రోత్పాదనంబులు సేయం గలరు. నీవు మదీయ శాసనంబును ధరిం
మదర్పి తాశేష కర్మండ వగుచు, నైకాంతిక స్వాంతంబున భూతాభ
దయాచరితజ్ఞానివై నాయందు జగంబులు గలవనియు, [2]నీయందు నేఁగలన
నెఱింగి సేవింపుము. చరమ కాలంబున ననుం బొందఁగలవు. భవదీయ వీర
వలన నేను నీ భార్యాగర్భంబుఁ బ్రవేశించి, మత్కళాంశంబున సంభవించి,
దత్త్వసంహిత నుపన్యసింతు. అని జనార్దనుండు గర్దమున కెఱింగించి, య
గనుంగొనుచుండ నంతర్హితుం డై,

చ. అతుల సరస్వతీ సరి దుదంచిత బాలరసాల సాల శో
భిత తట తుంగ రంగ మగు బిందుసరంబు వినిర్గమించి యం
చిత గరుడావరోహణము చేసెఁ దదీయ గరుత్ప్రభూత బృ
హత్ప్రతతి విలక్షణ క్రమ విరాజిత సామము వించు మోది యై.

చ. అరిగె వికుంఠ ధామమున కంత సకామునుఁ డైన కర్దముం
డరయ విమోహి యై [3]మనము నందును ముందట [4]వచ్చు కోరికల్
పరిగొనుచుండఁ దత్క్షణమ బిందుసరంబున కేగి యిందిరా
వరుఁ దలపోయుచుండె జనవంద్యుఁడు భక్తి నితాంత చిత్తుఁ డై.

1. భక్తిన్నెనయగ (క.చ.ట.త.జ.డ.) 2. నందునేఁ గలననియు (ఐ) 3. మనమున
(తం.వా.) 4. వచ్చు (ట)

వ. అంత స్వాయంభువుండు గనక రథారూఢుం డగుచు నిజభార్యా సమేతుం డై భర్తృవాంఛాపర యైన పుత్రికం దోడ్కొనుచు, నిజతనూజకుం దగిన వరునన్వేషింపుచు, భువనంబులు గలయం గ్రుమ్మరి, యెందునుం గానక, వచ్చి, వచ్చి,

ఉ. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు విష్ణుఁడు గర్దమున్ [1]దయా
నంద మెలర్పఁ జూడ నయనంబుల రాలిన బాష్పముల్ ధరన్
బిందువు లై వెసం దొరఁగి పేర్చి సరస్వతిఁ జుట్టి పాఱుటన్
బిందుసరోవరం బనెడి పేరఁ దనర్చిన పుణ్య తీర్థమున్. 756

ఉ. అందుఁ దమాల సాల వకు ళార్జున నింబ కదంబ పాటలీ
చందన నారికేళ ఘనసార శిరీష లవంగ లుంగ మా
కంద [2]కుచందన క్రముక కాంచన బిల్వ కపిత్థ మల్లికా
కుంద మధూక మంజుళనికుంజములం దనరారి వెండియున్. 757

క. పరిపక్వ ఫలభ రానత, తరుశాఖా నికర నివసిత స్ఫుట విహగో
త్కర బహు కోలాహల రవ,భరిత దిగంతములు గలిగి భవ్యం బగుచున్. 758

క. అతి నిశిత చంచుదళన, క్షత నిర్గత పక్వఫల రసాస్వాదన మో
దిత రాజశుక వచోర్థ, శ్రుతి ఘోషము చెలఁగ శ్రవణ సుఖదం బగుచున్. 759

క. లలిత సహకార పల్లవ, కలి తాస్వాదన కషాయ కంఠ విరాజ
త్కలకంఠ పంచమస్వర, కలనాదము లుల్లసిల్లఁ గడు రమ్యము లై. 760

క. అతుల తమాల మహీత, [3]ప్రత తీక్షణ జాత జలద పరిశం కాంగీ
కృత తాండవ ఖేలన విల, సిత పింఛ [4]విభాసమాన శిఖి సేవ్యం బై. 761

క. కారండవ జలకుక్కుట. సారస బక చక్రవాక షట్పద హంసాం
భోరుహ కై వర నవక, హ్లార విరాజిత సరోరుహాకరయుత మై. 762

క. కరి పుండరీక వృక కా, సర శశ భల్లూక హరిణ చమరీ హరి సూ
కర ఖడ్గ గవయ వలిముఖ, శరభ ప్రము ఖోగ్ర వన్య సత్త్వాశ్రయ మై. 763

వ. ఒప్పు నప్పరమ తాపసోత్తముని యాశ్రమంబు గనుంగొని మిత పరిజనంబుల తోడం జొచ్చి యందు, 764

1. మహానంద మెలర్ప (హ) 2. సుచందన (హ) 3. ప్రతతీక్షణజాత (తం.వా.) 4. విభాసితాంశిఖి (హ.తం.వా.)

సీ. అంచిత బ్రహ్మచర్యవ్రత యోగ్య మై విలసిల్లు ఘన తపోవృత్తిచేత
దేహంబు రుచిర సందీప్తమై చెలువొందఁ గడుఁ గృశీభూతాత్మకాయుఁ డయ్యు
నలినోద రాలాప నవ సుధాపూరంబు శ్రోత్రాంజలులఁ ద్రావి చొక్కియున్న
కతనఁ గృశీభూత కాయుండు గాక జటావల్కలాజిన శ్రీ వెలుంగఁ

తే. గమల పత్ర విశాల నేత్రములు దనర, నళినసంస్కార సంచి తానర్ఘ నూత్న
రత్నమును బోలి యున్న కర్దమునిఁ జూచి, భక్తి మ్రొక్కెను మనువు
తత్పాదములకు. 765

వ. ఇట్లు వందనంబు గావించినఁ గర్దముండు దన గృహంబునకు విందై చనుదెంచిన
య మ్మనువు నాదరించి,యర్ఘ్యపాద్యాది విధులం బరితుష్టుం గావించి, పూర్వోక్తం
బైన భగవ దాదేశంబు స్మరియించి స్వాయంభువున కి ట్లనియె. 766

సీ. వరగుణాకర ! భగవద్భక్తి యుక్తుండ వైన త్వదీయ పర్యటన మెల్ల
శిష్టపరిగ్రహ దుష్టనిగ్రహముల కొఱకుఁ గదా ! పుణ్యపురుష ! మఱియు
వనజ హితాహిత వహ్ని సమీర వైవస్వత వార్ధిప వాసవాత్మ
కుఁడవు హరిస్వరూపుఁడ వైన నీకును మానితభక్తి నమస్కరింతు

తే. ననఘ! [1]నీ వెప్పుడేనియు నఖిలలోక,జైత్ర మగు హేమ మణిమయ స్యందనంబు
నెక్కి కోదండపాణి వై యుద్ధసైన్య పద విఘట్టనచే భూమిభాగ మగల. 767

మ. తరణిం బోలి [2]చరింపకున్న ఘన నిద్రం బొంది యొందేని భూ
వర పద్మోదర కల్పితంబు లగు నీ వర్ణాశ్ర మోదార వి
స్తర పాథోనిధి [3]సేతుభూత మహి తాచారక్రియల్ దప్పి సం
కర మై చోరభయంబునన్ నిఖిల లోకంబుల్ నశించుం జుమీ ! 768

వ. అని పలికి భవ దాగమనంబునకు నిమిత్తం బెయ్యది? యనవుడు సమాహిత
[4]సకల నిత్యకర్మానుష్ఠానుం డైన మునీంద్రునకు స్వాయంభువుం డిట్లనియె. 769

1. నీ వెప్పుడే నేమి యఖిల (హ.తం.వా.) 2. చరింపలేక ఘన నిద్రం బొందియుందేని (హ)
3. హేతుభూత మహిమాచార క్రియల్ (హ); హేతుభూత విహితాచార క్రియల్ (జ) 4. సకల
ధర్మానుష్ఠానుండైన (ద)

అధ్యాయము—౨౨

క. సరసిజగర్భుఁడు తనచే, విరచిత మైనట్టి వేదవితతుల నెల్లన్
ధర వెలయించుటకై బుధవర! మిమ్ముం దన ముఖంబువలన సృజించెన్. 770

క. దురితస్వరూప పాట, చ్చరపీడం బొందకుండ సకలక్షోణిన్
బరిపాలించుట కై మము, నరవిందభవుండు భుజములందు సృజించెన్. 771

క. [1]మఱి యట్టి జలజభవునకుఁ, [2]గర మంతఃకరణ గాత్రకము లై వరుసన్
బరఁగిన బ్రహ్మక్షత్త్రము, లరయ రమాధీశ్వరునకు నవనీయంబుల్. 772

వ. కావున హరిస్వరూపుండ వై దుర్జన [3]దుర్దర్శుండ వైన నినుం గనుట మదీయ భాగ్యంబున సిద్ధించె. భవ త్పాదకంజ కింజల్క పుంజ రంజితం బై మదీయ మస్తకంబును, దావక వచనసుధా పూరితంబు లై శ్రవణంబులును, మంగళాకరత్వంబున సాఫల్యంబునుం బొందె. నేను గృతార్థుండ నైతి. దుహితృ స్నేహజ దుఃఖ [4]పరిక్లి న్నాంతఃకరణుండ నై సకలదేశ పరిభ్రమణ ఖిన్నుండ నైన నా విన్నపం బవధరింపు మని యిట్లనియె, 773

మ. వరయోగీశ్వర! దేవహూతి యను నీ వామాక్షి మ త్పుత్త్రి దా
వరలావణ్య గుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదిం గోర దా
తుర యై నారదు పంపునన్ మిము [5]వరింతు న్నంచు నేతెంచె నీ
తరుణీభిక్ష పరిగ్రహింపుము శుభోదాత్త క్రియాలోలతన్. 774

క. [6]అమరిన గృహమేధిక క, ర్మములకు ననురూప గుణవిరాజిత శీల
క్రమమునఁ దనరిన తరుణిం, బ్రమదమున వరింపుమయ్య! భవ్యచరిత్రా! 775

క. అనఘ! విరక్తుల కైనం, దనయంత లభించు సౌఖ్యతతి వర్జింపం
జన దఁట కాముకులకు న, బ్బిన మానుదురే? లభించు ప్రియ సౌఖ్యంబుల్. 776

క. వినుము ఫలారంభుఁడు గృప, ణుని నడిగినఁ దన యశంబునుం [7]దన మానం
బును జెడుఁ గావునఁ దగ నీ, వెనయ వివాహేచ్ఛఁ దగుట [8]యెఱిఁగే నిటకున్.

క. చనుదెంచితి నస్మ త్ప్రా, ర్థనఁ గైకొని మ త్తనూజఁ దగ వరియింపుం
డన ముని స్వాయంభువునిం, గనుఁగొని మరలంగఁ బలికెఁ గడు [9]మోదమునన్.

1 నెఱినట్టి (జ) 2. కరుణాంతః కరణ (జ) 3. దుర్దర్శనుండవైన (హ.తం. వా.) 4. పరిచ్ఛిన్నాంతః కరణుండనై (త. తం.); పరిక్లిష్టాంతః.......... (వా) 5. వరింతున్వేగ నంచెంచె (హ) 6. అమలిన (తం. వా.) 7. దగమానంబును (క); అభిమానంబును (జ) తగుమానంబును (తం. వా.) 8. తెఱిఁగి యిచటికిన్ (తం.వా.) 9. ముదమొప్పన్ (క.చ.టి.తం.)

సీ. అనఘ! నీచేత ననన్యదత్తముగఁ బ్రతిష్ఠితం బైన యీ తీఁగబోఁడి
కమనీయ రూపరేఖా విలాసంబుల మానిత లక్ష్మీసమాన యగుచు
నొకనాఁటి రాత్రియం దుడురాజ చంద్రికా ధవళిత నిజ సౌధతలమునందు
మహిత [1]రణ న్మణి మంజీర శోభిత చరణ యై నిజసఖీ సహిత యగుచుఁ

తే. గందుక క్రీడఁ జరియింప గగనమందు, వరవిమానస్థుఁ డగుచు విశ్వావసుండు
నాఁగఁదనరిన గంధర్వనాయకుండు, దరుణిఁ జూచి విమోహి యై ధరణిఁబడియె.

తే. పుండరీకాక్ష నెఱుఁగని పురుషపశువు, లీ తలోదరిఁ బొడగాన రేమిసెప్ప!
నట్టి కోమలి భాగ్యోదయమునఁ దాన, వచ్చి కామింప నొల్లనివాఁడు గలఁడె?

క. ఈ కన్యారత్నమునకు, నాకును [2]గుణ రూప వర్తనంబుల యెడ నా
లోకింప సమమ కావునఁ, గైకొని వరియింతు విగత కల్మషవృత్తిన్. 781

క. విమలాత్మ! దీని కొక సమ, యము గల దెఱిఁగింతు విను గుణాకర యగు నీ
రమణికి నపత్యపర్యంతము వర్తింపుదు గృహస్థ ధర్మక్రియలన్. 782

ఆ. అంతమీఁద విష్ణునాజ్ఞ యొఁదలఁ దాల్చి, శమదమాది యోగసరణిఁ బొంది
సన్న్యసించువాఁడ జలజనేత్రుని వాక్య, కారణమునఁ జేసి ధీర చరిత! 783

క. శ్రీవిభునివలన నీ లో, కావళి యుదయించుఁ బెరుఁగు నణఁగును విను రా
జీవభవ భవుల కతఁ డే, భూవర! నిర్మాణ హేతుభూతుం డరయన్. 784

వ. అదిగావున న మ్మహాత్మ్ముని యాజ్ఞోల్లంఘనంబు సేయరా దని కర్దముండు పలికిన
విని స్వాయంభువుండు నిజభార్యయైన శతరూప తలంపునుఁ, బుత్రి యైన దేవ
హూతి చిత్తంబును, నెఱింగిన వాఁడై మునిసమయంబున కియ్యకొని, ప్రహృష్ట
హృదయుం డగుచు, సమంచిత గుణ గణాఢ్యుం డైన కర్దమునకు దేవహూతిని
విధ్యుక్త ప్రకారంబున వివాహంబు సేయించె. తదనంతరంబ శతరూపయును,
పారిబర్హ సంజ్ఞికంబు లైన వివాహోచిత దివ్యాంబ రాభరణంబులు దేవహూతి
కర్దముల కొసంగె. ఇ వ్విధంబున నిజకులాచారసరణిం బరిణయంబు గావించి,
విగత చింతాభరుండై, స్వాయంభువుండు దుహితృవియోగవ్యాకులితస్వాంతుం
డై, కూఁతుం గౌఁగిలించుకొని, చుబుకంబు పుణుకుచుఁ, జెక్కిలి ముద్దుగొని,
శిరంబు మూర్కొని, ప్రేమాతిరేకంబున బాష్పధారా సిక్త మస్తకం జేసి తల్లీ!
పోయివచ్చెద నని చెప్పి కర్దమునిచేత నామంత్రితుం డై నిజభార్యాసమేతుం
డై రథంబెక్కి సపరివారుండై. 785

1. హిరణ్మయ (హ.తం.వా.) 2. నసురూప (డ.బ.)

చ. తరళ తరంగ వీచి సముదంచిత బిందుసర స్సరస్వతీ
[1]సరి దరవింద తుందిల లస త్తరు తీరనివాస స న్మునీ
శ్వరనిక రాశ్రమాకలిత సంపదలం గనుఁగొంచు వేడ్కఁ ము
ప్పిరిగొన నేఁగె నాత్మపుటభేదన విస్ఫుట మార్గవర్తి యై. 786

వ. ఇట్లు చనిచని బ్రహ్మావర్తదేశంబు నందు, 787

సీ. ఎందేని తొల్లి లక్ష్మీశుండు యజ్ఞ సూకరమూర్తిఁ గైకొని సరభసమున
నొడలు జాడించినఁ బుడమిపై రాలిన రోమజాలంబుల రుచిర హరిత
వర్ణమై పొలుపారు వర కుశ కాశ మయంబును యజ్ఞక్రియా కలాప
యోగ్యంబు నై చాల నొప్పారి బర్హిస్సు సంభవించిన దాన సకలమునులుఁ

తే. గ్రతువులొనరించి తద్విఘ్న కారులైన,యసురులను ద్రుంచిర ట్లస్వాయంభువుండు
విష్ణుపరముగ మఖము గావించి రుచిర, మేధ చెలువందినట్టి యాత్మీయపురము,

క. డాయం జనఁ బురజనములు, పాయనములు దెచ్చి యిచ్చి బహుగతుల నుతుల్
సేయఁగ మంగళతూర్యము,లాయతగతి మ్రోయఁ జొచ్చె నంతఃపురమున్.789

వ. ఇట్లు ప్రవేశించి తాపత్రయోపశమనం బగు భగవద్భక్తి వృద్ధిం బొందింపుచుం
బుత్ర మిత్ర కళత్ర సుహృ ద్బాంధవ యుతుం డై పరమానందంబున, 790

మ. అతిభక్తిం బ్రతివాసరంబును హరి వ్యాసంగుఁ డై ఘూధవాం
కిత గంధర్వ విపంచికా కలిత సంగీత ప్రబంధాను మో
దితుఁ డై [2]యిష్టవిభూతులందు ననురక్తిం బొంద కేప్రొద్దు న
చ్యుత సేవైక పరాయణుం డగుచు నస్తోక ప్రభావోన్నతిన్. 761

మ. హరిపాదాంబురుహ ద్వయార్పిత తుల స్యామోదముం గొంచుఁ ద
చ్చరితంబుల్ దలపోయుచుం బొగడుచున్ జర్చింపుచున్ వించుఁ ద
త్పరిచర్యా వ్యతిరిక్త సంసరణ సద్ధర్మార్థ కామంబులన్
బరిభూతంబులు సేసి మోక్షపద సంప్రాప్తి క్రియారంభుఁ డై. 792

క. నిగమార్థ గోచరుం డనఁ, దగు హరిచరిత ప్రసంగ తత్పర చిత్తుం
డగు నతనికి [3]స్వాంతరగము,లగు యామములొగి నయాత యామములయ్యెన్.

---

1. దరదరవింద మందిర వితాన నివాస లస న్మహామునీశ్వర(త) 2. యష్ట(క.చ.ట.త.జ.ద.)
3. మన్వంతరమగు (క.బ.తం.)

సీ. వెండియు న మ్మేటి విష్ణు మంగళ కథాకర్ణ ధ్యానానుగాన నుతులు
సలుపుచుఁ [1]దా స్వప్న జాగ్రత్సుషుప్తులఁ దలఁగించి యా పుణ్యతముఁడు దాను
జక్రిదాసుఁడు గాన శారీర మానస దివ్యమానుష భౌతిక వ్యథలను
దగులక సన్మునీంద్ర [2]శ్రేణికిం దగఁ దనరు వర్ణాశ్రమ ధర్మగతులు

తే. దప్పకుండంగ నడుపుచుఁ దగిలి సర్వ,భూత హితవృత్త నతులవిఖ్యాత లీల
నేక సప్తతి యుగము లస్తోక చరితుఁ, డగుచు వర్తించె సమ్మోద మతిశయిల్ల.

క. అని య మ్మనుచరితము విదు,రున క మ్మైత్రేయ మునివరుఁడు దయతోడన్
వినిపించి కర్దముని కథఁ, దనరఁగ నెఱిఁగింతు నని ముదంబునఁ బలికెన్. 795

అధ్యాయము—౨౩

—: కర్దమ ప్రజాపతి యోగప్రభావంబుచే విమానంబు గల్పించి భార్యతోఁగూడి విహరించుట :—

వ. ఇట్లు స్వాయంభువుండు దేవహూతినిఁ గర్దమునికి వివాహంబు నేసి మరలి చనిన దనంతరంబ దేవహూతియుఁ బతిభక్తి గలిగి భవునికి భవాని పరిచర్య సేయు తెఱంగునఁ బతియ తనకు నేడుగడయుంగా నెఱింగి య మ్మునీంద్రుని చిత్త వృత్తి కొలఁది దినదినంబునకు భక్తి తాత్పర్య [3]స్నేహంబులు రెట్టింపం బ్రియ శుశ్రూషణంబులు గావింపుచు ననూన తేజోవిరాజిత యగుచుఁ గామ క్రోధ దంభ లోభాది గుణ విరహిత యై శరీరశుద్ధి వహించి చతుర సౌహార్ద స్నేహం బులు గలిగి పతియ దైవంబుగా భావించి మృదు మధుర వచన రచన యై పతిభక్తి యేమఱక వర్తింప [4]దైవయోగంబు నైననుం దప్పింప సమర్థుం డైన కర్దముండు నిజసేవాయాస కృశీభూత దేహ యై యున్న దేవహూతిం గరుణాతరంగి తాపాంగుం డై కనుంగొని మంజుభాషణంబుల ని ట్లనియె. 796

ఉ. మానిత ధర్మమార్గ మహిమ స్ఫుట భూరి తప స్సమాధి వి
ద్యా నిభృ తాత్మయోగ సముపార్జిత విష్ణు కటాక్ష లబ్ధ శో
భానఘ దివ్య భోగ బహుభద్ర వితానము లస్మదీయ సే
వా నిరతిన్ లభించు ననివారణ నిత్తును దివ్య దృష్టియున్. 797

1. స్వస్వప్న (జ. ద. ద. బ. హ. వా.) 2. శ్రేణితోఁగూడ (క. చ. ట. లం.) 3. స్నేహభయంబులు (జ. తం.) 4. దైవయోగంబునుం దప్పింప (హ)

తే. నెలఁత ! త ద్దివ్య దృష్టి నన్నియును నీకుఁ, గానవచ్చు విలోకింపు కమలపత్ర
నయను బొమముడి మాత్రన నాశమందు, నితరమగు తుచ్ఛభోగంబు లేమిచెప్ప!

సీ. అనుపమ రాజ్య దర్పాంధ చేతస్కులై పాపవర్తను లైన పార్థివులకు
ధృతిఁ బొందరాని యీ దివ్యభోగంబులు నీతి పాతివ్రత్య నిష్ఠఁజేసి
సంప్రాప్తములు నయ్యె సమత భోగింపుము కార్యంబు సిద్ధించుఁ గాక నీకు
ననుటయు నతివయు ననుపమ యోగమాయా విచక్షణశాలి యైన కర్ద

తే. మునిఁ గనుంగొని విగతాధియును నపాంగ, కలిత లజ్జాన తాస్యపంకజయు నగుచు
[1]వినయ ప్రణయములం జేసి విహ్వలంబు,లైన పలుకులఁ బతికి నిట్లనియెఁ బ్రీతి.

వ. అనఘా ! అమోఘ యోగమాయా విభుండవు, సమర్థుండవు నైన నీయందు నీ యనుపమ దివ్యభోగంబులు గలుగుట నిక్కంబని యెఱుంగుదు. భవత్సంగతి నిన్నియును నాకుం గలుగు. ఐనను దేవా ! నీ వానతిచ్చిన సంతాన పర్యంతం బైన శరీర సంగమ సమయంబు చిత్తంబునం దలంచి భవ దంగ సంగమంబు కృపచేసి మన్నింపుము. భవదీయ సంయోగ వాంఛా పరతం గృశీభూతం బైన యీ దేహం బే విధంబున మజ్జన భోజన పాన సుఖంబులఁ బరితుష్టిం బొందు నట్టి మన్మనోరథంబు దీర్ప [2]రతితంత్రం బగు కామశాస్త్ర ప్రకారం బుపశిక్షించి, యందులకు నుచితంబు లైన వివిధాంబరాభరణ మాల్యానులేపన మందిరారామ ప్రముఖ నిఖిల వస్తు విస్తారంబు గావించి నన్నుం గరుణింపు మనిన న మ్మహాత్ముండు నిజ యోగమాయా బలంబునఁ దత్క్షణంబ, 800

సీ. దివ్య మణిస్తంభ దీప్తిఁ జెన్నొందుచు మరకత స్థలముల మహిమ దనర
వరవజ్ర కుడ్య కవాటశోభితము లై విద్రుమ దేహళీ వీథు లమరఁ
గొమరొప్ప నవశాతకుంభ కుంభములపై హరినీల[3]శకల విస్ఫురణ మెఱయఁ
దగఁ బద్మరాగంపు మొగడలఁ జెన్నొందు వైడూర్య వలభులు వన్నెచూపఁ

తే. దరళతర ధూతకేతు పతాక లొలయ, మంజు శింజ త్సమంచిత మధుప కలిత
సురుచి రాలంబమాన ప్రసూనరాజి, మాలికల నొప్పు వివిధ గృహాళిఁ దనరి.

క. మఱియును దుకూల చీనాం, బర కౌశేయాది వివిధపట పరివృత మం
దిర సుభగాకారం బై, [4]కర మొప్పు విచిత్ర పట్టికాలంకృత మై. 802

1. వినయ సౌహార్దములఁ జేసి (తం. వా.) 2. రతిరహస్యప్రకాశకంబగు (హ.వా.) 3. శిఖర (క. చ. ట. త. జ.) 4. అరుదార (తం. వా.)

మ. లలితోద్యాన వనాంత సంచరణ లీలాలోల హంసాళి కో
కిల పారావత చక్రవాక శుక [1]కేకిందిందిం రానీక ము
త్కలికం గృత్రిమ పక్షులన్ నిజ విహంగశ్రేణి యంచున్ [2]గుతూ
హలి యై పల్కుచు నాడుచుండుఁ బ్రతిశాఖారోహణ వ్యాప్తులన్. 803

వ. వెండియు, 804

క. ఘన సౌధాంతర శయ్యా, సన కేళీగేహ కృతకజగతీధర శో
భన చంద్రకాంత [3]చారుభ, వన ఫలభరి తావనీజవంతము లగుచున్. 805

క. సకలర్తు శోభితంబును, సకల శుభావహము సకల సంపత్కరమున్
సకలోప భోగయోగ్యము, సకలేప్సిత కామదంబు సదలంకృతమున్. 806

వ. అగుచు నొప్పు దివ్య విమానంబు గల్పించి తదీయసుషమా విశేష విచిత్రంబులు నిర్మించిన తాన తెలియం జాలని యద్భుతకర్మం బైన విమానంబు దేవహూతికిం జూపినం జూచి, యమ్ముద్దియ సంతసింపకుండుట యెఱింగి, సర్వభూతాంతరాళ యాభిజ్ఞుండును, సంతుష్టాంతరంగుండును నైన కర్దముం డిట్లనియె, 807

తే. అతివ! భగవ త్కృతంబును నఖిలమంగ, ళాకరంబును నగు నీ జలాశయమునఁ
దవిలి గ్రుంకిన జంతువితానములకుఁ, గామ్య ఫలసిద్ధి సేకుఱుఁ గాన నీవు.808

క. ఇ జ్జలముల నతిభక్తి ని, మజ్జన మొనరించి యీ విమానము వేడ్కన్
లజ్జావతి! యెక్కవె! యని, [4]బుజ్జవ మొనరంగఁ గర్దముఁడు వల్కుటయున్.

వ. విని యా కువలయాక్షి పతిసేవాయాస మలినాంబరయు, వేణీభూత శిరోజయు, ధూళి [5]ధూసరి తాతికృశీభూ తాంగియు (శబల స్తనయు నై) భర్తృనియోగం బున సరస్వతీ సలిలసంభూత జలచరాశ్రయం బగు బిందుసరోవరంబు ప్రవేశించి త జ్జలంబులఁ గ్రుంకులిడు సమయంబునఁ ద ద్వాఃపూర మధ్యంబున రుచిర [6]మంది రావాసినులును, గిశోర వయః పరిపాక శోభితలును, నుత్పలగంధులును నగు కన్యాసహస్రంబులు దేవహూతిం గనుంగొని యి ట్లనిరి, 810

క. తరుణీ! [7]నీదు నియోగా, చరణల మిదె మేము నీకు సదమల భక్తిన్
బరిచర్య సేయనేర్తుము, కరుణాకలి తేక్షణములఁ గనుఁగొను మమ్మున్. 811

1. కేకివ్యూహ మంచ త్సము, త్కలికం (తం.వా.) 2. గుతూహలు లై పల్కుచు (క.చ.ట.డ.ద.బ.) 3. రచితభ, వన (డ) 4. బుజ్జవ మొగిఁదోప (ద.డ.బ.) 5. ధూళిధూసరిత కుచసమే తాంగియు (క. చ. ట. క. జ. ద. బ.) 6. మందిరావాసులును (క.చ.త.జ.డ.ద.బ); సూక్ష్మాంశుక ధారులు (హ); సూక్ష్మాంశుక ధారిణులు (తం.వా.) 7. సంచితకర్మా, చరణలమిదె (క. చ. ట. జ. ద. ద. బ.) సంచితకర్మా, చరణల మగు మేము (తం. వా.); సంచితధర్మా......(త) ''వయం కర్మ కరీ స్తుభ్యం'' అని మూలము (23-27)

సీ. అని పల్కి దాసి య య్యతివకు నభ్యంజ నోద్వర్తనములు పెం పొనరఁ జేసి
మలయజ కర్పూర మహితవాసిత హేమ కలశోదకంబుల జలకమార్చి
ధవళవస్త్రంబులఁ దడియొత్తి సర్వాంగ ధూపంబు లొసఁగి కస్తూరి నలఁది
మంజు శింజ న్మణిమంజీర కింకిణీ కలరావ కలిత మేఖలలు [1]పూన్చి

తే. కనక తాటంక ముద్రికా కంకణాది, సముచితానర్ఘ [2]రత్న భూషణము లొసఁగి
భవ్య మాల్యానులేప నాంబరము లిచ్చి, షడ్రసోపేత వివిధాన్న సమితిఁ దనిపి.

వ. మఱియుం గనకపాత్ర రచితంబు లైన కర్పూర నీరాజనంబుల నివాళించి, రుచి రాసనంబునఁ గూర్చుండఁబెట్టి దర్పణంబు చేతికిచ్చినం ద త్ప్రతిఫలిత నిజ దేహంబు గనుంగొని, కర్దముని మనంబునం దలఁచిన, నతండునుం గన్యకా సహస్రంబును దత్క్షణంబునఁ దన సన్నిధి నుండుటం జూచి, నిజభర్తృ యోగ మాయా ప్రభావంబున కద్భుతంబు నొందె. అంతఁ గర్దముండు కృతస్నాన యైన దేవహూతిం గనుంగొని, వివాహంబునకు ముందట నే చందంబునం దనరుచుండె నాచందంబునం జెన్నొందుచుండుటకు నానందభరితుండై, భార్యా సహితంబుగఁ దత్కన్యకాసహస్రంబు గొలువ నిజవిమానారూఢుం డై తారాగణ పరివృత రోహిణీయుక్తుండగు సుధాకరుం బోలి యొప్పుచుఁ దదనంతరంబ, 813

చ. చిరశుభమూర్తి య మ్ముని యశేష దిగీశ విహార యోగ్యముల్
సురుచిర మంద గంధవహ శోభితముల్ నికట ప్రధాతు ని
ర్ఝర సరిదంబు శీతల తుషారము లై తనరారు మేరుకం
దరమున కేగి దేవవనితా యుతుఁ డై న కుబేరు చాడ్పునన్. 814

మ. అమరోద్యానవన ప్రదేశములు నవ్యారామభూముల్ దళ
త్కుముదాంభోజ విభాసి మానససరః కూలంబులున్ మంజు కుం
జములున్ జైత్రరథంబు విస్ఫురిత విస్రంభంబునం జూచె నె
య్యమునన్ గర్దమయోగి కామగ విమానారూఢుఁ డై చెచ్చెరన్. 815

వ. ఇవ్విధంబున సమస్త భూభాగంబును వాయువేగంబునం గలయం గ్రుమ్మరి, నిఖిల వైమానికలోకంబు [3]నతిశయించి *(లోకంబులం జరించె.) మోక్షదాయకుండు దీర్ఘపాదుండు నగు పుండరీకాక్షుని సన్నుతించి సేవించు పుణ్యాత్ములకుం బొందరాని పదార్థంబులు గలవె? ఇట్లు కర్దముండు దేవహూతికి నిఖిలధరా

1. రత్న, ఖచిత తాటంక (హ. వా.) 2. హేమ (హ. తం. వా.) 3. జయించి (క. బ)
*క. ద. బ. ద. లలో లేదు.

చక్రం బంతయుం జూపి, మరల నిజనివాసంబునకుం జనుదెంచి, కామకేళీ వినో
దాత్మ యై యున్న భార్య నుపలక్షించి, రతిప్రసంగ వ్యాసంగంబుం గైకొని,
బహువిధంబులైన యిష్టోపభోగంబుల బహువత్సరంబు లొక్క ముహూర్తంబుగా
జరుపుచు, నన్యోన్య సరసావలోకనంబుల సముచి తాలింగన సంభాషణంబులం
గాలనిరూపణంబు సేయనేరక, శతవత్సరంబులు గడపి తదనంతరంబ, 816

క. మునివరుఁ డొకనాఁ డిమ్మలఁ, దన నిజదేహంబు నవవిధంబులు గావిం
చి నయంబునఁ ద ద్వీర్యముఁ, దన సతిగర్భమున నవవిధంబుల నిలిపెన్. 817

క. అదికారణంబుగాఁ బెం, పొదవిన మునివలన [1]దేవహూతికిఁ గూఁతుం
డ్రుదయించిరి తొమ్మండ్ర, మ్ముదితయు మది సంతసించె మునివరుఁ డంతన్.

తే. సన్న్యసింపంగఁ గోరిన సతి యెఱింగి, యాత్మఁ బొడమిన సంతాప మగ్గలింపఁ
జింత వాటిల్లఁ జెక్కిటఁ జెయ్యిఁజేర్చి, పదములను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి.

సీ. అనఘ! సంతానపర్యంతంబు ననుఁ గూడి వర్తింతు ననుచుఁ బూర్వమునఁ బలికి
కూఁతుల నిచ్చితి కొమరార నిప్పు డీ తరుణులు పతులను దమకుఁ దార
యరసి వర్తింతురో? యని భీతినొందెదఁ గావున నీ పుత్రికలకుఁ దగిన
వరుల సంపాదించి పరిణయంబులు సేసి తత్త్వ సంహిత నాకుఁ దవిలి తెలుపు

తే. సుతునిఁ గృపసేసి ననుఁ గావు సుజన వినుత! యర్థి సంసార దుఃఖంబు నపనయింప
నర్హుఁడవు నీవ కామమోహమున నింత, కాల మూరకపోయె నేగతియు లేక.

చ. [2]అపరతి పుట్టె నీ యిహసుఖానుభవంబులయందు మున్ను నేఁ
జపలతఁ గామభోగ రతిసంగము గోరి మహాత్మ! నిన్ను న
చ్చపుఁదలఁ పొప్పఁగాఁ దెలియఁజాలకయున్ వరియించుటన్ భవ
త్కృప ఫలియించె? ముక్తి నినుఁ గేవల భక్తి భజింపఁ గల్గదే? 821

వ. అదియునుం గాక, 822

చ. సమమతి నొప్పు సత్పురుష సఖ్యము సద్గతి కారణంబు నీ
చమతి విలోల దుష్పురుష సఖ్యము దుర్గతి హేతు వంచుఁ జి
త్తమునఁ దలంచి యోగిజనతానుత! మిమ్ము భజింతుఁ బ్రాణి సం
గమమునఁ బుణ్యపాపములు గైకొని పొందవె? యెట్టివారలన్. 823

1. దేవహూతియుఁ గూఁతుల్, ముదమునఁగనెఁ దొమ్మండ్రన్ (హ. తం. వా.) 2. ఉపరతి పుట్టె నైహిక సుఖోపగతానుభవంబులందు మున్ (హ. తం. వా.)

అధ్యాయము - ౨౪

క. అని యిట్లు వేదనాభర,మున [1]మునుకుచుఁ బలుకఁ గర్దముఁడు మనుపుత్రిన్
గనుఁగొని సరసిజ నయను వ,చనములు మది సంస్మరించి సతి కిట్లనియెన్. 824

క. మనుసుత! నీ మది దుఃఖం, బును బొందకు మచిర కాలమున భగవంతుం
డనఘుం డక్షరుఁడు జనార్దనుఁడు భవద్గర్భమందుఁ దగ వసియించున్. 825

క. వరనియమ వ్రతనిష్ఠా, చరణ నియుక్తాంతరంగ సమధిక వై సం
భరిత తపోధన దాన, స్ఫురిత శ్రద్ధానుభక్తి పూర్వము గాఁగన్. 826

మ. [2]మఱి నారాయణ పాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజింపు త
త్పురుష శ్రేష్ఠుఁడు మానసంబున భవ త్పూజానుసంప్రీతుఁ డై
కర మర్థిం దరుణీ శిరోమణి! భవద్గర్భస్థుఁ డై యుండి తాఁ
గరుణం జేయు భవ న్మనో జనిత శంకా గ్రంథి విచ్ఛేదమున్. 827

—: దేవహూతి గర్భంబున విష్ణుండు గపిలాచార్యుండుగా నుదయించుట :—

చ. అనవుడు దేవహూతి హృదయంబున సంతస మంది య మ్మునీం
ద్రుని వచన క్రమంబునఁ బరున్ భగవంతు ననంతుఁ [3]బద్మలో
చను హరి విష్ణు నర్చనము సల్పుచు నుండఁగ గొన్ని యబ్దముల్
చనునెడ దానవాంతకుఁడు సమ్మతిఁ గార్దమ మైన తేజమున్. 828

క. ధరియించి య మ్మునీంద్రుని, తరుణీగర్భంబువలన దనుజారి శమీ
తరు కోటరమున వైశ్వా, నరుఁ డుదయించిన విధంబునన్ జనియించెన్. 829

సీ. అ య్యవసరమున నాకాశమున దేవ తూర్యఘోషంబులు దుముల మయ్యె
నందిత దేవతా బృందంబు [4]లందంద కురిసిరి మందార కుసుమ వృష్టి
గంధర్వ కిన్నర గానంబు వీతెంచె నప్సరోగణముల యాట లొప్పె
వావిరి దిక్కులఁ గావిరి విరిసెను దవిలి వార్ధుల కలంకువలు మానె

తే. సాధుజనముల మనములుసంతసిల్లె,హోమవహ్నులు ప్రభలఁజెన్నొంది వెలిఁగె
గుసుమ ఫలభారముల నొప్పెఁ గుజము లెల్ల,సర్వసస్యాళిచేఁనొప్పె జగతియెల్ల.

1. మునుఁగుచు (హ) 2. హరినారాయణ (క. బ. తం. వా.) 3. పద్మలోచన చరణాంబుజార్చనము (క.చ.త.జ.డ.ద బ.) 4. లంతంతఁ (హ)

వ. ఇట్టి మహోత్సవంబున దేవహూతికిం దత్త్వబోధంబు గావించుకొఱకుఁ దద్
గర్భంబున నుదయించిన పరబ్రహ్మ స్వరూపుం డైన నారాయణుని దర్శిం
కొఱకు మరీచి ప్రముఖ మునిగణ సమేతుండై చతుర్ముఖుండు చనుదెం
య మ్మహాత్ముని దర్శించి, కర్దమ దేవహూతులం గనుంగొని యిట్లనియె, 8

క. నుత చరితులార! మీరలు, కృతకృత్యులు విష్ణుపూజఁ గేవలభక్తిన్
[1]మతి నిష్కపటుల రై చేసితిరి త దర్చన ఫలంబు చేకుఱె మీకున్. 8

క. శ్రితభయ హరణుఁడు మునిజన, నుతచరితుఁడు పరుఁడు మీ మనోరథ సిద్ధిన్
వితతంబుగఁ గావించుటఁ, జతురత మీ జన్మ మింక సఫలతఁ బొందెన్. 8

క. వినుఁడు సకామను లై హరి, ననుపమ భక్తిన్ [2]భజించు నదె ముక్తికిఁ
లును మీ పుణ్యం బేమని, కొనియాడఁగ వచ్చు? నీతి కోవిదులారా! 8

వ. అని వెండియుం గర్దముని గనుంగొని యిట్లను భవదీయ తనూభవలం బ్రక
శీల వ్రతాచార సంపన్ను లైన మునివరేణ్యులకుం బెండ్లి సేయుము. అట్లై
వారి వలనం బ్రజాసృష్టి బహువిధంబుల వృద్ధిం బొందు. అని చెప్పి మఱియ
ని ట్లనియె. 83

చ. అనఘ! భవత్సుతుండు సముదంచిత తేజుఁడు నైన యి మ్మహా
త్మునిఁ బరమేశు నీవ నజితు [3]న్న వికారు నమేయు [4]నచ్యుతు
న్ననఘుని నక్షరున్ హరి ననంతుని నీపనిఁగా దలంతు నీ
ఘనుఁడు సమస్త చేతన నికాయ హృదీప్సిత దాయి [5]గావునన్. 83

సీ. మానిత జ్ఞాన విజ్ఞాన యోగంబులు నను నుపాయంబులు నొనరఁ జేసి
యోలిమై కర్మజీవుల నుద్ధరించుట కొఱకు న మ్మహితాత్మకుఁడు సమగ్ర
హాటకరుచి జటాజూటుండు నుత్ఫుల్ల పంకజ నేత్రుండు పద్మ వజ్ర
హల కులి శాంకుశ లలిత రేఖాంకిత చరణ తలుండును సత్త్వగుణుఁడు

తే. నగుచు నిప్పుడు సరసీరుహాక్షి! నీదు, గర్భమం దుదయించెను ఘనుఁడు నీకుఁ
దత్త్వ బోధంబు గావించుఁ దావకీన, హృదయ మందుల సంశయ మెల్లఁ బాపు.

వ. మఱియును, 83

1. సతతంబు నిష్ఠతోఁ జేసితి రంతయు బలమునొంది చేకుఱె మీకున్ (త) 2. భజించు నాయాసము చాలును (క.బ.) 3. నళినాక్షు (హ.వా.) 4. నచ్యుతున్ ఘను నవికారు నక్షరు, నఘారి, ననంతునిఁ గాఁదలంపు, సత్కనియు (హ); దలంపుమీ (తం. వా.) 5. గావుతన్ (హ)

క. నుతి కెక్కి సిద్ధగణ సే, వితుఁడై ఘన సాంఖ్యయోగ విలసిత తత్త్వ
స్థితి నిరతుఁ డగుచుఁ గపిలా, ఖ్యతఁ దనరి చరించు నీ జగత్త్రియ మెల్లన్. 839

క. అని పలికి య మ్మరీచిం, గని యుద్వాహార్థ మునిచి కమలజు, డంతన్
దన నందను లగు నారద, సనకాదులఁ గూడి యాత్మసదనము కరిగెన్. 840

వ. అంత నా కర్దముండు కమలసంభవ చోదితుం డగుచు యథోచితంబుగా నాత్మీయ దుహితల వివాహంబు సేయం దలంచి, మరీచికిం గళ యనుకన్యకను, అత్రికి ననసూయను, అంగిరసునకు శ్రద్ధను, పులస్త్యునకు హవిర్భువును, పులహునకుం గతిని, క్రతువునకుఁ గ్రియను, భృగువునకు ఖ్యాతిని, వసిష్ఠునకు నరుంధతిని, అధర్వునకు శాంతినిం గా నిజకులాచారసరణిం బరిణయంబు గావించిన, వారును గృత దారపరిగ్రహులును, గర్దమకృత సంభావనా సంభావితులును నగుచు నతని చేత ననుజ్ఞాతులై జాయాసహితు లగుచు నిజాశ్రమభూములకుం జనిరి. అనంతరంబు కర్దముండు దేవోత్తముం డగు విష్ణుండు దనమందిరంబున నవతరించి యుంటం దనచిత్తమున నెఱింగి వివిక్తస్థలంబునకుం జని యచ్చటఁ గపిలునికి వందనం బాచరించి యిట్లనియె, 841

సీ. చతురాత్మ! విను మాత్మకృతము లైనట్టి యమంగళభూత కర్మంబు లనెడి
దావాగ్ని శిఖలచే దందహ్యమానులై నట్టి జీవులు దుదముట్టలేక
పాయక సంసారబద్ధులై యుందురు [1]బహుళకాల మ్మిట్లు పరఁగుచుండ
సకలదేవతలు ప్రసన్నత నొందఁగ బహుజన్మపరిచయ ప్రాప్తయోగ

తే. చిరసమాధి తపోనిష్ఠచే వివిక్త, దేశముల యోగిజనములు ధృతులు నే మ
హానుభావు విలోకింతు రట్టి దివ్య, పురుషరత్నంబ! నాయింటఁ [2]బుట్టి తీశ! 842

వ. మఱియు సంసారచక్ర పరిభ్రామ్యమాణుల మగుచు గ్రామ్యులమైన మావర్తనంబులు గణింపక, మదీయగృహంబునం బూర్వంబునం బ్రతిశ్రుతంబులైన భవదీయ వాక్యంబులు దప్పకుండ ననుగ్రహింప నుదయించి తని వెండియు నిట్లనియె.

క. తలపోయఁగ నప్రాకృత, బలయుక్త చతుర్భుజాది భవ దవతారం
బులు [3]నీ కనురూపములై, బొలుపొందుం గాదె? పరమపురుష! మహాత్మా!

వ. అదియునుం గాక, 844

1. తద్భవహేతు భూతంబులైన (క. చ. ట. త. డ. బ. తం. వా.) ''నష్టః కాలేన భూయసా'' (మూ. 24-37) 2. బుట్టితీవు (తం. వా.) 3. నీకు రూపములునై (చ.త.ప.జ.డ.ద.హ.)

క. అనయము భవదీయాశ్రిత, జన సంరక్షణముకొఱకు సమ్మతితోఁ దా
ల్చిన మానవరూపంబులు, ననురూపము లగును గాదె? హరి! నీ కెపుడున్.

క. సమహిత తత్త్వజ్ఞానా, ర్థము విద్వజ్జనగణంబు దవిలి నమస్కా
రము లోలిఁ జేయు [1]పదపీ, ఠము గల నినుఁ బొగడవశమె? రవణింపంగన్. 846

సీ. సమధిక షడ్గుణైశ్వర్య కారణుఁడవు పరమేశ్వరుండవు ప్రకృతిపురుష!
మహదహంకార తన్మాత్ర తత్క్షోభక హేతు కాలాత్మ విఖ్యాత ధృతివి
జగదాత్మకుఁడవు చిచ్ఛక్తివి నాత్మీయ జఠరనిక్షిప్త విశ్వప్రపంచ
ముగు గల సర్వజ్ఞమూర్తి స్వచ్ఛంద శక్తి యుక్తుండవు సర్వసాక్షి

తే. వగుచుఁ గపిలాఖ్యఁ దనరారునట్టి నీకు, ననఘ! మ్రొక్కెదఁ బుత్రుండ వగుచు నీవు
నాకుఁ బుట్టినకతన [2]ఋణత్రయంబు, వలనఁ బాసితి నిఁక భక్తవరద! నేను.

తే. మానిత వ్రత యోగ సమాధినియతిఁ, జెంది భవదీయ పాదారవిందయుగము
డెందమునఁ జేర్చి శోకంబులందుఁ దొలఁగి, సంచరించెద నంచితస్థలములందు.

క. అని యిట్లు విన్నవించిన, మునిపుంగవుఁ డైన కర్దముని వచనంబుల్
విని భగవంతుం డగు న, య్యనఘుఁడు కపిలుండు పలికె నర్మిలి దోఁపన్. 849

సీ. నాచేతఁ బూర్వంబునం బ్రతిశ్రుత మైన వచనముల్ దప్పక వరమునీంద్ర!
నీ యింటఁ బుట్టితి నిర్హేతుకస్థితి భూరిదయాగుణంబున నవాప్త
సకలకాముఁడ నేను సన్మునివేషంబు ధరియించు టెల్ల నాకొఱకుఁ గాదు
విను మహాత్మకు లైన మునులకుఁ బరమాత్మ గురు సద్వివేకంబు సరసిచూపు

తే. తత్త్వబోధంబుకొఱకును దాల్పఁబడిన, యంచిత వ్యక్తమార్గ మైనట్టి దేహ
మని తలంపుము మత్పదధ్యానశక్తి, ధీపరాయణమహిమంబు తేజరిల్ల. 850

క. సమధికనిష్ఠం గృతయో, గమునన్ సన్న్యస్త సకలకర్ముఁడ వై మో
హముఁ బాసి భక్తిచే మో, క్షముకై భజియింపు నను వికారరహితుఁ డై. 851

క. ననుఁ బరమేశుఁ బరంజ్యో, తిని ననఘు ననంతు దేవదేవు సకలభూ
తనికాయ గుహాశయు నా, ద్యుని నజు నాద్యంతశూన్యు దురితవిదూరున్. 852

క. తిరముగ భవదీయాంతః కరణ సరోజాత కర్ణికాతలమున సు
స్థిరుఁ జేసి యింద్రియంబుల, నిరసించి మనోంబకమున నెఱిఁ గను మనఘా! 853

1. పదయు,గ్మము గల నినుఁ బొగడవశమె గణుతింపంగన్ (త) 2. గుణత్రయంబు (హ)

వ. అప్లేని, 854

క. తనరిన మోక్షము నొందెద, వని పలికినఁ గర్దముండు న మ్మునికుల చం
ద్రుని వలగొని వందనములు, ఘనముగ నతిభక్తిఁ జేసి కౌతుక మలరన్. 855

క. మునిగణసేవిత మగు వన, మునకుం జని యందు మౌనమున నిస్సంగుం
డును వహ్ని రహితుఁ డనికే, తనుఁడును నాత్మైకశరణ తత్పరుఁ డగుచున్.

వ. పరబ్రహ్మంబుఁ జిత్తంబున నిల్పి, యహంకారంబు విడిచి, మమత్వంబు నిరసించి, దయాగుణంబునం జేసి సకలభూతంబులందు సమత్వంబు భజియించి, శాంతి శేముషీ గరిష్ఠుం డగుచు, నిస్తరంగం బగు వార్ధిచందంబున ధీరుండై నిఖిల ప్రపంచంబును వాసుదేవమయంబుగాఁ దలంపుచు భక్తియోగంబున భాగవత గతిం బొందె.

అధ్యాయము—౨౫

వ. అని చెప్పి వెండియు మైత్రేయుండు విదురుం గనుంగొని కర్దముండు వనంబు నకుం జనిన యనంతరంబ మాతృవత్సలుం డైన కపిలుండు బిందుసరంబున వసియించియుండ దేవహూతి తత్త్వమార్గాగ్రదర్శనుం డైన సుతునిం గనుం గొని బ్రహ్మ వచనంబులు దలంపుచు నిట్లనియె, 858

—: దేవహూతి పుత్రుం డైన కపిలాచార్యునివలనం దత్త్వజ్ఞానంబు వడయుట :—

క. అన దింద్రియ ఘర్షణమున, [1]వసమతి నిర్విణ్ణ నగుచు వనరెడి నా కీ
యసదృశ మోహతమో విని, రసనం బనఘాత్మ! యే వెరవున ఘటించున్.

క. పటు ఘన నీరంధ్ర తమః, పటల పరీవృత జగత్ప్రపంచమునకు నె
క్కటిలోచనమై మహితో, త్కటరుచి వెలుఁగుదువు భానుకైవడి ననఘా!

ఉ. భూరి మదీయ మోహతమముం బెడఁబాప సమర్థు లన్యు లె
వ్వారలు? నీవ కాక నిరవద్య! నిరంజన! నిర్వికార! సం
సారలతా లవిత్ర! బుధసత్తమ! సర్వశరణ్య! [2]ధర్మవి
స్తారక! సర్వలోక శుభదాయక! నిత్యవిభూతి నాయకా! 861

చ. నిను శరణంబు సొచ్చెద ననింద్య తపోనిధి! నన్నుఁ గావవే!
యని తను దేవహూతి వినయంబున సన్నుతి చేసి వేఁడిన
న్ననుపమ సత్కృపాకలితుఁ డై కపిలుం డనురాగ మొప్ప స
జ్జన నిచ యాపవర్గఫల సాధన మై తగు తల్లివాక్యముల్. 862

1. వసుమతి (హ. తం. వా.) 2. కర్మనిస్తారక (జ)

క. విని మందస్మిత లలితా, ననకమలుం డగుచు నెమ్మనమునఁ బ్రమోదం
బనయంబు గడలుకొన నిజ, జననికి నిట్లనియెఁ బరమశాంతుం డగుచున్. 863

క. విను జీవుని చిత్తము దా, ఘన భవబం ధాపవర్గ కారణ మది యే
చినఁ ద్రిగుణాసక్తం బై, నను సంసృతిబంధకారణం బగు మఱియున్. 864

తే. అదియు నారాయణాసక్తమయ్యెనేని, మోక్షకారణమగు నని మునికులాబ్ధి
చంద్రుఁడన నొప్పుకపిలుఁడు జననితోడ,నర్థివినఁజెప్పి మఱియు నిట్లనియెఁ బ్రీతి.

వ. మఱియును చిత్తం బహంకార మమకార [1]రూపాభిమాన జాతంబు లగు కామ లోభాది కలుషవ్రాతంబులచేత నెప్పుడు విముక్తంబై పరిశుద్ధం బగు నప్పుడు సుఖదుఃఖ వివర్జితంబు నేకరూపంబునై ప్రకృతికంటెఁ బరుండును, బరమ పురుషుండును, నిర్భేద్యుండును, స్వయంజ్యోతియు, సూక్ష్మస్వరూపుండును, నితర వస్త్వంత రాపరిచ్ఛిన్నుండును, ఉదాసీనుండును నైన పరమాత్మునిం, దదీయ మహోహతౌజస్కం బైన ప్రపంచంబును, జ్ఞాన వైరాగ్య భక్తి యుక్తంబగు మనంబుచేఁ బొడగాంచిఁ యోగిజనులు పరతత్త్వసిద్ధికొఱకు నిఖిలాత్మకుండైన నారాయణునందు సంయుజ్యమానం బైన భక్తిభావంబు వలన నుదయించిన మార్గంబునకు నితరమార్గంబులు సరిగావండ్రు.విద్వాంసులు సంగం బింద్రియార్థా ద్యసద్విషయంబుగ నొనరింపబడిన జీవునకు నశిథిలం బగు బంధంబునకుఁ గారణం బగు ననియు, నదియె సద్విషయం బైన నంతఃకరణ [2]సంయమన హేతుభూతం బగుచు సాధుజనులకు ననర్గళ మోక్షద్వారం బగుననియుఁ దెలియుదురు. *(సహనశీలురును) సమస్తశరీరధారులకు సుహృత్తులును, బరమ శాంతులును, గారుణికులునై మదర్థంబుగఁ బరిత్యక్తకర్ములు, విసృష్ట స్వజన బంధుజనులునై, మత్పదాశ్రయులును, మద్గుణ ధ్యాన పారీణులును, మత్కథా ప్రసంగ సఫలిత శ్రవణులును నగుచు నుండు పరమ భాగవతోత్తములఁ దాపత్రయంబు తపింపంజేయంజాలదు. అట్టి సర్వసంగ వివర్జితు లగు పరమభాగవత జనుల సంగం బపేక్షణీయంబు. *(అది సకలదోష నివారకం బగు. అట్టి సత్సంగంబున సర్వప్రాణి హృత్కర్ణ రసాయనంబు లగు మదీయ కథా ప్రసంగంబులు గలుగు.) మద్గుణాకర్ణనంబునం జేసి శీఘ్రంబుగఁ గ్రమంబునం గైవల్యమార్గదంబు లగు శ్రద్ధాభక్తులుదయించు. అదియునుం గాక యే పురుషుం డైన నేమి ? మద్విరచిత జగత్కల్పనాది విహారచింతచే నుదయించిన భక్తిం జేసి

1. శరీరాభిమాన జాతం బగు (చ. బ.) 2. సంయమనోపాయ భూతంబు (వ)

యింద్రియ సుఖంబుల వలనను, దృష్టశ్రుతంబు లైన యైహి కాముష్మికంబుల వలనను, విముక్తుం డగుచుఁ జిత్తగ్రహణార్థంబు బుజువులైన యోగమార్గంబులచే సంయుక్తుం డగు నట్టి యోగి ప్రకృతిగుణ సేవనంబు చేతను, వైరాగ్యగుణ విజృంభితం బైన జ్ఞానంబుచేతను, మదర్పిత భక్తియోగంబు చేతను, బ్రత్యగాత్మకుండ నైన నను నంతఃకరణ నియుక్తునిం గావించు. అని చెప్పిన విని దేవహూతి కపిలున కి ట్లనియె. 866

క. ఏ భక్తి భవ ద్గుణ పర, మై భవపాప ప్రణాశ మై ముక్తి శ్రీ
లాభము రయమునఁ జేయునొ, యా భక్తివిధంబుఁ దెలియ నానతి యీవే! 867

వ. అదియునుం గాక భవదుదితం బైన యోగంబును, దదంగంబులును, దద్గత తత్త్వావబోధంబును సాకల్యంబుగ మందబుద్ధి నైన నాకు స్ఫుటం బగునట్లు దెలియ నానతిమ్మనినఁ గపిలుం డి ట్లనియె. 868

సీ. జనయిత్రి! విను మఱి సకలపదార్థ పరిజ్ఞానతత్త్వ పారీణ మగుచు
నామ్నాయవిహిత కర్మాచారములు గల్గి తివుటమై వర్తించు దేవగణము
పూని నైసర్గికం బైన నిర్హేతుక మగు భగవత్సేవ మహితముక్తి
కంటె గరిష్ఠంబు గావున నదియు భుక్తాన్నంబు జీర్ణంబు నందఁజేయు

తే. దీప్త జఠరాగ్ని గతి లింగదేహ నాశ, కంబు గావించు నదియును గాక విష్ణు
భక్తి వైభవములు దేటపఱుతు వినుము, సద్గుణవ్రాత! యోగలక్షణసమేత! 869

చ. అమలినభక్తిఁ గొందఱు మహాత్ములు మ చ్చరణారవిందయు
గ్మము హృదయంబునన్ నిలిపి కౌతుకు లై యితరేత రానులా
పముల మదీయ దివ్యతను పౌరుషముల్ గొనియాడుచుండి మో
క్షము మదిఁ గోరనొల్ల రనిశంబు మదర్పిత సర్వకర్ము లై. 870

సీ. పరికింపఁ గొందఱు భాగవతోత్తముల్ ఘనతకెక్కిన పురాతనము లైన
చారు ప్రసన్న వక్త్రారుణలోచనములు గల్గి వరదాన కలితములుగఁ
దనరు మద్దివ్యావతార వైభవములు మది నొప్పఁ దమ యోగమహిమఁ జేసి
యనుభవింపుచుఁ దదీ యాలాపముల సన్నుతింపుచుఁ దివుటఁ ద ద్దివ్యవిలస

తే. దవయవోదార సుందర నవవిలాస, మందహాస మనోహర మధురవచన
రచనచే నపహృత మనఃప్రాణులగుచు, నెలమి నుందురు నిశ్శ్రేయసేచ్ఛలేక.

మ. కణఁకన్ వారలు వెండి మోక్షనిరపేక్ష స్వాంతులై యుండియు
న్నణిమా ద్యష్ట విభూతి సేవితము నిత్యానంద సంధాయియున్
గణనాతీతము నప్రమేయము సమగ్రశ్రీకమున్ సర్వల
క్షణ [1]సంయుక్త వికుంఠలోక పదవిన్ గైకొందు రత్యున్నతిన్. 872

వ. ఇట్లు లొంది, 873

క. తనరుదు రప్పుణ్యాత్ములు, జనయిత్రి! మదీయ కాలచక్ర గ్రసనం
బును బొందక నిత్యం బగు, ననుపమ సుఖవృత్తి నుందు రది యెట్లనినన్. 874

మ. [2]సమతన్ స్నేహముచే సుతత్త్వమును, విశ్వాసంబుచేతన్ సఖి
త్వము, చాలన్ హితవృత్తిచేతను సుహృత్త్వంబున్, సుమంత్రోప దే
శముచేతన్ నిజదేశికుం డనఁగ నిచ్చల్ పూజ్యుఁడౌ నిష్ట దై
వము నై వారికిఁ గాలచక్ర భయముల్ వారింపుదుం గావునన్. 875

మ. విను మదిగాక యీ భువి దివిం బలుమాఱుఁ జరించు నాత్మఁ దా
ధన పశు పుత్ర మిత్ర వనితాతతిపైఁ దగులంబు మాని న
న్ననఘుని విశ్వతోముఖు ననన్యగతిన్ భజియించె నేని వా
నిని ఘనమృత్యురూప భవనీరధి నేఁ దరియింపఁ జేయుదున్. 876

సీ. రూఢిఁ బ్రధానపూరుష నాయకుండను భగవంతుఁడను జగత్ప్రభుఁడ నైన
నాకంటె నన్యులఁ గైకొని తగిలిన యాత్మలు భవభయం బందు నెపుడుఁ
గావున నాయాజ్ఞ గడవంగ నోడుటఁజేసి వాయువు వీచు శిఖి వెలుంగు
నినుఁడు దపించుఁ దా నింద్రుండు వర్షించు భయమంది మృత్యువు పరువువెట్టుఁ

తే. గాన విజ్ఞాన వైరాగ్యకలిత మైన, భక్తియోగంబునంజేసి పరమపదము
కొఱకు న య్యోగివరులు మ చ్చరణభజను, లగుచుఁ జరియింపుదురు
నిర్భయాత్మ లగుచు. 877

క. గురుభక్తిం జిత్తము మ త్పర మై విలసిల్లు నంత పర్యంతము స
త్పురుషుల కిహలోకంబునఁ, జిరతర మోక్షోదయంబు సేకుఱుచుండున్. 878

క. అని యిట్లు నమ్మునీంద్రుఁడు, జనకుని హరిభక్తి యోగ సంగతి నెల్లన్
వినిపించుచు వెండియు ని, ట్లనియెన్ సమ్మోదచిత్తుఁ డగుచుఁ గణంకన్. 879

1. యుక్తంబునునైన మోక్షపదవిన్ (చ. ద.) 2. సమత స్నేహముచే (చ) సమతా స్నేహముచే (జ) సముఁడై (హ. తం. వా.)

అధ్యాయము — ౨౬

వ. అవ్వా! యి విధ్వంబున భక్తియోగప్రకారంబు సెప్పితి. ఇంకఁ దత్త్వలక్షణంబు వేఱువేఱ యెఱిఁగింతు. ఏ తత్త్వగుణంబుల నెఱింగి నరులు ప్రకృతిగుణంబుల వలన విముక్తులగుదురు, హృదయగ్రంథి విచ్ఛేదకంబు నాత్మదర్శనరూపంబు నగు, నా జ్ఞానం బాత్మనిశ్శ్రేయసకారణంబు గావున దాని నెఱింగింతు. అందు నాత్మస్వరూపం బెట్టి దనిన ననాదియుఁ, బురుషుండును, సత్త్వాదిగుణశూన్యుం డును, బ్రకృతి గుణ విలక్షణుండును, ప్రత్యక్ స్వరూపుండును, స్వయంప్రకా శుండును నెవ్వండు,ఎవ్వనితోడ నీవిశ్వంబు సమన్వితంబగు, నతండు గుణత్రయా త్మకంబు, నవ్యక్తంబు, భగవత్సంబంధియు నగు ప్రకృతియందు(యదృచ్ఛచే) లీలావశంబునం బ్రవేశించిన, నా ప్రకృతి గుణత్రయమయంబై, సరూపంబైన ప్రజాసర్గంబుఁ జేయం గనుంగొని, యప్పుడు మోహితుం డై, విజ్ఞానతిరోధా నంబునంజేసి గుణత్రయాత్మకం బైన ప్రకృత్యధ్యాసంబున నన్యోన్యమేళనం బగుటయు.నంతం బ్రకృతిగుణంబుఁ దనయందు నారోపించికొని,క్రియమాణంబు లగు కార్యంబుల వలనం గర్తృత్వంబు[1]గలిగి,సంసారబద్ధుండై,పారతంత్ర్యంబు గలిగి యుండు, కర్తృత్వశూన్యుండగు నీశ్వరుండు సాక్షియగుటం జేసి యాత్మ కుం గార్యకారణ కర్తృత్వంబులు ప్రకృత్యధీనంబు లనియు, సుఖదుఃఖ భోక్తృ త్వంబులు ప్రకృతివిలక్షణుం డైన పురుషుని వనియు నెఱుంగుదురు. అని చెప్పిన విని దేవహూతి కపిలున కిట్లనియె. పురుషోత్తమా! ప్రకృతి పురుషులు సదస దాత్మక ప్రపంచంబునకుఁ గారణభూతులు గావున వాని లక్షణంబు సదసద్వివేక పూర్వకంబుగా నానతిమ్మనిన భగవంతుండైన కపిలుం డిట్లనియె. 880

క. క్రమమునఁ ద్రిగుణము నవ్య,క్తము నిత్యము సదసదాత్మకము మఱియుఁ బ్రధా
నము ననఁగా బ్రకృతివిశే,షము లదియు విశిష్ట మనిరి సద్విదు లెలమిన్. 881

వ. అందుం బ్రకృతి చతుర్వింశతి తత్త్వాత్మకం బై యుండు. అది యెట్లనినం బంచ మహాభూతంబులును, బంచ తన్మాత్రలును, జ్ఞానకర్మాత్మకంబు లైన త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబులును, వాక్పాణి పాద పా యూపస్థలు నను దశేంద్రి యంబులును, మనో బుద్ధి చిత్తాహంకారంబు లను నంతఃకరణ చతుష్టయంబును చతుర్వింశతి తత్త్వాత్మకంబునునైన సగుణ బ్రహ్మ సంస్థానంబు సెప్పితి. ఇట మీఁదఁ [2]కాలం బను పంచవింశక తత్త్వంబు సెప్పెద. అది గొందఱు పురుష

1. తలఁచి? ప్రకృతేః కర్తృత్వం............ఆత్మని మన్యతే (26-7) 2. కాలపురుషుండు పంచవింశకుం డనం బరగు (చ. ట. ద. బ.)

శబ్దవాచ్యుండైన యీశ్వరుని పౌరుషంబు కాలశబ్దంబునఁ జెప్పంబడు నందురు. అందు నహంకారమోహితుండై (ప్రకృతి నొందు జీవుండు భయంబుఁజెందు.) ప్రకృతిగుణ సామ్యంబునం జేసి వర్తించు (నిర్విశేషం బగు) భగవంతుని చేష్టా విశేషంబు (దేనివలన నుత్పన్నం బగు నదియె) కాలం బని చెప్పంబడు. (అదియు జీవరాశ్యంతర్గతం బగుటం జేసి) పురుషం డనియు,వాని బహిర్భాగ వ్యాప్తిం జేసి కాలం బనియు (జెప్పంబడు.) ఆత్మమాయం జేసి తత్త్వాంతర్గతుం డైన జీవునివలన క్షుభితం బై *(జగత్కారణం బగు) ప్రకృతియందుఁ బరమ పురుషుండు దన [1]వీర్యంబు వెట్టిన నా ప్రకృతి హిరణ్మయం బైన మహత్త్వంబు పుట్టించె. అంత సకలప్రపంచ [2]బీజభూతుండు *(లయవిక్షేప శూన్యుండు నగు) నీశ్వరుండు సూక్ష్మరూపంబున *(నాత్మగతం బైన) మహదాది ప్రపంచంబులఁ [3]జూపుచు స్వతేజోవిపత్తిం జేసి యాత్మప్రస్వాపనంబు [4]సేయునట్టి తమంబును గ్రసించె. అని చెప్పి వెండియు నిట్లనియె, 882

క. దివ్య మగు వాసుదేవా, ది వ్యూహచతుష్టయంబు త్రిజగములందున్
సేవ్యం బని చెప్పంబడు, భవ్యగుణా! దాని నెఱుఁగఁ బలికెద నీకున్. 883

సీ. సత్త్వప్రధాన మై స్వచ్ఛ మై శాంత మై యూర్మిషట్కంబున నోసరించి
సురచిర షాడ్గుణ్య పరిపూర్ణ మై నిత్య మై భక్తజన సేవ్య మై తనర్చి
వలనొప్పుచుండు న వ్వాసుదేవవ్యూహ మంత మహత్త్వమందు నొలి
రూఢిఁ గ్రియాశక్తి రూపంబు గల్గు నహంకార ముత్పన్న మయ్యె నదియుఁ

తే. సరవి వైకారికంబుఁ దైజసముఁ దామ,సంబు నా మూఁడుతెఱఁగులఁ బరగునందుఁ
దనరు వైకారికము మనస్సునకు నింద్రి, యములకును గగనముఖ భూతముల
కరయ. 884

వ. ఉత్పత్తిస్థానం బై యుండు. అదియు దేవతారూపంబున నుండు. తైజసాహంకారంబు బుద్ధిప్రాణంబులం గలిగియుండు తామసాహంకారంబు త్రిగుణమేళనంబున నర్థమాత్రం బై యుండు. మఱియు. 885

సీ. అట్టి యహంకారమం దుదయించి సాహస్ర ఫణామండల లాభిరాముఁ
డై తనరారు ననంతుండు సంకర్షణుం డనఁదగు పురుషుండు ఘనుఁడు
మహిత భూతేంద్రియ మానసమయుఁడు నై కర్తృత్వ కార్యత్వ కారణత్వ
ప్రకట శాంతత్వ ఘోరత్వ మూఢత్వాది లక్షణలక్షి తోల్లాసి యగుచు

1. చిచ్ఛక్తిబెట్టిన (క.చ.ద.ఖ.) 2. కారణంబగు (క.చ.బ.) 3. వెలిఁగింపుచు (హ.తం.వా.
4. చేయ నది తమస్సయ్యె (క.చ.ట.ల.జ.బ.)

తే. సుండు నమ్మెటి రెంతవవ్యూహ మనఁగ, ఘనవికారంబుఁ బొందు వైకారికంబు
వలన వినుము మనస్తత్త్వ మెలమిఁ బుట్టె, మఱియు వైకారిఁబును మాత! వినుము. 886

వ. సామాన్యచింతయు విశేషచింతయు ననం దగు సంకల్ప వికల్పంబులంజేసి కామ సంభవ మనంబడు. ఏది యనిరుద్ధాఖ్యం బైన వ్యూహం బదియ హృషీకంబులకు నధీశ్వరం బై సకల యోగీంద్ర సేవ్యం బగుచు శర దిందీవర శ్యామంబై యుండు వెండియుం దైజసంబువలన బుద్ధితత్త్వంబు వుట్టె. దాని లక్షణంబులు ద్రవ్య ప్రకాశం బైన జ్ఞానంబును, నింద్రియానుగ్రహంబును, సంశయంబును, మిథ్యా జ్ఞానంబును, నిద్రయు, నిశ్చయంబును, స్మృతియు ననం దగియుండు. తైజ సాహంకారంబువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులును గ్రియాజ్ఞాన సాధనంబు లును గలిగియుండు. ప్రాణంబునకుం గ్రియాశక్తియు, బుద్ధికి జ్ఞానశక్తియు నగుటంజేసి యింద్రియంబులకుఁ దైజసత్వంబు గలిగియుండు. భగవచ్ఛక్తి ప్రేరితం బైన తామసాహంకారంబువలన శబ్దతన్మాత్రంబు పుట్టె. దానివలన నాకాశంబును, నాకాశంబువలన శ్రోత్రేంద్రియంబును బుట్టె. శ్రోత్రంబు శబ్ద గ్రాహి యయ్యె. శబ్దం బర్థంబునకు నాశ్రయం బై శ్రోతకు జ్ఞానజనకం బయ్యె. మఱియు నభ స్తన్మాత్రంబు సూక్ష్మాకాశంబ. ఆ యాకాశంబు భూతంబులకు బాహ్యాభ్యంతరంబుల నవకాశం బిచ్చుటయు, నాత్మ ప్రాణేంద్రియాదులకు నాశ్రయం బగుటయు నను లక్షణంబులు గలిగియుండు. (కాలగతిచే వికారంబు నొందు) శబ్దతన్మాత్ర లక్షణంబగు నభంబువలన స్పర్శంబును, స్పర్శంబువలన వాయువును, (వాయువుచే స్పర్శగ్రాహి యై) త్వగింద్రియంబును బుట్టె. మృదుత్వంబుఁ (గఠినత్వంబు) శైత్యంబు నుష్ణత్వం బనునవి స్పర్శంబునకు (స్పర్శత్వం బని) చెప్పంబడు. మఱియు వాయువునకుఁ జాలనంబును, మేళనం బును, ద్రవ్యశబ్ద నేతృత్వంబును, సర్వేంద్రియాత్మంబు ననునవి లక్షణంబు లై యుండు. దైవప్రేరితం బై స్పర్శతన్మాత్ర గుణకం బగు వాయువువలన రూపం బును, దానివలనఁ దేజంబును బుట్టె. రూపంబు నేత్రేంద్రియ గ్రాహకం బయ్యె. ద్రవ్యాకార సమత్వంబును, ద్రవ్యంబునకు నుపసర్జనం బగుటయు, ద్రవ్యపరిమాణ ప్రతీతియు, నివి రూపవృత్తు లనంబడు. తైజసంబునకు [1]సాధారణంబు లగు ధర్మంబులు ద్యోతనంబనఁ బ్రకాశంబు, పచనం బనఁ దండులాదుల పాకంబు, పిపాసానిమిత్తం బైన పానంబు, క్షున్నిమిత్తకం బైన యదనంబు, హిమమర్దనం బగు శోషణంబు నను నివి వృత్తులై యుండు. రూపతన్మాత్రంబువలన దైవ

1. అసాధారణంబులగు (హ.)

సీ. గురుశక్తితో విరాట్పురుషుండు [1]ప్రభవించె నట్టి విశేషాండ [2]మర్థిఁ బొదివి
[3]యంబుముఖావరణంబు లొక్కొకటికి దశగుణితంబు లై తగిలి యావ
రణము లై యుండును గ్రమమున లోకంబులకు మేలుకట్ల పోలికఁ దనర్చి
పంకజోదరుని రూపము విలసించును లోలత జలములోఁ దేలుచున్న

తే. హేమమయమైన యండంబులో మహానుభావుఁ డభవుండు హరి దేవదేవుఁ డఖిల
జేత నారాయణుఁడు ప్రవేశించి యపుడు, విష్ణుపద భేదనంబు గావించి యందు.

సీ. కర మొప్పఁగా విరాట్పురుషుండు వెలుఁగొందు నా విరాట్పురుషుని యాననంబు
వలనను వాణియు, వాణితో వహ్నియు, నాసంబువలనఁ బ్రాణములఁ గూడి
ఘ్రాణేంద్రియం బయ్యె, ఘ్రాణంబువలనను వాయువులును, బ్రాణవాయువులును,
నందు నక్షులు, చక్షువందు సూర్యండును, నం దభిధ్యానంబు నర్థిఁజేయఁ

తే. గర్ణములు జాత మయ్యెఁ, దత్కర్ణసమితి వలన శ్రోత్రేంద్రియంబు,
దిక్కులును గలిగెఁ,
[4]ద్వక్కుచే శ్మశ్రు రోమ వితానకములు, నోషధీవ్రాతమును భవ మొందె మఱియు.

తే. దానివలనను మేఢ్రంబు గానఁబడియెఁ, బరఁగ రేతంబువలన నాపంబు పుట్టె
గుదము వలన నపానంబు నుదయ మయ్యె, దానివలనను మృత్యువు దగ జనించె.

క. కరములవలనను బలమును, నిరవుగ నా రెంటివలన నింద్రుఁడు పాదాం
బురుహంబులవలన గతియు, నరుదుగ నా రెంటివలన [5]హరియునుఁ గలిగెన్.

క. ఘన నాడీపుంజము వల, నను రక్తము దానివలన నదులును జఠరం
బున నాఁకలియును దప్పియు, ననయము నా రెంటివలన నబ్ధులు పుట్టెన్. 892

క. విను హృదయము వలనను మన, మును మనమునఁ దుహినకరుఁడు బుద్ధియుఁ
జిత్తం
బున బ్రహ్మయు [6]క్షేత్రజ్ఞుం, డును గలిగిరి య వ్విరాజుఁడున్ బూరుషతన్. 893

1. సంభవ, మయ్యె నయ్యండంబు నర్థిఁ బొదివి (క. చ. ట. త. జ. బ.) 2. మర్థిఁబొదివె (హ) 3. నంబ్వాదు లావరణంబు నొక్కొక్కటి, దశగుణితంబయి తవిలియావ (హ) 4. త్వక్కు వలనను రోమవితానములు మహౌషధి వ్రాతమును భవమందె మఱియు (జ. డ. ద. బ.) 5. నాడియు నయ్యెన్ (చ); నాడియు గలిగెన్ (ట) 6. క్షేత్రజ్ఞుఁడు, బొనరఁ గలిగిరి విరాజ పురుషుని వలనన్(ఢ); 'బుద్ధేర్గిరాం పతిః, అహంకార స్తతో రుద్రః, చిత్తం చైత్యస్తతోఽ భవత్'' (అని మూలము) 26-63.

*

వ. (మఱియు విరాట్పురుషునం దుదయించిన వ్యష్టిరూపంబు లగు నాకాశాది భూతంబులును, శబ్దంబు మొదలగు భూత తన్మాత్రంబులును, వాగా దీంద్రియ జాతంబును, త దధిదేవతలును దమంతన సమష్టిరూపం డగు క్షేత్రజ్ఞుం బ్రవృత్తి ప్రవర్తకుం జేయ నసమర్థంబు లయ్యె. ఎట్లనిన దేవాధిష్ఠితంబు లగు నింద్రియం బులు తాము వెవ్వేఱ య య్యాశ్వరుం బ్రవృత్త్యున్ముఖుం జేయ నోపక క్రమంబునం ద త్త దధిష్ఠానాదుల నొందె. అందు నగ్ని వాగింద్రియంబుతోడ ముఖంబు నొంది ప్రవర్తించిన విరాట్కార్యం బగు వ్యష్టిశరీరజాతం బనుత్పన్నం బయ్యె. అంత నాసయు ఘ్రాణేంద్రియంబుతోడ వాయువుం గూడిన నట్టిద యయ్యె. ఆదిత్యుండు చక్షురింద్రియముతోడ నేత్రంబుల నొందిన వృథాభూతం బయ్యె. దిగ్దేవతాకం బగు కర్ణంబులు శ్రోత్రేంద్రియంబుతోఁ గూడిన విరాట్కార్య ప్రేరణాయోగ్యం బయ్యె. ఓషధులు రోమంబులం ద్వగింద్రియంబుఁ, జెంద విఫలం బయ్యె. అద్దైవం బగు మేఢ్రంబు రేతంబు నొందినఁ ద త్కార్యకరణా దక్షం బయ్యె. పదంపడి గుదంబు మృత్యువుతోడ నపానేంద్రియంబుఁ జేరిన నది హైన్యంబు నొందె. విష్ణుదేవతాకంబు లగు చరణంబులు గతితోఁ గూడిన ననీశ్వరంబు లయ్యె. పాణీంద్రియంబు లింద్రదైవంబు లగుచు బలంబు నొందిన శక్తిహీనంబు లయ్యె. మఱియు నాడులు ననదీకంబు లై లోహితంబు నొందిన నిరర్థకంబు లయ్యె. ఉదరంబు సింధువులతోడం జేసి క్షుత్పిపాసలం బొందిన వ్యర్థం బయ్యె. హృదయంబు మనంబుతోడం జంద్రు నొందిన నూరక యుండె. బుద్ధి బ్రహ్మాధిదైవం బయి హృదయంబు నొందిన నిష్ఫలం బయ్యె. చిత్తం బభిమానంబుతో రుద్రునిం జెందిన విరాట్కార్యజాతం బనుద్భూతం బయ్యె. అంతం జైత్త్యుఁ డగు క్షేత్రజ్ఞుండు హృదయాధిష్ఠానంబు నొంది చిత్తంబుతోడ బ్రవేశించిన విరాట్పురుషుండు సలిలకార్యభూత బ్రహ్మాండంబు నొంది ప్రవృత్త్యున్ముఖక్షముం డయ్యె. సుప్తుం డగు పురుషునిం బ్రాణాదులు దమ బలంబుచే భగవ ద్ప్రేరితంబు లగుచు నుత్థాప నాసమర్థంబు లగు చందంబున నగ్న్యాదులు స్వాధిష్ఠానభూతంబు లగు నింద్రియంబులతోడ దేవాదిశరీరంబుల నొందియు

---

* ఈ క్రింది పద్యము 'త' ప్రతిలో అధికముగాఁ గలదు.

తే. మఱియుఁ జెప్పెద నిట మీఁద మాత! వినుము, దవిలి చిత్తమునందు క్షేత్రజ్ఞుఁ డనెడి
చారు నామంబునం దవతార మయ్యె, సరవి తోడుత న వ్విరాట్పురుషు వలన.

నశక్తంబు లయ్యె నని) మఱియు న వ్విరాట్పురుషుని ననవరత భక్తింజేసి విరక్తులై యాత్మలయందు వివేకంబు గల మహాత్ములు [1]చింతింపుదు రనియుఁ బ్రకృతిపురుష వివేకంబున మోక్షంబును, ప్రకృతిసంబంధంబున సంసారంబును గలుగు ననియుఁ జెప్పి మఱియు నిట్లనియె, 894

అధ్యాయము - ౨౭

సీ. జనసుత! స త్త్వ రజ స్తమోగుణ మయ మైన ప్రకృతికార్య మగు శరీర
గతుఁడయ్యుఁ బురుషుండు గణఁగి ప్రాకృతములునగు సుఖ దుఃఖ మోహముల వలన
గర మనురక్తుండు గాఁడు వికారవిహీనుఁడుఁ ద్రిగుణరహితుఁడు నగుచు
బలసి నిర్మల జల ప్రతిబింబితుం డైన దినకరుభంగి వర్తించు నట్టి

తే. యాత్మ ప్రకృతిగుణంబులయందుఁ దగులు, వడి యహంకారమూఢుఁ లై తొడరి యేనుఁ
గణఁగి నిఖిలంబునకు నెల్ల కర్తనని ప్ర,సంగవశతను బ్రకృతిదోషములఁబొంది.

క. సుర తిర్యఙ్మనుజ స్థా, వరరూపము లగుచుఁ గర్మవాసనచేతన్
బరపైన మిశ్రయోనులఁ, దిరముగ జనియించి సంసృతిం గైకొని తాన్. 896

క. పూని చరింపుచు విషయ, ధ్యానంబునఁజేసి స్వాప్ని కార్థాగమ సం
ధానము రీతి నసత్పథ, మానసుఁ డగుచున్ భ్రమించు మతిలోలుం డై. 897

వ. అట్లు గావున, 898

తే. పూని మోక్షార్థి యగు వాఁడు దీని తీవ్ర, భక్తియోగంబుచేత విరక్తిఁ బొంది
మనము వశముగఁ జేసి యమనియమాది, యోగమార్గ క్రియాభ్యాసయుక్తిఁజేసి.

సీ. శ్రద్ధాగరిష్ఠుఁ డై సత్య మైనట్టి మ ద్భావంబు మ త్పాదసేవనంబు
వర్ణిత మ త్కథాకర్ణనంబును సర్వ, భూతసమత్వ మజాతవైర
మును బ్రహ్మచర్యంబు ఘనమౌన మాదిగాఁ గల నిజ ధర్మసంగతులఁజేసి
సంతుష్టుఁడును మితాశనుఁడు నేకాంతియు మననశీలుఁడు వీతమత్సరుండు

తే. నగుచు మిత్రత్వమునఁ గృపఁ దగిలి యాత్మ, కలిత విజ్ఞానియై బంధకంబులైన
ఘనశరీర పరిగ్ర హోత్కంఠయందు, నాగ్రహముచేసి వర్తింపనగును మఱియు.

1. చింతింతురని చెప్పి వెండియు నిట్లనియె. ప్రకృతి పురుష వివేకంబున మోక్షంబు నెరుంగుము. ప్రకృతి స్వరూప సంబంధంబున నైన సంసార స్వరూపం బెరిగించెద నాకర్ణింపుము. (క. చ. ట. జ. ద. బ.)

వ. జీవేశ్వర తత్త్వజ్ఞానంబునంజేసి నివృత్తం బైన బుద్ధి తదవస్థానంబునుం గలిగి, దూరీభూతేతరదర్శనుం డై జీవాత్మ జ్ఞానంబునం జేసి చక్షురింద్రియంబున సూర్యుని దర్శించు చందంబున నాత్మనాయకుం డైన శ్రీమన్నారాయణుని దర్శించి, [1]నిరుపాధికం బై మిథ్యాభూతం బగు నహంకారంబున సద్రూపంబుచే ప్రకాశమానం బగుచుఁ, బ్రధానకారణంబునకు నధిష్ఠానంబును, గార్యంబునకుఁ జక్షువునుం బోలి, ప్రకాశకంబును, సమస్త కార్యకరణానుస్యూతంబునుఁ బరిపూర్ణంబును, సర్వవ్యాపకంబును నగు బ్రహ్మంబుఁ బొందునని చెప్పి వెండియు ని ట్లనియె. 901

సీ. విను మాత్మవేత్తకు విష్ణుస్వరూపంబు నెఱుఁగంగఁబడు నది యె ట్లటన్న
గగనస్థుఁ డగు దినకరు కిరణచ్ఛాయ జలముల గృహకుడ్య జాలకముల
వలనఁ దోఁచిన ప్రతిఫలితంబుచేత నూహింపంగఁబడిన య య్యినునిపగిది
నర్థి మనో బుద్ధ్యహంకార త్రితయ నాడీ ప్రకాశముచేత లీల నెఱుఁగ

తే. వచ్చు నాత్మస్వరూపంబు వలఁతిఁగాఁగఁ, జిత్తమునఁ దోఁచు నంచిత శ్రీఁ దనర్చి
య మ్మహామూర్తి సర్వభూతాంతరాత్ముఁ, డగుట నాత్మజ్ఞులకుఁ గాననగును
మఱియు. 902

వ. జీవుండు సుషుప్త్యా ద్యవస్థలయందుఁ బరమాత్మానుషక్తుం డైన భూతాది తత్త్వంబులు లీనంబు లై ప్రకృతియందు వాసనామాత్రంబు గలిగి యకార్యకారణంబులు గాకున్న సుషుప్తిసమయంబునం దా నిస్తంద్రుం డగుచు నితరంబుచేతఁ గప్పంబడనివాఁడై పరమాత్మానుభవంబు సేయుచుండు. అని చెప్పిన విని దేవహూతి యిట్లనియె, 903

సీ. విమలాత్మ! యీ పృథివికిని గంధమునకు సలిలంబునకును రసంబునకును
నన్యోన్య మగు నవినాభావ సంబంధ మైన సంగతిఁ బ్రకృత్యాత్మలకును
సతతంబు నన్యోన్యసంబధ మైయుండుఁ [2]బ్రకృతి దానయ్యాత్మఁ బాయు టెట్లు?
తలపోయ నొకమాటు తత్త్వబోధముచేత భవభయంబుల నెల్లఁ బాయు టెట్లు?

తే. చచ్చి క్రమ్మఱఁ బుట్టని జాడ యేది? యిన్నియుం దెలియ నానతి యిచ్చి నన్నుఁ
గరుణ రక్షింపవే! [3]దేవగుణ సుసేవ్య!, భక్తలోకానుగంతవ్య! పరమపురుష. 904

1. విముక్త లింగశరీరుండై సదా ప్రకాశమాన జ్ఞానంబు గలిగిన సత్పురుష బాంధవుండైన శత్రుమిత్ర సమదర్శనుండైన యాత్మ సమానాధిక రహితుండును, బ్రహ్మత్మాది శబ్దవాచ్యుండును, సమస్త పదార్థ స్యూతుండును నగు సర్వేశ్వరుం బొందు నని చెప్పి వెండియు నిట్లనియె. (క. చ. ట. జ. ద. బ.) 2. ప్రకృతితో నీయాత్మ (ట. త.) 3. దేవగణ నిషేవ్య (ట. త. డ. తం.)

వ. అనిన భగవంతుం డిట్లనియె. [1]అనిమిత్తం బైన స్వధర్మంబునను, నిర్మలాంతఃకరణంబునను, సునిశితం బైన మద్భక్తియోగంబునను, సత్కథాశ్రవణసంపాదితం బైన వైరాగ్యంబునను (దృష్ట ప్రకృతిపురుష యాథాత్మ్యం బగు జ్ఞానంబున బలిష్ఠం బయి కామానభిష్వంగం బగు విరక్తివలనఁ దపోయుక్తం బైన యోగంబునను) సుతీవ్రం బైన చిత్తైకాగ్రతనుం జేసి పురుషునిదగు ప్రకృతి దందహ్యమానం బై తిరోధానంబును బొందు. అది యెట్లనిన (నరణిగతం బైన వహ్నిచే) నరణి దహింపంబడు చందంబున, జ్ఞానంబునం దత్త్వదర్శనంబునం జేసి నిరంతరంబు దృష్టదోష యగు ప్రకృతి జీవునిచేత భుక్తభోగ యై విడువంబడు నని చెప్పి, 905

క. విను ప్రకృతి నైజ మహిమం, బునఁ దనలో నున్నయట్టి పురుషునకు మహేశునకు నశుభవిస్ఫురణం, బనయము గావింపఁజాల దది యెట్లనినన్. 906

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు [2]ననర్థకముల్ ప్రబోధమం
దరయఁగ మిథ్య లై పురుషునందు ఘటింపని కైవడిన్ బరే
శ్వరునకు నాత్మనాథునకు సర్వశరీరికిఁ గర్మసాక్షికిన్
బరువడిఁ బొంద వెన్నఁటికి బ్రాకృతదోషము లంగనామణీ! 907

వ. అని వెండియు నిట్లనియె. 908

సీ. ఆధ్యాత్మతత్పరుం డగువాఁడు పెక్కు జన్మంబులఁ బెక్కు కాలంబులందు
బ్రహ్మపద ప్రాప్తిపర్యంతమును బుట్టు సర్వార్థ వైరాగ్యశాలి యగుచుఁ
బూని నా భక్తులచే నుపదేశింపఁ బడిన విజ్ఞానసంపత్తిచేతఁ
బరఁగఁ బ్రబుద్ధుఁ డై బహువారములు భూరి మత్ప్రసాద ప్రాప్తిమతిఁ దనర్చి

తే. నిజపరిజ్ఞాన విచ్ఛిన్న నిఖిల[3]సంశ, యుండు నిర్ముక్త లింగదేహుండు నగుచు
ననఘ! యోగీంద్రహృద్గేయ మగు మదీయ, దివ్యధామంబు నొందు సందీప్తుఁ డగుచు. 909

వ. మఱియు నణిమాద్యష్టైశ్వర్యంబులు మోక్షంబున కంతరాయంబులు గావున వానియందు విగతసంగుండును, మదీయ చరణసరోజస్థిత లలితాంతరంగుండును నగువాఁడు మృత్యుదేవత నపహసించి [4]మోక్షంబు నొందు. అని చెప్పి వెండియు యోగలక్షణప్రకారంబు వినిపింతు విను మని భగవంతుం డైన కపిలుండు నృపాత్మజ కిట్లనియె, 910

1. అనివృత్తం బైన (హ.తం.వా.) 2. ననర్థము లబ్ధబోధమం......(క. చ.) 3. సంచయుండు (హ. తం. వా.) 4. మోక్షంబునం బొందునని (క. చ. తం.)

అధ్యాయము — ౨౮

క. ధీనిధు లే యోగవిధానంబునఁజేసి మనము తగ విమలం బై
మానిత మగు మత్పదముం, బూనుదు రా యోగధర్మముల నెఱిఁగింతున్. 911

వ. అది యెట్లనిన శక్తికొలఁది స్వధర్మాచరణంబును, శాస్త్రాచారంబుల వినిషిద్ధ [1]కర్మంబులు మానుటయును, దైవికం బై వచ్చిన యర్థంబువలన సంతోషించుటయును, మహాభాగవత పాదారవిందార్చనంబును, గ్రామ్యధర్మ నివృత్తియును, మోక్షధర్మంబులయందు రతియును, మితం బై శుద్ధం బైన యాహార సేవయును, విజనం బై నిర్బాధకం బైన స్థానంబున నుండుటయు, హింసారాహిత్యంబును, సత్యంబు, నస్తేయంబుఁ, దన కెంత యర్థం బుపయోగించు నంత యర్థంబ స్వీకరించుటయు, బ్రహ్మచర్యంబును, దపశ్శౌచంబులును, స్వాధ్యాయ పఠనంబును, బరమపురుషుం డైన సర్వేశ్వరుని యర్చనంబును, మౌనంబును, ఆసనజయంబునంజేసి స్థైర్యంబును, ప్రాణవాయు స్వవశీకరణంబును, నింద్రియనిగ్రహరూపం బైన ప్రత్యాహారంబును, (మనంబుచే నింద్రియంబుల విషయంబులవలన మఱలించి హృదయమందు నిలుపుటయును) దేహగతంబైన మూలాధారాది స్థానంబులలో నొక్క స్థానంబునందు హృదయగతం బైన మనస్సుతోడం గూడఁ బ్రాణధారణంబును, వైకుంఠుం డైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్యలీలాచరిత్ర ధ్యానంబును, *(మానసైకాగ్రీకరణంబును) పరమాత్మ యగు పద్మనాభుని సమానాకారత యను సమాధానంబును, నివియునుం గాక తక్కిన వ్రతదానాదులంజేసి మనోదుష్టం బైన యసన్మార్గంబును బరిహరించి, జితప్రాణుం డై మెల్లన యోజించి, శుచియైన దేశంబునం బ్రతిష్ఠించి, విజితాసనుం డై యభ్యస్త కుశాజిన చేలోత్తరాసనం బైన యాసనంబు సేసి, ఋజుకాయుం డై ప్రాణమార్గంబును గుంభక రేచక పూరకంబులం గోశశోధనంబు చేసి, కుంభకపూర్వకంబులచేతం బ్రతికూలంబు గావించి, చంచలంబైన చిత్తంబు సుస్థిరంబు గావించి, [2]తీవ్రం బైన యమంబునం బ్రతప్తంబై విగతసమస్తదోషం బగు చామీకరంబుకరణి విరజంబు చేసి, జితమారుతుండగు యోగికిం గ్రమ్మఱం బ్రాణాయామంబు లను పావకునిచేత వాత పైత్య శ్లేష్మంబు లను దోషంబుల భస్మీకరణంబు చేసి, ధారణంబులచేతఁ గిల్బిషంబులను, బ్రత్యాహారంబుచేత సంసర్గంబులను దహనంబు చేసి, ధ్యానంబుచేత రాగంబుల, సత్త్వాదిగుణంబు లను నివారించి, స్వనాసాగ్రావలోకనంబు చేయుచు, 912

1. ధర్మకర్మంబులు (తం. వా.) త్రైవర్గిక కర్మంబులు (క. చ. ట.) 2. శీఘ్రం బైన (క)

సీ. దర దరవింద సుందరపత్ర రుచిరాక్షు సలలిత శ్రీవత్సకలిత వక్షు
నీలనీరద నీలనీలోత్పల శ్యాము నళికులాకుల మాలికాభిరాముఁ
గౌస్తుభ[1]కలిత ముక్తాహారయుత కంఠు యోగిమానస పంకజోపకంఠు
సతతప్రసన్న సస్మిత వదనాంభోజు దినకరకోటి సందీప్తతేజు

తే. సలలి తానర్ఘ్య రత్నకుండల కిరీట, హార కంకణ కటక కేయూర ముద్రి
కా తులాకోటి భూషు, భక్తప్రపోషుఁ, గింకిణీయుత మేఖలాకీర్ణ జఘను. 913

వ. మఱియు, 914

సీ. కంజాత కింజల్క[2]పుంజ రంజిత పీత కౌశేయవాసు జగన్నివాసు
శత్రుభీకర చక్ర శంఖ గదా పద్మ విహితచతుర్బాహు విగతమోహు
నుత భక్తలోక మనోనేత్ర వర్ధిష్ణు లాలిత సద్గుణాలంకరిష్ణు
వరకుమారక వయఃపరిపాకు సుశ్లోకు సుందరాకారు యశోవిహారు

తే. సకలలోక నమస్కృత చరణకమలు, భక్తలోక పరిగ్రహ ప్రకటశీలు
దర్శనీయు మనోరథదాయిఁ గీర్త, నీయ తీర్థయశో మహనీయమూర్తి. 915

వ. వెండియు, 916

క. [3]అనుపమగుణ సంపూర్ణుని, ననఘుని సుస్థితుని గతుని నాసీను శయా
నుని భక్తహృద్గుహాశయు, నుని సర్వేశ్వరు ననంతు నుత్తమచరితున్. 917

మ. విమలంబై పరిశుద్ధమై తగు మనోవిజ్ఞాన తత్త్వ ప్రబో
ధమతి న్నిల్పి తదీయమూర్తివిభవ ధ్యానంబు గావించి చి
త్తము సర్వాంగ విమర్శన క్రియలకున్ దార్కొల్పి ప్రత్యంగమున్
సుమహాధ్యానము సేయఁగావలయుఁ బో శుద్ధాంతరంగంబునన్. 918

వ. అది యెట్టి దనిన, 919

సీ. హల కులి శాంకుశ జలజ ధ్వజ చ్ఛత్ర లాలితలక్షణ లక్షితములు
సలలిత నఖచంద్ర చంద్రికానిర్ధూత భక్తమానస తమఃపటలములును
సురుచిరాంగుష్ఠ నిష్ఠ్యూత గంగాతీర్థ మండిత హరజటా మండలములు
నంచిత ధ్యానపారాయణజన [4]భూరి కలుషపర్వత దీప్తకులిశములును

తే. దాసలోక మనోరథ దాయకములు, చారుయోగి మనఃపద్మ షట్పదంబు
లనఁగఁ దనరిన హరి చరణాబ్జములను, నిరుపమధ్యానమున మది నిలుపవలయు.

1. రుచిర (క. చ. తం. వా.) 2. పుంజవత్ రుచిపీత (చ. త. జ.) 3. అనుపమ సంపూర్ణాంగుని (క. చ.) 4. భూజ (హ)

చ. కమలజు మాతయై సురనికాయ సమంచిత సేవ్యమానయై
కమలదళాభ నేత్రములు గల్గి హృదీశ్వరభక్తి నొప్పు న
క్కమల నిజాంకపీఠమునఁ గైకొని యొత్తు పరేశు జానుయు
గ్మము హృదయారవిందమున మక్కువఁ జేర్చి భజింపఁగాఁ దగున్. 921

ఉ. చారు విహంగవల్లభు భుజంబులమీఁద విరాజమాన సు
శ్రీరుచి నుల్లసిల్లి యతసీకుసుమద్యుతిఁ జాల నొప్పు పం
కేరుహనాభు నూరువు లకిల్బిషభక్తి భజించి మానసాం
భోరుహమందు నిల్పఁదగుఁ బో మునికోటికి సంగనామణీ! 922

క. పరిలంబిత మృదుపీతాం, బర కాంచీగుణ నినాద భరితం బగు న
ప్పురుషోత్తముని నితంబముఁ, దరుణీ! భజియింపవలయుఁ దద్దయుఁ బ్రీతిన్. 923

క. విను భువనాధారత్వం, బునఁ దగి విధిజనన హేతుభూతం బగు న
వ్వసజాతముచేఁ గడు మిం, చిన హరి నాభీసరస్సుఁ జింతింపఁదగున్. 924

తే. దివ్య మరకతరత్న సందీప్త లలిత. కుచములను మౌక్తికావళి రుచులఁ దనరి
యిందిరాదేవి సదనమై యెసక మెసఁగు, వక్షమాత్మలఁ దలపోయవలయుఁ
జుమ్మ.

మ. నిరతంబున్ భజియించు సజ్జనమనో నేత్రాభిరామైక ను
స్థిర దివ్యప్రభ గల్గు కౌస్తుభరుచి శ్లిష్టంబునై యొప్పు నా
వరయోగీశ్వర వంద్యమానుఁ డగు సర్వస్వామి లక్ష్మీశు కం
ధర మాత్మన్ గదియించి తద్గుణగణ ధ్యానంబు సేయం దగున్. 926

క. ఘన మందరగిరి పరివ, ర్తన నికషోజ్జ్వలిత కనకరత్నాంగదముల్
[1]దనరారఁ లోకపాలకు, లను గల్గిన బాహుశాఖలను దలఁపఁదగున్. 927

వ. మఱియు విమత జనాసహ్యంబులైన సహస్రారంబులం గలుగు సుదర్శనంబును, సరసిజోదర కరసరోరుహంబందు రాజహంసరుచిరంబైన శంఖంబును, నరాతి భట శోణితకర్దమ లిప్తాంగంబై భగవ త్ప్రీతికారిణి యగు కౌమోదకియును, బంధుర సుగంధ గంధానుబంధ[2] మందగంధవహాహూయమాన పుష్పంధయ ఝుంకారనినద విరాజిత వైజయంతీ వనమాలికయును, జీవతత్త్వంబైన కౌస్తుభమణియును, బ్రత్యేకంబ ధ్యానంబు సేయందగు. వెండియు భక్త సంరక్షణార్థం బంగీకరించు దివ్యమంగళ విగ్రహంబున కనురూపంబైన నాసం

1. దనర నధిలోక (హ) 2. మంథర (త. తం.)

బును, మకరకుండల రుచినిచయ మండిత ముకురోపమాన నిర్మల గండమండలంబును, సతత శ్రీనివాసంబు లైన లోచనపంకజంబులును (గలిగి) లాలిత భ్రూ లతా జుష్టంబును, మధుకరోపమాన చికుర విరాజితంబును నైన ముఖ కమలంబును ధ్యానంబు గావింప వలయు, * 928

క. గురు ఘోర రూపకం బై, [1]జరిగెడు తాపత్ర యోపశమనార్థము శ్రీ
హరిచేత నిసృష్టము లగు, కరుణాలోకములఁ దలఁపఁగా దగు బుద్ధిన్. 929

క. ఘనరుచి మందస్మిత, మున కనుగుణ మగు ప్రసాదమును జిత్తములో
నునిచియు ధ్యానము సేయం, జను యోగిజనాళి కెపుడు సౌజన్య నిధీ! 930

తే. [2]పూని సతశిరు లైనట్టి భూజసముల, శోక బాష్పాంబుజలధి సంశోషకంబు
నత్యుదారతమము హరిహాసమెపుడు, దలఁపఁగవలయు నాత్మలోఁదవిలి వినుము.

సీ. మునులకు మకరకేతనునకు మోహనం బైన స్వకీయ మాయావిలాస
మున రచితం బైన భ్రూమండలంబును [3]ముని మనఃకుహర సమ్మోదమానుఁ
డగు నీశ్వరుని †మందహాసంబు నవపల్ల వాధరకాంతిచే నరుణ మైన
మొల్ల మొగ్గలకాంతి నుల్లసం బాడెడు దంతపంక్తియు మదిఁ దలఁపవలయు

తే. వెలయు నీ రీతి నన్నియు వేఱువేఱ, సంచిత ధ్యాననిర్మల స్థానములుగ
మనములోఁ గనుమని చెప్పి మఱియుఁ బలికె దేవహూతికిఁ గపిలుండు
దేటపడఁగ.

సీ. ఈ ప్రకారమున సర్వేశ్వరు నందును బ్రతిలబ్ధ భావసంపన్నుఁడగుచుఁ
జిరతర సద్భక్తిచేఁ బ్రవృద్ధం బైన యతిమోదమునఁ బులకితశరీరుఁ
డగుచు మహోత్కంఠ నానందబాష్పముల్ జడిగొనఁ బరితోషజలధిఁ గ్రుంకి
[4]భగవత్స్వరూప మై భవగుణ గ్రాహక మగుచు మత్స్యంబంధ మనుకరించి

* ఈ క్రింది వాక్యము తం.వా. ప్రతులలో నున్నది. తాళపత్ర ప్రతులలోఁగాని, మూలమునఁ గాని లేదు. మఱియు శరణాగతుల కభయ ప్రదంబులగుచు నెగడు పాణిసంకేరుహంబుల మనంబులఁ దలంపవలయు. 1. పరిఁగెడు తాపత్రయం బుపశమింపఁగ (తం. వా.)

2. ఆ. పూని వివశులైన భూజనంబుల చిత్త, శోక బాష్ప జలధి శోషణంబు
నత్యుదారతమము నగు హరి హాసంబు, తలఁప వలయు నాత్మఁ దవిలి మునులు(త.జ.ర.చ.)

3. మునిమనః కుహర సంవర్ధమాను (హ); వరమనః కుహర-(చ.ట.) † 'ప్రహసితం' అని మూలము (28-33) 'స్థూలహాస' మని వ్యాఖ్య. 4. ఇది మూలమునకు విరుద్ధముగా నున్నది. చిత్త బడిశం శనకై ర్వియుంక్తే. (28-34) అని మూలము. దుర్గ్రిహస్య భగవతో గ్రహణే బడిశం మత్స్య బంధన మివ. ఉపాయభూతం చిత్తం ధ్యేయా ద్వియుంక్తే. తద్ధారణే శిథిలప్రయత్నో భవ తీత్యర్థః. అని వ్యాఖ్య.

తే. సుమహిత [1]ధ్యానమునఁ బరంజ్యోతియందు, మనముఁ జాల నియోజించి మహిమఁ దనరు
మోక్షపద మాత్మలోన నపేక్షసేయు, ననఘవర్తనుఁడైన మహాత్ముఁడెపుడు.

వ. అది గావున ముక్తి నపేక్షించు మహాత్ముం డగువాని చిత్తంబు విముక్తంబైన భగవద్వ్యతిరిక్తాశ్రయంబు గలిగి విషయాంతర శూన్యంబై విరక్తిం బొందుటం జేసి *పురుషుండు శరీరభావంబుల ననన్యభావం బగు నిర్వాణ పదంబు సూక్ష్మం బగు తేజంబు తనకంటె నధికం బగు తేజంబుతోడి సమానాకారం బగు చందంబున నిచ్ఛయించు. వెండియు, 934

సీ. పురుషుఁడు చరమమై భువి నన్య విషయ నివృత్తమై గత నివర్తించు చిత్త
వృత్త్యాదులును గల్గి వెలయంగ నాత్మీయ మగు మహిమ సునిష్ఠుఁడై లభించు
సుఖదుఃఖముల మనస్సునఁ దలంపక యహంకారధర్మంబులుగాఁ దలంచి
యనయంబు సాక్షాత్కృతాత్మతత్త్వము గల్గు నతఁడు జీవన్ముక్తుఁ డంద్రు ధీరు
తే. లతఁడు నేచందమున నుండుననిన వినుము,తనశరీరంబు నిలుచుటయును జరించు
టయును గూర్చుండుటయు నిఁకేమియు నెఱుంగ, కర్థి వర్తించు విను తల్లి! యతఁడు మఱియు. 935

వ. మదిరాపానంబునం జేసి మత్తుం డగువాఁడు దనకుం బరిధానం బగు నంబరంబు మఱచి వర్తించు చందంబునఁ దనశరీరంబు[2]దైవాధీనంబున నశ్వరంబని తలంచి యాత్మతత్త్వనిష్ఠుండై యుపేక్షించు. అదియునుం గాక సమాధియోగంబునం జేసి సాక్షాత్కృతాత్మతత్త్వంబు గలవాఁడై స్వాప్నికశరీరంబు చందంబున యావత్కర్మఫలానుభవ పర్యంతంబు పుత్ర దార సమేతం బగు ప్రపంచంబు ననుభవించి, యటమీఁదఁ బుత్రదారాది సంబంధంబువలనం బాసి వర్తించు. 936

సీ. సుత దార మిత్రానుజులకంటె మర్త్యుండు భిన్నుఁడై వర్తించుచున్న రీతి
విస్ఫులిం గోల్ముక విపుల ధూమములచే హవ్య వాహనుఁడు వేఱైన రీతి
వలనొప్ప దేహంబువలన నీ జీవాత్మ పరికింప భిన్న రూపమున నుండుఁ
దవిలి భూతేంద్రి యాంతఃకరణంబుల భాసిల్లు చున్న యా ప్రకృతి రూప
తే. బ్రహ్మమున కాత్మ దాఁ [3]బృథగ్భావ మగుచు, ద్రష్టయగు బ్రహ్మసంజ్ఞ చేఁ దనరుచుండు
నఖిల భూత ప్రపంచంబులందుఁ దన్నుఁ,దవిలి తనయందు నఖిలభూతములఁగనుచు

1. ధ్యేయమగు (క) 2. దైవాధీనంబని (తం. వా.) 3. బృహద్భావమగుచు (హ)
* ముక్తాశ్రయం యర్హి నిర్విషయం విరక్తం నిర్వాణ మృచ్ఛతి మన స్సహసా యథార్చిః
ఆత్మాన మత్ర పురుషే వ్యవధాన మేక మన్వీక్షతే ప్రతినివృత్త గుణప్రవాహః.
(28-35) అని మూలము.

వ. వెండియు, 938

సీ. వరుస ననన్యభావంబులఁజేసి భూతావళియందుఁ దదాత్మకత్వ
మునఁ జూచు నాత్మీయ ఘనతరోపాదానములయందుఁ దవిలి యిమ్ములఁ వెలుంగు
[1]నిద్ధ దివ్యజ్యోతి యేక మయ్యును బహు భావంబులను దోఁచు ప్రకృతిగతుఁడు
నగుచున్న యాత్మయుఁ బొగడొందు దేవ తిర్య ఙ్మనుష్య స్థావరాది వివిధ

తే. యోనులను భిన్నభావంబు నొందుటయును,[2]జాలఁగల్గు నిజగుణ వైషమ్యమునను
భిన్నుఁడై వెల్గుఁ గావునఁ బేర్చి యదియ,[3]దేహసంబంధి యగుచు వర్తించుచుండు

క. భావింప సదసదాత్మక, మై వెలయుచు దుర్విభావ్య మగుచు స్వకీయం
బై వర్తింపుచుఁ బ్రకృతిని, భావమునఁ దిరస్కరించు భవ్యస్ఫూర్తిన్. 940

అధ్యాయము - ౨౯

వ. ఈ యాత్మ నిజస్వరూపంబునం జేసి వర్తించు నని కపిలుం డెఱింగించిన విని దేవహూతి వెండియు ని ట్లనియె. మహాత్మా! మహదాది భూతంబులకుం ప్రకృతి పురుషులకుం గల్గిన పరస్పర లక్షణంబులను,దదీయ స్వరూపంబు నెఱింగించితివి. ఇంక నీ ప్రకారంబున సాంఖ్యంబునందు నిరూపింపం బడునట్టి ప్రకారంబును, భక్తియోగ మాహాత్మ్యంబును, బురుషుండు [4]భక్తియోగంబునంజేసి సర్వలోక విరక్తుం డగునట్టి యోగంబును, ప్రాణిలోకంబునకు సంసారం బనేకవిధం బై యుండుం గావునం బరాపరుండ వై కాలస్వరూపి వైన నీ స్వరూపంబును, నే నీవలని భయంబునం జేసి జనులు పుణ్యకర్మంబులు సేయుదు (రవ్విధంబును), మిథ్యాభూతం బైన దేహంబునందు నాత్మాభిమానంబు సేయుచు మూఢుం డై కర్మంబులందు నాసక్తం బైన బుద్ధిం జేసి విభ్రాంతుం డగుచు సంసారస్వరూపం బగు మహాంధకారంబునందుఁ జిరకాల ప్రసుప్తుం డైన జనునిఁ బ్రబోధించు కొఱకు యోగభాస్కరుండవై యావిర్భవించిన పుణ్యాత్ముండవు గావున నాకు నన్నియుం దెలియ సవిస్తరంబుగా నానతిమ్మనిన దేవహూతికిఁ గపిలుం డి ట్లనియె, 941

1. నిద్ది (హ. వా.) 2. చాలఁగల్గిన గుణక వైషమ్యమునను (త. జ.) 3. దేవసంబంధి (బ)
4. భగవద్భక్తి యోగంబున (క. బ. తం.)

—: కపిలుండు దేవహూతికి భక్తియోగము తెలియఁ జేయుట :—

క. నలినాయతాక్షి! విను జనముల ఫలసంకల్ప భేదమునఁజేసి మదిం
గల భక్తియోగ మహిమం, బలవడఁగ ననేక విధము లనఁదగు నివియున్. 942

వ. వివరించెద. తామస రాజస [1]సాత్త్వక భేదంబులం ద్రివిధం బై యుండు. అందుఁ దామసభక్తి ప్రకారం బెట్టి దనిన, 943

తే. సతత హింసాతిదంభమాత్సర్య [2]రూప,తమములను జేయుచును భేదదర్శియగుచు
బరఁగ నాయందుఁ గావించు భక్తిదలఁప, దామసం బనఁదగు వాఁడు తామసుండు.

క. ఘన విషయ ప్రావీణ్యము, లను సుమహైశ్వర్య యశములకుఁ [3]బూజాద్య
ర్హుని నను నర్థి భజించుట, చను రాజసయోగ మనఁగ సౌజన్యనిధీ! 945

చ. అనుపమ పాపకర్మ పరిహారముకై భజనీయుఁ డైన శో
భన చరితుం డితం డనుచు భావమునం దలపోసి భక్తిచే
ననితర యోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్
జనహితకారి యై నెగడ సాత్త్వక యోగ మనంగఁ జొప్పడున్. 946

చ. మనుసుత! మద్గుణ శ్రవణమాత్ర లభించినయట్టి భక్తిచే
ననఘుఁడ సర్వశోభన గుణాశ్రయుఁడన్ బరమేశ్వరుండ నై
తనరిన నన్నుఁ జెందిన యుదాత్త మనోగతు లవ్యయంబు లై
వననిధిగామి యైన సురవాహినిఁ బోలి ఫలించు నిమ్మలన్. 947

క. హేయగుణ రహితుఁ డనఁగల, [4]నాయందలి భక్తి లక్షణముఁ దెలిపితి నన్
బాయక [5]నిర్హేతుకముగఁ, జేయు మదీయ వ్రతైక చిరతర భక్తిన్. 948

వ. నిష్కాము లైన మదీయ భక్తులకు నట్టి భక్తియోగంబు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యంబులకు సాధనంబు గావున మహాత్ములగువారు తమ మనోరథ ఫలదాయకంబు లైనను మదీయ సేవా విరహితంబు లైన యితర కర్మంబుల నాచరింప నొల్లరు. దీని నాత్యంతిక భక్తియోగం బని చెప్పుదురు. సత్త్వ రజ స్తమోగుణ హీనుం డైన జనుండు [6]మత్సమానాకారతం బొందు. అని చెప్పి మఱియు ని ట్లనియె, 949

1. సాత్త్వికాది (హ. తం. వా.) 2. రోష (హ. వా.) 3. పూజారూపుని (క. చ. బ.)
4. నాయందుల భక్తి లక్షణం బెఱిఁగించెదన్ (క.చ.ట.త.జ.) 5. నిర్హేతుకమై, చేయు (క. చ. ట. త. జ. తం.) 6. మత్స్వరూపంబునుం బొందుచునని (హ)

సీ. నిత్య నైమిత్తిక నిజధర్మమున గురు శ్రద్ధాగరిష్ఠతఁ జతుర పాంచ
రాత్రోక్త హరి సమారాధన క్రియలను [1]నిష్కామనంబున నెఱి మదీయ
విగ్రహదర్శన వినుతి పూజా వందన [2]ధ్యాన సంశ్రవణములఁ గర్మ
సంగి గాకుండుట సజ్జనప్రక రాభిమానంబు నొందుట హీనులందుఁ

తే. జాల ననుకంప సేయుట సములయందు, మైత్రినెఱపుట యను నియమక్రియాది
యైన యోగంబుచేత నాధ్యాత్మి కాధిభౌతికాదులఁ దెలియుట పలుకుటయును.

వ. మఱియును, 951

క. హరి మంగళ గుణకీర్తన, పరుఁడై తగ నార్జవమున భగవత్పరులన్
గర మనురక్తి భజించుట, నిరహంకారమున నుంట నిశ్చలుఁ డగుటన్. 952

క. ఇవి మొదలుగాఁగఁ గలుగు [3]భగవదుద్దేశాభిధర్మ కలితుం డై వీ
నివలనఁ బరిశుద్ధ గతిం, దవిలిన మదిఁ గలుగుఁ బుణ్యతముఁ డెయ్యెడలన్. 953

తే. గురుత రానేక కల్యాణగుణ విశిష్టుఁ, డనఁగ నొప్పిన ననుఁ బొందు నండఁగొనక
పవన వశమునఁ బువ్వుల పరిమళంబు, ఘ్రాణమున నావరించిన కరణి మెఱసి.

చ. అనిశము సర్వభూత హృదయాంబుజవర్తి యనం దనర్చు నీ
శు నను నవజ్ఞ సేసి మనుజుం డొగి మత్ప్రతిమార్చనా విడం
బనమున మూఢుఁడై యుచిత భక్తిని నన్ను భజింపఁడేని య
మ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చినయట్టివాఁ డగున్, 955

సీ. అబ్జాక్షి! నిఖిలభూ తాంతరాత్ముఁడ నైన నాయందు భూతగణంబునందు
నతిభేదదృష్టి మాయావులై సతతంబు పాయక వైరానుబంధ నిరతు
లగువారి మనములఁ దగులదు శాంతి యెన్నఁటికైన నేను నా కుటిలజనుల
మానక యెపుడు సామాన్యాధిక ద్రవ్య సమితిచే మత్పదార్చన మొనర్ప

తే. నర్థినాచిత్తమున ముదం బందకుందు, ననుచునెఱిఁగించి మఱియు నిట్లనియెఁ గరుణఁ
గలిత సద్గుణ జటిలుఁ డక్కపిలుఁ డెలమిఁ, దల్లితోడ గుణవతీమతల్లితోడ.956

సీ. తరలాక్షి! విను మచేతన దేహములకంటెఁ జేతనదేహముల్ శ్రేష్ఠ మందుఁ
బ్రాణవంతంబులై స్పర్శన జ్ఞానంబు గలుగు చైతన్య వృక్షములకంటె
ఘన రసజ్ఞాన సంకలిత చేతను లుత్తములు రసజ్ఞానంబు గలుగువాని
కంటె గంధజ్ఞాన కలిత [4]భృంగంబులు గడు శ్రేష్ఠములు వానికంటె శబ్ద

1. నిష్కామనంబుల (క.జ.డ.ద.) 2. ధ్యానగుణ శ్రవణములఁ గర్మ (క. చ. జ. డ.)
3. భగవదుద్దేశ స్వధర్మ (హ.వా.) 4. బృందములు (హ.వా.)

తే. [1]వేదు లగుదురు శ్రేష్ఠులు వెలయ శబ్ద, [2]విదులకంటెను మఱి రూపవేదులైన
వాయసాదులు శ్రేష్ఠముల్ వానికంటె, వరుస బహుపాదు లుత్తముల్[3]వారికంటె.

క. తలఁపఁ జతుష్పదు లధికులు, బలకొని మఱి వారికంటెఁ బాదద్వయముం
గల మనుజు లలఘుతము లి,మ్ముల వారలయందు వర్ణములు నాల్గరయన్. 958

వ. అందు, 959

సీ. తలఁప బ్రాహ్మణు లుత్తములు వారికంటెను వేదవేత్తలు, వేదవిదుల కంటె
విలసిత వేదార్థ విదులు, వారలకంటె సమధిక శాస్త్రసంశయము మాన్పు
మీమాంసకులు, మఱి మీమాంసకులకంటె నిజధర్మ విజ్ఞాన నిపుణు, లరయ
వారికంటెను సంగవర్జిత చిత్తులు, దగ వారికంటె సద్ధర్మపరులు,

తే. ధార్మికులకంటె నుత్తమోత్తముఁడు వినుము, మత్సమర్పిత సకల[4]కర్మస్వభావ
మహిమములుగల్గి యితర[5]కర్మములు విడిచి, సమత వర్తించు నప్పుణ్యతముఁడు
ఘనుఁడు. 960

వ. అట్టి వాని, 961

క. కని సకల భూతగణములు, మనమున నానందజలధి మగ్నము లగుచున్
ఘన బహుమాన పురస్సర, మనయముఁ బాటిల్ల వినుతు లర్థిం జేయున్. 962

వ. అంత నీశ్వరుండు జీవస్వరూపానుప్రవిష్టుం డై యుండు. అట్టి భగవంతుం జూచి భక్తియోగంబున నైన, యోగంబున నైనం బురుషుండు పరమాత్మం బొందు. ప్రకృతి పురుషాత్మకంబును దద్వ్యతిరిక్తంబును నైన దైవంబు నై కర్మ విచేష్టితం బగుచు నుండు. అదియ భగవద్రూపంబు. ఇట్టి భగవద్రూపంబు రూపభేదాస్పదం బగుచు నద్భుత ప్రభావంబు గల కాలం బనియుఁ జెప్పంబడు. అట్టి కాలంబు మహదాది తత్త్వంబులకును, దత్తత్త్వాభిమాను లగు జీవులకును భయావహం బగుటంజేసి సకల భూతంబులకు నాశ్రయం బగుచు, నంతర్గతంబై భూతంబుల చేత భూతంబుల గ్రసింపుచు, యజ్ఞఫలప్రదాత గావున వశీకృత

1. వేదులగు నహుల్ శ్రేష్ఠమై వెలయ (తం) 2. వేదికంటెను సద్రూప వేదులైన (హ)
3. వానికంటె (తం. వా.)
తేభ్యో గంధవిదశ్శ్రేష్ఠాః తతశ్శబ్దవిదోవరాః (29-30)
రూపభేద విదస్తత్ర తతశ్చోభయ తోదతః
తేషాం బహుపదా శ్శ్రేష్ఠాః చతుష్పాదా స్తతో ద్విపాత్ (29-31)]
4. ధర్మస్వభావ (హ. తం. వా.) 5. ధర్మములు (హ. తం. వా.)

భూతుం డై ప్రభుత్వంబు భజియించి [1]విష్ణుండు ప్రకాశింపుచుండు. అతనికి మిత్రుండును, శత్రుండును, బంధుండును లేఁడు. అట్టి విష్ణుండు సకలజనంబు లయం దావేశించి యప్రమత్తుండై ప్రమత్తులైన జనంబులకు సంహారకుండై యుండు. అతనివలని భయంబునంజేసి వాయువు వీచు. సూర్యుండు తపియించు. ఇంద్రుండు వర్షించు. నక్షత్రగణంబు వెలుంగు. చంద్రుండు ప్రకాశించు. తత్తత్కాలంబుల వృక్షలతాదు లోషధులతోడం గూడి పుష్పఫలభరితంబు లగు. సరిత్తులు ప్రవహించు. సముద్రంబులు మేరలు దప్పక యుండు. అగ్ని ప్రజ్వలించు. భూమి గిరులతోఁ గూడ బరువునఁ గ్రుంగ వెఱచు. ఆకాశంబు సకల జనంబులకు నవకాశం బిచ్చు. మహత్తత్త్వంబు జగత్తునకు సంకుర స్వరూపంబు గావున సప్తావరణావృతం బగు లోకం బను స్వదేహంబు విస్తరింపం జేయు. గుణాభిమానులగు బ్రహ్మాదులు సర్వేశ్వరునిచేత జగత్సర్గంబునందు నియోగింపబడి ప్రతి దినంబు న య్యాయి సర్గంబు చేయ నప్రమత్తులై యుండుదురు. పిత్రాదులు పుత్రోత్పత్తిఁ జేయుదురు. కాలుండు మృత్యుసహాయుం డై మారకుండై యుండు. చరాచరాత్మకంబగు సకల ప్రపంచంబు భగవదధీనం బయి యుండు. అని చెప్పి కపిలుండు వెండియు ని ట్లనియె.

## అధ్యాయము — ౩౦

క. నెఱి నిట్టి నిఖిలలోకే,శ్వరుని పరాక్రమముఁ దెలియ సామర్థ్యం బె
వ్వరికిని గలుగదు మేఘము, గరువలి విక్రమముఁ దెలియఁగాలేని గతిన్. 974

క. మగువా! విను సుఖహేతుక, మగు నర్థము దొరకమికి మహాదుఃఖమునం
దగులుదు రిది యంతయు నా, భగవంతుని [2]యాజ్ఞఁజేసి ప్రాణులు మఱియున్.

సీ. పూని [3]యనిత్యంబు లైన గృహ క్షేత్ర పశు ధన సుత వధూ బాంధవాది
వివిధవస్తువులను ధ్రువముగా మది నమ్మి వఱలు దుర్మతి యగువాఁడు జంతు
సంఘాత మగు దేహసంబంధమున నిల్చి యర్థి నెయ్యే యోనులందుఁ జొరఁగ
ననుగమించును వానియందు విరక్తుండు గాక యుండును నరకస్థుఁడైన

తే. దేహి యాత్మీయదేహంబుఁ దివిరి వదల, లేక తన కది పరమ సౌఖ్యాకరంబు
గాఁగ వర్తించు నదియునుఁగాక యతఁడు, దేవమాయా విమోహిత భావుఁడగుచు.

---

1. విష్ణుండు నాఁ (హ)
"సవిష్ణ్వాఖ్యోఽధియజ్ఞోఽసౌ కాలః కలయతాం ప్రభుః" (29-40)
2. మాయఁజేసి (చ) 3. యసత్యంబులైన (హ)

క. [1]ఘనముగఁ బుత్ర వధూ పశు, ధన గృహ రక్షణమునందుఁ దత్తత్క్రియలన్ మనమునఁ దలపోయుచు దిన, దినమున్ దందహ్యమానదేహుం డగుచున్. 967

క. అతిమూఢహృదయుఁ డగుచు దు, రితకర్మారంభమునఁ జరింపుచుఁ దరుణీ కృత గోప్యభాషణములను, సుత కలసంభాషణములఁ జొక్కుచు మఱియున్.

క. విను మింద్రియ పరవశుఁ డై, మునుకొని తత్కూటధర్మములుగల దుఃఖం బనయము సుఖరూపంబుగ, మనమునఁ దలపోసి తదభిమానుం డగుచున్. 969

క. సతతముఁ దమతమ సంపా, దిత మగు నర్థములచేత ధృతిఁ బరులకుఁ గు త్సితమతి హింసలు సేయుచు, నతిమూఢమనస్కుఁ డగుచు నాత్మజనములన్. 960

తే. పూని రక్షింపుచును వారి భుక్తశేష, మనుభవింపుచు నంత జీవనము [2]పోక [3]గడఁకతో నపుడు పరార్థకాముఁ డగుచు,సత్త్వ మెడలి కుటుంబపోషణమునందు.

సీ. బలిమి చాలక మందభాగ్యుఁడై కుమతి యై పూని యప్పుడు క్రియాహీనుఁడగుచుఁ దవిలి వృథాప్రయత్నంబులు సేయుచు మూఢుఁడై కార్పణ్యమునఁ జరించు నట్టి యకించనుఁ డగువానిఁ జూచి తద్దారసుతాదు లాత్మలను వీఁడు గడు నశక్తుఁడు ప్రోవఁగాఁజాలఁ డితఁ డని నెగ్గింతు రర్థిఁ గృషీవలుండు

తే. బడుగు ముసలెద్దు రోసినపగిది నంత, నతఁడు నే వెంటలను సుఖం బందలేక తాను పోషించు జనులు దన్ దనరఁ బ్రోవ, బ్రతుకు ముదిమియు మిక్కిలి బాధ పఱుప. 972

క. వెడరూపు దాల్చి బాంధవు, లకలఁగ నిర్యాణమునకు నభిముఖుఁ డై యిల్ వెడలఁగఁ జాలక శునకము, వడువునఁ గుడుచుచును మేను వడవడ వణఁకన్.

సీ. అతిరోగ పీడితుం డై మంద మగు జఠరాగ్నిచే మిగుల నల్పాశి యగుచు మెఱసి వాయువుచేత మీఁదికి నెగసిన కన్నులు, కఫమునఁ గప్పబడిన నాళంబులును, గంఠనాళంబునను ఘురఘుర మను శబ్దంబు దొరయ బంధు జనుల మధ్యంబున శయనించు, బహువిధములఁ దన్నుఁ బిలువంగఁ బలుకలేక

తే. చటులతర కాలపాశ వశంగతాత్ముఁ, డగుచు బిడ్డలఁ బెండ్లాము నరసి ప్రోచు చింత వికలము లైన హృషీకములును, గలిగి విజ్ఞానమునఁ బాసి కష్టుఁ డగుచు.

1. ఘనమగు ధనయువవధూపశు (క. చ. బ.) 2. పోప (హ) 3. కడఁగి మఱి మఱి యపరార్థ కాముఁ డగుచు. (తం. వా.)

వ. అంత మరణావస్థం బొందు సమయంబున నతిభయంకరాకారులును, సరభ నేత్రులును నగు యమదూత లిద్దఱు దన ముందఱ నిలిచినం జూచి, త్రస్త హృదయుం డై శకృన్మూత్రంబులు విడుచుచు, [1]యమపాశంబులచే గళంబున బద్ధుం డై శరీరంబువలన నిర్గమించి, యాతనాశరీరంబు నవలంబించి, బలాత్కారంబున దీర్ఘుం బై దుర్గమం బగు మార్గంబును బొంది, [2]రాజభటులచే నీయమానుం డగుచు దండంబున కభిముఖుం డై చను నపరాధిచందంబునం జనుచుండి,

చ. అనయము మూర్ఛనొందు శునకావళిచేతను భక్ష్యమాణుఁ డై
యనుపమ కాలకింకర భయంకర తర్జన గర్జనంబులన్
మనము గలంగ దేహము సమస్తము కంపము నొందఁగాఁ బురా
తనభవ పాపకర్మ సముదాయముఁ జిత్తములోఁ దలంపుచున్. 976

సీ. అనుపమ క్షుత్తృష్ణ లంతర్వ్యథలఁ జేయ యుంయూనిల జ్వల జ్వలన చండ
భాను ప్రదీప్తి తప్తం బైన వాలుకా మార్గానుగత తప్యమాన గాత్రుఁ
డై వీఁపు కశలచే నడువంగ వికలాంగుఁ డగుచు మార్గమునందు నచట నచటఁ
జాల మూర్ఛిల్లి †యాశ్రయశూన్య మగు నీళ్ళ మునుఁగుచు లేచుచు మొనసి పాప

తే. రూప మైన తమముచే నిరూఢుఁ డగుచు, వెలయఁ దొంబదితొమ్మిదివేల యోజ
నముల దూరంబు గల యమనగరమునకుఁ, బూని యమభటుల్ గొంపోవఁ
బోవు నంత. 977

వ. ఇట్లు మహాపాపాత్ముం డైనవాఁడు ముహూర్తత్రయ కాలంబునను, సామాన్య దోషి యగువాఁడు ద్విముహూర్తంబులను నేఁగి యాతనం బొందు. అందు,

క. పట్టుదురు కొఱవులను వడిఁ, బెట్టుదు రసిపత్రికలను బెనుమంటలయం
దొట్టుదురు నొడలు నలియఁగ, మట్టుదు ర ప్పాపచిత్తు మత్తుం బెలుచన్. 979

ఉ. ముంతురు తప్త[3]తోయముల మొత్తుదు రుగ్ర గదాసిధారలన్
ద్రెంతురు పొట్టప్రేవులు వధింతురు మీఁద నిభేంద్రపంక్తి ద్రొ
ప్పింతురు ఘోరభంగిఁ గఱపింతురు పాములచేత బిట్టు ద్రొ
బ్బింతురు [4]మీఁద గుండ్లు తినిపింతురు దేహముగోసి కండలన్. 980

1. యమపాశబద్ధుఁడై (క. చ. ట. త. బ.)
2. రాజ దండంబున కభిముఖుం బై చనుభటుని చందంబున చనుచుండ (క. తం.)
† ''చల త్యశక్తోఽపి నిరాశ్రమోదకే'' అని మూలము. (30-22.
''నిర్గతః ఆశ్రమో విశ్రామస్థాన ముదకంచ'' అని వ్యాఖ్య.
3. తైలముల (చ) 4. మీఁదనుండి (ట)

వ. మఱియుఁ గుటుంబపోషణంబునఁ గుక్షింభరుం డగుచు నధర్మపరుండై భూత ద్రోహంబున నతిపాపుం డై నిరయంబునం బొంది, నిజధనంబు గోలుపడి మొఱ వెట్టు నాపన్నుని చందంబునఁ బరస్పరసంబంధంబునఁ గల్పింపబడిన [1]తమిస్రాంధ తామిస్ర రౌరవాదు లగు నరకంబులం బడి, తీవ్రంబు లైన బహుయాతనల ననుభవించి, క్షీణపాపుం డై పున ర్నరత్వంబునుం బొందు. అని చెప్పి వెండియు ని ట్లనియె, 981

## అధ్యాయము—౩౧

—: కపిలుండు దేవహూతికిఁ బిండోత్పత్తిక్రమము తెలుపుట :—

సీ. కైకొని మఱి పూర్వకర్మానుగుణమున శశ్వ త్ప్రకాశకుం డీశ్వరుండు
ఘటకుండు గావునఁ గ్రమ్మఱ జీవుండు దేహసంబంధంబుఁ దివిరి తాల్ప
దొరఁకొని పురుష రేతో బిందుసంబంధి యై వధూగర్భంబునందుఁ జొచ్చి
కైకొని యొకరాత్రిఁ గలిలంబు పంచరాత్రముల బుద్బుదమును దశమదివస

తే. మందుఁ[2]గర్కంధువై యుండు నంతమీఁదఁ,బేశి యగు నంతమీఁదటఁబేర్చియుండ
కల్ప మగు నొక్కనెల మస్తకమును మాస, యమళ మైనను గరచరణములుఁ
బొడము. 982

వ. మఱియు మాసత్రయంబున నఖ రోమాస్థి చర్మంబులు లింగచ్ఛిద్రంబులును గలిగి, నాలవమాసంబున సప్తధాతువులు, పంచమమాసంబున క్షుత్తృష్ణలు గలిగి, షష్ఠమాసంబున మావిచేత బొదువంబడి, తల్లికుక్షిని దక్షిణభాగంబునం దిరుగుచు, మాతృభుక్తాన్న పానంబులవలనఁ దృప్తిం బొందుచు, [3]సమస్తధాతువులును గలిగి జంతుసంకీర్ణం బగు వి ణ్మూత్ర గర్తంబందుఁ దిరుగుచుఁ, గ్రిమిభక్షిత శరీరుండై మూర్ఛలం బొందుచుఁ, దల్లిభక్షించిన కటుతిక్తోష్ణ లవణ క్షారామ్లా ద్యుల్బణంబు లైన రసంబులచేతఁ బరితప్తాంగుం డగుచు, జరాయువునఁ గప్పంబడి, బహిః ప్రదేశంబునందు నాంత్రంబులచేత బద్ధుం డై, కుక్షియందు శిరంబు మోపికొని, భుగ్నంబైన పృష్ఠ*గ్రీవోదరుండై, స్వాంగచలనంబునందు నసమర్థుం డగుచుఁ, బంజరంబులందు బద్ధశకుంతంబు చందంబున నుండి,దైవకృతంబైన జ్ఞానంబునం

1. చరమంబగు నంధ తామిస్ర.(ట. ఢ. ద. బ.) 2. కర్కంధు వంతయౌ (తం. వా.) కల్కంబునై (క. బ.) 3. సప్తధాతువులు (హ); ఏధమాన ధాతువులు (తం. వా.)
* భుగ్నపృష్ఠ గ్రీవుండై - అని యుండుట యుచితము.
భుగ్నపృష్ఠ శిరోధర - అని మూలము. (31-9)

బూర్వజన్మ దుష్కర్మశతంబులం దలంపుచు, దీర్ఘోచ్ఛ్వాసంబు సేయుచు, నే సుఖంబునుం బొందక వర్తించు. అంత నేడవమాసంమున లబ్ధజ్ఞానుండై చేష్టలు గలిగి, విట్క్రిమి సోదరుండై యొకదిక్కున నుండక సంచరింపుచుఁ, బ్రసూతి మారుతంబులచేత నతివేపితుం డగుచు, యాచమానుండును దేహాత్మదర్శియుఁ బునర్గర్భవాసంబునకు భీతుఁడు నగుచు బంధనభూతంబు లగు సప్తధాతువులచే బద్ధుం డై, కృతాంజలిపుటుండును దీనవదనుండు నై, జీవుండు దా నెవ్వనిచే నుదరంబున వసియింప నియమింపంబడె నట్టి సర్వేశ్వరు నిట్లని స్తుతియించు. 983

—: గర్భస్థుం డగు జీవుండు భగవంతుని స్తుతించుట :—

క. అనయమును భువనరక్షణ, మునకై స్వేచ్ఛానురూపమునఁ బుట్టెడి వి
ష్ణుని భయవిరహిత మగు పద, వనజయుగం బర్థిఁ గొల్తు వారని భక్తిన్. 984

వ. అదియునుం గాక పంచభూత విరహితుం డయ్యుం బంచభూత విరచితం బైన శరీరంబునందుఁ గప్పంబడి, యింద్రియ గుణార్థ చిదాభాస జ్ఞానుండ నైన నేను,

సీ. ఎవ్వఁడు నిఖిలభూతేంద్రియమయ మగు మాయావలంబన మహిత కర్మ
బద్ధుఁ డై వర్తించుపగిది దందహ్యమానం బగు జీవచిత్తంబునందు
నవికార మై శుద్ధ మై యఖండ జ్ఞానమున నుండు వానికి ముఖ్యచరిత
నకు నకుంఠితశౌర్యునకుఁ బరంజ్యోతికి సర్వజ్ఞునకుఁ గృపాశాంతమతికిఁ

తే. గడఁగియుఁ బ్రకృతిపురుషులకంటెఁ బరముఁ, డై నవానికి మ్రొక్కెద నస్మదీయ
దుర్భరోదగ్ర భీకర గర్భనరక, వేదనలు మాన్చి శాంతిఁ గావించుకొఱకు. 986

సీ. [1]నావుడు సుతునకు దేవహూతి ట్లను మహితాత్మ! యెవ్వని మాయచేత
ఘనమోహు లై గుణకర్మనిమిత్త సాంసారికమార్గ సంచారములను
ధృతిచెడి యెలసి యేదిక్కు నెఱుంగక హరిపద ధ్యానంబు నాత్మ మఱచి
యుండు వారలకు నే యుక్తియు న మ్మహాపురుషు ననుగ్రహబుద్ధి లేక

తే. తద్గుణధ్యాన తన్మూర్తి దర్శనములు, గోచరించుట యెట్లు! నాకును బ్రబోధ
కలితముగ నానతిమ్మన్నఁ గపిలుఁ డనియె, నంబతోడను సుగుణకదంబతోడ.

వ. అట్టి యీశ్వరుండు కాలత్రయంబునందున జంగమస్థావరాంతర్యామి యగుటం జేసి జీవకర్మమార్గంబులం బ్రవర్తించువారు తాపత్రయ నివారణంబు కొఱకు భజియింతు రని మఱియు ని ట్లనియె,

1. అనవుడు సుతునకు జనని యిట్లనుఁ దగ (తం. వా.)

క. జనయిత్రి! గర్భమందును, ఘన క్రిమి విణ్మూత్ర రక్త గర్తములోనన్
మునుఁగుచు జఠరాగ్నిని దిన, దినమును సంతప్యమానదేహుం డగుచున్. 989

ఆ. దీనవదనుఁ డగుచు దేహి యీ దేహంబు, వలన నిర్గమింపఁ దలఁచి చనిన
నెలల నెన్నికొనుచు నెలకొని గర్భంబు, వలన వెడలఁద్రోయువారు గలరె?

వ. అని తలంపుచు దీనరక్షకుం డైన పుండరీకాక్షుండు దన్ను గర్భనరకంబువలన విముక్తునిం జేయ నమ్మహాత్మునికిఁ బ్రత్యుపకారంబు సేయలేమికి నంజలి మాత్రంబు సేయ దగు నట్టి జీవుండ నైన నేను శమదమాది యుక్తం బైన శరీరంబునందు విజ్ఞాన దీపాంకురంబునం బురాణపురుషు నిరీక్షింతు. అని మఱియు నిట్లనియె, 991

సీ. [1]నెలకొని బహుదుఃఖములకు నాలయ మైన యీ గర్భనరకము నేను వెడలఁ
జాల బహిఃప్రదేశమునకు వచ్చిన ననుపమ దేవమాయా విమోహి
తాత్ముండ నైన [2]ఘోర మగునట్టి సంసార చక్రమందును బరిభ్రమణశీలి
నై యుండవలయుఁ దా నదిగాక గర్భంబు నం దుండు శోకంబు నపనయించి

తే. యాత్మ కనయంబు సారథి యైనయట్టి, రుచిర విజ్ఞానమునఁ దమోరూప మైన
భూరి సంసారసాగరోత్తారణంబు, చేసి యీ యాత్మ నరసి రక్షించుకొందు. 992

వ. మఱియును, 993

చ. [3]భర మగుచున్న దుర్వ్యసన భాజన మై ఘన దుఃఖమూల మై
యరయఁగఁ బెక్కుతూట్లు గల దై క్రిమిసంభవ మైనయట్టి దు
స్తర బహుగర్భవాసముల సంగతి మాన్పుటకై భజించెదన్
సరసిజనాభ భూరి భవసాగరతారక పాదపద్మముల్. 994

క. అని కృతనిశ్చయుఁ డై యే, చిన విమలజ్ఞాని యగుచు జీవుఁడు గర్భం
బున వెడల నొల్లకుండన్, జనియెడు నవమాసములును జననీ! యంతన్. 995

వ. దశమమాసంబున వాని నధోముఖుం గావించిన నుచ్ఛ్వాస నిశ్వాసంబులు లేక ఘన దుఃఖభాజనుండును, విగతజ్ఞానుండును, [4]రక్తదిగ్ధాంగుండు నై (విష్ఠాస్థక్రిమిం బోలి నేలం బడి యేడ్చుచు జ్ఞానహీనుం డై జడుంబోలె నుండి, యంత నిజభావానభిజ్ఞు లగు) నితరులవలన వృద్ధిం బొందుచు నభిమతార్థంబులం

1. బలకొని (క. చ. ట.); మునుకొని (జ) 2. ఘోరతమమగు (హ) 3. పరఁగుచునున్న (హ. తం. వా.) 4. రక్తవిణ్మూత్ర పంకిలుండును (క. చ. ట. త. ద.)

చెప్పనేరక యనేక కీటసంకులం బైన పర్యంకంబునందు శయానుం డై యవయ
వంబులు కండూయమానంబు లైన గోఁకనేరక యాసనోత్థాన గమనంబుల
నశక్తుం డై తన శరీరచర్మంబు మశక మత్కుణ మక్షికాదులు వొడువఁ గ్రిము
లచే వ్యథంబడు క్రిమికుం బోలి, దోదూయమానుం డై రోదనంబు సేయుచు,
విగతజ్ఞానుం డై యుండుచు, శైశవంబునం దత్త త్క్రియానుభవంబు గావించి,
పౌగండవయస్సునఁ ద దనురూపంబు లగు నధ్యయనాది దుఃఖంబు లనుభవించి,
తదనంతరంబ యౌవనంబు ప్రాప్తం బైన నభిమతార్థ ఫలప్రాప్తికి సాహస
పూర్వంబు లగు వృథాగ్రహంబులు సేయుచు పంచమహాభూతారబ్ధం బగు దేహం
బందుఁ బెక్కు మాఱు లహంకార మమకారంబులు సేయుచుఁ దదర్థంబులైన
కర్మంబు లాచరింపుచు, సంసార బద్ధుం డగుచు, దుష్పురుష సంగమంబున
శిశ్నోదర పరాయణుం డై వర్తింపుచు, (నజ్ఞానంబునం జేసి వర్ధిష్యమాణ రోషం
డగుచుఁ, దత్ఫలంబు లగు దుఃఖంబు లనుభవింపుచుఁ, గాముకుం డై నిజ నాశనం
బునకు హేతువు లగు కర్మంబులం బ్రవర్తింపుచుండు.) మఱియును, 996

సీ. జనయిత్రి! సత్యంబు శౌచంబు దయయును ధృతియు మౌనంబు బుద్ధియును సిగ్గు[1]
క్షమయును యశమును[2]శమదమ భగములు మొదలుగాఁ గల గుణంబులు నశించు
జనుల కసత్సంగమున నని యెఱిఁగించి వెండియు నిట్లను వినుము మూఢ
హృదయులు శాంతివిహీనులు దేహాత్మ బుద్ధులు నంగనా మోహపాశ

తే. బద్ధ కేళీమృగంబుల పగిదిఁ దగిలి, పరవశ స్వాంతముల శోచ్యభావు లైన
వారిసంగతి విడువంగవలయు నందు, నంగనాసంగమము దోషమంద్రు గాన. 997

వ. దీని కొక్క యితిహాసంబు గలదు. తొల్లి యొక్కనాఁడు ప్రజాపతి తన కూఁతు
రైన భారతి మృగీరూపధారిణి యై యుండం జూచి తదీయ రూపరేఖా
విలాసంబులకు నోటువడి వివశీకృతాంతరంగుండును, విగత త్రపుండును నై
([3]మృగరూపంబు నొంది త దనుధావనంబు హేయం బని తలంపక ప్రవర్తించెం
గావున) నంగనాసంగమంబు వలవదు. అస్మదీయ నాభీకమల సంజాత చతు
ర్ముఖ నిర్మిత మరీచ్యాద్యుద్భూత కశ్యపాది కల్పిత దేవ మనుష్యాదులందు
మాయాబలంబునం గామినీజనమధ్యంబున విఖండితమనస్కుండు గాకుండుటకుఁ
బుండరీకాక్షుం డైన నారాయణ ఋషికిం దక్క నన్యులకు నెవ్వరికిని దీర దని
వెండియు నిట్లనియె. 998

1. న సత్పురుష (క. చ. ట. జ. ఢ. ద.) 2. శమమును దమమును (క. ట. ఢ. ద. బ. తం. వా.); శమోదమో భగశ్చేతి యత్సంగా ద్యాతి సంక్షయమ్. (31-34) భగఃఉన్నతిః (వ్యా.)
3. గానిపని చేసెంగావున (క. చ. ట. జ. ఢ. ద. బ.)

తే. రూఢి నా మాయ కామినీరూపమునను, బురుషులకు నెల్ల మోహంబుఁ
బొందఁ జేయుఁ
గానఁ బురుషులు సతుల సంగంబు మాని, యోగవృత్తిఁ జరింపుచు నుండవలయు.

క. ధీరతతో మత్పద సర, సీరుహ సేవానురక్తిఁ జెందిన వారల్
నారీసంగము నిరయ, ద్వారముగా మనములందుఁ దలఁపుదు రెందున్. 1000

క. హరిమాయా విరచిత మై, తరుణీరూపంబుఁ దాల్చి ధరఁ బర్విన యం
ధుర తృణపరివృత కూపము, కరణి నదియు మృత్యురూపకం బగు మఱియున్.

చ. ధన పశు పుత్ర మిత్ర వనితా గృహ కారణభూత మైన యీ
తనువున నున్న జీవుఁడు పదంపడి యెట్టి శరీర మెత్తిన
న్ననుగత మైన కర్మఫల మందక పోవఁగరాదు మిన్ను ప్రాఁ
కిన భువిఁ దూఱినన్ దిశల [1]కేగిన నెచ్చటనైన దాఁగినన్. 1002

వ. అట్టి పురుషరూపంబు నొందిన జీవుండు నిరంతర స్త్రీసంగంబుచే విత్తాపత్య గృహాది ప్రదం బగు స్త్రీత్వంబు నొందు. ఈ క్రమంబున నంగనారూపుం డగు జీవుండు మన్మాయచే బురుషరూపంబు నొంది, ధనాదిప్రదుం డగు భర్తను నాత్మబంధకారణం బగు మృత్యువునుగ నెఱుంగవలయు. మఱియు జీవోపాధి భూతం బగు లింగదేహంబుచే స్వావాస భూతలోకంబున నుండి, లోకాంతరంబు నొందుచుం, బ్రారబ్ధ కర్మఫలంబు ననుభవింపుచు, మఱలఁ గర్మాదులం దాసక్తుం డగుచు, మృగయుండు గాననంబున ననుకూల సుఖప్రదుం డైనను మృగంబునకు మృత్యు వగుచందంబున జీవుండు భూతేంద్రియ మనోమయం బైన దేహంబు గలిగి యుండు. అట్టి దేహనిరోధంబె మరణంబు. ఆవిర్భావంబె జన్మంబు. కాన సకల వస్తు విషయ జ్ఞానంబు గలుపుటకు జీవునకు సాధనంబు చక్షురింద్రియంబు. ద్రష్టృ దర్శనీయ యోగ్యతా ప్రకారంబున జీవునకు జన్మమరణంబులు లేవు. కావున భయకార్పణ్యంబులు విడిచి, సంభ్రమంబు మాని, [2]జీవ ప్రకారంబు జ్ఞానంబునం దెలిసి, ధీరుండై ముక్తసంగుం డగుచు యోగ వైరాగ్యయుక్తుం బైన సమ్యగ్ జ్ఞానంబున మాయా విరచితం బైన లోకంబున దేహాదులం దాసక్తి మాని. వర్తింపవలయు. అని చెప్పి వెండియు నిట్లనియె, 1003

1. గీల్కొని యెచ్చటనేని (తం.) 2. జగత్ప్రకారంబు (క. చ. బ.)

అధ్యాయము — ౩౨

సీ. గృహమందు వర్తించు గృహమేధులగువారు మహిత ధర్మార్థకామములకొఱకు
సంప్రీతు లగుచుఁ దత్సాధనానుష్ఠాన నిరతులై వేదనిర్ణీత భూరి
భగవత్స్వధర్మ తద్భక్తి పరాఙ్ముఖులై దేవగణముల ననుదినంబు
భజియింపుచును భక్తిఁ బైతృక కర్మముల్ సేయుచు నెప్పుడు శిష్టచరితు

తే. లగుచుఁ దగ దేవపితృ సువ్రతాఢ్యులైన, కామ్యచిత్తులు ధూమాదిగతులఁ జంద్ర
లోకములఁ జెంది పుణ్యంబు లోపమైన, మరలి వత్తురు భువికి జన్మంబు నొంద.

వ. అదియునుం గాక, 1005

తే. ప్రవిమ లానంత భోగి తల్పంబునందు, యోగనిద్రాళువై హరి యున్నవేళ
నఖిల లోకంబులును విలయంబునొందు, నట్టి సర్వేశ్వరునిఁగూర్చి
యనఘమతులు.

మ. పరికింపన్ నిజ [1]వర్ణధర్మ గరిమన్ బాటిల్లు పంకేరుహో
దర విన్యస్త సమస్త ధర్మముల శాంతస్వాంతులై సంగముం
బరివర్జించి [2]విశుద్ధచిత్తు లగుచున్ బంకేజ పత్రేక్షణే
తర ధర్మైక నివృత్తులై సతతముం దైత్యారిఁ జింతింపుచున్. 1007

సీ. మఱియు నహంకార మమకార శూన్యులై యర్థి వర్తింపుచు నర్చిరాది
మార్గ గతుండును మహనీయ చరితుండు విశ్వతోముఖుఁడును విమల యశుఁడు
జగదుద్భవ స్థాన సంహార కారణుం డవ్యయుఁ డజుఁడు పరాపరుండు
పురుషోత్తముఁడు నవపుండరీకాక్షుండునైన సర్వేశ్వరు నందుఁ బొంది

తే. మానితాపునరావృత్తి మార్గమైన, ప్రవిమ లానందతేజో విరాజమాన
దివ్యపదమున సుఖియించు ధీరమతులు, మరలిరా రెన్నఁటికిని జన్మముల నొంద.

వ. *(మఱియుఁ బరమేశ్వర దృష్టిచే హిరణ్యగర్భు నుపాసించువారు సత్యలోకంబున ద్విపరార్ధావసానం బగు ప్రళయంబుఁ దనుకఁ బరుం డగు చతురాననుం బరమాత్మ రూపంబున ధ్యానంబు సేయుచు నుండి) పృథివ్యప్తేజో వాయ్వాకాశ మానసేంద్రియ (శబ్దాది) భూతాదులతోడం గూడ (లోకంబునుం) ప్రకృతి యందు లీనంబు సేయ సర్వేశ్వరుండు సకల సంహర్త యగు సమయంబున

1. భక్తి యుక్తి (హ. తం. వా.) 2. విలుప్త కర్ములగుచో (క. చ. ట. త. జ. ద. బ.)
* కొన్ని ప్రతులందులేదు.

గతాభిమానంబులు గలిగి, బ్రహ్మలోకవాసు లగు నాత్మలు బ్రహ్మతోడం గూడి [1]పరమానందరూపుండు (సర్వోత్కృష్టుండు) నగు పురాణపురుషుం బొందుదురు. కావున నీవు సర్వభూత హృదయపద్మ నివాసుండును, శ్రుతానుభావుండును, (నిష్కళంకుండును, నిరంజనుండును, నిర్ద్వంద్వుండును నగు పురుషుని భావంబుచే) శరణంబు నొందు మని చెప్పి మఱియు నిట్లనియె, 1009

మ. సకల స్థావరజంగమ ప్రతతికిన్ జర్చింపఁ దా నాద్యుఁ డై
యకలంక శ్రుతి గర్భుఁడుం [2]బరముఁడు న్నైనట్టి యీశుండు సే
వక యోగీంద్ర కుమార సిద్ధ ముని దేవశ్రేణి యోగప్రవ
ర్తక మై తన్ను భజింపఁ జూపు సగుణబ్రహ్మంబు లీలాగతిన్. 1010

సీ. అట్టి సర్వేశ్వరుం డాయాయి కాలంబు లందును దద్గుణవ్యతికరమున
జనియింపుచుండు నీచాడ్పున ఋషిదేవ గణములు దమతమ కర్మనిర్మి
[3]తైశ్వర్య పారమేష్ఠ్యములందు పురుషత్వమును బొంది యధికారములు వహించి
వర్తించి క్రమ్మఱ వత్తురు మఱి కొంద ఱారూఢ కర్మానుసార మైన

తే. మనములను జాలఁ గలిగి ధర్మములయందు, శ్రద్ధతోఁ గూడి యప్రతిషిద్ధ మైన
నిత్య నైమిత్తికాచార [4]నియతు లగుచుఁ, దగి రజోగుణకలిత చిత్తములు గలిగి.

వ. సకాము లై యింద్రియజయంబు లేక పితృగణంబుల నెల్లప్పుడుఁ బూజింపుచు గృహంబులయందు వర్తించి *(హరిపరాఙ్ముఖులగు) వారు త్రైవర్గిక పురుషులని చెప్పంబడుదురు. 1012

చ. వినుత గుణోత్తరుండు నురు[5]విక్రముఁ డైన హరిం భజించి త
న్మనన లసత్కథామృతము మానుగఁ గ్రోలుట మాని దుష్కథల్
విని ముద మందుచుందురు వివేకవిహీనత నూరఁబంది యా
త్మను [6]మధురాజ్య భక్ష్యములు మాని పురీషము కేఁగుచాడ్పునన్. 1013

చ. అలవడ ధూమమార్గగతు లై పితృలోకముఁ బొంది పుణ్యముం
బొలసినవారు [7]దొంటి తమపుత్రులకుం దగఁ దాముఁ బుట్టి వి
హ్వలమతి గర్భగోళపతనాది పరేత[8]ధరా క్రియాంత మై
వెలసిన కర్మ మిం దనుభవింతురు గావున నీవు భామినీ! 1014

1. అమృతరూపుండు (క.చ.బ.) 2. బరుఁడు సర్వాద్యుండు నీశుండు (హ) 3. తములగు పారమేష్ఠ్యములొందు పురుషుల (క.చ.ట.బ.ద.బ.) 4. నిపుణులగుచు (హ. తం. వా.)

* కొన్ని తా. ప. ప్రతులందు లేదు.

5. విక్రముఁడున్నగునట్టి విష్ణుకీ, ర్తన రుచిరామృతంబు ప్రమదంబున (క. చ. బ.) 6. మధురాది (చ.ట.జ.ద.బ.డ) 7. ద్రొబ్బ (క.త.ద.జ.క.బ.) ద్రోవ (చ) 8. ధరాగతాంతమై (క.బ)

క. విను సర్వభావములఁ బర, ముని ననఘు ననంతు నీశుఁ బురుషోత్తముని
న్ననయము భజియింపుము ముద, మునఁ బునరావృత్తిలేని ముక్తి లభించున్.

వ. అని చెప్పి వెండియు నిట్లనియె. (భగవంతుం డగు వాసుదేవునియందుం) * (బ్రయుక్తం బగు భక్తియోగంబు బ్రహ్మసాక్షాత్కార సాధనంబు లగు వైరాగ్య జ్ఞానంబులం జేయు). అట్టి భగవద్భక్తియుక్తం బైన (చిత్తం బింద్రియ వృత్తులచే సమంబు లగు) నర్థంబులందు వైషమ్యంబును, బ్రియా ప్రియంబులును లేక నిస్సంగంబు సమదర్శనంబు హేయోపాదేయ విరహితంబు నై యారూఢం బైన యాత్మపదంబు నాత్మచేఁ జూచుచుండు. జ్ఞానరూపుండును, పరబ్రహ్మంబును, పరమాత్ముండును, నీశ్వరుండును నగు పరమపురుషుం డేక రూపంబు గలిగియుండియు (దృశ్యద్రష్టృ కరణంబులచేతఁ బృథగ్భావంబును బొందుచుండు. ఇదియ యోగికి సమగ్రం బగు) యోగంబునంజేసి ప్రాప్యం బగు ఫలంబు. కావున విషయవిముఖంబు లగు నింద్రియంబులచేత జ్ఞానరూపంబు హేయగుణరహితంబు నగు బ్రహ్మంబు మనోవిభ్రాంతింజేసి (శబ్దాదిధర్మం బగు నర్థరూపంబునం దోఁచు). అది యెట్లు లర్థాకారంబున దోఁచునని యడిగితివేని యహంకారంబు గుణరూపంబుసంజేసి త్రివిధంబును, భూతరూపంబునం బంచ విధంబును, నింద్రియరూపంబున నేకాదశవిధంబు నై యుండు. (జీవరూపుండగు విరాట్పురుషుండు) జీవవిగ్రహం బైన యండంబగు జగంబునం దోఁచుచుండు, దీని శ్రద్ధాయుక్తం బైన భక్తిచేత యోగాభ్యాసంబునం జేసి సమాహిత మనస్కుండై నిస్సంగంబున విరక్తుం డైనవాఁడు పొడగనుచుండు. అది యంతయు బుధజన పూజనీయ చరిత్రవు గావున నీకుం జెప్పితి. సర్వయోగ సంప్రాప్యుండును నిర్గుణుండును భగవంతుండని చెప్పిన జ్ఞానయోగంబును మదీయ భక్తి యోగంబును నను రెండు నొక్కటియ. ఇంద్రియంబులు భిన్నరూపంబులు గావున నేకరూపం బైన యర్థం బనేకవిధంబు లగున ట్లేకం బగు బ్రహ్మం బనేకం బుగఁ దోఁచు. మఱియు, 1016

సీ. అంబ! నారాయణుం డఖిలశాస్త్రములను సమధికానుష్ఠిత సవనతీర్థ
దర్శన జపతపోఽధ్యయన యోగక్రియా దానకర్మంబులఁ [1]గానఁబడఁడ
యేచినమనము బాహ్యేంద్రియంబుల గెల్చి సకలకర్మ త్యాగసరణి నొప్పి
తలకొని యాత్మతత్త్వజ్ఞానమున మించి యుడుగక వైరాగ్యయుక్తిఁ దనరి

* కొన్ని తాళప్రతులలో లేదు.

1. గానఁబడక (హ); గానఁబడఁడు (క. చ. ద. బ.)

తే. మహితఫలసంగరహిత ధర్మమునఁదనరు, నట్టిపురుషుండు దలపోయ నఖిలహేయ
గుణములను బాసి కల్యాణగుణవిశిష్టుఁ, డైన హరి నొందుఁ బరమాత్మ
నవఘుఁ డగుచు. 1017

వ. అది గావున నీకుం జతుర్విధ భక్తియోగప్రకారంబు దేటపడ నెఱింగించితి. అదియునుం గాక (కాలరూప యగు) మదీయగతి జంతువులయందు నుత్పత్తి వినాశరూపంబుల నుండు. అవిద్యాకర్మ నిర్మితంబులైన జీవునిగతు లనేక ప్రకారంబులై యుండు. అదియు జీవాత్మ వానియందుం బ్రవర్తించి (యాత్మగతి యిట్టిదని) యెఱుంగక యుండు. అని చెప్పి మఱియు నిట్లనియె. (ఇట్టి యతి రహస్యం బగు) సాంఖ్యయోగ ప్రకారంబు ఖలునకు నవినీతునకు జడునకు దురాచారునకు డాంబికునకు నింద్రియలోలునకు పుత్ర దారాగారా ద్యత్యంతాసక్త చిత్తునకు భగవద్భక్తిహీనునకు విష్ణుదాసులయందు ద్వేషపడు వానికి నుపదేశింపవలవదు. శ్రద్ధాసంపన్నుండు భక్తుండు వినీతుండు నసూయా రహితుండు సర్వభూతమిత్రుండు శుశ్రూషాభిరతుండు బాహ్యార్థజాత విరక్తుండు శాంతచిత్తుండు నిర్మత్సరుండు శుద్ధాత్ముండు మద్భక్తులయందు ప్రేమగలవాఁడు నన్యకాంతా విముఖుండు నిష్కాముండు నగు నధికారికి నుపదేశింప నర్హం బగు. ఈ యుపాఖ్యానం బే పురుషుండేని పతివ్రత యగు నుత్తమాంగనయేని శ్రద్ధాభక్తులుగలిగి మదర్పిత చిత్తంబున న్వినుఁ బఠియించు నట్టి పుణ్యాత్ములు మదీయ దివ్యస్వరూపంబుఁ బ్రాపింతురు. అని చెప్పెనని మైత్రేయుండు విదురునకు వెండియు నిట్లనియె. ఈ ప్రకారంబునం గర్దమదయిత యైన దేవహూతి కపిలుని వచనంబులు విని నిర్ముక్త మోహపటల యగుచు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి తత్త్వవిషయాంకిత సాంఖ్యజ్ఞాన ప్రవర్తకం బగు స్తోత్రంబు సేయ నుపక్రమించి కపిలున కిట్లనియె. 1018

అధ్యాయము—౩౩

సీ. అనయంబు విను మింద్రియార్థ [1]మనోమయంబును భూతచయమయంబును
[2]సమస్త
భూరి జగద్బీజ భూతంబును గుణప్రవాహ కారణమును వలనుమెఱయు
[3]నారాయణాభిఖ్య నాఁ గల భవదీయ దివ్యమంగళమూర్తిఁ దేజరిల్లు
చారు భవద్గర్భ సంజాతుఁ డగునట్టి కమలగర్భుండు [4]సాక్షాత్కరింప

1. మనోరయంబును (వా) 2. నశేష (క. చ. బ.) 3. నారాయణంబును ననఁగల (క. చ. ట. డ ద. బ.) 4. సాక్షాత్కరించె, నదియు నానావిధంబులై యలరు శక్తి (త. జ. ద. బ.)

తే. లేక మనములఁ గనియె ననేకశక్తి, వర్గములు గల్గి సుగుణప్రవాహరూప
మంది విశ్వంబు దాల్చి సహస్రశక్తి,కలితుఁడై సర్వకార్యముల్ గలుగఁజేయు.

వ. అంత, 1020

తే. [1]అతుల భూరి యుగాంతంబునందుఁ గపట,శిశువవై యెంటిఁ గుక్షినిక్షిప్త నిఖిల
భువననివహుండవై మహాంభోధినడుమఁ,జారు వటపత్రతల్ప సంస్థాయి వగుచు.

తే. లీల నాత్మీయ పాదాంగుళీ వినిర్గ, తామృతము గ్రోలినట్టి మహాత్మ! నీవు
గణఁగి నా పూర్వభాగ్యంబుకతన నిపుడు,పూని నా గర్భమున [2]నేఁడు పుట్టితయ్య!

వ. అట్టి పరమాత్ముండవైన నీవు, 1023

సీ. వరుస విగ్రహ పారవశ్యంబునను జేసి రఘురామ కృష్ణ వరాహ నార
సింహాది మూర్తు లంచితలీల ధరియించి దుష్టనిగ్రహమును శిష్టపాల
నమును గావింపుచు నయమున సద్ధర్మ నిరతచిత్తులకు వర్ణింపఁదగిన
చతురాత్మతత్త్వ విజ్ఞానప్రదుండవై వర్తింతు వనఘ ! భవన్మహత్త్వ

తే. మజున కైనను వాక్రువ్వ నలవిగాదు, నిగమజాతంబులైన వర్ణింపలేవ
యెఱిఁగి సంస్తుతి సేయ నే నెంతదాన? వినుత గుణశీల! మాటలు వేయునేల ?

వ. అదియునుం గాక, 1025

క. ధీమహిత! భవన్మంగళ, [3]నామ స్మరణాను కీర్తనము గల హీనుల్
శ్రీమంతు లగుదు రగ్ని, ష్టోమాది క్రి దాశికంటె శుద్ధులు దలఁపన్. 1026

వ. అదియునుం గాక. 1027

క. నీ నామస్తుతి శ్వపచుం, డైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్
వానికి సరి భూసురుఁడున్, గానేరఁడు చిత్ర మది జగంబుల సరయన్. 1028

ఉ. ఈ విధ మాత్మలం దెలిసి యెప్పుడు సజ్జనసంఘముల్ జగ
త్పావన మైన నీ గుణకథామృత మాత్మలఁ గ్రోలి సర్వతీ
ర్థావళిఁ గ్రుంకినట్టి ఫల మందుదు రంచు సమస్తవేదముల్
వావిరిఁ బల్కుఁ గావునను వారలు ధన్యులు మాన్యు లుత్తముల్. 1029

1. ప్రళయకాలంబునం దంఘ్రిపాయి కపట (హ) 2. నెట్లు పుట్టితివయ్య (క. చ. బ. హ.)
3. నామస్మరణ ప్రకీర్తనము గలవారల్ (క. చ. ట. త. జ. ద. బ.)

వ. అది గావునఁ బరబ్రహ్మంబవు పరమపురుషుండవు ప్రత్యఙ్మనో విభావ్యుండవు సమస్త జన పాపనివారక స్వయంప్రకాశుండవు వేదగర్భుండవు శ్రీమహావిష్ణుండవు నగు నీకు వందనం బాచరించెద. అని స్తుతియించినఁ బరమపురుషుండు మాతృవత్సలుండు నగు కపిలుండు కరుణా [1]రస సాంద్ర హృదయ కమలుం డై జనని కిట్లనియె, 1030

తే. తవిలి సుఖరూపమున మోక్షదాయకంబు, నైన యీ యోగమార్గమే నంబ! నీకు నెఱుఁగ వివరించి చెప్పితి నిది దృఢంబు గాఁగ భక్తి ననుష్ఠింపు కమలనయన!

క. జీవన్ముక్తి లభించుం, గావున నేమఱక తలఁపుఁ గై కొని దీనిన్
వావిరి నొల్ల నివారికిఁ, దావల మగు మృత్యుభయము దవ్వగు సుఖమున్.1032

క. అని యిట్లు దేవహూతికి, మన మలరఁగఁ గపిలుఁ డాత్మమార్గము నెల్లన్
వినిపించి చనియె నని విదు, రునకున్ మైత్రేయమునివరుం డెఱిఁగించెన్.1033

వ. అట్లు కపిలుం డేగిన పిదప దేవహూతియుం బుత్రుండు సెప్పిన యోగమార్గంబున విజ్ఞానంబు గలిగియుండియుం బెనిమిటి యైన కర్దమునిం దనయుం డైన కపిలునిం బాసి, నష్టవత్స యగు చందంబునఁ దల్లడిల్లుచుఁ, గపిలమహామునిం దలంపుచుం, గర్దమ [2]తపస్సామర్థ్యజనితం బైన యట్టి, 1034

ఉ. మానిత సౌరభప్రసవ మంజుల పక్వఫల ప్రవాళ భా
రానత చూతపోత విటపాగ్ర నికేతన [3]రాజకీర స
న్మానితరానులాప [4]పరిమండిత కర్దమతాపసాశ్రమో
ద్యాన వనప్రదేశ కమలాకరతీర నికుంజపుంజముల్. 1035

వ. వెండియు, 1036

సీ. అంచిత స్ఫటికమయ [5]స్తంభదీప్తిచేఁ గొమరారు మరకతకుడ్యములను
స జ్జాతివజ్రాల స జ్జాలక రుచుల భాసిల్లు నీల సోపానములను
దీపించు చంద్రకాంతోపల వేదుల విద్రుమ గేహాళీ విలసితముల
హాటకరత్న కవాటశోభితముల నలరిన సౌధశా లాంగణముల

తే. వర పయః ఫేనపటల పాండుర కరీంద్ర, దంత నిర్మిత [6]ఖట్వాతిధవళ పట్ట
[7]రచిత శయ్యావళులను జతురంతయాన,కనకపీఠాది వస్తుసంఘములు నెల్ల.1037

1. రసార్ద్ర (తం.వా.) 2. తత్త్వ సామర్థ్యంబులైన యట్టి (హ) 3. రాజకీర కేకి నికరానులాప (క.చ.బ.) రాజకీరస, న్మానిసుఖానులాప (తం.వా.) 4. పరికీర్తిత (క.చ.బ.) 5. స్తంభకంబుల (క.చ.త.జ.బ.); స్తంభరోచుల(ట) 6.ఖట్వాంగ ధవలపటలి(క.చ.బ.)7.రచిత ఖట్వంబులను(క.చ.బ.)

వ. మఱియు వికచ కమల కుముద సౌగంధిక బంధుర సుగంధానుబంధి గంధవహ శోభితంబు, నరవిందనిష్యంద కందళిత మరంద రస పాన మదవదిందిందిర సందోహ ఝుంకార సంకులంబు నై చెలువారు బావులు గలిగి, †పురందర సుందరీ నందితం బైన కర్దమాశ్రమంబు పరిత్యజించి *(కుటిలంబులైన కుంతలంబులు జటిలంబులుగా ధరియించి) సరస్వతీ బిందుసరోవరంబులం ద్రిషవణ స్నానంబు గావింపుచు నుగ్ర తపోభారంబునం గృశీభూత శరీర యై నిజకుమారుండును, బ్రసన్నవదనుండును, గపిల నామధేయుండును నగు నారాయణుని (సమస్త నవ్యస్త చింతలచే) ధ్యానంబు సేయుచుఁ బ్రవాహరూపం బైన భక్తియోగంబున నధిక వైరాగ్యంబున యుక్తానుష్ఠానజాతంబు బ్రహ్మత్వాపాదకంబు నగు జ్ఞానంబును విశుద్ధ మనంబునుం గలిగి, 1038

సీ. అనయంబు నాత్మనాయకుఁడును విశ్వతో ముఖుఁడనంతుఁడు పరముఁడు నజుండు
చతురుండు నిజపరిజ్ఞాన దీపాంకుర మహిమ నిరస్త సమస్తభూరి
మాయాంధకారుఁ డమేయుఁ డీశ్వరుఁ డగు నా పరబ్రహ్మంబునం దవిరత
బద్ధ తత్త్వజ్ఞాన పరతచే నిర్ముక్త జీవభావమున విశిష్ట యోగ

తే. భవ్యసంప్రాప్త నిర్మల బ్రహ్మభావ, ములను గలిగి సమాధిచే నెలమిఁ దసరు
నపునరావృత్త మగు త్రిగుణప్రధాన, తత్త్వముల నొప్పి సంతతోదార నియతి.

తే. కలలఁ దోచిన వస్తుసంఘముల మేలు, కని కనుంగొనఁగా లేని మనుజు పోల్కి
బొలఁతి దనయాత్మ మఱచి యిమ్మల సధూమ, మైన పావకుగతినుండె నంతలోన.

క. గురుయోగ శక్తిచే నం, బరతలమున కెగసి సత్కృపామయుఁ డగు నా
పరవాసుదేవు చరణాం,బురుహయుగ న్యస్తచిత్తము గలది యగుచున్. 1041

వ. ఇట్లు కపిలోక్త మార్గంబున దేవహూతి శ్రీహరియందుఁ గలసె. అ య్యంగనా రత్నంబు మోక్షంబునకుం జనిన క్షేత్రంబు సిద్ధిప్రదం బను పేరం బరఁగి ప్రసిద్ధి వహించె. అంత నక్కడఁ గపిలుండు దల్లి చేత ననుజ్ఞాతుం డై సిద్ధ చారణ గంధర్వాప్సరో ముని నివహ సంస్తూయమానుం డగుచు సముద్రునిచేత దత్తార్హణ [1]పూజానికేతనంబులు వడసి, సాంఖ్యాచార్యాభిష్టుతం బగు యోగంబు నవలంబించి (లోకత్రయ) శాంతికొఱకు సమాహితుం డై (స్వ పిత్రాశ

† దాసదాసీజన సఖీజనంబులను ననేక విచిత్రాభరణ పరిమళ ద్రవ్యంబులను బరిత్యజించి (చ. ట. త.)

* కొన్ని తాళపత్ర ప్రతులలో లేదు.

1. గరుడధ్వజంబులు (క. చ. ట. బ.)

మంబు విడిచి) యుదగ్భాగంబునకుం జనియె. అని మైత్రేయ మహాముని విదురున కిట్లనియె. (తండ్రీ! యీ యుపాఖ్యానంబు నాకు గోచరించిన రీతి నీకుం జెప్పితి. ఇది కపిల దేవహూతి సంవాదం బత్యంత పావనంబు కపిల ప్రణీతంబు నైన యోగంబు, దీనిం బరమ భక్తియుక్తుం డై యెవ్వఁడు పఠించు నెవ్వఁడు విను నట్టి పుణ్యాత్ముండు విగత పాపుం డై గరుడధ్వజుం డైన పుండరీకాక్షుని శ్రీ చరణారవిందంబుల బొందు నని మైత్రేయుండు విదురున కెఱింగించె. అని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పె. అని సూతుండు శౌనకాది మహామునులకు నీ కథా వృత్తాంతంబు చెప్పిన విని ప్రహృష్ట హృదయులై, మునికులోత్తమా! భవ ద్వాక్పూరం బగు భగవత్కథామృతంబు గ్రోలుచుండ మా మనంబులు తనివోవవు. ఇంకను తరువాతి వృత్తాంతంబులు మాకు విశదంబులుగ వినిపింప నీవ యర్హుండ వని యడుగుటయు). 1042

చ. జనకసుతా మనో విమలసారస కోమల చంచరీక! చం
దన శరదిందు కుంద హర తార మరాళ పటీర చంద్రికా
వినుత యశోవిశాల! రఘువీర! దర స్మిత పద్మపత్రలో
చన! నిట లాంబక ప్రకటచాప విఖండన! వంశమండనా! 1043

తరల. పరమపావన! విశ్వభావన! బాంధవప్రక రావనా!
శరధి శోషణ! సత్యభాషణ! సత్కృపామయ భూషణా!
దురిత తారణ! సృష్టికారణ! దుష్టలోక విదారణా!
ధరణిపాలన ధర్మశీలన! దైత్యమర్దన ఖేలనా! 1044

మాలిని. దివిజగణ శరణ్యా! దీప్తి తానంతపుణ్యా!
ప్రవిమల గుణజాలా! భక్త లోకానుపాలా!
భవతిమిర దినేశా! భానుకోటి ప్రకాశా!
కువలయ హితకారీ! ఘోర దైత్య ప్రహారీ! 1045

గద్య. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతం బైన శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబునందు విదురనీతియు, విదురుని తీర్థాగమనంబును, నుద్ధవ సందర్శనంబును, గౌరవ, యాదవ, కృష్ణాది నిర్యాణంబును, గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుటయు, విదుర మైత్రేయ సంవాదంబును, జగదుత్పత్తి లక్షణంబును, మహదాదుల సంభవ ప్రకారంబును, మహదాదులు నారాయణు నభినందించుటయు, విరా డ్విగ్రహ ప్రకారంబును, శ్రీ మహా

భాగవత భక్తికారణం బగు పద్మసంభవు జన్మ ప్రకారంబునుఁ బ్రహ్మ తపంబును, బరమేష్ఠికిఁ బుండరీకాక్షుండు ప్రత్యక్షం బగుటయు, బ్రహ్మ కృతం బైన విష్ణు స్తోత్రంబును, గమలసంభవుని మానస సర్గంబును, బరమాణువుల పుట్టువును, భూర్భువ స్సువాది లోకవిస్తారంబును, గాల దివస మాస వత్సరాది నిర్ణయం బును,నాయుః పరిమాణంబును, జతుర్యుగ పరిమాణంబును, బద్మసంభవు సృష్టి భేదనంబును, సనకాదుల జన్మంబును, స్వాయంభువ మనువు జన్మంబును,శ్రీహరి వరాహావతారంబును, భూధరణంబును, సూకరాకారుం డైన హరిని విధాత స్తుతియించుటయు,దితి కశ్యప సంవాదంబును,గశ్యపుండు రుద్రునిం బ్రశంసిం చుటయుఁ గశ్యపువలన దితి గర్భంబు ధరియించుటయుఁ, దత్ప్రభావంబునకు వెఱచి దేవతలు బ్రహ్మ సన్నిధికిం జని విన్నవించుటయు, సనకాదులు వైకుంఠంబునకు నరుగుటయు, అందు జయవిజయుల కలిగి శపించుటయు. శ్రీహరి దర్శనంబును, బ్రాహ్మణ ప్రశంసయు, సనకాదులు హరిని నుతించు టయు, హిరణ్యకశిపు హిరణ్యాక్షుల జన్మప్రకారంబును, హిరణ్యాక్షుని దిగ్వి జయంబును, సవనవరాహ హిరణ్యాక్షుల యుద్ధంబును, బ్రహ్మస్తవంబును, హిరణ్యాక్ష వధయు, నమరగణంబులు శ్రీహరి నభినందించుటయు, హరి వరా హావతార విసర్జనంబు సేయుటయు, దేవ తిర్య ఙ్మనుష్యాదుల సంభవంబును, గర్దమ మహాముని తపంబునకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షం బగుటయుఁ, గర్ద ముండు స్వాయంభువమను పుత్త్రి యైన దేవహూతిం బరిణయం బగుటయు, దేవహూతి పరిచర్యలకు సంతసించి, కర్దముండు నిజయోగ కల్పితం బగు విమా నంబునందు నిలిచి, సహస్ర దాసీ పరివృతయైన దేవహూతిం గూడి భారతాది వర్షంబులు గలయ గ్రుమ్మరుటయు, దేవహూతి కర్దముని వలనఁ గన్యకా నవ కంబును గపిలునిం గనుటయు, తత్కన్యకా వివాహంబులును, గర్దమ తపో యాత్రయుఁ, గపిల దేవహూతి సంవాదంబును, శబ్దాది పంచతన్మాత్రల జన్మ ప్రకారంబును, బ్రహ్మాండోత్పత్తియు, విరాట్పురుష కర్మేంద్రియ పరమాత్మ ప్రకారంబును, బ్రకృతిపురుష వివేకంబును,నారాయణుని సర్వాంగ స్తోత్రంబును, సాంఖ్యయోగంబును, భక్తియోగంబును, జీవునకైన గర్భసంభవ ప్రకారంబును, చంద్రసూర్య మార్గంబునఁ, బితృమార్గంబున, దేవహూతి నిర్యాణంబును, గపిలమహాముని తపంబునకుం జనుటయు నను కథలు గల తృతీయ స్కంధము సంపూర్ణము. 1046

---

ఓమ్

# శ్రీమహాభాగవతము

## చతుర్థస్కంధము

క. శ్రీవిలసిత ధరణీతన, యా వదన[1]సరోజ వాసరాధిప! సితరా
జీవదళనయన! నిఖిలధ, రావరనుత! సుగుణధామ! రాఘవరామా! 1

అధ్యాయము - ౧

వ. మహనీయ గుణగరిష్ఠు లగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యానవైఖరీ సమేతుం డయిన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2

—: మైత్రేయుండు విదురునకు స్వాయంభువ మనుపుత్రికల వంశవిస్తారంబుఁ దెలుపుట :—

సీ. జననాథ ! విను విదురునకును మైత్రేయ మునినాథచంద్రుఁ డిట్లనియె మఱియు
స్వాయంభువున కర్థి శతరూపవలనను గూఁతులు మువ్వు రాకూతి దేవ
హూతి ప్రసూతులు నొనరఁ బ్రియవ్రత తోత్తానపాదులు నను తనయయుగము
[2]జనియించి రం దగ్రసంభవ యైన యాకూతిని సుమహిత భ్రాతృమతివిఁ

తే. దనకు సంతాన విస్తరార్థంబుగాఁగఁ
బుత్రికా[3]ధర్మ మూఁది యా పువ్వుఁబోఁడిఁ
బ్రకటమూర్తి రుచి ప్రజాపతికి నిచ్చె
మనువు ముదమొంది శతరూప యనుమతింప. 3

వ. అట్లు వివాహం బైన రుచిప్రజాపతి బ్రహ్మవర్చస్వియుఁ బరిపూర్ణగుణుండును గావునఁ జిత్తైకాగ్రతం జేసి యాకూతియందు (శ్రీవిష్ణుండు) యజ్ఞరూపధరుం డగు పురుషుండుగను, జగదీశ్వరి యగు నాదిలక్ష్మి యమ్మహాత్మునకు నిత్యానపాయిని గావునఁ ద దంశంబున దక్షిణ యను కన్యకారత్నంబుగను, మిథునంబు

1. సరోజభాస్కరా వికసిత (ఐ); సరోజవాసరాధిప, నుత (హ) 2. జనియింపఁగా నందు (హ)
3. ధర్మమొంది (హ. వా.)

సంభవించె. అందు స్వాయంభువుండు సంతుష్టాంతరంగుం డగుచుఁ బుత్రిగా పుత్రుండును, వితతతేజోధనుండును, శ్రీ విష్ణుమూర్తి రూపుండును నగు యజ్ఞునిఁ దన గృహంబునకుఁ దెచ్చి యునిచె. రుచియుఁ గామగమన యైన దక్షిణ యను కన్యకాలలామంబును దనయొద్దన నిలిపె. అంత సకల మంత్రాధిదేవత యగు శ్రీయజ్ఞుండు దనుఁ బతిగఁ గోరెడు దక్షిణ యను కన్యకం బరిణయం బయ్యె. వా రాదిమిథునంబు గావున నది నిషిద్ధంబు గాకుండె. అని చెప్పి మైత్రేయుండు వెండియు నిట్లనియె. 4

క. ధీమహిత! యంత వారల, యామాఖ్యలు గలుగు దేవతావళి గడఁకఁ
వేమఱు [1]నభినందించుచు, నా మిథునము[2]వలనఁ బుట్టె [3]నతిబలయుతమై. 5

వ. వారు తోషుండును, ప్రతోషుండును, సంతోషుండును, భద్రుండును, శాంతియు, నిడస్పతియు, నిధ్మండును, గవియు, విభుండును, వహ్నియు, సుదేవుండును, రోచనుండును నసం బన్నిద్దఱు సంభవించిరి. వారలు(స్వాయంభు వాంతరంబునం దుషితు లను దేవగణంబు లై వెలసిరి. మఱియు) మరీచి ప్రముఖు లైన ఋషీశ్వరులును, యజ్ఞుండును, దేవేంద్రుండును, మహాతేజో రూప సంపన్ను లైన ప్రియవ్రతోత్తానపాదులుం గలిగి, పుత్ర పౌత్ర నప్తృ [4]వంశంబులచే వ్యాప్తం బై యా మన్వంతరంబు (పాలితం బగుచు) వర్తిల్లె. మనువు ద్వితీయ పుత్రి యైన దేవహూతిం గర్దమున కిచ్చి, త ద్వంశవిస్తారంబు గావించె నని మున్న యెఱింగించితి. వెండియు న మ్మనువు మూఁడవచూ లయిన ప్రసూతి యను కన్యకను బ్రహ్మపుత్రుం డగు దక్షప్రజాపతికి నిచ్చె. ఆ దక్షునకుం బ్రసూతి వలన నుదయించిన ప్రజాపరంపరలచేత ముల్లోకంబులు విస్తృతంబు లయ్యె, మఱియుఁ గర్దమపుత్రికా సముదయంబు బ్రహ్మర్షి భార్య లగుటంజేసి వారివలనం గలిగిన సంతానపరంపరల వివరించెద. 6

—: కర్దమ ప్రజాపతి సంతతి :—

సీ. ఘనుఁ డౌ మరీచికిఁ గర్దమాత్మజ యగు కళ యను నంగనవలనఁ గశ్య
పుం డను కొడుకును, బూర్ణిమ యను నాఁడుబిడ్డయుఁ బుట్టిరి, పేర్చి వారి
వలనఁ బుట్టిన ప్రజావళి పరంపరలచే భువనంబులెల్ల నాపూర్ణ మగుచు
జరిగెను, బూర్ణిమ జన్మాంతరంబున హరిపద ప్రక్షాళి తాంబువులను

1. నభినందించిరి (చ. ట. త. డ. ద.) 2. నందు (క. చ. ట. త. డ. ద.) 3. అమర గణం బులై (క. చ. ట. త. డ. ద.) 4. జనసంకీర్ణంబైన (క.ద).

తే. గంగ యను పేరఁ బుట్టిన కన్య దేవ
కుల్య యను దాని నొక్కతెఁ గూఁతు నఖిల
విష్టప వ్యాపకుం డగు విరజుఁ డనెడి
తనయు నొక్కనిఁ గాంచె మోదంబుతోడ. 7

క. అనఘుం డత్రిమహాముని, యనసూయాదేవివలన హ ర్యజ పురసూ
దనుల కళాంశంబుల నం, దనులను †మువ్వురను గాంచెఁ దద్దయుఁ బ్రీతిన్. 8

క. అనవుడు విదురుఁడు మైత్రే, యునిఁ గనుఁగొని పలికె మునిజనోత్తమ! జగతిన్
జనన స్థితి లయకారణు, లన వెలసిన పద్మగర్భ హరి హరు లెలమిన్. 9

క. ఏమి నిమిత్తం బత్రిమ, హాముని మందిరమునందు ననసూయకు ను
ద్దామగుణు లుదయ మై రన, నా మైత్రేయుండు పలికె న వ్విదురునితోన్. 10

సీ. సుచరిత్ర! విను విధిచోదితుండై యత్రి తప మాచరింపఁ గాంతాసమేతుఁ
డై ఋక్షనామ కులాద్రి తటంబున ఘుమఘుమారావ సంకుల విలోల
కల్లోలజాల సంకలిత నిర్వింధ్యానదీ జలపరిపుష్ట రాజిత ప్ర
సూనగుచ్ఛ స్వచ్ఛమాని తాశోక పలాశ కాంతారస్థలమున కెలమి

తే. నరిగి యచ్చట నిర్ద్వంద్వుఁ డగుచుఁ బ్రాణ
నియమనము స[1]నేకాంఘ్రిచే నిలిచి గాలిఁ
దివుటఁ గ్రోలి కృశీభూతదేహుఁ డగుచుఁ
దపముఁ గావించె దివ్యవత్సర శతంబు. 11

వ. ఇ ట్లతిఘోరం బైన తపంబు సేయుచుం దన చిత్తంబున, 12

క. ఏ విభుఁడు జగదధీశ్వరుఁ, డా విభు శరణంబుఁ జొత్తు నతఁ డాత్మసమం
బై వెలసిన సంతతిని ద, యావరమతి నిచ్చుఁగాక యని తలఁచు నెడన్. 13

చ. మునుకొని య త్తపోధనుని మూర్ధజ మైన తపఃకృశానుచే
తను ద్రిజగంబులుం [2]గరఁగి తప్తము లైనను జూచి పంకజా
సన మురశాసన త్రిపురశాసను లచ్చటి కేగి రప్సరో
జన సుర సిద్ధ సాధ్య మునిసన్నుత భూరి యశోభిరాము లై. 14

వ. అట్లు మునీంద్రు నాశ్రమంబు డాయంజను నవసరంబున, 15

† అత్రేఃపత్న్యనసూయాత్రీన్, సుషువే సుయశ స్సుతాన్, దత్తం దూర్వాససంసోమ మాత్మేశ బ్రహ్మసంభవాన్ (1-15). 1. నియమమున నేకపదమున నిలిచి (తం. వా.) 2. గలిగి (చ)

చ. అనఘతపోభిరాముఁ డగు నత్రిమునీంద్రుఁడు గాంచెఁ దత్ప్రకాం
చన ఘనచంద్రికా రుచిర చారు శరీరులఁ హంస నాగసూ
దన వృషభేంద్ర వాహుల, సుదారకమండలు చక్ర శూల సా
ధనుల విరించి విష్ణు పురదాహుల, వాక్కమలాంబికేశులన్. 16

వ. మఱియును గృపావలోక మందహాస సుందర వదనారవిందంబులు గల మహాత్ముల దర్శించి, యమం దానంద కందళిత హృదయారవిందుం డై సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి, పుష్పాంజలి గావించి నిటలతట ఘటిత కరపుటుం డై దుర్నిరీక్షం బైన తత్తేజోవిశేషంబుఁ దేఱిచూడం జాలక ముకుళిత నేత్రుం డై [1]తత్పదాయత్తచిత్తుం డగుచు సర్వలోక [2]ప్రశస్యంబు లైన మృదు మధుర గంభీర భాషణంబుల నిట్లని స్తుతియించె, 17

సీ. ప్రతికల్పమందు సర్వప్రపంచోద్భవ స్థితి వినాశంబులఁ జేయునట్టి
మహిత మాయాగుణమయ దేహములఁ బొల్చు నజ వాసుదేవ శివాభిధాన
ములు గల్గు మీ పాదజలజాతములకేను నతిభక్తి వందనం బాచరింతు
నఖిల చేతన మానసాగమ్య మన నొప్పు మూర్తులు గల్గు మీ మువ్వురందుఁ

తే. బరఁగ నాచేతఁ బిలువంగఁబడిన ధీరుఁ
డెవ్వఁ డే నొక్కరునిఁ బిల్వ నిపుడు మీరు
మువ్వు రేతెంచుటకు నాదుబుద్ధి విస్మ
యంబు గదిరెఁ జెప్పరే! యనఘులార! 18

వ. అదియునుం గాక సంతానార్థంబు నానావిధ పూజలు గావించి, నా చిత్తంబున ధరియించిన మహాత్ముం డొక్కరుండ. అనిన నమ్మువ్వురు విబుధశ్రేష్ఠులు నతనిం గనుంగొని సుధామాధుర్య సమంబు లయిన వాక్యంబుల నిట్లనిరి. 19

క. విను మేము ముగుర మయ్యును, ననుపమమతిఁ దలఁప నేక మై యుందుము నీ
మనమందు నేమి కోరితి? వనయము నా కోర్కి సఫల మయ్యెడుఁ జుమ్మీ! 20

క. మా మువ్వుర యంశంబుల, ధీమతులగు సుతులు పుట్టి త్రిభువనములలో
నీ మంగళ గుణకీర్తిన్, శ్రీమహితము సేయఁగలరు సిద్ధము సుమ్మీ! 21

క. అని మునిచంద్రుఁడు దన మన, మునఁ గామించిన వరంబు బుధవరులు ముదం
బున నొసఁగి [3]యతని సత్పూ,జనములఁ బరితృప్తు లగుచుఁ [4]జనిరి యథేచ్ఛన్.

1. తత్పరాయత్త (తం. వా. చ. డ.) 2. గరిష్ఠంబులైన (తం. వా.) 3. యతనిచే పూజనముల (చ. ట. త. జ.) 4. జవిరద్దివికిన్ (క. చ. ట. జ. డ.); "ప్రతిజగ్ముస్సురేశ్వరాః, సభాజిత స్తయోస్సమ్య గ్దంపత్యోర్మిషతో స్తతః" అని మూలము (1-32)

ఉ. ఆ సుచరిత్రదంపతు లుదంచితలీలఁ గనుంగొనంగ న
జ్ఞానను నంశమందు నమృతాంశుఁడు, విష్ణుకళన్ సుయోగవి
ద్యా సుభగుండు దత్తుఁడు, పురాంతకు భూరికళాంశమందు దు
ర్వాసుఁడు నై జనించి రనవద్య పవిత్ర చరిత్రు లిమ్ములన్. 23

క. అంగిరసుఁ డనెడు మునికిఁ గు, లాంగన యగు శ్రద్ధయందు నంచిత సౌంద
ర్యాంగులు గూఁతులు నలువురు, మంగళవతు లుదయ మైరి మాన్యచరిత్రా!

క. వారు సినీవాలియును గు, హూరాకానుమతు లనఁగ నొప్పిరి మఱియుం
గోర సుతయుగము గలిగెను, స్వారోచిషమనువువేళ శస్తఖ్యాతిన్. 25

వ. వారలు భగవంతుం డగు నుచథ్యుండును, బ్రహ్మనిష్ఠుం డగు బృహస్పతియు నను ప్రసిద్ధి వహించిరి. పులస్త్యుండు హవిర్భుక్కను నిజభార్యయందు నగస్త్యునిం బుట్టించె. ఆ యగస్త్యుండు జన్మాంతరంబున జఠరాగ్నిరూపం బై ప్రవర్తించె. వెండియు నా పులస్త్యుండు విశ్రవసునిం గలిగించె.ఆ విశ్రవసునకు నిళబిల యను భార్యవలనం గుబేరుండును, గైకసి యను దానివలన రావణ కుంభకర్ణ విభీషణులును బుట్టిరి. పులహునకు గతి యను భార్యయందుఁ గర్మ శ్రేష్ఠుండు, వరీయాంసుండు,సహిష్ణుండు నను ముగ్వురు కొడుకులు జనియించిరి. మఱియుఁ గ్రతువునకుఁ గ్రియ యను భార్యయందు (బ్రహ్మతేజంబున జ్వలింపు చున్న) షష్టిసహస్ర సంఖ్యలుగల వాలఖిల్యులను మహర్షులు గలిగిరి. వసిష్ఠుం డూర్జయను భార్యయందుఁ జిత్రకేతుండును,సురోచియును,విరజుండును, మిత్రుం డును, నుల్బణుండును, వసుభృద్యానుండును, ద్యుమంతుండును, నను సప్తఋషు లను, భార్యాంతరంబున శక్తిప్రముఖ పుత్రులనుం బుట్టించె. † అధర్వుం డను వానికిఁ *జిత్తి యనుభార్యయందు ధృతవ్రతుండును, అశ్వశిరస్కుండు నైన దధ్యంచుండు పుట్టె. ( మహాత్ముండగు ) భృగువు ఖ్యాతి యను పత్నియందు ధాతయు, విధాతయు నను పుత్రద్వయంబును, భగవత్పరాయణ యగు శ్రీ యను కన్యకం బుట్టించె. ఆ ధాతృ విధాతృలు మేరు వను వాని కూఁతు లైన యాయతి, నియతు లను భార్యలవలన మృకండ ప్రాణు లను కొడుకులం బుట్టించిరి. అందు మృకండునకు మార్కండేయుండును, ప్రాణునకు వేదశిరుం డను మునియుం బుట్టిరి. భార్గవునకు నుశన యను కన్యయందు కవి యను వాఁడు పుట్టె. ఇట్లు కర్దమదుహిత లైన కన్యకానవకంబు వలనం గలిగిన

† స్వధర్ముఁడు (క); అధర్వణుఁడు(చ) స్వధర్మణుఁడు (ట) *జత్తి (క); చిత్ర(త) శాంతి(ద) శాంత (ద)

సంతాన పరంపరలచేత సమస్త లోకంబులు పరిపూర్ణంబు లయ్యె. ఇట్టి సద్యః పాపహరంబును, శ్రేష్ఠతమంబు నైన కర్దమదౌహిత్ర సంతానప్రకారంబు శ్రద్ధా గరిష్ఠచిత్తుండవగు నీకుంజెప్పితి.ఇంక దక్షప్రజాపతి వంశం బెఱింగింతు.వినుము.

—: దక్షప్రజాపతి సంతతి :—

వ. వనజజునివలన భవమం, దిన యా దక్షప్రజాపతికి మను నిజనం
దన యగు ప్రసూతి[1]సతియం, దనఘా! పదియార్వు రుదయ మందిరి కన్యల్.

వ. ఇట్లావిర్భవించిన కన్యకలందు శ్రద్ధయు, మైత్రియు, దయయు, శాంతియుఁ, దుష్టియుఁ, బుష్టియుఁ, గ్రియయు, నున్నతియు, బుద్ధియు, మేధయుఁ, దితిక్షయుఁ, హ్రీయు, మూర్తియు నను నామంబులం గల పదుమువ్వురను ధర్మ రాజున కిచ్చె. ఒక్క కన్యక నగ్నిదేవునకు, నొక్కతె బితృదేవతలకు, నొక్కతె జన్మమరణాది నివర్తకుం డగు నభవునకుం బెండ్లిసేసె. అంత నా ధర్ముని పత్నులయందు శ్రద్ధవలన శ్రుతంబును, మైత్రివలన ప్రసాదంబును, దయవలన నభయంబును, శాంతివలన సుఖంబును, తుష్టివలన ముదంబును, పుష్టివలన స్మయంబును, క్రియవలన యోగంబును, ఉన్నతివలన దర్పంబును, బుద్ధివలన నర్థంబును, మేధవలన స్మృతియుఁ, దితిక్షవలన క్షేమంబును, హ్రీవలన ప్రశ్రయంబును, మూర్తివలన [2]సకల కల్యాణగుణోత్పత్తిస్థానభూతు లగు నరనారాయణు లను ఋషు లిద్దఱును సంభవించిరి. వారల జన్మకాలంబున, 28

సీ. గంధవాహుఁడు మందగతి ననుకూలుఁడై వీఁచె [3]నల్దిక్కులు విశద మయ్యె
నఖిలలోకంబులు నానందమును బొందెఁ దుములమై దేవదుందుభులు మ్రోసెఁ
గర మొప్ప జలధులఁ [4]గలఁకువ లుడిగెను మించినగతిఁ బ్రవహించె నదులు
గంధర్వ కిన్నర గానముల్ వీతెంచె నప్సరోజనుల [5]లాస్యములు చెలఁగె

తే. సురలు గురియించి రందంద విరులవాన
మునిజనంబులు సంతోషములఁ జెలంగి
వినతు లొనరించి రవ్వేళ విశ్వమెల్లఁ
బరమ మంగళ మై యొప్పె భవ్యచరిత! 29

వ. ఆ సమయంబున బ్రహ్మాది దేవత లమ్మహాత్మ్ములకడకుం జనుదెంచి యిట్లని స్తుతియించిరి.

1. వలనను, అనఘా ! జనించిరి పదార్వు రబ్జాతాక్షుల్ (క. గ. ట. డ. బ.) 2. సర్వగుణోత్పత్తి (క.బ) 3. నయ్యెను దిశల్ విశదములుగ (హ) 4. కలఁక లడంగెను (హ. తిం. వా.) 5. నృత్యంబు లొనరె (హ)

సీ. [1]గగనస్థలిం దోఁచు గంధర్వనగరాది రూపభేదము లట్లు రూఢి మెఱసి
యే యాత్మయందేని [2]నేపారు మాయచే నీ విశ్వ మిటు రచియింపఁబడియె
నట్టి యాత్మప్రకాశార్థ మై మునిరూపముల ధర్మగృహమునఁ బుట్టినట్టి
పరమపురుష! నీకుఁ బ్రణమిల్లెదము నది గాక సృష్టి దుష్కర్మవృత్తి

తే. [3]జరుగనీకుండుకొఱకు నై సత్త్వగుణము
చే సృజించిన మ మ్మిట్లు శ్రీనివాస
మైన సరసీరుహప్రభ నపహసించు
[4]నీ కృపాలోకనంబుల నెమ్మిఁ జూడు. 31

క. అని యిట్లు దేవగణములు, వినుతింపఁ గృపాకటాక్ష వీక్షణములచేఁ
గని వారు గంధమాదన, మున కేగిరి తంద్రిముదము ముప్పిరిగొనఁగన్. 32

క. ధరణీభర ముడుపుట కా, నరనారాయణులు భువి జనన మనయము నొం
దిరి యర్జున కృష్ణాఖ్యలఁ, గురు యదువంశముల సత్త్వగుణయుతు లగుచున్.

వ. మఱియు నగ్నిదేవునకు [5]దక్షపుత్రి యైన స్వాహాదేవి యను భార్యయందు హుత భోజను లగు పావకుండును, పవమానుండును, శుచియు నను ముప్వురు కొడుకులు గలిగిరి. వారివలనం బంచచత్వారింశ త్సంఖ్యలం గల యగ్ను లుత్పన్నంబు లయ్యె. ఇట్లు పితృ పితామహ యుక్తంబుగా నేకోనపంచాశ త్సంఖ్యలం గల *(యగ్నుల కొఱకు బ్రహ్మవాదులచే) యజ్ఞ కర్మంబులం దగ్ని దేవతాకంబు లయిన యిష్టులు దత్తన్నామంబులచేతఁ జేయంబడుచుండు. (ఆ యగ్ను లెవ్వ రనిన నగ్నిష్వాత్తులు, బర్హిషదులు, సౌమ్యులు, పితలు, ఆజ్యపులు, సాగ్నులు, నిరగ్నులు నన నేడు తెఱంగు లయి యుందురు. దాక్షాయణి యగు స్వధ యను ధర్మపత్నియందు వారలవలన వయునయు, ధారిణియు నను నిద్దరు కన్యలుద యించి, జ్ఞాన విజ్ఞాన పారగ లగుచు బ్రహ్మనిష్ఠ లయి పరఁగిరి.) వెండియు, 34

—: ఈశ్వరునకు దక్షప్రజాపతికిని విరోధము సంభవించుట :—

సీ. దక్షప్రజాపతి తనయ[6]యు. భవుని భార్యయు ననఁదగు సతి యను లతాంగి
సతతంబు పతిభక్తి సల్పుచుండియుఁ దనూజాతలాభము నందఁజాల దయ్యె

1. గగనమందుల (క.బ.) 2. యేపార (హ) 3. జరుగకనె యుండు (హ) 4. మీ కృపాలోక నంబుల మించి గనుఁడు (హ) 5. మనుపౌత్రి (చ. ద.) *కొన్ని ప్రతులయందు లేదు. 6. యాభవుని భార్య యనఁగా దగు (తం. హ.) యభవుని భార్య యన్నఁ గాఁదగు (హ)

భర్గునిదెసఁ జాలఁ బ్రతికూలుఁ డైనట్టి తమ తండ్రిమీఁది రోషమునఁజేసి
వలనేది తా ముగ్ధవలె నిజయోగమార్గంబున నాత్మదేహంబు విడిచె

తే. నని మునీంద్రుఁడు వినిపింప న మ్మహాత్ముఁ
డైన విదురుండు మనమున నద్భుతంబు
గదురఁ దత్కథ విన వేడ్క గడలుకొనఁగ
మునివరేణ్యునిఁ జూచి యిట్లనియె మఱియు. 35

అధ్యాయము — ౨

సీ. చతురాత్మ! దుహితృవత్సలుఁడైన దక్షుండు దనకూఁతు సతి ననాదరము సేసి
యనయంబు నఖిల చరాచర గురుఁడు నిర్వైరుండు శాంతవిగ్రహుఁడు ఘనుఁడు
జగముల కెల్లను జర్చింప దేవుండు నంచితాత్మారాముఁ డలఘుమూర్తి
శీల[1]వంతులలోన శ్రేష్ఠుండు నగు నట్టి భవునందు విద్వేషపడుట కేమి

తే. కారణము? సతి దానేమి కారణమున
విడువరానట్టి ప్రాణముల్ విడిచె? మఱియు
శ్వశుర జామాతృ విద్వేషసరణి నాకుఁ 36
దెలియ నానతి యిమ్ము సుధీవిధేయ!

క. అని యడిగిన నవ్విదురునిఁ, గనుఁగొని మైత్రేయుఁ డనియెఁ గౌతుకమొప్పన్
[2]విను మనఘ! తొల్లి బ్రహ్మలు, జననుతముగఁ జేయునట్టి సత్రముఁజూడన్. 37

చ. సరసిజగర్భ యోగిజన సర్వసుపర్వ మునీంద్ర హవ్యభు
క్ప్రరమఋషి ప్రజాపతులు భక్తి మెయిం జనుదెంచియుండ [3]న
త్తరణిసమానతేజుఁ డగు దక్షుఁడు వచ్చినఁ [4]ద త్సభాసదుల్
దరమిడి లేచి రప్పుడు పితామహ భర్గులు దక్క నందఱున్. 38

క. చనుదెంచిన యా దక్షుఁడు, వనజజునకు మ్రొక్కి భక్తివశు లై [5]సభ్యుల్
దన కిచ్చిన పూజలు గై, కొని యర్హాసనమునందుఁ గూర్చుండి తగన్. 39

తే. తన్నుఁ బొడగని [6]సభ్యు లందఱును లేవ
నాసనము డిగకున్న పురారివలనుఁ

1. శీలవ్రతులలోన (క.చ.ట.బ.) 2. అనఘాత్మ! తొల్లి (క.చ.ట.బ.) 3. న, త్తరిఁ దరుణార్క తేజుఁడగు (క. ట. త. బ.) 4. తత్సదస్యులా, దరమున (హ. వా.) 5. సభికుల్ (క. జ. ద. బ.) 6. సభికులందఱును (ట. జ.)

గన్ను గొనలను విస్ఫులింగములు చెదరఁ
జూచి యిట్లను రోషవిస్ఫురణ మెఱయ. 40

తే. †(వినుఁడు [1]మీరలు రౌద్రమాని విబుధ ముని హ
తాశనాది సురోత్తములార! మోహ
మత్సరోక్తులు గావు నామాట లనుచు
వారి కందఱి కా పురవైరిఁ జూపి.) 41

సీ. పరికింప నితఁడు [2]దిక్పాల యశోహాని కరుఁ డీ క్రియాశూన్య పరుని చేతఁ
గర మొప్ప సజ్జనాచరితమార్గము దూషితం బయ్యె నెన్న గతత్రపుండు
మహిత సావిత్రీసమానను సాధ్వి నస్మత్తనూజను మృగశాబనేత్ర
[3]నసల భూసుర బంధుజన సమక్షమున మర్కటలోచనుఁడు కరగ్రహణ మర్థిఁ

తే. జేసి తా[4]శిష్ట భావంబుఁ జెందు టాత్మఁ
దలఁచి ప్రత్యుద్గ మాభివందనము లెలమి
[5]నడపకుండిన మానసీ నన్నుఁ గన్న
నోరిమాటకుఁ దన కేమి [6]గోరువోయె ? 42

సీ. అనయంబు లుప్త క్రియాకలాపుఁడు మానహీనుఁడు మర్యాద లేనివాఁడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుఁడు దిగంబరుఁడు భూత ప్రేత పరివృతుండు
దామస ప్రమథ భూతములకు నాథుండు భూతి[7]లిప్తుం డస్థిభూషణుండు
నష్టశౌచుండు నుస్మదనాథుఁడును దుష్ట [8]హృదయుండు నుగ్ర పరేతభూని

తే. కేతనుఁడు వితత ప్రస్తకేశుఁ డశుచి
[9]యైన యితనికి శివనాముఁ డను ప్రవాద
[10]మెటులు గలిగె? నశివుఁ డగు నితని నెఱిఁగి
యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చినటులు. 43

వ. ఇతనికి నస్మత్తనయను [11]విధిప్రేరితుండ నై యిచ్చితి. 44

† ఈ పద్యము - క. చ. జ. డ. ద. బ. ప్రతులలో లేదు. 1. నా మాట (త) 2. దిక్పాలక వరయశో, హానికరుఁడు క్రియాహీనుచేత (క. చ. త. జ. ద.) 3. సకల భూమీ సురజన సమక్షమున హ. వా.) 4. శిష్య (హ. తం. వా.) 5. నడుపకుండినమానె వినతుఁడుగాక (హ) 6. గోర (తం.వా.) 7. త్రిపుండ్రాస్థి (క.చ.ట.బ.డ.) 8. హృదయుఁ డుగ్రుఁడును (తం. వా.) 9. యైన తనకౌక (క. చ. బ.) 10. గలిగెఁగాని యశివుఁడని కాన కెఱిఁగి (క. ట. త. డ. బ. తం.) 11. విధివక్త్రప్ర కారంబుగా (ట. త. జ. డ. ద. బ. తం.)

క. అని యిట్టులు ప్రతికూల వ, చనములు దక్షుండు వలికి [1]శర్వు శపింతు
న్నని జలములు గొని సుస్థల, మున[2]నిలి చిట్లనియె రోషమున ననఘాత్మా! 45

క. ఇతఁ డింద్రోపేంద్ర పరీ, వృతుఁ డై మఖసమయమున హవిర్భాగము దే
వతలం గూడఁగ మహితని, యతిఁ బొందక యుండుఁగాక యని శపియించెన్.

వ. ఇట్లు దక్షుండు వల్కిన గర్హితవాక్యంబులు వినిందితంబులుగ నుండినను, [3]అర్థాంత రంబున వాస్తవంబు లగుచు భగవంతుం డగు రుద్రునందు ననిందితంబు లై స్తుతి రూపంబున నొప్పె. తదనంతరంబ రుద్రునకు శాపం బిచ్చి, దక్షుండు సదస్య ముఖ్యులచే నకృత్యం బని నిషేధింపబడి, ప్రవృద్ధం బయిన క్రోధంబుతోడ నిజ నివాసంబునకుం జనియె. అంత గిరిశానుచరాగ్రేసరుం డగు నందికేశ్వరుండు, దక్షుండు నిటలాక్షుని శపియించిన శాపంబును, అతనిం బల్కిన యనర్హ వాక్యంబు లును విని కోపారుణిత లోచనుం డై యిట్లను. ఈ దక్షుండు మర్త్యశరీరంబు శ్రేష్ఠంబుగాఁ దలంచి, యప్రతిద్రోహి యైన భగవంతునందు భేదదర్శి యై యపరాధంబు గావించె. ఇట్టి మూఢాత్ముండు దత్త్వవిముఖుం డగు. మఱియుం గూటధర్మంబు లైన నివాసంబుల గ్రామ్యసుఖాకాంక్షలంజేసి సక్తుం డై యర్థ వాదంబు లయిన వేదంబులచేత నష్టమనీషం గలిగి, కర్మతంత్రంబు విస్తృతంబు సేయుచు, దేహాదికంబు లుపాదేయంబులుగాఁ దలఁచుచు, బుద్ధిచేత నాత్మ తత్త్వంబు మఱచి వర్తించి, పశుప్రాయుండు స్త్రీకాముకుండు నగు. ఇదియునుం గాక దక్షుం డచిరకాలంబున మేషముఖుం డగు. అని మఱియు, 47

మ. అనయంబున్ దనమానసంబున నవిద్యన్ ముఖ్యతత్త్వంబుగాఁ
గని గౌరీశుఁ దిరస్కరించిన యసత్కర్మాత్ము నీ దక్షుని
న్ననువర్తించిన[4]వారు సంసరణ కర్మారంభు లై నిచ్చలున్
జననం బందుచుఁ జచ్చుచున్ మరల నోజం బుట్టుచు న్నుండెడున్. 48

వ. అదియునుం గాక యీ హరద్వేషు లైన ద్విజు లర్థవాదబహుళంబు లైన వేదవాక్యంబులవలన మధుగంధసమం బైన చిత్తక్షోభంబుచేత విమోహిత మనస్కు లై కర్మాసక్తు లగుదురు. మఱియును భక్ష్యాభక్ష్య విచారశూన్యులై, దేహాది పోషణంబుకొఱకు ధరియింపబడు విద్యా తపో వ్రతంబుగల వార లై, ధన దేహేంద్రియంబులయందు ప్రీతింబొంది యాచకులై, విహరింతు రని

1. శపియింతును శర్వుని నని జలములు గొని కర (హ.తం.వా.) 2. నిలిచి యిటులనె రోషమున ననఘాత్మా ! (తం. వా.) 3. యథార్థంబున (హ) 4. వాఁడు......కర్మారంభుఁడై......బుట్టుచున్ వర్తిలున్ (హ)

నందికేశ్వరుండు బ్రాహ్మణజనంబుల శపియించిన వచనంబులు విని భృగు మహాముని మఱల శపియింపం బూని యి ట్లనియె. 49

తే. వసుధ నెవ్వారు ధూర్జటివ్రతులు వారు
వారి కనుకూలు రగుదు రెవ్వారు వార
లట్టి సచ్ఛాస్త్ర పరిపంథు లైనవారు
నవని పాషండు లయ్యెద రని శపించె. 50

వ. అది యెట్లంటేని, 51

సీ. సకల వర్ణాశ్రమాచార హేతువు లోకములకు మంగళమార్గమును సనాత
నము పూర్వఋషి సమ్మతము జనార్దనమూలమును నిత్యమును శుద్ధమును [1]బరంబు
[2]నార్యపథానుగం బగు వేదమును విప్రగణము నిందించిన కారణమున
నే శివదీక్షయం దేని మధ్యమపూజ్యుం డై భూతపతి దైవ మగుచునుండు

తే. నందు మీరలు భస్మ జటాస్థి ధార
ణములం దగి మూఢబుద్ధులు నష్టశౌచు
లై నశింతురు పాషండు లగుచు ననుచు
శాప మొనరించె నా ద్విజసత్తముండు. 53

వ. ఇట్లన్యోన్య శాపంబులం బొందియు, భగవ దనుగ్రహంబు గలవార లగుటం జేసి నాశంబు నొందరైరి. అట్టియెడ విమనస్కుం డగుచు ననుచరసమేతుం డై భవుండు చనియె. అంత, 52

సీ. అనఘాత్మ! యే యజ్ఞమందు సర్వశ్రేష్ఠుం డగు హరి సంపూజ్యుండై వెలుంగు
నట్టి యజ్ఞంబు సమ్యగ్విధానమున సహస్ర వత్సరములు నజుం డొనర్చెం
గర మొప్ప నమర గంగా యమునానదీ యోగంబు గలుగు ప్రయాగయందు
నవభృథస్నానంబు లతిభక్తిం గావించి గత కల్మషాత్ము లై ఘనత కెక్కి

తే. [4]తగ నిజాశ్రమభూములం దలంచి వార
లందఱును వేడ్కతోం జని రనుచు విదురు
నకును మైత్రేయుం డను మునినాయకుండు
నెఱుంగ వినిపించి వెండియు నిట్టు లనియె. 54

1. శివంబు (హ) 2. ఆర్యపథంబును నగు (క. చ. ట. జ.) 3. సంగ, మంబునం (హ)
4. తమతమాశ్రమ (చ. ట. జ.)

## అధ్యాయము — ౩

**—: దక్షప్రజాపతి యజ్ఞము చేయునపుడు దాక్షాయణి యచ్చటికిఁ బోవుట :—**

వ. అంత శ్వశురుం డగు దక్షునకు జామాత యైన భర్గునకు నన్యోన్యవిరోధంబు పెరుఁగుచుండ నతిచిరం బగు కాలం బరిగె. అంత దక్షుండు రుద్రహీనం బగు యాగంబు లేనిది యైనను శర్వుతోడి పూర్వవిరోధంబునను, బరమేష్ఠికృతంబైన సకల ప్రజాపతివిభుత్వ గర్వంబుననుం జేసి *(బ్రహ్మనిష్ఠు లగు నీశ్వరాదుల ధిక్కరించి) యరుద్రంబుగా వాజపేయసవనంబు గావించి, తదనంతరంబ బృహస్పతిసవన నామకంబైన మఖంబు సేయ నుపక్రమించిన నచ్చటికిం గ్రమంబున,

చ. కర మనురక్తి న మ్మఖము గన్గొను వేడుక దొంగలింపఁగాఁ
బరమముని ప్రజాపతి సుపర్వ మహర్షివరుల్ సభార్యులై
పరువడి వచ్చి యందఱు శుభస్థితి దీవన లిచ్చి దక్షుచేఁ
బొరిఁబొరి నచ్చటన్ విహితపూజల నొందిరి సమ్మదంబునన్. 56

తే. దక్షతనయ సతీదేవి దవిలి యాత్మ
సదనమున నుండి జనకుని సవనమహిమ
గగనచరులు నుతింప నా కలకలంబు
విని [1]కుతూహల మొప్ప గగనముఁ జూడ. 57

వ. ఆ య్యవసరంబున త దుత్సవదర్శన కుతూహలులై సర్వదిక్కులవారును చను సమయంబున, 58

సీ. తనరారు నవరత్న తాటంకరోచులు చెక్కుటద్దములతోఁ జెలిమిసేయ
మహనీయ తపనీయమయ పదకద్యుతు లంసభాగంబుల [2]నావరింప
సంచిత చీనిచీనాంబర ప్రభలతో మేఖలాకాంతులు మేలమాడఁ
జంచల సారంగ [3]చారు విలోచనప్రభలు నల్దిక్కులఁ బ్రబ్బికొనఁగ

తే. మించువేడుక భర్తృసమేతముగను
మానితములైన విమానయాన
లగుచు నాకాశపథమున నరుగుచున్న
ఖచర గంధర్వ కిన్నరాంగనలఁ జూచి. 59

* తా. ప. ప్రతులయందు లేదు. 1. కుతూహలయై వినువీథిఁ జూడ (చ); కుతూహలిని యయి విన్వీథిఁ జూడ (తం);......విన్వీథిఁ జూడ (వా) 2. నాదరింప (క.ట.త.జ.డ.) 3. చంచల లోచన (చ. త. జ. డ.)

క. పతి దనపతి యగు నా పశు, పతిఁ జూచి సముత్సుకతను భాషించెఁ బ్రజా
పతి మీ మామ మఖము సు, వ్రతమతి నొనరింపుచున్న [1]వాఁడని వింటిన్. 60

క. కావున నా యజ్ఞమునకు, నీ విబుధగణంబు లర్థి నేగెద రదిగో!
దేవ! మన మిప్పు డచటికిఁ, బోవలె నను వేడ్క నాకుఁ బుట్టెడు నభవా! 61

క. ఆ యజ్ఞముఁ గనుఁగొనఁగా, నా యనుజలు భక్తిఁ బ్రాణనాథులతోడన్
బాయక వత్తురు మనమున్, బోయిన నే వారి నచటఁ బొడగనఁ గల్గున్. 62

క. జనకుని మఖమున కర్థిం, జన నీతోఁ బారిబర్హ సంజ్ఞికములచేఁ
దనరిన భూషణములఁ గై, కొన వేడ్క జనించె నీశ! కుజనవినాశా! 63

క. నాతోడను స్నేహము గల, మాతనుఁ దత్సోదరీసమాజము ఋషిసం
ఘాత కృత మఖ సమంచిత, కేతువుఁ గన వేడ్క గగనకేశ! జనించెన్. 64

వ. అదియునుం గాక దేవా! *(మహా)శ్చర్యకరం బై *(గుణత్రయాత్మకం బగు) ప్రపంచంబు భవదీయ మాయా వినిర్మితం బగుటంజేసి నీకు నాశ్చర్యకరంబు గాదు. అయినను భవదీయ తత్త్వం బెఱుంగఁజాలక కామినీ స్వభావంబు గలిగి కృపణురాల నై మదీయ జన్మభూమిఁ గనుంగొన [2]నిచ్ఛయించితి. అని వెండియు నిట్లనియె, 65

చ. ముదమునఁ [3]దన్మఖోత్సవ విభూతిఁ గనుంగొన [4]దివ్యకామినుల్
పదువులు గట్టి భూషణ విభాసిత లై నిజనాథయుక్త లై
మదకలహంస పాండుర సమంచిత దివ్యవిమానయాన లై
యదె చనుచున్న వారు గను మభ్రపథంబున నీలకంధరా! 66

క. అనఘా! విను లోకంబున, జనకుని గేహమునఁ గలుగు సకలసుఖంబుల్
దనయలు జని సంప్రీతిన్, గనుఁగొన కేరీతి నిల్పఁ? గాయము లభవా! 67

క. అనయముఁ బిలువక యుండన్, [5]జన ననుచిత మంటివేని జనక గురు సుహృ
జ్జననాయక గేహములకుఁ, జనుచుందురు పిలువకున్న సజ్జను [6]లభవా! 68

వ. అని మఱియు నిట్లనియె. దేవా! నాయందుఁ బ్రసన్నుండ వై మదీయ మనోరథంబుఁ దీర్ప నర్హుండవు. సమధికజ్ఞానంబు గల నీచేత నేను భవదీయ దేహంబునం దర్ధంబున ధరియింపం బడితి. అట్టి నన్ను ననుగ్రహింప వలయు. అని

1. వాఁడఁట వింటే (డ) * తా. ప. ప్రతులయందు లేదు. 2. నాసచేసితినని (చ. ట. త.)
3. తన్మఖోద్భవ (క. ట. త. ప. హ. తం. వా.) 4. నన్యకామినుల్ (హ. తం. వా.) 5. జనుటను చిత మంటివేని (చ. త. జ.); జనుటుచితమే యంటివేని (బ) 6. లనఘా (చ. త. జ. డ. తం.)

ప్రార్థించిన మందస్మిత వదనారవిందుండగుచు [1]జగత్స్రష్టల సమక్షంబున దక్షుండు ద న్నాడిన మర్మభేదంబు లైన కూహక వాక్య సాయకంబులం దలంచుచు ని ట్లనియె. 69

సీ. కల్యాణి! నీమాట కడు నొప్పు బంధువుల్ పిలువకుండినను సంప్రీతిఁ జనుదు
[2]రంటివి యది లెస్స యైనను దేహాభిమాన మదమున నమర్షమునను
గడఁగి యారోపిత ఘన కోపదృష్టులు గారేని పోఁదగుఁ గాని వినుము
వినుత విద్యా తపో విత్త వయో రూప కులములు సుజనులకును గుణంబు

తే. లివియ కుజనులయెడ దోష హేతుకంబు
లై వివేకంబు చెఱుచు మహాత్ములైన
వారి మాహాత్మ్య మాత్మగర్వమునఁ జేసి
జడులు వొడగానఁజాలరు జలజనేత్ర! 70

క. విను మట్లు కుటిలు లగు దుర్జనుల గృహంబులకు బంధు సరణిని బోవన్
జనదు వినీతుల కది కడు, ననుచిత మై యుండు నింతి! యది యెట్లనినన్. 71

ఆ. కుటిలబుద్ధు లైన కుజనుల యిండ్లకు, నార్య లేగ వా రనాదరమున
బొమలు ముడివడంగ భూరిరోషాక్షులై, చూతు రదియుఁగాక సుదతి! వినుము.

చ. సమద రిపుప్రయుక్త పటుసాయక జర్జరితాంగుఁ డయ్యు దుః
ఖమును దొఱంగి నిద్రఁ గనుఁ గాని కృశింపఁడు మానవుండు నో
యుమ! విను మిష్టబాంధవ దురుక్తులు మర్మము లంట నాటఁ జి
త్తమున నహర్నిశంబు పరితాపము నొంది కృశించు[3]చాడ్పునన్. 73

క. [4]విను ముత్కృష్టుం డగు దక్షునికిఁ దనూభవలలోనఁ గూరిమి సుతవై
నను నా సంబంధంబున, జనకునిచేఁ బూజ వడయఁ జాలవు తరుణీ! 74

వ. అది యెట్లు? అతనిచేత భవ త్సంబంధంబునం జేసి పూజఁ బడయమికి నతనికి నీకు విరోధంబునకు హేతు వెట్టిది? అని యంటివేని, 75

మ. [5]నిరహంకార నిరస్తదోష సుజ నానింద్యోల్ల[6]సత్కీర్తిఁ గొం
దఱు కామించి యశక్తులై మనములన్ దందహ్యమా నేంద్రియా

1. బ్రహ్మసమక్షంబున (చ); బ్రహ్మల......(ట. త.) 2. రంటి విదియు లెస్స (తం. వా.) 3. నెప్పుడున్ (హ. తం. వా.) 4. విను లోకోత్కృష్టుఁడు (తం. వా.) 5. నిరహంకార మహత్సమృద్ధి (చ. త. ప. హ.) నిరహంకార నిరస్తపాప (తం. వా.) 6. కీర్తియున్, ధరఁ గామించి (హ)

తురులై [1]యూరక మచ్చరింతురు మహాత్ముం డీశ్వరుం డైన యా
హరితో బద్ధవిరోధముఁ దొడరు దైత్యశ్రేణి చందంబునన్. 76

వ. అదియునుం గాక నీ వతనికిం బ్రత్యుత్థానాభివందనంబులు గావింపకుండుటం జేసి యతండు దిరస్కృతుండయ్యె, అంటివేని, లోకంబుల జను లన్యోన్యంబును బ్రత్యుత్థానాభివందనంబులు గావింతురు. అదియ ప్రాజ్ఞు లయినవారు సర్వభూతాంతర్యామి యైన పరమపురుషుండు నిత్యపరిపూర్ణుండు గావునఁ గాయిక వ్యాపారం బయుక్తం బని, త దుద్దేశంబుగా మనంబునందు నమస్కారాదికంబులు గావింతురు. కాని దేహాభిమానంబులు గలుగు పురుషులందుఁ గావింపరు. కాన నేనును వసుదేవశబ్దవాచ్యుండు శుద్ధసత్త్వమయుండు నంతకరణంబునందు నావరణ విరహితుండు నై ప్రకాశించు వాసుదేవునకు నా హృదయంబున నమస్కరింపుచుండుదు. ఇట్లనపరాధి యైన నన్నుఁ బూర్వంబున బ్రహ్మలు సేయు సత్రంబునందు దురుక్తులం జేసి పరాభవించి మ ద్ద్వేషియైన దక్షుండు భవ జ్జనకుఁ డైన నతఁడును ద దనువర్తను లయిన వారలును జూడఁదగరు. కావున మ ద్వచనాతిక్రమంబుం జేసి యరిగితివేని యచట నీకుఁ బరాభవంబు సంప్రాప్తంబగు. లోకంబున బంధుజనంబులవలనఁ బూజపడయక తిరస్కారంబు నొందుట చచ్చుటయ కాదే? యని పలికి మఱియు భవుండు పొమ్మని యనుజ్ఞ యిచ్చిన నచ్చట నవమానంబునం జేసి యశుభం బగు ననియు, నిచ్చటఁ బొమ్మనక నివారించిన మనోవేదన యగు ననియు మనంబునం దలపోయుచు నూరకుండె నంత,

అధ్యాయము — ౪

సీ. సతి సుహృద్దర్శ నేచ్ఛా ప్రతికూల దుఃఖస్వాంత యగుచు నంగములు వడఁక
నందంద దొరఁగెడు నశ్రుపూరంబులు గండభాగంబులఁ గడలు కొనఁగ
నున్నత స్తనమండ లోపరి హారముల్ వేఁడినిట్టూర్పుల వెచ్చఁ గంద
నతిశోక రోషాకు లాత్యంత దోదూయమాన మై హృదయంబు మలఁగుచుండ

తే. [2]మఱియుఁ గుపితాత్మయై స్వపమానరహితు
నాత్మదేహంబు సగమిచ్చినట్టి భవుని
విడిచి మూఢాత్మ యగుచు న వ్వేలఁది సనియె
జనకుఁ జూచెడి వేడుక సందడింప. 78

1. కొందఱు (హ) 2. మహిత కుపితాక్షియై (క. చ. ల. డ. ద.)

వ. ఇట్లతిశీఘ్ర గమనంబున, 79

సీ. మానిని చనుచుండ మణిమన్మదాది సహస్ర సంఖ్యాత రుద్రానుచరులు
యక్షులు నిర్భయు లై వృషభేంద్రుని ము న్నిడుకొనుచు న మ్ముదిత దాల్చు
కందుకాంబుజ శారికా తాళవృంత దర్పణ ధవళాతపత్ర ప్రసూన
మాలికా సౌవర్ణ మణివిభూషణ ఘనసార కస్తూరికా చందనాది

తే. వస్తువులు గొంచు నేగి శర్వాణిఁ గదిసి
శంఖ దుందుభి వేణు నిస్వనము లొప్ప
మానితం బైన వృషభేంద్రయానఁ జేసి
[1]యజ్ఞభూమార్గులై యర్థి నరిగి యరిగి. 80

వ. ముందట,

చ. మనమున మోదమందుచు [2]సుమాతరుణీమణి గాంచె [3]దారు మృ
త్కనక కుశాజి నాయస నికాయ వినిర్మిత పాత్రసీమము
న్ననుపమ వేదఘోష సుమహ త్పశుబంధన కర్మభూమము॥
ముని విబుధాభిరామము సముజ్జ్వల హోమము యాగధామము॥. 82

వ. ఇట్లు గనుంగొని యజ్ఞశాలం బ్రవేశించిన, 83

క. చనుదెంచిన య మ్మగువను, జననియు సోదరులు దక్క సభఁ గల జను లె
ల్లను దక్షువలని భయమున, ననయము నపు డాదరింప రై రి మహాత్మా! 84

క. మఱి తల్లియుఁ బినతల్లులు, పరిరంభణ మాచరింపఁ బరితోషాశ్రుల్
దొరఁగఁగ డగ్గుత్తికతో, సరసిజముఖి నేమ మరయ సతి దా నంత॥. 85

క. జనకుం డవమానించుట, యును సోదరు లర్థిఁ దనకు నుచిత క్రియఁ జే
సిన పూజల నందక తో, భన మరసిన మాఱుమాటఁ బలుకక యుండె॥. 86

వ. ఇట్లు తండ్రిచేత నాదరింపఁ బడని దై విభుం డైన యీశ్వరునందు నాహ్వాన క్రియా శూన్యత్వ రూపం బైన తిరస్కారంబును, నరుద్రభాగం బైన యజ్ఞం బునుం, గనుంగొని నిజ రోషానలంబున లోకంబులు భస్మంబు సేయం బూనిన తెఱంగున నుద్రేకించి, రుద్రవిద్వేషియుఁ, గ్రతుకర్మాభ్యాస గర్విష్ఠుండును నగు దక్షుని వధియింతు మనుచు లేచిన భూతగణంబుల నివారించి, రోషావ్యక్తభాష ణంబుల నిట్లనియె. లోకంబున శరీరధారు లై జీవులకుఁ బ్రియాత్మకుం డై న

1. యజ్ఞ భూమార్గమున కర్థి (చ. ట. డ. బ.) 2. రమణీమణి (చ. త. డ.) 3. చారు (హ. తం. వా)

యీశ్వరునకుఁ బ్రియాప్రియులు, నధికులును లేరు. అట్టి సకలకారణుండు నిర్మత్సరుండు నైన రుద్రునందు నీవు దక్క నెవ్వండు ప్రతికూలం బాచరించు? అదియునుం గాక మిముబోఁటివారలు పరులవలని గుణంబులందు దుర్గుణంబు లన యాపాదింతురు. మఱియుం గొందఱు మధ్యస్థు లయినవారలు పరుల గుణంబులయందు దోషంబుల నాపాదింతురు. కొందఱు సాధువర్తనంబు గల వారలు పరుల దోషంబుల నైన గుణంబులుగా ననుగ్రహింతురు. మఱియుం గొంద ఱుత్తమోత్తములు పరులయందు దోషంబుల నాపాదింపక తుచ్ఛగుణం బులు గలిగినను సద్గుణంబులుగాఁ గైకొందురు. అట్టి మహాత్ములయందు నీవు పాపబుద్ధిం గల్పించితివి. అని వెండియు నిట్లను. మహాత్ము లగువారల పాద ధూళిచే నిరస్త ప్రభావు లై జడస్వభావంబుగల దేహంబు నాత్మ యని పల్కు కుజను లగువారు మహాత్ముల నిందించు [1]టాశ్చర్యంబు గాదు. అదియు వారి *కనుచితం బగు. అని వెండియు నిట్లనియె, 87

సీ. అనయంబు శివ యను నక్షరద్వయ మర్థి వాక్కునఁ బలుక భావమునఁ దలంప
సర్వజీవుల పాపసంఘముల్ చెడు నట్టి మహితాత్మునందు నమంగళుండ
వగు నీవు విద్వేషి వగుట కాశ్చర్యంబు నందెద వినుము నీ వదియుఁ గాక
చర్చింప నెవ్వని చరణపద్మంబుల నరసి బ్రహ్మానంద మను మరంద

తే. మతులభక్తినిఁ దమ హృదయంబు లనెడి
తుమ్మెదలచేతఁ గ్రోలి సంతుష్టచిత్తు
లగుదు రత్యంత విజ్ఞాను లట్టి దేవు
నందు ద్రోహంబు సేసి తేమందు నిన్ను ?

క. [2]మఱియును న మ్మహితాత్ముని, [3]చరణ సరోజాతయుగము సకలజగంబుల్
[4]నెఱిఁ గొలువఁ గోరు కోర్కులు, దరమిడి వర్షించు నతనిఁ దగునే తెగడన్? 89

చ. పరఁగఁ జితాస్థిభస్మ నృకపాల జటాధరుఁడున్ బరేత భూ
చరుఁడు పిశాచయుక్తుఁ డని శర్వు నమంగళుఁగాఁ దలంప రె
వ్వరు నొకఁ డీవు దక్క మఱి వాక్పతిముఖ్యులు న మ్మహాత్మ స
చ్చరణసరోజ రేణువులు సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్. 90

1. నిందించుట కార్యంబుగాదు (హ. తం. వా. క. జ. ద. బ.) 2. మఱిగడు (హ)
3. యతిముఱి జరణాబ్జయుగము నఖిల జగంబుల్ (హ) 4. నెఱి గోరిన కోరికలం (హ)
* తదేవ శోభనమ్-మూలము(4-13) అతోసత్సు మహన్నిందన మేవ ఉచిత మిత్యర్థః-వ్యాఖ్యా.

చ. నెలకొని ధర్మపాలన వినిర్మలు భర్గుఁ దిరస్కరించు న
క్కలుషుని జిహ్వఁ గోయఁ దగుఁగా కటు సేయఁగ నోపఁడేనిఁ దాఁ
బొలియుట యొప్పు రెంటికిఁ బ్రభుత్వము చాలమిఁ గర్ణరంధ్రముల్
బలువుగ మూసికొంచుఁ జనఁ బాడి యఁ టందురు ధర్మవర్తనుల్. 91

వ. అది గావున, 92

మ. జనుఁ డజ్ఞానమునన్ భుజించిన జుగుప్సం బైన యన్నంబు స
య్యన వెళ్లించి పవిత్రుఁ డైనగతి దుష్టాత్ముండ వై యీశ్వరున్
ఘను నిందించిన నీ తనూభవ యనంగా నోర్వ నీ హేయ భా
జన మైనట్టి శరీరమున్ విడిచి [1]భాస్వచ్ఛుద్ధి [2]ప్రాపించెదన్, 93

వ. అదియునుంగాక దేవతల కాకాశగమనంబును, మనుష్యులకు భూతలగమనంబును స్వాభావికంబు లైనట్లు ప్రవృత్తి నివృత్తి లక్షణ కర్మంబులు రాగ వైరాగ్యాధికారంబులుగా వేదంబులు విధించుటజేసి రాగయుక్తు లై కర్మతంత్రు లైన సంసారులకు వైరాగ్యయుక్తు లై యాత్మారాము లైన యోగిజనులకు విధి నిషేధ రూపంబు లయిన వైదిక కర్మంబులు గలుగుటయు, లేకుండుటయు నైజంబు లగుటఁజేసి స్వధర్మనిష్ఠుం డగువాని నిందింపం జనదు. ఈ యుభయ కర్మశూన్యుండు, బ్రహ్మభూతుండు నైన సదాశివునిఁ గ్రియాశూన్యుం డని నిందించుట పాపం బగు. తండ్రీ! సంకల్ప మాత్ర ప్రభవంబు లగుటంజేసి మహాయోగిజనసేవ్యంబు లైన యస్మదీయంబు లగు నణిమా ద్యష్టైశ్వర్యంబులు నీకు సంభవింపవు. భవదీయం బగు నైశ్వర్యంబులు ధూమమార్గ ప్రవృత్తులై యాగాన్న భోక్తలైన వారిచేత యజ్ఞశాలయందె చాల నుతియింపంబడి యుండుఁ గాన నీమనంబున నే నధికసంపన్నుఁడ ననియుఁ జితాభస్మాస్థిధారణుండైన రుద్రుండు దరిద్రుం డనియును గర్వింపం జనదు, అని వెండియు నిట్లనియె.

ఉ. నీలగళాపరాధి యగు నీకుఁ దనూభవ నౌట చాలదా?
చాలుఁ గుమర్త్య! నీదు తనుజాత ననన్ మది సిగ్గు పుట్టెడి
[3]న్నేల, ధరన్ మహాత్ములకు నెగ్గొనరించెడి వారి జన్మముల్
గాలుపనే; తలంప జనకా! కుటిలాత్మక! యెన్ని చూడఁగన్. 95

చ. వర వృషకేతనుండు భగవంతుఁడు నైన హరుండు నన్ను నా
దర పరిహాస వాక్యముల దక్షతనూభవ! యంచుఁ బిల్వ నేఁ

1. భాస్వచ్ఛుద్ధి వాటిల్లెదన్ (హ.తం.); 2. శుద్ధిఁ బాటిల్లెదన్ (వా) 3. జాల ధరన్ మహాత్ములకుఁ, జయ్యన నెగ్గొనరించు జన్మముల్ (హ.)

బరబరఁ బొక్కుచుఁ జ ముదముఁ బొందక నర్మవచః స్మితంబులన్
దొఱఁగుదు నీ తనూజ నను దుఃఖముకం బెను జచ్చు టొప్పగున్. 96

వ. అని యిట్లు యజ్ఞసభామధ్యంబున [1]విరోధి యైన దక్షు నుద్దేశించి పలికి, కామ క్రోధాది శత్రు విఘాతిని యగు సతీదేవి యుదఙ్ముఖి యై, జలంబుల నాచమనంబు చేసి, శుచి యై మౌనంబు ధరియించి, జితాసన యై భూమియందాసీన యగుచు యోగమార్గంబునంజేసి శరీరత్యాగంబు సేయం దలంచి, 97

సీ. వరుసఁ బ్రాణాపాన వాయునిరోధంబు గావించి వాని నేకముగ నాభి
తలమునఁ గూర్చి యంతట నుదానము దాఁక నెగయించి బుద్ధితో హృదయపద్మ
మున నిల్పి వాని మెల్లన గంఠమార్గమునను మఱి భ్రూమధ్యమున వసింపఁ
జేసి శివాంఘ్రి రాజీవచింతనముచే నాథునిఁ దక్క నన్యంబుఁ జూడ

తే. క మ్మహాత్ముని యంక పీఠంబునందు
నాదరంబున నుండు దేహంబు దక్షు
వలన రోషంబునను విడువంగఁ దలఁచి
తాల్చెఁ దనువున ననిలాగ్ని ధారణములు. 98

వ. ఇట్లు ధరియించి గతకల్మషం బైన దేహంబు గల సతీదేవి నిజ యోగసమాధి జనితం బైన వహ్నిచేఁ దత్క్షణంబ దగ్ధ యయ్యె నంత. 99

క. అది గనుగొని హాహా [2]రవ, మొదవఁగ ని ట్లనిరి మానవులుఁ ద్రిదశులు నీ
మదిరాక్షి యకట! దేహము, వదలెఁ గదా! దక్షుతోడి వైరము కతనన్. 100

వ. మఱియు ని ట్లనిరి. 101

సీ. సకల చరాచర జనకుఁ డై నట్టి యీ దక్షుండు దన కూర్మితనయ మాన
వతి పూజనీయ యీ సతి దనచే నవమానంబు నొంది సమక్షమందుఁ
గాయంబుఁదొఱఁగంగఁ గనుఁగొనుచున్న వాఁ డిట్టి [3]దురాత్ముఁ డెందేనిఁ గలఁడె?
యనుచుఁ జిత్తంబుల నాశ్చర్యములఁ బొంది రదియును గాక యిట్లనిరి యిట్టి

తే. దుష్టచిత్తుండు బ్రహ్మబంధుండు నైన
యీతఁ డనయంబు దా నపఖ్యాతిఁబొందు
నింద పడి మీఁద దుర్గతిఁ జెందుఁగాక
యనుచు జనములు పలుకు న య్యవసరమున. 102

1. ప్రతికూలుండగు (హ. తం. వా.) 2. ధ్వని, బొదలఁగ (వా) 3. దౌరాత్మ్య మెందేని గలదె (తం)

క. దేహము విడిచిన సతిఁ గని, బాహాబల మొప్ప రుద్రపార్షదులును ద
ద్ద్రోహిం ద్రుంచుటకై యు, త్సాహంబున లేచి రసి[1] గదాధరు లగుచున్. 103

క. ఆ రవ మపు డీక్షించి మ, హారోషముతోడ భృగుమహాముని గ్రతుసం
హారక మారక మగు[2] నభి, చారక హోమం బొనర్చె సరభస మొప్పన్. 104

వ. ఇట్లు దక్షిణాగ్నియందు వేల్చిన నందుఁ *(దపం బొనర్చి, సోమలోకంబుననుండు సహస్రసంఖ్యలుగల) ఋభునామధేయులైన దేవత లుదయించి, బ్రహ్మతేజంబు సంజేసి దివ్యవిమానులై యుల్ముకంబులు సాధనంబులుగా ధరియించి, రుద్రపార్షదులైన ప్రమథగుహ్యక గణంబులఁ బాఱందోలిన, వారును పరాజితులైరి. తదనంతరంబ నారదువలన భవుండు *(దండ్రిచే నసత్కృతురా లగుటం జేసి) భవాని పంచత్వంబు నొందుటయుం బ్రమథగణంబులు *(ఋభునామక దేవతలచేఁ) [3]బరాజితు లగుటయు విని, 105

—: శివుఁడు వీరభద్రునిచే దక్షయజ్ఞంబు ధ్వంసంబు చేయించుట :—

శా. ఆద్యుం డుగ్రుఁడు నీలకంఠుఁ డిభదైత్యారాతి దష్టోష్ఠుఁడై
మాద్యద్భూరిమృగేంద్ర ఘోషమున భీమప్రక్రియన్ నవ్వుచున్
విద్యుద్వహ్ని శిఖా సముచ్చ్రయరుచిన్ వెల్గొందు చంచజ్జటన్
సద్యః క్రోధముతోడఁ బుచ్చి వయిచెన్ క్ష్మాచక్ర మధ్యంబునన్. 106

వ. ఇట్లు పెఱికి వైచిన రుద్రుని జటయందు, 107

అధ్యాయము — ౫

సీ. అభ్రంలిహోదగ్ర విభ్రమాభ్రభ్రమకృన్నీల దీర్ఘశరీర మమరఁ
బ్రజ్వల జ్జ్వలన దీప్త జ్వాలికా జాల జాజ్వల్యమాన కేశములు మెఱయఁ
జండ దిగ్వేదండ శుండాభ దోర్దండ సాహస్రధృత హేతిసంఘ మొప్ప
వీక్షణత్రయ లోకవీక్షణ ద్యుతి లోకవీక్షణరతి దుర్నిరీక్ష మగుచుఁ

క. గ్రకచకఠిన కరాళదంష్ట్రలు వెలుంగ
ఘనకపాలాస్థి వనమాలికలును దనర

* కొన్ని తా. ప. ప్రతులలో లేదు.

1. గదాధారులై (చ. త. డ. ప. బ.) గదాపాణులునై (హ. త. వా.) 2. నభిచారము గావించె నంత (క.చ.ఒ.త.జ.బ.) 3. పలాయన మగుటయు (చ. ట.)

నఖిలలోక భయంకరుఁ డగుచు వీర
భద్రుఁ డుదయించె మాఱటరుద్రుఁ డగుచు. 108

తే. వీరభద్రుండు [1]విహతవిద్వేషి భద్రుఁ
డగుచుఁ దన వేయిచేతులు మొగిచి వినయ
మెసఁగ నే నేమి సేయుదు? నెఱుఁగ నాకు
నానతిమ్మన్న నతని క య్యభవుఁ డనియె. 109

చ. గురు భుజశౌర్య! భూరి రణకోవిద! మ ద్భటకోటి కెల్ల నీ
వరయ వరూథినీవరుఁడ వై చని యజ్ఞముగూడ దక్షునిన్
[2]బరువడి ద్రుంపు మీ వచట బ్రాహ్మణతేజ మ జేయ మంటి వే
నరిది మ దంశసంభవుఁడ వై తగు నీకు [3]నసాధ్య మె య్యెడన్? 110

వ. అని కుపితచిత్తుం డై యాజ్ఞాపించిన నట్ల కాక యని, 111

చ. అనఘుఁడు రుద్రుఁ జేరి ముదమారఁ బ్రదక్షిణ మాచరించి వీ
డ్కొని యనివార్య వేగమునఁ గుంభిని గ్రక్కదలన్ ఝళంఝళ
ధ్వని మణినూపురంబులు పదంబుల మ్రోయఁగ భీషణప్రభల్
దనరఁ గృతాంతకాంతక శిత స్ఫుట శూలముఁ బూని చెచ్చెరన్. 112

చ. సరభసవృత్తి న ట్లరుగు సైన్య పదాహత [4]ధూత ధూళి ధూ
సరిత కుబేరది క్తటము సభ్యులు దక్షుఁడుఁ జూచి యెట్టి భీ
కరతమ మం చనం దమము గాదు రజఃపటలం బటంచు [5]ని
వ్వెఱపడి పల్కి రాత్మల వివేకవిహీనతఁ బొంది వెండియున్. 113

సీ. ఈ ధూళి పుట్టుట కెయ్యది హేతువో? విలయసమీరమా? పౌలయ దిపుడు
ప్రాచీనబర్హి ధరాపతి మహితోగ్ర శాసనుం డిపుడు రాజ్యంబు సేయఁ
జోరసంఘములకో రారాదు మఱి గో గణాళి రాకకు సమయంబు గాదు
కావున నిప్పుడు గల్పావసానంబు గాఁబోలుఁగా కటు గాకయున్న

తే. [6]నిట్టి యౌత్పాతికరజ మెందేనిఁ గలదె?
యనుచు మనమున భయమంది రచటి జనులు

1. నిహత (చ. జ. డ. ద. బ.) 2. బరిపరిసేసి (జ. తం.) 3. నసాధ్యమున్నదే (క. చ. త. జ. డ. ద. బ.) 4. పాదధూళి (హ.తం.వా.) 5. న,చ్చరియము నొందిరాత్మల విచక్షణతా రహితాత్ములై కడున్ (హ) 6. ఇట్టి యుత్పాత జనక మెందేని గలదె (క.బ.)

సురలు దక్షుండు నంత ప్రసూతిముఖ్య
లైన భూసురకాంత లి ట్లనిరి మఱియు. 114

క. తన కూఁతులు సూడఁగ నిజ, తనయను సతి ననపరాధఁ [1]దగవే ది ట్లె
గ్గొనరించిన యీ దక్షుని, ఘన పాపవిపాక మిదియుఁ గాఁదగు ననుచున్. 115

వ. వెండియు ని ట్లనిరి. [2]కుపితాత్ముం డైన దక్షుండు దన కూఁతుతో విరోధంబు చాలక జగత్సంహారకారణుం డైన రుద్రునిం గ్రోధింపఁజేసె న మ్మహాత్ముం డెంతటివాఁ డంచేని ప్రళయకాలంబున, 116

సీ. సుమహిత నిశిత త్రిశూలాగ్ర [3]సంప్రోత నిఖిల దిక్కరిరాజ నివహుఁ డగుచుఁ
జటులోగ్ర నిష్ఠుర స్తనిత గంభీరాట్టహాస నిర్భిన్నాఖిలాశుఁ డగుచు
భూరి కరాళ విస్ఫార దంష్ట్రాహతి పతిత తారాగణ ప్రచయుఁ డగుచు
వివిధ హేతివ్రాత విపుల ప్రభాపుంజ మండిత చండ దోర్దండుఁ డగుచు

తే. వికటరోష భయంకర భ్రుకుటి దుర్ని
రీక్ష్య దుస్సహ తేజోమహిమఁ దనర్చి
ఘన వికీర్ణ జటాబంధ కలితుఁ డగుచు
నఖిల సంహారకారణుఁ డై నటించు. 117

తే. అట్టి దేవునిఁ ద్రిపుర సంహారకరునిఁ
జంద్రశేఖరు సద్గుణసాంద్రు నభవు
మనము రోషింపఁజేసిన మంగళములఁ
బొందవచ్చునె? పద్మగర్భునకు నైన. 118

వ. అని యి వ్విధంబున భయ విహ్వల లోచన లై పలుకుచున్న సమయంబున మహాత్ముం డైన దక్షునకు భయావహంబు లై సహస్రసంఖ్యాతంబు లైన మహోత్పాతంబులు భూనభోంతరంబులఁ గానంబడుచుండె. ఆ సమయంబున రుద్రానుచరులు [4]నానావిధాయుధంబులు ధరియించి, కపిల పీత వర్ణంబులు గలిగి వామనాకారులు మకరోదరాననులు నై యజ్ఞశాలా ప్రదేశంబునం బరువులు వెట్టుచుఁ గదియంజనుదెంచి దక్షాధ్వరవాటంబుల విటతాటంబు

1. దగవఱియిట్లె, గ్గొనరించిన (తం.వా.) 2. కుటిలాత్ముండైన (క.చ.జ.) 3. కుంఠిత (క. చ. ఓ. త. జ. ద. బ.) ''స్వ శూల సూచ్యర్పిత దిగ్గజేంద్రః" (5-10) 'స్వ శూలస్య సూచ్యాః అగ్రే అర్పితాః ప్రోతాః; దిగ్గజేంద్రా యేన, (వ్యా) 4. నానావిధ సాధనంబులు (క.చ.బ.)

సేయుచుం గొందఱు ప్రాగ్వంశంబును, గొందఱు పత్నీశాలయుఁ, గొందఱు సదస్యశాలయు, సంయఁ గొంద ఱాగ్నీధ్రశాలయుఁ, గొందఱు యజమానశాలయుఁ,గొందఱు మహానసగృహంబును విధ్వంసనంబులు గావించిరి.మఱియుఁ గొందఱు యజ్ఞపాత్రంబుల నుగ్నులం [1]జఱచిరి. వెండియుఁ గొందఱు హోమాగ్ను లార్చిరి. పదంపడి కొందఱు హోమకుండంబులయందు మూత్రంబులు విడిచిరి. కొంద ఱుత్తరవేదికా మేఖలలు ద్రెంచిరి. కొందఱు మునుల బాధించిరి. కొందఱు ద త్పత్నుల వెఱపించిరి. మఱికొందఱు దేవతానిరోధంబు గావించిరి. అంత మణిమంతుండు భృగువును, వీరభద్రుండు దక్షుని,చండీశుండు పూషుని, భగుని నందీశ్వరుండును బట్టిరి. ఇవ్విధంబున సదస్య దేవ ఋత్విజ్నికాయంబుల శిలల నువ్వియు, జానువులఁ బొడిచియు, నఱచేతుల నడిచియుఁ [2]గూర్పరంబులఁ బొడిచియు, వివిధబాధలం బఱచిన వారు కాందిశీకులై యెక్కడెక్క డేనియు, జనిరి. మరియును, 119

క. మును దక్షుఁ డభవుఁ బలుకఁగఁ, గనుగీటిన భగునిఁ బట్టి కన్నులు పెకలిం
చెను నందీశ్వరుఁ డచ్చటి, జనములు హాహారవముల సందడి పెట్టన్. 120

తే. కుపితుఁ డై నాఁడు భవుని దక్షుఁడు శపింపఁ
బరిహసించిన పూషుని పండ్లు డుల్ల
గొట్టె బలభద్రుఁ డా కళింగుని రదంబు
లెలమి డులిచిన పగిదిఁ జండీశ్వరుండు. 121

క. తగవేది దక్షుఁ డా సభ, నగచాపుఁ దిరస్కరించు[3]నాఁ డట శ్మశ్రుల్
నగుచుం జూపుట నా భృగు, పగకై శ్మశ్రువులు వీరభద్రుఁడు పెఱికెన్. 122

సీ. అతుల దర్పోద్ధతుం డై వీరభద్రుండు గైకొని దక్షు వక్షంబు ద్రొక్కి
ఘన శితధారాసిఁ గొని[4]మేను వొడిచియు మంత్రసమన్వితమహితశస్త్ర
జాలావినిర్భిన్న చర్మంబుఁగల దక్షుఁ జంపఁగాలేక విస్మయము నొంది
త ద్వధోపాయంబు దనచిత్తమునఁ జూచి కంఠ నిష్పీడనగతిఁ దలంచి

తే. మస్తకము ద్రుంచి సంచి తామర్షణమున
దక్షిణానలమున వేల్చెఁ ద దనుచరులు
హర్షమును బొంద నచటి బ్రాహ్మణజనంబు
లాత్మలను జాల దుఃఖంబు లందుచుండ. 123

1. జెఱచిరి (తం.వా.) 2. గుల్ఫంబులఁ(హ) 3. నాడు శ్మశ్రుల్ (హ) 4. మేన నవఁచియు (హ)

వ. ఇట్లు వీరభద్రుండు దక్షుని యాగంబు విధ్వంసంబు గావించి, నిజనివాసం బైన కైలాసంబునకుం జనియె. అయ్యవసరంబున, 124

అధ్యాయము - ౬

—: దేవతలు వీరభద్రాదులచేఁ బరాజితు లయి బ్రహ్మతో విన్నవించుట :—

చ. హరభటకోటిచేత నిశితాసి గదా కరవాల శూల ము
ద్గర ముసలాది సాధన విదారిత జర్జరితాఖిలాంగు లై
సురలు భయాకులాత్ము లగుచున్ సరసీరుహజాతుఁ జేరి త
చ్చరణ సరోరుహంబులకు సమ్మతిఁ జాఁగిలి మ్రొక్కి నమ్రులై. 125

క. తము ధూర్జటి సైనికు లగు
ప్రమథులు దయమాలి పెలుచ బాధించుట స
ర్వముఁ జెప్పి రనుచు మైత్రే
య మునీంద్రుఁడు విదురుతోడ ననియెన్ మఱియున్. 126

తే. ఇంతయును మున్న మనమున నెఱిఁగియున్న
కతన విశ్వాత్మకుండును గమలలోచ
నుండు నన నొప్పు నారాయణుండు నజుఁడు
చూడ రారైరి వినుము దక్షునిమఖంబు. 127

వ. అని చెప్పి సుర లిట్లు విన్నవించిన చతుర్ముఖుండు వారల కిట్లనియె, 127

క. ఘన తేజోనిధి పురుషుం, డనయంబు గృతాపరాధుఁడైనను [1]దామ
ల్లన ప్రతికారము గావిం, చిన జనులకు లోకమందు సేమము గలదే? 129

వ. అని మఱియు నిట్లనియె, 130

క. క్రతు భాగార్హుం డగు పశు,పతి నీశ్వరు నభవు శర్వు భర్గుని దూరీ
కృత యజ్ఞభాగుఁ జేసిన, యతిదోషులు దుష్టమతులునగు మీ రింకన్. 131

సీ. పూని యే దేవుని బొమముడిమాత్రన లోకపాలకులును లోకములును
నాశ మొందుదు రట్టి యీశుండు ఘన దురుక్తాస్త్రనికాయ విద్ధాంతరంగుఁ
డును బ్రియావిరహితుండుగ నైనవాఁ డమ్మహాత్మునిఁ ద్రిపుర సంహారకరుని
మఖ పునస్సంధానమతి నపేక్షించు మీరలు చేరి శుద్ధాంతరంగు లగుచు

1. దామల్లన (తం. వా.) దామెల్లన (హ).

తే. భక్తి నిష్ఠలఁ దత్పాదపద్మ యుగళ
ఘన పరిగ్రహపూర్వంబు గాఁగ నతని
శరణమొందుఁ డతండు ప్రసన్నుఁడైనఁ
దివిరి మీకోర్కి సిద్ధించు దివిజులార! 132

వ. అని మఱియు నిట్లనియె. అద్దేవుని డాయంజన వెఱతు మని తలంపకుండు. అతనిఁ జేర నుపాయం బెఱింగిపు మంటిరేని నేను, నింద్రుండు, మునులు, మీరలు, మఱియు దేహధారు లెవ్వరేని నమ్మహాత్ముని రూపంబు, నతని బల పరాక్రమంబుల కొలందియు నెఱుంగఁజాలము. అతండు స్వతంత్రుండు గావునఁ దదుపాయం బెఱింగింప నెవ్వఁడు సమర్థుం డగు? ఐన నిపుడు *(భక్తపరాధీనుండు శరణాగత రక్షకుం డగు నీశునిఁ జేరంబోవుద మని పలికి) పద్మసంభవుండు దేవ పితృగణ ప్రజాపతులం గూడి కైలాసాభిముఖుం డై చని చని, 133

ఉ. భాసురలీలఁ గాంచిరి సుపర్వులు భక్తజనైక మానసో
ల్లాసముఁ గిన్నరీజన విలాసము నిత్యవిభూతి మంగళా
వాసము సిద్ధ గుహ్యక నివాసము [1]రాజతభూ వికాసి కై
లాసము కాంతినిర్జిత కులక్షితిభృత్స్వ[2]మహా ద్విభాసమున్. 134

సీ. ధాతువిచిత్రి తోదాత్త రత్న ప్రభా సంగ తోజ్జ్వల తుంగ శృంగములును
గిన్నర గంధర్వ కింపురు షాప్సరో జననికరాకీర్ణ సానువులును
మానిత నిఖిల వైమానిక మిథున సద్విహరణైక శుభ ప్రదేశములును
గమనీయ నవమల్లికా సుమనో వల్లికామతల్లీ లస త్కందరములు

తే. నమర సిద్ధాంగనా శోభితాశ్రమములు
[3]విబుధజన యోగ్య సంప న్నివేశములును
గలిగి బహువిధ పుణ్యభోగముల నొప్పు
వినుత సుకృతములకు దండ వెండికొండ. 135

వ. అది మఱియును మందార పారిజాత సరళ తమాల సాల తాల తక్కోల కోవిదార శిరీ షార్జున చూత కదంబ నీప నాగ పున్నాగ చంపక పాటలాశోక వకుళ కుంద కురవక కన క్రాము శతపత్ర కింశుకైలా లవంగ మాలతీ మధూక

* కొన్ని తాళపత్ర ప్రతులందు లేదు.

1. చారువిరాజమాన (క. త. జ. బ. తం.) 2. మహా విభాసమున్ (త) 3. సిద్ధజన యోగ్య సంపద్విశేషములును (ట)

మల్లికా పనస మాధవీ కుట జోదుంబ రాశ్వత్థ ప్లక్ష వట హింగుళ *(భూర్జ పూగ రాజపూగ జంబూ ఖర్జూ రామ్రాతక ప్రియాళనాళికే రేంగుదవేణు) కీచక తరుశోభితంబును, గలకంఠ కాలకంఠ కలవింక రాజకీర మత్తమధుకర నానా విహంగకోలాహల నినద బధిరీభూత రోదోంతరాళంబును, సింహ తరక్షు శల్య గవయ శరభ శాఖామృగ వరాహ వ్యాఘ్ర కుక్కుర రురు మహిష వృక సారంగ ప్రముఖ వన్యసత్త్వ సమాశ్రయ విరాజితంబును, గదళీషండ మండిత కమల కల్హార కైరవకలిత పులినతల లలిత కమలాకర విహరమాణ కలహంస కారండవ సారస చక్రవాక బక జలకుక్కుటాది జలవిహంగకుల కూజిత సంకులంబును, సలిలకేళీ విహరమాణ సతీరమణీ రమణీయ కుచమండల విలిప్తమృగమద మిళిత హరిచందన గంధసుగంధిత జలపూరిత గంగాతరంగిణీ సమావృతంబును నైన కైలాసపర్వతంబు వొడగని, యరవిందసంభవ పురందరాది దేవగణంబు లత్యద్భు తానందంబులం బొంది, ముందటం దార హీర హేమమయ విమానసంకులంబును పుణ్యజన మానినీశోభితంబును నైన యలకాపురంబు గడచి, తత్పుర బాహ్య ప్రదేశంబునం దీర్ఘపాదుం డైన పుండరీకాక్షు పాదారవింద [1]రజఃపావనంబును, రతికేళీవ్యాసంగ పరిశ్రమ నివారక సలిలకేళీవిలోల దేవకామినీ పీనవక్షోజ విలిప్త కుంకుమపంక సంగత పిశంగవర్ణ వారిపూర విలసితంబును నగు నందాలక నందాభిధానంబులం గల నదీద్వితయంబు దాఁటి, తత్పురోభాగంబున వనగజ సంఘృష్ట మలయజ పరిమిళిత పవనాస్వాదన ముహుర్ముహు రున్మదితమానస పుణ్యజన కామినీకదంబంబును, వైడూర్యసోపాన సమంచిత కనకోత్పల వాపీ విభాసితంబును, గింపురుష [2]వ్యాప్తంబును నగు సౌగంధికవన సమీపంబునందు,

—బ్రహ్మాదులు దక్షిణామూర్తిరూపుం డగు నీశ్వరుని స్తుతించుట :—

సీ. ఉజ్జ్వలం బై శతయోజనంబుల [3]పొడవును పంచసప్తతి యోజనములఁ
బఱపును గల్గి యే పట్టునఁ [4]దిరుగని నీడ శోభిల్ల నిర్ణీత మగుచుఁ
బర్ణ శాఖా సమాకీర్ణ మై మాణిక్యములఁ బోలఁగల ఫలములఁ దనర్చి
కమనీయ సిద్ధ యోగక్రియామయ మయి యనఘ ముముక్షు జనాశ్రయంబు

* కొన్ని తా.ప. ప్రతులలో లేదు.

1. పాలితంబును (క. చ. ట. డ. ద. బ.) 2. సంచారయోగ్యంబునగు (క. చ. త. జ. బ. తం. వా.) 3. పొడవాగి (వా) 4. దఱుగని నీడ (హ. తం. వా.) 'పర్యక్కృతాచలచ్ఛాయః'

తే. భూరి సంసారతాప నివారకంబు
నగుచుఁ దరురాజ మనఁగఁ బెంపగ్గలించి
భక్తజనులకు నిచ్చలుఁ బ్రమద మెసఁగ
వలయు సంపద లందు నావటము వటము. 137

వ. ఆ వృక్ష మూల తలంబున, 138

సీ. ఇద్ధ సనందాది సిద్ధసంసేవితు, శాంతవిగ్రహుని [1]వాత్సల్య గుణుని
గమనీయ లోక మంగళ దాయకుని శివు విశ్వబంధుని జగద్విసుత యశుని
గుహ్యక సాధ్య యక్ష రక్షనాథ కుబేరసేవితుని దుర్వారబలుని
[2]నుచిత విద్యా తపో యోగ యుక్తుని బాల చంద్రభూషణుని మునీంద్రనుతునిఁ

తే. దాపసాభీష్టకరు భస్మదండలింగ
ఘన జటాజినధరుని భక్తప్రసన్ను
వితత సంధ్యాభ్రరుచి విడంబిత వినూత్న
రక్తవర్ణు సనాతను బ్రహ్మమయుని. 139

సీ. అంచిత వామపాదాంభోరుహము దక్షిణోరుతలంబున నొయ్య నునిచి
సవ్యజానువు మీఁద [3]సవ్యబాహువు సాఁచి వలపలి ముంజేత సలలితాక్ష
మాలిక ధరియించి మహనీయ తర్కముద్రాయుక్తు డగుచుఁ జిత్తంబులోన
నవ్యయం బైన బ్రహ్మానందకలిత సమాధినిష్ఠుఁడు వీతమత్సరుండు

తే. యోగపట్టాభిరాముఁ డై యుచితవృత్తి
రోషసంగతిఁ బాసి కూర్చున్న జముని
యనువునను దర్భరచిత బృస్యాసనమున
నున్న మునిముఖ్యు నంచిత యోగనిరతు. 140

క. అలఘుని నభవుని యోగీంద్రులు వినుచుండంగ నారదునితోఁ బ్రియ భా
షలు జరుపుచున్న రుద్రుని, సలలిత పన్నగవిభూషు సజ్జనపోషున్. 141

క. కని లోకపాలురును ముని, జనులును సద్భక్తి నతని చరణంబులకున్
వినతు లయిరి యపు డజ్ఞా, నసుఁ గని య య్యభవుఁ డధికసంభ్రమ మొప్పన్.

1. వాత్సల్యమునను (హ) విద్యా తపో యోగపథ మాస్థితం తదధీశ్వరం చరంతం విశ్వ సుహృదం వాత్సల్యా ల్లోకమంగళమ్ (౬-౩5) 2. ఉదిత (తం. వా.) ౩. భవ్య (హ. తం. వా.)

క. అనఘ! మహాత్ముం డగు నా, మనుఁ డా [1]కశ్యపున కొంగి నమస్కారము చే
సినగతి నజునకు నభవుం,డన యొగిఁ గావించె హరుఁడు నద్దయుఁ బ్రీతిన్. 143

తే. అంత రుద్రానువర్తు లైనట్టి సిద్ధ
[2]గణ మహర్షి జనంబులు గని పయోజ
గర్భునకు మ్రొక్కి రంత నా కమలభవుఁడు
శర్వుఁగని పల్కె మందహాసంబుతోడ. 144

తే. జగములకు నెల్ల యోని బీజంబులైన
శక్తిశివ కారణుండ వై జగతి నిర్వి
కార[3]బ్రహ్మంబ వగు నిన్నుఁ గడఁగి విశ్వ
నాథుఁగా నెఱిఁగెద నా మనమున నభవ! 145

తే. సమత నది గాక తావకాశంబు లైన
శక్తిశివ రూపములఁ గ్రీడ సలుపు [4]దూర్ణ
నాభిగతి విశ్వజనన వినాశ వృద్ధి
హేతుభూతుండ వగుచుందు వీశ! రుద్ర! 146

సీ. అనఘ! లోకంబులయందు వర్ణాశ్రమ సేతువు లనఁగఁ బ్రఖ్యాతి నొంది
బలసి మహాజన పరిగృహీతంబు లై యఖిల ధర్మార్థ దాయకము లైన
వేదంబులను [5]మఱి వృద్ధి నొందించుట, కొఱకు నై నీవ దక్షుని నిమిత్త
మాత్రునిఁ జేసి య మ్మఖము గావించితి వటుగాన శుభమూర్తి వైన నీవు

తే. గడఁగి [6]జనముల మంగళకర్ము లైన
వారి ముక్తి నమంగళాచారు లైన
వారి నరకంబు నొందింతు భూరిమహిమ
భక్తజనపోష! రాజిత ఫణివిభూష! 147

వ. అట్లగుటం ద త్కర్మంబు లోకానొకనికి విపర్యాసంబు నొందుటకుఁ గారణం బెయ్యదియో? భవదీయ రోషంబు హేతు వని దలంచితినేని త్వదీయ పాదార వింద నిహితచిత్తులై సమస్త భూతలంబులయందు నినుం గనుంగొనుచు భూతం

1. కశ్యపునకు నొగి (హ.తం.వా.) 2. దేవమహాఋషి జనము లర్థిని బయోజ (క. బ. తం.)
3. తత్త్వంబగు (క. చ. ట. తం.) 4. నూర్ణ (హ) 5. పరి (చ. ట. త. జ.) 6. జగముల (చ. తం.)

బుల నాత్మయందు వేఱుగాఁ జూడక వర్తించు మహాత్ములయందు నజ్ఞులైన వారియందుం బలె రోషంబు దఱుచు పొరయ దఁట. నీకుఁ గ్రోధంబు గలదే? యని, 148

సీ. మఱి భేదబుద్ధిఁ గర్మప్రవర్తనముల మదయుతులై దుష్టహృదయు లగుచుఁ
బరవిభవాసహ్య భవ మనోవ్యాధులఁ దగిలి మర్మాత్మభేదకము లైన
బహు దురుక్తులచేతఁ బరులఁ బీడింపుచు నుండు మూఢులను దైవోపహతులఁ
గాఁ దలపోసి య క్కపటచిత్తులకు నీవంటి సత్పురుషుఁ డేవలన నైన

తే. హింసఁ గావింపకుండు సమిద్ధ చరిత !
నీలలోహిత ! మహిత గుణాలవాల !
లోకపాలన ! కలిత గంగాకలాప !
హర ! జగన్నుతచారిత్ర ! యదియుఁ గాక. 149

సీ. అమర సమస్తదేశములందు నఖిల కాలములందుఁ దలప [1]దుర్లంఘ్య మహిమఁ
దగు పద్మనాభు మాయామోహితాత్మకులై భేదదర్శను లైనవారి
వలనను ద్రోహంబు గలిగిన నంతయు నది దైవకృత మని యన్యదుఃఖ
ముల కోర్వలేక సత్పురుషుండు దయసేయుఁ గాని హింసింపఁడు గాన నీవు

తే. నచ్యుతుని మాయ మోహము నందకుంటఁ
జేసి సర్వజ్ఞుఁడవు మాయచేత మోహి
తాత్ము లై కర్మవర్తను లైన వారి
వలన ద్రోహంబు గలిగిన వలయుఁ బ్రోవ. 150

వ. అది గావున యజ్ఞ భాగార్హుండ వైన నీకు సవనభాగంబు సమర్పింపని కతన నీచేత విధ్వస్తం బై పరిసమాప్తి వొందని దక్షాధ్వరంబు మరల నుద్ధరించి దక్షుని పునర్జీవితుం జేయుము. భగుని నేత్రంబులును, భృగుముని శ్మశ్రువులును, పూషుని దంతంబులును గృపసేయుము. భగ్నాంగు లైన దేవ ఋత్విక్కా యంబులకు నారోగ్యంబు గావింపుము. ఈ మఖావశిష్టంబు యజ్ఞపరిపూర్తి హేతుభూతం బైన భవదీయ భాగం బగుఁగాక. 151

1. దుర్లంఘనీయమగు (క. చ. ట. త. ద.)

అధ్యాయము - ౭

—: ఈశ్వరుండు బ్రహ్మాదులచేఁ బ్రార్థితుం డయి దక్షాదుల ననుగ్రహించుట :—

చ. అని చతురాననుండు వినయంబున వేఁడిన నిందుమౌళి స
య్యనఁ బరితుష్టి బొంది [1]దరహాసమునన్ గృప దొంగలింప ని
ట్లను హరిమాయచేత ననయంబును బామరు లైన వారు చే
సిన యపరాధ దోషములు చిత్తములో గణియింప నెన్నఁడున్. 152

వ. అ ట్లయ్యును, 153

క. [2]బలియుర దండించుట [3]దుర్బల జనరక్షణము ధర్మపద్ధతి యగుటన్
గలుషాత్మల నపరాధము, కొలఁదిని దండింపుచుందుఁ గొనకొని యేనున్. 154

వ. అని దగ్ధశీర్షుం డైన దక్షుం డజముఖుం డగు. భగుండు బర్హిస్సంబంధ భాగంబులు గలిగి మిత్రనామధేయ చక్షుస్సనం బొడగాంచు. పూషుండు పిష్ట భక్షకుండగుచు *(యజమానదంతంబులచే భక్షించు.) దేవతలు (యజ్ఞావశిష్టంబు నాకొసంగుటం జేసి) సర్వావయవ పరిపూర్ణులై వర్తింతురు. ఖండితాంగు లైన ఋత్విగాది జనంబు లశ్వినీదేవతల బాహువులచేతను, బూషుని హస్తంబుల చేతను లబ్ధ బాహుహస్తు లై జీవింతురు. భృగువు బస్తశ్మశ్రువులు గలిగి వర్తించునని శివుం డానతిచ్చిన సమస్త భూతంబులు సంతుష్టాంతరంగంబు లై, తండ్రీ! లెస్సయ్యె నని సాధువాదంబుల నభినందించిరి. అంత నా *(శంభుని యామంత్రణంబు వడసి) శునాసీర ప్రముఖు లగు దేవతలు *(ఋషులతోడం గూడి రా)నజుండును రుద్రునిం బురస్కరించుకొని దక్షాధ్వర వాటంబునకుం జనె. అంత,

క. శర్వుని యోగక్రమమున, సర్వావయవములు గలిగి సన్మని ఋత్వి
గ్గీర్వాణముఖ్యు లొప్పిరి, పూర్వతనుశ్రీల నార్యభూషణ! యంతన్. 156

క. విను దక్షు సవనబస్తము, ఖునిఁ జేసిన నిద్ర మేలుకొనిలేచిన పో
ల్కిన నిలిచె దక్షుఁ డభవుఁడు, గనుగొనుచుండంగ నాత్మఁ గౌతుక మొప్పన్.

వ. ఇట్లు లేచి నిలిచి ముందఱ నున్న శివునిం గనుంగొనిన మాత్రన శరత్కాలంబున నకల్మషం బైన సరస్సునుం బోలి పూర్వ రుద్రవిద్వేష జనితంబు లయిన కల్మ

---

1. దరహాసము మోమున దొంగలింప (క. ట. జ.) 2. బలియుర దండింపను దుర్బలులను రక్షింప (చ. ట. త. జ. తం.)

* ఈ గుర్తుగల భాగములు కొన్ని తాళపత్ర ప్రతులయందు లేవు.

షంబులం బాసి నిర్మలుండై యభవుని నుతియింపం దొడంగి, మృతిఁబొందిన సతీతనయుం దలంచి, యనురాగోత్కంఠ బాష్పపూరిత లోచనుండు, గద్గద కంఠుండు నై పలుకం జాలక యెట్టకేలకు దుఃఖంబుల సంస్తంభించికొని ప్రేమాతిరేక విహ్వలుం డగుచు సర్వేశ్వరుం డగు హరున కిట్లనియె. 158

క. వినుము నీ కపరాధుఁడ నగు, నను దండించు టది దండనము గాదు మదిన్
నను రక్షించుటగా మన, మునఁ దలఁతును దేవ! యభవ! పురహర! రుద్రా!

సీ. అనఘాత్మ! నీవును నబ్జనాభుండును, పరికింప బ్రాహ్మణాభాసులైన
వారల యెడల నెవ్వలను నుపేక్షింపరఁట దృఢ వ్రతచర్యులైన వారి
యెడ నీ కుపేక్ష యెక్కడిది? సర్గాదిని నామ్నాయ సంప్రదాయ ప్రవర్త
నము నెఱింగించుట కమర విద్యా తపో వ్రత పరాయణులైన బ్రాహ్మణులను

తే. వరుసఁ బుట్టించితివి గాన వారి నెపుడుఁ
గేల దండంబుఁ బూని గోపాలకుండు
బలసి గోవుల రక్షించు పగిది నీవు
నరసి రక్షింపుచుందు గదయ్య! రుద్ర! 160

సీ. తలపోయ నవిదిత తత్త్వ విజ్ఞానుండ నైన నాచేత సభాంతరమున
నతిదురుక్తాంబక క్షతుఁ డయ్యు నన్మత్కృతాపరాధము హృదయంబునందుఁ
దలఁపక [1]త్ర్యక్ష! నిందాదోషమున నధోగతిఁ బొందుచున్న దుష్కర్ము నన్నుఁ
గరుణఁ గాఁచిన [2]నీకుఁ గడఁగి ప్రత్యుపకార మెఱిఁగి కావింప నే నెంతవాఁడ?

తే. సుతచరిత్ర! భవత్ప్రానుగ్రహాను
రూపకార్యంబుచేత నిరూఢమైన
తుష్టి నీ చిత్తమందు నొందుదువు గాక
క్షుద్రసంహార! కరుణాసముద్ర! రుద్ర! 161

వ. అని యిట్లు రుద్రక్షమాపణంబు గావించి, పద్మసంభవునిచేత ననుజ్ఞాతుం డై దక్షుం డుపాధ్యాయర్త్విగ్గణ సమేతుం డగుచుఁ గ్రతుకర్మంబు నిర్వర్తించు సమయంబున బ్రాహ్మణ జనంబులు యజ్ఞంబులు నిర్విఘ్నంబులై సాగుటకుఁ బ్రమథాది వీరసంసర్గ కృతదోష నివృత్త్యర్థంబుగా విష్ణుదేవతాకంబును, త్రికపాల పురోడాశ ద్రవ్యకంబునైన [3]కర్మంబు గావింప [4]నుపాత్త హవిష్యుం డగు

1. సుజన (క) 2. నీదు, ఘనసద్గుణంబుల, నెఱిఁగి సంస్తుతిసేయ నెంతవాఁడ (హ)
3. యాగంబు (క. చ. ట. ల.) 4. నధ్వర్యుర్త్విక్ప్రవిష్టుండగు (హ)

భృగుపుత్రోడం గూడి నిర్మలాంతః కరణుం డగుచు దక్షుండు ద్రవ్య త్యాగంబు గావింపఁ బ్రసన్నుం డై సర్వేశ్వరుండు. 162

—: దక్షాధ్వరంబునకు వచ్చిన నారాయణుని దక్షాదులు స్తుతించుట :—

సీ. మానిత శ్యామాయమాన శరీర †దీధితులు నల్ దిక్కులఁ దీటుకొనఁగఁ
[1]గాంచనమేఖలా కాంతులతోఁ గౌశేయ చేలద్యుతుల్ చెలిమిసేయ
లక్ష్మీసమాయుక్త లలితవక్షంబున వైజయంతీప్రభల్ వన్నెఁజూప
హాటకరత్న కిరీటకోటి ప్రభల్ బాలార్కరుచులతో మేలమాడ

తే. లలిత [2]నీలాభ్రరుచిఁ గుంతలములు దనరఁ
బ్రవిమలాత్మీయ దేహజప్రభ సరోజ
భవ భవామరముఖ్యుల ప్రభలు మాప
నఖిల లోకైక గురుఁడు నారాయణుండు. 163

చ. సలలిత శంఖ చక్ర [3]జలజాత గదా శర చాప [4]ఖడ్గ ని
ర్మలరుచులన్ సువర్ణరుచిమన్మణికంకణ ముద్రికా ప్రభా
వళులను దేజరిల్లు భుజవర్గ మనర్గళకాంతి యుక్తమై
విలసిత కర్ణికార పృథివీరుహమున్ [5]బురణింప బిట్టుగన్. 164

క. సరసోదార సమంచిత, దరహాస విలోకనములఁ దగ లోకములన్
బరితోషము నొందింపుచుఁ, బరమోత్సవ మొప్ప విశ్వబంధుం డగుచున్. 165

చ. మఱియును రాజహంసరుచిమ ద్భ్రమణీకృత తాలవృంత[6]చా
మరములు వీవఁగా దివిజమానిను లచ్ఛ సుధామరీచి వి
స్ఫురిత సితాతపత్ర రుచిపుంజము దిక్కులఁ బిక్కటిల్లఁగాఁ
గరివరదుండు వచ్చె సుభగ స్తుతివర్ణ సుపర్ణయానుఁడై. 166

చ. ఘనరుచి నట్లు వచ్చిన వికారవిదూరు ముకుందుఁ జూచి బో
రన నరవిందనందన పురందర చంద్రకళాధ రామృతా

† 'ధియా విశుద్ధయా దధ్యౌ, తదా ప్రాదురభూద్ధరిః' అని, మూ. 7-18.

1. కాంచనాంబర నూత్న కాంతి విలాసంబు, తొలుకారు మెరుపుతో చెలిమిసేయ (ద). 2. నీలాళిరుచి (క. చ. ట. జ.) 3. జలజాసి (ద) 4. వర్మ (ద) 5. బురణించు (హ); బురుడింత బట్టుగన్ (తం. వా.) 6. చామర లిరువంకలన్ దివిజ (త. ద. ద. బ. తం.)

శనముఖు లర్థి లేచి యతిసంభ్రమ మొప్ప నమో నమో దయా
వన నిధయే, యటంచు ననివారణ మ్రొక్కిరి భక్తియుక్తులై. 167

వ. అట్లు కృతప్రణాము లైన యనంతరంబ, 168

ఉ. ఆ నలినాయతాక్షుని యనంతపరాక్రమ దుర్నిరీక్ష్య తే
జోనిహత స్వదీప్తు లగుచుఁ నుతిసేయ నశక్తులై భయ
గ్లాని వహించి బాష్పములు గ్రమ్మఁగ గద్గదకంఠు లై [1]తనుల్
మ్రానుపడంగ న వ్విభుని మన్నన గైకొని యెట్టకేలకుఁ. 169

వ. నిటలతట ఘటిత కరపుటులై య మ్మహాత్ముని యపారమహిమంబు బెఱిఁగి నుతియింప శక్తులు గాకయుండియుఁ [2]గృతానుగ్రహనిగ్రహుం డగుటం జేసి తమతమ మతులకు గోచరించిన కొలంది నుతియింపం దొడంగిరి. అందు *(గృహీతంబు లగు పూజాద్యుపచారంబులు గలిగి బ్రహ్మాదులకు జనకుండును, సునంద నందాది పరమ భాగవతజన సేవితుండును, యజ్ఞేశ్వరుండును నగు భగవంతుని శరణ్యునిఁగాఁ దలంచి) దక్షుం డిట్లనియె. దేవా! నీవు స్వస్వరూపమం దు*(న్న యప్పు డుపరతంబులుగాని) రాగా ద్యఖిల బుద్ధ్యవస్థలచే విముక్తుండవును, నద్వితీయుండవును, భయరహితుండవునునై, మాయం దిరస్కరించి, మఱియు నా మాయ ననుసరించుచు లీలామానుషరూపంబుల నంగీకరించి, స్వతంత్రుండ వయ్యును మాయాపరతంత్రుండ వై రాగాదియుక్తుం బలె రామకృష్ణా ద్యవతారంబులఁ గానంబడుచుందువు కావున నీ లోకంబులకు నీవ యీశ్వరుండ వనియు, నితరు లైన బ్రహ్మరుద్రాదులు భవ న్మాయావిభూతు లగుటంజేసి లోకంబులకు నీశ్వరులు గారనియు భేదదృష్టి గల నన్ను రక్షింపుము. ఈ విశ్వకారణు లైన ఫాలలోచనుండును, బ్రహ్మయు, దిక్పాలురును, సకల చరాచర జంతువులును నీవ. భవద్వ్యతిరిక్తంబు జగంబున లేదని విన్నవించినఁ ద దనంతరంబ ఋత్విగ్గణంబు లి ట్లనిరి. 170

సీ. వామదేవుని శాపవశమునఁ జేసి కర్మానువర్తనుల మే మైనకతన
బలసి వేదప్రతిపాద్య ధర్మోపలక్ష్యం బైనయట్టి మఖంబునందు
దీపింప నింద్రాది దేవతాకలిత రూపవ్యాజమును బొంది పరఁగు నిన్ను
యజ్ఞస్వరూపుండ [3]వని కాని కేవల నిష్కించనుండవు నిర్మలుఁడవు

* కొన్ని తాళప్రతులందు లేదు. 1. వెసన్ (చ. ట. త. జ. బ.) 2. భక్తానుగ్రహ (క. చ. ఓ. జ.) 3. వనియును కేవల, నిపుణుండవు నిష్క (హ)

తే. నరయ ననవద్యమూర్తివి యైన నీదు
లలిత తత్త్వ స్వరూపంబు దెలియఁజాల
మయ్య ! మాధవ ! గోవింద ! హరి ! ముకుంద !
చిన్మయాకార ! నిత్య లక్ష్మీవిహార ! 171

వ. సదస్యు లి ట్లనిరి. 172

సీ. శోక దావాగ్ని శిఖా[1]కులితంబు పృథు క్లేశ [2]ఘనదుర్గ దుర్గమంబు
చండధర క్రూరకుండలి శ్లిష్టంబు పాపకర్మ వ్యాఘ్ర పరివృతంబు
గురు సుఖదుఃఖ కాకోలపూరిత గర్తమగుచు ననాశ్రయ మైనయట్టి
సంసారమార్గ సంచారు లై మృగతృష్ణికలఁ బోలు విషయసంఘము నహమ్మ

తే. మేతి హేతుక దేహనికేతనములు
నను మహాభారవహు లై నయట్టి మూఢ
జనము లేనాఁట మీ పదాబ్జములు గానఁ
జాలు వారలు ? భక్తప్రసన్న ! దేవ ! 173

వ. రుద్రుం డి ట్లనియె. 174

ఉ. వరద ! నిరీహ యోగిజనవర్గ సుపూజిత ! నీ పదాబ్జముల్
నిరతము నంతరంగమున నిల్పి [3]సమగ్ర భవత్ పరిగ్రహ
స్ఫురణఁ దనర్చు నన్ను నతి[4]మూఢులు సంతతము న్నమంగళా
[5]చరణుఁ డటంచుఁ బల్కు నది సమ్మతి నే గణియింప నచ్యుతా ! 175

వ. భృగుం డి ట్లనియె. 176

మ. అరవిందోదర ! తావకీన ఘనమాయా మోహితస్వాంతు లై
పరమం బైన భవన్మహామహిమముం బాటించి కానంగ నో
పరు బ్రహ్మాది [6]శరీరు లజ్ఞులయి యో పద్మాక్ష ! భక్తార్తి సం
హరణాలోకన ! నన్నుఁ గావఁదగు నిత్యానందసంధాయి వై. 177

వ. బ్రహ్మ యిట్లనియె. 178

సీ. [7]సమధిక జ్ఞానార్థ సత్త్వాది గుణముల కాశ్రయభూత మై నట్టి పురుషుఁ
డగ్రపదార్థ భేదగ్రాహకము లైన చక్షురింద్రియముల సరవిఁ జూడఁ

1. కలితంబు (చ. ట. జ. ద.) 2. భవ (చ. ట.) 3. భవత్స్వమనుగ్రహాధిక (హ) 4. మూఢుల విద్యలు మున్నమంగళా (హ) 5. వరణుడటంచు బల్కిన భవన్మతి (హ) 6. శరీరధారులైన నో పద్మాక్ష (తం) 7. జ్ఞానార్థకారణ సత్త్వాదిగుణముల కాశ్రయభూతమై యలరుచున్న (హ)

గలఁడె? నీరూపంబు గడఁగి మాయామయంబగు నసద్వ్యతిరిక్త మగుచు మఱియు నిపమాకారంబు నీకు విలక్షణ మై యుండు ననుచు నే నాత్మఁ దలఁతు

తే. నిర్వికార ! నిరంజన ! నిష్కళంక !
నిరతిశయ ! నిష్క్రియారంభ ! నిర్మలాత్మ !
విశ్వ సంబోధ్య ! నిరవద్య ! వేదవేద్య !
ప్రవిమలానంద ! సంసారభయ విదూర ! 179

వ. ఇంద్రుం డిట్లనియె. 180

మ. దితిసంతాన వినాశసాధన సముద్దీప్తాష్టబాహా సమ
న్వితమై యోగిమనోనురాగకరమై వెల్గొందు నీ దేహ మా
యతమైనట్టి ప్రపంచముం బలెను మిథ్యాభూతముం గామి శా
శ్వతముం గా మదిలోఁ దలంతు హరి ! దేవా ! దైవ చూడామణీ ! 181

వ. ఋత్విక్పత్ను లిట్లనిరి. 182

చ. కడఁగి భవత్పదార్చనకుఁగా నిటు దక్షునిచే రచింపఁగాఁ
బడి శితికంఠరోషమున భస్మము నొంది పరేతభూమి యై
చెడి కడు శాంతమేధమునఁ జెన్నఱియున్న మఖంబుఁ జూడు మే
ర్పడ జలజాభనేత్రములఁ బావన మై విలసిల్లు నచ్యుతా ! 183

వ. ఋషు లిట్లనిరి. 184

మ. అనఘా ! మాధవ ! నీవు మావలెనె కర్మారంభి వై యుండియుఁ
విను తత్కర్మఫలంబుఁ బొంద వితరుల్ విశ్వంబునన్ భూతికై
యనయంబున్ భజియించు నిందిరఁ [1]గరం బర్థిన్ నినుం జేరఁ గై
కొన వేమందుము ? నీ చరిత్రమునకున్ గోవింద ! పద్మోదరా ! 185

వ. సిద్ధు లిట్లనిరి. 186

చ. హరి! భవదుఃఖ భీషణదవానల దగ్ధ తృషార్త మన్మనో
ద్విరదము శోభితంబును బవిత్రము నైన భవత్కథాసుధా
సరి దవగాహనంబునను సంసృతి తాపముఁ బాసి క్రమ్మఱన్
దిరుగదు బ్రహ్మముం గనిన ధీరునిభంగిఁ బయోరుహోదరా ! 187

వ. యజమాని యగు ప్రసూతి యిట్లనియె. 188

1. నిన్నున్నర్థించి యేతేర (చ)

చ. కరచరణాదికాంగములు గల్గియు మస్తములేని మొండెముం
బరువడి నొప్పకున్న గతిఁ బంకజలోచన! నీవు లేని య
ధ్వరము [1]ప్రయాజలం గలిగి తద్దయు నొప్పకయున్న దీయెడన్
హరి! యిటు నీదురాక శుభ మయ్యె రమాధిప! మమ్ముఁ గావవే! 189

వ. లోకపాలకు లి ట్లనిరి. 190

సీ. దేవాదిదేవ! యీ దృశ్యరూపం బగు సుమహిత విశ్వంబుఁ జూచు ప్రత్య
గాత్మభూతుండ వై నట్టి నీవు నన ప్రకాశ రూపంబు లై కలుగు మామ
కేంద్రియంబులచేత నీశ్వర! నీమాయ నొందించి పంచభూతోపలక్షి
తం బగు దేహి విధంబునఁ గానంగఁ బడుదువు గాని యేర్పడిన శుద్ధ

తే. సత్త్వగుణ యుక్తమైన భాస్వత్స్వరూప
ధరుఁడవై కానఁబడవు గా? పరమపురుష!
యవ్యయానంద! గోవింద! యట్లు గాక
యెనయ మా జీవనము లిఁక [2]నేమికలవు? 191

వ. యోగేశ్వరు లి ట్లనిరి, 192

సీ. విశ్వాత్మ! నీయందు వేఱుగా జీవులఁ గనఁ డెవ్వఁ డటు వానికంటెఁ బ్రియుఁడు
నీకు లేఁ డైనను నిఖిల విశ్వోద్భవ స్థితి విలయంబుల కతన దైవ
సంగతి నిర్భిన్న సత్త్వాది గుణవిశిష్టాత్మీయ మాయచే నజ భవాది
వివిధ భేదము లొందుదువు స్వస్వరూపంబు నం దుండుదువు వినిహత విమోహుఁ

తే. డగుచు నుందువు తగ ని న్ననన్యభక్తి
భృత్యభావంబుఁ దాల్చి సంప్రీతిఁ గొల్చు
మమ్ము రక్షింపు మో కృపామయ! రమేశ!
పుండరీకాక్ష! సంతత భువనరక్ష! 193

వ. శబ్దబ్రహ్మ యిట్లనియె. 194

చ. హరి! భవదీయ తత్త్వము సమంచితభక్తి నెఱుంగ నేను నా
సరసిజసంభవాదులును జాలము సత్త్వ గుణాశ్రయుండవున్
బరుఁడవు నిర్గుణుండవును [3]బ్రహ్మము నై తగు నీకు [4]నిప్పు డిం
దఱము చతుర్విధార్థ ఫలదాయక! మ్రొక్కెద మాదరింపుమా! 195

1. ప్రయాజులం గలిగి (క.ట.తం.వా.); ప్రయోక్తలం గలిగి (త) 2. ఏమి కెలవు (క.చ.ట.త. డ.) 3. బ్రహ్మమును న్నగు నీవు (డ ద.బ.) 4. నందఱున్, గరము...ఫలకాంక్షల (హ)

వ. అగ్నిదేవుం డిట్లనియె. 196

మ. హవరక్షాచరణంబునం బై నెగడుచు న్న య్యగ్నిహోత్రాది పం
చ విధంబుల్ మఱి మంత్రపంచక సుసృష్టం బై తగం బొల్చు నా
హవరూపం బగు నీకు మ్రొక్కెదను నీ యాజ్ఞన్ భువిన్ హవ్యముల్
సవనవ్రాతములన్ వహింతు హరి! యుష్మత్తేజముల్ బూనుచున్. 297

వ. దేవత లిట్లనిరి. 198

మ. మును గల్పాంతమునందుఁ గుక్షి సకలంబున్ దాఁచి యేకాకి వై
జనలోకోపరిలోక వాసులును యుష్మత్తత్త్వమార్గంబు చిం
తనముం జేయుఁ బయోధియందు సహిరాట్తల్పంబునం బవ్వళిం
చిన నీరూపము నేఁడు చూపితివి లక్ష్మీనాథ! దేవోత్తమా! 199

వ. గంధర్వు లిట్లనిరి. 200

మ. హర పంకేజభవామరాదులు మరీచ్యాది ప్రజానాథులో
యరవిందాక్ష! రమాహృదీశ! భవదీయాంశాంశ సంభూతు లై
పరఁగం దావకలీల [1]యై నెగడు నీ బ్రహ్మాండ మున్నట్టి యీ
శ్వర! నీ కే మతిభక్తి మ్రొక్కెదము [2]దేవా! దేవచూడామణీ! 201

వ. *విద్యాధరు లిట్లనిరి. 202

సీ. నలినాక్ష! విను భవ న్మాయావశంబున దేహంబు దాల్చి తద్దేహమందు
నాత్మ [3]నహ మ్మమే త్యభిమానమును బొంది పుత్ర జాయా గృహక్షేత్ర బంధు
ధన పశుముఖ వస్తుతతుల సంయోగ వియోగదుఃఖంబుల నొందుచుండు
ధృతివిహీనుఁడు నసద్విషయాతిలాలసుఁ డతిదుష్టమతియు నై నట్టివాఁడు

తే. దవిలి భవదీయగుణ సత్కథావిలోలుఁ
డయ్యెనేనియు [4]నాత్మమోహంబు వలనఁ

1. లీలనై (హ) 2. దేవాధీశ రక్షింపుమా (హ)

* ఈ క్రింది పద్యము 'ఱ' ప్రతిలో అధికముగా నున్నది.

మ. భవదంశాంశజు లే మరీచి ముఖరుల్ బ్రహ్మామరేంద్రాద్రిజా
ధవ ముఖ్యుల్ దివిషద్గణంబుఁ బరమాత్మా! నీకు విశ్వంబు ను
త్సవ లీలా కరకందుకోపమము నాథా! వేదశాఖాశిఖా
స్తవనీయాంఘ్రికి నీ కొనర్తుము నమస్కారంబు లశ్రాంతమున్.

3. ఆత్మ-యహమ్మను యను నభిమానియై (క. ఓ. ప. ద. బ. హ.) 4. నాత్మమోహంబు (హ)

బాసి వర్తించు విజ్ఞాన పరతఁ దగిలి
చిర దయాకార! యిందిరా చిత్తచోర!  203

వ. బ్రాహ్మణజనంబు లిట్లనిరి. దేవా! యీ క్రతువును, హవ్యంబును, నగ్నియు, మంత్రంబులును, సమిద్దర్భ పాత్రంబులును, సదస్యులును, ఋత్విక్కులును, దంపతులును, దేవతలును, నగ్నిహోత్రంబును, స్వధయు, సోమంబును, నాజ్యంబును, పశువును నీవ. నీవు దొల్లి వేదమయ సూకరాకారంబు ధరియించి, దంష్ట్రాదండంబున వారణేంద్రంబు నలినంబు ధరియించు చందంబున రసాతలగత యైన భూమి నెత్తితివి. అట్టి యోగిజన స్తుత్యుండవును, యజ్ఞ క్రతురూపుండవు నైన నీవు పరిభ్రష్ట కర్మల మై యాకాంక్షించు మాకుఁ బ్రసన్నుండ వగుము. భవదీయ నామకీర్తనంబుల సకల యజ్ఞ విఘ్నంబులు నాశంబునొందు. అట్టి నీకు నమస్కరింతుము.  204

క. అని యను సకల జనంబులు, వినుతించిన హరి భవుండు విఘ్నము గావిం
చిన యా దక్షుని యజ్ఞము, ఘనముగఁ జెల్లించెఁ గొఱఁత గాకుండంగన్.  205

క. సకలాత్ముఁడు దా నగుటను, సకల హవిర్భోక్త యయ్యు జలజాక్షుండున్
[1]ప్రకట స్వభాగమున న, య్యకలంకుఁడు దృప్తిఁ బొంది యనె దక్షునితోన్.  206

వ. అనఘా! *(ఏను, బ్రహ్మయు, శివుండు) నీ జగంబులకుఁ గారణ భూతులము. అందు నే నీశ్వరుండను, నుపద్రష్టను, స్వయంప్రకాశకుండను నై గుణమయం బైన యాత్మీయ మాయం బ్రవేశించి, జనన వృద్ధి విలయంబులకు హేతుభూతంబు లగు తత్తత్క్రియోచితంబు లైన బ్రహ్మ రుద్రాది నామధేయంబుల నొందుచుండుదు. అట్టి యద్వితీయ బ్రహ్మరూపకుండ నైన నాయందు నజ భవాదులను భూతగణంబులను మూఢుఁ డగువాఁడు వేఱుగాఁ జూచు. [2]మనుజుండు శరీరంబునకుఁ గరచరణాదులు వేఱుగాఁ దలంపని చందంబున మద్భక్తుండు నాయందు భూతజాలంబుల భిన్నంబుగాఁ దలంపఁడు. కావున మా మువ్వుర నెవ్వండు వేఱు సేయకుండు వాఁడు కృతార్థుం డని యానతిచ్చిన దక్షుండు,

క. విని [3]విష్ణుదేవతాకం, [4]బనఁగాఁ ద్రికపాల కలిత మగు నా యాగం
బునఁ దగ న వ్విష్ణుని పద, వనజంబులఁ [5]బూజచేసి వారని భక్తిన్.  508

1. ప్రకటస్వభావమున (క. ట. త. చ. బ. వా.) * కొన్ని తా. ప. ప్రతులలోలేవు.
2. మద్భక్తుండగు వాఁడు శరీరంబునకుఁ గరచరణాదులు వేఱుగా దలంపని చందంబున నా యందు భూతజాలంబు భిన్నంబుగా దలంపండు (క. చ. ట. బ. తం. వా.) 3. విను (హ. తం. వా.)
4. జనఘా (హ) 5. పూజఁజేసి (హ)

వ. మఱియును,

సీ. అంగ ప్రధానక యాగంబులను జేసి యమరుల రుద్రుని నర్థిఁ బూజ
నేసి [1]విశిష్టేష్ట శిష్టభాగమున నుదవసానకర్మంబు దవిలి తీర్చి
[2]తాను ఋత్విక్కులుఁ దగ సోమపులఁ గూడి యవభృథ స్నానంబు లాచరించి
కడఁక నవాప్త సకలఫలకాముఁ డై తనరు దక్షునిఁ జూచి ధర్మబుద్ధి

తే. గలిగి సుఖవృత్తి జీవింతు గాక యనుచుఁ
బలికి దివిజులు మునులును బ్రాహ్మణులును
జనిరి నిజమందిరములకు జలజనయన
భవులు వేంచేసి రాత్మీయ భవనములకు. 210

వ. అంత దాక్షాయణి యైన సతీదేవి పూర్వకళేబరంబు విడిచి, హిమవంతునకు మేనకయందు జనియించి, విలయకాలంబునం బ్రసుప్తం బైన శక్తి సృష్టికాలంబున నీశ్వరునిఁ బొందు చందంబునం బూర్వదయితుం డగు రుద్రుని వరియించె. అని దక్షాధ్వరధ్వంసకుం డగు రుద్రుని చరిత్రంబు బృహస్పతి శిష్యుఁ డైన యుద్ధవునకు నెఱింగించె. అతండు నాకుం జెప్పె. నేను నీకుం జెప్పితి. అని మైత్రేయుండు వెండియు విదురున కి ట్లనియె. 211

క. ఈ యాఖ్యానముఁ జదివిన, ధీయుతులై వినినయట్టి [3]ధృతిమంతులకు
న్నాయుః కీర్తులు గలుగును, బాయును దురితములు దొలఁగు, భవబంధంబుల్.

వ. అని వెండియు ని ట్లనియె.

## అధ్యాయము — ౮

క. విను సనకాదులు నారదుఁ
డును హంసుఁడు నరుణియు ఋభుఁడు యతియుఁ గమలా
సనజులు నైష్ఠికు లనికే
తను లగుటన్ సాగ వయ్యెఁ ద ద్వంశంబుల్. 214

వ. మఱియు నధర్మునకు మృష యను భార్యయందు దంభుండును, మాయ యను [4]నంగనయుఁ బుట్టిరి. అధర్మ సంతానం బగు వా రిరువురును మిథునం బై రి. వారిని సంతానహీనుం డగు నిరృతి గై కొనియె. వారలకు లోభుండును

1. విశిష్టేష్టి (జ.డ.బ.) 2. ఋత్విక్కులును దాను గృతసోమపానులై (క. చ. ట. త. బ.)
3. ధీరుల కైశ్వర్యాయుః కీర్తులు (హ. వా.) 4. కామినియుం (క. చ. బ. తం.)

నికృతి యను సతియునుం గలిగి మిథునం బై రి.ఆ మిథునంబునకుఁ గ్రోధుండు, హింస యను నంగనయుం బుట్టి మిథునం బై రి. ఆ మిథునంబునకుఁ గలియు, దురుక్తి యను నతివయు జన్మించి దాంపత్యంబు గైకొనిరి. ఆ దంపతులకు భయ మృత్యువు లను మిథునంబు గలిగె. దాని వలన యాతనయు, నిరయం బునుం బుట్టిరి. వీరలు సంసారహేతు వగు నధర్మ తరుశాఖలై నెగడిరి. వీని శ్రేయస్కాముం డగు జనుం డీషణ్మాత్రంబు ననువర్తింపం జనదు. ఇవ్విధం బునం బ్రతిసర్గంబును సంగ్రహంబున వినిపించితి. ఇప్పుణ్యకథ నెవ్వండేని ముమ్మాటు వినిన నతండు నిష్పాపి యగు నని చెప్పి మఱియు, 215

—: ధ్రువోపాఖ్యానము :—

క. విను మఖిల భువన పరిపా, లనమునకై [1]చక్రధరకళా కలితుండై
వనజజునకు స్వాయంభువ,మను వపు డుదయించెఁ గీర్తిమంతుం డగుచున్.216

తే. రూఢి న మ్మనువుకు శతరూపవలన
భూనుతు లగు ప్రియవ్రతోత్తానపాదు
లనఁగ నిద్దఱు పుత్త్రులై రందులోన
భవ్యచారిత్రుఁ డుత్తానపాదునకును. 217

క. వినుము సునీతియు సురుచియు
నను భార్యలు గలరు వారియందును ధ్రువునిన్
గనిన సునీతియు నప్రియ
యును సురుచియుఁ బ్రియయుఁ నగుచు నున్నట్టి యెడన్. 218

సీ. ఒకనాఁడు సుఖలీల నుత్తానపాదుండు [2]నెఱిఁ బ్రియురా లైన సురుచి గన్న
కొడుకు నుత్తముఁ దన తొడలపై నిడికొని యుపలాలనము సేయుచున్నవేళ
నర్థిఁ ద దారోహణాపేక్షితుం డైన ధ్రువునిఁ గనుంగొని తివక యాద
రింపకుండుటకు గర్వించి యా సురుచియు సవతి బిడ్డం డైన ధ్రువునిఁ జూచి

తే. తండ్రితొడ నెక్క వేడుక దగిలెనేని
పూని నాగర్భమున నాఁడు పుట్ట కన్య
గర్భమునఁ బుట్టఁ గోరినఁ గలదె నేఁడు
జనకు తొడ యెక్కు భాగ్యంబు సవతికొడుక! 219

1. చంద్రధరకళా (హ. తఁ. వా.) 2. మఱి (హ)

క. అది గాన నీ వధోక్షజు, పదపద్మము లాశ్రయింపు పాయక హరి నా
యుదరమునఁ [1]బుట్టు విచ్చును, వదలక యట్లైన ముదము [2]వడసెద వనఘా !

క. అని [3]యీలాగు ససహ్యావ, చనములు పినతల్లి యపుడు జనకుఁడు వినఁగాఁ
దను నాడిన దుర్భాషా, ఘనశరములు మనసు నాఁటి గాఱియ వెట్టన్. 221

క. తను నట్లుపేక్ష సేసిన, జనకుని కడఁ బాసి దుఃఖజలనిధి లోనన్
మునుగుచును దండతాడిత, ఘన భుజగముఁ బోలి రోషకలితుం డగుచున్. 222

క. ఘనరోదనంబు సేయుచుఁ, గనుఁగ[4]వలను శోక బాష్పకణములు దొరఁగన్
జననికడ కేగుటయు నిజ, తనయునిఁ గని యా సునీతి దద్దయుఁ బ్రేమన్. 223

వ. తొడలపై నిడికొని, 224

క. కర మనురక్తిని మోము ని, విరి త ద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతః
పుర[5]వాసలుఁ జెప్పిన విని, పఱపుగ నిట్టూర్పు లెసఁగ బాష్పాకుల యై. 225

తే. సవతి యాడిన మాటల సారెఁ దలఁచి
కొనుచుఁ బేర్చిన దుఃఖాబ్ధిఁ గుందుచుండె
దావ పావక శిఖలచేఁ దగిలి కాంతి
వితతి గందిన మాధవీలతిక వోలె. 226

వ. అంత నా సునీతి బాలకునిఁ జూచి తండ్రీ ! దుఃఖింపకు మని యి ట్లనియె. 227

క. అనఘా ! యీ దుఃఖమునకుఁ, బనిలే దన్యులకు నొలయ బలవంతం బై
తన పూర్వజన్మ దుష్కృత, ఘనకర్మము వెంటనంటఁగా నె వ్వలనన్. 228

వ. కావున, 229

క. పెనిమిటిచేతను బెండ్లా, మని కాదు నికృష్టదాసి యనియునుఁ బిలువం
గను జాలని దుర్భగురా, లనఁగల నాకుక్షి నుదయ మందిన కతనన్. 230

1. పుట్టనిచ్చును (హ. తం.); పుట్టఁజేయున్ (వా) 2. వఱలెడి నీకున్ (తం. చ. బ.) 3. అని యీరీతి (తం. వా.); అని యిదియు మొదలసహ్యా (జ) 4. నురుశోక (క. బ.) 5. వాసులు (క. బ. తం. వా.) "నిశమ్య త త్పౌరముఖా న్నితాంతం" (8-16); 'అంతఃపురజన ముఖా చ్ఛ్రుత్వా' (వ్యా)

క. నిను నాడిన యా సురుచి వ,చనములు సత్యంబు లగును సర్వశరణ్యుం
డనఁగల హరి చరణంబులు, గను జనకునియంక మెక్కఁగాఁ దలఁతేనిన్. 231

వ. కావున పినతల్లి యైన యా సురుచి యాదేశంబున నధోక్షజు నాశ్రయింపు మని
వెండియు ని ట్లనియె. 232

సీ. పరికింప నీ విశ్వపరిపాలనమునకై యర్థి గుణవ్యక్తుఁ డైన యట్టి
నారాయణుని పాదనళినముల్ సేవించి బ్రహ్మయు బ్రహ్మత్వ పదమునొందె
ఘనుఁడు మీతాత యా మనువు సర్వాంతర యామిత్వమగు నేక మైన దృష్టిఁ
జేసి యాగములు యజించి తా భౌమసుఖములను దివ్యసుఖముల మోక్ష

తే. సుఖములను బొందె నట్టి యచ్యుతునిఁ బరుని
వితత యోగీంద్రనికర [1]గవేష్యమాణ
చరణ సరసిజ యుగళు శశ్వత్ప్రకాశు
భక్తవత్సలు విశ్వసంపాద్యు హరిని. 233

వ. మఱియును. 234

క. [2]కరతల గృహీత లీలాం, బురుహ యగుచుఁ బద్మగర్భముఖ గీర్వాణుల్
పరికింపం గల లక్ష్మీ, తరుణీమణిచేత వెదకఁదగు పరమేశున్. 235

—: ధ్రువుండు నారదోపదేశంబు వడసి తపంబు చేయుట :—

వ. నిజ ధర్మ పరిశోభితం బైన యేకాగ్రచిత్తంబున నిలిపి సేవింపుము. అమ్మహా
త్మునికంటె నీ దుఃఖం బపనయించువాఁ డన్యుం డొక్కరుండు గలఁడే? యని
పలికిన పరమార్థ హేతుకంబు లైన తల్లి వాక్యంబులు విని, తన్నుఁ దాన నియ
మించికొని, పురంబువెడలు నవసరంబున నారదుండు తద్వృత్తాంతం బెఱింగి
యచ్చటికిం జనుదెంచి, యతని చికీర్షితంబుఁ దెలిసి, పాపనాశకరం బైన తన కర
తలంబున ధ్రువునిశిరం బంటి, మానభంగంబునకు సహింపని క్షత్త్రియుల ప్రభావం
బద్భుతంబుగదా! బాలకుం డై యుండియుఁ బినతల్లి యాడిన దురుక్తులు
చిత్తంబునం బెట్టి చనుచున్నవాఁ డని మనంబున నాశ్చర్యంబు నొంది,

1. సంవేద్యమాన (హ); సంవేష్ట్యమాణ (తం) 2. కరమున గృహీతలీలాం, బురుహయు
నరవింద గర్భ (హ); కరసరసిజగృహీతాం, బురుహయు (తం. వా.) ''యోమృగ్యతే హస్త గృహీత
పద్మయా, శ్రియేతరై రంగ విమృగ్యమాణయా'' (8-24)

†(యో బాలక ! సకల సంపత్సమృద్ధం బగు మందిరంబు దెగడి యెంటి యెందు నేగెదవు? స్వజనకృతం బగు నవమానంబుచే నిను సంతప్తుంగాఁ దలంచెద. అనిన ధ్రువుం డిట్లనియె. సపత్నీమాతృ వాగిషుక్షతం బగు వ్రణంబు భగవద్ధ్యాన యోగ రసాయనంబున మాపుకొందు. అను) ధ్రువునికి నారదుం డిట్లనియె. 236

క. పిను పుత్రక! బాలుఁడ వై, యనయంబును గ్రీడలందు నాసక్తమనం
బునఁ దిరిగెడు నిక్కాలం, బున నీ కవమాన మానములు లే వెందున్. 237

తే. కాఁగ మనమునఁ ద ద్వివేకంబు నీకు
గలిగెనేనియు సంతోషకలితు లైన
పురుషు లాత్మీయ కర్మవిస్ఫురణఁజేసి
వితత సుఖదుఃఖము లనుభవింతు రెపుడు. 238

వ. కావున వివేకంబు గల పురుషుఁడు దనకుం బ్రాప్తంబు లగు సుఖదుఃఖంబులు దైవ వశంబులుగాఁ దలంచి తావన్మాత్రంబునం బరితుష్టుం డగు. నీవును దల్లి చెప్పిన యోగమార్గ ప్రకారంబున సర్వేశ్వ రానుగ్రహంబుఁ బొందెద నంటివేని,

సీ. అనఘాత్మ! యోగీంద్రు లనయంబు ధరఁ బెక్కు జన్మంబులందు నిస్సంగ మైన
మతినిఁ బ్రయోగ సమాధి నిష్ఠలఁ జేసి యైనను దెలియలే రతనిమార్గ
మది గాన యతఁడు దురారాధ్యుఁ డగు నీవు నుడుగుము నిష్ఫలోద్యోగ మిపుడు
గాక నిశ్శ్రేయసకాముఁడ వగుదేని తండ్రి! వర్తించు తత్కాలమందుఁ

తే. బూని సుఖదుఃఖముల రెంటిలోన నేది
దైవవశమునఁ జేకుఱుఁ దానఁజేసి
డెందమునఁ జాల సంతుష్టి [1]నొందుచుండ
విమల విజ్ఞాని యన భువి [2]వెలయు డెపుడు. 240

† ఈ వచనమునకు బదులు 'ట' ప్రతిలో ఈ క్రింద పద్యములు గలవు.

గీ. సకల సౌభాగ్య సంపూర్ణ సదన సుఖము. నుడిగి యెందేగెదవు వత్స యొక్కరుఁడవ
అనఘ ! యాత్మీయ జన జనితావమాన, సంగతునిగా దలంచితి నింగితమున.

క. పరయోగసిద్ధి కొఱకై, పరమాత్మ ధ్యానమెట్లు వాటిల్లు నినున్
మఱలింపనేర సురుచి, స్థిరవాక్ దంద హ్యమాన చిత్తుఁడ వగుటన్-

1. నొందుచుండ (హ) 2. వెలయు డెపుడు (హ)

వ. మఱియు గుణాఢ్యుం డగువానిం జూచి సంతోషింపుచు, నాభాసుం డగు వానిం జూచి కరుణింపుచు, సమానునియెడ మైత్రి సలుపుచు వర్తింపుచున్న వాఁడు తాపత్రయాదికంబులం దొరంగు. అని నారదుండు పలికిన విని ధ్రువుం డిట్లనియె. అనఘా! యీ శమంబు సుఖదుఃఖ హతాత్ము లగు పురుషులకు దుర్గమం బని కృపాయత్తుండ వైన నీచేత వినంబడె. అట్లైనం బర భయంకరం బగు క్షాత్త్రి ధర్మంబు నొందిన యవినీతుండ నగు నేను సురుచి దురుక్తబాణ వినిర్భిన్న హృదయుండ నగుట మదీయ చిత్తంబున శాంతి నిలువదు. కావునం ద్రిభువనోత్కృష్టంబు,నన్యాధిష్ఠితంబు నగు పదంబును బొంద నిశ్చయించిన నాకు సాధు మార్గంబు నెఱింగింపుము. నీవు భగవంతుం డగు నజుని యూరువువలన జనియించి వీణావాదన కుశలుండ వై జగద్ధితార్థంబు సూర్యునింబోలి వర్తింతు వనిన విని,

క. నారదుఁ డిట్లను ననఘ! కు, మారక! విను నిన్ను మోక్షమార్గంబునకుఁ
బ్రేరేచిన వాఁ డిప్పుడు, ధీరజనోత్తముఁడు వాసుదేవుం డగుటన్. 242

వ. నీవు న మ్మహాత్ముని [1]నజస్ర ధ్యానప్రవణ చిత్తుండ వై భజియింపుము. 243

క. పురుషుఁడు దవిలి చతుర్విధ, పురుషార్థశ్రేయ మాత్మఁ బొందెద ననినన్
ధరఁ ద త్ప్రాప్తికి హేతువు, హరిపదయుగళంబు దక్క నన్యము గలదే? 244

వ. కావున, 245

క. వర యమునానది తటమున, † హరిసాన్నిధ్యంబు శుచియు నతిపుణ్యము నై
పరఁగిన మధువనమునకును,సరసగుణా!చనుము మేలు సమకుఱు నచటన్. 246

క. ఆ యమునాతటినీ శుభ, తోయములన్ గ్రుంకి నిష్ఠతో నచ్చట నా
రాయణునకును నమస్కృతు, లాయతమతిఁ [2]జేసి చేయు యమనియములన్.

వ. మఱియుం బాలుండ వగుటంజేసి వేదాధ్యయనా ద్యుచిత కర్మా నర్హుండ వయ్యు నుచితంబు లగు కుశాజినంబులం జేసి స్వస్తిక ప్రముఖాసనంబులం గల్పించుకొని, త్రివృత్ప్రాణాయామంబులచేతం బ్రాణేంద్రియ మనోమలం బను చాంచల్యదోషంబు ప్రత్యాహరించి స్థిరం బైన చిత్తంబున, 248

1. పదధ్యాన (క. బ. తం.)

† 'హరి సాన్నిధ్యదము' అని యుండుట లెస్స; ''సాన్నిధ్యా నిత్యదా హరే.'' అని మూలము. (8-44)

2. జేయుమయ్య (హ)

సీ. ఆశ్రిత సత్ప్రసాదాభిముఖుండును [1]స్నిగ్ధప్రసన్నాననేక్షణుండు
సురుచిర నాసుండు సుభ్రూయుగుండును సుకపోలతలుఁడును సుందరుండు
హరినీల సంశోభితాంగుండుఁ దరుణుండు నరుణావలోక నోష్ఠాధరుండు
గరుణాసముద్రుండు పురుషార్థనిధియును బ్రణతాశ్రయుండు శోభనకరుండు

తే. లలిత శ్రీవత్సలక్షణ లక్షితుండు
సర్వలోకశరణ్యుండు సర్వసాక్షి
పురుషలక్షణ యుక్తుండు పుణ్యశాలి
యసిత మేఘనిభ శ్యాముఁ [2]డవ్యయుండు. 249

వ. మఱియును. 250

సీ. హార కిరీట కేయూర కంకణ ఘన భూషణుఁ డాశ్రిత పోషణుండు
లాలిత కాంచీకలాప శోభిత కటి మండలుం డంచిత కుండలుండు
మహనీయ కౌస్తుభమణి ఘృణి చారుగ్రైవేయకుం డానందదాయకుండు
సలలిత ఘన శంఖ చక్ర గదా పద్మ హస్తుఁడు భువనప్రశస్తుఁ డజుఁడుఁ

తే. గమ్రసౌరభ వనమాలికాధరుండు
హతవిమోహుండు నవ్య పీతాంబరుండు
లలిత కాంచననూపు రాలంకృతుండు
నిరతిశయ సద్గుణుఁడు దర్శనీయతముఁడు. 251

క. సరస మనో [3]విలోచన ము, త్కరుఁడును హృత్పద్మ కర్ణికానివసిత వి
స్ఫుర దురు నఖమణి శోభిత, చరణసరోజాతుఁ డతులశాంతుఁడు ఘనుఁడున్.

వ. అయిన పురుషోత్తముం బూజింపుచు హృదయగతుండును, సానురాగ విలోక నుండును, వరదశ్రేష్ఠుండును నగు నారాయణు నేకాగ్రచిత్తంబున ధ్యానంబు సేయుచుం బరమ నివృత్తిమార్గంబున ధ్యానంబు సేయఁబడ్డ పురుషోత్తముని దివ్య మంగళ స్వరూపంబు చిత్తంబునం దగిలిన మరల మగుడనేరదు. అదియునుం గాక యే మంత్రరాజంబేని సప్తవాసరంబులు పఠియించిన ఖేచరులం గనుంగొను సామర్థ్యంబు గలుగు నట్టి ప్రణవయుక్తం బగు ద్వాదశాక్షర కలితంబును, దేశకాల విభాగవేది బుధానుష్ఠితంబును నైన వాసుదేవ మంత్రంబునం జేసి, 253

1. స్నిగ్ధ ప్రసన్నా.........(ఓ. బ. తం. వా.) 2. దచ్యుతుండు (జ) 3. నయన సము, త్కరుఁడును (హ)

సీ. దూర్వాంకురంబుల దూర్వాంకురశ్యాము జలజంబులను జారుజలజనయనుఁ
దులసీదళంబులఁ దులసికాదాముని మాల్యంబులను వినిర్మలచరిత్రుఁ
బత్రంబులను బక్షిపత్రునిఁ గడు వన్య మూలంబులను నాది మూలఘనుని
నంచిత భూర్జత్వగాది నిర్మిత వివిధాంబరంబులను [1]బీతాంబరధరు

తే. దనరుభక్తిని మృచ్ఛిలా దారు రచిత
రూపములయందుఁ గాని నిరూఢమైన
సలిలములయందుఁ గాని సుస్థలములందుఁ
గాని పూజింపవలయు నక్కమలనాభు. 253

క. ధృతచిత్తుఁడు శాంతుఁడు ని, యతపరిభాషణుఁడు సుమహితాచారుఁడు వ
ర్ణితహరిమంగళగుణుఁడును, మితవన్యాశనుఁడు నగుచు మెలఁగుచు మఱియున్.

వ. ఉత్తమశ్లోకుం డగు పుండరీకాక్షుండు నిజమాయా స్వేచ్ఛావతార చరితంబులచేత నచింత్యంబుగా నెద్ది సేయు, నద్ది హృదయగతంబుగా ధ్యానంబు సేయం దగు. మఱియుం గార్యబుద్ధిం జేసి చేయంబడు పూజావిశేషంబుల వాసుదేవ మంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింపవలయు. ఇట్లు మనో వాక్కాయ కర్మంబులచేత మనోగతం బగునట్లుగా భక్తియుక్తంబులైన పూజలచేతం బూజింపంబడి, సర్వేశ్వరుండు మాయాభిభూతులు గాక సేవించు పురుషులకు ధర్మాది పురుషార్థంబుల నభిమతార్థంబుల నిచ్చు. విరక్తుం డగువాఁడు నిరంతరభావంబైన భక్తియోగంబునం జేసి మోక్షంబు కొఱకు భజియించు. అని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రదక్షిణ పూర్వకంబుగా నమస్కరించి *(మహర్షిజన సేవ్యంబై సకలసిద్ధుల నొసంగుచు) భగవత్పాదసరోజాలంకృతంబైన మధువనంబునకుం జనియె. అంత, 256

తే. పద్మభవసూనుఁ డుత్తానపాదుకడకు
నరిగి యా రాజుచే వివిధార్చనముల
నంది సంప్రీతుఁడై యున్నతాసనమున
నెలమిఁ గూర్చుండి యాతనివలను చూచి. 257

వ. ఇట్లనియె. 258

క. భూనాయక! నీ విపుడా, మ్లానాస్యుఁడ వగుచుఁ జాల మదిలోఁ జింతం
బూనుట కేమి కతం బన, నా నారదుతోడ నాతఁ డనియెన్ మరలన్. 259

1. బీతాంబరునిని (క. చ. బ. తం.) * తా. ప. ప్రతులలో లేదు.

క. మునివర! వివేకశాలియు, ననఘుఁడు నై దేండ్లబాలుఁ డస్మత్ప్రియనం
దనుఁ డదయుఁడ నగు నాచే, తను బరిభవ మొంది చనియెఁ దల్లియుఁదానున్.

మ. చని యుగ్రాటవిఁ జొచ్చి యచ్చటఁ బథిశ్రాంతుండు క్షుత్పీడితుం
డును సంమ్లానముఖాంబుజుండు ననఘుండున్ బాలుఁడు నైన మ
త్తనయున్ ఘోర వృకాహిభల్ల ముఖ సత్త్వశ్రేణి భక్షించెనో
యని దుఃఖించెద నాదు చిత్తమున నార్యస్తుత్య! యిట్లౌటకున్. 261

తే. అట్టి యుత్తమబాలు నా యంకపీఠ
మందుఁ గూర్చుండనీక నిరాకరించి
యంగనాసక్తచిత్తుండ నైన యట్టి
నాదు దౌరాత్మ్య మిది మునినాథచంద్ర! 262

ఉ. నా విని నారదుండు నరనాథుని కిట్లను నీ కుమారుఁ డా
దేవకిరీట రత్నరుచి దీపిత పాదసరోజుఁ డైన రా
జీవదళాక్ష రక్షితుఁ డశేష [1]జగజ్జన కీర్తనీయ [2]కీ
ర్తివిభవ ప్రశస్త సుచరిత్రుఁడు వానికి దుఃఖ మేటికిన్? 263

ఉ. కావున నమ్మహాత్ముఁడు సుకర్మము చేత సమస్తలోకపా
లావళి కందరాని సముదంచిత నిత్యపదంబునన్ ప్రభు
శ్రీ విలసిల్లఁ జెందుఁ దులసీదళదాము భజించి యా జగ
త్పావనుఁడైన నీ సుతుప్రభావ మెఱుంగవు నీవు భూవరా! 264

వ. అదియునుం గాక. 265

క. నీ కీర్తియు జగములయం, దాకల్పము నొందఁజేయు నంచిత గుణ ర
త్నాకరుఁ డిట కేతెంచును, శోకింపకు మతనిఁగూర్చి సుభగచరిత్రా! 266

క. అని నారదుండు పలికిన, విని మనమున విశ్వసించి విభుఁడును బ్రియనం
దనుఁ జింతింపుచు నాదరమునఁ జూడం డయ్యె రాజ్యమునుఁ బూజ్యముగన్.

వ. అంత నక్కడ ధ్రువుండు, 268

క. చని ముందటఁ గనుఁగొనె మధు, వనము మునిదేవయోగి వర్ణిత గుణపా
వనము దుర్భవ జలదప, వనమును నిఖిలైక పుణ్యవరభవనంబున్. 269

1. జగత్పరికీర్తనీయ (క) 2. సు, శ్రీ విభవప్రశస్త (ద)

వ. అట్లు గని డాయంజని యమునానదిం గృతస్నానుం డై నియతుండును, సమాహిత చిత్తుండునునై, సర్వేశ్వరుని ధ్యానంబు సేయుచుం ద్రిరాత్రంబుల కొక్కమాఱు కృత కపిత్థ బదరీఫల పారణుం డగుచు దేహస్థితి ననుసరించి యొక్కమాసంబు హరిం బూజించి, యంతనుండి, యాఱేసి దినంబుల కొకపరి కృత జీర్ణ తృణ పర్ణాహారుం డగుచు, రెండవ మాసంబున విష్ణు సమారాధనంబు సేసి యంతనుండి నవరాత్రంబుల కొకమాఱు ఉదక భక్షణంబు సేయుచు, మూఁడవ మాసంబున మాధవు నర్చించి, యంతనుండి ద్వాదశదినంబుల కొకమాఱు వాయు భక్షణుం డగుచు, జితశ్వాసుండై నాలవమాసంబునం బుండరీకాక్షుని భజియించి, యంతనుండి మనంబున నలయక నిరుచ్ఛ్వాసుం డై యేకపదంబున నిలిచి పరమాత్మం జింతింపుచు నచేతనం బైన స్థాణువుం బలె నైదవ మాసంబునుం జరపె. అంత, 270

సీ. సకల భూతేంద్రియాశయ మగు హృదయంబునందు విషయములఁ జెందనీక
మహదాది తత్త్వ సమాజములకును నాధారభూతమును బ్రధానపూరు
షేశ్వరుఁ డై నట్టి శాశ్వత బ్రహ్మంబుఁ [1]దన సిత హృదయపద్మమున నిలిపి
హరిరూపమునకంటె నన్యంబు నెఱుఁగక చిత్త మవ్విభునందుఁ జేర్చియున్న

తే. కతన ముల్లోకములు చాలఁ గంప మొందె
వెండియును బేర్చి యయ్యర్భకుండు ధరణి
[2]నొక్కపాదంబు మోపి నిల్చున్న వేళఁ
బేర్చి యబ్బాలు నంగుష్ఠపీడఁ జేసి. 271

తే. వసుమతీ[3]తల మర్ధము వంగఁ జొచ్చె
భూరిమద దుర్నివారణ వారణేంద్ర
మెదమఁ గుడి నొరగఁగ నడుగడుగునకును
[4]జలనమొందు నుదస్థిత కలమువోలె. 272

చ. అతఁడు ననన్యదృష్టినిఁ జరాచర [5]దేహి శరీరధారణ
స్థితిగల యీశునందుఁ దన జీవితముఁ ఘటియింపఁజేసి యే
కతఁ గనఁ ద న్నిరోధమునఁ గైకొని కంపమునొందె నీశ్వరుం
డతఁడు చలింప నిజ్జగము లన్నియుఁ [6]జంచల మయ్యె భూవరా! 273

1. దనదైన (తం. వా.) 2. పాదంబుఁ జేర్చి (హ); పాదంబుచేర్చి (తం. వా.)
3. తలమును వడవడ వడంక (4) 4. జలనమొందుచు నడగెడు కలమువోలె (క. చ. ట. తం.డ. ద. బ. హ.); చలన మందు నుదస్థితకలమువోలి (జ); చలనమగు నుదధిస్థిత కలమువోలె (తం);
5. దేహశరీర ధారణా (హ.తం.వా.) 6. చంచలమందె నత్తఱిఁ (హ)

క. ఆ లోకభయంకర మగు, నాలోక మహావిప ద్దశాలోకను లై
యా లోకపాలు రందఱు, నా లోకశరణ్యుఁ గాన నరిగిరి భీతిన్. 274

వ. అట్లరిగి నారాయణు నుద్దేశించి కృతప్రణాములై కరంబులు ముకుళించి యి ట్లనిరి. 275

చ. హరి! పరమాత్మ! కేశవ! చరాచర భూతశరీరధారి వై
పరఁగుదు వీవు నిట్టులుగఁ [1]ప్రాణనిరోధ మెఱుంగ మెందు మున్
దిరముగ దేవదేవ! జగదీశ్వర! సర్వశరణ్య! నీ పదాం
బురుహము లోలిమై శరణుఁ బొందెద మార్తి హరించి కావవే! 276

వ. అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారల కి ట్లనియె. ఉత్తానపాదుం డను వాని తనయుండు విశ్వరూపుం డైన నాయందుఁ దన చిత్తం బైక్యంబుఁ జేసి తపంబు గావింపుచుండ దానంజేసి భవదీయ ప్రాణనిరోధం బయ్యె. అట్టి దురత్యయం బైన తపంబు నివర్తింపఁ జేసెద. వెఱవక మీ మీ నివాసంబులకుం జనుం డని యానతిచ్చిన నా దేవతలు నిర్భయాత్ములై యీశ్వరునకుం బ్రణామంబు లాచరించి త్రివిష్టపంబునకుం జనిరి. త దనంతరంబ, 277

## అధ్యాయము – ౯

సీ. హరి యీశ్వరుండు విహంగ కులేశ్వర యానుఁ డై నిజభృత్యుఁడైన ధ్రువునిఁ
గనుఁగొను వేడుక జనియింప నా మధువనమున కప్పుడు సని ధ్రువుండు
పరువడి యోగవిపాక తీవ్రం బైన బుద్ధిచే నిజమనోంబురుహ ముకుళ
మందుఁ దటి త్ప్రభాయతమూర్తి యటఁ దిరోధానంబునుం బొంది తత్క్షణంబ

తే. తన పురోభాగమునను నిల్చినను బూర్వ
సమధిక జ్ఞాననయన గోచర సమగ్ర
మూర్తిఁ గనుఁగొని సంభ్రమమునను సమ్మ
దాశ్రువులు రాలఁ బులకీకృతాంగుఁ డగుచు. 278

### —: ధ్రువుఁడు భగవంతుని స్తుతించుట :—

తే. నయనముల విభుమూర్తిఁ బానంబు సేయు
[2]పగిదిఁ దన ముఖమునను జుంబనము సేయు
లీలఁ దగ భుజములను నాలింగనంబు
సేయుగతి దండవ న్నమస్కృతు లొనర్చె. 279

1. నిరోధము లెందు మున్ను నే మెఱుఁగ మనాథనాథ (తం); విరోధ మెఱుంగ మెందు మున్, చిరవుగ దేవదేవ (వా); 2. పగిది గనుచును ముఖము (చ. ట. త.)

వ. ఇట్లు దండప్రణామంబు లాచరించి, కృతాంజలి యై స్తోత్రంబు సేయ నిశ్చయించియు *(స్తుతి క్రియా సమర్థుండు గాకయున్న) ధ్రువునకు సమస్తభూతంబులకు నంతర్యామి యైన యీశ్వరుండు ధ్రువుని తలం పెఱింగి, వేదమయం బైన తన శంఖంబుచేత నబ్బాలుని కపోలతలం బంటిన, జీవేశ్వర నిర్ణయజ్ఞుండును, భక్తిభావ నిష్ఠుండును నగు ధ్రువుండు నిఖిలలోక విఖ్యాతకీర్తి గల యీశ్వరుని (భగవ త్ప్రతిపాదితంబు లగుచు) వేదాత్మకంబు లైన తనవాక్కుల ని ట్లని స్తుతియించె. దేవా! నిఖిల శక్తిధరుండవు, నంతః ప్రవిష్టుండవు నైన నీవు లీనంబు లైన మదీయ వాక్యంబులం బ్రాణేంద్రియంబులం గర చరణ శ్రవణ త్వగాదులను జిచ్ఛక్తిచేఁ గృపంజేసి జీవింపంజేసిన భగవంతుండవును, పరమ పురుషుండవును నైన నీకు నమస్కరింతు. నీ వొక్కరుండ వయ్యును మహ దాద్యం బైన యీ యశేషవిశ్వంబు మాయాఖ్యం బైన యాత్మీయ శక్తిచేతం గల్పించి యందుం బ్రవేశించి, [1]యింద్రియంబులందు వసింపుచుఁ *(దత్తద్దేవతా రూపంబులచే) నానాప్రకారంబుల దారువులం దున్న వహ్నిచందంబునం బ్రకాశింతువు. అదియునుం గాక, 280

చ. వరమతి నార్తబాంధవ! భవ ద్ఘన బోధ సమేతుఁ డై భవ
చ్చరణము బొందినట్టి విధి సర్గము సృజనుండు బోధమం
దరయఁగఁ జూచురీతిఁ గను నట్టి ముముక్షుశరణ్య మైన నీ
చరణములం గృతజ్ఞుఁ డగు సజ్జనుఁ డెట్లు దలంప కుండెడున్? 281

సీ. మహితాత్మ! మఱి జన్మ మరణ ప్రణాశన హేతుభూతుండవు నిద్ధ కల్ప
తరువవు నగు నిన్నుఁ దగ నెవ్వరే నేమి పూని నీ మాయా విమోహి తాత్ము
లగుచు ధర్మార్థ కామాదుల కొఱకుఁ దా మర్థింపుచుం ద్రిగుణాభ మైన
దేహోప భోగ్య మై దీపించు సుఖముల నెనయంగ మది నిచ్ఛయింతు రట్టి

తే. విషయ సంబంధ జన్య మై వెలయు సుఖము
వారికి నిరయమందును వఱలు దేవ!
భూరి సంసారతాప నివార గుణ క
థామృతాపూర్ణ! యీశ! [2]మాధవ! ముకుంద! 282

మ. అరవిందోదర! తావకీన చరణ ధ్యానానురా గోల్లస
చ్చరి తాకర్ణనజాత భూరి సుఖముల్ స్వానందక బ్రహ్మమం

1. ఇంద్రియంబుల చేష్టింప జేయుచు (ట) * కొన్ని తా.ప. ప్రతులలో లేదు. 2. అవ్యయ (ట)

దరయఁ లేవఁట చండభృద్ధ*త విమానాకీర్ణులై కూలు నా
సురలోకస్థులఁ జెప్పనేల? సుజన స్తోమైక చింతామణీ! 283

చ. హరి! భజనీయ మార్గనియ తాత్మకులై భవదీయ[1]మూర్తిపై
వరలిన భక్తియుక్తు లగు వారల సంగతి గల్గఁజేయు స
త్పురుష సుసంగతిన్ వ్యసన దుర్భవసాగర మప్రయత్నతఁ
సరస భవత్కథామృతరసంబున మత్తుఁడనై తరించెదఁ. 284

చ. నిరతముఁ దావకీన భజనీయ పదాబ్జ [2]సుగంధలబ్ధి యె
వ్వరిమది వొందఁగా గలుగు వారలు దత్ప్రియ మర్త్య దేహము
[3]న్నరయఁ దదీయ దార తనయాది సుహృద్గృహ బంధువర్గముఁ
మఱతురు విశ్వతోముఖ! రమాహృదయేశ! ముకుంద! మాధవా! 285

సీ. పరమాత్మ! మర్త్య సుపర్వ తిర్య జ్మృగ దితిజ సరీసృప ద్విజగణాది
సంవ్యాప్తమును సదస ద్విశేషంబును గైకొని మహదాది కారణంబు
నైన విరాడ్విగ్రహంబు నే నెఱుఁగుదుఁ గాని తక్కిన [4]సుమంగళము నైన
సంతత సుమహి తైశ్వర్య రూపంబును భూరి శబ్దాది వ్యాపారశూన్య

తే. మైన బ్రహ్మస్వరూప మే నాత్మ నెఱుఁగఁ
బ్రవిమలాకార! సంసార భయవిదూర!
పరమ మునిగేయ! సంతత భాగధేయ!
నళిననేత్ర! రమాలలనా కళత్ర! 286

సీ. సర్వేశ! కల్పాంత సమయంబునందు నీ యఖిల ప్రపంచంబు నాహరించి
యనయంబు శేష సహాయుండ వై శేష పర్యంకతలమునఁ బవ్వళించి
యోగనిద్రారతి నుండి నాభీసింధుజ స్వర్ణలోక కంజాతగర్భ
మందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు రుచి నొప్పు బ్రహ్మస్వరూపి వైన

తే. నీకు మ్రొక్కెద సత్యంతనియమ మొప్ప
భవ్యచారిత్ర! పంకజపత్ర నేత్ర!
చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార!
యవ్యయానంద! గోవింద! హరి! ముకుంద! 287

* చండభృద్భట (తం. వా.) కిన్న్వంతకాసి లులితా ద్విమానాత్ (మూల) 4-9-10.

1. రూపమై (తం. వా.) 2. సుగంధలుబ్ధు, లెవ్వరి మదిఁ బొందఁగాఁ గలుగు వారలు (తం. వా.); సుగంధలబ్ధి నెవ్వరి మది (హ) 3. కరము తదీయధార సుతకామ (హ) 4. సమంగళము నైన (తం)

వ. అట్లు యోగనిద్రాపరవశుండ వయ్యును జీవులకంటె నత్యంత విలక్షణుండ వై యుండుదువు. అది యెట్లనిన, బుద్ధ్యవస్థా భేదంబున నఖండితం బైన స్వశక్తిం జేసి చూచు లోకపాలన నిమిత్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్యముక్తుండవు, పరిశుద్ధుండవు. *(సర్వజ్ఞుండవు, నాత్మవు, కూటస్థుండవు, నాది పురుషుండవు,) భగవంతుండవు, గుణత్రయాధీశ్వరుండవు నై వర్తింతువు. భాగ్యహీనుం డైన జీవునియందు నీ గుణంబులు గలవె. ఏ సర్వేశ్వరునం దేమేమి విరుద్ధగతు లై వివిధశక్తియుక్తంబులైన యవిద్యాదు లానుపూర్వ్యంబునం జేసి ప్రలీనం లగుచుండు నట్టి విశ్వకారణంబు నేకంబు ననంతంబు నాద్యంబు నానందమాత్రంబు నవికారంబు నగు బ్రహ్మంబునకు సమస్కరించెద. మఱియు దేవా! నీవు సర్వవిధ ఫలం బని చింతించు నిష్కాము లైన వారికి రాజ్యాది కామితంబులలోనఁ బరమార్థం బైన ఫలంబు సర్వార్థరూపుండ వైన భవదీయ పాదపద్మంబుల సేవనంబ. ఇట్లు నిశ్చితంబ యైనను సకాము లైన దీనులను, గోవు వత్సంబును స్తన్యపానంబు సేయింపుచు వృకాది భయంబువలన రక్షించు చందంబునం గామప్రదుండ వై సంసార భయంబువలనం బాపుదువు. అని యిట్లు సత్యసంకల్పుండును, సుజ్ఞానియు నైన ధ్రువునిచేత వినుతింపంబడి భృత్యానురక్తుం డైన భగవంతుండు సంతుష్టాంతరంగుం డై యి ట్లనియె, 288

క. ధీరవ్రత! రాజన్యకుమారక! నీ హృదయమందు మసలిన కార్యం
బారూఢిగా నెఱుంగుదు, నారయ నది వొందరాని దైనను నిత్తుఁ. 289

వ. అది యెట్టి దనిన నెందేని మేధియందుఁ బరిభ్రామ్యమాణ గోచక్రంబునుం బోలి గ్రహ నక్షత్ర తారాగణ జ్యోతిశ్చక్రంబు నక్షత్ర రూపంబులైన ధర్మాగ్ని కశ్యప [1]శక్రులును, సప్తర్షులును, [2]దారాసమేతు లై ప్రదక్షిణంబు దిరుగుచుండుదు రట్టి దురాపంబును, ననన్యాధిష్ఠితంబును, లోకత్రయ ప్రళయ కాలంబునందు నశ్వరంబు గాక ప్రకాశమానంబును నైన ధ్రువక్షితి యను పదంబు ముందట నిరువదియాఱువే లేండ్లు సనఁ బ్రాపింతువు. తత్పదప్రాప్తి పర్యంతంబు భవదీయ జనకుండు వనవాసగతుం డైనం దద్రాజ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేంద్రియుండ వై చేయుదువు. భవదనుజుం డగు నుత్తముండు మృగయార్థంబు వనంబునకుం జని మృతుం డగు. తదన్వేషణార్థంబు దదాహితచిత్త యై తన్మాతయు వనంబునకుం జని యందు దావ దహననిమగ్న యగు. వెండియు, 290

* కొన్ని తా. ప. ప్రతులలో కానరాదు. 1. శుక్రులు (చ.త.ఎ.బ.) 2. దారకాసమేతు లై (తం. వా.) ''భ్రమంతో యత్ర తారకాః'' (9-21)

సీ. అనఘాత్మ ! మఱి నీవు యజ్ఞరూపుం డనఁదగు నన్ను సంపూర్ణ దక్షిణంబు
లగు మఖంబులచేత నర్చించి సత్యంబు లగు నిహసౌఖ్యంబు లనుభవించి
యంత్యకాలమున న న్నాత్మఁ దలంపుచు మఱి సర్వలోక నమస్కృతమును
మహిఁ బునరావృత్తి రహితంబు సప్తర్షి మండలోన్నత మగు మామకీన

తే. పదముఁ దగఁ బొందఁగల వని పరమపురుషుఁ
డతని యభిలషితార్థంబు లర్థి నిచ్చి
యతఁడు గనుఁగొనుచుండంగ నాత్మపురికి
గరుడగమనుఁడు వేంచేసెఁ గౌతుకమున. 291

తే. అంత ధ్రువుఁడును బంకేరుహాక్ష పాద
కమల సేవోపసాదిత ఘనమనోర
థములఁ దనరియుఁ దనదు చిత్తంబులోనఁ
దుష్టిఁ బొందక చనియె విశిష్టచరిత్ర ! 292

వ. అట్లు, 293

క. అని మైత్రేయుఁడు ధ్రువుఁ డ
ట్లనయము హరిచేఁ గృతార్థుఁ డైనవిధం బె
ల్లను వినుపించిన విదురుఁడు
విని మునివరుఁ జూచి పలికె వినయం బెసఁగన్. 294

క. మునినాయక ! విను కాముక జన దుష్ప్రాపంబు విష్ణుచరణాంబురుహా
ర్చన [1]హితజన సంప్రాప్యము, సనఁగల పంకేరుహాక్షు నవ్యయపదమున్. 295

వ. పెక్కుజన్మంబులం గాని పొందరాని పదంబుఁ దా నొక్క జన్మంబుననే పొంది
యుం దనమనంబునం దప్రాప్తమనోరథుండ నని పురుషార్థవేది యైన ధ్రువుం
డెట్లు తలంచె ? అనిన మైత్రేయుం డి ట్లనియె, 296

తే. అనఘ ! పినతల్లి దన్నుఁ బల్కిన దురుక్తి
బాణ విద్ధాత్ముఁ డగుచుఁ ద ద్భాషణములు
చిత్తమునఁ దల్చుచుండుటఁజేసి ముక్తిఁ
గోరమికి నాత్మలో వగఁ [2]గుందుచుండె. 297

వ. అంత నా ధ్రువుండు, 298

1. మునిజన (తం. వా.) 2. గూరుచుండె (టి. వ. ఒం.)

చ. అనఘ! జితేంద్రియుల్ సుసమహితాత్ములు నైన సనందనాదు లిం
దనయ మనేకజన్మ సముపార్జిత యోగసమాధిఁ జేసి యె
వ్వని చరణారవిందములు వారనిభక్తి నెఱుంగుచుందు రా
ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజేయునాద్యునిన్. 299

వ. ఏను షణ్మాసంబులు భజియించి తత్పాదపద్మచ్ఛాయం బ్రాపించియు భేద దర్శనుండ నైతి. అక్కటా! ఇట్టి భాగ్యహీనుండ నైన యేను భవనాశకుం డైన యతనిం బొడంగనియు నశ్వరంబు లైన కామ్యంబు లడిగితి. ఇట్టి దౌరాత్మ్య మెందునుం గలదే? తమ పదంబులకంటె నున్నతపదంబు నొందుదునో? యని సహింపం జాలని యీ దేవతలచేత మదీయమతి గలుషితం బయ్యెం గాక. నాఁడు నారదుం డాడినమాట తథ్యం బయ్యె. అతని వాక్యంబు లంగీకరించక యే నసత్తముండ నై స్వప్నావస్థలం బొందినవాఁడు దైవికం బైన మాయం జెంది భిన్నదర్శనుం డగు చందంబున నే నద్వితీయుండ నైనను భ్రాత యను శత్రువుచేఁ బ్రాప్తం బైన దుఃఖంబు నొంది జగదాత్మకుండును, సుప్రసాదుండును, భవనాశకుండును నైన యీశ్వరు నారాధించి తత్ప్రసాదంబు వడసియు, నాయుర్విహీనుం డైన రోగికిం బ్రయోగించు నౌషధముంబలె నిరర్థకంబు లై *(నశ్వరంబు లయిన) యీ కామితంబులు గోరితి. అని వెండియు. 300

మ. ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ధాటిన్ ఫలీకార మి
మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుం డై నట్టి పంకేజలో
చనుఁడే చాలఁ బ్రసన్నుఁడైన నతనిన్ సాంసారికం బర్థిఁ గో
రిన నావంటి విమూఢమానసులు ధాత్రిన్ గల్గిరే? యెవ్వరున్. 301

— ధ్రువుండు మరలఁ దనపురంబునకు వచ్చుట :—

సీ. అని యిట్లు చింతించె ననుచు న మ్మైత్రేయ ముని విదురునకు ని ట్లనియెఁ దండ్రి!
కమనీయ హరిపాదకమల రజోభిసంస్కృత శరీరులును యాదృచ్ఛికముగ
సంప్రాప్త మగుదాన సంతుష్టచిత్తు లై వఱలుచునుండు మీవంటివారు
తగ భగవత్పాద దాస్యంబు దక్కంగ నితరపదార్థంబు లెడఁదలందు

తే. మఱచియును గోరనొల్లరు మనుచరిత్ర!
తవిలి యిట్లు హరిప్రసాదంబు నొంది
మరలి వచ్చుచునున్న కుమారువార్తఁ
జారుచే విని యుత్తానచరణుఁ డపుడు. 302

* కొన్ని తా. ప. ప్రతులలో లేదు.

వ. మనమున నిట్లని తలంచె.

క. చచ్చినవారలు గ్రమ్మఱ, వచ్చుటయే కాక యిట్టి వార్తలు గలవే?
నిచ్చలు నమ్మఁగఁ జన నగు, [1]దిచ్చట మఱి నాకు శుభము లేల ఘటించున్? 304

క. అని విశ్వసింప కుండియు, [2]మనమందును నారదుఁడు గుమారుఁడు వేగం
బున రాఁగలఁ డనుచును బలి, కిన పలుకులు దలఁచి నమ్మి కృతకృత్యుండై. 305

క. తన సుతుని రాకఁ జెప్పిన, ఘనునకు ధనములును మౌక్తికపుహారములున్.
మన మలర నిచ్చి తనయునిఁ, గనుఁగొను సంతోష మాత్మఁ గడలుకొనంగన్.

సీ. వలను [3]మీఱిన సైంధవంబులఁ బూన్చిన కనకరథంబు నుత్కంఠ నెక్కి
బ్రాహ్మణ కులవృద్ధ బంధుజనామాత్య పరివృతుఁ డగుచు విస్ఫురణ మెఱసి
బ్రహ్మనిర్ఘోష తూర్యస్వన శంఖ కాహళ వేణురవము లందంద చెలఁగ
శిబిక లెక్కియు విభూషిత లై సునీతి సురుచు లుత్తముండు నారూఢి నడువఁ

తే. గరిమ దీపింప నతిశీఘ్రగమన మొప్ప
నాత్మనగరంబు వెలువడి యరుగుచుండి
బలసి నగరోపవన సమీపంబునందు
వచ్చు ధ్రువుఁ గని మేదినీశ్వరుఁడు నంత. 307

చ. అరదము డిగ్గి ప్రేమ దొలఁకాడ ససంభ్రముఁ డై రమామనో
హర చరణారవిందయుగళార్చన నిర్దళితాఖిలాఘు నీ
శ్వర కరుణావలోకన సుజాత సమగ్రమనోరథున్ సుతున్
గర మనురక్తి డాసి పులకల్ ననలొత్తఁ బ్రమోదితాత్ముఁ డై. 308

తే. బిగియఁ గౌఁగిట జేర్చి నెమ్మొగము నివిరి
శిరము మూర్కొని చుబుకంబు చేతఁ బుణికి
యవ్యయానందబాష్ప ధారాభిషిక్తుఁ
జేసి యాశీర్వదింప నా చిరయశుండు. 309

క. జనకుని యాశీర్వచనము, లనయము గైకొని ప్రమోది యై తత్పదముల్
దన ఫాలతలము సోఁకఁగ, వినతులు గావించి భక్తివిహ్వలుఁ డగుచున్. 310

తే. అంత నా సజ్జనాగ్రణి యైన ధ్రువుఁడు
దల్లులకు భక్తి వినతులు దగ నొనర్చి

1. నిచ్చట (తం. వా.) 2. మనమున మును నారదుఁడు (చ) 3. మీరగ (హ)

సురుచికిని మ్రొక్క సర్భకుఁ జూచి యెత్తి
నగుమొగంబున నాలింగనంబుఁ జేసి. 311

సీ. కరమొప్ప నానందగద్గద స్వరమున జీవింపు మనుచు నాశీర్వదించె
భగవంతుఁ డెవ్వనిపై మైత్రి వాటించు సత్కృపానిరతిఁ బ్రసన్నుఁ డగుచు
నతనికిఁ దమయంత ననుకూల మైయుండు సర్వభూతంబులు సమతఁ బేర్చి
మహిఁ దలపోయ నిమ్నప్రదేశములకు ననయంబుఁ జేరు తోయములపగిదిఁ

తే. గాన ఘను న మ్మహాత్ముని గారవించె
సురుచి పూర్వంబుఁ దలఁపక సుజనచరిత!
విష్ణుభక్తులు ధరను బవిత్రు లగుట
వారి కలుగరు ధరణి నెవ్వారు మఱియు. 312

వ. కావున నుత్తముండును ధ్రువుండును ప్రేమవిహ్వలు లగుచు నన్యోన్యాలింగితులై పులకాంకురాలంకృత శరీరు లై యానంద బాష్పంబుల నొప్పిరి. అంత సునీతియుఁ దన ప్రాణంబులకంటెఁ బ్రియుం డైన సుతు నుపగూహనంబు చేసి తదవయవ స్పర్శనంబుచేత నానందంబు నొంది విగతశోక యయ్యె. అప్పుడు సంతోషబాష్ప ధారాసిక్తంబు లై చనుబాలు గురిసె. అంత, 313

సీ. ఉన్నతసంతోష ముప్పతిల్లఁగఁ బౌరజనము లా ధ్రువుతల్లి నెనయఁ జూచి
తొడరిన భవదీయ దుఃఖనాశకుఁ డైన యీ నీ తనూజుఁ డెందేని పెద్ద
కాలంబు క్రిందటఁ గడఁగి నష్టుం డైన వాఁ డిప్డు నీ భాగ్యవశముచేతఁ
బ్రతిలబ్ధుఁ డయ్యెను నితఁడు భూమండల మెల్లను రక్షించు నిద్ధమహిమఁ

తే. గమలలోచనుఁ జింతించు ఘనులు లోక
దుర్జయం బైనయట్టి మృత్యువును గెల్తు
రట్టి ప్రణతార్తి హరుఁ డైన యజ్ఞనాథుఁ
డర్థి నీచేతఁ బూజితుఁడగుట నిజము. 314

వ. అని ప్రశంసించిరి. అట్లు పౌరజనంబులచేత †నుపలాల్యమానుం డగు ధ్రువుని నుత్తానపాదుం డుత్తమ సమేతంబుగా గజారూఢునిం జేసి సంస్తూయమానుండును, ప్రహృష్టాంతరంగుడును నగుచు పురాభిముఖుం డై చనుదెంచి, 315

† "లాల్యమానం జనై రేవం ధ్రువం సభ్రాతరం నృపః,
ఆరోప్య కరిణం హృష్టః స్తూయమానో ఽవిశత్పురమ్" (మూ. 9-53)

సీ. స్వర్ణపరిచ్ఛద స్వచ్ఛ కుడ్యద్వార లాలితగోపు రట్టాలకంబు
ఫల పుష్ప మంజరీ కలిత రంభా స్తంభ పూగపోతాది విభూషితంబు
ఘనసార కస్తూరికా గంధజల బంధురాసిక్త విపణిమా ర్గాంచితంబు
మానిత నవరత్నమయ రంగవల్లీ విరాజిత ప్రతిగృహ ప్రాంగణంబు

తే. శుభనదీ జలకుంభ సంశోభితంబు
తండుల స్వర్ణలాజాక్షత ప్రసూన
ఫల [1]బలివ్రాత కలిత విభ్రాజితంబు
నగుచు సర్వతోలంకృత మైన పురము. 316

వ. ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచు నప్పుడు, 317

మ. హరిమధ్యల్ పుర[2]కామినీజనులు సౌధాగ్రంబులం దుండి భా
స్వర సిద్ధార్థఫలాక్షత ప్రసవ దూర్వావ్రాత దధ్యంబుల్
కరవల్లీ మణిహేమకంకణ ఝణత్కారంబు శోభిల్లఁ జ
ల్లిరి యా భాగవతోత్తమోత్తము నిపై లీలానుమేయంబుగన్. 318

వ. ఇట్లు వాత్సల్యంబునం జల్లుచు సత్యవాక్యంబుల దీవించుచు సువర్ణపాత్రరచిత మణిదీపనీరాజనంబున నివాళింపం *(పౌర జానపద మిత్రామాత్య బంధుజన పరివృతుం డై) చనుదెంచి, 319

సీ. కాంచనమయ మరకతకుడ్య [3]మణిజాల సంచయ రాజత సౌధములను
వర సుధా ఫేన పాండుర రుక్మ పరికర దాంతపరిచ్ఛద తల్పములను
సురతరుశోభిత శుకపిక మిథునాళి గాన విభాసితోద్యానములను
సుమహిత వైడూర్య సోపాన విమల శోభిత జలపూర్ణ వాపీచయముల

తే. వికచ కల్హార దర దరవింద కైర
వ ప్రదీపిత బక చక్రవాక రాజ
హంస సారస కారండవాది జలవి
హంగ నినదాభిరామ పద్మాకరముల. 320

వ. మఱియును, 321

1. భరవ్రాత (హ) 2. కామినుల్ సతులు (హ)
* తా. ప. ప్రతులలో లేదు.
3. మణిపరి, చ్ఛదవిరాజి స్వచ్ఛ సౌధములను (డ. తం. వా.)

తే. చారు బహువిధ వస్తు [1]విస్తరత నొప్పి
యంగనాయుక్త మగుచుఁ బెంపగ్గలించి
యర్థిఁ దనరాపు జనకు గృహంబుఁ జొచ్చె
నెలమిఁ ద్రిదివంబుఁ జొచ్చు దేవేంద్రుపగిది. 322

అధ్యాయము — ౧౦

వ. ఇట్లు ప్రవేశించిన రాజర్షి యైన యుత్తానపాదుండు సుతుని యాశ్చర్యకంబైన ప్రభావంబు వినియుం జూచియు మనంబున విస్మయంబు నొంది ప్రజానురక్తుండును, బ్రజాసమ్మతుండును, నవయౌవన పరిపూర్ణుండును నైన ధ్రువుని రాజ్యాభిషిక్తుం జేసి, వృద్ధవయస్కుం డైన తన్ను దాన యెఱింగి యాత్మ గతిఁ బొంద నిశ్చయించి విరక్తుం డై వనంబునకుం జనియె. అంత నా ధ్రువుండు శింశుమార ప్రజాపతి కూఁతు రైన భ్రమి యను దాని వివాహం బై దానివలనఁ గల్ప వత్సరు లను నిద్దఱు కొడుకులం బడసి యెండియు వాయు పుత్రి యైన యిల యను భార్యయందు నుత్కళ నామకుం డయిన కొడుకు, నతిమనోహర యైన కన్యారత్నంబునుం గనియె. అంతఁ దద్భ్రాత యైన యుత్తముండు వివాహంబు లేకుండియు, మృగయార్థంబు వనంబున కరిగి హిమవంతంబున యక్షుని చేత హతుం డయ్యె. అతని తల్లియుఁ ద ద్దుఃఖంబున వనంబున కేఁగి యందు గహనదహనంబున మృతింబొందె. ధ్రువుండు భ్రాతృ మరణంబు విని కోపామర్ష శోకవ్యాకులిత చిత్తుం డై జైత్రం బగు రథం బెక్కి యుత్తరాభిముఖుం డై చని హిమవద్ద్రోణియందు భూతగణ సేవితంబును, గుహ్యక సంకులంబును నైన యలకాపురంబు వొడగని య మ్మహాబాహుండు,

మ. ఘన శౌర్యోన్నతితోడ సర్వకకుబాకాశంబులందుఁ బ్రతి
ధ్వను లోలిన్ నిగుడంగ శంఖము మహోద్యల్లీలఁ బూరింపఁ ద
న్నినదంబున్ విని యక్షకాంతలు భయావిష్టాత్మ లై [2]రుగ్రసా
ధనులై యక్షభటుల్ పురిన్ వెడలి రుత్సాహంబు సంధిల్లఁగన్. 324

వ. ఇట్లు వెడలి యా ధ్రువునిం దాఁకిన, 325

చ. కరము మహారథుండు భుజగర్వ పరాక్రమ శాలియున్ ధను
ర్ధరుఁడును నైన యా ధ్రువుఁడు దన్ను నెదిర్చిన యక్షకోటిఁ జె

1. విస్తారములను (క. చ. బ.) 2. పోయి, చెప్పిన నయ్యక్షభటుల్......... గంభీరోద్ధతిన్నుగ్రులై (త. బ.)

చ్చెరఁ బదుమూఁడువేల నొక చీరికిఁ గైకొన కొక్కపెట్ట భీ
కరముగ మూఁడు మూఁడు శితకాండము[1]లం దగ గ్రువ్వనేసినన్. 326

ఉ. వారు లలాటముల్ వగిలి వారక [2]శోషిలి తేటి యమ్మహో
దారు పరాక్రమ ప్రకటధైర్యముఁ దత్కరలాఘవంబు ప
ల్మాఱు నుతింపుచున్ గుపితమానసులై పదవాడిత ప్రదు
ష్టోరగకోటిఁ బోలి చటులోగ్ర భయంకర రోషమూర్తులై. 327

ఉ. ఆ రథికోత్తముం దొడరి యందఱు నొక్కటఁ జుట్టుముట్టి యా
జాఱు శిలీముఖంబులఁ దదంగములన్ బగిలించి వెండి వి
స్ఫార గదా శర క్షురిక పట్టస తోమర శూల ఖడ్గముల్
సారథియుక్తుఁడైన రథిసత్తముపైఁ గురియించి రేపునన్. 328

వ. అట్లు గురియించిన నతండు, 329

క. పెంపఱియుండెను ధారా, సంపాత చ్ఛన్నమైన శైలము భంగిన్
గుంపులు గొని యాకసమునఁ,గంపింపుచు నపుడు సిద్ధగణములు వరుసన్. 330

క. హాహాకారము లెసఁగఁగ
నోహో! యీ రీతి ధ్రువ పయోరుహహితుఁడు
త్సాహము చెడి యిటు దైత్యస
మూహార్ణవమందు నేఁడు మునిఁగెనె యకటా ! 331

వ. అని చింతించు సమయంబున, 332

క. తా మాతని గెలిచితి మని, యా మనుజాశనులు పలుక నట నీహార
స్తోమము సమయించు మహో, ద్దాముం డగు సూర్యుఁ బోలి తద్దయుఁ దోఁచెన్.

వ. అట్లు దోఁచిన, 334

మ. అరిదుఃఖావహమైన కార్ముకము శౌర్యస్ఫూర్తితోఁ దాల్చి భీ
కర బాణావళిఁ బింజపింజ గరవంగా నేసి ఝుంఝానిలుం
డురు మేఘావళిఁ బాఱఁదోలుగతి నత్యుగ్రాహిత క్రూర బం
ధుర శస్త్రావళి రూపుమాపె [3]విలసద్దోర్లీల సంధిల్లగన్. 335

1. లంగములందు గుచ్చినన్ (త. జ. ద. బ.) 2. సోలియు తేలి (హ) 3. విలసద్దోర్దండ మేపారగన్ (త)

చ. మఱియును న మ్మహాత్ముఁ డసమానబలుండు మహోగ్రబాణముల్
[1]గఱిగఱిఁ దాఁకనేసి భుజగర్వ మెలర్ప విరోధివర్మముల్
[2]పఱియలు సేసి యంగములు భంగము నొందఁగఁ జేసె వ్రేల్మిడిన్
[3]గుఱికొని పర్వతంబులఁ బగుల్చు మహాశనికోటిరూపునన్. 336

వ. అయ్యవసరంబున,

చ. అలఘుచరిత్రుఁ డమ్మునికులాగ్రణిచే వికలాంగులైన [4]వా
రల సకిరీట కుండల విరాజిత మస్తకకోటిచే సము
జ్జ్వల మణికంకణాంగద లసద్భుజవర్గముచేత సంగర
స్థల మతిరమ్య మై తనరె సంచిత వీరమనోహరాకృతిన్. 338

వ. అంత హతశేషులు, 339

క. పరబలుఁ డగు మను మనుమని, శరసంఛిన్నాంగు లగుచు సమరవిముఖులై
[5]హరిరాజముఁ గని వఱచెడు, కరిబృందముఁ బోలి చనిరి కళవళపడుచున్. 340

క. అప్పుడు రాక్షసమాయలు, గప్పిన ధ్రువుఁ డసురవరుల కార్యం బెఱుఁగన్
జొప్పడక వారిఁ బొడగన, దెప్పర మగుటయును సారథిం గని యంతన్. 341

క. తలపోయఁగ భువి మాయా,వుల కృత్యం బెఱుఁగ నెవ్వ రోపుదు రనుచున్
బలుకుచుఁ దత్పురిఁ జొరఁగా, దలపఁగ నది గానరాక తద్దయు మానెన్. 342

వ. అట్లు పురంబున కరుగుట మాని చిత్రరథుం డైన యా ధ్రువుండు నప్రయత్నుం డయ్యును [6]పరప్రతియోగ శంకితుం డై యుండె. అయ్యెడ మహాజలధి ఘోషంబు ననుకరించు శబ్దంబు వినంబడె. అంత సకల దిక్తటంబుల వాయుజనితం బైన రజఃపటలంబునుఁ దత్క్షణంబున నాకాశంబున విస్ఫురత్తటిత్ప్రభాకలిత గర్జారవయుక్త మేఘంబులును నమోఘంబు లగుచు భయంకరాకారంబు లై తోఁచె. అంత, 343

మ. అనయంబున్ ధ్రువుమీఁద దైత్యకృత మాయాజాల మప్లేచి ఘో
రన మస్తిష్క పురీష మూత్రపల దుర్గంధాస్థి మేద శ్శరా
సన నిస్త్రింశ శరాసి తోమర గదా చక్ర త్రిశూలాది సా
ధన భూభృ ద్భుజగావళిం గురిసె నుద్దండ క్రియాలోలతన్. 344

1. గఱక (హ) 2. పరిపరిజేసి (క. త. చ. బ.) 3. గిఱికొని పర్వతంబుల నొగిం దెగఁ గొట్టెడు నింద్రు కైవడిన్ (హ); "గిరీ నశనయో యథా" అని మూలము (10-17) 4. వా, రలము (త) 5. హరియక్షముగని (క.చ.ద.బ.) 6. పరోద్యోగ (క.బ.); పరప్రయోగ (హ)

వ. మఱియును మత్తగజ సింహ వ్యాఘ్ర సమూహంబులును, నూర్మిభయంకరం బై సర్వతః ప్లవనం బైన సముద్రంబును గానంబడియె. వెండియుం గల్పాంతంబు నందుం బోలె భీషణం బైన మహోగ్రహ్రదంబును దోఁచె. ఇవ్విధంబున నానావిధంబుల ననేకంబులు నవిరళ భయంకరంబులు నైన యసురమాయలు క్రూర ప్రవర్తను లగు యతులచేత సృజ్యమానంబులై యడరె. ఆ సమయంబున, 345

క. [1]అనయంబును న య్యతుల, ఘనమాయ నెఱింగి మునినికాయము వరుసన్ మను మనుమని మను మనుమని, మనమునఁ దలఁపుచును దత్సమక్షంబునకున్.

వ. చనుదెంచి యిట్లనిరి. 347

సీ. అనఘాత్మ! లోకు లెవ్వని దివ్యనామంబు సమత నాకర్ణించి సంస్మరించి
దుస్తరంబైన మృత్యువునైన సుఖవృత్తిఁ దరియింతు రట్టి యీశ్వరుఁడు పరుఁడు
భగవంతుఁడును శార్ఙ్గపాణియు సతసుజనార్తి హరుండును నైన విభుఁడు
భవదీయ విమతులఁ బరిమార్చుఁగా కని పలికిన మునుల సంభాషణములు

తే. విని కృతాచమనుఁడు రమావిభుని పాద
కమలము దలంచి రిపుభయంకర మహోగ్ర
కలిత నారాయణాస్త్రంబు గార్ముకమునఁ
బూనఁ దడవఁ దదీయ సంధానమునను. 348

అధ్యాయము — ౧౧

తే. కడఁగి గుహ్యక మాయాంధకార మపుడు
వెరవు చెడి దవ్వు దవ్వుల విరిసిపోయె
విమల మైన వివేకోదయమునఁ జేసి
సమయు రాగాదికంబుల సరణి నంత. 349

మ. వరనారాయణ దైవతాస్త్ర [2]భవ దుర్వారప్రభా హేమపుం
ఖ రుచిస్ఫార మరాళరాజ సితపక్ష క్రూరధారా [3]పత
చ్ఛరసాహస్రము లోలి భీషణ విపక్షశ్రేణిపై వ్రాలె భీ
కరరావంబునఁ గానఁ జొచ్చు శిఖిసంఘాతంబు చందంబునన్. 350

వ. అ ట్లేసిన, 351

1. అనయము మాయావ్యసురుల (హ) 2. జని (హ); నారాయణ బాణరాడ్జనిత (లం)
3. రణత్ (వ. ద. తం.)

చ. [1]ఖర నిశితోగ్ర సాయకనికాయ నిరంతరవృష్టిచేఁ బొరిం
బొరి వికలాంగులై యసురపుణ్యజనుల్ పృథుహేతిపాణు లై
గరుడునిఁ జూచి భూరి భుజగప్రకరంబు లెదిర్చి పేర్చి చె
చ్చెర నడతెంచు చందమునఁ జిత్రరథుం బలుపూని తాఁకినన్. 352

ఉ. వారలఁ జండ తీవ్ర శరవర్గముచేత నికృత్త పాదజం
ఘోరు శిరోధరాంబక శిఖోదర కర్ణులఁ జేసి యోగిపం
కేరుహ మిత్రమండల [2]సకృద్భిద [3]నెట్టిపదంబుఁ జెందు నా
భూరిపదంబునం బెలుచఁ బొందఁగఁ [4]బంపె భుజావిజృంభి యై. 353

వ. ఇవ్విధంబున నా చిత్రరథుం డగు ధ్రువునిచేత నిహన్యమానులును నిరపరాధులును నైన గుహ్యకులం జూచి యతని పితామహుం డైన స్వాయంభువుండు ఋషిగణ పరివృతుం డై చనుదెంచి ధ్రువునిం జూచి యి ట్లనియె. వత్సా! నిరపరాధు లైన పుణ్యజనుల నెట్టిరోషంబున వధియించితి వట్టి నిర్హేతు వైన రోషంబు చాలు. భ్రాతృవత్సల! భ్రాతృవధాభితప్తుండ వై కావించు నీ యత్నం బుడుగుము. 354

క. అనఘా! మనుకులమున కిది, యనుచితకర్మంబ యొకనికై పెక్కండ్రి
ట్లనిమొనఁ ద్రుంగిరి యిది నీ, కనయంబును వలవ దుడుగుమయ్యా! కుమారా!

వ. అదియునుం గాక దేహాభిమానంబునం బశుప్రాయు లై భూతహింస గావించుట హృషీకేశానువర్తను లైన సాధులకుం దగదు. నీవు సర్వభూతంబుల నాత్మభావంబునఁ దలఁచి సర్వభూతావాసుఁడును, దురారాధ్యుండును నైన విష్ణుని పదంబులు పూజించి తత్పరమపదంబును బొందితివి. అట్టి భగవంతుని హృదయంబున ననుధ్యాతుండవు, భాగవతుల చిత్తంబులకును సమ్మతుండవు, మఱియు సాధువర్తనుండవన నొప్పు నీ వీ పాపకర్మం బెట్లు సేయ సమకట్టితివి? ఏ పురుషుం డైన నేమి? మహాత్ములయందుఁ దితిక్షయు, సములయందు మైత్రియు, హీనులయందుఁ గృపయు, నితరము లగు సమస్తజంతువుల యందు సమత్వంబును గలిగి వర్తించు వానియందు సర్వాత్మకుం డైన భగవంతుండు ప్రసన్నుం డగును. అతండు ప్రసన్నుం డైన వాఁడు ప్రకృతిగుణంబులం బాసి లింగశరీరంబు భంగంబుఁ గావించి బ్రహ్మానందంబునుం బొందు. అదియునుంగాక

1. ఖరనిశిత ప్రదీప్త ఘనకాండ (త. బ.) 2. నికృత్తత (క. చ. ట. జ. బ.) 3. నేపద మందుజెందు (క. బ.) 4. జంపె (క. చ. జ. ద. బ.)

కార్యకారణ సంఘాతరూపం బైన సర్గం బీశ్వరునందు నయస్కాంత సన్నిధా
నంబు గలిగిన లోహంబు చందంబున వర్తించు. అందు సర్వేశ్వరుండు నిమిత్త
మాత్రంబుగాఁ బరిభ్రమించు. అట్టి యీశ్వరుని మాయాగుణ వ్యతికరంబున
నారబ్ధంబు లైన పంచభూతంబులచేత యోషిత్పురుష వ్యవాయంబువలన
యోషిత్పురుషాది రూపసంభూతి యగు. ఇవ్విధంబున సర్గంబు, దత్సంస్థానంబు,
దల్లయంబు నగుచు నుండు. ఇట్లు దుర్విభావ్యం బైన కాలశక్తిం జేసి గుణ
క్షోభంబున విభజ్యమానవీర్యుండు, ననంతుండు, ననాదియు నై జనంబులచేత
జనంబులఁ బుట్టింపుచుండుటం జేసి గదా యాదికరుండు, మృత్యుహేతువున
జనంబుల లయంబు నొందించుటం జేసి యంతకరుండు, ననాది యగుటం జేసి
యవ్యయుండు నైన భగవంతుండు జగత్కారణుం డగు. కావున నీ సృష్టి
పాలన విలయంబులకుం గర్త గానివాఁడుం బలెం దానిం జేయుచుండు. ఇట్లు
మృత్యురూపుండు, పరుండు, సమవర్తియు నైన యీశ్వరునికి స్వపక్ష పరపక్షం
బులు లేవు. కర్మాధీనంబు లైన భూతసంఘంబులు రజంబులు మహావాయువు
ననుసరించు చాడ్పున నస్వతంత్రంబు లగుచు నతని ననువర్తించు. ఈశ్వరుండు
జంతుచయాయు రుపచయాపచయ కారణంబులం దస్పష్టుం డగుచు జీవుండు
గర్మబద్ధుం డగుటం జేసి వానికి నాయు రుపచయాపచయంబులం జేయుచుండు.
మఱియు సర్వజగత్కర్మసాక్షి యగు సర్వేశ్వరుని, 356

క. కొందఱు స్వభావ మందురు, కొందఱు గర్మం బటండ్రు గొందఱు కాలం
బందురు కొందఱు దైవం, బందురు కొంద ఱది కామ మండ్రు మహాత్మా! 357

వ. ఇట్టి లవ్యక్తరూపుండును, నప్రమేయుండును, నానా శక్త్యుదయ భూత
హేతుండును నైన భగవంతుండు సేయు కార్యంబుల బ్రహ్మరుద్రాదు లెఱుంగ
రన నతని తత్త్వంబు నెవ్వ రెఱుంగనోపుదురు? కావునం బుత్రా! యిట్లుత్పత్తి
నాశంబులకు దైవంబ కారణం బై యుండుఁ గాన నీ ధనదానుచరులు భవదీయ
భ్రాతృహంత లగుదురే? భూతాత్మకుండు భూతేశుండు భూతభావనుండు
సర్వేశ్వరుండు పరాపరుండు నగు నీశుండ మాయాయుక్తుం డై స్వశక్తిచే సృష్టి
స్థితి లయంబులం జేయు. ఐన ననహంకారంబునం జేసి గుణకర్మంబులచే
నస్పృశ్యుం డగుచు వర్తించు. అదియునుం గాక యీ ప్రజాపతులు విశ్వసృ
డ్నామంబుల నియంత్రితు లై ముకుఁదాళ్లు వెట్టిన పశువులం బోలి యెవ్వని
యాజ్ఞాధీనకృత్యు లై వర్తింతు రట్టి దుష్టజన మృత్యువు, సుజనామృత
స్వరూపుండు, సర్వాత్మకుండు, జగత్పరాయణుండు నైన యీశ్వరుని సర్వ
ప్రకారంబుల శరణంబుఁ బొందుము. అదియునుం గాక, 358

సీ. అనఘాత్మ ! నీవు పంచాబ్దవయస్కుండ వై పినతల్లి నిన్నాడినట్టి
మాటల నిర్భిన్న మర్ముండ వగుచును జనయిత్రి దిగనాడి వనము కేఁగి
తప మాచరించి యచ్చపు భక్తి నీశ్వరుఁ బూజించి పహితవిభూతి మెఱసి
[1]ప్రకట త్రిలోకో త్తరం బైన పదముఁ బొందితి వదిగాన [2]పూని భేద
తే. రూప మైన ప్రపంచంబు రూఢి నే మ
హాత్మునందుఁ బ్రతీత మై యలరు నట్టి
యగుణుఁ డద్వితీయుండును నక్షరుండు
నైన యీశ్వరుఁ బరమాత్ము ననుదినంబు. 359

సీ. కైకొని శుద్ధంబు గతమత్సరాదికం బమలంబు నగు హృదయంబునందు
నొలయ కన్వేషింపుచును బ్రత్యగాత్ముండు బరబ్రహ్మమయుఁడు
నానంద మాత్రుండు నవ్యయుండుపపన్న సకలశక్తియుతుండు నగుణుఁ డజుఁడు
నైన సర్వేశ్వరు నం దుత్తమం బైన సద్భక్తిఁ జేయుచు సమత నొప్పి
తే. [3]రూఢిని 'నహ మ్మమ' యని ప్రరూఢ మగుచు
[4]ఘనత కెక్కు నవిద్యయన్ గ్రంథి నీవు
ద్రెంచి వైచెదు గావున ధీవరేణ్య !
సర్వశుభహాని యైన రోషంబు వలదు. 360

క. †విను రోషహృదయు [5]చేతను, ననయము లోకము నశించు [6]నౌషధములచే
ఘన [7]రోగములు నశించిన, యనువున నదిగాన రోష మణఁపు మహాత్మా! 361

తే. అనఘ ! విను నీ సహోదరహంత లనుచుఁ
బెనఁగి యీపుణ్యజనులఁ జంపితి కడంగి
పరఁగ నిదియె సదాశివ భ్రాత యైన
యర్థవిభునకు నపరాధ మయ్యెఁ గాన. 362

క. [8]నతి నుతులచే నీ విపుఁ, డతనిఁ బ్రసన్నునిఁగఁ జేయు మని మనువు దయా
మతిఁ జెప్పి ధ్రువునిచే సత్కృతుఁ డై [9]రయ మొప్పఁజనియె ఋషియుక్తుం డై. 364

వ. అంత,

1. రమణ (హ) 2. భూరి (హ) 3. ఘనతకెక్కు నవిద్యయన్ గ్రంథి నీవు (ద. తం. వా.)
4. రూఢి సోహమ్మమేతి ప్రరూఢ మగుచు (తం. వా.); రూఢి సోహమ్మమ యని——(హ);
† సంయచ్ఛ రోషం భద్రంతే ప్రతీపం శ్రేయసాంపరమ్
శ్రుతేన భూయసా రాజ న్నగదేన యథాఽమయమ్. (11-31)
5. గనుగొని (హ) 6. నతిభయయుత మై (హ) 7. రోగమౌషధంబుల (హ) 8. ధృతి (హ)
9. నయ మొప్ప (హ)

అధ్యాయము — ౧౨

తే. *యక్ష చారణ సిద్ధ విద్యాధరాది
జనగణ స్తూయమానుఁ డై ధనదుఁ డంతఁ
బుణ్యజన వైశస నివృత్తు భూరిరోష
రహితుఁ డై నట్టి ధ్రువునిఁ జేరంగ వచ్చె. 365

సీ. చనుదెంచి వెసఁ గృతాంజలి యై ధ్రువునిఁ జూచి తివుట నిట్లనియె క్షత్త్రియ కుమార !
తగ భవదీయ పితామహాదేశంబునను దుస్త్యజం బైన ఘనవిరోధ
[1]ముడిగితి వట్లుగాపునఁ దానఁజేసి నీయందుఁ బ్రసన్నుండ నైతి భూత
జనన లయంబుల కనయంబుఁ గాలంబె కర్తయై వర్తించుఁ గాన యుష్మ

తే. దనుజుఁ జంపినవార లీ యక్షవరులు
గారు తలపోయ నీ యక్షగణము నిట్లు
నెఱి వధించినవాఁడవు నీవు గావు
వినుతగుణశీల ! మాటలు వేయునేల ? 366

వ. అదియునుం గాక యే బుద్ధింజేసి కర్మసంబంధ దుఃఖాదికంబులు దేహాత్మాను సంధానంబునం జేసి సంభవించు నట్టి యహం త్వ మ్మను నపార్థజ్ఞానంబు స్వప్న ఋందుం బలెను పురుషునకుం దోఁచు. అది గావున సర్వభూతాత్మవిగ్రహుం డును, నధోక్షజుండును, భవచ్ఛేదకుండును, భజనీయ పాదారవిందుండును, ననంతామేయ శక్తియుక్తుండును, గుణమయాత్మ మాయావిరహితుండును నైన యీశ్వరుని సేవింపుము. నీకు భద్రంబయ్యెడు. భవదీయ మనోగతం బైన వరంబు గోరుము.నీ వంబుజనాభ పాదారవింద సేవనంబుఁ దిరంబుగఁ జేయుదు వని యెఱుంగుదు. అని రాజరాజుచేత నిట్లు మహామతియు, భాగవతోత్త ముండు నైన ధ్రువుండు ప్రేరేపింపబడి యే హరిస్మరణంబుచేత నప్రయత్నం బున దురత్యయం బైన యజ్ఞానంబుం దరియింతు రట్టి హరిస్మరణం బచలితం బగున ట్లొసంగు మని యడిగిన నట్లకాక యని యంగీకరించి యంతఁ గుబేరుండు సంప్రీతచిత్తుం డై ధ్రువునికి శ్రీహరిస్మరణం బట్ల యనుగ్రహించి యంతర్ధా

* చ. ట. ద. ద. ప్రతులలో ఈ క్రింది పద్యమున్నది.
'అంత ధ్రువుడు వరకృపాయత్తచిత్తుడై, గుహ్యకులను యక్షకోటి జూచి
అభయ మిచ్చి కాని యర్థేశు గనుగొన, దలచి యలుక మాని యలక జొచ్చె.'

1. ఉడిగితి వటుగాన యొనరంగ నిపుడు నీ (తం. వా.)

సంబునొందె. అంత ధ్రువుండు యక్ష కిన్నర కింపురుషగణ సంస్తూయమాన వైభవుం డగుచు నాత్మీయపురంబునకు మరలి చనుదెంచి, 367

సీ. గణుతింప భూరిదక్షిణలచేఁ గడు నొప్పు యజ్ఞముల్ సేయ న య్యజ్ఞవిభుఁడు
ద్రవ్యక్రియాదేవతా ఫల రూప స త్కర్మఫల ప్రదాతయును నైన
పురుషోత్తముని నర్థిఁ బూజించి మఱియు సర్వోపాధివర్జితుఁ డుత్తముండు
సర్వాత్మకుం డగు జలజాక్షునందుఁ దీవ్రంబుం బ్రవాహరూపంబు నైన

తే. భక్తి సలుపుచు [1]భూతప్రపంచమందు
నలరఁ దనయందు నున్న మహాత్ము హరినిఁ
జిదచిదానందమయుని [2]లక్ష్మీశుఁ బరము
నీశ్వ రేశ్వరుఁ బొడగనె నిద్ధచరిత! 368

వ. ఇట్లు సుశీలసంపన్నుండును, బ్రహ్మణ్యుండును, ధర్మసేతు రక్షకుండును, దీన వత్సలుండును నై యవనిఁ బాలించు ధ్రువునిం బ్రజలు దండ్రి యని తలంప నిరువది యాఱువే లేండ్లు భోగంబులచేతం బుణ్యక్షయంబును, నభోగంబు లయిన యాగాదులచేత నశుభక్షయంబునుఁ జేయుచు బహుకాలంబు దనుకఁ ద్రివర్గసాధనంబుగా రాజ్యంబుచేసి కొడుకునకుం బట్టంబు గట్టి యచలితేంద్రియుం డై యవిద్యారచిత స్వప్నగంధర్వనగరోపమం బైన దేహాదికం బగు విశ్వంబు భగవన్మాయా రచితం బని యాత్మం దలంపుచు వెండియు, 369

చ. మనునిభుఁ డంత భృత్యజన మంత్రి పురోహిత బంధు మిత్ర నం
దన పశు విత్త రత్న వనితా గృహ రమ్యవిహార శైల వా
రినిధి పరీత భూతల హరి ద్వీపముఖ్య పదార్థజాలముల్
ఘనమతిచే ననిత్యములుగాఁ దలపోసి విరక్తచిత్తుఁ డై. 370

సీ. పురము వెల్వడి చని †పుణ్యభూ బదరికా ఘన విశాలానదీకలిత మంగ
ళాంబుపూరంబుల ననురక్తి మైఁ గ్రుంకి కమనీయ పరిశుద్ధ కరణుఁ డగుచుఁ
[3]బద్ధాసనస్థుఁడై పవనుని బంధించి నెలకొని ముకుళితనేత్రుఁ డగుచు
[4]హరి రూపవైభవ ధ్యానంబు సేయుచు భగవంతు నచ్యుతుఁ బద్మనేత్రు

1. అఖిల (హ. తం. వా.) 2. లక్ష్మీపరుఁ (తం. వా.)
† ప్రయయౌ విశాలమ్. (మూలము 12.16) విశాలామ్ = బదరికాశ్రమమ్ (వ్యా.)
3. పద్మాసనస్థుఁడై (హ. తం. వా.) 4. నచలితమతి హరిధ్యానంబు సేయుచు (త)

తే. నందు సతతంబు నిశ్చల మైన యట్టి
భక్తిఁ బ్రవహింపఁ జేయుచుఁ బరమ మోద
బాష్పధారాభిషిక్తుండు భవ్యయశుఁడు
పులకితాంగుండు నగుచు నిమ్ములఁ దనర్చె. 371

వ. మఱియు విగతక్లేశుండును, ముక్తలింగుండును నై ధ్రువుండు దన్నుఁ దా మఱచియుండు సమయంబున దశదిక్కుల నుద్యద్రాకానిశానాయకుం బోలె వెలింగింపుచు నాకాశంబుననుండి యొక్క విమానంబు చనుదేర నందు దేవ శ్రేష్ఠులును, జతుర్భుజులును, రక్తాంబుజేక్షణులును, శ్యామవర్ణులును, గదాధరులును, సువాసస్సులును, గిరీట హారాంగద కుండలధరులును, కౌమార వయస్కులును, నుత్తమశ్లోకకింకరులును నైన వారల నిద్దఱిం గని సంభ్రమంబున లేచి మధుసూదను నామంబులు సంస్మరింపుచు వారల భగవత్కింకరులుగాఁ దలంచి దండప్రణామంబు లాచరించిన కృష్ణ పాదారవింద విన్యస్త చిత్తుండుఁ గృతాంజలియు వినమితకంధరుండు నైన ధ్రువునిం గనుంగొని పుష్కరనాభ భక్తులైన సునందనందులు ప్రీతియుక్తులు మందస్మితులు నగుచు ని ట్లనిరి. 372

ఉ. ఓ నృప! నీకు భద్ర మగు నొప్పగుచున్న మదీయవాక్యముల్
వీనులయందుఁ జొన్పుము వివేకముతో నయిదేండ్లనాఁడు మే
ధానిధి వై యొనర్చిన యుదాత్త తపోవ్రతనిష్ఠచేతఁ దే
జోనయశాలి యైన మధుసూదనుఁ దృప్తి వహింపఁజేయవే? 373

ఆ. అట్టి శార్ఙ్గపాణి యఖిలజగత్కర్త
దేవదేవుఁ డతుల దివ్యమూర్తి
[1]పార్షదులము మేము భగవత్పదంబున
కర్థి నిన్నుఁ గొనుచు నరుగుటకును. 374

వ. వచ్చితిమి. ఏ పదంబునేని సూరిజనంబులు సర్వోత్తమం బని పొందుదురు. దేనిఁ జంద్ర దివాకర గ్రహ నక్షత్ర తారాగణంబులు ప్రదక్షిణంబుగాఁ దిరుగుచుండు, నేది నీ పితరులచేతను నన్యులచేతను ననధిష్ఠితంబును, జగద్వంద్యంబును, నభక్తజనాతిదుర్జయంబును నగు నట్టి విష్ణుపదంబుఁ బొందుదువు రమ్ము. ఇది విమాన శ్రేష్ఠంబు. ఉత్తమశ్లోకజన మౌళిమణియైన శ్రీహరి పుత్తెంచె. దీని నెక్క నర్హుండ

1. మమ్ముఁ బనుప మేము మాధవు పదమున (హ. తం. వా.)

వనిన సురుక్రమప్రియుం డైన ధ్రువుండు తన్మధురవాక్యంబులు విని కృతాభిషిక్తుం డై యచ్చటి మునులకుం బ్రణమిల్లి చ దాశీర్వాదంబు గైకొని విమానంబునకుం బ్రదక్షిణార్చనంబులు గావించి పార్షదు లైన సునందనందులకు నందనం బాచరించి *(భగవద్రూప విన్యస్త చక్షు రంతఃకరణాదికుం డగుచు నా విమానాధిరోహణంబు గావించుటకు) హిరణ్మయరూపంబు ధరియించె.

క. సురదుందుభి పణ వానక, మురజాదులు మొరసె విరులమును గురిసెఁ గిన్నర గంధర్వుల పాటలు, భరితము లై చెలఁగె నపుడు భవ్యచరిత్రా! 376

వ. *(అట్టి సమయంబున ధ్రువుండు దుర్గమం బగు త్రివిష్టపంబునకు నేగువాఁ డగుచు దీనయగు జననిం దిగనాడి యెట్లు పోవుదు నని చింతించువానిఁ బార్షదు లవలోకించి యగ్రభాగంబున విమానారూఢ యై యేగుచున్న జననిఁ జూపిన సంతుష్టాంతరంగుం డగుచు), 377

క. †[1]జనని సునీతిని [2]మును గనుఁగొని యమలవిమాన మెక్కి గొనకొని విబుధుల్ దనమీఁదఁ బుష్పవర్షము, లనయము గురియింప ధ్రువుఁడు హర్షముతోడన్.

క. చని చని వెస గ్రహమండల, మునుఁ దైత్రిలోక్యంబు సప్తముని మండలమున్ ఘనుఁ డుత్తరించి యవ్వలఁ, దనరెడు హరిపదము నొందెఁ దద్దయుఁ బ్రీతిన్. 378

వ. అది మఱియును నిజకాంతిచేతం ద్రిలోకంబులం బ్రకాశింపంజేయుచు నిర్దయాగమ్యంబును, శాంతులు, సమదర్శనులు, (శుద్ధులు,) సర్వభూతానురంజనులు, నచ్యుతభక్త బాంధవులు నైన భద్రాచారులకు సుగమ్యంబును నై గంభీర వేగంబు ననిమిషంబు నగు జ్యోతిశ్చక్రంబు సమాహితం బయి గోగణంబు మేధియందుం బలె నెందుఁ బరిభ్రమించుచుండు నట్టి యచ్యుత పదంబునుం బొంది విష్ణుపరాయణుం డైన ధ్రువుండు త్రిలోకచూడామణి యై యొప్పుచుండె. అప్పుడు భగవంతుం డైన నారదుండు ధ్రువుని మహిమం గనుంగొని ప్రచేత స్సత్రంబునందు వీణ వాయింపుచు. 380

* కొన్ని తా. ప. ప్రతులలో లేదు.

† ''ఇతి వ్యవసితం తస్య వ్యవసీయ సురోత్తమౌ,
దర్శయామాసతు ర్దేవం దేవయానేన గచ్ఛతమ్''—మూలము (12-32)

1. జనకునిమున్ను సునీతిఁడుకొని (క) 2. మున్నిడుకొని (చ. బ.)

సీ. పతియె దైవంబుగా భావంబులోపలఁ దలఁచు సునీతినందను [1]తపఃప్ర
భావము బలె ధర్మభవ్యనిష్ఠలఁ బొందఁ జాలరు బ్రహ్మర్షి జనము లనిన
క్షత్త్రియకులు లెన్నఁగానేల ? యెవ్వఁడు పంచసంవత్సర ప్రాయముననె
సురుచి దురుక్త్యుగ్రశర భిన్నహృదయుఁడై మద్వాక్య హితబోధ మతిఁ దనర్చి

తే. వనమునకు నేగి హరిభక్తి వశత నొంది
యజితుఁ డగు హరిఁ దనవశుఁడై చరింపఁ
జేసి వెసఁ దత్పదంబునుఁ జెందె నిట్టి
హరిపదంబును బొంద నెవ్వరికిఁ దరము ? 381

క. అని పాడె ననుచు విదురున కనఘుఁడు మైత్త్రేయుఁ డనియె నంచితభక్తిన్
వినుతోద్దామయశస్కం, డనఁగల యా ధ్రువుని చరిత మార్యస్తుత్యా ! 382

సీ. మహిత సత్పురుష సమ్మతమును ధన్యంబు స్వర్గప్రదంబు యశస్కరంబు
నాయుష్కరంబుఁ [2]బుణ్య ప్రదాయకమును మంగళకర మఘమర్షణంబు
సౌమనస్యముఁ బ్రశంసాయోగ్యమును బాపహరమును ధ్రువపద ప్రాపకంబు
నై యొప్పు నీ యుపాఖ్యానంబుఁ దగ నీకు నెఱిఁగించితి దీని నెవ్వఁడేని

తే. తివుట శ్రద్ధాగరిష్ఠుఁడై తీర్థపాద
చరణసరసీరుహ ద్వయాశ్రయుఁడు నగుచు
భవ్యచరిత [3]దినాంత ప్రభాతవేళ
[4]లను సినీవాలి పూర్ణిమలందు మఱియు. 383

తే. ద్వాదశినిఁ బద్మబాంధవ వాసరమున
శ్రవణ నక్షత్రమున దినక్షయమునందుఁ
బరఁగ సంక్రమణ వ్యతీపాతలందు
సభల భక్తిని విను నట్టి సజ్జనునకు. 384

వ. క్లేశనాశంబును, మహాప్రకాశంబును నైన భగవద్భక్తియు, శీలాదిగుణంబులును గలుగు. మఱియుఁ దేజఃకామునకుఁ దేజంబును, నిష్కామునకుఁ దత్త్వజ్ఞానంబును గలుగు. వినిపించువారికి దేవతానుగ్రహంబు గలుగు. ఇట్టి యుపాఖ్యానంబు నీ కెఱిఁగించితి. అని మైత్త్రేయుండు విదురునకుఁ జెప్పిన క్రమంబున శుకయోగి

1. తపః ప్రభావము క్రియ (తం. వా.) 2. పుణ్యం బధికంబును (క. బ.) 3. సాయంప్రభాత ములను (జ) 4. నలఘుమతి పౌర్ణిమాస్యలయందు మఱియు (చ.ట.త.జ.); నలఘుమతిఁ బూర్ణిమా...... (తం. వా.)

పరీక్షిత్తున కెఱింగించిన తెఱంగున సూతుండు శౌనకాదులకు వినుపించి వెండియు ని ట్లనియె. అట్లు చెప్పిన మైత్రేయునిఁ గని విదురుం డి ట్లనియె. 385

## అధ్యాయము—౧౩

సీ. అనఘాత్మ! నారదమునిపతి ధ్రువచరిత్రము ప్రచేతసుల సత్రంబునందు
సర్థిమైఁ గీర్తించె నంటి ప్రచేతసు లన నెవ్వ? రెవ్వనితనయు? లెట్టి
వంశజుల్? సత్ర మెవ్వలనుగాఁజేసి? ర[1]ధ్వరమందు నిజకులధర్మశీలు
రగు ప్రచేతసులచే యజియింపఁబడునట్టి యజ్ఞపూరుషుఁ డగు నచ్యుతాంఘ్రి

తే. భక్తియుక్తుఁడు విదిత సద్భాగవతుఁడు
దివిరి హరిపాదసేవానిధి ప్రయుక్త
దేవదర్శనుఁ డగు నట్టి దివ్యయోగి
[2]నారదుఁడు పొగడె నఁట! శ్రీనాథు కథలు. 386

క. నా కిపు డెఱిఁగింపుము సు, శ్లోకుని చరితామృతంబు శ్రోత్రాంజలులం
బై కొని జుఱ్ఱియుఁ దనివిం, గై కొనకున్నది మనంబు కరుణోపేతా! 387

క. అని యడిగిన విదురునిఁ గనుఁ, గొని మైత్రేయుండు వలికెఁ గొనకొని ధ్రువుఁడుఁ
వనమునకుఁ జనిన నాతని, తనయుం డగు నుత్కలుండు గళితాఘుండై. 388

సీ. చతురుఁ డాజన్మ ప్రశాంతుండు నిస్సంగుఁడును సమదర్శనుండును ఘనుండు
నై యాత్మయందు లోకావళి లోకంబులందు నాత్మయుఁ జూచు ననఘ మైన
యనుపమ యోగక్రియా పావకాదగ్ధ కర్మ మలాశయకలనఁ బేర్చి
జడుని కైవడిఁ జీఁకుచందంబునను [3]మూకు పగిది నున్మత్తునిభంగిఁ జెవిటి

తే. వడువునను గానఁబడుచు సర్వజ్ఞుఁ డై ప్ర
శాంతకీలహుతాశనుకరణిఁ బొల్చి
సతతశాంతంబు నంచితజ్ఞానమయము
నైన బ్రహ్మస్వరూపంబు నాత్మఁ దలచి. 389

క. తనకంటె నితర మొక టెఱుఁగ, గనికతమున సార్వభౌమక శ్రీఁ బొందఁ
మనమునఁ గోరకయుండుటఁ, గని కులవృద్ధులును మంత్రిగణములు నంతఁ.

1. యాగంబునను నిజాచారశీలు (హ) 2. నారదుం డెట్టు గొనియాడె శౌరికథలు (హ.తం.వా.)
3. మూఢు (హ. తం. వా.)

వ. అతని సున్మాత్తునింగాఁ దెలిసి తపనుజుం డైన వత్సరునికిఁ బట్టంబు గట్టిరి వత్సరునికి సర్వర్ధి యను భార్యయందుఁ బుష్పార్ణుండు, చంద్రకేతు నిషుండు, మార్జుండు, వసువు, జయుండు నన నార్వురు తనయులు గలి అందుఁ బుష్పార్ణుం డనువానికి ప్రభయు, దోషయు నన నిద్దఱు భార్య అందుఁ బ్రభ యను దానికిం బ్రాత ర్మధ్యందిన సాయంబులను సుతత్రయం దోష యనుదానికిఁ బ్రదోష నిశీథ వ్యుష్టు లనువారు ముగ్గురును బు అందు వ్యుష్టుం డనువానికిఁ బుష్కరిణి యను పత్నియందు సర్వతేజుఁ సుతుండు పుట్టె. వానికి నాకూతి యను మహిషివలనఁ జక్షుస్సంజ్ఞుం మనువు జనించె. వానికి నడ్వల యను భార్యయందుఁ బురువు, కుత్స ద్రితుండు, ద్యుమ్నుండు, సత్యవంతుండు, ఋతుండు, వ్రతుండు, అగ్ని ముండు, అతిరాత్రుండు, ప్రద్యుమ్నుండు, శిబి, ఉల్ముకుండు నను పన్ని తనయులు గలిగిరి. అందు నుల్ముకునికిఁ బుష్కరిణియనుదానివలన నంగు సుమనసుండు, ఖ్యాతియుఁ, గ్రతువు, నంగిరసుండు, గయుండు నను నార కొడుకులు పుట్టిరి. అందు నంగునికి సునీథ యను ధర్మపత్ని వలన వేనుం పుత్రుం డుదయించిన,

మ. క్షితినాథోత్తముఁ డాత్మనందనుని దుశ్శీలంబు వీక్షించి దుః
ఖితుఁ డై యొంటిగఁ బత్తురిఁ వెడలి యేఁగెఁ వేగ నెందేని త
ద్గతి నీక్షించి మునీశ్వరుల్ గుపితు లై దంభోళిసంకాశ వా
క్యతతిఁ జావ శపింప వాఁ డపుడు వీఁకం గూలె న మ్మేదినిఁ.

సీ. కైకొని యపుడు లోకం బరాజక మైనఁ బ్రజలు తస్కరపీడఁ బల్లటిల్ల
గనుఁగొని దుఃఖించి మునులు గతాసుఁ డై పడిన వేనుని వలపలి భుజంబు
నర్థి మథింప నారాయణాంశంబున నాదిరా జన నొప్పునట్టి పృథుఁడు
జనియించె ననవుడు విని విదురుఁడు మునిఁ గనుఁగొని పలికె నోయనఘచ

తే. సాధువు సుశీలనిధియును సజ్జనుండు
నలఘు బ్రహ్మణ్యుఁడును నై న యట్టి యంగ
ధరణివిభునకు దుష్టసంతాన మెట్లు
గలిగె ? న య్యంగపతి యేమి కారణమున.

వ. విమనస్కుం డగుచుఁ బురంబు విడిచె? ధర్మకోవిదు లై న మునులు దండ ధరుండును రాజును నగు వేనునియందు నే పాపంబు నిరూపించి *(బ

1. మహాత్ముం డనంగ (హ) * తా. ప. ప్రతిలో లేదు.

దండం బొనర్చిరి) అదియునుంగాక లోకంబుల రాజులు లోకపాల తేజో ధరులు (*(బజాపాల నాసక్తులును) గావునఁ గల్మషంబు గలిగినం బ్రజలచేత [1]ననవధ్యేయు లై యుందురు కావున నా వేనుని చేష్టితంబులు శ్రద్ధాగరిష్ఠుండు భక్తుండు నైన నాకుం బరావర విదగ్రేసరుండ వైన నీ వెఱింగింప నర్హుండ వనిన మైత్రేయుం డతని కి ట్లనియె. 395

## :— అంగపుత్రుం డగు వేనుని చరిత్రము :—

సీ. అనఘాత్మ! రాజర్షి యైనట్టి య య్యంగమేదినీవిభుఁ డశ్వమేధమఖము
గావింప ఋత్విజ్నికాయంబుచేత నాహూతమయ్యును సురవ్రాతమందు
నాత్మహవిర్భాగ మంద రాకుండిన నప్పుడు ఋత్విక్కు లద్భుతంబు
నందుచు యజమానుఁ డైన య య్యంగమహీవరుఁ జూచి రాజేంద్ర! యిట్లు

తే. త్రిదశు లిదె పిల్వఁబడియు సంప్రీతి నాత్మ
భాగములఁ బొంద రారై రి భవ్యచరిత!
యేమిహేతువొ? యిది మాకు నెఱుఁగఁజెప్పు
కడఁగి హోమంబు దుష్టంబు గాదు మఱియు. 395

వ. శ్రద్ధాయుక్తు లై ధృతవ్రతులై యీ బ్రహ్మవాదులచేత [3]యోజితంబు లైన యీ ఛందస్సులు వీర్యవంతంబు లై యున్నయవి. ఇందు దేవతాపరాధం బణు మాత్రం బైన నెఱుంగము. ఇట్టిచోటం గర్మసాక్షు లైన దేవతలు స్వకీయ భాగంబు లంగీకరింప కుండుటకుఁ గతం బెయ్యదిమో? యనిన న య్యంగుఁడు దుఃఖితస్వాంతుం డై త న్నిమిత్తంబు సదస్యుల నడుగం దలంచి *(వారల యనుమతిం బడసి) మౌనంబు మాని యి ట్లనియె, 396

ఆ. అనఘచరితులార! యాహూతు లయ్యు ను
పర్వగణము లాత్మభాగములను
స్వీకరింప రేను జేసిన యపరాధ
మెట్టి? దనిన వార లిట్టు లనిరి. 397

క. నరనాథ! యిదియు నిప్పుడు, పొరసిన దుష్కృతము గాదు పూర్వభవమునఁ
బరఁగిన దురితం బిది [2]యా, దరమున నెఱిఁగింతు మింత ధన్యచరిత్రా! 398

క. నీ వింతవాఁడ వయ్యును, భూవర! సంతానలాభమునుఁ బొందమి నా
దేవతలు యాగభాగము, లీ వేళ భుజింప రై రి యిందుకు నీవుఁ. 399

1. అవజ్ఞానష్టులయి (హ) 2. సంప్రయుక్తంబులైన (హ) 3. నీ, కెఱిగింతుము విన గదయ్యా యిద్ధచరిత్రా (క)

తే. పుత్రకామేష్టిఁ గావించి పుత్రుఁ బడయు
మట్లు చేసిన దేవత లాత్మభాగ
మర్థి నంగీకరింతు ర య్యజ్ఞపురుషు
హరి భజించిన సకలకార్యములుఁ గలుగు. 400

వ. అనిన నాతండు సంతానార్థంబు శిపివిష్టదేవతాకం బైన పురోడాశంబుచే హోమంబు గావించినం దదీయ హోమకుండంబునందు హేమమాల్యాంబరుం డైన పురుషుండు హిరణ్మయ పాత్రంబున సిద్ధపాయసంబు గొనుచు నుదయించిన నప్పుడు విప్రానుమతంబున రాజు త త్పాయసంబు నంజలిచే గ్రహించి యాఘ్రాణించి సంతోషయుక్తుం డగుచు భార్య కొసంగె. అంత, 401

చ. కమలదళాక్షి పాయసము కౌతుకమొప్ప భుజించి [1]భర్తృ సం
గమమునఁ జేసి తత్క్షణమ గర్భము దాల్చి కుమారుఁ గాంచె స
క్కొమరుఁడు నంత మాతృజనకుం డగు మృత్యువుఁ [2]బోలి తా నధ
ర్మమునఁ జరింపుచుండె గుణమండన! వేనుఁ డనంగ నిచ్చలున్. 402

చ. ఎనయఁగ బాల్యమందుఁ దన యీడు కుమారులఁ గ్రీడవోలె నె
మ్మనమున భీతిలేక కృపమాని పశుప్రకరంబు నొంచు పో
ల్కిన నరికట్టి చంపుచును గిల్బిష లుబ్ధకవృత్తిమై శరా
సన శరముల్ ధరించి మృగజాతి నసాధుగతిన్ వధింపుచున్. 403

వ. ఇట్లు పాపవర్తనుండై చరియించు కొడుకుం జూచి యంగుండు వివిధ శాసనంబుల దండించియు నతని దుశ్చేష్టితంబును మానుపం జాలక దుఃఖితాత్ముం డై మనంబున. 404

క. అనయము నిట్టి కుపుత్రునిఁ, గని పరితాపమును బొందుకంటెను ధరలో
ననపత్యుం డగు టొప్పును, వనజాక్షు భజించునట్టివాఁ డగువాఁడున్. 405

వ. అని వెండియు నిట్లనియె. 406

సీ. జనులకు దుష్పుత్రకునిచేత నపకీర్తియు నధర్మమును సర్వజనవిరోధ
మును మనోవ్యథయును [3]మునుకొని ప్రాపించు నట్టి కుపుత్రుమోహంబు విడువఁ
జాలక బహుమాన సంగతిఁ గను నెవ్వఁ డతని గేహంబు దుఃఖాలయంబు
నగు నని మఱియు నిట్లను మనుజుండు శోకస్థాన మగు పుత్రుకతనఁ జేసి

1. భవ్య (హ) 2. బోలుచున్న ధర్మమున (క.చ.డ.ద.బ.) 3. ననయము (క.తం.వా.)

తే. యనుపమ క్లేశభాజనం బైన గృహము
విడుచుఁ గావున నిట్టి వివేకహీనుఁ
డగు కుపుత్రు సుపుత్రుఁగా నాత్మఁ దలఁతు
ననుచు నా రాజు బహుదుఃఖితాత్ముఁ డగుచు. 407

క. తగు [1]మహదైశ్వర్యోదయ, మగు గృహమును [2]బ్రజల నిద్ర నందిన భార్యన్
దిగవిడిచి యెక్కడేనియు, జగతీశుఁడు చనె నిశీథ సమయమునందున్. 408

వ. అంతఁ దద్వృత్తాంతం బంతయు సుహృద్బాంధవ పురోహితామాత్య ప్రభృతు
లైన ప్రజ లెఱింగి †దుఃఖింపుచున్న తదనంతరంబ. 409

అధ్యాయము — ౧౪

సీ. సమధిక బ్రహ్మనిష్ఠాతి గరిష్ఠులౌ భృగ్వాది మౌనీంద్ర బృంద మపుడు
[3]లోకావనైకావలోకనోత్సుక మౌట జనులు స్వరక్షక జనవిభుండు
లేమిఁ బశుప్రాయు లై మెలంగుటఁ గని యంత వేనునిమాత యగు సునీథ
యనుమతి నఖిల ప్రజావళి కప్రియుం డైన న వ్వేనుఁ బట్టాభిషిక్తుఁ

తే. జేసె నంతట మహితోగ్రశాసనుఁ డగు
వేనుఁ బట్టంబు గట్టుట విని సమస్త
తస్కరులు సర్పభీతిచేఁ దలఁగు మూష
కముల కైవడిఁ గడఁగిరి గహనములకు. 410

వ. అంత నతండు. 411

చ. పరువడి నష్టలోకపరిపాలక ముఖ్య విభూతియుక్తుఁ డై
పరఁగి నృపాసనంబున విభాసితుఁ డౌట స్వభావసిద్ధ మై
వఱలు మహావలేపమున వారక సంతత మాననీయ స
త్పురుషుల నెల్ల నెందుఁ బరిభూతులఁ జేయుచు నుండె నిచ్చలున్. 412

1. సుమహైశ్వర్యోదయ (తం. వా.) 2. ప్రబల (డ) 3. కై కొని లోకరక్షకులగుట నిజలోక
జనరక్షకుండగు జనవిభుండు (క. జ. బ.)

† ఈ క్రిందివాక్యము తం. వా. ప్రతులలోను, మూలములోను నున్నది. వ్రాఁతప్రతులలోలేదు.

దుఃఖించుచు భూమియం దెల్ల యెడలఁ దదన్వేషణం బాచరించి గూఢుండైన పరమపురుషునిం
గానలేని కుయోగి చందంబున నారాజుం బొడగానలేక విఫలోద్యోగులయి మగిడి పురంబునకు వచ్చిరి.
తదనంతరంబ.

చ. మఱియు నతండు భూ గగనమార్గములం దొకవేళ నొక్కఁడే
యరదము నెక్కి గ్రుమ్మరు నిరంకుశవృత్తిఁ జరించు మత్తసిం
ధురవిభుపోల్కి సత్పురుషదూషిత వర్తన నొప్పుచుఁ నిరం
తర సుజనాపరాధ కృతితత్పర మానసుఁడై క్రమంబునన్. 413

క. దివ్యులు వెఱఁగందఁగఁ బృ, థ్వీవ్యోమము లగల భేరి వ్రేయించె "[1]నయ
ష్టవ్య మదాతవ్య మహో, తవ్యం విప్రాయ" యను చుదాత్త ధ్వనులన్. 414

క. అని యిట్టులు భేరీరవ, మునఁ జేసి సమస్త ధర్మములు వారింపన్
మును లవినీతుం డగు వే, నుని దుశ్చరితంబు జనమనోభయ మగుటన్. 415

తే. కని కృపాయత్తు లగుచు నిట్లనిరి యిట్టి
రాజచోరభయంబు లీ భూజనులను
బలిసి యిరువంకలను బాధ పఱుపఁజొచ్చె
దారువందుల వహ్ని చందమునఁ బెలుచ. 416

చ. అరయ నరాజకం బగు మహాభయముం [2]దొలఁగించు వార మై
*కర మతదర్హు గర్హితుని క్ష్మాపతిఁ జేసినయట్టి దోషమున్
బరువడిఁ జెందె దుగ్ధరసపానమునం బరివృద్ధి నొందు న
[3]య్యురగభయంబు పోషకుని నొందినరీతి ననర్థహేతువై. 417

వ. అదియునుం గాక, 418

క. మునుకొని సునీథ గర్భం, బున జనియించియు స్వభావమున దుర్జనుఁడై
యెనయఁ బ్రజాపాలనమున, కును బాల్పడి ప్రజల [4]మనికిఁ గొనఁజొచ్చెఁగదే!

వ. అదిగాన యీ వేనుండు పూర్వంబున జ్ఞానసంపన్నుల మైన మనచేత రాజుగాఁ జేయంబడియె. ఇట్టివాని మన మందఱమును గూడి ప్రార్థింతము. లోకరక్షణార్థంబు గావునఁ దద్దోషంబు మనల స్పృశింపదు. సమీచీనోక్తులం జేసి వీని ననునయింప వాని గ్రహింప కుండెనేనియు మున్న లోకధిక్కారాగ్ని సందగ్ధుం డగు వీని మన తేజోమహాగ్నిచేత భస్మీభూతుం జేయుదము. అని (యాలోచించి గూఢమన్యు లగుచు)వేనునిం గదియం జని యతని కిట్లనిరి. 420

1. న యష్టవ్యం దాతవ్యం హోతవ్యం విప్రాయ యను నుదాత్త ధ్వనులన్. (హ)
2. దొలఁగింపఁ గోరి యిట్లెఱుఁగక యీ యనర్హుని మహీపతిఁ జేసినయట్టి (తం. వా.)
* అరాజక భయాదేష కృతో రాజాఽతదర్హణః (1'-9).
3. ఉరగముభీతి (తం. వా.) ఉరగము నై జపోషకుని నొంచినరీతి (హ) 4. మన్నిగొనఁజొచ్చె తం. వా.)

క. నరపాలక! నీ కాయువు, సిరియును బలమును యశంబు చేకుఱు వృద్ధిన్
బొరయుదు గా కనుచు మనో, హరమ్ముగ నాశీర్వదించి యతివినయమునన్,

వ. ఇట్లనిరి. నరేంద్రా! యే మొక్కటి విన్నవించెదము. అవధరింపుము. పురుషులకు వాఙ్మనః కాయ వృత్తులవలన నాచరించు ధర్మంబు సమస్తలోకంబుల విశోకం బులం జేయు. అసంగులైన వారికి మోక్షంబు నిచ్చు. అట్టి ధర్మంబు ప్రజలకు క్షేమకారణంబు గావున నీయందుఁ జెడకుండుం గాక యని పలికి, మఱియు ధర్మంబు నాశంబునొందిన నైశ్వర్యంబుచే రాజు విడువంబడు. అనిచెప్పి వెండియు నిట్లనిరి. దుష్టచిత్తులగు నమాత్యులవలనను దస్కరులవలనను బ్రజలు నాశంబు నొందకుండ రక్షించుచు *(యథాన్యాయంబుగ వారలచేఁ గరంబుగొనుచు నుండు) మహీపతి యిహపరసౌఖ్యంబుల నందు. అదియునుం గాక యెవ్వని రాష్ట్రంబుననేని పురంబుననేని యజ్ఞేశ్వరుండైన పురుషోత్తముండు నిజవర్ణాశ్రమోచితంబైన ధర్మంబు గలవారిచేత యజియింపంబడు నట్టి నిజశాసనవర్తి యగు రాజువలన సర్వభూతభావనుండు మహాభాగుండు భగవంతుండు నగు సర్వేశ్వరుండు సంతుష్టుం డగు. అట్టి సకలజగదీశ్వరుండైన సర్వేశ్వరుండు సంతోషించిన రాష్ట్రాధిపతికి సర్వసౌఖ్యంబులుఁ బ్రాపించు. లోకపాలకులగు వారు సర్వేశ్వరునికొఱకు బలిప్రదానంబులు సేయుదురు. సమస్తలోక దేవతా యజ్ఞాది సంగ్రహుండు, వేదమయుండు, ద్రవ్యమయుండు, దపోమయుండు నగు నారాయణుని విచిత్రంబులైన యజ్ఞంబులచేత యజనంబు చేసిన నీకు నభయం బగు. మోక్షంబును గలుగు. కావున నీ రాజ్యంబున మఖంబులు సేయు మని యాజ్ఞాపింపుము. నీ దేశంబునం జేయంబడిన యజ్ఞంబులచేత హరికళా యుక్తంబు లగు దేవగణంబులు (స్విష్టంబులై) తుష్టంబు లగుచు భవదీయ వాంఛితార్థంబు లిత్తురు గావున దేవతా తిరస్కారంబు నీకు యుక్తంబు గాదు. (వేదచోదితంబు లగు ధర్మంబులం దాసక్తుండవు గమ్ము.) అనిన వేనుం డిట్లనియె. 422

క. మునులార! మీర లిప్పుడు, నను నీగతిఁ బడుచుఁదనమునం బలికితిరై
నను, మీర లధర్మముఁ దగ, ననయము ధర్మం బటంచు ననియెద రైనన్. 423

వ. అదియునుం గాక. 424

చ. ఎనయఁగ జారకామిని నిజేశుని మ్రుచ్చిలి జారపూరుషున్
దనపతిఁగా దలంచుగతిఁ దద్దయు మూఢమనస్కులై తన

* తా. ప. ప్రతులలో లేదు. బాలిశా బత యూయం వో అధర్మే ధర్మమానినః (4. 14. 23)
అది యధర్మ మందుల నెనయఁగ ధర్మమనఁ గలదె యెచ్చటనైనన్ (తం. వా.)

ర్చిన సరసాలరూపము ధరించిన యీశ్వరు నన్నెఱుంగ క
న్యుని భజియింప మీ రిహపరోన్నత సౌఖ్యము లంద రెన్నఁడుఁ౯.

వ. అని మఱియు నిట్లనియె. యజ్ఞపురుషుం డన నెవ్వఁ డెవ్వనియందు మీకు
స్నేహంబు లుదయించె. భర్తృస్నేహ విదూరంబు లై కుయోషిద్గణ
జారునందు చేయు భక్తిచందంబునఁ బలికెదరు. అదియునుం గాక.

క. హరి హర హిరణ్యగర్భ, స్వ రధీశ్వర వహ్ని శమన జలధిపతి మరు
న్నరవాహన శశి భూ రవి, సురముఖ్యులు నృపశరీర సూచకు లగుట౯.

క. పరికించి నను భజింపుఁడు, ధరణీశుఁడు సర్వదేవ తామయుఁ డగు మ
త్పర ముడుగుఁడు నాకంటెను, బురుషుఁడు మఱియెవ్వఁ డగ్రపూజార్హుఁ

వ. అదిగాక మీరు నాయందు బలివిధానంబులు సేయుఁడు, అని పాపకర్ముం
అసత్రవర్తకుండును, నష్టమంగళుండును, విపరీతజ్ఞానుండును నగు వే
*(పండితమాని యగుచుం) బలికి మునులవచనంబులు నిరాకరించి
కుండిన మునులు భగ్నమనోరథు లై తమలో నిట్లనిరి. ఈ దారుణకర్మ
పాపుండు హతుండు గాక జీవించెనేని వీనిచేత నీజగంబులు భస్మంబులు గా
ఇది నిశ్చయంబు. (దుర్వృత్తుం డగు) వీఁడు మహారాజ సింహాసన
కర్హుండుఁగాడు, ఇతండు నే సర్వేశ్వరు ననుగ్రహంబున నిట్టి విభూతియ
దయ్యె నట్టి యజ్ఞపతి యైన శ్రీవిష్ణుని నిందింపు చున్నవాఁడు గావున
దైన హరిదూషకుని హననంబు సేయవలయు. అని మును లుద్యోగించి,
ప్రకాశితం బైన క్రోధంబునం జేసి హుంకార మాత్రంబున నా యీశ్వర
హతుం డగు వేనునిం బొలియఁ జేసి రంత.

క. అరయ సునీథయు శోకా, తుర యై తనసుతుఁడు తనువుఁ దొఱఁగినఁ ద
తరమునను యోగశక్తి౯ బరువడి [1]నిజతనయు తనువుఁ బరిపాలించె౯.

వ. అంత నొక్కనాఁడు.

సీ. మునివరేణ్యులు భక్తి దనర సరస్వతీ సలిలంబులను గృతస్నాను లగుచ
మునుకొని త త్తీరమున నగ్నిహోత్రముల్ విలసిల్ల నియతిఁ గావించి య
దవిలి సత్పురుష కథా వినోదంబులు సలుపుచు నుండంగ సకలలోక
భయదంబు లగు మహోత్పాతముల్ దోఁచిన మసలి లోకంబు లమంగళ

* కొన్ని తా. ప. ప్రతులలో లేదు.

1 నిజరాజ్యు మరసి పరిపాలించె౯ (క. చ. జ. ఎం.)

తే. పొరయకుండెడుఁ గాకని బుద్ధిలోనఁ
దలఁపుచుండఁగఁ బెలుచ నుపద్రవ మగుచు
సర్వదిశలను బాంసువర్షంబు గురిసెఁ
దస్కరులు సర్వజనుల విత్తములు గొనిరి. 432

వ. ఇట్టి లోకోపద్రవం బెఱింగి జననాథుం డుపరతుం డగుటం జేసి జనపదంబు లరాజకంబు లై యన్యోన్యహింసల నొందుచుం దస్కరబాధితంబు లగుచు నుండుట యెఱింగియుఁ దన్నివారణంబునకు సమర్థు లయ్యును జోరాది బాధలం గనుంగొనుచు మునులు వారింపక యుండిరి. సమదర్శనుండును, శాంతుండును, మననశీలుండును నగు బ్రాహ్మణుండు దీనుల నుపేక్షించిన, నతనితపంబు భిన్నభాండగతం బైన క్షీరంబు చందంబున [1]స్రవించుం గావున నంగదేశాధీశ వంశోద్భవులు హరిపదాశ్రయు లగుటం జేసియు, నమోఘ సత్త్వనిష్ఠు లగుటంజేసియు, వీరల వంశంబు విచ్ఛిత్తినొందింప ననర్హంబు గాన స్థాపనీయం బని నిశ్చయించి, మృతుం డైన వేనుని కళేబరంబు డగ్గఱ వచ్చి తదూరుమథనంబు గావింప నందు. 433

సీ. ఘన కాకకృష్ణసంకాశ వర్ణుండును హ్రస్వావయవుఁడు మహాహనుండు
హ్రస్వబాహుండును హ్రస్వపాదుండును నిమ్న నాసాగ్రుండు నెఱయు రక్త
నయనుండుఁ దామ్రవర్ణ శ్మశ్రుకేశుండు నతిదీన వదనుండు నైనయట్టి
యొక్క నిషాదకుం డుదయించి యేమిచేయుదు? నని పలుకుచునున్నఁ జూచి

తే. వరమునులు 'నిషీద' యనుచుఁ బలుకుటయును
దాన వాఁడు నిషాదాభిధానుఁ డయ్యె
నతనివంశ్యులు గిరికాననలందు వేను
కల్మషము [2]చెర్పుచుండిరి కడఁక మఱియు. 434

అధ్యాయము—౧౫

క. [3]కని వా రనపత్యుం డగు, మనుజేంద్రుని బాహు లంత మథియించిన నం
దనఘం బగు నొక మిథునము, జనియించెను సకలజనులు సమ్మద మందన్. 435

1. క్షయించున్ (హ. వం. వా.) "స్రవతే బ్రహ్మ తస్యాసి భిన్నభాండా త్పయో యథా" (14. 41) 2. తెల్పుచుండిరి (హ. వం. వా.) "తస్య వంశాస్తు నైషాదా గిరికానన గోచరాః యే నాహర్జయమానో వేన కిల్బిష ముల్బణమ్ (14.47) 3. అనయము ననపత్యుఁడు నగు (క.చ.తం.)

వ. అందు లోకరక్షణార్థంబుగా నారాయణాంశంబున నొక పురుషుండును, హరికి
నిత్యానపాయిని యగు లక్ష్మీకళాకలితయు, * (గుణంబులకు భూషణంబు
లకు నలంకార ప్రదాత్రియు నగు) కామినియు జనియించె. అందుఁ బృథుశ్ర
వుండును, బృథుయశుండు నగుట నతండు పృథుచక్రవర్తి యను పేరం బ్రసిద్ధుం
డయ్యె. అంగనయు నర్చి యను నామంబునం దనరుచు నతని వరియించె.
ఆ సమయంబున. 436

సీ. అందంద గురియించి రమరులు మునినాథవితతి మోదంబంద విరులవానఁ
బరమానురక్తి శుంభల్లీలఁ జూపట్టె సురపతి వీట నచ్చరలయాట
కర్ణరసాయన క్రమమున వీతెంచెఁ బఱపైన తేట కిన్నరులపాట
యనిమిష కరహతం బై చాలఁ జెలఁగెను [1]విభవోత్సవంబు దుందుభిరవంబు

తే. మునినుతి చెలంగె [2]శిఖి గుండముల వెలింగె
నంత నచటికి సరసీరుహాసనుండు
గరుడ గంధర్వ కిన్నర గణముతోడ
నర్థిఁ జనుదెంచె సంతోష మతిశయిల్ల. 437

వ. అంత. 438

**కవిరాజ విరాజితము :**

అరయఁగ వైన్యుని దక్షిణహస్తమునందు [3]రమారమణీ సుమనో
హర లలితాయుధచిహ్నము పాదములందు సమగ్ర హలాంకుశ భా
స్వరకులిశ ధ్వజ చాప సరోరుహ శంఖ విరాజిత రేఖలు వి
స్ఫురగతి నొప్పఁ బితామహముఖ్యులు చూచి సవిస్మయులై మఱియున్. 439

వ. *(ఇతండు నారాయణాంశ సంభూతుండు నితని యంగన రమాంశసంభూతయుం
గా నొప్పుదు రని తలంచిరి. అ య్యవసరంబున బ్రహ్మవాదులగు బ్రాహ్మణోత్తము
లతనికి విధ్యుక్త ప్రకారంబున రాజ్యాభిషేకంబు [4]గావించు సమయంబున.) 440

క. సరిదంభోనిధి ఖగ మృగ, ధరణీ సురవర్త్మ పర్వత ప్రముఖము లై
పరఁగిన భూతశ్రేణులు, నరవరునకుఁ దగు నుపాయనము [5]లిచ్చె నొగిన్. 441

---

* కొన్ని తా. ప. ప్రతులలో లేదు.

1. ప్రభవోత్సవకర దుందుభి రవంబు (హ) 2. రవిచంద్రములు వెలింగె (క. చ. ట. త. జ.)
3. రమారమణీయమనో, హర లలితాయుధ చిహ్నము లంఘ్రుల (తం. వా.) 4. కావించిరి తదనం
తరంబ (చ. తం. వా.) 5. లిచ్చిరొగిన్ (హ)

తే. సమధికఖ్యాతి నా పృథుచక్రవర్తి
దేవి యగు నర్చితోఁ గూడ దివ్యవస్త్ర
గంధ మాల్య [1]ప్రభూషణకలితుఁ డగుచుఁ
బావకునిఁ బోలి సత్ప్రభాభాసి యయ్యె. 442

సీ. రాజరాజు పృథురాజుకు హేమమయం బైన వీరవరాసనంబు
జలపతి జలకణ స్రావకం బగు పూర్ణచంద్ర సన్నిభ సితచ్ఛత్రకమును
బవమానుఁ డతులశోభన మగు వాలవ్యజనసమంచిత సిత చామరములు
ధర్ముండు నిర్మలోద్య త్కీర్తిమయ మగు మహనీయ నవపుష్ప మాలికయును

తే. జంభవైరి కిరీటంబు శమనుఁ డఖిల
జన నియామక దండంబు జలజభవుఁడు
నిగమమయ కవచమును వాణీలలామ
[2]యచ్ఛ మగు నవ్యహారంబు లిచ్చె మఱియు. 443

సీ. దామోదరుండు సుదర్శనచక్రంబు నవ్యాహతైశ్వర్య మబ్జపాణి
[3]చంద్రార్ధధరుఁడును జంద్రమండల దశ కమనీయ కోశసంకలిత ఖడ్గ
మంబిక శతచంద్ర మను [4]జోడు చందురు డమృతమయ శ్వేత హయచయంబుఁ
ద్వష్ట రూపాశ్రయోదాత్త రథంబును భానుండు ఘృణిమయ బాణములును

తే. [5]శిఖియు నజగోవిషాణ సంచిత మహాజ
గవ మనం దగు చాపంబు నవనిదేవి
యోగమయ మైన పాదుకాయుగము గగన
చరులు గీతంబు లిచ్చిరి సంతసమున. 444

వ. వెండియుం బ్రతిదినంబు నాకాశంబు పుష్పంబులు గురియింప మహర్షులు సత్యంబులైన యాశీర్వచనంబులు సలుప సముద్రుండు శంఖంబును, నదంబులు పర్వతంబులు నదులును రథమార్గంబులు నొసంగె. తదనంతరంబ సూత మాగధ వంది జనంబులు దన్ను నుతియించినం (బ్రతాపశాలి యగు) నవ్వైన్యుండు మందస్మిత సుందరవదనారవిందుం డై చతురవచనరచనుం డగుచు మేఘ గంభీర భాషణంబుల ని ట్లనియె. 445

1. విభూషణ (తం. వా.) 2. స్వచ్ఛమగు నవ్యహారంబు సమత నిచ్చె (క. బ. తం. వా.) 3. చంద్రార్ధధరుం డర్ధచంద్ర రేఖాంకిత (క.చ.త.తం.వా.) "దశ చంద్ర మసిం రుద్రః" (15-17) 'దశ చంద్రాకారాణి బింబాని కోశే యస్య త మసిం ఖడ్గం' (వ్యా) 4. ఫలకము జంద్రుఁడు (హ. తం. వా.) 5. శిఖి యజా గో విషాణ (క. త. డ. ద. బ.)

సీ. వందిమాగధ సూతవరులార ! నాయందుఁ గమనీయగుణములు గలిగెనేని
యర్థంబు నుతిఁజేయ నవి లేవు నాయందు నదిగాన మీ నుతి వ్యర్థమయ్యె
నిటమీఁద గుణముల నేపారియుండిన నపుడు [1]నుతించెద రగుట మీరు
[2]సభ్యనియుక్తులై చతురత నుత్తమశ్లోకుని గుణము లస్తోక భూప్ర

తే. సిద్ధములు గాన సన్నుతిసేయుఁ డజుని
నతని బహువిధ [3]భావంబు లభినుతింప
నలవిగాకయె యుండుదు రదియుఁ గాక
చతురమతులార ! మాగధజనములార ! 446

వ. మఱియు మహాత్ముల గుణంబులు దనయందు సంభావితంబులు సేయ సామ ర్థ్యంబు గలిగిన నందు మహాత్ముల గుణంబులు ప్రసిద్ధంబులు గావునం దత్సమం బుగా నెట్లు నుతింపవచ్చు ? ఎవ్వండే నొకండు శాస్త్రాభ్యాసంబునం దనకు విద్యా తపో యోగ గుణంబులు గలుగు నని పలికిన, వానిం జూచి సభ్యులు పరిహసింతురు. (అది కుమతి యగు వాఁ డెఱుఁగండు.)అదియునుం గాక. 447

క. [5]అతి పరిశుద్ధులు లజ్జా, న్వితులు మహోదారు లధికనిర్మలు లాత్మ
స్తుతి పరనిందలు దోషము, లతిహేయము లని తలంతు రాత్మల నెపుడున్. 448

క. వందిజనంబులు [6]లోకము, లందున విదితవరకర్ము లగు భూపతులన్
నందించు టవశ్యం బై, నం దగదు నుతింప శిశుజనంబుల పగిదిన్. 449

అధ్యాయము — ౧౬

క. అన సూత వంది మాగధ, జను లా నరనాయకుని వచనములు వినియున్
మునిచోదితు లై క్రమ్మఱ, ననురాగము లుప్పతిల్ల న మ్మనుజేశున్. 450

వ. అమృతోపమానంబు లైన మధురవాక్యంబుల ని ట్లనిరి. 451

క. వేనాంగ సంభవుండవు, శ్రీనాథ కళాంశజుఁడవు చిరతరగుణ స
న్మానార్థుండ వతర్కిత, మైన భవన్మహిమఁ బొగడ నలవియె? మాకున్. 452

1. నుతించెద మంటి రేని (తం. వా.) 2. చతుర భాషణులైన సభ్యులు నుత్తమ (క.చ.బ.తం.) 3. భావంబులను నుతింప (హ) 4. అలవి గాదని సేయరు నదియుగాక (క.త.ద.బ.) 5. అతి ప్రసిద్ధులు లజ్జాన్వితులును నగునట్టి సభ్యనికరము లాత్మ (క.బ.) 6. లోకమునందు – నవిదిత (వా); లోకమునందును బరిశిష్ట కర్ములగు (తం)

ప్రభవో హ్యాత్మనః ఖ్యాతిం జుగుప్సం త్యతి విశ్రుతాః (15-26)
ప్రభవోఽపి విశ్రుతా అపి హ్రీమంతః జుగుప్సంతి (వ్యా.)

క. అని వెండియు నిట్లని రై, నను నొక మార్గంబు గలదు నందింప భవ
ద్ఘన చరితామృతపానం, బునఁ జేసియు మునుల వచనములఁ జేసి తగన్. 453

వ. శ్లాఘ్యంబు లైన భవదీయ చరిత్రంబుల స్తుతియించెద మని యిట్లనిరి. 454

సీ. ఈ వైన్యుఁ డఖిలలోకావళి ధర్మానువర్తనముల నెప్పు వఱలఁ జేసి
ఘన ధర్మమార్గ [1]వర్తనులలో ధుర్యుఁడై ధర్మసేతువుఁ దగిలి ప్రోచు
[2]ధర్మ శాత్రవులను దండించు [3]నష్టదిక్పాలకమూర్తి సంకలితుఁ డగుచు
న య్యయి కాలంబులందు [4]పోషణదానములఁ బ్రజారంజనములఁ దనర్చు

తే. [5]సవన సద్వృష్టి కరణాది సక్తిఁ దొట
నుభయలోకంబులకుఁ బ్రీతి నొదవఁజేయు
న్యాయమార్గంబునను భూజనాళి ధనముఁ
బుచ్చుకొను నిచ్చు సూర్యునిఁ బోలి యితఁడు. 455

వ. మఱియును. 456

సీ. సర్వభూతములకు సముఁడును బర్యతిక్రమమున లోకాపరాధములను
నతి శాంతి సంయుక్తుఁడై సహింపుచు నార్తులగు వారియెడఁ గృపాయత్తుఁడగుచు
నరరూపుఁ దాల్చిన హరిమూర్తి గావున నింద్రుండు వర్షించి యెల్ల ప్రజల
రక్షించుగతిఁ దాను రక్షించు నమృతాంశు సన్నిభ వదనాబ్జ సస్మితాను

తే. రాగ మిళితావలోకనరాజిఁ జేసి
సకలజనులకు సంప్రీతి సంభవింపఁ
జేయు సంతతమును గూఢచిత్తుఁ డగుచు
శత్రువరుల [6]కగమ్యుఁ డై సంచరించు. 457

వ. అని వెండియుం బ్రవేశనిర్గమశూన్య మార్గ [7]నిగూఢకార్యుండును, నపరిమిత మహత్త్వాది గుణగణైక ధాముండును సముద్రునిభంగి గంభీరచిత్తుండు (నుపగుప్త విత్తుండును, వరుణునింబోలి సంవృతాత్మండును శాత్రవా) సహ్య ప్రతాప యుక్తుండును, (* దురాసదుండును) సమీపవర్తియయ్యును దూరస్థుని భంగి వర్తింపుచు, వేనారణి జనిత హుతాశనుండు గావున హుతాశను చందంబున నన్యదుస్స్పర్శనుండును నై చారులవలన సకలప్రాణి బాహ్యాభ్యంతర కర్మంబులఁ

1. వర్తనులతోఁ దుల్యుఁడై (తం)——ధన్యుఁడై (వా) 2. ధరను శాత్రవులను (తం. వా)
3. దిక్పాల కావయవ (క.బ.తం.) 4. దండాదండముల (హ). భాషణదాన (క.ట.ద.బ.):
5. సవనకరణాదికాచార సమితిచేత (చ.ట.త.డ.ద.బ.) 6. అసాధ్యుఁడై (హ) 7. నిరూఢ (హ)
*తా.ప. ప్రతులలో లేదు.

దెలియుచు, (దేహధారులకు నాత్మభూతుం డయి సూత్రాత్మకుం డైన వాయువుభంగి వర్తించుచు నాత్మస్తుతి నిందల వలన నుదాసీనుం డగుచు, (ధర్మపథంబున వర్తించుచు) నాత్మీయ సుత సుహృజ్జనుల వలనం దప్పు గలిగినను దండించుచు (నాత్మశత్రు పుత్రుల నైన) నదండ్యుల దండింపక, ధర్మమార్గ గతుం డగుచుఁ, దన యాజ్ఞాచక్రం(బప్రతిహతం బగుచు)మానసాచల పర్యంతంబు వర్తింప సూర్యుండు నిజకిరణంబులచేత నెంతపర్యంతంబు భూమిం బ్రకాశింపంజేయు నంతపర్యంతంబు నిజగుణంబులచేత లోకంబుల రంజిల్లం జేయు. అదియునుం గాక ప్రకృతిరంజకంబు లైన గుణంబులచేత దృఢవ్రతుండును,సత్యసంధుండును,బ్రహ్మణ్యుండును,సర్వభూతశరణ్యుండును, వృద్ధసేవకుండును, మానప్రదుండును, దీనవత్సలుండును, పరవనితా మాతృభావనుండును, తన పత్ని నర్ధశరీరంబుగాఁ దలంచువాఁడును నగుచుం బ్రజల యెడఁ దండ్రివలెఁ బ్రీతిసేయుచు రక్షింపుచు నుండు. మఱియు, 458

సీ. తలపోయ బ్రహ్మవిద్యా[1]యుక్త జనముల కనయంబుఁ గింకరుం డైనవాఁడు
నఖిల శరీరి గుణాప్త సుహృజ్జనతానందకరుఁ డన నలరువాఁడు
సంసార ఘనకర్మ సంగహీనులయందు [3]సంగసంప్రీతుఁ డై జరుగువాఁడు
దుర్మార్గ మనుజ సందోహంబునకు నుగ్రదండధరుం డనఁ దనరువాఁడు

తే. ప్రకృతి[4]పురుషకావేశుఁ డై పరఁగువాఁడు
భగవ దవతారయుక్తుఁ డై నెగడువాఁడు
నగుచు వర్తించు సమ్మోద మతిశయిల్ల
జారుతరమూర్తి యా రాజచక్రవర్తి. 459

వ. మఱియుం* (ద్ర్యధీశుండుఁ) గూటస్థుఁడుఁ,బరమాత్మయు,బ్రహ్మకళారూపుండు నగువాఁడు నై యుదయించెం గావున నితనియందు నవిద్యారచితం బై ప్రతీతం బగు భేదంబు నిరర్థకం బగు నని పెద్ద లగువారలు చూతురు. అని మఱియు నిట్లనియె. 460

సీ. ఉదయాద్రిపర్యంత ముర్వీతలం బేకవీరుఁ డై రక్షించి వెలయు నీతఁ
డొకనాఁడు విజయ యాత్రోత్సవం బేపార సన్నద్ధుఁ డై మణిస్యందనంబు
నెక్కి చాపముఁ బూని దిక్కుల సూర్యుని పగిదిని శత్రుభూపాల తమము
విరియింతు నని చాల వెలుఁగొందుచును ధరాచక్ర ప్రదక్షిణశాలి యగుచుఁ

1. నిష్ఠ (హ) 2. అఖిలశరీరగుఁ డాప్త సుహృజ్జనతా (తం.వా.) దేహినామాత్మ వత్ప్రేష్ఠః (16, 18) అని మూలము. 3. సంతత (త) 4. ప్రకృతి పురుషుల కధీశుడై (క); ప్రకృతి పురుషకావేశుడై (ట) * కొన్ని తా.ప. ప్రతులలో లేదు.

తే. దిరుగునెడ సర్వదిక్పాలవరసమేత
పార్థివోత్తమనికర ముపాయనంబు
లిచ్చి తనుఁ జక్రపాణికి నెనయు నాది
ధరణివిభుఁ డని నుతియించి తలఁతు రనుచు. 461

క. ఈ నృపతి ధరాచక్రము, ధేనువుఁగాఁ జేసి పితుకు ధృతి నఖిల పదా
ర్థానీకము విబుధులు స, న్మానింపఁగఁ బ్రజకు జీవనప్రదుఁ డగుచున్. 462

చ. అమరవరేణ్యుఁ బోలి యనయంబు నితండును గోత్రభేదన
త్వమునఁ జెలంగుచు న్నజగవ ప్రదరాసన శింజినీ నినా
దమున విరోధిభూపతులు దల్లడమంద నసహ్య సింహ వి
క్రమమున సంచరించు నని కౌతుకమొప్పఁగఁ బల్కి వెండియున్. 463

వ. ఇట్లనిరి. 464

చ. [1]సకలజగన్నుతుం డితఁడు చారుయశోనిధి యశ్వమేధముల్
[2]ప్రకటముగా శతంబు దగఁ బావన మైన సరస్వతీ తటీ
నికటధరిత్రిఁ జేయుతఱి నేర్పున నంతిమయాగమందుఁ గొం
జక మఖసాధనాశ్వమును జంభవిరోధి హరించు నుద్ధతిన్. 465

సీ. ఒకనాఁడు నిజమందిరోపాంతవనమునఁ జని యందు [3]సద్గుణశాలి యైన
ఘనుని సనత్కుమారునిఁ గాంచి య మ్మునివరు బ్రహ్మతనయుని వరుస భక్తిఁ
బూజించి [4]విజ్ఞానమునుఁ బొందు [5]దానిచే బ్రహ్మవేత్తలు మునిప్రవరు లవని
[6]భావిత ముక్తిసంపన్ను లై వర్తింతు రి మ్మహారాజు మహీతలంబు

తే. నందు విశ్రుతవిక్రముఁ డగుచు మిగులఁ
దన కథావళి భూప్రజాతతి నుతింప
నక్కడక్కడ వినుచు శౌర్యమున నఖిల
దిక్కులను గెల్చి వర్తించు ధీరయశుఁడు. 466

అధ్యాయము — ౧౭

వ. ఇట్లు [7]విపాటిత విరోధి శల్యుండు సురాసుర [8]జేగీయమాన నిజవైభవుండు నై
ధరాచక్రంబున కితండు రా జయ్యెడి. అని యివ్విధంబున స్తోత్రంబు నేసిన వంది

1. సకలదిగంతరాళముల (క. చ. బ. తం) 2. ప్రకటముగా నౌనర్చుచును భారతిసన్నిధి నుండి వెండియున్ (క. బ.) 3. షడ్గుణ (హ) 4. తత్ఫలమునుబొందు (చ. ట. జ. డ. బ.) 5. నచ్చట (క. చ. ట. జ. బ.) 6. మానితలబ్ధ విజ్ఞానులై (క. చ. ట. ద. బ.) 7. విపాటిత విరోధి మనశ్శల్యుండు (హ) 8. జేగీయమానుండును నై (క. డ. ద. బ.)

మాగధ సూత జనంబులం బృథుచక్రవర్తి పూజించి మఱియుం బ్రాహ్మణ భృత్యామాత్య పురోహిత పౌర జానపద తైలిక తాంబూలిక (నియోజ్య) ప్రముఖాశేష జనంబులం దత్తదుచిత క్రియలం బూజించె. అని మైత్రేయుండు సెప్పిన విని విదురుం డిట్లనియె. 467

— పృథుచక్రవర్తి గోరూపధారిణి యగు భూమివలన నోషధులఁ బిదుకుట :—

సీ. [1]ఏమి నిమిత్తమై భూమి గోరూపిణి యయ్యె? దానికి వత్స మయ్యె నెద్ది?
[2]గొనకొని దోహనమునకు నర్హంబైన పాత్ర మెయ్యది? దలఁపంగ దోగ్ధ
యైన యా పృథు వే పదార్థముల్ పితికెను? బరికింప నవని స్వభావమునను
విషమ మై యుండియు వెలయంగ నేరీతి సమగతిఁ జెందెను? జంభవైరి

తే. క్రతుహయంబును గొనిపోవఁ గార్య మెద్ది?
ధీరనిధి [3]యాతఁడు సనత్కుమారువలనఁ
గలితవిజ్ఞానుఁ డగుచు నేగతిని బొందె
ననఘచారిత్ర! మైత్రేయ! యదియుఁ గాక. 468

వ. మఱియుఁ (బరబ్రహ్మంబును) భగవంతుండును (బుణ్యశ్రవణకీర్తనుండును సర్వనియామకుఁడును నగు కృష్ణుని యవతారాంతరాశ్రయం బగు పుణ్యకథ లన్నియు) నీకును, నధోక్షజునకును దాసుండ నైన నాకు నెఱింగింపు మనిన వాసుదేవకథా సంప్రీతచేతస్కుం డగు విదురుం బ్రశంసించి మైత్రేయుం డిట్లనియె. అట్లు బ్రాహ్మణజనంబులచేత రాజ్యంబునం దభిషిక్తుం డగుచు సకల ప్రజాపాలన నియుక్తుం డై పృథువు రాజ్యంబు సేయుచుండు నంత *(నీరస యగు ధరిత్రియం దన్నరహితు లగుచుం) బ్రజలు క్షుత్పీడా క్షీణ దేహులై వైన్యునిఁ జూచి యి ట్లనిరి. 469

క. అరయఁగ నేము బుభుక్షా, పరిపీడం బడితి మయ్య! పై కొని తరుకో
టరజనిత వహ్నిచేతను, దరికొను వృక్షములఁ బోలి ధరణీనాథా! 470

క. శరణశరణ్యుఁడ వగు నిను, శరణము వేఁడెదము మాకు సత్కృప నన్నం
బరసి కృపఁజేసి ప్రోవుము, నరనాయక! యనుచుఁ బ్రజలు నతులై పలుకన్.

క. విని దానికి సదుపాయము, జననాయకుఁ డాత్మఁ దలఁచి సక్రోధుం డై
ధనువున బాణముఁ దొడిగెను, ఘన రౌద్రుండైన త్రిపురఘస్మరు పగిదిన్. 472

1. ఏవిధంబున భూమిదేవి గో రూపయై, వరలెను దానికి వత్స మెద్ది (త.బ.) 2. కొనగొని— శుద్ధంబైన (త.ద.బ.); 3. యైన బ్రహ్మకుమారువలన (హ) *తా.ప. ప్రతులలో లేదు.

వ. ఇట్లు దొడిగిన. 473

క. మహిపతి నప్పుడుఁ గనుఁగొని. [1]మహి గోరూపమునఁ గంప్యమానయు నగుచున్
గుహకుం డగు లుబ్ధకుఁ గని, గహనంబునఁ బాఱు హరిణికై వడిఁ బాఱెన్. 474

వ. ఇట్లు ధరణి పాఱిన నతండును గుపితారుణేక్షణుండై వెంటం దగిలి నల్దిక్కులను విదిక్కులను భూ నభోభాగంబుల నెక్కడఁ జనియె నక్కడక్కడికి వెనుదగిలి యుద్యతాయుధుం డై చనుచుండ, న వ్వైన్యునిం గని, [2]మృత్యుగ్రస్తు లగు ప్రజలచందంబున *(ననన్యశరణ్య యై యతిభయంబునం బరితప్యమాన హృదయ యగుచు ని ట్లనియె.) వైన్యా! ధర్మజ్ఞుండ, వాపన్న వత్సలుండవు, మహాత్ముండవు, సకలప్రాణి పరిపాలనావస్థితుండవు నైన నీవీ దీనయుం, బాప రహితయుం, గామినియు నగు నను వధియింపం బూని యేల వెనుఁదగులు చున్నవాఁడవు? *(ధర్మతత్త్వం బెఱుంగువారు) సతీజనంబులు కృతాపరాధ లైనం దీనవత్సలతం జేసి వధియింపరు. అని పలికి, మఱియు, నా ధరణి పృథు చక్రవర్తి కి ట్లనియె. 475

క. జననాథచంద్ర! యీ భూ, జనకోటికి యానపాత్ర [3]సదృశస్థితితో
ఘన దృఢ శరీర నగుచును, ననయము [4]నాధారభూత నయి చరియింతున్. 476

తే. ఇట్టి నన్నుఁ గృపామతి యెడలి యిటు వి
పాటనము నేసి త్రుంచెదు ప్రజలు నీట
మునుఁగకుండంగ నే రీతి ననఘచరిత!
యరసి రక్షింతు వన నతం డవని కనియె[5] 477

వ. ధరిత్రీ! మదీయాజ్ఞోల్లంఘనంబు సేయుచున్న దానవు. అదియునుం గాక నీవు యజ్ఞంబులందు హవిర్భాగంబుల ననుభవింపుచు ధాన్యాదికంబుల విస్తరింపం జేయక గోరూపంబు ధరియించి యనయంబుఁ దృణభక్షణంబు సేయుచు బాలుం బితుకక నీయందణంచికొంటివి. నీయందున్న యోషధీ బీజంబులు బ్రహ్మ చేతం బూర్వంబునందె కల్పింపంబడినయవి. వానిని (నీ దేహమంద యణంచి కొని) యిప్పు డీయక మూఢహృదయవు, మందమతివియు నై యపరాధంబుఁ జేసిన *(దుష్టురాలి వగు) నిను నా బాణంబులచే జర్జరీభూత శరీరం జేసి వధియించి నీ మేని మాంసంబునంజేసి (క్షుద్బాధితులు దీనులు) నగు నీ ప్రజల

1. మహివలయము కంపమాన మానసయగుచో (క.ట.త.) * కొన్ని తా. ప. ప్రతులలో లేదు. 2. మృత్యుసముంగా భావించి (క.చ.ట.బ.); 3. సంగతితోడన్ (క.బ.) 4. నాధార భూతమనఁ (చ.ట.త.జ.డ.ద.)...భూతయగు (హ) 5. మాం విపాట్యాజరా న్నావం యత్రవిశ్వం ప్రతిష్ఠితం, ఆత్మానం చ ప్రజాశ్చేమాః కథ మంభసి ధాస్యసి. (16-21) అని మూలము.

యార్తి నివారించెద. నీవు కామిని నంటివి. స్త్రీ పురుష నపుంసకులలో నెవ్వరేని భూతదయ లేక స్వమాత్ర పోషకు లగుచు నిరనుక్రోశంబున భూత ద్రోహులై వర్తింతురు, వారిని రాజులు వధించినన్ వధంబు గాదు గానఁ దానఁ బాపంబు వొరయదు. నీవు కామిని వైనను (దుర్మదవు, స్తబ్ధవు) నగుచు మాయా గోరూపంబునం బాఱిపోవుచున్న నిన్నుఁ దిలలంతలు ఖండంబులు చేసి నా యోగమహిమం బ్రాణికోటి నుద్ధరించెద. అని పలికి, రోషభీషణాకారంబు ధరియించి, దండధరుండునుఁ బోలి వర్తించు పృథునింజూచి వడంకుచు మేదిని ప్రాంజలి యై యి ట్లని నుతియింపం దొడంగె. 478

క. ఓ నాథ! పరమపురుషుఁడ, వై నిజ మాయాగుణంబు లందిన కతనన్
నానావిధ దేహములం, బూనుదు సగుణుండ వగుచు బుధనుతచరితా! 479

వ. అట్టి నీవు, 480

క. నను సకల జీవతతికిని, మును నీ వాధారభూతముగ నిర్మింపన్
విను నాయందుఁ జతుర్విధ, ఘనభూత విసర్గ మర్థిఁ గైకొనవలసెన్. 481

వ. అట్లై యుండ. 482

క. నను నుద్య తాయుధుఁడ వై, మనుజేంద్ర! వధింపఁ బూని మసలెదు [1]నీకం
బె నితరు నెవ్వని నివు డే, ఘనముగ శరణంబు సొత్తుఁ గరుణాభరణా! 483

వ. అదియునుం గాక. 484

సీ. అనఘ! స్వకీయంబు నై యతర్కితము నై మహిమ నొప్పిన భవన్మాయచేత
సకల చరాచర సర్గంబు నిర్మించి [2]ధర్మపరుండ వై తనరు దీశ!
నీ విక్రమము నవనీరజలోచన! సకలలోకులకు దుర్జయము దలఁపఁ
దగునట్టి నీవు స్వతంత్రుఁడ వగుటను బ్రహ్మఁ బుట్టించి యా బ్రహ్మచేత

తే. సకలజగమును జేయింతు సమతఁ బేర్చి
యేకమయ్యు మహాత్మ! యనేకవిధము
లగుచు వెలుఁగొందుచుందు వీ యఖిలమందుఁ
జారుతరమూర్తి! యో పృథుచక్రవర్తి! 485

వ. మఱియు మహాభూ తేంద్రియ క్రియా కారక చేతనాహంకారంబు లను శక్తులంజేసి యీ జగంబుల కుత్పత్తి స్థితి లయంబులఁ గావింపుచు సముత్కట

* తా. ప. ప్రతులలో లేదు.

1. నీ కం, బెను నన్యుని నెవ్వనినే (క. చ. తం. వా.) 2. ధర్మార్థపరుఁడవై (హ.తం.వా.)

విరుద్ధశక్తులుం గల పురుషునకు నమస్కరించెద. అట్టి పరమపురుషుండ వైన నీవు నిజనిర్మితంబు, భూతేంద్రియాంతఃకరణాత్మకంబు నైన యీ విశ్వంబు సంస్థాపింపం బూని. 486

సీ. [1]ఆదివరాహంబ వగుచు రసాతల గత నైన నన్ను నక్కటికతోడ
నుద్ధరించితి వట్టి యుదకాగ్రభాగంబునం దర్థి నున్న నే ననెడి నావ
యం దున్న నిఖిల ప్రజావళి రక్షింపఁ గోరి యీ పృథురూపధారి వైతి
వట్టి భూధరణుండ వైన నీ విపుడు పయోనిమిత్తంబుగా నుగ్రచరుఁడ

తే. వగుచు నన్ను వధించెద ననుచు బుద్ధిఁ
దలఁపుచున్నాఁడ విది విచిత్రంబు గాదె!
విశ్వసంపాద్య! నిరవద్య! వేదవేద్య!
భవ్యగుణసాంద్ర! వైన్యభూపాలచంద్ర! 487

వ. కావున నీశ్వరగుణ సర్గరూపం బైన [2]మాయచే మోహితాంతఃకరణుల మైన మావంటివారలచేత హరిభక్తుల చేష్టితం బెఱుంగంబడ దన్న హరిచేష్టితం బెట్లెఱుంగంబడు! అట్టి జితేంద్రియ యశస్కరు లైన వారలకు నమస్కరింతు. అనుచు నివ్విధంబునం గోప ప్రస్ఫురితాధరుం డైన పృథుని నభినుతించి ధైర్యం బవలంబించి వెండియు ని ట్లనియె. 489

## అధ్యాయము - ౧౮

క. విమలాత్మ! నాకు నభయము, సమకూరెడు నట్లుగాఁగ సన్మతి నీ క్రో
ధము నుపశమించి కరుణిం, పుము నా విన్నపము వినుము పురుషనిధానా! 589

క. ధర విరులు గందకుండఁగ, సరసగతిన్ బూవుఁదేనెఁ జవిగొను నిందిం
దిరవిభు కై వడి బుధుఁ డగు,పురుషుఁడు సారాంశ[3]మాత్మఁ బూని గ్రహించున్.

సీ. వినుమయ్య! తత్త్వదర్శను లైన యట్టి సన్మునులచే నైహికాముష్మికంబు
లైన ఫలప్రాప్తి కర్థిఁ గృష్యాద్యగ్నిహోత్రా ద్యుపాయంబు లుర్వీమీఁద
దృష్టంబులును నాచరితములు నగుచుఁ దా నెనయంగఁ ద దుపాయ మెవ్వఁ డాచ
రించును వాఁడు ప్రాపించుఁ దత్ఫలమును విద్వాంసుఁ డైనను వెలయ దీని

తే. నాదరింపక తనయంత నాచరించె
నేని నాయాసమే యగుఁ గాని తత్ఫ
లమును బొందండు బహుళ కాలమున కైన
వినుత గుణశీల! మాటలు వేయు నేల? 491

1. ఆదివరాహంబవై యారసాతలగత, నైనన్ను (లం. వా.) 2. మాయామోహితాంతఃకరణులమైన (క. చ. లం.) 3. మాత్రబూని (చ).

వ. అని మఱియు మహి యి ట్లనియె. 492

చ. జలరుహగర్భుచేత మును చాల సృజింపఁగఁబడ్డ యోషధుల్
కలుషమతిన్ ధృతవ్రతులు గాని యసజ్జన భుజ్యమాన లై
[1]వెలయుట చూచి యే నృపతివీరులు మాన్పమిఁ జోరబాధలన్
బలుమఱుఁ బొంది తా నపరిపాలిత లై కృశియించి పెండియున్. 493

క. అనుపమ మఖ కర్మక్రియ, లనయము లేకుంట నే ననాదృత నగుచున్
జననాయక! యీ లోకము, ఘనచోరీభూత మగుటఁ గనుఁగొని యంతన్. 494

క. సవనాది సిద్ధికొఱకై, తవిలి తదీయౌషధీ వితతులను ధరణీ
ధవ! యే నపుడు గ్రసించితి, నవియును నాయందు జీర్ణమయ్యెఁ గడంకన్. 495

క. వినువాని నొకయుపాయంబునఁ గ్రమ్మఱఁ బడయవచ్చు భూవరచంద్రా!
విను మది యెఱిఁగించెద నీ, కనువత్సలురాల నగుట ననఘచరిత్రా! 496

క. అనయము నా కొకవత్సము, ననురూప సుదోహనమ్ము ననురూపక దో
గ్ధనుఁ [2]గల్పింపుమ యట్లైన నను నీ భూతముల కవనినాయక! దానన్. 497

క. పరఁగ నభీప్సితములు బల, కరములు నగు నన్న దుగ్ధ కలితము లగు భా
సురకామంబులఁ బితికెద, నరనాయకచంద్ర! వినుము నా వచనంబుల్. 498

చ. మనుజవరేణ్య! యేను విషమస్థలి నై [3]యిపు డున్న దానఁగా
వున జలదాగమోదిత పయోనివహంబు దదాగమంబు పో
యినను ద దంబువుల్ పుడమి నింకక యంతట నిల్చునట్లు గా
మనునిభ! నన్ను నిప్పుడు సమస్థలి నై పెనుబొందఁ జేయవే! 499

క. అని యి వ్విధమున నా భూ, వనితామణి పలుకు మధురవచనంబులు దా
విని యనురాగము దన మన, మునఁ గడలుకొనంగ రాజముఖ్యుం డంతన్.

చ. మనువును దూడఁ జేసి గరిమన్ నిజపాణితలంబు లీల దో
హనముగఁ జేసి యందు సకలౌషధులం బితికెం గ్రమంబునన్
దనరఁగఁ ద ద్విధంబునను ద త్పృథువత్సల యైన భూమియం
దనయము వారు వారును బ్రియం బగు కోర్కులఁ బొంది రున్నతిన్. 501

1. వెలఁగుటఁ జూచి యేను నృప మీరలు మాన్పమి (హ) 2. కల్పింపుము దగనైనను (హ)
3. 'ఉన్న దాన నౌ, య్యాన జలదాగ మోదిత పయః ప్రకరంబు' (వా)

సీ. బలసి ఋషుల్ బృహస్పతి వత్సకంబుగా [1]నర్థించి తమ యింద్రియంబులందు
నంచిత చ్ఛందోమయ క్షీరమును దేవతలు సురరాజు వత్సకము గాఁగఁ
గనక [2]పాత్రమునందుఁ దనరు నోజోబల [3]వీర్యామృతంబు నై వెలయు పయసు
దైత్య దానవులు దైత్య శ్రేష్ఠుఁ డగు గుణశాలిఁ బ్రహ్లాదు వత్సంబుఁ జేసి

తే. [4]సత్సు రాసవ పయ మాయస చషకమున
నప్సరోజన గంధర్వు లలరి యపుడు
[5]దనర విశ్వావసును వత్సమునుగఁ జేసి
పద్మమయ నిర్మితం బైన పాత్రమందు. 502

వ. మాధుర్య సౌందర్య సహిత గాంధర్వ క్షీరంబును, పితృదేవతలు సూర్యవత్స కంబుగా నామపాత్రమందుఁ గవ్యం బను దుగ్ధంబును, సిద్ధులు కపిలవత్సకంబుగా నాకాశపాత్రమందు సంకల్పనా రూపాణిమాదిసిద్ధి యను క్షీరంబును, విద్యాధరాదులు ద ద్వత్సకంబుగఁ ద త్పాత్రకంబునుగా ఖేచరత్వాది [6]విద్యా రూప క్షీరంబును, గింపురుషాదులు మయవత్సకంబును నాత్మపాత్రంబునుంగా సంకల్పమాత్ర ప్రభవంబును నంతర్ధానాద్భుతాత్మ సంబంధియు నగు మాయ యను క్షీరంబును, యక్ష రక్షో భూత పిశాచంబులు భూతేశవత్సకంబుగాఁ గపాలపాత్రకంబునుగా రుధిరాసవం బను క్షీరంబును, నహి దందశూక సర్ప నాగంబులు తక్షకవత్సకంబుగా బిలపాత్రంబున విషరూప క్షీరంబును, బసువులు గో వృష వత్సకంబును, నరణ్యపాత్రంబునుంగాఁ దృణం బను క్షీరంబును, గ్రవ్యాద మృగంబులు మృగేంద్రవత్సకంబుగా, నాత్మకళేబర పాత్రకంబుగాఁ గ్రవ్యం బను దుగ్ధంబును, విహంగంబులు సువర్ణవత్సకంబు, నిజకాయ పాత్రం బునుఁ గాఁ గీటకఫలాదికం బను దుగ్ధంబును, వనస్పతులు వటవత్సకంబుగా భిన్నరోహరూప పయస్సును, గిరులు హిమవద్వత్సకంబును, నిజసాను పాత్ర కంబును గా నానాధాతువు లను దుగ్ధంబులు ని వ్విధంబున సమస్తచరాచర వర్గంబు స్వ ముఖ్యవత్సకంబును, స్వ స్వ పాత్రకంబుగా భిన్నరూపంబు లైన క్షీరంబులం బితికి రని చెప్పి మఱియును. 503

క. క్రమమున నిటు పృథ్వ్యాదులు, దమతమ కామితము లనఁగఁదగు భిన్న క్షీ
రము దోహన వత్సక భే, దమునం దగఁ బితికి రంత ధరణీధవుఁడున్. 504

1. హత్తించి (ద) 2. పాత్రికయందు (క. చ. ట. ద.) 3. వీర్యస్వరూపంబు (క. చ. త. జ.) 4. ఘనసురాసవరూప దుగ్ధంబువరుస (తం. వా.) 'దైతేయా దానవావత్సం ప్రహ్లాద మసు రర్షభమ్, విధాయ దుదుహుః క్షీర మయః పాత్రే సురాసవమ్' (18-16) 5. వలను మెరయ విశ్వావసు వత్స జేసి (చ. ట. త. డ.) 6. వ్యాపార (హ)

తే. సముచితానందమును బొంది సర్వకామ
దుఘ యనం దగు భూమిని దుహిత గాఁగఁ
గోరి గైకొని నిజధనుః కోటిచేత
భూరి గిరికూటములఁ జూర్ణములుగఁ జేసి. 505

తే. చండ దోర్దండలీల భూమండలంబు
సమతలంబుగఁ జేసి శశ్వత్ప్రసిద్ధి
నొంది య వ్విభుఁ డీ లోకమందు నెల్ల
ప్రజకుఁ దండ్రియు, జీవనప్రదుఁడు నగుచు. 506

తే. అక్కడక్కడ పూర్వంబునందు లేని
గ్రామ పట్టణ దుర్గ ఖర్వట పుళింద
ఖేట శబరాలయ వ్రజవాట ఘోష
వివిధనిలయము లర్థిఁ గావించె నంత. 507

క. వారును భయవిరహితులై, ఘోరనఁ దత్తన్ని వాసములయందు సుఖ
శ్రీరుచి నొప్పుచు నుండిరి, వారక యా పృథునిఁ బొగడ వశమె ? ధరిత్రిన్.

అధ్యాయము - ౧౯

సీ. అని చెప్పి మునినాథుఁ డైన మైత్రేయుఁ డ వ్విదురున కిట్లను వేడ్కతోడ
ననఘాత్మ ! రాజర్షి యైన వైన్యుం డశ్వమేధ శతంబు సన్మేధతోడఁ
గావింతు నని దీక్ష గైకొని వ్రతనిష్ఠఁ దివిరి బ్రహ్మావర్త దేశమందు
నలరు మనుక్షేత్రమందు సరస్వతీ నది పొంతఁ దా మహోన్నతి నొనర్చ

తే. సవనకర్మ క్రియకు నతిశయవిశేష
ఫలము గలిగెడి నని బుద్ధిఁ దలఁచి యచట
వరుసఁ గావించు నతిశయాధ్వర మహోత్స
వము సహింపక యుండె న య్యమరవిభుఁడు. 509

—: పృథుచక్రవర్తి యశ్వమేధంబు సేయునెడ నింద్రుం డశ్వము నపహరించుట :—

సీ. అట్టి యధ్వరకర్మమందు సాక్షాద్భగవంతుండు హరి రమేశ్వరుఁడు లోక
గురుఁడును సర్వాత్మకుండును విభుఁడును నీరజభవ భవాన్వితుఁడు లోక
పాలక నిఖిల సుపర్వానుగుండును యజ్ఞాంగుఁ డఖిలాధ్వరాది విభుఁడు
గంధర్వ ముని సిద్ధగణ సాధ్య విద్యాధరాప్సరో దైత్య గుహ్యాళి దాన

తే. వాది జేగీయమానుఁడు నలఘుయశుఁడు
ప్రకట నంద సునందాది పార్షదుండు
కపిల నారద సనక ప్రముఖ్య
మహిత యోగీంద్ర సంస్తూయమానుఁ డజుఁడు. 510

వ. మఱియుం బరమ భాగవత [1]సేవితుండును, నారాయణాంశ ప్రభువుండును, నైన పృథుచక్రవర్తికి భూమి హవిరాది దోగ్ధ్రి యయ్యును, సర్వకామదుఘ యై సమస్త పదార్థంబులం బితుకుచుండె. మఱియుఁ దరువులు ఘనతరాకారంబులు గలిగి, మకరందస్రావు లగుచు నిక్షుద్రాక్షాది రసంబులు దధి క్షీరాజ్య తక్ర పానకాదికంబు వర్షింప నవియెల్ల నదులు వహించె. సముద్రంబులు హీరాది రత్న విశేషంబుల నీనుచుండె. పర్వతంబులు భక్ష్యభోజ్యలేహ్య చోష్యంబు లను చతుర్విధాన్నంబులఁ గురియుచుండె. లోకపాల సమేతు లైన సకలజనంబు లుపాయనంబులు దెచ్చి యిచ్చుచుండిరి. ఇట్టి పరిపూర్ణ విభవాభిరాముం డై యధోక్షజ సేవాపరాయణుం డగు పృథుచక్రవర్తి యేకోన శతాశ్వమేధంబులు సన్మేధంబునం గావించి నూఱవ యాగంబు నందు యజ్ఞపతి యైన పుండరీకాక్షుని యజింపుచుండం దదీయ పరమోత్సవంబు సహింపం జాలక. 511

క. అమరేంద్రుఁడు ఘన రోషో, ద్గముఁడై పాషండవేష కలిత తిరోభా
వమునం ద న్మఖపశువుం, గ్రమ మేది హరించి చనియె గగనంబునకున్. 512

వ. అట్లు చనునప్పుడు. 513

క. అనఘుం డగు నత్రిమహా, మునిచోదితుఁడగుచుఁ బృథుని పుత్రుఁడు బాణా
సనతూణీరధరుండై, యనిమిషపతి వెనుకఁ జనియె నతిదర్పమునన్. 514

వ. అట్లు చనిచని ముందట. 515

సీ. యజ్ఞ సాధన పశుహరణుని వధియించు ధర్మంబునందు నధర్మ మనెడి
బుద్ధిఁ బుట్టఁగ జేయ భూరి మాయావేషధారి యై యరుగు సుత్రాముఁ గదిసి
నిలు నిలు మని యార్చి నిజ గుణధ్వని నేసి ఘన జటా భస్మాస్థి కలిత మైన
మూర్తిఁ గనుఁగొని మూర్తీభవించిన ధర్మంబుగా బుద్ధిఁ దలఁచి యమర

తే. నాయకునిమీఁద సాయక మేయఁ జాల
కున్నఁ గనుఁగొని యత్రి విద్వన్నుతుండు
వైన్యజున కనె వాసవు వలనుఁ జూపి
మనములోపల రోషంబు మల్లడింప. 516

1. శ్రేష్ఠుండును (ద)

క. విను మితఁడు యజ్ఞహంతయు, ననిమిష నికరాధముండు నగు నింద్రుఁడు గా
వున నితని జయింపుము నీ, వని మున్ముఁ బుచ్చరింప నవ్వైన్యుఁడున్. 517

మ. వినువీథిన్ జను దేవవల్లభునిపై వీరుండు క్రోధాంతరం
గ నిరూఢిన్ మృగరాట్కిశోరము మహాగంధద్విపేంద్రంబు మీఁ
దను లంఘించు విధంబునం బడిన నాతం డశ్వ చౌర్యైక సా
ధనరూపంబును నశ్వమున్ విడిచి యంతర్ధానముం బొందినన్. 518

క. వీరుఁడు పృథుభూపాల కు, మారుఁడు నిజ యజ్ఞపశువు మఱలం గొని దు
ర్వార బలుఁ డగుచు జనకుని, భూరి సవనరాజ పుణ్యభూమికి వచ్చెన్. 519

వ. అ య్యవసరంబున నచ్చట నున్న పరమర్షి పుంగవు లతని యద్భుతకర్మంబు గనుంగొని, యాశ్చర్యంబు నొంది, యతనికి జితాశ్వుండను నన్వర్థ నామంబు వెట్టియున్న సమయంబున. 520

చ. మఱియును దేవతాపతి తమఃపటలంబు జనింపఁజేసి యె
వ్వరుఁ దనుఁ గానకుండ ననివారణఁ గాంచనపాశ బద్ధమై
సురుచిర యూపదారు పరిశోభిత మైన హయంబుఁ గొంచుఁ జె
చ్చెర వినువీథి నేఁగఁగఁ బుషిప్రవరుం డగు నత్రి సెప్పినన్. 521

క. విని పృథు భూవరతనయుఁడు, ఘనబలమునఁ జని కపాల ఖట్వాంగము లో
లిని ధరియించి రయంబునఁ, జను నింద్రునిఁ గాంచి నొంపజాలక యంతన్. 522

ఉ. క్రమ్మఱ నత్రిచేఁ దెలుపఁగాఁబడి వైన్యతనూభవుండు రో
షమ్మునఁ దోఁకఁ ద్రొక్కిన భుజంగమపుంగవుఁ బోలి యుగ్రుఁ డై
య మ్మరిఁబోసినం గని సురాధిపుఁ డెప్పటియట్ల పాఱె న
శ్వమ్మును రూపమున్ విడిచి చాలఁ దిరోహితుఁ డై రయంబునన్. 523

వ. అట్లు చనినం బశువుం గొని మఱలి య వ్వీరోత్తముండు పితృయజ్ఞశాలకుం జనుదెంచె నంత. 524

సీ. హరిహయుం డధ్వరహయ రక్షణార్థమై మించి గై కొని విసర్జించినట్టి
భూరి యమంగళభూత మాయారూపములను ధరించిరి మూఢజనులు
పాషండచిహ్నముల్ పరఁగుట వారలు జగతిపై నగ్నవేషములు గలుగు
జైనులు భూరి కాషాయవస్త్రంబులు ధరియించు బౌద్ధులుఁ దగ జటాస్థి

తే. భస్మధారులు నైన కాపాలికాదు
లనఁగ వెలసిరి లోకంబులందుఁ జాలఁ
దలఁప ధర్మోపమం బనఁదగు నధర్మ
మందు నభిరతి వొడమిన యజ్ఞజనులు. 525

వ. తదీయచిహ్నంబులు పారంపర్యంబుగా ధరియింపం దొడంగిరి. తద్వృత్తాంతంబు భగవంతుం డైన పృథుచక్రవర్తి యెఱింగి, కుపితుం డై యుద్యతకార్ముకుం డగుచు నింద్రునిమీఁద బాణంబు నేయ నుద్యమించిన, ఋత్విక్కులు శక్ర వధోద్యుక్తుండు, నసహ్యరంహుండు నైన పృథుచక్రవర్తిం గనుంగొని యిట్లనిరి.

క. జననాయక! యజ్ఞములం, దనుపమ విధిచోదితంబు లనఁదగు పశుబం
ధనహింసల కా కితరుల, ఘన దీక్షితునకు వధింపఁ గాదండ్రు బుధుల్. 527

వ. కావున నీ విపు డింద్రవధోద్యోగం బుపసంహరింపుము. భవదీయ ధర్మవిరోధి యైన యింద్రుని. 528

క. జనపాల! వీర్యవంతము, లనఁదగు మంత్రముల చేత నాహ్వానము చే
సిన నతఁ డిచటికి వచ్చును, జనుదెంచిన యమరవిభువి సరభసత దగన్. 529

క. ధృతి చెదరఁబట్టి శిఖి కా, హుతిఁ గా వేల్చెదము దాన నుర్వీవర! నీ
వితత మహోహత వీర్యో, న్నతుఁ డై చెడిపోవు నమరనాథుం డంతన్. 530

వ. అని పృథు నివారించి, ఋత్విగ్జనంబులు కుపితస్వాంతు లై హస్తంబుల స్రు క్స్రువంబులు ధరించి వేల్చు సమయంబునం జతుర్ముఖుండు చనుదెంచి, ఋత్వి క్కులం గనుంగొని యిట్లనియె. యజ్ఞంబులందు యజింపంబడు దేవత లెవ్వని యంశంబు, లెవ్వండు యజ్ఞనామకం బగు భగవదంశం బగుఁ నట్టి యింద్రుండు మీచేత వధార్హుండు గాఁ డితండు భగవదంశసంభవుం డగుట నీ యజ్ఞకర్మ విధ్వంసనేచ్ఛుం డై గావించు ధర్మవ్యతికరంబులు చూచుచుండవలయుం గాని ప్రతీకారంబులు కర్తవ్యంబులు గావు. *(ఈ పృథుకీర్తి యగు) పృథునకు నేకోనశతం బగు నధ్వరప్రయోగఫలంబు సిద్ధించుం గాక యని పృథుచక్రవర్తికి ని ట్లనియె.

సీ. మనుజేంద్ర! మోక్షధర్మము నెఱింగిన నీకు సవనముల్ సేయుటచాలు మఱియు
నేవిధంబున నైన దేవేంద్రు మనమునఁ గైకొని రోషంబు గదురకుండ
వర్తింపవలయును వాసవుండును నీవు పూని సుశ్లోకులు గాన మీకు
మంగళం బగుఁగాక మానవనాథ! నీ చిత్తంబులోపలఁ జింతఁ దొఱఁగి

తే. మించి మద్వాక్యముల నాదరించి వినుము
దైవహత మగు యజ్ఞంబుఁ దగిలి సేయు
కొఱకు భవదీయచిత్తంబు గుంది రోష
కలుషితం బైన నజ్ఞానకలిత మగును. 532

* తా. ప. ప్రతులలో లేదు.

వ. భవదీయ యజ్ఞహననార్థం బశ్వహరణుం డైన యింద్రుండు (దేవతలలోనం దురాగ్రహుం డగుటం జేసి యతనిచేత) నిర్మింపంబడి చిత్తాకర్షకంబు లైన యీ పాషండ ధర్మంబులచేత ధర్మవ్యతికరంబు గలుగుఁ గాన నీయజ్ఞంబు చాలింపుము. అని మఱియు ని ట్లనియె. 533

సీ. †అదిగాక వినుము వేనాపచారంబునఁ బూని విలుప్తంబు లైనయట్టి
యలఘు నానా సమయానుధర్మంబులఁ బరిపాలనము సేయఁ బరఁగి వేను
దేహంబువలనను దివిరి జనించియున్నాఁడవు నారాయణాంశజుఁడవు
[1]గావున నీ వీశ! కలిత ప్రపంచంబు పుట్టిన తెఱఁగు నీబుద్ధిఁ దలఁచి

తే. యెవరిచే నేమిటికి సృజియింపఁ బడితి
వట్టి యా బ్రహ్మసంకల్ప మవనినాథ!
తప్పకుండంగఁ బాలింపు ధర్మగతినిఁ
జారుశుభమూర్తి! యో పృథుచక్రవర్తి! 534

వ. అని మఱియు నిట్లనియె. ఉపధర్మమాతయుం బ్రచండ పాషండమార్గంబు నైన యీ యింద్రకృతం బగు మాయను జయింపుము. అని వనజసంభవుం డానతిచ్చినం బృథుచక్రవర్తియుఁ దదాజ్ఞాపితుం డై దేవేంద్రునితోడ బద్ధసఖ్యుం డయ్యె. అంత నవభృథానంతరంబున. 535

చ. సురుచిర లబ్ధదక్షిణల సొంపునఁ బొంపిరివోయి భూసురుల్
వరుసన పెక్కు దీవెన లవారణ నిచ్చిరి సర్వదేవతల్
భరిత ముదంతరంగములఁ బాయనివేడ్క వరంబు లిచ్చి రా
సరవరుఁ డైన వైన్యునకు నందితకీర్తికిఁ బుణ్యమూర్తికిన్. 536

వ. అంత నచ్చటి జనంబు లి ట్లనిరి. 537

తే. అనఘ! నీచేత నాదృతు లైరి సర్వ
జనులు మఱి దానమానోపచారములను
బితృసుదేవర్షి మానవవితతి పూజ
నొంది సంచిత మోదంబు నొందె నయ్య! 538

† ఈ సీసములోని నాల్గుపాదములు తా. ప. ప్రతులలోఁ గానరావు. గీతము మాత్రము కలదు. సీసపాదములకు బదులు, ఈ క్రింది వచనమున్నది.

భవదీయ యజ్ఞహరణార్థం బశ్వహరుం డైన యింద్రునిచేత నిర్మింపబడి మనోహరంబులై యీ పాషండధర్మంబులన్ పరిపాలనము సేయుకొఱకై వైనదేహంబువలనన్ దివిరిజనియించిన చారునారాయణాంశజుండవు గావున నీవు ఈ కలిత ప్రపంచంబు పుట్టిన తెఱంగు నీ బుద్ధిదలంచి (చ.ట.త.జ.ఢ.)

1. కావున నీ విశకలిత లోకంబునఁ బుట్టి తెఱఁగు (హ) కావున నీ నరకలిత లోకంబున...... (తఁ. వా.)

అధ్యాయము — ౨౦

వ. అని పలుకు సమయంబున యజ్ఞ భోక్తయు, యజ్ఞవిభుండును, భగవంతుడును నైన సర్వేశ్వరుం డింద్రసమేతుం డై యచ్చటికిం జనుదెంచి యా పృథున కిట్లనియె. 539

-: యాగంబున నారాయణుండు ప్రసన్నుం డై పృథుచక్రవర్తి ననుగ్రహించుట :-

క. జనవర ! భవదీయం బై, జనమత మగు నశ్వమేధ శతమున కిపు డీ
యనిమిషపతి భంగము చే, సినకతన క్షమాపణంబు నేసెడిఁ గంటే? 540

వ. కావున నితని క్షమింపుము. సత్పురుషు లగువారు దేహాభిమానులు గాకుండుటం జేసి భూతంబులయెడ ద్రోహం బాచరింపరు. అట్లగుటంజేసి నీవంటి మహాత్ములు దేవమాయా మోహితు లై పరోపతాపంబులు నేసిరేని దీర్ఘ తరం బైన వృద్ధజననేవ వ్యర్థంబు గాదె ? అదియునుం గాక యీ శరీరం బవిద్యా కామ కర్మంబులచేత నారబ్ధం బని తెలిసిన పరమజ్ఞాని యీ దేహంబునందు ననుషక్తుండు గాకుండుట *( సహజం బన ) దేహోత్పాదితంబు లైన గృహ దారాదుల యందు మమత్వంబు లేకుంటం జెప్ప నేల ? ఇట్టి దేహంబునందున్న యాత్మ యేకంబును, శుద్ధ స్వరూపంబును (స్వయంజ్యోతియు) నిర్గుణంబును, గుణాశ్రయంబును, వ్యాప్యవ్యాపకంబును, ససంవృతంబును, సాక్షిభూతంబును, (నిరాత్మకంబును నగు.) దీని దేహంబునకంటె వేఱుగా నెవ్వండు దెలియు వాఁడు మత్పరుండగుటంజేసి దేహధారియై యుండియుఁ దద్గుణంబులం బొరయక వర్తించు. మఱియు నెవ్వండేని స్వధర్మాచారపరుండును, నిష్కాముండును, శ్రద్ధాయుక్తుండును నైన నెల్లప్పుడు భజియించు నట్టివాని మనంబు (క్రమంబునఁ)బ్రసన్నం బగు. అట్లు ప్రసన్న మనస్కుండును ద్రిగుణాతీతుండును సమ్యగ్దర్శనుండు నైన యతండు ( మదీయ సమవస్థానరూప శాంతి నొందు. ) అదియు కైవల్యపదం బనంబడు. కూటస్థం బైన యీ యాత్మ యుదాసీన భూతం బైనను, దీని ద్రవ్య జ్ఞాన క్రియా మనంబులకు నీశ్వరుంగా నెవ్వండు దెలియు, వాఁడు భవంబు నొందకుండు. ఈ సంసారము ద్రవ్య క్రియా కారక చేతనాత్మకం బగుటం జేసి ప్రభిన్న దేహోపాధికంబు గావునఁ బ్రాప్తంబులైన యాపత్సంపదల యందు మత్పరు లైన మహాత్ములు వికారంబు నొందరు. కావున నీవు సుఖ దుఃఖములయందు సమచిత్తుండవును, సమానోత్తమ మధ్యమాధముండవును, జితేంద్రియాశయుండవును నై (వినిష్పాదితాఖిలామాత్యాది సంయుతుండ వై) యఖిలలోక రక్షణంబు నేయుము. అని వెండియు నిట్లనియె. 541

* తా. ప. ప్రతులలో లేదు.

సీ. పార్థివోత్తములకుఁ బ్రజల రక్షించుట పరమధర్మం బగు నరవరేణ్య!
ధరణీశులకుఁ బ్రజాపరిపాలనంబున బూని లోకులు సేయు పుణ్యమందు
షష్ఠాంశ మర్థిని సంప్రాప్త మగునట్లు ప్రజలఁ బ్రోవని రాజు ప్రజలచేత
నపహృత సత్పుణ్యుఁ డై వారు గావించు ఘన పాపఫలము దా ననుభవించుఁ

తే. గాన నీవును విప్రవరానుమతము
సాంప్రదాయిక విధము నై జరుగు ధర్మ
మహిమఁ జేపట్టి యర్థకామములఁ జెందు
సమత న మ్మూఁటియందు నాసక్తి లేక. 542

వ. ఇవ్విధంబున. 543

క. జనులకు ననుర క్తుఁడ వై, జననాయక! నీవు ధరణి సమచిత్తుఁడ వై
యనయముఁ బరిపాలించిన, సనకాదులఁ గాంతు వాత్మసదనమునందున్. 544

వ. అని వెండియు ని ట్లని యానతిచ్చె. 545

సీ. భూవర! యోగ తపో మఖంబులచేతఁ గైకొని సులభుండు గాని యేను
సమచిత్తు లైన సజ్జనుల చిత్తంబుల వర్తింపుచుండెడి వాఁడ నగుటఁ
జేసి తావక శమ శీల విమత్సర [1]కీర్తనముల వశీకృతుఁడ నైతి
నేను నీ కొకవరం బిచ్చెద వేఁడుము నావుడు విని మేదినీవరుండు

తే. లోకగురుఁ డైన య ప్పుండరీకనయనుఁ
డానతిచ్చిన మృదు లలితామృతోప
మాన వాక్యము లాత్మీయ మస్తకమునఁ
దాల్చి సమ్మోద చిత్తుఁ డై ధరణివిభుఁడు. 546

క. తన పాదములకు భక్తిన్, వినతుం డై యాత్మకర్మవితతికి లజ్జిం
దనరుచు నున్న సురేంద్రునిఁ,గనుఁగొని సత్ప్రేమ మొదవఁ గౌఁగిటఁ జేర్చెన్.

వ. ఇట్లు గౌఁగిటం జేర్చి గతద్వేషుం డై యున్న యనంతరంబ. 548

మ. భగవంతుండును, విశ్వరూపకుఁడు నై భాసిల్లు న వ్విష్ణుఁ డా
జగతీనాథ కృతార్చనానతులచే సంప్రీత చేతస్కుఁడై
నిగృహీతాంఘ్రి సరోరుహ ద్వయుఁడు నై నిల్చెన్ బ్రయాణాభిము
ఖ్య గరిష్ఠాత్మకుఁ డయ్యు నా పృథునిపైఁ గారుణ్య మేపారఁగన్. 549

1. గుణములచే వశీకృతుఁడ నైతి (చ. ట. త. డ. ద.)

వ. ఇట్లు తనమీఁది యనుగ్రహంబునం జేసి విలంబితుండగుటయు న య్యాదిరాజన్యుం డైన పృధుచక్రవర్తి య మ్ముకుందసందర్శ నానందబాష్పజల బిందు సందోహ కందళిత నయనారవిందుం డై య వ్విభుమూర్తిం గనుంగొని, గనుంగొనలేక గద్గదకంఠుండై పలుకలేక యుండియు నెట్టకేలకుఁ దన హృదయంబునన దేవుని నుపగూహనంబు గావించి, త న్మూర్తి ధరించి కన్నులం దొరంగు నానందబాష్పం బులు దుడిచికొని, విలోకనంబు సేయుచు నతృప్త దృగ్గోచరుండును, గరుడ స్కంధ విన్యస్తహస్తుండును, వసుధాతలస్థిత పాదకమలుండును నై యొప్పు నాదిపురుషున కిట్లనియె. 550

క. వరదా! యీశ్వర! విను స, త్పురుషుఁడు దేహాభిమాన [1]భోగ్యములకు నీ వర మెట్లు గోరు? నిహసుఖ, వరములు నారకుల కైన [2]వఱలవె? చెపుమా! 551

చ. ఘన మగు దేవ! యీ వరమె కాదు మహాత్మక! వా గ్వినిర్గతం బనఁదగు తావకీన చరణాంబుజ చారు మరందరూప మై తనరిన కీర్తియున్ విని ముదంబును బొందఁగలేని మోక్ష మై నను మదిఁ గోర నొల్ల నఘనాశ! రమేశ! సరోజలోచనా! 552

క. అది గానఁ బద్మలోచన!, సదమల భవదీయ ఘనయశము వినుటకు నై పదివేల చెవులు కృపని, [3]మ్మదియే నా యభిమతంబు నగును ముకుందా! 553

చ. అనఘ! మహాత్మ వా గ్గళిత మైన భవ త్పదపంకజాత సం [4]జనిత సుధాకణానిలము సక్కఁగ విస్మృత తత్త్వమార్గ వ ర్తను లగు దుష్టయోగులకుఁ గ్రమ్మఱఁ దత్త్వముఁ జూపఁ జాలుఁ గా వున నిది దక్క నన్యవర మొల్లఁ బయోరుహపత్రలోచనా! 554

సీ. వినుత మంగళ యశోవిభవ! సర్వేశ్వర! యిందిర గుణ సంగ్రహేచ్ఛఁ జేసి
యే నీదు శివతరం బైన సత్కీర్తిని నర్థిమై వరియించె నట్టికీర్తి
[5]చతుర సత్పురుష [6]సంగతము గల్గుచునుండ ధృతినెవ్వఁడేని యాదృచ్ఛికమునఁ
జేసియు నొకమాటు చెవులార విన్నవాఁ డనయంబును గుణజ్ఞుఁ డయ్యెనేని

తే. విరతి, నేరీతిఁ బొందును? ధరణిఁ బశువు
దక్కఁ దక్కిన తద్జ్ఞుండు దనుజభేది!
కాన నుత్సుకమతి నైన యేను లక్ష్మి
కరణి నిన్ను భజింతు నో పరమపురుష! 555

1. భోగములకు (హ. తం. వా.) 2. వరలునె (హ) 3. ఇదియే నా యభిమతంబు లెసఁగు ముకుందా (హ) 4. జనితసుధా కణానిలవశంబున (క. బ.) 5. కలిత (హ) 6. సంగమము (హ)

వ. ఇట్లు భవదీయ సేవాతత్పరుల మైన యిందిరయు నేను నేకపదార్థాభిలాషంజేసి స్పర్ధమాను లగుచున్న మా యిద్దఱికిని బర్యాయ సేవంజేసి కలహంబు లేకుండ ని మ్మట్లుగాక భవదీయ చరణసరోరుహ సేవాసక్త మనోవిస్తారుల మగుటంజేసి నేను నేన మున్ను భజియింతు నను తలంపుల గలహం బైననుం గానిమ్మ దేవా! యని వెండియు నిట్లనియె. 556

సీ. జగదీశ! దేవ యుష్మత్పదకైంకర్య పరతఁ దనర్చు సాగరతనూజ
కృత్యంబునందు నకిల్బిషబుద్ధి నేఁ బ్రీతిఁ గోరుట జగన్మాత యైన
యా రమాసతితోడి వైర మవశ్యంబు గల్గు నైనను దయాకార! నీవు
దీనవత్సలుఁడవు గాన స్వల్పం బైన నధికంబు సేయుదు వట్లు గాన

తే. భవ్యచరిత! నిజస్వరూపంబునందు
నభిరతుఁడ వైన నీవు న న్నాదరించు
పగిది నిందిర నాదరింపవు మహాత్మ!
భక్తజనలోక మందార! భవవిదూర! 557

వ. ఇట్లగుటం జేసి సత్పురుషు లైనవారలు నిరస్త మాయాగుణ [1]విభ్రమోదయంబు గల నిన్ను భజియింతురు. వారలు భవత్పాదానుస్మరణ రూపం బైన ప్రయో జనంబు దక్క నితర ప్రయోజనంబుల నెఱుంగరు. దేవా! సేవకజనంబులను వరంబులు వేఁడు మని జగద్విమోహనంబైన వాక్యంబుల బలుకుదువు. అట్టి భవ దీయ వాక్యతంత్రీనిబద్ధులు లోకులు గాకుండిరేని ఫలకాము లై కర్మంబుల నెట్టు లాచరింతురు? ఈశా! భవదీయ మాయావిమోహితు లై జను లేమి కారణంబున నీకంటె నితరంబులఁ గోరుచుందురు?ఇట్లగుటంజేసి తండ్రి దనంతన బాలహితం బాచరించు నట్లు మాకు నీవ హితాచరణం బాచరింప నర్హుండ వని పలికిన *(యాది) రాజర్షియైన పృథుచక్రవర్తి యర్థవంతంబులైన వచనంబులు విని (విశ్వద్రష్ట యగు) నారాయణుండు సంతుష్టాంతరంగుండై *(యిట్లనియె. ఓ మహారాజ! దైవప్రేరితుండ వై నాయెడ నిట్టి బుద్ధి కలుగుటం జేసి యచంచల మగు భక్తి వొడము. దానిచే దుస్తరం బగు మదీయ మాయం దరింతువు. నీవు నాచే నాదిష్టం బగు కృత్యం బప్రమత్తుండ వగుచు నాచరించిన సకల శుభంబులం బొందుదువు. మదీయ భక్తజనంబులు స్వర్గాపవర్గ నరకంబులం దుల్యంబులుగా నవలోకింతురు. కావున నీ యధ్యవసాయంబు నట్టిదియ. మఱియు, మదీయాదేశంబున దుస్త్యజం బగు రోషంబును ద్యజించి నాయెడ

1. సముదయంబుల (హ) * తా. ప. ప్రతులలో లేదు.

భక్తిసలిపితివి గాన నిదియె నాకుఁ బరమార్హణం బగు. అని యభినందించి యను గ్రహించి) యతండు గావించు పూజలు గైకొని గమనోన్ముఖుం డయ్యె. ఆ య్యవసరంబున. 558

సీ. నర సిద్ధ చారణ సురముని గంధర్వ కిన్నర పితృ సాధ్య పన్నగులును
నఖిలజనంబులు హరిపార్శ్వవర్తులు నానందమగ్నాంగు లగుచు వేడ్క-
యజ్ఞేశచింతనుం డైన యా పృథువుచే సత్కారములఁ బొంది సమ్మదమునఁ
జనిరి నిజాధివాసములకు భగవంతుఁ డైన నారాయణుం డచ్యుతుండు

తే. దగ నుపాధ్యాయసహితుఁ డై తనరు పృథుని
విమలమతు లయి చూచుచు నమరవరులు
దన్ను జయజయకలిత శబ్దములఁ బొగడఁ
జనియె నప్పుడు వైకుంఠ సదనమునకు. 559

అధ్యాయము - ౨౨

వ. అంతఁ బృథుచక్రవర్తియు నింద్రియాగోచరుం డయ్యును దర్శితాత్ముఁడు, దేవ దేవుండు నైన వాసుదేవునకు నమస్కరించి, నిజపురంబునకుం జనుదెంచు సమ యంబున, మౌక్తిక కుసుమమాలికా దుకూల స్వర్ణతోరణాలంకృతంబును, లలిత సుగంధధూప విలసితంబును, రత్నమయ రంగవల్లికా విరాజితంబును, ఫల పుష్ప లాజాక్షత దీపమాలికా స్తంభ పూగపోతాభిరామ ప్రతిగృహ ప్రాంగ ణంబును, మృగమద ఘనసార చందనాగరు వాఃపూర సంసిక్త రథ్యావళీ విభాసితంబును, దరు పల్లవాభిశోభితంబు నైన పురంబుఁ బ్రవేశించి, మండిత రత్నకుండల మణిమరీచులు గండఫలకంబులం దాండవంబులు సలుపం, బురకామి నులు కనకపాత్ర విరచితంబు లయిన యశేషమంగళ నీరాజనంబుల నివాళింప, శంఖ దుందుభి ప్రముఖ తూర్యఘోషంబులును, ఋత్విజ్ని కాయాశీర్వచనంబు లును జెలంగ, వంది మాగధ జన సంస్తూయమానుం డగుచు విగతగర్వుం డై యంతఃపురంబుఁ బ్రవేశించి యనంతరంబ. 560

సీ. సమధిక [1]గతిఁ బౌరజన జానపదులచేఁ దనరారు వివిధపూజనల నొంది
రాజు సంతుష్టాంతరంగుండు ప్రియవరప్రదుఁడు నై వారల బహువిధములఁ
బూజించె ని వ్విధంబున మహత్తరము లైనట్టి కర్మంబుల నాచరింపు
చును ననవద్యచేష్టుం డై మహత్తముఁ డన నొప్పు నా పృథు మనుజవిభుఁడు

1. మతి (హ. తం. వా.)

తే. మించి భూమండలమ్ముఁ బాలించి విశద
యశము సర్వ ధరాచక్రమందు నిలిపి
చారు శుభమూర్తి రాజన్యచక్రవర్తి
పరమమోచమునఁ బరమపదము నొందె. 561

క. అని మైత్రేయమహాముని, యనఘుఁడు విదురునకుఁ జెప్పె నని శుకుఁ డభిమ
న్యుని సుతునకుఁ జెప్పినతెఱఁగు, గని సూతుఁడు సెప్పె శౌనకాదులతోడన్. 532

—: పృథుచక్రవర్తి సభాసదులకు సద్ధర్మము నుపదేశించి బ్రాహ్మణప్రశంస చేయుట :—

వ. అ ట్లెఱింగించియు వెండియు నిట్లనియె. ఇ వ్విధంబున నాదిరాజన్యుం డైన పృథుచక్రవర్తి యశేష గుణ విజృంభితంబును, నిర్దోషంబును, సత్పురుష సత్కృతంబును నైన యశంబును బ్రకటంబుగాఁ జేయంజాలు మైత్రేయునిం జూచి మహాభాగవతుం డైన విదురుం డి ట్లనియె. 563

సీ. మునినాథ! విను పృథుజనపాల చంద్రుఁడు సొబగొప్ప మేదినీసురులచేత
రాజ్యాభిషేక సంపూజ్యుఁ డై దేవతా గణముచే లబ్ధార్హగుణుఁడు నగుచు
వైష్ణవతేజంబు వలనొప్ప ధరియించి యర్థి నె య్యే కర్మ మాచరించె
నది నాకు నెఱిఁగింపు [1]మనఘాత్మ! యెవ్వని రూఢి గోదోహనరూప మైన

తే. [2]విక్రమోచ్ఛిష్ట మై యొప్పి వెలయుచుండు
కర్మమున నిప్డు రాజన్యగణము బ్రదుకు
నట్టి పృథుకీర్తి [3]ధరలోన నతివివేకి
తవిలి యెవ్వఁడు వినకుండు? ధన్యచరిత! 564

క. నావుడు విని మైత్రేయుం, డా విదురునిఁ జూచి పలికె నతివినయమునం
బావనచరితుఁడు పృథుఁడు ధ, రావరనుతుఁ డలఘుయశుఁడు ప్రమదం బలరన్.

సీ. రంగ దుత్తుంగతరంగ గంగాయమునా మధ్యమందు నున్నతి వసించి
కైకొని ప్రారబ్ధ కర్మ [4]సంఘములఁ బుణ్యక్షయార్థంబుగా ననుభవించు
చును సర్వదేశంబులును దనయాజ్ఞ యప్రతిహత సత్ప్రతాపమునఁ జెలఁగఁ
బూని సప్తద్వీపములకుఁ దా నొక్కరుండ వైష్ణవ భూసురావళికిఁ దక్క

1. అనఘాత్మ! భూమియే. రూఢి గవాకృతి రూఢ యెవని (హ. తం. వా.) 2. విక్రమోద్దీప్తయై యొప్పి వెలయు నట్టి (తం. హ.) యద్విక్రమోచ్ఛిష్ట మశేష భూపాః, లోకాస్సపాలా ఉపజీవంతి కామ, మద్యాపి తన్మే వద కర్మ శుద్ధమ్ (21-10) 3. ధరవివేకైనవాఁడు (క. బ) 4. క్షయార్థంబు నఖిల పుణ్యంబుల ననుభవింపుచును (హ)

తే. ధరణిఁ దక్కినప్రజ కెల్ల దండధరునిఁ
బోలి వర్తింపుచును గొంతకాల మరుగఁ
దవిలి యొకనాఁడు దీర్ఘసత్రంబు సేయ
నర్థి నైకొని దీక్షితుం డయ్యె నందు. 566

తే. రాజఋషి దేవఋషి పితృ బ్రహ్మఋషులు
జనవరునిచేత విహితపూజనము లొంది
సమధికైశ్వర్యగతి నున్న సమయముననుఁ
జిరశుభాకారుఁ డా రాజశేఖరుండు. 567

సీ. ఉన్నతోన్నతుఁడు సముత్తుంగభుజుఁడు సన్మహనీయతర శోభమానముఖుఁడు
చారు సంఫుల్ల కంజారుణేక్షణుఁడు సునాసాపుటుండు మందస్మితుండు
వక్రసూక్ష్మ స్నిగ్ధ వర నీలకేశుండు కమనీయరుచి కంబుకంధరుండు
సుభగ విశాలవక్షుండును ద్రివళీశోభిత మధ్యభాగుండు పృథునితంబ

తే. మండలుండు నావర్తసమాన నాభి
వివరుఁడును గాంచనస్తంభ విలస దూరు
రాజితుండును నరుణచరణుఁడు లలిత
నవదుకూలోత్తరీయుఁ డున్నతయశుండు. 568

వ. మఱియు నియమనిమిత్తంబునం బరిత్యక్తభూషణుఁ డగుటం జేసి వ్యక్తాశేష గాత్రశ్రీకుండు, కృష్ణాజినధరుండు, శ్రీమంతుండు, కుశహస్తుండు, కృతోచితుండు, శిశిర స్నిగ్ధ తారాక్షుండు నైన పృథుచక్రవర్తి సభామధ్యంబున తారాగణమధ్య భాసితుం డగు సుధాకరునిం బోలి వెలుంగుచు లేచి నిలుచుండి సదస్య సంతోష దాయకంబులు, చిత్రపద విరాజితంబులు, ప్రసన్నంబులు, పరిశుద్ధంబులు, గంభీరార్థంబులు, నవ్యాకులంబులు నైన భాషణంబుల నిట్లనియె.

క. వినుఁ డీ సభ్యులు ధర్మము, నసయము నెఱుఁగంగఁ గోరునట్టి జనుఁడు దాఁ
దన తలఁపునఁ గల యర్థముఁ, జను నెఱిఁగింపంగ ధీరసత్పురుషులకున్. 570

సీ. ఏను నీ లోకవితానంబు లెల్లను శాసించి భూప్రజా సంతతులను
దత్తద్విహితవృత్తి దానంబులను జేసి రక్షింప వివిధమర్యాద దప్పి
పోకుండ నిలుపుటకై కమలజుచే నియోగింపఁబడితి ని ట్లొనరియుంట
నట్టి ప్రజాపాలనా ద్యనుష్ఠాన వశంబునఁ బ్రాక్కర్మసాక్షి యీశుఁ

తే. డెట్టి వానికి సంతుష్టి నెసఁగుచుండు
నట్టివానికి నేలోక మంద్రు ఙధులు
[1]కామదుఘమైన యట్టి లోకంబు నాకు
సరవి గలుగు ననుష్ఠానపరుఁడ నగుట. 571

వ. ఇట్లు ప్రజల ధర్మంబులయందు ననుశాసింపక యర్థకాముం డై వారివలన నవ్వ నంబులు గొనెనేని వారల పాపంబు దనకుఁ బ్రాపింపం దేజోహీనుఁడై భూ విభుండు చెడుం గావున *( భూపతిహితార్థంబునకు స్వార్థంబునకు ) ననూయా రహితులై ప్రజల వాసుదేవార్పణ బుద్ధింజేసి ధర్మం బాచరింపవలయు. ఇదియ నన్ను నుగ్రహించుట. అదియునుం గాక (పితృ దేవర్షి తుల్యు లగు మీరలను మోదించి) కర్తయు ననుశాసకుండు(ననుజ్ఞాతయు నైన) నాకుఁ బరలోకంబున నేఫలంబు గలుగు నట్టి ఫలంబునకు సదృశం బైన కర్మం బాచరింపవలయు. అట్లైన సంతోషంబు నొందుదు. అనిన వార లా రాజేంద్రున కి ట్లనిరి. 572

క. జననాయక ! ప్రజ లిరవొం, దిన ధర్మము లెల్ల వాసుదేవార్పణ బు
ద్ధినిఁ జేయవలయు నంటివి,యనయము న వ్వాసుదేవుఁ డనఁ గలఁడె! మహీశా.

సీ. [2]అన విని వారికి మనుజేశుఁ డను నర్హ తములార ! వినుఁడయ్య ! తవిలి మీరు
యజ్ఞాధిపతి యైన యఖిలేశ్వరుఁడు గొన్ని మతములఁ గలఁడు ధీమంతులార !
యట్లైన మీరలు నందుకు విప్రతిపత్తి [3]గల్గుట నుపపన్న మరయఁ
గాదంటిరేని యీ ఘనునిచే రచిత మై కాంతిమంత మగు జగంబు గానఁ

తే. బడుచునున్నది యిట్టి ప్రపంచ రచిత
కర్మవైచిత్ర్య మ మ్మేటి గలుగకున్న
[4]నమర దది త దుక్తు లుపపన్నములు గావు
కాన న వ్వాసుదేవుండు గలఁడు మఱియు. 574

వ. అదియునుం గాక యీ జగద్వైచిత్ర్యంబు కర్తయైన యీశ్వరుండు లేకున్నం గర్మవశంబునం జేసి యుపపన్నం బగు నంటిరేని. 575

* తా. ప. ప్రతులలో లేదు. 1. కామదుఘమైనయట్టి లోకంబు నాకు (హ. తం. వా )
2. అనిన వారికిని జనాధిపుఁడను నర్హ (హ) 3. గల్గుటను బ్రసన్నమరయ (హ. తం. వా.)
4. నది తదీయోక్తులును ప్రసన్నములు గావు (హ); అమర నది తదుక్తులుఁ బ్రసన్నములు గావు (హ. తం. వా )

సీ. పూని ప్రియవ్రతోత్తానపాద ధ్రువ మనుల కస్మత్పితామహుఁ డనఁగఁ
దగు నంగిమేదినీధవునకు మఱియును వినుతి కెక్కిన పృథివీపతులకుఁ
బద్మసంభవ భవ ప్రహ్లాద బలిచక్రవర్తి ప్రముఖ భాగవతుల కర్థి
వర్గ సుస్వర్గాపవర్గంబులకు ననుగత కారణుం డన ఘనత కెక్కి

తే. హీను లగు మృత్యు దౌహిత్రుఁ డైన వేన
ముఖ దురాత్ములు ధర్మవిమోహితులును
దక్కఁ దక్కినవారికిఁ దాఁ [1]ప్రపన్న
వరదుఁ డై యిచ్చు నభిమతావళుల నతఁడు. 576

వ. ఇట్టి విద్వదనుభవంబున భువనహితుం డగు వాసుదేవుండు లేఁడనుట యుప
పన్నంబుగాదు, అదియునుం గాక. 577

ఉ. భూరి తపోభిరామ [2]మునిపూజన మెవ్వని పాదపద్మ సే
వారతి వృద్ధిఁ బొంది యనివారణఁ బూర్వ[3] భవానుసార సం
సార మహోగ్ర తాపము భృశంబుగఁ బాపఁగ నోపుఁ దత్పదాం
భోరుహజాత దేవనదిఁ బోలి యశేష మనోఘహారియై. 578

వ. మఱియు. 579

చ. అనుపమభక్తి నెవ్వని పదాంబుజమూలము మందిరంబుగా
ననయముఁ బొందు వాఁడు నిహతాఖిల భూరి మనోమలుండు స
ద్వినుత విరక్తి బోధ ధృతి [4]వీర్య విశేష సమన్వితుండు దా
ననఁ దగి భూరి సంసృతి మహత్తర దుఃఖము నందఁ డెన్నఁడున్. 580

క. నారాయణుండు జగదా, ధారుం డగు నీశ్వరుండు దలఁప నతనికిన్
లే రెందు సములు నధికులు, ధీరోత్తముఁ డతఁడు నద్వితీయుం డగుటన్. 581

వ. అదియునుం గాక. 582

ఉ. కర్మవశంబునం జగము గల్గును హెచ్చు నడంగు నన్నచోఁ
గర్మము బుద్ధిఁ జూడ జడకార్యము గాని ప్రపంచ కల్పనా
కర్మమునందుఁ గర్త యనఁగా విలసిల్లఁగఁజాల దీ జగ
త్కార్మక కార్యకారణము గావున నీశుఁడు విష్ణుఁ డారయన్. 583

వ. కావున మీర లవ్వాసుదేవుని నధికారానుసారంబున నిశ్చితార్థఫలసిద్ధి గలవార
లై మనోవాక్కాయ కర్మంబుల నిష్కపటవృత్తిం దగిలి వినుతి నతి పరిచర్యా

1. ప్రసన్న (హ) 2. పూజ్యము లెవ్వని (చ. జ. డ.) 3. భవానుబంధ (ట. జ.) 4. వీర్య విశేష మనీష వంతుడున్ (క. చ. ట. ల. బ.)

పూర్వకంబుగాఁ గామదుఘంబు లైన యతని పాదపంకజంబులు భజియింపుండు. అదియునుం గాక. 584

సీ. రూఢి నీశ్వరుఁడు స్వరూపంబునంజేసి పూని విశుద్ధ విజ్ఞాన ఘనుఁడు
నగుఖుండు [1]నైనఁ దా నరయని కర్మమార్గమునందు వ్రీహ్యాది ద్రవ్యములను
శుక్లాది గుణము విస్ఫుర దవఘాతాది సత్క్రియలును మంత్ర సంచయంబు
సంకల్పమును యాగసాధ్య మైనట్టి యఖండోపకారంబు ఘనపదార్థ

తే. [2]శక్తియు మఱి జ్యోతిష్టోమ సంజ్ఞకమ్మ
నను ననేక విశేష గుణతను మెఱయు
నట్టి యధ్వరరూప మై యఖిల జగము
నందు ననిశంబు ప్రఖ్యాతి నొందుచుండు. 585

వ. అదియునుంగాక దారుస్థితం బైన యనలంబు త ద్దారు గుణంబు లైన దైర్ఘ్య వక్రత్వాదికంబుల ననుసరించు చందంబున నవ్యక్తంబును, తత్ క్షోభకం బైన కాలంబు, వాసనయు, నదృష్టంబు నను కారణంబులం బుట్టిన శరీరంబునందు విషయాకారం బైన బుద్ధి నొంది, త ద్విషయాభివ్యంగ్యం బైన యానంద స్వరూపుం డగుచు క్రియాఫలంబునఁ బ్రసిద్ధియు నొందు. అని చెప్పి వెండియు నిట్లను. మదీయ జనంబు లీ మేదినీతలంబున దృఢవ్రతు లై యజ్ఞ భుగీశ్వరుం డును, గురుండును నైన సర్వేశ్వరుని హరిని నిరంతరంబును స్వధర్మయోగం బునం బూజింపుచున్నవారలు. (వారు) న న్నాశ్చర్యకరంబుగా ననుగ్రహించు వారు. అని హరిభక్తిరతు లైన య మహాత్ముల నుతియించి వెండియు ని ట్లనియె. 586

మ. వర సంపద్విభవ ప్రతాప [3]మహదై శ్వర్యంబులుం బొల్చు నీ
ధరణీనాథుల తేజ మంచిత తపో దాంతి క్షమా విద్యలం
గర మొప్పారు ధరాసుపర్వ హరిభక్త శ్రేణులం దెప్పుడుం
ధరలోనం బ్రభవింపకుండు నని య ద్ధాత్రీవిభుం డిట్లనున్. 587

చ. అరయఁగ నే ధరామర పదాంబుజ రేణువు లర్థిఁదాల్చి య
ప్పరమ పురాణపూరుషుఁడు బ్రాహ్మణదేవుఁడు నైనయట్టి యీ
శ్వరుఁడు [4]సదానపాయినిని సాగరకన్యను సర్వలోక వి
స్ఫురిత పవిత్రకీర్తియును బొంది విభూతిఁ దనర్చెఁగావునన్. 588

1. నయినను నరయ నీ (చ. పు. త. జ. ద.) 2. శక్తి యును మఱి సోమాది సంజ్ఞికమ్ము (హ)
3. సుమహైశ్వర్యఁ (తం. వా.) 4. సదానపాయియగు (హ)

సీ. ఏ వసుధామర సేవను జేసి యశేషగుణాన్విత స్థితిఁ దనర్చు
సర్వేశ్వరుఁడు మఱి సంతుష్టుఁ డగు నట్టి ధరణి[1]దివిజులఁ దద్ధర్మపరులు
నలఘు వినీతులు నై యవశ్యంబును [2]సేవింపరే! ధరాదేవ నిత్య
సేవచేఁ బురుషుఁడు చిరతర జ్ఞాన విద్యాభ్యాసి గాకున్న నైన నతఁడు

తే. వేగమున నంతరంగంబు విశద మగుటఁ
జేసి కైవల్య పదమునుఁ జెందు నట్లు
గాన లోకులు భూదేవతా నికరముఁ
దగిలి భజియింపవలయు నుదాత్త మతిని. 589

వ. మఱియు. 590

సీ. విజ్ఞానఘనుఁ డన వెలయు నీశ్వరుఁడు తత్త్వజ్ఞాను లైనట్టి వారిచేత
దీపింప నింద్రాది దేవతోద్దేశంబు నను భూమిసుర ముఖంబున హుతంబు
లగు హవిస్సులఁ దృప్తి నందినగతి నచేతన మైన హుతాశన ముఖంబు
వలన వేల్చిన హవిస్సులచేతఁ దృప్తుండు గాకుండుఁ గావున లోకమందు

తే. నగ్నిముఖమునకంటె ధరామరేంద్ర
ముఖము పరిశుద్ధ మత్యంత ముఖ్య మనఁగఁ
దనరు నదిగాక భూసురార్చనము సకల
జనులు గావింపఁ దగు నార్యజనములార! 591

వ. అదియునుం గాక. 592

సీ. ఏ వేదమం దేని యీవిశ్వమెల్లను [3]దర్పణ ప్రతిబింబిత ప్రభూష
నివహంబు కైవడిఁ [4]దవిలి ప్రకాశించు [5]నట్టి విరజమును నవ్యయంబు
నగుచు సనాతనం బగు వేద మే ధరాదేవతాజనములు దినముఁ దగిలి
[6]మహిత శ్రద్ధా తపో మంగళ మౌన సంయమ సమాధులఁ బొలుపారు చుండి

తే. యర్థ సదసద్విచారు లై యధికరింతు
రట్టి వారల పద[7]రజం బర్థిఁ దాల్చు
నలఘులకు సర్వ పాపక్షయంబు నఖిల
సద్గుణావాప్తియును నగుఁ జతురులార! 593

1. దివిజులు (హ) 2. సేవింపుఁడీ (హ) 3. దర్పణ ప్రతిబింబిత మగు వస్తు (హ. వా.) 4. దివిరి (హ) 5. నది విరజము మఱి యవ్యయంబు (హ) 6. మహిని (హ) 7. రజంబంది తాల్చు (హ)

వ. కావున నట్టి విప్రపాద సరోజరేణువు లేనును గిరీటంబున ధరియింతు. ఇట్లు బ్రాహ్మణ భజనంబునం జేసి యవాప్త సకల గుణుండు, శీలధనుండు, కృతజ్ఞుండు, శ్రద్ధాయుక్తుండు నైన మహాత్ము నఖిల సంపదలు ప్రాపించు. కావున గోబ్రాహ్మణ కులంబును, సమచర సమేతుండైన జనార్దనుండును నాయెడం బ్రసన్ను లయ్యెదరు గాక. అని పలుకుచున్న పృథుచక్రవర్తిం గనుంగొని పితృదేవ ద్విజ సత్పురుషులు సంతుష్టాంతరంగు లై సాధువాదంబుల నభినందించి యి ట్లనిరి. 594

క. మనుజేంద్ర! నీ కతంబున, ననుపమ ఘన బ్రహ్మదండహతుఁ డత్యఘవ
ర్తనుఁడు నగునట్టి వేనుం, దనయము నరకంబువలన నర్థిఁ దరించెన్. 594

వ. కావునం 'బుత్రేణ లోకాన్ జయతి' యను వేదవచనంబు నిశ్చయంబు. అదియునుం గాక. 596

చ. పురుషవరేణ్య! హేమకశిపుండు రమాలలనేశు నిందచే
నరకము నందఁగోరియు గుణజ్ఞుఁడు భాగవతుండు నైన యా
వర తనయప్రభావమున వాసికి నెక్కి విధూతపాపుఁ డై
[1]నిరయముఁ బొందఁ డయ్యె నతి నిర్మలకీర్తిఁ దనర్చెఁ గావునన్. 597

క. అని పలికి వీరవర్యుం, డనఁ దగు[2] పృథుచక్రవర్తి నయుతాబ్దంబుల్
దనరఁగ జీవింతువు గా, కని తగ నాశీర్వదించి యభిమత మొప్పన్. 598

వ. వెండియు నిట్లనిరి. †(దేవా! నీకు సకల లోకభర్త యగు నారాయణునందు నిట్టి భక్తి వొడముటం జేసియు) బ్రహ్మణ్యదేవుండు, నుత్తమశ్లోకుండు నైన సర్వేశ్వరుని సత్కథాజాలంబు వ్యక్తంబుసేయుచున్న నీవు మాకు నాథుండ వగుటంజేసియు, నేము ముకుందదాసుల మైతిమి. భవదీయ ప్రజాశాసనంబును బ్రజానురాగంబును గారుణ్యమూర్తు లైన మహాత్ములకు స్వభావంబులు గావున నాశ్చర్యంబు గాదు. దైవసంజ్ఞితంబు లైన కర్మంబులచేత వినష్టజ్ఞానుల మై పరిభ్రమించు మాదగు తమఃపారంబుఁ గంటిమి. ఏ సర్వేశ్వరుండు బ్రాహ్మణ జాతి నధిష్ఠించి క్షత్త్రియులను, క్షత్త్రియజాతి నధిష్ఠించి బ్రాహ్మణులను,నీ యుభయంబు నధిష్ఠించి విశ్వంబును భరించు నట్టి వివృద్ధసత్త్వుండు, సర్వరూపుండు, మహాపురుషుండు నైన పృథునకు నీశ్వరబుద్ధింజేసి యేము నమస్కరింతు మను సమయంబున. 599

1. నిరయమునందు బొంకక వినిర్మల కీర్తి (క. ట. జ. ద.) 2. శాశ్వతంబులగు హాయనముల్ (హ) † తా. ప. ప్రతులలో లేదు.

అధ్యాయము - ౨౨

:- పృథుచక్రవర్తి యొద్దకు సనకాదు లరుసుదెంచుట :-

క. వినువీథినుండి మెల్లనఁ, జనుదెంచిరి బాలసూర్య సంకాశతనుల్
జనవినుత ! సిద్ధవర్యులు, సనకాదులు శేముషీ విచక్షణు లంతన్. 600

వ. ఇట్లు చనుదెంచిన. 601

క. అనఘాత్ము లతిథిరూపం, బున రా గృహమేధి ప్రాణములు నుద్గతిచేఁ
దనరినఁ బ్రత్యుద్గతి [1]వం, దనముల మరలం బ్రతిష్ఠితము లగు ననుచున్. 602

క. వినబడు వచనన్యాయం, బున నుద్గతము లగు ప్రాణములఁ గ్రమ్మఱఁ బొం
దను గోరువాఁడునుం బలె,ననుచర ఋత్విక్సదస్యుఁడై పృథుఁ డంతన్. 603

తే. [2]ఇంద్రియేశుఁడు గంధాదికేష్టగుణముఁ
గూర్చి యుద్గమనక్రియఁ గోరి చేయు
పగిదిఁ బృథుచక్రవర్తి సంభ్రమముతోడ
మహితభక్తినిఁ బ్రత్యుద్గమంబు సేసె. 604

క. ఘన గౌరవమున న మ్మునిఁ, జక చిత్తవశీకృతుండు సభ్యుఁడు ప్రియుఁడున్
వినయానత కంధరుఁడై, జనవరుఁ డా పరమయోగిచంద్రుల నెలమిన్. 605

సీ. పూని యర్ఘ్యాసనాసీనులఁ గావించి కర మర్థి విధివత్ప్రకారమునను
బూజించి త త్పదాంభోరుహ క్షాళనసలిలంబు లాత్మమస్తమునఁ దాల్చి
హాటకకలిత సింహాసనాసీను లై విహితాగ్నులను బోలి వెలుఁగుచున్న
శర్వాగ్రజన్ముల సనకాదులను జూచి యతుల శ్రద్ధా సంయమాన్వితుండుఁ

తే. బరమ సంప్రీతమతియు నై పలికె రాజు
గోరి యో మంగళాయనులార ! పూర్వ
భవమునం దెద్ది మంగళ ప్రద సుకర్మ
మేను జేసితి ? మిముఁ జూడ నిపుడు గలిగె. 606

వ. అని వెండియు. 607

క. భువి నెవ్వనియెడ విప్రులు, భవుఁడును విష్ణుఁడుఁ దదీయభక్తులును బ్రస
న్నవదను లగుదురు వానికి, భువిని దివి నసాధ్యకర్మములు లే వనఘా! 608

వ. అని మఱియు ననఘాత్ములార! లోకంబుల నీక్షింపుచుం బర్యటనంబు సేయు
మిమ్ము సర్వదర్శనుం డైన యాత్మనుం గనుంగొనం జాలని సర్వదృశ్యంబు

1. వం, దనముల పునః ప్రతిష్ఠితము(క.జ.) 2. ఇంద్రియాధీశుఁ డగు జీవు డింద్రియముల(క.చ.)

చందంబున నీ లోకంబు గనుంగొనం జాలకుండు. అట్టి మహాత్ములరైన మీ దర్శనంబునంజేసి [1]యేను ధన్యుండనైతి. అదియునుం గాక. 609

చ. అరయ ధరిత్రి నెవ్వనిగృహంబు మహార్హ జనోప[2]భోగ్య వి
స్ఫురిత తృణాంబు భృత్య గృహభూముల సారెఁ దనర్చు నట్టి మం
దిరపతి పేదయైన జగతిం గడు ధన్యుఁ డటంద్రు గాన సు
స్థిరమతి మీరు వచ్చుట నశేషశుభంబుల నేను బొందెదన్. 610

వ. అదియునుం గాక. 611

చ. వరమతులార! యెవ్వని నివాసముఁ [3]దీర్థపదాంతరంగులై
పరఁగినయట్టి భాగవత పాదజలంబులు సోఁకవేని త
త్పురుషుఁడు భూరిసంపదలఁ బొంచిపిరిపోయిననైన వాని మం
దిర మురగప్రకీర్ణ జగతీజముఁ బోలు నటంద్రు కోవిదుల్. 612

వ. అని పలికి వెండియు నిట్లనియె. 613

సీ. పరమపావనులార! బాల్యంబునం దుండి మానిత శ్రద్ధాసమన్వితులును
గుణనిధుల్ ధైర్యయుక్తులు ముముక్షువులై యధికవ్రతంబుల నాచరింతు
రట్టి పుణ్యులు భవదాగమనంబు స్వాగతమయ్యె! సత్కృపాకలితులార!
యనివారిత వ్యసనార్ణవంబైనట్టి భూరి దుర్లంఘ్య సంసారమందు

తే. మతివిహీన స్వకీయ కర్మములఁజేసి
యశరి మగ్నులమై యింద్రియార్థములనె
తివిరి పురుషార్థములు గాఁగఁ దెలియు మాకుఁ
గుశల మున్నదె? లోకైకకుశలులార! 614

వ. మీరలు నాత్మారాము లగుటంజేసి మీయందుఁ గుశలాకుశలరూపంబులైన మతివృత్తులు సంభవింపవు. కావునం గుశలప్రశ్నం బుపపన్నంబు గాదు. కాన నేను గృతవిశ్వాసుండనై సంతప్తులైన వారలకు సుహృత్తులైన మిమ్ము నాకు నీ సంసారంబునందు నేమిట వేగంబ క్షేమంబు గలుగు ననిన యడిగెద. ఆత్మవంతులకు నాత్మయు, నాత్మభావనుండునైన యీశ్వరుండు భక్తానుగ్రహంబుకొఱకు నీ లోకంబుల మీ వంటి సిద్ధరూపంబున వర్తింపుచుండు. అని పలికిన యతని గంభీరార్థ గౌరవంబులును,[4]శుభకరంబులును, న్యాయ సహితంబు

1. యేము ధన్యుల మైతిమి (క. చ. ట. త.) 2. యోగ్య (క. తం.) 3. మరిగియున్న (క)
4. శోభమానంబులు (క. త. ద.)

లును, మితాక్షరంబులును, శ్రోత్రప్రియంబులును నైన వచనంబులు విని,సంప్రీత చేతస్కుండును. మందస్మితుండును నై సనత్కుమారుం డిట్లనియె. 615

మ. ధరణీశోత్తమ! సర్వభూత హిత [1]చేతస్కుండ వై ధర్మను
స్థిర భాగ్యోదయ[2]శాలి వై యెసఁగు నీచే సాధులోకోత్తరో
త్తర సంప్రశ్నము సేయఁగాఁబడె మహాత్మా! సాధులోకైక స
చ్చరితంబుం దలపోయ నిట్టిద కదా! చర్చింప లోకత్రయిన్. 616

తే. ధరణి సజ్జనసంగంబు దలఁప నుభయ
సమ్మతం బగు వారలు సలుపునట్టి
సరస సంభాషణ ప్రశ్న సరణి నిఖిల
జనములకు సుఖకర మగు జనవరేణ్య! 617

వ. అని యభినందించి మోక్షసాధనోపదేశ కాముం డైన పృథుచక్రవర్తికి వెండియు నిట్లనియె. 618

సీ. ధరణీశ! మధునిషూదనుఁ డైన యట్టి నారాయణు లలిత పాదారవింద
వర గుణధ్యాన ధీ పరిణతత్వంబున సకలాత్మ మలవిమోచనము నైన
రతియును నిత్యవైరాగ్యంబు మొదలనే లోకోత్తరుఁడవైన నీకుఁ గలవు
సమ్యగ్విచార! శాస్త్రములందు జనులకు నేమంబునకును నిశ్చితములైన

తే. [3]యాత్మ కన్యము లగువానియందు వీత
రాగత దలంప నిర్గుణబ్రహ్మ మైన
యాత్మయందుల రతియును సనఁగ నివియ
హేతువులు బుద్ధిఁ జింతింప నిద్ధచరిత! 619

వ. కావున శ్రద్ధయు, భగవద్ధర్మచర్యయుఁ, దద్విశేష జిజ్ఞాసయు, నాధ్యాత్మిక యోగనిష్ఠయు, [4]యోగేశ్వరోపాస్తియుఁ, [5]బుణ్యశ్రవణుం డైన నారాయణ కథాలాపంబు, నర్థేంద్రియారాము లైనవారలతోడి సంగతియందు [6]విరక్తియు, వారల కభిమతంబులైన యర్థకామంబులందు ననాకాంక్షయు, సర్వేశ్వరుని గుణకీర్తనామృతపానంబు దక్క నితరపదార్థ వైరాగ్యంబు నొంది యాత్మా రామతం గలిగి విజనస్థలంబులందుల రుచిగలుగుటయు, నహింసయు, [7]శమాది ప్రధాన వృత్తియు, నాత్మహితానుసంధానంబును, భగవత్కథానుస్మరణంబును,

1. చేతస్కుండవున్ (క) 2. శాలియునైన (క.చ.డ.ద.) 3. ఆత్మవ్యతిరిక్త వస్తువునందు (చ. జ. ద.) 4. యోగీశ్వరోపాస్తి (హ. తం. వా.) 5. బుణ్యశ్లోకుఁడు (క.ట.) 6. విరతియు (క. చ. జ. డ.) 7. శమదమాది (క. చ. త.)

నకామ్యంబు లైన యమనియమంబులు *(నితర భక్తిమార్గాగర్హణంబును, యోగక్షేమార్థ క్రియారాహిత్యంబును) శీతోష్ణాది ద్వంద్వసహిష్ణుతయు భాగవత కర్ణాలంకారభూతంబు లగు భగవద్గుణాభిధానంబులు నను వీనిచేత విజృంభమాణం బైన భక్తియోగంబునం జేసి యనాత్మయందు నసంగంబును, (కార్యకారణ రూపం బగు) నిర్గుణ బ్రహ్మంబునందు రతియు నెప్పుడు గలుగునప్పుడు సదాచార్యానుగ్రహవంతుండైన పురుషుండు (బహ్మనిష్ఠులతోడఁ) జెలిమి సేయుచు నీషణత్రయంబు వర్జించి ప్రకృతిం జేరక జ్ఞానవైరాగ్య వేగంబునం జేసి. 620

సీ. అనఘ! సాక్షాత్కార మగు భక్తి యోగాగ్నిఁ గడఁగి జీవాధారకమును [1]పంచ
భూతాత్మకంబు నై పొలుచు హృద్గ్రంథినిఁ బూని స్వకారణభూత మైన
యరణి దహించు హుతాశను కై వడి నిర్దహించిన నిట్లు నెఱసి దగ్గ
చిత్తుఁడై ముక్త నిశ్శేషాత్మగుణుఁడు సద్ధర్ముఁడు నైన యతండు మిగుల

తే. నర్థి బాహ్యంబు లైన ఘటాదికములు
నాంతరము లైన సౌఖ్యదుఃఖాదికములు
నను విభేదము లాత్మ [2]భేదనము లగుట
న య్యుపాధివినాశంబు నందఁగలఁడు. 621

వ. అది యె ట్లనిన. 622

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁబొందిన యాత్మసుఖై కహేతు వై
పరఁగిన రాజభృత్యజన భావ గుణంబులు సంప్రబోధమం
దరయఁగ మిథ్య యైనగతి నాంతర బాహ్య గుణప్రభేదముల్
పరువడి గానకుండు జనపాలనశీలన! నిత్యఖేలనా! 623

వ. మఱియును ద్రష్టయైన యాత్మయు, దృశ్యం బైన యింద్రియార్థంబు నను వీనికి నహంకారంబు సంబంధహేతు వగుటంజేసి, యది యంతఃకరణంబునం గలుగుచుండు జాగ్రత్స్వప్నంబుల యందు నీ భేదంబు గనుంగొనుచుండు. ఇట్టి యంతఃకరణంబు లేనిది యగు సుషుప్తి కాలంబునం బురుషుండు జలదర్పణాది నిమిత్తాభావం బగునప్పుడు బింబ ప్రతిబింబభేదంబు గనుంగొనని చందంబున దృశ్యభేదంబు గనుంగొనకుండుం గావున నంతఃకరణనిలయంబు నొందిన భేదంబు గనకుండుట నిశ్చయం బని వెండియు నిట్లనియె. 624

*తా,ప. ప్రతులలో లేవు. 1. పంచ (తం. వా.) 2. భేదకములగుట (హ); సాధకములగుట (జ. ద. బ.)

సీ. భువి విషయాకృష్టభూతంబు లైన యింద్రియములచేతను దివిరి మనము
దగ విషయాసక్తిఁ దగిలి యాంతర మైన మహిత విచారసామర్థ్య మెల్ల
శరకుశాది స్తంబ జాలంబు హ్రదతోయములు గ్రోలుగతిఁ గ్రమంబున హరించు
నీ రీతి నంతర్విచార సామర్థ్యంబు నపహృతం బైన పూర్వాపరాను

తే. మేయ [1]సంధానరూప సంస్మృతి నశించు
నది నశించిన విజ్ఞాన మంతఁ దొలఁగు
నట్టి విజ్ఞాననాశంబు నార్యజనులు
స్వాత్మ కది సకలాపహ్నవం బటంద్రు. 625

వ. అదియునుం గాక "ఆత్మన స్తు కామాయ సర్వం ప్రియం భవతి" యను వేద వచనంబునంజేసి విషయంబులకుం బ్రియతమంబై యాత్మోపాధికంబు నొంది, యాత్మాపహ్నవంబునం బాటిల్లు స్వార్థనాశం బెద్ది గలుగు దానికంటె లోకంబున నధికం బైన స్వార్థనాశంబు లేదు. అది యెట్లనిన సర్వార్థనాశంబునకు స్థైర్యంబు నొందించునట్టి యర్థకామాభిధ్యానంబునం ద ద్దేతుకం బైన స్వార్థ నాశంబునం బరోక్షాపరోక్షరూప జ్ఞానంబు నశించుం గావున నాత్మాపహ్నవంబున కంటె నధికతరం బైన సర్వార్థనాశంబు లేదు. అని వెండియు నిట్లనియె. 626

సీ. అనఘ! యీ సంసార మతిశయంబునఁ దరియింపంగ మది నిశ్చయించువాఁడు
గైకొని ధర్మార్థ కామ మోక్షములకు నతివిఘాతుక మెద్ది? యట్టిదాని
వలన సంగము సేయవలవదు ధర్మాదులందుఁ ద్రివర్గంబు నంతకోగ్ర
భయకారి యగుటను బరమమోక్షంబె ముఖ్యార్థ మై విలసిల్లు నంద్రు బుధులు

తే. భువి గుణవ్యతికరమునఁ బుట్టినట్టి
యబ్జజాతాదులకు నస్మ దాదులకును
గాలవిధ్వంసి తాఖిలక్రమము గల్గుఁ
గలుగ దెన్నఁడు సేమంబు గాన వినుము. 627

వ. కావున మోక్షంబె పరమపురుషార్థం బని చెప్పి వెండియు నిట్లనియె. నరేంద్రా! దేహేంద్రియ [2]ప్రాణ బుద్ధ్యహంకార పరివృతంబు లైన యీ స్థావరజంగమంబుల హృదయంబులందు వ్యాపకుండును, బ్రత్యక్షభూతుండును, బ్రత్యగ్రూపుండును, భగవంతుండును నైన యీశ్వరుం డంతర్యామి రూపంబునం బ్రకాశింపుచుండును. ఆదినారాయణుని స్వరూపంబుగాఁ దెలియుము. అని వెండియు నిట్లనియె.

1. సంధానురూప (హ) 2. ప్రాణేంద్రియ (హ)

ఉ. భూవర! యే మహాపురుష భూషణునందుల నీ సమస్తవి
శ్వావళి లీలమై సదసదాత్మక భావము నొంది భూరి మా
యావిభవంబులం [1]దగి సమగ్ర వివేక విరోధి ప్రగ్ఘనా
శీవిషబుద్ధిఁ [2]దోఁచుచు విశేషగతిన్ వెలుఁగొందు నెప్పుడున్. 629

చ. సుమహిత నిత్యముక్త పరిశుద్ధ విబుద్ధ సుతత్త్వుఁడై యురు
క్రముఁ డఖిభూత సత్ప్రకృతి కర్మకళంకుఁడు నైన యట్టి యు
త్తమచరితుం గృపాకరు నుదాత్తగుణోన్నతు నీశ్వరేశుఁ జి
త్తమునఁ దలంపుమయ్య! జనతా పరిరక్షణ! దుష్టశిక్షణా! 630

సీ. వసుమతీనాథ! యెవ్వని పాదపద్మపలాశవిలాస సల్లలితభక్తి
సంస్మరణంబుచే సజ్జనప్రకరంబు ఘనకర్మసంచయ [3]గ్రథిత మగు న
హంకార మను హృదయగ్రంథిఁ [4]జెఱుతురు వివరింప నిట్లు నిర్విషయమతులు
మహి నిరుద్ధేంద్రియమార్గులు నైనట్టి [5]యతులకుఁ జేరంగ నలవికాని

తే. యట్టి పరమేశుఁ గేశవు నాదిపురుషు
వాసుదేవుని భువనపావనచరిత్రు
నర్థి శరణంబుగాఁ దత్పదాంబుజములు
భక్తి సేవింపు గుణసాంద్ర! పార్థివేంద్ర! 631

మ. అరిషడ్వర్గ [6]మహోగ్ర నక్రనికర వ్యాకీర్ణ సంసార సా
గర మజ్జోదర [7]కీర్తనాతరణి సాంగత్యంబునం బాసి తా
[8]మరుదార న్నసుఖావహ ప్రకట యోగాది క్రియాయుక్తిచేఁ
దరియింప న్మదిఁ గోరువారలకు దుర్దాంతం బగుం గావునన్. 632

మ. ధరణీశోత్తమ! నీవు కేవల సముద్యద్భక్తి ధీయుక్తిమై
వర గోవింద పదారవిందయుగ భాస్వన్నావ సంధించి దు
స్తర భూరి వ్యసనాకరోల్లసిత దుర్దాంతోగ్ర గంభీర సం
సరణాంభోధిఁ దరింపుమయ్య! పరమోత్సాహంబు దీపింపఁగన్. 633

క. అని యీగతిఁ బంకరుహా, సనసుతుఁడు[9]ను బ్రహ్మబోధశాలియు నగు నా
ఘన యోగివల్లభునిచే, తను దెలియఁగబడిన బ్రహ్మతత్త్వం బగుచున్. 634

1. దగిలియగ్ర వివేక (చ. ట. జ. డ.) 2. దోపుచు (హ) 3. గ్రథితమైన (క.జ.డ.ద.బ.)
4. చేరరు (హ) 5. యతులును జెరుపలేరేమి జెప్ప (క. చ. త. జ. డ. బ. ద.) 6. మహోర్మి నక్ర
హ. తం. వా.) 7. కీర్తనాద్యుడుప (హ) 8. అరుదారంగ నహూపహ ... (హ. తం. వా.)
''భవార్ణవ మప్లవేశాః, షడ్వర్గ నక్ర మసుఖేన తితీర్షయంతి'' అని మూలము (23-40) 9. సనత్కు
మార సన్ముని నాథుం, దనుయోగి (హ)

క. జనపతి మునిఁ బొగడి ముదం, బున నిట్లనుఁ బూర్వ[1]కాలమున దీనజనా
వనుఁడైన యీశ్వరునిచే, తను [2]నేను ననుగ్రహింపఁదగితి మునీంద్రా! 635

క. వినుఁ డట్టి యనుగ్రహ సా,ధనమునకై మీర లిపుడు దగ నిచ్చటికిం
జనుదెంచితిరి దయాళులు, ననఘులు [3]భగవత్తములును నగు మీచేతన్. 636

సీ. నిరతంబు నాయందు నిష్పాదితము లగు దేహసమేత మదీయరాజ్య
సర్వసంపదలును సద్ద్విజదత్తముల్ గావునఁ బ్రాణ కాంతా విభూతి
మందిర సుత రాజ్య మహీ బల కోశ పరిచ్ఛదంబుల నెల్ల ధృతిఁ దలంప
రాజుకు భృత్యుండు రాజకీయము లగు తాంబూలముఖ పదార్థములఁ జేసి

తే. సమత సంతర్పణోపచారములు నడపు
గతిని వారల కవి నివేదితము లయ్యెఁ
గాన మీ కుపచార మేగతి నొనర్తు?
నతులగుణసాంద్ర! యోగికులాబ్ధిచంద్ర! 637

వ. అది యెట్లు బ్రాహ్మణాధీన మంటిరేని, సేనాధిపత్య రాజ్య దండ నేతృత్వ సర్వలోకాధిపత్యంబులు వేదశాస్త్రవేది యైన బ్రాహ్మణునకుం గాని యితరులకు యోగ్యంబులు గావు కావున బ్రాహ్మణులకు భోజన వసన దానంబులు స్వకీయంబులై యుండు. క్షత్త్రియాదులకు బ్రాహ్మణానుగ్రహంబున నన్నమాత్రంబు దక్కం దక్కిన వస్తుస్వాతంత్ర్యంబు లేదు. కావున మీకు గురుదక్షిణ నేమి సమర్పించువాఁడ? అదియునుం గాక స్వాతంత్ర్యంబు గలిగిన నిట్టి యధ్యాత్మవిచారులు వేదాంతవేదులునై భగవద్భక్తి నుపదేశించెడు మీవంటి పుణ్యాత్ములకుం బరితోషాస్పదుండు దక్కఁ దక్కినవాఁ డెవ్వం డంజలిమాత్రంబు దక్కఁ దక్కిన ప్రత్యుపకారంబు సేయం దలంచు? అది గావున దయాళువులైన మీరలు స్వకృతోపకారంబునం జేసి సంతుష్టాంతరంగు లగుదురు గాక. అని పలుకుచున్న యాదిరాజైన పృథుచక్రవర్తిచేతం బూజితులై యాత్మయోగనిష్ఠులైన సనకాదు లతని స్వభావంబుఁ బ్రశంసింపుచు సమస్తజనంబులు సూచుచుండ నాకాశగమనంబునం జనిరి. అయ్యవసరంబున. 638

—: పృథుచక్రవర్తి జ్ఞానవైరాగ్యవంతుఁ డగుచు ముక్తినొందుట :—

ఆ. విను మహాత్మ! ముఖ్యుఁ డన నొప్పు వైన్యుఁ డే
కాగ్రచిత్తుఁ డగుచు నాత్మనిష్ఠుఁ
డైనయట్టి తను నవాప్తకాముని గాఁగ
బుద్ధిలోనఁ దలఁచె భూవరుండు. 639

1. జన్మమున నేదీనా (హ) 2. నిక్క మనుగ్రహింప (హ) 3. భాగవతవరులు నగు నుత్తములున్ (హ. వా.)

వ. అంత. 640

సీ. కర్మంబులను యథాకాల దేశోచిత బల విత్తములుగాఁగఁ [1]బరఁగు ధర్మ
ములను బ్రహ్మార్పణబుద్ధినిఁ జేసి [2]నిరాసక్తుఁ డగుచు సమాహితుండు
ప్రకృతికంటెను దన్నుఁ బర మైన యాత్మను గర్మసంచయ సాక్షిఁ గాఁగ బుద్ధి
నర్థిఁ దలంపుచు[3] నాచరింపుచు నట్లు మెఱసి సామ్రాజ్య లక్ష్మీసమేత

తే. మంది రోద్యాన వనభూములందు రాజ్య
గరిమ వర్తింపఁగా నహంకారరహితుఁ
డగుచుఁ దన చిత్తమున నింద్రియార్థములను
[4]దగులకయ యుండె నాతండు తరణిపగిది. 641

వ. ఇట్లధ్యాత్మ యోగనిష్ఠుం డై కర్మంబుల నాచరింపుచు నర్చి యను భార్య
యందు విజితాశ్వుండు, ధూమ్రకేశుండు, హర్యశ్వుండు, ద్రవిణుండు, వృకుండు
నను నాత్మసములైన పుత్రుల నేవురం గనియె. అంత.' 642

క. జనవినుత! భూమివలనను, ధనముల మర్యాదఁ గొనుచు దాననిమిత్తం
బునఁ గ్రమ్మఱఁ దా నిచ్చుచు, దిననాయకుఁ బోలి వసుమతీవిభుఁ డొప్పెన్. 643

వ. అతండు మఱియు నగ్నిచందంబునం దేజోదుర్ధర్షుండును *(మహేంద్రుని పగిది
దుర్జయుండును) ధరణికరణి సతత క్షమాయుక్తుండును †(స్వర్గంబునుంబోలె
నభీష్టదుండును, బర్జన్యునిభాతిఁ గామిత ప్రవర్షణుండును,సముద్రురీతి గాంభీర్య
యుక్తుండును) మేరువుపోలికి సత్త్వవంతుండును, ధర్మరాజుకైవడి ననుశాస
కుండును (మహేంద్రుని విధంబున నైశ్వర్యవంతుండును) కుబేరునిమాడ్కి
ధనవంతుండును, వరుణునిసరణి గుప్తార్థుండును, సర్వాత్మకుం డగు వాయువు
చొప్పున బలౌజస్తేజో యుక్తుండును, రుద్రునిపగిది నసహ్యతేజుండును, గంద
ర్పునియనువున సౌందర్యవంతుండును, మృగరాజునోజ నధిక శౌర్యోపేతుండును,
మనువురూపున వాత్సల్యయుక్తుండును, నజునిచందంబునం బ్రభుత్వసమేతుం
డును, బృహస్పతిగరిమ బ్రహ్మవాదియు, సర్వేశ్వరుని జాడ జితేంద్రియుండును
నై విష్వక్సేనానువర్తులైన గో గురు విప్రజనంబులందు భక్తి గలిగి, లజ్జా
వినయ శీలంబులందుం, బరోపకారంబునందును నిరుపముం డై యివ్విధంబున
సర్వ లోకపాలక పృథగ్విధ గుణంబుల నన్నింటినిం దా నొక్కరుండ ధరియించి.

1. బరమధర్మ (క.డ.ద.బ.) 2. నిరాసంగుఁడగుచు (క.చ.త.డ.ద.) 3. కర్మాధ్యక్షం చ మన్వాన ఆత్మానం ప్రకృతేః పరమ్. ( 22-51 ) అని మూలము, 4. దగులకుండెను నమ్మహోదాద దంత (క.బ.తం.వా.) ''నా సజ్జతేంద్రియార్థేషు నిరహంమతి రర్కవత్'' (22-52) * కొన్ని ప్రతులలో లేదు. † ఈ భాగము మూలములో నున్నది. వ్రాఁత ప్రతులలో లేదు.

క. అనఘాత్మక ! లోకత్రయ, మున సజ్జన కర్ణరంధ్రముల వినఁబడు నా
వినుత యశోమహనీయుఁడు, జనవినుతుం డగును రామచంద్రుని మాడ్కిన్.

చ. సరస వచోర్థ సత్పురుషసంఘ సమంచితగీయమాన సు
స్థిర వర[1]కీర్తిపూరము సుధీజన కర్ణములందు నించి తా
నిరుపమ సౌఖ్యభాషణ మనీషితతోఁ బ్రజానురక్తుఁ[2]డై
ధరణిని రాజనామమునఁ దాఁ దగు రెండవ చంద్రుఁడో! యనన్. 646

అధ్యాయము — ౨౩

వ. †మఱియు న మహాత్ముండు విజ్ఞానియు, వర్ధితాశేష స్వానుసర్గుండును, ప్రజాపాలకుండును,స్థావరజంగమ వృత్తిదాయకుండును,సత్పురుషధర్మవర్తనుండును, నిష్పాదితేశ్వరాదేశకుండు నైన పృథుం డొక్కనాఁడు దన వార్ధకంబు వీక్షించి, []నిజాత్మజ నాత్మజులయందు నిలిపి, ప్రజలు చింతాతుర చిత్తు లగుచుండ నిజ భార్యాసమేతుం డై యప్రతిహత నియమంబున వైఖానస సమ్మతం బైన యుగ్రతపంబునందుఁ బూర్వంబున దిగ్విజయప్రవృత్తుం డగు చందంబునం బ్రవృత్తుం డై తపోవనంబునకుం జని యందు. 647

మత్తకోకిల. కందమూల ఫలాశి యై బహుకాల ముగ్రతపః పరి
స్పందుఁ డై యట మీఁదటం దృణ పర్ణ భక్షణఁ జేసి యా
చంద మేది జలాశి యై నృపసత్తముం డది మాని తా
మంద గంధవహాశి య య్యుగ్రమంబునం దృఢచిత్తుఁడై. 648

వ. ఇట్లు వర్తింపుచు. 649

సీ. మెండుగా మిటమిట మండు వేసవియందుఁ దప్త పంచాగ్ని మధ్యమున నిలిచి
మానక జడి గొన్న వానకాలంబునఁ బైఁ గోక వేయక బయట నిలిచి
జనులు హూ! హూ! యను చలివేళఁ గుత్తుకబంటి తోయములలోపల వసించి
శిశిరంబు చాల నల్దిశలఁ బర్వినవేళ వెలయ భూశయనుఁ డై విశ్రమించి

తే. మహితనియతిఁ దితిక్షా సమన్వితుండు
నియత పరిభాషణుఁడు జితానిలుఁడు దాంతుఁ
డిద్ధమతి నీశ్వరారాధనేచ్ఛుఁ డనఘుఁ
డూర్ధ్వరేతస్కుఁడును నై క్రమోచితముగ. 650

1. కీర్తిపూరముల దిగ్గజ కర్ణములందు (త) 2. డైన (తం. వా.) † వాక్యమున 'పృథుండు' అను కర్తృపద మున్నది గావున—'మఱియు నమ్మహాత్ముండు' అను మాట లేకుండుట యుచితము.
[] ఆత్మజ = పృథ్వి (వ్యాఖ్య)

వ. అతిఘోరం బైన తపం బాచరించె. ఇవ్విధంబునం గ్రమానుసిద్ధం బైన తపంబున విధ్వస్తాశేష కర్మమలాశయుండును * (ప్రాణాయామంబులచే జితారిషడ్వర్గుండును, ఛిన్నబంధనుండును)నై పురుషశ్రేష్ఠుండైన పృథు చక్రవర్తి భగవంతుండైన సనత్కుమారుం డెఱింగించిన యోగమార్గంబున సర్వేశ్వర భజనంబు గావించె. ఇట్లు భగవద్ధర్మపరుండును, సాధువర్తనుండును, శ్రద్ధాసమన్వితుండును నైన పృథునకు నారాయణునందు భక్తి యనన్యవిషయం బై ప్రవృద్ధం బయ్యె. ఇవ్విధంబున. 651

క. నరలోకోత్తర! భగవ, త్పరిచర్యారాధనములఁ బరిశుద్ధాంతః
కరణుం డగు నా పృథునకు, సరసిరుహోదరు కథానుసంస్మరణమునన్. 652

క. పరిపూర్ణం బగు భక్తిని, గర మనిశము సంశయాత్మకం బై చాలన్
వఱలిన హృదయగ్రంథిని, [1]నిరసించు విరక్తియుత మనీష జనించెన్. 653

వ. దానంజేసి యతండు సంఛిన్న దేహాత్మజ్ఞానుండు, నధిగతాత్మ స్వరూపుండు నై గదాగ్రజుం డైన శ్రీకృష్ణుని కథాసక్తి నొంది సమస్త యోగసిద్ధులందు నిస్పృహుం డగుట హృదయగ్రంథి విచ్ఛేదకం బైన జ్ఞానయోగంబును విడిచి, యాత్మయందు నాత్మయోగంబుఁ గావించి, బ్రహ్మభూతుం డై నిజకళేబరంబు విడువ నిశ్చయించి. 654

సీ. కోరి మడమలచే గుదపీడనము చేసి పూని [2]ముక్తాసనాసీనుఁ డగుచుఁ
దనరు మూలాధారమున నుండి వాయువు నొయ్యన నెగయించి యొనర నాభి
కలితంబు గావించి క్రమము హృ ద్వత్స [3]కంఠ శిరః కోష్ఠకములఁ జేర్చి
కైకొని మూర్ధభాగమునకు నెగయించి ప్రాణముల్ విడిచి యా పవనుఁ బవను

తే. నందు నాకాశ మాకాశమందుఁ దేజ
మందుఁ దేజంబు నుదకంబునందు నుదక
మర్థిఁ గాయంబు మేదినియందుఁ గలిపెఁ
బూని వాని యథోచిత స్థానములుగ. 655

వ. మఱియు భూమి నుదకంబునందును, నుదకంబును దేజమందును, దేజంబును వాయువున, వాయువు నాకాశంబునందును, నాకాశంబును మనంబున, మనంబు నింద్రియంబుల, నింద్రియతన్మాత్రల భూతాది యైన యహంకారంబునం,

* తా. ప. ప్రతులలో లేదు. 1. నెరిద్రుంచు (క. చ. ద. బ.) 2. యుక్తాసనా...(హ. తం. హ.); బద్ధాసనా...(త) 3. కంఠశీర్షిక కోష్ఠకముల జేర్చి (త. జ.)

దహంకారంబు మహత్తత్త్వంబునందును గూర్చి, యట్టి సర్వకార్య హేతుభూతం బైన మహత్తత్త్వంబును జీవోపాధిభూతం బైన ప్రకృతియందుఁ గలిపి, జీవ భూతుం డైన పృథుండు జ్ఞాన వైరాగ్యంబులచేత బ్రహ్మనిష్ఠుం డై, మాయో పాధిం బాసి, ముక్తుం డయ్యె. అని చెప్పి వెండియు నిట్లనియె. 656

సీ. అంత నా పృథుని భార్యామణియగు నర్చి పుడమిపైఁ దన యడు గిడినఁ గందు
సుకుమార పాదాబ్జ సుందరీరత్నంబు నతుల పతివ్రత యగుటఁ జేసి
యాత్మేశకృత సువ్రతాచరణంబును [1]సుమహిత భక్తి శుశ్రూషణమును
నార్షేయ యగు దేహయాత్రయు నను వీనిచేత మిక్కిలి కృశీభూతదేహ

తే. యయ్యుఁ బ్రియనాథకృత కరుణావలోక
కరతల స్పర్శనాది సత్కారములను
నబల సుఖవృత్తిఁ జెంది య య్యడవులందుఁ
గృశత మదిఁ దోఁపకుండఁ జరించు నపుడు. 657

క. తన మనమున నే దుఃఖం, బనయంబు నెఱుంగనట్టి యర్చి నిజాధీ
శుని ప్రాణరహిత దేహముఁ, గనుఁగొని విలపించి విగతకౌతుక యగుచున్.

సీ. మానిత మందర సానుప్రదేశంబునందుఁ జితారోప మర్థిఁ జేసి
లలిత మహానదీ లలిలసుస్నాత యై కలిత మహోదారకర్ముఁ డైన
నాథున కుదకదానక్రియల్ గావించి యతిభక్తి సురలకు నతు లొనర్చి
వహ్నికి ముమ్మాటు వలగొని పతిపాద కమలయుగంబు చిత్తమున నిలిపి

తే. †వీరవరుఁ డైన పృథు పృథివీతలేశు
నందు ననుగమనము సేయునట్టి సాధ్వి
నర్చిఁ గనుఁగొని [2]దేవాంగనాసహస్ర
మాత్మనాథులఁ గూడి నెయ్యంబుతోడ. 659

క. పరమోత్కంఠమున న్మం, దరగిరి సానుప్రదేశతలమున వరుసం
గురియించిరి నవసురభిత, వర మందార ప్రసూన వర్షము లంతన్. 660

క. [3]తరమిడి యచ్చర లాడిరి, మొరయించిరి శంఖతూర్యములు దివిజులు పా
డిరి కిన్నరజనులు పర, స్వరనుతు లొనరించి రా సుపర్వాంగనలున్. 661

వ. మఱియు నిట్లనిరి. 662

1. సుమహిత శుశ్రూషణమును జేసి (హ) †ఈ గీతము, ఒక్క 'హ' ప్రతిలో మాత్రము "సంస్మరింపుచు శిఖిప్రవేశంబుసేసె" అను పాదముతో ప్రారంభమై, పంచపాదిగా నున్నది. 2. దేవభార్యాసహస్ర (తం. వా.) 3. కరమపు డచ్చర (హ)

సీ. చర్చింప నిట్టి యాశ్చర్య మెందేనియుఁ గనుఁగొంటిరే? యర్చి యను లతాంగి
ధన్యాత్మురాలు గదా! తన పతిఁ గూడి యిందిరారమణి యజ్ఞేశుఁ గూడి
వెనుచను కైవడి ననుగమనముఁ జేసె నియ్యమ నిజహృదయేశుఁ డైన
ఘను వైన్యు నూర్ధ్వలోకంబును బొందును నేఁ డింతపట్టును నిశ్చితంబు

తే. పరమయోగీంద్రులకు దుర్విభావ్య మైన
దృఢ సుకర్మమువలన నతిక్రమించి
వైన్యభూమీశు వెనుచని వరుస నూర్ధ్వ
[1]గామినియు నగు నీ యింతి ఘనత నొంది. 663

వ. [2]కానం బతివ్రతలకు నసాధ్యం బెందునుం గలదె? అని మఱియు. 664

క. పరికింపఁగ నే మనుజుఁడు, హరిపదమును బొందఁజేయు నట్టి వివేక
స్ఫురణం దనర్చు వానికిఁ, బరువడి నిలఁ బొందరాని పదముం గలదే! 665

తే. అట్టి యపవర్గసాధన మైన మనుజ
భావ మొందియు విషయసంబద్ధుఁ డగుచు
వసుధ నెవ్వఁడు వర్తించు వాఁడు ధరణి
ననయమును నాత్మవంచకుఁ డనఁగఁ బరఁగు. 666

క. అని వారలు దన్నర్థిని, వినుతింపఁగ నర్చి యాత్మ[3]విభుఁడగు పృథుఁడొం
దిన యచ్యుతలోకంబున, ననుపమ విభవమును బొందె నని విదురునకున్. 667

క. మునివరుఁ డగు మైత్రేయుఁడు, వినయంబున నెఱిఁగఁజెప్పి వెండియుఁదగ ని
ట్లను [4]న మహానుభావుం,డనఘుఁడు [5]భగవత్తముండు నగుఁ బృథుఁ డనఘా!

క. ఏ నీ కిప్పుడు సెప్పితి, మానుగ నీ పుణ్యకథను మహిత శ్రద్ధా
ధీనుం డై విస్ఫుర దవధానుం డై యెవ్వఁ డేని తనరిన భక్తిన్. 669

క. వినినఁ బఠించిన వ్రాసిన, వినుపించినవాఁడు పృథుఁడు విమలగతిం బొం
దినక్రియ హరిపద మొందెడు, ననయము నిర్ధూతపాపుఁ డగుచు మహాత్మా! 670

సీ. బ్రాహ్మణుం డంచితభక్తిఁ బఠించిన బ్రహ్మవర్చస్సు సంప్రాప్త మగును
క్షత్త్రియుం డర్థిమైఁ జదివిన విన్నను జగతీవిభుత్వంబు సంభవించు
వైశ్యుండు విని ధనవంతుఁ డై యొప్పును శూద్రుండు వినిన సుశ్లోకుఁ డగును
మఱియును భక్తి ముమ్మాఱు పఠించిన విత్తవిహీనుండు విత్తపతియు

1. గామియగుచున్నదీ యింతిగాన యిపుడు (క. బ.) 2. కాన పతివ్రతలకు (తం. వా.)
3. విభువెనువెంటం జని (హ) 4. నాత్మభూతభావుం (త) 5. భగవద్వరుండు (తం. వా.)

తే. నప్రసిద్ధుఁడు ప్రఖ్యాతయశుఁడు ప్రజలు
లేని యధముఁడు వితత సంతానయుతుఁడు
మూర్ఖచిత్తుండు విజ్ఞానబోధమతియు
నగుచు నుతి కెక్కుదురు మహితాత్మ! మఱియు. 671

వ. ఈ లోకంబునం బురుషులకు స్వస్త్యయనంబు నమంగళనివారణంబు ధనప్రదంబు యశస్కరంబు నాయుష్కరంబు స్వర్గదాయకంబు కలిమలాపహంబు నైన యీ పుణ్య చరిత్రంబు చతుర్విధ పురుషార్థకాము లైనవారికి చతుర్విధ పురుషార్థ కారణం బగుం గావున వినందగు. రాజు సంగ్రామాభిముఖుం డై యీ చరిత్రంబు ననుసంధించి, విరోధి నెదిర్చిన న వ్విరోధి పృథునకుం బలెఁ గప్పంబు లిచ్చు. ముక్తాన్యసంగుండు భగవద్భక్తుండు నైనవాఁడు పుణ్యంబును వైన్య మాహాత్మ్య సూచకంబును నైన యీ చరిత్రంబు వినుచుం బఠియింపుచుం గృతమతి యై దిన దినంబును నాదరంబునం బ్రకటంబు సేయ, వాఁడు భవ సింధుపోత పాదుం డైన సర్వేశ్వరునియందు నచలం బైన భక్తి గలిగి, పృథుచక్రవర్తి వొందిన విష్ణుపదంబుఁ బొందు. అని యి ప్పుణ్యచరిత్రంబు మైత్రేయుండు విదురున కెఱింగించి వెండియు ని ట్లనియె. 672

అధ్యాయము — ౨౪

క. పృథునకు నర్చికిఁ బుట్టిన, పృథుకీర్తిధనుండు ఘనుఁడు పృథుతుల్యుం డై
పృథు శౌర్య ధైర్య ధుర్యుఁడు, పృథివిఁ [1]విజితాశ్వుఁ డొప్పెఁ బృథివీపతియై.

క. †విను మంతర్ధానగతిం, దనరి సునాసీరువలనఁ దగ విజితాశ్వుం
డును మఱి యంతర్ధానుం, డను పేరఁ బ్రసిద్ధుఁ డయ్యె నతిచతురుం డై. 674

సీ. స్థిరమతి రాజ్యాభిషిక్తుఁ డై య మ్మేటి సమమతి నయ్యనుజన్ము లైన
హర్యశ్వునకు సమాదరమునఁ [2]దూర్పు దక్షిణదిశఁ దగ ధూమ్రకేశునకును
బరఁగంగ వృకునకుఁ బశ్చిమభాగంబు ద్రవిణున కర్థి నుత్తరపుదిశను
గొమరొప్ప నలువురకును బంచి యిచ్చె [3]సత్కాంత యైనట్టి [4]శిఖండినికిని

తే. మనుజయోనిని జనియింపుఁ డనుచు మున్ను
పలికినట్టి వసిష్ఠు శాపమునఁ జేసి
పూని త్రేతాగ్ను లతనికిఁ బుత్రు లగుచు
జననమొందిరి సజ్జన స్తవ్యచరిత! 675

1. విజితాశ్వ దనెడి పేరఁ దనరెఁ (క.చ.జ.ద.) †ఇది వ్రాఁతప్రతులలోలేదు (హ.తం.వా.) లలో కలదు. మూలమునఁ గలదు. 2. తూర్పును; దగ ధూమ్రకేశిక దక్షిణమును (క.బ.) 3. స్వకాంత (హ.తం.వా.) ఇది తం.వా. పాఠము. 4. శిఖండి వలన (హ) "శిఖండిని యందు" అని యుండనగును.

వ. వారలు పావకుండును, పవమానుండును, శుచియు నను నామంబుల మనుష్య
యోనిం బుట్టియు నాత్మప్రభావంబునం గ్రమ్మఱ నగ్నులై చనిరి. తదనంత
రంబ. 676

క. అతఁడు నభస్వతి యనియెడి, ద్వితీయపత్నివలనను హవిర్ధానుఁడు నా
సుతుఁ గని విజితాశ్వం †డా, నత విమతుఁడు రాజ్యవర్తనము దలపోయన్.

క. విమలాత్మ! కరాదానము, దమ శుల్కాదికము కరము దారుణ మని ధై
ర్యమునన్ దీర్ఘ మఖ వ్యా, జమునన్ దద్వర్తనంబు సమమతి విడిచెన్. 678

వ. ఇట్లు విడిచి. 679

క. అతఁ డాత్మదర్శనుం డై, చతురతఁ బరమాత్ము హంసు సర్వేశ్వరుఁ ద
త్క్రతువున యజించి కుశలా, ద్భుత యోగసమాధి ముక్తిఁ బొందె మహాత్మా!

వ. అంత విజితాశ్వుండు పరలోకగతుం డైన హవిర్ధానుండు హవిర్ధాని యను భార్య
వలన బర్హిష్మదుండు గయుండు శుక్లుండు కృష్ణుండు సత్యుండు జితవ్రతుండు
నను పుత్రుల నార్వురం గాంచె. అందు బర్హిష్మదుండు. 681

సీ. సంతత సవనదీక్షాశాలి యగుచు ధరాతలం బెల్లను గ్రతువులకును
విలసిల్లు యజ్ఞశాలలు వేలువేలు కల్పించ యజ్ఞములు గావించుచుండి
చిరకీర్తి యతఁడు ప్రాచీనాగ్ర కుశలచే క్షితితలం బెల్ల నాస్తృతము సేయ
వసుధ యెల్లను యజ్ఞవాట మై విలసిల్ల సత్క్రియాకాండ [1]నిష్ణాతుఁ డగుచు

తే. సుభగ యోగసమాధి నిష్ఠుఁడు ప్రజాప
తి యగు నని తన్ను జనము నుతింప వెలయు
నట్టి ఘనుఁడు హవిర్ధాని యఖిల జగతిఁ
బరఁగుఁ గుశలను బ్రాచీనబర్హి యయ్యె. 682

వ. మఱియు నతండు. 683

చ. అలవడ నే సతీమణి సమంచితలీల విహహవేళ ను
త్కలికఁ బ్రదక్షిణంబు లిడఁగాఁ గని హవ్యవహుండు దొల్లి యి
మ్ముల శుకిఁ జూచి మోహమున బొందినరీతి విమోహి యయ్యె నా
లలిత వినూత్న భూషణ యలంకృతచారుశుభాంగి వెండియున్. 684

† ఇట మూలమున ''య ఇంద్ర మశ్వ హర్తారం విద్వా నపి న జఘ్నివాన్'' అని కలదు.

1. నిష్ఠాత్ముఁ డగుచు (హ) నిష్ఠాస్థుఁ డగుచు (తం. వా) ''క్రియా కాండేషు నిష్ణాతః,'' అని మూలము. (24-9)

చ. సురుచిరభంగి నా సతి కిశోరవయఃపరిపాకయై రణ
ద్వర మణి హేమ నూపుర రవంబు [1]చెలంగఁగ నాడుచున్ దివా
కర రుచిరేఖ నొప్పెసఁగఁగా గని నిర్జితులైరి దేవ కి
న్నరవర సిద్ధ సాధ్య ముని నాగ నభశ్చర ముఖ్యు లందఱున్. 685

వ. అట్టి సౌందర్యఖనియు సముద్రపుత్రియు నైన శతధృతి యను కన్యం బ్రహ్మాదేశంబునం బాణిగ్రహణంబు సేసె. ఆ శతధృతివలనం బ్రాచీనబర్హికిం బదుగురు కొడుకులు జనియించిరి. వారలు తుల్యనామవ్రతులును, ధర్మపారగులును నైన ప్రచేతసులు. ప్రజాసర్గంబునందుఁ దండ్రిచే నాజ్ఞాపితు లగుచుఁ దపంబు గావింప [2]వనంబునకుం జను సమయంబునం [3]ద న్మార్గంబునఁ బ్రసన్నుం డగుచు దృశ్యమానుం డైన రుద్రునిచేత నేది యుపదేశింపంబడె దాని [4]జప ధ్యాన పూజా నియమంబుల సేవింపుచుఁ [5]దపఃపతి యైన నారాయణుం బదివేల సంవత్సరంబులు పూజించిరి. అని చెప్పిన విని విదురుండు మైత్రేయున కిట్లనియె. 686

—: రుద్రుండు ప్రచేతసులకు యోగాదేశ మను స్తోత్రమును దెలియఁజేయుట :—

సీ. తాపసోత్తమ! ప్రచేతసులకు [6]నా వన మార్గంబునందు నా భర్గుతోడ
సంగ మెట్లయ్యెఁ? బ్రసన్నుఁడై హరుఁ డెద్ది తివుట వారల కుపదేశ మిచ్చె?
జీవరాశులకు నా శివుతోడి సంగంబు గడు దుర్లభం బీ జగంబునందుఁ
జర్చింప న మ్మేటి సన్మునీంద్రులకును సంచిత ధ్యానగోచరుఁడు గాని

తే. పుడమిఁ బ్రత్యక్షమునఁ గానఁబడడు మఱియు
నంచితాత్మ సదారాముఁ డఖిలలోక
[7]రక్షణార్థంబుగా విరూపాక్షుఁ డాత్మ
శక్తితోఁ గూడి జగతిపై సంచరించు. 687

క. కావున భగవంతుండును, [8]దేవాధీశుండు నైన దేవుని సంగం
బే వెరవున ఘటియించెనొ, యా విధ మంతయును దెలియ నానతి యీవే! 688

క. అనవుడు విదురున క మ్ముని, జననాయకుఁ డనియె నట్టి సాధుమనీషం
దనరు ప్రచేతసులును నిజ, జనకుని [9]సద్భాషణములు సమ్మతితోడన్, 689

1. చెలంగ వివాహవేళఁ దాఁ గరము నవోఢయై బరఁగఁ గాంచి వినిర్జితులైరి (హ) 2. అర్ణవంబునకు (క.చ.ట.జ.డ.ద.తం.) ''దిశం ప్రదీచీం ప్రయయు స్తప స్యాదృతచేతసః, సముద్ర ముప విస్తీర్ణ మపశ్యన్ సుమహత్సరః'' అని మూ. (24-20) 3. అర్ణవమార్గమున(క) 4. వస్తు జపధ్యాన(క) 5. దపస్పతి (హ.వా.) 6. అర్ణవమార్గంబునందు (క.తం.) 7. రక్షకుఁడు పరముఁడు (హ) 8. దేవాధిపుఁడైన దేవ దేవుఁడు (ట. డ.) 9. పరిభాషణములు (చ.ట.జ.డ.)

క. [1]శిరమున వహించి [2]పడమటి, కరిగెడి సమయమున నెదుర నంబుధికంటెన్
బఱపగు నొకసరసి మనోహర నిర్మల సలిలపూర్ణ మై యది మఱియున్. 690

సీ. రక్తోత్ప లేందీవర ప్రఫుల్లాంభోజ కమనీయ కల్హార కలిత మగుచుఁ
వర మత్తమధుప సుస్వర మోద పల్ల వాంకురిత లతా తరు భరిత మగుచుఁ
రమణీయ హంస సారస చక్రవాక కారండవ నినదాభిరామ మగుచుఁ
గంజాత కింజల్క పుంజ విక్షేపక మంద గంధానిలానంద మగుచు

తే. సజ్జనుని హృదయముఁ బోలి స్వచ్ఛ మగుచు
[3]హరిపదాకృతి దివిజవిహార మగుచు
ఘనుని సిరిభంగి సర్వ జీవనము నగుచు
మానవతి వృత్తిగతిని నిమ్నంబు నగుచు. 691

వ. ఒప్పునట్టి సరోవరంబుఁ బొడగని యందు నొక్క దివ్యపురుషునిం గనిరి.
అతండును వారు, 692

మ. సమద శ్రీక మృదంగ వేణు ముఖ భాస్వన్నాద మై దివ్యమా
ర్గ మనోరంజక మై తనర్చు విలస ద్గాంధర్వగానంబు నె
య్యము సంధిల్లఁగ వించుఁ ద న్మహిమ కత్యాశ్చర్యముం బొంద వే
గమునం ద త్కమలాకరంబు వెడలెన్ గౌతూహలోల్లాసి యై. 693

వ. ఇట్లు వెడలి వచ్చిన.

మ. కని రా తాపసపుంగవుల్ దివిజలోక శ్రేష్ఠునిం ద ప్త కాం
చనవర్ణున్ సనకాది యోగిజన భాస్వ ద్గీయమానున్ త్రిలో
చను భ క్తానుగుణాసుగున్ సుమహి తైశ్వర్యున్ బ్రసాదాభి శో
భన వక్త్రున్ నిహతాఘక ర్తృజన సంపద్భద్రునిన్ రుద్రునిన్. 695

1. శిరసావహించి (చ.జ.డ.తం.) 2. ప్రాగ్దిశ కరిగెడి (హ.తం.)

† ఇచ్చట హ.తం.వా. లలో ఈ క్రింది పద్యములు కూడఁ గలవు-ఇవి తా.ప. ప్రతులలో లేవు.

తే. సిద్ధ చారణ గంధర్వ సేవ్య మగుచుఁ బుణ్యముల కాలయం బయి పొలుపు మిగిలి
లలిత మై చూడ నొప్పయి రమ్య మగుచు, దివ్యశుచి లఘు మధురాంబు భవ్య మగుచు.

తే. శశికరంబులఁ బోలి విశదము లగుచు, హరికథలఁ బోలి కల్మషహరము లగుచు
వహ్నులను బోలి భువనపావనము లగుచుఁ, బొగడఁదగు నీరములచేఁ బ్రపూర్ణ మగుచు.

3. అబ్ధియును బోలె లఘుతరమగు జలమున,
నొప్పు నొక్క సరోవరం బుజ్జ్వలముగఁ
గాంచి యందొక పురుషునిఁ గని రతండు (క.చ.)
కుసుమ ఫలభరితం బనుకూల మగుచు
లలిత కల్ప లతాపుంజ కలిత మగుచు
గీర శారికాకలిత విహారి మగుచు (ప.)

క. కని వారలు పరమపనముల, ననురాగము నద్భుతంబు నసయము వొడమన్
వినయము దోఁపఁగఁ బత్పద, వనజములకు మ్రొక్కి భక్తి వశగతు[1]లగుడున్.

వ. భగవంతుడును, అఖిల ధర్మజ్ఞుండును, కృపాళుండును, దర్శనంబున నిఖిల పాప హరుండును, భక్తవత్సలుండును నైన హరుండు *(ప్రీతుం డగుచుం) బ్రసన్నాంతఃకరణులు ధర్మజ్ఞులు శీలసంపన్నులు సంప్రీతులు నైన వారలకిట్లనియె.

—: రుద్రగీత :—

సీ. వినుఁడు నృపాలనందనులార! మీ మదిఁ గల తలం పెల్లను గానవచ్చె
మీకు భద్రం బగు మీయెడ నే ననుగ్రహబుద్ధిచే నిటు గానఁబడితిఁ
గైకొని యిపుడు సూక్ష్మముఁ ద్రిగుణాత్మకము నగు నాప్రకృతికంటెను ధరణినిఁ
బరఁగు జీవునికంటెఁ బరుఁడైన వాసుదేవుని చరణాబ్జముల్ దనరు భక్తి

తే. నర్థి నెవ్వరు భజియింతు రట్టివారు
నాకుఁ బ్రియతముల్ వారికి నయచరిత్రు
లార! యేను బ్రియుండ నై భూరి మహిమ
వెలయుచుండుదు నదిగాక వినుఁడు మీరు. 698

వ. స్వధర్మనిరతుం డైన పురుషుం డనేక జన్మాంతర సుకృత విశేషంబులం జతుర్ముఖత్వంబు నొంది, తదనంతరంబునం బుణ్యాతిరేకంబున నన్నుం బొంది, యధికారాంతంబున నేను దేవతాగణంబులు నవ్యాకృతం బైన యే హరిపదం బులు వొందుదు మట్టి పదంబు భాగవతుండు దనంతనె పొందుం గావున మీరు భాగవతత్వంబు నొందుటం జేసి నాకుం బ్రియులై యుండుదురు. భాగవత జనంబులకు నాకంటె నధిక ప్రియుండు లేఁడు. కాన వివిక్తంబును, జప్యంబును, బవిత్రంబును, మంగళంబును, నిశ్శ్రేయసకరంబును నైన నా వచనంబు నాకర్ణింపుఁడు. సర్గాదిని బ్రహ్మ నిజనందనుల కెఱింగించిన శ్రీహరి స్తోత్రంబు మీకు నెఱింగింతు. వినుం డది యెట్టి దనిన. 699

క. వనజాసనుఁ డాత్మజు లగు, సనకాదులఁ జూచి పలికె సమ్మతితోడన్
వినుఁడు కుమారకులారా!, వనజోదరు మంగళస్తవం బెఱిఁగింతున్. 700

వ. అని హరి నుద్దేశించి వారలు విన నిట్లనియె. ఓ యీశా! యాత్మవేదులైన వారలకు భవదీయోత్కర్షంబు స్వానంద లాభకరంబు గావున నట్టి స్వానంద లాభంబు మాకుం గలుగవలయును. నీవు పరిపూర్ణానందస్వరూపుండవు. ఇట్టి సర్వాత్మకుండ వైన నీకు నమస్కరింతు. అని వెండియు నిట్లనియె. 701

1. లగుచున్ (హ.తం.వా.) * తా.ప. ప్రతులలో లేదు.

సీ. పంకజనాభాయ సంకర్షణాయ, శాంతాయ, విశ్వప్రబోధాయ, భూత
సూక్ష్మేంద్రియాత్మనే, సూక్ష్మాయ, వాసుదేవాయ, పూర్ణాయ, పుణ్యాయ, నిర్వి
కారాయ, కర్మనిస్తారకాయ, [1]త్రయీపాలాయ, త్రైలోక్య పాలకాయ,
సోమరూపాయ, తేజోబలాఢ్యాయ, స్వయం జ్యోతిషే, [2]దురంతాయ, కర్మ

తే. సాధనాయ, పురాపురుషాయ, యజ్ఞ
రేతసే, జీవతృప్తాయ, పృథ్వీరూప
కాయ, లోకాయ, నభసే, ఽంతకాయ, విశ్వ
యోనయే, విష్ణవే, జిష్ణవే, నమోఽస్తు. 702

సీ. స్వర్గాపవర్గ సుద్వారాయ, సర్వరసాత్మనే, పరమహంసాయ, [3]ధర్మ
పాలాయ, సద్ధిత ఫలరూపకాయ, కృష్ణాయ, ధర్మాత్మనే, సర్వశక్తి
యుక్తాయ, ఘనసాంఖ్య యోగీశ్వరాయ, హిరణ్యవీరాయ రుద్రాయ, శిష్ట
నాథాయ, దుష్టవినాశాయ, శూన్య ప్రవృత్తాయ, కర్మణే, మృత్యవే, వి

తే. రాచ్ఛరీరాయ, నిఖిల ధర్మాయ, వాగ్వి
భూతయే, నివృత్తాయ సత్పుణ్య భూరి
వర్చసే, ఽఖిల ధర్మదేహాయ, చాత్మ
నే ఽనిరుద్ధాయ, నిభృతాత్మనే, నమోఽస్తు. 703

తే. సర్వసత్త్వాయ, దేవాయ, సన్నియామ
కాయ, బహిరంతరాత్మనే, కారణాత్మ
నే, సమస్తార్థ లింగాయ, [4]నిర్గుణాయ,
వేధసే, జితాత్మక సాధవే, నమోఽస్తు. 704

వ. అని మఱియుఁ బ్రద్యుమ్నుండవు, నంతరాత్మవు, [5]సమస్త శేష కారణుండవు, చాతుర్హోత్ర రూపుండవు, నంతకుండవు, సర్వజ్ఞుండవు, జ్ఞానక్రియా రూపుండవు, నంతఃకరణ వాసివియు నైన నీకు నమస్కరింతు నని. 705

క. అనఘా! దేవ! భవత్పద, వనరుహ సందర్శనేచ్ఛ వఱలిన మాకున్
విను వైష్ణవ సత్కృత మై, యెనయు భవద్దర్శనంబు నీవే! మహాత్మా! 706

వ. అది యెట్టి దనిన. 707

క. అనఘ! సకలేంద్రియ గుణాం జనమును భక్తప్రియంబు జలదశ్యామం
బును సౌందర్య సమగ్రము, ననుపమమును నిత్యమంగళావహ మగుచున్. 708

1. క్షేత్రపాలాయ (తం .వా.) 2. దురంత్యాయ (తం); దురన్యాయ (వా) 3. కర్మపాకాయ (తం. వా.) 4. నిర్వికల్పమేధసేఽహం కృతాత్మనే (జ. డ. బ.) 5. సమస్త జగత్కారణుండవు (జ) ''సమస్త అశిషా మీశ పనపే కారణాత్మనే'' (24-42)

వ. మఱియును, 709

సీ. అళికులోపమ లస దలక శోభిత మగు నమృతాంశు రేఖానిభాననమును
సమకర్ణ దివంభూషా ప్రభా కలితంబు సుందర భ్రూనాస సురుచిరంబు
సలలిత [1]కుందకుట్మల సన్నిభ ద్విజ పూరిత స్నిగ్ధ కపోలయుగము
పద్మపలాశ శోభన లోచనంబును మందస్మి తాపాంగ సుందరమును

తే. సస్మి తాలోక సతత ప్రసన్న ముఖము
కంబుసుందర రుచిర మంగళగళంబు
హార మణికుండల ప్రభాపూర కలిత
చారు మృగరాజ సన్నిభ స్కంధ [2]యుతము. 710

వ. వెండియు శంఖ చక్ర గదా పద్మ కలి తాయత బాహుచతుష్టయంబును, వైజయంతీ వనమాలికా కౌస్తుభమణి శ్రీ విరాజితంబును, నిత్యానపాయిని యైన యిందిరా సుందరీ రత్నపరిస్పందంబునం దనరి తిరస్కృత నికషోపల వక్షస్థలంబును, నుచ్ఛ్వాస నిశ్వాసంబులం జంచలంబు లైన వళిత్రయ రుచిర ప్రకాశమాన దళోదరంబును, పూర్వ వినిర్గత నిఖిలవిశ్వంబును బ్రవిష్టంబు సేయు రీతి నొందు సలిలావర్త సన్నిభ గంభీర నాభీవివరంబును, పంకజ కింజల్క విభాసిత దుకూల నిబద్ధ కనక మేఖలా కలాప శోభిత శ్యామ పృథు నితంబబింబంబును, నీల కదళీ స్తంభ రుచిరోరుయుగళంబును, సమ చారు జంఘంబును, నిమ్న జానుయుగ[2]ళంబును, పద్మపత్ర భాసుర పాదద్వయంబును, మదీయాంతరంగ తమో నివారక నిర్మల చంద్రశకల సన్నిభ నఖంబును, గిరీట కుండల గ్రైవేయ హార కేయూర వలయ ముద్రికా మణినూపురాది వివిధభూషణ భూషితంబును, నిరస్త సమస్త నతజన సాధ్వసంబును, భక్తజన మనోహరంబును, సర్వమంగళాకరంబు నైన భగవద్దివ్యరూపంబుఁ దామసజన సన్మార్గ ప్రదర్శకుండవైన నీవు మాకుం జూపి మమ్ముఁ గృతార్థులఁ జేయుము. అని వెండియు ని ట్లనియె. 711

సీ. ఆత్మకుఁ బరిశుద్ధి నర్థించువారికి ధ్యేయవస్తువు [3]భవద్దివ్యమూర్తి
యంచిత స్వర్గరాజ్యాభిషిక్తున కైన సమధిక స్పృహణీయతముఁడ వీవు
సద్భక్తియుత భక్తజన సులభుండవు దుష్టాత్ములకుఁ గడు దుర్లభుండ
వాత్మదర్శనులకు నరయఁ గమ్యుండవు నై యర్థి విలసిల్లు దనఘ చరిత!

1. కుట్మలరద స్ఫురితంబు, లాలితస్నిగ్ధ కపోలయుగము(జ) 2. ములును (చ.ట.త.డ.ద.బ.)
3. భవదీయమూర్తి (చ.ట.)

తే. యిట్టి నిఖిల దురారాధ్యు నీశు నిన్ను
నెఱయ సుజనుల కైన వర్ణింపరాదు
వఱల నెవ్వఁడు పూజించు వాఁడు విడువఁ
జాలునే? పద్మదళనేత్ర! సచ్చరిత్ర! 712

చ. ఎనసిన భక్తియోగమున నే భవదీయ పదాబ్జమూలము
న్ననయముఁ బొందువాఁడు చటులాగ్రహ భీషణ వీర్య శౌర్య త
ర్జనములచే ననూనగతి సర్వజగంబులు సంహరించు న
య్యనుపముఁ డైన కాలుని భయంబునుఁ బొందఁడు సుమ్ము కావునన్. 713

తే. ఇట్టి మీ పాదమూలంబు లెవ్వఁడేని
పొంది ధన్యాత్ముఁ డౌ నట్టిపుణ్యుఁ డొండు
మనములోపలఁ గోరునే? మఱచి యైన
నవ్యయానంద! గోవింద! హరి! ముకుంద! 714

క. హరి! మీ భక్తజనులతో, నిరుపమగతిఁ జేయు సంఖ్య నిమిషార్ధముతో
సరిగాదు మోక్ష మనిన న, చిరశుభ మగు మర్త్యసుఖముఁ జెప్పఁగ నేలా? 715

క. దురితవినాశక పదపం, కరుహా! భవత్కీర్తి తీర్థకణచయ బాహ్యం
తరనేక ధూతకల్మష, పురుషులు ధరమీఁదఁ దీర్థభూతులుగారే? 716

వ. అట్టి భూతదయా సమేతులు, రాగాది విరహితచిత్తులు, నార్జవాది గుణయుక్తులు నైన భాగవతజనుల సంగంబు మాకుం గలుగంజేయుము. ఇదియ మమ్మనుగ్రహించుట. అని వెండియు నిట్లనియె. 717

చ. సరసిజనాభ! సత్పురుషసంగ సముంచిత భక్తి యోగ వి
స్ఫురణ ననుగ్రహింపఁబడి శుద్ధము నొందినవాని చిత్త మ
స్థిర బహిరంగముం గనదు చెందదు ఘోరి తమస్స్వరూప సం
సరణగుహన్ జిరంబు గనఁజాలు భవ న్మహనీయతత్త్వమున్. 718

వ. అది యెట్టి దనిన. 719

సీ. అరయంగ నెమిటియందు నీ విశ్వంబు విదిత మై యుండు నీ విశ్వమందు
నేది ప్రకాశించు నెప్పుడు నిట్టి స్వయంజ్యోతి నిత్యంబు నవ్యయంబు
నాకాశమును బోలి యవిరళ వ్యాపక మగు నాత్మతత్త్వంబు నధికమహిమఁ
దనరు పరబ్రహ్మ దా నని పల్కి యిట్లనియె నవిక్రియుం డైనవాఁడు

తే. నెవ్వఁ డాతఁడు దనయందు నెపుడు నాత్మ
కార్య కరణసమర్థంబు గాని భేద
బుద్ధిజనకంబు నాఁడగు భూరిమాయఁ
జేసి విశ్వంబు సత్యంబుగా సృజించె. 720

ఆ. మరల మరలఁ బెక్కుమాఱు లీ విశ్వంబు
జనన వృద్ధి విలయ సంగతులను
నందఁ జేయుచుండు నట్టి యీశ్వరుఁడ వై
తనరు నిన్ను నాత్మతత్త్వముగను. 721

వ. తెలియుదుము. అని వెండియు ని ట్లనియె. యోగపరాయణు లగువారు శ్రద్ధా సమన్వితులై క్రియాకలాపంబుల నంతఃకరణోపలక్షితం బైన భవదీయరూపంబు యజింతురు. వారు వేదాగమ తత్త్వజ్ఞానులు. నీ వాద్యుండవు, ననాదియు, నద్వితీయుండవు, మాయాశక్తి యుక్తుండవు నై విలసిల్లుచుందువు. అట్టి మాయాశక్తిచేత. 722

సీ. చతురాత్మ! సత్త్వ రజ స్తమోగుణములు వరుస జనించెను వానివలన
మహ దహంకార తన్మాత్ర నభో మరు దనల జలావని ముని సుపర్వ
భూతగణాత్మకస్ఫురణ నీ విశ్వంబు భిన్న రూపమున నుత్పన్న మయ్యె
దేవ! యీగతి భవదీయ మాయనుజేసి రూఢిఁ జతుర్విధరూప మైన

తే. పురము నాత్మాంశమునఁ జెందు పురుషుఁ డింద్రి
యములచే విషయసుఖము లనుభవించు
మహిని మధుమక్షికాకృత మధువుఁ బోలి
యతనిఁ బురవర్తి యగు జీవుఁడండ్రు మఱియు. 723

వ. ఇట్టి జగత్స్రష్టకుండ వైన నీవు. 724

క. భూతగణంబులచేతనె, భూతగణంబులను మేఘపుంజంబుల ని
ర్ఘాతముగఁ జేయు ననిలుని, భాతినిఁ జరియింపఁ జేసి పౌరుష మొప్పన్. 725

తే. రూఢిఁ దత్త్రిక్రియాలబ్ధ రూపుఁడవును
సుమహిత స్ఫుర దమితతేజుఁడవుఁ జండ
వేగుఁడవు నయి ఘన భుజా విపుల మహిమ
విశ్వసంహార మర్థిఁ గావింతు వీశ! 726

వ. అది యె ట్లనిన. 727

క. ఇతికర్తవ్య విచారక, మతిచేఁ దగ నెప్పుడుం బ్రమత్తంబును సం
చిత విషయాలాలసము నూ, ర్జితలోభము నైనయట్టి సృష్టి గడంకన్. 728

తే. అప్రమత్తుండ వగుచుఁ బద్మాక్ష! నీవు
మ్రింగుదువు చాల నాఁకట [1]మ్రేఁగుచుండి
నాలుకలు [2]గ్రోయు భూరి పన్నగము వాతఁ
బడిన యెలుకను భక్షించుపగిది ననఘ! 729

చ. అనిశము నస్మదీయ గురుఁడైన సరోరుహ సంభవుండు న
మ్మనువులు నాత్మ సంశయము మాని భజించు భవత్పదాబ్జముల్
మనమున నిల్పి యుష్మ దవమాన మహావ్యథఁ జెందునట్టి స
జ్జనుఁడు పరిత్యజించునెః భుజంగమతల్పక! భక్త కల్పకా! 730

క. కావున నాకును సూరిజ, నావళికిని సర్వసంశయంబులు వాపం
గావను బ్రోవను దగుగతి, నీ వని వినుతించినట్టి యీ స్తవ మెలమిన్. 731

వ. రుద్రుండు ప్రచేతసుల కెఱింగించి వెండియు నిట్లనియె. ప్రచేతసులారా! యిట్టి యోగాదేశనామకం బైన యీ స్తోత్రం బాచార్యోపదేశంబున బహువారావృత్తిచే మనంబున ధరియించి, [3]సమాహిత చిత్తులై మీ రందఱు నాదరంబున విశ్వాస యుక్తులు, స్వధర్మాచారవంతులు, భగవదర్పితాశయులు నై జపియించుచు సర్వభూతావస్థితుండు, నాత్మారాముండు నైన సర్వేశ్వరుని నుతింపుచు ధ్యానయుక్తంబుగాఁ బూజింపుఁడు. తొల్లి యీ స్తోత్రంబు భగవంతుఁడైన పద్మసంభవుండు *(సిసృక్షు వగుచు) నాత్మజుల మైన మాకును (సృజియింప నిచ్ఛగించు) భృగ్వాదులకును నెఱింగించె. ఏము (నా భృగ్వాదులును) ప్రజాసర్గంబునందు బ్రహ్మచోదితుల మై యీ స్తోత్రంబునం జేసి విధ్వస్త సమస్త తమోగుణుల మై వివిధ ప్రజాసర్గంబు గావించితిమి. కావున నీ స్తోత్రంబు నెల్లప్పుడు నేకాగ్రచిత్తుండు, వాసుదేవ పరాయణుండు నై యెవ్వఁడు జపియించు, వాఁడు వేగంబె శ్రేయస్సునుం బొంది, తదీయ జ్ఞానప్లవంబున వ్యసనార్ణవ రూపంబైన సంసారంబును సుఖతరంబుగం దరియించు. ఇట్టి మ దుపదిష్టం బైన శ్రీహరి స్తవంబు నెవ్వండు చదువుచు దురారాధ్యుం డైన శ్రీహరిం బూజించు, వాఁడు మదుక్త స్తోత్ర గాన సంతుష్టుండును, శ్రేయస్సులకు నేకాశ్రయభూతుండును నగు శ్రీమన్నారాయణుని వలన సమస్తాభీష్టంబులం బొందు. ఎవ్వఁడు ప్రభాతమున లేచి ప్రాంజలియు, శ్రద్ధా సమన్వితుండు నై

1. మ్రొగ్గు (హ) 2. చాచు (హ) 3. సమాధాన (క.ఐ.) * తా.ప. ప్రతులలో లేదు.

యీ మంగళ స్తవరాజంబును విను, వినుపించు, వాఁడు కర్మబంధ విముక్తుండగు. అని మఱియు నిట్లనియె. 732

క. నరదేవ తనయులారా!, పురుషాధీశుండు పరమ పురుషుఁడు నగు నీ
శ్వరు సుస్తోత్రము [1]మీ కా, దరమునఁ దెలిపితిని మీరుఁ దద్దయు భక్తిన్. 733

క. ఏకాగ్ర చిత్తులును సు, శ్లోకులు నై జపము సేయుచును ఘనతపముం
గై కొని చేసిన మీకును, జేకుఱు మహితేప్సితార్థసిద్ధి కడంకన్. 734

అధ్యాయము—౨౫

క. అని యీగతి నుపదేశం, బొనరించి సదాశివుండు నొగి వారలచే
తను బూజితుఁ డై వారలు, గన నంతర్ధానుఁ డయ్యెఁ గౌతుక మొప్పన్. 735

వ. అంత. 736

తే. తివుట వారలు రుద్రోపదిష్ట మైన
యచ్యుత స్తవము జపించు చయుత సంఖ్య
వత్సరము లుగ్రతపము దుర్వార వారి
మధ్యమునఁ జేయుచున్న సమయమునందు. 737

—: నారదుండు ప్రాచీనబర్హికి జ్ఞానమార్గమును దెలియఁ జేయుట :—

వ. ఘనకర్మాసక్త చిత్తుండై యున్న ప్రాచీనబర్హి కడకు నధ్యాత్మవేదియుం గృపాళువు నైన నారదుండు చనుదెంచి, యా రాజునకు జ్ఞానబోధంబు సేయుకొఱకు నతని కిట్లనియె. రాజా! యీ కర్మంబునంజేసి యెట్టి శ్రేయస్సు నభిలషించుచున్నవాఁడ వట్టి యరిష్ట నిరసనంబును, నభీష్ట ప్రాప్తికరంబును నైన శ్రేయంబీ కర్మంబువలన లభింపదు. అనినం బ్రాచీనబర్హి నారదున కిట్లనియె. 738

సీ. అనఘ! మునీంద్ర? మహాభాగ! యేను [2]గర్మాపహత జ్ఞానుఁ డగుచు మోక్ష
మెఱుఁగంగలే నైతి నిట్టి నా కిప్పుడు గడు విమలంబును గర్మబంధ
నాశకంబును నగు జ్ఞానోపదేశంబు గావింపు మతిదయాకార! కూట
ధర్మంబు లగు [3]గేహతతులందుఁ జెంది జాయా తనూజాత ధనాదికములె

1. మీకే, నెఱుగించితి మీపు దీని నెప్పుడు భక్తిన్ (ట. జ. డ. త.) 2. కర్మాపవిద్ధ జ్ఞాని నగుచు (ఛ); "కర్మాపవిద్ధ ధీః" (25-5) 3. దేహ (క. చ. ట. డ. ద. బ.)

తే. భూరిపురుషార్థములు గాఁగ బుద్ధిఁ దలఁచు
మతివిహీనుండు సంసారమార్గములను
దగఁ బరిభ్రామ్యమాణుఁడై [1]నాఁగిలి మోక్ష
పదము నొందంగఁజాలఁడు భవ్యచరిత! 739

క. అనవుడు నతనికి [3]నతఁడను, నసఘా! యీ యధ్వరంబులందును గృపమా
లిన నీచే విశసింపం. జని కూలిన పసులు వేలసంఖ్యలు కనుమా! 740

వ. కావునం బశువ్రాతంబులు త్వదీయ వైశసంబును స్మరింపుచున్నవి యగుచు లోహయంత్రమయ శృంగంబులచేత నెపుడు నీవు పరలోకంబు నొందెద వపుడు నిను హింసింతు మని భవదీయమృతికి నెదురుచూచుచున్నవి. ఇట్టి సంకటంబు నొందంగల నీకు నిస్తారకం బైన యొక్క యితిహాసంబు గల దెఱింగింతు. అని యి ట్లనియె. 741

—: పురంజనోపాఖ్యానము :—

సీ. భూమీశ! వినుమయ్య! పూర్వకాలమునఁ బురంజనుఁ డను నొక రాజు గలఁడు
[3]నతని కవిజ్ఞాతుఁ డను పేరఁ దగిలి విజ్ఞాతచేష్టితుఁ డగు సఖుఁడు గలఁడు
ఆ పురంజనుఁడు పురాన్వేషి యై ధరాచక్రంబు గలయంగ సంచరించి
తన కనురూప మై పెనుపొందు పుర మెందు వీక్షింపఁ జాలక విమనుఁ డగుచు

తే. నే పురము లుర్విఁ బొడఁగనె నా పురములు
కామములఁ గోరు తనకు న క్కామములను
బొందుటకు వానిని ననర్హములుగఁ దన మ
నమునఁ దలఁచి యొకానొక నాఁ డతండు. 742

వ. *(చనుచున్న సమయంబున హిమవత్పర్వత దక్షిణసానువులందు.) 743

సీ. వర నవద్వార కవాట గవాక్ష తోరణ దేహళీ గోపురముల నొప్పి
ప్రాకార యంత్ర వప్ర ప్రతోళీ పరిఘాట్టాల కోపవనాళిఁ దనరి
సౌవర్ణ రౌప్యాయస ఘన శృంగంబుల రమణీయ వివిధగేహముల మించి
రథ్యా సభా చత్వర ధ్వజ క్రీడాయతన సుచైత్యాపణతతిఁ దనర్చి

1. యొగిని (హ) 2. నతఁడును (హ. తం. వా.) 3. అతనికి విజ్ఞాతుఁ డను పేరఁ దగిలి (హ); అతనికి విజ్ఞాతుఁ డను పేరఁ దగిన (తం. వా.); ''తస్యా విజ్ఞాత నామాఽసీత్ సఖావిజ్ఞాత చేష్టితః'' (25-10) * తా.ప. ప్రతులలో లేదు.

తే. మరకత స్ఫటిక విడూర మణి వినూత్న
మౌక్తికాయుత ఖచిత హర్మ్యములు గలిగి
విద్రుమ ద్రుమవేదుల వెలయు నొక్క-
పురముఁ గనియె భోగవతినిఁ బోలుదాని. 744

వ. ఇట్లు గనుంగొని యనంతరంబ ముందట దివ్యద్రుమ [1]లతాకుంజ పుంజంబును, సమద నద ద్విహంగ మత్తమధుకర కుల కోలాహల సంకుల జలాశయ శోభితంబును, హిమనిర్ఝర బిందుసందోహ పరిస్పంద కందళిత మందమలయ మరుదుచ్చలిత ప్రవాళవిటప నళినీతటంబును, పాంథజన మనోరంజ నాహ్వాన బుద్ధి జనక కలహంస రాజకీర కోకిలాలాప విరాజమానంబును, మునివ్రత నానావిధ వనమృగవ్రాత బాధారహితంబును నైన పుర బాహ్యోద్యాన వనంబునందు యాదృచ్ఛికంబున నేకైక శతనాయకు లైన యనుచర దశకంబును, పంచమస్తక సర్పప్రతిహారుండును దోడరాఁ జనుదెంచుచున్న భర్త్రన్వేషిణియుం, గామరూపిణియు, నప్రౌఢయు నైనయట్టి. 745

సీ. ఘన సమవిన్యస్త కర్ణకుండల రుచుల్ గండభాగంబుల [2]నిండి పర్వఁ
దమ్మిఱేకుల సిరిఁ దటమటింపఁగఁజాలు మెఱుఁగు కన్నులు దలఁ దిరిగిరాఁగఁ
జఘనసంకలిత పిశంగ నీవీద్యుతి కనక కాంచీరుచిఁ గరముఁ బెనుపఁ
జరణ సరోజ భాసుర చలన్నూపుర ఝణఝణధ్వని నర్మసరణిఁ జూప

తే. లలితయౌవనలక్ష్మీవిలాస భాను
రోదయ వ్యంజిత ప్రభాయుక్త పీన
సమ నిరంతర కుచకుట్మలముల వ్రీడఁ
జెంది పయ్యెదఁ గప్పు బాలేందుముఖియు. 746

వ. మఱియును [3]బాలయు, సుదతియు, గజగామినియు నైన యొక్క- ప్రమదోత్తమం గాంచి. 747

క. [4]తరమిడి ప్రేమోద్గత మై, మరువిండ్లం బోలు కన్బొమలు గల తరుణీ
సరసాపాంగ విలోకన, శర పరివిద్ధాంగుఁ డగుచు జనవిభుఁ డనియెన్. 748

1. లతాకులంబును (డ. బ.) 2. నిండ బర్వ (చ-బ) 3. బాలకియు (చ.ట.త.డ.ద.బ.)
4. అరుదుగఁ బ్రేమగ్గలమై (హ)

క. ఎవ్వరిదానవు? జనకుం, డెవ్వఁడు? పేరేమి? భృత్యు లీ పదియొక రిం
దెవ్వరు? సతు లెవ్వరు? పఱి, యివ్వనమున నుండఁ గార్య మెద్ది? మృగాక్షీ!

క. భవదీయ పురస్సరుఁ డగు, పవనాశనుఁ డెవ్వఁ డతికృపామతి నాకున్
వివరింపు మనుచు వెండియు, ధవళేక్షణఁ జూచి ధరణిధవుఁ డి ట్లనియెన్. 750

సీ. తరళాక్షి పతి యగు ధర్ము నన్వేషింపఁ జరియించు హ్రీ యగు సతివొ? కాక
రుద్రు నన్వేషించు రుద్రాణివో? కాక బ్రహ్మను వెదకు భారతివొ? కాక
నారాయణుని భక్తి గోరి యన్వేషించు నిందిరవో? కాక యెవ్వ రీవు?
త్వత్పాదకామనత్వమునను సంప్రాప్త సకలకాముం డగు [1]సరసు నెట్టి

తే. వాని వెదకెదు? తరుణి! భవత్కరాగ్ర
పద్మకోశంబు[2] నేఁ డెందుఁ బతిత మయ్యె?
నాకు నెఱిఁగింపఁ దగుదు వివేక చరిత!
యని నృపాలుఁడు మఱియు ని ట్లనియె సతికి. 751

క. కర మొప్పఁగ నీ విటు భూ, చర వగుటన్ హ్రీవి శివవు శారదవును సా
గరకన్యవుఁ గా కుండుటఁ, దరుణీ! పొడగంటి నని పదంపడి పలికెన్. 752

సీ. మొనసి యద్భ్రకర్ముఁడ నైన నాచేత నిపుడు పాలిత మైన యీ పురంబు
సరసిజోదరుని భుజాపాలి తోదాత్త లలిత వైకుంఠ మలంకరించు
నిందిరాసుందరి చందంబునను నీ వలంకరింపఁ గడంగు పంకజాక్షి!
యది గాక తావకీనాపాంగరుచి మోహితాంతరంగుండ నైనట్టి నన్ను

తే. మహిత సవ్రీడభావ సన్మందహాస
చారు విభ్రమ భ్రూలతా ప్రేరితుఁడుగఁ
దనరు భగవంతుఁ డగునట్టి మనసిజుండు
పడఁతి! యుడుగక పీడింపఁ దొడఁగె నిపుడు. 753

వ. కావున.

చ. తరుణి! సుతార లోచనయుతంబును మంజు సుధాసమాన భా
సుర మృదువాక్యయుక్తమును శోభిత కోమల లంబమాన సుం
దర చికురాభిరామము నుదారము నైన భవన్ముఖాబ్జమున్
సురుచిరలీల నెత్తి ననుఁ జూడుము సిగ్గును జెందనేటికిన్? 755

1. జనుని (క. చ. ట. త. బ.) 2. బడెక్కడ (క. చ. బ.)

వ. అని యి విధ్వంబున నధీరుం డై పలుకు పురంజనుం జూచి, యా ప్రమదోత్తమ వీరమోహితయై, సస్మితానన యగుచు, నానందంబు నొంది యిట్లనియె. 756

క. పురుషవర! నాకు నీకును, గురువును నామమును గులముం గోరి యెఱుగ నీ పురమున నుండుదుం గా కీ, పురమును నిర్మించినట్టి పురుషు నెఱుంగన్. 757

క. వీరలు నా సఖు లీ లలల, నారత్నము లార్యవినుత ! నా చెలు లీ [1]వృ ద్ధోరగ మే నిద్రింపంగ, ధీరత మేల్కాంచి పురము ధృతిం బాలించున్. 758

వ. వెండియు ని ట్లనియె.

సీ. మనుజనాయక ! నీవు మ ద్భాగ్యవశమున నిటకు నేతెంచితి విపుడు నీకు మంగళం బగు నీవు మహితేంద్రియ గ్రామ భోగ్యంబు లగు కామపుంజములను అర్థి సంపాదింతు వనఘాత్మ! యీ నవ ద్వారప్రయుక్త మై తనరు పురము [2]నీవు గై కొని యేలు నీకంటె నిందుకు నధికుం డన్యుండు లేం డనఘ! యిందు

తే. మదుపనీతము లైన కామముల ననుభ వింపుచును సమాశత మధిష్ఠింపు మెలమిం గోరి నీకంటెం బ్రియులు నెవ్వారు ? నాకు నరసిచూడంగ మనుజేంద్ర ! యదియుం గాక. 760

వ. మఱియు రతిజ్ఞాన విహీనుండును, నకోవిదుండును, నిహపర చింతా శూన్యుం డును, బశుప్రాయుండును,*(ద్వదన్యుండును నైన వాని)నే నెట్లు వరియింతు? గృహస్థాశ్రమమందు ధర్మార్థ కామ మోక్ష ప్రజానందంబులును, యశంబును, యతి వేద్యంబులు గాని రజ స్తమో విహీన(పుణ్య)లోకంబులును గలుగు. పితృ దేవర్షి మర్త్య భూత గణంబులకుం దనకు నీలోకంబున గృహస్థాశ్రమంబు సర్వ క్షేమార్హం బైన యాశ్రమం బండ్రు. కావున వదాన్యుండవు, వీరవిఖ్యాతుం డవు, ప్రియదర్శనుండవు, స్వయంప్రాప్తుండవు నై భోగిభోగ సదృశ భుజా (దండ) ములచే నొప్పు భవాదృశుం దగిలి (మాదృశ యగు) కన్య వరింప కుండునే ? యని వెండియు. 761

క. కరుణారస పరిపూర్ణ, స్ఫురిత స్మితరుచి విలోకపుంజము చేతన్ గర మర్థి దీనజన భయ, హరణుం డ వై సంచరింపు మఖిలజగములన్. 762

1. క్రుద్ధోరగ (క. చ. జ. ద. బ.) 2. నందు నా చెలులచే నభిమత కామముల్, నెమ్మి నరిందమ నీకుగూర్తు (ట) * తా. ప. ప్రతులలో లేదు.

క. అని యీగతిఁ బలికిన యా, వనజాక్షిఁ బురంజనుండు వరియించి ముదం
బున నన్యోన్యప్రీతిన్, దనరుచుఁ ద త్పురము సొచ్చి ధన్యుం డగుచున్.

చ. శతసమకాల మ ప్పురి నజస్రము భూరి సమ స్తసౌఖ్య సం
గతులఁ దనర్చి వందిజన గాయక [1]సద్వినుతోపగాన మో
దితమతి నొప్పి సుందర సతీజన సేవితుఁ డై నృపాలకో
చిత లలితస్థలంబుల వసింపుచుఁ గ్రీడలు సల్పుచుండఁగన్. 764

క. నరనాథుఁడు లోకభయం, కరగతి వ ర్తించు గ్రీష్మకాలము దోఁపం
దరళ లహరీమనోహర, వరహ్రదిని సలిలమందు వసియించెఁ దగన్. 765

వ. ఇట్లు వసించి, కతిపయ దినంబు లరుగు సమయంబున. 766

సీ. అవనీశ్వరో త్తమ! య ప్పురంబున నాల్గువంకల నున్న [2]గవఁకులు వినుము
తూర్పుదిక్కునను నై దును దక్షిణో త్తరంబుల రెండుఁ బశ్చిమంబునను రెండుఁ
గాఁగ నా తొమ్మిది గవఁకుల నుపరిదిక్కున నేడుఁ గ్రిందిదిక్కునను రెండు
నై యుండు మఱి వానియందుఁ బృథగ్విధ విషయగత్యర్థ మై వెలయు నీశ్వ

తే. రుం డొకఁ డరయఁగఁ గలండు రూఢిఁ ద త్పు
రంబుఁ బాలించునట్టి పురంజనుండు
నా పురద్వార నవకంబు నందులోన
నర్థిఁ బ్రాగ్ద్వార పంచకమందు వరుస. 767

వ. ఖద్యోతయు, హావిర్ముఖియు నను నామంబులు గల ద్వారయుగంబున ద్యుమ
త్సఖుం డై విభ్రాజిత జనపదంబును బొందు. వెండియు నళినియు, నాళినియు
నను పేళ్ళుం గల వాకిళ్ళ రెంటియందు నవధూతసఖుండై సౌరభరూపంబులైన
విషయంబులం బొందు. మఱియు ముఖ్యానామకం బైన ప్రధాన ప్రాగ్ద్వారంబున
రసజ్ఞ విపణాన్వితుం డై యాపణ, బహూదనంబు లను విషయంబులఁ బొందు.
పితృహూ నామకం బై న దక్షిణద్వారంబున శ్రుతధరాన్వితుం డై దక్షిణ
పాంచాలం బను రాష్ట్రంబు నొందు. దేవహూ నామకం బై న యు త్తరపువాకిట
శ్రుతధరాన్వితుం డై యు త్తరపాంచాలం బను రాష్ట్రంబు నొందు. వెండియుం
బడమటి వాకిళ్ళ రెంటియందు నాసురీనామకం బైన వాకిట దుర్మదసమేతుండై

1. సద్వినుతోరుగాన (తం. వా) 2. గవనులు (హ)

గ్రామకనామకం బైన విషయంబును, నిరృతి నామకం బైన వాకిటియందు లుబ్ధకయుక్తుండై వైశసం బను విషయంబు నొందుచుండు. వెండియుం బురంజనుం డప్పురంబునం బౌరజనంబులందుఁ గల నిర్వా, క్పేశస్కారులను నిద్ద అంధుల చేతగమన,కరణంబులను క్రియల నొందుచు,నంతఃపురగతుండగునప్పుడు విషూచీన సమన్వితుం డై, జాయాత్మజోద్భవం బైన మోహ ప్రసాద హర్షంబుల నొందుచుండు. ఇవ్విధంబునం గర్మాసక్తుండుఁ, గామాత్మకుండు నై బుద్ధి యను మహిషిచేత వంచితుం డయ్యె. అ క్కామిని. 768

సీ. పానంబు సేసినఁ దాను బానముఁ జేయుఁ గుడిచినఁ దానును గుడుచు మఱియు
భక్షింపఁ దానును భక్షించు నడచిన నడుచును నవ్విన నవ్వు నేడ్వ
నేడుచుఁ బాడినఁ బాడు విన్నను విను< జూచినఁ జూచుఁ గూర్చున్న నుండు
దుఃఖింప దీనుఁడై దుఃఖించు నిలిచిన నిలుచు నిద్రింపంగ నిద్రవోవు

తే. ముట్టినను ముట్టు మూర్కొన్న మూరుకొనును
బలుకఁ బలుకును బవళింపఁ బవ్వళించు
హర్షమును బొంద నాత్మను హర్ష మొందు
మోదమును బొందఁ దానును మోద మొందు. 769

వ. ఇవ్విధంబున నతండు మహిషీ విప్రలబ్ధుండును, వంచిత స్వభావుండును నై పారవశ్యంబునం జేసి యజ్ఞుండును, ఇతరేచ్ఛా విరహితుండు నై క్రీడామృగంబు చాడ్పున ననుకరింపుచు, వర్తింపుచు నా పురంబునఁ గాపురం బుండె. ఆ పురంజనుం డొకానొక దినంబునం ధనుర్ధరుండై. 770

అధ్యాయము — ౨౬

సీ. పంచాశ్వ యుక్తంబు పంచబంధనము చక్రద్వితయమును యుగద్వయంబు
నాశువేగంబు నేనాక్షంబుఁ గూబర ద్వయముఁ బతాకా త్రితయయుతంబు
నేకరశ్మియుతంబు నేకసారథికంబు సప్తవరూథంబు స్వర్ణభూష
మును బంచవిక్రమమును నేకనీడంబుఁ బ్రకట పంచప్రహరణము నైన

తే. రథము కాంచనరచిత వర్మము ధరించి
విలస దక్షయ తూణీర కలితుఁ డగుచుఁ
గణఁక దీపింప నెక్కి యేకాదశ ప్ర
సంఖ్య సేనాసమేతుఁడై సరభసముగ. 771

వ. పురంబు వెడలి, పంచప్రస్థం బను వనంబునకుం జని, యందు విడువరాని మహిషిని విడిచి, మృగయాసక్తుండై *(దృప్తుం డగుచు) ధనుర్బాణంబులు ధరియించి సంచరించుచు, నాసురవృత్తిం దగిలి, ఘోరాత్ముండు, నదయుండు నై నిశాత సాయకంబులచేత న మ్మృగవ్రాతంబులం బరిమార్చె. రాజులకు మృగయావినోదంబు విహితానుష్ఠానం బగుచుండ నాసురవృత్తి యెట్లయ్యె నని యంటివేని, నిది రాగప్రాప్తంబగుటను విహితంబు గాదు. వినుము, [1]తీర్థంబులందె, ప్రఖ్యాత శ్రాద్ధదినసంబులయందె, రాజైనవాఁడె, మేధ్యంబులైన పశువులనె, వనంబునందె, యథోపయుక్తంబుగానె, వధింపం జను నను నియమమాత్రంబు గలదు. కావున జ్ఞాని యైన విద్వాంసుం డాచరింపఁడు గాక. ఆచరించినం గర్మానుష్ఠానజనితంబైన జ్ఞానంబునం జేసి యందుం బొరయండు. అట్లుగాక నియమోల్లంఘనంబునం గర్మాచరణుం డగువాఁ డభిమానంబు నొంది, కర్మబద్ధుండై గుణప్రవాహ పతితుండును, నష్టప్రజ్ఞుండును నై యధోగతిం గూలు. ఇట్లగుటంజేసి (సాధుజనులకు సర్వప్రకారంబుల) నాసురవృత్తి మానం దగు. అని వెండియు ని ట్లనియె. అంతం బురంజనుం డ వ్వనంబున. 772

క. వర చిత్రపక్ష సునిశిత, శరములచే శశ వరాహ చమరీ రురు కా
సర గవయ శల్య హరిణీ, కరి హరి వృక పుండరీక కపి ఖడ్గములన్. 773

వ. వధియించి మఱియు. 774

సీ. వరుస మేధ్యామేధ్య వనమృగంబుల [2]ఘృణ సన దుస్సహక్రీడ సంహరించి
శ్రమయుక్తుండై వేఁట సాలించి మరలి మందిరమున కర్థి నేతెంచి యందు
సముచిత స్నాన భోజనకృత్యములు దీర్చి యతి[3]విశ్రమమున శయానుఁ డగుచుఁ
బరిమళ మిళిత ధూపవ్రాత వాసిని సర్వాంగుఁ డగుచు స్రక్చందనాది

తే. వివిధ భూషణ చేలముల్ వెలయఁ దాల్చి
తృప్తుఁడును హృష్టుఁడున్ మఱి దృప్తుఁ డయి య
నన్యజాకృష్టచిత్తుండు నై రతిప్ర
సంగ కౌతుక మాత్మను దొంగలింప. 775

వ. అంత స్వకీయ ప్రాణవల్లభ యగు మహిషియందు మనంబు నునిచి, యా వరారోహయు, గృహమేధినియు నైన గృహిణిం గానక, విమనస్కుండై నిజాంతః పుర కామినులం గనుంగొని యి ట్లనియె. 776

* తా. ప. ప్ర. లలో లేదు. 1. శ్రాద్ధాదు (హ. తం. వా.) 2. ఘృణజన (హ) కృపాజన (క)
3. పరిశ్రాంతి (హ. వా.)

క. రామాజన సంఘములా, రా! మానవతీలలామ రామామణి [1]నా
రామకృప వడసి మెలఁగుడు, రా? మానుగఁ గుశలమా? పరామర్శింపన్.

ఉ. సారవివేకలార! గృహసంపద లేమెడఁ బూర్వరీతిచే
నారయఁగా రుచింపవు గృహస్థునకున్ గృహమందు మాతగా
నీ రమణానుకూల రమణీమణి యై తనరారు భార్యగా
నీ రుచి నొందకున్నఁ గనసేర్చునె? త ద్గృహమేధి సౌఖ్యముల్. 778

వ. అదియునుం గాక. 779

క. పొగ డొందు జనని గానీ, తగవున వర్తించునట్టి దయితయు కానీ
తగ నుండని గృహమున నుం, టగుఁ జక్రవిహీన రథమునం దుం టరయన్. 780

వ. కావున. 781

చ. తలకొని నాకుఁ [2]దా ననుపదంబును బ్రజ్ఞ జనింపఁజేసి సం
చల దురు దుర్భర వ్యసనసాగర మగ్నుఁడ నైన నన్ను ని
శ్చలమతి నుద్ధరించి యనిశంబును మత్ప్రియ యైన భార్య యే
వలనఁ జరింపుచున్న దనివారణ నా కెఱిఁగింపరే! దయన్. 782

క. అనవుడు విని య క్కాంతలు, జనపతి కిట్లనిరి రాజసత్తమ! [3]యదిగో!
దన కొంగైనను బఱపుగ, నొనరింపక నేలఁ బొరలుచున్నది వగలన్. 783

తే. ఏమికతమున నున్నదో? యెఱుఁగ మేము
నీవు చూడు మటన్న నా భూవరుండు
నేలఁ బడి పొరలెడు భార్యఁ బోలఁ జూచి
మనములో దుఃఖతాపంబు మల్లడింప. 784

వ. అంత. 785

ఆ. జలజనేత్రి ప్రణయసంజాత రోషభా
వమున నైనయట్టి వక్రదృష్టి
జనవిభుండు సూచి యనునయ కోవిదుఁ
డగుచు న ప్పయోరుహాక్షిఁ జేరి.

1. సారామలకృపచే (హ) 2. దాను సుపథంబున (హ) 3. ఇదిగో (తం. వా.)

క. పొలఁతుకఁ దన యుత్సంగం, బుల నిడి త త్పాదయుగళమును నంటుచు మం
జుల మృదుభాషణముల నా, లలనామణిఁ జూచి పలికె లాలన మొప్పన్. 787

చ. రమణిరొ? భృత్యులందు నపరాధము గల్గిన నాయకుల్ స్వప
క్షముఁ దలపోసి యుగ్రతర శాసనముం దెగి చేయ రట్లుగా
క మనములోని కిన్కఁ దమకంబున నాజ్ఞ నొనర్చిరేని ని
క్కముగ ననుగ్రహించుటయ కాక తలంపఁగ నాజ్ఞసేయుటే? 788

క. కమలానన బాంధవ కృ, త్యముఁ దలఁపక రోషచిత్తుఁ డగు [1]కుటిలాత్మున్
మమతం గ్రోధియు నీతి, క్రమరహితుఁడు నైన బాలుఁగా నెన్నఁదగున్. 789

వ. అని వెండియు నిట్లనియె. 790

మ. సరసోదార సుధారసోపమ వచశ్చాతుర్య సౌభాగ్య మై
హరినీలోపమ కోమలాలకయుతం బై విభ్రమభ్రూలతా
పరిపుష్ట స్మిత సద్విలోకనము నై భాసిల్లు యుష్మన్ముఖాం
బురుహంబున్ భవదీయ దాసునకుఁ బూఁబోణీ! కృపంజూపవే! 791

క. విను వీరపత్ని! నీ యెడ, ననయంబును బ్రాహ్మణులును హరిభక్తులుఁ ద
క్క నితరు లెగ్గొనరించిన, వనితా! శిక్షింతు నెంతవారల నైనన్. 792

క. ఈ ముల్లోకములందును, నా మనమున రోష మొదవినన్ భయరహితుం
డై మదిలోఁ బరితోషము, తో మెలఁగెడు వానిఁ గానఁ దోయజనేత్రా! 793

సీ. ఇందీవరేక్షణ! యే నెందు భవదీయ తిలకవిరహితము మలినయుతము
హర్షశూన్యంబు [2]నపాస్తరాగంబును సత్యమర్ష యుతంబు నైన ముఖము
గళి తాశ్రుబిందు సంకలిత సంచితశోభమాన పీన స్తనమండలమును
రమణీయ తాంబూలరాగ విహీన మైనట్టి సుపక్వ బింబాధరంబుఁ

తే. [3]గాన నిట్లుంట కిపు డేమి కతము నాకు
నర్థి నెఱిఁగింపవే! [4]మృగయాతిసక్తి
నబల! నీ కెఱుఁగింపక యరిగినట్టి
తప్పు సైరించి కావంగఁ దగుదు నేను. 794

1. కుటిలాత్మ, న్నమర్షయుతుఁడును నీని (క.ద.); కుటిలాత్మున్ సముదా మర్షుఁడు (తం.వా.)
2. మనోప్రకాశకము నై (హ. తం. వా.) 3. గాఁగ (హ. తం. వా.) 4. మృగవ్యసన మొంది (క. చ. ట. తం.)

క. వనితాజన పరవశుఁ డై, మనసిజశర బాధ్యమాన మానసుఁ డగువా
నినిఁ దగఁ గర్తవ్యార్థము లను భజియింపక తొలంగు లలనలు గలరే? 795

వ. అనుచుం దదీయ విభ్రమవశంగతుం డై పలికిన విని. 796

క. కంజాతపత్రనేత్ర పు, రంజనుదెస రోష ముడిగి రమణీయ శ్రీ
మంజుల మృదూక్తుల మనము, రంజింపుచుఁ బలికె సదనురాగ మెలర్పన్. 797

వ. అంత. 798

అధ్యాయము—౨౬

సీ. అ మ్మహాదేవి నెయ్యంబున మంగళస్నాత యై మృదుల వస్త్రముల గట్టి
స్రక్చందనాది భూషణములు ధరియించి కమనీయ మోహనాకార యగుచుఁ
బతికడ నిలిచిన నతఁడు సంతుష్టాంతరంగుఁ డై యభ్యంతరమున నుండి
యన్యోన్య సరస గాఢాలింగనంబులు గావించి గోప్య వాక్యములచేత

తే. నతఁడు ప్రమదా పరిగ్రహ వ్యసనమునను
గడఁక నపకృష్ట ఘనవివేకమును గలిగి
పగలు రేయను ప్రొద్దు లేర్పఱుపలేక
యెనసి యాయు ర్వ్యయంబు దా నెఱుఁగఁ డయ్యె. 799

వ. మఱియు నతం డున్నద్ధమదుండును, మహామనుండును, అర్హశయ్యా శయా
నుండును, మహిషీ భుజోపధానుండును నై యజ్ఞానాభిభూతుం డగుటంజేసి
స్వరూపభూత పరమపురుషార్థంబు నెఱుంగక, నిజమహిషినే పరమ పురుషా
ర్థంబుగాఁ దలంపుచు, రమింపుచుం గామ కశ్మల చిత్తుం డైన యతనికి నవ
యౌవనం బైన కాలంబు క్షణార్ధంబునుం బోలి గతం బయ్యె. అంత, 800

క. విశద [1]యశోజలనిధి యా శశిముఖి యయగు భార్యవలన సమ్మతి నేకా
దశశత పుత్రుల రణక, ర్కశదేహులఁ గాంచి కౌతుకంబున మఱియున్. 801

క. గురుశీ లౌదార్య గుణో, త్తరలను సల్లలిత గుణకదంబలఁ బ్రియలన్,
వర కులపావనల దశో, త్తరశత దుహితలను గాంచెఁ ద త్సతివలనన్. 802

వ. ఇట్లు పుత్ర పుత్రికా జనంబులంగని యున్నంత.

1. యశోనిధి యగునా (త. ద.)

క. విను మాతని [1]యాయువులో, న నరిగె నర్ధంబు నంత నరపతి కులవ
ర్ధను లగు సుతులకుఁ బరిణయ మొనరించెన్ సదృశ లైన యువిదలతోడన్

క. నరనాథుఁ డాడుబిడ్డల, వర రూప వయో విలాస వైభవములచేఁ
బరఁగిన [2]నిజ తనయ సదృశ, వరులకు సంప్రీతితో వివాహము చేసెన్. 805

వ. అట్లు వివాహంబు గావించి యున్న సమయంబున. 806

క. విను తత్సుతు లొక్కొక్కని, కనయముఁ బాంచాలదేశ మందులఁ బౌరం
జన కులవర్ధను లగుచున్, జనియించిరి నూర్వురేసి శౌర్యబలాఢ్యుల్. 807

ఆ. అనఘ ! యిట్టి రిక్థహారులు గేహ కో
శానుజీవ యుతులు నైన యట్టి
నందనాదులందుఁ జెందిన [3]మమత ని
బద్ధుఁ డయ్యె నంతఁ బార్థివుండు. 808

చ. తిర మగు నిష్ఠతో నతఁడు దీక్షితుఁ డై పశుమారకంబులు
[4]న్నరిది భయంకరంబులును నైన మఖంబులు పెక్కు చేసి యా
దరమున నీవునుం బలెను దత్త దనూన [5]ఫలప్రకాముఁ డై
సుర పితృ భూత సంఘము నసూయ, దనర్చి భజించె భూవరా ! 809

వ. ఇట్లాత్మహితంబు లైన కర్మంబులయం దనవహితుండును, గుటుంబాసక్త మానసుండును నై యున్న యతనికి విరోధి యై ప్రియాంగనాజనంబులకు నప్రియం బగు*(కాలంబు సంభవించినం)జండవేగ విఖ్యాతుం డగు †గంధర్వాధీశుండు షష్ట్యుత్తర శతత్రయ సంఖ్యాతు లైన గంధర్వులును, అందఱు గంధర్వీ జనంబులును †(సితాసిత వర్ణంబులు గలిగి మిథునీభూతు లగుచు) ననుగమింపం జనుదెంచి(స్వ పరిభ్రమణంబుచేతనే సర్వకాలంబుల నిర్మితం బగు నా)పురంబు నిరోధించిన, నప్పు డా చండవేగానుచరు లైన గంధర్వు లా పురంజను పురంబు [6]వ్యాకులంబు నొందింపుచు నపహరింప నుపక్రమించు సమయంబునం బురంజన పురాధ్యక్షుం డైన ప్రజాగరుం డనువాఁడు వింశత్యుత్తర సప్తశతంబు లైన గంధర్వ గంధర్వీ జనంబుల నివారించి,బలవంతుండై సంవత్సర శతంబు యుద్ధంబు

1. యాయువు వలనను (క. చ. త. ద. దం. భ.) 2. స్వతనయం సదృశ (హ) 3. మమత్వ (చ. త. జ. డ. ద. బ.) 4. నకవి భయంకరంబులగు సన్మఖముల్ దగఁ (హ. వా.) 5. ఫలాప్తి కాముఁడై (హ) * తా. ప. ప్రతులలో లేదు. † గంధర్వాధీశుఁడు = కాలము "గంధర్వాః దివసాః (వ్యా.)" 6. పర్యాయంబున విశీర్ణంబు నొందించుచు (క. త. ద. ద. బ.)

గావించి, యొక్కఁడుం డయ్యు న ప్పెక్కండ్రతో నిట్లు వోరి, క్షీణుం డైనఁ బురంజనుండు దాన నిలిచి, త త్పురంబున నల్పసుఖంబు లనుభవించుచుఁ బాంచాల దేశంబులందు నిజ పార్షదులచేత [1]నానీతంబు లైన పదార్థంబుల నొందుచుం గామినీజన సమేతుం డై, భయపర్యాలోచనంబు సేయనేరక రాష్ట్రి పుర బాంధవ సమేతుం డై, యా ర్తి నొంది చింతాక్రాంతుం డై యుండె. అంత. 810

క. అనయంబు కాలపుత్రిక, యను నొక కామిని పరేచ్ఛ నఖిలజగంబుం
దనయంతఁ గలయఁ దిరుగుచుఁ, జని చని యొకనాఁడు రాజస త్తమ! వింటే!

సీ. అనఘాత్మ! రాజర్షి యైన యయాతి కుమారకుం డై నట్టి పూరుచేత
వరింపఁగాఁ బడి వలనొప్ప నతనికి వరమిచ్చి దౌర్భాగ్యవశత నొంది
ప్రఖ్యాతిఁ గనుట దుర్భగ యను పేరను బరఁగు న క్కాంత నే పురుషవరుఁడు
వరియింపఁడయ్యె నా తరుణియు నొకనాఁడు గర మొప్ప బ్రహ్మలోకముననుండి

తే. వసుధ కేతెంచి విను బృహద్వ్రతుఁడ నైన
నన్ను వరింపఁ గోరి మనమునఁ గామ
శర విమోహిత యై వేఁడఁ గరము నేను
నమ్మతింపక యున్న రోషము నలిగి. 812

వ, ఇ ట్లను. మునీంద్రా! మదీ యాశా విముఖుండ వై న నీకు నేకత్రావస్థానంబు లేక యుండుం గాక,అని శపించి, విహతసంకల్పయై మ దుపదేశంనంబు జని, యవనేశ్వరుండు, భయనామకుండు నై న వానిం గదిసి యిట్లనియె. 813

క. అవనీపతి! భయనామక యవన, కులాధీశ్వరుండ వగు నినుఁ బతిగాఁ
దవిలి వరింపఁగ వచ్చితి, సవినయముగ వినుము భూతసంకల్పమునన్. 814

వ. కలుగు మ త్కామితంబు వృథగాదు, లోకంబున[2]వేదంబులయందు దేయగ్రాహ్య రూపం బయిన వస్తువు యాచ్యమానం బగుచుండ *(నెవ్వం డొసంగఁడు)నెవ్వం డిందు దీయమానం బగుచుండం గోరండు, నట్టి వీర లిద్దఱును జడస్వభావు లని సత్పురుషులు శోకంబు నొందుదురు. కావున నిన్ను భజియింపుచున్న నన్నుం గరుణార్ద్రచిత్తుండవై భజియింపుము.ఇట్టి యార్తానుకంపయుఁ బురుషధర్మంబు. అని పలికిన న క్కాలపుత్రిక వచనంబులు విని యవనేశ్వరుండు దేహగుహ్య చికీర్షు వగు దానిం గనుంగొని మందస్మిత వదనుం డగుచు ని ట్లనియె. 815

1. పాలితంబులైన (క.చ.ట.జ.డ.బ.) 2. శాస్త్రంబందు (క. బ.) * తా.ప. ప్రతులలో లేదు.

క. విను తరుణి! యాచ్యమానం, బనఁదగు నీ లోకముం దమంగళవును స
జ్జనముల కసమ్మతవు నగు నిను నభినందింపకుండు నెఱి నెవ్వారుః. 816

వ. కావున నేను జ్ఞానదృష్టింజేసి నీకుం బతినిరూపణంబు సేసెద, అది యెట్లనిన. మదీయ సేనాసహాయంబు వడసి, ప్రజానాశం బొనరించునట్టి నీ వవ్యక్తగతివై కర్మనిర్మితం బైన లోకంబు ననుభవింపుము. ఈ ప్రజ్వారుం డనువాఁడు నాకు సహోదరుండు. నీవు మదీయ భగినివి. ఈ యిద్దఱిం గూడి యీ లోకంబునందు నవ్యక్తుండను, భీమసైనికుండు నై యేను వర్తింతును,

అధ్యాయము — ౨౮

అనిన నా భయనామకుం డైన యవనేశ్వరుని దిష్టికారులైన సైనికులు ప్రజ్వార కాలకన్యా యుక్తులై భూమండలం బెల్లఁ దిరుగుచు నొక్కనాఁ డతివేగంబున భౌమభోగాఢ్యంబుఁ, జరత్పన్నగ పాలితంబు నైన పురంజనుపురంబు నావరించి యున్నంత, స్వాభిభూతుం డైన పురుషునకు నిస్సారత్వంబు గలిగించునట్టి కాల కన్యక బలాత్కారంబున నా పురంజను పురంబు ననుభవించె. అట్లు కాలకన్య కోపభుజ్యమానం బైన పురంబు సర్వద్వారంబులందును [1]సర్వతో దిశంబుగా న య్యవనులు ప్రవేశించి, త త్పురంబు సమస్తంబును బీడింప, నిట్లు పురంబు ప్రపీడ్యమానం బగుచుండ నభిమాని యైన పురంజనుండు. 817

సీ. అనఘ! యీతఁడు మమతాకులచిత్తుఁ డై బహువిధ భూరితాపములఁ బొంది
ఘన కుటుంబియుఁ గాలకన్యోపగూఢుండు నష్టసంపదుఁడు వినష్టమతియు
విషయాత్మకుండును వినిహతైశ్వర్యుండుఁ గృపణుండుఁ జాల నకించనుండు
నగు పురంజనుఁడు శోకావిలభావుఁ డై గంధర్వ యవన సంఘముల చేత

తే. [2]నోఁజ చెడి వికలత నొందు నైజపురముఁ
దవిలి ప్రతికూలు రయి యనాదరణయుతులు
నైన పుత్రులఁ బౌత్రుల ననుచరులను
సచివ పౌరోహితుల నిజసతినిఁ జూచి. 818

వ. మఱియుం గాలకన్యాగ్రస్తుం డైన తన్నును, నరిదూషితంబు లైన పాంచాల బలంబులనుం జూచి, యపార చింత నొంది, త త్ప్రతీకారంబు సేయ నెఱుంగక

1. సర్వతోధికంబుగా (హ. తం. వా.) 2. భజనచెడి.........నిజపురమును (క. ఐ.)

కాలకన్యాపహృత వీర్యంబు లయినం, గామంబుల నభిలషింపుచు వీనుండును, విగతాత్మగతికుండును, (స్నేహంబునం జేసి) పుత్త్రదారోపలాలన పరుండును నై కాలకన్యోపమర్దితంబును, గంధర్వ యవనాక్రాంతంబును నైన పురంబు విడువ నిచ్ఛలేకయు విడువ నుపక్రమించె. అప్పుడు. 819

క. అనఘా! భయనామాగ్రజుఁ, డనఁగల ప్రజ్వారుఁ డప్పు డరుదెంచి పురం
బును సకలంబును భయనా, మునికిం బ్రీతిగ దహించె మునుకొని యంతన్. 820

వ. అట్లు పురంబు దహ్యమానం బగుచుండ *(పౌర) భృత్యవర్గాది సమన్వితుండును, గౌటుంబికుండును, పుత్త్రాది సమన్వితుండును, యవనోపరుద్ధాలయుండును, గాలకన్యా గ్రస్తుండును నైన పురంజనుం డప్పురంబునందుఁ బ్రజ్వార సంస్పృష్టుం డై యనుతాపంబు నొంది, త త్పురపాలనంబునందు సమర్థుండు గాక పురుకృ చ్ఛ్రోరువేపథుం డై యందుండ న శక్తుం డయ్యె. 821

క. దవశిఖియుత తరుకోటర, నివసిత పన్నగము పగిది నిజపురి వెడలం
దివురుచు నతఁడు [1]శిథిల దవ, యవుఁడును గంధర్వగణ విహత శౌర్యుండున్.

సీ. అయి చాల ఘురఘుర మను శబ్ద మడరంగ మనమునఁ జింతానిమగ్నుఁ డగుచుఁ
గొడుకులఁ గోడండ్రఁ గూఁతుల నల్లుండ్ర మనుమల [2]నాప్తుల ననుచరాళి
నసయంబు స్వత్వమాత్రావశిష్టం బైన గృహ కోశనివహ పరిచ్ఛదముల
మసలు నహంకార మమకారములఁజేసి మతిహీనుఁ డగుచు నెమ్మనములోనఁ

తే. గణఁకఁ దలఁచుచు విప్రయోగమునఁ దాను
గటకటా! యిట్లు పరలోక గతుఁడ నైన
యిట్టి భార్య యనాథ యై యీ కుమార
వరుల నేరీతిఁ బ్రోచునో? యవని ననుచు. 823

వ. మఱియు నిట్లని తలంచు. 824

సీ. పడఁతి యే మనుభుజింపక భుజింపదు నేను నిద్రవోవక మఱి నిద్రవోదు
నేను నీళ్ళాడక నీళ్ళాడ నొల్లదు పదరి యేఁ గోపింప భయము నొందు
భర్జించినను మాఱు పలుకక వాయోదు బుద్ధిహీనుఁడ నైన బుద్ధిఁ జెప్పు
లలి మీఱ నిట్టి కళత్రంబుతో నేనుఁ గడఁగి దేహాంతర గతుఁడ నైన

* తా. ప. ప్రతులలో లేదు. 1. శిథిలావయవుడు (క. చ. జ.) 2. సచివుల ననుచరుల (చ. త. డ. ద. బ.)

తే. తనయమును దాను [1]బుత్రిణి యగుటఁ జేసి
యాత్మ శోచిని యగుచు గృహస్థధర్మ
మాచరింపుచు నుండునో? యనుగమనము
సేయునో? యని మనమునఁ జింత నొంది. 825

క. తనపుత్రులుఁ దనతనయులు,తనయముఁ దాఁ జనినయెడ నిరాశ్రయు లగుచున్
వననిధి మధ్యంబున నవి, సిన కలముం బోలి యెట్లు జీవించెదరో ? 826

క. అని యి వ్విధమునఁ గృపణుని, యనువున ఘన దుఃఖవిహ్వ లాన్తర్వాం డ
య్యును దుఃఖించు పురంజను, తనయముఁ గొనిపోవ నిశ్చితాత్ముం డయ్యెన్.

క. చను దెంచెను భయనాముం, డనువాఁ డప్పుడు పురంజనాఖ్యుఁడు పెలుచ
న్న నఘాత్మ! పశువు భంగిని, [2]మనము గలఁగ యవన నీయమానుం డగుచున్.

వ. అనుచర వర్గంబు భృశాతురులు, దుఃఖితులు నై వెనుచనుచుండ, నుపరుద్ధం బగు భుజంగమం బ ప్పురంబు నెపుడు వాసె నప్పు డా పురంబు విశీర్ణం బై ప్రకృతిం బొందె. బలవంతు డైన యవనునిచేత బలాత్కారంబున వికృష్య మాణుం డైన పురంజనుండు దమః పిహితుం డై పూర్వసుహృత్తగు సఖు నీశ్వరు నెఱుంగ కుండె. అంతం బరలోకగతుం డైన పురంజనుం గదిసి, పూర్వం బున నదయుం డైన యతనిచేత, హింసింపం బడిన యజ్ఞపశువులు క్రోధోద్రేకం బునఁ గుఠారంబుల నతని నఱికె. ఇ వ్విధంబునం బ్రమదాసంగ దోషదూషితుం డును, నపారతమో నిమగ్నుండును, నష్టజ్ఞానుండును నై పురంజనుం డనేక కాలంబు పరలోకంబున నార్తి ననుభవించి, త ద్భార్య యైన ప్రమదోత్తమం జిత్తంబున నశ్రాంతంబును దలంచుచుండం, దదీయ సంస్మరణంబునం జేసి తరు వాతి జన్మంబున విదర్భరాజు గృహంబునం బ్రమదోత్తమ యై జన్మించె. అంత.

సీ. నరవర! వీర్య [3]పణం బైన యట్టి వైదర్భిని మలయకేతనుఁ డనంగఁ
బరపురంజయుఁ డైన పాండ్య భూమీశుండు దారుణ సంగర స్థలమునందు
శక్తి ననేక రాజన్యుల నిర్జించి పరిణయం బయ్యె నా గురుభుజుండు
నా విదర్భాత్మజయం దసితేక్షణ యైన కూఁతును ద్రవిడాధినాథు

1. పుత్రాఘవగుటజేసి ( చ. జ. ) 2. మన మగలగ ( ట. త. ) 3. పణా ప్త యైనట్టి (హ)

తే. లైన కొడుకుల నేడ్వుర నర్థిఁ గనియె
వారలకు నెల్ల నొక్కొక్క వరుస నర్బు
దార్బుద సుతులు సంజాతులైరి యతని
సుత ధృతవ్రత నా యగస్త్యుడు వరించె. 830

క. అతఁ డా కన్యక వలనను, జతుడుం డై యిధ్మవాహ జనకుఁ డగు దృఢ
చ్యుతుఁడను మునీంద్రుఁ గనియెను, మతినంత విరక్తుఁడగుచు మలయధ్వజుఁడుఁ.

తే. క్ష్మాతలం బెల్ల నిజ తనూజాతులకును
బంచియిచ్చి సరోజాక్షు పాదపంక
జార్చనాయత్తుఁ డగుచుఁ గులాద్రి కరుగ
నంత మదిరాక్షి సతి యగు నా విదర్భి. 832

తే. కడఁక గృహములు నఖిలభోగములు విడిచి
చంద్రు వెనుచను చంద్రిక చందమునను
భక్తి దళుకొత్తఁ బాండ్యభూపాలుఁ డైన
మలయకేతను వెనుకొని మగువ సనియె. 833

వ. అట్లు ధర్మపత్ని వెంటరాఁ జని, యందుఁ †జంద్రమసా తామ్రపర్ణీ నవోదక లను నదుల పుణ్యజలంబుల స్నాతుం డై, ప్రక్షాళిత బాహ్యాభ్యంతర మలుండును గందమూల ఫల బీజ పుష్ప పర్ణ తృణ తోయాహారుండును నై కాయకర్శనం బైన తపం బాచరింపుచు, శీతోష్ణ వర్షవాతంబులు, క్షుత్పిపాసలు, ప్రియాప్రియం బులు, సుఖదుఃఖంబులు నను ద్వంద్వంబుల సమదర్శనుం డై జయించి, తపో విద్యా యమ నియమంబులం జేసి పక్వకషాయుం డై, బ్రహ్మమ్మునందు నిజాత్మ ననుసంధించి, విజితేంద్రియ ప్రాణచిత్తుం డై, స్థాణువుం బోలి దివ్యవర్ష శతంబు తపంబు సేసి, భగవంతుడైన వాసుదేవునందుఁ బ్రీతివహింపుచు, నన్యంబెఱుంగక వర్తింపుచుఁ, దన్ను స్వప్నమందు "మమేదం శిర శ్ఛిన్న" మిత్యాది ప్రతీతి యందుం బలె వ్యతిరిక్తునిఁగ, వ్యాపకునిగ, నంతఃకరణవృత్తి సాక్షిఁగా నెఱింగి.

సీ. సాక్షాత్కృతుండును సర్వేశ్వరుండును భగవంతుఁడును గృపాపరుఁడు నైన
హరి యను లోకైక గురునిచే నుక్తమై సర్వతోముఖమును స్వప్రకాశి
తము నగు మహిత శుద్ధ జ్ఞాన దీప ప్రభాతతిచేఁ బరబ్రహ్మమందుఁ
దన్నును దనయందుఁ దగఁ బరబ్రహ్మంబు నెనయఁ గన్గొనుచు దగ్ధేంధనాగ్ని

† 'తత్ర చంద్రమసానామ తామ్రపర్ణీ నవోదకా' యని మూలము. (28-35)

తే. భంగి నీషణములఁ బెదబాసి భూరి
వ్యసన సాగర సంసృతి వలనఁ జాల
నుపరతుం డయ్యె నా మహితోన్నతుండు
నవనినాయక ! విను మప్పు డతని భార్య. 835

క. పతిదైవతశీల సమం, చితవేణీభూతచికుర చీరాంబర సు
వ్రతచర్యా క్షామాంగి వి, గతదోష విదర్భరాజ కన్యక యచటన్. 836

తే. కమలలోచన నిఖిలభోగములఁ దొఱఁగి
మలయకేతనుఁ బరమధర్మజ్ఞుఁ జేరి
నిరుపమైక పతివ్రతా నియమ మొప్ప
సాధ్వియై భక్తిఁ బరిచర్య సలుపుచుండె. 837

క. విమలమతి నిజేశు సమీ, పమునన్ సతి ధూమరహిత పవమాన సఖా
గ్రమున వెలుఁగొందు కీల వి, ధమున బ్రకాశింపుచుండెఁ దద్దయు వేడ్కన్. 838

క. పతి దనప్రాణేశ్వరుఁ డుప, రతుఁ డగుట మనంబులో నరయకను బూర్వ
స్థితి నుపచారక్రియ లం, చితమతిఁ గావింపఁ దలఁచి చిరతరభక్తిన్. 839

క. అనుపమ సుస్థిర నియమా, సనుఁ డగు నిజనాథు దాయఁజని పూర్వగతిన్
వినమిత యై సతి త త్పద, వనజము లర్పించునపుడు వరుపాదములన్. 840

క. విను మూష్మత లేకున్నను, గని యూథభ్రష్ట హరిణి కై వడి సతి నె
మ్మనమునఁ బెగడుచు [1]దీనత, ననయంబును బంధురహిత యై శోకించెన్. 841

చ. అనయము నిట్లు శోకవిపు లాశ్రుపయః కణసిక్త మానిత
స్తనయుగ యై వియోగ పరితాపమునన్ హృదయంబు మాఁడ శో
భన లలితాధరోష్ఠ నవపద్మము గందఁగ సుస్వరంబుగా
వనజదళాక్షి యేడ్చె ననివారణఁ ద ద్విపినాంతరంబునన్. 842

ఉ. హా ! నరనాథ ! హా ! సుమహితాత్మక ! హా గుణశాలి ! యింక నం
భోనిధి మేఖలాకలిత [2]భూమి యధార్మిక రాజ చోర పీ
డా నిరతిం గృశింప నకటా ! తగునయ్య యుపేక్ష సేయ ? శో
భానయశాలి ! నీవు పరిపాలన సేయుము లెమ్ము భూవరా ! 843

చ. అని విలపించుచున్ సరసిజాక్షి నిజేశు పదారవిందముల్
దన నిటలంబు సోఁకఁ బరితాపమునం బడి బిట్టు చాల రో
దన మొనరింపుచుం గఠినదారువులన్ జితి పేర్చి యందులోఁ
బెను పగు తత్కళేబరముఁ బెట్టి శిఖిం దరికొల్పి యమ్మెలన్. 844

1. దీనా, ననయగుచు (త) 2. భూతలమెల్ల నుగ్రచోర (క. బ.)

క. తా ననుగమనము సేయం, బూనుటయును నంతలోన బూర్వసఖుఁడు వి
జ్ఞానస్వరూపకుండును, నైన ధరాదివిజుఁ డొక్కఁ డబలం గదియన్. 845

క. చనుదెంచి య త్తలోదరి, సునయో క్తుల ననునయింపుచుం దగ ననియెన్
వనితా! నీ వెవ్వతె? వె, వ్వని[1]దాన? వితం డెవండు? వగచెద వేలా? 846

క. అని యడుగుచు వెండియు ని, ట్లనియెను నే సృష్టిపూర్వమందును నీ వె
వ్వనితోడి సఖ్యసౌఖ్యం, బనవరతం బనుభవించి తట్టి సఖుండన్. 847

క. న న్నెఱుఁగు దేని మనమున, నన్నెఱుఁగక యున్న నైన నళినదళాక్షీ!
"[2]నిన్నుఁ బురాతనసఖునిఁగ, నెన్నంగలదాన"[3] ననియు నెఱుఁగవె? చెపుమా!

వ. కావున నీవు నేనునుం బూర్వంబునందు మానసనివాసుల మై హంసల మై యుండి, గృహంబుఁ బాసి, సహస్రవత్సరంబులు సఖుల మై వర్తించునంత నీవు నన్నుం బాసి భౌమభోగరతుండ వై పదంబు నిచ్చయించుచు మహీమండలంబు గలయం గ్రుమ్మఱునప్పు డొక్క కామినీనిర్మితంబు పంచారామంబు నవద్వార సమేతంబు నేకపాలకంబు త్రికోష్ఠంబు షట్కులంబుఁ బంచవిపణంబుఁ బంచ ప్రకృతియు స్త్రీనాయకంబునైన యొక్క పురంబు వొడగంటివి. అది యెట్టిదనినం, బంచారామంబు లనం బంచేంద్రియార్థంబులు. నవద్వారంబు లన నాసికాది ద్వారంబులు. ఏకపాలకం బనం బ్రాణపాలనంబు, త్రికోష్ఠంబు లనం దేజోభిన్నం బులు. షట్కంబు లన నింద్రియ సంగ్రహంబు. విపణంబు లనం గర్మేంద్రియం బులు. పంచప్రకృతి యన భూతంబులు. ప్రకృతియను కామిని యన బుద్ధి. ఇట్టి పురంబునం బ్రవిష్టుం డైన పురుషుం డంగనాపరతంత్రుండును, నజ్ఞుండును నైన నీవ యప్పురంబునం గామినీసంస్పృష్టుండ వై రమియింపుచుం దత్సంగ మంబున నష్టస్మృతివై *(పురంజన వైదర్భిజన సంభావిత సుఖాభాసంబు లగు దుఃఖంబులచే నిట్టి) పాపిష్ఠం బైన దశం బొందితివి. కావున. 849

సీ. నీవు వైదర్భివి గావు వీఁడితండు వివరింపఁగాఁ గాఁడు విభుఁడు నీకు
వొగి మున్ను పురమున నుపరుద్ధుఁ జేసిన యా పురంజనపతి వరయఁ గావు
[4]అర్థి నీ విపుడు పరాంగన ననియును జర్చింపఁగాఁ బూర్వజన్మమందుఁ
బురుషుండ వనియును బుద్ధిఁ దలంచుట యరయంగ నీ యుభయము నసత్య

1. దానవు యీపడున్నవా దెవ్వడిలన్ (క. చ. ట. జ. ద. బ.) 2. నన్ను (హ. తం. వా.)
3. పైన (హ. తం. వా.)
* తా. ప. ప్రతులలో లేదు.
4. మఱియు నీ వన్య సీమంతిని యనియును (హ. తం. వా.)

తే. మింతయును మామకీన మై యెసఁగు మాయఁ
జేసి కల్పిత మయ్యెఁ జర్చించ మనము
పూర్వమున హంసల మనియుఁ బూని యెఱుఁగఁ
బలికితిఁ దెలియు మనల రూపంబుఁ జూడు. 850

వ. ఏనే నీవు గాని యన్యుండవు గావు. నీవే నేఁ గాని యన్యుండంగాను. ఇట్లెఱుంగుము. విద్వాంసులు మన యిద్దఱియందు నంతరంబు నీక్షింపరు. పురుషుండు దన్నొక్కనినె యాదర్శచక్షువులందు భిన్నరూపులుగా దలంచుచందంబున మన యిద్దఱికిని భేదంబు గలిగినయట్లు దోఁచు. అని యివ్విధంబున నతం డతనిచేత నీవు పూర్వంబున మదీయసఖుండ వైన హంసవని తెలుపంబడి స్వస్థుం డై తద్వియోగనష్టం బైన జ్ఞానంబుఁ గ్రమ్మఱం బొందె. అని చెప్పి నారదుండు ప్రాచీన బర్హిం జూచి, యీ యధ్యాత్మతత్త్వంబు రాజకథా మిషంబున నీ కెఱింగించితి. అనిన. 851

అధ్యాయము — ౨౯

క. విని భూమీశుఁడు నారద, ముని కను భవదీయ వచనములు సూరులు దక్కను గర్మమోహితుల మై, వనరెడు నే మెట్లు దెలియువారము చెపుమా!

వ. అనిన యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. రాజేంద్రా! యేమి కతంబున నాత్మ యేక ద్వి త్రి చతుష్పాదంబు బహుపాదంబు నపాదంబు నగుచుఁ బురంజను దేహంబు ప్రకటం బొనర్చె నా కతంబునం బురంజనుండు పురుషుండయ్యె, అట్టి పురుషునకు నామ క్రియా గుణంబులచేత విజ్ఞాయమానుండు గాకుండుటం జేసి యవిజ్ఞాతశబ్దంబునం జెప్పంబడు సఖుం డీశ్వరుండు. పురుషుండు సాకల్యంబు నంజేసి దేహపరిగ్రహంబు సేయ నిచ్ఛయించు నప్పుడు నవద్వారకలితంబును, ద్విహస్తచరణయుక్తంబును నైన పురం బేది గల దది లెస్స యని తలంచి, య ప్పురం బను దేహంబు నొందు. పురుషుం డింద్రియంబులం జేసి యే బుద్ధి నధిష్ఠించి విషయంబుల ననుభవించు, నహంకార మమకారంబులకు నే బుద్ధి తత్త్వంబు గారణం బగు, నట్టి బుద్ధి ప్రమదోత్తమ యనంబడు. దానికి సఖులు జ్ఞానకర్మ కారణంబులైన యింద్రియగుణంబులు. సఖీజనంబులు దదీయవృత్తులు. పంచముఖోరగం బనం బంచవృత్తియైన ప్రాణంబు, †ఏకాదశ మహాభటు లన బృహద్బలుండును, నుభయేంద్రియ నాయకుండును నైన మనంబు. నవద్వార సమేతంబైన యప్పురంబు చుట్టివచ్చిన పాంచాలదేశంబులనం బంచవిషయంబులు.

† ''ఏకాదశ భట ఇత్యనేన ఏకాదశో మహాభటో నాయకః'' (29-7) (వ్యాఖ్య)

నవద్వారంబు లన నక్షి నాసికా కర్ణ ముఖ గుద శిశ్నంబులు. అందు నక్షినాసాస్యంబు లైదునుం బ్రాగ్ద్వార పురస్కృతంబులు. దక్షిణోత్తర కర్ణంబులు దక్షిణోత్తర ద్వారంబులు. గుద శిశ్నంబులు పశ్చిమద్వారంబులు. అందు నేకస్థల నిర్మితంబు లైన ఖద్యోతావిర్ముఖులు నేత్రంబులు. విభ్రాజితం బన రూపంబు. ద్యుమంతుం డనం జక్షురింద్రియంబు. నళినీనాళిను లన నాసికా ద్వారంబులు. సౌరభం బనం గంధంబు. అవధూత యన ఘ్రాణేంద్రియంబు. ముఖ్య యన నాస్యంబు. విపణం బన వాక్కు. రసజ్ఞుం డన రసంబు. ఆపణంబన వ్యవహారంబు. బహూదనం బన వివిధాన్నంబు. [1]పితృహూ వన దక్షిణకర్ణంబు. [2]దేవహూ వన నుత్తరకర్ణంబు. చండవేగుం డనం గాలోపలక్షకం బైన సంవత్సరంబు. గంధర్వు లన దివంబులు. గంధర్వీజనంబు లన రాత్రులు. పరీవర్తనంబన నాయుర్హరణంబు. కాలకన్యక యన జర. యవనేశ్వరుం డన మృత్యువు. అతని సైనికు లాధి వ్యాధులు. ప్రజ్వారుం డనం బ్రాణిహింసయందు శీఘ్రవేగంబు గలిగి, శీతోష్ణ భేదంబుల ద్వివిధం బైన జ్వరంబు. దక్షిణపాంచాలం బనం బితృలోక ప్రాపకంబును, ప్రవృత్తిరూపకంబును నైన శాస్త్రంబు. ఉత్తరపాంచాలం బన దేవలోక ప్రాపకంబును, నివృత్తిసంజ్ఞికంబును నైన శాస్త్రంబు. శ్రుతధరుం డన శ్రోత్రంబు. ఆసురీనామం బన బశ్చాద్ద్వారం బైన మేఢ్రంబు. గ్రామకం బన సురతసుఖంబు. దుర్మదుం డన గుహ్యేంద్రియంబు. నిర్‌ఋతి నామకం బైన పశ్చిమద్వారం బన గుదంబు. వైశసం బన నరకంబు. లుబ్ధకుం డనం బాయువు. అంధు లన హస్తపాదంబులు. అంతఃపురం బన హృదయంబు. విషూచి యన మనంబు. అని వెండియు. 853

సీ. అనఘాత్మ! వినుము జాయాత్మజులను గుణార్తం బగు మఱి బుద్ధితత్త్వమర్థి
వెలయ నే యే గతి [3]వికృతిఁ జేయంబడు నే యే తెఱంగుల నింద్రియములు
వికృతిని బొందు నా విధమునఁ దద్గుణాన్వితుఁడును వరుసఁ దద్వృత్తులకును
ఘనుఁడు నుపద్రష్టయును దగు నాత్మయుఁ దద్వృత్తులను బలాత్కారమునను

తే. ననుకరింపంగ నర్థిఁ జేయంగఁ బడుట
ననవరత మాత్మమహిషిని ననుచరించు
టయు నెఱుంగఁగఁ జెప్పి యి ట్లనియె మఱియు
జనవరేణ్యునితో యోగిసత్తముండు. 854

1. పితృహూయన (హ) 2. దేవహూయన (హ) 3. వివరింపగాబడు (క. త. ద. బ.); వికలింపగాబడు (చ. డ.) వికసింపగాబడు (ట. జ.)

వ. మఱియు నరదం బన దేహంబు. తురంగంబు లన నింద్రియంబులు. ఈషాద్వయం బన సంవత్సరంబును, దత్కృత వయస్సును. చక్రద్వయం బనం బుణ్యపాపకర్మ ద్వయంబు. వేణుత్రయం బన గుణత్రయంబు. పంచబంధురం బనం బంచప్రాణం బులు. రశ్మి యన మనంబు. సారథి యన బుద్ధి. రథికోపవేశ స్థానం బన హృద యంబు. కూబరంబు లన శోకమోహంబులు. పంచప్రహరణంబు లనం బంచేంద్రి యార్థ ప్రక్షేపంబు. పంచవిక్రమం బనం గర్మేంద్రియంబులు. *(సప్తవరూథంబు లన ధాతువులు.) హైమోపస్కరం బన రజోగుణంబు. అక్షయతూణీరం బన ననంత వాసనాహంకారోపాధి. ఏకాదశచమూపతి యన నేకాదశేంద్రియం బైన మనంబు. (ఆసురీవృత్తి యనం బాహ్యవిక్రమంబు.) పంచేంద్రియంబుల చేత మృగయావినోదంబు చందంబున హింసాదులం జేసి విషయంబు లనుభ వించుటయ మృగయాచరణంబు. ఈ విధంబున నుండ జీవుండు దేహంబున స్వప్న సుషుప్తి జాగ్ర దవస్థలయందు నాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబు లైన బహువిధ దుఃఖంబులం జేసి క్లేశంబుల ననుభవించుచు నజ్ఞానావృతుం డై వర్ష శతంబు నిర్గుణుం డయ్యును బ్రాణేంద్రియ మనోధర్మంబులఁ దనయందు నధ్య వసించి, కామలవంబుల ధ్యానంబు సేయుచు, నహంకార మమకారసహితంబుగాఁ గర్మాచరణంబు సేయుచుండు. 855

క. పురుషుఁడు నిజప్రకాశతఁ, బరఁగియు నలఘుఁడు పరుండు భగవంతుండున్ గురుఁడును నగు న య్యాత్మను, బరువడి నెఱుఁగంగలేక ప్రకృతిగుణములన్.

క. విను మెపుడు దగులు నప్పుడ, యొనరంగ గుణాభిమానియును గర్మవశుం డనఁ దగు నా పురుషుఁడు దా, ఘన మగు త్రైగుణ్య కర్మకలితుం డగుచున్.

సీ. ధృతి నొప్పుచున్న సాత్త్వికకర్మమునను బ్రకాశ భూయిష్ఠ లోకముల భూరి
రాజస ప్రకటకర్మమున దుఃఖోదర్క లోలక్రియాయాస లోకములను
గైకొని తామసకర్మంబునను దమ శ్శోక మోహోత్కట లోకములను
బొందుచుఁ బుం స్త్రీ నపుంసకమూర్తుల దేవ తిర్య ఙ్మర్త్యభావములను

తే. గలుగుఁ గర్మానుగుణములుగాఁగ జగతిఁ
బుట్టి చచ్చుచుఁ గ్రమ్మఱఁ బుట్టునట్లు
దివిరి కామాశయుం డైన దేహి యెప్డు
నున్నతోన్నత పదవుల నొందుచుండు. 858

వ. అని మఱియు ని ట్లనియె. 859

* తా. ప. ప్రతులలో లేదు.

మ. ఎనయన్ శీతపరిపీడఁ గుంది శునకం బింటింటికిం బోవఁ బూ
నినఁ దద్దైవికమైన దండహతి గానీ, కాక చౌర్యాన్నమై
నను గానీ తగఁ బొందుచందమున నెన్నన్ దైవయోగంబు పెం
పున నీ జీవుఁడు దాఁ బ్రియాప్రియములం బొందుం ద్రిలోకంబులన్. 860

చ. గొనకొని యెట్టి దుఃఖములకుం బ్రతికారము మానవేంద్ర! క
ల్గిన విను తత్ప్రతిక్రియ నకించనవృత్తి జనుండు మస్తకం
బున నిడు మోపు మూఁపునను బూనినఁ దద్భరదుఃఖ మాత్మఁ బా
యనిగతి జీవుఁడుం ద్రివిధమై తగు దుఃఖముఁ బాయఁ డెన్నఁడున్. 861

క. ఘన దుఃఖహేతు కర్మం, బును దత్ప్రతికార కర్మమును నన మాయా
జననము లగుటను బురుషుఁడు, గనుఁ గలలోఁ దోఁచినట్టి కలచందమునన్. 862

వ. సవాసనోచ్ఛేదకంబు గాదని వెండియు నిట్లనియె. 863

సీ. నరనాథ! వినుము స్వప్నంబు చందంబున నజ్ఞానవిలసితం బగుటఁ జేసి
తివిరి మిథ్యాభూత దేహాదికమునకు నరయ నివర్తనాయాస మేటి
కని యంటివేనియు నర్థంబు లేకున్న నర్థి సోపాధికం బైన మనము
వాంఛతో స్వప్నము వర్తింపఁ బురుషునిఁ బూవి జాగ్రద్బోధచే నుపాధి

తే. చెడక స్వాప్నికసంసృతి విడువనట్లు
తత్త్వవిజ్ఞానమున నవిద్యానివృత్తి
దార దేహాదిక నివృత్తి దగులకున్నఁ
దివుట సంసృతిఁ దా నివర్తింపకుండు. 864

చ. ఘన పురుషార్థభూత మనఁగాఁ దగు నాత్మకు నే నిమిత్తమై
యొనర ననర్థహేతు వన నూల్కొను సంసృతి సంభవించిన
ట్లనయముఁ దన్నిమిత్త పరిహారక మర్థి జగద్గురుండు నాఁ
దనరిన వాసుదేవ పదతామరస స్ఫుటభక్తి యారయన్. 865

క. పూనిన తద్భక్తి సమీ, చీనగతిం దెలియ ననఘ! చిర వైరాగ్య
జ్ఞాన జనక మగు భక్తి ని, ధానము గోవిందవర కథాశ్రయమ యగున్. 866

వ. కావున నది తత్కథాకర్ణన గాన నిరతుండు, విశ్వాసయుక్తుండు నైన వానికి
సంభవించు. మఱియును. 867

క. ధర సాధులు విమలాంతః, కరణులు భగవ ద్గుణానుకథన శ్రవణ
స్ఫురితస్వాంతులు నసఘులు, [1]వరమతులు న్నైన భాగవత నిలయములన్. 868

క. సరసోదార మహాత్మ్య ము, ఖరితము లగు మధువిరోధి కమనీయ గుణో
త్కర సురుచిర చరితామృత, పరిపూరిత వాహినులను బరమప్రీతిన్. 869

క. మన మలరఁగ శ్రోత్రాంజలు, లను బానము సేయు పుణ్యులకు క్షుత్తృష్ణా
ఘనభయ శోక విమోహము, లనయంబును సోఁకుండు నవనీనాథా! 870

వ. కావున నిట్టి భాగవతసహవాసంబు లేక *(తనంతన భగవ ద్భాగవత గుణాభి
వర్ణన కథానుచింతనాదులయందుం బ్రవర్తించిన) నాలస్యాది దోషంబు లొంది,
యీ జీవలోకంబు సహజ క్షుధాదికంబున నుపద్రుతం బై సర్వేశ్వర కథామృత
వాహినియందు రతిం జేయదు. ఇది నిశ్చయంబు. అని మఱియు ని ట్లనియె.

సీ. పద్మసంభవుఁడును భవుఁడును మనుకులసమితి దక్షాది ప్రజాపతులును
నైష్ఠికు లైన సనకముఖ్యమునులుఁ బులస్త్యుండు భృగువు పులహుఁడుఁ గ్రతువు
నత్రి మరీచియు నంగిరసుండు నరుంధతీవిభుఁడును రూఢిమెఱయ
బహుపుణ్యులేఁ గడపలఁ గాఁగఁ గల బ్రహ్మవాదులు నందఱు వాక్సమితికి

తే. నెనయ నీశ్వరు లై యుండియును సమగ్ర
మతిఁ దపో యోగవిద్యా సమాధి వరవి
చారు లై యుండియును సర్వసాక్షి యైన
యీశ్వరుని వెదకియుఁ గాన రిద్ధచరిత! 872

వ. అది యెట్లంటేని. 873

మ. ఘనవిస్తార మపార మద్వయ మనంగా నొప్పు [2]వేదంబు దా
మనువర్తింపుచు మంత్రయుక్తి వివిధం బై నట్టి దేవాఖ్య శో
భన సామర్థ్యముచేత నింద్రముఖరూపం బిష్టదైవంబుగాఁ
గని వేడ్కన్ భజియించువారలు గనంగా నేర్తురే! యీశ్వరున్. 874

క. విను మాత్మభావితుం డన, నెనసిన భగవంతుఁ డెప్పు డెవ్వనిఁ గరుణన్
[3]దనరుచు ననుగ్రహించును, మనుజేశ్వర! యపుడ వాఁడు మహితాత్మకుఁ డై.

క. ధీరత నీ లోకవ్యవ, హారంబును వైదికంబు ననఁదగు కర్మా
చారములందు వినిష్ఠత, మై రూఢిఁ దనర్చు బుద్ధి నర్థిన్ విడుచున్. 876

1. వరధిషణులు నైన భాగవత జనులు సభన్ (తం. వా.)
* శా. ప. ప్రతులలో లేదు.
2. వేదము న్ననుం, వర్తించు (క. తం.) 3. ననయము (క. చ. ట. తం.)

సీ. కావున రాజేంద్ర! నీవును బరమార్థ [1]రూపంబు లగుచుఁ బ్రరోచమాన
ములును గర్ణప్రియంబులును నస్పృష్ట వస్తువులును నైన యీ వివిధకర్మ
ములయందుఁ బుష్పార్థబుద్ధి గావింపకు మఱిఘనస్వాంతు లైనట్టివారు
పరఁగు జనార్దనప్రతిపాదకం బైన శ్రుతిఁ గర్మపర మని చూపుచుండు

తే. వారు వేదజ్ఞు లనఁదగు వారు గారు
రూఢి మఱి వారు నిత్యస్వరూపభూత
మైన యీ యాత్మతత్త్వంబు నలరు వేద
కలిత తాత్పర్య మని యాత్మఁ దెలియ లేరు. 877

వ. కావునం బ్రాగగ్రంబు లైన దర్భలచేత సకలక్షితి మండలాస్తరంబు గావించి,
యహంకారయుక్తుండవు, నవినీతుండవు నై పెక్కుపశువులఁ జంపనే కాని
కర్మస్వరూపంబును, విద్యాస్వరూపంబును నెఱుంగవు. ఆ కర్మవిద్యాస్వరూపంబు
లెట్టి వనిన, సర్వేశ్వరపరితోషకం బేది యది కర్మంబు. ఆ సర్వేశ్వరునియందు
నేమిట మతి సంభవించు నదియ విద్య. అతండె దేహాలకు నాత్మయు,నీశ్వరుండు
నగుచుండుం గావునం బురుషులకు క్షేమకరం బైన యాశ్రయంబు తత్పాద
మూలంబ. అతండు ప్రియతముండును, సేవ్యమానుండును, నగుచుండ నణు
మాత్రం బైన దుఃఖంబు లేదు. అట్టి యీ భగవత్స్వరూపం బెవ్వం డెఱుంగు
వాఁడు విద్వాంసుండు, గురుండు, హరియు నని చెప్పి వెండియు ని ట్లనియె.

క. అవనీశ! యీవిధంబున భవదీయ ప్రశ్న మిట్లు పరిహృత మయ్యెఁ
దవిలి యింక నొక్కగోప్యము, వివరించెదఁ జిత్తగింపు విమలచరిత్రా! 879

సీ. లలి సుమనోవాటికలయందు నల్పప్రసూన మరంద గంధానుమోద
సంచారియును మృగీసహితముఁ ద న్నివేశితచిత్తమున మధువ్రతనినాద
మేదుర శ్రవణానుమోదితమును బురోభాగచర న్నిజ ప్రాణహారి
దీపిత వృకగణాధిష్ఠితమును లుబ్ధక క్రూర ఘనసాయక ప్రభిన్న

తే. పృష్ఠభాగంబునై తగ నెదను మృత్యు
భీతి వాటిల్లు నొందు దప్పింప వెరవు
గాన కడవిఁ జరించు మృగంబుపగిది
భూవరోత్తమ! వినవయ్య! పురుషుఁ డెపుడు. 880

వ. అంగనానివాసంబులయందు క్షుద్రతమం బగు కామ్యకర్మ పరిపాకజనితం బైన
జిహ్వోపస్థాది కామజనిత సుఖలేశంబుల నన్వేషింపుచుఁ గామినీయుక్తుండును,
దన్నివేశిత మానసుండును. నతిమనోహర వనితాజనాలాపశ్రవణ తత్పర చిత్తుం,

1. కలితంబు లగుచు బ్రకాశమాన (క. చ.)

డును, ప్రత్యక్షంబున నాయుర్హరణకారణాహోరాత్రాది కాలవిశేష గణనాపరుండు గాక పరోక్షంబునం గృతాంత శరనిర్భిన్న గాత్రుండు నగుచు నీ జీవుండు విహ రింపుచుండుం గావున నీవు నీ జీవుని మృగచేష్టితునిఁగ విచారించి, శ్రోత్రాదు లందున్న శబ్దాదులంబలె బాహ్యవృత్తులగు *(శ్రౌత స్మార్తాది రూపంబగు కర్మం బును హృదయంబునందు నియమింపుచు) నసజ్జనయూథ వార్తాసహితం బైన గృహాశ్రమంబు విడువుము. సకలజీవాశ్రయుం డైన యీశ్వరుని భజియింపుము. ఇట్లు సర్వతోవిరక్తుండవు గమ్ము.అని నారదుండు పలికినం బ్రాచీనబర్హి యిట్లనియె.

క. మునివర! భగవంతుండవు, ననుపమ విజ్ఞాననిధివి ననఁదగు నీచే
తను వివరింపంగాఁ దగి, యెనసిన యీ యాత్మతత్త్వ మిటు నాచేతన్. 882

వ. శ్రుతంబు విచారితంబు నయ్యె. కర్మనిష్ఠ లగు నుపాధ్యాయు లయిన వార లీ యాత్మతత్త్వంబు నెఱుంగరు. ఎఱింగిరేని యుపదేశింపరు. కావునఁ దత్కృతం బయిన మహాసంశయంబు నీచేత నివృత్తం బయ్యె. అని వెండియు నిట్లనియె.

సీ. అనఘాత్మ! యేమిటియందు నీ యింద్రియ వృత్తులు దగఁ బ్రవర్తింపకుండు
టను జేసి బుషు లైన ఘనముగ మోహింతు రట్టియర్థమునందు నాత్మసంశ
యము గల్గుచున్నది యది యెట్టి దనినను బురుషుఁ డే యే దేహమునను జేసి
కర్మముల్ సేసి తత్కాయంబు నీ లోకమందునే విడిచి తా నన్యదేహ

తే. మర్థితో ఘటియించి లోకాంతరమును
బొంది తత్కర్మఫలము బొందు ననుచుఁ
బ్రకటముగ వేదవేత్తలు పలుకుచుందు
రన్న నదియెట్లు విన నుపపన్న మగును? 884

వ. అదియునుం గాక యాచరితం బైన కర్మంబు దత్క్షణంబున వినష్టం బగుటంజేసి (జీవుండు) దేహాంతర లోకాంతర [1]భావి యైన ఫలం బెట్లనుభవించు? అనిన బర్హిష్మంతునకు నారదుం డిట్లనియె. నరేంద్రా! స్వప్నావస్థయందు లింగశరీరాధి ష్ఠాత యైన జీవుండు జాగ్రద్దేహాభిమానంబు విడిచి, తాదృశంబ కాని యతా దృశంబ కాని యైన శరీరాంతరంబు నొంది, మనంబునందు సంస్కారరూపంబున నాహితంబైన కర్మంబు ననుభవించు చందంబునం బురుషుం డే లింగశరీరంబునం జేసి కర్మంబు నాచరించు నా లింగశరీరంబుననే లోకాంతరంబున దేహవిభేదంబు నొందక తత్ఫలం బనుభవించు. అదియునుం గాక దాన ప్రతిగ్రహాదు లయందు స్థూలదేహంబునకుం గర్తృత్వంబు గల దంటివేని, నహంకార మమకారయుక్తుం

* తా. ప. ప్రతులలో లేదు. 1. గామియై (హ)

డైన పురుషుండు మనంబునంజేసి యే యే దేహంబు పరిగ్రహించు నా యా దేహంబున సిద్ధం బైన కర్మం బా జీవుం డనుభవించు. అట్లు గాకున్నఁ గర్మంబు పునర్భవకారణం బగుట యుపపన్నంబు గాకయుండు. కావున మనఃప్రధానం బైన లింగశరీరంబునకె కర్తృత్వం బుపపన్నం బగు. అని వెండియు నిట్లనియె.

క. క్షితి నుభయేంద్రియ కర్మ, స్థితు లనుభవ మందఁబడిన చిత్తము పగిదిన్
ధృతిఁ జిత్తవృత్తులను లం, క్షిత మగుఁ ద త్పూర్వ[1]దేహ కృతకర్మంబుల్. 886

వ. అది యెట్లనిన నీ దేహంబునం జేసి యే రూపంబున నే ప్రకారంబున *(నెప్పు డెచ్చట) నగు నది యననుభూతంబు, నదృష్టంబు, నశ్రుతంబు నై యుండును. అట్టిది యొకానొకకాలంబున వాసనాశ్రయుం డైన పురుషునకుఁ (ద దనుభవాదియుక్తం బగు) పూర్వదేహంబున ననుభూతంబును, దృష్టంబును, శ్రుతంబు నని విశ్వసింపుము. ఈ మనంబున ననుభూతార్థంబు గోచరింపఁజాలదు. ఈ మనంబె పురుషులకు శుభాశుభనిమిత్తంబు లైన పూర్వాపరదేహంబులఁ బ్రకాశింపజేయుచుండు. ఈ మనంబునందు నదృష్టంబు, నశ్రుతంబు నైన యర్థంబు స్వప్నాదికమందు దోఁచు నంటివేని, నది దేశ కాలక్రియాశ్రయం బని తలంపం దగు. సమస్త విషయంబులు గ్రమానురోధంబున మనంబునంజేసి భోగ్యంబు లగు. అని మఱియు. 887

చ. సుమహిత శుద్ధ సత్వగుణ శోభితముం సరసీరుహోదరో
త్తమగుణ చింతనాపరము ధన్యము నైన మనంబునందు భూ
రమణ ! సుధాంశునందు నుపరాగమునన్ దివిఁ దోఁచు రాహువం
దమునను గోచరం బగు నుదారత నీ యఖిలప్రపంచమున్. 888

వ. అని వెండియు నిట్లనియె. (లింగదేహమునకుఁ) గర్తృత్వ భోక్తృత్వంబులు స్థూలదేహద్వారకంబు లగుటంజేసి స్థూలదేహవినాశనంబు గలుగం జీవునకుఁ గర్తృత్వ భోక్తృత్వంబులు లేకుండుటంజేసి ముక్తి గలుగునంటివేని, నీ స్థూల దేహ సంబంధంబు జీవునియందు బుద్ధి మనో మోక్షార్థ గుణవ్యూహ రూపాది లింగశరీర భంగపర్యంతంబును గలుగుచుండును. సుషుప్తిమూర్ఛాదులయందు *(నిష్టవియోగాది దుఃఖమందు) నహంకారంబు గలిగియుండు. అది యింద్రియోపహతింజేసి యమావాస్య యందులఁ జంద్రునిబోలి తరుణపురుషునకు (గర్భ) బాల్యావస్థలయందు నింద్రియపౌష్కల్యంబు లేకుండుటంజేసి యేకాదశేంద్రియస్ఫురణ సమర్థం బైన యహంకారంబు (గర్భాదులకుఁ)బ్రకాశింపని

1. కాలకృత (క. చ. ట. త.) * తా. ప. ప్రతులలో లేదు.

చందంబునం దోఁపకుండుం గావున స్థూలదేహ విచ్ఛేదంబు లేకుండుటంజేసి వస్తు భూతార్థంబు లేకున్న నీ సంసారంబు(విషయంబులయం దాసక్తుం డగు జీవునకు) స్వాప్నికానర్థాగమనంబు (చందంబున) నివర్తింపదు. ఈ తీరునఁ బంచతన్మాత్రాత్మకంబును (త్రిగుణాత్మకంబును) షోడశవికారాత్మకంబును నై (విస్తృతంబైన) లింగశరీరంబు నధిష్ఠించి, చేతనాయుక్తుం డైన జీవుం డని చెప్పంబడు. మఱియు. 889

సీ. తివిరి య ప్పురుషుండు దేహంబుననుజేసి యనయంబుఁ బెక్కు దేహాంతరముల
నంగీకరింపుచు నది విసర్జింపుచు సుఖ దుఃఖ భయ మోహ శోకములను
బొలుపొందు తద్దేహములనె పొందుచుండను నది యెట్టు లన్నను నగ్రభాగ
తృణ మూఁది మఱి పూర్వతృణపరిత్యాగంబు గావించు తృణజలూకయును బోలి

ఆ. జీవుఁ డవనిఁ గొంత జీవించి మ్రియమాణుఁ
డగుచు నొండుదేహ మర్థిఁ జెంది
కాని పూర్వ మైన కాయంబు విడువఁడు
గాన మనమె జన్మకారణంబు. 890

తరల. నరవరోత్తమ! యిట్లు గాన మనంబె జీవులకెల్ల సం
సరణకారణ మట్టి కర్మవశంబునన్ సకలేంద్రియా
చరణుఁ డౌట నవిద్య గల్గును సంతతంబు నవిద్యచేఁ
బరఁగుటన్ బహు దేహకర్మ నిబంధముల్ గలుగుం జుమీ! 891

చ. విను మది గాన భూవర! యవిద్య లయించుటకై రమాపతిన్
ఘన జనన స్థితి ప్రళయ కారణభూతునిఁ బద్మపత్రలో
చనుఁ బరమేశు నీశ్వరుని సర్వజగంబుఁ దదాత్మకంబుగా
గనుఁగొనుచుం దదీయ పదకంజము లర్థి భజింపు మెప్పుడున్. 892

క. అని యీగతి భగవంతుం, డనఘుఁడు భాగవతముఖ్యుఁ డగు నారదుఁ డా
ఘనునకు జీవేశ్వరగతి, ఘనకృప నెఱిఁగించి సిద్ధగతిఁ జనిన యెడన్. 893

సీ. రాజర్షి యైనట్టి ప్రాచీనబర్హి తాఁ దగఁ బ్రజాపాలనార్థంబు సుతుల
ధరకు నియోగించి తపము సేయుటకు నై కపిలాశ్రమంబున [1]కరిగి వేగ
నచ్చట నియతి నేకాగ్రచిత్తుండును ముక్తసంగుండును భూరి ధైర్య
యుక్తుండు నగుచును భక్తియోగంబున ననఘ! గోవింద పదారవింద

1. అపుడు వేగ (లం. వా.)

తే. చింతనామృత పానవిశేష చిత్తుఁ
డగుచు విధి రుద్రముఖ్యుల కందరాని
యవ్యయానందమగు పద మందె నప్పు
డనుచు మైత్రేయముని విదురునకుఁ జెప్పె. 894

వ. వెండియు నిట్లనియె. ఇట్లు ముకుందయశంబునం జేసి భువనపావనంబు, మనశ్శుద్ధికరంబు, సర్వోత్కృష్ట ఫలప్రదాయకంబు, దేవర్షివర్య ముఖ వినిస్సృతంబు నైన యీ యధ్యాత్మ పారోక్ష్యంబు నెవ్వండు పఠియించు, నెవ్వండు విను, నట్టివాఁడు లింగశరీర విధూననంబు గావించి విముక్త సమస్త బంధుండై *(విదేహ కైవల్యంబు నొందు) సంసారంబు నందుఁ బరిభ్రమింపండు. అనిన మైత్రేయునకు విదురుం డిట్లనియె. 895

అధ్యాయము - ౩౦

క. మునినాథ! [1]ప్రచేతసు లా, [2]ఘనముగ రుద్రోపదిష్ట కమలోదర కీ
ర్తనమున నేగతిఁ బొందిరి, వనజాక్షుఁడు సంతసింప వా రనఘాత్మా! 896

తే. కడఁగి మఱి వారు యాదృచ్ఛికమునఁ జేసి
హరికి నిత్యప్రియుం డగు హరునిఁ గాంచి
యతనివలన ననుగ్రహ మంది మోక్ష
మంది రని చెప్పె తది నిశ్చయంబు మఱియు. 897

క. హరిదర్శన పూర్వం బిహ, పరలోకములందు నా నృపాలతనయు లం
దిరి యేఫలముల నందఱు?, నిరతి నెఱింగింపు మన మునీంద్రుఁడు వలికెన్.

క. విను జనకాదేశము మద, మునఁ దాల్చి నృపాత్మజులు సముద్రోదరమం
దనుపమ జపయజ్ఞంబున, [3]నొనరఁ దపం బూని ముదము నొందుచు నుండన్.

క. పదివే లేడులు నిష్ఠను, వదలక తప మాచరింప వారల కర్థిన్
సదయాంతరంగుఁ డభయ, ప్రదుఁడు సనాతనుఁడు నైన పద్మోదరుఁడున్. 900

క. అనుపమ శాంతము లగు నిజ, తనురశ్ములచే నృపాలతనయ తపోవే
దనలు శమింపఁగఁ జేయుచు, ననయముఁ బ్రత్యక్ష మయ్యె నచ్యుతుఁ డంతన్.

సీ. ఘన మేరుశృంగ సంగత[4] మైన మేఘంబు నెఱి గరుడస్కంధ నివసితుండుఁ
గమనీయ నిజదేహకాంతి విపాటి తాఖీ లాఖి లాశాంతరాళ తముఁడు
సుమహి తాష్టాయుధ సుమనో మునీశ్వర సేవక పరిజన సేవితుండు
మండిత కాంచనకుండల రుచిరోప లాలిత వదన కపోలతలుఁడుఁ

1. ప్రచేతస్కులు (వా) * తా. ప. ప్రతులలో లేదు. 2. ఘనమగు (క)
3. నొనరింపం జనుఁడు ముదము నొందుచు నుండున్ (క) 4. నీలమేఘంబు (తం. వా.)

తే. జారు నవరత్న దివ్యకోటీర ధరుఁడుఁ
గౌస్తుభ ప్రవిలంబ మంగళ గళుండు
లలిత పీతాంబర ప్రభాలంకృతుండు
హార కేయూర వలయ మంజీర యుతుఁడు. 902

క. లలితాయ తాష్టభుజమం,డల మధ్య స్ఫురిత రుచివిడంబిత లక్ష్మీ
లలనా కాంతిస్పర్ధా, కలిత లస ద్వైజయంతికా శోభితుఁడున్. 903

క. సుర గరుడ యక్ష కిన్నర, నిరుపమ జేగీయమాన నిఖిల దిశా సం
భరిత యశో మహనీయ, స్ఫురణుఁడు నగు నప్పురాణపురుషుం డెలమిన్. 904

క. కరుణావలోకనంబుల, నిరవొంద నృపాలసుతుల నీక్షించి రమా
వరుఁ డంబుదగంభీర మ,ధుర భాషలఁ బలికెఁ బ్రియము దూఁకొనుచుండన్. 905

తే. తాపసోత్తము లగు ప్రచేతస్కులార!
వినుఁడు మీరలు సౌహార్దమున నభిన్న
ధర్మ లగుట భవ త్సౌహృదమున నేను
జాలఁ బరితోష మందితి సమత నేఁడు. 906

క. అనయమును మీ మనోరథ, మొనరింతు నెఱుంగఁ బలుకుఁ డుత్తము లగు మి
మ్మనుదిన మే నరుఁడు సుఖశ, యనుఁడై మదిలోనఁ దలఁచు నా నరుఁ డెపుడున్.

క. భ్రాతృజన సౌహృదంబును, భూతదయాగుణము విమలబుద్ధియు సుజన
ప్రీతియుఁ గల్గి సుఖించును, వీత సమస్తాఘుఁ డగుచు విశ్వములోనన్. 908

వ. మఱియు రుద్రగీతం బైన మదీయ స్తవం బెవ్వ రనుదినంబును స్తోత్రంబు సేయుదురు, వారల కభిమత వరంబులు శోభనకరం బగు ప్రజ్ఞయు నిత్తు. మీరలు ముదన్వితు లై జనకాదేశం బంగీకరించుటం జేసి మీకీర్తి లోకంబుల విస్తరించు. మీకు ననూన బ్రహ్మగుణుండు, నాత్మ సంతతిం జేసి లోకత్రయ పరిపూర్ణ గుణాకరుండు నైన పుత్రుండు సంభవింపఁ గలండు. కండుమహాముని తపోవినాశార్థంబుగా నింద్రునిచేతఁ బ్రేరిత యగు ప్రమ్లోచ యను నప్సరస గర్భంబు దాల్చి య మ్మునీంద్రుని వీడ్కొని *(దివంబునకుఁ) జను సమయంబునం బ్రసూత యై త త్పుత్రిని వృక్షంబులందుఁ బెట్టి చనిన. 909

సీ. ఆ శిశు వపుడు పేరాఁకలిచేఁ గుంది [1]వావిచ్చి బిట్టు వాపోవుచుండ
నాలించి [2]యడుకు రాజైన సోముఁడు వచ్చి వలనొప్ప నవసుధావర్షి యైన
యాత్మీయ తర్జని నర్థిఁ బానమ్ము సేయింపఁగఁ బెరిఁగిన యిందువదనఁ
గన్య వరారోహఁ గడఁక [3]మదనువర్తి యైన పుణ్యుండు ప్రాచీనబర్హి

* తా. ప. ప్రతులలో లేదు. 1. వాక్రుచ్చి బిట్టుగవగచుచుంచ (హ) 2. యగమ (హ)
3. మారిషయను చెలువఁ బుణ్యుండు (హ. ఎం. వా)

తే. య న్నృపునిచేఁ బ్రజావిసర్గంబునందుఁ
బూని వేడ్కఁ ద దాదిష్టులైన మీర
లందఱును నెయ్యమున వివాహంబు గండ
యని సరోరుహ నయనుఁ డి ట్లనియె మఱియు. 910

వ. అనఘాత్ములారా! యభిన్న *ధర్మశీలు రైన మీ కందఱకు మీ సుమధ్యమయైన కన్య యభిన్న ధర్మశీలయు, భవదర్పితాశయయు నైన భార్య యగు. మీర లప్రతిహత తేజస్కులరై దివ్యవర్ష సహస్రంబులు భౌమదివ్యభోగంబులు మదనుగ్రహులై యనుభవించెదరు. అంత నాయందుల భక్తిం జేసి నిర్మలాంతః కరణులై యీ భోగంబులు నిరయప్రాయంబులుగాఁ దలంచి మదీయస్థానంబు బొందెదరు. అని వెండియు ని ట్లనియె. 911

చ. అరయ గృహస్థు లయ్యును మ దర్పిత కర్ములు నస్మదీయ సుం
దర చరితామృత శ్రవణ తత్పర మానస యాతయాములై
సరసగుణాఢ్యు[1]లై తసరు సాధుల కే గృహముల్ దలంప దు
ష్కర భవబంధహేతువులు గావు నృపాత్మజులార! యెన్నఁడున్. 912

క. †నరసుఁడ నగు నను బొందిన,పురుషులు ఘన శోక మోహ మోదంబులఁ బొం
దరు గావున నెనయఁగను ద్రి, పురుషాధీశ్వరుఁడ బ్రహ్మభూతుఁడ నగుదుర్.

వ. అని యిట్లు పలుకుచున్న పురుషార్థభాజనుం డగు జనార్దనుని దర్శించి త ద్దర్శన విధ్వస్త రజ స్తమోగుణు లైన ప్రచేతస్కులు, 914

చ. కరసరసీరుహంబు [2]లెనకంబెనఁగన్ ముకుళించి గద్గద
స్వరములఁజేసి యి ట్లనిరి [3]సర్వశరణ్యు నగణ్యు నిందిరా
వరు నజితు న్ననంతు ననవద్యచరిత్రుఁ బవిత్రు నచ్యుతుం
బరుఁ బరమేశు నీశు భవబంధవిమోచనుఁ బద్మలోచనున్. 915

* శీలనాములైన (క. ఐ. తం.) 1. లున్నయిన (క. ఐ.)

† వ. అది యెట్టిది రేని.

చ. అనుపమ బ్రహ్మవాదు లగు నంచిత యోగిజనానుగీయమా
న నిజకథా సముత్సుకుఁ దనందగు నేను మదీయులంద నూ
తనముగ నుందుఁ గావున నుదారత వారికి నీ గృహావళుల్
ఘన భవబంధహేతువులు గా విధి యంతయు నిక్క మారయన్.

పై వచనము పద్యము కొన్ని ప్రతులలో లేవు. మూలమునఁ గూడ లేవు.

2. లెసగన్ ముకుళించి ప్రమోదగద్గద, స్వర (ట. ద. బ.) 3. సర్వశరణ్యుని నిందిరాసతీ (ట. జ.)

సీ. కేశవ! సంతత క్లేశనాశనుఁడవు [1]కోరి మనో వా గగోచరుఁడవు
నిద్ధ మనోరథ హేతుభూ తోదార గుణనాముఁడవు సత్త్వగుణుఁడ వఖిల
విశ్వోద్భవ స్థితి విలయార్థ [2]ధారిత విపుల మాయాగుణ విగ్రహుఁడవు
మహితాఖి లేంద్రియ మార్గ నిరధిగత మార్గుండ వతిశాంత మానసుఁడవు

తే. తవిలి సంసారహారి మేధస్కుఁడవును
దేవదేవుఁడవును వాసుదేవుఁడవును
సర్వభూతనివాసివి సర్వసాక్షి
వైన నీకు నమస్కారమయ్య! కృష్ణ! 916

వ. మఱియును, 917

ఉ. తోయరుహోదరాయ, భవదుఃఖహరాయ, నమోనమః పరే
శాయ, సరోజకేసర పిశంగ వినిర్మల దివ్య [3]నవ్య వ
స్త్రాయ, పయోజసన్నిభ పదాయ, సరోరుహ మాలికాయ, కృ
ష్ణాయ, పరాపరాయ, సుగుణాయ, సురారి హరాయ, వేధసే. 918

వ. అని వినుతించి. 919

చ. కమలదళాక్ష! దుఃఖలయ కారణ మై తగు తావకీన రూ
పము ననివార్య దుర్భర విపద్దశ దుఃఖము నొందు మాకు నీ
సుమహిత సత్కృపాగరిమఁ జూపుటకంటె ననుగ్రహంబు లో
కమునఁ దలంప నొండొకటి కల్గునె? భక్తఫలప్రదాయకా! 920

ఉ. భూరి [4]వివేకితావహ విభూతిసమేత! మహాత్మ! దీనర
క్షారతి నొప్పు నీవు చిరకాలమునన్ సుఖవృత్తి వీరు మా
వార లటంచు బుద్ధి ననవద్య! తలంచిన యంతమాత్ర స
త్కారమె చాలు న ట్లగుటగా కిటు సన్నిధి వైతి వీశ్వరా! 921

చ. అరయఁగ క్షుద్ర భూతహృదయంబులయందుల నంతరాత్మ వై
తిరముగ నుండు నీవు భవదీయ పదాంబురుహ ద్వయార్చనా
పరమతు లైన [5]మామక శుభప్రద భూరి మనోరథంబు లీ
[6]వెఱుఁగవె భక్తలోక హృదయేప్సితదాయక! ముక్తినాయకా! 922

1. గురుసన్మనో (హ) 2. ధృతనిత్య (హ) 3. భర్మ (హ) 4. శివేతరాపహ (తం. వా.)
5. మాకును (హ) 6. అడుదుగనీవె భక్తహృదయ ప్రమదప్రద ముక్తిదాయకా (హ)

సీ. అయినను విను సరోజాయతలోచన! [1]వరమోక్షమార్గ ప్రవర్తకుండవు
పురుషార్థభూత విస్తరుండవు నగు నీవు దగిలి ప్రసన్నుండ వగుట మాకు
నర్థి మనోభీష్ట మైన వరం బయ్యె నైనను నాథ! పరాపరుండ
వైన ని న్నొకవరం బర్థింతు మనినను భువిఁ దావకీన విభూతు లెన్న

తే. నంత మెఱుఁగంగరామి ననంతుఁ డనుచుఁ
బలుకుదురు నిన్ను నదిగానఁ బరమపురుష!
యే వరం బని కోరుదు మేము? దప్పి
[2]గొన్న బాలకుఁ డబ్ధినీళ్ళెన్ని గ్రోలు? 923

వ. అదియునుం గాక. 294

ఉ. పూని భవత్పదాంబురుహ మూలనివాసుల మైన మేము మే
ధానిధి! నీ విలోకనముఁ దక్కఁగ నన్యముఁ గోరనేర్తుమే?
మానిత పారిజాతకుసుమ స్ఫుట నవ్యమరంద లుబ్ధ శో
భానయశాలి యైన మధుపంబు భజించునె? యన్యపుష్పముల్. 925

చ. హరి! భవదీయమాయ ననయంబును జెందిన నేము నిచ్చలున్
గర మనురక్తి నేది దుదగా భవకర్మలమై ధరిత్రిపైఁ
దిరుగుదు మంతదాఁక భవదీయ జనంబులతోడి సంగతిన్
గురుమతి జన్మజన్మములకున్ సమకూరఁగఁ జేయు మాధవా! 926

మ. కమలాధీశ్వర! తావకీన వర భక్తవ్రాత సంసర్గ లే
శముతోడన్ సరిగాఁ దలంప మెలమిన్ స్వర్గాపవర్గాది సౌ
ఖ్యము లన్నన్ విను మానుషంబు లగు నీ కామంబులం జెప్ప నే
ల? మునీంద్రస్తుత పాదపద్మ! సుజనాలాపానుమోదాత్మకా! 927

వ. మఱియు భగవద్భక్తసంగంబులయందుఁ దృష్ణాప్రశమనంబు లైన మృష్టకథలు చెప్పంబడుటచే భూతంబులయందు వైరంబును, నుద్వేగంబునులేకుండు. అని,

చ. వనముల ముక్తసంగు లగువారు నుతింపఁ దనర్తు వీవు గా
వున నిలఁ బుణ్యతీర్థముల నొప్పఁ [3]బునీతము సేయఁ బూని య
ర్థిని బదచారులై ధరఁ జరించు భవత్పదభక్త సంగమం
బనుపమ భూరి సంసృతి భయఘ్నుని బుద్ధి రుచింపకుండునే? 929

వ. కావున, 930

1. తగుమోక్షమార్గప్రదర్శకుండవు (ల. ఢ. ద. బ.) 2. గొన్న బాలుఁడు గంగ నీళ్ళెన్ని గ్రోలు (ట. డ.) 3. బవిత్రము సేయఁ బూని (వా)

చ. వనరుహపత్రలోచన! భవత్సఖుఁ డైన సుధాంశుమౌళితో
డి నిమిషమాత్ర సంగతిఁ గడింది వ్రణంబును దుశ్చికిత్సము
న్నను భవకష్టరోగమున కర్మిలి వైద్యుడ వైన నిన్ను నే
మనయముఁ జూడఁ గంటిమి కృతార్థుల మై తగ మంటి మీశ్వరా! 931

వ. దేవా! మదీయ స్వాధ్యాయాధ్యయనంబులును, గురుప్రసాదంబును, విప్రవృద్ధానువర్తనంబును, ఆర్యజన నమస్కరణంబును, సర్వభూతానసూయయు, నన్న విరహితంబుగా ననేకకాలం బుదకంబులయందు సుతప్తం బైన తపంబు సేయుటయు నివి యన్నియును బురాణపురుషుండ వైన భవదీయ పరితోషంబు కొఱకు నగుం గాక యని విన్నవించెదము. అని వెండియు ని ట్లనిరి. 932

మ. మను పద్మాసన ధూర్జటి ప్రముఖ ధీమంతుల్ తపో జ్ఞాన స
త్వనిరూఢిం దగువారు నీ మహిమముల్ వర్ణింపఁ బారం బెఱుం
గనివా రయ్యును నోపినంత వినుతుల్ గావింతు రట్లౌట నే
మును ని న్నర్థి నుతింతు మీశ! వరదా! బుద్ధ్యాదిమూలంబుగన్. 933

వ. అని మఱియు సముండవు, నాదిపురుషుండవు, శుద్ధుండవు, పరుండవు, వాసుదేవుండవు, సత్త్వమూర్తివి, భగవంతుండవు నైన నీకు నమస్కరించెదము. అని *(యిట్లు ప్రచేతసులచేత నుతింపంబడి శరణ్యవత్సలుం డగు హరి సంతుష్టాంతరంగుం డై వారలు గోరినయట్ల వరంబు లిచ్చిన), 934

తరల. [1]అనుచు నా నృపనందనుల్ ముదమార సన్నుతిఁ జేయఁగా
మనములోఁ బరితోష మంది రమాహృదీశుఁడు భక్తపా
లనకరుండు తదీయ దర్శనలాలసాత్మకు లాత్మలం
దనివి సాలక చూడ నాత్మపదంబు కేఁగె రయంబునన్. 935

వ. త దనంతరంబ ప్రచేతసులు (భగవదాజ్ఞ శిరంబుల ధరియించి) సముద్రసలిలనిర్గతు లై. 936

క. భూరిసమున్నతి నాక, ద్వారనిరోధంబు గాఁగఁ దగఁ బెరిఁగిన యా
భూరుహ సంపిహితాఖిల, ధారుణి నీక్షించి రాజతనయులు వరుసన్. 937

చ. ఘన కుపితాత్ము లై విలయకాల భయంకర హవ్యవాహులో
చనుగతి నుగ్రు లై ధరణిచక్రము నిర్వసుధారుహంబుగా
ననయముఁ జేయఁబూనిన జనాధిపసూనుల [2]మోముఁదమ్ముల
న్ననలసమీరముల్ జననమంది కుజంబులఁ గాల్పఁ జొచ్చినన్. 938

* తా. ప. ప్రతులలో లేదు. 1. అనయమా (హ) 2. మోములందుఁ దామనల (హ)

క. నలినభవుఁ డా మహీజ, ప్రలయముఁ గని వచ్చి ధరణిపాలతనూజా
తుల మధురోక్తుల నుపశాంతులఁ గావింపుచును [1]బ్రియము దూఁకొనఁ బలికెన్.

వ. అట్లు పలికి వారల నుపశమిత క్రోధులం జేసిన యనంతరంబ. 940

సీ. అవశిష్ట ధరణీరుహంబులు భయమంది తివిరి చతుర్ముఖాదేశమునను
మారిష యను సతీమణిఁ దమకూఁతును నా ప్రచేతసులకు నర్థి నిచ్చె
నా నరపాలక సూనులు దక్షున కరయంగ [2]ము న్నీశ్వరాపరాధ
మునఁ బ్రాప్త మైనట్టి జనపాలజన్మంబునకుఁ గారణం బైన నలిననయన

తే. నాదరంబునఁ గమలజు నాజ్ఞఁజేసి
కడఁక దీపింప విధివ త్ప్రకారమునను
వరుస నందఱుఁ గూడి వివాహమైరి
గడవవచ్చునె దైవసంకల్ప మెందు. 941

క. కలదే? జగతిం బదురు నృ, పులకును నొకభార్యయందుఁ బొసఁగునె? వినఁగా
నలినోదరు ఘన మాయా, కలి తాద్భుతములకు నతులు గావింపఁ దగున్. 942

వ. అంతం జాక్షుషమన్వంతరంబుల దైవచోదితుండై యిష్టప్రజాసర్గంబుఁ గావింపుచుఁ బ్రసిద్ధుం డైన దక్షుండు పూర్వదేహంబు కాలవిద్రుతంబుగాఁ బ్రచేతసులకు న మ్మారిష యను భార్యయందు సంభవించి, నిజకాంతింజేసి సమస్త తేజోధనుల తేజంబును బిహితంబుగాఁ జేయుచుఁ, గర్మదాక్ష్యంబున దక్షుం డను నామంబు వహించి, బ్రహ్మచేతం బ్రజాసర్గ రక్షయందు నియోగింపంబడి, మరీచ్యాదులం దత్త ద్వ్యాపారంబులందు నియోగించియుండె. అంత. 943

## అధ్యాయము - ౩౧

సీ. ఒనరఁ బ్రచేతస్కు లుత్పన్నవిజ్ఞాను లగుచు వేగంబ నారాయణోక్తిఁ
దలఁపుచు నాత్మనందనుకడ నిజభార్య నిడి వనవాసులై కడఁగి మున్ను
జాబలి యను [3]మునీశ్వరుఁడు సిద్ధుం డైన భూరి పశ్చిమవార్ధి తీరమునను
సర్వభూతాత్మవిజ్ఞానంబు గల యాత్మ ఘనవిమర్శ కృతసంకల్పులైరి

తే. యంత నచటికి సమ్మోద మతిశయిల్ల
నర సురాసుర యక్ష కిన్నరవరేణ్యు
మానితోన్నతి సంపూజ్యమానుఁ డైన
నారదుండు వివేకవిశారదుండు. 944

1. నయము (హ. తం. వా.) 2. మును నీశ్వరాపరాధ (క. బ.) 3. మునీశ్వరునాశ్రమం బైన (చ. ట. త. డ. ద. బ.)

వ. చనుదెంచి నిర్జిత ప్రాణ మనో వా గ్గర్శనులు, జితాసనులు, శాంతులు, సమాన విగ్రహులు, నిర్మలంబై న పరబ్రహ్మంబునందు నియోజితంబై న యంతఃకరణులు నై న రాజనందనులకడ నిలిచిన. 945

క. చనుదెంచిన నారదమునిఁ, గనుఁగొని నృపసుతులు లేచి కౌతుక మొప్పన్
వినమితులై సముచితపూ, జనములఁ బరితుష్టుఁ జేసి సద్వినయమునన్. 946

చ. అనఘ ! మునీంద్రచంద్ర ! భవ దాగమనంబు సమస్తలోక శో
భన మగు నస్మదీయ మగు భాగ్యవశంబున నేఁడు విశ్వపా
వన ! నినుఁ జూడఁగంటి మనివార్య భవ భ్రమణంబు లోకలో
చనుగతిఁ బోలి ప్రాణులకు సర్వభయాపహరంబు గావునన్, 947

వ. అని మఱియు ని ట్లనిరి. 948

సీ. అనఘాత్మ ! భగవంతులై న కేశవ వామదేవులచే నుపదిష్ట మైన
యాత్మతత్త్వంబు గృహస్థుల మగు మాకు ననయంబు విస్మృతం బయ్యె నట్టి
[1]యీశతత్త్వార్థ ప్రకాశకంబును [2]భూరి ఘోర సంసారాబ్ధి తారకంబు
నై కర మొప్పారు నాత్మతత్త్వము నేఁడు చిరదయామతిఁ బ్రకాశింపఁజేయు

తే. మని ప్రచేతస్కు లర్థిఁ బల్కినఁ జెలంగి
భగవదాయత్తచిత్తుండు భవ్యగుణుఁడు
నఖిలలోకవిహారుండు నై నయట్టి
నారదుఁడు వల్కె నా రాకుమారులకును. 949

సీ. చర్చింప నరులకే జన్మకర్మాయు ర్మనోవచనంబుల దేవదేవుఁ
డఖిల విశ్వాత్మకుం డైన గోవిందుండు విలసిల్లు భక్తి సేవింపఁబడును
నవియ పో జన్మకర్మాయు ర్మనోవచనములని ధరణి నెన్నంగఁదగును
వనరుహనాభ సేవారహితము లై న జననోపనయన దీక్షాకృతంబు

తే. లై న జన్మంబు లేల ? దీర్ఘాయు వేల ?
వేదచోదిత యగు కర్మవితతి యేల ?
జప తప శ్శ్రుత వాగ్విలాసంబు లేల ?
మహిత నానావధాన సామర్థ్య మేల ? 950

వ. మఱియు హరివిరహితం బై న యింద్రియపాటవంబు, నిపుణ యైన బుద్ధియుఁ, బ్రాణాయామాది యోగంబు, దేహాది వ్యతిరిక్తాత్మజ్ఞానంబు, సన్న్యాసాధ్య

1. కలిత (క. చ. బ.) 2. భూరి, తరళ సంసారాబ్ధి తారణంబు (క. చ. ట. జ. ద. బ.)

యనంబులును,దక్కిన వ్రతవైరాగ్యాది శ్రేయస్సాధనంబులునేల?సర్వేశ్వరుండు సమస్త శ్రేయ స్స్వరూపుండు, సమస్త శ్రేయోవధిభూతుండు, సర్వభూతావాసుండు, సర్వభూతాత్మప్రదుండు, సర్వభూతప్రియుండు, సర్వవ్యాపకుండును గావున. 951

మ. కమలాధీశ్వరుఁ బూజసేయుట సమగ్రప్రీతిఁ బ్రాణోపహా
రము సర్వేంద్రియ తృప్తిహేతువును సర్వక్ష్మాజ మూలాభిషే
కము శాఖాభుజపుష్టిదంబు నగు రేఖన్ సర్వదేవార్హణ
క్రమ మై యొప్పు ధరావరేణ్య సుతులారా! బుద్ధి నూహించినన్. 952

వ. అదియునుం గాక. 953

క. పెనుపగు వర్షాకాలం, బున దిననాయకునివలనఁ బొడమిన సలిలం
బనయముఁ గ్రమ్మఱ గ్రీష్మం, బున సూర్యునియందుఁ జెందుపోలిక మఱియున్.

క. ధరణిఁ జరాచరభూతము, లరయఁగ జనియించి యందె యణఁగిన పగిదిన్
హరిచేఁ బుట్టిన విశ్వము, హరియందె లయంబు నొందు నది యెట్లన్నన్. 955

మ. [1]అరయ న్నభ్రతమః ప్రభల్ మును నభంబం దొప్పఁగాఁ దోఁచి క్ర
మ్మఱ ఢీకింపఁగ నందె లేనిగతి బ్రహ్మంబందు నీశక్తులున్
బరికింపన్ ద్రిగుణప్రవాహమున నుత్పన్నంబు లై క్రమ్మఱన్
విరతిం బొందుచునుండుఁ గావున హరిన్ విష్ణున్ భజింపం దగున్. 956

వ. మఱియు సమస్త దేహులకు నాత్మయు *(నిమిత్త భూతుండు) నద్వితీయుండు, [2]శశ్వత్ప్రకాశుండు, ప్రధాన పురుషుండు, స్వతేజో విధ్వస్త గుణప్రవాహుండు, (మానస బుద్ధి సుఖేచ్ఛా ద్వేషాది వికల్పరహితుండు, నగుణుండు, దేహాత్మ భ్రమ నివృత్త్యుపలభ్యుండు, నాది మధ్యాంత రహితుండు, నిత్యానంద స్వరూపుండు, సర్వజ్ఞుండుఁ) బరమేశ్వరుండు నైన నారాయణు నభేదబుద్ధిం జేసి, భజింపుండు.అతండు[3]సర్వభూతదయాళువులును,ఎంతమాత్రంబు సంభవించునంత మాత్రంబున సంతుష్టచిత్తులును, సర్వేంద్రియోపశాంతులును నగు పురుషుల యెడ సంతుష్టుం డగు. అని వెండియు ని ట్లనియె. 957

1. అరుదౌ నభ్రతమః ప్రభల్ (హ) * తా. ప. ప్రతులలో లేదు.

2. స్వయం ప్రకాశుండు (క. చ. ద. బ.) 3. సర్వభూతదయయు............సంతుష్టుం డగుటయును సర్వేంద్రియోపశాంతియు నను నీ గుణంబులు గలిగిన యెడ (తం. వా.)

"దయయా సర్వభూతేషు సంతుష్ట్యా యేన కేనచిత్.
సర్వేంద్రియోపశాంత్యాచ తుష్యత్యాశు జనార్దనః" (31-20)

చ. చతురత నట్టి యీశ్వరుఁడు సజ్జనలోక నిరస్త సర్వకా
మిత విమలాంతరంగమున మిశ్రితభావనఁ జేసి సన్నిధా
పితుఁ డగుచుణ్ దయాకర గభీరగుణంబులఁ జాల నొప్పి యా
శ్రితజన పారతంత్ర్యమును జేకొని పాయకయుండు నిచ్చలుణ్. 958

క. శ్రుత ధన [1]కుల ధర్మ సము, న్నత మదములఁజేసి సజ్జన ప్రతతికి సంతత
మెగ్గొనరించుచును గు, మతు లర్థిం జేయుపూజ మతిఁ గొనఁ డెందుణ్. 959

వ. అది యెట్లనిన. 960

సీ. వలనొప్పఁ దను ననువర్తించు నిందిరా కామినీమణిఁ ద దాకాంక్ష లగుచు
ధృతి ననువర్తించు దేవేంద్రముఖ్యుల [2]నే ననువర్తింప కెప్పు డాత్మ
నిత్య స్వతంత్రుఁడు నిజభక్త వరదుఁడు [3]దీనవత్సలుఁడును నై నయట్టి
పురుషోత్తముని జగద్భరితు సర్వేశ్వరు నారాయణునిఁ జిదానంద మయుని

తే. నజితు నచ్యుతుఁ బుండరీకాయతాక్షుఁ
దవిలి సేవింప కుండునే ? ధరఁ గృతజ్ఞుఁ
డైన పురుషుండు సమ్మోదితాత్ముఁ డగుచుఁ
జారుమతులార ! రాజకుమారులార ! 961

వ. *(అని మఱియు ని ట్లనియె. భవదీయ వంశధుర్యుండుఁ, జిత్రరథుండు నగు ధ్రువుండు సపత్ని మాతృ వాగ్బాణ భిన్నహృదయుం డై పంచ వర్షార్భకుం డగుచుఁ దపోవనంబున కరుగునపుడు మార్గంబున నాచే నుపదిష్టంబయిన క్రమంబున భగవంతుం డగు పుండరీకాక్షు నారాధించి, యితరులచే నొందరాని సర్వోత్తమం బగు పదంబు నొందె. కాన మీరును రుద్రోపదేశక్రమంబున సర్వభూతాంతర్యామి యగు నీశ్వరు భవచ్ఛేదనంబునకై భజియింపుఁడు.) 962

క. అని యి వ్విధమున నారద, ముని రాజకుమారులకును ముదము దలిర్పణ్
వనజోదరు సచ్చరితము, వినుపించి సరోజభవుని వీటికిఁ జనియెణ్. 963

వ. ఇట్లు నారదుండు చనిన యనంతరంబ, 964

చ. నరవరనందనుల్ గణఁక నారదవక్త్రవినిర్గతంబు సుం
దరమును మంగళావహము ధన్యము లోక మలాపహంబు నై
పరఁగిన విష్ణు [4]కీర్తి విని పాయక తత్పదభక్తి చింతనా
నిరుపమభక్తిఁ జెంది హరినిత్యపదంబును బొంది రున్నతిణ్. 965

1. కర్మ (హ) 2. నైన నెవ్వఁడు చూడఁనాత్మ నట్టి (హ) 3. దీనవత్సల గుణాధీశు నజుని (హ) * తా. ప. ప్రతులలో లేదు. 4. సద్యశము భక్తినుతించి ముకుంద చింతనా (హ)

వ. అని మైత్రేయుండు విదురున కిట్లనియె. మహాత్మా ! నీవు న న్నడిగిన ప్రచేతో నారద సంవాదరూపం బైన హరికీర్తనంబును, మనుపుత్రుం డైన యుత్తాన పాదుని వంశ ప్రకారంబును జెప్పితి. అని వెండియు ని ట్లనియె. నారదు వలనం బ్రియవ్రతుం డాత్మవిజ్ఞానంబు నొంది, [1]మహీమండలంబు పరిపాలించి, యనంత రంబునఁ బుత్రులకు రాజ్యంబుఁ బంచియిచ్చి పరలోకగతుం డయ్యెఁ. అనిన, 966

క. విని విదురుం డా [2]తాపసు, ఘనచరణము లాత్మమస్తకంబున మధుసూ
దను చరణాంభోరుహములు, మనమునఁ దగఁ దాల్చి పలికె మైత్రేయునితోన్.

క, మునినాథచంద్ర! కరుణా, వననిధి! నీచేత భక్తవత్సలుఁ డగు నా
వనజాక్షు తత్త్వ మెఱిఁగితి, నని తత్పదములకు వినతుఁ డై వినయమునన్.

క. [3]ఆ మునిచే నామంత్రితుఁ, డై మనమున బంధుదర్శ నాకాంక్షితుఁ డై
ధీమహితుఁ డైన విదురుఁడు సామజపురమునకుఁ జనియె సమ్మద మొప్పన్.

క. అని శుకుఁడు పరీక్షిత్తున, కనుకంపం జెప్పె నీ యుపాఖ్యానంబున్
వినువాఁ డైశ్వర్యాయు, ర్ధన కీర్తి స్వస్తిగతులఁ దగఁ బ్రాపించున్. 970

క. అని శుకయోగి పరీక్షి, జ్జనపాల సుధాపయోధిచంద్రున కర్థిన్
వినిపించిన కథ మోదం, బున సూతుఁడు శౌనకాది మునులకుఁ జెప్పెన్. 971

చ. సరస వచోవిలాస! గుణసాగర! సాగరమేఖలా మహీ
భరణ ధురంధరప్రకట భవ్య భుజా భుజగేంద్ర! రాజశే
ఖర! ఖర దూషణప్రముఖ గాఢ తమఃపటల ప్రచండ భా
స్కర! కఠినకంఠకార్ముక విఖండన ఖేలన! భక్తపాలనా! 972

క. శరవిదళిత సారంగా!, సరస దయాపాంగ! భక్తజలధి తరంగా
దురితధ్వాంత పతంగా!, వర జనకసుతాభిషంగ! వననిధి భంగా! 973

మాలిని. సురవిమత విదారీ! సుందరీ శంబరారీ!
సరసవినుత సూరీ! సర్వలోకోపకారీ!
నిరుపమగుణహారీ! నిర్మలానందకారీ!
గురు సమరవిహారీ! ఘోరదైత్య ప్రహారీ! 974

1. మహాభోగానంతరంబున (త) 2. మునివరు (హ)
3. మునిచే నామంత్రితుడై, తన మనముల బంధుజనుల దర్శన కాంక్షన్
ఘన మహితుడైన విదురుడు చనియెన్ గరిపురమునకును సమ్మద మొప్పన్ (టి. జ. ద.)

గద్య. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతం బైన శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబునందు స్వాయంభువ మనువులకు నాకూతి, దేవహూతి, ప్రసూతి, ప్రియవ్రతోత్తానపాదులు జన్మించుటయు, నందు నాకూతి రుచిప్రజాపతికి నిచ్చుటయు, నా రుచిప్రజాపతికి నాకూతిదేవియందు శ్రీ విష్ణుమూర్తి యంశజుం డైన యజ్ఞుండును, లక్ష్మీకళాంశజ యగు దక్షిణ యను కన్యకయు నుద్భవించుటయు, మనుపుత్రి యైన దేవహూతినిఁ గర్దమున కిచ్చుటయు, బ్రసూతిం దక్షప్రజాపతి కిచ్చుటయుఁ, బ్రసూతిదక్షులవలనం బ్రజాపరంపరలు గలుగుటయు, మఱియుం గర్దమప్రజాపతి పుత్రికాసముదయంబును క్షత్రబ్రహ్మర్షుల కిచ్చుటయుఁ, గర్దమపుత్రిక యైన కళవలన మరీచికిఁ గశ్యపుఁ డను పుత్రుండు, పూర్ణిమ యను కూఁతురుం బుట్టుటయుఁ, బూర్ణిమవలన గంగయు విరజుం డనెడి కుమారుండును జన్మించుటయుఁ, గశ్యప ప్రజాపతివలన నైన ప్రజాపరంపరలచే ముల్లోకంబు లాపూర్ణంబు లగుటయు, నత్రిమహాముని తపంబును, నతనికి హరి హర బ్రహ్మలు ప్రత్యక్షం బగుటయు, ననసూయా పాతివ్రత్య మాహాత్మ్యంబు వలన ననసూయాత్రులకుం ద్రిమూర్తుల కళాంశజు లయిన చంద్ర దత్తాత్రేయ దుర్వాసుల జన్మంబును, దక్షాత్మజల జన్మంబును, భృగువు వలన ఖ్యాతి యను నంగనకు శ్రీమహాలక్ష్మి జన్మించుటయు, భృగు పౌత్రుం డైన మార్కండేయు జన్మంబును, ధర్మునకు మూర్తివలన నరనారాయణులు సంభవించుటయు, సత్రయాగంబునందు దక్షుండు శివుని నిందించుటయు, దక్షాధ్వర ధ్వంసంబును, బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుండు దక్షాదుల ననుగ్రహించుటయు, దక్షాదికృత శ్రీహరి స్తవంబును, శ్రీహరి ప్రసన్నుండై దక్షుని యజ్ఞంబు సఫలంబుగా ననుగ్రహించుటయు, సతీదేవి హిమవంతునకు జనించి హరునకుం బ్రాప్తించుటయు, నుత్తానపాదుని వృత్తాంతంబును, ధ్రువోపాఖ్యానంబును, ధ్రువుండు దండ్రిచేత నవమానితుం డై నారదోపదేశంబున మధువనంబునకుం జని తపంబు సేయుటయు, హరి ప్రసన్నుం డై యతని మనోరథంబు లిచ్చుటయు, నతండు మఱల పురంబునకు వచ్చుటయుఁ, గుబేరానుచరులైన యక్షులతోడి యుద్ధంబును, ధ్రువుండు యజ్ఞంబులు సేయుచు రాజ్యభోగంబులం దనిసి దనయు నుత్కలునిం బట్టంబు గట్టి హరి యనుగ్రహంబున ధ్రువక్షితిని నిలుచుటయు, నుత్కలుండును వత్సరుఁడను తన సుతునిఁ బట్టంబుగట్టి హరిం జేరుటయు, వత్సరుని వంశ పరంపరయు, నందు నంగుని సుతుం డయిన వేను కళేబరంబున లక్ష్మీనారాయణుల

యంశంబున నర్చియుఁ,బృథుండును జన్మించుటయుఁ,బృథుండు భూమిం గామ ధేనువురీతి నఖిల వస్తువులం బితుక నియమించి, సమస్థలింజేసి, యింద్రుడు వశ వర్తియై యుండ బహుయజ్ఞంబులు సేసిన నతనికి హరి ప్రత్యక్షం బగుటయు, నధ్యాత్మ ప్రబోధంబును, నింద్రునివలనం బాషండసంభవంబును, నింద్రుని జయించిన విజితాశ్వుని, నతని తమ్ములను బృథివీపాలనంబున నిలిపి, పృథుండు నర్చియుం బరమపద ప్రాప్తు లగుటయు, విజితాశ్వునకు వసిష్ఠ శాపంబునం ద్రేతాగ్నులు తనయు లయి జనియించుటయుఁ, బృథుని పౌత్రుం డైన ప్రాచీన బర్హి రాజ్యంబును, నతని యజ్ఞంబు లసంఖ్యాతంబు లయిన నారదుండు మాన్పం దలంచి, పురంజను కథ నధ్యాత్మ ప్రపంచంబుగాఁ దెలుపుటయుఁ, బ్రాచీనబర్హి సుతులయిన ప్రచేతసులు పదువురకు శ్రీ మహాదేవుఁడు ప్రత్యక్షం బయి హరిస్తవం బుపదేశించుటయు, వారి తపంబునకు మెచ్చి హరి ప్రత్యక్షం బగుటయు, వారికి మారిషవలన దక్షుండు పూర్వకాలంబున శివవిద్వేష ప్రయుక్త శాపంబున జనియించుటయుఁ, బ్రచేతస్కులు ముక్తికిం జనుటయు, మొదలగు కథలం జెప్పిన విని మైత్రేయుని వీడ్కొని విదురుండు హస్తిపురంబున కరుగు టయు, నను కథలుం గల చతుర్థ స్కంధము సంపూర్ణము.

---

ఓమ్

# శ్రీమహాభాగవతము

## పంచమస్కంధము

### ప్రథమాశ్వాసము

[1]శ్రీకర! కరుణాసాగర! ప్రాకట లక్ష్మీకళత్ర! భవ్యచరిత్రా!
లోకాతీత గుణాశ్రయ! గోకులవిస్తార! నందగోపకుమారా! 1

అధ్యాయము — ౧

వ. *మహనీయగుణగరిష్ఠు లగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డి ట్లనియె. 2

క. †భూనాథుఁ డుత్తరాత్మజుఁ, డైన పరీక్షిన్న రేంద్రుఁ డభిమన్యుసుతుం
డానంద మొంది ఘన సు, జ్ఞానుం డగు శుకునిఁ గాంచి సరసతఁ బలికెన్. 3

వ. మునీంద్రా! పరమభాగవతుండు, నాత్మారాముండు నైన ప్రియవ్రతుండు గృహంబుననుండి యెట్లు రమించె? •కర్మబంధంబు లైన పరాభవంబులు గల గృహంబులయందు ముక్తసంబంధు లైన పురుషులకు సంతోషంబు గానేరదు. ఉత్తమశ్లోకుఁ డైన [2]పుండరీకాక్షుని పాదచ్ఛాయంజేసి నిర్వృతచిత్తు లైన మహాత్ములు కుటుంబంబునందు నిస్పృహత నేయుదురు. కాన ప్రియవ్రతునికి సంసారంబునందుఁ దగులంబు గలుగు టెట్లు? దారాగార సుతాదులందుఁ దగులంబు గలవానికి నెట్లు సిద్ధి గలుగు? శ్రీహరియం దస్ఖలితమతి యెట్లు గలుగు? ఈ సంశయంబుఁ దేటపఱుపుము. అని పరీక్షిన్న రేంద్రుం డడిగిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 4

1. శ్రీ సీతానయనోత్పల, శ్రీసతి సహజన్మ! త్రిదశసేవిత! ఆశా
వాస ప్రకాశ! జయ భా, సాసురపతి హరణ! రామచంద్ర నృపాలా? (క. చ. ట. జ. బ.)

* వ. సకల పురాణార్థజ్ఞాన విఖ్యాతుం డగు సూతుండు శౌనకాదుల కిట్లనియె. (చ.ట.జ.డ.బ.)

† ఈ పద్యము, క. చ. ట. జ. డ. లలో లేదు.

• "కర్మబంధః పరాభవః" (అని మూలము) "కర్మణాం బంధః పరాభవశ్చ" (వ్యాఖ్య 5-1)

2. పుండరీకాక్షుని కటాక్షవీక్షణామృత ధారంజేసి (క. చ.)

క. హరి చరణాంబుజ మకరం, ద రసావేశిత మనః ప్రధానుం డగు స
త్పురుషుఁడొకవేళ విఘ్నముఁ, బొరసినఁ దన పూర్వమార్గమును విడువఁడిలన్.

—: మనుపుత్రుం డగు ప్రియవ్రతుని యుపాఖ్యానము :—

క. ధరణీవల్లభ! విను మా, నరవరుఁడు ప్రియవ్రతుండు నారదముని[1] స
చ్చరణోపసేవఁ జెందుచు, నరుదుగ [2]నధ్యాత్మ సత్రయాగంబందున్. 6

సీ. దీక్షితుం డై ధరిత్రీపాలనముఁ దండ్రి పనిచిన సుజ్ఞానభంగ మనుచు
[3]నంగీకరింపకుం టంతయుఁ దెలిసి పద్మాసనుం డతనికి నతుల రాజ్య
మందుల మిక్కిలి యాసక్తిఁ బుట్టింతు ననుచును దనచిత్తమందు దలచిఁ
తారకా ద్యనుసృత తారాధిపుని మాడ్కి శ్రుతులతోఁ గూడి [4]యచ్యుతవిభూతి

తే. హంసవాహనుఁ డగుచు నింద్రాదులెల్లఁ
గదిసి సేవింప బ్రహ్మలోకముననుండి
సన్మునీంద్రులు దన్నుఁ బ్రశంస సేయ
నల్లనల్లన యుడువీథి నరుగుదెంచె. 7

వ. మఱియు నయ్యై మార్గములయందు సిద్ధ సాధ్య గంధర్వ చారణ గరుడ కింపురుషులు స్తోత్రంబులు సేయుచుండ గంధమాదన ద్రోణులం బ్రకాశంబు నొందింపుచుం జనుదెంచిన పద్మాసనునకు నారదుండు స్వాయంభువ ప్రియవ్రతులతోఁ గూడి ముకుళిత [5]కరకమలుం డై యెదురు చనుదెంచి, సంస్తుతులతోడఁ బూజించిన విరించి సంతసించి ప్రియవ్రతునిం జూచి నవ్వుచు ని ట్లనియె. 8

క. హరి నాముఖమున నీకును, [6]గర మెఱిఁగింపగ బనిచెఁ గావున నిదె సు
స్థిరమతి విను మంతయు శ్రీహరి వాక్యముగా నెఱింగి యవనీనాథ! 9

ఆ. కోరి వేడ్కి నేను నారదుండును నీవు
నందఱ మిదె యీశ్వరాజ్ఞఁ బూని
యుడుగ కెపుడు సేయుచున్నవారము గాన
నతనియాజ్ఞఁ దప్ప నలవిగాదు. 10

వ. మఱియు శ్రీహరియాజ్ఞం జీవుండు తపోవిద్యలను యోగవీర్య జ్ఞానార్థ ధర్మంబులును దనచేత నొరులచేతను దప్పింప సమర్థుండు గాఁడు. ఉత్పత్తినాశంబులకు

1. శ్రీ; చరణాబ్జ సేవ (ట.త.జ.డ.) 2. సుజ్ఞాన (క.బ.) 3. అంగీకరింపమి నంతయు (హ.తం.వా.) 4. నంచిత (చ.బ.) 5. హస్తుండై (హ) 6. నెఱుగింపదలంచినాకు నెఱిగించెను (చ.ట.జ.డ.ద.)

శోకమోహ సుఖదుఃఖంబులకు నీశ్వరాధీనుండె కాని జీవుండు స్వతంత్రుండు గాఁడు. శ్రీహరి వాగ్రూపంబు లైన శ్రుతులందు గుణత్రయం బను రజ్జువున బంధింపబడ్డ యస్మదాదులము ముకుఁద్రాటిచేఁ బశువు మనుష్యులకు వశం బైన చందంబున నీశ్వరాజ్ఞం బ్రవర్తింపుచుందుము. నరుండు సుఖదుఃఖానుభవంబులకు నీశ్వరాధీనుండు నేత్రంబులు గలవానిచేతఁ దివియంబడ్డ యంధుండునుంబోలె నీశ్వరుం డిచ్చిన సుఖదుఃఖంబు లనుభవింపుచున్నవారము. స్వప్నంబునం గన్న పదార్థము మేలుకాంచి మిథ్యగాఁ దలంచిన చందంబున మోక్షార్థి యైన సుజ్ఞానవంతుండు ప్రాప్త సుఖదుఃఖంబు లనుభవింపుచు దేహారబ్ధ కర్మంబులం బాయ నొల్లఁడు. వనవాసి యైనను జితేంద్రియుండు గాకుండె నేనిఁ *(గామాది సహితుం డగుటం జేసి) సంసారబంధంబులు గలుగు. గృహస్థాశ్రమంబందును జితేంద్రియుం డై యాత్మజ్ఞానంబు గల పురుషునకు మోక్షంబు సిద్ధించు. శత్రువుల గెలువ నిచ్ఛయించిన పురుషుండు, దుర్గం బాశ్రయించి శత్రువుల గెలిచిన మాడ్కి, మోక్షార్థి యగు [1]పురుషుండు గృహాశ్రయుం డగుచు శ్రీహరి చరణారవిందంబు లను దుర్గం బాశ్రయించి యరిషడ్వర్గంబుల జయించు. నీవును ముక్తసంగుండ వై (యీశ్వరకల్పితంబు లగు) భోగంబుల ననుభవించి ముక్తిం జెందుము. అనినఁ బ్రియవ్రతుండు త్రిభువనగురుండైన బ్రహ్మవాక్యంబు నవనత మస్తకుండై బహుమాన పూర్వకంబుగ నంగీకరించె. అంత. 11

ఆ. సరసిజాసనుండు స్వాయంభువునిచేత
నధిక మైన పూజ లంది నార
దుండు నా ప్రియవ్రతుండును జూడఁగఁ
జనియెఁ దనదు పూర్వసదనమునకు. 16

ఆ. సత్యసంధుఁ డైన స్వాయంభువుం డను
మనువు బ్రహ్మచేత మన్ననఁ దగ
నంది యంత నారదానుమతంబునఁ
దనదు సుతుని [2]రాజ్యమునను నిలిపె. 13

వ. ఇట్లు స్వాయంభువమనువు భూపరిపాలనంబునకు బ్రియవ్రతునిఁ బట్టంబుగట్టి (విషమంబులగు) విషయంబులను విషసముద్రాశవలన విముక్తుం డై వనంబునకుం జనియె. అంత. 14

* తా. ప. ప్రతులలో లేదు. 1. నీవును (హ) 2. రాజ్యమునకు (క. చ. ట. జ. డ. ద. బ).

మ. ధరణీవల్లభుఁ డా ప్రియవ్రతుఁడు మోదం బందుచుఁ లీల నీ
శ్వరవాక్యంబునఁ గర్మతంత్రపరుఁ డై సంగంబులం బాపు శ్రీ
హరి పాదాంబుజచింతనం దగిలి నిత్యానందముం బొంది దు
ర్భర రాగాదులఁ బాఱఁదోలి ప్రజలం బాలించె నత్యున్నతిన్. 15

వ. ఇట్లు ప్రియవ్రతుండు రాజ్యంబు సేయుచు విశ్వకర్మప్రజాపతి పుత్రిక యగు బర్హిష్మతి యనుదానిం బత్నిగాఁ బడసి, యా సతివలన శీల వృత్త గుణ రూప వీర్యౌదార్యంబులం దనకు సమాను లైన యాగ్నీధ్ర, ఇధ్మజిహ్వ, యజ్ఞబాహు, మహావీర, హిరణ్యరేతో, ఘృతపృష్ఠ, సవన, మేధాతిథి, వీతిహోత్ర, కవు లను నామంబులు గల పుత్రదశకంబును, ఊర్జస్వతి యను నొక్క కన్యకనుం గాంచె. అందుఁ గవి మహావీర సవనులు మువ్వురు బాలకు లగుచునుండియు నూర్ధ్వరేతస్కు లై బ్రహ్మవిద్యా నిష్ణాతు లై, (యుపశమశీలు రగుచుం) బారమహంస్య యోగం బాశ్రయించి, సర్వజీవనికాయావాసుండును, (భవభీతజనశరణ్యుండును, సర్వాంతర్యామియు) భగవంతుడును నగు వాసుదేవుని చరణారవిందావిరత స్మరణావిగళిత పరమభక్తియోగానుభావంబున విశోధితాంతఃకరణు లగుచు నీశ్వరు తాదాత్మ్యంబుఁ బొందిరి. అంత. 16

సీ. వసుధేశ! యా ప్రియవ్రతుఁ డొండుకాంతయం దధికుల మన్వంతరాధిపతుల
మఱియు నుత్తముఁడు తామసుఁడు రైవతుఁ డను సుతులను బుట్టించె సుమహితులను
మున్ను జన్మించిన పుత్రులలో మువ్వు రవ్యయపదవికి నరుగుటయును
నపుడు ప్రియవ్రతుఁ డఖిలశాత్రవకోటిఁ దన బాహుబలముచేతను జయించి

తే. యతఁడు బర్హిష్మతీకాంతయందుఁ బ్రీతి
గలిగి యౌవన లీలావికాస హాస
హేలనాదులఁ జిత్తంబు గీలుపఱిచి
గతవివేకుండు వోలె భోగములఁ బొందె. 17

వ. ఇట్లు ప్రియవ్రతుం డేకాదశార్బుద పరివత్సరంబులు రాజ్యంబు సేసి, యొక్కనాఁడు మేరునగ ప్రదక్షిణంబు సేయు సూర్యునకు నపరభాగంబునం బ్రవర్తించు నంధకారంబు నివర్తింపం బూని, భగవదుపాసనా జనితాతిపురుష ప్రభావుం డై సవితృ రథసదృక్ష వేగంబు గలిగి తేజోమయం బైన రథంబు నారోహణంబు సేసి, రాత్రుల నెల్ల దివంబు లొనర్తునని సప్తవారంబులు ద్వితీయ తపనుండు వోలె నరదంబు వఱపుటయు, నా రథనేమి మార్గంబులు సప్తసముద్రంబులును, నా మధ్య భూసంధులు సప్తద్వీపంబులు నయ్యె. అందు. 18

సీ. సరస జంబూ ప్లక్ష శాల్మలిద్వీప కుశ క్రౌంచ శాక పుష్కరము లనగఁ
నలరు నా ద్వీపంబులందు జంబూద్వీప మొనరంగ లక్షయోజనము లయ్యె
నట యుత్తరోత్తరాయతసంఖ్యఁదా ద్విగుణితము లై యొండొంటి కతిశయిల్లు
క్షా రేక్షురస సురాజ్య క్షీర దధ్యుదకంబులు గలుగు సాగరము లేడు

తే. ద్వీప పరిమాణములు గల్గి విస్తరిల్లు
సంధి సంధులఁ బరిఘల చందమునను
క్రమము దప్పక యొండొంటిఁ గలయకుండ
సకలజీవుల కెల్ల నాశ్చర్యముగను. 19

వ. అట్టి ద్వీపంబులందుఁ బరిపాలనంబునకుం బ్రియవ్రతుం డాత్మభవులు నాత్మ సమాన శీలురు నైన యాగ్నీధ్రేధ్మజిహ్వ యజ్ఞబాహు హిరణ్యరేతో ఘృతపృష్ఠ మేధాతిథి వీతిహోత్రుల *(నొక్కొకని నొక్కొక ద్వీపంబునకుం) బట్టంబుగట్టి యూర్జస్వతి యను కన్యకను భార్గవున కిచ్చిన, నా భార్గవునకు నూర్జస్వతియందు దేవయాని యను కన్యారత్నంబు జనించె, అట్లు బలపరాక్రమ వంతుం డైన ప్రియవ్రతుండు విరక్తుం డై యొక్కనాఁడు నిజగురు వగు నారదుని (చరణానుసేవానుపతిత రాజ్యాది ప్రపంచ సర్గంబు) దలంచి దుఃఖించి. 20

సీ. అక్కట! యే నింద్రియములచేఁ గట్టంగఁ బడియుండి యందులఁ బాయలేక
యజ్ఞానవిరచితం బగు విషయములను నంధకూపంబుల నణఁగియుండి
తరుణుల కే వినోదమృగంబు నై యుండి నది యెల్ల నే నొల్ల ననుచు రోసి
హరికృపచే నప్పు డందిన యాత్మవిద్యను గల్గి తనవెంట నరుగుదెంచు

తే. కొడుకులకు నెల్ల రాజ్యంబు గుదురుపఱిచి
తనదు పత్నుల దిగనాడి ధనమువిడిచి
హరివిహారంబు చిత్తంబునందు నిలిపి
పరఁగ నల్లన నారదపదవి కరిగె. 21

వ. ఇట్లు తన రథమార్గంబులు సప్తద్వీప సాగరంబులుగాఁ జేసి సూర్యునకుఁ బ్రతి సూర్యుం డై సరిద్గిరి వనాదులచే (భూతనిర్వృతి కొఱకుఁ బ్రతిద్వీపంబునకు నవధులఁ గల్పించి) ద్వీప వర్ష నిర్ణయంబులఁ బుట్టించి, పాతాళ భూ స్వర్గాది జాతంబు లగు సుఖంబులు నరకసమానంబులుగాఁ దలంచి, విరక్తిం బొంది నిరంతర భగవద్ధ్యాన విమలీకృతాశయుం డగుచు (హరిభక్త ప్రియుండైన)

* తా. ప. ప్రతులలోఁ గానరాదు.

ప్రియవ్రతుని చరిత్రంబు లీశ్వరునకుఁదక్క నన్యుల కెఱుంగఁ దరంబుగాదు. అతని మహిమలు నేఁడునుం గొనియాడుదురు. అని మఱియును శుకుం డి ట్లనియె.

క. హరిసేవ నా ప్రియవ్రతుఁ, డరయఁగఁ గైవల్యపదవి నందుట యరుదే ?
ధరఁ జండాలుం డైనను, హరినామ స్మరణఁ జెందు నవ్యయపదమున్. 23

వ. అని పలికి శుకుండు మఱియు ని ట్లనియె. 24

అధ్యాయము - ౨

మ. జనకుం డిట్లు విరక్తుఁ డైనను ద దాజ్ఞం జేసి యాగ్నీధ్రుఁ దే
పున ధర్మప్రతిపాలనుం డగుచు [1]జంబూద్వీప మేలెం దగం
దన సత్పుత్రులమాడ్కి నెల్లప్రజలం తాత్పర్యచిత్తంబునన్
ఘనతం బ్రోచె ననేకకాల మిలఁ బ్రఖ్యాతంబుగా భూవరా ! 25

వ. ఇ ట్లాగ్నీధ్రుండు రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు పుత్రకాముం డై మంద రాద్రి సమీపంబున నఖిలోపచారంబుల నేకాగ్రచిత్తుం డై యర్చించినం గమల సంభవుండు సంతసిల్లి, తన సమ్ముఖంబున సంగీతంబు సేయు పూర్వచిత్తి యను నప్సరోంగనం బంపుటయు, నా యప్సరోంగన చనుదెంచి, రమణీయ వివిధ నిబిడ [2]విటపి విటప సమాశ్లిష్ట సమీప సువర్ణలతికారూఢ స్థలవిహంగమ మిథు నోచ్చార్యమాణ షడ్జాది స్వరంబులచే బోధ్యమాన సలిలకుక్కుట కారండవ బక కలహంసాది విచిత్రకూజిత సంకులంబు లైన నిర్మలోదక కమలాకరంబులు గల త దాశ్రమోపవనంబున విహరింపుచు, విలాస విభ్రమ గతివిశేషంబులం జలనంబు నొందు స్వర్ణ చరణాభరణ స్వనం బన్న రదేవకుమారుం డాలించి, యోగసమాధిం జేసి ముకుళితనేత్రుం డై యుండ, యల్లన కనువిచ్చి చూచి తన సమీపంబునన్ మధుకరాంగనయుఁ బోలె పుష్పాఘ్రాణంబు సేయుచు దేవమానవులకు మనో నయనాహ్లాదంబు పుట్టింపుచున్నగతి విహార వినయావలోకన సుస్వరావయవంబుల మన్మథశరపరంపరల నొందింపుచు ముఖకమల విగళితామృతసమాన హాసభాష ణామోద మదాంధంబు లైన మధుకరమిథునంబుల వంచించి, శీఘ్రగమనంబునం జలించు కుచ కచ మేఖలలు గల దేవిం గనుంగొని, చిత్తచలనంబు నొంది మన్మథపరవశుం డై జడునిచందంబున ని ట్లనియె. 26

క. సతి ! నీ వెవ్వతె ? వీ ప, ర్వతమున కేమైనఁ గోరి వచ్చిన వనదే
వతవో ? శారదవో ? రతి, పతి పంపిన మాయవో ? తపస్సారమవో ? 27

1. జంబూద్వీపము న్నేలుచున్ (చ. ట. త.) 2. అప్సరాంగనన్ (హ)

ఉ. అంగజుఁ డెక్కుడించిన శరాసనముల్ ధరియించి యంత నా
యంగజు వేఁట మానవ మృగావళిఁ జూచుచు నున్న దానవో ?
రంగగు నీదు చెయ్వుల తెఱం గెఱుఁగంగ నిజంబుఁ బల్కుమా
యంగన ! నిన్నుఁ గన్గొనిన [1]యంత ననంగుఁడు సందడించెడున్. 28

క. పొలుపగుచున్న విలాసం, బుల నంగజుబాణములను బోలెడి నీ చం
చల సత్కటాక్ష వీక్షణ, ముల నెవ్వని నింతి ! చిత్తమునఁ గలఁచెదవే ? 29

చ. చెదరఁగ వేదముల్ చదువు శిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి స
మ్మదమున నంతలోఁ గురియు మాడ్కిని మన్మథసామగానముల్
చదివెడు శిష్యులో ? యనఁగ షట్పదపంక్తులు చేరి మ్రోయఁగాఁ
బదపడి మీఁద రాలుఁ గచభారమునందుల జాఱు క్రొవ్విరుల్. 30

క. [2]అందియల వెలయు రత్నము, లందంబుగ లలితపదములన్ సుభగములై
యందంద మ్రోయుచును నా, డెందంబునఁ దగిలి [3]సందడించెడిఁ దరుణీ ! 31

క. పాయక కదంబపుష్ప, చ్ఛాయం గల వస్త్రకాంతిఁ [4]జననీ కంత
న్నాయెడ నితంబరోచులు, గాయుచు నెడతెగక తటిమి కప్పెడుఁ దన్వీ ! 32

క. నిరతము నీ తనుమధ్యముఁ, గర మరుదుగ నరసి చూడఁ గానంబడ దీ
కరికుంభంబులఁ బోలెడి, గురుకుచముల నెట్లు నిలుపుకొంటి ? లతాంగీ ! 33

క. పొంకము లగు కుచములపై గుంకుమ[5]పంకంబు సొంపు గొని వాసనలం
గొంకక వెదచల్లెడు నీ, బింకం బగు చన్నుదోయి పెంపో ! సొంపో ! 34

శా. ఏలోకంబుననుండి వచ్చితివి ? నీ విచ్చోటికి న్మన్ను నే
నేలోకంబునఁ జెప్పఁ జూప నెఱుఁగ న్నీ సుందరాకారము
న్నీ లాలిత్యము నీ వినోదములు నీ కె ట్లొప్పునే ? కామినీ !
భూలోకంబున కెట్లువచ్చితివి ! నా పుణ్యం బగణ్యంబుగన్. 35

క. హాసావలోకనంబుల, భాసిల్లెడు నీ ముఖంబు పలుమఱు నిపుడే
యాసలు పుట్టింపఁగ నే, నాసగొనెద నిన్నుఁ జూచి యంబుజనేత్రీ ! 36

1. యంతన సందడి వెట్టనంగుడున్ (హ)
2. అందియలు డిండిమంబుల, చందమునఁ బాదపంకజంబుల యందున్ (క. తం. వా.);
అందియలు టిట్టిభంబులు (చ. ట. చ.)
3. సందడించుచు నున్నన్ (హ) 4. చల్లెడుఁ గుచే (హ. తం. వా.) జనునీకంతన్ (జ)
5. పంకంబుఁ బూసికొని (హ)

ఆ. కందులేని యిందుకళ మించి నెమ్మోము
కాంతియుక్త మగుచుఁ గానుపించెఁ
గాన విష్ణుకలయుఁ గాఁబోలు నని నా మ
నంబు నందుఁ దోఁచె నళిననేత్రి! 37

మ. పటు తాటంక రథాంగ యుగ్మమునకుం బల్మారు భీతిల్లుచున్
నటనం బందెడు గండుమీనములతో నాసన్న నీలాలకో
త్కట భృంగావళితో ద్విజావళి లసత్కాంతిన్ విడంబించు మా
అట కాసారముఁ బోలి నెమ్మొగము దా రంజిల్లు నక్కన్నతిన్. 38

చ. కరువలిఁ బాయు వస్త్రమును గట్ట నెఱుంగవు చూడ్కి దిక్కులం
బఱపుచుఁ జంచరీకముల భాతిఁ జెలంగెడు కంధరంబునం
బొరలెడు ముక్తకేశభరముం దుఱుమంగఁ దలంప విప్పు డి
ట్లరుదుగ రత్నకందుక విహారము సల్పెదు సంభ్రమంబునన్. 39

వ. మఱియు నిట్లను. తపోధను లగువారల తపంబుల నీ రూపంబున [1]నపహరించిన దానవు. [2]ఈ చక్కఁదనం బేమి తపంబున సంపాదించితివి? నాతోడం గూడి తపంబు సేయుము. సంసారంబు వృద్ధిఁ బొందం జేయుము. పద్మాసనుండు నాకుం బ్రత్యక్షం బై నిన్ను నిచ్చినవాఁడు గావున నిన్ను విడువం జాలను. నీ సఖీజనంబులును మా వాక్యంబులకు ననుకూలించుదురు గాక. నీవు చను చోటికి ననుం దోడ్కొని చనుము. అని స్త్రీలకు ననుకూలంబులుగాఁ బలుక నేర్చిన యాగ్నీధ్రుండు పెక్కు భంగులం బలికిన, నా పూర్వచిత్తియు నతని (యను నయ వాక్యంబులకు సమ్మతించి, వీరశ్రేష్ఠుఁ డగు నా రాజవర్యుని బుద్ధి రూప శీలౌదార్య విద్యా వయ శ్శ్రీలచేఁ బరాధీన చిత్త యగుచు, జంబూద్వీపాధిపతి యగు నా రాజశ్రేష్ఠునితోడం గూడి) శత సహస్ర సంవత్సరంబులు భూ స్వర్గ భోగంబు లనుభవించె. (అంత నాగ్నీధ్రుం డా) పూర్వచిత్తివలన నాభి, కింపురుష, హరివర్ష, ఇలావృత, రమ్యక, హిరణ్మయ, కురు, భద్రాశ్వ, కేతుమాల సంజ్ఞలు గల కుమారులఁ బ్రతివత్సరంబు నొక్కొక్కనిగఁ దొమ్మండ్రంగాంచె. అంత నా పూర్వచిత్తి (యా యర్భకుల గృహంబున) విడిచి, యాగ్నీధ్రుం బాసి, బ్రహ్మలోకంబునకుం జనిన, నా యాగ్నీధ్ర పుత్రులు మాతృసామర్థ్యం బున జేసి (స్వభావంబుననె) శరీర బలయుక్తు లగుచుఁ దండ్రిచేత ననుజ్ఞాతు లై తమ తమ నామంబులఁ బ్రసిద్ధంబు లైన జంబూద్వీపాది వర్షంబులఁ

1. అపహ్నవించినదానవు (హ. తం. వా.) 2. నీ (హ)

బాలింపుచుండిరి. అంత నాగ్నీధ్రుండు నా పూర్వచిత్తి వలనం గామోపభోగం బులం దృప్తిం బొందక, పూర్వచిత్తిం దలంపుచు వేదోక్తంబు లగు కర్మంబులఁ జేసి తత్సలోకం బగు బ్రహ్మలోకంబునకుం జనియె. ఇట్లు దండ్రి పరలోకంబు నకుం జనిన, నాభి ప్రముఖు లగు నాగ్నీధ్రకుమారులు దొమ్మండ్రును మేరు దేవియుఁ, బ్రతిరూపయు, నుగ్రదంష్ట్రియు, లతయు, రమ్యయు, శ్యామయు, నారియు, భద్రయు, దేవవతియు నను నామంబులు గల మేరుపుత్రిక లగు తొమ్మండ్రు కన్యల వివాహం బైరి. అంత, 40

అధ్యాయము — ౩

—: భగవంతుం డగు నారాయణుండు ఋషభావతార మెత్తుట :—

ఆ. నరవరేణ్యుఁ డైన నాభి సంతానార్థ
మంగనయును దాను యజ్ఞపురుషుఁ
డైన వాసుదేవు నతుల భక్తిశ్రద్ధ
లను జెలంగి పూజ లొనరఁ జేసి. 41

వ. మఱియుం బ్రవర్గ్య సంజ్ఞికంబు లగు కర్మంబుల శ్రద్ధా విశుద్ధ ద్రవ్య దేశ కాల మంత్రఋత్విగ్దక్షిణావిధాన యోగంబులం బరమేశ్వరుని మెప్పించిన, నెవ్వ నికిం బ్రసన్నుండు గాని పుండరీకాక్షుండు భక్తవత్సలుం డై సురుచిరావయవం బులు గలిగి, యజన శీలుం డైన యాతని హృదయంబునందుఁ బాయని రూపంబు గలిగి, మనోనయనానంద కరావయవంబులు గల తన స్వరూపంబుఁ జూపం దలంచి, 42

సీ. అంత నావిష్కృత కాంత చతుర్భుజంబులును పీతాంబరంబును వెలుంగ
శ్రీవత్స కౌస్తుభ శ్రీరమా చిహ్నంబు లురమందు రమ్య మై యరవు వడఁగ
శంఖ చక్ర గదాంబుజాత ఖడ్గాది దివ్యాయుధంబులు చేతులందు మెఱయ
[1]నతులిత నవరత్న హాటకాంకిత నూత్న ఘన కిరీటద్యుతుల్ గడలుకొనఁగ

తే. గర్ణకుండల కటిసూత్ర కనకరత్న
హార కేయూర వర నూపురాది భూష
ణముల భూషితుఁ డైన శ్రీనాయకుండు
దంపతుల కప్పు డెదురఁ బ్రత్యక్ష మయ్యె. 43

1. కమనీయ కాంచన ఘన కిరీట ప్రభల్ గండమండలదీప్తి గడలు కొనగ (చ)

తే. ఇట్లు ప్రత్యక్ష మగు [1]పరమేశ్వరునినిఁ
బెన్నిధానంబు గనుఁగొన్న పేదమాడ్కి
హర్షమున ఋత్విగాదికు లవనతాస్యు
లగుచు నభినుతి చేసి రి ట్లనుచు నపుడు. 44

క. పరిపూర్ణుఁడ వై యుండియు, మఱవక మా పూజలెల్ల మన్నింతువు నీ
చరణారవింద సేవయు, ధరఁ బెద్దలు చెప్పినటులు దగఁ జేసెద మౌ. 45

క. ఏ మిపుడు సేయు సంస్తుతి, నీమహిమ నెఱింగి కాదు నిరతముఁ బెద్దల్
దా మెది యుపదేశించిరొ, యా మతమునఁ బ్రస్తుతింతుమయ్యా! మహాత్మా! 46

వ. మఱియు నీవు సంసారసక్తమతి గలిగినవారికి వశుండు గావు. ఈశ్వరుండవును, బ్రకృతిపురుషవ్యతిరిక్తుండవును, బరమపురుషుండవు నైన నిన్నుఁ బొందని ప్రపంచాంతర్గతంబులైన నామరూపంబులు గల యస్మదాదులచేత నిరూపింప నశక్యం బగు.సర్వజీవులం జెందిన దురిత సంఘంబుల నిరసించు స్వభావంబుగల నీ యుత్తమ గుణంబులయందు నేకదేశంబ కాని, సర్వగుణ నిరూపణంబుఁజేయ శక్యంబు గానేరదు. నీ భక్తులు మిక్కిలి భక్తింజేసి స్తుతియించు గద్గదాక్షరములను, సలిల శుద్ధ పల్లవ తులసీదళ దూర్వాంకురములను, సంపాదించిన పూజచే సంతసిల్లెడి నీకు బహువిధ ద్రవ్యసంపాదనంబు గలిగి, విభవయుక్తంబు లైన యశ్వమేధాదులును, దృప్తికరంబులు గానేరవు. స్వభావంబున సర్వకాలంబు నందును సాక్షాత్కరించి, యతిశయం బై వర్తింపుచు, నశేషపురుషార్థ స్వరూపమవు, పరమానంద రూపమవు నైనవాఁడ వగుటంజేసి యజ్ఞాదులయందు నీకుఁ దృప్తి లేక యున్న నస్మదాదుల కోరికల కుపకరించు కతంబున యజ్ఞాదుల నొనరింతుము. అని మఱియు ని ట్లనిరి. 47

క. బాలిశుల మగుచు మిక్కిలి, మే లెఱుఁగని [2]మమ్ము నీదు మించిన దయచేఁ
బాలించి యిత్తు వెప్పుడు, చాలఁగ నిహపరములందు సకల సుఖంబుల్. 48

ఆ. ఇపుడు మేము నీకు [3]నిష్టంబు లగు పూజ
లాచరింపకున్న నైన నధిక
మైన నీ కృపాకటాక్ష వీక్షణములఁ
జక్కఁ జూచి తగఁ బ్రసన్నుఁ డగుచు. 49

1. పరమేశ్వరునకు (హ) 2. మాకునీదు (క.ట.డ.జ.) 3. నిష్టమై తగుపూజ (క.త.జ.డ.)

క. [1]వర మీయఁదలఁచి మమ్ముం, గరుణించితి గాక నిన్నుఁ గనుగొనుటకు నై
యరసి నుతింపఁగ మాకుం, దర మగునే? వరద! నీరద శ్యామాంగా! 50

వ. మఱియు నిస్సంగులై నిశిత జ్ఞానంబునంజేసి దోషరహితులై భవత్స్వభావులు *(నాత్మారాములు నగు మునులకు) స్తుతియింపం దగిన గుణంబులు గలవాఁడ వగుచు నుండియుఁ బ్రసన్నుండవు *(స్ఖలన క్షుత పతన జృంభణాది దురవస్థ లందును) జ్వర మరణాధి దుర్దశలందును, గల్మషనాశకరంబులైన భవ ద్దివ్య నామంబులు మా వచనగోచరంబు లగుం గాక. మఱియు నీ రాజర్షి నీతోడ సమానుం డైన కుమారునిం గోరి *(కామంబుల) స్వర్గాపవర్గంబుల నీనోపిన నినుం బూజించి, ధనకాముం డైనవాఁడు ధనవంతునిం జేరి తుషమాత్రం బడిగిన చందంబున, మోక్షనాథుండ వైన నీవలన సంతానంబు గోరుచున్నవాఁడు. జయింపరాని నీ మాయచేత నెవ్వండు మోహంబు నొంది *(విషయాసక్తుండు గాక) యుండు? *(అర్థకాములము, మదాంధులము నగు మేము) నిన్ను నాహ్వానంబు సేసిన యపరాధంబు *(సర్వాత్మకుండ వగుటంజేసి సామ్యంబుచే) మన్నింపందగుదువు. మమ్ముం దయఁజూడుము. అని ప్రణమిల్లిన దేవతాశ్రేష్ఠుం డైన సర్వేశ్వరుండు వర్షాధిపతి యగు నాభిచేతను, ఋత్విక్కులచేతను వందితుం డై దయాకలితుం డగుచు ని ట్లనియె. 51

క. †మునులార! వేదవాక్యము, లను బ్రస్తుతిఁ జేసి సర్వలక్షణముల నా
కెన యగు పుత్రుని నిమ్మని, వినఁ బలికితి రిపుడు మిగుల వేడుకతోడన్. 52

క. [2]నాకాది లోకములలో, నాకున్ సరివచ్చునట్టి నందను నెటు నా
లోకింపలేరు గావున, నాకున్ సరి నేనకా మనమున నెఱుఁగుడీ! 53

వ. అదియునుం గాక భూసురోత్తములు నా ముఖం బగుటం జేసి విప్రవాక్యంబు దప్పింపరాదు. మీరు నా యీడు కుమారు నడిగితిరి గావున నాభిపత్ని యగు మేరుదేవియందు నేనే పుత్రుండ నై జనియించెద. అని పలికి, పరమేశ్వరుం డాగ్నీధ్రీయపత్ని యగు మేరుదేవి చూచుచుండ నా [3]హోమకుండంబున నంతర్ధానంబు నొంది, యానాభిమీఁది దయంజేసి (దిగంబరులు, దపస్వులు, జ్ఞానులు, నూర్ధ్వరేతసునులు నగు నైష్ఠికులకు) యోగధర్మంబుల నెఱింగింపం దలంచి, పుండరీకాక్షుండు నాభిపత్ని యగు మేరుదేవి గర్భాగారంబునం బ్రవేశించె. అంత

† చ. బ. ప్రతులలో, 52-53 కందములకు బదులుగా ఈ క్రింది వచన మున్నది.

'మునీంద్రులార! నన్ను నుపనిషద్వాక్యంబుల ప్రస్తుతి స్తబకంబులం బూజించితిరి గావున ప్రసన్న మనోరథుండ నైతి. నా కెనయగు పురుషుండు లోకాలోకంబుల యందు లేడు.'

1. వర మొసగ దలచి మమ్ముల (చ.డ.బ.) * తా.ప. ప్రతులలోఁ గానరాదు 2. లోకాలోకము లందును (క.ట.జ.డ.ద.) 3. యజ్ఞంబున (హ తం.వా.)

అధ్యాయము - ౪

ఆ. మేరుదేవియందు మేరుధీరుం డగు
హరి సమస్త లక్షణాన్వితుండు
శమదమాది గుణవిశారదుం డుదయించె
సకల జనుల కపుడు సంతసముగ. 55

ఆ. [1]ధవళకాంతియుక్తిఁ దనరు దేహంబును
మహిత బలపరాక్రమంబు వీర్య
మును దలంచి చూచి జనకుండు పేరిడె
సుతుని ఋషభుఁ డనుచు సొంపుతోడ. 56

క. ధరణీసురులును మంత్రులుఁ
[2]బరివారము హితులుఁ బ్రజలు బాంధవులును సు
స్థిరమతి నా బాలకునిం
గర మనురాగమున రాజుఁ గాఁ జూచి రిలన్. 57

క. †పురుహూతుఁ డతనిమహిమలు, సరగున విని, చిత్తమునకు సహ్యము గామిం
బరికించి ఋషభుఁ డేలెడి, ధరణి ననావృష్టి మిగుల దట్టము సేసెన్. 58

ఆ. అది యెఱింగి ఋషభుఁ డంతట యోగమా
యా బలంబుకతన నఖిలరాజ్య
మందుఁ గురియఁ జేసె నత్యంత సంపూర్ణ
వృష్టి దినదినంబు వృద్ధిఁ బొంద. 59

వ. ఇట్లు ఋషభుండు పురందరుండు సేయు [3]దౌష్ట్యంబునకు నవ్వి, యజనాభం బను తన మండలంబు సుభిక్షంబుగాఁ జేసె. నాభియుం దన కోరిన చందంబునం బుత్రుండు జనియించి వృద్ధిఁ బొందుటకు సంతసిల్లి, తనచేత నంగీకరింపంబడు నరలోకధర్మంబు గల పుండరీకాక్షుని మాయావిలసిత మతింజేసి బాలకు నా

1. అతని కాంతియుక్తమైన దేహంబును (క.త.జ.డ.ద.) 2. పరిజనులును హితులు(ట.త.జ.డ.ద.)

† ఈ పద్యమునకు ముందున్న రెండు పద్యములకు బదులుగా 'చ' ప్రతిలో ఈ క్రింది వచనమున్నది.
"ఆ దివ్యపురుషుని దివ్య ప్రభావంబును బలపరాక్రంబును జూచి జనకుండు ఋషభుం డను నామంబున బిలుచుచు నుర్వీ సుపర్వులును పరిజనులును బాంధవ వ్రజంబును నతని రాజుగా జూచి సేవించుచుండన్.''

3. దుర్బుద్ధికి (క.చ.ట.జ.డ.ద.బ.)

తండ్రి యని మోహంబున నుపలాలింపుచుం బ్రజానురాగంబున సర్వసమ్మతుం డైన పుత్రుని *(సమయసేతు రక్షణంబునకుఁ) బూజ్యం బైన రాజ్యంబునం దభిషిక్తుం జేసి, భూసురులకుఁ బ్రధాన వర్గంబునకు నప్పగించి, మేరుదేవిం గూడి నరనారాయణస్థానం బైన బదరికాశ్రమంబునకుం జని, యచ్చట మహాయోగ సమాధిచే *(నరనారాయణాఖ్యుండును, బురుషోత్తముండు నగు వాసుదేవు నారాధించి) క్షీణదేహుం డై యా నాభి హరితాదాత్మ్యంబు నొందె. అంత. 60

చ. సరసత నే నృపాలకుని జన్మమునందును భూసురోత్తముల్
సరసిజనాభునిం దగఁ బ్రసన్నతఁ [1]జేసిన నంత మెచ్చి యీ
శ్వరుఁడు దనంత గర్భమున వచ్చి తనూభవుఁ డై జనించె నా
నరపతి నాభికిన్ సరి యనం దగునే? నరనాథ! యన్యులన్. 61

వ. అంత. 62

సీ. †భూవరుఁ డగు ఋషభుఁడు దన రాజ్యంబు గర్మభూమిగ నాత్మఁ గాంచి జనుల
కందఱకును బ్రియం బగు నట్లు గర్మతంత్రంబెల్లఁ దెలుపంగఁ దలఁచి కర్మ
ములు సేయుటకు గురువులయొద్ద వేదంబు చదివి వారల యనుజ్ఞను వహించి
శతమన్యుఁ డిచ్చిన సతి జయంతీకన్యఁ బరిణయం బై యట్టి పడఁతివలన

తే. భరతుఁ డాదిగ సుతుల నూర్వురను గాంచె
నట్టి భరతుని [2]పేరను నవనితలము
పురవరాశ్రమ గిరి [3]తరు పూర్ణ మగుచు
నమరి భారత వర్ష నామమున మించె. 63

వ. ఆ మహాభారతవర్షంబునందు తమ తమ పేరం గల భూములకుం గుశావర్త ఇలావర్త, బ్రహ్మావర్త, ఆర్యావర్త, మలయకేతు, భద్రసేన, ఇంద్రస్పృక్, విదర్భ, [4]కీకటు లను తొమ్మండ్రు కుమారులను సవతి పుత్రులకుఁ [5]బ్రధానులనుగాఁ జేసె, అంతఁ గవి, హరి, అంతరిక్ష, ప్రబుద్ధ, పిప్పలాయన, ఆవిర్హోత్ర, ద్రమీళ, చమస,

* తా. ప. ప్రతులలో లేదు. 1. బెట్టిన (హ.తం.వా.) † ఋషభుండును తన రాజ్యంబు కర్మభూమిగా నాత్మ నెరింగి జనంబు లందరికిని ప్రియంబగునట్లుగా కర్మతంత్రంబు దెలుపం దలంచి కర్మంబు సేయుచు గురువులవలన వేదాభ్యాసంబుచేసి వారల యనుమతి వడసి శతమన్యుం డిచ్చిన సతిం జయంతి కన్యను పరిణయంబై, య ప్పణతి వలన భరతుం డాదిగా నూర్గురు కుమారులం గాంచె. కులగిరి కుంజంబులం గల ధరణి యా భరతునిపేర భారతవర్షంబని ప్రసిద్ధం బయ్యె. (చ.బ.) 2. పేరధరాతలంబు(హ) 3. కుంజపుంజములను (క.త.డ.ద.బ.) 4. కీకటులను రాజులంగాజేసి (ద) 5. రాజులనుగాజేసె క. చ. ట. త. జ. ద. బ.)

కరభాజను లనువారు తొమ్మండ్రును [1]భాగవతధర్మ ప్రకాశకులైరి. *(భగవన్మహిమోపబృంహితంబు లగు) వారల చరిత్రంబులు ముందఱ నెఱింగించెద. తక్కిన [2]యెనుబది యొక్క కుమారులును ( బిత్రాదేశకరులు, నతివినీతులు ) మహాశ్రోత్రియులు, యజ్ఞశీలురుఁ, గర్మనిష్ఠులు నైన బ్రాహ్మణోత్తములైరి. ఋషభుండు స్వతంత్రుం డై సంసారధర్మంబులం బొరయక కేవలానందానుభవుండై న*(యీశ్వరుం డై యుండియుఁ)బ్రాకృతుండు వోలెఁ గాలానుగతంబు లగు ధర్మంబుల నాచరింపుచు *(ధర్మప్రవర్తకులకు సముండును) నుపశాంతుండును, మైత్రుండును, గారుణికుండు నై ధర్మార్థ యశః ప్రజానందామృతావరోధంబుచే గృహస్థాశ్రమంబులం బ్రజల నియమింపుచుఁ) గొంత కాలంబు నీతిమార్గంబు దప్పక ప్రజాపాలనంబు సేయుచు (వేదరహస్యంబు లగు సకల ధర్మంబులు స్వవిదితంబులైనను)బ్రాహ్మణోపదేశ (పూర్వకంబున ద్రవ్య దేశ కాల వయ శ్శ్రద్ధర్త్విగ్విధోద్దేశోపచితంబులుగ) నొక్కొక్క క్రతువును శత వారంబు యథావిధిగఁ జేసి సుఖంబుండె. అంత.) 64

క. జనవర ! ఋషభుని రాజ్యం, బున నైహికఫలము గోరు పురుషుని నొకనిం
గనుఁగొని నెఱుంగ మెన్నఁడు, నినతేజుం డతనిమహిమ లేమని చెప్పన్! 65

—: ఋషభుండు పుత్రులకు నీతి నుపదేశించుట :—

సీ. ఆ ఋషభుండు రాజ్యంబు సేయుచునుండి యంతట నొక్కనాఁ డాత్మయందుఁ
దలపోసి భూలోకఫల మపేక్షింపక మోహంబు దిగనాడి పుత్రులకును
దన రాజ్యమెల్ల నప్పనచేసి వెనువెంటఁ గొడుకులు మంత్రులుఁ గొలిచి రాఁగ
నల్లన యరిగి బ్రహ్మావర్తదేశంబు నందుల నపుడు మహాత్ములైన

తే. యట్టి మునిజన సమ్ముఖంబందుఁ జేరి
తనదు పుత్రుల నందఱ దాయఁ బిలిచి
పరమపుణ్యుండు ఋషభుండు [3]ప్రణయ మొప్ప
హర్షమందుచు నప్పుడి ట్లనుచుఁ బలికె. 66

అధ్యాయము—౫

ఆ. తనయులార ! వినుఁడు ధరలోనఁ బుట్టిన
పురుషులకును శునకములకు లేని
కష్టములను దెచ్చుఁ గానఁ గామంబుల
వలన బుద్ధి సేయవలదు మీరు. 67

1. భగవద్దర్శనంబు గలవారైరి (క. చ. ట. త. జ. డ. బ.) 2. యెనబదిద్ధ (హ.తం.వా.)
* తా. ప. ప్రతులలో లేదు. 3. భక్తితోడ (హ)

నాయందు భక్తి సేయుటయు, విగత తృష్ణయు, [1]ద్వంద్వతితిక్షయు (సర్వలోకంబులందుల) [2]జంతువ్యసనావగతియు, [3]నీశ్వరవిషయక జ్ఞానాపేక్షయుఁ, (దపంబు,) విగతేచ్ఛయు, మత్కృత కర్మంబులు, మత్కథలు వినుటయు, నన్నె దైవంబుగా నెఱుఁగుటయు, నస్మద్గుణకీర్తనంబు, [4]నిర్వైర సామ్యోపశమంబులు, దేహ గేహంబులందు నాత్మబుద్ధి జిహాసయు, (నధ్యాత్మయోగంబు,) నేకాంత సేవయుఁ, (ప్రాణేంద్రియాత్మల గెలుచుటయుఁ, గర్తవ్యాపరిత్యాగంబు,) సచ్ఛ్రద్ధయు, బ్రహ్మచర్యంబుఁ (గర్తవ్యకృత్యంబులందుల) నప్రమత్తుండగుటయు, వాఙ్నియమనంబు, సర్వంబు నన్నుకా దలంచుటయు, జ్ఞానంబు, విజ్ఞానవిజృంభితం బైన యోగంబు, (ధృత్యుద్యమంబు,) సాత్త్వికంబు నాదిగాఁ గల తెఱంగులచేత లింగదేహంబు జయించి దేహి కుశలుం డగుచు నుండవలయు.

ఆ. అరయఁ గర్మరూప మగు నవిద్యాజన్మ
[5]మైన హృదయబంధనాది లతల
నప్రమత్త యోగమను మహాచ్ఛురికచేఁ
దెంపవలయు నంతఁ దెంపుతోడ. 70

ఆ. ఒనర నిట్లు యోగయుక్తుండు గురుఁ డైన
భూపుఁ డైన శిష్య పుత్రవరుల
యోగమతులఁ జేయ నొప్పుగా వలయును
గర్మపరులఁ జేయఁ గాదు కాదు. 71

సీ. జనులెల్ల నర్థవాంఛలఁ జేసి యత్యంత మూఢులై యైహికంబులు మనంబు
లందులఁ గోరుదు రల్పసౌఖ్యములకు నన్యోన్యవైరంబు లంది దుఃఖ
ములఁ బొందుదురు గాన నలయక గురుఁ డైన వాఁడు మాయామోహ
వశుఁడు నెంత
జడుఁడును నైనట్టి జంతువునందును దయ గల్గి మిక్కిలి ధర్మబుద్ధిఁ

ఆ. గన్ను లున్నవాఁడు గానని వానికిఁ
దెరువుఁ జూపినట్లు దెలియఁ బలికి
యతుల మగుచు దివ్యమైన యా మోక్షమా
ర్గంబుఁ జూపవలయు రమణతోడ. 72

1. ద్వంద్వ నివృత్తి (చ.త.జ.డ.ద.బ.) 2. జంతువ్యసన నిరీక్షణంబును (క. త. డ. ద. బ.)
3. ఈశ్వరదర్శనాపేక్షయు (క.చ.ట.త.డ.ద.బ.) 4. నిరహంకారంబును, కర్మత్యాగేచ్ఛయును(క.బ.)
5. బంధనాదికంబు (క. చ. త. జ. ద. బ.)

వ. మఱియుఁ బితృ గురు (జననీ) బంధు (పతి) దైవంబులలో నెవ్వఁడైనను (సంసారరూప) మృత్యురహితంబైన మోక్షమార్గంబుఁ జూపకుండె నేని వా రెవ్వరును హితులు గానేరరు. నాదు శరీరంబు దుర్విభావ్యంబును, నాదు మనంబు (సత్త్వయుక్తంబును, ధర్మసమేతంబును,) పాపరహితంబు నగుటం జేసి పెద్దలు నన్ను ఋషభుం డండ్రు. కావున (శుద్ధసత్త్వమయం బైన) [1]నా శరీరంబునం బుట్టిన మీర లందఱును సోదరుండు, మహాత్ముండు, నగ్రజుండు నైన భరతు నన్నేకాఁ జూచి (యక్లిష్టబుద్ధిచే భజింపుఁడు. అదియు నాకు శుశ్రూషణంబు.) ప్రజాపాలనంబు సేయుట మీకును బరమధర్మంబు, అని మఱియు నిట్లనియె. 73

సీ. భూతజాలములందు భూజముల్ వర్యముల్ భూరుహంబులకంటె భోగికులము
భోగిసంతతికన్న బోధనిష్ఠులు బోధ మాన్యులకన్నను మనుజవరులు
వీరికన్నను సిద్ధ విబుధ గంధర్వులు [2]వారికన్న నసురుల్ వారికన్న
నింద్రాదిదేవత లిందఱికన్నను దక్షాది సన్మునుల్ దలఁప నెక్కు-

తే. డంతకన్నను భర్గుఁ డా యభవుకన్నఁ
గమలభవుఁ డెక్కుఁ డాతనికంటె విష్ణుఁ
డధికుఁ డాతఁడు విప్రుల నాదరించుఁ
గాన విప్రుఁడు దైవంబు మానవులకు. 74

క. భూసురులకు సరి దైవం, బీ సచరాచరమునందు నెఱుఁగను నాకున్
భూసురులు గుడుచు నప్పటి, యా సంతోషంబు [3]దోఁచ దగ్నులయందున్. 75

సీ. †మంగళం బైన బ్రహ్మస్వరూపంబును వేదరూపంబున నాదిరూప
మగుచున్న నాదు దేహము బ్రాహ్మణోత్తముల్ ధరియింతు రెప్పుడు [4]తత్త్వబుద్ధి
శమదమానుగ్రహ సత్య తప స్తితిక్షలు గల్గు విప్రుండు సద్గురుండు
గాన మిక్కిలి భక్తిగల్గి యకించను లైన భూసురుల దేహములవలన

1. నాశరీరంబున నుద్భవించిన మీరు మీకగ్రజుం డైన (చ. త.) 2. వారికన్నను సురల్ (తం. వా.); "దేవాసు రేభ్యో" మూలము 5-22 "దేవాః అసురేభ్యః" (వ్యాఖ్య.) 3. లేదు యజ్ఞములందున్ (క. చ. ట. త.)

† మంగళ స్వరూపులైన బ్రాహ్మణులు నా రూపంబు గావున సమదమానుగ్రహంబు గలవారు మేదినీసురులు గావున ఇట్లు సచరిత్రులై యకించనులైన భూమీసుపర్వులు నారూపంబుగా నెఱింగి యేకాగ్రచిత్తులై పూజించు వారలు నాకును ప్రియంబు చేసిన వారగుదురు. ఈ విధం బెఱింగినవారు మోక్షమార్గంబున జెందుదురు (చ.బ)

1. తాత్పర్యబుద్ధి (క.జ.ఢ.ద.బ.)

తే. నందుచుండును నాదుదేహంబు గాఁగ
[1]నెఱిఁగి వరులగు విప్రుల నెల్ల భక్తిఁ
బూజ సేయుటయే సన్నుఁ బూజసేయు
టనుచు వినుపించి మఱియు ని ట్లనుచుఁ బలికె. 76

క. ఈ తెఱఁగుఁ దెలిసి భూసుర, జాతిం బూజించునట్టి జనుఁడును మాయా
తీతుం డై నిక్కంబుగ, భూతలమున మోక్షమార్గమును బొడగాంచుఁ. 77

వ. ఇట్లు సదాచారులగు కుమారులకు [2]లోకానుశాసనార్థం బాచారంబు లుపదేశించి, మహాత్ముండుఁ,బరమసుహృత్తుననగు భగవంతుండు ఋషభాపదేశంబునం గర్మ త్యాగంబుఁ జేసి *(యుపశమశీలు రగు) మునులకు భ క్తిజ్ఞాన వైరాగ్య లక్షణంబులు గల పారమహంస్య ధర్మం బుపదేశింపం గలవాఁ డగుచుఁ,బుత్రశతంబు నం దగ్రజుండుఁ (బరమభాగవతుండు, భగవజ్జనపరాయణుండు) నగు భరతుం (ధరణీపాలనంబునకుఁ) బట్టంబు గట్టి, తాను (గృహమందె) దేహమాత్రావలంబనంబుఁ జేసి, దిగంబరుం డై యున్మత్తాకారుం డగుచుం (బ్రకీర్ణకేశుం డై) యగ్నుల నాత్మారోపణంబు సేసి, బ్రహ్మావర్తదేశంబును బాసి, జడాంధ బధిర మూక పిశాచోన్మాదులుంబోలె నవధూతవేషంబునొంది, జనులకు మాఱువలుకక, మౌనవ్రతంబునం బుర గ్రామ (కర) జనపదారామ శిబిర వ్రజ ఘోష సార్థ గిరి వనాశ్రమాదులయందు వెంటం జనుదెంచు దుర్జన (తర్జన) తాడనావమానమేహన నిష్ఠీవన పాషాణ శకృద్రజః ప్రక్షేపణ పూతివాత దురుక్తులం బరిభూతుం డై నను గడనం బెట్టక, వనమదేభంబు మక్షికాది కృతోపద్రవంబును బోలెఁ గైకొనక, దేహాభిమానంబునం జిత్తచలనంబు నొందక, యేకాకి యై చరియింపుచుండ, నతిసుకుమారంబు లగు కరచరణోరస్స్థలంబులు (విపులంబులగు బాహ్వంస కంఠ వదనాద్యవయవ విన్యాసంబులుం గలిగి, ప్రకృతిసుందరం బగుచు స్వతస్సిద్ధ దరహాస రుచిర ముఖారవిందంబై, నవ నళిన దళంబులఁ బోలి శిశిర కనీనికలఁ జెలువొంది, యరుణాయతంబు లగు నయనంబులచే నొప్పి, యన్యూనాధికరంబు లగు కపోల) కర్ణ కంఠ నాసాదండంబులచేఁ దేజరిల్లుచు, విగూఢ స్మితవదన విభ్రమంబులఁ బ్రకాశించు తన దివ్యమంగళవిగ్రహంబుచేఁ బురసుందరుల మనంబుల నతిమోహంబు గలుఁగజేయుచు. 78

ఆ. ధూళిచేత మిగుల ధూసరితంబు నై
జడలుగట్టి కడు పిశంగవర్ణ
ము నగు కేశపాశమును వెలిఁగింపుచు
నితరు లెవరుఁ దన్ను నెఱుఁగకుండ. 79

---

1. నెరిగి ఏకాంతులై విప్రవరుల నెల్ల (క.జ.డ.) 2. లోకప్రదర్శనార్థంబు (క.ట.త.డ.ద.)
* తా.ప. ప్రతులలో లేదు.

క. అవధూతవేషమున ని, ట్లవనిఁ మలినంబు లైన యవయవములతోఁ
దవిలి జరింపుచు [1]నుండెను, భువి భూతాక్రాంతుఁ డైన పురుషుని మాడ్కిన్. 80

ఆ. జనుల కిట్లు యోగసంచార మెల్ల వి
రుద్ధ మనుచు నాత్మ[2]బుద్ధిఁ జూచి
యజగరంబు మాడ్కి నవనిపై నుండె బీ
భత్సకర్మమునకుఁ బాలుపడుచు. 81

వ. ఇట్లు బీభత్సరూపంబున వసుంధరం బండియుండి, యన్నంబు భుజియింపుచు, నీరు ద్రావుచు, మూత్రపురీషంబులు విడుచుచు, నవి శరీరంబున నంటం బొరలుచుండె. మఱియుఁ దత్పురీష సౌగంధ్య యుక్తం బగు వాయువు దశదిశల దశయోజన పర్యంతంబు పరిమళింప జేయుచుండ, గో మృగ కాక చర్యలం జరియింపుచు, భగవదంశంబైన ఋషభుండు మహానందంబు ననుభవింపుచుం, దనయందు సర్వభూతాంతర్యామి యగు వాసుదేవునిం బ్రత్యక్షంబుగాఁ గనుఁగొనుచు, సిద్ధిం బొందిన వైహాయస మనోజవ పరకాయప్రవేశాంతర్ధాన దూరగ్రహణ శ్రవణాది యోగసిద్ధులు దమంత వచ్చినం గైకొనక యుండె. అని పలికిన శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్న రేంద్రుం డి ట్లనియె. 82

అధ్యాయము — ౬

క. మునివర యోగజ్ఞానం, బునఁ జెఱుపంబడ్డ కర్మములు గల పెద్దల్
గనియుండెడి యైశ్వర్యం, బును ఋషభుం డెఱిఁగి యేల పొందకయుండెన్?

వ. అనిన శుకుం డిట్లనియె. 84

మ. ధరణీవల్లభ! నీదు వాక్యములు దథ్యం బింతయుం దప్ప దె
ట్లరయన్ వన్యమృగంబు పట్టువడి తా నావేళ నా లుబ్ధకున్
ధర వంచించిన మాడ్కి నింద్రియములం దండించి చిత్తంబు ని
ర్భర కామాదుల కాసయిచ్చుఁ గడు సంరంభంబుతోఁ గ్రమ్మఱన్. 85

క. చిరకాలతపము నైనను, హరియింపఁగ నోపుఁ జిత్త మని పెద్దలు న
మ్మరు జారులకును జారిణి, కరణి [3]నచరించు మనసు కామాదులకున్. 86

క. కామక్రోధాదులు గా, భూమీశ్వర! కర్మబంధములు మఱియును జే
తోమూలము లగుటను దా, రీ మహిలో మనసు నమ్మ రెప్పుడు పెద్దల్. 87

1. నుండును (హ) 2. రోసిజూచి (క.బ.) 3. మరలించు (బ)

సీ. అది గాన నెన్నఁడు నైశ్వర్యములను జేపట్టఁ జూడఁడు [1]లోకపాలముఖ్యు
లైనవారలచేత నభినందనము లొంది వెలయంగ నవధూత వేషభాష
ణంబుల నెఱిఁగికొనఁగరాని భగవత్స్వరూపంబు గలిగి [2]యా రూపమందుఁ
బరమయోగ ధ్యానపరులకు నెల్ల దేహత్యాగ సమయంబు నంతలోనఁ

తే. [3]జూపుచుండియు దేహంబుఁ [4]బాప నిచ్చ
యించె నచ్చట దివ్యయోగీంద్రుఁ డాద్యుఁ
డతుల దివ్య ప్రకాశకుఁ డమరగురుఁడు
పరమపురుషుండు ఋషభుండు పార్థివేంద్ర! 88

వ. *(అంత విముక్త లింగుండు, భగవంతుండు నగు ఋషభుండు మనంబున దేహాభిమానంబు విసర్జించి, కులాలచక్రంబు కులాలునిచే భ్రమియింపఁబడి విసృష్టంబైనను భ్రమియించుగతిం బ్రాచీన సంస్కారవిశేషం బగు నభిమానాభాసంబున దేహచలనాదికంబుల నొప్పియుండియు, యోగమాయా వాసనచే యుక్తుం డయ్యె. మఱియు నా ఋషభుం డొక్క దినంబునం †గొంకణవంక పటకుటకంబు లను దక్షిణ కర్ణాట దేశంబులకు యదృచ్ఛచేఁ జని, కుటకాచలోపవనంబున నిజాస్యకృత శిలాకబళుం డగుచు, నున్మత్తుని చందంబున వికీర్ణకేశుండు, దిగంబరుడునై సంచరింప, వాయువేగ విధూత వేణు సంఘర్షణ సంజాతం బగు నుగ్రదావానలంబు తద్వనంబు దహింప నందు దగ్ధుం డయ్యె. అంత నతని కృత్యంబులు త ద్దేశవాసు లగు జనంబులు చెప్ప నర్హన్నామకుం డగు త ద్రాష్ట్రాధిపతి విని, నిజధర్మంబులం బరిత్యజించి, స్వదేశస్థులతోడం గూడి, దానాయాచారంబుల నంగీకరించి, యధర్మ బహుళం బగు కలియుగంబున భవితవ్యతచే మోహితుండై మనుజులు నసమంజసం బగు పాషండ మతాభినివేశులం జేసె.) మఱియును గలియుగంబునందు మనుజాధములు దేవమాయా మోహితులై శాస్త్రోక్త శౌచాచారంబులు విడిచి, నిజేచ్ఛం జేసి [5]దేవతాహేళనంబులు సేయుచు, నస్నానానాచమనాశౌచ కేశోల్లుంచనాదికాపవిత్ర వ్రతంబులం జేయుచు నధర్మ బహుళం బగు కలియుగంబునం జెఱుపంబడ్డ బుద్ధిధర్మంబుల గలిగి, వేద బ్రాహ్మణ యజ్ఞపురుషుల దూషింపుచు లోకంబులం దమ తమ మతంబులకుం దామే సంతసింపుచు, నవేదమూలం బగు స్వేచ్ఛంజేసి బ్రవర్తించి, యంధపరంపరచే విశ్వాసంబు నేసి, తమంతన నంధ తమసంబునం బడుచు నుండుదురు.

1. లోకభవ్యులైన వారలచే (హ) 2. యారూఢి నంత (తం) 3. అరయ జూపుచు నుండి దేహంబుబాప, నిశ్చయించెను దివ్యయోగీంద్రు డాద్యు (బ) 4. ప్రాయ (?) * తా.ప. ప్రతులలో లేదు.
† కోరకణ లేక కోంకణ? మూలములో 'కోరకణ' అని కలదు. 5. నింద (క. తం.)

ఈ ఋషభుని యవతారంబు [1]రజోవ్యాప్తు లగు పురుషులకు మో
నుపదేశించుటకు నయ్యె. అదియునుం గాక సప్తసముద్ర పరివృత
ఖాద్వీప వర్షంబులందలి జనంబులు దివ్యావతార ప్రతిపాదకంబు, ల
నగు నెవ్వని కృత్యంబులం గీర్తింతురు, మఱియు †(నెవ్వని వంశం
మంతుం డగు ప్రియవ్రతుండు గలిగె, నెందు జగదాద్యుం డగు పు
డవతారంబు నొంది కర్మహేతుకంబులు గాని మోక్షధర్మంబుల
వెండియు నెవ్వండు యోగమాయా సిద్ధుల నసద్భూతంబు లగుటంజే
నట్టి ఋషభునితోడఁ ద త్సిద్ధికృత ప్రయత్ను లగు నితరయోగీశ్వ
రథంబున నైన నెట్లు సరి యగుదురు?) ఇట్లు సకల వేదలోక దేవబ్ర
గోవులకుం బరమగురుండు, భగవంతుండు నగు ఋషభు చరిత్రంబ
లకు దుశ్చరిత్రంబు దొలంగు. మంగళంబులు సిద్ధించు మిక్కి
నెవ్వండు విను, వినుపించు, వానికి హరిభక్తి దృఢం బగు. అ
తాత్పర్యంబునం బెద్దలు భాగవతు లగుటంజేసి సంప్రాప్త సర్వపు
వివిధ వృజిన హేతుకం బగు సంసార తాపంబును బాసి, యవిరతం
యోగామృత స్నానంబుఁ జేసి పరమపురుషార్థం బైన *మోక్షంబును
అని సప్తద్వీపంబులవారు నేఁడునుం గొనియాడుచుండుదురు.

ఆ. యాదవులకు మీకు నత్యంత కులగురు
వైన కృష్ణుఁ డచట నైనఁ గలఁడు
కొలుచువారి కెల్ల సులభుఁ డై మోక్షంబు
నిచ్చుఁ జింత సేయనేల? నీకు.

సీ. నిత్యానుభూత మౌ నిజరూపలాభ నివృత్త మై దగు మహాతృష్ణ గ
యతులిత విపుల మాయా రచితం బైన లాభంబునకుఁ దగులంబు
మతి గల్గి లోకుల నతివేడ్కఁ గరుణించి యభయదానం బిచ్చి య
నవ్యయం బై దివ్య మై మహానంద మై యత్యంత సేవ్య మై య

1. బ్రహ్మ క్షత్రియులకు (క)

† ఏ వంశంబునందు శ్రీహరి యవతరించి మహాయోగధర్మ ప్రకాశంబుసేసె న
చరిత్రంబు మనోరథంబున నైనను బొందలేరు. అతండు యోగమాయను నిరసించి మా
సకల సిద్ధుల నసత్యంబుగా దలచె. ఇట్లు సర్వలోక పూజ్యులైన దేవబ్రాహ్మణులకును
పరమ గురుండగు ఋషభుని చరిత్రంబు నెవ్వరు వినినను దుశ్చరితంబులు తొలంగు (క.బ)

* ఇట "పరమ పురుషార్థ మపి స్వయమాసాదితం నోఏవాద్రియంతే" యని మూల
హరికథామృత పానంబున నిర్వృతులై పరమపురుషార్థంబైన మోక్షంబున పేక్షింపరని వ్రాఁత

తే. తనదు లోకంబు చూపంగఁ దగినయట్టి
మోక్షమార్గంబు నెఱిఁగించి ముక్తదేహుఁ
డగుచుఁ దాదాత్మ్య మొందెఁ బ్రత్యక్ష విష్ణు
వైన ఋషభుండు జనులకు నద్భుతముగ. 91

అధ్యాయము — ౭

—: భ ర తో పా ఖ్యా న ము :—

మ. భరతుం డంత ధరాతలంబు గడఁకం బాలింపుచున్ ధారుణీ
శ్వరచంద్రుం డగు విశ్వరూపునకు మున్ సంజాత యై యుండి ని
ర్భరకాంతిన్ విలసిల్లు పంచజని పేరం గల్గు కాంతామణిం
గర మర్థిం ధరఁ బెండ్లియాడె శుభలగ్నం బందు భూవల్లభా! 92

వ. ఇట్లు వివాహితుం డై యా పంచజనివలన నహంకారంబునం బంచతన్మాత్రలు జనియించిన తెఱంగున సుమతి, రాష్ట్రభుక్, సుదర్శన, ఆవరణ, ధూమ్రకేతువు లను నేవురు పుత్రులం బుట్టించె. అటమున్న నజనాభం బను పేరంగల వర్షంబు భరతుండు పాలించుకతంబున భారతవర్షంబు నాఁ బరగె. అంత. 93

క. భరతుఁడు [1]నిజపిత లేలిన, కరణినిఁ గర్మముల నెల్ల గైకొని ప్రజలన్
హరికృప నొందుచు నేలెను, ధరణీసురవరులు వొగడ ధరణీనాథా! 94

సీ. భగవంతుఁ డగు జగద్భరితు నల్పంబులు నధికంబు లైన పెక్కధ్వరముల
దర్శ పూర్ణిమలచేఁ దగను జాతుర్మాస్యముల నగ్నిహోత్రమువలనఁ గడఁకఁ
బశు సోమములచేతఁ బలుమాఱు పూజించి వేదోక్త మైన యా విమలకర్మ
ములఁ గల్గు ధర్మంబు పురుషోత్తమార్పణంబుగఁ జేయుచును మఖంబులను మంత్ర

తే. ములను బలికెడు నా దైవములను శ్రీశు
నవయవంబులుగాను భూధవుఁడు ప్రేమ
ననుదినంబును బాయక ఘనత దలఁచి
యఖిల రాజ్యానుసంధానుఁ డగుచు నుండె. 95

క. ఈరీతిఁ గర్మసిద్ధుల, నారయ నత్యంతశుద్ధ మగు చిత్తముతో
నా రాచపట్టి భరతుఁడు, ధారుణిఁ బాలించె నధిక ధర్మాన్వితుఁ డై. 96

వ. మఱియు నా భరతుండు శ్రీవత్స కౌస్తుభ వనమాలాలంకృతుండును, సుదర్శనాద్యాయుధోపలక్షితుండును, నిజభక్తజన హృదయారవింద వాసుండును, బరమ

1. పూర్వజు లేలిన (క. తం.)

పురుషుండును నైన వాసుదేవునియందు నధికభక్తి ననుదినంబును
నేఁబదిలక్షలవే లేండ్లు రాజ్యంబు చేసి, పితృ పితామహోద్యా
ధనంబును యథార్హంబుగఁ బుత్రులకుఁ బంచియిచ్చి, బహువిధ స
గృహంబును బాసి, పులహాశ్రమంబున కరిగె నంత,

సీ. ఏ యాశ్రమంబున నిందిరాధీశ్వరుఁ డచ్చటి వారల నాదరించి
ప్రత్యక్షమున నుండుఁ బాయక యెప్పుడు నట్టి రమ్యం బైన యా
నిలిచి సాలగ్రామములు గల [1]గండకీనది యెందు నెంతయు గదిసి
న చ్చోట నేకాకి యగుచును భరతుండు బహువిధ నవపుష్ప పల్లవ

తే. నతుల తులసీదళంబుల నంబువులను
గందమూలాది ఫలములఁ గంజములను
ఘనత నర్పించి నిచ్చలుఁ దనివిలేక
సేవచేయుచు నుండె నా శ్రీశు హరిని.

వ. దానం జేసి విగత విషయాభిలాషుం డై శమదమాది గుణంబు
యథేచ్ఛం జేసి యెడతెగక పరమపురుషుని పరిచర్యాభక్తిభరంబు
హృదయగ్రంథిం గలిగి, సంతోషాతిశయంబునం బులకితాంగుండు,
*(నిరుద్ధావలోక) నయనుండు నగుచు నిజస్వామి యైన హరిచరణ
ధ్యాన (పరిచితభక్తి) యోగంబునం బరమానంద (గంభీర) హృద
నమృత [2]హ్రదంబున నిమగ్నుం డగుచుఁ, దా నపుడు పూజించు
గక యిట్లు భగవద్వ్రతంబు ధరియించి, యేణాజిన వాస స్త్రిషవ
బుల నార్ద్రకుటిల కపిశవర్ణ జటాకలాపంబులు గలిగి, మార్తాండాం
పరమేశ్వరుని హిరణ్మయ పురుషునిం గాఁ దలంచుచు ని ట్లనియె.

సీ. కర్మఫలంబులఁ [3]గడఁక నిచ్చుచు మనోవ్యాపారమున నిట్టి యఖిల
ములఁ జేసి యా లోకములకు నంతర్యామి యగుచుఁ బ్రవేశించి
నానందరూప మైనట్టి బ్రహ్మముఁ గోరుచున్న [4]జీవునిఁ దన యోగ
శక్తిచేఁ దగ ననిశంబుఁ బాలన సేయుచుండి యంతటను మార్తాం

ఆ. వర్తి యగుచు నిట్లు వఱలుచు జగముల
యందు నుండి ప్రకృతిఁ బొంద కంత
నతుల దివ్యమూర్తి యైన యానంద రూ
పమును శరణ మొందె భరతవిభుఁడు.

1. చక్రతీర్థంబుచే పవిత్రంబుగాన (డ) * తా. ప. ప్రతులలో లేదు. 2. 
(క.చ ట.త.జ.డ.) 3. కడుసమర్పణ (క); గడవరించుచు (చ. ట. త.) 4. జీవుని
యోగ (హ); జీవుఁ డనయం దున్న యోగ (తం)

అధ్యాయము - ౮

వ. అంత నా భరతుం డొక్కనాఁడు [1]మహానదిం గృతాభిషేకుం డై ముహూర్త త్రయం బంతర్జలంబులందుఁ బ్రణవోచ్చారణంబు సేయుచుండు సమయంబున, నిర్భరగర్భిణి యగు హరిణి జలార్థిని యై యొంటి జలాశయ సమీపంబునకు వచ్చి, జలపానంబు సేయునెడ నా సమీపంబున మృగపతి గర్జించి (లోక భయంకరంబుగ) నాదంబు సేయ, హరిణి స్వభావంబున భీతయగుటం జేసి బెగ్గడిలి (హరివిలోకన వ్యాకులచిత్త యై) దిగ్గన [2]నదరి గగనంబునకు[3]నెగిరి, *యవగతతృష యగుచు నది నుల్లంఘించునెడ నధికభయంబునం జేసి యా గర్భంబు యోనిద్వారంబున గళితం బై జలంబులం బడియె. (ఆ హరిణి యుల్లంఘనాది భయంబునం జేసి) తత్తీరంబున నుండు (గిరిదరిం) బడి శరీరంబును బాసె. అంత నా హరిణపోతంబు జలంబులం దేలుచున్న, భరతుండు గనువిచ్చి చూచి కరుణార్ద్రచిత్తుం డై (మృతజనని) యగు హరిణపోతంబును దన యాశ్రమంబునకుఁ గొనిపోయి, మిక్కిలి ప్రీతింజేసి యుపలాలనంబు సేయుచుండఁ బోషణ పాలన ప్రీణన లాలనానుధ్యానంబుల భరతునకు నాత్మ నియమంబులైన యష్టాంగ యోగంబులును బరమ పురుష పూజా పరిచర్యాదులు నొక్కొక్కటిగఁ గ్రమక్రమంబునం గొన్ని దినంబులకు సమస్తంబు నుత్సన్నం బయ్యె. అంత. 101

క. ఘనతపము చలన మొందుట, యును భరతుం డెఱుఁగ కాత్మయోగంబునఁ జ
య్యనఁ బాసె హరిణపోతము, దన మదిలో నిల్పి ప్రీతిఁ దప్పక పలికెన్. 102

ఉ. అక్కట! తల్లిఁ బాసి హరిణార్భక మాప్తులు లేమిఁజేసి యే
దిక్కును లేకయున్న నిటఁ దెచ్చితి నాయెడ నీ మృగార్భకం
బెక్కుడు ప్రేమఁజేసి జరియింపుచునున్నది నాదుసన్నిధిన్
మక్కువచేసి దీనిఁ గడు మన్ననలం దగఁ బ్రోతు నెంతయున్. 103

క. శరణ మని వచ్చు జంతువుఁ, గరుణం గనువిచ్చి చూచి కాచినఁ బుణ్యం
బరయఁగ నధికం బని ము, [4]న్నెఱిఁగించిరి సన్మునీంద్రు లెల్లం బ్రేమన్. 104

వ. అని యిట్లు హరిణపోతంబుం దన యాశ్రమంబున నత్యాసక్తింజేసి యాసన శయనాటన స్నాన సమిత్కుశ కుసుమ ఫల పలాశ మూలోదకాహరణ దేవ పూజా జపాదులయెడం దన యొద్దన యునిచికొనుచు, వృక సాలావృకాది

1. చక్రతీర్థంబున (క) 2. నుదరి (క. చ. ట. ద. తం) 3. నెగసిన నుద్దవడికి గర్భంబు స్రవించి శంబరంబులం బడియె (క. బ.) 4. కరమెఱిఁగించెను మునీంద్ర గణముల్ ప్రేమన్ (హ)

* అగతతృషా - అని మూలము.

క్రూరమృగంబులవలని భయంబున వనంబుల వెనువెంటం దిరుగుచు నధిక ప్రణయభర పరీతహృదయుం డగుచు, నతి స్నేహంబునంజేసి గొంతసేపు స్కంధంబుల వహించుచు,మఱి గొంతతడ వురంబున నుత్సంగంబున నుంచికొని లాలింపుచు, సంతసంబు నొందు. మఱియు నా భరతుండు నిత్య నైమిత్తికాది క్రియాకలాపంబు నిర్వర్తించునెడ నంత నంత లేచి హరిణకుణకంబుం జూచుచుఁ, గించి త్స్వస్థహృదయుం డై దాని నాశీఃపరంపరల (నభినందించుచుం) జుంబనాదులం (బ్రీతి సేయుచు) నతిమోహంబునఁ బెంచుచుండు నెడ. 105

చ. †గురువులు వాఱి బిట్టుఱికి కొమ్ములఁ జిమ్ముచు నంతనంత ద
గ్గఱుచును గాలు ద్రవ్వుచు నఖంబుల గీఱుచు గాసి సేయుచు
న్నొఱుగుచు ధారుణీశ్వరుని యూరువులన్ శయనించి యంతలో
నఱకడ మెక్కుచుం బొదలి యాడుచు నా హరిణంబు లీలతోన్. 106

తే. గరిమ నీరీతి నెల్లెడఁ గెరలు వొడిచి
చెలఁగి యాడంగ భరతుండు చిత్తమందు
సంతసిల్లుచునుండె నాశ్రమముఁ బాసి
హరిణడింభక మంతలో నుఱికి చనియె. 107

వ. భరతుం డంతఁ (ద న్మృగశాబకంబు గానంబడమి మిక్కిలి వ్యాకులితచిత్తుం డగుచు, నష్టధనుండువోలె నతిదీనుం డై కరుణతోడం గూడి, త ద్విరహవిహ్వలమతి యై దానిన తలంచుచు నతిశోకంబుతో) మనంబున దుఃఖించి యిట్లనియె.

తే. హరిణపోతంబ! నీకు వనాంతమందుఁ
గ్రూరమృగబాధ లేకుండఁ గోరుచుండఁ
దలఁగిపోయితె? యనుచుఁ జిత్తంబునందు
రాజఋషభుండు భరతుఁ డారాట మొంది. 109

తే. తల్లిచచ్చిన హరిణపోతంబు వచ్చి
పుణ్యహీనుండ నగు నన్నుఁ బొంది పాసె
నేమి సేయుదు? నే నింక నెట్లు గందుఁ?
జేరి యేరీతిఁ గాంచి రక్షించువాఁడ? 110

క. కట్టా! యీ యాశ్రమమునఁ, బుట్టిన తృణచయము మేసి పొదలిన హరిణం
బిట్టట్టుఁ దిరుగుచుండఁగఁ, బట్టి మృగేంద్రుండు గొట్టి బాధించె నొకో! 111

† ఈ పద్యము (హ) లో లేదు.

ఇట్లు భరతుండు హరిణకుణక క్షేమంబు గోరుచు నెప్పుడు వచ్చి నన్ను సంతోష
పఱుచు? నానాప్రకారంబు లైన తన గతులచేత నెప్పు డానంద మొందించు?
ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుం గొమ్ముల గోకుచు నుండునట్టి వినోదంబు
లెప్పుడు గనుఁగొందు? దేవపూజా ద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనినం
గోపించి చూచినం గుమారుండు వోలె దూరంబునకుం జని నిలిచిన మఱల నేఁ
బిలిచిన వెనుక నిలిచియుండు నిట్టి మెలఁకువ స్వభావంబు గలుగుట యెట్టు?
ఈ భూదేవి యెంత తపంబుఁ జేసినదియో? ఏ హరిణపాద స్పర్శంబులం
బవిత్రం బైన భూమి స్వర్గా (పవర్గ) కాములైన మునులకు యజ్ఞార్హ యగు
నట్టి హరిణపోతంబు నెట్లు గనుఁగొందు? అదియునుం గాక భగవంతుం డగు
చంద్రుండు మృగపతిభయంబున మృతజననియు, స్వాశ్రమ పరిభ్రష్టంబు నైన
మృగశాబకంబును గొనిపోయి పెంచుచున్నవాఁడొ? మున్ను పుత్రవియోగ
తాపంబును జంద్రకిరణంబులం బాపుదు. ఇపుడు హరిణపోతంబు దన శరీర
స్పర్శంజేసి చంద్రకిరణంబులకన్న నధికం బగుచుఁ బుత్రవియోగ తాపంబు
నివర్తింపం జేసె. అనుచుం బెక్కుభంగుల హరిణనిమిత్తంబు లైన మనోరథం
బులచేతం బూర్వకర్మవశంబున యోగభ్రష్టుం డగు భరతుండు భగవదారాధ
నంబువలన విభ్రంశితుం డగుచు, నితరజాతిం బుట్టిన హరిణపోతంబు మీఁది
మోహం బగ్గల బగుచుండ నుండె. అని పలికి శుకయోగీంద్రుండు మఱియు
నిట్లనియె. 112

జననాథ! మున్ను మోక్షవిరోధ మని పాయఁగారాని పుత్రాదికంబు లెల్లఁ
బాసి తపస్వియై భరతుండు హరిణశాబక పోషణంబునఁ బాలనమున
నతిలాలన ప్రీణనానుషంగంబున మూషకబిల మతిరోషమునను
సర్పంబు జొచ్చిన చందంబునను యోగవిఘ్నంబు మిక్కిలి విస్తరిల్లెఁ*

గాన నెంతవాని కైనను గాలంబు
గడవరామి నట్లు గాకపోదు
పరమమునుల కైనఁ బాయదు కర్మంబు
నరు లనంగ నెంత? నరవరేణ్య! 113

ఇట్లు భరతుండు మృగవియోగతాపంబు నొందుచుండు నెడ నా మృగశాబకంబు
చనుదెంచిన సంతసిల్లుచుండె. అంత నొక్కనాడు. 114

* రాజర్షే ర్భరతస్య తావ న్మృగార్భక పోషణ పాలన ప్రీణన లాలనానుషంగే ణావిగణయత
ః మహిరి వాఖుబిలం దురతిక్రమః కాల కరాళరభస ఆపద్యత — అని మూలము. 5-8-23.

మ. భరతుం డల్లన నంత్యకాలము వెసం బ్రాపించఁగా నప్పు డా
హరిణంబుం గడుభక్తిఁ బుత్రుగతి నత్యాసక్తి వీక్షింప నా
హరిణంబుం దన యాత్మలో నిలిపి దేహం బంతటం బాసి తా
హరిణీగర్భమునం జనించి హరిణం బై యొప్పెఁ బూర్వస్మృతిన్. 115

వ. ఇట్లు భరతుండు హరిణీగర్భంబునం బుట్టియు భగవదారాధన సామర్థ్యంబునం దన మృగత్వ కారణంబు దెలిసి, మిక్కిలి తాపంబు నొందుచు నిట్లనియె. 116

ఉ. రాజులు ప్రస్తుతింప వసురాజ సమానుఁడ నై తనూజులన్
రాజుల జేసి తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజమునొంది యా హరిణదేహము నందులఁ బ్రీతిఁ జేసి నా
యోజ చెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేల నై. 117

వ. ఇట్లు శ్రీహరి శ్రవణ మనన సంకీర్త నారాధ నానుస్మర ణాభియోగంబులం జేసి యశూన్య సకలయామం బగు కాలంబు గల నాకు హరిణ పోతస్మరణంబునంజేసి (యోగ) విఘ్నంబు ప్రాప్తం బయ్యె. మోక్షదూరుండ నైతి. అని (నిగూఢ నిర్వేదుం డగుచుఁ) దల్లిం బాసి క్రమ్మఱ నుపశమశీల మునిగణ సేవితం బై భగవత్ క్షేత్రం బైన సాలతరు నిబిడతమ గ్రామసమీప పులస్త్య పులహాశ్రమంబునకుం (గాలాంజన పర్వతంబు) వలనం జనుదెంచి, యందు మృగ దేహత్యాగావసానంబు గోరుచు (సంగంబు విడిచి) యేకాకి యగుచు, శుష్క పర్ణ తృణ వీరుదాహారుం డై * (మృగత్వ నిమిత్తం బగు) నా నదీ తీర్థంబునందుఁద త్తీర్థోదక క్లిన్నం బగుచునుండు శరీరంబు విడిచె. అని శుక యోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకు వినుపించి మఱియు నిట్లనియె. 118

అధ్యాయము - ౯

సీ. హరిణదేహముఁ బాసి యంత నాంగిర[1]సాన్వయుండు శుద్ధుపవిత్రుండుఘనుఁడు
శమదమ ఘనతప స్స్వాధ్యాయ నిరతుండు గుణగరిష్ఠుఁడు నీతికోవిదుండు
నైన బ్రాహ్మణునకు నాత్మజుం డై పుట్టి సంగంబువలనను జకితుఁ డగుచుఁ
గర్మబంధంబుల ఖండింపఁజాలు నీశ్వరుని నచ్యుతు నజు శ్రవణ మనన

తే. ములను హరి చరణధ్యానములను విఘ్న
భయమునను జేసి మనమందుఁ బాయనీక
నిలిపి సంస్తుతి సేయుచు నిలిచియుండె
భరిత యశుఁ డైన భరతుండు పార్థివేంద్ర! 119

1. ఆప్వయుఁడు (హ.)

వ. ఇట్లాంగిరసుండు ప్రథమ భార్యయందుఁ బుత్ర నవకంబును, గనిష్ఠభార్యయందు స్త్రీపురుషుల నిద్దఱను గలుగఁజేసిన నందుఁ బురుషుండు, బరమ భాగవతుండు, రాజర్షి ప్రవరుండు, నుత్సృష్ట మృగశరీరుండుఁ, జరమ శరీరంబునం బ్రాప్త విప్రశరీరుండు నగు భరతుం డై శ్రీహరి యనుగ్రహంబునం బూర్వజన్మ పరంపరల సంస్మరింపుచుఁ దన స్వరూపం బున్మత్త జడాంధ బధిర రూపంబున లోకులకుం జూపుచుండె. అంత. 120

మ. [1]జనకుం డౌటను విప్రుఁ డాత్మజుని వాత్సల్యంబునం బెంచుచున్
దనరం జౌలముఖాగ్ర్య కర్మలచేతన్ సంస్కృతుం జేసి పా
యని మోహంబున నిచ్చలుం గడఁగ శౌచాచారముల్ సెప్పినన్
ఘనుఁ డా [2]విప్రసుతుం డసమ్మతినిఁ దత్కర్మంబులన్ గైకొనెన్. 121

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుండు గర్మంబులయందు నిచ్చ లేకయుండియును [3]పితృనియోగ నిర్బంధంబునం (బితృ సన్నిధియందె యసమీచీనంబుగా వ్యాహృతి ప్రణవశిర స్సహితం బగునట్లు)గాయత్రీమంత్రోపదేశంబు నొంది,చైత్రాది చతుర్మాసంబుల సమవేతంబుగ వేదంబుల నధ్యయనంబు సేయుచుండె. జనకుం డాత్మజుని శిష్టాచారంబుచే శిక్షింపవలయు నను లోకాచారంబు ననువర్తించి, యాత్మభూతుం డగు నాత్మజునందు నభినివేశిత చిత్తుం డగుచు, శౌచాచమనాధ్యయన వ్రతనియమ గుర్వనలశుశ్రూషణాదికంబుల ననభియుక్తంబు లైనం, బుత్రునిచే నొనరింపుచు నప్రాప్తమనోరథుం డయ్యె. అంత. 122

క. ఈరీతినిఁ గొడుకున కా, చారం [4]బుపదేశమిచ్చి సద్గృహమున సం
సారి యగుచుండి విప్రుఁడు, ఘోరన దేహంబుఁ బాసి పోయిన మీఁదన్. 123

ఆ. తల్లి దండ్రితోడఁ దగ నగ్నిఁ జొచ్చిన
నతని మహిమ లెఱుఁగ కంతలోన
సవతితల్లి కొడుకు లవినీతులగుచును
శాస్త్రవిద్య లతనిఁ జదువనీక. 124

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుని సవతితల్లి కొడుకులు వేదవిద్యలవలనం బాపి గృహకర్మంబుల నతని నియమించిన. 125

క. ధరణీసురోత్తముఁడు దా, సరుదుగఁ దమవారు సెప్పినవి యెల్లను నే
మఱ కందుఁ బ్రీతిసేయక, నిరతము గృహకర్మమట్లు నెఱపుచు నుండెన్. 126

1. జనకుండాంగిరసుండు నాత్మజుని (హ.తం.వా.) 2. ఘనుఁడా భాగవతుండు (హ.తం.వా.)
3. పితృనిరోధంబున (చ.ట.త.డ.ద.బ.) 4. బులు, గరపిభింత (హ. తం. వా.)

వ. ఇట్లు గృహకర్మ ప్రవర్తనుం డగుచు *(నుండ మూఢులగు ద్విపాత్పశువులచే నున్మత్త! జడ! బధిర! యని యాహూయమానుం డగునపుడు త దనురూపంబు లగు సంభాషణంబుల నొనరుచుచుఁ బరేచ్ఛా యదృచ్ఛలంజేసి విష్టి వేతన యాజ్ఞాదుల వలన నియుక్త కర్మంబులం బ్రవర్తించుచు.)

తే. [1]అతుల మృష్టాన్న మైన శుష్కాన్న మైన
నెద్ది వెట్టిన జిహ్వకు హితముగానె
తలఁచి భక్షించుఁ గా కొండుఁ దలఁచి మిగులఁ
బ్రీతిసేయఁడు రుచులందుఁ బెంపుతోడ. 128

వ. మఱియు నా విప్రుండు నిత్యానంద సుఖలాభంబు గలిగి, బాహ్య సుఖదుఃఖంబుల యందు దేహాభిమానంబు సేయక, శీతోష్ణవాత వర్షాతపంబులకు నోడి పై చీర గప్పక, వృషభంబునుంబోలెఁ (బీనుండుఁ, గఠినాంగుండు నగుచు) స్థండిల శాయి యై, రజఃపటలంబునం గప్పంబడ్డ దివ్యమాణిక్యంబు వోలె ననభివ్యక్త బ్రహ్మవర్చసుం డై (మలినాంబర పరీత కటితటుండు, నతిమషీ లిప్త యజ్ఞోప వీతుండు నగుటంజేసి యజ్ఞజనంబు లతఁడు) బ్రాహ్మణాభాసుండు, మందుండు నని పలుక, సంచరించుచుండం (గర్మమూలంబునం బరులవలన నాహారంబు గొనునపుడు) దమవారును వ్యవసాయ కర్మంబునందు నియమించిన క్షేత్రవిహిత సమవిషయ న్యూనాధికంబుల నెఱుంగక ప్రవర్తింపుచు, నూఁక, తవుడు, తెలిక పిండి (పొట్టు, నిప్పటి, మాఁడు) ద్రబ్బెట యాదిగాఁగల ద్రవ్యంబులయందు నమృతంబుపగిది రుచిజేసి భక్షింపుచుం జేనికావలి యుండనెడ నొక్కనాడు.

—: వృషలరాజు భృత్యులు కాళికిలికి భరతునిఁ గొంపోవుట :—

క. పురిలోన వృషలపతి దా, నరుదుగ సంతానకాముఁ డై వేడుకతోఁ
బురుష పశువుఁ గాళికి [2]వే, దఱుముకఁ గొనిపోవఁ బశువు దలఁగిన భృత్యుల్.

ఆ. అరసి కానలేక యా రాత్రి వీరాస
నమునఁ జేనికాపు విమలబుద్ధి
నున్న విప్రయోగి నొయ్యనఁ బొడగాంచి
పశువు మంచి దనుచుఁ బట్టి రతని. 131

క. ఆరీతిని భూసురవరు, నారయ నా కాళికా గృహమునకు భృత్యుల్
బోరనఁ గొని చని సల్పిరి, చారుతరాభ్యంజనాది సంస్కారంబుల్. 132

*. తా. ప. ప్రతులలో లేదు.

1. అతుల దివ్యాన్నమైన మృష్టాన్నమైన (హ) 2. తఱమిడి గొనిపోవ (జ. బ.)

ఇట్లు భ్యంజనాది కృత్యంబులు దీర్చి (నూతన వసనంబు గట్ట నిచ్చి) గంధ పుష్ప భరణాక్షతాలంకృతునిం జేసి, మృష్టాన్నంబులు భుజియింపం బెట్టి, ధూప దీప మాల్య లాజ కిసలయాంకుర ఫలోపహారాదులు సమర్పించి, పంచమహావాద్య ఘోషంబుతోడ నా పురుషపశువుం గాళికాదేవి సమ్ముఖంబున నాసీనుం గావించిరి. అ వృషలపతి పురుషపశువు రక్తంబునం భద్రకాళి సంతోషపెట్టం దలంచి, కాళికా మంత్రాభిమంత్రితంబు (నతికరాళంబునైన) ఖడ్గం బంది (నిజాభీష్ట సిద్ధికి) హింసింపం దలఁచిన. 133

సర్వభూతములకు సఖుఁడును బ్రహ్మభూతాత్ముఁడు నిర్వైరుఁడైన బ్రహ్మ సుతుని తేజం బంతఁ జూడ దుస్సహ మైన భయమంది వడఁకుచు భద్రకాళి క్రోధంబు ముమ్మడి గొనఁగ హుంకారంబు సలుపుచు నట్టహాసంబుఁ జేసి పాపాత్ములను దౌష్ట్యపరులును రాజస తామస కర్మసంధాను లగుచు

విప్రవరు నట్లు హింసించు వృషలపతిని
భృత్యవర్గంబుతోఁ దలల్ బృథ్విఁ గూల్చి
యపుడు వృషలాధిపుని శిర మంది లీలఁ
బాడి యాడుచు నందంద క్రీడసలిపె. 134

ధరలోన నెవ్వరేనియు, ధరణీసురవరుల కెగ్గు దగఁ దలఁచిన వా
రరయఁగఁ జెడుదురు నిక్కము, హరి ధరణీసురవరేణ్యులం దుండుటచేన్. 135

మఱియు. 136

అచ్చట విప్రసూనుఁడు భయం బొకయించుక లేక చంపఁగా
వచ్చినవారియందుఁ గరవాలమునందును గాళియందుఁ దా
†నచ్చుతభావ ముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండె నత్తఱిన్. 137

మఱియు నా విప్రవరుండు చండికాగృహంబు వెలువడి క్రమ్మఱం జని కావలి యుండునెడ. 138

†'అచ్యుతభావ'మని అన్ని యచ్చుప్రతులలోఁ గల పాఠము. ఈ పాఠమునఁ బ్రాసము సరిపడదు. [...]త భావము'' వ్యాకరణ సమ్మతము కాకపోయినను, పోతన రచనలో ఇట్టి సమాసములు తరచు [...]ంచుండుటను బట్టియు, ప్రాసము ననుసరించియు, 'అచ్చుతుఁడు' అనుట వాడుకలో నుండుట [...] ఇదే కవిపాఠముగా గ్రహింపఁబడినది.

## అధ్యాయము — ౧౦

సీ. అంతటఁ గొన్ని హాయనములు సన సింధు భూపాలనము సేయు భూవరుండు
ధీరత నిక్షుమతీ తీరమున నున్న కపిలమహామునిఁ గాంచి తత్త్వ
విజ్ఞాన మెఱిఁగెడు వేడ్కతోఁడుత శిబికారోహణముఁ జేసి యరుగుచుండ
నాలోన నా శిబికారోహకులు చేనికాపున్న విప్రునిఁ గాంచి తెచ్చి

తే. శిబిక మోపింత మీతనిచేత ననుచుఁ
బట్టి మూఁపునఁ బల్లకిఁ బెట్టి మోవు
మనుచు మోపించునంత ధరామరుండు
శిబిక మూఁపున నిడి యెందుఁ జింతలేక. 139

క. తన మనసుకొలఁది నప్పుడు, మునుకొని య ట్లప్రయత్నమున నడువఁగ నా
జనపతి నిమ్నోన్నత మై, చనుట యెఱిఁగి శిబిక మోయుజనులకు ననియెన్.

ఆ. మీర లిప్పు డిచటఁ జేరి మిక్కిలి ప్రయ
త్నంబుతోడఁ దగిలి నడుచుచుండ
విషమ మగుచు గమనవేగంబునను బాధ
పెట్టుచున్న దనిన బెస్త లనిరి. 141

వ. దేవా! యీ విషమగమనంబు మావలన నైనది గాదు. ఈ [1]తురీయవాహకుండు సుఖగమనంబుగా నడువనేరండు. (వీనితోడ మేమును నడువనేరము. అనిన రహూగణుండను) నా రా (జుపాసిత వృద్ధజనుం డైనను బలాత్కారంబునం బుట్టిన కోపంబునం) గోపించి, విమర్శ దప్పి, నీఱుగప్పిన నిప్పునుం బోలె నెఱుంగరాని బ్రహ్మతేజంబుగల బ్రాహ్మణునికిం గంటకంబుగా నిష్ఠురవాక్యం బుల ని ట్లనియె. 142

చ. అలసితి వెంతయున్ ముసలి వాఁకట డస్సితి [2]మేను మిక్కిలిం
బలుచనయున్న దీ శిబికభారము దూరము [3]మోసి తే గతిన్
నిలిచెద? వంచు భూవరుఁడు నిష్ఠురముల్ వినఁ బల్కె నాయెడం
బలుకక మోసె నా శిబిక బ్రాహ్మణవర్యుఁడు పార్థివేశ్వరా! 143

వ. అప్పు డా విప్రవరుండు దనకుం గడపటిది యగు కళేబరంబునందు నహంకార మమకారంబులం బొరయక మిథ్యాజ్ఞానరహితుం డై బ్రహ్మభూతుం డై మౌన

1. వింతవాహకుండు(క.ట.త.జ.డ.ద.) 2. వెన్ను(తం.వా.) 3. ఇంక నేగతిన్ (క.చ.ట.బ.)

వ్రతంబున నా శిబిక మోయుచున్న విషమగమనంబుఁ జూచి (యతికుపితుం డగుచు) భూవరుండు వెండియు ని ట్లనయె. 144

సీ. ఓరి! దుర్మద! వినరోరి! జీవన్మృత! నా యాజ్ఞఁ [1]దప్పుచు నడచె దీవు
నీ వక్రమార్గంబు లిన్నియు విడిపించి నడపింతు నిన్ను సన్మార్గమందు
నని [2]రాజగర్వాంధుఁ డగుచు గుణత్రయంబున వృద్ధిఁ బొందిన భూవరుం డ
బద్ధ ప్రలాపముల్ పల్కుచుండినఁ జూచి శమదమాదులచేఁ బ్రశస్తుఁ డగుచు

తే. జగతి బ్రహ్మస్వరూప మై సకలభూత
ములకు నత్యంతహితుఁ డైన భూసురుండు
యోగివర్తనఁ దెలియకయున్న రాజు
నంత వీక్షించి మఱియు ని ట్లనుచుఁ బలికె. 145

వ. నరేంద్రా! నీవు చెప్పినది సత్యంబు. భారం బీ శరీరంబునకే కాని నాకుం గలుగ నేరదు. ఐనను స్థౌల్య కార్శ్యంబులు వ్యాధులు నాధులు క్షుత్తృష్ణలు నిచ్ఛా విరోధ (భయంబులు) జరామరణంబులు రోష నిద్రా జాగరణంబు లహంకార మమకార మదశోషణాదులు దేహంబుతోడన జనియించు గాని నాకుం గలుగ నేరవు. జీవన్మృతుండ నేనకా దాద్యంతంబులు గలుగుటంజేసి యందఱియందును గలిగియుండు. స్వామిభృత్య సంబంధంబులు విధికృత్యంబులగుచు, వ్యవహారంబు లంజేసి శరీరంబులకుం గలుగుం గాని జీవులకు లేకయుండు. అదియునుం గాక రాజాభిమానంబున నీవు న న్నాజ్ఞాపించెదవేనియుం, బ్రమత్తుండ వైన నీకుం బూర్వస్వభావం బెట్లుండె, నట్లు గాక యే నేమిసేయుదుః నెఱింగింపుము. ఉన్మత్త (మూకాంధ) జడులఁ బోలె సహజస్వభావంబునుం బొందిన నాయందు నీ శిక్ష యేమిలాభంబుఁ బొందింప నేర్చు? అదియునుం గాక (స్తబ్ధుండు) మత్తుండ నైన నాకు నీ శిక్ష వ్యర్థం బగు. అని పలికి, యుపశమ శీలుండై ముని వరుండు పూర్వకర్మ శేషంబునం గల్గు భారవాహకత్వంబును దలంగం దోలుటకు భారంబు వహించి, శిబిక మోచుచుం జనునెడ, నా రాజవల్లభుండు తత్త్వజ్ఞానా పేక్షితుం డై చవియెడివాఁ డగుటం దన హృదయగ్రంథి విమోచకంబులు, బహు యోగగ్రంథ సమ్మతంబులు నగు బ్రాహ్మణవాక్యంబులు విని, యాశిబిక దిగ్గన డిగ్గనుఱికి, యా విప్రునికి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, గర్వ వర్జితుం డై ముకుళితహస్తుం డగుచు ని ట్లనియె. 146

1. దప్పించి (క. ట. త. ద. బ.) 2. రాజ్య (క. ట. త. ద.)

సీ. ధరణీసురులలోనఁ దలఁప నెవ్వఁడ వీవు నవధూతవేషివై యవనియందు
నేమిటికై చరియింపఁగ వచ్చి తిచ్చటికి నొక్కఁడ వొంటి ననుట నేఁడు
ననుఁ గృతార్థునిఁ జేయ ననుకూలుఁ డగుమన్న యట్టి యా కపిలమహా మునీంద్రుఁ
డవో? నీ మహత్త్వంబు దవిలి విచారింప నెఱుఁగక చేసితిఁ గరుణఁ జూడు

తే. తప్పు సైరింపు నే యమదండమునకు
హరుని శూలంబునకును వజ్రాయుధమున
కనల చంద్రార్క ధనద శస్త్రాస్త్రములకు
వెఱవ విప్రున కే మది వెఱచినట్లు. 147

వ. మఱియు నిస్సంగుడవై జడుండవుం బోలె నిగూఢవిజ్ఞానంబు గలిగి చరియింపుచు
నున్నవాఁడవు. నీ వచనంబులు యోగశాస్త్రసమానంబులై వాఙ్మనంబులకు
నభేద్యంబులై యున్నవి. (ఏను విష్ణుకళావతీర్ణుండు, సాక్షాద్ధరియునగు) కపిల
మహామునివలన బ్రహ్మవిద్య తెలియఁగోరి చనుచున్నవాఁడ. నీవు లోకనిరీక్ష
ణార్థం బవ్యక్తలింగుండవై చరియింపుచున్న కపిల మహామునీంద్రుండవు
గాఁబోలుదువు. మందుండైన గృహస్థుండు యోగీశ్వరచరిత్రంబు లెట్లు లెఱుంగ
నేర్చు? కర్మవశంబున దృష్టంబై శ్రాంతి [1]వహించుచు నడచుచున్న యీ యాశ్ర
మంబు నాకునుం బోలె మీకు నగునని తోఁచుచున్నది. అది యెట్లనిన, ఘటంబు
లేక జలంబులు దే నేరని తెఱుంగున, లేనిది గలుగనేరదు గావునం బ్రమాణ
మూలంబైన లోకవ్యవహారంబు సత్పథంబున సమ్మతంబై యుండుటం జేసి
మీర లాడు వాక్యంబులు నాకు సమ్మతంబు గానేరవు. అని, సింధుదేశాధీశ్వ
రుండు వినుపించిన, నా విప్రుండు లోకవ్యవహారంబునకు నిత్యత్వం బౌపాధికం
బగుం గాని నిత్యంబు గానేరదు. అని దృష్టాంత నిదర్శనంబున ని ట్లనియె. 148

సీ. పావకశిఖలచే భాండంబు దాఁ దప్తమగుఁ దప్తఘటముచే నందునున్న
జలము తపించు నా జలముచేఁ దండులంబులు తప్త మొంది యప్పుడు విశిష్ట
మైన యన్నం బగు నా చందమునను దా దేహేంద్రియంబులఁ దెలివితోడ
నాశ్రయించుక యున్నయట్టి జీవునకు దేహంబునఁ బ్రాణేంద్రియాదికమున

ఆ. జరుగుచుండు నిట్లు సంసారఘట [2]శిక్ష
[3]రక్షకుండు నైన రాజు దుష్ట
కర్మములకుఁ బాసి కంజాక్షపద సేవఁ
జేసెనేని భవముఁ జెందకుండు. 149

1. శాంతి (క.చ.ట.) భ్రాంతి (హ) 2. వృత్తి (హ) 3. దండునైన రాజు దుష్టమైన (హ)

ంచు ధారుణీసురాత్మజుఁ డీ రీతిఁ
ౘ—టయును రాజు పరిణమించి
యు వాక్యములను వినుతించి క్రమ్మఱఁ
ుఙ్ఞఁ డైన సింధుభూవరుండు. 150

హాత్మా ! యేను రాజ ననియెడి యభిమాన మదాంధుండ నై మహాత్ములం
స ౘ—రించిన నన్నుం గరుణింపుము. నీ వార్తబంధుండవు. నీ కృపాదృష్టింజేసి
హాత్ముల నవమానంబుచేసిన దురితంబువలన విముక్తుండ నయ్యెద. విశ్వ
రాౢత్తవైన నీకుం గోపంబు గలుగనేరదు. అసమర్థులైన మాబోఁటివారలు
హాజనావమానంబున శీఘ్రంబె నశింతురు. కాన నీవు దయాళుండ వై నన్ను
ౢంపుము. అనిన నా విప్రుం డిట్లనియె. 151

అధ్యాయము — ౧౧

డుఁ వేడ్క [1]నీ వవిద్వాం,సుఁడవై యుండియును మిగులఁ [2]జోద్యము విద్వాం
డుపోలెను బలికెద వి, ప్పుడు మే లనవచ్చుఁ గొంత పురుషులలోనఁ. 152

ఁగఁ బెద్ద లీ ప్రపంచమంతయుఁ దథ్య
రరు నీవు తథ్యమనుచుఁ బలికి
ఁగాన నిన్ను నధికుండ వని పల్క
రు నాకుఁ జూడ రాజచంద్ర ! 153

జ్ఞాదికములందు నామ్నాయములయందుఁ దఱచుగాఁ దత్త్వవాదంబు లేదు
వప్నంబునందుల సౌఖ్య మాకారంబు నందుల నిత్య మై యంత లేని
ట్టిచందమున వేదాంతవాక్యంబులు తత్త్వంబు నెఱిఁగించి తలఁగుఁ గాని
వ్యంబు లై యుండనేరవు పురుషుని చిత్తంబు గుణములఁ జెంది యెంత

ల ముందును మఱి యంతకాలమందు
యు విజ్ఞాన కర్మేంద్రియములచేత
రగి ధర్మంబు మఱి యధర్మంబు నట్లు
లి పుట్టించుచుండు నత్యంతమహిమ. 154

ఱియు ధర్మాధర్మవాసనాయుక్తంబు, విషయానురక్తంబు నైన చిత్తంబు
ణ ప్రవాహంబులచేత వికారంబు నొంది, దేవతిర్యఙ్మనుష్యరూపంబు లైన

ఈ పద్యము క.చ.ట. లలో లేదు. 1. నీవు విద్వాంసుఁడవై (హ.వా.) 2. చోద్య మవిద్వాం
(హ)

దేహంబుల ధరించుచుఁ, గాలప్రాప్తంబు లైన సుఖదుఃఖ తదుభయ ఫలంబుల ననుభవింపుచు,ననవరతంబు జీవునికిం బ్రత్యక్షం బగుచు,స్థూలసూక్ష్మరూపంబుల నుండు. స్వాంతంబు గుణరహితం బైన, ముక్తికారణం బగు. ఘృతవర్తులుగల దీపంబు సధూమశిఖలం బుట్టించు;ఘృతవర్తులు నాశంబు నొందిన స్వరూపంబుఁ బొందు. ఈ తెఱంగున,మనంబు గుణకర్మానుబంధం బైన జన్మాదులం బుట్టించు. గుణకర్మంబులం బాసె నేనియుం బరతత్త్వంబు నొందు.జ్ఞానేంద్రియంబు లేనును విషయంబులమీఁదఁ దోఁచుబుద్ధు లేను నభిమానంబు నను నేకాదశవృత్తులం గూడిన మనంబు జీవుని నసంఖ్యంబులైన జన్మంబులం బొందించు. మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరంజ్యోతియైన నారాయణస్వరూపంబుగా నెఱుంగుము. స్థావరజంగమంబు లైన జీవులకుం బవనుండు ప్రాణం బై యున్న చందంబున, నీశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మస్వరూపంబున నుండు, జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంతకాలంబు గెలువకుండు, నంత కాలంబు ముక్తసంగుండు గాఁడు. అరిషడ్వర్గంబును జయించి, పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుండగు. చిత్తం బెంతకాలంబు విషయాసక్తం బగు, నంతదడవు సంసారచక్రంబునందు సంచరించుఁ గావున మహావీరుం డైనను దనకు శత్రువైన మనంబు నప్రమత్తుం డై, యుపేక్షాబుద్ధిం జేసి యిచ్ఛా విహారంబున జరగనీక, పరమగురుం డైన శ్రీహరి చరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం, బర తత్త్వంబు నొందు. అని విప్రుండు పలికిన. నతని మహిమకు వెఱఁగంది బ్రాహ్మణునకు నమస్కారంబు సేయుచు భూవరుం డి ట్లనియె. 155

## అధ్యాయము—౧౨

ఉ. కారణవిగ్రహంబు నురుకాయము నీ యవధూతవేషమున్
భూరి ధరామరత్వమును బూర్వసమాగమ మాత్మభావముం
జారు [1]విహార మత్యతుల శాంతి గుణంబును గూఢవర్తనం
బారయఁ గల్గు నీకు ననయంబును మ్రొక్కెదఁ బెక్కుభంగులన్. 156

మ. జ్వరితార్తుం డగు రోగి కౌషధ మతీష్టం బైన చందంబున
న్నరయ న్నాతపతప్త దేహి గడు శైత్యం బైన తోయంబునుం
గరిమం గ్రోలినరీతి నెంతయు నహంకారాహిదష్టుండ నై
పరఁగు న్నాకును నీ వచోమృతము దప్పన్ మందు వేఱున్నదే? 157

1. విహారమున్నతుల (చ)

ఆ. విప్రవర్య ! నేను వేడ్కతో నాసంశ
యంబు లెల్ల నిన్ను నడిగి తెలియఁ
దలఁచి యున్నవాఁడఁ దప్పక యెఱిఁగింపు
ముచితవృత్తిఁ దత్త్వయోగ మెల్ల. 158

వ. (అని యడిగిన యా రాజున కా విప్రుం డిట్లనియె). 159

తే. కానవచ్చిన ఫలములు కర్మమూల
[1]ము లగుటనుజేసి సంసారములను జిత్త
మెపుడు వర్తించుచుండఁగా నెఱుఁగలేవు
తత్త్వయోగంబు మిగుల నిత్యం బటంచు. 160

వ. మఱియు, నీ వసుంధర నున్న చరణంబులకు నెక్కుడు జంఘలు నా మీఁద జానువు లా పొదవున నూరువు లందులకు నుపరిప్రదేశంబున మధ్యం బటమీఁద నుర మందుకు నెక్కువ కంఠం బటమీఁద స్కంధం బందుల దారు వా దారువున శిబికయందు రాజ ననియెడి యభిమానంబు గలిగి నీవున్న వాఁడవు. ఇట్టి చోద్యం బైన కష్టదశం బొంది, జనుల దయలేక నిగ్రహించి, నీవు ప్రజాపాలనంబు సేయు చున్నవాఁడ నను గర్వంబున మావంటి మహాత్ముల సభలోనం బూజ్యుండు గాకయున్న వాఁడవు. ఈ స్థావర జంగమంబులకు నివాసస్థానంబు వసుంధర యైన చందంబున, సత్క్రియలచేత నెఱుంగం దగిన జగత్కారణం బైన తత్త్వంబు నెఱింగించెద. పరమాణుసముదయం బీ ధరిత్రి యైన చందంబున, నవిద్యామనం బులచేతం గల్పితం బైన కృశ స్థూల బృహ దణు సదసజ్జీవాజీవ ద్రవ్య స్వభా వాశయ కాల నామ బుద్ధిరూపం బైన మాయచేత జగత్తు రెండవది యై కల్పింపబడియె. బాహ్యాభ్యంతరంబులఁ గలిగి స్వప్రకాశం బై, భగవ చ్ఛబ్ద వాచ్యంబు, విశుద్ధంబుఁ, బరమార్థంబు, జ్ఞానరూపంబు నైన బ్రహ్మం బొకటియె సత్యంబు. జగ త్తసత్యం బగు. అని పలికి మఱియు. 161

సీ. ధరలోన బ్రహ్మంబు తపమున దానంబులను గృహధర్మంబులను జలాగ్ని
సోమ సూర్యులచేత శ్రుతులచే నైనను బరమభాగవతుల పాదసేవఁ
బొందినమాడ్కిని బొందంగ రా దని పలుకుదు రార్యులు పరమమునులు
ఘన తపో బాహ్యసౌఖ్యములకు విముఖులు నై పుణ్యులు హరిగుణానువాద

తే. మోదితాత్ములు నగు బుధపాదసేవ
ననుదినంబును జేసిన నంతమీఁద
మోక్షమార్గంబునకును బద్మాక్షునందుఁ
బట్టువడి యుండు నెప్పుడు పరఁగ బుద్ధి. 162

1. మగుటఁజేసియు సంసారమందుఁ జిత్త (క. ద. తం.)

వ. నరేంద్రా ! యేను పూర్వంబున భరతుం డను రాజను. సర్వసంగ పరిత్యాగంబు సేసి భగవదారాధనంబు సేయుచు మృగంబుతోడి స్నేహంబుకతన మృగంబ నై పుట్టియు, నందును హరిభక్తి దప్పకుండ యిపుడు మనుష్యుండనై జన సంగంబున శంకితుండ నగుచు మనుష్యసంసర్గంబును బాసి యేకాకినై చరి యింపు చున్నవాఁడ. నరుఁడు వృద్ధసంసేవంజేసి సంసారమోహంబును బాసి హరిధ్యాన కథలచే లబ్ధజ్ఞానుం డై పుండరీకాక్షునిం బూజింపుచుం బరలోకంబును బొందు. అని పలికి విప్రుండు మఱియు ని ట్లనియె. 163

అధ్యాయములు - ౧౩, ౧౪

సీ. ధరణీశ ! మాయచేతను దాఁటఁగారాని పథమునఁ బెట్టంగఁ బడ్డ జీవుఁ
డెలమిమై గుణకర్మములఁ జేయుచును లాభ మాశించి [1]తిరిగెడు నర్యమాడ్కి-
ఫల మపేక్షింపుచుఁ బాయక జీవుండు సంసారగహన సంచారి యగుచు
ననవరతము నుండు నా మహావనమందుఁ గామలోభాది తస్కరులు గూడి

తే. ధరణి విజితేంద్రియుఁడు గాని నరునిఁ బట్టి
ధర్మమనియెడి యా మహాధనము నెల్ల
నరసి గొనిపోవుచుండుదు రనుదినంబుఁ
గాన సంసారమందు నాకాంక్ష వలదు. 164

క. అరయఁగ సంసారాటవిఁ, దరలక యీ పుత్ర మిత్ర దారాదు లనం
[2]బరఁగుచునుండెడు వృకములు, పరువడి [3]నర బస్తములను భక్షించు వడిన్.

తరల. మలసి సంసృతి ఘోరకానన మందిరంబుల నెల్లచోఁ
జెలఁగి గుల్మలతా తృణాదులచేత గహ్వర మైన ని
శ్చల నికుంజములందు దుర్జనసంజ్ఞలం గల మక్షికం
బుల నిరోధము దమ్మ సోఁకినఁ బొందుచుందురు దుర్దశన్. 166

ఆ. మఱియు నీ గృహస్థమార్గంబునం దెల్ల
విషయములను బొంది విశ్వమెల్ల
గణఁకతోడ నిట్లు గంధర్వనగరంబు
గాఁ దలంచి మిగుల మోద మందు. 167

1. తిరుగు బేహారిమాడ్కి (క) 2. బరగెడు మాయావృకములు (క.చ.త.) బరఁగు గోమాయు వృకములు (హ) 3. మానవునిదిగిచి (ట)

ఆ. మరగి కాననమునఁ గొఱవిదయ్యముఁ గాంచి
యగ్నిఁ గోరి వెంట నరుగుమాడ్కిఁ
గాంచనంబుఁ గోరి కలవారి యిండ్ల పం
చలను దిరుగు నరుఁడు చలనమంది. 168

ఆ. బహుకుటుంబి యగుచు బహుధనాపేక్షల
నెండమావులఁ గని యేఁగు మృగము
కరణిఁ బ్రేమఁజేసి పరువులువాఱుచు
నొక్కచోట నిలువకుందు రెపుడు. 169

ఆ. మఱియు నొక్కచోట మత్తుఁ డై పవన ర
జోహతాక్షుఁ డగుచుఁ జూపు దప్పి
దిక్కెఱుంగ కొండుదిశ కేగు పురుషుని
కరణిఁ దిరుగు నరుఁడు నరవరేణ్య ! 170

వ. మఱియు నొక్కచోట నులూక ఝిల్లీస్వనంబులతోడ సమానంబు లైన శత్రు రాజి తిరస్కారవచనంబులకు దుఃఖపడుచు, నొక్కచోట క్షుధార్దితుం డై యపుణ్యవృక్షంబుల నాశించుమాడ్కిఁ బాపకర్ములు, ద్రవ్యహీనులు నగువారి నాశ్రయించుచు, నొక్కయెడం బిపాసాపరుం డై బలహీనం బైన నదికిఁ జనినరీతి నిహపరదూరు లైన పాషండుల సేవింపుచు, మఱియు నొక్క ప్రదేశంబునం దగ్నిచేతఁ దప్తుం డైనవాఁడు దావాగ్నిం జేరి వ్యథ నొందురీతి నన్నార్థి యగుచు దాయాదులం జేరి దుఃఖించుచు, మఱియు నొక్కచోట పరబాధంజేసి మున్ను గానక రాజ్యాభిలాషం బ్రాణసఖు లైన పితృ పుత్ర భ్రాతృ జ్యేష్ఠుల నైనను వధియింపుచు, మఱియు శూరులచేతం గొట్టువడి, సర్వధనంబును బోనాడి చింతాపరవశుం డై దుఃఖింపుచు నున్నంత, గంధర్వ నగర ప్రాయం బైన సంసారసుఖంబు లనుభవించి, మోదింపుచు, మఱియు నగారోహణంబు సేయు నరుండు కంటక పాషాణాదులవలనం బాధపీడితుం డగుచు దుఃఖించుచందంబున గృహాశ్రమోచిత మహానుష్ఠానంబునకు నుపక్రమించి, వ్యసనకంటక శర్కరాపీడితుం డై దుఃఖింపుచు, నొక్కచోటం జఠరాగ్ని పీడితుం డై కుటుంబంబుమీఁద నాగ్రహింపుచు, వనంబున [1]నజగర గృహీతుం డై నిగీర్ణుం డైన చందంబున రాత్రి గృహాటవియందు నిద్రాపరవశుం డై యెఱుంగక యుండుచు, మఱియును వనంబునం దృణచ్ఛన్న కూపపతితుం

1. నజగరగిళితుండై జీర్ణితుండై (హ)

దగుచు సర్పదష్టుం డైన తెఱంగున సంసారి యై దుర్జనులచేత వ్యథిత హృదయుం డగుచు, నంధుం డై యజ్ఞానాంధకూపంబునం బడుచు, నొక్కయెడ జుంటితేనియకు నై మక్షికాబాధ నత్యంత దుఃఖితుం డైన మాడ్కిని సంసార కాముం డై పరదార ద్రవ్యాభిలాషి యగుచు, భూపాలకులచేత నైనను, గృహపతి చేత నైనను, దాడితుం డై నరకంబునఁ బడుచుండు. యౌవనంబున సంపాదించిన ద్రవ్యంబులు పరులచేతం బోనాడిన విధంబున, శీతవాతా ద్యనేక ప్రయాసలబ్ధుం బైన ధనంబులు వోనాడి, సంసారి, యతి చింతాక్రాంతుం డై యుండు. మఱియును వనంబున లుబ్ధకులు సంస్పృష్టం బైన యల్పామిషంబునకు నన్యోన్యవైషమ్యంబునం గలహించిన విధంబున సంస్పృష్టవ్యవహారి యై, యల్ప ద్రవ్యంబులకుం బోరాడుచుండు. అని భూపాలునకు విప్రుండు సంసారాటవి తెఱం గెఱింగించి వెండియు ని ట్లనియె. 171

ఆ. అల్పధనుఁడు విశ్రమాస్థానములఁ దృప్తిఁ
బొంద కొరులధనముఁ బొందఁగోరి
యరిగి వారివలన నవమానములఁ బొంది
యధిక మైన దుఃఖ మనుభవించు. 172

ఆ. అంతఁ గొంద ఱల్ల నన్యోన్యవిత్తాది
వినిమయమునఁ గడుఁ బ్రవృద్ధ మైన
వైరములను బొంది పోరాట నొందుదు
రాత్మచింత లేక యనుదినంబు. 173

సీ. సంసారమార్గ సంచారుఁ డై యధిక ప్రయాసంబునను గూర్చ నర్థములను
విహరింపుచును గొంద ఱిహలోకఫలములఁ గోరి మోక్షంబును గోర కంతఁ
జెడిపోవుచుందు రెప్పుడు గాని యందుకుఁ గడపటి యోగంబుఁ గానలేరు
మానవంతులు నసమాన శౌర్యులు నగు వారు మిక్కిలి యైన వైరబుద్ధి

తే. నాహవంబున మడియుదు రంతెకాని
మోక్షమార్గంబు గానరు మూఢవృత్తి
ననుచు సంసార గహన విహార మెల్లఁ
దెలిపి క్రమ్మఱ ననియె ధాత్రీసురుండు. 174

వ. మఱియుం గాలచక్ర నియంత్రితుం డై చక్రాయుధునిం గొల్వక, కాక గృధ్ర బక సమాను లైన పాషండులతో సఖ్యంబునంజేసి వారలచేత వంచితుం డై, బ్రాహ్మణ కులంబునం జేసి శ్రౌత స్మార్త కర్మానుష్ఠానపరుం డై. విషయ సుఖం

బులందుఁ దగులంబడి కాలంబుతుద నెఱుంగక, [1]వృక్షంబులుం బోలె నైహికా ర్థంబులయందుఁ దృష్ణగలిగి, మైథుననిమిత్తంబు సుత దారాదులయందు స్నేహంబు సేయుచు,పథికుండు మాతంగంబులయందు భయంబున దీర్ఘ నిమ్న కూపంబునం బడిన తెఱంగున, సంసార మృత్యుగజ భయంబున గిరికందర ప్రాయం బైన యజ్ఞానతమంబునం బడుం, గావున మాయచేత సంసారమార్గం బైన రాజభావంబు విడిచి, సర్వభూతమైత్రి గలిగి, జితేంద్రియుండ వై జ్ఞానా సిచే మార్గంబు కడపలఁ గనుము. అని పలికిన భూపాలుం డి ట్లనియె. 175

క. అక్కట! మానుషజన్మం, [2]బెక్కువ యై యుండు నెపు డభేదమతిం బెం
పెక్కిన యోగిసమాగమ, మక్కజముగఁ గలిగెనేని యఖిలాత్మలకున్. 176

క. ధరణీసురవర! నీ శ్రీ, చరణాంబుజ యుగళరేణు సంస్పర్శము నా
దురితంబు లడఁచె నింతట, హరిభక్తియు మిగుల నాకు నధికం బయ్యెన్. 177

వ. మఱియు విప్రవరులయందు యోగీశ్వరు లవధూత వేషంబునం జరియింపు చుందురు.కావున విప్రులు పిన్నలు పెద్ద లనక యందఱికి నమస్కారంబని స్తుతియిం చిన, నా యోగీశ్వరుండును సింధుపతికిఁ గరుణాన్వితుం డగుచుఁ దత్త్వజ్ఞానం బుపదేశించి యా రాజుచేత వందితచరణుం డై, పూర్ణార్ణవంబునుం బోలె సంపూర్ణ కరుణారసపూరిత స్వాంతుం డై, వసుంధరం జరియింపుచుండె. సింధు భూపతియును సుజన సమాగమంబున లబ్ధ తత్త్వజ్ఞానుం డై దేహాత్మ భ్రమం బాసె. అని పలికి శుకయోగీంద్రుఁడు పరీక్షిన్నరేంద్రున కి ట్లనియె. 178

చ. అరయఁగ మక్షికంబు వినతాత్మజుఁ గూడఁగలేని రీతి నీ
భరతుని సచ్చరిత్రములు ప్రస్తుతి సేయఁగ నీ వసుంధరన్
నరపతు లెల్ల నోపరు మనంబున నైనను నెంచ నింక నా
భరతుని పుణ్యవర్తనముఁ బ్రస్తుతిసేయఁగ నాకు శక్యమే? 179

వ. నరేంద్రా! భరతుండు సుత దార రాజ్యాదులను బూర్వకాలంబునందె, విడిచి భగవత్పరుం డగుచు, యజ్ఞరూపంబును, ధర్మ స్వరూపంబును, సాంఖ్యయోగం బును, ప్రకృతిపురుష స్వరూపంబు నైన నారాయణునకు నమస్కారం బనుచు మృగరూపంబునుం బాసె. అట్టి భరతుని చరిత్రం బెవ్వరు సెప్పిన, నెవ్వరు వినిన, నట్టివారలఁ బుండరీకాక్షుండు రక్షించు. ఆయు రభివృద్ధియు, ధన ధాన్య సమృద్ధియు నగుచుండ, స్వర్గోపభోగంబులం బొందుదురు. అని. 180

1. వృకంబులుంబోలె (క. చ. ట.) 2. ఎక్కువయైయుండు చాలహితమతితో (క.ట.త.జ.) ము, పెక్కువయై (తం. వా.)

మ. †నర దేవాసుర యక్ష రాక్షస మునీంద్ర స్తుత్య! దివ్యాంబరా
భరణాలంకృత భక్తవత్సల! కృపాపారీణ! వైకుంఠ మం
దిర! బృందావన భాసుర ప్రియధరిత్రీనాథ! గోవింద! శ్రీ
కర! పుణ్యాకర! వాసుదేవ! త్రిజగత్కల్యాణ! గోపాలకా! 181

క. పరమపదవాస! దుష్కృత, హర! కరుణాకర! మహాత్మ! హతదితిసుత! భా
సురగోపికా మనోహర!, సరసిజదళనేత్ర! భక్తజననుత గాత్రా! 182

మాలిని. సరస హృదయవాసా! చారు లక్ష్మీవిలాసా!
భరిత శుభచరిత్రా! భాస్కరాబ్జారినేత్రా!
నిరుపమ ఘనగాత్రా! నిర్మల జ్ఞానపాత్రా!
గురుతర భవదూరా! గోపికా చిత్తచోరా! 183

గద్య. ఇది సకల సుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్య ప్రణీతం బైన శ్రీ మహాభాగవత పురాణంబునందు ప్రియవ్రతుని సుజ్ఞాన దీక్షయు, బ్రహ్మ దర్శనంబును, ఆగ్నీధ్రాదుల జన్మంబును, ఉత్తమ తామస రైవతుల జన్మంబును, ప్రియవ్రతుండు వనంబునకుం జనుటయు, ఆగ్నీధ్రుం డప్సరః స్త్రీనిం బరిగ్రహించుటయు, వర్షాధిపతుల జన్మంబును, ఆగ్నీధ్రుండు వనంబునకుం జనుటయు, నాభిప్రముఖుల రాజ్యంబును, నాభి యజ్ఞంబును, ఋషభుని జన్మంబును, ఋషభుని రాజ్యాభిషేకంబును, భరతుని జన్మంబును, ఋషభుండు తపంబునకుం జనుచు సుతులకు నతుల జ్ఞానం బుపదేశించుటయు, భరతుని పట్టాభిషేకంబును, భరతుండు వనంబునకుం జనుటయు, భరతుండు హరిణపోతంబునందుఁ బ్రీతిఁ జేసి హరిణ గర్భంబున జనించుటయు, మఱల విప్రసుతుం డై జనించుటయు, విప్రుండు చండికా గృహంబున బ్రతికి వచ్చుటయు, సింధుపతి విప్ర సంవాదంబును, అను కథలుం గల పంచమ స్కంధంబునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

---

† ఈ యాశ్వాసాంత పద్యములును గద్యయు తా. ప. ప్రతులలో లేవు. దీనిని బట్టి పంచమ స్కంధము నందలి రెండాశ్వాసములును గలిపి ఒకే యాశ్వాసముగా నుండినట్లు భావింపవలెను.

ఓమ్

# శ్రీ మ హా భా గ వ త ము

—●—

## ప ం చ మ స్కం ధ ము

### ద్వి తీ యా శ్వా స ము

క. †శ్రీకాంతా హృదయప్రియ !, లోకాలోకప్రచార ! లోకేశ్వర ! సు
శ్లోక భవభయనివారక !, గోకులమందార ! నందగోపకుమారా ! 1

అధ్యాయము - ౧౫

వ. †సకల పురాణార్థజ్ఞాన విఖ్యాతుం డగు సూతుం డి ట్లనియె. 2

క. మునులార ! బాదరాయణి, యనఘాత్మకుఁ డైన యుత్తరాత్మజునకు స
ద్వినయోక్తి భరతుచరితము, వినుపింపుచు మఱియు నిట్లు వినుపించెఁ దగన్. 3

ఆ. పార్థివేంద్ర ! యట్లు భరతాత్మజుం డైన
సుమతి ధర్మవర్తనమునఁ దిరుగ
నది యెఱింగి దుష్టు లైన పాషండులు
దమ మతంబు మిగులఁ దలఁచి పొగడి. 4

క. ధరణీవల్లభ ! నిన్నును, నిరతంబును బుద్ధదేవునిం గొలిచిన యా
తెఱఁగునఁ గొలిచెద మని భా, సురమతి బోధించి రపుడు సుమతిం బ్రీతిన్. 5

వ. ఇట్లు పాషండబోధితుం డైన సుమతికి ధ్రువసేనయందు దేవతాజిత్తను పుత్రుండు జనించె. వానికి దేవద్యుమ్నుం డను సత్పుత్రుం డాసురియం దుద యించె. ఆ మ్మహాత్మునకు ధేనుమతియందుఁ బరమేష్ఠి జనియించె. అతనికి సువర్చలయందు ప్రతీహుం డనువాఁడు సుతుం డయ్యె. ఆ ప్పరమపురుషుండు సకల జనులకు బ్రహ్మోపదేశంబు సేసి,తాను శుద్ధాత్ముండై,హరిస్మరణసేయుచు యజ్ఞకరణ నిపుణు లగు ప్రతిహర్త ప్రస్తోత ఉద్గాత యను సత్పుత్రులం గాంచె. ఆ ప్రతిహర్తకు స్తుతియందు వ్యోమ భూమ నామక పుత్రద్వయం బుత్పన్నం

---

† తా.ప. ప్రతులలో లేదు.

బయ్యె. అందు భూమునకు ఋషికుల్యయందు నుద్గీథుం డను సుతుండు జనించె.
అతనికి దేవకుల్యయందుఁ బ్రస్తోత గలిగె. ఆ ప్రస్తోతకు వరదుత్సయందు విభుం
డను తనయుం డుద్భవించె. అతనికి భారతియందు పృథుషేణుం డుదయించె.
అతనికి నాకూతియందు నక్తుండు గలిగె. ఆ నక్తునకు రాజర్షి శ్రేష్ఠుం డగు
గయుం డను మహాకీర్తి సంపన్నుం డుదయించె. 6

ఆ. [1]ఆ గయుండు లీల నఖిలజీవులఁ బ్రోవఁ
దలఁచి సాత్త్వికప్రధాన మైన
యట్టి మేను దాల్చి యాత్మతత్త్వజ్ఞానుఁ
డగుచునుండె హరి నిజాంశమునను. 7

వ. †(ఇట్టి మహనీయ సుగుణాకరుం డగు గయుని గాథానువర్ణనంబు పురావిదు
లగు మహాత్ములచే నీ తెఱంగున నుతింపఁ బడుచున్నది. సావధాన మనస్కుండ వై
యాలకింపుము. అని యి ట్లనియె.) 8

సీ. ధర్మమార్గంబున ధారుణీ జనులను బ్రేమతోఁ బోషణ ప్రేషణోప
లాలన శాసన లక్షణాదులచేతఁ బోషింపుచును యజ్ఞములను యజ్ఞ
పురుషు నీశ్వరుఁ జిత్తమున నిల్పి సేవించి స్వాంతమం దున్న యీశ్వరునిఁ గాంచి
యఖిలజీవతతికి నానంద మొసఁగుచు [2]నిరభిమానంబున నేల యేలె

తే. సత్యమందు మిగుల సత్సేవయందును
ధర్మమందు యజ్ఞకర్మమందు
గయుఁడు వసుధలోనఁ గంజాక్షుఁడే కాని
మానవుండు గాఁడు మానవేంద్ర! 9

వ. అట్టి *(మహాపురుష గుణగణ పరిపూర్ణుం డగు) గయునికి (దక్షకన్యక లగు
శ్రద్ధా మైత్రి దయాదులు దమయంత వచ్చి కోరిక లొసఁగ, నతని ప్రజలకు
వసుంధర కామధేను వై పితుక, వేదంబులు సకల కామంబుల నిచ్చుచుండ,
సంగరంబున భంగంబు నొందిన రాజు లప్పనంబు లొప్పనంబు సేయ) విప్రులు
ధర్మం బాఱవపాలు పంచి నిరంతర సోమపానంబును, శ్రద్ధాది శుద్ధభక్తి
యోగంబునుం గలిగి యొనర్చు యజ్ఞంబుల నింద్రాదిదేవతలు తృప్తులై
యజ్ఞఫలంబుల నొసంగ, బ్రహ్మాది తృణ గుల్మ లతాపర్యంతంబు సకలలోకంబుల

1. అట్టిగయునివలన (హ) †ఈ వచనము వ్రాఁతప్రతులలో లేదు. హ.తం.వా. లలో కలదు. మూలములో 9 వ సీసపద్యము తరువాతఁ గలదు. 2. నిరభిమానతమెయి (తం. వా.)

* తా. ప. ప్రతులలో లేదు.

వారినిఁ దృప్తిం బొందింపుచు, శ్రీహరిం దృప్తిఁ బొందఁజేయుచు, గయుండు పెక్కు కాలంబు రాజ్యంబు నేలె. అట్టి గయునికి (జయంతియందుఁ)జిత్రరథ, స్వాతి, అవరోధను లను ముగ్వురు కొడుకులు పుట్టిరి. ఆ చిత్రరథునికి నూర్ణ యందు సమ్రాట్టును, వానికి [1]నుల్కయందు మరీచియు, ఆ మేటికి బిందుమతి యందు బిందుమంతుఁ డనువాఁడును, ఆ బిందుమంతునకు *(సరఘ) యందు మధువును, మధువునకు (సుమన స్సనుదానియందు) వీరవ్రతుండును, ఆ వీర వ్రతునకు భోజయందు మన్యు ప్రమన్యు లను నిరువురును, నందు మన్యువునకు సత్యయందు భువనుండును, నతనికి దోషయందుఁ ద్వష్టయు, నా త్వష్టకు విరోచన యందు విరజుం డనువాఁడును జనించిరి. అంత. 10

క. ఆ విరజున కుదయించిరి, భూవినుత! [2]విషూచియందుఁ బుత్రశతంబు
న్నావల నొక కన్యకయు, న్నా వేళ సమస్తజనులు హర్షం బందన్. 11

క. ఘనుఁడు ప్రియవ్రతు వంశం, బునకుం దుద యై విరజుఁడు భూవిభు వంశం
బును దా నలంకరించెను, విను మింద్రావరజుఁ డైన విష్ణుని మాడ్కిన్. 12

అధ్యాయము — ౧౬

క. అని పలికిన శుకయోగిం, గనుఁగొని యభిమన్యు సుతుఁడు కడు మోదముతో
వనజదళాక్షుని మహిమలు, విని సంతసమంది యనియె వేడుక మఱియున్. 13

వ. మునీంద్రా! సూర్యరశ్మి యెందాఁకం బ్రవర్తిల్లు, నక్షత్రయుక్తంబు లైన చంద్ర కిరణంబు లెంతమేరఁ దిరుగు,నంతదూరంబు ప్రియవ్రతుని రథనేమి ఘట్టనలచేత సప్తద్వీపంబులును,సప్తసముద్రంబులు నయ్యె నని పలికితివి,ఆ ద్వీప సముద్రం బుల పరిమాణంములు సవిస్తరంబులుగా నెఱింగింపుము.గుణమయంబును,స్థూల రూపంబును నైన శ్రీహరి శరీరం బగు నీ లోకంబునందు నిలిపిన చిత్తం బగుణంబును, సూక్ష్మంబును, నాత్మజ్యోతియు, బ్రహ్మంబు నైన వాసుదేవుని యందు నిల్చుం గావున, ద్వీపవర్షాది విస్తారంబు వినిపింపుము. అనిన శుకయోగీం ద్రుఁడి ట్లనియె. 14

క. ధరణీవల్లభ! విను శ్రీ, హరి మాయాగుణ విభూతు లగు జలనిధులన్
బరఁగిన దీవులు వర్షము, లరయంగాఁ గొలఁది వెట్ట నలవియె! జగతిన్. 15

ఆ. తెలిసినంత[3]వట్టుఁ దెలిపెద సంక్షేప
మునను జిత్తగించి వినుము దెలియ
ననుచుఁ జెప్పఁ దొడఁగె నభిమన్యుసుతునకు
[4]నింపుగాను శుకమునీంద్రుఁ డిట్లు. 16

1. ఉత్కళ (హ.తం.వా.) * తా. ప. ప్రతులలో లేదు. 2. జితారిలోక (క.చ.ట) 3. నేను (హ. తం. వా.) 4. రమణతోడ బాదరాయణుండు (చ. ట. త. జ. ద. బ.)

—: శుకయోగివరుం డుపదేశరూపముగాఁ దెలుపు భూగోళస్వరూపాది నిర్ణయము :—

వ. నరేంద్రా! జంబూద్వీపంబు భూపద్మంబునకు మధ్యప్రదేశంబున లక్షయోజనం బుల వెడల్పు, నంతియ నిడుపునుం గలిగి, కమలపత్రంబునుం బోలె వర్తులాకారం బై (నవసహస్రయోజన పరిమితాయామంబు గల) నవవర్షంబులు నష్టమర్యా దాగిరులునుం గలిగి విభక్తం బై యుండు. అందు మధ్యమవర్షం బిలావృత వర్షం బగు. అందు మధ్యప్రదేశంబున సువర్ణమయం బై. 17

క. భూపద్మమునకు మేరువు, దీపించుచుఁ గర్ణికాకృతిని బెం పగుచుం
బ్రాపై కులగిరిరాజుగఁ, జూపట్టును సురగణాళి చోద్యం బందన్. 18

సీ. మఱియును ద న్మేరుగిరి లక్షయోజనోన్నత మగుచుండి యా [1]నడిమిదళము
విదిత మై పదియాఱువేల యోజనములు నంతియ పాఁతు నై యతిశయిల్లు
నా మీఁద విస్తార మరయ ముప్పదిరెండు వేల యోజనముల వెలసియుండు
నా గిరి కుత్తరంబందు నీల శ్వేత శృంగపర్వతములు నింగిముట్టి

ఆ. యుండు రెండువేలయోజనంబుల దాఁకఁ
బఱపు గలిగి పూర్వ పశ్చిమాయ
తంబు దక్షిణోత్తరంబును విస్తార
మగుచు మిగుల రమ్య మై నరేంద్ర! 19

వ. ఇట్లు పూర్వపశ్చిమంబుల లవణసాగరాంతంబు లై యున్న సీమా పర్వతంబుల యందు నీల శ్వేత శృంగవత్పర్వతంబులు నిడివిని†యథాక్రమంబున దశమాంశ న్యూనప్రమాణ యోజనములు గలవిగా నుండు. వీని మధ్యప్రదేశంబున రమ్యక, హిరణ్మయ, కురువర్షంబు లను నామంబులుగల వర్షంబులుండు. వానివిస్తారంబులు నవసహస్రయోజనంబులుగలిగి, లవణసముద్రాంతంబులై క్రమంబున నీలాది పర్వత దీర్ఘ పరిమాణంబుల నుండు. ఇలావృత వర్షంబునకు దక్షిణంబున నిషధ హేమకూట హిమవత్పర్వతంబు లను సీమా పర్వతంబులును, పూర్వపశ్చిమంబులు నిడుపును, దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు, నా నీలాది పర్వతంబులతీరున నుండు. ఆ గిరుల మధ్యప్రదేశంబున కింపురుషవర్ష హరివర్ష భారతవర్షంబు లను నామంబులు గల వర్షంబు లుండు. ఆ యిలావృత వర్షంబునకుఁ బశ్చిమంబున మాల్యవత్పర్వతంబును, పూర్వభాగంబున గంధమాదనంబును, సీమాపర్వతం బులు. పూర్వపశ్చిమంబులు నిడుపును, దక్షిణోత్తరంబులు విశాలంబులు నగుచు నీల

1. నడిమియిమ్మ (క.బ.) †"ఉత్తరోత్తరో దశాంశా దధికాంశేన దైర్ఘ్యాఏవ హ్రసంతి"(16-7)

పర్వత నిషధ పర్వతంబులం గదిసి,ద్విసహస్రయోజనంబుల విస్తారం బై యుండు మాల్యవత్పర్వతంబు పశ్చిమసముద్రాంతంబై కేతుమాలవర్షంబును,గంధమాదన పర్వతంబునకుఁ బూర్వభాగంబున సముద్రాంతం బగుచు భద్రాశ్వ వర్షంబును, మేరువునకుం దూర్పున మందరపర్వతంబును,దక్షిణంబున మేరుమందరపర్వతంబులును, బశ్చిమటి పార్శ్వంబుల నుత్తరమునం గుముదపర్వతంబులను నామంబులు గలిగి, యయుతయోజ నోన్నతంబు లై మేరునగం బను మధ్యోన్నత*(మేధి) స్తంభంబునకుం జతుర్ముఖంబుల హ్రస్వ స్తంభంబులను బోలియుండు. నా చతుః స్తంభంబులయందును పర్వతశిఖరంబుల వెలుఁగొందు కేతువులునుంబోలె చూత జంబూ కదంబ న్యగ్రోధంబు లను వృక్షరాజంబులు, క్రమంబున నొండొంటికి నేకాదశశతయోజనాయతంబును, నంతియవిస్తారంబునుం గలిగియుండు.మఱియు నా పర్వతశిఖరంబులఁ గ్రమంబునం బయోమధ్విక్షురస మృష్టజలంబులం గలిగి, శతయోజన విస్తారంబు లైన సరోవరంబులు తేజరిల్లు. అందు సుస్నాతు లగు వారలకు యోగైశ్వర్యంబులు స్వభావంబునం గలుగు. మఱియు నందన చైత్ర రథ వైభ్రాజిక సర్వతోభద్రంబు లను నామంబులంగల దేవోద్యానంబు లాపర్వత శిఖరంబుల వెలుఁగొందుచుండు. అందు దేవతాగణంబులు దేవాంగనలం గూడి గంధర్వుల గీతనృత్యంబులు గనుంగొనుచు విహరింతురు. 20

ఉ. మందరపర్వతంబు తుది మామిడిపం డ్లమృతోపమాన మై
మందరశైల [1]శృంగక సమానము లై గిరిమీఁద రాల మా
కంద ఫలామృతంబు గలఁగంబడి జాఱి మహాప్రవాహ మై
యం దరుణోద నామమున నద్భుత మై విలసిల్లు నెంతయున్. 21

చ. కడు మధురంబునన్ సురభిగంధముచే నరుణప్రకాశతన్
వడిగొని మందరాచలము వంతల చెంతల జాఱి యంతలోఁ
దొడి తొడి నా యిలావృతముఁ దోఁచుచు వింతగఁ బూర్వవాహి యై
[2]నడుచుఁ దరంగసంతతుల నందఱి నచ్చటఁ జేయు ధన్యులన్. 22

ఆ. ఆ నదీజలంబు [3]లాడిన యచ్చటి
యంబికానుచరుల యంగగంధ
మంది పవనుఁ డంత మనుజేశ ! పదియోజ
నములు సుట్టు పరిమళముల నింపు.

* తా. ప. ప్రతులలో లేదు. 1. శృంగముల మానములై (ట.త.జ.) 2. అదరు (తం.వా.) నద చుతరంగలన్ సురగణంబుల ధన్యుల జేయుచుండగన్(క.ద.) 3......అనినవారలు సుఖులు చటుల పుణ్యః శుభము వృద్ధినొంది దివ్యగంధ మందంద శతయోజనముల బరిమళించు రమణతోడ (క.త.ద.బ.)

ఆ. మేరుమందరముల మీఁద జంబూఫలం
బులు మహాగజోపములుగ వ్రాలి
యవిసి యంతఁ ద ద్రసామృతం బల్లన
య మ్మహానగంబులందుఁ బౌడమి. 24

క. అనుపమ మగు జంబూనది, యను పేరను వెలసి లీల నరుగుచు నంతం
ఘనత నిలావృతవర్షము, పనుపడఁ దడుపుచును ధరణిఁ బ్రవహించుఁ దగన్.

ఉ. ఆ నదినీటఁ దోఁగి [1]పద నై యటు మృత్తనిలార్క సంగతిన్
బూని కడున్ విపాకమునఁ బొందుచు శుద్ధ సువర్ణ [2]జాతి జాం
బూనదనామ మొంది సురముఖ్యుల కెల్లను భూషణార్హ మై
మానుగ వన్నె మించి కడు మంచిది యై విలసిల్లు నెంతయున్. 26

వ. మఱియు సుపార్శ్వ నగాగ్రంబునందుఁ *(బంచవ్యామ పరీణాహ బంధురంబు) లగు నైదు మధుధారా ప్రవాహంబులు పంచముఖంబుల వెడలి, సుపార్శ్వ నగ శృంగంబులం బడి,యిలావృతవర్షంబు పశ్చిమభాగంబుఁ దడుపుచుం బ్రవహించు. ఆ తేనియ యనుభవించువారల ముఖమారుత సుగంధంబు శతయోజన పర్యంతంబు పరిమళించు. 27

సీ. †కుముదపర్వత శిఖాగ్రమున నుత్పన్న మై కనుపట్టు వటతరు స్కంధములను
నుదయించునట్టి పయో దధి ఘృత మధు గుడ విశిష్టాన్నంబు లొడిక మైన
యంబర శయ్యాస నాభరణాది వస్తువులు గోరికలు దీర్చుచును గుముద
పర్వతాగ్రంబునఁ బడి యిలావృతవర్షమున జనులకు నెల్ల భోగ్యములను

ఆ. వదల కొసఁగు వారి వళిపలితంబులు
[3]దలఁగు స్వేదగంధములును బాయు
మరణభయము ముదిమి బొరయ దెన్నఁడును శీ
తోష్ణబాధ చెందకుండు నధిప ! 28

ఆ. దేవదానవులును దివ్యమునీంద్ర గం
ధర్వులాదిగాఁగఁ దగిలి యాశ్ర
యించియుందు రా గిరీంద్రమూలమునందు
హర్షమంది ఘన విహారలీల. 29

1. పదునై దగు మృత్తికలర్క సంస్పర్శన్(ద) పదనందిన మేదినినర్క(బ) 2. కాంతి(క.చ.ట.డ.ద.) * తా. ప. ప్రతులలో లేదు. † కుముద నిరూఢో యశ్శతవల్శోనామ వట స్తస్య స్కంధేభ్యో నీచీనాః పయోదధీ ఘృతమధు గుడాన్నా ద్యంబర శయ్యాసనాభరణోదయ స్సర్వ ఏవ కామదుఘా నదాః (16-19) 3. తొలుగుదుష్ట (హ)

వ. నరేంద్రా! †మేరునగేంద్రంబునకుఁ బూర్వభాగంబున జఠర దేవకూటంబులుఁ బశ్చిమంబునం బవనపారియాత్రంబులు నను పర్వతంబులు నాలుగు, నొండొంటికి దక్షిణోత్తరంబుల నష్టాదశసహస్ర యోజనంబుల నిడుపును, బూర్వపశ్చిమంబుల ద్విసహస్రయోజనంబుల వెడల్పును నగుచు దక్షిణంబునఁ గైలాస కరవీరంబులును, ఉత్తరంబునఁ ద్రిశృంగ మకరంబులును నను నామంబులుగల దక్షిణోత్తర పర్వతంబులు నాలుగును, బూర్వపశ్చిమంబుల నష్టాదశసహస్ర యోజనంబుల నిడుపును, దక్షిణోత్తరంబుల ద్విసహస్రయోజనంబుల వెడల్పును నగుచు,నగ్ని పురుషునకుం బ్రదక్షిణం బగుచున్న పరిస్తరణంబుల చందంబున మేరువునకుం బ్రదక్షిణంబుగా నష్టనగంబులు నిలిచియుండు. మేరుశిఖరంబున దశసహస్రయోజనంబుల నిడుపు, నంతియ విస్తారంబు నగుచు సువర్ణమయం బైన బ్రహ్మపురంబు తేజరిల్లుచుండు. ఆ పట్టణంబునకు నష్టదిక్కులయందును లోకపాలుర పురంబులుండు. 30

అధ్యాయము — ౧౭

క. పరమేష్ఠి పట్టణంబున హరి మున్ను త్రివిక్రమణము లందన్ సర్వే
శ్వర చరణాగ్రనఖాహతిఁ బరువడి నూర్ధ్వాండ మంతఁ బగిలె నరేంద్రా! 31

వ. ఇట్లు చరణ నఖస్పర్శంజేసి భేదింపంబడ్డ యూర్ధ్వకటాహ వివరంబువలన నంతః ప్రవేశంబు సేయుచున్న బాహ్యజలధార శ్రీహరి పాదస్పర్శం జేయుచుం జనుదెంచి, సకలలోకజనంబుల దురితంబులు వాపుచు [1]భగవత్పది యను పేరం దేజరిల్లు. దీర్ఘ కాలంబు స్వర్గంబున విహరింపుచు విష్ణుపదంబున నుత్తానపాద పుత్రుండునుం, బరమభాగవతుండు నైన ధ్రువుండు తనకులదేవతయైన శ్రీహరి పాదోదకంబు ప్రతిదినంబును భక్తియోగంబున నిమీలితనేత్రుం డై, యానంద బాష్పంబుల రోమాంచితగాత్రుం డై యత్యాదరంబున నేఁడును శిరంబున ధరియింపుచు నున్నవాఁడు. అతనికి నధోభాగంబున నుండు మండలాధిపతులైన సప్తర్షులును హరి పాదోదక ప్రభావంబు నెఱింగి (తాము పొందు) తపస్సిద్ధి యాకాశ గంగాజలంబుల స్నాతు లగుటయే యని సర్వభూతాంతర్యామి యగు నీశ్వరునియందు భక్తి సలిపి, యితర పదార్థాపేక్ష సేయక మోక్షార్థి ముక్తిమార్గంబు బహుమానంబు సేయుతెఱంగున బహుమాన యుక్తంబుగాఁ దమ జటాజూటంబులయందు నేఁడును ధరియింపుచుందురు. 32

† కురంగ కురర కుసుంభ వైకంకత త్రికూట శిశిర పతంగ రుచక నిషధ శితివాస కపిల శంఖాదులైన పర్వతంబులు మేరుపర్వత కర్ణికకుఁ గేసరంబులై పరివేష్టించియుండు. (తం. వా.)

1. భగవత్పాది (హ. తం. వా.)

సీ. అంత నసంఖ్యంబు లైన దివ్యవిమాన సంకులంబులను విశాల మైన
దేవమార్గంబున దిగివచ్చి చంద్రమండలముఁ దోఁచుచు మేరునగ శిఖాగ్ర
మునను నా బ్రహ్మదేవుని పట్టణమునకు వచ్చి యందులఁ జతుర్ద్వారములను
వరుసతో దీర్ఘ ప్రవాహంబు లగుచును బ్రవహించి యమలప్రభావములను

ఆ. నరుగు లవణసాగరాంతంబులుగ నాల్గు
మోములందు †నాల్గునామములను
దన్నుఁ గన్నవారిఁ దనవారిఁ దోఁగిన
వారి కెల్ల నమృతవారి యగుచు. 33

వ. అందు సీత యనుపేర వినుతి నొందిన యమ్మహానదీ ప్రవాహంబు బ్రహ్మసదన పూర్వద్వారంబున వెడలి, కేసరావలయంబుం దడుపుచు గంధమాదనాద్రికిం జని, భద్రాశ్వవర్షంబుం బాలనంబుసేయుచుఁ బూర్వ లవణసాగరంబునం బ్రవేశించు. చక్షు వనుపేరఁ దేజరిల్లెడు దీర్ఘప్రవాహంబు పశ్చిమద్వారంబున వెడలి, మాల్యవత్పర్వతంబునం బడి, కేతుమాలవర్షంబుఁ బవిత్రంబుసేయుచుఁ బశ్చిమ లవణార్ణవంబునం గలయు. భద్ర యనుపేర వెలుఁగొందిన యతుల ప్రవాహం బుత్తరద్వారంబున వెడలి, కుముద నీల శ్వేతాఖ్య పర్వతశిఖరంబుల గ్రమంబునఁ బ్రవహింపుచు శృంగనగంబునకుం జని, మానసోత్తరంబులగు కురుభూములఁ బవిత్రంబుసేయుచు నుత్తర లవణసాగరంబుఁ జేరు. అలకనంద యని ప్రఖ్యాతిగాంచిన యమ్మహానదీ ప్రవాహంబు బ్రహ్మసదన దక్షిణద్వారంబున వెడలి, యత్యంత దుర్గమంబు లైన భూధరంబులఁ గడచి, హేమకూట హిమకూట నగరంబుల నుత్తరించి, యతివేగంబునఁ *(గర్మక్షేత్రం) బగు భారత వర్షంబుఁ బావనంబు సేయుచు దక్షిణ లవణాంబుధిం గలయు. 34

సీ. జగతిలో మేరు వాదిగఁ బర్వతములకుఁ బుత్రిక లైనట్టి పుణ్యతీర్థ
ములు వేలసంఖ్యలు గలవు జంబూద్వీప మందు భారతవర్ష మరయఁ గర్మ
భూమి; తక్కినవర్షముల దివంబుననుండి భువికి వచ్చినవారు పుణ్యశేష
ములు భజింపుచు నుంద్రు భూస్వర్గ మనఁదగు నా వర్షమున నుండునట్టి వార

ఆ. లయుతసంఖ్య వత్సరాయువు లయుత మా
తంగబలులు దేవతాసమాను
లతుల వజ్రదేహు లధిక ప్రమోదితు
లప్రమత్తు లార్యు లనఘు లధిప! 35

† 'చతుర్భిర్నామభి శ్చతుర్దిశ మభిస్యందంతీ, నదనదీ పతిమేవాభి విశతి సీతాఽలకనందా చక్షుర్భద్రేతి' (మూలము 17-6)

వ. మఱియును సురతసుఖానందంబున మోక్షంబు నైననుం గైకొనక †సకృత్ప్రసూతు లగుచు ననవరతంబును త్రేతాయుగకాలంబునుం గలిగి ప్రవర్తింతురు. ఈ యష్టవర్షంబులయందును దేవతాగణంబులు తమ భృత్యవర్గంబు లత్యుపచారంబులు సేయుచుండ, నెల్ల ఋతువులయందుం గిసలయకుసుమ ఫల భరితంబులైన లతాదుల శోభితంబు లగు వనంబులం గల వర్ష నిధి గిరిద్రోణులయందును, గమలామోదితంబు లగు రాజహంస కలహంసలు గల సరోవరంబులయందును జలకుక్కుట కారండవ సారస వినోదంబులు గలిగి, మత్తాళి ఝంకృతి మనోహరంబులై నానావిధంబులైన కొలంకులయందును దేవాంగనల కామోద్రేకజంబులైన విలాస లీలా విలోకనంబులం దివియంబడిన మనోదృష్టులు గల దేవగణంబులు విచిత్రవినోదంబులం దగిలి యిచ్ఛావిహారంబులు సలుపుచుండుదురు. 36

క. ఈ నవవర్షంబులయం, దా నారాయణుండు వచ్చి యనవరతము లో
కానుగ్రహమునకైనను, జ్ఞానం బీఁదలఁచి లీలఁ జరియించుఁ దగన్. 37

సీ. వసుధ నిలావృత వర్షాధిపతి యైన పురహరుం డా వర్షమున వనంబు
నందు నుండుటకు నా యంబికా శాపవశంబున నా వనస్థలమునందు
నెవ్వరు వచ్చిన నింతులై యుందు రా వనమందుఁ బార్వతి యనుదినంబు
నంగనాజన సహస్రార్బుదంబుల తోడ ననమలోచనుఁ గొల్చు నతులభక్తి

ఆ. *నట్టి శివునిఁ గోరి యా యిలావృతవర్ష
మునఁ జరించు జనులు మోదమునను
గదిసి తత్ప్రకాశకము లైన మంత్ర తం
త్రములఁ బూజఁ జేసి తలఁతు రెపుడు. 38

అధ్యాయము—౧౮

క. భద్రాశ్వ వర్షమందుల, •భద్రశ్రవుఁ డనెడి పేరఁ బరఁగుచుఁ దవనీ
యాద్రిసమ ధైర్యుఁ డగుచు స, ముద్రాంతం బైన జగతిఁ బొలుపుగ నేలున్.

క. ఆ నరవరునకుఁ బ్రియతముఁ, డైన హయగ్రీవమూర్తి ననవరతంబున్
ధ్యాన స్తోత్ర జపానుష్ఠానాదులఁ జేసి సజ్జను లంతన్. 40

† "ఏకగర్భ కళత్రాణాం" (17-13)
"ఏకవర్ష శేషే ఆయుషి ధృత ఏకో గర్భోయైః తాదృశాని కళత్రాణి యేషాం" (వ్యా)
* 'హ' ప్రతిలో, అధోభాగమున ఈ క్రింది వాక్య మున్నది.
ఈ షట్టము మొదలుకొని యాయా వర్షములయందు వర్షాధిదేవతల నారాధించెడు వారలుపాసించెడు మంత్రములాంధ్రంబున విడువఁబడియున్నవి. వానిని సంస్కృత భాగవతముఁజూచి తెలిసికోవలెను.
• "భద్రశ్రవా నామ ధర్మసుతః" (18-1)

ఆ. తత్ప్రకాశకకృత్ప్రధాన మంత్రార్థ సం
సిద్ధిఁ జేసి ముక్తిఁ జెందిరప్పు
డట్టి వర్షమందు నా హయగ్రీవునిఁ
దలఁచి కొలిచి మిగుల ధన్యులగుచు. 41

సీ. హరి వర్షపతి యైన నరహరి ననిశంబు నందున్న జనులు మహాత్ము లైన
దైత్య దానవకులోత్తములు ప్రహ్లాదాది [1]వృద్ధులఁ గూడి సంప్రీతితోడ
సుస్నాతులై భక్తిఁ జూపుచునుందురు రమ్య దుకూలాంబరములు దాల్చి
తత్ప్రకాశక మంత్ర తంత్ర జప స్తోత్ర పాఠక ధ్యాన తపః ప్రధాన

తే. మైన సత్పూజలను జేసి యచలబుద్ధి
శ్రీనృసింహునిఁ జేరి పూజించి యతని
కరుణ నొందుచు నతుల ప్రకాశు లగుచు
భుక్తిముక్తులఁ గైకొంద్రు భూపవర్య! 42

వ. మఱియుఁ గేతుమాలవర్షంబునందు భగవంతుండు శ్రీదేవికి సంతోషంబు నొసఁగుటకుఁ గామదేవరూపంబున నుండు. అ మ్మహాపురుషుని యస్త్ర తేజః ప్రకాశంబునఁ బ్రజాపతి[2]దుహిత లగు రాత్ర్యధిదేవతల గర్భంబులు సంవత్సరాంతంబున నిర్జీవంబులై స్రవించు. ఆ కామదేవుండును దన గతివిలాస లీలావలోకన సుందర భ్రూమండల సుభగవదనారవింద కాంతులంజేసి శ్రీరమాదేవిని రమియింపం జేయు. భగవన్మాయారూపిణి యగు శ్రీదేవియుఁ, బ్రజాపతి పుత్రికలును, బుత్రులునైన *రాత్రింబగళ్ళం గూడి, కామదేవ స్తోత్రపాఠక పూజా ధ్యానాదులం బూజింపుచుండునంత. 43

క. విమలమతిఁ జిత్తగింపుము, రమణీయంబైన విమల రమ్యక మను వ
ర్షమునకు నధిదేవత దా, నమరంగా మత్స్యరూపమగు హరి దలఁపన్. 44

ఆ. అట్టి వర్షమునకు నధిపతి యగుచున్న
మనువు పుత్ర పౌత్ర మంత్రివరులఁ
గూడి మత్స్యమైన కుంభినీధరుఁ జిత్త
మతుల భక్తియుక్తి హత్తిఁ గొలుచు. 45

1. పెద్దల (క.హ.ఐ.) 2. దుహితలును నగు అహోరాత్రాద్యధిపతుల గర్భంబులు (క.ద.)
* రాత్రులం బగళ్ళన్ (తం. వా.)

ఆ. తత్ప్రకాశకప్రధానమంత్ర స్తోత్ర
ములను ధర్మకర్మములను హోమ
ములను జనులు సేసి పుణ్యులై భుక్తిము
క్తులను బొందుచుందు రెలమితోడ. 46

క. వినుము హిరణ్మయవర్షం, బునకుం గూర్మావతారమును దాల్చిన యా
వనజోదరుఁ డధిదేవత, యనఘుఁడు పితృపతి మహాత్ముఁ డర్యముఁడు నృపా!

క. ఆ వర్షమందు సర్యముఁ, డావర్షజనంబుఁ గూడి హరిఁ జిత్తములో
భావించి సంస్తవంబులు, గావింపుచు [1]భుక్తి ముక్తి గాంచుఁ గడంకన్. 48

అధ్యాయము — ౧౮

క. †ఉత్తర కురుభూములకును, హత్తుకొని వరాహదేహుఁ డధిపతియైనన్
సత్తుగ భూసతి యతనిన్, జిత్తములో నిలిపి పూజసేయుచునుండున్. 49

క. అరయఁగ సీతాలక్ష్మణ, పరివృతుఁడై వచ్చి రామభద్రుఁడు గడిమిం
బరఁగు నధిదేవతగఁ గిం, పురుష మహావర్షమునకు భూపవరేణ్యా! 50

ఆ. అట్టి రామభద్రు నంజనీసుతుఁడు కిం
పురుషగణముఁ గూడి పూజచేసి
తత్ప్రకాశక ప్రధానమంత్ర స్తోత్ర
పఠనములను దగ నుపాస్తి సేయు. 51

సీ. భారతవర్షాధిపతి యగు బదరికాశ్రమమున నున్న నారాయణుండు
భూనాథ! యా మహాత్ముని నారదాదుల భారతవర్షంబు ప్రజలుఁ బ్రేమఁ
బాయక చేరి యుపాస్తి సేయుచు సాంఖ్య యోగంబు నుపదేశ ముచితవృత్త
నంది యందఱును గృతార్థులై యట్టి నారాయణదేవు నారాధనంబు

ఆ. చేసి యాత్మఁ జాలఁ జింతించి తత్ప్రకా
శకము లైన మంత్రసంస్తవములఁ
బూజఁ జేసి ముక్తిఁ బొందుచు నుండుదు
రచలమైన భక్తి ననుదినంబు. 52

1. గాంతురతని కైవల్యంబున్ (హ)

† ఈ పద్యము (వా) లో లేదు. దీని తరువాత

క. ఆ వర్షమందులను బ్రజ, లా విపుల వరాహమూర్తి ననవరతంబున్
సేవించి కొలిచి సంస్తుతిఁ, గావించుచుఁ గాంతు రంతఁ గైవల్యంబున్.

అను పద్యము (తం. వా.) లలోఁ గలదు. మూలమునను గలదు.

క. భారత వర్షమునందుల, సారాంశము లైన పుణ్యశైలంబులు గం
భీర ప్రవాహములు గల, వారయ నెఱిఁగింతు వాని నవనీనాథా ! 53

వ. మలయపర్వతమును, మంగళప్రస్థమును ,మైనాకంబును, త్రికూటంబును, ఋషభ పర్వతంబును, కూటకమును, గోల్లమును, సహ్యపర్వతంబును, వేదగిరియును, ఋష్యమూక పర్వతమును, శ్రీశైలంబును, వేంకటాద్రియును, మహేంద్రంబును,వారిధరంబును,వింధ్యపర్వతంబును, శుక్తిమత్పర్వతంబును, ఋక్షగిరియుఁ, బారియాత్రంబును, ద్రోణపర్వతంబును, చిత్రకూటంబును, గోవర్ధనాద్రియును, రైవతకంబును,కుకుంభంబును,నీలగిరియుఁ, గాకముఖంబును, నింద్రకీలంబును, రామగిరియు నాదిగాఁ గల పుణ్యపర్వతంబు లనేకంబులు గలవు. ఆ పర్వత పుత్రిక లైన చంద్రపటయుఁ. దామ్రపర్ణియు, నవటోదయుఁ, కృతమాలయు, వైహాయసియుఁ, గావేరియు, వేణియుఁ, బయస్వినియుఁ,బయోదయు,శర్కరావర్తయుఁ, దుంగభద్రయుఁ, కృష్ణవేణియు, భీమరథియుఁ, గోదావరియు, నిర్వింధ్యయుఁ, బయోష్ణయుఁ, దాపియు,రేవానదియు,శిలానదియు,సురసయుఁ, జర్మణ్వతియు, వేదస్మృతియు, ఋషికుల్యయుఁ, త్రిసమయుఁ, కౌశికియు, మందాకినియు, యమునయు, సరస్వతియు, దృషద్వతియు, గోమతియు, సరయువును, భోగవతియు, సుషమయు, శతద్రువును, చంద్రభాగయుఁ, మరుద్వృధయు, వితస్తయు, నసిక్నియు, విశ్వయు, నను నీ మహానదులును, నర్మద, సింధువు, శోణ యను నదంబులును నయిన మహాప్రవాహంబు లీ భారతవర్షంబునం గలవు. అందు సుస్నాతు లైన మానవులు ముక్తిం జెందుదురు. మఱియు నీ భారతవర్షంబున జన్మించిన పురుషులు [1]శుక్ల లోహిత కృష్ణవర్ణ రూపంబు లగు త్రివిధకర్మంబులం జేసి క్రమంబుగ దేవ మనుష్య నరక గతు లను త్రివిధగతులఁ బొందుదురు, వినుము. రాగద్వేషాది శూన్యుఁడును (నవాఙ్మానస గోచరుఁడును,ననాధారుండు నగు శ్రీవాసుదేవమూర్తి యందుఁ జిత్తంబు నిలిపి భక్తియోగంబున నారాధించెడు మహాత్ము లవిద్యా గ్రంథివహనంబు గావించుటం జేసి పరమభాగవతోత్తములు పొందెడు నుత్తమగతినిం జెందుదురు. కావున భారతవర్షంబు మిగుల నుత్తమం బని) మహాపురుషు లిట్లు స్తుతింపుచుండుదురు.

ఉ. భారతవర్ష జంతువుల భాగ్యము లేమని చెప్పవచ్చు ! నీ
భారతవర్ష మందు హరి పల్మఱు బుట్టుచు జీవకోటికిం
ధీరతతోడఁ దత్త్వ ముపదేశము సేయుచుఁ జెల్మి సేయుచు
న్నారయ బాంధవాకృతిఁ గృతార్థులఁ జేయుచునుండు నెంతయున్. 55

1. సాత్త్వికరాజసతామస (జ) * తా. ప. ప్రతులలో లేదు.

క. తన జన్మకర్మములనుం, గొనియాడెడివారి కెల్లఁ గోరిన వెల్లన్
దనియఁగ నొసఁగుచు మోక్షం, బనయముఁ గృపసేయుఁ గృష్ణుఁ డవనీనాథా!

వ. ఇట్లు భారతవర్షంబునందుల జనంబులకు నెద్దియు నసాధ్యంబు లేదు. నారాయణ స్మరణంబు సకల దురితంబుల నడంచు. తన్నామస్మరణ రహితంబులైన యజ్ఞ తపో దానాదులు దురితంబుల నడంపలేవు. బ్రహ్మకల్పాంతంబు బ్రతికెడి యితర స్థానంబునం బునర్జన్మభయంబున భీతిల్లుచు నుండుటకన్న, భారతవర్షంబు నందు క్షణమాత్రంబు మనంబున సర్వసంగ పరిత్యాగంబు చేసిన పురుషశ్రేష్ఠునకు శ్రీమన్నారాయణ పదప్రాప్తి యతిసులభంబుగ సంభవించు. కావున నట్టి యుత్తమ మగు నీ భారతవర్షంబె కోరుచుండుదురు. మఱియు నెక్కడ వైకుంఠుని కథావాసన లేకుండు, నే దేశంబున సత్పురుషులైన పరమభాగవతులు లేకుండుదు, రే భూమిని యజ్ఞేశ్వరుని మహోత్సవంబులు లేకయుండు నది సురేంద్రలోకం బైన నుండం దగదు. జ్ఞానానుష్ఠాన ద్రవ్య కలాపంబుచేత మనుష్యజాతిం బొంది, తపంబున ముక్తిం బొందకుండెనేని, మృగంబుల మాడ్కి నతండు దనకుం దానె బంధనంబు నొందు. భారతవర్షంబు నందుఁ బ్రజలచేత శ్రద్ధాయుక్తంబుగా ననుష్ఠింపంబడ్డ యజ్ఞంబులయందు వేల్వంబడ్డ హవిస్సులను బెక్కునామంబులం బుండరీకాక్షుం డంది,తనమీఁది భక్తి యధికంబుగాఁ జేయు. అట్టి భారతవర్షంబునందలి ప్రజల మీఁదం గరుణించి (సర్వేశ్వరుం) డిహ పర సౌఖ్యంబుల నొసఁగుచుండు. జంబూద్వీపంబున సగరాత్మజు లశ్వమేధాశ్వంబు నన్వేషింపఁ బూని భూఖననంబు సేయుటంజేసి స్వర్ణప్రస్థ, చంద్రశుక్ల, ఆవర్తన, రమణక, మందేహారుణ, పాంచజన్య, సింహళ, లంక లను నెనిమిది యుపద్వీపంబులు గలిగె. 57

## అధ్యాయము - ౨౦

సీ. లక్షయోజనముల లవణాబ్ధి పరివృత మగుచు జంబూద్వీప మతిశయిల్లు
విను రెండులక్షలు విస్తృతముగను బ్లక్షద్వీప మిక్షురసాబ్ధిచేత
నావృత మై యుండు నారూఢముగ నందు వృక్షంబు ప్లక్షంబు విదితముగను
దనరు నా ద్వీపంబు తరునామ మహిమచే మిగులఁ బ్లక్షం బన మించి రహిని

ఆ. నందు సంచరించునట్టివారల కగ్ని
దేవుఁ డమరు నాదిదేవతయుఁగ
నందులోన నా ప్రియవ్రత సుతుఁ డగు
నిధ్మజిహ్వుఁ డను మహీవరుండు. 58

వ. నరేంద్రా! యీ యిధ్మజిహ్వుం డా ప్లక్షద్వీపంబు నేడు వర్షంబులుగ విభజించి యందు నా వర్షనామధారులుగా నుండు తన పుత్రు లగు శివ, యశస్య, సుభద్ర, శాంత, క్షేమ, అభయ, అమృతు లనియెడు నేడుగుర నేడువర్షంబుల కధిపతులం గావించి, తపంబునకుం జనియె. ఆ వర్షంబులయందు మణికూట, వజ్రకూట, ఇంద్రసేన, జ్యోతిష్మ, ధూమ్రవర్ణ, హిరణ్యగ్రీవ, మేఘమాల లను నామంబులం గల సప్త కులపర్వతంబులును, అరుణయు, నృమణయు, నంగిరసియు, సావిత్రియు, సుప్రభాతయు, ఋతంభరయు, సత్యంభరయు, నన సప్త మహానదులును, నా నదులయందు స్నాతు లగుచు గతపాపు లైన హంస, పతంగ, గోర్ధ్వాయన, సత్యాంగు లను నామంబులు గల చాతుర్వర్ణ్యంబును గలిగియుండు. అందుఁ బురుషులు సహస్రవత్సర జీవులును, దేవతాసములును, [1]దృష్టిమాత్రంబునఁ గ్లమ స్వేదాది రహితం బగు నపత్యోత్పాదనంబు గలవారలు నగుచు వేదత్రయాత్మకుండును, స్వర్గద్వారభూతుండును భగవత్స్వరూపియు నగు సూర్యుని వేదత్రయమున సేవింతురు. ప్లక్షద్వీపం బాదిగా మీఁదటి ద్వీప పంచకమందలి పురుషులకు నాయు రింద్రియ పటుత్వంబులును, తేజో బలంబులును, దోడనె జనియింపుచుండు. 59

క. ప్లక్షద్వీపము ద్విగుణిత, లక్షేక్షురసాబ్ధి సుట్టి రా విలసిల్లు
న్నిక్షురసోద ద్విగుణం, బక్షయముగ శాల్మలీమహాద్వీప మిలన్. 60

వ. అందు శాల్మలీవృక్షంబు ప్లక్షాయామం బై తేజరిల్లు. (ఆ వృక్షరాజంబునకు నధోభాగంబున) పతత్రిరాజుగా నుండు గరుత్మతుండు నిలుకడగా వసియించు. శాల్మలీవృక్షంబు పేర నా ద్వీపంబు శాల్మలీ ద్వీపం బన విలసిల్లు. అ ద్వీపపతియైన (ప్రియవ్రతాత్మజుం డగు) యజ్ఞబాహువు తనపుత్రు లగు సురోచన, సౌమనస్య, రమణక, దేవబర్హ, పారిబర్హ, ఆప్యాయన, అభిజ్ఞాతు లనియెడు వారి పేర నేడు వర్షంబుల నేర్పఱిచి యా వర్షంబులయం దేడ్వురఁగుమారుల నభిషిక్తులం జేసె. ఆ వర్షంబులయందు స్వరస, శతశృంగ, వామదేవ, కుముద, ముకుంద, పుష్పవర్ష, శతశ్రుతు లను పర్వత సప్తకంబును, అనుమతియు, సినీవాలియు, సరస్వతియుఁ, గుహూవును, [2]రజనియు, నందయు, రాకయు నను సప్తమహానదులును గలవు. అందు శ్రుతధర, విద్యాధర, వసుంధర, ఇధ్మధర సంజ్ఞులగు నా వర్షపురుషులు భగవత్స్వరూపుండును, వేదమయుండును, నాత్మస్వరూపుండు నగు సోముని వేదమంత్రంబులచేత నారాధించుదురు. ఆ ద్వీపంబు లక్షచతుష్టయ పరిమితి యోజన విస్తృతమైన సురాసముద్రముచే నావృతమై తేజరిల్లు. అందు,

1. దృష్టిమాత్ర గర్భోత్పత్తులగుదురు (క.చ.ట.) 2. అజని (హ) 'సరస్వతీకుహూరజనీనందారాకేతి' (20-8)

సీ. భూనాథ! యా సురాంభోధికిఁ జుట్టుగా నుండు కుశద్వీప మర్వీమీఁదఁ
దోరమై తా ద్వివతుర్లక్ష యోజనంబులను విస్తార మై పొలుపు మిగుల
నందుఁ గుశస్తంభ మనిశంబు దేవతాకల్పితం బై నట్టి కాంతిచేత
దిక్కులు వెలిఁగించు ద్వీపంబునకుఁ దన పేరను సత్కీర్తి పెంపుసేయు

తే. నట్టి దీవికి నధిపతి యగు ప్రియవ్ర
తాత్మజుండు హిరణ్య రేతసుఁడనం ద
నరెడి భూపతి దన సుత నామములను
వర్షములు సేసె నత్యంత హర్షమునను. 62

వ. ఇట్లు హిరణ్యరేతసుఁడు వసుదాన, దృఢరుచి, నాభి, గుప్త, సత్యవ్రత, విప్ర, వామదేవు లను నామంబులు గల పుత్రుల నామంబుల సప్తవర్షంబులం గావించి, యా కుమారుల నందు నిలిపి, తాను దపంబునకుం జనియె. ఆ వర్షంబునందు బభ్రు, చతుశ్శృంగ, కపిల, చిత్రకూట, దేవానీక, ఊర్ధ్వరోమ, ద్రవిణంబు లను నామంబులు గల సప్తగిరులును, రసకుల్యయు, మధుకుల్యయు, శ్రుతవిందయు, మిత్రవిందయు, దేవగర్భయు, ఘృతచ్యుతయు, మంత్రమాలయు నను సప్త మహానదులును గలవు. ఆ నదీజలంబులఁ గృతమజ్జను లగుచు భగవంతుం డగు యజ్ఞ పురుషునిఁ గుశల, కోవిద, అభియుక్త, కులక సంజ్ఞలు గల వర్షపురుషు లారాధింపుచుందురు. 63

సీ. ఆ కుశద్వీపంబు నరికట్టుకొని యుండు నెనిమిదిలక్షల ఘనఘృతాబ్ధి
యా ఘృతసాగరం బవ్వల షోడశలక్ష యోజనముల లలిత మగుచు
నుండుఁ గ్రౌంచద్వీప ముర్వీశ! యందు మధ్యప్రదేశంబున నట్టి దీవి
పేరుగాఁ దనపేరఁ బెద్దగాఁ జేసిన క్రౌంచాద్రి గల దా నగంబు మున్ను

ఆ. షణ్ముఖుండు దివ్యశరమున ఘననితం
బంబు [1]దూయనేయఁ బాలవెల్లి
గరిమఁ దడుపుచుండు వరుణుఁడు రక్షింప
నందు మిగుల భయము నొందకుండె. 64

వ. నరేంద్రా! యా క్రౌంచద్వీపపతి యగు ఘృతపృష్ఠుండు దన కుమారుల నా పేళ్ళుగల యామోద, మధువహ, మేఘపృష్ఠ, సుదామ, ఋషిజ్య, లోహితార్ణ, వనస్పతు లను వర్షంబుల కభిషిక్తులం జేసి పరమ కళ్యాణగుణయుక్తుం డైన శ్రీహరి చరణారవిందంబులు సేవింపుచుం దపంబునకుం జనియె. ఆ వర్షంబుల

1. గాడనేయ (క. చ. ట.)

యందు శుక్ల, వర్ధమాన, భోజన, ఉపబర్హణ, ఆనంద, నందన, సర్వతోభద్రము లను సప్తసీమా పర్వతంబులును, అభయయు, అమృతౌఘయు, ఆర్యకయు, తీర్థవతియు, తృప్తిరూపయు, పవిత్రవతియు, శుక్లయు నను సప్తనదులును గలవు. అందుల పవిత్రోదకంబు లనుభవించుచు గురు, ఋషభ, ద్రవిణక, దేవక సంజ్ఞలు గలిగి, వరుణదేవుని నుదకాంజలులం బూజించుచున్న చాతుర్వర్ణ్యంబుండు. 65

సీ. జగదీశ ! వినుము క్రౌంచద్వీపమును జుట్టియుండు షోడశలక్ష యోజనముల
విస్తార మై పాలవెల్లి యందునను శాకద్వీప మతుల ప్రకాశ మొందు
దండి మై ముప్పది రెండులక్షల యోజనముల విస్తార మై యమరియుండు
నందున శాకవృక్షమోద మా ద్వీపమును సుగంధంబునఁ బెనఁగఁ జేసి

తే. యంతఁ దనపేర దీవి ప్రఖ్యాత [1]మగుటఁ
జేసి యందున మిగులఁ బ్రసిద్ధి కెక్కె
నందు మేధాతిథియుఁ గర్త యగుచు నుండెఁ
దవిలి వేడుకఁ దనదు నందనులఁ జూచి. 66

వ. మఱియు నా ప్రియవ్రతపుత్రుం డైన మేధాతిథి తన పుత్రుల పేరం గల పురోజన, మనోజన, వేపమాన, ధూమ్రానీక, చిత్రరథ, బహురూప, విశ్వాచారము లను సంజ్ఞలు గల సప్తవర్షంబులయందు వారలకుఁ బట్టంబు గట్టి, శ్రీహరి పాదసేవచేయుచుఁ దపోవనంబునకుం జనియె. ఆ శాకద్వీపంబునందు ఈశాన, ఉరుశృంగ, బలభద్ర, శతకేసర, సహస్రస్రోతో, దేవపాల, మహానసము లను సీమాగిరులును, అనఘ, ఆయుర్ద, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచపరి, సహస్ర స్మృతి, నిజధృతి యను సప్త నదులును గలవు. ఆ నదీజలంబు లుపయోగించి, యచ్చటి వారలు ప్రాణాయామంబు సేసి, విధ్వస్త రజస్తమోగుణు లై పరమ సమాధిని వాయురూపం బైన భగవంతుని సేవింతురు. ఋతవ్రత, సత్యవ్రత, దానవ్రత, సువ్రత నామంబులు గల చాతుర్వర్ణ్యం బందుఁ గలిగియుండు. 67

సీ. అట్టి శాకద్వీప మరికట్టి త త్ప్రమాణంబున దధిసముద్రంబు వెలుఁగు
నందుకుఁ బరివృతం బై పుష్కరద్వీప మిలఁ జతుష్షష్టి లక్షల విశాల
మ మ్మహాద్వీపమం దయుత కాంచన పత్రములు గల్గి కమలగర్భునకు నాస
నం బగు పంకేరుహం బుండు నా ద్వీపమధ్యంబునను నొక్క మానసోత్త

1. మమరఁ (హ)

ఆ. రం బనంగఁ బర్వతం బుండుఁ దనకుఁ బూ
ర్వాపరముల నుండునట్టి వర్ష
ములకు రెంటి కిట్లు నిలిచిన మర్యాద
నగ మనంగఁ జాలఁ బొగడ నెగడి. 68

వ. ఇట్లు దనకు లోపలి వెలుపలి వర్షంబులు రెంటికి మర్యాదాచలంబునుం బోలి యున్న మానసోత్తర పర్వతం బయుత యోజన విస్తారంబును, నంతియ యౌన్నత్యంబునుం గలిగియుండు. ఆ నగంబునకు నలుదిక్కుల యందును నాలుగు లోకపాలుర పురంబులుండు. ఆ మానసోత్తర పర్వతంబు తుద సూర్యరథచక్రంబు సంవత్సరాత్మకం బై యహోరాత్రంబులయందు మేరుప్రదక్షిణంబు సేయు. అందు నా పుష్కర ద్వీపాధిపతి యగు వీతిహోత్రుండు రమణక, ధాతక నామంబులు గల పుత్రుల నిరువుర వర్షద్వయంబునందు నభిషిక్తులం జేసి, తాను పూర్వజు లేగిన తెఱంగున భగవత్కర్మశీలుం డగుచుఁ దపంబునకుం జనియె. అంత. 69

క. మనుజేశ్వర! యా వర్షంబున నెప్పుడు సంచరించు పురుషులు పద్మా
సనుఁ దగ సకర్మకారా, ధన సేయుదు రచలబుద్ధి తాత్పర్యమునన్. 70

క. ధరణీవల్లభ! విను పుష్కర మను ద్వీపమున లేరు చాతుర్వర్ణ్యుల్
పరఁగఁగ[1]నెక్కువ తక్కువ,[2]లెఱుఁగక సము లగుచు నుందు రెల్ల జనంబుల్. 71

వ. మఱియు నా పుష్కరద్వీపంబు చతుష్షష్టి లక్షల యోజనవిస్తారం బైన శుద్ధోదక సముద్రముద్రితం బగుచుండు. అవ్వల లోకాలోకపర్వతం బుండు. శుద్ధోదక సముద్ర లోకాలోకపర్వతంబుల నడుమ రెండు కోట్ల యోజనవిస్తారం బైన నిర్జన[3](కాంచన) భూమి *(దర్పణోదర సమానం బై, దేవతావాస యోగ్యంబుగా నుండు.) ఆ భూమిం జేరిన పదార్థంబు మరలఁ బొంద నశక్యంబుగా నుండు. అటమీఁద లోకాలోకపర్వతం బెనిమిదికోట్ల యోజనంబులు. సువర్ణ భూమియు [4]సూర్యాదిధ్రువాంతంబు లగు జ్యోతిర్గణంబులు మధ్యంబున నుండుటం జేసి [5]లోకాలోకపర్వతం బనఁదగి యుండు. పంచాశత్కోటి (యోజనవిస్తృతం బగు) భూమండల (మానంబునకుఁ దురీయాంశ ప్రమాణంబు గల) లోకాలోక పర్వతంబు మీఁద నఖిల జగద్గురు వగు [6]బ్రహ్మచేతఁ (జతుర్దిశలయందు) ఋషభ,

1. భేదములేక (హ) 2. నరసత సములగుదు రందు సకలజనంబుల్ (హ.తం.వా.) 3. నిర్జన భూమి (హ. తం. వా.) 4. గ్రహతేజోంధతమో మధ్యంబున నుండుటంజేసి (క.చ.ట.త.ద.ప.బ.) 5. చక్రవాళ పర్వతంబు నాబడు (ట. జ. ద. బ.) 6. బ్రహ్మచేత నిర్మితంబైన దిక్పాలుర పురంబులును దిక్పాల సమేతంబైన పట్టణంబులు నాల్గును (చ.ట.ద.ద.బ.) * తా. ప. ప్రతులలో లేదు.

పుష్కరచూడ, వామన, అపరాజిత సంజ్ఞలం గల దిగ్గజంబులు నాలుగును లోక రక్షణార్థంబు నిర్మితం బై యుండు. మఱియును, 72

సీ. తనదు విభూతు లై తనరిన యా దేవబృంద తేజశ్శౌర్య బృంహణార్థ
మై భగవంతుండు నాదిదేవుండును నైన జగద్గురుం డచ్యుతుండు
సరిలేని ధర్మవిజ్ఞాన వైరాగ్యాదు లైన విభూతుల నలరియున్న
యట్టి విష్వక్సేనుఁ డాదిగా వెలుఁగు పార్షదులతోఁ గూడి ప్రశస్తమైన

తే. నిజ వరాయుధ దోర్దండ నిత్య సత్త్వుఁ
డగుచు నా పర్వతంబుపై నఖిలలోక
రక్షణార్థంబు కల్పపర్యంత మతఁడు
యోగమాయా [1]పరీతుఁ డై యొప్పుచుండు. 73

వ. ఇట్లు వివిధ మంత్రగోపనార్థం బా నగాగ్రంబున నున్న భగవంతునికిఁ దక్క లోకాలోకపర్వతంబునకు నవ్వల నొరులకు సంచరింప నశక్యం బై యుండు. బ్రహ్మాండంబునకు సూర్యుండు మధ్యగతుం డై యుండు. ఆ సూర్యునకు నుభయ పక్షంబులయందు నిరువదేనుకోట్ల యోజనపరిమాణంబున నండకటాహం బుండు. అట్టి సూర్యునిచేత నాకాశ దిక్స్వర్గాపవర్గంబులును, నరకంబులును నిర్ణయింపం బడు. దేవ తిర్యఙ్మనుష్య నాగ పక్షి తృణ గుల్మ లతాది సర్వ జీవులకును సూర్యుం డాత్మ యగుచు నుండు. 74

క. కర మనురాగంబున నీ, ధరణీ మండలము సన్నిధానం బెల్లన్
నరవర! యెఱుఁగం జెప్పితి, మఱి చెప్పెద వినుము దివ్యమానం బెల్లన్. 75

అధ్యాయము — ౨౧

## —: భగోళ విషయము :—

ఆ. కమలజాండ మధ్యగతుఁ డైన సూర్యుండు
[2]భరిత మైన యాతపంబుచేత
మూఁడు లోకములను [3]మించి తపింపంగఁ
జేసి కాంతి నొందఁ జేయుచుండు. 76

వ. అట్టి [4]భాస్కరుం డుత్తరాయణ దక్షిణాయన [5]వైషువతంబు లను నామంబులు గల మాంద్య తీవ్ర సమానగతుల నారోహణావరోహణ స్థానంబులయందు దీర్ఘ హ్రస్వ సమానంబులుగాఁ జేయుచుండు. 77

1. విరచితుఁడైన (హ. తం. హ.) 2. అధికమైన యాన మతడుచేయు (క.చ.) 3. మొనసి (బ)
4. భాస్కరుఁ డుదగయన దక్షిణాయన (జ. డ.) 5. విష్ణువులను (హ) విషువులను (తం. వా.)

ఆ. మేష తులలయందు మిహిరుం డహోరాత్రు
లందుఁ దిరుగు సమవిహారములను
పరఁగఁగ వృషభాది పంచ [1]రాసులను నొ
క్కొక్క గడియ రాత్రి దక్కి నడచు. 78

ఆ. మించి వృశ్చికాది పంచ [2]రాసులను నొ
క్కొక్కగడియ రాత్రి నిక్కి నడచు
దివములందు నెల్లఁ దిగఁజాఱు నొక్కొక్క
గడియ నెలకుఁ దత్ప్రకారమునను. 79

వ. మఱియు, నివ్విధంబున దివసంబు లుత్తరాయణ దక్షిణాయనముల వృద్ధిక్షయంబుల నొంద, నొక్క యహోరాత్రంబున [3]నేక పంచాశదుత్తర నవకోటి యోజనంబుల పరిమాణంబు గల మానసోత్తర పర్వతంబున సూర్యరథంబు దిరుగుచుండు. ఆ మానసోత్తర పర్వతంబునందుఁ దూర్పున దేవధాని యను నింద్రపురంబును, దక్షిణంబున సంయమని యను యమనగరంబును, బశ్చిమంబున నిమ్లోచని యను వరుణపట్టణంబును నుత్తరంబున విభావరి యను సోముని పుటభేదనంబును దేజరిల్లుచుండు. ఆ పట్టణంబులయందు నుదయ మధ్యాహ్నాస్తమయ నిశీథంబు లనియెడు కాలభేదంబులను, భూతప్రవృత్తి నివృత్తి నిమిత్తం బచ్చటి జనులకుం బుట్టింపుచుండు. †సూర్యుఁ డెపు డింద్రనగరంబుననుండి గమనించు నదియాదిగాఁ బదియేను గడియలను రెండుకోట్లుం ముప్పదియేడు లక్షల డెబ్బదియైదువేల యోజనంబులు నడుచు. ఇవ్విధంబున నింద్ర యమ వరుణ సోమ పురంబులమీఁదఁ జంద్రాది గ్రహనక్షత్రంబులం గూడి సంచరించుచుఁ బండ్రెండంచులు, నాఱు కమ్ములును, మూఁడు [4]తొలులుం గలిగి, సంవత్సరాత్మకం బై యేకచక్రం బైన సూర్యుని రథంబు ముహూర్తమాత్రంబున [5]సప్తశతాధిక చతుస్త్రింశల్లక్ష యోజనంబులు సంచరించు. 80

సీ. ఇను రథంబున నున్న యిరు సొక్కటియ మేరు శిఖరంబునందును జేరియుండు
నొనరఁ జక్రము మానసోత్తరపర్వతం బందులఁ [6]దిరిగెడు నా రథంబు
నిరుసున నున్న రెండిరుసులు దగులంగఁ బవనపాశంబుల బద్ధమగుచు
ధ్రువమండలంబునందుల నంటి యుండఁగా సంచరించుచునుండు సంతతంబు

1. మాసముల (హ.తం.వా.); ''వృషభాదిషు పంచసురాశిషు" (21-4) 2. మాసముల (హ.తం. వా.) 3. తొమ్మిదికోట్లు యాబదియొక్కలక్ష (క. చ. త. ద.) †ఇచ్చట మూలమున మఱికొంత విషయ మధికముగాఁ గలదు. 4. నాభులు (క.ద.) 5. ముప్పదినాలుగు లక్షల యెనమన్నూరు యోజనంబులు (చ.త ద.) 6. తిరుగాడు (క.ట.) తిరిగాడు (త.డ.ద.బ.)

తే. నట్టి యరదంబు ముప్పదియాఱులక్ష
లందు నంటిన కాఁడియు సన్ని యోజ
నముల విస్తార మై తురంగముల కంధ
రములఁ దగులుచు వెలుఁగొందు రమణతోడ. 8

వ. ఆ రథంబునకు గాయత్రీఛందం బాదిగా సప్తచ్ఛందంబులు నశ్వంబు లై సంచ
రించు. భాస్కరునకు నగ్రభాగంబున నరుణుండు నియుక్తుం డై రథంబు గడ
చుండు. అంగుష్ఠపర్వమాత్ర శరీరంబులు గల యఱువదివేల వాలఖిల్యాఖ్యు లగు
ఋషివరులు సూర్యునిముందట సౌరసూక్తంబుల స్తుతియింప, మఱియు ననేక
మునులును గంధర్వ కిన్నర కింపురుష నాగాప్సరః పతంగాదులును నెలనెల
వరుసక్రమంబున సేవింపఁ దొమ్మిదికోట్లు న్నేఁబదియొక లక్ష యోజనంబుల
పరిమాణంబు గల భూమండలంబునం (దొకక్షణంబున సూర్యుండు రెండువేల
న్నేఁబదియోజనములు సంచరింపుచు) నొక యహోరాత్రంబునందె యీ భూ
మండల మంతయు సంచరించు. అనిన శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్న రేంద్రుం
డి ట్లనియె. 8

## అధ్యాయము - ౨౨

క. మునివర! మేరు ధ్రువులకు, నొనరఁ బ్రదక్షిణము దిరుగుచుండెడు [1]నజుఁ డ
యినుఁ డభిముఖుఁ డై రాసుల, కనుకూలత నేఁగు నంటి వది యెట్లొప్పున్? 8

క. అని పలికిన భూవరునిం, గనుఁగొని శుకయోగి మిగులఁ గరుణాన్వితుఁ డై
మనమున శ్రీహరిఁ దలఁపుచు, వినుమని క్రమ్మఱఁగ నిట్లు వినుపించెఁ దగన్.

వ. నరేంద్రా! (యతివేగంబునఁ) దిరుగుచుండు [2]కులాల చక్రంబునందుఁ జక్ర
భ్రమణమునకు వేఱైన గతినొంది, బంతి సాగి తిరిగెడు పిపీలికాదుల చందంబు
నక్షత్రరాసులతోఁగూడిన కాలచక్రంబు ధ్రువమేరువులం బ్రదక్షిణంబు తిరుగు
డా కాలచక్రంబు [3]వెంట సంచరించు సూర్యాది గ్రహంబులకు నక్షత్రాంతరంబు
యందును, రాశ్యంతరంబులయందును, [4]నునికి గలుగుటం జేసి(సూర్యాది గ్రహ
బులకుఁ జక్రగతిస్వగతులవలన గతిద్వయంబు గలుగుచుండు. మఱియు
సూర్యుం డాదినారాయణమూర్తి యగుచు లోకంబుల యోగక్షేమంబులకు వేద

1. ఆ సూర్యునకును రాసుల కెదురయ్యును చందము తేటపడగ నెరిగింపు తగన్ (క.చ.ట.త.డ.ద.బ.) 2. కులాల చక్రంబుతోడనె తిరుగు పిపీలికాదులకు భ్రమణవేగంబున స్థానాంతరంబునందునికి దోచిన చందంబున (క.చ.ట.డ.త.ద.బ.) (తోఁపని-తం.) 3. నెదుర (హ) 4. ఉనికి దోచుగా రాశికి నెదురు నడచుట లేదు (క.బ)

యాత్మకంబును, గర్మసిద్ధినిమిత్తంబును, దేవర్షిగణంబులచేత, [1]వేదాంతార్థంబుల ననవరతంబు వితర్క్యమాణంబును నగుచున్న ) తన స్వరూపంబును ద్వాదశ విధంబులుగ విభజించి, వసంతాదిఋతువుల [2]నా యా కాలవిశేషంబులయందుఁ [3]గలుగజేయుచుండు. (అట్టి పరమపురుషుని మహిమ నీ లోకంబున మహాత్ము లగు పురుషులు వారి వారి వర్ణాశ్రమాచారముల చొప్పున వేదోక్త ప్రకారంబుగా భక్త్యతిశయంబున నారాధింపుచు క్షేమంబు నొందుచుందురు. అట్టి యాది నారాయణమూర్తి జ్యోతిశ్చక్రాంతర్వర్తి యై, స్వకీయ తేజఃపుంజ దీపితాఖిల జ్యోతిర్గణంబులు గలవాఁ డై, ద్వాదశరాసులయందు నొక సంవత్సరంబున సంచరింపుచుండు. అట్టి యాదిపురుషుని గమనవిశేషకాలంబును లోకులు అయన, ఋతు, మాస, పక్ష, తిథ్యాదులచే వ్యవహరింపుచుందురు. మఱియు న ప్పరమ పురుషుం డా రాసులయందు షష్ఠాంశసంచారంబు నొందిన సమయంబును ఋతు వని వ్యవహరించుదురు. ఆ రాసులయందు నర్ధాంశసంచారమున రాశిషట్క భోగం బొందినతఱి అయన మని చెప్పుదురు.) సమగ్రముగా రాసులయందు సంచార మొందినయెడల, నట్టి కాలంబును సంవత్సరం బని నిర్ణయించుదురు. ఇట్టి సమగ్ర రాశి సంచారమునందు శీఘ్రగతి, మందగతి, సమగతు లనియెడు త్రివిధ గతివిశేషములవల్ల వేఱుపడెడు నా సంవత్సరంబును, వత్సరము, పరివత్స రము, ఇళావత్సరము, అనువత్సరము, ఇద్వత్సర మని పంచవిధంబులఁ జెప్పుదురు. చంద్రుండును, నీ తెఱంగున నా సూర్యమండలంబుమీఁద లక్షయోజనంబుల నుండి సంవత్సర పక్ష రాశి నక్షత్ర [4]భుక్తులు గ్రహించుచు నగ్రచారియై, శీఘ్ర గతిం జరించు. అంత, వృద్ధిక్షయరూపంబునఁ బితృగణంబులకు (బూర్వప క్షాపర పక్షంబులచేత నహోరాత్రంబులఁ గలుగఁజేయుచు) సకల జీవప్రాణుం డై యొక్క నక్షత్రంబు త్రింశన్ముహూర్తంబు లనుభవింపుచు, షోడశకళలం గలిగి మనోమయాన్నమయామృతమయ దేహుం డై, దేవ పితృ మనుష్య భూత పశు పక్షి సరీసృప వీరు త్ప్రభృతులకుం బ్రాణాప్యాయనశీలుం డగుటంజేసి సర్వ [5]మయుం డనఁబడును. 85

క. చందురునకు మీఁదై యా, నందంబున లక్షయోజనంబులఁ దారల్
గ్రందుకొని మేరుశైలం, బంది ప్రదక్షిణము దిరుగు నభిజిద్భముతోన్. 86

1. ధ్యానంబు సేయంబడ్డ దగుచు తన (క. డ. ద.) 2. నాకాశగతుండై (క. చ. ట. త. జ. బ.)
3. ద్వాదశ మాసంబులను ద్వాదశ రాశులను అనుభవించుచుండు (క. చ. ట. బ) 4. పుచ్చుకొనుచు (హ)
4. భుక్తి నిచ్చుచు (క. బ.) 5. సముఁడు (హ. తం. వా.)

సీ. అటమీఁదఁ దారల కన్నిటి కుపరి యై రెండులక్షల శుక్రుఁ డుండి భాస్క
రునికి ముందఱఁ బిఱుఁదను సామ్య మృదు శీఘ్ర సంచారములను భాస్కరుని మాడ్కిఁ
జరియింపుచుండును జనులకు ననుకూలుఁ డై వృష్టి నొసఁగుచు నంతనంతఁ
జతురత వృష్టివిష్కంభక గ్రహశాంతి నొనరించువారల కొసఁగు శుభము

తే. లుండు నామీఁద సౌమ్యుండు రెండులక్ష
లను జరింపుచు రవిమండలంబుఁ బాసి
[1]కండ్లఁబడినను జనులకు క్షామ డాంబ
రాది భయములఁ బుట్టించు నతులమహిమ. 87

సీ. ధరణీతనూజుఁ డంతటిమీఁద రెండులక్షల నుండి మూఁడుపక్షముల నొక్క
రాశి దాఁటుచునుండుఁ గ్రమమున ద్వాదశ రాసులు భుజియించు రాజసమున
వక్రించి యైన నవక్రత నైనను దఱచుగాఁ బీడలు నరుల కొసఁగు
నంగారకుని పట్టు కావల రెండు లక్షల యోజనంబుల ఘనత మించి

ఆ. యొక్కరాశి నుండి యొక్కొక్క వత్సరం
బనుభవింపుచుండు నమరగురుఁడు
వక్ర మందు నైన వసుధామరులకును
శుభము నొసఁగు నెపుడు నభినవముగ. 88

క. సురగురునకు మీఁదై భా, స్కర సుతుఁ డిరులక్షలను జగములకుఁ బీడల్
జరపుచుఁ ద్రింశన్మాసము, లరుదుగ నొక్కొక్క రాశియందు వసించున్. 89

క. ప్రాకటముగ రవిసుతునకు, నేకాదశ లక్షలను మహీసురులకు నీ
లోకులకు మేలుగోరుచు, జోకగ మునిసప్తకంబు సొంపు వహించున్. 90

క. మునిసప్తకమున కెగువం, దనరుచు నామీఁదఁ ద్రియుతదశ లక్షలఁ బెం
పున శింశుమార చక్రం, బనఁగా నన్నిటికి నుపరి యగుచుండు నృపా! 91

## అధ్యాయము - ౨౩

సీ. ఆ శింశుమారాఖ్య మగు చక్రమున భాగవతుఁడైన ధ్రువుఁ డింద్ర [2]వహ్ని కశ్య
ప ప్రజాపతి యను ప్రముఖులతోఁ గూడి బహుమానముగ విష్ణుపదముఁ జేరి
కఱఁక నిచ్చలుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచుఁ జెలఁగియుండును గల్పజీవి యగుచు
ననఘుఁ డుత్తానపాదాత్మజుఁ డార్యుఁడు నైన యా ధ్రువుని మహత్త్వమెల్లఁ

1. కానఁబడినను (తం.వా.) 2. వరుణ (హ. తం. వా.)

తే. దెలిసి వర్ణింప బ్రహ్మకు నలవిగాదు
నే నెఱిఁగిన యంతయు నీకు మున్న
తెలియఁ బలికితిఁ గ్రమ్మఱఁ దలఁచికొనుము
జితరిపువ్రాత! శ్రీ పరీక్షిన్న రేంద్ర! 92

వ. మఱియు నా ధ్రువుండు కాలంబుచేత నిమిషమాత్రం బెడలేక సంచరించు జ్యోతిర్గ్రహ నక్షత్రంబులకు నీశ్వరునిచేత (ధాన్యాక్రమణంబునఁ బశువులకైన యేర్పఱచిన మేధిస్తంభము తెఱంగున) మేటిగాఁ గల్పింపంబడి ప్రకాశింపుచుండు. గగనంబునందు మేఘంబులును, శ్యేనాదిపక్షులును వాయువశంబునం గర్మసారథులై చరించు తెఱంగున, జ్యోతిర్గణంబులును బ్రకృతి పురుషయోగ గృహీతాశులై కర్మనిమిత్తగతిం గలిగి వసుంధరం [1]బడకుందురు. 93

క. పొందుగ జ్యోతిర్గణముల, నందఱ నా శింశుమార మందుల నుండం
గొందఱు దఱుచుగఁ జెప్పుచు, నుందురు నెఱిఁగింతు విను మహోన్నత చరితా!

క. తలక్రిందై వర్తువ యై, సలలితమగు శింశుమార చక్రమునందున్
నెలకొని పుచ్ఛాగ్రంబున, నిలిచి ధ్రువుం డుండు నెపుడు నిర్మల చరితా! 95

వ. మఱియు నా శింశుమారచక్ర పుచ్ఛంబునఁ బ్రజాపతియును, నగ్నీంద్ర ధర్ములును, పుచ్ఛమూలమున ధాతృ విధాతలును, గటిప్రదేశంబున ఋషి సప్తకంబును, దక్షిణావర్త కుండలీ *(భూత భూత) శరీరంబునకు నుదగయన నక్షత్రంబులును, దక్షిణ పార్శ్వంబున దక్షిణాయన నక్షత్రంబులును, బృష్ఠంబున దేవమార్గంబును, నాకాశగంగయు, నుత్తర భాగంబునఁ బునర్వసు పుష్యంబులును, దక్షిణాయనంబున నార్ద్రాశ్లేషలును, దక్షిణ వామ పాదంబుల నభిజిదుత్తరాషాఢలును, దక్షిణ వామ నాసారంధ్రంబుల శ్రవణ పూర్వాషాఢలును, దక్షిణ వామ లోచనంబుల ధనిష్ఠామూలలును, దక్షిణ వామ కర్ణంబుల మఖాద్యష్ట నక్షత్రంబులును, వామపార్శ్వంబున దక్షిణాయనంబును, దక్షిణ పార్శ్వంబునఁ గృత్తికాది నక్షత్ర త్రయంబును, నుత్తరాయణంబును, వామ దక్షిణస్కంధంబుల [2]శతభిషగ్ జ్యేష్ఠలును, నుత్తర హనువున నగస్త్యుండును,నపరహనువున యముండును,ముఖంబున నంగారకుండును,†గుహ్యంబున శనైశ్చరుండును,మేఢ్రంబున బృహస్పతియును, వక్షంబున నాదిత్యుండును, నాభిని శుక్రుండును, జిత్తంబునఁ జంద్రుండును, స్తనంబున నశ్వినులును, బ్రాణాపానంబుల బుధుండును, సర్వాంగంబులను గేతు గ్రహంబులును, రోమంబునఁ దారలు నుండును. అది సర్వదేవతామయం బైన పుండరీకాక్షుని దివ్యదేహంబు (*ధ్రువునింగా నెఱుంగుము.)

1. బడుదురు (హ) 2. శతభిష జ్యేష్ఠ లును (హ) †"శనైశ్చరః ఉరస్థ్సరే-బృహస్పతిః కకుది" అని మూలము (23-7) * ధ్రువునింగా నెఱుంగుము (హ. తం. వా.) 'ధ్రువంబుగా' అని 'తం' ఫుట్ నోటు, మూలమున ధ్రువుని ప్రసక్తి లేదు.

సీ. ఇట్టి దివ్యశరీర మెవ్వఁడు ప్రతిదినం బందు సంధ్యాకాల మతులభక్తి
మనమందు నిలిపి యేమఱక మిక్కిలి ప్రయత్నంబున నియతుఁ డై తత్త్వబుద్ధి
మౌనవ్రతంబునఁ బూని వీక్షింపుచు నీ సంస్తవంబుఁ దా నెంతొ ప్రేమ
జపియించి కడుఁ బ్రశస్తమును మునీంద్రసేవ్యమును జ్యోతిస్స్వరూపమున
వెలుఁగు

ఆ. విపుల శింశుమార విగ్రహంబునకు వం
దనము వందనంబు లనుచు నిలిచి
సన్నుతించె నేని సకలార్థ సిద్ధులఁ
బొందు మీఁద ముక్తిఁ జెందు నధిప! 97

అధ్యాయము — ౨౪

క. ఇనమండలంబునకుఁ గ్రిం,దను దశసాహస్ర యోజనంబుల స్వర్భా
నుని మండలంబు గ్రహ మై, ఘనత న్నపసవ్యమార్గ గతి నుండు నృపా! 98

క. అసురాధముఁ డగు రాహువు, బిసరుహ సంభవుని వరము పెంపున నెంతో
పసయగు నమరత్వంబున, నసమానం బైన గ్రహవిహారముఁ బొందెన్. 99

సీ. జననాథ! రాహువు జన్మకర్మంబులు వినుపింతు ముందఱ విస్తరించి
యయుతయోజన విస్తృతార్కమండలము ద్విషట్సహస్ర విశాల చంద్రమండ
లముఁ బర్వకాలంబులను త్రయోదశసహస్ర విశాల మై మీఁద రాహుఁ గప్పు
నది చూచి యుపరాగ మనుచును బలుకుదు రెల్లవారును స్వధర్మేచ్ఛు లగుచు

ఆ. నంతలోన నిన శశాంక మండలములఁ
గరుణఁ బ్రోవఁదలఁచి హరిసుదర్శ
నంబు [1]వచ్చు నను భయంబున నై దాఱు
గడియలకును రాహు [2]విడిచి తొలఁగు. 100

క. నరవర! యా రాహువునకును, సరసత నాక్రింద సిద్ధ చారణ విద్యా
ధరు లయుతయోజనంబులఁ, దిరముగ వసియించి లీలఁ దిరుగుదు రచటన్. 101

క. పరికింప సిద్ధ విద్యా, ధరులకుఁ బదివేలు క్రిందఁ దరలక యక్షుల్
మఱియును భూతప్రేతలుఁ, జరియింతురు రాక్షసులుఁ బిశాచులుఁ గొలువన్. 102

ఆ. వారిక్రిందఁ దగిలి వాయువశంబున
మలయుచుండు మేఘమండలంబు
మేఘమండలంబు మీఁదగుచుండు †భూ
మండలంబు క్రిందనుండు నధిప! 103

1. వచ్చు (తం) 2.నడికి తొలఁగు (తం. వా.) † "తతో౽ధస్తా చ్ఛత యోజనాంతరేణేయం పృథివీ" అని మూ.(24-2)

వ. అట్టి భూమండలంబు క్రింద యోజనాయుతాంతరంబున (నంచకటాహాయామంబు) గలిగి, క్రమంబున నొండొంటికిం గ్రిం దగుచు నతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళలోకంబు లుండు. అట్టి బిలస్వర్గంబుల యందు సుపరిస్వర్గంబున కధికం బైన కామభోగంబులను, ఐశ్వర్యానందములను సుసమృద్ధ భవనోద్యాన క్రీడావిహారస్థానంబుల ననుభవింపుచు, దైత్య దానవ కాద్రవేయాది దేవయోనులు నిత్య ప్రముదితానురక్తు లగుచుఁ గళత్రాపత్య సుహృద్బంధు దాసీదాస పరిజనులతోఁ జేరుకొని, మణిగణ ఖచితంబు లగు నతిరమణీయ గృహంబులయందు నీశ్వరునివలనం జేటులేని కాయంబులం గలిగి, వివిధ మాయావిశేష వినిర్మిత (నూతన కేళీసదన విహరణ మంటప విచిత్రోద్యానాదులయందుఁ గేళీవినోదంబులు సలుపుచుం) జరియింతురు. అంత, 104

సీ. అట్టి పాతాళంబునందును మయకల్పితము లగు పుటభేదనములయందు
బహు రత్ననిర్మిత ప్రాకార భవన గోపుర సభా చైత్య చత్వరవిశేష
ములయందు నాగాసురుల మిథునములచే శుక పిక శారికానికర సంకు
లముల శోభిల్లు కృత్రిమభూములను గల గృహములచే నలంకృతము లగుచుఁ

ఆ. గుసుమ ఫల సుగంధి కిసలయ స్తబక సం
తతులచేత నవనతంబు లైన
[1]యతుల రుచిర నవ లతాంగనాలింగిత
విటపములను గలుగు విభవములను. 105

వ. మఱియు నానావిధ జలవిహంగమ మిథునంబులం గలిగి, నిర్మల జలపూరితంబులై మత్స్యకుల సంచారక్షుభితంబు లైన, కుముద కువలయ కల్హార నీలనీరజ లోహితశతపత్త్రాదికంబులఁ దేజరిల్లెడు సరోవరంబులుం గల యుద్యానవనంబుల యందుఁ గృతనికేతులై, స్వర్గభూముల నతిశయించిన వివిధ విహారంబులు గలిగి, యహోరాత్రాది కాలవిభాగభయంబు లేక మహాహిప్రవరుం డైన శేషుని శిరోమణిరోచులచే నంధకారోపద్రవంబు లేక యెల్లప్పుడు దివసాయమానంబుగా నుండు నాలోకంబునందు నఖిలజనులు దివ్యౌషధిరస రసాయనంబుల ననవరతంబు నన్నపానంబులుగా, సేవించుటం జేసి యాధివ్యాధులును, వలితపలితంబులును, జరారోగంబులును, శరీరవైవర్ణ్యంబులును, స్వేదదౌర్గంధ్యంబులునుఁ, గలుగక పరమకల్యాణమూర్తు లగుచు హరిచక్రభయంబు దక్క నన్యం బగు మృత్యుభయంబు నొందక యుందురు. అదియునుం గాక. 106

1. వృక్షరాజంబులందుల వెలయుచుండు, శారికా కీర పికములు సంతతంబు (హ)

తే. అట్టి పాతాళలోకంబునందు విష్ణు
చక్ర మెప్పుడేనియుఁ బ్రవేశంబు నొందు
నప్పు డెల్లను దైత్యకులాంగనలకు
గర్భసంపద లందంద కరఁగుచుండు. 107

చ. అతలమునందు న మ్మయుని యాత్మజుఁ డైన బలాసురుండు స
న్మతిఁ జరియించు షణ్ణవతిమాయలఁ గూడి వినోద మందుచుం
గుతలమునందు నేఁడు నొకకొందఱు నచ్చటి మాయఁ జెంది సం
తతముఁ జరించుచుండుదురు దప్పక మోహనిబద్ధచిత్తులై. 108

వ. అట్టి బలుని యావలింతలను స్వైరిణులు కామినులు పుంశ్చలు లను స్త్రీగణంబులు జనియించిరి. ఆ కామినీజనంబులు పాతాళంబుఁ బ్రవేశించిన పురుషునికి (హాటక రసం బనియెడు సిద్ధరసఘుటిక నిచ్చి, రససిద్ధునిం గావించి, యతనియందు) స్వవిలాసావలోకానురాగ స్మిత సల్లాపోపగూహనాదుల నిచ్ఛావిహారంబు నల్పుచుండ, నా పురుషుండు మదాంధుం డై, తానె సిద్ధుండనియును, నాగాయుత బలుం డనియును దలంచి, నానావిధ రతిక్రీడలఁ బరమానందంబు నొందుచుండు.

సీ. హాటకేశ్వరుఁ డైన యంబికాధీశుండు వితలంబునందుల వేడ్క నిలిచి
తనదు పార్షద భూతతతులతో బ్రహ్మ సర్గోపబృంహణమున కొఱకుఁ జోటఁ
బార్వతీసంభోగపరుఁ డగుచుండఁగా వారల వీర్యంబువలనఁ బుట్టి
నట్టిది హాటకి యనియెడు నది యనిలాగ్నులు భక్షించి యంత నుమియ

తే. నదియు హాటక మనుపేర నతిశయిల్లి
వన్నెమీఱుచు శుద్ధసువర్ణ మయ్యె
నా సువర్ణంబు నా లోకమందు నున్న
జనులకెల్లను వినుత భూషణము లయ్యె. 110

సీ. ఆక్రింద సుతలంబునందు మహాపుణ్యుఁ డగు విరోచనపుత్రుఁ డైనయట్టి
బలిచక్రవర్తి యా పాకశాసనునకు ముద మొసంగఁగఁ గోరి యదితిగర్భ
మున వామనాకృతిఁ బుట్టి యంతటఁ ద్రివిక్రమ రూపమునను లోకత్రయంబు
నాక్రమించిన దానవారాతిచేత నుండఁబన యీఁబడిన యింద్రత్వ మిట్లు

ఆ. గలుగువాఁడు పుణ్యకర్మసంధానుండు
హరిపదాంబుజార్చనాభిలాషుఁ
డగుచు శ్రీరమేశు నారాధనము సేయు
చుండు నెపుడు నతిమహోత్సవమున. 111

వ. నరేంద్రా ! సకలభూతాంతర్యామియును, దీర్ఘభూతుండు నైన వాసుదేవుని యందుఁ జిత్తంబు గలిగి యిచ్చిన భూదానంబునకు సాక్షాత్కరించిన మోక్షంబు ఫలం బగుంగాని, పాతాళ స్వర్గరాజ్యంబులు ఫలంబులు గానేరవు. ఐన నెవ్వరికిని మోక్షంబు సాక్షాత్కృతంబు గాకుండుటంజేసి లోకప్రదర్శనార్థంబు పాతాళ స్వర్గరాజ్యంబులు నిచ్చె. క్షుత పతన ప్రస్ఖలనాదులందును వివశుండై నను నామస్మ రణంబు సేయు పురుషుండు కర్మబంధంబులవలన విముక్తుండగుచు సుజ్ఞానంబునం బొందు, అట్టి వాసుదేవుం డాత్మజ్ఞాన ప్రమోషణము సేయు మాయామయంబు లైన భోగైశ్వర్యంబుల నెల్ల నెట్లిచ్చు నన వలవదు. భగవంతుండు యాచనఁ జేసి సకలసంపదలఁ జేకొని శరీరమాత్రావశిష్టునిం జేసి వారుణపాశంబుల గట్టి విడిచినప్పుడు బలీంద్రుం డిట్లనియె. 112

సీ. పరమేశ్వరునకు [1]నెప్పటిపదార్థములందుఁ దృష్ణ లేకుండుట దెలిసినాఁడ
నింద్రాదు లెల్ల నుపేంద్రునిఁ బ్రార్థించి యడిగిరి గాని శ్రీహరికిఁ గోరి
కలు లేవు మిక్కిలి గంభీర మగు మహా కాలస్వభావంబు గలుగుచుండు
నరయంగ మన్వంతరాధిపత్యమును లోకత్రయంబును నెంత గానఁ దలఁప

ఆ. మ త్పితామహుండు మానవంతుండు ప్ర
హ్లాదవిభునిఁ జూచి హర్ష మంది
యెద్దియైనఁ గోరు మిచ్చెద ననుటకు
నంతలోన నీశ్వరాజ్ఞఁ దెలిసి. 113

వ. ఇట్లుకుతోభయంబుఁ బిత్ర్యంబు నైన రాజ్యంబు నొల్లక పరమేశ్వరదాస్యంబ కోరె. ఆ ప్రహ్లాదచరిత్ర కథనావసరమున, నీ తండ్రికిని నీకును విశేషముగా నే పురుషుండు భగవదనుగ్రహంబుఁ బొందనోపు నని పుండరీకాక్షుం డాన తిచ్చిన వాక్యంబులు [2]వక్ష్యమాణగ్రంథంబున విస్తరించెద. ఆ బలిచక్రవర్తి గృహద్వారంబున నఖిలలోకగురుం డైన శ్రీమన్నారాయణుండు గదాపాణి యును, నిజ జనానుకంపితుండును (శంఖ చక్రాద్యాయుధ ధరుండు) నగుచు నిప్పుడును తేజరిల్లుచుండు. అట్టి బలిద్వారంబున నున్న గరుడధ్వజుండు లోకం బుల గెలువ నిచ్ఛయించెడు దశగ్రీవుం డు (ల్లంఘితశాసనుం డై ప్రవేశంబు గావింపఁ) దన పాదాంగుష్ఠంబున యోజనాయుతాయుతంబులం బాఱఁజిమ్మె. అంత. 114

క. ఆ సుతలమునకుఁ గ్రిందై, భాసిల్లుఁ దలాతలంబు ప్రభు వందు మయుం
డాసుర పురనిర్మాతయు, వాసిగఁ బొగడొంది యేలు వసుధాధీశా ! 115

1. నిప్పటి (క. చ. డ.) 2. ఉత్తరోత్తరంబుగా వివరించెద (క)

చ. పురహరుచే రమేశ్వరుఁడు భూతహితార్థముగాఁ బురత్రయం
బరుదుగ నీఱుసేసె శరణాగతు నా మయుఁ గాఁచి యెంతయుం
గరుణఁ దలాతలంబునకుఁ గర్తగ నిల్పిన నున్నవాఁడు శ్రీ
ధరుని సుదర్శనంబునకుఁ దప్పి విముక్తభయుండుగాఁ దగన్. 116

క. తలపఁగ నాక్రింద మహా, తలమునఁ గద్రువవధూటి తనయులు సర్పం
బులు గలవు పెక్కుశిరములు, నలరంగాఁ గ్రోధవశ గణావళి యనఁగన్. 117

వ. మఱియును గుహక, తక్షక, కాళియ, సుషేణాది ప్రధాను లైనవార లతుల శరీరంబులం గలిగి, యాదిపురుషుని వాహనం బైన పతగరాజభయంబున ననవరతంబు నుద్వేజితు లగుచు, స్వకళత్రాపత్య సుహృద్బాంధవ సమేతు లై యుండుదురు. ఆ క్రింద రసాతలంబున దైత్యులు, దానవులు నగు నివాత కవచ కాలకేయు లను హిరణ్యపుర నివాసు లగు దేవతాశత్రువులును, మహా సాహసులును, తేజోధికులు నగుచు సకలలోకాధీశ్వరుం డైన శ్రీహరితేజంబునం బ్రతిహతు లై, వల్మీకంబులందు నడంగియున్న సర్పంబుల చందంబున, నింద్రదూతి యగు సరమచేఁ జెప్పఁబడెడు మంత్రాత్మక వాక్యంబులకు భయంబు నొందుచుండుదురు. 118

క. ఇందుకులోద్భవ! విను మా, క్రిందటి పాతాళమునను గ్రీడింపుచు నా
నందము నొందుచునుండును, సందడిపడి నాగకులము చతురతతోఁ[1]గన్. 119

వ. ఇట్లు వాసుకిప్రముఖు లైన శంఖ, కులిక, మహాశంఖ, శ్వేత ధనంజయ, ధృతరాష్ట్ర, శంఖచూడ, కంబళాశ్వతర, దేవదత్తాదు లైన మహానాగంబులు (దీర్ఘామర్షు) లైదు నేడు పదియు నూఱు వేయు శిరంబులం గలిగి, ఫణామణి కాంతులంజేసి పాతాళతిమిరంబును బాపుచుండుదురు. 120

అధ్యాయము - ౨౫

సీ. పాతాళలోకంబు పాతున శేషుండు వెలయంగ ముప్పదివేల యోజ
నంబుల వెడలుపునను దోఁక జుట్టఁగా జుట్టుకయుండు విష్ణుని మహోగ్ర
మైన శరీరంబు దానై యనంతాఖ్యసంరక్షణుం డుండు సంతతంబు
నట్టి యనంతనామాభిధానుని మస్తకమున సిద్ధార్థంబుకరణి ధరణి

1. చకితులగుచు (క)

ఆ. †యంత నా విభుండు నఖిలలోకంబుల
సంహరింపఁ గోరి చండకోప
వశత సృజనఁజేయు వరుస నేకాదశ
రుద్రమూర్తు లనెడు రౌద్రమతుల. 121

ఆ. అట్టి రుద్రమూర్తు లతుల త్రినేత్రులు
నఖిలశూలహస్తు లగుచు నుందు
రందు నున్న ఫణికులాధిపుల్ శేషుని
పాదపంకజముల భక్తిఁ జేరి. 122

ఆ. నమ్రులగుచు ననుదినంబును మౌళి ర
త్నములచేతఁ గడు ముదంబు నొంది
కోరికలు దలిర్ప నీరాజనంబుల
నిచ్చుచుందు రెపుడు మచ్చికలను. 123

వ. మఱియు నా సంకర్షణమూర్తిం జేరి [1]నాగకన్యకలు కోరికలుగలవార లగుచు, నొప్పెడి శరీరవిలాసంబులం జేసి యగరు చందన కుంకుమ పంకంబు లనులేపనంబులు సేయుచు, సంకర్షణమూర్తి దర్శనస్పర్శనాదుల నుద్బోధిత మకరధ్వజావేశిత చిత్తంబులు గలిగి, చిఱునవ్వు లొలయ నధికాభిలాషం జేసి స్మితావలోకనంబుల సవ్రీడిత లై యవలోకింపుచుండ,ననంతగుణంబులం గల యనంత దేవుం డుపసంహరింపంబడిన క్రోధంబుఁ గలిగి, లోకంబులకు క్షేమంబు గోరుచు సురాసుర సిద్ధ గంధర్వ విద్యాధర మునిగణంబు లనవరతంబు ధ్యానంబు సేయ, సంతత సంతోషాతిశయంబున [2]మ్రాన్గన్ను వెట్టుచు, సలలిత గీతావాద్యంబుల నానందంబు నొందుచుఁ, దన పరిజనంబుల నతి స్నేహంబున నవలోకింపుచు,నవ తులసీ గంధ పుష్పరసామోదిత మధుకరవ్రాత మధురగీతంబులు గల వైజయంతీ వనమాల ధరియింపుచు, నీలాంబరధరుండును, హలధరుండును నగుచు నితండు మహేంద్రుండొ హరుండొ యనుచు జనంబులు వలుకుచుండఁ గాంచనాంబరధరుండై ముముక్షువులు ధ్యానంబులు సేయ, నధ్యాత్మవిద్యాయుక్తం బైన యానందహృదయ గ్రంథిని భేదించు. అట్టి శేషుని స్వాయంభువుం డగు నారదుండు తుంబురుప్రభృతు లగు ఋషిశ్రేష్ఠులతోఁ జేరుకొని కమలాసనుని సభాస్థానంబునందు నిట్లు స్తుతించుండు. 124

† "దేరియుండు బ్రహ్మదేవుని దైనందిన ప్రళయమునందు నాగవిభుని వలన నుదయ మైన వార లేకాదశ రుద్రమూర్తు లధిక రౌద్రమతులు. (క.చ.ట.) 1.నాగకన్నియలు (హ) 2. మ్రాఁగన్ను (తం.వా.)

సీ. ఓలిమై నెవ్వని లీలావినోదముల్ జన్మ సంరక్షణ క్షయములకును
హేతువు లగుచుండు నెవ్వనిచూపుల జనియించె సత్త్వ రజ స్తమంబు
లెవ్వని రూపంబు లేకమై బహువిధంబులను జగత్తులఁ బ్రోచుచుండు
నెవ్వనినామంబు లెఱుఁగక తలఁచిన యంతన దురితంబు లడఁగుచుండు

తే. నట్టి సంకర్షణాఖ్యుండు నవ్యయుండు
నైన శేషుని వినుతిసేయంగఁ దరమె?
తలఁప నెప్పుడు వాఙ్మనంబులకు నింక
మూఁడు లోకంబులందును భూతతతికి. 125

ఆ. మఱియుఁ బెక్కుగతుల మాబోఁటివారలఁ
బ్రోవదలఁచి శేషమూర్తి సాత్త్వి
కస్వభావ మొందెఁ గణఁకతో నట్టి శే
షునకు మ్రొక్కుచుందు ననుదినంబు. 126

వ. మఱియు నా శేషుని నెవ్వండేనియు నాకస్మికంబుగ నైనను, నార్తుం డగుచు నైనను స్మరించినమాత్రమున నఖిలపాపంబుల బాసి సకల శ్రేయస్సులం బొందు. అట్టి శేషుని నే ముముక్షువు లాశ్రయించి (ధ్యానం బొనర్చి భవబంధ నిర్ముక్తు లగుదురు.) అతని ఫణంబులయందు భూగోళం బణుమాత్రం బగుచు నుండు. అతనిమహిమలు గణుతింప సహస్రజిహ్వలు గల పురుషుఁడైన నోపం డని పలుకుచుందురు. ఆ యనంతుఁడు పాతాళంబున నుండి సకలలోక హితార్థంబు భూమిని ధరియించు.అని లోక తిర్య ఙ్మనుష్య గతులను,లోకస్థితియును శుకయోగీంద్రుండు వినుపించి, యింక నేమి వినుపింతు నెఱింగింపుము అనినం బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కి ట్లనియె. 127

క. మునివర! లోకచరిత్రం, బనుపమము మహావిచిత్ర మగునట్లుగ నా
కును వినుపించితి వంతయుఁ, బనుపడి నా చిత్తమందుఁ బాయక నిలిచెన్. 128

వ. అనిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 129

ఆ. జంతుజాలములకు శ్రద్ధలు త్రిగుణాత్మ
కములు గాన వారి కర్మగతుల
తారతమ్యములును దగిలి యిన్నియు వివి
ధంబు లగుచు సంతతంబు నుండు. 130

వ. నరేంద్రా ! ప్రతిషిద్ధలక్షణం బగు నధర్మం బాచరించు *(నరుని శ్రద్ధ విపరీత ముగాఁ బ్రవర్తిల్లు.) అట్టివానికిఁ గలిగెడు కర్మఫలంబును విపరీతంబుగానె యుండు. కావున ననాద్యవిద్యా కామప్రవర్తనలవల్లఁ బెక్కుతెఱంగులఁ గలిగెడు కర్మగతుల సంగ్రహంబుగ నెఱింగించెద. అనిన శుకునితోఁ బరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 131

ఆ. మునివరేణ్య ? నరకములు ముజ్జగంబుల
యందొ ? యంతరాళమందొ ? వెలినొ ?
యదియుఁ గాక దేశమం దుండు భూవిశే
షములయందొ ? తెలుపు సంతసమున. 132

వ. అనిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 133

అధ్యాయము — ౨౬

—: శుకయోగి పరీక్షిత్తునకు నరకలోకవర్ణనము దెలుపుట :—

క. ఎడతెగక ముజ్జగంబుల, కడపల నయ్యామ్యదిశను గదలక [1]నిలుచుం
గడు ఘోరములుగ నరకము, లడరంగా నంతరాళమందుల నధిపా ! 134

వ. మఱియును దక్షిణంబున నగ్నిష్వాత్తాది పితృగణంబులు తమ గోత్రజులకు (మేలు గలుగుట కొఱకు) సత్యంబు లగు నాశీర్వాదంబుల నొసంగు చుండుదురు. అచ్చటి పితృపతి యగు శమనుండు తన లోకంబునకుం జనుదెంచు జంతువుల కర్మంబులకుం దగిన ఫలంబుల నిచ్చి శిక్షింపుచుండు. నరక ప్రశంస వినుము. తామిస్రంబును, అంధతామిస్రంబును, రౌరవంబును, మహారౌరవంబును, కుంభీపాకంబును, కాలసూత్రంబును, అసిపత్రవనంబును, సూకరముఖంబును, అంధకూపంబును, క్రిమిభోజనంబును, సందంశమును, తప్తోర్మియును, వజ్రకంటక శాల్మలియు, వైతరణియు, పూయోదమును, ప్రాణరోధంబును, విశసంబును, లాలాభక్షణమును, సారమేయాదనంబును, అవీచిరయంబును, రేతఃపానంబును నను నేకవింశతి మహానరకంబులును, మఱియును, క్షారకర్దమంబును, రక్షోగణ భోజనంబును, శూలప్రోతమును, దందశూకంబును, అవట నిరోధనంబును, అపర్యావర్తనంబును, సూచీముఖంబు నన (సప్తవిధ నరకంబుల తోడి) యష్టావింశతి నరకంబులు గల వని కొందఱు నొడుపుదురు. అందు. 135

క. [2]పర విత్త కళత్రంబులఁ, [3]బరికింపక యపహరించు పాపాత్ముఁడు దు
ష్కర పాశబద్ధుఁ డై యమ, పురుషులచే నధికబాధఁ బొందుచునుండుం. 136

* తా. ప. ప్రతులలో లేదు. 1. నిలిచె, ప్పుడుబాయకుండు నరకము (క. ఓ. త. ద. ప. బ.)
2. పరపుత్ర (హ. తం. వా.) 3. బరికింపఁగ నపహసించు (హ. తం. వా.)

వ. మఱియు ని వ్విధంబున బాధితుండగుచుఁ దామిస్రనరకంబునం బడి యనశ నాద్రిపాతన దండతాడన తర్జనాది బాధలం జెంది కడుభయంబున మూర్ఛలం బొందుచుండు.

క. పరకాంత నెవ్వఁ డేనియుఁ, బురుషుం డుండంగ మొఱఁగి పొందిన యమకిం కరు లతనిఁ బట్టి వడిఁ ద, త్తరమునఁ బడవైతు రంధతామిస్రమునన్. 138

వ. నరేంద్రా! యెవ్వఁడేనియుఁ గుటుంబపోషణార్థంబు పరులకు ద్రోహంబుసేయు, నా నరుండు రౌరవనరకంబునం బడు. (ఎవ్వం డిహలోకంబునందు స్వేచ్ఛా విహారంబున సంచరించుచుఁ బరోపద్రవ పరాఙ్ముఖంబులై యుండు పశు పక్షి మృగాదుల బాధించు, నా యా మృగంబులు రురు రూపంబులఁ దాల్చి యట్టి పాపిజనుల నానావిధయాతనల)బాధించుటంజేసి రౌరవ,మహారౌరవ నరకంబులం బడు. ఎవ్వఁ డేనియుఁ దేహపోషణార్థంబు పశుమృగాదుల ప్రాణనిరోధంబుఁ జేసి వధించు,నా నిష్కరుణుం డైన పురుషుని గుంభీపాక నరకంబులయందుఁ గాల తప్త తైలంబులం బెక్కు బాధలం బొందింతురు. 139

సీ. తల్లిదండ్రులకును ధరణీసురులకును నహితంబుఁ జేసిన యట్టివాఁడు
కాలసూత్రం బను కడుఁ దీవ్రనరకంబు నందున సందంద యయుతయోజ
నాయత [2]తామ్రపాత్రాదుల సూర్యుండు మీఁదఁ గ్రిందను వహ్ని మిగుల మండ
నత్యంత క్షుత్పిపాసాదులచేతను బాధితుం డగుచుండుఁ బాయ కెపుడు

ఆ. పరువు వెట్టుచున్న బడియున్న నిలిచినఁ
గదలకున్నఁ జాల నొదిఁగియున్న
బాధఁ బొందుచుండుఁ [3]బశువు రోమము లెన్ని
వరుస నన్నివేల వత్సరములు. 140

వ. మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాచరించు పురుషుని నసిపత్ర వనంబునందు యమకింకరులు తఱట్ల నడుచుచుఁ బరిహసింపుచుం దోలునెడ నా యసిపత్రంబు లిరుగెలంకుల శరీరంబు దెంపుచుండ నడుగడుగున మొఱఁబెట్టు చుండ బాధింపుచుండుదురు. 141

క. దండింపఁ దగనివారల, దండించిన విప్రవరుల తనువులు ముట్టం దండించిన దుర్మతులం, †దండింతురు కాలసూత్ర నరకము లందున్. 142

1. మూషకాదుల బిల (హ) 2. పాత్రాదులందుల (హ.తం.వా.) 3. బశురోమము లెక్క, వరుస నపరిమేయ వత్సరములు. (హ.తం.వా.) †''సూకరముఖం''—అని మూలము. దీని కనువుగా ''దండింతురు సూకరముఖ నరకము లందున్'' అని యుండవచ్చును.

ఆ. మఱియు నట్టి దుష్టమానవుఁ గింకరుల్
[1]విఱిచి చెఱకుఁగోల [2]విఱిచినట్లు
బాధపెట్టు చుండఁ బడి మూర్ఛఁ జెందుచు
[3]మొఱలు వెట్టుచుండు భూపవర్య! 143

వ. నరేంద్రా ! యెవ్వం డేనియు నీశ్వర కల్పిత వృత్తి గల జంతువుల హింసించు నట్టివాని నంధకూపం బను నరకంబునం బడవైచిన (నందు నతండు దొల్లి తాను జేసిన) భూతద్రోహంబున నచ్చట వివిధ క్రూర పక్షి, మృగ, పశు, సర్ప, మశక, మత్కుణ, మక్షికాదులచేత హింసం బొందుచు, మహాంధకారంబునందు నిద్రానుభవ సుఖలేశంబును లేక కుశరీరంబునందుల జీవుండునుం బోలె మృత ప్రాయుం డై యుండు. 144

క. తన కలిమి నెవ్వఁడేనియుఁ దన బాంధవవరులఁ గూడి తగఁ గుడువక తా
నును వాయసంబు భక్షించిన మాడ్కిన్ దిన్నవాఁడు శీఘ్రమె యచటన్. 145

క. క్రిమిభోజన మనియెడి నర,కమునం బడి క్రిములె కూడుగాఁ గుడుచుచుఁ దాఁ
గ్రిమి యగుచు లక్షపరిమా,ణము గల క్రిమిగుండమందు నాటుక యుండున్.

వ. మఱియు నీ భూలోకంబున నెవ్వఁడేనియు నవిపన్నుం డై చౌర్య బలోద్వృత్తుల బ్రాహ్మణాదుల హిరణ్యరత్నాది ద్రవ్యంబుల [4]నపహరించు,నట్టి పురుషుని[5]నగ్ని వర్ణంబు లగు నయః పిండంబుల (నగ్నితప్తంబు లగు శూలంబుల నతని) శరీరంబునం దివియుచుండుదురు. మఱియును మదనాతురు లగుచు స్త్రీపురుషు లగమ్యాగమనంబులు సేసిరేని, నట్టివారి యమలోకంబున (నతితీక్ష్ణ కశాతాడితులం)జేసి, యగ్నిమయంబు లైన యుక్కు ప్రతిమల నాలింగనంబు సేయింతురు.

ఆ. [6]సర్వజంతుజాల సంగమ మొందెడు
వానిఁ బట్టి కట్టి వజ్ర దంష్ట్ర
కములు గలుగునట్టి ఘనతర శాల్మలీ
తరువులందుఁ జేర్చి దంతు రెపుడు. 148

1. కరచి (క. త. డ. ద. బ.) 2. నరకినట్లు (క. త. ద. ద. బ.) 3. పొరలు వెట్టుచుండు (హ. క. చ. ట. త.) 4. నపహరించినను బ్రాహ్మణుం డితరజాతివారల హిరణ్య ద్రవ్యంబులు నపహరించిన నట్టి పురుషుని (క. ట. గ. త. ప. బ. తం.) 5. ఇనప తండసంబుల (క.చ.ట.త.జ.ప.వ.బ.)
6. పర్వకాలములను పణతుల బొందిన (క. ట. త. డ. ద. బ.)

ఆ. పార్థివేంద్ర! నరుఁడు పాషండ దర్శనుఁ
డగుచు ధర్మమార్గ మడఁచెనేని
వాఁడు నరకమందు వైతరణీ నది
నుడుగ కెపుడుఁ బొరలి పడుచునుండు. 149

వ. మఱియు నట్టి వైతరణీ నదియందు జలగ్రాహంబులు దిగిచి భక్షింపం బ్రాణంబులు నిర్గమింపఁ దన పాపంబు లుచ్చరింపుచు విణ్మూత్ర పూయ శోణిత కేశ నఖాస్థి మేదో మాంస వసావాహినిఁ దప్తుం డగుచునుండు. విప్రుండు శూద్ర కామినులం బొంది శౌచాచారంబులం బాసి గతలజ్జుం డై పశువునుం బోలి చరియించెనేని, నతండు నరకంబునుం బొంది యందు పూయ విణ్మూత్ర లాలా శ్లేష్మ పూర్ణార్ణవం బందు (ద్రొబ్బంబడి) యతి బీభత్సితంబు లగు నా ద్రవ్యంబుల భుజింపుచుండు. 150

క. శునకములఁ బెంచి యెవ్వం, డనయంబును వేఁట సలిపి యాత్మార్థముగా
వనమృగములఁ జంపును నా, మనుజాధము నస్త్రములను మర్దింతు రొగిన్.151

ఆ. [1]ద్రవ్యలోభమునను దంభార్థ మై పశు
వులను జంపి జన్నములను జేయు
వానిఁ బట్టి యముని వారలు గోయుచు
నుందు రెపుడు మిగుల సందడిలుచు. 152

వ. కామమోహితుం డై యెవ్వఁడేనియుఁ దనభార్యచేత రేతఃపానంబు సేయించు, నా పాపాత్ముని రేతోహ్రదంబునం ద్రోచి యా రేతంబునె పానంబు సేయింతురు. రాజభటు లైనను, చోరులైనను ధనిక గ్రామంబులపైఁ బడి యందు గృహదాహంబు సేయువారలను, విషంబు పెట్టువారలను, వజ్రదంష్ట్రలు గల వింశత్యుత్తర సప్తశత శునకంబు లెడతెగక తిగిచి భక్షింపుచుండు. 153

సీ. లంచంబుఁ గొని సాక్షి వంచించి యనృతంబుఁ బలికెడు పాపాత్ముఁ బట్టి కట్టి
యంత మానక వీచి యను నరకమునందు శతయోజనోన్నత శైలశిఖర
మునఁ దలక్రిందుగా నునిచి యధోముఖంబుగఁ బడద్రొబ్బిన బొబ్బ లిడుచు
కల్లోలములు లేని కమలాకరము వోలె[2]చటుల మై యున్న పాషాణమందు

తే. పడినయంతన దేహంబు పగిలి పెక్కు
తునుక లై పాసి యది గూడికొనుచు నుండు
[3]నుండి [4]యాకులమును నొందుచుండుఁ గాని
చావు లేకుండు నా దుష్టజంతువునకు. 154

1. జృంభణమున నరుడు దంభార్థమై పశు (ట.డ.ద.బ.) 2. చదరమై (క.త.డ.బ.తం.వా.)
3. దండియాపద నొందుచునుండుగాని (క) 4. యాకులతను (తం.వా.)

ఆ. †సోమయాజిభార్యఁ గామించి పొందిన
వానిఁ గపట మద్యపాన సోమ
పాన మనుదినంబుఁ బానంబు సేయు విట్
క్షత్త్రియులను బట్టి సంభ్రమమున. 155

ఆ. త్రొమ్మ ద్రొక్కి మోము త్రిమ్మ పట్టఁగ మోది
యనల ముఖమునందు నగ్ని వర్ణ
ముగను గాఁచి వక్త్రమున నిండఁగా నుక్కు
నీరు వోతు రేచి నిష్ఠురముగ. 156

వ. మఱియు నీచవర్ణుండు నిష్ఠ సలుపుచుం దపో దాన విద్యాచారంబులం బెద్దల కవమానంబు సేయువాఁడు క్షారకర్దమం బను నరకంబునందు నధోముఖుం డగుచు బాధలం బొందు. స్త్రీ పురుషు లెవ్వరేనియు శరీర రక్షణార్థంబు పశువుల, మానవుల బలి యిచ్చిరేనియు, వారలను నిరయంబునందు యమకింకరులు సురియలం దునిమి, తద్రక్తంబు పానంబు సేయుచుఁ బాఱాడుచుండుదురు. గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతంబులం గావించి హింసింపుచు హర్షించుచున్న వారలను, శూలప్రోతం బను నరకంబు నందు శూలప్రోతులం జేసిన, క్షుత్పిపాసాపరు లగుచుండఁ గంక గృధ్రాదులు(తీక్ష్ణ తుండాగ్రంబులఁ) దిగిచి భక్షింపుచుండు. మఱియు ధూర్తస్వభావంబునఁ జంతుపీడనంబుఁ గావించెడు పాపాత్ములం దందశూకం బను నరకంబునందు నైదు ముఖంబుల సర్పంబులు గఱచుచు నుండు.*

ఆ. ఎనయ దొడ్లలోన నిండ్లలో నైనను
బహు పతంగ హరిణపంక్తి నెల్లఁ
బట్టి హింససేయు పాపాత్మ విషవహ్ని
ధూమశిఖల ద్రొబ్బుదురు నృపాల! 158

క. తన యింటికి వచ్చిన [1]మనుజుని నతిథిం గ్రోధదృష్టిఁ జూచిన వానిం
గనుఁగవల వజ్ర దంష్ట్రలఁ, దనరిన యా కంక గృధ్రతతి భక్షించున్. 159

---

†''యస్త్విహవైవిప్రో రాజన్యో వైశ్యోవా సోమపీథ స్తత్కళత్రంవా సురాం వ్రతస్థోవా పిబతి ప్రమాదతః'' -అని మూలము (26-28) * 'కన్యకారత్నంబు నొరులకు ప్రదత్తంబుచేసి మరొక వరునకు నొసగు పాపకర్ముని బట్టి కొట్టియు వాని వక్త్రంబున హాలాహలంబు పోసి నిగ్రహింతురు మఱియు' (చ.ట.జ.ద.బ.) 1. భిక్షుని, నతిథిని (చ.త.జ.డ.)

మ. ధనవంతుం డగు మానవుండు గడఁకన్ ధర్మోపకారంబులన్
ఘనతం జేయక యుండెనేని యమలోకంబందు సూచీముఖం
బను నా దుర్గతిఁ బట్టి త్రోచి [1]నిధికాపై యున్న భూతం బటం
చును బాశంబులఁ బట్టి కట్టి వడితో నొప్పింతు రత్యుగ్రులై. 160

ఆ. నరవరేణ్య! యిట్టి నరకముల్ యమలోక
మందుఁ గలవు మఱి సహస్ర సంఖ్య
లందు శమనదూత లనిశంబు బాధింతు
రవని ధర్మదూరులైన నరుల. 161

ఆ. ధర్మవంతులెల్లఁ దప్పక స్వర్గంబు
నందు భోగసమితిఁ బొందుచుండు
రెలమిఁ బుణ్యపాపముల శేషములవల్లఁ
బుట్టుచుందు రవనిఁ బుణ్యచరిత! 162

వ. నరేంద్రా! మోక్షమార్గంబు మున్నె వినుపించితి. ఇప్పుడు నీకు నెఱింగించిన వెల్లను బ్రహ్మాండకోశంబునం జతుర్దశకోశంబు లని పురాణంబులు పలుకుచుండు. అట్టి బ్రహ్మాండంబు శ్రీమన్నారాయణుని స్థూలశరీరం బగుటంజేసి బ్రహ్మాండం బెవ్వరు వర్ణింతు, రెవ్వరు విందురు, వారలకు సకలశ్రేయస్సులుం గలుగు. ఈశ్వర స్థూలశరీరంబు దెలిసినవారికి శ్రద్ధాభక్తులం జేసి సూక్ష్మదేహంబు నెఱుంగవచ్చు. భూ ద్వీప వర్ష సరి దద్రి నభ స్సముద్ర పాతాళ ది జ్నరక తారాగణ లోక సంస్థితంబైన సకల జీవనికాయంబై యద్భుతంబైన శ్రీహరి స్థూలశరీరంబు వినుపించితి. [2]అని. 162

చ. జలజభవాది దేవముని సన్నుత! తీర్థపదాంబుజాత! ని
ర్మల నవరత్ననూపుర విరాజిత! కౌస్తుభభూషణాంగ! యు
జ్జ్వల తులసీ [3]కురంగమద వాసనవాసిత దివ్యదేహ! శ్రీ
నిలయ శరీర! కృష్ణ! ధరణీధర! భానుశశాంకలోచనా! 164

క. శ్రీతరుణీ హృదయస్థిత! పాతకహర! సర్వలోకపావన! భువనా
తీత గుణాశ్రయ! యతి వి, ఖ్యాత! సురార్చితపదాబ్జ! కంసవిదారీ! 165

1. యిదిగాపైయున్న (హ.తం.వా.) 2. స్థూలదేహంబు (హ.తం.వా.)''పరమాత్మన ఉపగేయం హ్యనిష్ఠమపి శ్రద్ధాభక్తి విశుద్ధ బుద్ధిర్వేద'' (26-38) 3. మరంద (హ)

మత్తకోకిల. దండితారిసమూహ ! భక్తనిధాన ! దానవిహార ! మా
ర్తాండమండల మధ్యసంస్థిత ! తత్త్వరూప ! గదాసి కో
దండ శంఖ సుదర్శనాంక ! సుధాకరార్క సునేత్ర ! భూ
మండలోద్ధరణార్తపోషణ ! మత్తదైత్యనివారణా ! 166

గద్య. ఇది శ్రీ సకల సుకవిజనానందకర బొప్పనామాత్య పుత్ర గంగనార్య ప్రణీతంబైన శ్రీమద్భాగవత పురాణంబునందు భరతాత్మజుండైన సుమతికి రాజ్యాభిషేకంబును, పాషండదర్శనంబును, సుమతి పుత్ర జన్మవిస్తారంబును, గయుని చరిత్రంబును, గయుని సంస్తుతియు, భూ ద్వీప వర్ష సరి దద్రి నభస్సముద్ర పాతాళ దిఙ్నరక తారకాగణ సంస్థితియును నను కథలు గల పంచమస్కంధంబు నందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

ఓమ్

# శ్రీ మ హా భా గ వ త ము

—●—

## ష ష్ఠ స్కం ధ ము

శా. †శ్రీవత్సాంకిత కౌస్తుభస్ఫురిత లక్ష్మీచారు వక్షస్స్థల
శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరాజీవాక్షుఁ గంజాతభూ
దేవేంద్రాది సమస్తదేవ మకుటోద్దీప్తోరు రత్నప్రభా
వ్యాపి ద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్. 1

ఉ. నిందుమతిం దలంతుఁ గమనీయభుజంగమరాజమండలీ
మండనుఁ జంద్రఖండ పరిమండితమస్తకుఁ దారమల్లికా
పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారుకో
దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్. 2

ఉ. హంసతురంగముం బరమహంసము నంచితదేవతా కులో
త్తంసము నాగమాంత విదిత ధ్రువ పుణ్యరమావతంసముం
గంసజిఘాంసు నంశమును గర్భురసూత్ర సమావృతాంసమున్
[1]హింస నడంచు బ్రహ్మము నహీనశుభంబులకై భజించెదన్. 3

ఉ. మోదకహస్తునిన్ సమదమూషకవాహను నేకదంతు లం
బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యు గణేశు దేవతా
హ్లాదగరిష్ఠు దంతిముఖు నంచిత భక్త ఫల ప్రదాయకున్
మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్. 4

---

†ఈ పద్యము క.ట.డ.బ. లలో లేదు.4140 క. లో ఈ క్రింది పద్య మున్నది.

క. శ్రీరామనామ ! పావన, కారుణ్య సరోజనేత్ర ! కౌసల్యాసుతా
భారతిపతి మునిసేవిత!, చారుకృపాలోల! రామచంద్ర! నృపాలా !

ఆంధ్రసాహిత్య పరిషత్తు (15) 1533, 4168 లలోను, జ.ట.డ.బ. లలోను ఈ క్రింది పద్యమున్నది.

క. శ్రీ విశ్వభారభరణా, ప్రావీణ్య విభాసమాన ఫణిరాణ్ణిభ బా
హా విపుల విజయ దోహల, రావణ మదకరి మృగేంద్ర రామనరేంద్రా!

1. హింస నడంచు నబ్జభవు నెల్ల సుఖంబులకై భజించెదన్ (చ)

ఉ. కల్లతనంబు గాక పొడగట్టిన పూర్వపురీతి నేఁడు నా
యుల్లమునందు నుండుము సమున్నత తేజముతోడ భక్తిరం
జిల్లిన చూపు గూడ విధిఁ జెందిన ప్రోఢ బుధాళి నీడ మా
తల్లి దయామతల్లి ప్రణతద్రుమకల్పకవల్లి భారతీ! 5

క. విలస త్కంకణరవరవ, కలితం బగు నభయ వరద కరములు బెరయం
జెలరేఁగి భక్తులకు నల, కలుములు దయసేయు జలధికన్యకఁ దలఁతుఁ. 6

క. కాళికి బహూసన్నత లో, కాళికి కమనీయ వలయ కరకీలిత కం
కాళికి తాపస మానస, కేళికి వందనము సేసి కీర్తింతు మదిఁ. 7

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబు సేసి. 8

చ. పరమసమాధిధుర్యుఁ బటు పావనకర్మ విధేయు దేవతా
వర నర వంద్యు సద్విమలవాక్యు జనార్దన కీర్తన క్రియా
భరణ సమర్థు వేద చయ పారగు భవ్యుఁ ద్రికాలవేది భా
సురమతిఁ గొల్చి టొప్పు బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మజుఁ. 9

క. వ్యాసుని భగవ త్పదసం, వాసుని నాగమ పురాణ వర విష్ణుకథా
వాసుని నిర్మల కవితా, భ్యాసుని పదపద్మయుగము భావింతు మదిఁ. 10

సీ. వరకవిత్వోద్రేకి వాల్మీకిఁ గొనియాడి భాగవతార్థ వైభవముఁ బలుకు
శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి బాణ మయూరుల ప్రతిభ నొడివి
భాస సౌమిల్లక భారవి మాఘుల ఘన సుధా మధుర వాక్యములఁ దలఁచి
కాళిదాసుఁ గవీంద్రకల్పవృక్షముఁ [1]గొల్చి నన్నపాచార్యు వర్ణనలఁ బొగడి

తే. వెలయఁ దిక్కన సోమయాజుల భజించి
యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చ [1]నునిచి
సుకవిసోముని నాచనసోము నెఱిఁగి
కవిమనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి. 11

ఉ. ఎమ్మెలు సెప్పనేల? జగ మెన్నఁగఁ బన్నగరాజశాయికిఁ
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు చేసినవాని భక్తిలో
నమ్మినవాని భాగవత నైష్ఠికుఁ డై తగువానిఁ బేర్మితో
బమ్మెర పోతరాజు కవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదఁ. 12

వ. అని సకల సుకవి నికరంబులకు ముకుళిత కరకమలుండ నై. 13

1. గొలిచి (తం. వా)

ఉ. ఎయ్యది కర్మబంధముల నెల్ల హరించు విభూతికారణం
బెయ్యది స న్మునీంద్రులకు నెల్లఁ బవిత్రసమాశ్రయంబు ము
న్నెయ్యది సర్వమంత్రముల నేలిన దెయ్యది మోక్షలక్ష్మిరూ
పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవ[1]తాఖ్య మంత్రమున్. 14

వ. అని శ్రీమహాభాగవత పురాణంబునందు షష్ఠస్కంధం బంధ్రభాష రచియింపం బూని† మదీయ కవితామహాలక్ష్మికి నారాయణుండె నాథుఁ డగుటంజేసి యీ కృతి కృష్ణార్పణంబుఁ జేసితి. అది యె ట్లనిన, నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండుక నై యుండ నొక్కనాఁడు దివంబున. 15

చ. కలిత విశేషవస్త్రములు గట్టి హిమాంబు సుగంధ చందనం
బలఁది వినూత్న భూషణము లారయఁ దాల్చి వినోదలీల నిం
పుల మృదుశయ్య నిద్రఁ దగి పొందినచోఁ గనుపట్టెఁ బల్మఱుం
[2]గలయఁ దటిద్విలాసములు గట్టిగ నొక్కట నిల్చు పోలికన్. 16

సీ. ఉరవడి ప్రాగ్వీథి నుదయించు మార్తాండ కోటిబింబచ్ఛాయ గూడినట్లు
హరి హర బ్రహ్మల యాత్మలలో నుబ్బి కరుణ యొక్కట మూర్తి బెరసినట్లు
ఖరకర కర తీవ్ర గతినిఁ గరంగుచు హేమాద్రి [3]సోగ పెల్లెగసినట్లు
ఫణిరాజ ఫణరాజి మణిగణ విస్ఫూర్తి సుషిరంపు వెలిదల చూపినట్లు

తే. ఉట్టిపడ్డట్లు కట్టెట్టు నూఁదినట్లు
తేజ మెసఁగంగ నా మ్రోల దివ్యవాణి
పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ
జూచి యిట్లని పలికె మంజులముగాను. 17

ఉ. ఆటలు పాటలుం జదువు లద్భుతముల్ విన నొప్పు వాద్యముల్
సాటి దలంపరాని బలుసాములు మున్నగు విద్యలెల్ల నీ
కాటలు పాట లయ్యె వినుమన్నిటికిన్ మెఱుఁ గిడ్డభంగి నా
చాటునఁ జాటుకారపద సాధుకవిత్వముఁ జెప్పు మింపుగన్. 18

వ. అని యానతిచ్చు జగన్మాత కృపావలోకన సుశ్లోకుండ నై యే నొక శ్లోకంబు నాక్షణంబ నొడివితి. అది యెట్టి దనిన. 19

1. భాగవతార్థ (హ) † యీ కృతికిం బతిగా నద్దేవుండు గలండని వితర్కించి నాకుం గవిత్వ మహత్త్వంబు సంప్రాప్తంబగు కాలంబుఁ దలంచి నారాయణుండె దైవంబని యెఱింగి మనోరథంబు సఫలంబయ్యెనని యీ కృతిఁ గృష్ణార్పణంబు చేసితి. తా. ప. ప్రతులలో నిట్లున్నది. 2. దలమునఁ గ్రమ్ముక్రొమ్మెఱుఁగు తండము రూపున (హ. తం. వా.) 3. చెంత (తం. వా.) చెంగ (క. ట. జ. డ. బ)

శ్లోకము. హంసాయ సత్త్వనిలయాయ [1]సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్సంగ్రహాయ సగుణాయ నిరీశ్వరాయ
సంపూర్ణ పుణ్యపతయే హరయే నమస్తే. 20

వ. ఈ శ్లోకం [2]బ ద్దెవి యంగీకరించె. అంత మేలుకాంచి యానందభరితుండనై నాఁటనుండి, చంద్రానుగత యగు చంద్రికయుం బోలె, నారాయణాంకితం బైన కవిత్వ తత్త్వజ్ఞానంబు గోచరం బయ్యె. దానికి ఫలంబుగా గోపికావల్లభుని సుల్లంబున నిడుకొని. 21

ఆ. పలుకఁ గలిగె మొదల భాగవతార్థంబు
భర్త కృష్ణుఁ డాయె భాగ్య మొదవె
నమృతరసము గోర నలరు చింతామణి
పాత్ర సంభవించు భంగి నిపుడు. 22

ఆ. భాగవతము తేటపఱుప నెవ్వఁడు సాలు
శుకుఁడు దక్క నరుని సకుఁడు దక్క
బుద్ధిఁ దోఁచినంత బుధులచే విన్నంత
భక్తి నిగిడినంత పలుకువాఁడ. 23

ఉ. పుట్టిననాఁట నుండియును బుట్టడ యెట్టియ దట్టునైనఁ జే
పట్టి నుతింపఁ జిత్తము శుభం బగు మద్వరవాక్యసీమకుం
బట్టము గట్టినాఁడ హరిఁ బాయక తత్కథనామృతంబు నే
నుట్టిపడంగఁ జెప్పెదు బుధోత్తము లానుఁడు శ్రోత్రపద్ధతిన్. 24

వ. అని. 25

సీ. శ్రీవత్స గోత్రుండు శివభక్తి యుక్తుఁ డాపస్తంబ సూత్రుఁ డపార గుణుఁడు
నేర్పూరి శాసనుం డెఱ్ఱనప్రెగ్గడ పుత్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుం డగు నాదెయామాత్యునకుఁ బోలమాంబకు నందను లమితయశులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి సింగధీమణియు నంచితగుణాఢ్యు

తే. లుద్భవించిరి తేజంబు లూర్జితముగ
సొరిది మూర్తిత్రయం బన శుభ్రకీర్తిఁ
బరఁగి రందులఁ గసువన ప్రభువునకును
ముమ్మడమ్మను సాధ్వి యిమ్ములను వెలసె. 26

1. సమాశ్రయాయ (హ) 2. అ ద్దేవుం డంగీకరించె (హ)

ఉ. †ఆడదు భర్తమాట కెదు రాడదు వచ్చినవారి పీడఁగా
నాడదు పెక్కుభాష లెడనాడదు వాకిలి వెళ్ళి కల్ల మా
టాడదు మిన్నకేని సుగుణావళి కిందిరగాక సాటి యే
చేడియ [1]లేదు చూరికుల శేఖరుకన్వయ ముమ్మడమ్మకున్. 27

క. ఆ కనువయమంత్రికిఁ బు, ణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మయు మము న
వ్యాకులచిత్తుల నిరువుర, శ్రీకర గుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్. 28

క. అంగజసమ లావణ్య శు, భాంగులు హరి దివ్యపదయుగాంబుజ విలస
ద్భృంగాయమాన చిత్తులు, సింగయ తెలగయలు మంత్రిశేఖరు లనఁగన్. 29

క. అం దగ్రజుండ శివపూ, జం దనరినవాఁడ విష్ణుచరితామృత ని
ష్యంది పటు వాగ్విలాసా, నందోచిత మానసుఁడను నయకోవిదుఁడన్. 30

వ. కావునం గృష్ణపాదారవింద సందర్శనాదర్శతలాయమాన చిత్తుండ నై. 31

—: షష్ఠ్యంతములు :—

క. శ్రీపతికి మత్పతికి నుత, గోపతికిఁ ద్రిలోకపతికి గురుజనబుధ సం
తాప నివారణ మతికినిఁ, బ్రాపితసనకాది తతికి బహుతర ధృతికిన్. 32

క. హరికి గురు కలుషకుంజర, హరికి బలాభీలహరికి నంతస్స్థిత గ
హ్వరికి నరహరికి రక్షిత, కరికిఁ గరాగ్రస్థగిరికి ఘనతరకిరికిన్. 33

క. గుణికి సమాశ్రిత చింతా, మణికి మహేంద్రాది దివిజమండల చూడా
మణికిఁ బ్రకల్పితశయ్యా, ఫణికి నురోభాగ కౌస్తుభ ప్రియమణికిన్. 34

క. [2]కంసాసుర సంహారున, కంసాంచిత కర్ణకుండలాభరణునకున్
హింసాపర పరమస్తక, మాంసకరాశిత గదాభిమత హస్తునకున్. 35

క. వర యోగి మానసాంతః, కరణ సుధాంబోధి భావకల్లోల లస
త్పరతత్త్వ శేషశాయికిఁ, జిరదాయికి సకలభక్త చింతామణికిన్. 36

-: కథా ప్రారంభము :-

వ. సమర్పితంబుగా నా యొనర్పంబూనిన షష్ఠస్కంధంబునకుం గథా ప్రారంభ క్రమం బెట్టిదనిన, హరి చరణస్మరణ పరిణామ వినోదులయిన శౌనకాదులకు నిఖిల పురాణేతిహాస నిర్ణయ విఖ్యాతుం డైన సూతుం డి ట్లనియె. 37

†27, 28 పద్యములు (ద) లో లేవు. 1. లేరుచూరి కులశేఖరు. అని యుండవలెను.
2. కంసమద దమన దక్షున కంసాంచిత కర్ణకుండలాభరణునకున్ (చ. ఓ. త.)

అధ్యాయము—౧

క. శ్రీరమణీ రమణకథా, పారాయణ చిత్తుఁడగుచుఁ బలికెఁ బరీక్షి
ద్భూరమణుఁ డాదరంబున, సూరిజనానందసాంద్రు శుకయోగీంద్రున్. 38

సీ. షడ్గుణైశ్వర్య శాశ్వతమూర్తి వైనట్టి మునినాథ! దయతోడ ముక్తిపదము
మున్నుగా నే మార్గమున వినుపించితి వారయ నపవర్గ భూరిమహిమఁ
గ్రమ యోగసంభవ బ్రహ్మంబు [1]తోఁకన యనువొంద నగు నవి వినుతికెక్క
మఱియు సత్త్వ రజ స్తమః ప్రభావంబులఁ గడిఁది యై యున్నట్టి కర్మచయము

తే. నప్పటప్పటి కణఁగని యట్టి ప్రకృతిఁ
గలుగు పురుషుని భోగార్థఘటన దేహ
కారణారంభరూప మార్గంబు మొదలు
మాటిమాటికి నన్నియుఁ దేటపడఁగ. 39

వ. మఱియు ననేక పాపలక్షణంబు లగు నానావిధ నరకంబులును, వాని కాద్యంతం
బులును,స్వాయంభువ సంబంధియగు మన్వంతరంబును, ప్రియవ్రతోత్తానపాదుల
వంశంబును, దచ్చరిత్రంబును, ద్వీప వర్ష సముద్రాద్రి నద్యుద్యాన వనస్పతు
లును, భూమండల సంస్థానంబును, వాని పరిమాణంబును, జ్యోతిశ్చక్రచలన
ప్రకారంబును, విభుం డైన పరమేశ్వరుం డెవ్విధంబున నిర్మించె, నా విధం
బంతయు నెఱింగించినాఁడవు. ఇప్పుడు, 40

తే. కడిఁది వేదనలకుఁ గారణం బై యుండు
గుఱుతులేని నరక కూపరాశి
పాలుగాక నరుఁడు బ్రతికెడు మార్గంబు
పరమపుణ్య! తెలియఁ బలుకవయ్య! 41

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 42

క. కట్టా! త్రికరణ [2]ములచేఁ, బుట్టిన దురితముల నపుడ పొలియింపని యా
కట్టిఁడి దేహం బుడిగినఁ, గొట్టాడును బిట్టు నరకకూపంబులలోన్. 43

ఉ. కావునఁ గాలకింకర వికారముఁ గానకమున్న మృత్యు దు
ర్భావన చిత్తమున్ [3]వెడఁగుపాటును జెందకమున్న మేనిలో
జీవము వెగ్గలుచుండి తన చెల్వము దప్పకమున్న మున్నుగాఁ
బావనచిత్తుఁ డై యఘముఁ బాయు తెఱం గొనరింపఁగాఁ దగున్. 44

1. తోఁగూడ (తం.వా.) 2. మెఱుఁగక (హ.తం.వా.) 3. జెడుగుపాటుగఁ జేయకమున్న (హ)

క. కాలం బెడగని పాపము, మూలముఁ జెఱుపంగవలయు మును రోగములన్
దేలిన దోషము నెఱుఁగుచు, వాలాయము దాని నడఁచు వైద్యునిభంగిన్. 45

సీ. అనవుడు నాతని కనియె భూకాంతుఁడు కనుకలి వినుకలి గలిగినట్టి
పాపము దనకు నొప్పని దని కని చాలఁ బరితప్తుఁ డయ్యుఁ గ్రమ్మఱ నొనర్చు
మూఢాత్మునకు దోషమోచనం బెయ్యది? యారయ నెఱిఁగింపు మదియుఁ గాక
కలుష మొక్కొకచోటఁ గావించు నొకచోటఁ గావింపకుండుఁ దత్కర్మ మెఱిఁగి

తే. యట్టి జనుఁడు పుణ్య మేరీతిఁ జేసిన
నది ఫలింపనేర దని తలంతు
సలిలమందు మేలి మలినంబు [1]వోవంగ
గజము గ్రుంకువెట్టు గతియుఁ బోలె. 46

వ. అనిన శుకుం డిట్లనియె.

క. కర్మము కర్మముచేతను, నిర్మూలము గాదు తెలియనేరక తానే
కర్మము సేసినఁ ద త్ప్రతి, కర్మం బొనరింపవలయుఁ గలుషవిదూరా! 48

క. హితముగల కుడుపు మఱి రు, గ్వితతులఁ బొడమంగనీని విధమున నతిస
ద్వ్రతుఁ డైనవాఁడు [2]నిర్మల, మతిచే నఘరాశి నెల్ల మట్టముసేయున్. 49

చ. తపమున బ్రహ్మచర్యమున దానములన్ శమ సద్దమంబులన్
జపముల సత్య శౌచముల సన్నియమాది యమంబులన్ గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తను వాక్యజంపుఁ బా
పపుగుదిఁ ద్రుంతు రగ్ని శతపర్వ వనంబుల నేర్చుకైవడిన్. 50

వ. అదియునుం గాక. 51

ఉ. కొందఱు పుణ్యవర్తనులు గోపకుమార పదారవిందజా
నంద మరందపాన కలనారత షట్పదచిత్తులౌచు గో
విందపరాయణుల్ విమలవేషులు దోష మశంతు రాత్మలం
జెందిన భక్తిచేత రవి చేకొని మంచు నడంచుకైవడిన్. 52

క. హరిభక్తిచేతఁ గొందఱు, బరిమార్తురు మొదలు ముట్టఁ బాపంబుల ని
ష్ఠురతర కరముల సూర్యుం, డరుదుగఁ బెనుమంచు[3]పించ మణఁచినభంగిన్. 53

క. దంతిపురనాథ! విను మొక, మంతన మెఱిఁగింతు శమ దమంబులు నంహో
వంతు శుభవంతుఁ జేయవు, కంతునిగురు భక్తి ముక్తిఁ గలిగించుగతిన్. 54

1. పీచమణఁచిన (తం.వా.) 2. తాలిమి, కతమున తత్త్వంబు కొఱకు కల్పించుజూషి (క)
3. పీచమణచిన (ట)

సీ. హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగ నుండువాని కైవల్య మెవ్వనికి లేదు
వనజలోచను భక్తవరుల సేవించినవాని కైవల్య మెవ్వనికి లేదు
వైకుంఠ నిర్మల వ్రతపరుం డై నట్టివాని కైవల్య మెవ్వనికి లేదు
సరసిజోదరు కథా శ్రవణ లోలుం డైనవాని కైవల్య మెవ్వనికి లేదు

తే. లేదు తపముల బ్రహ్మచర్యాది నిరతి
శమదమాదుల సత్యశౌచముల దాన
ధర్మ సుఖముల సుస్థిరస్థాన మైన
వైష్ణవజ్ఞాన జనిత నిర్వాణపదము.

తే. అరయ నెన్నఁడుఁ జేటు లేనట్టి ముక్తి
పర్త్మ మీ లోకమందు నెవ్వనికిఁ గలదు?
సాధులును బుణ్యశీలురు సజ్జనులును
హరిపరాయణ తత్పరు [1]లగుటఁ గాక. 56

క. అరుదుగ నరహరి భక్తిం, బొరయని యా పురుషు సుకృతి పుంజంబులు వే
మఱు పుణ్యుఁ జేయ నేరవు, సరవర మధుఘటముఁ బెక్కు నదులం బోలెన్. 57

చ. సతతముఁ గృష్ణ పాదజలజంబులయందు మనంబు నిల్పు సు
వ్రతులు తదీయ శుద్ధ గుణరాగులు కాలుని యుగ్రపాశ సం
హతుల ధరించు తత్సుభటవర్గములం గలలోనఁ గాన రే
గతులను దుష్టకర్మములు గైకొని వారలఁ జెందనేర్చునే? 58

వ. కావున నీయర్థంబునకుం బురాతనంబగు నొక్క యితిహాసంబు గలదు. అది విష్ణు
దూత యమదూత సంవాదం బనంబడు. దాని నెఱింగింతు ఆకర్ణింపుము. 59

—: అ జా మి ళో పా ఖ్యా న ము :—

సీ. నరనాథ! వినుము కన్యాకుబ్జపురమునఁగలఁడు బ్రాహ్మణుఁ డజామిళుఁ డనంగఁ
బాతకుం డతుల నిర్భాగ్యుం డవజ్ఞుండు నష్టసదాచారి కష్టరతుఁడు
జూదంబులందు దుర్వాదంబులందును జౌర్యంబునందు మచ్చరము గలిగి
[2]తొత్తును బత్నిగా మత్తుఁ డై వరియించి కొడుకులఁ బదుగురం బడసి బాల

ఆ. మోహజలధిలోన మునిఁగి ముచ్చట దీర
బాల లాలనాది లీలఁ దగిలి
పెద్దకాల మతఁడు పెంపార సుఖియించి
[3]బలిత మెల్లఁ దొలఁగి పలితుఁడయ్యె. 60

1. లైనఁగాక (తం. వా.) 2. తొత్తాత్మ పత్నిగా (హ. తం. వా.) 3. ఫలితమెల్ల వదలి పలితుఁడయ్యె (హ. తం. వా.)

సీ. [1]నిర్మలం బనఁ జాలనెఱయు చిత్తం బన నల్లని వెంట్రుకల్ తెల్లనయ్యె
దగు మోహపాశ బంధంబు జాఱినమాడ్కిఁ [2]బొదలినయంగంబు వదల వ్రాలె
నింద్రియంబుల కోర్కె లింక నొల్ల ననుభంగి నుడుగక తల చాల వడఁకఁ జొచ్చెఁ
దమకంబు ప్రాయంబు [3]దగిలిపోయిన మాడ్కి లోచనంబుల చూడ్కి నీచమయ్యె

ఆ. వగరు పుట్టె నంతఁ బెగలె దంతంబులు
నుక్కసయును దగ్గుఁ బిక్కటిల్లె
శిరసు నొవ్వఁదొడఁగె జెదరె మనం బంతఁ
గడిఁది యైన ముప్పుకాలమునను. 61

ఆ. ఎనయ నతని కెనుఁబదెనిమిది వర్షంబు
లంత నరుగుటయును భ్రాంతుఁ డగుచుఁ
గోరి పిన్నకొడుకు నారాయణాఖ్యుండు
బాలుఁ డగుట మిగుల భక్తిఁ జేసి. 62

క. తన సతియుఁ దానుఁగూరిమి, మనమునఁ బెనఁగొనఁగ నక్కుమారుని నవిశం
బును ముద్దు సేయుచుండెను, జనవర! వాత్సల్య మాత్మ సందడిఁ గొనఁగన్. 63

క. బాలునిఁ [4]గలభాషణ జన, పాలుని (?) నిజ జనక బంధు పరిణామ కళా
శీలుని లోలతఁ గనుఁగొని, యాలరి బ్రాహ్మణుఁడు నందితాత్ముం డగుచున్.

క. అత్యంత పాన భోజన, కృత్యంబులఁ బొత్తు గలిగి క్రీడలఁ దత్సం
గత్యంబు వదల కాగత, మృత్యువుఁ గన నేరఁ డయ్యె మిక్కిలి జడుఁడై. 65

తే. తెలియ కీ రీతి నతఁడు వర్తింపుచుండ
భయద మగు మృత్యుకాలంబు ప్రాప్త మైన
భూరి వాత్సల్యవృత్తి న ప్పుత్రుఁ దలఁచి
[6]యాత్మఁ బ్రలపించు నారాయణా యటంచు. 66

వ. అప్పుడు. 67

క. కింకరుల ధర్మరాజ వ, శంకరుల దురంత దురిత సమధిక జన నా
శంకరుల సకలలోక భ, యంకరులం గనియె నింద్రియాకులుఁ డగుచున్. 68

క. ఘాతకుల దండదండిత, పాతకుల మహోగ్ర కర్మ భర నిష్కరుణా
జాతకులఁ బ్రేతనాయక, దూతక సంతతుల నతఁడు దూరమునందున్. 69

---

1. నిర్మలంబని చాల నెరయుచిత్తంబున (హ), నిర్మలంబయి (?) 2. పొదలిన యంగముల్ వదలి వ్రేలె (తం. వా.) 3. తలగిపోయిన (క) తరిగిపోయిన (ద) 4. అర్ధవచోబుజుషాలుని (చ) ముగ్ధవచో (తం.వా.) 5. అడరి కలవించు నారాయణాహ్వయునిని (చ)

మ. కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁకన్ రోషనిష్ఠ్యూతులన్
ఘన పీనోష్ఠ వికారవక్త్ర విలసద్గర్వేక్షణోపేతులన్
జన సంత్రాస కరోద్యతాయత సుపాశ శ్రేణికా హేతులన్
హననవ్యాప్తి విభీతులన్ మువుర నాత్మానేతలన్ దూతలన్. 70

వ. ఇట్లతి వికృత తుండ గండభాగ విషమ వివృత్త నేత్రులు, నతి పుష్ట నిష్ఠురతను యష్టి సంవేష్టిత మహోర్ధ్వరోములు, నభ్యస్త సమస్త జీవాపహరణ కరణ ప్రశస్త హస్త విన్యస్త పాశధారులు నగు యమభటుల మువ్వురం గనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును, వికంపిత ప్రాణుండును, [1]వికృత లోచనుండును, విహ్వలాత్మకుండు నై, 71

క. దూరమున నాడు బాలుఁడు, బోరనఁ దన చిత్తసీమఁ బొడగట్టిన నో
నారాయణ! నారాయణ! నారాయణ! యనుచు నాత్మనందను నొడివెన్.

చ. మరణపువేళ నద్దనుజమర్దను సంస్మరణంబు సేయఁ ద
త్పరిసరవర్తు లాత్మపరిపాలకు నామము నాలకించి ని
ష్ఠురగతి నేగుదెంచి పొడసూపి యదల్చిరి కాలుదాసులన్
ఖరతరభాషులన్ వికట కల్పిత వేషుల దీర్ఘరోషులన్. 73

క. దాసీభర్త నజామిళ, భూసురుఁ దత్తనువువలన బోరన వెలికిం
[2]దీసెడు యమభటులను బోఁ, ద్రోసిరి శ్రీవరుని కూర్మిదూతలు కడిమిన్. 74

—: విష్ణుదూత యమదూతల సంవాదము :—

వ. ఇట్లు విష్ణుదూతలవలన నిర్ధూత ప్రయత్ను లై యమదూత లిట్లనిరి. 75

క. ఎవ్వనివారలు మాతోఁ, జివ్వకుఁ గత మేమి? యిట్లు చిక్కినవానిం
గ్రొవ్వున విడిపించితి రిఁక, నవ్వులకో? జముని శాసనంబులు జగతిన్. 76

సీ. ఎవ్వరు మీ రయ్య! యీ భవ్యరూపముల్ కన్నుల కద్భుతక్రమ మొనర్చె
[3]దివ్యోపదివ్యులో? దేవతాప్రవరులో? సిద్ధులో? సాధ్యులో? చెప్పరయ్య!
దళిత పాండుర పద్మదళ దీర్ఘ నేత్రులు వర పీత కౌశేయ వాసు లరయ
గండమండల నటత్కుండలద్వయులును బటు కిరీటప్రభా భాసితులును

తే. భూరి పుష్కర మాలికా చారువక్షు
లమిత కోమల నవయౌవనాధికులును
బాహు కేయూర మణిగణ భ్రాజమాన
ఘన చతుర్భుజు లభ్రసంకాశ రుచులు. 77

1. విక్రుత (హ) 2. దీసి యమభటులఁ బారన్ (హ) 3. దివిజులో భువిజులో (హ.తిం.వా.)

క. ధనువులు నిషంగచయములు, కనదంబుజ శంఖ చక్ర ఖడ్గ గదా సా
ధనములు ధరియించిన మీ, తనువులు లోకముల కద్భుతం బొనరించెన్. 78

క. శాంతంబు లైన మీ తను, కాంతులు జగములను దిశలఁ గలిగిన బహుళ
ధ్వాంతములఁ బాఱఁదోలుచు, సంతస మొనరించె నిపుడు సర్వంకషమై. 79

వ. ఇట్లఖిల లోకానందకర [1]కమ్రాకారులు, నఖిల విభ్రాజమాన తేజో దుర్నిరీక్ష్యమాణులును, నిఖిల ధర్మపాలురు నగు మీరు ధర్మపరిపాలుర మమ్ము నడ్డపెట్టం గతం బేమి? అనిన మందస్మిత కందళిత ముఖారవిందు లై గోవిందుని కందువ మందిరంబు కావలివారలు వారివాహ గంభీర నిర్ఘోష పరిపోషణంబు లైన విశేష భాషణంబుల నిట్లనిరి. 80

ఉ. మీరు పరేతనాయకుని మేలిమి దూత లటేనిఁ బల్కుఁడా
తోరపుఁ బుణ్యలక్షణము, దుష్కృతభావము, దండకృత్యముం,
బేరముతోడ నీతని కభీష్టనివాసము, పూని దండ్యు లె
వ్వారలు? సర్వభూతములొ? వారక కొందఱు పాపకర్ములో? 81

వ. అనిన యమభటు లిట్లనిరి. 82

క. వేద ప్రణిహితమే యను, మోదంబుగ ధర్మ మయ్యె మున్ను తదన్యం
బేది యగు నది యధర్మం, బాదియు హరిరూపు [2]వేద మన వినుకతనన్. 83

సీ. *ఎవ్వనిచేఁ జన యిరవొందు త్రిగుణ స్వభావ మైనట్టి యీ ప్రాణిచయము
లనుగుణ నామక్రియారూపములచేత [3]నెంతయుఁ దమయంత నెఱుఁగఁ బడును
నర్యముం డనలంబు నాకాశమును ప్రభంజనుఁడు గోచయమును శశధరుండు
సంధ్యలు దినములు శర్వరీచయములు కాలాంబు వసుమతీ జాలములును

తే. దేహధారికి సాక్షు లై తెలుపుచుండు
దండన స్థాన విధము †సద్ధర్మగతియుఁ
‡దగుల మీ రీ క్రమానురోధనము చేసి
యఖిలకర్ములు దండార్హు లరయ నెపుడు. 84

తే. కోరి కర్మంబు నడపెడువారి కెల్లఁ
గలిత శుభములు నశుభముల్ గలుగుచుండు
నరయఁగా దేహి గుణసంగి యైనయపుడె
పూని కర్మంబు సేయక మానరాదు. 85

1. సుందరాకారులు (క.చ.జ.డ.బ.) 2. వేదమని (క.జ.) 3. నేర్పడుగతిఁ దాన నెఱుఁగఁబడును (హ) * ఈ పద్యమున కన్వయము సరిగాఁ గుదురుటలేదు. † "ఏతై రధర్మో విజ్ఞాతః, స్థానం దండస్య యుజ్యతే" - మూలము. (1-43) ‡"సర్వేకర్మానురోధేన దండమర్హంతి కారిణః" - మూలము (1-48)

క. ప్రకృతమునఁ దా నొనర్చిన, సుకృతము దుష్కృతము నెంత చూడఁగ నంతే
[1]వికృతిఁ గని యనుభవించు, న్నకృతమతిఁ ద త్ఫలంబు నతినిపుణుం డై. 86

వ. మఱియు వినుండు, *జన్మంబు శాంత ఘోర మూఢ గుణంబులచేత నైనను, సుఖ దుఃఖ గుణంబులచేత నయినను, ధార్మికాది గుణంబులచేత నైనను, సకల భూతంబులు త్రైవిధ్యంబు నే ప్రకారంబునం బొందు, నా ప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు. దేవుం డైన యముండు సర్వ జీవాంతర్యామి యై ధర్మాధర్మయుక్తం బైన పూర్వరూపంబులను మనస్సుచే విశేషంబుగఁ జూచుచుండి, వాని కనురూపంబులఁ జింతింపుచుండు. అవిద్యోపాధి జీవుండు తమోగుణయుక్తుం డై ప్రాచీనకర్మంబుల నేర్పడ్డ వర్తమాన దేహంబు, నే నని తలంపుచుండి, నష్ట జన్మస్మృతి గలవాఁ డై పూర్వపరంబు లెఱుంగం జాలకుండు. మఱియుఁ గర్మేంద్రియములచేతఁ గర్మంబులఁ జేయుచుండి, జ్ఞానేంద్రియంబుల చేతఁ దమోవిషయంబు లయిన శబ్దస్పర్శ రూప రస గంధంబుల నెఱుంగుచుండి, పదియాఱవది యైన మనంబుతోఁ గూడి, పదియేడవవాఁ డగుచుండి, షోడశోపాధ్యంతర్గతుం డై యొక్కరుం డైన జీవుండు, సర్వేంద్రియ విషయ ప్రతిసంధానంబు కొఱకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయంబులం బొందుచుండి, షోడశకళలం గలిగి, లింగ శరీరం బనం బరఁగి, గుణత్రయకార్యం బను నిమిత్తంబున హర్ష శోక భయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియింపుచుండు. [2]అజిత షడ్వర్గుం డైన దేహి [3]కర్మంబు లొల్లని బుద్ధి నెఱింగియు, వినియుఁ, గర్మంబులు సేయుచుండి, తన సంచారకర్మంబునం జుట్టుకొన్న పసిరికాయ పురువునుం బోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందుచుండు. వర్తమాన వసంతాది కాలంబు, భూత భావి వసంతకాల యోగ్యం బైన పుష్ప ఫలాదులు తత్కాల జ్ఞాపకంబు నెట్లు సేయు, నట్లు భూత భావి జన్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు. ఒక్కనరుండు నొక క్షణంబును గర్మంబుఁ జేయకుండువాఁడు లేఁడు. పూర్వ సంస్కారంబులం గల గుణంబులచేతఁ బురుషుం డవశుండు గావునఁ బలిమిఁ గర్మంబులు సేయింపంబడుచుండు. అవ్యక్తనిమిత్తంబు నొంది త దనురూపంబు లైన స్థూల సూక్ష్మ శరీరంబులు మాతా పితృ సదృశంబు లగుచుండు. ఇట్టివిపర్యయంబు పురుషునికిఁ బ్రకృతిసంగమంబునం గలుగుచుండు. ఆ ప్రకృతి పురాణపురుషుం డైన యప్పరమేశ్వరుని సేవించినఁ దలంగుచుండు.

1. వికృతగతి (త. జ.) * ఇహజన్మని (వ్యాఖ్య) ఈ జన్మంబున 2. విజిత (హ. తం. వా.)
3. కర్మంబు లొల్లనని (చ. జ.)

సీ. కావున నితఁడు సత్కర్మ వర్తనమున భూదేవకులమునఁ బుట్టినాఁడు
దాంతుఁడై శాంతుఁడై ధర్మసంశీలుఁడై సకలవేదంబులఁ జదివినాఁడు
అనయంబు గురువుల నతిథులఁ బెద్దలఁ జేసి శుశ్రూషలు చేసినాఁడు
సర్వభూతములకు సమబుద్ధియై చాల బహుమంత్రసిద్ధులఁ బడసినాఁడు

తే. సత్యభాషణ నియమంబు జరపినాఁడు
నిత్యనైమిత్తికాదుల నెఱపినాఁడు
దండి లోభాది గుణములఁ దరపినాఁడు
మంచిగుణములు దనయందు మరపినాఁడు. 88

క. సతతాచార సమంచిత, మతియై సుజ్ఞానములకు మరగెడి తఱి నా
యత [1]గతి నాతని కంగజ, మతమై నవయౌవనాగమం బెడ సొచ్చెన్. 89

సీ. కడకంట యౌవనగర్వంబు వొడగట్టె మదిలోన నుద్రేకమదము దొట్టె
కడు మేనఁ గామవికారంబు దలసూపె ముఖమునఁ జిఱునవ్వు మొలకలెత్తె
నతిపుష్టి నిష్ఠురం బయ్యె దేహం బెల్లఁ గచభారమున నెఱికప్పు మెఱసె
కటిభారమున నూరుకాండముల్ జిగి [2]మీఱె బాహుశాఖలు దీర్ఘభంగిఁ దోఁచె

ఆ. నురము విపుల మయ్యె నుల్లస ద్వరకాంతి
పూర మంగకమునఁ బొందుపడియె
భూరితేజుఁడైన భూసురాన్వయునకు
[3]నభినవైక యౌవనాగమమున. 90

క. హృదయమునఁ బొడము యౌవన, మదము వెలిం దోఁచుభంగి మానితరుచిఁ ద
ద్వదనమున నూఁగుమీసలు, పొదలుచుఁ గప్పడరి చూడఁ బొంకంబయ్యెన్. 91

వ. మఱియును. 92

క. తమ్మివిరి మీఁద వ్రాలిన, తుమ్మెద పంక్తియును బోలెఁ దొరపులీలం
గ్రమ్ముకొని విప్రతనయుని, నెమ్మొగమునఁ గానఁబడియె నెఱిమీసంబుల్. 93

వ. అంత ననంగబ్రహ్మతంత్రంబునకు వసంతుం డొనర్చు నంకురార్పణారంభం బునుం బోలె [4]లలిత కిసలయ విసర ప్రసార భాసుర బాహు పాదపాది పురోపవన పవన జవనప్రభావ పరికంపిత విట విటీజన హృదయ ప్రఫుల్ల పల్లవ భల్లంబును, అసూన ప్రసూన నిర్భర గర్భావిర్భూత సురభి పరాగపటల పటఘటిత నభో మండలంబును, అమంద నిష్యంద మరంద బిందుసందోహ కందళిత చిత్త మత్త

1. మతి (క.చ.త.బ.) 2. మించె (క.చ.త.జ.బ.) 3. అభినవీన (హ) 4. అసిత (హ)

మధుప సంకుల ఝుంకార ముఖరిత సకల దిశావలయంబును, నిరంతర ధారాళ రసభరిత పరిపక్వ ఫలానుభవ ప్రభవ సమ్మోదవాద శుకప్రముఖ పతంగ కోలాహలంబు నైన మధుమాసంబు సర్వజన మనోహరంబు నై నిఖిల వనపాదపంబుల నలంకరించె. ఆ య్యవసరంబున నజామిళుండు పితృనిర్దేశంబునం గుశ సమిత్పుష్ప ఫలార్థంబు వనంబున కరిగి, తిరిగి వచ్చు సమయంబున నొక్క లతాభవనంబున. 94

క. బద్ధానురాగయై స్మర, యుద్ధంబున కలరు బుద్ధి [1]నురు కామకళా
సిద్ధ యగు వృషలితోఁ బ్రియ, వృద్ధిం దగఁ గూడియున్న విటు నొరు గాంచెన్.

క. ఘటునిన్ రతిశాస్త్ర కళా, ర్భటునిన్ వర యౌవనానుభవ మదవిభవో
ద్భటునిన్ సురతేచ్ఛా సం, ఘటునిన్ విగతాంబరోరుకటునిన్ విటునిన్. 96

శా. హాలా ఘూర్ణిత నేత్రతో మదన తంత్రారంభ [2]సంరంభతో
[3]ఖేలాపాలన యోగ్య భూవిభవతోఁ గీర్ణాలకాజాలతో
హేలాలింగన భంగి వేషవతితో చిచ్ఛావతీమూర్తితోఁ
గేళిం దేలుచునున్నవానిఁ గనె పుంఖీభూత రోమాంచుఁ డై. 97

క. [4]కలికి వగ మదనకదనపుఁ, బలుకుల కలకలము బెడఁగు వడు మేఖల ము
వ్వల రవళిఁ దగిలి గతిగొనఁ, గలకంఠి రతంబు సలుపుగమకముఁ గనియెన్.

క. [5]కవకవనై పదనూపుర, [6]రవరవ లాగుబ్బుకొన్న రతిపతి గతులం
జివచివ నై [7]విటు చెయ్యువల, రవళిన్ రతిసల్పు రతుల రవరవఁ గనియెన్. 99

చ. కురు లళికంబుపై నెగయఁ గ్రొమ్ముడి వీడఁగ గుబ్బదోయిపై
సరములు చౌకళింపఁ గటిసంగతి మేఖల తాళగింప స
త్కర వర కంకణావళులు గర్జిలఁ గౌ నసియాడ మీఁదుగా
మరుని వినోదముల్ సలిపె మానిని యౌవన గర్వరేఖతోన్. 100

క. మవ్వపు సుకుమారాంగిని, జవ్వని నుపగూహనాది సముచిత రతులన్
నివ్వటిలుదానిఁ గని మది, నువ్విళ్ళూరంగ మన్మథోద్దీపనుఁ డై. 101

తరళ. బహుళ దృక్పరిపాక మోహ నిబద్ధుఁ డౌచు మనంబులో
సహజ కర్మము వేదశాస్త్రము సాత్త్వికంబుఁ దలంచి త
న్నిహిత చిత్తము పట్టి పట్టఁగ నేరఁ డయ్యె సదా మనో
గహనమందు మరుండు పావకు కైవడిన్ జరియింపఁగాన్. 102

1. నుద్ధతకేళిం, బద్ధయగు (హ) 2. సంసిద్ధిలో (క.జ.బ.) 3. ఖేలాపాటన కోటరీ విభవతో (క. చ. డ. బ.) 4. కలికివడు (తం.వా.) 5. కవకవలై (క. చ. జ.) 6 రవరవమై గుబ్బుకొన్న (హ) 7. విటుచెవులకు (హ.వా.)

శా. ఆ లీలావతి గండపాళికలపై హాస ప్రసాదంబుపై
నాలోలాలకపంక్తిపై [1]నాసలిపై [2]నాకర్ణ దృగ్వ్యాప్తిపై
హేలాపాది కుచద్వయోరు కటిపై నిచ్చల్ పిసాళింపఁగా
జాలిం బొందుచు నాత్మఁ గుందుచు మనోజాతానలోపేతుఁ డై. 103

గీ. మఱి కులాచార వర్తన [3]మాలు చేసి
పరగుఁ పిత్రర్థములు దాని పాలు చేసి
సాధులక్షణ గుణవృత్తిఁ జాలు చేసి
లోలలోచన [4]వసఁ జెంది లోలుఁ డయ్యె. 104

క. శ్యామఁ గుసుమాస్త్ర ఖేలన, [5]కామఁ గులస్త్రీలలామఁ గమనీయగుణ
స్తోమ నిజభామ నొల్లక, [6]ధామంబున డించి క్రించుఁదనమునఁ [7]బొడవై. 105

ఉ. [8]బంధులఁ దిట్టి సజ్జనుల బాధలఁ బెట్టి యనాథకోటిఁ బెన్
బందెలు సుట్టి [9]యారములు పట్టి పథంబులు గొట్టి దిట్టయై
నిందల కోర్చి [10]సాధుకుల నిందితుఁ డై గడియించు విత్తమా
సుందరి కిచ్చి మచ్చికలు [11]సొం పెసఁగూర్చి వసించెఁ దత్కృపన్. 106

సీ. సముచిత శ్రుతిచర్చ చర్చింప నొల్లక సతి కుచద్వయచర్య చర్చసేయుఁ
దర్క కర్కశ పాఠ తర్కంబు గాదని కలికితోఁ బ్రణయ తర్కంబు సేయు
స్మృతి పదవాక్య సంగతిఁ గాక తత్సతి పదవాక్య సంగతిఁ బరఁగఁ జేయు
నాటకాలంకార నైపుణం బుడిగి తన్నాటకాలంకార పాటిఁ దిరుగుఁ

గీ. బరఁగఁ జిరకాల మీ రీతిఁ బాపనియతి
రమణ [12]దాసీ కుటుంబ భారము వహించి
యది కుటుంబిని గాఁగఁ బాపాత్ముఁ డగుచు
నశుచియును దుష్టవర్తనుం [13] డై మెలంగె. 107

క. అటు గానఁ బాపకర్మునిఁ, గుటిలుని సుజనార్తు ధూర్తుఁ గ్రూరుని [14]నే మా
వటమునఁ గొని యేగెద మం,తట దండమువలన నితఁడు ధన్యత నొందున్. 108

1. నళికపై (హ. తం. వా.) 2. నాకీర్ణ (క. బ.) 3. మాటు (హ. వా.) మాల (చ) 4. వెస (ద) 5. కామన్ సుగుణాభిరామ (హ) 6. ధామమున నటించె (హ) 7. జడుఁడై (హ) 8. బందుగులట్టి (హ) బందులబట్టి (ట. త. జ. బ.) 9. యాతములుగట్టి (జ) 10. సాధులకు (హ. తం. వా.) 11. సొంపెదఁగూర్చి (తం.వా.) 12. దాని (క. చ. బ.) 13. డగుటఁజేపి (హ) 14. నేమా, రటమున (హ)

అధ్యాయము — ౨

వ. ఇట్లు పలుకుచున్న యమదూతల వారించి, నయకోవిదు లైన భగవద్దూత లి ట్లనిరి. 109

క. అవురా! ధర్మవివేక, ప్రవరుల సభఁ గానఁబడియెఁ బాపము పుణ్యో
ద్భవుల నదండ్యుల దండన, వివరం బొనరింపఁబడియె విధి యెఱుఁగమిచేన్.

చ. సములును సాధులున్ విహితశాసనులున్ సుదయాళురున్ శుభో
త్తమ గుణులైన యట్టి తలిదండ్రులు బిడ్డల కెగ్గు సేయుచోఁ
గ్రమమున వార లెవ్వరికిఁ గైకొని కుయ్యిడఁ జాలువారు [1]సం
భ్రమమున మీ మనంబులఁ దిరంబుగఁ జర్చ యొనర్చి చూడుఁడా! 111

గీ. ఎఱుక గలుగు నాతఁ డేది యొనర్చిన
నదియ చేతు రితరు లైన వార
లతఁడు సత్య మిట్టి దనెనేని లోకంబు
తత్ప్రవర్తనమునఁ దగిలి యుండు. 112

గీ. నెమ్మిఁ దొడలమీఁద నిద్రించు చెలికాని
నమ్మఁదగినవాఁడు నయము విడిచి
ద్రోహబుద్ధిఁ జంపఁ దొడరునే? యెందైనఁ
బ్రీతి లేక ధర్మదూతలార! 113

గీ. చిత్తమెల్ల నిచ్చి చెలితనంబున వచ్చి
నచ్చి కలయ [2]మెచ్చి నమ్మువానిఁ
గరుణ గలుగువాఁడుఁ గడుసౌమ్యుఁ డగువాఁడుఁ
జింతసేయ కెట్లు సెఱుప నేర్చు. 114

వ. అదియునుం గాక. 115

ఉ. ఈతఁడు కోటిసంఖ్యలకు నెక్కుడు పుట్టువులందుఁ [3]జెంది యా
యాతము లైన పాప నివహంబుల నన్నిటిఁ బాఱఁ దోలెఁ బ్ర
ఖ్యాతమతిన్ మహామరణ కాలమునన్ హరిపుణ్యనామ సం
భూత సుధామయాద్భుత విభూతి కరాక్షర సంగ్రహంబునన్. 116

సీ. బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్నికీలలు హరినామ కీర్తనములు
గురుతల్ప కల్మష క్రూరసర్పములకుఁ గేకులు హరినామ కీర్తనములు
తపనీయ చౌర్య సంతమసంబునకు సూర్య కిరణముల్ హరినామ కీర్తనములు
మధుపాన కిల్బిష మదనాగ సమితికిఁ గేసరుల్ హరినామ కీర్తనములు

1. సంభ్రమగతి (క.చ.ద.) సంభ్రమమతి (ట) 2. నొచ్చి (హ) 3. బుట్టి (హ)

గీ. మహిత యోగోగ్ర [1]నిత్యసమాధి విధుల
నలరు బ్రహ్మాది సురులకు నందరాని
భూరి నిర్వాణసామ్రాజ్య భోగభాగ్య
ఖేలనంబులు హరినామ కీర్తనములు. 117

సీ. ముక్తికాంతైకాంత మోహన కృత్యముల్ కేలిమై హరినామ కీర్తనములు
సత్యలోకానంద సౌభాగ్యయుక్తముల్ కేలిమై హరినామ కీర్తనములు
మహిత నిర్వాణ సామ్రాజ్యాభిషిక్తముల్ కేలిమై హరినామ కీర్తనములు
బహుకాల జనిత తపఃఫల సారముల్ కేలిమై హరినామ కీర్తనములు

గీ. పుణ్యమూలంబు లనపాయ పోషకంబు
లభిమతార్థంబు లజ్ఞాన హరణ కరము
లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ
లార్తశుభములు హరినామ కీర్తనములు. 118

క. కామంబు పుణ్యమార్గ, స్థేమంబు మునీంద్ర సాంద్ర చేతస్సరసీ
ధామంబు జిష్ణు నిర్మల, నామంబుఁ దలంచువాఁడు నాథుఁడు గాఁడే? 119

క. దెందంబు పుత్రు వలనన్, జెందిన దని తలఁప వలదు [2]శ్రీపతిపే రే
చందమున నైనఁ బలికిన, నందకధరుఁ డందె కలఁడు నాథుం డగుచున్. 120

గీ. బిడ్డపేరుఁ బెట్టి పిలుచుట విశ్రామ
కేళి నైన మిగుల గేలి నైన
పద్య గద్య గీత భావార్థముల నైనఁ
గమలనయనుఁ దలఁపఁ గలుషహరము. 121

ఉ. కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట మహోజ్వరాదులం
బ్రేలినచోట సర్పముఖ పీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణు భవదూరునిఁ బేర్కొనిరేని మీఁద న
క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్. 122

సీ. అతిపాపములకుఁ బ్రయత్న పూర్వకముగఁ దనుపాపములకు మితంబుగాఁగ
సన్మని వరులచే [3]సంప్రోక్తమై యుండు నిర్మలం బగు పాప నిష్కృతములు
క్రమరూపమున నుపశమనంబు లగుఁ గాని [4]తత్క్షణంబున నవి దరువలేవు
సర్వకర్మంబుల సంహార మొనరించి చిత్తంబునకుఁ దత్త్వ సిద్ధి [5]నొసఁగు

1. మార్గ (క. చ. ట. త.) 2. రే, చందమున (ల) (బలుకఁ గలిగిన (క. చ. ట. జ. తం.)
3. సంపాద్య (హ.తం.వా) 4. తద్భయచయములఁ దఱుపలేవు (హ); తత్పాపచయములు దలఁపలేవు (హ. తం. వా.) 5. నెపుడు (హ)

గీ. [1]నాసర నీకు సేవ యోగిమానస సరో
వాసు సేవ [2]హేమవాసు సేవ
వేదవేద్యు సేవ, వేదాంత విభుసేవ
పరమపురుష పాదపద్మ సేవ. 123

క. హరి నెఱుఁగని యా బాలుఁడు, హరిభక్తులతోడఁ గూడి హరి యనువాఁడున్
సరి యై దోషము లడఁచును,గరువలితో నగ్ని తృణముఁ గాల్చిన భంగిన్.124

ఉ. అరయఁగ వీర్యవంత మగు నౌషధ మెట్లు యదృచ్ఛఁ గొన్నఁ ద
చ్చారు గుణంబు రోగములఁ జయ్యనఁ బాపినమాడ్కిఁ బుణ్య వి
స్ఫారుని నంబుజోదరునిఁ బామరుఁ డజ్ఞుఁ డవజ్ఞఁ బల్కినన్
వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే! 125

క. ధృతి తప్పిన తఱినిఁ బురా, కృతమునఁ గా కెట్లు దోఁచు గేశవుఁడు మదిన్
మితిలేని జగముఁ దాల్చిన, యతఁ డొక్కని మనములోన నణఁగెడు వాఁడే?

మ. నిరతం బై నిరవద్య మై నిఖిల చి న్నిర్మాణ మై నిత్య మై
నిరహంకార గుణాఢ్య మై నియమ మై నిర్దోష మైనట్టి శ్రీ
హరి నామస్మరణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా
మరణాంతంబున నిట్టి సజ్జనుని ధర్మం బేల వ్యర్థం బగున్? 127

వ. అని యిట్లు భగవద్దూతలు భాగవతధర్మంబు నిర్ణయించి, యీ యర్థంబున మీకు సంశయంబు గలదేని మీ రాజు నడుఁగుడు.పొండు.అని పలికి బ్రాహ్మణుని నతిఘోరం బైన యామ్యపాశ బంధ నిర్ముక్తునిం గావించి, మృత్యువువలని యెదరు వాపిరి. అంత నా యమదూతలు చేయునది లేక యమలోకంబునకుం జని, పితృపతికి సర్వంబును నెఱింగించిరి. అంత. 128

క. అతఁడును బాశచ్యుతుఁ డై, గతభయుఁ డై ప్రకృతి నొంది కడు నుత్సవసం
గతిఁ జూచి మ్రొక్కి మదిలో,నతులిత ముద మొదవి పొదలి హరిదాసులకున్.

తే. నిలిచి కేలు మొగిచి పలుక నుద్యోగించి
చెలఁగుచున్న లోని తలఁపుఁ దెలిసి
చక్రధరుని కూర్మిసహచరు లరిగి ర
దృశ్య లగుచు దేవదేవు కడకు. 130

క. వేదత్రయ సంపాద్యము, మోదంబు గుణాశ్రయంబు మును భగవ ద్ధ
ర్మాదేశం బగు త ద్భట, వాదంబు నజామిళుండు [3]వదలక వినుచున్. 131

1. నాసఁగునట్టి పుణ్యయోగ (హ) 2. రుచిర (క. ద.) 3. వారక (క. చ. బ.)

క. శ్రీమ న్నారాయణ పద, తామరస ధ్యానసలిల ధౌత మహాఘ
స్తోముం డై సద్భక్తికి, ధామం బగుచుండెఁ దెలిసి తత్క్షణమాత్రన్. 132

క. బరవసమున నరికట్టిన, దురితంబులఁ దలఁచి తలఁచి తుదిఁ దాపమునన్
హరి నీకు నాశ్రయింపుచుఁ బరితాపము నొంది పలికె బ్రాహ్మణుఁ డాత్మన్.

సీ. వృషలియం దనురాగ వృద్ధి బిడ్డలఁ గని కులము గోదావరిఁ గూలఁద్రోచి
రచ్చల కెక్కి పెన్ రజ్జునేఁతల సరివారిలోపలఁ దలవంపు చేసి
కట్టిఁడిముదుక నై కర్మబంధంబుల పుట్ట నై నిందల ప్రోవ నగుచుఁ
దరుణుల రోఁతలఁ [1]దవిలి భోగించిన కడిఁది నా జన్మంబు [2]గాలిపోయెఁ

తే. జదువు చట్టువడియె శాస్త్రంబు మన్న య్యె
బుద్ధి [3]పురువుమేసెఁ బుణ్య మణఁగె
నీతి [4]మట్టుపడియె నిర్మలజ్ఞానంబు
[5]మొదలి కుడిగె బోధ మూరిఁబోయె. 134

క. చిక్కని చక్కని చన్నుల, మక్కువయిల్లాలి విడిచి మాయలుగల యా
వెక్కసపు మద్యపానపు, డొక్కపసన్ దగిలి దుర్విటుఁడ నై చెడితిన్. 135

ఉ. అక్కట ! ఘోర దుష్కృత మహానలకీలలు నన్ను ముట్టి పే
రుక్కణఁగింప కిట్లు ధృతి నుండఁగ నిచ్చె నహో ! దురాత్మునిం
గ్రక్కునఁ దల్లిదండ్రుల నకల్మషచిత్తులఁ బెద్దలన్ మతే
దిక్కును లేనివారిఁ బెను [6]తీపులఁ బెట్టుచుఁ బాఱఁదోలితిన్. 136

క. అకృతజ్ఞుఁడ నై విడిచితిఁ, బ్రకృతిం గల బంధువులను [7]బాల్యమున ననున్
వికృతిఁ జనకుండఁ బెంచిన, సుకృతుల మజ్జనకవరుల శోభనకరులన్. 137

వ. అప్పుడు.

తే. పెక్కు పాతకముల భృశదారుణం బైన
దొడ్డ నరకమందుఁ బడ్డ నన్ను
నాపదలకుఁ బాపి యరికట్టి రక్షించి
రిట్టి ధర్మపురుషు లెందు వారొ ? 139

శా. చోద్యం బై కలవోలె నీ క్షణమునం జూడంగఁ బ్రత్యక్షమై
వేద్యం బయ్యెను నన్ను నీడ్చిన మహావీరుల్ భృశోదగ్రు లా
యుద్యోగంబులవారు పాశధరు లీ యుత్సాహముల్ మాని సం
పాద్యానేక వికారరూప కుటిల ప్రఖ్యాతు [8]లెం దేగిరో ? 140

1. ద్రవ్వి(క.చ.జ.)2. గాలిబోయె (ట జ.) 3. పూరి (ట.ద.)4. కట్టు (క.చ.త.జ.బ.)5. ముట్ట నుడిగె (క. వ.) 6. త్రిక్కుల (తం. వా.) 7. బాల్యమునను దు,ర్వికృతి (తం.త.)8. లెవ్వారలో (హ)

ఉ. దారుణ పాశబంధన విధానములన్ నరకార్ణవంబులోఁ
గూరినవాని నన్నుఁ జెడకుండ నొనర్చిన పుణ్యవంతు లం
భోరుహనేత్రు లుజ్జ్వల నభోమణితేజులు లోచనోత్సవుల్
చారు దయా [1]సమంచిత విచారులు నల్వురు నెందుఁ బోయిరో? 141

మ. నను రక్షించిన పుణ్యవంతులు కన న్నాళీకపత్రాక్షు లం
జనసంకాశులు శంఖచక్రధరు లాజానూరుబాహుల్ స్మితా
నను లాలంబిత కర్ణవేష్టన సువర్ణచ్ఛాయ దివ్యాంబరుల్
ఘన కారుణ్య రసైకపూర్ణులు సమగ్రస్ఫూర్తి [2]నెం దేగిరో? 142

వ. పాతకుండ నగు నాకు ని వ్విబుధోత్తమ దర్శనంబు పురాకృత మదీయ పుణ్య విశేషంబునం గాని పొంద శక్యంబు గాదు. త త్సందర్శనం బాత్మకు నతి సుప్రసన్నం బై యొప్పు. అట్లు గాకుండె నేనిఁ గలుషవర్తనంబుల వృషలీభర్త నై యుండి మృతిం బొందుచున్న నాదు జిహ్వకు శ్రీమన్నారాయణ నామ గ్రహణంబు సంభవింపనేరదు. మఱియును. 143

ఆ. పాతకుఁడను జడుఁడ బ్రహ్మఘాతకుఁడను
మాన లోభ మోహ మత్సరుండ
నాకు నెట్లు దొరకు? నారాయణుని దివ్య
నామ విమల కీర్తనంబు మదికి. 144

సీ. దారుణ మోహాంధకార పూరితుఁడను హరి విస్మయ స్మరణార్హ మతినె?
పంచ మహాతీవ్ర పాతకోపేతుఁడ హరి విస్మయ స్మరణార్హ మతినె?
కౌటిల్య కితవ వికార పారీణుండ హరి విస్మయ స్మరణార్హ మతినె?
అఖిల దుఃఖైక ఘోరార్ణవ మగ్నుండ హరి విస్మయ స్మరణార్హ మతినె?

తే. నిందలకు నెల్ల నెల వైన నిర్గుణుండ
మందభాగ్యుండ నే నెడ? మధువిదారి
దివ్య గుణనామ కీర్తన తెలుఁగ దేడ?
పూర్వ సుకృతంబు లే కెట్లు పొందఁ గలుగు? 145

వ. అని వితర్కించి, 146

మ. యత చిత్తేంద్రియ మారుతుండ నగుచున్ యత్నం బొనర్తున్ హరి
వ్రత సంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదావాసోన్ముఖాసక్తికిన్
యుత నిర్వాణ పదానురక్తికి సుఖోద్యోగ క్రియాశక్తికిన్
ధృతి లబ్ధోత్తమ [3]ముక్తికిన్ సకల ధాత్రీధుర్య సద్భక్తికిన్. 147

1. సమన్విత (క. చ. ట. త. బ.) 2. నెవ్వారలో (హ) 3. మూర్తికిన్ (హా.వా.ట.బ)

క. విడిచితి భవబంధంబుల నడఁచితి మాయావిమోహ మయిన తమంబు
న్నొడిచితి నరివర్గంబులఁ, గడచితి నా జన్మదుఃఖ కర్మార్ణవముఀ. 148

క. యోషి ద్రూపంబున నను, నేషణ ముఖగహ్వరమున నెగ్రమింగి కడుఀ
ద్వేషమునఁ గోఁతిఁ జేసిన, దోషద యగు నాత్మ మాయ తొలఁగం గంటిఀ.

వ. అని యిట్లు వైష్ణవ జ్ఞానదీపం బాత్మ స్నేహంబునం దోఁచిన బ్రాహ్మణుండు. 150

మ. భగవద్ధర్మ పరాయణో త్తముల సంభాషైక మంత్రంబులఀ
మిగులఀ జ్ఞానము పుట్ట మోహ భవ సమ్మిశ్రాత్మ బంధంబులఀ
దెగ ఖండించి సబంధు మిత్ర సుత పత్నీ మోహ విశ్రాంతుఁ డై
జగతీనాథు రమేశుఁ గృష్ణుని దయైశ్వర్యంబులం గోరుచుఀ. 151

క. హరిభక్తులతో మాటలు, ధర నెన్నఁడుఁ జెడని పుణ్యధనముల మూటల్
వర ముక్తికాంత తేటలు, నరిషడ్వర్గంబు చొరని [1]యరుదగు కోటల్. 152

సీ. అనుచు నా బ్రాహ్మణుం డతితత్త్వవేది యై భవబంధముల నెల్లఁ బాఱఁబోలి
మొనసి గంగాద్వారమున కేగి యచ్చటఁ బ్రబ్బిన దేవతాభవనమందు
నాసీనుఁ డై మోగ మాశ్రయించి [2]చెలంగు దేహేంద్రియాదుల తెరువువలనఁ
దనుఁ బాపుకొని పరతత్త్వంబుతోఁ గూర్చి మానుగా [3]యోగసమాధిచేత

ఆ. గుణగణంబుఁ బాసి కొమరొప్పిన భగవ
దనుభవాత్మయందు నాత్మఁ గలిపి
రమణఁ దన్ను మొదల రక్షించినట్టి యా
పురుషవరులఁ గాంచి పొసఁగ మ్రొక్కె. 152

వ. అట్లజామిళుండు యోగమార్గంబున దేహంబు విడిచి, పుణ్య శరీరుం డై యగ్ర భాగంబునం బ్రాగుపలబ్ధు లైన మహాపురుష కింకరుల గాంచి, సమంచిత రోమాంచిత చల చ్ఛటా పింజరిత స్వేదబిందు సందోహ మిష నిష్యంద మహా నందవల్లికా మతల్లికాంకుర సంకుల పరిశోభిత తనుండును, హర్ష నికర్ష మాణ మానసోద్యోగ యోగప్రభావోత్సాహ విస్మయ మందస్మిత ముఖారవింద కందళితుండును, [4]నిఖిల జగజ్జేగీయమానాఖండ శుభప్రద శుభాకార సందర్శన సమాసాదిత కుతూహల మానసుండును నై, ప్రణామంబు లాచరించుచు భాగీరథీ తీరంబునఁ గళేబరంబు విడిచి, తత్క్షణంబున హరిపార్శ్వవర్తను లైన దాసవరుల స్వరూపంబుఁ దాల్చి, యా విష్ణుసేవకులతోఁ గూడి (దివ్య మణి

1. అరుగుల (హ. ట. బ.) 2. వెలుంగు (హ) 3. నాత్మ (హ) 4. లోచనోత్సవ కరాకార సందర్శమాన ధౌరేయుండును (క)

ఉ. నీ విభవంబు లీ జగము నిండుట యుండుట నాశ మొందుటల్
నీ విమలాంశజాలములు నెమ్మి జగంబు సృజించువార లో
దేవ ! భవద్గుణాంబుధుల తీరముఁ గానక యీశ ! బుద్ధితో
వావిరిఁ జర్చ సేయుదురు వారికి వారలు దొడ్డవారలై. 472

క. పరమాణువు మొదలుగఁ గొని, పరమము తుది గాఁగ మధ్య పరికీర్తనచే
స్థిరుఁడవు [1]త్రయీవిదుఁడవై, [2]సరి సత్త్వా ద్యంత మధ్య సద్భ్రవగతివై. 473

తే. ఉర్వి మొదలగు నేడు నొండొంటికంటె
[3]దశగుణాధికమై యుండు దాని నండ
[4]కోశమందు రజాండంబు కోటు లెవని
యందు నణుమాత్ర మగు ! ననంతాఖ్యుఁ డతఁడు. 474

వ. మఱియు నొకనొకచోట విషయతృష్ణాపరులైన నరపశువులు పరతత్త్వంబవైన నిన్ను మాని, యైశ్వర్యకాములై తక్కిన దేవతలం భజియించుదురు. వా రిచ్చు సంపదలు రాజకులంబునుం బోలె వారలం గూడి నాశంబునం బొందుచుండు. విషయకాములైనను నిన్ను సేవించినవారు, వేఁచిన విత్తనంబునుం బోలె, దేహాంతరోత్పత్తి వొందకుండుదురు.*(నిర్గుణుండవై జ్ఞానవిజ్ఞానరూపంబు నొందియున్న నిన్ను గుణసమేతునిఁగా నజ్ఞానులు భావించుదురు.)నీ భజనం బే రూపున నైన మోక్షంబు ప్రసాదించు. జితమతివైన నీవు భాగవతధర్మం బే ప్రకారంబున నిర్ణయించితి, వా ప్రకారంబున సర్వోత్కృష్టుండవైన నిన్ను సనత్కుమారాదులు మోక్షంబుకొఱకు సేవింపుచున్నారు. ఈ భాగవతధర్మంబు నందు జ్ఞానహీనుం డొకండును లేఁడు. అన్య కామ్యధర్మంబులందు విషమబుద్ధి చేత నేను, నాకు, నీకు, నని [5]వచియింపుచున్నవాఁ డధర్మనిరతుండై క్షయింపుచుండు. స్థావర జంగమ ప్రాణిసమూహంబునందు సమంబైన భాగవత ధర్మంబుల వర్తింపుచున్న మనుజునికి భవద్దర్శనంబు వలనఁ బాపంబు క్షయించుట యేమి చిత్రంబు ? ఇపుడు భవత్పాదావలోకనంబున నిరస్తాశయమలుండనైతి. మూఢుండనైన నాకుఁ బూర్వకాలంబున నారదుం డనుగ్రహించి, భగవద్ధర్మంబు దయసేసె. అది నేఁడు నాకు వరదుండవైన నీ కతంబున దృష్టం బయ్యె. ఖద్యోతంబులచేత సూర్యుండు గోచరుండు గాని మాడ్కి, జగదాత్మకుండవైన నీ మహత్త్వంబు మనుజులచేత నాచరింపఁబడి, ప్రసిద్ధంబైనది కాదు.

1. త్రిగుణహరుండవు (హ) 2. సరసత్త్వాద్యంత మధ్య సర్వసుగతివై(హ) సరి... మధ్య సదృశ గతుఁడవై (వా) 3. దశగుణాధిక్య మయ్యుండు దాననంద (హ) 4. నాశమొందెడు నాయంశ కోటులెన్న (హ) * తా. ప. ప్రతులలో లేదు. 5. రచియింపబడుచున్న (ట.త.)

ఉత్పత్తి స్థితి లయకారుఁడ వై భగవంతుండ వైన నీకు నమస్కరించెద. అని మఱియును. 475

తే. అరయ బ్రహ్మాదు లెవ్వని ననునయించి
భక్తియుక్తుల [1]మనమునఁ బ్రస్తుతింతు
రవని యెవ్వని తలమీఁద నావగింజఁ
బోలు నా వేయిశిరముల భోగిఁ గొల్తు. 476

క. ఈ విధమున వినుతింపఁగ, నా విద్యాధరుల భర్త కనియె ననంతుం
డో విమలబుద్ధి! నీదగు, ధీ విభవంబునకు మెచ్చితిం బ్రియమారన్. 477

ఆ. అరయ నారదుండు నంగిరసుండును
తత్త్వ మొసఁగినారు దానికతన
నన్నుఁ జూడఁ గలిగె నాభక్తి మదిఁ గల్గె
నాపథంబు నీకు నమ్మఁ గలిగె. 478

సీ. పూని నా రూపంబు భూతజాలంబులు [2]భూతభావనుఁ డని పొందుపడఁగ
బ్రహ్మంబు మఱియు శబ్ద బ్రహ్మమును శాశ్వతం బైన తనువులు దగిలె నాకు
నఖిల లోకంబులు ననుగతం బై యుండు లోకంబు నాయందు జోకఁజెందు
నుభయంబు నాయందు నభిగతం బై యుండు [3]నభిలీనమగుదు నయ్యుభయమందు

తే. వెలయ నిద్రించువాఁ డాత్మ విశ్వమెల్లఁ
జూచి మేల్కాంచి తానొక్క చోటువాని
గా వివేకించుమాడ్కి నీ [4]జీవుఁ డీశు
మాయ దిగనాడి పరమ ధర్మంబుఁ దెలియు. 479

ఆ. నిద్ర వోవు వేళ నిరతుఁడై దేహి తా
నెట్టి గుణముచేత నింద్రియములఁ
గడచినట్టి సుఖముఁ గను నట్టి బ్రహ్మంబుఁ
గడిమిమెఱయ నన్నుఁగా నెఱుంగు. 480

తే. స్వప్నమందు నెట్లు సంచార మొనరించు
మేలుకాంచి దృష్ట [5]మెల్ల నెఱుఁగు
నుభయ మెఱుఁగు నట్టి యుత్తమజ్ఞానంబు
తత్త్వ మట్టి దైన తలఁపు నేను. 481

1. భయమున (క. బ.) 2. భూతపావనుఁడని (హ) 3. నది లీనమయ్యె (హ) 4. జీవితేశ (తం. వా.) జీవదేశ (వా) 5. మోలి (తం. వా.)

సీ. అరయంగ నెవ్వని కలవి గానట్టి యీ సలలిత మానుషజాతిఁ బుట్టి
యాత్మతత్త్వజ్ఞాన హేతుఁ డైనవానికిఁ గలుగునే? యందు సుఖం బొకింత
వెలయఁ బ్రవృత్తి నివృత్తి మార్గంబుల సుఖమును దుఃఖంబు సొరిదిఁ దెలిసి
పనిచెడి సంకల్ప ఫలమూలమునఁ బాటి కడు సుఖదుఃఖ మోక్షములకొఱకు

ఆ. †దంపతి క్రియామతంబు దగిలి వర్తింతురు
దాన మోక్ష మేల దక్కియుండు?
నఖిల దుఃఖహేతు వైన యీ కర్మంబు
నెఱిఁగి నన్నుఁ [1]దలఁప రిచ్చలోన. 482

వ. మఱియు విజ్ఞానాభినూను లైన మనుష్యులకు నతిసూక్ష్మం బైన *యాత్మ గతిని స్థానత్రయ విలక్షణం బైన చతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మిక విషయంబులచేతను, వివేకబలంబుచేతను, నిర్ముక్తుం డై, జ్ఞాన విజ్ఞాన సంతృప్తుం డైన పురుషుండు నా భక్తుం డగు. ఈ విధంబు గలవారలు, యోగ నైపుణ బుద్ధి గలవారలు నై, స్వార్థం బైన యాత్మచేతం బరమాత్మను దెలియుచుందురు. నీవు నీ క్రమంబున మద్భక్తి శ్రద్ధాపరుండ వై విజ్ఞానసంపన్నం బైన వాక్కులచేత నన్ను స్తోత్రంబు చేసి ముక్తుండ వైతివి. అని, యా శేష భగవంతుండు విద్యాధరపతి యైన చిత్రకేతుం బలికి, యతని కదృశ్యుం డై

అధ్యాయము - ౧౭

పోయె. ఏదిక్కున సర్వాత్మకుం డైన యనంతుం డంతర్ధానంబు నొందె, నా దిక్కునకు విద్యాధరభర్త నమస్కరించి, గగనచరుండై చని, లక్షల సంఖ్య లైన దివ్యవర్షంబు లవ్యాహత బలేంద్రియుం డై, పరమ [2]యోగి పురుషులను దివ్యమునీంద్ర సిద్ధ చారణ గంధర్వులను, [3]వినుతి సేయం గుల శైల ద్రోణులను, రమ్య ప్రదేశంబులను, సకల సిద్ధ ప్రదేశంబులను, వినోదింపుచు, శ్రీ నారాయణ దత్తం బగు దివ్యవిమానంబునందుఁ జరియింపుచు నుండె. 483

శా. ఆడించుం హరి దివ్యనాటక గుణవ్యాపార నృత్యంబులం
బాడించుం జలజాతనేత్ర బిరుద ప్రఖ్యాత గీతంబులం
గూడించుం సతతంబు జిహ్వల తుదిం గోవింద నామావళుల్
క్రీడం గిన్నర యక్షకామినులచేఁ గృష్ణార్పిత స్వాంతుఁ డై. 484

† "కుర్వాతే దంపతీ క్రియాః" (16-60) 1. వదల రిచ్చలోన (చ. బ.) * "ఆత్మనశ్చ గతిం సూక్ష్మాం స్థానత్రయ విలక్షణామ్" (తురీయామ్) 16-61. ఆత్మగతి నిజస్థాన త్రయలక్షణంబునఁ జతుర్థాంశంబు నెఱింగి (తం. వా.) 2. యోగీంద్ర పురుషులను (హ) 3. వినుతిసేయంగుల శైల ద్రోణులను (హ) కులద్రోణాది శైలంబులను (తం. వా.); "కులాచలేంద్ర ద్రోణీషు" (17-3)

సీ. వాసించు నాత్మలో వైష్ణవజ్ఞానంబు నాశించు భాగవతార్చనంబు
భూషించు నేఁ బ్రొద్దుఁ బుండరీకాక్షుని భాషించు హరికథాప్రౌఢి మెఱసి
ఘోషించు హరినామ గుణనికాయంబులు పోషించు పరతత్త్వబోధ మరసి
సేవించు శ్రీకృష్ణ సేవకనికరంబు సుఖమునఁ జేయు నీపనకు బలులు

తే. పాడుఁ బాడించు వైకుంఠభర్తనటన
రూపవర్తన గుణనామ దీపితోరు
గీతజాత ప్రబంధ సంగీత విధులఁ
గేశవప్రీతిగాఁ జిత్రకేతుఁ డెపుడు. 485

విద్యాధరాధిపతి యగు చిత్రకేతుం డీశ్వరధిక్కారంబున గౌరిచే శాప మొందుట.

మ. హరిఁ గీర్తింపుచు నల్లనల్ల మదిలో నబ్జాక్షు [1]సేవింపుచుం
బరమానందము నొందుచుణ్ జగములణ్ బ్రఖ్యాతి వర్తింపుచుణ్
సురరాజోపమమూర్తి యక్షగణముల్ సొంపార విద్యాధరా
ప్సరసల్ గొల్వఁగఁ బాడఁగా సితగిరి ప్రాంతంబున న్నేగుచుణ్, 486

శా. ఆ విద్యాధరభర్త గాంచె హర నీహారామృతాహాసముణ్
శ్రీవిభ్రాజితముణ్ నిరస్త గిరిజా సేవాగతాయాసముణ్
దేవానీకవికాసముణ్ శుభ మహాదేవాంఘ్రి సంవాసముణ్
భూ విఖ్యాత విలాసముం ద్రిభువనీభూతంబుఁ గైలాసముణ్. 487

క. ఆ రజతభూధరంబున, నీరేజభవామరాది నికరము గొల్వణ్
పేరోలగమున నుండిన, గౌరీయుతుఁ డైన హరునిఁ గనియె నరేంద్రా! 488

సీ. †తన నిజరూప మింతం తని తెలియక వాదంబు [2]సేసెడి వేదరవము
గరుణావలోకనా కాంక్షితు లై యున్న బ్రహ్మాది సనక [3]సత్ప్రణుతి రవము
సార శివానంద సల్లాపముల నొప్పు ప్రమథగణాళి యార్భటరవంబు
డమరు మృదంగాది ధమధమ ధ్వనితోడి పటు భృంగి నాట్య విస్ఫార రవము

తే. మానుగాఁ జామరలు వీచు మాతృకాది
కామినీజన మహిత కంకణ రవంబు
మెండుఁ జెలఁగంగఁ గన్నులపండు వయ్యెఁ
గొండరా చూలి పెనిమిటి నిండు కొల్వు. 489

1. నీక్షింపుచుణ్ (త) † 'తనదగు' అనుట యుచితము 2. సేసెడు (తం.) 3. సంప్రణుతి రవము (తం. వా.)

వ. ఇట్లు బ్రహ్మాది సురనికర సేవితుం డై యూరుపీఠంబున నున్న భవానిఁ గౌఁగిటం జేర్చుకొని, యొడ్డోలగంబున నున్న పరమేశ్వరుం జూచి, చిత్రకేతుండు పకపక నగి య ద్దేవి వినుచుండ ని ట్లనియె. 490

సీ. కామ రొప్పంగా లోకగురుఁడును గడలేని ధర్మస్వరూపంబుఁ దాన యగుచు
జడలు ధరియించియు సరిలేని తపమునఁ బొడ వైన యీ యోగిపుంగవులును
బ్రహ్మవాదులుఁ గొల్వ భాసిల్లు కొల్వులో మిథునరూపంబున మెలఁత తోడఁ
బ్రాకృతుండును బోలె బద్ధానురాగుఁ డై లాలితుం డయ్యె [1]నిర్లజ్జత నిట

ఆ. నకట! ప్రకృతిపురుషుఁ డై నఁ దా నేకాంత
[2]మందు సతులతోడ నలరుఁ గాని
యిట్లు ధర్మసభల నింతులతోఁ గూడి
పరిభవింపఁ [3]దగదు భ్రాంతి నొంది. 491

క. అన విని సర్వేశ్వరుఁ డా, తని నేమియు ననక నవ్వెఁ ద త్సభవారుం
గనుఁగొని యూరక యుండిరి, మనుజేశ్వర! యీశు ధైర్యమహి మెట్టిదియో!

వ. ఇట్లు తన పూర్వకర్మవిశేషంబున నింద్రియజయుండ నని పుట్టిన యహంకారంబున జగద్గురువుఁ బెక్కు ప్రల్లదంబు లాడుచున్న చిత్రకేతుఁ జూచి, భవాని యి ట్లనియె. 493

క. మముబోఁటి లజ్జ లుడిగిన, కుమతులకుం గ ర్త యగుచుఁ గోపింపంగా
నమితాజ్ఞా నిపుణుఁ డగు, శమనుండా? నేఁడు వీఁడు జగముల కెల్లన్. 494

క. భృగు నారద కపిలాదులు, నిగమాంతజ్ఞులును యోగనిర్ణయ నిపుణుల్
త్రిగుణాతీతు మహేశ్వరు, నగ రెన్నఁడు వారు ధర్మనయ మెఱుఁగరొకో? 495

సీ. ఎవ్వని పదపద్మ మింద్రాది విబుధుల చూడాగ్ర పంక్తుల నీడ చూచు
నెవ్వని త త్త్వం బ దెనయంగ బ్రహ్మాది యోగి మానసపంక్తి నోలలాడు
నెవ్వని రూపంబు నేర్పాటు గానక వేదంబు లందంద వాద మడుచు
నెవ్వని కారుణ్య మీ లోకముల నెల్ల దనిపి యెంతయు ధన్యతముఁ జేయు

తే. నట్టి సర్వేశు పాపసంహారు ధీరు
శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు
నెగ్గు వల్కిన పాపాత్ముఁ డెల్లభంగి
దండనార్హుండు గా కెట్లు తలఁగఁ గలఁడు? 496

1. నిర్లజ్జతోడ (హ) 2. సీమసతులతోడ జెలగుగాక (క. చ. ట. డ. ద. బ.) 3. వలదు (హ) లేఁడు (తం. వా.)

**తే.** నిఖిల లోకాశ్రయంబు సన్నిహిత సుఖము
సకల భద్రైక మూలంబు సాధుసేవ్య
మైన కంజాక్షు పాదపద్మార్చనంబు
ననుచరింపంగ ఖలుఁడు వీఁ డర్హుఁ డగునె? 497

**వ.** కావున నోరి దురాత్మక! యీ పాపంబునం బాపస్వరూపం బైన రాక్షస యోనిం బుట్టుము. అని శపియించి, యింతనుండి మహాత్ములకు నవజ్ఞ సేయకుము. అని పల్కినఁ, జిత్రకేతుండు విమానంబు డిగ్గివచ్చి, యద్దేవికిం దండప్రణామంబు లాచరించి, కరకమలంబులు దోయిలించి, యిట్లనియె. ఓ జగన్మాత! భవచ్ఛాపవాక్యంబు లట్ల కైకొంటి. ప్రాచీన కర్మంబులం బ్రాప్తం బైన సంసార చక్రంబుచేత నజ్ఞాన మోహితు లై తిరుగుచున్న జంతువులకు సుఖదుఃఖంబులు నైజంబు లై ప్రవర్తిల్లుచుండు. ఇందులకుఁ బరతంత్రు లైనవా రాత్మ సుఖదుఃఖంబులకు నెవ్వరు కర్తలు? ఈ గుణంబుల నిమిత్త మై శాపానుగ్రహంబులును, స్వర్గనరకంబులును, సుఖదుఃఖంబులును, సమంబులు. భగవంతుం డొక్కండు దనమాయచేత జగంబులు సృజియింపుచుండు. వారివారికి [1]బద్ధానురాగంబులు గలుగఁ జేయుచుఁ, దాను వానికి లోనుగాక [2]నిష్కళుం డై యుండు. ఈ విధంబునఁ బుట్టుచున్న నరునకుం బత్ని బంధు శత్రు మిత్రోదాసీనంబు లెక్కడివి? వారివారి కర్మవశంబునం బరమేశ్వరుండు కల్పించుచుండు. సర్వసముం డై యుండు న ప్పరమేశ్వరునకు సుఖదుఃఖంబులచేత రాగంబు లేదు. రాగానుబంధం బైన రోషంబును లేదు. అతని మాయాగుణ విసర్గంబు జంతువులకు సుఖదుఃఖంబులను, బంధమోక్షంబులం గల్పించుచుండు. కావున నీకు నమస్కరింపుచున్న నన్ను ననుగ్రహింపుము. శాపభయ శంకితుండం గాను. జగన్మాత వైన నిన్నుఁ బలికిన దోషంబునకు శంకింపుచున్న వాఁడ. అని దండప్రణామంబు లాచరించి, పార్వతీపరమేశ్వరులం బ్రసన్నులం జేసి, తన విమానం బెక్కి చనియె. అప్పుడు పరమేశ్వరుండు బ్రహ్మాది దేవర్షి దైత్య దానవ ప్రమథ గణంబులు వినుచుండఁ బార్వతికి ని ట్లనియె. నీకు నిప్పుడు దృష్టం బయ్యెం గదా నారాయణ దాస దాసానుచరుల నిస్పృహభావంబు! హరితుల్యార్థదర్శను లై నిస్పృహు లైన భాగవతులకు స్వర్గాపవర్గ నరక భేదభావంబులు లేవు. ప్రాణులకు దేహ సంయోగంబువలన నారాయణలీలం జేసి యుండి ద్వంద్వాది సుఖదుఃఖంబు లాత్మయందు నజ్ఞానంబునం భేదంబు సేయంబడియె.

1. బంధాదిరాగంబులు (తం. వా.) "బంధంచ మోక్షంచ" (18-22) 2. నిష్కర్ముండై యుండు (హ); నిష్కళంకుండై యుండు (తం) మూ. "నిష్కళః" (18-22)

ఇట్టి విపర్యయంబులు భగవంతుం డైన వాసుదేవుని భక్తిగలవారిం జెందవు. మఱియును, 498

ఉ. నేనుఁ గుమార నారదులు నీరజగర్భుఁడు దేవసంఘముల్
మానిత యోగివర్య ముని[1]మండలి మున్నగు వార మెల్ల నా
దానవ విద్విదండ † జనితంబుల మయ్యుఁ దదీయ తత్త్వముం
గానఁగనేర మీశ ఘనగర్వమునం దలపోసి చూచుచున్. 499

క. అతనికినిఁ బ్రియుఁ డప్రియుఁ, డేతెఱఁగున లేఁడు నఖిల మెల్లను దా నై
భూతముల కాత్మ యగుటయు, భూతప్రియుఁ డొక్క డాదిపురుషుఁడు తన్వీ !

ఆ. అరయఁ జిత్రకేతుఁ డతిశాంతుఁ డతిలోక
సముఁడు విష్ణుభక్తి సంగతుండు
నితని నేమిచెప్ప ? నీకుండ నగు నేను
నువిద యచ్యుతప్రియుండఁ జుమ్మి ! 501

క. కావున భగవద్భక్తుల, భావమునకు విస్మయంబు పనిలేదు మహా
ధీవిభవ శాంతచిత్తులు, పావన పరతత్త్వ నిపుణ భవ్యులు వారల్. 502

వ. అనిన విని యద్రినందన విస్మయంబు మాని, శాంతచిత్త యయ్యె. అట్లు పరమ భాగవతుం డైన చిత్రకేతుం డద్దేవికిం బ్రతిశాపం బియ్య సమర్థుం డయ్యును, మరల శపింపక యతి శాంతరూపంబునఁ దచ్ఛాపంబు శిరంబున ధరియించె. ఇట్లు సాధులక్షణంబులు నారాయణపరాయణు లైన వారలకుంగాక యొరులకుం గలుగనేర్చునే ? ఇపుడు శాపహతుం డైన చిత్రకేతుండు త్వష్ట నేయు యజ్ఞంబున దక్షిణాగ్నియందు దానవయోనిం బుట్టి, వృత్రాసురుం డన విఖ్యాతుం డై భగవద్ జ్ఞానపరిణతుం డయ్యె. కావున, 503

సీ. నరనాథ ! యీ వృత్రునకు రాక్షసాకృతి గలిగిన యీ పూర్వకారణంబు
చిరపుణ్యుఁ డై నట్టి చిత్రకేతు మహానుభావంబు భక్తితోఁ బరఁగ విన్నఁ
జదివిన వారికి సకల దుష్కర్మముల్ శిథిలంబు లగుచును జెదరిపోవు
సకల వైభవములు సమకూరుఁ దమయంత తొల్కాడు కోర్కులతోడఁ గూడి

ఆ. నిర్మలాత్మ లగుచు నిత్య సత్య జ్ఞాన
నిరతు లగుచు విగత దురితు లగుచు
బంధు మిత్ర పుత్ర పౌత్రాదులను గూడి
యనుభవింపుచుందు రధిక [2]ఫలము. 504

---

1. మండల మిట్లగు (హ) † జనితాత్మలమయ్యు (కొన్ని వ్రా. ప్ర.) 2. సుఖము (తం.వా.)

## అధ్యాయము - ౧౮

### —: సవితృవంశాది ప్రవచనకథ :—

సీ. వినవయ్య! నరనాథ! విశదంబుగాఁ ద్వష్టృ వంశంబు సెప్పితి వాని వెనుక
*సవితృండు పృశ్నియు సావిత్రి వ్యాహృతి యను భార్యలందు నింపారు వేడ్క
నగ్నిహోత్రంబుల నరయంగఁ బశు సోమ పంచయజ్ఞంబులఁ బరఁగఁ గనియె
భగుఁడు సిద్ధిక యను భార్యకు [1]మహిమానుఁ బ్రభువును విభునిఁ దాఁ బడసె
ముపురఁ

తే. దనయ నొకతెఁ గాంచెఁ ద దనంతరమున నా
తరళనేత్ర [2]సద్వ్రతైకధామ
పుణ్యశీల సుగుణపూరిత చారిత్ర
యఖిలలోక పూజ్య యాశిషాఖ్య. 505

వ. మఱియు ధాతకుఁ † (గల కుహూ సినీవాలీ రా కానుమతు లనియెడు నలువురు భార్యలలోఁ గుహూదేవి) సాయ మను సుతునిఁ గాంచె. సినీవాలి దర్శాఖ్యునిఁ బడసె. రాక ప్రాతరాఖ్యునిఁ గాంచె. అనుమతి పూర్ణిమాఖ్యునిఁ గనె. విధాత క్రియ యను భార్యయందు నగ్ని పురీష్యాదులం గనియె. వరుణునకు జర్షణి యను భార్యయందుఁ బూర్వకాలంబున బ్రహ్మపుత్రుం డైన భృగువును, వల్మీకంబునం జనించిన వాల్మీకియు నుదయించిరి. మిత్రావరుణులకు నూర్వశి సన్నిధియందు రేతఉద్గమం బైన,నదియుఁ గుంభంబునం బ్రవేశింపఁజేయ, నందు నగస్త్యుండును,వసిష్ఠుండును జనియించిరి. ప్రత్యేకంబ మిత్రునకు రేవతియందు నుత్సర్గసంభవు లైన యరిష్టయు,పిప్పలుండు ననువారలు జనియించిరి. శక్రునకు పౌలోమియందు జయంత, ఋషభ, విదుషు లన ముగ్గురు పుట్టిరి. వామనుం డైన యురుక్రమదేవునకుఁ గీర్తి యను భార్యయందు బృహచ్ఛ్లోకుండు పుట్టె. ఆ బృహచ్ఛ్లోకునకు సౌభగాదులు పుట్టిరి.మఱియు మహానుభావుం డైన కశ్యప ప్రజాపతికి నదితియందు శ్రీనారాయణుం డవతరించిన ప్రకారంబు వెనుక వివరించెద.దితిసుతు లైన దైతేయుల వంశంబు సెప్పెద. ఆ దైతేయవంశమం

*"పృశ్నిస్తు పత్నీ సవితుః సావిత్రీం వ్యాహృతి త్రయం అగ్నిహోత్రం పశుం సోమ చాతుర్మాస్యాఀ మహామఖాన్." (18-1) 1. మహిమానుభావుల విభవులఁ దాఁబడసె (హ. తం. వా.); మహిమాను ప్రభవ విభవ (ట) "మహిమానం విభుం ప్రభుమ్" అని మూలము (18-2). మూలము ననుసరించియు 'ట' పాఠమును బట్టియు పూర్వపాఠము సవరింపఁ బడినది. 2. సద్వ్రత స్వధామ (తం.వా.)
† తా. ప. ప్రతులలో లేదు.

దైనను ప్రహ్లాదబలులు పరమభాగవతులై, దైత్య దానవ వందితులై వెలసిరి. దితి కొడుకులు హిరణ్యకశిపు, హిరణ్యాక్షు లనఁ బ్రసిద్ధి నొందిరి. అందు హిరణ్యకశిపునకు జంభాసుర తనయ యైన దత్తకుఁ బ్రహ్లాద, అనుహ్లాద, సంహ్లాద, హ్లాదులను నలుగురు కొడుకులును, సింహికయను కన్యకయుం జన్మించిరి. ఆ సింహికకు రాహువు జనియించె. ఆ రాహువు శిరం బమృతపానంబు సేయ హరి దన చక్రంబునం ద్రుంచె. సంహ్లాదునకు గతి యను భార్యయందు పంచజనుండు పుట్టె. హ్లాదునకు దమని యను భార్యయందు వాతాపీల్వలులు పుట్టిరి. వారల నగస్త్యుండు భక్షించె. అనుహ్లాదునకు సూర్మ్యి యను భార్యయందు బాష్కల, మహిషులు గలిగిరి. ప్రహ్లాదునకు దేవి యను భార్యయందు విరోచనుండు పుట్టె. అతనికి బలి జన్మించె. ఆ బలికి నశన యను భార్యయందు బాణుండు జ్యేష్ఠుండుగా నూర్గురు కొడుకులు పుట్టిరి. ఆ బలిప్రభావంబు వెనుక వివరించెద. బాణాసురుండు పరమేశ్వరు నారాధించి, ప్రమథగణంబులకు ముఖ్యుం డయ్యె. మఱియు నా దితిసంతానంబు లగు మరుత్తు లేకోన పంచాశ త్సంఖ్యగలవార లందఱు ననపత్యులై యింద్రుతోఁగూడి, దేవత్వంబు నొందిరి. అనిన విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 506

ఆ. ఏమి కారణమున నింద్రున కీ మరు
[1]చ్చయము లాప్తు లగుచు శాంతి నొంది?
రరయఁ ద త్సమాను లగుచు వర్తించిరి?
దీని వినఁగవలయుఁ దెలుపవయ్య! 507

వ. అనిన శుకుం డి ట్లనియె. 508

సీ. నరనాథ! విను తన నందను లందఱు నమరేంద్రుచే హతు లగుచునుండఁ
గోప శోకంబులఁ గ్రుళ్ళుచుఁ దనలోన మండుచు దితి చాల మఱుఁగఁదొడఁగె
భ్రాతృ[2]హంతకు నతిపాతకు నింద్రునిఁ జంపక నా కేల సొంపుగలుఁగు?
వీని భస్మము సేయువానిఁ గా నొక సుతుఁ బడసెద నని చాల భర్తఁ గోరి

ఆ. ప్రియము సేయఁ దొడఁగెఁ బెక్కు భావంబుల
భాషణముల నధిక పోషణముల
భక్తియుక్తిచేతఁ బరిచర్య గతిచేత
నుతులచేత నతుల రతులచేత. 509

1. చయము లాప్తమగుచు శాంతినొంది యరయఁ దత్సమాన మగుచు వర్తించెను (తం)
2. ఘాతుకు (వా)

చ. కలికి కటాక్ష వీక్షణ వికారములన్ హృదయానురాగ సం
కలిత విశేష వాఙ్మధుర గర్జనలన్ లలితాననేందుమం
డల పరిశోభితామృత విడంబిత సస్మిత సుప్రసన్నతా
ఫల రుచిర ప్రదానముల భామిని భర్తమనంబు లోఁగొనెన్. 510

తే. అఖిల మెఱిఁగిన కశ్యపు నంతవాని
హితవు తలకెక్కు రతుల సంగతులచేత
నవశుఁ గావించె ప్రేల్మిడి నబ్జవదన
పతుల భ్రమియింపనేరని సతులు గలరె? 511

క. ఏతలఁ బెఱుఁగక [1]నిలిచిన, భూతంబులఁ జూచి [2]ధాత పురుషుల మనముల్
[3]ప్రీతి గొలుపంగ యువతీ, వ్రాతంబు సృజించెఁ బతులు వారల కరుదే? 512

వ. ఇట్లు నిజసతిచేత నుపలాలితుం డైన కశ్యపప్రజాపతి, యా సతికిం బరమప్రీతుం డై యి ట్లనియె. ఓ తన్వీ! నీకుఁ బ్రసన్నుండ నైతి. వరంబు గోరుము. ఇచ్చెద. నాథుండు ప్రసన్నుం డైన స్త్రీలకుం గోరిక సంభవించుట కేమి గొఱంత? సతికిం బతియె దైవంబు. సర్వభూతంబుల మానసంబులకు వాసుదేవుండె భర్త. నామ రూప కల్పితు లైన సకల దేవతామూర్తులచేతం, బురుషులచేతను భర్తృ రూపధరుం డైన భగవంతుండు సేవింపఁబడుచుండు. విశేషించి స్త్రీలచేతఁ బతిరూపంబున భజియింపఁబడుచుండు. కావునఁ బతివ్రత లైన సుందరులు శ్రేయస్కామ లై యేకచిత్తంబున నాత్మేశ్వరుం డైన యప్పరమేశ్వరుని భర్తృభావంబున సేవింపుచుండుదురు. ఏనును నీ కీ భావంబున వరదుండ నైతి. దుశ్శీల లైన వనితలకుం బొందరాని వరంబు నీ కిచ్చెద. వేఁడుము. అనిన కశ్యపునకు దితి యి ట్లనియె. 513

ఆ. వరము గోర నాకు వరదుండ వేనియు
నింద్రుఁ ద్రుంచునట్టి యిద్ధబలుని
నమితతేజుఁ దనయు నమరత్వ సంప్రాప్తు
నెందుఁ జెడనివాని నిమ్ము నాథ! 514

అ. అనవుడు. 515

క. ఉట్టిపడునట్టి వర మీ, కట్టిఁడి న న్నెట్టు వేఁడెఁ! గటకట! యనుచున్
మిట్టిపడి యతఁడు మదిలోఁ, బుట్టిన తల్లడముతోడఁ బొక్కుచు నుండెన్. 515

1. నిలిచెను (హ) 2. యాత్మ (హ) 3. భీతి (తం.వా.) 'పీతి' అను సవరణ 'యయా పుంసాం మతి ర్హృతా' అను మూలము ననుసరించి. (18. 30.)

చ. ప్రకృతినిఁ గర్మపాశముల బద్ధుఁడ నైతిఁ గదయ్య! నేఁడు నీ
వికట సతీస్వరూపమున వేఁదుఱు గొల్పిన మాయ నింద్రియా
ధికమతి యైనవాఁడు దన పెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పా
తకములఁ గూలకున్నె! నను దైవము నవ్వదె? లోలితాత్మనిన్. 517

సీ. ఖండశర్కరతోడఁ గలహించు పలుకులు పద్మవిలాస మేర్పఱుచు మోము
తుహినాంశు కళలతోఁ దులఁదూఁగు చెయ్వులు చెమటఁ గ్రొన్నెత్తురు
నేయు మేను
నిలు వెల్లఁ గరఁగించు నేర్పుల యింపులు పువ్వుల కరుదైన ప్రోదిసేఁత
తమకంబు పుట్టించు తరితీపు తలఁపులు నెనసిన మదిలోని యిచ్చగింత

ఆ. కలిగి కఱవనున్న కాలాహిపోలికిఁ
జెలఁగుచున్న సతుల చిత్తవృత్తిఁ
దెలియవశమె యెంత ధృతి గలవారికి
నాకె కాదు నిఖిల లోకములకు. 518

ఆ. కోరి సతుల కెల్లఁ గూర్చెద రెవ్వరు
పతుల నైన సుతుల హితుల నైన
బలిమిఁ జేసి యైనఁ బరహస్తమున నైన
హింస సేతు రాత్మహితముకొఱకు. 519

వ. అని చింతించి, దీనికి నేమని ప్రతివాక్యం బిచ్చువాఁడ? మద్వచనం బెందు నమోఘంబు. త్రిలోక పరిపాలనశీలుం డైన భిదురపాణి వధార్హుండె? ఐనను దీనికి నై నయది యొకటి కల్పించెద. అని దితిం జూచి, యో తనుమధ్య! నీకు నట్ల దేవబాంధవుం డైన యింద్రహంత యగు పుత్త్రుండు గలిగెడు. ఒక్క సంవత్సరం బీ వ్రతంబు చరియింపుము. దీని ప్రకారంబు వినుము. ఎల్ల జీవుల వలన హింసాభావంబు లేక, యతిధ్వనివాక్యంబు లుడిగి, కోపంబుమాని, యనృతంబులు వలుకక, నఖ రోమ చ్ఛేదనంబు సేయక, యస్థి కపాలాదు లైన యమంగళంబుల నంటక, నదీ నద తటాకాదుల నవగాహన స్నానంబ కాని ఘటోదక కూపోదకంబుల స్నానంబు సేయక, దుర్జన సంభాషణంబులు వర్జించి కట్టిన కోకయును, ముడిచిన పువ్వులును, గ్రమ్మఱ ధరియింపక, భోజనంబుల యందు నుచ్ఛిష్టాన్నంబును, చండికానివేదితాన్నంబును, గీశ శునక మార్జార కంక క్రిమి పిపీలికాది విదూషితాన్నంబును, సామిషాన్నంబును, వృషలాహృతాన్నంబును, నను నీ పంచవిధ నిషిద్ధాన్నంబులు వర్జించి, దోయిట

నీళ్ళుద్రావక, యుచ్ఛిష్ట గాక, సంధ్యాకాలంబుల ముక్తకేశి గాక, మితభాషిణి యై, యలంకారవిహీన గాక, వెలుపలం దిరుగక, పాదప్రక్షాళనంబుఁ జేసికొని కాని శయనింపక, యార్ద్రపాద యై పవ్వళింపక. పశ్చిమ [1]శిర స్సయ్యును, నగ్న యయ్యును, సంధ్యాకాలంబుల నిద్రింపక, నిత్యంబును ధౌత వస్త్రంబులఁ గట్టి, శుచి యై, సర్వమంగళసంయుక్త యై, ప్రాతఃకాలంబునఁ దూర్పుమొగం బై, లక్ష్మీనారాయణుల నారాధించి, యావాహ నార్ఘ్య పాద్యోపస్పర్శన సుస్నాన వాస ఉపవీత భూషణ పుష్ప ధూప దీ పోపహారా ద్యుపచారంబుల నర్చించి, హవిశ్శేషంబు గా ద్వాదశాహుతుల వేల్చి, దండప్రణామంబు లాచరించి, భగవన్మంత్రంబును దశవారంబు లనుసంధించి, స్తోత్రంబు చేసి, గంధ పుష్పాక్షతల ముత్తైదువులం బూజించి, పతిని సేవించి, పుత్రుం గుక్షిగతుం గా భావించి, యి వ్విధంబున మార్గశీర్ష శుద్ధ ప్రతిపదారంభంబుగా నొక్క సంవత్సరంబు సలిపి, యా ద్వాదశ మాసాంత్యదివసంబున విద్యుక్తంబుగా నుద్యాపనంబు సేయవలయును. నీ వీ పుంసవనం బనియెడి వ్రతంబు ద్వాదశమాస పర్యంతం బేమఱక సల్పిన, నీవు కోరిన కుమారుండు గలిగెడు. అనిన దితి యా వ్రతంబుతోడనె గర్భంబు ధరియించి, వ్రతంబు సలుపుచుండ, నింద్రుండు మాతృభిప్రాయం బెఱింగి, యా యమ్మ నహరహంబును రహస్యంబున సేవింపుచు, వ్రతంబునకుం దగిన పుష్ప ఫల సమిత్కుశ పత్రాంకురంబులు మొదలైన వస్తు వితతిం ద్రికాలంబులం దెచ్చి యిచ్చుచుఁ, బుండరీకంబు హరిణికిం బొంచి యున్న భంగి, [2]నా యమ్మ వ్రతభంగంబున కై కాచి, ప్రతీక్ష చేయుచు, నాయమ్మ గర్భంబున ధరియించిన తేజోవిశేషంబునకు [3]బెగ్గలింపుచుఁ, గృశింపుచు నుండె. అంత నొక్కనాఁడు. 520

సీ. వామాక్షి యనుదిన వ్రత ధారణోన్నత పరిచర్యవిధులచే బడలి యలసి
యొంటి సంధ్యావేళ నుచ్ఛిష్ట యై పద ప్రక్షాళనాదులఁ బాసి మఱచి
తన కర్మమోహంబు తవిలి నిద్రింపంగ నింద్రుండు చయ్యన నెడరు గాంచి
యోగమాయా బలోద్యుక్తుఁ డై యా యింతి యుదరంబుఁ జొరఁబడి
యుగ్రుఁ డగుచుఁ

1. శిరస్క (తం.వా.) 2. తద్వ్రత భంగంబు (తం.వా.) 3. దిగులు గుడుచుచు (తం)

తే. దివిరి దేదీప్యమాన మై తేజరిల్లు
నర్భకుని వజ్రధారల నడిచె నేడు
దునుకలుగ వాఁడు దునిసియుఁ దునుకఁ దునుకఁ
జెడక నొక్కొక్క బాలుఁ డై చెలఁగుచున్న. 521

క. వారేడ్వ రగుచుఁ గుయ్యిడ, †నో రేడ్వకు మనుచుఁ ద్రుంచె నొక్కొక్కని నా
[1]శూరుం డేడేసి దునుక, గా రయమున వారు నెడక ఖండితు లయ్యున్. 522

క. ఖండము లన్నియు నందఱు, చండాంశు సమప్రకాశ శాశ్వతు లగుచున్
మెండుకొని నిల్చి యని రా, ఖండలునకుఁ గరుణ పుట్టు గతి మదిఁ దోఁపన్.

వ. అందఱు ముకుళిత కరకమలు లై, నీకుం దోడఁబుట్టువులము. మమ్ము హింసింపం బనిలేదు. నీకు బారిషదుల మై, మరుద్గణముల మై నిన్ను సేవించెదము. మమ్ము రక్షింపుము. అనిన నారాయణ ప్రసాదంబునఁ జెడని మరుద్గణంబుల పలుకులకుఁ గృపాళుం డై, యింద్రుండు వారల సహోదరులుగాఁ గైకొని మఱి హింసింపక మానె. అశ్వత్థామ శరాగ్నివలన నారాయణ రక్షితుండ వైన నీవునుంబోలెఁ, గులిశధారల శకలంబు లైన [2]కుమారు లన్ని రూపంబు లై, సంవత్సరంబునకు నొక్కింత కడమగా హరిం బూజించిన నుద్భవించిన వారు గావున, నింద్రుతోడం గూడ నేకోనపంచాశ ద్దేవత లైన మరుద్గణంబులు దితిగర్భంబు వెలువడిరి. అంత దితి మేల్కాంచి, యనల ప్రకాశు లై యింద్రుతోడం గూడి వెలుంగుచున్న కుమారులం జూచి సంతోషించక, యింద్రుం జూచి, నీకు మృత్యురూపం బైన పుత్రుం గోరి, దుస్తరం బైన వ్రతంబు సలిపితి. సంకల్పించిన పుత్రుం డొక్కరుండే సప్త సప్త సంఖ్యలం గల కుమారు లగుట కేమి కతంబు ? నీ వెఱింగిన భంగి తథ్యంబుఁ బలుకుము. అనిన నింద్రుం డి ట్లనియె. ఓ తల్లీ! భవ ద్వ్రతంబుఁ జింతించి సమయ విచ్ఛేదనంబునం గర్భంబుఁ జొచ్చి, పాపచిత్తుండ నై వజ్రధారం గర్భంబు విదళనంబు చేసిన, నా శకలంబులు నెడక మహాశ్చర్యంబుగా ని వ్విధంబునం గుమారకు లైరి. మహాపురుష పూజాసంసిద్ధి కార్యా

† 'ఓరీ...ఏడ్వకు' అని సంధి. ఓరి యఱవకనుచుఁ ద్రుంచె (వా)
1. శూరుండేడ్గురిఁ దునకలుగా (హ.వా.)
2. కుమారుఁ డన్ని రూపంబులై (తం.వా.)

నుషంగి గాకుండునే ? భగవదారాధనంబు గోరికలం బాసి యెవ్వరు గావిం తురు, వా రిహపరంబుల సర్వార్థ కుశలు లగుదురు. అ మ్మహాపురుష వ్రత సముత్పన్న తేజంబు నడంప నెవ్వండోపు? కావున దుర్మదంబున బాలిశ స్వభా వుండ నై దోషంబు చేసిన నా దౌర్జన్యకర్మంబు సహింపఁ దల్లి కన్న నెవ్వరు సమర్థులు ? పాపాత్ముండ నగు నన్నుం గావుము. నేను వీరల తోడివాఁడ. అని నిష్కపటంబుగాఁ బ్రార్థించిన, న ద్దేవి యట్ల కాక యని, శాంతచిత్త య య్యె. ఇంద్రుండును వారలం గూడి త్రిదివంబునకుం బోయి, సోమపాన, హవిర్భాగం బులు వారలకుం బంచిపెట్టి, కూడి సుఖం బుండె. అని చెప్పి, పరీక్షిన్నరేంద్రు నకు శుకయోగీంద్రుండు వెండియు ని ట్లనియె. 524

క. హరి వరదుఁ డైన వ్రత మఁట, హరివంశజు లగుచు నెగడు నమరుల జన్మ స్ఫురణం బఁట, పఠియించిన, నరయఁగ నురు దీర్ఘ [1]కర్మహర మగు టరుదే?

వ. అని విష్ణు కథాశ్రవణ కుతూహలాయమాన మానసు లైన శౌనకాది మహా మునులకు సూతుండు సెప్పె. అని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పె. అనుటయు. 526

క. [2]రాజీవరాజ పూజా, శ్రీజిత గోపీకటాక్ష సేవాంతర వి
భ్రాజితమూర్తి ! మదోద్ధత, రాజకులోత్పాద ! రామరాజాఖ్య నిధీ ! 527

తరల. మురవిదారణ ! ముఖ్య కారణ ! మూలతత్త్వ విచారణా !
దురిత తారణ ! దుఃఖవారణ ! దుర్మదాసుర మారణా !
[3]కిరివిహారణ ! కీర్తిపూరణ ! కీర్తనీయ మహా రణా !
ధరణి ధారణ ! ధర్మ తారణ ! తాపస స్తుతి పారణా ! 528

తోటకము. కరుణాకర ! శ్రీకర ! కంబుకరా !
శరణాగత సంగత జాడ్యహరా !
పరిరక్షిత శిక్షిత [4]భక్తమురా !
కరిరాజ శుభప్రద ! కాంతిధరా ! 529

1. పాప (హ) 2. రాజీవ రాజపూజ వి, రాజిత (క) 3. గిరి (తం) 4. భక్తహరా (హ)

గద్య. ఇది శ్రీ సకల సుకవిజన మిత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర కసువయామాత్య పుత్ర బుధజన ప్రసంగానుషంగ సింగయనామధేయ ప్రణీతం బైన శ్రీ మహాభాగవత పురాణంబునందు నజామిళోపాఖ్యానంబును, బ్రచేతసులఁ జంద్రుం డామంత్రణంబు సేయుటయు, దక్షోత్పత్తియుఁ, బ్రజాసర్గంబును, దక్షుండు శ్రీహరిం గూర్చి తపంబు సేయుటయు,నతనికి న ప్పరమేశ్వరుండు ప్రత్యక్షం బగుటయు, హర్యశ్వ శబలాశ్వుల జన్మంబును, వారలకు నారదుండు బోధించుటయు, నారదు వచనప్రకారంబును, వారు మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబు నారదు వలన విని దక్షుండు దుఃఖాక్రాంతుం డగుటయుఁ, దదనంతరంబ బ్రహ్మవరంబున దక్షుండు శబళాశ్వసంజ్ఞుల సహస్రసంఖ్యాకులగుపుత్రులంగాంచుటయు, సృష్టి నిర్మాణేచ్ఛా నిమిత్తంబున దక్షుపంపున వారలగ్రజన్ములు సిద్ధిం బొందిన తీర్థరాజంబయిన నారాయణ సరస్సునకుం జనుటయు, వారికి నారద భగవంతుండు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించుటయు, వారు పూర్వజు లేగిన ప్రకారంబున మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబును దక్షుండు దివ్యజ్ఞానంబున నెఱింగి, నారదోపదిష్టం బని తెలిసి, నారదుని శపించుటయు, నారదుండు దక్షశాపంబు బ్రతిగ్రహించుటయు, దక్షునకు మఱల బ్రహ్మవరంబున సృష్టి విస్తారంబు కొఱకు కూఁతు లఱువది మంది జన్మించుటయు, నందుఁ గశ్యపునకు నిచ్చిన పదుమువ్వుర వలన సకల లోకంబులు నిండుటయు, దేవాసుర, నర, తిర్య జ్మృగ, ఖగాది జన్మంబులును, దేవేంద్ర తిరస్కారంబున బృహస్పతి యధ్యాత్మ మాయచేతం గానరాకుండుటయు, దద్వృత్తాంతంబు రాక్షసులు విని శుక్రోపదిష్టు లై వచ్చుటయును, దేవాసుర యుద్ధంబున నాచార్య తిరస్కారంబున దివిజరాజపలాయనంబును, బలాయమాను లై దేవతలు బ్రహ్మ సన్నిధికిం జనుటయు, బ్రహ్మ వాక్యంబున ద్వష్ట్ర కుమారుం డైన విశ్వరూపు నాచార్యునింగా దేవతలు వరియించుటయు, విశ్వరూపు ప్రసాదంబున నింద్రుండు నారాయణవర్మం బను కవచంబు ధరియించి రాక్షసుల జయించుటయుఁ, బరోక్షంబున రాక్షసులకు ననుకూలుం డైన విశ్వరూపు నింద్రుండు వధించుటయు, విశ్వరూపు వధానంతరంబున నింద్రునకు బ్రహ్మహత్య సంప్రాప్తం బైన, నింద్రుండు స్త్రీ, భూ, జల, ద్రుమంబులయందుఁ బంచి పెట్టుటయు, విశ్వరూపుండు హతుం డగుటకు త్వష్ట కోపించి యింద్రవధార్థంబు మారణ

హోమంబు సేయ వృత్రాసురుండు జనియించుటయు, వృత్రాసుర యుద్ధంబునఁ బరాజితు లై యింద్రసహితు లైన దేవతలు శ్వేతద్వీపంబునకు జనుటయు, నందు శ్రీహరి ప్రసన్నుం డై దధీచివలన భిదురంబు గైకొనుటయు, నింద్రుండు వజ్రాయుధంబున వృత్రుని సంహరించుటయు, నింద్రుండు బ్రహ్మహత్యా పీడితుం డై మానస సరస్సుఁ బ్రవేశించుటయు, నహుషుండు శతాశ్వమేధంబులం జేసి, యింద్రాధిపత్యంబు వడయుటయు, నహుషం డగస్త్య శాపంబున సురరాజ్యచ్యుతుం డై యజగరయోనిం బుట్టుటయు, నింద్రాగమనంబును, నశ్వమేధంబును, నింద్రుండు త్రిలోకాధిపత్యంబు వడయుటయును, జిత్రకేతూపాఖ్యానంబును, మరుద్గణంబుల జన్మ ప్రకారంబును నను కథలుం గల షష్ఠస్కంధము సంపూర్ణము.

మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీ మహాభాగవతము

## ద్వితీయ సంపుటము

( సప్తమ, అష్టమ, నవమ స్కంధములు )

※

బహు పాఠాంతర పరిష్కార విపుల పీఠికా సహితము

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి

హైదరాబాదు.

**1964.**

# విషయ సూచిక

## సప్తమ స్కంధము



## అష్టమ స్కంధము



## నవమ స్కంధము

ఓమ్

# శ్రీ మహా భాగవతము

---

## సప్తమ స్కంధము

క. శ్రీమ ద్విఖ్యాతి లతా, క్రామిత రోదోంతరాళ! కమనీయ మహా
జీమూత తులిత దేహా, శ్యామల రుచిజాల! రామచంద్రనృపాలా! 1

### అధ్యాయము – ౧

వ. మహనీయ గుణగరిష్ఠు లగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీసమేతుం డైన సూతుం డి ట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నవలోకించి. 2

సీ. సర్వభూతములకు సముఁడు నెచ్చెలి ప్రియుం డైన వైకుంఠుఁ డనంతుఁ [1]డాఢ్యుఁ
డింద్రునికొఱకు దైత్యేంద్రుల నేటికి విషమునికై వడి వెదకి చంపె?
నసురులఁ జంపంగ నమరులచేఁ దన కయ్యెడు లాభ [2]మిం తైనఁ గలదె?
నిర్వాణనాథుండు నిర్గుణుం డగు తన కసురులవలని భయంబుఁ బగయుఁ

ఆ. గలుగనేర వట్టి ఘనుఁడు దైత్యులఁ జంపి
సురలఁ గాఁచుచునికి చోద్య మనుచు
సంశయంబు నాకు జనియించె మునినాథ!
ప్రజ్ఞ మెఱసి తెలియఁ బలుకవయ్య! 3

వ. అనిన శుకుం డి ట్లనియె. 4

శా. నీ సంప్రశ్నము వర్ణనీయము గదా! నిక్కంబు రాజేంద్ర! ల
క్ష్మీ[3]సంభావ్యుని సచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁ ద
ద్దాసాఖ్యానము లొప్పు విష్ణుచరణ ధ్యాన ప్రధానంబు లై
శ్రీసంధానము లై మునీశ్వరవచో జేగీయమానంబు లై. 5

క. చిత్రంబులు త్రైలోక్య ప, విత్రంబులు భవలతా లవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజన వన, చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్. 6

---

1. ఆద్యుఁడు (తం. హా.) 2. ఏమైన (త); ఎంతైన (హ. వా.) 3. సంభావ్యుఁడు (హ)

వ. నరేంద్రా! కృష్ణద్వైపాయనునకు నమస్కరించి, హరికథనంబులు సెప్పెద. వినుము. వ్యక్తుండు గాక, గుణంబులు లేక, ప్రకృతిం జెందక, భవంబుల నొందక పరమేశ్వరుండు దన మాయవలన నైన గుణంబుల నావేశించి బాధ్యబాధకత్వంబుల నొందు. అతండు గుణరహితుండు. సత్త్వ రజ స్తమంబులు ప్రకృతిగుణంబులు. ఆ గుణంబులకు నొక్కొక్క కాలంబున హానివృద్ధులు గలవు. ఆ యీశ్వరుండు సత్త్వంబున దేవఋషులను, రజోగుణంబున నసురులను, దమోగుణంబున యక్ష రక్షో గణంబులను విభజించె. సూర్యుండు పెక్కు డలంగానంబడియు నొక్కరుం డైనతెఱంగునఁ, ద ద్విభుండును సర్వగతుం డయ్యును భిన్నుండు గాఁడు. తత్త్వవిదు లైన పెద్దలు దమలోనం బరమాత్మస్వరూపంబున నున్న యీశ్వరు ని వ్విధంబున నెఱుంగుదురు. జీవాత్మకుఁ బరుం డైన సర్వమయుండు దనమాయచేత విశ్వంబుఁ సృజియింపం గోరి రజంబును, గ్రీడింపం గోరి సత్త్వంబును, నిద్రింపం గోరి తమంబును,నుత్పాదించి చర మైన కాలంబును సృజియించు. ఆ కాలమున సర్వదర్శనుం డైన యీశ్వరుండు కాలాహ్వయుండై సత్త్వగుణం బైన దేవానీకంబునకు వృద్ధియు, రజ స్తమో గుణు లైన రాక్షసులకు హానియుం జేయుచుండు. 7

క. జననాయక! యీ యర్థము, ఘనయశుఁ డగు ధర్మజునకుఁ గ్రతుకాలమునన్
మును నారదుండు సెప్పెను, వినుపించెద వినుము చెవులు విమలత నొందన్. 8

వ. మున్ను ధర్మరాజు సేయు రాజసూయయాగంబున బాలుం డైన శిశుపాలుండు హరిని నిందించి, నిశిత నిర్వక్ర చక్రధారా దళిత మ స్తకుం డై, తేజోరూపంబున వచ్చి, హరిదేహంబు సొచ్చుటం జూచి వెఱఁగుపడి, ధర్మజుండు సభలో నున్న నారదు నీక్షించి యి ట్లనియె. 9

ఆ. ఎట్టివారి కైన నేకాంతులకు నైన
వచ్చి చొరఁగరాని వాసుదేవు
తత్త్వమందుఁ జెంది ధరణీశుఁ డహితుఁ డై
యెట్లు చొచ్చె? మునివరేణ్య! నేఁడు. 10

ఉ. [1]వేనుఁడు మాధవుం దెగడి విప్రులు దిట్టిన భగ్నుఁ డై తమో
లీనుఁడు గాఁడె? తొల్లి మదలిప్తుఁడు చైద్యుఁడు పిన్ననాఁటనుం
డేనియు మాధవున్ విన సహింపఁడు భక్తి వహింపఁ డిట్టి వాఁ
డే నిబిడప్రభావమున నీ పరమేశ్వరునందుఁ జొచ్చెనో? 11

---

1. వెన్నుఁడు (క. చ. బ. హ.)

మ. హరి సాధింతు హరిన్ [1]గ్రసింతు హరిఁ బ్రాణాంతంబు నొందింతుఁ దా
హరికిన్ వైరి నటంచు వీఁడు పటు రోషాయత్తుఁడై యెప్పుడున్
దిరుగుం బ్రువ్వదు నోరు బ్రీలి పడదున్ దేహంబు దాహంబుతో
[2]నరకావాసము నొందఁ డేక్రియ జగన్నాథుం బ్రవేశించెనో ? 12

వ. అదియునుం గాక దంతవక్త్రుండును, వీఁడును నిరంతరంబు గోవిందు నింద సేయుదురు. నిఖిలజనులు సందర్శింప నేఁడు వీనికి విష్ణుసాయుజ్యంబు గలుగుట కేమి హేతువు? వినుపింపుము. పవనచలిత దీపశిఖయునుం బోలె నా హృదయంబు చలింపుచున్నది. అనిన ధర్మనందనునకు నారదుం డిట్లనియె, దూషణ భూషణ తిరస్కార సత్కారంబులు శరీరంబునకుం గాని పరమాత్మకు లేవు. శరీరాభిమానంబునం జేసి దండ వాక్పారుష్యంబులు హింస యై తోఁచుతెఱంగున, నేను, నాయది యనియెడు వైషమ్యంబు భూతంబులకు శరీరంబునంద సంభవించు. అభిమానంబు బంధంబు. నిరభిమానుండై వధించినను వధంబు గాదు. కర్తృత్వ మ్ముల్లని వానికి హింసయు సిద్ధింపదు సర్వభూతాత్మకుండైన యీశ్వరునికి వైషమ్యంబు లేదు. కావున. 13

ఆ. అలుక నైనఁ జెలిమి నైనఁ గామంబున
నైన బాంధవమున నైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁ డగు హరిఁ
జేరవచ్చు వేఱుసేయఁ డతఁడు. 14

క. వైరానుబంధనంబునఁ, జేరిన చందమున విష్ణుఁ జిరతరభక్తిం
జేరఁగరా దని తోఁచును, నారాయణ భక్తియుక్తి నా చిత్తమునన్. 15

క. కీటకముఁ దెచ్చి భ్రమరము, పాటవమున బంభ్రమింప భ్రాంతం బై త
త్కీటకము భ్రమరరూపముఁ, బాటించి వహించుఁ గాదె! భయయోగమునన్.

వ. ఇవ్విధంబున. 17

శా. కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్య నృపతుల్ సంబంధు లై వృష్ణులున్
బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామ ధ్యానగరిష్ఠుఁ డైన హరిఁ జెందన్‌వచ్చు ధాత్రీశ్వరా ! 18

---

1. గ్రహింతు (హ) 2. నరకప్రాప్తియు (క. తం. వా.)

—:శ్రీహరి ద్వారపాలకులకు సనక సనంద నాదులవలన శాపంబు సంభవించుట:—

వ. మఱియుం బెక్కండ్రు కామ ద్వేష భయ స్నేహ సేవాతిరేకంబులఁ జిత్తంబు హరిపరాయత్తంబుగాఁ జేసి [1]తద్గతిం జెందిరి. హరి నుద్దేశించి(న) క్రోధాదు లైన యేనింటిలోపల నొకటి యైన [2]వేనునికి లేని నిమిత్తంబున నతండు వ్యర్థుం డయ్యె. మీ తల్లికిఁ జెల్లెలికొడుకు లైన శిశుపాల దంతవక్త్రులు దొల్లి విష్ణు మందిర ద్వారపాలకులు. విప్రశాపంబునఁ బదభ్రష్టు లై భూతలంబున జన్మించిరి. అనిన విని యుధిష్ఠిరుండు నారదున కి ట్లనియె. 19

మ. అలుగం గారణ మేమి విప్రులకు? ము న్నా విప్రు లెవ్వారు? ని
శ్చలు లేకాంతులు నిర్జితేంద్రియులు నిస్సంసారు [3]లీశానువ
ర్తులు వైకుంఠపురీ నివాసు లన విందుఁ వారి కె ట్లుంగి నీ
ఖలజన్మంబులు వచ్చె? నారద! వినం గౌతూహలం బయ్యెడిన్. 20

వ. అనిన నారదుం డి ట్లనియె. ఒక్కనాఁడు బ్రహ్మమానసపుత్రు లైన సనక సనందనాదులు దైవయోగంబున భువనత్రయంబున సంచరింపుచు, నైదాఱేండ్ల ప్రాయంపు బాలకుల భావంబున దిగంబరు లై హరిమందిరంబునకు వచ్చి చొచ్చు నెడ, మొగసాల నున్న పురుషు లిరువురు వారలం జూచి. 21

క. డింభకుల ననర్గళ వి, స్రంభకుల రమాధినాథ సల్లాప సుఖా
రంభకుల ముక్తమానస, దంభకులం జొరఁగనీక తఱిమి రధీశా! 22

క. వారించినఁ దమకంబున, వా రించుక నిల్వలేక వడిఁ దిట్టిరి దౌ
వారికుల నసురయోని న, వారితు లై పుట్టుఁ డనుచు వసుధాధీశా! 23

వ. మఱియు నా పిన్నపెద్దలు వారలం జూచి, మీ రీయెడ నుండ నర్హులు గారు. నారాయణచరణమూలంబు విడిచి, రజ స్తమో గుణు లై, రాక్షసయోనిం బుట్టుడు. అని శపియించిన వారు నా శాపవశంబునఁ బదభ్రష్టు లై కూలుచు మొఱ లిడిన, న మ్మహాత్ములు దయాళువు లై క్రమ్మఱం గరుణించి, మూఁడు జన్మంబులకు వైరంబున భగవ త్సన్నిధానంబు గలిగెడు నని నిర్దేశించి చనిరి. ఇవ్విధంబున శాపహతు లై హరి పార్శ్వచరు లైన పురుషు లిరువురు హిరణ్య కశిపు హిరణ్యాక్షు లన దితికి జన్మించిరి. అందుఁ గనిష్ఠుం డైన హిరణ్యాక్షుని హరి వరాహరూపంబున సంహరించె. అగ్రజుం డైన హిరణ్యకశిపుండును నర సింహమూర్తి యైన శ్రీహరిచేత విదళితుం డయ్యె. అతని కొడుకు ప్రహ్లాదుండు దండ్రిచేత హింసితుం డయ్యును నారాయణ పరాయణుం డై శాశ్వతుం

1. సద్గతిం (క) 2. వెన్నునికి (హ. తం. వా.) 3. ఇచ్ఛానువర్తులు (ట. త.)

డయ్యె. రెండవభవంబునఁ [1]గైకసి యను రాక్షసికి రావణ కుంభకర్ణులై సంభ
వించిన, విశ్వంభరుండు రఘుకులంబున రాఘవుండై యవతరించి వధించె.
తృతీయజన్మంబున మీ తల్లిచెల్లెలికి శిశుపాల దంతవక్త్రు లన నుద్భవించి. 24

శా. వక్రం బింతయు లేక పాయని మహావైరంబుతో నిత్య జా
త క్రోధ స్మరణంబులన్ విదళితోద్యత్పాపసంఘాతులై
చక్రచ్ఛిన్న శిరస్కులై మునివచశ్శాపావధి ప్రాప్తులై
చక్రిం జెందిరి [2]వారె పార్శ్వచరులై సారూప్య భావంబునన్. 25

వ. అనిన విని ధర్మనందనుం డిట్లనియె. 26

క. బాలున్ హరిపద చింతా, శీలున్ సుగుణాలవాలు శ్రీమన్మేధా
జాలున్ సంతోషించక, యేలా శిక్షించె? రాక్షసేంద్రుం డనఘా! 27

క. పరిభూత వ్యథనంబులు, నిరుపమ సంసారజలధి నిర్మథనంబుల్
నరకేసరి కథనంబులు, పరిరక్షిత దేవ యక్ష ఫణి మిథునంబుల్. 28

వ. మునీంద్రా! వినుపింపు మనిన నారదుం డిట్లనియె.

## అధ్యాయము – ౨

కమలోదరుచేత సహోదరుండు హతుం డయ్యె నని విని, హిరణ్యకశిపుండు రోష శోక దందహ్యమాన మానసుండై ఘూర్ణిల్లుచు, నాభీల దావదహన జ్వాలా [3]కరాళంబు లయిన విలోకనజాలంబుల గగనంబునం బొగ లెగయ నిరీక్షింపుచుఁ, దటిల్లతాంకుర సంకాశ ధగద్ధగిత దంతసందష్ట దశనచ్ఛదుండును, నదభ్ర భయంకర భ్రుకుటీత ఫాలభాగుండును, నిరంత రాశాంత దురంత వైరవేగుండును నై మహాప్రభాజాల జటాలం బగు శూలంబుఁ గేల నందుకొని, సభామండపంబున నిలువంబడి, త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి ప్రముఖులైన దైత్య దానవుల నాలోకించి యి ట్లనియె. 29

శా. నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి రణన్యాయైక దక్షుండు బా
హా కుంఠీకృత దేవయక్షుఁడు హిరణ్యాక్షుండు వానిన్ మహా
సౌకర్యాంగముఁ దాల్చి దానవవధూ సౌకర్యముల్ నీఱుగా
వైకుంఠుండు వధించి పోయె నఁట యీ వార్తాస్థితిన్ వింటిరే! 30

---

1. కైకేశి (హ. తం.) 2. వారు (తం. వా.) 3. విశాలంబులయిన (హ)

చ. [1]వనముల నుండుఁ జొచ్చు మునివర్గములోపల ఘోణి గాఁడు సం
జనన మెఱుంగ రెవ్వరును జాడ యొకింతయు లేదు తన్ను డా
సిన మఱి డాయు [3]వెంటఁబడి చిక్కక చిక్కఁడు వీని నొక్క కీ
లున మనమెల్ల లోఁబడక [4]లోఁబడఁ బట్టుకొనంగవచ్చునే ? 31

సీ. భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి మున్నీట మునిఁగిన మునుఁగుఁ గాక
యేఁయించి పెనఁగు నా యచల సంభ్రమమున కెఱఁగి వెన్నిచ్చిన నిచ్చుఁ గాక
జగడంబు సైపక సౌకర్య కాంక్షి యై యిలఁ గ్రింద నీఁగిన నీఁగుఁ గాక
క్రోధించి యటుగాక కొంత పౌరుషమున హరిభంగి నడరిన నడరుఁ గాక

గీ. కఠిన శూలధారఁ గంఠంబు విదళించి
వాని శోణితమున వాఁడి మెఱసి
మ త్సహోదరునకు మహిఁ దర్పణము సేసి
[5]మీఁద వత్తు మీకు మేలుఁ దెత్తు. 32

క. ఖండిత మూలద్రుమమున, [6]నెండిన విటపములభంగి నీతఁడు వడ నా
ఖండలముఖ్యులు వడుదురు, ఖండనమున నితఁడు దమకుఁ బ్రాణము లగుటన్.

సీ. పొండు దానవులార! భూసురక్షేత్ర సంగత యైన భూమికి గములు గట్టి
మహిఁ దప స్స్వాధ్యాయ మౌనవ్రతస్థుల వెదకి ఖండింపుఁడు విష్ణుఁ డనఁగ
నన్యుఁ డొక్కఁడు లేఁడు యజ్ఞంబు వేదంబు నతఁడె భూదేవ క్రియాది మూల
మతఁడె దేవర్షి పిత్రాది లోకములకు ధర్మాదులకు మహాధార మతఁడె

గీ. యే స్థలంబున గో భూసురేంద్ర వేద
వర్ణ ధర్మాశ్రమంబులు వరుస నుండు
నా స్థలంబుల కెల్ల మీ రరిగి చెఱిచి
దగ్ధములు సేసి రండు మీ దర్ప మొప్ప. 34

వ. అని యిట్లు నిర్దేశించిన, దివిజమర్దను నిర్దేశంబులు శిరంబున ధరియించి, రక్క
సులు పెక్కండ్రు భూతలంబునకుం జని. 35

సీ. గ్రామ పుర క్షేత్ర ఖర్వట ఖేట ఘోషారామ నగరాశ్ర మాదికములు
గాలిచి కొలఁకులు గలఁచి ప్రాకార గోపుర సేతువులు ద్రవ్వి పుణ్యభూజ
చయముల ఖండించి సౌధ ప్రపా గేహ పర్ణశాలాదులు పాడుచేసి
సాధు గో బ్రాహ్మణ సంఘంబులకు హింస గావించి వేదమార్గములు చెఱచి



ఆ. కుతలమెల్ల నిట్లు కోలాహలంబుగా
దైత్యు లాచరింపఁ దల్లడిల్లి
నష్టమూర్తు లగుచు నాకలోకము మాని
యడవులందుఁ జొచ్చి రమరవరులు. 36

వ. అంత హిరణ్యకశిపుండు దుఃఖితుం డై, మృతుం డైన సోదరునకు నుదకప్రదా
నాది కార్యంబు లాచరించి, యతని బిడ్డ లగు శకుని, శంబర, కాలనాభ,
మహోత్కచ ప్రముఖుల నూఱడించి, వారల తల్లితోఁ గూడ హిరణ్యాక్షుని
భార్యల నందఱ రావించి, తమ తల్లి యైన దితి నవలోకించి యి ట్లనియె.

శా. నీరాగార నివిష్ట పాంథుల క్రియన్ నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు కూడి విత్తురు సదా సంగంబు లే దొక్కచో
శూరుల్ వోయెడి త్రోవఁ బోయెను భవ త్పుత్రుండు దల్లీ! మహా
శూరుం డాతఁడు త ద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్. 38

సీ. సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుఁ డమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుఁ
డాత్మరూపంబున నశ్రాంతమును దన మాయాప్రవర్తన మహిమవలన
గుణములఁ గల్పించి గుణసంగమంబున లింగశరీరంబు లీలఁ దాల్చి
కంపిత జలములోఁ గదలెడిక్రియఁ దోఁచు పాదపంబులభంగి భ్రామ్యమాణ

ఆ. చక్షువుల ధరిత్రి చలిత యై కానంగఁ
బడినభంగి వికల భావరహితుఁ
డాత్మమయుఁడు కంపితాంతరంగంబునఁ
గదలినట్ల తోఁచుఁ గదలఁ డతఁడు. 39

—: బాలవేషము దాల్చిన యముండు దెలిపెడు సుయజ్ఞోపాఖ్యానము :—

వ. అవ్వా! యి వ్విధంబున లక్షణవంతుండు గాని యీశ్వరుండు లక్షితుం డై, కర్మ
[1]సంసరణంబున యోగవియోగంబుల నొందించు. సంభవ వినాశ శోక వివేకా
వివేక చింతా స్మరణంబులు వివిధంబులు. ఈ యర్థంబునకుఁ బెద్దలు ప్రేత
బంధు యమసంవాదం బను నితిహాసంబు నుదాహరింతురు. వినుఁడు; సెప్పెద.
[2]ఉశీనరదేశంబునందు సుయజ్ఞుం డను రాజు గలండు. అతండు శత్రువులచేత
యుద్ధంబున నిహతుం డై యున్న యెడ. 40

ఆ. కుతలమెల్ల నిట్లు కోలాహలంబుగా
దైత్యు లాచరింపఁ దల్లడిల్లి
నష్టమూర్తు లగుచు నాకలోకము మాని
యడవులందుఁ జొచ్చి రమరవరులు. 36

వ. అంత హిరణ్యకశిపుండు దుఃఖితుం డై, మృతుం డైన సోదరునకు నుదకప్రదానాది కార్యంబు లాచరించి, యతని బిడ్డ లగు శకుని, శంబర, కాలనాభ, మదోత్కచ ప్రముఖుల నూఱడించి, వారల తల్లితోఁ గూడ హిరణ్యాక్షుని భార్యల నందఱ రావించి, తమ తల్లి యైన దితి నవలోకించి యి ట్లనియె.

శా. నీరాగార నివిష్ట పాంథుల క్రియన్ నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు కూడి విత్తురు సదా సంగంబు లే దొక్కచో
శూరుల్ వోయెడి త్రోవఁ బోయెను భవ త్పూనుండు దల్లీ! మహా
శూరుం డాతఁడు త ద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్. 38

సీ. సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుఁ డమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుఁ
డాత్మరూపంబున నశ్రాంతమును దన మాయాప్రవర్తన మహిమవలన
గుణములఁ గల్పించి గుణసంగమంబున లింగశరీరంబు లీలఁ దాల్చి
కంపిత జలములోఁ గదలెడిక్రియఁ దోఁచు పాదపంబులభంగి భ్రామ్యమాణ

ఆ. చక్షువుల ధరిత్రి చలిత యై కానంగఁ
బడినభంగి వికల భావరహితుఁ
డాత్మమయుఁడు కంపితాంతరంగంబునఁ
గదలినట్లు తోఁచుఁ గదలఁ డతఁడు. 39

## —: బాలవేషము దాల్చిన యముండు దెలిపెడు సుయజ్ఞోపాఖ్యానము :—

వ. అవ్వా! యి వ్విధంబున లక్షణవంతుండు గాని యీశ్వరుండు లక్షితుం డై, కర్మ [1]సంసరణంబున యోగవియోగంబుల నొందించు. సంభవ వినాశ శోక వివేకావివేక చింతా స్మరణంబులు వివిధంబులు. ఈ యర్థంబునకుఁ బెద్దలు ప్రేతబంధు యమసంవాదం బను నితిహాసంబు నుదాహరింతురు. వినుఁడు; సెప్పెద. [2]ఉశీనరదేశంబునందు సుయజ్ఞుం డను రాజు గలండు. అతండు శత్రువులచేత యుద్ధంబున నిహతుం డై యున్న యెడ. 40

---

1. సంస్మరణంబున (వా) 2. ఉసీనర (వా)

సీ. చినిఁగిన బహురత్న [1]చిత్ర వర్మంబుతో రాలిన భూషణ రాజితోడ
భీకర బాణనిర్భిన్న వక్షముతోడ దఱచుఁ గాఱెడు శోణితంబుతోడఁ
గీర్ణ మై జాఱిన కేశబంధముతోడ రయ రోష [2]దష్టాధరంబుతోడ
నిమిషహీనం బైన నేత్రయుగ్మముతోడ భూరజోయుత ముఖాంబుజముతోడఁ

ఆ. దునిసి పడిన దీర్ఘ దోర్దండములతోడ
జీవరహితుఁ డగు నుశీనరేంద్రుఁ
జుట్టి బంధుజనులు సొరిది నుండఁగ భయా
క్రాంత లగుచు నతని కాంతలెల్ల. 41

శా. ప్రస్తాకంపిత కేశబంధములతో సంఛిన్న హారాళితో
హస్తాబ్జంబులు సాఁచి మోదుకొనుచున్ హా! నాథ! యంచున్ బహు
ప్రస్తావోక్తులతోడ నేడ్చిరి వగన్ బ్రాణేశు పాదంబుపై
నస్తోక స్తన కుంకుమారుణ వికీర్ణాస్రంబు వర్షింపుచున్. 42

మ. అనఘా! నిన్ను నుశీనరప్రజల కర్థానంద సంధాయిగా
మును నిర్మించిన బ్రహ్మ నిర్దయత నున్మూలించెనే? వీరికిన్
దనయశ్రేణికి మాకు దిక్కు గలదే? ధాత్రీశ! నీవొంటికిన్
జనునే? పాసి చనంగ భ్రాతృజనులన్ సన్మిత్రులన్ బుత్రులన్. 43

మ. జనలోకేశ్వర! నిన్నుఁ బాసిన నిమేషంబుల్ మహాబ్దంబు లై
చను లోకాంతరగామి వై మరల కీ చందంబున న్నీవు పో
యిన [3]నె ట్లంగిఁ జరింతు మొల్లము గదా! యీ లోకవృత్తంబు నేఁ
డనలజ్వాలలఁ జొచ్చి వచ్చెదము నీ యంఘ్రిద్వయిం జూడఁగన్. 44

వ. అని యిట్లు రాజభార్య లా రాజశవంబు డగ్గఱి విలపింపం, బ్రొద్దు గ్రుంకెడు సమయంబున వారల విలాపంబులు విని, బాలకుం డై యముండు సనుదెంచి, ప్రేతబంధులం జూచి యి ట్లనియె. 45

ఉ. మచ్చిక వీరికెల్ల [4]బహుమాత్రము చోద్యము దేహి పుట్టుచున్
జచ్చుచునుండఁ జూచెదరు చావక మానెడువారిభంగి నీ
చచ్చినవారి కేడ్చెదరు [5]చావుకు నొల్లక డాఁగవచ్చునే?
యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికిన్. 46

---

1. జీర్ణ (క) 2. దంష్ట్రాధరంబు (హం.వా.) 3. మే మెట్లు (తం. వా.) 4. బహుమాత్రపు (చ)
5. చావున కొల్లక (తం.వా.)

క. జననీజనకులఁ బాసియు, ఘన వృకముల బాధపడక కడుఁ బిన్నల మై
మనియెద మెవ్వఁడు గర్భం, బున మును పోషించె వాఁడె పోషకుఁ డడవిన్.

క. ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల, నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు నెవ్వఁ డనంతుం
డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ, డి వ్విధమున [1]మనుచుఁ బెనుచు హేలారతుఁ డై.

ఆ. ధనము వీథిఁ బడిన దై వవశంబున
నుండుఁ బోవు మూల నున్న నైన
నడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు
రక్షితుండు మందిరమునఁ జచ్చు. 49

క. కలుగును మఱి లేకుండును, గల భూతము లెల్లఁ గాలకర్మవశము లై
[2]యిలఁ బడియుఁ బ్రకృతిఁ ద ద్గుణ, కలితుఁడు గాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలఁపన్. 50

సీ. పాంచభౌతిక మైన భవనంబు దేహంబు పురుషుండు దీనిలోఁ బూర్వకర్మ
వశమున నొకవేళ వర్తించు దీపించు తఱి యైన నొకవేళ తలఁగిపోవు
చెడునేని దేహంబు చెడుఁ గాని పురుషుండు చెడఁ డాతనికి నింతచేటు లేదు
పురుషునికిని దేహపుంజంబునకు వేఱు గాని యేకత్వంబు గానరాదు

ఆ. దారువుల వెలుంగు దహనుని కై వడిఁ
గాయములఁ జరించు గాలిభంగి
నాళలీన మైన నభము చాడ్పున వేఱు
దెలియ వలయు దేహి దేహములకు. 51

వ. అని మఱియు ని ట్లనియె. 52

సీ. భూపాలకుఁడు నిద్రపోయెడి నొండేమి విలపింప నేటికి ? వెఱ్ఱులార !
యెవ్వఁడు భాషించు నెవ్వఁ డాకర్ణించు నట్టివాఁ డెన్నఁడో యరిగినాఁడు
ప్రాణభూతుం డై న పవనుఁ డా కర్ణింప భాషింప నేరఁడు ప్రాణి దేహ
ములకు వేఱై తాను ముఖ్యుఁ డై యింద్రియవంతుఁ డై జీవుండు వలను మెఱయఁ

ఆ. బ్రాభవమున భూతపంచ కేంద్రియ మనో
లింగదేహములను లీలఁ గూడి
విడుచు నన్యుఁ డొకఁడు విభుఁడు దీనికి మీరు
[3]వాఁగల నేల ? ఏగలఁ బొరల నేల ? 53

---

1. మనుపుఁ బెనుపు (హ) మనుపు దనుపు(ద) 2. నిలువదు ప్రకృతిం (హ) నిలువఁబడుఁ బ్రకృతిఁ (తం) నిలఁబడుఁ బ్రకృతిం (వా.) 3. పొగలనేల వగలఁ బొగలనేల (హ)

క. ఎందాఁక నాత్మ దేహము, [1]నొందెడు నందాఁక కర్మయోగము లటపైఁ
జెందవు మాయా యోగ, స్పందితు లై రిత్త జాలిఁ బడ నేమిటికిన్ ? 54

మ. చెలులుం దండ్రులు దల్లు లాత్మజులు సంసేవ్యల్ సతుల్ చారు ని
ర్మల గేహంబు లటంచుఁ గూర్తురు మహా మాయాగుణ భ్రాంతు లై
కలలోఁ దోఁచిన [2]యర్థముల్ నిజములే ? కర్మానుబంధంబులం
గలుగున్ సంగము లేక మాను పిదపన్ గర్మాంత కాలంబునన్. 55

వ. మఱియు, మాయా గుణప్రపంచంబు నెఱింగెడి తత్త్వజ్ఞులు నిత్యానిత్యంబులం గూర్చి సుఖదుఃఖంబులం జెందరు. అజ్ఞులు గొందఱు యోగవియోగంబులకు సుఖదుఃఖంబుల నొందుదురు. తొల్లి యొక్క మహాగహనంబున విహంగంబులకు నంతక భూతుం డైన యెఱుకు గలఁడు. అతండు ప్రభాతంబున నొక్కనాఁడు లేచి వాటం బైన వేఁట తమకంబున. 56

క. వల లురులు జిగురుఁ గండెలుఁ, జలిదియుఁ జిక్కంబు ధనువు శరములుఁ గొనుచుం
బులుఁగులఁ బట్టెడు వేడుక, [3]నలుకుడు వెడలంగఁ గదలి యడవికి నడచెన్. 57

వ. ఇట్లడవికిం జని తత్ప్రదేశంబునందు. 58

క. కట్టలుకఁ [4]దడక చాటునఁ, బిట్టల [4]నురిగోలఁ దిగిచి బిరుసున ఱెక్కల్
వట్టి విఱిచి చిక్కములోఁ, బెట్టుచు విహరించె లోకభీకర లీలన్. 59

వ. మఱియు, నానావిధంబు లగు శకుంతంబుల నంతంబు నొందింపుచు, సకల పక్షి సంహార సంరబ్ధకరుం డైన లుబ్ధకుండు, దన ముందటఁ గాలచోదితం బై సంచరింపుచున్న కుళింగపక్షిమిథునంబుఁ గనుంగొని, యందుఁ గుళింగి నురిం దిగిచి, యొక్క చిక్కంబులో వైచినం జూచి, దుఃఖించి, గుళింగపక్షి యిట్లనియె.

చ. అడవుల మేఁత మేసి మన మన్యుల కెన్నఁడు నెగ్గు సేయ కి
క్కడ విహరింప నేఁ డకట ! కట్టిఁడి బ్రహ్మ కిరాతు చేతిలోఁ
బడు మని వ్రాసెనే ? నుదుటఁ బాపపు దైవము కంటి కింత యె
క్కుడు బరు వయ్యెనే బ్రతుకు ? కోమలి ! యే మననేర్తుఁ [6]జెల్ల రే ! 61

క. ఒకమాటు మనల నందఱఁ, బ్రకటించి కిరాతువలలఁ బడఁజేయక ని
[7]న్నొకతిన్ వలఁ బడఁజేసిన, వికటీకృత దక్ష మైన విధి నే, మందున్ ? 62

---

1. నుండెడు (హ) 2. యోగముల్ (ట. తం.) 3. అలుగులు (తం. వా.) 4. తడుకు (తం. వా) 5. మఱిఁగోల (హ) 6. చెప్పవే (క) 7. ఒకటిన్ (హ. వా.)

ఉ. ఱెక్కలురావు పిల్లలకు ఱేపటి నుండియు మేఁత గానమిన్
బొక్కుచుఁ గూఁటిలో నెగసి పోవఁగ నేరవు మున్ను తల్లి [1]యే
దిక్కున నుండి వచ్చు నని త్రిప్పని చూడ్కుల నిక్కి నిక్కి నల్
దిక్కులు చూచుచున్న వతిదీనత నెట్లు భరింతు ? నక్కటా ! 63

వ. అని యి వ్విధంబున. 64

క. కుంఠిత నాదముతోడను, గంఠము శోషింప వగచు ఖగమును హానన్
త్కంఠుం డైన కిరాతుఁ డ,కుంఠిత గతి నేసె నొక్క కోలన్ గూలన్. 65

క. కాలము వచ్చిన శబరుని, కోలం ధరఁ గూలె ఖగము ఘోషముతోడన్
కాలము డాసిన నేలం, గూలక పో వశమె ? యెట్టి గుణవంతులకున్. 66

ఉ. కావున మీరు చచ్చుతఱిఁ గానరు చచ్చి ధరిత్రిఁ బడ్డ ధా
త్రీ విభు దేహముం గదిసి దీనత నేడువనేల ? పొందు చిం
తావతులార ! వత్సర శతంబుల కైన నిజేశు చక్కికిం
బోవుట దుర్లభంబు మృతిఁ బొందినవారలు సేర వత్తురే ? 67

వ. అని యిట్లు కపట బాలకుం డై క్రీడించుచున్న యముని యుపలాల నాలాపంబులు విని సుయజ్ఞుని బంధువు లెల్ల వెఱఁగు పడి, సర్వప్రపంచంబు నిత్యంబు గాదని తలంచి, శోకంబు మాని, సుయజ్ఞునికి [2]సాంపరాయిక కృత్యంబులు సేసి చనిరి. అంత నంతకుం డంతర్హితుం డయ్యె. అని చెప్పి హిరణ్యకశిపుండు దన తల్లినిఁ, దమ్ముని, భార్యలం జూచి యి ట్లనియె. 68

క. పరు లెవ్వరు ? దా మెవ్వరు ?, పరికింపఁగ నేక మగుట భావింపరు త
త్పరమజ్ఞానము లేమినిఁ, బరులును మే మనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్. 69

వ. అని తెలియం బలికిన, హిరణ్యకశిపుని వచనంబులు విని, దితి కోడండ్రునుం, దానును, శోకంబు మాని, తత్త్వ విలోకనంబు గలిగి, లోకాంతర గతుం డైన కొడుకునకు వగవక చనియె. అని చెప్పి నారదుండు ధర్మనందనునకు ని ట్లనియె.

## అధ్యాయము - ౩

క. అజరామర భావంబును, ద్రిజగ ద్రాజ్యంబు నప్రతిద్వంద్వము దో
ర్విజి తాఖిల శాత్రవమును, గజరిపు బలమును హిరణ్యకశిపుఁడు గోరెన్. 71

వ. ఇట్లు గోరి, మందరాచల ద్రోణికిం జని, యందుఁ గాలిపెనుఁ వ్రేల నేల నిలువంబడి యూర్ధ్వబాహుం డై, మిన్ను చూచుచు, వాఁడి మయూఖంబుల తోడి

1. యీ దిక్కున (తం. వా.) 2. సాంప్రదాయిక (ట)

ప్రళయకాల భానుండునుం బోలె దీర్ఘ జటారుణ ప్రభాజాలంబులతోడ నెవ్వరికిం దేఱిచూడ రాక, పరమ దారుణం బైన తపంబు సేయుచుండె. నిర్జరులు నిజ స్థానంబుల నుండిరి. అంత. 72

మ. అదరెం గుంభిని సాద్రి యై కలఁగె నే డంభోనిధుల్ తారకల్
చెదరెన్ సగ్రహసంఘ లై దిశలు విచ్ఛిన్నాంత లై మండెఁ బె
ల్లదరెన్ గుండెలు జంతుసంహతికి నుగ్రాచార దైత్యేంద్ర [1]మూ
ర్ధ దిశోద్ధూత సధూమ హేతిపట లోదంచ త్తపోవహ్నిచేన్. 73

వ. ఇట్లు త్రైలోక్య సంతాపకరం బైన దైత్యరాజ తపో దహన విజృంభణంబు సైరింపక, నిలింపులు నాకంబు విడిచి, బ్రహ్మలోకంబునకుం జని, లోకేశ్వరుం డైన బ్రహ్మకు వినతు లై, యి ట్లని విన్నవించిరి. 74

క. దితికొడుకు తపమువేఁడిమి, నతితప్తుల మైతి మింక నలజడి నమరా
వతి నుండ వెఱతు మె య్యది, గతి మాకును దేవదేవ! కారుణ్యానిధీ! 75

శా. శంకాలేశము లేదు దేవ! త్రిజగ త్సంహారముం దేవతా
సంకోచంబును వేదశాస్త్ర పదవీ సంక్షేపముం [2]జాల నే
వంకం [3]జేతు నటంచు దుస్సహ తపోవ్యావృత్తి చిత్తంబులో
సంకల్పించె నిశాచరుండు ప్రతిసంస్కారంబు చింతింపవే! 76

శా. నీ వే రీతి తపోబలంబున జగ న్నిర్మాణముం జేసి యీ
దేవాధీశులకంటె నెక్కుడు సిరిం దీపించి తి ట్లంగిఁ దా
నీ విశ్వంబుఁ దపస్సమాధి మహిమం హింసించి వేఱొక్క వి
శ్వావిర్భావకరత్వ శక్తి మదిలో నర్థించినాఁ డీశ్వరా! 77

వ. అదియునుం గాక కాలాత్ము లగు జీవాత్ముల కనిత్యత్వంబు గలుగుటం జేసి తపో యోగ సమాధి బలంబునం దనకు నిత్యత్వంబు సంపాదింతు నని తలంచి నాఁడు. అని మఱియు ని ట్లనిరి. 78

మ. భవదీయం బగు నున్నతోన్నత మహాబ్రహ్మైక పీఠంబు సం
స్తవనీయం బగు భూతియుం [4]విజయముం సౌఖ్యంబు సంతోషముం
భువనశ్రేణికి నిచ్చు దైత్యుని తపస్స్ఫూర్తి న్నివారించి యో
భువనాధీశ్వర! కావవే! భువనముల్ పూర్ణ ప్రసాదంబునన్. 79

---

1. మూర్ధ్న (హ) 2. లేక (తం. వా.) 3. లేవ (తం. వా.)
4. విభవముం (హ. చ. బ.)

—: బ్రహ్మదేవుండు హిరణ్యకశిపునకు వరము లిచ్చుట :—

వ. అని దేవతలు విన్నవించిన స్వయంభూతుండును, భగవంతుండును నైన నలు మొగంబుల [1]ప్రోడ భృగు దక్షాదులతోడ మందరపర్వతంబునకు వచ్చి, యందు నియమ యుక్తుండును, బిపీలికావృత మేదో మాంస చర్మ రక్తుండును, వల్మీక తృణ వేణుపటల పరిచ్ఛన్నుండును, మహా తపః ప్రభావ సంపన్నుండును నై నీరంధ్ర నిబిడ నీరదనికర నివిష్ట నీరజబంధుండునుం బోలె నివసించి యున్న నిర్జరారాతిం జూచి, వెఱఁగుపడి, నగుచు ని ట్లనియె. 80

మత్తకోకిల. ఓ సురారికులేంద్ర ! యీ క్రియ నుగ్ర మైన తపంబు మున్
చేసి చూపినవారు లే రిఁకఁ జేయువారును లేరు నే
నీ సమాధికి మెచ్చితిన్ విను నీ యభీష్టము లిత్తు నా
యాస మేటికి ? లెమ్ము [2]లెమ్ము మహాత్మ ! కోరుము కోరికల్. 81

శా. దంశవ్రాతములున్ బిపీలికలు మేదః క్రవ్య రక్తంబులన్
సంశీర్ణంబులు సేసి పట్టి తినఁగా శల్యావశిష్టుండ వై
వంశచ్ఛన్న తృణావళీ యుత మహావల్మీకమం దింద్రియ
భ్రంశం బెంతయు లేక [3]నీవు నిలువం బ్రాణంబు [4]లె ట్లుండెనో ? 82

ఉ. ఉత్సుకతన్ జలాన్నముల నొల్లక యీ క్రియ నూఱు దివ్యసం
వత్సరముల్ శరీరమున వాయువులన్ నిలుపంగ వచ్చునే ?
యుత్సవ మయ్యెఁ జూచి మము నుగ్రతపంబున గెల్చి తీవు నే
వత్సలత న్నినుం గదియ వచ్చితిఁ గోరిక లెల్ల నిచ్చెదన్. 83

వ. అని పలికి వనమక్షికా పిపీలికా భక్షితం బైన రక్షోవిభుని దేహంబుమీఁదం గమండలుజలంబులు ప్రోక్షించిన, న ద్దానవేంద్రుండు కమలాసన కరకమల కమనీయ కనకమయ దివ్యామోఘ కమండలు నిర్గత నిర్మల నీరధారా బిందుసందోహ సంసిక్త సకలాంగుం డై, తపంబు సాలించి, సాంద్ర కీచక సంఘాత సంఛాదిత వామలూరుమధ్యంబు వెలువడి, మహాప్రభావ బల సౌందర్య తారుణ్య సహితుండును, వజ్రసంకాశ దేహుండును, దప్త సువర్ణ వర్ణుండును నై నీర సేంధన నికర నిర్గత వహ్నియుంబోలె వెలుంగుచుఁ జనుదెంచి. 84

మ. దివిజానీకవిరోధి మ్రొక్కెఁ గని వాగ్దేవీ మనోనేతకున్
సవిశేషోత్సవ సంవిధాతకు నమ త్సంత్రాతకున్ స త్తపో
నివహాభీష్ట వరప్రదాతకు జగ న్నిర్మాతకున్ ధాతకున్
వివిధప్రాణి లలాటలేఖన మహావి ద్యానుసంధాతకున్. 85

---

1. వేల్పుప్రోడ (హా. వా) 2. వేగ (హ) 3. నీకు (తం. వా) 4. ఎట్లోర్చునో (క. బ.) ఎట్లోర్చెనో (తం.)

వ. ఇట్లు దైత్యేశ్వరుండు దివి నున్న హంసవాహనునకు ధరణీతలంబున దండ ప్రణామం బాచరించి, సంతోష బాష్ప సలిల సంవర్ధిత పులకాంకురుం డై యంజలి చేసి, కంజగర్భునిమీఁద దృష్టి యిడి, గద్గదస్వరంబున నిట్లని స్తుతియించె.

సీ. కల్పాంతమున నంధకార [1]సంవృత మైన జగము నెవ్వఁడు దన సంప్రకాశ
మున [2]వెలుఁగింపుచు మూఁడుభంగుల రజస్సత్త్వ తమో గుణ[3]సహితుఁ డగుచుఁ
గల్పించు రక్షించుఁ గడపటఁ బ్రహరించు నెవ్వఁ డాద్యుఁడు సర్వహేతు వగుచు
శోభితుం డై స్వయంజ్యోతి యై యొక్కట విలసిల్లు నెవ్వఁడు విభుత మెఱసి

ఆ. సమయ మైన మానస ప్రాణ బుద్ధీంద్రి
యములతోడ నెవ్వఁ డలఘుమహిమ
[4]నడరు నట్టి సచ్చి దానందమయునకు
మహితభక్తి నే నమస్కరింతు. 87

వ. దేవా! నీవు ముఖ్యప్రాణం బగుటం జేసి ప్రజాపతివి. మనో బుద్ధి చిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు. మహాభూతగణంబులకు నాధార భూతుండవు. త్రయీతనువునం గ్రతువులు విస్తరింతువు. సకల [5]విద్యాకళలు నీ తనువు. [6]సర్వార్థసాధకులకు సాధనీయుండవు. †(ఆత్మనిష్ఠా గరిష్ఠులకు ధ్యేయం బగు నాత్మవు.) కాలమయుండ వై జనులకు నాయుర్నాశంబుఁ జేయుదువు. జ్ఞాన విజ్ఞాన మూర్తివి. ఆద్యంత రహితుండవు. అంతరాత్మవు. త్రిమూర్తులకు మొద లైన పరమాత్మవు. జీవలోకంబునకు జీవాత్మవు. నీవ సర్వంబును. నీవు గానిది లేశంబును లేదు. వ్యక్తుండవు గాక పరమాత్మవై, పురాణపురుషుండ వై, యనంతుండ వైన నీవు ప్రాణేంద్రియ మనో బుద్ధి గుణంబుల నంగీకరించి, పరమేష్ఠి పదవిశేషంబున నిలిచి, స్థూలశరీరంబునం జేసి యింతయుం బ్రపంచింతువు. భగవంతుండ వైన నీకు మ్రొక్కెద. అని మఱియు ని ట్లనియె. 88

క. కోరినవారల కోర్కులు, నేరుపుతో నిచ్చి మనుప నీక్రియ నన్యుల్
నేరరు [7]కరుణాకర, నేఁ! గోరెద నీ విచ్చెదేనిఁ గోరిక లభవా! 89

శా. గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములన్ దమః[8]ప్రభల భూరి గ్రాహ రక్షో మృగ
వ్యాళాదిత్య నరాది జంతు కలహవ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువులేని జీవనము లోకాధీశ! యిప్పించవే! 90

1. సంభృతమైన (హ) 2. వెలిఁగించుచు (తం.వా.) 3. జనకుఁడగుచు (జ.ద.) 4. తనరు నట్టి (క. ట. డ.) 5. విద్యలు (హ. తం. వా.) 6. తత్త్వార్థ (చ. జ.) † తా. ప. ప్రతులలో లేదు.



అధ్యాయము - ౪

వ. అని మఱియు, రణంబులందుఁ దన కెదురులేని శౌర్యంబును, లోకపాలకుల నతిక్రమించు మహిమయును, భువనత్రయ జయంబును, హిరణ్యకశిపుండు గోరిన, నతని తపంబునకు సంతోషించి, దుర్లభంబు లైన వరంబు లన్నియు నిచ్చి, కరుణించి విరించి యి ట్లనియె. 91

శా. అన్నా! కశ్యపపుత్ర! దుర్లభము లీ యర్థంబు లె వ్వారికిన్
ము న్నెవ్వారలుఁ గోర రీ వరములన్ మోదించితి న్నీ యెడన్
నన్నున్ గోరినవెల్ల నిచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధి సం
పన్నత్వంబున నుండుమీ! సుమతి వై భద్రైకశీలుండ వై. 92

వ. అని యి ట్లమోఘంబు లైన వరంబు లిచ్చి, దితినందనుచేతం బూజితుం డై యరవింద సంభవుండు బృందారక సందోహ వంద్యమానుం డగుచు, నిజమందిరంబునకుం జనియె. ఇ వ్విధంబున నిలింపారాతి వరపరంపరల సంపాదించుకొని. 93

క. సోదరుఁ జంపిన పగకై, యాదర మించుకయు లేక యసురేంద్రుఁడు కం
జోదరు పై వైరము దు, ర్మాదరతుం డగుచుఁ జేసె మనుజాధీశా! 94

సీ. ఒకనాఁడు గంధర్వ యూథంబుఁ బరిమార్చు దివిజుల నొకనాఁడు దెరలఁ దోలు
భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు గ్రహముల నొకనాఁడు గట్టివైచు
నొకనాఁడు యక్షుల నుగ్రత దండించు నొకనాఁడు విహగుల నొడిసిపట్టు
నొకనాఁడు సిద్ధుల నోడించి బంధించు మనుజుల నొకనాఁడు మదము లడఁచు

తే. కడిమి నొకనాఁడు కిన్నర ఖచర సాధ్య
చారణ ప్రేత భూత పిశాచ వన్య
సత్త్వ విద్యాధరాదుల సంహరించి
దితితనూజుండు దుస్సహ తేజుఁ డగుచు. 95

క. [1]అ ట్టళ్ళతోడఁ గోటలు, కట్టలుకం గూలఁ ద్రోచి క్రవ్యాదులతోఁ
జుట్టువిడిసి దిక్పాలుర, [2]పట్టణములు గొనియె నతఁడు బలమున నధిపా! 96

క. కృశ లై సంప్రాపిత దు, ర్దశ లై సర్వంకషోగ్ర దైతేయాజ్ఞా
వశ లై నిశలును దినములు, దిశ లెల్లను గట్టువడియె దీనత ననఘా! 97

వ. మఱియు, న ద్దానవేంద్రుండు విద్రుమ [3]సోపానంబులును, మరకతమణిమయ ప్రదేశంబులును, వైడూర్య రత్న స్తంభసముదయంబులును, చంద్రికాసన్నిభ

## అధ్యాయము - ౪

వ. అని మఱియు, రణంబులందుఁ దన కెదురులేని శౌర్యంబును, లోకపాలకుల నతిక్రమించు మహిమయును, భువనత్రయ జయంబును, హిరణ్యకశిపుండు గోరిన, నతని తపంబునకు సంతోషించి, దుర్లభంబు లైన వరంబు లన్నియు నిచ్చి, కరుణించి విరించి యి ట్లనియె. 91

శా. అన్నా! కశ్యపపుత్ర! దుర్లభము లీ యర్థంబు లె వ్వారికిన్
ము న్నెవ్వారలుఁ గోర రీ వరములన్ మోదించితి న్నీ యెడన్
నన్నున్ గోరినవెల్ల నిచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధి సం
పన్నత్వంబున నుండుమీ! సుమతి వై భద్రైకశీలుండ వై. 92

వ. అని యి ట్లమోఘంబు లైన వరంబు లిచ్చి, దితినందనుచేతం బూజితుం డై యరవింద సంభవుండు బృందారక సందోహ వంద్యమానుం డగుచు, నిజమందిరం బునకుం జనియె. ఇ వ్విధంబున నిలింపారాతి వరపరంపరల సంపాదించుకొని. 93

క. సోదరుఁ జంపిన పగ కై, యాదర మించుకయు లేక యసురేంద్రుఁడు కం
జోదరు పై వైరము దు, ర్మాదరతుం డగుచుఁ జేసె మనుజాధీశా! 94

సీ. ఒకనాఁడు గంధర్వ యూథంబుఁ బరిమార్చు దివిజుల నొకనాఁడు దెరలఁ దోలు
భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు గ్రహముల నొకనాఁడు గట్టివైచు
నొకనాఁడు యతుల నుగ్రత దండించు నొకనాఁడు విహగుల నొడిసిపట్టు
నొకనాఁడు సిద్ధుల నోడించి బంధించు మనుజుల నొకనాఁడు మదము లడఁచు

తే. కడిమి నొకనాఁడు కిన్నర ఖచర సాధ్య
చారణ ప్రేత భూత పిశాచ వన్య
సత్త్వ విద్యాధరాదుల సంహరించి
దితితనూజుండు దుస్సహ తేజుఁ డగుచు. 95

క. [1]అ ట్టళ్ళతోడఁ గోటలు, కట్టలుకం గూలఁ ద్రోచి క్రవ్యాదులతోఁ
జుట్టువిడిసి దిక్పాలుర, [2]పట్టణములు గొనియె నతఁడు బలమున నధిపా! 96

క. కృశ లై సంప్రాపిత దు, ర్దశ లై సర్వంకషోగ్ర దై తేయాజ్ఞా
వశ లై నిశలును దినములు, దిశ లెల్లను గట్టువడియె దీనత ననఘా! 97

వ. మఱియు, న ద్దానవేంద్రుండు విద్రుమ [3]సోపానంబులును, మరకతమణిమయ ప్రదేశంబులును, వైడూర్య రత్న స్తంభసముదయంబులును, చంద్రికాసన్నిభ

---

1. అట్టములతోడ(ట) 2. పట్టణములు చూరగొనియె బలమున నధిపా(క) 3. సోపానంబులును(హ)

స్ఫటికసంఘటిత కుడ్యంబులును, బద్మరాగపీఠ కనకకవాట గేహాళీ విటంక వాతాయనంబులును, విలంబమాన ముక్తాఫలదామవితాన శోభిత ధవళ పర్యంకంబులును, వివిధ విచిత్ర విమానంబులును, నిరంతర సురభి కుసుమ ఫల భరిత పాదప మహోద్యానంబులును, హేమారవింద సౌగంధిక బంధుర సరోవరంబులును, రమణీయ రత్న ప్రాసాద విశేషంబులును, మనోహర పరిమళ శీతల మందమారుతంబులును, మృదు మధుర నినద కీర కోకిలకుల కోలాహలంబులునుఁ గలిగి, విశ్వకర్మనిర్మితంబై, త్రైలోక్య రాజ్యలక్ష్మీ శోభితంబైన మహేంద్రభవనంబు సొచ్చి. 98

మ. దితిపుత్రుండు జగత్త్రయైక విభుఁడై దేవేంద్ర సింహాసనో
ద్ధతుఁడై యుండ [1]హరాచ్యుతాంబుజభవుల్ దప్పంగ భీతిన్ సమా
గతులై తక్కిన యక్ష కిన్నర మరు ద్గంధర్వ సిద్ధాదు లా
నతులై కానుక లిచ్చి [2]కొల్తు రతనిన్ నానా ప్రకారంబులన్. 99

శా. ఏ దిక్పాలురఁ జూచి నేఁ డలుగునో ? యే దేవు బంధించునో ?
యే దిగ్భాగముమీఁద దాడి చనునో ? యే ప్రాణులం జంపునో ?
యీ దైత్యేశ్వరుఁ డంచు నొండొరులు దా రింద్రాదు లాస్థానభూ
వేదిన్ మెల్లన నిక్కి చూతురు భయావిర్భూత రోమాంచులై. 100

సీ. కోలాహలము మాని కొలువుఁడు సురలార ! [3]తలఁగి దీవింపుఁడు తపసులార !
ఫణ లెత్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార ! ప్రణతులై చనుఁడు దిక్పాలురార !
గానంబు సేయుఁడు గంధర్వవరులార ! సందడిఁ [4]బడకుఁడు సాధ్యులార !
ఆడుఁడు నృత్యంబు లప్సరోజనులార ! [5]చేరిక మ్రొక్కుఁడు సిద్ధులార !

తే. శుద్ధ కర్పూర వాసిత సురభి మధుర
భవ్య నూతన మైరేయ పానజనిత
సుఖవిలీనత నమరారి సొక్కినాఁడు
శాంతి లేదండ్రు నిచ్చలుఁ జారు లధిప ! 101

శా. లీలోద్యాన [6]లతానివాసములలో లీలావతీ యుక్తుఁడై
హాలాపాన వివర్ధమాన మద లోలావృత్త తామ్రాక్షుఁడై
కేళిం [7]దేలఁగ నేను తుంబురుఁడు సంగీత ప్రసంగంబులన్
[8]వాలాయంబు గరంగఁజేయుదుము దేవద్వేషి సర్వేశ్వరా ! 102

---

1. సరోరుహాసనభవుల్ (క) 2. కొల్చు (చ) 3. తవిలి (బ) 4. బలుకుఁడు (హ. క. బ.)
5. చేరక (హ): చెదరక (జ) 6. వితానములలో (క. జ.) 7. జేయఁగ (హ) 8. వాలాయించి (క.బ)

క. యాగములు బుధులు ధరణీ, భాగములం జేయుచుండఁ బఱతెంచి హవి
ర్భాగములు దాన కైకొనుఁ, [1]జాగింపఁడు దైత్యుఁ డమరసంఘంబునకున్. 103

సీ. సకల మహాద్వీప సహిత విశ్వంభరా స్థలిని దున్నక పండు సస్యచయము
కామధేన్వాదుల కరణి నర్థులు గోరు కోర్కులు గగనంబు గురియుచుండు
వననిధు లేడును వాహినీ [2]సందోహ ములును వీచుల రత్నములు వహించు
నుర్వీరుహంబులు [3]నొక్కకాలంబున నఖిలర్తు గుణముల నతిశయిల్లు

తే. నంబుసంపూరిత ద్రోణు లగుచు నొప్పు
పర్వతంబులు సకల దిక్పాల వివిధ
గుణము లెల్లను దానె కైకొనుచు దైత్య
విభుఁడు త్రైలోక్యరాజ్య సంవృద్ధి [4]నుండ. 104

వ. ఇట్లు సకలదిక్కులు నిర్జించి, లోకైక నాయకుం డై, తన యిచ్ఛాప్రకారంబున నింద్రియసుఖంబు లనుభవింపుచుం, దనియక శాస్త్రమార్గంబు నతిక్రమించి, విరించి వరజనిత దుర్వార గర్వాతిరేకంబున సురవైరి యైశ్వర్యవంతుం డై పెద్దకాలంబు రాజ్యంబు సేయునెడ. 105

ఉ. ఎన్నఁడు మాకు దిక్కు గల? దెన్నఁడు దైత్యుని బాధ మాను? మే
మెన్నఁడు వృద్ధిఁ బొందఁగల? మెవ్వఁడు రక్షకుఁ? డంచు దేవతా
కిన్నర సిద్ధ సాధ్య ముని ఖేచరనాయకు లాశ్రయించి రా
పన్నగతల్పు భూరి భవబంధ విమోచనుఁ బద్మలోచనున్. 106

వ. ఇట్లు దానవేంద్రుని యుగ్రదండంబునకు వెఱచి, యనన్య శరణ్యు లై రహస్యంబున నందఱుం గూడికొని. 107

ఉ. ఎక్కడ నున్నవాఁడు? జగదీశ్వరుఁ డాత్మమయుండు మాధవుం,
[5]డెక్కడి కేఁగి శాంతులు మునీశులు భిక్షులు రారు? క్రమ్మఱన్
[6]దిక్కుల కెల్ల నెక్కుడు తుదిం జొర దిక్కగు నట్టి దిక్కుకున్
మ్రొక్కెద మేము హస్తయుగముల్ ముకుళించి మదీయ రక్షకున్. 108

వ. అని మఱియు, నాహారనిద్రలు మాని, చిత్తంబులు పరాయత్తంబులు గానీక సమాహిత బుద్ధు లై భగవంతుండును, మహాపురుషుండును, మహాత్ముండును, విశుద్ధ జ్ఞానానందమయుండును నైన హృషీకేశునకు నమస్కరించుచున్న యెడ,

---

1. సాగింపడు (క.ట.త.జ.డ.బ.) చాగింపఁడు (హ) 2. సంఘాత (జ. ద. బ) 3. నురుల తాజాలంబు (తం) 4. నొంది (హ) 5. ఎక్కడికేఁగె (హ) 6. దిక్కులనెల్ల నెక్కడ (హ)

మేఘరవసమాన గంభీరనినదంబున దిశలు మ్రోయించుచు, సాధులకు నభయంబు గావింపుచు, దృశ్యమానుండునుం గాక పరమేశ్వరుం డైన హరి యిట్లనియె.

మ. భయముం జెందకుఁ[1]డయ్య! నిర్జరవరుల్ భద్రంబు మీ కయ్యెడిన్
జయమున్ లాభము భూతసంతతికి మ త్సందర్శన ప్రాప్తి న
వ్యయ మై చేరు నెఱుంగుడున్ దితిసుత వ్యాపార భాషావిప
ర్యయముం గాలము గూడఁ జంపెదఁ జనుం డందాఁక మీ త్రోవలన్. 110

ఆ. శుద్ధ సాధులందు సురలందు శ్రుతులందు
గోవులందు విప్రకోటియందు
[2]ధర్మపదవియందుఁ దలిగి నాయందు వాఁ
డెన్నఁ డలుగు నాఁడె హింసఁ జెందు. 111

క. కన్నకొడుకు శమ దమ సం, పన్నుని నిర్వైరుఁ డనక ప్రహ్లాదుని వాఁ
డెన్నఁడు రోషంబున నా, పన్నత నొందించు నాఁడె పట్టి వధింతున్. 112

శా. వేధోదత్త వర[3]ప్రసాద గరిమన్ వీఁ డింతవాఁ డై మిమున్
[4]బాధం బెట్టుచునున్నవాఁ డని మదిన్ భావింతు భావించి నే
సాధింపం దఱికాదు కావునఁ గడున్ సైరించితిన్ మీఁదటన్
సాధింతున్ సురలార! [5]నేఁడు సనుఁడా! శంకింప మీ కేటికిన్? 113

వ. అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన, నిలింపులు గుంపులుగొని మ్రొక్కి, రక్కసుండు [6]మ్రక్కుట నిక్కం బని తమతమ దిక్కులం జనిరి. హిరణ్యకశిపునకు విచిత్రచరిత్రులు నలువురు పుత్రు లుద్భవించిరి. అందు. 114

—: ప్రహ్లాద చరిత్ర :—

సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరుగువాఁడు
పెద్దలఁ బొడగన్న భృత్యునికై వడి చేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డం బైన మాతృభావన సేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను దీనులఁ గావఁ జింతించువాఁడు

తే. [7]సములయెడ సోదరస్థితి [8]జరుపువాఁడు
దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలిత మర్యాదుఁ డైన ప్రహ్లాదుఁ డధిప! 115

1. రయ్య (క. బ.) 2. తప్పి (ట) 3. ప్రభావ (క) 4. బాధం జేయుచు (హ); బాధల్ పెట్టుచు-అనియుండనగును 5. మీరు సనుడా (క. త.) 6. మ్రగ్గుట (హ) 7. సఖుల (హ) 8. జరుగువాడు (క. చ. ట. డ.); పలుపువాడు (బ)

వ. మఱియును. 116

సీ. ఆకార జన్మ విద్యార్థ [1]వరిష్ఠుఁ డై గర్వ సంస్తంభ సంగతుఁడు గాఁడు
వివిధ మహానేక విషయసంపన్నుఁ డై పంచేంద్రియములచేఁ బట్టువడఁడు
భవ్య వయో బల ప్రాభవోపేతుఁ డై కామ రోషాదులఁ గ్రందుకొనఁడు
కామినీప్రముఖ భోగము లెన్ని గలిగిన వ్యసనసంసక్తి నా వంకఁ బోఁడు

ఆ. విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు
వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు
ధరణినాథ! దైత్యతనయుండు హరిపర
తంత్రుఁ డై హతాన్యతంత్రుఁ డగుచు. 117

ఆ. సద్గుణంబు లెల్ల సంఘంబు లై వచ్చి
యసురరాజ తనయునందు నిలిచి
పాసి చనవు విష్ణుఁ బాయనివిధమున
[2]నెమ్మి దగిలియుండు నిర్మలాత్మ! 118

మ. పగవా రైన సురేంద్రులుం సభలలోఁ బ్రహ్లాదసంకాశులం
సుగుణోపేతుల నెందు మే మెఱుఁగ మంచున్ వృత్తబంధంబులం
బొగడం జొత్తురు సత్కవీంద్రులక్రియం భూనాథ! మీబోఁటి స
ద్భగవద్భక్తులు దైత్యరాజ తనయుం బాటించి కీర్తింపరే! 119

క. గుణనిధి యగు ప్రహ్లాదుని, గుణము లనేకములు గలవు గురుకాలమునం
గణుతింప నశక్యంబులు, ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిం. 120

వ. ఇట్లు సద్గుణగరిష్ఠుం డైన ప్రహ్లాదుండు భగవంతుం డైన వాసుదేవునియందు
సహజ సంవర్ధమాన నిరంతర ధ్యాన రతుం డై. 121

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ [3]జేరిన య ట్లైన చెలికాండ్ర నెవ్వరిఁ జేర మఱచు
నసురారి దనమ్రోల నాడిన[4] య ట్లైన నసురబాలురతోడ నాడ మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించి న ట్లైన పరభాషలకు [5]మాఱుపలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచిన[6] య ట్లైనఁ జొక్కి సమస్తంబు జూడ మఱచు

---

1. విశిష్టుడై (చ. త. జ. ద.) గరిష్ఠుడై (ట. డ.)
2. నెపుడు (హ) నిండి తగిలియుండు (చ. జ. డ.) నెందు దగిలియుండు (ట. ద. బ.) నేఁడు గలిగియుండు (తం), నేఁడు దగిలియుండు (వా) 3. జేరిన యెట్లైన (హ) యెట్లైన (హ)
4. మాఱుబలుక వెఱచు (హ) 5. యెట్లైన (హ)

తే. హరి పదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండిన దైన నతఁడు
నిత్య పరిపూర్ణుఁ డగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండును జడునిభంగి. 122

శా. పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషింపుచున్ హాస లీ
లా నిద్రాదులు సేయుచుఁ దిరుగుచున్ లక్షింపుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుం డై మఱచెన్ సురారిసుతుఁ డేత ద్విశ్వమున్ భూవరా! 123

సీ. వైకుంఠ చింతావివర్జిత [1]చేష్టుఁ డై యొక్కఁడు [2]నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావ నారూఢచిత్తుఁ డై యుద్ధతుఁ డై పాడు నొక్కచోట
విష్ణుఁ డింతియ కాని వేఱొండు లేదని యొత్తిలి నగుచుండు నొక్కచోట
నళినాక్షుఁ డను నిధానముఁగంటి [3]నేఁ డని యుబ్బి గంతులు వైచు నొక్కచోటఁ

ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయ హర్ష జనిత బాష్పసలిల
మిళిత పులకుఁ డై నిమీలిత నేత్రుఁ డై
యొక్కచోట [4]నిలిచి యూరకుండు. 124

వ. ఇట్లు పూర్వజన్మ పరమభాగవత సంసర్గ సమాగతం బైన ముకుంద చరణారవింద సేవాతిరేకంబున నఖర్వ నిర్వాణభావంబు విస్తరింపుచు, నప్పటప్పటికి దుర్జన సంసర్గ నిమిత్తంబునం దన చిత్తం బన్యాయత్తంబు గానీక నిజాయత్తంబు సేయుచు, నప్రమత్తుండును, సంసార నివృత్తుండును, బుధజన విధేయుండును, మహాభాగధేయుండును, సుగుణ మణిగణ గరిష్ఠుండును, బరమ భాగవతశ్రేష్ఠుం డును, గర్మబంధలతా లవిత్రుండును, *(బవిత్రుండును నైన పుత్రునియందు విరోధించి, సురవిరోధి యనుకంప లేక చంపం బంపె. అని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె. 125

శా. పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధి సెప్పి దురితోన్మేషంబు వారింతు రే
శత్రుత్వంబుఁ దలంప [5]రెట్టియెడ నా సౌజన్య రత్నాకరున్
బుత్రున్ లోకపవిత్రుఁ దండ్రి [6]నెగులుం బొందింప నెట్లోర్చెనో! 126

---

1. ష్వాంతుడై (ర) 2. నాఁడును (హ) 3. నేనని (హ. తం. వా.) 4. నగుచు (హ)

* శా. వ. ప్రతులలోలేదు. 5. రిట్టియెడ (వా) 6. మిగులం బాధింప (హ)

ఉ. బాలుఁ బ్రభావిశాలు హరి పాదపయోరుహ చింతనక్రియా
లోలుఁ గృపాళు సాధు గురు లోక [1]పదానత పాలు నిర్మల
శ్రీలు సమస్త సభ్య నుతశీలు విఖండిత మోహవల్లికా
జాలు నదేల తండ్రి వడిఁ జంపగఁ బంపె ? మునీంద్ర ! సెప్పవే. 127

అధ్యాయము – ౫

వ. అనిన నారదుం డి ట్లనియె. 128

శా. లభ్యం బైన సురాధిరాజపదముఁ లక్షింపఁ డక్రాంతముఁ
సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁ డై జాడ్యంబుతో వీఁడు వి
ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతి గాఁడంచుఁ విచారించి దై
త్యేభ్యుం డొక్కదినంబునం బ్రియసుతుఁ వీక్షించి సోత్కంఠుఁ డై. 129

క. చదువనివాఁ డజ్ఞుం డగుఁ, జదివిన స దస ద్వివేక చతురత గలుగుం
జదువఁగ వలయును జనులకుఁ, జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ. 130

వ. అని పలికి, యసురలోక పురోహితుండును (భగవంతుండును నగు) శుక్రాచార్యు కొడుకులఁ బ్రచండవితర్కు లైన చండామర్కుల రావించి, సత్కరించి యి ట్లనియె. 131

శా. అంధ [3]ప్రక్రియ నుండు రాఁడు పలుకం డస్మ త్ప్రతాపక్రియా
గంధం బించుక లేదు మీరు గురువుల్ కారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు మముం బాటించి యీబాలకున్
గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం గాఁ జేసి రక్షింపరే ! 132

వ అని పలికి, వారలకుం బ్రహ్లాదు నప్పగించి, తోడ్కొనిపొం డనిన, వారును దనుజరాజ కుమారునిం గొనిపోయి, యతనికి సమానవయస్కులగు సహశ్రోతల నసురకుమారులం గొందఱం గూర్చి. 133

ఉ. అంచిత భక్తితోడ దనుజాధిపు గేహసమీపముం బ్రవే
శించి సురారిరాజసుతుఁ జేకొని శుక్రకుమారకుల్ పఠిం
పించిరి పాఠయోగ్యములు పెక్కులు శాస్త్రము లా కుమారుఁ డా
లించి పఠించె నన్నియుఁ జలింపని వైష్ణవభక్తిపూర్ణుఁ డై. 134

క. ఏ పగిది వారు సెప్పిన, నా పగిదిం [4]జదువు గాని యట్టి ట్టని యా
క్షేపింపఁడు తా నన్నియు, రూపించిన మిథ్య లని నిరూఢ మనీషన్. 135

---

1. పదాసితపాలు (హ); పదానతజాలు (క) 2. సురారిరాజపదముఁ (హ) 3. ప్రక్రియ నున్నవాఁడు (తం. వా.) 4. చెప్పు (హ)

శా. అంతం గొన్నిదినంబు లేఁగిన సురేంద్రారాతి శంకాన్విత
స్వాంతుం డై నిజనందనుం గురువు లే జాడం బఠింపించిరో ?
భ్రాంతుం డేమి పఠించెనో ? పిలిచి సంభాషించి విద్యాపరి
శ్రాంతిం జూచెదఁ గాక నేఁ డని మహా సౌంధాంత రాసీనుఁ డై. 136

ఉ. మోదముతోడ దైత్యకులముఖ్యుఁడు రమ్మని చీరఁబంచె బ్ర
హ్లాదకుమారకున్ భవ మహార్ణవ తారకుఁ గామ రోష లో
భాది విరోధివర్గ పరిహారకుఁ గేశవ చింతనామృ తా
స్వాద కఠోరకున్ గలుషజాల మహోగ్రవనీ కుఠారకున్. 137

వ. ఇట్లు చారులచేత నాహూయమానుం డై ప్రహ్లాదుండు సనుదెంచిన. 138

శా. ఉత్సాహ ప్రభు మంత్రశక్తి యుత మై యుద్యోగ మారూఢ సం
వి త్సంపన్నుఁడ వై తివే? చదివితే వేదంబులున్ శాస్త్రముల్ ?
వత్సా ! ర మ్మని చేరఁ జీరి కొడుకున్ వాత్సల్య [1]సంపూర్ణుఁ డై
యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపఁగన్. 139

క. అనుదిన సంతోషణములు, జనిత శ్రమ తాప దుఃఖ సంశోషణముల్
తనయుల సంభాషణములు, జనకులకుం గర్ణయుగళ స ద్భూషణముల్. 140

వ. అని మఱియుఁ బుత్రా ! నీకు నెయ్యది భద్రం బై యున్నది ? చెప్పు మనినఁ గన్న తండ్రికిఁ బ్రియనందనుం డి ట్లనియె. 141

చ. ఎల్ల శరీరధారులకు నిల్లను చీఁకటి నూతి లోపలం
ద్రెళ్ళక వీరు నే మను మతిభ్రమణంబున భిన్ను లై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతని దివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ ! 142

వ. అని కుమారుం డాడిన ప్రతిపక్షానురూపంబు లైన సల్లాపంబులు విని, దానవేంద్రుండు నగుచు ని ట్లనియె. 143

క. ఎ ట్టాడిన న ట్టాడుదు, రిట్టి ట్టని [2]పలుక నెఱుఁగ రితరుల శిశువుల్
దట్టించి యెవ్వ [3]రేనియుఁ, బట్టించిరొ ? బాలకునకుఁ బరపక్షంబుల్. 144

శా. నాకుం జూడఁగఁ జోద్య మయ్యెడుఁగదా ! నా తండ్రి యీబుద్ధి దా
నీకున్ లోపలఁ దోఁచెనో ? పరులు దుర్నీతుల్ పఠింపించిరో ?
యేకాంతంబున భార్గవుల్ పలికిరో ? యీ దానవశ్రేణికిన్
వై కుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్ ? 145

1. మేపారగా (క) 2. మాఱుపలుక నెఱుగరు శిశువుల్ (క) 3. రేమని (క. చ. తం. వా.)

మ. సురలం దోలుటయో! సురాధిపతులన్ స్రుక్కించుటో! సిద్ధులం
బరివేధించుటయో! ముని ప్రవరులన్ బాధించుటో! యక్ష కి
న్నర గంధర్వ విహంగ నాగపతుల న్నాశంబు నొందించుటో!
హరి యంచున్ గిరి యంచు నేల చెడ? మోహాంధుండవై పుత్రకా! 146

వ. అనినఁ దండ్రిమాటలకుఁ బురోహితు నిరీక్షించి, ప్రహ్లాదుం డిట్లనియె. మోహ నిర్మూలనంబు సేసి, యెవ్వనియందుఁ దత్పరులైన యెఱుక గల పురుషులకుఁ బరులు దా రనియెడు మాయాకృతం బైన యసద్గ్రాహ్యంబు గానంబడ దట్టి పరమేశ్వరునకు నమస్కరించెద. 147

శా. అజ్ఞుల్ గొందఱు మేము దా మనుచు మాయం జెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యు వరాన్వయ క్రమములన్ భావింపఁగా నేర రా
జిజ్ఞాసా పథమందు మూఢులు గదా! చింతింప బ్రహ్మాది వే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ దర్శింపఁగా నేర్తురే? 148

తే. ఇనుము మయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశుసన్నిధి నా విధమునఁ
గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంత మగుచు. 149

సీ. మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే? మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాలపల్లవ ఖాది యై చొక్కు కోయిల సేరునే? కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక మరుగునే? సాంద్ర నీహారములకు

తే. అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పానవిశేష మత్త
చిత్త మేరీతి [1]నితరంబుఁ జేరనేర్చు
వినుతగుణశీల! మాటలు వేయునేల? 150

వ. అనిన విని రోషించి, రాజసేవకుం డైన పురోహితుండు ప్రహ్లాదుం జూచి, తిరస్కరించి యి ట్లనియె. 151

ఉ. పంచశర ద్వయస్కుఁడవు బాలుఁడ వించుక గాని లేవు భా
షించెదు తర్కవాక్యములఁ జెప్పిన శాస్త్రములోని యర్థ మొ
క్కించుక యైనఁ జెప్ప వసురేంద్రుని ముందట మాకు నౌదలల్
వంచుకొనంగఁ జేసితివి వైరి విభూషణ! వంశదూషణా! 152

1. నితరుల (హ)

చ. తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు దైత్య చం
దనవనమందుఁ గంటకయుత క్షితిజాతముభంగిఁ బుట్టినాఁ
డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి సేయుచుండు దం
డనమునఁ గాని శిక్షలకు డాయఁడు పట్టుఁడు కొట్టుఁ డుద్ధతిన్. 153

క. నీ పాపనిఁ జదివించెద, నీ పాదము లాన యింక నిపుణతతోడం
గోపింతుము దండింతుము, కోపింపకుమయ్య! దనుజకుంజర వింటే! 154

వ. అని మఱియు, నా రాచపాపనికి వివిధోపాయంబులం బురోహితుండు వెఱపుఁ జూపుచు రాజసన్నిధిం బాపి, తోడుకొని పోయి యేకాంతంబున. 155

క. భార్గవనందనుఁ డతనికి, మార్గము సెడకుండఁ బెక్కుమాఱులు నిచ్చల్
వర్గత్రితయముఁ జెప్పె న,నర్గళ మగు మతివిశేష మమర నరేంద్రా! 156

వ. మఱియు, గురుండు శిష్యునకు సామ దాన భేద దండోపాయంబు లన్నియు నెఱింగించి, నీతికోవిదుం డయ్యె నని నమ్మి నిశ్చయించి, తల్లికి నెఱింగించి, తల్లిచేత నలంకృతుం డైన కులదీపకు నవలోకించి. 157

ఉ. త్రిప్పకు మన్న మా మతము దీర్ఘము లైన త్రివర్గపాఠముల్
దప్పకు మన్న! నేఁడు మన దైత్యవరేణ్యుని మ్రోల నేము మున్
చెప్పినరీతి గాని మఱి సెప్పకు మన్న! విరోధి [1]నీతులన్,
విప్పకు మన్న! దుష్ట మగు విష్ణుచరిత్ర కథార్థ జాలముల్. 158

వ. అని బుజ్జగించి, దానవేంద్రుని సన్నిధికిం దోడి తెచ్చిన. 159

సీ. అడు గడ్గునకు మాధ వానుచింతన సుధామాధుర్యమున మేను మఱచువాని
నంభోజగర్భాదు లభ్యసింపఁగలేని హరిభక్తి పుంభావ మైనవాని
మాతృగర్భముఁ జొచ్చి మన్నది మొదలుగాఁ జిత్త మచ్యుతుమీఁదఁ జేర్చువాని
నంకించి తనలోన నఖిల ప్రపంచంబు శ్రీవిష్ణుమయ మని చెలఁగువాని

తే. వినయ కారుణ్య [2]బుద్ధివివేక లక్ష
ణాది గుణముల కాటప ట్టయిన వాని
శిష్యు బుధలోక సంభావ్యుఁ జీరి గురుఁడు
ముందటికి ద్రొబ్బి తండ్రికి మ్రొక్కు మనుచు. 160

క. శిక్షించితి మన్యము లగు, పక్షంబులు మాని నీతిపారగుఁ డయ్యెన్
రక్షోవంశాధీశ్వర!, వీక్షింపుము నీ కుమారు విద్యాబలమున్. 161

---

1. శాస్త్రముల్ (హ) 2. శీల (డ)

వ. అని పలికిన, శుక్రకుమారకు వచనంబు లాకర్ణించి, దానవేంద్రుండు దనకు దండ ప్రణామంబు చేసి నిలుచున్న కొడుకును దీవించి, బాహుదండంబులు సాఁచి, దిగ్గనం డగ్గఱం దిగిచి, పెద్ద తడవు గాఢాలింగనంబు సేసి, తన తొడ మీఁద నిడుకొని, చుంచు దువ్వి, చుబుకంబు పుణికి, చెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ప్రేమాతిరేక సంజనిత బాష్పబిందు సందోహంబుల నతని వదనార విందంబుఁ దడపుచు, మందమధురాలాపంబుల ని ట్లనియె. 162

శా. చోద్యం బయ్యెడు నింతకాల మరిగెన్ శోధించి యే మేమి సం
[1]వేద్యాంశంబులు సెప్పిరో ? గురువు లే వెంటం బఠింపించిరో ?
విద్యాసార మెఱుంగఁ గోరెద భవ ద్విజ్ఞాత శాస్త్రంబులోఁ
బద్యం బొక్కటి చెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా ! 163

శా. నిన్నుం మెచ్చరు నీతిపారమహిమ [2]స్నీతోడి దైత్యార్భకుల్
గన్నా రన్నియుఁ జెప్ప నేర్తురుగదా ! గ్రంథార్థముల్ దఱు లై
యన్నా ! యెన్నఁడు నీవు [3]నీతిమతి వౌ దంచుం మహోవాంఛతో
నున్నాఁడ న్ననుఁ గన్నతండ్రి ! [4]భవదీ యోత్కర్షముం జూపవే ! 164

వ. అనినం గన్నతండ్రికిఁ బ్రియనందనుం డైన ప్రహ్లాదుం డి ట్లనియె. 165

క. చదివించిరి నను గురువులు, సదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మ మెల్లఁ జదివితిఁ దండ్రీ ! 166

మ. [5]తను హృ ద్భాషల సఖ్యముం శ్రవణముం దాసత్వముం వందనా
ర్చనముల్ సేవయు ‡నాత్మలో నెఱుకయుం [6]సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముం హరి న్నమ్మి స
జ్జనుఁ డై యుండుట భద్రమంచుఁ దలఁతుం సత్యంబు దైత్యోత్తమా ! 167

శా. అంధేం దూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూక స
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూకాంతుల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మ హవ్యములు లుబ్ధ ద్రవ్యముల్ క్రోడ [7]స
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్త వ్యర్థ సంసారముల్. 168

---

1. వేద్యార్థంబులు (డ) 2. నీతోటి (హ) 3. నీతినిధి వౌదంచున్ (జ.డ.ద.) నీతివిదుడౌ దంచుం (బ. తం. వా.) 4. భవదీయోత్కర్ష తం (హ) 5. హృగ్భాషల (హ.త.జ.డ.ద.) 6. సత్కీర్తియుం (హ) 7. సద్గంధంబుల్ (హ) † "ఆత్మ నివేదనమ్" అని మూలము(5-23)

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
[1]దండ్రి! హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి. 169

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే? పవన గుంభిత చర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే? ఢమఢమ ధ్వనితోడి ఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే? తరుశాఖ నిర్మిత దర్వి గాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే? తను కుడ్య జాల రంధ్రములు గాక

ఆ. చక్రిచింత లేని జన్మంబు జన్మమే?
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే?
పాదయుగము[2]తోడి పశువు గాక. 170

సీ. సంసారజీమూత సంఘంబు విచ్చునే? చక్రి దాస్యప్రభంజనము లేక
తాపత్ర యాభీల దావాగ్ను లాఱునే? విష్ణుసేవామృత వృష్టి లేక
సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే? హరి మనీషా బడబాగ్ని లేక
ఘన విప ద్గాఢాంధకారంబు లణఁగునే? పద్మాక్షు నుతి రవిప్రభలు లేక

తే. నిరుప మాపునరావృత్తి నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే? ముఖ్యమైన
శార్ఙ్గి కోదండ చింతనాంజనము లేక
తామరస గర్భునకు నైన దానవేంద్ర! 171

వ. అని యి వ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక, యులుకు చెడి పలికెడు కొడుకు నుడువులు చెవులకు ములుకుల క్రియ నొదవినఁ, [3]బెదవు లదరం గదురుచు, నదరిపడి, గురుసుతునిం గనుంగొని, విమత కథనంబులు గఱపినాఁడ వని దానవేంద్రుం డి ట్లనియె. 172

1. తగిలి హరిఁజేరు (ట) 2. తోఁటి (హ) 3. కటము లదరఁ బెదవులం గఱచుచు (హ. వా) పెదవు లదరం బదరుచు (ట. త.) పెదవు లదుర కనలుచు నదరిపడి (డ)

చ. పటుతర నీతిశాస్త్రచయ పారగుఁ జేసెద నంచు బాలు నీ
వటు గొనిపోయి వానికి ననర్థము లైన విరోధి శాస్త్రముల్
కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిన్
గటకట! బ్రాహ్మణాకృతివి గాక యథార్థపు బ్రాహ్మణుండవే? 173

క. ధర్మేతర వర్తనులును, [1]దుర్మంత్రులు నైన జనుల దురితము లొందున్
మర్మములు గలఁచి కల్మష, కర్ముల రోగములు వొందుకైవడి విప్రా! 174

వ. అనిన రాజునకుం బురోహితుం డి ట్లనియె. 175

ఉ. తప్పులు లేవు మావలన దానవనాథ! విరోధిశాస్త్రముల్
సెప్పము క్రూరులై పరులు సెప్పరు మీ చరణంబు లాన సు
మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు నైజమనీష; యెవ్వరుం
జెప్పెడిపాటి గాదు ప్రతిచింతఁ దలంపుము నేర్పు కైవడిన్. 176

క. మిత్రులము పురోహితులము, పాత్రుల మే మదియుఁ గాక భార్గవులము నీ
పుత్రుని నిటువలెఁ జేయఁగఁ, శత్రుల మే? దైత్య జలధి చంద్రమ వింటే? 177

వ. అనినం గురునందనుం గోపింపక దైత్యవల్లభుండు గొడుకు నవలోకించి యి
ట్లనియె. 178

క. ఒజ్జలు సెప్పని యీ మతి, మ జ్ఞాతుఁడ వైన నీకు మఱి యెవ్వరిచే
నుజ్జాత మయ్యె బాలక!, త జ్జనులం బేరుకొనుము తగ నా మ్రోలన్. 179

వ. అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డి ట్లనియె, 180

ఉ. అచ్చపుఁ జీఁకటిం బడి గృహవ్రతులై విషయ [2]ప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మఱలఁ జర్విత చర్వణులైనవారికిం
జెచ్చెరఁ బుట్టునే? పరులు సెప్పిన నైన నిజేచ్ఛ నైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేఁగిన నైన హరిప్రబోధముల్. 181

ఉ. కానని వాని నూఁతగొని కానని వాఁడు [3]విశిష్ట వస్తువుల్
గానని భంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁ గొంద ఱటఁ గందు రకించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజోఽభిషిక్తు లగు సంహృతకర్ములు దానవేశ్వరా! 182

---

1. దుర్మైత్రులు (తం) 2. ప్రమత్తులై (హ. క. చ.) 3. నభీష్ట (హ)

శా. శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ! వె య్యేటికిన్
గాథల్ మాధవశేముషీ తరణి సాంగత్యంబునం గాక దు
ర్మేధం దాటఁగ వచ్చునే? సుత వధూ మీనోగ్రవాంఛా మద
క్రోధోల్లోల విశాలసంసృతి మహా ఘోరామితాంభోనిధిన్. 183

వ. అని పలికిన కొడుకును ధిక్కరించి, మక్కువ సేయక, రక్కసులఱేఁడు దన తొడలపై నుండనీక గొబ్బున దిగఁద్రొబ్బి, నిబ్బరం బగు కోపంబు దీపింప, వేఁడి చూపుల మింట మంట లెగయ, మంత్రులం జూచి యి ట్లనియె. 184

—: హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని వివిధోపాయంబుల హింసించుట :—

శా. క్రోడం బై పినతండ్రిఁ జంపె నని తాఁ గ్రోధించి చిత్తంబులోఁ
వీడం జేయఁడు బంటుభంగి హరికిన్ విద్వేషికిన్ భక్తుఁ డై
యోడం డక్కట! ప్రాణవాయువులు వీఁ డొప్పించుచున్నాఁడు నా
తోడన్ వైరము[1]పట్టె నిట్టి జనకద్రోహిన్ [2]మహిన్ గంటిరే? 185

వ. అని రాక్షసవీరుల వీక్షించి యి ట్లనియె. 186

శా. పంచాబ్దంబులవాఁడు తండ్రి నగు నా పక్షంబు నిందించి య
త్కించి ద్భీతియు లేక విష్ణు నహితుం గీర్తింపుచున్నాఁడు వ
ద్దించుం జెప్పిన మానఁ డంగమునఁ బుత్త్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీని వధించి రండు దనుజుల్ మీ మీ పటుత్వంబులన్. 187

శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష సేయుక్రియ నీ యజ్ఞుం గులద్రోహి దు
స్సంగుం గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదన్ గులము నిర్దోషంబుఁ గావించెదన్. 188

క. హంతవ్యుఁడు రక్షింపను, మంతవ్యుఁడు గాఁడు యముని మందిరమునకున్
గంతవ్యుఁడు వధమున కుప, రంతవ్యుం డనక చంపి రం డీ [3]పడుచున్. 189

వ. అని దానవేంద్రుం డానతిచ్చిన, వాఁడికోఱల రక్కసులు పెక్కండ్రు శూల హస్తు లై వక్త్రంబులు దెఱచికొని యుబ్బి బొబ్బలిడుచు, ధూమసహిత దావ దహనంబునుం బోలెఁ దామ్రసంకాశంబు లైన కేశంబులు మెఱయ, భేదన వాదన చ్ఛేదనంబులు సేయుచు. 190

---

1. చేసెనిట్టి (ట. ద.) 2. కనుంగొంటిరే (హ) 3. వటునిన్ (హ. క. చ. జ.)

చ. బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్య సం
శీలుఁడు వీఁ డవధ్యుఁ డని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్ర వా
చాలత నందఱుఁ దివిజశత్రుఁడు వల్దనఁ డయ్యె భూవరా! 191

చ. *పలువురు దానవుల్ పొడువ బాలునిదేహము లేశమాత్రము
న్నొలియదు లోపలన్ రుధిర ముబ్బదు కందదు శల్యసంఘము
న్నలియదు దృష్టివైభవము నష్టముగాదు ముఖేందుకాంతియున్
బొలియదు నూతనశ్రమము పుట్టదు [1]పట్టదు దీనభావమున్. 192

ఉ. తన్ను నిశాచరుల్ వొడువ దైత్యకుమారుఁడు మాటిమాటి కో
పన్నగశాయి! యో దనుజభంజన! యో జగదీశ! యో మహా
పన్న శరణ్య! యో నిఖిలపావన! యంచు నుతించుఁ గాని తాఁ
గన్నుల నీరు దేఁడు భయకంప సమేతుఁడు గాఁడు భూవరా! 193

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బాహువు లొడ్డఁడు బంధురాజిలోఁ
దూఱఁడు ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని మిత్రవర్గమున్
జీరఁడు మాతృసంఘము వసించు సువర్ణ గృహంబులోనికిన్
దాఱఁడు కావరే యనఁడు తాపము నొందఁడు [2]కంటగింపఁడున్. 194

వ. ఇట్లు సర్వాత్మకం బై యిట్టి దట్టి దని నిర్దేశింపరాని పరబ్రహ్మంబు దాన యై యమ్మహావిష్ణుని యందుఁ జిత్తంబుఁ జేర్చి, తన్మయుం డై పరమానందంబునం బొందియున్న ప్రహ్లాదునియందు రాక్షసేంద్రుండు దన కింకరులచేతం జేయింపుచున్న మారణకర్మంబులు పాపకర్మునియందుఁ బ్రయుక్తంబు లైన సత్కారంబులుం బోలె విఫలంబు లగుటం జూచి. 195

ఉ. శూలముల న్నిశాచరులు స్రుక్కక దేహము నిగ్రహింపఁగా
బాలుఁడు నేలపైఁ బడఁడు పాఱఁడు చావఁడు తండ్రి నైన నా
పాలికి వచ్చి చక్రధరుపక్షము మానితి నంచుఁ బాదముల్
ఫాలము సోఁక మ్రొక్కఁ డనపాయత నొందుట కేమి హేతువో? 196

వ. అని శంకింపుచు. 197

సీ. ఒకమాటు దిక్కుంభియూథంబుఁ దెప్పించి కెరలి [3]బాలకునిఁ ద్రొక్కింపఁ బంపు
నొకమాటు విషభీక రోరగశ్రేణులఁ గడువడి నర్భకుఁ గఱవఁ బంపు
నొకమాటు హేతిసం ఘోగ్రానలములోన విసరి కుమారుని వేయఁ బంపు
నొకమాటు గూలంక షోల్లోల జలధిలో మొత్తించి శాబకు ముంపఁ బంపు

---

* ఈ పద్యమున క్రియాపద మొకటి యధికముగానున్నది.

1. మోమున (హా. క. చ. త. జ. డ. బ.) 2. కంటగింపఁగన్ (హ) 3. డింభకుని(ద.తం.వా.)

ఆ. విషము వెట్టఁ బంపు విదళింపఁగాఁ బంపు
దొడ్డకొండ చఱులఁ ద్రోయఁ బంపుఁ
బట్టి కట్టఁ బంపు [1]బాధింపఁగాఁ బంపు
బాలుఁ గినిసి దైత్యపాలుఁ డధిప! 198

సీ. ఒకవేళ నభిచార హోమంబు సేయించు నొకవేళ నెండల నుండఁ బంపు
నొకవేళ వానల నుపహతి నొందించు నొకవేళ రంధ్రంబు లుక్కఁ బట్టు
నొకవేళఁ దనమాయ నొదవించి బెగడించు నొకవేళ మంచున నొంటి నిలుపు
నొకవేళఁ బెనుగాలి కున్ముఖుఁ గావించు నొకవేళఁ బాఁతించు నుర్వియందు

తే. నీరు నన్నంబు నిడనీక నిగ్రహించుఁ
గశల నడిపించు నుబ్బించు గండశిలల
గదల వ్రేయించు నేయించు ఘనశరములఁ
గొడుకు నొకవేళ నమరారి క్రోధి యగుచు. 199

వ. మఱియు ననేక మారణోపాయంబులఁ బాపరహితుం డైన పాపని రూపుమాప లేక యేకాంతంబున దురంత చింతాపరిశ్రాంతుం డై రాక్షసేంద్రుండు దన మనంబున. 200

చ. ముంచితి వార్ధులం గదల మొత్తితి శైలతటంబులందుఁ ద్రో
బ్బించితి శస్త్రరాజిఁ బొడిపించితి మీఁద నిభేంద్రపంక్తిఁ ద్రో
క్కించితి ధిక్కరించితి శపించితి ఘోర దవాగ్నులందుఁ ద్రో
యించితిఁ బెక్కు [2]పాట్ల నలయించితిఁ జావఁ డి దేమి [2]చిత్రమో! 201

చ. ఎఱుఁగడు జీవనౌషధము లెవ్వరు భర్తలు లేరు బాధలన్
దరలఁడు నైజతేజమునఁ దథ్యము జాడ్యము లేదు మిక్కిలిన్
మెఱయుచునున్నవాఁ డొక నిమేషము దైన్యము నొందఁ డింక నే
తెఱఁగునఁ ద్రుంతు? వేసరితి దివ్యము వీని ప్రభావ మెట్టిదో! 202

వ. అదియునుం గాక తొల్లి శునశ్శేఫుం డను మునికుమారుండు దండ్రిచేత యాగ పశుత్వంబునకు దత్తుం డై తండ్రి దనకు నపకారి యని తలంపక బ్రతికిన చందంబున. 203

క. ఆగ్రహమున నేఁ జేసిన, నిగ్రహములు పరులతోడ నెఱి నొకనాఁడున్
విగ్రహము లనుచుఁ బలుకఁ డ, నుగ్రహములుగాఁ [3]దలంచునొవ్వఁడు మదిలోన్.

---

1. బాధింపుఁడని (హ) 2. బాధ (హా.క.జ.) 3. హేతువో (ట) 4. స్మరించు(ట.డ.ద.తం.వా.)

వ. కావున వీఁడు మహా తపఃప్రభావ సంపన్నుండు. వీని కెందును భయంబు లేదు. వీనితోడి విరోధంబునం దనకు మృత్యువు సిద్ధించు. అని నిర్ణయించి, చిన్నఁబోయి ఖిన్నుం డై ప్రసన్నుండు గాక క్రిందు సూచుచు విషణ్ణుం డై చింతనంబు సేయుచున్న రాజునకు మంతనంబునఁ జండామర్కు లి ట్లనిరి. 205

శా. శుక్రఖ్యాతివి నీ [1]ప్రభావము మహాచోద్యంబు దైత్యేంద్ర! రో
ష భ్రూయుగ్మ విజృంభణంబున దిగీశవ్రాతమున్ బోరులన్
విభ్రాంతంబుగఁ జేసి యేలితి గదా! విశ్వంబు వీఁ డెంత! యీ
దభ్రోక్తుల్ గుణ దోష హేతువులు చింతం బొంద నీ కేటికిన్. 206

ఉ. వక్రుం డైన జనుండు వృద్ధ గురు సేవం జేసి మేధా నయో
పక్రాంతిన్ విలసిల్లు మీఁదట వయఃపాకంబుతో బాలకున్
శక్రద్వేషణ [2]బద్ధుఁ జేయుము మదిన్ జాలింపు మీ రోషమున్
శుక్రాచార్యుఁడు వచ్చునంత కితఁడున్ సుశ్రీయుతుం డయ్యెడున్. 207

వ. అని గురుపుత్రులు పలికిన, రాక్షసేశ్వరుండు గృహస్థులైన రాజులకు నుపదేశింపం దగిన ధర్మార్థ కామంబులు, ప్రహ్లాదునకు నుపదేశింపుం డని యనుజ్ఞ చేసిన, వారును నతనికిఁ ద్రివర్గంబు నుపదేశించిన, నతండును, రాగద్వేషంబుల చేత విషయాసక్తు లైన వారికి గ్రాహ్యంబు లైన ధర్మార్థ కామంబులు దనకు నగ్రాహ్యంబు లనియును, వ్యవహార ప్రసిద్ధికొఱ కైన భేదంబు గాని యాత్మ భేదంబు లే దనియు, ననర్థంబుల నర్థకల్పనంబు సేయుట దిగ్భ్రమం బనియును నిశ్చయించి, గురూపదిష్ట శాస్త్రంబు మంచి దని తలంపక, గురువులు దమతమ గృహస్థ [3]కర్మానుష్ఠానంబులకుం బోయిన సమయంబున. 208

క. ఆటలకుఁ దన్ను రమ్మని, పాటించి నిశాటసుతులు భాషించిన దో
షాటకులేంద్ర కుమారుఁడు, పాటవమున వారిఁ [4]జేరి ప్రజ్ఞాన్వితుఁ డై. 209

క. చెప్పఁ డొకచదువు మంచిది, చెప్పెడిఁ దగులములు చెవులు చిందఱఁ గొనఁగా
[5]నెప్పుడు మనయెడ నొజ్జలు, సెప్పెద నొక చదువు వినుఁడు చిత్తము లలరన్.

వ. అని రాచకుమారుండు గావునఁ గరుణించి, సంగడికాండ్రతో నగియెడు చందంబునఁ గ్రీడలాడుచు, సమానవయస్కు లైన దైత్యకుమారుల కెల్ల నేకాంతంబున ని ట్లనియె.

---

1. ప్రతాపము (ట. త. తం. హా.) 2. బుద్ధు (హా.బ.) 3. కర్మానుసంధానము (ట. డ. ద.)
4. ఁజీరి (హ) 5. చెప్పెడు (హ. తం. క. బ.)

## అధ్యాయము - ౬

ఉ. బాలకులార! రండు మన ప్రాయముబాలురు కొంద ఱుర్విలోఁ
గూలుట కంటిరే! గురుఁడు [1]క్రూరుఁ డనర్థచయంబునందు దు
శ్శీలత నర్థకల్పనముఁ [2]జేసెడి గ్రాహ్యము గాదు శాస్త్రముల్
మే లెఱిఁగించెదన్ వినిన మీకు నిరంతర భద్ర మయ్యెడిన్. 212

వ. వినుండు. సకల జన్మంబులందును ధర్మార్థాచరణ కారణం బైన మానుషజన్మంబు దుర్లభంబు. అందుఁ బురుషత్వంబు దుర్గమంబు. అదియు శతవర్ష పరిమితం బైన జీవితకాలంబు నియతం బై యుండు. అందు సగ మంధకార బంధురం బై రాత్రిరూపంబున నిద్రాది వ్యవహారంబుల నిరర్థకం బై చను. చిక్కిన పంచాశ ద్వత్సరంబులందును [3]బాల్య కైశోర వయోవిశేషంబుల వింశతి హాయనంబులు గడచు. కడమ ముప్పది యబ్దంబులు నింద్రియంబులచేతఁ బట్టువడి, దురవగాహంబు లైన కామ క్రోధ లోభ మోహ మద మత్సరంబు లను పాశంబులఁ గట్టువడి, విడివడ సమర్థుండు గాక ప్రాణంబుల కంటె మధురాయమాణ యైన తృష్ణకు లోనై భృత్య తస్కర వణిక్కర్మంబులఁ బ్రాణహాని యైన నంగీకరించి, [4]పరార్థంబుల నర్థింపుచు రహస్య సంభోగచాతుర్య సౌందర్య విశేషంబుల ధైర్యవల్లికా లవిత్రంబు లైన కళత్రంబులను, మహనీయ మంజుల మధురాలాపంబులు గల్గి, వశు లైన శిశువులను, శీల వయో రూప ధన్య లగు కన్యలను, వినయ వివేక విద్యాలంకారు లైన కుమారులను, గామిత ఫలప్రదాత లగు భ్రాతలను, మమత్వ ప్రేమ దైన్య జనకు లైన జననీ జనకులను, సకల సౌజన్య సింధువు లైన బంధువులను, ధన కనక వస్తు వాహన సుందరంబు లైన మందిరంబులను, సుకరంబు లైన పశు భృత్య నికరంబులను, వంశ పరంపరాయత్తంబు లైన విత్తంబులను, వర్జింప లేక, సంసారంబు నిర్జింప నుపాయంబుఁ గానక, తంతువర్గంబున నిర్గమద్వార శూన్యం బైన మందిరంబుఁ జేరి, చిక్కువడి, వెడలెడి పాటవంబు సాలక, తగులు వడు కీటకంబు చందంబున, గృహస్థుండు స్వయంకృత కర్మబద్ధుం డై, శిశ్నోదరాది సుఖంబులఁ బ్రమత్తుం డై, నిజ కుటుంబ పోషణ పారవశ్యంబున విరక్తి మార్గంబు దెలియనేరక, స్వకీయ పరకీయ భిన్న భావంబున నంధకారంబునం బ్రవేశించు. కావునఁ గౌమార సమయంబున మనీషాగరిష్ఠుం డై, పరమ భాగవత ధర్మం బనుష్ఠింప వలయు. దుఃఖంబులు వాంఛితంబులు గాక చేకుఱు భంగిని

---

1. క్రూరుఁడు నర్థచయంబునందు (హ) 2. జెప్పెడి (హ) 3. బాల్యయౌవన కౌమార కైశోర వయో విశేషంబుల (హ) 4. పదార్థంబుల నార్జింపుచు (ట. త.)

సుఖంబులును గాలానుసారంబు లై లబ్ధంబు లగు. కావున వృథా ప్రయాసం బున నాయుర్వ్యయంబు సేయం దగదు. హరి భజనంబున మోక్షంబు సిద్ధించు. విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు. ప్రియుండు ముముక్షుం డగు దేహికి దేహావసాన పర్యంతంబు నారాయణ చరణారవింద సేవనంబు కర్తవ్యంబు.

సీ. కంటిరే మనవారు ఘనులు గృహస్థు లై విఫలులై కైకొన్న వెట్టితనము
భద్రార్థులై యుండి పాయరు సంసార పద్ధతి నూరక పట్టువడిరి
కలయోనులం దెల్ల గర్భాద్యవస్థలఁ బురుషుండు దేహియై పుట్టుచుండుఁ
దన్నెఱుంగఁడు కర్మతంత్రుఁ డై కడపల ముట్టఁడు భవశతములకు నైన

ఆ. దీన శుభము లేదు దివ్యకీర్తియు లేదు
జగతిఁ బుట్టి పుట్టి చచ్చి చచ్చి
పొరల నేల మనకుఁ బుట్టని చావని
త్రోవ వెదకి కొనుట దొడ్డ బుద్ధి. 214

శా. హాలాపాన విజృంభమాణ మద[1] గర్వారూఢ దేహోల్లస
ద్బాలాలోకన శృంఖలానిచయ సంబద్ధాత్ముఁ డై లేశము_ఁ
వేలా నిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడు_ఁ గామినీ
హేలాకృష్ట కురంగశాబక మగు_ఁ హీనస్థితి_ఁ వింటిరే. 215

ఆ. విషయ సక్తు లైన వివిధాహితుల తోడి
మనికి వలదు ముక్తిమార్గ వాంఛ
నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త
సంగజనులఁ గూడి శైశవమున. 216

వ. కావున విషయంబులఁ జిక్కువడిన రక్కసులకు హరిభజనంబు శక్యంబు గాదు. రమ్య మయ్యును, బహుతర ప్రయాసగమ్య మని తలంచితి రేనిఁ జెప్పెద. సర్వ భూతాత్మకుం డై, సర్వ దిక్కాల సిద్ధుం డైన బ్రహ్మ కడపలగాఁ గల చరాచర స్థూల సూక్ష్మ జీవసంఘంబు లందును, అంభో వాయు కుంభినీ గగన తేజంబు లనియెడు మహాభూతంబులందును, భూతవికారంబు లైన ఘట పటాదు లందును, గుణసామ్యం బైన ప్రధానమందును, గుణవ్యతికరంబైన మహత్తత్త్వాది యందును, రజ స్సత్త్వ తమోగుణంబుల యందును, భగవంతుం డవ్యయుం డీశ్వరుండు పరమాత్మ పరబ్రహ్మ మనియెడు వాచక శబ్దంబులుంగల్గి కేవలానుభ వానంద స్వరూపకుండు, నవికల్పితుండు, ననిర్దేశ్యుండు నైన పరమేశ్వరుండు

1. గర్వాతీత (హ. తం. వా.)

త్రిగుణాత్మకం బైన తన దివ్యమాయచేత నంతర్హితైశ్వర్యుం డై, వ్యాప్య వ్యాపక రూపంబులం జేసి దృశ్యుండును, ద్రష్టయు, భోగ్యుండును, భోక్తయు నై నిర్దేశింపం దగి, వికల్పితుం డై యుండు. తత్కారణంబున నాసుర భావంబు విడిచి, సర్వభూతంబులందును దయా సుహృ ద్భావంబులు కర్తవ్యంబులు. [1]దయా సుహృద్భావంబులు గలిగిన నధోక్షజుండు సంతసించు. అనంతుం, డాద్యుండు, హరి సంతసించిన నలభ్యం బెయ్యదియు లేదు. జనార్దన చరణ సరసీరుహయుగళ స్మరణ సుధారసపాన పరవశుల మైతిమేని మనకు దైవవశంబున నకాంక్షితంబు లై సిద్ధించు, ధర్మార్థ కామంబులును, గాంక్షితం బై సిద్ధించు మోక్షం బన నేలను? త్రివర్గంబును, నాత్మవిద్యయుం, దర్క, దండనీతి, జీవికాదు లన్నియును, త్రైగుణ్య విషయంబు లైన వేదంబులవలనం బ్రతిపాద్యంబులు. నిస్త్రైగుణ్య లక్షణంబునం బరమపురుషుం డైన హరికి నాత్మ సమర్పణంబు సేయుట మేలు. పరమాత్మ తత్త్వ జ్ఞానోదయంబునం జేసి స్వ పర భ్రాంతిం జేయక పురుషుండు యోగావధూతత్వంబున నాత్మవికల్ప భేదంబునం గలలోఁ గన్న విశేషంబుల భంగిఁ దథ్యం బనక మిథ్య యని తలంచు. అని మఱియుఁ బ్రహ్లాదుం డి ట్లనియె. 217

మ. నరుఁడుం దానును మైత్రితో [2]మెలఁగుచో నారాయణుం డింతయున్
వరుస న్నారద సంయమీశ్వరునకున్ వ్యాఖ్యానముం జేసె మున్
హరిభక్తాంఘ్రి పరాగ శుద్ధతను లేకాంతుల్ మహాకించనుల్
పరతత్త్వజ్ఞులుగాని నేరరు మదిన్ భావింప నీ జ్ఞానమున్. 218

వ. తొల్లి నేను దివ్యదృష్టి గల నారదమహామునివలన సవిశేషం బైన యీ జ్ఞానంబును బరమ భాగవత ధర్మంబును వింటి. అనిన వెఱఁగుపడి, దైత్య బాలకు లద్దనుజరాజ కుమారున కి ట్లనిరి. 219

ఉ. మంటిమి కూడి భార్గవ కుమారకు లొద్ద ననేకశాస్త్రముల్
వింటిమి లేఁడు సద్గురుఁడు వేఱొకఁ డెన్నఁడు రాజశాల ము
క్కంటికి నైన రాదు సొరఁగా వెలికిం జనరాదు నీకు ని
ష్కంటక వృత్తి నెవ్వఁడు ప్రగల్భుఁడు సెప్పె గుణాఢ్య! సెప్పుమా. 220

క. సేవింతుము ని న్నెప్పుడు, భావింతుము రాజ వనుచు బహుమానంబుల్
గావింతుము తెలియము నీ, కీ వింత మతిప్రకాశ మే క్రియఁ గలిగెన్. 221

---

1. దయగలిగిన (హ) 2. మెలగుచున్ (క. తం. వా.) 2. కుమారకునొద్ద (హ)

వ. అని యిట్లు దైత్యనందనులు దన్నడిగినఁ బరమభాగవత కులాలంకారుం డైన ప్రహ్లాదుండు నగి, తనకు పూర్వంబునందు వినంబడిన నారదు మాటలు దలంచి యి ట్లనియె. 222

అధ్యాయము – ౭

శా. అక్షీణోగ్ర తపంబు మందరముపై నర్థించి మా తండ్రి శు
ద్ధక్షాంతిం జనియుండఁ జీమగమిచేతన్ భోగిచందంబునన్
భక్షింపంబడెఁ బూర్వపాపములచేఁ బాపాత్మకుం డంచు ముం
రక్షస్సంఘము మీఁద నిర్జరులు సంరంభించి యుద్ధార్థులై. 223

శా. ప్రస్థానోచిత భేరి భాంకృతులతోఁ బాకారియుం దారు [1]శౌ
ర్య స్థైర్యంబుల నేఁగుదెంచినఁ దదీ యాటోప విభ్రాంతులై
స్వస్థేమల్ దిగనాడి పుత్ర ధన యోషా మిత్ర సంపత్కళా
ప్రస్థానంబులు డించి పాఱి రసురుల్ ప్రాణావనోద్యుక్తులై. 224

మత్తకోకిల. ప్రల్లదంబున వేల్పు లుద్ధతిఁ బాఱి రాజనివాసమున్
గొల్లవెట్టి సమస్తవిత్తముఁ గ్రూరతం గొనిపోవఁగా
నిల్లు సొచ్చి విశంకుఁ డై యమరేశ్వరుం డదలించి మా
తల్లిఁ దాఁ జెఱవట్టె సిగ్గునఁ దప్త యై విలపింపఁగాన్. 225

వ. ఇట్లు సురేంద్రుండు మా తల్లినిం జెఱగొని పోవుచుండ, నమ్ముగుద కురరి యను పులుఁగుక్రియ మొఱయిడినఁ, దెరువున దైవయోగంబున నారదుండు పొడగని యి ట్లనియె. 226

ఉ. స్వర్భువనాధినాథ ! సురసత్తమ ! వేల్పులలోన మిక్కిలి
న్నిర్భర పుణ్యమూర్తివి సునీతివి మానినిఁ బట్టనేల యీ
గర్భిణి నాతురన్ విడువు కల్మషమానసురాలు గాదు నీ
దుర్భర రోషము న్నిలుపు దుర్జయుఁ డైన నిలింపవైరిపై. 227

వ. అనిన వేల్పుతపసికి [2]వేయుఁగన్నులఱవర యి ట్లనియె. 228

ఉ. అంతనిధాన మైన దివిజాధిపు వీర్యము దీని కుక్షి న
త్యంతసమృద్ధి నొందెడి మహాత్మక ! గావునఁ దత్ప్రసూతిప
ర్యంతము బద్ధఁ జేసి జనితార్భకు వజ్రపుధారఁ ద్రుంచి ని
శ్చింతుఁడ నై తుదిన్ విడుతు సిద్ధము దానవరాజ వల్లభన్. 229

1. శౌర్య స్థైర్యంబున (హ) 2. వేయిగన్నులుగల గరువ (త. తం)

వ. అని పలికిన వేల్పుఱేనికిఁ దపసి యి ట్లనియె. 230

శా. నిర్భీకుండు ప్రశస్త భాగవతుఁ[1]డు న్నిర్వైరి జన్మాంత రా
విర్భూ తాచ్యుత పాదభక్తి మహి మావిష్టుండు దైత్యాంగనా
గర్భస్థుం డగు బాలకుండు బహు సంగ్రా మా ద్యుపాయంబులన్
దుర్భావంబునఁ బొంది చావఁడు భవ ద్దోర్దర్ప [2]విభ్రాంతుఁ డై. 231

వ. అని దేవముని నిర్దేశించిన, నతని వచనంబులు మన్నించి, తానును హరిభక్తుండు గావున దేవేంద్రుండు భక్తి[3]భావంబున మా యవ్వను విడిచి, వలగొని, సురలోకం బునకుం జనియె. మునీంద్రుండు మ జ్జననియందుఁ బుత్రికాభావంబు చేసి యూఱడించి, నిజాశ్రమంబునకుం గొనిపోయి, నీవు పతివ్రతవు. నీ యుద రంబునఁ బరమభాగవతుం డైన ప్రాణి యున్నవాఁడు. తపోమహత్త్వంబునం గృతార్థుండై నీ పెనిమిటి రాఁగలండు. అందాఁక నీ విక్కడ నుండుము. అనిన సమ్మతించి. 232

శా. యోషారత్నము నాథదేవత విశాలోద్యోగ మా తల్లి ని
ర్దైన్యమ్యంబున నాథురాక మదిలో వాంఛించి నిర్దోష యై
యీష ద్భీతియు లేక గర్భ పరిరక్షేచ్ఛన్ విచారించి శు
శ్రూషల్ సేయుచు నుండె నారదునకున్ సువ్యక్త శీలంబునన్. 233

వ. ఇట్లు దనకుఁ బరిచర్య చేయుచున్న దైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షా విశారదుం డైన నారదుండు నిజసామర్థ్యంబున నభయం బిచ్చి, గర్భస్థుం డైన నన్ను నుద్దేశించి, ధర్మతత్త్వంబును, నిర్మలజ్ఞానంబును నుపదేశించిన, న మ్ముద్దియ దద్దయుం బెద్దకాలంబునాఁటి వినికియుం గావున, నాఁడుది యగుటం జేసి, పరి పాటి దప్పి సూటిలేక మఱచె. నారదుండు నాయెడఁ గృప గల నిమిత్తంబున.

క. వెల్లిగొని నాఁటనుండియు, నుల్లసితం బైన దైవయోగంబున శో
భిల్లెడు మునిమత మంతయు, నుల్లంబున మఱపు పుట్ట దొకనాఁ డైనన్. 235

ఆ. వినుఁడు నాదుపల్కు విశ్వసించితి రేని
సతుల కైన బాలజనుల కైనఁ
దెలియవచ్చు మేలు [4]దేహాద్యహంకార
దళన నిపుణ మైన తపసిమతము. 236

---

1. ఉన్నిద్రుండు (తం) 2. విక్రాంతుఁడై (హ) 3. బాంధవంబున (ట. త. జ. తం. వా)
4. దేహాద్యలంకార (చ. బ. హ. వా.)

వ. అని నారదోక్త ప్రకారంబున బాలకులకుఁ బ్రహ్లాదుం డిట్లనియె. ఈశ్వరమూర్తి యైన కాలంబునంజేసి వృక్షంబు గలుగుచుండ ఫలంబునకు జన్మ సంస్థాన వర్ధనాపక్షీణత్వ పరిపాక నాశంబులు ప్రాప్తంబు లైన తెఱంగున, దేహమునకుం గాని *(షడ్భావవికారంబు) లాత్మకు లేవు. ఆత్మ నిత్యుండు, క్షయరహితుండు, శుద్ధుండు, క్షేత్రజ్ఞుండు, గగనాదులకు నాశ్రయుండు, క్రియాశూన్యుండు, స్వప్రకాశుండు, సృష్టిహేతువు, వ్యాపకుండు, నిస్సంగుండు, పరిపూర్ణుండు, నొక్కండు నని వివేకసమర్థంబులగు నాత్మలక్షణంబులు పండ్రెండు నెఱుంగుచు, దేహాదులందు మోహజనకంబు లగు నహంకార మమకారంబులు విడిచి, పసిండిగనులు గల నెలవున విభ్రాజమాన కనకలేశంబు లైన పాషాణాదులందుఁ బుటంబు వెట్టి, వహ్ని యోగంబున గరంగ నూఁది, హేమకారకుండు పాటవంబున హాటకంబుఁ బడయుభంగి, నాత్మకృత కార్యకారణంబుల నెఱింగెడి నేర్పరి, దేహంబునం దాత్మసిద్ధికొఱకు నైన యుపాయంబునంజేసి బ్రహ్మభావంబుఁ బడయు. మూలప్రకృతియు, మహ దహంకారంబులును, బంచ తన్మాత్రంబులు నివి యెనిమిదియుం బ్రకృతు లనియును, రజస్సత్త్వ తమంబులు మూఁడును బ్రకృతిగుణంబు లనియును, గర్మేంద్రియంబు లైన వాక్పాణి పాద పా యూపస్థలును, జ్ఞానేంద్రియంబు లైన శ్రవణ నయన రసనా త్వ ఘ్రాణంబులును, మనంబును, మహీ సలిల తేజో వాయు గగనంబులును నివి పదాఱును వికారంబు లనియును, గపిలాది పూర్వాచార్యులచేతం జెప్పంబడియె. సాక్షిత్వంబున నీ [1]యిరువదియేడింటిని నాత్మ గూడియుండు. పెక్కింటి కూటువ దేహము. అదియు జంగమ స్థావర రూపంబుల రెండువిధంబు లయ్యె. మూలప్రకృతి మొద లైన వర్గంబునకు వేఱై మణిగణంబులం జొచ్చియున్న సూత్రంబు చందంబున నాత్మ యిన్నింటియందునుం జొచ్చి దీపించు. ఆత్మకు జన్మ స్థితి లయంబులు గల వంచు మిథ్యాతత్పరులు గాక, వివేకశుద్ధ మైన మనంబున విచారించి, దేహంబునం దాత్మ వెతకవలయు. ఆత్మకు నవస్థలు గలయట్లుండుఁ గాని యవస్థలు లేవు. జాగరణ స్వప్న సుషుప్తు లను వృత్తు లెవ్వనిచేత నెఱుంగంబడు, నతం డాత్మ యండ్రు. కుసుమధర్మంబు లైన గంధంబులచేత గంధాశ్రయుం డైన వాయువు నెఱింగెడుభంగి ద్విగుణాత్మకంబు లై కర్మజన్యంబు లైన బుద్ధిభేదంబుల నాత్మ నెఱుంగం దగు. అని చెప్పి.

సీ. సంసార మిది బుద్ధిసాధ్యము గుణకర్మ గణబద్ధ మజ్ఞాన కారణంబు
కలవంటి దింతియ కాని నిక్కము కాదు సర్వార్థములు మన స్సంభవములు

---

* తా. ప. ప్రతులలో లేదు. 1. యిరువది యేనింటిని (హ)

స్వప్న జాగరములు సమములు గుణశూన్యుఁ డగు పరమునికి గుణాశ్రయమున భవవినాశంబులు పొటిల్లి నట్లుండుఁ బట్టిచూచిన లేవు బాలురార!

తే. కడఁగి త్రిగుణాత్మకము లైన కర్మములకు
జనక మై వచ్చు నజ్ఞాన సముదయమును
ఘనతర జ్ఞానవహ్నిచేఁ గాల్చిపుచ్చి
కర్మవిరహితు లై హరిఁ గనుట మేలు. 238

వ. అది గావున గురుశుశ్రూషయు, సర్వలాభ సమర్పణంబును, సాధుజన [1]సంగంబును నీశ్వరప్రతిమా సమారాధనంబును, హరికథా తత్పరత్వంబును, వాసుదేవుని యందలి ప్రేమయు, నారాయణ గుణ కర్మ (కథా) నామ కీర్తనంబును, వైకుంఠ చరణకమల ధ్యానంబును, విశ్వంభరమూర్తి విలోకన పూజనంబులును, మొద లైన విజ్ఞాన వైరాగ్య లాభసాధనంబు లైన భాగవతధర్మంబులపై రతి గలిగి, సర్వభూతంబులయందు నీశ్వరుండు భగవంతుం డాత్మ గలం డని సన్మానంబు సేయుచుఁ, గామ క్రోధ లోభ మోహ మద మత్సరంబుల గెలిచి, యింద్రియవర్గంబును బంధించి, భక్తి సేయుచుండ నీశ్వరుం డైన విష్ణుదేవుని యందుల గతి సిద్ధించు. 239

సీ. దనుజారి లీలావతారంబులందలి శౌర్యకర్మంబులు సద్గుణములు
విని భక్తుఁ డగువాఁడు వేడ్కతోఁ బులకించుఁ గన్నుల హర్షాశ్రుకణము లొలుక
గద్గదస్వరముతోఁ గమలాక్ష! వైకుంఠ! వరద! నారాయణ! వాసుదేవ!
యనుచు నొత్తిలి పాడు నాడు నాక్రోశించు నగుఁ జింతనముసేయు నతి యొనర్చు

తే. మరులుకొని యుండుఁ దనలోన మాటలాడు
వేల్పుసోఁకిన పురుషునివృత్తిఁ దిరుగు
బంధములు వాసి యజ్ఞానపటలిఁ గాల్చి
విష్ణుఁ బ్రాపించుఁ దుది భక్తివివశుఁ డగుచు. 240

వ. కావున రాగాదియుక్త మనస్కుం డైన శరీరికి సంసారచక్ర నివర్తకం బైన హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణసుఖ మని బుధులు దెలియుదురు. హరి భజనంబు దుర్గమంబు గాదు. హరి సకలప్రాణి హృదయంబులయందును నంత ర్యామి యై యాకాశంబుభంగి నుండు. విషయార్జనంబుల నయ్యెడిది లేదు. నిమిషభంగుర ప్రాణు లైన మర్త్యులకు మమతాస్పదంబు లగు చంచలంబు లైన పుత్ర మిత్ర కళత్ర పశు భృత్య బల బంధు రాజ్య కోశ మణి మందిర

1. సంగమంబును (చ. బ)

మంత్రి మాతంగ మహీ ప్రముఖ విభవంబులు నిరర్థకంబులు. యాగప్రముఖ పుణ్యలబ్ధంబు లైన స్వర్గాది లోకభోగంబులు పుణ్యానుభవ క్షీణంబులు గాన, నిత్యంబులు గావు. నరుండు విద్వాంసుండ నని యభిమానించి, కర్మంబు లాచరించి, యమోఘంబు లైన విపరీతఫలంబుల నొందు. కర్మంబులు కోరక చేయవలయు. కోరి చేసిన దుఃఖంబులు ప్రాప్తించు. పురుషుండు దేహంబుకొఱకు భోగంబుల నపేక్షించు. దేహంబు నిత్యంబు గాదు. తోడరాదు. [2]మృతుం డైన వాని దేహమును శునకాదులు భక్షించు. దేహి కర్మంబు లాచరించి, కర్మబద్ధుం డై క్రమ్మఱం గర్మానుకూలం బైన దేహంబుఁ దాల్చు. అజ్ఞానంబునం జేసి పురుషుండు కర్మదేహంబుల విస్తరించు. అజ్ఞానతంత్రంబులు ధర్మార్థ కామంబులు. జ్ఞానలభ్యంబు మోక్షంబు. మోక్షప్రదాత యగు హరి సకల భూతంబులకు నాత్మేశ్వరుండు. ప్రియుండు. తనచేత నైన మహాభూతంబుల తోడ జీవసంజ్ఞితుం డై యుండు. నిష్కాము లై హృదయగతుం డైన హరిని నిజభక్తిని భజింపవలయు. 241

క. దానవ దైత్య భుజంగమ, మానవ గంధర్వ సుర సమాజములో ల
క్ష్మీనాథు చరణకమల, ధ్యానంబున నెవ్వఁ డైన ధన్యత నొందున్. 242

క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ, జిక్కఁడు దానముల శౌచ శీల తపములన్
జిక్కఁడు [3]యుక్తిని భక్తినిఁ, జిక్కినక్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ. 243

క. చాలదు భూదేవత్వము, చాలదు దేవత్వ మధిక శాంతత్వంబున్
చాలదు హరి మెప్పింప వి, శాలోద్యములార! భక్తి చాలినభంగిన్. 244

ఆ. దనుజ భుజగ యక్ష దైత్య మృగాభీర
సుందరీ విహంగ శూద్ర శబరు
లైనఁ బాపజీవు లైన ముక్తికిఁ బోదు
రఖిలజగము విష్ణుఁ డనుచుఁ దలఁచి. 245

క. గురువులు [4]తమకును లోఁబడు, తెరువులు సెప్పెదరు విష్ణు దివ్యపదవికిన్
దెరువులు సెప్పరు చీఁకటిఁ, బరువులు వెట్టంగ నేల బాలకులారా! 246

క. తెం డెల్ల పుస్తకంబులు, నిం డాచార్యులకు మఱల నేకతమునకున్
రండు విశేషము సెప్పెదఁ, బొం డొల్లనివారు కర్మపుంజము పాలై. 247

---

1. సంగమంబును (చ. బ.) 2. మృతంబైన దేహమును (తం. వా) 3. వృత్తిని (హ. ట. బ.)
4. మనకును లోఁబడు (హ)

క. ఆడుదము మనము హరి రతిఁ, బాడుద మే ప్రొద్దు విష్ణు భద్రయశంబుల్
వీడుదము దనుజసంగతిఁ, గూడుదము ముకుంద[1]భక్తకోటిన్ సూటిన్. 248

క. విత్తము సంసృతిపటలము, ప్రత్తము కామాది వైరివర్గంబుల నేఁ
డిత్తము చిత్తము హరికినిఁ, జొత్తము నిర్వాణపదము శుభమగు మనకున్. 249

వ. అని యిట్లు ప్రహ్లాదుండు రహస్యంబున నయ్యా వేళల రాక్షసకుమారులకు నపవర్గమార్గంబు నెఱిఁగించిన, వారును గురుశిక్షితంబు లైన చదువులు సాలించి, నారాయభక్తిఁ జిత్తంబులం గీలించియుండుటఁ జూచి, వారల యేకాంతభావంబుఁ దెలిసి, వెఱచి, వచ్చి, శుక్రాచార్య నందనుండు శక్రవైరి కిట్లనియె. 250

## అధ్యాయము - ౫

శా. రక్షోబాలుర నెల్ల నీకొడుకు చేరం జీరి లోలోన నా
శిక్షామార్గము లెల్లఁ గల్ల లని యాక్షేపించి తా నందఱన్
మోక్షాయత్తులఁ జేసినాఁడు మనకున్ మోసంబు వాటిల్లె నీ
దక్షత్వంబునఁ జక్కఁ జేయవలయున్ దైతేయవంశాగ్రణీ! 251

క. ఉల్లసిత విష్ణుకథనము, లెల్లప్పుడు మాకుఁ జెప్పఁ డీ గురుఁ డని న
న్నుల్లంఘించి కుమారకు, లొల్లరు చదువంగ దానవోత్తమ! వింటే. 252

క. ఉడుగఁడు మధురిపు కథనము, [1]విడివడి జడుపగిదిఁ దిరుగు వికసనమున నే
నొడివిన నొడువులు నొడువఁడు, దుడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా!

క. చొక్కపు రక్కసికులమున, [3]వెక్కురు జన్మించినాఁడు [4]పీతాంబరుని
న్నిక్కపు మక్కువఁ గొలిచెడి, నెక్కడి సుతుఁ గంటి రాక్షసేశ్వర! వెఱ్ఱిన్. 254

వ. అని యిట్లు గురుసుతుండు సెప్పిన కొడుకువలని విరోధవ్యవహారంబులు కర్ణరంధ్రంబులందు ఖడ్గప్రహారంబు లై సోఁకిన బిట్టు మిట్టిపడి, పాదతాడితం బైన భుజంగంబుభంగిఁ బవనప్రేరితం బైన దవానలంబు చందంబున, దండతాడితం బైన కంఠీరవంబు కైవడి, భీషణ రోష రసావేశ జాజ్వల్యమాన చిత్తుండును, *(పుత్రసంహారోద్యోగ యుక్తుండును) గంపమాన గాత్రుండును, నరుణీకృత నేత్రుండును నై కొడుకును రప్పించి, సమ్మానకృత్యంబులు దప్పించి, నిర్దయుం డై యశనిసంకాశ భాషణంబుల నదల్చుచు. 255

---

1. భక్తికోటిన్ (క. బ. హ. తం. వా.) 2. విడువఁడు (క. చ. త. బ. హ) విడువడు మరి జడునివగిది (ట) 3. ‹బెక్కురు జన్మించి రందు (క. చ. త. జ. ద. హ) 4. విష్ణునియందున్, నిక్కపు మక్కువ విడువం, డెక్కడి (తం. వా.) * తా. వ. ప్రతులలో లేదు.

శా. సూనుం శాంతగుణ ప్రధాను నతి సంశుద్ధాంచిత జ్ఞాను న
జ్ఞా నారణ్య కృశాను నంజలిపుటీ సంభ్రాజమానుం సదా
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృ తాస్వాదనా
ధీనుం ధిక్కరణంబుఁ జేసి పలికెం దేవాహితుం డుగ్రతన్. 256

సీ. అస్మదీయం బగు నాదేశమునఁ గాని మిక్కిలి రవి మింట మెఱయ వెఱచు
నన్ని కాలములందు ననుకూలుఁ డై కాని [1]విద్వేషి యై గాలి వీవ వెఱచు
మత్ప్రతాపానల మందీకృతార్చి యై విచ్చలవిడి నగ్ని వెలుఁగ వెఱచు
నతి తీక్ష్ణ మైన నా యాజ్ఞ నుల్లంఘించి శమనుండు ప్రాణులఁ జంప వెఱచు

తే. నింద్రుఁ డౌదల నాజ్ఞ మోల నెత్త వెఱచు
నమర కిన్నర గంధర్వ యక్ష విహగ
నాగ విద్యాధ రావళి నాకు వెఱచు
నేల వెఱవవు పలువ! నీ కేది దిక్కు. 257

శా. ప్రజ్ఞావంతులు లోకపాలకులు శుంభద్ద్వేషు లయ్యుం మదీ
యాజ్ఞాభంగము సేయ నోడుదురు రోషాపాంగ దృష్టిన్ వివే
క జ్ఞానచ్యుత మై జగత్త్రితయముం గంపించు నీ విట్టిచో
నాజ్ఞోల్లంఘన మెట్లు సేసితివి సాహంకారతన్ దుర్మతీ! 258

శా. కంఠక్షోభము గాఁగ నొత్తిలి మహాగాఢంబుగా డింభ! వై
కుంఠుం జెప్పెదు దుర్జయుం డనుచు వైకుంఠుండు వీరవ్రతో
త్కంఠాబంధురుఁ డేని నే నమరులన్ ఖండింప దండింపఁగాఁ
గుంఠీభూతుఁడు గాక రావలదె మద్ఘోరాహవ [1]క్షోణికిన్. 259

శా. ఆచార్యోక్తము మాని [4]బాలురకు మోక్షాసక్తిఁ బుట్టించి నీ
వాచాలత్వముఁ జూపి విష్ణు నహితున్ వర్ణించి మ ద్దైత్యవం
శాచారంబులు [5]నీఱు చేసితివి మూఢాత్ముం గులద్రోహి ని
న్నీచుం జంపుట మేలు చంపి కులము న్నిర్దోషముం జేసెదన్. 260

క. దిక్కులు గెలిచితి నన్నియు, ది క్కెవ్వఁడు రోరి! నీకు దేవేంద్రాదుల్
దిక్కుల రాజులు వేఱొక, ది క్కెఱుఁగక కొలుతు రితఁడె దిక్కని నన్నున్. 261

క. బలవంతుఁడ నే జగముల, బలములతోఁ జనక వీరభావమున మహా
బలుల జయించితి నెవ్వని, బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడ వై. 262

వ. అనినఁ దండ్రికి మెల్ల మెల్లన వినయంబుతోఁ గొడు కిట్లనియె. 263

క. బలయుతులకు దుర్బలులకు, బల మెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును, బల మెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా! 264

1. విద్వేషమున (హ) 2. గంపింప (హ) 3. క్రీడనున్ (క) 4. కాక (శ. తం. వా.)
5. నీరు చేసిన (చ)

క. దిక్కులు కాలముతో నే, దిక్కున లే కుండుఁ గలుగు దిక్కుల మొదలై
దిక్కు గల లేని వారికి, ది క్కెయ్యది యదియ నాకు దిక్కు మహాత్మా! 265

సీ. కాలరూపంబులఁ [1]గల విశేషంబుల నలఘు గుణాశ్రయుం డైన విభుఁడు
సత్త్వ బలేంద్రియ సహజ ప్రభావాత్ముఁ డై వినోదంబుల నఖిలజగముఁ
గల్పించు రక్షించు ఖండించు నవ్యయుం డన్నిరూపములందు నతఁడు గలఁడు
చిత్తంబు సమముగాఁ జేయుము మార్గంబు దప్పి వర్తించు చిత్తంబుకంటె

తే. వైరు లెవ్వరు? చిత్తంబు వైరి గాక
చిత్తమును నీకు వశముగాఁ జేయవయ్య!
మదయు తాసురభావంబు మానవయ్య!
యయ్య! నీ ప్రోల మే లాదరయ్య! జనులు. 266

ఉ. లోకము లన్నియుఁ గడియలోన జయించినవాఁడ వింద్రియా
నీకముఁ జిత్తముం గెలువ నేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకర శత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁ డొకఁడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా! 267

క. పాలింపుము శేముషి నున్మూలింపుము కర్మబంధముల సమదృష్టిన్
జాలింపుము సంసారముఁ, గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్. 268

వ. అనినఁ బరమ భాగవత శేఖరునకు దోషాచరశేఖరుం డి ట్లనియె. 269

క. చంపినఁ జచ్చెద ననుచును, గంపింపక యోరి [2]పలువ! కఠినోక్తుల నన్
గుంపించెదు చావునకున్, దెంపరి వై వదరు వాని తెఱఁగునఁ గుమతీ! 270

శా. నాతోడం బ్రతిభాష లాడెదు జగన్నాథుండు నాకంటె నీ
భూతశ్రేణికి రాజు లే డొకఁడు సంపూర్ణ ప్రభావుండు మ
ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిన్ బల్మాఱు నారాయణుం
డేత ద్విశ్వములోన లేఁడు మఱి వాఁ డెందుండురా దుర్మతీ! 271

క. ఎక్కడఁ గలఁ డే క్రియ నే, [3]చక్కిని వర్తించు నెట్టిజాడను వచ్చున్!
జక్కడుతు నిన్ను విష్ణునిఁ, బెక్కులు ప్రేలెదవు వాని భృత్యునిపగిదిన్. 272

వ. అనిన, హరికింకరుండు శంకింపక హర్ష పులకాంకుర సంకలిత విగ్రహుం డై యాగ్రహంబు లేక హృదయంబునఁ గేశవునిం దలంచి, నమస్కరించి, బాల వర్తనంబుల నర్తనంబులు సేయుచు ని ట్లనియె. 273

---

1. ఉగ్రమ (తం. వా.) 2. పదుచ (క. తం. వా.) 3. చక్కటి (తం. వా.)

మ. [1]కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులం దంతటన్
గలఁ డీశుండు గలండు దండ్రి! వెదకంగా నేల యీ యా యెడన్. 274

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెం దెందు వెదకి చూచిన, నం దందే గలఁడు దానవాగ్రణి! వింటే. 275

వ. అని యి వ్విధంబున. 276

మ. హరి సర్వాకృతులం గలం డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప స
త్వరుఁ డై యెందును లేఁడుఁ లేఁ డని సుతుం దైత్యుండు [2]తర్జింప శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానా జంగమ స్థావరో
త్కర గర్భంబుల నన్ని దేశముల నుద్దండ ప్రభావంబునన్. 277

వ. అ య్యవసరంబున దానవేంద్రుండు. 278

క. డింభక! సర్వస్థలముల, నంభోరుహనేత్రుఁ డుండు నంచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ, స్తంభంబునఁ జూపఁగలవె చక్రిం గ్రిక్కిన్. 279

క. స్తంభమునఁ జూపవేనియుఁ, గుంభిని నీ శిరము ద్రుంచి కూల్పఁగ రక్షా
రంభమున వచ్చి హరి వి, స్రంభంబున నడ్డపడఁగ శక్తుం డగునే. 280

వ. అనిన [3]భక్తవత్సలుం డగు శ్రీహరి పరమభక్తుం డైన ప్రహ్లాదుం డి ట్లనియె.

శా. అంభోజాసనుఁ డాది గాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁ డై
సంభావంబున నుండు ప్రోడ విపుల స్తంభంబులో నుండఁడే
స్తంభాంతర్గతుఁ డయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్ష స్వరూపంబునన్. 282

వ. అనిన విని కరాళించి, గ్రద్దన లేచి, గద్దియ డిగ్గ నుఱికి, యొఱ వెఱికిన ఖడ్గంబుఁ గేల నమర్చి, జళిపించుచు, మహాభాగవతశిఖామణి యైన ప్రహ్లాదుని ధిక్కరింపుచు.

మ. వినరా! డింభక! మూఢచిత్త! [4]గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెద వైన నిందుఁ గలఁడే యంచున్ మదోద్రేకి యై
దనుజేంద్రుం డఱచేత వ్రేసెను మహోదగ్ర ప్రభాశుంభమున్
జన దృగ్భీషణ దంభమున్ హరిజను స్సంరంభమున్ స్తంభమున్. 284

---

1. కలఁ డంభోనిధులందు (క. చ.) 2. భర్జింప (క): దండింప (ద) 3. భక్తవత్సలుని భటుం డిట్లనియె (తం. వా.) 4. జడిమన్ (క)

## —: శ్రీహరి నరసింహ రూపమున స్తంభంబునం దావిర్భవించుట :—

వ. ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణ వైరుండును, వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును, రోషానల జంఘన్యమాన విజ్ఞానవినయుండును, వినయ గాంభీర్య ధైర్య జేగీయమాన హృదయుండును, హృదయ చాంచల్యమాన తామసుండును, తామసగుణ చంక్రమ్యమాణ స్థైర్యుండును నై, విస్రంభంబున హుంకరించి, బాలుని ధిక్కరించి, హరి నిందుఁ జూపుమని, కనత్కనక మణిమయ కంకణ క్రేంకార శబ్దపూర్వకంబుగా దిగ్దంతి దంత భేదన పాటవ ప్రశస్తం బగు హస్తంబున సభామండప స్తంభంబు వేసిన, వ్రేటుతోడన దశదిశలును మిణుఁగురులు సెదరఁ జిటిలి, పెటిలి పడి, బంభజ్యమానం బగు నమ్మహాస్తంభంబు వలనఁ బ్రళయవేళా సంభూత సప్తస్కంధ బంధుర సమీరణ సంఘటిత జోఘుష్యమాణ మహా బలాహకవర్గ నిర్గత నిబిడ నిష్ఠుర దుస్సహ నిర్ఘాతసంఘ నిర్ఘోష నికాశంబు లైన ఛటచ్ఛట, స్ఫుటస్ఫుట ధ్వనిప్రముఖ భయంక రారావపుంజంబులు జంజన్యమానంబు లై యెగసి, యాకాశ కుహ రాంతరాళంబు నిరవకాశంబు నేసి నిండినం బట్టు చాలక, దోదూయమాన హృదయంబు లై పరవశంబు లైన పితామహ మహేంద్ర వరుణ వాయు శిఖి ప్రముఖ చరాచర జంతుజాలంబులతోడ బ్రహ్మాండకటాహంబు పగిలి పరిస్ఫోటితంబుగాఁ, బ్రఫుల్ల పద్మయుగళ సంకాశ భాసుర చక్ర చాప హల కులి శాంకుశ జలచర రేఖాంకిత చారు చరణ తలుండును, చరణ చంక్రమణ ఘన వినమిత విశ్వ విశ్వంభరాభర ధౌరేయ దిక్కుంభి కుంభీనస కుంభినీధర కూర్మ కుల శేఖరుండును, దుగ్ధజలధి జాత శుండాల శుండాదండ మండిత ప్రకాండ ప్రచండ మహోరు స్తంభ యుగళుండును, ఘణఘణాయమాన మణికింకిణీగణ ముఖరిత మేఖలావలయ వలయిత పీతాంబర శోభిత కటిప్రదేశుండును, నిర్జర నిమ్నగావర్త వర్తుల కమలాకర గంభీర నాభీ వివరుండును, ముష్టిపరిమేయ వినుత తనుతర స్నిగ్ధ మధ్యుండును, కులాచల సానుభాగ సదృశ కర్కశ విశాల వక్షుండును, దుర్జన దనుజభట ధైర్యలతికా లవిత్రాయమాన, రక్షోరాజ వక్షోభాగ విశంకట క్షేత్ర విలేఖన [1]చుంచు లాంగలాయమాన, ప్రతాపజ్వలన జ్వాలాయమాన, శరణాగత నయనచకోర చంద్ర రేఖాయమాన, వజ్రాయుధప్రతిమాన భాసమాన, నిశాత ఖరతర ముఖనఖరుండును, శంఖ చక్ర గదా కుంత తోమర ప్రముఖ నానాయుధ మహిత మహోత్తుంగ మహీధరశృంగసన్నిభ వీరసాగర వేలాయమాన, మాలికా విరాజమాన, నిరర్గ

1. చంగ (శ. తం.)

—: శ్రీహరి నరసింహ రూపమున స్తంభంబునం దావిర్భవించుట :—

వ. ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణ వైరుండును, వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును, రోషానల జంఘన్యమాన విజ్ఞానవినయుండును, వినయ గాంభీర్య ధైర్య జేగీయమాన హృదయుండును, హృదయ చాంచల్యమాన తామసుండును, తామసగుణ చంక్రమ్యమాణ స్థైర్యుండును నై, విస్రంభంబున హుంకరించి, బాలుని ధిక్కరించి, హరి నిందుఁ జూపుమని, కనత్కనక మణిమయ కంకణ క్రేంకార శబ్దపూర్వకంబుగా దిగ్దంతి దంత భేదన పాటవ ప్రశస్తం బగు హస్తంబున సభామండప స్తంభంబు వేసిన, వ్రేటుతోడన దశదిశలును మిణుఁగురులు సెదఱఁ జిటిలి, పెటిలి పడి, బంభజ్యమానం బగు నమ్మహాస్తంభంబు వలనఁ బ్రళయవేళా సంభూత సప్త స్కంధ బంధుర సమీరణ సంఘటిత జోఘుష్యమాణ మహా బలాహకవర్గ నిర్గత నిబిడ నిష్ఠుర దుస్సహ నిర్ఘాతసంఘ నిర్ఘోష నికాశంబు లైన ఛటచ్ఛట, స్ఫుటస్ఫుట ధ్వనిప్రముఖ భయంక రారావపుంజంబులు జంజన్యమానంబు లై యెగసి, యాకాశ కుహ రాంతరాళంబు నిరవకాశంబు సేసి నిండినం బట్టు చాలక, దోదూయమాన హృదయంబు లై పరవశంబు లైన పితామహ మహేంద్ర వరుణ వాయు శిఖి ప్రముఖ చరాచర జంతుజాలంబులతోడ బ్రహ్మాండకటాహంబు పగిలి పరిస్ఫోటితంబుగాఁ, బ్రఫుల్ల పద్మయుగళ సంకాశ భాసుర చక్ర చాప హల కులి శాంకుశ జలచర రేఖాంకిత చారు చరణతలుండును, చరణ చంక్రమణ ఘన వినమిత విశ్వ విశ్వంభరాభర ధౌరేయ దిక్కుంభి కుంభీనస కుంభినీధర కూర్మ కుల శేఖరుండును, దుగ్ధజలధి జాత శుండాల శుండాదండ మండిత ప్రకాండ ప్రచండ మహోరు స్తంభ యుగళుండును, ఘణఘణాయమాన మణికింకిణీగణ ముఖరిత మేఖలావలయ వలయిత పీతాంబర శోభిత కటిప్రదేశుండును, నిర్జర నిమ్నగావర్త వర్తుల కమలాకర గంభీర నాభీ వివరుండును, ముష్టిపరిమేయ వినుత తనుతర స్నిగ్ధ మధ్యుండును, కులాచల సానుభాగ సదృశ కర్కశ విశాల వక్షుండును, దుర్జన దనుజభట ధైర్యలతికా లవిత్రాయమాన, రక్షోరాజ వక్షోభాగ విశంకట క్షేత్ర విలేఖన [1]చుంచు లాంగలాయమాన, ప్రతాపజ్వలన జ్వాలాయమాన, శరణాగత నయనచకోర చంద్రరేఖాయమాన, వజ్రాయుధప్రతిమాన భాసమాన, నిశాత ఖరతర ముఖనఖరుండును, శంఖ చక్ర గదా కుంత తోమర ప్రముఖ నానాయుధ మహిత మహోత్తుంగ మహీధరశృంగసన్నిభ వీరసాగర వేలాయమాన, మాలికా విరాజమాన, నిరర్గ

1. చంగ (త. తం.)



ళానేకశత భుజార్గళుండును, మంజు మంజీర మణిపుంజ రంజిత మంజుల హార కేయూర కంకణ కిరీట మకరకుండలాది భూషణ భూషితుండును, త్రివళీయుత శిఖరి శిఖరాభ పరిణద్ధ బంధుర కంధరుండును, ప్రకంపన కంపిత పారిజాతపాదప పల్లవ ప్రతీకాశ కోపావేశ సంచలి తాధరుండును, శరత్కాల మేఘజాల మధ్యమ ధగద్ధగాయమాన తటిల్లతా సమాన దేదీప్యమాన దంష్ట్రాంకురుండును, కల్పాంత కాల సకలభువన గ్రసన విలసన విజృంభమాణ సప్తజిహ్వ జిహ్వా తులిత తరళతరాయమాణ విభ్రాజమాన జిహ్వుండును, మేరుమందర మహా గుహాంతరాళ విస్తార విపుల వక్త్ర నాసికా వివరుండును, నాసికావివర నిస్సర న్నిబిడ నిశ్శ్వాస నికర సంఘట్టన సంక్షోభిత సంతప్యమాన సప్తసాగరుండును, పూర్వపర్వత విద్యోతమాన ఖద్యోతమండలసదృక్ష సమంచిత లోచనుండును, లోచనాంచల సముత్కీర్యమాణ విలోల కీలాభీల విస్ఫులింగ వితాన రోరుధ్యమాన తారకా గ్రహ మండలుండును, శక్ర చాప సురుచి రోదగ్ర మహా భ్రూలతాబంధ బంధుర భయంకర వదనుండును, ఘనతర గండశైల తుల్య కమనీయ గండభాగుండును, సంధ్యారాగ రక్త ధారాధరమాలికా ప్రతిమ మహాభ్రంకష తంతన్యమాన పటుతర సటాజాలుండును, సటాజాల సంచాలన సంజాత వాత డోలాయమాన వైమానిక విమానుండును, నిష్కంపిత శంఖ వర్ణ మహోర్ధ్వకర్ణుండును, మంథదండాయమాన మందరవసుంధరాధర పరిభ్రమణ వేగ సముత్పద్యమాన వియన్మండల మండిత సుధారాశికల్లోల శీకరాకార భాసుర కేసరుండును, పర్వాఖర్వ శిశిర కిరణమయూఖ గౌర తనూరుహుండును, నిజ గర్జననినాద నిర్దళిత కుముద సుప్రతీక వామ నైరావణ సార్వభౌమ ప్రముఖ దిగిభరాజ కర్ణకోటరుండును, ధవళ ధరాధర దీర్ఘ దురవలోకనీయ దేహుండును, దేహ ప్రభాపటల [1]నిర్మథ్యమాన పరిపంథియాతుధాన నికురుంబ గర్వాంధకారుండును, బ్రహ్లాద హిరణ్యకశిపు రంజన భంజన నిమి త్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణా వీర రస సంయుతుండును, మహాప్రభావుండును నైన శ్రీనృసింహదేవుం డావిర్భవించినం గనుంగొని. 285

క. నరమూర్తి గాదు కేవల, హరిమూర్తియుఁ గాదు మానవాకారము కే
సరియాకారము నున్నది, హరి మాయారచిత మగు యథార్థము సూడన్. 286

ఉ. తెంపున బాలుఁ డాడిన సుధీరత సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపఁ దలంచి యిందు నరసింహశరీరము దాల్చి చక్రి శి
క్షింపఁగ వచ్చినాఁడు హరిచే మృతి యంచుఁ దలంతు నైన నా
సొంపునఁ బెంపు నందఱును జూడఁ జరింతు హరింతు శత్రునిన్. 287

1. సమ్మథ్యమాన (ద)

## —: నరసింహమూర్తి హిరణ్యకశిపుని వధించుట :—

వ. అని మెత్తంబడని చిత్తంబున గద యెత్తికొని, తత్తఱంబున నార్చుచు నకుంఠిత కంఠీరవంబు డగ్గఱు గంధసింధురంబు చందంబున నక్తంచరకుంజరుండు నరసింహ దేవుని కెదురు నడచి, తదీయ దివ్య తేజోజాల సన్నికర్షంబునం జేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెఁ గర్తవ్యాకర్తవ్యంబులు దెలియక నిర్గత ప్రభుం డై యుండె. అంత. 288

మ. ప్రకటం బై ప్రళయావసానమున మున్ బ్రహ్మాండభాం డావరో
ధక మై యున్న తమిస్రముం జగము నుత్పాదించుచోఁ ద్రావి సా
త్త్విక తేజోనిధి యైన విష్ణు నెడ నుద్దీపించునే నష్ట మై
వికలం బై చెడుఁ గాక తామసుల ప్రావీణ్యంబు రాజోత్తమా! 289

వ. అంత నద్దానవేంద్రుండు మహోద్దండం బగు గదాదండంబు గిరగిరఁ ద్రిప్పి, నరమృగేంద్రుని వేసిన, నతండు దర్పంబున సర్పంబు నొడిసిపట్టు సర్పపరిపంథి నేర్పున దితిపట్టిం బట్టికొనిన, మిట్టిపడి, దట్టించి, బిట్టు కట్టలుక న య్యసుర వరుండు దృఢబలంబున నిట్టట్టు [1]మిడిసి, పట్టుదప్పించుకొని, విడివడి, దిటవుతప్పక కుప్పించి, యుప్పరంబున కెగసి, విహంగకులరాజచరణ నిర్గళిత భుజంగంబు చందంబునఁ దలంగ నుఱికి, తన భుజాటోపంబున [2]వరకంఠీరవుండు కుంఠితుం డయ్యెడి నని తలంచి, కలంగక చెలంగుచుఁ, దన్ను నిబిడ నీరదనికరంబుల మాటున నిలింపులు గుంపులుగొని డాఁగి మూఁగి క్రమ్మఱ నాత్మీయ జీవనశంకా కళంకితు లై మంతనంబులఁ జింతనంబులు సేయుచు నిరీక్షింప, నక్షీణ సమరదక్షతా విశేషం బుపలక్షించి, ఖడ్గ వర్మంబులు ధరియించి, భూనభోభాగంబుల వివిధ విచిత్ర లంఘన లాఘవంబులఁ బరిభ్రమణ భేదంబులఁ గరాళవదనుం డై యంత రాళంబున దిరుగు [3]సాళువడేగ చందంబున సంచరించిన సహింపక. 290

సీ. పంచాన నోద్ధూత పావక [4]జ్వాలల భూనభోంతర మెల్లఁ బూరితముగ
దంష్ట్రాంకు రాభీల ధగధగాయిత దీప్తి నసురేంద్రు నేత్రము లంధములుగఁ
గంటక [5]సన్నిభోత్కట కేసరాహతి, నభ్రసంఘము భిన్న మై చరింపఁ
బ్రళయార్క చంచలాప్రతిమ భాస్వరము లై ఖర నఖరోచులు గ్రమ్ముదేర

తే. సటలు జళిపించి గర్జించి సంభ్రమించి
దృష్టి సారించి బొమలు బంధించి కెరలి
జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి
పట్టె నరసింహుఁ డా దితిపట్టి నధిప! 291

---

1. జడిసి (తం) 2. నరకంఠీరవుం డకుంఠితుం డయ్యె నని (హ)
3. సాళువపుడేగ (తం. వా.) 4. జ్వాలలు (హ. తం. వా.) 5. సన్నిభోత్కర (హ)

క. సరకుగొనక లీలాగతి, నురగేంద్రుఁడు మూషకంబు నొడిసినభంగిన్
నరకేసరి దను నొడిసిన, సురవిమతుఁడు ప్రాణభీతి సుడివడియె నృపా! 292

క. సురరాజవైరి లోఁబడెఁ, బరిభావిత సాధు భక్త పటలాంహునకున్
నరసింహునకు నుదంచ, త్వరతర [1]జిహ్వునకు నుగ్రతర రంహునకున్.

వ. అంత. 294

మ. విహగేంద్రుం డహి వ్రచ్చుకైవడి మహోద్వృత్తి న్నృసింహుండు సా
గ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసంఘాతంబులన్ వ్రచ్చె దు
స్సహు దంభోళి కఠోర దేహు నచలోత్సాహున్ మహాబాహు నిం
ద్ర హుతాశాంతక భీకరున్ ఘనకరున్ దైత్యాన్వయ శ్రీకరున్. 295

శా. చించున్ హృత్కమలంబు శోణితము వర్షించున్ ధరామండలిన్
ద్రెంచుం గర్కశ నాడికావళులు భేదించున్ మహా వక్షమున్
ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా దుష్టాసురున్ వ్రచ్చి ద
ర్పించుం ద్రేవులు కంఠమాలికలు కల్పించు న్నఖోద్భాసియై. 296

సీ. వక్షః కవాటంబు వ్రక్కలుసేయుచో ఘన కుఠారంబుల కరణి నొప్పు
గంభీర హృదయపంకజము భేదించుచోఁ గుద్దాలముల భంగిఁ గొమరు మిగులు
ధమనీ వితానంబుఁ దగిలి ఖండించుచోఁ బటు లవిత్రంబుల పగిది మెఱయు
జఠర విశా లాంత్రజాలంబుఁ ద్రెంచుచోఁ గ్రకచ సంఘంబుల గరిమఁ జూపు

తే. నంకగతుఁడైన దైత్యుని నాగ్రహమున
శస్త్రచయముల నొంపక సంహరించి
యమరు నరసింహు నఖరంబు లతివిచిత్ర
సమర ముఖరంబులై యుండె జనవరేణ్య! 297

క. స్ఫురిత విబుధజన ముఖములు, పరివిదళిత దనుజ నివహపతి తను ముఖముల్
గురురుచి జిత శిఖిశిఖములు, నరహరి కరనఖము లమరు నతజన [2]సఖముల్. 298

వ. ఇట్లు కేవల పురుషరూపంబును మృగరూపంబునుం గాని నరసింహ రూపంబున రేయునుం బగలునుం గాని సంధ్యాసమయంబున, నంతరంగంబును బహిరంగంబును గాని సభాద్వారంబున, గగనంబును భూమియుం గాని యూరుమధ్యంబున, ప్రాణసహితంబులును, ప్రాణరహితంబులును గాని నఖంబులం, త్రైలోక్యజన హృదయభల్లుండైన దైత్య మల్లుని వధియించి, మహా దహన కీలాభీల దర్శనుండును, కరాళ వదనుండును, లేలిహాన భీషణ జిహ్వుండును, శోణితపంకాం

1. కుదగ్ర ఘనరంహునకున్ (తం) 1. సుఖముల్ (చ)

కిత కేసరుండును నై ప్రేవులు కంఠమాలికలుగ ధరించి, కుంభికుంభ విదళనంబుఁ జేసి చనుదెంచు పంచాననంబునుం బోలె దనుజకుంజర హృదయకమల విదళనంబుం జేసి, తదీయరక్తసిక్తంబు లైన నఖంబులు సంధ్యారాగ రక్త చంద్రరేఖ చెలువు వహింప, సహింపలేక లేచి, తన కట్టెదుర నాయుధంబు లెత్తుకొని, తత్తఱంబున రణంబునకు నురవణించు రక్కసులం బెక్కు సహస్రంబులం జక్రాది నిర్వక్రసాధనంబుల నొక్కనిం జిక్కకుండం జక్కడిచె. ఇ వ్విధంబున. 299

శా. రక్షోవీరుల నెల్లఁ ద్రుంచి రణసంరంభంబు చాలించి దృ
ష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుఁ డై
యక్షీణాగ్రహుఁ డై నృసింహుఁడు కరాళాస్యంబుతో నొప్పెఁ దన్
వీక్షింపం [1]బరికింప నోడి [2]యమరుల్ విభ్రాంతు లై డాఁగఁగన్. 300

క. సుర చారణ విద్యాధర, గరుడోరగ యక్ష సిద్ధ గణములలో నొ
క్కరుఁ డైన డాయ వెఱచును, నరహరి న య్యవసరమున నరలోకేశా! 301

క. తర్షంబుల నరసింహుని, హర్షంబులఁ జూచి నిర్జరాంగనలు మహో
త్కర్షంబులఁ గుసుమంబుల, వర్షంబులు గురిసి రుత్సవంబుల నధిపా! 302

వ. మఱియు, న య్యవసరంబున మింట ననేక దేవతావిమానంబులును, గంధర్వ గానంబులును, నప్సరోగణ నర్తనసంవిధానంబులును, దివ్య కాహళ భేరీ పటహ మురజాది ధ్వానంబులును, బ్రకాశమానంబు లయ్యె. సునంద కుముదాదు లైన హరి పార్శ్వచరులును, మహేశ్వర విరించి మహేంద్ర పురస్సరు లగు త్రిదశ కిన్నర కింపురుష పన్నగ సిద్ధ సాధ్య గరుడ గంధర్వ చారణ విద్యాధరాదులును (మునులును, మనులును) బ్రజాపతులును, నరకంఠీరవ దర్శనోత్కంఠితు లై చనుదెంచి. 303

—: బ్రహ్మాదిదేవతలు నృసింహమూర్తిని వేఱువేఱ స్తుతించుట :—

క. కర కమలయుగళ కీలిత, శిరు లై డగ్గఱక భక్తిఁ జేసిరి బహు సం
సరణాబ్ధి తరికి నఖరికి, నరభోజనహస్తి హరికి నరకేసరికిన్. 304

వ. ఆ సమయమున దేవత లందఱు వేఱువేఱ వినుతించిరి. అందుఁ గమలాసనుం డిట్లనియె. 305

1· బరికింప (హ) 2. ఇతరుల్ (తం. వా.)

మ. ఘన లీలాగుణ చాతురిం భువనముల్ గల్పించి రక్షించి భే
దనముం జేయు దురంతశక్తికి ననంతజ్యోతికిం జిత్రవీ
ర్యునికి న్నిత్యపవిత్రకర్మునికి నే నుత్కంఠతో నవ్యయా
త్మునికిం వందన మాచరించెదఁ గృపాముఖ్య ప్రసాదార్థి నై. 306

వ. రుద్రుం డి ట్లనియె. 307

చ. అమరవరేణ్య! మీఁదట సహస్రయు గాంతము నాఁడు గాని కో
పమునకు వేళకాదు సుర[1]బాధకుఁ డైన తమస్వినీచరుం
సమరమునన్ వధించితివి చాలుఁ దదాత్మజుఁ డైన వీఁడు స
ద్విమలుఁడు నీకు భక్తుఁడు పవిత్రుఁడు గావుము భక్తవత్సలా! 308

వ ఇంద్రుం డి ట్లనియె. 309

సీ. ప్రాణిసంఘముల హృత్పద్మ మధ్యంబుల నివసించి భాసిల్లు నీవ యెఱుఁగు
దింతకాలము దాన వేశ్వరుచే బాధపడి చిక్కియున్న యాపన్నజనుల
రక్షించితివి మమ్ము [2]రాక్షసేశ్వరుఁ జంపి క్రతుహవ్యములు మాకుఁ గలిగె మఱల
మంటిమి నీసేవ మరగినవారలు కై వల్యవిభవంబు కాంక్షసేయ

ఆ. రితరసుఖము లెల్ల నిచ్ఛయింపఁగ నేల
యస్థిరంబు లివి యనంతభక్తిఁ
గొలువ నిమ్ము నిన్ను ఘోర దైత్యానీక
చిత్తభయద రంహ! శ్రీనృసింహ! 310

వ. ఋషు లి ట్లనిరి. 311

మ. [3]భవదీ యోదరలీన లోకముల నుత్పాదించి రక్షించ నేఁ
డవి దైత్యేశునిచేత భేదితము లై హ్రాస్వంబు లై యుండ నీ
యవినీతు న్నరసింహరూపమున సంహారంబు నొందించి వే
దవిధిం గ్రమ్మఱ నుద్ధరించితిగదా! ధర్మానుసంధాయి వై. 312

వ. పితృదేవత లి ట్లనిరి. 313

శా. చండక్రోధముతోడ దైత్యుఁడు వడిం శ్రాద్ధంబులం మత్సుతుల్
పిండంబుల్ సతిలోదకంబులుగ నర్పింపంగ మా కీక యు
ద్దండత్వంబునఁ దానె కైకొను మహోదగ్రుండు [4]వీఁ డిక్కడం
ఖండింపంబడె నీ నఖంబుల నుతుల్ గావింతు మాత్మేశ్వరా! 314

---

1. బంధకుఁడై (డ) 2. రాక్షసుఁ జంపితి(తం.వా.) 3. భవదీయోదరలీల(హ.తం.వా) 4. నేఁడిక్కడన్(క)

వ. సిద్ధు లి ట్లనిరి. 315

క. క్రుద్ధుం డై యణిమాదిక, సిద్ధులు గై కొనిన దైత్యుఁ జీరితివి మహా
యోద్ధవు నీ కృప మాకును, సిద్ధులు మఱలంగఁ గలిగె శ్రీనరసింహా! 316

వ. విద్యాధరు లి ట్లనిరి. 317

క. దానవునిఁ జంపి యంత, ర్ధానాదిక విద్యలెల్ల దయతో మఱలం
గా నిచ్చితివి విచిత్రము, నీ నిరుపమ వైభవంబు నిజము నృసింహా! 318

వ. భుజంగు లి ట్లనిరి. 319

క. రత్నములను మత్కాంతా, రత్నములనుఁ బుచ్చుకొన్న రక్కసు నురముఁ
యత్నమున వ్రచ్చి వేసితి, పత్నులు రత్నములు గలిగెఁ బ్రతికితి మీశా! 320

వ. మనువు లి ట్లనిరి. 321

క. దుర్ణయుని దైత్యుఁ బొరిగొని, వర్ణాశ్రమ ధర్మ సేతు వర్గము మఱలం
బూర్ణముఁ జేసితి వేమని, వర్ణింతుము కొలిచి బ్రతుకువారము దేవా! 322

వ. ప్రజాపతు లి ట్లనిరి. 323

మ. ప్రజలం జేయుటకై సృజించితి మముం బాటించి దైత్యాజ్ఞచేఁ
బ్రజలం జేయక యింతకాలము మహాభారంబుతో నుంటి మీ
కుజనున్ వక్షముఁ జీరి చంపితివి సంకోచంబు [1]లే కెల్లచోఁ
బ్రజలం జేయుచు నుండువారము జగద్భద్రాయమానోదయా! 324

వ. గంధర్వు లి ట్లనిరి. 325

క. అడుదుము రేయుఁ బగలుం, బాడుదుము నిశాటు నొద్ద బాధించు దయం
జూడఁడు నీచే జమునిం, గూడె మహాపాతకునికిఁ గుశలము గలదే. 326

వ. చారణు లి ట్లనిరి. 327

క. భువనజన హృదయ భల్లుఁడు, దివిజేంద్ర విరోధి నేఁడు దెగె నీచేతఁ
భవరోగ నివర్తక మగు, భవదంఘ్రియుగంబుఁ జేరి బ్రతికెద మీశా! 328

వ. యక్షు లి ట్లనిరి. 329

ఉ. భ్రంశము లేని నీ భటుల భంగవిముక్తుల మమ్ము నెక్కి ని
స్సంశయవృత్తి దిక్కులఁ బ్రచారముఁ జేయుచునుండు వీఁడు ని
స్త్రింశముతోడ వీనిఁ గడఁదేర్చితి వాపద మానె నో చతు
ర్వింశతి తత్త్వ శాసక! త్రివిష్టప ముఖ్య జగన్నివాసకా! 330

1. లేకెల్లచోఁ (క. బ.) 2. బ్రతికితిమీశా (క. చ. డ. ద.)



వ. కింపురుషు లి ట్లనిరి. 331

క. పురుషోత్తమ! నేరము కిం, పురుషుల మల్పులము నిన్ను భూషింపఁగ దు
ష్పురుషున్ సకలసుజన హృ, త్పరుషుం జంపితివి [1]జగము బ్రతికె నధీశా! 332

వ. వైతాళికు లి ట్లనిరి. 333

క. త్రిభువన శత్రుఁడు పడియెను, సభలందును మఖములందు జగదీశ్వర! నీ
[2]శుభగీతములు పఠింపుచు, నభయుల మై సంచరింతు మార్తశరణ్యా! 334

వ. కిన్నరు లి ట్లనిరి. 335

క. ధర్మము దలఁపఁడు లఘుతర, కర్మము సేయించు మమ్ముఁ గలుషాత్మకు దు
ష్కర్మునిఁ జంపితి వున్నత, శర్మల మై నీదుభక్తి [3]సలిపెదము హరీ! 336

వ. విష్ణుసేవకు లి ట్లనిరి. 337

ఉ. సంచిత విప్రశాపమునఁ జండనిశాచరుఁ డైన వీని శి
క్షించుట కీడుగాదు కృపచేసితి వీశ్వర! భక్తితోడ [4]సే
వించినకంటె వైరమున వేగమె చేరఁగవచ్చు నిన్ను నీ
యంచిత నారసింహతను వద్భుత మాపదఁ బాసి రందఱున్. 338

## అధ్యాయము - ౯

వ. ఇట్లు బ్రహ్మ రుద్రేంద్ర సిద్ధ సాధ్య పురస్సరు లైన దేవముఖ్యు లందఱు (నెడ
గలిగి యనేక ప్రకారంబుల వినుతించి, రోష సంరంభ విజృంభమాణుం డైన
నరసింహ దేవుని డగ్గఱ వెఱచి, లక్ష్మీదేవిం బిలిచి యి ట్లనిరి. 339

క. హరికిం బట్టపు దేవివి, హరిసేవా నిపుణమతివి [5]హరిగతివి సదా
హరిరతివి నీవు సని నర, హరి రోషము డింప వమ్మ! హరివరమధ్యా! 340

వ. అనిన నియ్యకొని మహోత్కంఠ తోడ నా కలకంఠి నరకంఠీరవుని యుపకంఠం
బునకుం జని. 341

సీ. ప్రళయార్క బింబంబు పగిది నున్నది గాని నెమ్మోము పూర్ణేందు నిభము గాదు
శిఖి శిఖాసంఘంబు చెలువు చూపెడుఁ గాని చూడ్కి ప్రసాదభాసురము గాదు
వీర రౌద్రాద్భు తావేశ మొప్పెడుఁ గాని భూరి కృపారస స్ఫూర్తి గాదు
భయద దంష్ట్రాంకుర ప్రభలు గప్పెడుఁ గాని దరహాసి తాంబుజాతంబు గాదు

1. జనము (బ.) 2. శుభగీతంబులు పాడుచు (త.) శుభతరగీతము పాడుచు (క.)
3. పలిపెదమీశా (హ.) 4. సేవించుటకంటె (హ. తం. వా.) 5. హరిపతివి (త—బ.)

వ. కింపురుషు లి ట్లనిరి. 331

క. పురుషోత్తమ ! నేరము కిం, పురుషుల మల్పులము నిన్ను భూషింపఁగ దు
ష్పురుషున్ సకలసుజన హృ,త్పరుషుం జంపితివి [1]జగము బ్రతికె నధీశా ! 332

వ. వైతాళికు లి ట్లనిరి. 333

క. త్రిభువన శత్రుఁడు వడియెను, సభలందును మఖములందు జగదీశ్వర ! నీ
[2]శుభగీతములు పఠింపుచు, నభయుల మై సంచరింతు మార్తశరణ్యా ! 334

వ. కిన్నరు లి ట్లనిరి. 335

క. ధర్మము దలఁపఁడు లఘుతర, కర్మము సేయించు మమ్ముఁ గలుషాత్మకు దు
ష్కర్మునిఁ జంపితి వున్నత, శర్ముల మై నీదుభక్తి [3]సలిపెదము హరీ ! 336

వ. విష్ణుసేవకు లి ట్లనిరి. 337

ఉ. సంచిత విప్రశాపమునఁ జండనిశాచరుఁడైన వీని శి
క్షించుట కీడుగాదు కృపచేసితి వీశ్వర ! భక్తితోడ [4]సే
వించినకంటె వైరమున వేగమె చేరఁగవచ్చు నిన్ను నీ
యంచిత నారసింహతను వద్భుత మాపదఁ బాసి రందఱుఁ. 338

## అధ్యాయము - ౯

వ. ఇట్లు బ్రహ్మ రుద్రేంద్ర సిద్ధ సాధ్య పురస్సరు లైన దేవముఖ్యు లందఱు (నెడ
గలిగి యనేక ప్రకారంబుల వినుతించి, రోష సంరంభ విజృంభమాణుం డైన
నరసింహ దేవుని డగ్గఱ వెఱచి, లక్ష్మీదేవిం బిలిచి యి ట్లనిరి. 339

క. హరికిం బట్టపు దేవివి, హరిసేవా నిపుణమతివి [5]హరిగతివి సదా
హరిరతివి నీవు సని నర, హరి రోషము డింప వమ్మ ! హరివరమధ్యా ! 340

వ. అనిన నియ్యకొని మహోత్కంఠ తోడ నా కలకంఠి నరకంఠీరవుని యుపకంఠం
బునకుం జని. 341

సీ. ప్రళయార్క బింబంబు పగిది నున్నది గాని నెమ్మోము పూర్ణేందు నిభము గాదు
శిఖి శిఖాసంఘంబు చెలువు చూపెడుఁ గాని చూడ్కి ప్రసాదభాసురము గాదు
వీర రౌద్రాద్భు తావేశ మొప్పెడుఁ గాని భూరి కృపారస స్ఫూర్తి గాదు
భయద దంష్ట్రాంకుర ప్రభలు గప్పెడుఁ గాని దరహాసి తాంబుజాతంబు గాదు

1. జనము (బ.) 2. శుభగీతంబులు పాడుచు (త.) శుభతరగీతము పాడుచు (క.)
3. సలిపెదమీశా (హ.) 4. సేవించుటకంటె (హ. తం. వా.) 5. హరిసతివి (త—బ.)

తే. [1]కఠిన నఖర నృసింహ విగ్రహము గాని
కామినీజన సులభవిగ్రహము గాదు
విన్నదియుఁ గాదు తొల్లి నే విష్ణువలనఁ
గన్నదియుఁ గాదు భీషణాకార మనుచు. 342

క. పలికెద నని గమకము గొనుఁ, బలికినఁ గడు [2]నలిగి విభుఁడు ప్రతివచనములం
బలుకఁ డని నిలుచు శశిముఖి,బలువిడి హృదయమునఁ జనవు భయమును గదురన్.

వ. ఇట్లు నరహరిరూపంబు వారిజనివాసిని వీక్షించి, శంకించి, శాంతుం డైన వెనుక
డగ్గఱియెద నని చింతింపుచున్న, వారిజసంభవుం డ ద్దేవునిరోషంబు నివారింప
నితరుల కలవిగా దని ప్రహ్లాదుం జీరి యి ట్లనియె. 344

క. తండ్రి మగు రోషమున మీ, తండ్రి నిమిత్తమునఁ జక్రి దారుణమూ ర్తిన్
[3]వేంద్రము విడువడు మెల్లనఁ, దండ్రీ! శీతలునిఁ జేసి దయసేయఁగదే. 345

వ. అనిన నౌఁగాక యని మహాభాగవత శేఖరుం డైన బాలకుండు కరకమలంబులు
ముకుళించి, మందగమనంబున నమంద వినయ వివేకంబుల నరసింహదేవుని సన్ని
ధికిం జని, సాష్టాంగ దండప్రణామంబులు సేసిన, భక్తపరాధీనుం డగు న య్యీ
శ్వరుం డాలోకించి, కరుణాయత్త చిత్తుం డై. 346

ఉ. ప్రాభవ మొప్ప [4]నుత్కట కృపామతి యై కదియంగ జీరి సం
శోభిత దృష్టిసంఘములఁ జూచుచు బాలుని మౌళియందు లో
కాభినుతుండు వెట్టె నసురాంతకుఁ డుద్భట కాలసర్ప భీ
తాభయ దాన శస్తము ననర్గళ మంగళ హేతు హస్తమున్. 347

వ. ఇట్లు హరి కరస్పర్శంబున భయవిరహితుండును, బ్రహ్మజ్ఞాన సహితుండును,
పులకిత దేహుండును, సముత్పన్న సంతోష బాష్ప సలిలధారా సమూహుండును
ప్రేమాతిశయ గద్గద భాషణుండును, వినయ వివేక భూషణుండును, నేకాగ్ర
చిత్తుండును, భక్తిపరాయత్తుండును నై, య ద్దేవుని చరణ కమలంబులు దన
హృదయంబున నిలిపికొని, కరకమలంబులు ముకుళించి యి ట్లని వినుతించె. 448

—: ప్రహ్లాదుండు నరసింహమూర్తిని స్తుతించుట :—

మ. అమరుల్ సిద్ధులు సంయమీశ్వరులు బ్రహ్మాదుల్ సతాత్పర్య చి
త్తముల న్నిన్ను బహుప్రకారముల నిత్యంబున్ విచారించి పా
రము ముట్ట న్నుతిసేయ నోప రఁట నే రక్షస్తనూజుండ గ
ర్వ మదోద్రిక్తుఁడ బాలుఁడన్ జడమతిన్ వర్ణింప శక్తుండనే. 349

1. కఠినఖరనారసింహ (హ.) 2. నలుగువిభుఁడు (తం. వా.) 3. వేంద్రమగుగాన (క.డ.ద.)
4. గన్గొని (హ.)

మ. తపముల్ వంశము తేజముల్ శ్రుతము సౌందర్యంబు నుద్యోగము
న్నిపుణత్వంబు ప్రతాప పౌరుషములు న్నిష్ఠా బల ప్రజ్ఞలున్
జప[1]యోగంబులుఁ జాల వీశ్వర ! భవ త్సంతుష్టికై దంతి యూ
థపు చందంబున భక్తి సేయవలయున్ దాత్పర్య సంయుక్తుఁడై. 350

మ. [2]అమలజ్ఞాన సుదాన ధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర
త్వములన్ యజ్ఞ తపోఽనసూయల గడున్ దర్పించు ధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోఽర్థ ప్రాణ వాక్కర్మముల్
సమత [3]న్నిన్ను నయించెనేని [4]నిజవంశ శ్రీకరుం డౌఁ దుదిన్. 351

సీ. అజ్ఞుండు సేసిన [5]యారాధనములఁ జేపట్టఁ డీశ్వరుఁడు కృపాళుఁ డగుటఁ
జేపట్టు నొకచోట సిద్ధ మీశ్వరునకు నర్థంబు లేకున్న [6]నతఁడు పూర్ణుఁ
డైన నర్థము లీశ్వరార్పణంబులు గాఁగఁ జేయుట ధర్మంబు సేసెనేని
నద్దంబుఁ జూచిన నళిక లలామంబు ప్రతిబింబితం బగు పగిది మఱల

తే. నర్థములు [7]దోఁచుఁ గావున నధికబుద్ధి
భక్తి సేయంగవలయును భక్తిగాని
మెచ్చఁ డర్థంబు లొసఁగెడు మేరలందుఁ
బరమ కరుణుండు హరి [8]భక్తబాంధవుండు. 352

క. కావున నల్పుఁడ సంస్తుతిఁ, గావించెద వెఱపు లేక కల నేరుపునన్
నీ వర్ణనమున ముక్తికిఁ, బోవు నవిద్యను జయించి పురుషుఁ డనంతా ! 353

సీ. [9]సత్త్వాకరుఁడ వైన సర్వేశ ! నీ యాజ్ఞ శిరముల నిడుకొని చేయువారు
బ్రహ్మాదు లమరులు భయ మొందుచున్నారు నీ భీషణాకృతి నేఁడు చూచి
రోషంబు మాను నీ రుచిర విగ్రహములు కల్యాణకరములు గాని భీతి
కరములు గావు లోకములకు వృశ్చిక పన్నగములభంగి భయముఁ జేయు

తే. నసుర మర్దించితివి [10]సాధుహర్ష మయ్యె
నవతరించిన పని దీఱె నలుక యేల
కలుషహారివి సంతోషకారి వనుచు
నిన్నుఁ దలఁతురు లోకులు నిర్మలాత్మ ! 354

---

1. హోమంబులు (హ.వా.); యాగంబులు (చ. బ. తం.) 2. అమలజ్ఞానతదాన ధర్మ (తం.); ....సదానధర్మ (హ) 3. నీకు నొసంగెనేని (డ) 4. భగవత్సంతోషకుండౌఁ (హ) 5. యపరాధములనుఁ (హ. తం. వా.) 6. లేకుండు (హ. తం. వా.) 7. జూచు (తం.) 8. భక్తి (హ. వా.) 9. సర్వాత్మకుఁడ (క. త. జ. బ.) 10. చాలు హర్షమయ్యె (క. ట. ద. బ.)

మ. ఖరదంష్ట్రా భ్రుకుటీ సటా నఖయు నుగ్రధ్వానయుక్ రక్తకే
సరయుం దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయు నైన నీ
నరసింహాకృతిఁ జూచి నే వెఱవఁ బూర్ణ క్రూర దుర్వార దు
ర్భర సంసారదవాగ్నికిన్ వెఱతు నీ పాదాశ్రయుం జేయవే. 355

వ. దేవా! సకలయోనులందును సుఖవియోగ దుఃఖసంయోగ జనితం బైన శోకా నలంబున దందహ్యమానుండ నై, దుఃఖనివారకంబు గాని దేహాద్యభిమానంబున మోహితుండ నై, పరిభ్రమించుచున్న యేను, నాకుం బ్రియుండవు, సఖుండవు, పరమదేవతవు నైన నీయొక్క బ్రహ్మగీతంబు లైన లీలావతార కథా విశేషం బులఁ బఠియించుచు, రాగాది నిర్ముక్తుండ నై, దుఃఖపుంజంబులఁ [1]దరించి, భవదీయ చరణకమల స్మరణ సేవా నిపుణు లైన భక్తులం జేరి యుండెద. బాలునిం దల్లిదండ్రులును, రోగిని వైద్యదత్తం బైన యౌషధంబును, సము ద్రంబున మునింగెడువాని నావయును, దక్క నొరులు రక్షింపలేని తెఱంగున, సంసారతాప సంతప్యమానుం డై నీచేత నుపేక్షితుం డైన వాని నుద్ధరింప నీవు దక్క నన్యుండు సమర్థుండు గాడు. జగంబుల నెవ్వం డేమి కృత్యంబు నెవ్వని చేతం బ్రేరితుం డై యే యింద్రియంబులం జేసి యేమిటికొఱకు యెవ్వనికి సంబంధి యై యే స్థలంబున నే సమయంబునం దేమి రూపమున నే గుణంబున నపరం బైన జనకాది భావంబున నుత్పాదించి, పరం బైన బ్రహ్మాదిభావంబున రూపాంత రంబు నొందించు, నట్టి వివిధ [2]ప్రకారంబు లన్నియు నీవ. నిత్యముక్తుండవు, రక్షకుండవు నైన నీ యంశం బైన పురుషునికి నీ యనుగ్రహంబునఁ గాలంబు చేతం బ్రేరిత యై కర్మమయంబును, బలయుతంబును, ప్రధానలింగంబును నైన మనంబును నీ మాయ సృజించు. అవిద్యార్పిత వికారంబును, వేదోక్త కర్మ ప్రధానంబును, సంసారచక్రాత్మకంబును నైన యీ మనమును నిన్ను సేవింపక నియమించి తరియింప నొక్కండును సమర్థుండు లేఁడు. విజ్ఞాననిర్జిత బుద్ధి గుణుండవు నీవు. †నీవలన వశీకృత కార్యసాధనశక్తి యైన కాలంబు, మాయ తోడం గూడ షోడశవికారయుక్తం బైన సంసార చక్రంబుఁ జేయుచుండు. సంసార దావదహన సంతప్యమానుండ నగు నన్ను రక్షింపుము. 356

సీ. జనులు దిక్పాలుర సంప దాయు ర్విభవములు గోరుదురు భవ్యంబు లనుచు
నవి యెంతయును రోష హాస జృంభిత మైన మాతండ్రి బొమముడి మహిమఁ జేసి
విహితంబు లగు నట్టి వీరుండు నీచేత నిమిషమాత్రంబున నేఁడు మడిసెఁ
గావున ధ్రువములు గావు బ్రహ్మాదుల శ్రీవిభవంబులు జీవితములు

---

1. విదళించి(క.);పరిహరించి(ద.) 2.ప్రకారంబులన్నియు (హ.); † "సత్వంహి నిత్యవిజితాత్మ గుణస్స్వధామ్నా, కాలో వశీకృత విసృజ్యవిసర్గశక్తిః" అని మూలము (9-22)

తే. కాలరూపకుఁ డగు నురుక్రమునిచేత
విదళితము లగు నిలువవు వేయునేల
యితర మే నొల్ల నీమీఁది యెఱుక కొంత
గలిగియున్నది గొలుతుఁ గింకరుఁడ నగుచు. 357

మత్తకోకిల. ఎండమావులవంటి భద్రము లెల్ల సార్థము లంచు మ
ర్త్యుండు రోగనిధాన దేహముతో విరక్తుఁడు గాక యు
ద్దండ మన్మథవహ్ని నెప్పుడుఁ దప్తుఁ డై యొకనాఁడు చే
రండు పారము దుష్ట సౌఖ్యపరంప రాక్రమణంబునన్. 358

ఉ. శ్రీమహిళా మహేశ సరసీరుహగర్భుల కైన నీ మహో
ద్దామ కరంబుచే నభయదానము [1]సేయని నీవు బాలుఁడన్
దామస వంశ సంభవుఁడ దైత్యుఁడ నుగ్ర రజోగుణుండ ని
స్సీమదయన్ గరాంబుజము శీర్షముఁ జేర్చుట చోద్య మీశ్వరా ! 359

వ. మహాత్మా! సుజను లైన బ్రహ్మాదులందును, దుర్జను లైన మాయందును, సేవానురూపంబునం బక్షపాతంబులు లేక కల్పవృక్షంబుచందంబున ఫల ప్రదానంబు సేయుదువు. కందర్పసర్ప సమేతం బగు సంసారకూపంబునం గూలుచున్న మూఢజనులం గూడి కూలెడి నేను, భవదీయ భృత్యుం డగు నారదుని యనుగ్రహంబునం జేసి నీ కృపకుం బాత్రుండ నైతి. నన్ను రక్షించి, మజ్జనకుని వధియించుట నాయందులఁ బక్షపాతంబు గాదు. దుష్టజన సంహారంబును, శిష్ట భృత్య మునిజన రక్షాప్రకారంబును నీకు నైజగుణంబులు. విశ్వంబు నీవ. గుణాత్మకం బైన విశ్వంబు సృజియించి, యందుం బ్రవేశించి, హేతుభూత గుణయుక్తుండ వై, రక్షక సంహారకాది నానారూపంబుల నుండుదువు. సదస త్కారణ కార్యాత్మకం బైన విశ్వంబునకుం బరమకారణంబు నీవ. నీ మాయ చేత వీఁడుఁ దా నని యెడి బుద్ధివికల్పంబు దోఁచుఁ గాని, నీకంటె నొం డెద్దియు లేదు. బీజంబునందు వస్తుమాత్ర భూత సౌక్ష్మ్యంబును, వృక్షంబునందు నీల త్వాది వర్ణంబునుఁ గలుగుతెఱంగున, విశ్వంబునకు నీయంద జన్మ స్థితి ప్రకాశ నాశంబులు గలుగు. నీచేత నైన విశ్వంబు నీయంద నిలుపుకొని, తొల్లి ప్రళయ కాల పారావారంబునఁ బన్నగేంద్ర పర్యంకంబునఁ గ్రియారహితుండ వై, నిజ సుఖానుభవంబు సేయుచు, నిద్రితునిభంగి యోగ నిమీలిత లోచనుండ వై యుండుచుఁ, గొంత కాలంబునకు నిజ కాలశక్తిచేతఁ బ్రేరితంబు లై, ప్రకృతి

1. సేయవునేను (హ. తం. వా.)

ధర్మంబు లైన సత్త్వాదిగుణంబుల నంగీకరించి, సమాధి చాలించి, వెలుంగు
చున్న నీ నాభియందు, వటబీజమువలన నుద్భవించు వటంబు తెఱంగున, నొక్క
కమలంబు సంభవించె. అట్టి కమలంబున నాల్గుమోముల బ్రహ్మ జన్మించి, దిశలు
వీక్షించి, కమలంబునకు నొండైన రూపంబు లేకుండుటఁ జింతించి, జలాంత
రాళంబుఁ బ్రవేశించి, జలంబులందు నూఱు దివ్యవత్సరంబులు వెదకి, తన
జన్మంబున కుపాదానకారణం బైన నిన్ను దర్శింప సమర్థుండు గాక, మగిడి
కమలంబుకడకుం జని, విస్మయంబు నొంది, చిరకాలంబు నిర్భరతపంబు చేసి,
పృథివియందు గంధంబు గనుచందంబునఁ దనయందు నానా సహస్ర వదన శిరో
నయన నాసా కర్ణ వక్త్ర భుజ కర చరణుండును, బహువి ధాభరణుండును,
మాయా కలితుండును, మహాలక్షణ లక్షితుండును, నిజప్రకాశ దూరీకృత
తముండునుఁ, బురుషో త్తముండును నైన నిన్ను దర్శించె. అ య్యవసరంబున.

క. ఘోటకవదనుఁడ వై మధు, కైటభులం ద్రుంచి నిగమగణముల నెల్లన్
బాటించి యజున కిచ్చిన, కూటస్థుఁడ వీశ్వరుఁడవు కోవిదవంద్యా ! 361

వ. ఇ వ్విధంబునఁ గృత త్రేతా ద్వాపరంబు లను మూఁడు యుగంబులందును, తిర్య
జ్మానవ ముని జలచ రాకారంబుల నవతరించి, లోకంబుల నుద్ధరింపుచు,
ధరియింపుచు, హరియింపుచు, యుగానుకూల ధర్మంబులం బ్రతిష్ఠింపుచు
నుండుదువు. దేవా! యవధరింపుము. 362

సీ. కామ హర్షాది [1]సంకలిత మై చిత్తంబు భవదీయ [2]చింతన పదవి సొరదు
మధురాది రసముల మరగి చొక్కుచు జిహ్వ నీ వర్ణనమునకు నిగుడనీదు
సుందరీముఖములఁ జూడఁగోరెడు చూడ్కి తావకాకృతులపైఁ దగులువడదు
వివిధ దుర్భాషలు వినఁగోరు వీనులు వినవు యుష్మత్కథా విరచనములు

తే. ఘ్రాణ మురవడిఁ దిరుగు దుర్గంధములకుఁ
[3]దనివు గొలుపదు వైష్ణవధర్మమునకు
నణఁగి యుండవు కర్మేంద్రియములు పురుషుఁ
గలఁచు సవతులు గృహమేధిఁ గలఁచునట్లు. 363

వ. ఇ వ్విధంబున నింద్రియంబులచేతం జిక్కువడి, స్వకీయ పరకీయ శరీరంబులందు
మిత్రామిత్ర భావంబులు సేయుచు, జన్మమరణంబుల నొందుచు, సంసార
వైతరణీ నిమగ్నం బైన లోకంబు నుద్ధరించుట, లోకసంభవ స్థితి లయ

---

1. సంఘటితమై (క. తం.) 2. చిత్తంబు (హ.) 3. ఁదనుపు (హ) ఁదవులు (వా)

కారణుండ వైన నీకుం గర్తవ్యంబు. భవదీయ సేవకుల మైన మా యందుఁ బ్రియభక్తు లయిన వారల నుద్ధరింపుము. 364

మ. భగవ ద్దివ్య గుణాను [1]వర్ణన సుధా ప్రాప్తైక చిత్తుండ నై
బెగడన్ సంసరణోగ్ర వైతరణికిన్ భిన్నాత్ములై తావకీ
య గుణస్తోత్ర పరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్య భావంబులన్
సుగతిం గానని మూఢులం గని మదిన్ శోకింతు సర్వేశ్వరా! 365

వ. దేవా! మునీంద్రులు [2]నిజ విముక్తికాము లై విజన స్థలంబులం దపంబు లాచరింతురు. కాముకత్వంబు నొల్లక యుండువారికి నీకంటె నొండు శరణంబు లేదు. నిన్ను సేవించెద. కొందఱు కాముకులు కరద్వయ కండూతిచేతం దనియని చందంబునఁ, దుచ్ఛమై పశు పక్షి క్రిమి కీట సామాన్యం బైన మైథునాది గృహమేధి సుఖంబులం దనియక, కడపట నతిదుఃఖవంతు లగుదురు. నీ ప్రసాదంబు గల సుగుణుండు నిష్కాముం డై యుండు. మౌనవ్రత జప తప శ్రుతాధ్యయనంబులును, నిజ ధర్మవ్యాఖ్యాన విజనస్థల నివాస [3]సమాధులును, మోక్షహేతువు లగు. ఐన నివి పదియు నింద్రియజయంబు లేనివారికి భోగార్థంబు లై, విశ్రమించువారికి జీవనోపాయంబు లై, డాంబికులకు వార్తాకరంబు లై యుండు. సఫలంబులు గావు. భక్తి లేక భవదీయ జ్ఞానంబు లేదు. రూపరహితుండ వైన నీకు బీజాంకురంబుల కై వడిఁ, గారణ కార్యంబు లయిన సదసద్రూపంబులు రెండును బ్రకాశమానంబు లగు. ఆ రెంటియందును భక్తియోగంబున బుద్ధిమంతులు, మథనంబున దారువులందు వహ్నిం గనియెడి తెఱంగున, నిన్నుం బొడగందురు. పంచభూత తన్మాత్రంబులును, బ్రాణ బుద్ధీంద్రియంబులును, మనోఽహంకార చిత్తంబులును నీవ. సగుణంబును, నిర్గుణంబును నీవ. గుణాభిమానులై జన్మమరణంబుల నొందు [4]విబుధు లాద్యంతంబులు గానక నిరుపాధికుండ వైన ని న్నెఱుంగరు. తత్త్వజ్ఞు లైన విద్వాంసులు వేదాధ్యయనాది వ్యాపారంబులు మాని, వేదాంత ప్రతిపాద్యుండ వగు నిన్ను సమాధివిశేషంబుల నెఱింగి, సేవింతురు. అది గావున. 366

సీ. నీ గృహాంగణభూమి నిటలంబు మోవంగ మోదించి నిత్యంబు మ్రొక్కఁ డేని
నీ మంగళ స్తవ నికర వర్ణంబులు పలుమాఱు నాలుకఁ బలుకఁ డేని
నీ యధీనములుగా నిఖిలకృత్యంబులు ప్రియభావమున సమర్పింపఁ డేని
నీ పదాంబుజముల నిర్మలహృదయుఁ డై చింతించి మక్కువఁ జిక్కఁ డేని

---

1. వర్తన (హా. తం. వా.) 2. నిజవిముక్త కాములై (హా. తం. వా.) 3. నియమంబులను (హా) 4. విమతులు (త. డ. ద. బ.)

తే. నిన్నుఁ జెవులార వినఁ డేని నీకు సేవఁ
జేయరాఁ డేని బ్రహ్మంబుఁ జెందఁగలఁడె
యోగి యైనఁ దపోవ్రత యోగి యైన
వేది యైన మహా తత్త్వవేది యైన. 367

వ. కావున భవదీయ దాస్యయోగంబు కృపసేయుము. అని ప్రణతుం డైన ప్రహ్లాదుని వర్ణనంబులకు మెచ్చి, నిర్గుణుం డైన హరి రోషంబు విడిచి యి ట్లనియె. 368

శా. సంతోషించితి నీ చరిత్రములకున్ సద్భద్ర మౌఁగాక ! నీ
యంత ర్వాంఛిత లాభ మెల్లఁ గరుణాయత్తుండ నై యిచ్చెదన్
జింతం జెందకు భక్తకాముఁడ నే సిద్ధంబు దుర్లోక్యుఁడన్
జంతుశ్రేణికి నన్నుఁ జూచిన పునర్జన్మంబు లే దర్భకా ! 369

ఆ. సకల భావములను సాధులు విద్వాంసు
లఖిల భద్రవిభుఁడ నైన నన్నుఁ
గోర్కు లి మ్మటంచుఁ గోరుదు రిచ్చెదఁ
గోరు మెద్ది యైనఁ గుఱ్ఱ ! నీవు. 370

## అధ్యాయము–౧౦

వ. అని పరమేశ్వరుండు ప్రహ్లాదునియందుఁ గల సకామత్వంబుఁ దెలియుకొఱకు వంచించి యి ట్లానతిచ్చిన, నతండు నిష్కాముం డైన యేకాంత భక్తుఁడు గావునఁ, గామంబు భక్తియోగంబునకు నంతరాయం బని తలంచి యి ట్లనియె. ఉత్పత్తిమొదలు కామా ద్యనుభవాసక్తి గల నాకు వరంబు లిచ్చెద నని వంచింప నేల. సంసార బీజంబులును, హృదయబంధకంబులును నైన కామంబు లకు వెఱచి, ముముక్షుండ నై, సేమంబుకొఱకు నేమంబున నిన్నుం జేరితి. కామంబులును, నింద్రియంబులును, మన శ్శరీర ధైర్యంబులును, మనీషా ప్రాణ ధర్మంబులును, లజ్జా స్మరణ లక్ష్మీ సత్య తేజో విశేషంబులును, నశించు. లోకంబు లందు భృత్యు లర్థకాము లై రాజుల సేవింతురు. రాజులుం బ్రయోజనంబు లర్థించి, భృత్యులకు నర్థంబు లొసంగుదురు. అ వ్విధంబునఁ గాదు. నాకుం గామంబు లేదు. నీకుం బ్రయోజనంబు లేదు. ఐన దేవా ! వరదుండ వయ్యెద వేని కామంబు వృద్ధిఁ బొందని వరంబుఁ గృపసేయుము. కామంబుల విడిన పురుషుండు నీతోడ సమానవిభవుం డగు. నరసింహా! పరమాత్మ ! పురుషోత్తమ ! యని ప్రణవపూర్వకంబుగ నమస్కరించిన, హరి యి ట్లనియె. 371

సీ. నీవంటి విజ్ఞాననిపుణు లేకాంతులు గోర్కులు నాయందుఁ గోర నొల్ల
రట్లైనఁ బ్రహ్లాద! యసురేంద్రభర్త వై సాగి మన్వంతరసమయ మెల్ల
నిఖిలభోగంబులు నీవు భోగింపుము కల్యాణబుద్ధి నా కథలు వినుము
సకలభూతములందు సంపూర్ణుఁ డగు నన్ను యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి

ఆ. కర్మచయము లెల్ల ఖండించి పూజన
మాచరింపు మీశ్వరార్పణముగ
భోగముల నశించుఁ బుణ్యంబు వ్రతములఁ
బాపసంచయములు పాయు నిన్ను. 372

వ. మఱియు నటమీఁదఁ గాలవేగంబునం గళేబరంబు విడిచి, త్రైలోక్య విరాజమానంబును, దివిజరాజ జేగీయమానంబును, బరిపూరిత దశదిశంబు నైన యశంబుతోడ ముక్తబంధుండ వై నన్ను డగ్గఱియెదవు వినుము. 373

ఆ. నరుఁడు ప్రియముతోడ నా యవతారంబు
నీ యుదారగీత నికరములను
మానసించె నేని మఱి సంభవింపఁడు
కర్మబంధచయము గడచిపోవు. 374

వ. అనినఁ బ్రహ్లాదుం డి ట్లనియె. 375

సీ. దంష్ట్రి వై తొల్లి సోదరుని హిరణ్యాక్షు నీవు సంపుటఁజేసి నిగ్రహమున
మా తండ్రి రోషనిర్మగ్నుఁ డై సర్వలోకేశ్వరుఁ బరము ని న్నెఱుఁగలేక
పరిపంథిపగిది నీ భక్తుండ నగు నాకు నపకారములు సేసె నతఁడు నేఁడు
నీ శాంతదృష్టిచే నిర్మలత్వము నొందెఁ గావున పాపసంఘంబు వలనఁ

తే. బాసి శుద్ధాత్ముఁడు గాఁగ భవ్యగాత్ర!
వరము వేఁడెద నా కిమ్ము వనజనేత్ర!
భక్తసంఘాత ముఖపద్మ పద్మమిత్ర!
[1]భక్త కల్మషవల్లికా పటు లవిత్ర! 376

వ. అనిన భక్తవత్సలుం డి ట్లనియె. 377

మ. నిజభక్తుండవు నాకు నిన్నుఁ గనుటన్ నీ తండ్రి త్రిసప్త పూ
ర్వజులం గూడి పవిత్రుఁ డై శుభగతిన్ వర్తించు విజ్ఞానదీ
ప జితానేక భవాంధకారు లగు మద్భక్తుల్ వినోదించు దే
శజనుల్ దుర్జను లైన శుద్ధులు సుమీ సత్యంబు దైత్యోత్తమా! 378

---

1. భయదకల్మష (చ. జ.)

సీ. ఘన సూక్ష్మ భూతసంఘాతంబులోపల నెల్లవాంఛలు మాని యెవ్వ రైన
నీచందమున నన్ను నెఱయ సేవించిన మద్భక్తు లగుదురు మత్పరులకు
గుఱిసేయ నీవ యోగ్యుఁడ వైతి విటమీఁద వేదచోదిత మైన విధముతోడఁ
జిత్తంబు నామీఁదఁ జేర్చి మీ తండ్రికిఁ బ్రేతకార్యములు సంప్రీతిఁ జేయు

తే. మతఁడు రణమున నేఁడు నా యంగమర్శ
నమున నిర్మలదేహుఁ డై నవ్యమహిమ
నపగతాఖిల కల్మషుఁ డై తనర్చి
పుణ్యలోకంబులకు నేఁగుఁ బుణ్యచరిత! 379

వ. అని యిట్లు నరసింహదేవుం డానతిచ్చినఁ, బ్రహ్లాదుండు హిరణ్యకశిపునకుం బరలోకక్రియలు సేసి, భూసురోత్తములచేత నభిషిక్తుం డయ్యె. అ య్యెడం బ్రసాదపరిపూర్ణుం డైన శ్రీనరసింహదేవునిం జూచి, దేవతాప్రముఖ సహితుం డై బ్రహ్మదేవుం డి ట్లనియె. 380

సీ. దేవదే వాఖిలదేవేశ! భూతభావన! వీఁడు నాచేత వరము వడసి
మత్సృష్ట జనులచే మరణంబు నొందక మత్తుఁ డై సకలధర్మములఁ జెఱచి
నేఁడు భాగ్యంబున నీచేత హతుఁ డయ్యెఁ గల్యాణ మమరె లోకముల కెల్ల
బాలు నీతని మహాభాగవతశ్రేష్ఠు బ్రతికించితివి మృత్యుభయము వాపి

తే. వరముఁ గృపసేసితివి మేలు వారిజాక్ష!
నీ నృసింహావతారంబు నిష్ఠతోడఁ
దగిలి చింతించువారలు దండధరుని
బాధ నొందరు మృత్యువుబారిఁ బడరు.† 381

వ. అనిన నృసింహదేవుం డి ట్లనియె. 382

క. మన్నించి దేవశత్రుల, కెన్నఁడు నిటువంటివరము లీకుము పాపో
త్పన్నులకు వరము లిచ్చుట, పన్నగముల కమృత మిడుట పంకజగర్భా! 383

వ. అని యి ట్లానతిచ్చి, బ్రహ్మాది దేవతాసమూహంబుచేతం బూజితుం డై, భగవంతుం డైన శ్రీనరసింహదేవుండు తిరోహితుం డయ్యె. ప్రహ్లాదుండును, శూలికిం బ్రణమిల్లి, తమ్మిచూలికి వందనం బాచరించి, ప్రజాపతులకు మ్రొక్కి, భగవత్కళ లైన దేవతలకు నమస్కరించినం జూచి, బ్రహ్మదేవుండు శుక్రాది మునిసహితుం డై, దైత్యదానవ రాజ్యంబునకుఁ బ్రహ్లాదునిఁ బట్టంబు గట్టి,

† నవ్యమై భవ: నీ రక్షణమునఁ జేసి.
ఇది (హ) లో నైదవ పాదముగాఁ గలదు.

యతనిచేతం బూజితుం డై దీవించె. అంతట నీశానాది నిఖిలదేవతలు, వివిధంబు లగు నాశీర్వాదంబులచేత నా ప్రహ్లాదునిఁ గృతార్థుఁగాఁ జేసి, తమ్మిచూలి ముందఱ నిడుకొని,తమతమ నివాసంబులకుంజనిరి. ఇట్లు విష్ణుదేవుండు జనిపార్శ్వ చరులిరువురు బ్రాహ్మణశాపంబునం జేసి ప్రథమజన్మంబున దితిపుత్రు లైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను వరాహ నారసింహ రూపంబుల నవతరించి వధియించె. ద్వితీయభవంబున రాక్షసజన్మంబు దాల్చిన రావణ కుంభకర్ణులను శ్రీరామరూపంబున సంహరించె. తృతీయజన్మంబున శిశుపాల దంతవక్త్రు లను పేరులఁ బ్రసిద్ధినొందిన వారలం గృష్ణావతారంబున సంహరించె. ఇవ్విధంబున మూఁడుజన్మంబుల గాఢవైరానుబంధంబున, నిరంతర సంభావిత ధ్యాను లై, వారలు [1]నిఖిలకల్మష వినిర్ముక్తు లై, హరిం గదిసిరి. అని చెప్పి నారదుం డిట్లనియె. 384

ఉ. శ్రీరమణీయ మైన నరసింహవిహారము నింద్రశత్రు సం
హారముఁ బుణ్యభాగవతుఁ డైన నిశాచరనాథపుత్రు సం
చారము నెవ్వఁ డైన సువిచారత విన్నఁ బఠించినన్ శుభా
కారముతోడ నేభయము గల్గని లోకముఁ జెందు భూవరా! 385

మ. జలజాతప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిన్
బలుకన్లేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు నీ యింటిలోఁ
జెలి యై మేనమఱంది యై సచివుఁ డై చిత్తప్రియుం డై మహా
ఫలసంధాయకుఁ డై చరించుట మహాభాగ్యంబు రాజోత్తమా! 386

## —: త్రిపురాసుర సంహారము :—

క. బహుమాయుఁ డైన మయుచే, విహతం బగు హరుని యశము విఖ్యాత జయా
వహముగ నీ భగవంతుఁడు, మహితాత్ముఁడు మున్నొనర్చె మనుజవరేణ్యా!

వ. అనిన ధర్మనందనుం డిట్లనియె. 388

క. ఏ కర్మంబున విభుఁ డగు, శ్రీకంఠునియశము మయునిచే సుడివడియెన్
వైకుంఠుఁ డెవ్విధంబునఁ, గైకొని [2]తత్కీర్తి చక్కఁగా నొనరించెన్. 389

వ. అనిన నారదుం డిట్లనియె. 390

క. చక్రాయుధ బలయుతు లగు, శక్రాదుల కోహటించి శ్రమమున నసురుల్
[3]సాక్రోశంబుగ నరిగిరి, విక్రమములు మాని మయుని వెనుకకు నధిపా! 391

---

1. హరినిందాది పాపవిముక్తులై (క) 2. సత్కీర్తి (హ) 3. సక్రోధంబున (హ. త. జ.)

వ. ఇట్లు రక్కసులు దనవెనుకఁ జొచ్చిన, మాయానిలయుండును, [1]దుర్దముండును నైన మయుండు, దన మాయాబలంబున నయో రజత సువర్ణమయంబు లై యెవ్వరికిని లక్షింపరాని గమనాగమనంబులును, వితర్కింపరాని కర్కశ పరిచ్ఛదంబులును గలిగిన త్రిపురంబులు నిర్మించి యిచ్చిన, నక్తంచరు లందఱు నందుఁ బ్రవేశించి, కామసంచారు లై పూర్వవైభవంబు దలంచి, [2]సనాయకానీకంబు లయిన లోకంబుల నస్తోకంబు లైన బలాతిరేకంబుల శోకంబుల నొందించిన.

క. లోకాధినాథు లెల్లను, శోకాతురు లగుచు నేఁగి చొచ్చిరి దుష్టా
నీక [3]విదళ నాకుంఠున్, శ్రీకంఠున్ భువనభరణ చిత్తోత్కంఠున్. 393

వ. ఇట్లు సకలలోకేశ్వరుం డగు మహేశ్వరుం జేరి, లోకపాలకులు ప్రణతు లై పూజించి, కరకమలంబులు ముకుళించి. 394

క. త్రిపురాలయు లగు దానవు, లపరాజితు లగుచు మాకు నశ్రాంతంబున్
వపురాది పీడఁ జేసెద, రపరాధకులను వధింపు మగజాధీశా! 395

క. దీనులము గాక యుష్మ ద, ధీనుల మై యుండు మేము దేవాహిత దో
ర్లీనుల మైనారము బల, హీనుల మగు మమ్ముఁ గావు మీశాన! శివా! 396

వ. అనిన, భక్తవత్సలుం డగు పరమేశ్వరుండు, శరణాగతు లైన గీర్వాణుల వెఱవకుం డని, దుర్వారబలంబున బాణాసనంబుఁ గేల నందికొని, యొక్క దివ్యబాణంబు సంధించి, త్రిపురంబులపై నేసిన, మార్తాండమండలంబున వెలువడు మయూఖజాలంబుల చందంబునఁ, దద్బాణంబువలన దేదీప్యమానంబు లయిన యనేక బాణ సహస్రంబులు సంభవించి, భూ నభోఽంతరాళంబులు నిండి, మండి, కుప్పలు గొని, త్రిపురంబులపైఁ గప్పె. అప్పుడు తద్బాణపావక హేతిసందోహ దందహ్యమాను లై, గతాసు లైన త్రిపురనివాసులం దెచ్చి, మహాయోగి యైన మయుండు సిద్ధరస కూపంబున వైచిన. 397

క. సిద్ధామృత రసమహిమను, శుద్ధ మహావజ్రతుల్య శోభితతను లై
వృద్ధిం బొందిరి దానవు, లుద్ధత నిర్ఘాతపావకోపము లగుచున్. 398

క. కూపామృతర[4]స సంగతి, దీపితు లై నిలిచియున్న దేవాహితులన్
రూపించి చింత నొందెడు, గోపధ్వజుఁ జూచి చక్రి కుహనాన్వితుఁ డై. 399

---

1. దుర్నయుండు (క.తం.వా.) 2. నాకనాయకానీకంబు లైన (హ) 3. విదళనాకంఠున్ (హ) 4. రసిద్ధిని (ట)

శా. ఉత్సాహంబున నొక్క పాఁడిమొదవై యూధంబు ఘ్రాణించుచున్
వత్సంబై తనవెంట బ్రహ్మ నడవన్ వైకుంఠుఁ డేతెంచి యు
ద్యత్సత్త్వంబునఁ గూపమధ్యరసముం ద్రావెన్ విలోకింపుచున్
దత్సౌభాగ్య నిమగ్ను లై మఱచి రా దైత్యుల్ నివారింపఁగన్. 400

వ. ఇట్లు విష్ణుండు మోహనాకారంబున ధేను వై వచ్చి, త్రిపురమధ్య కూపామృత రసంబుఁ ద్రావిన, నెఱింగి శోకాకుల చిత్తు లైన, రసకూప పాలకులం జూచి, మహాయోగి యైన మయుండు వెఱఁగుపడి, దైవగతిఁ జింతించి, శోకింపక యి ట్లనియె. 401

ఆ. అమరు లైన దనుజు లైనను నరులైన
నెంత నిపుణు లైన నెవ్వ రైన
దైవికార్థచయముఁ దప్పింపఁగా లేరు
వలదు దనుజులార! వగవ మనకు. 402

వ. అని పలికె. అంత విష్ణుండు నైజంబు లైన ధర్మ జ్ఞాన విద్యా తపో విరక్తి సమృద్ధి క్రియాది శక్తివిశేషంబుల శంభునికిం బ్రాధాన్యంబు సమర్పించి, రథ సూత కేతు వర్మ బాణాసన ప్రముఖ సంగ్రామ సాధనంబులు సేసినం గైకొని.

మ. శరి యై కార్ముకి యై మహాకవచి యై సన్నాహి యై వాహియై
సరథుం డై సనియంత యై సబలుఁ డై సత్కేతన చ్ఛత్రుఁ డై
పరమేశుం డొక బాణమున్ విడిచెఁ దద్బాణానల జ్వాలలన్
బురము ల్గాలెఁ జటచ్చట ధ్వని నభో భూమధ్యము న్నిండఁగన్. 404

వ. ఇట్లు హరుండు దురవగాహంబులైన త్రిపురంబుల నభిజిన్ముహూర్తంబున భస్మంబు సేసి కూల్చిన, నమర గరుడ సిద్ధ సాధ్య గంధర్వ యక్ష వల్లభులు వీక్షించి, జయ జయ శబ్దంబులు సేయుచుఁ, గుసుమ వర్షంబులు వర్షించిరి. ప్రజలు హర్షించిరి. బ్రహ్మాదులు కీర్తించిరి. అప్సరసలు నర్తించిరి. దివ్య కాహళ దుందుభి రవంబులును, మునిజనోత్సవంబులును, బ్రచురంబు లయ్యె. ఇట్లు విశ్వ జనీనం బగు త్రిపురాసుర సంహారంబున నఖిలలోకులును సంతసిల్లి యుండ న య్యవసరంబున. 405

ఆ. తృణకణముల భంగిఁ ద్రిపురంబుల దహించి
పరముఁ డవ్యయుండు భద్రయశుఁడు
శివుఁడు పద్మజాది జేగీయమానుఁ డై
నిజనివాసమునకు నెమ్మిఁ జనియె. 406

వ. ఇట్లు నిజమాయా విశేషంబున మర్త్యలోకంబున విడంబించుచున్న విష్ణుని పరాక్రమ విధానంబులు మునిజన వంద్యమానంబు లై, సకలలోక కల్యాణ ప్రదానంబు లై యుండు. అనిన విని, నారదునకు ధర్మనందనుం డి ట్లనియె. 407

## అధ్యాయము - ౧౧

—: నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మంబులు తెలుపుట :—

సీ. అనఘాత్మ ! సకల వర్ణాశ్రమాచార సమ్మత ధర్మ మెయ్యది మానవులకు
నే ధర్మమున నరుం డిద్ధ విజ్ఞానము భక్తియుఁ బ్రాపించుఁ బద్మజునకు
సాక్షా త్సుతుండవు సర్వజ్ఞుఁడవు నీకు నెఱుఁగరానిది ధర్మ మింత లేదు
నారాయణ పరాయణ స్వాంతు లనఘులు శాంతులు సదయులు సాధువృత్తి

ఆ. మెఱయుచున్న ఘనులు మీవంటి వా రెద్ది
పరమధర్మ మనుచు భక్తిఁ దలఁతు
రట్టి ధర్మరూప మఖిలంబు నెఱిఁగింపు
వినఁగ నిచ్చ గలదు విమలచరిత ! 408

వ. అనిన, నారదుండు ధర్మరాజుం జూచి, దాక్షాయణియందు నిజాంశంబున జన్మించి, భువనశోభనంబుకొఱకు బదరికాశ్రమంబునఁ దపోనిరతుం డై యున్న నారాయణునివలన సనాతనధర్మంబు వింటిని. అది సెప్పెద. సకల వర్ణంబుల జనులకు సత్యంబును, దయయును, నుపవాసాది తపంబును, శౌచంబును, సైరణయు, సద సద్వివేకంబును, మనోనియమంబును, బహిరింద్రియ జయంబును, హింస లేమియు, బ్రహ్మచర్యంబును, దానంబును, యథోచిత జపంబును, సంతోషంబును, మార్దవంబును, సమదర్శనంబును, మహాజన సేవయు, గ్రామ్యంబు లైన కోరికలు మానుటయు, నిష్ఫలక్రియలు విడుచుటయు, మితభాషిత్వంబును, దేహంబు గాని తన్ను వెదకి కొనుటయు, నన్నోదకంబులు ప్రాణులకుం బంచియిచ్చుటయుఁ, బ్రాణులందు దేవతాబుద్ధియు, నాత్మబుద్ధిం జేయుటయు, శ్రీ నారాయణచరణ స్మరణ కీర్తన శ్రవణ సేవార్చన నమస్కార దాస్యాత్మసమర్పణ సఖ్యంబు లనెడి త్రింశ ల్లక్షణంబులు గలుగవలయు. అందు సత్కులాచారుం డై [1]మంత్రవంతంబు లైన గర్భాధానాది సంస్కారంబు లవిచ్ఛిన్నంబులుగాఁ గలవాఁడు ద్విజుండు. ద్విజునకు యజన యాజ నాధ్యయ నాధ్యాపన దాన ప్రతిగ్రహంబు లను షట్కర్మంబులు విహితంబులు. రాజునకుఁ

1. విధిచోదితంబు లైన (హా. చ.)

ప్రతిగ్రహ వ్యతిరిక్తంబు లైన యజనాది కర్మంబు లైదును, ప్రజాపాలనంబును, బ్రాహ్మణులు గానివారివలన దండ శుల్కాదులను గొనుటయు, విహిత కర్మంబులు. వైశ్యునికిఁ గృషి వాణిజ్య గోరక్షణాది కర్మంబులును, బ్రాహ్మణ కులానుసరణంబును విహితంబులు. శూద్రునకు ద్విజశుశ్రూష సేయవలయు. 409

సీ. విను కర్షణాదిక వృత్తికంటెను మేలు యాచింప నొల్లనియట్టి వృత్తి
ప్రాప్తంబు గైకొని బ్రతుకుకంటెను లెస్స యనుదినంబును ధాన్య మడిగికొనుట
యాయావరముకంటె నధికకల్యాణంబు పఱిగ యెన్నుల ధాన్య భక్షణంబు
శిలజీవనముకంటె శ్రేయ మాపణములఁ బడ్డ గింజలు దిని బ్రతుకుఁ గనుట

ఆ. యెడరుచోట నృపతి కీ నాల్గు వృత్తులు
దగుఁ బ్రతిగ్రహంబు దగదు తలఁప
నాప దవసరముల నధముఁ డెక్కువజాతి
వృత్తి నున్న దోషవిధము గాదు 410

వ. వినుము. శిలవృత్తియు, నుంఛవృత్తియు ఋతమనియు, నయాచితవృత్తి యమృత మనియు, నిత్య యాచ్ఞావృత్తి మృత మనియు, కర్షకవృత్తి ప్రమృత మనియు నెన్నుదురు. అట్టి వృత్తుల జీవించుట మేలు. వాణిజ్యంబు సత్యానృతం బనియు, శ్వవృత్తి నీచసేవ యనియుఁ బలుకుదురు. సర్వవేదమయుండు బ్రాహ్మణుండు. సర్వదేవమయుండు క్షత్త్రియుండు. బ్రాహ్మణ క్షత్త్రియులకు నీచసేవనంబు కర్తవ్యంబు గాదు. 411

క. దమమును శౌచముఁ దపమును, శమమును మార్దవముఁ గృపయు సత్యజ్ఞాన
క్షమలును హరిభక్తియు హా, ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా! 412

ఉ. శౌర్యము దానశీలముఁ బ్రసాదము నాత్మజయంబుఁ దేజముం
ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముఁ గామముం బుధా
చార్య ముకుంద సేవలును సత్కృతియుం బరితోషణంబు న
ద్వీర్యము రక్షణంబుఁ బృథివీవరశేఖర! రాజచిహ్నముల్. 413

క. ధర్మార్థ కామవాంఛయు, నిర్మల గురుదేవ విప్ర నివహార్చనముల్
నిర్మదభావముఁ బ్రమదము, శర్మకరత్వమును వైశ్యజన లక్షణముల్. 414

ఉ. స్తేయములేని వృత్తియు శుచిత్వము సన్నుతియు న్నిజేశులన్
మాయలులేక డాయుటయు మంత్రము సెప్పక పంచయజ్ఞముల్
సేయుటయుం ధరామరుల సేవయు గోవుల రక్షణంబు న
న్యాయము లేమియుం మనుజనాథ! యెఱుంగుము శూద్రధర్మముల్. 415

సీ. నిలయము వాటించి నిర్మలదేహి యై శృంగార మేప్రొద్దుఁ జేయవలయు
సత్యప్రియాలాప చతుర యై ప్రాణేశు చిత్తంబు ప్రేమ రంజింపవలయు
దాక్షిణ్య సంతోష ధర్మ మేధాదుల దైవత మని ప్రియుఁ దలఁపవలయు
నాథుఁ డేపద్ధతి నడచు నా పద్ధతి నడచి సద్బంధుల నడపవలయు

ఆ. మార్దవమునఁ బతికి మజ్జన భోజన
శయన పాన రతులు జరుపవలయు
విభుఁడు పతితుఁ డైన వెలఁది పాతివ్రత్య
మహిమఁ బుణ్యుఁ జేసి మనుపవలయు. 416

క. తరుణి తన ప్రాణవల్లభు, హరిభావంబుగ భజించి యతఁడును దానున్
సిరి కైవడి వర్తించును, హరిలోకమునందు సంతతానందమునన్. 417

క. ఉపవాసంబులు వ్రతములుఁ, దపములు వెయ్యేల భర్త దైవత మని ని
ష్కపటతఁ గొలిచిన సాధ్వికి, నృపవర! దుర్లభము లేదు నిఖిలజగములన్. 418

వ. మఱియు, సంకరజాతు లైన రజక, చర్మకారక, నట, బురుడ, కైవర్తక, మేడ, భిల్లు రగు నంత్యజాతు లేడువురకును, జండాల, పుల్కస, మాతంగ జాతులకును నా యా కులాగతంబు లైన వృత్తులఁ, జౌర్య హింసాదులు వర్జించి సంచరింపవలయు. మానవులకుఁ బ్రతియుగంబున నైసర్గికంబు లైన ధర్మంబులు, రెండు లోకంబులందును సుఖకరంబు లని వేదవిదు లైన పెద్దలు సెప్పుదురు. కారు కారున దున్నెడు క్షేత్రంబు లావు చెడు. అందుఁ జల్లిన బీజంబులు నిస్తేజంబు లై యుండి, లెస్సగ నంకురింపవు. నిరంతర ఘృతధారా వర్షంబున దహనంబునకు దాహకత్వంబు శాంతిం జెందు. అందు వేల్చిన హవ్యంబులు ఫలింపవు. తద్విధంబున ననవరత కామానుసంధానంబునఁ గామోన్ముఖం బైన చిత్తంబు కామంబులం దనిసి, నిష్కామం బై విరక్తి నొందుం గావున, సత్త్వస్వభావంబు తోడ నెప్పుడుఁ దప్పక నిజవంశానుగత విహితధర్మంబున వర్తించు నరుండు మెల్లన స్వాభావిక కర్మపరత్వంబు విడిచి ముక్తినొందు. జాతిమాత్రంబునఁ బురుషుని వర్ణంబు నిర్దేశింప లేరు. శమదమాది వర్ణలక్షణ వ్యవహారంబులఁ గనవలయు. అని నారదుం డిట్లనియె. 419

## అధ్యాయము-౧౨

క. క్రమమున వర్ణంబుల చి, హ్నము లెల్లను జెప్పఁబడియె నాశ్రమముల ధ
ర్మము లెఱిఁగించెద నన్నియు, సమదాహితహృదయ శూల! సదమలశీలా! 420

వ. వినుము. బ్రహ్మచారి మౌంజీ, కౌపీన యజ్ఞోపవీత కృష్ణాజిన పాలాశదండ కమండలు ధరుండును, సంస్కారహీన శిరోరుహుండును, దర్భహస్తుండును, శీల

ప్రశస్తుండును, మౌనియు నై, త్రిసంధ్యంబును బ్రహ్మగాయత్రి జపియించుచు, సాయం ప్రాత రవసరంబుల నర్క పావక గురు దేవతోపాసనంబులు సేయుచు, గురుమందిరంబునకుం జని, దాసునిచందంబున భక్తి వినయ సౌమనస్యంబులు గలిగి, వేదంబులు సదువుచు, నధ్యాయ నోపక్ర మావసానంబుల గురుచరణంబు లకు నమస్కరింపుచు, రేపు మాపును విహితగృహంబుల భిక్షించి, భైక్షంబు గురువునకు నివేదించి, యనుజ్ఞఁ గొని, మితభోజనంబు గావింపుచు, విహిత కాలంబుల నుపవసింపుచు, నంగనలందు నంగనాసక్తులందుం బ్రయోజనమాత్ర భాషణంబు లొనర్చుచు, గురు పరాంగనలవలన నభ్యంగ కేశప్రసాధన శరీర మర్దన మజ్జన రహస్యయోగంబులు వర్జించుచు, గృహంబున నుండక, జితేంద్రియత్వంబున సత్యభాషణుం డై సంచరింపవలయు. 421

ఆ. పొలఁతి దావవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు
[1]కరఁగ కేల యుండుఁ గదిసె నేని
బ్రహ్మ యైన కూఁతుఁ బట్టక మానఁడు
వడుగు కింతిపొత్తు వలదు వలదు. 422

వ. వినుము. స్వరూప సాక్షాత్కారంబున దేహి, బహిరింద్రియాదికం బైన యంతయు నాభాసమాత్రంబుగా నిశ్చయించి, యెందాఁక జీవుండు స్వతంత్రుం డైన యీశ్వరుండు గాకుండు, నంత దడవు నంగన యిది, పురుషుండ నే ననియెడి బుద్ధి మానుట కర్తవ్యంబు గాదు. బ్రహ్మచారి యతి గృహస్థులం దెవ్వఁ డైనఁ జిత్తంబు పరిపక్వంబు గాక యద్వైతాను సంధానంబు సేసిన మూఢుం డగు. కావున రహస్యంబునఁ బుత్రిక నైనం డాయకుండ వలయు. 423

చ. శిరమున మేన సంస్కృతులు చేయక చందన భూషణాద్యలం
కరణము లెల్ల మాని ఋతుకాలముల న్నిజభార్యఁ బొందుచుం
దరుణులఁ జూడఁ బాఱక ధృతవ్రతుఁ డై మధు మాంస వర్జి యై
గురుతరవృత్తితో మెలఁగు కోవిదుఁ డొక్క గృహస్థు భూవరా! 424

వ. మఱియు, ద్విజుండు గృహస్థుం డై గురువులవలన నుపనిష దంగ సహితం బైన వేదమంత్రంబును బఠియించి, నిజాధికా రానుసారంబుగా నర్థవిచారంబు సేసి, తన బలంబుకొలఁది గురువులకు నభీష్టంబు లొసంగి, గృహంబున నొండె, వనంబున నొండె, నైష్ఠికత్వంబు నాశ్రయించి, ప్రాణులతోడ జీవింపుచు, గురు వునందు, నగ్నియందు, నాత్మయందు, సర్వభూతములయందు నచ్యుత దర్శనంబు

1. కరఁగకుండ రాదు (హ)

సేయుచు, నింద్రియ వ్యసనాది మగ్నుండు గాక యెఱుక గలిగి వర్తింపుచుఁ బరబ్రహ్మంబు నొందు. 425

క. వినుము వనప్రస్థునకుఁ, మునికథితము లైన నియమములు గల వా చో
ప్పున వనగతుఁ డై మెలఁగెడి, ఘనుఁడు మహర్లోకమునకు గమనించు నృపా!

వ. అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి, వనంబునకుం జని, దున్నక పండెడి నీవారాదికంబు లగ్నిపక్వంబు చేసి యొండె, నామంబులు చేసి యొండె, నర్కపక్వంబు లైన ఫలాదు లొండె, భక్షింపుచు, వన్యాహారంబుల నిత్యకృత్యంబు లైన చరుపురోడాశంబు లొనర్చుచుఁ, బ్రతిదినంబునం బూర్వసంచితంబులు పరిత్యజించి, నూతన ద్రవ్యంబులు సంగ్రహింపుచు, నగ్నికొఱకుఁ బర్ణశాల యైనఁ, బర్వతకందరం బైన, నాశ్రయింపుచు, హిమ, వాయు, వర్షాతపంబులకు సహింపుచు, నఖ శ్మశ్రు కేశ తనూరుహంబులు ప్రసాధితంబులు సేయక జటిలుం డై వసియింపుచు, దండాజిన కమండలు వల్కల పరిచ్ఛదంబులు ధరియించి, పండ్రెం డైన, నెనిమి దైన, నాలు గైన, రెండైన, నొక వత్సరం బైనఁ, దపఃప్రయాసంబున బుద్ధినాశంబు గాకుండ ముని యై చరింపుచు, దైవవశంబున జరారోగంబులచేతఁ జిక్కి, నిజ ధర్మానుష్ఠాన సమర్థుండు గాని సమయంబున నిరశన వ్రతుం డై, యగ్నుల నాత్మారోపణంబులు సేసి, సన్న్యసించి, యాకాశంబునందు శరీరరంధ్రంబులును, గాలియందు నిశ్శ్వాసంబును, తేజంబులోపల నూష్మంబును, జలంబుల రసంబును, ధరణియందు శల్య మాంస ప్రముఖంబులును, వహ్నియందు వక్తవ్యంబుతోడ వాక్కును, నింద్రునియందు శిల్పంబుతోడఁ గరంబులును, విష్ణునియందు గతితోడఁ బదంబులును, బ్రజాపతియందు రతితోడ నుపస్థంబును, మృత్యువందు విసర్గంబుతోడఁ బాయువును, దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రంబును, వాయువందు స్పర్శంబుతోడఁ ద్వక్కును, సూర్యునియందు రూపంబుతోడఁ జక్షువులును, సలిలంబులందుఁ బ్రచేతస్సహిత యైన జిహ్వయు, క్షితియందు గంధసహితం బైన ఘ్రాణంబును, జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును, గవి యైన బ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు, రుద్రునియం దహంకారంబుతోడ మమత్వంబును, క్షేత్రజ్ఞునియందు సత్త్వంబుతోడఁ జిత్తంబునుఁ, [1]బరంబునందు గుణంబులతోడ వైకారికంబునుఁ జెందించి, యటమీఁద బృథివిని జలంబునందును, జలంబును దేజంబునందును, దేజంబును వాయువందును, వాయువును గగనమందును,

1. డిందించి (తం. వా.)

గగనము నహంకారతత్త్వమందును, నహంకారమును మహత్తత్త్వంబునందును, మహత్తత్త్వమును బ్రకృతియందును, బ్రకృతి నక్షరుం డైన పరమాత్మయందును లయంబు నొందించి, చిన్మాత్రావశేషితుం డైన క్షేత్రజ్ఞుని నక్షరత్వంబున నెఱింగి, ద్వయరహితుం డై, దగ్ధకాష్ఠుం డైన వహ్నిచందంబునఁ బరమాత్మ యైన నిర్వికారబ్రహ్మంబునందు లీనుండు గావలయు. 427

## అధ్యాయము - ౧౩

క. అనఘ ! వనప్రస్థుం డై, చని త ద్ధర్మంబు లిట్లు సలుపుచు మఱియుఁ
మనె నేని సన్న్యసింపం, జను నట మీఁదటను [1]ముక్తిసంగత్వమునన్. 428

వ. ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరిపి, సన్న్యసించి, దేహమాత్రావశిష్టుండును, నిరపేక్షుండును, భిక్షుండును, నిరాశ్రయుండును, నాత్మారాముండును, సకలభూతసముండును, శాంతుండును, సమచిత్తుండును, నారాయణ పరాయణుండును నై, కౌపీనాచ్ఛాదనమాత్రం బైన వస్త్రంబు ధరియించి, దండాది వ్యతిరిక్తంబులు విసర్జించి, యాత్మపరంబులు గాని శాస్త్రంబులు వర్జించి, గ్రహ నక్షత్రాది విద్యల [2]నభ్యసింపక, భేదవాదంబు లైన తర్కంబులు తర్కింపక, యెందును బక్షీకరింపక, శిష్యులకు గ్రంథంబులు వంచించి యుపన్యసింపక, బహువిద్యల జీవింపక, మఠాది వ్యాపారంబుల నుల్లసిల్లక, పెక్కుదినంబు లొక్కయెడ వసియింపక, యూరూర నొక్కొక్క రాత్రి నిలుచుచుఁ, గార్యకారణ వ్యతిరిక్తం బయిన పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు, స దస న్మయం బైన విశ్వంబు నందుఁ బరబ్రహ్మ మైన యాత్మ నవలోకింపుచు, జాగరణ స్వప్న సంధిసమయంబుల నాత్మనిరీక్షణంబు సేయుచు, నాత్మకు బంధమోక్షణంబులు మాయామాత్రంబులు గాని, వస్తుప్రకారంబున లే వనియును, దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియును, మృత్యువు ధ్రువంబనియు నెఱుంగుచు, భూతదేహంబుల సంభవనాశంబులకు మూలం బైన కాలంబుఁ బ్రతీక్షించుచు, నివ్విధంబున జ్ఞానోత్పత్తి పర్యంతంబు సంచరించి, యటమీఁద విజ్ఞానవిశేషంబు సంభవించినఁ బరమహంసుం డై, దండాది చిహ్నంబులు ధరియించి యుండె, ధరియింపక యుండె, బహిరంగ వ్యక్తచిహ్నుండు గాక, యంతరంగవ్యక్త మైన యాత్మానుసంధానంబు గలిగి, మనీషి యై, బాహ్యానుసంధానాభావంబున మనుష్యులకుం దన వలన నున్మత్త బాల మూకులతెఱంగుఁ జూపుచుండవలయు. 429

---

1. ముక్తసంగత్వమునన్ (తం. వా.) 2. జీవింపక (హ)

—: ప్రహ్లాదాజగర సంవాదము :—

క. మునివల్లభుఁ డజగరుఁ డను, సునయుండు హిరణ్యకశిపు సూనుండును ము
న్నొనరించిన సంవాదము, విను మీ యర్థంబు నందు వెలయు నరేంద్రా! 430

వ. తొల్లి భగవత్ప్రియుం డైన ప్రహ్లాదుండు కతిపయామాత్య సహితుం డై, లోక
తత్త్వంబు నెఱింగెడికొఱకు లోకంబుల సంచరింపుచు, నొక్కనాఁడు కావేరీ
తీరంబున సహ్యాపర్వతతటంబున ధూళిధూసరితంబు లైన కరచరణాద్యవయ
వంబులతోడ గూఢం బైన నిర్మలతేజంబుతోఁ గర్మాకార వచో లింగ వర్ణాశ్ర
మాదుల నెవ్వరికి నెఱుంగఁబడక, నేల నిద్రింపుచు, నజగర వ్రతధరుం డైన
మునిం గని, డాయం జని, విధివత్ప్రకారంబున నర్చించి, మునిచరణంబులకు
శిరంబు మోపి, మ్రొక్కి, యతని చరిత్రంబులు దెలియ నిచ్చగించి యి ట్లనియె.

సీ. భూమి నుద్యోగి వై భోగి వై యుండెడి నరునికై వడి మునినాథ! నీవు
ఘనశరీరముఁ దాల్చి కదలవు చిత్ర ముద్యమయుక్తునకుఁ గాని ధనము లేదు
ధనవంతునకుఁ గాని తగు భోగములు లేవు భోగికిఁ గాని సంపూర్ణ మైన
తనువు లే దుద్యోగ ధన భోగములు లేక నేల నూరక పడి నిద్రవోవు

ఆ. నీకు నెట్లు గలిగె నిరుపమ దేహంబు?
సముఁడ వార్యుఁడవు విశారదుఁడవు
బుద్ధినిధివి జనులఁ బొగడవు దెగడవు
నిద్ర ప్రతిదినంబు నిలుప నేల. 432

వ. అని యిట్లు ప్రహ్లాదుం డడిగిన, వికసితముఖుం డై మునీంద్రుండు తదీయ
మధురాలాప సుధారస ప్రవాహంబులు కర్ణంబులఁ బరిపూర్ణంబు లైన నతని
నవలోకించి యి ట్లనియె. 433

సీ. అంతరంగికదృష్టి నంతయు నెఱుఁగుదు వార్యసమ్మతుఁడ వీ వసురవర్య!
విశ్వజంతువుల ప్రవృత్తి నివృత్తి లక్షణములు నీ వెఱుంగనివి లేవు
భగవంతుఁ డగు హరిఁ బాయక నీ మనో వీథి రాజిల్లుచు వెలుఁగుచేని
క్రమమున బహిరంధకారంబుఁ బరిమార్చు పరమ సాత్త్వికుఁడవు భద్రబుద్ధి

ఆ. వైన నీవు నన్ను నడిగెదు గావున
విన్నధర్మ మెల్ల విస్తరింతు
నిన్నుఁ జూడఁ గలిగె నీతోడి మాటల
నాత్మశుద్ధి గలిగె ననఘచరిత! 434

వ. వినుము. ప్రవాహకారిణి వై, విషయంబులచేతం బూరింపరాని తృష్ణచేతం బడి, కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండ నైన నేను నానావిధ యోనులందుఁ బ్రవేశింపుచు, వెడలుచు, నెట్టకేలకు మనుష్యదేహంబు ధరియించి, యందు ధర్మంబున స్వర్గద్వారంబును, నధర్మంబున శునక సూకరాది తిర్యగ్జంతు యోని ద్వారంబులను నొంది, క్రమ్మఱ మనుష్యుం డై పుట్టవలయు నని వివేకించి, సుఖరక్షణ దుఃఖమోక్షణంబుల కొఱకు ధర్మంబులు సేయు దంపతుల వ్యవహారంబుఁ గని, సర్వక్రియానివృత్తిఁ గలిగిన జీవుండు స్వతంత్రుం డై ప్రకాశించు నని నిర్ణయించి, భోగంబులు మనోరథజాత మాత్రంబులు గాని శాశ్వతంబులు గావని పరీక్షించి, నివృత్తుండ నై యుద్యోగంబు లేక నిద్రించుచుఁ, బ్రారబ్ధ భోగంబు లనుభవింపుచు, నుండుదు. ఇవ్విధంబునఁ దనకు సుఖరూపం బైన పురుషార్థంబు దనయందుఁ గలుగుట యెఱుంగక, పురుషుండు శైవాలజాల నిరుద్ధంబు లైన శుద్ధజలంబుల విడిచి, యెండమావులు జలంబు లని పాఱెడి మూఢుని తెఱంగున సత్యంబుగాని ద్వైతంబుఁ జొచ్చి, ఘోర సంసారచక్ర పరిభ్రాంతుం డై యుండు. దైవతంత్రంబు లైన దేహాదులచేత, నాత్మకు సుఖంబును, దుఃఖనాశంబునుఁ గోరుచు, నిరీశుం డైన వాని ప్రారంభంబులు నిష్ఫలంబు లగు. అదియునుం గాక, మర్త్యునకు ధనంబు ప్రాప్తం బైన, నది దుఃఖకరంబు గాని సుఖకరంబు గాదు. లోభవంతు లైన ధనవంతులు నిద్రాహారంబులు లేక రాజ చోర యాచక శత్రు మిత్రాది సర్వస్థలంబులందును శంకింపుచు దాన భోగంబుల మఱచి యుండుదురు. ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు. శోక మోహ భయ క్రోధ రాగ శ్రమాదులు వాంఛా మూలంబులు. వాంఛ లే కుండవలయు. 435

మ. సరఘల్ గూర్చిన తేనె మానవులకుం సంప్రాప్త మైనట్లు లో
భరతుల్ గూర్చిన విత్తముల్ పరులకుం బ్రాపించుఁ బ్రాప్తాశి యై
[1]తిరుగంబోని మహోరగంబు బ్రతుకుం దీర్ఘాంగ మై యుండియుం
జిరకాలంబును వాని వర్తనములం జింతించి యేకాంతి నై. 436

క. అజగరమును జుంటీఁగయు, నిజగురువులుగాఁ దలంచి నిశ్చింతుఁడ నై
విజనస్థలిఁ గర్మంబుల, గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్. 437

---

1. తిరుగంబాసి (చ)

సీ. అజిన వల్కల దుకూలాంబరంబులు గట్టి [1]యైనఁ గట్టక యైన నలరుచుండు
నాందోళికా రథ హయ నాగముల నెక్కి యైన నెక్కక యైన నరుగుచుండుఁ
గర్పూర చందన కస్తూరికా లేప మైన భూరజ మైన నలఁదికొందు
ధర్మ్మ శయ్యల నైనఁ బర్ణ శిలా తృణ భస్మంబులం దైనఁ [2]బడుచునుండు

ఆ. మానయుక్త మైన మానహీనం బైనఁ
దీయ నైన మిగులఁ దిక్త మైనఁ
గుడుతు సగుణ మైన గుణవర్జితం బైన
నల్ప మైనఁ జాల నధిక మైన. 438

క. లేదని యెవ్వరి నడుగను, రాదని చింతింపఁ బరులు రప్పించినచోఁ
గాదని యెద్దియు మానను, ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్. 439

క. నిందింపఁ బరుల నెన్నఁడు, వందింప ననేక పీడ వచ్చిన మది నా
క్రందింప విభవముల కా, నందింపఁ బ్రకామవర్తనంబున నధిపా! 440

వ. ఇట్లు కోరిక లేక యొక్కసమయంబున దిగంబరుండ నై పిశాచంబు చందంబున నుండుచుఁ, బెక్కు దినంబులంగోలెఁ బెనుబాము వర్తనంబు గైకొని, నిమీలిత లోచనత్వంబున నేకాంతభావంబు విష్ణునియందుఁ జేర్చి, వికల్పంబు భేదగ్రాహక చిత్తవృత్తులను, జిత్తంబు నర్థరూప పరిభ్రమంబు గల మనంబునందును, మనంబు నహంకారంబునందును, నహంకారంబును మాయయందును, మాయ నాత్మానుభూతియందును, లయంబు నొందించి, సత్యంబు దర్శించుచు, విరక్తి నొంది, స్వానుభవంబున నాత్మస్థితుండ నై యుండుదు. నీవు భగవత్పరుండవు గావున రహస్యం బైన పరమహంసధర్మంబు స్వానుభవ గోచరం బైన తెఱంగున నీకు హృద్గోచరం బగునట్లు చెప్పితి. అనిన విని. 441

క. ఘను నజగర మునివల్లభు, దనుజేంద్రుఁడు పూజచేసి తగ వీడ్కొని నె
మ్మనమున సంతోషించుచుఁ, జనియెన్ నిజగేహమునకు శశికులతిలకా! 442

అధ్యాయము - ౧౪

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె. 433

క. ననుబోఁటి జడ గృహస్థుఁడు, మునివల్లభ! యిట్టి పదవి మోదంబున నే
యనువునఁ జెందును వేగమ, వినుపింపుము నేఁడు నాకు విజ్ఞాననిధీ! 444

వ. అనిన నారదుం డిట్లనియె. గృహస్థుం డైనవాఁడు, వాసుదేవార్పణంబుగా గృహోచితక్రియ లనుసంధించుచు, మహామునుల సేవించి, వారలవలన నారా

---

1. పండుచుండు (తం. వా.) 2. యొండెఁ గట్టక యొండె నుండుచుండు (హ. క. బ.)

యణ దివ్యావతార కథాశ్రవణంబు సేయుచు, నయ్యై విహితకాలంబుల శాంతజనులం గూడియుండుచుఁ, బుత్ర మిత్ర కళత్రాది సంగంబులు గలలవంటి వని యెఱుంగుచు, లోపల నాసక్తి లేక సక్తునికైవడి వెలుపలఁ బురుషకారంబు లొనర్చుచుఁ, దగులంబులు లేక, విత్తంబు లిచ్చి జనక సుత సోదర సఖ జ్ఞాతి జనుల చిత్తంబులు సమ్మదాయత్తంబులు గావింపుచు, ధన ధాన్య నిధాన దైవ లబ్ధంబులవలన నభిమానంబు మాని యనుభవింపుచు, గృహక్షేత్రంబులఁ జొచ్చి యుదరపూరణమాత్రంబు దొంగిలించినవాని దండింపక, భుజగ మృగ మూషక మర్కట మక్షికా ఖరోష్ట్రంబుల హింసింపక పుత్రులభంగి నీక్షింపుచు, దేశ కాల దైవంబుల కొలఁదిని ధర్మార్థ కామంబులఁ బ్రవర్తింపుచు, శునక పతిత చండాలాదులకైన భోజ్యపదార్థంబులు తగినభంగి నిచ్చుచు, నిజవృత్తి లబ్ధంబు లగు నశనాదులచేత దేవ ఋషి పితృ భూత మానవుల సంతర్పించుచుఁ, బంచ మహాయజ్ఞావశేషంబుల నంతర్యామిపురుషయజనంబు, నాత్మజీవనోపాయంబును సమర్థింపుచు నుండవలయు. 445

ఆ. జనక గురుల నైనఁ జంపు నర్థమునకై
ప్రాణ మైన విడుచు భార్యకొఱకు
నట్టి భార్యఁ బురుషుఁ డతిథిశుశ్రూష సే
యించి [1]గెలుచు నజితు నీశు నైన. 446

ఆ. పరముఁ డీశ్వరుండు బ్రాహ్మణముఖమున
నాహరించి తుష్టుఁ డైన భంగి
నగ్నిముఖమునందు హవ్యరాసులు గొని
యైన తుష్టినొందఁ డనఘచరిత! 447

వ. కావున గృహస్థుండు బ్రాహ్మణులందును, దేవతలందును, మర్త్య పశుప్రముఖ జాతులందును, నంతర్యామియు, బ్రాహ్మణాననుండును నైన క్షేత్రజ్ఞునందు నయ్యై కోరికలు సమర్పించి, సంతర్పణంబు సేయవలయు. భాద్రపదంబునఁ, గృష్ణపక్షంబునందును, దక్షిణోత్తరాయణంబులందును, రేయింబగలు సమ మైన కాలంబులందును, వ్యతీపాతంబులందును, దినక్షయంబులందును, సూర్య చంద్ర గ్రహణంబులందును, శ్రవణద్వాదశియందును, వైశాఖశుక్ల తృతీయయందును, కార్తికశుక్ల నవమియందును, హేమంత శిశిరంబులోన నాలు గష్టక లందును, మాఘశుక్ల సప్తమియందును, మాస నక్షత్రంబులతోడం గూడిన పున్నమ

1. కొలుచు (హ)

లందును, ద్వాదశితోడం గూడిన యుత్తరాత్రయ శ్రవణానూరాధలందును, నుత్తరాత్రయ సహిత లైన యేకాదశీ తిథులందును, జన్మనక్షత్ర యుక్త దివసంబులందును, మఱియుఁ, బ్రశస్తకాలంబులందును, జననీ జనక బంధుజనులకు శ్రాద్ధంబులును, జప హోమ స్నాన వ్రతంబులును, దేవ బ్రాహ్మణ సమారాధనంబులును, నాచరింపవలయు. భార్యకుఁ బుంసవనాదికంబును, నపత్యంబునకు జాతకర్మాదికంబును, దనకు యజ్ఞదీక్షాదికంబును, బ్రేతజనులకు దహనాదికంబును, మృతదివసంబున సాంవత్సరికంబును, జరుపవలయు. 448

మ. వినుమే దేశములం దయాగుణ తపో విద్యాన్వితం బైన వి
ప్రనికాయంబు వసించు నే స్థలములన్ భాగీరథీముఖ్యవా
హిను లుండున్ హరిపూజ లెయ్యెడల భూయిష్ఠ ప్రకారంబులన్
దనరున్ భూవర ! [1]యిట్టి చోటులఁ దగున్ ధర్మంబులం జేయఁగన్. 449

క. హరియందు జగము లుండును, హరిరూపము సాధుపాత్ర మం దుండు శివం
కర మగు పాత్రము గలిగిన, నరయఁగ నది పుణ్యదేశ మనఘచరిత్రా! 450

వ. మఱియుఁ, గురుక్షేత్రంబును, †గయాశీర్షంబును, బ్రయాగంబును, బులహాశ్రమంబును, నైమిశంబును, ఫల్గునంబును, సేతువును, బ్రభాసంబునుఁ, గుశస్థలియును, వారాణసియు, మధురాపురియును, బంపా బిందు సరోవరంబులును, నారాయణాశ్రమంబును, సీతారామాశ్రమంబును, మహేంద్ర మలయాదు లైన కులాచలంబులును, హరిప్రతిమార్చన ప్రదేశంబులును, హరిసేవాపర పరమభాగవతులు వసించెడు పుణ్యక్షేత్రంబులును, శుభకాముం డైన వాఁడు సేవింపవలయు. 451

ఆ. భూవరేంద్ర ! యిట్టి పుణ్యప్రదేశంబు
లందు నరుఁడు సేయునట్టి ధర్మ
మల్ప మైన నది సహస్రగుణాధిక
ఫలము నిచ్చు హరి కృపావశమున. 452

వ. వినుము. చరాచరం బైన విశ్వ మంతయు విష్ణుమయం బగుటం జేసి, పాత్రనిర్ణయ నిపుణు లైన విద్వాంసులు నారాయణుండు ముఖ్యపాత్ర మని పలుకుదురు. దేవఋషులును, బ్రహ్మపుత్రు లైన సనకాదులును నుండ, భవదీయ రాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుం డయ్యె. అనేక జంతుసంఘాత సంకీర్ణం బైన బ్రహ్మాండ పాదపంబునకు నారాయణుండు మూలంబు.

---

1. యట్టి (వా) † "హయశిరః" (మూలము) (14-81)

తన్నిమిత్తంబున నారాయణసంతర్పణంబు సకలజంతు సంతర్పణ మని యెఱుంగుము. ఋషి నర తిర్యగమర శరీరంబులు పురంబులు. వానియందుఁ దారతమ్యంబులతోడ జీవరూపంబున భగవంతుఁడైన హరి వర్తించుటం జేసి, పురుషుండనఁ బ్రసిద్ధుం డయ్యె. అందుఁ దిర్యగ్జాతులకంటె నధికత్వంబు పురుషునియందు విలసిల్లుటం జేసి పురుషుండు పాత్రంబు. పురుషులలోన హరి తను వైన వేదంబు నుద్ధరింపుచు సంతోష విద్యా తపోగరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు. బ్రాహ్మణులలోన నాత్మజ్ఞాన పరిపూర్ణుండైన యోగి ముఖ్యపాత్రం బని పలుకుదురు. పరస్పర పాత్రంబులకు సహింపని మనుష్యులకుఁ బూజనార్థంబు త్రేతాయుగంబునందు హరిప్రతిమలు గల్పింపఁబడియె. కొందఱు ప్రతిమార్చనంబుఁ జేయుదురు. [1]పురుషద్వేషులైనవారలకు నట్టి ప్రతిమార్చనంబు ముఖ్యార్థప్రదంబు గాదు. మందాధికారులకుఁ బ్రతిమార్చనంబు పురుషార్థప్రదం బగును.

ఆ. అఖిల లోకములకు హరి దైవతము సూడ
హరికి దైవతము [2]ధరామరుండు
పదపరాగ లేశపంక్తిచేఁ ద్రైలోక్య
పావనంబుఁ జేయు బ్రాహ్మణుండు. 454

అధ్యాయము – ౧౫

వ. అట్టి బ్రాహ్మణజనులందుఁ గర్మనిష్ఠులు, తపోనిష్ఠులు, వేదశాస్త్రనిష్ఠులు, జ్ఞానయోగనిష్ఠులునై కొందఱు వర్తింతురు. అందు జ్ఞాననిష్ఠునికి ననంత ఫలకామియైన గృహస్థుండు పితృజనుల నుద్దేశించి కవ్యంబులును, దేవతల నుద్దేశించి హవ్యంబులునుఁ బెట్టుట ముఖ్యంబు. దైవకార్యంబునకు నిరువుర నైన, నొకరి నైనఁ, బితృకార్యంబునకు ముప్పుర నైన నొకరి నైన, భోజనంబు సేయింపవలయు. ధనవంతున కైనను శ్రాద్ధ విస్తారంబు కర్తవ్యంబు గాదు. దేశ కాల ప్రాప్త కంద మూల ఫలాదికం బైన హరి నైవేద్యంబున, విధి చోదిత ప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబునందుఁ బెట్టిన యన్నంబు కామదం బై యక్షయ ఫలకారి యగు. ధర్మతత్త్వ వేది యైనవాఁడు శ్రాద్ధంబులందు మాంసప్రదానంబు సేయక, భక్షింపక, చరింపవలయు. కందమూలాది దానంబున నయ్యెడి ఫలంబు, పశుహింసనంబున సంభవింపదు. ప్రాణిహింస సేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు. యజ్ఞవిదు లైన ప్రోడలు నిష్కాము లై, బాహ్యకర్మం

1. పాత్రపురుషద్వేషులైన (తం. వా. చ.) 2. ధరాధినాథ (హ)

బులు విడిచి, ‡యాత్మజ్ఞాన దీపంబులందుఁ గర్మమయంబు లయిన యజ్ఞంబుల నాచరింతురు. 455

క. పశువులఁ బొరిగొని మఖములు, విశదములుగఁ జేయు బుధుని వీక్షించి తముఁ బ్
విశసనము చేయునో యని, [1]కసిమసి బెగడొందు భూతగణము నరేంద్రా!

వ. అది గావున ధర్మవేది యైనవాఁడు, ప్రాప్తంబు లైన కందమూలాదికంబులచేత నిత్య నైమిత్తిక క్రియలఁ జేయవలయు. నిజ ధర్మబాధకం బయిన ధర్మంబును, బరధర్మ ప్రేరితం బైన ధర్మంబును, నాభాసధర్మంబును, బాషండధర్మంబును, గపటధర్మంబును, ధర్మజ్ఞుం డైనవాఁడు మానవలయు. నైసర్గికధర్మంబు దురిత శాంతి సమర్థం బగు. నిర్ధనుండు ధర్మార్థంబు యాత్రసేయుచు నైన ధనంబు గోర వలదు. జీవనోపాయంబునకు [2]నిట్టట్టుఁ దిరుగక, కార్పణ్యంబు లేక జీవించుచు, మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముం డై, యెద్దియుం గోరక బ్రతికెడి సుగుణునికిం గల సుఖంబు, [3]కామలోభంబులం దశదిశలం బరి ధావనంబు సేయువానికి సిద్ధింపదు. పాదరక్షలు గలవానికిఁ [4]శర్కరా కంటకాదులవలన భయంబు లేక మెలంగ నలవడుభంగిఁ, గామంబులవలన నివృత్తి గలవానికి నెల్లకాలంబును భద్రం బగు. ఉపస్థకును, జిహ్వా దైన్యంబునకును బురుషుండు గృహపాలక శునకంబు కైవడి సంచరించుచు సంతుష్టిలేక చెడు. సంతోషిగాని విప్రుని విద్యా తపో విభవ యశంబులు నిరర్థ కంబులు. ఇంద్రియలోలత్వంబున జ్ఞానంబు నశించు. సకల భూలోక భోగంబులు భోగించియు, దిగ్విజయంబు సేసియు, బుభుక్షా పిపాసలవలన కామపారంబును, హింసవలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు. సంకల్ప వర్జనంబునఁ గామం బును, గామవర్జనంబునఁ గ్రోధంబును, నర్థానర్థ దర్శనంబున లోభంబులును, నద్వైతానుసంధానంబున భయంబును, నాత్మానాత్మ వివేకంబుల శోక మోహం బులును, సాత్త్విక సేవనంబున దంభంబును, మౌనంబున యోగాంతరాయంబును, శరీరవాంఛలేమి హింసయు, హితాచరణంబున భూతజం బైన దుఃఖంబును, సమాధిబలంబున దైవికవ్యథయును, ‡ప్రాణాయామాదికంబున మన్మథవ్యథ యును, సాత్త్వికాహారంబుల నిద్రయు, సత్త్వగుణంబున రజస్తమంబులును, నుపశమంబున సత్త్వంబును, గురుభజనకుశలుం డై *(శీలంబున) జయింప వలయు. 457

† "ఆత్మ సంయమనేఽనీహాః జుహ్వతి జ్ఞానదీపితే" మూలము (15-9)
1. క్రశిమన్ (చ. తం. వా.) 2. ఇంటింట (చ) 3. మాన (హ) 4. కర్కశ (హ)
‡ "ఆత్మజం యోగ వీర్యేణ" అని మూలము. 'ఆత్మజం దేహజం' అని వ్యాఖ్య. * తా.ప. ప్రతులలో లేదు.

క. హరి మహిమ తనకుఁ జెప్పెడి, గురువు న్నరుఁ డనుచుఁ దలఁచి కుంఠితభక్తిన్
దిరుగు పురుషు శ్రమ మెల్లను, కరిశౌచముక్రియ నిరర్థకం బగు నధిపా! 458

ఉ. ఈ వనజాతనేత్రుఁ బరమేశు మహాత్ముఁ బ్రధానపూరుషున్
[1]దేవశరణ్యు సజ్జనవిధేయు ననంతుఁ బురాణయోగి సం
సేవిత పాదపద్ముఁ దమచిత్తముల న్నరుఁడంచు లోకు లి
చ్ఛావిధిఁ జూచుచుండుదురు సన్మతి లేక నరేంద్రచంద్రమా! 459

వ. వినుము. షడింద్రియంబులలోన నొకటియందుఁ దత్పరు లై, యిచ్ఛాపూరణ విధానంబులఁ జరితార్థుల మైతి మను వారలు ధారణాభ్యాస సమాధియోగంబుల సాధింపలేరు. కృషిప్రముఖంబులు సంసారసాధనంబులు గాని మోక్షసాధనంబులు గావు. కుటుంబసంగంబునఁ జిత్తవిక్షేపం బగు. చిత్తవిజయప్రయత్నంబున సన్న్యసించి, సంగంబు వర్జించి, మితం బైన భిక్షాన్నంబు భక్షింపుచు, శుద్ధ వివిక్త సమప్రదేశంబున [2]నొక్కరుఁడు నాసీనుం డై సుస్థిరత్వంబునఁ బ్రణవో చ్చారణంబు సేయుచు, రేచక పూరక కుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరో ధించి, కామాహతం బైన చిత్తంబు పరిభ్రమణంబు మాని, కామవిసర్జనంబు చేసి మరలునంతకు నిజ నాసాగ్రనిరీక్షణంబు సేయుచు, నివ్విధంబున యోగా భ్యాసంబు సేయువాని చిత్తంబు, కాష్ఠరహితం బైన వహ్ని తెఱంగున శాంతిఁ జెందు. కామాదులచేత వేధింపఁబడక, ప్రశాంత సమస్తవృత్తం బైన చిత్తంబు బ్రహ్మసుఖ సమ్మర్శనంబున లీనం బై మఱియు నెగయనేరదు. 460

మ. ధరణీదేవుఁడు సన్న్యసించి యతి యై ధర్మార్థ కామంబులన్
బరివర్జించి పున ర్విలంబమునఁ దత్ప్రారంభి యౌనేని లో
భరతిం గక్కినకూడు మంచి దనుచున్ భక్షించి జీవించు దు
ర్నరుచందంబున హాస్యజీవనుఁ డగున్ నానాప్రకారంబులన్. 461

క. మలమునఁ గ్రిమియునుఁ బడుక్రియ, నిలఁ బడు నొడలాత్మగాదు హేయం బనుచున్
దలఁతురు తద్జ్ఞులు వొగడుదు, రలసత నొడలాత్మ యనుచు నజ్ఞు లిలేశా!

ఆ. వ్రతము మానఁ దగదు [3]వడుగుఁగుఱ్ఱనికినిఁ
గ్రియలు మానఁ దగదు గృహాగతునికిఁ
దపసి కూర నుండఁ దగదు సన్న్యాసికిఁ
దరుణితోడి పొత్తు తగదు తగదు. 463

1. దేవవరేణ్యు (చ.తం.వా.) 2. నొక్కచో (హ.వా.) 3. వడుక (చ)

సీ. రథము మేనెల్ల సారథి బుద్ధి యింద్రియగణము గుఱ్ఱములు పగ్గములు మనము
ప్రాణాది దశవిధపవనంబు లిరుసు ధర్మాధర్మగతులు రథాంగకములు
బహుళతరం బైన బంధంబు చిత్తంబు శబ్దాదికములు సంచారభూము
లభిమానసంయుతుం డైన జీవుఁడు రథి ఘనతర ప్రణవంబు కార్ముకంబు

తే. శుద్ధజీవుండు బాణంబు [1]శుభగ మైన
బ్రహ్మ మంచితలక్ష్యంబు పరులు రాగ
భయ మద ద్వేష శోక లోభ ప్రమోహ
మాన మత్సర ముఖములు మానవేంద్ర! 464

వ. ఇట్లు మనుష్యశరీరరూపం బైన రథంబుఁ దనవశంబు సేసికొని, మహాభాగవత చరణకమల సేవానిశితం బైన విజ్ఞానఖడ్గంబు ధరియించి, శ్రీమన్నారాయణ కరుణావలోకన బలంబున రాగాది శత్రునిర్మూలనంబు గావించి, ప్రణవబాణాస నంబున శుద్ధజీవశరంబును సంధించి, బ్రహ్మ మని యెడి గుఱియందుఁ [2]బడ నేసి, యహంకార రథికుండు రథికత్వంబు మాని, నిజానందంబున నుండవలయు. అట్టి విశేషంబు సంభవింపని సమయంబున, బహిర్ముఖంబు లైన యింద్రియఘోట కంబులు బుద్ధిసారథి సహితంబు లై, [3]సాభిమాన రథికుని ప్రమత్తత్వంబు దెలిసి, ప్రవృత్తిమార్గంబు నొందించి, విషయ శత్రుమధ్యంబునం గూల్చిన. 465

ఆ. విషయశత్రు లెల్ల విక్రాంతితోడ సా
రథిసమేతుఁ డైన రథికుఁ బట్టి
యుగ్ర తిమిర మృత్యుయుత మగు సంసార
కూప మధ్యమందుఁ గూల్తు రధిప! 466

వ. విను. వైదికకర్మంబు ప్రవృత్తంబును, నివృత్తంబు నను, రెండు తెఱంగు లయ్యె. అందుఁ బ్రవృత్తంబునఁ బునరావర్తనంబును, నివృత్తంబున మోక్షంబును సిద్ధించు. ప్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబు లన రెండుమార్గంబులు గలవు. అందు హింసా ద్రవ్యమయ కామ్యరూపంబు లైన దర్శ పూర్ణమాస పశుసోమయాగ వైశ్వదేవ బలిహరణ ప్రముఖంబు లైన యాగాదికంబు లిష్టంబులు. దేవాలయ వన కూప తటాక ప్రముఖంబులు పూర్తంబులు. ప్రవృత్తకర్మంబున దేహంబు విడిచి, దేహాంత రారంభంబున దేహి హృదయాగ్రంబున వెలుంగు. వానితోడ నింద్రియంబులఁ, గూడి, *భూత సూక్ష్మయుక్తు డై ధూమ దక్షిణాయన కృష్ణ పక్ష రాత్రి దర్శంబులవలన సోమలోకంబుఁ జేరి, భోగావసానంబున విలీన

---

1. శుభద (తం. వా.) 2. ఁబడవేసి (హ. వా.) 3. స్వాభిమాన (తం. నా.)

* దేహాంతరారంభంబు నొందు దేహి హృదయాగ్రంబు వెలుంగ (తం)
వెలుంగు వానితోడ నింద్రియంబులుం గూడ (వా)
హృదయాగ్రంబు వెలుంగ, దానితోడ నింద్రియంబులుం గూడ ?

దేహుం డై, వృష్టిద్వారంబునఁ గ్రమంబున నోషధిలతాన్న శుక్లరూపంబులఁ బ్రాపించి, భూమియందు జన్మించు. ఇది పునర్భవరూపం బైన పితృమార్గంబు. నివృత్త కర్మనిష్ఠుం డైనవాఁడు, జ్ఞానదీప్తంబు లైన యింద్రియంబులందుఁ గ్రియాయజ్ఞంబుల యజించి, యింద్రియంబుల దర్శనాది సంకల్పరూపం బైన మనంబునందును, వికారయుక్తంబైన మనంబును వాక్కునందును, విద్యాదిలక్షణ మైన వాక్కును వర్ణసముదాయంబు నందును, వర్ణసముదాయంబు నకారాది స్వరత్రయాత్మకం బైన ఓంకారంబు నందును, నోంకారంబును బిందువందును, బిందువును నాదంబునందును, నాదంబును బ్రాణంబునందును, బ్రాణంబును బ్రహ్మమందును, నిలుపవలయు. దేవమార్గంబు లైన యుత్తరాయణ శుక్లపక్ష దివా ప్రాహ్ణ రాకలవలన [1]సూర్యబ్రహ్మలోకంబునందుఁ జేరి, భోగావసానంబున స్థూలోపాధి యైన విశ్వుం డై, స్థూలంబును సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధి యైన తేజసుం డై, సూక్ష్మంబును గారణంబునందు లయించి కారణోపాధి యైన ప్రాజ్ఞుం డై, కారణంబును సాక్షిస్వరూపంబునందు లయించి తురీయుం డై, [2]సూక్ష్మలయంబునందు శుద్ధాత్ముం డై యి వ్విధంబున ముక్తుం డగును. 467

ఆ. అమరనిర్మితంబు లై యొప్పు పితృ దేవ
సరణు లెవ్వఁ డెఱుఁగు శాస్త్రదృష్టి
నట్టివాఁడె దేహి యై మోహమున నొందఁ
డతిశయించు బుద్ధి నవనినాథ! 468

వ. వినుము. దేహాదులకుఁ గారణత్వంబున నాదియందును, నవధిత్వంబున నంత్యమందునుఁ గలుగుచు, బహిరంగంబున భోగ్యంబును, నంతరంగంబున భోక్తయుఁ, బరంబును, నపరంబును, జ్ఞానంబును, జ్ఞేయంబును, వచనంబును, వాచ్యమును, నప్రకాశమును, బ్రకాశంబు నైన వస్తువునకు వేఱొండు లేదు. ప్రతిబింబాదికంబు వస్తుత్వంబునం జేసి వికల్పితం బై తలంపంబడుభంగి, నైంద్రియకం బైన సర్వంబును నర్థత్వంబున వికల్పితం బై తోఁచుం గాని పరమార్థంబు గాదు. దేహాదికంబులు [3]వినాశ్యంబులు. వానికి హేతువు లైన [4]క్షితి[5]ప్రముఖంబులును వినాశ్యంబు లగుట సిద్ధంబు. పరమాత్మకు నవిద్యచేత నెంత తడవు వికల్పంబు దోఁచు, నంత తడవును భ్రమంబుదోఁచు. అవిద్యానివృత్తి యైన సర్వంబును మిథ్య యయి శాస్త్ర విధినిషేధంబులు[7] కలలోపల మేలుగన్న తెఱంగు లగు భావా

---

1. సూర్యబ్రహ్మ లోకంబులందు(హ) 2. సాక్షి(హ) 3. మిథ్యాత్మకంబులు(చ.తం.వా.) 4. చితి (హ)
5. ప్రముఖంబులకును మిథ్యాత్వం బగుట (తం.వా.) 6. యని (హ. తం.) 7. ల నెఱింగి (హ)

ద్వైత, క్రియాద్వైత, ద్రవ్యాద్వైతంబులు మూఁడు గలవు. అందుఁ బటతంతు న్యాయంబునఁ గార్యకారణంబులందు వస్తువొక్కటియై యుండు[1]నని యెఱింగి, యేకత్వాలోచనంబు చేసి, వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు. మనో వా క్కాయకృతంబు లైన సర్వకర్మంబులను ఫలభేదంబు సేయక, పరబ్రహ్మార్ప ణంబు సేయుట క్రియాద్వైతంబు. పుత్రమిత్రకళత్రాది సర్వప్రాణులకుం దనకును దేహమునకుం బంచభూతాత్మకత్వంబున భోక్త యొక్కండను పరమార్థత్వంబున నర్థకామంబులయెడ నైక్యదృష్టిఁ జేయుట ద్రవ్యాద్వైతంబు. నేర్పున నాత్మ తత్త్వానుభవంబున నద్వైత త్రయంబును విలోకించి, వస్తుభేదబుద్ధియుఁ, గర్మభేద బుద్ధియు, స్వకీయ పరకీయ బుద్ధియు, స్వప్నంబులుగాఁ దలంచి ముని యైన వాఁడు [1]మానవలయు. 469

క. వాదములు వేయు నేటికి, వేదోక్తవిధిం జరించు విబుధుఁడు గృహమం
దాదరమున నారాయణ, పాదంబులు గొలిచి ముక్తిపదమునఁ కేఁగుఁ. 470

శా. భూపాలోత్తమ ! మీరు భక్తిగరిమస్ఫూర్తిన్ సరోజేక్షణ
శ్రీపాదాంబుజ యుగ్మము న్నియతు లై సేవించి కాదే మహో
గ్రాపత్సంఘములోనఁ జిక్కక సమస్తాశాంత నిర్జేత లై
యేపారంగ మఖంబు సేసితిరి దేవేంద్ర ప్రభావంబునన్. 471

## —: నారదుని పూర్వజన్మ వృత్తాంతము :—

వ. వినుము. పోయిన మహాకల్పంబునందు గంధర్వులలోన నుపబర్హణుం డను పేర గంధర్వుండ నైన నేను సౌందర్య చాతుర్య మాధుర్య గాంభీర్యాది గుణంబుల సుందరులకుఁ బ్రియుండ నై క్రీడింపుచు, నొక్కనాఁడు విశ్వస్రష్ట లైన బ్రహ్మలు దేవసత్ర మనియెడి యాగంబులోన నారాయణ కథలు గానంబు చేయుకొఱకు నప్సరోజనులను, గంధర్వులనుం జీరిన. 472

ఆ. క్రతువులోని కేను గంధర్వ గణముతోఁ
గలసి పోయి విష్ణుగాథ లచటఁ
గొన్ని పాడి సతులఁ గూడి మోహితుఁడ నై
తలఁగి చనితి నంత ధరణినాథ ! 473

క. వారిజగంధుల పొత్తున, వారిం గైకొనక దలఁగివచ్చిన బుద్ధిన్
వా రెఱిఁగి శాపమిచ్చిరి, వారింపఁగరాని రోషవశమున నధిపా ! 473

1. మనవలయు (చ)

ఆ. పంకజాతు నిచటఁ బాడక కామినీ
గణముఁ గూడి చనిన కల్మషమున
దగ్ధకాంతి వగుచు ధరణీతలంబున
శూద్రజాతిసతికి సుతుఁడ వగుము. 475

వ. అని యిట్లు విశ్వస్రష్టలు శపించిన, నొక్క బ్రాహ్మణదాసికిఁ బుత్రుండ నై జన్మించి, యందు బ్రహ్మవాదు లైన పెద్దలకు శుశ్రూష చేసిన భాగ్యంబున, నిమ్మహాకల్పంబునందు బ్రహ్మపుత్రుండ నై జన్మించితి. 476

ఆ. కౌశలమున మోక్షగతికి గృహస్థుఁ డే
ధర్మ మాచరించి తగిలిపోవు
నట్టి ధర్మమెల్ల నతివిశదంబుగాఁ
బలుకఁబడియె నీకు భవ్యచరిత ! 477

మ. అఖిలాధారుఁ డజాది దుర్లభుఁడు బ్రహ్మం బైన విష్ణుండు నీ
మఖమం దర్చితుఁ డై నివాసగతుఁ డై [1]మర్త్యాకృతిః సేవ్యుఁ డై
సఖ యై చారకుఁ డై మనోదయితుఁ డై సంబంధి యై మంత్రి యై
సుఖదుం డయ్యె భవన్మహామహిమఁ దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా ! 478

వ. అని యిట్లు నారదుండు చెప్పిన వృత్తాంతం బంతయు విని, ధర్మనందనుండు ప్రేమవిహ్వలుం డై వాసుదేవునిం బూజించె. వాసుదేవ ధర్మనందనులచేతఁ బూజితుం డై, నారదమునియు దేవమార్గంబునం జనియె. అని శుకయోగీంద్రుండు పాండవపౌత్రునకుం జెప్పె నని సూతుండు శౌనకాదులకుం జెప్పె.

క. రాజీవసదృశలోచన !, రాజీవభవాది దేవరాజవినుత ! వి
భ్రాజిత కీర్తిలతావృత, రాజీవభవాండభాండ ! రఘుకులతిలకా ! 480

మాలిని. ధరణిదుహితృరంతా ! [2]ధర్మమార్గానుగంతా !
నిరుపమనయవంతా ! నిర్జరారాతిహంతా !
గురుబుధసుఖకర్తా ! కుంభినీచక్రభర్తా !
సురభయపరిహర్తా ! సూరిచేతోవిహర్తా !

చ. హరపటుచాపఖండన ! మహాద్భుత విక్రమ శౌర్య భండనా !
శరనిధి గర్వభంజన ! రసాతనయాహృదయాబ్జ రంజనా !
తరుచర సైన్యపాలన ! సుధాంధసమౌని మనోజ్ఞ ఖేలనా !
సరసిజగర్భ సన్నుత ! నిశాచర సంహార ! త్రైజగన్నుతా !

1. మాధుర్య సంభాషి యై( హ) మంతవ్యు డై భో క్త యై (చ.ట.త.జ.) 2.ధర్మమార్గావగంతా(హ)
* ఈ పద్యము నెంబరు 4140 ప్రతిలోమాత్ర మధికముగా నున్నది.

గద్య. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల పూర్వజన్మ వృత్తాంతంబు సెప్పుటయు, హిరణ్యకశిపు దితి సంవాదంబును, సుయజ్ఞ చరిత్రంబును, యమసల్లాపంబును, బ్రహ్మవరలాభ గర్వితుం డైన హిరణ్యకశిపు చరిత్రంబును, ప్రహ్లాద విద్యాభ్యాస కథయును, ప్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదంబును, ప్రహ్లాదు వచనంబు ప్రతిష్ఠింప హరి నరసింహరూపంబున నావిర్భవించి, హిరణ్యకశిపుని సంహరించి, ప్రహ్లాదునకు నభయం బిచ్చి, నిఖిల దేవతానివహ ప్రహ్లాదాది స్తూయమానుం డై, తిరోహితుం డగుటయుఁ, త్రిపురాసుర వృత్తాంతంబును, ఈశ్వరుండు త్రిపురంబుల దహించుటయు, వర్ణాశ్రమ ధర్మ వివరణంబును, ప్రహ్లాదాజగర సంవాదంబును, నారదు పూర్వజన్మ వృత్తాంతంబును నను కథలం గల సప్తమ స్కంధము సంపూర్ణము.

★

ఓమ్

# శ్రీ మ హా భా గ వ త ము

## అ ష్ట మ స్కం ధ ము

క. శ్రీమన్నామ! పయోద, శ్యామ! ధరాభృల్లలామ! జగదభిరామా!
రామాజనకామ! మహో, ద్దామ! గుణస్తోమధామ! దశరథరామా!

### అధ్యాయము - ౧

వ. మహనీయ గుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుం డైన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

క. వినఁబడియెను స్వాయంభువ, మనువంశము వర్ణ ధర్మ మర్యాదలతో
మనుజుల దనుజుల వేల్పుల, జననంబులు [1]స్రష్ట లెల్ల జనియించుటయున్. 3

ఉ. ఏ మనుకాలమందు హరి యీశ్వరుఁ డేటికి సంభవించె నే
మేమి యొనర్చె న[2]మ్మనువు లే రతఁ డేక్రియఁ జేయుచున్నవాఁ
డేమి నటించు మీఁద గత మెయ్యది సజ్జను లైనవారు ము
న్నేమని చెప్పుచుందురు మునీశ్వర! నా [3]కెఱుఁగింపవే! దయన్. 4

వ. అనిన శుకుం డిట్లనియె. 5

క. ఈ కల్పంబున మనువులు, ప్రాకటముగ నార్వు రైరి పదునలువురలో
లోకముల జనుల పుట్టువు, లాకథితము లయ్యె వరుస నఖిలములు నృపా! 6

వ. ప్రథమమను వైన స్వాయంభువునకు నాకూతి, దేవహూతు లను నిరువురు కూఁతులు గలరు. వారికిఁ గ్రమంబునఁ గపిల, యజ్ఞ నామంబుల లోకంబులకు ధర్మజ్ఞాన బోధంబులు సేయుకొఱకు హరి పుత్రత్వంబు నొందె. అందుఁ గపిలుని చరిత్రంబులు మున్ను చెప్పంబడియె. యజ్ఞుని చరిత్రంబు చెప్పెద వినుము. 7

---

1. సృష్టియెల్ల (హ) 2. మనువులెవ్వరు నేక్రియ (హ) 3. నాకెఱుఁగంగఁ జెప్పవే (చ-బ.)

మ. శతరూపాపతి కామభోగ [1]విరతిఁ సంత్యక్త భూభారుఁ డై
సతియుం దాను వనంబు కేఁగి శతవర్షంబుల్ సునందానదిన్
వ్రతి యై యేకపదస్థుఁ డై నియతుఁ డై [2]వాచంయమ స్ఫూర్తితో
గతదోషుండు తపంబు సేసె భువన ఖ్యాతంబుగా భూవరా! 8

వ. ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువమనువు దన మనంబులోన. 9

సీ. సృష్టిచే నెవ్వఁడు చేతన పడకుండు సృష్టి యెవ్వని చేఁతచే జనించు
జగములు నిద్రింప జాగరూకత నుండి యెవ్వఁడు [3]బ్రహ్మంబు నెఱుఁగుచుండు
నాత్మ కాధారంబు నఖిలంబు నెవ్వఁడు నెవ్వని నిజధనం బింతవట్టు
పొడగాన రాకుండుఁ బొడగను నెవ్వఁడు నెవ్వని [4]దృష్టికి నెదురు లేదు

ఆ. జనన వృద్ధి విలయ సంగతిఁ జెందక
నెవ్వఁ డెడప కుండు నెల్లయెడలఁ
[5]దన మహత్త్వసంజ్ఞ తత్త్వ మెవ్వఁడు దాన
విశ్వరూపుఁ డనఁగ విస్తరించు. 10

వ. అని మఱియు, నిరహంకృతుండును, బుధుండును, నిరాశియుఁ, బరిపూర్ణుండును, ననన్యప్రేరితుండును, నృశిక్షా పరుండును, నిజమార్గ సంస్థితుండును, నిఖిల ధర్మ భావనుండు నైన పరమేశ్వరునకు నమస్కరించెద. అని యుపనిష దర్థంబులు పలుకుచున్న మనువుం గనుంగొని. 11

క. రక్కసులు దినఁగఁ గడఁగిన, వెక్కసముగ యజ్ఞనామ విష్ణుఁడు వారిం
జక్కడిచెఁ జక్రధారల, [5]మిక్కుటముగ వేల్పులెల్ల మే లని పొగడన్. 12

వ. ఇది ప్రథమమన్వంతరంబు. ఇంక రెండవ [7]మన్వంతరంబు వినుము. 13

సీ. స్వారోచిషుం డన సప్తార్చి బిడ్డఁడు మనువు వానికి నా ద్యుమ త్సుషేణ
రోచిష్మ దాద్యు లారూఢ పుత్త్రులు ధాత్రి యేలిరి రోచనుం డింద్రుఁ డయ్యె
నధికులు తుషితాదు లమరు [8]లూర్జస్తంబ ముఖ్యు లాఢ్యులు సప్తమునులు నాఁడు
వేదశిరుం డను విప్రుని దయితకుఁ దుషితకుఁ బుత్త్రుఁ డై తోయజాక్షుఁ

ఆ. డవతరించెను [9]విభుఁ డన నశీత్యష్ట స
హస్రమునులు నధికు లైనవారు
ఘను లనుగ్రహింపఁ గౌమారక బ్రహ్మ
చారి యగుచు నతఁడు సలిపె వ్రతము. 14

---

1. నియతిఁ (త) 2. వాంఛన్ మనస్స్ఫూర్తితో (జ) 3. బ్రహ్మాండ మెఱుఁగుచుండు (హ.తం.వా.) బ్రహ్మాంత మెఱుఁగుచుండు (త) 4. సృష్టికి (హ) 5. సన్మహత్త్వ తత్త్వ సంజ్ఞ నెవ్వఁడు దాన (తం) 6. మిక్కుటముగ (చ.ట.త.జ.డ,బ.) 7. మనువు వినుము (హ) 8. ఊర్జస్తంభ (తం) 9. విభుఁడను (హ)

వ. తదనంతరంబ. 15

సీ. మనువు మూఁడవవాఁడు మనుజేంద్ర!యుత్తముం డన ప్రియవ్రతునకునాత్మజుండు
పాలించె నిల యెల్లఁ బవన సృంజయ యజ్ఞహోత్రాదు లాతని పుత్త్రు లధిక
గుణులు వసిష్ఠుని కొడుకులు ప్రమథాదు లైరి సప్తఋషులు నమరవిభుఁడు
సత్యజిత్తనువాఁడు సత్య భద్రాద్యులు సురలు ధర్మునికిని సూనృతకును

ఆ. బుట్టి సత్యనియతిఁ బురుషోత్తముఁడు సత్య
సేనుఁ డనఁగ దుష్టశీలయుతుల
దనుజ యక్షపతుల దండించె సత్యజి
న్మిత్రుఁ డనఁగ జగము మే లనంగ. 16

## —: గజేంద్రమోక్షణ కథ :—

వ. చతుర్థమనువు కాలప్రసంగంబు వివరించెద. 17

సీ. మానవాధీశ్వర ! మనువు నాలవవాఁడు తామసుం డనఁగ నుత్తముని భ్రాత
పృథ్వీపతులు కేతు పృథు నర ఖ్యాతాదు లతని పుత్రులు [1]పదు రధికబలులు
సత్యక హరివీర సంజ్ఞులు వేల్పులు త్రిశిఖ నామమువాఁడు దేవవిభుఁడు
మునులు జ్యోతిర్వ్యోమ ముఖ్యులు హరి పుట్టె హరిమేధునకుఁ బ్రీతి హరిణియందు

ఆ. [2]గ్రహనిబద్ధుఁ డైన గజరాజు విడిపించి
ప్రాణభయమువలనఁ బాపి కాఁచె
హరి దయాసముద్రుఁ డఖిల లోకేశ్వరుఁ
డనిన శుకునిఁ జూచి యవనివిభుఁడు. 18

క. నీరాట [3]వనాటములకుఁ, బోరాటం బెట్లు గలిగెఁ, బురుషోత్తము చే
నారాట మెట్లు మానెను, ఘోరాటవి[4]లోని భద్రకుంజరమునకున్. 19

క. మునినాథ ! యీ కథాస్థితి, వినిపింపుము విన్నఁగ నాకు వేడుక పుట్టెన్
వినియెదఁ [5]గర్ణేంద్రియములు, పెనుఁ బండువు సేయ మనము ప్రీతిం బొందన్.

క. ఏ కథలయందుఁ బుణ్య, శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే
నా కథలు పుణ్యకథ లని, యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్. 21

వ. ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుం డైన పరీక్షన్నరేంద్రుండు బాదరాయణి నడిగె.
అని చెప్పి, సభాసదు లైన మునుల నవలోకించి, సూతుండు పరమ హర్షసమే
తుం డై చెప్పె. అట్లు శుకుండు రాజున కిట్లనియె. 22

1. పద్గు రధిక బలులు (తం. వా) పదుగు రధిక బలులు (హ) 2. గ్రాహబద్ధుఁడైన (తం)
3. వనాటులకుం (హ) 4. లోన (హ) 5. కర్ణేంద్రియముల పెనుఁబండువు (తం. వా.)

అధ్యాయము — ౨

సీ. రాజేంద్ర! విను సుధారాశిలో నొక పర్వతము త్రికూటం బనఁ దనరు చుండు
యోజనాయుత మగు నున్నతత్వంబును నంతియ వెడలుపు నతిశయిల్లుఁ
గాంచనాయస్సార కలధౌత మయము లై మూఁడుశృంగంబులు మొనసియుండుఁ
దటశృంగ బహురత్న ధాతు చిత్రితము లై దిశలు[1] భూనభములుఁ దేజరిల్లు

తే. భూరి భూజ లతా కుంజ పుంజములును
మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును
[2]మరగి తిరిగెడు దివ్య విమానములును
జఱులఁ గ్రీడించు కిన్నరచయముఁ గలిగి. 23

వ. అది మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత [3]కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుళ వట కుటజ కుంద కురువక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సిందువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశు పాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంతసమయ సౌభాగ్యసంప దంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరు న్నివ హాలంకృతంబును, మణివాలు కానేక విమల పులిన తరంగిణీ సంగత విచిత్ర విద్రుమలతా మహోద్యాన శుక పిక నికర నిశిత సముంచిత చంచూపుట నిర్దళిత శాఖి శాఖాంతర పరిపక్వ ఫల రంధ్ర ప్రవర్షిత రసప్రవాహ బహుళంబును, కనకమయ సలిల కాసార కాంచన కుముద కల్హార కమల పరిమళ మిళిత కబళాహార సంత తాంగీకార భార పరిశ్రాంత కాంతా సమాలింగిత కుమార మత్త మధుకర విట సముదయ సమీపసంచార సముదంచిత శకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బలాహక కోయష్టిక ముఖర జలవిహంగ విసర వివిధకోలాహల బధిరీభూత భూ నభోంతరాళంబును, తుహినకరకాంత మరకత కమలరాగ వజ్ర వైడూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనక కలధౌత మణిమ యానేక శిఖరతట దరీ విహారమాణ విద్యాధర విబుధ సిద్ధ చారణ గంధర్వ గరుడ కిన్నర కింపురుష మిధున సంతత సరససల్లాప సంగీతప్రసంగ మంగళాయతనంబును, గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ

1. భూనభమునఁ దేజరిల్లు (హ) 2. మలసి తిరిగెడు (హ) 3. కామ్లాతక (హ)

కంఠీరవ శరభ శార్దూల చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహిష మర్కట మహోరగ మార్జాలాది నిఖిల మృగనాథ సమూహ సమరసన్నాహ సంరంభ [1]సంచకిత శరణాగత శమనకింకరంబును నై యొప్పు న పర్వత సమీపంబునందు. 24

క. ఖిల్లీ [2]భల్ల లులాయక, భల్లుక ఫణి ఖడ్గ గవయ బలిముఖ చమరీ
ఝిల్లీ హరి [3]శరభక కిటి మల్లాద్భుత కాక ఘూకమయ మగు నడవిన్. 25

శా. అన్యాలోకన భీకరంబులు జితాశానేకపానీకముల్
వన్యేభంబులు గొన్ని మత్తతను లై వ్రజ్యావిహారాగతో
దన్యత్వంబున భూరి భూధర [4]దరీ ద్వారంబులం దుండి సౌ
జన్యక్రీడల [5]నీరుగాలివడిఁ గాసారావగాహార్థ మై. 26

ఆ. అంధకార మెల్ల నద్రి గుహాంతర
వీథులందుఁ బగలు వెఱచి డాఁగి
యెడరు వేచి సంధ్య నినుఁడు వృద్ధత నున్న
వెడలె ననఁగ గుహలు వెడలెఁ గరులు. 27

క. తలఁగవు కొండల కైనను, మలఁగవు సింగముల కైన మార్కొను కడిమిం
గలఁగవు పిడుగుల కైనను, నిల బలసంపన్న వృత్తి నేనుఁగుగున్నల్. 28

సీ. పులుల మొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు ఘోర భల్లూకముల్ గుహలు సొచ్చు
భూదారములు నేలబొఱియలలో డాఁగు హరిదంతముల కేఁగు హరిణచయము
మడుఁగులఁ జొరఁబాఱు మహిషసంఘంబులు గండశైలంబులఁ గపులు ప్రాఁకు
వల్మీకములు సొచ్చు వనభుజంగంబులు నీలకంఠంబులు నింగి కెగయు

తే. వెఱచి చమరీమృగంబులు విసరు వాల
చామరంబుల విహరణశ్రమము వాయ
భయద పరిహేల విహరించు భద్రకరుల
గాలి వాఱిన మాత్రాన జాలిఁ బొంది. 29

క. మదగజ దానామోదము, కదలని తమకములఁ ద్రావి కడుపులు నిండన్
బొదలుచుఁ దుమ్మెదకొదమల, కదుపులు ఝుం ఝు మ్మటంచు గానము సేసెన్. 30

క. తేఁటి యొకటి యొరు [6]ప్రియకును, మాటికి మాటికిని నాగ మదజల గంధం
బేటి కని తన్నుఁ బొందెడి, బోటికి నందిచ్చు నిండు [7]బోటుఁదనమునన్. 31

---

1. సంచరిత (చ. డ. ద.) 2. భల్లు లులూయక (హ) 3. శరభకిటీ, మల్లాద్భుత (హ)
4. తటీ (బ) 5. నీరుగాలి పడి (తం) 6. ప్రియునకు (క.ట.త.జ.డ.బ.) 7. బోటితనమునన్ (హ)

క. అంగీకృత రంగ స్థా, తంగీ మదగంధ మగుచుఁ దద్దయు వేడ్కన్
సంగీత విశేషంబుల, భృంగీగణ మొప్పె మ్రానుపెట్టెడి మాడ్కిన్. 32

క. [1]వల్లభలు వాటి మున్పడ, [2]వల్లభ మని మునరిరేని వారణ[3]దానం
బొల్లక మధుకరవల్లభు, లుల్లంబులఁ బొంది రెల్ల యుల్లాసంబుల్. 33

వ. అప్పుడు. 34

మ. కలభంబుల్ చెరలాడుఁ బల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్
ఫలభూజంబులు రాయుచున్ జివురుజొంపంబుల్ వడిన్ మేయుచున్
బులులం గారెనుపోతులన్ మృగములన్ బోనీక శిక్షించుచున్
గొలఁకుల్ సొచ్చి [4]కలంపుచున్ గిరులపై గొబ్బిళ్ళు గోరాడుచున్. 35

క. తొండంబుల మదజలవృత, గండంబుల కుంభములను ఘట్టన సేయం
గొండలు దల్కిం చై పడు, బెండుపడున్ దిశలు సూచి బెగడున్ జగముల్. 36

క. ఎక్కడఁ జూచిన లెక్కకు, నెక్కువ యై [5]యడవి నడచు నిభయూథములో
నొక్క కరినాథుఁ డెడతెగి, చిక్కె నొక కరేణుకోటి సేవింపంగన్. 37

వ. ఇట్లు వెనుక ముందఱ నడుమ నుభయపార్శ్వంబులఁ దృషార్తితంబు లై యరుగు దెంచు నేనుంగుగములం [6]గానక తెఱంగుదప్పి [7]తొలంగుడుపడి, యీశ్వరాయత్తం బైన చిత్తంబు సంవిత్తంబు గాకుండుటం జేసి తానును, దన కరేణుసముదయంబును నొక్క తెరు వై పోవుచు. 38

సీ. పల్వలంబుల లేఁతపచ్చికఁ మచ్చికఁ జెలుల కందిచ్చు నచ్చికము లేక
నివురుజొంపములఁ గ్రొవ్వెలయు పూఁగొమ్మలఁ బ్రాణవల్లభలకుఁ బాలు వెట్టు
ఘన దాన శీతల కర్ణతాళంబుల దయితల చెమటార్చుఁ దనువు లరసి
మృదువుగాఁ గొమ్మల మెల్లన గళములు నివురుచుఁ బ్రేమతో [8]నెఱపు వలపు

తే. పిఱుఁదు చక్కట్ల డగ్గఱి ప్రేమతోడ
డాసి మూర్కొని దివికిఁ దొండంబు సాపు
వెద వివేకించుఁ గ్రీడించు విశ్రమించు
మత్త మాతంగమల్లంబు మహిమతోడ. 39

---

1. వల్లభులువారు మున్పడ (హ) 2. వల్లభయని (హ) 3. దానం బొల్లకు (హ) 4. కలంపుచున్ (హ) 5. యడవి నడుమ (హ) 6. గూడికొని (హ) 7. తొలంగుపడి (హ) 8. నెరపు గరపు (హ)

సీ. తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతుల కుచములు పయ్యెద[1]కొంగు లీఁగఁ
దన యానగంభీరతకుఁ జాల కబలల యానంబు లందెల నండఁగొనఁగఁ
దన కరశ్రీఁ గని తలఁగి బాలల చిఱు దొడలు మేఖలదీప్తిఁ దోడుపిలువఁ
దన దంతరుచి కోడి తరుణుల నగవులు ముఖచంద్ర దీప్తుల ముసుఁగు దిగువఁ

తే. దనదు లావణ్యరూపంబుఁ దలఁచి చూడ
నంజనాభ్రము కపిలాది హరిదిభేంద్ర
దయిత లందఱుఁ దన వెంటఁ దగిలి నడువ
గుంభివిభుఁ డొప్పె నొప్పుల కుప్పఁబోలి. 40

వ. మఱియు నానా గహనవిహరణ మహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి, పిపాసా పరాయత్తచిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానును జని చని. 41

మ. అటఁ గాంచెన్ గరిణీవిభుండు నవ ఫుల్లాంభోజ కల్హారమున్
[2]నట దిందిందిర వారమున్ గమఠ మీన గ్రాహ దుర్వారమున్
వట హింతాళ రసాల సాల సుమనో వల్లీ కుటీ తీరమున్
చటులోద్ధూత మరాళ చక్ర బక సంచారంబుఁ గాసారమున్. 42

వ. ఇట్లనన్య పురుషసంచారంబును, నిష్కళంకంబును నైన యప్పంకజాకరంబుఁ బొడగని. 43

సీ. తోయజగంధంబు దోఁగిన చల్లని మెల్లని గాడ్పుల మేను లలర
గమల నాళాహార విమల వాక్కలహంస రవములు సెవుల పండువులు సేయ
ఫుల్ల దిందీవ రాంభోరు హామోదంబు ఘ్రాణరంధ్రంబుల గారవింప
నిర్మల కల్లోలనిర్గ తాసారంబు వదనగహ్వరముల వాడు దీర్పఁ

తే. ద్రిజగ దభినవ సౌభాగ్య దీప్త మైన
విభవ మిథునములకును విందు సేయ
నరిగి పంచేంద్రియ వ్యవహారములను
మఱచి మత్తేభయూథంబు మడుఁగుఁ జొచ్చె. 44

క. తొండంబులఁ బూరింపుచు, గండంబులఁ జల్లుకొనుచు గళగళ రవముల్
మెండుకొన వలుదకడుపులు, నిండన్ వేదండకోటి నీరుం ద్రావెన్. 45

వ. అప్పుడు. 46

---

1. కొంగులీవ (హ) 2. నటదిందీవర (క. ట. త. డ. బ.)

మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీ రెక్కించి పూరించి చం
డభ మార్గంబున కెత్తి నిక్కి వడి [1]నుడ్డాడించి [2]పింజింప నా
రభటి †న్నీరములోనఁ బెల్లెగసి నక్ర గ్రాహ పాఠీనముల్
నభమం దాడెడు మీన కర్కటములన్ బట్టెన్ సురల్ మ్రాన్పడన్. 47

వ. మఱియు, న గ్గజేంద్రం బనర్గళ విహారంబున. 48

సీ. కరిణీ కరోజ్ఝిత కంకణ చ్ఛటఁ దోఁగి సెలయేటి నీలాద్రి చెలువుఁ దెగడు
హస్తినీ హస్తవిన్యస్త పద్మంబుల వేయుగన్నులవాని వెఱవు సూపు
కలభ సముత్కీర్ణ కల్హార రజమునఁ గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చుఁ
గుంజరీ పరిచిత కుముద కాండంబుల ఫణిరాజమండన ప్రభ వహించు

ఆ. మదకరేణు ముక్త మౌక్తిక శుక్తుల
మెఱుఁగు మొగిలుతోడ మేలమాడు
నెదురులేని గరిమ నిభరాజ మల్లంబు
వనజగేహకేళి వ్రాలు నపుడు. 49

వ. మఱియు, నా సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధ విహార వ్యాకులిత నూతన లక్ష్మీవిభవ యై, యనంగవిద్యా నిరూఢ పల్లవప్రబంధ పరికంపిత శరీరాలంకార యగు కుసుమకోమలియునుం బోలె, వ్యాకీర్ణ చికుర మత్తమధుకర నికరయు, విగతరస వదనకమలయు, నిజస్థాన చలిత కుచ రథాంగయుగళ లంపటిత జఘన పులినతలయు నై యుండె. అంత. 50

సీ. భుగభుగాయుత భూరి బుద్బుద చ్ఛటలతోఁ గదలుచు దివికి భంగంబు లెగయ
భువన భయంకర ఫూత్కార రవమున ఘోర నక్ర గ్రాహకోటి బెగడ
వాలవిక్షేప దుర్వార ఝంఝానిల వశమున ఘుమఘు మావర్త మడరఁ
గల్లోల జాల సంఘట్టనంబులఁ దటీ [4]తరులు మూలములతో ధరణిఁ గూల

తే. సరసిలోనుండి పొడగని సంభ్రమించి
యుదరి కుప్పించి లంఘించి హుంకరించి
భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది
నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసి పట్టె. 51

---

1. నొడ్డాణించి (క.ట.జ.డ.ద) 2. పైఁజిందు (హ) † నీరముతోన పెల్లెగసి-అనియుండుట యుచితము. 3. నభమం దాడగ వాని బట్టి ఖగముల్ నాకౌకసుల్ మ్రాన్పడన్ (క. జ. డ. బ.)
4. తరు లమూలంబులై (తం. వా.)

క. వడి దప్పించి కరీంద్రుఁడు, నిడుదకరం బెత్తి [1]వ్రేయ నీరాటంబుం
బొడ వడఁగినట్లు జలములఁ, బడి కడువడిఁ బట్టెఁ బూర్వ పదయుగళంబున్. 52

చ. పదములఁ బట్టినం దలఁకుఁబా టొకయింతయు లేక శూరతన్
మదగజ వల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంత ఘట్టనన్
బెదరఁగ జిమ్మె నమ్మకరి చిప్పలు పాదులు దప్ప [2]నొప్పఱన్
వదలి జలగ్రహంబు కరి వాలము మూలముఁ జీరెఁ [3]గోఱలన్. 53

క. కరిఁ దిగుచు మకరి సరసికిఁ, [4]గరి దరికిని మకరిఁ దిగుచుఁ [5]గరకరి బెరయన్
కరికి మకరి మకరికిఁ గరి, [6]భర మన నిట్లతల కుతల భటు లదిరిపడన్. 54

వ. ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండ దండంబులై తలపడి, నిఖిల లోకాలోకన భీకరంబులై, యన్యోన్య విజయశ్రీ వశీకరంబులై, సంక్షోభిత కమలాకరంబులై, హరి హరియును, గిరి గిరియునుం దాఁకి, పిఱుతివియక పెనంగుతెఱంగున, నీరాటంబైన [7]పోరాటంబునఁ బట్టుచు వెలికి లోనికిం దిగుచుచుఁ, గొలంకు కలంకం బందఁ, గడువడి నిట్టట్టుపడి, తడఁబడక, బుడబుడానుకారంబులై, భుగులు భుగుల్లను చప్పుళ్లతో నురువులు గట్టుచు, జలంబు లుప్పరంబున కెగయం జప్పరింపుచుఁ, దప్పక వదనగహ్వరంబుల నప్పళింపుచు, నిశిత నితాంత దురంత దంతకుంతంబుల నింతింతలు దునియలై, నెప్పళంబునం బునుకచిప్పలు కుదుళ్లుదప్పి రక్తంబులు గ్రమ్ముదేర, హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు, నితరేతర సమాకర్షణంబులం గదలక, పదంబులు మొదలిపట్టు వదలక, కుదురై [8]యుండుచుఁ, బరిభ్రమణ వేగంబున జలంబులం దిరుగుచు, మకర కమఠ కర్కటగండక మండూకాది సలిలనిలయంబుల ప్రాణంబులు క్షీణంబులుగా, నొక టొకటిం దాఁకు రభసంబున నిక్కలువడ మ్రక్కం ద్రొక్కుచు, మెండు చెడి, బెండువడి, నాఁచు గుల్లచిప్ప తండంబులం బరస్పర తాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు, నోల మాసగొనక, గెలుపుఁదలంపులు బెట్టిదంబులై రెట్టింప, నహోరాత్రంబులుం బోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులై, బహుకాల కలహావిహారంబులై, నిర్గత నిద్రాహారంబులై, యవక్ర పరాక్రమ ఘోరంబులై, పోరుచున్న సమయంబున. 55

క. జవమును జలమును బలమును, వివిధములుగఁ బోరు కరటి వీరతకు భువిన్
దివి మకర మీన కర్కట, నివహము లొక్కటన మిత్రనిలయముఁ బొందెన్.

---

1. వైవ (హా) 2. నుప్పరన్ (హా) 3. గోరులన్ (హా) 4. కరి ధరణికి మకరి (క-బం.) 5. కరి కరి బెరయన్ (హా.) 6. భరమనుచును నతల కుతల భటులదురుపడన్ (తం. వా.) 7. పోరాటం బెట్టుచు (హా) 8. వర్తించుచు (తం. వా.)

శా. ఆటోపమ్మునఁ జిమ్ము ఔ మ్మగల వజ్రాభీల దంతమ్ములన్
దాఁటించున్ మెడఁ జుట్టి పట్టి హరి దోర్దండాభ శుండాహతిన్
నీటన్ మాటికి మాటికిం దిగువఁగా నీరాటము న్నీటి పో
రాటం దోటమిపాటుఁ జూపుట[1] కరణ్యాటంబు వాచాట మై. 57

వ. అప్పుడు. 58

ఆ. మకరితోడఁ బోరు మాతంగవిభుని నొ
క్కరుని డించిపోవఁ గాళ్ళురాక
కోరి చూచుచుండెఁ గుంజరీయూథంబు
మగలు తగులుగారె మగువలకును. 59

వ. అంత. 60

ఆ. జీవనంబు దనకు జీవనం బై యుంట
నలవు చలము నంత కంత కెక్కి
మకర మొప్పె డస్సె మత్తేభమల్లంబు
బహుళపక్ష శీతభాను పగిది. 61

మ. ఉఱుకుం గుంభయుగంబుపై హరిక్రియన్ హుమ్మంచు పాదంబులం
దిఱుకుం గంఠము వెన్నుదన్ను నెగయున్ హేలాగతిః వాలమున్
జఱచు న్నగ్గగఁ దాఁకు ముంచు మునుఁగున్ శల్యంబులున్ దంతముల్
విఱుగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి కదియున్ వేదండ యూథోత్తమున్. 62

మ. పొడ గానంబడకుండ డాఁగు వెలికిం బోవంగఁ దా నడ్డ మై
పొడచూపుం జరణంబులం బెనఁగొనుం బోరాక రారాక బె
గ్గడిలం గూలఁగఁ [2]దాఁచు లేచుతటి నుద్ఘాటించు లంఘించు బల్
విడి జీరున్ దలఁగున్ మలంగు నొడియున్ వేధించుఁ గ్రోధించుచున్. 63

వ. ఇట్లు విస్మిత నక్రచక్రం బై, నిర్వక్ర విక్రమంబున, నల్ప హృదయ జ్ఞానదీపంబు నతిక్రమించు మహా మాయాంధకారంబునుం బోలె, నంతకంతకు నుత్సాహ కలహ సన్నాహ బహువిధ జలావగాహం బైన గ్రాహంబును మహాసాహసంబున.

శా. పాదద్వంద్వము నేల మోపి పవనుః బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకుః [3]మాఱాకు హత్తించి [4]ని
ష్ఖేద బ్రహ్మపదావలంబన గతిం గ్రీడించు యోగీంద్రు మ
ర్యాద న్నక్రము విక్రమించెఁ గరి పాదాక్రాంత నిర్వక్ర మై. 65

1. జూపక యరణ్యటంబు? 2. దాఁటు(హ) 3. మాఱాకులొత్తించి(ట.త.జ.డ.) 4. నిఃఖేద(హ)

ఆ. వనగజంబు నెగుచు వనచారిఁ బొడగని
వనగజంబె కాన వజ్రిగజము
వెల్ల నై సురేంద్రు వేచి సుధాంధులఁ
బట్టు పట్టనీక బయలు వ్రాఁకె. 66

ఉ. ఊహ కలంగి జీవనపు టోలమునం బడి పోరుచున్ మహా
మోహలతా నిబద్ధ పదమున్ విడిపించుకొనంగలేక సం
దేహముఁ బొందు దేహిక్రియ దీనదశన్ గజ ముండె భీషణ
గ్రాహ దురంతదంత పరిఘట్టిత పాద ఖురాగ్ర శల్య మై. 67

వ. ఇ వ్విధంబున. 68

క. అలయక సొలయక వేసట, నొలయక కరి మకరితోడ నుద్దండత రా
త్రులు సంధ్యలు దివసంబులు, సలిపెన్ బో రొక్కవేయి సంవత్సరముల్. 69

మ. పృథుశక్తిన్ గజ మా జలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సం
శిథిలం బై తనలావు వైరిబలముం జింతించి మిథ్యా మనో
రథ మింకేటికి దీని గెల్వ సరి పోరం జాలరా దంచు స
వ్యథ మై యి ట్లనుఁ బూర్వపుణ్య ఫల దివ్యజ్ఞాన [1]సంపత్తితోన్. 70

అధ్యాయము – ౩

శా. ఏ రూపంబున దీని గెల్తు, నిటమీఁ దే వేల్పుఁ జింతింతు, నె
వ్వారిం జీరుదు, నెవ్వ రడ్డ మిఁక, ని వ్వారిప్రచారోత్తమున్
వారింపం దగువార లెవ్వ, రఖిల వ్యాపారపారాయణుల్
లేరే, మ్రొక్కెద దిక్కుమాలిన మొ ఱాలింపం బ్రపుణ్యాత్మకుల్. 71

శా. నానానేకప యూథముల్ వనములోనం బెద్దకాలంబు స
న్మానింపన్ దశలక్షకోటి కరిణీనాథుండ నై యుండి మ
ద్దానాంభః పరి[2]పుష్ట చందన లతాంత చ్ఛాయలం దుండలే
కీ నీరాశ నిశేల వచ్చితి, భయం బెట్లోకదే, యీశ్వరా! 72

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీన మై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాది మధ్య లయుఁ డెవ్వఁడు సర్వముఁ దాన యైన వాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. 73

1. వేయు (హ) 2. సంపూర్తితో (క. చ. ట. త. జ. డ.) 3. పూర్ణ (హ)

క. ఒకపరి జగములు వెలినిడి, యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ [1]దా నై
సకలార్థ సాక్షి యగు న, య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్. 74

క. లోకంబులు లోకేశులు, లోకస్థులుఁ దెగినతుది నలోకం బగు పెం
జీఁకటి కవ్వల నెవ్వఁడు, నేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్. 75

క. నర్తకునిభంగిఁ బెక్కగు, మూర్తులతో నెవ్వఁ డాడు మునులున్ దివిజుల్
కీర్తింప నేర రెవ్వని, వర్తన మొరు లెఱుఁగ రట్టి వాని నుతింతున్. 76

ఆ. ముక్తసంగు లైన మునులు దిదృక్షులు
సర్వభూత హితులు సాధుచిత్తు
లసదృశ వ్రతాఢ్యు లై కొల్తు రెవ్వని
దివ్యపదము, వాఁడు దిక్కు నాకు. 77

సీ. భవము దోషంబు రూపంబు కర్మంబు నాహ్వాయమును గుణము లెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించుకొఱకు నై నిజమాయ నెవ్వఁ డిన్నియునుదాల్చు
[2]నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ [3]కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునకు సాక్షికి [4]నాత్మరుచికినిఁ బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు

ఆ. మాటల న్నెఱుకల మనములఁ జేరంగఁ
[5]గాని శుచికి సత్త్వగమ్యుఁ డగుచు
నిపుణుఁ డైనవాని నిష్కర్మతకు మెచ్చు
వాని కే నొనర్తు వందనములు. 78

సీ. శాంతున కపవర్గ సౌఖ్య సంవేదికి, నిర్వాణ భర్తకు నిర్విశేషు
నకు, ఘోరునకు మూఢునకు గుణధర్మికి సౌమ్యున కధికవిజ్ఞానమయున
కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహు క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మ [6]మూలునకు జితేంద్రియ జ్ఞాపకునకు దుఃఖాంతకృతికి

ఆ. నెఱిన సత్య మనెడి నీడతో వెలుఁగుచు
నుండు నొక్కటికి మహోత్తమునకు
నిఖిలకారణునకు, నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుచు కొఱకు. 79

క. యోగాగ్ని దగ్ధకర్ములు, యోగీశ్వరు లే మహాత్ము నొం డెఱుఁగక స
ద్యోగ విభాసిత మనముల, బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్. 80

---

1. గనుచున్ (క) 2. అపరమేశు కనంత శక్తికి (క) 3. వేదరూపికి రూపవిరహితునకు (ట)
4. ఆత్మవిభునకు (క.ట.) 5. రాని శుచికి సత్త్వరమ్యుడగు(ట) 6. మూలున కఖిలేంద్రియ (తం.వా.)

సీ. సర్వాగమామ్నాయ జలధికి నపవర్గ మయునికి నుత్తమ మందిరునకు
సకల గుణారణి చ్ఛన్న బోధాగ్నికిఁ దనయంత రాజిల్లు ధన్యమతికిఁ
గుణలయోద్దీపిత గురుమానసునకు సంవర్తిత కర్మనిర్వర్తితునకు
దిశలేని నాబోఁటి పశువుల పాపంబు లణఁచువానికి సమస్తాంతరాత్ముఁ

ఆ. డై వెలుంగువాని, కచ్ఛిన్నునకు, భగ
వంతునకుఁ [1]దనుజ సువస్తు దేశ
దార సక్తు లైనవారి కందఁగరాని
వాని కాచరింతు వందనములు. 81

వ. మఱియును. 82

సీ. *వర ధర్మ కామార్థ వర్జితకాము లై విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి కాంక్షించువారి కవ్యయ దేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ
ముక్తాత్ము లెవ్వని మునుకొని చింతింతు రానంద వార్ధి మగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని నేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుందు

ఆ. రా మహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మ మైన వానిఁ [2]బరుని నతీంద్రియు
నీశు [3]స్థూలు సూక్ష్ము నే భజింతు. 83

వ. అని మఱియు ని ట్లని వితర్కించె, 84

సీ. పావకుం డర్చుల భానుండు దీప్తుల నె బ్భంగి నిగిడింతు రె ట్లడంతు,
రా క్రియ నాత్మకరావళిచేత బ్రహ్మాదుల వేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘన నామ రూప భేదములతో మెఱయించి తగ నడంచు
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియములుఁ దాన యై గుణ [4]సంప్రవాహంబుఁ బఱపు

తే. స్త్రీ నపుంసక పురుష మూర్తియును గాక
తిర్యగమర నరాది మూర్తియును గాక
కర్మ గుణ భేద సదస త్ప్రకాశి గాక
వెనుక నన్నియుఁ దా నగు విభుఁ దలంతు. 85

క. కలఁ డందురు దీనులయెడఁ, గలఁ డందురు పరమయోగి గణములపాలం,
గలఁ డందు రన్ని దిశలను, గలఁడు గలం డనెడువాఁడు గలఁడో లేఁడో. 86

---

1. దనూజపశునివేశ (ట.డ.); * "యం ధర్మ కామార్థ విముక్తి కామా భజంత ఇష్టాంగతి మాప్నువంతి." (8-19) 2. బరము (తం.) 3. దూరు (వా.); 'అతీంద్రియం సూక్ష్మ మివాతిదూర మనంత మీడ్యం పరిపూర్ణమీడే." (8-21) 4. సంప్రవాహంపు బరపు (హా.)

సీ. కలుగఁడే నాపాలి కలిమి [1]సందేహింపఁ గలిమిలేములు లేక గలుగువాఁడు
నా కడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ బడిన సాధుల కడ్డపడెడు వాఁడు
చూడఁడే నా పాటు చూపులఁ జూడక చూచువారలఁ గృపఁ జూచువాఁడు
లీలతో నా మొ ఱాలింపఁడే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁ దన్ను
మొఱఁగువాఁడు

తే. నఖిల రూపులుఁ దనరూప మైనవాఁడు
[2]నాది మ ధ్యాంతములు లేక యడరువాఁడు
భ క్తజనముల దీనుల పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపఁడె వేగ రాఁడె, 88

క. విశ్వకరు విశ్వదూరుని, విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు, నీశ్వరునిం [3]బరమపురుషు నే భజియింతున్. 89

వ. అని పలికి, తన మనంబున న గ్గజేంద్రుం డీశ్వర సన్నిధానంబుఁ గల్పించుకొని యి ట్లనియె.

శా. లా వొక్కింతయు లేదు, ధై ర్యము విలోలం బయ్యెఁ, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛ వచ్చెఁ, దనువున్ డస్సెన్, శ్రమం బయ్యెడిన్,
నీవే తప్ప నితః పరం బెఱుఁగ, మన్నింపందగున్ దీనునిన్,
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా! 90

క. విను దఁట జీవుల మాటలు, జను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో
యను దఁట పిలిచిన సర్వముఁ, గను దఁట సందేహ మయ్యెఁ గరుణావార్ధీ! 91

ఉ. ఓ కమలాత్మ! యో వరద! యో ప్రతిపక్ష విపక్షదూర! కు
య్యో! కవి యోగి వంద్య! సుగుణో త్తమ! యో శరణాగ తామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యో విపులప్రభావ! రా
వే, కరుణింపవే, తలఁపవే, శరణార్థిని నన్నుఁ గావవే. 92

వ. అని పలికి, మఱియు నరక్షిత రక్షకుం డై న యీశ్వరుం డాపన్నుం డై న [1]నన్నుం గాచుఁ గాక యని, నింగి నిక్కి చూచుచు, నిట్టూర్పులు నిగిడింపుచు, బయ లాలకింపుచు, న గ్గజేంద్రుండు మొఱ సేయుచున్న సమయంబున, 93

---

1. సందేహించి (హ.) 2. ప్రథమ మ ధ్యాంతముల గానబడెడు వాడు (క.) .... గానబడని వాడు (ట.) 3. బరమపరుని నే ప్రణుతింతున్ (ట.)

ఆ. విశ్వమయత లేమి వినియు నూరక యుండి
రంబుజాసనాదు [1]లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు
భ_క్తియుతున కడ్డపడఁ[2] దలంచి. 94

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నా మూలసౌధంబు దా
పల మందార వనాంత రామృతసరఃప్రాంం తేందుకాం తోప లో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము "పాహి పాహి" యనఁ గుయ్యాలించి సంరంభి యై. 95

మ. సిరికిం జెప్పఁడు శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణి కాం
తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాద [3]ప్రోద్ధత శ్రీ కుచో
పరి చేలాంచల మైన వీడఁడు గజ ప్రాణావ నోత్సాహి యై. 96

వ. ఇట్లు భక్తజనపాలన పరాయణుండును, నిఖిల జంతు హృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయణుండు, కరికులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి, లక్ష్మీకాంతా వినోదంబులం దనివి సాలించి, సంభ్రమించి, దిశలు నిరీక్షించి, గజేంద్ర రక్షాపరత్వంబు నంగీకరించి, నిజ పరికరంబును మరల నవధరించి, గగనంబున కుద్గమించి, వేంచేయు నప్పుడు. 97

మ. తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధ వ్రాతమున్, దాని వె
న్కను బక్షీంద్రుఁడు, వాని పొంతను ధనుః కౌమోదకీ శంఖ చ
క్ర నికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుండుఁ [4]దా వచ్చి రో
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాల గోపాలమున్. 98

వ. తదనంతరంబ ముఖారవింద మకరంద బిందుసందోహ పరిష్యందమా నానంద దిందిందిర యగు న య్యిందిరాదేవి, గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవాద చేలాంచల యై పోవుచు. 99

మ. తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ, డనాథ స్త్రీ జనాలాపముల్
వినెనో, మ్రుచ్చులు మ్రుచ్చిలించిరో [5]ఖలుల్ వేదప్రపంచంబులన్,
దనుజానీకము దేవతా నగరిపై దండెత్తెనో, భక్తులం
గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁ డని ధిక్కారించిరో దుర్జనుల్. 100

---

1. లడ్డపడఁగ (హ.) 2. కడ్డఁబడదలంచి (హ.) కడ్డపడఁదలంచె (తం. వా.)
3. ప్రోత్థిత (తం. వా.) 4. రా వచ్చిరొయ్యన (తం. వా.) 5. ఖరుల్ (హ.)

వ. అని వితర్కింపుచు. 101

శా. తాటంకాచలనంబుతో, భుజ నట ద్ధమ్మిల్ల బంధంబుతో,
శాటీ ముక్త కుచంబుతో, నదృఢ చంచ త్కాంతితో, శీర్ణ లా
లా టాలేపముతో, మనోహర కరాలగ్నో త్తరీయంబుతోఁ
గోటీందు ప్రభతో, నురోజ భర సంకోచ ద్వలగ్నంబుతోన్. 102

క. అడిగెద నని కడువడిఁ జను, నడిగిన దను మగుడ నుడుగఁ డని నడ యుడుగున్
వెడ వెడ సిడిముడి తడఁబడ, నడుగిడు [1]నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్.

సీ. నిటలాలకము లంటి నివుర జుం జు మ్మని ముఖసరోజము నిండ మునరుఁ దేంట్లు
నళులఁ జోఁపగఁ జిల్క లల్ల నల్లనఁ జేరి యోష్ఠబింబ ద్యుతు లోడియ నుఱుకు
శుకములఁ దోలఁ జతుర్మీనములకు మందాకినీ పాఠీనలోక మెగుచు[2]
మీనపంక్తులు దాఁట మెయిదీఁగెతో రాయ శంపాలతలు మింట సరణి గట్టు

ఆ. శంపలను జయింపఁ జక్రవాకంబులు
కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వ చూపు
మెలఁత మొగులు పిఱుఁది మెఱుఁగుఁ దీగెయుఁబోలె
జలదవర్ణు వెనుక జరుగు నపుడు. 104

మ. వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతి జీ
వనసంప త్తి నిరాకరిష్ణుఁ గరుణా వర్ధిష్ణు యోగీంద్ర హృ
ద్వన వ ర్తిష్ణు సహిష్ణు భ క్తజన బృందప్రాభ వాలంకరి
ష్ణు నవోఢోల్లస దిందిరా పరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్. 105

వ. ఇట్లు పొడగని. 106

మ. చనుదెంచెన్ ఘనుఁ డల్ల వాఁడె హరి పజ్జం గంటిరే లక్ష్మి శం
ఖనినాదం బదె చక్ర మల్లదె భుజంగధ్వంసియున్ వాఁడె క్ర
న్నన నేతెంచె నటంచు వేల్పులు నమో నారాయణా యేతి ని
స్వను లై మ్రొక్కిరి మింట హ స్తిదురవస్థావక్రికిం జక్రికిన్. 107

వ. అ య్యవసరంబునఁ గుంజరేంద్రపాలన పారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక, మనస్సమాన సంచారుం డై, పోయి పోయి, కొంతదూరంబున శింశుమార చక్రంబునుంబోలె గురు మకర కుళీర మీన మిథునం బై, కిన్నరేంద్రుని భాండాగారంబునుంబోలె స్వచ్ఛ వర కచ్ఛపం బై, భాగ్యవంతుని

1. నుడుగిడను (హ.) 2. మెసఁగు (హ.)

భాగధేయంబునుం బోలె సరాగ జీవనం బై, వైకుంఠపురంబునుంబోలె శంఖ
చక్ర కమలాలంకృతం బై, సంసారచక్రంబునుంబోలె ద్వంద్వ సంకుల పంక
సంకీర్ణం బై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని. 108

మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్వరితాకంపిత [1]భూమిచక్రము మహోద్యద్విస్ఫులింగ చ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్ బహువిధ బ్రహ్మాండభాండ చ్ఛటాం
తర నిర్వక్రముఁ బాలితాఖిల సుధాంధశ్చక్రముం జక్రమున్. 109

వ. ఇట్లు పంచిన. 110

శా. అంభోజాకర మధ్య నూతన నళి న్యాలింగన క్రీడనా
రంభుం డైన వెలుంగుఱేని చెలు వారన్ వచ్చి నీటన్ గుభుల్
గుంభ ధ్వానముతోఁ గొలంకువు గలంకం బొందఁగాఁ జొచ్చి దు
ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయంబోయి హృద్వేగ మై. 111

శా. భీమం బై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర మాశుక్రియన్
హేమక్ష్మాధర దేహముం జకిత వన్యేభేంద్ర సందోహమున్
గామ క్రోధన గేహమున్ గరటి రక్తస్రావ గాహంబు ని
స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్. 112

వ. ఇట్లు నిమిషస్పర్శనంబున సుదర్శనంబు మకరి తల ద్రుంచు నవసరంబున. 113

క. మకర మొకటి రవిఁ జొచ్చెను, మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్,
మకరాలయమునఁ దిరిగెడు, మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్. 114

మ. తమముం బాసిన రోహిణీవిభు క్రియన్ దర్పించి, సంసారదుః
ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రాహంబు పట్టూడ్చి, పా
దము లల్లార్చి, కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె, సం
భ్రమ దాశా కరిణీ కరోజ్ఝిత సుధాంభస్స్నాన విశ్రాంతుఁ డై. 115

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ, గృపాంభోరాశి సౌజన్యమున్,
భూరిధ్వాన చలాచలీకృత మహాభూత ప్రచైతన్యమున్,
సారోదార సితప్రభా చకిత పర్జన్యాది రాజన్యమున్,
దూరీభూత విపన్న దైన్యమును, నిర్ధూత ద్విష త్సైన్యమున్. 116

---

1. భూరిచక్రము (హ.)

## అధ్యాయము - ౪

మ. మొఱసె న్నిర్జరదుందుభుల్, జలరుహామోదంబు లై వాయువుల్
దిరిగెన్, బువ్వుల వానజల్లు గురిసెన్, దేవాంగనా లాస్యముల్
పరఁగెన్, దిక్కులయందు జీవ జయ[1] ఖేల ధ్వానముల్ నిండె, సా
గర ముప్పొంగెఁ దరంగచుంబిత నభోగంగా ముఖాంభోజ మై. 117

క. నిడుద యగు కేల గజమును, మడువున వెడలంగఁ దిగిచి మదజలరేఖల్
దుడుచుచు మెల్లన పుణుకుచు, నుడివెన్ విష్ణుండు దుఃఖ ముర్వీనాథా! 118

క. [2]శ్రీహరి కర సంస్పర్శను, దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీ సం
దోహమును దాను గజపతి, మోహన ఘీంకారశబ్దములతో నొప్పెన్. 119

క. కరమున మెల్లన [3]నివురుచుఁ, గర మనురాగమున మెఱసి కలయంబడుచున్
గరి హరికతమున బ్రతుకుచుఁ, గరపీడన మాచరించెఁ గరిణుల మరలన్. 120

సీ. జననాథ! దేవలశాప విముక్తుఁ డై పటుతర గ్రాహరూపంబు మాని
ఘనుఁడు హూహూనామ గంధర్వుఁ డప్పుడు తన తొంటి నిర్మలతనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి తవిలి కీర్తించి గీతములు పాడి
యా దేవు కృప నొంది యందంద మఱియును వినతశిరస్కుఁ డై వేడ్కతోడ

ఆ. దళితపాపుఁ డగుచుఁ దనలోకమున కేఁగె
నపుడు శౌరి కేల [4]నంటఁ దడవ
హ స్తిలోకనాథుఁ డజ్ఞానరహితుఁ డై
విష్ణురూపుఁ డగుచు వెలుఁగుచుండె. 121

మ. అవనీనాథ! గజేంద్రుఁ డా మకరితో నాలంబు గావించె, మున్
ద్రవిళాధీశుఁ డతండు పుణ్యతముఁ డింద్రద్యుమ్న నాముండు, వై
ష్ణవముఖ్యుండు, గృహీత మౌననియతిన్ సర్వాత్ము నారాయణున్
సవిశేషంబుగఁ బూజ చేసెను మహాశైలాగ్ర భాగంబునన్. 122

మ. ఒకనాఁ డా నృపుఁ డచ్యుతున్ మనములో నూహింపుచున్ మౌని యై
యకలంకస్థితి నున్నచోఁ గలశజుం డచ్చోటికిన్ వచ్చి తే
వక పూజింపక యున్న [5]రాజుఁ గని నవ్యక్రోధుఁ డై మూఢ! లు
బ్ధ కరీంద్రోత్తమ యోనిఁ బుట్టు మని శాపం బిచ్చె భూవల్లభా! 123

---

1 శబ్దధ్వానముల్ (తం. వా.) 2. శ్రీహరి సంస్పర్శనమున (హ.) 3. పుణుకుచు (క. ట.)
4. నంటనడవ (హ.) నంటితడవ (తం.) నంటినడవ (వా.) అంటఁదడవ = అంటినంతనే-అని యర్థము.
5. మౌనిఁగని (హ. తం. వా.)

క. మునిపతి నవమానించిన, ఘనుఁ డింద్రద్యుమ్నవిభుఁడు [1]గొంజరయోనిం
జననం బందెను విప్రులఁ, గని యవమానింపఁ దగదు ఘనపుణ్యులకున్. 124

క. కరినాథుఁ డయ్యె నాతఁడు, కరులైరి ‡భటాదులెల్ల గజమై [2]యుండిన్
హరి చరణసేవ కతమునఁ, గరివరునకు నధికముక్తి గలిగె నరేంద్రా! 125

ఆ. కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు
నుభయనియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మ మెల్ల శిథిలమై మెల్లనఁ
బ్రబలమైన విష్ణుభక్తి చెడదు. 126

క. చెడుఁగరులు హరులు ధనములుఁ, జెడుదురు నిజసతులు సుతులుఁ జెడు చెనఁటులకున్
జెడక మను నెఱసుగుణులకుఁ, జెడని పదార్థములు విష్ణుసేవా నిరతుల్. 127

వ. అప్పుడు జగజ్జనకుం డగు నప్పరమేశ్వరుండు దరహసిత ముఖకమల యగు నక్కమల కిట్లనియె. 128

క. బాలా! నా వెనువెంటను, హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ
చేలాంచలంబుఁ బట్టుట, కాలో నేమంటి నన్ను నంభోజముఖీ! 129

క. ఎఱుఁగుదు తెఱవా! యెప్పుడు, మఱవను సకలంబు నన్ను మఱచినయెడలన్
మఱతునని యెఱిఁగి మొఱఁగక, మఱవక మొఱయిడిరయేని మఱి యన్యములన్

వ. అని పలికిన, నరవింద మందిర యగు నయ్యిందిరాదేవి మందస్మిత చంద్రికా వదనారవింద యగుచు ముకుందున కిట్లనియె. 131

క. దేవా! దేవర యడుగులు, భావంబున నిలిపి కొలుచు పని నాపని గా
కో వల్లభ! యేమనియెద, నీవెంటనె వచ్చుచుంటి నిఖిలాధిపతీ! 132

క. దీనుల కుయ్యాలింపను, దీనుల రక్షింప మేలు దీవనఁ బొందన్
దీనావన! నీ కొప్పును, దీనపరాధీన! దేవదేవ! మహేశా!. 133

వ. అని మఱియును, సముచిత సంభాషణంబుల నంకించుచున్న పరమ వైష్ణవీరత్నం బును సాదర సరస సల్లాప మందహాస పూర్వకంబుగా నాలింగనంబు గావించి, సపరివారుం డై, గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుం డై, గరుడారూఢుం డగుచు, నిజసదనంబునకుం జనియె. అని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె.

---

1. గుంజరయోనిం (హ.) 2. గజమైయుండెన్ (హ.)

‡ 'భటాదులెల్ల కరులైరి' యనుట అమూలకము. శాపము రాజునకేకాని, భటాదులకు లేదు.

సీ. నరనాథ! నీకును నాచేత వివరింపఁ బడిన యీ కృష్ణానుభావ మైన
గజరాజ మోక్షణ కథ వినువారికి [1]యశము లిచ్చును గల్మషాపహంబు
దుస్స్వప్న నాశంబు దుఃఖసంహారంబుఁ బ్రొద్దుల మేల్కాంచి పూతవృత్తి
నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్మకు లైన విప్రులకును బహువిభవ మమరు

తే. సంపదలు గల్గుఁ బీడలు శాంతిఁ బొందు
సుఖము సిద్ధించు వర్ధిల్లు శోభనములు
మోక్ష మఱచేతి దై యుండు ముదము చేరు
ననుచు విష్ణుండు ప్రీతుఁ డై యానతిచ్చె. 135

వ. అని మఱియు, నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె. ఎవ్వరేనియు నపరరాత్రంబున మేల్కాంచి, సమాహిత మనస్కు లై, శ్వేతద్వీపంబును, నాకుం బ్రియం బైన సుధాసాగరంబును, హేమనగంబును, ని గ్గిరికందర కాననంబులను, వేత్ర కీచక వేణులతా గుల్మ సురపాదపంబులను, ఏనును బ్రహ్మాయు ఫాలలోచనుండును నివసించి యుండు న క్కొండశిఖరంబులను, కౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను, శ్రీదేవిని, శేష గరుడ వాసుకి ప్రహ్లాద నారదాది ఋషులను, మత్స్య కూర్మ వరాహా ద్యవతారంబులను, దదవతారకృత కార్యంబులను, సూర్య సోమ పావకులనుఁ, బ్రణవంబును, ధర్మ తప స్సత్యంబులను, వేదంబును, వేదాంగంబులను, శాస్త్రంబులను, గో భూసుర సాధు పతివ్రతాజనంబులను, జంద్రకాశ్యపజాయా సముదయంబును, గౌరీ గంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ నిచయంబును, నమరులను, నమరతరువులను, నైరావతంబును, నమృతంబును, ధ్రువుని, బ్రహ్మర్షి నివహంబును, బుణ్యశ్లోకు లైన మానవులను, సమాహిత చిత్తు లై తలంచువారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయం బగు విమలగతి నిత్తు. అని హృషీకేశుండు నిర్దేశించి, శంఖంబు పూరించి, విహగపరివృఢ వాహనుం డై వేంచేసె. విబుధానీకంబు సంతోషించె. అని చెప్పి శుకుండు రాజున కి ట్లనియె. 136

## అధ్యాయము – ౫

క. గజరాజ మోక్షణంబును, నిజముగఁ బఠియించునట్టి నియతాత్ములకున్
గజరాజవరదుఁ డిచ్చును, గజతురగ స్యందనములుఁ గైవల్యంబున్. 137

క. తామసు తమ్ముఁడు రైవత, నామకుఁ డై వెలసె మనువు నలువుర మీఁదన్
భూమికిఁ బ్రతివిం ధ్యార్జున, నామాదులు నృపులు మనువు నందనులు నృపా!

1. యశము లెచ్చును (వా.)

సీ. మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు వేదశిర్షుండును వీరు మొదలు
నమరులు భూతరయాదులు శుభ్రుని పత్ని వికుంఠాఖ్య పరమ సాధ్వి
యా యిద్దఱకుఁ బుత్రుఁ డై తనకళలతో వైకుంఠుఁ డనఁ బుట్టి వారిజాతుఁ
డవనిపై వైకుంఠ మనియెడి లోకంబుఁ గల్పించె నెల్లలోకములు మ్రొక్క

తే. రమ యెదుర్కోలు చేకొనె రాజముఖ్య!
తదనుభావ గుణంబులుఁ దలఁపఁ దరమె?
యీ ధరారేణు పటలంబు నెఱుఁగవచ్చుఁ
గాని రాదయ్య హరి గుణగణము సంఖ్య. 139

వ. తదనంతరంబ. 140

సీ. చక్షు స్తనూజుండు చాక్షుషుం డను వీరుఁ డాఱవమను వయ్యె నవనినాథ!
భూమీశ్వరులు పురుః పురుష సుద్యుమ్నాదు లాతని నందను లమరవిభుఁడు
మంత్రద్యుమాఖ్యుఁ డమర్త్య *లాప్యాదికు [1]లా హవిష్మ ద్వీరకాది ఘనులు
మునులందు విభుఁడు [2]సంభూతికి వైరాజునకుఁ బుట్టి యజితుండు నాఁగ నొప్పె

ఆ. నతఁడ కాఁడె కూర్మ మై మందరాద్రిని
నుదధిజలములోన నుండి మోసె
నతఁడు సువ్వె దివిజు లర్థింప నమృతాబ్ధిఁ
ద్రచ్చి యిచ్చె నా సుధారసంబు. 141

వ. అని పలికినం, బరీక్షిన్నరేంద్రుండు మునీంద్రున కి ట్లనియె. 142

మ. విను ము న్నేటికిఁ ద్రచ్చె పాలకడలిన్ విష్ణుండు కూర్మాకృతిన్
వనధిం జొచ్చి య దెట్లు మోసెఁ బలు కవ్వం బైన శైలంబు దే
వనికాయం బమృతంబు నెట్లు వడసెన్ వారాశి నేమేమి సం
జనితం బయ్యె మునీంద్ర! చోద్యము గదా సర్వంబుఁ జెప్పంగదే. 143

క. అప్పటనుండి బుధోత్తమ!, చెప్పెదు భగవ త్కథావిశేషంబులు నా
కెప్పుఁడు దనివి జనింపదు, సెప్పఁగదే చెవులు నిండ [3]శ్రీహరికథలన్. 144

వ. అని మఱియు నడుగంబడినవాఁ డై యతని నభినందించి, హరిప్రసంగంబు చెప్ప
నుపక్రమించె. అని సూతుండు ద్విజుల కి ట్లనియె. అట్లు శుకుండు రాజుం జూచి.

---

* "ఆప్యాదికు" లనియే అన్ని ప్రతులలోను పాఠము. "దేవా ఆప్యాదయోగణాః" అని మూలము (5-8) 1. లాహవవృష భీకరాదిఘనులు (హ.) 2. సంభూతికి నాత్మజుం, డై పుట్టి యజితుండు నాఁగ నొప్పె (హ.) 3. శ్రీపతికృతముల్ (ట.)

క. కసిమసఁగి యసురవిసరము, లసిలతికల సురల నెగువ నసువులు వెడలం
[1]జసచెడిరి పడిరి కెడసిరి, యసమ సమరవిలసనముల ననువెడలి నృపా! 146

క. సురపతి వరుణాదులతో, [2]సురముఖ్యులు కొంద ఱరిగి సురశైలముపై
సురనుతుఁ డగు [3]నజుఁ గని యా,సురదుష్కృతిఁ జెప్పి రపుడు సొలయుచు నతులై.

క. దుర్వాసుశాపవశమున, నిర్వీర్యత జగములెల్ల నిశ్శ్రీకము లై
పర్వతరిపుతోఁ గూడ [4]న,పర్వము లై యుండె హత సుపర్వావళు లై. 148

ఆ. నెలవు వెడలియున్న నిస్తేజు లైనట్టి
వేల్పుగములఁ జూచి వేల్పుపెద్ద
పరమపురుషుఁ దలఁచి ప్రణతుఁ డై [5]సంఫుల్ల
పద్మ వదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ. 149

క. ఏనును మీరును గాలము, [6]మానవ తిర్య గ్లతా ద్రుమ స్వేదజముల్
మానుగ నెవ్వని కళలము, వానికి మ్రొక్కెదము గాక వగవఁగ నేలా? 150

క. *ఆద్యుండు రక్షకుండు న, సాధ్యుఁడు మాన్యుండు లోక సర్గ త్రాణాం
తాద్యాదు లొనర్చు నతం, డాద్యంత విధానములకు నర్హుఁడు మనకుఙ్. 151

క. వరదునిఁ బరము జగద్గురుఁ, గరుణాపరతంత్రు మనము గనుఁగొన దుఃఖ
జ్వరములు చెడు నని సురలకు, [7]సరసిజజని చెప్పి యజితు సదనంబునకుఙ్. 152

వ. తానును, దేవతాసమూహంబును నతిరయంబునఁ జని, గానంబడని య వ్విభు నుద్దేశించి, దైవికంబు లగు వచనంబుల నియతేంద్రియుఁ డై యి ట్లని స్తుతియించె. 153

సీ. ఎవ్వని మాయకు నింతయు మోహించుఁ దఱిమి యెవ్వనిమాయ దాఁటరాదు
తనమాయ నెవ్వఁ డింతయును గెల్చినవాఁడు నెవ్వనిఁ బొడగాన రెట్టిమునులు
సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు చరియించుఁ దనచేత జనిత మైన
ధరణి పాదములు చిత్తము సోముఁ డగ్ని [8]ముఖంబును గన్నులు కమలహితులు

---

1. బసఁజెడిరి (హ. తం. వా.) 2. సురమునులుం గొలువఁ గదలి (హ.) 3. నజుఁగాంచిరి, సురదుష్కృతిఁ జెప్పిరపుడు (హ.) 4. సపర్వతమైయుండె (హ.) 5. సంమల్ల (హ) 6. మానవ తిర్యఙ్నరద్రుమ (హ)

* వధ్యుండు రక్షణీయుఁడు, సాధ్యుఁడు మాన్యుఁడని లేక సర్గ త్రాణా
వధ్యాదు లొనర్చు నతం, డాద్యంత విధానమునకు నర్హుఁడు మనకున్. (తం. వా.)

7. పరగఁగఁ బద్మజుఁడు సెప్పి పరమ ప్రీతిన్ (హ)

8. ముఖంబు గన్నులు సోమ కమల హితులు (తం. వా.); "యచ్చక్షురాసీత్తరణిః" అని మూలము (5-36)

తే. చెవులు దిక్కులు రేతంబు సిద్ధజలము
మూఁడుమూర్తుల పుట్టిల్లు మొదలి నెలవు
గర్భ మఖిలంబు మూర్ధంబు గగన మగుచు
మలయు నెవ్వని వాని నమస్కరింతు. 154

వ. మఱియు, నెవ్వని బలంబున మహేంద్రుండును, ప్రసాదంబున దేవతలును, గోపంబున రుద్రుండును, పౌరుషంబున విరించియు, నింద్రియంబులవలన వేదంబులును మునులును, మేఢ్రంబునఁ బ్రజాపతియు, వక్షంబున లక్ష్మియు, ఛాయవలనఁ బితృదేవతలును, స్తనంబులవలన ధర్మంబును, పృష్ఠంబువలన నధర్మంబును, శిరంబువలన నాకంబును, [1]విహాసంబువలన నప్సరోజనంబులును, గుహ్యంబువలన బ్రహ్మంబును, ముఖంబువలన విప్రులును, భుజంబులవలన రాజులును (బలంబును) నూరువులవలన వైశ్యులును (నైపుణ్యంబును) పదంబులవలన శూద్రులును, (అవేదంబును) అధరంబువలన లోభంబును, [2]నుపరి రదచ్ఛదంబువలనఁ బ్రీతియు, నాసాపుటంబువలన [3]ద్యుతియు, స్పర్శంబునఁ గామంబును, భ్రూయుగళంబున యమంబును, పక్ష్మంబునఁ గాలంబును సంభవించె, నెవ్వని [4]యోగమాయా విహితంబులు ద్రవ్య వయః కర్మ గుణ విశేషంబులు, చతుర్విధ భూత సర్గం బెవ్వని యాత్మతంత్రంబు, నెవ్వని వలన సిద్ధించి, లోకంబులును లోకపాలురుం బ్రతుకుచుందురు, పెరుఁగుచుందురు, దివిజులకు నాయువు బలంబు నై, జగంబులకు నీశుం డై, పరమ మహాభూతి యగు న ప్పరమేశ్వరుండు మాకుం బ్రసన్నుండు గాక! అని మఱియును. 155

క. మొదల జల మిడిన భూజము, దుది నడుమను జల్లఁదనము దొరఁకొను మాడ్కిన్
మొదలను హరికిని మ్రొక్కిన, ముద మందుదు మెల్ల వేల్పుమూఁకలు నేమున్.

క. ఆపన్ను లగు దిదృక్షుల, కో పుణ్యా! భవన్ముఖాబ్జ మొయ్యన [5]తఱితోఁ
బ్రాపింపఁ జేయు సంపద, నో పరమదయానివాస! యుజ్జ్వలతేజా! 157

## అధ్యాయము - ౬

వ. అని యిట్లు దేవగణసమేతుం డై యనేకవిధంబులఁ గీర్తింపుచున్న పరమేష్ఠి యందుఁ గరుణించి, దయాగరిష్ఠుం డగు విశ్వగర్భుం డావిర్భవించె. 158

మ. ఒక వేయర్కులు గూడి గట్టికరు వై యుద్యత్ప్రభాభూతితో
నొకరూ పై చనుదెంచుమాడ్కి హరి దా నొప్పారె; నావేలుపుల్
వికలాలోకను లై, విషణ్ణమతు లై, విభ్రాంతు లై మ్రోలఁ గా
నక శంకించిరి కొంతప్రొద్దు; విభుఁ గానం బోలునే వారికిన్. 159

1. విహారంబు వలన(హ); "అప్సరసోపి హాసాత్" (మూ. 6-40) 2. సుపర్వరంధ్రంబు వలన (హ) 3. ధృతియు (హ) 4. యోగమాయా నిర్జితంబులు (హ); "యద్యోగమాయా విహితాన్ వదంతి (5 - 43) 5. తనితో (హ) 6. కదుపై (హ)

వ. అప్పుడు. 160

సీ. హార కిరీట కేయూర కుండల పాదకటక కాంచన రత్న కంకణాది
కౌస్తుభోపేతంబుఁ గౌమోదకీ శంఖ చక్ర శరాసన సంయుతంబు
మరకతశ్యామంబు సరసిజనేత్రంబు కర్ణాభరణ కాంతి గండయుగము
కలిత కాంచనవర్ణ కౌశేయవస్త్రంబు శ్రీ వనమాలికా సేవితంబు

ఆ. నై మనోహరంబు నై దివ్యసౌభాగ్య
మైన యతనిరూపు హర్ష మెసఁగఁ
జూచి [1]బ్రహ్మ హరుడు సురలును దానును
బొంగి నమ్రు లగుచుఁ బొగడఁ దొడఁగె. 161

క. జనన స్థితి లయ దూరుని, మునినుతు నిర్వాణసుఖ సముద్రుని సుగుణుం
దనుతనునిఁ బృథులబృథులుని, ననఘుఁ డగు మహానుభావు నభినందింతున్.

క. పురుషోత్తమ ! నీరూపము, పరమశ్రేయంబు భువనపంక్తుల కెల్లన్
స్థిర వైదికయోగంబున, వరుసను మీయందుఁ గానవచ్చెను మాకున్. 163

క. మొదలును నీలోఁ దోఁచెను, దుదియు న్నటఁ దోఁచె నడుము దోఁచెను [2]నీవే
మొదలు నడుము దుది సృష్టికిఁ, గదియఁగ ఘటమునకు మన్ను గతి యగు
మాడ్కిన్. 164

క. నీ మాయచేత విశ్వము, వేమాఱు సృజింతు వనుచు విష్ణుఁడ వనుచున్
ధీమంతులు గుణపదవిని, నేమంబున సగుణుఁ డైన నినుఁ గాంతు రొగిన్. 165

ఆ. అన్న మవని యందు నమృతంబు గోవుల
యందు వహ్ని సమిధలందు [3]నరులు
యోగవశతఁ బొందు నోజను బుద్ధిచే
నగుణు నిన్నుఁ గాంతు [4]రాత్మవిదులు. 166

మత్తకోకిల. పట్టులేక బహుప్రకార విపన్నచిత్తుల మైతి మే
మెట్టకేలకు నిన్నుఁ గంటి [5]మభీప్సితార్థము వచ్చెఁ బెం
వెట్ట యైన దవానలంబున వేఁగు నేనుఁగు మొత్తముల్
[6]నిట్ట లేచిన గంగలోపల నీరు గాంచిన చాడ్పునన్. 167

---

1. బ్రహ్మేంద్రాది సురలును (హ) 2. నాపై (హ) 3. నమరు (హ) 4. రధిక గుణులు (హ) 5. అభీప్సితార్థము వచ్చు (హ. వా.) అభీప్సితార్థమ వంచు (తం) 6. నిట్టవేర్చిన (వా)

మ_త్తకోకిల. నీకు నేమని విన్నవింతుము నీవు సర్వమయుండ వై
లోక మెల్లను నిండి యుండఁగ లోకలోచన! నీ పదా
లోకనంబు శుభంబు మాకును లోకపాలకు లేను నీ
నాకవాసులు నీవ వహ్నిఁ దనర్చు [1]కేతు తతిక్రియన్. 168

వ. అని కమలసంభవ ప్రముఖులు వినుతిచేసిరి. అని చెప్పిన నరేంద్రునకు శుకుం డి ట్లనియె. 169

శా. ఈ రీతిం జతురాననాది నుతుఁ డై యేపార జీమూతగం
భీరం బైన రవంబునం బలికె సంప్రీతాత్ముఁ డై యీశ్వరుం
డా రోమాంచిత కాయుల న్నవ విముక్తాపాయులన్ [2]శ్రేయులం
బ్రారబ్ధోగ్ర మహార్ణవోన్మథన వాం ఛానల్పులన్ వేల్పులన్. 170

క. ఓ నలువ! యో సురేశ్వర!, యో నిటలతటాక్ష! యో సురో త్తములారా!
దానవులతోడ నిప్పుడు, మానుగఁ బోరామి గలిగి మనుటే యొప్పున్. 171

వ. అది యె ట్లంటి రేని. 172

క. ఎప్పుడు దనకును స త్త్వము, చొప్పడు నందాఁక రిపులఁ జూచియుఁ దన మైఁ
గప్పికొని యుండవలయు, న్నొప్పుగ నహి మూషకమున కొదిఁగిన భంగిన్.

క. అమృతోత్పాదన యత్నము, [3]విమలమతిం జేయుటొప్పు వేల్పులు వినుఁడీ
యమృతంబుఁ ద్రావి జంతువు, లమృతగతిం [4]బ్రతుకుచుండు నాయుర్వృద్ధిన్.

సీ. పాలమున్నీటిలోపల సర్వతృణ లతౌ షధములు దెప్పించి చాల వైచి
మందరశై లంబు మంథానముగఁ జేసి తనర వాసుకిఁ దరిత్రాడు సేసి
[5]నా సహాయంబున నలి నందఱును మీరు తరువుఁడు వేగ నతంద్రు లగుచు
ఫలము మీ దయ్యెడు బహుళదుఃఖంబులఁ బడుదురు దైత్యులు పాపమతులు

ఆ. [6]అలసటయును లేక యఖిలార్థములు గల్గు
విషధిలోన నొక్క విషము పుట్టుఁ
[7]గలఁగి వెఱవ వలదు [8]కామరోషంబులు
వస్తుచయమునందు [9]వలదు చేయ. 175

---

1. లాతితతిక్రియన్ (హా) 2. శ్రేయులన్ (తం. వా.)
3. విశదమతిం (హా); విమృష్టమతిఁ జేయుటొప్పు (తం) 4. బ్రదుకుచుండు రాయుర్వృద్ధిన్ (హా) 5. నాసహాయంబున నెలమి నందఱు (హా) నాసహాయతచేత (వా.) 6. అలసటేమిలేక (తం. వా.) 7. గడఁగి చెఱుపలేవు (హా) 8. కామదోషంబులు (హా) 9. వలయుఁ జేయ (హా)

వ. అని యుపదేశించి. 176

క. అంతాదిరహితుఁ డచ్యుతుఁ, డంతర్ధానంబు నొందె నజ ఫాలాక్షుల్
సంతోషంబునఁ దమ తమ, కాంతాలయములకుఁ జనిరి గౌరవ మొప్పన్. 177

క. కయ్యంబు సేయ నొల్లక, నెయ్యంబున నతులు వెట్టి నిర్జరనికరం
బి య్యాపనములు వెట్టుచుఁ, దియ్యంబునఁ గొల్చె బలిని దేవద్వేషిన్. 178

క. పస చెడి తనకును వశ మై, సుసరముతోఁ గొల్చుచున్న సురసంఘములన్
గసిమసఁగి చంపఁ బూనిన, నసురుల వారించె బలియు నతి నయయుక్తిన్. 179

వ. అట్లు వారించి, వైరోచని రాక్షససముదయంబున కి ట్లనియె. 180

క. పగవారు శరణుచొచ్చిన, మగతనములు నెఱపఁ దగదు మగవారలకున్
దగు సమయ మెఱుఁగవలదే, మగఁటిమి పాటింపవల దమర్త్యులతోడన్. 181

వ. అని పలికి, కొలువుకూటంబున [1]నసురనికర పరివృతుం డై, నిఖిలలోక రాజ్య లక్ష్మీసహితుం డై, యఖిల విబుధ వీర విజ యాహంకార నిజాలంకారుం డై, సుఖంబునఁ గొలువున్న విరోచన నందనుం గని, శచీవిభుం డుత్తమ సచివుం డునుం బోలె సాంత్వవచనంబుల శాంతిం బొందించి, పురుషోత్తమ శిక్షితం బైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు సెప్పి, యరిష్టనేమి ననునయించి, త్రిపురవాసు లగు దానవుల నొడంబఱిచి, జంభుని సమ్మతంబు చేసికొని, హాయ గ్రీవుని [2]విగ్రహంబు మాన్చి, నముచి తారక బాణాదులతో సఖ్యంబు నెఱపి, [3]విప్రచిత్తికిఁ బొత్తు హత్తించి, శకుని విరోచన [4]ప్రహేతులకుఁ బోరామి సూపి, మయ మాలి సుమాలి ప్రముఖులకు మైత్రి యెఱింగించి, [5]కుంభ నికుంభులకు సౌజన్యంబు గైకొలిపి, పౌలోమ కాలకేయ నివాత కవచాదుల యెడ బాంధవంబు ప్రకటించి, వజ్రదంష్ట్రికి [6]వశుం డై, యితర దానవ దైత్య సమూహంబువలన నతిస్నేహంబు సంపాదించి, మనకు నక్కచెలియండ్ర బిడ్డలకు నొడ్డారంబు లేమిటికి? ఏకకార్య పరత్వంబున నడ్డంబు లేక బ్రతుకుదము. అన్యోన్య విరోధంబు లేల ? తొల్లి యన్యోన్య విరోధంబున నలంగితిమి. ఇదిమొదలు దనుజ దివిజ సముదయంబులకు రాజు విరోచననందనుండ. మనమందఱ మతనిపంపు సేయంగలవారము. ఉభయకులంబును వర్ధిల్లునట్టి యుపాయం బెఱింగింతు. అని యమృతజలధి మథనప్రారంభ కథనంబు దెలియం జెప్పి, అట్లు సురాసుర యూథం

---

1. సురనికర పరివృతుండై (హ. తం. వా.)

2. నిగ్రహంబు (క) 3. విప్రజిత్తునకు (హ) 4. హేతిప్రహేతులకు (చ) 5. కుంభ నికుంభులకు (చ) 6. నశక్తుండై (హ)

బులు బలారాతి బలి ప్రముఖులై, పరమోద్యోగంబున సుధా సంపాదనా
యత్తచిత్తులై, సఖ్యంబు నొంది, మందగమనంబున మందరనగంబునకుం జని.

సీ. వాసవు [1]వర్ధకి వాఁడిగాఁ జఱచిన కుద్దాలముఖములఁ గొంత ద్రవ్వి
ముసలాగ్రములు సొన్పి మొదలిపాఁ తగలించి దీర్ఘపాశంబులఁ దిండుసుట్టి
పెకలించి బాహులఁ బీడించి కదలించి పెల్లార్చి తమ తమ పేరు వాడి
పెఱికి మీఁదికి నెత్తి పృథుల హస్తంబులఁ దలల భుజంబులఁ దరలకుండ

తే. నాని మెల్లన కుఱుతప్పు టడుగు లిడుచు
భార మధికంబు [2]మఱవకఁ బట్టుఁ డనుచు
మందరనగంబుఁ దెచ్చి రమందగతిని
దేవదైత్యులు జలరాశి తెరువు పట్టి. 183

క. మందరము మోవ నోపమి, నందఱిపైఁ బడియె నదియు నతిచోద్యముగాఁ
గొందఱు నేలం గలసిరి, కొందఱు నుగ్గైరి చనిరి కొందఱు భీతిన్. 184

క. ఏలా హరికడ కేఁగితి, మేలా దొరఁకొంటి మధికహేలన శైలో
న్మూలనము చేసి తెచ్చితి, మేలా పెక్కండ్రు మడిసి రేలా నడుమన్. 185

క. ఏటికి మముఁ బనిపంచె, [3]న్నేటికి మనబోఁటివారి కింతలుపను లిం
కేటికి రాఁడు [4]రమేశ్వరుఁ, డేటి కుపేక్షించె మఱవ నేటికి మనలన్. 186

వ. అని కులకుధర పతనజన్యం బగు వేదన సహింపనోపక, పలవించుచున్న దివిజ
దితిజుల భయంబు మనంబున నెఱింగి, సకలవ్యాపకుం డగు హరి తత్సమీపంబున.

మ. గరుడారోహకుఁడై గదాది ధరుఁడై కారుణ్య సంయుక్తుఁడై
హరికోటి ప్రభతో [5]నోహో వెఱకుఁడీ యంచుం బ్రదీపించి త
[5]ద్గిరిఁ గేల న్నొవకుండఁ గందుకము మాడ్కిన్ బెట్టెఁ బక్షీంద్రుపైఁ
గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థింపుచున్. 188

క. వారలు గొలువఁగ హరియును, [6]వారిధి దరి కరుగు మన్నఁగ వసుధాధరమున్
వారిజనయనునిఁ గొంచు న, వారితగతిఁ జనియె విహగవల్లభుఁ డఱుతన్.

క. చని జలరాశి తటంబున, వనజాక్షుని గిరిని డించి వందనములు స
ద్వినతులు సేసి ఖగేంద్రుఁడు, [8]పనివినియెను భక్తి నాత్మభవనంబునకున్. 190

వ. అప్పుడు. 191

---

1. వర్ధికి(హా) 2.పట్టుడి పట్టు డనుచు(చ)3.ఏటికిఁ దగుబోటి వారి కింతలు(హా) 4.మహేశ్వరు(హా)
5. గిరికేలన్నవకుండ కందుకము మాడ్కిం బట్టి క్రీడించుచున్ (తం.వా.);"గిరిం చారోప్య గరుడే హస్తే
నైకేన లీలయా"(8-38) 6. వారధిదరికడకు నేఁగె(హా)7.డుఱుకన్ (హా) 8.పనివినియెన్నాత్మభక్తి(హా)

## అధ్యాయము – ౮

సీ. భూనాథ! వినవయ్య భోగీంద్రు వాసుకిఁ బిలిపించి యతనికిఁ బ్రియము సెప్పి
ఫలభాగ మీ నొడఁబడి సమ్మతునిఁ జేసి మెల్లనఁ జేతుల మేను నిమిరి
నీవ కా కెవ్వరు నేర్తు రీ పని కియ్య కొమ్మని యతనిఁ గై కోలు వడసి
కవ్వంపుఁగొండ నిష్కంటకంబుగఁ జేసి [1]ఘుర్షించి యతని భోగంబుఁ జుట్టి

ఆ. కడఁగి యమృతజలధిఁ గలశంబుఁ గావించి
త్రచ్చు [2]న చ్ఛలమునఁ దలఁపు లమర
బద్ధ వస్త్ర కేశ భారు లై యా రెండు
గములవారు తరువఁ గదిసి రచట. 192

వ. తదనంతరంబ. 193

క. హరియును దేవానీకము, సురగేంద్రుని తలలు పట్ట నుద్యోగింపన్
హరిమాయా పరవశు లై, సురవిమతులు గూడి పలుకఁజొచ్చిరి కడిమిన్.

మత్తకోకిల. స్వచ్ఛ మైన ఫణంబు మీరలు చక్కఁ బట్టి మథింపఁగాఁ
బుచ్ఛ మేటికి మాకుఁ బట్టఁగఁ బూరుషత్వము గల్గి మే
మచ్ఛమైన తపో బలాఢ్యయ నాన్వయంబుల వార మై
యిచ్ఛయింతు మె తుచ్ఛవృత్తికి [3]నిండు మాకు ఫణాగ్రముల్. 195

వ. అని పలుకు దనుజులం జూచి. 196

క. విస్మయముఁ బొంది దానవ, ఘస్మరుఁ డహిఫణము విడువఁ గై కొని యసురుల్
విస్మితముఖు లై యార్చి [4]ర, విస్మేరతఁ గొనిరి సురలు వీఁకన్ దోఁకన్. 197

వ. ఇట్లు సమాకర్షణ స్థాన భాగ నిర్ణయంబు లేర్పఱుచుకొని, దేవతలు పుచ్ఛంబును, పూర్వదేవతలు ఫణంబులం బట్టి, పయోరాశిమధ్యంబునం బర్వతంబు వెట్టి, పరమాయత్త చిత్తు లై, యమృతార్థంబు ద్రచ్చుచున్న సమయంబున. 198

క. విడు విడుఁ డని ఫణి పలుకఁగఁ,గడు భరమున మొదలఁగుదురు [5]గలుగమి వెడఁగై
బుడబుడ రవమున నఖిలము, వడవడ వణఁకఁగ మహాద్రి వనధి మునిఁగెన్. 199

ఉ. గౌరవ మైన భారమునఁ గవ్వపుఁగొండ [6]ధరింపలేక దో
స్సారవిహీను లై యుభయసైనికులున్ గడు సిగ్గుతో నకూ
పారతటంబునం బడిరి పౌరుషముం జెడి పాండవేయ! యె
వ్వారికి నేరఁబోలు బలవంతపు దైవము నాక్రమింపఁగన్. 200

---

1. గర్జించు నతని(హ) 2. నవసరమున(హ) 3. నీడు(హ.) 4. య, విస్మితముగఁ గొలువ మేటి (హ)య, విస్మరతి (ట.) 5. గలగమి (హ) 6. ధరింప (చ.)

క. వననిధి జలములలోపల, మునిఁగెడి గిరిఁ జూచి దుఃఖమునఁ జింతాబ్ధిన్
మునిఁగెడి వేల్పులఁ గనుఁగొని, వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు సూడన్.

—: కూర్మావతార కథా ప్రారంభము :—

సీ. సవరనై లక్షయోజనముల వెడలుపై కడుఁ గఠోరంబైన కర్పరమున
నదనైన బ్రహ్మాండమైన నాహారించు ఘనతరంబగు ముఖగహ్వరంబు
సకల చరాచర జంతురాసుల నెల్ల మ్రింగి లోఁగొనునట్టి మేటి కడుపు
విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁబడ్డ నాఁగినఁ గదలనియట్టి కాళ్ళు

తే. వెలికి లోనికిఁ జనుదెంచు విపులతుండ
మంబుజంబులఁ బోలెడి యక్షియుగము
[1]సుందరంబుగ విష్ణుండు సురలతోడి
కూర్మి చెలువొంద నొకమహాకూర్మ మయ్యె. 202

మ. కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘు ముక్తాశుక్తి చందంబునన్
నమదద్రీంద్రము [2]నెత్తె వాసుకి మహానాగంబుతో లీలతో
నమరేంద్రాదులు మౌళికంపములతో నౌ నౌఁ గదే బాపురే
కమలాక్షా! [3]శరణంచు భూ దిశలు నాకాశంబునున్ మ్రోయఁగాన్. 203

వ. ఇవ్విధంబున. 204

క. తరిగాండ్రలోన నొకఁడఁట, తరికడవకుఁ గుదురు [4]నాఁక త్రాడును జేరుల్
దరిగవ్వంబును దానఁట, హరి హరి హరి చిత్రలీల హరియే యెఱుఁగున్. 205

ఆ. జలధిఁ గడవసేయ శైలంబు కవ్వంబు
సేయ భోగిఁ ద్రాడుసేయఁ దరువ
సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడు దక్క
నొరుఁడు శక్తిమంతుఁ డొకఁడు గలఁడె. 206

ఆ. గొల్లవారి బ్రతుకు గొఱఁతన వచ్చునే
గొల్లరీతిఁ బాలకుప్పఁ దచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు
చేటులేనిమందు సిరియుఁ గనిరి. 207

వ. ఇట్లు సురాసురయూథంబులు హరిసనాథంబులై, కవచంబులు నెట్టంబులు వెట్టికొని, పుట్టంబులు పిరిచుట్లు చుట్టుకొని, కరంబులు గరంబుల నప్పళించుచు,

1. సుందరంబగు (హ.) 2. నెత్తి (హ.) 3. శరణంబు (హ.) 4. ఆఁకత్రాడఁట చేతుల్ (హ.)

భుజంబులు భుజంబులు నొఱయుచు, లెండు లెండు [1]దరువం దొడంగుఁడు రం
డని, యమందగతిఁ బెరుఁగుఁ ద్రచ్చు మందగొల్లల చందంబున, మహార్ణవ
మధ్యంబున మంథాయమాన మందరమహీధర విలగ్న భోగిభో గాద్యంతంబులం
గరంబులం దెమల్చుచుఁ, బెను బొబ్బలం బ్రహ్మాండకటాహంబు నిర్భరం బై
గుబ్బుగు బ్బని [2]యురలఁ, గొండ కవ్వంబుగు త్తి జిఱజిఱం దిరుగు వేగంబున,
ఛటచ్ఛటాయమానంబు లై భుగులు భుగు ళ్ళను చప్పుళ్ళ నుప్పరం బెగసి,
లెక్కకు మిక్కిలి చుక్కల కొమ్మల చెక్కుల నిక్కలువడు మిసిమిగల మీఁది
మీఁగడపాల తేటనిగ్గు తుంపరల పరంపరలవలన నిజకర క్రమక్ర మాకర్షణ పరి
భ్రాంత ఫణి ఫణాగర్భ సముద్భూత నిర్భర విషకీలి కీలజాలంబు లప్పటప్పటికి
నుప్పతిల్లిన, దప్పినొందక, మందగతిం జెందక, య కూపార వేలా తటకుటజ
కుసుమ[3]గుచ్ఛ పుచ్ఛ పిచ్ఛిల స్వచ్ఛమకరంద సుగంధి గంధవ హావహానంబునం
గ్రొంజెమట [4]పిచ్ఛిల పెను వఱదగము లొడళ్ళ నిగుర, నొండొరులం బరిహ
సించుచుఁ, బేరువాడి విలసించుచు, మేలు మే లని యగ్గించుచుఁ, గాదు కా దని
భంగించుచు, నిచ్చ మెచ్చని మచ్చరంబులవలన వనధివలమాన వై శాఖ వసుంధ
రాధర [5]పరివ ర్తన సంజనిత ఘుమఘుమా రావంబును, మథనగుణాయమాన
మహాహీంద్రప్రముఖ ముహుర్ముహు రుచ్చలిత భూరి ఘోర ఫూత్కార
ఘోషంబును, గులకుధర పరిక్షేపణ క్షోభిత సముల్లంఘన సమాకులితంబు లై,
[6]వెఱచఱచి, గుబురుగుబురు లై యొరలు కమఠ కర్కట కాకోదర మకర
తిమి తిమింగిల మరాళ చక్రవాక బలాహక భేక సారసానీకంబుల మొఱలు
నుం గూడికొని ముప్పిరిగొని, దనుజ దివిజ భటాట్టహాస తర్జన గర్జన ధ్వనుల
నలుపురి యై మొ త్తి నఱెన, దశదిగంత భిత్తులును బేడె త్తి పెల్లగిల్లం ద్రుళ్ళుచుఁ
గికురు పొడుచుచు, నొకని కొకనికంటె వడియునుం, [7]దడవునుం గలుగఁ
ద్రచ్చుచుఁ, బంతంబు లిచ్చుచు, సుధాజననంబుఁ జింతింపుచు, నూతన పదార్థంబు
లకు నెదుళ్ళు సూచుచు, నెంత తడవు ద్ర త్త మని హారి నడుగుచు, నెడపడని
తమకంబుల నంతకంతకు మురువు డింపక త్రచ్చు సమయంబున. 208

క. అ ప్పాలవెల్లి లోపల, న ప్పటి కప్పటికి మందరాగము తిరుగం
జప్పుడు నిండె నజాండము, చెప్పెడిదే మజుని చెవులు చిందఱఁ గొనియెన్. 209

వ. అంత న ప్పయోరాశి మధ్యంబున. 210

---

1. దరవం దొడంగు రండని (హ.) 2. యురులు (హ) 3. గుచ్ఛపుచ్ఛ స్వచ్ఛ (హ).
4. పిట్టిలి (హ.) 5. ప్రవ ర్తన (హ) 6. వెఱచి చెఱచి (హ) 7. గడపునుంగలుగ (తం. వా.)

క. ఎడమఁ గుడి మునుపు దిరుగుచుఁ, గుడి నెడమను వెనుకఁ దిరుగు కులగిరి కడలిన్
గడ వెడల సురలు నసురులు, దొడితొడి ఫణిఫణము మొదలుఁ దుదియును దిగువన్.

క. వడిగొని కులగిరిఁ [1]దరువఁగ, జడనిధి ఖగ మకర కమఠ ఝష ఫణి గణముల్
సుడివడుఁ దడఁబడుఁ గెలఁకులఁ, బడు భయపడి నెగసి బయలఁబడు నురలిపడున్.

క. అమరాసుర కరవిపరి, భ్రమణ ధరాధరవరేంద్ర [2]భ్రమణంబును దాఁ
గమఠేంద్రుఁ వీఁపు తీఁటను, శమియింపఁగఁ జాల దయ్యె జగతీనాథా! 213

వ. త దనంతరంబ. 214

క. [3]*ఆలోల జలధిలోపల, నాలో నహి విడిచి సురలు నసురులు బఱవం
గీలా కోలాహాల మై, హాలాహలవిషము పుట్టె నవనీనాథా! 215

వ. అదియునుం, బ్రళయకాలాఖిల ఫాలలోచను లోచనానలశతంబు చందంబున నమందం బై, విలయదహన సహస్రంబు కై వడి వడి యై, కడపటి పట్టపగటింటి వెలుంగుల లక్ష తెఱంగున దుర్లక్షితం బై, తుదిరేయి వెలింగిన మొగులు గములవలనం బడు బలుపిడుగుల వడువున బెడిదం బై, పంచభూతంబులుం దేజోరూపంబు లైన చాడ్పున దుస్సహం బై, భుగభుగాయమానంబు లైన పొగలును, చిటచిటాయ మానంబు లైన విస్ఫులింగంబులును, ధగద్ధగాయ మానంబు లైన నెఱమంటలుం గలిగి, మహార్ణవ మధ్యంబున మందరనగం బమం దరంబుగం దిరుగు నెడ జనియించి, పెటపెటాయమానం బై, నింగికిం బొంగి, దిశలకుం గేలుసాఁచి, బయళ్ళు ప్రబ్బికొని, తరిగవ్వంపుఁ గొండ నండ గొనక, నలుగడలకుం బఱచి, దరుల కుఱికి, సురాసుర సముదయంబులం దరికొని, గిరి వర గుహాగహ్వరంబుల సుడివడక, కులశిఖరి శిఖరంబుల నెరగలి వడి, గహనం బులు దహించి, కుంజ మంజరీపుంజంబుల భస్మంబుచేసి, జనపదంబు లేర్చి, నదీ నదంబు లెరియించి, దిక్కుంభి కుంభంబులు నిక్కలువడ నిక్కి, తరణి తారామండ లంబులపై మిట్టించి, మహర్లోకంబు దరికొని, యుపరి లోకంబునకు మాఱు గొన లిడి, సుడివడి, ముసరుకొని, బ్రహ్మాండగోళంబు చిటిలిపడం దాఁటి, పాతాళాది లోకంబులకు వ్రేళ్ళువాఱి, సర్వాధికం బై శక్యంబుగాక, యెక్కడఁ జూచినం దాన యై, కురంగంబుక్రియం గ్రేళ్ళుఱుకుచు, భుజంగంబువిధంబున

1. దిరుగగ (డ.) 2. బంభ్రమణముదా (తం.): "భ్రిభ్రత్తదా వర్తనమాది కచ్ఛపో మేనేంగ కండూయన మప్రమేయః" (7-10) 3. ఆలోన (హ.)

* గౌతమీ గ్రంథాలయ ప్రతిలోను, ద. బ. ప్రతులలోను ఈ క్రింది పద్యమున్నది.
"కమఠము కర్పరమునగిరి, భ్రమణంబున బొడమి అగ్ని బాడపకణముల్
క్రమముగ సర్వవిషాగ్నిని, నమరంగా కాలకూట మంబుధి బొడమెన్."

నొడియుచు, సింగంబుభంగి లంఘింపుచు, విహంగంబు పగిది నెగయుచు, మాతంగంబు పోలిక నిలువంబడుచు, నిట్లు హాలాహల దహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున, [1]మెలకు సెగల మిడుకం జాలక నీ లైన దేవతలును, నేలంగూలిన రక్కసులును, డుల్లిన తారకంబులును, గీటణం గిన కిన్నర మిథునంబులును, గమలిన గంధర్వ విమానంబులును, జీకాకువడ్డ సిద్ధచయంబులును, జిక్కువడిన గ్రహంబులును, [2]జిందఱవందఱ లైన వర్ణాశ్రమం బులును, నిగిరిపోయిన నదులును, నింకిన సముద్రంబులును, గాలిన కాననంబు లును, బొగిలిన పురంబులును, బొనుంగువడిన పురుషులును, బొక్కిపడిన పుణ్యాం గనా జనంబులును, బగిలి పడిన పర్వతంబులును, భస్మంబు లైన ప్రాణిసంఘం బులును, వేఁగిన లోకంబులును, వివశ లైన దిశలును, నొడ్డగెడవు లైన భూజ చయంబులును, నఱవఱ లైన భూములును నై యకాల విలయకాలం బై తోఁచుచున్న సమయంబున. 216

క. ఒడ్డారించి విషంబున, కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిఁ
[4]గొడ్డేటి ప్రమంది రా లన, [3]బి డ్డన నెడలేక జనులు పృథ్వీనాథా! † 217

వ. అప్పుడు. 218

మ. చని కైలాసముఁ జొచ్చి శంకరు నివాసద్వారముం జేరి [5]యీా
సున దౌవారికు లడ్డపెట్టఁ దల మంచుం జొచ్చి కుయ్యో మొఱో
విను మాలింపుము చిత్తగింపుము దయన్ వీక్షింపు మం చంబుజా
సన ముఖ్యుల్ గని రార్తరక్షణ కళాసంరంభునిన్ శంభునిన్. 219

క. వారలు దీనత వచ్చుటఁ, గూరిమితో నెఱిఁగి దక్షుకూఁతురుఁ దానున్
బేరోలగమున నుండి ద, యారతుఁ డై చంద్రచూడుఁ డవసర మిచ్చెన్. 220

వ. అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగ దండప్రణామంబులు గావించి, ప్రజాపతి ముఖ్యు లి ట్లని స్తుతియించిరి. 221

---

1. మెలంగమిడుకం జాలక (తం.) 2. వరుసతెడలిన (ట.)
3. గొడ్డేటి (తం. వా.) 4. బీడన నెడలేక (హ.)
† 217వ పద్యము క్రింద, తాళపత్ర ప్రతులలో నీ క్రింది పద్యము లున్నవి.
"మనుజుల కమృత మొసంగన్, జనితం బగు నంచు మదిని శంభుడు గోరన్
విను డాద్య ఫల మి దీశా,నున కర్పణ మనిరి హరి యనుమతిని సురలున్" (క.)
"మును జలనిధి నమృతము నం, జనితం బగు ననుచు తనకు శంభుడు గోరన్
విను డాద్యథవ మిదీశా, నున కర్పణమనిన హరియనుమతిన్ సురలున్." (డ)
5. యీశుని దవ్వారికు లడ్డపడ్డ (హ)

సీ. భూతాత్మ ! భూతేశ ! భూతభావనరూప ! దేవ ! మహాదేవ ! దేవవంద్య !
యీ లోకములకెల్ల నీశ్వరుండవు నీవ బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ
యార్తశరణ్యుండ వగు గురుండవు నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు
సకల సృష్టి స్థితి సంహార కర్త వై బ్రహ్మ విష్ణు శివాఖ్యఁ బరఁగు దీవు

ఆ. పరమగుహ్య మైన బ్రహ్మంబు సదస త్త
మంబు [1]నీవ శక్తిమయుఁడ వీవ
శబ్దయోని వీవ జగ దంతరాత్మవు
నీవ ప్రాణ మరయ నిఖిలమునకు. 222

క. నీయంద సంభవించును, నీయంద వసించి యుండు నిఖిలజగంబుల్
నీయంద లయముఁ బొందును, నీ యుదరము సర్వభూత నిలయము రుద్రా !

సీ. అగ్ని ముఖంబు, పరాపరాత్మక మాత్మ, కాలంబు గతి, రత్నగర్భ పదము,
శ్వసనంబు నీయూర్పు, రసన జలేశుండు, దిశలు కర్ణంబులు, దివము నాభి,
సూర్యుండు గన్నులు, శుక్లంబు సలిలంబు, జఠరంబు [2]జలధులు, చదలు శిరము,
సర్వౌషధులు రోమచయములు, శల్యంబు లద్రులు, మానస మమృతకరుఁడు,

తే. ఛందములు ధాతువులు, ధర్మసమితి హృదయ,
మాస్యపంచక ముపనిష దాహ్వయంబు,
లైన నీరూపు పరతత్త్వ మై శివాఖ్య
మై స్వయంజ్యోతి యై యొప్పు నాద్య మగుచు. 224

క. కొందఱు కలఁ డందురు నినుఁ, గొందఱు లేఁడందు రతఁడు గుణి గాఁ డనుచుం
గొందఱు కలఁ డని లేఁడని, కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా! 225

సీ. తలఁపఁ బ్రాణేంద్రియ ద్రవ్య గుణ స్వభా వుఁడవు, కాల క్రతువులును నీవ
సత్యంబు ధర్మ మక్షరము ఋతంబును [3]నీవ ముఖ్యుండవు నిఖిలమునకు
ఛందోమయుండవు సత్త్వ రజ స్తమ శ్చక్షుండ వై [4]యుందు సర్వరూప
కామపురాధ్వర కాలగరాది [5]భూతద్రోహిజయము చోద్యంబు గాదు

తే. లీల లోచనవహ్ని స్ఫులింగ శిఖల
నంతకాదులఁ గాల్చిన యట్టి నీకు
రాజఖండావతంస ! పురాణపురుష !
దీనరక్షక ! కరుణాత్మ ! దేవదేవ ! 226

---

1. నీశక్తి(హా.) 2. జలములు (హా.) 3. నీవగమ్యుండవు (జ.డ.ద.బ.) 4. యుండు(హా.తం.వా.)
5. భూతద్రోహభయము (హా. తం. వా.)

ఆ. మూఁడుమూర్తులకును మూఁడు లోకములకు
మూఁడు కాలములకు మూలమగుచు
[1]భేదమగుచు మది నభేద మై యొప్పారు
బ్రహ్మ మనఁగ నీవ ఫాలనయన! 227

క. స దస త్తత్త్వ చరాచర, సదనం బగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్
పెదవులు గదలుప వెఱతురు, వదలక నినుఁ బొగడ నెంతవారము దేవా! 228

మత్తకోకిల. బాహుశక్తి సురాసురుల్ సని పాలవెల్లి మథింప హా
లాహలంబు జనించె నేరి కలంఘ్య మై భువనంబు కో
లాహలంబుగఁ జేసి చిచ్చును [2]లాగముం గొని ప్రాణిసం
దోహముం బ్రతికింపవే దయ దొంగలింపఁగ నీశ్వరా! 229

క. లంపటము నివారింపను, సంపద కృపసేయ జయము సంపాదింపన్
జంపెడివారి వధింపను, సొంపారఁగ నీకె చెల్లు సోమార్ధధరా! 230

క. నీకంటె నొం డెఱుంగము, నీకంటెం బరులు గావనేరరు జగముల్
నీకంటె నొడయఁ డెవ్వఁడు, లోకంబుల కెల్ల నిఖిలలోకస్తుత్యా! 231

—: ఈశ్వరుండు దేవబృందప్రార్థితుం డై హాలాహలమును బానముచేయుట :—

వ. అని మఱియు నభినందింపుచున్న ప్రజాపతిముఖ్యులం గని, సకలభూత సముం డగు న ద్దేవుండు తన ప్రియసతి కి ట్లనియె. 232

క. కంటే జగముల దుఃఖము, వింటే జలజనిత విషమువేఁడిమి ప్రభు వై
యుంటకు నార్తుల యాపదఁ[3] గెంటించుట ఫలము దానఁ గీర్తి మృగాక్షీ! 233

క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన, ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లన్
బ్రాణుల కిత్తురు సాధులు, ప్రాణంబులు నిమిష భంగురము లని మగువా! 234

క. పరహితము [4]సేయు నెవ్వఁడు, పరమ హితుం డగును భూత పంచకమునకున్
బరహిత మె పరమధర్మము, పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ! 235

క. హరి మది నానందించిన, హరిణాక్షీ! జగంబు లెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ, గరళము వారింపు టొప్పుఁ గమలదళాక్షీ! 236

క. శిక్షింతు హాలహలమును, భక్షింతును మధుర సూక్ష్మ ఫలరసము క్రియన్
రక్షింతుఁ బ్రాణికోట్లను, వీక్షింపుము నేఁడు నీవు వికచాబ్జముఖీ! 237

---

1. భేదమగుదు దీనభేదమై (హ.) 2. లాలనంగొని (హ.) 3. గెంటింపఁగ ఫలముగాదె కీర్తి (హ.) 4. సేయ (హ. తం. వా.)

ఆ. మూఁడుమూర్తులకును మూఁడు లోకములకు
మూఁడు కాలములకు మూలమగుచు
[1]భేదమగుచు మది నభేద మై యొప్పారు
బ్రహ్మ మనఁగ నీవ ఫాలనయన! 227

క. స దస త్తత్త్వ చరాచర, సదనం బగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్
వెదవులు గదలుప వెఱతురు, వదలక నినుఁ బొగడ నెంతవారము దేవా! 228

మత్తకోకిల. బాహుశక్తి సురాసురుల్ సని పాలవెల్లి మథింప హా
లాహలంబు జనించె నేరి కలంఘ్య మై భువనంబు కో
లాహలంబుగఁ జేసి చిచ్చును [2]లాగముం గొని ప్రాణిసం
దోహముం బ్రతికింపవే దయ దొంగలింపఁగ నీశ్వరా! 229

క. లంపటము నివారింపను, సంపద కృపసేయ జయము సంపాదింపన్
జంపెడివారి వధింపను, సొంపారఁగ నీకె చెల్లు సోమార్ధధరా! 230

క. నీకంటె నొం డెఱుంగము, నీకంటెం బరులు గావనేరరు జగముల్
నీకంటె నొడయఁ డెవ్వఁడు, లోకంబుల కెల్ల నిఖిలలోకస్తుత్యా! 231

—: ఈశ్వరుండు దేవబృందప్రార్థితుం డై హాలాహలమును బానముచేయుట :—

వ. అని మఱియు నభినందింపుచున్న ప్రజాపతిముఖ్యులం గని, సకలభూత సముం డగు న ద్దేవుండు తన ప్రియసతి కి ట్లనియె. 232

క. కంటే జగముల దుఃఖము, వింటే జలజనిత విషమువేఁడిమి ప్రభు వై
యుంటకు నార్తుల యాపదఁ[3] గెంటించుట ఫలము దానఁ గీర్తి మృగాక్షీ! 233

క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన, ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లన్
బ్రాణుల కిత్తురు సాధులు, ప్రాణంబులు నిమిష భంగురము లని మగువా! 234

క. పరహితము [4]సేయు నెవ్వఁడు, పరమ హితుం డగును భూత పంచకమునకున్
బరహితమె పరమధర్మము, పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ! 235

క. హరి మది నానందించిన, హరిణాక్షీ! జగంబు లెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ, గరళము వారింపు టొప్పుఁ గమలదళాక్షీ! 236

క. శిక్షింతు హాలహలమును, భక్షింతును మధుర సూక్ష్మ ఫలరసము క్రియన్
రక్షింతుఁ బ్రాణికోట్లను, వీక్షింపుము నేఁడు నీవు వికచాబ్జముఖీ! 237

1. భేదమగుదు దీనభేదమై (హ.) 2. లాలనంగొని (హ.) 3. గెంటింపఁగ ఫలముగాదె కీర్తి (హ.) 4. సేయ (హ. తం. వా.)



వ. అని పలికినఁ, బ్రాణవల్లభునకు వల్లభ యి ట్లనియె. దేవా! చిత్తంబు కొలంది నవధరింతు గాక. అని పలికె నని చెప్పిన య మ్మునీంద్రునకు నరేంద్రుం డి ట్లనియె. 238

మ. అమరన్ లోకహితార్థ మంచు నభవుం డాఁగాక యం చాడెఁ బో
యమరుల్ భీతిని మ్రింగుమీ యనిరి వో యంభోజ గర్భాదులుం
దముఁ గావన్ హర! లెమ్ము లె మ్మనిరి వో తాఁ జూచి కన్గంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగు మనె న య్యుగ్రానల జ్వాలలన్. 239

వ. అనిన శుకుం డి ట్లనియె. 240

క. మ్రింగెడివాఁడు విభుం డని, మ్రింగెడిదియు గరళ మనియు మేలని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ, మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో! 241

మ. తన చుట్టున్ సురసంఘముల్ జయజయ ధ్వానంబులన్ బొబ్బిడన్
ఘన గంభీర రవంబుతో శివుఁడు లోకద్రోహి! హుం! పోకు ర
మ్మని కెంగేలఁ దెమల్చి కూర్చి కడిగా [2]నంకించి జంబూ[3]ఫలం
బన సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్. 242

వ. అ య్యవిరళ గరళ దహన పాన సమయంబున. 243

మ. కదలంబాఱవు పాఁపపేరు లొడలన్ ఘర్మాంబు జాలంబు పు
ట్టదు నేత్రంబులు నెఱ్ఱగావు నిజ జూటార్ధేందుఁడున్ గందఁడున్
వదనాంభోజము వాడ దా విషము నాహ్వానించుచో డాయుచోఁ
బదిలుం డై కడిసేయుచోఁ [4]దిగుచుచో భక్షింపుచో మ్రింగుచోన్. 244

క. ఉదరము లోకంబులకును, సదనం బగు టెఱిఁగి శివుఁడు చటుల విషాగ్నిన్
గుదురుకొనఁ గంఠబిలమునఁ, బదిలంబుగ నిలిపె సూక్ష్మ ఫలరసము క్రియన్. 245

క. మెచ్చిన మచ్చిక గలిగిన, నిచ్చిన నీవచ్చుఁ గాక యిచ్చ నొరులకుం
[5]జిచ్చుఁ గడిఁ గొనఁగ వచ్చునె, చిచ్చఱచూ పచ్చుపడిన శివునకుఁ దక్కన్. 246

ఆ. హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ
గప్పు గలిగి తొడవు కరణి నొప్పె
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబు గాదె భూవరేంద్ర! 247

1. వల్లభి (హ) 2. నక్కించి (హ) 3. ఫలంబని (హ. తం. వా.) 4. దిరుగుచో (వా) 5. చిచ్చఱ రూపచ్చు పడిన (హ. వా.)

వ. తదనంతరంబ. 248

క. గరళంబుఁ గంఠబిలమున, హరుఁడు ధరించుటకు మెచ్చి 'యౌనౌ' న నుచున్
హరియు విరించియు నుమయును, సురనాథుఁడుఁ బొగడి రంత సుస్థిరమతితో.

క. హాలాహల భక్షణ కథ, హేలాగతి [1]నైన విన్న నెలమిఁ బఠింపన్
వ్యాళానల వృశ్చికముల, పాలై చెడ రెట్టి జనులు భయవిరహితులై. 250

## అధ్యాయము – ౮

## —: పాలకడలిలో నైరావతాదులు జనియించుట :—

వ. మఱియు నా రత్నాకరంబు సురాసురులు ద్రచ్చు నెడ. 251

క. తెల్లని మేనును నమృతము, [2]జిల్లున జల్లించు పొదుఁగు శిత[3]శృంగములున్
బెల్లుగ నర్థుల కోర్కులు, వెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్. 252

ఆ. అగ్నిహోత్రి యనుచు నా సురభిని దేవ
మునులు పుచ్చుకొనిరి ముదముతోడ
విబుధ సంఘములకు వెరవుతో నధ్వర
హవులు వెట్టుకొఱకు నవనినాథ! 253

వ. మఱియు నా జలరాశియందు. 254

క. స చ్చంద్రపాండురం బై, యుచ్చైశ్శ్రవ మనఁగఁ దురగ ముదధి జనించెన్
బుచ్చికొనియె బలిదైత్యుం, డిచ్చఁ గొనం డయ్యె నింద్రుఁ డీశ్వరశిక్షన్. 255

క. [4]ఒఱపగు నురమును పిఱుఁదును, నెఱిదోఁకయు ముఖమునిరియు నిర్మలఖురముల్
కుఱుచచెవులుఁ దెలిగన్నులుఁ, దఱచగు కందంబు చూడఁ దగు నా హరికిన్. 256

వ. అంత నా పాలకుప్పయందు. 257

క. దంత చతుష్టాహతి శై, లాంతంబులు విఱిగిపడఁగ నవదాత కుభృ
త్కాంతం బగు నైరావణ, దంతావళ ముద్భవించె ధరణీనాథా! 258

క. తడలేని నడపువడి గల, యొడలును బెను నిడుదకరము నురుకుంభములున్
బెడఁ గై యువతుల మురిపెపు, నడతలకున్ మూలగురు వనన్ గజ మొప్పెన్.

వ. మఱియు న త్తరంగిణీవల్లభు మథింపు న య్యెడ. 260

---

1. విన్ననైన(హ) 2. ఝల్లున(హ) 3. శృంగములన్(హ) 4. పరపగు (క. చ. ట. డ.)

తే. ఎల్ల ఋతువులందు నెలరారి పరువమై
యింద్రు విరులతోఁట కేపు దెచ్చి
కోరి వచ్చువారి కోర్కుల నీనెడు
వేల్పుమ్రాను పాలవెల్లిఁ బుట్టె. 261

వ. మఱియునుం గొండకవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె. అంత 262

క. క్రొక్కారు మెఱుఁగు మేనులుఁ, గ్రిక్కిరిసిన చన్నుఁగవలుఁ గ్రిస్సిన నడుముల్
బిక్కటిలి యున్న తుఱుములుఁ, జక్కని చూపులును దివిజసతులకు నొప్పెన్.

వ. మఱియు నా రత్నాకరంబునందు సుధాకరుం డుద్భవించి, విరించి యనుమతంబునఁ దన యథాస్థానంబునం బ్రవర్తించుచుండె. అంత 264

క. తొలుకారు మెఱుఁగుకైవడి, తళతళ యని మేను మెఱయ ధగధగ యనుచున్
గలుముల నీనెడు చూపుల, చెలువంబుల మొదలిటెంకి సిరి పుట్టె నృపా! 265

సీ. పాలమున్నీటిలోపలి మీఁది మీఁగడ మిసిమి జిడ్డునఁ జేసి మేనువడసి
క్రొక్కారుమెఱుఁగుల కొనల తళుక్కుల మేనిచేగల నిగ్గుమెఱుఁగుచేసి
నాఁడునాఁటికిఁ బ్రోది నవకంపుఁ దీఁగెల నునుఁబోద నెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కొలఁకులఁ బ్రొద్దునఁ బొలసిన వలపులఁ బ్రోదివెట్టి

తే. పసిఁడిచంపకదామంబు [1]బాగుఁ గూర్చి
వ్రాలు క్రొన్నెల చెలువున వాఁడి దీర్చి,
జాణతనమునఁ జేతుల [2]జడ్డు విడిచి
నలువ యీ కొమ్మ నొగిఁ జేసి నాఁడు నేఁడు. 266

క. కెంపారెడు నధరంబును, జంపారెడి నడుము సతికి శంపారుచులన్
సొంపారు మోముఁ గన్నులుఁ, బెంపారుచు నొప్పుఁ గొప్పుఁ బిఱుదును గుచముల్

వ. అని జనులు పొగడుచుండ. 268

సీ. తరుణికి మంగళస్నానంబు సేయింతు మని పెట్టె నింద్రుఁ డనర్ఘమైన
మణిమయపీఠంబు మంగళవతులైన వేలుపుగరితలు విమల తోయ
పూర్ణంబులై యున్న పుణ్యాహ కలశంబు లిడిరి పల్లవముల నిచ్చె భూమి
కడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చె మలసి వసంతుఁడు మధువు నొసఁగె

---

1. బాగుఁబెట్టి (హ) 2. జాడదీర్చి (హ)

తే. మునులుఁ గల్పంబుఁ జెప్పిరి మొగిలుగములు
పణవ గోముఖ కాహళ పటహ మురజ
శంఖ వల్లకి వేణు నిస్వనము నిచ్చె,
పాడి రాడిరి గంధర్వపతులు సతులు. 269

క. పండిత సూక్తులతోడుతఁ, దుండంబులు సాఁచి తీర్థతోయము లెల్లన్
[1]గుండముల ముంచి దిగ్భే, దండంబులు జలకమార్చెఁ దరుణీమణికిన్. 270

సీ. కట్టంగ పచ్చని పట్టుపుట్టము దోయి ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె
మత్తాళినికరంబు మధు వాన మూఁగిన వైజయంతీ మాల వరుణుఁ డిచ్చెఁ
గాంచన కేయూర కంకణ కింకిణీ కటకాదులను విశ్వకర్మ యిచ్చె
భారతి యొకమంచి తారహారము నిచ్చెఁ బాణిపద్మము నిచ్చెఁ బద్మభవుఁడు

ఆ. కుండలివ్రజంబు కుండలముల నిచ్చె
శ్రుతులు భద్ర మైన నుతులు సేసె
నెల్లలోకములకు నేలికసాని వై
బ్రతికె దనుచు దిశలు వలికె నధిప! 271

వ. మఱియును. 272

సీ. పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో భాషించు నతఁడె పో బ్రహ్మ యనఁగ
నెలయించి కెంగేల నెవ్వని వరియించె వాఁడె లోకములకు వల్లభుండు
[2]మెయిదీఁగె నెవ్వని మేనితోఁ గదియించె వాఁడె పో పరమ సర్వజ్ఞమూర్తి
నెలఁతుక యెప్పుడు [3]నివసించు నేయింట నా యిల్లు పర మగు నమృతపదము

ఆ. నెలఁత చూపు వాలు నె చ్చోటి కచ్చోటు
జిష్ణుధనదధర్మ జీవితంబు
కొమ్మ పిన్న నగవు గురుతరదుఃఖ ని
వారణంబు సృష్టికారణంబు. 273

వ. మఱియు న క్కొమ్మ నెమ్మనంబున. 274

సీ. భావించి యొకమాటు బ్రహ్మాండమంతయు నాటల బొమ్మరి ల్లని తలంచుఁ
బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ దన యింటిలో దొంతు లని తలంచుఁ
[4]బాటించి యొకమాటు బ్రహ్మాది సురలను దన యింటిలో బొమ్మ లని తలంచుఁ
గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు నలవడ బొమ్మపీఁటని తలంచు

---

1. దుండముల (హ) 2. మెైదీఁగె (హ) 2. నేయింట వసియించె (హ) 1. ప్రాపించి (హ)

ఆ. సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల
నచటి దీపకళిక లని తలంచు
[1]భామ యొక్కమాటు భారతీదుర్గల
నాత్మసఖు లటంచు నాదరించు. 275

వ. తదనంతరంబ. 276

ఆ. చంచరీక నికర ఝుంకార నినదంబు
దనరు నుత్పలముల [2]దండఁ బట్టి
మేఘకోటి నడిమి మెఱుఁగుఁ బుత్తడి మాడ్కి
సురలనడుమ నిల్చె సుందరాంగి. 277

క. ఆ కన్నులు నా చన్నులు, నాకురు లాపిఱుఁదు నడుము నాముఖ మా న
వ్యాకారముఁ గని వేల్పులు, చీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్. 278

వ. అట్లు నిలిచి, దశదిశలం బరివేష్టించియున్న యక్ష రక్ష స్సిద్ధ సాధ్య దివిజ గరుడ గంధర్వ చారణ ప్రముఖ యూథంబులం గనుంగొని, య ప్పురాణ ప్రౌఢ కన్యకా రత్నంబు దనమనంబున ని ట్లని వితర్కించె. 279

సీ. ఐదువ నై [3]యుండ నలవడ దొకచోట నొకచోట సవతితో నోర్వరాదు
తగ నొకచోట సంతత వైభవంబుగా దొకచోట [4]వేఁడిమి నుండఁబోల
దొకచోటఁ గరుణలే దొక్కింత వెదకిన నొకచోట డగ్గఱి [5]యుంట బెట్ట
నెఱయంగ నొకచోట నిలుకడ చాలదు చర్చింప నొకచోట జడత గలదు

ఆ. కొన్నిచోట్లు కామ గుణగరిష్ఠంబులు
క్రోధసంయుతములు కొన్ని యెడలు
కొన్ని మోహలోభ కుంఠితంబులు కొన్ని
ప్రమద మత్స రానుభావకములు. 280

వ. అని సకల సత్పురుష జనన వర్తనంబులు మానసించి పరిహరించి. 281

సీ. అమర ముత్తైదువ నై యుండవచ్చును వరుసకు సవతు లెవ్వరును లేరు
వెలయంగ నశ్రాంత విభవ మీతని యిల్లు శృంగారచందన శీతలుండు
గలఁగఁ డెన్నఁడు శుద్ధ కారుణ్యమయమూర్తి విమలుండు గదిసి సేవించవచ్చు
నెఱి నాడి తిరుగఁడు నిలుకడ గలవాఁడు సకలకార్యములందు జడత లేదు

---

1. బాల (వ్రాఁతప్రతులన్నిట) 2. దండవెట్టి (హ) 3. యుండ దలవడ నొకచోట (హ)
4. వేడుక (జ) 5. యుంట బెట్టు (వ్రాఁతప్రతులు); యుంటబెట్ట (తం); యుండబెట్ట (వా).

ఆ. సాధురక్షకుండు షడ్వర్గ రహితుండు
నాథుఁ డయ్యెనేని నడప నోపు
నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ
బుష్పదామకమునఁ బూజఁ జేసె. 282

క. ఇందీవర దామమున ము, కుందునిఁ బూజించి తనకుఁ గూడి వసింపన్
మందిరముగఁ ద ద్వక్షము, [1]నంద సలజ్జానుదృష్టి నాలోకించెన్. 283

ఆ. మోహరుచులవలన ముద్దియ తలయెత్తు
సిగ్గువలన బాల శిరమువంచు
నింతి వెఱఁగువలన నెత్తదు వంపదు
తనదు ముఖము ప్రాణదయితుఁ జూచి. 284

క. హరిసూచిన సిరిసూడదు, సిరిచూచిన హరియుఁ జూడ సిగ్గును బొందున్
హరియును సిరియునుఁ దమలో, సరిచూపులఁ జూడ మరుడుఁ సందడి వెట్టెన్.

చ. జగములతండ్రి యై దనరు శౌరి జగంబుల తల్లి నిందిరం
దగ నురమందుఁ దాల్చె నటఁ ద త్కరుణారసదృష్టిచేఁ బ్రజల్
మగుడఁగఁ దొంటిభంగి నతిమంగళ సాధిపతిత్వ సంపదన్
నెగడిన లోకముల్ గని రనేకశుభంబులఁ బొంది ర త్తఱిన్. 286

వ. †అటమున్న యబ్ధిరాజు దనయందు నున్న యమూల్యం బైన కౌస్తుభంబు పేరిటి యనర్ఘ మణిరాజంబు న య్యంబుజాక్షునకు సమర్పించిన దానిఁ దన వక్షస్థలంబున ధరించె. అప్పు డ య్యాదిలక్ష్మియు శ్రీవత్స కౌస్తుభ వైజయంతీ వనమాలికాది తారహారాలకృతంబైన పుండరీకాక్షు వక్షస్థలంబున వసియించె. న య్యవసరంబున. 287

శా. మ్రోసెన్ శంఖ మృదంగ వేణు రవముల్ మున్నాడి పెం జీఁకటుల్
వాసెన్ నర్తన గానలీలల సురల్ భాసిల్లి రార్యుల్ జగ
ద్వాసుల్ విష్ణుని [2]బ్రహ్మ రుద్ర ముఖరుల్ ద ల్లింగమంత్రంబులం
బ్రాసక్తిన్ వినుతించి రుల్లసిత పుష్పశ్రేణి వర్షింపుచున్. 288

క. ఆ పాలవెల్లికూఁతురు, తీపులఁ జూపులను దోఁగి తిలకించి ప్రజల్
చేపట్టిరి సంపదలను, బ్రాపించెను మేలు జగము బ్రతికె నరేంద్రా! 289

క. పాలేటిరాచ కన్నియ, మేలారెడు చూపు లేక మిడుమిడు కంచుం
జాలిం బురబురఁ బొక్కుచుఁ, దూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా! 290

---

1. నందంద సలజ్జదృష్టి(తం.వా) † ఈ వచన మేప్రాతప్రతిలోనులేదు. 2. బ్రహ్మదేవముఖరుల్ (హ.వా.)

క. [1]వారిధిఁ దరువఁగ నంతట, వారుణి యను నొక్కకన్య వచ్చిన నసురుల్
వారిజలోచను సమ్మతి, వారై కైకొనిరి దాని వారిజనేత్రిన్, 291

వ. మఱియుఁ దరువం దరువ న ప్పయోరాశియందు. 292

సీ. తరుణుండు దీర్ఘదోర్దండుండు కంబుకంధరుఁడు పీతాంబరధారి స్రగ్వి
[3]లాలిత భూషణాలంకృతుం డరుణాక్షుఁ డున్నతోరస్కుఁ డత్యుత్తముండు
నీల కుంచిత కేశ నివహుండు జలధర శ్యాముండు మృగరాజ సత్త్వశాలి
మణికుండలుఁడు రత్నమంజీరుఁ డచ్యుతు నంశాంశ సంభవుం డమలమూర్తి

ఆ. భూరి యాగభాగ భోక్త ధన్వంతరి
యనఁగ నమృతకలశ హస్తుఁ డగుచు
నిఖిల వైద్యశాస్త్ర నిపుణుఁ డాయుర్వేది
వేల్పువెజ్జు కడలి వెడలివచ్చె.

వ. త దనంతరంబ. 293

ఆ. అతనిచేత నున్న యమృతకుంభము సూచి
కెరలు వొడిచి సురలు కికురువెట్టి
పుచ్చుకొనిరి యసుర పుంగవు లెల్లను
మాఱులేని బలిమి మానవేంద్ర! 294

వ. వెండియు. 295

ఆ. చావులేని మందు చక్కఁగ మన కబ్బె
ననుచుఁ గడవ యసురు లాచికొనిన
వెఱచి సురలు హరికి మొఱలువెట్టిరి సుధా
పూర్ణఘటము పోయెఁ బోయె ననుచు. 296

—: శ్రీవిష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట :—

వ. ఇట్లు శరణాగతు లైన వేల్పుల దైన్యంబు వొడగని, భృత్యజన కాముదుం డగు న ప్పరమేశ్వరుండు మీరలు దుఃఖింప వలవదు. ఏను నామాయాబలంబునం జేసి మీ యర్థంబు మరల సాధించెద. అని పలికె. తత్సమయంబున న య్యమృతపూరంబు నేముం ద్రావుదు మని తమకించు దైత్య దానవజనంబుల లోపల నమంగళం బగు కలి సంభవించిన కతంబునఁ, బ్రబలు లగు రక్కసులు విలోకించి, సత్రయాగంబునందు నడచుచందంబునఁ దుల్యప్రయాస హేతువు లగు సురలును సుధా

1. వారధి (హ) 2. లాశిత (తం. వా.)

భాగంబున కర్హు లగుటం బంచి కుడుచుట కర్తవ్యంబు ఇది సనాతన ధర్మం బగుటంజేసి య య్యమృతకుంభంబు విడువుండు. అని, దుర్జను లగు నిశాచరులు జాతమత్సరు లై తమవారల వారింపుచున్న సమయంబున. 298

తే. ఒకనిచేత నుండ నొకఁడు బలిష్ఠుఁ డై
పుచ్చికొనిన వానిఁ బొదుగఁ బట్టి
యంతకంటె నధికుఁ డమృతకుంభము నెత్తి
కొంచుఁ బాఱెఁ బరులు గు య్యిడంగ. 299

వ. అంత. 300

సీ. మెత్తని యడుగుల మెఱుఁగారు జానువు లరఁటికంబముల దో రైన తొడలు
ఘన మగు జఘనంబు కడు లేఁత నడుమును బల్లవారుణకాంతి పాణియుగముఁ
గడు దొడ్డ[1]పాలిండ్లుఁ గంబుకంఠంబును బింబాధరముఁ జంద్రబింబ ముఖముఁ
దెలి గన్నుఁగవయును నళికుంతలంబులు బాలేందుసన్నిభ ఫాలతలము

తే. నమరఁ గుండల కేయూర హార కంక
ణాదు లేపార మంజీరనాద మొప్ప
నల్ల నవ్వులఁ బద్మదళాక్షుఁ డసుర
పతుల నణఁగింప నాఁడురూపంబుఁ దాల్చి. 301

వ. అ య్యవసరంబున జగన్మోహనాకారంబున. 302

సీ. [2]పాలిండ్లపై నున్న పయ్యెద జాఱించు జాఱించి మెల్లనఁ జక్క నొత్తుఁ
దళుక్క త ళుక్కను గండఫలకంబు లోలయించు నొలయించి కెంగేల నుజ్జగించుఁ
గడు మెఱుంగులువాఱు కడకన్ను లల్లార్చు నల్లార్చి ఱెప్పల నండ గొలుపు
నవరని దరహాస చంద్రికఁ జిలికించుఁ జిలికించి కెమ్మోవిఁ జిక్కుపఱుచు

తే. దళితధమ్మిల్ల కుసుమగంధమ్ము నెఱపుఁ
గంకణాది ఝణంకృతుల్ గడలుకొలుపు
నొడలికాంతులు పట్టులే కులుకఁబాఱు
సన్న[3]వలిపంపుఁ బయ్యెద చౌకళింప. 303

1. పాలిండ్లు (హ.) 2. పాలిండ్లపై (హ.)
1. వలిపంబు వెలువడి చౌకళింప (క.చ.ట. త. జ. డ) వలిపంపుఁ బయ్యెద చౌకళించి (వా)

## అధ్యాయము - ౯

వ. ఇవ్విధంబున నక్కపట యువతీరత్నంబు జగన్మోహన దేవతయునుంబోలె, నెమ్మొగంబుదావికి మత్తిల్లిన తేఁటి మొత్తంబులం గెలిచి, చిగురుజొంపంబుల నెడగలుగఁ జడియుచు, మురియుచుండ, రాక్షసవరులు గనుంగొని. 304

సీ. ఓఁ గదె లావణ్య మోఁ గదే మాధుర్య మోఁ గదే సతి! నవయౌవనాంగి!
యెటనుండి వచ్చితి వేమి యిచ్ఛించెదు నీ నామ మెయ్యది నీరజాక్షి!
యమర [1]గంధర్వ సిద్ధాసుర చారణ మనుజకన్యలకు నీ మహిమ గలదె
‡ప్రాణ చిత్తేంద్రియ పరిణామ దాయి వై నిర్మించెఁ బో! విధి నిన్నుఁ గరుణ

తే. వనిత! కశ్యపు సంతతివార మేము
భ్రాతలము సురల కే మిద్ధపౌరుషులము
జ్ఞాతులకు మాకు నేకార్థ సంగతులకు
జాలు దీరని యర్థంబు పంచి యిమ్మ. 305

క. సభ యై యుండెద మిందఱ, మభయంబున వచ్చుకొలఁది నమృతంబును నీ
విభరాజగమన! తప్పక, విభజింపు విపక్షపక్ష విరహితమతి వై. 306

వ. అని మంత్రించిన దైత్యులం గని, మాయాయువతిరూపుం డగు హరి తన వాఁడి చూపుటంపరలవలన వారల తాలుముల నగలించి చిఱునగవు లెగయ మొగమెత్తి యి ట్లనియె. 307

క. సుందరు లగు పురుషులఁ గని, పొందెడు నాయందు [2]బుద్ధి పుట్టెనె మీకుఁ
బృందారక రిపులారా!, చెందరు కామినుల విశ్వసింపరు పెద్దల్. 308

క. పలుకులు మధు రసధారలు, దలఁపులు నానాప్రకార దావానలముల్
నెలుములు సాలావృకములు, చెలువల [3]నమ్మంగ వేదసిద్ధాంతములే. 309

క. నా నేర్చుకొలఁది మీకును, మానుగ విభజించి యిత్తు మానుఁడు శంకన్
గానిం డనవుడు నిచ్చిరి, దానవు లమృతంపుఁగడవఁ దరుణీమణికిన్. 310

క. ఆ [4]శాంతాలోకనములు, నా శీతలభాషణములు నా లాలితముల్
రాశిపరంపర లగుచును, పాశము లై వారినోళ్ళ బంధించె నృపా! 311

---

1. గంధర్వవిద్యాధర చారణ(తం.) ‡ "నూనం త్వం విధినా ప్రేషితాసి శరీరిణాం సర్వేంద్రియ మనఃప్రీతిం విధాతుం సఘృణేన కిమ్" అని మూలము (9-5)

2. నిజము పుట్టునె (తం.వా.); "కథం కాశ్యపదాయాదాః పుంశ్చల్యాం మయి సంగతాః. విశ్వాస పండితా జాతు కామినీషునయాంతిహి." (9-9) 3. నమ్మఁటలు (తం. వా.)

4. ఆ శాతాలోకనములు (క. ట.)

వ. ఇట్లు సుధాకలశంబు చేత నందుకొని, మందస్మిత భాషణంబుల సుందరీరూపుం డగు ముకుందుండు, మేలు కీ డనక నేను బంచియిచ్చిన తెఱంగున నంగీకరించుట కర్తవ్యంబు అనవుడు నగుంగాక యని, సురాసుర [1]దైత్యాదానవ సమూహంబుపవసించి, కృతస్నాను లై, హోమంబు లాచరించి, విప్రులకు గో భూ హిరణ్యాదానంబులు సేసి, తదాశీఃప్రవచనంబులు గైకొని, ధవళ పరిధానులై, గంధ మాల్య ధూప దీపాలంకృతం బగు కనక రత్నశాలా మధ్యంబునఁ, బ్రాగగ్ర కుశపీఠంబులం బూర్వదిశాభిముఖు లై, పంక్తులు గొనియున్న సమయంబున.

క. శ్రోణీభర కుచయుగభర, వేణీభరములను డస్సి వివిధాభరణ
క్వాణ యయి యువిద వచ్చెను, పాణిసరోజమున నమృత భాండముఁ గొంచున్.

క. భాసుర కుండల భాసిత, నాసా ముఖ కర్ణ గండ నయనాంచల యై
శ్రీ సతి యగు సతిఁ గని దే, వాసురయూథంబు మోహ మందె నరేంద్రా !

వ. అప్పుడు. 315

క. అసురుల కమృతము వోయుట, పొసఁగదు పాములకుఁ బాలు వోసినమాడ్కిన్
దొసఁ గగు నంచును వేఱొక, దెసనుం గూర్చుండఁ బెట్టె దేవాహితులన్. 316

వ. ఇట్లు రెండుపంక్తులు గా నేర్పఱించి. 317

సీ. వేగిరపడకుఁడీ వినుఁడు దానవులార ! తడవుసేయక వత్తు దైత్యులార !
యటు చక్కఁ గూర్చుండుఁ డని కన్ను లల్లార్చి చనుఁగవ పయ్యెదఁ జాఱఁ దిగిచి
వదినె[2]మఱందుల వావులు గల్పించి మర్మంబు లెడలించి మఱుఁగు సేసి
మెల్లని నగవుల మేనులు మఱపించి కడు [3]జాణమాటలఁ గాకుపఱిచి

తే. యసురవరుల నెల్ల నణకించి సురలను
దడవు సేయవలదు ద్రావుఁ డనుచు
వచ్చుకొలఁది నమృతవారి విభాగించెఁ
దరుణి దివిజులెల్లఁ దనిసి పొగడ. 318

వ. అ య్యవసరంబున. 319

సీ. మనకు వేల్పులకును మారాటములు [5]రాక పంచిపెట్టెద నని పలఁతి పూనెఁ
దా నేల తప్పును దప్పదు తరళాక్షి గాక ర మ్మనుచును గడఁకఁ బిల్వ
మఱుమాట లాడదో మఱి చూడకుండునో చనుఁగవ గప్పునో చాలు ననుచు
[4]నొండాడ కలుగుచు నొక్కింత సొలయునో మనయెడఁ గందునో మగువయనుచు

---

1. "దైత్య యూథపాః" (మూలము) 2. మఱందలి (హ.) 3. జాడమాటల (హ.)
4. నొండెడ కేఁగునో (తం.) 5. మందట లేకుండఁ బంచి (తం.వా.)

ఆ. నెలఁత చూడ్కిఁ గముల నీరై కలంగుచుఁ
బ్రణయభంగభీతి బద్ధు లగుచు
నూరకుండ్రి గాని యువిద! తే తెమ్మని
యడుగఁజాల రైరి యసురవరులు. 320

వ. అప్పుడు. 321

మ. అమరవ్రాతములోనఁ జొచ్చి దివిజుం డై రాహు పీయూషపా
నము సేయం గని చంద్రభాస్కరులు సన్నల్ సేయ నారాయణుం
డమరారాతిశిరంబు చక్రహతిఁ దున్మాడెన్ సుధాసిక్త మై
యమరత్వంబునుఁ జెందె [1]మూర్ధము [2]తదన్యాంగంబు నేలం బడెన్. 322

ఆ. అజుఁడు వానిశిరము నంబరవీథిని
గ్రహము సేసి పెట్టి గారవించె
వాఁడు పర్వములను వైరంబు దప్పక
[3]భానుచంద్రములను బట్టుచుండు. 323

క. ఒకబొట్టు జిక్కకుండఁగ, సకల సుధారసము నమర సంఘంబులకుం
బ్రకటించి పోసి హరి దన, సుకరాకృతిఁ దాల్చె నసురశూరులు బెగడన్. 324

## —: దేవాసుర యుద్ధము :—

మ. అమరుల్ రక్కసులుం బ్రయాస బల హే త్వర్థాభిమానంబులన్
సములై లబ్ధవికల్పు లైరి సురలున్ సంశ్రేయసంయుక్తు లై
రమరారుల్ బహుదుఃఖముం గనిరి తా మత్యంత దోర్గర్వు లై
కమలాక్షున్ శరణంబు వేఁడని జనుల్ కల్యాణసంయుక్తు లే. 325

## అధ్యాయము - ౧౦

క. దానవు లమృతము ద్రావం, బూని పయోరాశిఁ ద్రచ్చి పొగిలిన మాడ్కిన్
శ్రీనాథ పరాఙ్ముఖు లగు, హీనులు వొందంగఁజాల రిష్టార్థములన్. 326

క. శోధించి జలధి నమృతము, సాధించి నిలింపవైరి చతుర్గతులన్
రోధించి సురల కిడి హరి, బోధించి ఖగేంద్రు నెక్కి పోయె నరేంద్రా! 327

క. శుద్ధు లగు సురల కమృతము, సిద్ధించిన నసురవరులు సిడిముడి పడుచున్
గ్రుద్ధులు నానాయుధ సన్నద్ధులు నై యుద్ధమునకు నడిచిరి బలిమిన్. 328

---

1. మూర్ధ్నము (హ) 2. తదీయాంగంబు (తం.) 3. భానుచందురులను (హ.)

క. ధన్యులు వైరోచని శత, మన్యు ప్రముఖులు మదాభిమానులు తమలో
నన్యోన్యరణము బాహా, సిన్యాసంబులను బేర్చి చేసిరి కడిమిన్. 329

మ. అరుదై కామగమై మయాసురకృతం బై లోకితాలోక్యమై
వర శస్త్రాస్త్ర సమేతమై తరళమై వైహాయసం బై మహా
సుర యోధాన్విత మైన యానమున సంశోభిల్లెఁ బూర్ణేందు సు
స్థిర కాంతిన్ బలి చామర ధ్వజ చమూ దీప్తస్థితిన్ ముందటన్. 330

వ. మఱియు, నముచి, శంబర, బాణ, ద్విమూర్ధ, కాలనాభ, శకుని, నికుంభ, కుంభ, అయోముఖ, ప్రహేతి, హేతి, భూతసంతాప, హయగ్రీవ, కపిల, మేఘదుందుభి, మయ, త్రిపురాధిప, విప్రచిత్తి, విరోచన, వజ్రదంష్ట్ర, తారక, అరిష్ట, అరిష్టనేమి, శుంభ, నిశుంభ, శంకు, శిరోముఖ ప్రముఖులును, పౌలోమ కాలకేయులును, నివాత కవచ ప్రభృతులును, దక్కిన దండయోధులునుం గూడికొని, యరదం బులం, దురంగంబుల, మాతంగంబుల, హరిణంబుల, హరి కిరి కీట జలచరంబులను, శరభ మహిష గవయ ఖడ్గ గండభేరుండ చమరీ జంబుక శార్దూల గో వృషాది మృగంబులను, గంక గృధ్ర కాక కుక్కుట బక శ్యేన హంసాది విహంగంబులను, దిమి తిమింగిలాది జలచరంబులను, నరులను, నసుర సురనికర వికృత విగ్రహ రూపంబులగు జంతువులను నారోహించి, తమకు నడియాలంబులగు గొడుగులు, పడగలు, జోడులు, కైదువులు, పక్కెరలు, బొమిడికంబులు మొదలగు పోటుము ట్లాయితంబుగఁ గైకొని, వేఱువేఱు మొనలై, విరోచన నందనుం డగు బలిముందట నిలువంబడిరి. దేవేంద్రుఁడు నైరావణారూఢుం డై, వైశ్వా నర వరుణ వాయు దండధరా ద్యనేక నిర్జరవాహినీ సందోహంబులును, దాను నెదురుపడి, పిఱుతివియక మోహరించె. అట్లు సంరంభ సన్నాహ సముత్సాహం బుల తెండుదెఱంగుల వారుం బోరాడు వేడుకల మీఁటగు మంటల సరదడింపు చున్న సమయంబున. 331

సీ. వజ్ర దంష్ట్రాంచిత వ్యజనంబులును బర్హి చామరంబులు సిత చ్ఛత్రములును,
జిత్రవర్ణ ధ్వజచేలంబులును వాత చలితోత్తరోష్ణీష జాలములును
[3]జప్పుళ్ళ నెసఁగు భూషణ కంకణంబులుఁ జండాంశు రోచుల శస్త్రములును
వివిధ ఖేటకములు [4]పీరమాలికలును బాణపూర్ణము లైన తూణములును

---

1. విన్యాసంబులను బేర్మి వెలసిరి కడిమిన్ (హ) 2. ద్విమూర్ధ ౨ (హ.)
3. చప్పుళ్ళనొసఁగు కంకణభూషణంబులు (హ) 4. వీరమాలికెలును (హ)

ఆ. నిండి పెచ్చు రేఁగి నిర్జరాసురవీర
సైన్యయుగ్మకంబు చాల నొప్పె
గ్రాహ తతులతోడఁ [1]గలహంబునకు వచ్చు
సాగరములభంగి జనవరేణ్య ! 332

క. భేరీ భాంకారంబులు, వారణ ఘీంకారములును వర హరి హేషల్
భూరి రథనేమి రవములు, ఘోరము లై [2]పెల్లగించెఁ గులశైలములన్. 333

వ. ఇవ్విధంబున నుభయ బలంబులు మోహరించి, బలితో నింద్రుండును, తారకునితో గుహుండును, హేతితో వరుణుండును, ప్రహేతితోడ మిత్రుండును, కాలనాభుని తోడ యముండును, మయునితో విశ్వకర్మయు, త్వష్టతో శంబరుండును, సవిత తోడ విరోచనుండును. పరాజిత్తుతో నముచియు, వృషపర్వునితో నశ్వినీదేవత లును, బాణాది బలిపుత్ర శతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, పులోముతో ననిలుండును, నిశుంభ శుంభులతో భద్రకాళీదేవియును, జంభుని తోడ వృషాకపియును, మహిషునితో విభావసుండును, బ్రహ్మపుత్రులతోడ నిల్వల వాతాపులును, కామదేవునితోడ దుర్మర్షణుండును, మాతృగణము తోడ నుత్కలుండును, శుక్రునితోడ బృహస్పతియును, నరకునితో శనైశ్చరుం డును, నివాత కవచులతో మరుత్తులును, కాలేయులతోడ వసువులను నమరు లును, [3]క్రోధవశ పౌలోములతో రుద్రవిశ్వేదేవగణంబులును, ని వ్విధంబునఁ గలిసి పెనంగి, ద్వంద్వయుద్ధంబు సేయుచు, మఱియు రథికులు రథికులను, పదాతులు పదాతులను, వాహనారూఢులు వాహనారూఢులం దాఁకి, సింహ నాదంబులు సేయుచు, నట్టహాసంబు లిచ్చుచు, నాహ్వానంబు లొసంగుచు, నన్యోన్య తిరస్కా రంబులు సేయుచు, బాహునాదంబుల విజృంభించుచుఁ, బెను బొబ్బల నుబ్బి రేఁగుచు,హుంకరింపుచు, నహంకరింపుచు, ధనుర్గుణంబులఁ దంకరింపుచు,శరంబుల నాఁటింపుచుఁ, బరశువుల నఱుకుచుఁ, జక్రంబులం జెక్కుచు, శక్తులం దును ముచుఁ, గశలం బెట్టుచుఁ, గుఠారంబులం బొడుచుచుఁ, గదల నడుచుచుఁ, గరం బులం బొడుచుచుఁ, గరవాలంబుల వ్రేయుచుఁ, బట్టసంబుల నొంచుచుఁ, బ్రాసంబులం దెంచుచుఁ, బాశంబులఁ గట్టుచుఁ, బరిఘంబుల మొత్తుచు, ముసలం బుల మోఁదుచు, ముద్గరంబులఁ జదుపుచు, ముష్టివలయంబుల ఘట్టింపుచుఁ, దోమరంబుల నఱుముచు, శూలంబులఁ జిమ్ముచు, నఖంబులం జీరుచుఁ, దరు

1. గదనంబునకు వచ్చు (చ.) 2. పెల్లగిల్లెఁ గులశైలంబుల్ (హ) 3. క్రోధవశులైన, పౌలోములతో (హ) పౌలోములతో విశ్వేదేవగణంబును, క్రోధవశులతో రుద్రులును (తం. వా.)

శైలంబుల రువ్వుచు, నుల్మూకంబులం [1]జూడుచు, నిట్లు బహువిధంబులం గలహ విహారంబులు సలుపు నవసరంబున, భిన్నంబు లైన శిరంబులును, విచ్ఛిన్నంబు లైన కపాలంబులును, వికలంబు లైన కపోలంబులును, జిక్కులువడిన కేశబంధం బులును, భగ్నంబు లైన దంతంబులును, గృత్తంబు లైన భుజంబులును, ఖండి తంబు లైన కరంబులును, విదళితంబు లైన మధ్యంబులును, వికృతంబు లైన వదనబింబంబులును, వికలంబు లైన నయనంబులును, వికీర్ణంబు లైన కర్ణంబు లును, విశీర్ణంబు లైన నాసికలును, విఱిగిపడిన యూరుదేశంబులును, వితథంబు లైన పదంబులును, జినిఁగిన కంకటంబులును, వ్రాలిన కేతనంబులును, గూలిన ఛత్రంబులును, మ్రొగ్గిన గజంబులును, నుగ్గైన రథంబులును, నుఱుమైన హయం బులును, జిందఱవందఱ లైన భటసమూహంబులును, [2]ప్రాణంబుల బొరలెడు మేనులును, నుబ్బి యాడెడు భూతంబులును, బాఱెడు రక్తప్రవాహంబులును, గట్టలు గొన్న మాంసంబులును, నెగసి తిరిగెడి [3]కళేబరంబులును, గలకలంబులు సేయు కంక గృధ్రాది విహంగంబులు నై యొప్పు నప్పో రతిఘోరం బయ్యె. అప్పుడు. 334

శా. నాకాధీశుఁ బదింట మూఁట గజము న్నాల్గింట గుఱ్ఱంబుల
న్నేకాస్త్రంబున సారథిం జొనిపె దైత్యేంద్రుండు [4]వీఁకన్ వియ
ల్లోకాధీశుఁడు ద్రుంచె నన్నిటినిఁ దోడ్తో నన్ని భల్లంబులన్
రాకుండన్ రిపువర్గముం దునిమె [5]గీర్వాణుల్ నుతింపన్ వెసన్. 335

సీ. తన తూపు లన్నియుఁ దరమిడి శక్రుండు నఱికిన జోదు విన్ననువు మెఱసి
బలి [6]మహాశక్తిఁ జేపట్టిన నదియును నతఁడు ఖండించె నత్యద్భుతముగ
మఱి ప్రాస శూల తోమరములు గైకొన్నఁ దోడ్తోన నవియునుఁ దునిమివైచె
నంతటఁ బోక యెయ్యది వాఁడు [7]సంధించె దొంఁదరి తా నదియును దుమురుసేసె

ఆ. నసురభర్త విరథుఁ డై పోయి పగఱకుఁ
గానఁబడక వివిధ కపటవృత్తి
నేర్పు మెఱసి మాయ నిర్మించె మింటను
వేల్పుగములు [8]సూచి వెఱఁగుపడఁగ. 336

---

1. చూరిడుచు (తం) 2. ఒరలెడు కొఱప్రాణంబులును (తం. వా.) 3. కబంధంబులును (తం. వా.) 4. దా నాకస, ల్లోకాధీశుఁడు (వా) సువ,ర్లోకాధీశుఁడు (హ) 5. గీర్వాణారి యెగ్గింపఁగన్ (హ) గీర్వాణారి యగ్గింపఁగన్ (తం. వా.) 6. మహాశక్తి చేఁ బట్టిన(హ.తం.వా.) 7. సాధించె (హ) 8. గూడి (క. చ. ట. త.)

వ. ఇట్లు దానవేంద్రుని మాయావిశేష విధానంబున సురానీకంబులపైఁ
బర్వతంబులు వడియె. దావాగ్ని దందహ్యమాన తరు విస్ఫులింగంబులు గురిసె.
[1]శిఖిశిఖాసారంబులు గప్పె. మహోరగ దందశూకంబులు గఱచె. వృశ్చికంబులు
మీటె. వరాహ వ్యాఘ్ర సింహంబులు కదిసి, విదళింపం దొరఁకొనియె. వన
గజంబులు మట్టి మల్లాడం జొచ్చె. శూలహస్తులు, దిగంబరులు నై, బలురక్కసులు
శతసహస్ర సంఖ్యలు భేదన చ్ఛేదన భాషణంబు లాడం దొడంగిరి. వికృతవదనులు
గదాదండధారులు నాలంబిత కేశభారులు నై, యనేక రాక్షసవీరులు "పోనీకు
పోనీకుఁడు, తును ముండని" వెనుతగిలిరి. వర్షగంభీర నిర్ఘాత సమేతంబు లైన
జీమూత సంఘాతంబులు, వాతాహతంబు లై యుప్పతిల్లి, నిప్పుల కుప్పలు,
మంటల ప్రోవులుం గురిసె. మహాపవన విజృంభితం బైన కార్చిచ్చు ప్రళయా
నలంబు చందంబునం దరికొనియె. ప్రచండ ఝంఝానిలప్రేరిత సముత్తుంగ
తరంగావర్త భీషణం బైన మహార్ణవంబు, చెలియలికట్ట దాఁటి వెల్లివిరిసిన
ట్లయ్యె. ఆ సమయంబునఁ బ్రళయకాలంబునుం బోలె మిన్నుమన్ను రేయుం
బగ లని యెఱుంగరా దయ్యె. అ య్యవసరంబున. 337

క. ఆ యసురేంద్రుని బహుతర, మాయా జాలంబులకును మా ఱెఱుఁగక వ
జ్రాయుధ ముఖరాదిత్యు ల, పాయంబునుఁ బొంది చిక్కువడిరి నరేంద్రా! 338

వ. అప్పుడు. 339

క. ఇ య్యసురలచేఁ జిక్కితి, మెయ్యది దెరు వెందుఁ జొత్తు మిటు వొలయఁ గదే
యయ్యా! దేవ! జనార్దన!, కుయ్యో! మొఱ్ఱో! యటంచుఁ గూయిడి రమరుల్.

వ. అట్లు మొఱయిడు నవసరంబున. 341

మ. విహగేంద్రాసన రూఢుఁ డై మణి రమా విభ్రాజితోరస్కుఁ డై
బహు శస్త్రాస్త్ర రథాంగ సంకలితుఁ డై భాస్వ త్కిరీటాది దు
స్సహుఁ డై నవ్య పిశంగచేల ధరుఁ డై సంఫుల్ల పద్మాక్షుఁ డై
విహితాలంకృతితోడ మాధవుఁడుఁ దా వేంచేసె న చ్చోటికిన్. 342

చ. అసురుల మాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్
గసిబిసి యై నిరర్థ మయి గ్రక్కునఁ బోయెను నిద్రనొంది సం
తసమున మేలుకొన్నగతిఁ గాంచి చెలంగిరి వేల్పు లందఱుం
బసచెడ కేలయుండు హరిపాద [2]పరిస్మృతి సేయ నాపదల్. 343

---

1. సటంక శిఖర నికర శిలాసారంబులు(తం.వా.) శిలా స్సటంక శిఖరాః (మూలము 10-46)
2. పరిషత్కృ సేయ (హ)

వ. అయ్యెడ. 344

ఆ. కాలనేమి ఘోర కంఠీరవము నెక్కి
తార్క్ష్యశిరము శూలధారఁ బొడువ
నతని పోటుముట్టు హరి కేల నంకించి
దానఁ జావఁబొడిచె దానవునిని. 345

క. పదపడి మాలి సుమాలులు, బెదరించినఁ దలలు ద్రుంచెఁ బృథు చక్రహతిన్
గదఁగొని గరుడుని ఱెక్కలు, చెదరించిన మాల్యవంతు శిరముఁ ద్రెవ్వేసెన్. 346

## అధ్యాయము - ౧౧

వ. ఇట్లు పరమపురుషుం డగు హరి కరుణా పరత్వంబునఁ బ్రత్యుపలబ్ధమనస్కు లయిన వరుణ వాయు వాసవ ప్రముఖులు పూర్వంబున నెవ్వ రెవ్వరితోఁ గయ్యంబు సేయుదురు, వారు వారలం దలపడి నొప్పించిరి. అ య్యవసరంబున.

క. బాహు బలంబున నింద్రుఁడు, సాహసమున బలిమి గెలువ సమకట్టిన స
న్నాహమున వజ్ర మెత్తిన, హా హా నినదంబు సేసి రఖిలజనంబుల్, 348

వ. ఇట్లు సముద్యత భిదురహస్తుం డై, యింద్రుఁడు తన పురోభాగంబునం బరాక్రమించుచున్న విరోచననందను నుపలక్షించి యి ట్లనియె. 349

మ. జగతిన్ వైరి మొఱంగి గెల్చు టదియున్ శౌర్యంబె ధైర్యంబె తా
మగవాఁ డయ్యును దన్నుఁ దా నెఱిఁగి సామర్థ్యంబునుం గల్గియున్
బగవానిం గని డాఁగెనేని మెయి సూపంజాలఁ డేనిం గటా!
నగరే బంధులు, దిట్టరే బుధులు, కన్యల్ గూర్తురే దానవా! 350

ఉ. మాయల్ సేయఁగరాదుపో! నగవులే మాతోడి పోరాటముల్?
దాయా! చిక్కితి వ్రక్కలించెదఁ గన ద్దంభోళి ధారాహతిన్
నీ యుప్పొంగము లెల్లఁ జూడుము వెస న్నీవారలం గూడుకో
నీ యాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్ నే డాజిలో దుర్మతీ! 351

వ. అని పలికిన వజ్రితో విరోచననందనుం డి ట్లనియె. 352

శా. నీవే పోటరివే సురేంద్ర! తెగడ న్నీకేల గెల్పోటముల్
లేవే యెవ్వరిపాలఁ బోయినవి మేల్కీడుల్ విరించాదులున్
ద్రోవంజాలుదు రె వ్విధానమున సంతోషింప శోకింప నా
దైవం బేమి కరస్థలామలకమే దర్పోక్తులుం బాడియే. 353

1. గెల్చుట యిసీ (తం) గెల్చుటదియున్ (వా)

ఆ. జయము లపజయములు సంపద లాపద
లనిలచలిత దీపికాంచలములు
చంద్రకళలు మేఘచయము తరంగలు
మెఱుఁగు లమరవర్య! మిట్టిపడకు. 354

వ. అని యి ట్లాక్షేపించి. 355

క. వీరుఁడు దానవనాథుఁడు, నారసములు నింద్రు మేన నాఁటించి మహా
ఘోరాయుధ కల్పము లగు, శూరాలాపములు సెవులఁ జొనిపెన్ మరలన్. 356

వ. ఇట్లు తథ్యవాది యైన బలిచే నిరాకృతుం డై. 357

క. శత్రువు నాక్షేపంబునఁ, దోత్త్రాహత గజముఖంగిఁ ద్రుళ్ళుచు బలి నా
వృత్రారి వీచి వైచిన, గోత్రాకృతి నతఁడు నేలఁ గూలె నరేంద్రా! 358

క. చెలికాని పాటు గనుఁగొని, బలిసఖుఁ డగు జంభుఁ డతుల బాహాశక్తిన్
జెలితనము సాల నెఱపుచు, నిలు నిలు మని వీఁకఁ దాఁకె నిర్జరనాథున్. 359

క. పంచానన వాహనుఁ డై, చంచ ద్గద జంభుఁ డెత్తి శైలారినిఁ దా
కించి సురేభంబును నొ, ప్పించి విజృంభించి యార్చి పేర్చెం గడిమిన్. 360

క. వీఁక చెడి ఘన గదాహతిఁ, దోఁకయుఁ గదలింపలేక దుస్సహపీడన్
మ్రోఁకరిలఁ బడియె నేలను, సోఁ కోర్వక దిగ్గజంబు సుడిసుడి గొంచున్. 361

వ. అయ్యెడ. 362

క. సారథి వేయు హయంబుల, [1]తే రాయితపఱిచి తేర దేవేంద్రుఁడు దా
నారోహించెను దైత్యుఁ డు, దారత మాతలిని శూలధారం బొడిచెన్. 363

ఆ. శూలనిహతి నొంది స్రుక్కుచు నొచ్చిన
సూతు వెఱకు మంచు సురవిభుండు
వాని శిరము దునిమె వజ్రఘాతంబున
దైత్యసేన లెల్లఁ దల్లడిలఁగ. 364

చ. చని సురనాథుచేఁ గలన జంభుఁడు సచ్చుట నారదుండు చె
ప్పిన విని వాని భ్రాతలు గభీరబలాధికుఁ డా బలుండు పా
క నముచు లా పురందరునిఁ గాంచి ఖరోక్తులఁ దూలనాడుచున్
ఘన జలధారల న్నగము గప్పిన చాడ్పునఁ గప్పి రమ్ములన్. 365

---

1. తేరాయత్తంబుసేసె (హ)

సీ. విబుధలోకేంద్రుని వేయుగుఱ్ఱంబుల నన్ని కోలల బలుం డదర నేసె
నిన్నూట మాతలి నిన్నూట రథమును నారీతి నింద్రు ప్రత్యంగకముల
వేధించెఁ బాకుండు వింట వాఁ డస్త్రంబు లేయుట దొడుగుట యెఱుఁగరాదు
కనకపుంఖంబుల కాండంబు లొకపది యేనింట నముచియు నేసి యార్చె

ఆ. బలిమి నిట్లు ముగురు పగవాని రథసూత
[1]సహితు ముంచి రస్త్రజాలములను
వనజలోక సఖుని వానకాలంబున
మొగులుగములు మునుఁగ [2]మూఁగినట్లు. 366

వ. అ య్యవసరంబున. 367

మ. అమరారాతుల బాణజాలముల పాలై పోయితే చెల్లరే
యమరాధీశ్వర! యంచు [3]భిన్నతరులై యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకు వణిగ్జనంబుల క్రియం దైత్యాధిపవ్యూహ మ
ధ్యమునం జిక్కిరి వేల్పు లందఱు విప ద్ధ్వానంబులన్ జేయుచున్. 368

శా. ఓహో దేవతలార! కుయ్యిడకుఁ డే నున్నాఁడ నం చంబుభృత్
వాహుం డా శరబద్ధ పంజరము నంతం జించి తేజంబునన్
వాహోపేత రథంబుతోడ వెలికిన్ వచ్చెన్ నిశాంతోల్లస
న్మాహాత్మ్యంబునఁ దూర్పునం బొడుచు నా మార్తాండు చందంబునన్. 369

వ. ఇట్లు వెలువడి. 370

చ. విఱిగిన సేనఁ గాంచి సురవీరుఁ డొహో యని బిట్టు చీరి క్ర
మ్మఱఁ బురికొల్పి పాక బలమ స్తకముల్ నిశితాస్త్రధారల
న్నఱసిన తీక్ష్ణవజ్రమున నేలకు వ్రాల్చెను వాని చుట్టముల్
వెఱచిరి త చ్చమూపతులు విహ్వలులై చెడి పాఱి రార్తితో. 371

వ. అప్పుడు నముచి నిలువంబడి. 372

మ. తన చుట్టంబులఁ జంపె వీఁ డనుచు నుద్య త్క్రోధ శోకాత్ముఁడై
కనకాంతంబును నశ్మసారమయమున్ ఘంటాసమేతంబునై
జనదృ గ్దుస్సహమైన శూలము నొగిన్ సారించి వైచెన్ సురేం
ద్రునిపై దీన హతుండ వౌ దని మృగేంద్రుం బోలి గర్జించుచున్. 373

---

1. సహితముగను శస్త్రజాలములను (హ) 2. ముంచునట్లు (తం) 3. ఖిన్నతనులై (హ) ఖిన్నతరులై (తం. వా.)

శా. ఆకాశంబున వచ్చు శూలమును జంభారాతి ఖండించి నా
నా కాండంబుల వాని కంఠము దెగన్ దంభోళియున్ వైచె న
స్తోకేంద్రాయుధమున్ సురారిగళమున్ ద్రుంపంగలే దయ్యె వాఁ
డాకంపింపక నిల్చె దేవవిభుఁ డత్యాశ్చర్యమున్ బొందఁగన్. 374

వ. ఇట్లు నిలిచియున్న నముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతం బగుటకు శంకించి, బలభేది తన మనంబున. 375

సీ. కొండలఱెక్కలు ఖండించి వైచుచో వజ్ర మెన్నఁడు నింత వాఁడి సెడదు
వృత్రాసురాదుల విదళించె నీ పవి తిరుగ దెన్నఁడు పగ దీర్చి కాని
యింద్రుఁడఁ గానొకో యేను దంభోళియుఁ గాదొకో యిది ప్రయోగంబు చెడెనొ
దనుజాధముఁడు మొనతాఁకు దప్పించెనో భిదురంబు నేఁ డేల బెండువడియె

ఆ. ననుచు వజ్రి వగవ నార్ద్రశుష్కంబులఁ
జావకుండఁ దపము [1]సలిపె నీతఁ
డితర మెద్ది యైన నింద్ర ప్రయోగింపు
వైళ మనుచు దివ్యవాణి వలికె. 376

వ. ఇట్లుపదేశించిన దివ్యవాణి పలుకు లాకర్ణించి యింద్రుండు. 377

ఆ. ఆత్మబుద్ధిఁ దలఁచె నార్ద్రంబు శుష్కంబు
గాని సాధనంబు ఫేన మనుచు
[2]నదియ వైచి దాన నమరులు మెచ్చంగ
నముచి శిరముఁ ద్రుంచె నాకవిభుఁడు. 378

వ. అ య్యవసరంబున. 379

సీ. పురుహూతు నగ్గించి పుష్పాంజలులు సేసి మునులు దీవించిరి ముదముతోడ
గంధర్వ ముఖ్యులు ఘనులు విశ్వావసుఁడును పరావసుఁడు నిం పెనయఁ బాడి
రమరాంగనాజను లాడిరి దేవతా దుందుభులును మ్రోసె దురములోన
వాయు వహ్ని కృతాంత వరుణాదులును [3]బ్రతి ద్వంద్వుల గెల్చి రుద్దండవృత్తి

తే. నల్పమృగముల సింహంబు లట్ల తోలి
రమరవర్యులు దనుజుల నదటువాయ
నజుఁడు పుత్తేర నారదుఁ డరుగుదెంచె
దైత్య హారణంబు వారింప ధరణినాథ! 380

1. సలిపె నకట (హ) 2. అదియ వైచెఁ దాన (హ) 3. ప్రీతి ద్వంద్వుల గెల్చి (హ)

వ. వచ్చి సురలకు నారదుం డి ట్లనియె. 381

శా. సిద్ధించెన్ సురలార! మీ కమృతమున్ శ్రీనాథసంప్రాప్తు లై
వృద్ధిం బొందితి రెల్ల వారలును విద్వేషుల్ మృతింబొంది రీ
యుద్ధం బేటికి నింకఁ జాలుఁ బనిలే దోహో పురే యంచుసం
బద్ధాలాపము లాడి మాన్చె సురలం బాండవ్య వంశాగ్రణీ! 382

వ. ఇట్లు నారదవచేన నియుక్తు లై, రాక్షసులతోడి సంగ్రామంబు సాలించి, సకల దేవముఖ్యులునుం ద్రివిష్టపంబునకుం జనిరి. హతశేషు లైన దైత్యదానవులు, [1]విపన్నుం డైన బలిం దోడ్కొని, పశ్చిమ శిఖరి శిఖరంబుఁ జేరిరి. విధ్వంసమాన కంధరు లై, వినష్టదేహు లగు యామినీచరుల నెల్లను శుక్రుండు మృతసంజీవని విద్య పెంపునంజేసి బ్రతికించె. బలియును భార్గవానుగ్రహంబున విగత శరీర వేదనుండై, పరాజితుండయ్యును, లోకత త్త్వ [2]విచక్షణుం డగుటంజేసి దుఃఖింపక యుండె. అని చెప్పి రాజునకు శుకుం డి ట్లని యె. 383

అధ్యాయము – ౧౨

సీ. కై లాసగిరిమీఁద ఖండేందుభూషణుం డొకనాఁడు కొలువున నున్న వేళ
నంగన నై యె విష్ణుఁ డసురుల వంచించి సురలకు నమృతంబు చూఱలిడుట
విని దేవియును దాను వృషభేంద్రగమనుఁడై కడువేడ్క భూతసంఘములుగొలువ
మధుసూదనుం డున్న మందిరంబున కేఁగి పురుషోత్తమునిచేతఁ బూజ లొంది

తే. తాను గూర్చుండి పూజించె దనుజవై రి
కుశలమే మీకు మాకును గుశల మనుచు
మధురభాషల హరిమీఁద మైత్రి నెఱపి
హరుఁడు పద్మాక్షుఁ జూచి యి ట్లనియెఁ బ్రీతి. 384

సీ. దేవ! జగన్మయ! దేవేశ! జగదీశ! కాల! [3]జగద్వ్యాపకస్వరూప!
యఖిల భావములకు [4]నాత్మయు హేతువు నై న యీశ్వరుఁడ [5]వాద్యంతములును
మధ్యంబు బయలును మఱి లోపలయు లేక పూర్ణ మై యమృత మై భూరి సత్య
మానంద చిన్మాత్ర మవికార మాద్య మనన్య మశోకంబు [6]నగుణ మఖిల

---

1. విషణ్ణుండైన (తం) 2. లోకకాల (హ. తం.) 3. జగద్రూపక (హ.) 4. భూతములకు (తం. వా.) 5. ఆద్యంతములకు (హ. తం. వా.) 6. నఖిలగుణము (హ.)

తే. సంభవ స్థితి [1]లయముల సంగరహిత
మైన బ్రహ్మంబు నీవ నీ యంఘ్రియుగము
నుభయ సంగ విసృష్టు లై యున్న మునులు
కోరి కైవల్యకాము లై కొల్తు రెపుడు. 385

సీ. భావించి కొందఱు బ్రహ్మంబు నీ వని తలపోసి కొందఱు ధర్మ మనియుఁ
జర్చించి కొందఱు స దస దీశ్వరుఁ డని సరవిఁ గొందఱు శక్తిసహితుఁ డనియుఁ
జింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ డాత్మతంత్రుఁడు పరుం డధికుఁ డనియుఁ
దొడరి యూహింతురు తుది నద్వయ ద్వయ స దస ద్విశిష్ట సంశ్రయుఁడ వీవు

తే. తలఁప నొక్కంత వస్తుభేదంబు గలదె
కంకణాదుల పసిఁడి యొక్కటియ గాదె
కడలు వె క్కైన వార్ధి యొక్కటియఁ గాదె
భేద మంచును నిను వికల్పింప వలదు. 386

సీ. యద్విలాసము మరీచ్యాదు లెఱుంగరు నిత్యుఁడ వై యున్న నేను నెఱుఁగ
[2]న మ్మాయ నంధు లై యమరాసురాదులు వనరెద రఁట యున్న వార లెంత
నే రూపమునఁ బొంద కేపారుదువు నీవు రూపి వై సకలంబు రూపుసేయ
రక్షింపఁ జెఱుపఁ గారణ మైన సచరాచ రాఖ్య మై విలసిల్లు దంబరమున

తే. ననిలుఁ డేరీతి విహరించు నట్లు నీవు
గలసి వర్తింతు సర్వాత్మకత్వ మొప్ప
జగములకు నెల్ల బంధమోక్షములు నీవ
నీవ సర్వంబుఁ దలపోయ నీరజాక్ష! 387

మ. ఘనత న్నీ మగపోఁడుముల్ పలుమఱుం [3]గన్నారముఁ గీనులన్
నిను విన్నారము చూడ మెన్నఁడును ము న్నీ యాఁడు చందంబు మో
హిని వై దైత్యులఁ గన్నుఁ ద్రిమ్మి యమృతం బింద్రాది దేవాళి కి
చ్చిన నీ రూపముఁ జూపుమా కుతుకముల్ జిత్తంబునం బుట్టెడిన్. 388

క. [4]మగవాఁడ వై జగంబులఁ, [5]దగిలిచి చిక్కులను బెట్టు దంటవు నీకున్
మగువతనంబున జగములఁ, దగులముఁ బొందింప నెంతతడవు ముకుందా! 389

వ. అని పలుకుచున్న శూలపాణిచే నపేక్షితుం డై, విష్ణుండు భావగంభీరం బగు
నవ్వు నివ్వటిల్ల న వ్వామదేవున కి ట్లనియె. 390

---

1. లయముల దంభకంబు(వా.); లయమూల దంభకంబు (తం.) 2. యన్మాయ (హా.తం.వా.) 3. గన్నారఁ గన్నారమే (హా. వా.) 4. మగవాఁడవయ్యు (తం.) 5. దగులం జిక్కులను బెట్టు(తం)

శా. శ్రీకంఠా! నిను నీవ యేమఱకుమీ చిత్తంబు రంజించెదన్
నాకద్వేషుల డాఁగురించుటకు నై నాఁ డేను గైకొన్న కాం
తాకారంబు జగన్నిమజ్జనము [1]నీ వై చూచెదేఁ జూపెదన్
గైకో నర్హము లండ్రు కాముకులు సంకల్ప [2]ప్రభూతార్థముల్. 391

—: శ్రీహరి తన మోహినీస్వరూపముచేత నీశ్వరుని మోహింపఁజేయుట :—

వ. అని పలికి, కమలలోచనుం డంతర్హితుం డయ్యె. అయ్యుమాసహితుం డైన భవుండు విష్ణుం డేడఁ బోయెనో, యెందుఁ జొచ్చెనో, యని దశదిశలుం గలయ నవలోకించుచుండం దన పురోభాగంబున. 392

సీ. ఒక యెలదోఁటలో నొక వీథి నొక నీడఁ గుచకుంభములమీఁది కొంగు దొలఁగఁ
గబరికాబంధంబు గంపింప నుదుటిపైఁ జికురజాలంబులు చిక్కువడఁగ
ననుమాన మై మధ్య మల్లాడఁ జెక్కులఁ గర్ణకుండలకాంతి గంతు లిడఁగ
నారోహభరమున నడుగులు దడఁబడఁ దృగ్దీప్తిసంఘంబు దిశలు గప్ప

తే. వామకరమున జాఱిన వలువఁ బట్టి
కనక నూపురయుగళంబు ఘల్లనంగఁ
గంకణంబుల ఝణఝణత్కార మెసఁగ
బంతిచే నాడు ప్రాయంపు టింతిఁ గనియె. 393

వ. కని, మున్ను మగువ మరగి సగమైన మగవాఁ, డమ్మగువ వయో రూప గుణ విలాసంబులు తన్ను నూరింపం, గనుఱెప్ప వెట్టక తప్పక చూచి, మెత్తనైన చిత్తంబున. 394

శా. ఈ కాంతాజనరత్న మెవ్వరిదొకో యీ యాఁడురూపంబు ము
న్నేకల్పంబులయందుఁ గాన మజుఁడీ యింతిన్ సృజింపంగఁ దా
లేకుం జెల్ల నిజంబు వల్లభత నీ లీలావతిం జేరఁగా
నేకాంతుండు గలండొ క్రీడలను నాకీ యింతి సిద్ధించునే. 395

వ. అని మఱియుం జెఱకువిలుతుని కోలలు [3]మేరమీఱి దఱుమ, నెఱబిరుదు వెఱఁగుపడం, దెఱవఁ దుఱిమిన తుఱుము బిగిముడి వదలి కదలి భుజముల మెడల నదరి చెదరిన కుఱులు నొసలి మృగమద తిలకంపు టసలు మసల, విసవిస నగు మొగము మెఱుంగులు దశదిశలం బసలుగొలుపఁ, జిఱునగవు మెఱయ, నునుఁజెమటఁ దడంబడి [4]పులకలుగొన, హృదయానంద కందం బగు కందు

1. నీకై (హ.) 2. సంకల్ప ప్రభావంబులన్ (హ.వా.) సంకల్ప ప్రభూతాత్మముల్ (తం.)
3. మెరవడి దరిసిన (క. ద.) 4. పులకరములు గులకరములుగొన (తం. వా.)

కంబు కరారవిందంబునం దమర్చి, యక్కునం జేర్చి, చెక్కున హత్తించి, చుబుకంబు మోపి, చూచుకంబులం గదియించి, నఖంబుల మీటుచు, మెల్ల మెల్లన గెల్లాడు కరకమలములం గనక మణివలయములు ఝుణఝుణ యనం, గుచకలశములు నొకటి నొకటి నొఱయ, నెడమ కుడినిం దడంబడం, గ్రమ్మన నెగురంజిమ్ముచు, నెగరజిమ్మి, తనకుం దానె కొన్ని చిన్న పన్నిదంబులు చేసికొని, బడుగునడుము బెడసి వడవడ వడంక, నఱితి సరులు కలయంబడం దిరుగుచుం బెనకువలు గొనం, జెవులతొడవుల రుచులు కటముల నటనములు సలుపం, బవిరి తిరిగి రొయుడియుచు, నొడిసి కెలంకులకుం జడియుచు, జడిసి జడను వడక, వలువ నెలవువదలి దిగంబడం, గటిస్థలంబునం గాంచీ కనకమణి కింకిణులు మొరయం, జరణకటకములు ఘల్లుఘల్లుమనంగ, మితిదప్పిన మోహాతిరేకం బుప్పొంగ, వెనుకొని యుఱికి పట్టుచుం, బట్టి పుడమిం బడవైచి, పాటువెంటనే మింటి కెగసినం, గెంటక కరంబునం గరంబు దిరం బై పలుమఱు నెగయ నడుచుచు, నెగయునెడ దిగంబడుతఱిని, నీలంపు మెఱుంగునిగ్గు సొగపగ్గంబుల వలలు వైచి, రా దిగిచినపగిది వెనుకొనంగ, విలోకనజాలంబులు నిగిడించుచు, మగిడించుచుం, గరలాఘవంబున నొకటి, పది, నూఱు, వేయు నేసి, నేర్పు వాటింపుచు నరుణ చరణకమల రుచుల నుదయశిఖరి శిఖర తరణి కరణి సేయుచు, [1]ముఖచంద్ర చంద్రికలు మండలంబులు గావింపుచు, నెడనెడ నురోజదుర్గ నిర్గత చేలాంచలంబుం జక్క నొత్తుచుం, గపోలఫల కాలోల ఘర్మజల బిందుబృందంబులు నఖాంతంబుల నోసరింపుచు, నధర బింబారుణ సంభ్రాంత సమాగత రాజకీరంబులం జోపుచు, ముఖసరోజ పరిమళాసక్త మత్తమధుపంబుల నివారింపుచు, మందగమనాభ్యాస కుతూహలాయత్త మరాళయుగ్మంబులకుం దలంగుచు, విలాసవీక్షణానందిత మయూరమిథునంబులకు నెడంగలుగుచుం, బొదరిండ్ల యూఱంబులకుం బోక మలంగుచుం, గరకిసల యాస్వాదకాముక కలకంఠ దంపతులకు దూరింపుచుం, దీఁగె యుయ్యాలల నూఁగుచు, మాధవీమంట పంబు లెక్కుచుం, గుసుమ రేణుపటలంబుల గుబ్బళ్లు వాకుచు, మకరందస్యంద బిందుబృందం బుత్తరింపుచుం, గృతకశైలంబుల నారోహింపుచుం, బల్లవ పీఠంబులం బరిశ్రమంబు వుచ్చుచు, లతాసౌధభాగంబులం బొడసూపుచు, నున్నత కేతకీ స్తంభంబుల నొరగుచుం, బుష్పదళ ఖచిత వాతాయనంబులం దొంగిచూచుచుం, గమలకాండ పాలికల నాలంబించుచుం, జంపకగేహాళి మధ్యం బుల నిలువంబడుచుం, గదళికాపత్ర వాతంబుల నొఱయు పరాగనిర్మిత సాల

1. ముఖచంద్ర చంద్రికలం జంద్రమండలంబులు గావించుచు (తం. వా.)

భంజికానివహంబుల నాదరింపుచు, మణికుట్టిమంబుల మురియుచుఁ, జంద్రకాంత వేదికల నెలయుచు, రత్నపంజర శారికానివహంబులకుం జదువులు చెప్పుచుఁ, గోరినక్రియం జూచుచుఁ, జూచినక్రియ మెచ్చుచు, మెచ్చినక్రియ వెఱఁగుపడుచు, వెఱఁగుపడినక్రియ మఱచుచు, మఱవక యేకాంతం బగు న వ్వనాంతంబున ననంతవిభ్రమంబుల జగన్మోహిని యై విహరింపుచున్న సమయంబున. 396

ఆ. వాలుఁగంటి వాఁడి వాలారుఁ జూపుల
శూలి ధైర్యమెల్లఁ గోలుపోయి
తఱలి యెఱుకలేక మఱచె గుణంబుల
నాలి మఱచె నిజ గణాలి మఱచె. 397

వ. అప్పుడు, 398

ఆ. ఎగురవైచి పట్టి నెడలేమిఁ జేదప్పి
వ్రాలుబంతిఁ గొనఁగ వచ్చునెడను
బడఁతి వలువ వీడి పడియె మారుతహతిఁ
జంద్రధరుని మనము సంచలింప. 399

మ. రుచిరాపాంగిని వస్త్రబంధనపరన్ రోమాంచ విభ్రాజిత
గ్గుచభారానమితం గరద్వయపుటీ గూఢీకృతాంగిం జల
త్కచబంధం గని మన్మథాతురత నాకంపించి శంభుండు ల
జ్జ చలింపం దన కాంత సూడఁ గదిసెం జంద్రాస్య కేల్దమ్మికిన్. 400

ఆ. పదము సేరవచ్చు ఫాలాక్షుఁ బొడగని
చీర వీడిపడిన సిగ్గుతోడ
మగువ నగుచుఁ దరులమాటున డాఁగెను
వేల్పుఱేఁడు నబలవెంటఁ బడియె. 401

మ. ప్రబలోద్యత్ కరిణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చులీలన్ శివుం
డబలా! "పోకుము పోకువే" యనుచు డాయం బాఱి కెంగేలఁ దాఁ
గబరీబంధము వట్టి సంభ్రమముతోఁ గౌఁగిళ్ళ నూరార్చె నం
త బహుఃప్రక్రియ నెట్టకేనిఁ గదియం ద ద్బాహు నిర్ముక్త యై. 402

సీ. వీడి వెన్నున నాడు వేణీభరంబుతో జఘనభారాగత శ్రాంతితోడ
మాయావధూటి యై మఱలి చూచుచుఁ బాఱు విష్ణు నద్భుతకర్ము వెంటఁ దగిలి
యాశాను మఱల జయించె మరుం డనఁ గరిణి వెన్చను కరి కరణిఁ దాల్చి
కొండలు నేఱులు కొలఁకులు వనములు దాఁటి శంభుఁడు సనం ద న్మహాత్ము

తే. నిర్మ లామోఘ వీర్యంబు నేలమీఁదఁ
బడిన చోటెల్ల వెండియుఁ బైఁడి యయ్యె
ధరణి వీర్యంబు వడఁ దన్నుఁ దా నెఱింగి
దేవమాయా జడత్వంబుఁ దెలిసె హరుఁడు. 403

క. జగదాత్మకుఁ డగు శంభుఁడు, మగిడెను హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమునన్
విగత త్రపుఁ డై నిలిచెను, మగువతనం బుడిగి హరియు మగవాఁ డయ్యెన్.

ఆ. కాము గెలువవచ్చుఁ గాలారి గావచ్చు
మృత్యుజయము గలిగి మెఱయవచ్చు
నాఁడువారి చూపు టంపఱ గెలువంగ
వశముగాదు త్రిపురవైరి కైన. 405

వ. ఇట్లు పురుషాకారంబు వహించిన హరి హరున కిట్లనియె. 406

సీ. నిఖిలదేవోత్తమ ! నీ వొక్కరుఁడు దక్క నెవ్వఁడు నా మాయ నెఱుఁగనేర్చు
మానిని యైన నా మాయచే మునుఁగక ధృతి మోహితుండ వై తెలిసి తీవు
కాలరూపంబునఁ గాలంబుతోడ[1] నా యందును నీ మాయ యధివసించు
నీమాయ నన్ను జయింపనేరదు నిజ మకృతాత్ములకు [2]నెల్ల ననుపలభ్య

తే. యిపుడు నీ నిష్ఠ పెంపున నెఱిఁగి తనుచు
సత్కరించిన సఖ్యంబు చాల నెఱపి
దక్షతనయ గణంబులుఁ దన్నుఁ గొలువ
భవుఁడు విచ్చేసెఁ దగ నిజభవనమునకు. 407

శా. పారావారముఁ ద్రచ్చుచో [3]గిరి సముద్వాహార్థ మై కచ్ఛపా
కారుం డైన రమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింప సం
సారాంభోనిధిలో మునుంగు కుజనుల్ సంశ్రేయముం బొంది వి
స్తారోదార సుఖంబుఁ జెందుదురు తథ్యం బింతయున్ భూవరా ! 408

మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం
జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి ని
ర్మలరేఖన్ విలసిల్లు శ్రీవిభునిఁ ద న్మాయావధూ రూపముం
దలఁతున్ మ్రొక్కుదు నాత్మలోన [4]దురిత ధ్వాంతోగ్ర దీపంబుగన్. 409

---

1. తోడుత, నాయందు నీమాయ యధివసించు(హ) 2. ఎట్లు మనుపలభ్య, మిపుడు నీ నిష్ఠ పెంపున నిలిచి తనుచు(హ) 3. గిరిసముద్యద్భార మై (హ. వా.); ఈపాఠమున యతి భంగము. సముద్భారార్థ మై (తం) ఈ పాఠమున అర్థము సరిపడదు. 4. దురిత ధ్వాంతోగ్ర రూపంబుగన్ (హ); దురిత ధ్వాంతార్క రూపంబుగన్ (వా)

## అధ్యాయము - ౧౩

వ. అని చెప్పి శుకుం డి ట్లనియె. 410

తే. నరవరాధీశ! యిప్పుడు నడుచుచున్న
వాఁడు సప్తమమనువు వైవస్వతుండు
[1]శ్రాద్ధదేవుం డనందగు జనవరేణ్య!
పదురు నందను లతనికిఁ బ్రకటబలులు. 411

వ. వార లిక్ష్వాకుండును, నభగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుండును నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, వృషధ్రుండును, వసుమంతుండు, ననువారు పదుగురు రాజులు. పురందరుఁ డనువాఁ డింద్రుండును, ఆదిత్యమరు దశ్వి వసు రుద్ర సంజ్ఞలం గలవారు దేవతలును, గౌతమ కశ్య పాత్రి విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ వసిష్ఠు లను వారు సప్తర్షులు నై యున్నవారు. అందుఁ గశ్యపున కదితిగర్భంబున విష్ణుండు వామనరూపుం డై జనియించి, యింద్రావరజుం డయ్యె. ఇప్పు డేడుమన్వంతరంబులు సెప్పంబడియె. రాగల మన్వంతరంబులును, శ్రీహరి పరాక్రమంబునుఁ జెప్పెద. దత్తావధానుండ వై వినుము. అని శుకుం డి ట్లనియె. 412

సీ. జననాథ! సంజ్ఞయు ఛాయయు ననువారు గల రర్కునకు విశ్వకర్మతనయ
లిరువురు వల్లభ లిటమున్న చెప్పితిఁ బరఁగఁ దృతీయయు బడబ యనఁగ
సంజ్ఞకు యముఁడును శ్రాద్ధదేవుండును [2]యమునయుఁ బుట్టిరి హర్ష మెసఁగ
ఛాయకుఁ దపతియు సావర్ణియును శనైశ్చరుఁడును గలిగిరి సంవరుణుఁడు

తే. తపతి నాలిఁగఁ గైకొని తా వరించె
నశ్వియుగళంబు బడబకు నవతరించె
వచ్చు నష్టమవసువు సావర్ణి వాఁడు
తపము సేయుచునున్నాఁడు ధరణినాథ! 413

క. ఒకపరి చూచిన వెండియు, నొకపరి చూడంగలేక యుండు సిరులకున్
నొకనొకని [3]చేటు వేళకు, [4]నొకఁడొకఁడు మనుండు గాచియుండు నరేంద్రా!

వ. సూర్యసావర్ణి మన్వంతరంబున నతనితనయులు, నిర్మోహ విరజస్కాద్యులు రాజులును, సుతపో విరజామృత ప్రభు లనువారు దేవతలును గాఁగలరు. గాల

1. శ్రాద్ధదేవుండు నందురు జనులువాని(క) 2. యమియును(క); "యమోయమీ శ్రాద్ధదేవశ్చ" (13-9); 'యమీ యమునా'(వ్యా) 3. చోటు వేళకు(తం) 4. ఒక్కఁడొక్కనాఁడు మనువుగాచి(తం.వా.)

వుండును, దీప్తిమంతుండును, బరశురాముండును, ద్రోణపుత్రుం డగు నశ్వత్థామయుఁ,గృపుఁడును, మజ్జనకుం డగు బాదరాయణుండును,ఋష్యశృంగుఁడు ననువారు సప్తర్షు లయ్యెదరు. వార లిప్పుడు దమ తమ యోగబలంబుల నిజాశ్రమమండలంబులం జరియింపుచున్న వారు. విరోచన నందనుం డగు బలి యింద్రుం డయ్యెడు. అని చెప్పి శుకుం డిట్లనియె. 415

సీ. బలి మున్ను నాకంబు బలిమిమైఁ జేకొన్న వామనుం డై హరి వచ్చి వేఁడఁ
బాదత్రయం బిచ్చి భగవన్నిబద్ధుఁ డై సురమందిరముకంటె సుభగ మైన
సుతలలోకంబున సుస్థితి నున్నాఁడు [1]వెతలేక నిట మీఁద వేదగుహికి
నా సరస్వతికిఁ దా నట సార్వభౌముండు నాఁ బ్రభు వై హరి నాకవిభునిఁ

ఆ. బదవిహీనుఁ జేసి బలిఁ దెచ్చి నిలుపును
బలియు నిర్జరేంద్రు పదము నొందు
నింద్రపదము హరికి నిచ్చినకతమున
దానఫలము చెడదు ధరణినాథ! 416

వ. అటమీఁదటి కాలంబున వరుణ నందనుం డగు దక్షసావర్ణి తొమ్మిదవ మను వయ్యెడి. అతని కొడుకులు ధృతకేతు దీప్తకేతు ప్రముఖులు రాజులును, బర మరీచి గర్గాదులు నిర్జరులును, నద్భుతుం డనువాఁ డింద్రుండును, ద్యుతిమత్ప్రభృతు లగువారలు ఋషులు నయ్యెదరు. అందు. 417

ఆ. దనుజహరణుఁ డంబుధార కాయుష్మంతు
నకు జనించి రక్షణంబు సేయ
మూఁడు లోకములను మోదంబుతో నేలు
నద్భుతాఖ్య నొప్పు నమర విభుఁడు. 418

వ. మఱియు, నుపశ్లోకసుతుండగు బ్రహ్మసావర్ణి దశమమను వయ్యెడి. తత్పుత్రులు భూరిషేణాదులు భూపతులును, హవిష్మత్ప్రముఖులు మునులును, శంభుం డనువాఁ డింద్రుండును, విబుద్ధ్యాదులు నిర్జరులు నయ్యెదరు. అందు. 419

ఆ. [2]విశ్వసృజుని యింట విభుఁడు విషూచికి
సంభవించు నంశ సహితుఁ డగుచుఁ
జెలిమి శంభుతోడఁ జేయు విష్వక్సేనుఁ
డనఁగ జగముఁ గాచు నవనినాథ! 420

---

1. తెఱఁగొప్ప నటమీఁద దేవగుహికి (క) 2. విశ్వజిత్తునింట (హ)

వ. మఱియుం, దదాగమిష్య త్కాలంబున ధర్మసావర్ణి పదునొకొండవ మను వయ్యెడి. మనుతనూజులు, సత్యధర్మాదులు పదుండ్రు ధరణిపతులును, విహంగమ కామగమన నిర్వాణరుచు లనువారు సురలును, వైధృతుం డనువాఁ డింద్రుండు, నరుణాదులు ఋషులును నయ్యెదరు. అందుఁ 421

ఆ. అంబుజాత నేత్రుఁ డా సూర్యసూనుఁ డై
ధర్మసేతు వనఁగఁ దగ జనించి
వైభవాఢ్యుఁ డగుచు వైధృతుఁ డలరంగఁ
గరుణఁ ద్రిజగములను గావఁ గలఁడు. 422

వ. మఱియుం దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పండ్రెండవ మను వయ్యెడి. అతని నందనులు దేవవ దుపదేవ దేవశ్రేష్ఠాదులు వసుధాధిపతులును, ఋతుధాముం డనువాఁ డింద్రుండును, హరితాదులు వేల్పులును, దపోమూర్తి తప ఆగ్నీధ్రకాదులు ఋషులు నయ్యెదరు. అందు. 423

ఆ. జలజలోచనుండు సత్య తప స్సూనృ
తలకు సంభవించుఁ దనయుఁ డగుచు
ధరణిఁ గాచు నంచిత స్వధామాఖ్యుఁ డై
మనువు సంతసింప మానవేంద్ర ! 424

వ. మఱియుఁ దదేష్యత్కాలంబున నాత్మవంతుం డగు దేవసావర్ణి పదుమూఁడవ మను వయ్యెడి. మనుకుమారకులు చిత్రసేన విచిత్రాదులు జగతీనాయకులు. సుకర్మ సుత్రామ సంజ్ఞలం గలవారు బృందారకులును, దివస్పతి యనువాఁ డింద్రుండును, నిర్మోహ తత్త్వదర్శాద్యులు ఋషులు నయ్యెదరు. అందు. 425

ఆ. [1]ధరణిదేవ ! హోత్రదయితకు బృహతికి
యోగవిభుఁడు నాఁగ నుద్భవించి
వనజనేత్రుఁ డా దివస్పతి కెంతయు
[2]సౌఖ్య మాచరించు జగతినాథ ! 426

వ. మఱియు నచట వచ్చుకాలంబున నింద్రసావర్ణి పదునాల్గవ మను వయ్యెడి. మను నందనులు ఉరుగంభీర వస్వాదులు రాజులును, పవిత్ర చాక్షుషు లనువారు దేవగణంబులును, శుచి యనువాఁ డింద్రుండును, నగ్ని రాహు శుచి శుక్ర మాగధాదులు ఋషులు నయ్యెదరు. అందు. 427

---

1. అవని దేవహోత్రుఁ డైన గీష్పతికిని (హ) 2. సఖ్య (హ)

తే. తనర సత్రాయణునకు వితానయందు
భవము నొందెడి హరి బృహద్భానుఁ డనఁగ
విస్తరించుఁ గ్రియాతంతు విసరములను
నాకవాసులు ముద మొంద నరవరేణ్యా! 428

క. జగదీశ! త్రికాలములను, బొగడొందు మనుప్రకారములు సెప్పఁబడెన్
దగఁ బదునలువురు మనువులు, దెగయుగములు వేయు నడువ దివ మగునడకగున్.

అధ్యాయము – ౧౪

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 430

ఆ. ఈ పదంబులందు నీ మనుప్రముఖుల
నెవ్వ రనుపువార లేమి కతన
నధిక విభవులై రి హరి యేల జనియించె
నెఱుఁగఁ బలుకు మాకు నిద్ధచరిత! 431

వ. అనినం బారాశర్య కుమారుం డిట్లనియె. 432

సీ. మనువులు మునులును మనుసుతు లింద్రులు నమరులు హరియాజ్ఞ నడఁగువారు
యజ్ఞాదు లందఱు హరి పౌరుషాకృతు లా మనువులు తత్సహాయ శక్తి
జగములు నడుపుదు రొగి నాల్గుయుగముల కడపటఁ గాలసంగ్రస్తమైన
నిగమచయంబును నిజ తపోబలముల మరలఁ గాంతురు ఋషివరులు దొంటి

తే. పగిది ధర్మంబు నాలుగు పాదములను
గలిగి వర్తించు మనువులు గమలనేత్రు
నాజ్ఞఁ దిరుగుదు రేలుదు రవనిపతులు
జగతి భాగించి తమ తమ సమయములను. 433

వ. మఱియుం బ్రాప్తులైన వారల నింద్రపదంబులను, బహుప్రకారంబుల దేవపదం బులను హరి ప్రతిష్ఠించుచుండు. వారలు విహిత కర్మంబుల జగత్త్రయంబునుం బరిపాలింతురు. లోకంబులు సువృష్టులై యుండు. అందు. 434

సీ. యోగీశరూపుఁడై యోగంబు చూపును మౌనిరూపమునఁ గర్మంబు దాల్చు
సర్గంబుసేయుఁ బ్రజాపతి రూపుఁడై యింద్రుఁడై దైత్యుల నేపడంచు
జ్ఞానంబు నెఱిఁగించుఁ జతుర సిద్ధాకృతిఁ గాలరూపమునఁ బాకంబు సేయు
నానావిధాకార నామరూపంబులఁ గర్మలోచనులకుఁ [1]గానఁ బడఁడు

1. గలఁడులేఁడు (తం.)

ఆ. చనిన రూపములును జను రూపములు నింకఁ
జనఁగ నున్న రూపచయము నతఁడ
వివిధుఁ డై యనేక వృత్తి వెలుంగును
విష్ణుఁ డవ్యయుండు విమలచరిత ! 435

అధ్యాయము - ౧౫

వ. అనిన భూవరుం డిట్లనియె. 436

—: వామనచరిత్ర ప్రారంభము :—

మ. బలి నంభోరుహనేత్రుఁ డేమి కొఱకై పాదత్రయిన్ వేఁడె ని
శ్చలుఁడుం బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమాసంపన్నుఁ డై తాఁ బర
స్థలికిన్ దీనునిమాడ్కి నేల చనియెన్ ద ప్పేమియున్ లేక ని
ష్కలుషున్ బంధన మేల చేసెను వినం గౌతూహలం బయ్యెడిన్. 437

వ. అనిన మునినందనుం డిట్లనియె. 438

సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే బలి యెట్టకేలకు బ్రతికి వారి
చిత్తంబు రాఁ గొల్చి శిష్యుఁ డై వర్తింప వారు నాతని భక్తివలన మెచ్చి
విశ్వజి ద్యాగంబు విధితోడఁ జేయింప భవ్య కాంచన పట్టబద్ధ రథము
నర్కవాజులఁ బోలు హరులు కంఠీరవ ధ్వజము మహాదివ్య ధనువుఁ బూర్ణ

తే. తూణయుగళంబుఁ గవచంబుఁ దొలుత హోమ
పావకుం డిచ్చె నమ్లాన పద్మమాల
కలుషహరుఁ డగు తనతాత కరుణ నొసఁగె
సోమసంకాశ శంఖంబు శుక్రుఁ డిచ్చె. 439

వ. ఇ వ్విధంబున. 440

క. పాణియు రథియుఁ గృపాణియు, దూణియు ధన్వియును స్రగ్వి తురగియు దేహ
త్రాణియు ధిక్కృత విమత, ప్రాణియు మణికనక వలయ పాణియు నగుచున్.

మ. పలు దానంబుల విప్రులం దనిపి తద్భద్రోక్తులం బొంది పె
ద్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతల నంతర్భక్తిఁ బూజించి ని
ర్మలుఁ బ్రహ్లాదునిఁ జీరి నమ్రశిరుఁ డై రాజ ద్రథారూఢుఁ డై
వెలిఁగెన్ దానవభర్త శైలశిఖ రోద్దీప్తల ద్దవాగ్ని ప్రభన్. 442

క. దండిత మృత్యు కృతాంతులు, ఖండిత సుర సిద్ధ సాధ్య గంధర్వాదుల్
పిండిత దిశు లమరాంహిత, దండాధీశ్వరులు సములు దన్నుం గొలువన్. 443

క. చూపుల గగనము మ్రింగుచు, నేపున దివి భువియు [1]నావ లీవల సేయన్
రూపింపుచు దనుజేంద్రుఁడు, ప్రాపించెను దివిజ నగర పథము నరేంద్రా! 444

వ. ఇట్లు బలవంతుం డగు బలి, సురేంద్రుని సాధింప సమకట్టి, దండగమనంబు సేసి, నిడుద పయనంబులం జని చని. 445

మ. కనియెన్ బుణ్యజనౌకమున్ విగత రోగ స్వప్న [2]పీడాన్న ఖా
దన సం [3]శోకముఁ బుష్ప పల్లవ ఫలోద్దామ ద్రుమానీకమున్
స్వని తోద్ధూత పతాకమున్ బ్రవిచర ద్వైమాని కానీకమున్
ఘన గంగా సలిలైకమున్ మఘవయుక్త శ్రీకమున్ నాకమున్. 446

వ. కని, రక్కసులఱేఁడు వెక్కసం బై చాల్పుగల వేల్పులనెలవు దరియంజొచ్చి, చెచ్చెర ముందటకుం జని చని, ముందట నెడపడక [4]మొన మొగ్గ యిగురు చిగురు తలిరాకు జొంపంబు నన మొగుడుమొగ్గ యరవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁప దోరగాయ పండు గెలలతండంబుల వ్రేఁగు లాఁగలేక, మూఁగి వీఁగి వ్రేఁకలగు మ్రాఁకుల ప్రోకలకుఁ [5]బేట లగు పెందోఁటలును, తోఁటల గాటంబు లై నివ్వటిల్లు మవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ గవలు విప్పక కసిమసలు గలిగి, ముసరి కొసరి [6]పూని పాదుకొని తేనియ లాని, విసరు గలిగి, మసరు గవిసి, క్రొవ్వి, [7]రిమ్మగొని, జుమ్ముజుమ్మంచు జంజాటించు తేఁటిదాఁటులును, దాఁటు వడక నాటుకొని, కూడి, జోడు వీడక, క్రొమ్మావుల కమ్మని కొమ్మల నిమ్ముల ముసరి, పసిమిగల కిసలయంబులు పొసఁగంగ మెసఁగి, కిసరువడక కసరుచెడి, బిట్టు రట్టడితనంబుల మించి కరాళించు కోయిలల మొత్తంబును, మొత్తంబు లై చిత్తంబులు మత్తంబులుగఁ దత్తఱంబునం దీయని పండ్లకుఁ [8]గదియంబడి, కయ్యంబుసేసి, [9]యేస రేగి, బేసంబులు గాసంబులు గొని, వాసికెక్కి, పలు బాసలాడు బహుప్రకారంబు లగు కీరంబులును, గీరంబులకు నలి గడచి, మింట నంట నెగసి, [10]పెట్టలం బట్టి, చీరి, యిట్టట్టు చనక నెట్టకొని, నెలవుల వ్రాలుచు, నింపుగల రవములం గలుగు కలరవంబులును, కలరవంబు లలరం, [11]దొలంకుల కొలంకుల కెలంకులఁ గడంకలం బ్రియల నిడుకొని, క్రమ్మి, దొమ్మిచేసి,

---

1. అతలీతలసేయన్ (తం.) 2. పీడాన్నఖాదన సంకేతము (హ.) 3. శోకము (తం. వా). 4. మొనమోసి (తం. వా.) 5. పెంటలగు (హ.) 6. పూనిపోని (తం.) 7. ఱొమ్ముగొని (హ.); రెమ్మలుగొని (త.) 8. క్రయ్యంబడి (తం.) 9. యానఱేగి (హ.) 10. పిట్టలంబట్టి చీఱిన (హ.) 11. తలంకని కొలంకుల కెలంకుల కడపలం (హ.)

యెలదమ్మి [1]తూఁడుల వాఁడు లగు చంచువులం జించి, మెక్కి, చొక్కి, రెక్కల మిక్కిలి కలకలపడుచు నలబలంబులు సేయు హంసంబులును, హంసరుచి జనిత వికసనముల వికవిక నగుచుం బస గలిగి, మిసమిస మెఱచు పసిఁడి కెందమ్మి లిందిరామందిరంబుల చందంబు లగు కొలంకులును, గొలంకుల కరణిఁ దడిసి, వడవడ వడంకుచు, నల్లిబిల్లులు గొని, సాఁగిన తీఁగెయిండ్ల గండ్ల యీఱములం దొరములు సెడి, పలువిరుల కమ్మవలపుల వ్రేఁగునం [2]దూరలేక యీడిగలంబడు గాడ్పులును, గాడ్పులవలన నెగసి, గగనమున విరిసి, పలువన్నెలం జెన్నగు మేలుకట్టు పుట్టంబుల తెఱంగుల దట్టంబు లైన కుసుమపరాగంబులును, బరాగంబుల సరాగంబు లగు వాగుల వంతల చెంతల గఱికజొంపంబుల లంపులు దిని. మంపులు గొని, గుంపులుగొని, నెమర్లువెట్టుచు నొదువు గల పొదువులు గదల, వాడల జాడలం బరుగులిడు దూడల క్రీడల వేడుకలం గూడుకొని, యిళ్ళ వాకిళ్ళ కుంజేరి, పౌరుల [3]కోరికల కనుసారిక లగుచు, నమృతంబు గురియు కామధేనువులును, గామధేనువులకు నిలుప నీడ లగుచు, నడిగిన జనములకు ధనములు ఘనముగఁ బుడుకు కల్పతరువులును, గల్పతరువుల పల్లవమంజరులఁ గుంజరులకు విఱిచియిచ్చుచు, మచ్చికల కలిమిని మెచ్చుచుఁ [4]గృతకగిరుల చఱుల నడరు పడఁతుల నడలకు గురువు లగు మత్తేభంబులును, నిభంబుల సరస [5]నొరసికొని, వరుసఁ బరుసఁదనము లెడలి సుకరము లగు మకరతోరణ స్తంభంబులును, దోరణ స్తంభంబుల చేరువ నిలిచి, చెఱకు విలుతుం డొర వెఱికినం బెడిదము లగు నవకంపు మెఱుఁగుజిగురు టడిదముల తెఱంగున నిలుకడ సంపదలు గలుగు శంపల సొంపునం, గర చరణాది శాఖలం గల చంద్రరేఖల పోడిమిని, వాహిని గల మోహినీవిద్యల గ్రద్దన, చూపులకుం దీపు లొదవించుచు, [6]మర్మకర్మంబుల [7]యశంబుల వశంబు గలిగి, యనూనంబు లగు విమానంబు లెక్కి, చక్కవచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెర నెదురుసని, తూకొని, తోకొనిపోవు రంభాది కుంభి కుంభ కుచల కలకలంబులును, గలహంస కారండవ కోక సారస బృంద సుందర సుందరియు, నిందీవ రారవింద నంద దిందిందిరయు, నభంగయు, సభంగయు నగు గంగ నింగికిం బొంగి, మిగుల దిగులువడఁ బొగడ్తల కెక్కిన యగడ్తలును, నగడ్తల మిన్నేటి తేటనీట నీటు లీను పాటి సూటి చల్లులాటల మేటి కూటువలు గొనుచు నేచిన ఖేచరకన్యకా వారంబులును, వారవనితానుపూజిత దేహళీ పాటవంబు లగు గోపుర కనకకవాటంబులును, గవాటవేదికా ఘటిత మణిగణ

---

1. తూండ్లవాండ్లగు చంచువులం (హ.) 2 దూఁగలేక (తం.) 3. కోరికలు సారికె లగుచు(హా.) 4. చరమగిరిచరుల (హ.) 5. మెసరుకొని (హ.) 6. ధర్మకర్మంబుల(హ.) 7. వశంబు లరయు యశంబులు (వా.)

కిరణోదారంబు లగు నింద్రనీల స్తంభ [1]గంభీరతలును, గంభీర విమల కమలరాగ పాలికా మాలికావారంబు లగు చతుర్ద్వారంబులును, ద్వారదేశంబుల సావళ్ళం గావ ళ్ళుండి, ప్రొద్దులుపోక, రక్కసులవేల్పుల కయ్యంబులు నెయ్యంబులు నెప్పికొనుచున్న యస్త్ర శస్త్ర ధారులును, శూరులు నైన మహా ద్వారపాలక వీరులును, వీరరసజలధి వేలాకారంబు లయి, శుద్ధ స్ఫటిక బద్ధ మహోత్తాలంబు లగు సోపాన సుకుమారంబులును, సుకుమార మహారజత ప్రదీపంబు లగు వప్రంబులును, వప్రోపరి వజ్రకుడ్య శిరోభాగ చంద్రకాంత కాంత తరుణ హిమకర కిరణ ముఖరంబు లగు సాలశిఖరంబులును, శిఖరస్తోమ ధామ నికృత్త తారకంబులును, దారతారమణి శిలాకార కఠోరంబు లగుచు, మిగుల గరిత యగు నగరిసిరి [2]పెరిమ గల మగల మొగములు పొడగన, నిలుకడలకు నలువ నడిగికొని పడసిన పసిఁడి తెరవలల వడువున బెడంగునం దోరంబు లగు ప్రాకారంబులును, ప్రాకార కాంచనాంచిత యుద్ధసన్నద్ధ మహోశ్చర్వ గంధర్వవాహినీ పాలకంబు లగు మరకతాట్టాలకంబులును, నట్టాల కోత్తుంగ వజ్రమయ స్తంభోదంచనంబులును, బరభట ప్రాణవంచనంబులును, సముదంచనంబులు నగు దంచనంబుల తుదలు రథంబుల యిరుసు లొరసికొనం గోట యీావ లావల కావలిదివియల కరణి రుచిరము లగుచున్న దినకర హిమకర మండలంబులును, హిమకరమండలంబు నిద్దంపు టద్దం బని మూఁగి, తొంగిచూచుచు, [3]నళికఫలకములఁ గులకములు గొను నలకములం దఱిమి, తిలకములం దెఱఁగు పఱుచుకొని, సమయముల వెనుక నొదిగి, కదిసి, ముకురమునం బ్రతిఫలితు లైన పతు లితరసతుల రతుల కనుమతు లని, [4]కలఁగి, తలఁగిచని, [5]కాంతులకు సొలయు ముగుదలకు నేకాంతంబు లై, గగనసముచ్ఛేదనంబు లైన రాజసౌధంబులును, సౌధంబుల సిరుల ముత్తియపు సరులతోడి నిబ్బరపు గుబ్బచన్నుల చెన్నులం బ్రక్కలం జుక్కల పదుపు లుండ, మండిత సౌధశిఖరంబులకు శృంగారంబు లైన శృంగారంబులును, శృంగారశయన జాలక డోలికా నిశ్శ్రేణికాది విశేషరమ్యంబు లైన హర్మ్యంబులును, హర్మ్య కనకగవాక్ష రంధ్ర నిర్గత కర్పూర కుంకు మాగరు ధూప ధూమంబులును, ధూమంబులు జీమూత స్తోమంబు లని ప్రేమంబున [6]గొబ్బున గిబ్బటు పబ్బంబు లబ్బె నని, పురులుగొని, పురులు విన్నియల సిరులుగొనం గుటవిటపములం దటవట నటింపుచుఁ [7]బలుకులు

1. గంభీరంబులును (హా.) 2. మీరనమర మొగులు పొడగని (హా.) మీరనమరు మొగులు పొడగని (తం. వా.) 3. అళికఫలకఫలము లగు కలములుగొను (హా.) 3. కన్నుచెన్ను మఱల నీడ తలంగికలగి చని(హా) 5. కాంతులసొలయ(హా); కాంతులు వొలయ(తం. వా.) 6. గొబ్బునపాటు పబ్బులచ్చె నని(హా); గొబ్బునం ఉబ్బాటు పబ్బంబుల బ్బెనని(తం. వా.) 7. బారుజువిడిచి కిపురుపొడుచుచు (హా)

విరిసి, కికురువోడుచుచు, వలఱేని మఱుఁగుచదువుల టీకలనం, గేకలిడు నెమళ్లను, నెమళ్ళ పురుల నారలు నారు లగు విండ్ల నినదములను తలంపులఁ దోఁకలు వడసి, వీఁకలు మెఱసి, మూఁకలు గొని, దివి కెగిరి, రవికిం గవిసిన రాహువు క్రియం, దివిఁ దడఁబడు పడగలును, పడగలును గొడుగులును దమకు [1]నాలంబులకు నడియాలంబులుగఁ దోరంబు లైన సారంబుల తీరంబులు మెఱసి, బెబ్బులుల గ్రబ్బునం గరుల సిరుల, సింగంబుల భంగంబుల, శరభంబుల రభసంబుల, ధూమకేతువుల రీతుల వైరిం జీరికిం గొనక, శంక లుడిగి, అంకె లిడుచు, లంకె లై లెక్కకు మిక్కిలి లగుచు, రక్కసుల చక్కటి యెక్కటి కయ్యముల దయ్యము లెఱుంగం దిరుగు వీరభటుల కదంబంబులును, గదంబ కరవాల శూలాదుల మెఱుంగులు మెఱుపుల తెఱంగుల దిశల చెఱంగులం దుఱంగలింప, నేమి నినదంబులు [2]తుఱుము లగు నుఱుములుగ, నడ మొగుళ్ళ వెల్లునం, బ్రవర్తిత రథిక మనోరథంబు లగు రథంబుల గములును, గములుగొని, గమనవేగముల వలన హరిహరుల నగి, గాలిం జాలింబడ గెలిగొని, ఘనంబు లగు మనంబులం దెగడి, నెగడు సురంగంబు లగు తురంగంబులును, రంగ దుత్తుంగ విశద మద కల కరి కటతట జనిత మదసలిల కణగణ [3]విగణిత దశశతనయన భుజ సరళ మిళిత లలిత నిఖిల దిగధిపతి శుభకర కర కనక కటక ఘటిత మణిసముదయ సముదిత రేణువర్గ దుర్గమంబు లైన నిర్వక్ర మార్గంబులును, మార్గ స్థలోపరి గతాగత శతాయు తానేక గణనాతీత రోహణాచల తట విరాజమానంబు లగు విమానంబులును, విమాన విహారమాణ సుందర సుందరీ సందోహ సంపాదిత భూరి భేరీ వీణా పణవ మృదంగ కాహళ శంఖాది వాద నానూన గాన సాహిత్య నృత్య విశేషంబులును, విశేష రత్న సంఘటిత శృంగార శృంగాటక వాటికా గేహ దేహళీప్రదీపంబులును, దీపాయమాన మానిత సభామంటప ఖచిత రుచిర చింతారత్నంబులునుం గలిగి, రత్నాకరంబునుం బోలె ననిమిష కౌశిక వాహినీ విశ్రుతం బై, శ్రుతివాక్యంబునుం బోలె నకల్మష సువర్ణ ప్రభూతం బై, భూతపతి కంఠంబునుం బోలె భోగిరాజ కాంతం బై, కాంతాకుచంబునుం బోలె సువృత్తం బై, [4]వృత్తజాలంబునుం బోలె సదా గురు లఘు నియమాభిరామం బై, రామచంద్రుని తేజంబునుం బోలె ఖరదూషణాది దోషాచరానుపలబ్ధం బై, లబ్ధవర్ణ చరిత్రంబునుం బోలె [5]విమలాంతరంగ ద్యోతమానం బై, మానధనుని నడవడియునుం బోలె సన్మార్గభాతి సుందరం బై, సుందరోద్యా

---

1. హారంబులగు (హ.) 2. దళములగు (తం.వా.) 3. విగళిత (తం.వా.)
4. వృత్తజాతంబునుంబోలె (తం. వా.) 5. విమలశుద్ధాంతరంగ (బ్రా. ప్ర.)

నంబునుం బోలె రంభాంచి తాశోక పున్నాగం బై, పున్నాగంబునుం బోలె [1]సురభి సుమనో విశేషం బై, శేషాహి మస్తంబునుం బోలె నున్నత క్షమా విశారదం బై, శారదసముదయంబునుం బోలె ధవళజీమూత ప్రకాశితం బై, సితేతరాజినదానంబునుం బోలె సరస తిలోత్తమం బై, యుత్తమపురుష వచనంబునుం బోలె ననేక సుధారస ప్రవర్షం బై, వర్షాదియునుం బోలె నుల్లస దింద్రగోపం బై, గోపతి మూఁపురంబునుం బోలె విచక్షు రార్యాలంకృతం బై, కృతార్థం బైన యమరావతి నగరంబు చేరం జని, కోటచుట్టునుం బట్టు గలుగ బలంబును జలంబుల విడియించి, పొంచి, మార్గంబు లెల్ల నరికట్టుకొని, యేమఱక యుండె. అంత. 447

క. మాయరు నగవులకును గను, మూయరు కాలంబుకతన ముదియరు ఖలులం
డాయరు పుణ్యజనంబులఁ, బాయరు సురరాజు వీటి ప్రమదాజనముల్. 448

వ. అప్పుడు. 449

క. దుర్భర దానవశంఖా, విర్భూత ధ్వనులు నిండి విబుధేంద్ర వధూ
గర్భములు పగిలి లోపలి, యర్భకతతు లావు రనుచు నాక్రోశించెన్. 450

వ. అంత. 451

సీ. బలి వచ్చి విడియుట బలభేది వీక్షించి గట్టిగాఁ గోటకుఁ గాపువెట్టి
దేవవీరులుఁ దాను దేవతామంత్రిని రప్పించి సురవైరిరాకఁ జెప్పి
ప్రళయానలుని భంగి భాసిల్లుచున్నాఁడు ఘోరరాక్షసులను గూడినాఁడు
మన కోడి చని నేఁడు మరల వీఁ డేతెంచె నేతపంబున వీని కింత వచ్చె

ఆ. నీ దురాత్మకునకు నెవ్వఁడు తోడయ్యె
నింక వీని గెల్వ నేది త్రోవ
యేమి చేయువార మెక్కడి మగఁటిమి
యెదురు మోహరింప నెవ్వఁ డోపు. 452

క. మ్రింగెడు నాకాశంబును, బొంగెడు నమరాద్రికంబెఁ బొడ వై వీఁడున్
మ్రింగెడు కాలాంతకుక్రియ, భంగించును మరలఁబడ్డఁ బంకజగర్భున్. 453

క. ఈరాదు రాజ్య మెల్లను, బోరాదు రణంబు సేయఁ బోయితి మేనిన్
రారాదు దనుజుచేతను, జారా దిటమీఁద నేమి జాడ మహాత్మా! 454

వ. అనిన సురరాజునకు నాచార్యుం డిట్లనియె. 455

---

1. సురభిమనోమాన విశేషంబై (హ.)

సీ. వినవయ్య ! దేవేంద్ర ! వీనికి సంపద బ్రహ్మవాదులు భృగుప్రవరు లర్థి
నిచ్చిరి రాక్షసు నెదురింప వారింప హరి యీశ్వరుఁడు దక్క నన్యజనులు
నీవును నీ సముల్ నీకంటె నధికులుఁ జాలరు రాజ్యంబు సాలు నీకు
విడిచిపోవుట నీతి విబుధనివాసంబు విమతులు నలఁగెడు వేళ సూచి

తే. మరలి మఱునాడు వచ్చుట మా మతంబు
విప్రబలమున వీనికి వృద్ధివచ్చె
వారిఁ గైకొన కిటమీఁద వాఁడి చెడును
దలఁగు మందాక [1]రిపు పేరు తడవవలదు. 456

క. పరు గెలువవలయు నొండెను, సరి పోరఁగవలయు నొండెఁ జావలె నొండెన్
సరి గెలుపు మృతియు దొరకమి,సరసంబుగ మున్నె తొలఁగి చనవలె నొండెన్.

వ. అనినఁ గార్యకాల [2]నిదర్శి యగు బృహస్పతి వచనంబులు విని, కామరూపు లై దివిజులు త్రివిష్టపంబున్ విడిచి,తమతమ పొందుపట్లకుం జనిరి. బలియునుం బ్రతిభట వివర్జిత యగు దేవధాని నధిష్ఠించి, జగత్త్రయంబునుం దనవశంబు చేసికొని, విశ్వ విజయుం డై, పెద్దకాలంబు రాజ్యంబు సేయుచుండె. శిష్యవత్సలు లగు భృగ్వాదు లతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి. త త్కాలంబున. 458

శా. అర్థుల్ వేఁడరు దాతలుం జెడరు సర్వారంభముల్ పండుఁ బ్ర
త్యర్థుల్ లేరు మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చుఁ బూ
ర్ణార్థుల్ విప్రులు వర్షముల్ గురియఁ గాలార్హంబు లై ధాత్రికిన్
సార్థం బయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్. 459

వ. అంత. 460

## అధ్యాయము-౧౭

సీ. తన తనూజులప్రోలు దనుజులు గొనుటయు వేల్పు లెల్లను డాఁగ వెడలుటయును
భావించి సురమాత పరితాపమును బొంది వగ ననాథాకృతి వనరుచుండ
నాయమ్మ పెనిమిటి యగు కశ్యపబ్రహ్మ, మఱియొకనాఁడు సమాధి మాని
తన కుటుంబిని యున్న ధామంబునకు నేఁగి నాతిచే విహితార్చనములు వడసి

ఆ. వంది వ్రాలి కుంది వాడిన యిల్లాలి
వదనవారిజంబు వడువుఁ జూచి
చేరఁ దిగిచి మగువ చుబుకంబు పుణుకుచు
వారిజాక్షి యేల వగచె దనుచు. 461

1. రిపు పేఱు దలవవలదు(వా.) 2. ప్రదర్శి(తం.వా.)"గురుణార్థానుదర్శినా" అనిమూలము (15-32)

వ. అ మ్మహాత్ముం డి ట్లనియె. 462

మ. తెఱవా! విప్రులు పూర్ణులే జరుగునే దేవార్చ నాచారముల్
తఱితో వేలుతురే గృహస్థులు సుతుల్ ధర్మానుసంధానులే
నెఱి నభ్యాగతకోటి కన్నమిడుదే నీరంబునుం బోయుదే
మఱ లే కర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే పైదలీ! 463

ఆ. అన్న మైనఁ దోయ మైన ద్రవ్యం బైన
శాక మైనఁ దనకుఁ జరుగుకొలఁది
నతిథిజనుల కడ్డ మాడక యిడ రేని
[2]లేమ! వారు కలిగి లేనివారు. 464

వ. మఱియును. 465

ఆ. నెలఁత విష్ణునకును నిఖిల దేవాత్మున
కాననంబు శిఖియు నవనిసురులు
వారు దనియఁ దనియు వనజాతలోచనుఁ
డతఁడు దనియ జగములన్ని దనియు. 466

క. బిడ్డలు వెఱతురె? నీ కోఱ, గొడ్డెంబులు సేయ కెల్లకోడండ్రును మా
రొడ్డారింపక నడతురె, యొడ్డము గా కున్నదే మృగేక్షణ యింటన్. 467

వ. అని పలికినం బతికి సతి యిట్లనియె. 468

ఉ. ప్రేమ యొకింత లేక దితిబిడ్డలు బిడ్డలబిడ్డలున్ మహా
భీమ బలాఢ్యు లై తనదు బిడ్డల నందఱిఁ దోలి సాహసా
క్రామిత వైరు లయ్యు నమరావతి నేలుచు నున్న వారు నీ
కేమని విన్నవింతు హృదయేశ్వర! మేలు దలంచి చూడవే. 469

క. అక్కాచెల్లెం డ్రయ్యును, [3]దక్కదు నాతోడి పోరు తానును దితియున్
రక్కసులు సురల మొత్తఁగ, నక్కట వల దనదు చూచు నౌ నౌ ననుచున్.

సీ. ఎండక న్నెఱుఁగని యింద్రుని యిల్లాలు పలుపంచలను జాలిఁ బడియె నేఁడు
త్రిభువన సామ్రాజ్య విభవంబు గోల్పోయి దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు
కలిమి గారాపు బిడ్డలు జయంతాదులు శబరార్భకులవెంటఁ జనిరి నేఁడు
నమరుల కాధార మౌ నమరావతి యసురుల కాటపట్టయ్యె నేఁడు

---

1. చెలగునే (హ.) 2. లేనివారు పుడమిలేనివారు (హ.) లేనివారు కలిగిలేనివారు (వ్రాఁతప్రతులన్నిట) 3. దక్కరు....దనుజులు(హ.)

ఆ. బలి జగముల నెల్ల బలియుచు నున్నాఁడు
వాని గెలువరాదు వాసవునకు
యాగభాగ మెల్ల నతఁ డాహరించెను
[1]ఖలుఁడు సురల కొక్కకడియు నీఁడు. 471

క. ప్రజలకు నెల్లను సముఁడవు, ప్రజలను గడుపారఁ గన్న బ్రహ్మవు నీవుం
బ్రజలందు దుష్టమతులను, నిజముగ శిక్షింపవలదె నీవు మహాత్మా! 472

మ. సురలన్ సఖ్యుల నార్తులన్ విరథులన్ శోకంబు వారించి ని
ర్జరధాని న్నిలుపంగ రాత్రిచరులన్ శాసింప సత్కార్య మే
వెర వేరీతి ఘటించు నట్టి క్రమమున్ వేవేగఁ జింతింపవే
కరుణాలోక సుధాఝురిం దనుపవే కల్యాణ సంధాయకా! 473

వ. అనిన, [2]మనోవల్లభ పలుకు లాకర్ణించి, ముహూర్తమాత్రంబు చింతించి, విజ్ఞాన దృష్టి నవలంబించి, భావికాల కార్యంబు విచారించి, కశ్యపబ్రహ్మ యి ట్లనియె.

మ. జనకుం డెవ్వఁడు జాతుఁ డెవ్వఁడు జనస్థానంబు లెచ్చోటు సం
జననం బెయ్యది మేను లేకోలఁది సంసారంబు లే రూపముల్
వినుమా యంతయు విష్ణుమాయ దలఁపన్ వే ఱేమియున్ లేదు [3]మో
హ నిబంధంబు నిధాన మింతటికి జాయా! విన్నఁ బో నేటికిన్. 475

వ. అగు నైననుం గాలోచితకార్యంబు సెప్పెద. 476

మ. భగవంతుం బరమున్ జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరి సేవసేయు మతఁడున్ [4]సంతుష్టినిం బొంది నీ
కగు నిష్టార్థము లెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి చేకూరెడిన్
భగవత్సేవలఁ బొందరాదె బహు సౌభాగ్యంబులుం బ్రేయసీ! 477

వ. అనిన గృహస్థునకు గృహిణి యి ట్లనియె. 478

క. నారాయణుఁ బరమేశ్వరు, నేరీతిఁ దలంతు మంత్ర మెయ్యది విహితా
చారంబు లేప్రకారము, లారాధనకాల మెద్ది యానతి యీవే. 479

వ. అనినం గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణం బను వ్రతం బుపదేశించి, తత్కాలంబును, దన్మంత్రంబును, దద్విధానంబును, దదుపవాస దాన భోజన ప్రకారంబులు నెఱింగించెను.

---

1. కడఁగి (హ.) 2. వల్లభి (హ.) 3. మోహనిబద్ధం బది మూలము (హ.) 4. సాంగత్యముం బొంది (హ. తం. వా.)

అధ్యాయము-౧౭

అదితియును, ఫాల్గుణమాసంబున శుక్లపక్షంబునఁ బ్రథమదివసంబునం దొరఁకొని, పండ్రెండు దినంబులు హరిసమర్పణంబుగా వ్రతంబు సేసి, వ్రతాంతంబున నియత యై యున్నయెడఁ, జతుర్బాహుండును, పీతవాసుండును, శంఖ చక్ర గదా ధరుండును నై, నేత్రంబుల కగోచరుం డైన నారాయణదేవుండు ప్రత్యక్షం బైనం గనుంగొని. 480

క. కన్నుల సంతోషాశ్రులు, చన్నులపైఁ బఱవఁ బులకజాలము [1]లెసఁగన్
సన్నతులును సన్నుతులును, నున్నతరుచిఁ జేసి నిటల యుక్తాంజలి యై. 481

క. చూపుల శ్రీపతి రూపము, నాపోవక త్రావి త్రావి హర్షోద్ధత యై
వాపుచ్చి మందమధురా, లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్. 482

సీ. యజ్ఞేశ! విశ్వంభరాచ్యుత! శ్రవణమం గళ నామధేయ! లోకస్వరూప!
యాపన్న భక్తజనార్తి విఖండనా! దీనలోకాధార! తీర్థపాద!
విశ్వోద్భవ స్థితి విలయకారణభూత! సంతతానంద శశ్వద్విలాస!
యాయువు దేహంబు ననుపమ లక్ష్మియు వసుధయు దివముఁ ద్రివర్గములును

తే. [2]వైదిక జ్ఞానయుక్తియు వైరిజయము
నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁ గలదె
వినుతమందార! గుణహార! వేదసార!
ప్రణుతవత్సల! పద్మాక్ష! పరమపురుష! 483

ఆ. అసురవరులు సురల నదరించి బెదరించి
నాక మేలుచున్న నాఁటనుండి
కన్నకడుపు గాన కంటఁ గూరుకు రాదు
గడుపుపొక్కు మాన్పి కావవయ్య. 484

వ. అనిన విని, దరహాసితవదనుం డయి, యాశ్రిత కామధేను వైన యప్పర మేశ్వరుం డిట్లనియె. 485

శా. నీ కోడండ్రును నీ కుమారవరులున్ నీ నాథుఁడున్ నీవు [3]సం
శ్లోకింపన్ సతులున్ బతుల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయ గర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుక పుట్టు నీ సుతుఁడ నై నర్తించి వర్తింపఁగాన్. 486

---

1. లెగయన్ (వ్రా.ప్ర.) 2. వైదికజ్ఞానమును ముక్తి(తం.) 3. సు,శ్లోకింపన్....మిగులసంతోషింప (హ.); ఈ పాఠమున యతిభంగము.

మ. బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబులం గాని సం
చలనం బొందకు నేను నీ నియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్
బలివిద్వేషియు నా నిలింపగణమున్ బౌలోమియున్ మెచ్చ దై
త్యులరాజ్యంబు హరింతు నింద్రునికి నిత్తున్ దుఃఖ మిం కేటికిన్. 487

క. నీ రమణుని సేవింపుము, నా రూపము మానసించి నలి నీ గర్భా
గారంబు వచ్చి చొచ్చెద, గారామునఁ బెంపవమ్మ కరుణన్ నన్నున్. 488

క. ఏలింతు దివము సురలను, జాలింతు మహేంద్రయువతి భాగ్యశ్రీలన్
దూలింతుదానవుల ని, ర్మూలింతు రిపు ప్రియాంగముల భూషణముల్. 489

వ. అని యిట్లు భక్తజన పరతంత్రుం డగు పురాణపురుషుం డానతిచ్చి, తిరోహితుం డయ్యె. అ య్యదితియుఁ, గృతకృత్య యై సంతోషంబునఁ దన మనోవల్లభుం డగు కశ్యపు నాశ్రయించి, సేవింపుచుండె. అంత నొక్కదినంబున. 490

ఆ. ఘన సమాధినుండి కశ్యపుఁ డచ్యుతు
నంశ మాత్మ నొలయ నదితియందుఁ
దనదు వీర్య మధికతరము సేర్చెను గాలి
శిఖిని దారువందుఁ జేర్చినట్లు. 491

వ. ఇట్లు గశ్యప చిరతర తపస్సంభృత వీర్యప్రతిష్ఠిత గర్భయై, సురలతల్లి యుల్లంబున నుల్లసిల్లుచుండె. అంత. 492

క. చలచల నై పిదపిద నైఁ, గలలం బై కరుడుగట్టి గళనాళముతోఁ
దల యేర్పడి గర్భం బై, నెల మసలం జీరచిక్కె నెలఁతకు నధిపా! 493

క. నెలఁతకు చూ లై నెల రె, న్నెల లై మఱి మూఁడు నాల్గు నెల లై వరుసన్
నెల లంతకంత కెక్కఁగ, నెలలును డగ్గఱియె నసుర నిర్మూలతకున్. 494

క. మహితతర మేఘమాలా, పిహితాయుత చండభాను బింబప్రభతో
విహితాంగంబులఁ గశ్యపు, గృహిణీగర్భమున శిశువు గ్రీడించె నృపా! 495

క. తనకడుపున నొకవెలవున, [1]గొనకొని జగములను నిముడుకొనియెడి ముదుకం
డనిమిషుల జనని కడుపునఁ, దనుగతిఁ గడు నడఁగి మడఁగి తనరెన్ బెడఁగై.

వ. అంత న క్కాంతాతిలకంబు క్రమక్రమంబున. 497

---

1. వనరుహ గర్భాండభాండ వనధి చయంబుల్ గొనకొని జగములు నిడుకొని....మణఁగి మునిఁగి తనరెడు బెగడై (హ.)

మ. నిలిపెన్ ఱెప్పల బృందిమన్ విశదిమన్ నేత్రంబులం జూచుకం
బుల నాకాళిమ మేఖలన్ [1]ద్రఢిమ [2]నెమ్మోమున్ సుధాపాండిమన్
బలిమిం జన్నుల శ్రోణిపాళి [3]గరిమన్ మధ్యంబునన్ బృంహిమన్
లలితాత్మన్ లఘిమన్ మహామహిమ మేనన్ గర్భదుర్వార యై. 498

క. పెట్టుదురు నుదుట భూతిని, బొట్టిడుదురు మేనఁ బట్టుఁ బుట్టపు దోయిన్
బెట్టుదురు [4]వేల్పుటమ్మకుఁ, గట్టుదురును రక్ష పడఁతిగర్భంబునకున్. 499

వ. ఇ వ్విధంబున. 500

తే. విశ్వగర్భుఁడు తన గర్భవివరమందుఁ
బూఁటపూఁటకుఁ బూర్ణుఁ డై పొటకరింప
వ్రేఁకఁ జూలాలితనమున వేల్పుపెద్ద
పొలఁతి కంతట నీళ్ళాడుప్రొద్దు లయ్యె. 501

వ. తదనంతరంబునం జతురాననుం డరుగుదెంచి, యదితి గర్భపరిభ్రమ విభ్రముం డగు న ప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె. 502

సీ. [5]త్రిభువనమయరూప! దేవ! త్రివిక్రమ! పృథులాత్మ! శిపివిష్ట! పృశ్నిగర్భ!
ప్రీతత్రినాభ! త్రిపృష్ఠ జగంబుల కాద్యంత మధ్యంబు లరయ నీవ
జంగమ స్థావర జననాది హేతువు నీవ కాలంబ వై నిఖిల మాత్మ
లోపల ధరియింతు లోని జంతుల నెల్ల స్రోతంబు లోఁగొను సుందరతను

ఆ. బ్రహ్మలకు నెల్ల సంభవభవన మీవ
[6]దినమునకుఁ బాసి దుర్దశ దిక్కు లేక
శోకవార్ధి మునింగిన సురల కెల్లఁ
[7]దేల నాధార మగుచున్న తెప్ప వీవ. 503

క. విచ్చేయు మదితిగర్భము, చెచ్చెర వెలువడు మహాత్మ చిరకాలంబున్
విచ్చలవిడి లే కమరులు, ముచ్చటపడి యున్నవారు ముద మందింపన్. 504

వ. అని యిట్లు కమలసంభవుండు వినుతి సేయ న య్యవసరంబున. 505

---

1. క్రసిమమున్ (ట) 2. నెమ్మోమారఁగాబాండిమన్ (తం. వా.) 3. ఁబ్రథిమన్ (తం.)
4. వేల్పుటక్కలు (త.) 5. త్రిజగజ్జయోన్నతదేవ యురుక్రమ (తం.) త్రిభువనజయరూఢ (వా.)
6. త్రిదివమెడబాసి (క) 7. దెలియ (హ.)

## అధ్యాయము - ౧౮

### —: వామనమూర్త్యావిర్భావము :—

మ. రవి మధ్యాహ్నమునం జరింప † గ్రహ తారాబద్ధ చంద్రస్థితిన్
శ్రవణ ద్వాదశినాఁడు శ్రోణ నభిజిత్సంజ్ఞాత లగ్నంబునన్
భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్య వ్రతోపేతకున్
దివిజాధీశ్వరు మాతకుం బరమ పాతివ్రత్య విఖ్యాతకున్. 506

వ. మఱియు న ద్దేవుండు, శంఖ చక్ర గదా కమలకలిత చతుర్భుజుండును, పిశంగవర్ణ [1]వస్త్రుండును, మకర కుండల మండిత గండభాగుండును, శ్రీవత్సవక్షుండును, నిరంతర శ్రీవిరాజిత రోలంబ[2]కదంబ బింబిత వనమాలికా పరిష్కృతుండును, గనకకంకణ కాంచీవల యాంగద నూపురాలంకృతుండును, గమనీయ కంఠ [3]కౌస్తుభాభరణుండును, నిఖిలజన మనోహరుండును నై యవతరించిన సమయంబున. 507

శా. చింతం బాసిరి యక్ష తార్క్ష్య సుమన స్సిద్ధోర గాధీశ్వరుల్
సంతోషించిరి సాధ్య చారణ మునీశ బ్రహ్మ విద్యాధరుల్
గాంతిం జెందిరి భాను చంద్రములు రంగ ద్గీత వాద్యంబులన్
గంతుల్ వైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్వులున్ గిన్నరుల్. 508

క. దిక్కుల కావిరి [4]విరిసె, [5]నెక్కువ నిర్మలత నొందె నేడుపయోధుల్
[6]నిక్కమెయి నిలిచె ధరణియుఁ, జుక్కలత్రోవయును విప్రజన[7]సేవ్యము లై. 509

క. ముంపుగొని విరులవానల, జొంపంబులు గురియ సురలు సుమనోమధువుల్
తుంపర లెగయఁ బరాగపు, రొంపుల భూభాగ మతినిరూపిత మయ్యెన్. 510

వ. తదనంతరంబ. 511

ఆ. ఈ మహానుభావుఁ డెట్టింతకాలంబు
నుదరమందు నిలిచియుండె ననుచు
నదితి వెఱఁగుపడియె [9]నానంద జయశబ్ద
ములను గశ్యపుండు మొగి నుతించె. 512

---

† గ్రహతారా చంద్ర భద్ర స్థితిన్ (తం. వా.)
1. వక్త్రుండును (హ.) 2. కదంబాలంబిత (వా ) 3 కంఠాభరణుండును (ట.)
4. వాసెన్ (హ.) 5. నెక్కువతక్కువలు లేక (హ.) 6. నిక్కమయి (హ.) 7. సేవ్యంబై (హ.)
8. డెట్లకోయీకాల (హ.) డేలొకో యీకాల (వ్రా. ప్ర.) 9. ఆనందభయశబ్ద (హ.)

వ. అంత న వ్విభుండు సాయుధ సాలంకారం బగు తన దివ్యరూపంబు నుజ్జగించి, రూపాంతరం బంగీకరించి, కపటవటుని చందంబున, నుపనయన [1]వయస్కుండై, బాలకుండు తల్లిముందట సముచితాలాపంబు లాడుచుఁ గ్రీడించు సమయంబున, నదితియుం దనయ విలోకన పరిణామ పారవశ్యంబున. 513

ఆ. నన్నుఁ గన్నతండ్రి! నాపాలి దైవమ!
నా తపః ఫలంబ! నా కుమార!
నాదు చిన్నివడుగ! నా కులదీపక!
రాఁగదయ్య! భాగ్యరాశి వగుచు. 514

క. అన్నా! రమ్మని డగ్గఱి, చన్నుల పాలేఱువాఱ సంశ్లేషిణి యై
చిన్నారి మొగము నివురుచుఁ, గన్నారం జూచెఁ గన్న కడు పై యుంటన్. 515

క. పురు డీ బోటికి నిందిర, పురు డంబిక గాక యొరులు పురుడే యనుచున్
బురుటాలికి పదిదినములు, పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపుగరితల్. 516

వ. అంత న బ్బాలునకు సంతసంబున మహర్షులు కశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితోపనయన కర్మకలాపంబులు చేయించిరి. సవిత సావిత్రి నుపదేశించె. బృహస్పతి యజ్ఞోపవీతంబును, గశ్యపుండు ముంజియు, గౌపీనం బదితియు, ధరణి కృష్ణాజినంబును, దండంబు సోముండును, గగనాధిష్ఠానదేవత ఛత్రంబును, [2]గమండలువు బ్రహ్మయు, సరస్వతి యక్షమాలికయు, సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి. మఱియును. 517

క. భిక్షాపాత్రిక నిచ్చెను, యక్షేశుఁడు వామనునకు నక్షయ మనుచున్
సాక్షాత్కరించి పెట్టెను, భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా! 518

—: బలిచక్రవర్తి కడకు వామనమూర్తి యేతెంచుట :—

క. శుద్ధబ్రహ్మర్షి సమా, రాద్ధుం డై విహిత మంత్రరాజిఁ జదువుచు
న్నిద్ధం బగు ననలంబున, వృద్ధాచారమున వటుఁడు వేల్చెం గడిమిన్. 519

వ. ఇట్లు కృతకృత్యుం డై మాయామాణవకుండు దేశాంతర సమాగతు లగు బ్రాహ్మణులఁ గొందఱ నవలోకించి యి ట్లనియె. 520

క. వత్తురె విప్రులు వేడ, న్నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం
దెత్తురె మీరును సంపద, లి త్తెఱఁగున దానవీరుఁ డెవ్వఁడొ నెపుఁడా. 521

---

1. వయస్కుండైన వామనబాలకుండై (తం. వా.) 2. కమండలంబు (హ.)

వ. అనిన నఖిల దేశీయులగు భూసురు లి ట్లనిరి. 522

మ. కలరున్ దాతలు నిత్తురుౝ ధనములుం గామ్యార్థముల్ గొంచు వి
ప్రులు నేతెంతురు కాని యీవిని బలిం బోలౝ వదాన్యుండు లేఁ
డలఘుం డై యొనరించు నధ్వర శతం బా భార్గవానుజ్ఞతో
బలి వేఁడం బడయంగవచ్చు బహు సంపల్లాభముల్ వామనా! 523

వ. అని తెలియఁజెప్పిన బ్రాహ్మణ వచనంబు లాలకించి, లోకంబులకుం బ్రీతి పుట్టింపఁ బయనం బై, లాభవచనంబులు గై కొని, తల్లిదండ్రుల వీడ్కొని, శుభముహూ ర్తంబునం గదలి. 524

క. ప్రక్షీణ దివిజవల్లభ, రక్షాపరతంత్రుఁ డగుచు రాజీవాక్షుం
డ క్షణమున బలియింటికి, భిక్షాగమనంబు సేసెఁ బేదటికముతోన్. 525

క. హరిహరి సిరియురమునఁగల, హరి హరిహయు కొఱకు దనుజునడుగౝ జనియెౝ
బరహిత రతమతియుతు లగు, దొరలకు నడుగుటలు నొడలి తొడవులు పుడమిౝ.

క. సర్వ ప్రపంచ గురుభర, నిర్వాహకుఁ డగుటఁ జేసి నెఱిఁ జనుదేరౝ
ఖర్వుని వ్రేఁగు సహింపక, నుర్వీస్థలి గ్రుంగె, మ్రొగ్గె నురగేంద్రుండున్. 527

వ. ఇట్లు చనిచని. 528

క. శర్మద యమదండక్షత, వర్మద నతికఠిన ముక్తివనితా చేతో
మర్మద నంబునివారిత, దుర్మద నర్మదఁ దరించెఁ ద్రోవౝ వటుఁడున్. 529

వ. దాఁటి తత్ప్రవాహంబున కుత్తర తటంబునందు. 530

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె బహుధా జల్పన్నిశాటంబు, ను
ద్దండాహూత మునీభ్య బిభ్య దమృతాంధ స్సిద్ధకూటంబు, వే
దం డాశ్వ ధ్వజినీ కవాటము, మహోద్య ద్ధూమసంఛన్న మా
ర్తాండ స్యందన ఘోటముౝ, బలి మఖాంత ర్వేదికా వాటముౝ. 531

వ. కని, దానవేంద్రుని హయమేధవాటిక దాఁటి, దరియంజొచ్చు న య్యవసరంబున.

శా. శంభుండో, హరియో, పయోజ భవుఁడో, చండాంశుఁడో, వహ్నియో,
దంభాకారత వచ్చెఁ గాక, ధరణిౝ ధాత్రీసురుం డెవ్వఁ డీ
శుంభద్ద్యోతనుఁ డీ మనోజ్ఞతనుఁ డంచుౝ విస్మయభ్రాంతు లై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని, తత్సభ్యుల్ రహస్యంబునన్. 533

క. గుజగుజలు వోవువారును, [2]గజిబిజి పడువారు చాలఁ గలకల పడుచుౝ
గజిబిజి యైరి సభాస్థలిఁ, బ్రజలెల్లను బొట్టివడుగు పాపని రాకౝ. 534

---

1. దాతృవరుల్ వెసన్ ధనములున్ (హ.) 2. గజిబిజిఁబడువారు (హ. తం. వా.)

వ. ఆ సమయంబున బలి సభామంటపంబు దఱియం జొచ్చి. 535

సీ. చవులుగాఁ జెవులకు సామగానంబులు సదివెడు హోతల చదువు వినుచు
మంత్రతంత్రార్థ సంబంధభావంబులు గొనియాడు యాజులఁ గూడికొనుచు
[1]హోమకుండంబులం దున్న త్రేతాగ్నుల వెలిఁగించు యాజకవితతిఁ గనుచు
దక్షు లై బహువిధాధ్వర విధానంబులు సెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచు

తే. [2]బెట్టు గోరెడు వేడుక పట్టుపఱుప
నదితిపుట్టువు లచ్చికి నాటపట్టు
కోరి చరియించె సభలోనఁ గొంతతడవు
పుట్టు వెన్నఁడు నెఱుఁగని పొట్టివడుగు. 536

వ. మఱియును. 537

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు, నఱిముఱి గుబురులకుఁ జనుచు హరిహరి! యనుచున్
మఱుఁగుచు నులుకుచు [3]దిరదిరఁ, గుఱుమట్టపు పొట్టివడుగు గొంత నటించెన్.

క. కొందఱితోఁ జర్చించును, గొందఱితో జటలుసెప్పు గోష్ఠిం జేయుం
గొందఱితోఁ దర్కించును, గొందఱితో ముచ్చటాడుఁ గొందఱ నవ్వున్. 539

వ. మఱియు ననేకవిధంబుల నందఱికి నన్నిరూపు లై వినోదించుచు. 540

క. వెడవెడ నడకలు నడచుచు, నెడనెడ నడుగిడఁగ నదరి యిల దిగఁబడఁగన్
బుడిబుడి నొడువులు నొడువుచుఁ, జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్.

వ. ఇట్లు డగ్గఱి మాయా[4]భిక్షుకుండు రక్షోవల్లభుం జూచి యి ట్లనియె. 542

మ. [5]ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాది ది
క్పతి గర్వాపనయ ప్రవర్తి గత లోభస్ఫూర్తి నానామఖ
వ్రత దాన ప్రవణానువర్తి సుమనోరామా మనోభేదనో
ద్ధత చంద్రాతపకీర్తి సత్య కరుణా ధర్మోల్లసన్మూర్తి దాన్. 543

వ. ఇట్లు కుశ పవిత్రాక్షత సంయుతం బగు దక్షిణహస్తంబు సాఁచి యి ట్లనియె.

ఉ. స్వస్తి జగత్త్రయీ భువన శాసనకర్తకు హాసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు నుదారపద వ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర [6]విధానవిహర్తకు నిర్జరీ గళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోకభర్తకున్. 545

---

1. హోమగుండంబులందున్న (హ.) 2. బెట్టుగూరెడు (హ.) 3. దిఱదిఱ (హ. తం. వా.)
4. భిక్షుకుండు (హ.) 5. ఇతఁడా (త.) 6. వితాన (హ.)

[11]

వ. అని దీవించి, కరచరణా ద్యవయవంబులు ధరియించిన వేదరాశియునుం బోలె ముందట నకుటిలుండును, జటిలుండును, సదండచ్ఛత్రుండును, గఘలంబిత భిక్షాపాత్రుండును, గరకలిత జల కమండలుండును, మనోహర వదన చంద్రమండలుండును, మాయావాదన [1]పటుండును నగు వటునిం గని, దినకరకిరణ పిహితంబు లైన గ్రహంబులచందంబునఁ దిరోహితు లయి భృగువులు గూర్చున్న యెడ లేచి సేమం బడిగి తియ్యనిమాటల నాదరించిరి. బలియును నమస్కరించి, తగిన గద్దియ నునిచి,పాదంబులు దుడిచి, తన[2]ప్రాణవల్లభ [3]పసిండికలశంబున నుదకంబులు వోయ, వడుగుకొమరుని చరణంబులు గడిగి, తడియొత్తి తత్సమయంబున.

ఆ. వటుని పాదశౌచవారి శిరంబునఁ
బరమభద్ర మనుచు బలి వహించె
నే జలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ
దేవుఁ డుద్వహించె ధృతి శిరమున. 547

వ. మఱియు, న య్యజమానుం డభ్యాగతున కి ట్లనియె. 548

మ. వడుగా ! యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్య ది
య్యెడకున్ నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మమున్
గడు ధన్యాత్ముఁడ నైతి నీ మఖము యోగ్యం బయ్యె నాకోరికల్
గడతేఱెన్ [4]సుహుతంబు లయ్యె శిఖులుం [5]గల్యాణ మి క్కాలమున్. 549

మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ [6]విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా ! 550

అధ్యాయము - ౧౯

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన [7]వైరోచని వచనంబులు విని, సంతోషించి, యీశ్వరుం డి ట్లనియె. 551

సీ. ఇది నాకు నెలవని [8]యేరీతిఁ బలుకుదు నొకచో టనక నిండి యుండనేర్తు
నెవ్వనివాఁడ నం చేమని పలుకుదు నాయంతవాఁడ నై నడవనేర్తు
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ బూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు నని యేల చెప్పంగ నేరుపు లన్నియు నేన నేర్తు

1. నటుండును(తం. వా.) 2. ప్రాణవల్లభి(హ.) 3. పసిండిగిండి(వ్రా.ప్ర.) 4. సుహృతంబులయ్యె(హ.)
5. కల్యాణమె క్కాలమున్(హ.) 6. విశిష్టార్థంబులో(హ.) 7. వైరోచను(క.) 8. యేమనిపలుకుదు(హ.)

ఆ. నొరులు గారు నాకు నొరులకు నే నౌదు
నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లిఁ గలదు సెప్పెద నా వెంకి
సుజనులందుఁ దఱచుఁ జొచ్చియుండు. 552

వ. అది యట్లుండనిమ్ము. 553

సీ. జననాథ ! నీ మాట సత్యంబు సత్కీర్తిదంబు కులార్హంబు ధర్మయుతము
కరుణానువర్తులు ఘనసత్త్వమూర్తులు గాని మీకులమందుఁ గలుగ రొరులు
రణభీరువులు వితరణభీరువులు లేరు ప్రత్యర్థు లర్థులు ప్రబ్బికొనిన
దానశౌండు లగుచు దనుపుదు రధికులై మీతాత లందఱు మేటిమగలు

ఆ. మీకులంబునందు మెఱయఁ బ్రహ్లాదుండు
మింటి చంద్రుమాడ్కి మేలిరుచులఁ
బ్రథితకీర్తితోడ భవదీయవంశంబు
నీరరాశిభంగి నెగడుచుండు. 554

వ. తొల్లి మీ మూఁడవతాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు సేసి, గదాయుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరింప, విష్ణుండు వరాహరూపంబున నతని సమయించె. తద్భ్రాత యగు హిరణ్యకశిపుం డది విని, హరిపరాక్రమంబునకు నాశ్చర్యంబు నొంది, తన జయంబునుం, బలంబునుం, బరిహాసించి, గ్రద్దన నుద్దవిడి న ద్దనుజమర్దను మందిరంబుకుం జనియె. అప్పుడు. 555

క. శూలాయుధహస్తుం డై, కాలాకృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండున్
గాలజ్ఞత మాయాగుణ, శీలత నిట్లని తలంచెఁ జిత్తములోనన్. 556

మ. ఎదురై పోర జయింపరా దితనిఁ గా కెందేనియుం బోవ భీ
ప్రదుఁ డై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియం బై వచ్చు నంచుం గ్రియా
విదుఁ డబ్జాక్షుఁడు సూక్ష్మరూపమున నావేశించె నిశ్శ్వాస రం
ధ్రదిశన్ దైత్యు హృదంతరాళమునఁ బ్రత్యక్క్రియా భీరుఁ డై. 557

వ. అంత న ద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి, వెదకి, హరిం గానక, మిన్నుమన్ను నన్వేషించి, త్రిదివంబున నరసి, దిశలం బరికించి, భూవివరంబులు వీక్షించి, సముద్రంబులు వెదకి, పురంబులు శోధించి, వనంబులు విమర్శించి, పాతాళంబు పరీక్షించి, జగంబున నదృష్ట శత్రుం డై, మార్గణంబు సాలించి, తనలో నిట్లనియె.

క. పగవాఁడు మడియ నోవును, దెగఁడేనియు నెదురుపడఁడె తెగువ నరులకుం
దెగిన యెడఁ బగఱు మీఁదను, బగ గొనఁదగ దనుచు మానెఁ బ్రాభవశక్తిన్.

వ. అతండు మీ ప్రపితామహుండు. అతని గుణంబు లనేకంబులు గలవు. అది య ట్లుండ నిమ్ము. 560

క. ఆతుర భూసురగతిఁ బురు, హూతాదులు దన్ను వేఁడ నొగిఁ గొ మ్మనుచున్
మీ తండ్రి యిచ్చె నాయువు, నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్. 561

క. ఏలితివి మూఁడు జగములు, దోలితి వింద్రాది సురులఁ దొల్లిటివారిం
బోలితివి దానగుణములఁ, [1]జాలితి వీ రాక్షసులను సంరక్షింపన్. 562

వ. అదియునుం గాక. 563

క. [2]రాజ్యంబు గలిగెనేనియుఁ, బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్
భాజ్యముగ బ్రతుకఁ డేనియుఁ, ద్యాజ్యంబులు వాని జన్మ ధన గేహంబుల్.

క. ము న్నెన్నఁడు రు వదాన్యుల, నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుఁడ వనుచు
న్నిన్ని దినంబులనుండియు, నెన్నఁడు నినుఁ బెట్టు మనుచు [3]నింద్రము సేయన్.

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెం డడుగుల
మేర యిమ్ము సొమ్ము మేర యొల్లఁ
గోర్కెదీర బ్రహ్మకూఁకటి ముట్టెద
దానకుతుకసాంద్ర! దానవేంద్ర! 566

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యి ట్లనియె. 567

ఆ. ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ
సత్యగతులు వృద్ధసమ్మతంబు
లడుగఁ దలఁచి కొంచె మడిగితి వోచెల్ల!
దాతపెంపు సొంపుఁ దలఁపవలదె? 568

మ. వసుధాఖండము వేఁడితో [4]గజములన్ వాంఛించితో వాజులన్
వెస నూహించితొ కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీ వడుగ నీ భాగ్యంబు లీపాటిగా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీనేర్చునే. 569

వ. అనిన మొగంబునం జిఱునగవు మొలకలొత్త,గృహమేధికి మేధావి యి ట్లనియె.

మ. గొడుగో జన్నిదమో [5]కమండలువొ నాకున్ ముంజియో దండమో
[6]వడు గే నెక్కడ భూము లెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదాకాంక్షామితం బైన మూ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటయె బ్రహ్మాండంబు నాపాలికిన్. 571

1. సోలితివి పిశాచరాక్షసుల రక్షింపన్ (హ.తం.వా.) 2. రాజ్యముగలిగిన మీదట(క.) 3. నింట్రము (క.) నిట్రము (త.) 4. జగమ్ములన్ (హ.) 5. కమండలమొ (హ.) 6. వడుగం డెక్కడ (తం.)

వ. అదియునుం గాక. 572

క. వ్యాప్తిం బొందక వగవక, ప్రాప్తం బగు లేశ మైనఁ బదివే లనుచున్
దృప్తిం జెందని మనుజుఁడు, సప్తద్వీపముల నైనఁ జక్కం బడునే. 573

శా. ఆశాపాశము దాఁ గడు న్నిడుపు లే దంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు చేకూడియుం
గాసిం బొందిరి గాక వైన్య గయ భూకాంతాదులు న్నర్థకా
మాశన్ బాయఁగనేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే. 574

సీ. సంతుష్టుఁ డీ మూఁడుజగములఁ బూజ్యుండు సంతోషి కెప్పుడు జరుగు సుఖము
[1]సంతోషి గాకుంట సంసారహేతువు సంతసంబున ముక్తిసతియు దొరకుఁ
బూఁటపూఁటకు జగంబున యదృచ్ఛాలాభ తుష్టిని఼ దేజంబు తోన పెరుఁగు
పరితోషహీనతఁ బ్రభ చెడిపోవును జలధార ననలంబు సమయునట్లు

ఆ. నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట
తగవు గాదు నాకుఁ దగినకొలఁది
యేను వేఁడికొను నిన యీ పదత్రయమును
చాల దనక యిమ్ము చాలు చాలు. 575

వ. ఇట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీశ్వరుం డుర్వీదానంబు సేయం దలంచి, కరకలిత సలిల కమండలుం డైన య వ్వితరణగుణ ముఖరునిం గని, నిజ విచారయుక్త దనుజరాజ్యచక్రుం డగు శుక్రుం డి ట్లనియె. 576

సీ. దనుజేంద్ర! యీతఁడు ధరణీసురుఁడు గాఁడు దేవకార్యంబు సాధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితిగర్భంబునఁ గశ్యపసూనుఁ డై గలిగె నకట
యెఱుఁగ వీతనికోర్కె నిచ్చెద నంటివి దైత్యసంతతి కుపద్రవము వచ్చు
నీ లక్ష్మి తేజంబు నెలవు నైశ్వర్యంబు వంచించి యిచ్చును వాసవునకు

ఆ. మొనసి జగము లెల్ల మూఁడుపాదంబుల
నఖిలకాయుఁ డగుచు నాక్రమించు
సర్వధనము విష్ణు [2]సంతర్పణము చేసి
బడుగుపగిది యెట్లు బ్రతికె దీవు. 577

క. ఒక్కపదంబున భూమియు, నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి యున్నతమూర్తిన్
దిక్కులు గగనముఁ దా నై, వెక్కస మై యున్న [3]నెట్లు వెడలెదు చెపుమా.

---

1. సంతుష్టి గాకున్న (వా.) 2. సంసర్జనము చేసి (క.చ.ట.) 3. నెందు వెడలెదు(చ.)

సీ. ఇచ్చెద నని పల్కి యీకున్న నరకంబు ద్రోవ నీవును [1]సమర్థుఁడవె దేవ !
యేదానమున నాశ మేతెంచు నదియును దానంబు గాదండ్రు తత్త్వవిదులు
దానంబు యజ్ఞంబు తపము కర్మంబులు దా విత్తవంతుఁడై తలఁపవలయుఁ
దనయింటఁ గల సర్వధనమెల్ల నైదుభాగములుగా విభజించి కామమునకు

ఆ. నర్థమునకు ధర్మయశముల కాశ్రిత
బృందములకు సమతఁ బెట్టునట్టి
పురుషుఁ డిందు నందుఁ బూర్ణుఁడై మోదించుఁ
[2]దన్ను మాని చేఁత తగవుగాదు. 579

వ. అదియునుం గాక యీయర్థంబునందు బహ్వృచగీతార్థంబు గల దొకటి. సావధానుఁడవై యాకర్ణింపుము. 580

సీ. అంగీకరించిన నఖిలంబు పోవుచో నన్నృతంబు గాదు లేదనిన నధిప!
యాత్మవృక్షము మూల మనృతంబు నిశ్చయ ‡[3]మన్నృతమూలము గల్గ నాత్మ చెడదు
పుష్పఫలము లాత్మభూజంబునకు సత్య మా మ్రాను బ్రతుకమి నవియుఁ జెడును
ఫలపుష్పములు లేక పసచెడి వృక్షంబు మూలంబుతో వృద్ధిఁ బొందుఁ గాదె

తే. చేటు గొఱతయు లఘిమయుఁ జెందకుండ
నిచ్చు పురుషుండుఁ జెడకుండు నిద్ధచరిత !
కాక యంచిత సత్యసంగతి నటంచు
నిజధనం బర్థి కిచ్చిన నీకు లేదు. 581

ఆ. సర్వమైన చోట సర్వధనంబులు
నడుగ లే దటంచు నన్నృతమాడు
చెనఁటి పంద నేమిచెప్పఁ బ్రాణముతోడి
శవము వాఁడు వాని జన్మమేల. 582

వ. మఱియు నొక్కవిశేషంబు గలదు వివరించెద. 583

ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణ విత్త మాన భంగమందుఁ
జకిత గోకులాగ్రజన్మ రక్షణమందు
బొంకవచ్చు నఘము పొంద దధిప ! 584

---

1. సమర్థుడవుగావ (క.తం.వా.) 2. దనుమానిశాత (హ.) 3. మాత్మమూలముగల్గ (హ.)
‡ "వృక్షే జీవతి తన్నస్యాత్ అనృతం మూల మాత్మనః." (మూలము 19-39)

అధ్యాయము—౨౦

మ. కులమున్ రాజ్యము తేజమున్ నిలుపు మీ కుబ్జుండు విశ్వంభరుం
డలఁతిం బోఁడు త్రివిక్రమస్ఫురణవాఁ డై నిండు బ్రహ్మాండమున్
గలఁడే మాన్ప నొకండు నా పలుకు లాకర్ణింపు కర్ణంబులన్
వల దీ దానము గీనమున్ బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా! 585

వ. అని యిట్లు హితంబు పలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలితలోచనుం డై యశస్వి యి ట్లనియె. 586

సీ. నిజ మానతిచ్చితి నీవు మహాత్మక! [1]మహిని గృహస్థధర్మంబు నిదియ
యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు
నర్థలోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు పలికి లే దనుకంటెఁ బాప మెద్ది
యెట్టి దుష్కర్ముని నే భరించెదఁ గాని సత్యహీనుని మోవఁజాల ననుచుఁ

తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరమం దడ్గ దిరుగక చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమున బరఁగుకంటె
మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె. 587

క. ధాత్రిని హలికునకు సు, క్షేత్రము బీజములు లెస్స చేకుఱు భంగిం
[2]జిత్రముగ దాత కీవియుఁ, బాత్రము సమకూఱునట్టి భాగ్యము గలదే. 588

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వా రేరీ సిరి మూటగట్టుకొని పోవంజాలిరే భూమిపైఁ
బే రైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాము లై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే యి క్కాలమున్ భార్గవా! 589

క. ఉడుగని క్రతువుల వ్రతములఁ, బొడగనఁ జననట్టి పొడవు పొడవునఁ గుఱు చై
యడిగెడి నఁట నను బోఁటికి, నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్. 590

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు క్రిం దగుట మీఁ దై నా కరం బుంట మే
లౌదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే. 591

---

1. మహిత (చ.) 2. జిత్రంబుగ రాజునకును (వా.)

మ. నిరయం బైన [1]నిబంధ మైన ధరణీనిర్మూలనం బైన దు
ర్మరణం బైనఁ గులాంత మైన నిజముల్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁ డైనన్ హరి యైన నీరజభవుం డభ్యాగతుం డైన నౌఁ
దిరుగ న్నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య! వే యేటికిన్. 592

ఆ. నోడివినంతవట్టు నుసలక యిచ్చుచో
నేల కట్టు విష్ణుఁ డేటిమాట
కట్టెనేనిఁ దాన కరుణించి విడుచును
విడువ కుండనిమ్ము విమలచరిత! 593

క. మేరువు తలక్రిం దైనను, బారావారంబు లింకఁబాటిన లోలో
ధారుణి రజ మై పోయినఁ, [2]దారాధ్వము బద్ధ మైనఁ దప్పక యిత్తున్. 594

మత్తకోకిల. ఎన్నఁడుం బరు వేఁడఁబోఁడట [3]యేకలం బఁట కన్న వా
రన్నదమ్ములు నైన లేరఁట యన్నివిద్యల మూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రోడగు జ్జఁట చేతు లొగ్గి [4]వసింప నీ
చిన్నిపాపనిఁ ద్రోసిపుచ్చఁగఁ జిత్త మొల్లదు సత్తమా! 595

వ. అని యిట్లు సత్యపదవీ ప్రమాణ తత్పరుండును, వితరణకుతూహల సత్వరుండును, విమల యశస్కుండును, దృఢ మనస్కుండును, నియత సత్యసంధుండును, నర్థిజన కమలబంధుండును నైన బలిం జూచి, శుక్రుండు కోపించి, మదీయశాసన మతిక్రమించుటం జేసి శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శపియించెను. బలియును, గురుశాపతప్తుం డయ్యును, సూనృతమార్గంబున కభిముఖుం డై యుండె. అప్పుడు. 596

ఆ. బ్రతుకవచ్చుఁ గాక బహుబంధనము లైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనము లైనఁ జెడుఁగాక పడుఁగాక
మాట దిరుగలేరు మానధనులు. 597

వ. అను న య్యవసరంబున. 598

ఆ. దనుజలోకనాథు దయిత వింధ్యావళి
రాజవదన మదమరాళగమన
వటుని కాళ్ళు గడుగ వర హేమఘటమున
జలము దెచ్చె భర్త సన్న యెఱిఁగి. 599

---

1. నిబద్ధమైన (హ.) 2. దారధ్వర ఖండమైన (హ.) 3. ఏకలుండఁట (వా.) 4. వచింప (ట.)

వ. అ య్యవసరంబునఁ గపటవటునకు న ద్దానవేంద్రుం డి ట్లనియె. 600

క. రమ్మా మాణవకోత్తమ! లెమ్మా నీ వాంఛితంబు లేదన కిత్తున్
దెమ్మా యడుగుల నిటు రా, నిమ్మా గడుగంగవలయు నేటికిఁ దడయన్. 601

మ. బలిదైత్యేంద్ర కరద్వయీకృత జలప్రక్షాళన వ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమన స్సంప్రార్థిత శ్రీదమున్
గలితానమ్ర రమాలలాట పదవీ కస్తూరికా శాదమున్
నళినామోదము రత్ననూపురిత నానావేదముం బాదమున్. 602

క. సురలోక సముద్ధరణము, నిరత శ్రీకరుణ మఖిల నిగమాంతాలం
కరణము భవసంహరణము, హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్. 603

వ. ఇట్లు ధరణీసుర దక్షిణచరణ ప్రక్షాళనంబు చేసి, వామపాదంబు గడిగి, తత్పా
వనజలంబు శిరంబునం జల్లుకొని, వార్చి, దేశకాలాది పరిగణనంబు సేసి. 604

శా. విప్రాయ [1]ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్య[2]విదే త్రిపాదధరణీం దాస్యామి యంచుం గ్రియా
క్షిప్రుం డై దనుజేశ్వరుండు వడుగుం జేసాఁచి పూజించె బ్ర
హ్మప్రీత మ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్. 605

వ. తత్కాలంబున. 606

ఆ. †నీరధారఁ బడఁగనీక యడ్డంబుగాఁ
గలశరంధ్ర మాఁపగాను దెలిసి
హరియుఁ గావ్యునేత్ర మటు కుశాగ్రంబున
నడువ నేకనేత్రుఁ డయ్యె నతఁడు. 607

వ. అంత. 608

మ. అమరారాతి [3]కరాక్షతోక్షిత పవిత్రాంభః కణశ్రేణికిం
గమలాధీశ్వరుఁ [4]డొడ్డె ఖండిత దివౌకస్స్వామి జిహ్మాస్తమున్
గమలాకర్షణ సుప్రశస్తము రమా[5]కాంతా కచోపాస్తమున్
విమల [6]శ్రీకుచ శాత చూచుకతటీ విన్యస్తమున్ హస్తమున్. 609

క. మునిజన నియమాధారను, జనితాసుర యువతి నేత్ర జలకణ ధారన్
దనుజేంద్ర [7]నిరాధారను, వనజాక్షుఁడు గొనియె బలివివర్జిత ధారన్. 610

---

1. ప్రకటాయ (హ.) 2. విధే (హ.) † ఈ పద్యము తాళపత్ర ప్రతులలో లేదు. దీనికి మూలమును లేదు. 3. కరోక్షరోక్షిత (హ.) 4. డొండె.... చిన్న్యస్తమున్ (హ.) 5. కాంతా కుచోపాస్తమున్ (హ.) 6. శ్రీకుచచాతచూచుక (హ.) .7. నీరధారను (హ.)

ఆ. కమలనాథు నెఱిఁగి కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రు మాట లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్ర మనుచు నిచ్చె దానము బలి
మహి వదాన్యుఁ డొకఁడు మఱియుఁ గలఁడె. 611

క. క్షితి దానమిచ్చు నతఁడును, నతికాంతుఁ బరిగ్రహించు నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు, శతమఖ లోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్. 612

వ. అట్లు గావున నే దానంబును భూమిదానంబునకు సదృశంబు గానేరదు. కావున వసుంధరా దానం బిచ్చితి. ఉభయలోకంబులం గీర్తి సుకృతంబులు వడయుము. అని పలికి, [1]య మ్మాయా వటుం డి ట్లనియె. 613

క. ఇది యేమి వేఁడి తని నీ, మది వగవక ధారవోయుమా, [2]సత్యము పెం
పొదవఁగఁ గోరిన యర్థం, బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 614

వ. అని పలికిన పలుకులకు హర్ష నిర్భర చేతస్కుం డై వైరోచనుండు. 615

ఆ. పుట్టి నేర్చుకొనెనో పుట్టక నేర్చెనో
చిట్టి బుద్ధు లిట్టి పొట్టి వడుగు
పొట్టనున్న వెల్ల [3]బూమెలు నని నవ్వి
యెలమి ధరణిదాన మిచ్చె నపుడు. 616

క. †బలి చేసిన దానమునకు, నళినాక్షుఁడు నిఖిల భూతనాయకుఁ డగుటం
గలకల మనె దశదిక్కులు, భళిభళి యని పొగడె భూతపంచక మనఘా! 617

ఆ. గ్రహ మునీంద్ర సిద్ధ గంధర్వ కిన్నర
యక్ష పక్షి దేవ తాహి పతులు
పొగడి రతని పెంపుఁ బుష్పవర్షంబులు
గురిసె దేవతూర్యకోటి మొరసె. 618

వ. ఇట్లు ధారా పరిగ్రహంబు చేసి. 619

—: వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట :—

శా. ఇంతిం తై వటుఁ డింత యై మఱియుఁ దా నిం తై నభోవీథిపై
నం తై తోయద [4]మండలాభ్రమున కల్లం తై ప్రభారాశిపై
నం తై చంద్రుని కంత యై ధ్రువునిపై నం తై మహర్వాటిపై
నం తై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధి యై. 620

---

1. యమ్మాయావర్ధి వటుం డి ట్లనియె(హ.) 2. సజ్జను బెంపొదువఁగ (హ.) 3. భూములు(హ.)
† ఈ పద్యము - తం. వా. ప్రతులలో 'కమలనాథు నెఱిఁగి' అను పద్యము క్రింద నున్నది.
4. మండలాగ్రమున కల్లం తై (తం. వా.)

మ. రవిబింబం బుపమింపఁ బాత్ర మగు ఛత్రం బై శిరోరత్న మై
శ్రవణాలంకృత మై గళాభరణ మై సౌవర్ణ కేయూర మై
ఛవిమ త్కంకణ మై కటిస్థలి [1]నుదంచ ద్వస్త్ర మై నూపుర
ప్రవరం బై పదపీఠ మై వటుఁడు దా బ్రహ్మాండము న్నిండుచోన్. 621

వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకం బగు విశ్వరూపంబు ధరియించిన, నభంబును, దివంబును, భువనంబును, దిశలును, సముద్రంబులును, జల దచల దఖిలభూత నివహంబులుం దాన యై యేకీభవించి, క్రమక్రమంబున భూలోకంబునకుం బొడవై, భువర్లోకంబు నతిక్రమించి, సువర్లోకంబునుం దలకడచి, మహర్లోకంబు దాఁటి, జనోలోకంబునకు మీఁదై, [2]తపోలోకంబునకు నుచ్ఛ్రయుం డై, సత్య లోకంబుకంటె నౌన్నత్యంబు వహించి, యెడ, లిఱుములు, సందులు, రంధ్రంబులు లేకుండ నిండి, మహాదేహమహితుం డై, చరణతలంబున రసాతలంబును, పాదంబుల మహియును, జంఘల మహీధ్రంబులును, జానువులం బతత్త్రి సము దయంబులును, నూరువుల నింద్రసేన, మరుద్గణంబులును, [3]వాసస్స్థలంబున సంధ్యయు, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబునం దనుజులును, నాభిని నభంబును, నుదరంబున నుదధి సప్తకంబును, నురంబునఁ దారకా నికరంబును, నురోజంబుల [4]ఋతసత్యంబులును, [5]హృదయంబున ధర్మంబును, మనంబునఁ జంద్రుండును, వక్షంబునఁ గమలహస్త యగు లక్ష్మియుఁ, గంఠంబున సామాది సమస్త వేదములును, భుజంబులం బురందరాది దేవతలును, గర్ణంబుల దిశలును, శిరంబున నాకాశంబును, శిరోజంబుల మేఘంబులును, నాసాపుటంబున వాయు వులును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు, వాణి నఖిల చ్ఛంద స్సముదయంబును, రసనంబున జలేశుండును, భ్రూయుగళంబున విధినిషే ధంబులును, ఱెప్పల నహోరాత్రంబులును, లలాటంబునఁ గోపంబును, నధరం బున లోభంబును, స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, పృష్ఠంబున నధర్మంబును, గ్రమణంబున యజ్ఞంబును, ఛాయవలన మృత్యువు, నగవువలన ననేక మాయా విశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణంబుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమ స్థావర జంతు సంఘంబులును, గలవాఁ డై, జలధర నినద శంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖడ్గాక్షయబాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కేయూర హార కటక కంకణ కౌస్తుభ మణిమేఖ లాంబర

---

1. నుదంచత్ శాటి యై(క.)నుదంచత్ ఘంటి యై(ట.) 2.తపంబునకు(హ) 3. స్కంధంబున(హ); వస్త్రంబున(ట); "సంధ్యాం విభో ర్వాససి"(20-24) 4. ఋతుషట్కంబును (హ)5. ఉదరంబున (హ)

వనమాలికా విరాజితుండును, సునంద నంద జయ విజయ ప్రముఖ పరిచర వాహినీ సందోహ పరివృతుండును, నసమాన తేజో విలసితుండును నై, బ్రహ్మాండంబు తనమేని కప్పు తెఱంగున నుండ విజృంభించి. 622

మ. ఒకపాదంబున భూమిఁ గప్పి దివి వేఱొంటన్ నిరోధించి యొం
డొకటం మీఁది జగంబు లెల్లఁ దొడి నొండొంటన్ విలంఘించి ప
ట్టక బ్రహ్మాండకటాహముం బగిలి వేంద్రం బై పగుల్ గాన రా
నొకఁ డై వా గ్ద్రు గలభ్యుఁ డై హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్. 623

ఆ. ఒక పదంబు క్రింద నుర్వి పద్మమునంటి
కొనినఁ బంకలవము కొమరుఁ దాల్చె
నొకటి మీఁదఁ దమ్మి కొదిఁగిన తేఁటి నా
వెలసె మిన్ను నృప! త్రివిక్రమమున. 624

వ. తత్సమయంబున. 625

ఆ. జగము లెల్ల దాఁటి చనిన త్రివిక్రము
చరణ నఖరచంద్ర చంద్రికలను
[1]బొనుఁగు వడియె సత్యమున బ్రహ్మ తేజంబు
దివసకరుని రుచుల [2]దివియ భంగి. 626

అధ్యాయము – ౨౧

సీ. భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ గాఁపురంబులు సేయు ఘనులు రాజు
లా మరీచ్యాదులు నా సనందాదులు నా దివ్యయోగీంద్రు లచట నెపుడు
మూర్తిమంతంబు లై మ్రోయు పురాణ తర్కామ్నాయ నియమేతిహాస ధర్మ
సంహితాదులు గురు జ్ఞానాగ్ని నిర్దగ్ధ కర్ము లై మఱియునుఁ గలుగునట్టి

ఆ. వారలెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు
నంఘ్రిఁ జూచి మ్రొక్కి రధికభక్తిఁ
దమ మనంబులందుఁ దలఁచు నిధానంబు
గంటి మనుచు నేఁడు మంటి మనుచు. 127

మ. తన పుట్టి ల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభి పంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నతపదంబుం జూచి తత్పాదసే
చనముం జేసెఁ [3]గమండలూదకములం జల్లించి తత్తోయముల్
వినువీథిం బ్రవహించె దేవనది నా విశ్వాత్ము కీర్తి ప్రభన్. 628

---

1. బొనరువడియె (హ) 2. దివియుభంగి (హ) 3. కమండలోదకమున (హ)

వ. తత్సమయంబున. 629

సీ. యోగమార్గంబున నూహించి బహువిధ పుష్పదామంబులఁ బూజచేసి
దివ్యగంధంబులు దెచ్చి సమర్పించి ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి
భూరి లాజాక్షతంబులు సల్లి ఫలములు గానుక లిచ్చి రాగములఁ బొగడి
శంఖాదిరవముల జయఘోషములు సేసి కరుణాంబునిధి! త్రివిక్రమ! యటంచు

ఆ. బ్రహ్మ మొదలు లోకపాలురు గొనియాడి
రెల్ల దిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁ డరిగి చాటె భేరీధ్వని
వెలయఁ జేసి విష్ణు విజయ మనుచు. 630

క. అన్ని జగంబులఁ దానై, యున్న జగన్నాథుఁ జూడ నొగి భావింపం
గ న్నందక మన మందక, సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియుఁ౯. 631

వ. అంత నొయ్యనఁ బూర్వప్రకారంబున నున్న వామనునిం గని, పదత్రయ వ్యాజంబున నితఁడు సకల మహీమండలంబు నాక్రమించె. కపటవటురూప తిరోహితుం డగు విష్ణుం డని యెఱుంగక మన దానవేంద్రుండు సత్యసంధుండు గావున మాటదిరుగక యిచ్చె. అతనివలన నేరంబు లేదు. ఈ కుబ్జుం డప్రతిహత తేజః ప్రభావంబున ని జ్జగంబులం బరిగ్రహించి, [1]పర్జన్యాదులకు విసర్జనంబు చేయం దలంచి యున్నవాఁడు. ఈ వటునిం దూటి పాఱనీక నిర్జించుట కర్జం బని, తర్జనంబులు, గర్జనంబులు, సేయుచు, వజ్రాయుధాది మరుజ్జేత లగు విప్రచిత్తి రాహు హేతి ప్రహేతి ముఖ్యు లగు రక్కసు లుక్కుమిగిలి, యుద్ధంబునకు సన్నద్ధు లై, పరశు పట్టస భల్లాది సాధనంబులు ధరియించి, కసిమసంగి, ముసరి కొని, దశదిశలం బ్రసరించినం జూచి, హరిపరిచరులగు సునంద నందజయ జయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్త్వతు లను దండనాథు, లయుత వేదండ సముద్దండ బలు లై, తమతమ యూథంబుల నాయుధంబులతోఁ గూడికొని, దానవానీకంబులం బరలోకంబున కనుపువార లై యుండ, వారల నెదుర్కొని, కదనంబునకుం బరవసంబు సేయు చున్నం గనుంగొని, శుక్రుశాపంబు దలంచి, దనుజ వల్లభుం డి ట్లనియె. 632

సీ. రాక్షసోత్తములార! రండు పోరాడక కాలంబు గా దిది కలహమునకు
సర్వభూతములకు సంప దాపదలకుఁ బ్రభు వైన దైవంబు పరిభవింప
మన మోపుదుమె తొల్లి మనకు రాజ్యంబును సురలకు నాశంబు నొరిది నిచ్చి
విపరీతముగఁ జేయు వేల్పు నేమందుము మనపాలి భాగ్యంబు మహిమ గాక

1. వాసవునకు నీయ (హ)

తే. వెఱచి వలుమాఱుఁ బాఱెడి విష్ణుభటులు
మిమ్ముఁ గెలుచుట దైవంబు మేర గాదె
మనకు నెప్పుడు దైవంబు మంచి దగును
నాఁడు గెలుతము పగవారి నేఁడు వలదు. 633

వ. అదియునుం గాక. 634

క. బలుదుర్గంబులు సచివులు, బలములు మంత్రౌషధములు బహుశేముషియుం
గలిగియు సామోపాయం, బులఁ గాలం బెఱిఁగి నృపుఁడు పోరుట యొప్పున్.

వ. అట్లు గావున రణంబున కిప్పుడు శత్రుల కెదురు మోహరించుట కార్యంబుగాదు. మనకునుం దగు కాలంబున జయింతము. నలంగక తలంగుం డనినఁ, దలంగి, భాగవతభట భీతులై, చిక్కి, రక్కసులు రసాతలంబునకుం జనిరి. అప్పుడు హరి హృదయం బెఱింగి, తార్క్ష్యనందనుండు [1]యాగసుత్యాహంబున వారుణపాశం బుల నసురవల్లభుని బంధించె. అంత. 636

క. బాహులు పదములుఁ గట్టిన, శ్రీహరికృప గాక యేమిసేయుదు నని సం
దేహింపక బలి నిలిచెను, హాహారవ మెసఁగె దశ దిగంతములందున్. 637

క. సంపద చెడియును దైన్యముఁ, గంపంబును లేక దొంటికంటెను బెంపుం
దెంపును నెఱుకయు ధైర్యము, వంపని సురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్.

సీ. [2]దానవ! త్రిపదభూతల మిత్తు నంటివి, [3]తరణి చంద్రాగ్ను లెందాఁక నుందు
రంతభూమియు నొక్కయడు గయ్యె నాకును స్వర్లోకమును నొకచరణ మయ్యె
నీసొమ్ము సకలమ్ము నేఁడు రెం డడుగులు గడమపాదమునకుఁ గలదె భూమి
యిచ్చెద నన్నర్థ మీని దురాత్ముండు నిరయంబు నొందుట నిజము గాదె

తే. కాన దుర్గతికినిఁ గొంత కాల మరుగుఁ
గాక యిచ్చెద వేని వేగంబు నాకు
నిపుడు మూఁడవ పదమున కిమ్ము చూపు
బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మావశమె. 639

అధ్యాయము - ౨౨

వ. అని యిట్లు వామనుండు వలుక, సత్యభంగ సందేహ విషదిగ్ధ శల్యానికృత్త హృదయుం డయ్యును, విషణ్ణుండు గాక, వైరోచని ప్రసన్నవదనంబుతోడఁ జిన్ని ప్రోడవడుగున కిట్లనియె. 640

1. యాగస్తుత్యాహంబున (హ. తం) "సుత్యేఽహని" (మూ.21-27) "సౌత్యే అహని సోమాభిషవదినే" (వ్యాఖ్య) 2. దానము (తం. త.) 3. ధరణిఁ జంద్రార్కు (హ)

ఆ. సూనృతంబ కాని నుడియదు నా జిహ్వ;
బొంకఁజాల నాకు బొంకు లేదు
నీ తృతీయపదము నిజము నా శిరమున
నెలవుసేసి పెట్టు నిర్మలాత్మ! 641

ఆ. నిరయమునకుఁ బ్రాప్త నిగ్రహంబునకును
బదవిహీనతకును బంధమునకు
నర్థభంగమునకు నఖిలదుఃఖమునకు
వెఱవ దేవ ! బొంక వెఱచినట్లు. 642

వ. అదియునుం గాక. 643

సీ. తల్లిదండ్రులు నన్నదమ్ములు చెలికాండ్రు గురువులు శిక్షింపఁ గొఱఁత వడునె
పిదప మే లగుఁగాక పృథు మదాంధులకును దానవులకు మాకుఁ దఱి యెఱింగి
[1]విభ్రంశచతువుల్ వెలయ నిచ్చుటఁ జేసి గురువులలో నాదిగురువ వీవ
నీవు బంధించిన నిగ్రహమో లజ్జయో నష్టియో బాధయో తలంప

తే. నిన్ను నెదిరించి పోరాడి నిర్జరారు
లాదియోగీంద్రు లందెడు నట్టి యెంకి
నందరే తొల్లి పెక్కండ్రు హర్షమూర్తి !
[2]వైరభక్తులు గట్టిగా వలయుఁగాక.† 644

మ. చెలియే మృత్యువు చుట్టమే యముఁడు సంసేవార్థులే కింకరుల్
శిలలం జేసెనె బ్రహ్మ దన్ను దృఢమే జీవంబు నో చెల్లరే
చలితం బౌట యెఱుంగ రీ కపటసంసారంబు నిక్కంబుగాఁ
దలఁచుఁ మూఢుఁడు సత్య దాన కరుణా ధర్మాది నిర్ముక్తుఁ డై. 645

సీ. చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు కాంతలు సంసార[3]కారణములు
ధనము లస్థిరములు దను వతి[4]చంచల కార్యార్థు లన్యులు గడచుఁ గాల
[5]మాయువు సత్వర మతిశీఘ్రు మని కాదె యనఘుండు దమతండ్రి నధికరించె
మాతాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు నీపాదకమలంబు నియతిఁ జేరె

---

1. విస్రంభ (హ) "విభ్రంశం చతురాదిశత్" (22-5)
2. వైరిభక్తులు (హ) † తం. ప్రతిలోను, కొన్ని వ్రాఁతప్రతులలోను, 'ఈశ నీ యెడ దుర్లభమేమి కలదు' అను-అయిదవపాద మున్నది. 3. కపటమతులు (ట) 4. చలనంబు (హ)
5. మాయుష్య మైశ్వర్యమతి శీఘ్రమనిగాదె (హ)

తే. భర్తఁ డతనికి [1]మృతిలేని బ్రతుకు గలిగె
వైరులై కాని తొల్లి మావారు గాన
నర్థి వై వచ్చి నీవు నన్నడుగు టెల్లఁ
బద్మలోచన! నాపుణ్యఫలము గాదె. 646

వ. అని యిట్లు పలుకుచున్న యవసరంబున. 647

శా. ఆ దైత్యేంద్రుఁడు పినవతు నవపద్మాక్షున్ బిశంగాంబరా
చ్ఛాదున్ నిర్మల సాధువాదు ఘన [2]సంసారచ్ఛద చ్ఛేదు సం
శ్రీదున్ భక్తిలతా తిరోహిత హరిశ్రీపాదు నిఃఖేదుఁ బ్ర
హ్లాదున్ బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్. 648

వ. ఇట్లు సమాగతుం డైన తమ తాతం గనుంగొని, విరోచననందనుండు వారుణ పాశ బద్ధుండు గావునఁ దనకుం దగిన నమస్కారంబు సేయరామింజేసి సంకులాశ్రు విలోలలోచనుం డై, సిగ్గుపడి, నతశిరస్కుం డై, నమ్రభావంబున మ్రొక్కు చెల్లించె. అంతఁ బ్రహ్లాదుండును మఖమంటపంబున సునందాది పరిచర సమేతుం డై, కూర్చున్న వామనదేవునిం గని, యానంద బాష్ప జలంబులుం, బులకాంకురంబులు నెఱయ, దండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె.

సీ. ఇతనికి మున్ను నీ వింద్రపదం బిచ్చి నేఁడు త్రిప్పుటయును నెఱయ మేలు
మోహానాహంకృతి మూలంబు గర్వాంధతమస [3]వికారంబు దాని మాన్పి
కరుణ రక్షించుట గాక బంధించు టే తత్త్వజ్ఞునకు మహేంద్రత్వ మేల
నీ పాదకమలంబు నియతిఁ గొల్చినదానిఁ బోలునే సురరాజ్య భోగపరత

తే. గర్వ మేపారఁ గన్నులు గానరావు
చెవులు వినరావు చిత్తంబు చిక్కువడును
మఱచు నీసేవ లన్నియు మహిమ మాన్చి
మేలు చేసితి నీ మేటిమేర సూపి. 650

వ. అని పలికి, జగదీశ్వరుండును, నిఖిల లోకసాక్షియు, నగు నారాయణదేవునకు నమస్కరించి, ప్రహ్లాదుండు పలుకుచున్న సమయంబున. 651

మ. తతమత్తద్విపయాన యై కుచ నిరుంధ చ్చోళ సంవ్యాన యై
ధృత బాష్పాంబు వితాన యై కరయుగాధీ నాలిక స్థాన యై
'పతి భిక్షాం మమ దేహి కోమలమతే! పద్మాపతే!' యంచుఁ ద
త్సతి వింధ్యావళి సేరవచ్చెఁ ద్రిజగ ద్రక్షామనున్ వామనున్. 652

1. తుదిలేని (త. జ. ద.) 2. సంహారాది విచ్ఛేదు (హ. వా.) 3. వికాలంబు (చ. ట.)

వ. వచ్చి యచ్చేడియ తచ్చరణసమీపంబునం బ్రణత యై, నిలువంబడి యిట్లనియె.

క. నీకుం గ్రీడార్థము లగు, లోకంబులఁ జూచి పరులు లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు, లోకములకు రాజ వీవ లోకస్తుత్యా! 654

క. కాదనఁడు [1]పొమ్ము లే దీ, రా దనఁడు జగత్త్ర యైక రాజ్యము నిచ్చె
న్నా దయితుఁ గట్టనేటికి, శ్రీదయితా చిత్తచోర! శ్రితమందారా! 655

వ. అని యిట్లు వింధ్యావళియునుం, బ్రహ్లాదుండును విన్నవించు నవసరంబున హిరణ్యా
గర్భుండు సనుదెంచి యిట్లనియె. 656

సీ. భూతలోకేశ్వర! భూతభావన! దేవ దేవ! జగన్నాథ! దేవవంద్య!
తనసొమ్ము సకలంబు దప్పక నీ కిచ్చె దండయోగ్యుఁడు గాఁడు దానపరుఁడు
కరుణింప నర్హుండు కమలలోచన! నీకు విడిపింపు మీతని వెఱపుఁ దీర్చి
తోయపూరము చల్లి దూర్వాంకురంబులఁ జేరి నీ పదము లర్చించునట్టి

తే. భక్తియుక్తుఁడు లోకేశపదము నందు
నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ
నెఱిఁగి తనరాజ్య మంతయు నిచ్చినట్టి
బలికిఁ దగునయ్య దృఢ పాశబంధనంబు. 657

వ. అని పలికిన, బ్రహ్మవచనంబులు విని, భగవంతుం డిట్లనియె. 658

సీ. ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛయించితి వాని యఖిలవిత్తంబు నే నపహరింతు
సంసార గురుమద స్తబ్ధుఁ డై యెవ్వఁడు దెగడి లోకము నన్ను ధిక్కరించు
నతఁ డెల్లకాలంబు నఖిలయోనులయందుఁ బుట్టుచు దుర్గతిఁ బొందుఁ బిదప
విత్త వయో రూప విద్యా బలైశ్వర్య కర్మ జన్మంబుల గర్వ ముడిగి

తే. యేక విధమున విమలుఁ డై యెవ్వఁ డుండు
వాఁడు నాకూర్చి రక్షింపవలయువాఁడు
స్తంభ లోభాభిమాన సంసారవిభవ
మత్తుఁ డై చెడ నొల్లఁడు మత్పరుండు. 659

శా. బద్ధుం డై [2]గురు శప్తుఁ డై ఛలితుఁ డై బంధువ్రజ త్యక్తుఁ డై
సిద్ధైశ్వర్యము గోలుపోయి విభవక్షీణుండు నై పేద యై
శుద్ధత్వంబును సత్యమున్ గరుణయున్ [3]జో ప్పేమియుం దప్పఁడు
దృబ్ధుం డై యజయాఖ్య మాయ గెలిచెం బుణ్యుం డితం డల్పుఁడే. 660

---

1. పొండు (చ) 2. గురుశాపతప్తుఁ డయి (హ. వా.) 3. సొంపేమియుం (హ)

ఆ. [1]అసురనాథుఁ డనుచు ననఘుని మర్యాద
యేను జూత మనుచు నింత వలుక
నిజము వలికె నితఁడు నిర్మలాచారుండు
మేలు మేలు నాకు [2]మెచ్చువచ్చె. 661

క. సావర్ణిమనువువేళను, దేవేంద్రుం డగు నితండు దేవతలకు సం
భావిత మగు నా చోటికి, రావించెద నంతమీఁద రక్షింతు దయన్. 662

క. వ్యాధులు దప్పులు నొప్పులు, బాధలు చెడి విశ్వకర్మభావిత దనుజా
రాధిత సుతలాలయమున, నేధితవిభవమున నుండు నిత డందాఁకన్. 663

వ. అని పలికి, బలిం జూచి, భగవంతుం డి ట్లనియె. 664

సీ. సేమంబు నీ కింద్రసేనమహారాజ! వెఱవకు మేలు నీ వితరణంబు
వేలుపు లం దుండ వేడుక పడుదురు దుఃఖంబు లిడుమలు దుర్మరణము
లాతురతలు నొప్పు లం దుండువారికి నొందవు సుతలమం దుండు నీవు
నీ పంపు సేయని నిర్జరారాతుల నా చక్ర మేతెంచి నఱకుచుండు

ఆ. లోకపాలకులకు లోనుగా వక్కడ
నన్యు లెంతవార లచట నిన్ను
నెల్లప్రొద్దు వచ్చి యేను రక్షించెదఁ
గరుణతోడ నీకుఁ గానవత్తు. 665

క. దానవ దైత్యుల సంగతిఁ, బూనిన నీ యసురభావమును దోడ్తో మ
ద్ధ్యానమునఁ దొలఁగిపోవును, మానుగ సుతలమున నుండుమా మా యాజ్ఞన్.

## అధ్యాయము – ౨౩

వ. అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తులముదుకవేల్పు తియ్యని నెయ్యంపుఁ బలుకుఁ జెఱకురసంపు సోనలు వీనులతెరువులం జొచ్చి, లో బయలు నిండి, ఱెప్పలకప్పు తప్పం ద్రోచికొని, కనుఁగవకొలంకుల నలుఁగులు వెడలినచందంబున సంతసంబునం గన్నీరు మున్నీ రై పఱవ, నురఃఫలకంబునం బులకంబులు కుల కంబు లై తిలకంబులొత్తఁ గేలు మొగిడ్చి, నెక్కొన్న వేడుకం ద్రొక్కుడు వడుచుఁ జిక్కనిచిత్తంబునఁ జక్కనిమాటల రక్కసులఱేఁ డి ట్లనియె. 667

---

1. అసురనాథుఁ డయ్యు ననఘుండు–మర్యాద (చ.ట.జ.ద.) 2. మెచ్చువచ్చు (హ.తం.వా.) మెచ్చువచ్చె (ద)

ఉ. ఎన్నఁడు లోకపాలకుల నీ కృపఁ జూడని నీవు నేఁడు న
న్నన్నతుఁ జేసి నా బ్రతుకు నోజయు నానతియిచ్చి కాచి తీ
మన్నన నీదయారసము మాటలపెద్దఱికంబు చాలదే
పన్నగతల్ప! ని న్నెఱిఁగి పట్టిన నాపద గల్గనేర్చునే. 668

వ. అని పలికి, బంధవిముక్తుం డై, హరికి నమస్కరించి, బ్రహ్మకుం బ్రణామంబు సేసి, యిందుధరునకు వందనం బాచరించి, తనవారలతోఁ జేరికొని, బలి సుతలంబునకుం జనియె. అంత హరికృపావశంబునం గృతార్థుం డై, కులోద్ధారకుం డైన మనుమనిం గని, సంతోషించి ప్రహ్లాదుండు భగవంతున కి ట్లనియె. 669

సీ. చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు శర్వుఁ డీ లక్ష్మల జాడఁ బొందఁ
డన్యులఁ కెక్కడి దసురులకును మాకు బ్రహ్మాది పూజితపదుఁడ వైన
దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి పద్మజాదులు భవ త్పాదపద్మ
మకరందసేవన మహిమ నైశ్వర్యంబు లందిరి కాక మే మల్పమతుల

తే. మధిక [1]దుర్యోనులము కుత్సితాత్మకులము
నీ కృపాదృష్టి మార్గంబు నెలవు సేర
నేమి తపమాచరించితి మెన్నఁగలమె
మమ్ముఁ గాచుట చిత్రంబు మంగళాత్మ! 670

వ. అదియునుం గాక. 671

ఆ. సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు
నొకట విషమవృత్తి నుండు దరయ
నిచ్చలేనివారి కీవు; భక్తులు గోరు
తలఁపు లిత్తు కల్పతరువుమాడ్కి. 672

వ. అని విన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి, పరమపురుషుం డి ట్లనియె. 673

తే. వత్స! ప్రహ్లాద! మేలు నీ వారు నీవు
నొరిది మనుమనిఁ దోడ్కొని సుతలమునకుఁ
బైన మై పొమ్ము నే గదాపాణి నగుచుఁ
జేరి రక్షింతు దురితంబు చెంద దచట. 674

వ. అని, యిట్లు నియమించినం, బరమేశ్వరునకు నమస్కరించి, వలగొని, కరకమల పుట ఘటిత నిటలతటుం డై, వీడ్కొని, బలిం దోడ్కొని, సకలాసుర యూథం

---

1. దుర్యోధులము (హ. వా.)

బునుం, దాను, నొక్క మహాబిలద్వారంబు సొచ్చి, ప్రహ్లాదుండు సుతలలోకంబు నకుం జనియె. అంత బ్రహ్మవాదు లైన యాజకుల సభామధ్యంబునం గూర్చున్న శుక్రునిం జూచి, నారాయణుం డి ట్లనియె. 675

ఆ. ఏమి గొఱంత వడియె నీతని యాగంబు
విస్తరింపు కడమ విప్రవర్య!
విషమ మైన కర్మ విసరంబు బ్రాహ్మణ
జనులు సూచినంత [1]సమతఁ బొందు. 676

వ. అనిన శుక్రుం డి ట్లనియె. 677

సీ. అఖిలకర్మంబుల కధినాథుఁడవు నీవు యజ్ఞేశుఁడవు నీవు యజ్ఞపురుష!
ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ [2]గడ మేల గల్గు నే కర్మములకు
ధన దేశ కాలార్హ తంత్ర మంత్రంబుల కొఱఁతలు నిన్నుఁ బేర్కొనిన మాను
నైనఁ గావింతు నీ యానతి భవదాజ్ఞ మెలఁగుట జనులకు మేలు గాదె

తే. యింతకంటెను శుభము నా కెచటఁ గలుగు
ననుచు హరిపంపు శిరమున నావహించి
కావ్యుఁ డసురేంద్రు జన్నంబు కడమఁ దీర్చె
మునులు విప్రులు సాహాయ్యమునఁ జరింప. 678

వ. ఇవ్విధంబున వామనుం డై హరి బలి నడిగి, మహిం బరిగ్రహించి, తనకు నన్న యగు నమరేంద్రునకుం ద్రిదివంబును సదయుం డై యిచ్చెను. అప్పుడు దక్ష భృగు ప్రజాపతులును, భవుండును, గుమారుండును, దేవర్షి పితృగణంబులును, రాజులును, దానును, గూడికొని, చతురాననుండు, కశ్యపునకు, నదితికి సంతోషంబుగా, లోకంబులకును, లోకపాలురకును, వామనుండు వల్లభుం డని నియమించె. అందఱును ధర్మంబునకు, యశంబునకు, లక్ష్మికి, శుభంబులకు, దేవతలకు, వేదంబులకు, స్వర్గాపవర్గంబులకు, నుపేంద్రుండు ప్రధానుం డని సంకల్పించిరి. ఆ సమయంబున. 679

క. కమలజుఁడు లోకపాలురు, నమరేంద్రునిఁ గూడి దేవయానంబున న
య్యమరావతికిని వామను, నమరం గొనిపోయి రంత నటమీఁద నృపా! 680

---

1. శమత (హ) 2. కడములు గల్గునే (తం)

ఆ. బల్లి దంపుఁ దోడు ప్రాపున నింద్రుని
కింద్రపదము చేరు టిట్లు గలిగెఁ
దనకు నాద్యుఁ డైన తమ్ముఁడు గలిగినఁ
గోర్కు లన్న కేల కొఱఁత నొందు. 681

క. పా లడుగఁడు మే లడుగం, డేలఁడు భిక్షించి యన్న కిచ్చెఁ ద్రిజగముల్
వేలుపులతల్లి కడపటి, చూలుం బోలంగఁ గలరె సొలయని తమ్ముల్. 682

ఆ. కడుపు [1]బరువుగాఁగఁ గొడుకులఁ గనుకంటె
తల్లి కొకఁడె చాలు బల్లిదుండు
త్రిదశగణముఁ గన్న యదితి కానుపు [2]దీర్చి
చిన్ని మేటివడుగుఁ గన్న యట్లు. 683

వ. ఇట్లు దేవేంద్రుండు వామన భుజపాలితం బగు త్రిభువన సామ్రాజ్య విభవంబు మఱల నంగీకరించె. అప్పుడు బ్రహ్మయు, శర్వుండును, గుమారుండును, భృగు ప్రముఖు లైన మునులును, పితృదేవతలును, దక్షాది ప్రజాపతులును, సిద్ధులును, వైమానికులును, మఱియుం దక్కిన వారలు నద్భుత ప్రకాశం బైన విష్ణు ప్రభావంబులకు నాశ్చర్యంబు నొందుచుఁ, బ్రశంసింపుచు, నాడుచుం, బాడుచుం, దమతమ నివాసంబులకుం జనిరి. అని చెప్పి, శుకుం డి ట్లనియె. 684

తే. మనుజనాథ ! త్రివిక్రమ మహిమ కొలఁది
యెఱిఁగి తర్కింప లెక్కింప నెవ్వఁ డోపుఁ
గుంభినీ రేణుకణములు గుఱుతు వెట్టు
వాఁడు నేరఁడు తక్కినవారి వశమె. 685

క. అద్భుత వర్తనుఁ డగు హరి, సద్భావిత మైన విమలచరితము వినువాఁ
డుద్భట విక్రముఁ డై తుది, [3]నుద్భాసితలీలఁ బొందు నుత్తమ గతులన్. 686

తే. తగిలి మానుష పైతృక దైవకర్మ
వేళలందుఁ ద్రివిక్రమ విక్రమంబు
లెక్క డెక్కడఁ గీర్తింతు రెవ్వరేనిఁ
బొందుదురు నిత్య సౌఖ్యంబు భూవరేంద్ర ! 687

వ. అని, యిట్లు శుకుండు రాజునకు వామనావతార చరితంబు సెప్పె. అని సూతుండు మునులకుం జెప్పిన విని, వార లతని కి ట్లనిరి. 688

---

1. బదరగాఁగ (తం. వా.) 2. దీఱ (తం. వా.) 3. నుద్భావిత (హ)

## అధ్యాయము — ౨౪

### —: మత్స్యావతారకథ :—

సీ. విమలాత్మ! విన మాకు వేడుకయ్యెను మున్ను హరి మత్స్యమైన వృత్తాంతమెల్లఁ
గర్మబద్ధుని భంగి ఘనుఁ డీశ్వరుఁడు లోక నిందితం బైన తమోనిలయ మైన
మీనరూపము నేల మేలని ధరియించె నెక్కడ వర్తించె నేమి చేసె
నాద్య మై వెలయు న య్యావతారమునకు నెయ్యది కారణంబు కార్యాంశ మెట్లు

ఆ. నీవు తగుదు మాకు నిఖిలంబు నెఱిఁగింపఁ
దెలియఁ జెప్పవలయు దేవదేవు
చరిత మఖిలలోక సౌభాగ్యకరణంబు
గాదె విస్తరింపు క్రమముతోడ. 689

వ. అని, మునిజనంబులు సూతు నడిగిన, నతం డిట్లనియె. మీర లడిగి యీ యర్థంబుఁ
బరీక్షిన్నరేంద్రుం డడిగిన, భగవంతుం డగు బాదరాయణి యి ట్లనియె. 690

సీ. విభుఁ డీశ్వరుఁడు వేద విప్ర గో సుర సాధు ధర్మార్థములఁ గావఁ దనువుఁ దాల్చి
గాలి చందంబున ఘనరూపముల యందుఁ దనురూపముల యందుఁ దగిలియుండు
నెక్కువ తక్కువ నెన్నఁడు నొందక నిర్గుణత్వంబున నెఱియు ఘనుఁడు
గురుతయుఁ గొఱఁతయు గుణసంగతి వహించు మనుజేశ! చోద్యమే మత్స్యమగుట

తే. వినుము పోయిన కల్పాంతవేళఁ దొల్లి
ద్రవిళ దేశపురాజు సత్యవ్రతుండు
నీరు ద్రావుచు హరిఁ గూర్చి నిష్ఠతోడఁ
దపముఁ గావించె నొక యేటి తటమునందు. 691

వ. మఱియు, నొక్కనాఁ డ మ్మేదినీకాంతుండు, కృతమాలిక యను నేటి పొంత
హరిసమర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్న సమయంబున, నా రాజు
దోసిటి నొక్కమీను పట్టి, దవిలివచ్చిన నుల్కిపడి, మఱలం దరంగిణీ జలంబునందు
శకుల శాబకంబు విడిచె. విడివడి నీటిలో నుండి జలపోతంబు భూతలేశ్వరున
కి ట్లనియె. 692

మత్తకోకిల. పాటువచ్చిన జ్ఞాతిఘాతులు పాపజాతి ఝషంబు లీ
యేటఁ గొండొక మీనుపిల్లల నేఱి పట్టి వధింప న
చ్చోట నుండక నీదుదోసిలి సొచ్చి వచ్చిన నన్ను న
చ్చేటఁ ద్రోవఁగఁ బాడియే కృప యింతలేక దయానిధీ! 693

ఆ. వలలుఁ దారు నింక వచ్చి జాలరి వేఁట
కాఱు నేఱుఁ గలఁచి [1]గాఱ వెట్టి
మిడిసి పోవనీక మెడఁ బట్టుకొని యెద
రప్పు డెందుఁ జొత్తు ననఘ చరిత! 694

క. భక్షించునొండె [2]ఝషములు, శిక్షింతురు [3]ధూర్తులొండె చెడకుండ నను
రక్షింపు దీనవత్సల!, ప్రక్షీణులఁ గాచుకంటె భాగ్యము కలదే. 695

వ. అనిన విని, కరుణాకరుం డగు న వ్విభుండు, మెల్లన శకుల డింభకంబును గమండలు జలంబునం బెట్టి, తననెలవునకుం గొనిపోయె. అదియు నొక్క రాత్రంబునం గుండ నిండి, తనకు నుండ నిమ్ము చాలక రాజన్యున కి ట్లనియె. 696

క. ఉండ నిది కొంచె మెంతయు, నొండొకటిం దెమ్ము భూవరోత్తమ! యనుడు
గండకముఁ దెచ్చి విడిచెను, మండలపతి కలశ సలిల మధ్యమునందు. 697

వ. అదియును, ముహూర్త మాత్రంబునకు మూఁడుచేతుల నిడుపై, యుదంచనంబు నిండి, పట్టులేక వేఱొండు దెమ్మనవు, డా రాచపట్టి కరుణాగుణంబులకు నాటపట్టు గావున, గండకంబును నొక్క చిఱుత మడుఁగున నునిచె. అదియును నా సరోవర జలంబులకు నగ్గలం బై, తనకు సంచరింప నది కొంచెం బని పలికినఁ, బుడమి ఱేఁడు మంచివాఁ డగుటం జేసి, యా యుదకచరంబు నుదంచిత జలాస్పదం బైన హ్రదంబునందు నిడియె. అదియును జలాశయంబునకు నధికం బై, పెరుఁగ నిమ్ములే దని చెప్పికొనిన, న ప్పుణ్యుం డొప్పెడి నడవడి దప్పనివాఁ డైన కతంబున, న మ్మహామీనంబును మహార్ణవంబున విడిచె. అదియును, మకరాకరంబునం బడి, పెను మొసళ్ళు మునరికొని, కసిమసంగి, మ్రింగెడిని. ఇంత కాలంబునడపి, కడపట దిగవిడువక, వెడలం దిగువుము. అని [4]యెలుంగింప, న న్నీటిపొడవునకుం[5] బుడమిఱేఁడు దెలిసి యి ట్లనియె. 698

సీ. ఒక దినంబున శతయోజన మాత్రము విస్తరించెదు నీవు వినము చూడ
మిటువంటి ఝషముల నెన్నఁడు నెఱుఁగము మీనజాతుల కిట్టి మేను గలదె
యేమిటి [6]కెవ్వఁడ వీలీలఁ ద్రిప్పెదు కరుణ నాపన్నులఁ గావవేఁడి
యంభశ్చరం బైన హరివి నే నెఱిఁగితి నవ్యయ! నారాయణాభిధాన!

---

1. కారవెట్టి (తం. వా.) తాఱువెట్టి (హా) 2. ఝషముల (హా) 3. ధూర్తులైన (హా) 4. యెఱింగింప (హా) 5. యన్నీటి తిరుగుడు ప్రోడకుం (వా) 6. కెవ్వఁడ వేల ద్రవ్వించెదు (హా) ఏల త్రిప్పించెదు (తం)

తే. జనన సంస్థితి సంహార చతురచిత్త!
దీను లగు భక్తులకు మాకు దిక్కు నీవ
నీదు మీనావతారంబు నిఖిలభూత
భూతిహేతువు మ్రొక్కెదఁ బురుషవర్య! 699

క. [1]ఇతరులము గాము చిత్సం, గతులము మాపాల నీవు గలిగితి భక్త
స్థితుఁడ వగు నిన్ను నెప్పుడు, నతి సేసిన వాని కేల నాశము గల్గున్. 700

క. శ్రీలలనా కుచవీథీ, కేళీపరతంత్ర బుద్ధిఁ గ్రీడించు సుఖా
లోలుఁడవు తామసాకృతి, నేలా మత్స్యంబ వైతి వెఱఁగింపు హరీ! 701

వ. అని పలుకు సత్యవ్రతుం డను మహారాజునకు న య్యుగంబు కడపటఁ బ్రళయ వేళ సముద్రంబున నేకాంత జన ప్రీతుం డై విహరింప నిచ్ఛయించు మీనరూపుం డైన హరి యి ట్లనియె. 702

సీ. ఇటమీఁద నీ రాత్రి కేడవదినమునఁ బద్మగర్భున కొక్క పగలు నిండు
భూ ర్భువాదిక జగంబులు మూఁడు విలయాబ్ధిలోన మునుంగు నాలోనఁ బెద్ద
నావ చేరఁగవచ్చు నా పంపుపెంపున దానిపై నౌషధతతులు బీజ
రాసులు నిడి పయోరాశిలో విహరింపఁ గలవు సప్తర్షులుఁ గలసి తిరుగ

ఆ. మ్రోలఁ గానరాక ముంచుఁ జెంజీఁకటి
[2]మినుకుచుండు మునుల మేని వెలుఁగు
దొలకుచుండు జలధి దోధూయమాన మై
నావ తేలుచుండు నరవరేణ్య! 703

వ. మఱియు, న న్నావ మున్నీటికరళ్ళకు లోనుగాకుండ, నిరుగెలంకుల వెనుక ముందఱ నేమఱకుండ, పెన్నెఱు లగు నాగఱులం జడియుచుఁ, బొడువవచ్చిన బలుగ్రాహంబుల నొడియుచు, సంచరించెద. ఒక్క పెనుఁబాము చేరువ, నా యనుమతిం బొడచూపెడు. దానం జేసి సుడిగాడ్పులకతంబున నావ వడిఁ [3]దిరుగంబడకుండ నా కొమ్ముతుదిం బదిలంబుగఁ జేసి, నీకును, మునులకు, నలజడి చెందకుండ మున్నీటి నిప్పాటం దమ్మిచూలి రేయి వేగునంతకు మెలంగెద. అది కారణంబుగా జలచరరూపంబుఁ గైకొంటి. మఱియునుం బ్రయోజనంబు గలదు. నామహిమ పరబ్రహ్మం బని తెలియుము. నిన్ను ననుగ్రహించితి. అని సత్యవ్రతుండు సూడ హరి తిరోహితుం డయ్యె. అ య్యవసరంబున. 704

1. ఇతరులముగదా (హ) 2. మిణుకుచుండు (చ) 3. దిఱుగకుండ (హ)

ఆ. మత్స్యరూపి యైన మాధవు [1]నుడుగులు
తలఁచికొనుచు రాచతపసి యొక్క
దర్భశయ్యఁ దూర్పు దలగడగాఁ బండి
కాచి యుండె నాఁటి కాలమునకు. 705

వ. అంతఁ గల్పాంతంబు డాసిన. 706

క. ఉల్లసిత మేఘపంక్తులు, జల్లించి మహోగ్రవృష్టి జడిగొని గురియన్
వెల్లి విరిసి జలరాసులు, సెల్లెలికట్టలను దాఁటి [2]సీమల ముంచెన్. 707

వ. తదనంతరంబ. 708

తే. మున్ను వోయిన కల్పాంతమున నరేంద్ర!
బ్రాహ్మ మనఁగ నైమిత్తికప్రళయ మైన
నింగిపైఁ దొట్టి తొలఁకు మున్నీటిలోనఁ
గూలె భూతాళి జగముల కొలఁదు లెడలి. 709

వ. అంత న మ్మహారాత్రి యందు. 710

మ. నెఱి నెల్లప్పుడు నిల్పి [3]ప్రాణిచయమున్ మీలింప నిర్మించి [4]వీఁ
పిఱియ న్నిల్గుచు నావులింపుచు నజుం డేసృష్టియున్ మాని మే
నొఱఁగన్ ఱెప్పలు మూసి కే ల్దలగ డై యుండంగ నిద్రింపుచున్
గుఱు వెట్టం దొడఁగెన్ గల ల్గనుచు నిర్ఘోషింపుచున్ భూవరా! 711

ఆ. అలసి సొలసి నిదుర నందిన పరమేష్ఠి
ముఖమునందు వెడలె మొదటిశ్రుతులు
నపహరించె నొక హాయగ్రీవుఁ డను దైత్య
భటుఁడు దొంగఁ దొడరఁ బరులవశమె. 712

క. చదువులు తనచేపడె నని, చదువుచుఁ బెన్ బయల నుండ శంకించి వడిన్
జదువులముదుకఁడు గూరుకఁ, జదువులతస్కరుఁడు సొచ్చె జలనిధికడుపున్. 713

వ. ఇట్లు వేదంబులు దొంగిలి, దొంగరక్కసుండు మున్నీట మునింగిన, వాని జయింపవలసియు, ద్రమానుదీఁగెలయందు విత్తనంబుల పొత్తరులు పెన్నీట నాని చెడకుండ మనుపవలసియు, నెల్లకార్యంబులకుఁ గావలి యగు నా పురుషోత్తముం డ ప్పెను రేయి చొరుదలయందు. 714

---

1. నడుగులు (హా) 2. జీవుల ముంచెన్ (ట) 3. ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించి (తం. శా.) 4. వీపెఱియన్ (హా)

క. కుఱుగఱులు వలుఁదమీసలు, చిఱుదోఁకయుఁ బసిఁడి యొడలు సిరిగలపొడలుఁన్
నెఱిమొగము నొక్కకొమ్మును, మిఱుచూపులు గలిగి విభుఁడు మీనం బయ్యెన్

వ. ఇట్లు లక్ష యోజనాయతం బైన పాఠీనం బై, విశ్వంభరుండు జలధి సొచ్చి.

సీ. ఒకమాటు జలజంతు యూథంబుతోఁ గూడు నొకమాటు దరులకు నుఱికివచ్చు
నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు నొకమాటు లోపల నొదిఁగి యుండు
నొకమాటు వారాశి నొడలు ముంపమి సూపు నొకమాటు బ్రహ్మాండ
మొరయఁ దలఁచు
నొకమాటు ఝషకోటి నొడిసి యాహారించు నొకమాటు జలముల నుమిసివైచు

తే. గఱులు సారించు మీసలు గడలుగొలుపుఁ
బొడలు మెఱపించుఁ గన్నుల [1]పొలప మార్చు
నొడలు ఝళిపించుఁ దళతళ లొలయు మీన
వేషి యెన్నిట నిగమ గవేషి యగుచు. 717

వ. అంతకుమున్ను సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు ముంచు నవస రంబున, భక్తపరాధీనుం డగు హరిం దలఁచుచునుండ, నారాయణప్రేరిత యై, యొక్క నావ వచ్చినం గనుంగొని. 718

మ. చని సత్యవ్రత మేదినీదయితుఁ డోజం బూని ప్రాఁన్ దీఁగె వి
త్తనముల్ పెక్కులు నావపై నిడి హరిధ్యానంబుతో దానిపై
మునిసంఘంబులుఁ దాను నెక్కి వెఱతో మున్నీటిపైఁ దేలుచున్
గని యెన్ ముందట భక్తలోక హృదలంకర్మీణమున్ మీనమున్. 719

వ. కని, జలచరేంద్రుని కొమ్మున నొక్క పెనుఁబాపత్రాట నన్నావ గట్టి, సంతసించి డెందంబు నివిరికొని, తపస్వులతోడఁ గూడికొని, యా రాచపెద్ద మీనాకారుం డగు వేల్పుఱేని ని ట్లని పొగడె. అప్పుడు. 721

మ. తమలోఁబుట్టు నవిద్యఁ గప్పుగొనఁగన్ దన్మూల సంసారవి
భ్రము లై కొందఱు దేలుచున్ గలఁగుచున్ బల్వెంటలం దైవయో
గమునం దే పరమేశుఁ గొల్చి ఘను లై కైవల్యసంప్రాప్తు లై
ప్రమదం బందుదు రట్టి నీవు కరుణం బాలింపు మ మ్మీశ్వరా. 720

---

1. పొలుపుమార్చు (హ)

ఉ. [1]కన్నులులేనివాఁడు మఱి కాననివానికిఁ ద్రోవ సూపఁగాఁ
జన్న తెఱంగు [2]మూఢున కసన్మతి దా గురుఁడౌట సూర్యుఁడే
కన్నులుగాఁగ భూతములఁ గాంచుచు నుండు రమేశ! మాకు ను
ద్యన్నయమూర్తి వై గురువ వై యల సద్గతిజాడఁ జూపవే. 722

క. ఇంగలముతోడి సంగతి, బంగారమువన్నె గలుగుభంగిని నీ సే
వాంగీకృతుల యఘంబులు, భంగంబులఁ బొందు ముక్తి ప్రాపించు హరీ! 723

క. హృదయేశ! నీ ప్రసన్నత, పదివేలవపాలి లేశభాగము కతనం
ద్రిదశేంద్రత్వము గల దఁట, తుది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా! 724

క. పెఱవాఁడు గురుఁ డటంచును, గొఱగాని పదంబు సూపఁ గుజనుండును నీ
నెఱత్రోవ నడవనేర్చిన, నఱమఱ లేనట్టిపదము నందు దయాబ్ధీ. 725

మ. చెలి వై చుట్టమ వై మనస్థ్సితుఁడ వై చిన్మూర్తి వై యాత్మ వై
వల నై కోర్కెలపంట వై విభుఁడ వై వర్తిల్లు ని న్నొల్ల కే
పలువెంటం బడి లోక మక్కట! వృథా బద్ధాశమైపోయెడిన్
నిలువ న్నేర్చునె హేమరాశిఁ గనియు న్నిర్భాగ్యుఁ డంభశ్శయా! 726

ఆ. నీరరాశిలోన నిజకర్మబద్ధ మై
యుచితనిద్రఁ బొందియున్న లోక
మే మహాత్ముచేత నెప్పటి మేల్కాంచు
నట్టి నీవు గురుఁడ వధిప! మాకు. 727

క. ఆలింపుము విన్నప మిదె, వేలుపుగమి ఱేని నిన్ను వేఁడికొనియెదన్
నాలోని చిక్కు మానిచి, నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా! 728

వ. అని యిట్లు సత్యవ్రతుండు వలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసము
ద్రంబున విహరించు హరి, పురాణపురుషుం డగుటం జేసి, సాంఖ్యయోగ క్రియా
సహిత యగు పురాణసంహిత నుపదేశించె. అ మ్మహారాజు మునిసమేతుం డై,
భగవ న్నిగదితం బైన, సనాతనం బగు బ్రహ్మస్వరూపంబు దెలిసికొని, కృతార్థుం
డయ్యె. ఇ మ్మహాకల్పంబున వివస్వతుం డనం బరఁగిన సూర్యునకు శ్రాద్ధదేవుం
డన జన్మించి, శ్రీహరికృపావశంబున నేడవ మను వయ్యె. అంత న వ్విధంబునం
బెనురేయి నిండు నంతకు సంచరించి, జలచరాకారుం డగు నారాయణుండు,
ద న్నిశాంత సమయంబునందు. 729

---

1. కన్నులు గల్గువాఁడు (వా) 2. మూఢునకు సన్మతి (వా)

మ. ఉఱ కంభోనిధి లోని వేదముల కుయ్యుం దైన్యముం జూచి వే
గఱు లాడించి ముఖంబు సాఁచి బలువీఁకన్ దోఁక సారించి మేన్
మెఱయన్ దౌడలు గీఱి మీస లడరన్ మీనాకృతిన్ విష్ణుఁ డ
క్కఱటిం దాఁకి వధించె ముష్టి దళిత గ్రావున్ హయగ్రీవునిన్. 730

వ. అంతఁ బ్రళయావసాన సమయంబున. 731

సీ. ఎప్పుడు వేగునం చెదురు సూచుచు నుండు మునుల డెందంబులు ముదము నొందఁ
దెలివితోఁ బ్రక్క నిద్రించు భారతి లేచి యోరపయ్యెద చక్క నొత్తికొనఁగ
మలిన మై పెనురేయి గ్రమ్మిన తేజంబు తొంటిచందంబునఁ దొంగలింపఁ
బ్రాణుల సంచిత భాగధేయంబులు గన్నుల కొలుకులఁ గానఁబడఁగ

తే. నవయవంబులు కదలించి యావులించి
నిదుర దెప్పిఱి మేల్కాంచి నీల్గి మలఁగి
యొడలు విఱుచుచుఁ గనుఁగవ [1]నుసుము కొనుచు
ధాత గూర్చుండె సృష్టి సంధాత యగుచు. 732

వ. అ య్యవసరంబున. 733

ఆ. వాసవారిఁ జంపి వాని చేపడియున్న
వేదకోటి చిక్కు విచ్చి తెచ్చి
నిదుర మాని యున్న నీరజాసనునకు
నిచ్చెఁ గరుణతోడ నీశ్వరుండు. 744

క. జలరుహ నాభుని కొఱకై, జలతర్పణ మాచరించి సత్యవ్రతుఁ డా
జలధిఁ బ్రతికి మను వయ్యెను, జలజాతునిఁ గొలువ కెందు సంపద గలదే. 735

ఆ. జనవిభుండు తపసి సత్యవ్రతుండును
మత్స్యరూపి యైన మాధవుండు
సంచరించి నట్టి సదమలాఖ్యానంబు
వినినవాఁడు బంధ విరహితుండు. 736

క. హరి జలచరావతారముఁ, బరువడిఁ బ్రతిదినముఁ జదువఁ బరమపదంబున్
నరుఁ డందు వాని కోర్కెలు, ధరణీశ్వర ! సిద్ధిఁబొందుఁ దథ్యము సుమ్మీ. 737

---

1. నుదురు కొనుచు (హ)

మ. ప్రళయాంభోనిధిలోన మేన మఱచి నిద్రం జెందు వాణీశు మో
ముల వేదంబులు గొన్న దైత్యుని మృతిం బొందించి, సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటలం దెలిపి సర్వాధారుఁ డై మీన మై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్. 738

వ. అని చెప్పి. 739

క. రాజేంద్ర! దైత్యదానవ, రాజ మహాగహన దహన! రాజస్తుత్యా!
రాజావతంస మానిత!, రాజధరార్చిత! గుణాఢ్య! రాఘవరామా! 740

మాలినీ. దివిజరిపు విదారీ! దేవలోకోపకారీ!
భువనభర నివారీ! పుణ్యరక్షానుసారీ!
ప్రవిమల శుభమూర్తీ! బంధుపోష ప్రవర్తీ!
ధవళ బహుళ కీర్తీ! ధర్మనిత్యానువర్తీ! 741

గద్య. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతం బైన శ్రీ మహాభాగవత పురాణం బను మహా ప్రబంధంబునందు స్వాయంభువ స్వారోచి షోత్తమ తామస మనువుల చరిత్రంబును, కరిమకరి యుద్ధంబును, గజేంద్ర రక్షణంబును, రైవత చాక్షుష మనువుల వర్తనంబును, సముద్ర మథనంబును, కూర్మావతారంబును, గరళ భక్షణంబును, అమృతాది సంభవంబును, దేవాసుర కలహంబును, హరి కపట కామినీ రూపంబున నసురుల వంచించి, దేవతల కమృతంబు వోయుటయు రాక్షసవధంబును, హరిహర సల్లాపంబును, గపటకామినీరూప విభ్రమణంబును, వైవస్వత, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, భద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణి, మనువుల వృత్తాంతంబును, బలి యుద్ధయాత్రయును, స్వర్గవర్ణ నంబును, దేవపలాయనంబును, వామనావతారంబును, శుక్ర బలి సంవాదం బును, త్రివిక్రమ విస్ఫురణంబును, రాక్షస సుతల గమనంబును, సత్యవ్రతో పాఖ్యానంబును, మీనావతారంబును నను కథలు గల యష్టమ స్కంధము సంపూర్ణము.

ఓమ్

# శ్రీ మహా భాగవతము

## నవమ స్కంధము

క. శ్రీరాజిత! మునిపూజిత!, వారిధి గర్వాతిరేక వారణ బాణా!
సూరిత్రాణ! మహోజ్జ్వల, సారయశస్సాంద్ర! రామచంద్రనరేంద్రా! 1

### అధ్యాయము - ౧

వ. మహనీయ గుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం డైన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రునిం గనుంగొని. 2

సీ. మనువుల నడవళ్ళు మర్యాదలును వింటి మన్వంతరంబుల మాధవుండు
దిరిగిన జాడలు దెలిసె సత్యవ్రతుం డను రాజు ద్రవిళదేశాధిపుండు
పోయిన కల్పాంతమున విష్ణు సేవించి విజ్ఞానమునఁ బొంది వెలుఁగుఁజేని
కతఁడు వైవస్వతుం డై పుట్టి మను వయ్యె నతనికి నిక్ష్వాకుఁ డాదిగాఁగఁ

తే. బదుగు కొడుకులు గల [1]రంటి పరఁగ వారి
వంశ మేరీతి వర్తించె వారిలోనఁ
జనినవారిని జనువారిఁ [2]జనెడివారిఁ
జెప్పవే వ్యాసనందన! చిత్తగించి. 3

క. చెవులార నేఁడు వినియెద, రవివంశమునందుఁ గలుగు రాజుల కీర్తుల్
వివరింపు వరుసతోడను, భువిఁ బుణ్యుల[3]చరిత వినినఁ బుణ్యముగాదే. 4

వ. అనినం బరాశరముని మనుమం డిట్లనియె. 5

ఆ. వినుము మనువుకులము వెయ్యినూఱేండ్లును
బరఁగ విస్తరించి పలుకరాదు
నాకుఁ దోఁచినంత నరనాథ! వేగంబ
[4]యెఱుకపడఁగఁ బ్రీతి నేర్పరింతు. 6

---

1. రంచు (హ); అంద్రు (వా); 2. చనినవారి (తం) "యేభూతా యేభవిష్యాశ్చ భవం త్యద్యతనాశ్చయే" (1–5) 3. కీర్తి (ద. బ. తం. వా.) 4. యెఱుఁగఁ బడఁగ (హ)

క. ఎక్కువ తక్కువ [1]పొడవుల, కెక్కటి మొద లైన పురుషుఁ డింతయుఁ జెడఁ దా
నొక్కఁడు కల్పాంతంబున, [2]నక్కజ మై నిల్చె విశ్వ మతఁ డై యుంటన్. 7

సీ. భూమీశ ! య మ్మహాపురుషుని నాభిమధ్యమున బంగారుఁ గెందమ్మి మొలచె
నా తమ్మిపూవులో నటమీఁదఁ దనయంత నాలుఁగు మోముల నలువ పుట్టె
నా బ్రహ్మమనమున నట మరీచి జనించెఁ గశ్యపుం డతనికిఁ గల్గె నంత
నా కశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ గొమరుఁ డై చీఁకటిగొంగ వొడమె

తే. జలజబంధుని పెండ్లాము సంజ్ఞయందు
శ్రాద్ధదేవుండు మనువు సంజాతుఁ డయ్యె
మనువునకు శ్రద్ధ యనియెడి మగువయందుఁ
బదురు కొడుకులు గలిగిరి భద్రయశులు. 8

వ. వార లిక్ష్వాకుండును, నృగుండును, శర్యాతియు, దిష్టుండును, ధృష్టుండును, గరూశకుండును, నరిష్యంతుండును, వృషధ్రుండును, నభగుండును, గవియు నన నెగడిరి. అటమున్ను మనువు, కొడుకులు లేనివాఁ డై, మిత్రావరుణుల నుద్దేశించి. 9

సీ. మనువు బిడ్డలు వుట్ట మఖ మాచరించుచో నతని భార్యయు హోత నాశ్రయించి
కూఁతురు పుట్ట నాకును జేయు మని పల్కి వరభక్తితోఁ బయోవ్రతము సల్పె
నా సతి సెప్పిన ట్లధ్వర్యుఁడును హోత నగుఁగాక [3]వేలువు మనుచుఁ బలికె
[4]హవి యందుకొని [5]కూఁతు రగుఁ గాక యని వషట్కారంబు సెప్పుచుఁ గదిసి వేల్వ

తే. హోత [6]వెడసేఁత నిల యను నువిద వుట్టె
దానిఁ బొడగని మనువు సంతాప మంది
కొడుకు మేల్గాక యేటికిఁ [7]గూఁతు రకట !
చెప్పవే యని పోయె వసిష్ఠు కడకు. 10

వ. చని యి ట్లనియె. 11

క. అయ్యా ! కొడుకులకొఱకై, [8]యి య్యాగము నీ యనుజ్ఞ నేఁ జేయంగా
ని య్యాఁడ దేల పుట్టెను, మి య్యంతటివారి కొండు మేరయుఁ గలదే. 12

---

1. పొడవుల నెక్కటి (హా) పొడవుల కెక్కటి పొడవైన (క. ద. బ. తం.) 2. అక్కజమై యుండి విశ్వమంతయు నిల్చెఁ (తం) 3. వేల్పుడుననుచు (హా); వేలుపుమనుచు (తం) 4. హవి నందుకొని (తం); హవిసందుకొని (వా) 5. కూతురయ్యెద మని (ట.త.డ.) కూఁతు రయ్యెడుమని (తం. వా.) 6. పెడచేత (హా. తం. వా) 7. కూఁతురనుచు (హా) 8. మీయంతటి (తం.వా) ఈ పాఠమున ప్రాసభంగము. మీ + అంతటి = మియ్యంతటి. స్వతంత్ర ప్రయోగము. 'అయ్యా-యీ యాగము – నీ యాడదేల - మీయంతటి' (హా).

వ. అదియునుం గాక, మీరు బ్రహ్మవాదులరు. మంత్రవాదులరు. పాపంబు లంద కుండం [1]జేయించువారలు. ఇది యేమి యనవుడు, [2]వసిష్ఠుండు, హోతృవ్యభిచారం బెఱింగి, మనువున కిట్లనియె. 13

తే. అధిప ! సంకల్ప వైషమ్య మగుటఁ జేసి
హోత [3]కల్లతనంబున నువిద గలిగె
నైనఁ గలిగింతు నీకుఁ బ్రియాత్మజులను
నీవు మెచ్చంగఁ జూడు నా నేర్పుబలిమి. 14

వ. అని పలికి భగవంతుం డగు వసిష్ఠుండు కీర్తి తత్పరుండు గావున, మనువు [4]కొమరిత మగతనంబు కొఱకు నేకచిత్తంబున నాది పురుషుం డగు హరిం బొగడిన, నప్పరమేశ్వరుండు మెచ్చి, తపసి కోరినవరం బిచ్చె. అది నిమిత్తంబుగా నిళా కన్యక సుద్యుమ్నుం డను కుమారుం డై రాజ్యంబు సేయుచు. 15

సీ. ప్రొద్దుపోకొకనాఁడు పోయి పేరడవుల వెంట [5]వేఁటాడుచు వేడ్కతోడఁ
గొందఱు మంత్రులు గూడిరా సైంధవం బైన గుఱ్ఱము నెక్కి [6]యంద మైన
బలువిల్లుఁ గ్రొవ్వాఁడి బాణంబులును దాల్చి పెను మెకంబుల వెంట బిరుసుతోడ
నుత్తరదిశకు మహోగ్రుఁ డై [7]చనిచని మేరువుపొంతఁ గుమారవనము

తే. †జేరె నెందు మహేశుండు శివయు నెపుడు
[8]రతి సలుపుచుందు రందుఁ జొరంగఁబోవ
నాఁడ దయ్యెను దోడనె యనుచరులును
బడఁతు లైరి తదశ్వంబు బడబ యయ్యె. 16

వ. ఇట్లు మగతనంబు సెడి, మగువ లై యొండొరుల మొగంబులు సూచి, మఱుఁగుచుండి రనిన విని శుకునకు రాజి ట్లనియె. 17

ఆ. రాజుఁ దోడివారు రమణు లై రంటివి
కాంత లైరి యేమి కారణమున
[9]నిట్టి దేశ మెఱుఁగ మెన్నఁ డా కథలెల్ల
వేడ్కదీర నాకు విస్తరింపు. 18

---

1. చేయువారలు (క. తం.) 2. మాతాత వసిష్ఠుండు (తం. వా.) 3. కల్లఁ దనంబున (తం)
4. కొమారుని (హ); కొమరాలి (తం); కూఁతు (వా) 5. వేఁటాడెడి (తం) 6. యడవి కేఁగి (హ) 7. యేతెంచి (హ) 8. రతియు సలుపుదు రందు నారాజుపోవ (హ)
† క. చ. ప్రతులలో గీత మిట్లున్నది.
'జేరె నవ్వేళ శంభుండు శివయు దాను. నందు క్రీడింప పొచ్చిన యంత మాత్ర
నాట దయ్యెను రాజు రాజాను చరులు, పడతులైరి తదశ్వంబు బడబ యయ్యె.'
9. నిట్టి దేమెఱుంగ (క)

వ. అదియునుం గాక. 19

ఆ. మగువతనము మాని మగవాఁడు గావచ్చుఁ
గాక పేరు పెంపు గాసి గాఁగ
మగతనంబు మాని మగువ గావచ్చునె
మానవంతుఁ డైన మానవునికి. 20

వ. అని యడిగిన నర్జున పౌత్రునకు వ్యాసపుత్రుం డి ట్లనియె. 21

సీ. పురవైరి కొకనాఁడు పొడసూపు వేడుకఁ దపసులు దిక్కుల తమము లెల్లఁ
[1]దమతమ వెలుఁగులు దగిలి గొందులు సొరఁ గొందఱు [2]పౌనులు [3]గోరి రాఁగ
ప్రాణేశు తొడలపై భాసిల్లు నంబిక వారలఁ జూచి మై వలువలేమి
సిగ్గు పుట్టిన లేచి చీరఁ గట్టినఁ జూచి దేవియు దేవుండు దీర్ఘలీల
తే. నొంటిఁ దమలోనఁ గ్రీడింపుచున్న వారు
మనకు సమయంబు గా దని మరలి మునులు
నరుఁడు నారాయణుండు ననారతంబు
మెలఁగు చోటికి నడచిరి మేదినీశ! 22

వ. అది కారణంబుగా, భగవంతుం డగు శివుండు తన ప్రియురాలి వేడుకల కొఱకు
ని ట్లనియె. 23

క. ఈ నెల వెవ్వఁడు సొచ్చిన, మానిని యగు ననిన తొంటి మాటకతమునన్
మానవుఁడు మగువ పోడిమి, మానక పేరడవులందు మఱియుం దిరిగెన్. 24

వ. ఇట్లు చెలికత్తియల మొత్తంబులుం దానును, నా రాచపూఁబోఁడి వాఁడిమి
చూపుల నాఁడు పోఁడిమి నెఱపుచు, దైవయోగంబున సోమసుతుండును, భగ
వంతుండును, నగు బుధుని యాశ్రమంబు సేరి మెలఁగుచున్న యెడ. 25

ఆ. రాజు కొడుకుఁ జూచె రాజీవదళ[4]నేత్రి
రాజవదన చూచె రాజుపట్టి
దొంగకాముఁ డంత దొందడిఁ జిగురాకు
వాలు వెఱికి యుఱికి వారి మొత్తె. 26

వ. ఇ[5]ట్లలరువిల్తుని నెఱవిరుదు చిగురు టడిదంబు మొనకు మోహాటించి, వార లిరు
వురుం బైపడి వేడుకలకుం జొచ్చిన, వారలకుం బురూరవుం డను కుమారుండు
పుట్టె. ఇవ్విధంబున. 27

1. తమమెయి వెలుఁగులు (త. జ.); తమమేని వెలుఁగులు (ద) 2. పథికులు (చ. ట. త.)
3. గొల్చి (బ. తం.) 4. నేత్ర (తం.) 5. పూవు కైదువులుగల నెఱవిరుదు (క)

ఆ. మనుసుతుండు ఘనుఁడు మగనాలి తనమునఁ
గొడుకుఁ గాంచి విసివి [1]కుంది కుంది
చింతఁ బొంది గురు వసిష్ఠుని భావింప
నతని [2]తలఁపుతోన నతఁడు వచ్చె. 28

వ. వచ్చి సుద్యుమ్నుండు మగవాఁ డయ్యెడు కొఱకు, న మ్మునిపుంగవుండు శంకరు నారాధింప, నీశ్వరుండునుం దపసి ప్రయాసంబునకు సంతసిల్లి యి ట్లనియె. 29

మ. తన ము న్నాడిన మాటయు న్నిజముగాఁ దన్మౌనికిం బ్రీతిగా
[3]మనుచుండుఁ నెల వో నెలం బురుషుఁ డై మాసాంతరం బై నఁ గా
మిని యై యీగతి వీడుపా టమర భూమిం దాన రక్షించుఁ బొ
మ్మనినఁ వచ్చె వసిష్ఠుఁ డా మనుసుతుం డారీతి రాజ్యస్థుఁ డై. 30

ఆ. మగువ యగుచు మరల మగవాఁడు నగుచును
భూత ధాత్రి యంత నాతఁ డేలెఁ
బ్రజలు సంతసింప బాహాబలముతోడ
గురుని కరుణఁ జేసి కువలయేశ ! 31

వ. అతనికి నుత్కలుండును, గయుండును, [4]విమలుండును ననుకొడుకులు మువ్వురు గలిగి ధర్మపరు లై, [5]యుత్తరా పథంబునకు రాజు లై రి. సుద్యుమ్నుండు ముదుసలి యై, ప్రతిష్ఠానపురంబు విడిచి, పురూరవునకు భూమి నిచ్చి, వనంబునకుం జనియె. ఇవ్విధంబున. 32

## అధ్యాయము – ౨

సీ. కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేఁగ వందుచు మనువు వైవస్వతుండు
దనకు బిడ్డలు గల్గ దపమాచరించెను హరిఁగూర్చి నూఱేండ్లు యమునలోన
[6]హరి యంత నిక్ష్వాకుఁ డాదిగాఁ బదుగురు పుత్రుల నిచ్చెను బొసఁగ వారి
[7]యందుఁ బృషధ్రాఖ్యుఁడగు వాఁడు గురునాజ్ఞ విమలధర్మంబులు వెలయఁ బూని
తే. పసుల కదుపులు గాచుచు బలుమొగుళ్ళు
వచ్చి నడురేయి [8]జోరున వాన గురియ
మంద విడియించి చుట్టు నేమఱక యుండె
నడవిమేకములు సొరకుండ నరసికొనుచు. 33

1. కుంది కంది (ట) 2. తలఁపులోన (హ) 3. మనుజేంద్రుండు నెలన్నెలం బురుషుఁ డై (హ) 4. విహ్వలుండును (హ) 5. దక్షిణపథంబునకు (హ) 6. హరియును నిక్ష్వాకుఁ డాదిగాఁ బదురు పుత్రుల నిచ్చె మనువుతో దొరయు వారి (తం.) 7. అందులోనఁ బృషధ్రుఁడను వాఁడు (క. చ. ట. బ తం.) 8. బోరన (క. ట.)

వ. అంత. 34

క. ప్రబ్బికొనిన పెంజీఁకటి, నిబ్బరమున నడికి నడికి నింగికి వడితో
గొబ్బున నెగసి తటాలునఁ బెబ్బులి మందావుఁ బట్టెఁ [1]బెల్కుఱి యఱవన్. 35

క. ఉల్లములు గలఁగి మొదవుల, వెల్లువ లన్నియును లేచి విచ్చలవిడితోఁ
జెల్లాచెద రై పాఱెను, బెల్లుగ నంభా యటంచు బెబ్బులిగాలిన్. 36

వ. అ య్యవసరంబున. 37

శా. ఆ పెంజీఁకటి మ్రోలఁ గాన కడిదం బంకించి శార్దూల మం
చా పుల్లావు శిరంబు ద్రుంచి తెగదో యంచున్ బులిన్ వెండియున్
వాపోవం దెగ వ్రేసి భూవరుఁడు ద్రోవన్ ఖడ్గ రక్తంబుచేఁ
బై పై [2]గీయుచుఁ జేరి చూచెఁ దల ద్రెవ్వం బడ్డ య ద్ధేనువున్. 38

వ. చూచి, దుఃఖంతుం డై యున్న పృషధ్రునిఁ గని, కులగురుం డగు వసిష్ఠుండు గోపించి, నీవు రాజత్వంబు వాసి, యీ యపరాధంబున శూద్రుండవు గమ్మని శపియించె. అతండును గృతాంజలి యై, తన కులాచార్యునివలన మరలం గై కోలు వడసి, యతని యనుమతంబున. 39

సీ. అఖిలాత్ముఁ డగుచున్న హరియందుఁ [3]బరునందు భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి
[4]యూర్ధ్వరేతస్కుఁ డై యున్న ప్రాణుల కెల్ల [5]నాప్తుఁ డై సర్వేంద్రియముల గెలిచి
సంగంబునకుఁ బాసి శాంతుండు నపరిగ్రహుండు నై [6]కోరక యుండి తనకు
వచ్చిన యదియ జీవనముఁ గావించుచుఁ దనుఁదాన నిలుపుచు ధన్యబుద్ధి

తే. జడునితెఱఁగున [7]నంధుని చందమునను
జెవిటిభంగిని మహి నెల్లఁ జెల్లఁ దిరిగి
యడవులకు నేఁగి కార్చిచ్చునందుఁ జొచ్చి
చిక్కి నియతుఁ డై బ్రహ్మంబుఁ జెందె నతఁడు. 40

క. కవి యను కడపటి కొమరుఁడు, భవనము రాజ్యంబు విడిచి బంధులతో నేఁ
గి వనమునఁ బరమపురుషునిఁ, బ్రవిమలమతిఁ దలఁచి తలఁచి వరముం బొందెన్.

వ. మఱియుఁ గరూశుం డను మానవునివలనం గొందఱు కారూశులు క్షత్త్రియులు గలిగి, ధర్మంబుతోడి ప్రియంబున బ్రహ్మణ్యు లై, యుత్తరాపథంబునకు రక్షకు

---

1. బెంబడి (ట. త.) 2. గీఱుచు (క.తం.) 3. హరునందు (హ) 4. ఊర్ధ్వరేతస్కు లై (హ)
5. ఆర్యుఁ డై (హ); ఆఢ్యుఁ డై (ట) 6. కోరక నుండుఁ దనకు (హ) 7. మందుని (హ)

లైరి. ధృష్టునివలన ధార్ష్టం బనెడి వంశంబు గలిగి, భూతలంబున బ్రహ్మ భూయంబు నొంది నెగడె. నృగుమూలంబున సుమతి గలిగె. అతనికి భూతజ్యోతి పుట్టె. అతనికి వసువు జనియించె. వసువునకుం బ్రతీతుండు గలిగె. ప్రతీతునికి నోఘవంతుండు జనించె. అతని కూఁతు రోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహం బయ్యె. నరిష్యంతుం డను మనుపుత్రునికిఁ జిత్రసేనుం, డా విభునకు దక్షుం, డా పుణ్యునకు మీఢ్వాంసుం, డా సుజనునికి శర్వుం, డ మ్మహాత్మునికి నింద్రసేనుం, డా రాజునకు వీతిహోత్రుం, డా సుమతికి సత్యశ్రవుం, డా ఘనునికి నురుశ్రవుం, డా వీరునకు దేవదత్తుం, డా పండితునకు నగ్నివేశుండు సుతులై జని యించిరి. అయ్యగ్నివేశుండు కానీనుం డన నెగడి, జాతుకర్ణుం డను మహర్షి యై వెలసె. అతనివలన నాగ్నివేశ్యాయనం బను బ్రహ్మకులంబు గలిగె. ఇవ్విధంబున

క. తెలుపఁబడె నరిష్యంతుని, కుల మెల్లను నీకు దిష్టకులముఁ [1]దెలియఁ
దెలిపెద రాజేంద్రోత్తమ !, తెలియుము సర్వంబు నీకుఁ దేటపడంగన్. 43

వ. దిష్టునికొడుకు నాభాగుం డనువాఁడు, కర్మవశంబున వైశ్యత్వంబు నొందె. ఆ నాభాగునికి హలంధనుండు గలిగె. అతనికి వత్సప్రీతియు, వత్సప్రీతికిఁ బ్రాంశువును, నతనికిఁ బ్రమితియుఁ, బ్రమితికి ఖమిత్రుఁడును, ఖమిత్రునికిఁ జాక్షుషుండును,నతనికి వివింశతియు, వివింశతికి రంభుండును, రంభునికి ధార్మికుం డైన ఖనినేత్రుండును, నతనికిఁ గరంధనుండును, గరంధనున కవిక్షిత్తును, నా యవిక్షిత్తునకు మరుత్తుండును, జనించిరి. ఆ మరుత్తుండు చక్రవర్తి యయ్యె. అతని చరిత్రంబు వినుము. 44

సీ. [2]అంగిర స్సుతుఁడు మహాయోగి సంవర్తుఁ డతని యాగమునకు యాజకుండు
[3]తిరిగి యుండెడివారు మరుదాఖ్య గణము లొప్పారు విశ్వేదేవు లచటి సభ్యు
లధిక [4]దక్షిణల బ్రాహ్మణకోటిఁ దనిపెను సోమపానంబున సురవరుండు
[5]మత్తిల్లి బంగారుమయము గావించెను-యాగవస్తువు లెల్ల నధికనియతి

తే. నా మరుత్తుఁడు సేసినయట్టి భంగి
ధీరభావంబుఁ [6]జాగంబుఁ దెంపుఁ గలిగి
మఖము చేసిన వారిని మఱియు నెఱుఁగ
మెల్లలోకము లందు నరేంద్ర ముఖ్య ! 45

---

1. వరుసన్ (తం) 2. అంగిరసుండు (చ) 3. తరగియుండెడి మరుదాఖ్య గణంబులో వారు (హ); (పరివేష్టారః 2–28) 4. లక్షణుల (హ) 5. మంత్రి యై (హ) 6. నమరంగ (హ)

వ. ఆ మరుత్తునకు దముండును, దమునకు రాజవర్ధనుండును, రాజవర్ధనునకు సుధృతియు, సుధృతికి సౌధృతేయుండును, సౌధృతేయునకుఁ గేవలుండును, గేవలునకు బంధుమంతుండును, నతనికి వేదవంతుండును, వేదవంతునికి బంధుండును, బంధునకుఁ దృణబిందుండును సంభవించిరి. అంత. 46

క. అచ్చర కన్య యలంబుస, [1]క్రచ్చఱఁ దృణబిందుఁ జూచి కామించి తుదిన్
బచ్చవిలుకాని యమ్ముల, [2]ముచ్చిచ్చున వచ్చి పొందె మోహాతుర యై. 47

వ. ఆ దంపతులకు నిలబిల యను కూతురు జన్మించె. ఆ కొమ్మను విశ్రవసుండు పొందిన, నై లబిలుం డనఁ గుబేరుండు వుట్టె. ఆ తృణబిందునకు విశాలుండును, శూన్యబంధుండును, ధూమ్రకేతుండు ననువారు ముప్పురు కొడుకులు గలిగిరి. అందు విశాలుండు, వంశవర్ధనుం డై, వైశాలి యను నగరంబు నిర్మించె. ఆ రాజునకు హేమచంద్రుండును, నా నరేంద్రునకు ధూమ్రాక్షుండును, నా పుడమి ఱేనికి సహదేవుండును, నా బలిష్ఠునికిఁ గృశాశ్వుండును, నాతనికి సోమదత్తుండును జన్మించె. అతండు. 48

ఆ. అమరవిభుఁడు మెచ్చ నశ్వమేధము సేసి
భూరి పుణ్యగతికిఁ బోయె నెలమి
సోమదత్తు కొడుకు సుమతికి జనమేజ
యుం డనంగఁ గొమరుఁ డుప్పతిల్లె. 49

వ. వీరలు వైశాలురనం బరఁగి, తృణబిందుని కీర్తి వహించి, రాజ్యంబు సేసిరి. మఱియును. 50

## అధ్యాయము – ౩

సీ. శర్యాతి యను రాజు జనియించె బ్రహ్మవరుం డైన మనువుకు రూఢితోడ
నతఁ డంగిరసు సత్రమందు రెండవనాఁటి విహితకర్మము లెల్ల వెలయఁ జెప్పె
నతని కూఁతురు సుకన్యక యను వనజాక్షి తన తండ్రితోఁ దపోవనము కరిగి
చ్యవనాశ్రమముఁ జేరి సఖులును దానును ఫలపుష్పములు గోయఁ బాఱఁదిరిగి

ఆ. యొక్క పుట్టలోన నొప్పారు జ్యోతుల
రెంటిఁ గాంచి వాఁడిముంటఁ బొడిచె
కన్య ముగుద మఱచి ఖద్యోత యుగమంచు
దైవవశము కతనఁ దమకి యగుచు. 51

1. క్రచ్చర నాబంధుఁ జూచి (హ) 2. ముచ్చిచ్చున వచ్చి (హ)

క. జ్యోతుల ముంటం బొడిచిన, వాతుల నెత్తురులు గురిసె వసుధేశు భట
వ్రాతముల కెల్ల నచ్చట, నా తటి మలమూత్రబంధ మయ్యె నరేంద్రా! 52

వ. వారలం జూచి, రాజర్షి యగు శర్యాతి విస్మితుం డై, [1]మీర లీ యాశ్రమదూష ణము సేయనోపుదురు. అది కారణంబుగా మీ కీ నిరోధంబు సిద్ధించె. అని పలుకు నవసరంబునం దండ్రికి సుకన్యక యి ట్లనియె. 53

తే. అయ్య! యీ పుట్టచేరువ నాడి యాడి
యిందుఁబో రెండుజ్యోతుల నేనుఁ గాంచి
కంటకంబునఁ బొడువ రక్తంబు గురిసె
నేవిధంబునఁ గురిసెనో యెఱుఁగు మీవు. 54

వ. అనిన విని, శర్యాతి భీతుం డై, కూఁతుం దోడ్కొని, వల్మీకంబుకడకుం జని, యందులోఁ దపంబు సేయుచున్న చ్యవనునిం గని, తన నేర్పున నతని వలనఁ బ్రసన్నత వడసి, తపసిచిత్తంబు నెఱింగి, తన పుత్రిక నిచ్చి, యెట్టకేలకుం బ్రతికిన వాఁ డై, మునీశ్వరుని వీడ్కొని, పురంబునకుఁ జనియె. నంత. 55

ఆ. పరమకోపుఁ డైన భార్గవుఁ బతిఁ జేరి
మిగుల పనులయెడల మెచ్చుఁ దిరిగి
యతని పర్ణశాల నా సుకన్యక యను
మగువ గొన్నియేండ్లు మనువు మనియె. 56

వ. అంత నొక్కనాఁ డయ్యాశ్రమంబునకు, వేల్పువెజ్జులైన యాశ్విను లిద్దఱు వచ్చిన వారలం బూజించి తన ముదిమి చూపి, చ్యవనుం డి ట్లనియె. మీకు మున్ను యాగభాగంబుల లేని సోమపానంబు నేను గల్పించి యిచ్చెద. సోమపానసమ యంబునఁ బానపాత్ర మీకు నందిచ్చెద. నా ముదిమి మానుపుం డని యి ట్లనియె.

క. నవకం బగు ప్రాయంబున, జవరాండ్రఁ గరంచు మేని చక్కఁదనంబుఁ
[2]శివతరముగఁ గృపసేయుఁడు, దివిజాధిపవైద్యులార! దీవింతు మిమున్. 58

వ. అనిన, నశ్విదేవతలు సంతోషించి, సిద్ధనిర్మితం బైన యీ మడుఁగున మునుఁగు మని పలికి. 59

సీ. ముసలితాపసిఁ బట్టి మొగి నెత్తుకొని పోయి ముగురు నా మడుఁగున మునిఁగి లేచి
వనితాజనుల నెల్ల వలపించు వార లై సుందరమూర్తు లై సుభగు లగుచుఁ
గమలమాలికలతోఁ గనక[3]కుండలములతో మంచి చీరలతోడఁ దుల్యు
లై సూర్యతేజస్కు లై యున్నవారల ముగ్గురఁ బొడగాంచి ముగుద బాల

1. మీరలీయాశ్రమంబున నకృత్యంబు సేయనోపుదురు (తం)
2. శివకరముగ (తం) 3. కుండలములుఁ గాఁ బుష్పసాయకుతోడఁ బోలితుల్యు (హ)

తే. ఇందుఁ బెనిమిటి వీఁ డని యెఱుఁగలేక
గరిత గావున నిజనాథుఁ గానఁ గోరి
సుభగమతులార ! నా నాథుఁ జూపుఁ డనుచు
[1]నశ్విదేవతల కపు డ య్యబల మ్రొక్కె. 60

వ. వార లా పతివ్రత నిజమరితనంబునకు మెచ్చి, వయో రూప సంపన్నుం డైన చ్యవనుం జూపి, దంపతుల వీడ్కొని, విమానారూఢు లై, వేలుపుల ప్రోలికిం జనిరి. అంత. 61

సీ. యాగంబు సేయంగ నర్థించి శర్యాతి చ్యవనమునీంద్రు నాశ్రమముకడకుఁ
[2]గూఁతురి నల్లునిఁ గొనిపోవువేడుక వచ్చి పుత్రికకు పార్శ్వంబునందు
సూర్యతేజంబున సొంపారు [3]నరుఁ గని వీఁ డెవ్వఁడో దీనివిభుఁడు గాఁడు
చెల్లరే యని పుత్రి సేసిన ప్రియములు మ్రొక్కులు నొల్లక మోము వాంచి

తే. మాఱు మాటాడ దీవింప మనసు రోసి
చ్యవనుఁ డధికుండు మునిజన సత్తముండు
భువనసన్నుతుఁ డతఁ డెందుఁ బోయె నాతఁ
డెట్లు వంచింపఁబడియె వీఁ డెవ్వఁ డబల ! 62

మ. తగవే ధర్మమె శీలమే కులజ వై [4]దర్పించి మోదింప నా
జగదారాధ్యునిఁ బుణ్యశీలుఁ దపసిన్ సాధ్వీమన స్సమ్మతున్
మగనిన్ మాని భుజంగుఁ బొందఁదగునే మానంబు వాటింపఁగా
దగదే దుర్గతిఁ ద్రోచితే కఠిన వై తండ్రిం బతిం గూఁతురా ! 63

ఆ. పద్మనయన ! మగఁడు ప్రాయంపువాఁ డైన
గాపుఁ బెట్టి కొంతఁ గావనేర్చుఁ
[5]గడఁగి ముసలితపసి గావంగ నేర్చునే
యువతి ముసలిఁ గూర్చు టొప్ప దెందు. 64

వ. అని పలికిన న ప్పరమపతివ్రతా లలామంబు చిఱునగవు చెక్కుటద్దంబులఁ జిడిముడి పడం దండ్రి కి ట్లనియె. 65

క. నీయల్లుఁ డితఁడు భార్గవుఁ, డయ్యా ! జారుండు గాఁడు హర్షముతోడ
న్నెయ్యంబు నిల్పు మంచును, దొయ్యలి సర్వంబు దండ్రితో వినిపించెన్. 66

---

1. నశ్వినీదేవతలకు నయ్యబల మ్రొక్కె (హ) 2. కూఁతు నల్లునిఁ దోడుకొని పోవువేడుక (తం. వా.) గూఁతురు (హ) 3. వరుఁగని (తం. వా.) 4. తప్పుల్ విచారింపకే (ట): తప్పన్ వినోదింప (తం) 5. కపటి (హ)

వ. అంత శర్యాతియు, నప్రమత్తుం డై, కూఁతురిం గౌఁగిలించుకొని, గారవంబున నైదువవు గమ్మని దీవించె. అంత భార్యాసహితుం డై చ్యవనుండు సని తన మామకు యాగంబు సేయించి యొక్క పాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజ తపోబలంబున నశ్విదేవతల కిచ్చినం జూచి. 67

క. కోపముతోడుత వాసవుఁ, డేపున ముని వైవ వజ్రమెత్తిన మరలన్ దాపసుఁడు వజ్రి భుజమున, నా పవి నిలిపెఁ జగంబు లాశ్చర్యపడఁగ. 68

వ ఇవ్విధంబున దేవతావైద్యు లగు నశ్విదేవత లిద్దఱు, సోమభాగంబు లేనివా రయ్యును, చ్యవను సామర్థ్యంబునఁ బ్రాప్తభాగు లై చనిరి. శర్యాతికి నుత్తాన బర్హియు, నానర్తుండును, భూరిషేణుండు నను మువ్వురు కొడుకులు గలిగిరి. అందు.

సీ. ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె నతఁడు కుశస్థలి యను పురంబు
నీరధిలోపల నిర్మించి పెంపుతో నానర్త ముఖ విషయంబు లేలెఁ
గనియెఁ గకుద్మి ముఖ్యం బైన నందన శతము [1]రైవతుఁడు విశాలయశుఁడు
దనకూఁతు రేవతి ధాతముందటఁ బెట్టి తగు వరు నడిగెడి తలఁపుతోడఁ

తే. గన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేఁగి
యచట గంధర్వ కిన్నరు లజునిమ్రోల
నాటపాటలు సలుపఁగ నవసరంబు
గాక నిలుచుండె నతఁ డొక్క-క్షణము దడవు. 70

వ. అంత నవసరం బైన నజునికి నమస్కరించి,[2]రైవతుండు రేవతిఁ జూచి యి ట్లనియె.

ఆ. చాల ముద్దరాలు జవరాలు గోమరాలు
నీ శుభాత్మురాలి కెవ్వఁడొక్కొ
మగఁడు సెప్పు మనిన మదిఁ జూచి పకపక
నవ్వి భూమిపతికి నలువ వలికె. 72

సీ. మనుజేశ! దీనికై మదిలోనఁ దలఁచిన వార లెల్లను గాలవశతఁ జనిరి
వారల బిడ్డల వారల మనుమల వారల గోత్రంబువారి నైన
వినము మేదినిమీఁద వినుము నీ వచ్చిన యీలోన నిరువదియేడు మార్లు
నొండొండ నాలుగు యుగములు చనియె నీ వటు గాన ధరణికి నరుగు మిపుడు

---

1. గకుద్మి (హ) 2. కకుద్మి యి ట్లనియె. (హ)

తే. దేవదేవుండు హరి బలదేవుఁ డనఁగ
భూమిభారంబు మాన్పంగఁ బుట్టినాఁడు
సకలభూతాత్మకుఁడు నిజాంశంబుతోడ
యువతిమణి నిమ్ము జనమణి కున్నతాత్మ ! 73

వ. అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి, భూలోకంబునకుం జనుదెంచి, సోదర స్వజనహీనం బగు తన నగరంబున కా రాజు వచ్చి, బలభద్రుం గాంచి రేవతీకన్య నతని కిచ్చి, నారాయణాశ్రమం బగు బదరికావనంబునకు నియమంబునం దపంబు సేయుటకుం జనియె. 74

## అధ్యాయము – ౪

క. నభగుఁ డను [1]మనుజపతికిని, శుభమతి నాభాగుఁ డనఁగ సుతుఁ డుదయించెన్
ప్రభు లై [2] కవియను తలఁపున, విభజించిరి భ్రాత లతని విత్తము నధిపా! 75

వ. అంత నాభాగుండును బ్రహ్మచారి యై, తన తోడం బుట్టువులను ధనంబుపా లడిగిన, వారలు దండ్రి చెప్పిన క్రమంబున నిచ్చెద మనిన, నాభాగుండు తండ్రి యగు నభగుకడకుం జని, విభాగంబు సేయు మని పలికిన, నతం డిందు నంగిరసులు మేధగలవార లయ్యును, సత్రయాగంబు సేయుచు నాఱవదినంబున నర్హకర్మంబులు దోఁపక మూఢు లయ్యెదరు. వారలకు నీవును, వైశ్వదేవ సూక్తంబులు రెం డెఱింగించినఁ, గవి యనం బ్రసిద్ధి కెక్కెదవు. [3]దానం జేసి వారలు కృతకృత్యు లై, స్వర్గంబునకుఁ బోవుచు, సత్రావశిష్టం బైన ధనంబు నీ కిచ్చెదరు. అని పలికినం దండ్రి వీడ్కొని నాభాగుండు సని, యట్లు సేసిన, నంగిరసులు సత్ర పరిశేషితధనంబు లతని కిచ్చి, నాకంబునకుం జనిరి. అంత. 76

క. అంగిరసు లిచ్చు పసిఁడికి, మంగళమతిఁ జేరు నృపుని మానిచి యొకఁ డు
త్తుంగుఁడు [4]జలద నిభాంగుఁడు, ముంగల నిలుచుండి విత్తముం జేకొనియెన్.

వ. వానిం జూచి, నాభాగుండు దనకు మును లిచ్చుటం జేసి తనధనం బని పలికిన, న మ్మహాపురుషుండు, మీతండ్రి సెప్పినక్రమం బకర్తవ్యం బనిన, నాభాగుండు నభగు నడిగిన, నతండు యజ్ఞమందిరగతం బై, యుచ్ఛిష్టం బగు ధనంబుఁ దొల్లి మహామునులు రుద్రున కిచ్చిరి. అది కారణంబుగా నా దేవుండు, సర్వధనంబులకు నర్హుండు. అనిన విని, వచ్చి, నాభాగుండు మహాదేవునకు నమస్కరించి, దేవా ! యీధనంబు నీయధీనంబని మాతండ్రి సెప్పె. నే నపరాధంబు సేసితి. సహింపుము.

1. మానవునకును (తం) 2. వెలయు తలంపున (హ); "తద్భ్రాతరః కవిమ్"(4-1)
3. వారలు దానంబు సేసి కృతకృత్యులై (హ) కృష్ణాంగుఁడు దగ (తం. వా.)

అనవుడు భక్తవత్సలుం డగు న మ్మహాపురుషుండు నభగు సత్యవచనంబులకు, నాభాగుని నిజంబునకు మెచ్చి, నీవు దప్పక పలికితివి కావున, సత్రపరిశేషితం బగు ధనంబు నీకు నిచ్చితి. అని పలికి, [1]మంత్రదర్శిత్వంబును, సనాతనం బగు బ్రహ్మజ్ఞానంబును నుపదేశించి, తిరోహితుం డయ్యె. ఇ వ్విధంబున. 78

క. భువిలో నాభాగుని కథ, [2]తవిలి మతిఁ రేపు మాపుఁ దలఁచిన మాత్రం
గవి యగు మంత్రజ్ఞుం డగుఁ బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁ డై.

వ. అంత నాభాగునకు నంబరీషుండు జనియించె. అతనియందు జగదప్రతిహతం బైన [3]బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె. అనిన విని యేమికారణంబున దురంతం బైన బ్రహ్మదండంబువలన నతండు విడువంబడియె ననిన న ప్పుడమిఱేనికి శుకుం డి ట్లనియె. 80

—: అంబరీషోపాఖ్యానము :—

శా. సప్తద్వీపవిశాల భూభరము దోః స్తంభంబునం [4]బూని సం
ప్రాప్త శ్రీయుతుఁ డై మహావిభవ సంపచ్చాతురిం గల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరం గాలముం బుచ్చుచున్
సుప్తిం బొందక యొప్పె సద్గుణ[5]గరిష్ఠుం డంబరీషుం డిలన్. 81

సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద పలుకులు హరిగుణ పఠనమంద
కరములు విష్ణుమందిర మార్జనములంద [6]శ్రవములు హరికథా శ్రవణమంద
చూపులు గోవింద రూపవీక్షణమంద శిరము కేశవ నమస్కృతులయంద
పదము లీశ్వర గేహ పరిసర్పణములంద కామంబు చక్రి కైంకర్యమంద

తే. సంగ మచ్యుత జనగుణ సంగమంద
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద
రసన తులసీదళములంద రతులు పుణ్య
సంగతులయంద యా రాజచంద్రమునకు. 82

వ. మఱియు న మ్మహీవిభుండు. 83

సీ. ఘన వైభవంబునఁ గల్మషదూరుఁ డై యజ్ఞేశు నీశు నజ్ఞాతుఁ గూర్చి
మొనసి వసిష్ఠాది మునివల్లభులతోడఁ దగిలి సరస్వతీ తటమునందు
మేధతో బహు వాజిమేధంబు లొనరించె గణుతింపరాని దక్షిణలు వెట్టి
సమ లోష్టహేముఁ డై సర్వకర్మంబులు హరిపరంబులు గాఁగ నవని యేలె

---

1. అంతర్దర్శిత్వంబు (హ) 2. ధవళ (హ) 3. బ్రాహ్మణ శాపంబువలన విడువంబడియెనని (జ) 4. బూన్చి (త. డ. ద. బ. తం. వా.) 5. విశేషుం (క. బ.) 6. చెవులు మాధవకథా శ్రవణమంద (క. చ. తం.)

ఆ. విష్ణుభక్తులందు విష్ణువునందుఁ గ
లంక మెడల మనసు లంకెపెట్టి
విహిత రాజ్యవృత్తి విడువనివాఁడు నై
యతఁడు రాచతపసి యనఁగ నొప్పె. 84

వ. వెండియు న మ్మహాభాగవతుండు. 85

క. హరి యని [1]సంభావించును, హరి యని దర్శించు నంటు నాఘ్రాణించున్
హరి యని రుచిగొనఁ దలఁచును, హరిహరి! ఘను నంబరీషు నలవియె పొగడన్

వ. ఇట్లు పుణ్యాచిత్తుం డీశ్వరాయత్తుండు నై, యల్లనల్లన రాజ్యంబుసేయుచున్న సమయంబున. 87

ఆ. అతని కీహ మానె హరులందుఁ గరులందు
ధనములందుఁ గేళివనములందుఁ
బుత్రులందు బంధు మిత్రులయందును
బురమునందు నంతిపురమునందు. 88

వ. అంతఁ గొంతకాలంబున క మ్మేదినీకాంతుండు సంసారంబువలని తగులంబు విడిచి, నిర్మలుం డై యేకాంతంబున భక్తిపరవశుం డై యుండ, నా రాచ తపసికి భక్తలోకవత్సలుం డగు పురుషోత్తముండు ప్రతిభట శిక్షణంబును, నిజ జనరక్షణంబును, నిఖిల జగ దవక్రంబును నగు చక్రం బిచ్చి చనియె. అంత. 89

క. తన తోడినీడకై వడి, ననురూప గుణాఢ్య యైన యాత్మమహిషితో
జనవిభుఁడు ద్వాదశీవ్రత, మొనరఁగ హరిఁగూర్చి చేసె [2]నొక యేఁ డధిపా! 90

వ. ఇట్లు వ్రతంబు సేసి, యా వ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడురాత్రు లుపవసించి, కాళిందీజలంబుల సుస్నాతుం డై, మధువనంబున మహాభిషేక విధానంబున విహిత పరికరసంపన్నుం డై, హరి నభిషేకంబు సేసి, మనోహ రంబు లైన గంధాక్షతంబులు సమర్పించి, యభినవామోదంబు లైన పుష్పం బులం బూజించి, తదనంతరంబ. 91

శా. పాలేపా[3]ర[3]ప్రవహింప [4]దగ్గఱుచు లేఁబ్రాయంబులన్ రూపముల్
[5]మేలై ధూర్తలు గాక వెండిగొరిజల్ [6]హేమోరు శృంగంబులున్
గ్రాలం బ్రేపుల యట్లు నాకుచును [7]రంగ చ్చేల లై యున్న మం
దాలన్ న్యర్బుదషట్క మిచ్చె విభుఁ డుద్య ద్వైదికశ్రేణికిన్. 92

---

1. సంభాషించును(క.త.జ.డ.బ.) 2. యేటిదరిన్(హ) 3. పఱవంగ(క.త.తం.) 4. నంగరుచులుం బ్రాయం బులున్ రూపముల్(వా) 5. హేలన్ (హ) 6. హెమోపశృంగంబులున్ (క) 7. నంగచ్ఛాయలై(హ)

క. పెక్కండ్రు విప్రవరులకు, గ్రక్కున నతిభక్తితోడఁ గడుపులు నిండన్
జొక్కపు టన్నం బిడి విభుఁ, [1]డొక్కెడఁ బారణముసేయ నుద్యోగించెన్. 93

వ. అ య్యవసరంబున. 94

క. భాసుర నిగమ పదోప, న్యాసుఁడు సుతపోవిలాసుఁ డనుపమ యోగా
భ్యాసుఁడు రవిభాసుఁడు [2]దు, ర్వాసుం డేతెంచెఁ దన్నివాసంబునకున్. 95

వ. వచ్చిన, న మ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు సేసి, కూర్చుండ గద్దియ యిడి, పాదంబులు గడిగి, పూజించి, సేమం బరసి, తనయింట నన్నంబు గుడువు మని నమస్కరించిన, న మ్మహాత్ముండును, సంతోషించి, భోజనంబునకు నంగీకరించి, నిర్మలం బగు కాళిందీజలంబులం బరమధ్యానంబు సేయుచు, మునింగి, లేచిరాక తడవుసేసిన, ముహూర్తార్ధావశిష్ట యగు ద్వాదశియందుఁ బారణ సేయవలయుటఁ జింతించి, బ్రాహ్మణాతిక్రమ దోషంబునకు శంకించి, విద్వజ్జనంబుల రావించి, వారల నుద్దేశించి. 96

క. ముని నీరుసొచ్చి వెడలఁడు, [3]చనియెడు ద్వాదశియు నింతఁ జనియెడు నీలో
[4]నన పారణ చేయవలయు, [5]వినిపింపుం డర్హ మైన విధ మెట్టిదియో. 97

వ. అని పలికిన నా రాజునకు బ్రాహ్మణజను లి ట్లనిరి. 98

ఆ. అతిథి వోయి రామి నధిప! యీ ద్వాదశి
పారణంబు మానఁ బాడిగాదు
గుడువకుండఁ గాదు గుడుచుటయును గాదు
సలిలభక్షణంబు సమ్మతంబు. 99

వ. అని ధర్మసందేహంబు వాపిన, నా రాజర్షిశ్రేష్ఠుండును మనంబున హరిం దలంచి, నీరు పారణంబు సేసి, జలంబుల మునింగిన తపసిరాక కెదురుచూచు చున్న సమయంబున. 100

సీ. యమునలోఁ గృతకృత్యుఁ డై వచ్చి రాజుచే సేవితుం డై రాజచేష్టితంబు
బుద్ధిలో నూహించి బొమముడిమొగముతో నదరెడిమేనితో నాగ్రహించి
రెట్టించి యాఁకలి కొట్టుమిట్టాడంగ నీ సంపదున్మత్తు నీ నృశంసు
నీ దురహంకారు నిందఱుఁ గంటిరే విష్ణుభక్తుఁడు గాఁడు వీఁడు నన్నుఁ

---

1. డొక్కట (క. త.) 2. దుర్వాసుఁ డతిథి య య్యె (తం) 3. చనియెను....జననిదె యీలో (హ) 4. మనపారణయున్ వలయును (ట) 5. వినుఁడర్హంబైన ధర్మ (హ)

తే. గుడువ రమ్మని మునుముట్టఁ గుడిచినాఁడు
ధర్మ భంగంబు సేసి దుష్కర్ముఁ డయ్యె
నైన నిప్పుడు సూచెద నన్ని దిశల
నేనుఁ గోపింప మాన్పువాఁ డెవ్వఁ డనుచు. 101

చ. పెటపెటఁ బండ్లు గీఁటుచును భీకరుఁ డై కనుఁగవ నిప్పుకల్
పొటపొట రాల, గండములు పొంగ, మునీంద్రుఁడు హుంకరింపుచున్
జట మొదలంటఁగాఁ బెఱికి చక్కన దానన కృత్య నాయుధో
త్కటఁ [2]వలమాన హస్తయుతఁగా [3]నొనరించె నయించె రాజు పైన్. 102

క. కాలానల సన్నిభ యై, శూలాయుధహస్త యగుచు సుఱసుఱ స్రుక్కన్
నేలఁ బదంబులఁ ద్రొక్కుచు, వాలి మహాకృత్య మనుజవల్లభుఁ జేరెన్. 103

ఆ. ఆ ప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుండు
వెట్టితపసి సేయు వేడబంబుఁ
జక్కఁబెట్టు మనుచు చక్రంబుఁ బంచిన
వచ్చె నదియుఁ బ్రళయ వహ్నిపగిది. 104

వ. వచ్చి మునిపంచిన కృత్యను దహించి, తనివి సనక, మునివెంటం బడిన, మునియు మేరుగుహ సొచ్చిన, నదియు వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన సొచ్చె. మఱియును. 105

మ. భువిఁ దూఱన్ భువిఁ దూఱు నబ్ధిఁ జొర [4]నబ్ధిం జొచ్చు నుద్వేగి యై
దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు దిక్కులకుఁ బో దిగ్వీథులం బోవుఁ, జి
క్కి వెసన్ గ్రుంకినఁ గ్రుంగు, నిల్వ నిలుచున్, గేడింపఁ గేడించు, నొ
క్కవడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్ర మై. 106

శా. ఏలోకంబున కైన వెంటబడి తో నేతెంచు చక్రానల
జ్వాలల్ మానుపువారు లేమిఁ జని దేవజ్యేష్ఠు లోకేశు వాఁ
డాలోకించి "విధాత! విశ్వజనన వ్యాపారపారీణ రే
ఖాలీలేక్షణ! కావవే కరుణ చక్రంబు న్నివారింపవే." 107

వ. అనిన బ్రహ్మ యి ట్లనియె. 108

---

1. సూపెద (తం. వా.) మాన్పెద (బ) 2. వనమాలహస్తయును (హ) వరశూలహస్త యును (వా) 3. నొనరించియునైచె (హ) కవించె (వా) 4. నబ్ధుల్ సొచ్చు (తం. వా.)

మ. కర మర్థిఁ ద్విపరార్థ సంజ్ఞ గల యీ కాలంబుఁ గాలాత్ముఁడై
సొరది న్నిండఁగఁజేసి, లోకముల నాచోటుల్ విభుం డెవ్వఁడో
పరిపూర్తిన్ గనుఁ గ్రేవఁ [1]గెంపు లొలుకన్ భస్మంబుగాఁ జేయు నా
హరి[2]చక్రానల లీల కన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే. 109

ఆ. ఏను భవుఁడు దక్షుఁ డింద్రాదులునుఁ బ్రజా
పతులు భృగుఁడు భూతపతులు శిరము
లందుఁ దాల్తు మతని యాజ్ఞ జగద్ధితం
బంచు భూరికార్య మతుల మనుచు. 110

వ. కావున సుదర్శన నివారణంబునకు నోపనని, విరించి పలికిన, సంచలించి, దుర్వాసుండు కైలాసంబునకుం జనుదెంచి, శర్వు నాలోకించి, చక్రానలంబు తెఱంగెఱింగించిన, న మ్మహాదేవుం డి ట్లనియె. 111

సీ. వినవయ్య! తండ్రి! యే విశ్వేశ్వరునియందుఁ జతురాస్య జీవకోశములు పెక్కు
వేలసంఖ్యలు గూడి వేళతో నిబ్బంగి నగుచుండుఁ జనుచుండు నదియుఁగాక
నె వ్వానిచే భ్రాంతి నే మందుచున్నార మేను దేవలుఁ డసురేంద్ర సుతుఁడు
నారదుఁ డజుఁడు సనత్కుమారుఁడు ధర్ముఁ డా కపిలుఁడు మరీచ్యాదు లఖిల

ఆ. [3]నిర్జరులును సిద్ధ [4]నివహ మెవ్వనిమాయ
నెఱుఁగలేము [5]మూల మిట్టి దనుచు
నట్టి నిఖిలనాథు నాయుధశ్రేష్ఠంబుఁ
దొలఁగఁజేయ మాకు దుర్లభంబు. 112

వ. మునీంద్రా! నీవు నమ్మహాత్ముని శరణంబు వేఁడుము. అతండు మేలు సేయంగలవాఁడు. అని పలికిన, నీశ్వరుని వలన నిరాశుండై, దుర్వాసుండు వైకుంఠ నగరంబునకుం జని. 113

శా. ఆ వైకుంఠములోని భర్మ మణి సౌధాగ్రంబు పై లక్ష్మి దాఁ
గ్రేవన్ మెల్లన నర్మభాషణములన్ [6]గ్రీడింపఁ బుణ్యున్ హరిన్
దేవాధీశ్వరుఁ గాంచి "యో వరద! యో దేవేశ! యో భక్తర
క్షా విద్యా పరతంత్ర! మానుపఁగదే, చక్రానల జ్వాలలన్. 114

---

1. గొలుపన్ భస్మంబులై పోవు (తం.) గదురన్ (వా.) 2. చక్రాకృతివహ్ని (హ)
3. పారవిదులు (తం. వా) 4. పతులు (తం. వా.) 5. దాన నింతవడుదు మట్టి(తం.వా.)
6. గ్రీడించు పుణ్యున్ (తం. వా.)

ఉ. నీ [1]మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుఁగంగలేక నీ
ప్రేమకు వచ్చు దాసునకుఁ [2]గ్రించుఁ దనంబున నెగ్గుచేసితి
న్నా మఱపుఁ సహింపు మట నారకుఁ డైన మనంబులో భవ
న్నామము చింతచేసిన ననంత సుఖస్థితిఁ జెందకుండునే. 115

వ. అని పలికి, పాదకమలంబులకు మ్రొక్కి, లేవకయున్న దుర్వాసునిం గని, హరి యి ట్లనియె. 116

చ. చలమున బుద్ధిమంతు లగు సాధులు నా హృదయంబు లీల దొం
గిలి గొనిపోవుచుండుదు రకిల్బిష భక్తిలతాచయంబుల
న్నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభి కైవడిఁ
వలలకుఁ జిక్కి భక్తజన వత్సలతన్ జనుచుందుఁ దాపసా! 117

†

ఆ. నాకు మేలుఁ గోరు [3]నాభక్తుఁ డగువాఁడు
భక్తజనుల కేన పరమ గతియు
భక్తుఁ డెందుఁ జనినఁ బఱతెంతు వెనువెంట
గోవు వెంటఁ దగులు [4]కోడె భంగి. 118

వ. అదియునుం గాక. 119

---

1. మడి (హ) 2. బిచ్చతనంబున (హ) 3. కొట్టుదురు(హ)

† 1. చ. శమకరుణా విహారులగు శాంతులు నాదు మనంబు లాలనన్
క్రమమున యోగమార్గమునఁ గాంచుచు నెప్పుడు గారవంబునన్
మమతను జుట్టికట్టుదురు మచ్చికనే మదదంతి మాడ్కి నా
భ్రమలకు సొక్కి వత్సగతి భద్రముగా చరియింతు భూసురా!

2. చ. క్రతువులు దేవపూజలును కాంచనధేను ముఖప్రదానముల్
వ్రతములు తీర్థయాత్రలును వానికి నెక్కగ జేయు పుణ్యసం
తతులకు జిక్క నయ్యా తగ తప్పక యెప్పుడు మానసంబులం
దతులిత భక్తియోగులగు నార్యులకుం బఱె సంయమీశ్వరా!

3. చ. పరతరలోక బృందముల భావము నాయది శోక మెన్నగా
నిరతము యోగిచిత్తముల నేను కుతూహల మానసుండ నై
యెరుగుదు నేను యోగులను నెప్పుడు నిశ్చలయోగి సంఘముల్
విరివిగ నాదు చర్యలును వేమరు గాంచుదు రార్య పుంగవా! (జ)

4. గోర నా భక్తులరు కాని (తం) నా భక్తులక కాని (వా) 5. కుఱ్ఱ (ట. ద.)

ఆ. తనువు మనువు విడిచి తనయుల చుట్టాల
నాలి విడిచి సంపదాలి విడిచి
నన్నె కాని యన్య మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టివారి నైన. 120

క. పంచేంద్రియముల తెరువుల, [1]వంచించి మనంబులందు వరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నన్నును, [2]మంచివరున్ బుణ్యసతులు [3]మరగిన భంగిన్. 121

క. సాధుల హృదయము నాయది, సాధుల హృదయంబు నేను జగముల నెల్లన్
సాధుల నేనే యెఱుఁగుదు, సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా! 122

ఆ. ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు
ముక్తి చేయుచుండు ముదముతోడ
దుర్వినీతు లైన [4]దుర్జన సమితికి
[5]నివియుఁ గీడు సేయ కేల యుండు, 123

క. నా తేజము సాధులలో, నాతత మై యుండు వారి నలఁచు జనులకున్
హేతిక్రియ భీతి నిచ్చును, చేతో మోదంబు చెఱుచు సిద్ధము సుమ్మీ. 124

క. అదె పో బ్రాహ్మణ! నీకును, సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుత గుణా
స్పదుఁ డిచ్చు నభయ మాతని, మది సంతసపఱిచి వేఁడుమా శరణంబున్. 125

అధ్యాయము - ౫

మ. అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోద్య చ్చక్ర కీలావళీ
జనితాయాసుఁడు నిర్వికాసుఁ డుదిత[7]శ్వాసుండు దుర్వాసుఁ డ
ల్లన యేతెంచి సభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్యవేషున్ విదో
షు నయోదారమనీషు మంజు మిత భాషు న్నంబరీషున్ వెసన్. 126

వ. కని, దుఃఖితుం డై, యమ్మహీవల్లభు పాదంబులువట్టి విడువకున్న నా నరేంద్ర
చంద్రుండు చరణ స్పర్శనంబునకు నోడుచుఁ [8]గరుణా పీడిత హృదయుం డై,
హరి చక్రంబు ని ట్లని స్తుతియించె. 127

సీ. నీవ పావకుఁడవు నీవ సూర్యుండవు నీవ చంద్రుండవు నీవ జలము
నీవ నేలయు నింగి నీవ సమీరంబు నీవ భూతేంద్రియ నికరములును
నీవ బ్రహ్మంబును నీవ సత్యంబును నీవ యజ్ఞంబును నీవ ఫలము
నీవ లోకేశులు నీవ సర్వాత్మవు నీవ కాలంబును నీవ జగము

1. వంచింప (క. చ. త. ద.) 2. పతిన్ (తం) 3. మరగించు క్రియన్ (క. చ.) 4. దుర్జనులకు మీకు (హ) దుర్జనునకు నీకు (క. ద. బ.) 5. నిదియుఁ గీడుగాక యేలయుండు (హ) 6. భాగవతుఁడు (హ) 7. స్వాంతుండు (హ) 8. కరుణారసభరిత (హ. తం. వా.)

తే. నీవ బహుయజ్ఞ భోజివి నీవ నిత్య
మూల తేజంబు నీకు నే మ్రొక్కువాఁడ
నీరజాతుండు చాల మన్నించు నట్టి
శస్త్రముఖ్యమ! కావవే [1]చాలు మునిని. 128

మ. హరిచే నీవు విసృష్ట మై చనఁగ ము న్నాలించి నీ ధారలన్
ధరణిన్ వ్రాలుట నిక్క మంచు మును పే దైత్యేంద్ర మధ్యంబులన్
శిరముల్ పాదములున్ [2]భుజోరుయుగముల్ చేతుల్ నిజాంగంబులం
దురులన్ బ్రాణసమీరముల్ [3]వెడలు నీ యుద్ధంబులం జక్రమా! 129

ఆ. [4]కలఁగి నిద్రవోవఁ గలలోన వచ్చిన
నిన్నుఁ జూచి దీర్ఘనిద్ర వోదు
రసురవరులు శయ్యలం దున్న సతులు ప్ర
భాతమందు లేచి పలువరింప 130

ఉ. చీఁకటి వాపుచున్ వెలుఁగు సేయుచు సజ్జనకోటి నెల్ల స
చ్ఛ్రీకులఁ జేయు నీరుచులు చెల్వుగ ధర్మసమేత లై నినున్
వాకున నిట్టి దట్టి దని వర్ణనసేయ విధాత నేరఁ డ
స్తోకము [5]నీదు రూపు గలదుం దుది లేదు పరాత్పరాద్య మై.

ఆ. కమలలోచనుండు ఖలుల శిక్షింపంగఁ
[6]బాలుసేయ నీవు పాలు వడితి
వైన నింకఁ జాలు నాపన్నుఁ డై యున్న
తపసిఁ గావు నీవు ధర్మవృత్తి. 132

వ. అని పలికి కేలుఁదమ్మిదోయి నొసటం గదియించి యి ట్లనియె. 133

ఆ. ఏ నమస్కరింతు నింద్రశాత్రవ ధూమ
కేతువునకు ధర్మసేతువునకు
విమల రూపమునకు [7]విశ్వగోపమునకుఁ
జక్రమునకు గుప్త శక్రమునకు. 134

వ. అని మఱియు ని ట్లనియె. 135

---

1. సాధుమునిని (ద) 2. భుజాయుగళముల్ ఛేదింప నంగంబులన్, యొరలన్ (హ)
3. కదలు (హ) 4. కడఁగి (చ. బ.) 5. నీ మహామహిమ దోషనివారి పరాపరాధ్యమే (హ)
పరాత్పరాద్యమై (తం. వా.) 6. బాగు (హ) పాలుచేసి నీపు పంపబడితి (చ. ట. ద. క. త.)
7. విశ్వదీపమునకు (హ. వా.)

ఆ. విహిత ధర్మమందు విహరింతు నేనియు
[1]నిష్ట మైన ద్రవ్య మిత్తునేని
ధరణిసురుఁడు మాకు దైవతం బగునేని
విప్రునకు శుభంబు వెలయుఁగాక. 136

క. అఖిల గుణాశ్రయుఁ డగు హరి, సుఖ మై నా కొలువు వలనఁ జొక్కెడి నేనిన్
నిఖిలాత్మ మయుం [2]డగుటకు, సుఖమందుం గాక భూమిసురుఁ డీ వేళన్. 137

వ. అని, యి వ్విధంబునం బొగడు పుడమిఱేనివలన మన్నించి, తపసిని దాహంబు నొందింపక, రక్కసుల గొంగ చక్రంబు తిరిగి చనియె. అంత దుర్వాసుండు శాంతిం బొంది, మెల్లని మేలిమి మాటల నా రాజుం దీవించి, యి ట్లనియె.

మ. నరనాథోత్తమ ! మేలు సేసితి కదా నా తప్పు మన్నించి శ్రీ
హరి పాదాబ్జము లింత ముట్టఁ గొలుతే యాశ్చర్య మా [3]నెన్నచో
నరుదం డ్రే నినుబోఁటి సాధులకుఁ దా నై యిచ్చుటల్ గాచుటల్
పొరిదిన్ నైజగుణంబు లై సరస వచ్చుం గాదె మిత్రాకృతిన్ 139

వ. అదియునుం గాక. 140

మ. ఒకమా టెవ్వనిపేరు కర్ణములలో నొయ్యార మై సోఁకినన్
సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టి స
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశుఁ దా
రకలంకస్థితిఁ గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ ! 141

మత్తకోకిల. [4]తప్పు లోఁగొని చక్రపావక దాహముం బెడఁబాపి తా
నొప్పు నొప్పు భవద్దయారస మో నరేశ్వర ! ప్రాణముల్
చెప్ప మున్మను బోయి క్రమ్మఱఁ జేరె ధన్యుఁడ వై తి నీ
కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా ! 142

క. అనిన విని రాజముఖ్యుఁడు, మునివల్లభు పాదములకు మ్రొక్కి కడున్ మ
న్నన సేసి యిష్టభోజన, మనువుగఁ బెట్టించెఁ దృప్తుఁ డయ్యె నతండున్. 143

వ. మఱియు న మ్మునీంద్రుం డి ట్లనియె. 144

---

1. ఇష్టభద్రమడుగ (చ. ట.); ఇష్టద్రవ్య మడుగ (జ. ద. బ.) 2. అగుటను (తం).
3. నైనచో (హ) 4. తప్పులుం గొని (హ)

శా. [1]కంటి న్నేటికి నిన్ను నీ వచనముల్ కర్ణద్వయ ప్రీతిగా
వింటి న్నన్నముఁ గొంటి నీ గృహమునన్ వేడ్కన్ ఫలం బబ్బె నే
మంటిన్ బోయెద నీ చరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీను లై
మింటన్ మేదిని సన్నుతింపఁ గల రీమీఁద న్నరేంద్రాగ్రణీ! 145

వ. అని చెప్పి, దుర్వాసుం డంబరీషుని దీవించి, కీర్తించి, మింటితెరువున బ్రహ్మలోక మునకుం జనియె. మునీశ్వరుండు తిరిగి చనువేళకు నొకసంవత్సరంబు నిండి, వ్రతంబు పరిపూర్ణం బయిన. 146

ఆ. అవనిసురుఁడు గుడువ నతిపవిత్రం బైన
వంటకంబు భూమివరుఁడు గుడిచెఁ
[2]దపసి నెగులు మాన్పఁ దా నెంతవాఁడను
హరి కృపామహత్త్వ మనుచుఁ దలఁచి. 147

వ. మఱియును. 148

క. హరిఁ గొల్చుచుండువారికిఁ, బరమేష్ఠిపదంబు మొదలు [3]పదభోగంబుల్
నరకసమం బని తలఁపున, ధరణీరాజ్యంబుతోడి తగులము మానెన్. 149

వ. ఇట్లు విరక్తుం డై. 150

ఆ. తనకు సదృశు లైన తనయుల రావించి
ధరణిభరము వారిఁ దాల్పఁ బంచి
కాననంబు సొచ్చె కామాది విజయుఁ డై
నరవిభుండు హరిసనాథుఁ డగుచు. 151

క. ఈ యంబరీషు చరితము, తీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం
డై యుండును భోగపరుం, డై యుండును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా!

అధ్యాయము - ౬

వ. †విను మ య్యంబరీషునకు విరూపుండును, కేతుమంతుండును, శంభుండు నను వారు మువ్వురు కొడుకులు. అందుఁ గేతుమంతుండును, శంభుండును హరింగూర్చి తపంబుసేయువా రై, వనంబునకుం జనిరి. విరూపునికిఁ బృషదశ్వుండును, బృష దశ్వునకు రథీతరుండును గలిగిరి. అమ్మహాత్మునికి సంతతి లేకున్న నంగిరసుఁడను

1. కంటిన్నంటితి నిన్ను (క.ట.త.జ.డ.బ.) 2. దపసి యెలుఁగుమాన్ప (హ) 3. పరభోగంబుల్ (హ)
† చ. డ. బ. ప్రతులలో నంబరీషునకు సురూపుఁడను నాల్గవ కొడుకుం డె ననియు, నతఁడు వ్యాఘ్ర నిహతుఁ డయ్యెననియుఁ గలదు.

మునీంద్రుం డతని భార్యయందు బ్రహ్మతేజోధను లైన కొడుకులం గనియె. వారలు రథీతరగోత్రులు, నాంగిరసు లను బ్రాహ్మణులు నై, యితరులందు ముఖ్యు లై ప్రవర్తిల్లిరి. అని చెప్పి శుకుం డిట్లనియె. 153

## —: ఇక్ష్వాకు వంశానుక్రమము :—

క. ఒకనాఁడు మనువు దుమ్మిన, వికలుఁడు గా కతని [1]ఘ్రాణవివరము వెంటన్
ప్రకటయశుం డిక్ష్వాకుం, డకలంకుఁడు వుట్టె [2]రవికులాధారుం డై. 154

సీ. ఇక్ష్వాకునకుఁ బుత్రు లెలమిఁ బుట్టిరి నూర్వు రమర వికుక్షియు నిమియుఁ దండ
కుండు నాతని పెద్దకొడుకులు మువ్వు రా ర్యావర్తమందు హిమాచలంబు
వింధ్యాద్రిమధ్య మూర్వీమండలము కొంత యేలిరి యిరువదియేగు రొక్క
పొందుగ నా తూర్పుభూమి పాలించిరి [3]యందఱు పడమటి కధిపు లైరి

తే. యున్న నలువదియేడ్గురు నుత్తరోర్వి
దక్షిణోర్వియుఁ గాచిరి తండ్రి యంత
నష్టకాశ్రాద్ధ మొనరింతు ననుచు నగ్ర
సుతు వికుక్షి నిరీక్షించి శుద్ధ మైన
మాంసఖండంబుఁ దెమ్మనె మహితయశుఁడు. 155

మ. అగుఁగా కంచు వికుక్షి వేఁటసని ఘోరారణ్యభూమిం దగన్
మృగసంఘంబులఁ జంపి బిట్టలసి తా మేనొల్లఁబో నాఁకటన్
నగ మై యొక్క శశంబుఁ బట్టి తిని శేషం బైన మాంసంబు శీ
ఘ్రగతిం దండ్రికిఁ దెచ్చి యిచ్చె నకలంకస్ఫూర్తి వర్తిల్లఁగాన్. 156

తరల. కులగురుండు వసిష్ఠుఁ డంత వికుక్షి కుందెలు దింట లో
పల నెఱింగి యనర్హ మెంగిలి పైతృకం బొనరింపఁగా
వలదు వీఁడు దురాత్మకుం డన వాని తండ్రియు వానిఁ జెం
తలను జేరఁగనీక దేశము దాఁటిపో నడిచెన్ వడిన్. 157

ఆ. కొడుకు వెడలఁగొట్టి గుణవంతుఁ డిక్ష్వాకుఁ
డా వసిష్ఠుఁ డేమి యానతిచ్చె
నదియుఁ జేసి యోగి యై వనంబునఁ గళే
బరము విడిచి ముక్తిపదము నొందె. 158

---

1. ఘ్రాణరంధ్రము వెంటన్ (హ) 2. రవికులాధీశుం డై (హ. తం. వా) 3. కొందఱు(హ)

చ. జనకుఁడు ముక్తిఁ బొంద నయశాలి వికుక్షి శశాదు డంచు భూ
జనులు నుతింప నీ ధరణిచక్ర మశేషము నేలి యాగముల్
గొనకొని చేసెఁ బ్రీతి హరిఁగూర్చి పురంజయుఁ బుత్త్రుఁ గాంచెఁ బే
ర్కొనె నమరేంద్రవాహుఁడుఁ గకుత్స్థుఁడు నంచును వాని లోకముల్. 159

సీ. కృతయుగాంతంబున దితిసుతామరులకు రణ మయ్యె నందులో రాక్షసులకు
నమరవల్లభుఁ డోడి హరితోడఁ జెప్పిన జలజనేత్రుఁడు పురంజయునియందు
వచ్చి నే నుండెద వాసవ! వృషభంబ వై మోవు మని పల్క నమరవిభుఁడు
గోరాజమూర్తిఁ గకుత్త్రదేశంబున నా పురంజయు మోచె నంత నతఁడు

తే. విష్ణుతేజంబు దనయందు విస్తరింప
దివ్యచాపంబు చేపట్టి దీర్ఘ నిశిత
బాణములఁ బూని వేల్పులు ప్రస్తుతింప
†నంతకాలాగ్నిచాడ్పున ననికి నడచె. 160

చ. నడచి శరావళిం దనుజనాథుల మేనులు చించి కంఠముల్
దొడిఁ దొడిఁ ద్రుంచి కాలుపురి త్రోవకుఁ గొందఱఁ బుచ్చి కొందఱ
వడి నురగాలయంబున నివాసము సేయఁగఁ దోలి యంత నూ
రడక నిశాచరేంద్రుల పురంబులు గూల్చె పురంజయాఖ్యతన్ 161

వ. ఇ వ్విధంబున శశాదపుత్త్రుండు, రాక్షసుల పురంబులు జయించిన కతనం, బురంజయుండును, వృషభరూపుం డై యింద్రుండు వాహనం బగుటం జేసి యింద్రవాహనుండును, నతని మూఁపురం బెక్కి రణంబు సేసినకారణంబునఁ గకుత్స్థుండును నన నీ మూఁడునామంబులఁ బ్రసిద్ధికెక్కె. దైత్యుల ధనంబుల నింద్రుని కిచ్చె. అ ప్పురంజయునిపుత్త్రుం డనేనసుండు. అతనిపుత్త్రుండు పృథుండు. పృథుని కొడుకు విశ్వగంధుండు. విశ్వగంధు నందనుండు చంద్రుఁడు. చంద్రసుతుండు [1]యవనాశ్వుండు. యవనాశ్వ తనూభవుండు శవస్తుండు. అతండు శావస్తినామ నగరంబు నిర్మించె. శవస్తతనయుండు బృహదశ్వుండు. బృహదశ్వునకుఁ గువలయాశ్వుండు జనించె. ఆ నరేంద్రచంద్రుండు. 162

క. లావు మెఱసి యిరువదియొక, వేవురు నందనులుఁ దాను వీరుఁ డతఁడు భూ
దేవుఁ డుదంకుఁడు వనుప దు, రావహుఁ డై చంపె దుందు [2]నమరాబంధున్.

వ. అది కారణంబుగా దుందుమారుం డన నెగడె. అ య్యసుర ముఖానలంబునఁ గువలయాశ్వు కుమారు లందఱు భస్మం బై రి. అందు దృఢాశ్వుండును, గపి

---

† అంతఁ గాలాగ్ని (తం. వా.) 1. యవనాశ్వుండు (తం. వా.) 2. హవమందున్ (ద)

లాశ్వుండును, భద్రాశ్వుండును నను వారలు ముగ్గురు చిక్కిరి. అందు దృఢాశ్వునకు హర్యశ్వుండును, హర్యశ్వునకు నికుంభుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృశాశ్వుండును, గృశాశ్వునకు సేనజిత్తును, సేనజిత్తునకు యువనాశ్వుండును జనియించిరి. అ య్యువనాశ్వుండు గొడుకులు లేక నూర్వురుభార్యలుం, దానును నిర్వేదపడియుండ, నా రాజునకు మునులు కృపసేసి, యింద్రునిఁ గూర్చి సంతతికొఱకై యైంద్రయాగంబు సేయించిరి. అందు. 164

సీ. భూమీశు భార్యకుఁ బుత్రలాభమునకై పోయు తలంపున భూమిసురులు
జలమును మంత్రించి జలకలశము దాఁచి నియమంబుతోఁ గూడి నిద్రవోవ
ధరణీశ్వరుఁడు [1]పేరు దప్పితో నా రాత్రి ధృతిలేక యజ్ఞమందిరముఁ జొచ్చి
యా నీరుఁ ద్రావిన నంత మేల్కని వార లెవ్వఁడు ద్రావె నీ రెందుఁ బోయె

ఆ. ననుచు రాజు ద్రావు టంతయు భావించి
యెఱిఁగి చోద్య మంది యీశ్వరాజ్ఞ
యెవ్వఁ డోపుఁ గడవ నీశ్వరునకు నమ
స్కార మనుచు నేది కార్య మనుచు. 165

వ. వారలు దుఃఖింపుచుండునంతఁ గొంత తడవునకు యువనాశ్వుని కడుపు వ్రక్కలించుకొని, చక్రవర్తి చిహ్నంబులు గల కుమారుండు జన్మించి, తల్లి లేని కతంబునఁ గడుపునకు లేక యేడ్చుచుండ, నింద్రుండు వచ్చి, శిశువునకు నాఁకలి దీఱుకొఱకు వాని నోటం దన వ్రేలిడినం, ద్రావెడి కతంబున వాని పేరు మాంధాత యని నిర్దేశించి చనియె. ఇ వ్విధంబున. 166

ఆ. కడుపు పగుల ముద్దు కొడుకు జన్మించిన
[2]తీఱఁ డయ్యెఁ దండ్రి దేవ విప్ర
కరుణ నట్లకాదె కడిది దైవము లావు
కలుగువాఁడు బ్రతుకుఁగాక చెడునె. 167

వ. ఇట్లు బ్రతికియున్న యువనాశ్వుండు, గొంతకాలంబునకుఁ దపంబు సేసి, సిద్ధిం బొందె. అంత. 168

1. నీరు (హ) 2. ధీరుఁడయ్యె (హ)

సీ. పడమటఁ బొడమెడు బాలచంద్రునిమాడ్కిఁ బూఁటపూఁటకు వృద్ధిఁబొందెబాలుఁ
డల్లన పరిపూర్ణ యౌవనారూఢుఁ డై రావణాది రిపుల రాజవరుల
దండించి తనుఁ ద్రసదస్యుఁ డంచు సురేంద్రుఁ డంకింప శూరుఁ డై యఖిలదేవ
మయు నతీంద్రియు విష్ణు మాధవు ధర్మాత్ము నజుని యజ్ఞాధీశు నాత్మఁగూర్చి

తే. చేసెఁ గ్రతువులు భూరి దక్షిణల నిచ్చి
ద్రవ్య యజమాన విధి మంత్ర ధర్మ యజ్ఞ
కాల ఋత్విక్ప్రదేశ ముఖ్యంబు లెల్ల
విష్ణురూపంబు లనుచు [1]భావించి యతఁడు. 169

క. [2]బలిమి నడంచుచు నరులం, జలివెలుఁగున్ వేఁడివెలుఁగుఁ జనుచో టెల్లన్
జలరుహనయనుని కరుణను, జెలువుగ మాంధాత యేలె సిరి నిండారన్. 170

వ. అంత నా రాజునకు శతబిందు కూఁతు రగు బిందుమతియందుఁ బురుకుత్సుండును,
నంబరీషుండును, ముచుకుందుండును నను వారు ముగ్గురు కొడుకులు, నేఁబండ్రు
కూఁతులుం జనియించి, పెరుఁగుచున్న యెడ. 171

సీ. యమునా జలములోన నధికుఁడు సౌభరి తపము సేయుచు జల స్థలమునందుఁ
బిల్లలుఁ దన ప్రాణవల్లభయునుఁ గూడి మెలఁగ నానందించు మీనరాజుఁ
గనుఁగొని సంసార కాంక్షి యై మాంధాత నొకకన్య నడుగ నృపోత్తముండు
తరుణి నిత్తును స్వయంవరమునఁ జేకొను మనవుడు ననుఁ జూచి యౌవనాంగి

ఆ. యేల ముసలిఁ గోరు నిట్టట్టు వడఁకెడి
వాఁడఁ జాల నరసినాఁడ నొడల
జిగియు బిగియు లేని శిథిలుండఁ గరఁగింపఁ
జాలఁ దిగిచికొను నుపాయ మెట్లు.

వ. అదియునుం గాక.

ఆ. బాల పువ్వుఁబోణి ప్రాయంపు వానినిఁ
జెన్ను వాని ధనముఁ జేర్చువాని
మరగెనేని కొంత మరగుఁగా కెదిరిఁ ద
న్నెఱిఁగి ముసలి తపసి నేల మరగు. 174

వ. అని విచారించి సౌభరి తన తపోబలంబునం జేసి ముసలితనంబు విడిచి, యెల
ప్రాయంపుఁ గొమరుం డై, యలంకరించికొని, ముందట నిలువంబడిన, మాంధా

1. భావించె నతఁడు (హ) 2. బలిమి నిలనేడు చెరగుల (క-బ)

తయుఁ గన్నియల నగరు గాచికొని యున్న వారికి సెలవు సేసిన, వా ర
మ్మునీంద్రుని, నా రాజపుత్రిక లున్న యెడకుం గొనిపోయి చూపిన. 175

ఉ. కోమలులార! వీఁడు నలకూబరుఁడో మరుఁడో జయంతుఁడో
యేమటి వచ్చె వీనిఁ దడ వేల వరింతుము, నేమ నేమ యం
చా మునినాథుఁ జూచి చలితాత్మిక లై పొరిదిన్ వరించి రా
భామిను లందఱుం గుసుమబాణుఁడు ఘీ యని ఘంట ద్రేయఁగన్. 176

వ. ఇట్లు రాజకన్యకల నందఱం జేకొని, సౌభరి నిజ తపఃప్రభావంబున, ననేక లీలా
వినోదంబులు గల్పించి. 177

సీ. గృహరాజములయందుఁ గుసుమవల్లులయందుఁ [2]గోలాహలం బైనఁ గొలఁకులందుఁ
గలకంఠ శుక మధుకర నినాదములచే వర్ణనీయము లైన వనములందు
మణివేదికలయందు మహనీయ పర్యంక పీఠ లీలాశైల బిలములందు
శృంగారవతు లగు చెలువలు పలువురు తన పంపుసేయ సుస్థలములందు

తే. వస్త్ర మాల్యానులేప సువర్ణహార
భూరి సంపద నిష్టాన్నభోజి యగుచుఁ
బూఁటపూఁటకు నొక [3]వింత పొలుపు దాల్చి
రాజకన్యల నందఱ రతులఁ దేల్చె. 178

క. పెక్కండ్రు రాజముఖులకు, నొక్కఁడు మగఁ డయ్యుఁ దనియకుండె మునీంద్రుం
డెక్కుడు ఘృతధారలచే, నక్కజ మై తృప్తిలేని యనలుని భంగిన్. 179

వ. ఇవ్విధంబున. 180

క. ఆరామంబున మునివరుఁ, డా రామలతోడ బహు [4]విహారాములుఁ డై
[5]పోరాములఁ దన కిట్టటు, [6]పోరాములఁ జేసి కొన్ని ప్రొద్దులు పుచ్చెన్. 181

వ. అంత నొక్కనాఁడు మేదినీవల్లభోత్తముం డగు నా మాంధాత, మునీశ్వరుం
డెందు వోయె. కూఁతు లెక్కడ నలజడి పడుచున్నవారలో. అని తలంచి,
వెదకవచ్చి, యొక్క మహానగంబున, మణిమయ సౌధంబులం, జక్రవర్తియుం
బోలెఁ గ్రీడించుచున్న తాపసరాజుం గని, సంతసించి, వెఱఁగుపడి, మన్ననలం
బొంది, మెల్లన కూఁతులం బొడగని, సత్కరించి యి ట్లనియె. 182

క. నాతోడులార! మీపతి, [4]మీతోడిద పనులయెడల మేలే యనుడున్
"నాతోడిదె నాతోడిదె, తాతా! మే"లనుచు ననిరి తరుణులు వరుసన్. 183

---

1. కృతకాచలములందు (తం.వా.) 2. కలువలు విలసిల్లు 3. కొంత (హ) 4. విహారమయుం డై (హ)
5. గారాముల (హ) 6. పోరాములుచేసి (హ. తం. వా.) 7. మీతోడే (వా)

వ. అంతఁ గొంతకాలంబునకు బహు భార్యాచర్యుం డగు సౌభరి, యేకాంతంబునఁ దన్నుఁ దానె చింతించుకొని, మీన మిథున సంగదోషంబునం గాఁపురంబు దనకు నగపడుట యెఱింగి, పశ్చాత్తాపంబున ని ట్లనియె. 184

మ. ఉపవాసంబుల డయ్యుటో విషయ సంయోగంబు వర్జించుటో
తపముం బూని చరించుటో హరి పద ధ్యానంబునన్ నిల్చుటో
యపలాపంబున నేల పొందితి హతం బయ్యెం దపం బెల్ల నీ
కపటస్త్రీ పరిరంభముల్ మునులకుం గైవల్య సంసిద్ధులే. 185

చ. ముని యఁట తత్త్వవేది యఁట మోక్షముగాని సుఖంబు లెవ్వియుం
జన వఁట కాంత లేఁబ దఁట సౌధచయం బఁట వాసదేశముం
దనయులు నైదువే లఁట నిదానము మీనకుటుంబి సౌఖ్యముం
[1]గను టఁట చెల్లరే నగవు గాక మహాత్ములు సూచి మెత్తురే. 186

ఆ. తపము సేయువాఁడు తత్త్వజ్ఞుఁ డగువాఁడు
నెలమి మోక్ష మిచ్ఛయించువాఁడు
నేకతంబు విడిచి యేర్పడ నేరఁడు
కాఁపురంబుసేయు కఱటి తపసి. 187

వ. అని దుఃఖించి, తనుం దాన [2]నిందించికొని, తన వేడబంబు వివేచింపుచు, నిహ పరసాధకుం డై, కాఁపురంబు విడిచి, సతులుం దానును వానప్రస్థ ధర్మంబున నడవికిం జని, ఘోరతపంబు సేసి, శరీరము గుదియించి, యగ్ని సహితుం డై, పరబ్రహ్మంబు సొచ్చె. అంత. 188

క. మునిపతి వనమున కరిగిన, వనితలు తో నరిగి ప్రాణవల్లభు గతికిం
జనిరి వెనుదగిలి విడువక, ననలముతో శిఖలు నిలువ కరిగిన భంగిన్.

## అధ్యాయము – ౭

వ. అంత మాంధాత పెద్దకొడు కగు [3]నంబరీషుని, వాని పితామహుండగుటం జేసి, యువనాశ్వుండు దనకుం బుత్రుండు గావలయు నని కోరి పుచ్చికొనియె. అ య్యంబరీషునకు యౌవనాశ్వుండు, నతనికి [4]హారితుండు జనియించిరి. అది కారణంబున నంబరీష యౌవనాశ్వ హారితులు మాంధాతృ గోత్రంబునకుం బ్రవరు లై రి. మాంధాత రెండవ కొడుకు పురుకుత్సుండు. అతని నురగలోకంబునకుం గొనిపోయి భుజంగకుమారులు దమ చెల్లె లగు నర్మద యను కన్యకను వివా

---

1. గనునట (హ) 2. చింతించికొని (హ) 3. అంబరీషుండు (హ) 4. హారివరుండు (హ)

హంబు చేసిరి. పురుకుత్సుండును, నక్కడ ననేక గంధర్వ నాయకుల వధించి, తన నాగలోకసంచరణంబు దలంచువారికి, నురగ భయంబు లేకుండ వరంబు వడసి తిరిగివచ్చె. ఆ పురుకుత్సునకుఁ ద్రసదస్యుండుఁ, ద్రసదస్యున కనరణ్యుండు, న య్యనరణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వునకు [1]నరుణుండు, నరుణునకుఁ ద్రిబంధనుండుఁ, ద్రిబంధనునకు [2]సత్యవ్రతుండును జనించిరి. ఆ సత్యవ్రతుండుఁ ద్రిశంకుం డనం బరఁగె. 190

సీ. గురు శాపవశమునఁ గూలి చండాలుఁ డై యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి
యతనిలావున దివిజాలయంబున కేఁగ మన్నింప కమరులు మరల ద్రొబ్బ
దలక్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ గౌశికుం డప్పటి ఘనత మెఱసి
నిలిపె నాకసమున నేఁడు [3]నున్నాఁడు త్రిశంకుఁ డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె

తే. నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జేరి
యాగదక్షిణ మిషమున నఖిలధనముఁ
గొల్లఁగొని మీఁదఁ గులహీనుఁ గొలువఁ [4]బెట్ట
బొంక కలజడిఁ బొందె నా భూవరుండు. 191

వ. ఇట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులువఱచుట విని, వసిష్ఠుండు, విశ్వామిత్రుని గృధ్రము గ మ్మని శపించె. విశ్వామిత్రుఁడును వసిష్ఠుని బకంబు గ మ్మని శపించె. పక్షిరూపు లయ్యును నా యిరువురు యుద్ధంబు సేసిరి. బ్రహ్మ వారించి యెప్పటి నిజాకృతులుగా నొసరించె. అంత హరిశ్చంద్రుండు పుత్రులు లేక, నారదు నుపదేశంబున వరుణోపాసన నతిభక్తితోఁ జేయ, నా వరుణుండు ప్రత్యక్షుం డైన, నతనికి మ్రొక్కి యి ట్లనియె. 192

ఆ. వరుణదేవ! నాకు వర వీరగుణములఁ
గొడుకు పుట్టెనేనిఁ గొడుకుఁ బట్టి
పశువుఁ జేసి నీవు పరిణమింపఁగ వేల్తుఁ
గొడుకు నీఁగదయ్య కొసరు లేక. 193

వ. అని పలికినం, గుమారుండు గలిగెడు నని, వరుణుండు వరమిచ్చి చనియె. అంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున, రోహితుం డను కుమారుఁడు జన్మించె. వరుణుండును హరిశ్చంద్రకుమారు నుద్దేశించి. 194

---

1. "ఉరుణః" అని మూలము(7-5) 2. సత్యవ్రతుండు, సత్యవ్రతునకు ద్రిశంకుండు జన్మించె(హ)
3. నున్నట్టి (హ) 4. ఁబెట్టి (హ)

సీ. పురిటిలోపల వచ్చి పుత్త్రు వేలువు మన్నఁ బురుడు వెళ్ళినఁ గాని పొసఁగ దనియెఁ
బలు రాక మునువచ్చి బాలు వేలువు మన్నఁ బండ్లులేకున్న నభావ్యుఁ డనియెఁ
బండ్లు రాఁ జూచి డింభకుని వేలువు మన్నఁ బడిపండ్లు రామి నభావ్యుఁ డనియెఁ
బడిపండ్లు వొడమినఁ గొడుకు వేలువు మన్నఁ బోరుల కొదవక పొసఁగ దనియెఁ

ఆ. దొడరి యిట్లు కొడుకుతోడి మోహంబునఁ
బ్రొద్దుఁ గడపుచుండె భూవరుండు
దండ్రి తలఁపుకొలఁదిఁ దనలోనఁ జింతించి
యింటనుండ కడవి కేఁగెఁ గొడుకు, 195

వ. ఇట్లు వనంబునకుం జని, శర శరాసనధరుం డై, రోహితుండు దిరుగుచుండి, వరుణగ్రస్తుం డై, హరిశ్చంద్రుండు, మహోదరవ్యాధిచేఁ బీడితుండుగా నుండుట విని, పురంబునకుం దిరిగి రా గమకింప, నింద్రుండు ముసలితపసి యై వచ్చి, యి ట్లనియె. 196

ఆ. పుణ్యభూము లరుగు పుణ్యతీర్థంబులఁ
గ్రుంకు పుణ్యజనులఁ గోరి చూడు
పుణ్యకథల వినుము భూపాలపుత్త్రక!
మేలు గలుగు [1]నింటిమేర వలదు. 197

వ. అని యిట్లు మగుడించినం, దిరిగి రోహితుం డొక్క యేఁడ వ్వనంబునం దిరిగి, క్రమ్మఱఁ జనుదేర, నింద్రుండు వచ్చి, తొంటియట్ల నివారించె. ఇవ్విధంబున.

సీ. ఐదేళ్ళు మరలించె నమరేంద్రుఁ డా బాలు నాఱవయేఁట వాఁ డడవినుండి
యింటికి వచ్చుచు నెలమి [2]నజీగర్తు మధ్యమపుత్త్రు సమ్మాన్యచరితు
ఘను శునశ్శేఫునిఁ గొని యాగపశువుగ నా హరిశ్చంద్రున కాతఁ డిచ్చెఁ
బురుషమేధము సేసి భూపాలవర్యుఁడు [3]వరుణాది నిఖిలదేవతలఁ దనిపె

తే. హోత కౌశికుఁ డధ్వర్యుఁ డొనర భృగుఁడు
బ్రహ్మ జమదగ్ని సామంబు పాడువాఁడు
ముని వసిష్ఠుఁ డా మఖమున ముదముఁ బొంది
కనకరథ మిచ్చె నింద్రుఁ డా మనుజపతికి. 199

వ. శునశ్శేఫుని ప్రభావంబు వెనుక వివరించెద. అంత భార్యాసహితుం డైన, హరిశ్చంద్రువలనం బ్రీతుం డై విశ్వామిత్త్రుం డతనికి ముఖ్యజ్ఞానంబు కృపసేసిన,

1. నట్టిమేఱగలదు (హ. వా.); మేరవలదు (క. బ.) 2. నజగర్తు (హ) 3. వరుణుఁ డాదిగ దేవతలను దనిపి (హ)

మనం బన్నమయంబు గావున, మనంబున నన్నరూప యైన పృథివి నెఱింగి, పృథివిని జలంబువలన నణంచి, జలంబు తేజంబువలన నింకించి, తేజంబు వాయువు వలనం జేర్చి, వాయువు నాకాశంబునం గలిపి, యాకసంబుఁ దామసాహం కారంబునందు లయంబుచేసి, [1]యహంకార త్రయంబు మహత్తత్త్వంబునందు డిందించి, పరతత్త్వంబునకు లోకంబునుసృజించెదనను తలంపైన,మహత్తత్త్వంబు నందుల విషయాకారంబు నివర్తించి, విషయవివర్జితుం డై, మహత్తత్త్వంబును బరతత్త్వంబుఁ గా నెఱుంగుచు, న య్యెఱుకవలన సంసారహేతు వైన ప్రకృతిని భస్మంబు సేసి, య య్యెఱుకను నిర్వాణసుఖ పారవశ్యంబునం బరిహరించి, సకల బంధవిముక్తుం డై, హరిశ్చంద్రుం డవాఙ్మానస గోచరం బైన నిజ రూపంబుతో వెలుంగుచుండె.

## అధ్యాయము - ౮

అతని కుమారునకు హరితుండు వుట్టె. హరితునకుఁ జంపనామధేయుండు జని యించె. అతండు దనపేరఁ జంపానగరంబు నిర్మించె చంపునకు సుదేవుండు, సుదేవునికి విజయుండు, విజయునకు రురుకుండు, రురుకునకు వృకుండు, వృకునకు బాహుకుండు జనియించిరి. అందు బాహుకుండు. 200

సీ. దండించి పగవారు తనభూమిఁ జేకొన్న నంగనలునుఁ దాను నడవి కేఁగి
యడవిలో ముసలి యై యాతఁడు సచ్చిన నాతని భార్యఁ దా ననుగమింపఁ
గదియుచో నా స్త్రీకి గర్భంబుగలుగుట యౌర్వ మునీశ్వరుఁ డాత్మ నెఱిఁగి
వారించె నంతన వనజాక్షి సవతులు సూలు నిండారినఁ జూడఁజాల

తే. కర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి
విషము పెట్టిరి పెట్టిన విరిసిపడక
గరముతోఁగూడ సగరుండు ఘనుఁడు పుట్టె
వర యశస్స్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె. 201

శా. చండస్ఫూర్తి నతండు దండ్రి పగకై సంగ్రామరంగంబులన్
జెండెన్ హైహయ బర్బరాదుల వధించెన్ దాళ జంఘాదులన్
ముండీభూతులుగా నిరంబరులుగా మూర్తుల్ సబీభత్సు లై
యుండం జేసె నిజారులన్ సగర నామోర్వీవిభుం డల్పుఁడే. 202

క. ఖగరాజరుచులు గల [2]యల, పగరాజుల నడఁచి యేలె బాహాశక్తిన్
నగరాజధీరు శూరున్, సగరున్ హత విమత[3]నగరుఁ జను వినుతింపన్. 203

1. యహంకారంబు మూటిని (హ) 2. యలఁ (తం. వా.) 3. నిఖిలజనులు నుతింపన్ (హ)

సీ. ఔర్వుండు సెప్పఁగ నమర వేదాత్మకు హరి నీశు నమృతు ననంతుఁ గూర్చి
వాజిమేధంబులు వసుధేశ్వరుఁడు సేసె నం దొక్కమఖమున హయము విడువ
నగభేది గొనిపోయి నాగలోకంబునఁ గపిలునిచేరువఁ గట్టి తొలఁగె
నంత గుఱ్ఱముఁ గాన కా రాజు తనపుత్ర నివహంబు దిశలకు [1]నెమకఁ బంపె

తే. వారు నిల యేడుదీవులు వరుస వెదకి
మఖతురంగంబు లేకున్న మగుడి రాక
ప్రాభవంబున దోర్దండబలము మెఱసి
[2]గ్రొచ్చి కోరాడి త్రవ్విరి కుతల మెల్ల. 204

వ. ఇట్లు [3]వసుమతీశు కొడుకులు నేలఁ ద్రవ్వి, పాతాళంబునం దూర్పు ముట్టియున్న యుత్తరభాగంబునం గపిలముని పొంత నున్న తురంగంబుఁ గని. 205

చ. ఎఱిఁగితి మద్దిరయ్య! తడ వేటికి [4]గుఱ్ఱపుదొంగ యీతఁడే
గుఱుతుగఁ బట్టి చంపుఁ డతిఘోర మునీంద్రుఁడుఁ వోలె నేత్రముల్
[5]దెఱవక జాకినోరు మెదలింపక బైసుకపట్టె నంచుఁ న
య్యఱువదివేవురు న్నిజ కరాయుధముల్ జళిపించి డాయుచోన్. 206

చ. కపిలుఁడు నేత్రముల్ దెఱవఁగాఁ దమ మేనుల మంటవుట్టి తా
రపగతధైర్యులై [6]పడి యహంకరణంబున మూఢచిత్తులై
నృపసుతు లందఱున్ ధరణి నీఱయి రా తృణమంద సాధులం
దపసులఁ గాసివెట్టెడి మదస్ఫురితాత్ములు నిల్వనేర్తురే. 207

సీ. కొందఱు కపిలుని కోపానలంబున మ్రందిరి సగరకుమారు లనుచు
నందు రా ముని శాంతుఁ డానందమయమూర్తి తొడరి కోపించునే దువ్వ నేలఁ
గాక జన్మించునే గగనస్థలంబున నే సాంఖ్యమతమున నిద్ధమతులు
భవసముద్రము మృత్యుపదమును లంఘింతు రా బుద్ధిఁ జేయు పరాత్మభూతుఁ

తే. డఖిలబోధకుఁ డతనికి నరసిచూడ
[7]సఖు లమిత్రులు నెవ్వరు సగరసుతులు
దాము దమచేయు నేరమి దనువులందు
ననలకీలలు పుట్టి నీఱైరి కాక. 208

---

1. వెదుక (హ) 2. క్రొచ్చి కోఱాడి (హ) 3. సుమతి కొడుకులు (హ) 4. గుఱ్ఱపు దొంగబంటు నీ జఱభునిఁ బట్టి చంపుఁ డతి సాధు మునీంద్రుఁడువోలె (తం. వా.) 5. దెఱవకనున్న వాఁడితనిఁ దెంపుగఁ బైసిగవట్టి వంచు డంచు (హ) 6. పడి రఘూళి కతంబున (బ డ.)
7. సఖులుమిత్రులు (హ)

వ. మఱియు, సగరుండు సుకేశినియందుఁ గన్న పుత్త్రుం డసమంజసుం డనువాఁడు, సమంజసగుణంబులు లేక, పూర్వజన్మంబున యోగీశ్వరుం డై యుండి, సంగదోషంబువలన యోగభ్రష్టుం డై, సగరునకు జన్మించి, జాతిస్మరజ్ఞానంబు గలిగి, లోకులకుఁ దమవారలకు నప్రియం బగు వర్తనంబునం దిరుగుచు, నొక్కనాఁడు. 209

చ. వరుస నయోధ్యలోనఁగల [1]వాడల నాడెడు పిన్నవాండ్ర నా
సరయువులోన వైచి జనసంఘముఁ దండ్రియు [2]బిట్టుఁ దిట్ట వాఁ
డురుమతిఁ గొన్నిప్రొద్దులకు యోగబలంబునఁ జేసి బాలురం
దిరిగి పురంబులోపలికిఁ దెచ్చిన నివ్వెఱ గంది రందఱున్. 210

వ. అయ్యసమంజసుని కొడుకు, అంశుమంతుం డనువాఁడు, వినీతుం డై, తనయొద్దఁ బనులు సేయుచుండు నంత సగరుం డమ్మనుమని, నంశుమంతు నశ్వంబు వెదకి తెమ్మని పంచిన, నతండు దమతండ్రుల చొప్పునం జని, వారలు ద్రవ్విన మహాఖాతంబు సొచ్చి, యందు భస్మరాసుల పొంత నున్న హయంబునుం గని, హయసమీపంబునం దున్న [3]కపిలాఖ్యుం డైన విష్ణునికి దండప్రణామంబు సేసి, యిట్లని స్తుతియించె.

సీ. మతిచిక్కఁబట్టి సమాధిగౌరవమున [4]వాసిగాఁ దనకు నవ్వల వెలుంగు
[5]నిను నొక్కనాఁ డైన నెఱుఁగునే యాబ్రహ్మ యజుని మనంబున నవయవముల
[6]బుద్ధి జన్మించిన భూరి జంతువులందు హీను లయిన మాకు నెఱుఁగ వశమె
తమలోన నీ వుండఁ దా మెఱుంగరు నిన్ను గుణములు చూతురు గుణము లైనఁ

తే. [7]గాన రొకచోటఁ జీఁకటిఁ గందు రాత్మ
లందుఁ దెలియరు [8]వెలుపల నమరు పొందు
[9]లరయుదురు దేహధారు లత్యంధు లగుచుఁ
గడిఁది నీ మాయ నెన్నఁడుఁ గడవలేక. 212

వ. అని నుతిసేయుచు, హయంబు విడువు మని చెప్పక, తన తండ్రులు నీఱగుటం దడవక, మ్రొక్కి నిలుచున్న యంశుమంతునికిఁ గరుణావిపులుం డగుచుఁ గపిలుం డిట్లనియె. 213

---

1. వారల (హా. తం. వా) 2. దిట్టుచుండ (హా. వా.) 3. కపిలాఖ్యుండైన (హా) 4. వ్రాలియుఁ దనకు నవ్వల వెలుంగు (ట. తం. వా.) 5. నినుగానఁ డొకనాఁడు, నిన్నెఱుంగునె బ్రహ్మ (చ. తం. వా.) 6. బుట్టి (హా) 7. గాననొకచోట (హా) 8 వేలుపు అరయఁ (హా) 9. అరయుదుర (హా)

క. గుఱ్ఱము గొనిపో [1]బుద్ధుల, కుఱ్ఱడ! మీ తాతయొద్దకున్ నీ తండ్రుల్
వెఱ్ఱులు నీఱై రదె యీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభ మగున్. 214

వ. అని పలికిన, నమస్కరించి, తురంగంబుం గొనివచ్చి, యా సగరున కిచ్చిన, సగరుం డా పశువువలన జన్నంబు కడమ నిండించి, యంశుమంతునకు రాజ్యం బిచ్చి, ముక్తబంధనుం డై, యౌర్వుండు సెప్పినమార్గంబున నుత్తమగతికిం జనియె. అంత. 215

## అధ్యాయము – ౯

క. జనకులు మ్రగ్గిన చోటికి, ననిమిషనదిఁ దెత్తు ననుచు నటవీస్థలికిన్
జని తపము సేయఁజాలక, మనమున వగ లొలయ నంశుమంతుఁడు దీఱెన్.

క. ఆతనికొడుకు దిలీపుఁడు, [2]భూతలముకు గంగఁ దెచ్చి పొందించుట కై
ప్రీతిం దపంబు సేయుచు, భాతిగఁ దేలేక కాల[3]పరవశుఁ డయ్యెన్. 217

క. అతనిసుతుండు భగీరథుఁ, డతితప మొనరించి కనియె నమృతాపాంగన్
సుతరంగన్ ముఖవనరుహ, రతభృంగన్ శివజటాగ్ర రంగన్ గంగన్. 218

వ. కని, నమస్కరించిన గంగ కృపచేసి, వరంబు వేఁడు మనిన, నా రాచపట్టి యి ట్లనియె. 219

క. మావారి భస్మరాసుల, నీ వారిం గలిపికొనుము నెఱి మావారల్
నీ వారిఁ గలయ నాకము, మా వారికిఁ గలుగు నిది ప్రమాణము తల్లీ! 220

ఇంద్రవజ్రము. చెల్లన్ మది న్నిన్ను భజింతు గంగన్
[4]ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగన్
గల్లోలలక్ష్మీ జితకాశమల్లిన్
దల్లిన్ సుధీ కల్పలతా మతల్లిన్. 221

వ. అని వినుతులు సేయుచున్న రాజకుమారునకు లోకపావని యి ట్లనియె. 222

మ. వినువీథిం బఱతెంచి నేలఁ బడ నా వేగంబును న్నిల్ప నో
పినవాఁ డెవ్వఁడు మేదినీతలము నే భేదించి పాతాళమున్
జనుదున్ వచ్చితినేని నా జలములన్ సంస్నాతు లై మానవుల్
ననుఁ బొందించు నఘవ్రజం బెచట నే నాశంబుఁ బొందించెదన్. 223

వ. అది కారణంబుగా విచారించెద. అని పలుకుచున్న లోకమాతకు రాజన్యవర్యుం డగు భగీరథుం డి ట్లనియె. 224

1. ముద్దుల (ట) 2. భూతలమున(తం.వా) 3. పరివృతుఁ డయ్యెన్(క.చ.బ.) 4. ఫుల్లత్తరంగన్(తం)

మ. †పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపఃపారీణు లార్యుల్ [1]ఘనుల్
పురుషశ్రేష్ఠులు వచ్చి తల్లి! భవదంభోగాహముల్ సేయఁగా
నరసంఘాఘము నిన్నుఁ బొందునె జగన్నాథుండు నానాఘసం
హరుఁ డా విష్ణుఁడు వారిచిత్తములఁ దా నై యుంట మందాకినీ! 225

మ. తనలో నిన్ని జగంబులుం గలుగుటం దా నిన్నిటం [2]గల్గుటన్
జననీ! తంతువులందుఁ జీర గల యా చందంబునన్ విశ్వభా
వనుఁ డై యొప్పు శివుండు గాక మఱి నీ వారి న్నివారింప నే
ర్చినవా రెవ్వరు నిన్ ధరించుకొఱకై శ్రీకంఠునిన్ గొల్చెదన్. 226

వ. అని యెఱింగించి, వీడ్కొని, చని, భగీరథుండు మహేశ్వరు నుద్దేశించి, గ్రద్దనఁ
దపంబుఁ జేసిన. 227

ఆ. భక్తవత్సలుండు ఫాలాక్షుఁ డా భగీ
రథుని మెచ్చి నిజశిరంబునందు
శౌరిపాదపూత సలిల యై దివినుండి
ధరకు వచ్చు గంగఁ దాల్చె నపుడు. 228

—: పరమేశ్వర జటాజూటనిర్గత గంగానదీ ప్రవాహ మహిమానువర్ణనము :—

వ. ఇట్లు మ్మహానది, పురారాతి జటాజూట రంధ్రంబువలన దిగంబడి, నిరర్గళ
ప్రవాహం బై, యిలకు జల్లించి, నెఱసి, నిండి, పెల్లు వెల్లిగొని, పెచ్చురేఁగి,
విచ్చలవిడిఁ గ్రేపువెంబడి నుఱుక క్రేళ్ళుఱుకు మఱకప్రాయంపుఁ గామధేనువు
చందంబున ముందఱికి నిగుడుచు, ముద్దుఁ జందురుతోడి నెయ్యంబునఁ గ్రయ్య
నడరి చొప్పుదప్పక సాఁగి చనుదెంచు సుధార్ణవంబుకై వడిఁ బెంపుగలిగి,
మహేశ్వరు వదనగహ్వరంబువలన నోంకారంబుపిఱుంద వెలువడు శబ్దబ్రహ్మంబు
భంగి నదభ్ర విభ్రమంబున న మ్మహీపాలతిలకంబు తెరువు వెంటనంటి వచ్చుచు,
వెలియేనుఁగు తొండంబుల ననుకరించి పఱచు వఱదమొగంబులును, వఱద
మొగంబుల పిఱుంద నందంద క్రందుకొని, పొడచూపి, తొలంగు బాలశారదా
కుచకుంభంబుల పగిది కగ్గలం బైన బుగ్గలును, బుగ్గలసంగడంబునం బారిజాత
కుసుమస్తబకంబుల చెలువంబునుం దెగడు వెలినురువులును, వెలినురువుల చెంగల
నర్ధోన్మీలిత కర్పూరతరు కిసలయంబుల చక్కందనంబుం గేలిగొను సుళ్ళును,
సుళ్ళకెలంకుల ధవళజలధర రేఖాకారంబుల బాగు మెచ్చని నిడుదయేఱులును,
నేఱులం గలసి వాయువశంబున నొండొంటిం దాఁకి బిట్టు మిట్టించి, మీఁది

† ఈపద్యము 'బ' ప్రతిలోలేదు. 1. మునుల్ (క. డ.) 2. జెందుటన్ (హ)

కెగయు దురితభంగంబు లైన భంగంబులును, భంగంబుల కొనల భిన్నభిన్నంబు లై కుప్పించి, యుప్పరం బెగసి, ముత్తియంపు సరుల వడువున, మల్లికా దామంబుల తెఱంగునఁ, గర్పూరఖండ కందంబంబుల చెలువంబున, నిందు శకలంబుల తేజంబునఁ, దారకానికరంబుల పొలుపున, మెఱయుచు, ముక్తికన్యా వశీకరంబు లైన శీకరంబులు నుం గలిగి, మధ్యమలోక శ్రీకరం బై, శ్రీకరంబు తెఱంగున విష్ణుపదంబు ముట్టి, విష్ణుపదంబు భాతి నుల్లసిత హంసరుచిరం బై, రుచిరపతంగంబురీతి నతిశోభిత కువలయం బై, కువలయంబుచెన్నున బహుజీవనం బై, జీవనంబులాగున సుమనో వికాస ప్రధానం బై, [1]ప్రధానపర్వంబుపొలుపున [2]నేక చక్ర బక భీమ మహాభంగ సుభద్రార్జున చరితాభిరామం బై, రామ చిత్తంబు మెలుపునం దనవారిలోఁ జొచ్చిన దోషాచరుల కభయప్రదాన చణం బై, ప్రదానచణ వర్తనంబు భాతి సముపాసిత మృత్యుంజయం బై, మృత్యుంజయు రూపంబు పోలిక విభూతి సుకుమారం బై, కుమారచరిత్రంబు ఠేవను క్రౌంచప్రముఖ విజయం బై, విజయురథంబు భాతి [3]హారిహయామంథరం బై, [4]మంథరవిచారంబు గ్రద్దన మహారామగిరి వనప్రవేశకామం బై, కామకేతనంబు పెల్లున నుద్దీపిత మకరం బై, మకరకేతను బాణంబు కైవడి నిలీన పరవాహినీ కలిత శంబరం బై, శంబరారాతి చిగురుఁగొంతంబుసూటి నధ్వగవేదనా శమనం బై, శమనదండంబుజాడ నిమ్నోన్నత సమవృత్తం బై, వృత్తశాస్త్రంబు విధంబున వడిఁగలిగి, సదా గురు లఘు వాక్యచ్ఛటా పరిగణితం బై, గణిత శాస్త్రంబుకొలందిని ఘన ఘనమూల వర్గమూల సంకలిత భిన్న [5]మిశ్ర ప్రకీర్ణ ఖాత భీష్మం బై, భీష్మపర్వంబు పెంపున ననేక భగవద్గీతం బై, గీతశాస్త్రంబు నిలుకడను మహాసుషిర తను ఘన నానాశబ్దం బై, శబ్దశాస్త్రంబుమర్యాద నచ్చు వడి హల్లు గలిగి, మహాభాష్య రూపావతారవృత్తి వృద్ధి గుణ [6]సమర్థం బై, యర్థశాస్త్రంబు మహిమను బహుప్రయోజన ప్రమాణ దృష్టాంతరం బై, దృష్టాంతరంబు తెఱంగున సర్వసామాన్య గుణవిశేషం బై, శేషవ్యాపారంబు కరణి సుస్థిరోద్ధరణ తత్పరం బై, పరబ్రహ్మంబుగరిమ నతిక్రాంతానేక నిగమం బై, నిగమంబునడవడి బ్రహ్మవర్ణ పద క్రమ సంగ్రహం బై, గ్రహశాస్త్రంబు పరిపాటిని కర్కట మీన మిథున మకరరాశి సుందరం బై, సుందరీముఖంబు పోఁడిమి నిర్మల చంద్రకాంతం బై, కాంతాధరంబురుచిని [7]శోణచ్ఛాయా విలాసం బై, విలాసవతి కొప్పుచొప్పునఁ [8]గృష్ణాలకాధికం బై, యధికమతి [9]శాస్త్రసంవాదంబుసొంపున నపార సరస్వతీ విజయవిభ్రమం బై, విభ్రమవతి

1. పర్వతంబు(హ) 2. ననేక(హ. తం) 3. హారిదయామందిరం బై (హ) 4. మందర(హ) 5. మిత్ర (హ) 6. సమృద్ధం బై (హ) 7. శోణిత (హ) 8. కృష్ణనాగాధిక(తం. వా.) 9. కుశల సంవాదంబు (తం)

చనుదోయిపగిది నిరంతర పయోవ్యాప్తాఖిలలోక జీవనప్రద తుంగభద్రాతిరేఖా సలలితం బై, లలితవతి నగవు మించున సపహాసిత చంద్రభాగధేయం బై, భాగధేయవంతుని వివాహంబులీల మహామేఖలాకన్యకా విస్తారం బై, తార కెంగేలి యొడికంబున [1]నాక్రాంతసూర్యతనయం బై, సూర్యతనయు శరవర్షంబుపోలిక భీమరథ్యాటోప వారణం బై, వారణంబు బిరుసునం బుష్కరోన్నత సంరంభం బై, రంభ [2]నెమ్మోముడాలున [3]సురసాతిశయ దశం బై, దశరథతనయు బోమ ముడిచాడ్పున సింధుగర్వ ప్రభంజనం బై, ప్రభంజనతనయు గదపెట్టు మాడ్కిని సమీపగత దుశ్శాసన దుర్మద నివారకం బై, వారకన్యక ముంజేతి గతిని ముహుర్ముహు రుచ్చలిత కంకణాలంకృతం బై, కృతయుగంబు నోజనపంకం బై, పంకజాసను ముఖంబు నొఱపునఁ బ్రభూత ముఖ్యవర్ణం బై, వర్ణగుణితంబు తెఱకువను బహుదీర్ఘ బిందువిసర్గం బై, సర్గబంధ కావ్యంబు విన్ననువున గంభీర భావ మధురం బై, మధురాపురంబు సొబగున మహానంద నందనం బై, నందన వనంబుపొందున విహారమాణ కౌశికం బై, కౌశికహయంబురీతి [4]నుదరధ్రువం బై, ధ్రువు తలంపుక్రియను [5]పరికీలిత విశ్వంభరం బై, విశ్వంభరుని శంఖంబు రూపున దక్షిణావర్తోత్తరం బై, యుత్తరా వివాహంబు చందంబునఁ బ్రముదిత [6]నరం బై, నరసింహ నఖరంబులభాతి నాశ్రిత ప్రహ్లాద గురువిభవ ప్రదానం బై, దానకాండంబు సిరిం గామధేను గల్పలతా ద్యభినవం బై, నవసూతికా కుచంబు పేర్మిని నిరంతర పయోవర్ధనం బై, ధనదు నిలయంబు తూనిక సంగత మకర మహాపద్మ కచ్ఛపం బై, కచ్ఛపకర్పరంబు బలిమిని పతిత శైలసముద్ధరణం బై, ధరణీధరంబుసాటి నుత్తుంగ తటముఖ్యం బై, ముఖ్యవరాహంబుగరిమ నున్నత క్షమం బై, క్షమాసురహస్తంబు గరగరికను సత్పవిత్ర మనోరామం బై, రామచంద్రు బాణంబు కడింది నభ్యాగత ఖర దూషణ [7]మదాపహారణ ముఖరం బై, ముఖర రామకుఠారంబురీతిని భూభృ[8]న్మూలభేదన ప్రబలం బై, బలరామ హలంబుభాతిని బ్రతికూల సన్నికర్షణ [9]ప్రబుద్ధం బై, బుద్ధదేవుని మేని యొఱపున నభియాతి[10]రక్షోదార మనోహారం బై, హారతాండవంబు మేర నుల్లసితానిమిషం బై, యనిమిషావతారంబు కీర్తిని శ్రుతిమంగళప్రదం బై, ప్రదాత యోఁగి సూటి నర్థపరంపరా వామనం బై, వామన చరణరేఖను బలివంశ వ్యపనయం బై, నయశాస్త్రంబు మార్గంబున సామ భేద మాయోపాయ

---

1. నతిక్రాంత (హ) 2. కెమ్మోవి (తం. చ.) 3. సురతనాతిశయ (హ) 4. సుదశధ్రువంబై (క. వా.); సుదర్శన ధ్రువంబై (తం) 5. పరిశీలిత (తం. వా. క. ట. జ.) 6. నలవరంబై (హ) 7. మదాపహార ముఖాభిరామంబై, రామ కుఠారంబు (పాఠాంతరము) 8. మూలచ్ఛేదన (తం. వా.) 9. ప్రవృద్ధంబై (హ) 10. వక్షోదార (హ)

చతురం బై, చతురాననాండంబు భావంబున నపరిమిత భువన జంతుజాల సేవ్యమానం బై, మానిని యన లోఁతు సూపక, గరిత యన [1]సడి చప్పుడు సేయక, ముగుద యన బయలుపడక, ప్రమద యనఁ గ్రయ్యం బాఱుచుఁ, బతివ్రత యన నిట్టట్టు సనక, తల్లి యన నెవ్వి యైన లోఁగొనుచు, దైవం బన భక్తమనోరథంబు లిచ్చుచు, నంతకంతకు విస్తరించి గుఱిగడచి, యవాఙ్మానస గోచరం బై ప్రవహించి 229

మ. జగతీనాథు రథంబు పజ్జ బహుదేశంబుల్ వడిం దాటి త
త్సగరక్ష్మాపకుమార భస్మములమీఁదన్ ముంచి పాఱన్ మరు
న్నగరావాసము వారు పొందిరి నవీన శ్రీలతో గంగనీ
రుగతిన్ గాక మహాదురంత సుజనద్రోహానలం బాఱునే. 230

మ. హరు [2]మెప్పించి మహాతపో నియతుఁ డై యాకాశగంగానదిన్
ధరకుం దెచ్చి నితాంత కీర్తిలతికా స్తంభంబుగా నవ్య సు
స్థిరలీలం బితృకృత్య మంతయు నొనర్చెన్ వారితానేక దు
స్తర వంశవ్యథుఁ డా భగీరథుఁడు నిత్యశ్రీకరుం డల్పుఁడే.  231

క. హరిఁ దమ మనమున లోనిడి, హరి పాదాంభోజజనిత మైన నదిన్ సు
స్థిరు లై గ్రుంకి మునీంద్రులు, హరిఁ గలసిరి త్రిగుణరహితు లై య వ్వేళన్.

వ. అంత నా భగీరథునకు శ్రుతుండును, శ్రుతునకు నాభావరుండును, నాభావరునకు సింధుద్వీపుండును, సింధుద్వీపునకు నయుతాయువును, అయుతాయువునకు ఋతుపర్ణుండును జనియించె. అతండు. 233

ఆ. నయవిశాలబుద్ధి నలచక్రవర్తితో
సంగడీనితనము చాలఁ జేసి
యక్షహృదయ మతని కక్ష్యస్తముగ నిచ్చి
యశ్వవిద్య నేర్చె నతనివలన. 234

వ. ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును, సర్వకామునకు మదయంతీవల్లభుం డైన సుదాసుండును బుట్టె. ఆ రాజశేఖరుని, మిత్రసహుండును, గల్మాషపాదుండు నని చెప్పుదురు. ఆ భూవరుండు వసిష్ఠుని శాపంబున రాక్షసుండై, తనకర్మంబున ననపత్యుం డయ్యె. అనిన విని పరీక్షిన్న రేంద్రుం, డేమికారణంబున సుదాసునకు గురుశాపంబు ప్రాప్తం బయ్యె, ననిన విని శుకుం డి ట్లనియె. 235

---

1. నలి (హ) 2. మెచ్చించి (ద) 3. అవ్యస్తముగ (హ. వా.)

సీ. ఆ సుదాసుఁడు వేఁటకై వనంబున కేఁగి గర్వించి యొక్కరక్కసునిఁ జంపి
వాని తోఁబుట్టినవానిఁ బోవిడిచిన వాఁడునుఁ దన[1]తోడివాని [2]మృతికి
నతిదుఃఖితుండు నై యా రాజగృహమున సూదభావంబున సొంపునొంది
యుండ వసిష్ఠున కుర్వీశుఁ డొక్కనాఁ డన్నంబు సేయంగ నతనిఁ బనుప

తే. వాఁడు మానవమాంసంబు వండి తెచ్చి
మునికి వడ్డింపఁ గోపించి ముని నరేంద్రు
బిల్చి మానవమాంసంబుఁ బెట్టితనుచు
నలుకతో రాక్షసుఁడవు గమ్మని శపించె. 236

వ. ఇట్లు శపియించి పదంపడి, రాక్షసుండు వండి తెచ్చుటయు, సుదాసుని యెఱుఁగమియుఁ దనమనంబున నెఱింగి, వసిష్ఠుండు పండ్రెండేండ్లు రక్కసుండ వై యుండు మని [3]నియమించె. అ య్యవసరంబున. 237

మ. గురువున్ మాఱుశపింతు నంచు జలముల్ గోపంబుతోఁ దోయిటన్
నరనాథుండు ధరింపఁ దత్సతి పతిన్ వారింప మిన్నున్ దిశల్
ధరయున్ జీవమయంబకా నిఖిలముం దాఁ జూచి చల్లెన్ ధరా
వరుఁ డాత్మీయపదంబులం గరపుటీ వాఃపూరమున్ [4]బొక్కుచున్. 238

వ. ఇట్లు మిత్రసహుండు గావునఁ గళత్రానుకూలుం డై శపియింప నొల్లక, సుదాసుండు రాక్షసభావంబు నొంది, కల్మాషవర్ణంబు అయిన పాదంబులతో నడవులం దిరుగుచు. 239

క. ఆఁకట [5]మలమల మాడుచు, వీఁక నతం డడవి నున్న విప్రమిథునమున్
దాఁకి తటాలున విప్రునిఁ, గూఁకటి చేఁబట్టి మ్రింగఁ గొనిపోవుతఱిన్. 240

వ. అంత నా బ్రాహ్మణుని భార్య మోఁదికొనుచుం బెగ్గడిల్లి, డగ్గుత్తికతోఁ బతికి నడ్డంబువచ్చి, యేడ్చుచు రాచరక్కసున కి ట్లనియె. 241

క. మానుషదేహము గలుగుట, భూనాయక ! దుర్లభంబు పుట్టినమీఁదన్
దానము పరోపకారము, భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్. 242

మ. రవివంశాగ్రణి వై సమస్తధరణీ రాజ్యానుసంధాయి వై
భువనస్తుత్యుఁడ వై పరార్థరతి వై పుణ్యానుకూలుండ వై
వివరం బేమియు లేక నా పెనిమిటిన్ విప్రున్ దపశ్శీలు స
త్ప్రవరుఙ్ బ్రహ్మవిదున్ [6]జగన్నుతగుణున్ భక్షింపఁగాఁ బాడియే. 243

---

1. తోటి (హా) 2. చావు, వోనీక కపటియై భూపాల గృహమున నడ బాలతనమున నర్థిఁ గొలిచి (తం. వా.) 3. శపియించె (హా) 4. మున్నుచున్ (హా) 5. మటమలు (హా) 6. జగద్భరణునిన్ (హా)

శా. తండ్రీ! మీకు దినేశవంశజులకున్ దైవం బగున్ బ్రాహ్మణుం
డం డ్రా మాటలు లేవె భూమిసుర గోహత్యాభిలాషంబు గై
కొం డ్రే మీయటువంటి సాధువులు రక్షోభావ మి ట్లేల మీ
తండ్రిన్ దాతలఁ బూర్వులన్ దలఁపవే ధర్మంబునం బోఁగదే. 244

శా. అన్నా! చెల్లెల నయ్యెదన్ విడువు నీ కన్నంబు వెట్టింతునా
హ్మణ్నాథున్ ద్విజు [1]గంగికుట్టి నకటా! హింసింప నేలయ్య! నీ
వెన్నం డింతులతోడఁ బుట్టవె నిజం బిట్లైన [2]మున్నుట్ట నా
పన్నన్ నన్ను శిరంబు ద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే. 245

క. అని కరుణ పుట్ట నాడుచు, వనితామణి పలవరింప వసుధాదేవుం
దినియె నతఁడు పులి పశువుం, దిను క్రియ శాపంబుకతన ధీ రహితుం డై. 246

వ. అంత నా బ్రాహ్మణి కోపించి, కామార్త నైన నాదు పెనిమిటిని భక్షించితివి గావున, నీవు నెలఁతలం బొందఁ జేరినవేళ మరణంబును బొందు మని, కల్మాష పాదుని శపించి, పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబు సేసి సుగతికిం జనియె. అంత బండ్రెండేండ్లు సనిన నా రాజు మునిశాపవిముక్తుం డై. 247

ఆ. రతులకొఱకు భార్య రావింప నదియును
బెదరి విప్రసతి శపించు టెఱిఁగి
మగని నడ్డపెట్టి మైథునకర్మంబు
మాన్పె సతులగోష్ఠి మానె నతఁడు. 248

క. అది కారణముగఁ బుత్రా, భ్యుదయము లే దా సుదాస భూపాలునకున్
దదనుమతి న వ్వసిష్ఠుఁడు, మదయంతికిఁ గడుపు సేసె మదనక్రీడన్. 249

వ. ఇట్లు సుదాసుని భార్య యగు మదయంతి వసిష్ఠువలన గర్భిణి యై, యేడేండ్లు గర్భంబు ధరియించి, నీళ్ళాడ సంకటపడుచున్న, వసిష్ఠుండు వాఁడి యగు నశ్మమున నా గర్భంబుఁ జీరిన, నశ్మకుం డను కుమారుండు పుట్టె. అతనికి [1]మూల కుండు పుట్టె. అతండు. 250

క. వీరుఁ డగు పరశురాముఁడు, ఘోర కుఠారమున నృపులఁ గూలుచు[4]వేళన్
నారీజనములు దాఁచిన, నారీకవచుం డనంగ [5]నరనుతి కెక్కెన్. 251

---

1. ధర్మవర్తి నకటా (క. చ. జ. డ. ద.) 2. మున్నుట్ట (హ) 3. నారీకవచుండు (హ)
4. వేళ్ళన్ (హ) 5. నలి (తం. వా.)

వ. ఆ నారీకవచుండు నిర్మూలం బయిన రవివంశంబునకు మూలం బగుటం జేసి, మూలకుం డయ్యె. [1]మూలకునకు విశ్వసహుండు పుట్టె. విశ్వసహునకు ఖట్వాంగుండు పుట్టి చక్రవర్తి యయ్యె. అతండు. 252

సీ. అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి త్రిదశులతోఁ దన [2]బ్రదుకుకాల
మెంతని యడిగిన నిదె నిండుచున్నది తడవులే దేమైన నడుగు మనిన
వరములు గోరక వరవిమానం బెక్కి తనపురి కేతెంచి తత్త్వబుద్ధిఁ
బరమేశ్వరునియందు భావంబు గీలించి కులదైవత ద్విజకులము కంటె

తే. నంగనా ప్రాజ్య రాజ్య పుత్త్రాదు లెల్లఁ
గావు ప్రియములు ధర్మంబు గడచి నాదు
మతి ప్రవర్తింప దెన్నఁడు మది నెఱుంగ
నన్య మా యీశ్వరునిఁ దక్క ననుచు మఱియు. 253

మ. ఇలమీఁదం బ్రతుకేల వేల్పుల వరం బేలా ధనం బేల చం
చల గంధర్వపురీ విడంబనము లైశ్వర్యంబు లేలా జగం
బులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తై తుదిం బాసి ని
ర్మల మై వాఙ్మనసామితం బగు పరబ్రహ్మంబు నేఁ జెందెదన్. 254

వ. అని నిశ్చయించి. 255

మ. కలసెన్ [3]సంగము లెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగుఁ డ్రశాంత మై
[4]కల దయ్యున్ మఱి మీఁద లేదనెడి దై కల్యాణ మై [5]యాత్మలోఁ
దలఁపం బల్కఁగరాని దై పరమ మై తత్త్వజ్ఞు లూహించి హృ
జ్జలజాతంబుల వాసుదేవుఁ డని సంస్థాపించు నా బ్రహ్మమున్. 256

## అధ్యాయము - ౧౦

వ. అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు, దీర్ఘబాహునకు రఘువు, రఘునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండును బుట్టిరి. ఆ దశరథునకు సురప్రార్థితుండై పరబ్రహ్మమయుం డైన హరి నాల్గువిధంబు లై, శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్ననామంబుల నిజాంశ సంభూతుం డై జన్మించె. తచ్చరితంబు వాల్మీకిప్రముఖు లైన మునులచేత వర్ణింతం బైనది. ఐనం జెప్పెద. సావధానమనస్కుఁడ వై యాకర్ణింపుము. 257

---

1. మూలకునకు దశరథుండను కుమారుండు పుట్టె. ఆతనికి నైబలుండుపుట్టె. అతనికి విశ్వసహుండు (చ) 2. దెగెడు(హ) 3. సంఘము (హ) 4. కలిగిం దై మరి పైన లేదనెడి దై (హ) 5. సన్నుతిం (హ)

## —: శ్రీరామ చరిత్రము :—

మ. అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుం డైనట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధ రావణ శిరస్సంఘాత సంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డా గరితకుం గౌసల్యకుం సన్నుతా
సమ నైర్మల్య కతుల్య కంచిత జను స్సంసార సాఫల్యకున్. 258

మ. సవరక్షార్థము దండ్రి వంపఁ జని విశ్వామిత్రుడుం దోడ రా
నవలీలం దునుమాడె రాముఁ డదయుం డై బాలుఁ డై కుంతల
చ్ఛవి సంప జ్జిత హాటకన్ గపట భాషా విస్ఫుర న్నాటకన్
జవభి న్నార్యమ ఘోటకన్ గర విరాజ త్ఖేటకన్ దాటకన్. 259

క. గా రామునఁ గౌశికమఖ, మా రాముఁడు గాచి దైత్యు నధికు సుబాహుం
ఘోరాజిఁ ద్రుంచి తోలెను, మారీచు న్నీచుఁ గపట మంజుల రోచుం. 260

మ. ఒక మున్నాఁడు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షు చాపంబు బా
లకరీంద్రంబు సులీల మై చెఱకుఁ గోలం ద్రుంచుచందంబునం
సకలోర్వీశులు సూడఁగా విఱిచె దోశ్శక్తిం విదేహక్షమా
పక గేహంబున సీతకై గుణమణి ప్రస్ఫీతకై లీలతోన్. 261

క. భూతలనాథుఁడు రాముఁడు, ప్రీతుం డై పెండ్లియాడె పృథుగుణమణి సం
ఘాతం భోగ్యోపేతం, సీతం ముఖకాంతి విజిత సితఖద్యోతం. 262

క. రాముఁడు నిజబాహుబల, స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో
ద్దాముం విదళీకృత నృప, భామం రణరంగభీము భార్గవరామున్. 263

క. దశరథుఁడు మున్ను కైకకు, వశుఁ డై తా నిచ్చినట్టి వరముకతన వా
గ్దశ చెడక యడవి కనిచెను, [1]దశముఖ ముఖకమల తుహినధాముం రామున్.

క. జనకుఁడు పనిచిన మేలని, జనకజయును లక్ష్మణుండు సంసేవింపం
జనపతి రాముఁడు విడిచెను, జనపాలారాధ్య ద్విష దసాధ్య నయోధ్యన్. 265

క. భరతుం నిజపదసేవా, నిరతుం రాజ్యమున నునిచి నృపమణి యెక్కెం
సురుచిర రుచి పరిభావిత, గురు గోత్రాచలముఁ జిత్రకూటాచలమున్. 266

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసోత్తమ శరణ్యము నుద్దత బర్హిబర్హ లా
వణ్యము గౌతమీ విమల వాః కణ పర్యటన ప్రభూత సా
ద్గుణ్యము నుల్లస త్తరు నికుంజ వరేణ్యము నగ్రగణ్యమున్. 267

---

1. దశముఖ (హ)

సీ. ఆ వనంబున రాముఁ డనుజ సమేతుఁ డై సతితోడ నొక పర్ణశాల నుండ
రావణు చెల్లెలు రతిఁగోరి వచ్చిన మొగి లక్ష్మణుఁడు దాని ముక్కుఁగోయ
నది విని ఖరదూషణాదులు పదునాల్గు [1]వేవురు రా రామవిభుఁడు కలన
బాణానలంబున భస్మంబు గావింప జనకనందన మేని చక్కఁదనము

తే. విని దశగ్రీవు డంగజవివశుఁ డగుచు
నర్థిఁ బంచినఁ బసిఁడిఱ్ఱి యై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱి వధించె
నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు. 268

ఉ. ఆ యసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న
న్యాయము సేసి నిష్కరుణుఁ డై కొనిపోవఁగ నడ్డమైన ఘో
రాయతహేతిఁ ద్రుంచె నసహాయత రామనరేంద్ర కార్య ద
త్తాయువుఁ బక్షవేగ పరిహాసిత వాయువు న జ్జటాయువున్. 269

వ. అంత నా రామచంద్రుండు లక్ష్మణసహితుం డై, సీత వెదక నరుదెంచి, నిజ కార్య [2]నిహితుం డైన జటాయువునకుం బరలోకక్రియలు గావించి, ఋశ్య మూకంబునకుం జని. 270

క. నిగ్రహము నీకు వల దీఁక, నగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో
నగ్రేసరుగా నేలెను, సుగ్రీవున్ చరణఘాత చూర్ణగ్రావున్. 271

క. లీలన్ రామవిభుం డొక, కోలన్ గూలంగ నేసె గురు నయశాలిన్
శీలిన్ సేవితశూలిన్, మాలిన్ వాలిం దశాస్యమానోన్మూలిన్. 272

క. ఇలమీఁద సీత వెదకఁగ, నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి
చ్ఛలవంతున్ మతిమంతున్, బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్. 273

క. [3]అలవాటు కలిమి మారుతి, లలితామిత లాఘవమున లంఘించెను శై
వలినీగణ సంబంధిన్, జలపూరిత ధరణిగగన సంధిన్, గంధిన్. 274

వ. ఇట్లు సముద్రంబు దాఁటి, సీతం గని, హనుమంతుండు దిరిగి చనుదెంచుచు, నక్షకుమారాదుల వధియించి. 275

క. సమదగ్రత ననిలసుతుం, డమరాహిత దత్త వాల హస్తాగ్నుల భ
స్మము సేసె నిరాతంకన్, సమదాసుర సుభట విగత శంకన్, లంకన్. 276

---

1. వేలువచ్చిన రామ (తం. వా.) 2. సహితుం డై న (హ)
3. అలవాయిగొనక (హ) అళువాయి గలిగి (ప్రా. ప్ర.)

వ. ఇట్లు లంకాదహనంబు సేసి వచ్చి, వాయుజుండు సీతాకథనంబు సెప్పిన విని, రామచంద్రుండు రావణుని సాధింప వనచరనాథ యూథంబులుం, దానునుఁ జని చని. 277

శా. ఆ రాజేంద్రుఁడు గాంచె భూరి విధ రత్నాగారమున్ మీన కుం
భీర [1]గ్రాహ కఠోరమున్ విపుల గంభీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్య విభిన్న భంగ భవ నిర్ఘోష చ్ఛటాంభఃకణ
ప్రారుద్ధాంబర పారమున్ లవణ పారావారమున్ జేరువన్. 278

వ. కని, తనకుఁ ద్రోవ యిమ్మని వేఁడిన, నదియు మార్గంబు సూపక మిన్నందిన, నా రాచపట్టి రెట్టించిన కోపంబున. 279

క. మెల్లని నగవున నయనము, లల్లార్చి శరంబు విల్లు నందినమాత్రం
గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ, బెల్లలు నై జలధి పెద్ద బీడై యుండెన్. 280

వ. ఇట్లు విపన్నుం డగు సముద్రుండు నదులతో మూర్తిమంతుం డై చనుదెంచి, రామచంద్రుని చరణంబులు శరణంబు చొచ్చి, యి ట్లని స్తుతియించె. 281

శా. ఓ కాకుత్స్థ కులేశ! యో గుణనిధీ! యో దీనమందార! నే
నీ కోపంబున కెంతవాఁడ [2]జడధిన్ నీ వేమి [3]భూరాజవే
లోకాధీశుఁడ వాదినాయకుఁడ వీ లోకంబు లెల్లప్పుడున్
నీకుక్షిన్ బ్రభవించుచుండు నడఁగు న్నిక్కంబు సర్వాత్మకా! 282

క. ధాతల రజమున దేవ, వ్రాతము సత్త్వమున భూతరాశి దమమునన్
[4]జాతులుగా నొనరించు గు, ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా! 283

క. కట్టుము సేతువు లంకన్, జుట్టుము నీ బాణశిఖల సురవైరి తలల్
గొట్టుము నేలం బడఁ జే, పట్టుము నీ యబల నధిక [5]భాగ్యప్రబలన్. 284

ఆ. హరికి మామ నగుదు నటమీఁద శ్రీదేవి
తండ్రి నూర కేల తాగడింపఁ
గట్టఁ గట్టి దాఁటు కమలాప్తకులనాథ!
నీ యశోలతలకు నెలవుగాఁగ. 285

వ. అని విన్నవించిన, రామచంద్రుండు సముద్రునిం బూర్వప్రకారంబున నుండు పొమ్మని వీడు కొల్పె. అంత. 286

---

1. గంభీరంబు (హ) 2. జడుఁడన్ (హ) 3. భూపుండవే (హ) 4. జ్ఞాతులుగా (హ)
5. ప్రభలన్ (హ)

క. ఘనశైలంబులుఁ దరువులు, ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్
ఘన వనరాశిం గట్టిరి, ఘనవాహప్రముఖ దివిజగణము నుతింపన్. 287

వ. ఇట్లు సముద్రంబు దాఁటి, రామచంద్రుండు రావణుతమ్ముండైన విభీషణుండు శరణంబు వేఁడిన, నభయం బిచ్చి, కూడుకొని లంకకుం జని, విడిసి, [1]వేఁడె వెట్టించి, లగ్గలు పట్టించిన. 288

సీ. ప్రాకారములు [1]ద్రవ్వి పరిఘలు [2]పూడిచి కోటకొమ్మలు నేలఁ గూలఁద్రోచి
వప్రంబు లగలించి వాకిళ్ళు పెకలించి తలుపులు విఱిచి యంత్రములు చెఱిచి
ఘన విటంకంబులు ఖండించి గోపురంబులు విప్పి వలభుల పొందు చెఱిచి
మకరతోరణములు మహిఁ గూల్చి కేతనంబులు సించి సోపానములు గదల్చి

ఆ. గృహము లెల్ల వ్రచ్చి గృహరాజముల గ్రొచ్చి
భర్మ కుంభచయము పాఱవైచి
కరులు కొలను సొచ్చి కలఁచినక్రైవడి
కపులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు. 289

వ. అంత న య్యసురేంద్రుండు వంచినఁ గుంభ నికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష సురాంతక నరాంతక దుర్ముఖ ప్రహస్త మహాకాయ ప్రముఖు లగు దనుజ వీరులు, శర శరాసన తోమర గదా ఖడ్గ శూల భిండివాల పరశు పట్టిస ప్రాస ముసలాది సాధనంబులు ధరియించి, మాతంగ తురంగ స్యందన సందోహంబుతో బవరంబు సేయ, సుగ్రీవ పవనతనయ పనస గజ గవయ గంధమాదన నీలాంగద కుముద జాంబవదాదు లా రక్కసుల నెక్కటికయ్యంబులందుఁ దరుల గిరుల కరాఘాతంబుల నుక్కడంచి, త్రుంచిరి. అంత. 290

క. ఆయెడ లక్ష్మణుఁ డుజ్జ్వల, సాయకములఁ ద్రుంచె శైలసమకాయు సురా
జేయు ననర్గళ మాయో, పాయు నయగుణవిధేయు న య్యతికాయున్. 291

ఆ. రామచంద్రవిభుఁడు రణమున ఖండించె
మేటికడిమి నీలమేఘ కర్ణు
బాహుశక్తిపూర్ణుఁ బటుసింహనాద సం
కుచిత దిగిభకర్ణుఁ గుంభకర్ణు. 292

క. అలవున లక్ష్మణుఁ డాజి, స్థలిఁ గూల్చెన్ [3]మేఘనాదుఁ జటులాహ్లాదున్
బలభేదిజయ వినోదున్, బల జనిత సుపర్వ సుభట భావ విషాదున్. 293

---

1. వెడవెట్టించి (హ) 2. నిండించి (హ) 3. మేఘనాథు (హ. తం.)

వ. అంత. 294

క. తనవా రందఱు మ్రగ్గిన, ననిమిషపతి వైరి పుష్పకారూఢుం డై
యనికి నడచి రామునితో, ఘన రౌద్రముతోడ నంపకయ్యము సేసెన్. 295

వ. అ య్యవసరంబున. 296

క. సురపతి పంపున మాతలి, గురుతర మగు దివ్యరథము గొనివచ్చిన నా
ధరణీవల్లభుఁ డెక్కెను, ఖరకరుఁ డుదయాద్రి నెక్కు కై వడితోఁపన్. 297

వ. ఇట్లు దివ్యరథారూఢుం డై, రామచంద్రుండు రావణున కి ట్లనియె. 298

మ. చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో
కపట బ్రాహ్మణమూర్తి వై యబల నా కాంతారమధ్యంబునన్
దపలాపించుటయో మదీయ శిత దివ్యామోఘ బాణాగ్ని సం
తపనం బేగతి నోర్చువాఁడవు దురంతం బెంతయున్ రావణా! 299

క. నీ చేసిన పాపములకు, నీచాత్మక! యముఁడు వలదు నేఁ డిట నా నా
రాచములఁ [1]ద్రుంచి వై చెద, ఖేచర భూచరులుఁ గూడి క్రీడన్ జూడన్. 300

వ. అని పలికి. 301

మ. బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండ భీమంబుగాఁ
బ్రళయోగ్రానల సన్నిభం బగు మహాబాణంబు సంధించి రా
జలలాముం డగు రాముఁ డేసె ఖర భాషాశ్రావణున్ దేవతా
బల విద్రావణు వైరిదారజన గర్భస్రావణున్ రావణున్. 302

క. దశరథ సూనుం డేసిన, విశిఖము హృదయంబు దూఱ [2]వివశుం డగుచున్
దశకంధరుండు గూలెను, దశవదనంబులను రక్తధారలు దొరఁగన్. 303

వ. అంత నా రావణుండు దెగుట విని. 304

సీ. కొప్పులు బిగి వీడి కుసుమమాలికలతో నంసభాగంబుల నావరింప
సేస ముత్యంబులు చెదరఁ గర్ణిక లూడఁ గంఠహారంబులు గ్రందుకొనఁగ
వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ గన్నీళ్ళు వఱద లంగములు దడుప
సన్నపు నడుములు జవ్వాడఁ బాలిండ్ల బరువులు నడుమలఁ బ్రబ్బికొనఁగ

ఆ. నెత్తి మోఁదికొనుచు నెఱిఁ బయ్యెదలు జాఱ
నట్టు నిట్టు తప్పు టడుగు లిడుచు
నసుర సతులు వచ్చి రట భూత బేతాళ
సదనమునకు ఘోరకదనమునకు. 305

---

1. నాజ్ఞచేసెద (క. చ. బ.) 2. వివశదశుండై (తం)

వ. ఇట్లు వచ్చి, తమతమ నాథులం గని, శోకించిరి. అందు. మందోదరి రావణుం జూచి, యి ట్లనియె. 306

ఉ. హా దనుజేంద్ర! హా సురగణాంతక! హా హృదయేశ! నిర్జరేం
ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రుని కోలల కోర్వలేక సో
న్మాదమునన్ రఘుప్రవరు మానిని నేటికిఁ దెచ్చి [1]తప్పు డేఁ
గాదని చెప్పినన్ వినక కాలవశంబునుఁ బొంది తక్కటా! 307

ఆ. ఎండ గాయ వెఱచు నినుఁడు వెన్నెలఁ గాయ
వెఱచు విధుఁడు గాలి వీవ వెఱచు
లంకమీఁద నిట్టి లంకాపురికి మాకు
నధిప! విధవభావ మడరె నేఁడు. 308

క. దురితముఁ దలఁపరు గానరు, జరుగుదు రెట కైన నిమిష సౌఖ్యంబులకై
పరవనితాసక్తులకునుఁ, బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే. 309

వ. అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపు వడసి, రావణునకు దహ నాది క్రియలు గావించె. అంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేఁగి, శింశుపా తరు సమీపంబునందు. 310

శా. దైతేయ ప్రమదా పరీత నతిభీతన్ గ్రంథి బంధాలక
వ్రాతన్ నిశ్వసనానిలాశ్రుకణ జీవం జీవ దారామ భూ
జాతన్ శుష్క కపోలకీలిత కరాబ్జాతన్ బ్రభూతన్ గృశీ
భూతన్ బ్రాణసమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డా ముందటన్. 311

వ. కని రామచంద్రుండును దాపంబు నొంది, భార్యవలన దోషంబు లేకుండుట వహ్నివలనం బ్రకటంబు నేసి, దేవతల పంపున దేవిం జేకొని. 312

ఉ. శోషిత దానవుండు నృపసోముఁడు రాముఁడు రాజసేంద్రతా
శేష విభూతిఁ గల్పసమజీవివి గమ్మని నిల్పె నర్థి సం
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వ దరోషణున్ మితా
భాషణు నార్యతోషణుఁ గృపాగుణ భూషణు న విభీషణున్. 313

వ. ఇట్లు విభీషణ సంస్థాపనుం డై రామచంద్రుండు సీతాలక్ష్మణ సమేతుం డై, సుగ్రీవ హనుమదాదులం గూడికొని, పుష్పకారూఢుం డై, వేల్పులు గురియు పువ్వుల సోనలం దడియుచుఁ, దొల్లి వచ్చిన తెరువు జాడలు సీతకు నెఱిం గించుచు, మరలి నందిగ్రామంబునకు వచ్చె. అ య్యవసరంబున. 314

---

1. తప్పుడున్ (హ)

ఆ. రామచంద్రవిభుని రాక వీనుల విని
భరతుఁ డుత్సహించి పాదుకలను
మోచికొనుచు [1]వచ్చి ముదముతోఁ బురజను
[2]లెల్లఁ గొలువ నన్న కెదురు వచ్చె. 315

వ. వచ్చి, పాదుకలు ముందట నిడికొని, యెడనెడ సాష్టాంగ దండప్రణామంబులు సేయుచు, మెల్ల మెల్లన డాసి, రామచంద్రుని పాదంబులు నొసలం గదియించి, తచ్చరణ రేణువులు దుడిచి, శిరంబునం జల్లికొని, తనివిలేక మఱియు, న ప్పద కమలంబు [3]లక్కున మోపికొనుచు, సంతసంపుఁ గన్నీటం గడిగి, సేమంబు లరయుచుండె. అంత సీతాలక్ష్మణ సహితుం డై, విభుండును, దనకెదురు వచ్చిన బ్రాహ్మణ జనంబులకు నమస్కరించి, తక్కిన వారలచేత మన్ననలు వొంది, వారల మన్నించె. అ య్యవసరంబున, 316

చ. నృపవర ! పెక్కు నాళ్ళగొలె [4]నిన్ గనకుండిన యట్టి నేఁడు మా
తపములు పండె నిందఱము ధన్యుల మైతి మటంచుఁ బుట్టముల్
చపలతఁ ద్రిప్పి పువ్వుల వసంతము లాడుచుఁ బాడుచున్ గత
త్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁ బండుగ సేసి రెల్లెడన్. 317

సీ. కవగూడి యిరుదెసఁ గపిరాజు రాక్షస రాజు నొక్కెడఁ జామరములు వీవ
హనుమంతుఁ డతి ధవళాతపత్రము వట్టఁ [5]బాదుకల్ భరతుండు భక్తిఁ దేర
శత్రుఘ్నుఁ డమ్ములు చాపంబుఁ గొనిరాఁగ సౌమిత్రి భృత్యుఁ డై చనువుసూప
జలపాత్ర చేపట్టి జనకజఁ గూడిరాఁ గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ

ఆ. బసిఁడి [6]వేడె మర్థి భల్లూకపతి మోచి
కొలువఁ బుష్పకంబు వెలయ నెక్కి
గ్రహము లెల్లఁ [7]గొలువఁ గడునొప్పు సంపూర్ణ
చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె. 318

వ. ఇట్లు పుష్పకారూఢుండై, కపిబలంబులు చేరి కొలువ, రామచంద్రుం డయో ధ్యకుం జనియె. అంతకుమున్న య ప్పురంబునందు. 319

---

1. తూర్యములుమ్రోయఁ బురజనుల్ (చ. ద.) 2. గొల్చుచుండ నన్న కెదురువచ్చె (హ)
3. అక్కునఁ జెక్కున నొత్తి కొనుచు (తం) 4. నిన్నుఁ గనుంగొనఁ గల్గెనేఁడు (తం)
5. బావాలు (తం) 6. గద్దెపెద్ద (హ) జోడుబట్టి (చ. త. జ.) 7. వెలయ (హ)

సీ. వీథులు [1]నున్నఁ గావించి తోయంబులుసల్లి రంభా స్తంభచయము నిలిపి
పట్టుచీరెలు సుట్టి బహుతోరణంబులు గలువడంబులు మేలుకట్లు గట్టి
వేదిక లలికించి వివిధ రత్నంబుల ముగ్గులు పలుచందములుగఁ బెట్టి
కలయ గోడల రామకథ లెల్ల వ్రాయించి ప్రాసాదములు దేవభవనములును

తే. గోపురంబుల బంగారు కుండ లెత్తి
యెల్ల వాకిండ్లఁ గానుక లేర్పరించి
జనులు కైసేసి తూర్యఘోషములతోడ
నెదురు నడతెంచి రా రాఘవేంద్రు కడకు. 320

క. సమదగజ దానధారల, దుమదుమ లై యున్న పెద్దత్రోవలతోడన్
రమణీయ మయ్యె న ప్పురి, రమణుఁడు వచ్చినఁ గరంగు రమణియ పోలెన్. 321

ఆ. రామభూవరేంద్రు రాకఁ దూర్యములతో
రథ గజాశ్వ సుభట రాజితోడ
నమరెఁ బురము, చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు
జంతు భంగ మిళిత జలధి భంగి. 322

వ. ఇ ట్లొప్పుచున్న య ప్పురంబు ప్రవేశించి, రాజమార్గంబున రామచంద్రుం డరుగుచున్న సమయంబున. 323

మ. ఇతఁడే రామనరేంద్రుఁ డీ యబల కా యింద్రారి ఖండించె న
ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివరుం డా పొంతవాఁడే మరు
త్సుతుఁ డాచెంగట నా విభీషణుఁ డటంచుం జేతులం జూపుచున్
సతులెల్లం బరికించి చూచిరి పురీ సౌధాగ్ర భాగంబులన్. 324

వ. ఇట్లు సమస్త జనులు సూచుచుండ రామచంద్రుండు రాజమార్గంబునం జనిచని.

సీ. పటికంపు గోడలు పవడంపు వాకిండ్లు నీలంపు టరుఁగులు నెఱయఁ గలిగి
కమనీయ వైడూర్యక స్తంభ చయముల [2]మకరతోరణముల మహిత మగుచుఁ
బడగల మాణిక్యబద్ధ చేలంబులఁ జిగురు తోరణములఁ జెలువుమీఱి
పుష్పదామకముల [3]భూరి వాసనలను బహుతర ధూపదీపముల మెఱసి

తే. మూఱువేల్పుల భంగిని మలయుచున్న
సతులు పురుషులు నెప్పుడు సందడింప
గుఱుతు లిడరాని ధనముల కుప్పలున్న
రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు. 326

---

1. నక్క (హా. వా.) 2. మరకత భూముల (వ్రా.ప్ర.) 3. భూరివాసనముల (తం)

వ. ఇట్లు వచ్చి. 327

ఉ. తల్లుల కెల్ల మ్రొక్కి తమతల్లికి వందన మాచరించి య
ల్లల్ల బుధాళికిన్ వినతుఁ డై, చెలికాండ్రను దమ్ములం బ్రసం
పుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁ డోలిఁ గృపారసంబు రం
జిల్లఁగఁ జాల మన్ననలు సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్. 328

వ. తత్సమయంబునఁ దల్లులు. 329

చ. కొడుకులుఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నెత్తి చేతులన్
బుడుకుచు మోమునం దలలు భోరన ముద్దులు గొంచు నవ్వుచున్
దొడలకు వారి రాఁదిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్
వెడలిన ప్రాణముల్ దగఁ బ్రవిష్టము లయ్యె నటంచు నుబ్బుచున్. 330

వ. అంత వసిష్ఠుండు, శ్రీరామచంద్రుని జటాబంధంబు విడిపించి, కులవృద్ధులుం, దానును సమంత్రకంబుగ దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతి చందంబున, సముద్ర నదీజలంబుల నభిషేకంబు సేయించె. రఘువరుండును, సీతాసమేతుం డై, జలంబు లాడి, మంచి పుట్టంబులు గట్టికొని, కమ్మని పువ్వులు దుఱిమి, సుగంధంబు లలందికొని, తొడవులు దొడిగికొని, తనకు భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి, యతని మన్నించి, కౌసల్యకుఁ బ్రియంబు సేయుచు, జగత్ప్రాజ్యంబుగ రాజ్యంబు సేయుచుండె. అప్పుడు. 331

సీ. కలఁగు టెల్లను మానెఁ గంధు లేడింటికిఁ జలనంబు మానె భూచక్రమునకు
జాగరూకత మానె జలజలోచనునకు దీనభావము మానె దిక్పతులకు
మాసియుండుట మానె మార్తాండ విధులకుఁ గావిరి మానె [1]దిక్తటములకును
నుడిగిపోవుట మానె నుర్వీరుహంబుల కణఁగుట మానెఁ ద్రేతాగ్నులకును

ఆ. గడిఁది వ్రేఁగు మానెఁ గరి గిరి కిటి నాగ
కమఠములకుఁ బ్రజల కలఁక మానె
రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు
ధరణి భరణరేఖఁ దాల్చు నపుడు. 332

వ. మఱియును. 333

సీ. పొలఁతుల వాలుఁజూపుల యందు చాంచల్య మబలల నడుములయంద లేమి
కాంతాలకములంద కౌటిల్యసంచార మతివల నడుపులయంద జడిమ
ముగుదల పరిరంభములయంద పీడన మంగనాకుచములయంద పోరు
పడఁతుల రతులంద బంధ సద్భావంబు సతులఁ బాయుటయంద సంజ్వరంబు

---

1. దిగ్గగనములకు (హ)

తే. ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పు
లంద చౌర్యంబు వల్లభు లాత్మసతుల
నాఁగి క్రొమ్ముళ్ళు వట్టుటం దక్రమంబు
రామచంద్రుండు పాలించు రాజ్యమందు. 334

క. తండ్రిక్రియ రామచంద్రుఁడు, దండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపన్
దండ్రుల నందఱు మఱచిరి, తండ్రిగదా రామచంద్ర ధరణిపుఁ డనుచున్. 335

వ. మఱియు, నా రామచంద్రుండు రాజర్షి చరితుండును, నిజధర్మ నిరతుండును, నేకపత్నీ వ్రతుండును, సర్వలోక సమ్మతుండును నగుచు, ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లనుభవింపుచుఁ, ద్రేతాయుగం బైనఁ, గృతయుగధర్మంబు గావించుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుగకుండ రాజ్యంబు సేయుచుండె. అయ్యెడ. 336

ఆ. సిగ్గువడుట గల్గి సింగారమును గల్గి
భక్తి గల్గి చాల భయము గల్గి
నయముఁ బ్రియముఁ గల్గి నరనాథు చిత్తంబు
సీత దనకు వశము చేసికొనియె. 337

## అధ్యాయము-౧౧

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 338

ఆ. భ్రాతృజనులయందు బంధువులందును
బ్రజలయందు రాజభావ మొంది
[1]యెట్లు మెలఁగె రాముఁ డీశ్వరుం డగు తన్నుఁ
గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె. 339

వ. అనిన శుకుం డిట్లనియె. 340

సీ. భగవంతుఁ డగు రామభద్రుండు ప్రీతితో దేవోత్తముని సర్వదేవమయునిఁ
దనుఁదాన కూర్చి యధ్వరములు సేసెను హోతకుఁ దూరుపు నుత్తరంబు
సామగాయకునికి శమన దిగ్భాగంబు బ్రహ్మకుఁ గ్రమమునఁ బడమ రెల్ల
నధ్వర్యునకు శేష మాచార్యునకు నిచ్చి సొమ్ములు పంచి భూసురుల కొసఁగి

1. యెట్లు మెలఁగె రాఘవేశ్వరుం డీశ్వరుఁ గూర్చి క్రతువులేల (తం) రాఘవేశ్వరుం డెవ్వనిఁ గూర్చి క్రతువు లెట్లు (వా)

తే. [1]తనకు రెండు పుట్టంబులుఁ దనకు నైన
మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క
వినతుఁ డై యుండె నా రాము వితరణంబు
పాండవోత్తమ! యేమని పలుకవచ్చు. 341

వ. అంత నా రామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు తమతమ భూములు మరల నిచ్చి యి ట్లనిరి. 342

ఆ. ధరణి వలదు మాకుఁ దపసుల కేల నీ
వఖిల లోకగురుఁడ వైన హరివి
మా మనంబులందు మలయు చీఁకటిఁ బాపు
భవదుదార రుచులఁ పార్థివేంద్ర! 343

వ. అని పలికి, బ్రహ్మణ్యదేవుం డైన రామచంద్రుని వినయోక్తులఁ బూజించి, మునులు సనిరి. ఇట్లు పెద్దకాలంబు రాజ్యంబు సేసి, రాఘవేంద్రుం డొక్క దినంబున. 344

సీ. వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించు కొఱకు నై రాముండు గూఢవృత్తి
నడురేయిఁ దిరుగుచో నాగరజనులలో నొక్కఁడు దనసతి యొప్పకున్న
నొరు నింటఁ గాఁపురం బున్న చంచలురాలిఁ బాయంగలేక చేపట్టె [2]నేమి
తా వెఱ్ఱియగు రామ ధరణీశ్వరుండ నే బేల! పొమ్మను మాట బిట్టు వలుక

ఆ. నాలకించి మఱియు నా మాట చారుల
వలన జగములోనఁ గలుగఁ దెలిసి
సీత నిద్రవోవఁ జెప్పక వాల్మీకి
పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి. 345

వ. అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడి కొడుకులం గనియె. వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె. లక్ష్మణునకు నంగదుండును, చంద్రకేతుండును, భరతునకుఁ దక్షుండును, బుష్కలుండును, శత్రుఘ్ననకు సుబాహుండును, శ్రుతసేనుండును సంభవించిరి. అయ్యెడ. 346

క. బంధురబలుఁ డగు భరతుఁడు, గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధుఁ డగు నన్న కిచ్చెను, బంధువులును మాతృజనులుఁ బ్రజలున్ మెచ్చన్.

---

1. తనదు (హ) 2. నేని తా వెఱ్ఱినగు (హ)

ఆ. మధువనంబులోన మధునందనుం డగు
లవణుఁ జంపి భుజబలంబు మెఱసి
మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ
డన్న రామచంద్రుఁ డౌ ననంగ. 348

వ. అంతఁ గొంతకాలంబునకు రామచంద్రుని కొమారు లైన కుశలవు లిద్దఱును వాల్మీకివలన వేదాది విద్యలయందు నేర్పరు లై, పెక్కుసభలను [1]సతానంబుగా రాము కథాశ్లోకంబులు పాడుచు, నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని. 349

మత్తకోకిల. వట్టి మ్రాఁకులు పల్లవింప నవారి యై మధుధార దా
నుట్టఁ బాడిన వారి పాటకు నుర్వరాధిపుఁడుఁ బ్రజల్
బిట్టు సంతస మంది రయ్యెడఁ బ్రీతిఁ గన్నుల బాష్పముల్
దొట్ట నౌదల లూచి వారలతోడి మక్కువ పుట్టఁగాన్. 350

వ. అంత నా రామచంద్రుఁడు కుమారుల కి ట్లనియె. 351

ఆ. చిన్ని యన్నలార! శీతాంశుముఖులార!
నళినదళ విశాల నయనులార!
మధుర భాషులార! మహిమీఁద నెవ్వరు
దల్లి దండ్రి మీకు ధన్యులార! 352

వ. అనిన వారు, నేము వాల్మీకి [2]శిష్యులము. రాఘవేశ్వరుని యాగంబు సూడ వచ్చితిమి. అనవుడు, మెల్లన నగి, యెల్లి ప్రొద్దున మీ తండ్రి నెఱింగెదరు. ఉండుండు. అని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె. మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల ముందట నిడుకొని, వాల్మీకి వచ్చి, రఘుపుంగవునిం గని, యనేక ప్రకారంబుల స్తుతియించి యి ట్లనియె. 353

ఆ. [3]సీత శుద్ధురాలు చిత్త వాక్కర్మంబు
లందు సత్యమూర్తి యమలచరిత
పుణ్యసాధ్వి విడువఁబోలదు చేకొను
రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర! 354

---

1. సుతానకంబుగా (హ) 2. పౌత్రులము (హ); వాల్మీకి శిష్యులము సీతపుత్రులము (జ)
2. ముద్దరాలు (హ. తం.) సుద్దరాలు (వా)

వ. అని వాల్మీకి వలుక, రామచంద్రుండు పుత్రార్థి యై విచారింపఁ, గుశలవులను వాల్మీకికి నొప్పగించి, రామచంద్ర చరణధ్యానంబు సేయుచు, నిరాశ యై సీత భూవివరంబు సొచ్చె. అ య్యెడ. 355

మ. ముదితా! యేటికిఁ గ్రుంకి తీపు [1]మనలో మోహంబు చింతింపవే
వదనాంభోజము సూపవే మృదువు నీ వాక్యంబు విన్పింపవే
తుది సేయం [2]దగదంచు నీశ్వరుఁడు నై దుఃఖించె భూపాలుఁ డా
పద గాదే ప్రియురాలిఁ బాసినయెడన్ భావింప నె వ్వారికిన్. 356

వ. అని వగచి, రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి, [3]పదుమూఁడు వేల యేం డ్లెడతెగకుండ నగ్నిహోత్రంబులు సెల్లించి, తా నీశ్వరుండు గావునఁ దన మొదలి నెలవునకుం జనియె. ఇ వ్విధంబున. 357

ఆ. ఆది దేవుఁ డైన యా రామ చంద్రుని
కబ్ధిఁ గట్టు టెంత యసురకోటిఁ
జంపు టెంత కపుల సాహాయ్య మది యెంత
సురల కొఱకుఁ గ్రీడ చూపెఁ గాక. 358

చ. వశుఁడుగ మ్రొక్కెదన్ లవణవార్ధి విజృంభణతా నివర్తికిన్
దశ దిగధీశ మౌళిమణి దర్పణమండిత దివ్యకీర్తికిన్
దశశత భానుమూర్తికి సుధారుచి భాషికి సాధు పోషికిన్
దశరథరాజు పట్టికిని దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్. 359

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్
విల్లును దాల్చువాఁడు గడు విప్పగు వక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డీవుత మా కభీష్టముల్. 360

ఆ. † రామచంద్రుఁ గూడి రాకల పోకలఁ
గదిసి తిరుగువారుఁ గన్నవారు
నంటికొన్నవారు నా కోసలప్రజ
లరిగి రాదియోగు లరుగు గతికి. 361

క. మంతనములు సద్గతులకు, పొంతనములు ఘనము లైన [4]పుణ్యముల కిదా
నీంతన పూర్వ మహాఘ నికృంతనములు రామనామ కృతిచింతనముల్. 362

---

1. మదిలో (తం) 2. దగవచ్చు (హ) 3. పదునొకండు (హ) † 'బ' ప్రతిలో ఈ పద్యములేదు. 4. పుణ్యములకుఁ దా నింతనములు పూర్వాఘుని (హ)

అధ్యాయము - ౧౨

వ. ఆ రామచంద్రునకుఁ గుశుండునుఁ, గుశునకు నతిథి, యతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునికిఁ బుండరీకుండును, బుండరీకునకు క్షేమధన్వుండును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, బారియాత్రునకు బలుండును, బలునకుఁ జలుండును, జలునకు నర్కసంభవుం డగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియును, విధృతికి హిరణ్యానాభుండును, జయించిరి. ఆ హిరణ్యానాభుండు జైమిని శిష్యుం డైన యాజ్ఞవల్క్యామునివలన నధ్యాత్మయోగంబు నేర్చి, హృదయకలుషంబులంబాసి, యోగచర్యుం డయ్యె. అతనికిఁ బుష్యుండును, బుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుండును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరు వను రాజశ్రేష్ఠుండును బుట్టె. [1]ఆ రాజు యోగసిద్ధుం డై, కలాప గ్రామంబున నున్నవాఁడు. కలియుగాంతంబున నష్టం బయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱం బుట్టింపఁ గలవాఁడు మరువు. ఆ మరువునకు బ్రశుశ్రుకుండు, నా ప్రశుశ్రుకునకు సంధియు, నతనికి నమర్షణుం, డా యమర్షణునికి మహస్వంతుం, డా మహస్వంతునకు [2]విశ్వసాహ్యుండు, విశ్వసాహ్యునకు బృహద్బలుండు జనియించె. వాఁడు భారత యుద్ధంబున మీ తండ్రియగు నభిమన్యునిచేత హతుం డయ్యె. వినుము. 363

—: భవిష్య ద్రాజేతిహాస వర్ణనము :—

తే. పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలుఁ
దుదయుఁ గాఁగల రాజులఁ దోడుతోడ
నెఱుఁగఁ జెప్పితి [3]నీ వారి నింకమీఁదఁ
బుట్టఁ గలవారిఁ జెప్పెద భూవరేంద్ర! 364

వ. ఆ బృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణునకు నురుక్రియుండు, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును, బ్రతివ్యోమునకుఁ భానుండును, భానునకు [4]సహదేవుండును, సహదేవునకు బృహదశ్వుండును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును, బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరుదేవునకు [5]సుత

1. ఆ రాజ యోగి సిద్ధుం డై (హ. తం. వా.); "యో అసావాస్తే యోగసిద్ధః (12-6)"
2. విశ్వసాహి (హ) 3. నేవారి (హ) 4. దివాకా వాహినీపతిః సహదేవ స్తతః (12-10)
5. హతశుత్రః అని మూలము (12-11)

క్షత్రుండును, సుతక్షత్రునకు ఋక్షకుండును, ఋక్షకునకు నంతరిక్షుండును, నతనికి సుతపుండును, సుతపునకు నమిత్రజిత్తు, నతనికి బృహద్వాజియు, నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండును, ధనంజయునకు రణంజయుండును, రణంజయునకు సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధాదుండును, శుద్ధాదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తు, నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునకు ఋణకుండును, ఋణకునకు సురథుండును, సురథునకు సుమిత్రుండును బుట్టుదురు. సుమిత్రుని యనంతర కాలంబున సూర్యవంశంబు నశింపంగలదు. వీరలు బృహద్బలునినుండి క్రమంబునం బుట్టం గలవారలు. అని చెప్పి శుకుం డి ట్లనియె. 365

## అధ్యాయము-౧౩

సీ. ధన్యుఁ డా యిక్ష్వాకు తనయుఁడౌ నిమి యాగ మాచరింపఁగఁ గోరి యా వసిష్ఠు
నా ర్త్విజ్యమునకుఁ దా నర్థింపఁ గని యాతఁ డింద్రుని మఖము సేయింప నియ్యా
కొని నాఁడ మఱి వత్తుఁ [1]గొదవ లేదన వచ్చి సంసార మెంతయుఁ జంచలంబు
కాలయాపన మేల క్రతువు సేసెద నని యన్య ఋత్విక్కుల నతఁడు గూర్చి

తే. సేయ నింద్రుని యాగంబు చెల్లఁజేసి
గురుఁడు చనుదెంచి శిష్యుపైఁ గోపమెత్తి
యోరి నా వచ్చునందాఁక నుండ వనుచు
నతని దేహంబు పడుఁగాక యని శపించె. 366



వ. ఇట్లు వసిష్ఠుండు శపించిన, నిమియును, వసిష్ఠుని దేహంబు పడుఁగాక యని మరల శపించిన, న వ్వసిష్ఠుండు మిత్రావరుణుల వలనఁ గడపట నూర్వశికి జన్మించె. గురుశాపంబునఁ బ్రహ్మజ్ఞాని యైన నిమి, విగతదేహుం డైన, నతని దేహంబు మునీశ్వరులు గంధవస్తువులం బొదివి, దాఁచి, దొరకొన్న సత్రయాగంబు చెల్లించిరి. యాగంబు కడపటను దేవగణంబులు మెచ్చి వచ్చిన, వారలకు నిమి దేహంబు సూపి, బ్రతుకం జేయుం డనవుడు వారలు నిమి ప్రాణంబులు వచ్చుంగాక యని పలికిన, నిమి తన దేహంబు సొరనొల్లక యి ట్లనియె. 367

మ. అతి మోహాకులితంబు సాంద్ర మమతాహంకార మూలంబు సం
తత నానా సుఖదుఃఖ పీడిత మనిత్యం బిట్టి దేహంబు సం
కృతి నా కేటికి మీనజీవనము భంగిం భీతిబాహుళ్య మం
చితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశున్ మదిన్ గొల్చెదన్. 368

1. కొదవసేసెద వచ్చి (తం. వా)

వ. అని పలికిన నిమిమాటలు గ్రమ్మఱింప నేరక, శరీరులు గన్నులు దెఱచినప్పుడును, మూసినప్పుడును, నిమి గానవచ్చుంగాక యని పల్కి దేవతలు సనిరి. అంత. 369

ఆ. పెద్ద లైన మునులు పృథ్వీస్థలికి రాజు
లేమిఁ జూచి నిమి కళేబరంబు
తరువ నొకఁడు పుట్టెఁ దనయుండు వానిని
జనకుఁ డనుచుఁ బలికె జగము లెల్ల. 370

వ. మఱియు నతఁడు [1]విగతదేహుండు గావున, వైదేహుం డనియును, మథన జాతుండు గావున మిథిలుం డనియుం బరఁగె. అ మ్మిథిలుని చేత నిర్మితం బైనది గావున మిథిలానగరంబు నాఁబరఁగె; ఆ జనకునకు సుదావసుండును, సుదావసునకు నందివర్ధనుండును, నందివర్ధనునకు సుకేతుండును, సుకేతువునకు దేవరాతుండును, దేవరాతునకు బృహద్రథుండును పుట్టె. అతనికి [2]మహావీర్యుండును, నతనికి సుధృతియు, నతనికి ధృష్టకేతుండును, నతనికి హర్యశ్వుండు, నతనికి మరువు, నతనికిఁ బ్రతింధకుండును, నతనికిఁ గృతరయుండు, నతనికి దేవమీఢుండును, నతనికి విధృతుండును, నతనికి మహాధృతియు, నతనికిఁ గీర్తిరాతుండు, నతనికి మహారోముండు, నతనికి స్వర్ణరోముండును, నతనికి హ్రస్వరోముండును, నతనికి సీరధ్వజుండును బుట్టె. 371

ఆ. అతఁడు మఖముసేయ నవని దున్నింపంగ
లాంగలంబు కొనను లక్షణాంగి
సీత జాత యయ్యె సీరధ్వజుం డన
దానఁ జెప్పఁబడియె ధన్యుఁ డతఁడు. 372

వ. ఆ సీరధ్వజునకుఁ గుశధ్వజుండును, గుశధ్వజునకు ధర్మధ్వజుండును, ధర్మధ్వజునకు గృతధ్వజ, మితధ్వజు లను వారిద్దఱుఁ బుట్టిరి. అందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుఁ డుదయించె. అతండుఁ దన్నుఁ దా నెఱింగెడి విద్యయందు నేర్పరియయ్యె. మితధ్వజునకు ఖాండిక్యుండనువాఁడు జన్మించి, తండ్రివలన నెఱుకగలవాఁ డై, కర్మతత్త్వంబు నేర్చి, కేశిధ్వజునివలన భీతుండై యేఁగె. ఖాండిక్యునకు భానుమంతుండును, భానుమంతునకు శతద్యుమ్నుండును, శతద్యుమ్నునికి శుచియు, శుచికి సనద్వాజుండును, సనద్వాజునకు నూర్ధ్వకేతుండు, నూర్ధ్వకేతునకు నజుండును, నజునకుఁ గురుజిత్తుఁ, గురుజిత్తునకు నరిష్టనేమియు, నరిష్టనేమికి

---

1. విదేహజుండు గావున (వా); "సోఽభూ ద్వైదేహస్తు విదేహజః" (13-13)
2. "తస్య మహావీర్య స్సుధృతిపితా" (13-15)

శ్రుతాయువు, శ్రుతాయువునకుఁ బార్శ్వుండును, బార్శ్వునకుఁ జిత్రరథుండును, చిత్రరథునకు క్షేమాపియు, క్షేమాపికి హేమరథుండును, హేమరథునకు సత్యరథుండును, సత్యరథునకు నుపగురుండును, ఉపగురునకు నగ్నిదేవు ప్రసాదమున నుపగుర్వుండును, ఉపగుర్వునకు సావనుండును, సావనునకు సువర్చసుండును, గలిగె. అతఁడె సుభూషణుం డని వినంబడు. ఆ సుభూషణునకు జయుండును, జయునకు విజయుండును, విజయునకు ఋతుండును, ఋతునకు ననఘుండును, అనఘునకు వీతిహవ్యుండును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహుళాశ్వుం డును, బహుళాశ్వునకుఁ గృతియుఁ, గృతికి మహావశి యనువాఁడును జన్మించె. వీరలు మైథిలు లగు రాజు లని చెప్పంబడుదురు. యోగీశ్వర ప్రసాదంబున గృహస్థు లై యుండియు, బంధ విముక్తు లై, యాత్మజ్ఞానంబు గలిగి, నిరంతర బ్రహ్మానుసంధానంబు సేయుచు నుండుదు. అని పలికి, శుకయోగీంద్రుం డి ట్లనియె. 373

## అధ్యాయము - ౧౪

### —: చంద్రవంశ్యు లగు రాజుల యితిహాసము :—

ఆ. [1]చంద్రగౌర మైన చంద్రవంశమునందుఁ
జంద్రకీర్తితోడ జనిత మైన
యట్టి పుణ్యమతులు [2]నై ళాదిరాజుల
నింక వినుము మానవేంద్రచంద్ర! 374

సీ. ఒక వేయుతలలతో నుండు జగన్నాథు బొడ్డుఁ దమ్మిని బ్రహ్మ పుట్టె మొదల
నతనికి గుణముల నతనిఁ బోలిన దక్షుఁ డగు నత్రి సంజాతుఁ డయ్యె నత్రి
కడగంటి సూడ్కులఁ గలువలసంగడీఁ డుదయించె విప్రుల కోషధులకు
[3]నమరఁ దారాతతి కజుని పంపున నాథుఁ డై యుండి రాజసూయంబు సేసి

తే. మూఁడు లోకములను గెల్చి [4]మోఅకమునఁ
జని బృహస్పతి పెండ్లాముఁ జారుమూర్తిఁ
దార నిలుసొచ్చి కొనిపోయి తన్ను గురుఁడు
వేఁడు నందాఁక న య్యింతి విడువఁ డయ్యె. 375

వ. అంత వేల్పులతో రక్కసులకుఁ గయ్యం బయ్యె. బృహస్పతితోడి వైరంబునం జేసి, కావ్యుఁడు రాక్షసులతోఁ జేరికొని, చంద్రునిం జేపట్టి, సురాచార్యునిం

---

1. చంద్ర గౌరవమున (హ) 2. నైన రాజులనెల్ల (హ) 3. నంబుగర్భములకు (హ) 4. మోదమునను (హ)

బోఁదోలిన, హరుండు భూతగణసమేతుం డై, తన గురుపుత్రుం డైన బృహస్పతినిఁ జేపట్టె. దేవేంద్రుండును, సురగణంబులుం, దానును బృహస్పతికి నడ్డంబు వచ్చె. అ య్యవసరంబున బృహస్పతి భార్యానిమిత్తంబున రణంబు సురాసుర వినాశకరం బయ్యె. ఆలోన బృహస్పతి తండ్రి యగు నంగిరసుండు సెప్పిన విని, బ్రహ్మదేవుండు చంద్రునిం [1]గోపించి, గర్భిణి యైన తారను మరల నిప్పించినం జూచి, బృహస్పతి దాని కి ట్లనియె. 376

ఉ. సి గ్గొకయింత లేక వెలచేడియ భంగిని ధర్మకీర్తులన్
బొగ్గులు సేసి జారు శశిఁ బొంది కటా! కడుపేల [2]దెచ్చికొం
టెగ్గు దలంపఁగా వలదె యిప్పుడు గర్భము దించుకొమ్ము నిన్
బ్రగ్గఁగఁ జేసెదన్ జెనఁటి మానవతుల్ నినుఁ జూచి మెత్తురే. 377

వ. అని కోపించుచుండ, నా చెలువకుఁ బసిండిచాయ మేను గల కుఱ్ఱ పుట్టె. వానిం జూచి, మోహంబు చేసి, బృహస్పతి తనకొడు కనియునుం, జంద్రుండు దన కన్నవాఁ డనియును, జగడించిరి. అప్పుడు. 378

ఆ. వారి వాదు చూచి వారింపఁగా వచ్చి
యేర్పరింపలేక యెల్ల మునులు
నమర వరుల నడుగ నా వేడుకలకత్తె
యెఱుఁగుఁ గాని యితరు లెఱుఁగ రనిరి. 379

వ. ఆ పలుకులు విని, సిగ్గుపడియున్న తారకుఁ జిన్ని కొమరుం డి ట్లనియె. 380

క. ఇలువరున చెడఁగ బంధులు, దలవంపఁగ మగఁడు రోయఁ దల్లీ! కట్టా
వెలి నేలఁ[3]దన్నుఁ గంటివి, కలిగించినవాఁడు శీతకరుఁడో గురుఁడో. 381

వ. అని పలుకుచున్న కొడుకునకు మఱుమాట లాడనేరకున్న తార నేకాంతంబునఁ జీరి మంతనంబున బ్రహ్మ యి ట్లనియె. 382

మ. చెలువా! నీ యెలసిగ్గు వాపి, గురుఁడో శీతాంశుఁడో యెవ్వఁడో
లలితాకారుఁ గుమారుఁ గన్న యతఁ డేలా దాఁప నీ పాటు నీ
తలనే పుట్టెనె వెచ్చ నూర్పకుము కాంతల్ [4]కామినుల్ గారె మా
టల నిం దేమియుఁ [5]బోదు పో యొరులతోడం [6]జెప్ప విన్పింపవే. 383

వ. అని పలికిన బ్రహ్మకు నెదురు మాటాడ వెఱచి, మంతనంబున న య్యింతి, చంద్రునికిం గన్నదాన. అనవుఁడు నా బాలకునకు బుధుం డను పేరు పెట్టి, చంద్రున కిచ్చి, బ్రహ్మ సనియె. అంత. 384

---

1. తిట్టి(తం.క.చ.ట.త.) 2. చేసికొంటి(తం.క.) 3. నన్ను(తం.వా.) 4. కాముకల్(తం.వా.) 5. బోవదొండొరులతోడన్(తం) 6. జెప్పి (హ)

ఆ. బుద్ధిమంతుఁ డైన బుధుఁడు పుత్రుం డైన
మేను పెంచి రాజు మిన్నుముట్టె
బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి
మిన్ను ముట్ట కేల మిన్నకుండు. 385

వ. ఆ బుధునకుఁ దొల్లి చెప్పిన యిళాకన్యకవలనఁ బురూరవుండు పుట్టె. ఆ పురూరవునకుఁ గల శౌర్య సౌందర్య గాంభీర్యాది గుణంబులు నారదునివలన నింద్రసభలోన నూర్వశి విని, మిత్రావరుణుల శాపంబున మనుష్య స్త్రీరూపంబు దాల్చి, భూలోకంబునకు వచ్చి, పురూరవు ముందట నిలువంబడి. 386

తరల. సరసిజాతు మృగేంద్రమధ్యు విశాలవక్షు మహాభుజున్
సురుచిరానన చంద్రమండల శోభితున్ సుకుమారు నా
పురుషవర్యుఁ బురూరవుం గని, పువ్వుటంపర జోదు చేఁ
దొరఁగు క్రొవ్విరి తూపులన్ మదిఁ [1]దూలపోవఁగ భ్రాంత యై. 387

వ. ఊర్వశి నిలిచి యున్నంత. 388

ఉ. భావజు [2]కోలయో మొగులువాసి వెలుంగు మెఱుంగొ మోహినీ
దేవతయో నభోరమయొ దీని కరగ్రహణంబు లేనిచో
జీవన మేటి కంచు మరుచేఁ జిగురాకడిదమ్ము జిమ్ములం
దా వడఁకెన్ బురూరవుఁడు తామరపాకు జలంబు కైవడిన్. 389

వ. ఇట్లు రాచపట్టి చెలుకు వింటివాని దాడికి నోడి, యెట్టకేలకు సైరణచేసి నిలుకడం దెచ్చికొని, య చ్చెలువ కి ట్లనియె. 390

ఉ. ఎక్కడనుండి రాక మన కిద్దఱికిం దగు నీకుఁ దక్కితిన్
[3]మ్రుక్కడి వచ్చెనే యలరు ముల్కుల వాఁ డడిదంబు [4]ద్రిప్పుచే
దిక్కునెఱుంగ [5]నో యబల! దేహము దేహము గేలుఁ గేల నీ
చెక్కునఁ జెక్కు మోపి తగు చెయ్వుల నన్ను విపన్నుఁ గావవే. 391

వ. అనినం బ్రోడచేడియ యి ట్లనియె. 392

మ. ఇవి నా కూర్చు తగళ్లు రెండు దగ నీ వెల్లప్పుడున్ గాచెదే
ని వివస్త్రుండవు గాక [6]నాకడ సదా నీ వుండుదేనిన్ విశే
ష [7]విలాసాధిక! నీకు నా ఘృతము భక్ష్యం బయ్యె నేనిన్ మనో
జ వినోదంబుల నిన్నుఁ దేల్తు నగునే చంద్రాన్వయ గ్రామణీ! 393

---

1. దొందడించిన (తం. క. జ.) 2. దీమయో (తం. వా. క.) 3. ముక్కడి వచ్చెనో (హ) 4. ద్రిప్పనే (హ); ద్రిప్పెనే (తం) 5. నే (హ) 6. నాకడనుదా (హ); నాకడనుఁ దగన్ (వా); 7. వివేకగుణాలంకృత నీకు నామతము నిక్కంబయ్యె నేనిన్ (హ); లక్ష్యంబయ్యె నేనిన్ (చ)

వ. అని పల్కిన వేల్పుల వెలయాలి ప్రతిమాటల కియ్యకొని తన మనంబున. 394

క. మంచిదఁట రూపు [1]ననురతి, నంచిత యఁట దేవగణిక యఁట మరుచేతన్
సంచలిత [4]చిత్తనైయె కామించిన దఁట యింతకంటె మేలుం గలదే. 395

వ. అని నిశ్చయించుకొని. 396

ఆ. రాజు రాజముఖిని రతిఁదేల్చె బంగారు
మేడలందుఁ దరుల నీడలందుఁ
[3]దోఁటలందు రత్నకూటంబు లందును
గొలఁకులందు గిరుల కెలఁకులందు. 397

వ. అంత న య్యిద్దఱకుం దగులంబు నెలకొనిన. 398

క. [4]ఒకదిక్క యేగుదురు వా, రొకచోటన కాని నిలిచి యుండరు దమలో
[5]నొకటియె మనమున నెంచుదు, రొకనిమిషము పాయకుందు రువిదయుఁదానున్. 399

క. దయ్యు మెఱుంగును వారల, నెయ్యంబును మక్కువలును [6]నిజమరితనముల్
[7]వియ్యములును నెడసందినిఁ, బయ్యదకొం గడ్డమైనఁ బ్రాణము వెడలున్. 400

వ. ఇ ట్లూర్వశియుం, బురూరవుండు నొండొరులవలని మక్కువలు చెక్కులొత్తం, బగళ్ళు రేలు నెల్లెడల విహరింప, నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండు తఱిఁ గొలువున నూర్వశి లేకుండుటం జూచి. 401

క. ఇన్నిదినంబులోవలె నా, యున్న సభామధ్యవేది యూర్వశి లేమిన్
విన్నఁదనముతో నున్నది, వన్నె దఱిఁగియున్న పసిఁడివడువున ననుచున్. 402

వ. ఇంద్రుండు గంధర్వులం బనిచిన, వారు నడురేయిం జని, చీఁకటి నూర్వశి పెంచుకొన్న యేడకంబులం బట్టిన, నవి రెండును మొఱవెట్టిన, వాని మొఱ విని, రతి ఖిన్నుండై మేను మఱచి, కూరుకుచున్న పురూరవు కౌఁగిటనుండి యూర్వశి యి ట్లనియె. 403

మ. అదె నా బిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు ను
న్నదులై పోయెద రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై
కదలం డీ మగపంద కూరుకుగతిం గన్మూసి గుర్వెట్టుచున్
[9]వదలంజాలఁడు నాదు కౌఁగిలియుఁ దా వంధ్యాత్ముఁడై చెల్ల రే. 404

---

1. సంతతి (హ); ననుమతి (ద) 2. చిత్తు నన్తుఁ (హ) 3. డోలలందు రత్నశాలలందును దమ్మి 4. ఒక దిక్క కాని చనబో (తం.వా.) 5. నొకటియె కాని తలంపరు(క.త.డ.తం.వా.) 6. నిజగరితనముల్ (హ) 7. వియ్యముగలచో సందడిఁ (హ); తియ్యము లౌ నెడ సుందరి (క.జ.డ.) 8. లోమన, మున్న (హ) 9. ప్రిదులం జాలఁడు నాదు కౌఁగిలియు సంప్రీతాత్ముఁడై చెల్ల రే (చ. జ.) సంభీతాత్ముఁడై చెల్ల రే (తం)

క. పగతురు [1]దొంగల రేఁపఁగ, మగఁటిమి వాటింపలేక [2]మగతన మెల్లన్
మగువల కౌఁగిటఁ [3]జూపెడు, మగవాఁ డగుకంటె మగఁడు మగువగు టొప్పున్

ఆ. అధముఁ డైనవాని కాలగుకంటె న
త్యధికునింట దాసి యగుట మేలు
హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల
యువతిజనుల కూర కుంట లెస్స. 406

క. [4]పటికి నీ రాచరికం, బాఁటది మొఱవెట్టఁ బశువు లాతురపడ నో
యాఁట దని లేచి దొంగల, గీఁటవు వెడలంగ శవముక్రియ నుండె దిదే. 407

క. వినియు వినవు రణభీరువు, మనుజాధము నిదురబోతు మందుని నకటా!
నినుఁ జక్రవర్తిఁ జేసిన, వనజాసనుకంటె వెట్టివాఁడునుఁ గలఁడే. 408

వ. అని పెక్కుభంగుల న య్యింతి, [5]పరుషోక్తు లను కరవాలమ్ములు చెవులఁ జొనుప, నా రాజశేఖరుం డంకుశంబు పోట్ల [6]నదరు మదగజంబు చందంబున చీర మఱచి, దిగంబరుం డై, వాలు కేల నంకించి, నడురేయి దొంగల నఱికి వైచి, మేషంబుల విడిపించుకొని, తిరిగి వచ్చునెడ. 409

ఆ. చీఱలేని మగనిఁ జెలువ దా నీక్షించి
కన్నుమొఱఁగి పోవఁ [7]గడఁక నతఁడు
వెట్టివాని భంగి వివశుఁ డై పడి లేచి
పొగిలి తెఱలి స్రుక్కి పొక్కిపడియె. 410

వ. మఱియుఁ బురూరవుండు మదనాతురుం డై, వెతకుచు, సరస్వతీ తీరంబునఁ జెలికత్తెలతోఁ గూడియున్న యూర్వశిం గని, వికసితముఖుం డై యి ట్లనియె.

మ. తనుమధ్యా! యిది యేల వచ్చి తకటా ధర్మంబె శర్మంబె మున్
మనలో [8]నుంకువ లాడికొన్న పలుకుల్ మర్యాదలున్ దప్పెనే
నిను నే బాసినయంతనుండి తనువు న్నేలం బడన్ [9]బాఱె మే
దినిపై వ్రాలకమున్న నన్నుఁ గరుణాదృష్టిన్ విలోకింపవే. 412

వ. అనిన నూర్వశి యి ట్లనియె. 413

---

1. దొంగలనేఁపఁగ (తం. వా.) 2. మగతనమెడలన్ (తం) 3. నడఁగెడు (తం)
4. పటికి నీరాచరికము, బోటులు మొఱవెట్టఁ బశువు బోరని యరవన్
వేఁటల నీడ్చెడు దొంగల, గీఁటణఁపవు వెడలి శవము క్రియ నుండెడిదే (హ)
5. పరుసని పలుకులను కఱకు వాలమ్ముల (ట. తం. వా.) 6. నడంగు (హ) 7. కాళ్ళురాక (హ) 8. నుంకుగ (తం. వా) 9. బారె నన్, దిను నుగ్రంపు మృగాళి దీనిఁ (హ. వా)

క. మగువలకు నింత లోఁగెదు, మగవాఁడవె నీవు పశువుమాడ్కిన్ వగవం
దగవే మానుషపశువును, మృగములు గని రోయుఁగాక మేలని తినునే. 414

వ. అదియునుం గాక. 415

మ. తలఁపుల్ చిచ్చులు మాట లుజ్జ్వల సుధాధారల్ విభుం డైన పు
వ్విలుతుఁ [1]మెచ్చర [2]యన్యులన్ వలతురే విశ్వాసమున్ లేదు క్రూ
రలు [3]తోడుం బతి నైనఁ జంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాం డ్రెక్కడ వారి వేడబము లా వేదాంతసూక్తంబులే. 416

ఉ. ఇంక నొకండయేఁడు వోయిన నరేశ్వర! యాతలి రేయి నీవు నా
లంకెకువచ్చి యాత్మజుల లక్షణవంతులఁ గాంచె దేమియుఁ
గొంకక పొమ్ము నావుడును గొమ్మను గర్భిణిఁగాఁ దలంచుచున్
శంక యొకింత లేక నృపసత్తముఁ డల్లన పోయె వీటికిన్. 417

వ. ఇట్లు మరలి చని, తన పురంబున నొక్కయేఁ డుండి, పిదప నూర్వశి కడ కేఁగి, యొక్క రేయి పురూరవుం డయ్యింతికడ నున్న, నా వెలఁదియు గంధర్వుల వేఁడికొనుము. త న్నిచ్చెదరు. అనవుడు నతండు గంధర్వులను బ్రార్థించిన, వార లతండు పొగడుటకు మెచ్చి, యగ్నిస్థాలి నిచ్చిన, న య్యగ్నిస్థాలిని నూర్వ శింగాఁ దలంచుచు, దానితో నడవిం దిరుగుచుండి, యొక్కనాఁ డగ్నిస్థాలి యని యెఱింగి, వనంబున దిగవిడిచి, యింటికిఁ జనుదెంచి, నిత్యంబు రాత్రి దానిన చింతించుచుండఁ, ద్రేతాయుగంబు సొచ్చిన నా రాజు చిత్తంబునఁ గర్మ బోధంబు లై, వేదంబులు మూఁడు మార్గంబులం దోఁచిన, నా భూవరుండు స్థాలికడకుం జని, యందు శమీగర్భజాతం బైన యశ్వత్థంబుఁ జూచి, యశ్వత్థంబు చేత నరణులు రెండు గావించి, ముందటి యరణి దానును, వెనుకటియరణి నూర్వశియును, రెంటినడుమ నున్న కాష్ఠంబు పుత్రుండు నని, మంత్రంబు చెప్పుచుం ద్రచ్చుచుండ, జాతవేదుం డను నగ్ని సంభవించె. అతఁడు విహితా రాధన సంస్కారంబునం జేసి, యాహవనీయాది రూపంబుల మూఁట నెగడి, పురూరవుని పుత్రుం డని కల్పింపంబడియె. ఆ యగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబు నకుం బనుపం గారణం బగుటం జేసి. 418

క. ఆ యగ్నిచేఁ బురూరవుఁ, డా యజ్ఞేశ్వరు ననంతు హరి వేదమయున్
శ్రీయుతుఁ గూర్చి యజించె గుణాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడుకొఱకై

---

1. మెచ్చరు (హ) 2. యన్యులం దలఁతురే (హ) 3. పొత్తుం (హ)

ఉ. §ఒక్కఁడ వహ్ని వేల్పు పురుషోత్తముఁ డొక్కఁడ సర్వ వాఙ్మయం
బొక్కఁడ వేద మా ప్రణవ మొక్కఁడ వర్ణము తొల్లి త్రేతయం
దెక్కటి మాన్చి మూఁడుగను నేర్పఱిచెన్ దన బుద్ధిపెంపుచేఁ
జక్కఁగ నా పురూరవుఁ డశక్తులకున్ సులభంబు లౌ గతిన్. 420

అధ్యాయము - ౧౫

వ. ఇట్లు వేదవిభాగంబు గల్పించి, యాగంబు సేసి, పురూరవుం డూర్వశి యున్న గంధర్వలోకంబునకుం జనియె. అతనికి నూర్వశిగర్భంబున నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండు, జయుండు, విజయుం డన నార్గురు పుత్రులు గలిగిరి. అందు శ్రుతాయువునకు వసుమంతుండును, సత్యాయువునకు ద్రుతంజయుండును, రయునకు శ్రుతుండు, నేకుండు నన నిరువురును, గలిగిరి. జయునకు నమితుండును, విజయునకు భీముండును జనించిరి. ఆభీమునకుఁ గాంచనుండును, గాంచనునకు హోత్రకుండును, హోత్రకునకు గంగాప్రవాహంబు పుక్కిటం బట్టిన జహ్నుండును, జహ్నునకుఁ బూరుండును, బూరునకు బాలకుండును, బాలకునకు నజకుండును, నజకునకుఁ గుశుండును, గుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుం డన నలువురును సంభవించిరి. అందుఁ గుశాంబునికి గాధి యనువాఁడు గలిగె. ఆ గాధి రాజ్యంబు సేయుచుండ. 421

సీ. సత్యవతిని గాధిజాతను కన్యను విప్రుఁడు ఋచికుండు వేఁడికొనిన
గాధియు సుత కీడు గాఁడని తెల్లని నవకంపు మేనులు నల్లచెవులు
గల గుఱ్ఱములు వేయు కన్యకు నీ వుంకు విచ్చిన [1]గూఁతురు నిత్తు ననిన
వసుధామరుండును వరుణుని కడ కేఁగి హరులఁ దెచ్చినఁ గూఁతు నాతఁ డిచ్చె

ఆ. నా మహాత్మ్మ సతియు [2]నత్తయుఁ గొడుకులఁ
గోరి యడుగ నీయకొని యతండు
విప్రరాజ మంత్రవితతుల వేల్పించి
చరువుసేసి గ్రుంకఁ జనియె నదికి. 422

వ. అయ్యెడం దల్లి యడిగిన, సత్యవతి బ్రహ్మమంత్రంబుల వేల్పించిన చరువు దల్లి కిచ్చి, క్షాత్రమంత్రంబులం దల్లికి వేల్పించిన, చరువు దా నందుకొని యుండ, నా ముని సనుదెంచి, చరువు వీడ్వడుట యెఱింగి, భార్య కి ట్లనియె.

---

§ ఉ. ఒక్కటి వహ్ని వేల్వఁ బురుషోత్తము డొక్కఁడు వాఙ్మయంబులం
దొక్కటి వేద మా ప్రణవ మొక్కటి వర్ణముదొల్లిఁ ద్రేతయం
దొక్కటి చూచి మూఁడుగను దోరముగా నొనరించె బుద్ధిచేఁ
జక్కన నా పురూరవుఁ డశక్తులకున్ సులభంబు లెట్లగున్ (హ)

1. నే నిత్తుననిన (తం. వా.) 2. నంతయు (హ)

ఆ. తల్లిచరువు నీవు దాల్చి నీచరు వేల
తల్లిపాల నిడితి తరళనేత్ర!
కొమ్మ యింక నీకుఁ గ్రూరుఁడు వుట్టు మీ
యమ్మ బ్రహ్మవిదుని ననఘుఁ గాంచు. 424

వ. అనిన, న య్యింతి వెఱచి మ్రొక్కి, వినయంబు లాడినం బ్రసన్నుం డై, నీ కొడుకు సాధు వై, నీ మనుమండు క్రూరుం డగుం గాక యని, రుచికుం డనుగ్రహించిన, నా సత్యవతికి జమదగ్ని సంభవించె. ఆసత్యవతియునుం గౌశికీనది యై, లోకపావని యై ప్రవహించె. ఆ జమదగ్నియు రేణువుకూఁతురు రేణుకను వివాహం బై, వసుమనాది కుమారులం గనియె. అందు. 425

క. పురుషోత్తము నంశంబున, ధర జమదగ్నికి జనించె ధన్యుఁడు రాముం
డిరువదియొక మఱి నృపతుల, శిరములు జక్కడిచెఁ దనదు చే గొడ్డంటన్. 426

వ. అనిన విని, భూవరుండు శుకున కి ట్లనియె. 427

## —: పరశురాముని చరిత్ర :—

ఉ. ఏటికిఁ జంపె రాముఁ డవనీశులఁ బల్వుర వారియందుఁ [1]ద
ప్పేటిది విప్రుఁడయ్యు నతఁ డేటికి రాజస తామసంబులన్
వాటముఁ బొందె భూభరము వారిత మౌ టది యేవిధంబు నా
మాటకు మౌనిచంద్ర! మఱుమాట ప్రకాశముగాఁగఁ జెప్పవే. 428

వ, అనిన విని శుకుం డి ట్లనియె. 429

సీ. హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు
పురుషోత్తమాంశాంశుఁ బుణ్యు దత్తాత్రేయు నారాధనము సేసి యతనివలనఁ
బరిపంథిజయమును బాహుసహస్రంబు నణిమాది గుణములు యశము బలము
యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబు చెడని యింద్రియములు సిరియుఁ బడసి

తే. గాలికై వడి సకలలోకంబులందుఁ
దనకు [2]పోరాని రారాని [3]తలములేక
యెట్టిచో నైనఁ దనయాజ్ఞ యేపు మిగుల
ధరణి వెలుగొందె వినువీథిఁ దరణిమాడ్కి. 430

---

1. తప్పేమిటి (హ); తప్పేటికి (వా) 2. పోరామి రారామి (హ) 3. తావు (ట.వా.)

మ. ఒకనాఁ డా మనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁ డై వీట నుం
డక రేవానది కేఁగి యందుఁ దెలినీటన్ జల్లుఁ బోరాడి దీ
ర్ఘ కరాబ్జంబుల నా నదీజలములన్ గట్టెన్ వడి న్నీరు ప్రో
లకుఁ బెల్లుబ్బి రణాగతుం డయిన యా లంకేశుపైఁ [1]దొట్టఁగన్. 431

వ. ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుం డా రాజు [2]చేకట్టం దొట్టిన యేటినీటికి సహింపక, రోషంబునం బోటరియుఁ బోలె న మ్మేటిమగనితోడి పోరాటము నకుం దొడరినఁ, బాటింపక తన బాహుపాటవంబున. 432

క. వీఁక మెయి నతఁడు రావణు, కూఁకటు లగలించి పట్టికొని మోఁకాళ్ళం
దాఁకించి కోఁతికై వడి, నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్. 433

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబున కేతెంచి. 434

క. ఆ రాజేంద్రుఁడు రావణు, నోరీ! యిటమీఁద నూరకుండుము జగతిన్
[3]వీరుఁడ ననకుము కాచితిఁ, బోరా యని సిగ్గుపఱిచి పుచ్చెను మరలన్. 435

వ. అంత. 436

సీ. ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున వేఁటకై కాంతారవీథి కేఁగి
తిరిగి [4]వేఁటల శ్రాంతదేహుఁ డై జమదగ్నిమునియాశ్రమముఁ జేరి మ్రొక్కి నిలువ
నా మునీంద్రుఁడు రాజు నర్థితోఁ [5]బూజించి యా రాజునకు రాజు ననుచరులకుఁ
దన హోమధేనువుఁ దడయక రప్పించి యిష్టాన్నములు గురియింపఁ దడవఁ

తే. గుడిచి కూర్చుండి మొదవుపైఁ గోర్కిఁ జేసి
[6]సంప దేటికి నీ యావు చాలుఁగాక
యిట్టి గోవుల నెన్నఁడు నెఱుఁగ మనుచుఁ
బట్టి తెండని తనయొద్ది భటులఁ బనిచె. 437

వ. పంచిన వారలు దర్పంబునం జని. 438

క. క్రేపుం బాపకుఁ డంచును, [7]నాపదలం బడితి ననుచు నంభా యంచున్
జూపోపరు నృపు లంచును, వాపోవన్ మొదవుఁ గొంచు వచ్చిరి పురికిన్. 439

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబునకు వచ్చునెడ, రాముం డాశ్రమంబున కేతెంచి. 440

---

1. గొట్టఁగన్ (హా) 2. చెంగటం (హా) 3. వీరుఁడవని నిముఁ గాచితి (హా) 4. ఆకట (క.బ.); అటల (వా) 5. దీవించి (క.త.డ.) 6. సంపదయదేల (తం. వా.) 7. హాపీడం బడితిమనుచు (తం.)

ఆ. అద్దిరయ్య యింట నశనంబుఁ గుడిచి మా
యయ్య వల దనంగ నాక్రమించి
[1]కోరి మొదవు రాజు గొనిపోయినాఁ డఁట
యేను రాముఁ డౌట యెఱుఁగఁ డొక్కొ. 441

వ. అని పలికి. 442

మ. ప్రళయాగ్నిచ్ఛట భంగిఁ గుంభి విదళింపన్ బాలు సింహాకృతిన్
బెలుచన్ రాముఁ డిలేశు వెంట నడచెన్ బృథ్వీతలం బెల్ల నా
కులమైఁ గ్రుంగఁ గుఠారి యై కవచి యై కోదండి యై కాండి యై
ఛలి యై సాహసి యై మృగాజిన మనోజ్ఞ శ్రోణి యై తూణి యై. 443

వ. చని మాహిష్మతీపురంబుఁ జేరి నిలుచున్న సమయంబున. 444

మ. కని యెన్ ముందటఁ గార్తవీర్యుఁడు సమిత్కాముం బ్రకాముం శరా
సనతూణీర కుఠారభీము నతిరోష ప్రోచ్ఛలత్ భ్రూయుగా
నన నేత్రాంచల సీము నైణపట నానామాలికోద్దాము నూ
తన సంరంభ నరేంద్ర దార శుభసూత్రక్షామునిన్ రామునిన్ 445

వ. కని కోపించి. 446

ఉ. బాలుఁడు వెట్టి బ్రాహ్మణుఁడు బ్రాహ్మణు కై వడి నుంటమాని భూ
పాలురతోడ భూరిబల భవ్యులతోడ భయంబుఁ దక్కి క
య్యాలకు వచ్చినాఁడు మనయం దిఁకఁ బాపము లేదు లెండు లెం
డేల సహింప భూసురునినేయుఁడు వ్రేయుఁడు గూల్పుఁ డిమ్మహిన్. 447

వ. అని కదలించి, దండనాయకులం బురికొల్పిన, వారును రథగజతురగపదాతిసమూహంబులతో లెక్కకుం బదియే డక్షౌహిణులతో నెదుర నడచి, శరచక్రగదా ఖడ్గ భిండివాల శూల ప్రముఖ సాధనంబుల నొప్పించిన, న వ్విప్రుండు గన్నులకొలుకుల నిప్పులు కుప్పలుగొన రెట్టించిన కట్టల్క మిట్టిపడి, యజ్ఞోపవీతంబు చక్కనిడికొని,కరాళించి, బిట్టు [2]దట్టించి, కఠోరం బగు కుఠారంబు సారించి,మూఁకలపై కుఱికి, [3]తొలియాడిమొగంబునం [4]గ్రొచ్చెలికపట్టునం జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగునఁ బదంబులు ద్రెంచుచు, నరఁటికంబంబులఁ దెగనడుచు నారామకారుని పగిది మధ్యంబులఁ ద్రుంచుచుఁ, దాళఫలంబులు రాల్చు వృక్షారోహకునికై వడి శిరంబులఁ ద్రుంచుచు, మృగంబుల [5]వండం దుండించు సూపకారునిభంగి నవయవం

1. క్రొవ్వి (తం. వా.) 2. రెట్టించి (హ) 3. తొలకరి (తం. వా.) 4. నెట్టంగ (హ)
5. మృగముల ఖండించు (హ)

బులఁ జెక్కుచు, సంతతం దనివి సనక, విలయకాల కీలికేళిని మంట లుమియుచు, విల్లంది యెల్లెడం బిడుగులసోనలు గురియు బలు మొగుళ్ళవడువున నప్రమాణంబు లగు బాణంబులు పఱపి, సుభటసైన్యంబుల దైన్యంబు నొందించుచు, నడ్డంబులు లేని యార్భాటంబులు గల బాణవర్ష ఘృతంబులచే రాహుతులం గోపానలం బున కాహుతులు సేయుచుఁ, దురంగంబుల నిరంగంబులఁ గావించుచు, రథంబుల [1]వితథంబులుగా నొనర్చుచు, ద్విరదంబుల నరదంబులపైఁ బడఁద్రోయుచు, ని వ్విధంబున సేనల నంపవానల ముంచి, రూపు[2]మాపిన. 448

క. మత్తిల్లి భూతజాలము, చిత్తంబులఁ జొక్కి వేడ్క చిందులువాఱన్
జొత్తిల్లి సమిత్తలమున, నెత్తురు మేదంబు పలలనికరం బయ్యెన్. 449

వ. అ య్యవసరంబున. 450

క. మే లీ బ్రాహ్మణుఁ డొక్కఁడు, [3]నేలం బడఁగూల్చె సైన్యనిచయము నెల్లన్
బాలార్ప నేల యీతనిఁ, దూలించెదఁగాక నాదు దోర్బలమువడిన్. 451

వ. అని పలికి. 452

మ. ఒక యేనూఱు కరంబులన్ ధనువు [4]లత్యుల్లాసి యై తాల్చి వే
ఱొక యేనూట గుణధ్వనుల్ నిగుడ శాతోగ్రాస్త్రముల్ గూర్చి వి
ప్రకుఠారంబును నిన్నుఁ గూల్తు ననుచున్ భర్జించి పుంఖానుపుం
ఖ కఠోరంబుగ [5]నేసె రాజు [6]రయరేఖా ధాముని న్రామునిన్. 453

క. వడిఁ దూపు [7]లేయ గుడుసులు, పడి కార్ముక పంచశతము పరఁగ విభుఁడు సొం
పడరెఁ బరివేషచయముల, నడుమ ఖరద్యుతుల వెలయు నళినాప్తు క్రియన్.

వ. ఇ ట్లర్జునుండు [8]బాణవిలాసంబు సూపిన. 455

మ. ధరణీదేవుఁడు రాముఁ డాఢ్యుఁడు జగ ద్ధానుష్క రత్నంబు దు
ష్కరచాపం బొక కెక్కువెట్టి శరమున్ సంధించి పెల్లేసి భూ
వరు కోదండము లొక్క[9]చూడ్కిఁ దునిమెన్ వా డంతటం బోక వే
తరువుల్ ఱువ్వఁ గుఠారధార నఱకెన్ దద్బాహు సందోహమున్. 456

క. కరములు దునిసిన నతనికి, శిర మొక్కటి చిక్క శైలశిఖరముభంగిం
బరశువున నదియుఁ ద్రుంచెను, బరసూదనుఁ డైన ఘనుఁడు భార్గవుఁడు వడిన్.

---

1. శ్లథంబులుగా (తం. వా.) 2. మానిన (హ) 3. నేలంగూలించె (హ)
4. లత్యుగ్రాకృతిన్ (ట) 5. నేసియార్చె (హ) 6. జయ (తం) 7. లెగయ (హ)
8. బహు (హ) 9. మాటు (తం)

ఆ. తండ్రి వడిన నతని తనయులు పదివేలు
దలఁగి పోయి రతనిఁ దాఁకలేక
పర భయంకరుండు భార్గవుం డంత నా
గోవుఁ గ్రేపుతోడఁ గొనుచుఁ జనియె. 458

వ. ఇట్లు హోమధేనువు మరలం దెచ్చి యిచ్చి తన పరాక్రమంబుఁ దండ్రికిం దోఁబుట్టు
వులకుఁ దెలియఁజెప్పిన, జమదగ్ని రామున కిట్లనియె. 459

క. కల వేల్పు లెల్లఁ దమతమ, చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదు రకటా!
బలువేల్పు రాజు వానిం, జలమున నిట్లేల పోయి చంపితి పుత్రా! 460

క. తాలిమి మనకును ధర్మము, తాలిమి మూలంబు [1]ధర్మ తత్త్వంబునకున్
దాలిమి గల దని యీశుం, డేలించును బ్రహ్మపదము నెల్లన్ మనలన్. 461

క. క్షమ గలిగిన సిరి గలుగును, క్షమ గలిగిన వాణి గలుగు సౌఖ్యము లెల్లన్
క్షమగలుగఁ దోన కలుగును, క్షమ కలిగిన మెచ్చు శౌరి సదయుఁడు తండ్రీ!

క. పట్టపురాజును జంపుట, గట్టలుకన్ విప్రుఁ జంపు కంటెను పాపం
బ ట్టిట్టనకుము నీ వీ, చెట్ట సెడన్ దీర్థసేవ సేయుము తనయా! 463

## అధ్యాయము - ౧౬

క. అని తన్నుఁ దండ్రి పనిచినఁ, బనిపూని ప్రసాద మనుచు భార్గవుఁడు రయం
బున నొకయేఁడు ప్రయాణము, చని తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా!

ఉ. ఆయెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం
బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమపిండుతోఁ
దోయవిహారియుల్ సలుపు దుర్లభుఁ జిత్రరథున్ సరోజమా
లాయుతుఁ జూచుచుండెఁ బతియాజ్ఞఁ దలంపక కొంత ప్రేమతోన్. 465

వ. ఇట్లు గంధర్వవల్లభునిం జూచు కారణంబునఁ దడసి. 466

ఉ. అక్కట! వచ్చి పెద్దతడ వయ్యెడి హోమమువేళ దప్పె నే
నిక్కడ నేల [2]యుండితి మునీశ్వరుఁ డేమనునో యటంచుఁ దా
గ్రక్కునఁ దోయకుంభము శిరస్థలమం దిడి తెచ్చి యిచ్చి వే
మ్రొక్కి కరంబుమోడ్చి పతి ముందట నల్లన [3]నిల్వఁ జూచుచున్. 467

1. మనకు ధన్యత్వమునకున్(హ) 2. యుంటి ముని యేమనునోయని భీతచిత్తయై (తం. వా.)
3. నిల్చె నల్కుచున్ (తం. వా.)

వ. అప్పుడు. 468

క. చిత్తమున భార్య దడసిన, వృత్తాంతం బెఱిఁగి తపసి వేగమ సుతులన్
మత్తం దీనిం జావఁగ, మొత్తుం డన మొత్త రైరి మునుకుచు వారల్. 469

క. [1]కడుకొని పెండ్లముఁ జంపని, కొడుకులఁ బెండ్లాముఁ జంప గురు [2]డానతి యీ
నడుగులకు నెఱిఁగి రాముం, డడు గిడకుండంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్. 470

శా. తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపు మనుచోఁ దాఁ జంపి రాకున్న బెం
పెల్లన్ బోవ శపించుఁ దండ్రి దన పం పేఁ జేయుదున్ మెచ్చి నా
తల్లిన్ భ్రాతల నిచ్చు నిక్కము తపోధన్యాత్మకుం డంచు వే
తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు లేదా చంపఁ జేయాడునే. 471

వ. ఇవ్విధంబున. 472

క. అడ్డము చెప్పక కడపటి, బిడ్డఁడు రాముండు సుతులఁ బెండ్లము నచటన్
గొడ్డంటం దెగ నడిచిన, జడ్డనఁ దలయూఁచి మెచ్చె జమదగ్ని మదిన్. 473

క. మెచ్చిన తండ్రినిఁ గనుఁగొని, చెచ్చెర నీ పడినవారి జీవంబులు నీ
విచ్చితి నను మని మ్రొక్కిన, నిచ్చెన్ వారలును లేచి రెప్పటి భంగిన్. 474

ఆ. పడినవారి మరల బ్రతికింప నోపును
జనకుఁ డనుచుఁ జంపె [3]జామదగ్న్యుఁ
డతఁడు సంపె ననుచు నన్నలఁ దల్లిని
జనకు నాజ్ఞ నైనఁ జంపఁ దగదు. 475

వ. అంత. 476

సీ. పరశురామున కోడి పరుగులు వెట్టిన యర్జున పుత్రకు లాత్మయందుఁ
దండ్రి మ్రగ్గుటకు సంతప్తులై పొగులుచు నింతట నంతట నెడరు వేచి
తిరిగి యాడుచు నొక్క దివసమం దా రాముఁ డడవి కన్నలతోడ నరుగఁ బిదపఁ
బగ దీర్పఁ దఱి యని పఱతెంచి హోమాలయంబున సర్వేశు నాత్మ నిలిపి

తే. నిరుపమ ధ్యాన సుఖవృత్తి నిలిచి యున్న
పుణ్యు జమదగ్ని నందఱుఁ బొదివి పట్టి
కుదుల కుండఁగఁ దలఁ ద్రెంచి కొనుచు జనిరి
యడ్డ మేతెంచి రేణుక యడిచికొనఁగ. 477

వ. మఱియును. 478

1. కొడుకులు పెండ్లముఁ జంపమి (తం. వా.) 2. ఁడొనఁగినఁదా (హ) 3. జామదగ్ని యతడు (హ)

మ. జనకుం జంపిన [1]వైర మేమఱక రాజన్యాత్మజుల్ నేఁడు మీ
జనకుం జంపిరి రామ! రామ! రిపులన్ శాసింతు రమ్మంచు న
మ్మునిపై [2]వ్రాలి లతాంగి [3]మోఁదికొనియెన్ ముయ్యేడుమాఱుల్ రయం
బున రాముం డరుదెంచి యెన్నికొన నాపూర్ణాపదాక్రాంత యై. 479

వ. ఇట్లప్పుడు దల్లి మొఱ విని, జమదగ్ని కుమారులు వచ్చి, యిట్లని విలపించిరి.

క. వాకిలి వెడలవు కొడుకులు, రాకుండఁగ నట్టి నీవు రాజసుతులచేఁ
జీకాకు నొంది పోవఁగ, నీ కాళ్ళెట్లాడెఁ దండ్రి! నిర్జరపురికిన్. 481

వ. అని విలపించుచున్న యన్నలం జూచి రాముం డిట్లనియె. 482

ఉ. ఏడువనేల తండ్రితను వేమఱకుండుఁడు తోడులార! [4]నే
నూ డొగిఁ దీర్తునంచుఁ బరశు ద్యుతి భీముఁడు రాముఁ డుగ్రుఁ డై
యోడక యర్జునాత్మభవు లున్న పురంబున కేఁగి [5]వారు గో
డాడఁగఁ బట్టి చంపె వడి నర్జునజాతుల బ్రహ్మఘాతులన్. 483

క. ఖండించి రిపుల శిరములు, గొండలుగాఁ బ్రోగులిడియె గురు రక్తనదుల్
నిండికొని [6]పాఱి యుబ్బెను, భండనమున నృపులు రిపులు భయమంద నృపా!

వ. మఱియు నంతటఁ బోక. 485

ఆ. అయ్య పగకు రాముఁ డలయక రాజుల
నిరువదొక్క [7]మాఱు లరసి చంపె
జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ
నూడు దీర్పలేని సుతుఁడు సుతుఁడె. 486

వ. మఱియు నారాముండు శమంతకపంచకంబున రాజరక్తంబులం దొమ్మిది మడుఁగులు గావించి, తండ్రి శిరంబుఁ దెచ్చి, శరీరంబుతో సంధించి, సర్వదేవమయుం డగు దేవుండు తాన కావునఁ దన్ను నుద్దేశించి, యాగంబు చేసి, హోతకుం దూర్పును, నధ్వర్యునకుఁ బడమటి దిక్కును, నుద్గాతున కుత్తర దిశయును, నున్నవారల కవాంతర దిశలును, బ్రహ్మకు దక్షిణభాగంబును, నశ్యపునకు మధ్యదేశంబును, నుపద్రష్టకు నార్యావర్తంబును, సదస్యులకుం దక్కిన యెడలును, గలయ నిచ్చి, బ్రహ్మనది యైన సరస్వతియం దవబృథస్నానంబు సేసి, కల్మషంబులం బాసి, మేఘవిముక్తుం డైన సూర్యుండునుం బోలె నొప్పుచుండె. అంత.

---

1. వైరమున్ మనక (హ) 2. వ్రాలె (హ) 3. కొనుచున్ (హ) 4. నే జూడుడు నే డటంచు (హ) 5. సొచ్చికో, డాడకపట్టి (హ) 6. పాసి (హ) 7. మాటు నరసి చంపె (హ)

క. ఆప్తుఁ డగు పుత్రువలనను, బ్రాప్తతనుం డగుచుఁ దపము బలిమిని మింటన్
సప్తర్షి మండలంబున, సప్తముఁ డై వెలుఁగుచుండె జమదగ్ని నృపా! 488

క. ఆ జమదగ్ని తనూజుఁడు, రాజీవాక్షుండు ఘనుఁడు రాముఁ డధికుఁ డై
యోజను [1]వేదర్షులలో, రాజిల్లెడు మీఁది మనువు రా న వ్వేళన్. 489

ఆ. శాంత చిత్తుఁ డగుచు సంగవిముక్తుఁ డై
భవ్యుఁ డై మహేంద్ర పర్వతమున
నున్నవాఁడు రాముఁ డోజతో గంధర్వ
సిద్ధవరులు నుతులు సేయుచుండ. 490

క. భగవంతుఁడు హరి యీ క్రియ, భృగుకులమునఁ బుట్టి యెల్ల పృథివీపతులన్
జగతీ భారము వాయఁగఁ, బగఁగొని పలుమాఱు చంపెఁ బవరమున నృపా! 491

వ. అంత గాధికి నగ్నితేజుం డగు విశ్వామిత్రుండు జన్మించి, తపోబలంబున రాజ ధర్మంబును మాని, బ్రహ్మర్షి యై, యేకశత సంఖ్యాగణితు లగు కొడుకులం గనియె. అయ్యెడ భృగుకులజాతుం డైన యజీగర్తుని కొడుకు శునశ్శేఫుండు దల్లిదండ్రుల చేత హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకు నమ్ముడు వడి, బ్రహ్మాది దేవతల వినుతిసేయుచు, మెప్పించి, పితృదేవతలచేత బంధవిముక్తుం డైన వాని యందుఁ గృప గలిగి, విశ్వామిత్రుండు పుత్రుల కి ట్లనియె. 492

క. కన్నులఁ గంటిని వీనిని, మన్నన కొమరుండు నాకు మక్కువ [2]మీలో
నన్నన్న యనుచు నతనిన్, మన్నింపుం డనినఁ జూచి మదసంయుతు లై. 493

క. [3]ఇతఁ డన్నఁట వో మాకును, గృతకృత్యుల మైతి మనుచు గేలి యొనర్పన్
సుతులన్ మ్లేచ్ఛులు గం డని, ధృతిలేక శపించి తపసి తిరుగుడు వడఁగన్. 494

వ. అయ్యెడ నతని శాపంబునకు వెఱచి, మధ్యముం డైన మధుచ్ఛందుం డేఁబండ్రు దమ్ములుం దానును నమస్కరించి, తండ్రీ! నీ చెప్పిన క్రమంబున శునశ్శేఫుండు మా కన్న యని, నమస్కరింపంగలవార మనవుఁడు సంతసించి, మంత్ర దర్శియైన శునశ్శేఫుని వారలయందుఁ బెద్దఁ జేసి, మధుచ్ఛందున కిట్లనియె. 495

ఆ. పాడి సెడక వీఁడె నేఁడు నీకతమునఁ
గొడుకు కలిగె నేఁడు కొడుకులార!
కడుపులార మీరు గొడుకులఁ గనుఁ డింకఁ
బ్రీతితోడ దేవరాతుఁ గూడి. 496

---

1. సప్తర్షులలో (క.తం.వా.) 2. మీతో(హా): మీరో(హా) 3. ఇతఁడన్నఁట మాకఁట కట(తం)

వ. అని పలికె. అట్లు శునశ్శేఫుండు దేవతలచేత విడివడుటంజేసి, దేవరాతుం డయ్యె. మధుచ్ఛందుండు మొదలైన యేఁబండ్రును దేవరాతునకుఁ దమ్ము లైరి. పెద్దలైన యష్టక, హారీత,జయంత, సుమదాసు లేఁబండ్రును వేఱై చనిరి. ఈ క్రమంబున విశ్వామిత్రు కొడుకులు రెండువిధంబు లైనం, బ్రవరాంతరంబు గలిగె. అని చెప్పి శుకుం డిట్లనియె

అధ్యాయము - ౧౭

ఆ పురూరవు కొడు కగు నాయువునకు నహుషుండును, క్షత్రవృద్ధుండును, రజియును, రంభుండును, ననేనస్సు ననువారు పుట్టిరి. అందు, క్షత్రవృద్ధునకుఁ గుమారుం డగు సుహోత్రునకుఁ గాశ్యుండుఁ, గుశుఁడు, గృత్సమదుఁ డను ముగ్గురు గలిగిరి. ఆ గృత్సమదునకు శునకుండును, శునకునకు శౌనకుండును, నమ్మహాత్మునకు బహ్వృచప్రవరుండును జన్మించిరి. ఆ బహ్వృచప్రవరుండు తపోనియతుం డై చనియె. కాశ్యునకుఁ గాశియుఁ, గాశికి [1]రాష్ట్రుండును, రాష్ట్రునకు [2]దీర్ఘతపుండు నుదయించిరి. 497

క. ఆ దీర్ఘతపుని కధికుఁడు, శ్రీదైవాంశమునఁ బుట్టె సేవ్యుం డాయు
ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి, ఖేదంబులు వాయు నతనిఁ గీర్తనసేయన్. 498

వ. వాసుదేవాంశసంభూతుండగు నా ధన్వంతరి,యజ్ఞభాగంబున కర్హుండు. అతనికిఁ గేతుమంతుండు, కేతుమంతునకు భీమరథుం, డతనికి దివోదాసుం డనం బరఁగు ద్యుమంతుం డుదయించిరి. ఆద్యుమంతునకుఁ బ్రతర్దనుండు జన్మించె. ఆ ప్రతర్ద నుండు శత్రుజిత్తనియు, ఋతధ్వజుం డనియుం జెప్పఁబడె. అతనికిఁ గువల యాశ్వుండు సంభవించె. 499

ఆ. వసుమతీశ! విను కువలయాశ్వభూభర్త
లలితపుణ్యు ఘను నలర్కుఁ గనియె
నాతఁ డేలె నేల నఱువదియాఱు వే
లేండ్లు వాని భంగి నేలె నెవఁడు. 500

వ. అ య్యలర్కునకు సన్నతియు, నతనికి సునీతుండు, నతనికి సుకేతనుండును, నతనికి ధర్మకేతువును, నతనికి సత్యకేతువును, నాతనికి ధృష్టకేతువును, నా ధృష్ట కేతువునకు సుకుమారుండును, సుకుమారునకు వీతిహోత్రుండును, వీతిహోత్రు నకు భర్గుండును, భర్గునకు భార్గభూమియు జనియించిరి. 501

---

1. సురాష్ట్రుండు (హ) 2. దీర్ఘతముండు (హ)

ఆ. వాఁడు [1]తుదయుఁ గాశ్య వసుమతీశుం డాది
యైనవారు గాశు లనఁగ నెగడి
రవనిమీఁద వార లా క్షత్రవృద్ధుని
వంశజాతు లగుచు వంశవర్య! 502

వ. మఱియు, క్షత్రవృద్ధునికి రెండవకొడు కగు *(కుశునికిఁ బ్రీతియును, వానికి సంజయుండును, సంజయునికి జయుండును, జయునికిఁ గృతుండును, [2]గృతునకు హార్యధ్వనుండును, హార్యధ్వనునకు సహదేవుండును, సహదేవునికి భీముండును, భీమునకు జయత్సేనుండును, జయత్సేనునకు సంకృతియును, సంకృతికి జయుండును, జయునికి క్షత్రధర్ముండును బుట్టిరి. వీరలు క్షత్రవృద్ధుని వంశంబునం గల రాజులు.) రంభునికి రభసుండును, రభసునకు గంభీరుండును, గంభీరునికిఁ గృతుండును గలిగిరి. ఆ కృతునికి బ్రహ్మకులంబు పుట్టె. ‡ అ య్యేనేనసునికి శుద్ధుండును, శుద్ధునకు శుచియు, శుచికి బ్రహ్మసారథి యైన త్రికకుత్తును జనించిరి. అతనికి శాంతరజుండు పుట్టె. అతండు విజ్ఞానవంతుండు, కృతకృత్యుండు, విరక్తుండు నయ్యె. 503

సీ. రజి యనువానికి రాజేంద్ర! [3]యేనూఱు కొడుకులు గలిగిరి ఘోరబలులు
వేల్పు లెల్లను వచ్చి వేఁడిన నారజి దైత్యులఁ జెక్కండ్ర ధరణిఁ గూల్చి
నాకంబు దేవేంద్రునకు నిచ్చె నిచ్చిన రజి కాళ్ళకెఱఁగి సురప్రభుండు
వెండియు నతనికి విబుధగేహము నిచ్చి సంతోషబుద్ధి నర్చన మొనర్చె

ఆ. నంత నా రజి మృతుఁ డైన నతని పుత్రు
లమరవిభుఁడు దమ్ము నడిగికొనిన
నీక యింద్రలోక మేలిరి యాగభో
గములు పుచ్చుకొనిరి గర్వమంది. 5C4

క. † వేలుపులఱేఁడు గురుచే, [4]వేలిమిఁ బెట్టించి బలిమి వెలయఁగ నిజ దం
భోళిని రజిసుతులను ని, ర్మూలము గావించి స్వర్గముం గైకొనియెన్. 505

---

1. తుదయుఁగాగ (హ) 2. క్రతుండు (క. బ.) * అమూలకము ‡ "క్షుణు వంశమనేనసః" (మూలము) 3. యాబంద్రు (క-బ)

† క. చాల మదిఁ గినిసి చటులో
ద్వేలంబగు కలిమి బలిమి వెలయఁగ నిజదం
భోళిని..............................(ద)

4. వేలిమి దప్పించి (హ) వేలిమివేల్పించి (తం. వా)

వ. అది యట్లుండె. నహుషునకు యతియు, యయాతియు, సంయాతియు, నాయాతియు, వియతియుఁ, గృతియు నన నార్గురు కొడుకులు, దేహికి నింద్రియంబుల చందంబున సంభవించిరి. అందుఁ బెద్దకొడు కగు యతికి రాజ్యం బిచ్చిన, నతఁడు విరక్తుం డై. 506

క. రాజ్యంబు పాపమూలము, రాజ్యముతో నొడ లెఱుంగ రాదు సుమతియుఁ
రాజ్యమునఁ బూజ్యు నెఱుఁగడు, రాజ్యము గిజ్యంబు ముక్తిరతులకు నేలా.

వ. అని పలికి, వాఁడు రాజ్యంబునకుం బాసి చనియె. 508

క. ఆ నహుషుఁడు మఖశతమును, మానుగఁ గావించి యింద్రమానినిఁ గవియం
బూని మునీంద్రులు మోచిన, యానముపై నుండి కూలె నహి యై నేలన్.

ఉ. అన్నయుఁ దండ్రియుం జన యయాతి మహీపతి యై చతుర్దిశల్
పన్నుఁగఁ గావఁ దమ్ములకుఁ బాలిడి శుక్రుని కూఁతురిఁ సుసం
పన్నగుణాభిరామ వృషపర్వుని కూఁతురి నోలి నాండ్రుగా
[1]సన్నయశాలి యీ [2]ధరణిచక్ర ధురంధరుఁ డయ్యెఁ బేర్మితో. 510

వ. అనిన విని, పరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 511

అధ్యాయము–౧౮

## —: యయాతి చరిత్ర :—

ఆ. పార్థివుఁడు యయాతి బ్రహ్మర్షి భార్గవుఁ
డల్లుఁ డగుట మామ యగుట యెట్లు
రాజు రాచకూఁతు రతిసేయఁ దగుఁ గాక
విప్రకన్య నొంద విహిత మగునె. 512

వ. అనిన శుకుం డి ట్లనియె. 513

సీ. దనుజేంద్రు కూఁతురు తరళాక్షి శర్మిష్ఠ పురములో నొకనాఁడు ప్రొద్దువోక
వేలసంఖ్యను చెలుల్ వెంటరా గురుసుత యగు దేవయానితో నాట మరగి
పూచిన [3]యెలదోఁట పొంత జొంపము గొన్న క్రొమ్మావి చేరువ కొలఁకుఁ జేరి
యందుఁ దమ్మిలతేనె లాని చొక్కుచు మ్రోయు [4]నళుల ఝుంకృతులకు నదరి
పడుచు

1. సన్నయశాలియై (తం) 2. ధరణిచక్ర మశేషము నేలె లీలతోన్ (బ)
3. యలతోఁట (హ) 4. నలరు (హ)

ఆ. వలువ లూడ్చి కొలఁకు వడిఁ జొచ్చి తమలోనఁ
బెల్లు రేఁగి నీటఁ జల్లులాడ
నంది నెక్కి మౌళి నిందురోచులు పర్వ
శూలి వచ్చెఁ గొండచూలితోడ. 514

చ. మలహరుఁ జూచి సిగ్గుపడి మానిను లందఱు సంభ్రమంబునన్
వలువలు గట్టుచో దనుజవల్లభు కూఁతురు దేవయాని దు
వ్వలువ ధరించి [1]ముందటికి వచ్చినఁ జూచి యెఱింగి నా
వలు విది [2]యెట్లు గట్టుకొన వచ్చును [3]దానికి నంచు దెప్పుచున్. 515

వ. దేవయాని యి ట్లనియె. 516

శా. ఆ లోకేశు ముఖంబునం గలిగె బ్రహ్మణ్యంబు బ్రహ్మంబు నా
మే లై వైదికమార్గముల్ దెలుపుచున్ [4]మిన్నంది రందున్ మహా
శీలుర్ భార్గవు లందు [5]శుక్రుఁడు [6]సుధీసేవ్యుండు నే వానికిన్
జూలన్ నా వలు వెట్లు గట్టితివి రక్షోజాత వై చేటికా! 517

క. మహిమవతు లైన [7]భూసుర, మహిళల విత్తంబులు వెఱ మగువల కగునే
మహిఁ బసిఁడిగొలుసు లిడినన్, విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్. 518

క. మీ తండ్రి మాకు శిష్యుఁడు, మా తండ్రి గురుండు గొంతమాత్రం బైనం
బ్రీతిం గావింపక పరి, భూతం జేయుదువె తులువ పోఁడిమిఁ జెనఁటీ! 519

వ. అని భర్జించుచున్న దేవయాని పలుకులు విని, కరాళించి, మ్రోఁగుచున్న భుజంగిపగిది నిట్టూర్పులు నిగుడించి, పెదవులు [8]గొఱుకుచు, శర్మిష్ఠ యిట్లనియె.

శా. భిక్షుం డై తమతండ్రి మా జనకునిన్ భిక్షించి యుండంగ సం
రక్షింపం దుది నింత యైయె మఱపుతో రాజ[9]ప్రసూతాకృతిన్
రక్షోరాజ తనూజతో సుగుణతో [10]నాతో సమం బాడెడిన్
గుక్షిస్ఫోటము గాఁగ దీనిఁ జెలు లీ కూపంబునం ద్రోవరే. 521

వ. అని పలికి. 522

---

1. వేగమున (హ) 2. యేల (హ) 3. దానవికంచు దెప్పుచున్ (ట. డ. బ. హ.)
4. మిన్నందె నందున్ (హ) 5. నొప్పెడు (హ) 6. మహాసేవ్యుండు (క–బ) 7. అసుర (హ)
8. విరుచుచు (క. బ) 9. ప్రమత్తాకృతిన్ (హ) 10. నాక్షేపముం జేసెదన్ (హ)

ఆ. [1]బోఁటిపిండుచేతఁ బొదువంగఁ బట్టించి
రాజసమున దైత్యరాజ తనయ
తొడరి దేవయానిఁ ద్రోపించె వలు వీక
[2]క్రుంకి నూతిలోనఁ [3]గుదిలకొనఁగ. 523

వ. ఇట్లు సేసి, శర్మిష్ఠ పోయిన వెనుక, యయాతిభూపాలుండు వేఁటమార్గంబున నడవిం దిఱుగుచు, దైవయోగంబున నా దేవయానియున్న నుయ్యి చేరం జను దెంచె. అందు. 524

—: దేవయాని యయాతిని వరించుట :—

క. బంధువుల నెల్లఁ జీరుచు, నందు [4]జలామగ్నమధ్య యై వగచుచు వని ర్బంధమునఁ జిక్కి [5]వ్రీడా సింధువున మునింగి యున్న చేడియఁ గనియెన్. 525

వ. కనుంగొని 526

శా. సప్తాంభోనిధి మేఖలావృత మహాసర్వంసహా కన్యకా
ప్రాప్త్యుద్యద్వర దక్ష దక్షిణకర ప్రాలంబముం జేసి ప్రో
త్క్షిప్తం జేసె యయాతి [7]కట్టుకొనఁ బై చేలంబు మున్నిచ్చి ప
ర్యాప్త స్వేదజలాంగి [8]నాళిసముదాయ స్వర్గవిన్ భార్గవిన్. 527

వ. ఇట్లు నుయ్యివెడలించిన రాజునకు రాజవదన యిట్లనియె. 528

మ. ననుఁ బాణిగ్రహణంబు చేసితి గదా నా భర్తవు న్నీవ దై
వనియోగం బిది [9]పౌరుషంబునకు నా వాక్యంబు సిద్ధంబు సౌ
ఖ్యనివాసు [10]న్నిను మాని యొండువరునిం గాంక్షింప నే [11]నోర్తు నే
వనజం బానెడి తేఁటి యన్య కుసుమావాసం బపేక్షించునే. 529

వ. అదియునుం గాక, 530

సీ. సుగుణాఢ్య! విను నేను శుక్రుని కూఁతుర దేవయానినిఁ దొల్లి దేవమంత్రి
తనయుండు కచుఁడు మా తండ్రిచేత మృతసంజీవనిఁ దా నభ్యసించువేళ
నతనిఁ గామించిన నతఁ డొల్ల ననవుడు నతఁడు నేర్చినవిద్య యణఁగిపోవ
[12]నతని శపించిన నతఁడు నా భర్త బ్రాహ్మణుఁడు గాకుండెడు నని శపించె

1. బోఁటిచెలులచేత దొడువంగ బట్టించి (ద) 2. గ్రుక్కి (హా) 3. ఁగుతిలకొనఁగ (వా) 4. జలామగ్న నగ్నయై (చ. త.) 5. పీడా (హా. తం. వా.) 6. భరదక్ష (క. చ.); భరరక్ష (త. జ. డ. ద.) 7. ఁగట్టుఁగొనఁ (హా) 8. నారిసముదాయాలంకృతిన్ భార్గవిన్ (హా) 9. తప్పదప్పురుషతావాక్యంబు సిద్ధంబు (హా. తం. వా.) 10. నినుజూచి (క. డ.) నినుఁజేరు నాఁటది పరున్ (తం) 11. నేర్తునే (హా) 12. నేశపించిన నాతఁ డెఱిఁగి నాభర్త (తం)

తే. నది నిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు
ప్రాణనాథుఁడ వీ వని పడఁతి వలుకఁ
దనదు హృదయంబు నెలఁతపైఁ దగులువడినఁ
దమక మొకయింతయును లేక తలఁచి చూచి. 531

మత్తకోకిల. దైవ[1]యోగముగాక విప్రసుతఁ వరించునె నా మనం
బే విధంబున నీశ్వరాజ్ఞయు నిట్టి దంచు వరించె ధా
త్రీవరుండును దేవయానిని ధీరబుద్ధులకున్ మనో
[2]భావ మొక్కటియే ప్రమాణ మభావ్య భావ్య పరీక్షకున్. 532

వ. ఇట్లు [3]వరించి, యయాతి చనిన వెనుక దేవయాని శుక్రునికడకుం జని, శర్మిష్ఠ చేసిన వృత్తాంతం బంతయుం జెప్పి, కన్నీరు మున్నీరు గా వగచిన. 533

క. క్రూరాత్ముల మందిరములఁ, [4]బౌరోహిత్యముల కుంట పాపం బీ సం
సారముకంటె శిలల్ దిని, యూరక కాపోతవృత్తి నుండుట యొప్పున్. 534

వ. అని వృషపర్వునికడ నుండుట నిందించుచు, శుక్రుం డా కూఁతుం దోడ్కొని పురంబు వెడలి చన, న య్యసురవల్లభుం డెఱింగి, శుక్రునివలన దేవతలఁ గెలువఁ దలఁచి తెరువున కడ్డంబు వచ్చి, పాదంబులపైఁ బడి, ప్రసన్నుం జేసిన, నా కోపంబు మాని, శుక్రుండు శిష్యున కిట్లనియె. 535

తరల. చెలులు వేవురుఁ దాను నీ సుత చేటికై వడి నా సుతం
[5]గొలుచుచుండిన దీఱుఁ గోపము గొల్వఁ బెట్టెద వేని నీ
వెలఁదిఁ దోడ్కొని వత్తు నావుడు వేగ ర మ్మని భార్గవిం
గొలువఁ బెట్టె సురారివర్యుఁడు గూఁతు నెచ్చెలి పిండుతోన్. 536

మ. చల మిం కేలని తన్నుఁ దండ్రి వనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో
జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబు న్నజస్రంబుఁ ద
[6]న్నలమన్ దాసి సుదాసి యయ్యెఁ బగ వాయఁ [7]భూరి కోపానలా
కలిత గ్లానికి దేవయానికి మహా గర్వోద్యమ స్థానికిన్. 537

వ. అంత. 538

---

1. యుక్తము (హా) 2. భావమొక్కటియుఁ బ్రమాణము భావ్యభావ పరీక్షకున్ (హా) 3. తరించి (వా) 4. బౌరోహిత్యంబుకంటె (హా.తం.వా.) 5. కొలుచుచుండను (హా); కొలువఁ బెట్టినఁ దీఱుఁ గోపము(తం) 6.న్నెలగన్ దాసియు దాసి యయ్యె వివిధామేయోగ్ర కోపానలా(హా) 7. వీతచేతస్సమాకలిత గ్లానికి (క. చ. జ. డ.)

ఉ. ఆతత మైన వేడ్క దనుజాధిప మంత్రి సురారి నందనో
పేతఁ దనూభవం బిలిచి పెండ్లి యొనర్చె మహావిభూతికిన్
బ్రీతి మహోగ్రజాతికి నభీతికి సాంధువినీతికిన్ సిత
ఖ్యాతికి [1]భిన్న దుష్కలహకా ర్యభియాతికి న య్యయాతికిన్. 539

వ. ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి శుక్రుండు శర్మిష్ఠాసంగమంబు సేయకు మని, నియమించి చనియె. పిదప న ద్దేవయానియు, న య్యయాతివలన యదు తుర్వసులను కుమారులం గనియె. ఒక్క రేయి సెఱంగుమాసి, దేవయాని వెలుపల నున్న యెడ శర్మిష్ఠ యెడరు వేచి, యేకాంతంబున యయాతికడకుం జని, చెఱకువింటిజోదు పువ్వుటంపర కోహటించి, తన తలంపు సెప్పిన. 540

—: శుక్రాచార్యులు యయాతికి శాపం బొసంగుట :—

ఉ. ఆ జవరాలిఁ జూచి మన మాఁపఁగలేక మనోభవార్తుఁ డై
యా జనభర్త మున్ను [2]కవి యాడినమాట దలంచి యైనఁ జే
తోజ సుఖంబులం దనిపెఁ ద్రోవఁగవచ్చునె దైవయోగముల్
రా జఁట సద్రహస్య మఁట [3]రాజకుమారిని మాన నేర్చునే. 541

వ. ఇట్లు యయాతివలన శర్మిష్ఠ గర్భం బై క్రమంబున ద్రుహ్యుండును, ననువును, పూరువును నను వారి ముప్వురు తనయులం గాంచె. అంత దేవయాని తద్వృత్తాంతం బంతయు నెఱింగి, కోపించి, శుక్రునికడకుం జని, క్రోధమూర్ఛిత యై యున్న సమయమున యయాతి వెంటం జని, యి ట్లనియె. 542

ఆ. మామ కేల చెప్ప [4]మాను సరోజాక్షి
దనుజతనుజఁ బొంది తప్పు వడితిఁ
గామి నై న నన్నుఁ గరుణింపు పతిమాట
[5]తండ్రిమాటకంటెఁ దగును నీకు. 543

వ. అని పలికి, పాదంబుల కెఱఁగిన, న య్యింతి యొడంబడక యుండె. అంత నది యెఱింగి శుక్రుం డి ట్లనియె. 544

క. నా మాటఁ ద్రోచి దానవ, భామను బొందితివి ధరణిపాలక ! తగవే
యేమాట యేది రూపము, [6]కాముకులకు లోలుపులకుఁ గలవే నిజముల్. 545

---

1. భిన్నదుఃఖ బహుకార్యభియాతికి (హ. వా.) 2. గని (హ) 3. కుమారుని (హ. వా.); కుమారుడు (క. చ.జ.) 4. మామా సరోజాక్షి (డ. బ. తం.) 5. తండ్రి కెఱుగ జెప్ప తగవె సతికి (చ); తండ్రి మాటకంటెఁ దగును సతికి (వా) 6. కామినిలోలులకు నెచట (హ); కాముకులకు లోకమందు (చ)

వ. అని పలికి, నీవు వనితాజన హేయంబైన ముదిమిం బొందెదవు. అని శపియించిన, యయాతి యిట్లనియె. 546

క. మామా! నాపై కోపము, మామా! నీపుత్త్రియందు మానవు నాకుం
గామోపభోగ వాంఛలు, ప్రేమన్ రమియించి ముదిమిఁ బిదపన్ దాల్తున్. 547

వ. అని పలికి యనుజ్ఞగొని, దేవయానిం దోడ్కొని, పురంబునకుఁ జని, పెద్దకొడుకగు యదువుం బిలిచి, యయాతి యిట్లనియె. 548

శా. నీ తల్లిం గనినట్టి శుక్రువలనన్ నేఁ డీ జరం బొందితిన్
నా తండ్రీ! యదు నామధేయ! తనయా! నా వృద్ధతం దాల్పవే
నీ తారుణ్యము నాకు నిమ్ము [1]తనివో నిండారఁ గొన్నేండ్లు నేఁ
జేతోజాత సుఖంబులం దిరిగెదన్ శృంగారినై పుత్త్రకా! 549

వ. అనిన విని, తండ్రికి యదు విట్లనియె. 550

శా. కాంతాహేయము దుర్వికారము దురాకండూతి మిశ్రంబు హృ
చ్చింతామూలము [2]పీనసాన్వితము ప్రస్వేద వ్రణాకంపన
భ్రాంతి స్ఫోటక యుక్త మీ ముదిమి వాంఛం దాల్చి నానా సుఖా
పాంతంబైన వయోనిధాన మిది యయ్యా! తేర యీ వచ్చునే. 551

వ. అని యదుం డొడంబడకున్న, యయాతి తుర్వసు, ద్రుహ్యాదుల నడిగిన, వారును, యదువు పలికినట్లు పలికినఁ, గడకొట్టు కుమారుండైన పూరువున కిట్లనియె. 552

ఉ. పిన్నవు గాని నీవు కడుఁ బెద్దవు బుద్ధులయందు రమ్ము నా
యన్న! మదాజ్ఞ దాఁటవు గదన్న! వినీతుఁడ వన్న! నీవు నీ
యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకు మన్న! నా జరన్
మన్ననఁ దాల్చి నీ తరుణిమం బొనఁగూర్పుము నాకుఁ బుత్త్రకా! 553

వ. అనిన విని, గురుభక్తి గుణాధారుండైన పూరుం డిట్లనియె. 554

శా. అయ్యా! నన్నిటు వేఁడనేల భవదీ యాజ్ఞా సముల్లంఘనం
బయ్యుండఁగఁ బరిహారమున్ నొడువ నే నన్యాయినే నీ జర
న్నెయ్యం బొప్పఁగఁ దాల్చి నా తరుణిమ న్నీ కిచ్చెదఁ బంపినన్
[3]గయ్యం బాడెడి పుత్త్రకుండు క్రిమిసంకాశుండుఁ గాకుండునే. 555

---

1. తనివో నిండారఁ గొన్నాళ్ళు (హ) 2. పీనస జ్వరము (హ); పీనసజ్వర తమ స్వేదవ్రణా కంపన (క. బ.) 3. క్రయ్యం బాడెడి (తం)

వ. అదియునుం గాక. 556

క. మునివృత్తి డయ్యు నేటికి, జనపాలక! సుగతిఁ గోరు సత్పురుషులకున్
[1]దనుఁ గన్నతండ్రి సెప్పిన, పని చేసిన సుగతి గొంగుపసిఁడియ కాదే. 557

క. పనుపక చేయుదు రధికులు, పనిచిన మధ్యములు పొందుపఱుతురు తండ్రుల్
పనిచెప్పి కోరి పనిచిన, ననిశము మాఱాడు పుత్రు లధములు దండ్రీ! 558

వ. అని పలికి, పూరుండు ముదిమి చేకొని, తన లేఁతప్రాయంబు యయాతి కిచ్చె.
అ య్యయాతియుం దరుణుం డై. 559

శా. [2]ఏడుఁ దీవులు నేడు వాడలుగ సర్వేలాతలం బెల్లఁ బెఁ
పీడై [3]లోనుగ నేలుచుం బ్రజల నన్వేషించి రక్షింపుచున్
దోడం భార్గవి రా మనోజ సుఖ సంతోషంబులం దేలుచుఁ
గ్రీడించె న్నియతేంద్రియుం డగుచు నా [4]క్రీడావిశేషంబులఁ. 560

క. మర్మంబుల నతిసాధ్వీ, ధర్మంబుల దేవయాని దన ప్రాణేశుఁ
నర్మముల మనోవా [5]క్తను, కర్మంబుల నొండు లేక కడు మెప్పించెఁ. 561

శా. ఆకాశంబున మేఘబృందము ఘనం బై సన్న మై దీర్ఘ మై
యేకం బై బహురూప మై యణఁగున ట్లే దేవు గర్భంబులో
లోకశ్రేణి జనించుచున్ మెలఁగుచున్ లోపించు నా దేవు సు
శ్రీకాంతుఁ హరిఁ గూర్చి యాగములు సేసె న్నాహుషుం డిమ్ములన్. 562

వ. మఱియును. 563

మ. చెలికాండ్రన్ గరులఁ రథమ్ముల భటశ్రేణిం దురంగమ్ములఁ
గలలోఁ గన్న ధనాళితో సమములం గాఁ జూచుచుఁ భార్యతోఁ
బలువే లేండ్లు మనోజభోగ లహరీ పర్యాప్తుఁ డై తేలియున్
బలుతృష్ణం గడఁగాన కెంతయు మహాబంధంబులఁ ద్రుక్కుచున్. 564

## అధ్యాయము – ౧౯

వ. ఒక్క దినంబున నాత్మజ్ఞానంబునం జేసి, కాంతానిమిత్తంబున మోసపోవుట యెఱింగి, యయాతి విషాదంబు నొంది, దేవయాని కి ట్లనియె. 565

1. తనకన్నతండ్రి (తం) 2. ఏడు ద్వీపము లేడు వాడలుగ (హ) ఏడౌ ద్వీపము (వా) 3. పోఁడిగ నేలుచున్ (తం.వా.) 4. క్రీడాతిరేకంబులన్ (తం. వా.); క్రీడాద్రి శైలంబులన్ (క. బ.); క్రీడాద్రిదేశంబులన్ (డ) 5. వాక్కుల (హ)

## యయాతి దేవయానికి బస్తోపాఖ్యాన మను వ్యాజంబున స్వవృత్తాంతమును దెలుపుట

క. మన చారిత్రమువంటిది, విను మితిహాసంబు కలదు వృద్ధజనంబుల్
మునులును మెత్తురు నీవును, మనమున నంగీకరింపు మంజులవాణీ! 566

వ. అది యెట్టి దనిన. 567

సీ. [1]అజ మొకం డడవిలో నరుగుచుం దాం గర్మ ఫలమున నూతి లోపలికి జాఱి
[2]లోంగెడి ఛాగి నాలోకించి కామి యై కొమ్మున దరిం గొంత గూలం ద్రోచి
వెడలింప న చ్ఛాగి విభునిగాం గోరిన నగుంగాక యని తాను నదియుం దిరుగ
నెన్నియేనియుం దన్ను నెంత కామించిన నన్నిటికిని భర్త యై తనర్చి

తే. వాని నేప్రొద్దు [3]రతులకు వశలం జేసి
సొరిదిం గ్రీడించి క్రీడించి సొక్కి సొక్కి
కాముం డనియెడు దుస్సహ గ్రహముకతనం
జిత్త మేమఱి మత్తిల్లి చెల్లం [4]జిక్కె. 568

క. [5]వెడవింటివాని చిగురా, కడిదపు వ్రేటునకు లోంగి యతిమోహితుం డై
విడువక సతులం దగిలెడు, జడునకు [6]నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్. 569

వ. అంత న చ్ఛాగంబు తనపిదపం దగిలిన ఛాగీనివహంబులోపలం జూడ నొప్పెడి ఛాగియందుం దగిలి, క్రీడింపం గని, నూతిలోపలం బడి వెలువడిన ఛాగి, తన పతివలని నెయ్యంబు లేకుండుటకు విన్న నై, తన మనంబున. 570

క. పలికిన పలుకులు పలుకండు, కలంచు న్నవకాంతం జూచి కడు సంచలుం డై
నిలిచిన చోట న్నిలువండు, నిలు వెల్లను గల్ల కామి [7]నిజమరి గలండే. 571

వ. అని పలికి, విడిచి చనిన, న య్యజవల్లభుండు సురతపరతంత్రుం డై, మిసిమిసి యను శబ్దంబు సేయుచు, న చ్ఛాగివెంటం జని, యొడంబఱుపం జాలకుండె. అంత దానికిం గర్త యైన బ్రాహ్మణుండు రోషంబున రతిసమర్థంబు గాకుండ నల్లాడుచున్న ఛాగవృషణంబులు త్రెంచివేసిన, న చ్ఛాగంబు గ్రిందంబడి, వేండుకొనినం, బ్రయోజనంబు వొడగని, యోగవిదుండు గావున, బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ న య్యజవృషణంబులు సంధించిన. 572

క. వృషణములు మరలం గలిగిన, సుషముం డై ఛాగివిభుండు సుందరితోడన్
విషయసుఖంబులం బొందుచుం, దృష తుదిం గనండయ్యెం బెక్కుదివసము లయ్యున్.

---

1. అజ మొక్కటియు వనమందేగుచును గర్మ(హ) 2. లోగిడి(హ) 3. రతులనువశునింజేసి(హ) 4. జిక్కి (హ. తం. వా.) 5. వెడవిలుతుకేలి (హ. వా.) 6. నెక్కడిది (హ) 7. నిజమతి (హ)

వ. అని, యి వ్విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతంబుఁ గథారూపంబున నెఱింగించి, యి ట్లనియె. 574

మ. ‡అబలా! నీ నిబిడాతి దుర్జయ సలజ్జాపాంగ భల్లంబులం
బ్రబలం బైన మనంబు భగ్నముగ నా ప్రావీణ్యముం గోలుపో
యి బలిష్ఠుం డగు కాముఁ బారిఁ బడి నే [1]నెట్లోర్చెదన్ బందిక
త్తె బడిం బాపపుఁ దృష్ణ యిప్పు డకటా! దీర్ఘాకృతిన్ రొప్పెడిన్. 575

క. [2]అదలదు ప్రాణము లదలినఁ, [3]గదలదు సర్వాంగకములు గదలుచు నున్నన్
వదలదు బిగువులు వదలినఁ, దుదిలే దీ తృష్ణ దీనిఁ ద్రుంపఁగవలయున్. 576

క. [4]వెయ్యేం డ్లయ్యెను నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడ గామసుఖములం
[5]గ్రుయ్యి దొక యించుకైనన్, [6]దయ్యదు కొనలిడియెఁ దృష్ణ [7]నవపద్మముఖీ!

క. ముదిసెను దంతావళియును, ముదిసెను కేశములుఁ దనువు ముదిసెం దనకున్
ముదియనివి రెండు చిక్కెను, బ్రదికెడి తీపియును విషయపశు స్పృహయున్.

క. కడ లే దాశాలతకును, గడఁ జూడఁగఁ గానరాదు కడఁ గని రేనిన్
గడు ముదమున సంసారము, గడఁ గందురు తత్త్వవిదులు కమలదళాక్షీ! 579

క. మండన హాటక పశు వేదండాశ్వ వధూ దుకూల ధాన్యాదులు పె
క్కుండియు నాశాపాశము, [8]ఖండింపఁగ లేవు మఱియుఁ గడమయ చుమ్మీ.

క. కామోపభోగ సుఖములు, వేమాఱును బురుషుఁ డనుభవింపుచు నున్నం
గామంబు శాంతిఁ [9]బొందదు, ధూమధ్వజుఁ [10]డాజ్యవృష్టిఁ ద్రుంగుడువడునే. 581

ఆ. అక్క తల్లి చెల్లె లాత్మజ [11]యెక్కిన
పాను పెక్కఁ జనదు పద్మనయన!
పరమయోగి కైన బలిమిని నింద్రియ
గ్రామ మధికపీడఁ గలుగఁ జేయు. 582

క. వెంగలి వితైె [12]తిరుగక, [13]కంగారై చెడక ముక్తిఁ గాంక్షించు నతం
డంగనలతోడ విడునని, సంగడములు వదలవలయు జలజాతముఖీ! 583

వ. [14]అది గావున నేఁడు మొదలు తృష్ణాఖండనంబు సేసి, నిర్విషయుండ నై, యహంకారంబు విడిచి, మృగంబులంగలసి, వనంబున సంచరించెద. పరబ్రహ్మంబు

---

‡ ఈ పద్యము 'క' ప్రతిలో లేదు. 1. నెట్లోర్తునే (తం.వా.) 2. అడలవు (హ) 3. గదలవు(హ) 4 వెయ్యేండ్లైనను (హ) 5 గ్రుయ్యఁడొక (హ) 6. డయ్యేదు (హ) 7. తవతవ తోడన్ (హ) 8. నిండింపఁగలేవు జగతి నిజమిది సుమ్మీ (హ) 9. బొందునె (తం) 10. ఆజ్య ధార (క) 11. లెక్కిన (హ) 12. తిరుగుచు (తం. వా.) 13. సంగజు లీలను ముక్తి నాశించు (హ) 14. అదియునుంగాక (హ)

నందుఁ జిత్తంబుఁ జేర్చెద. బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగుటం జేసి యే నందుఁ దత్పరుండ నై, యాహార నిద్రాది యోగంబులం బరిహరించెద. ఆత్మవిదుం డై, సంసారనాశంబుఁ దలంచినవాఁడె విద్వాంసుం డని తలంచి పలికి, పూరుని యౌవనం బతని కిచ్చి, ముదిమి తాను గైకొని, విగత లోభుం డై, నిజ భుజశక్తి పాలితం బగు భూమండలంబు విభాగించి, ద్రుహ్యునకుఁ బూర్వభాగంబును, యదువునకు దక్షిణ భాగంబును, దుర్వసునకుఁ బశ్చిమ దిగ్భాగంబును, ననువునకు నుత్తర దిగ్భాగంబును సంరక్షింపుం డని యిచ్చి, వారల సమక్షంబున. 584

క. నాలుగు చెఱఁగుల నేలయుఁ, బాలింపుం డనుచు నగ్రభవులకుఁ బంచెన్
భూలోక మేలు మనుచును, బాలార్కోదారుఁ బూరుఁ బట్టము గట్టెన్. 585

వ. ఇట్లు పూరునికి రాజ్యం బిచ్చి, పెక్కు వర్షంబులయందు ననుభూతంబు లైన, యింద్రియ సుఖంబులు విసర్జించి. 586

క. మిక్కిలి [1]విజ్ఞానంబున, జక్కఁగ [2]దిగవిడిచి వైరి షడ్వర్గంబున్
ఱెక్కలు వచ్చిన విహగము, గ్రక్కున నీడంబు విడుచు కరణి నుదిత్తుఁ డై.

క. కారుణికోత్తముఁ డగు హరి, కారుణ్యము కతన నతఁడు ఘనుఁ డై గెలిచెన్
ఘోరము లగు విషయంబుల, నూరక గెలువంగ శక్తుఁ డొక్కఁడు గలఁడే. 588

వ. మఱియు, నిర్మూలిత సకల సంగుం డై, సత్వ రజ స్తమో గుణంబులం దిగనాడి నిర్మలం బై, పరమం బైన వాసుదేవాభిధాన బ్రహ్మంబునందు యయాతి భూపాలుండు [3]స్వతస్సిద్ధ యైన భాగవత గతిం జెందె. అంత. 589

సీ. ప్రాణేశుఁ డాడిన పలుకులు నగవులుగాఁ జూడ కంతరంగమున నిలిపి
పథికు లై పోవుచుఁ బానీయశాలలఁ జల్లఁగా నుండెడి జనుల యట్ల
సంసారమునఁ గర్మసంబంధు లై వచ్చి యాలు బిడ్డలు మగం డనుచుఁ గూడి
యుండుట గాని సంయోగంబు నిత్యంబు గా దీశమాయా ప్రకల్పితంబు

తే. దీని విడుచుట తగవని తెగువ మెఱసి
నిద్ర సాలించి మేల్కొన్న [4]నేర్పు చాలఁ
గలిగి భార్గవి సర్వసంగముల విడిచి
హరి [5]పదధ్యాన యై ముక్తి కరిగె నధిప! 590

---

1. సుజ్ఞానంబున (తం. వా. క.) 2. తెగనడిచి (తం. వా.) 3. స్వసిద్ధియైన (హ)
4. నెలవు (హ); "స్వప్నౌపమ్యేన" అని మూలము (19-28) 5. పరాధీనయై (హ. తం. వా.)

వ. అని, యిట్లు యయాతి చరితంబు చెప్పి, భగవంతుండును, సర్వభూత నివాసుండును, శాంతుండును, వేదమయుండు నైన వాసుదేవునకు నమస్కరించెద. అని, శుకుం డి ట్లనియె. 591

అధ్యాయము – ౨౦

క. భారత ! నీవు జనించిన, పూరుని వంశంబునందుఁ బుట్టిన వారిన్
జారుయశోలంకారుల, ధీరుల వినుపింతు నధిక తేజోధనులన్. 592

వ. పూరునకు జనమేజయుండు, జనమేజయునకుఁ బ్రాచిన్వాంసుఁ, డతనికిఁ బ్రవిరోధనమన్యు, వతనికిఁ జారువు పుట్టె. ఆ చారునకు సుద్యువు, సుద్యువునకు బహుగతుండును, బహుగతునకు శర్యాతి, శర్యాతికి సంయాతి, సంయాతికి రౌద్రాశ్వుండు, రౌద్రాశ్వునకు ఘృతాచి యను నచ్చర లేమయందు ఋతేపువు, కక్షేపువు, *స్థలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, వ్రతేపువు,వనేపువు అను వారు,జగదాత్మ భూతుండైన ప్రాణునకు నింద్రియంబుల చందంబునఁ బదుగురు కొడుకులు జన్మించిరి. అందు ఋతేపునకు నంతిసారుండు, నంతిసారునకు సుమతియు, ధ్రువుండు, నప్రతిరథుండు, నన ముప్పురును బుట్టిరి. అందు నప్రతిరథునకుఁ గణ్వుం, డా కణ్వునికి మేధాతిథి, యతనికి బ్రస్కందుండు మొదలగు బ్రాహ్మణులు జన్మించిరి. ఆ సుమతికి రైభ్యుండు, రైభ్యునకు దుష్యంతుండు పుట్టె. 593

క. పారావార పరీతో, దార ధరా భారదక్ష దక్షిణహస్త
శ్రీ రాజిల్లఁగ నొకనాఁ, డా రాజేంద్రుండు వేఁటయం దభిరతుఁ డై. 594

క. గండక కంఠీరవ భే, రుండ శశ వ్యాళ కోల రోహిష రురు వే
దండ వ్యాఘ్ర [1]మృగాదన, చండ శరభ శల్య భల్ల చమరాటవులన్. 595

క. చప్పుడు సేయుచు మృగముల, రొప్పుచు నీరములయందు [2]రోయుచు వలలం
ద్రిప్పుకొని పడఁగఁ ద్రోపుచుఁ, దప్పక యేయుచును వేఁటతమకం బొప్పన్. 596

క. మృగయూథంబుల వెంటను, మృగలాంఛన సన్నిభుండు మృగయాతురుఁ డై
మృగయులు గొందఱుఁ గొలువఁగ,మృగరాజ పరాక్రమంబు మెఱయఁగ వచ్చెన్.

వ. ఇట్లు వచ్చి వచ్చి, దైవయోగంబునఁ గణ్వమహాముని తపోవనంబు చేరంజని.598

---

* "సలేపుల్చ" అని మూలము (20–4)

1. మృగాధిక (హ) 2. రోజుచు (హ)

సీ. ఉరుతర క్రాంతాహి యుగళంబులకుఁ బింఛములు విసరెడి కేకి ముఖ్యములను
[1]గరుణతో మదయుక్త కలభంబులకు మేఁత లిడుచు ముద్దాడు మృగేంద్రములను
ఘన మృగాదనములు గాపుగా లేళ్ళతో రతులు సాగించు సారంగములను
నునుపుగా హోమధేనువుల కంఠంబులు దువ్వుచు నాడు శార్దూలములను

తే. [2]దారి కలహించు [3]మూషిక దంపతులకు
మైత్రి నంకించు మార్జాల మల్లములను
మఱియు జాతివైరంబులు మాని కూడి
కలసి క్రీడించు మృగములఁ గాంచె నతఁడు. 599

క. ఇత్తెఱఁగున మృగజాతుల, [4]పొత్తులు మే మెఱుఁగ మనుచు భూవల్లభుఁడుం
జిత్తములోపల నా ముని, సత్తము సద్వృత్తమునకు సంతస పడుచున్. 600

క. హల్లక బిసరుహ సరసీ, కల్లోలోత్ఫుల్ల యూథికా గిరిమల్లీ
మల్లీ మరువక కురవక, సల్లలి తానిలమువలన సంతుష్టుం డై. 601

వ. దుష్యంతుండు వచ్చు నవసరంబున. 602

క. ఇం దిందిరాతి సుందరి, యిందిందిర చికుర యున్న దిం దిం ద శుభం
బిం దిందువంశ యనుక్రియ, నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్. 603

క. మా కందర్పుని [6]శరములు, మాకందము లగుటఁ జేసి మాకందంబుల్
మా కందము లను కైవడి, మాకందాగ్రములఁ బికసమాజము నిలిచెన్. 604

వ. అంత. 605

క. ఇందున్న కణ్వమునికిని, వందన మొనరించి తిరిగి వచ్చెద ననుచుం
బొందుగ [7]ననుచరులను దా, నందఱ నందంద నిలిపి యట చని మ్రోలన్. 606

శా. ఆ కణ్వాశ్రమమందు నీరజనివాసాంత ప్రదేశంబులన్
మాకందంబుల నీడఁ [8]బుష్పలతికా మధ్యంబునన్ మంజు రం
భాకాండాంచిత శాలలోఁ గుసుమ సంపన్న [9]స్థలిన్ జూచె నా
భూకాంతుండు శకుంతల [10]న్నవనటత్ భ్రూపర్యట త్కుంతలన్. 607

క. దట్టపుఁ దుఱుమును మీఁదికి, మిట్టించిన చన్నుఁగవయు [11]మిఱిమిఱి చూడ్కుల్
నట్టాడు నడుముఁ దేనియ, లుట్టెడు మోవియును మనము నూరింపంగన్. 60

1. కరిణు లొల్లని కుంభి కలభంబులకు మేఁత (తం. క) 2. దార (హా. తం. వా.)
3. నుందుర (తం. వా) 4. మతిని (హా. తం. వా.) 5. పొత్తుల మేమెఱుఁగ జూచు (హ)
6. సాయక (హ) 7. సన్నుతమాన్యుల (క) 8. కల్పలతికా (హా.తం.వా.) 9. స్థితిన్ (హ)
10. నవనవభ్రూ (తం) 11. మిఱుమిఱు (తం. వా.)

వ. అంత నా రాజకుమారుం డలరుటమ్ముల విలుకాని వెడవింట ఘుణఘుణాయమానలై ప్రమోయు ఘంటలకుం [1]బబ్బరించి, తన మనంబున. 609

శా. వన్యాహారములన్ జితేంద్రియత నావాసించు నా కణ్వుఁ డీ
కన్యారత్నము నేగతిం గనియెడిం గా దీ కురంగాక్షి రా
జన్యాపత్యము గాఁగ నోపు నఖిలాపం బయ్యెఁ గాదేని [2]నే
యన్యాయ క్రియలందుఁ బౌరవుల కెం దాశించునే చిత్తముల్. 610

క. అడిగిన నృపసుతఁ గా నని, నొడివెడినో కదే మనంబు [3]నొవ్వ నని విభుం
డుడురాజ వదన [4]నడుగఁగఁ, [5]దడుమన యొకకొంతప్రొద్దు తడఁబడఁ జొచ్చెన్.

వ. మఱియు నెట్టకేలకుఁ దన చిత్త[6]సంచలనంబు సత్యంబుగాఁ దలంచి యి ట్లనియె.

క. భూపాలక కన్యక వని, నీపైఁ జిత్తంబు నాకు నీ వా రేరీ
[7]నీ పే రెవ్వరు నిర్జన, భూపర్యటనంబు తగవె పూర్ణేందుముఖీ ! 613

వ. అని పలుకుచున్న రాజకుమారుని [8]వదనచంద్ర చంద్రికారసంబు నేత్రచకోరంబుల వలనఁ ద్రావుచు, న య్యువిద విభ్రాంత యై యున్న సమయంబున. 614

క. కంఠేకాలుని చేతన్, గుంఠితుఁ డగు టెట్లు మరుఁడు కుసుమాస్త్రంబుల్
లుంఠించి గుణనినాదము, [9]ఠం ఠ మ్మన బాల నేసె ఠవఠవ [10]గదురన్. 615

వ. ఇట్లు వలరాజు వాఁడి [11]క్రొవ్విరి కోలల వేఁడిమిఁ దాలిమి పోఁడిమి సెడి, యా వాలుఁగంటి యి ట్లనియె. 616

మ. అనివార్యప్రభ మున్ను మేనకయు విశ్వామిత్ర భూభర్తయున్
గని రా మేనక డించిపోయె [12]నడవిన్ గణ్వుండు న న్నింతగా
మనిచెన్ సర్వము నా మునీంద్రుఁ డెఱుఁగున్ మద్భాగధేయంబునన్
నినుఁ గంటిం బిదపం గృతార్థ నగుదున్ నేఁ డీ వనాంతంబునన్. 617

క. నీ వారము ప్రజ మేమును, నీవారముఁ బూజ గొనుము [13]నిలువుము నీవున్
నీ వారును మా యింటను, నీవారాన్నంబుఁ [14]గొనుఁడు నేఁడు నరేంద్రా !

వ. అని పలికిన, దుష్యంతుండు మెచ్చి, మచ్చెకంటి యిచ్చ యెఱింగి యి ట్లనియె.

---

1. బంటించి (తం.వా.క.చ.) 2. నీ యన్యాయ త్తములందుఁ బౌరవుల కెట్లాశించునే (హ); నే యన్యాయ....కిట్లాశించునే (తం) 3. నొప్పనని (హ) 4. నడుగక (హ. వా.) 5. నడుమన నొకకొంత (హ); దడుమునఁబడి (తం) 6. సంచారంబు (తం. వా) 7. నీపే రేది నిర్జనవన (హ) 8. వదనచంద్రికా రసంబు (హ.తం. వా.) 9. ఠంఠమ్మని (హ) 10. తేమిన్ (హ) 11. క్రొవ్వాడి (హ) 12. నటనీ (హ) 13. నేడిట (హ) 14. ఁగుడుదు (హ)

ఆ. రాజతనయ వగుదు [1]రాజీవదళనేత్రి!
మాట నిజము [2]లోనిమాట లేదు
తనకు సదృశుఁడైన [3]తరుణునిఁ గైకొంట
రాజ సుతకుఁ దగవు రాజవదన! 620

వ. అని మఱియుఁ దియ్యని నెయ్యంపుఁ బలుకులవలన నయ్యువిద నియ్యకొలిపి.

క. బంధుర యశుఁడు జగన్నుత, సంధుఁడు దుష్యంతుఁ డుచిత సమయజ్ఞుం డై
గంధగజ గమన నప్పుడు, గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్. 622

## —: భరతుని చరిత్రము :—

వ. ఇవ్విధంబున నమోఘ వీర్యుం డగు నా రాచపట్టి, తపసిరాచూలికిఁ జూలు నిలిపి, మఱునాఁడు తన వీటికిం జనియె. అ య్యింతియుం గొంతకాలంబునకుఁ గొడుకుం గనినం, గణ్వమునీంద్రుఁ డా రాచపట్టికి జాతకర్మాది మంగళాచారంబు లొనర్చె. ఆ డింభకుండును దినదినంబునకు బాలచంద్రుండునుం బోలె నెదుగుచు.

క. కుంఠితుఁడు గాక వాఁడు, త్కంఠం దన పిన్ననాఁడె కణ్వవనచరత్
కంఠీరవ ముఖ్యంబుల, కంఠములన్ బట్టి యడుచుఁ [4]గట్టున్ విడుచున్. 624

వ. అంత నా కణ్వమునీంద్రుండు బాలకుం జూచి శకుంతల కి ట్లనియె. 625

ఉ. పట్టపురాజు నీ మగఁడు పాపఁడు నన్నిట నెక్కుడంతకున్
బట్టపు దేవి వై [5]గరిమ బాగుగ నుండక [6]పాఱువారితో
[7]గట్టు వనంబులో నవయఁగా బనిలే దిటఁ దర్లి పోఁగదే
[8]పుట్టిన యిండ్లు మాని పతిఁ బొందక యి ట్లనిశంబు నుందురే. 626

వ. అనిన నియ్యకొని. 627

క. ఆ పిన్నవాని నతుల, వ్యాపారు నుదారు వైష్ణవాంశోద్భవునిం
జూపెద నంచు శకుంతల, భూపాలుని కడకు వచ్చెఁ బుత్రునిఁ గొనుచున్. 628

వ. వచ్చి దుష్యంతుం డున్న సభా మంటపంబునకుం జని నిలిచియున్నయెడ. 629

---

1. నేత్ర (తం.వా) 2. లోనిమాటులేదు (తం.క.); లోని మాటులేల (డ); లోనిమాటలేల (చ); లోని మాటులేక (ట) 3. తనయుని (హ) 4. కాననవీథిన్ (హ.) 5. గఱువబాగున (తం.వా.) 6. వారివారితో (హ) 7. కట్టః (త) 8. పుట్టిన యిండ్ల మానినులు పోరచిగా ననిశంబు నుందురే (క. తం. వా.) 9. మండపంబునకు (తం. వా.)

మ. [1]వలకేలన్ గురు చక్రరేఖయుఁ బదద్వంద్వంబునం బద్మరే
ఖలు నొప్పారఁగ [2]విందువచ్చిన రమాకాంతుండు నాఁ గాంతి న
గ్గల మై యున్న కుమారు మారసదృశాకారున్ విలోకించి తాఁ
బలుకం డయ్యె విభుం డెఱింగి సతి విభ్రాంతాత్మ యై [3]వందురన్. 630

వ. ఆ సమయంబున. 631

మ. అదె నీ [4]వల్లభ వాఁడు నీ సుతుఁడు భార్యాపుత్రులన్ [4]భ్రాతులన్
వదలం గా దలనాటి కణ్వవనికా వైవాహికారంభముల్
మది నూహింపు శకుంతలా వచనముల్ మాన్యంబు లౌ భూవరేం
ద్ర! దయం జేకొను మంచు మ్రోసెను వియద్వాణీ వధూ వాక్యముల్. 632

వ. ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుఁ దేటపడ భరింపు మని పలికిన, నాకుమారుండు భరతుం డయ్యె. ఆ రాజు రాజవదన నంగీకరించి, తనూభవుం జేకొని, కొంత కాలంబు రాజ్యంబుఁ జేసి పరలోకంబునకుం జనియె. తదనంతరంబ. 633

క. రెండవ హరిక్రియ ధరణీ, మండల భారంబు నిజ సమంచిత బాహా
దండమున నిలిపి తనకును, ఖండనమున నెదురులేక భరతుం డొప్పెన్. 634

వ. మఱియు నా దౌష్యంతి, యమునాతటంబున దీర్ఘతపసుండు పురోహితుండుగా డెబ్బది యెనిమిదియును, గంగాతీరంబున నేఁబది యయిదును, నిట్లు నూట ముప్పదిమూఁ డశ్వమేధ యాగంబులు సదక్షిణంబులుగా నొనర్చి, దేవేంద్ర విభవంబున నతిశయించి, పదుమూఁడువేలు న్నెనుబదినాలుగు కదుపు *(ధేనువులు గలయది ద్వంద్వం బనం బరగు. అట్టి వెయ్యి ద్వంద్వంబుల పాఁడిమొదవుల) క్రేపుల తోడ నలంకార సహితలం జేసి, వేవురు బ్రాహ్మణుల కిచ్చి, [6]మష్కార పుణ్య తీర్థకూలంబున విప్రముఖ్యులకు రత్నభూషణ శోభితంబు లై, ధవళదంతంబులు గల [7]నల్లని యేనుంగులఁ బదునాలుగు లక్ష లొసంగె. దిగ్విజయకాలంబున †శక, శబర, బర్బర, కష, కిరాతక, హూణ, మ్లేచ్ఛ దేశంబుల రాజుల పీచం బడంచి, రసాతలంబున రాక్షస కారాగృహంబు లం దున్న వేల్పుల గరితలం బెక్కండ్ర విడిపించి తెచ్చి, వారల వల్లభులం గూర్చె. త్రిపురదానవుల జయించి, నిర్జరుల నిజమందిరంబుల నునిచె. అతని రాజ్యంబున గగన ధరణీతలంబులు ప్రజలు గోరిన కోరిక లిచ్చుచుండె. ఇవ్విధంబున. 635

---

1. వలకేల న్నురుచక్ర రేఖయు (క. తం.) 2. నిందు వచ్చిన (హ); నందువచ్చిన (వా) 3. యుండగన్ (హ) 4. వల్లభి (హ) 5. భ్రాతలన్ (హ) * తా. వ. ప్రతులలో లేదు. 7. మహాహ్రదంబను (హ) 8. దంతావళులం (హ)

† "కిరాతహూణాన్ యవనా నాంధ్రాన్ వంగాన్ శకాన్ కశాన్" (20-33), మూలము.

ఆ. సత్యచరితమందుఁ జలమందు బలమందు
భాగ్యమందు లోకపతులకంటె
నెక్కుడైన పేర్మి నిరువదియేడువే
లేండ్లు ధరణి భరతుఁ డేలె నధిప! 636

క. అర్థపతికంటెఁ గలిమిఁ గృ, తార్థుం డై యతుల శౌర్య మలవడియు నతం
డర్థములును బ్రాణములును, వ్యర్థము లని తలఁచి శాంతుఁ డయ్యె నరేంద్రా!

క. భరతుని భార్యలు ముప్పురు, వరుసం బుత్రకులఁ గాంచి వల్లభుతోడన్
సరి గా రని తోడ్తోడను, శిరములు దునుమాడి రాత్మశిశువుల నధిపా! 638

వ. ఇట్లు విదర్భరాజపుత్రికలు శిశువులఁ జంపిన, భరతుం డపుత్రకుం డై మరుత్స్తోమం బను యాగంబు పుత్రార్థియై చేసి, దేవతల మెప్పించె. అ య్యవసరంబున. 639

సీ. అన్నయిల్లాలిఁ జూలాలిని మమతాఖ్యఁ జూచి బృహస్పతి సురతమునకుఁ
దొరఁకొని పైఁబడ్డఁ దొల్లి గర్భంబున నున్న బాలుఁడు భయం బొదవి వలదు
తగ దని మొఱసేయఁ దమకంబుతో వాని నంధుండ వగు మన్న నలిగి వాఁడు
యోనిలోపలి [1]వీర్య మూడఁదన్నిన నేలఁ బడి బిడ్డఁ డై యున్నఁ బాయలేక

ఆ. నితనిఁ బెంపు కొడుకు లిరువురు జన్మించి
రనుచు వెలయఁ జేయు మనిన మమత
బెంపఁజాల నీవ పెంపు భరింపు మీ
ద్వాజు ననుచుఁ జనియె దాని విడిచి. 640

వ. [2]ఇట్లుచథ్యునిభార్య యగు మమతయు, బృహస్పతియు శిశువుం గని, ద్వాజుం డైన వీని నీవ నీవ భరింపు మని, వదినె మఱందులు దమలో నొండొరువులం బలికిన కారణంబున వాఁడు భరద్వాజుం డయ్యె. గర్భస్థుం డైనవాఁడు బృహస్పతిశాపంబున దీర్ఘతముం డయ్యె. అంత నా బృహస్పతియు, మమతయు నుదయించిన వాని విడిచి, నిజేచ్ఛం జనిన, మరుత్తులు వానిం బోషించి, పుత్రార్థి యైన భరతున కిచ్చిరి. భరతుండును, వానిఁ జేకొనియె. వితథం బైన భరతవంశమునకు నా భరద్వాజుండు వంశకర్త యగుటం జేసి, వితథుం డనం బరఁగె. ఆ వితథునికి మన్యువు. మన్యువునకు బృహత్క్షత్ర జయ మహావీర్య నర గర్గు లనువా రేవురు సంభవించిరి. అందు నరునికి సంకృతి, సంకృతికి గురుండు, రంతిదేవుం డన నిరువురు జన్మించిరి. అందు. 641

1. వీర్య మురలఁ దన్నిన (తం) 2. ఇట్లురుచథ్యుని (హ)

## అధ్యాయము-౨౧

### —: రంతిదేవుని చరిత్రము :—

సీ. రాజవంశోత్తమ! రంతిదేవుని కీర్తి [1]యెల్లఁ జెప్పఁగఁబడు నిందు నందు
నా రాజు దన సంచితార్థంబు లన్నియు నెడపక దీనుల కిచ్చి యిచ్చి
సకుటుంబుఁ డై ధైర్యసంయుతుం డై పేద యై కూడు నీరు లే కధమవృత్తి
నెంచేని నలువదియెనిమిది దివసముల్ చరియింప నొకదివసంబు రేపు

ఆ. నెయ్యి పాయసంబు నీళ్లును గలిగిన
బహు కుటుంబభార భయముతోడ
నలసి నీరువట్టు నాఁకలియును మిక్కి
లొదవఁ జూచి కుడువ నుత్సహించె. 642

వ. అ య్యవసరంబున. 643

సీ. అతిథి భూసురుఁ డొక్కఁ డాహార మడిగినఁ గడపక ప్రియముతోఁ గారవించి
హరిసమర్పణ మంచు నన్నంబులో సగ మిచ్చిన భుజియించి యేఁగె నాతఁ
డంతలో నొకశూద్రుఁ డశనార్థి యై వచ్చి పొడసూప లే దనఁబోక తనకు
నున్న యన్నములోన నొకభాగ మిచ్చిన సంతుష్టుఁ డై వాఁడు సనిన వెనుక

ఆ. కుక్కగమియుఁ దాను నొక్కఁ డేతేర నా
యన్నశేష మిచ్చి [2]స న్నయమున
వాని మ్రొక్కి పంప వరుసతోఁ జండాలుఁ
డొక్కఁ డరుగుదెంచి చక్క నిలిచి. 644

క. హీనుఁడఁ జండాలుండను, మానవకులనాథ! దప్పి మానదు నవలం
బోనేర నీకుఁ జిక్కిన, పానీయము నాకుఁ బోసి బ్రతికింపఁగదే. 645

వ. అనిన వాని దీనాలాపంబులకుఁ గరుణించి, రా జి ట్లనియె. 646

ఉ. అన్నము లేదు [3]కొద్ది మధురాంబువు మాత్రము ద్రావ వన్న రా
వన్న! శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపదల్
గ్రన్ననఁ [4]దాల్చి వారికి సుఖంబులు సేయుటకంటె నొండు మే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ సుమ్ము పుల్కసా. 647

వ. అని పలికి. 648

---

1. యేలచెప్పఁగ వినుమిందునందు(తం.వా.) 2. సన్నయంబు, లాడిమ్రొక్కిపంప నోడక(క.చ.ట.తం.వా.) 3. కొన్ని మధురాంబువు లున్నవి త్రావుమన్న (తం. వా.) 4. మాన్చి (తం. వా.)

మ. బలవంతం బగు నీరువట్టున నిజప్రాణాంత మై యున్నచో
నలయం డేమియు వీని హృజ్జ్వరము [1]నాయాసంబు ఖేదంబు నా
జలదానంబున నేఁడు మాను ననుచుఁ సర్వేశ్వరాధీనుఁ డై
జలముల్ వోసెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్. 649

వ. తదనంతరంబున, బ్రహ్మాదిదేవతలు సంతోషించి, రంతిదేవునికి మేలు సేయం దలంచి, నిజాకారంబులతో ముందట నిలువంబడి, యా రాజు ధైర్యపరీక్షార్థంబు దమ చేసిన వృషలాదిరూపంబు లగు విష్ణుమాయ నెఱింగించిన, నా నరేంద్రుం డంద ఱికి నమస్కరించి. 650

క. వారల నేమియు నడుగక, నారాయణభక్తి తన మనంబున వెలుఁగన్
ధీరుం డాతఁడు మాయా, పారజ్ఞుం డగుచుఁ బరమపదముం బొందెన్. 651

క. ఆ రాజర్షి ని గొలిచిన, వారెల్లఁ దదీయ యోగవైభవమున శ్రీ
నారాయణచింతను లై, చేరిరి యోగీశు లగుచు సిద్ధపదంబున్. 652

వ. ఇట్లు రంతిదేవుండు విజ్ఞానగర్భిణి యగు భక్తివలనఁ బరమపదంబునకుం జనియె. అంత గర్గునకు శిని జన్మించె. శినికి గార్గ్యుండు గలిగె. ఆతనినుండి బ్రాహ్మణ కులం బయ్యె. మహావీర్యునికి [2]నురుక్షయుండు, నురుక్షయునకుఁ ద్రయ్యారు ణియు, కవియుఁ,బుష్కరారుణియు నను మువ్వురు సంభవించిరి. వారు బ్రాహ్మణు లై చనిరి. బ్రహ్మక్షత్రునికి సుహోత్రుండును, సుహోత్రునికి హస్తియు జనిం చిరి. అతండు దనపేర హస్తినాపురంబు నిర్మించె. ఆ హస్తికి నజమీఢుండును, ద్విమీఢుండును, పురుమీఢుండును నన ముగ్గురు జనియించిరి. అందు నజమీఢుని వంశంబునఁ బ్రియమేధాదులు గొందఱు పుట్టి, బ్రాహ్మణు లై చనిరి. అ య్యజమీఢునికి బృహదిషువు, నతనికి బృహద్ధనువు, నతనికి బృహత్కా యుండు, నతనికి జయద్రథుండు, అతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు సేనజిత్తు, సేనజిత్తునకు రుచిరాశ్వుండు, దృఢహనువు, కాశ్యుండు, వత్సుండు నన నలుగురు జనియించిరి. అందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండు, నతనికిఁ బృథుసేనుండును, బృథుసేనునికిఁ బారుండును, వానికి నీపుండును, నీపునికి నూర్వురు కొడుకులును బుట్టిరి. మఱియును. 653

ఆ. శుకుని కూఁతు రైన సుందరి సత్కృతిఁ
బొందువేడ్క నీపభూవిభుండు
విమల యోగవిత్తు విజ్ఞానదీపితో
దార[3]చిత్తు బ్రహ్మదత్తుఁ గనియె. 654

1. నారాటంబు (హ) 2. సుంక్షయుండు (తం) 3. విత్తు (హ)

వ. బ్రహ్మదత్తుండు, జైగిషవ్యోపదేశంబున, యోగతంత్రంబునఁజేసి [1]గోదేవి యను భార్యవలన విష్వక్సేనుం డను కుమారునిం గనియె. విష్వక్సేనునకు నుదక్సేనుండు, నుదక్సేనునకు భల్లాదుండు. వీరలు బార్హదిషవు లను రాజు లైరి. ద్విమీఢునకు యమీనరుండు, యమీనరునికిఁ గృతిమంతుండు, కృతిమంతునికి సత్యధృతి, సత్యధృతికిదృఢనేమి,దృఢనేమికి సుపార్శ్వకృత్తు,సుపార్శ్వకృత్తునకు సుపార్శ్వుండు సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతిమంతుండు జనించిరి. సన్నతిమంతు కొడుకు కృతి యనువాఁడు, హిరణ్యనాభునివలన యోగమార్గం బెఱింగి, శోకమోహంబులు విడిచి, తూర్పుదేశంబున సామసంహిత పఠియించె. అతనికి నుగ్రాయుధుండు, నుగ్రాయుధునకు క్షేమ్యుండు, క్షేమ్యునకు సువీరుండు, సువీరునకుఁ బురంజయుండు, బురంజయునకు బహురథుండు జన్మించిరి. హస్తి కొడుకు పురుమీఢునకు సంతతి లేదయ్యె. అ య్యజమీఢునికి నళిని యను భార్య యందు నీలుండు, నీలునికి శాంతి, శాంతికి సుశాంతి, సుశాంతికిఁ బురుజుండు, పురుజునికి నర్కుండు, నర్కునికి భర్మ్యాశ్వుండు, భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు కాంపిల్య సృంజయు లనువా రేవురు పుట్టిరి. 655

క. మించిన భర్మ్యాశ్వుఁడు సుత, పంచకమును జూచి విషయపంచకమును వ
ర్జించితి మే మని పల్కినఁ, బాంచాలురు నాఁగ సుతులు పరఁగిరి ధరణిన్. 656

వ. అంత ముద్గలుని నుండి, బ్రాహ్మణ కులం బై ముద్గలగోత్రంబు నా నెగడె. భర్మ్యాశ్వ పుత్రుం డైన యా ముద్గలునికి దివోదాసుండు, నహల్య యను కన్యకయునుం బుట్టిరి. అహల్యయందు గౌతమునికి శతానందుండు పుట్టె. శతానందునికి ధనుర్వేద విశారదుం డైన [2]సత్యధృతి పుట్టె. అతనికి శరద్వంతుండు పుట్టె. అతం డొక్కనాఁడు వనంబున నూర్వశిం గనిన, నతనికి రేతః పాతం బై, తద్వీర్యంబు శరస్తంబంబునం బడి, మిథునం బైన సమయంబున.

క. చపలరతి శంతనుం డను, నృపవరుఁ డడవికిని వేఁటనెపమునఁ జనుచుం
గృపతో శిశుయుగముం గని, కృపియుం గృపుఁ డనుచుఁ దెచ్చి గృహమునఁ
బెంచెన్. 658

## అధ్యాయము - ౨౨

వ. ఆ కృపి ద్రోణునకు భార్య యయ్యె. దివోదాసునకు మిత్రాయువు, మిత్రాయువునకుఁ జ్యవనుండు, చ్యవనునకు సుదాసుండు, సుదాసునకు సహదేవుండు, సహదేవునకు సోమకుండు, సోమకునకు సుజన్మకృత్తు, సుజన్మకృత్తునకు నూర్వురు

1. సరస్వతి (క) 2. సత్యధృతిపుట్టె నతం డొక్కనాఁడు (హా. తం. వా.)

కొడుకులుం గలిగిరి. *(వారిలో జంతు వనువాఁడు జ్యేష్ఠుండు.) కడచూలు [1]పృషదుండు. పృషదునకు ద్రుపదుండు, ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదు లయిన కొడుకులును, ద్రౌపది యను కూఁతురుం గల్గిరి. ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతువు పుట్టె. వీరలు పాంచాల రాజు లని యెఱుంగుము. మఱియు, న య్యాజమీఢుని కొడుకు ఋక్షుండు. ఋక్షునకు సంవరణుం డుదయించె. ఆ సంవరణుండు తపతి యనియెడి సూర్యకన్యక యందుఁ గురువుం గనియె. ఆ కురువు పేరం గురుక్షేత్రం బయ్యె. ఆ కురువునకుఁ బరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుండు ననువారలు నలువురు పుట్టిరి. అందుఁ బరీక్షిత్తు కొడుకులు లేక చనియె. సుధనువునకు సుహోత్రుండు, నతనికి చ్యవనుండు, చ్యవనునకుఁ గృతి, [2]కృతికి నుపరిచర వసువు, వసువునకు బృహద్రథ, కుసుంబ, మత్స్య, ప్రత్యగ్ర, చేదిపాదులు పుట్టిరి. అందు, బృహద్రథు నకుఁ గుశాగ్రుండు, గుశాగ్రునికి ఋషభుండు, ఋషభునికి సత్యహితుండు, సత్యహితునికిఁ బుష్పవంతుండు, బుష్పవంతునకు జహ్ను వను వాఁడు జనియించిరి. మఱియును.

సీ. ఆ బృహద్రథునకు నన్యభార్యా గర్భమున రెండు [3]తనుఖండములు జనించెఁ
దునుకలు గని తల్లి తొలఁగంగ వైచిన సంధించె నొకటిగా జర యనంగ
నొక దైత్యకాంత వాఁ డొప్పె జరాసంధుఁ డన గిరివ్రజపుర మాతఁ డేలె
నతనికి సహదేవుఁ డతనికి సోమాపి తనయుఁ డాతనికి శ్రుతశ్రవుండు

తే. జహ్నుపుత్రుండు సురథుండు జనవరేణ్య!
యతని కొడుకు విదూరథుఁ డతని పట్టి
సార్వభౌముండు వానికి సంభవుండు
విను జయత్సేనుఁ డనువాఁడు విమలకీర్తి. 660

వ. ఆ జయత్సేనునికి రథికుండు, రథికునకు నయుతాయువు, నయుతాయువునకుఁ గ్రోధనుండుఁ, గ్రోధనునకు దేవాతిథి, దేవాతిథికి ఋక్షుండు, ఋక్షునికి భీమసేనుండు, వానికిఁ బ్రతీపుండుఁ, బ్రతీపునకు దేవాపి శంతను బాహ్లికు లను మువ్వురు కొడుకులు పుట్టిరి. అందు. 661

సీ దేవాపి రాజ్యంబు దీర్పనొల్లక వనంబున కేఁగెఁ దమ్ముండు పూర్వజన్మ
మందు మహాభిషుఁ డనియెడు వాఁడు శంతనుఁ డయ్యె వాఁడె యీ ధాత్రినెల్ల
నేలుచుఁ గరముల [4]నే వృద్ధు ముట్టిన వాఁడెల్ల నిండుజవ్వనము నొందు
[5]నతఁడు శాంతిప్రాప్తుఁ డై యున్నఁ దానఁ బండ్రెండేండ్లు వజ్రి వర్షింప కున్న

---

* తా.ప. ప్రతులలో లేదు. 1. పృషతుండు (తం.వా.); ''పృషద స్తతః'' అని మూలము (22-2) 2. కృతికివసువు (హ.తం.వా.); 'చ్యవన స్తత్సుతః కృతీ; వసు స్తస్యోపరి చరో' (22-5) 3. తగఖండములు (హ) 4. నెవని ముట్టినఁ గాని (హ) 5. నధిక (హ)

ఆ. వృష్టిలేని చొప్పు విప్రుల నడిగిన
"నన్న యుండఁ దమ్ముఁ డగ్నిహోత్ర
దార సంగ్రహంబుఁ దాల్చినఁ" బరివేత్త
[1]యండ్రు వాని నీవ యతఁడ వైతి. 662

వ. అది కారణంబుగా నన్న యుండఁ దమ్ముఁడు రాజ్యార్హుండు గాఁడు. నీవు పరివేత్తవు. మీ యన్నకు రాజ్యం బిచ్చిన, ననావృష్టి దోషంబు చెడు. అని బ్రాహ్మణులు వల్కిన, శంతనుండు వనంబునకుం జని, దేవాపికిఁ బ్రియంబు చెప్పి, రాజ్యంబు చేకొమ్మని పల్కె. అంతకు మున్న [2]వాని మంత్రి దేవాపిని రాజ్యంబున కనర్హుం జేయఁదలంచి, విప్రులం బంచిన, నా విప్రులు పాషండమత వాక్యంబులు దేవాపికి నుపదేశించిరి. దేవాపి వేదంబుల నిందించినఁ, బాషండుండును, దేవదూషకుండును గావున వానికి రాజ్యంబు లే దని బ్రాహ్మణులు సెప్పిన, శంతనుండును మగుడి వచ్చి, రాజ్యంబుఁ జేకొనియె. అంత వర్షంబులు గురిసె. ఇ వ్విధంబున. 663

క. దేవాపి కలాపపురం, బావాసము గాఁగ యోగి యై యున్నాఁ డు
ర్వీవర ! కలి నష్టం బగు, జైవాత్మక కులము మీఁద సంస్థాపించున్. 664

వ. బాహ్లీకుం డనువానికి సోమదత్తుండు పుట్టె. సోమదత్తునకు భూరియు, భూరిశ్రవస్సు, శలుం డను వారు ముువ్వురు పుట్టిరి. 665

క. *భాతిగ శంతనునకు గంగాతటినికి వైష్ణవాగ్రగణ్యుఁడు ఘోరా
రాతినయన నీలోత్పల, భీతికర గ్రీష్ముఁ డైన భీష్ముఁడు పుట్టెన్. 666

ఆ. పరశురాముతోడఁ బ్రతిఘటించి జయింప
[3]నన్యు నొకని నెఱుఁగ మతనిఁ దక్క
వీరయూథపతి వివేక ధర్మజ్ఞుండు
[4]వేల్పుటేటిపట్టి విమలయశుఁడు. 667

---

1. యండ్రుగాన (తం. వా.) 2. వాని తండ్రి దేవాపిని రాజ్యంబున కర్హుం జేయం దలంచి విప్రులం బిలిచిన (హ. తం. వా.)

* ఈ క్రిందిది "హ" ప్రతిపాఠము.

క. భాతిగ శంతనునకు సుజ్ఞాతుం డై గంగయందు జనియించెను స
ద్ఖ్యాతి విమల కీర్తులచే, నాతత వ్యోముండు భీష్ముఁ డాత్మజ్ఞుఁడుగా"

3. నన్యుఁడొకఁడు....మతఁడుదక్క (హ) 4. దివిజనది సుతుండు దేవసముఁడు (హ)

వ. ఆ శంతనునకు దాశకన్యక యైన సత్యవతియందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులు పుట్టిరి. అందుఁ [1]జిత్రాంగదుండు (చిత్రాంగదుండను) గంధర్వుని చేత నిహతుఁ డయ్యె. మఱియును. 668

ఉ. సత్యవతీ వధూటి మును శంతను పెండ్లము గాని నాఁడు సాం
గత్యమునం బరాశరుఁడు గర్భము చేసిన బాదరాయణుం
డత్యధికుండు శ్రీహరి కళాంశజుఁ డై ప్రభవించె [2]నిత్యముల్
సత్యము లైన వేదముల సాంగములన్ విభజింప దక్షుఁ డై. 669

ఆ. బాదరాయణుండు భగవంతుఁ డనఘుండు
పరమగుహ్య మైన భాగవతము
నందనుండ నైన నాకుఁ జెప్పెను శిష్య
జనుల మొఱఁగి యేను జదువుకొంటి. 670

వ. ఆ విచిత్రవీరునికిఁ గాశిరాజు కూఁతుల, నంబి కాంబాలికల భీష్ముండు బలాత్కారంబునం దెచ్చి వివాహంబుచేసిన, విచిత్రవీర్యుండు వారలం దగిలి, మనోజరాగ మత్తుం డై, చిరకాలంబు నానావిధ క్రీడలన్ విహరింపుచు, రాజయక్ష్మ పీడితుం డై, మృతుం డయ్యె. అంత. 671

క. అతని [3]సతివలన సుతులను, సుత ! కను మని దల్లి వనుప సౌరదిం గనియెన్
ధృతరాష్ట్ర పాండు విదురుల, నుతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా !

వ. అందు, ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనాదు లగు కొడుకులు నూర్వురును, దుశ్శల యను కన్యకయును, జన్మించిరి. మృగశాప భయంబునం జేసి, భార్యం బొంద వెఱచిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్ర ప్రసాదంబున యుధిష్ఠిర భీమార్జును లను ముువ్వురును, మాద్రిదేవివలన నాసత్యప్రసాదంబున నకుల సహదేవు లనువా రిద్దరును గా నేవురు పుట్టిరి. అ య్యేవురకును ద్రుపదరాజ పుత్రి యైన ద్రౌపదియందుఁ గ్రమంబునం † ప్రతివింధ్యుండును, శ్రుతుసేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతకర్ముండు నన నేవురు పుట్టిరి. మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును, భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును, గాశియందు సర్వగతుండును, సహదేవునికి విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును.

---

1. చిత్రాంగదుండు గంధర్వులచేత నిహతుం డయ్యె(హా.తం వా.) 2. చోరహ్యాత్, దైత్యకరావ కౢప్త మిశితస్థితవేద విభాగదక్షుఁడై (క. చ. ట. త. జ.) 3. సతులవలన సుతుల (తం. వా.)

* "యుధిష్ఠిరాత్ప్రతీ వింధ్యః" (22-29) అని మూలము.

నర్జునునకు నులూపియను నాగ కన్యకయందు నిరావంతుండును, మణలూరు పతి పుత్రికయైన చిత్రాంగదయందు బభ్రువాహనుండును, సుభద్రయందు శౌర్య ధైర్య తేజో విభవంబుల నఖిల రాజనికరంబునఁ బ్రఖ్యాతుం డైన యభిమన్యుం డును జన్మించిరి. అందుఁ బభ్రువాహనుం డర్జునుని నియోగంబున మాతా మహుని గోత్రంబునకు వంశకర్త యయ్యె. 673

ఉ. అన్యసుపూజ్య! నీ జనకుఁ డై యభిమన్యుఁడు భూవరేంద్ర మూ
ర్ధన్యుఁడు [1]ధన్వ మార్గణ కదంబ విదారిత వైరివీర రా
జన్యుఁడు జన్యభీత కురుసైన్యుఁడు సైన్యసమూహనాథ ధృ
ష్టద్యుమ్నుఁడు మాన్య కీర్తి మహిమం దనరెం గురువంశకర్త యై. 674

వ. ఆ యభిమన్యునకు నుత్తరయందు నీవు జన్మించితివి. 675

క. ద్రోణసుతు తూపు వేఁడిమిఁ, బ్రాణంబులఁ బాసి హరి కృపాదర్శన సం
త్రాణంబున బ్రతికితె కా, క్షోణీశ్వర! మున్ను నీ శిశుత్వము వేళన్. 676

వ. నీ కుమారులు జనమేజయ శ్రుతసేన భీమసేనోగ్రసేను లను నల్వురు. వీరల యందు. 677

ఆ. నీవు తక్షకాహి నిహతుఁడ వని విని
సకల సర్పలోక సంహృతముగ
సర్పయాగ మింక జనమేజయుఁడు సేయఁ
గలఁడు పూర్వరోష కలితుఁ డగుచు. 678

వ. మఱియు నతఁడు సర్వధరణీ మండలంబును జయించి, కావషేయుండు పురోహితుండుగా నశ్వమేధంబు సేయఁగలవాఁడు. వానికి శతానీకుండు జనియించి, యాజ్ఞవల్క్యుని [2]తోడ వేదంబులు పఠియించి, కృపాచార్యునివలన [3]విలువిద్య నేర్చి, శౌనకునివలన నాత్మజ్ఞానంబునుం బడయంగలవాఁడు. ఆ శతానీకునికి సహస్రానీకుండు, వానికి నశ్వమేధజుండు, నశ్వమేధజునికి నాసీమకృష్ణుండు, నాసీమకృష్ణునకు నిచకుండు జనియించిరి. ఆ నిచకుఁడు గజాహ్వయంబు నదిచే హృతంబుగాఁ గౌశాంబియందు వసియించు. అతనికి నుప్తుండు, ఉప్తునికిఁ జిత్రరథుండు, చిత్రరథునకు శుచిరథుండు, శుచిరథునికి వృష్టిమంతుండు, వృష్టిమంతునికి సుషేణుండు, సుషేణునికి సుపీతుండు, సుపీతునికి నృచక్షుస్సు, నృచక్షుస్సుకు సుఖానిలుండు, సుఖానిలునికిఁ బరిప్లవుండు, పరిప్లవునకు మేధావి, మేధావికి సునయుండు,

---

1. ధర్మమార్గణ (జ. డ. బ.) 2. యందు (హ) 3. తత్త్వజ్ఞానంబు (హ)

సునయునికి నృపంజయుండు, నృపంజయునికి దూర్వుండు, దూర్వునికి నిమి, నిమికి బృహద్రథుండు, బృహద్రథునకు సుధాంశుండు, సుధాంశునికి శతానీకుండు, శతానీకునకు దుర్దమనుండు, దుర్దమనునికి విహీనరుండు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుండు, మితునకు క్షేమకుండు, క్షేమకునకు బ్రహ్మక్షత్రుండు పుట్టిరి. వాఁడు నిర్వంశుం డై, దేవర్షి సత్కృతుం డై, కలియుగంబునందుఁ జనంగలవాఁడు. 679

క. జగతి నిటమీఁద బుట్టెడు, మగధాధీశ్వరుల నిఖిల మనుజేశ్వరులన్
నిగమాంతవిదులఁ జెప్పెద, సుగుణాలంకార ! ధీర ! సుభగవిచారా ! 680

వ. జరాసంధపుత్రుఁ డైన సహదేవునికి మార్జాలి, మార్జాలికి శ్రుతశ్రవస్సు, శ్రుతశ్రవస్సుకు నయుతాయువు, నయుతాయువునకు నిరమిత్రుండు, నిరమిత్రునకు సునక్షత్రుండు, సునక్షత్రునికి [1]బృహత్సేనుండు, బృహత్సేనునికిఁ గర్మజిత్తు, కర్మజిత్తునికి శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు, విప్రునకు శుచి, శుచికి క్షేముండు, క్షేమునికి సువ్రతుండు, సువ్రతునకు ధర్మనేత్రుండు, ధర్మనేత్రునకు శ్రుతుండు, శ్రుతునకు దృఢసేనుఁడు, దృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తుకుఁ బురంజయుండును, జన్మించెదరు. అని చెప్పి, మఱియు ని ట్లనియె. 681

ఆ. వినుము మగధదేశవిభులు జరాసంధ
ప్రముఖ ధరణిపతులు ప్రబలయశులు
వీరు కలియుగమున వెయ్యేండ్లలోపల
పుట్టి గిట్టఁగలరు భూవరేంద్ర. 682

## అధ్యాయము - ౨౩

వ. యయాతికొడుకు కనువునకు సభానరుండు, చక్షువు, పరోక్షుండు ననువారు ముగ్గురు పుట్టిరి అందు సభానరునికిఁ గాలనాథుండు, కాలనాథునకు సృంజయుండు, సృంజయునకుఁ బురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాశాలుండు, మహాశాలునికి మహామనసుఁడు, మహామనసునకు నుశీనరుండు, తితిక్షు వన నిరువురు జన్మించిరి. అం దుశీనరునకు శిబియు, వనుండును, క్రిమియు, దర్పుండు నన నలువురు జన్మించిరి. అందు శిబికి వృషదర్ప సువీర మద్ర కేకయులు నలువురు పుట్టిరి. తితిక్షునకు రుశద్రథుండు, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపుండు, సుతపునకు బలి పుట్టిరి. ఆ బలి క్షేత్ర

---

1. "బృహత్‌క్షత్రః" (అని మూలము)

మున దీర్ఘతముని వలన అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్రాంధ్రు లను పేళ్ళు గలవా రార్వురు కుమారులు పుట్టిరి. వారలు తూర్పుదేశంబునకు రాజులై, దేశంబులకుఁ దమతమ నామధేయంబు లిడి యేలిరి. సుపీరునకు సత్యరథుఁడు, సత్యరథునికి [2]నిరథుండు, నిరథునికి ధర్మరథుండు, ధర్మరథునకుఁ జిత్రరథుండు పుట్టిరి. ఆ చిత్రరథుండు రోమపాదుండు నాఁ బరఁగె. 683

క. సంతతి లేనికతంబునఁ జింతింపుచు నుండ నతని చెలికాఁ డగు ధీ
మంతుఁడు దశరథుఁ డతనికి, సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్. 684

వ. అంత రోమపాదుఁడు తనకూఁతురు శాంత యని కైకొని మెలఁగుచుండ, నా రాజు రాజ్యంబునం గొంతకాలంబు వర్షంబులేమికిం జింతించి, విభాండకసుతుం డైన ఋశ్యశృంగుండు వచ్చిన వర్షంబు గురియు నని పెద్దలవలన నెఱింగి. 685

క. ఆ రాజు ఋశ్యశృంగుని, ఘోర తపోనిరతుఁ దెచ్చుకొ మ్మనికై పనిచెన్
వారసతుల నేర్పరుల ను, దారస్తనభార భీరుతర మధ్యగలన్. 686

వ. వారును జని. 687

ఆ. కాంతలార! మెగము గన్నది మొదలుగా
నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన
గోఁచి బిగియఁగట్టుకొనిన యా వడుగని
మత్తకాని రతికి మరప వలయు. 688

వ. అని పలుకుచు. 689

క. ఆడుచుఁ జెవులకు నింపుగఁ, బాడుచు నాలోక నిశితబాణౌఘములన్
వీడుచు డగ్గఱ నోడుచుఁ, జేడియ లా [2]తపసి కడకుఁ జేరిరి [3]కలఁపన్. 690

వ. అ య్యవసరంబున వారలం జూచి. 691

సీ. మిళితాళినీల ధమ్మిల్లభారంబులు చారు జటావిశేషంబు లనియు
శర్మాంచ లోజ్జ్వల ప్రభ దుకూలంబులు తత చర్మవస్త్ర భేదంబు లనియు
బహు రత్నకీలిత భాసురదామంబు లధిక రుద్రాక్షమాలాదు లనియు
మలయజ మృగనాభి మహిత లేపంబులు బహువిధ భూతిలేపంబు లనియు

తే. మధురగానంబు శ్రుతియుక్త మంత్రజాతు
లనియు వీణెలు దండంబు లనియు సతుల
మూర్తు లెన్నఁడు నెఱుఁగని ముగుదతపసి
వారిఁ దాపసు లని డాయ వచ్చి మ్రొక్కె. 692

---

1. దివిరథుండు (తం. వా); హవిరథః (మూలము) 2. వడుగు చెంతఁజేరి (జ): తపసి వడుగుఁజేరిరి (తం) 3. కలవన్ (హ)

వ. ఇట్లు వచ్చి మ్రొక్కిన ఋశ్యశృంగుం జూచుచు నగుచు డగ్గఱి. 693

సీ. సేమమే యని సతుల్ చేతుల గ్రుచ్చి కర్కశకుచంబులు మోపి కౌఁగిలించి
చిర తపోనియతి డస్సితి గదా యని మోముఁ [1]గంఠంబు నాభియుఁ గలయఁ బుణికి
[2]క్రొత్త దీవన లివి కొను మని పీనుల పొంత నాలుకలఁ జప్పుళ్ళు చేసి
మా వనంబుల పండ్లు మంచివి తిను మని పెక్కు [3]లడ్వంబులు ప్రీతి నొసఁగి

తే. †చర్మవస్త్రము వదలించి భర్మకాంతి
మించి చెలఁగు పీతాంబర మిచ్చి వెసను
మనము సొక్కంగ నతనిఁ జేకొనఁగ వారి
మఱుఁగునకుఁ జేరె నతఁడు వే మరగి వారి. 694

వ. ఇట్లు హారిణీసుతుండు [4]కాంతాకటాక్ష పాశబద్ధుం డై, వారలవెంటం జని, రోమపాదుకడకుం బోయిన, నతండు, దన ప్రియనందన యైన శాంత నిచ్చి పురంబున నునిచికొనియె. అ మ్మునీశ్వరుండు వచ్చిన వర్షప్రతిబంధ దోషంబు చెడి వర్షంబు గురిసె. అంత. 695

ఆ. ఆ నృపాలచంద్రుఁ డనపత్యుఁ డై యుంట
యెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁ గూర్చి
యిష్టి చేసి సుతుల నిచ్చె నాతనికృపఁ
బంక్తిరథుఁడు పిదపఁ బడసె సుతుల. 696

వ. ఆ రోమపాదునకుఁ జతురంగుండును, జతురంగునకుఁ బృథులాక్షుండును, బృథులాక్షునికి బృహద్రథుండు, బృహత్కర్మ, బృహద్భానుండు నను వారు ముువ్వురును బుట్టిరి. అందు బృహద్రథునకు బృహన్మనస్సును, బృహన్మనస్సుకు జయద్రథుండును, జయద్రథునకు విజయుండును, విజయునకు సంభూతి యను భార్యయందు ధృతియు, నా ధృతికి ధృతవ్రతుండును, ధృతవ్రతునకు సత్యకర్ముండును, సత్యకర్మునకు నతిరథుండును జన్మించిరి. 697

---

1. కందువ (చ. ట. జ. బ. తం) 2. క్రొత్తగా మమ్ముఁ జేకొనుమని (హ)
3. భక్ష్యంబులు (హ. వా)

† క-బ ప్రతులలో పాఠమిట్లున్నది.
నూతనాజినంబు నునుపిది మేలని, గోచి విడిచి మృదుదుకూల మిచ్చి
మౌని మరగ జేసి మాపర్ణశాలకు, బోద మంచు గొంచు పోయి రతని.

4. హారిణీ సుతుండు వచ్చిన కతంబున (వ్రాఁతప్రతు లన్నిట)

గీ. కుంతి పిన్ననాఁడు గోరి సూర్యునిఁ బొంద
బిడ్డఁ డుదితుఁ డైనఁ బెట్టెఁ బెట్టి
గంగనీట విడువఁ గని యతిరథుఁ డంతఁ
గర్ణుఁ డనుచుఁ గొడుకు గారవించె. 698

వ. ఇట్లతిరథునకుఁ గానీనుం డైన కర్ణుండు కొడు కయ్యె. కర్ణునకు వృషసేనుండు పుట్టె. అ య్యయాతికొడు కైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, బభ్రుసేతువునకు నారబ్ధుండు, నారబ్ధునకు గాంధారుం, డా గాంధారునకు ఘర్మ్ముండు, ఘర్మ్మునకు ఘృతుండు, ఘృతునకు దుర్మదుండు, దుర్మదునకుఁ బ్రచేతస్సు జనించిరి. ప్రచేతస్సునకునూఱుగురు పుట్టి, మ్లేచ్ఛాధిపతు లై, యుదీచీదిశ నాశ్రయించిరి. తుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుండు, భర్గునకు భానుమంతుండు, భానుమంతునకుఁద్రిసానువు, త్రిసానువుకుఁ గరంధముండు, కరంధమునకు నుదారచిత్తుం డైన మరుత్తుండును బుట్టిరి. అతనికి యయాతి శాపంబున సంతతి లే దయ్యె. వినుము. 699

—: యదువంశ చరిత్రము :—

చ. అనఘ! యయాతి పెద్దకొడు కైన యదుక్షితిపాలు వంశముల్
వినినఁ బఠించినన్ నరుఁడు వెండియుఁ బుట్టఁడు ముక్తిఁ బొందు న
య్యనుపమ మూర్తి [1]విష్ణుఁడు నరాకృతిఁ బొంది జనించెఁ గావునన్
వినుము నరేంద్ర! [2]నీకు నిది వీనుల పండువు గాఁగఁ జెప్పెదన్. 700

వ. యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుండు, రిపుండు నను వారు నలువురు సంభవించిరి. అందుఁ బెద్దకొడు కైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె. ఆ శతజిత్తుకు మహాహయ, వేణుహయ, హేహయు లను వారు ముగ్గురు పుట్టిరి. అందు హేహయునకు ధర్మ్ముండు, ధర్మ్మునకు నేత్రుండు, నేత్రునకుఁ గుంతి, కుంతికి మహిష్మంతుండు, మహిష్మంతునకు భద్రసేనుండు, భద్రసేనునకు దుర్మదుండు, దుర్మదునికి ధనికుండు, ధనికునికిఁ గృతవీర్యుండు, కృతాగ్ని, కృతకర్మ, కృతేజుఁ డను నలువురు సంభవించిరి. అందుఁ గృతవీర్యునికి నర్జునుండు జనియించె. అతండు మహాబుద్ధిబలంబున. 701

సీ. హరి కళాసంజాతుఁ డైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధిఁ బొంది
బహు యజ్ఞ దాన తపంబులు గావించి సకల దిక్కులు గెల్చి జయముతోడ
సతతంబు హరి నామ సంకీర్తనము సేసి [3]ధనముల నొంది యుదారవృత్తి
నెనుబదియైదువే లేండ్లు భూచక్రంబు [4]ఘనకీర్తిఁ దన పేరుగాఁగ నేలె

1. విష్ణుఁ డపరాకృతి (హ) 2. నాపలుకు (హ. తం. వా.) 3. ధనములు నమ్మ కుదారవృత్తి (క. తం.) 4. కలదెల్ల (క-బ.)

ఆ. ముదిమి లేక తరుణమూర్తి యై యురుకీర్తి
నమరెఁ గార్తవీర్యుఁ [1]డనఁగ విభుఁడు
నిజము వానిభంగి నేల యేలినయట్టి
రాజు నెఱుఁగ మెందు రాజముఖ్య! 702

వ. ఆ యర్జునునకుంగల పుత్రసహస్రంబునం బరశురామునిబారికిం దప్పి, జయధ్వజుండు, శూరసేనుండు, వృషణుండు, మధువు, నూర్జితుం డను వా రేవురుం బ్రతికిరి. జయధ్వజునకుఁ దాళజంఘుండు, తాళజంఘునకు నౌర్వముని తేజంబున నూర్వురు కొడుకులుఁ గలిగిరి. అందుఁ బ్రథముండు వీతిహోత్రుండు. మధువునకు వృష్ణుండు, వృష్ణునకుఁ బుత్రశతంబు పుట్టె. ఆ వంశంబువారు మాధవులును, బ్రథముండు వృష్ణి గాన, వృష్ణులు యాదవులు ననఁ బరఁగిరి. యదుపుత్రుం డయిన క్రోష్టువునకు వృజినవంతుండు, వృజినవంతునకు శ్వాహితుండు, శ్వాహితునకు భేరుశేకుండు, భేరుశేకునకుఁ జిత్రరథుండు, చిత్రరథునకు శశిబిందుండు పుట్టిరి. 703

మ. కృశమధ్యల్ పదివేవు రంగనలతోఁ గ్రీడం బ్రమోదింప స
త్కుశలుం డై పదివేలలక్షలు సుపుత్రుల్ భక్తి సేయం జతు
ర్దశరత్నుండును యోగి నాఁ బరఁగి సప్తద్వీప రాజేంద్రుఁ డై
శశిబిందుం డురు నీతిమంతుఁ డమరెన్ సత్కాంతి పూర్ణేందుఁ డై. 704

వ. అతని కొడుకుల మొత్తంబులకు ముఖరు లైన యార్వురలోఁ బృథుశ్రవుఁ డను వానికి ధర్ముండు పుట్టె. ధర్మునకు నుశనుండు పుట్టి, నూ ఱశ్వమేధంబులు సేసె. అ య్యుశనునకు రుచకుండు పుట్టె. ఆ రుచకునకుఁ బురుజిత్తు, రుక్మండు, రుక్మేషువు, పృథువు, జ్యామఘుండు నను వా రేవురు పుట్టిరి. అందు జ్యామఘుండు.

సీ. తొట్రు కొల్పెడు శైబ్యతోడి ప్రేమంబున ననపత్యుఁ డయ్యును నన్యభార్యఁ
గై కొన కొకకొంత కాలంబునకుఁ బోయి పగవారియింటను బలిమిఁ బట్టి
యొకకన్యఁ దేరిపై నునిచి తోడ్తేరంగ జననాథుఁ గన్యను శైబ్య చూచి
కోపించి మానవకుహక! యీ పడుచును [2]దెచ్చియు నే నుండఁ దేరిమీఁదఁ

ఆ. బెట్టినాఁడ వనుచు బిఱుసులు పలుకంగ
నతఁడు వలికె నంత నతివతోడ
నాకుఁ గోడ లింత నమ్ము మీ లలితాంగి
సవతి గాదు వినుము సత్య మనుచు. 706

---

1. డర్జునుండు (క-బ.) 2. దెచ్చి యేనుండెడి తేరిమీఁద (తం)

వ. అ య్యవసరంబున శైబ్యకొడుకుం గాంచు నని యెఱింగి, విశ్వేదేవతలును, పితృదేవతలును సంతసించిరి. వారల ప్రసాదంబున. 707

క. [1]తన సవతి మొఱఁగి పెనిమిటి, తనుఁ బొందిన శైబ్య మఱి విదర్భునిఁ గని యెౘ దనయుఁ గని జ్యామఘుండును, దన తెచ్చినకన్యఁ దెచ్చి తనయున కిచ్చెౘ.708

అధ్యాయము - ౨౪

వ. ఆ కన్యకయందు విదర్భునకుఁ గుశుండును, క్రథుండును, రోమపాదుండునుం బుట్టిరి. రోమపాదునకు బభ్రువు, బభ్రువునకు విభువు, విభువునకుఁ గృతి, కృతికి నుశికుండు, ఉశికునకు చేది, చేదికి చైద్యాదులు పుట్టిరి. క్రథునకుఁ గుంతి, కుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుండు, దశార్హునకు వ్యోముండు, వ్యోమునకు జీమూతుండు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుండు, భీమ రథునకు నవరథుండు, నవరథునకు దశరథుండు, దశరథునకు శకుని, శకునికిఁ గుంతి, కుంతికి దేవరాతుండు, దేవరాతునకు దేవక్షత్రుండు, దేవక్షత్రునకు మధువు, మధువునకుఁ గురువశుండు, కురువశునకు ననువు, అనువునకుఁ బురు హోత్రుండు, నతనికి నంశువు, నతనికి సాత్త్వతుండు, సాత్త్వతునకు భజమా నుండును, భజియు, దివ్యుండును, వృష్ణియు, దేవావృధుండును, నందకుండును, మహాభోజుండు నను నేడ్గురును బుట్టిరి. అందు భజమానునకుఁ బ్రథమభార్యయందు నిమ్రోచి కంకణ వృష్ణులు మువ్వురును, రెండవ భార్యయందు శతజిత్తు, సహస్ర జిత్తు, అయుతజిత్తు నను మువ్వురును బుట్టిరి. అందు దేవావృధునికి, బభ్రువు పుట్టె. వీర లిరువుర ప్రభావంబులఁ బెద్దలు శ్లోకరూపంబునఁ బఠియించుదురు. అట్టి శ్లోకార్థం బెట్టి దనిన. 709

తే. వినుము దూరంబు [2]నం దేమి వినుచునుందు
[3]మదియ చూతుము డగ్గఱ నరుగుదేర
నరులలో బభ్రుకంటెను నున్నతుఁడు లేఁడు
యోజ దేవా[1]వృధున కెన యొరుఁడు గలఁడె. 710

క. పదునాలుగు వేవురు నఱు, వది[4]యేవురు నరులు ముక్తి వడసిరి బభ్రుం డుదితుఁడు దేవావృధుఁడును, బదపడి యోగంబుఁ దెలియఁ బలికిన కతనౘ.

వ. మహాభోజుం డతిధార్మికుండు. వాని వంశంబువారు భోజు లని పలుకంబడిరి. వృష్ణికి సుమిత్రుండును, యుధాజిత్తును జన్మించిరి. అందు యుధాజిత్తునకు

1. తన చెలువలాతి పెనిమిటి (క. చ.) 2. నాడిన (హ) 3. మఱియుఁ జూడము (హ)
4. నాలుగు (హ)

శినియు, అనమిత్రుండును జనించిరి. అనమిత్రునికి నిమ్నుండు, నిమ్ననికి సత్రాజితుండు, ప్రసేనుండు నన నిరువురు వుట్టిరి. మఱియు, ననమిత్రునికి శిని యను వాఁడు వేఱొకండుఁ గలఁడు. అతనిపుత్రుండు సత్యకుండు. అతనికి యుయుధానుం డనఁ బరఁగిన సాత్యకియు, నా సాత్యకికి జయుండును, జయునకుం గుణియు, నా కుణికి యుగంధరుండును బుట్టిరి. మఱియు ననమిత్రునకుఁ బృశ్ని యను వేఱొక కొడుకుం గలఁడు. వానికి శ్వఫల్క చిత్రకులు గలిగిరి. అందు శ్వఫల్కునకు గాందినియం దక్రూరుండును, నసంగుండును, సారమేయుండును, మృదుకుండును, మృదుపచ్ఛివుండును, వర్మదృక్కును, ధృష్టవర్ముండును, క్షత్రోపేక్షుండును, అరిమర్దనుండును, శత్రుఘ్నుండును, గంధమాదుండును, ప్రతిబాహువు ననువారు పన్నిద్దఱు కొడుకులును, సుచారు వను కన్యకయుం జనించిరి. వారియం దక్రూరునికి దేవలుండును, అనుపదేవుండును బుట్టిరి. మఱియుఁ జిత్రునకుఁ బృథుండును, విడూరథుండును, మొదలుగాఁ గలవారు పెక్కండ్రు వృష్ణివంశజాతు లయిరి. భజమానుండు, కుకురుడు, శుచి, కంబళబర్హిషుండు నన నలువు రంధకునికిఁ బుట్టిరి. కుకురునకు వృష్ణి, వృష్ణికి విలోమతనయుండు, విలోమతనయునికి కపోతలోముండు, కపోతలోమునికిఁ దుంబురుసఖుం డైన యనువు, అనువునకు దుందుభి, దుందుభికి దవిద్యోతుండు, దవిద్యోతునకుఁ బునర్వసువు, అతనికి ఆహుకుం డను కుమారుండును, ఆహుకి యను కన్యకయుం గలిగిరి. ఆ యాహుకునికి దేవకుండు, ఉగ్రసేనుండు నన నిరువురు జనించిరి. అందు దేవకునికి దేవలుండు, అనుపదేవుండు, సుదేవుండు, దేవవర్ధనుం డన నలుగురు గలిగిరి. వారలకు ధృతదేవయు, శాంతిదేవయు, ఉపదేవయు, శ్రీదేవయు, దేవరక్షితయు, సహదేవయు, దేవకియు ననఁ దోఁబుట్టువు లేడ్వురు గలిగిరి. 712

క. అసదృశ లలితాకారలఁ, గిసలయ కరతలల దేవకీముఖ్యల నా
బిసరుహనయనల నందఱ, వసుదేవుఁడు పెండ్లియాడె వసుధాధీశా ! 713

వ. ఉగ్రసేనునకుఁ గంసుండును, న్యగ్రోధుండును, సునామకుండును, కహ్వుండును, శంకుండును, సుభువును, రాష్ట్రపాలుండును, విసృష్టుండును, తుష్టిమంతుండు నను కొడుకులును, కంసయు, కంసవతియు, సురాభువు, రాష్ట్రపాలికయు నను కూఁతులుం బుట్టిరి. వారు వసుదేవానుజ భార్య లైరి. భజమానునికి విడూరథుండును, విడూరథునికి శినియు, నతనికి భోజుండు, భోజునికి హృదికుండు, హృదికునకు దేవమీఢుండు, శతధనువు, కృతవర్మయు నను కొడుకులు గలిగిరి. ఆ దేవమీఢునికి మారిష యను భార్యయందు వసుదేవుండును, దేవభాగుండును, దేవ

శ్రవుండును, ఆనకుండును, సృంజయుండును, శ్యామకుండును, కంకుండును, అనీకుండును, వత్సకుండును, వృకుండు నను వారు పదుగురు కొడుకులును, పృథయు, శ్రుతదేవయు, శ్రుతకీర్తియు, శ్రుతశ్రవసయు, రాజాధిదేవియు నను కూఁతు లేవురును బుట్టిరి. అందు. 714

—: వసుదేవుని వంశక్రమాను వర్ణనము :—

ఉ. ధీనయశాలి యైన వసుదేవుఁడు వుట్టిన వెంట మింటిపై
నానకదుందుభుల్ మొరసె నచ్యుతుఁ డీతనికిం దనూజుఁ డై
మానుగఁ బుట్టు నంచు గరిమంబున దేవత లుబ్బ రాజపం
చానన! తన్నిమిత్తమున నానకదుందుభి యయ్యె వాఁ డిలన్. 715

క. తన చెలికాఁ డగు కుంతికిఁ, దనయులు లేకున్నఁ జూచి తన తనయఁ బృథన్
దనయఁగ నిమ్మని శూరుఁడు, దనయందుల మైత్రి నిచ్చె ధరణీనాథా! 716

వ. అ య్యింతి కుంతిభోజునియింటం బెరుగుచుండ, నొకనాఁడు దూర్వాసుం డరుగు దెంచిన, న మ్మహాత్మునకుఁ గొన్నిదినంబులు పరిచర్యలు చేసి, వేల్పులం జేరఁ జీరు విద్య వడసి, యా విద్య లా వెఱుంగ నొక్కనాఁ డేకాంతంబున వెలుంగు ఱేని నాకర్షించిన, నా దేవుండు వచ్చినం జూచి, వెఱఁగువడి యి ట్లనియె. 717

క. మంత్రపరీక్షార్థం బక, మంత్రించితిఁ గాని దేవ! మదనక్రీడా
తంత్రంబుఁ గోరి చీరన్, మంత్రించిన తప్పు సైచి మరలు దినేశా! 718

వ. అనిన న య్యువిదకుం బద్మినీవల్లభుం డి ట్లనియె. 719

మ. [1]తెఱవా! నీ పలు కట్ల యౌ వినుము లే[2] దేవోత్తమాహ్వానముల్
మొఱగం బోలునె వేల్పులం బడయుటల్ మోఘంబులే నీకు నీ
తఱి గర్భం బగుఁ బుత్రుఁడుం గలుగు నీ తారుణ్యముం బాజ్య మౌ
[3]వెఱవం గార్యము లేదు సిగ్గు దగునే వ్రీడావినమ్రాననా! 720

చ. అని తగ నీయకొల్పి లలితాంగికి గర్భము సేసి మింటికిన్
జనియె దినేశ్వరుం డపుడు చక్కని రెండవసూర్యుఁడో యనన్
దనరెడు పుత్రుఁ గాంచి కృప దప్పి జగజ్జన వాదభీత యై
తనయుని [4]నీటఁ బోవిడిచి తా నరిగెం బృథ దండ్రియింటికిన్. 721

---

1. తెఱవా! నీ ప్రతిమా గృహాటనము లే దేవోత్త మాహ్వానముల్ (క) 2. అసదులే (తం.) 3. వెఱవం గారణ మేమి (ట) 4. నేటిలో విడిచి (తం)

వ. అయ్యువిదను నీ ప్రపితామహుం డైన పాండురాజు వివాహం బయ్యె. అయ్యంగనకుఁ బాండురాజువలన ధర్మజ భీమార్జునులు పుట్టిరి. అమ్మగువ చెల్లె లగు శ్రుతదేవను, గారూషకుం డైన వృద్ధశర్మ పెండ్లియాడె. అయ్యిద్దఱ కును మునిశాపంబున దంతవక్త్రుం డను దానవుండు జన్మించె. దాని తోడం బుట్టు వగు శ్రుతకీర్తినిఁ [1]గేకయుండు పెండ్లియాడె. ఆ దంపతులకుఁ బ్రతర్ద నాదు లేవురు పుట్టిరి. దాని భగిని యైన రాజాధిదేవిని జయత్సేనుండు పరిణయం బయ్యె. ఆ మిథునమునకు విందానువిందులు సంభవించిరి. చేదిదేశాధిపతి యైన దమఘోషుండు శ్రుతశ్రవసను బరిగ్రహించె. వారలకు శిశుపాలుం డుదయించె. వసుదేవుని తమ్ముఁ డైన దేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతు బృహద్బలు లిరువురు జనించిరి. వాని భ్రాత యగు దేవశ్రవ స్సనువానికిఁ గంసవతియందు వీరుండును, నిషుమంతుండును నుద్భవిల్లిరి. వాని సోదరుం డైన కంకునికిఁ గంక యను దానికి బకుండును, సత్యజిత్తు, పురజి త్తనువారు జనించిరి. వాని సహజుం డైన సృంజయునికి రాష్ట్రపాలియందు వృష, దుర్మర్ష ణాదులు జనించిరి. వాని యనుజాతుం డైన శ్యామకునకు సురభూమియందు హరికేశ హిరణ్యా క్షులు ప్రభవించిరి. వాని తమ్ముం డైన వత్సుండు మిశ్రకేశి యను నప్సరస యందు వృకాది సుతులం గనియె. వృకుండు దూర్వాక్షి యందుఁ దక్ష పుష్కర సాళ్వాదుల నుత్పాదించె. వాని జఘన్యజుం డయిన యనీకుండు సుదామని యనుదానియందు సుమిత్రానీక బాణాదు లయిన కొడుకులం బడసె. వాని యనుజుం డైన యానకుండు కర్ణికయందు ఋత ధామ జయులం గాంచె. వసుదేవునివలన రోహిణియందు బలుండును, గదుండును, సారణుండును, దుర్మదుండును, విపులుండును, ధ్రువుండును, కృతాదులును, పౌరవియందు సుభద్రుండును, భద్రబాహుండును, దుర్మదుండును, భద్రుండును, భూతాదులుం గూడఁ బన్నిద్దఱును, మదిరయందు నం దోపనంద కృతక శ్రుత శూరాదులును, గౌసల్యయందుఁ గేశియు, రోచనయందు హ స్త హేమాంగాదు లును, నిళయందు యదుముఖ్యు లయిన యురువల్కలాదులును, ధృతదేవయందుఁ ద్రిపృష్ఠుండును, శాంతిదేవాత్మజయందు బ్రశమ ప్రశ్రితాదులును, నుపదేవ యందుఁ గల్పవృష్ణ్యాదులు పదుండ్రును, శ్రీదేవయందు వసుహంస, సుధన్వాదు లార్గురును, దేవరక్షితయందు గదాదులు తొమ్మండ్రును, సహదేవయందుఁ బురూథ శ్రుతముఖ్యాదు లెనమండ్రును, దేవకీదేవియందుఁ గీర్తిమంతుఁడును,

---

1. కేకయరాజైన ధృష్టకేతుండు (తం. వా.)

సుషేణుండును, భద్రసేనుండును, ఋజువును, సమదనుండును, భద్రుండును, సంకర్షణుండును ననువా రేడ్వురు పుట్టిరి. మఱియును. 722

క. దుష్టజన నిగ్రహంబును, [1]శిష్టజనానుగ్రహంబు సేయుటకొఱకై
యష్టమగర్భమున గుణో, త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్. 723

ఆ. విష్ణుఁ డుదితుఁ డైన వెనుక నా దేవకి
భద్రమూర్తి యగు సుభద్రఁ గనియె
నా గుణాఢ్య ముత్త వగు నీకు నర్జున
దయిత యగుటఁ జేసి ధరణినాథ! 724

క. ఎప్పుడు ధర్మక్షయ మగు, నెప్పుడు పాపంబు పొడము నీ లోకములో
నప్పుడు విశ్వేశుఁడు హరి, దప్పక విభుఁ డయ్యుఁ దన్నుఁ దా సృజియించున్.

క. తన మాయ లేక [1]పరునకు, ఘనునకు నీశ్వరున కాత్మకర్తకు హరికిన్
[2]జననములకుఁ గర్మములకు, మనుజేశ్వర! కారణంబు మఱియును గలదే. 726

క. తలపఁగ నెవ్వని మాయా, విలసనములు జనన వృద్ధి విలయంబులకుం
గలిమి కనుగ్రహ మోక్షం, బులకును జీవులకు మూలములు నా నెగడున్. 727

సీ. అట్టి సర్వేశుని కరయంగ జన్మాది పరతంత్రభావ మెప్పాటఁ గలదు
రాజ లాంఛనముల రాక్షసవల్లభు లక్షౌహిణీశు లై యవనిఁ బుట్టి
జనులను బాధింప శాసించుకొఱకు నై సంకర్షణునితోడ జనన మంది
యమరుల మనముల కైన లెక్కింపఁగ రాకుండు నట్టి కర్మములఁ జేసి

తే. కలియుగంబున జన్మింపఁ గలుగు నరుల
దుఃఖ [3]శోకతమంబులఁ దొలఁగఁ జేసి
నేల ప్రేఁగెల్ల వారించి నిఖిలదిశల
విమలకీర్తులు వెదచల్లి వెలసె [4]శౌరి. 728

సీ. జనకుని గృహమున జన్మించి మందలోఁ బెరిఁగి శత్రుల నెల్లఁ బీఁచ మణఁచి
పెక్కండ్రు భార్యలఁ బెండ్లియై సుతశతంబులఁ గాంచి తను నాదిపురుషుఁ గూర్చి
[5]శరణన్న వారినిఁ గరుణించి పాండవ కౌరవులకు నంతఁ గలహ మైన
నందఱ సమయించి యర్జును గెలిపించి యుద్ధవునకుఁ దత్త్వ మొప్పఁ జెప్పి

---

1. శిష్టప్రతిపాలనంబు (క. చ.) 2. జనములకుఁ గర్మములకును (హ.వా.) 3. జాలంబు లన్నిటిఁ దొలఁగ నడఁచి (హ) 4. నధిప (హ) 5. క్రతువులు పెక్కులు గావించి (క. త.)

తే. మగధ పాండవ సంజయ మధు దశార్హ
భోజ వృష్ణ్యంధకాది సంపూజ్యుఁ డగుచు
నుర్విభరము నివారించి యుండ నొల్ల
కా మహామూర్తి నిజమూర్తియందుఁ బొందె. 729

క. మంగళ హరికీర్తి మహా, గంగామృత మించుకైనఁ గర్ణాంజలులన్
సంగతము [1]సేసి ద్రావఁ దొలంగును గర్మంబు లావిలం బగుచు నృపా! 730

క. వనజాక్షుని మందస్మిత, ఘన కుండల దీప్తి గండ కలితాననమున్
వనితలుఁ బురుషులుఁ జూచుచు, ననిమిష భావంబు లేమి కలయుదు రధిపా!

చ. నగుమొగమున్ సుమధ్యమును నల్లనిదేహము లచ్చి కాటప
ట్టగు నురమున్ మహాభుజము లంచిత కుండలకర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృపారస దృష్టియుఁ గల్గు వెన్నుఁ డి
మ్మగఁ బొడసూపుఁ గాతఁ గను మూసిన యప్పుడు విచ్చునప్పుడున్. 732

వ అని చెప్పి. 733

క. జనకసుతా హృచ్చోరా!, జనక వచోలబ్ధ విపిన శైల విహారా!
జన కామిత మందారా!, జనకాది మహేశ్వరాతిశయ సంచారా! 734

మాలిని. [2]జగదవన విహారీ! శత్రులోక ప్రహారీ!
సుగుణ [3]ఘనవిహారీ! సుందరీ మానహారీ!
విగత కలుష [4]పోషీ! వీరవిద్యాభిలాషీ!
స్వగురు హృదయతోషీ! సర్వదా సత్యభాషీ! 735

గద్య. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతం బైన శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబునందు సూర్యవంశారంభంబును, వైవస్వతమను జన్మంబును, హైమచంద్ర కథనంబును, సుద్యుమ్నాది మనుసూనుల చరిత్రంబును, మరుత్తు, తృణబిందు, శర్యాతి, కకుద్మి, సగర, నాభాగ ప్రముఖుల చరిత్రంబులును, నంబరీషుని యందుఁ బ్రయోగింపఁబడిన దుర్వాసుని కృత్య నిరర్థక యగుటయు, నిక్ష్వాకు వికుక్షి, మాంధాతృ, పురుకుత్స, హరిశ్చంద్ర, సగర, భగీరథ ప్రముఖుల చరి

---

1. చేసి రేని (తం) 2. జగదుపవనచారీ సర్వలోకోపకారీ (హ) 3. వన (తం. వా.)
4. దోషీ (హ) 5. పోషీ (హ)

త్రంబులును, భాగీరథీప్రవాహ వర్ణనంబును, గల్మాషపాద, ఖట్వాంగప్రముఖుల వృత్తాంతంబును, శ్రీరామచంద్ర కథనంబును, దదీయ వంశపరంపరాగణనంబును, నిమికథయును, జంద్రవంశారంభంబును, బుధపురూరవుల కథయును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబును, విశ్వామిత్ర నహుష యయాతి పూరు దుష్యంత భరత రంతిదేవ పాంచాల బృహద్రథ శంతను భీష్మ పాండవ కౌరవ ప్రముఖుల వృత్తాంతంబులును, ఋశ్యశృంగ వ్రతభంగంబును, ద్రుహ్యానుతుర్వసుల వంశంబును, యదు కార్తవీర్య శశిబిందు జామదగ్న్యాదుల వృత్తాంతంబులును. శ్రీకృష్ణావతార కథా సూచనంబును నను కథలం గల నవమస్కంధము సంపూర్ణము.

---

మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

## మూఁడవ సంపుటము

(దశమ, ఏకాదశ, ద్వాదశ స్కంధములు)

బహు పాఠాంతర పరిష్కార విపుల పీఠికా సహితము


ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి

హైదరాబాదు.

1964.

# విషయ సూచిక

## దశమస్కంధము (పూర్వభాగము)

## దశమ స్కంధము (ఉత్తర భాగము)

## ఏకాదశ స్కంధము

## ద్వాదశ స్కంధము

ఓమ్

# శ్రీ మ హా భా గ వ త ము

## ద శ మ స్కం ధ ము

## పూ ర్వ భా గ ము

### అధ్యాయము – ౧

### —: పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రుని నడిగెడు ప్రశ్న :—

క. శ్రీకంఠచాప ఖండన !, పాకారిప్రముఖ వినుతభండన ! విలసత్
కాకుత్స్థవంశ మండన !, రాకేందుయశోవిశాల ! రామనృపాలా ! 1

వ. మహనీయ గుణగరిష్ఠు లగు న మ్మునిశ్రేష్ఠులకు, నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుం డైన సూతుం డి ట్లనియె. అట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగిం గనుంగొని. 2

క. తెలిపితివి సోమసూర్యుల, కులవిస్తారంబు వారికులము ధరిత్రీ
శుల నడవళ్లును వింటిమి, కల రూపములెల్ల మాకుఁ గడు వెలుఁగులుగన్. 3

క. శీలము గల యదుకులమున, నేలా పుట్టెను మహాత్ముఁ డీశుఁడు విష్ణుం
డేలీల మెలఁగె నె య్యే, వేళల నే మేమి చేసె వివరింపు తగన్. 4

క. భవములకు మందు చిత్త, శ్రవణానందము ముముక్షుజన పదము, హరి
స్తవము పశుఘ్నుఁడు దక్కను, జెవులకుఁ దని వయ్యె ననెడి చెనఁటియుఁ గలఁడే.

క. మా పెద్దలు మును వేల్పులు, నోపని భీష్మాది కురుకులోత్తమ సేనా
కూపారము నే కోలము, ప్రాపున లంఘించి రొక్క బాలపదముగాన్. 6

క. మాయమ్మకుక్షి గురుసుత, సాయక పీడితుఁడ నైన జడు నన్నుం గాం
తేయ కురుకులము [1]మొదలుగ, నా యుత్తముఁ డాత్తచక్రుఁ డై రక్షించెన్. 7

---

1. నిలువగ (క.)

ఆ. [1]కలసి పురుషమూర్తి కాలరూపములను
లోకజనుల వెలిని లోన నుండి
జన్మమృత్యువులను సంసారముక్తుల
నిచ్చు నతని చరితమెల్లఁ జెపుమ. 8

సీ. ఊహించి రాముఁడు రోహిణికొడుకు కంచు నప్పుడు యోగీంద్ర! చెప్పి తీవు
[2]దేవకికడుపున నే వెరవున నాతఁ డుండెను దేహంబు నొందు లేక
తన తండ్రి యిలు వాసి వనజాక్షుఁ డే రీతి మందకుఁ బోయె నే మందిరమున
నుండి యెయ్యది సేయుచుండెను దనమేనమామ కంసుని నేల నామ మణఁచె

ఆ. నెన్ని యేండ్లు మనియె నిలమీఁద మనుజుఁడై
యెంద ఱైరి భార్య లెట్లు మెలఁగె
మఱియు నేమి చేసె మాధవు[3]చారిత్ర
మెంత గలదు నాకు నేర్పరింపు. 9

వ. అని మఱియు నిట్లనియె. 10

ఆ. నీ ముఖాంబుజాత నిర్ముక్త హరికథా
మృతముఁ ద్రావఁ ద్రావ మేను [4]వొదలె
వంత మానె నీరువట్టు నాఁకలియును
దూర మయ్యె మనము తొంగలించె. 11

వ. అని పలుకుచున్న రాజు మాటలు విని, వైయాసి యిట్లనియె. 12

క. విష్ణు కథా రతుఁ డగు నరు, విష్ణుకథల్ చెప్పు మనుచు వినుచుండు నరున్
విష్ణుకథా సంప్రశ్నము, విష్ణుపదీ జలముభంగి విమలులఁ జేయున్. 13

సీ. రాజేంద్ర! విను తొల్లి రాజలాంఛనముల, వేలసంఖ్యల దైత్యవిభులు తన్ను
నాక్రమించిన భార మోఁగఁజాలక భూమి గోరూప యై బ్రహ్మఁ జేరఁ బోయి
కన్నీరు మున్నీరుగా రోదనము సేయఁ గరుణతో భావించి కమలభవుఁడు
ధరణి నూఱడఁ బల్కి ధాత్రియు వేల్పులుఁ గదలిరా విష్ణునిఁ గాన నేఁగి

తే. పురుషసూక్తంబుఁ జదివి యద్భుతసమాధి
నుండ నొకమాట విని వారిజోద్భవుండు
వినుఁడు వేల్పులు ధరయు నే విన్నయట్టి
పలుకు వివరింతు నని ప్రీతిఁ బలికెఁ జెలియ. 14

---

1. కదిసి (త.) 2. దేవకి కడుపున దివిజులకై పూనియుండు నందేహంబు నొందులేక (క.)
3. సంచార (హ.) 4. వదలు (హ.)

క. యాదవకులమున నమరులు, మేదినిపైఁ బుట్టఁ జనుఁడు మీ యంశములన్
శ్రీదయితుఁడు వసుదేవున, కాదరమునఁ బుట్టి భార మంతయుఁ బాపున్. 15

క. హరిపూజార్థము బుట్టుఁడు, సురకన్యలు భూమియందు సుందరతను లై
హరి కగ్రజుఁ డై శేషుఁడు, హరికళతోఁ బుట్టుఁ [1]దత్ప్రియారంభుం డై. 16

ఆ. ఈ ప్రపంచ మెల్ల నే మాయచే మోహి
తాత్మ మగుచునుండు నట్టి మాయ
కమలనాభు నాజ్ఞఁ గార్యార్థ మై నిజాం
శంబుతోడఁ బుట్టు జగతియందు. 17

వ. అని యిట్లు వేల్పుల నియ్యకొలిపి, పుడమిముద్దియ నొడంబఱిచి, తమ్మిచూలి తన మొదలినెలవునకుం జనియె. అంత యదువిభుం డైన శూరసేనుం డనువాఁడు మథురాపురంబు తనకు రాజధానిగా, మాథురంబులు, శూరసేనంబు లనియెడు దేశంబు లేలె. పూర్వకాలంబున. 18

క. ఏ మథురయందుఁ బ్రియమున, శ్రీమన్నారాయణుండు చెలఁగును నిత్యం
బా మథుర సకలయాదవ, భూమీశుల కెల్ల మొదలిపురి యయ్యె నృపా! 19

సీ. ఆ శూరసేనున కాత్మజుం డగు వసు దేవుఁ డా పురి నొక్కదినమునందు
దేవకిఁ బెండ్లి యై దేవకియును దానుఁ గడు వేడ్క రథమెక్కి కదలువేళ
నుగ్రసేనుని సుతుం డుల్లాసి కంసుఁడు చెల్లెలు మఱఁదియు నుల్లసిల్ల
హరులఁ బగ్గములు చే నంది రొప్పఁదొణంగె ముందర భేరులు మురజములును

ఆ. శంఖ పటహములును జడిగొని మ్రోయంగఁ
గూఁతుతోడి వేడ్క కొనలుసాఁగ
దేవకుండు సుతకు దేవకీదేవికి
నరణ మీఁదలంచి యాదరించి. 20

వ. సార్థంబు లయిన రథంబుల [2]వేయు నెనమన్నూటిని, కనకదామ సముత్తుంగంబు లైన మాతంగంబుల నన్నూటినిఁ, బదివేల తురంగంబులను, విలాసవతు లైన దాసీజనంబుల నిన్నూటి నిచ్చి, యనిచినం గదలి, వర వధూ యుగళంబు తెరువునం జను సమయంబున. 21

క. పగ్గములు వదలి వేగిర, మగ్గలముగ రథముఁ గడపు నా కంసుఁడు లో
బెగ్గిలి యెగ్గని తలఁపఁగ, దిగ్గన నశరీరవాణి దివి ని ట్లనియెన్. 22

---

1. దత్క్రియారంభు డై (చ.) 2. వెయ్యునెన్మనబన్నూటిని (హ).

క. తుష్ట యగు భగిని మెచ్చఁగ, నిష్టుఁడ వై రథము గడపె దెఱుఁగవు మీఁదన్
శిష్ట యగు నీ తలోదరి, యష్టమ గర్భంబు నిన్ను హరియించుఁ జుమీ. 23

వ. అని యిట్లాకాశవాణి పలికిన, నులికిపడి, [1]భోజకుల నాపకుం డైన కంసుండు సంచల దంసుం డై, యడిదంబు బెడిదంబుగఁ బెఱికి, ఝళిపించి, దెప్పరంబుగ ననుజ కొప్పుఁ బట్టి, [2]కప్పరపాటున నొ ప్పఱం దిగిచి, యొడిసిపట్టి, తోఁబుట్టు వని తలంపక, తెంపుచేసి తెగ వ్రేయ గమకించు సమయంబున, వసుదేవుండు డగ్గఱి. 24

క. ఆ పాపచిత్తు మత్తుం, గోపాగ్ని శిఖానువృత్తుఁ గొనకొని తన స
ల్లాపామృత ధారా వి, క్షేపణమునఁ గొంత శాంతుఁ జేయుచుఁ బలికెన్. 25

ఉ. అన్నవు నీవు చెల్లెలికి నక్కట! మాఁడలు చీరె లిచ్చుటో
మన్నన సేయుటో మధుర మంజుల భాషల నాదరించుటో
మిన్నుల మ్రోఁతలే నిజము మే లని చంపకు మన్న! మాని రా
వన్న! సహింపు మన్న! తగ దన్న! వధింపకు మన్న! వేఁడెదన్. 26

వ. అదియునుం గాక. 27

మ. చెలియల్ కన్నియ ముద్దరా లబల నీ సేమంబె చింతించు ని
ర్మల దీనిన్ బయ లాడు మాటలకు నై మర్యాద వోఁగొట్టి స
త్కుల జాతుండవు పుణ్యమూర్తి వకటా! కోపంబు పాపంబు నె
చ్చెలి నోహో తెగ వ్రేయఁ బాడి యగునే చింతించు భోజేశ్వరా! 28

సీ. మేనితోడనె పుట్టు మృత్యువు జనులకు నెల్లి నేఁ డైన నూఱేండ్ల కైనఁ
దెల్లంబు మృత్యువు దేహంబు పంచత నందఁ గర్మానుగుం డై శరీరి
మాఱుదేహము [3]నూఁది మఱి తొంటిదేహంబుఁ బాయును దన పూర్వభోగ మెత్తి
వేఱొంటిపైఁ బెట్టి వెనుక భోగం బెత్తి గమనించు తృణజలూకయునుబోలె

ఆ. వెంట వచ్చు కర్మవిసరంబు మునుమేలు
కన్నవేళ నరుఁడు గన్న విన్న
తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ
బాడితోడఁ గానఁబడినయట్లు. 29

క. తన తొంటి కర్మరాశికి, ననుచర మై బహువికార మై మనము వడిం
జను నింద్రియముల తెరువులఁ, దనువులు పెక్కయినఁ జెడవు తనకర్మంబుల్. 30

1. భోజకుల నాయకుండైన పాపుండు (తం) భోజకుల పాంసనుండైన (వా). 2. యప్పార పాటున (వా). 3. ఁజొచ్చి (వా).

ఆ. జల ఘటాదులందుఁ జంద్ర సూర్యాదులు
గానఁబడుచు గాలిఁ గదలుభంగి
నాత్మ కర్మనిర్మితాంగంబులను బ్రాణి
గదలుచుండు రాగకలితుఁ డగుచు. 31

క. కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు కీడు నిచ్చు కర్తలు దనకుఁ
గర్మములు బ్రహ్మకైనను, గర్మగుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్. 32

క. కావున పరులకు హింసలు, గావింపఁగ వలదు తనకుఁ గల్యాణముగా
భావించి పరుల నొంచినఁ, బోవునె తత్ఫలము పిదపఁ బొందకయున్నే. 33

మత్తకోకిల. వావిఁ జెల్లెలు గాని కూఁతురువంటి దుత్తమురాలు సం
భావనీయచరిత్ర భీరువు బాల నూత్నవివాహ సు
శ్రీవిలాసిని దీన కంపితచిత్త నీ కిదె మ్రొక్కెదన్
గావవే కరుణామయాత్మక ! కంస ! మానవవల్లభా ! 34

వ. అని మఱియు, [1]సామ భేదంబు లగు పలుకులు పలికిన, వినియు, వాఁడు, వేఁడి చూపుల రాలు నిప్పులు కుప్పలుగొన, ననుకంపలేక, తెంపుసేసి, చంపకగంధిం జంపఁజూచుటయు నెఱింగి, మొఱంగెడి తెఱంగు విచారించి, తనలో ని ట్లనియె. 35

క. ఎందును గాలము నిజ మని, పందతనంబునను బుద్ధిఁ బాయక ఘను లై
యెందాఁక బుద్ధి నెగడెడి, నందాఁకఁ జరింపవలయు నాత్మబలమునన్. 36

వ. అని నిశ్చయించి. 37

సీ. ఆపన్నురాలైన యంగన రక్షించి సుతుల నిచ్చెద [2]నంట శుభము నేఁడు
మీఁ దెవ్వఁ డెఱుఁగును మేలఁత ప్రాణముతోఁడ నిలిచిన మఱునాఁడు నేరరాదె
సుతులు పుట్టిరయేని సుతులకు మృత్యువు వాలాయమై వెంట వచ్చెనేని
బ్రహ్మచేతను వీఁడు పా పేమియును లేక యుండునే సదుపాయ మొకటి లేదె

తే. పొంత మ్రాఁకులఁ గాల్పక పోయి వహ్ని
యెగసి దవ్వులవాని దహించుభంగిఁ
గర్మవశమున భవ మృతి కారణంబు
దూరగతిఁ బొందు నిదియేల త్రొట్టుపడఁగ. 38

1. సామరూపంబులగు (వా). 2. నన్న (హ).

క. కొడుకుల నిచ్చెద నని సతి, విడిపించుట నీతి వీఁడు విడిచిన మీఁదన్
కొడుకులు పుట్టినఁ గార్యము, దడఁబడదే నాఁటి కొక్కదైవము లేదే. 39

క. ఎనిమిదవ చూలు వీనిన్, దునుమాడెడి ననుచు మింటఁ దొరపుఁ బలుకుల్
వినఁబడియె నేల తప్పును, వనితను విడిపించు టొప్పు వైశం బనుచున్. 40

క. తిన్నని పలుకులు వలుకుచుఁ, గ్రన్ననఁ దగఁ బూజచేసి కంసు నృశంసున్
మన్నించి చిత్త మెరియఁ బ్ర, సన్నాననుఁ డగుచుఁ బలికె శౌరి నయమునన్. 41

క. లలనకుఁ బుట్టిన కొమరుని, వలనం దెగె దనుచు గగనవాణి వలికె నం
చలిగెదవేని మృగాక్షికిఁ, గల కొడుకులఁ జంప నిత్తుఁ గ్రమమున నీకున్. 42

వ. అని యిట్లు పలికిన విని, కంసుండు కంపితావతంసుం డై, సంతసించి, గుణగ్రా హిత్వంబు గైకొని, కొందలమందు చెలియలి ముందల విడిచి చనియె. వసు దేవుండును, బ్రతుకుమందల గంటి ననుచు, సుందరియుం, దానును మందిరంబు నకుం బోయి, డెందంబున నానందంబు నొందియుండె. అంతఁ గొంతకాలంబు చనిన సమయంబున. 43

క. విడువక కంసుని యెగ్గులఁ, బడి దేవకి నిఖిల దేవభావము తన కే
ర్పడ నేఁట నొకని లెక్కను, గొడుకుల నెనమండ్ర నొక్క కూఁతుం గనియెన్.

వ. అందు. 45

గీ. సుదతి మున్ను గన్న సుతుఁ గీర్తిమంతునిఁ
బుట్టు దడవఁ గంసభూవరునకు
దెచ్చి యిచ్చెఁ జాల ధృతి గల్గి వసుదేవుఁ
డాసపడక సత్యమందు నిలిచి. 46

క. పలికిన పలుకులు తిరుగక, సొలయక వంచనము లేక సుతుల రిపునకున్
గలఁగక యిచ్చిన ధీరుం, డిల వసుదేవుండు దక్క నితరుఁడు గలడే. 47

ఆ. మానవేంద్ర ! సత్యమతికి దుష్కర మెయ్య
దెఱుఁగనేర్చు వాని కిష్ట మెయ్య
దీశభక్తిరతున కీరాని దెయ్యది
[1]యెఱుక లేనివాని కేది కీడు. 48

---

1. యెఱుఁగ లేని (హ.) కిం దుస్సహన్ను సాధూనాం విదుషాం కి మపేక్షితమ్, కి మకార్యం కదర్యాణాం దుస్త్యజం కిం ధృతాత్మనామ్ (1-58).

వ. ఇట్లు సత్యంబు దప్పక కొడుకు నొప్పించిన వసుదేవుని పలుకు నిలుకడకు మెచ్చి, కంసుం డిట్లనియె. 49

ఆ. కొడుకు నీవు మరలఁ గొనిపొమ్ము వసుదేవ !
వెఱపులేదు నాకు వీనివలన
నల్ల వీనికి భవ దష్టమపుత్రుండు
మృత్యు వఁట వధింతు మీఁద నతని. 50

వ. అనిన నానకదుందుభి నందనుం గొని చనియు, నానందంబు నొందక, దుష్టభావుం డగు బావపలుకులు వినియు, నులుకుచుండె. అంత. 51

సీ. ఒకనాఁడు నారదుం డొయ్యన కంసుని యింటికిఁ జనుదెంచి యేకతమున
మందలోపల నున్న నందాదులును వారి భార్యలుఁ బుత్రులు బాంధవులును
దేవకి మొదలగు తెఱవలు వసుదేవుఁ డాదిగాఁ గల సర్వయాదవులును
సురలు గాని నిజంబునరులు గా రని చెప్పి కంసుండ ! నీవు రక్కసుఁడ వనియు

ఆ. దేవమయుఁడు చక్రి దేవకీదేవికి
పుత్రుఁ డై జనించు భూతలంబు
చెఱుపఁ బుట్టినట్టి చెనఁటి దైత్యుల నెల్లఁ
జంపు ననుచుఁ జెప్పి చనియె దివికి. 52

క. నారదుమాటలు విని పె, ల్లారాటముఁ బొంది యదువు లనిమిషు లనియున్
నారాయణ కరఖడ్గ వి, దారితుఁ డగు కాలనేమి దా ననియు మదిన్. 53

మ. కలఁగంబాఱి మఱందిఁ జెల్లెలి నుదగ్రక్రోధుఁ డై పట్టి బ
ద్ధులఁ గావించి హరిం దలంచి [1]వెఱఁ దోడ్తో వారు గన్నట్టి పు
త్రులఁ జంపెన్ గురు నుగ్రసేను[2] యదుఁ దద్భోజాంధకాధీశు ని
ర్మలుఁ బట్టెన్ గడు వాలి యేలెఁ జలమారన్ శూరసేనంబులన్. 54

ఆ. తల్లిఁ దండ్రి నైనఁ దమ్ముల [3]నన్నల
సఖుల నైన బంధుజనుల నైన
రాజ్యకాంక్షఁ జేసి రాజులు చంపుదు
రవనిఁ దఱచు జీవితార్థు లగుచు. 55

---

1. వెసఁ (తం. వా.) 2. ఉగ్రసేను డచలత్ భోజాంధకాధీశు. (క. చ. ట. త. వ.)
3. బిడ్డల (ట. త.).

అధ్యాయము - ౨

వ. మఱియు, బాణ భౌమ మాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టి కారిష్ట ద్వివిద పూతనాది సహాయ సమేతుం డై, కంసుండు కదనంబున మదంబు లణంచిన, వదనంబులు వంచికొని, సదనంబులు విడిచి, యదవ లై, యదువులు [2]పదువులు వదలి, నిషధ కురు కోసల విదేహ విదర్భ కేకయ పాంచాల [3]సాల్వదేశంబులు సొచ్చిరి. మచ్చరంబులు విడిచి, కొందఱు కంసునిం గొలిచిరి. అంత. 56

క. తొడిఁదొడిఁ గంసుఁడు దేవకి, కొడుకుల నార్వుర వధింప గురు శేషాఖ్యం
బొడ వగు హరిరుచి యా సతి, కడుపున నేడవది యైన గర్భం బయ్యెన్. 57

వ. అ య్యవసరంబున విశ్వరూపుం డగు హరి, తన్ను నమ్మిన యదువులకుఁ, గంసుని వలన భయంబు గలుగు నని యెఱింగి, యోగమాయాదేవి కి ట్లనియె. 58

సీ. గోపికాజనములు గోపాలకులు నున్న పసులమందకుఁ బొమ్ము భద్ర! నీవు
వసుదేవు భార్యలు వరుసఁ గంసునిచేత [4]నాఁకలఁ బడియుండ నందుఁ జొరక
తలఁగి రోహిణి యను తరళాక్షి నందగోకులమందు నున్నది గుణగణాఢ్య
దేవకికడుపున దీపించు శేషాఖ్య మైన నా తేజ మీ వమరఁ బుచ్చి

ఆ. నేర్పు మెఱసి రోహిణీదేవి కడుపునఁ
జొనుపు దేవకికిని సుతుఁడ నగుదు
నంశభాగ యుతుఁడ నై యశోదకు నందు
పొలఁతి [5]కంతమీఁదఁ బుట్టె దీవు. 59

క. నానావిధ సంపదలకుఁ, దానక మై సర్వ కామదాయిని వగు నిన్
మానవులు భక్తిఁ గొలుతురు, కానుకలును బలులు నిచ్చి కల్యాణమయీ! 60

వ. మఱియు, నిన్ను మానవులు దుర్గ భద్రకాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణి ఈశాన శారద అంబిక యను పదు నాలుగు నామంబులం గొనియాడుదురు. ఆ యా స్థానంబులయంద యెఱిం గించి, సర్వేశ్వరుం డగు హరి పొమ్మని యానతిచ్చిన, మహాప్రసాదం బని, య య్యోగనిద్ర యియ్యకొని, మ్రొక్కి, చయ్యన న య్యాల కయ్యెడ వాసి వచ్చి. 61

---

1. యనదలై (జ). 2. పదువులు (క). 3. సాల్వరాజులన్ గొల్చిరి (క).
4. ఆకులబడి (హ). 5. పొలఁతి కడుపునందు (హ).

తే. దేవకీదేవి కడుపులోఁ దేజరిల్లు
దీప్తగర్భంబు మెల్లనఁ [1]దిగిచి యోగ
నిద్ర రోహిణికడుపున నిలిపి చనియె
కడుపు దిగె నంచుఁ బౌరులు గలఁగఁబడఁగ. 62

వ. అంత. 63

ఆ. బలము మిగులఁ గలుగ బలభద్రుఁ డన లోక
రమణుఁ డగుటఁ జేసి రాముఁ డనఁగ
సతికిఁ బుట్టె గర్భసంకర్షణమున సం
కర్షణుం డనంగ ఘనుఁడు సుతుఁడు. 64

వ. తదనంతరంబ. 65

క. ఆనకదుందుభి మనమున, శ్రీనాథుం డంశభాగ శిష్టతఁ జొరఁగన్
భానురుచి నతఁడు వెలిఁగెను, గానఁగఁ బట్టయ్యె భూతగణములకు నృపా! 66

ఉ. ఆ వసుదేవుఁ డంతఁ దనయం దఖిలాత్మక మాత్మభూతమున్
బావనరేఖయున్ భువనభద్రము నై వెలుఁగొందుచున్న ల
క్ష్మీవిభు తేజ మచ్చుపడఁ జేర్చినఁ దాల్చి నవీనకాంతితో
దేవకి యొప్పె పూర్వ యగు దిక్పతి చంద్రునిఁ దాల్చు కైవడిన్. 67

వ. అనిన విని, తరువాతి వృత్తాంతం బెట్లయ్యె నని రా జడిగిన, శుకుం డి ట్లనియె.

క. గురుతరముగఁ దన కడుపున, సరసిజగర్భాండ భాండచయములు గల యా
హరి దేవకికడుపున భూ, భరణార్థము వృద్ధిఁ బొందె బాలార్కుక్రియన్. 69

వ. అంత. 70

సీ. విమతుల మొగములు వెలవెలఁబాఱంగ విమలాస్య మోము వెల్వెలుకఁ బాఱె
మలయు వైరుల కీర్తి మాసి నల్లన గాఁగ నాతి చూచుకములు నల్లనయ్యె
దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట లేమ యారున రోమరేఖ మెఱసె.
నరిమానసముల నాహారవాంఛలు దప్ప వనజాక్షి కాహారవాంఛ దప్పె.

తే. శ్రమము సంధిల్లె రిపులకు శ్రమము గదుర
జడత వాటిల్లె శత్రులు జడను వడఁగ
మన్ను రుచి యయ్యెఁ బగతురు మన్ను చొరఁగ
వెలఁది యుదరంబులో హరి వృద్ధిఁ బొంద. 71

1. తిరిగి (తం).

వ. మఱియును. 72

సీ. సలిల మా యెలనాఁగ జఠరార్భకునిఁ గానఁ జనిన కైవడి ఘర్మసలిల మొప్పె
నొగిఁ దేజ మా యింతి యుదరడింభకుఁ గొల్వఁ గదిసిన క్రియ దేహకాంతి మెఱసెఁ
బవనుఁ డా కొమ్మ గర్భస్థుని సేవింప నుదయించెనో యన నూర్పు లమరెఁ
గుంభిని యా లేమ కుక్షిగు నర్చింపఁ జొచ్చుభంగిని మంటిచొరవ దనరె

ఆ. గగన మిందువదన కడుపులో బాలు సే
వలకు రూపుమెఱసి వచ్చినట్లు
బయలువంటి నడుము బహుళ మయ్యెను బంచ
భూతమయుఁడు లోనఁ బొదల సతికి. 73

వ. తదనంతరంబ. 74

సీ. అతివ కాంచీగుణం బల్లన బిగియంగ వైరివధూ గుణవ్రజము వదలె
మెల్లన తన్వంగి మెయిదీఁగె మెఱుఁగెక్క దుష్టాంగనా తనుద్యుతు లణంగె
నాతి కల్లన భూషణములు పల్వలుకగాఁ బరసతీ భూషణపంక్తు లెడలెఁ
గలకంఠి కొయ్యన గర్భంబు దొడ్డుగాఁ బరిపంథి దారగర్భములు పగిలెఁ.

తే. బోలఁతి కంతంత నీళ్లాడు ప్రొద్దు లెదుగ
నహితవల్లభ లైదువ లై తనర్చు
ప్రొద్దు లన్నియుఁ గ్రమమునఁ బోవఁ దొణఁగె
నువిదకడుపున నసురారి యుంటఁ జేసి. 75

వ. ఇ వ్విధంబున. 76

ఆ. జ్ఞానఖలునిలోని శారదయును బోలె
ఘటములోని దీపకళికవోలె
భ్రాతయింట నాఁకఁ బడియుండె దేవకీ
కాంత విశ్వగర్భ గర్భ యగుచు. 77

వ. అంత న క్కాంతాతిలకంబు నెమ్మొగంబు తెలివియును, మేనిమెఱుంగును, మెలంగెడి సొబగునుం జూచి, వెఱఁగుపడి, తఱచు వెఱచుచుఁ గంసుండు తనలో ని ట్లనియె. 78

క. కన్నులకుఁ జూడ బరు వై, యున్నది యెలనాఁగ గర్భ ముల్లము గలఁగన్
ము న్నెన్నఁడు ని ట్లుండదు, వెన్నుఁడు [1]చొరఁబోలు గర్భవివరములోనన్. 79

1. సొరనోపు (క.)

ఉ. ఏమి తలంచువాఁడ నిఁక నెయ్యది కార్యము నాఁడునాఁటికిన్
గామినిచూలు పెంపెసఁగె గర్భిణి చెల్లెలి నాఁడుపేద నే
నేమని చంపువాఁడఁ దగ వే లని చంపితి నేని శ్రీయు ను
ద్దామయశంబు నాయువును ధర్మమునుం జెడిపోవకుండునే. 80

క. వావి నెఱుంగని క్రూరుని, జీవన్మృతుఁ డనుచు నిందసేయుదు రతఁడున్
బోవును నరకమునకు దు, ర్భావముతోఁ బ్రతుకు టొక్క బ్రతుకే తలఁపన్. 81

వ. అని నిశ్చయించి, క్రౌర్యంబు విడిచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు వాటించి, శౌర్యంబు ప్రకటించుకొనుచు, దిగ్గనం జెలియలిం జంపు నగ్గలిక యెగ్గని [1]యుగ్గ డించి, మాని, మౌనియుం బోలె నూరకుండియు. 82

ఆ. పాపరాని దొడ్డ [2]పగ పుట్టె నిఁక నెట్టు
విందుముఖికిఁ జక్రి యెపుడు పుట్టుఁ
బుట్టి నపుడె పట్టి పురుటింటిలోఁ దెగఁ
జూతు ననుచు నెదురు చూచుచుండె. 83

వ. మఱియు, వైరానుబంధంబున నన్యానుసంధానంబుల మఱచి, యతండు. 84

క. తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు, నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్
హరిఁ దలఁచి తలఁచి జగ మా, హరిమయ మని [3]తలఁచెఁ గంసుఁ డాఱని యలుకన్.

వ. వెండియు. 86

సీ. శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు నది హరిపలు కని యాలకించు
నక్షిమార్గమున నెయ్యది చూడఁబడు నది హరిమూర్తి గానోపు నంచుఁ జూచు
దిరుగుచో దేహంబుఁ దృణ మైన సోఁకిన హరి కరాఘాత మో యనుచుఁ గలఁగు
గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన హరి మాలికాగంధ మనుచు నదరుఁ

ఆ. బలుకు లెవ్వి యైనఁ బలుకుచో హరిపేరు
పలుకఁబడియె ననుచు భ్రమసి పలుకుఁ
దలఁపు లెట్టి వైనఁ దలఁచి యా తలఁపులు
హరితలంపు లనుచు నలుగఁ దలఁచు. 87

వ. అ య్యవసరంబున, ననుచరసమేత లైన దేవతలును, నారదాది మునులును గూడి నడవ, నలువయును, ముక్కంటియు నక్కడికి వచ్చి, దేవకీదేవి గర్భాభర్భకుం డగు పురుషోత్తము ని ట్లని స్తుతియించిరి. 88

1. యుగ్గళించి (హ.) 2. పనిపుట్టె (హ.) 3. చూచె (హ.తం.ఖా.)

—: బ్రహ్మాది దేవతలు దేవకీగర్భస్థుఁ డగు స్వామిని స్తుతించుట :—

సీ. సత్యవ్రతుని నిత్య సంప్రాప్తిసాధనుఁ గాలత్రయమునందుఁ గలుగువాని
భూతంబు లైదును పుట్టు చోటగువాని నైదుభూతంబులం దమరువాని
నైదుభూతంబులు నణఁగిన పిమ్మటఁ బరఁగువానిని సత్యభాషణంబు
సమదర్శనంబును జరిపెడువానిని ని న్నాశ్రయింతుము నీ యధీన

ఆ. మాయచేత నెఱుక మాలినవారలు
పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు
రెఱుఁగనేర్చు విబుధు లేకచిత్తంబున
నిఖిలమూర్తు లెల్ల నీవ యండ్రు. 89

వ. అదియునుం గాక. 90

సీ. ప్రకృతి యొక్కటి పాదు ఫలములు సుఖదుఃఖములు రెండు గుణములు మూఁడు వేళ్లు
తగు రసంబులు నాల్గు ధర్మార్థ ముఖరంబు లెఱిఁగెడి విధము లై దింద్రియంబు
లాఱు స్వభావంబు [1]లా శోక మోహాదు లూర్ములు ధాతువు లొక్కయేడు
పై పొర లెనిమిది ప్రంగలు భూతంబు లైదు బుద్ధియు మనోఽహంకృతులును

తే. రంధ్రములు తొమ్మిదియుఁ గోటరములు ప్రాణ
పత్రదశకంబు జీవేశ పక్షియుగము
గలుగు సంసారవృక్షంబుఁ గలుగఁ జేయఁ
గావ నణఁగింప రాజ వొక్కరుఁడ వీవ. 91

క. నీదెసఁ దమచిత్తము లిడి, యే దెసలం బోక కడతు రెఱుక గలుగువా
రాదూడయడుగు క్రియ నీ, పాదం బను నావకతన భవసాగరముల్. 92

ఆ. మంచివారి కెల్ల మంగళప్రద మయ్యుఁ
గల్లరులకు మేలు గానియట్టి
తనువు లెన్నియైనఁ దాల్చి లోకములకు
సేమ మెల్లప్రొద్దు సేయు దీవు. 93

క. ఎఱిఁగినవారలమనుచును, గొఱమాలిన యెఱుక లెఱిఁగి క్రొందఱు నీపే
రెఱిఁగియుఁ దలఁపఁగ నొల్లరు, పఱతు రధోగతుల జాడఁ బద్మదళాక్షా ! 94

---

1. లాకాళ (హ.)

క. నీవాఱైనీదెసఁ దమ, భావంబులు నిలిపి [1]ఘనులు భయవిరహితులై
యే విఘ్నంబులఁ జెందక, నీ వరయఁగ మేటిచోట నెగడుదు రీశా! 95

క. నిను నాలు గాశ్రమంబుల, జనములు సేవింప నఖిలజగముల సత్త్వం
బును శుద్ధంబును శ్రేయం, బును నగు గాత్రంబు నీవు పొందుదువు హరీ! 96

సీ. నళినాక్ష! సత్త్వగుణంబు నీ గాత్రంబు గాదేని విజ్ఞానకలిత మగుచు
నజ్ఞాన భేదకం బగుటెట్లు [2]గుణముల యందుల వెలుఁగ నీ వనుమతింపఁ
బడుదువు సత్త్వరూపంబు సేవింపంగ సాక్షాత్కరింతువు సాక్షి వగుచు
వాఙ్మనంబులకు నవ్వల నైన మార్గంబు గలుగు నీ గుణజన్మ కర్మరహిత

తే. మైన రూపును పేరు నత్యనఘబుద్ధు
లెఱుఁగుదురు నిన్నుఁ గొల్వ నూహించుకొనుచు
వినుచుఁ దలఁచుచుఁ బొగడుచు వెలయువాఁడు
భవము నొందఁడు నీ పాదభక్తుఁ డగుచు. 97

క. ధరణీభారము వాసెను, బురుషోత్తమ! యీశ! నీదు పుట్టువున భవ
చ్చరణాంబుజముల ప్రాపున, ధరణియు నాకసముఁ గాంచెదము నీ కరుణన్.

ఉ. పుట్టువులేని నీ కభవ! పుట్టుట క్రీడయె కాక పుట్టుచే
యె ట్టనుడున్ భవాది [3]దశ లెల్లను జీవులయం దవిద్య తాఁ
బుట్టుచు నుండుఁ గాని నినుఁ బుట్టినదిం బలెఁ బొంత నుండియుం
బుట్టఁగలేమిఁ దత్క్రియలఁ బొక్కని యొక్కటి వౌదు విశ్వరా! 99

మ. గురు పాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుఁడవై హయాననుఁడవై క్ష్మాదేవతా భర్తవై
ధరణీనాథుఁడవై దయాగుణ గణోదారుండవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద మిలాభారంబు వారింపవే!. 100

క. [4]ముచ్చిరి యున్నది లోకము, నిచ్చలుఁ గంసాదిఖలులు నిర్దయు లేచన్
మచ్చికఁ గావఁగవలయును, విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా! 101

---

1. మునులు (క.); ఘనుల భయవిరహితులై (తం.) 2. గుణముల, యందును వెలుఁగు నీవనుమతింపఁ బడుదువు. (హ.తం.వా.) 3. దిశలెల్లను జీవమునం దవిద్యఁదా బుట్టుచునుండుఁగాని నినుఁ బుట్టినదిం బలెఁ బొంతనుండియుం, బుట్టఁగలేని తత్క్రియలఁ బొక్కని యొక్కటి వౌదు విశ్వరా. (హ.) 4. ముచ్చిలి (హ).

వ. అని మఱియు దేవకీదేవిం గనుంగొని. 102

మత్తకోకిల. *తల్లి ! నీ యుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్నవాఁ
డెల్లి పుట్టెడిఁ గంసుచే భయ మింత లేదు నిజంబు మా
కెల్లవారికి భద్ర మయ్యెడు నింక నీ కడు పెప్పుడున్
జల్ల గావలె యాదవావళి సంతసంబును బొందఁగన్. 103

వ. అని, యి వ్విధంబున హరిం బొగడి, దేవకీదేవిని దీవించి, దేవత లీశాన బ్రహ్మల ముందట నిడుకొని, చనిరి. అంత. 104

## అధ్యాయము - ౩

### —: శ్రీ కృష్ణావతార ఘట్టము :—

క. పంకజముఖి నీల్గాడను, సంకటపడ ఖలుల మానసంబుల నెల్లన్
సంకటము దోఁచె మెల్లన, సంకటములు లేమి దోఁచె సత్పురుషులకున్. 105

సీ. స్వచ్ఛంబు లై పొంగె జలరాసు లేడును గలఘోషణముల మేఘంబు లుఱిమె
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ
గమ్మని చల్లని గాలి మెల్లన వీచె హోమానలంబు చెన్నొంది వెలిఁగెఁ
గొలఁకులు కమలాళి కులము లై సిరి నొప్పెఁ బ్రవిమలతోయ లై పాఱె నదులు

తే. వర పుర గ్రామ ఘోష యై వసుధ యొప్పె
విహగరవ పుష్ప ఫలముల వెలసె వనము
లలరు సోనలు గురిసి ర య్యమరవరులు
దేవదేవుని దేవకీదేవి కనఁగ. 106

క. పాడిరి గంధర్వోత్తము, లాడిరి రంభాది కాంత లానందమునన్
గూడిరి సిద్ధులు భయములు, వీడిరి చారణులు మొరసె వేల్పుల భేరుల్. 107

క. సుతుఁ గనె దేవకి నడురే, యతి శుభగతిఁ దారలును గ్రహంబులు నుండన్
దితిసుత నిరాకరిష్ణున్, శ్రిత వదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్. 108

క. వెన్నుని నతి ప్రసన్నునిఁ, గన్ననఁ గని మెఱుఁగుఁబోణి కడు నొప్పారెన్
బున్నమనాఁడు కళానిధిఁ, గన్న మహేంద్రాశ చెలువుఁ గలిగి నరేంద్రా! 109

---

*"క" ప్రతిలో ఈ క్రింది "తరళ" యున్నది.
అలర శ్రావణ బహుళ నష్టమి విశ్వసృడ్ విధితారకో
చెలువమగు చంద్రోదయంబున శ్రీవిభుండు జనించినన్
అలరగా వసుదేవదేవకి ఆత్మ సంతస మందినన్
చెలగి చేతులు మోడ్చి మ్రొక్కియు సంతసించిరి యంతటన్.

వ. అప్పుడు. 110

సీ. జలధరదేహు నాజాను చతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షుఁ
జారు గదా శంఖ చక్ర పద్మ విలాసుఁ గంఠ కౌస్తుభమణి కాంతిభాసుఁ
గమనీయ కటిసూత్ర కంకణ కేయూరు శ్రీవత్సలాంఛ నాంచితవిహారు
నురుకుండల ప్రభాయుత కుంతల లలాటు వైడూర్య మణిగణ వరకిరీటు

తే. బాలుఁ బూర్ణేందు రుచిజాలు భక్తలోక
పాలు సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ
జూచి తిలకించి పులకించి చోద్య మంది
యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె. 111

క. స్నానము సేయఁగరామిని, నానంద రసాబ్ధి మగ్నుఁడై విప్రులకుఁ
ధేనువులం బదివేలను, మానసమున ధారవోసె మఱి యిచ్చుటకుఁ. 112

వ. మఱియును వసుదేవుండు. 113

క. ఈ పురుటి యింటి కుద్య, ద్దీపంబును బోలి చాల దీపించు నిజం
బీ పాపఁడు నలుమొగముల, యా పాపని గనినమేటి యగు నని భక్తిన్. 114

ఆ. చాఁగి మ్రొక్కి లేచి సరగున నొసలిపై
గేలుఁదమ్మిదోయిఁ గీలుకొలిపి
పాపఁ డనక వెఱక పాపని మొదలింటి
పోకలెల్లఁ దలఁచి పొగడఁదొణఁగె. 115

క. ఏ నిన్ను నఖిలదర్శను, జ్ఞానానంద స్వరూపు సంతతు నపరా
ధీనుని మాయాదూరుని, సూనునిఁగాఁ గంటి నిట్టి చోద్యము గలదే !. 116

క. అచ్చుగ నీ మాయల మును, చెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగముం
జొచ్చిన క్రియఁ జొరకుందువు, చొచ్చుటయును లేదు లేదు చొరకుండుటయున్.

సీ. అదియు నెట్లన మహదాదులఁ బోలెడివై వేఱువేఱైయి యన్నివిధము
లగు సూక్ష్మభూతంబు లమర షోడశ వికారములతోఁ గూడి విరాట్టనంగఁ
బరమాత్మునకు నీకు బఱపైన మేను సం పాదించి యందులోఁ బడియుఁ బడక
యుండు [1]సృష్టికి మున్న యున్నకారణమున వానికి లోని భవంబు గలుగ

---

1. సృష్టికి లోననున్న (హ.) సృష్టికి మ్రోలనున్న (వ్రాఁతప్రతులన్నిట)

ఆ. దట్టు బుద్ధి నెఱుఁగ నను వైన లాగునఁ
గలుగు నింద్రియముల కడల నుండి
వాని పట్టు లేక వరుస జగంబులఁ
గలసియుండి యైనఁ గలయ వెపుడు. 118

క. సర్వము నీ లోనిదిగా, సర్వాత్ముఁడ [1]వాదివస్తు సంపన్నుఁడ వై
సర్వమయుఁడ వగు నీకును, సర్వేశ్వర ! లేవు లోను సంధులు వెలియుౘ. 119

ఆ. ఆత్మవలనఁ గలిగి యమరు దేహాదుల
నాత్మకంటె వేఱు లవి యటంచు
దలఁచువాఁడు మూఢతముఁడు గావున నీశ !
విశ్వమెల్ల నీవ వేఱు లేదు. 120

వ. అదియునుం గాక. 121

సీ. గుణము వికారంబుఁ గోరికయును లేని నీవల్ల జగములు నెఱి జనించుఁ
బ్రబ్బు లే దగు నంచుఁ బలుకుట తప్పుగా దీశుండ వై బ్రహ్మ మీవ యైన
నినుఁ గొల్చు గుణములు నీ యానతులు సేయ భటుల శౌర్యంబులు పతికి వచ్చు
పగిది నీ గుణముల భాగులు నీవని తోఁచును నీ మాయతోడఁ గూడి

ఆ. నీవు రక్త ధవళ నీల వర్ణంబుల
జగము సేయఁ గావ సమయఁ జూడఁ
దనరు దట్టు నేఁడు దైత్యుల దండింపఁ
బృథివిఁ గావ నవతరించి తీశ ! 122

శా. మింటౘ బ్రమోసిన బ్రమోఁత తాలిమిని లో మేంబ్రడింప ము న్నీవు నా
యింటం బుట్టెద వంచుఁ గంసుఁడు దొడిౘ హింసించె నీ యన్నలం
గంటం గూరుకుఁ డేఁడు నీ యుదయ మీ కారాజనుల్ సెప్పఁగాఁ
బంటింపం డెదు రేఁగుదెంచు వడి నీపై నేఁడు సన్నద్ధుఁ డై. 123

వ. అనుచుండ దేవకీదేవి మహాపురుష లక్షణుండును, విచక్షణుండును, సుకుమారుండును నైన కుమారునిం గని, కంసునివలని వెఱపున శుచిస్మిత యై యి ట్లనియె. 124

---

1. వాత్మవస్తు (చ. త. వ. జ. డ.).

## —: దేవకీదేవి స్వామిని స్తుతించుట :—

సీ. అట్టిట్టి దనరాని దై మొద లై నిండుకొన్న దై వెలుఁగుచు గుణము లేని
దై యొక్కచందంబు దై కల దై నిర్విశేష మై క్రియ లేక చెప్పరాని
దీ రూప మని శ్రుతు లెప్పుడు నొడివెడి యా రూప మగుచు నధ్యాత్మదీప
మై బ్రహ్మ రెండవ యర్ధంబు తుది జగంబులు నశింపఁగఁ బెద్ద భూత గణము

ఆ. సూక్ష్మభూతమందుఁ జొరఁగ నా భూతంబు
ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి వోయి
వ్యక్తమందుఁ జొరఁగ వ్యక్త మణంగను
శేషసంజ్ఞ నీవు చెలువ మగుదు. 125

ఉ. విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టమ వైన నీకు నా
శాశ్వత మైన కాల మిది సర్వము వేడబ మందు రట్టి వి
శ్వేశ్వర! మేలుకుప్ప! నిను నెప్పుడుఁ గోరి భజించువాఁడె పో
శాశ్వతలక్ష్మి మృత్యుజయ సౌఖ్యయుతుం డభయుండు మాధవా! 126

మత్తకోకిల. ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గ నిరూఢు లై
కంటి మందురు గాని నిక్కము గాన రీ భవదాకృతిన్
గంటి భద్రముఁ గంటి మాంసపుఁ గన్నులం [1]గనఁబోల దీ
తొంటి రూపుఁ దొలంగఁబెట్టుము తోయజేక్షణ! మ్రొక్కెదన్. 127

ఆ. విలయకాలమందు విశ్వంబు నీ పెద్ద
కడుపులోనఁ దాఁచు కడిమి మేటి
నటుఁడ వీవు నేఁడు నా గర్భజుఁడ వౌట
పరమపురుష! వేడబంబు గాదె. 128

తరల. నళినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెద వంచు నీ
ఖలుఁడు కంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె దు
ర్మలినచిత్తుని నాజ్ఞ సేయుము మమ్ముఁ గావుము భీతులన్
నలుసు లేక ఫలించె నోచిన నోము లెల్లను నీవ యై. 129

వ. అని యిట్లు దేవకీదేవి విన్నవించిన, నీశ్వరుం డిట్లనియె. అవ్వా! నీవు తొల్లి స్వాయంభువ మన్వంతరంబున పృశ్ని యను పరమపతివ్రతవు. వసుదేవుండును సుతపుం డను ప్రజాపతి. మీ రిరువురును సృష్టికాలంబున బ్రహ్మపంపునం బెంపున నింద్రియంబులం జయించి, తెంపున వాన గాలి యెండ మంచు లకు సైరించి,

1. గనబోలనీ (హా.)

యేకలంబు లై, యా కలంబులు దిని, యే కలంకంబును లేక, వేంద్రంబునఁ బండ్రెండువేల దివ్యవర్షంబులు తపంబుల నెపంబుల మీ రూపంబులు మెఱయు నోజ, నా జపంబులు సేసి, డాసి, పేర్చి, యర్చింప, మీకు నాకుఁ గలరూపుఁ జూపి, యేను తిరంబు లగు వరంబులు వేఁడు మనిన, మీరు నా మాయం బాయని మోహంబున, బిడ్డలు లేని దొడ్డ యడ్డంబున, దుర్గమం బగు నపవర్గంబుఁ గోరక, నా యీడు కొడుకు నడిగిన మెచ్చి, యట్ల వరం బిచ్చి, మీ కేను పృశ్ని గర్భుం డను నర్భకుండ నైతి. మఱియును. 130

క. అదితియుఁ గశ్యపుఁ డనఁగా, విదితుల రగు మీకుఁ గుఱుచవేషంబున నే
నుదయించితి వామనుఁ డనఁ, ద్రిదశేంద్రానుజుఁడ నై ద్వితీయభవమునన్. 131

క. ఇప్పుడు మూఁడవ [1]జామునఁ, దప్పక మీ కిరువురకును దనయుఁడ నైతిం
జెప్పితిఁ బూర్వము మీయం, దెప్పటికిని లేదు జన్మ మిటపై నాకున్. 132

క. నందనుఁ డనియుం బరమా, నందం బగు బ్రహ్మ మనియు ననుఁ దలఁచుచు నా
పెం దెరువు నొందెదరు నా, యందుల ప్రేమమున భవము నందరు మీరున్. 133

వ. అని యిట్లు పలికి, యీశ్వరుం డా రూపంబు విడిచి. 134

క. ఱెప్ప లిడక తలి దండ్రులు, తప్పకఁ దనుఁజూడ మాయఁ దనరి లలితుఁ డై
యప్పు డటు గన్న పాపని, యొప్పున వేడుకలు సేసె నొకకొన్ని నృపా! 135

వ. అంత వసుదేవుండు తనకుం జేయవలసిన పను లీశ్వరుం డైన హరివలన నెఱింగిన వాఁడుఁ గావున. 136

క. ఆ పురిటి యిల్లు వెలువడి, పాపనిఁ దరలించుకొనుచుఁ బఱచెద ననుచున్
[2]రూపింప నందుభార్యకుఁ, బాప యగుచు యోగమాయ ప్రభవించె నృపా!

వ. అ య్యవసరంబున. 138

క. బిడ్డనిఁ గరముల ఱొమ్మున, నడ్డంబుగఁ బట్టి పదము లల్లన యిడుచున్
జడ్డనఁ గావలివారల, యొద్దు గడచి పురిటిసాల యొయ్యన వెడలెన్. 139

వ. అంత నట. 140

క. నందుని సతికి యశోదకుఁ, బొందుగ హరియోగమాయ పుట్టిన మాయా
స్పందమున నొక్క యెఱుఁగమి, క్రందుకొనియె నూరివారిఁ గావలివారిన్. 141

---

1. భవమున (క. చ. ట. త. వ. తం.) 2. రూపించి (హ.)

వ. అప్పుడు చప్పుడుకాకుండఁ దప్పటడుగు లిడుచు, నినుపగొలుసుల [1]మెలుసులు వీడినఁ దాలంబులు మహోత్తాలుం డైన బిడ్డనికి నడ్డంబు గాక కీ లూడి వీడిపడ, యరళంబులు విరళంబు లై సరళంబు లగు మొగసాలలం గడచి, పాఁపఱేఁడు వాకిళ్లు మరల మూయుచుఁ, బడగ లెడగలుగ విప్పి, కప్పి, యేచి, కాచికొని వెంటనంటిరాఁగ గడంగి నడచునెడ. 142

క. ఆ శౌరికి దెరు వొసఁగెఁ బ్ర, కాశోద్ధత తుంగ భంగ కలిత ధరాశా
కాశ యగు యమున మును సీ, తేశునకుఁ బయోధి త్రోవ యిచ్చిన భంగిన్. 143

వ. ఇట్లు యమున దాఁటి, దూఁటిచని, నందుని మందం జేరి, యం దమందనిద్రం బొంది, యొడ లెఱుంగని గొల్లలం దెలుప నొల్లక, నిత్యప్రసాద యగు యశోద శయ్య నొయ్యన చిన్ని నల్లనయ్య నునిచి, చయ్యన న య్యవ్వకూఁతు నెత్తుకొని, మరల నింటికి [2]బంటింపక వచ్చి, య చ్చిఱుతపాపను దేవకి ప్రక్కం జక్కనిడి. 144

క. పదముల సంకెల లిడుకొని, మదిఁ దలఁకుచు శూరసుతుఁడు మందుఁడు వోలెన్
బెదరు గల రీతి దేహము, గదలించుచు నొదిఁగియుండె గఱువతనమునన్. 145

క. వనజాతునిఁ దెచ్చుటయును, దనసుతఁ గొనిపోవుటయును దా నెఱుఁగక మూఁ
గిననిద్రఁ జొక్కుచుండెను, వనజాక్షి యశోద రేయి వసుధాధీశా ! 146

## అధ్యాయము – ౪

సీ. అంత బాలిక యావు రని యేడ్చు చిఱుచప్పు డాలించి వేకన నాఁకయింటి
కావలివారు మేల్కని చూచి తలుపుల తాళముల్ తొంటివిధమున నుండఁ
దెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్లాడె రమ్ము ర మ్మని భోజరాజుతోడఁ
జెప్పిన నాతఁడు చిడిముడిపాటుతోఁ దల్పంబుపై లేచి త త్తఱమున

తే. [3]వెంద్రుకలు వీడఁ బై చీర [4]వ్రేలి యాడ
తాల్మి కీలూడ రోషాగ్ని దర్పమాడ
భూరి వైరంబుతోఁ గూడ పురిటియింటి
జాడఁ జనుదెంచి యా పాపఁ జంపఁ గదియ. 147

వ. అంత దేవకి యడ్డంబు వచ్చి యి ట్లనియె. 148

---

1. మెలుసులువడిన (తం.) 2. శంకింపక (క. త. ద.) 3. వెంట్రుకలు (హ)
4. వ్రేలిజీర (హ.)

ఉ. అన్న! శమింపు మన్న! తగ దల్లుఁడు గాఁ డిది! మేనగోడ లా
మన్నన సేయు మన్న! విను మానినిఁ జంపుట రాచపాడి గా
దన్న! సుకీర్తి వై మనఁగ దన్న! మహాత్ములు వోవు త్రోవఁ బో
వన్న! భవత్సహోదరిఁ గదన్న! నినున్ శరణంబు వేఁడెదన్. 149

క. కట్టా! యార్గురు కొడుకులఁ, బట్టి వధించితివి యాఁడుఁబడు చిది కోడల్
నెట్టన చంపఁగవలెనే, కట్టిఁడివి గ దన్న! యన్న! కరుణింపఁగదే. 150

క. పుత్రుఁడు నీ బ్రతుకునకును, శత్రుం డని వింటి గాన సమయింపఁ దగున్
పుత్రులకు [1]నోమ నై తిని, పుత్రీదానంబు సేసి పుణ్యముఁ గనవే! 151

వ. అని పయ్యెదఁ జక్కఁగ సవరించుకొనుచుఁ, బలవరింపుచు, భ్రాంతిపడి, కూఁతుం
గ్రక్కున నక్కునం జక్క హత్తుకొని, చెక్కు చెక్కున మోపి, చక్కన నుత్తరీ
యాంచలంబున సంచలతం గప్పి, చప్పుడు గాఁ గుయ్యిడ, న య్యెడం గ్రయ్యం
బడి, వాఁడు పోఁడిమి చెడఁ, దోఁబుట్టువుం దిట్టి, చిట్టిపట్టి యావు రని వాపోవఁ,
గావరంబున నడుగు లొడిసి, తిగిచి, వడిం బెడిసిపడం బుడమి పయిం బడ వ్రేసిన,
న బ్బాలయు నేలం బడక, లీల నెగసి, నవ్య దివ్యమాలికా గంధబంధుర మణిహా
రాంబరా ద్యలంకార మనోహారిణియు, గదా శర శంఖ చక్ర చర్మ చాపాసి
శూలంబు లెనిమిది కరంబులం గరం బొప్ప నొప్పుచు, సిద్ధ చారణ కిన్నర గరుడ
గంధర్వాది వైమానికులు కానుక లిచ్చి పొగడ, నెగడుచు, నచ్చరల యాటపాట
లకు మెచ్చుచు, మింటనుండి, కంటఁబడి, కంటుపడఁ, గంసుని కి ట్లనియె. 152

ఉ. తెంపరి వై పొరింబొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం
జంపితి వింక నైన నుపశాంతి వహింపక రాలమీఁద [2]న
న్నొంపితి విస్సిరో యిదియు బీరమె నా సరసన్ జనించి నిన్
జంపెడు వీరుఁ డొక్కెడ సత్కృతి నొందెడువాఁడు దుర్మతీ! 153

వ. అని పలికి. 154

క. మహనీయ గుణాస్పద యై, మహిలో నా దేవి [3]జనము మన్నింపంగా
బహు నామ నివాసంబులఁ, బహు నామములం జరించె భద్రాత్మిక యై. 155

వ. అంత నా బోటి పలికిన కలికిపలుకులు ములుకు లై, చెవులఁ జిలికిన నులికిపడి,
[4]జళుకు గదిరిన మనంబున ఘనంబుగ వెఱఁగంది, కంది, కుందెదు దేవకీవసుదేవుల
రావించి, యాదరంబున గారవించి, చేరి, వారితో ని ట్లనియె. 156

---

1. నోమవేనియు (క. చ. ట. త. తం.) 2. నొప్పించితి విస్సిరో. (తం) ; నొప్పింపఁగ (వా.)
3. జగము (ట) 4. ఝుళుకు (హ.) జుళుకు (తం.)

ఉ. పాపుఁడ బాల [1]ఘాతకుఁడ బంధువిరక్తుఁడ దుష్టచిత్తుఁడన్
గోపనుఁడం జరన్మృతుఁడఁ గ్రూరుఁడ బ్రాహ్మణహంత భంగి మీ
పాపలఁ జంపితిన్ బయలిపల్కుల నమ్మితి సాధులార! నా
పాపము లుగ్గడింపక కృపాపరు లై కనరే శమింపరే!. 157

ఉ. ఒక్కెడఁ బ్రాణు లందఱు నిజోచితకర్మము లోలిఁ ద్రిప్పఁగా
నొక్కొక [2]మేనితోఁ బొడమి యొక్కొక [3]త్రోవను రాకపోకలం
జిక్కులఁ [4]బొందుచుం దుదలు [5]చేరరు సంసృతితోడఁ బాయ రే
వెక్కడివాంత మీ శిశువు లెక్కడి హన్యులు దూఱ నేటికిన్. 158

క. పగతురఁ జెఱిచితి ననియును, బగతురచేఁ జెడితి ననియు బాలుఁడు దలఁచున్
బగ చెలుములు లే వాత్మకుఁ, బగచెలుముల కీలు కర్మబంధము సుండీ. 159

వ. అని పలికి, కన్నీరు నించి, వగచి, వెగచుచు, దేవకీవసుదేవుల పాదంబులఁ బట్టు కొని, సంకెలలు విప్పించి, మిక్కిలి యక్కఱగల వాక్యంబుల నైక్యంబులు నెఱపిన, వారును, బరితప్తుం డైన కంసునిఁ జూచి, రోషంబును బాసిరి. అంత నా వసుదేవుండు బావ కి ట్లనియె. 160

శా. బావా! నీ వచనంబు నిక్కము సుమీ ప్రాణుల్ గతజ్ఞాను లై
నీ వే నంచును లోభ మోహ మద భీ నిర్మిత్రతా మోద శో
కావేశంబుల నొండొరుం బొడుతు రేకాకారుఁ డై సర్వ రూ
పావిష్టుం డగు నీశ్వరుం దెలియలే రన్యోన్య విభ్రాంతు లై. 161

వ. అని యిట్లు ప్రసన్ను లైన దేవకీవసుదేవుల యనుజ్ఞ వడసి, కంసుం డింటికిం జని, యా రేయి గడపి, మఱునాఁడు గ్రద్దనం బ్రొద్దునం దనకుం బరతంత్రు లగు మంత్రుల రావించి, యోగనిద్రవలనం దా వినిన వృత్తాంతం బంతయు మంత నంబున నెఱింగించిన, నపుడు వార లతని కి ట్లనిరి. 162

క. ఇట్లైనఁ దడయ నేటికి, పట్టణముల మందలందుఁ బల్లెల నెల్లన్
బుట్టెడి పెరిఁగెడి శిశువులఁ, బట్టి వధించెదము మమ్ముఁ బంపు మధీశా! 163

మ. భవదీ యోజ్జ్వల బాహు చాప విలస ద్బాణావళీ భగ్ను లై
దివిజాధీశ్వరు లేక్రియం బడిరొ యే దేశంబులం డాఁగిరో
శివునిం జొచ్చిరొ బ్రహ్మఁ జెందిరొ హరిన్ సేవించిరో మౌనివృ
త్తి వనాంతంబుల నిల్చిరో మనకు శోధింపందగున్ వల్లభా! 164

---

1. ఘాతుకుఁడ (తం.) 2. మేనులంబొడమి (హ.); యోనులంబొడమి (తం.) 3. త్రోవలరాక (హ. తం.) 4. పొందుచుండుదురు. (హ.) 5. చెల్మిని సంసృతితోడ (వా.)

కం. నొచ్చిరి శాత్రవు లనుచును, విచ్చలవిడిఁ దిరుగవలదు వివిధాకృతులన్
ప్రుచ్చిలి వత్తురు వారలు, సచ్చినయందాఁక మఱవఁ జన దధిపునకున్. 165

క. ఒత్తికొనుచు రానీఁ జనఁ, డెత్తిన రోగముల రిపుల నింద్రియముల ను
తృత్తిసమయములఁ జెఱుపక, మెత్తన గారాదు రాదు మీఁద [1]జయింపన్. 166

మ. అమరశ్రేణికి నెల్లఁ జక్రి ముఖరుం డా చక్రి ధర్మంబునం
దమరున్ గోవులు భూమిదేవులుఁ దితిక్షామ్నాయ కారుణ్య స
త్యములున్ యాగ తపో దమంబులును శ్రద్ధా శాంతులున్ విష్ణుదే
హము లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్. 167

వ. కావున. 168

ఉ. చంపుదుమే నిలింపులను జంకెల ఱంకెలఁ దాపసావళిం
బంపుదుమే కృతాంతకునిపాలికిఁ గ్రేపులతోడ గోవులన్
ద్రుంపుదుమే ధరామరులఁ దోలుదుమే నిగమంబులన్ విదా
రింపుదుమే వసుంధర హరింపుదుమే జననాథ! పంపుమా. 169

వ. అని పలుకు మంత్రుల మంత్రంబుల నిమంత్రితుం డై, బ్రాహ్మణ నిరోధంబు నిషేధం బని తలంపక, కాలపాశబద్ధుం డై, విప్రాది సాధుమానవులఁ జంపన్ దానవులం బంపి, యంతిపురంబునకుం జనియె. అనంతరంబ యా రక్కసులు వెక్కసంబు లగు మొక్కలంబుల సజ్జనుల పజ్జలం బడి, తర్జన గర్జన భర్జనాది దుర్జనత్వంబుల నిర్జించి, పాపంబు లార్జించిరి. 170

ఆ. వెదకి వెదకి దైత్యవీరులు సాధుల
నణఁప వారిబలము లణఁగిపోయె
యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు
నార్యహింస సేయ నణఁగుఁ గాదె! 171

## అధ్యాయము - ౫

వ. అంత మందలో నందుండు, నందనుండు పుట్టుట యెఱింగి, మహానందంబున నెఱవాదు లగు వేదవిదులం బిలిపించి, జలంబు లాడి, శుచి యై, శృంగారించుకొని, స్వస్తిపుణ్యాహవాచనంబులు చదివించి, జాతకర్మంబులు సేయించి, పితృదేవతల నర్చించి, క్రేపులతోడఁగూడఁ గై సేసిన పాఁడి మొదవుల రెండు లక్షలను, గనకకలశ మణి వసన విశాలంబు లైన తిలశైలంబు లేడింటిని భూదేవతల కిచ్చిన. 172

1. జయంబున్ (హ.)

క. ఈ యాభీరకుమారుఁడు, శ్రీయుతుఁ డై వీరవైరి జేతయు నై దీ
ర్ఘాయుష్మంతుం డగు నని, పాయక దీవించి రపుడు బ్రాహ్మణజనముల్. 173

క. దుందుభులు మొరసె గాయక, సందోహము వాడె సూతసముదాయముతో
వందిజనులు కీర్తించిరి, క్రందుగ వీతెంచె భద్రకాహళ రవముల్. 174

క. పల్లవ తోరణ [1]రాజిత, వల్లీ [2]ధ్వజరాజ ధూప వాసనములతో
సల్లలితము లై యొప్పెను, వల్లవవల్లభుల యిండ్ల వాకిం డ్లెల్లన్. 175

క. పసుపులు నూనెలు నలఁదిన, పసఁ దనరి సువర్ణ బర్హిబర్హ ప్రభతోఁ
బసిమి గలిగి వెలుఁగొందుచుఁ, బసు లన్నియు మందలందుఁ [3]బ్రసరించె నృపా!

క. క్రేళ్ళుఱికి మసలె లేఁగలు, మల్లడి గొని ఱంకె లిడియె మదవృషభంబుల్
పెల్లుగ మొదవుల పొదుఁగుల, జల్లించెం బాలు బాలు సంభవవేళన్. 177

క. అరఁగఁ జదివెడి పొగడెడి, వారికి విద్యలను బ్రతుకువారికి లేమిం
జేరినవారికి నెల్లను, గోరక మును నందుఁ డిచ్చె గో ధనచయముల్. 178

వ. ఆ సమయంబున. 179

క. కంచుకములు [4]తల చుట్లును, గాంచన భూషాంబరములుఁ గడు మెఱయఁగ నే
తెంచిరి గోపకు లందఱు, మంచిపదార్థములు గొనుచు మాధవుఁ జూడన్. 180

క. ఏతెంచి చూచి చెలఁగుచు, నేతులఁ బెరుఁగులను బాల నీళ్ళను వెన్నం
బ్రీతి వసంతము లాడిరి, [5]యాతురు లై సరసభాష లాడుచు గొల్లల్. 181

వ. తదనంతరంబ. 182

ఆ. ఏమి నోముఫలమొ యింతప్రొ ద్దొకవార్త
వింటి మబలలార! వీను లలర
మనయశోద చిన్ని మగవానిఁ గనెనఁట
చూచి వత్తమమ్మ! సుదతులార! 183

వ. అని యొండొరుల లేపి, గోపిక లోపికలు లేని చిత్తంబుల నెత్తిన తత్తఱంబు లొత్తుకొన, నుదారంబు లగు శృంగారంబుల నిండ్లు వెలువడి. 184

క. జడగతులును బలు పిఱుఁదులుఁ, బిడికెడు నడుములును వలుఁద బిగి చనుఁగవలున్
వెడఁద నయనములు సిరి దడఁబడు మోములు భ్రమరచికుర భరములు నమరన్

---

1. సురుచిర (హ. వా.) రాంగిక (తం.) 2. లాజ (చ.ట.త.జ.) 3. ప్రభవించె (హ.)
4. తలచుట్టలు (హ.) 5. యేతదులై....తెనఁగన్ (తం. వా.)

ఉ. వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరి [1]హారరేఖ ల
ల్లాడఁ గపోలపాలికల హాటకపత్త్ర రుచుల్ వినోదనం
బాడఁ బటాంచలంబు లసియాడఁగఁ జేరి యశోదయింటికిన్
జేడియ లేఁగి చూచి రొగి జిష్ణుని విష్ణునిఁ జిన్ని కృష్ణునిన్. 186

వ. చూచి సంతసించి తెచ్చిన కానుక లిచ్చి. 187

తే. పాపనికి నూనెఁ దలయంటి పసుపుఁ బూసి
బోరుకాడించి హరిరక్ష పొమ్మటంచు
జలము లొకకొన్ని చుట్టి [2]రాఁజల్లి తొట్ల
నునిచి దీవించి పాడి ర య్యువిద లెల్ల. 188

క. జోజో కమలదళేక్షణ!, జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!
జోజో పల్లవకరపద!, జోజో పూర్ణేందు వదన జోజో యనుచున్. 189

వ. ఇవ్విధంబున. 190

క. పలు తోయంబుల జగములఁ, బలు తోయములందు ముంచి భాసిల్లెడి యా
పలుతోయగాఁడు వల్లవ. లలనా కరతోయములఁ జెలంగుచుఁ దడియున్. 191

క. లోకములు నిదుర వోవను, జోకొట్టుచు నిదురవోని సుభగుఁడు రమణుల్
జోకొట్టి పాడ నిదురం, గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవకయున్. 192

సీ. ఏజాము తెఱుఁగక యేపారు [3]గట్టికిఁ బసుల కాపరి యింటఁ జాము గలిగె;
నే కర్మములు లేక యెనయు [4]నెక్కటికిని జాతకర్మంబులు సంభవించె
నే తల్లి చనుఁబాలు నెఱుఁగని ప్రోఢ యశోద చన్నుల పాలచొరవ యెఱిఁగె
నే హానివృద్ధులు నెఱుఁగని బ్రహ్మంబు పొదిఁగిటిలో వృద్ధిఁ బొందఁ జొచ్చె

ఆ. నేతపముల నైన నెలమిఁ బండని పంట
వల్లవీజనముల వాడఁ బండె
నే చదువుల నైన నిట్టిట్టి దనరాని
యర్థ మవయవముల నంద మొందె. 193

మ. చెయువుల్ సేయుతఱిన్ విధాతకరణిం జెన్నొందు సంతోష దృ
ష్టియుతుం డై నగుచున్ జనార్దనుని మాడ్కిన్ బొల్చు రోషించి యు
న్నయెడన్ రుద్రునిభంగి నొప్పును సుఖానందంబునుం బొంది త
న్మయుఁ డై బ్రహ్మము భాతి బాలుఁ డమరున్ బాహుళ్య బాల్యంబునన్. 194

---

1. వల్లు (ద.) 2. రాజిలెడు (హా.) 3. మేటికి (వా.) 4. చక్కటికిని (హా. తం.)

వ. అ య్యవసరంబున. 195

ఆ. కొడుకుఁ గన్న వేడ్క గొనసాగ రోహిణిఁ
జీరఁ బంచి చిత్ర చేలములను
మండనముల నిచ్చి మన్నించె నందుఁ డా
యంబుజాక్షి ప్రీత యై చరింప. 196

వ. అది మొదలు మొదవుల కదుపులు పొదువులు గలిగియుండె. అంత నందుండు గోపకుల ననేకుల గోకుల రక్షకుం డకు లై నవారిని నియమించి, మధురకుం జని, కంసునికి నేఁటేఁటం బెట్టెడి యరిం బెట్టి, వీడ్కొని, వసుదేవుని కడకుం జని, యథోచితంబుగ దర్శించిన. 197

క. నందునిఁ బొడగని ప్రాణముఁ, బొందిన బొందియునుఁ బోలెఁ బొలుపారుచు నా నందాశ్రులు గడకన్నులఁ, గ్రందుకొనం గేలుసాఁచి కౌఁగిటఁ జేర్చెన్. 198

వ. మఱియుం గౌఁగిలించుకొని, సుఖాసీనునిం జేసి, వసుదేవుండు తన కొడుకు వలని మోహంబు దీపింప నందున కి ట్లనియె. 199

క. సంతతి లే దనియెడి ఘన, చింతనముల మునిఁగి ముదిసి చిక్కిన నీకున్ సంతతి గలిగెను భాగ్యము, సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే. 200

క. పొడగంటి నిన్ను బ్రతికితిఁ, గడచితి నాపదల నింకఁ గార్యములం దే [1]యెడమడుగు లేని నెచ్చెలిఁ, బొడగాంచుట చచ్చి మరలఁ బుట్టుటగాదే. 201

క. పలుపాటులఁ బడు జనులకు, నిల నొకచో నుండఁగలదె యేఱుల వెంటన్ గలసి చను మ్రాఁకు లన్నియుఁ, బలువెంటలఁ బోవుఁగాక పాయకయున్నే. 202

మ. బలురోగంబుల నొందకున్న వె పసుల్ పా లిచ్చునే ధేనువుల్
కొలఁకుల్ వాఁగులు వారిపూరితములే గోష్ఠ ప్రదేశంబులం
బులులున్ [2]దుప్పులు సంచరింపవు గదా పొల్పారునే ఘోషముల్
కలవే పచ్చని పూరిజొంపములు తత్కాంతార భాగంబులన్. 203

క. తన పుత్ర మిత్ర ముఖరులఁ, దనుపక చూడకయు వారు దఱిఁగి నశింపన్ మనుచు గృహమేధియాశ్రమ,మున నుండెడువాని కొక్క మోదము గలదే. 204

క. నీ కాంతయొద్ద నీవును, నీకాంతయు గారవింప నినుఁ దండ్రిఁ గ నా లోకింపుచు నీ మందను, నా కొడు కున్నాఁడె నంద! నందాన్వితుఁ డై. 205

వ. అనిన నందుం డి ట్లనియె. 206

1. యెడమరుగు (పా.) 2. దుప్పులు (పా.)

శా. నీకుం దేవకికిం జనించిన సుతానీకంబుఁ దోడ్తోడ ము
న్నీ కంసుండు వధించె మీసుతఁ దుదిన్ హింసింపఁ జేతప్పి తా
నాకాశంబున కేఁగె బాల యిది దైవాధీన మాపద్దశన్
శోకం బందుదె తజ్జ్ఞుఁ డూఱడిలు నా సూనుండు నీ సూనుఁడే. 207

వ. అనిన వసుదేవుండు నందునకు మఱియు ని ట్లనియె. 208

క. జనపతి కరి యిడితివి మముఁ, గనుఁగొంటివి మేము నిన్నుఁ గంటిమి మేల
య్యెను బో మ్మింకను గోకులమున నుత్పాతములు దోఁచు మునుకొనవలయున్.

అధ్యాయము - ౬

వ. అని పలికి, వసుదేవుండు నందాదు లైన వల్లవులను వీడ్కొలిపిన, వారలు గొబ్బున వడిగల గిబ్బలం [1]బూన్చిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి, తమతమ పల్లెల త్రోవలం బట్టి చనిరి. ఆ నందుండు ప్రతీతంబు లైన యుత్పాతంబులు ముందరఁ బొడగని, శౌరి తనతోఁ బలికిన పలుకులు దప్ప వనుచుఁ దలంచుచుండె. అంత.

సీ. కంసుపంపున బాలఘాతిని పూతన పల్లెల మందలఁ బట్టణముల
నిల నెల్లచో బాలహింసఁ గావించుచుఁ జనుచు నెవ్వని పేరు శ్రవణవీథిఁ
బడినయంతన సర్వ భయనివారణ మగు నట్టి దైత్యాంతకుం డవతరించి
యున్న నందునిపల్లె కొకనాఁడు ఖేచరి యై వచ్చి యందు మాయాప్రయుక్తిఁ
తే. గామరూపిణి యై చొచ్చి కానకుండ
నరిగి యిల్లిల్లుఁ దప్పక యరసికొనుచు
నందగృహమున బాలుని నాద మొకటి
విని ప్రమోదించి సుందరీవేష యగుచు. 211

మత్తకోకిల. కాలు కన్నులు గుబ్బచన్నులు గందు వొందని చందురుం
బోలు మోమును కల్గు లేదన బుద్ధి [2]దూఱని కౌను పే
రాళ మైన పిఱుందు పల్లవరాగ పాదకరంబులున్
జాల దొడ్డగు కొప్పు నొప్పఁగ సర్వమోహన మూర్తితోన్. 212

మానినీవృత్తము. కాంచనకుండల కాంతులు గండయుగంబునఁ గ్రేళ్లుఱుకన్ జడపై
మించిన మల్లెల మేలిమితావులు మెచ్చి మదాళులు మిన్నున రా
నంచిత కంకణ హార రుచుల్ చెలు వారఁగ బైవలు వంచల [3]మిం
చించుక జాఱఁగ నిందునిభానన యేఁగెఁ గుమారుని యింటికి నై.

---

1. బూనిన (హ. తం. వా.) 2. మానని (హ) 3. నించుక (తం.)

వ. ఆ సమయంబున. 214

మ. సిరి మమ్మిం బ్రతుకంగఁ జూచుటకు నై శృంగారవేషంబుతో
నరుదే నోపు నటంచు గోపికలు జివ్వాల్ రాక మోహించి త
త్పర లై చూడ లతాంగి పోయి కనియెం బర్యంకమధ్యంబునన్
బరు భస్మానలతేజు దుర్జనవధ ప్రారంభకున్ డింభకున్. 215

వ. కని కదియవచ్చు సమయంబున. 216

శా. ఆ లోకేశ్వరుఁ డా చరాచరవిభుం డా బాలగోపాలుఁ డా
బాలధ్వంసిని [1]గొంటి గంటిడి వెసన్ బాలెంతచందంబునన్
బాలిండ్లన్ విషమూని వచ్చుట మదిన్ భావించి లో నవ్వుచున్
కాలుం గేలు నెఱుంగకున్న కరణిన్ గన్మోడ్చి [2]గుర్వెట్టఁగన్ 217

క. ఆ పాపజాతి సుందరి, యా పాపనిపాన్పుఁ జేర నరిగి కరములన్
లేపి చనుంగవ శిశువున్, మోపుచు ముద్దాడి శిరము మూర్కొని పలికెన్. 218

క. చను నీకుఁ గుడుపఁజాలెడి, చనువారలు లేరు నీవు చనవలె ననుచున్
చనుగుడిపి మీఁద [3]నిలుకడఁ, జనుదాన ననంగ వేడ్కఁ జనుఁ జను గుడుపన్. 219

క. నా చనుఁబా లొకగ్రుక్కెఁడు, నో చిన్నికుమార! త్రావు మొయ్యన పిదపన్
నీ చెలువ మెఱుఁగవచ్చును, నాచెలువము సఫల మగును నళినదళాక్షా! 220

వ. అని బాలు నుద్దేశించి ముద్దాడెడిభంగి మాటలాడెడి చేడియం జూచి. 221

మ. వనితా! ముట్టకు మమ్మ చన్ను గుడుపన్ వ ల్దమ్మ! నీ చన్ను మా
తనయుం డొల్లఁడు వాసి పొ మ్మని యశోదారోహిణుల్ సీరఁ గై
కొన కీక్షింపుచు మాయఁబన్ని పెలుచన్ [4]కోశంబులో వాలు మె
ల్పున రాజిల్లుచు మాటమెత్తఁదనమున్ లో వాఁడియు న్నేర్పడన్. 222

వ. కదిసి కలికిపలుకులు వలుకుచు, నులుకు చెడి, జళుకు సొరక, యెదుర నిదురం గదిరిన ఫణి యని యెఱుంగక, గుణమతిం దిగుచు జడమతితెఱంగున నరిది జలధితెఱవ (నెరపునం జనుదెంచి) పఱపు నడుమ నొఱపుగలిగి మెఱయుచు, కనుంగవం దెఱవక, వెఱపు మఱపు నెఱుంగక, కొమరుమిగులు చిఱుతకొమరునిం దిగిచి, తొడలనడుమ నిడుకొని, యొడలు నివురుచు, నెడనెడ మమతం గడలుకొలుపుచు, "నాఁకొన్న చిన్నయన్న! చన్నుగుడువు"మని చన్నిచ్చు సమయంబున. 223

1. గొంటు (తం. వా.); గొట్టుకట్టిడి (ద. ద.) 2. గుర్వెట్టుచున్ (హ. తం.) 3. నీకడ(హ)
4. కోశంబులోఁబాలుచెల్వున (హ.)

సీ. మేల్కొన్న తెఱఁగున మెల్లన గనువిచ్చి క్రేగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి
యావులింపుచుఁ జేతు [1]లాకసంబునఁ జాచి యొదిఁగిలి యాఁకొన్న యోజ నూఁది
బిగి చన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి గ్రుక్కగ్రుక్కకు గుటుగుటుకు మనుచు
నొకరెండు గ్రుక్కల నువిదప్రాణంబులు సయితము మేనిలో సత్త్వ మెల్లఁ

తే. త్రావె నదియును గుండెలు దల్లడిల్ల
[2]జిమ్మ దిరుగుచు నిలువక శిరము వ్రాల
నితరబాలుర క్రియవాఁడ వీవు గావు
చన్నువిడువుము విడువుము చాలు ననుచు. 224

క. నిబ్బరపు దప్పి మంటలు, ప్రబ్బిన ధృతిలేక నేత్ర పద హస్తంబుల్
గొబ్బున [3]వివృతములుగ నా, గుబ్బగుచున్నట్టి కూఁతఁ గూలెన్ నేలన్ 225

మ. అదరెన్ గొండలతోడ భూమి గ్రహ తారానీకముల్ మింటిపై
బెదరెన్ దిక్కుల మాఱుమ్రోఁత లెసఁగెన్ భీతిల్లి లోకంబులున్
గదలంబాఱెను వజ్రభిన్న గిరిరేఖం బూర్వదేహంబుతోఁ
ద్రిదశధ్వంసిని గూలి [4]కుయ్యిడఁగఁ దద్ఘోర ఘోషంబునన్. 226

క. అప్పుడు దెప్పర మగు నా, చప్పుడు హృదయములఁ జొచ్చి సందడిపెట్టన్
ముప్పిరిగొని పడి రెలుకలు, దప్పి ధరం గొల్లలెల్లఁ దల్లడపడుచున్. 227

క. ఆ జఱభిరండ రక్కసి, నైజశరీరంబు నేల నలియంబడినన్
యోజనమున్నర మేర ధ, రాజంబులు నుగ్గు లయ్యె రాజవరేణ్యా! 228

సీ. దారుణలాంగూల దండదంతంబులు నగగహ్వరముఁ బోలు నాసికయును
గండశైలాకృతి గల కుచయుగమును విరిసి తూలెడు పల్లవెంట్రుకలును
జీఁకటినూతులఁ బెనయు నేత్రంబులుఁ బెనుదిబ్బఁ బోలెడి పెద్దపిఱుఁదుఁ
జాఁగుకట్టలఁ బోలు చరణోరుహస్తంబు లింకిన [4]చెఱువుతో నెనయు కడుపుఁ

తే. గలిగి షట్క్రోశదీర్ఘమై కదిసి చూడ
భయద మగు దాని ఘనకళేబరముఁ జూచి
గోప గోపీజనంబులు గుంపు గూడి
బెగడుచుండిరి మనమున బెదరు గదిరి. 229

---

1. లాదరంబునఁజూచి (తం.) ఁజూఁచి (వా.) 2. ఁజిమ్మఁదిరుగుచు (తం. వా.) 3. వివృతములుగనా, గుబ్బాగుబ్బయిన కూఁతఁ (తం.); గుబ్బాగుబ్బైనపూత (క. చ. ట. త.); వివృతము లగుచును, గుబ్బనుచున్నట్టి కూఁత (హ.) 4. కుయ్యిడిన (తం. వా.) 5. మడువు (హ.)

వ. ఇ వ్విధంబున. 230

క. ఆ తఱిఁ గుడువఁగ నడిచెను, నూతన ఫుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యు
ద్యోతనఁ గృతమునిసముదయ, యాతనఁ బూతన నెఱిఁగి యాతనలీలన్. 231

క. విషధరరిపు గమనునికిని, విషగళ సఖునికిని విమల విష శయనునికిన్
విషభవభవ జనకునికిని, విషకుచ చనువిషముఁ గొనుట విషమే తలఁపన్. 232

వ. అంత నా గోప గోపీజనంబులు దెలిసి, రోహిణీ యశోదలం గూడుకొని, బెగ్గడిలక దగ్గఱి. 233

శా. నేలం గూలిన మేటి పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడింప నో
బాలా! రమ్మని [1]మూఁపుఁ జేర్చుకొని సంస్పర్శించి యూరార్చుచున్
గోలాంగూలముఁ ద్రిప్పి గోపురజమున్ గోమూత్రమున్ జల్లి త
ద్బాలాంగంబుల గోమయం బలఁది రా పంద్రెండునామంబులన్. 234

రక్షావచనము. మఱియు, నంతటం దనియక, గోపిక లాచమనంబులు చేసి, దక్షలై, మును తమకు రక్షాకరం బగు, బీజన్యాసంబు చేసికొని, చిన్నియన్న! నీ యడుగు లజుండును, [2]జానువు లణిమయును, దొడలు యజ్ఞుండును, గటితలం బచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబు కేశవుండును, నురము మీశుండును, గంఠం బినుండును, భుజంబులు చతుర్భుజుండును, ముఖం బురుక్రముండును, శిరం బీశ్వరుండును, రక్షింతురు. ముందు చక్రియు, వెనుక గదాధరుం డైన హరియుఁ, బార్శ్వంబుల ధనుర్ధరుం డైన మధువైరియు, నసిధరుం డగు నజనుం డును, గోణంబుల శంఖ చక్ర ధరుం డైన [3]యురుగాయుండును, మీఁదు నుపేంద్రుండును, గ్రిందు తార్క్ష్యుండును, నంతటను హలధరుం డగు పురుషుండును గాతురు. ఇంద్రియంబుల హృషీకేశుండును, ప్రాణంబుల నారాయణుండును, జిత్తంబును శ్వేతద్వీపపతియును, మనంబును [4]యోగేశ్వరుండును, బుద్ధిని బృశ్నిగర్భుండును, నహంకా రంబును భగవంతుం డైన పరుండును, బాలనంబు సేయుదురు. నీవు క్రీడించు నెడ గోవిందుండును, శయనించుతఱిని మాధవుండును, నడచువేళ వైకుంఠుండును, గూర్చున్నసమయంబున శ్రీపతియును, గుడుచుకాలంబున సర్వభక్షకుం డైన యజ్ఞభుజుండును, నేమఱి

1. మూఁపుఁజిమ్ముకొని (తం.) 2. జానువు లనిలుండును (తం. వా.); "అణిమాతవజాను" (6-28) 3. యురగశయన్నుండును (హా.) యురుకాయుండును (వా.) 4. యోగీశ్వరుండైన కపిలుండును (తం. వా.); "మనో యోగేశ్వరోఽవతు" అని మూలము (6-25)

కుండుదురు. నిన్నుఁ జేర్కొనిన, దుస్స్వప్న వృద్ధ బాల గ్రహంబులును, గూశ్మాండ డాకినీ యాతుధానులును, భూత ప్రేత యక్ష రాక్షస పిశాచ వినాయకులును, [1]గోటరా రేవతీ జ్యేష్ఠలును, బూతనా మాతృకాది గణంబులును నశియించుదురు. నీయందుఁ బ్రాణేంద్రియ శరీరనిరోధంబు లైన యున్మాదంబులును, నపస్మారంబును, మహోత్పాతంబులును, బొందకుండుం[2]గావుత నని రక్షచేసి, దీవించిరి. అంత. 235

క. ఆ పెద్దవేడబంబుల, పాపనికినిఁ జన్నుఁగుడిపి పానుపు [3]పై సం
స్థాపించి కప్పి కూరుకు, మో పాపఁడ! యని యశోద యొయ్యన పాడెన్. 236

వ. అంత నందుండు మొద లైన గోపకులు మధురనుండి వచ్చి, రక్కసిమేనుఁ గని వెఱఁగుపడి, మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె. అతండు మహాయోగి యని పొగడి, కఠోరం బగు పూతనయొడలు కుఠారంబుల నఱికి, తమ కుటీరంబులకుం [4]దవ్వగు ప్రదేశంబున పటీరంబుల దహనంబు సంగ్రహించి దహించిరి. 237

ఆ. పొగిలి పొగిలి కాలు మగువదేహంబున
నగరుపరిమళముల పొగలు వెడలె
దేహకల్మషములు శ్రీహరిముఖమునఁ
ద్రావఁబడుటఁ జేసి భూవరేణ్య! 238

క. హరి దనమీఁదం బదములు, గరములు నిడి చన్నుఁగుడిచి కదిసినమాత్రన్
హరిజననిపగిదిఁ బరగతి, కరిగెను [5]దురితములు వాసి యసురాంగనయున్. 239

క. వెన్నుని కొకమఱి విష మగు, చన్నిచ్చిన బాలహంత్రి చనె నఁట దివికిన్
[6]వెన్నునిఁ గని పెంచుచుఁ దన, చన్నిచ్చిన సతికి మఱియు జన్మముఁ గలదే. 240

క. హరిఁ గని చన్నులు గుడిపెడు, తరుణులు ప్రాపించు పదము దలఁపన్ వశమే
హరి యారగించుటకుఁ బా, ల్గురిసిన ధేనువులు ముక్తికొనలఁ జరించున్. 241

క. ఆ పూతన మెయిగంధము, గోపాలు రెఱింగి యిట్టి కువనిత యొడలం
దీపాటి స్వాదుగంధము, ప్రాపించునె యనుచుఁ జనిరి [7]పల్లెల కధిపా! 242

---

1. కోటరాదులును జ్యేష్ఠాది భూతనాథులును (హ.) 2. గావుతమని (తం. వా.) 3. పైనం బ్రాపించి (హ.) 4. దవ్వగువటారంబున దహనంబు (తం.) 5. దురితములఁ బాసి (తం. వా.) 6. వెన్నుఁగని పెంచి భక్తిం జన్నిచ్చిన (తం.) 7. పల్లెకు నధిపా (తం.)

వ. అంత నందుండును, బరమానందంబున నింటికిఁ జని, ప్రేతలచేత రక్కసి సేఁత లన్నియు నెఱింగి, వెఱఁగుపడి, పాపని లేపి, శిరంబు మూర్కొని, ముద్దాడి, ముదంబున నుండె. అని చెప్పిన, పరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 243

క. ఏ యే యవతారంబుల, నే యే కర్మములు సేసె నీశుఁడు హరి భ
ద్రాయతనము లన్నియు వినఁ, బాయదు చిత్తంబు సెవులపండువు లయ్యెన్.

క. ఉరు సంసారపయోనిధి, తరణంబులు పాపపుంజ దళనంబులు శ్రీ
కరణంబులు ముక్తిసమా, చరణంబులు బాలకృష్ణు సంస్మరణంబుల్. 245

## అధ్యాయము - ౭

వ. అని తరువాత బాలకృష్ణుం డేమిచేసె. నాయందుం గృప గలదేనిం జెప్పవే యని యడిగిన, రాజునకు శుకుం డి ట్లనియె. 246

### —: బాలుం డగు కృష్ణుండు చెంతనున్న శకటమును గూలఁదన్నుట :—

సీ. బాలకుం [1]డొదిఁగిలఁ బడనేర్చె నని జన్మ నక్షత్రమం దొకనాఁడు నందు
పొలఁతి వేడుక [2]బోర్కువోయ ప్రేతలఁ జీరి వాదిత్ర గీతారవంబు చెలఁగ
విప్రులతోఁగూడ వేదమంత్రంబుల నభిషేచనాదిక మాచరించి
వారి [3]దీవెనఁ బొంది వారికి మొదవులు నన్నంబు చీరలు నడిగినట్టు

ఆ. లిచ్చి బాలుఁ దియ్యమెసఁగఁ బానుపు సేర్చి
నిదుర పుచ్చి గోపనివహమునకు
గోపికలకుఁ బూజ గొమరారఁ జేయుచు
జనని కొడుకు మఱచె సంభ్రమమున. 247

వ. ఆ సమయంబున. 248

క. నిదురించిన శిశు వాఁకొని, కిదుకుచుఁ జనుఁ గోరి కెరలి కిసలయ విలస
న్మృదు చక్ర చాప రేఖా, స్పద పదమునఁ దన్నె నొక్క బండిన్ దండిన్. 249

క. శకటము హరి తన్నిన దివిఁ, బ్రకటం బై యెగసి యిరుసు భరమున గండ్లున్
వికటంబుగ నేలంబడె, నకటా! యని గోపబృంద మాశ్చర్యపడన్. 250

వ. అప్పు డందున్న సరసపదార్థంబులు వ్యర్థంబు లై నేలం గూలుటం జూచి, యశోదా నందముఖ్యు లయిన గోప గోపికాజనంబులు పనులు మఱచి, పబ్బంబులు మాని, యుబ్బు చెడి, వెఱపులు ఘనంబులుగ మనంబులందు. 251

---

1. డొదికిల(తం.) 2. తోడఁబొరుగు ప్రేతల(హా.) 3. దీవనలొంది(తం.హా.)

క. మిన్నున నూరక యెగయదు, దన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ
చిన్నికుమారుఁడు తేరే, విన్ననువుగ నెగసె దీనివిధ [1]మెట్టిదియో. 252

వ. అని వితర్కించు సమయంబున. 253

క. బాలకుఁ డాఁకొని యేడ్చుచుఁ, గా లెత్తినఁ దాఁకి యెగసెఁ గాని శకట మే
మూలమున నెగయ దని త, ద్బాలునికడ నాడుచుండి పలికిరి శిశువుల్. 254

వ. ఇట్లు శిశువులు పలికిన పలుకులు విని. 255

శా. బాలుం డెక్కడ బండి యెక్కడ నభోభాగంబు పైఁ [2]జేడ్పడన్
గాలం [3]దన్నుట యెక్క డాటపడుచుల్ గల్లాడి రీ జడ్డుఁబ
ల్కేలోకంబున నైనఁ జెప్పఁబడునే యేచందమో కాక యం
చాలాపించుచు వ్రేలు వ్రేతలు ప్రభూతాశ్చర్యలై రంతటన్. 256

వ. అప్పు డా బాలుని రోదనంబు విని, యశోద పఱతెంచి. 257

ఆ. అలసితివి గదన్న! యాఁకొంటివి గదన్న!
మంచి యన్న! యేడ్పు మానుమన్న!
చన్నుగుడువు మన్న! సంతసపడు మన్న!
యనుచుఁ జన్ను గుడిపె నర్భకునకు. 258

వ. అంత న బ్బాలుని మేన బాలగ్రహంబు సోకునుగదా యని శంకించి, గోపకు లనేకు లనేక బలివిధానంబులు చేసిరి. బ్రాహ్మణులు దధి కుశాక్షతంబుల హోమంబు లాచరించిరి. ఋగ్యజుస్సామ మంత్రంబుల నభిషేచనంబులు సేయించి, స్వస్తిపుణ్యాహవాచనంబులు చదివించి, కొడుకున కభ్యుదయార్థంబు నందుం డలంకరించిన పాఁడిమొదవుల విద్వజ్జనంబుల కిచ్చి, వారల యాశీర్వాదంబులు గైకొని, ప్రమోదించె. అని చెప్పి, శుకుం డి ట్లనియె. 259

## —: తృణావర్త సంహారము :—

క. కొడుకు నొకనాఁడు తొడపై, నిడుకొని ముద్దాడి తల్లి యెలమి నివురుచోఁ
గడు దొడ్డ కొండశిఖరము, వడువున వ్రేఁగయ్యె నతఁడు వసుధాధీశా! 260

క. బరువైన కొడుకు మోఁతను, వెరవిఁడి యిలమీఁదఁ బెట్టి వెఱచి జనని దా
ధరగావఁ బుట్టిన మహా, పురుషుఁడు గాఁబోలు ననుచు బుద్ధిఁ దలంచెన్. 261

వ. అప్పుడు. 262

---

1. మెట్టిదయో (వా.) 2. జెంపటన్ (తం.) 3. దన్నుట యెక్కడేల పడుచున్ (వా.)

క. [1]ఖరుఁడగు కంసుని పంపున, నరిగి తృణావర్తుఁ డవని [2]కవచాటముగా
[3]సురకరువలి యై బిసబిస, నరుదరు దన ముసరి విసరి హరిఁ గొనిపోయెన్. 263

క. సుడి యెఱుఁగని హరి [4]సుడిపడ, సుడిగాలితెఱంగు రక్కసుఁడు విసరెడి యా
సుడిగాలి ధూళి కన్నుల, సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా! 264

వ. మఱియు, [5]నవ్వాలయ పవనదనుజుండు విలయపవనుని తెఱంగునఁ గసిమసంగి, ముసరిన మసరు కవిసి విసరెడి సురగరువలిం బొడమిన పుడమిరజంబు వడి నెగసి, గగనము మెఱసి, తరణికిరణములు మరుగువడిన, నిబిడ మగు బెడిదంపుఁ దిమిరమ్మున దశదిశ లెఱుంగఁబడక, గోకులం బాకులంబు నొంద, నొండొరుల నెఱుంగక, బెండువడుచున్న జనంబుల మనంబుల ఘనం బగు భయంబు రయంబునం జెంద, నదభ్ర పరిభ్రమణ శబ్దంబున దిగంతంబులు చెవుడుపడి, పరిభ్రాంతంబులుగ నొక్కముహూర్త మాత్రంబున భువనభయంకరత్వంబుఁ దోఁచె. ఆ సమయంబున. 265

ఉ. పాపనిఁ జూడఁగానక విపద్దశ నొంది కలంగి తల్లి యో
పాపఁడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేఁడు గాలికిన్
జేపడిపోయితే యనుచుఁ జీరుచు దైవముఁ జాల దూఱుచున్
దాపమునొంది నెవ్వగల దయ్యుచుఁ గుందుచు బిట్టుఁ [6]గూయుచున్. 266

క. సుడిగాలి వచ్చి నిన్నున్, సుడిగొని కొనిపోవ మింట [7]సుడిసుడి గొనుచున్
బెడఁ గడరెడి నా ముద్దుల, కొడుకా! యేమంటి వనుచు ఘోరం బనుచున్. 267

ఉ. ఇక్కడఁ బెట్టితిం దనయుఁ డిక్కడ నాడుచునుండె గాలి దా
నెక్కడనుండి వచ్చె శిశు వెక్కడిమార్గము వట్టిపోయె నే
నెక్కడఁ జొత్తు నంచుఁ గమలేక్షణ గ్రేపుఁ దొఱంగి ఖిన్న యై
పొక్కుచు వ్రాలు గోవుక్రియ భూస్థలి వ్రాలె దురంతచింత యై. 268

క. [8]పాపనికై యిటు పొగిలెడి, యా పాపనితల్లిఁ జూచి యారట పడుచున్
గోపాలసతులు బాష్పజ, లాపూరిత [9]నయనలైరి యార్తిం బడుచున్. 269

---

1. ఖరమతి (హ.) 2. కతిచోద్యముగా (హ.) 3. సురగరువలి (తం.) 4. సుడిగొన (తం.) 5. మలయు పవన (హ.) 6. గుయ్యుచున్ (హ) 7. సుడివడిగొనుచున్ (హ) 8. ఆ పాపనికై పొగులుచు (తం.) 9. వదనలేడ్చి రార్తిం (క. చ.) నయనలేడ్చి....(తం.)

శా. ఆలోఁ జక్రసమీర దైత్యుఁడు మహాహంకారుఁ డై మింటికిన్
బాలుం దోకొని పోయి, పోయి తుదిఁ దద్భారంబు మోవం బల
శ్రీ లేమిన్ బరిశాంత వేగుఁ డగుచున్ జేష్టింపఁగా లేక ము
న్నీలా గర్భకుఁ జూడ నంచు నిటమీఁ దెట్లంచుఁ జింతింపుచున్. 270

వ. (అట్లు దనుజుండు చింతింపుచున్న సమయంబున.) 271

క. బాలద్విరద కరంబులఁ, బోలెడి కరములను దనుజు [1]బొండుగ బిగియం
గీలించి వ్రేలఁబడియెను, బాలకుఁ డొక కొండభంగి బరు వై యధిపా! 272

క. మెడ బిగియఁ బట్టుకొని డిగఁ, బడియెడు బాలకునిచేతఁ బర్వతనిభుచే
విడివడఁ జాలక వాఁ డురిఁ, బడి బెగడెడు ఖగముభంగి భయముం బొందెన్.

క. హరి కరతల పీడనమునఁ, బరవశుఁ డై రాలమీఁద భగ్నాంగకుఁ డై
సురవైరిభటుఁడు గూలెను, పురభంజను కోలఁ గూలు పురముం బోలెన్. 274

వ. అంత గోపకాంత లంతయుం గని, రోదనంబులు మాని, సమ్మోదంబున విక్క విరిసి, రక్కసుని [2]యురమున మురువుగలిగి, బరువులేక వ్రేలు బాలుం గొనివచ్చి, ముచ్చిరుచున్న తల్లి కిచ్చిరి. అప్పుడు, గోపగోపికాజనంబు లందఱుఁ దమలోని ట్లనిరి. 275

క. రక్షణము లేక సాధుఁడు, రక్షితుఁ డగు సమతఁ జేసి రాయిడులందున్
[3]రక్షణములు వెయి గలిగిన, శిక్షితుఁ డగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్. 276

మ. గతజన్మంబుల [4]నేమి నోఁచితిమొ యాగశ్రేణు లేమేమి సే
సితిమో యెవ్వరి కేమి పెట్టితిమొ యే చింతారతిం బొద్దుఁ బు
చ్చితిమో సత్యము లేమి పల్కితిమొ యే సిద్ధప్రదేశంబు ద్రొ
క్కితిమో యిప్పుడు చూడఁగంటి మిచటం గృష్ణార్భకున్ నిర్భయున్. 277

వ. అని పలికిరి. అంత, నందుండు మున్ను దనకు వసుదేవుండు సెప్పిన మాటలకు వెఱఁగుపడుచుండె. మఱియును. 278

సీ. జననాథ! యొకనాఁడు చన్నుచేఁపినఁ దల్లి చిన్ని ముద్దులకృష్ణుఁ జేరఁదిగిచి
యెత్తి పెం దొడలపై నిడికొని ముద్దాడి చన్నిచ్చి నెమ్మోము చక్క నివిరి
యల్లని నగవుతో నావులించిన బాలు వదనగహ్వరమున వారినిధులు
దిశలు భూమియు నవద్వీప శైలంబులు నేఱులు గాలియు నినుఁడు శశియు

1. (బొండిగ బిగియఁగా (హ.) "గళేగృహీత ఉత్స్రష్టుం నాశకోన్నదద్భుతార్భకమ్" (7-27.)
2. యురువున (తం.) 3. రక్షణము వేయుగలిగిన (హ.) 4. నెందుబుట్టితిమొ (హ.)

ఆ. దహనుఁ డాకసంబుఁ దారలు గ్రహములు
నఖిలలోకములుఁ జరాచరంబు
లైన భూతగణము లన్నియు నుండుటఁ
జూచి కన్ను మోడ్చి చోద్యపడియె. 279

అధ్యాయము – ౮

వ. అంత నొక్కనాఁడు వసుదేవుపంపున యాదవపురోహితుం డైన గర్గుండు, మందకుం జనుదెంచిన, నందుం డతనిఁ గనుంగొని, లేచి నిలిచి, కృతాంజలి యై.

క. కోరి భజించెను నందుఁడు, సార గుణాచారమార్గు సత్సంసర్గు
న్నారాధిత భర్గుఁ మతి, దూరిత షడ్వర్గుఁ గుజనదుర్గుఁ గర్గుఁ 281

వ. మఱియుఁ దగిన సత్కారంబులు సేసి, యిట్లనియె. 282

క. ఊరక రారు మహాత్ములు, [1]వా రధముల యిండ్లకడకు వచ్చుట లెల్లఁ
గారణము మంగళములకు, నీ రాక శుభంబు మాకు నిజము మహాత్మా! 283

శా. [2]జ్యోతిశ్శాస్త్రము కెల్ల మేటరివి తేజోమూర్తి వాశాంత వి
ఖ్యాతస్ఫూర్తివి బ్రహ్మబోధనుఁడ వాకర్ణింపు నాపల్కు ని
ర్ణీతుం డైన గురుండు మానవులకుఁ విప్రోత్తముం డంద్రు నీ
చాతుర్యంబున నీ కుమారులకు సంస్కారంబుఁ [3]గావింపవే. 284

వ. అని రామకృష్ణులం జూపిన, గర్గుండు మున్ను కంసునిచేత ద్రేటువడి, దివి కెగసి పోయిన తెఱవ చెప్పిన తెఱంగు తేటపఱిచి, దేవకీదేవి కొడుకని కృష్ణునిఁ గంసుండు దలంచుం గావున రహస్యంబున సంస్కారంబు సేయుట కార్యం బని నందానుమతంబున రోహిణీకుమారు నుద్దేశించి. 285

క. జనులు రమియింపఁ దిరిగెడి, యనువు కలిమి రాముఁ డనియు యదుసంకర్షం
బున సంకర్షణుఁ డనియును, ఘనబలమున బలుఁడు ననియు గణుతించె నృపా!

వ. మఱియుం, గృష్ణు నుద్దేశించి, తొల్లి యీ శిశువు, ధవళారుణ పీతవర్ణుం డై, యిప్పుడు నల్లనై నకతంబునఁ గృష్ణుం డయ్యె. వసుదేవునకు నొక్కెడ జన్మించిన కారణంబున వాసుదేవుం డయ్యె. ఈ పాపనికి గుణ రూప కర్మంబు లనేకంబులు గలుగుటం జేసి, నామంబు లనేకంబులు గలవు. ఈ బాలకునివలన మీరు

---

1. వారైమా యిండ్లకడకు (చ.) 2. శాస్త్రులకెల్ల మేటరివి (తం.వా.) 3. సేయంగదే (తం.)

దుఃఖంబులఁ దరియించుదురు. ఈ యర్భకునిచేత దుర్జనశిక్షణంబు నగు. ఈ కుమారుండు నారాయణసమానుం డని చెప్పి, తనగృహంబున క మ్మునీశ్వరుండు సనియె. నందుండును పరమానందంబున నుండె. అంత 287

## —: శ్రీకృష్ణబలరాముల బాలక్రీడాభివర్ణనము :—

సీ. జానుభాగముల [1]హస్తమ్ములు వీడ్వడ నిడుచు దిగ్గనఁ బోదు రింత నంత
నవ్వుల పయ్యెద లంది జవ్వాడుదు రాలక్రేపుల తోఁక లలమి పట్టి
విడువనేరక వాని వెనువెంట [2]జరుగుచు సొరిది పంకములందుఁ జొత్తు రెలమి
నెత్తి చన్నిచ్చుచో నిరుదెసఁ బాలిండ్లు చేతులఁ బుణుకుచుఁ జేఁపుఁగలుగ

తే. దూటుదురు గ్రుక్క గ్రుక్కకుఁ దోర మగుచు
నాడుదురు ముద్దుపలుకు లవ్యక్తముగను
గరము లల్లార్చి కోరిక గడలుకొలుప
రామకృష్ణులు శైశవరతులఁ దగిలి. 288

క. తడ వాడిరి బలకృష్ణులు, దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్
దడ వాడి రరులు భయమునఁ, దడ వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్.

సీ. తలలెత్తి మెల్లనఁ దడవి యాడెడువేళ పన్నగాధీశుల పగిదిఁ దాల్తు
రంగసంమృష్ట పంకాంగరాగంబుల నేనుఁగుగున్నల యెత్తు వత్తు
రసమంబు లైన జవాతిరేకంబుల సింగంపుఁ గొదమల సిరి వహింతు
రాననంబుల కాంతు లంతంత కెక్కంగ బాలార్కచంద్రుల పగిదిఁ దోఁతు

తే. రెలమి తల్లుల చన్నుఁబా లెల్లఁ ద్రావి
పరమ యోగోద్భవామృత పానలీల
సోలి యోగులవిధమున సొంపుగందు
రా కుమారులు జనమనోహారు లగుచు. 290

క. చూడనివారల నెప్పుడుఁ, జూడక లోకములు మూఁడు చూపులఁ దిరుగం
జూడఁగనేర్చిన బాలక, చూడామణి జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్. 291

క. [3]నగవుల విద్యల పోఁడిమి, నగుఁబాటుగఁ జేయనేర్చు నగవరి యంతన్
నగుమొగముతోడ మెల్లన, నగుమొగముల సతులఁ జూచి నగనేర్చె నృపా! 292

---

1. హస్తములు వీడ్వడఁజేసి(హ.) 2. జరుగుదు రప్పంకముల దుడుకడరఁజొత్తు, రెత్తి(తం.వా.) "దుడుకడువ" అని "తం" ప్రతిలో పాఠాంతరము. 3. నగవుల నవిద్యపోఁడిమి (తం. వా.)

క. అవ్వల నెఱుఁగక మువ్వురి, కవ్వల వెలుఁగొందు బరముఁ డర్భకుఁ డై యా
యవ్వలకు సంతసంబుగ, నవ్వా! యవ్వా! యనంగ నల్లన నేర్చెన్. 293

క. అడుగులు వేయు గలిగి రెం, డడుగులనే మన్ను మిన్ను నలమిన బాలుం
డడుగిడఁ దొడఁగెను శాత్రవు, లడుగులు [1]సడుగులును వదలి యడుగ గవనిఁ బడన్.

వ. మఱియును. 295

సీ. తనువున నంటిన ధరణీపరాగంబు పూసిన నెఱి భూతిపూఁత గాఁగ
ముందట వెలుఁగొందు ముక్తాలలామంబు తొగలసంగడికాని తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁ బరఁగు [2]గావలిబొట్టు కాముని గెల్చిన కన్ను గాఁగ
కంఠమాలికలోని ఘన నీలరత్నంబు కమనీయ మగు మెడకప్పు గాఁగ

ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ
బాలలీల ప్రౌఢబాలకుండు
శివునిపగిది నొప్పె శివునికిం దనకును
వేఱులేమిఁ దెలుప వెలయునట్లు. 296

క. ఆ పాపల విహరణములు, తీపులు పుట్టింప మఱఁగి తేఁకువలే కా
గోపాలసతులు మక్కువ, నే పనులును మఱచియుండి రీక్షణపర లై. 297

వ. ఆ సమయంబునఁ బాలకుల తల్లులు గోఱ గోరు కొమ్ములు గల జంతువులవలన నేమఱక, జల దహన కంటకాదులయెడ మోసపోక, బాలసంరక్షణంబు సేయుచు నుల్లంబుల మొల్లంబు లైన ప్రేమంబు లభిరామంబులుగా విహరింపుచుండి. 298

క. తనయీడు గోపబాలురు, తనుఁ గొలువఁగ రాముఁ గూడి [3]తనుపు గలుగుచున్
దను గమనంబులఁ గృష్ణుఁడు, తనుమధ్యలు మెచ్చ నీల తనురుచి నమరెన్. 299

వ. మఱియు నా కుమారుండు దినదినంబునకు సంచార సంభాషణ దక్షుం డై 300

ఉ. చప్పుడు సేయకుండు మని జంకె యొనర్చిన నల్గి పోవఁగా
నప్పుడు బార సాచి తన [4]నవ్వుల విందులు వచ్చి రంచు న
వ్వొప్పఁగఁ జీరు తల్లిదెస కొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచు
న్నప్పుడు వచ్చి చన్గుడుచు నవ్వొలయన్ మొలగంట మ్రోయఁగన్. 301

క. వల్లవగృహ నవనీతము, లెల్లను భక్షించి వచ్చి యెఱుఁగనిభంగిన్
దల్లిఁ గదిసి చిట్టాడుచు, నల్లన చను బువ్వబెట్టు మవ్వా! యనుచున్. 302

---

1. నుడుగులు (తం. F. N.) 2. కావిరిబొట్టు (తం. వా.) 3. తనువు (హ.)
4. యుర్మిలి (వా.); యవ్వలు (తం.)

వ. మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు. 303

సీ. గోవల్లభుఁడ నేను గోవులు మీరని వడి నంకె వైచుచు వంగి యాడు
రాజనే భటులు మీరలు రండు రం డని ప్రాభవంబునఁ బెక్కుపనులు వనుచు
నేఁ దస్కరుండ మీ రింటివా రని నిద్ర పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు
నే సూత్రధారి మీ రిందఱు బహురూపు లని చెలంగుచు నాటలాడఁ బెట్టు

తే. మూల లులుకును డాఁగిలిమూఁత లాడు
నుయ్యాలల నూఁగుఁ జేబంతు లొనర వైచు
[1]జారచోరుల జాడలఁ జాల నిగుడు
శౌరి బాలురతో నాడు సమయమందు. 304

వ. మఱియు, నా కుమారశేఖరుండు, కపటశైశవంబున దొంగజాడలం గ్రీడింప గోపిక లోపికలు లేక, యశోదకడకు వచ్చి యి ట్లనిరి. 305

—: గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁ జేఁతలు యశోదాదేవికిఁ దెల్పుట :—

క. బాలురకుఁ బాలు లేవని, [2]బాలింతలు మొఱలు వెట్టఁ బకపక నగి యీ
బాలుం డాలము సేయుచు, నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ! 306

క. పడఁతీ! నీ బిడ్డఁడు మా, కడవలలో నున్న మంచి కాఁగిన పాలా
పడుచులకుఁ బోసి చిక్కిన, కడవలఁ బోనడిచె నాజ్ఞ కలదో లేదో. 307

క. మీ పాపఁడు మా గృహమున, నాపోవఁగఁ బాలుఁ [3]ద్రావ నగపడ కున్నన్
గోపించి పిన్నపడుచుల, వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ! 308

మత్తకోకిల. పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలఁబోయి మా యిలు సొచ్చి తా
నుట్టి యందక ఱోలుఁ బీఁటలు నొక్కక్రపై విడి యెక్కి చే
వెట్టఁజాలక కుండక్రిం దొక పెద్దతూఁ టొనరించి మీ
పట్టి మీఁగడ పాలు చేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ! 309

క. ఆడం జని [3]మీఁగడ పెరుఁ, గోడక నీ సుతుఁడు త్రావి యొకయించుక తాఁ
గోడలి మూఁతిం [4]జరిమినఁ, గోడలు మ్రు చ్చనుచు నత్త కొట్టె లతాంగీ! 310

క. వా రిల్లు సొచ్చి కడవలఁ, [5]దోరంబుగ నెయ్యి త్రావి తుది నా కడవల్
వీ రింటను నీ సుతుఁ డిడ, వారికి వీరికిని దొడ్డ వా దయ్యె సతీ! 311

---

1. (జాఱ జీరలఁ జిఱుతలసాటినిగుడు (చ. త. గ. తం.) 2. బాలెంతలు (తం. వా.)
3. ద్రావి యగపడకున్నన్ గోపింపఁ జిన్నపడుచుల (తం. వా.) 4. వీరల 5. తుడిచిన (క. తం.) 5. దోరంబగు (తం. వా.)

క. వేలుపు లఱె నాకంబెను, వేలుపు మఱి యెవ్వఁ డనుచు వికవిక నగి మా
వేలుపుల గోడపై నో, హేలావతి! నీ తనూజుఁ డెంగిలి చేసెన్. 312

క. వెన్నఁ దినఁగ బోడగని మా, పిన్నది యడ్డంబు వచ్చి పిఱిఁదికిఁ దీయన్
జ న్నొడిసి పట్టి చీరెను, జిన్నికుమారుండె యితఁడు శీతాంశుముఖీ! 313

క. ఇ మ్మగువ తన్ను వాకిటఁ, గ్రుమ్మఱుచోఁ జేరి నిలుపుకొని పే రడుగన్
గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె, నమ్మా! యీ ముద్దుఁగుఱ్ఱఁ డల్పుఁడె చెపుమా!.314

క. చేబంతి తప్పిపడె నని, ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్
మా బిడ్డ జలకమాడఁగ, నీ బిడ్డఁడు వలువఁ దెచ్చె నెలఁతుక! తగునే. 315

క. ఇ చ్చెలువఁ జూచి ముచ్చిలి, యచ్చుగ నుఱికించుకొనుచు నరిగెద నాతో
వచ్చెదవా యని యన్నాఁ, డి చ్చిఱుతఁడు సుదతి! చిత్ర మిట్టిది గలదే. 316

క. కొడుకులు లేరని యొకసతి, కడు వగవగఁ దన్ను మగనిఁగాఁ గైకొనినన్
గొడుకులు గలిగెద రని పైఁ, [1]బడినాఁ డిది వినుము శిశువు పనులే తల్లీ! 317

క. తలఁగినదానం [2]దల మనఁ, దలఁగక [3]నేఁ దలఁగ నంచుఁ దగఁ బల్కుచు నీ
తలఁగినచో నెయ్యది యని, తల యూఁచెన్ నీ సుతుండు తగవె మృగాక్షీ!

క. వ్రాలఁగ వచ్చిన నీ సతి, చూలాలం దలఁగు మనినఁ జూ లగుటకు నే
మూలంబు చెప్పు మనె నీ, బాలుఁడు చెప్పుదురె సతులు పర్వేందుముఖీ! 319

క. మగువా! నీ కొమరుఁడు మా, మగవా రటు వోవఁ జూచి మంతనమునకున్
దగఁ జేరి పొందు నడిగెను, జగముల ము న్నిట్టి శిశువు చదువంబడెనే. 320

ఆ. నమ్మి నిదురవోవ నా పట్టిచుంచు మా
లేఁగ తోఁకతోడ లీలఁ గట్టి
వీథులందుఁ దోలె వెలఁది! నీ కొమరుండు
రాచబిడ్డఁ డయిన నవ్వ మేలె? 321

క. నా పట్టి పొట్టనిండఁగఁ, బై పడి నీ పట్టి వెన్న బానెం డిడినాఁ
డూపిరి వెడలదు వానిం, జూపెద నేమైన నీవ సుమ్ము లతాంగీ! 322

క. తెఱవ యొకతె నిద్రింపఁగ, నెఱిఁ గట్టిన వలువ [4]వీడ్చి [5]నేటగు తేలుం
గఱపించె నీ కుమారుఁడు, వెఱచుచు నది [6]పఱవ [7]నగియె విహితమె సాధ్వీ! 323

---

1. వడినాఁడోయమ్మ (చ.); పైపడినాఁడదిరవ్వ (తం.) 2. దలఁగన (హా. గ. జ.)
3. యాచెలికినాన తలయెత్తఁగ (గ. జ. తం. వా.) 4. విడిచి (హా.) 5. నేఁడొక (హా.)
6. యఱవ (తం.) 7. నగుట (హా.)

క. నా కొడుకును నా కోడలు, నేకతమునఁ బెనఁగఁ బాము నీతఁడు వైవం
గోక లెఱుంగక పాఱినఁ, గూఁక లిడె నీ సుతుండు గుణమె గుణాఢ్యా! 324

ఆ. తరుణి యొకతె పెరుఁగుఁ దఱచుచుఁ దుది వంగి
వెన్నఁ దియ్య నొదిఁగి వెనుకఁ గదిసి
మగువ! నీ సుతుండు మగపోఁడుములు సేయ
సాఁగినాఁడు తగదె చక్కఁజేయ. 325

సీ. కలకంఠి! మా వాడ గరితల మెల్ల నీ పట్టి రాఁగలఁ డని పాలు పెరుఁగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దన త్రోవ చూచుచో నెప్పుడు చొచ్చినాఁడొ
తలుపులు ముద్రలు తాళంబులును పెట్టి యున్న చందంబున నున్న వరయ
నొక యింటిలోఁ బాడు నొక యింటిలో నాడు నొక యింటిలో నవ్వు నొకటఁ దిట్టు

తే. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ
పక్షి ఘోషణములు పరఁగఁ జేయు
నిట్లు చేసి వెనుక నెక్కడఁ బోవునో
కానరాఁడు రిత్తకడవ లుండు. 326

క. కడు లచ్చి గలిగెనేనియుఁ, గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచుం
బడుగుల వాడలపైఁ బడ, విడుతురె రాకాంత లెందు విమలేందుముఖీ! 327

క. ఓ యమ్మ! నీ కుమారుఁడు, మా యిండ్లను బాలు పెరుఁగు మననీఁ డమ్మా!
పోయెద మెక్కడి కైనను, మా యన్నల సురభు లాన మంజులవాణీ! 328

వ. అని మఱియు ననేకవిధంబు లైన బాలకృష్ణుఁడు సేయు వినోదంబులు దమ యందుఁ జేయు మహాప్రసాదంబు లని యెఱుంగక, దూఱుచున్నయట్టి గోపికలకు యశోద యి ట్లనియె. 329

క. చన్ను విడిచి చనఁ [1]డిట్టటు, నెన్నఁడుఁ బొరుగిండ్ల త్రోవ లెఱుఁగఁడు నేఁడుం
గన్నులు దెఱవని మా యీ, చిన్ని కుమారకుని ఱవ్వసేయం దగునే. 330

తే. అన్య మెఱుఁగడు తనయంత నాడుచుండు
మంచివాఁ డితఁ డెగ్గులు మానరమ్మ!
రామలార! త్రిలోకాభిరామలార!
తల్లులార! గుణవతీ మతల్లులార! 331

---

1. డొకపరి (హ.)

వ. అని యశోద వారల నొడంబఱిచి పంపి, కొడుకుం గోపింపంజాలక యుండె. ఇట్లు. 332

ఉ. కాంతలు తల్లితోఁ దన వికారము లెల్ల గణింప భీతుఁ డై
శాంతుని సొంపునన్ బరమసాధుని పెంపున గోల మాడ్కి వి
భ్రాంతుని కైవడిన్ జడుని భంగిఁ గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక తల్లి కుచవేదిక నౌదల మోపి యాడుచున్. 333

వ. అంత నొక్కనాఁడు బలభద్రప్రముఖు లయిన గోపకుమారులు వెన్నుండు మన్ను దినె నని చెప్పిన, యశోద బాలుని కేలు వట్టికొని, యి ట్లనియె. 334

—: మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనా ద్యఖివర్ణనము :—

క. మ న్నేటికి భక్షించెదు, మ న్నియ మము లేల నీవు మన్నింపవు నీ
యన్నయు సఖులును జెప్పెద, ర న్నా! మ న్నేల మఱి పదార్థము లేదే. 335

వ. అని పలికిన ముగుద తల్లికి [1]వెఱదంట యైన కొడు కి ట్లనియె. 336

శా. అమ్మా! మన్ను దినంగ నే శిశువునో యాఁకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరి మాటలు మది న్న న్నీవు కొట్టంగ వీ
రి మ్మార్గమ్ము ఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీ [2]యాస్యగం
ధ మ్మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పైన దండింపవే. 337

వ. అని పలికి, నెయ్యంబున న య్యవ్వ నియ్యకొలిపి, క్రీడామనుజబాలకుం డైన యీశ్వరుండు తన నోరు దెఱచి, ముఖంబుఁ జూపిన. 338

క. ఆ లలితాంగి కనుంగొనె, బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది, క్పాలాది [3]కరండ మైన బ్రహ్మాండంబున్. 339

వ. కనుంగొని. 340

మ. కలయో [4]వైష్ణవ మాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలప న్నేరక యున్నదాననొ యశోదాదేవిఁ గానో పర
స్థలమో బాలకుఁ డెంత యీతని ముఖస్థం బై యజాండంబు ప్ర
జ్వల మై యుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపఁగన్. 341

1. వెఱవాది దంట (తం.) 2. రంధ్ర మ్మాఘ్రాణము (హ.) 3. చండమైన (క.)
4. మోహమొ (హ.)

ఆ. బాలమాత్రుఁ[1] డగు సలీలుని ముఖమందు
విశ్వ మెల్ల నెట్లు వెలసి యుండు
బాలుభంగి నితఁడు భాసిల్లుఁ గాని స
ర్వాత్ముఁ డాదివిష్ణుఁ డగుట నిజము. 342

వ. అని నిశ్చయించి. 343

ఆ. ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు
గానఁబడిన బుద్ధి కంప మయ్యె
నా మహాత్ము విష్ణు నఖిల లోకాధారు
నార్తు లెల్లఁ బాయ నాశ్రయింతు. 344

క. నా మగఁడు నేను గోవులు, నీ మందలు [2]గోపజనులు ని బ్బాలుని నె
మ్మోమం దున్నవిధముఁ గని, యేమఱితిమి గాని యీశుఁ డితఁ డే మాకున్.

వ. అని తన్ను పరమేశ్వరుం డని తలంపుచున్న యశోదయందు నా కృష్ణుండు
వైష్ణవమాయం బొందించిన. 346

క. జడను వడి [3]మోహమున నా, పడఁతుక సర్వాత్ముఁ డనుచుఁ బలుకక యతనిం
గొడుకని తొడపై నిడుకొని, కడు వేడుకతోడ మమత గావించె నృపా! 347

వ. అనిన విని, రా జి ట్లనియె. 348

ఆ. జగ దధీశ్వరునకుఁ జన్నిచ్చు తల్లిగా
నేమినోము నోఁచె నీ యశోద
పుత్రుఁ డనుచు నతనిఁ బోషించు తండ్రిగా
నందుఁ డేమి చేసె నందితాత్మ! 349

క. ప్రబ్బిన భక్తిని హరిపైఁ, గబ్బంబులు సెప్పి కవులు కైవల్య శ్రీ
కబ్బుదు రఁట హరిపోషణ, మబ్బిన తలిదండ్రు లెచటి కబ్బుదురో తుదిన్. 350

వ. అనిన విని, రాజయోగికి శుకయోగీంద్రుఁ డి ట్లనియె. 351

—: యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతము :—

సీ. అవనీశ! విను ద్రోణుఁ డనువాఁడు వసువుల యందు ముఖ్యుఁడు ధర యతని భార్య
వారి నిద్దఱి బ్రహ్మ వసుధపై జన్మించుఁ డంచుఁ బంపిన వార లతనిఁ జూచి
విశ్వేశ్వరుం డైన విష్ణు సేవారతి మా కిచ్చితేనియు మహి జనింతు
మనవుడు నట్లకా కనియె వేల్పులపెద్ద యా ద్రోణుఁ డీ నందుఁ డై జనించె

---

1. డైనబాలుని (తం.) 2. సుతులుఁ బతులు నీభవనంబుల్ (హ.) 3. యెఱుకసెడియా పడఁతుక (తం. వా.)

ఆ. 'ధర' యశోద యయ్యె దనుజేంద్రవైరియుఁ
గమలగర్భు మాట గారవించి
తల్లిదండ్రు లనుచుఁ దగ వారి మన్నించె
నధిక[1]భక్తితోడ నలరి రిట్లు. 352

## అధ్యాయము — ౯

## —: కృష్ణుఁడు దధిభాండ వికలనాదులు చేసిన యశోద యతని వెంటఁ దిరిగి పట్టుకొనుట :—

వ. అంత నొక్కనాఁడు, దన యింటి పాప లందఱు నయ్యై పనులందుఁ బంపువడి పోయిన, నందసుందరి, సంరంభంబునం దరిగంబంబుకడఁ గుదురున నొక్క కుంభంబు వెట్టి, మిసిమి గల మీఁగడ పెరుఁగులు కూడంబోసి, వీఁక నాఁక త్రాడు కవ్వంబున నలవరించి. 353

సీ. కరకమ లారుణకాంతిఁ గవ్వపుఁ ద్రాడు పవడంబు నునుఁదీఁగెపగిది మెఱయఁ
గ్రమముతో రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడి యొండొంటి వీఁక నొత్తఁ
గుచకుంభములమీఁది కొంగు జాఱఁగ జిక్కువడుచు హారావళుల్ బయలు పడఁగఁ
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము మంచుపైఁ బడిన పద్మంబుఁ దెగడ
తే. కౌను నులియంగఁ గంకణక్వణన మెసఁగఁ
దుఱుము బిగివీడఁ గర్ణికాద్యుతులు మెఱయ
బాలు నంకించి [2]పాడెడు పాటవలనఁ
దరువు లిగురొత్తఁ బెరుఁ గింతి దరువఁ జొచ్చె. 354

వ. ఆ సమయంబున. 355

క. సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు, నడిగొట్టుచు "నమ్మ ! రమ్మ" చన్నిమ్మనుచున్
వెడవెడ గంతులు వైచుచుఁ, గడవఁ గదిసి బాలకుండు కవ్వముఁ బట్టెన్. 356

క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు, న వ్వనరుహనేత్రి దిగిచి యంకతలమునన్
నవ్వుచు నిడుకొని కూఁకటి, దువ్వుచుఁ జన్నిచ్చె నతఁడు దూఁటుచుఁ గుడిచెన్.

మ. కడుపారం జనుఁబాలు ద్రావని సుతున్ గంజాక్షి పీఠంబుపై
నిడి పొంగారెడు పాలు డించుటకు [3]నై యేఁగంగఁ దద్బాలుఁ డె
క్కుడు కోపంబున వాఁడిఱాత దధిమ త్కుంభంబు వోఁగొట్టి తెం
పడరం గుంభములోని వెన్న దినె మిథ్యా సంకుల ధ్యాన్యుఁ డై. 358

1. వారు (తం.) 2. యప్పుడు పాటవాడ (హా.) 3. బోవఁజూచి (హా.)

వ. అంత నా లోలలోచన, పాలు డించివచ్చి, వికలంబులైన దధికుంభ శకలంబులం బొడగని, తుంటకొడుకు వెన్నఁ దింట యెఱింగి, నగుచు, నా కలభగామిని యతనిఁ గానక, చనిచని. 359

ఆ. వికచకమలనయన వేఱొక యింటిలో
వెలయ ఱోలు దిరుగవేసి యెక్కి
యుట్టిమీఁది వెన్న నులుకుచు నొకకోఁతి
పాలు సేయుచున్న బాలుఁ గనియె. 360

మ. కని చేతన్ సెలగోల వట్టికొనుచున్ గానిమ్ము కానిమ్ము రా
తనయా! యెవ్వరియందుఁ జిక్కువడ వే దండంబునుం గాన వే
వినివారంబును బొంద వే వెఱపు నే విశ్రాంతియుం జెంద వు
న్ననియో నీ విటు నన్నుఁ గైకొనవు నేఁ డారీతి సిద్ధించునే. 361

వ. అని యదలించుచుఁ, గొడుకు నడవడిం దలంచి తనుమధ్య తన మనంబున. 362

సీ. బాలుఁ డీతం డని భావింతు నందునా యే పెద్దలును నేర రీ క్రమంబు
వెఱ పెఱుంగుటకునై వెఱపింతు నందునా కలిగి లే కొక్కఁడు గాని లేఁడు
వెఱపుతో నాబుద్ధి వినిపింతు నందునా తనుదాన యై బుద్ధి తప్పకుండు
నొం డెఱుంగక యింట నుండెడి నందునా చొచ్చి చూడని దొకచోటు లేదు

ఆ. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాఱెడు
నోజ లేదు భీతి యొక టెఱుంగఁ
డెలమి నూరకుండఁ డెకసక్కెముల నాడుఁ
బట్టి శాస్తి చేయు భంగి యెట్లు? 363

వ. అని వితర్కించి. 364

క. లాలనమున బహుదోషము, లోలిం బ్రాపించుఁ దాడనోపాయములం
జాల గుణంబులు గలుగును, బాలురకును దాడనంబ పథ్యం బరయన్. 365

వ. అని నిశ్చయించి, కేల నున్న కోల జళిపించి, బాలా! నిలు నిలు మని బగ్గు బగ్గున నదల్చి, తల్లి డగ్గఱిన, బెగ్గడిలిన చందంబున నగ్గలిక చెడి, ఱోలు డిగ్గ నుఱికి. 366

క. గజ్జెలు ఘల్లని మ్రోయఁగ, నజ్జలు ద్రొక్కుటలు మాని యతిజవమున యో
షిజ్జనములు నగఁ దల్లియు, పజ్జం జనుదేర నతఁడు పరువిడె నధిపా! 367

వ. అప్పుడు, 368

మ. స్తనభారంబున డస్సి క్రుస్సి యస దై జవ్వాడు మధ్యంబుతో
జనితస్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ [1]కూడఁబాఱి తిరిగెన్ వారించుచున్ వాకిటన్
ఘన యోగీంద్రమనంబులున్ వెనుకొనంగా లేని లీలారతున్. 369

వ. ఇట్లు గూడంజని. 370

సీ. స్తంభాదికంబులు దనకు నడ్డం బైన నిట్టట్టు చని పట్టనీనివాని
నీ తప్పు సైరింపు మింక దొంగిలఁబోవ నేనని మునుముట్ట నేడ్చువానిఁ
గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలు కన్నీటితో వెగచువాని
నేదెస వచ్చునో యిది యని పలుమాఱు సురుఁగుచుఁ గ్రేఁగంటఁ జూచువాని

ఆ. గూడఁబాఱి పట్టుకొని వెఱపించుచుఁ
జిన్ని వెన్నదొంగ చిక్కె ననుచు
నలిగి కొట్టఁ జేతు లాడక పూఁబోణి
కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి. 371

క. వీ రెవ్వరు శ్రీకృష్ణులు, గారా ! యెన్నఁడును వెన్న గానరఁట కదా
చోరత్వం బించుకయును, నేరరఁట, ధరిత్రి నిట్టి నియతులుఁ గలరే. 372

క. పట్టినఁ [2]బట్టువడని నినుఁ, బట్టెద మని చలము కొనినఁ బట్టుట బెట్టే
పట్టువడ వండ్రు పట్టీ, పట్టుకొనన్ నాకుఁ గాక పరులకు వశమే. 373

క. ఎక్కడ నైనను దిరిగెద, వొక్కయెడన్ గుణము గలిగి యుండవు నియమం
బెక్కడిది నీకు మఱచినఁ, జక్కనఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా ! 374

సీ. తోయంబు లివి యని తొలఁగక చొచ్చెదు తలఁచెదు [3]గట్టైనఁ దరల నెత్త
మంటితో నాటలు మానవు కోరాడె దున్నత స్తంభంబు లూపఁబోయె
దన్యుల నల్పంబు లడుగంగఁ బాఱెదు రాచవేఁటలఁ జాల నవ్వ దెచ్చె
దలయవు నీళ్ళకు నడ్డంబు గట్టెదు [4]ముసలి వై హారివృత్తి మొనయఁ జూచె

ఆ. దంబరంబు మొలకు నడుగవు తిరిగెద
వింకఁ గలికిచేఁత లేల పుత్ర !
నిన్ను వంప వ్రాల్ప నే నేర ననియొ నీ
విట్టు క్రిందు మీఁదు నెఱుఁగ కునికి. 375

---

1. పాఱి కూడఁ దిరిగెన్ (హ.); కూడఁబాఱి యొయిదెన్ (తం.) 2. పట్టడకని (హ); పట్టానపడక నిన్నున్ (తం.) 3. తలఁచెద వెట్టైనఁ దరలనొత్తి (హ.) 4. ముసలిపై హారివృత్తి (హ. తం. వా.)

వ. అని మర్మంబు లెత్తి పలికి. 376

### —: ఉలూఖలబంధన యమళార్జున భంజనా ద్యభివర్ణనము :—

క. ఆ లలన గట్టె ఱోలన్, లీలన్ నవనీత చౌర్యలీలుం బ్రియవా
గ్జాలున్ బరివిస్మిత గో, పాలున్ ముక్తాలలామ ఫాలున్ బాలున్. 377

క. ఱోలను గట్టఁబడియు న, బ్బాలుఁడు విలసిల్లె భక్తపరతంత్రుం డై
యాలాన సన్నిబద్ధ వి, శాల మదేభేంద్రకలభ సమరుచి నధిపా! 378

క. వెలిలోను మొదలు తుద నడు, ములు లేక జగంబు తుదియు మొదలున్ నడుమున్
వెలియున్ లోనగు నీశ్వరు, నలవడునే కట్టఁ బ్రణతురాల్ గాకున్నన్ 379

ఆ. పట్టి [1]యలరుఁబోఁడి పట్టి యీతం డని
గట్టితలఁపుతోడఁ గట్టెఁ గాక
పట్టి కడుపు పెక్కు బ్రహ్మాండములు పట్టు
టెఱిఁగెనేని తల్లి యేలకట్టు. 380

క. చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ, జిక్కఁడు సనకాది యోగి చిత్తాబ్జములన్
జిక్కఁడు శ్రుతిలతికావళిఁ, జిక్కె నతఁడు లీలఁ దల్లిచేతన్ ఱోలన్. 381

వ. ఇట్లు గ్రద్దన నా ముద్దియ [2]ముద్దుల కొడు కని యుదరంబుఁ గట్ట నడరుచుఁ, [3]జదరంబుగఁ జక్క నొక్క త్రాడుం జుట్టిన, నది రెండంగుళంబులు గడమ పడియె. మఱియు నొక్క బంధంబు సంధించి వలగొనిన, నంతియ కొఱంత యయ్యె. వెండియు నొక్కపాశంబు గూర్చి పరివేష్టించిన, వెల్తి నూపె. ఇట్లు.

క. తజ్జనని లోఁగిటం గల, రజ్జుపరంపరలఁ గ్రమ్మఱన్ సుతుఁ గట్టన్
బొజ్జ దిరిగి రాదయ్యె జ, గజ్జాలము లున్న బొజ్జఁ గట్టన్ వశమే. 383

వ. అప్పు డా యవ్వయు, గోపికలున్ వెఱుగుపడిరి. తదనంతరంబ. 384

ఆ. ఒడలఁ జెమట తెగయ నుత్తరీయము జాఱ
వీడియున్న తుఱుమువిరులు రాలఁ
గట్టరాని తన్నుఁ గట్టెద నని చింతఁ
గట్టుకొన్న తల్లిఁ గరుణఁ జూచి. 385

---

1. యెల్లబోఁటి(తం.వా.) 2. ముద్దుకొడుకని(హ.) 3. చదురంబని(తం.); చతురంబుగ(వా)

క. బంధవిమోచనుఁ డీశుఁడు, బంధింపఁ జెనంగు [1]జనని పా టోర్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ, బంధంబునఁ గట్టువడియెఁ [2]జాటించి నృపా ! 386

క. సంగడిఁ దిరిగెడు శంభుఁడు, నంగాశ్రయ యైన సిరియు నాత్మజుఁ డై యు
ప్పొంగెడు పద్మజుఁడును, గోపాంగనక్రియఁ గరుణవడయ రఖిలేశ్వరుచేన్. 387

క. జ్ఞానులచే మౌనులచే, దానులచే యోగ సంవిధానులచేతన్
బూని నిబద్ధుం డగునే, శ్రీనాథుఁడు భక్తియుతులచేతం బోలెన్. 388

వ. అంత న య్యశోద యింటికడం బనులవెంటం దిరుగఁ, గృష్ణుండు, తొల్లి నారదు శాపంబున నిరుమద్దు లై యున్న నలకూబర మణిగ్రీవు లను గుహ్యకుల నిద్దఱం గని, శాప విడ్చుకొని చనియె. అని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డి ట్లనియె. 389

## అధ్యాయము - ౧౦

క. నారదుఁ డేల శపించెను, వా రా వృక్షత్వమునకు వచ్చిన పనికిం
గారణ మెయ్యది యోగికు, లారాధ్య ! యెఱుంగఁ జెప్పుమయ్య ! వినియెదన్.

వ. అనిన శుకుం డి ట్లనియె. మున్ను కుబేరుని కొడుకు లిరువురు శంకరకింకరు లై, యహంకరించి, వెండికొండ మీఁద విరులతోఁటలం బాడెడి చేడియలం గూడికొని, కరేణుసంగతంబు లైన యేనుంగులభంగి సురగంబు లైన మందాకినీ తరంగం బులఁ గ్రీడింప, నారదుండు వచ్చిన, న చ్చెలువలు చెచ్చెర వలువలు ధరియించిరి. మదిరాపాన పరవశులు గావున వార లిరువురు వివస్త్రు లై మెలంగుచున్న, నా మునీశ్వరుండు చూచి, శపియించువాఁ డై, [3]ప్రతీతంబుగ గీతంబు పాడె. వినుము.

శా. సంపన్నుం డొరుఁ గానలేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁ డై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సములుగాఁ జింతించు నట్లౌటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్. 392

వ. అని గీతంబు పాడి తన మనంబున. 393

క. కలవాని సుతుల మనుచును, గలకంఠులతోడఁ గూడి కానరు పరులన్
గలలో నైనను వీరికిఁ, గలక్రొవ్వడఁగించి బుధులఁ గలుపుట యొప్పున్. 394

---

1. జననిఁ జాలార్చి (తం.) 2. ఁజాటింప (తం.) 3. ప్రతీతం బగు (వా.)

వ. అని చింతించి, విజ్ఞానవిశారదుం డగు నారదుండు, నళకూబర మణిగ్రీవులం జూచి, మీరలు స్త్రీమదాంధులరు గావున, భూలోకంబున నర్జునతరువు లై, నూఱు దివ్యవర్షంబు లుండుండు. అటమీఁద గోవింద చరణారవింద పరిస్పందంబున. 395

క. ముక్తుల రై నారాయణ, భక్తుల రై పరమ సాధు భావ శ్రీసం
సక్తుల రై సురలోక, వ్యక్తుల రయ్యెదరు నాదు వాక్యము కతనన్. 396

వ. అని యిట్లు పలికి, నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె. వా రిరువురు సంగడిమద్దు లై రి. పరమభాగవతుం డైన నారదు మాటలు వీటింబుచ్చక, పాటించి. 397

క. ముద్దుల తక్కరిబిడ్డఁడు, మద్దులఁ గూల్పంగఁ దలఁచి మసలక దా నా
మద్దికవ యున్నచోటికి, గ్రద్దన ఱో లీడ్చుకొనుచుఁ గడఁకన్ జనియెన్. 398

వ. చని యా యూర్జిత మహాబలుండు, నిజోదరదామ సమాకృష్యమాణ తిర్యగ్భవదులూఖలుం డై, యా రెండుమ్రాఁకుల నడుమం జొచ్చి, ముందటికి నిగుడుచు.

క. బాలుఁడు ఱో లడ్డము దివ, మూలంబులు పెకలి విటపములు విఱిగి మహా
భీలధ్వనిఁ గూలెను శా, పాలస్య వివర్జనములు యమళార్జునముల్. 400

వ. ఇట్లు నిర్మూలంబు లై పడిన సాలంబులలోనుండి, కీలికీలలు వెల్వడు పోలికె, నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం, బ్రసిద్ధు లైన సిద్ధు లిద్దరు వెడలివచ్చి, ప్రబుద్ధు లై, భక్తలోకపాలకుం డైన బాలకునకు మ్రొక్కి, లేచి, కరకమలంబులు మొగిచి, యి ట్లనిరి. 401

క. బాలుఁడవె నీవు పరుఁడ వ, నాలంబుఁడ వధికయోగి వాద్యుఁడవు తను
స్థూలాకృతి యగు విశ్వము, నీ లీలారూపమండ్రు నిపుణులు కృష్ణా! 402

సీ. ఎల్ల భూతంబుల కింద్రియాహంకృతి ప్రాణంబులకు నధిపతివి నీవ
ప్రకృతియుం బ్రకృతిసంభవ మహత్తును నీవ వీని కన్నిటికిని విభుఁడ వీవ
ప్రాకృత గుణవికారములఁ బొందక పూర్వ సిద్ధుఁడ వగు నిన్నుఁ జింతసేయ
గుణవృతుం డోపునే గుణహీన! నీయందు కల గుణంబుల నీవ కప్పఁబడుదు

తే. మొదల నెవ్వని యవతారములు శరీరు
లందు సరి దొడ్డు లేని వీర్యములఁ దనువు
లడర జన్మించి వారలయందుఁ జిక్క
పట్టి పరమేశ! మ్రొక్కెద మయ్య! నీకు. 403

క. భువనములు సేయఁ గావఁగ, నవతీర్ణుఁడ వైతి గాదె యఖిలేశ్వర ! యో
గివరేణ్య ! విశ్వమంగళ !, కవిసన్నుత ! వాసుదేవ ! కల్యాణనిధీ ! 404

ఉపేంద్రవజ్రము. తపస్వి వాక్యంబులు దప్ప వయ్యెన్
నెపంబునం గంటిమి నిన్నుఁ జూడన్
దపంబు లొప్పెన్ మముఁ దావకీయ
ప్రపన్నులం జేయుము భక్తమిత్రా !. 405

శా. నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీపేరం బనిసేయు హస్తయుగముల్ నీ మూర్తిపైఁ జూపులున్
నీ పాదంబులపొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా !. 406

వ. అని యిట్లు కీర్తించిన, గుహ్యకులం జూచి, నగుచు నులూఖలబద్ధుం డైన హరి యి ట్లనియె. 407

క. తమతమ ధర్మము తప్పక, సము లైనను సమ్మి తిరుగు సత్పురుషులకును బం
ధము నన్నుఁ జూచిన విరియును, గమలాప్తుఁడు వొడమ విరియు ఘన తమము
క్రియన్. 408

క. కారుణ్యమానసుం డగు, నారదు వచనమునఁ జేసి నన్నుఁ బొడగనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి, చేరెన్ నామీఁదఁ దలఁపు సిద్ధము మీకున్. 409

వ. అని యీశ్వరుండు మీరు మీనెలవులకుం బొండు. అని యానతిచ్చిన,[1]మహాప్రసాదం బని, వల గొని, పెక్కు మ్రొక్కులిడి, నలకూబర మణిగ్రీవు లుత్తర భాగంబున కరిగిరి.

## అధ్యాయము – ౧౧

అంత నందాదు లైన గోపాలకులు, నిర్మూలంబు లై పడిన సాలంబుల చప్పుడు పిడుగుచప్పు డని శంకించి, వచ్చి చూచి. 410

క. ఈ పాదపములు గూలఁగ, నీ పాపఁ డులూఖలమున నిటు బద్ధుం డై
యే పగిది బ్రతికెఁ గంటిరె, వాపోవఁడు వెఱవఁ డెట్టివాఁడో యితఁడున్. 411

ఆ. పిడుగు [1]వడదుగాక పెనుగాలి విసరదు
ఖండితంబు లగుట గానరాదు
బాలుఁ డితఁడు పట్టి వడఁద్రోయఁ జాలఁడు
తరువు లేలఁ గూలె ధరణిమీఁద. 412

1. వడుట (తం.)

వ. అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయు నని శంకించిన, నక్కడ నున్న బాలకు లి ట్లనిరి. 413

క. నందుని కొమరుఁడు వినుఁ డీ, సందున మును దాఁటి త్రోలు సరి నడ్డముగా ముందటి కీడ్చిన మద్దులు, గ్రందుకొనం గూలె జనులఁ గంటి మిరువురన్. 414

వ. అని యిట్లు పలికిన బాలకాలాపంబులు విని, మిథ్యారూపంబు లని కొంద ఱనిరి. కొందఱు నానావిధంబుల సందేహించిరి. అంత నందుఁడు వికసిత వదనార విందుం డగుచుఁ, బట్టి కట్టు విడిచె. అట్టియెడఁ దన తెఱం గెవ్వరు నెఱుంగ కుండవలె నని కపటకుమారుండు. 415

శా. పాడుం మందునిభంగి గోపవనితల్ పాణిధ్వనుల్ సేయఁగా
నాడుం జంత్రముకై వడిన్ బరవశుం డై హస్తముల్ ద్రిప్పుచున్
జూడన్ నేరని వానిభంగిఁ [1]జనులం జూచున్ నగున్ బాలురన్
గూడుం బెద్దలపంపు సేయఁ జను డాఁగున్ [2]దూఁగుఁ జిట్టాడుచున్. 416

క. చుం[3]చెదుగుఁ బాలు ద్రావు ము, దంచితముగ ననుడు పాలు ద్రావి జననితోఁ
జుం చెదుగ దంచు లీలా, చుంచుం డై యతఁడు చుంచుఁ జూపె నరేంద్రా! 417

క. నెలగోల పట్టుకొని జల, కలశములో నీడఁ జూచి కలశ[1]గతుం డై
నెలగోలఁ బాపఁ డొకఁ డిదె, తలచెన్ ననుఁ గొట్ట ననుచుఁ దల్లికిఁ జెప్పెన్.

క. భిక్షులు వచ్చెద రేడ్చిన, భిక్షాపాత్రమున వేసి బెగడించి నినున్
శిక్షించెద రని చెప్పిన, భిక్షులఁ గని తల్లి [4]నొదిఁగి భీతిల్లు నృపా! 419

## —: నందాదులు బృందావనంబునకు నరుగుట :—

వ. ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప, బృహద్వనంబున నందాదు లైన గోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు, వానివలన బాలుం డు త్తరించుటయుం జూచి, యేకాంతంబున నొక్కనాఁడు విచారింప, నుపనందుం డను వృద్ధగోపకుండు తన యెఱుక మెఱసి యి ట్లనియె. 420

ఉ. ఇక్కడ నుందు రే మనుజు లీ మన కృష్ణున కెగ్గు సేయఁగా
రక్కసురాలు చన్నొసఁగె రాలపయిన్ సుడిగాలి [5]వై చెఁ బైఁ
గ్రిక్కిఱియం దరుల్ వడియెఁ గేశవు సత్కృపఁ దప్పెఁ జాలు నేఁ
డెక్కడి కైనఁ బోవలయు నిం కిట గోపకులార! వింటిరే. 421

1. తలయూఁచున్ విన్నగున్ (హ.) 2. మట్టిఁ (తం.) 3. చుంచొదవు (హ) 4. గనియు (హ.)
5. వీచె (హ.)

క. [1]కసవు గల దిరవు పసులకు, లస దద్రి నదీ మహీజ లతి కావళిఁ బెం
పెసఁగును గాఁపురమునకును, బొసఁగును బృందావనంబు పొదఁ డచ్చటికిన్. 422

వ. అను నుపనందుని పలుకుల కార్యు లైన గోపకు లిదియ కార్యంబు మందల. అని కొందల మందక, యాలమందల సమందగమనంబున ముందఱ నడవం బంచి, పిఱుందం గ్రందుకొన (కుండ) బాల వృద్ధ నారు లెక్కిన తేరులు సాఁగించి, తనుత్రాణ తూణీర బాణధరు లై, విండ్లు పట్టుకొని నడవ, బండ్ల వెనుకం గొమ్ము లిమ్ములఁ బూరింపుచు, నవార్యంబు లగు తూర్యరవంబుల నార్య పురోహిత సమేతు లై, వేడుకలు కొనలునిగుడ మొన లేర్పఱుచుకొని పావనం బగు బృందావనంబునకుం జనిరి. అప్పుడు. 423

తరల. పసుపు లాడి యురోజ కుంకుమ పంక శోభిత లై లస
ద్వసన లై కచభార చంపకదామ లై [2]సులలామ లై
పసిఁడిమాడల కాంతు లట్టులఁ బర్వఁ దేరులమీఁదఁ బెం
పెసఁగఁ బాడిరి వ్రేత లా హరి పేల లింపగు నేలలన్. 424

వ. అప్పుడు రోహిణీయశోద లేకరథంబునఁ బరిపూర్ణ మనోరథ లై, రామకృష్ణుల ముందట నిడుకొని, వారల వినోదంబులకుఁ బ్రమోదంబు నొందుచుండిరి. ఇట్లు గోపకులు బృందావనంబు సొచ్చి, యం దర్ధచంద్రాకారంబుగ శకటసందోహంబు నిలిపి, మందలు విడియించి, వసియించిరి. 425

క. చెందిరి బలమాధవు లఖి, నందించుచుఁ బరమపావనము నంచిత కా
ళిందీ సంజీవనమున్, బృందావనమున్ మునీంద్ర బృందావనమున్. 426

వ. ఇట్లు బృందావనంబు చేరి, కొంతకాలంబునకు రామకృష్ణులు సమానవయస్కు లైన గోపబాలకులం గూడుకొని, వేడుక [3]లూఁదుకొన దూడలఁ గాచుచు. 427

సీ. వేణువు లూఁదుచు వివిధ రూపములతో గంతులు వైతురు కౌతుకమున
గురు కంబళాదుల గో వృషంబులఁ బన్ని పరవృషభము లని [4]ప్రతిభటింతు
రల్లులు ధట్టించి యంఘ్రుల గజ్జెలు మొరయఁ దన్నుదు రొలి ముమ్మరముగఁ
బన్నిదంబులు వైచి ఫలమంజరులఁ గూల్చి వ్రేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప

తే. వన్య జంతుచయంబుల వాని వాని
పదురు పదురుచు వంచించి పట్టఁబోదు
రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు
రా కుమారులు బాల్యవిహారు లగుచు. 428

---

1. కసువు (హ.) 2. సులలాటలై (ట.) 3. లూఁదుకొన (హ.); లాడుకొన (చ.)
4. ప్రతిఘటింతు (తం.)

క. పోరుదురు గికురు వొడుచుచు, దూఱుదురు భయంబులేక తోరపు టిరువుల్
జాఱుదురు ఘన శిలాతటి, మీఱుదు రెన్నంగరాని మెలఁకువల నృపా! 429

## —: వత్సాసుర బకాసురుల వధ :—

వ. అంత నొక్కనాఁడు యమునాతీరంబున నా కుమారులు, గోపకుమారులుం, దారును గ్రేపుల మేప, నొక్క రక్కసుండు గ్రేపురూపంబున వచ్చి, వారల హింసింపం దలంచి. 430

క. క్రేపుల యట్టుల నాకుచుఁ, గ్రేపులలో నిదియు మంచి క్రేపనఁగఁ గడుం
జూపట్టె భక్తిసంగతిఁ, గ్రేపై [1]చనువాని మ్రోలఁ గ్రేపై తిరిగెన్. 431

వ. వాని నెఱిఁగి, కృష్ణుండు రామునకుం జెప్పి. 432

చ. ఇది యొక మంచిలేఁగ వినుఁ డెంతయు నొప్పెడి నంచు [2]డాసి త
త్పదములుఁ దోఁకయున్ బిగియఁ బట్టి చెలంగి వెలంగ మ్రానితోఁ
జదియఁగ నొక్కపెట్టు గొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసున్
గుదులుకొనంగ బాలకులు కో యని యార్వ నఖర్వలీలతోన్. 433

వ. ఇట్లు రక్కసుండు వ్రేటువడి, విశాలం బగు సాలంబుతో నేలం గూలె. అప్పుడు.

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ, జంగున దాఁటుచును జెలఁగి చప్పటు లిడుచున్
బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచుఁ, ద్రుంగిన రక్కసునిఁ జూచి త్రుళ్ళిరి కొమరుల్.

వ. ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించిరి. అప్పుడు. 436

క. వత్సములపగిది జగముల, వత్సలతన్ మనుపఁ జూచువాఁడై యుండున్
వత్సముల మేపుచుండియు, వత్సాసురుఁ జంపె భక్తవత్సలుఁ డధిపా! 437

వ. మఱియు నొక్కనాఁడు, రేపకడ గోపకుమారులు గ్రేపులం గొనుచు, నడవికిం జని, యెండం బడి, మ్మొదుకొనిన దప్పిం బెండువడిన, తమ తమ లేఁగకదుపుల నేర్పఱించి, నిలువరించుకొని, కలంకంబు లేని యొక్కకొలంకున నీరుం ద్రావించి, తారును నీరు పానంబుచేసి, వచ్చునెడ నందు. 438

క. అకలంకులు బాలురు గని, రకుటిల దంభోళిహత సితాద్రిశిఖర రూ
పకమున్ హరి హింసారం, భకమున్ బకమున్ విశాల భయ దాంబకమున్. 439

వ. కని దాని యొడలి పొడవునకు వెఱఁగుపడి చూచుచుండ. 440

---

1. చనుమ్రోల వాఁడు (హ.) 2. డాసె (హ.)

ఆ. ఎల్లపనులు మాని యేకాగ్రచిత్తుఁ డై
మౌనివృత్తి నితర [1]మమత విడిచి
వనములోన నిలిచి వనజాతుపై దృష్టిఁ
జేర్చి బకుఁడు తపసిచెలువు దాల్చె 441

వ. ఇవ్విధంబున నొదుఁగు వెట్టుకొని యుండి. 442

ఉ. చంచువు దీటి పక్షములు జల్లున విచ్చి పదంబు లెత్తి కు
ప్పించి నభంబుపై కెగసి భీషణఘోషణ వక్త్రుఁ డై విజృం
భించి గరుత్సమీరమున భిన్నము లై తరు లొలిఁ గూలఁగా
మించి బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణునిఁ జిష్ణుకృష్ణునిన్. 443

క. సంగడిలోకము లన్నియు, మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచు ను
ప్పొంగెడు వేడుక కాఁ డటు, మ్రింగుడువడె బకునిచేత మీఁ దెఱిఁగి నృపా!

క. దనుజుఁడు మ్రింగిన కృష్ణునిఁ, గనలేక బలాది బాలక ప్రముఖు లచే
తను లై వెఱఁ గందిరి చ, య్యన ప్రాణములేని యింద్రియంబుల భంగిన్. 445

వ. ఇట్లు మ్రింగుడువడి లోనికిం జనక. 446

శా. కంఠోపాంతము దొడలున్ [2]మెఱముచున్ గాలాగ్నిచందంబునన్
గుంఠీభూతుఁడు గాక వేంద్ర మగు నా గోపాలబాలున్ జయో
త్కంఠున్ బ్రహ్మగురున్ మహామహిముఁ జక్కన్ మ్రింగరా దంచు నో
ల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్కె వెడలన్ లోకం బశోకంబుగన్. 447

క. క్రక్కి మహాఘోషముతోఁ, జక్కఁగఁ దనుఁ బొడవరాఁగఁ జంచులు రెండున్
ద్రుక్కఁగఁబట్టి తృణముక్రియ, గ్రక్కున హరి చీరె బకునిఁ గలహోత్సుకునిన్.

వ. అప్పు డా నందనందను మీఁద వేలుపులు చాలుపులుగా నందన మల్లికాది కుసుమవర్షంబులు హర్షంబునఁ గురిసిరి. దేవవాద్యంబులు మొరసె. రామాది గోపకుమారులు, ప్రాణములతోఁ గూడిన యింద్రియంబులుం బోలెఁ గ్రమ్మఱఁ గృష్ణునిం గని, రమ్మని, కౌఁగిలించుకొని, కృష్ణసహితు లై, లేఁగదాటుల మరల దాఁటించుకొని, మందగమనంబున మంద కరిగిన, వారలచేత వృత్తాంతం బంతయు విని, వెఱఁగుపడి, గోప గోపికాజనంబులు. 449

క. ఆపదలమీఁద నాపద, లీ పాపనిఁ జెంది తలఁగె నీ యర్భకునిం
బై పడిన ఖలులు దహనుని, పై పడు శలభములవగిదిఁ బడిరి ధరిత్రిన్. 450

---

1. మతము (హ.) 2. నెరయులుం (హ.)

వ. అని పలికిరి. మఱియు, నా రామకృష్ణులు క్రేపులం గాచుతఱిని. 451

సీ. కపుల మై జలరాశి కట్టుదమా యని కట్టుదు రడ్డంబు కాలువలకు
మునుల మై తపములు మొనయుదమా యని మౌను లై యుందురు మాటలేక
గంధర్వవరుల మై గానవిద్యలు మీఱఁ బాడుదమా యని పాడఁజొత్తు
రప్సరోజనుల మై యాడుదమా యని యాఁడురూపులు దాల్చి యాడఁజనుదు

ఆ. రమర దైత్యవరుల మై యబ్ధిఁ ద్రచ్చమా
యని సరోవరములయందు హస్త
దండచయముఁ ద్రిప్పి తరుతురు తమ యీడు
కొమరు లనుసరింపఁ గొమరు మిగుల. 452

## అధ్యాయము - ౧౨

### —: శ్రీకృష్ణుండు గోపకులతో బంతిచల్దులు కుడువ నేఁగుట :—

వ. అంత నొక్కనాఁడు [1]కృష్ణుండు కాంతారంబున బంతిచల్దులు గుడువ నుద్యోగించి, ప్రొద్దున లేచి, గ్రద్దన తనయింటి లేఁగకదుపులం గదలించి, సురంగం బగు శృంగంబు పూరించిన, విని, మేలుకొని, సంరంభంబున గోపడింభకులు చల్ది కావళ్లు మూపుల వహించి, సజ్జంబు లగు కజ్జంబులు గట్టుకొని, పదత్రాణ వేత్ర దండ ధరు లై, లెక్కలకు వెక్కసం బైన తమతమ క్రేపుకదుపులం జప్పుడించి రొప్పుకొనుచుఁ, గాననంబులు సొచ్చి, కాంచన మణిపుంజ గుంజాది భూషణభూషితు లయ్యును, ఫల కుసుమ కోరక పల్లవ వల్లరులు తొడవులుగా నిడుకొని, కొమ్ము లిమ్ముగఁ బూరింపుచు, వేణువు లూఁదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబులతోడం గూడి యాడుచుఁ, బికంబులం గలసి కూయుచు, శుకంబులఁ జేరి రొదలుసేయుచుఁ, బులుఁగుల నీడలం బాఱుచుఁ, బొదరిండ్లు దూఱుచు, సరాళంబు లగు వాఁగులు గడచుచు, మరాళంబులచెంత నడచుచు, బకమ్ములం గని నిలుచుచు, [2]సారసంబులం జోపి యలంచుచు, నదీ జలంబులం దోఁగుచు, తీఁగెయుయ్యాల లూఁగుచుఁ, బల్లంబులం డాఁగుచుఁ, గపుల సంగడిఁ దరువు లెక్కుచు, ఫలంబులు మెక్కుచు, రసంబులకుం జొక్కుచు, నింగికి న్నిక్కుచు, నీడలుచూచి నవ్వుచుఁ, గయ్యంబులకుం గాలు ద్రవ్వుచుఁ, జెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు, బహుప్రకారంబుల శరీరవికారం బులు సేయుచు, మఱియును. 453

---

1. రామకృష్ణులు (తం. వా.); "వినిర్గతోవత్సపురస్సరోహరిః" (12-1) 2. సారసంబులం జొచ్చి మెలుచుచు (హ.)

క. ఒక నొకని చల్దికావడి, నొకఁ డొకఁ డడకించి దాఁచు నొకఁ డొకఁ డది వే
ఱొక రొకరి మొఱఁగి కొని చన, నొకఁ డొకఁ డది తెచ్చి యిచ్చు నుర్వీనాథా!

క. ఒక్కఁడు ము [1]న్నేమఱిచిన, నొక్కఁడు బలు బొబ్బవెట్టు నులికిపడఁగ వే
ఱొక్కఁడు మీఱి తటాలున, నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్.

క [2]తీపిగల కజ్జ మన్యుఁడు, కోపింపఁగ నొడిసి పుచ్చుకొని పో వాఁడున్
బై పడి యడుగఁగ నొక్కఁడు, క్రేపులలో నట్లు నిట్లుఁ గికురించె నృపా! 456

క. వనజాతుఁడు ము న్నరిగిన, మునుపడఁగా నతని మేము ముట్టెద మనుచున్
జని మును ముట్టనివానిన్, మును ముట్టినవాఁడు నవ్వ మొనసి నరేంద్రా! 457

వ. ఇ వ్విధంబున. 358

ఉ. ఎన్నఁడు నైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయున్
గన్నలఁ గాన రట్టిహరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁబట్టుచున్
దన్నుచు గ్రుద్దుచు న్నగుచుఁ దద్దయుఁ బై పడి కూడి యాడుచున్
మన్ననసేయు వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పునే. 459

క. విందులకును బ్రహ్మాసుఖా, నందం బై భక్తగణమునకు దైవత మై
నందునికి బాలుఁ డగు హరి, పొందు గనిరి గొల్ల లిట్టి పుణ్యులుఁ గలరే. 460

## — అఘాసుర వృత్తాంతము —

వ. అని పలికి, శుకయోగీంద్రుఁడు మఱియు ని ట్లనియె. 461

క. అమరు లమృతపానంబున, నమరినవా రయ్యు నే నిశాటుని పంచ
త్వమునకు నెదుళ్లు సూతురు, తము నమ్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁ డై.

క. బకునికిఁ దమ్ముఁడు గావున, బకమరణము తెలిసి కంసుపంపున గోపా
లకబాలురతోఁ గూడన్, బకవైరినిఁ ద్రుంతు ననుచుఁ బటురోషమునన్. 463

క. బాలురు ప్రాణంబులు గో, పాలురకు మదగ్రజాతు ప్రాణము మాఱీ
బాలురఁ జంపిన నంతియ, చాలును గోపాలు రెల్ల సమసినవారల్. 464

వ. అని నిశ్చయించి, యోజనంబు నిడుపును, మహాపర్వతంబు పొడువును, గొండ
తుదల మీఱిన కోఱలును, మిన్ను దన్ని పన్నిన నల్లమొగుళ్ల పెల్లుగల పెదవు
లును, బిలంబులకు నగ్గలం బైన యుగుళ్ల సందులును, అంధకారబంధురం బైన
వదనాంతరాళంబును, దావానల జ్వాలాభీలం బైన దృష్టిజాలంబును, వేఁడిమికి

1. ఏమఱి చన (తం. వా.); 2. తీపులగు (హ.)

నివాసంబు లైన యుచ్ఛ్వాస నిశ్వాసంబులును మెఱయ, నేల నాలుకలు పఱచు కొని, ఘోరం బగు నజగరాకారంబున. 465

క. [1]జాపిరము లేక యిప్పుడు, [2]గ్రేపుల గోపాలసుతులఁ గృష్ణునితోడన్
గీపెట్టఁగ మ్రింగెద నని, పాపపురక్కసుఁడు [3]త్రోవఁ బడియుండె నృపా!. 466

వ. ఆ సమయంబున. 467

మ. ఒక వన్యాజగరేంద్ర మల్లదె గిరీంద్రోత్సేధ మై దావపా
వక కీలా పరుష ప్రచండతర నిశ్వాసంబుతో ఘోర వ
హ్నికరా ళాతత జిహ్వతోడ మనలన్ హింసింప నీక్షించుచున్
వికటం బై పడి సాఁగియున్నది పురోవీథిన్ గనుంగొంటిరే. 468

వ. అని యొండొరులకుం జూపుచు. 469

మ. బకునిం జంపిన కృష్ణుఁ డుండ మనకుం బాముంచుఁ జింతింప నే
టికి రా పోదము దాఁటి కాక యిది కౌటిల్యంబుతో మ్రింగుడున్
బకువెంటం జనుఁ గృష్ణుచేత ననుచున్ బద్మాక్షు నీక్షించి యు
త్సుకు లై చేతులు వేసికొంచు నగుచున్ దుర్వారు లై పోవఁగన్ 470

వ. వారలం జూచి, హరి తన మనంబున. 471

ఉ. అర్భకు లెల్లఁ బాము దివిజాంతకుఁ డౌట యెఱుంగ రక్కటా!
నిర్భయు లై యెదుర్కొనిరి నేఁ గల నంచు విమూఢు లంచు నా
విర్భవ దాగ్రహత్వమున వెందగులం దమ లేఁగపిండుతో
దుర్భర ఘోర సర్ప ఘన తుండబి లాంతముఁ జొచ్చి రందఱున్. 472

వ. అ య్యవసరంబున. 473

శా. వేల్పుల్ చూచి భయంబు నొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వల
త్కల్పాం తోజ్జ్వలమాన జిహ్వ దహనాకారంబుతో మ్రింగె న
స్వల్పాహీంద్రము మాధవార్పిత మనోవ్యాపార సంచారుల
న్నల్పాకారుల శిక్యభారులఁ గుమారాభీరులన్ ధీరులన్. 474

వ. ఇట్లు పెనుఁబాముచేత మ్రింగుడుపడు [4]సంగడికాండ్ర గమిఁ జూచి, కృష్ణుండు.

---

1. జాపెరము (హా.) 2. క్రేపులతో గొల్లసుతుల (హా.) 3. నేలఁబడియుండె (హా.)
4. సంగడికానిగమి (హా.)

చ. "పడుచులు లేఁగలుం గలసి పైకొని వత్తురు తొల్లి కృష్ణ! మా
కొడుకు లదేల రా" రనుచు గోపిక లెల్లను బల్క నేక్రియన్
నొడివెద నేఁడు పన్నగమునోరికి వీరికి నొక్క లంకెగా
నొడఁబడ నేల చేసె విధి యోడక సేయుఁ గదయ్య! క్రౌర్యముల్. 476

వ. అని తలపోసి, నిఖిల లోచనుండును, నిజాశ్రిత నిగ్రహ మోచనుండు నైన తమ్మికంటి, మింటి తెరువరులు మొఱలిడ, రక్కసు లుక్కుమిగుల, వెక్కసం బగు నజగరంబు కుత్తుకకుం బోత్తుగాని మొత్తంబు వెంటనంటం జని, తమ్ము నందఱ చిందఱవందఱఁ జేసి, మ్రింగ నగలించు నజగరంబు కంఠద్వారంబున సమీరంబు వెడలకుండ తనశరీరంబు పెంచి, గ్రద్దన మిద్దె సఱచి న ట్లుండ. 477

క. ఊపిరి వెడలక కడుపున, వా పొదవినఁ బాము ప్రాణవాతంబులు సం
తాపించి శిరము [1]వ్రక్కలు, వాపికొనుచు వెడలి చనియెఁ బటు ఘోషముతోన్.

శా. క్రూరవ్యాళ విశాల కుక్షిగతులన్ గోవత్స సంఘంబుతోఁ
గారుణ్యామృత దృష్టితోడ బ్రతుకంగాఁ జూచి వత్సంబులున్
వారుం దానుఁ దదాస్యవీథి [2]మగుడన్ వచ్చెన్ ఘనోన్మత్తుఁ డై
తారానీకముతోడ నొప్పెసఁగు నా తారేశు చందంబునన్. 479

ఆ. అమరవరులకొఱకుఁ గమలజాండం బెల్ల
బలిఁ దిరస్కరించి బలియు వడుగు
గోపసుతులకొఱకుఁ బాపపు పెనుఁబాము
గళము దూఁటుగట్టు బలియకున్నె. 480

ఉ. ఆ పెనుఁబాము మేన నొక యద్భుత మైన వెలుంగు దిక్తటో
ద్దీపక మై వడిన్ వెడలి దేవపథంబునఁ దేజరిల్లుచున్
గ్రేపులు బాలురున్ బెదరఁ గృష్ణుని దేహము వచ్చి చొచ్చె నా
పాపఁడు చొచ్చి ప్రాణములఁ [3]బాపిన యంతనె శుద్ధసత్త్వ మై 481

క. తన రూ పొకమా టైనను, మనమున నిడికొనినఁ బాప [4]మంతయుఁ దనలోఁ
గొని చను హరి తను మ్రింగిన, దనుజునిఁ గొనిపోవ కున్నె తన లోపలికిన్. 482

వ. తదవసరంబున, సురలు కుసుమవర్షంబులు గురియించిరి. రంభాదు లాడిరి. మేఘంబులు మృదంగంబులభంగి ఘోషించె. సిద్ధ గంధర్వులు 'జయ, జయ' భాషణంబుల భాషించిరి. అంత. 483

---

1. వ్రక్కలు బాపికొనుచు (హ.); వ్రక్కలు వాపికొనుచు (వా.) 2. దిరుగన్ (హ.)
3. బాసిన (తం.) 4. మయుఁ దనగతికిన్ (తం.); మయు నైననులో (వా.)

శా. ఆ వాద్యంబులు నా మహా జయరవం బా పాట లా యాటలున్
దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిం భూమి కేతెంచి నేఁ
డీ వత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం
డే వెంటన్ బ్రతికించె మే లనుచు నూహించెన్ గడున్ నివ్వెఱన్. 484

వ. అంత న య్యజగరచర్మంబు కొన్నిదివసంబుల కెండి, పెద్దగాలంబు గోపాలురకుం గేళిబిలం బై యుండె. ఇట్లు కౌమారవిహారంబున నైదవయేఁటఁ గృష్ణుం డఘాసురునిం దెగఁజూచుటయుఁ, దమ్ముం గాచుటయు, నాఱవయేఁటిదైన పౌగండ వృత్తాంతం బని చిత్తంబులం గోపకుమారులు దలంపుచుందురు. అని చెప్పిన, న ప్పుడమిఱేఁ డ ప్పరమయోగీంద్రున కి ట్లనియె. 485

సీ. ఐదేండ్లు కౌమార మటమీఁద నైదేండ్లు పౌగండ మనియెడు ప్రాయ మందు
నైదేండ్లవాఁ డైన యజ్ఞాఘుచరితంబు "పౌగండ మని" గోపబాలు రెల్లఁ
దలఁతు రంటివి యెట్లు తలఁతురు వారలు నిరుడు చేసిన పని నేఁటి దనఁగ
వచ్చునే యిది నాకు వరుసతో నెఱిఁగింపు మనవుడు యతిచంద్రుఁ డైన శుకుఁడు

ఆ. యోగదృష్టిఁ జూచి యొక్కింత భావించి
వినుము రాజవర్య! వినయధుర్య!
పరమగుహ్య మనుచుఁ బల్కుదు రార్యులు
శిష్యజనుల కీవు సేయు తలఁపు. 486

అధ్యాయము - ౧౩

క. *ప్రియురాలివలని వార్తలు, ప్రియజనులకు నెల్లప్రొద్దుఁ బ్రియ మగు భంగిన్
బ్రియుఁ డగు హరిచరితంబులు, ప్రియభక్తుల కెల్లయెడలఁ బ్రియములు గావే.

వ. అని పలికి, య య్యోగీంద్రుఁడు రాజేంద్రున కి ట్లనియె. అ ట్లఘాసురు మొగంబు వలనం గడచి, [1]లేఁగలన్ గోపకుమారులం బ్రతికించి, వారునుం దానునుం జని చని. 488

మ. కనియెం గృష్ణుఁడు సాధునీరము మహాగంభీరముం బద్మ కో
కనద స్వాదు వినోద మోద మద భృంగ ద్వంద్వ ఝుంకారమున్
ఘన కల్లోల లతావితాన విహార త్కాదంబ కోలాహల
స్వన విస్ఫారము మందవాయుజ కణాసారంబుఁ గాసారమున్. 489

---

* "స్త్రియావిటానామివ సాధువార్తా" (మూ.)

1. లేఁగల గోపవరులం (హ.) లేఁగకాపరులం (తం.)

—: గోపాలబాలురు కృష్ణునితోఁ గూడి చల్ది లారగించుట :—

వ. కని తమ్మికంటి తమ్ములయింటి సొబగునకు నిచ్చ మెచ్చుచుఁ, జెచ్చెర గాలిం గదలెడు కరళ్ల తుంపురుల జల్లు పెల్లున నొడళ్లు గగురుపొడువఁ, గొలంకు కెలంకులఁ గాయ పండుల గొలల వ్రేఁగున వీఁగి, పట్టుగల చెట్టుతుటుము నీడల నొప్పుచున్న యిసుకతిప్పల విప్పు చూచి, వేడుక పిచ్చలింప, నెచ్చెలుల కిట్లనియె. 490

శా. ఎండన్ గ్రమ్మఁగ నీ రాఁకటం బడితి రిం కేలా విలంబింపఁ గా
రండో బాలకులార! చల్ది గుడువన్ రమ్యస్థలం బిక్కడి
దండన్ లేఁగలు నీరు ద్రావి యిర వందం బచ్చికల్ మేయుచుం
దండం బై విహరించుచుండఁగ నమంద ప్రీతి [1]భక్షింత మే. 491

వ. అనిన నగుఁగాక యని, వత్సంబుల నుత్సాహంబుల నిర్మలంబు లగు జలంబులు ద్రావించి, పచ్చికల మొల్లంబులు గల పల్లంబుల నిలిపి, సొక్కంబు లగు చల్దుల చిక్కంబులు సక్క డించి. 492

మ. జలజాంతస్థిత కర్ణికం దిరిగి రా సంఘంబు లై యున్న రే
కులచందంబునఁ గృష్ణునిం దిరిగి రాఁ గూర్చుండి వీక్షింపుచున్
శిలలుం బల్లవముల్ తృణంబులు లతల్ చిక్కంబులున్ బువ్వ లా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా!. 493

సీ. మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి చూడు లే దని నోరు సూపు నొక్క
డేగు రార్గుర చల్దు లెలమిఁ బన్నిద మాడి కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ
డిన్నియుఁ [2]దగఁ బంచియిడుట నెచ్చెలితన మనుచు బంతెనగుండు లాడు నొకఁడు

ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి [3]పరు మ్రోలి
మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు
నవ్వు నొకఁడు సఖుల నవ్వించు నొక్కఁడు
ముచ్చటాడు నొకఁడు మురియు నొకఁడు. 494

వ. అ య్యవసరంబున. 495

---

1. భుంజింతమే (వ్రా. ప్ర. అన్నిట.) 2. ఁబోరుచు లిడుచు నెచ్చెలితనమనుచు బంతిన గుండ్లునాఁడు నొకఁడు (హ.); డిన్నియుండఁగఁ బంచియిడుట (వా.) 3. వడి (హ.)

సీ. కడుపున దిండుగాఁ గట్టిన వలువలో లాలిత వంశనాళంబుఁ జొనిపి
విమల శృంగంబును వేత్రదండంబును జాఱిరానీక డాచంక నిఱికి
మీఁగడపెరుఁగుతో మేళవించిన చల్దిముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు వ్రేళ్లసందులను దా వెలయ నిఱికి

ఆ. సంగడీల నడుమఁ జక్కనఁ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి చల్ది గుడిచె. 496

వ. ఇట్లు కృష్ణసహితులైన గోపకుమారులు చల్దులు గుడుచునెడఁ, గ్రేపులు మేపులకుం జొచ్చి, పచ్చని గఱికిజొంపంబుల గుంపుల కుఱికి, లంపులు మేయుచు, ఘోరం బగు వనంబునడుమఁ దోరం బగు దూరంబు సనిన, వానిం గానక, వెఱచుచున్న గోపడింభకులకు నంభోజనయనుం డి ట్లనియె. 497

—: బ్రహ్మ గోవత్సములను గోపాలకులతోఁగూడ నంతర్ధానము చేయుట :—

మ. వినుఁడో బాలకులార! క్రేపు లటవీవీథిన్ మహాదూరముం
జనియెం గోమల ఘాసఖాదన రతోత్సాహంబుతో నెందుఁ బో
యెనొ యే మయ్యెనొ క్రూరజంతువులచే నే యాపదం బొందెనో
కని తెత్తుం గుడువుండు చల్ది గొఱఁతల్ గాకుండ మీ రందఱున్. 498

వ. అని చెప్పి. 499

శా. కర్ణాలంబిత కాకపక్షములతో గ్రైవేయ హారాళితో
[1]స్వర్ణభ్రాజిత వేత్ర[2]దండకముతో సత్పింఛ దామంబుతోఁ
బూర్ణోత్సాహముతో ధృతాన్న కబళోత్ఫుల్లాబ్జ హస్తంబుతోఁ
దూర్ణత్వంబున నేఁగె లేఁగలకునై దూరాటవీవీథికిన్. 500

వ. ఇ ట్లేగుచు. 501

క. ఇచ్చోఁ బచ్చిక మేసిన, విచ్చోఁ ద్రావినవి తోయ మేఁగిన విచ్చో
నిచ్చోట మందగొన్నవి, యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె యనుచున్. 502

క. కంజదళాక్షుఁడు వెదకెను, గొంజక లేఁగల నపార గురు తృణవనికా
పుంజంబుల భీకర మృగ, కుంజంబులఁ దరుల గిరులఁ గొలఁకుల నదులన్. 503

వ. అంత. 504

---

1. స్వర్ణాభాసిత (హ. తం. వా.) 2. దండములతో (హ.)

శా. బాలుం [1]డయ్యు బకాసురానుజుఁడు ద్రుంపన్ బాలురన్ గ్రేపుల
న్నేలీలన్ బ్రతికించెనొక్కొ భువి నూహింపం గడున్ జోద్య మం
చాలో నంబుజసంభవుండు చని మాయాబాలు శుంభద్బలం
బాలోకింపఁ దలంచి డాఁచె నొకచో నా లేఁగలన్ బాలురన్. 505

వ. ఆ సమయంబున, దూడలు పోయిన జాడ లెఱుంగక తప్పి, య ప్పద్మలోచనుం డెప్పటి కొలంకు కడకు వచ్చి, య చ్చోట నెచ్చెలులం గానక, వారిం జీరి, లేకుండుట నిశ్చయించి, గోవిందుండు విశ్వవిదుండు గావున, నిది విరించి మొఱం గని యెఱింగి, తిరిగి పోవుచు. 506

శా. వంచింపం బనిలేదు బ్రహ్మ కిచటన్ వత్సంబులన్ బాలురన్
వంచించెన్ గనుఁ బ్రామి తన్ను మరలన్ వంచించు టాశ్చర్యమే
వంచింపన్ దన కేల [2]తెచ్చుటకు నై వర్ధించు బ్రహ్మాండముల్
వంచింపన్ మరలింప నేర్చు హరి లీలన్ మందహాసాస్యుఁ డై. 507

క. గోపాలసుతులు లే రని, గోపికలకుఁ జెప్పనేల గోపాలకులున్
గోపికలు నలర బాలుర, గ్రేపుల రూపముల నేఁ జరించెద ననుచున్. 508

మ. కరముల్ పాదములున్ శిరంబు లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం
తరముల్ ముక్కులుఁ గన్నులున్ శ్రవణముల్ దంతాదులున్ దండకాం
బర స్రగ్వేణు విషాణ భూషణ వయో భాషా గుణాఖ్యాన త
త్పరతల్ వీడ్వడకుండఁ దాల్చె విభుఁ డా వత్సార్భకాకారముల్. 509

క. రూపంబు లెల్ల నగు బహు, రూపకుఁ డిట బాల వత్స రూపంబులతో
నేపారు టేమి చోద్యము, రూపింపఁగ నతని కితర రూపము గలదే. 510

క. మరలుపు మనియెడు కర్తయు, మరలించు కుమారకులును మరలెడి క్రేపుల్
పరికింపఁ దాన యై హరి, మరలం జనె లీలతోడ మందకు నధిపా! 511

వ. ఇట్లు బాల వత్స రూపంబులతో విహరించుచు, మందకు వచ్చి, వారి వారి దొడ్ల న య్యై వత్సంబుల ముందటి కందువల నిలిపి, త త్త ద్బాలరూపంబుల నందటి గృహంబులఁ బ్రవేశించి, వేణునాదంబులు చేసిన. 512

చ. కొడుకుల వేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబు లై
ముడివడ లేచి యెత్తుకొని మూర్కొని తల్లులు కౌఁగిలించుచుం
జడిఁగొనఁ జేఁపు వచ్చి తమ చన్నులయందు సుధాసమంబు లై
వెడలెడు పాలు నిండుకొను వేడుక నిచ్చిరి తత్సుతాళికిన్. 513

---

1. బాలుం డై యితండా యఘాసురుని ద్రుంపన్ (తం.); బాలుండయ్యునితండఘా....(వా.)
2. తెచ్చుట యగున్ (హ.)

వ. మఱియుఁ దల్లు లుల్లంబులఁ బెల్లుగ వెల్లిగొను వేడుకలం దమ నందనులకు నలుంగు లిడి, మజ్జనంబులు గావించి, గంధంబు లలంది, తొడవులు దొడిగి, నిటలతటంబుల రక్షా తిలకంబులు వెట్టి, సకలపదార్థ సంపన్నంబు లైన యన్నంబు లొసంగి, సన్నములు గాని మన్ననలు సేసిరి. 514

క. ఏ తల్లుల కే బాలకు, లే తెఱఁగున దిరిగి ప్రీతి యొసఁగింతురు ము
న్నా తల్లుల కా బాలకు, లా తెఱఁగునఁ బ్రీతి సేసి రవనీనాథా! 515

వ. ఆ సమయంబున. 516

ఉ. పాయని వేడ్కతో నునికి పట్టులకుం జని గోవు లెల్ల [1]నం
భా యని చీరి హుమ్మనుచుఁ బైపడి మూర్కొని [2]బంచితిల్లి పె
ల్లై యతిరేకమై పొదువులం దెడలేక స్రవించుచున్న పా
లా యెడ నాకుచున్ సుముఖలై యొసఁగెన్ నిజ వత్సకోటికిన్. 517

క. వ్రేతలకును గోవులకును, మాతృత్వము చాలఁ గలిగె మఱి మాధవుపై
మాత లని హరియు నిర్మల, కౌతూహల మొప్పఁ దిరిగెఁ గడు బాల్యమునన్.

ఆ. ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వేడ్క
పూఁట పూఁట కెలమిఁ బొటమరించె
నిచ్చ క్రొత్త లగుచు నీరజాతుని మీఁద
వేడ్కఁ దమకుఁ దొల్లి వెలసినట్లు. 519

వ. ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి, తన్నుఁ దాన రక్షించుకొనుచు [3]నుండి మందను వనంబుల నమంద మహిమంబున నొక్కయేఁడు క్రీడించె. ఆ యేఁటికి నయిదాఱు దినంబులు కడమ వడియుండ, నం దొక్కనాఁడు బలభద్రుం డునుం, దానును వనంబునకుం జని, మందచేరువ లేఁగల మేప, నతిదూరంబునం గోవర్ధన శైల శిఖరంబున ఘాసంబులు గ్రాసంబులు గొనుచున్న గోవు లా లేఁగలం గని. 520

చ. ముదమున హుంకరింపుచును మూఁపులపై మెడ లెత్తి చాఁపుచున్
బదములు నాల్గు రెం డయిన భాగునఁ గూడఁగఁ బెట్టి దాఁటుచున్
వదనములన్ విశాలతర వాలములన్ వడి నెత్తి పాఱి యా
మొదవులు చన్నులం గుడిపె మూతుల మ్రింగెడిభంగి నాకుచున్. 521

వ. అంత గోపకులు గోవుల నివారింప నలవిగాక, దిగ్గన నలుకతోడి సిగ్గు లగ్గలంబుగ దుర్గమమార్గంబున వాని వెంటనంటి వచ్చి, లేఁగల మేపుచున్న కొడుకులం గని.

1. అంబేయని .... బేరిచి (వా.) 2. పంచటిల్లె (హ.) 3. నుండెను వనంబుల (హ.)

ఉ. అయ్యలఁ గంటి మంచుఁ బులకాంకురముల్ వెలయంగఁ గుఱ్ఱలన్
జయ్యన డాసి యెత్తుకొని సంతస మందుచుఁ గౌఁగిలించి తా
ర య్యెడ నౌదలల్ మనములారఁగ మూర్కొని ముద్దుసేయుచున్
దయ్యు మెఱుంగు గోపకులు తద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్. 523

వ. ఇట్లు బాలకాలింగనంబుల నానందబాష్ప పూరితనయను లై, గోపకులు గోవుల మరలించుకొని, తలఁగి చన, వారలం జూచి, బలభద్రుం డి ట్లని, తనలోఁ దలంచె. 524

సీ. చన్ను మానిన యట్టి శాబక శ్రేణిపై గోగణంబులకును గోపకులకు
ని బ్భంగి వాత్సల్య మెటువలె నుదయించె హరిఁ దొల్లి మన్నించునట్లు వీరు
మన్నించుచున్నారు మమతసేయుచుఁ బ్రీతి నంబుజాక్షునిఁ గన్న యట్ల నాకుఁ
బ్రేమ మయ్యెడి డింభబృందంబుఁ గనుఁగొన్న నిది మహాద్భుత మెందు
నెఱుఁగరాదు

తే. మనుజ దైవత దానవ మాయయొక్కొ
కాక నా భర్త యగుచున్న కమలనయను
మాయయో గాక యితరుల మాయ నన్నుఁ
గలఁపనోపదు విభుమాయ గాఁగ నోపు. 525

క. అని మున్ను ముగ్ధుఁ డయ్యును, దనయందుల దివ్యదృష్టిఁ దప్పక బుద్ధిన్
దన చెలికాండ్రను గ్రేపుల, వనజాక్షుం డనుచుఁ జూచె వసుధాధీశా ! 526

వ. ఇట్లు విజ్ఞానదృష్టిఁ జూచి, యెఱింగియు నమ్మక కృష్ణుం జూచి మహాత్మా ! తొల్లి యెల్ల క్రేపులును ఋషుల యంశం బనియును, గోపాలకులు వేల్పుల యంశం బనియును, దోఁచుచుండు. ఇప్పుడు వత్స బాలక సందోహంబు సందేహంబు లేక నీవే యని తోఁచుచున్నది. ఇది యేమి యని యడిగిన, నన్నకు నున్నరూపంబు వెన్నుండు మన్నన సేసి, క్రన్నన యెఱింగించె. అతండును నెఱింగె. ఇ వ్విధంబున హరి బాలవత్సంబులు దాన యై సంచరించిన యేఁడు విరించికి తనమానంబున నొక్క త్రుటిమాత్రం బైన, విరించి చనుదెంచి, వత్స బాలకుం డైన కృష్ణ బాలకుం జూచి, వెఱఁగుపడి, యి ట్లని వితర్కించె. 527

శా. మందం బగ్గిన వత్స బాలకులు నా మాయా గుహా సుప్తు లై
యెందుం బోవరు లేవ రిప్పుడును [1]లేరే చేయ నా కన్యు లొం
డెందున్ లేరు [2]విధాతలుం బరులు వీ రెవ్వార లె ట్లైరొకో
యెం దేతెంచిరొ కృష్ణుతో మెలఁగు [3]వా రేఁ డయ్యెడిన్ నేఁటికిన్. 528

1. వేఱేచేయ (తం. వా.) 2. విధాతనేఁబరులు (తం.) 3. వారెంద య్యెడిన్నేటికిన్ (హ)

మత్తకోకిల. బ్రహ్మపంపునఁ గాని పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్
బ్రహ్మ నొక్కఁడఁ గాని వేఱొక బ్రహ్మ లేఁడు సృజింపఁగా
బ్రహ్మ నేను సృజింప [1]నొండొక బాల వత్స కదంబ మే
బ్రహ్మమందు జనించె [2]నొక్కట బ్రహ్మ మైనది చూడఁగన్. 529

వ. అని యిట్లు సకలంబును సుకరంబుగ వెఱ వెఱింగెడి నెఱవాది ముదుక యెఱుకగల [3]ప్రోడ వెఱంగుపడి, గ్రద్దన పెద్దప్రొద్దు తద్దయుం దలపోసి, కర్జంబుమందల యెఱుంగక, కొందలపడుచు, నాందోళనంబున. 530

క. మోహము లేక జగంబుల, మోహింపఁగ జేయ నేర్పు మొనసిన విష్ణున్
[4]మోహింపించెద ననియెడి, మోహమున విధాత తానె మోహితుఁ డయ్యెన్.

తే. పగలు ఖద్యోతరుచి చెడుపగిది రాత్రి
మంచు చీఁకటి లీన మై మాయుమాడ్కి
విష్ణుపై నన్యమాయలు విశద మగునె
చెడి నిజేశుల గరిమంబుఁ జెఱుచుఁ గాక. 532

వ. మఱియును. 533

క. పుట్టితి బుద్ధి యెఱింగితిఁ, బుట్టించితి జగము సగము పోయెను ప్రాయం
[5]బిట్టివి నూతన సృష్టులు, పుట్టుటలే దౌర యిట్టి బూమెలు భూమిన్. 534

వ. అని యిట్లు తలవాకిట వాఁడిమిగల వాణి పోఁడిమిచే వాఁడికెక్కిన నలుమొగంబుల తక్కరిగొంటు పెనుదంట పలువెంటలఁ దన మనంబున వితర్కించి, విచారించు నెడ, నతండు గనుఁగొనుచుండ, న బ్బాలకులు మేఘశ్యాములును, హార కుండల కిరీట వనమాలికాభిరాములును, శ్రీవత్స మంగళాంగద నూపుర కనకకటక కంకణ కటిఘటిత కాంచీగుణోద్దాములును, నాపాదమస్తక తులసీ నవదాములును, విలస దంగుళీయక స్తోములును, శంఖ చక్ర గదా కమల హస్తులును, జతుర్భుజ ప్రశస్తులును, పీత కౌశేయవాసులును, జంద్రికా ధవళ హాసులును, నరుణకరుణా కటాక్షవీక్షణ విలాసులును, ననంత సచ్చిదానందరూప మహితులును, విజాతీయ భేదరహితులు నయి తమకుఁ బరతంత్రంబు లగుచు నృత్తగీతాది సేవా విశేషంబులకుఁ జొచ్చి మెలంగు(చు) మూర్తిమంతంబు లైన బ్రహ్మాది చరాచరంబులును, నణిమ మహిమాది సిద్ధులును, మాయాప్రముఖంబు లైన శక్తు

1. నుండక (హ.) 2. నొక్కడ (హ.) 3. ప్రోగు (హ.) 4. మోహించెద నేనని యెడు (హ.) 5. ఇట్టివి తనసృష్టులలో (ట.) 6. తలవాకిట వాణిగల పోఁడిమి వాఁడిమి కెక్కిన (తం. వా.)

లును, మహదాది చతుర్వింశతి తత్త్వంబులును, గుణక్షోభ కాలపరిమాణ హేతు
సంస్కార కామ కర్మ గుణంబులును సేవింప, వేదాంతవిదుల కైన నెఱుంగరాని
తెఱంగున మెఱయుచుఁ, గానంబడిన వారలం గనుంగొని. 535

ఉ. బాలురఁ గంటి నా [1]మదికిఁ బాసిన వారిని మున్ను వారి నేఁ
బోలఁగఁ జూచునంతటన భూరి నిరర్గళ దుర్గమ ప్రభా
జాలముతోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచు నున్న వార లే
మూలమొ మార్గ మెయ్యదియొ మోసము వచ్చెఁ గదే విధాతకున్. 536

వ. అని సకలేంద్రియంబులకు వెక్కసంబు లైన ప్రుక్కి. 537

ఉ. ఏ పరమేశు తేజమున నీ సచరాచర మైన లోక ము
ద్దీపిత మయ్యె నట్టి విభు తేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా
నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మైమఱచె నప్పుడు చిత్రపు రూపు కైవడిన్. 538

వ. ఇట్లు మాయాతీతుండును, వేదాంత విజ్ఞాన దుర్లభుండును, స్వప్రకాశానందుం
డును నైన తన బాహుళ్యంబుఁ జూచి, నివ్వెఱపడిన బ్రహ్మం గని, యీశ్వరుండు.

శా. బాలుం డై చతురాననుండు [2]తన యా బ్రహ్మాభిమానంబునన్
లోలుం డై మతిఁ దప్పి నా మహిమ [3]మాలోకింప నేతెంచెఁ దా
నాలోకింపఁగ నెంతవాఁ డనుచు మాయాజాలమున్ విప్పి త
ల్లీలారూపము లెల్ల దాఁచె నటఁ గేళీచాతురీ ధుర్యుఁ డై. 540

వ. అంతలోన నిర్జీవుండు సజీవుం డయిన తెఱంగున, నెనిమిది కన్నులుగల వేల్పుగమి
కాఁడు, తేటి, తెప్పిఱిలి ,కాలుఁ గేలుఁ గదలించి, చెచ్చెరం గన్నుఁ దెఱచిచూడ
సమర్థుం డై, ముందఱఁ గని, వెనుకఁ జూచి, దివి విలోకించి, దిక్కులు వీక్షించి,
యెల్లయెడలన్ గలయ దర్శించి, తన పురోభాగంబున హరి సంచరించుటం జేసి
జాతివైరంబు లేని నర పశు మృగాదులకు నాటపట్టయి, సిరిగలిగి, కామ
క్రోధాది రహితులకు జీవనం బైన బృందావనంబు పొడగాంచి యందు. 541

సీ. తన కన్యములు లేక తనరారి ముమ్మూల విభుఁ డయ్యుఁ గ్రేపుల వెదకువాని
నఖిలజ్ఞుఁ డై యొక్కఁ డయ్యు నజ్ఞాకృతిఁ జెలికాండ్రఁ బెక్కండ్రఁ జీరువాని
బహి రంత రాద్యంత భావశూన్యుం డయ్యు నంతంత నడుగుచొ ప్పరయువాని
గురు గభీరుం డయ్యు [4]గురువులు వాఱుచు [5]నట్టిట్టు పాతర లాడువాని

---

1. చెయిదిఁ (వా.) 2. తనయీ (తం. వా.) 3. యాలోకింప (తం. వా.)
4. ఁబరువులు వారుచు (హా.) 5. నట్టిట్టుఁబాతర (తం. వా.)

ఆ. జాతిరహితుఁ డయ్యుఁ జతుర గోపార్భక
భావ మెల్ల నచ్చు పడిన [1]మేని
చెలువువాని హస్త శీతాన్న కబళంబు
వానిఁ గాంచె నపుడు వాణిమగఁడు. 542

వ. కని, సంభ్రమించి, విరించి రాయంచ డిగ్గనుఱికి, కనకదండ సుకుమారం బయిన శరీరంబుతోడ నేలం జాగిలంబడి, మణిగణ సుప్రకాశంబు లయిన తన కిరీట శిఖరప్రదేశంబు లా కుమారుని పాదంబులు మోవ మ్రొక్కి, తోరంబు లగు నానందబాష్ప జలపూరంబుల నడుగులు గడిగి, మఱియును. 543

క. అడుగులపైఁ బడు లేచుఁ, బడుఁ గ్రమ్మఱ లేచు నిట్లు భక్తిన్ మును దాఁ
బొడగనిన పెంపుఁ దలఁపుచు, [2]దుడుకని మహిమాబ్ధి నజుఁడు దుడుకడిచె నృపా!

వ. అంత నల్లనల్లన లేచి, నిలుచుండి, నయనారవిందంబులు దెఱచి, గోవిందుని సందర్శించి, చతుర్ముఖుండు ముఖంబు వంచి, కృతాంజలి యై, డిగ్గన డగ్గుత్తిక యిడుకొనుచు, నేకచిత్తంబునఁ జతుర్ముఖంబుల నిట్లని స్తుతియించె. 545

## అధ్యాయము – ౧౪

సీ. శంపాలతికతోడి జలదంబు కైవడి మెఱుఁగు టొల్లియతోడి మేనివానిఁ
గమనీయ మృదులాన్నకబళ వేత్ర విషాణ వేణుచిహ్నంబుల వెలయువానిఁ
గుంజావినిర్మిత కుండలంబులవాని శిఖిపింఛ వేష్టిత శిరమువాని
వనపుష్ప మాలికావ్రాత కంఠమువాని నళిన కోమల చరణములవానిఁ

ఆ. గరుణ గడలుకొనిన కడకంటివాని గో
పాలబాలు భంగిఁ బరఁగువాని
నగుమొగంబువాని ననుఁ గన్నతండ్రిని
నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష ! 546

మ. నను మన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ
తను రూపం బిదె నా మనంబున కచింత్యం బయ్యె నీ యుల్లస
ద్ఘన విశ్వాకృతి నెవ్వఁ డోపు నెఱుఁగన్ గైవల్య మై యొప్పు నా
త్మ నివేద్యం బగు నీదు వైభవము చందం బెట్టిదో యీశ్వరా ! 547

క. విజ్ఞాన విధము లెఱుఁగక, [3]తజ్జ్ఞులు నీ వార్తఁ జెప్పఁ దను వాఙ్మనముల్
యజ్ఞేశ ! నీకు నిచ్చిన, యజ్ఞులు నినుఁ బట్టి [4]గెలుతు రజితుఁడ వైనన్. 548

---

1. మేటి (క.ట.తం.) 2. నుడుగని....దుడుకడఁచె(హా.) 3. తద్జ్ఞులు(హా.) 4.కొలుతు(హా.)

క. శ్రేయములు గురియు భక్తిని, జేయక కేవలము బోధసిద్ధికిఁ దపముం
జేయుట విఫలము పొల్లం, దాయము చేకుఱునె తలఁప నధికం బైనన్. 549

క. నిజముగ [1]నిన్నెఱుఁగరు మును, నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీ కథ వినుచున్
నిజకర్మ లబ్ధ భక్తిన్, సుజనులు నీ మొదలిటెంకిఁ జొచ్చి రధీశా! 550

సీ. విక్రియా శూన్య మై విషయత్వమును లేని దగుచు నాత్మాకార మై తనర్చు
నంతఃకరణ మొక్క యధికసాక్షాత్కార విజ్ఞానమునఁ బట్టి వే ఱొరులకు
నెఱుఁగంగ రాని దై యేపారి యుండుటఁ జేసి నీ నిర్గుణ [2]శ్రీ విభూతి
బహిరంగ వీథులఁ బాఱక తిరము లై యమలంబు లగు నింద్రియములచేత

ఆ. నెట్టకేల కైన నెఱుఁగంగ వగుఁ గాని
గుణవిలాసి వగుచుఁ గొమరుమిగులు
నీగుణ వ్రజంబు నేరరా దెఱుఁగంగ
నొక్క మితము లేక యుంట నీశ! 551

క. తారాతుషార శీకర, భూరజముల కైన లెక్క బుధు లిడుదురు భూ
భారావతీర్ణ! వారును, నీ రమ్య గుణంబు లెన్న నేర రగణ్యా! 552

శా. ఏవేళం గృపఁ జూచు నెన్నఁడు హరిన్ వీక్షింతు నంచాఢ్యుఁ డై
నీ వెంటంబడి తొంటి కర్మచయమున్ నిర్మూలమున్ జేయుచున్
నీవాఁ డై తను వాఙ్మనోగతుల నిన్ సేవించు విన్నాణి వో
కైవల్యాధిప లక్ష్మి నుద్దవడిఁ దాఁ గైకొన్న వాఁ డీశ్వరా! 553

ఉ. మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి ప్రోడ! నిన్ను నా
మాయఁ గలంచి నీ మహిమమానముఁ జూచెద నంచు నేరమిన్
జేయఁగ బూనితిన్ గరుణ సేయుము కావుము యోగిరాజ వా
గ్గేయ! దవాగ్నిఁ దజ్జనితకీలము గెల్చి వెలుంగ నేర్చునే. 554

సీ. సర్వేశ! నే రజోజనితుండ మూఢుండ ప్రభుఁడ [3]నేనని వెఱ్ఱిప్రల్లదమున
గర్వించినాఁడను గర్వాంధకారాంధ నయనుండఁ గృపఁ జూడు ననుఁ బ్రధాన
మహదహంకృతి నభో మరు దగ్ని జల భూమి పరివేష్టి తాండ కుంభంబులోన
నేడు [4]జేనల మేన [5]నెనయ నే నెక్కడ నీదృగ్వి ధాండంబు [6]లేరి కైన

---

1. నిన్నెఱుఁగఁగ (తం. వా.) 2. శ్రీవిభాతి (హ.) 3. నోయని (హ.)
4. జానల (హ.) 5. నెనయు నొక్కండనే (హ.) 6. నేరికైన (హ.)

తే. సంఖ్య సేయంగరానివి సంతతంబు
నోలిఁ బరమాణువులభంగి నొడలి రోమ
వివరములయందు వర్తించు విపులభాతి
నెనయుచున్న నీవెక్కడ నెంత కెంత. 555

తరల. కడుపులోపల నున్న పాపఁడు కాలఁ దన్నినఁ గిన్కతో
నడువఁ బోలునె కాఁగి తల్లికి [1]నాథ! సన్నము దొడ్డు నై
యడఁగి కారణకార్య రూపము నైన యీ సకలంబు నీ
కడుపులోనిది గాదె పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్. 556

క. భూరి లయజలధి నిద్రిత, నారాయణ నాభికమల నాళమున నజుం
డారయఁ బుట్టె ననుట నిజ, మో [2]రాజీవాక్ష! పుట్ట నోటు తలంపన్. 557

సీ. నళినాక్ష! నీ వాదినారాయణుండవు జలము నారము జీవచయము నార
మందు నీ వుంట నీయం దది యుంటను నారాయణుం డను నామ మయ్యె
సకలభూతములకు సాక్షి వధీశుండ వబ్ధి నిద్రించు నారాయణుఁడవు
నీమూర్తి యిది నీకు నిజమూర్తి యనరాదు నళిననాళముత్రోవ నడచి మున్ను

తే. కడఁగి నూఱేండ్లు వెదకి నేఁ గాన నైతి
నేకదేశస్థుఁడవు గావ నేకరుచివి
జగములో నుందు నీలోన జగము లుండు
నరుఁడు నీమాయ నెట్లైన నగుచు నుండు. 558

మ. వినుమా యీశ్వర! వెల్పల న్వెలుఁగు నీ విశ్వంబు నీ మాయ గా
క నిజం బైన యశోద యెట్లు కనియెన్ గన్నార నీ కుక్షిలోఁ
గనెఁ బో క్రమ్మఱఁ గాంచెనే భవదపాంగ శ్రీఁ బ్రపంచంబు [3]చ
క్కన లో నా వెలి యాను లోను వెలియుం గాదేఁ దదన్యం బగున్. 559

మ. ఒకఁ డై యుంటివి బాలవత్సములతో నొప్పారి నీ వంతటన్
సకలోపాసితులై చతుర్భుజులు నై సంప్రీతి నేఁ గొల్వఁగాఁ
బ్రకట శ్రీ గలవాఁడ వైతి విపుడున్ బ్రహ్మాండముల్ సూపి యొ
ల్లక యి ట్లొక్కఁడ వైతి నీ వివిధలీలత్వంబు గంటిం గదే. 560

క. [4]ఎఱుఁగనివారికిఁ దోఁతువు, నెఱిఁ బ్రకృతిన్ జేరి జగము నిర్మింపఁగ నా
తెఱఁగున రక్షింపఁగ నీ, తెఱఁగునఁ బ్రహరింప రుద్రు తెఱఁగున నీశా! 561

1. నాది సన్నము(తం.) 2. రాజీవదలాక్ష(హ.) 3. చక్కనలో నా వెలి నుండులోను వెలియా వీక్షింప ధన్యంబగున్ (హ.) 4. ఎఱుఁగని వారికిఁ దోఁచవు (హ.); ఎఱిఁగిన వారికిఁదోఁతువు (తం.వా.)

క. జలచర మృగ [1]సుర మునినర, కులముల జన్మించి తీవు కుజనులఁ దెఱువన్
దెలిమిని సుజనుల మనుపను, దలపోయఁగ [2]రాదు నీ విధంబు లనంతా! 562

ఆ. [3]మంపు గొలిపి యోగమాయ నిద్రించిన
యో పరాత్మ భూమ! యోగిరాజ!
యే తెఱంగు లెన్ని [3]యెప్పు డెచ్చోట నీ
పేల లెవ్వఁ డెఱుఁగు నీశ్వరేశ! 563

సీ. అదిగాన నిజరూప మనరాదు కలవంటి దై బహువిధ దుఃఖ మై విహీన
సంజ్ఞాన మై యున్న జగము సత్సుఖ బోధ తనుఁడ వై తుది లేక [4]తనరు నీదు
మాయచేఁ బుట్టుచు మనుచు లే కుండుచు నున్న చందంబున నుండుచుండు
వొకఁడ వాత్ముఁడ వితరోపాధి శూన్యుండ వాద్యుండ వమృతుండ వక్షరుండ

ఆ. వద్వయుండవును స్వయంజ్యోతి వాపూర్ణుఁ
డవు పురాణపురుషుఁడవు నితాంత
సౌఖ్యనిధివి నిత్య సత్యమూర్తివి నిరం
జనుఁడ వీవు తలఁపఁ జనునె నిన్ను. 564

వ. దేవా! యిటువంటి నీవు జీవాత్మ స్వరూపకుండవును, సకలాత్మలకు నాత్మ యైన పరమాత్మ స్వరూపకుండవును నని యెవ్వ రెఱుంగుదురు, వారుగదా గురు వనియెడు దినకరుని వలనఁ బ్రాప్తం బైన యుపనిష దర్థజ్ఞానం బను సునేత్రం బునం జేసి, సంసార మిథ్యాసాగరంబుఁ దరించిన చందంబున నుండుదురు. రజ్జు వందు రజ్జు వని యెఱింగెడి యెఱుక లేకుండ న య్యెఱుంగమి నది సర్పరూపం బై తోఁచిన పిదప నెఱింగినవారి వలన రజ్జు వని [5]తెలియుచుండ, సర్పరూపంబు లేకుండు కైవడి, నాత్మ య ప్పరమాత్మ యని యెవ్వ రెఱుంగరు. వారి క య్యెఱు గమివలన సకల ప్రపంచంబు గలిగి, తోఁచు. ఆత్మ య ప్పరమాత్మ యని యెవ్వ రెఱుంగుదురు, వారి క య్యెఱుక వలన ప్రపంచంబు లేకుండు. అజ్ఞాన సంభావిత నామకంబు లైన సంసార బంధ మోక్షంబులు, జ్ఞానవిజ్ఞానంబుల లోనివి గావు. కావునఁ గమల మిత్రున కహోరాత్రంబులు లేని తెఱంగునఁ, బరిపూర్ణ జ్ఞానమూర్తి యగు నాత్మయందు నజ్ఞానంబు లేమిని బంధంబును, జ్ఞానంబు లేమిని మోక్షంబును లేదు. ఆత్మవైన నిన్ను దేహాదికం బని తలంచియు,

1. భూసురనర (హా.) "సురేష్వృషిష్వీశతథై వ నృష్వపి తిర్యక్షుయాదస్స్వపి" (14-20)
2. రావు (హా.) 3. మప్పు (హా.) 4. యెంతనిపోల్చనీ (హా.) 5. తనరుదీవు (హా.)
6. తెలుపుచుండ (హా.); రజ్జుపురజ్జువని యెఱుంగుచుండ (తం. వా.)

దేహాదికంబు నిన్నుఁగా దలంచియు, నాత్మ వెలి నుండు నంచు మూఢులు మూఢత్వంబున వెదకుచుందురు. వారి మూఢత్వంబు చెప్పనేల ? బుద్ధిమంతు లై పర తత్త్వంబుగాని జడంబును నిషేధింపుచున్న సత్పురుషులు తమతమ శరీరంబుల యందె నిన్నరయుచుందురు. అది గావున. 565

శా. దేవా ! నీ చరణప్రసాద కణలబ్ధిం గాక లేకున్న నొం
డే వెంటన్ జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్
నీవారై చనువారిలో నొకఁడ నై నిన్ గొల్చు భాగ్యంబు నా
కీవే [1]యిప్పటి జన్మ మందయిన నొం డెం దైన [2]నో యీశ్వరా ! 566

తరల. క్రతుశతంబునఁ బూర్ణకుక్షివి గాని నీ విటు క్రేపులున్
సుతులు నై చనుఁబాలుఁ ద్రావుచుఁ జొక్కి యాడుచుఁ గౌతుక
స్థితిఁ జరింపఁగఁ దల్లు లై విలసిల్లు గోవుల గోపికా
సతుల ధన్యత లెట్లు చెప్పఁగఁ జాలువాఁడఁ గృపానిధీ ! 567

క. పరిపూర్ణంబుఁ బురాణముఁ, బరమానందంబు నైన బ్రహ్మమె చెలికాఁ
డరు దరుదు నందఘోష, స్థిర జనముల భాగ్యరేఖ చింతింపంగన్. 568

సీ. ఏకాద శేంద్రియాధీశులు చంద్రాదు లేను ఫాలాక్షుండు నిట్టు గూడఁ
బదుమువ్వురము నెడపడక యింద్రియపాత్రముల నీ పదాంభోజముల మరంద
మమృతంబుగాఁ ద్రావి యమర నేకై కేంద్రియాభిమానుల మయ్యు నతికృతార్థ
భావుల మైతిమి పరఁగ సర్వేంద్రియ వ్యాప్తులు నీమీఁద వ్రాల్చి తిరుగు

తే. [3]గోప గోపికా జనముల గురు విశిష్ట
భాగ్యసంపదఁ దలపోసి ప్రస్తుతింప
నలవిగా దెవ్వరికి నైన నంబుజాక్ష !
భక్తవత్సల ! సర్వేశ ! పరమపురుష ! 569

శా. ఏలా బ్రహ్మపదంబు ? వేదములకున్ వీక్షింపఁగా రాని ని
న్నీ లోకంబున నీ వనాంతరమునం దీ మందలోఁ గృష్ణ యం
చాలాపాది సమస్తభావములు నీయందే [4]సమర్పించు నీ
వ్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే. 570

మ. నిను హింసించిన పూతనాదులకు మున్నీ మేటి సంకేత మి
చ్చిన నీకున్ బర దార పుత్ర గృహ గో స్త్రీ ప్రాణ దేహాదు లె
ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ లక్షింప నే మిచ్చెదో
యని సందేహము దోఁచుచున్నది ప్రపన్నానీక రక్షామణీ ! 571

1. యెప్పటి(హ.) 2.నున్నీశ్వరా(హ.) 3.గోపిగోపక జనముల(హ) 4.సమర్పించినీ[వ్రే]లం[దొ]క్కిన(హ)

క. దేహము కారాగేహము, మోహము నిగళంబు రాగ ముఖరములు రిపు
వ్యూహములు భక్తితో ని, న్నూహింపని యంత తడవు నో కమలాక్షా! 572

ఆ. ఆశ్రయించు జనుల కానందసందోహ
మీఁ దలంచి వివిధ హేలతోడ
నప్రపంచకుండ వయ్యుఁ బ్రపంచంబు
వెలయఁ జేయు దీవు విశ్వమూర్తి! 573

క. ఎఱిఁగినవార లెఱుంగుదు, రెఱుఁగను బహుభాష లేల యీశ్వర! నీ పెం
పెఱుఁగ మనో వాక్కులకును, గుఱిసేయం గొలఁది గాదు గుణరత్ననిధీ! 574

క. సర్వము నీవ యెఱుంగుదు, సర్వవిలోకనుఁడ వీవ జగదధిపతివిన్
[2]సర్వాపరాధు నన్నున్, సర్వేశ! యనుగ్రహించు చనియెద నింకన్. 575

క. జిష్ణు! నిశాట విపాటన!. వృష్ణికులాంభోజసూర్య! విప్రామర గో
వైష్ణవసాగర హిమకర!, కృష్ణా! పాషండ ధర్మ గృహదావాగ్నీ! 576

వ. దేవా! నీకుఁ గల్పపర్యంతంబు నమస్కరించెద. అని యి వ్విధంబున సంస్తుతించి, ముమ్మాటు వలగొని, పాదంబులపైఁ బడి వీడ్కొని, బ్రహ్మ తన నెలవునకుం జనియె. అతని మన్నించి, భగవంతుండైన హరి, తొల్లి చెడి తిరిగివచ్చిన వత్స బాలకులఁ గ్రమ్మఱం గైకొని, పులినంబుకడఁ జేర్చె. ఇట్లు. 577

క. క్రించుఁదనంబున విధి దము, వంచించినయేఁడు గోపవర నందను లొ
క్కించుక కాలంబుగ నీక్షించిరి రాజేంద్ర! బాలకృష్ణుని మాయన్. 578

ఆ. ఏ మహాత్ము మాయ నీ విశ్వమంతయు
మోహితాత్మక మయి మునిఁగియుండు
నట్టి విష్ణుమాయ నర్భకు లొక్కయేఁ
డెఱుఁగకుండి రనుట యేమి [4]దొడ్డు? 579

వ. అప్పుడు. 580

మ. చెలికాఁడా! యరుదెంచితే యిచటికిన్ సేమంబునన్ గ్రేపులున్
నెలవు ల్సేరె నరణ్యభూమివలనన్ నీ వచ్చునందాఁకఁ జ
ల్దులు వీ రించుక యెవ్వరున్ గుడువ రాలోకింపు ర మ్మించు నా
జలజాతుండు నగన్ భుజించి రచటన్ సంభాషలన్ డింభకుల్. 581

---

1. ఎఱిఁగిన వారి యెఱుంగమి, యెఱుఁగమె (తం. వా.); యెఱుఁగని వార మెఱింగియు నెఱుఁగని బహుభాష లేల (గ) 2. సర్వాపరాధి (హ) 3. కృష్ణా(తం) 4. వెఱఁగు (తం.వా)

వ. ఇట్లు బాలకులతోడఁ జల్ది గుడిచి, వారలకు నజగర చర్మంబుఁ జూపుచు వనంబున నుండి తిరిగి. 582

పంచచామరము. [1]ప్రసన్న పింఛమాలికా ప్రభా [2]విభాసి తాంగుఁడుం
బ్రసిద్ధ శృంగ వేణునాద పాశబద్ధ [3]లోకుఁడుం
బ్రసన్న గోపబాల గీత బాహువీర్యుఁ డయ్యు ను
ల్లసించి యేఁగె గోపకుల్ సెలంగి చూడ మందకున్. 583

వ. ఆ సమయంబున. 584

క. పెనుఁబాము దమ్ము మ్రింగిన, మన నందసుతుండు పాము మర్దించి మముం
మనిచె నరణ్యము లోపల, నని ఘోషించిరి కుమారు లా ఘోషములోన్. 585

వ. అనిన విని నరేంద్రుం డి ట్లనియె. 586

క. కని మనిచి యెత్తి పెంచిన, తనుజన్ములకంటె నందతనయుం డా ఘో
ష నివాసులకు మనోరంజనుఁ డె ట్లయ్యెను బుధేంద్ర ! చను నెఱిఁగింపన్. 587

వ. అనిన శుకుం డి ట్లనియె. 588

సీ. అఖిల జంతువులకు [4]నాత్మ వల్లభ మైన భంగి బిడ్డలు నిండ్లు పసిఁడి మొదలు
వస్తువు లెవ్వియు వల్లభంబులు గావు సకలాత్మకుం డైన జలజనేత్రుఁ
డఖిలజంతువులకు నాత్మ గావున ఘోషవాసుల కెల్లను వల్లభత్వ
[5]మున మిక్కి లొప్పెను మూఁడు లోకములకు హితము సేయఁగ జలజేక్షణుండు

ఆ. మాయతోడ మూర్తిమంతుఁ డై యొప్పారుఁ
గలఁ డతండు నిఖిల గణములందు
[6]భవతి ధాతు వెట్లు భావార్థ మై సర్వ
ధాతు గణమునందు దనరు నట్లు. 589

క. శ్రీపతి పద మను నావను, బ్రాపించి భవాబ్ధి వత్సపదముగ ధీరుల్
రూపించి దాఁటి చేరుదు, రాప త్పదరహితు లగుచు నమృతపదంబున్. 590

ఆ. అఘునిఁ జంపి కృష్ణుఁ డాప్తులుఁ దానును
చల్ది గుడిచి జలజసంభవునకుఁ
జిద్విలాస మైన చెలువుఁ జూపిన కథఁ
జదువ వినినఁ గోర్కె [7]సఫల మగును. 591

వ. అని చెప్పి మఱియు, వ్యాసనందనుం డి ట్లనియె. 592

---

1. ప్రసూన (తం. వా. క.) 2. విచిత్రితాంగుఁడున్ (తం. వా.) 3. లోలుఁడున్ (హ) 4. వల్లభుఁడైన (హ. తం. వా.); 5. మునను మిక్కిలియొప్పె (వా) 6. భవవిధాతవెట్లు భావార్థమై సత్వ (హ); సర్వేషామపి భూతానాం భావార్థో భవతి స్మృతః (14-57) 7. సంభవించు (తం.వా.)

## అధ్యాయము – ౧౫

క. రాగంబుల బలకృష్ణులు, పౌగండ వయస్కు లగుచుఁ [1]బశుపాల కళా
యోగంబున బృందావన, భాగంబునఁ గాచి రంతఁ బశువుల నధిపా! 593

వ. అ య్యెడఁ గృష్ణుం డొక్కనాఁడు రేపకడ లేచి, వేణువు పూరించి, బలభద్ర సహితుం డై, గోపకుమారులు దన్ను బహువారంబులు కై వారంబులు సేయ, మ్రోల నాలకదుపుల నిడికొని, నిరంతర ఫల కిసలయ [2]కుసుమంబును, గుసుమ మకరంద నిష్యంద పానానంద దిందిందిర కదంబంబును, గదంబాది నానా తరు లతా గుల్మ సంకులంబును, గులవిరోధ రహిత మృగ పక్షి భరితంబును, [3]భరిత రససరోరుహ పరిమళ మిళిత పవనంబును నైన వనంబుఁ గని, యందు వేడుకం గ్రీడింప నిశ్చయించి, వెన్నుం డన్న కి ట్లనియె. 594

శా. శాఖా పుష్ప ఫల ప్రభార నత లై చర్చించి యో దేవ! మా
శాఖిత్వంబు హరింపు మంచు శుకభాషన్ నీ కెఱింగింపుచున్
శాఖాహస్తములం బ్రసూన ఫలముల్ సక్కన్ సమర్పించుచున్
శాఖి శ్రేణులు నీ పదాబ్జముల కోజన్ మ్రొక్కెడిన్ జూచితే. 595

సీ. నిఖిలపావన మైన నీ కీర్తిఁ బాడుచు నీ తుమ్మెదలు వెంట నేఁగుదెంచె
నడవిలో గూఢుండ వైన యీశుఁడ వని మునరి కొల్వఁగ వచ్చె మునిగణంబు
నీలాంబరముతోడ నీవు జీమూతమ వని నీలకంఠంబు లాడఁ దొణఁగెఁ
బ్రియముతోఁ జూచు గోపికల చందంబున నినుఁ జూచె నదె హరిణీచయంబు

ఆ. నీవు విందవనుచు నిర్మల సూక్తులు
వలుకుచున్న విచటఁ బరభృతములు
నేఁడు విపినచరులు నీవు విచ్చేసిన
ధన్యు లైరి గాదె తలఁచి చూడ. 596

సీ. నీ పాదములు సోఁకి నేఁడు [4]వీరు తృణ పుంజంబుతో భూమి పుణ్య యయ్యె
నీ నఖంబులు తాఁకి నేఁడు నానాలతా తరుసంఘములు కృతార్థంబు లయ్యె
నీ కృపాదృష్టిచే నేఁడు నదీ శైల ఖగ మృగంబులు దివ్యకాంతిఁ జెందె
నీ పెన్నురము మోవ నేఁడు గోపాంగనా జనముల పుట్టువు సఫల మయ్యె

---

1. వటుబాలకళా (హ); పశుపాలకతా (తం. వా.) 2. కుసుమంబులును (హ. శా.); కుసుమంబులను (తం) 3. భరిత సరస్సరోరుహ (తం. వా.) 4. నీరుసుతృణ (హ)

ఆ. నని యరణ్యభూమి నంకించు పసులను
మిత్రజనులుఁ దాను మేపుచుండి
నలినలోచనుండు నదులందు గిరులందు
సంతసంబు మెఱయ సంచరించె. 597

వ. మఱియు, న య్యీశ్వరుండు. 598

సీ. ఒకచోట మత్తాళి యూథంబు ఝుమ్మని మ్రోయంగ ఝుమ్మని మ్రోయుచుండు
నొకచోటఁ గలహంసయూథంబుగూడి కేంకృతులు సేయంగఁ గేంకృతులు సేయు
నొకచోట మదకేకియూథంబు లాడంగ హస్తాబ్జములు త్రిప్పి యాడఁ దొణఁగు
నొకచోట వనగజయూథంబు నడవంగ నయముతో మెల్లన నడవఁ జొచ్చుఁ

ఆ. గ్రౌంచ చక్ర ముఖర ఖగము లొక్కొకచోటఁ
బలుక వానియట్ల పలుకుఁ గదిసి
పులుల సింహములను బొడగని యొకచోటఁ
బఱచు మృగములందుఁ [1]దఱచుఁ గూడి. 599

వ. మఱియును. 600

సీ. రా పూర్ణచంద్రిక! రా గౌతమీగంగ! రమ్ము భగీరథరాజ తనయ!
రా సుధాజలరాశి! రా మేఘమాలిక! రమ్ము చింతామణీ! రమ్ము సురభి!
రా మనోహారిణి! రా సర్వమంగళ! రా భారతీదేవి! రా ధరిత్రి!
రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి! రమ్ము మందాకిని! రా శుభాంగి!

ఆ. యనుచు మఱియుఁ గలుగు నాఖ్యలు గల గోవు
లడవిలోన దూర మందు మేయ
ఘన గభీరభాషఁ గడు నొప్పఁ జీరు నా
భీరజనులు బొగడఁ బెంపు నెగడ. 601

క. కాంతార [2]విహారణమ్ముల, శ్రాంతుం డై [3]గోపకాంక [4]శయుఁ డగు నన్నా
సంతుష్టిఁ బొందఁజేయు ని, రంతర కర చరణ మర్దనాదుల నధిపా! 602

క. పాడుచు నాడుచు [5]ముచ్చట, లాడుచు [6]నొండొరులఁ దాఁకు నాప్తులఁ గని బి
ట్టాడుచుఁ [7]జేతులు వ్రేయుచుఁ, గ్రీడింతురు నగుచు బలుఁడుఁ గృష్ణుఁడు
నొకచోఁ. 603

---

1. బఱచుఁగూడి (తం) 2. విహారమ్ముల (తం. వా.) 3. గోపికాంత (హ) 4. శయ నుండగుచున్ (హ) 5. మందట (తం. వా) 6. నొండొరునిఁదాక నాప్తుంగని (హ) 7. జేతల వ్రేయుచు (వా)

వ. ఇవ్విధంబున. 604

సీ. వేదాంతవీథుల విహరించు విద్వాంసుఁ డిల విహరించుఁ గాంతార వీథులందు
ఫణిరాజ శయ్యపైఁ బవళించు సుఖభోగి పల్లవశయ్యలఁ బవ్వళించు
గురుయోగి మానసగుహలఁ గ్రుమ్మరు మేటి గ్రుమ్మరు నద్రీంద్ర గుహలలోనఁ
గమలతోడఁ బెనంగి కడు దయ్యు చతురుఁ డాభీరజనులతోడఁ బెనఁగి డయ్యు

ఆ. నఖిలలోకమునకు నాశ్రయుం డగు ధీరుఁ
డలసి తరులనీడ నాశ్రయించు
యాగ భాగచయము లాహారించు మహాత్ముఁ
డడవిలోని ఫలము లాహారించు. 605

వ. ఆ సమయంబున. 606

సీ. అలసినచోఁ గొంద ఱతిమోదమున వీఁపు లెక్కించుకొని పోదు రేఁపు మెఱసి
సొలసి నిద్రించినచో నూరు తల్పంబు లిడుదురు కొందఱు హితవు గలిగి
చెమరించి యున్నచోఁ జిగురుటాకులఁ గొంద ఱొయ్యన విసరుదు రుత్సహించి
డ వ్వేఁగి నిలుచుచోఁ దడయక కొందఱు పదము లొత్తుదు రతిబాంధవమున

ఆ. గోపవరులు మఱియుఁ [1]గొందఱు ప్రియమున
మాధవునకుఁ బెక్కు మార్గములను
బనులు సేసి రెల్లభవములఁ జేసిన
పాపసంచయములు భస్మములుగ. 607

## —: గర్దభాకారుం డైన ధేనుకాసురుని వధ :—

వ. అ య్యవసరంబున శ్రీదామ నామధేయుం డైన గోపాలుండు రామకేశవులం జూచి యి ట్లనియె. 608

క. దూరంబునఁ దాలతరు, స్ఫారం బగు వనము గలదు పతితానుపత
ద్భూరి ఫలసహిత మది యే, ధీరులుఁ జొర వెఱతు రందు ధేనుకుఁ డుంటన్.

వ. ఆ ధేనుకాసురుండు మహాశూరుండును, ఖరాకారుండును నై, సమాన సత్వ సమేతు లైన జ్ఞాతులుం, దానును, మనుష్యులం బట్టి, భక్షింపుచుండు. అయ్యెడఁ బరిమళోపేతంబు లైన ఫలవ్రాతంబు లసంఖ్యాకంబులుగఁ గలవు. వినుండు. 610

క. ఫలగంధము నాసాపుట, ములవెంటన్ జొచ్చి చిత్తములఁ గొనిపోయెన్
ఫలములు [2]నమలింపుఁడు మము, బలియురకును మీకు దైత్య[3]బల మడ్డంబే. 611

1. ఁగొందఱు కొందఱు (హ) 2. తినిపింపుడు (క) 3. భటులడ్డంబే (తం. వా.)

వ. అని పలికిన చెలికాండ్రపలుకు లాదరించి, నగి, వారునుం, దాను నుత్తాలం బగు తాలవనంబునకుం జని యందు. 612

క. తత్తరమున బలభద్రుఁడు, తత్తాలానోకహములఁ దన భుజబలసం
పత్తిఁ గదల్చుచు గ్రక్కున, మత్తేభముభంగిఁ బండ్లు మహిపైఁ రాల్చెన్. 613

వ. అప్పుడు పండ్లురాలిన చప్పుడు చెవులకుఁ దెప్పర మైన, నదరిపడి, రిపుమర్దన కుతుకంబున గర్దభాసురుండు. 614

మ. పదవిక్షేపములన్ సవృక్ష ధరణీభాగంబు గంపింపఁగా
రదముల్ దీటుచుఁ గత్తిరించిన చెవుల్ రాజిల్ల వాలంబు భీ
తిద మై [1]తూలఁగఁ గావరంబున సముద్దీపించి గోపాలకుల్
బెదరన్ రాముని[2]ఱొమ్ముఁ దన్నె వెను కై భీరంబు తోరంబుగన్. 615

క. మఱియును దనుజుఁడు రామునిఁ, గఱవన్ గమకించి తెఱపి గానక యతనిన్
జుఱచుఱఁ జూచుచు శౌర్యము, పఱివోవఁగ [3]నంత నింతఁ బదములఁ దన్నెన్.

వ. అంత బలభద్రుండు రౌద్రాకారంబున గర్దభాసురు పదంబులు నాలుగు నొక్క కేల నంటంబట్టి, బెట్టు దట్టించి, త్రిప్పి, విగతజీవుం జేసి. 617

మ. ఒకతాళాగ్రము తాఁకవైవ నది [4]కంపోద్రిక్త మై త్రెళ్ళి వే
ఱొక తాళాగ్రముపైఁ బడ న్నదియు నత్యుగ్రాహతిన్ నిల్వ కొం
డొక తాళాగ్రముపైఁ బడన్ విఱిగి యి ట్లొండొంటిపైఁ దాళవృ
క్షకము ల్గూలెఁ బ్రచండమారుతము తాఁకన్ గూలు చందంబునన్. 618

ఉ. తంతువులందుఁ జేలము విధంబున నే పరమేశు మూర్తి యం
దింతయుఁ బుట్టు నట్టి జగదీశుఁ డనంతుఁడు దైత్యమాత్రు ని
ట్లంతము సేయు టెంతపని యద్భుతమే విను మంతలోన వాఁ
డంతముఁ బొందు టెల్లఁ గని యాతనిబంధులు గర్దభంబు లై. 619

క. బలకృష్ణులపైఁ గదిసిన, బలియుర ఖరదైత్య [5]భటుల పశ్చిమపాదం
బులు పట్టి తాళశిఖరం, బుల నెగురఁగవైచి [6]వారు పోరిగొని రధిపా! 620

వ. అప్పుడు. 621

క. ఆలమున నోలిఁ గూలిన, తాలద్రుమఖండ దైత్య తనుఖండములన్
గీలిత యై ధర జలధర, మాలావృత మైన మింటిమాడ్కిని వెలిఁగెన్. 622

---

1. తూల ఖరారవంబున(తం) 2. వెన్నుతన్నె(హ) 3. నింత నంత(తం.వా) 4. కంపోద్రేకమై (హ) 5. నఖుల (చ) 6. వారిఁ బోరిగొనిరి (హ)

క. ధేనుకవనమున నమలిరి, మానవు లా వేళఁ దాటి[1] మానులఫలముల్
ధేనువులు మెసఁగెఁ గసవులు, ధేనుకహార భక్త కామధేనువు గలుగన్. 623

వ. ఆ సమయంబున సురలు విరులవానలు గురియించి, దుందుభులు మొరయించిరి. అంతఁ గమలలోచనుండు, గోపజన జేగీయమాన వర్తనుం డై, యన్నయుఁ దానును గోపగణంబులం బిల్చుకొని, మందకుం జనియె. అ య్యెడ. 624

ఉ. గో పదరేణు సంకలిత కుంతలబద్ధ మయూరపింఛు ను
ద్దీపిత మందహాస శుభదృష్టి లస న్ముఖు [2]వన్య పుష్ప మా
లా పరిపూర్ణు గోపజన లాలిత వేణురవాభిరాము నా
గోపకుమారునిం గనిరి గోపసతుల్ నయనోత్సవంబుగన్. 625

ఆ. కమలనయను వదనకమల మరందంబుఁ
దవిలి నయన షట్పదముల వలనఁ
ద్రాగి దిన వియోగతాపంబు మానిరి
గోపకాంత లెల్లఁ గోర్కు లలర. 626

—: గోపాలకృష్ణుండు కాళియమర్దనము గావించుట :—

వ. ఇట్లు గోపిక లాదరంబునం జూడ, వ్రీడా హాస వినయంబులం జూచుచుం, గ్రీడా గరిష్ఠుం డైన ప్రౌఢ గోష్ఠంబుఁ బ్రవేశించె. అంత రోహిణీయశోదలు కుఱ్ఱలవలని మచ్చికలు పిచ్చలింప, నిచ్చకు వచ్చిన ట్లయ్యే వేళల దీవించిరి. వారును మజ్జనోన్మర్దనాదు లంగీకరించి, సురభి కుసుమగంధంబులు గైకొని, రుచిర చేలంబులు గట్టికొని, రసోపపన్నంబు లైన యన్నంబులు గుడిచి, తృప్తు లై, మంజుల శయ్యల సుప్తు లై యుండిరి. అందు. 625

సీ. ఒకనాఁడు బలభద్రుఁ డొక్కఁడు రాకుండ గోపాలకులుఁ దానుఁ గూడి కృష్ణు
డడవికిఁ జని యెండ నా గోవులును గోపకులు నీరువట్టునఁ గుంది [3]డస్సి
కాళిందిలో విషకలిత తోయము ద్రావి ప్రాణానిలంబులు వాసి పడిన
యోగీశ్వరుండును యోగివంద్యుఁడుఁ గృష్ణుఁ డీక్షణామృతధార లెలమిఁ గురిసి

ఆ. పసుల గోపకులను బ్రతికించె మరలంగ
వారుఁ దముకుఁ గృష్ణువలన మరల
బ్రతుకు గలిగె నంచు భావించి సంతుష్ట
మానసములఁ జనిరి మానవేంద్ర! 628

1. మ్రాఁకుల (తం. వా) 2. నవ్యపుష్ప (హ) 3. యుండఁ (హ)

## అధ్యాయము - ౧౬

క. కాళియఫణి దూషిత యగు, కాళిందిఁ బవిత్రఁ జేయఁగా నుత్సుకుఁ డై
కాళిందీ జలవర్ణుఁడు, కాళియు వెడలంగ నడిచెఁ గౌరవముఖ్యా! 629

వ. అనిన న య్యగాధజలంబువలన మాధవుం డెట్టి నేర్పున, సర్పంబుదర్పంబు మాపి వెడలించె? అందుఁ బెద్దకాలం బా వ్యాళం బేల యుండె? ఎఱింగింపుము. 630

క. తొట్టులఁ [1]గాచెడి నందుని, కుట్టని చరితామృతంబు గొనకొని చెవులం
జుట్టంగఁ దనివి గల్గునె, వెట్టుల కైనను దలంప విప్రవరేణ్యా! 631

వ. అనిన శుకుం డి ట్లనియె. 632

సీ. మానవేశ్వర! యొక్కమడుఁగు కాళిందిలోఁ గల దది యెప్పుడు కాళియాహి
విషవహ్ని శిఖలచే [2]వేఁగుచుండును మీఁదఁ బఱతెంచు నంతన పక్షు లైనఁ
బడి మ్రగ్గు నందుఁ దద్భంగ శీకరయుక్త పవనంబు సోఁకినఁ బ్రాణు లెవ్వి
యైన నప్పుడె చచ్చు నట్టి యా మడుఁగులో నుదకంబు పొంగుచు నుడుకుచుండఁ

తే. జూచి వెఱఁగంది కుజనుల స్రుక్కఁ జేయ
నవతరించిన బలువీరుఁ డాగ్రహించి
భుజగ విషవహ్ని దోషంబు వొలియఁ జేసి
సుజలఁ గావించి యా నదిఁ జూతు ననుచు. 631

వ. కృతనిశ్చయుం డై, పూర్వజన్మ భాగ్యంబునం దన చరణ సంస్పర్శనంబునకు యోగ్యం బై, తత్సమీపంబున విశాల విటపిశాఖా కదంబంబుతో నున్న కదంబ భూజంబు నెక్కి. 633

మ. కటి[3]చేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు బంధించి దో
స్తట సంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబు గీలించి త
త్కుటశాఖాగ్రముమీఁద నుండి యుఱికెన్ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభగుభ ధ్వానం బనూనంబుగన్. 635

ఉ. భూరి మహాప్రతాప పరిపూర్ణ భయంకర గోపబాల కం
ఠీరవ పాతవేగ వికటీకృత దుర్విష భీషణోర్మి సం
పూరిత మై వడిం గలఁగి పొంగి ధనుశ్శతమాత్ర భాగ వి
స్తారము వొంగె న మ్మడుఁగు తప్త పయఃకణ బుద్బుదోగ్ర మై. 636

---

1. గాచిన (తం. వా.) 2. వేఁచు (తం. వా. క. గ) 3. సూత్రంబు (హ)

శా. పాఠీనాకృతిఁ దోయరాశి నడుమన్ భాసిల్లి మున్నాథుఁ డై
కాఠిన్యక్రియ నీఁదు నేర్పు దనకుం గల్మిన్ భుజంగేంద్ర హృ
త్పీఠాగ్రంబున రోషవహ్ని లెగయన్ భీమంబుగా నీఁదె [1]ను
ల్లోఠోత్తుంగ తరంగ మై మడుఁగు దుర్లోక్యంబుగా బాహులన్. 637

వ. ఆ సమయంబున. 638

శా. బాలుం డొక్కఁడు వీఁడు నా మడుఁగు విభ్రాంతోచ్చల త్కీర్ణ క
ల్లోలం బై కలఁగం జరించె నిట నే లోనుంటఁ జూడండు మత్
కీలాభీల విశాల దుస్సహ విషాగ్ని జ్వాలలన్ భస్మ మై
కూలం జేసెద నేఁడు లోకులకు నా కోపంబు దీపింపఁగన్. 639

వ: అని తలంచి విజృంభించి. 640

ఉ. ఘోర విషానల ప్రభలు గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్య వి
స్ఫారుఁడు కాళియోరగుఁడు పాఱి వడిన్ గఱచెన్ బయోధరా
కారుఁ బయోవిహారు భయకంప విదూరు మహాగభీరు నా
భీరకుమారు వీరు నవ పీత శుభాంబరధారు ధీరునిన్. 641

క. కఱచి పిఱుతివక మఱియును, వెఱవక నిజ వదనజనిత విషదహన శిఖల్
మెఱయ తన నిడుద [2]యొడలను, నెఱి హరిఁ బెనఁగొనియె భుజగ నివహాపతి
వడిన్. 642

వ. [3]ఇట్లు భోగిభోగ పరివేష్టితుం డై, చేష్టలు లేనివాని తెఱంగునఁ గానంబడుచున్న ప్రాణసఖునిం గనుంగొని, తత్ప్రభావంబు లెఱుంగక, తత్సమర్పిత ధన [4]దార మనోరథ మానసులు గావున. 643

చ. అదె మన కృష్ణునిం గఱచె నంతటఁ బోక భుజంగమంబు దు
ర్మదమున మేనఁ జుట్టుకొని మానక యున్నది యింక నేమి సే
యుద మెట పొత్త మే పురుషు లోపుదు రీ యహి నడ్డపెట్ట నె
య్యది సదుపాయమంచుఁ బడి రార్తరవంబులఁ దూలి గోపకుల్. 644

క. గోప కుమారక శేఖరు, నేపున సర్పంబు గఱచు టీక్షించి వగన్
మేపులకుఁ దొలఁగి గోవులు, వాపోవుచు నుండె వృషభ వత్సంబులతోన్ 645

క. భూతములు వణఁకె నుల్కా, పాతంబులు మింటఁ గానఁబడె ఘోషములో
వ్రేతలకును గోపక సం, ఘాతములకు నదరెఁ [5]గిడు కన్ను లిలేశా ! 646

---

1. ఉల్లుంఠోత్తుంగ (హ) 2 యొడలిని (వా) 3. ఇట్లు భోగపరివేష్టితుం డై (హ)
4. ధాన్య (క. చ. త.) 5. గడకన్ను (హ); వలకడకన్ను (వా)

వ. అంత నా దుర్నిమిత్తంబులు పొడగని, బెగడు గదిరిన చిత్తంబుల నుత్తలపడుచు, మంద న్నున్న నందయశోదాదు లయిన గోప గోపికాజనంబులు హరి దళసరి యెఱుంగక, గోపాల గోగణ పరివృతుం డైన కృష్ణుం డెక్కడ నైనం జిక్కనోపు నని పొక్కుచుం, బెక్కువ లైన మక్కువలు చెక్కులొత్త, నొక్కపెట్ట బాల వృద్ధసమేతు లై, మహా ఘోషంబున నా ఘోషంబు వెలువడి. • 647

క. వారి బ్భంగి నెఱుంగని, వా రై హరిఁ జూడఁ బోవ వడిగొని నగుచున్
వారింపఁ డయ్యె రాముఁడు, వారిని హరి లా వెఱుంగు వాఁ డయ్యు నృపా!

వ. అంతలోన వారునుం గాంతారమార్గంబు వట్టి పోవుచు, నెడనెడ గోప గోష్పదంబుల సందుల నింత నంత నక్కడక్కడ యవాంకుశ హల కమల కులిశ చక్ర చాప కేతనాది రేఖాలంకృతంబు లయి, మార్గాభరణంబు లైన హరి చరణంబుల జాడఁ గని, చొప్పు దప్పక చని, దుర్ఘటం బైన యమునాతటంబు చేరి, వారిమధ్యంబున నితరుల కసాధ్యం బైన సర్పంబుచేతఁ గాటువడి, దర్పంబు చూపక, భోగిభోగ పరివృతుం డైన శ్రీకృష్ణునిం గని, కృష్ణ కృష్ణేతి విలాపంబులఁ దాపంబులఁ బొందుచుఁ, [1]దత్కాలంబునం బ్రతికూలం బయ్యె ననుచు దైవంబుఁ దిట్టు గోపికలుం, గోపకులుం గలసి, మేఁత లుడిగి, ఱెప్ప లిడక, కృష్ణునిం దప్పక చూచుచు, నొరలుచున్న గోవులం గనిరి. అందుఁ గొందఱు యశోదం బట్టుకొని, విలపింపుచుఁ, గృష్ణు నుద్దేశించి, యి ట్లనిరి. 649

సీ. ఎదురువచ్చినఁ జాల నెదురుగాఁ జనుదెంతు వెదురువచ్చిన నేఁ డదేల రావు
చూచినఁ గృపతోడఁ జూచుచుందువు నీవు చూచినఁ గనువిచ్చి చూడవేల
డాసిన నలిలేక డాయంగ వత్తువు డాసిన నేటికి డాయ విచటఁ
జీరిన 'నో' యని చెలరేఁగి పలుకుదు విది యేమి చీరిన నెఱుఁగకుంట

ఆ. తలఁపు నేయు నంతఁ దలపోయు చుందువు
తలఁపు నేయ నేఁడు తలఁప వకట!
యనుచు భక్తివివశు లాడెడి కైవడి
వ్రేత లెల్ల నాడి వివశ లైరి. 550

వ. ఆ సమయంబున నందయశోదాదులు హరిం జూచి, యధికం బైన శోకంబున ని ట్లనిరి. 551

క. విషకుచయుగ యగు రక్కసి, విషకుచ దుగ్ధంబు ద్రావి విషవిజయుఁడ వై
విషరుహలోచన! యద్భుత, విషయుం డగు నీకు సర్పవిష మెక్కెఁ గదా. 652

1. తత్కాలంబున (క. చ. ట. వ.)

క. కట్టా! క్రూరభుజంగము, కట్టలుకన్ నిన్నుఁ గఱవఁ గంపించితివో
తిట్టితివో పాపపువిధిఁ, బట్టీ! మముఁ దలఁచి కావఁ బలికించితివో. 653

క. పన్నగము మమ్ముఁ గఱవక, ని న్నేటికిఁ గఱచెఁ గుఱ్ఱ! నెమ్మిగ గలిగి నీ
వున్నను మము రక్షింతువు, నిన్నుం రక్షింప నేము నేరము తండ్రీ! 654

ఉ. చూడ వదేమి గారవపుఁ జూపుల మమ్ము సఖాళితోడ మా
టాడ వదేమి [1]నర్మముగ నందెలు పాదములందు మ్రోయ నేఁ
డాడ వదేమి నర్తనము లవ్వల మ్రోలను గోపికావళిన్
గూడ వదేమి నవ్వులకు గోపకుమారవరేణ్య! చెప్పుమా. 655

సీ. శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందఁగ నెలమి భాషించువా రెవ్వ రింకఁ
గరచరణాదుల కలిమి ధన్యత నొంద నెగిరి మైఁ బ్రాఁకువా రెవ్వ రింక
నయనయుగ్మంబు లున్నతిఁ గృతార్థములుగా నవ్వులు చూపువా రెవ్వ రింక
జిహ్వలు గౌరవ శ్రీఁ జేరఁ బాటల నొడఁ [2]బలికించు వా రెవ్వ రింకఁ

ఆ. తండ్రి! నీవు సర్పదష్టుండ వై యున్న
నిచట మాకుఁ బ్రతుకు లెవ్వ రింక
మరగి పాయలేము మాకు నీతోడిద
లోక మీవు లేని లోక మేల? 656

వ. అని యొండొరులం బట్టుకొని విలపించుచుం, గృష్ణునితోడన మడుఁగుఁ జొత్తము, చత్త మనుచుఁ, గృష్ణ విరహ వేదనానల భార తప్తులై, మడుఁగుఁ జొరఁజూచు చున్న వారలం గనుంగొని, భగవంతుం డైన బలభద్రుండు, మీరు మీఁ దెఱుంగరు. ధైర్యంబు విడుచుట కార్యంబుగాదు. సహించి చూడుఁడు. అనుచు వారిని వారించె. 657

క. తనుఁ గూర్చి యి వ్విధంబున, వనితలు బిడ్డలును దారు వాపోయెడి ఘో
షనివాసులఁ గని కృష్ణుఁడు, మనుజునిక్రియ నొక ముహూర్తమాత్రము జరిపెన్.

శా. అంతన్ గృష్ణుఁడు మేను పెంప భుజగుం డావృత్తులం బాసి తా
సంత ప్తాయత భోగుఁ డై కఱచుటల్ చాలించి నిట్టూర్పుతో
శ్రాంతుం డై తల యెత్తి దుర్విషము నాసావీథులం గ్రమ్మ దు
శ్చింతన్ దిక్కులు సూచుచున్ దలఁగి నిల్చెన్ ధూమకాష్ఠాకృతిన్. 659

---

1. మర్మముగ (పా) 2. బలికించు (తం. కా)

చ. [1]వెఱమఱ లేని మేటి బలువీరుఁడు కృష్ణకుమారుఁ డొక్కచేఁ
జఱచి ఖగేంద్రు చందమునఁ జక్కన దౌడలు వట్టి కన్నులన్
జొఱచొఱ దుర్విషానలము జొబ్బిలుచుండఁగ నెత్తి లీలతోఁ
జిఱజిఱఁ ద్రిప్పి వైచెఁ బరిశేషిత దర్పముఁ గ్రూరసర్పమున్. 660

వ. ఇట్లు వేగంబున నాగంబు వీచి వైచి, జగజెట్టి యైన నందునిపట్టి రెట్టించిన సంభ్రమంబున. 661

సీ. ఘన యమునానదీ కల్లోల ఘోషంబు సరస మృదంగ ఘోషంబు గాఁగ
సాధు బృందావన చర చంచరీక గానంబు గాయక సుగానంబు గాఁగఁ
గలహంస సారస కమనీయ మంజు శబ్దంబులు తాళశబ్దములు గాఁగఁ
దివినుండి వీక్షించు దివిజ గంధర్వాది జనులు సభాసీన జనులు గాఁగఁ

తే. బద్మరాగాది రత్న ప్రభాసమాన
మహిత కాళియఫణి ఫణామంటపమున
నళినలోచన విఖ్యాత నర్తకుండు
నిత్య నైపుణ్యమునఁ బేర్చి నృత్యమాడె. 662

శా. కుక్షిన్ లోకము లున్న గౌరవముతో గోపాకృతి న్నున్న యా
రక్షోహంత వడిన్ మహాఫణి ఫణారంగ ప్రదేశంబు పై
నక్షీణోద్ధతి నాడుఁ బాడుఁ జెలఁగున్ హాసంబుతోడం బద
ప్రక్షేపంబులు సేయుఁ గేళిగతులన్ బ్రాహ్మైక శేషంబుగన్. 663

క. ఘనతర సుషిరానంద, స్వనములతో సిద్ధ సాధ్య చారణ గంధ
ర్వ నిలింప ముని సతులు చ, య్యనఁ గురిసిరి విరులవాన లాడుచు హరిపై. 664

వ. ఇట్లు దుష్టజన దండధరావతారుం డయిన హరి, వడి గలిగిన పడగలమీఁదఁ దాండవంబు సలుప, బెండువడి, యొండొండ ముఖంబుల రక్తమాంసంబు లుమియుచుఁ, గన్నుల విషంబు గ్రక్కుచు, నుక్కు చెడి,చిక్కి, దిక్కులు చూచుచుం, గంఠగత ప్రాణుం డై, ఫణీంద్రుండు దన మనంబున. 665

ఉ. వేలుపు లైన లావుచెడి వేదనఁ బొందుచు నా విషానల
జ్వాలలు సోఁకి నంతటనె చత్తురు నేఁ డిది యేమి చోద్య మా
భీల విషాగ్ని హేతి [2]చయ పీడకు నోర్చియుఁ గ్రమ్మఱంగ నీ
బాలుఁడు మత్ఫణాశతము భగ్నముగా వెసఁ ద్రొక్కి యాడెడిన్. 666

1. వెఱమెర (తం. వా.) 2. భయ (హ)

క. ఈతఁడు సర్వ చరాచర, [1]భూతేశుండైన పరమపురుషుఁడు సేవా
ప్రీతుఁడు శ్రీహరి యగు నని, భీతిఁ శరణంబు నొందె బి ట్టలసి నృపా! 667

వ. ఇట్లు క్రూరంబు లయిన హరి చరణప్రహారంబులం [2]బడగ విడిసి, నొచ్చి, చచ్చిన క్రియం బడియున్న పతిం జూచి, నాగకాంతలు దురంతం బయిన చింతా భరంబున నివ్వటిల్లెడు నెవ్వగల నొల్లంబోయి, పల్లటిల్లిన యుల్లంబుల. 668

—: కాళియుని భార్య లైన నాగకాంతలు స్వామిని స్తోత్రముచేయుట :—

మ. కచబంధంబులు వీడ భూషణము లాకంపింపఁ గాఁదీవియల్
కుచయుగ్మంబుల వ్రేఁగునం గదలఁ బై కొంగుల్ [3]వడిఁ జాఱఁగాఁ
బ్రచురభ్రాంతిఁ గలంగి ముందట రుద ద్బాలావలిం గొంచు స్రు
క్కుచు భక్తిం జని కాంచి రా గుణమణిఁ గోపాల చూడామణిఁ. 669

వ. కని దండప్రణామంబు లాచరించి, నిటలతట ఘటిత కరకమల లై యి ట్లనిరి.

క. క్రూరాత్ముల దండింపఁగ, ధారుణిపై నవతరించి తనరెడి నీ కీ
క్రూరాత్ముని దండించుట, క్రూరత్వము గాదు సాధుగుణము గుణాఢ్యా! 671

క. పగవారి సుతులయందును, బగ యించుక లేక సమతఁ బరఁగెడి నీకుఁ
బగ గలదె ఖలుల నడఁచుట, జగ దవనము కొఱకుఁ గాక జగదాధారా! 672

క. నిగ్రహమె మము విషాస్యుల, నుగ్రుల శిక్షించు టెల్ల నూహింప మహా
నుగ్రహము గాక మా కీ, నిగ్రహము విషాస్యభావ నిర్గతిఁ జేసెఁ. 673

ఉ. ఎట్టితపంబు చేసెనొకొ యెట్టిసుకర్మము లాచరించెనో
యెట్టి నిజంబు బల్కెనొకొ యీ ఫణి పూర్వభవంబునందు ము
న్నెట్టి మహానుభావులకు నెన్నఁడుఁ జేరువ గాని నీవు నేఁ
డిట్టి వినోదలీలఁ దల లెక్కి నటించెద వీ ఫణీంద్రు పై. 674

మ. బహుకాలంబు తపంబు సేసి వ్రతముల్ పాటించి కామించి నీ
మహనీ యోజ్జ్వల పాదరేణు కణ సంస్ప ర్శాధికారంబు శ్రీ
మహిళారత్నము తొల్లి కాంచె నిదె నేమం బేమియుఁ లేక యీ
యహి నీ పాదయుగాహతిఁ బడసె నేఁ డత్యద్భుతం బీశ్వరా! 675

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము
న్నొల్లరు యోగసిద్ధి మఱి యొండు భవంబుల నొంద నీని నీ
సల్లలి తాంఘ్రిరేణువుల సంగతి నొందిన ధన్యు లెప్పుడుఁ. 676

1. భూతేశుఁడు పరమయోగి (హ) 2. బెడసి (తం. వా.) 3. విడిఁ (హ); వడిఁ జీరఁగా (తం)

క. ఘన [1]సంసా రాహాతు లగు, జను లాకాంక్షింపఁ గడు నశక్యం బగు శో
భనము సమక్షంబున నహి, గనియెం దామసుఁడు దోషకలితుం డయ్యున్. 677

వ. దేవా! సకల పురుషాంతర్యామి రూపత్వంబువలనఁ బరమపురుషుండ వయ్యు, నపరిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండ వయ్యు, నాకాశాది భూత సమాశ్రయత్వంబువలన భూతవాసుండ వయ్యు, భూతమయత్వంబువలన భూతశబ్ద వాచ్యుండ వయ్యుఁ, గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండ వయ్యు, జ్ఞాన విజ్ఞాన పరిపూర్ణత్వంబు గలిగి, నిర్గుణత్వ నిర్వికారత్వంబులవలన బ్రహ్మంబ వయ్యుఁ, బ్రకృతి ప్రవర్తకత్వంబువలన ననంతశక్తి వై, యప్రాకృతుండ వయ్యును, గాలచక్ర ప్రవర్తకత్వంబునఁ గాలుఁడ వయ్యుఁ, గాలశక్తిసమాశ్రయత్వంబువలనం గాలనాథుండవయ్యుఁ, జిన్మయత్వంబువలన మహాత్మకుండ వయ్యు, సృష్టి జీవన సంహారాది దర్శిత్వంబువలనం గాలావయవసాక్షి వయ్యు, నొప్పు నీకు నమస్కరించెదము. మఱియును. 678

సీ. విశ్వంబు నీవ యై విశ్వంబుఁ జూచుచు విశ్వంబుఁ జేయుచు విశ్వమునకు
హేతువ వై పంచభూతమాత్రేంద్రియములకు మనః ప్రాణ బుద్ధి చిత్త
ముల కెల్ల నాత్మ వై మొనసి గుణంబుల నావృత మగుచు నిజాంశభూత
మగు నాత్మచయమున కనుభూతి సేయుచు మ్రూఁ డహంకృతులచే [2]ముసుఁగువడక

తే. నెఱి ననంతుండ వై దర్శనీయ[3]రుచివి
కాక సూక్ష్ముఁడ వై నిర్వికారమహిమఁ
దనరి కూటస్థుఁ డన సమస్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ! 679

వ. మఱియుఁగలండు, లేఁడు,సర్వంబు నెఱుంగు,నించుక యెఱుంగు,నించుకబద్ధుండు, విముక్తుం, డొకం, డనేకుఁడు నను నివి మొదలుగాఁ గల వాదంబులు మాయవలన ననురోధింపుదురు. కావున నానా వాదానురోధకుండ వయ్యు, నభిధానాభిధేయ శక్తి భేదంబు వలన బహుప్రభావ ప్రతీతుండ వయ్యుఁ, జతురాది రూపంబుల వలనఁ బ్రమాణ [4]రూపకుండ వయ్యు, నిరపేక్ష జ్ఞానంబు కలిమిం గవి వయ్యు, వేదమయ విశ్వాసత్వంబువలన శాస్త్రయోని వయ్యు, సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ రూపంబులవలనఁ జతుర్మూర్తి వయ్యు, భక్తజనపాలకుండవయ్యు, నంతఃకరణ ప్రకాశత్వంబు గలిగి, నీవ సేవకజన ఫలప్రదానంబు కొఱకు గుణాచ్ఛాదకుండ వయ్యుఁ, జిత్తాది వర్తనంబులం గానందగిన గుణంబులకు సాక్షి వై

1. సంసారాహితులగు (హ) సంసారచక్రే భ్రమత శ్శరీరిణః (16-38) 2. ముసుగుబడక (క.ట.ద.) 3. రుచివికార (హ) 4. మూలకుండ (క. చ. ట. త. జ. ద.)

యొరుల కెఱుంగరామి నగోచరుండ వయ్యుఁ, దర్కింపరాని పెంపువలన
నవ్యాహత విహారుండ వయ్యు, సకల కార్యహేతువ వయ్యు, నంతఃకరణ ప్రవర్త
కత్వంబువలన హృషీకేశుండ వయ్యును, సాధన వశంబు గాని యాత్మారామ
త్వంబువలన ముని వయ్యు, [1]నధిక సూక్ష్మమతుల నెఱుంగుచు, నెందుఁ
జెందక, నీవు విశ్వంబు కాకయు, విశ్వంబు నీవ యయ్యును, విశ్వ భావాభావ
సందర్శనంబు సేయుచు, విద్యావిద్యలకు హేతువైన నీకుం బ్రణామంబు లాచ
రించెదము. అవధరింపుము. 680

క. లోక జని స్థితి లయములు, గైకొని చేయుదువు త్రిగుణ కలితుఁడవై కా
లాకారమున నమోఘు, శ్రీకలితుఁడ వగుచు నిచ్చ నెందక యీశా! 681

క. నీ శాంతలుఁగాని తనువు, లీశా! యీ మూఢజాతు లీ సజ్జాతుల్
నీ శాంతతనువు లందుఁ, బ్రకాశింతువు ధర్మహితముఁగా సుజనులలోఁ. 682

ఉ. నేరము లెన్న నెక్కుడివి నేము దలంచు తలంపులందు లో
నేరుపు లున్నవే సుతులనేరమిఁ దండ్రులు ద్రోచిపుచ్చరే
నేరము సేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే
నేరమి గల్గు మద్విభుని నేఁ డిటు గావఁగదే కృపానిధీ! 683

శా. బాలుం డీతఁడు మంచివాఁ డనుచుఁ జెప్పన్ రాము క్రూరుండు దు
శ్శీలుం [2]డా నవునైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్య దు
ష్టాలంకారముఁ బొంద నోడెద మనాథాలాప మాలింపవే
చాలున్ నీ [3]పదతాడనంబు పతిభిక్షన్ బెట్టి రక్షింపవే. 684

ఉ. ఆకుల మయ్యె భోగ మిదె యాఁదల లన్నియు వ్రస్సెఁ, బ్రాణముల్
రాకలఁ బోకలం బొలిసె రాయిడి పెట్టక మా నిజేశుపై
నీ కరుణాకటాక్షములు నిల్పఁగదే తగ నో సమస్త లో
కైకశరణ్య! యో యభయకారణ! యో కమలామనోహరా! 685

ఆ. మమ్ముఁ బెండ్లిసేయు మా ప్రాణ[4]వల్లభు
ప్రాణ మిచ్చి కావు భక్తవరద!
నీవు సేయు పెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాఁటి పెండ్లి పెండ్లి గాదు. 686

---

1. స్థూలసూక్ష్మగతుల నెఱుంగుచు (తం. వా.) 2. డాటయు (హ.) 3. తాండవంబు (తం. వా.) 4. యుభయ (ట. ద. డ.) 5. వల్లభుఁ బ్రాణమిచ్చి (హ.)

ఇంద్రవజ్రము. నీ యాన ! యెవ్వారిని నిగ్రహింపం
డా యుగ్ర పాపాకృతి నందఁ డింకన్
నీ యాజ్ఞలో నుండెడు నేఁటనుండిన్
మా యీశు ప్రాణంబులు మాకు నీవే. 687

వ. అని యిట్లు తమ పెనిమిటి బ్రతుకుఁ గోరెడి భుజగసతులయందు శరణాగత వత్సలుం డైన పుండరీకాక్షుండు కరుణించి, చరణఘట్టనంబు చాలించి, తలంగిన నెట్టకేలకుఁ బ్రాణేంద్రియంబుల మరలం బడసి, చదిసి నలఁగిన తలలు సవరించు కొని, వగపు గదుర భుజగపతి జలజనయనునునికి నంజలి చేసి, మెల్లన ని ట్లనియె.

చ. మలకలు మా ప్రచారములు మా ముఖముల్ విషవహ్ని ఘోరముల్
ఖలులము రోషజాతులము గర్వుల మే మొకమంచివార మే
నళినదళాక్ష ! ప్రాణులకు నైజగుణంబులు మానవచ్చునే
వెలయవె మా వికారములు వింతలె మే లొనరించి తీశ్వరా ! 689

సీ. వివిధ భావాకార వీర్య బీజాశయ [1]జన యోనియుతముగా జగము లెల్ల
నీవ చేసితి మున్ను నే మా జగంబులో సహజ కోపనులము సర్పములము
దుర్వార మైన నీ ఘోరంపు మాయ నే మెటిఁగి దాఁటెడు పని కెంతవార
మంతకుఁ గారణ మఖిలేశ్వరుండవు సర్వజ్ఞుఁడవు నీవు జలజనయన !

తే. మనిచె దేనియు మన్నించి మనుపు నన్ను
నిగ్రహించెద వేనియు నిగ్రహింపు
ఇంక సర్వేశ ! మా యిమ్ము లెందుఁ గలవు
చిత్తమం దున్న క్రమమునఁ జేయఁ దగును. 690

క. నా పుణ్య మేమిచెప్పను, నీ పాదరజంబుఁ గంటి నే సనకాదుల్
నీ పాదరజముఁ గోరుదు, రే షదమం దున్న నైన నిఁక మేలు హరీ ! 691

వ. అని విన్నవించినఁ, గాళియు పలుకుల విన నవధరించి, కారుణ్యామానసుం డైన సర్వేశ్వరుం డతని కి ట్లనియె. 692

క. గోవర్గముతో మనుజులు, ద్రావుదు రీ మడుఁగునీరు తగ దిం దుండన్
నీవును నీ బాంధవులును, నీ వనితలు సుతులు జనుఁడు నేఁ డంబుధికిన్. 693

క. నిను నే శాసించిన కథ, మనమునఁ జింతించి రేపు మాపును గీర్తిం
చిన మనుజులు మీ భయమును, విను మెన్నఁడుఁ బొందరెందు విషవిజయముతోన్.

---

1. జవయోని (తం. వా.);

చ. ఇది మొదలెవ్వరైన నరు లీ యమునా [1]నళినీ హ్రదంబులో
వదలక తోఁగి నన్ను నుపవాసముతోడఁ దలంచి కొల్చుచుం
గదలక దేవతాదులకుఁ గా జలతర్పణ మాచరించినన్
సదమలచిత్తులై దురితసంఘము బాయుదు రా క్షణంబునన్. 695

ఆ. గరుడభీతి రమణక ద్వీప మొల్లకీ
మడుపుఁ జొచ్చి తీవు మత్పదాబ్జ
లాంఛనములు నీ తలను నుంటఁ జూచి యా
పక్షిరాజు నిన్నుఁ బట్టఁ డింక. 696

వ. అని యిట్లు విచిత్రవిహారుం డైన గోపాలకృష్ణకుమారుం డానతిచ్చిన, నియ్యకొని, చయ్యన న య్యహీంద్రుండు, తొయ్యలులుం, దానును నెయ్యంబునన య్యీశ్వరునకు నవ్య దివ్యాంబ రాభరణ రత్నమాలి కానులేపనంబులు సమర్పించి, తేఁటి తండంబులకు దండ యగు నీలోత్పలంబుల దండ యిచ్చి, పుత్ర మిత్ర కళత్రసమేతుం డై, బహువారంబులు కై వారంబులు చేసి, వలగొని, మ్రొక్కి, లేచి, వీడ్కొని, రత్నాకర ద్వీపంబునకుం జనియె. ఇట్లు. 697

క. వారిజలోచనుఁ డెవ్వరు, వారింపఁగ లేని ఫణి నివాసత్వంబున్
వారించిన యమున సుధా, వారిం బోలుపారె నెల్లవారికిఁ బ్రియ మై. 698

అధ్యాయము - ౧౭

వ. అనిన విని, మునీంద్రా! యేమి కారణంబునఁ గాళియుండు భుజగనివాసం బైన రమణక ద్వీపంబు విడిచె ? అతం డొక్కరుండును గరుడున కేమి యెగ్గుఁ దలంచె? అని నరవరుం డడిగిన, మునివరుం డి ట్లనియె. 699

సీ. సర్పభీరువు లైన జనులెల్ల నెలనెల సరస భక్ష్యములు వృక్షముల మొదల
సర్పంబులకుఁ బెట్ట సర్పంబులును మున్ను సర్పాంతకుఁడు దమ్ముఁ జంపకుండ
బ్రతిమాసమును దమ భాగభక్ష్యంబు లాపక్షిరాజున కిచ్చి బ్రతుకుచుండ
విషవీర్య దుర్మదావిష్టుఁ డై కాళియుం డహికులాంతకుని పా లపహరించి

తే. యాక తన [2]పాలి భాగంబు లెల్లఁ దినిన
విని ఖగేంద్రుఁడు కోపించి వీనితలలు
చీరి చెండాడి భోగంబు చించి వైచి
ప్రాణములఁ బాపి వచ్చెదఁ బట్టి యనుచు. 700

---

1. తటినీ (తం. వా.) 2. బలిభాగమెల్ల (తం. వా.)

క. అక్షీణ కనకసన్నిభ, పక్ష యుగోద్భూత ఘోరపవమాన మహా
విక్షేప కంపితానే, క క్షోణిధరేంద్రుఁ డగుచు గరుడుఁడు వచ్చెన్. 701

ఉ. వచ్చిన సర్పవైరిఁ గని వ్రాలక లేచి మహాఫణావళుల్
విచ్చి దృగంచలంబుల నవీన విషాగ్నికణంబు లొల్కఁగా
నుచ్చల దుగ్రజిహ్వలు మహోద్ధతిఁ ద్రిప్పుచు నూర్పులందుఁ గా
ర్చి చ్చెగయంగఁ దాఁకఁ గఱచెన్ విహగేంద్రు నహీంద్రుఁ డుగ్రతన్. 702

క. కఱచిన భుజగము రదములు, విఱుగఁగ వదనముల విషము వెడలఁగ శిరముల్
పఱియలుగ నడిచె గరుడుఁడు, తఱిమి కనకరుచులు గలుగు తన [1]వలఱెక్కన్.

వ. ఇట్లహికులారాతిచేత వ్రేటువడి, వెఱచి, పఱతెంచి, కాళియుం డీ గభీరం బైన మడుఁగుఁ జొచ్చె. మఱియు నొక్క విశేషంబు గలదు. 704

సీ. మున్ను సౌభరి యను ముని యా హ్రదంబునఁ దపముసేయుచు నుండ ధరణిలోన
నాఁకలి గొని పన్నగాంతకుఁ డొకనాఁడు చనుదెంచి యందలి జలచరముల
నొడిసి భక్షించిన నున్న మీనము లెల్ల ఖిన్నంబు లై వగఁ గ్రిస్సి యున్నఁ
జూచి యా మునిరాజు శోకించి కోపించి గరుడుఁడు నేఁ డాదిగాఁగ నిందుఁ

తే. జొచ్చి మీనంబులను మ్రింగఁ జూచె నేనిఁ
జచ్చు గావుత మని యుగ్రశాప మిచ్చెఁ
గాళియుం డొక్కఁ డా శాపకథ నెఱుంగు
నితర భుజగంబు లెవ్వియు నెఱుఁగ వధిప ! 705

వ. అది కారణంబునఁ గాళియుం డా మడుఁగుఁ జొచ్చిన, గో మనుజ రక్షణార్థంబు కృష్ణుం డతని వెడలించె. ఇట్లు దివ్య గంధాంబర సువర్ణ మణిగణ మాలికాలం కృతుం డై, మడుఁగు వెడలి వచ్చిన మాధవుం గని, ప్రాణలాభంబులం బొందిన యింద్రియంబులం బోలె, యశోదా రోహిణీ సమేత లైన గోపికలును, నంద సునందాదు లైన గోపకులును మూర్ఛలం బాసి, తేఱి, తెప్పిఱిలి, లేచి, పరమా నందంబులం బొందిరి. బలభద్రుండు తమ్ముని నాలింగనంబు చేసె. అప్పుడు.706

క. ఱంకెలు వైచె వృషభము ల, హంకారముతోడ లేఁగ లట్టిట్టుఱికెం
బొంకముల నొప్పె ధేనువు, లంకురితము లయ్యెఁ దరువు లా హరిరాకన్.

క. నీ సుతుఁ డహిచే విడివడె, నీ సురుచిర భాగ్యమహిమ నిశ్చల మనుచున్
భూసురులు సతులుఁ దారును, భాసుర వచనముల నందుఁ బలికి రిలేశా ! 708

1. డాఱెక్కన్ (తం. వా.), "పక్షేణసవ్యేన హిరణ్యరోచిషా" (17-7)

శా. ని న్నా యుగ్ర భుజంగమంబు గఱవన్ నీ వాపదం బొందుచు
న్న న్నేమంటి తనూజ! యోడవు గదా నా కూన! నా తండ్రి! రా
వన్నా! యంచు శిరంబు మూర్కొని నిజాంకాగ్రంబుపై నిల్పుచున్
గన్నీ రొల్కఁ గవుంగిలించెఁ దనయున్ గారాముతోఁ దల్లి దాన్. 709

వ. ఇట్లు పరమసంతోషు లై, ఘోషజను లా రేయిఁ గాళిందీతటంబున నాఁకలి నీరు వట్టుల డస్సి, క్రుస్సి, గోవులుం దారు నుండ, నగణ్యం బగు న య్యరణ్యంబున నొక్క దవానలంబు పుట్టి, చుట్టుకొని, నడురేయి నిద్రితం బైన వ్రజంబుమీఁదఁ గదిసిన, నదిరిపడి, లేచి, దందహ్యమాన దేహు లైన సకలజనులును మాయామనుజ బాలకుం డైన హరికి శరణాగతు లై, యి ట్లనిరి.

—: గో గోప గోపికాసంఘమును గార్చిచ్చు చుట్టుకొనుట :—

మ. అదె వచ్చెన్ దవవహ్ని ధూమకణ కీలాభీల దుర్వార మై
యిదె కప్పెన్ మము నెల్లవారి నిటమీఁ దేలాగు రక్షింపు నీ
పదపద్మంబులు గాని యొం డెఱుఁగ మో పద్మాక్ష! యో కృష్ణ! మ్రొ
క్కెద మో రామ! మహాపరాక్రమ! దవాగ్నిన్ వేగ వారింపవే. 711

క. నీ పాదంబులు నమ్మిన, నాపద లెక్కడివి జనుల కత్యుగ్ర మహో
దీపిత తాపజ్వలనము, పైపడకుండెడు విధంబు భావింపఁగదే. 712

వ. అని ఘోషించు ఘోషజనులం గరుణించి, య వ్వద్మలోచనుం డగు ననంతుం డనంతశక్తియుతుం డై, గహనంబు నిండిన దావదహనంబు పానంబుచేసిన, విజయ గానంబు దశదిశల నిగిడె.

అధ్యాయము—౨౦

అంతఁ గృష్ణుండు గోగణ జ్ఞాతి సమేతుం డై, మందయానంబున మందకుం జనియె. ఇట్లు రామకేశవులు గోపాల వేషంబులఁ గ్రీడించు సమయంబున. 713

—: గ్రీష్మర్తు వర్ణనము :—

సీ. దినము లంతంతకు దీర్ఘంబు[1] లై తోఁచె దిననాథుఁ డుత్తరదిశఁ జరించె
నాఁడు నాఁటికి నెండ [2]నవ్య మై ఘన మయ్యె వెచ్చని గాడ్పులు విసరఁ జొచ్చె
మేదినీరేణువుల్ మింట సంకుల మయ్యె నేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ
బానీయశాలలఁ బథికసంఘము నిల్చెఁ జప్పరంబుల భోగిచయము డాఁగెఁ

1. లయ్యెండె (హా.) 2. నవక మై (క. ట. వ.)

ఆ. దరులు [1]లతలుఁ గుసుమదళములతో వాడె
మిథునకోటికి రతి మెండు దోఁచె
నఖిలజంతు భీష్మ మైన గ్రీష్మము రాకఁ
[2]గిలి యడవులందుఁ గేలి సలిపె. 714

ఆ. వాఁడి రుచులు గలుగువాని వేఁడిమి గ్రీష్మ
కాలమందు జగము గలయఁబడియె
బ్రహ్మ జనులకొఱకు బ్రహ్మాండఘటమున
నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ. 715

వ. ఇట్లు భీలం బైన నిదాఘకాలంబు వర్తింప, బృందావనంబు రామగోవింద మందిరం బైన కతంబున, నిదాఘకాల లక్షణంబులం బాసి, నిరంతర గిరినిపతిత నిర్ఝరశీకరపరంపరాభాసిత పల్లవిత కుసుమిత తరు లతం బయ్యును, దరు లతా కుసుమపరిమళమిళిత మృదులపవనం బయ్యును, పవనచలిత కమలకహ్లార సరోవర మహాగభీర నదీప్రహ్రాదం బయ్యును, నదీ ప్రహ్రాద కల్లోల కంకణ ప్రభూత పంకం బయ్యును, బంకసంజనిత హరితాయమాన తృణనికుంజం బయ్యును, జన మనోరంజనం బైన వసంతకాల లక్షణంబులు గలిగి, లలిత మృగ పక్షి శోభితం బై, యొప్పుచుండె. మఱియు నందు. 716

క. పికముల కోలాహలమును, శుకసంఘము కలకలంబు సుభగ మయూర
ప్రకరము కేకారవ మళి, నికరము రొదయును జెలంగె నెఱి న య్యడవిన్. 717

క. ఆతత యమునాసరసీ, జాత తరంగాభిషిక్త జలరుహ గంధో
పేతానిల మడఁచె నిదా, ఘాతత దావాగ్నిపీడ న వ్వన[3]మలరన్. 718

వ. ఇట్లామని కందువ తెఱంగు గల్గి, సుందరం బైన బృందావనంబునకు బలకృష్ణులు గోవుల రొప్పికొని చని, గోవులుం దారును నొండొరులతో నగుచుఁ, దెగడుచుఁ, జెలంగుచుఁ, దలంగుచుఁ, జిఱజిఱం దిరుగుచుఁ, దరులసందుల నుఱుకుచు, దాగుఁరు మూఁత లాడుచు, గీతంబులు పాడుచు, వేణునాదంబులు ఘటియింపుచు, నటియింపుచు, గతులుదప్పిన క్రియ నొఱగుచుఁ గుప్ప లుఱుకుచుఁ, జప్పట్లు వెట్టుచుఁ, గందుకంబులఁ దట్టుచు, నుప్పరం బెగసి, [4]దర్దురంబులచందంబున దాఁటుచు, నామలక బిల్వాది ఫలంబులం మీటుచుఁ, గుట విటపంబులు గదల్చుచు, మృగంబుల నదల్చుచుఁ, బెరల రేఁపుచు, [5]మధుమక్షికలఁ జోపుచుఁ, దేనియలు ద్రావుచు,

---

1. తరులు కుసుమచయము (హా.) 2. కలిగి యడవులందు (హా.) 3. మందున్ (తం.వా.)
4. మర్కటంబుల (త.) 5. మక్షికముల (హా.)

సొమ్మసిలంబోవుచు, గురు శిష్య కల్పనంబులం బనులుసేయుచుఁ, గాకపక్షధరులై, ముష్టియుద్ధంబుల డాయుచుఁ, బన్నిదంబులు చఱచుచు, బులుఁగుల భంగి నఱచుచు, బహురూపంబులఁ బన్నుచు, నెగిరి తన్నుచు, సేవ్యసేవక మిత్రామిత్ర భావంబులు వహించుచు, నుత్సహించుచు, మఱియు ననేకవిధంబులఁ గ్రీడించిరి. అందు. 719

క. మా పాలికి బలకృష్ణులు, భూపాలకు లంచు నెగిరి బొబ్బ లిడుచు నా
గోపాలురు మోతురు ప్రమ, దాపాదకులగుచు వల్లి కాందోళికలన్. 720

క. గోపకు లందఱు నాడుచు, దీపింపఁగ రామ వాసుదేవుల వెనుకన్
బైపడి పాఠక గాయక, రూపంబులఁ బొగడుదురు నిరూఢాత్మకులై. 721

క. ప్రీతిన్ గోపకు లందఱు, గీతంబులు వాడఁ దరుల క్రిందను నగుచున్
జేతులు త్రిప్పుచు వెడవెడఁ, జాతర[1]లాడును యశోద పాపం డడవిన్. 722

మ. జలజాక్షుండును రాముఁడున్ నటనముల్ సల్పంగ గోపాలమూ
ర్తులతో వారలఁ గొల్చి నిర్జరులు సంతోషించి వేణుస్వనం
బులు గావించుచుఁ గొమ్ము లూఁదుచు శిరంబుల్ ద్రిప్పుచున్ బాడుచున్
వలనొప్పన్ వినుతించి రప్పుడు నటుల్ వర్ణించు చందంబునన్. 723

వ. ఇట్లు రామకృష్ణులు నదనదీ తీరంబులఁ, గొలంకుల సమీపంబుల, గిరుల చేరువల, సెలయేఱుల చెంతల,మడువుల కడలఁ,బొదరు నీడలఁ,బసిమిగల కసవుజొంపంబులఁ బసులను మేపుచుండం, బ్రలంబుం డను రక్కసుం డుక్కుమిగిలి, గోపాలరూపంబున వచ్చి, వారల హింససేయం దలంచుచుండ, న య్యఖిల దర్శనుం డగు సుదర్శనధరుం డెఱింగియు నెఱుఁగని తెఱంగున. 724

—: బలభద్రుండు ప్రలంబాసురుని వధించుట :—

క. ఆ రాముని సహజన్ముఁడు, రా రమ్మని వానిఁ జీరి రాకన్ బోకన్
గారాము చేసి మెల్లన, బోరామి యొనర్చెఁ బిదపఁ బొరిగొను కొఱకున్. 725

వ. ఇట్లు ప్రలంబునితోఁ జెలిమిసేయుచుఁ, గృష్ణుండు గోపాలకులకు నిట్లనియె.

ఆ. మనకుఁ బ్రొద్దువోదు మన మిందఱము రెండు
గములవార మగుచుఁ గందుకముల
శిలల గుఱులు చేసి చేరి క్రీడింతము
రండు వలయు జయపరాజయములు. 727

1. లాడఁగ (వా.)

వ. అని యిట్లు పలికి, తానును బలభద్రుండును, బెన్నుద్దు లై, యితర వల్లవు లెల్ల నుద్దించుకొని చిట్టుద్దు లై వచ్చిన సమయంబున విభజించికొని, రెండుగములవా రై, మార్గంబులందుఁ దృణ దారు శిలా కల్పితం బగు గుఱు లొడ్డి, కందుక శిలాది ప్రక్షేపణంబుల, లక్ష్యంబులు దాఁక వైచి, జయ పరాజయ నిర్ణయం బులు గైకొని, వాహ్య వాహక లక్షణంబులఁ జేతలను నిర్జితులు చేతుల వహించి, క్రీడించుచు, బలరామునికి వాని చందంబు రహస్యంబున నెఱింగించి, పసుల వెల్బుచు, భాండీరకం బను వటంబుఁ జేరిరి. ఆ క్రీడయందుఁ బిదపఁ గృష్ణుని శ్రీ నామనామధేయుం డైన గోపకుఁడు వహించె. భద్రసేనుండు వృషభు నెక్కించుకొనియె. బలభద్రుండు ప్రలంబు నారోహించె. అపుడు. 728

మ. వనజాక్షున్ బలిమిన్ బలాఢ్యుఁడు తృణావర్తుండు మున్ మింటికిన్
గొనిపోఁ జాలక చిక్కె వాఁ డతని నాకున్ మోవరా దంచు నా
దనుజారిం గొనిపోఁ దలంపక వడిన్ దైత్యేశుఁ డయ్యాటలోఁ
గొనిపోయెన్ [2]గుటిదాఁటి రాము నఖిలక్రూరక్షయోద్దామునిన్. 729

వ. ఇట్లు క్రీడాకల్పిత వాహనుం డయిన ప్రలంబుండు బలభద్రునిం గొనిపోవుచు.

మ. గురుశైలేంద్రసమాన భారుఁ డగు నా గోపాలకున్ మోవలే
క రయోద్రేకము మాని దైత్యుఁడు నరాకారంబు సాలించి భీ
కర దైత్యాకృతి నేఁగె హేమ కటకాకల్పంబుతో రాముతో
మురు వొప్పంగఁ దటిల్లతేందుయుత జీమూతంబు చందంబునన్. 731

ఉ. మోసములేక వాని వెనుమూఁపున నుండుచు నా హలాయుధుం
డా సమయంబునం గనియె హాటకరత్న కిరీట కుండలో
ద్భాసిత మస్తకున్ భ్రుకుటి భాసుర దారుణనేత్రు నుగ్రదం
ష్ట్రాసహితుం బ్రలంబు నురుశౌర్యవిలంబు మదావలంబునిన్. 732

వ. కని నక్తంచరుం డని యించుక శంకించి వెఱవక. 733

క. కడువడిఁ దను బెనఁగొని, వడిఁ జనియెడు దనుజు శిరము వ్రయ్య హలధరుం డడరి పటు చటులతర మగు, పిడికిట వెస విసరి పొడిచె బిఱుసున నలుకన్. 734

క. హలధరు బలు పిడికిటిహతిఁ, దల పగిలిన రుధిరజలము తనువివరములం
దొలఁక మొఱ యిడుచు దనుజుఁడు, బలరిపు పవినిహత నగము పగిదిం బడియెన్.

1. పసులంబిల్చుచు (హ.) 2. గిరి (హ.) 3. వెసగొనిచని, యెడుదనుజుని శిరము పగల వెగరి (హ.) నిరీక్ష్య తద్వపు రల మంబరేచరన్....రు షాహన చ్ఛిరసి దృఢేన ముష్టినా (18-28)

మత్తకోకిల. మేలు మేలు గదయ్య! రాముఁడు మేటిరక్కసు నొక్కనిన్
నేలఁ గూలిచె నొక్కపోటున నేఁడు విస్మయ మంచు గో
పాలకుల్ కని చచ్చి వచ్చిన భ్రాతఁ గన్న విధంబునన్
జాల దీవెన లిచ్చి రాముని [1]సంస్తుతించిరి వేడుకన్. 736

క. బలవంతుఁ డగు ప్రలంబుఁడు, బలు ముష్టిన్ నిహతుఁ డైన బ్రతికితి మనుచున్
బలసూదనాది దివిజులు, బలుపైఁ గుసుమములవానఁ బరఁగించి రొగిన్. 738

అధ్యాయము - ౧౯

—: శ్రీకృష్ణుండు దావాగ్ని మ్రింగి గోపక గోసంఘమును గాపాడుట :—

వ. ఇట్లు గోపకులు క్రీడింప, గోవు లంతంతఁ గాంతారంబున వింతకసవులు మెసవుచు, మేఁతవడి నొం డడవికి దూరంబు చని, యందు దవదహన పవన సంస్పర్శంబు సైరింపక, కంపించి దప్పి నొప్పుసెడి ఘోషించిన. 738

శా. ఆ గోపాలకు లందఱుం బసుల కుయ్యాలించి కౌమార కే
ళీ గాఢత్వము మాని గోఖుర రదాళిచ్ఛిన్న ఘాసంబుతో
బాగై యున్న పథంబునం జని దవాపన్నంబు గాకుండ వే
వేగన్ గోగణమున్ మరల్చి రటవీ వీథిన్ జవం బొప్పఁగన్. 739

క. జలధర గభీరరవమున, నళినదళాక్షుండు దమ్ము నామాంకములన్
బిలిచిన విని ప్రతిఘోషణములు చేయుచు పసులు దిరిగె ముదమున నధిపా!

వ. అంత న వ్వనంబున దైవయోగంబునఁ గార్చిచ్చు పుట్టి, బిట్టు విసరెడి కరువలి వలన మిన్నుముట్ట మిట్టిపడి గట్టు చెట్టనక దరికొని పట్టి కాలుచుఁ జుట్టుకొని పఱవంగని, వల్లటిల్లిన యుల్లంబుల వల్లవు లెల్లఁ దల్లడిల్లి, సబలుం డైన హరికి మృత్యుభీతుల రీతిం జక్క మ్రొక్కి యి ట్లనిరి. 741

క. అభ్రంకష ధూమాయుత, విభ్రాంత మహో స్ఫులింగ విస రోగ్ర శిఖా
విభ్రష్ట దగ్ధలోకా, దభ్రం బై వచ్చెఁ జూడు దవశిఖి కృష్ణా! 742

శా. నీ చుట్టాలకు నాపదల్ గలుగునే నే మెల్ల నీ వార మ
న్యాచారంబు లెఱుంగ మీశుఁడవు మా కాఖిల దావాగ్ని నేఁ
డే చందంబున నింక దాఁటుదుము మ మ్మీక్షించి రక్షింప వ
న్నా! చంద్రాక్ష! విపన్నులన్ శిఖివితాన చ్ఛన్నులన్ ఖిన్నులన్. 743

వ. అని మఱియును. 744

---

1. సత్కరించిరి (హ.)

ఉ. బంధుజనంబుచేత నిటు ప్రార్థితుఁ డై హరి విశ్వరూపుఁ డో
బంధువులార ! మీ నయనపంకజముల్ ముకుళింపుఁ డగ్ని నీ
సంధి నడంతు నే ననినఁ జక్కన వారలు నట్ల సేయుడున్
బంధుర దావపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్. 745

వ. ఇట్లు నిజ యోగవైభవంబున దావదహనంబు పానంబు చేసి, నిమిషమాత్రంబున గోపకుల నందఱను భాండీరక వటసమీపంబునకుం దెచ్చి విడిచిన, వారును వికసిత నయనకమలు లై, కృష్ణుని యోగమాయా ప్రభావంబున నెరగలిచిచ్చు ప్రగ్గెనని, [1]యగ్గించుచుఁ దమ మనంబులందు. 746

క. కార్చిచ్చార్చు పటుత్వము, నేర్చునె నరుఁ డొకఁడు శౌరి నేఁ డిదె కార్చి
చ్చార్చి మనల రక్షింపఁగ, నేర్చె నితం డజుఁడొ హరియొ నిటలాక్షుండో. 747

వ. అని వితర్కించిరి. అంతఁ గృష్ణుండు సాయాహ్నసమయంబున రామసహితుండై వంశనాళంబు పూరించుచు, గోపజేగీయమానుం డై, గోష్ఠంబుఁ బ్రవేశించె. అప్పుడు. 746

క. కమలాక్షు నొద్ద నుండని, నిమిషము యుగశతము గాఁగ నెగడిన గోప
ప్రమదలు సంభ్రమమున నా, కమలాక్షునిఁ జూచి ముదముఁ గనిరి మహీశా !

వ. ఆ సమయంబున గోపకు లిండ్లకడ నున్న వృద్ధ కాంతాజనంబులకు రామకృష్ణుల చిత్రచరిత్రంబులు చెప్పిన విని, వారు వారినిఁ గార్యార్థు లై వచ్చిన వియచ్చర వరు లని తలంచిరి. అంత. 750

## అధ్యాయము - ౨౦

## —: వర్షర్తు వర్ణనము :—

సీ. పూర్వవాయువులు ప్రభూతంబు లై వీచెఁ బడమట నింద్రచాపంబు దోఁచె
పరివేషయుక్త మై భానుమండల మొప్పె మెఱుము లుత్తరదిశ మెఱవఁదొడఁగె
దక్షిణగాము లై తనరె మేఘంబులు జలచరానీకంబు సంతసించెఁ
జాతకంబుల పిపాసలు కడపలఁ జేరెఁ గాంతారవహ్నుల గర్వ మడఁగె

ఆ. నిజ కరాళివలన నీరజబంధుండు
దొల్లి పుచ్చుకొన్న తోయ మెల్ల
మరల నిచ్చుచుండె మహి కర్షకానంద
కంద మైన వాన కందు వందు. 751

1. యెఱింగించుచు (హ.)

క. వర్షాకాల భుజంగుఁడు, హర్షముతో నిడిన నవ నఖాంకము లని యు
త్కర్షింప భూమి సతిపై, కర్షక హాలరేఖ లమరె గహనాంతములన్. 752

క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, పొలసినఁ బులకించు భూమి పులకము లనఁగా
మొలచి తలలెత్తి నిక్కుచు, సలలితగతి జాలువాఱె సస్యము లధిపా! 753

వ. మఱియుం, జటుల పవనచలితంబు లై పన్ని, మిన్ను దన్ని, లెక్కలకు మిక్కిలి
యై, ఱెక్కలు గల నీలగిరుల సిరుల మీఱి, కాఱుకొని తెఱపి పడక, నిబిడంబు
లై, శిశిరకిరణ తరణి మండలంబుల చొప్పు దప్పించి, విప్పు కలిగి, చదలు గప్పిన
నీలమేఘంబులును, మేఘవిముక్తంబు లై జలదసమయ విటుండు సరసగతి
ధరణిసతి యురమ్మున దర్పించి, నేర్పున సమర్పించు కర్పూర ఖండంబుల వడు
వునఁ బుడమిం బడు కరకలును, గరకానుగతంబు లై యసిత భోగిభోగంబుల
బాగున, నీలమణి మాలికావిశేషంబుల విధంబున నెడపడక పడు సలిలధారలును,
ధారాధర విగళిత విమల సలిలంబులం దోఁగు మదజలాభిషిక్త మాతంగంబుల
సొబగున నుండు కొండలును, గొండల తుదలనుండి గండశైలంబుల పైఁ బడి
వికీర్యమాణంబు లగు గిరినిర్ఝరంబుల శీకరంబులును, శీకరపరంపరలఁ [1]జొదు
గులు మదుగులు గొనఁ బిదపిద నగుచుఁ జిదుకు చిదుకు మను రొంపులును,
రొంపులు గ్రొచ్చి క్రచ్చఱ నుచ్చలితంబు లై పఱచు వఱదలును, వఱదలవలన
మెదల్చి కదలి పాఱెడి యేఱులును, నేఱులవెంట గఱులు ద్రిప్పుచు గములు
గొని క్రొన్నీటి కెదురునడచు మీనంబులును, మీననయనల మేనుల మెఱుంగు
సొంపు పెంపు సైరింపక కంపించి, సురిఁగి తిరిగి చని యెడికరణి మేఘమధ్యంబులోఁ
బొలసి, మలసి, నిలువక మరలిచను గ్రొమ్మెఱుంగులును, మెఱుంగులపగిది మగు
వలు పురుషులం దగిలి నిలువ రని జనుల కెఱుంగ నలువ మొఱయిడిన తెఱం
గున మొరయు నుఱుములును, నుఱుముల కులికిపడక కికురుపొడుచుచు
బింఛెంబులు కొంచెంబులు సేయక, విప్పి దెప్పరంబుగ రొప్పుచు నర్తనంబులు
సేయు మయూరంబులును, మయూర ఘోషంబులు భీషణంబు లై చెవులకు
సోఁక ననూనంబు లైన మానంబుల నాసలుచెడి, యొండొరులకుం గ్రిందుపడి
క్రందుకొను విరహిజనులును, జనులకు రేపు మాపు నిరూపింపరాక మాలతీ
కుసుమవిసర వికసన విదితావసానంబు లగు దుర్దినంబులును, దినావసాన సమయం
బున మినుకు మినుకు మని మెఱచుచుం దిరుగు ఖద్యోతంబులును, ఖద్యోత
సందర్శనంబు గోరుచు నుడుగక విడువక కురియు జడిం బడి, వలిగొని వడంకుచు
నశనయత్నంబుల వర్జించి, ఖర్జూర జంబూఫల భక్షణంబుల దేహసంరక్షణంబు

1. చొదుకులు మదుకులు (తం. వా.)

లాచరించు వనచరులును, వనచరానందకారిణు లయి వారరమణుల రుచి ననవరత భుజగసమేత లగు కేతకులును, గేతకీ కదంబయూథికా కుటజ కుసుమ పరిమళ మిళితంబు లగు విపినమార్గంబులును, మార్గనిరోధంబు లగుచుం బెరిఁగి రసికంబు లై పసరుడాలు గలుగుచు [1]హరి న్మణి కిరణ పుంజంబుల భంగి రంజిల్లి తొంగలించుచు, జొంపంబులు గొనిన కసవులును, గసవులు మెసవి మిసమిస తనువులు మెఱయ, వలుఁద పొదుఁగుల బరువునఁ గదలక నిలిచి, నెమ రమర నిడు ధేనువులును గలిగి, ధేనువ్రజంబు కై వడి పయఃకణ మనోహరం బై, హార కరంబు భంగి పరిపూర్ణ సారంగ భాసురం బై, సురగిరి చెలువున [2]హరి శరాసన విభీషణం బై, విభీషణ హృదయంబు పోలికెఁ బ్రకటిత హరిశబ్ద వైభవం బై, భవపూజనంబు చందంబున నింద్రగోపాది విభవజనకం బై, జనకయాగంబు భాతి సీతాప్రకర ణాలంకృతం బై, కృతయుగంబు సొంపున బహు వర్షంబు నై వర్షాగమంబు వచ్చె. అందు. 754

క. వాడక వ్రాలక తెవులులఁ, గూడక తగ నల్లగెఱలు కొని నవకము లై
చూడఁగ భద్రము లగుచున్, పీడెన్ సస్యంబు లిడుమ వీడెం బ్రజకున్. 755

క. జీవనము చాలఁ గలిగియుఁ, గావరమున మిట్టిపడని ఘనునిక్రియ నదీ
జీవనములు సొర జలనిధి, ప్రావృట్కాలమున డిందుపడియుండె నృపా! 756

శా. ఆ వర్షాగమమందు గోవుల నరణ్యాంతంబులన్ మేపుచున్
గోవిందుండు ప్రలంబ వైరియుతుఁ డై గోపాలవర్గంబుతోఁ
బ్రావీణ్యంబునఁ గందమూల ఫలముల్ భక్షింపుచున్ మంజుల
గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్ది గుడిచెన్ గాసారతీరంబులన్. 757

వ. ఆ సమయంబున.

సీ. విశ్వమోహన మైన వేణునినాదంబు సరస గంభీర గర్జనము గాఁగ
మహనీయ నిర్మల మందహాసద్యుతి లలిత సౌదామినీ లతిక గాఁగఁ
దలచుట్టు బాగునఁ దనరు పింఛపుదండ శైలభేదను శరాసనము గాఁగఁ
గరుణా కటాక్షవీక్షణ సుధావర్షంబు సలిలధారా ప్రవర్షంబు గాఁగ

తే. జాడ నేతెంచు గోపాలజన మునీంద్ర
చాతకంబుల దురవస్థఁ జక్కఁజేసి
కృష్ణమేఘంబు బహు[3]తర కీర్తి నొప్పె
విమల బృందావ నాకాశవీథియందు. 759

---

1. పద్మరాగ (హ) 2. హార (హ) 8. రత (హ)

క. గోవుల వృషవత్సంబుల, వావిరిఁ బూజించి పిదప వర్షాకాల
శ్రీవనితను బూజించెను, శ్రీవల్లభుఁ డయ్యె గోపశేఖరుఁ డధిపా! 780

వ. ఇట్లు కృష్ణుండు విహిత విహారంబుల వర్షాకాలంబుఁ బుచ్చె నంత. 761

—: శ ర దృ తు వ ర్ణ న ము :—

క. జొంపములు గొనియె వనములు, రొంపు లిగిరె నెమలిగముల రొద లుడిగె నదుల్
పెంపులకుఁ బాసె నుఱుముల, శంపల సంపదలు మానె శారదవేళన్. 762

వ. మఱియు, జీవనంబుల విడిచి, విమల జ్ఞానవశంబున ముక్తు లగు పురుషరత్నంబుల చెన్నునఁ జెన్నువదలి, మిన్నువిడిచి, వాయువశంబు లై, వెల్లివిరిసి చను మేఘంబులును, మేఘపటల రహితంబును, గలశభవముని సహితంబును నై, విజ్ఞానదీప విలసితం బగు యోగి హృదయంబు చందంబున శుభ్రం బైన యభ్రంబును, నభ్రంబున నీలదుకూల వితాన సంయుక్త ముక్తాఫలంబుల వడువున నెగడు నుడుగణంబులును, నుడుగణ మయూఖంబు క్రొవ్వు లువ్వెత్తుగొని నివ్వటిల్లుచు, బ్రహ్మాండకరండ కర్పూర ఖండాయమానంబు లగు చంద్రకిరణంబులును, జంద్రకిరణ [1]సంస్పర్శనంబున సగర్భంబు లై భూమికి దుర్భరంబు లగుచు నిండి పండి హాలిక కర నిశిత లవిత్ర ధారా సంరంభంబుఁ దలంచి, తల్లడిల్లి, వెలవెలఁ బాఱుచుఁ దల్లి యగు విశ్వంభరకు మునుకొని, ప్రణతంబు లై వణంకుచు, నెఱిఁగ మొఱయిడుచున్న పెంపున సంపన్నంబు లయిన యొన్నుల ప్రేగున వ్రాలి, గాలిం దూలుచు, మర్మర[2]ధ్వనుల సారస్యంబు లగు కలమాది సస్యంబులును, సస్యమంజరీ పుంజంబులు గొంచక చంచువులఁ ద్రుంచి, కబళించి, పిల్ల పెంటి తండంబులం గూడి, కడుపుల నిండ మెక్కి, వెక్కవిరిసి, చొక్కుచుఁ ద్రిక్కులుకొని, మహోత్తుంగ సమంచిత మంచప్రదేశంబు లెక్కి సంచరించుచు, వెన్నుల కావలియున్న యన్నుల కెమ్మోవులు బింబఫలంబు లని కఱచి, తత్కరస్ఫాలనంబుల నులికిపడి, యెగసి చను శుకనికర కలకలంబులును, కలహంస కోక సారస కోలాహల మండితంబు లై, నిండి నిర్మలజలంబులు గల జలాశయంబులును, జలాశయంబుల జలము లనుదినము నిగుర గృహములం బ్రతుకు దినములు సనుట యెఱుంగని మనుజుల గమనికం దిరుగు జలచరములును, జలచర హృదయముల బెగడుగదుర డొంకి యింకిన నదులును, నదులందుఁ

1. సమ్మర్శనంబున (హ) 2. ధ్వని సారస్యంబులు (?)

గహ్వరమండపంబుల తెఱంగున, మణికుట్టిమంబుల మాడ్కిని, సౌధ సోపాన మార్గంబుల జాడను విలోకితంబు లగు నూతన సైకతంబులును, సైకత ప్రదేశంబుల నుదయవేళ నిత్యకర్మానుష్ఠాన నిరతు లగు మునులును, ముని కన్యకా కరకలశ సలిలాభిషిక్త మూలంబు లగు తపోవన బాలరసాల సాలంబు లును, సాలవిటపి వాసంతికా కుంజపుంజంబుల తఱుచున నిముడుకొని, దినకరకిరణ ములకుం గరువలికిం జొర వెఱవుపడని వనములును, వనములం దరుల కొమ్మలు నాకలంబులు నేకలంబు లై మెసంగి, మసరుకవిసి, క్రొవ్వి, కొమ్ములకొనల నూది, యేటిదరులు త్రవ్వి, చిమ్మి, క్రుమ్మి, కోరాడెడి వనగజంబులును, గజ కుంభ కనకకుంభ రుచిర కుచభార భీరుమధ్య సమంచిత లగు చెంచితలును, చెంచితల క్రూరమ్ము లగు వాలమ్ముల సారమ్ములు చెడి, [1]ఖేదంబునఁ బాదంబులు దొట్రుపడఁ బెను[2]గాధంబులం బడు వరాహ పుండరీకంబులును, బుండరీక కుముద కురంటకాది కుసుమ మకరందంబు గ్రోలి, తేలి, సోలి, వ్రాలి, మహోహాంకృతుల ఝుంకృతులు సేయు తేఁటి కదుపులును, గదుపులం గలయక యెడగలిగి, మదమున నదను పద నెఱింగి, మదనమార్గణ ప్రేరితంబు లై, పెంటితుటుముల వెంటం జని, యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కి గర్భంబులు నెక్కొలుపు మృగ వృషభరాజంబులును గలిగి, రాజరాజ గృహంబుపగిది విలసిత కుంద పద్మ సౌభాగ్యం బై. భాగ్యహీను కర్ణంబురేఖ నశ్రుత నీలకంఠ శబ్దం బై, శబ్ద శాస్త్రవేది హృదయంబు బాగున [3]విశద ప్రకాశాభిరామం బై, రామ సంగ్రా మంబు కైవడి బాణాసనాలంకృతం బై, కృతాంత హృదయంబుకరణి నపంకం బై, పంకజాసను గేహంబు సొంపున రాజహంస విరాజమానం బై, మానధనుని చరిత్రంబు సొబగున నకల్మష జీవనం బై, వననిధి పొలుపున సమ్మిళిత భూభృ ద్వాహినీ సంకులం బై, కులవధూరత్నంబు చెలువున నదృష్ట పయోధరం బై, ధరణికిం దొడ వగుచు శరత్కాలంబు వచ్చె. అందు. 763

క. వాజుల నీరాజనములు, రాజుల జయగమనములును రాజిత లక్ష్మీ
పూజలు దేవోత్సవములు, రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా! 764

క. చేగ గల చెఱకువింటను, బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం
యోగంబు చేసి మదనుఁడు, [4]వేగిరమున విరహిజనుల [5]వేఁటాడె నొగిన్. 765

---

1. బెడిదంబున (హ) 2. గాదంబులంబడు (తం.చ.); గాతమ్ములం (వా. ద.) 3. విశ్వ (తం. వా.) 4. వేగంబున(హ. వా.) 5. వేఁటాడించెన్ (హ. తం.)

## అధ్యాయము - ౨౧

వ. ఇట్లు భాసురంబు లైన శరద్వాసరంబుల గోవిందుండు గోపబృందసమేతుం డై, బృందావనంబునం బసులఁ బొసంగ మేపుచు. 766

సీ. కర్ణావతంసిత కర్ణికారప్రభ గండభాగద్యుతిఁ గడలుకొలుప
భువనమోహన మైన భ్రూ విలాసంబుతో వామభాగానత వదన మొప్ప
నపసవ్యకర మృదులాంగుళీ చాతురి షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప
డాకాలిమీఁద నడ్డము సాచి నిల్పిన పద నఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ

తే. మౌళిపింఛము కంఠదామమును మెఱయ
విలసిత గ్రామముగ నొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వ గీతంబు పరఁగఁ జేసెఁ
జతుర నటమూర్తి గోపాల చక్రవర్తి. 767

వ. ఇట్లు హరి వేణునాదంబు పూరించిన, మారవికార హేతు వగు తద్గీతం బాలించి సిగ్గులు సాలించి, మక్కువలు చెక్కు లొత్త, గోపిక లోపికలు లేక, తమతమ పొత్తుకత్తెలుం దారును, దత్తరంబున బదుగురు, నేగురుం దుటుములుగొని, జిలిబిలి ముచ్చటలకుం జొచ్చి, తమలోన. 768

మ. శ్రవణోదంచిత కర్ణికారములతో స్వర్ణాభ చేలంబుతో
నవతంసాయిత కేకి పింఛకముతో నంభోజ దామంబుతో
స్వవశుం డై మధురాధరామృతముచే వంశంబుఁ బూరింపుచు
న్నవిదా! మాధవుఁ డాలవెంట వనమం దొప్పారెడిం జూచితే. 769

శా. రావే సుందరి! యేమె బోటి! వినవే రాజీవనేత్రుండు బృం
దావీథిన్ దగ వేణు వూఁదుచు లస త్సవ్యానతాస్యంబుతో
భ్రూవిన్యాసము లంగుళీక్రమములం బొల్పార షడ్జంబుగాఁ
గావించెన్ నటుభంగి బ్రహ్మ మగు తద్గాంధర్వ సంగీతమున్. 770

క. తలఁకెను గొబ్బునఁ జిత్తము, నళినాక్షుని మధుర వేణునాదము నా వీ
నులు సోఁకి నంత మాత్రన, చెలియా! యిఁక [1]నెట్లు వెరవు చింతింపఁగదే. 771

క. నాతోడ వెఱవ వలదే, నాతోడనె కొనుచుఁ బోయి నళినదళాక్షున్
నీతోడుతఁ బలికించెద, నీతోడి జనంబు మెచ్చ నీతోడు సుమీ. 772

---

1. నేటివెఱపు (హ)

వ. అని పెక్కుభంగుల నో ర్తోర్తు నుద్దేశించి పలుకుచు, గోపసుందరులు బృందా వనంబునకు గోవిందుని కెదురు చని, పరమానందంబున నతనిం దమమనంబులఁ బ్రతిపదంబును నాలింగనంబు చేసినవార లగుచు, రామకృష్ణుల నుద్దేశించి. 773

మ. నవ [1]గోస్థానక రంగమందుఁ బరమానందంబుతోఁ జూడఁ బ
ల్లవ నీలోత్పల పింఛ పద్మదళమాలా వస్త్రసంపన్ను లై
కవ లైయె వేణువు లూఁదుచున్ బహు నటాకారంబులన్ గేళితాం
డవముల్ చేసెద రీ కుమారకులు వేడ్కన్ గామినుల్ గంటిరే! 774

క. ఓ చెలువలార! వినుఁడీ, వాచాశతకంబు లేల వర్ణింపంగా
లోచనముల కలిమికి ఫల, మీ చెలువురఁ జూడఁగలుగు టింతియ సుండీ. 775

వ. అని పలికిరి. అందుఁ గొందఱు గోవిందు నుద్దేశించి. 776

మ. ఒనరన్ వ్రేతల కించుకేనియును లేకుండంగ గోపాలకృ
ష్ణుని కెమ్మోవి సుధారసంబుఁ గొనుచున్ జోద్యంబుగా మ్రోయుచున్
దన పర్వంబులు నేత్రపర్వములుగా దర్పించెఁ బూర్వంబునన్
వనితా! యెట్టి తపంబు చేసెనొకొ యీ వంశంబు వంశంబులోన్. 777

మ. ముదితా! యే తటినీ పయఃకణములన్ మున్ వేణు వింతయ్యె నా
నది సత్పుత్రునిఁ గన్న తల్లిపగిదిన్ నందంబుతో నేఁడు స
మ్మద హంసధ్వని పాటగా వికచ పద్మశ్రేణి రోమాంచ మై
యొదవన్ తుంగ తరంగహస్త నటనోద్యోగంబుఁ గావింపదే. 778

క. నలినోదరు భక్తునిఁ గని, కులజులు నందాశ్రుజలము గురియుపగిది మ్రాఁ
కులు పూఁదేనియ లొలికెడు, నలినాక్షునిచేతి వంశనాళము మ్రోఁతన్, 779

శా. నా మోసంబున కెద్ది మేర విన వే నా పూర్వజన్మంబులన్
లేమా! నోములు నోఁచుచో నకట! కాళిందీతటిన్ వేణు వై
భూమిన్ బుట్టెద నంచు గోరఁ దగదే బోఁధిల్లి యట్లైన నీ
బామం దిప్పుడు మాధవాధర సుధాపానంబు గల్గుం గదే. 780

క. కాళిందీ కూలంబున, నాళీ యీ నందతనయు నధరామృతమున్
గ్రోలెడి వేణువ నగు నో, మేలాగున నోమవచ్చు నెఱిఁగింపఁగదే. 781

క. వనితా! కృష్ణుఁడు నల్లని, ఘన మనియున్ వేణురవము గర్జన మనియున్
మనమునఁ దలంచి రొప్పుచు, ననవరతము నెమలితుటుము లాడెడిఁ గంటే. 782

---

1. గోష్ఠానక (హ)

క. గిరిచర మిథునము లోలిఁ, బరికింపఁగఁ గృష్ణపాద పద్మాంకిత మై
సురరాజు నగరికంటెను, దరుణీ ! బృందావనంబు తద్దయు నొప్పెన్. 783

మ. అమరేంద్రాంగన లాకసంబున విమానారూఢ లై పోవుచున్
గమలాక్షున్ శుభమూర్తిఁ గాంచి మురళీగానంబు లందంద క
ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా నాథాంక మధ్యంబులన్
బ్రమదా ! వ్రాలిరి చూచితే వివశ లై పంచాశుగ భ్రాంత లై. 784

ఉ. కానల నుండుచున్ సరస గాన వివేక విహీన జాత లై
వీనుల నేఁడు కృష్ణముఖ వేణు రవామృతధార సోఁకినన్
మేనులు మేఁతలున్ మఱచి మెత్తని చూడ్కి మృగీ మృగావళుల్
మానిని ! చూడవమ్మ బహుమానము చేసెఁ గృతార్థచిత్త లై. 785

ఉ. తల్లుల చన్నుఁబాలు మును ద్రావు తఱిన్ దమ కర్ణవీథులన్
వల్లభ మైన మాధవుని వంశ రవామృతధార చొచ్చినన్
ద్రుళ్ళక పాలురాఁ దివక దూఁటక మానక కృష్ణుమీఁద దృ
గ్వల్లులు చేర్చి నిల్చె నదె వత్సము లంగనలార ! కంటిరే. 786

మ. మమతన్ మోములు మీఁది కెత్తుకొని రోమంథంబు సాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీ గానామృత శ్రేణి క
ర్ణములన్ గ్రోలుచు మేఁత మాని గళితానందాశ్రు లై చిత్రితో
పమ లై గోవులు చూచుచున్న వదిగో పద్మాక్షి ! వీక్షించితే. 787

మ. జగతీజంబుల శాఖ లెక్కి మురళీ శబ్దామృత స్యందముల్
మిగులన్ వీనులఁ ద్రావి వేఁగుపడి నెమ్మిం గృష్ణరూపంబు చి
త్తగ మై యుండఁగ నడ్డపెట్టుక్రియ నేత్రంబు ల్దగన్ మూసి యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే మునిజనాకారంబులం గామినీ ! 788

మ. క్రమ మొప్పన్ నదులెల్ల వంశరవ మాకర్ణించి సంజాత మో
హములన్ మన్మథసాయక క్షత విశాలావర్త లై హంసవా
క్యములం జీరి తరంగహస్తముల నాకర్షించి పద్మోపహా
రములన్ గృష్ణు పదార్చనంబు సలిపెన్ రామా ! విలోకించితే. 789

ఆ. వనిత ! నేఁడు కృష్ణు వంశనినాదంబు
విని పయోధరంబు విరులు గురిసి
తన శరీర మెల్ల ధవళాతపత్రంబుఁ
జేసి మింట నీడఁ జేసెఁ గంటె. 790

క. మంచి ఫలంబులు హరిచే, నించి కరాలంబనముల నెగడుచు నిదె క్రీ
డించెద రంగన! చూడుము, చెంచితలం బింఛపత్ర చేలాంచితలన్. 791

క. ఉల్లసిత కుచభరంబుల, నల్లాడెడి నడుముతోడ నలరులదండల్
ఖిల్లి యొకతె హరి కిచ్చెను, హల్లోహల కలిత యగుచు నంగన! కంటే. 792

క. గిరు లెల్ల జలము లయ్యెం, దరు లెల్లను బల్లవించె ధరణి గగన భూ
చరు లెల్లను జొక్కిరి హరి, మురళీ రవామృతము సోఁకి ముద్దియ! కంటే. 793

మ. బలకృష్ణాంఘ్రి సరోజసంగమముచే భాసిల్లుచున్ ధన్య మై
ఫలపుష్పంబులఁ గానుకల్ గురిసి సంభావించి మిన్నందుచున్
జలఘాసంబుల గోవులం దనిపి చంచత్ భూజరోమాంచ మై
వెలసెన్ జూడఁగదమ్మ! యీ గిరి పురోవీథిన్ సరోజాననా! 794

వ. అని యిట్లు బృందావన విహారి యైన గోవిందుని సందర్శించి, పంచబాణభల్లభగ్నహృదయ లై, వల్లవకాంత లేకాంతంబులఁ జింతించుచుఁ, దత్పరతంత్ర లయి యుండిరి. అంత. 795

అధ్యాయము—౨౨

## —: హేమంత ఋతు వర్ణనము :—

క. శామంతికా ప్రసగంచిత, సీమంతవతీ కుచోష్ణ జిత శీతభయ
శ్రీమంతం బై గొబ్బున, హేమంతము దోఁచె మదనుఁ దేఁచె విరహులన్. 796

క. ఉత్తరపుగాలి విసరె వి,యత్తలమునఁ దుహినకిరణుఁ డహితుం డయ్యెం
బొత్తు జరిగె మిథునములకు, నెత్తమ్ములు దఱిగె హిమము నెలకొనియె నృపా!

క. అహములు సన్నము లయ్యెను, దహనము హిత మయ్యె దీర్ఘదశ లయ్యె నిశల్
బహు శీతోపేతం బై, యుహుహూ యని వణఁకె లోక ముర్వీనాథా! 798

క. అన్నుల చన్నుల దండ వి,పన్నులుగా కెల్లవారు బ్రతికిరిగా కీ
చన్నుల మీఱిన [1]వలి నా, పన్నులు గాకుండఁ దరమె బ్రహ్మాదులకున్. 799

ఆ. [1]పొడుపుఁ గొండమీఁద [2]బొడుచుట మొదలుగాఁ
బరువు వెట్టి యినుఁడు పశ్చిమాద్రి
మఱుఁగుఁ జొచ్చెఁ గాక మసలినఁ జలిచేతఁ
జిక్కెఁ జిక్కె ననఁగఁ జిక్కకున్నె. 800

1. చలి(హ) 2. పొడవుఁ గొండమీఁదఁ బొడిచింది మొదలుగా (హ); పొడమింది మొదలుగా (చ)

క. చెంగల్వ విరులగంధము, మంగళముగఁ గ్రోలుచున్న మధుపము లొప్పె
న్నంగజ వహ్నులపై నుప్పొంగి విజృంభించు పొగల పోలిక నధిపా! 801

ఆ. శంభు కంట నొకటి జలరాశి నొక్కటి
మఱియు నొకటి మనుజ మందిరముల
నొదిఁగెఁ గాక మెఱసి యున్న మూఁడగ్నులుఁ
జలికి నోఁడి భక్తి సలుపకున్నె. 802

శా. *ఈ హేమంతము రాకఁ జూచి రమణీహేలాపరీరంభ స
త్సాహాయ్యంబునఁ గాని వీని గెలువన్ శక్యంబు గాదంచు దా
రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీయుక్తాంగులై నారు గా
కోహో! వార లదేమి సంతత వధూయోగంబు రాఁ గందురే. 803

క. *ఈ హేమంతము రాకకు, శ్రీహరి యొక్కింత వణఁకి చింతింపంగా
నోహో! వెఱవకు మనుచు, న్నా హరికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్. 804

## —: గోపికా వస్త్రాపహరణకథ :—

వ. ఇట్లు నితాంతం బగు హేమంతంబున మొదలినెల తొలిదినంబునందు, నందుని మందలోఁ గల గోపకుమారికలు రేపకడ లేచి చని, కాళిందీ జలంబులం దోఁగి, జలతీరంబున నిసుకం గాత్యాయనీరూపంబు చేసి, సురభి కుసుమగంధంబు లిడి, ధూపదీపంబు లిచ్చి, బహువి ధోపహారంబులు సమర్పించి. 805

క. ఓ కాత్యాయని! భగవతి!, నీకును మ్రొక్కెదము మేము నేఁ డనుకంపన్
మా కిందఱకును వైళమ, శ్రీకృష్ణుఁడు మగఁడు గాఁగఁ జేయుము తల్లీ! 806

క. ఓ తల్లి! మాకుఁ గృష్ణుఁడు, చేతోవిభుఁ డైన నాఁడు చెలువల మెల్లన్
నేతివసంతము లాడుచుఁ, జాతర చేసెదము భక్తిచాతురితోడన్. 807

వ. అని నమస్కరించి, హవిష్యంబులు గుడుచుచు, ని వ్విధంబున మాసవ్రతంబు సల్పిరి. అం దొక్కనాఁడు. 808

మ. రమణుల్ ప్రొద్దున మేలుకాంచి సఖులన్ రం డంచు నాత్మీయ నా
మములం జీరి కుచద్వయీ భరములన్ మధ్యంబు లల్లాడఁగాఁ
బ్రమదోద్దామ గజేంద్రయాన లగుచున్ బద్మాప్తునిం బాడుచున్
యమునాతీరముఁ జేరఁబోయిరి గృహీతాన్యోన్య హస్తాబ్జ లై. 809

---

* ఈ పద్యములు తాళ ప్రతులలో లేవు.

వ. ఇట్లా నదీతీరంబుఁ జేరంజని, గజగమనలు విజన ప్రదేశంబున వలువలు విడిచి యిడి, మది శంక లేక, యకలంక లై, క్రుంకు లిడఁ జలంబున జలంబు సొచ్చి.

క. వారిజ లోచనుఁ బాడుచు, వారిజ లోచనలు వారివారికి వేడ్కన్
వారివిహారము సలిపిరి, వారి విహారములు జగతివారికిఁ గలవే. 811

వ. ఆ సమయంబున. 812

క. తోయజనయనలు యమునా, తోయములం దుండు టెఱిఁగి దూరగుఁడయ్యున్
దోయజనయనుఁడు వారి తన, తోయము గోపకులుఁ దానుఁ దోఁతెంచె నృపా!

తరల. కదలకుం డని తోడివారలఁ గన్నుసన్నల నిల్పుచున్
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ బద్మనేత్రుఁడు మౌని యై
పొదలమాటున నల్లనల్లన పొంచి పొంచి నతాంగుఁ డై
యదను గోరుచు డాసి ప్రేతల యంబరంబులు దొంగిలెన్. 814

వ. ఇట్లు దొంగిలి. 815

శా. ఉద్యద్గంధగజేంద్ర గౌరవముతో యోషాంబరంబుల్ విభుం
డాద్యుం డర్భకుభంగి నర్భకులతో హాసార్థి యై కొంచుఁ ద
న్నద్యంభఃకణ శీతవాత జనితానందంబుతో నెక్కె దా
సద్యోముక్త దురంత పాదప జను స్సంతాపమున్ నీపమున్. 816

వ. అప్పు డ య్యింతు లి ట్లనిరి. 817

క. మా మా వలువలు ముట్టకు, మామా కొనిపోకు పోకు మన్నింపు తగన్[1]
మా మానమేల కొనియెదు, మా మానసహరణ మేల మానుము కృష్ణా! 818

సీ. బహు జీవనముతోడ భాసిల్లి యుండుటో గోత్రంబు నిల్పుటో కూర్మితోడ
మహి నుద్ధరించుటో మనుజసింహంబ వై ప్రజలఁ గాచుటొ కాక బలి దెరల్చి
పిన్న వై యుండియుఁ బెంపు వహించుటో రాజుల గెల్చుటో రణములోన
గురు నాజ్ఞ సేయుటో గుణనిధి వై బల ప్రఖ్యాతిఁ జూపుటో భద్రలీల

ఆ. బుధులు మెచ్చ భువిఁ బ్రబుద్ధత మెఱయుటో
కలికితనము సేయ ఘనత గలదె
వావి లేదు వారి వారు నా వా రని
యెఱుఁగవలదె వలువ లిమ్ము కృష్ణ! 819

---

1. మన్నింపఁదగున్ (హ)

క. కొంటివి మా హృదయంబులు, కొంటివి [1]మా మనము లజ్జ గొంటివి వలువల్
గొంటి వికఁ నెట్లు చేసెదొ, కొంటెవు గద నిన్ను నెఱిఁగికొంటిమి కృష్ణా! 820

సీ. రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమే చెలరేఁగి వింతలు చేయుచుండ
సత్త్వసంపద గల్గి జరుగుటఁ దలఁపమే సిరిగల్గి యన్యులఁ జెనకుచుండ
గురుతర శక్తియుక్తుఁడ వౌటఁ జూడమే తామసంబున నెగ్గు దలఁచుచుండ
నొకభంగితో నుండకుంటఁ జింతింపమే మాయావి వై మాఱు మలయుచుండ

ఆ. నేమి జాడవాఁడ వేపాటి గలవాఁడ
వే గుణంబు నెఱుఁగ వెల్లయెడల
నొదిగి యుండనేర వోరంత ప్రొద్దును
బటము లీఁగదయ్య! పద్మనయన! 821

క. [2]రాజు నెఱుంగవు బలిమిని, [3]రాజిల్లెదు చీర లీవు రమణుల మింకన్
రాజున [4]కెఱిఁగించెద మో, రాజీవదళాక్ష! నీవు రాజవె ధరకున్. 822

వ. అని పలికిన కన్నియల పలుకు లాలించి, మందహాస సుందర వదనారవిందుండై, గోపాలబాలకుల కరంబులం గరంబులు వేసి, య మ్ముద్దియల నుద్దేశించి నెఱవాది చతురుం డి ట్లనియె. 823

శా. రామల్ [5]రాజులతోడ [6]నీ పనికి నారంభింతురే మీ క్రియన్
[7]మోమా టేమియు లేక [8]దూఱెదరు మీ మోసంబు చింతింప రం
భోమధ్యంబున నుండి వెల్వడి వెసన్ బూర్ణేందు బింబాననల్
మీ మీ చీరలు వచ్చి పుచ్చుకొనుఁడీ మీ కిచ్చెదం జెచ్చెరన్. 824

వ. అనిన న మ్మానవతు లొండొరుల మొగంబులు సూచి నగుచు, మర్మంబుల నాటిన మాటలకు మగుడం బలుక సిగ్గువడుచు, నగ్గలం బైన చలిని వలిగొని, కంఠప్రమాణ జలంబులం దుండి, డోలాయమాన మానస లై, యి ట్లనిరి. 825

క. [9]మా వలువలు లాఘవమున, నీ వేటికిఁ బుచ్చుకొంటి వీ వల్వుఁడవే
నీ వెఱుఁగని దే మున్నది, [10]నీ వంటిలోన ధర్మనిరతుఁడవు గదే. 826

---

1. మానంబు (తం): యానంబు (వా) 2. తాజుల నెఱుఁగవు (హ. తం. వా.)
3. రాజిల్లెడు (హ. వా.) 4. కెఱుఁగించెదవో (హ) 5. రాములతోడ (హ) 6. నీ పనికి గారారింతురే (హ) 7. మోమోటేమియు (వా) 8. మాఱెదరు (హ): తూఱెదరు (వా)
9. మావలువలాగడంబున (తం. వా.) 10. విందఱిలోన (తం. వా.)

మ. ఇంతుల్ తోయము లాడుచుండ మగవా రేతెంతురే వచ్చిరా
యింతల్ సేయుదురే కృపారహితు లై యే లోకమం దైన నీ
వింతల్ నీ తలఁ బుట్టెఁ గాక మఱి యేవీ కృష్ణ ! యో చెల్ల ! నీ
చెంతన్ దాసుల మై చరించెదము మా చేలంబు లిప్పింపవే. 827

క. వచ్చెదము నీవు పిల్చిన, నిచ్చెద మేమైనఁ గాని [1]యెటు చొరు మనినం
జొచ్చెదము నేఁడు వస్త్రము, లిచ్చి మమ్ముం గరుణతోడ నేలుము కృష్ణా! 828

వ. అనిన దరహాసితవదనుం డై హరి యి ట్లనియె. 829

క. ఏ తరుణుఁడు మగఁ డొటకు, మీ తపములు చెప్పుఁ డింక మీ యానలు సుం
డీ తప్పిన [2]నీ కూరిమి, మీ తలలనె వుట్టె నోటు మేదిని లేదే.

క. ఎవ్వనిఁ గని మోహించితి, రెవ్వఁడు మీ మానధనము లెల్ల హరించెన్
[3]నివ్వటిలెను మీ కూరిమి, యెవ్వనిపైఁ బలుక రాదె యే నన్యుఁడనే. 831

వ. అనిన విని, సుందరు లన్యోన్య సందర్శనంబులు సేయుచు, హృదయారవిందంబులఁ గందర్పుండు సందడింప నగుచు, నిరుత్తర లై యున్న [4]లోకోత్తరుం డి ట్లనియె.

క. నా యింటికి దాసుల రై, నా యాజ్ఞ వహించి మీరు నడచెద రేనిన్
మీ యంబరంబు లిచ్చెదఁ, దోయంబులు వెడలి రండు తొయ్యలులారా. 833

వ. అనిన విని, హరిమధ్యలు చలికి వెఱచి, సలిల మధ్యంబున నిలువ నోపక. 834

క. కొందఱు వెడలుద మందురు, కొందఱు వెడలుటయు సిగ్గుఁ గొను గోవిందుం
డందురు కొందఱు దమలోఁ, గొందల మందుదురు వణఁకుగొని మనుజేంద్రా.

వ. మఱియు, నెట్టకేలకుఁజిత్తంబులు గట్టిపఱుచుకొని, తనుమధ్యలు తోయమధ్యంబు వెలువడి. 836

క. చంచ త్పల్లవకోమల, కాంచన నవరత్నఘటిత కంకణ రుచి రో
దంచిత కరసంఛాదిత, పంచాయుధగేహ లగుచుఁ బడఁతులు వరుసన్. 837

వ. చని ప్రౌఢ లయిన సుందరుల ముందఱ నిడుకొని, మందగమనలు మందహాసంబుతోడ నెదుర నిలిచిన, నరవిందనయనుం డి ట్లనియె. 838

సీ. శృంగారవతులార ! సిగ్గేల మిముఁ గూడి పిన్ననాఁటను గోలెఁ బెరిఁగినాఁడ
నెఱుఁగనే మీలోన నెప్పుడు నున్నాఁడ నేను జూడని మర్మ మెద్ది గలదు
వ్రతనిష్ఠ లై యుండి వలువలు గట్టక నీరు సొత్తురె మీరు నియతిఁ దప్పి
కాత్యాయనీదేవిఁ గల్ల సేయుట గాక నీరీతి నోమువా రెందుఁ గలరు

---

1. యెటఁజొరు (వా) 2. మీ (హ) 3. నివ్వటిలుమీకుఁ గూరిమి (తం); నివ్వటిల మీకుఁ గూరిమి (వా) 4. లోకోత్తర చరిత్రుండైన హరి (క. వ.)

ఆ. వ్రతము ఫలము [1]మీకు వలసినఁ జక్కఁగ
నింతు లెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుఁడు చీరలు సిగ్గు వో
నాడనేల యెగ్గు లాడనేల. 839

వ. అనిన విని, మానవతులు దమలోన. 840

మ. వ్రతముల్ సేయుచు నొక్కమా టయిన నెవ్వానిన్ విచారించినన్
వ్రతభంగంబులు మాను నట్టి వరదున్ వామాక్షు లీక్షించియున్
గత చేలాప్లవనంబు నేఁడు వ్రతభంగం బంచు శంకించి ఫా
లతట న్యస్త కరాబ్జ లై సరస లీలన్ మ్రొక్కి ర ట్లందఱున్. 841

క. బాలలకు హ స్తకీలిత, ఫాలలకు నితాంత శీతపవనాగమ నా
లోలలకు నంబరములు కృ, పాలుఁడు హరి యిచ్చె భ క్తపాలకుఁ డగుటన్. 842

ఆ. చీర లపహరించి సిగ్గులు విడిపించి
పరిహసించి యైనఁ బరఁగ మనకు
ఘనుఁడు నోము కొఱఁత గాకుండ మ్రొక్కించె
ననుచు హరి నుతించి రబల లెల్ల. 843

క. ఉల్లములు నొవ్వ నాడినఁ, గల్లలు చేసినను నగినఁ గలఁచిన నైనన్
వల్లభులు సేయు కృత్యము, వల్లభలకు నెగ్గు గాదు వల్లభ మధిపా! 844

వ. ఇట్లు హరి వలువ లిచ్చినం గట్టుకొని, సతు లతనియందు బద్ధానురాగ[2] లై, యుచ్చరింపక, ఱెప్పలిడక, తప్పక చూడ, నా ప్రోడ యెఱింగి, చేరి, వారి కి ట్లనియె. 845

సీ. లక్షణవతులార! లజ్జించి చెప్పరు గాని మీ మర్మముల్ గానఁబడియె
నను గొల్వఁ జింతించినారు నా చేతను సత్యంబు మీ నోము సఫల మగును
గామితార్థంబుల కలిమి చెప్పఁగ నేల ననుఁ గొల్వ ముక్తికి నడవవచ్చుఁ
గడమ గూడఁగ నంబికాదేవి నోమంగ నటమీఁద రాత్రులయందు మీకు

ఆ. నన్నుఁ బొందఁ గల్గు నమ్మి పొం డని హరి
పల్క నింతు లెల్ల భ్రాంతిఁ జనిరి
తపము పండె ననుచుఁ దత్పదాంభోజముల్
మానసించుకొనుచు మందకడకు. 846

---

1. మీరు (హ); మీరు వలచిన (తం. వా.) 2. లయ్యుఁ జలింపక (తం. వా.)

వ. ఇట్లు గోపకన్యలందుఁ బ్రసన్నుఁ డై, గోవిందుండు బృందావనంబు దాఁటి, దూరంబున ధేనువుల మేపుచుండఁ, జండకిరణుని యెండం బడి, దండిఁ జెడి, తరులదండ నండగొనుచు, నాతపత్రాకారంబు లై నీడలు సేయుచున్న వృక్షం బుల నీక్షించి, కృష్ణ బల [1]శ్రీదామ దేవప్రస్థ విశాలార్జున ప్రముఖులకుం దక్కిన గోపకు లి ట్లనిరి. 847

—: మునిభార్య లన్నము తీసికొని వచ్చి స్వామి కారగింపు చేయుట :—

మ. అపకారంబులు సేయ వెవ్వరికి నేకాంతంబులం దుండు నా
తప శీతానిల వర్ష వారకము లై త్వగ్గంధ నిర్యాస భ
స్మ పలాశాగ్ర మరందమూల కుసుమ చ్ఛాయా ఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు నర్థులకు నీ యుర్వీజముల్ గంటిరే. 848

వ. అని చిగురాకు పువ్వు కాయ పండు తండంబుల ప్రేఁగున వీఁగిన తరువుల నడిమి తెరువుల బసులదాఁటుల దాఁటించి, యమునకుం జని, వెడఁదమడుఁగుల మెల్లన చల్లని నీరు ద్రావించి, తత్సమీపంబున మేపుచు,

అధ్యాయము - ౨౩

వల్లవు లెల్ల మూఁకలుగొని, యాఁకలి గొంటి మని విన్నవించినఁ, దనకు భక్తు రాం డ్రగు విప్ర భార్యలవలనం బ్రసన్నుం డయి, వారలఁ జూచి, రామ సహితుం డయిన హరి యి ట్లనియె. 849

సీ. వల్లవులార ! యీ వనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు
[2]నరుగుట గోరి యాంగిరసాహ్వ సత్రంబు సలుపుచు నున్నారు సనుఁడు మీరు
మా నామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబు వెట్టుదు రనుచుఁ బలుక
వారలు చని విప్రవరుల కెల్లను మ్రొక్కి పసుల మేపుచు బలభద్రకృష్ణు

తే. లలసి పుత్తెంచి రిట మము నన్న మడుగ
ధర్మవిదులార ! యర్థి ప్రదాతలార !
పెట్టుఁ డన్నంబు; కాంతులఁ బిలిచి తెచ్చి
పెట్టుదురు గాదె మిముబోఁటి పెద్దలెల్ల ! 850

క. ఘన దీక్షితునకు నై నం, జనుఁ గుడువగఁ బశువధంబు సౌత్రామణియుం
జనిన వెనుక దోషము లే, దనఘాత్మకులార ! పెట్టుఁ డన్నము మాకున్. 851

---

1. శ్రీరామదేవప్రశస్త (తం) 2. అరుగుట కాంగిరసాహ్వయ (తం. వా.)

వ. అని గోపకులు వలికిన. 852

మ. క్రతువుఁ మంత్రము తంత్రముఁ ధనములుం గాలంబు దేశంబు దే
వతయుఁ ధర్మము సన్యముల్ దలఁప నెవ్వాఁ డట్టి సర్వేశ్వరుఁ
మతి నూహింపక గోపబాలుఁ డనుచుఁ మందస్థితిం జూచి దు
ర్మతు లై యన్నము లేదు లే దనిరి సన్మాన క్రియా శూన్యు లై. 853

వ, అంత గోపకులు నిరాశు లై వచ్చి, యెఱింగించిన, హరి లౌకికానుసారి యగుచు, మీ ర య్యార్యుల నడుగక, వారి భార్యలకు మా రాక చెప్పుండు. అన్నంబుఁ బెట్టెదరు. అని పంచిన వారు చని, బ్రాహ్మణసతుల దర్శించి, నమస్కరించి, సంపూజితు లై, యి ట్లనిరి. 854

క. గోవుల మేపుచు నాఁకొని, గోవిందుం డన్న మడిగికొని రం డని మ
మ్మీ వేళను బుత్తెంచెను, భీవిలసితలార ! రండు తెం డన్నంబుల్. 855

వ. అనిన విని, గోవింద సందర్శన కుతూహల లై, ధరణీసుర సుందరులు, సంభ్రమానందంబులు డెందంబుల సందడింప, భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయ భేదంబులం గలిగి, సంస్కారసంపన్నంబు లయిన యన్నంబులు కుంభంబుల నిడుకొని, సంరంభంబుల సముద్రంబులకు నడచు నదుల తెఱంగున. 856

క. బిడ్డలు మగలును భ్రాతలు, నడ్డము చని వల దనంగ నటు దలఁ డని మా
ఱొడ్డుచు జగదీశ్వరునకు, జడ్డన నన్నంబుఁ గొనుచుఁ జని రా సుదతుల్. 857

వ. చని యమునా సమీపంబున నవ పల్లవాతిరేకంబును, విగత వనచర శోకంబును నయిన యశోకంబు క్రింద నిర్మల స్థలంబున. 858

సీ. ఒక చెలికానిపై నొకచెయ్యి చాఁచి వేఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పున కందని కొన్ని కుంతలములు చెక్కుల నృత్యంబు సేయువానిఁ
గుఱుచ చుంగులు పుచ్చి కొమరారఁ గట్టిన పసిఁడివన్నెలు గల పటమువాని
నౌదలఁ దిరిగిరా నలవడఁ జుట్టిన దట్టంపుఁ [1]బింఛపు దండవాని

తే. రాజితోత్పల కర్ణపూరములవాని
మహిత పల్లవ పుష్పదామములవాని
భువనమోహన నటవేష భూతివానిఁ
గనిరి కాంతలు కన్నుల కఱవు దీఱ. 859

---

1. శిఖిపింఛదండవాని (హ)

క. కని లోచనరంధ్రంబుల, మునుమిడి హరి లలితరూపు మును లోఁగొని నె
మ్మనములఁ బరిరంభించిరి, తనుమధ్యలు హృదయజనిత తాపము వాయన్.

వ. ఇవ్విధంబున. 860

క. వారిత సర్వ స్పృహ లై, వా రందఱుఁ దన్నుఁ జూడ వచ్చుట మదిలో
వారిజనయనుఁడు పొడగని, వారికి ని ట్లనియె నగి యవారిత దృష్టిన్. 861

శా. కాంతారత్నములార ! మీ గృహములం గల్యాణమే యేమి గా
వింతున్ మీ కిటు రండు మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచినా
రెంతో వేడుకతో నెఱుంగుదుము నిర్హేతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మిక్కియఁ జేరి కందురు గదా మత్సేవలన్ సర్వమున్. 862

వ. కావున గృహస్థు లైన మీ పతులు మిమ్ముం గూడి క్రతువు సమాప్తి సేసెదరు.
మీరు యాగవాటంబునకుం జనుండు. అనిన, విప్రభార్య లి ట్లనిరి. 863

మ. తగునే మాధవ ! యిట్టి వాఁడిపలుకుల్ ధర్మంబులే [2]యియ్యెడన్
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ
చ్చిగ నీ యంఘ్రులు చేరినార మట వోఁ జేకొందురే వార లా
పగి దే మొల్లము కింకరీజనులఁ గా భావించి రక్షింపవే. 864

వ. అనిన జగదీశ్వరుండు. 865

సీ. నా సమీపమున నున్నా రంచు నలుగరు బంధులు భ్రాతలుఁ బతులు సుతులు
మిమ్ము దేవత లైన మెత్తు రంగనలార ! నా దేహసంగంబు నరుల కెల్ల
సౌఖ్యానురాగ సంజనకంబు గాదు ముక్తిప్రదాయకము నా కీర్తనమున
దర్శనాకర్ణన ధ్యానంబులను గర్మబంధ దేహంబులఁ బాసి మీరు

తే. మానసంబులు నాయందు మరగఁ జేసి
నన్నుఁ జేరెద రిటమీఁద నమ్ముఁ డనుచుఁ
బలికి వారలు దెచ్చిన భక్షణాదు
లాప్తవర్గంబుతో హరి యారగించె. 866

క. పరమేశ్వరార్పణంబుగఁ, బరజనులకు [3]భిక్షమిడినఁ బరమ పదమునన్
బరఁగెద రఁట తుది సాక్షా [4]త్పరమేశ్వరు భిక్ష సేయు ఫల [5]మెట్టిదియో. 867

---

1. నిర్విఘ్నంబుగా సమాప్తించెదరు (తం) 2. మాయెడన్ (క. చ. గ. జ.)
3. యిడిన (తం. వా.) 4. పరమేశుఁడు భిక్షసేయు (తం); పరమేశుఁడు భిక్షగొన్న (వా)
5. దయో (హ)

వ. ఇట్లు సర్వేశ్వరుం డైన హరికి భిక్షయిడి, తమతమ భార్య లతనివలనం గృతార్థ లౌట యెఱింగి, భూసురులు తమలో ని ట్లనిరి. 868

చ. కటకట ! మోసపోయితిమి కాంతలపాటియు బుద్ధి లేదు నే
డిట హరిఁ గానఁబోఁ నెఱుఁగ మేము దురాత్ముల మేము కల్మషో
ద్భటులము విష్ణుదూరగుల ప్రాజ్ఞతలేల తపంబు లేల ? ప
ర్యటనము లేల శీలములు యాగములున్ మఱి యేల కాల్పనే. 869

క. జప హోమాధ్యయనంబులు, తపములు వ్రతములును లేని తరుణులు హరి స
త్కృప వడసి రన్ని గలిగియుఁ, జపలతఁ బొందితిమి భక్తి సలుపమి నకటా ! 870

క. సురగురు లగు యోగీంద్రుల, నరుదుగ మోహితులఁ జేయుహరిమాయ మముఁ
నరగురుల మూఢవిప్రుల, [1]నురువడి మోహితులఁ జేయ నోపక యున్నే. 871

మ. క్రతువుల్ ధర్మము మంత్ర తంత్ర ధనముల్ కాలంబు దేశంబు దే
వతయుఁ వహ్నులు, మేదినీసురులు నెవ్వాఁ డట్టి సర్వేశుఁ డీ
క్షితి రక్షింప జనించినాఁ డెఱుఁగ మా శ్రీభర్తకుం గర్తకుం
గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథ సంహర్తకుఁ. 872

—: నందాదు లిందర్రియాగము సేయ శ్రీ కృష్ణునితో నాలోచించుట :—

వ. అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబులం బొంది, హరిం దలంచి, శమింపు మని మ్రొక్కి, బ్రాహ్మణులు కంసభీతు లై కృష్ణ సందర్శనంబు సేయం జనరైరి.

## అధ్యాయము – ౨౪

అంత నక్కడ నఖిల దర్శనుం డైన హరి, యింద్రయాగంబు సేయం దలంచి, తనకడకు వచ్చిన నందాది గోపవృద్ధులం గని, నమస్కరించి, నందున కి ట్లనియె.

సీ. యాగంబు సేయంగ నర్థించి వచ్చితి రీ యాగమున ఫల మేమి గలుగు
నెవ్వాఁడు దీనికి నీశ్వరుం డధికారి యెవ్వఁడు సాధన మెంత వలయు
శాస్త్రీయమో జనాచారమో కార్యంబు వైరుల కెఱిఁగింప వలదు గాని
యెఱిఁగెడి మిత్రుల కెఱిఁగింపఁ దగుఁ జేరి యెఱిఁగి చేసినఁ గోర్కులెల్లఁగలుగుఁ

ఆ. బగయు చెలిమి లేక బరఁగిన మిముబోఁటి
మంచివారి కేల మంతనంబు
తలఁపు లెల్ల మాకుఁ దగ నెఱిఁగింపవే
తాత ! వాక్సుధా ప్రదాత వగుచు. 874

1. సురవడి (తం. వా.)

వ. అని పలికిన, ప్రౌఢకుమారునికిఁ దండ్రి యి ట్లనియె. 875

సీ. పర్జన్యుఁ డధికుండు భగవంతుఁ డమరేంద్రుఁ డతనికిఁ బ్రియమూర్తు లగుచునున్న
మేఘబృందంబులు మేదినీతలముపై నతని పంపున భూతహర్షణముగ
జలములు గురియుఁ ద జ్జలపూరములఁ దోఁగి పండు సస్యంబు లా పంట దమకు
ధర్మార్థ కామ ప్రదాయకముగ లోకు లెల్లనుఁ బ్రతుకుదు రింత యేటిఁ గి

తే. మేఘవిభుఁ డైన యింద్రుండు మెచ్చుకొఱకు
నింద్ర[1]మఖములు సేయుదు రెల్లనృపులు
కామ లోభ భయ ద్వేష కలితు లగుచుఁ
జేయకుండిన నశుభంబు చెందుఁ బుత్ర! 876

వ. అదియునుం గాక. 877

ఆ. మఖము సేయ వజ్రి మది సంతసించును
వజ్రి సంతసింప వాన గురియు
వాన గురియఁ గసవు వసుమతిఁ బెరుఁగును
గసవు మేసి ధేనుగణము బ్రతుకు. 878

క. ధేనువులు బ్రతికె నేనియు, మానదు ఘన మైన పాఁడి మందలఁ గలుగున్
[2]మానుగను బాఁడి గలిగిన, మానవులును సురలుఁ దనిసి మనుదురు పుత్రా! 879

వ. అని యిట్లు నొడివిన నందుని వచనంబులు విని, యింద్రునికిఁ గోపంబు దీపింప దనుజదమనుండు తండ్రి కి ట్లనియె. 880

క. కర్మమునఁ బుట్టు జంతువు, కర్మమునన్ వృద్ధిఁ బొందుఁ గర్మమునఁ జెడున్
గర్మమె జనులకు దేవత, కర్మము సుఖదుఃఖములకుఁ గారణ మధిపా! 881

క. కర్మములకుఁ దగు ఫలములు, [3]కర్మరులకు నిడఁగ రాజు గాని సదా ని
ష్కర్ముఁ డగు నీశ్వరుండును, గర్మవిహీనునికి రాజు గాఁడు మహాత్మా! 882

వ. కావునఁ గర్మాను[4]యాతంబు లైన భూతంబులకుఁ బురుహూతునివలన భీతి యేటికి ? పురాతన జన్మసంస్కారంబులు కుప్పలుగొని కప్పినఁ గర్మంబుల దప్పించి, పెంపు పడయ న ప్పరమేశ్వరుండును నేరఁడు. ఇతరుం జెప్ప నేల. సురాసుర నరానీకంబులతోడి లోకంబు నిజ సంస్కారవశం బై యంద డింది యున్నది. సందేహంబు లేదు. దేహి కర్మవశంబున గురు తను దేహంబులఁ

---

1. యాగము (తం. వా.) 2. మానముగ (హ) 3. కర్మాదుల నిడఁగ (హ)
4. యోగంబు లైన (త)

జొచ్చి వెడలు. ఒజ్జ, వేలుపు, నెచ్చెలి, [1]పగఱు, చుట్టంబులు, కర్మంబులు, జీవుండు కర్మంబుతోడ వర్తించు. అతనికిఁ గర్మంబు దైవతంబు. కర్మంబునం బ్రతుకుచు నితరసేవ సేయుట, సతి పతిని విడిచి, జారుం జేరినచందం బగు. విప్రుండు వైదికకర్మంబున మెలంగు. నృపతి ధరణీపాలనంబున సంచరించు. వైశ్యుండు వాణిజ్య కృషి కుసీద గో రక్షణాదుల వర్తించు. శూద్రుం డగ్రజన్మల సేవించి బ్రతుకు. సత్త్వ రజ స్తమోగుణంబు లుత్పత్తి స్థితి లయ కారణంబులు. అందు రజంబున జగంబు జన్మించు. రజోగుణ ప్రేరితంబులై మేఘంబులు వర్షించు. వర్షంబునం బ్రజావృద్ధి యగు. ఇంద్రుం డేమి సేయంగల వాఁడు. అదియునుం గాక. 884

శా. కోపింపన్ బనిలేదు శక్రునికిఁ దాఁ గోపించుఁ గాకేమి సం
క్షేపం బయ్యెడి దేమి పట్టణములన్ గేహంబులన్ దేశముల్
వ్యాపారంబులు మీకుఁ బోయెడి నె? శైలారణ్య భాగంబులన్
గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగా నేటికిన్. 885

సీ. పసులకుఁ గొండకు బ్రాహ్మణోత్తములకు మఖము గావించుట మంచిబుద్ధి
యింద్రయాగంబున కేమేమి దెప్పింతు రవి యెల్లఁ దెప్పింపుఁ డరసి మీరు
పాయసంబులు సపూపములు సైదపుఁ బిండివంటలు పప్పును వలయునట్టి
ఫల శాకములు వండఁ బంపుఁడు హోమంబు సేయుఁడు ధేను దక్షిణల నిచ్చి

తే. బహు రసాన్నంబుఁ బెట్టుఁడు బ్రాహ్మణులకు
నచలులై పూజ లొనరింపుఁ డచలమునకు
నధమ చండాల శునక సంహతికిఁ దగిన
భక్ష్యములు దెండు కసవులు పసుల కిండు. 886

శా. గంధాలంకరణాంబరావళులచేఁ గైసేసి యిష్టాన్నముల్
బంధుశ్రేణియు మీరలుం గుడిచి నా భాషారతిన్ వేడుకల్
సంధిల్లం గిరి గో ద్విజానల నమస్కారంబు [2]గావింపుఁ డో
జం ధర్మం బని తోఁచెనేని జనకా! [3]జన్మంబు ధన్యం బగున్. 887

వ. అని మఱియు, నిలింపపతి [4]పెంపు దింపు తలంపున, ని మ్మఖంబు తనకు సమ్మతం బని, గోవిందుండు పలికిన, నందాదులు మేలు మే లని, తద్వచన ప్రకారంబునం బుణ్యాహవాచనంబులు సదివించి, ధరణీసురులకు భోజనంబు లిడి, పసులకుం గసవు లొసంగిరి. అప్పుడు. 888

---

1. పగతు (హ) 2. గావింపుమా సద్ధర్మంబని తోచెనేని (హ); గావింపుమీ, సంధానం బొడ గూడె నేని (వ) 3. జన్మంబు (త జ. తం. వా.) 4. సొంపు (హా. తం. వా.)

మ. సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన నైజం బైన రూపంబుతో
నకలంకస్థితి నుండి శైల మిదె మీ రర్చింప రం డంచుఁ దా
నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో నొండొండఁ బూజించి గో
పక దత్తాన్నము లాహరించె విభుఁ డా ప్రత్యక్ష శైలాకృతిన్. 889

మ. వినుఁ డీ శైలము కామరూపి ఖలులన్ వేధించు నాజ్యాన్నముల్
మన మొప్పించిన నాహరించె మనలన్ మన్నించెఁ జిత్తంబులో
ననుకం పాతిశయంబు సేసె మనపై నంచున్ సగోపాలుఁ డై
వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ వందారు మందారుఁ డై. 890

వ. ఇట్లు గోపకులు హరిసమేతు లై, గిరికిం బూజనోపహారంబులు సమర్పించి, గోధనంబులం బురస్కరించుకొని, భూసురాశీర్వాద వచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు సేసిరి. ఆ సమయంబున. 891

క. గుఱ్ఱముల పరువు మెచ్చని, నఱ్ఱులఁ గట్టిన రథమ్ము నంద [1]ప్రముఖుల్
కుఱ్ఱల యార్పులు చెలఁగఁగఁ, దొఱ్ఱులగమి వెంటనంటఁ దోలి రిలేశా! 892

క. పాటించి గానవిద్యా, పాటవమునఁ దేరు లెక్కి బహుతానములన్
జాటల గంధులు కృష్ణుని, పాటలు వాడిరి విరోధిపాటనుఁ డనుచున్. 893

క. కుండనిభాపీనంబులు, మండిత [2]వర్ణములు వివిధ మహితాకృతులు
న్నిండిన కడుపులు గన్నుల, పండువులుగఁ జాడి [3]కుఱ్ఱి పదువులు నడచెన్. 894

క. పొగ రెక్కిన మూఁపురములుఁ, దెగ గల వాలములు శైలదేహంబులు భూ
గగనములు నిండు అంకెలు, మిగుల మెఱయు వృషభగణము మెల్లన నడచెన్.

వ. ఇట్లు పర్వత ప్రదక్షిణంబులుసేసి, గోపకులు మాధవసమేతు లై, మందకుం జనిరి.

## అధ్యాయము - ౨౫

అంత మహేంద్రుం డంతయు నెఱింగి, మహాకోపంబునఁ బ్రళయ ప్రవర్తకంబు లగు సంవర్తకాది మేఘంబులఁ జీరి యి ట్లనియె. 896

మ. పెరుఁగున్ నేతులు ద్రావి క్రొవ్వి భువి నాభీరుల్ [4]మదాభీరు లై
గిరిసంఘాత కఠోర పత్త్రదళన క్రీడాసమారంభ దు
ర్భర దంభోళిధరుం బురందరు ననుం జాటించి పూజింప క
గ్గిరికిం బూజలు సేసి పోయి రిదె పో కృష్ణుండు ప్రేరేఁపఁగన్. 897

---

1. వ్రజముల్ (హ) 2. కర్ణములు (ట) 3. కుఱ్ఱ పదువులు జరిగెన్ (హ) 4. మదాభీలులై (హ); మహాధీరులై (వ)

క. గురు దేవ హీను బాలుని, గిరి భుజ ప్రముఖవాసుఁ గృష్ణు ననీశున్
[1]బరిమాణ శీల కుల గుణ, విరహితుఁ జేపట్టి [2]యింద్రు విడిచిరి గొల్లల్. 898

ఆ. విమల ఘనతరాత్మ విజ్ఞానవిద్యచే
నిగుడ లేక యుడుప నిభము లగుచుఁ
గర్మమయము లయిన క్రతువుల భవ మహా
ర్ణవముఁ గడవఁ గోరినారు వీరు. 899

శా. ఉద్యత్సంపద నమ్మి నంద తన యోద్యోగమ్మునన్ వెఱ్ఱులై
మద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్వల్లులఁ గప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
సద్యోమృత్యువుఁ బొంద రా ల్గురియుఁడీ శౌర్యం బవార్యంబుగన్. 900

క. మీవెంట వత్తు నే నై, రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా
దేవగణంబులతోడను, గోవిందుని మంద లెల్లఁ గొందలపెట్టన్. 991

వ. అని యిట్లు పలికి, జంభవైరి సంరంభంబున దంభోళి ఝుళిపించి, బింకంబున శంకింపక కిన్కతోడ సంకెలలు విప్పించిన, మహానిల ప్రేరితంబులై చని, నందుని మందమీఁద నమోఘంబు లయిన మేఘంబులు మహౌఘంబులై పన్ని, ప్రచండగతిఁ జండమరీచిమండలంబుఁ గప్పి, దివి నిండి, దిశ లావరించి, రోదోంతరాళంబు నిరంతర నీరంధ్ర నిబిడాంధకార బంధురంబుగ నిరోధించి, బలిభంజన తృతీయ పాదపల్లవ భగ్నం బయిన బ్రహ్మాండభాండంబు చిల్లుల జల్లించినఁ, దొఱఁగు బహిస్సముద్ర సలిలనిర్ఝరంబుల వడువున నెడతెగక తోరంబు లయిన నీరధారలం గురియుచు, శిలలు వర్షింపుచుఁ, బిడుగులు ఱువ్వుచునుండ, మిట్టు పల్లంబులు సమతలంబు లయి, యేకార్ణవంబురూపు చూపిన, నందు దుడుకడుచుచు విలయ విశిఖ శిఖా సరంభ విజృంభమాణ విద్యుల్లతా విలోకనంబున రిమ్మలుగొని [3]సొమ్మలువోవు లేఁగలును, లేఁగలకు మూతు లడ్డంబు లిడి, ప్రళయ భైరవ భేరీ భాంకార భీషణంబు లగు గర్జనఘోషణంబులఁ జెవుడువడి చిందఱ వందఱ లైన డెందంబులం గంది, ప్రాలు ధేనువులును, ధేనువుల వెనుక నిడుకొని దురంత కల్పాంతకాల కీలి కరాళ [4]కాలకర విశాల గదాఘాత ప్రభూతంబు లయిన నిర్ఘాతపాతంబుల భీతంబులై, హరికి మ్రొక్కి, రక్ష రక్షేతి శబ్దంబులు సేయుచుకై వడి, విడువని జడిం బడి, సైరింపక, శిరంబులు వంచుకొని, గద్గదకంఠంబుల నంభారవంబులు సేయు వృషభంబులును, వృషభాది గోరక్షణంబు సేయుచు దుర్వార ఘోర శిలాసారంబుల సారంబులు నెడి, శరీరంబులు భారంబు లయిన

1. పరిణామశీలుఁ గులగుణ (తం. వా.) 2. నన్ను (చ) 3. సొమ్మసిల్లంబోవు (హ)
4. కాలకంఠకర (తం. వా.)

మ్రానువడు గోపకులును, గోపకులం [1]బట్టుక, దట్టం బయిన వానకొట్టునం బెట్టు వడి, బడుగునడుములు [2]నులుసువడ వడంకుచు, గోవిందునిం జీరు గోపికలును, గోపికాజన కఠిన కుచకలశ యుగళంబుల మఱుంగునం దలలు పెట్టుకొని, పరవశు లయిన శిశువులుం గలిగి, మహాఘోషంబులతోడ నష్టం బయిన ఘోషంబుఁ జూచి, ప్రబుద్ధు లయిన గోపవృద్ధులు కొందఱు దుర్జన శిక్షకుండును, దీనజన రక్షకుండును నయిన పుండరీకాక్షునకు మ్రొక్కి యి ట్లనిరి. 902

ఉ. అక్కట! వానఁ దోఁగి వ్రజ మాకుల మయ్యె గదయ్య! కృష్ణ! నీ
[3]విక్కడనుండి యింతతడ వేల సహించితి నీ పదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు దీనత నొంద భయాపహారి వై
గ్రక్కున గావ కి ట్లునికి కారుణికోత్తమ! నీకుఁ బాడియే. 903

క. ఈ యుఱుములు నీ మెఱుములు, నీ యశని విఘోషణములు నీ జలధారల్
నీ యాన తొల్లి యెఱుఁగము, కూ యాలింపం గదయ్య! గుణరత్ననిధీ! 904

క. వారి బరువయ్యె మందల, వారికి నిదె పరులు లేరు వారింపంగా
వారిదపటల భయంబును, వారిరుహదళాక్ష! నేఁడు వారింపఁగదే. 905

వ. అనిన విని, సర్వజ్ఞుం డైన కృష్ణుం డంతయు నెఱింగి.

ఉ. త న్నొకయింత గైకొనక [4]తప్పిరి యాగము సేసి రంచు దా
మిన్ను ననుండి గోపకులమీఁద శిలల్ గురియింపుచున్న వాఁ
డున్నత నిర్జరేంద్ర [5]విభవోత్థిత గర్వన గాధిరూఢుఁ డై
కన్నులఁ గానఁ డింద్రుఁ డిటు గర్వపరుం డొరుఁ గాన నేర్చునే. 807

క. దేవత లందఱు నన్నును, సేవింతురు రాజ్యమదముఁ జెందరు చెఱుపం
గావలదు మానభంగము, గావింపఁగ వలయు శాంతి గలిగెడుకొఱకై. 908

వ. అని చింతించి, శిలావర్షహతు లై, శరణాగతు లైన ఘోషజనుల రక్షించుట తగ వని, సకల లోక రక్షకుం డైన విచక్షణుండు. 909

చ. కలఁగకుఁడీ వధూజనులు కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్
తలఁగకుఁడీ కుమారకులు తక్కినవారలు రాలవానచే
[6]నలయకుఁడీ పశువ్రజము నక్కడ నక్కడ నిల్వనీకుఁడీ
మెలపున మీకు నీశ్వరుఁడు మే లొసఁగుం గరుణార్ద్రచిత్తుఁ డై. 910

వ అని పలికి. 911

---

1. బట్టుకొని (తం.వా.) 2. నునులువడ (తం.వా.) 3. వెక్కడనుంటివింత (హ.తం.వా)
4. తప్రృతి (హ) 5. విభవోచిత (హ) 6. నలఁగకుఁడీ (తం. వా.)

—: శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తుట :—

క. కిరి యై ధర యెత్తిన హరి, కరి సరసిజముకుళ మెత్తుగతిఁ ద్రిభువన శం
కరకరుఁ డై గోవర్ధన, గిరి యెత్తెం జక్క నొక్కకేల లీలన్. 912

క. దండిని బ్రహ్మాండంబులు, చెండులక్రియఁ బట్టి యెగరఁజిమ్మెడు హరికిన్
గొండఁ బెకలించి యెత్తుట, కొండొక పనిగాక యెక్క కొండా తలఁపన్. 913

వ. ఇట్లు గిరి యెత్తి. 914

శా. బాలుం డాడుచు నాతపత్ర మని సంభావించి పూగుత్తి కెం
గేలన్ దాల్చినలీల లేనగవుతోఁ గృష్ణుండు దా న మ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపుల చ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుత దుశ్శిలాచకిత గోపీగోప గోపంక్తికిన్. 915

వ. ఇట్లు గోత్రంబు ఛత్రంబుగాఁ బట్టి, గోపజనులకు గోపాలశేఖరుం డిట్లనియె. 916

క. రా తల్లి! రమ్మ తండ్రీ!, వ్రేతలు గోపకులు రండు వినుఁడీ గర్త
ఆత్మతలమున నుండుఁడు గో,వ్రాతముతో మీరు మీకు వలసిన యెడలన్. 917

శా. బాలుం డీతఁడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపఁగా
జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల దీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబు పైఁబడ్డ నా
కే లల్లాడదు బంధులార! నిలుఁ డీ క్రిందన్ బ్రమోదంబునన్. 918

వ. ఇట్లు పలుకుచున్న హరిపలుకులు విని, నెమ్మనముల నమ్మి, కొండయడుగునఁ దమతమ యిమ్ములం బుత్ర మిత్ర కళత్రాది సమేతు లై, గోవులుం, దారును, గోపజనులు, జనార్దన కరుణా విలోకనామృత వర్షంబున నాఁకలి నీరు దప్పుల చొప్పెఱుంగక, కృష్ణ కథావినోదంబుల నుండిరి. ఇవ్విధంబున. 919

మ. హరి దోర్దండము కామ గుబ్బ శిఖరం బాలంబి ముక్తావళుల్
పరఁగన్ జాఱెడు తోయబిందువులు గోపాలాంగనాపాంగ హా
సరుచుల్ రత్నచయంబు గాఁగ నచల చ్ఛత్రంబు శోభిల్లెఁ ద
ద్గిరిభి ద్దుర్మద భంజి యై జలధరా క్లిన్న ప్రజారంజి యై. 920

క. రాజీవాక్షునిచే నొక, రాజీవముభంగి శైలరాజము మెఱసెన్
రాజేంద్ర! మీఁద మధుకర, రాజిక్రియ మేఘరాజి రాజిల్లెఁ గడున్. 921

క. వడిగొని బలరిపు పనుపున, నుడుగక జడి గురిసె నే డహోరాత్రము ల
య్యెడ గోపజనులు బ్రతికిరి, జడిఁ దడియక గొండగొడుగు చాటున నధిపా!

వ. ఇట్లు హరి యేడహోరాత్రంబులు గిరి ధరియించిన, గిరిభేది విసిగి, వేసరి, కృష్ణుని చరితంబులు విని, వెఱఁగుపడి, విఫలమనోరథుం డై, మేఘంబుల మరలించుకొని చనియె. అంత నభోమండలంబు విద్యోతమాన ఖద్యోతమండలం బగుట విని, గోవర్ధనధరుండు గోపాలకుల కిట్లనియె. 923

క. ఉడిగెను వానయు గాలియు, [1]వడిచెడె నదులెల్లఁ [2]బొలపవఱద లిగిరెఁ గొం
డడుగున నుండక వెడలుఁడు, కొడుకులుఁ గోడండ్రు సతులు గోవులు మీరున్.

వ. అనిన విని, సకల గోపజనులు శకటాద్యుపకరణ సమేతు లై, గోవులుఁ, దారును గొండ యడుగు విడిచి వచ్చిరి. అచ్యుతుండును జెచ్చెరఁ దొల్లింటి యట్ల నిజ స్థానంబున గిరి నిలిపె. అంత వల్లవు లెల్లం గృష్ణుం గౌఁగిలించుకొని, సముచిత ప్రకారంబుల సంభావించి దీవించిరి. గోపికలు సేసలిడి, దధ్యన్న కబళంబు లొసంగుచు, నాశీర్వదించిరి. నంద బలభద్ర రోహిణీ యశోద లాలింగనంబు సేసి, భద్రవాక్యంబులు పలికిరి. సిద్ధ సాధ్య గంధర్వవరులు విరులు గురియించిరి. సురలు శంఖదుందుభులు మ్రోయించిరి. తుంబురు ప్రముఖు లయిన గంధర్వులు పాడిరి. అప్పుడు. 925

క. వల్లవకాంతలు తన కథ, లెల్లను బాడంగ నీరజేక్షణుఁ డంతన్
వల్లవజన సంయుతుఁ డై, యుల్లన గోష్ఠంబు సేరె నుర్వీనాథా ! 926

అధ్యాయము - ౨౬

వ. అ య్యవసరంబునఁ గృష్ణు చరిత్రంబులు తలంచి, వెఱఁగుపడి, గోపజనులు నందున కిట్లనిరి. 927

సీ. కన్నులు తెఱవని కడుఁ జిన్నపాపఁ డై [3]దానవిఁ జనుఁబాలు ద్రావి చంపె
మూఁడవ నెలనాఁడు ముద్దుల బాలుఁ డై కోపించి శకటంబుఁ గూలఁ దన్నె
నేఁడాది కుఱ్ఱఁ డై యెగసి తృణావర్తు మెడఁ బట్టుకొని కూల్చి మృతునిఁ జేసెఁ
దల్లి వెన్నలకు నై తను ఱోలఁ గట్టినఁ గొమరుఁ డై మద్దులఁ గూల నీడ్చెఁ

తే. బసులఁ గ్రేపులఁ గాచుచు బకునిఁ జీరె
వెలఁగతో వత్సదైత్యుని వ్రేసి చంపె
సబలుఁ డై ఖరదైత్యుని సంహరించె
నితఁడు కేవల మనుజుఁడే యెంచి చూడ. 928

క. తెంపరి యై రామునిచేఁ, జంపించెఁ బ్రలంబు మ్రింగెఁ జటుల దవాగ్నిన్
సొంపుచెడఁ ద్రొక్కి కాళియుఁ, ద్రుంపక కాళింది వెడలఁ దోలెన్ లీలన్. 929

---

1. వడిచెడి (హ. వా.) 2. బొలువ (హ) 3. దానవి చనుఁ బాలు (తం. వా.)

క. ఏ డేండ్ల బాలుఁ డెక్కడ, క్రీడం గరి తమ్మి యెత్తుక్రియ నిందఱముం
జూడ గిరి యెత్తు టెక్కడ, వేడుక నొకచేత నేఁడు వెఱఁగౌఁ గాదే. 930

క. ఓ నంద ! గోపవల్లభ !, నీ నందనుఁ డాచరించు నేర్పరి తనముల్
మానవులకు శక్యంబులె, మానవ మాత్రుండె నీ కుమారుఁడు తండ్రీ ! 931

వ. అనిన విని, నందుండు వారలం జూచి, మున్ను దనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబు తెలిపి, శంక లేదు. కృష్ణుండు లోకరక్షకుం డైన పుండరీకాక్షుని నిజాంశ మనుచు నంతరంగంబున జింతింతు.” అని పలికిన, వెఱఁగుపడి, గోపకులు కృష్ణుం డనంతుం డని పూజించిరి. అంత. 932

అధ్యాయము - ౨౭

మ. హరి కేలన్ గిరియెత్తి వర్ష జల భిన్నాభీర గోరాజికిన్
శరణం బైనఁ ద్రిలోకరాజ్య మదముం జాలించి నిర్గర్వుఁ డై
సురభిం గూడి బలారి వచ్చి కనియెన్ సొంపేది దుష్ట ప్రజే
శ్వర దుర్మాన నిరాకరిష్ణుఁ గరుణా వర్ధిష్ణు శ్రీకృష్ణునిన్. 933

క. కని యింద్రుఁడు పూజించెను, దినకరనిభ నిజకిరీట దీధితిచేతన్
మునిహృ ద్దలంకరణంబులు, సునతోద్ధరణములు నందసుతు చరణంబుల్. 934

వ. ఇట్లు నమస్కరించి, కరకమలంబులు ముకుళించి, హరికి హరిహయుం డి ట్లనియె.

సీ. పరమ ! [1]నీ ధామంబు భాసుర [2]సత్త్వంబు శాంతంబు హత రజస్తమము నిత్య
మధిక తపోమయ మట్లు గావున మాయ నెగడెడి గుణములు నీకు లేవు
గుణహీనుఁడవు గాన గుణముల నయ్యెడి లోభాదికములు నీలోనఁ జేర
వైన దుర్జననిగ్రహము శిష్టరక్షయుఁ దగిలి సేయఁగ దండధారి వగుదు

తే. జగము భర్తవు గురుఁడవు జనకుఁడవును
జగ దధీశుల మను మూఢజనులు తలఁక
నిచ్చపుట్టిన రూపంబు లీవు దాల్చి
హితము సేయుదు గాదె లోకేశ్వరేశ! 936

క. నావంటి వెట్టివారిని, శ్రీవల్లభ ! నీవు శాస్తి చేసితి వేనిం
గావరము మాని పెద్దల త్రోవల జరుగుదురు బుద్ధితోడుత నీశా ! 937

క. ఒక్కొకలోకముఁ గాచుచు, నెక్కుడు గర్వమున నేమె యీశుల మనుచున్
జొక్కి నను బోఁటి వెట్టులు, నిక్కము నీ మహిమఁ దెలియనేర రనంతా ! 938

---

1. నిధానంబు (హ) 2. త త్త్వంబు (హ)

ఆ. వాసుదేవ! కృష్ణ! వరద! స్వతంత్ర! వి
జ్ఞానమయ! మహాత్మ! సర్వపుణ్య
పురుష! నిఖిలబీజ భూతాత్మక బ్రహ్మ!
నీకు వందనంబు నిష్కలంక! 939

శా. నీ సామర్థ్య మెఱుంగ మేఘములచే నీ ఘోషముం భీషణో
గ్రాసారంబున ముంచితిన్ మఖము నాకై వల్లవుల్ సేయ రం
చో సర్వేశ! భవన్మహత్త్వమున నా యుద్యోగ మిట్లయ్యె నీ
దాసుం నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ దర్శింపవే మాధవా! 940

మ. నిను బ్రహ్మాదు లెఱుంగలేరు జడతానిష్ఠుండ లోకత్రయా
వన దుర్మాన గరిష్ఠుఁడన్ విపుల దుర్వైదుష్య భూయిష్ఠుఁడన్
వినయత్యాగ[1] కనిష్ఠుఁడన్ గుజన గర్విశ్రేష్ఠుఁడన్ దేవ! నీ
ఘన లీలావిభవంబు పెంపు దెలియంగా నెవ్వఁడన్ సర్వగా! 941

వ. అనిన విని, నగుచు, జలధర గంభీరరవంబున శక్రునకుం జక్రి యిట్లనియె. 942

మ. అమరాధీశ్వర! లక్ష్మితోఁ దగిలి యిట్లంధుండ వై యున్న నీ
సమదోద్రేకముఁ ద్రుంచివైచుటకు నీ జన్నంబుఁ దప్పించితిన్
[2]ప్రమదశ్రీకుఁడు దండధారి నగు నన్ [3]భావింపఁ డెవ్వాని ని
క్కము రక్షింపఁ దలంతు వాని నధనుం గావింతు జంభాంతకా! 943

క. నా యాజ్ఞ సేయుచుండుము, నీ యధికారంబునందు నిలువు సురేంద్రా!
శ్రీయుతుఁడ వై మదింపకు, శ్రేయంబులు గల్గుఁ బొమ్ము సితకరిగమనా!

వ. అని యిట్లు జిష్ణునిన్ బల్కుచున్న కృష్ణునికి మ్రొక్కి గోగణసమేత యైన కామధేనువు భక్తజన కామధేను వైన యీశ్వరున కిట్లనియె. 947

క. విశ్వేశ! విశ్వభావన! విశ్వాకృతి! యోగివంద్య! విను నీచేతన్
శాశ్వతుల మైతి మిప్పుడు, శాశ్వతముగఁ గంటి మధికసౌఖ్యంబు హరీ! 946

వ. దేవా! మాకుం బరమ దైవతంబవు. ఇంద్రుండవు. భూసుర గో సుర సాధు సౌఖ్యంబుకొఱకు ని న్నింద్రునిం జేసి, పట్టము గట్టుమని, విరించి నియమించి పుత్తెంచె. నీవు భూతల భూరిభార నివారణంబు సేయ నవతరించిన హరివి. అని పలికి యంత. 947

---

1. వరిష్ఠుఁడన్ (తం. వా.); వరిష్ఠ—శబ్దమునకును తక్కువవాఁ డన్న యర్థము కలదు.
2. ప్రమద శ్రీరతదండధారియగునన్ భావింపఁడు (హ); ప్రమదశ్రీకులు దండధారి నగునన్ భావింపరు(తం.వా.) 3. భావింపఁ డెవ్వాఁడు ని,క్కము రక్షింపఁ దలంతు (హ); "మామైశ్వర్య శ్రీమదాంధో దండపాణిం నపశ్యతి, తం భ్రంశయామి సంపద్భ్యో యస్య వాంఛా మ్యనుగ్రహమ్" (27-16)

మ. సురభిక్షీరములన్ సురద్విప మహాశుండాలతానీత ని
ర్జర గంగాంబువులన్ నిలింపజననీ సన్మౌని సంఘంబుతో
సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁ డం
చు రణాక్రాంత విపత్తుఁ దోయజదళాతున్ సాధుసంరక్షణున్. 948

సీ. తుంబురు నారదాదులు సిద్ధ చారణ గంధర్వులును హరికథలు పాడి
రమరకాంతలు మింట నాడిరి వేల్పులు గురియించి రంచిత కుసుమవృష్టి
జగములు మూఁడును సంతోషమును బొందె గుబ్బులు చన్నులఁ గురిసెఁ బాలు
నవజలంబులతోడ నదులెల్లఁ బ్రవహించె నిఖిలవృక్షములు తేనియలు వడిసె

తే. సర్వలతికల ఫల పుష్పచయము లమరెఁ
బర్వతంబులు మణిగణ ప్రభల నొప్పెఁ
బ్రాణులకు నెల్లఁ దమలోని పగలు మానె
వాసుదేవుని యభిషేక వాసరమున. 949

వ. ఇట్లు గోప గోగణ పతిత్వంబునకు గోవిందు నభిషిక్తుం జేసి, వీడ్కొని, పురంద రుండు దేవగణంబులతో దివంబున కరిగె. అంత. 950

అధ్యాయము - ౨౮

—: శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుండి కొనితెచ్చుట :—

సీ. నందుఁ డేకాదశినాఁ డుపవాసంబు చేసి శ్రీహరిపూజ చేసి దనుజ
వేళ యెఱుంగక వేగక మున్నఱ ద్వాదశీస్నానంబు తగ నొనర్ప
యమునాజలము సొర నం దొక్క దైత్యుండు నందుని వరుణుని నగరమునకుఁ
గొనిపోవఁ దక్కిన గోపకు లందఱు నందగోపకునిఁ గానక కలంగి

తే. రామకృష్ణులఁ బేర్కొని రవము సేయఁ
గృష్ణుఁ డీశుండు తమ తండ్రిఁ గికురుపెట్టి
వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు
టెఱిఁగి రయమున న చ్చోటి కేఁగె నధిప! 951

వ. అప్పుడు. 952

క. వచ్చిన మాధవుఁ గనుఁగొని, చెచ్చెర వరుణుండు పూజచేసి వినతుఁ డై
యచ్చుగ నిట్లని పలికెను, విచ్చేసితె దేవ! నా నివేశంబునకున్. 953

ఉ. ఏ విభు పాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెం
ద్రోవఁ జరింతు రట్టి బుధతోషక! నీ వరుదెంచుటం బ్రమో
దావృత మయ్యెఁ జిత్తము కృతార్థత నొందె మనోరథంబు నీ
సేవఁ బవిత్రభావమును జెందె శరీరము నేఁడు మాధవా! 954

ఉ. ఏ పరమేశ్వరున్ జగము లిన్నిటిఁ గప్పిన మాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక! యట్టి నీకు ను
ద్దీపిత భద్రమూర్తికి సుధీజన రక్షణ వర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద నుదార తపోధన చక్రవర్తికిన్. 955

చ. ఎఱుఁగఁడు వీఁడు నా భటుఁ డొకించుక యైన మనంబులోపలన్
దెఱకువ లేక నీ జనకుఁ దెచ్చె దయం గొనిపొమ్ము ద్రోహమున్
మఱవుము నన్ను నీ భటుని మన్నన సేయుము నీదు సైరణన్
వఱలుదు గాదె [1]యో జనకవత్సల! నిర్మల! భక్తవత్సలా! 956

వ. అని యిట్లు పలుకుచున్న వరుణునిం గరుణించి, తండ్రిం దోడ్కొని, హరి తిరిగి వచ్చె. అంత నందుండు తన్ను నెన్నఁడు వరుణనగరంబున నుండ విడిపించి తెచ్చిన వృత్తాంతం బంతయు బంధువుల కెఱింగించిన, వారలు కృష్ణుం డీశ్వరుం డని తలంచిరి. అఖిలదర్శనుం డయిన యీశ్వరుండు వారల తలం పెఱింగి, వారి కోరిక సఫలంబు సేయుదు నని వారి నందఱిని బ్రహ్మహ్రదంబున ముంచి యెత్తి. 957

ఆ. [2]ప్రకృతిఁ గామకర్మపరవశ మై యుచ్చ
నీచగతులఁ బొంది నెఱయ భ్రమసి
తిరుగుచున్న జనము తెలియనేరదు నిజ
గతివిశేష మీ జగంబునందు. 958

మ. అని చింతించి దయాళుఁ డై న హరి మాయాదూర మై జ్యోతి యై
యనిరూప్యం బయి సత్య మై [3]యెఱుక యై యానంద మై బ్రహ్మ మై
యనఘాత్ముల్ గుణనాశ మందుఁ గను నిత్యాత్మీయ లోకంబు గ్ర
క్కునఁ జూపెన్ గరుణార్ద్రచిత్తుఁ డగుచున్ గోపాలక శ్రేణికిన్. 959

వ. ఇట్లు హరి మున్నక్రూరుండు పొందిన లోక మంతయుఁ జూపి, బ్రహ్మలోకంబునుం జూపినం జూచి, నందాదులు పరమానందంబునుం బొంది, వెఱఁగుపడి, హంసస్వరూపకుఁ డైన కృష్ణునిం బొడగని, పొగడి, పూజించిరి. అంత.

---

1. యోగిజనవత్సల (క. ద.) 2. ప్రకృతికామకర్మ (తం. వా.) 3. యతులమై (చ)

అధ్యాయము - ౨౯

—: శరద్రాత్రియందు గోపికలు గానముచేసెడు శ్రీకృష్ణుని సన్నిధికి వచ్చుట :—

చ. కలువలమేలి కందువలు కాముని కయ్యపుఁ [1]శాలెముల్ విర
క్తులు తల డించువేళలు చకోరకపంక్తుల భోగకాలముల్
చెలువలు సైరణల్ విడిచి చిక్కుతఱుల్ ఘన చంద్ర చంద్రికా
జ్వలిత దిశల్ శరన్నిశలు జారకదుర్దశ లయ్యె న య్యెడన్. 561

ఆ. కామతంత్ర టీక కలువల జోక కం
దర్పు డాక విటుల తాల్మిపోక
చకిత చక్రవాక సంప్రీతిజన లోక
రాక వచ్చె మేలురాక యగుచు. 562

క. పతి తనకరముల కుంకుమ, సతిమొగమున నలఁదుభంగి సముదయ వేళాం
చిత కరరాగమున నిశా, పతి రంజించెన్ నరేంద్ర! ప్రాక్సతిమొగమున్. 963

సీ. [2]విటసేనపై దండు వెడలెడు వలరేని గొల్లెనపై హేమకుంభ మనఁగఁ
గాముక ధృతి వల్లికలు ద్రెంప నెత్తిన శంబరాంతకు చేతి చక్ర మనఁగ
మారుండు పాంథుల మానాటవులు గాల్పఁ గూర్చిన నిప్పులకుప్ప యనఁగ
విరహిణీ మృగముల వేఁటాడ మదనుండు దెచ్చిన మోహన దీప మనఁగ

ఆ. వింతనునుపు గల్గి వృత్తమై యరుణమై
కాంతితోఁ జకోరగణము లుబ్బఁ
బొడుపుఁ గొండ చక్కిఁ బొడిచె రాకాచంద్ర
మండలంబు గగనమండలమున. 964

వ. ఇట్లు పొడమిన నవకుంకుమాంకిత [3]రమా ముఖ మండలంబునుం బోలె నఖండం బైన చంద్రమండలంబుం బొడగని, పుండరీకనయనుండు యమునాతట వనంబున జగన్మోహనంబుగ నొక్క గీతంబు వాడిన, విని, పరాయత్తచిత్తలై, తత్తరంబున ప్రేతలు పనులకుం జేతు లాడకయు, గోవులకుం గ్రేపుల విడువకయు, విడిచి విడిచి యీాడకయు, నీడి యీాడి యీాడినపాలు కాఁపకయుఁ, గాఁచి కాఁచియుఁ గాఁగిన పాలు డింపకయు, డించి డించియు డించినపాలు బాలురకుం బోయకయుఁ బోసి పోసియుఁ బతులకుఁ జరిచర్యలు సేయకయుఁ, జేసి చేసియు నశనంబులు గుడువకయుఁ, గుడిచి కుడిచియుఁ,

1. బాణముల్ (హ) 2. విరహులపై (క. చ. ట. త. వ.) 3. రమాముఖర మండల మండితం బైన చంద్రమండలంబు (హ)

గుసుమంబులు ముడువకయు, ముడిచి ముడిచియుఁ, దొడవులు దొడుగకయుఁ, దొడిగి తొడిగియు గోష్ఠంబుల పట్టుల నుండకయుఁ, బాయసంబుల నెఱయ వండకయు, న య్యా వ్యేడల నిలువంబడకయుఁ, గాటుకలు సూటి నిడకయుఁ గురులు చక్కనొ త్తకయుఁ,గుచంబుల గంధంబులు కలయ మె త్తకయుఁ, బయ్యె దలు విప్పి కప్పకయు, సఖులకుం జెప్పకయు, సహోదరులు, మగలు, మామలు, మఱఁదులు, బిడ్డలు, నడ్డంబుచని, నివారింపం, దలారింపకయు, సంచలించి, పంచ భల్లుని భల్లంబుల మొల్లంపు జల్లులపెల్లునం దల్లడిల్లి, డిల్లపడి, మొగుళ్ళగమి వెలువడి యుల్లసిల్లు తటిల్లతల పొందున, మందగమన లమందగమనంబుల మందలు వెలువడి, గోవింద సందర్శనంబునకుం జనిరి. అప్పుడు. 965

మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీథిన్ విభున్ మాధవున్
బరిరంభంబులు సేసి జారుఁ డనుచున్ భావించియున్ జొక్కి పొం
దిరి ము క్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీతిన్ బంధనిర్ము క్త లై. 966

వ. అనిన నరేంద్రుం డి ట్లనియె. 967

క. జారుఁ డని కాని కృష్ణుఁడు, భూరి పరబ్రహ్మ మనుచు బుద్ధిఁ దలంపన్
నేరరు గుణమయ దేహము, లేరీతిన్ విడిచి రింతు లెఱిఁగింపు శుకా! 968

వ. అనిన శుకుం డి ట్లనియె. 969

మ. మును నేఁ జెప్పితిఁ జక్రికిం బగతుఁ డై మూఢుండు చైద్యుండు పెం
పునఁ గై వల్యపదంబు నొందెఁ బ్రియ లై పొందంగ రా కున్నదే
యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుం డై నట్టి గోవిందు మూ
ర్తి నరశ్రేణికి ము క్తిదాయిని సుమీ తెల్లంబు భూవల్లభా! 970

ఆ. బాంధవమున నై నఁ బగ నై న వగ నై నఁ
బ్రీతి నై నఁ బ్రాణభీతి నై న
భ క్తి నై న హరికిఁ బరతంత్రు లై యుండు
జనులు మోక్షమునకుఁ జనుదు రధిప! 971

వ. అటు గావునఁ బరమపురుషుండు నజుండు యోగీశ్వరేశ్వరుం డై న హరిని సోఁకిన స్థావరం బై న ము క్తం బగు. వెఱఁగుపడ వలవదు. ఇ వ్విధంబున. 972

క. ఘన మధురగీత నినదము, విని వచ్చిన గోపికలను వీక్షించి నయం
బున మేటిసుగుణి నేర్పరి, తన వాగ్వైభవము మెఱసి తగ ని ట్లనియెన్. 973

ఉ. మేలా మీకు భయంబు పుట్టదుగదా మీ మందకుఁ సింహ శా
ర్దూలానేకప ముఖ్యముల్ దిరిగెడిఁ దూరంబు లేతెంతురే
[1]యేలా వచ్చితి రీ నిశాసమయమం దిచ్చోట వర్తింతురే
చాలుం జాలు లతాంగులార ! చనుఁడీ సంప్రీతితో మందకుఁ. 974

శా. మీ రేతెంచిన జాడఁ గానక వగఁ మీ తల్లులుం దండ్రులుఁ
మీ రాముల్ మఱఁదుల్ తనూజులు గురుల్ మీ సోదరుల్ బంధువుల్
మేరల్ మీఱిరి లేరు పోయి రనుచుఁ మీ ఘోషభూభాగమం
దేరీతిం బరికించిరో తగవులే యీ సాహసోద్యోగముల్. 975

చ. ఇలువడి సున్నచేసి హృదయేశుల సిగ్గులువుచ్చి యుత్తమా
మల నెరియించి సోదరుల మానము నూఱలువుచ్చి తల్లిదం
డ్రుల రుచి మాన్చి బంధులకు రోఁత యొనర్చుచు జారవాంఛలఁ
వలనటి సత్కులాంగనలు వత్తురె ? లోకులు సూచి మెత్తురే. 976

సీ. ప్రాణేశుఁ డెటిఁగినఁ బ్రాణంబునకుఁ దెగు దండించు నెటిఁగిన ధరణి విభుఁడు
మామ యెటింగిన మనువెల్లఁ జెడిపోవుఁ దలవరి యెటిఁగినఁ దగులు సేయు
దలిదండ్రు లెటిఁగినఁ దలలెత్త కుండుదు రేరా లెటింగిన నెత్తిపొడుచు
నాత్మజు లెటిఁగిన నాదరింపరు చూచి బంధువు లెటిఁగిన బలిసి చెఱుతు

ఆ. రితరు లెటిఁగి రేని నెంతయుఁ జులుకఁగాఁ
జూతు రిందు నందు సుఖము లేదు
యశము లేదు నిర్భయానందమును లేదు
జారుఁ జేరఁ జనదు చారుముఖికి. 977

క. నడవడి కొఱగా కున్నను, బడుగైనఁ గురూపి యైనఁ బామరుఁ డైనఁ
జడుఁ డైన రోగి యైనను, విడుచుట మర్యాద కాదు విభు నంగనకుఁ, 978

చ. ఇది యమునానదీ జలసమేధిత పాదప పల్లవ ప్రసూ
న దళ విరాజితం బగు వనంబు మనంబులు మేర దప్పెనో
[3]పొదఁ డటు నేడ్చు బిడ్డలకుఁ బోయుఁడు పాలు విడుండు లేఁగలఁ
మొదవులకుఁ నిజేశ్వరుల ముద్దియలార ! భజింపుఁ డొప్పుగఁ. 979

చ. వనితలు నన్నుఁ గోరి యిట వచ్చితి రింత కొఱంత లేదు మే
లొనరె సమస్త జంతువులు నోలిఁ బ్రియంబులు గావె నాకు నై
నను నిలువంగఁ బోలదు సనాతన ధర్మము లాఁడువారికిం
బెనిమిటులఁ భజించుటలు పెద్దలు సెప్పుచునుందు రెల్లెడఁ. 980

1. మేలా (హ) 2. బహి యొనర్తు (తం. వా. క. చ. ట.) 3. పొదుగిట నేడ్చు (వా)

క. ధ్యానాకర్ణన దర్శన, గానంబుల నా తలంపు గలిగినఁ జాలుఁ
బూనెదరు కృతార్థత్వము, మానవతుల్ చనుఁడు మరలి మందిరములకుఁ, 981

వ. అని పలికిన విని. 982

సీ. విరహాగ్ని శిఖలతో వెడలు నిట్టూర్పుల ముమ్మరంబులఁ గంది మోవు [1]లెండఁ
గన్నుల వెడలెడి కజ్జలధారలు కుచకుంకుమంబుల [2]గ్రొబ్బి పాఱఁ
జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి మోముఁదమ్ముల మేలి మురువు [3]డిందఁ
బోరిఁబోరిఁ బుంఖానుపుంఖంబులై తాఁకు మదనుకోలల ధైర్య[4]మహిమ లెడల

తే. దుఃఖభరమున మాటలు తొట్రుపడఁగఁ
బ్రియము లాడని ప్రియుఁ జూచి బెగ్గడిల్లి
చరణములు నేల వ్రాయుచు సంభ్రమమునఁ
గాంత లెల్లను వగల నాక్రాంత లగుచు. 983

వ. ఇట్లనిరి. 984

మ. అకటా! నమ్మితి మేము క్రూరుఁ డన నిన్నర్థంబె మా యుండ్లలో
సకలవ్యాప్తుల డించి నీ పదసరోజాతంబు లర్చింపఁ జి
క్కక యేతెంచితి మీశుఁ డాఢ్యుఁడు ముముక్షాసక్తులం గాచు పో
ఱికఁ గావం దగుఁ గావవే విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్. 985

మ. పతులన్ బిడ్డల బంధులన్ సతులకున్ బాటించుటే ధర్మప
ద్ధతి [5]యటౌనంటివి దేహధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా
పతి పుత్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీ యందుఁ ద
త్పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే! 986

మత్తకోకిల. నీపయిన్ రతి సేయుచుందురు నేర్పరుల్ సతత ప్రియో
ద్దీపకుండవు గాన నెవ్వగఁ దెచ్చు నాథ సుతాదులన్
జూప నేటికి మన్మహాశలు [6]సుట్టి నీ కడ నుండఁగాఁ
బాప నేల మదీయ తాపముఁ బాపఁ బోలుఁ గృపానిధీ! 987

సీ. నీ పాదకమలంబు నెమ్మి డగ్గఱఁ గాని తరలి పోవంగఁ బాదములు రావు
నీ కరాబ్జంబులు నెఱి నంటి[7] తివఁ గాని తక్కిన పనికి హస్తములు చొరవు
నీ వాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని చెవు లన్యభాషలఁ జేరి వినవు
నీ సుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని చూడ వన్యంబులఁ జూడ్కి[8]కవలు

1. మోములెండ(హ) 2. గ్రుచ్చిపార(హ) 3. డింప(హ) 4. మహిమలెడల(హా); మహిమ లెదర (వా) 5. నీవంటివి (వ) 6. చుట్టి (హ) 7. తినఁగాని (తం) 8. కనులు (తం)

ఆ. నిన్నె కాని పలుకనేరవు మా జిహ్వ
లొల్ల ననుచుఁ బలుక నోడ వీవు
మా మనంబు [1]లేల మఱపి దొంగిలితివి
యేమి సేయువార మింకఁ గృష్ణ! 988

చ. సిరికి నుదార చిహ్నములఁ జేయు భవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర! మా తపము సంపదఁ జేరితి మెట్టకేలకున్
మరలఁగ లేము మా మగలమాటల నొల్లము పద్మగంధముల్
మరఁగిన తేటు లన్య[2]కుసుమంబుల చెంతలఁ జేరనేర్చునే. 989

ఆ. సవతు లేక నీ విశాల వక్షఃస్థలిఁ
దులసితోడఁ గూడఁ దోయజాక్ష!
మనుపు మనుచు [3]నెపుడు మాకాంత నీ పాద
కమల రజముఁ గోరుఁ గాదె కృష్ణ! 990

ఉ. అత్తలు మామలున్ వగవ [4]నాడిక కోడక నాథులన్ [5]ద్రపా
యత్తులఁ జేసి యిల్వరుస [6]లాఱడివోవఁగ నీదు నవ్వులన్
మెత్తని మాటలన్ మరుఁడు [7]మేకొని యేఁచిన వచ్చినార మే
పొత్తుల నొల్ల మో పురుషభూషణ! దాస్యము లిచ్చి కావవే. 991

మ. మగువల్ చిక్కరె తొల్లి వల్లభులకున్ మన్నించి తద్వల్లభుల్
మగపంతంబు తలంపరే తగులముల్ మాపాలనే పుట్టెనే
మగవా రాడెడి మాటలే తగవు నీ మాటల్ మనోజాగ్నిచేఁ
బొగలం జాలము కౌఁగిలింపుము మముం బుణ్యంబు పుణ్యాత్మకా. 992

ఉ. కుండలదీప్త గండమును గుంచిత కుంతలఫాలమున్ సుధా
మండిత వల్లవాధరము మంజుల హాసవిలోకనంబునై
యుండెడు నీ ముఖంబుఁ గని యుండగవచ్చునె మన్మథేషు కో
దండ విముక్త బాణముల దాసల మయ్యెద మాదరింపవే. 993

సీ. నీ యధరామృత నిర్ఝరంబులు నేఁడు చేరి వాతెఱలపైఁ జిలుకకున్న
నీ విశాలాంచిత నిర్మల వక్షంబుఁ గుచకుట్మలంబులఁ గూర్పకున్న
నీ రమ్యతర హస్త నీరజాతంబులు చికురబంధంబులఁ జేర్పకున్న
నీ కృపాలోకన నివహంబు మెల్లన నెమ్మొగంబులమీఁద నెఱపకున్న

---

1. లెల్ల (తం. వా.) 2. కుసుమంబులకుం జననిచ్చయించునే (తం) 3. నైన (హ) 4. నారడి (హ) 5. వగాయత్తుల (హ); కుగాయత్తుల (తం.వా.) 6. లారడిఁబోవఁగ (హ); లాఱడిఁబోవగ (తం.) 7. మేల్కొని (హ)

ఆ. నీ నవీన మాననీయ సల్లాపంబు
కర్ణరంధ్ర దిశలఁ గప్పకున్న
నెట్లు బ్రతుకువార మెందుఁ జేరెడువార
మధిప! వినఁగఁ దగదె యాఁడు కుయులు. 994

మ. భవదాలోకన హాస గీతజము లై భాసిల్లు కామాగ్నులన్
భవదీ యాధర పల్లవామృతముచేఁ బాపన్ దగున్ బాపవే
ని వియోగానల హేతిసంహతులచే నీఱై భవచ్చింతలన్
భవదంఘ్రి ద్వయవీథిఁ బొందెదము నీ పాదంబు లానన్ బ్రియా! 995

క. తరు మృగ ఖగ గోగణములు, కర మొప్పెడు నిన్నుఁ గన్న గానము విన్నన్
గరఁగి పులకించు నబలలు, కరఁగరె నినుఁ గన్న నీదు గానము విన్నన్. 976

సీ. ఈ పంచబాణాగ్ని నేమిట నార్తుము నీ మంజు వాగ్వృష్టి నెగడదేని
నీ మన్మథాంబోధి నేత్రోవఁ గడతుము నీ దృష్టి నావ యై నిలువదేని
నీ చిత్తజధ్వాంత మేజాడఁ జెఱుతుము నీ హాసచంద్రిక నిగుడదేని
నీ దర్పకజ్వర మేభంగి నణఁగు నీ యధరామృ తౌషధ మబ్బదేని

ఆ. ఎట్లు నిర్వహింతు మేలాగు మాలాగు
కరుణ సేయవేనిఁ గదియవేని
మరుఁడు నిర్దయుండు మన నిచ్చునే యశో
దాకుమార! యువతి ధైర్యచోర! 998

క. అమరులఁ గాచిన హరి క్రియఁ, గమలేక్షణ! నీవు నేఁడు కరుణ నభయహ
స్తము మా యురముల శిరములఁ, బ్రమదంబున నిడుము మూర్ఛ పాల్పడకుండన్.

క. కట్టా! తలమునుకలు నై, దట్టపు [2]విరహాగ్ని శిఖలు తరుణుల వేఁప
[3]న్నెట్టుం బలుకవు చూడవు, [4]కట్టిఁడివి గదా కుమార! కరుణోదారా! 999

వ. అని యిట్లు కుసుమశరుని శరపరంపరా పరవశ లై, యోపికలు లేక పలికిన గోపికల దీనాలాపంబులు విని, నవ్వి యోగీశ్వరేశ్వరుం డైన కృష్ణుం డాత్మారాముం డై, వారలతో రమించె. అప్పుడు. 1000

---

1. నడఁతుము, నీ నవాధరసుధ నింపవేని (తం. వా.)

2. విరహాబ్ధి తెరలు తరుణుల నేఁపన్ (తం); ....నేఁచన్ (వా) 3. ఎట్టుం దరిజేర్పవయో (తం. వా) 4. కట్టిడివి (హ)

మ. కరుణాలోకములం బటాంచల కచాకర్షంబులన్ మేఖలా
కర బాహు స్తన మర్దనంబుల నఖాంక వ్యాప్తులన్ నర్మవా
క్పరిరంభంబుల మంజులాధర సుధాపానంబులన్ గాంతలన్
గరఁగించెన్ రతికేళిఁ గృష్ణుఁడు కృపన్ గందర్పుఁ బాలార్చుచున్. 1001

క. మక్కువ వికసిత వదనలు, చక్కఁగఁ దనుఁ గొల్వ హాసచంద్రికతోడన్
మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు, చుక్కలగమి నడిమి పూర్ణసోముని భంగిన్. 1002

ఆ. సతులు దన్నుఁ బాడ సంప్రీతి నాడుచు
నలుత నున్న వైజయంతితోడ
వనజలోచనుండు వనభూషణుం డయ్యె
యువతిజన శతంబు లోలిఁ గొలువ. 1003

వ. అంత. 1004

ఉ. చిక్కక యూళుఁ దై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడి మాయలానికిన్
జిక్కి కృతార్థ లై మరుని చిక్కులఁ జొక్కి లతాంగు లుండఁగా
మక్కువ శాంతిసేయుటకు మన్ననసేసి ప్రసన్నుఁ డౌటకున్
జక్కన నా విభుండు గుణశాలి తిరోహితుఁ డయ్యె న య్యెడన్. 1005

## అధ్యాయము - ౩౦

వ. ఇట్లు హరి, కనుమొఱంగి చనిన, కరిం గానక తిరుగు కరేణుల పెల్లున, నుల్లం బులు దల్లడిల్ల, వల్లవకాంతలు తదీయ గమన హాస విలాస వీక్షణ విహార వచన రచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి, వివిధ చేష్టలకుం బాల్పడి, తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ నని, కృష్ణగుణావేశంబులం జరియించుచు.

క. [1]భూతములలోన వెలిఁ బ్ర, ఖ్యాతుం డగునట్టివానిఁ గాంతలు కాళిం
దీతీర వనాంతరముల, భ్రాంతిన్ వెదకంగఁ జనిరి పాడుచు నధిపా! 1007

సీ. పున్నాగ! కానవే పున్నాగవందితుఁ దిలకంబ! కానవే తిలకనిటలు
ఘనసార! కానవే ఘనసారశోభితు బంధూక! కానవే బంధుమిత్రు
మన్మథ! కానవే మన్మథాకారుని వంశంబ! కానవే వంశధరునిఁ
జందన! కానవే చందనశీతలుఁ గుందంబ! కానవే కుందరదను

తే. నింద్రభూజమ! కావవే యింద్రవిభవుఁ
గువలవృక్షమ! కానవే కువలయేశుఁ
బ్రియకపాదప! కానవే ప్రియవిహారు
ననుచుఁ గృష్ణుని వెదకి ర య్యబ్జముఖులు. 1008

వ. మఱియును. 1009

ఉ. నల్లనివాఁడు పద్మ నయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళి పరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబు దెచ్చె నో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గదమ్మ! చెప్పరే. 1010

ఉ. అంగజు నైనఁ జూడ హృదయంగముఁ జై కరఁగించువాఁడు శ్రీ
రంగ దురంబువాఁడు మధురం బగు వేణురవంబువాఁడు మ
మ్మంగజు పువ్వుఁదూపులకు నగ్గము చేసె లవంగ లుంగ నా
రంగములార! మీకడకు రాఁడుగదా! కృప నున్నఁ జూపరే. 1011

సీ. మానినీమన్మథు మాధవుఁ గానరే సలలితోదార వత్సకములార!
సలలితోదార వత్సకవైరిఁ గానరే సుందరోన్నత లతార్జునములార!
సుందరోన్నత లతార్జునభంజుఁ గానరే ఘనతర లస దశోకంబులార!
ఘనతర లసదశోక స్ఫూర్తిఁ గానరే నవ్య రుచిర కాంచనంబులార!

ఆ. నవ్య రుచిర కాంచన కిరీటుఁ గానరే
గహనపదవి కురువకంబులార!
గహనపదవి కురువకనివాసిఁ గానరే
గణికలార! చారు గణికలార! 1012

సీ. అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ జాటలీతరులార! పట్టరమ్మ!
హేలావతులఁ గృష్ణ! యేల పాసితి వని యైలేయ లతలార! యడుగరమ్మ!
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా చూత మంజరులార! చూడరమ్మ!
మానినీమదనుతో మా రాక యెఱిఁగించి మాధవీలతలార! మనుపరమ్మ!

ఆ. జాతిసతులఁ బాయ నీతియె హరి కని
జాతులార దిశలఁ జాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ
జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ! 1013

క. హరి చరణములకుఁ బ్రియ మై, హరి నిను మన్నింప భద్ర మందెదు తులసీ!
హరి నీ దెస రాఁడు గదా!, హరి చొప్పెఱిఁగించి శుభము లందింపఁగదే. 1014

తే. పొగడఁ దగువానిఁ గానరే పొగడలార!
యీ తెఱంగని విభుఁ జూపుఁ డీడెలార!
మొల్ల మగు కీర్తివాఁ డేడి మొల్లలార!
శుకనిగదితునిఁ జెపుఁడు కింశుకములార! 1015

క. తరుణీకుచ కుంకుమయుత, హారికంధర దామగంధ మడరెడిఁ జూడ్కుల్
హారిఁ గనినపగిదిఁ దనరెడి, హారిణీ! హారిజాడఁ బుణ్యా మయ్యేడిఁ జెపుమా.

క. కిటి యై కౌఁగిటఁ జేర్చెను, వటుఁ డై వర్ధిల్లి కొలిచె వడిఁ గృష్ణుం డై
[1]యిటఁ బదచిహ్నము లిడెఁ గ్రిం, దటి శామున నేమి నోఁచితమ్మ! ధరిత్రీ!

వ. అనుచు నున్మత్తచిత్త లై, తదాత్మకత్వంబునఁ గృష్ణులీలల ననుకరింపుచు. 1018

సీ. పూతన యై యొక్కపొలఁతి చరింపంగ శౌరి యై యొకకాంత చన్నుఁ గుడుచు
బాలుఁ డై యొకభామ పాలకు నేడ్చుచో బండి నే నను లేమఁ బాఱఁదన్ను
సుడిగాలి నని యొక్కసుందరి కొనిపోవ హారి నని వర్తించు నబ్జముఖియు
బకుఁడ నే నని యొక్కపడఁతి సంరంభింపఁ బద్మాక్షుఁ డను కొమ్మ పరిభవించు

ఆ. నెలమి రామకృష్ణు లింతు లిద్దఱు గాఁగ
గోప వత్సగణము కొంద ఱగుదు
రసురవైరి ననుచు నబల యొక్కతె చీరుఁ
బసుల మనెడి సతుల భరతముఖ్య! 1019

ఆ. లోకమెల్లఁ గుక్షిలోపల నున్నట్టి
మాధవుండ నేను మాత వీవు
చూడు మనుచు నొక్క సుందరి యొకతెకు
ముఖముఁ దెఱచి చూపు ముఖ్యచరిత! 1020

క. వెన్నలు దొంగిలి తినియెడి, వెన్నుఁడ నని యొకతె నుడువ వే ఱొక్కతె చే
సన్నల యశోద నంచును, గ్రన్నన కుసుమములదండఁ గట్టు నిలేశా! 1021

క. కాళియఫణి యిది వీరలు, కాళియఫణి సతులు మ్రొక్కఁ గడఁగిరి నే గో
పాలకుమారుఁడ ననుచును, లీలాగతి నాడు నొక్క లేమ నరేంద్రా! 1022

క. తరుణులు గోపకు లందఱు, హారిహాయుఁ డిదె వానఁ గురిసె హారి నే నని భా
సుర చేలాంచల మొక్కతె, గిరి నెత్తెద ననుచు నెత్తుఁ గెంగేల నృపా! 1023

క. మీరలు గోపకు లే నను,రారని దావాగ్ని వచ్చె నటుఁ జూడకుఁడీ
వారించెద నని యొక్కతె, చేరి బయల్ కబళనంబు సేయు నరేంద్రా! 1024

వ. ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునం గల తరు లతాదుల
హారి నడుగుచు, నిరర్గళంబు లయిన విపినమార్గంబుల సరోజాత కేతన హాల కులి

---

1. యిటుపదచిహ్నము నేడే, డటుశామున (హా)

శాంకుశాది లక్షణ లక్షితంబు లై, మనోహరంబు లైన హరిచరణంబుల చొప్పు
గని, తప్పక చెప్పుకొనుచుఁ దమలో ని ట్లనిరి. 1025

సీ. కొమ్మకుఁ బువ్వులు కోసినాఁ డిక్కడ మొనసి పాదాగ్రంబు మోపినాఁడు
సతి నెత్తుకొని వేడ్క జరిగినాఁ డిక్కడఁ దృణములో లే దిదె తెఱవజాడ
ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినాఁ డిక్కడఁ గూర్చున్న చొప్పిదె కొమరుమిగులు
నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ వెలఁది నిక్కినగతి విశద మయ్యె

ఆ. సుదతితోడ నీరుఁ జొచ్చినాఁ డిక్కడఁ
జొచ్చి తా వెడలినచోటు లమరెఁ
దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడ
నసఁగి పెనఁగి యున్న యంద మొప్పె. 1026

వ. మఱియును. 1027

సీ. ఒక యెలనాఁగ చె య్యూఁదినాఁ డిక్కడ సరస నున్నవి నాల్గు చరణములును
నొక నీలవేణితో నొదిఁగినాఁ డిక్కడ మగజాడలో నిదె మగువజాడ
యొకలేమ మ్రొక్కిన [1]నొడిసినాఁ డిక్కడ రమణి మ్రొక్కినచొప్పు రమ్య మయ్యె
నొకయింతి నెదురుగా [2]నొలసినాఁ డిక్కడ నన్యోన్యముఖములై యంఘ్రులొప్పె

ఆ. నొకతె వెంటఁ దగుల నుండక యేఁగినాఁ
డడుగుమీఁదఁ దరుణి యడుగు లమరె
నబల లిరుకెలంకులందు రాఁ దిరిగినాఁ
డాఱుపదము లున్నవమ్మ! యిచట. 1028

సీ. ఈ చరణంబులే యిందునిభానన! సనకాదిముని యోగసరణి నొప్పు
నీ పాదతలములే యెలనాఁగ! శ్రుతివధూ సీమంతవీథులఁ జెన్నుమిగులు
నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన! పాలేటిరాచూలి పట్టుకొమ్మ
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ! ముక్తికాంతా మనోమోహనంబు

ఆ. లీ యడుగుల రజమె యింతి! బ్రహ్మేశాది
దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల లజ్ఞాతుఁ డేఁగిన
క్రమముఁ గనియు నతనిఁ గాన రైరి. 1029

---

1. నొడివినాఁడిక్కడ (హ) నురివినాఁ (తం.వా.) నుడిపినాఁ (తం. F. N.) 2. నొలిసి (హ.)

సీ. పతుల దైన్యంబును భామల క్రౌర్యంబుఁ జూపుచు విభుఁ డొక్క సుదతితోడ
విహరింప నది యెల్ల వెలఁదుల వర్జించి నా యొద్ద నున్నాఁడు నాథుఁ డనుచు
గర్వించి రాఁ జాలఁ గమలాక్షు మూఁపున నిడుకొను మనుడు న య్యీశ్వరుండు
మొఱఁగి పోయినఁ దాపమును బొంది యో కృష్ణ! యెక్కడఁ జనితి
ప్రాణేశ! రమణ!

తే. నీకు వరవుడ నయ్యెద నిలువు మనుచు
వగవఁ గొందఱు కాంత లా వనితఁ జూచి
వరుఁడు మన్నింప గర్వించి వనజనేత్రి
చిక్కె నేఁ డని వెఱగును జెంది రపుడు. 1030

వ. మఱియును. 1031

సీ. ఈ పొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు నాతోడ మన్మథనటన మాడె
ని య్యాల మగుచోట నిందాఁకఁ జెలువుండు గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె
నీ మహీజము నీడ నిందాఁక సుభగుండు [1]చిట్టంటు సేఁతల సిగ్గు గొనియె
నీ పుష్పలత పొంత నిందాఁక దయితుండు నను డాసి యధరపానంబు సేసె

ఆ. నీ ప్రసూనవేది నిందాఁక రమణుండు
కుసుమదామములనుఁ గొప్పు దీర్చె
ననుచు గొంద ఱతివ లంభోజనయనుని
పూర్వలీలఁ దలఁచి పొగడి రధిప! 1032

మ. అని యి బ్భంగి లతాంగు లందఱును బృందారణ్యమం దీశ్వరున్
వనజాక్షున్ బరికించి కానక విభున్ వర్ణింపుచున్ బాడుచున్
మనముల్ మాటలు చేష్టలున్ గ్రియలు న మ్మానాథుపైఁ జేర్చి వే
చని ర య్యామున సైకతాగ్రమునకున్ సంత్యక్త గేహేచ్ఛ మై. 1033

వ. చని గోపికలు హరి నుద్దేశించి యి ట్లనిరి. 1034

## అధ్యాయము - ౩౧

### —: గోపికాగీతలు :—

క. నీవు జనించిన కతమున, నో వల్లభ! లక్ష్మి మంద నొప్పె నధిక మై
నీవెంటనె ప్రాణము లిడి, నీ వా రరసెదరు చూపు నీ రూపంబున్. 1035

1. చిట్టట్టు (హ)

క. శారద కమలోదర రుచి, చోరక మగు చూపువలన సుందర! మమ్మున్
గోరి వెలయాని దాసుల, ధీరత నొప్పించు టిది వధించుట గాదే. 1036

ఆ. విషజలంబువలన విషధర [1]దానవు
వలన గాలివానవలన వహ్ని
వలన [2]మిగులువానివలనను రక్షించి
కుసుమశరుని జారిఁ గూల్పఁదగునె. 1037

ఉ. నీవు యశోద బిడ్డఁడవె నీరజనేత్ర! సమస్తజంతు చే
తో విదితాత్మ వీక్షుఁడవు తొల్లి విరించి తలంచి లోక ర
క్షావిధ మాచరింపు మని సన్నుతి సేయఁగ [3]సత్కులంబునన్
భూవలయంబుఁ గావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్. 1038

ఆ. చరణసేవకులకు సంసారభయమును
బాపి శ్రీకరంబు పట్టుగలిగి
కామదాయి యైన కరసరోజంబు మా
మస్తకముల నునిచి మనుపు మీశ! 1039

ఉ. గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారల పాపసంఘముల్
ద్రోవఁగఁ జాలి శ్రీఁ దనరి దుష్టభుజంగ ఫణాలతాగ్ర సం
భావిత మైన నీ చరణపద్మము చన్నులమీఁద మోపి త
ద్భావజ పుష్ప భల్లభవ బాధ హరింపు వరింపు మాధవా! 1040

క. బుధరంజనియును సూక్తియు, మధురయు నగు నీదు వాణి మరఁగించెను నీ
యధరామృత సంసేవన, విధి నంగజతాప మెల్ల విడిపింపఁగదే. 1041

క. మగువలయెడ నీ [4]శౌర్యము, తగునే నిజభక్తభీతి దమనుఁడ వకటా!
తగదు భవద్దాసులకును, నగుమొగముం జూపి కావు నళినదళాక్షా! 1042

మ. ఘన లక్ష్మీయుత మై [5]మహాశుభద మై కామాది విధ్వంసి యై
సనకాది స్తుత మై నిరంతర తప స్సంతప్త పున్నాగ జీ
వన మై యొప్పెడు నీ కథామృతము ద్రావంగల్గునే భూరి దా
న నిరూఢత్వము లేనివారలకు మానారీ మనోహారకా! 1043

క. నీ నగవులు నీ చూడ్కులు, నీ నానావిహరణములు నీ ధ్యానంబుల్
నీ నర్మాలాపంబులు, మానసముల నాటి నేఁడు మగుడవు కృష్ణా! 1044

1. దానవి (తం) 2. నున్నవాని వలనను (తం) 3. మత్కులంబునన్ (వ); "ఉదేయివాన్ సాత్త్వతాం కులే" (31-4) 4. క్రౌర్యము (తం. వా. క.) 5. వినన్ (తం. వా. క.)

ఆ. ఘోషభూమి వెడలి గోవుల మేపంగ
నీరజాభ మయిన నీ పదములు
కసవు శిలలఁ దాఁకి కడు నొచ్చునో యని
కలఁగు మా మనములు కమలనయన! 1045

ఉ. మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి గోప్పద
ప్రాపిత ధూళిధూసరిత భాసిత కుంతల మై సరోరుహ
ద్దీపిత మైన నీ మొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతోఁ
జూపి మనంబులన్ మరునిఁ [1]జూపుదు గాదె క్రమక్రమంబునన్. 1046

ఆ. భక్తకామదంబు బ్రహ్మసేవిత మిలా
మండనంబు దుఃఖమర్దనంబు
భద్రకరము నైన భవదంఘ్రియుగము మా
యురములందు రమణ! యునుపఁ దగదె. 1047

ఆ. సురతవర్ధనంబు శోకాపహరణంబు
[2]స్వరిత వంశనాళ సంగతంబు
నన్యరాగజయము నయిన నీ మధురాధ
రామృతమునఁ దాప మార్పు మీశ! 1048

ఉ. నీ వడవిన్ బవల్ దిరుగ నీ కుటిలాలక లాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబు లై చనుం
గావున శాత్రు లైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁ డై. 1049

ఉ. అక్కట! బంధులన్ మగలు నన్నలుఁ దమ్ములుఁ బుత్రకాదులన్
నెక్కొని రాత్రిఁ బోకుఁ డన నీ మృదు గీతరవంబు వీనులన్
వెక్కస మైన వచ్చితిమి వేగమె మోహము [3]నొంది నాథ! నీ
వెక్కడఁ బోయితో యెఱుఁగ మిక్రియ నిర్దయుఁ డెందుఁ గల్గునే. 1050

తే. మదనుఁ డార్వంగ నీ వాదుమంతనములు
నవ రసాలోకనం బగు నగుమొగంబు
కమల కిర వైన మహిత వక్షస్థలంబు
మా మనంబుల లోఁగొని [4]మలపెఁ గృష్ణ! 1051

---

1. జూపుటగాదె (చ) 2. స్వనిత (హ); స్వరితవేణునా సుష్ఠుచుంబితమ్ (31-4)
3. నొందినార మీ (తం) 4. మరపె (తం, వా.)

మ. అరవిందంబులకంటెఁ గోమలము లై యందంబు లై యున్న నీ
చరణంబుల్ కఠినంబు లై మొనయు మా చన్నుంగవల్ మోవఁగా
నెరియం బోలు నటంచుఁ బొక్కుదుము నీ యీ కర్కశారణ్య భూ
పరిసంచారము కృష్ణ! నీ ప్రియులకున్ బ్రాణవ్యథం జేయదే. 1052

క. కట్టా! మన్మథుకోలలు, నెట్టున నోనాఁట బెగడి నీ పాదంబుల్
పట్టికొనఁగ వచ్చిన మము, నట్టడవిని డించి పోవ న్యాయమె కృష్ణా! 1053

క. హృదయేశ్వర! మా హృదయము, మృదుతరముగఁ జేసి తొల్లి మిక్కిలి కడ నీ
హృదయము కఠినము జేసెను, మదీయసౌభాగ్య మిట్టి మందము గలదే. 1054

ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడి దాఁకి వీఁక వా
లమ్ముల తెట్టెముల్ వఱప నడ్డయి వచ్చి జయింతు వంద్రు నిన్
నమ్మిన ముగ్ధలన్ రహితనాథల నక్కట! నేఁడు రెండుమూఁ
డమ్ముల యేటుకాఁ [1]డెదుర నడ్డము రాఁదగదే కృపానిధీ! 1055

క. [2]తియ్యవిలుకాఁడు డీకొని, వ్రయ్యలుగాఁ దూఱ నేసె వనితల మనముల్
[3]వియ్యాన నింకనయినన్, గు య్యాలింపం గదయ్య! గోవింద! హరీ! 1056

## అధ్యాయము - ౩౨

మ. అని యి ట్లంగన లంచితస్వరముతో నంకింపుచున్ బాడుచున్
దను రావే యని చీరి యేడువ జగత్త్రాణుండు లై త్రిలోక్య మో
హనుఁ డై మన్మథమన్మథుం డయి మనోజ్ఞాకారి యై [4]హారి యై
ఘన పీతాంబర ధారి యై పొడమెఁ దత్కాంతా సమీపంబునన్. 1057

క, వచ్చిన వల్లభుఁ గనుఁగొని, విచ్చేసె నటంచు సతులు వికసితముఖు లై
యచ్చుగ నిలిచిరి ప్రాణము, వచ్చిన నిలుచుండు యవయవంబుల భంగిన్. 1058

సీ. అబల యొక్కతె భక్తి నంజలిఁ గావించి ప్రాణేశు కెంగేలు వట్టికొనియె
నింతి యొక్కతె జీవితేశ్వరు బాహువు మూఁపున నిడుకొని ముదము నొందె
వనిత యొక్కతె తన వల్లభు తాంబూల చర్విత మాత్మహస్తమునఁ దాల్చెఁ
బడఁతి యొక్కతె ప్రియు పదములు విరహాగ్ని తప్త కుచంబులఁ దాపుకొనియె

1. డెగవ (తం. వా.) 2. తియవిలుకాఁడు - పాయలుగా - నీయాన - గూయాలింపం (తం. ఫుట్ నోటు) 3. నియ్యాన (హ) 4. యంతటఁ (హ)

ఆ. భామ యొకతె భృకుటిబంధంబు గావించి
ప్రణయభంగ కోపభాషణమున
దష్టదశన యగుచు దండించు కైవడి
వాఁడి చూడ్కిగముల వరునిఁ జూచె. 1059

క. హరి ముఖకమలముఁ జూచుచుఁ, దరుణి యొకతె ఱెప్పలిడక తనియక యుండెన్
హరి [1]పదకమలముఁ జూచుచు, మరగి తనివిలేని సుజనుమాడ్కి నరేంద్రా!

ఉ. ఒక్కలతాంగి మాధవుని యుజ్జ్వలరూపము చూడ్కితీఁగెలం
జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ జేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచున్
జొక్కము లైన లోచవులఁ జొక్కుచు నుండెను యోగికైవడిన్. 1061

సీ. ఎలయించి ప్రాణేశ! యెందుఁ బోయితి వని తోరంపు టలుకతో దూఱె నొకతె
జలజాక్ష! ననుఁ బాసి చనఁగ నీ పాదంబు లెట్లాడె నని [2]వగ నెయిదె నొకతె
నాథ! నీ వరిగిన నా ప్రాణ మున్నది కూర్మియే యిది యని కుందె నొకతె
యీశ్వర! నను నిన్ను నింటాఁక బాపె నీ పాపపు విధి యని పలికె నొకతె

ఆ. తలఁగి పోవునట్టి తప్పేమి చేసితి
నధిప! పలుకు ధర్మ మనియె నొకతె
యేమి నోముఫలమొ హృదయేశ! నీ మోము
మరలఁ గంటి ననుచు మసలె నొకతె. 1062

క. పలికిన ప్రతిజ్ఞఁ దప్పెడిఁ, బలికించినఁ గాని రమణుఁ బలుక నటంచున్
గలకంఠి యొకతె చెలితోఁ, బలుకుల నమృతములు గురియు పలుకులు పలికెన్.

క. పట్టినఁ గాని మనోవిభుఁ, బట్టఁగదా యంచు నొక్క బాలిక సఖిచేఁ
బట్టుకొని చెప్పె ధైర్యము, పట్టెల్లను మరుని ఱెంకిపట్టుగ నధిపా! 1064

క. చెలువుఁడు చెప్పకపోయిన, పొలపున నొకముగ్ధ మున్ను చూడ ననుచు నౌ
దల వంచి యుండఁ జాలక, దల యెత్తెను లోన మరుఁడు దలయెత్త నృపా!

వ. ఇ వ్విధంబున. 1066

క. హరి సురుచిర లలితాకృతిఁ, దరుణులు గని ముక్త విరహతాప జ్వర లై
పరమోత్సవంబు సలిపిరి, పరమేశ్వరుఁ గనిన ముక్తబంధుల భంగిన్. 1067

---

1. పాదములను జూచుచు (హ) 2. నెదిరె (హ)

వ. అంత నక్కాంతుండు కాంతాజన పరిక్రాంతుం డై, వనాంతరంబున శక్తినికర సంయుక్తుం డైన పరమపురుషుండునుం బోలె, వారలం దోడ్కొని, మందార కుంద కుసుమ పరిమళ మిళిత పవమాన మానిత మధుకర నికర ఝుంకార సుకుమారంబును, శరత్కాల చంద్రకిరణ సందోహ సందళిత తాంధకారంబును, యమునా తరంగ సంగత కోమల వాలుకా స్ఫారంబును నై, యమలినం బైన పులినంబుఁ బ్రవేశించె. వారును జ్ఞానకాండంబున నీశ్వరుం గని శ్రుతులు ప్రమోదంబునం గామానుబంధంబులు విడిచిన విధంబున, హరిం గని, విరహవేదనల విడిచి, పరిపూర్ణ మనోరథ లై. 1068

క. పాఠీననయన లెల్ల న, కాఠిన్య పటాంచలములఁ గౌతుకములు హృ
త్పీఠముల సందడింపఁగఁ, బీఠము గల్పించి రంతఁ బ్రియునకు నధిపా! 1069

ఆ. పరమ యోగిహృదయ భద్రపీఠంబుల
నుండు మేటి వ్రజవధూత్తరీయ
పీఠమున వసించి పెంపారెఁ ద్రిభువన
దేవలక్ష్మి మేనఁ దేజరిల్ల. 1070

మ. మదనోద్దీపితుఁ డైన నాథునికి సన్మానంబుఁ గావించుచున్
ముదితల్ హాస విలోక విభ్రమములన్ మోదింపుచున్ జేరి త
త్పదముల్ హస్తతలంబులన్ బిసుకుచున్ బై ముట్టుచున్ దూఱుచున్
జదురుల్వల్కుచుఁ గూర్మి ని ట్లనిరి యీ షత్కోప దీప్తాస్య లై. 1071

క. కొలిచినఁ గొలుతురు కొందఱు, గొలుతురు దముఁ గొలువకున్నఁ గొందఱువరులం
గొలిచినను గొలువకున్నను, గొలువరు మఱికొంద ఱెలమి గోపకుమారా!

వ. అని తన్ను నుద్దేశించి రహస్యంబుగాఁ బల్కిన సుందరుల పల్కులు విని, గోపాల సుందరుం డి ట్లనియె. 1072

సీ. కొలిచినఁ గొలుతురు గొందఱు పశువుల భజనము భంగిని ఫలము గోఱకు
నై సఖ్యధర్మము లందు సిద్ధింపవు కొందఱు దంద్రుల గుణముఁ దాల్చి
దయగలవారలు దగిన సుహృత్తులు గొలువనివారలఁ గొల్తు రెపుడు
ధర్మకామంబులు తనరంగఁ గొందఱు కొలువని వారినిఁ గొలుచువారిఁ

ఆ. గొలుచు తలఁపు లేమి గొలువ రాత్మారాము
లాప్తకాము లజ్ఞు లతి కఠినులు
వారియందుఁ బిదపవానిఁగాఁ జింతించి
యే లతాంగులార! యిట్టు లనుట. 1074

క. ఏ నిం దెవ్వఁడ నైనం, గా నంగనలార ! పరమ కారుణికుండన్
మానస బంధుఁడ నిత్యా, ధ్యానము మీ [1]కొనరవలసి తలఁగితిఁ జుండీ. 1075

మ. నను సేవింపుచునున్న వారలకు నే నా రూపముం జూపఁ జూ
చినఁ జాలించి మదించి వారు మది నన్ సేవింపరో యంచు ని
ర్ధనికుం డాత్మధనంబు చెడ్డ నెపుడున్ దత్పారవశ్యంబుఁ దా
ల్చినభంగిన్ ననుఁ బాసి మత్ప్రియుఁడు దాఁ జింతించు నా రూపమున్. 1074

తరల. తగవు ధర్మముఁ జూడనొల్లక తల్లిదండ్రుల బంధులన్
మగల బిడ్డలఁ బాసి వచ్చిన మన్నిషక్తల మిమ్ము నేఁ
దగదు పాసితిఁ దప్పు నైపుఁడు తద్వియోగ భరంబునన్
వగలఁ బొందుచు మీర లాడిన వాక్యముల్ వినుచుండితిన్. 1077

ఉ. పాయని [2]గేహశృంఖలముఁ బాసి నిరంతర మత్పరత్వముం
జేయుచు నున్న మీకుఁ బ్రతిసేయ యుగంబుల నైన నేర నన్
బాయక గొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుట తప్పుగాఁ గొనక భామినులార ! కృపన్ క్షమింపరే. 1078

అధ్యాయము—౩౩

క. చక్కఁగ హరి యిటు పలికినఁ, జక్కని వాక్యముల నతని సంగమమున లో
నిక్కిన వియోగతాపము, లొక్కట విడిచిరి లతాంగు లుర్వీనాథా ! 1079

—: రా స క్రీ డా భి వ ర్ణ న ము :—

ఉ. ఆ సమయంబునన్ విభుఁ డనంతుఁడు కృష్ణుఁడు చిత్రమూర్తి యై
చేసెను[3] మండల భ్రమణ శీల పరస్పరబద్ధ బాహు కాం
తా సువిలాసమున్ బహువిధ స్ఫురితానన హస్త పాద వి
న్యాసము రాసమున్ గృత వియచ్చరనేత్ర మనో వికాసమున్. 1080

వ. ఇట్లు బహుగతు లంది దిరుగ నేర్పరి యగు హరి దర్పించి, తన యిరుకెలంకుల నలంకృత లై, కళంక రహిత చంద్రవదన లిద్దఱు ముద్దియ లుద్దికొని, వీణలంది కొని, వీణలం బ్రవీణ లై, సొంపు మెఱసి, యింపుగ వాయింపుచు, నానంద లహరీ నిధానం బగు గానంబు సేయ, నవిరళం బై తరళంబుగాని వేడుక సరళం బగు ‡ మురళంబు లీలం గేల నందుకొని, మధురం బగు నధరంబునం

1. కొనఁగ (తం. వా.) 2. శృంఖలల (తం. వా.) 3. నమంద చంక్రమణశీల వరత్వర బంధబాహు (వ) ‡. మురళంబు = మురళి.

గదియించి, మించి కామినీజన కబరికా సౌగంధిక గంధబంధుర కరాంగుళీ కిసలయంబులు యతిలయంబులం గూడి వివరంబుగ మురళీ వివరంబుల సారించి, పూరించుచు, సరిలేనిభంగిం ద్రిభంగి యై, కమలకర్ణికాకారంబున నడుమ నిలిచి, మఱియు గోపసుందరు లెంద ఱందఱకు నంద ఱై, సుందరుల కవలి యెడలం దానును, దన కవలియెడల సుందరులును దేజరిల్ల, నృత్యవిద్యా మహార్ణవ వేలావలయ వలయితం బై, విస్మితాఖండలం బైన రాసమండలంబుఁ గల్పించి, వేల్పులు వర్షంబునం గుసుమవర్షంబులు గురియ, నందుఁ బ్రసూనమంజరీ సహచరంబు లైన చంచరీకంబుల మించు ప్రకటించుచు, సువర్ణ మణిమధ్యగంబు లైన మహేంద్రనీలంబుల తెఱంగు నెఱపుచుఁ, గరిణీవిహార బంధురంబు లైన సింధురంబుల చెలువుఁ గైకొలుపుచుఁ, బల్లవిత కుసుమిత లతానుకూలంబు లైన తమాలంబుల సొబగు నిగుడించుచు, మెఱపుతీఁగెల నెడనెడ బెడంగడరు నల్లమొగుళ్ల పెల్లు చూపుచుఁ, దరంగిణీ సంగతంబు లైన రోహణాచల శృంగంబుల బాగు లాగించుచు, జగన్మోహనుఁ డై యుండి, రక్త కమలారుణంబులును, జంద్రశకల నిర్మల సంస్ఫురణంబులును, శ్రుతినితంబినీ సీమంత వీథికాలంకరణంబులును, సనక సనందనాది యోగీంద్ర మానసాభరణంబులును నైన చరణంబులు గదియ నిడి, సమస్థితినంజలి పుటంబులం బుష్పంబు లుల్లసిల్లఁ జల్లి, సల్లలిత కమల ప్రశస్తంబు లైన హస్తంబులు వల్లవీజనుల కంఠంబులపై నిడి, తాను గీతానుసారంబుగ విచిత్ర పాద సంచారంబులు సలుపుచు, వర్తులాకార రాసబంధంబుల నర్తనంబునం బ్రవర్తించి, వెండియు వ్రేతలుం, దానును, శంఖ పద్మ వజ్ర కందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర సౌభద్ర నాగ నంద్యావర్త కుండలీకరణ [1]కురళీబంధ ప్రముఖంబు లైన విశేష రాసంబంధంబులకుం జొచ్చి, ఏకపాద సమపాద వినివర్తిత గతాగత వలిత వైశాఖ మండల త్రిభంగి ప్రముఖంబు లైన తానకంబుల నిలుచుచుఁ గనకకింకిణీ కంకణమంజుల మంజీర శింజనంబులు జగజ్జన కర్ణరంజనంబు లై చెలంగ, ఘటిత మర్దిత పార్శ్వగ ప్రముఖంబు లైన పాదచారి భేదంబులు చేయుచు, (సమపాద శకట వదన మతల్లి [2]శుక్తి ప్రముఖంబు లైన) పార్థివచారి విశేషంబులును, అపక్రాంత డోలాపాద సూచీ ప్రముఖంబు లైన వ్యోమచారి విశేషంబులుం జూపుచు, సురేంద్రశాఖి శాఖా మనోహరంబులును, నవహసిత దిక్కరీంద్ర కరంబులును, ద్రిలోక క్షేమంకరంబులును, నగు కరంబులం దిరంబు లగు రత్నకటకంబుల మెఱుంగులు నింగి చెఱంగులం దఱచుకొన, నర్ధచంద్ర కర్తరీముఖ కపిత్థ కటకాముఖ శుకతుండ లాంగూల పద్మకోశ

---

1. ఖురరి (తం. వా.); కురళీ—ఖురరి శబ్దములు కోశములలో లేవు. 2. సుప్తి (తం)

[1]పతాకా ప్రముఖంబు లైన స్వస్వభావసూచక నానావిధ) కరభావంబు లాచరింపుచు, కటీనిబద్ధ సువర్ణవర్ణ చేలాంచల ప్రభానికరంబులు సుకరంబు లై దిశాంగనా ముఖంబులకు హారిద్రా లేపన ముద్రాలంకారరంబు లొసంగుచు, నాస్కందిత భ్రమర శకటాసన ప్రముఖంబు లైన జానుమండల భేదంబులును, అలాత, దండలాత లలిత విచిత్ర ప్రముఖంబు లైన దైవ మండలంబులు నొనర్చుచుఁ, గమనీయ కంబుకంఠాభిరామంబులు, నుద్దామ తేజస్తోమంబులు నైన నీల మౌక్తిక వజ్ర వైడూర్య దామంబుల రుచు లిందిరా సుందరికి మందిరంబు లై, సుందరంబు లైన యురంబులం దిరుగుడువడి కలయంబడ, సంగాంతర [2]బాహ్యాలగ్న చ్ఛత్ర ప్రముఖంబు లైన భ్రమణవిశేషంబుల విలసించుచు, నిద్దంబు లగు చెక్కుటద్దంబుల నుద్దవిడిం దద్దయుం [3]ప్రభాజిత చంద్ర మండలంబు లగు కుండలంబుల మెఱుంగు మొత్తంబులు నృత్యంబు లొనరింపఁ, గటిభ్రాంత దండరచిత లలాట తిలక మయూరలలిత చక్రమండల నికుంచిత గంగావతరణ ప్రముఖంబు లైన కరణంబు లెఱింగింపుచు, వెలిదమ్మి విరుల సిరుల చెన్నుమిగులు కన్నులవల దీనజన దైన్యకర్కశంబు లై తనరు కటాక్షదర్శన జాలంబులు జాలంబు లై కామినీజన నయనమీనంబుల నావరింప, లలిత కుంచిత వికాస ముకుళ ప్రముఖంబు లైన చూడ్కులఁ దేజరిల్లుచు, ననేక పరిపూర్ణ చంద్రసౌభాగ్య సదనంబులగు వదనంబులఁ బ్రసన్నరాగంబులఁ బ్రకటించుచు, నుదంచిత పింఛమాలికా మయూఖంబు లకాల శక్రచాపంబుల సొంపు సంపాదింప, నికుంచి తాకుంచిత కంపి తాకంపిత పరివాహిత పరావృత్త ప్రముఖంబు లైన శిరోభావంబులు నెఱపుచు, మృగనాభి తిలకంబులు గల నిటలఫలకంబులఁ జికురంబుల నికరంబులు గప్ప, నపరాజిత సూచికావిద్ధ పరిచ్ఛిన్న విష్కంభ రేచిత ప్రముఖంబు లగు నంగహారంబుల విలసిల్లుచుఁ, జరణ కటి కర కంఠ రేచకంబు లాచరించుచు నొప్పె. అప్పుడా రాసంబు సంజనిత సకలజన మానసోల్లాసకరం బై, సుధార్ణవంబునుం బోలె నుజ్జ్వల రసాభిరామం బై, రామరాజ్యంబునుం బోలె రాగ పరిపూర్ణం బై, పూర్ణ చంద్ర మండలంబునుం బోలెఁ గువలయానందం బై, నందనవనంబునుం బోలె భ్రమరీ విరాజమానం బై, మానధనుని చిత్తంబునుం బోలెఁ [4]ప్రధానవృద్ధి సమర్థం బై, సమర్థ కవివిలసనంబునుం బోలె బహుప్రబంధ భాసురం బై, సురలోకంబునుం బోలె వసుదేవనందన విశిష్టం బై, శిష్టచరితంబునుం బోలె ధరణీ గగన మండల సుందరం బై, సుందరీరత్నంబునుం బోలె

1. పతాక ప్రముఖ (తం. వా) 2. కలయంబడ నంగాంతారబాహ్యాలకు ఛత్ర (హ) కలయంబడ నంగాతర వాహ్యాలకు ఛత్ర (తం. వా.) 3. ప్రభాసిత (తం.వా.) 4. వృత్తి (వా.హ.)

సంగహార మనోహరం బై, హరవధూ నిలయంబునుం బోలె ననేక చారి
సుకుమారం బై, సుకుమారవృత్తంబునుం బోలె నుద్దీపిత వంశం బై యుండె. అందు.

చ. నడుములు వీఁగియాడ చిఱునవ్వులు నివ్వటిలంగ హారముల్
సుడివడ మేఖలల్ వదలఁ జూడ్కి మెఱుంగులు పర్వ ఘర్మముల్
పొడమఁ గురుల్ చలింప శ్రుతిభూషణముల్ మెఱవన్ సకృష్ణ లై
పడఁతుక లాడుచుం జెలఁగి పాడిరి మేఘ తటిల్లతా ప్రభన్. 1082

క. అంకరహితేందువదనలు, పంకజలోచనునిఁ గూడి పరఁగ నటింపన్
గింకిణుల నూపురంబుల, కంకణముల మ్రోఁత లెసఁగెఁ గర్ణోత్సవ మై. 1083

క. హరిణీనయనలతోడను, హరి రాసక్రీడ సేయ నంబరవీథిన్
సురనాథులు భార్యలతో, సొరిది విమానంబు లెక్కి చూచి రిలేశా! 1084

క. కురిసెన్ బువ్వుల వానలు, మొరసెన్ దుందుభులు మింట ముదితలుఁ దారున్
సరసన్ గంధర్వపతుల్, వరుసన్ హరిఁ బాడి రపుడు వసుధాధీశా! 1085

క. రామలతోడను రాసము, రామానుజుఁ డాడఁ జూచి రాగిల్లి మనో
రాములమీఁద వియచ్చర, రామలు మూర్ఛిల్లి పడిరి [1]రాజకులేశా! 1086

క. తారాధిప నిభవదనలు, తారాధిపవంశ్యుఁ గూడి తారు నటింపన్
[2]దారలు నిల్చి సుధాంశుఁడుఁ, దారును వీక్షింప రేయి తడవుగ జరిగెన్. 1087

మ. యమునాకంకణ చారి యై వనజ పుష్పామోద సంచారి యై
రమణీ ఘర్మనివారి యై మధువతీ రాస శ్రమోత్తారి యై
ప్రమదామానస నవ్య భవ్య సుఖసంపత్కారి యై చేరి యా
కమలాక్షుం డలరంగ గాలి విసరెన్ గల్యాణభావంబునన్. 1088

వ. అప్పుడు. 1089

చ. ప్రమద యొకర్తె మాధవుఁడు పాడ విపంచి ధరించి కేల సం
భ్రమమునఁ దంత్రి మీటుచుఁ దిరంబుగ [3]రాయము చేసి యొక్క రా
గము తగ నాలపించి సుభగ స్వరజాతులు వేఱు వేఱుగా
సమరఁగఁ బాడె దన్ రమణుఁ డౌ నన దారువు లంకురింపఁగన్. 1090

క. ఆడుచుఁ బాడుచు నం దొక, చేడియ మంజీర మంజు శింజిత మమరం
గూడి హరికరము చనుఁగవ, పై డాయం దిగిచె జఘన భారాలస యై. 1091

---

1. రామవినోదా (హ) 2. దారటనిల్చి (హ)
3. గానముచేసి (హ); రాయముచేసి (క. చ. ట. త.)

క. చందనలిప్తం బై యర, విందామోదమున నొప్పు విపులభుజము గో
విందుఁ డొక తరుణి మూఁపునఁ, బొందించిన నది దెమల్చి పులకించె నృపా! 1092

సీ. చెలువ యొక్కతె చెక్కుఁ జెక్కుతో మోపిన విభుఁడు తాంబూలచర్వితము వెట్టె
నాడుచు నొకలేమ యలసినఁ బ్రాణేశుఁ డుస్నత దోస్తంభ మూఁత సేసెఁ
జెమరించి యొకభామ చేరినఁ గడగోరఁ జతురుఁడు కుచఘర్మజలము వాపె
నలకంబు లొకయింతి కలిక చిత్రకరేఖ, నంటినఁ బ్రియుఁడు పాయంగ దువ్వెఁ

ఆ. బడఁతి యొకతె [1]పాడిపాడి డస్సిన యధ
రామృతమున నాథుఁ డాదరించె
హార మొక్కసతికి నంసావృతం బైనఁ
గాంతుఁ డురముఁ జేర్చి కౌఁగిలించె. 1093

క. హాసంబులఁ గరతల వి, న్యాసంబుల దర్శనముల నాలాపములన్
రాసక్రాంతల కా హరి, సేసెన్ మన్ననలు కరుణఁజేసి నరేంద్రా! 1094

క. హరి తను సంగ సుఖంబునఁ, బరవశ లై ప్రేతలెల్లఁ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె, సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్.

వ. ఇట్లు భగవంతుం డైన కృష్ణుం డాత్మారాముం డయ్యును, గోపసతు లెంద ఱందఱకు నంద ఱై, నిజ ప్రతిబింబంబుతోడన్ గ్రీడించు బాలురపోలికె రాసకేళి సలిపిన.

క. తగఁ గూడియాడి మనముల, నగెఁ జూచెం బలికె నందనందనుఁ డనుచున్
మగువలు పెద్దటికముతోఁ, బొగడిరి తమ పూర్వజన్మ పుణ్యశ్రేణిన్. 1097

—: జలక్రీడాభి వర్ణనము :—

వ. ఇట్లు హరి రాసకేళి సాలించి, [2]తారకాంచిత లగు తటిల్లతల చెలువున ఘర్మ సలిలకణాక్రాంత లగు కాంతలం గూడి, జలక్రీడా కుతూహలుం డై, యమునా జలంబులు సొర, నందు ముందట సుందరులు సొచ్చి, పదప్రమాణంబు, జాను దఘ్నంబు, కటిద్వయసంబు, మధ్యమాత్రంబు, కుచంబులబంటి, యని పలుకుచుం, గుచ నయన నాభివివర కుంతలంబులు చక్రవాక జలచ రావర్త శైవాలంబుల చందంబున నందంబుగ నీడు బొందిన యేటు లని, కళిందనందన కరంబులు సాచి, పరిరంభములకు నారంభించు నైకె వడి నెదురు సనుదెంచి తాఁకు తరంగంబులకు నులుకుచు, సారసంబులకుం గరంబులు సాచుచు, మరాళంబుల జోఁపుచుఁ జెన్ను మిగిలిన చన్నుల యొత్తువత్తు మను నెపంబులం దపంబులు నీట గావించు మాడ్కిని సంచరించు చక్రవాకంబులఁ దోలుచు, నితాంత కాంతిసదనంబు లగు

1. పాటఁబాడి (హ) 2. కరకాంచితలగు (తం. వా.)

వదనంబులకు నోడి, ప్రీడం జెంది, కంది, చందురుఁడు చల ముడిగి, జలమునం బడి, కంపించు కరణి, నిజ కరకలిత జలప్రతిఫలితుం డై కదలు చంద్రునిం గని మెచ్చి సోలుచు, సలిలావగాహన సమయ సముచ్ఛలిత వారిశీకర పరంపరల వలన మకరందపాన మత్త మధుకర పక్షవిక్షేపణ సంజాతవాత సముద్ధూత కుముదాది పరాగపటలంబులం [1]జెఱుచుచు, మోముఁదమ్ముల కమ్మఁదనంబులకు మూఁగి, ఝుమ్మ్మ రను దుమ్మెదలకు వెఱచుచుఁ, గరంబుల నీ రెగయం జఱచుచు, నీలనీరద నిపతిత పయోబిందు సందోహంబులం దడియు పువ్వుదీవి యల బాగునఁ గృష్ణు కరద్వయతోయంబునం బెక్కు తోయంబులం దడియుచుఁ గ్రందుకొని సుడియుచు, నసమబాణుని పులు కడిగిన కుసుమబాణంబుల పగిది మేనులు మెఱవ, సలిలావగాహన పరాయత్త చిత్త లగుచు, మొత్తంబు లై సరసభాషణంబులం బ్రదుళ్ళుచు, గరంబుల నీరు నించి హరిమీఁదఁ జల్లుచుఁ, జల్లు నెడం దడఁబడ దాఁటుచు, దాఁటి చనక నిలువరించుచు, వినోదింప, హరియుఁ గరేణుకర వికీర్ణ నీరధారాభిషిక్తం బగు శుండాలంబులీల నాభీర కామినీ కర సముక్షిత జలాసారంబులం దోఁగుచు, వ్రజవధూజన హస్తప్రయుక్త కల్హార కైరవ పరాగపటలంబువలన భూతిభూషణు సిరి వహించుచు, గోపికాజన పాణి కిసలయ సమున్ముక్త కమలదళంబులవలన సహస్రనయనుని రూపుఁ జూపుచు, గోపాలబాలికా కుచకలశ కుంకుమ పంకంబువలన బ్రభాతభానుని భంగి భాసిల్లుచు, ఘోషయోషా కటాక్షవిక్షేపణంబులవలన మధుపపరివృత హరి చందన సౌందర్యంబు నొందుచు, వల్లవీ హాసరుచులవలనఁ జంద్రికాప్రభా భాసిత నీలశైలంబు క్రియ నమరె. అంత. 1098

మ. సతులుం దానును నీటిలో వెడలి భూషాగంధ చేలాద్యలం
కృతుఁ డై కుంభి కరేణు యూథములతోఁ గ్రీడించు చందంబునన్
లతలందుం దరులందుఁ బుష్పమయ లీలాశయ్యలందున్ సుఖో
న్నతుఁ డై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్. 1099

వ. ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించె. అని చెప్పిన, మునివరునకు భూవరుం డి ట్లనియె. 2000

మత్తకోకిల. ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ డీశుఁడు ధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజన సంగమే
ధర్మ మంచుఁ దలంచి చేసె నుదాత్తమానస చెప్పుమా! 2001

1. చేరుచు (తం. వా.)

వ. అనిన శుకుం డి ట్లనియె. 1102

ఆ. సర్వభక్షకుఁ డగ్ని సర్వంబు భక్షించి
దోషి గానివగిది దోష మైనఁ
జేసి దోషపదముఁ జెందరు తేజస్వు
లగుటఁ జంద్ర వాసవాదు లధిప ! 1103

క. ఈశ్వరుఁడు గానివాఁడు న,రేశ్వర ! పరకాంతఁ దలఁచి యెట్లు బ్రతుకు గౌ
రీశ్వరుఁడు దక్క నన్యుఁడు, విశ్వభయద విషము మ్రింగి వెలయం గలఁడే.

క. సత్యము ప్రభువుల వచనము, నిత్యము తద్వచనవిధిని నిలుతురు పెద్దల్
సత్యాసత్యము గావున, సత్య మనుచుఁ జనరు వారిచరితమున నృపా ! 1105

మ. ఘను లై యెవ్వని పాదపంకజ పరాగ ధ్యానసంప్రాప్త యో
గ నిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం
ధ నిరోధంబులు లేక విచ్చలవిడిం దర్పింతు రా నిత్యశో
భనుఁ డె ట్లుండిన నుండెఁ గాక కలవే బంధంబు లుర్వీశ్వరా ! 1106

ఆ. గోపజనములందు గోపికలందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు
సర్వమయుఁడు లీల సలిపెఁ గాక. 1107

వ. అని చెప్పి, శుకుం డి ట్లనియె. అంత బ్రాహ్మముహూర్తంబునం గృష్ణు
వీడ్కొని, గోపిక లిచ్ఛలేకయు నిండ్లకడ కేగినం, గృష్ణమాయా మోహితు
లై, గోపకులు వారలం గోపింప నెఱుంగనేర రైరి. 1108

ఇంద్రవజ్రము. గోపాల కృష్ణుండును గోపకాంతల్
ప్రాపించి క్రీడించిన భంగు లెల్లం
రూపించి వర్ణించి నరుండు హృత్పం
తాపంబులం బాయును దత్ప్రసక్తిన్. 1109

అధ్యాయము – ౩౪

—: సర్పరూపి యగు సుదర్శనుం డను గంధర్వుని శాపవిమోచనము :—

వ. అంత నొక్కనాఁడు నందాదు లైన గోపకు లంబికావనంబునకు శకటంబు లెక్కి
జాతరకుం జని, సరస్వతీ నదీజలంబుల స్నానంబులు సేసి, యుమామహేశ్వరుల
నర్చించి, కానుక లిచ్చి, బ్రాహ్మణులకు గో హిరణ్య వస్త్రాన్న దానంబు లొసంగి,

జలప్రాశనంబు సేసి, నియమంబున నుండ, దైవయోగంబున నాఁకొని యొక్క మహోరగంబు,నిదురవోయిన నందునింగఱచి, మ్రింగ నగ్గలింప, నతండుఁ 'కృష్ణ! కృష్ణేతి' వచనంబులం దన్ను విడిపించు మని మొఱ యిడిన, విని. 1110

క. గోపకు లందఱు మేల్కొని, కోపముతోఁ బెద్దగుదెలఁ గొఱవుల మొత్తన్
దాపము నొందియు వదలక, పాపపుఁ, బెనుబాము నందుఁ బట్టె నృపాలా!

వ. అయ్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి, పాదతాడనంబు సేసి, త్రొక్కిన, సర్పంబు సర్పరూపంబు విడిచి, విద్యాధరేంద్ర రూపంబు దాల్చి, హరికి మ్రొక్కిన నతనికి హరి యి ట్లనియె. 1112

ఉ. మండిత మూర్తితోఁ గనక మాలికతో శుభలక్షణుండ వై
యుండెడు నీకుఁ గష్టపు మహోరగ దేహ మిదేల వచ్చె నె
వ్వండవు నామ మెయ్యది భవంబున కెద్ది మిషంబు నాకు నొం
డొండ యెఱుంగఁ జెప్పుము బుధోత్తమ! నీవని చోద్య మయ్యెడిన్. 1113

వ. అనిన వాఁ డి ట్లనియె. దేవా! యేను సుదర్శనుం డను విద్యాధరుండ. విమానారూఢుండ నై, రూపసంప ద్గర్వంబులం జొక్కి, దిక్కులఁ జరించుచు, నొక్క యెడ నాంగిరసు లైన ఋషులఁ గురూపులైన వారలం గని, నగిన, వారును, నీవును రూపదర్పంబునం దమ్ము నగితివి గావున మహాసర్పంబ వై యుండు మని శపించినఁ బిదప నే వేఁడుకొనిన ని ట్లనిరి. 1114

చ. యదుకులమందు భక్తుల భయంబు హరించుటకుం జనార్దనుం
డుదయము నొంది యీ యడవి కొక్కదినంబున రాఁ గలండు త
త్పదమున నీవు దన్నఁబడి పన్నగ దేహముతోడఁ బాసి నీ
మొదలిటి మేను గాంచెదవు మూఢుఁడ! [1]పొమ్మని రా దయానిధుల్! 1115

మ. నినుఁ జింతించిన విన్నఁ బేరుకొనినన్ నిర్మాల మై క్రుస్సి పా
పనికాయంబు వినష్ట మౌ నఁట భవత్పాదంబు నా మీఁదఁ బె
ట్టినఁ దద్బ్రాహ్మణ శాపసంజనిత కౌటిల్యంబు దా నిల్చునే
వనజాక్షా! నేఁడు వాసె నురగత్వం బెల్ల నేఁ బోయెదన్. 1116

వ. అని విన్నవించి, హరికిం బ్రదక్షిణంబు వచ్చి, మ్రొక్కి, సుదర్శనుండు దివంబునకుం జనియె. సర్పంబువలన నందుండు విముక్తుం డయ్యె. తత్ప్రకారంబు విని, వెఱఁగుపడి, గోపకులు దేవతా మహోత్సవంబు సమాప్తి నొందించి, శ్రీకృష్ణ కీర్తనంబు సేయుచు, మరల మందకుం జనిరి. అంత. 1117

---

1. పొమ్మనిరో దయానిధీ (క.బ.తం)

-: శ్రీకృష్ణుడు కుబేరభటుఁ డగు శంఖచూడుం డను గుహ్యకుని సంహరించుట :-

చ. మఱియొక నాఁటి రాత్రి బలమాధవు లుజ్జ్వల వస్త్ర మాలికా
ధరులును లేపనాభరణ ధారులు నై చని మల్లికాది పు
ష్పరస నిమగ్న మత్త మధుపంబుల గీతము వించుఁ దద్వనాం
తరమున వెన్నెలన్ వ్రజనితంబిను లుండగఁ బాడి రింపుగన్. 1118

క. ఆ పాట చెవులు సోఁకిన, నేపాటియు దేహలతల నెఱుఁగక దృగ్వా
చా పాటవములు [1]నెడి పడి, రా పాటలగంధు లెల్ల నటవీవీథిన్. 1119

వ. ఇట్లు సకల భూతసమ్మోహం బగు గానంబు సేయుచు, నిచ్ఛావర్తనంబులం బ్రమత్తుల చందంబున రామకృష్ణులు క్రీడింపఁ, గుబేరభటుండు శంఖచూడుం డనువాఁడు, రామకృష్ణ రక్షిత లగు గోపికలం దన యోగబలంబున నుత్తరపు దిక్కునకుం గొనిపోవ, న య్యాపలు 'రామ! కృష్ణేతి' భాషణంబులు వలుకుచుఁ, బులికి నగపడిన మొదవుల క్రియ మొఱయిడిన విని. 1120

ఉ. గ్రద్దన సాలవృక్షములు గైకొని బల్లిదు లన్నదమ్ము లా
యిద్దఱు కాలమృత్యువుల యేఁపున వే చని యోడకుండుఁ డో
ముద్దియలార! యంచుఁ దను ముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం
డుద్దవడిన్ గతిన్ బఱచె నుత్తర మింతుల డించి భీతుఁ డై. 1121

వ. ఇట్లు గుహ్యకునిచేత విడివడిన గోపికల రక్షించుకొని యుండు మని, బలభద్రునిం బలికి. 1122

శా. ఓరీ! గుహ్యక! పోకు పోకుమని రోషోక్తిం బకారాతి వాఁ
డే రూపంబున నెందుఁ జొచ్చె నటఁ బోయెం దోడఁ దా నేఁగి దు
ర్వారోదంచిత ముష్టి వాని తలఁ ద్రెవ్వంబట్టి తద్వీరు కో
టీర భ్రాజిత రత్నమున్ గొనియె దండిన్ గోపిక ల్చూడఁగన్. 1123

వ. ఇట్లు శంఖచూడునిం జంపి, వాని శిరోరత్నంబు దెచ్చి, బలభద్రున కిచ్చి మెప్పించె.

## అధ్యాయము — ౩౫

మఱియు, నొక్క దినంబునం గృష్ణుండు వనంబునకుం జనిన, నతని లీలలు పాడుచు నిండ్లకడం దద్విరహ వేదనానల భరంబు సహింపక, గోపికలు తమలో ని ట్లనిరి.

---

1. వడినెడిరా (గ. డ.)

శా. భ్రూవిక్షేపముతోడ దాపలి భుజంబుం జెక్కుఁ గీలించి కె
మ్మోవిన్ వేణువుఁ గూర్చి సుస్వరముగా మ్రోయించుచు న్నంగుళీ
ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని సత్ప్రాణేశ లై యుండియున్
నీవీబంధము లూడఁ జొక్కుదురు పో నింగిన్ నిలింపాంగనల్. 1125

మ. నవమాధుర్యము గల్గు కృష్ణు మురళీ నాదామృత స్యందముల్
సెవులన్ జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబు లై
యువిదా! మేపులకుం దొరంగి మృగ గోయూథంబు లుత్కంఠతో
దివికిన్ గంఠము లెత్తి లో వదలుఁ బో దేహేంద్రియ వ్యాప్తులన్. 1126

శా. ఓ కంజేక్షణ! కష్ణుఁ డుజ్జ్వలిత హారోద్దాముఁ డై గాన వి
ద్యా కౌతూహలితన్ మనోజ్ఞ మురళీధ్వానంబుఁ గావింపఁగా
నాకర్ణించి సకంప మై మొఱయు నీలాభ్రంబుగాఁ జూచుచున్
గేకారావము లిచ్చుచున్ మురియుఁ బో కేకీంద్ర సంఘాతముల్. 1127

మ. లలనా! యేటికిఁ దెల్లవాఱె రవి యేలా తోఁచెఁ బూర్వాద్రిపైఁ
గలకాలంబు నహంబు గాక నిశిగాఁ గల్పింపఁ డా బ్రహ్మ దా
వలఱేఁడున్ గృపలేఁడు కీరములు దుర్వారంబు లెట్లో కదే
[1]కలవే మాపటికాలమందు మనకున్ గంజాక్షు సంభోగముల్. 1128

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు హరి యెప్పుడు గోవులమేపి తెచ్చు మా
కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణ మబ్బు నతండు వచ్చి న
న్నెప్పుడు గారవించుఁ దుది యెప్పుడు మద్విరహాగ్ని రాశికిన్
జెప్పఁ గదమ్మ! బోఁటి! మరుసేఁతల నుల్లము దల్లడిల్లెడిన్. 1129

మ. చెలియా! కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం జేరంగ న య్యా క్షణం
బులు నా కన్నియు నుండ నుండఁగఁ దగన్ బూర్ణంబు లై సాఁగి లో
వలఁ దోఁచుం బ్రహరంబు లై దినము లై పక్షస్వరూపంబు లై
నెల లై యబ్దము లై మహాయుగము లై నిండారు కల్పంబు లై. 1130

వ. అని మఱియుఁ, గృష్ణవిరహ దుఃఖంబున బహువిధంబులఁ బశ్చాత్తాపంబునొందుచు, గోపిక లోపికలు లేక, యెట్టకేలకు దినంబు గడపి, దినాంతసమయంబునందు.

మ. అదె భానుం డపరాద్రిఁ జేరె నిదె సాయంకాల మేతెంచె న
ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె బృందారణ్య మార్గంబునం
దిదె వీతెంచె వృషేంద్రఘోషము ప్రియుం డేతెంచె రండంచుఁ దా
మెదు రేతెంతురు మాపు కృష్ణునికి న య్యింతుల్ పరిభ్రాంత లై. 1132

1. వలదే....కాలముం గలుగునే (హ); కలదే మాపటి వేళయున్ (తం. వా)

వ. ఇట్లు తన కెదురువచ్చిన మచ్చిక న చ్చెలువల నచ్యుతుం డిచ్ఛావర్తనంబుల గార వించె. అంత నొక్కనాఁడు. 1133

## అధ్యాయము - ౩౬

### —: వృషభాసుర సంహారము :—

సీ. ఎవ్వని మూఁపుర మీక్షించి మేఘంబు లద్రిశృంగం బని యాశ్రయించు
నెవ్వని అంకె కర్ణేంద్రియంబులు సోఁక గర్భపాతం బగు గర్భిణులకు
నెవ్వని పదహతి నెగయు పరాగంబు లంధకారారాతి నావరించు
నెవ్వఁడు కొమ్ముల నెదురించి చిమ్మినఁ బృథ్వీధరంబులు పెల్లగిల్లు

తే. నట్టి వృషభాసురేంద్రుఁ డహంకరించి
వాలలత యెత్తి పెనుఅంకె వైచి నేలఁ
గాలు ద్రవ్వుచు నిశితశృంగములు సాచి
మంద బెగడంగ గవిసె నమందుఁ డగుచు. 1134

వ. ఇట్లు వృషభాకారంబున నరిష్టుండు, హరికి నరిష్టంబు సేయందలంచి, పై కుఱికిన.

ఉ. క్రేపులువాఱె గోవులకుఁ గ్రేపులు గోవులు గో వృషంబులఁ
బైపడె వత్స ధేను వృషభంబులు గోపకులందుఁ జొచ్చె నా
గోపకు లా వృషేంద్రములు గోవులు లేఁగలు విచ్చి పాఱఁగా
గోపచమూ విభుండు గనె గోవృష దైత్యుఁడు వెంట నంటఁగన్. 1136

వ. ఇట్లు భయభ్రాంతు లై, కాంతలుం దారును కృష్ణ! కృష్ణ! రక్షింపు మని యెడి గోపకులకు నడ్డంబు వచ్చి, దీనజన రక్షకుం డైన పుండరీకాక్షుం డిట్లనియె,

ఉ. బాలుర నింతులం బసులఁ బాఱఁగఁదోలుట బంటుపంతమే
చాలు వృషాసురేంద్ర బలసంపదఁ జూపఁగ నెల్లబోఁటి గో
పాలుర మంద గాదు చను పైఁ బడితేనిఁ బ్రచండ కృష్ణ శా
ర్దూలము నేఁడు నీ గళముఁ ద్రుంపక చంపక పోవనిచ్చునే. 1138

ఆ. అనుచు ధిక్కరించి హస్తతలంబులఁ
[2]జప్పుడించి నగుచు [3]సఖునిమీఁదఁ
బన్నగేంద్రభయద బాహుదండము సాఁచి
దండిమెఱసి [4]దనుజుదండ నిలిచె. 1139

---

1. జూడగ నెల్ల బోటి (చ. డ. వ. జ. ద.)
2. జప్పళించి (హ) 3. చలముమీఱ (వ) 4. దనుజదండి (హ)

వ. అప్పుడు. 1140

చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంఠిత వాలసమీరణంబులన్
విరవిరఁ బోయి మేఘములు వివ్వ విషాణము లొడ్డికొంచు దు
స్తరతర మూర్తి యై వృషభదైత్యుఁడు కన్నుల నిప్పు లొల్కఁగా
దురదుర వచ్చి తాఁకె రిపుదుర్మద మోచనుఁ బద్మలోచనున్. 1141

ఉ. యాదవకుంజరుండు వృషభాసురు కొమ్ములు రెండుఁ బట్టి య
ష్టాదశ పాదమాత్రము గజంబు గజంబును ద్రొబ్బుకై వడిన్
భేదిల ద్రొబ్బ న య్యసుర పిమ్మటి నొంది చెమర్చి క్రుగ్గి దు
ర్మాదముతోడ డీకొనెఁ బ్రమత్త విమర్దను నా జనార్దనున్. 1142

ఆ. అంత గోపసింహుఁ డసుర కొమ్ములువట్టి
ధరణి ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల
కొమ్ము వీఁగ సురల కొమ్ము వర్ధిల వాని
కొమ్ము వెఱికి మొత్తి కూల్చె నధిప! 1143

క. ఉక్కఁచెడి రోఁజి నెత్తురు, ముక్కున వాతను స్రవింప మూత్ర శకృత్తుల్
మిక్కిలి విడుచుచుఁ బసరపు, రక్కసుఁ డని సమసెఁ బ్రజకు రాగము లమరన్.

వ. ఇట్లు వృషభాసురుం జంపిన, నిలింపులు గుంపులు గొని, విరులు వర్షింప, గోపకులు హర్షింప, గోపసతు లుత్కర్షింప, బలభద్రుండును, వారును, గోవిందుండును, బరమానందంబున మందకుం జనిరి. అంత. 1145

చ. ఘనుఁ డొకనాఁడు నారదుఁడు కంసునితోడ యశోదకూఁతు దాఁ
గనుటయుఁ జక్రి దేవకికి గర్భజుఁ డౌటయు మున్ను రోహిణీ
తనయుఁడు రాముఁ డౌటయును దద్విభు లిద్దఱు మంద నున్న వా
రని యెఱుఁగంగఁ జెప్పిన మహాద్భుత మంచు జలించెఁ గిన్కతోన్. 1146

చ. కొడుకుల మందలోన నిడి గొంటుతనంబున మోసపుచ్చె నీ
బడు గని పట్టి చంపు టిది భావ్యమటంచుఁ గృపాణపాణి యై
వడి వసుదేవునిం దునుమవచ్చిన కంసునిఁ జూచి నారదుం
డుడుగుము చంపఁ బోల దని యొడక మానిచి పోయె మింటికిన్. 1147

వ. మఱియు, నలుకదీఱక కంసుండు, దేవకీవసుదేవుల లోహపాశబద్ధులం జేసి, కేశి యనువానిం బిలిచి, రామకేశవులం జంపు మని పంపి, మంత్రి భట గజారోహక చాణూర ముష్టిక సాల్వ కోసల ప్రముఖుల రావించి, యి ట్లనియె. 1148

శా. ఎందుం జన్నెదిరించి పోరుటకు దేవేంద్రాదులుం జాల రీ
బృందారణ్యము మంద నిప్పుడు మదాభీరార్భకుల్ రామగో
విందుల్ వర్ధిలుచున్నవా రఁట రణోర్విం గంసు [1]నొప్పింతు మం
చుం దర్పంబులు వల్కుచుందు రఁట యీ చోద్యంబులన్ వింటిరే. 1149

క. పట్టణజనములు సూతురు, దట్టంబుగ మల్లరంగతల పార్శ్వములం
బెట్టింపుఁడు తమకంబులు, పుట్టింపుఁడు వీట మల్లుపో రను మాటన్. 1150

శా. విన్నాణంబులఁ బోర నేర్తురు మహావీర్య ప్రతాపాది సం
పన్నుల్ మీరలు మేటి [2]మల్లుగములం బ్రఖ్యాతులై పెంపుతో
మన్నా రా బలకృష్ణులం బెనఁకువన్ మర్దించి మత్ప్రీతి కా
సన్నుల్ గండు పురీజనుల్ పొగడ నో చాణూర! యో ముష్టికా! 1151

శా. రారా! హస్తిపకేంద్ర గండ మదధారా గంధలోభాంధ గం
భీరాళివ్రజ మైన మత్కువలయాపీడ ద్విపేంద్రంబు [3]మ
ద్ద్వారోదంచిత దేహళీ పరిసర స్తంభంబు డాయంగ [4]నా
భీరుల్ రా నదలించి డీకొలుపు నీ భీరంబు తోరంబుగన్. 1152

క. పశువిశసనములు సేయుఁడు, పశుపతికిం బ్రియముగాఁగ భావించి చతు
ర్దశినాఁడు ధనుర్యాగము, విశదంబుగఁ జేయవలయు విజయముకొఱకున్. 1153

వ. అని తనవారి నందఱ నయ్యై పనులకు నియమించి, యదుశ్రేష్ఠుం డగు
నక్రూరునిం బిలిచి, చెట్టఁ బట్టుకొని, యి ట్లనియె. 1154

శా. అక్రూరత్వముతోడ నీవు మనఁగా నక్రూరనామంబు ని
ర్వక్రత్వంబునఁ జెల్లె మైత్రి సలుపన్ వచ్చుం నినుం జేరి నీ
వక్రోధుండవు మందలోన బలకృష్ణాభీరు లస్మద్వినా
శ క్రీడారతులై చరింతు రఁట యోజం దెచ్చి యొప్పింపవే. 1155

ఆ. నాకు వెఱచి సురలు నారాయణుని వేఁడి
కొనిన నతఁడు వచ్చి గోపకులము
నందుఁ గృష్ణమూర్తి నానకదుందుభి
కుదితుఁ డయ్యె ననఁగ నొకటి వింటి. 1156

---

1. మర్దింతు (తం); కంసునిం ద్రుంతు (వా) 2. మంతనములన్ (హ) 3. దుర్వారో దంచిత (హ) 4. నాభీరుస్త్రాణ (హ)

వ. కావున నీవు గోపకులచేత నరులు గొని, ధనుర్యాగంబుఁ జూడ రం డని, వారలఁ దోడ్కొనిరమ్ము. తెచ్చిన. 1157

శా. కొండల్ గూలఁగ ద్రొబ్బు కొమ్ముఁ దుదిం గోపించి కోరాడుచో
దండిన్ దండి నధఃకరించు నొక వేదండంబు నా యింట బ్ర
హ్మాండం బైనఁ గదల్పనోపు బలకృష్ణాభీరులన్ బోరిలోఁ
ఖండింపన్ దడ వెంత దాని కదియుం గాదేని యక్రూరకా ! 1158

శా. చాణూరుండును ముష్టికుండును సభాసంఖ్యాత మల్లుల్ జగ
త్ప్రాణుల్ మెచ్చరు సత్వసంపదల బాహాబాహి సంగ్రామ పా
రీణుల్ వారలు రామకృష్ణుల బలోద్రేకంబు సైరింతురే
క్షీణప్రాణులఁ జేసి చంపుదురు సంసిద్ధంబు యుద్ధంబునన్. 1159

సీ. ఆ రామకేశవు లంతరించిన వసుదేవముఖ్యులఁ జంపి తెగువ మెఱసి
వృష్ణిభోజ దశార్ణవీరులఁ దెగటార్చి ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు
నగు నుగ్రసేను మాయయ్య గీ టణఁగించి పినతండ్రి దేవకుఁ బిలుకుమార్చి
మఱియు వైరుల నెల్ల మర్దించి నే జరాసంధ నరక బాణ శంబరాది

ఆ. సఖులతోడ భూమిచక్ర మేలెదఁ బొమ్ము
తెమ్ము వేగమ వసుదేవసుతుల
మఖముపేరు సెప్పి మంత్రభేదము [2]సేయ
వలయుఁ బెంపఁజనదు వైరిజనుల. 1160

వ. అనిన నక్రూరుం డి ట్లనియె. 1161

ఉ. పంపినఁ బోనివాఁడనె నృపాలక ! మానవు [3]లెన్నఁ దమ్ము నూ
హింపరు దైవయోగముల నించుక గానరు తోఁచినట్లు ని
ష్కంపగతిన్ జరింతు రది గాదనవచ్చునె యీశ్వరేచ్ఛఁ ద
ప్పింపఁగరాదు నీ పగతుబిడ్డలఁ దెచ్చెదఁ [4]బోయివచ్చెదన్. 1162

వ. అని పలికి, రథ మెక్కి, యక్రూరుండు చనిన, సకలజనులను వీడ్కొలిపి, కంసుం డంతిపురంబునకుం జనియె.

## అధ్యాయము — ౩౯

అంత కంసప్రేరితుం డయి. 1163

---

1. చూపుదురు పంపిద్ధంబు (హ): చూపుదురు సూసిద్ధంబు (తం. వా.) 2. సేయవలదు. ప్రాఁతప్రతులన్నిట (తం. వా.) 3. లైన తమ్ము (హ): లైననమ్ము (క) 4. నొప్పగించెదన్ (త.)

—: శ్రీకృష్ణుండు కేశి వ్యోమాసురుల సంహరించుట :—

సీ. ఖురపుటాహతిఁ [1]దూలి కుంభినీచక్రంబు ఫణిరాజు [2]ఫణలకు బరువుసేయ
భీషణ హేషా విభీషితులై మింట నమృతాంధు లొండొరు నండ గొనఁగఁ
జటుల చంచల సటాచ్ఛటల గాడ్పుల మేఘములు విమానముల పై
ముసుఁగు పడఁగ
వివృతాస్య గహ్వర విపుల దంతంబులు ప్రళయాగ్ని కీలలపగిది మెఱయఁ

ఆ. గాలపాశలీలగా వాల మేపార
వావహా మగుచు గంధవాహగతుల
విజిత శక్రపాశి వీర్య పయోరాశి
కేశి వచ్చె మంద క్లేశమంద. 1164

క. భీషణ ఘోటక దానవ, హేషానిర్ఘోష భిన్న హృదయ నిఖిల గో
యోషా పురుషార్భక మై, ఘోషము హరి చూడ దైన్యఘోషం బయ్యెన్.

వ. అ య్యవసరంబున. 1166

ఉ. పేదల ఘోషగోపకుల బి ట్టదలించుట వీరధర్మమా
కాదు వ్రజంబులో దనుజఘస్మరుఁడేఁ డని తన్నుఁ దోయు క్ర
వ్యాదునిఁ జూచి గోపకుల కడ్డము వచ్చి నిశాట! యింకఁ బో
రా దని శౌరి చీరె మృగరాజుక్రియ [3]న్నదిరించె దైత్యుఁడున్. 1167

ఆ. నిష్ఠురోగ్ర సింహనినదంబుతో నింగి
మ్రింగుభంగి నోరు మిగులఁ దెఱచి
కఱవరాఁగ నతఁడు కాటు దప్పించినఁ
దన్నె నెగసి తురగదానవుండు. 1168

ఉ. తన్నిన తన్నునం బడక దానవహంత సమీక రంత యై
కన్నులఁ గెంపు పెంపెనయ గ్రక్కున ఘోటనిశాటు పాదముల్
వన్నెచెడంగఁ బట్టి పడవైచె ధనుశ్శతమాత్ర దూరమున్
బన్నగ డింభమున్ విసరి పాఱఁగ వైచు ఖగేంద్రుకైవడిన్. 1169

ఉ. వైచిన మ్రొగ్గి లేచి వెస వాజినిశాటుఁడు హుంకరించి సం
కోచము లేక పైఁబడిన గోపకులేంద్రుఁడు దిగ్గజేంద్ర శుం
డా చటులప్రభా బలవిడంబక మైన భుజార్గళంబు దో
షాచరు నోటిలోన నిడెఁ జండఫణిన్ గుహ నుంచుకైవడిన్. 1170

1. ధూళి (హ) 2. ఫణులకు (హ) 3. న్నదించె (గ)

శా. దంభోళి ప్రతిమాన కర్కశ మహోద్యద్బాహు దోఃస్తంభముం
గుంభశ్రీల నఘారి వాని రదముల్ చూర్ణంబులై రాలఁగా
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి పేర్చన్ వృద్ధి [1]పొందింపుచున్
గుంభించెన్ [2]బవనంబు పిక్కటిలఁ దత్కుక్షిన్ నరేంద్రోత్తమా! 1171

క. వాయువు వెడలక నిలిచినఁ, గాయంబు చెమర్పఁ గన్నుఁగవ వెలి కుఱుకన్
మాయ సెడి తన్నుకొనుచును, గూయుచు నశ్వాసురుండు గూలెన్ నేలన్. 1172

ఆ. ఘోటకాసురేంద్రు కుక్షిలోఁ గృష్ణుని
బాహు వధిక మయినఁ బట్టలేమిఁ
బగిలి దోసపండు పగిదిఁ దద్దేహంబు
వసుమతీశ! రెండు వ్రయ్య లయ్యె. 1173

క. నళినాక్షుఁడు లీలాగతి, విలయముఁ బొందించె నిట్లు వీరావేశిన్
బలలాశిన్ జగ దహితవ, బలరాశిన్ విజిత శక్రపాశిన్ గేశిన్. 1174

వ. ఆ సమయంబునం బుష్పవర్షంబులు గురియించి, సురలు వినుతించిరి. అంత హరిభక్తి విశారదుం డయిన *నారదుండు వచ్చి, గోవిందుని సందర్శించి, రహస్యంబున ని ట్లనియె. 1175

సీ. జగతీశ! యోగీశ! సర్వ భూతాధార! సకలసంపూర్ణ! యీశ్వర! మహాత్మ!
కాష్ఠగత జ్యోతికైవడి నిఖిల భూతములందు నొకఁడవై తనరు దీవు
సద్గూఢుఁడవు గుహాశయుఁడవు సాక్షివి నియంతవాఁడవై నీవు మాయఁ
గూడి కల్పింతువు గుణముల ; వానిచేఁ బుట్టించి రక్షించి పొలియఁజేయు

ఆ. దీ ప్రపంచమెల్ల నిట్టి నీ విప్పుడు
రాజమూర్తు లయిన రాక్షసులను
సంహరించి భూమిచక్రంబు రక్షింప
నవతరించినాఁడ వయ్య! కృష్ణ! 1176

వ. దేవా! నీచేత నింకఁ జాణూర, ముష్టిక, గజ, కంస, శంఖ, యవన, ముర, నరక, పౌండ్రక, శిశుపాల, దంతవక్త్ర, సాల్వ ప్రముఖులు మడిసెదరు. పారిజాతం

---

1. (బొందించుచున్ (తం) 2. భువనంబు (హ)

* ఇక్కడ కథాక్రమమును గూర్చి వ్యాఖ్యానమున నిట్లు తెలుపఁబడినది.

"ప్రాతరేవం కేశివధానంతరం నారదోక్తమంగీకృత్య, పునస్తథైవ పశూన్ చారయతా వ్యోమో హతః. యద్వా వ్యోమవధః పూర్వమేవ ప్రవృత్తోఽపి వేషధారి వధ ప్రసంగాదత్రోచ్యత ఇతి ద్రష్టవ్యమ్. కేచిత్తునః శంఖచూడ వధాత్పూర్వమేవ పఠంతి (37-24)

బపహృతం బయ్యెడిని. నృగుండు శాపవిముక్తుం డగు. [1]శమంతకమణి సంగ్రహం
బగు. మృత బ్రాహ్మణపుత్ర ప్రదానంబు సిద్ధించు. అర్జును సారథి వై యనేకా
క్షౌహిణీ బలంబుల వధియించెదవు. మఱియును. 1177

శా. కృష్ణా! నీ వొనరించు కార్యములు లెక్కింపన్ సమర్థుండె వ
ర్ధిష్ణుం డైన విధాత మూఁడు గుణముల్ దీపించు లోపించు రో
చిష్ణుత్వంబున నుండు నీవలన నిస్సీమంబు నీరూపునిన్
విష్ణున్ జిష్ణు సహిష్ణు నీశు నమితున్ విశ్వేశ్వరున్ మ్రొక్కెదన్. 1178

వ. అని [2]వినిపించి, వీడుకొని, నారదుం డరిగె. అంత నొక్కనాఁడు కృష్ణసహితు
లై, గోపకుమారు లడవికిం జని, పసుల మేపుచు, నొక్క కొండ దండ [3]నిలాయన
క్రీడ చేసిరి. అందు. 1179

క. కొందఱు గొఱియల మనుచును, గొందఱు పాలకుల మంచుఁ గుటిలత్వమునన్
గొందఱు దొంగల మనుచును, జెంది కుమారకులు క్రీడఁ జేసిరి తమలోన్. 1180

శా. ఆలో దొంగలలో మయాసురసుతుం డాద్యుండు వ్యోముండు గో
పాలుం డై చని మేషకల్పనలతో భాసిల్లి క్రీడించు త
ద్బాలవ్రాతము నెల్ల మెల్లన చతుఃపంచావశిష్టంబుగా
శైలాంత ర్గుహలోనికిం గొని చనెన్ [4]జౌర్యం బవార్యంబుగన్. 1181

వ. ఇట్లు కొండగుహలోనఁ గ్రమక్రమంబున గోపకుమారుల నిడి, యొక్క పెను
రాతఁ దద్ద్వారంబుఁ గప్పి, యెప్పటి యట్లు వచ్చిన. 1182

ఉ. వీరుఁడు మాధవుం డఖిలవేది నిశాచరభేది నవ్వుతో
నోర! నిశాట! దొంగతన మచ్చుపడెన్ నెఱదొంగ వౌదు వా
భీరుల నెల్ల శైలగుహఁ బెట్టితి చిక్కినవారిఁ బెట్టరా
రార! యటంచుఁ బట్టి మృగరాజు వృకాఖ్యముఁ బట్టు కైవడిన్. 1183

ఉ. పంకజలోచనుం డొడిసిపట్టిన శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁ బొంగి విడిపించుకొనంగ బలంబు లేమి లో
శంకిలి బిట్టు తన్నుకొనఁ జక్కన నా రణభీము వ్యోమునిన్
గొంకక కూల్చె న వ్విభుఁడు కో యని మింట సుపర్వు లార్వఁగన్. 1184

---

1. శమంతక (హ. తం. వా.) 2. వినుతించి (తం.వా.) 3. "చక్రు ర్నిలాయనక్రీడామ్" (37-27) 4. శౌర్యం (క. చ.త. వ.)

ఆ. ఘోరదనుజు నేలఁ గూల్చి పర్వతగుహ
వాతనున్న ఱాయి వ్రయ్యఁ దన్ని
గుహ చరించుచున్న గోపాలకులఁ గాంచు
బల్లిదుండు [1]గొల్లపల్లె కరిగె. 1185

## అధ్యాయము - ౩౭

—: కంసునిపంపున నక్రూరుండు బృందావనమునకుం జనుట :—

వ. అంత నా రాత్రి మధురానగరంబున నక్రూరుండు వసియించి, నియతుం డయి, రేపకడ రథం బెక్కి కదలి, నందగోకులంబునకుం బోవుచుం, దెరువునఁ దనలో ని ట్లనియె. 1186

ఉ. ఎట్టితపంబు సేయఁబడె నెట్టిచరిత్రము లబ్ధ మయ్యెనో
యెట్టిధనంబు లర్హులకు నీఁబడెనో తొలుబామునందు నా
యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులన్
బట్టఁగలేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడఁగల్గెడిన్. 1187

ఉ. సూరులు దొల్లి యే విభుని శోభిత పాదనఖ ప్రభావళిం
జేరి భవాంధకారములఁ జిక్కక దాఁటుదు రట్టి దేవునిన్
వైరముతోడ నైనఁ బిలువన్ ననుఁ బంచి శుభంబు సేసె ని
ష్కారణ [2]మైన ప్రేమ నిదె కంసునిఁ బోలు సఖుండు గల్గునే. 1188

మ. ఇతఁ డా కంసునిచేతఁ బంపువడి నన్ హింసింప నేతెంచినాఁ
డతి దుష్టుం డని చూచునో సకల భూతాంతర్ బహి ర్మధ్య సం
గతుఁ డౌటన్ దలపోసి నన్ను సుజనుంగాఁ జూచునో యెట్టి యు
న్నతిఁ గావించునొ యేక్రియన్ బలుకునో నాభాగ్య మె ట్లున్నదో. 1189

వ. అని మఱియును. 1190

మ. అలకభ్రాజిత మై సుధాంశు నిభ మై హాస ప్రభోద్దామ మై
జలజాతుం బయి కర్ణకుండల విరాజ ద్గండ మై యున్న యా
జలజాతాక్షు ముఖంబుఁ జూడఁ గలుగున్ సత్యంబు వో నాకు నా
వల ది క్కేఁగుచునున్న వీ వనమృగ వ్రాతంబు లీ త్రోవలన్. 1191

---

1. గోప (హ)  1. ప్రేమతోడ (హ)

ఉ. మాపటివేళ నేను జని మాధవు పాదసమీపమందు దం
డాపతితుండ నైన నతఁ డాశుగ కాలభుజంగ వేగ సం
తాపిత భక్తలోక భయ దారణ మైన కరాబ్జ మౌదలన్
మోపి హసించి నా కభయముం గృపతోడుత నీయకుండునే. 1192

వ. అని మఱియు, నక్రూరుం డనేక విధంబుల గోవింద సందర్శనంబు గోరుచు, నమందగమన సుందర స్యందనారూఢుం డై చని చని. 1193

క. ముందటఁ గనె ఘనచందన, కుంద కుటజ తాల సాల కురవక వట మా
కందన్ నందిత బల గో,విందన్ వికచారు ణారవిందన్ బృందన్. 1194

వ. కని, బృందావనంబు దరియంజొచ్చి, యందు సాయంకాలంబున నడవికి నెఱిగల మేఁతల వెంబడిం దిగంబడి, రాక చిక్కిన కుఱ్ఱకోడె పడ్డ తండంబులం గానక పొద, [1]యిఱుము, మిట్టుపల్లంబు లనక, తూఱి, పాఱి, వెదకి, చీరెడు గోపకుల యాహ్వాన శబ్దంబు లాకర్ణింపుచుఁ, గోమల ఘాసఖాదన కుతూహలంబులఁ జిక్కి, మక్కువలఁ గ్రేపులం దలంచి, తలారింపక, తమకంబులం దమతమ యంత నంభా రవంబులు సేయుచు, [2]నూధంబులు స్రవింపఁ బరువులిడు ధేనువులకు నోసరింపుచు, సద్యోజాతంబు లగు తర్ణకంబుల వహించిన సూతికలు వెనుదగులుటవలన దామ హస్తు లై చను వల్లవుల మెల్లన విలోకింపుచు, మంద యిరుగెలంకులం గళంక రహితు లై, పులి, సివంగి, వేఁగి [3]లోనగు వాలుమెకంబుల మొత్తంబులవలన నప్రమత్తు లై, కుఠార కుంత శరాసన ప్రముఖంబులు ధరియించి, కావలి [4]తిరుగువారలఁ గడచి, నానావిధ సరస తృణకబళ ఖాదనగరిష్ఠ లయి, గోష్ఠంబులు ప్రవేశించి, రోమంథ లీలాలస లయిన ధేనువులును, చన్నులు గుడిచి తల్లుల ప్రోలఁ బెల్లు రేఁగి క్రేళ్ళుఱుకు లేఁగలును, నెద లయిన మొదవులఁ బయి కొని, పరస్పర విరుద్ధంబు లయి డీకొని, కొమ్ముల యుద్ధంబులు సలుపు వృష భంబులును, నకుంఠిత బలంబులం గంఠరజ్జువులఁ దెంచుకొని, పొద లుఱికి, దాఁటి, తల్లులం దూఁటి, కుడుచు తఱిపి దూడల ధట్టించి పట్టనోపక, గ్రద్దనఁ బెద్దలం జీరు గోపకుమారులును, కొడుకుల, మగల, మామల, మఱఁదుల వంచించి, పంచాయుధభల్ల భగ్నహృదయ లయి, గృహకృత్యంబులు మఱచి, శంకిలక, సంకేత స్థలంబులఁ గృష్ణాగమన తత్పర లయియున్న గోపకామినులును, గోష్ఠ ప్రదేశంబుల గోవులకుం గ్రేపులు విడిచి, యొడ్డుచు, మఱలం గట్టుచు, నీడ్చుచుం,

---

1. యిరువు (హ) 2. మూత్రంబులు (హ) 3. వాలవు మొత్తంబుల (హ)
4. ప్రేలం గడచి (తం. వా.)

గ్రీడించు గోపకులును, గోఖుర సముద్ధూత కరీష పరాగ పటలంబులవలన నల్లారి, దులదుల నై, ధేనుదోహనవేళా వికీర్ణ పయోబిందు సందోహ పరంపరా సంపాదిత పంకంబులును, దోహన సమయ గోపవరాకృష్ట గో స్తననిర్గతంబు లయి కలశంబులందుఁ బడు క్షీరధారల చప్పుళ్ళును, మహోక్ష కంఠసంస్పర్శన స్నిగ్ధంబు లయిన మందిరద్వార దారు స్తంభంబుల పొంత నూతనజన విలోకన కుపితంబు లయి కరాళించు సారమేయంబులునుం గలిగి, బల కృష్ణ బాహు దండ ప్రాకార రక్షావిశేషణ భూషం బయిన ఘోషంబు ప్రవేశించి యందు. 1195

క. జలజాంకుశాది రేఖలు, గల హరిపాదముల చొప్పుఁ గని మోదముతోఁ
బులకించి రథము డిగి యు, త్కలికన్ సంతోషబాష్ప కలితాక్షుం డై. 1196

మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేను దో
హనవాటీ గతుల నలంకృతుల నుద్య ద్భాసులన్ బీత నీ
ల నవీనోజ్జ్వల వాసులన్ గుసుమమాలా ధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్య క్రమోద్దాములన్. 1197

క. కని వారల పాదములకు, వినయంబున మ్రొక్కి భక్తివివశుం డగుచున్
దనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానందబాష్పములు జడి గురియన్.

వ. తదనంతరంబ. 1299

క. అక్రూరు లయిన జనుల న,వక్రగతిన్ గాఁచు భక్తవత్సలుఁ డంత
న్నక్రూరుఁ గౌఁగిలించెను, జక్రాంకిత హస్తతలము సాఁచి నరేంద్రా! 1200

వ. మఱియు, నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుం డయినఁ, గౌఁగిలించి, చెట్టపట్టి కొని, కృష్ణసహితుం డయి,. గృహంబునకుం గొనిపోయి, మే లడిగి, గద్దియనిడి, పాదప్రక్షాళనంబు చేసి, మధుపర్కంబు సమర్పించి, గోవు నిచ్చి, యాదరంబున రసవదన్నంబు వెట్టించి, తాంబూల గంధమాల్యంబు లొసంగె. అ య్యవసరం బున నందుం డుపవిష్టుం డయిన యక్రూరున కి ట్లనియె. 1201

క. చెలియలు మొఱయిడ నల్లుర, ఖలుఁ డయి పొరిగొనిన యట్టి కంసుఁడు బ్రతుకం
గలఁడే మనికి దశార్హుల, కిలపై మీసేమ మింక నేమని యడుగన్. 1202

అధ్యాయము-౩౯

వ. అని పలికె. అంత నక్రూరుం డొక్క పర్యంకంబున సుఖోపవిష్టుం డై యుండ హరి యి ట్లనియె. 1203

మ. శుభమే నీకుఁ బ్రమోదమే సఖులకుం జుట్టాలకున్ సేమమే
యభయంబే ప్రజ కెల్ల గోత్రజుల [1]కత్యానందమే మామ ము
క్తభయుండే వసుదేవ దేవకులు తత్కారాగృహంబందు మ
త్ప్రభవవ్యాజ నిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై. 1204

మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ వగతో నీతోడ నేమైన నా
కెఱుఁగం జెప్పు మటంచుఁ జెప్పరుగదా యేమందు రా వార్త యే
తెఱఁగున్ లేదని డస్సిరో వగచిరో దీనత్వముం జెందిరో
వెఱతో నా తలిదండ్రు లెట్లు పడిరో విన్పింపు మక్రూరకా! 1205

వ. మఱియు, నీ వేమికారణంబున వచ్చి తని, హరి పలికిన, నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పిన వైరానుబంధ ప్రకారంబును, గంసుండు దేవకీ వసుదేవుల వధియింపం గమకించి, మానిన తెఱంగును, ధనుర్యాగంబు పేరు చెప్పి పుత్తెంచిన ప్రకారంబు నెఱింగించిన, రామకృష్ణులు నగిరి. అంతఁ దమ్ముం బరివేష్టించిన నందాది గోపకులఁ జూచి కృష్ణుం డిట్లనియె. 1206

శా. భూనాథుండు మఖంబుఁ జూడఁ బిలువం బుత్తెంచినాఁ డవ్విభుం
గానం బోవలెఁ బాలు నెయ్యి పెరుఁగుల్ గట్నంబులున్ గానుకల్
మీ నేర్పొప్పఁగఁ గూడఁ బెట్టుఁడు తగన్ మీ మీ నివాసంబులన్
యానంబుల్ గొనిరండు పొందు మధురా యాత్రాభిముఖ్యంబుగన్. 1207

వ. అని నియమించె. అంత నక్రూరుండు మధురకు వారిం గొంపోయెడి నని యెఱింగి, వ్రేతలు గలంగి. 1208

ఉ. హరి నవ్వుల్ హరిమాటలున్ హరిమనోజ్ఞాలాపముల్ లీలలున్
హరివేడ్కల్ హరిమన్ననల్ హరికరాబ్జాలంబ నాహ్వానముల్
హరిణీలోచను లందఱున్ [2]దలఁచుపాయం బెట్లొకో యంచు లో
నెరియన్ ముచ్చటలాడి రంత గములై యేకాంతగేహంబులన్. 1209

వ. మఱియుం దమలో ని ట్లనిరి. 1211

ఉ. మేటిగృహస్థు బ్రహ్మ యని మిక్కిలి నమ్మితి! మమ్ము చూడ నే
పాటియు లేదు మాకుఁ బరిపాలకుఁడైన సరోజనేత్రు ని
చ్చోట వసింపనీక నొకచోటికిఁ బో విధియించి పిన్నబి
డ్డాటలు చేసె నీ [3]సుఖము లక్కట! భారతి కైనఁ జెప్పరే. 1211

---

1. కాత్యానందమే(తం.వా.) 2. మఱియు పాయం బెట్లొకో(తం.) 3. దుడుకులక్కట(తం.వా.)

వ. అని విధిం దూఱుచు, మదనతాపాయత్త చిత్త లై. 1212

ఉ. రమ్మని చీరినంతనె పురంబున కేఁగెడుఁ గాని నన్ను నీ
కొమ్మలు నమ్మినారు మరు కోలల కగ్గముచేసి పోవఁగా
ముమ్మర మైన తాపమున మ్రొగ్గుదురో యనఁ డంబుజాక్షుఁ డా
యమ్మలు గోపవృద్ధులు ప్రయాణము వల్దన రైరి చెల్లరే! 1213

శా. అక్రూరుం డని పేరు పెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం
జక్రిం మాకడఁ బాపికొంచు నరుగన్ జర్చించి యేతెంచి నా
డక్రూరుం డఁట క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁ డౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తన త్రోవం బో విచారింపఁడే. 1214

ఉ. ఫుల్ల సరోజలోచనలు పూర్ణ సుధాంశుముఖుల్ పురాంగనల్
మెల్లనె యెల్లి పట్టణము మేడలనుండి సువర్ణలాజముల్
చల్లఁగ వారిఁ జూచి హరి సంగతి సేయఁదలంచుఁ గాక వ్రే
పల్లె వసించు ముద్దియలపైఁ బడ నేల తలంచు నక్కటా! 1215

క. పురసతుల విలోకనములు, సరసాలాపములు నర్మసంభోగములున్
మరగి హరి మనల నొల్లఁడు, నరవరు లో యమ్మ! నూతనప్రియులు గదే. 1216

క. పుట్టైన్నఁడు హరి నెఱుఁగని, పట్టణసుందరుల కితనిఁ బతిఁ జేసి కడున్
దట్టపు విరహాగ్నులకును, గట్టిఁడి దైవంబు ఘోషకాంతల వెదకెన్. 1217

మ. హరి నేలా కొనిపోయె దంచు మన మా యక్రూరు బ్రార్థింతమా
హరిఁ బోనీకుఁడు నిల్పరే యనుచు నేఁ డర్చింతమా వేల్పులన్
హరిపాదంబుల కడ్డముల్ వడుదమా హా దైవమా! యంచు నా
తరుణుల్ కొప్పులుఁ జీరెలున్ మఱచి కందర్పజ్వర భ్రాంత లై. 1218

మ. ఉవిదల్ సిగ్గులు మాని కన్నవల నీ రొండొండ [1]వర్షింపఁగా
వివశత్వంబులతోఁ గపోలతట సంవిన్యస్త హస్తాబ్జ లై
పవనోద్ధూత లతాభ లై మముఁ గృపం బాలింపు గోవింద! మా
ధవ! దామోదర! యంచు నేడ్చిరి సుజాతం బైన గీతంబులన్. 1219

వ. అంత మఱునాఁడు సూర్యోదయకాలంబునం దనతోడఁ బయనంబునకు గమకించి నడచు గోపికలను, మఱల వత్తు నని దూతికాముఖంబున నివర్తించి, కృష్ణుండు శకటంబులందుఁ గానుకలును, గోరసంబులు నిడుకొని, నందాదు లైన గోపకులు

1. వర్ణింపుచున్ (హ)

వెనుతగుల నక్రూరచోదితం బైన రథం బెక్కి, మధురాభిముఖుం డయి చను సమయంబున. 1220

చ. అదె చనుచున్నవాఁడు ప్రియుఁ డల్లదె తే రదె వైజయంతి య
ల్లదె రథఘోటకాంఘ్రి రజ మాదెస మార్గము చూడుఁ డంచు లో
నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖ లై గము లై వ్రజాంగనల్
కదలక నిల్చి చూచి రట కన్నుల [1]కబ్బినయంత దూరమున్. 1221

వ. ఇట్లు బలభద్ర కృష్ణాక్రూరులు చనిచని. 1222

క. అవలోకించెను గృష్ణుఁడు, ప్రవిమల కల్లోలపవన భాసిత జన్య
న్నవసన్న పాపసైన్యన్, గవిజన మాన్యన్ గళిందకన్యన్ ధన్యన్. 1223

వ. కని తత్కాళిందియందుఁ బరిశుభ్ర మణిగణ సముజ్జ్వలంబు లగు జలంబులు ద్రావి, తరుసమూహ సమీపంబున రామసహితుం డయి, కృష్ణుండు రథంబు నెక్కె. అంత నక్రూరుండు వారలకు మ్రొక్కి, వీడ్కొని, కాళిందీహ్రదంబు సొచ్చి, విధిపూర్వకంబుగా వేదమంత్రంబుల జపియించుచు. 1224

—: అక్రూరుండు యమునను రామకృష్ణుల దర్శించి నుతించుట :—

ఉ. స్నానము చేసి చేసి నది చల్లనినీటను రామకృష్ణులన్
మానుగఁ జూచి వారు రథమధ్యముపై వసియించియున్నవా
రీ నది నీటిలోపలికి నెప్పుడు వచ్చి రటంచు లేచి మే
ధానిధి చూచె వారిని రథస్థుల భక్త మనోరథస్థులన్. 1225

వ. కని వెఱఁగుపడి. 1226

శా. కంటిన్ మున్ను రథంబుపై జలములోఁ గంటిన్ దుదిన్ గ్రమ్మఱన్
గంటిన్ దొంటి రథంబుమీఁద నిదె యీ కల్యాణచారిత్రు లే
వెంటన్ దోఁచిరి రెండుదిక్కుల మనోవిభ్రాంతియో నీటిలో
నుం డాశ్చర్యము చూతు నంచు మఱియున్ స్నాహించి మగ్నాంగుఁ డై. 1227

ఉ. పోషితబాంధవుండు యదుపుంగవుఁ డా జలమందుఁ గాంచె స
ద్భాషు సహస్రమస్తక విభాసిత భూషు సహిశు భూమి భృ
ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతివీర చమూ విజిగీషు నిత్య సం
తోషు సరోషు నిర్దళితదోషు ననేకవిశేషు శేషునిన్. 1228

---

1. కద్భుతమైన (హ)

గూర్మలీలా పరిష్పంది వై, వంది వై, మేదినిఁ మీఁదికిం ద్రోచి, దోషా
చరుం గొమ్ములఁ జెమ్మలం జిమ్ముచుఁ గ్రువ్వవే, త్రవ్వవే ఘోరవైరిఁ
నృసింహుండ వై, దండి వై దండి వైరోచనిం జూచి యాచింపవే,
పెంపవే మేను బ్రహ్మాండము న్నిండఁ బొఱుండ వై, రాజకోటిఁ
విపాటింపవే, రాజ వై రాజబింబాస్యకై దుర్మదారిఁ విదారింపవే,
నొంపవే క్రూరులఁ వాసుదేవాది రూపంబులఁ, శుద్ధబుద్ధుండ వై
వైరిదారాంతరంగంబుల న్నంతరంగంబులుం గాఁ గరంగింపవే, పెంపు
దీపింపవే, కల్కిమూర్తిం బ్రవర్తించు ని న్నెన్న నే నెవ్వఁడన్, నన్ను
మాయా విపన్నున్, విషణ్ణుం, బ్రపన్నుం, బ్రసన్నుండ వై, ఖిన్నతం
బాపి, మన్నింపవే, పన్నగాధీశతల్పా! కృపాకల్ప! వందారుకల్పా!
నమస్తే, నమస్తే, నమస్తే, నమః. 1232

మ. కలలం బోలెడి పుత్ర మిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ చేయు చందంబునన్
దలఁతున్ రుచ్యము లంచు మూఢుఁడ వృథా తత్త్వజ్ఞుఁడన్ నాకు నీ
విలసత్ [1]పాదయుగంబుఁ జూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ! 1233

## అధ్యాయము - ౪౧

వ. అని మఱియును వినుతింప నక్రూరునికి యమునాజలంబులోనం దన మొదలి
మేను సూపి, చాలించి, నటునికైవడి, దిరోహితుం డైన, నక్రూరుండు నీరువెడలి,
వెఱఁగుపడుచు వచ్చి, రథారోహంబు సేసిన, హరి యి ట్లనియె. 1234

క. జలములు చేరువ నున్నవి, తలపోయఁగ నీవు పోయి తడ వయ్యె నదీ
జలమున నభమున ధరణిం, గలుగని చోద్యములు నీకుఁ గానంబడెనే. 1235

వ. అనిన నతం డి ట్లనియె. 1236

క. నీలోన లేని చోద్యము, లే లోకమునందుఁ జెప్ప రీశ్వర! నీట
న్నేలం నింగిని [2]నున్నవె, నీలోఁ జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా! 1237

వ. అని పలికి, సాయంకాలంబునకు నక్రూరుండు మధురానగరంబు చేర రథంబు
గడపె. అంతట మున్ను చనిన నందాదులు పురోపవనంబున విడిసియుండ,
వారలం గూడుకొని, కృష్ణుం డక్రూరునిం జూచి, నీవు రథంబు గొనుచు
నగరంబునకుం జనుము. మేము వెనుక వచ్చెదము. అనిన, నతండి ట్లనియె. 1238

1. పద్మపదంబుఁ (హ) 2. దిక్కుల (హ)

## —: శ్రీకృష్ణుని మధురానగర ప్రవేశము :—

క. నా యింటికి విచ్చేయుము, నీ యంఘ్రిసరోజ రేణునికరము సోఁకన్
నా యిల్లు పవిత్రం బగు, శ్రీయుత ! నీ భటునిఁ బెద్ద సేయం దగదే. 1239

వ. అని మఱియుం బ్రార్థించిన, హరి యి ట్లనియె. 1240

క. యదుకుల విద్వేషణుఁ డై, మదమున వర్తించు కంసు మర్దించి భవత్
సదనంబు సూడ వచ్చెదఁ, [1]బోద యీ స్యందనముఁ గొనుచుఁ బురమునకనఘా !

వ. అని పలికిన, నక్రూరుండు పురంబునకుం జని, రామకృష్ణులు వచ్చి రని, కంసున కెఱింగించి, తన గృహంబునకుం జనియె. అంత నపరాహ్ణంబున బలభద్ర గోపాల సహితుం డయి, కృష్ణుండు. 1242

మ. పరిఘల్ కోటలు కొమ్మలున్ బడగలున్ ప్రాసాదముల్ వీథులున్
హరులున్ దేరులు వీరులున్ గజములున్ హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహోద్యానంబులున్ దీర్ఘికల్
కర మాశ్చర్యరుచిం దనర్చు మధురన్ గాంచెన్ విభుం డంతటన్ 1243

వ. కని య ప్పురంబు ప్రవేశించి, వచ్చు సమయంబున. 1244

ఉ. నంద తపఃఫలంబు సుగుణంబుల పుంజము గోపకామినీ
బృందము నోముపంట సిరివిందు దయాంబుధి యోగిబృందముల్
డెందములందుఁ గోరెడు కడింది నిధానము చేరవచ్చెనో
సుందరులార ! రండు చని చూతము కన్నులకోర్కె దీరఁగన్. 1245

వ. †అని మరియు, గోవిందసందర్శన కుతూహలంబులం బౌరసుందరులు పరస్పరాహూయమాన లై, భుంజాన లై, భోజనభాజనంబులు దలంగం ద్రోచియు, శయాన లై లేచియు, [2]నభ్యజ్యమాన లై జలంబు లాడకయు, గురుజన శిక్ష్యమాణ లై యోడకయు, గృహకార్య ప్రవర్తమాన లై పరిభ్రమింపకయు, రమణ రమమాణ లై రమింపకయు, శిశుజన బిభ్రాణ లై డించియు, నలంకుర్వాణ లై యన్యోన్య వస్త్రాభరణ మాల్యాను లేపనంబులు వీడ్వడ ధరించియు నరిగి. 1246

క. వీటఁ గల చేడె లెల్లను, హాటక మణి ఘటిత తుంగ హర్మ్యాగ్రములన్
గూటువలు గొనుచుఁ జూచిరి, పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్. 1247

---

1. బద (హ) 2. అభ్యంజ్యమాన లై (తం)

సీ. వీఁడఁటే ! రక్కసి విగతజీవగఁ జన్నుఁ బాలు ద్రావిన మేటి బాలకుండు
వీఁడఁటే ! నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు
వీఁడఁటే ! మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన దాఁపరీఁడు
వీఁడఁటే ! [1]యెలయించి వ్రేతలమానంబు చూఱలాడిన లోకసుందరుండు

తే. వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు
వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగరుతము
వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు. 1248

మ. చెలియా ! గోపిక లీ కుమారతిలకుఁ జింతింపుచుఁ బాడుచుఁ
గలయం బల్కుచు నంటుచుఁ నగుచు నాకర్షింపుచున్ హస్తగా
మలకక్రీడకుఁ దెచ్చి యిచ్చలును సమ్మానంబులఁ బొందఁగాఁ
దొలిజన్మంబుల నేమి నోఁచిరొ గదే దుర్గప్రదేశంబులఁ. 1249

క. అని మఱియుఁ బౌరకాంతలు, మునుకొని హరిరూపు నేత్రములవెంటను లోఁ
గొని తాల్చిరి హృదయములను, జనిత ప్రమదమున విరులు సల్లుచు నధిపా !

వ. మఱియును. 1251

క. నానావిధ గంధములుఁ బ్ర, సూన ఫలాదులును హరిత శుభ లాజములున్
గానుక లిచ్చుచు విప్రులు, మానుగఁ బూజించి రా కుమారోత్తములఁ. 1252

వ. ఆ సమయంబున నగరద్వారంబుననుండి వచ్చు రాగకారుం డగు నొక రజకుం
గాంచి హరి యి ట్లనియె. 1253

ఉ. విందుల మై నరేశ్వరుని వీటికి వచ్చితి మేము మాకు మా
మందలలోనఁ గట్టుకొన మంచిపటంబులు లేవు నీ మడిఁ
సుందర ధౌతచేలములు శోభిలుచున్నవి తెమ్ము నిన్ను మే
లందెడి నిమ్ము రాజుదెస నల్లుర మో రజకాన్వయాగ్రణీ ! 1254

వ. అనిన రోషించి వాఁ డి ట్లనియె. 1255

శా. ఎట్టెట్టా మనుజేంద్రుచేలములు మీ కీఁ బాడియే మీరలుం
గట్టం బోలుదురే పయో ఘృత దధి గ్రాసంబులన్ మత్తులై
యి ట్టాడం జనెఁ గాక గొల్లలకు మీ [2]కె ట్బంగి నోరాడెడిఁ
గట్టా ! ప్రాణముఁ గోలుపోయెదు సుమీ కంసోద్ధతిం బాలకా ! 1256

---

1. యలయించి (హ. వా.) 2. కిట్లాడ (హ)

క. మా రాజు సొమ్ముఁ గైకొన, నే రాజులు వెఱతు రింత యెల్లిదమే నీ
కీ రాజరాజ గృహమున, నీ రాజస మేల గొల్ల యేఁగుము తలఁగన్. 1257

వ. అనిన విని రోషించి. 1258

క. ఘోర కరాగ్రతలంబున, ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ గొట్టెన్
బౌరుల గుండెలు వగులఁగ, వీరోద్రేకిన్ మదావివేకిన్ జాకిన్. 1259

వ. ఇట్లు భగ్నుం డయిన రజకుం జూచి, వానివారలు పటంబులు డించి, వెఱచి, పఱచిన, రామకృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించి, కొన్ని గోపకుల కొసంగి, చనుచుండ. 1260

క. అంతట నొక వాయకుఁ డా, క్రంతన్ వసుదేవసుతులఁ గని బహువర్ణా
త్యంత మృదు పటాభరణము, లెంతయు సంతసముతోడ నిచ్చెన్ మెచ్చన్.

శా. కారుణ్యంబున వానిఁ గైకొని యలంకారంబు గావించి శృం
గారోదంచిత దిగ్గజేంద్ర వలభాకారంబులం బొల్చి రా
శూరుల్ మాధవుఁ డంత వాయకుని శుశ్రూషన్ మహాప్రీతుఁ డై
సారూప్యంబును లక్ష్మియు న్నొసఁగె నైశ్వర్యాది సంధాయి యై. 1262

వ. అంత నా రామకృష్ణులు, సుదాముం డను మాలాకారు గృహంబునకుం జనిన, నతండు గని లేచి, గ్రక్కున మ్రొక్కి, చక్కన నర్ఘ్యపాద్యాదికంబు లాచరించి, సానుచరు లైన వారలకుఁ దాంబూల కుసుమ గంధంబు లొసంగి, యి ట్లనియె.

ఉ. పావన మయ్యె నా కులము పండెఁ దపంబు గృహంబు లక్ష్మికిన్
సేవిత మయ్యె నిష్టములు సేకుఱె విశ్వనిదానమూర్తు లై
భూవలయంబుఁ గావ నిటు పుట్టిన మీరలు రాకఁ జేసి నే
నేవిధ మాచరింతుఁ బను లెయ్యవి బంట నెఱుంగఁ జెప్పరే. 1264

వ. అని పలికి. 1265

క. దామోదర రాముల కు, ద్దామ యశోహసిత తుహినదాములకు వధూ
కాములకుఁ దెచ్చి యిచ్చె సు, దాముఁడు ఘన సురభికుసుమ దామము లధిపా!

క. వారును మాలికుఁ డిచ్చిన, భూరి కుసుమదామములను భూషితు లై నీ
కోరిన వర మిచ్చెద మని, కారుణ్యము సేయ నతఁడు గని యి ట్లనియెన్.

క. నీ పాదకమల సేవయు, నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును, దాపసమందార! నాకు దయసేయఁగదే! 1268

వ. అని వేఁడుకొనిన నిచ్చి, మఱియును, మాధవుం డమ్మాలికునకు బలాయుః కాంతి కీర్తి సంపద లొసంగి, వాని గృహంబు వెడలి, రాజవీథిం జని చని.

అధ్యాయము - ౪౨

క. ఆ నళినాక్షుఁడు గాంచెను, నానా లేపముల భాజనము చేకొనుచుం
బూని చనుదెంచు దానిని, నానన రుచినిచయ వినమితాబ్జం గుబ్జన్. 1270

వ. కని యిట్లనియె. 1271

క. ఎవ్వరిదానవు లేపము, లెవ్వరికిం గోరి కొనుచు నేఁగెదు నీ పే
రెవ్వతె మా కిమ్మన్నియు, నివ్వటిలెదు చక్క నగుచు నీరజనేత్రీ! 1272

వ. అనిన నయ్యబల యిట్లనియె. 1273

ఉ. చక్కనివాఁడ వౌదు సరసంబుల నొంపకు మెల్లవారికిన్
జక్కఁదనంబు లెక్కుడివి చారుశరీర ! త్రివక్ర యండ్రు నే
నిక్కము కంసు దాసిని వినిర్మల లేపనవిద్యదాన నన్
మిక్కిలి రాజు మెచ్చుఁ దగ మీరు విలేపనముల్ ధరింపరే. 1274

క. గొల్లలకును గంబళ్ళును, జెల్లును గట్టంగ గఱకు చీరలు నింతే
మెల్లనె మేలము లాడెదొ, యుల్లంబున నడుగ నిట్లు నుచితమె మీకున్. 1275

క. అని పలికి యా కుమారుల, తనువులు నగవులును వీక్షితములును మాటల్
దనచిత్తముఁ గరఁగించిన, ననులేపము లిచ్చె వారి కబల ప్రియముతోన్. 1276

సీ. ఇవ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబు లన్నియుఁ దాను దేహమున నలఁది
కొని ప్రసన్నత నొంది కుబ్జ మువ్వంకల యొడలు చక్కఁగ నొత్తి యునుపఁ దలఁచి
తత్పదంబులమీఁదఁ దనపదంబులు ద్రొక్కి హస్తాంగుళిద్వయ మబల గవుద
క్రింద విప్పుగ నిడి కృష్ణుఁడు మీఁదికి నెత్తిన వక్రత లెల్ల మాని

ఆ. చక్కనైన చిత్తజన్మబాణముక్రియఁ
గొమరుమిగిలి పిఱుఁదు గుచయుగంబు
సొంపుఁ జేయఁ దరుణి సుందరమూర్తియై
కమలనయనుఁ జూచి కాంతతోడ. 1277

క. వేంచేయుము నా యింటికి, పంచశరాకార యనుచుఁ బైకొం గాక
ర్షించి హరిఁ దిగిచెఁ గామిని, పంచాశుగ బాణజాల భగ్నహృదయయై. 1278

క. కామిని దిగిచినఁ గృష్ణుఁడు, రాముని వీక్షించి నగుచు రాజానన ! మ
త్కామితముఁ దీర్చి పిదపన్, నీ మందిరమునకు వత్తు నేఁ డలుగకుమీ. 1279

వ. అని వీడుకొలిపి, కృష్ణుండు, విపణిమార్గంబునం జని చని, తాంబూల మాలికా గంధంబులును, బహు విధంబు లయిన కానుకలును, పౌరు లిచ్చినం బరిగ్రహింపుచు, ధనుశ్శాల కరిగి, యందు. 1280

క. సురరాజు వింటికై వడి, గురుతర మయి భూరి వీరగుప్తం బయి దుస్తర మయిన విల్లుఁ బొడగని, నరులు వల దనంగ బట్టు నగి వికసితుఁ డై.

శా. బంధుల్ మేలన వామహస్తమునఁ జాపం బెత్తి మౌర్వీలతా సంధానం బొనరించి కొంచెపుఁ దెగన్ శబ్దించుచున్ ధీరతా సింధుం డా హరి దాని ఖండితముగాఁ జేసెన్ జనుల్ చూడఁగా గంధేభంబు రసాలదండము నొగిన్ ఖండించుచందంబునన్. 1282

క. కోదండ భంగ నిర్గత, నాదము వీనులకు భీషణం బై యాశా రోదోంతరములు నిండుచు, భేదించెన్ భోజవిభుని బింకము నధిపా! 1283

వ. అప్పుడు. 1284

ఉ. అద్దిర ! రాచవిల్ విఱిచె నర్భకుఁ డెంతయు శంకలేక నేఁ డుద్దవడిన్ సహింపఁదగ దుగ్రతఁ బట్టుద మంచుఁ గ్రుద్ధు లై గ్రద్దన లేచి తద్ధనువు కావలివా రరుదేర వారి న యిద్దఱుఁ గూడి పట్టి [1]వధియించిరి కార్ముకఖండ హస్తు లై. 1285

వ. ఇట్లు రామకృష్ణులు మధురాపురంబున విహరించి వెడలి, విడిదలకుం జనిరి. అంత.

—: సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణనము :—

మ. గగనారణ్య చరాంధకారగజమున్ గాలాహ్వాయ వ్యాధుఁ డచ్చుగఁ బట్టం గమకించి మచ్చిడుటకై చూతాంకుర శ్రేణిచే నొగిఁ గల్పించిన కందుకం బనఁగఁ సూర్యుం డంత వీక్షింపఁగాఁ దగె మందప్రభతోడఁ బశ్చిమ మహా ధాత్రీధరేంద్రంబునన్. 1287

క. తరుణుఁ డగు శీతకరునిన్, మరగి వియల్లక్ష్మి తన్ను మాని ముదుకఁడున్ ఖరకరుఁడు ననుచు ద్రొబ్బిన, కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా !

ఆ. కళలు గలుగుఁగాక కమల తోడగుఁగాక శివుని మౌళిమీఁదఁ జేరుఁగాక నన్ను నొల్లఁ దపనుఁ డైన మత్పతి యని సాధ్విభంగి కమలజాతి మొగిడె. 1289

---

1. మడియించిరి (తం. వా.)

క. సుందర సాయంసంధ్యా, వందన విప్రార్ఘ్యతోయ వజ్రహతోద్య
న్మందేహాసుర రక్త, స్యందము క్రియఁ గెంపు సొంపెసఁగె నవరదిశన్. 1290

ఆ. భూమినిండ మింటఁ బూర్ణ మై కర్కట
మకర మీనరాశి మహితమైన
హార యశ స్సుధాబ్ధి యందుల తుంపురు
లనఁగఁ జుక్క లొప్పె నాకసమున. 1291

క. ఎల్ల దిశలు నిండిన శ్రీ, వల్లభు గుణమహిమ బ్రహ్మ వాసించుటకై
చల్లిన మృగమద మనఁగా, వెల్లివిరిసెఁ దమము గగన వీథుల నెల్లన్. 1292

క. ఆ చీఁకటి వెను దగిలిన, ప్రాచీదిశనుండి గంతు పరువున రవి భ
ర్మాచలము మఱఁక త్రోవను, వే చనియెం గాక నిలిచి విఱుగకయున్నే. 1293

ఉ. మీకును వైరి యెప్పుడును మిక్కిలి మాకును వైరి రాజు దో
షాకరుఁ డింక వచ్చు జలజాతములార! మదీయ బాలురన్
జేకొనుఁ డంచు బాలకులఁ జీఁకటి దాఁచిన భంగిఁ జిక్క రా
రాక వసించెఁ దుమ్మెదలు రాత్రి సరోరుహ కుట్మలంబులన్. 1294

సీ. ప్రాచీదిశాంగనా ఫాలతలంబున దీపించు సిందూరతిలక మనఁగ
దర్పించి విరహుల ధైర్యవల్లులు ద్రెంప దర్పకుం డెత్తిన దాత్ర మనఁగ
నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు ఖండింప మెఱయించు ఖడ్గ మనఁగ
గగన తమాల వృక్షము తూర్పు కొమ్మను లలిత మై మెఱయు పల్లవ మనంగఁ

ఆ. [1]దొగలు సంతసిల్ల దొంగలు భీతిల్లఁ
గడలి మిన్నుముట్టి కడలు కొనఁగఁ
బొడిచె శీతకరుఁడు భూరి చకోరక
ప్రీతికరుఁడు జార భీతికరుఁడు. 1295

క. దర్పిత తారాధిప వరి, సర్పిత కిరణౌఘ మిళిత సకల దిశం బై
యేర్పడి కమల భవాండము, కర్పూరపుఁ గ్రోవిభంగిఁ గనుపట్టె నృపా! 1296

క. ఆ రేయి గోపయుతు లై, క్షీరాన్నము గుడిచి రామకృష్ణులు మదిఁ గం
సారంభ మెఱిఁగి [2]యిట్లు వి,హారంబుల నప్రమత్తు లై యుండి రిటన్. 1297

క. తన పురికి రామకృష్ణులు, చనుదెంచి నిజానుచరులఁ జంపుటయు మహా
ధనువుఁ గదిసి విఱుచుటయును, విని కంసుఁడు నిద్రలేక విహ్వలమతి యై. 1298

---

1. దొగలగముల బ్రతుకు తొగలు రాజిల్లంగ (హ) 2. యిష్ట (తం. వా.)

సీ. కర్ణరంధ్రములు చేఁగప్పిన లోపలి ప్రాణఘోషము వినఁబడక యుండెఁ
దోయాదికములందుఁ దొంగిచూచుచు నుండఁ దల గానరా దయ్యెఁ దనువుమీఁదఁ
గరశాఖ నాసికాగ్రంబు పై నిడి చూడ గ్రహతారకలు [1]రెండుగా నగపడె
వెలుఁగున నిలుచుండి వీక్షింపఁగా మేని నీడ సరంధ్ర మై నేలఁ దోఁచె

ఆ. నడుగుజాడ దృష్ట మౌట లే దయ్యెను
దరువు లెల్ల హేమతరువు లగుచు
మెఱయుచుండెఁ గాలమృత్యువు డగ్గఱ
బుద్ధియెల్లఁ గలఁగె భోజపతికి. 1299

క. గరళము దినుటయుఁ బ్రేతము, బరిరంభించుటయు నగ్న భావుఁ డవుటయున్
శిరమునఁ దైలము వడుటయు, ఖరపతి నెక్కుటయు నతఁడు గలలోఁ గనియెన్.

వ. మఱియుఁ రక్త కుసుమమాలికా ధరుం డై, యొక్కరుండును నెక్కడేనియుం జనుచున్నవాఁడ నని కల గాంచి, మరణహేతుక భీతిఁ జింతాక్రాంతుం డై నిద్రఁ జెందక వేగించుచున్న సమయంబున. 1301

## —: సూర్యోదయ వర్ణనము :—

క. అరుణ హరినఖర విదళిత, గురు తిమిరేభేంద్ర కుంభకూట వినిర్ము
క్త రుధిర మౌక్తికముల క్రియ, సురపతి దిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్.

సీ. పౌలోమి తన బాలు పాన్పుపైఁ గనుపట్టఁ బన్నిన పవడంపు బంతి యనఁగ
నాయురర్థముల వ్యయంబు లొత్తిలి చాటుకాల [2]జాంఘికు చేతిఘంట యనఁగ
ఘన జంతుజీవిత కాలరాసుల విధి కొల్వ నెత్తిన హేమకుంభ మనఁగఁ
బశ్చిమ దిక్కాంత బరఁగఁ గై సేయుచో ముందర నిడుకొన్న ముకుర మనఁగఁ

తే. గోక తాపోపశమ దివ్యఘుటిక యనఁగఁ
బద్మినీకాంత నోముల ఫల మనంగ
మూఁడు మూర్తుల సారంపు ముద్ద యనఁగ
మిహిరమండల ముదయాద్రి మీఁద నొప్పె. 1303

క. వచ్చెం జల్లని గాడ్పులు, విచ్చెం గమలములు దమము విరిసి బిలంబుల్
చొచ్చెన్ బద్మమరందము, మెచ్చెన్ దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు పొడమన్.

క. సంకాశి తోదయాచల, పంకజసఖ కిరణరాగ పరిపూర్ణం బై
పంకేరుహ గర్భాండము, కుంకుమసలిలంబు గ్రోవి కొమరున నొప్పెన్. 1305

వ. తదనంతరంబున. 1306

---

1. రెంటఁ గానఁబడియె (హ. తం.) 2. కాంఖికు (హ)

సీ. పాషాణ వల్మీక పంకాది రహితంబు మృదుల కాంచననిభ మృణ్మయంబు
కమనీయ కస్తూరికాజల సిక్తంబు బద్ధ చందనదారు పరివృతంబు
మహనీయ కుసుమదామ ధ్వజతోరణ మండితోన్నత మంచ మధ్యమంబు
బ్రాహ్మణ క్షత్త్రాది పౌరకోలాహలం బశ్రాంతతూర్య త్రయాంచితంబు

ఆ. నిర్మలంబు సమము నిష్కంటకంబు నై
పుణ్యపురుషు మనముఁ బోలి కంస
సైన్య తుంగ మగుచు సంతుష్ట లోకాంత
రంగ మైన మల్లరంగ మొప్పె. 1307

క. ఆ మల్లరంగ పరిసర, భూమి స్థిత మంచమందు భోజేంద్రుఁడు మా
న్యామాత్య సంయుతుం డై, భూమీశులు గొలువ నుండెఁ బొక్కుచు నధిపా!

మ. సకలాంభోనిధి మేఖలావహనముం జాలించి యేతెంచు నా
గ కులాగంబులభంగి నొప్పుచుఁ దగం గై సేసి చాణూర ము
ష్టికకూటుల్ [1]శలతోశలుల్ గురువులన్ సేవించుచున్ రంగధా
త్రికి నేతెంచిరి తూర్యఘోషముల నుద్రేకం బనేకంబుగన్. 1309

క. నందాదు లయిన గోపకు, లందఱు నని కానుకలు సమర్పించి నృపున్
సందర్శించి తదనుమతిఁ, జెంది మహామంచముల వసించిరి వరుసన్. 1310

అధ్యాయము – ౪౩

—: శ్రీ కృష్ణుండు కువలయాపీడనమును వధించుట :—

న. అంత నా రామకృష్ణులు నలంకృతు లై, మల్లదుందుభి నినదంబులు విని, సంద
ర్శన కుతూహలంబున. 1311

క. ఓడక రంగద్వారము, జాడం జని వారు గనిరి సమద కువలయా
పీడంబున్ భిన్నపరా, క్రీడంబున్ బ్రమదకంటకిత చూడంబున్. 1312

వ. కని, తత్కరి పాలక శ్రేష్ఠుం డయిన యంబష్ఠునికి మేఘనాద గంభీర భాషణం
బుల రిపుభీషణుం డగు హరి యి ట్లనియె. 1313

శా. ఓరీ! కుంజరపాల! మా దెసకు నీ యుద్యన్మదేభేంద్రముం
బ్రేరేఁపం బనిలేదు త్రిప్పు మరలం బ్రేరేఁచినన్ నిన్ను గం
భీరోగ్రాశని తుల్య ముష్టిహతులన్ భేదించి నేఁ డంతకుం
జేరం బుత్తు మహోత్తరద్విపముతో సిద్ధంబు యుద్ధంబునన్. 1314

---

1. చలకోసలుల్ (హ); శలతోసలుల్ (తం.వా.); "చాణూరోమృష్టికః కూటశ్శల స్తోశల ఏవచ" (42-37)

వ. అని పలికి. 1315

మ. మించిన కోపమ్మునఁ జక్కనిడి [1]మే లన పచ్చనిచీర కాసె బం
ధించి లలాట కుంతలతతిన్ మరలింపుచు సంగర క్రియా
చుంచుతఁ జేర్చి బాలకుఁడు సూచుజనంబులు దన్ను బాపురే!
యంచు నుతింప డగ్గఱియె హస్తిజితాగము గంధనాగమున్. 1316

క. అంజక బాలకుఁ డనియును, గొంజక దయమాలి [2]రాజకుంజరు నాజ్ఞన్
గుంజరమును డీకొలిపెను, గుంజరపాలకుఁడు గోపకుంజరు మీఁదన్. 1317

వ. మఱియు, న య్యనేకపం బనేకపాలక ప్రేరితం బై, మహావాత సంఘాత సముద్ధూతం బగు విలయకాల కీలికేళిని బిట్టు మిట్టిపడి, మృత్యుదేవత యెత్తునం, గాలుపోలిక, శమను గమనిక, నెదిరి, మదసలిల పరిమళ లుబ్ధ పరిభ్రమ దదభ్ర భ్రమరగాయక ఝుంకృతు లహంకృతి సంపాదింపం, గులకుంభినీధర గుహాకుంభ గుంభనంబుగ ఘీంకరించి, రోషభీషణ శేషభోగి భోగభయంకరం బగు కరంబున శౌరిం జీరి, చీరికిం గొనక పట్టిన, నట్టిటు గిట్టి, విధుంతుద వదన గహ్వరంబు వలన విడివడి యుఱుకు తరణికరణి దర్పించి కుప్పించి, పాదమధ్యంబునకు నసాధ్యం బై దూఁటి దాఁటి, మాటుపడినం, గ్రోధబంధురం బై ,సింధురంబు మహార్ణవ మధ్య మంథాయమాన మంథర మహీధరంబు కై వడి, జిఱజిఱం దిరిగి, కానక, భయానకం బై , గాలివెరవునం గని పొంగి, చెంగటం బ్రళయదండి దండ ప్రశస్తం బగు హస్తంబు వంచి, వంచించి, చుట్టిపట్టి, పడవేయం గమకించినం, జలింపక, తెంపున హరి కరి పిఱింది కుఱికి, మహారాహు వాలవల్లి కాకర్ష ణోదీర్ణుం డగు సుపర్ణు తెఱంగున నెగిరి, శుండాలంబు వాలంబులీలం గేల నొడిసి పట్టి, జళిపించి, పంచవింశతి బాణాసనప్రమాణ దూరంబు బిఱబిఱం ద్రిప్పి వైవ, న వ్వారణంబు దుర్నివారణం బై , రణంబున కోహటింపక, సవ్యాప సవ్య పరిక్రమణంబుల నవక్రం బై , కవిసిన, నపసవ్య సవ్య క్రమంబులం దప్పించి, రొప్పి, కుప్పించి, యెదుర్కొనిన, కర్కశుం డై , మేచకాచల తుంగశృంగ నిభంబగు కుంభికుంభంబు చక్కటి వ్రక్కలై, చెక్క లెగయ, దురంత కల్పాంత జీమూత ప్రభూత నిర్ఘాత నిష్ఠురం బగు ముష్టి సారించి, యూఁచి, పొడిచినం, దద్వికీర్ణ పూర్ణ రక్త సిక్త మౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగ రక్తతారకాచ్ఛన్నం బగు మిన్ను చెన్నలవరింప, నిలువరింపక, మ్రొగ్గి, మోఁకరిలి, మ్రొగ్గక దిగ్గన నగ్గజంబు లేచి, చూచి, త్రోచి, నడచి, సంహారసమయ సముద్రసంఘూత

1. మెల్లన (తం) 2. కుంజరయంతన్ (హ)

సంభూత సముత్తుంగ భంగ సంఘట్టితం బగు కులాచలంబుక్రియఁ గ్రమ్మఱ నమ్మహాభుజుని భుజాదండంబువలన ఘట్టితం బై, కట్టలుక ముట్టి, నెట్టి, డీకొని, ముమ్మరంబుగం గొమ్ములం జిమ్మిన, న మ్మేటి చేసూటి మెఱసి, హస్తాహస్తి సంగరంబునఁ గరం బొప్పి, దప్పిం బడక నొప్పించిన, నకుంఠిత కాలకంఠ కఠోరభల్ల భగ్నం బగు పురంబు పగిదిం, జలధిం జటుల ఝంఝానిల వికలం బగు కలంబు కైవడి, న మ్మదకలభంబు మదంబు దక్కి, చిక్కి, స్రుక్కువడి, లోభి కరంబునుం బోలె దాన సలిలధారా విరహితం బై, విరహి తలంపునుం బోలె నిరంతర చిత్తజాత విగ్రహం బై, గ్రహణకాలంబునుం బోలెఁ బరాధీన ఖరకరం బై, ఖరకరోదయంబునుం బోలె భిన్నపుష్కరం బై, పుష్కరవైరి విలసనంబునుం బోలె నఖాసిత పద్మకం బై యున్న సమయంబున. 1318

ఉ. కాలం ద్రొక్కి సలీలుఁ డై నగవుతోఁ గంఠీరవేం ద్రాకృతిన్
గేలన్ భీషణదంతముల్ వెఱికి సంక్షీణంబుగా మొత్తి గో
పాలగ్రామణి వీర మౌళిమణి యై ప్రాణంబులం బాపె నా
శైలేంద్రాభముఁ బ్రాణలోభము నుదంచ త్సార గంధేభమున్. 1319

వ. మఱియు, దంతి దంతతాడనంబుల దంతావళ పాలకుల హరించి, తత్ప్రదేశంబు వాసి. 1320

మ. కరిదంతంబులు మూఁపులందు మెఱయన్ ఘర్మాంబువుల్ మోములన్
నెఱయం గోపకు లంత నంత మలయన్ నిత్యాహవస్థేము లా
హరిరాముల్ సనుదెంచి కాంచిరి మహో గ్రాడంబ రాపూరి తా
మర మర్త్యాది జనాంతరంగము లస న్మల్లావనీ రంగమున్. 1321

సీ. మహిత రౌద్రంబున మల్లుల కశని యై నరుల కద్భుతముగ నాథుఁ డగుచు
శృంగారముగఁ బురస్త్రీలకుఁ గాముఁ డై నిజమృత్యు వై కంసునికి భయముగ
మూఢులు బీభత్సమును బొంద వికటుఁడై తండ్రికి దయరాఁగఁ దనయుఁ డగుచు
ఖలులకు విరసంబుగా దండి యై గోపకులకు హాస్యంబుగఁ గులజుఁ డగుచు

ఆ. బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేలు పై
శాంత మొనర యోగిజనుల కెల్లఁ
బరమతత్త్వమగుచు భాసిల్లె బలునితో
మాధవుండు రంగ మధ్యమందు. 1322

వ. అప్పుడు. 1323

క. చచ్చిన కుంభీంద్రంబును, వచ్చిన బలమాధవులను వరుసం గని తా
నొచ్చిన చిత్తముతోడుతఁ, జెచ్చెరఁ గడు వెఱచె భోజసింహుం డధిపా! 1324

ఉ. ధీరుల వస్త్ర మాల్య మణి దీప్త విభూషణధారుల న్నటా
కారుల సర్వలోక శుభకారుల మానవ మానినీమనో
హారుల రంగభూతల విహారుల గోపకుమారులన్ మహా
వీరులఁ జూచి చూచి తనివిన్ మదిముట్టక లోకు లందఱున్. 1325

ఉ. సన్నుత రామకృష్ణ ముఖచంద్ర మయూఖ సుధారసంబులన్
గన్నులఁ ద్రావుచందమునఁ గాంచుచు జిహ్వల నంటి చూచు లీ
ల న్నుతిసేయుచున్ గరములన్ బరిరంభణ సేయుభంగి న
త్యున్నతిఁ జూపుచున్ దగిలి యొండొరుతోడ రహస్యభాషలన్. 1326

క. వసుదేవు నివాసంబున, వసుధన్ రక్షింప వీరు వైష్ణవతేజో
లసనమునఁ బుట్టినా రఁట, పసిబిడ్డ లనంగఁ జనదు పరదేవతలన్. 1327

సీ. చంపె రక్కసిఁ బట్టి చక్రవాకునిఁ గూల్చెఁ బడద్రొబ్బె మద్దుల బకునిఁ జీరె
నఘదైత్యుఁ బొరిగొనె నడరి వత్సకుఁ ద్రుంచె గిరి యెత్తె దేవేంద్రుఁ గ్రిందుపఱిచెఁ
గాళియు మర్దించె గహనానలముఁ ద్రావెఁ, గేశి నంతకు పురిక్రేవ కనిచె
మయుపుత్రుఁ బరిమార్చె మఱియు దానవభటుల హరించి గోపకులంబుఁ గాచె

తే. గోపకాంతల మనముల కోర్కెఁ దీర్చె
నీ సరోరుహాలోచనుం డీ శుభాంగుఁ
డీ మహామహుఁ డీ దిగ్గజేంద్ర [2]నిభుఁడు
మనుజమాత్రుఁడె తలపోయ మాధవుండు. 1328

—:శ్రీకృష్ణబలరాములు చాణూరముష్టికులను వధించుట:—

వ. అని పలికి, సకలజనులు సూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుం డిట్లనియె.

మ. వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచున్
బెనఁగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీరఁ బనిచెన్ మల్లాహవక్రీడకున్
జనదే కొంత పరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్. 1330

---

1. మహా (వా) 2. ముణఁచె (హ)

మ. జవసత్త్వంబులు మేలె సాము గలదే సత్త్రాణమే మేను భూ
ప్రవరుం బోసన మి మ్మనంగవలెనే పాపీ లఘిష్టంబులే
పవివో కాక కృతాంత దండకమవో ఫాలాక్షు నేత్రాగ్నివో
నవనీతంబుల ముద్ద గాదు మెసఁగన్ నా ముష్టి గోపార్భకా ! 1331

క. జనములు నేర్చిన విద్యలు, జననాథునికొఱకుఁ గాదె జననాథుఁడు నీ
జనములు మెచ్చఁగ యుద్ధం, బున మనముం గొంత ప్రొద్దు పుత్తమె కృష్ణా !

వ. అనిన విని, హరి యి ట్లనియె. 1333

ఉ. సాములు లేవు పిన్నలము సత్త్వము గ ల్దనలేదు మల్ల సం
గ్రామ విశారదుల్ కులిశ కర్కశదేహులు మీరు మీకడన్
నేము చరించు టెట్లు ధరణీశుని వేడ్కలు సేయువారమున్
గాము వినోదముల్ సలుపఁ గా దనవచ్చునె యొక్కమాటికిన్. 1334

క. నీతోడుత నేఁ బెనఁగెదఁ, బ్రీతిన్ ముష్టికునితోడఁ బెనఁగెడి బలుఁడు
గ్రాతత మల్లాహవమున, భూతలనాథునికి మెచ్చుఁ బుట్టింతు సభన్. 1335

వ. అనిన విని, రోషించి, చాణూరుం డి ట్లనియె. 1336

శా. నాతోఁ బోరఁగ నెంతవాఁడ విసిరో నా సాటియే నీవు ? వి
ఖ్యాతుండన్ గులజుండ సద్గుణుఁడ సత్కర్మస్వభావుండ నీ
కేతాదృ గ్విభవంబు లెల్లఁ గలవే యీ పీటఁ బోరాడుటల్
వ్రేతల్ జూడఁగఁ గుప్పిగంతు లిడుటే పీఠింపు గోపార్భకా ! 1337

శా. స్థాణున్ మెచ్చఁడు బ్రహ్మఁ గైకొనఁడు విష్వక్సేను సవ్వుం జగ
త్ప్రాణున్ రమ్మనఁ డీడుగాఁ డని మహాబాహాబల ప్రౌఢి స
క్షీణుం డాజికి నెల్లి నేఁ డనఁడు [1]సంక్రీడన్ విజృంభించు స
చ్చాణూరుం డొక గోపబాలు పనికిన్ శక్తుండు గాకుండునే. 1338

క. ప్రల్లద మేటికి గోపక !, బల్లిదుఁడను లోకమందుఁ బ్రఖ్యాతుఁడ నా
చల్లడము క్రింద దూఱని, మల్లురు లే రెందు ధరణిమండలమందున్. 1339

సీ. చలమున నను డాసి జలరాశిఁ జొరరాదు నిగుడి గోత్రముదండ నిలువరాదు
కేడించి కుంభినిక్రిందికిఁ బోరాదు మనుజసింహుండ నని మలయరాదు
చేరినఁ బడవైతుఁ జెయ్యి సాఁపఁగరాదు బెరసి నాముందటఁ బెరుఁగరాదు
భూనాథ హింసకుఁ బోరాదు నను మీఱి శోధింతుఁ గానలఁ జొరఁగరాదు

---

1. వైచిత్రిన్ వినోదించు (తం. వా. హ.) 2. ననికిన్ (తం. F. N.)

ఆ. ప్రబలమూర్తి ననుచు భాసిల్లఁగారాదు
ధరఁ బ్రబుద్ధుఁడ నని దఱుమరాదు
కలికితనము చూపి గర్వింపఁగారాదు
తరముగాదు కృష్ణ! తలఁగు తలఁగు. 1340

వ. అదిగాక నీవు శ్రీహరి నంటివేని. 1341

సీ. [1]మహిమతో నుండంగ మధురాపురము గాని పొలుపార వైకుంఠపురము గాదు
గర్వంబుతో నుండఁ గంసునిసభ గాని సంసారరహితుల సభయుఁ గాదు
ప్రకటించి వినఁగ నా బాహునాదము గాని నారదు వీణాస్వనంబు గాదు
చదురులాడఁగ మల్లజన విగ్రహము గాని రమతోడి ప్రణయవిగ్రహము కాదు

తే. వెలసి తిరుగంగ వేదాంతవీథి గాదు
మొఱఁగి పో ముని మనముల మూలగాదు
సొఁగి నడవంగ భక్తుల జాడ గాదు
శౌరి! నాప్రోల నీ వెందుఁ జనియె దింక. 1342

వ. అని పలికి. 1343

సీ. రోషాగ్ని ధూమప్రరోహంబు కైవడి శిరమున సన్నపు సిగ వెలుంగ
నాశామదేభేంద్ర హస్తసన్నిభము లై బాహుదండంబులు భయదములుగ
లయసమ యాంతకోల్లసిత దంష్ట్రిల భంగిఁ జాఁగిన కోఱమీసములు మెఱయ
నల్లని [2]తెగగల నడగొండచాడ్పున నాభీల నీలదేహంబు మెఱయ

ఆ. చరణహతుల ధరణి సంచలింపఁగ నభో
మండలంబు నిండ మల్లసఱచి
శౌరిదెసకు నడచెఁ జాణూరమల్లుండు
పౌరలోక హృదయ భల్లుఁ డగుచు. 1344

## అధ్యాయము - ४४

వ. ఇట్టగ్గలం బగు నగ్గలిక డగ్గఱిన మల్లునిం గని, మెల్లన మొల్లం బగు బీరంబు వెల్లిగొనఁ, వల్లవ వల్లభుం డుల్లసిల్లి బాహునాదంబున రోదోంతరాళంబు పూరించి, మించి, కవిసె. ఇట్లిద్దఱు నుద్దవిడి నున్నత విషమంబు లగు తాణ లిడి, కరి కరియును, హరి హరియును, గిరి గిరియునుం దాఁకువీఁకం దలపడి, యితరేతర హేతిహింసితంబు లగు దవానలంబుల తెఱంగునఁ బరస్పర దీర్ఘ నిర్ఘాత ఘట్టితంబు

1. మదముతోనేలంగ (చ. ట. వ. త. జ.) 2. జిగిగల (త)

లగు మహాభ్రంబుల విభ్రమంబున, నన్యోన్య తుంగ తరంగతాడితంబు లగు కల్పాంతకాల సముద్రంబుల రౌద్రంబున, నొండొరుల ముష్టిఘట్టనంబుల ఘట్టిత శరీరు లై, దద్దరిలక, డగ్గఱి, గ్రద్దన, న య్యిద్దఱుం దిరుగునెడ, హరి చొచ్చి, పేర్చి, యార్చి, జెట్టిం బట్టి, పడం దిగిచి, పాదంబుల జాడించి, సముల్లాసంబున నెసకంబునకు వచ్చిన, మెచ్చి, నొచ్చి, య చ్చపలుండు మీఱి, మోర సారించి, తెరలక, పొరలం ద్రొబ్బిన, న బ్బలానుజుం డుబ్బి, గొబ్బున మేను వర్ధిల్ల, నర్ధాంగకంబుననుండి, జానువుల నొత్తుచు, నురవడిం గరవడంబున నున్న, నా దుర్నయుండును బాల! మేలు మేలని, లీలం గాలు సొరనిచ్చి, త్రోచినం జూచి, యేచి, ఖేచరు లగ్గించి యుగ్గడింప, న గ్గోపకుమారుండు, పాటవంబున రాటవంబునకుం జని, వెన్నెక్కి, నిక్కిన, న క్కంసభటుండు, [1]మదగజరేఖా బంధురం బగు పదంబును బదంబునం, గరంబును గరంబునం గ్రహించి, వహించి, నైపుణంబున లోపలం దిరిగి, యట్టిట్టు దట్టించిన, దిట్టతనంబునం దిటవు దప్పక, య ప్పద్మలోచనుండు, కేడించి, యేచి, సమరతలంబున వైచి, ప్రచండం బగు వాని పిచండంబు [2]వాగించి, కాలఁ గాలు గీలించి, డొక్కరంబు గొనిన, న య్యభ్యాసి, సభ్యులు సన్నుతింపం గ్రమ్మఱించి, జడ్డనం గా లడ్డగించి, రక్షించు కొనిన, నా రక్షోవైరి, వైరి కటిచేలంబు పట్టి, యెత్తి, యెత్తిన, నడుమ రాగె యిడి, సందువెట్టి, నవ్విన, నవ్విరోధి కాలు కాలితో నిడి, వేధించి, నిరోధించిన, నిరోధంబుం బాసి, తిరిగి, వసుదేవుపట్టి, పట్టిసంబు గొని, దట్టించిన, నుబ్బరిక చేసి, చాణూరుండు, హరి కరంబు వట్టి, హుమ్మని నెమ్మొగంబునం గా లిడి, మీఁ దైనం, గేళిబాలకుండు, కాలిం గాల నివారించి, మీఁదై, నెగడి యుండనీక, దుర్వారబలంబున విదలించి, లేచి, గృహీత పరిపంథిచరణుం డై, విపక్షుని వక్షంబు, వజ్రి వజ్ర సన్నిభం బగు పిడికిటం బొడిచిన, వాఁడు, వాఁడి చెడక, విజృంభించి, యంభోరాశి మథనంబునం దిరుగు శైలంబు పోలిక, నేల జిఱ్ఱుజిఱ్ఱం దిరిగి, తన్నిన, వెన్నుండు, కుప్పించి, యుప్పరం బెగసి, మీఁద నుఱికిన, నతండు, కృష్ణపాదసంధిపరిక్షిప్తపాదుం డై, యెగసి, లేచి, [3]సముద్ధతుం డయ్యె. అ య్యెడ. 1345

క. బలభద్రుఁడు ముష్టికుఁడును, బలములు మెఱయంగఁ జేరి బాహాబాహిం
బ్రళయాగ్నుల క్రియఁ బోరిరి, వెలయఁగ బహువిధము లైన విన్నాణములన్. 1346

వ. ఇ వ్విధంబున. 1347

---

1. మదజలరేఖా బంధురంబగు గంధసింధురంబు చందంబున (తం. వా.) 2. లాగించి (తం)
3. సముత్థితుం డయ్యె (తం)

క. వల్లవులు పెనఁగి రున్నత, గల్లులతో భిన్న దిగిభ కరవల్లులతో
మల్లులతో రిపుమానస భల్లులతో భీత [1]గోపవల్లులతోడన్. 1348

వ. ఆ సమయంబునం బౌరకాంతలు మూఁకలు గట్టి, వెచ్చ నూర్చుచు, ముచ్చట
లకుం జొచ్చి, తమలో ని ట్లనిరి. 1349

ఉ. మంచి కుమారులం గుసుమ మంజుశరీరులఁ దెచ్చి చెల్లరే!
యంచిత వజ్రసారులు మహాద్రి కఠోరులు నైన మల్లురం
గ్రించులఁ బెట్టి రాజు పెనఁగించుచుఁ జూచుచు నున్నవాఁడు మే
లించుక లేదు మాను మనఁ డిట్టి దురాత్ముని మున్ను వింటిమే! 1350

క. చూచెదరు గాని సభికులు, నీ చిన్నికుమారకులకు నీ మల్లురకు
నోచెల్ల! యీడు గాదని, సూచింపరు పతికిఁ దమకు శోకము గాదే. 1351

సీ. వేణునాదముల మై వెలసిన మాధవుం డధరామృతము లిచ్చి యాదరించుఁ
బింఛదామముల మై పెరిఁగిన వెన్నుండు మస్తకంబునఁ దాల్చి మైత్రి నెఱపుఁ
బీతాంబరముల మై బెరసిన గోవిందుఁ డంసభాగములఁ బాయక ధరించు
వైజయంతికల మై వ్రాలినఁ గమలాక్షుఁ డతికుతూహలమున నఱుతఁ దాల్చుఁ

తే. దనరు బృందావనంబునఁ దరుల మైన
గృష్ణుఁ డానందమునఁ జేరి క్రీడసల్పు
నెట్టి నోముల నయిన ము న్నిట్టివిధము
లేల కామైతి మో యమ్మ! యింక నెట్లు. 1352

ఉ. పాపపుబ్రహ్మ! గోపికల పల్లెలలోన సృజింపరాదె ము
న్నీ పురిలోపలన్ మనల నేల సృజించె న నైన నిచ్చలున్
జేపడుఁ గాదె యీ సుభగుఁ జెందెడి భాగ్యము సంతసంబు నీ
గోపకుమారుఁ బొంద మును గోపకుమారిక లేమి నోచిరో. 1353

క. గోపాలకృష్ణుతోడను, గోపాలన వేళలందుఁ గూడి తిరుగు నా
గోపాలు రెంతధన్యులో, [2]గోపాలుర కైన నిట్టి గురురుచి గలదే. 1354

క. శ్రమజలకణ సిక్తం బై, కమల దళేక్షణుని వదన కమలము మెఱసెన్
హిమజలకణ సిక్తం బై, కమనీయం బగుచు నున్న కమలముభంగిన్. 1355

---

1. వల్లుల (తం.) 2. గోపాలకు లైన (హ)

ఆ. సభకుఁ బోవఁ జనదు సభవారి దోషంబు
నెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న
నెఱిఁగియుండి యైన నిట్టట్టు పలికినఁ
బ్రాజ్ఞు డైనఁ బొందుఁ బాపచయము, 1356

వ. అని పెక్కండ్రు పెక్కు విధంబులం బలుకఁ దద్బాహు యుద్ధంబున. 1357

క. ధృతిచెడి లోఁబడె మల్లుం, డతులిత భవ జలధి తరికి హృత రిపు పురికిన్
[1]జిత కరికిన్ ధృత గిరికిన్, తత హరి రవ భరిత శిఖరి దరికిన్ హరికిన్. 1358

క. హరికిని లోఁబడి బెగడక, హరి యురము మహోగ్ర ముష్టి నహితుఁడు వొడువన్
హరి కుసుమమాలికా హృత, కరిభంగిఁ బరాక్రమించెఁ గలహోద్ధతుఁ డై. 1359

క. శౌరి నెఱిఁ జొచ్చి కరములు, క్రూరగతిం బట్టి త్రిప్పి కుంభిని వైచెన్
శూరున్ గలహ గభీరున్, వీరున్ జాణూరు ఘోరు వితతాకారున్. 1360

క. శోణితము నోర నొలుకఁగఁ, జాణూరుం డట్లు [2]కృష్ణ సంభ్రామణమున సం
క్షీణుం డై క్షోణిం బడి, ప్రాణంబులు విడిచెఁ గంసుప్రాణము గలఁగన్. 1361

క. బలభద్రుండును లోకులు, బలభద్రుం డనఁగ బెనఁగి పటుబాహు గతిన్
బలభేది మెచ్చఁ ద్రిప్పెను, బలవ న్ముష్టికునిఁ గంసు బలములు బెగడన్. 1362

ఆ. త్రిప్పి నేలవైవ దిగ్గన రక్తంబు
వదనగహ్వరమున వరదవాఱ
ముష్టికుండు ఘోర ముష్టిసత్త్వము సెడి
కూలె గాలిఁ దరువు గూలినట్లు. 1363

క. పాటవమునఁ బలు పిడికిట. సూటిం బడఁ బొడిచె బలుఁడు శోభిత ఘన బా
హాటోప [3]నృపతి కీటున్, గూటున్ వాచాటు నధిక ఘోరలలాటున్. 1364

వ. అంత నద్దనుజాంతకుండు, చరణప్రహారణంబుల భిన్నమస్తకులం జేసి, వాని
చెలుల నంతకాంతికంబున కనిచిన. 1365

క. వల్లవబాలకు లని మన, మల్లవరులు పెనఁగి నేఁడు మడిసిరి వీరల్
బల్లిదులు తలఁడు, తలఁ డని, చెల్లాచెద రైరి పాఱి చిక్కని మల్లుల్. 1366

---

1. హితకరికిన్ (హ) 2. కృష్ణుసంభ్రమమున (హ) 3. నృపకిరీటున్ (హ) శోభితబాహా, స్ఫోటనత నృపకిరీటున్ (తం. F. N.)

—: శ్రీకృష్ణుండు కంసుని వధించుట :—

ఉ. మల్లురఁ జంపి గోపక సమాజములో మృగరాజురేఖ శో
భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయ వచ్చు నా
వల్లవరాజ నందనుల వారక చూచి మహీసురాదు ల
ల్లల్లన సంస్తుతించిరి ప్రియంబుగఁ గంసుఁడు దక్క నందఱున్. 1367

వ. అంత సభాజనంబుల కలకలంబు నివారించి, మంత్రులం జూచి, కంసుం డిట్లనియె.

మ. వల్లవ బాలురన్ నగరివాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుఁ డీ
గొల్లల ముట్టికో ల్గొనుఁడు క్రూరుని నందునిఁ గట్టుఁ డుర్వికిన్
దెల్లముగాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు తండ్రి గాఁడు వీఁ
డెల్లవిధంబులన్ బరుల కిష్టుఁడు కావకుఁ డుగ్రసేనునిన్. 1369

వ. అని పలుకు సమయంబున. 1370

శా. జంఘాలత్వముతో నగోపరి చర త్సారంగ హింసేచ్ఛ ను
ల్లంఘింపం గమకించు సింహముక్రియన్ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కంస ప్రాణహింసార్థి యై
లంఘించెన్ [1]దమగంబు మీఁదికి [2]రయోల్లాసంబు భాసిల్లఁగన్. 1371

క. తమగమున కెగురు యదుస,త్తము గన్గొనిఁ జూచి ఖడ్గధరుఁ డై యెదిరెం
దమ గమివారలు వీరో, త్తమగణ విభుఁ డనఁగఁ గంసధరణీపతియున్. 1372

శా. పక్షీంద్రుం డురగంబుఁ బట్టువిధ మొప్పన్ గేశబంధంబు లో
కక్షోభంబుగఁ బట్టి మౌళిమణు లాకల్పాంతవేళా పత
న్నక్షత్రంబులభంగి రాల రణసన్నాహంబు [3]డిందించి రం
గక్షోణిం బడఁద్రోచెఁ గృష్ణుఁడు వెసన్ గంసున్ నృపోత్తంసునిన్. 1373

శా. మంచాగ్రంబుననుండి రంగధరణీ మధ్యంబునం గూలి యే
సంచారంబును లేక చిక్కి జను లాశ్చర్యంబునుం బొందఁగా
బంచత్వంబును బొందియున్న విమతున్ బద్మాక్షుఁ డీడ్చెన్ వడిన్
బంచాస్యంబు గజంబు నీడ్చు పగిదిన్ బాహా బలోల్లాసి యై. 1374

క. రోష ప్రమోద నిద్రా, భాషాశన పాన గతులఁ బాయక చక్రిన్
[4]దోషగతిఁ జూచి యైన వి,[5]శేషగతిన్ గంసుఁ డతనిఁ జెందె నరేంద్రా! 1375

---

1. దమకంబు (హా) 2. రయోల్లాసంబు (వ్రా. ప్ర.) 3. దీపింప (వ); రణసంరంభంబు డిందించి (తం. వా.) 4. దోషరతి (హ. వా.) 5. రుచిన్ (హ. వా.)

వ. ఆ సమయంబున. 1376

క. గోపాలుఁ డొక్క డద్దిర! భూపాలకుఁ జంపె వీనిఁ బొడుపుం డేత
ద్రూపాలస్యము లే లని, [1]తా పాలఘు రోషు లగుచు దర్పోద్ధతు లై. 1377

శా. న్యగ్రోధుండును గహ్వుఁడున్ మొదలుగా నానాయుధానీక సా
మగ్రిన్ గంసుని సోదరుల్ గవియుడున్ మాద్య ద్గజేంద్రాభుఁ డై
యుగ్రుం డై పరిఘాయు ధోల్లసితుఁ డై యొండొండ చెండాడి కా
లాగ్ర క్షోణికిఁ బంచె రాముఁడు గరీయస్థేముఁ డై వారలన్. 1378

వ. అ య్యవసరంబున. 1379

క. చేతులఁ [2]దాళము లొత్తుచుఁ, జేతోమోదంబుతోడ సిగముడి వీడన్
జాతరలాడుచు మింటను, గీతము నారదుఁడు వాఁడెఁ గృష్ణా! యనుచున్.

క. వారిజభవ రుద్రాదులు, భూరి కుసుమవృష్టి గురిసి పొగడిరి కృష్ణున్
భేరులు మ్రోసెను నిర్జర, నారులు దివి నాడి రధిక నటనముల నృపా! 1381

వ. అంతం, గంసాదుల కాంతలు, భర్తృమరణ దుఃఖాక్రాంత లై, కరంబుల శిరం
బులు మోఁదుకొనుచు, నశ్రుధారా పరిషిక్త వదన లై, సదనంబులు వెలువడి
వచ్చి, వీరశయ్యా నిద్రితు లయిన విభులం గౌఁగిలించుకొని, సుస్వరంబుల విల
పించిరి. అందుఁ గంసభార్య లి ట్లనిరి. 1382

సీ. గోపాల సింహంబు కోపించి వెల్వడి నిను గజేంద్రునిభంగి నేఁడు గూల్చె
యాదవేంద్రానిల మాభీలజవముల నిను మహీజము మాడ్కి నేల వ్రాల్చె
వాసుదే వాంభోధి వారి యుద్వేల మై నిను దీవి కై వడి నేఁడు ముంచె
దేవకీసుత వజ్రి దేవత లలరంగ నినుఁ గొండక్రియ నేఁడు నిహతుఁ జేసె

తే. హా మనోనాథ! హా వీర! హా మహాత్మ!
హా మహారాజ! నీ విట్లు హతుఁడ వయిన
మనుచు నున్నార మక్కట! మమ్ముఁ బోలు
కఠినహృదయలు జగతిపైఁ గలరె యెందు. 1383

క. భూతముల కెగ్గు సేసిన, భూతంబులు నీకు నెగ్గుఁ బుట్టించె వృథా
భూత మగు మనికి యెల్లను, భూతద్రోహికిని శుభముఁ బొంద దధీశా! 1384

క. గోపాలకృష్ణు తోడను, భూపాలక! మున్ను దొడరి పొలిసినవారిన్
నీపాల బుధులు సెప్పరె, కోపాలస్యములు విడిచి కొలువం దగదే. 1385

---

1. తాపానల (క. ప. గ. డ.) 2. తాళంబట్టుక (హ); తాళము దట్టుచు (వ)

—:శ్రీకృష్ణుండు దేవకీవసుదేవుల చెఱ మాన్పి యుగ్రసేనునికి పట్టముకట్టుట:—

వ. అని, విలపించుచున్న రాజవల్లభల నూరార్చి, జగద్వల్లభుం డయిన హరి కంసాదులకుఁ బరలోక సంస్కారంబులు సేయం బనిచి, దేవకీవసుదేవుల [1]బంధనంబు విడిపించి, బలభద్రసహితుం డయి, వారలకుఁ బ్రణామంబులు సేసిన. 1386

అధ్యాయము – ౪౫

మ. కని లోకేశులు గాని వీరు కొడుకుల్ గా రంచుఁ జిత్తంబులన్
జనయిత్రీ జనకుల్ విచారపరులై శంకింపఁ గృష్ణుండు దా
జనసమ్మోహిని యైన మాయఁ దదభిజ్ఞానంబు వారించి యి
ట్లనియెన్ సాగ్రజుఁడై మహావినతుఁడై యానంద సంధాయియై. 1387

సీ. మమ్ముఁ గంటిరి గాని మా బాల్య పౌగండ కైశోర వయసులఁ గదిసి మీర
లెత్తుచు దింపుచు నెలమి మన్నింపుచు నుండు సౌభాగ్యంబు లొంద రైతి
రా కాంక్ష గలిగియు న్నది దైవయోగంబు తల్లిదండ్రులయొద్దఁ దనయు లుండి
యే యవసరమున నెబ్బంగి లాలితు లగుచు వర్ధిల్లుదు రట్టి మహిమ

తే. మాకు నిన్నాళ్లు లేదయ్యె మఱియు వినుఁడు
నిఖిల పురుషార్థహేతు వై నెగడుచున్న
మేని కెవ్వార లాఢ్యులు మీర కారె
యా ఋణముఁ దీర్ప నూతేండ్లకైనఁ జనదు. 1388

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు, తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్
సెల్లింపఁ డట్టి కష్టుఁడు, ప్రల్లదుఁ డామీఁద నాత్మపలలాశి యగున్. 1389

క. జననీజనకుల వృద్ధులఁ, దనయుల గురు విప్ర సాధు దారాదుల నే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక, వనరును జీవన్మృతుండు వాఁడు ధరిత్రిన్.

వ. అదియునుం గావున. 1391

శా. కారాశాలల మానిమిత్తము మిముం గంసుండు గారింపఁగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపఁగా[2]రాక ని
ష్కారుణ్యాత్ముల మైన క్రూరుల మహా కౌటిల్యసంచారులన్
సారాతిక్షములార! మమ్ముఁ గొఱఁతల్ సైరించి రక్షింపరే. 1392

వ. అని యిట్లు మాయామనుష్యుం డయిన హరి పలికిన పలుకులకు మోహితులై, వారల నంకపీఠంబుల నిడుకొని, కౌఁగిలించుకొని, కన్నీటం దడుపుచుఁ, బ్రేమ

---

1. సంకలియలు (క. చ. తం.) 2. లేక (హ)

పాశబద్ధు లయి, దేవకీవసుదేవు లూరకుండిరి. అంత వాసుదేవుండు మాతామహుం డయిన యుగ్రసేనునిఁ జూచి, 1393

చ. అనఘ! యయాతిశాపమున యాదవవీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు నృపసత్తమ రాజవు గమ్ము భూమికిన్
నినుఁ గొలువంగ నిర్జరులు నీ కరివెట్టుదు రన్యరాజులం
బనిగొను టెంత రమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్. 1394

వ. అని పలికి. 1395

క. మన్నించి రాజుఁ జేసెను, వెన్నుఁడు సత్యావధాను విశ్రుతదానున్
సన్నుత మానున్ గదన, చ్ఛిన్నాహిత సేను నుగ్రసేనున్ దీనున్. 1396

వ. తదనంతరంబ, తొల్లి కంసభీతు లయి, విదేశంబులం గృశింపుచున్న యదు వృష్ణి భోజ మరు దశార్ణ [1]కుకు రాంధక ప్రముఖు లగు సకల జ్ఞాతిబంధులను రావించి, చిత్తంబు లలర విత్తంబు లిచ్చి, వారి వారి నివాసంబుల నుండ నియమించె. ఇ వ్విధంబున. 1397

క. మధుసూదన సత్కరుణా, మధురాలోకన విముక్త మానస భయు లై
మధురవచనములఁ దారును, మధురానగరంబు ప్రజలు మనిరి నరేంద్రా!

వ. అంత నొక్కనాఁడు సంకర్షణసహితుం డయి,నందునిం జేరి, గోవిందుం డి ట్లనియె.

శా. తండ్రిం జూడము తల్లిఁ జూడము యశోదాదేవియున్ నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లి యే
తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి భవ త్సౌజన్యభావంబులన్
దండ్రీ! యింతటివార మైతిమి గదా తత్త ద్వయోలీలలన్. 1400

ఉ. ఇక్కడనున్న బాంధవుల కెల్లను సౌఖ్యము సేసి వత్తు మే
మక్కడికిన్ మదీయులకు నందటికిన్ వినుపింపుమయ్య! నే
మెక్కడ నున్న మాకు మది నెన్నఁడుఁ బాయవు మీ వ్రజంబులో
మక్కువతోడ మీరు కృప మా కొనరించు క్రియావిశేషముల్. 1401

వ. అని పలికి, వస్త్రభూషణాదు లొసంగి, సాదరంబునం గౌఁగిలించుకొని, గోవిందుం డనిచిన, నందుండు ప్రణయవిహ్వలుం డయి, బాష్పజలపూరిత లోచనుం డగుచు వల్లవులుం, దానును వ్రేపల్లెకుం జనియె. అంత. 1402

---

1. కుకురాంధ్ర ప్రముఖు (ట)

—:రామకృష్ణు లుపనీతు లై కాశీపట్టణమునకుం జని విద్యాభ్యాసముఁ జేయుట:—

క. గర్గాది భూసురోత్తమ, వర్గముచే నుపనయనము వసుదేవుఁడు స
న్మార్గంబునఁ జేయించెను, నిర్గర్వ చరిత్రులకును నిజ పుత్రులకున్. 1403

క. [1]ద్విజరాజ వంశవర్యులు, ద్విజరాజ ముఖాంబుజోపదిష్ట వ్రతు లై
ద్విజరాజత్వము నొందిరి, ద్విజరాజాదిక జనంబు [2]దీవింపంగన్. 1404

వ. ఉపనయనానంతరంబున వసుదేవుండు, బ్రాహ్మణులకు సదక్షిణంబులుగా ననేక గో హిరణ్యాదానంబు లొసంగి, తొల్లి రామకృష్ణుల జన్మసమయంబునందు నిజ మనోదత్త లయిన గోవుల నుచ్చరించి యిచ్చి, కామితార్థంబుల నర్థులకుం బెట్టె. ఇట్లు బ్రహ్మచారు లై. 1405

శా. ఉర్విన్ మానవు లెవ్వ రైన గురు వాక్యోద్యుక్తు లై కాని త
త్పూర్వార్వారంభము సేయఁ బోల దనుచున్ బోధించుచందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువు లై సంపూర్ణు లై యుండియున్
గుర్వంగీకరణంబు సేయఁ జని రా గోవిందుఁడున్ రాముఁడున్. 1406

వ. చని మహా వైభవరాశి యైన కాశిం జేరి, తత్తీరంబున నవంతీపుర నివాసియు, సకల విద్యావిలాసియు నైన, [3]సాందీపని యను బుధవర్యుం గని, యథోచితం బుగ దర్శించి, శుద్ధభావ వర్తనంబుల భక్తి సేయుచు నుండ, వారలవలన సంతుష్టుం డై. 1407

శా. వేదశ్రేణియు నంగకంబులు ధనుర్వేదంబుఁ దంత్రంబు మ
న్వాది వ్యాహృత ధర్మశాస్త్రములు నుద్య న్న్యాయముం దర్కవి
ద్యా దక్షత్వము రాజనీతియును [4]శుద్ధప్రక్రియన్ జెప్పె నా
భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూత ప్రమోదంబునన్. 1408

క. అఱువదినాలుగు విద్యలు, నఱువదినాలుగు దినంబు లంతన వారల్
నెఱవాదు లయిన కతమున, నెఱి నొక్కొకనాఁటి వినికి నేర్చి రిలేశా. 1409

క. గురువులకు నెల్ల గురు లై, గురు లఘు భావములు లేక కొమరారు జగ
ద్గురులు త్రిలోక హితార్థము, గురుశిష్య న్యాయలీలఁ గొల్చిరి వేడ్కన్. 1410

వ. ఇట్లు కృతకృత్యు లయిన శిష్యులఁ జూచి, వారల మాహాత్మ్యంబునకు వెఱఁగు పడి, సభార్యుం డయిన [5]సాందీపని యి ట్లనియె. 1411

---

1. ద్విజరాజత్వము నొందిరి (తం) 2. దీవింపంగన్ (హ) 3. సాందీపుండను (హ) అప్టే—సాందీపని, మూలము—సాందీపనః (45—33) 4. శబ్ద (హ) 5. సాందీపుం డిట్లనియె (హ)

శా. అంభోరాశిఁ బ్రభాసతీర్థమున మున్నస్మత్తనూ సంభవుం
డంభోగాహము సేయుచుండ మునిఁగి లేఁ డయ్యెం గృపాంభోనిధుల్
కుంభద్వీర్యులు మీరు మీ గురునికిం జోద్యంబుగా శిష్యతన్
గాంభీర్యంబునఁ బుత్రదక్షిణ యిడన్ గర్తవ్య మూహింపరే. 1412

క. శిష్యులు బలాఢ్యు లయిన వి, శేష్యస్థితి నొంది గురువు జీవించును ని
ర్దూష్య గుణబల గరిష్ఠులు, శిష్యుల రై గురునికోర్కి సేయం దగదే. 1413

వ. అనిన విని, రామకృష్ణులు గుర్వర్థంబుగా దుర్వారరథారూఢు లై, రయంబునం
జని, రౌద్రంబున సముద్రంబుఁ జేరి యి ట్లనిరి. 1414

క. సాగర ! సుబుద్ధితోడను, మా గురుపుత్రకునిఁ దెమ్ము మా ఱాడిన నీ
వాగడ మౌదువు దుస్సహా, వేగ రణాభీల నిశిత విశిఖాగ్నులకున్. 1415

వ. అనిన వారలకుం జలరాశి యి ట్లనియె. 1416

ఉ. వంచన యింత లేదు యదువల్లభులార ! ప్రభాసతీర్థమం
దంచితమూర్తి విప్రసుతుఁ డాఢ్యుఁడు తోయము లాడుచుండ ను
త్సంచలితోర్మి యొక్కటి ప్రచండ గతిం గొనిపోయెఁ బోవఁగా
బంచజనుండు మ్రింగె నతిభాసురశీలుని విప్రబాలునిన్. 1417

వ. అని వాని వసియించు చో టెఱింగించిన. 1418

శా. శంఖారావముతోడఁ బంచజనుఁ డాశంకించి చిత్తంబులో
సంఖిన్నుండుగ వార్ధిఁ [1]జొచ్చి దహన జ్వాలాభ హేమోజ్జ్వలత్
పుంఖాస్త్రంబునఁ గూల్చి వాని జఠరంబున్ వ్రచ్చి గోవిందుఁ డ
ప్రేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక గురు ప్రేమోది తోద్యోగుఁ డై. 1419

క. దానవుని దేహజం బగు, మానిత శంఖంబుఁ గొనుచు మసలక బలుఁడున్
తో నేతేరఁగ రథి యై, దానవరిపుఁ డరిగె దండధరు పురికి నృపా ! 1420

వ. చని, [2]సంయమనీ నామ నగరంబు చేరి, తద్ద్వారంబునం బ్రళయకాల మేఘ
గంభీర నినద భీషణం బగు శంఖంబు పూరించిన, విని వెఱంగుపడి. 1421

శా. అస్మద్బాహుబలంబు గైకొనక శంఖారావమున్ మానసా
పస్మారంబుగ నెవ్వఁ డొక్కొ నగరప్రాంతంబునం జేసె మ
ద్విస్మేరావహ రోషపావకునిచే విధ్వస్తుఁ డై వాఁడు దా
భస్మం బై చెడు నంచు నంతకుఁడు కోప ప్రజ్వలన్మూర్తి యై. 1422

1. జొచ్చె (హ) 2. యమనీ (హ)

వ. వచ్చి, రామకృష్ణులం గని, వారు లీలామనుష్యు లయిన విష్ణుమూర్తు లని యెఱింగి, భక్తితోడ శుశ్రూష చేసి, సర్వభూత మయుం డగు, కృష్ణునకు నమస్కరించి, యేమి సేయుదు. ఆనతిమ్ము. అనిన, న మ్మహాత్ముం డి ట్లనియె. 1423

క. చెప్పెద మా గురునందనుఁ, దప్పు గలుగఁ జూచి నీవు దండనమునకున్
దెప్పించినాఁడ వాతని, నొప్పింపుము మాకు వలయు నుత్తమచరితా! 1424

క. అనిన విని వీఁడె వీనిం, గొని పొండని భక్తితోడ గురునందను ని
చ్చినఁ గృష్ణుఁడు [1]వీడ్కొనియెను, ఘన దుర్జనదమను మహిషగమనున్ శమనున్.

వ. ఇట్లు జము నడిగి తెచ్చి, రామకృష్ణులు సాందీపనికిం బుత్రుని సమర్పించి, యింక నేమి సేయవలయు. [2]అడుగుము. అనిన నతం డి ట్లనియె. 1426

క. గురునకుఁ గోరిన దక్షిణ, కరుణన్ మ న్నెవ్వఁ డిచ్చె ఘనులార! భవ
ద్గురునకుఁ గోరిన దక్షిణ, దిరముగ నిచ్చితిరి మీరు దీపిత యశులై. 1427

క. కాలుని వీటికి జని మృత, బాలకుఁ దే నొరుల వశమె? భవదీయ కృపన్
మేలు దొరకొనియె మాకు వి,శాల మగుం గాత మీ యశము లోకములన్. 1428

వ. మహాత్ములార! యేను గృతార్థుండ నైతి. అని దీవించిన, సాందీపని వీడ్కొని. కృతకృత్యులై, రామకృష్ణులు రథారోహణంబు సేసి, మధురకుం జనుదెంచి, పాంచజన్యంబు పూరించినఁ గని, నష్టధనంబులు గనినవారి భంగిం బ్రజలు ప్రమోదించిరి. అంత నొక్క నాఁ డేకాంతంబున. 1429

## అధ్యాయము - ౪౬

## —: శ్రీ కృష్ణుండు గోపకాంతల చెంతకు నుద్ధవునిఁ బంపుట :—

శా. నాపైఁ జిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నా రాకఁ గాంక్షింపుచున్
నా పే రాత్మల నావహించుచు వగన్ నానాప్రకారంబులన్
గోపాలాంగన లెంత జాలిపడిరో కోపించిరో దూఱిరో
ప్రేపల్లెన్ [3]నిజ ధర్మగేహములలో విభ్రాంత [4]చైతన్యలై. 1230

వ. అని చింతించి. 1431

క. సిద్ధవిచారు గభీరున్, వృద్ధవచో వర్ణనీయ వృష్ణిప్రవరున్
బుద్ధినిధి నమర గురు సము, నుద్ధవునిం జూచి కృష్ణుఁ డొయ్యన పలికెన్. 1232

---

1. వీడ్కొల్పెను (హ) 2. నానతిండనిన (తం. వా.) 3. నర్మ (తం. F. N.)

శా. రమ్మా యుద్ధవ ! గోపకామినులు నా రాకల్ నిరీక్షింపుచున్
సమ్మోహంబున నమ్మియున్ మఱచి యే చందంబునన్ గుందిరో
తమ్మున్ నమ్మినవారి డిగ్గవిడువం ధర్మంబు గా దండ్రు వే
పొమ్మా ! ప్రాణము లే క్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్. 1433

క. లౌకిక మొల్లక నన్నా, లోకించు ప్రపన్నులకును లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతును, నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్. 1434

క. సందేహము మానుం డర, విందాననలార ! మిమ్ము విడువను వత్తున్
బృందావనమున కని హరి, సందేశము పంపె నను సంకేతమునన్. 1435

వ. అని మందహాస సుందర వదనారవిందుం డై, కరంబు కరంబున నవలంబించి, సరసవచనంబు లాడుచు, వీడుకొల్పిన, నుద్ధవుండును రథారూఢుం డై, సూర్యాస్తమయ సమయంబునకు నందవ్రజంబుఁ జేరి, వనంబులనుండి వచ్చు గోవుల చరణరేణువులం బ్రచ్ఛన్న రథుం డై, చొచ్చి, నందు మందిరంబు ప్రవేశించిన.

శా. ఆ పుణ్యాత్మునిఁ గౌఁగిలించుకొని నందాభీరుఁ డానంది యై
మా పాలింటికిఁ గృష్ణుఁ డీతఁ డనుచున్ మన్నించి పూజించి వాం
ఛాపూర్ణంబుగ మంజులాన్న మిడి మార్గాయాసముం బాపి స
ల్లాపోత్సాహముతోడ ని ట్లనియె సంలక్షించి మోదంబునన్. 1437

క. నా మిత్త్రుఁడు వసుదేవుఁడు, సేమంబుగ నున్నవాఁడె చెలువుగఁ బుత్త్రుల్
సేమంబునఁ బూజింప మ,హామత్తుం డైన కంసుఁ డణఁగిన పిదపన్. 1438

శా. అన్నా ! భద్రమె తల్లిదండ్రుల మముల్ హర్షించి చింతించునే
తన్నుం బాసిన గోపగోపికల మిత్త్రవ్రాతముం గోగణం
బు న్నిత్యంబుఁ దలంచునే వన నదీ భూముల్ ప్రసంగించునే
వెన్నుం డెన్నఁడు వచ్చునయ్యా! యిట మా వ్రేపల్లెకున్ నుద్ధవా ! 1439

క. అంకిలి గలుగక మా కక, లంకేందుని పగిదిఁ గాంతి లలితం బగు త
త్పంకజ నయనుని నెమ్మొగ, మింక విలోకింపఁ గలదె యీ జన్మమునన్. 1440

క. అని హరి ము న్నొనరించిన, పను లెల్లను జెప్పి చెప్పి బాష్పాకుల లో
చనుఁ డై డగ్గుత్తికతో, వినయంబున నుండె గోపవీరుం డంతన్. 1441

క. పెనిమిటి బిడ్డని గుణములు, [1]వినుతింప యశోద ప్రేమ విహ్వలమతి యై
చనుమొనలఁ బాలు గురియఁగఁ, గనుఁగొనలను జలము లొలుకఁగా బెగ్గిలియెన్.

1. వినుపింప (హ)

వ. ఇట్లు గోవింద సందర్శనాభావవిహ్వలు లైన యశోదానందులకు నుద్ధవుం డి ట్లనియె. 1443

క. జననీజనకుల మిమ్ముం, గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును, మనమున వగవకుఁడు ధైర్య మండనులారా! 1444

మ. బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే వసుమతీభారంబు వారింప వా
రల రూపంబులఁ బుట్టినాఁడు హరి నిర్వాణ ప్రభుం [1]డెవ్వఁ డు
జ్జ్వలుఁ డై ప్రాణవియోగ కాలమున దత్సర్వేశుఁ జింతించు వాఁ
డలఘు శ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁ డై యర్కాభుఁ డై నిత్యుఁ డై.

సీ. అట్టి నారాయణుం డఖిలాత్మ భూతుండు కారణ మానవాకారుఁ డైనఁ
జిత్తంబు లతనిపైఁ జేర్చి సేవించితి రతి కృతార్థుల రైతి రనవరతము
శోభిల్లు నింధనజ్యోతి చందంబున నఖిలభూతములందు నతఁ డతనికి
జననీ జనక దార సఖ పుత్ర బాంధవ శత్రు ప్రియాప్రియ జనులులేరు

ఆ. జన్మ కర్మంబులు జన్మంబులును లేవు
శిష్టరక్షణంబు సేయుకొఱకు
గుణవిరహితుఁ డయ్యు గుణి యయి సర్వర
క్షణ వినాశకేళి సలుపుచుండు. 1446

వ. అని మఱియును, బెక్కువిధంబుల హరిప్రభావం బుపన్యసింపుచు, నా రేయి గడపి, దధిమథన శబ్దంబు లాకర్ణింపుచు లేచి, మఱునాఁడు కృతానుష్ఠానుం డై, యుద్ధవుం, డొక్క రహస్య ప్రదేశంబున నున్న సమయంబున. 1447

## అధ్యాయము - ४८

శా. రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోరస్కుండు పీతాంబరుం
డాజానుస్థిత బాహుఁ డంబురుహ మాలాలంకృతుం డుల్లసత్
రాజ త్కుండలుఁ డొక్క వీరుఁ డిచటం రాజిల్లుచున్నాఁడు మా
రాజీవాక్షుని భంగి నంచుఁ గని రా రాజాన్వయుం గోపికల్. 1448

వ. కని లజ్జాసహిత హాసవిలోకనంబులు ముఖంబులకుం జెలు వొసంగ ని ట్లనిరి.

---

1. డివ్వుడు (హ)

## —: భ్రమర గీతలు :—

చ. ఎఱుఁగుదు మేము నిన్ను వనజేక్షణు మిత్రుఁడ వీవు కూరిమిన్
మెఱయుచుఁ దల్లిదండ్రులకు మే లెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా
వఱలెడు భక్తి వచ్చితివి వారల నైన మనంబులోపలన్
మఱవఁడు శౌరి మేలు మఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్. 1450

క. మునివరు లైనను బంధుల, ఘన సఖ్యము విడువలేరు గాక విడువరే
స[1]నిమిత్త సఖ్య మాఁకటి, పని దీఱిన నళులు విరులఁ బాయునొ లేదో. 1451

చ. అని యిటు గోపికల్ వలుక నం దొకగోపిక కృష్ణపాద చిం
తనమునఁ జొక్కి చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వలత్
సునిశిత సద్వివేకముఁ బ్రసూన మరంద మదాదిరేకమున్
ఘన మృదునాద సంచలిత కాముక లోకముఁ జంచరీకమున్. 1452

వ. కని, హరి తన్నుం బ్రార్థింపఁ బుత్తెంచిన దూత యని కల్పించుకొని, యుద్ధవునికి నన్యాపదేశం బై యెఱుకపడ, న య్యళికిం దొయ్యలి యి ట్లనియె. 1453

మ. భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మా పాదాబ్జముల్ నాగర
ప్రమదాళీ కుచకుంకు మాంకిత లస త్ప్రాణేశ దామ ప్రసూ
న మరం దారుణి తాననుండ వగుటన్ నాథుండు మన్నించుఁ గా
క మము న్నేపుచుఁ బౌరకాంతల శుభాగారంబులన్ నిత్యమున్. 1454

మ. ఒక పువ్వందలి తేనె ద్రావి మధుపా! యుత్సాహి వై నీవు వే
ఱొకటిం బొందెడి భంగి మ మ్మధరపీయూషంబునం దేల్చి మా
యకలం కోజ్జ్వల యౌవనంబుఁ గొని యన్యాసక్తుఁ డయ్యెన్ విభుం
డకటా! యాతని కెట్లు దక్కె సిరి మిథ్యాకీర్తి [2]నమ్మెన్ జుమీ. 1455

శా. భృంగా! కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిన్ బ్రసంగించె దీ
సంగీతంబున నేము సొక్కుదుమె తచ్చారిత్రముల్ వింతలే
యంగీకారము గావు మాకుఁ బురకాంతాగ్ర ప్రవేశంబులన్
సంగీతం బొనరింపు వా రిడుదు రోజన్ నీకు నిష్టార్థముల్. 1456

మ. సమదాళీశ్వర! చూడు ముజ్జ్వలిత హాస భ్రూ విజృంభంబులన్
రమణీయుం డగు శౌరిచేఁ గరఁగ రే రామల్ త్రిలోకంబులన్
బ్రమదారత్నము లక్ష్మి యాతని పదాబ్జాతంబు సేవించు ని
క్కము మే మెవ్వర మా కృపాజలధికిన్ గారుణ్యముం జేయఁగన్. 1457

---

1. యనిమిత్త (హ) 2. యయ్యెన్ జుమీ (హ)

శా. రోలంబేశ్వర! నీకు దూత్యము మహారూఢంబు నీ నేరుపుల్
చాలుం గమ్మచ్చరణాబ్జముల్ విడువు మస్మన్నాథ పుత్రాదులన్
లీలం బాసి పరంబు డించి తనకున్ లీనత్వమున్ బొందు మ
మ్మేలా వాసె విభుండు ధార్మికులు ము న్నీ చందమున్ మెత్తురే. 1458

శా. వాలిం జంపెను వేటకాని పగిదిన్ వంచించి దైత్యానుజన్
లోలం బట్టి విరూపఁ జేసెను బలిన్ లోభంబుతోఁ గట్టి యా
త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్ ధర్మజ్ఞుఁడే మాధవుం
డేలా షట్పద! యెగ్గు మావలన నీ కెగ్గింపఁగా నేటికిన్. 1459

ఉ. పన్నగ మింటిపై నెగసి పాఱు విహంగము లైన వీనులన్
త న్నొకమాటు విన్న గృహ దార సుతాదులఁ బాపి విత్త సం
పన్నత డించి సంసరణపద్ధతిఁ బాపెడువాఁడు నిత్యకాం
తు న్నెఱి నున్న మా బ్రతుకు సైఁచునె యేల మధువ్రతోత్తమా! 1460

మ. కమనీయం బగు వేటకాని[1]పలు కాకర్ణించి నిక్కంబుగాఁ
దమ చిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ తద్బాణ నిర్భిన్న లై
యమితోగ్ర వ్యథ నొందుభంగి హరి మాయాలాపముల్ నమ్మి దుః
ఖములం జెందితి మంగజాస్త్ర జనితోగ్రశ్రాంతి నిందిందిరా! 1461

ఉ. బంధుల బిడ్డలన్ మగల భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్ మనో
జాంధతఁ జేసి డించి శరణందిన మమ్ము వియోగ దుర్దశా
సింధువునందుఁ ద్రోసి యిటు చేరకపోవుట పాడి గాదు పు
ష్పంధయ! మీ యధీశునకుఁ బాదములం బడి యొత్తి చెప్పవే 1462

సీ. కాంచన రత్న సంఘటిత సౌధంబులే మా కుటీరంబులు మాధవునకు
వివిధ నరేంద్ర సేవిత రాజధానియే మా పల్లె యదువంశ మండనునకు
సురభిపాదప లతాశోభి తారామమే మా యరణ్యము సింహమధ్యమునకుఁ
గమనీయ లక్షణ గజ తురంగంబులే మా ధేనువులు కంసమర్దనునకు

తే. రూపవిభ్రమ నైపుణ రూఢ లైన
మగువలమె మేము మన్మథమన్మథునకు
నేల చింతించు మముఁ గృష్ణుఁ డేల తలఁచుఁ
బృథివి నధిపులు నూతన ప్రియులు గారె. 1463

---

1. పదు రాకర్ణించి (తం.)

వ. అని మఱియు ని ట్లనేకవిధంబులఁ గృష్ణసందర్శన లాలస లై, పలుకుచున్న గోపి కల వచనంబులు విని, యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు ని ట్లనియె.

మ. జప దాన వ్రత హోమ సంయమ తప స్స్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నే విభున్ మనములో నిల్పంగ లే రట్టి స
ద్విపులాకారునిపై మహా మహిముపై విశ్వేశుపై మీ కజ
స్ర పటుధ్యానము లిట్లు నిల్చెనె భవచ్చారిత్రముల్ చిత్రముల్. 1465

క. నను మీకడకుం గృష్ణుఁడు, పని పంపెడు వేళఁ బిలిచి పలికిన పలుకుల్
వినుఁ డన్నియు వివరించెద, వన జేక్షణలార! మీరు వగవకుఁ డింకన్. 1466

వ. అని హరివచనంబులుగా ని ట్లనియె. 1467

సీ. ఎల్లకార్యములకు నేను బ్రధానకారణము గావున మీకు రమణులార
కలుగదు మద్వియోగము చరాచరరూపములలో మహాభూతములు వసించు
కరణి నుండుదు సర్వగతుఁడ నై నే మనః ప్రాణ బుద్ధి గుణేంద్రి యాశ్రయుండ
నాత్మయం దాత్మచే నాత్మఁ బుట్టింతు రక్షింతును ద్రుంతు వ్యాపికభూత

తే. గుణగణాకార మాత్మలోఁ గొమరుమిగులు
నిబిడ మాయానుభవమున నిత్యశుద్ధ
మాత్మవిజ్ఞాన మయము నై యమరు గుణముఁ
బ్రకృతికార్య మనోవృత్తిఁ బట్టి పొందు. 1468

చ. కలఁ గని లేచి మున్ను కలఁ గన్న సమస్తవిధంబు కల్లగాఁ
దలఁచినభంగి మానస పదార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి తద్జ్ఞుఁడు ప్రపంచము లే దనుఁ దన్మనంబు దా
రలయక గట్టుడున్ బుధుల కవ్వల నొండొక భేద మున్నదే. 1469

ఆ. సాంఖ్యయోగ నిగమ సత్య తపో దమ
ములు మనోనిరోధములు గడపలఁ
గాఁగ నుండు జలధి కడపలగాఁ గల
నదులభంగి నళిననయనలార! 1470

మ. చెలువల్ దవ్వుల నున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తు రు
త్కలికన్ జేరువవారికంటె నదియుం గా కెప్పుడున్ నన్ను మీ
రలు చింతింపుచునుండఁ గోరి యిటు దూరస్థత్వమున్ బొందితిం
దలఁకం బోలదు నన్నుఁ బొందెదరు నిత్య ధ్యానపారీణ లై. 1471

1. నియమ (చ. వ.)

వ. అని మీకుం జెప్పు మని కృష్ణుండు సెప్పె. అనవుడు నుద్ధవునికిం గోపికలు సంతసించి యి ట్లనిరి. 1472

ఉ. ఇమ్మొల నున్నవాఁడె హరి యిక్కడి కెప్పుడు వచ్చు వచ్చి మా
యుమ్మలికంబు వాపునె ప్రియుం డిట వచ్చెద నన్న నైఁతురే
య మ్మధురాపురీ రమణు లడ్డము వత్తురు గాక చెల్లరే!
మమ్ము విధాత నిర్దయుఁడు మన్మథవేదనపాలు సేసెనే. 1473

చ. మఱచునొకో మదిం దలఁచి మాధవుఁ డా యమునాతటంబునన్
దఱచుగ దివ్య సౌరభ లతాగృహ సీమల నేము [1]డాఁగ నా
మఱువుల నుండి నీడలకు మ మ్మొలయించి కలంచి దేహముల్
మఱచినఁ దేర్చి నూల్కొలిపి మన్మథలీలలఁ దేల్చుచందముల్. 1474

శా. నీతో నర్మగృహంబులం బలుకునే నే మెల్ల వంశోల్లస
ద్గీతభ్రాంతల మై కళిందతనయా తీరంబునన్ జేరినన్
జేతోజాత సుఖంబులం దనిపి మా చిత్తస్థితుల్ సూడ లీ
లా తంత్రజ్ఞత డాఁగి మెల్లన మదాలాపంబు లాలించుటల్. 1475

క. ముచ్చటవేళలఁ జెప్పునె, యచ్చుగ మును నేము నోమునప్పుడు జలముల్
సొచ్చిన మా చేలంబులు, ముచ్చిలి యిచ్చిన విధంబు మూలం బెల్లన్.

శా. ఏకాంతంబున నీదుపై నొరగి తా నేమేని భాషించుచో
మాకాంతుండు వచించునే రవిసుతా మధ్యప్రదేశంబునన్
రాకాచంద్ర మయూఖముల్ మెఱయఁగా రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు విన్నాణముల్. 1476

సీ. తనుఁ బాసి యొక్కింత తడ వైన నిటమీఁద నేలపై మేనులు నిలువ వనుము
నేలపై మేనులు నిలువక యటమున్న ధైర్యంబు లొక్కటఁ దలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగిన పిమ్మటఁ జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ బ్రాణంబు లుండక పాయు ననుము

తే. ప్రాణములు పోవ మఱి వచ్చి ప్రాణవిభుఁడు
ప్రాణి రక్షకుఁ డగు తన్నుఁ బ్రాణు లెల్ల
జేరి దూఱంగ మఱి యేమి సేయువాఁడు
వేగ విన్నప మొనరింపవే మహాత్మ! 1478

క. తగులరె మగలను మగువలు, తగులదె తను మున్ను కమల తగవు విడిచియున్
దగిలిన మగువల విడుచుట, దగుఁ దగదని తగవు బలుకఁ దగుదువు హరికిన్.

1. రాగ (క)

సీ. విభుఁడు మా వ్రేపల్లెవీథుల నేతేరఁ జూతుమే యొకనాఁడు చూడ్కు లలర
ప్రభుఁడు మాతో నర్మభాషలు భాషింప విందుమే యొకనాఁడు వీను లలరఁ
దనువులు పులకింప దయితుండు డాసినఁ గలుగునే యొకనాఁడు గౌఁగిలింపఁ
బ్రాణేశు మమ్మేల పాసితి వని దూఱ దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ

తే. వచ్చునే హరి మే మున్న వనముఁ జూడఁ
దలఁచునే భర్త మాతోడి తగులు తెఱఁగు
తెచ్చునే విధి మన్నాథుఁ దిట్టు వడక
యెఱుఁగఁ బలుకు మహాత్మ ! నీ కెఱుఁగవచ్చు. 1480

వ. అని, దుఃఖార్ణవ మగ్నం బైన గోపకులంబు నుద్ధరింపుము. రమానాథ! యని, గోపికలు వగచి, తదనంతరంబ మఱియు, నుద్ధవ నిగదితంబు లైన కృష్ణసందేశం బులవలన విరహవేదనలు విడిచి, యుద్ధవునిం బూజించిరి. ఇట్లు కృష్ణలీలా వర్ణనలు సేయుచు, వ్రేపల్లె నుద్ధవుండు కొన్ని నెల లుండి, నందాదుల వీడ్కొని, మరలి, రథారూఢుం డై, చని చని. 1481

క. సారమతిఁ బ్రణుతి సేయుచు, నారయ నుద్ధవుఁడు గాంచె నఘసంహారిన్
హారిన్ మధురానగర వి,హారిన్ రిపుజన మదాపహారిన్ శౌరిన్. 1482

వ. కని, యథోచితంబుగా భాషింపుచుఁ దనచేత నందాదులు పుత్తెంచిన కానుకలు బలకృష్ణులకు, నుగ్రసేనునికిన్ వేఱువేఱ యిచ్చె. అని శుకుండు పరీక్షిన్నరేంద్రున కి ట్లనియె. 1483

## అధ్యాయము - ౪౮

### —: కృష్ణుం డుద్ధవునితోఁ జేరి కుబ్జా గృహంబున కరుగుట :—

మ. తను ము న్నంగజకేళిఁ గోరిన లతాతన్విన్ రతిక్రీడలం
దనువన్ గోరి జనార్దనుం డరిగె రత్న స్వర్ణ మాల్యానులే
పన భూషాంబర ధూప దీప పరిదీప్తం బై మనోజ ప్రదీ
పన మై యున్న తదీయ గేహమునకుం బంచేషు బంచేషుఁ డై. 1484

వ. ఇ ట్లరిగి తద్గేహ మధ్యంబున. 1485

ఆ. కాము శరముఁ బోలె కమలారి కళవోలె
మెలఁగి యాడనేర్చు మెఱుఁగువోలె
నిఖిల భువన మోహినీ దేవతయుఁ బోలె
జెలువు మెఱసి యున్న చెలువఁ గనియె. 1486

మ. హరి యేతెంచిన లేచి సంభ్రమముతో నాశీసమూహంబు చే
సిరి యొప్పఁగ విహితోపచారములు తాఁ జేయించి సౌవర్ణ సుం
దర తల్పస్థితుఁ జేసి యుద్ధవుని నుద్యత్ప్రీతిఁ బూజించి భా
సురపీఠంబున నుండు మంచు మది నౌత్సుక్యంబు శోభిల్లఁగన్. 1487

క. ఆళినివహ నివేదిత, మాలా మృగనాభిపంక మణిమయ భూషా
చేలాలంకృత యగుచును, హేలావతి గోరె వనరుహేక్షణుఁ గవయన్. 1488

క. లీలావతీ కృతోల్లస, దేలా కర్పూర మిళిత హిత మధుర మహా
హాలారస పానమద, శ్రీలాలిత యగుచు నబల చేరెఁ గృష్ణున్. 1489

మ. సరసాలోకన వృష్టి పైఁ గురియుచున్ సమ్యగ్వచో వైఖరిన్
గరఁగం జేసి సువర్ణ కంకణ సమగ్రం బైన సైరంధ్రి కేల్
గర పద్మంబునఁ బట్టి తల్పమున కాకర్షించి గంభీరతన్
బరిరంభాదుల నాన వుచ్చి మరు సంభావింపుచున్ వేడుకన్. 1490

ఉ. జాతియుఁ గాలముం గళయు సత్త్వము దేశము భావ చేష్టలున్
ధాతువుఁ బ్రాయముం గుణముఁ దద్దశయున్ హృదయంబు జాడ్క్యయున్
బ్రీతివిశేషముం దెలిసి పెక్కువిధంబులఁ దొయ్యలిన్ మనో
జాత సుఖంబులం దనిపె శౌరి వధూ హృదయాపహారి యై. 1491

క. కరపద్మంబుల మాధవుఁ, గర మొప్పం గౌఁగిలించి కామానలమున్
గరభోరువు వర్జించెను, గర మరు దని తోడి శీతకరముఖు లలరన్. 1492

మ. సనకాదుల్ తలపోసి కానని విభున్ సర్వప్రభున్ దుర్లభున్
మును దా నిచ్చిన యంగరాగ సుకృతామోదంబునన్ గూడియున్
ఘన నిర్వాణవిభూతి యి మ్మనక యా కంజాక్షు యేఁ బాయఁ జా
ల ననుం గొన్నిదినంబు లంగభవ లీలం దేల్పవే నావుడున్. 1493

ఆ. వనిత గోరుకొనిన వరమిచ్చి శౌరి యా
యుద్ధవుండుఁ దాను నువిద యిల్లు
[1]వెడలె నపుడు తియ్యవిలుకాఁడు సురభితోఁ
దీఁగెయిల్లు వెడలు తెఱఁగు మెఱయ. 1494

క. ఏ వేదంబులు గానని, దేవోత్తముఁ గాంచి ముక్తి తెరు వడుగక రా
జీవేక్షణ రతి యడిగెను, భావింపఁ దదీయకర్మ ఫల మెట్టిదియో. 1495

---

1. వెడలి రపుడు (హ.)

క. కారుణ్యంబునఁ గృష్ణుఁడు, తారుణ్యము మెఱసి మదన తంత్రంబుల లీ
లారణ్య వీథిఁ దేల్చెను, సైరంధ్రిన్ విభవవిజిత శక్రపురంధ్రిన్. 1496

వ. తదనంతరంబ కృష్ణుం డుద్ధవ రామ సహితుం డయి, హాస్తిపురంబునకు నక్రూ
రునిం బనుపం దలంచి, తద్గృహమునకుం జనిన, నతండు వారలం గని, లేచి,
రామకృష్ణులకు నమస్కరించి, యుద్ధవుం గౌఁగిలించుకొని, వారి నందఱను
యథావిధిం బూజించి, హరిపాదంబులు తనతొడల మీఁద నిడుకొని, యిట్లనియె.

క. అనుచరులుఁ దానుఁ గంసుఁడు, సనియెన్ నీచేత జముని సదనంబునకుఁ
ఘనులార! మీ బలంబున, నొనరఁగ యాదవుల వంశ ముద్ధృత మయ్యెన్. 1498

వ. మహాత్ములారా! మీరు విశ్వాది పురుషులరు, విశ్వకారణులరు, విశ్వమయులరు,
నగుట, మీకు కార్యకారణంబులు లేవు అవధరింపుము. పరమేశ్వరా! నీవు రజో
గుణంబున నఖిలంబులు సృజియించి, కారణరూపంబునం దదనుప్రవిష్టుండ వై,
[1]శ్రుతదృష్టకార్యరూప ప్రపంచాకారంబున దీపించుచుందువు. కార్యరూప చరాచర
దేహంబులకుం గారణంబు లయిన భూ ప్రముఖంబు లనుగతంబులును, గార్య
రూప దేహంబులు నయి, ప్రకాశించు చందంబున నొక్కండవు, కారణరహితుం
డవు, నాత్మ తంత్రుండవు నై యుండియు, విశ్వాకారంబునం బెక్కగుదువు.
సృష్టి స్థితి లయంబులం జేయుచుండియు, విజ్ఞానమూర్తి వగుటఁ బరిభ్రాంతుఁ
డయిన జీవునిభంగి గుణ కర్మ బద్ధుండవు గావు. [2]కావున, సిద్ధంబు తన్నిమిత్తంబు
బంధహేతువు సిద్ధింపదు. 1499

సీ. పరఁగ జీవుని కైన బంధమోక్షము లంట వంటునే పరతత్త్వ మైన నిన్ను
నంటునే యీశ! దేహ ద్యుపాధులు ననిర్వచనీయములు గాన వరుస నీకు
జన్మంబు జన్మసంశ్రయ భేదమును లేదు కావున బంధమోక్షములు లేవు
గణుతింప నిన్నులూఖలబద్ధుఁ డనుటయు నహిముక్తుఁ డనుటయు నస్మదీయ

ఆ. బాల బుద్ధిఁగాదె పాషండముఖర మా
ర్గములచేత నీ జగద్ధితార్థ
మైన వేదమార్గ మణఁగిపో వచ్చిన
నవతరించి నిలుపు దంబుజాక్ష! 1500

క. ఆ నీవు ధరణిభారము, మానిచి రక్కసుల నెల్ల మర్దించుటకై
యానకదుందుభి యింటను, [3]మానుగ జన్మించితివి సమంచిత కీర్తిన్. 1501

---

1. కృతదృష్ట (హ. తం.) 2. జ్ఞానాత్మన స్తేక్వచ నైవహేతుః (48-21) 3. మానక (హ.)

మ. త్రిజగత్పావన పాదతోయములచే దీపించి వేదామర
ద్విజ ముఖ్యాకృతి వైన నీవు కరుణన్ విచ్చేయుటల్ జేసి మా
నిజగేహంబులు ధన్యతం దనరెఁ బో ని న్నార్యు లర్చింపఁగా
[1]నజితత్వంబులు వారి కిత్తు వనుకంపాయత్త చిత్తుండ వై. 1502

శా. ఏ పుణ్యాతిశయ ప్రభావముననో యీ జన్మమం దిక్కడన్
నీ పాదంబులఁ గంటి ని న్నెఱిఁగితిన్ నీవుం గృపాళుండ వై
నాపై నర్మిలిఁ జేసి మాన్పఁగదవే నానా ధనాగార కాం
తా పుత్రాదులతోడి బంధనము భక్తవ్రాత చింతామణీ! 1503

—: కృష్ణుం డక్రూరుని హస్తినాపురంబునకుఁ బంపుట :—

వ. అని పలికి నగుచు నక్రూరునికి మాటలవలన సంసారసంబంధం బగు మోహంబు
గీలుకొలుపుచు, హరి యి ట్లనియె. 1504

క. బంధుండవు సద్బో హిత, సంధుండవు వావిఁ జూడ జనకుఁడవు, కృపా
సింధుండ వెల్లగుణముల, నంధుండవు గావు ప్రోవ నర్హుఁడ వెందున్. 1505

చ. కొలుతురు మర్త్యు లిష్టములు గోరి శిలామయ దేవసంఘముల్
జలమయ తీర్థసంఘమును సంతతము న్నటు వారు గొల్వఁగా
వల దనరాదు గాక భగవ త్పదభక్తుల రైన మీక్రియల్
నొలయక దేవతీర్థములు చూచినయంతనె కోర్కె లిచ్చునే. 1506

వ. మహాత్మా! పరమభాగవతుండ వైన నీవు మా కభీష్టంబుల నొనరింప నర్హుండవు.
వినుము. పాండురాజు పరలోకగతుం డయినఁ, గుంతీసహితు లయిన పాండవులు
ధృతరాష్ట్రు శాసనంబున నేతెంచి, కరిపురంబున నున్నవా రఁట. నిజ పుత్రమో
హితుం డగు న య్యంధనృపతి, వారియందు సమత్వంబునం జరింపండు. అటు
గావున. 1507

క. వారలు బంధులు గావున, వారలకును మే లొనర్చి వా రలరంగా
వారింపవలయు దుస్థితి, వారిజరిపువంశ! పొమ్ము వారిం జూడన్. 1508

వ. అని పలికి, సంకర్షణోద్ధవ సహితుం డై, హరి నిజగృహంబునకుఁ జనుటయు,

అధ్యాయము – ౪౯

అక్రూరుండు కౌరవరాజధాని యగు కరిపురి కరిగి, యందు ధృతరాష్ట్ర భీష్మ
విదుర బాహ్లీక భారద్వాజ గౌతమ దుర్యోధన కర్ణాశ్వత్థా మాదులన్, గుంతీ

---

2. అజరత్వంబులు (క)

సహితు లైన పాండవులం, దక్కిన బంధువులనుం గని, యథోచిత సత్కారంబుల నొంది, తత్తద్వర్తనంబు లెఱింగికొనుచుఁ, గొన్ని దినంబు లుండ, నొక్కనాఁడు విదురుండు విన నేకతంబున నక్రూరునికిఁ గుంతి యి ట్లనియె. 1509

శా. అన్నా ! తల్లులు దండ్రులుం భగినులు న్నల్లుండ్రు మద్భ్రాతలున్
నిన్నుం బొమ్మనువేళ నే మనిరి మా నెవ్వల్ విచారింతురే
యున్నారా సుఖయుక్తులై మృగ వృక వ్యూహంబులో నున్న రే
ఖ న్నే నిక్కడ నున్నదానఁ గుమనః కౌరవ్య మధ్యంబునన్. 1510

మ. కఱపించెన్ ఫణికోటిచే లతికలం గట్టించి గంగానదిన్
నెటఁ ద్రోపించె విషాన్వితాన్న మొసఁగెన్ నిద్రారతిం జెంది యే
మఱి యుండన్ బొడిపించె నాయుధములన్ మత్పుత్రులం దేమియున్
గొఱగాఁ డీ ధృతరాష్ట్రసూనుఁడు మహాక్రూరుండు కార్యంబులన్. 1511

మ. బలుఁడున్ గృష్ణుఁడు నెన్నఁ డైనఁ [1]దమలో భావించి మేనత్త బి
డ్డలకున్ మేలు దలంతురే వగపులం డయ్యెంగఁ బా లై రయో!
జలజాతాక్షుఁడు భక్తవత్సలుఁ డిలాచక్రంబు భాగించి యి
మ్ములఁ నిప్పించునె నా కుమారకులకున్ ముఖ్యప్రకారంబునన్. 1508

వ. అనిపలికి, కృష్ణునిఁ జిత్తంబుననిల్పి, నమస్కరించి, సంకీర్తనంబుచేసి, సర్వాత్మ! సర్వ పాలక! పుండరీకాక్ష! శరణాగత నైన నన్ను రక్షింపు. రక్షింపుము. అని వగచు చున్న కుంతికి, నక్రూరుండు విదురసమేతుం డై, ప్రియ వచనంబుల దుఃఖోప శమనంబు చేసి, వీడ్కొని, బంధు మిత్ర మధ్యంబున సుఖోపవిష్టుం డైన ధృతరాష్ట్రున కి ట్లనియె.

—: అక్రూరుండు ధృతరాష్ట్రునితో హితోపదేశరూపముగా సంభాషించుట :—

ఉ. నీ యనుజుండు పాండు ధరణీవిభు డీల్గిన నీవు భూమి ధ
ర్మాయతబుద్ధి నేలుచుఁ బ్రజావళిఁ గాచుచు గౌరవంబుతోఁ
బాయక లోకులందు సమభావనఁ జేసితి వేనిఁ గీర్తియున్
శ్రేయముఁ గల్గు వే ఱొకటి చేసిన దుర్గతి గల్గు భూవరా ! 1514

సీ. అవనీశ ! పాండవులందు నీ నందను లందు సమానుండ వగుట బుద్ధి
యెవ్వనితో యోగ మిం దెవ్వనికి నిత్య మంగనాగార పుత్రాదికముల
వలన నయ్యెడి దేమి వసుమతి నొకజంతు వుదయింప నొకజంతు వు క్కడంగు
నొకఁడు పుణ్యముఁ జెందు నొకఁడు పాపము నొందు మీన జీవనభూతమిళిత జలము

---

1. దమతో భావించి (తం. వా.)

ఆ. తత్తనూజు లెట్లు ద్రావుదు రట్లు మూ
ఢాత్ము విత్తమెల్ల నపహరింతు
రహితు లైన కొడుకు లటమీఁద మని యైనఁ
జచ్చి యైనఁ దండ్రి జాడఁ జనరు. 1515

క. కావున మూఢాత్ముఁడ వై, నీ వార్జించిన ధనంబు నీ పుత్రులు దు
ర్భావులు పుచ్చుకొనంగా, భూవర! నిందితుఁడ వగుదు భూ నాకముల౯.

శా. నిందం బొందకు మయ్య! యీ తనువు దా నిద్రా కళాదృష్ట మా
[1]సందోహంబువిధంబు నిల్వదు సుమీ జాత్యంధతం బొందియున్
మందప్రజ్ఞత లేల చేసెదవు సమ్యగ్ జ్ఞానచతుండ వై
సందేహింపక యిమ్ము పాండవులకు౯ సర్వంసహా భాగము౯. 1517

వ. అనిన ధృతరాష్ట్రుం డి ట్లనియె.

సీ. నీ మాట మంచిది నిశ్చయ మగు నైన నస్థిరం బయిన నా యంతరంగ
మందు నిల్వదు సుదామాచల స్ఫటిక శిలాత లోద్యత తటిల్లతిక భంగి
నమృతంబు నొందియు నానందితుఁడు గాని నరుమాడ్కి నేను నానంద మొంద
నీశ్వరాజ్ఞావిధ మెవ్వఁడు దప్పింప నోపు విజ్ఞాని యై యుండి యైన

ఆ. విశ్వమెల్లఁ జేసి విభజించి గుణముల
నెవ్వఁ డనుసరించె నెవ్వఁ డవని
భారమెల్లఁ బాయఁ బ్రభవించె దేవకి
కెవ్వఁ డాత్మతంత్రుఁ డీశ్వరుండు. 1519

వ. అట్టి కృష్ణునకు నమస్కరించెద. ఆ నందనందనుని దివ్యచిత్తంబునం గల తెఱంగునం బ్రతుకం గలవారము. అని వీడ్కొలిపిన, నక్రూరుం డతని తలం పెఱింగి, యి ట్లనియె. నీ తలంపు గనుంగొంటి. నీ కిష్టం బగునట్లు వర్తింపుము. అని పలికి, మరలి మధురకుం జనుదెంచి, తదీయ వృత్తాంతంబు రామకృష్ణుల కెఱింగించె.

## అధ్యాయము – ౫౦

అంతఁ గంసభార్య లగు నస్తియుం, బ్రాప్తియు, విధవ లయి దుఃఖింపుచుం, దమ తండ్రి యయిన జరాసంధునికడకుం జని.

---

1. సందేహంబును లేదు (హ)

జరాసంధుఁడు మధురాపట్టణముమీఁద దండెత్తి వచ్చి కృష్ణునితో యుద్ధముఁజేయుట

శా. వాం(డ్రుల్ వీం(డ్రును రాజులే యనుచు గర్వప్రౌఢితో యాదవుల్
వేండ్రం బైన బలంబుతో మధురకున్ వే వచ్చి నిష్కారణం
బాండ్రుల్ బిడ్డలు బంధులుల్ వగవఁ గంసాది క్ష్మానాథులన్
దండ్రీ! చంపిరి కృష్ణుచేత నిటు వైధవ్యంబు వచ్చెన్ జుమీ. 1521

వ. అనిన విని, ప్రళయకాలానలంబు తెఱంగున మండిపడి, శోకరోషంబులు బంధురంబులుగా జరాసంధుం డి ట్లనియె. 1522

శా. ఏమీ! కంసునిఁ గృష్ణుఁడే రణములో హింసించె నోచెల్ల! నా
సామర్థ్యంబుఁ దలంపఁ డించుకయు మచ్చండప్రతాపానలో
ద్దామార్చుల్ వడి నేఁడు గాల్చు యదు సంతానాటవీ వాటికల్
భూమిం గ్రుంగిన నింగిఁ బ్రాఁకిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్. 1523

క. యాదవవిరహిత యగుఁ బో, మేదిని నా చేత నేఁడు మీఁదుమిగిలి సం
పాదిత బలు లై హరి రు, ద్రాదులు నింద్రాదు లెవ్వ రడ్డం బైనన్. 1524

వ. అని పలికి, సమరసన్నాహ సంకుల చిత్తంబునఁ గోపంబు దీపింప, సంగరభేరి వేయించి కదలి. 1525

క. దక్షుం డై యిరువదిమూఁ, డక్షౌహిణు లైన బలము లనుగతములుగా
[1]నక్షణమ జరాసంధుఁడు, ప్రక్షోభముతోడ మధురపైఁ జనియె నృపా!

క. గంధేభ తురగ రథ భట, బంధుర చరణోత్థి తోగ్ర పాంసుపటల యో
గాంధీభూతము లై దివి, మంథరగతి నడచె నపుడు మార్తాండహరుల్.

వ. ఇట్లు చని, నిరంతర కిసలయ పత్ర కోరక కుసుమ ఫలభార వినమిత వృక్షవిలసిత మహోద్యానంబును, ఉద్యానవనభాగ వలమాన జలోన్నయన దారుయంత్ర లతానిబద్ధ కలశవిముక్త సలిలధారా శీకరపరంపరా సంపాదిత వర్షాకాలంబును, కాలకింకర సదృశ వీరభట రథ తురగ సామజ సంకులంబును, గులాచార ధర్మ ప్రవీణ పౌరజన భాసురంబును, సురాభేద్యమాన మహోన్న తాట్టాలక యంత్ర భయంకర ప్రాకారచక్రంబును, జక్ర సారస హంసాది కలకల రవకలిత సరోవరంబును, సరోవర సంఫుల్ల హల్లక కమల పరిమళ మిళిత పవన విరాజితంబును, జితానేక మండలేశ్వర భూషణ మణిగణ రజోనివారిత మదగంధేభ దానజల ప్రభూత పంకంబును, బంకరహిత యాదవేంద్ర దత్త సువర్ణాచల కల్పతరు

1. ఆక్షణమ (తం)

కామధేను సమ్మర్దిత విద్వజ్జన నికేతనంబును, గేతన సన్నిబద్ధ చామర మయూర చాప శింజినీనినద పరిపూరితాభ్రంబును, నభ్రంలిహ మహాప్రాసాద సౌధ గవాక్ష రంధ్ర నిర్గత ఘనసార ధూపధూమ పటల విలోకన సంజనిత జలధరభ్రాంతి విభ్రాంత శిఖండి తాండవ రుచిరంబును, జిరతరానేక దేవాలయ ఘోఘుష్యమాణ తూర్య నినద పరిభావిత పారావార కల్లోల ఘోషంబును, ఘోషకామినీ ప్రాణవల్లభ బాహుదండ పరిరక్షితంబును నై, పరులకు నలక్షితం బైన మధురానగరంబు చేరి, వేలాలంఘనంబు చేసి, వెల్లివిరిసిన మహార్ణవంబు తెఱంగున పట్టణంబునకు ముట్టణంబు చేసి, చుట్టును విడిసిన జరాసంధుని బలౌఘంబు గని, వేళావిదుం డగు హరి తన మనంబున.

మ. ఐదు న్నాలుగు నాఱు రెండు నిరు మూ డక్షౌహిణుల్ సుట్టి సం
ఛాదించెం బుర మెల్ల మాగధు నెడం సామంబు దానంబు నం
భేదంబుం బనిలేదు దండవిధి శిక్షిల్లం బ్రయోగించి యీ
భూదేవీ తనుభార మెల్ల నుడుపన్ బోలున్ జయోద్భాసి నై. 1529

క. ఏ నవతరించు టెల్లను, మానుగఁ జతురంత ధరణిమండల భరముం
మానుపుకొఱకుం గాదే, పూనెద నిది మొదలు దగిలి భూభర మణఁపన్.

ఆ. మగధనాథుఁ బోర మడియింపఁ బోలదు
మడియకున్న వీఁడు మరలి మరలి
బలముఁ గూర్చుకొంచుఁ బఱతెంచుఁ బఱతేరఁ
ద్రుంపవచ్చు నేల దొసఁగు దొఱఁగ. 1531

వ. అని యిట్లు చింతించుచున్న సమయంబున, నభోభాగంబున నుండి మహాప్రభా సమేతంబులును, సపరిచ్ఛద సూతంబులును, ననేకబాణ బాణాసన చక్రాది వివిధాయుధోపేతంబులు నైన రథంబులు రెండు మనోరథంబులు పల్లవింప దైవయోగంబునం జేరవచ్చినం జూచి, హరి సంకర్షణున కిట్లనియె.

శా. కంటే రామ! రథంబు లాయుధములుం గాఢ ప్రకాశంబు లై
మింటం వచ్చెను వీనిఁ గైకొని సురల్ మెచ్చం నృపశ్రేణులన్
బంటింపం బనిలేదు చంపుము ధరాభారంబు వారింపు మీ
వెంటం నీ యవతారమున్ సఫల మౌ వేవేగ లె మ్మాజికిం. 1533

వ. అని పలికి. 1534

క. ఖరు లై దృఢకవచ ధను, శ్శరు లై యధిగత రథానుచరు లై మదవత్
కరు లై ఘనహరు లై బల, హరు ల య్యెడ నాజి కేఁగి రరి భీకరు లై.

వ. ఇట్లు సమర సన్నాహంబునం బురంబు వెడలి. 1536

ఉ. అన్యులు దల్లడిల్ల దను జాంతకుఁ డొత్తె గభీరఘోష కా
తిన్య మహాప్రభావ వికటీకృత పద్మభవాండ జంతు చై
తన్యము ధన్యమున్ దివిజతాపస మాన్యముఁ బ్రీత భక్త రా
జన్యము భీత దుశ్చరిత శాత్రవ సైన్యముఁ బాంచజన్యమున్. 1537

క. సింధురభంజన పూరిత, బంధురతర శంఖనినద భారమున జరా
సంధునికిం గల సైన్యము, లంధము లై సంచరించె నాహవభూమిన్. 1538

వ. అయ్యవసరంబున మాగధుండు మాధవున కిట్లనియె. 1539

సీ. తిదలించి రొప్పంగ నాలమందలు గావు గంధగజేంద్ర సంఘములు గాని
పరికించి వినఁగ నంభారవంబులు గావు వాజీంద్ర హేషారవములు గాని
పదహతిఁ గూల్పంగఁ బ్రాఁతబండ్లును గావు నగసమాన స్యందనములు గాని
ప్రియము లాడంగ నాభీరలోకము గాదు కాలాభ వైరివర్గంబు గాని

తే. యార్పవనవహ్ని గాదు బాణాగ్ని గాని
మరియు బృందావనము గాదు మొనలు గాని
యమున గాదు నటింప ఘోరాజి గాని
పోరు నీ కేల గోపాల! పొమ్ము పొమ్ము. 1540

మ. తరుణిం జంపుటయో బకుం గెడపుటో ధాత్రీజముల్ గూల్చుటో
[1]ఖరమున్ ద్రుంచుటయో ఫణిం బఱపుటో గాలిం నిబంధించుటో
గిరి హస్తంబునఁ దాల్చుటో లయమహాగ్ని స్ఫార దుర్వార దు
ర్భర బాణాహతి నెట్లు నిల్చెదవు సత్ప్రాణుండ వై గోపకా! 1541

వ. అదియునుం గాక. 1542

సీ. గోపికావల్లకీ ఘోషణంబులు గావు శింజినీరవములు చెవుడుపఱుచు
వల్లవీకర ముక్త వారిధారలు గావు శరవృష్టిధారలు చక్కు సేయు
ఘోషాంగనాపాంగ కుటిలాహతులు గావు నిశితాసి నిహతులు నిగ్రహించు
నాభీరకామినీ హస్తాబ్జములు గావు ముష్టిఘాతంబులు మురువు డించు

తే. నల్ల వ్రేపల్లె గాదు ఘోరావనీశ
మకరసంఘాత సంపూర్ణ మగధరాజ
వాహినీసాగరం బిది వనజనేత్ర!
నెఱసి నిను దీవికై వడి నేఁడు ముంచు. 1543

---

1. ఖరునిం ద్రుంపుటయో (హ)

వ. అనిన శ్రీహరి యి ట్లనియె. 1544

ఉ. పంతములేల తొల్లి జనపాలురఁ బోరుల గెల్చినాఁడ వం
ద్రంతియ చాలదే బిరుదు లాడుట బంటుతనంబు త్రోవయే
యింతటఁ దీఱెనే మగధ! యేటికిఁ బ్రేలెదు నీవ యేల క
ల్పాంత మహోగ్ర పావకుని నైన హరింతు వరింతు సంపదన్. 1545

క. గోపాలుఁడ వని పలికితి, భూపాలక! దీన నేమి పోరాడంగా
గోపాల మహీపాల, వ్యాపారాంతరముఁ దెలియ వచ్చుం బోరన్. 1546

వ. అనిన రోషబంధురుం డై, జరాసంధుం డి ట్లనియె. 1547

ఉ. బాలుఁడ వీవు కృష్ణ! బలభద్రునిఁ బంపు రణంబు సేయ గో
పాలకబాలుతోడ జనపాల శిఖామణి యైన మాగధుం
డాలము సేసె నంచు జను లాడెడి మాటకు సిగ్గు పుట్టెడిన్
జాలుఁ దొలంగు దివ్య శరజాలుర మమ్ము జయింపవచ్చునే. 1548

వ. అనిన నగి, నగధరుం డి ట్లనియె. 1549

క. పొగడుకొనుదురె శూరులు, మగఁటిమిఁ జూపుదురు గాక మాగధ! నీకున్
మగతనము గలిగె నేనియుఁ, దగు మెఱయ వికత్థనములు దగ దీ పోరన్. 1550

వ. అనిన రోషించి. 1551

చ. పవనుఁడు మేఘరేణువుల భాను కృశానులఁ గప్పునట్టి వడిన్
వివిధ బలౌఘముం బనిచి వేగమ మాగధుఁ డావరించె భూ
మ్యవనచరిష్ణులన్ విమత మానవనాథ నిరాకరిష్ణులన్
దివిష దలంకరిష్ణుల నతిస్థిర జిష్ణుల రామకృష్ణులన్. 1552

మ. హయహేషల్ గజబృంహితంబులు రథాంగారావముల్ శింజినీ
చయ టంకారములున్ వివర్ధిత గదా చక్రాస్త్ర నాదంబులున్
జయశబ్దంబులు భేరి భాంకృతులు నిస్సాణాది ఘోషంబులున్
భయదప్రక్రియ నొక్కటైఁ జెలగెన్ బ్రహ్మాండ భేదంబుగన్. 1553

వ. మఱియు, న య్యెడ మాగధ మాధవ వాహినులు రెండు నొండొంటిం దాఁకి, రౌద్రంబున, సంవర్తసమయ సముద్రంబులభంగి నింగికిం బొంగి, చెలంగి, చలంబునం దలపడి, పోరునెడ, మసరు కవిసి, మహారణ్యంబులు వెలువడి మార్కొను మదగజంబుల మాడ్కిని, మహోత్కంఠంబు లగు కంఠీరవంబుల గ్రద్దన, దుర్లభంబు లగు శరభంబుల చాడ్పునం, బ్రచండంబు లగు గండభేరుండం

బుల గమనికం, దమతమ మొనలకుం దలకడచి, వీరరసంబులు వివిధరూపంబులై న విధంబునం బదుగురు, నూర్వు,రేవురు, గము లై , కులకుధర గుహాంతరాళంబులు నిండ, సింహనాదంబు లొనర్చుచు,నార్చుచు, నట్టహాసంబులు సేయుచు, నరివీరుల రోయుచు, పటహ కాహళ భేరీ శంఖశబ్దంబులకు నుబ్బుచు, గర్వంబులం బ్రబ్బుచు, గదల వ్రేయుచుఁ, గాండంబుల నేయుచు, ముద్గరంబుల నొత్తుచు, ముసలంబుల మొత్తుచుఁ, గుంతంబులం గ్రుచ్చియెత్తుచుఁ, గరవాలంబులం ద్రెంచుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, శస్త్రంబులం దఱుఁగుచుఁ,జిత్రంబులం దిరుగుచుఁ, బరిఘంబులం ద్రిప్పికొట్టుచుఁ, బ్రాసంబులం బెట్టుచు, శూలంబులఁ జిమ్ముచు, నురియలం గ్రుమ్ముచు, బహుభంగులం బరాక్రమించు వీరభటులును, నిబిడ నీరంధ్ర నేమి నిర్ఘోషంబుల నాకాశంబు నిరవకాశంబుగా ననర్గళ [1]చక్రమార్గంబులం బడు పదాతులు చదియ నరదంబులుదోలి, వివిధాయుధ ప్రయోగంబుల వైరుల వ్రచ్చి వందఱలాడు రథికులును, రథిక శరపరంపరలఁ గంపింపక, మహామోఘ మేఘ ధారలకుం జలింపని ధరణీధరంబుల చాడ్పున రథంబులకుం గవిసి, కల్పాంత కాల దండి దండప్రచండంబు లగు శుండాదండంబులు సాచి, పూఁచి, కడనొగ లొడిసి, తిగిచి, కుదిచి, విఱిచి, కూబరములు నుఱుములుగం జిఱజిఱఁ ద్రిప్పి వైచియు, భటులం జటులగతి బంతులక్రియ న్నెగర వైచి, దంతంబుల గ్రుచ్చియు, ఘోటకంబుల వ్రచ్చియు, విచ్చలవిడిం దిరుగు కరులును, వజ్రి వజ్ర ధారలకుం దప్పి, కకుప్పులకు నెగయు ఱెక్కలుగల గిరుల సిరులం బక్కెరల తోడ హేషారవ భీషణంబు లై, మనోజవంబు గల తురంగంబులం బఱపి, తురంగపద పాంసుపటల [2]ప్రభూత బహుళాంధకారంబులు, కరకలిత కఠోర ఖడ్గ మరీచిజాలంబుల నివారింపుచు, నానాప్రకారంబులం బ్రతివ్యూహంబులం జించి చెండాడు రాహుత్తులుం గలిగి, సంగ్రామంబు భీమం బయ్యె. అందు. 1554

క. చెడు రథములుఁ దెగు హరులును
బడు కరులును మడియు భటులుఁ బఱచు రుధిరమున్
మడియు తల లొఱగు తనువులుఁ
బొడియగు తొడవులును మధురిపుని దెసఁ గలిగెన్. 1555

క. భీతం బై హత సుభట, వ్రాతం బై భగ్న తురగ వారణ రథ సం
ఘాతం బై విజయ శ్రీ, పీతం బై యదుబలంబు విఱిగె నరేంద్రా! 1556

---

1. చక్రమార్గణంబులం (హ) 2. ప్రఘూత (వా)

శా. యోధాగ్రేసరుఁ డా హలాయుధుఁడు లోకోత్కృష్ట బాహాచల
శ్రీ ధౌరేయుఁడుఁ గృష్ణుఁ డిట్టి ఘనులన్ జిత్రంబు నేఁ డిట్లు సం
రోధించెం బలముం దెరల్చె మగధేంద్రుం డంచు వీక్షింపుచున్
సౌధాగ్రంబులఁ బౌరకాంతలు మహాసంతుష్ట లై రెంతయున్. 1557

వ. ఇట్లు తన మొనలు విఱిగి పాఱినం, గనుంగొని, సమరసంరంభంబున హరి విశ్వంభరాభరణ వేదండతుండాభంబు లగు బాహుదండంబులం బెంచి, విజృంభించి, బ్రహ్మాండకుహర కుంభపరిస్ఫోటనం బగు పాంచజన్య నినదంబు నిబిడ నిర్ఘాతశబ్దంబుగ, నుదంచిత పింఛదామంబు సంక్రందనచాపంబుగఁ, బ్రశస్త హస్తలాఘవంబున, శరాకర్షణ సంధాన మోక్షణంబు లేర్పడక, నిర్వక్ర చక్రాకారంబుతోడ మార్తాండ మండల ప్రభాప్రచండం బగు శార్ఙ్గ కోదండంబు క్రొమ్మెఱుంగులుగ, దిగ్గజేంద్ర కర్ణభీషణంబు లగు గుణఘోషణంబులు ఘుమఘుమారావ దుస్సహంబు లైన గర్జనంబులుగ, రథ తురంగమ రింఖా సముద్ధూత పరాగపటల పరంపరా సంపాదిత పుంజీభూతం బగు పెంజీఁకటి యిరులుగ, నసమ సమర సన్నాహ చాతురీ విశేషంబులకుం జొక్కి, నిక్కి, కరంబు లెత్తి, నర్తనంబులం బ్రవర్తించు నారద హస్తవిన్యాసంబులు లీలాతాండవ మండిత మహోత్కంఠంబు లగు నీలకంఠంబులుగ, సుందర స్యందన నేమి నిర్ఘోష భీతు లై కుంభి కుంభంబులపై బ్రాలు వీరులు, మత్తమయూర కేకారవ చకితు లై, యువతి కుచకుంభంబుల మీఁద బ్రాలెడు కాముకులుగ, నానా నరేంద్ర రక్తపిపాసా పరవశంబు లై, వాచఱచుచున్న భూతవ్రాతంబులు, వర్ష వర్షేతి నిస్వనంబు లొసంగు చాతకంబులుగ, నభంగ సంగరప్రేరకుం డగు హలాయుధుండు వృష్టికారణం బగు మందసమీరణంబుగ, ననల్ప కల్పాంత కాల నీల బలాహకంబుభాతి నరాతి చతురంగదేహ క్షేత్రంబులం బుంఖానుపుంఖంబులుగ, నసంఖ్యాత బహువిధ దివ్యబాణవర్షంబు గురియునెడ, శస్త్రాస్త్ర పరంపరా సంఘట్టన జనితంబు లగు మిణుఁగుఱులు వర్షాకాల విహిత విద్యోతమాన ఖద్యోతంబులుగ, విశిఖ వికీర్ణ కోటీర ఘటిత పద్మరాగ శకలంబు లింద్రగోపంబులుగ, మహిత మార్గణ విదళిత మత్తమాతంగ కుంభ మౌక్తికంబులు వడగండ్లుగఁ, జటు లార్ధచంద్ర శర చ్ఛిన్న చరణంబు లై, కృష్ణ! కృష్ణ! నిలు, నిలు మని పలుకుచుం గూలెడి మేనులు, కృషీవల కర పరశుధారా విదళిత మూల విశాల సాలంబులుగ, భాసుర భల్లభగ్నంబు లయిన వదన గహ్వరంబులవలన దుల్లెడు దంతపుంజంబులు మాలతీ కుసుమ మంజరులుగ, నవ్యనారాచ భిన్న దేహంబు లై, దిగ్గన క్రొగ్గండ్లవలన వెడలు రక్తస్యంద

సందోహంబులతో సంచరింపక, ప్రాణంబులు విడుచు శుండాలంబులు సెలయే ఱులతోడి కొండలుగఁ, గఠోర కాండఖండితంబు లైన భుజాదండంబుల తోడం గలసి పడిన వజ్రమయ కంఠికాభరణంబులు భోగి భోగసమేత కేతకీ కుసుమంబు లుగఁ, బ్రళయార్ణవ కల్లోలశబ్ద సన్నిభంబు లయిన భేరీరవంబులు భీకర భేకీరవం బులుగ, దారుణేషు విలూన వాహ వారణ మనుజ మస్తిష్కంబు రొంపిగ, సొంపుమెఱయ నాభీల కీలాల ప్రవాహంబులు ప్రవహించె. అందు భుజంబులు భుజంగమంబులుగఁ, గపాలంబులు కమఠంబులుగ, శిరోజంబులు శైవాలంబు లుగఁ, గరంబులు మీనంబులుగ, హయంబులు నక్రంబులుగ, గజంబులు దీవులుగ, ధవళచ్ఛత్రంబులు నురువులుగఁ, జామరంబులు కలహంసంబులుగ, భూషణరత్న రేణురాసులు పులినంబులుగను నొప్పె. అప్పుడు. 1558

లయవిభాతి. హాసిత హరినీలనిభ వసనము విశాలకటి
నసమనయ నాద్రి పరిలసిత మగు మేఘో
ల్లసనము వహింపఁ గరకిసలయము హేమ మణి
విసర వలయ ద్యుతులు దెసల తుదలందుఁ
బసలు గురియంగ సరభసమున బలుండు దర
హసితము ముఖాబ్జమున నెసఁగ ఘన కాలా
యసమయ మహోగ్రతర ముసలము వడిఁ విసరి
కసిమసఁగి శత్రువుల నసువులను బాపెన్. 1559

లయవిభాతి. ప్రళయసమ యాంతకుని చెలువున కటాక్షముల
నలఘు చటులాగ్నికణములు చెదరఁ గోలా
హలముగ సువర్ణ మణి వలయనిచ యోజ్జ్వలిత
హలము వడిఁ జాఁచి శిరములు నురములుఁ ని
ర్దళితములుగఁ శకలములుగ నొనరింపఁ గని
వెలుకుటీ జరాసుతుని బలము రణవీథిఁ
జలిత దనుజావళికి, బలికి, భయభీత సుర
ఫలికి త్రిజగ చ్ఛలికి హలికిఁ దల డించెఁ. 1560

శా. రోషోద్రేక కళాభయంకర మహారూపంబుతో నొక్కచే
నీషాదండము సాఁచి లాంగలము భూమీశోత్తమ గ్రీవలఁ
భూపల్ రాలఁ దగిల్చి రాఁదిగిచి సంపూర్ణోద్ధతిఁ రోఁకటఁ
వేషంబుల్ చెడ మొత్తె రాముఁడు రణోర్విఁ నెత్తురుల్ జొత్తిలఁ. 1561

క. హలి హలహ్రూత కరికుంభ,స్థల ముక్తాఫలములోలిఁ దనరెఁ గృషిక లాం
గల మార్గకీర్ణ బీజా,వలికై వడి నద్భుతాహవ క్షేత్రమునన్. 1562

క. తఱిమి హలి హలము విసరుచు, నెఱిఁ గదిసిన బెగడి విమత నికరము లెడ లై
వెఱఁగుపడు నొదుఁగు నడఁగును, మఱుపడుఁ జెడు మడియు బొఱలు మఱలుం
దెఱలున్. 1563

క. హరి తిగ్మ గో శతంబుల, హరిదంతర మెల్లఁ గప్పు నాకృతిఁ గడిమిన్
హరి తిగ్మ గో శతంబుల, హరిదంతర మెల్లఁ గప్పె [1]నరిభీకరుఁ డై. 1564

సీ. పదుగు రేగురు దీర్ఘ బాణముల్ గాఁడిన గుదులు గ్రుచ్చినభంగిఁ గూలు వారు
తలలు ద్రెవ్విన మున్ను తారు వీక్షించిన వారల నొప్పించి వ్రాలువారు
పదములు తెగిపడ్డ బాహులఁ బోరి నిర్మూలిత బాహు లై మ్రొగ్గువారు
క్షతముల రుధిరంబు జల్లింప నిర్ఝరయుత శైలములభంగి నుండువారు

ఆ. భ్రాతృ పుత్ర మిత్ర బంధువుల్ వీఁగిన
నడ్డ మరుగుదెంచి యణఁగువారు
వాహనములు దెగిన వడి నన్యవాహనా
ధిష్ఠు లగుచు నెదిరి త్రెళ్ళువారు. 1565

వ. మఱియును. 1566

శా. ఈ కాయంబులఁ బాసి నంతటనె మా కెగ్గేమి చేతృత్వమున్
నీకుం జెల్లదు కృష్ణ! నిర్జరుల మై నిన్నోర్తు మీ మీఁదటన్
వైకుంఠంబున నంచుఁ బల్కుక్రియ దుర్వారాస్త్ర భిన్నాంగు లై
యాకంపింపక గొంద ఱాడుదురు గర్వాలాపముల్ కృష్ణునిన్. 1567

వ. ఇవ్విధంబున. 1568

క. జగతీశ! యేమి చెప్పుదు, నగణిత లయవార్ధి భయద మై మూఁగిన య
మ్మగధేశు బలము లెల్లను, దెగఁజూచిరి హరియు హలియుఁ దీవ్రక్రీడన్. 1569

క. భువనజని స్థితి విలయము, లవలీలం జేయు హరికి నరినాశన మెం
త విషయ మైన మనుజుఁ డై, భవ మొందుటఁ జేసి పొగడఁ బడియెం గృతులన్.

వ. ఆ సమయంబున. 1571

---

1. నతిభీకరుఁడై (తం. వా.)

శా. అంహః కర్ములు తల్లడిల్ల భయదాహంకారుఁ డై సేరి దో
రంహం బొప్ప హలాహతిన్ రథ ధనూ రథ్యంబులం గూల్చి తత్
సంహార స్పృహఁ జొచ్చి పట్టెను జరాసంధున్ మదాంధున్ మహా
సింహంబున్ బ్రతిసింహముఖ్యము బలశ్రీఁ బట్టు నే ర్పేర్పడన్. 1572

వ. ఇట్లు పట్టుకొని. 1573

ఉ. కుంఠితు లై పరుల్ బెగడ ఘోరబలుండు బలుండు వాని సో
ల్లుంఠము లాడుచున్ దిగిచి లోకభయంకర మైన ముష్టిచేఁ
గంఠ గతాసుఁ జేసి తమకంబున మొత్తఁగ భూభర క్షయో
త్కంఠుఁడు చక్రి మీఁ దెఱిఁగి కార్యము గల్దని మాన్చి యి ట్లనున్. 1574

శా. దుఃఖింపన్ బనిలేదు పొమ్ము బలసందోహంబులన్ దెమ్ము చే
తః ఖేదం బెడలంగ రమ్ము రిపులం దండింపు కాదేని భూ
స్వఃఖేల జ్జనమెల్ల మెచ్చ నృప! నీ శౌర్యోన్నతుల్ చూపి మే
దః ఖండంబులు భూతముల్ దినఁ దనుత్యాగంబు సేయం దగున్. 1574

వ. అని నగుచు విడిపించిన, విడివడి, చిడిముడికి నగ్గలం బయిన సిగ్గున మ్రొగ్గి, నెమ్మొగంబు సూపక, కోప కపటభావంబులు మనంబునం బెనంగొనఁ, దపంబు జేసియైన, వీరలం జయించెద నని, పలాయితు లైన రాజులం గూడుకొనుచు, జరాసంధుండు విఱిగి చనియె. సురలు కుసుమ వర్షంబులు గురియ, హరియు, హలియును మధురానగరజన వంది మాగధ జేగీయమాను లై, వీణా వేణు మృదంగ శంఖ దుందుభి నినదంబు లాకర్ణింపుచు, మృగమదజల సిక్త విమల వీథికా శతంబును, వివిధ విచిత్ర కేతనాలంకృతంబును, సువర్ణ మణి వజ్ర జయ స్తంభ నిబద్ధ తోరణ సంయుతంబును, వేదనాద నినాదితంబును, సంతుష్టజన సంకుల గోపురంబును నైన పురంబు ప్రవేశించిరి. అందు. 1577

ఉ. వెల్లువ లైన వైరి నృపవీరుల నెల్ల జయించి వీటికిన్
బల్లిదు లైన కృష్ణబలభద్రులు వచ్చుచు నున్నవారు రం
డుల్లములారఁ జూత మని యున్నతసౌధము లెక్కి వారిపైఁ
బల్లవ పుష్ప లాజములు పౌరపురంధ్రులు సల్లి రెల్లెడన్. 1577

-: కాలయవనుండు శ్రీకృష్ణునిమీఁద దండెత్తి మథురాపురమును ముట్టడివేయుట :-

వ. ఇట్లు పురంబు ప్రవేశించి, యుద్ధప్రకారం బెల్ల నుగ్రసేనున కెఱింగించి, కృష్ణుం డిచ్ఛావిహారంబుల నుండె. మఱియు నెక్కువ మచ్చరంబున న మ్మాగధుండు మహీమండలంబునం గల దుష్ట మహీపతుల నెల్లం గూడుకొని, సప్తదశ

వారంబులు, సప్తదశాక్షౌహిణీ బల సమేతుండై, మధురానగరంబు పై విడిసి, మాధవ భుజాప్రాకార రక్షితు లగు యాదవులతోడ నాలంబు చేసి, నిర్మూలిత బలుండై పోయి, క్రమ్మఱ నష్టాదశ యుద్ధంబునకు వచ్చునెడం, గలహవిద్యా విశారదుం డగు నారదుండు కాలయవనుకడకుం జని, యి ట్లనియె. 1578

మ. యవనా! నీవు సమస్త భూపతుల శౌర్యోత్కర్ష గర్వోన్నతిన్
బవనుం డభ్రములన్ హరించు పగిదిన్ భంజించియు న్నేల యా
దవులన్ గెల్వవు వారలన్ మఱచితో దర్పంబు లేకుండితో
యవివేకస్థితి నొందితో వెఱచితో హైన్యంబునుం జెందితో. 1579

క. యాదవులలోన నొక్కఁడు, మేదినిపై సత్వరేఖ మెఱసి జరాసం
ధాదులఁ దూలన్ దోలెన్, దాదృశుఁ డిల లేఁడు వినవె తత్కర్మంబుల్. 1580

వ. అనిన విని, కాలయవనుం డి ట్లనియె. 1581

శా. ఏమీ నారద! నీవు చెప్పిన నరుం డేరూపువాఁ డెంతవాఁ
డే మేరన్ విహరించు నెవ్వఁడు సఖుం డెం దుండు నేపాటి దో
స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు నస్మద్బాహు శౌర్యంబు సం
గ్రామక్షోణి భరించి నిల్వఁగలఁడే గర్వాఢ్యుఁడే చెప్పుమా. 1582

వ. అనిన విని, దేవముని యి ట్లనియె. 1583

సీ. నీలజీమూత సన్నిభ శరీరమువాఁడు తామరసాభ నేత్రములవాఁడు
పూర్ణేందు బింబంబుఁ బోలెడి మోమువాఁ డున్నత దీర్ఘ బాహువులవాఁడు
శ్రీవత్స లాంఛనాంచిత మహోరము వాఁడు కౌస్తుభమణి పతకంబువాఁడు
శ్రీకర పీతకౌశేయ చేలమువాఁడు మకరకుండల దీప్తి మలయువాఁడు

తే. రాజ! యింతంతవాఁ డనరాని వాఁడు
మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు
తెలిసి యేవేళలం దైనఁ దిరుగువాఁడు
పట్ట నేర్చినఁ గాని లోఁబడనివాఁడు. 1584

వ. అని మఱియు నితర లక్షణంబులుచెప్పిన విని, సరకుసేయక యవనుం డి ట్లనియె.

ఉ. యాదవుఁ డెంతవాఁడు ప్రళయాంతకుఁ డైన నెదిర్చె నేనియున్
గాదనఁ బోర మ త్కలహ కర్కశ బాహు ధను ర్విముక్త నా
నా దృఢ హేమపుంఖ కఠిన జ్వల దస్త్ర పరంపరా సము
త్పాదిత వహ్నికీలముల భస్మముఁ జేసెదఁ దాపసోత్తమా! 1586

వ. అని పలికి, కాలయవనుండు మూఁడుకోట్ల మ్లేచ్ఛ వీరులం గూడుకొని, శీఘ్ర గమనంబునం దాడివెడలి, మథురాపురంబుమీఁద విడిసినం జూచి, బలభద్రసహితుం డయి కృష్ణుం డి ట్లని వితర్కించె. 1587

—విశ్వకర్మ కృష్ణ నియోగంబున సముద్రములో ద్వారకానగరమును నిర్మించుట—

సీ. యవనుండు పురమెల్ల నావరించెను నేఁటి [1]యెల్లిటి యెల్లుండి యీ నడుమను
మాగధుండును వచ్చి మనమీఁద విడియును యవన మాగధులు మహాప్రబలులు
పురి రెండువంకలఁ బోరుదు రట్టిచో నోపినభంగి నొక్కొక్కచోట
మనము యుద్ధముసేయ మఱియొక్కఁ డెడ సొచ్చి బంధుల నందఱఁ బట్టి చంపు

తే. నొండెఁ గొనిపోయి చెఱఁబెట్టు నుగ్రకర్ముఁ
డైన మాగధుఁ డది గాన యరివరులకు
విడియఁ బోరాడఁగారాని విషమభూమి
నొక్కదుర్గంబు చేసి యం దునుపవలయు. 1588

వ. అని వితర్కించి సముద్రు నడిగి, సముద్రమధ్యంబునఁ బండ్రెండు యోజనంబుల నిడుపు, నంతియ వెడల్పుం గల దుర్గమప్రదేశంబు సంపాదించి, తన్మధ్యంబునం గృష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్కనగరంబు నిర్మింపు మని విశ్వకర్మం బంచిన. 1589

ఆ. వరుణపురముకంటె వాసవుపురికంటె
ధనదు వీటికంటె దండధరుని
నగరికంటె బ్రహ్మనగరంబుకంటెఁ బ్ర
స్ఫుటము గాఁగ నొక్కపురముఁ జేసె. 1590

వ. అందు. 1591

క. ఆకసముతోడి చూలన, ప్రాకారము పొడువు గలదు పాతాళ మహా
లోకముకంటెను లోఁ తెం, తో కల దా పరిఘ యెఱుఁగ దొరక దొకరికిన్.

క. కోటయు మిన్నును తమలోఁ, బాటికి జగడింప నడ్డపడి నిల్చిన వా
చాటుల రుచిఁ దారకములు, కూటువ లై కోటతుదలఁ గొమరారుఁ బురిన్.

1. యెల్లింటిలోపల నీ నడుమను (తం. వా.)

శా. సాధు ద్వార కవాట కుడ్య వలభీ స్తంభార్గళా గేహళీ
వీథీ వేది గవాక్ష చత్వర సభా వేశ్మ ప్రఘాణ ప్రపా
సౌధాట్టాలక సాల హర్మ్య విశిఖా సోపాన సంస్థానముల్
శ్రీధుర్య స్థితి నొప్పుఁ గాంచనమణి స్నిగ్ధంబులై యప్పురిన్. 1594

క. కూడి గ్రహంబులు దిరుగఁగ, మేడలతుది నిలువులందు మెలఁగెడి బాలల్
క్రీడింపరు పురుషులతోఁ, వ్రీడన్ దద్వేళలందు విను మా వీటన్. 1595

ఉ. ఆయత వజ్ర నీలమణి హాటకనిర్మిత హర్మ్య సౌధ వా
తాయనరంధ్ర [1]నిర్య దసితాభ మహాగరు ధూపధూమముల్
తోయదపంక్తులో యనుచుఁ దుంగమహీరుహ రమ్యశాఖలన్
జేయుచునుండుఁ దాండవవిశేషము లప్పురిఁ గేకిసంఘముల్. 1596

ఆ. సరస నడచుచుండి సౌధాగ్ర హేమకుం
భములలోన నినుఁడు ప్రతిఫలింప
నేర్పఱింపలేక నినులు పెక్కం డ్రంచుఁ
ప్రజలు చూచి చోద్యపడుదు రందు. 1597

ఉ. శ్రీరమణీయ గంధములఁ జెన్నువహించు పురీవనంబులన్
గోరక జాలక స్తబక కుట్మల పుష్ప మరందపూర వి
స్ఫార లతాప్రకాండ విటప చ్ఛద పల్లవ వల్లరీ శిఫా
సార పరాగమూల ఫలసంభృత వృక్ష లతావిశేషముల్. 1598

క. శ్రీకరములు జనహృదయ వ, శీకరములు మందపవన శీర్ణ మహాంభః
శ్శీకరములు హంస విహం, గాకరములు నగరి కువలయాబ్జాకరముల్. 1599

క. నవ కుసుమామోద భరా, జవనము రతిఖిన్న దేహజ స్వేదాంభో
లవనము సమధిగత వనము, పవనము విహరించుఁ బౌర భవనములందున్.

క. బ్రహ్మత్వము లఘు వగు నని, బ్రహ్మయు బిరుదులకు వచ్చి పట్టఁడు గా కా
బ్రహ్మాదికళలఁ దత్పురి, బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్కువఱుపరె చర్చన్. 1601

క. నగరీభూసుర కృత లస, దగణిత మఖధూమ పిహిత మై కాక మహా
గగనము నీలం బగునే, మిగులఁగ బెడఁ గగునె గ్రహ సమృద్ధం బయ్యున్.

క. తిరుగరు పలు కర్థులకును, సురుఁగరు ధన మిత్తు రితర సుదతీమణులన్
[2]మరగరు రణమునఁ బిఱిఁదికి, నరుగరు రాజన్యతనయు లా నగరమునన్.

1. నిర్గతసితాభ్ర (తం. వా.)   2. మరుగరు (హ)

క. రత్నాకర మయి జలనిధి, రత్నము లీనేర దేటి రత్నాకరమో
రత్నములఁ గొనుదు రిత్తురు, రత్నాకర జయులు వైశ్యరత్నములు పురిన్.

క. తుంగంబులు కరహత గిరి, శృంగంబులు దానజల వశీకృత భృంగీ
[1]భృంగంబులు పటుశైల స, మాంగంబులు నగరి మత్తమాతంగంబుల్. 1605

క. ప్రియములు జితపవన మనో, రయములు కృతజయము లధిక రమణీయ గుణా
న్వయములు సవినయములు ని, ర్భయములు హతరిపుచయములు పట్టణ
హయముల్ 1606

క. పులులపగిదిఁ గంఠీరవ, ములక్రియ శరభములమాడ్కి ముదిత మదేభం
బులతెఱఁగున నానావిధ, కలహ మహోద్భటులు భటులు గల రా వీటన్.

క. ఆ వీట నుండువారికి, భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు త
ద్గోవింద కృపావశమున, దేవప్రతిమాను లగుచు దీపింతు రిలన్. 1608

సీ. ఆసక్తి కృష్ణము భావలోకనమంద హరి పాదసేవనమంద చింత
వెఱపు నారాయణ విముఖ కార్యములంద పారవశ్యము విష్ణుభక్తియంద
బాష్పనిర్గతి చక్రి పద్యసంస్తుతులంద పక్షపాతము శార్ఙ్గి భక్తులంద
లేమి గోవిందాన్య లీలాచరణమంద శ్రమము గోవింద పూజనములంద

తే. బంధ మచ్యుతేతర దుష్టపథములంద
జ్వరము మాధవవిరహిత క్షణములంద
మత్సరము లీశు కైంకర్య మతములంద
నరవరోత్తమ! వినుము తన్నాగరులకు. 1609

వ. మఱియు నప్పురవరంబున హరికిం బారిజాత మహీజంబును, సుధర్మ యని యెడి దేవసభయును, దేవేంద్రుం [2]డిచ్చె. కర్ణైకదేశంబుల నలుపుఁ గలిగి, మనో జవంబులును, శుక్ల వర్ణంబులు నైన తురంగంబుల వరుణుం డొసంగె. మత్స్య కూర్మ పద్మ మహాపద్మ శంఖ ముకుంద కచ్ఛప నీలంబు లను *నెనిమిది నిధులఁ గుబేరుండు సమర్పించుకొనె. నిజాధికార సిద్ధికొఱకుఁ దక్కిన లోకపాలకులును, దొల్లి తమకు భగవత్కరుణా కటాక్షవీక్షణంబుల సంభవించిన సర్వసంపదల మరల నతిభక్తితో సమర్పించిరి. ఇవ్విధంబున. 1610

1. శృంగంబులు శైలాభస, మాంగంబులు (హ) 2. కంఠైక (త); శ్యామైకవర్ణాః వరుణోహయాన్ (50-54)

* "పద్మశ్చైవ మహాపద్మో మత్స్యం కూర్మస్తథోదకః, నీలో ముకుంద శ్శంఖశ్చ నిధయోఽష్టౌ ప్రకీర్తితాః" (వ్యాఖ్య) (50-55)

క. దర్పించి చేసి పురము స, మర్పించెను విశ్వకర్మ మంగళగుణ సం
తర్పిత గహ్వారికిం గురు, దర్పిత దుఃఖప్రవాహ తరికిన్ హరికిన్. 1611

—: శ్రీకృష్ణుండు నిరాయుధుం డై-కాలయవనుఁడు వెంటనంటఁ బరుగెత్తుట :—

వ. ఇట్లు విశ్వకర్మ నిర్మితం బయిన ద్వారకానగరంబునకు నిజ యోగప్రభావంబున మథురాపుర జనుల నందఱం జేర్చి, బలభద్రున కెఱింగించి, తదనుమతంబున నందనవనంబు నిర్గమించు పూర్వదిగ్గజంబు పెంపున, మేరుగిరి గహ్వరంబు వెలువడు కంఠీరవంబు తెఱంగున, హరిహయ దిగంతరాళంబున నుదయించు నంధకార పరిపంథికై వడి, మధురానగరంబు వెలువడి, నిరాయుధుం డై, యెదురు వచ్చుచున్న హరిం గని. 1612

అధ్యాయము - ౫౧

మ. కరిసంఘంబులు లేవు రావు తురగౌఘంబుల్ రథవ్రాతముల్
పరిసర్పింపవు రారు శూరులు ధను ర్బాణాసి ము ఖ్యాయుధో
త్కరముం బట్టఁడు శక్రచాపయుత మేఘస్ఫూర్తితో మాలికా
ధరుఁ డొక్కం డదె నిర్గమించె నగరద్వారంబునం గంటిరే. 1613

శా. ఎన్నే నయ్యె దినంబు లీ నగరిపై [1]నేతెంచి పోరాటకున్
ము న్నెవ్వండును రాఁడు వీఁ డొకఁడు నిర్ముక్తాయుధుం డేగుదెం
చె న్న నోర్వఁగనో, ప్రియోక్తులకునో, శ్రీఁ గోరియో చూడుఁ డం
చు న్నాత్మీయజనంబుతోడ యవనేశుం డిట్లు తర్కింపఁగన్. 1614

క. విభు లగు బ్రహ్మప్రముఖుల, కభిముఖుఁ డై నడవకుండు నట్టి గుణాఢ్యుం
డిభరాజగమన మొప్పఁగ, నభిముఖుఁ డై నడచెఁ గాలయవనున కధిపా! 1615

వ. ఆ సమయంబున న య్యాదవేంద్రుని నేర్పడం జూచి. 1616

మ. వనజాతాతుఁడు సింహమధ్యుఁడు రమావతుండు శ్రీవత్సలాం
ఛనుఁ డంభోధరదేహుఁ డిందుముఖుఁ డంచ ద్దీర్ఘబాహుండు స
ద్వనమా లాంగద హార కంకణ సముద్యత్ కుండలుం డీతఁ డా
ముని సూచించిన వీరుఁ డౌ ననుచు న మ్మ్లేచ్ఛుండు గాఢోద్ధతిన్. 1617

సీ. చటుల వాలాభీల సైంహికేయుని భంగి లాలితేతర జటాలతిక తూలఁ
బ్రళయావసర బృహద్భాను హేతిద్యుతిఁ బరుషారుణ శ్మశ్రు పటలి వ్రేలఁ
గాదంబినీ ఛన్న కాంచనగిరి భాతిఁ గవచసంవృత దీర్ఘకాయ మమర
వల్మీకసుప్త దుర్వారాహి కైవడి కోశంబులో వాలు కొమరు మిగులఁ

1. నేనుండి (హ)

ఆ. నార్చి పేర్చి మించి యశ్వంబు గదలించి
కమలసంభవాది ఘనుల కైనఁ
బట్టరాని ప్రోడఁ బట్టెద నని జగ
దవనుఁ బట్టఁ గదిసె యవనుఁ డధిప! 1618

క. ఇటు దన్నుఁ బట్టవచ్చినఁ, బటుతర జవరేఖ మెఱసి పట్టువడక ది
క్తటము లద్రువ హరి వాఱెం, జటులగతిన్ వాఁడుఁ దోడఁ జనుదేరంగన్. 1619

వ. అప్పుడు కాలయవనుం డి ట్లనియె. 1620

మ. యదువంశోత్తమ! పోకు పోకు రణ మీ నర్హ్వంబు కంసాదులన్
గదనక్షోణి జయించి తీ వని సమిత్కామంబునన్ వచ్చితిన్
విదితఖ్యాతులు వీటిఁబోవ నరికిన్ వెన్నిచ్చి యి బ్భంగి నే
గుదురే రాజులు రాజమాత్రుఁడవె వైగుణ్యంబు వచ్చెన్ జుమీ. 1621

మ. బలిమిన్ మాధవ! నేఁడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁ బట్టుదున్
జలముల్ బొచ్చిన భూమిక్రిందఁ జనినన్ శైలంబుపై నెక్కినన్
బలిదండ [1]న్విలసించినన్ వికృతరూపంబుం బ్రవేశించినన్
జలధిన్ దాఁటిన నగ్రజన్ము హాలి కాశ్వా టాకృతుల్ దాల్చినన్. 1622

వ. అదియునుం గాక. 1623

మ. శరముల్ దూఱవు మద్ధనుర్గుణ లతాశబ్దంబు వీతేదు నా
హరి రింఖోద్ధత ధూళి గప్ప దకటా! హాస్యుండ వై పాఱె దు
ర్వరపై నేక్రియఁ బోరితో కదిసి ముఙ్ వాతాశితోఁ గేశితోఁ
గరితో మల్లురతో జరాతనయుతోఁ గంసావనీనాథుతోన్. 1624

వ. అని పలుకుచుఁ, గాలయవనుండు వెంట నరుగుదేర, సరకుసేయక, మందహాసంబు ముఖారవిందంబునకు సౌందర్యంబు నొసంగ, వేగిరపడక, రమ్ము ర మ్మనుచు హరియును. 1625

సీ. అదె యిదె లోఁబడె నని పట్టవచ్చినఁ గుప్పించి లంఘించుఁ గొంతతడవు
పట్టరా దీతని పరు వగ్గలం బని భావింపఁ దన సమీపమున నిలుచు
నడరి పార్శ్వంబున కడ్డంబు వచ్చినఁ గేడించి యిట్టట్టుఁ గికురువెట్టు
వల్మీక తరు సరోవరము లడ్డం బైన సవ్యాపసవ్య సంచరతఁ జూపుఁ

1. విహరించినన్ (క)

తే. బల్లముల డాఁగు దిబ్బల బయలుపడును
నీడలకుఁ బోవు నిఱుముల నిగిడి తాఱు
నన్నుఁ బట్టిన నీవు మానవుఁడ వనుచు
యవనుఁ డెగువంగ బహు జగదవనుఁ డధిప ! 1626

వ. మఱియును. 1327

సీ. సకల భూతవ్రాత సంవాసుఁ డయ్యును వనములు నగములు వరుస దాఁటు
లోకోన్నతుండును లోకచతురుఁడు నయ్యు మాటిమాటికి నిక్కి మగిడి చూచుఁ
బక్షవిపక్ష సంబంధ శూన్యుం డయ్యుఁ దను విపక్షుఁడు వెంటఁ దగుల నిగుడు
విజయాపజయ భావ విరహితుం డయ్యుఁ దా నపజయంబును జెందినట్లు తోఁచు

తే. నభయ భయవిహీనుఁ డయ్యు భీతుని మాడ్కిఁ
గానఁబడును సర్వకాలరూపుఁ
డయ్యుఁ గాలచకితుఁ డైన కైవడి వన
మాలి పఱచు వెఱపుమాలి యధిప ! 1628

వ. ఇవ్విధంబున. 1629

క. దారిత శాత్రవ భవను న,పార మహావేగ విజిత పవనుఁ యవనుఁ
దూరము గొని చని కృష్ణుఁడు, ఘోరం బగు నొక్క శైలగుహ వడిఁ జొచ్చెఁ.

క. అదె లోఁబడె నిదె లోఁబడె, నదె యిదె పట్టెద నటంచు నాశావశుఁ డై
యదుసింహుని పదపద్ధతి, వదలక గిరిగహ్వరంబు వాఁడుం జొచ్చెన్. 1631

వ. ఇట్లు చొచ్చి మూఢహృదయంబునుం బోలెఁ దమఃపూర్ణం బైన గుహాంతరాళం
బున దీర్ఘతల్ప నిద్రితుం డై, [3]గుఱకపెట్టుచున్న యొక్క మహాపురుషునిం
గని శ్రీహరిఁ గాఁ దలంచి. 1632

ఉ. ఆలము సేయలేక పురుషాధమ ! దుర్లభ కంటక ద్రుమా
భీల మహాశిలా సహిత భీకరకుంజర ఖడ్గ సింహ శా
ర్దూల తరక్షు సంకలిత దుర్గపథంబునఁ బాఱుదెంచి యీ
శైలగుహఁ [4]సనిద్రుక్రియఁ జాఁగి నటించినఁ బోవనిత్తునే. 1633

క. ఎక్కడ నె వ్వారలకును, జిక్క వనుచు నారదుండు సెప్పెను నాకుం
జిక్కితి వెక్కడఁ బోయెదు, నిక్కముగా నిద్రపుత్తు ని న్నీకొండఁ. 1634

1. ఎదుగంగ (హా) 2. చేసు (హా) 3. గుఱువొడుచుచున్న (తం) 4. మునీంద్రుక్రియ (క)

ఆ. అనుచు యవనుఁ డట్టహాసంబు గావించి
చటుల కఠిన కులిశ సదృశ మైన
పాద మెత్తి తన్నెఁ బాటి తద్దేహంబు
నగగుహాం బ్రతిస్వనంబు నిగుడ. 1635

ఉ. తన్నిన లేచి నిల్చి కనుఁదమ్ములు మెల్లన విచ్చి లోపలన్
సన్నపుఁ గిన్క వర్ధిల దిశల్ గని దృష్టి సమిద్ధ విగ్రహో
త్పన్న మహాగ్ని కీలముల భస్మముసేసె నతండు సాయక
చ్ఛిన్న విరోధికంఠ వను శ్రీభవనున్ యవనున్ లఘుక్రియన్, 1636

న. ఇ ట్లేకక్షణ మాత్రంబున యవనుండు నీఱయ్యె. అనిన విని, రా జి ట్లనియె. 1637

ఆ. ఎవ్వఁ డాతఁ డతని కెవ్వండు దండ్రి ఘో
రాద్రి గుహకు నేటి కతఁడు వచ్చి
నిద్రవోయె [1]యవను నిటు గాల్ప నె ట్లోపెఁ
దెలియఁ బలుకు నాకు ధీవరేణ్య! 1638

వ. అనినం, బరీక్షిన్నరేంద్రునకు నతికుతూహలంబుతో శుకయోగివర్యుం డి ట్లనియె. ఇక్ష్వాకుకుల సంభవుండు మాంధాతకొడుకు ముచుకుందుం డను రాజు, రాక్షస భీతు లయిన వేల్పులం బెద్దకాలంబు సంరక్షించిన మెచ్చి, వా రమరలోక రక్షకుం డైన యా రాజకుమారుని కడం జేరి, వరంబు వేఁడు, మనిన వారలం గనుంగొని, మోక్షపదం బడిగిన వార లతని కి ట్లనిరి.

—: ముచుకుందుని పూర్వకథాభివర్ణనము :—

మ. జగతిన్ నిర్గత కంటకం బయిన రాజ్యంబున్ విసర్జించి శూ
ర గణాగ్రేసర! పెద్దకాలము మమున్ రక్షించి తీలోన నీ
మగువల్ మంత్రులు బంధులున్ సుతులు సంబంధుల్ భువిన్ లేరు కా
లగతిన్ జెందిరి కాల మెవ్వరికి దుర్లంఘ్యంబు [2]దా నారయన్. 1640

క. కాలము ప్రబలులకును బలి, కాలాత్ముం డీశ్వరుం డగణ్యుఁడు జనులన్
గాలవశులుగాఁ జేయును, గాలము గడవంగలేరు ఘను లె వ్వారున్. 1641

క. వర మిచ్చెద మర్థింపుము, ధరణీశ్వర! మోక్షపదవి దక్కను మే మె
వ్వరమును విభులము గా మీ,శ్వరుఁ డగు హరి దక్క మోక్షసంగతిఁ జేయన్.

వ. అని పలికిన, దేవతలకు నమస్కరించి, ముచుకుందుండు నిద్రం గోరి, దేవదత్త నిద్రావశుం డై, పర్వత గుహాంతరాళంబున శయనించి యుండె. యవనుండు నీ ఱైన పిమ్మట, హరి ముచుకుందుని ముందట నిల్చిన. 1643

1. యవనునిం గాల్ప (హా. చ.) 2. గాదారయన్ (హ)

సీ. వనరుహాలోచను వై జయంతీదామ శోభితు రాకేందు సుందరాస్యు
మకరకుండల కాంతి మహిత గండస్థలుఁ [1]గౌస్తుభ గ్రైవేయుఁ ఘనశరీరు
శ్రీవత్స లాంఛనాంచిత వక్షు మృగరాజ మధ్యుఁ జతుర్బాహు మందహాసుఁ
గాంచనసన్నిభ కౌశేయవాసు గాంభీర్య సౌందర్య శోభితుఁ బ్రసన్ను

ఆ. న మ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమును బొంది
తన్మనోజ్ఞదీప్తి తనకుఁ జూడ
నలవి గాక చకితుఁ డై యెట్టకేలకుఁ
బలికెఁ బ్రీతి నవని పాలకుండు. 1644

మ. శశివో యింద్రుఁడవో విభావసుఁడవో చండప్రభారాశివో
శశిచూడామణివో పితామహుఁడవో చక్రాంక హస్తుండవో
దిశలుఁ భూమియు మిన్ను నిండె నిదె నీ తేజంబుఁ జూడంగ [2]దు
ర్వశ మెవ్వండ వి టేలవచ్చి తిచటన్ వర్తించె దేకాకి వై. 1645

క. ఈ యడవి విషమ కంటక, భూయిష్ఠము ఘోర సత్త్వ పుం జాలభ్యం
బో యయ్య! యెట్లు వచ్చితి, నీ యడుగులు కమలపత్ర నిభములు సూడఁ.

వ. మహాత్మా! యేను నీకు శుశ్రూషణంబు సేయఁగోరెద. నీ జన్మగోత్రంబు లెఱింగింపు. నే నిక్ష్వాకువంశ సంభవుండను. మాంధాతృ నందనుండను. ముచుకుందుం డను వాఁడ. దేవహితార్థంబు చిరకాల జాగర శ్రాంతుండ నై, నిద్ర నొంది, యింద్రియ సంచారంబులు మఱచి. 1647

శా. ఏ నిద్రింపుచునుండ నొక్క మనుజుం డేతెంచి దుష్కర్ముఁ డై
తా నీల్గె౯ జెడె [3]నాత్మకిల్బిషమున౯ దర్పోగ్రుఁ డై యంతటన్
శ్రీనాథాకృతి వైన నిన్నుఁ గని వీక్షింప న్నశక్తుండ నై
దీనత్వంబును జెందితి౯ ననుఁ గృపాదృష్టి౯ విలోకింపవే. 1648

వ. అనిన విని, మేఘగంభీర భాషల హరి యి ట్లనియె. 1649

సీ. భూరజంబుల నైన భూనాథ! యెన్నంగ జనుఁ గాని నా గుణ జన్మ కర్మ
నామంబు లెల్ల నెన్నంగ నెవ్వరుఁ జాల రదియేల నాకును నలవి గాదు
నేలకు వ్రేఁ గైన నిఖిల రాక్షసులను నిర్జించి ధర్మంబు నిలువఁబెట్ట
బ్రహ్మచే మున్ను నేఁ బ్రార్థింపఁబడి వసుదేవు నింటను వాసుదేవుఁ డనఁగఁ

---

1. కౌస్తుభాలంకృతు (తం. వా.) 2. దుర్వశమై యెవ్వఁడవేల (తం. వా.)
3. కిల్బిషమహా (హ)

ఆ. గరుణ నవతరించి కంసాఖ్యతో నున్న
కాలనేమిఁ జంపి ఖలుల మఱియుఁ
ద్రుంచుచున్నవాఁడఁ దొడరి నీ చూడ్కి నీ
ఱైనవాఁడు కాలయవనుఁ డనఘ! 1650

వ. వినుము. తొల్లియు, నీవు నన్ను సేవించినకతంబున, ని న్ననుగ్రహింప నీ శైల గుహకు నేతెంచితి. అభీష్టంబు లయిన వరము లడుగుము. ఇచ్చెద. మద్భక్తు లగు జనులు క్రమ్మఱ శోకంబున కర్హులు గారు. అనిన, హరికి ముచుకుందుండు నమస్కరించి, నారాయణదేవుం డగుట యెఱింగి, యిరువదియెనిమిదవ మహాయుగంబునందు నారాయణుం డవతరించు నని, మున్ను గర్గుండు చెప్పుట దలంచి. 1651

—: ముచుకుందుని శ్రీకృష్ణ స్తోత్రము :—

క. నీ మాయఁ జిక్కి పురుష, స్త్రీ మూర్తిక జనము నిన్ను సేవింపదు వి
త్తామయ గృహగత మై సుఖ, తామస మై కామవంచితం బై యీశా! 1652

ఉ. పూని యనేకజన్మములఁ బొంది తుదిన్ దన పుణ్యకర్మ సం
తానము పేర్మిఁ గర్మవసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁ డై
మానవుఁ డై గృహేచ్ఛఁ బడు మందుఁ డజంబు తృణాభిలాషి యై
కానక పోయి నూతఁ బడు కైవడి నీ పదభక్తి హీనుఁ డై. 1653

క. తరుణీ పుత్ర ధనాదుల, మరగి మహారాజ్య విభవ మదమత్తుఁడ నై
నర తను లబ్ధుఁడ నగు నా, కరయఁగ బహుకాల మీశ! యాఱడిఁ బోయెన్.

క. ఘట కుడ్య సన్నిభం బగు, చటుల కళేబరముఁ జొచ్చి జనపతి నంచున్
బటు చతురంగంబులతో, నిట నటఁ దిరుగుదును నిన్ను నెఱుఁగక యీశా!

ఆ. వివిధ కామ లోభ విషయ లాలసు మత్తు
నప్రమత్తవృత్తి నంతకుండ
వైన నీవు వేళ నరసి తుంతువు సర్ప
మొదిఁగి మూషకంబు నొడియునట్లు. 1656

క. నరవర సంజ్ఞిత మై రథ, కరి సేవిత మైన యొడలు కాలగతిన్ భీ
కర మృగభక్షిత మై దు, స్తర విట్క్రిమి [1]భస్మ సంజ్ఞితం బగు నీశా! 1657

1. భస్త్రీసంగతంబగు (హ)

ఆ. సకలదిశలు గెలిచి సములు వర్ణింపంగఁ
జారు పీఠ మెక్కి సార్వభౌముఁ
డైన సతుల గృహములందు [1]క్రీడాభోగ
వృత్తి నుండు నిన్ను వెదక లేఁడు. 1658

ఆ. మానసంబుఁ గట్టి మహిత భోగంబులు
మాని యింద్రియముల మదము లణఁచి
తపము చేసి యింద్రతయుఁ గోరుఁ గాని నీ
యమృతపదము గోరఁ డజ్ఞుఁ డీశ! 1659

సీ. సంసారి యై యున్న జనమునఁ కీశ్వర! నీ కృప యెప్పుడు నెఱయ గల్గు
నప్పుడే బంధంబు లన్నియు తెగిపోవు బంధమోక్షం బయినఁ బ్రాప్త మగును
సత్సంగమంబు సత్సంగమంబున నీదు భక్తి సిద్ధించు నీ భక్తివలన
సన్ముక్తి యగు నాకు సత్సంగమునకంటె మును రాజ్యబంధ నిర్మూలనంబు

తే. గలిగినది దేవ! నీ యనుగ్రహము కాదె
కృష్ణ! నీ సేవ గాని తక్కినవి వలదు
ముక్తిసంధాయి వగు నిన్ను ముట్టఁ గొలిచి
యాత్మబంధంబుఁ గోరునే యార్యు డెందు. 1660

వ. కావున, రజ స్సత్త్వ తమోగుణంబుల యనుబంధంబు లగు నైశ్వర్య శత్రు మరణ ధర్మాది విశేషంబులు విడిచి, యీశ్వరుండును, విజ్ఞానఘనుండును, నిరంజనుండును, నిర్గుణుండును, నద్వయుండును నైన పరమపురుషుని నిన్నాశ్రయించెద. చిరకాలంబు కర్మఫలంబులచేత నార్తుండ నై, క్రమ్మఱం దద్వాసనల [2]సంతప్తుండ నై, తృష్ణం బాయక శత్రువు లైన యింద్రియంబు లాఱింటిని గెలువలేని నాకు శాంతి యెక్కడిది. విపన్నుండ నైన నన్ను నిర్భయుం జేసి, రక్షింపుము. అనిన ముచుకుందునికి హరి యిట్లనియె. 1661

ఉ. మంచిది నీదు [3]బుద్ధి నృపమండన! నీవు పరార్థ మెట్లు వ
ర్తించిన నైనఁ గోరికల దిక్కునఁ జిక్కవు మేలు నిర్మలో
దంచిత వృత్తి నన్ గొలుచు ధన్యు [4]లబద్ధులు నట్ల నీకు ని
శ్చంచల భక్తి గల్గెడిని సర్వము నేలుము మాన నేటికిన్. 1662

వ. నరేంద్రా! తొల్లి, క్షత్త్రి ధర్మంబున నిలిచి, మృగయావినోదంబుల జంతువుల వధియించినాఁడవు. తపంబునఁ దత్కర్మవిముక్తుండ వై, తర్వాతిజన్మంబున

---

1. క్రీడాసక్తి (హ) 2. సంతుష్టుండ నై (హ) 3. భక్తి (హ) 4. లబుద్ధులు (తం)

సర్వభూత సఖిత్వంబు గలిగి, బ్రాహ్మణ శ్రేష్ఠుండ వై, నన్నుం జేరెద వని వీడ్కొలిపిన.

అధ్యాయము - ౫౨

హరికిం బ్రదక్షిణంబు వచ్చి, నమస్కరించి, గుహ వెడలి, సూక్ష్మప్రమాణ దేహంబులతో నున్న మనుష్య పశు వృక్ష లతాదులం గని, కలియుగంబు ప్రాప్తం బగు నని తలంచి, యుత్తరాభిముఖుం డై, తపోనిష్ఠుం డగుచు, సంశయంబులు విడిచి, సంగంబులు పరిహరించి, విష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చి, గంధమాదనంబు ప్రవేశించి, మఱియు, నరనారాయణ నివాసం బయిన బదరికాశ్రమంబు చేరి, శాంతుం డై, హరి నారాధించుచుండె. ఇట్లు ముచుకుందుని వీడ్కొని. 1663

శా. అచ్ఛిద్ర ప్రకట ప్రతాప రవిచే నాశాంతరాళంబులన్
బ్రచ్ఛాదించుచుఁ గ్రమ్మఱన్ మథురకున్ బద్మాక్షుఁ డేతెంచి పీ
డాచ్ఛాదించి మహానిరోధముగఁ జక్రాకార మై యున్న యా
మ్లేచ్ఛవ్రాతము నెల్లఁ ద్రుంచె రణభూమిన్ బెంపు సొంపారఁగన్. 1664

—: జరాసంధుఁడు ప్రవర్షగిరిని దహించుట :—

వ. ఇట్లు మ్లేచ్ఛులం బోరిగొని, మఱియు, న మ్మథురానగరంబునం గల ధనము ద్వారకానగరంబునకుం బంచిన, మనుష్యులు కొనిపోవు నెడ. 1665

సీ. ఘోటకసంఘాత ఖుర సమున్నిర్గత ధూళి జీమూత సందోహముగను
మహనీయ మద కల మాతంగ కట దాన ధారలు కీలాల ధారలుగను
నిరుపమ స్యందన నేమి నిర్ఘోషంబు దారుణ గర్జిత ధ్వానముగను
నిశిత శస్త్రాస్త్ర మానిత దీర్ఘ రోచులు లలితసౌదామినీ లతికలుగను.

తే. శత్రురాజ ప్రతాపాగ్ని శాంతముగను
వృష్టికాలము వచ్చు న వ్విధము దోఁప
నేఁగుదెంచె జరాసంధుఁ డిరువదియును
మూఁడు నక్షౌహిణులు దన్ను మొనసి కొలువ. 1666

చ. ఇటు చనుదెంచియున్న మగధేశ్వరు వాహినిఁ జూచి యుద్ధ సం
ఘటనము మాని మానవులకై వడి భీరులభంగి నోడి ముం
దటి ధన మెల్ల డించి మృదు తామరసాభ పదద్వయుల్ క్రియా
పటువులు రామకేశవులు పాఱిరి ఘోర వనాంతరంబులన్. 1667

వ. ఇట్లు పఱచుచున్న కృష్ణబలభద్రులం జూచి, వారల ప్రభావంబు తెలియంగక, పరిహాసించి. 1668

ఉ. ఓ యదువీరులార! రథసోద్ధతిఁ బాఱకుఁ డిట్లు పాఱినన్
బోయెదువాఁడఁ గాను మిము భూమి నడంగిన మిన్నుఁ బ్రాఁకినన్
దోయధిఁ జొచ్చినం దగిలి ద్రుంచెద నంచు సమస్తసేనతోఁ
బాయక వచ్చె వెంటఁబడి బాహుబలాఢ్యుఁడు మాగధేశుఁడున్. 1669

వ. మఱియుం, బలాయమాను లై, బహుయోజనంబుల దూరంబు చని, విశ్రాంతు లై, తమకు డాఁగ నెల వగునని, యింద్రుండు మిక్కిలి వర్షింపఁ, బ్రవర్షణాఖ్యం బై, [1]పదునొకండు యోజనంబుల పొడవును, నంతియ వెడలుపునుం గల, గిరి యెక్కిరి. అంత. 1670

శా. ఆ శైలేంద్రముఁ జుట్టి రా విడిచి రోషావిష్టుఁ డై మాగధో
ర్వీశుం డా వసుదేవనందనులఁ దా వీక్షింపగాఁ లేక త
న్నాశేచ్ఛన్ బిల సాను శృంగములఁ బూర్ణక్రోధుఁ డై కాష్ఠముల్
రాసు ల్గా నిడి చిచ్చు వెట్టఁ బనిచెన్ రౌద్రంబుతో భృత్యులన్. 1671

వ. ఇట్లు జరాసంధ పరిజన ప్రదీపితం బైన మహానలంబు దరికొనియె. అందు. 1672

క. పొగలెగసెఁ బొగలతుదలను, మిగులుచు మిణుఁగురులునిగిడె మిణుఁగురుగమి ము
న్నుగ బ్రహ్మాండము నిండను, భగభగ మని మంట లొదవె భయదము లగుచున్.

వ. మఱియు, న మ్మహానలంబు బిల సాను శృంగ వృక్ష లతా కుంజ పుంజంబుల దరికొని, శిఖలు కిసలయంబులుగ, విస్ఫులింగంబులు విరులుగ, సముద్ధూత ధూమపటలంబులు బంధుర స్కంధ శాఖా విసరంబులుగ, నవోకహంబు కై వడి నభ్రంకషం బై, ప్రబ్బి [కఠోర సమీరణ సమున్నత మహోల్కాజాల తిరోహిత వియచ్చరవిమానంబును, వివిధ విధూమ విస్ఫులింగ విలోకన ప్రభూత నూతన తారకాభ్రాంతి విభ్రాంత గగనచరంబును, [2]సంతప్యమాన సరోవర [3]సలిలంబును, విశాల జ్వాలాజాల జాజ్వల్యమాన తక్కోల చందనాగరు కర్పూర ధూమ వాసనా వాసిత గగనకుహరంబును] కరాళ కీలాజాల దందహ్యమాన కీచక నికుంజపుంజ సంజనిత చిటచిటారావ పరిపూరిత దిగంతరాళంబును, భయంకర బహుళతర శాఖాభిద్యమాన పాషాణఘోషణ పరిమూర్ఛిత ప్రాణిలోకంబును, సంతప్యమాన శాఖిశాఖాంతర నిబిడ నీడనిహిత శాబక వియోగదుఃఖ డోలాయ

---

1. పదనకొండు (హ) 2. సంతప్తమానస (హ) 3. సలిలకూలంబును (హ)

మాన విహగకులంబును, మహాహేంతి సందీప్యమాన కటిసూత్ర సంఘటిత మయూరపింఛ కుచకలశయుగళ భారాలస శబరకామినీ సమాశ్రిత నిర్ఝరంబును, దగ్ధానేక మృగమిథునంబును నై, యేర్చు నెడ. 1674

క. ఇల నేకాదశ యోజన, ముల పొడ వగు శైలశిఖరమున నుండి వడిన్
బలకృష్ణులు రిపుబలముల, వెలి కుటికిరి కానఁబడక విలసితలీలన్. 1675

వ. ఇట్లు శత్రువుల వంచించి, యాదవేంద్రులు సముద్రపరిఘం బైన ద్వారకా నగరంబునకుం జనిరి. జరాసంధుండును వారలు దగ్ధు లై రని తలంచుచు, బలంబులుఁ దానును, మగధదేశంబునకు మరలి చనియె. అంత. 1676

—: రుక్మిణీకల్యాణ కథాప్రారంభము :—

క. ఆ వనజగర్భు పంపున, రైవతుఁ డను రాజు దెచ్చి రామున కిచ్చెన్
రేవతి యనియెడు కన్యను, భూవర ! మును వింటి కాదె బుద్ధిం దెలియన్. 1677

వ. తదనంతరంబున. 1678

మ. ఖగనాథుం డమరేంద్రుఁ గెల్చి సుధ మున్ గైకొన్నచందంబునన్
జగతీనాథులఁ జైద్య పక్షచరులన్ సాళ్వాదులం గెల్చి భ
ద్రగుఁ డై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా
భగవ త్యంశభవన్ మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్. 1679

వ, అనిన రా జిట్లనియె. మున్ను రాక్షస వివాహంబున స్వయంవరంబునకు వచ్చి, హరి రుక్మిణిం గొనిపోయె నని పలికితివి. కృష్ణుం డొక్కరుం డెవ్విధంబున సాళ్వాదులం జయించి, తన పురంబునకుం జనియె. అదియునుం గాక. 1680

శా. కల్యాణాత్మక మైన విష్ణుకథ లాకర్ణింపుచున్ [1]ముక్త వై
కల్యుం డెవ్వఁడు తృప్తుఁ డౌ, నవి వినంగాఁ గ్రొత్త లౌచుండు సా
కల్యం బేర్పడ భూసురోత్తమ ! యెఱుంగం బల్కవే రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్. 1681

క. భూషణములు సెవులకు బుధ, తోషణము లనేక జన్మ దురితౌఘ విని
శ్శోషణములు మంగళతర, ఘోషణములు గరుడగమను గుణ భాషణముల్.

వ. అని, రా జడిగిన శుకుం డి ట్లనియె. 1683

---

1. ముక్తుఁడౌ కల్యుం డెవ్వఁడు (హ)

చ. వినుము విదర్భదేశమున వీరుఁడు కుండినభర్త భీష్మకుం
డను నొక దొడ్డరాజు గలఁ డాతని కేవురు పుత్రు లగ్రజుం
డనఘుఁడు రుక్మి నాఁ బరఁగు నందఱకుం గడగొట్టు చెల్లెలై
మనుజవరేణ్య! పుట్టె నొక మానిని రుక్మిణి నాఁ బ్రసిద్ధయై. 1684

క. బాలేందు రేఖ దోఁచిన, లాలితయగు నపరదిక్కు లాగున ధరణీ
పాలుని గేహము మెఱసెను, బాలిక జన్మించి యెదుగ భాసుర మగుచున్.

వ. మఱియును, దినదిన ప్రవర్ధమాన యై. 1686

సీ. పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు నబలలతోడ వియ్యంబు లందు
గుజ్జనగూళ్లను గొమరొప్ప వండించి చెలులకుఁ బెట్టించుఁ జెలువుమెఱయ
రమణీయ మందిరారామ దేశంబులఁ బువ్వుఁదీఁగెలకును బ్రోదిసేయు
నదమల మణిమయ సౌధభాగంబుల లీలతో భర్మడోలికల నూఁగు

తే. బాలికలతోడఁ జెలరేఁగి బంతులాడు
శారికా కీర పంక్తికిఁ జదువుచెప్పు
బర్హిసంఘములకు మురిపములు గఱపు
మదమరాళంబులకుఁ జూపు మందగతులు. 1687

వ. అంత. 1688

సీ. దేవకీ సుతుకోర్కె తీఁగెలు వీడంగ వెలఁదికి మైదీఁగె వీడఁ దొణఁగెఁ
గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁ గాంతి నింతికి ముఖకమల మొప్పె
మధువిరోధికి లోన మదనాగ్ని వొడచూపఁ బొలఁతికిఁ జనుదోయి పొడవుసూపె
శౌరికి ధైర్యంబు [1]సన్న మై డయ్యంగ జలజాక్షి మధ్యంబు సన్న మయ్యె

ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబు గాఁ గేశ
బంధ మధిక మగుచు బాల కమరెఁ
బద్మనయను వలనఁ బ్రమదంబు నిండార
నెలఁత [2]యౌవనంబు నిండియుండె. 1689

వ. ఇట్లు రుక్మి, [3]రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, [4]రుక్మమాలి యను నేవురకుం జెలియ లైన రుక్మిణీదేవి దన యెలప్రాయంబున. 1690

క. తన తండ్రి గేహమునకుం, జనుదెంచుచునున్న యతిథిజనులవలనఁ గృ
ష్ణుని రూప బల గుణాదులు, విని కృష్ణుఁడు దనకుఁ దగినవిభుఁ డని తలఁచెన్.

---

1. సన్నమై డాయంగ (హ) 2. యౌవనమున (హ) 3. రుక్మధర (తం)
4. రుక్మనేత్రులను (హ. తం. వా.)

క. ఆ లలన రూపు బుద్ధియు, శీలము లక్షణము గుణముఁ జింతించి తగన్
బాలారత్నముఁ దన కి, ల్లాలుగఁ జేకొందు ననుచు హరియుం దలఁచెన్. 1692

వ. అంత. 1693

ఉ. బంధువు లెల్లఁ గృష్ణునకు బాలిక నిచ్చెద మంచు శేముషీ
సింధువు లై విచారములు సేయఁగ వారల నడ్డపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ జాల విరోధముఁ జేసి మత్త పు
ష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచుఁ దలంచె నంధుఁ డై. 1694

ఉ. అన్న తలంపుఁ దా నెఱిఁగి య న్నవనీరజగంధి లోన నా
పన్నత నొంది యాప్తుఁ డగు బ్రాహ్మణు నొక్కనిఁ జీరి గర్వసం
ఛన్నుఁడు రుక్మి నేఁడు ననుఁ జైద్యున కిచ్చెద నంచు నున్నవాఁ
డెన్నివిధంబులం జని బుధేశ్వర! చక్రికి విన్నవింపవే! 1695

క. అయ్యా! కొడుకు విచారము, లయ్యయు వారింపఁ జాలఁ డటు గాకుండన్
నెయ్య మెఱిఁగించి చీరుము, చయ్యన నిజ సేవకానుసారిన్ శౌరిన్. 1696

వ. అని కొన్ని రహస్యవచనంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకానగరంబునకుం జని, ప్రతిహారులవలనఁ దనరాక నెఱింగించి, య న్నగధరుం డున్న నగరుఁ బ్రవేశించి, యందుఁ గనకాసనాసీనుం డై యున్న పురుషోత్తముం గాంచి, పెండ్లికొడుకవు గమ్మని దీవించిన, ముసిముసినగవులు నగుచు, బ్రహ్మణ్య దేవుం డైన హరి, తన గద్దియ దిగ్గన డిగ్గి, బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి, తనకు దేవతలు సేయు చందంబునం బూజలు సేసి, సరస పదార్థ సంపన్నం బైన యన్నంబు పెట్టించి, రెట్టించిన ప్రియంబున నయంబున భాసురుం డైన భూసురుం జేరి, లోకరక్షణ ప్రశస్తం బైన హస్తంబున నతని యడుగులు పుడుకుచు, మెల్లన నతని కి ట్లనియె. 1697

సీ. జగతీసురేశ్వర! సంతోషచిత్తుండ వై యున్న నీ ధర్మ మతిసులభము
వృద్ధసమ్మత మిది విత్త మెయ్యది యైనఁ బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు
తనధర్మమున నుండుఁ దరల డా ధర్మంబు గోరిక లతనికిఁ గురియుచుండు
సంతోషి గాఁడేని శక్రుఁ డైన నశించు నిర్ధనుం డయినను [1]నింద్రుఁ బోలు

ఆ. సంతసించె నేని, సర్వభూత సుహృత్త
ములకుఁ బ్రాప్తలాభ ముదితమాన
సులకు శాంతులకును సుజనులకును గర్వ
హీనులకును వినతు లే నొనర్తు. 1698

1. నిద్రవోవు (హ. తం. వా.)

ఉ. ఎవ్వని దేశమం దునికి యెవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ
కెవ్వనిరాజ్యమందుఁ బ్రజ లెల్ల సుఖింతురు వాఁడు మత్ప్రియుం
డి వ్వనరాశిదుర్గమున కె ట్లరుదెంచితి వయ్య! నీవు [1]తే
నవ్వులు గావు నీ తలఁపునం గల మే లొనరింతు ధీమణీ! 1699

వ. అని యిట్లు లీలా గృహీతశరీరుం డైన య ప్పరమేశ్వరుం డడిగిన, ధరణీసుర వరుం డతని కి ట్లనియె. దేవా! విదర్భదేశాధీశ్వరుం డగు భీష్మకుం డను రాజు గలండు. ఆ రాజుకూఁతురు రుక్మిణి యను కన్యకామణి గలదు. అ య్యిందువదన నీకుం గైంకర్యంబు సేయం గోరి, వివాహమంగళ ప్రశస్తం బైన యొక్క సందేశంబు విన్నవింపు మని పుత్తెంచె. అవధరింపుము. 1770

సీ. ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీ చరణసేవ లే ప్రొద్దు చేసిన భువనోన్నతత్వంబుఁ బొందఁగలుగు
నే నీ లసన్నామ మేప్రొద్దు భక్తితోఁ [2]దడవిన బంధసంతతులు వాయు

తే. నట్టి నీయందు నా చిత్త మనవరతము
నచ్చియున్నది నీ యాన నానలేదు
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!
శ్రీయుతాకార! మానినీచిత్తచోర! 1701

శా. ధన్యున్ లోకమనోభిరాముఁ గుల విద్యా రూప తారుణ్య సౌ
జన్య శ్రీ బల దాన శౌర్య కరుణా సంశోభితుం నిన్ను నే
కన్యల్ గోరరు? కోరదే మును రమా కాంతాలలామంబు రా
జన్యానేకప సింహ! నావలననే జన్మించెనే మోహముల్. 1702

ఉ. శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ! సింహము పాలి సొమ్ము గో
మాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయిని యైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ
డా యధమాధముం డెఱుఁగఁ డద్భుత మైన భవత్ప్రతాపముల్. 1703

మ. వ్రతముల్ దేవ గురు ద్విజన్మ బుధ సేవల్ దానధర్మాదులుం
గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణుఁ గాంక్షించి చే
సితి నేనిం వసుదేవనందనుఁడు నా చిత్తేశుఁ డౌఁగాక ని
ర్జితు లై పోదురు గాక సంగరములోఁ జైదీశము ఖ్యాధముల్. 1704

---

1. నే నవ్వులుగావు (తం) 2. నొడివిన (హ)

ఉ. అంకిలి సెప్పలేదు చతురంగ బలంబులతోడ నెల్లి యో
పంకజనాభ ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షసవివాహమునన్ భవదీయ శౌర్య మే
యుంకువ సేసి కృష్ణ ! పురుషోత్తమ ! చేకొనిపొమ్ము వచ్చెదన్. 1705

సీ. లోపలి సౌధంబులోన వర్తింపంగ దేవచ్చునే నిన్నుఁ దెత్తునేనిఁ
గావలివారలఁ గల బంధువులఁ జంపి కాని తేరా దని కమలనయన !
భావించితేని నుపాయంబు చెప్పెద నాలింపు కులదేవయాత్రఁ జేసి
నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్కఁ బెండ్లికి మునుపడఁ బెండ్లికూఁతు

తే. నెలమి మావారు పంపుదు రేను నట్లు
పురము వెలువడి యేతెంచి భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నా సమయమునకు
వచ్చి కొనిపొమ్ము నన్ను నవార్యచరిత ! 1706

మ. ఘను లాత్మీయ తమోనివృత్తి కొఱకై గౌరీశుమర్యాద నె
వ్వని పాదాంబుజ తోయమందు మునుఁగన్ వాంఛింతు రే నట్టి నీ
యనుకంపన్ విలసింప నేని వ్రతచర్యన్ నూఱు జన్మంబులన్
నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా ! 1707

సీ. ప్రాణేశ ! నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమి యేల
పురుషరత్నమ ! నీవు భోగింపఁగా లేని తనులతవలని సౌందర్య మేల
భువనమోహన ! నిన్నుఁ బొడగానఁగా లేని చక్షురింద్రియముల సత్త్వ మేల
దయిత ! నీ యధరామృతం బానఁగా లేని జిహ్వకు ఫలరససిద్ధి యేల

ఆ. నీరజాతనయన ! నీ వనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణ మేల
ధన్యచరిత ! నీకు దాస్యంబు సేయని
జన్మ మేల యెన్ని జన్మములకు. 1708

వ. అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును, రూప సౌందర్యాతి విశేషంబు
లును, బ్రాహ్మణుండు హరికి విన్నవించి, కర్తవ్యం బెద్ది సేయ నవధరింపు మని,
[1]సవరణగా ని ట్లనియె. 1709

1. సవర్ణనంబుగా (తం. వా.)

సీ. పల్లవ వైభవాస్పదములు పదములు కనకరంభా తిరస్కారు లూరు
లరుణప్రభా మనోహరములు కరములు కంబుసౌందర్య మంగళము గళము
మహిత భావాభావ మధ్యంబు మధ్యంబు చతు రుత్సవదాయి చన్నుదోయి
పరిహాసి తార్ధేందు పటలంబు నిటలంబు జిత మత్తమధుకర శ్రేణి వేణి

ఆ. భావజాశుగముల ప్రాపులు చూపులు
కుసుమశరుని వింటి [1]కొమలు బొమలు
చిత్తతోషణములు చెలువభాషణములు
జలజనయనముఖము చంద్రసఖము. 1710

ఉ. ఆ యెలనాఁగ నీకుఁ దగు నంగనకుం దగు దీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లి యగుఁ దప్పదు జాడ్యము లేల నీవు నీ
తోయమువారుఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తుగాని వి
చ్చేయుము శత్రులన్ నుఱుముసేయుము సేయుము శోభనం బిలన్. 1711

అధ్యాయము - ౫౩

వ. అని యిట్లు పలికి, బ్రాహ్మణునివలన విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశం
బును, రూప సౌందర్యాది విశేషంబులును విని, యవధరించి, నిజకరంబున నతని
కరంబుఁ బట్టి నగుచు, న య్యాదవేంద్రుం డి ట్లనియె. 1712

చ. కన్నియమీఁద నా తలఁపు గాఢము కూరుకురాదు రేయి నా
కెన్నఁడు నా వివాహము సహింపక రుక్మి తలంచు కీడు నే
మున్నె యెఱుంగుదుఁ బరులమూఁక లడంచి కుమారిఁ దెత్తు వి
ద్వన్నుత! మాను ద్రచ్చి నవవహ్నిశిఖన్ వడిఁ దెచ్చుకైవడిన్. 1713

క. వచ్చెద విదర్భభూమికిఁ, జొచ్చెద భీష్మకుని పురము సురుచిరలీలన్
దెచ్చెద బాలన్ వ్రేల్మిడి, వచ్చెద నడ్డంబు రిపులువచ్చినఁ బోరన్. 1714

వ. అని పలికి, రుక్మిణీదేవి పెండ్లి నక్షత్రంబు దెలిసి, తనపంపున రథసారథి యైన
దారుకుండు శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబు లను తురంగంబులం గట్టి,
రథ మాయత్తంబు చేసి తెచ్చిన, నమోఘ మనోరథుం డైన హరి తానును,
బ్రాహ్మణుండును, రథారోహణంబు సేసి, యేకరాత్రంబున నానర్తక దేశం
బులు గడచి, విదర్భదేశంబునకుం జనియె. అందుఁ గుండిన పురీశ్వరుం డైన
భీష్మకుండు కొడుకునకు వశుం డై, కూఁతు శిశుపాలున కిత్తు నని తలంచి,
శోభనోద్యోగంబు సేయించె. అప్పుడు. 1715

---

1. కొనలు (హ)

సీ. రచ్చలుఁ గ్రంతలు రాజమార్గంబులు విపణిదేశంబులు విశదములుగఁ
జేసిరి చందనసిక్త తోయంబులు గలయంగఁ జల్లిరి కలువడములు
రమణీయ వివిధతోరణములు గట్టిరి సకలగృహంబులు సక్కఁజేసి
కర్పూర కుంకుమాగరు ధూపములు వెట్టి రతివలు పురుషులు నన్నియెడల

ఆ. వివిధ వస్త్రములను వివిధ [1]మాల్యాభర
ణాను లేపనముల నమరియుండి
రఖిల వాద్యములు మహాప్రీతి మ్రోయించి
రుత్సవమున నగర మొప్పియుండె. 1716

వ. అంత నా భీష్మకుండు విహితప్రకారంబులం బితృదేవతల నర్చించి, బ్రాహ్మణులకు భోజనంబులు వెట్టించి, మంగళాశీర్వచనంబులు సదివించి, రుక్మిణీదేవి నభిషిక్తం జేసి, వస్త్రయుగళ భూషితం గావించి, రత్నభూషణంబు లిడి, ఋగ్యజు [2]స్సామ మంత్రంబుల మంగళాచారంబు లొనరించి, భూసురులు రక్షాకరణంబు లాచరించిరి. పురోహితుండు గ్రహశాంతికొఱకు నిగమనిగదిత న్యాయంబున హోమంబు గావించె. మఱియు నా రాజు దంపతుల మేలుకొఱకు తిల ధేను కలధౌత కనక చేలాది దానంబులు ధరణీ దేవతల కొసంగె. అ య్యవసరంబున. 1717

మ. భటసంఘంబులతో రథావళులతో భద్రేభ యూథంబుతోఁ
బటు వేగాన్విత ఘోటకవ్రజముతో బంధుప్రియ శ్రేణితోఁ
గటు సంరంభముతో విదర్భతనయం గైకొందు నంచున్ విశం
కటవృత్తిన్ జనుదెంచెఁ జైద్యుఁడు గడుం గర్వించి య వ్వీటికిన్ 1718

ఉ. బంధులఁ గూడి కృష్ణ బలభద్రులు వచ్చినఁ బాఱఁదోలి ని
ర్బంధరవృత్తిఁ జైద్యునికి మానినిఁ గూర్చెద మంచు నుల్లసత్
సింధుర వీర వాజి రథ సేనలతోఁ జనుదెంచి రా జరా
సంధుఁడు దంతవక్త్రుఁడును సాల్వ [3]విదూరథ పౌండ్రకాదులున్. 1719

వ. మఱియు, నానాదేశంబుల రాజు లనేకు లేతెంచిరి, అందు శిశుపాలు నెదుర్కొని, పూజించి, భీష్మకుం డొక్క నివేశంబున నతని విడియించె. అంతఁ దద్వృత్తాంతంబు విని. 1720

---

1. మాల్యాంబరా,భరణలేపనముల నమరియుండి (హ); మాల్యాంబరాభరణలేపనములఁ బరఁగియుండి (వా) 2. సామాథర్వణ (తం.వా.) 3. విదూరక (తం. వా.); "దంతవక్త్రో విదూరథః" (53-17)

చ. హరి యొకఁ డేగినాఁడు మగధాదులు చైద్య హితానుసారు లై
నరపతు లెందఱేనిఁ జనినారు కుమారికఁ దెచ్చుచోట సం
గర మగుఁ దోడు గావలయుఁ గంసవిరోధికి నంచు వేగఁ దా
నరిగె హలాయుధుండు కమలాక్షునిఁ జూడ ననేకసేనతోన్. 1721

క. ఆలోపల నేకతమున, నాలోలవిశాలనయన యగు రుక్మిణి త
న్నాలోకలోచనుఁడు హరి, యాలోకము చేసి కదియఁ డని శంకిత యై. 1722

శా. లగ్నం బెల్లి వివాహముం గదిసె నేలా రాఁడు గోవిందుఁ డు
ద్విగ్నుం బయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతముం బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుఁ డేటికిం దడసె నా యత్నంబు సిద్ధించునో
భగ్నం బై చనునో విరించి కృత మెబ్భంగిం బ్రవర్తించునో! 1723

మ. ఘనుఁ డా భూసురుఁ డేఁగెనో నడుమ మార్గశ్రాంతుఁ డై చిక్కెనో
విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో యార్యామహాదేవియుం
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో నా భాగ్య మె ట్లున్నదో. 1724

వ. అని వితర్కింపుచు. 1725

ఉ. పోఁడను బ్రాహ్మణుండు యదుపుంగవు వీటికి వాసుదేవుఁడుం
రాఁ డను నింకఁ బోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుఁడుం
లేఁ డను రుక్మికిం దగవు లే దిటఁ జైద్యున కిత్తు నంచు ను
న్నాఁ డను గౌరి కీశ్వరికి నావలనం గృప లేదు నేఁ డనున్. 1726

ఉ. చెప్పదు తల్లికిం దలఁపుఁ జిక్కు దిశల్ దరహాస చంద్రికన్
గప్పదు వక్త్రతామరస గంధసమాగత భృంగసంఘముం
రొప్పదు నిద్రఁ గైకొనదు రోజ పరస్పరసక్త హారముల్
విప్పదు కృష్ణమార్గగత వీక్షణపంక్తులఁ ద్రిప్ప దెప్పుడున్. 1727

చ. తుడువదు కన్నులం వెడలు తోయకణంబులు కొప్పుఁ జక్కగా
ముడువదు నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన దన్న మేమియుం
గుడువదు నీరమున్ గొనదు కూరిమి కీరముఁ జేరి పద్యముం
నొడువదు వల్లకీగుణ వినోదము సేయదు డాయ దన్యులన్. 1728

సీ. మృగనాభి యలఁదదు మృగరాజమధ్యమ జలముల నాడదు జలజగంధి
ముకురంబుఁ జూడదు ముకురసన్నిభముఖి పుష్పలు దుఱుమదు పుష్పఁబోణి
వనకేళిఁగోరదు వనజాతలోచన హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁ బోషింపదు లతికా లలితదేహ తొడవులు దొడవదు తొడవుతొడవు

ఆ. తిలక మిడదు నుదుటఁ దిలకినీతిలకంబు
గమలగృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁ గైకొన వన
మాళి రాఁడు తగవుమాలి యనుచు. 1729

వ. మఱియును. 1730

మ. మలఁగుం మెల్లనిగాలికిన్ బటు నట న్మత్త ద్విరేఫాళికిం
దలఁగుం గోయిల మ్రోఁత కై యలఁగు నుద్యత్ కీరసంభాషలం
గలఁగుం వెన్నెలవేఁడిమిన్ మలఁగు మాకందాంకుర చ్ఛాయకున్
దొలఁగుం గొమ్మ మనోభవానల శిఖా దోదూయమానాంగి యై. 1731

వ. ఇట్లు హరిరాక కెదురుచూచుచు, సకల ప్రయోజనంబులయందును విరక్త యై, మనోజానలంబునం బొగిలెడి మగువకు శుభంబు చెప్పు చందంబున వామోరు లోచన భుజంబు లదరె. అంతఁ గృష్ణు నియోగంబున బ్రాహ్మణుండు సను దెంచిన, నతని ముఖలక్షణం బుపలక్షించి, యా కలకంఠి మహోత్కంఠతోడ నకుంఠిత యై, మొగంబునం జిఱునగవు నిగుడ, నెదురుచని నిలువంబడిన, బ్రాహ్మణుం డి ట్లనియె. 1732

ఉ. మెచ్చె భవద్గుణోన్నతి కమేయ [1]ధనాదుల నిచ్చె నాకుఁ దా
వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె సురాసురు లెల్ల నడ్డ మై
వచ్చిన నైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా! 1733

వ. అనిన వైదర్భి యి ట్లనియె. 1734

మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశముం జెప్పి నన్
నిలువం బెట్టితి నీ కృపం బ్రతికితిం నీయట్టి పుణ్యాత్ముకుల్
గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింపఁగా నేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధు చింతామణీ! 1735

వ. అని నమస్కరించె. అంత రామకృష్ణులు దన కూఁతు వివాహంబునకు వచ్చుట విని, తూర్యఘోషణంబులతో నెదుర్కొని, విధ్యుక్త ప్రకారంబునఁ బూజించి, మధుపర్కంబు లిచ్చి, వివిధాంబరాభరణంబులు మొదలైన కానుక లొసంగి, భీష్మకుండు బంధుజన సేనాసమేతు లైన వారలకుం దూర్ణంబున సకల సంప త్పరిపూర్ణంబు లైన నివేశంబులు గల్పించి, విడియించె. ఇట్లు కూడిన రాజుల

---

1. ధనావళులిచ్చె (తం. వా.)

కెల్లను వయో వీర్య బలవిత్తంబు లెట్లట్ల కోరిన పదార్థంబు లెల్ల నిప్పించి, పూజించె. అంత విదర్భపురంబు ప్రజలు హరిరాక విని, వచ్చి చూచి, నేత్రాంజలులం దదీయ వదనకమల మధుపానంబుసేయుచు. 1736

మ. తగు నీ చక్రి విదర్భరాజ సుతకుఁ దథ్యంబు వైదర్భియుం
దగు నీ చక్రికి నింత మంచి దగునే దాంపత్య మీ యిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి•గదా దర్పాహతారాతి యై
మగఁ డౌఁ గావుతఁ జక్రి యీ రమణికిన్ మా పుణ్య మూలంబునన్. 1737

వ. అని పలికిరి. ఆ సమయంబున. 1738

సీ. సన్నద్ధు లై బహు శస్త్రసమేతు లై బలసి చుట్టును వీరభటులు గొలువ
ముందఱ నుపహారములు కానుకలుఁ గొంచు వర్గంబు లై వారవనిత లేఁగఁ
బుష్ప గంధాంబర భూషణ కలిత లై పాడుచు భూసుర భార్య లరుగఁ
బణవ మర్దల శంఖ పటహ కాహళ వేణు భేరీ ధ్వనుల మిన్ను పిక్కటిలఁగఁ

ఆ. దగిలి సఖులు గొల్వఁ దల్లులు బాంధవ
సతులు దోడ రాఁగ సవినయముగ
నగరువెడలి నడచె నగజాతకును మ్రొక్క
బాల చికుర పిహిత ఫాల యగుచు. 1739

వ. మఱియు, సూత మాగధ వంది గాయక పాఠక జను లంతంత నభినందించుచుం జనుదేర, మందగమనంబున ముకుంద చరణారవిందంబులు డెందంబునం దలంచుచు, నిందుధరసుందరీ మందిరంబు చేరి, సలిల ధారా ధౌత చరణ కరారవింద యై, వార్చి, శుచి యై, గౌరీసమీపంబునకుం జనియె. అంత ముత్తైదువు లగు భూసురోత్తముల భార్యలు భవసహిత యైన భవానికి మజ్జనంబు గావించి, గంధాక్షతంబు లిడి, వస్త్ర మాల్యాది భూషణంబుల నలంకరించి, ధూప దీపంబు లొసంగి, నానావి ధోపహారంబులు సమర్పించి, కానుకలిచ్చి, దీపమాలికల నివాళించి, రుక్మిణీదేవిని మ్రొక్కించిరి. అప్పుడు. 1740

ఉ. నమ్మితి నా మనంబున సనాతను లైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ! మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతిసేయుమమ్మ! నిన్
నమ్మిన వారి కెన్నఁటికి నాశము లేదు గదమ్మ! యీశ్వరీ! 1741

వ. అని గౌరీదేవికి మ్రొక్కి, పతులతోడం గూడిన బ్రాహ్మణభార్యలకు లవణాపూపంబులును, దాంబూల కంఠసూత్రంబులును, ఫలంబులు, నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారలఁ బూజించిన. 1742

ఆ. వారు నుత్సహించి వలనొప్ప దీవించి
సేస లిడిరి యువతి శిరమునందు
సేస లెల్లఁ దాల్చి శివవల్లభకు మ్రొక్కి
మౌననియతి మాని మగువ వెడలె. 1743

వ. ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగున, మృగధరమండలంబు నిర్గమించి చరించు మృగంబుచందంబునఁ, గమలభవనర్తకుం డెత్తిన జవనికమఱుఁగు దెరలి పొడసూపిన మోహినీదేవత కైవడి, దేవ దానవ సంఘాత కరతల సవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్ర పాశ పరివలయిత పర్యాయ పరిభ్రాంత మందరాచల మంథాన మథ్యమాన ఘూర్ణిత ఘుమఘుమాయిత మహార్ణవ మధ్యంబున నుండి చనుదెంచు నిందిరాసుందరీ వైభవంబున, బహువిధ ప్రభాభాసమాన యై, యిందుధరసుందరీ మందిరంబు వెడలి, మానసకాసార హేమకమల కానన విహరమాణ మత్తమరాళంబు భంగి, మంద గమనంబునఁ గనకకలశయుగళ సంకాశ కర్కశ పయోధర భార పరికంప్యమాన మధ్య యై, రత్నముద్రికాలంకృతం బైన కెంగేల నొక్క సఖీలలామంబు కైదండ గొని, రత్ననివహ సమంచిత కాంచన కర్ణపత్ర మయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప, నరవింద పరిమళ కుతూహలావతీర్ణ మత్త మధుకరంబుల మాడ్కి నరాళంబు లైన కుంతలజాలంబులు ముఖమండలంబునఁ గ్రందుకొన, సుందర మందహాస రోచులు దిశలందు బాలచంద్రికా సౌందర్యంబు నావహింప, నధరబింబఫ లారుణమరీచి మాలికలు వదన కుందకుట్మలంబుల కనురాగంబు సంపాదింప, మనోజాతకేతన సన్నిభం బైన పయ్యెదకొంగు దూఁగ, సువర్ణ మేఖలాఘటిత మణికిరణపటలంబు లకాల శక్రచాప జనకంబు లై మెఱయ, జెఱకువిలుతుం డొఱ వెడలి, వాఁడియిడి, ఝళిపించిన ధగద్ధగాయమానంబు లగు బాణంబులపగిది, సురుచిర విలోకననికరంబులు రాజవీరుల హృదయంబులు భేదింప, శింజాన మంజు మంజీరనినదంబులు చెవులపండువులు సేయఁ, బాద సంచారంబున హరి రాక కెదురుసూచుచు, వీర మోహిని యై చనుదెంచుచున్న సమయంబున. 1744

మ. అళినీలాలకఁ బూర్ణచంద్రముఖ నేణాక్షిం బ్రవాళాధరన్
గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళన్ గంధేభకుంభస్తనిన్
బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో
త్పలగంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ము లై రందఱున్. 1745

వ. మఱియు, న య్యింతి దరహాస లజ్జావలోకనంబులఁ జిత్తంబు లేమఱి, ధైర్యంబులు దిగనాడి, గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని, యెఱుక లుడిగి, యాయుధంబులు దిగవైచి, గజ తురగ రథారోహణంబులు సేయనేరక, రాజు లెల్ల నేలకు వ్రాలిరి. ఆ యేణీలోచన తన వామకర నఖంబుల నలకంబులు దలఁగ ద్రోయుచు, నుత్తరీయంబు చక్కనొత్తుచుఁ, గడకంటి చూపులం గ్రమంబున నా రాజలోకంబు నాలోకింపుచు. 1746

చ. కనియెన్ రుక్మిణి చంద్రమండల ముఖుం గంఠీరవేంద్రావల
గ్న నవాంభోజదళాక్షుఁ జారుతర వక్షున్ మేఘసంకాశ దే
హు నగారాతి గజేంద్రహస్త నిభ బాహుం జక్రిఁ బీతాంబరున్
ఘన భూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్. 1747

వ. కని తదీయ రూప వయో లావణ్య వైభవ గాంభీర్య చాతుర్య తేజోవిశేషంబులకు సంతసించి, మనోభవ శరాక్రాంత యై, రథారోహణంబు గోరుచున్న వరారోహం జూచి, పరిపంథి రాజలోకంబులు సూచుచుండ, మందగమనంబున గంధసింధురంబులీలఁ జనుదెంచి, ఫేరవంబుల నడిమిభాగంబు గొని చను కంఠీరవంబు కైవడి, నిఖిల భూపాలగణంబుల గణింపక, తృణీకరించి, రాజకన్యకం దెచ్చి, హరి తన రథంబుమీఁద నిడుకొని, భూ నభోంతరాళంబులు నిండ, శంఖంబు పూరించుచు, బలభద్రుండు తోడ నడవ, యాదవ వాహినీ పరివృతుండై, ద్వారకానగర మార్గంబు పట్టి చనియె. అంత జరాసంధ వశులైన రాజులందఱు హరి పరాక్రమంబు విని సహింపనోపక. 1748

మ. ఘన సింహంబుల కీర్తి నీచమృగముల్ గైకొన్న చందంబునన్
మన కీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు నున్మాదంబుతో గోపకుల్
సనుచున్నా రదె శౌర్య మెన్నఁటికి మీ శస్త్రాస్త్రముల్ గాల్పనే
తనుమధ్యన్ విడిపింపమేని నగరే ధాత్రీజనుల్ గ్రంతలన్. 1749

## అధ్యాయము - ౫౪

వ. అని యొండొరులఁ దెల్పుకొని, రోషంబులు హృదయంబుల నిల్పుకొని, సంరంభించి, తనుత్రాణంబుల వహియించి, ధనురాది సాధనంబులు ధరియించి, పంతంబు లాడి, తమతమ చతురంగబలంబులం గూడి, జరాసంధాదులు యదువీరులవెంట నంటందాఁకి, నిలు నిలుండని ధిక్కరించి పలికి, యుక్కుమిగిలి, మహీధరంబులమీఁద సలిలధారలు గురియు ధారాధరంబుల చందంబున, బాణ

వర్షంబులు గురిసిన, యాదవసేనలం గల దండనాథులు కోదండంబు లెక్కిడి, గుణంబులు మ్రోయించి, నిలువంబడిరి. అప్పుడు. 1750

క. అరి బలభట సాయకముల, హరిబలములు గప్పఁబడిన నడరెడి భీతిన్
హరిమధ్య సిగ్గుతోడను, హరివదనముఁ జూచె చకిత హరిణేక్షణ యై. 1751

వ. ఇట్లు చూచిన. 1752

క. [1]వచ్చెద రదె యదువీరులు, వ్రచ్చెద రరిసేన లెల్ల వైరులు పెలుచన్
నొచ్చెదరును విచ్చెదరును, జచ్చెదరును నేఁడు చూడు జలజాతాక్షీ! 1753

వ. అని రుక్మిణీదేవిని హరి యూఱడించె. అంత బలభద్రప్రముఖు లైన యదువీరులు ప్రళయవేళ మిన్నునం బన్నిన బలుపిడుగుల నడరించు పెను మొగుళ్ళ వడువున, జరాసంధాది పరిపంథి రాజ చక్రంబుమీఁద నవక్ర పరాక్రమంబున శిఖిశిఖా సంకాశ నిశిత శిలీముఖ నారాచ భల్ల ప్రముఖంబు లైన బహువిధ బాణపరంపరలు గురియ, నదియును విదళిత మత్త మాతంగంబును, విచ్ఛిన్న తురంగంబును, విభిన్న రథవరూథంబును, వినిహత పదాతియూథంబును, విఖండిత వాహ వారణ రథారోహ మస్తకంబును, విశకలిత వక్షో మధ్య కర్ణ కంఠ కపోల హస్తంబును, విస్ఫోటిత కపాలంబును, వికీర్ణ కేశజాలంబును, విపాటిత చరణ జాను జంఘంబును, విదళిత దంతసంఘంబును, విఘటిత వీర మంజీర కేయూరంబును, విభ్రష్ట కుండల కిరీట హారంబును, విశ్రుత వీరాలాపంబును, విదార్యమాణ గదా కుంత తోమర పరశు పట్టస ప్రాస కరవాల శూల చక్ర చాపంబును, వినిపాతిత కేతన చామర ఛత్రంబును, విలూన తనుత్రాణంబును, వికీర్యమాణ ఘోటకసంఘ రింఖాసముద్ధూత ధరణీపరాగంబును, వినష్ట రథవేగంబును, వినివారిత సూత మాగధ వంది వాదంబును, వికుంఠిత హయ హేషా పటహ భాంకార, కరటిఘటా ఘీంకార, రథనేమి ఘటాత్కార, తురగ నాభిఘంటా ఘణఘణాత్కార, వీర హుంకార, భూషణ ఝుణఝుణాత్కార, నిస్సాణ ధణధణాత్కార, మణినూపుర క్రేంకార, కింకిణీగణ కిణాత్కార, శింజినీ టంకార, భట పరస్పర ధిక్కార నాదంబును, వినిర్భిద్యమాన రాజ సమూహంబును, విద్యమాన రక్తప్రవాహంబును, విశ్రూయమాణ భూత బేతాళ కలకలంబును, విజృంభమాణ ఫేరవ కాక కంకాది సంకులంబును, ప్రచలిత కబంధంబును, ప్రభూత పలలగంధంబును, ప్రదీపిత మేదో మాంస రుధిర ఖాదంబును, ప్రవర్తిత డాకినీ ప్రమోదంబును నై యుండె. అప్పుడు. 1754

1. చొచ్చెద (తం. వా.)

చ. మగిడి చలించి పాఱుచును మాగధముఖ్యులు గూడి యొక్కచో
వగచుచు నాలిఁ గోల్పడిన వానిక్రియన్ గడు వెచ్చ నూర్చుచున్
మొగమునఁ దప్పి దేరఁ దమ ముందటఁ బొక్కుచు నున్న చైద్యుతోఁ
బగతుర చేతులోఁ బడక ప్రాణముతోడుత నున్నవాఁడవే. 1755

ఆ. బ్రతుక వచ్చు నొడలఁ బ్రాణంబు లుండిన
బ్రతుకు గలిగెనేని భార్య గలదు
బ్రతికి తీవు భార్యపట్టు [1]దైవ మెఱుంగు
వగవవలదు చైద్య! వలదు వలదు. 1756

వ. వినుము. దేహధారి స్వతంత్రుఁడు గాడు. జంత్రగానిచేతి జంత్రపుబొమ్మ కైవడి నీశ్వరతంత్ర పరాధీనుం డై, సుఖదుఃఖంబులందు నర్తనంబులు సలుపు. తొల్లి నేను మధురాపురంబుమీఁదఁ బదియేడుమాఱులు పరాక్రమంబునన్ విడిసి, చక్రి చేత నిర్మూలిత బలచక్రుండ నై, కామపాలుచేతం బట్టువడి, యీ కృష్ణుండు కరుణతో విడిపించిన వచ్చి, క్రమ్మఱ నిఱువదిమూ డక్షౌహిణులం గూడు కొని, పదునెనిమిదవమాఱు దాడిచేసి, శత్రువులం దోలి, విజయంబుఁ జేకొంటిని. జయాపజయంబులందు హర్షశోకంబుల నెన్నండును జెంద. (నేఁటి దినంబున నీ కృష్ణుని కెదిరిపోర మనరాజలోకంబు లెల్ల నుగ్రాతుం గూడుకొని, యెదిరి పోరిన నోడు.) ఇంతియ కాక దైవయుక్తం బైన కాలంబునం జేసి, లోకంబులు పరిభ్రమించుచునుండు. అదియునుం గాక. 1757

మ. తమకుం గాలము మంచి దైన మనలం దై త్రిలోక్యవిఖ్యాత వి
క్రములం గెల్చిరి యాదవుల్ హరి భుజాగర్వంబునన్ నేఁడు కా
లము మేలై చనుదెంచె నేని మనముం లక్షించి విద్వేషులన్
సమరక్షోణి జయింత మింత పనికై శంకింప నీ కేటికిన్. 1758

వ. అని యిట్లు జరాసంధుండును, అతని యొద్ది రాజులును, శిశుపాలుని పరితాపంబు నివారించి, తమతమ భూములకుం జనిరి. శిశుపాలుండు ననుచర సేనాసమేతుం డై, తన నగరంబునకుం జనియె, నంత రుక్మి యనువాఁడు కృష్ణుండు రాక్షస వివాహంబునం దన చెలియలిం గొనిపోవుటకు సహింపక, యేకాక్షౌహిణీ బలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదగిలి పోవుచుఁ, దన సారథితో ని ట్లనియె. 1759

---

1. దయ్య మెఱుఁగు (తం. వా.)

ఉ. బల్లిదు నన్ను భీష్మజనపాల కుమారునిఁ జిన్నఁ జేసి నా
చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కని నిక్కపు బంటువోలె నీ
గొల్లఁడు వోయెడిన్ రథము గూడఁగఁదోలుము తేజితోల్ల సత్
భల్లపరంపరన్ మదముఁ బాపెదఁ జూపెద నా ప్రతాపమున్. 1760

వ. అని యిట్లు రుక్మి హరి కొలంది యెఱుంగక సారథి నదలించి, రథముఁ గూడ దోలించి, గోపాలక! వెన్నద్రుచ్చ! నిమిషమాత్రంబు నిలు నిలు మని తిరస్కరించి, బలువింట నారి సైరించి, మూఁడు వాఁడితూపుల హరి నొప్పించి, యి ట్లనియె. 1761

సీ. మాసరివాఁడవా మాపాపఁ గొనిపోవ నేపాటి గలవాఁడ వేది వంశ
మెందు జన్మించితి వెక్కడఁ బెరిఁగితి వెయ్యది నడవడి యెవ్వఁ డెఱుఁగు
మానహీనుఁడ వీవు మర్యాద లెఱుఁగవు మాయఁ గైకొనికాని మలయరావు
నిజరూపమున శత్రునివహంబు పైఁ బోవు వసుధేశుఁడవు గావు వావి లేదు

ఆ. కొమ్మ నిమ్ము నీవు గుణరహితుండవు
విడువు విడువవేని విలయకాల
శిఖిశిఖా సమాన శిత శిలీముఖముల
గర్వమెల్లఁ గొందుఁ గలహమందు. 1762

వ. అని పలికిన, నగధరుండు నగి, యొక్క బాణంబున వాని కోదండంబు ఖండించి, యాఱుశరంబుల శరీరంబు దూఱనేసి, యెనిమిది విశిఖంబుల రథ్యంబులం గూల్చి, రెం డమ్ముల సారథిం జంపి, మూఁడు వాఁడితూపులం గేతనంబు ద్రుంచి, మఱియు నొక్క వి ల్లందినం ద్రుంచి, వెండియు, నొక్కధనువు వట్టిన విదళించి, క్రమంబున పరిఘ పట్టిస శూల చర్మాసి శక్తి తోమరంబులు ధరియించినం, దునుకలు సేసి, క్రమ్మఱ నాయుధంబు లెన్ని యెత్తిన నన్నియు శకలంబులు గావించె. అంతటం దనివిసనక వాఁడు రథంబు డిగ్గి, ఖడ్గహస్తుం డై, దవానలంబు పైఁ బడు మిడుతచందంబునం గదిసిన, ఖడ్గకవచంబులు చూర్ణంబులు చేసి, మెఱుంగులు చెదర నడిదంబు వెలికి ఝళిపించి, వాని శిరంబుఁ దెగ వ్రేయుదు నని, గమకించి, నడచుచున్న, నడ్డంబువచ్చి, రుక్మిణీదేవి హరి చరణారవిందంబులు వట్టుకొని, యి ట్లనియె. 1763

మత్తకోకిల. నిన్ను నీశ్వరు దేవదేవుని నిర్ణయింపఁగ లేక యో
సన్నుతామర! కీర్తిశోభిత! సర్వలోక శరణ్యా! మా
యన్న యీతఁడు నేఁడు చేసె మహాపరాధము నీయెడన్
నన్ను మన్నన చేసి కావు మనాథనాథ! దయానిధీ! 1764

మత్తకోకిల. కల్ల లేదని విన్నవించుట గాదు వల్లభ! యీతనిన్
బ్రల్లదుం డెగఁజూచి తేనియు భాగ్యవంతుల మైతి మే
మల్లుఁ డయ్యె ముకుందుఁ డీశ్వరుఁ డంచు మోదితు లైన మా
తల్లిదండ్రులు పుత్రశోకముఁ దాల్చి చిక్కుదు రీశ్వరా! 1765

మ. అని డగ్గుత్తికతో మహాభయముతో నాకంపి తాంగంబుతో
వినత శ్రాంత ముఖంబుతో శ్రుతిచల ద్వేణీ కలాపంబుతోఁ
గనుదోయిన్ జడిగొన్న బాష్పములతోఁ గన్యాలలామంబు ప్రమొ
క్కిన రుక్మిం దెగ వ్రేయఁ బోక మగిడెన్ గృష్ణుండు రోచిష్ణుఁడై. 1766

వ. ఇట్లు చంపక, బావా! రమ్మని చిఱునగవు నగుచు, వానిం బట్టి బంధించి, గడ్డంబును, మీసంబునుం, దలయును (నొక కత్తివాతి యమ్మున) రేవులువాఱఁ గొఱిగి, విరూపిం జేసె. అంతట యదువీరులు పర సైన్యంబులం బాఱఁదోలి, తత్సమీపంబునకు వచ్చిరి. అప్పుడు హాతప్రాయుం డై, కట్టువడియున్న రుక్మిం జూచి, కరుణచేసి, బలభద్రుండు బంధంబులు విడిచి, హరిని డగ్గఱి, యి ట్లనియె.

క. తల మనక భీష్మనందను, తలయును మూతియును గొఱుగఁ దగవే! బంధుం
దలయును మూతియుఁ గొఱుగుట, తల దఱుగుటకంటెఁ దుచ్ఛతరము మహాత్మా!

క. కొందఱు రిపు లని కీడును, గొందఱు హితు లంచు మేలు గూర్పవు నిజ మీ
వందఱియందును సముఁడవు, పొందఁగ నేలయ్య! విషమబుద్ధి ననంతా! 1769

వ. అని వితర్కించి పలికి, రుక్మిణీదేవి నుపలక్షించి యి ట్లనియె. 1770

-:సహోదరుని భంగమునకు ఖిన్న యగు రుక్మిణీదేవిని బలభద్రుం డూరార్చుట:-

శా. తోడంబుట్టినవాని భంగమునకున్ దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడం జూడకుమమ్మ! పూర్వభవ కర్మాధీన మై ప్రాణులన్
గీడున్ మేలును జెందు లేఁ డొకఁడు శిక్షింపంగ రక్షింప నీ
తోడంబుట్టువు కర్మశేష పరిభూతుం డయ్యె నేఁ డి య్యెడన్. 1771

క. చంపెడిదోషము గలిగినఁ, జంపఁజనదు బంధుజనులఁ జను విడువంగాఁ
జంపిన దోషము సిద్ధము, చంపను మఱి యేల మున్న చచ్చినవానిన్. 1772

ఆ. బ్రహ్మచేత భూమిపతుల కీ ధర్మంబు
కల్పితంబు రాజ్యకాంక్షఁ జేసి
[2]తోడిచూలు నైనఁ దోడబుట్టినవాఁడు
చంపుచుండుఁ గ్రూరచరితుఁ డగుచు. 1773

---

1. మైతి మా కల్లుఁ డయ్యె (హ) 2. తోడఁబుట్టువు నైనఁ దొడిబడఁగాఁ బట్టి (హ)

క. భూమికి ధనధాన్యములకు, భామలకును మానములకుఁ బ్రాభవమునకుం
గామించి మీఁదు గానరు, శ్రీమదమున మానధనులు చెనకుదు రొరులన్. 1774

వ. వినుము. దైవమాయం జేసి, దేహాభిమానులైన మానవులకున్ బగవాఁడు, బంధుండు, నుదాసీనుండు నను మోహంబు సిద్ధంబై యుండు. జలాదులయందుఁ జంద్రసూర్యాదులును, ఘటాదులయందు గగనంబును, [1]పెక్కై కానంబడుభంగి, దేహధారుల కందఱికి నాత్మ యొక్కండయ్యును, పెక్కండై తోఁచు. ఆద్యంతంబులు గల యీ దేహంబు ద్రవ్య ప్రాణ గుణాత్మకంబై, యాత్మయందు నవిద్యచేతఁ గల్పితంబై, దేహిని సంసారంబునం ద్రిప్పు. సూర్యుండు తటస్థుండై యుండం, బ్రకాశమానంబులైన దృష్టిరూపంబులఁ బోలె నాత్మ తటస్థుండై యుండ, దేహేంద్రియంబులు ప్రకాశమానంబు లగును. ఆత్మకు వేఱొక్కటితోడ సంయోగవియోగంబులు లేవు. వృద్ధిక్షయంబులు చంద్రకళలకుం గాని, చంద్రునికి లేనికైవడి, జన్మనాశంబులు దేహంబునకుఁ గాని, యాత్మకుఁ గలుగనేరవు. నిద్రవోయినవాఁ డాత్మను విషయఫలానుభవంబులు సేయించు తెఱంగున, నెఱుకలేనివాఁడు నిజముగాని [2]యర్థమునందు భవము నొందుచుండుఁ గావున. 1775

క. అజ్ఞానజ మగు శోకము, విజ్ఞాన విలోకనమున విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే, యజ్ఞానులభంగి వగవ నంభోజముఖీ. 1776

వ. ఇట్లు బలభద్రునిచేతఁ దెలుపంబడి, రుక్మిణీదేవి దుఃఖంబు మాని యుండె. అట రుక్మి యనువాఁడు ప్రాణావశిష్టుండై, విడువఁబడి, తన విరూప భావంబునకు నెరియుచు, హరిం గెల్చి కాని కుండినపురంబుఁ జొర నని ప్రతిజ్ఞసేసి, తత్సమీపంబున నుండె. ఇవ్విధంబున. 1777

క. రాజీవలోచనుఁడు హరి, రాజసమూహములఁ గెల్చి రాజస మొప్పన్
రాజిత యగు తనపురికిని, రాజాననఁ దెచ్చె బంధురాజి నుతింపన్. 1778

## —:శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిని పెండ్లియాడుట:—

వ. అంత న య్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధ వివాహకృత్యంబును, బ్రవర్తమాన గీత వాద్య నృత్యంబును, బ్రతిగృహాలంకృత విలసి తాశేష నర నారీవర్గంబును, బరిణయ మహోత్సవ సమాహూయమాన మహీపాల గజఘటా గండమండల దానసలిలధారా సిక్త మార్గంబును, బ్రతిద్వార మంగళాచార సంఘటిత క్రముక

---

1. పెక్కండై (హ.) 2. అవర్తమానే తథాప్యోతత్యబుధో భవమ్ (54-49).

కదళికా కర్పూర కుంకు మాగరు ధూప దీప పరిపూర్ణ కుంభంబును, విభూషిత సకల గృహవేదికా కవాట దేహళీస్తంభంబును, విచిత్ర కుసుమాంబర రత్నతోరణ విరాజితంబును,సముద్ధూత కేతనవిభ్రాజితంబును నై, యుండె. అ య్యవసరంబున.

మ. ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజ చేతోహారిణిన్ మాన వై
భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం
ధవ సత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబర ధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్. 1780

క. సతులుం దారును బౌరులు, హితమతిఁ గానుకలు దెచ్చి యిచ్చిరి కరుణో
న్నత వర్ధిష్ణులకును మా, నిత రోచిష్ణులకు రుక్మిణీకృష్ణులకున్. 1781

క. హరిపెండ్లికిఁ గైకేయక, కురు సృంజయ యదు విదర్భ కుంతి నరేంద్రుల్
పరమానందముఁ బొందిరి, ధరణీశులలోన గాఢ తాత్పర్యములన్. 1782

క. హరి యీ తెఱఁగున రుక్మిణి, నరుదుగఁ గొనివచ్చి పెండ్లియాడుట విని దు
ష్కరకృత్య మనుచు వెఱఁ గం, దిరి రాజులు రాజసుతులు దిక్కుల నెల్లన్.

ఆ. అనఘ ! యాదిలక్ష్మి యైన రుక్మిణితోడఁ
గ్రీడ సలుపుచున్న కృష్ణుఁ జూచి
పట్టణంబులోని ప్రజ [1]ఉల్లసిల్లిరి
ప్రీతు లగుచు ముక్త భీతు లగుచు. 1784

వ. అని చెప్పి. 1785

క. కువలయ రక్షాతత్పర ! కువలయదళ నీలవర్ణ కోమలదేహా !
కువలయనాథ శిరోమణి ! కువలయజన వినుత విమలగుణ సంఘాతా ! 1786

మాలిని. సరసిజనిభ హస్తా ! సర్వలోక ప్రశస్తా !
నిరుపమ శుభమూర్తీ ! నిర్మలారూఢ కీర్తీ !
పరహృదయ విదారీ ! భక్త లోకోపకారీ !
గురు బుధజన పోషీ ! ఘోర దైతేయ శోషీ ! 1787

గద్య. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీ మహాభాగవతం బను మహాపురాణమునందు దేవకీదేవి వివాహంబును, గగనవాణీ శ్రవణంబును, కంసోద్రేకంబును, వసుదేవ ప్రార్థనంబును, యోగమాయా ప్రభావంబును,

---

1. ఉల్లసించిరి (హ)

బలభద్రుని జన్మంబును, బ్రహ్మాది సుర స్తోత్రంబును, కృష్ణావతారంబును, ఘోష ప్రవేశంబును, యోగనిద్రా చరితంబును, నంద పుత్రోత్సవంబును, పూతనా సంహారంబును, శకటభంజనంబును, తృణావర్తు మరణంబును, గర్గాగమనంబును, నారాయణాది నామనిర్దేశంబును, బాలక్రీడయును, మృద్భక్షణంబును, వాసుదేవ వదనగహ్వర [1]విలోక్య మా నాఖిల లోకాలోకనంబును, నవనీత చౌర్యంబును, యశోదారోషంబును, ఉలూఖలబంధనంబును, అర్జునతరు యుగళ నిపాతనంబును, నలకూబర మణిగ్రీవుల శాపమోక్షణంబును, బృందావన గమనంబును, వత్సపాలనంబును, వత్సాసుర వధయును, బకదనుజ విదారణంబును, అఘాసుర మరణంబును, వత్సాపహారణంబును, నూతనవత్సబాలక కల్పనంబును, బ్రహ్మవినుతియు, [2]గోపాలనంబును, గార్దభాసుర దమనంబును, కాళియఫణి మర్దనంబును, గరుడ కాళియనాగ విరోధకథనంబును, ప్రలంబాసుర హింసనంబును, దవానల పానంబును, వర్షర్తు వర్ణనంబును, శరత్కాల లక్షణంబును, వేణువిలాసంబును, హేమంతసమయ సమాగమంబును, గోపకన్యా చరిత హావిష్య వ్రతంబును, కాత్యాయనీ సేవనంబును, వల్లవీ వస్త్రాపహారణంబును, విప్రపత్నీ దత్తాన్న భోజనంబును, ఇంద్రయాగ నివారణంబును, నంద ముకుంద సంవాదంబును, పర్వతభంజనంబును, పాషాణసలిల వర్షంబును, గోవర్ధనోద్ధరణంబును, వరుణకింకరుండు నందునిం గొనిపోయిన హరి దెచ్చుటయును, వేణుపూరణంబును, గోపికాజన ఘోషనిర్గమనంబును, యమునాతీర వనవిహారణంబును, కృష్ణాంతర్ధానంబును, ఘోషకామినీ గణ పరిదేవనంబును, గోపికాన్వేషణంబును, గోపికాగీతలును, హరిప్రసన్నతయును, రాసక్రీడనంబును, జలకేళియును, సర్పరూపకుం డయిన సుదర్శనవిద్యాధరుండు హరిచరణ తాడనంబున నిజరూపంబు వడయుటయును, శంఖచూడుం డను గుహ్యకుని వధించుటయును, వృషభాసుర విదళనంబును, నారదోపదేశంబున హరి జన్మకథ నెఱింగి కంసుండు దేవకీవసుదేవుల బద్ధులం జేయుటయును, ఘోటకాసురుం డయిన కేశి యను దనుజుని వధించుటయును, నారదస్తుతియును, వ్యోమదానవ మరణంబును, అక్రూరాగమనంబును, అక్రూర రామ కృష్ణుల సల్లాపంబును, ఘోషనిర్గమంబును, యమునా జలాంతరాళంబున నక్రూరుండు హరి విశ్వరూపమును గాంచుటయును, అక్రూర స్తవంబును, మథురానగర ప్రవేశంబును, రజకవధయును, వాయకమాలికులచే సమ్మాన

1. విలోక్యమాన చరాచర సమస్త లోక విలోకనంబును(తం.వా.) 2. గోపాలకత్వంబును(హ)

మొందుటయును, కుబ్జా ప్రసాదకరణంబును, ధనుర్భంగంబును, కంసు దుస్స్వప్నంబును, కువలయాపీడ పీడనంబును, రంగస్థల ప్రవేశంబును, చాణూర ముష్టికుల వధయును, కంసవధయును, వసుదేవదేవకీ బంధమోక్షణంబును, ఉగ్రసేను రాజ్యస్థాపనంబును, రామకృష్ణులు సాందీపనివలన విద్య లభ్యసించుట యును, సంయమినీ నగరగమనంబును, గురుపుత్ర దానంబును, ఉద్ధవుని ఘోషయాత్రయును, భ్రమరగీతలును, కుబ్జావాస గమనంబును, కరినగరంబు నకు నక్రూరుండు సని కుంతీదేవి నూరార్చుటయును, కంసభార్య లగు నస్తి ప్రాప్తులు జరాసంధునకుఁ గంసు మరణం బెఱింగించుటయును, జరాసంధుని దండయాత్రయును, మథురానగర నిరోధనంబును, యుద్ధంబున జరాసం ధుండు సప్తదశవారంబులు పలాయితుం డగుటయును,నారద ప్రేరితుం డై కాలయవనుండు మథురపై దాడివెడలుటయును, ద్వారకానగర నిర్మాణం బును, మథురాపుర నివాసులం దన యోగబలంబున హరి ద్వారకానగరంబు నకుఁ దెచ్చుటయును, కాలయవనుండు హరివెంటం జని, గిరిగుహయందు నిద్రితుం డైన ముచుకుందుని కోపదృష్టివలన నీ అగుటయును, ముచుకుందుఁడు హరిని సంస్తుతిచేసి, తపంబునకుం జనుటయును, జరాసంధుండు గ్రమ్మఱ రామకృష్ణులపై నేతెంచుటయును, ప్రవర్షణ పర్వతారోహణంబును, గిరిదహ నంబును, గిరి డిగ్గ నుఱికి రామకృష్ణులు ద్వారకకుం జనుటయు, రుక్మిణీ జన్మంబును, రుక్మిణీ సందేశంబును, వాసుదేవాగమనంబును, రుక్మిణీగ్రహణం బును, రాజలోక పలాయనంబును, రుక్మి యను వాని భంగంబును, రుక్మిణీ కల్యాణంబును, నను కథలుగల దశమస్కంధంబునందుఁ బూర్వభాగము సంపూర్ణము.

ఓమ్

# శ్రీ మహా భాగవతము

←→

## దశమస్కంధము

## ఉత్తర భాగము

### —: ప్రద్యుమ్నోపాఖ్యానము :—

క. శ్రీకర! పరిశోషిత ర, త్నాకర! కమనీయ గుణగణాకర! కారు
ణ్యాకర! భీకర శరధా, రాకంపిత దానవేంద్ర! రామనరేంద్రా! 1

అధ్యాయము - ౫౫

వ. మహనీయ గుణగరిష్ఠు లగు న మ్మునిశ్రేష్ఠులకు, నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం డైన సూతుం డి ట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షి న్నరేంద్రుండు రుక్మిణీ పరిణయానంతరంబున నైన కథావృత్తాంతం బంతయు వినిపింపు మనిన, శుకయోగీంద్రుం డి ట్లనియె. 2

ఉ. తామరసాక్షు నంశమున దర్పకుఁ డీశ్వరు కంటిమంటలన్
దా మును దగ్ధుఁ డై పిదపఁ దత్పరమేశుని దేహలబ్ధి కై
వేమఱు నిష్ఠఁజేసి హరివీర్యమునం బ్రభవించె రుక్మిణీ
కామినిగర్భమం దసురఖండను మాఱటమూర్తియో యనన్. 3

వ. అంత నా డింభకుండు, ప్రద్యుమ్నుం డనుపేర విఖ్యాతుం డయ్యె. ఆ శిశువు సూతికాగృహంబునం దల్లి పొదిఁగిట నుండం, దనకు శత్రుం డని యెఱింగి, శంబరుం డను రాక్షసుండు, తన మాయాబలంబునం గామరూపి యై వచ్చి, కొనిపోయి, సముద్రంబులో వైచి, తన గృహంబునకుం జనియె. అంత నా బాలకుండు, జలధిజలంబునం దిగంబడ, నొడిసి, యొక మహామీనంబు మ్రింగె. అందు. 4

క. జాలిఁబడి పాఱు జలచర, జాలంబులఁ బోవనీక చని రోషాగ్ని
జ్వాలలు నిగుడఁగ నూరక, జాలంబుల వైచి పట్టు జాలరు లంతన్. 5

వ. సముద్రంబులోన నా మీనంబును, దత్సహచరంబు లైన మీనంబులనుం బట్టుకొని, తెచ్చి, శంబరునకుం గానుకగా నిచ్చిన, నతండు వండి తెం డని, మహానసగృహం బునకుం బంచిన. 6

క. రాజనగరి [1]యడబాలలు, రాజీవము కడుపు వ్రచ్చి రాజనిభాస్యున్
రాజశిశువుఁ గని చెప్పిరి, రాజీవదళాక్షి యైన రతికి నరేంద్రా! 7

వ. అంత, నారదుండు వచ్చి, బాలకుని జన్మంబును, శంబరోద్యోగంబును, మీనోదర ప్రవేశంబునుం జెప్పిన విని, యా రతి, మాయావతి యను పేర శంబరునియింటఁ బాతివ్రత్యంబు నడపుచు, దహనదగ్ధుం డైన తన పెనిమిటి శరీరధారణంబు సేయుట కెదురు చూచుచున్నయది గావున, న య్యర్భకుండు కందర్పుం డని తెలిసి, మెల్లన పుత్రార్థిని యైన తెఱంగున, శంబరుని యనుమతి వడసి, సూప కారులయొద్ద నున్న పాపనిం దెచ్చి పోషింపుచుండె. ఆకుమారుండును, శీఘ్ర కాలంబున నారూఢయౌవనుం డై. 8

క. సుందర మగు తన రూపము, సుందరు లోకమాఱు దేఱిచూచినఁ జాలున్
సౌందర్య మేమి చెప్పను, పొందెద మని డాయ బుద్ధిఁ బుట్టించు నృపా! 9

సీ. చక్కనివారల చక్కఁదనంబున కుపమింప నెవ్వఁడు యోగ్యుఁ డయ్యె
మిక్కిలి తపమున మెఱయు నంబికకు నై శంకరు నెవ్వఁడు సగము సేసె
బ్రహ్మత్వమును బొంది పరఁగు విధాతను వాణికై యెవ్వఁడు వాఁడి చెఱిచె
వేయు డాఁగులతోడి విబుధలోకేశుని మూర్తికి నెవ్వఁడు మూల మయ్యె

తే. మునులతాలిమి కెవ్వఁడు ముల్లుసూపు
మగల మగువల నెవ్వఁడు మరులుకొలుపు
కుసుమధనువున నెవ్వఁడు గొను విజయము
చిగురువాలున నెవ్వండు చిక్కుపఱుచు. 10

వ. అని తన్ను లోకులు వినుతించు ప్రభావంబులు గలిగి, పద్మదళలోచనుండును, ప్రలంబబాహుండును, జగన్మోహనాకారుండును నైన పంచబాణునిం గని, లజ్జా హాస గర్భితంబు లైన చూపులం జూచుచు, మాయావతి సురతభ్రాంతిఁ జేసినం జూచి, ప్రద్యుమ్నుఁ డి ట్లనియె. 11

మత్తకోకిల. నా తనూభవుఁ డీత డంచును నాన యించుక లేక యో
మాత ! నీ విది యేమి? నీ విటు మాతృభావము మాని సం
ప్రీతిఁ గాముకిభంగిఁ జేసెదు పెక్కు విభ్రమముల్ మహో
ఖ్యాతవృత్తికి నీకు ధర్మము గాదు మోహము సేయఁగాన్. 12

---

1. యెడబాలురు (హ)

వ. అనిన రతి యి ట్లనియె. నీవు నారాయణనందనుండ వైన కందర్పుండవు. పూర్వ కాలంబున నేను నీ భార్య నైన రతిని. నీవు శిశువ వై యుండ, నిర్దయుం డై, దొంగిలి, తల్లిఁ దొలఁగఁజేసి, శంబరుండు గొనివచ్చి నిన్ను నీరధిలో వైచిన, నొక్క మీనంబు మ్రింగె.మీనోదరంబు వెడలి తీవు. మీఁదటికార్యం బాకర్ణింపుము.

క. మాయావి వీఁడు దుర్మతి, మాయఁడు సంగరములం దమర్త్యుల గెలుచున్
మాయకరణమున వీనిఁ, మాయింపుము మోహనాది మాయలచేతన్. 14

మత్తకోకిల. పాపకర్ముఁడు వీఁడు ని న్నిటుఁ బట్టి తెచ్చిన లేచి నా
పాపఁ డెక్కడఁ బోయెనో సుతుఁ బాపితే విధి యంచుఁ దాఁ
గ్రేపుఁ బాసిన గోవుభంగిని ఖిన్న యై పడి గాఢ సం
తాప యై నిను నోఁచి కాంచిన తల్లి కుయ్యిడ కుండునే. 15

వ. అని పలికి మాయావతి మహానుభావుం డైన ప్రద్యుమ్మునికి సర్వ శత్రుమాయా వినాశిని యగు మహామాయావిద్య నుపదేశించె. ఇ విధ్వంబున. 16

మ. గురు మాయారణ వేది యై కవచి యై కోదండి యై బాణి యై
హరిజుం డోరి! నిశాట! వై చితివి నాఁ డంభోనిధిఁ నన్ను ఘో
రరణాంభోనిధి వైతు నిన్ను నిదె లే ర మ్మంచుఁ జీరెన్ మనో
హర దివ్యాంబరు నుల్లస ద్దనుజసేనా డంబరుఁ శంబరున్. 17

చ. అదలిచి యిట్లు కృష్ణసుతుఁ డాడిన నిష్ఠుర భాషణంబులఁ
బదహతిమై వడిం గవయు పన్నగరాజముఁ బోలి శంబరుం
డదరుచు లేచి వచ్చి గద నచ్యుతనందను ప్రేసె నుజ్జ్వల
ద్భిదుర కఠోరఘోష సమ భీషణ నాదము చేసి యార్చుచుఁ. 18

క. దనుజేంద్రుఁడు ప్రేసిన గదఁ, దనగదచేఁ బాయనడిచి దనుజులు బెదరఁ
దనుజాంతకుని కుమారుఁడు, దనుజేశునిమీఁద నార్చి తన గద వైచెఁ. 19

వ. అంత నా రక్కసుండు, వెక్కసం బగు రోషంబునఁ, దనకుఁ దొల్లి మయుం డెఱింగించిన దై తేయమాయ నాశ్రయించి, మింటికి నెగసి, పంచబాణునిపై బాణవర్షంబు గురిసిన; న మ్మహారథుండు నొచ్చియు, సంచలింపక, మచ్చరంబున సర్వమాయా వినాశిని యైన సాత్త్వికమాయం బ్రయోగించి, దనుజుని బాణ వర్షంబు నివారించె. మఱియు, వాఁడు భుజగ గుహ్యక పిశాచమాయలు పన్ని నొప్పించిన, నన్నియుఁ దప్పించి, 20

క. దండధరమూర్తిఁ గై కొని, యొం డాడక చక్రసూనుఁ డుగ్రతరాసిఁ
ఖండించె శంబరుని తలఁ, గుండల కోటీరమణులు కుంభిని రాలఁ. 21

క. చిగురా కడిదపు ధారల, జగములఁ బరవశము సేయు చలపాదికి దొ
డ్డగు నుక్కడిదంబునఁ దన, పగతుం దెగ వ్రేయు టెంతపని చింతింపన్. 22

క. బెగడుచు నుండక శంబరుఁ, దెగడుచుఁ బూవింటిజోదు ధీరగుణంబుల్
పొగడుచుఁ గురిసిరి ముదమున, నెగడుచుఁ గుసుమముల ముసురు నిర్జరు లధిపా!

—: రతీదేవి ప్రద్యుమ్నసహిత యై గగనమార్గంబున ద్వారకకుఁ బోవుట :—

వ. ఇట్లు శంబరుని వధియించి, విలసిల్లుచున్న యించువిలుకానిం గొంచు, నాకాశ
చారిణి యై. యా రతీదేవి, గగనపథంబు వట్టి, ద్వారకా నగరోపరిభాగంబునం
జనుదెంచిన. 24

ఆ. మెఱుపుఁదీఁగెతోడి మేఘంబు కై వడి
యువిదతోడ మింటనుండి కదలి
యరుగుదెంచె మదనుఁ డంగనా జనములు
మెలఁగుచున్న లోనిమేడకడకు. 25

మ. జలదశ్యాముఁ బ్రలంబ బాహు యుగళున్ జంద్రాననున్ నీల సం
కుల వక్రాలకుఁ బీతవాసు ఘనవక్షున్ సింహమధ్యున్ మహో
త్పల పత్రేక్షణు మందహాస లలితుం బంచాయుధున్ నీరజా
క్షులు దా [2]రేమఱిపాటఁ జూచి హరియంచుం డాఁగి ర య్యై యెడన్. 26

క. కొందఱు హరి యగు నందురు, కొందఱు చిహ్నములు గొన్ని కొన్ని హరికి లే
వందురు మెల్లనె తెలియుద, మందురు మఱుఁ జూచి కొంద ఱబలలు గము లై.

క. హరి యని ఫెనుచని పిదపను, హరిఁ బోలెడువాఁడు కాని హరి కాఁ డనుచున్
హరిమధ్య లల్లనల్లన, హరినందనుఁ డాయవచ్చి రాశ్చర్యములన్. 28

ఉ. అన్నులు సేరవచ్చి మరు నందఱు చూడఁగ దాను వచ్చి సం
పన్న గుణాభిరామ హరి పట్టపుదేవి విదర్భపుత్రి గ్రేఁ
గన్నుల నా కుమారకుని కై వడి నేర్పడఁ జూచి బోఁటితోఁ
జన్నులు చేప ని ట్లనియె సంభ్రమ దైన్యము లుల్లసిల్లఁగన్.

శా. ఈ కంజేక్షణుఁ డీ కుమారతిలకుం డీ యిందుబింబాననుం
డీ కంఠీరవమధ్యుఁ డిచ్చటికి నేఁ డెందుండి యేతెంచెనో
యీ కల్యాణునిఁ గన్న భాగ్యవతి ము న్నే నోములన్ నోఁచెనో
యే కాంతామణియందు [3]వీఁగి కనెనో యే కాంతుఁ డీ కాంతునిన్. 30

---

1. శతములు (క-బ.) 2. ఏమఱుపాటు (వా.) ఏమఱిపాటు (తం.); 3. వీని (హ)

శా. ఆళీ ! నా తొలిచూలు బిడ్డనికిఁ బోర్కాడించి నే సూతికా
శాలామధ్య విశాల తల్పగత నై చన్నిచ్చి నిద్రింప నా
బాలుణ్ణ నాచనుఁ బాలకుం జెటిచి యే పాపాత్ము లే త్రోవ ము
న్నే లీలం గొనిపోయిరో శిశువుఁ దా నే తల్లి రక్షించెనో. 31

క. కొడుకఁడు నా పొదిఁగిటిలోఁ, జెడిపోయిన నాఁటనుండి చెలియా ! తెలియం
బడ దే వార్త్తయు నతఁ డే, నలువున నెచ్చోట నిలిచి వర్త్తించె [1]నొకో ! 32

క. ఇందాఁక వాఁడు బ్రతికిన, సందేహము లేదు దేహ చాతుర్య వయ
స్సౌందర్యంబున లోకులు, వందింపఁగ నితనియంతవాఁ డగుఁ జుమ్మీ. 33

మ. అతివా ! సిద్ధము నాఁటి బాలకుని కి య్యాకార మీ వర్ణ మీ
[2]గతి యీహాస విలోకన స్వరము లీ గాంభీర్య మీ కాంతి వీఁ
డతఁడే కాఁదగు నున్నవారలకు నా యాత్మేశు సారూప్య సం
గతి సిద్ధింపదు వీనియందు మిగులం గౌతూహలం బయ్యెడిణ్ణ. 34

క. పొదలెడి ముదమునఁ జిత్తము, గదలెడి నా యెడమమూఁపు గన్నులవెంటణ్ణ
[3]బ్రిదిలెడి నానందాశ్రులు, మెదలెడిఁ బాలిండ్లఁ బాలు మే లయ్యెడినో. 35

వ. అని డోలాయమాన మానస యై వితర్కింపుచు. 36

క. తనయుఁ డని నొడువఁ దలఁచును, దనయుఁడు గాకున్న మిగులఁ దతిగొని సవతుల్
తను నగియెద రని [4]తలఁచు న, తనుసంశయ [5]మలమికొనఁగఁ దనుమధ్య మదిణ్ణ.

వ. ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ, లోపలినగరి కావలివారివలన విని, కృష్ణుండు దేవకీవసుదేవులఁ దోడ్కొని చనుదెంచి, సర్వజ్ఞుఁ డయ్యు నేమియు వివరింపక యూరకుండె. అంత నారదుండు చనుదెంచి, శంబరుండు కుమారునిం గొనిపోవుట మొదలైన వార్త లెటింగించిన. 38

క. చచ్చిన బాలుఁడు గ్రమ్మఱ, వచ్చినక్రియ వచ్చెఁ బెక్కు వర్షములకు నీ
సచ్చరితు నేఁడు గంటిమి, చెచ్చెర ము న్నెట్టితపము సేయంబడెనో. 39

వ. అని యంతఃపురకాంతలును, దేవకీ వసుదేవ రామకృష్ణులును, యథోచితక్రమం బున నా దంపతుల దివ్యాంబరాభరణాలంకృతుల సత్కరించి, సంతోషించిరి. రుక్మిణీదేవియు నందనుఁ గౌఁగిలించుకొని. 40

1. వర్త్తించెడినో (తం. వా.); వర్ధిల్లెడునో (వ.) 2. గతిహాసంబు (హ.) 3. బొదలెడి (హ.)
4. తలచును తనుసంశయ (క. ట. ద. వ) 5. మెలమి (హ.)

శా. అన్నా! నా చనుఁ బాపి నిన్ను దనుజుం డంభోనిధిన్ వైచెనే
యెన్నే వర్షము లయ్యెఁ బాసి సుత! నీ వేరీతి జీవించి యే
సన్నాహంబున శత్రు [1]గెల్చితివొ యాశ్చర్యంబు సంధిల్లెడిన్
నిన్నుం గాంచితి నింతకాలమునకున్ నే ధన్యతన్ జెందితిన్. 41

వ. అని కొడుకుం జూచి, సంతోషించి, కోడలిగుణంబులు కైవారంబు చేసి, వినోదింపుచుండె. అంత ద్వారకానగరంబు ప్రజలు విని హర్షించిరి. అందు. 42

క. సిరిపెనిమిటి పుత్రకుఁ డగు, మరుఁ గని హరిఁ జూచినట్లు మాతలు దమలో
గరఁగుదు రఁట పరకాంతలు, మరుఁ గని మోహాంధకార మగ్నులు గారే. 43

## అధ్యాయము - ౫౬

### —: శ్రీకృష్ణుండు లోకాపవాద నివృత్తికొఱకు - స్యమంతకమణినిఁ దెచ్చుట :—

వ. అని చెప్పి శుకుం డిట్లనియె. 44

క. సత్రాజిత్తు నిశాచర, శత్రునకుం గీడుసేసి సద్వినయముతోఁ
బుత్రి స్యమంతకమణియును, మైత్రిం గొనితెచ్చి యిచ్చె మనుజాధీశా! 45

వ. అనిన విని రా జిట్లనియె. 46

ఆ. శౌరి కేమి తప్పు [2]సలిపె సత్రాజిత్తు
కూఁతు మణియు నేల కోరి యిచ్చె
నతని కెట్లు గలిగె నా స్యమంతకమణి
విప్రముఖ్య! నాకు విస్తరింపు. 47

వ. అనిన విని, శుకయోగివర్యుం డిట్లనియె. సత్రాజిత్తనువాఁడు సూర్యునకు భక్తుం డై, చెలిమిసేయ, నతనివలన సంతసించి, సూర్యుండు స్యమంతకమణి నిచ్చె. ఆ మణి కంఠంబున ధరియించి, సత్రాజిత్తుండు భాస్కరునిభంగి భాసమానుం డై, ద్వారకానగరంబునకు వచ్చిన, దూరంబున నతనిం జూచి, జనులు మణిప్రభా పటల [3]తిరోహిత దృష్టు లై, సూర్యుం డని శంకించి వచ్చి, హరి కి ట్లనిరి. 48

క. నారాయణ! దామోదర!, నీరజదళనేత్ర! చక్రి! నిఖిలేశ! గదా
[4]ధారణ! గోవింద! నమ, స్కారము యదుపుత్ర! నిత్యకల్యాణ [5]నిధీ! 49

---

1. గెల్చితివి (హ.); 2. సేసె (హ.) సత్రాజితుఁడుసేసె (తం. వా.) 3. ప్రభాపటల తేజోహృతదృష్టులై (తం. వా.) 4. ధారి (వ్రా. ప్ర.) 5. హరి (హ.)

మ. దివిజాధీశ్వరు లిచ్చగింతురు గదా దేవేశ! నిన్ జూడ యా
దవవంశంబున గూఢమూర్తివి [1]జగత్త్రాణుండ వై యుండఁగా
భవదీ యాకృతిఁ జూడ నేఁ డదె రుచిప్రచ్ఛన్న దిగ్భాగుఁ డై
రవియో నీరజగర్భుఁడో యొకఁడు చేరన్ వచ్చె మార్గంబునన్. 50

వ. అని యిట్లు పలికిన మూఢజనులం జూచి, గోవిందుండు నగి, మణిసమేతుం డైన సత్రాజిత్తుండు గాని, సూర్యుండు గాఁ డని పలికె. అంత సత్రాజిత్తుండు, శ్రీయుతం బై, మంగళాచార సంచారం బైన తన గృహంబునకుం జని, మహీసురులచేత నిజ దేవతామందిరంబున, న మ్మణి శ్రేష్ఠంబుఁ బ్రవేశింపఁ జేయించె. అది ప్రతిదినంబును, నెనిమిదిబారువుల సువర్ణం బొసంగుచుండు. 51

క. ఏ రా జేలెడు వసుమతి, నా రత్నము పూజ్యమాన మగు నక్కడ రో
గారిష్ట సర్వమాయిక, మారీ దుర్భిక్షభయము మాను నరేంద్రా! 52

క. అ మ్మణి యాదవ విభునకు, నిమ్మని హరి యడుగ నాతఁ డీక ధనేచ్ఛన్
బొమ్మని పలికెను జక్రికి, ని మ్మణి యాకున్న మీఁద నేమౌ ననుచున్. 53

వ. అంత. 54

చ. అడరెడు వేడ్కఁ గంఠమున న మ్మణిఁ దాల్చి ప్రసేనుఁ డొక్కనాఁ
డడవికి ఘోర వన్య మృగయారతి నేఁగిన వానిఁ జంపి పైఁ
బడి మణిఁ గొంచు నొక్కహరి పాఱఁగ దాని వధించి డాసి యే
ర్పడఁ [2]గనె జాంబవంతుఁడు ప్రభాత్త దిగంతము నా స్యమంతమున్. 55

క. కని జాంబవంతుఁ డా మణిఁ, గొనిపోయి సమీప శైలగుహఁ జొచ్చి ముదం
బునఁ దన కూరిమి [3]సుతునకు, ఘన కేళీకందుకంబుగాఁ జేసె నృపా! 56

వ. అంత సత్రాజిత్తుండు తన సహోదరుం డైన ప్రసేనునిం గానక దుఃఖించుచు. 57

మ. మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మావాఁడు వర్తింపఁగా
మణికై పట్టి వధించినాఁడు హరికిన్ మర్యాద లే దంచు దూ
షణముం జేయఁగ వాని దూషణముఁ గంసధ్వంసి యాలించి యే
వ్రణమున్ నాయెడ లేదు నింద గలిగెన్ వారించు టేరీతియో. 58

వ. అని వితర్కించి. 59

---

1. జగత్ప్రాణుండ (హ.) 2. ఁగను (హ.) 3. సుతకును (హ. తం. వా.)

మ. తనవా రెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపన్ దర్శించుచున్ వచ్చి త
ద్వనవీథిం గనె నేలఁ గూలిన మహాశ్వంబున్ బ్రసేనుం బ్రసే
నుని హింసించిన సింహమున్ మృగపతిన్ నొప్పించి ఖండించి యేఁ
గిన భల్లూకము చొచ్చియున్న గుహయుం గృష్ణుండు రోచిష్ణుఁ డై 60

వ. కని తన వెంటనంటి వచ్చిన ప్రజల నెల్ల గుహాముఖంబున విడిచి, సాహసంబున మహానుభావుం డైన హరి, నిరంతర నీరంధ్ర నిబిడాంధకార బంధురం బై, భయంకరం బై, విశాలం బైన గుహాంతరాళంబు సొచ్చి, చని, యక్కడ నొక్క [1]బాలున కెదుర దర్శనీయ కేళీకందుకంబుగా వ్రేలంగట్టిన య మ్మణి శ్రేష్ఠంబుఁ గని హరింప నిచ్ఛయించి. 61

క. మెల్లనె పదము లిడుచు యదు, వల్లభుఁ డా [2]శిశువుకడకు వచ్చిన గుండెల్
జల్లనఁగఁ జూచి కంపము, మొల్లంబుగ [3]వానిదాది మొఱవెట్టె నృపా! 62

వ. అంత నా ధ్వని విని, బలవంతుం డైన జాంబవంతుండు వచ్చి, తనస్వామి యని కృష్ణు నెఱుంగక, ప్రాకృతపురుషుం డని తలంచి, కృష్ణునితో రణంబుచేసె. అందు. 63

క. పలలమునకుఁ బోరెడు డే, గల క్రియ శస్త్రములఁ దరులఁ గరముల విజయే
చ్ఛల నిరువది యెనిమిది దిన, ములు వోరిరి నగచరేంద్ర ముఖ్యుఁడు హరియున్.

క. అడిదములఁ దరులు విఱిగిన, బెడిదము లగు మగతనములఁ బిఱుతివక వడిన్
[4]బిడుగుల వడువున వడియెడి, [5]పిడికిటి పోటులను గలన బెరసి రిరువురున్. 65

శా. స్పష్టాహంకృతు లుల్లసిల్ల హరియున్ భల్లూకలోకేశుఁడున్
ముష్టాముష్టి నహర్నిశంబు జయ సమ్మోహంబులం బోరుచోఁ
బుష్టిం బాసి ముకుంద ముష్టి హతులన్ బూర్ణ శ్రమోపేతుఁ డై
పిష్టాం [6]గోరు శరీరుఁ డై యతఁడు దా భీతాత్ముఁ డై యిట్లనెన్. 66

వ. దేవా! నిన్నుఁ బురాణపురుషు నధీశ్వరుం డైన విష్ణుంగా నెఱుంగుదు. సర్వభూతంబులకుం బ్రాణ ప్రతాప ధైర్య బలంబులు నీవ. విశ్వంబునకు సర్గ స్థితి లయంబుల నెవ్వ రాచరింతురు, వారికి సర్గ స్థితి లయంబులు సేయు నీశ్వరుండవు నీవ. ఆత్మకుం బరమాత్మవు నీవ. అని మఱియును. 67

---

1. బాలికకెదుర (హ. తం. వా.); బాలునకెదురుగ (గ. ట.) 2. బాలకడకు (హ.)
3. దానిదాది (హ. తం. వా.) 4. బడుగుల (హ.) 5. పిడికిటఁ బొడుచుటలు గలన (హ.)
6. పిష్టాంసోరు (వా.); పిష్టాకార (ట.)

సీ. బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి నింకించి బంధించి యేపుమాపెఁ
బరఁగ నెవ్వఁడు ప్రతాప ప్రభారాశిచే దానవ గర్వాంధతమస మణఁచెఁ
గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వఁడు దశకంఠు కంఠ బృందములు ద్రుంచె
నాచంద్రసూర్యమై యమరు లంకారాజ్యమునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె

తే. నన్ను నేలిన లోకాధినాథుఁ డెవ్వఁ
డంచితోదార కరుణారసాబ్ధి యెవ్వఁ
డాతఁడవు నీవకావె మహాత్మ! నేఁడు
మాఱుపడి యెగ్గుఁ జేసితి మఱవవలయు. 68

వ. అని యిట్లు పరమభక్తుం డైన జాంబవంతుండు వినుతించిన, నతని శరీరనిగ్రహ నివారణంబుగా భక్తవత్సలుం డయిన హరి, తనకరంబున నతనిశరీరంబు నిమిరి, మేఘగంభీర భాషణంబుల నిట్లనియె. 69

క. ఈ మణి మాచేఁ బడె నని, తామసు లొనరించు నింద దప్పెడు కొఱకై
నీ మందిర మగు బిలమున, కే మరుదెంచితిమి భల్లుకేశ్వర! వింటే. 70

వ. అనిన విని సంతసించి, జాంబవంతుండు మణియునుం, [1]దనకూఁతు జాంబవతి యను కన్యకామణియునుం దెచ్చి, హరికింగానుకగా సమర్పించె. అట మున్ను హరి వెంట వచ్చిన వారలు, బిలంబు వాకిటం బండ్రెండుదినంబులు హరిరాక కెదురు చూచి, వేసరి,వగచి,తమపురంబునకుం జనిరి. అంత దేవకీవసుదేవులును, రుక్మిణియు, మిత్ర బంధు జ్ఞాతిజనులును, గుహ సొచ్చి కృష్ణుండు [2]రాక చిక్కె నని శోకించి. 71

క. దుర్గమ మగు బిలమున హరి, నిర్గతుఁ డై చేరవలయు నేఁ డని పౌరుల్
వర్గము లై సేవించిరి, దుర్గ గ్గృత కుశలమార్గఁ దోషిత భర్గన్. 72

క. డోలాయిత మానసు లై, జాలిం బడి జనులు గొలువఁ జండిక పలికెన్
బాలామణితో మణితో, హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁ డనుచున్. 73

క. యత్నము సఫలం బైన స, పత్నసమూహములు బెగడఁ బద్మాక్షుం డా
రత్నముతోఁ గన్యాజన, రత్నముతోఁ బురికి వచ్చె రయమున నంతన్. 74

క. మృతుఁ డైనవాఁడు పున రా, గతుఁ డైన క్రియం దలంచి కన్యామణిసం
యుతుఁ డై వచ్చిన హరిఁ గని, వితతోత్సవ కౌతుకముల వెలసిరి పౌరుల్. 75

వ. ఇట్లు హరి తన పరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి, రాజసభకు సత్రాజిత్తుఁ బిలిపించి, యా వృత్తాంతం బంతయు నెఱింగించి, సత్రాజిత్తునకు మణి

1. త్రైలోక్యసుందరి యగు తన కూతు (క.) 2. రాఁడు చిక్కె (హ)

నిచ్చిన, నతండు సిగ్గువడి, మణిం బుచ్చుకొని, పశ్చాత్తాపంబు నొందుచు, బలవ
ద్విరోధంబునకు వెఱచుచు, నింటికిం జని. 76

క. పాపాత్ముల పాపములం, బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ
బాపము గల దని నొడివిన, పాపాత్ముని పాపమునకుఁ బారము గలదే. 77

మ. మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబుఁ జే
సితిఁ బాపాత్ముఁడ నర్థలోభుఁడను దుశ్చిత్తుండ మత్తుండ దు
ర్మతి నీ దేహము[1] గాల్పనే దురిత మే మార్గంబునన్ బాయు నే
గతిఁ గంసారి ప్రసన్నుఁ డై మనుచు నన్ గారుణ్యభావంబునన్. 78

ఆ. మణియుఁ గూఁతు నిచ్చి మాధవు పదములఁ
బట్టుకొంటి నేని బ్రతుకు గలదు
సంతసించు నతఁడు సదుపాయ మగు నిది
సత్య మితరవృత్తిఁ జక్కఁబడదు. 79

మ. అని యి బ్భంగి బహుప్రకారముల నేకాంతస్థుఁ డై యింటిలోఁ
దనబుద్ధిం బరికించి నీతి గని సత్రాజిత్తు సంప్రాప్త శో
భనుఁ డై యిచ్చె విపత్పయోధి తరికిన్ భామా మనోహారికిన్
దనుజాధీశ విదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్. 80

ఉ. తామరసాక్షుఁ డచ్యుతుఁ డుదార యశోనిధి పెండ్లియాడె నా
నా మనుజేంద్ర నందిత గుణస్థితి లక్షణ సత్యభామ ను
ద్దామ పతివ్రతాత్వ నయధర్మ విచక్షణతా దయా యశః
కామను సత్యభామను ముఖద్యుతి నిర్జిత సోమ నయ్యెడన్. 81

క. మణి యిచ్చినాఁడు వాసర, మణి నీకును మాకుఁ గలవు మణులు కుమారీ
మణి చాలు నంచుఁ గృష్ణుఁడు, మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్. 82

## అధ్యాయము - ౫౭

### —: శతధన్వుఁడు సత్రాజిత్తును జంపి మణి నపహరించుట :—

వ. అంత నక్కడ కుంతీసహితు లైన పాండవులు లాక్షాగారంబున దగ్ధు లైరని విని, నిఖిలార్థదర్శనుం డయ్యును గృష్ణుండు బలభద్ర సహితుం డై, కరినగరంబునకుం జని, కృప విదుర గాంధారీ భీష్మ ద్రోణులం గని, దుఃఖోపశమనంబులు[2] సేయు నయ్యెడ. 83

1. గాల్పనే (హ. తం. వా.) 2. శమనాలాపంబు లాడుచుండు నెడ (తం. వా.)

సీ. జగతీశ ! వినవయ్య ! శతధన్వుఁ బోడనుగని యక్రూర కృతవర్మ లాప్తవృత్తి
మన కిత్తు ననుచు సమ్మతిఁ జేసి తనకూఁతుఁ బద్మాక్షునకు నిచ్చి పాడి తప్పె
ఖలుఁడు సత్రాజిత్తు గడఁక నే క్రియ నైన మణి పుచ్చుకొనుము నీమతము మెఱసి
యని తన్నుఁ బ్రేరేఁప నా శతధన్వుఁడు పశువుఁ గటికివాఁడు పట్టిచంపు

ఆ. కరణి నిదురవోవఁ గడఁగి సత్రాజిత్తుఁ
బట్టి చంపి వాని భామలెల్ల
మొఱలు వెట్ట లోభమునఁ జేసి మణిఁ గొంచుఁ
జనియె నొక్కనాఁడు జనవరేణ్య! 84

వ. ఇట్లు హతుం డయిన తండ్రిం గని, శోకించి, సత్యభామ యతనిం దైలద్రోణి యందుఁ బెట్టించి, హస్తిపురంబునకుం జని, సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తు మరణంబు విన్నవించిన, హరియును, బలభద్రుండును నీశ్వరు లయ్యును, మనుష్య భావంబుల విలపించిరి. అంత బలభద్ర, సత్యభామా సహితుం డై హరి, ద్వారకా నగరంబునకు మరలి వచ్చి, శతధన్వుం జంపెద నని తలంచిన, నెఱింగి, శతధన్వుండు, ప్రాణభయంబునఁ గృతవర్మయింటికిం జని, తనకు సహాయుండవు గమ్మని పలికినఁ, గృతవర్మ యి ట్లనియె. 85

ఉ. అక్కట! రామకృష్ణులు మహాత్ములు వారల కెగ్గుసేయఁగా
నిక్కడ నెవ్వఁ డోపు విను మేర్పడఁ గంసుఁడు బంధుయుక్తుఁ డై
చిక్కఁడె మున్ను మాగధుఁడు సేనలతోఁ బదియేడు తోయముల్
దిక్కులఁ బాఱఁడే మనకు దృష్టము వారలలావు వింతయే. 86

వ. అని యుత్తరంబు సెప్పిన విని, శతధన్వుం డక్రూరుని యింటికిం జని, హరితోడి పగకుం దోడు రమ్మని చీరిన, నక్రూరుండు (హరి బలపరాక్రమ ధైర్య స్థైర్యంబు లుగ్గడించి.) మఱియు ని ట్లనియె. 87

సీ. ఎవ్వఁడు విశ్వంబు నెల్ల సలీలుఁ డై పుట్టించి రక్షించి పొలియఁ జేయు
నెవ్వనిచేష్టల నెఱుఁగరు బ్రహ్మాదు లెవ్వనిమాయ మోహించు భువన
మేడేండ్ల పాపఁ డై యేవిభుఁ డొకచేత గోరక్షణమునకై కొండ నెత్తె
నెవ్వఁడు కూటస్థుఁ డీశ్వరుఁ డద్భుత కర్ముఁ డనంతుఁడు కర్మసాక్షి

తే. యట్టి ఘనునకు శౌరికి ననవరతము
మ్రొక్కెదము గాక విద్వేషమునకు నేము
వెఱతు మొల్లము [1]నీపొందు వేగ పొమ్ము
చాలు పదివేలు వచ్చె నీ సఖ్యమునను. 88

వ. అని యి ట్లక్రూరుం డుత్తరంబు పలికిన, న మ్మహామణి నక్రూరు[2]నివద్ద నునిచి, వెఱచి, శతధన్వుండు తురగారూఢుండై, శతయోజన దూరంబు చనియె. అంత

1. నీ పొందు వెంటఁ బొమ్ము (తం. వా.) 2. నియొద్ద (వా.) నొద్ద (తం.)

గరుడకేతనాలంకృతం బైన తేరెక్కి, రామకృష్ణులు వెనుచనిరి. అంత నతండును మిథిలానగరంబుఁ జేరి, సమీపంబునందు. 89

చ. తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారి యై
పరువిడఁ బోకు పోకు మని పద్మదళాక్షుఁడు గూడఁబాటి భీ
కరగతి వాని మస్తకము ఖండిత మై పడ [1]వేసెఁ జక్రముం
బరిహృత దైత్యచక్రముఁ బ్రభాచయ మోదిత దేవశక్రమున్. 90

వ. ఇట్లు హరి శతధన్వుని వధియించి, వాని వస్త్రంబులందు మణి వెదకి, లేకుండుట దెలిసి, బలభద్రునికడకు వచ్చి, శతధన్వుం డూరక హతుం డయ్యె. [2]మణి లే దనిన, బలభద్రుం డి ట్లనియె. 91

సీ. ఆ మణి శతధన్వుఁ డపహరించుట నిక్క మెవ్వరిచే దాఁప నిచ్చినాఁడొ
వేగమ నీ వేఁగి వెదకుము పురిలోన వైదేహు దర్శింప వాంఛ గలదు
పోయివచ్చెద నీవు పొ మ్మని వీడ్కొన మెల్లన రాముండు మిథిలఁ జొచ్చి
పోయిన జనకుండు పొడగని హర్షించి యెంతయుఁ బ్రియముతో నెదురువచ్చి

తే. యర్ఘ్యపాద్యాది కృత్యంబు లాచరించి
యిచ్చవచ్చిన వస్తువు లెల్ల నిచ్చి
యుండు మని భక్తిఁ జేసిన నుండె ముసలి
కువలయేశ్వర ! మిథిలలోఁ గొన్ని యేండ్లు. 92

వ. అంత దుర్యోధనుండు, మిథిలానగరంబునకుం జనుదెంచి, జనకరాజుచేత సన్మానితుం డై. 93

క. చలమున గాంధారేయుఁడు, లలిత గదాయుద్ధ కౌశలము నేర్చెఁ దగన్
హలిచే శ్రితజన నిర్జర, ఫలిచేఁ ద్రైలోక్య వీరభటగణ బలిచేన్. 94

వ. అటఁ గృష్ణుండును, ద్వారకానగరంబునకుం జని, శతధన్వుని మరణంబును, మణి లేకుండుటయును, సత్యభామకుం జెప్పి, సత్యభామా ప్రియకరుండు గావున, సత్రాజిత్తునకుం బరలోక క్రియలు సేయించె. అక్రూర కృతవర్మలు శతధన్వు మరణంబు విని, వెఱచి, ద్వారకానగరంబు వెడలి, బహుయోజన దూర భూమికిం జనిరి. అక్రూరుండు లేమిం జేసి, వానలు లేక మహోత్పాతంబులును, శరీర మానస తాపంబులును, ద్వారకానగరవాసులకు సంభవించిన, నందుల వృద్ధజనులు బెగడి, హరి కి ట్లనిరి. 95

---

1. వ్రేసె (హ. తం. వా.) 2. వానిచేత మణిలేదనిన (త. వ.)

సీ. కమలాక్ష! వినవయ్య! కాశీశుఁ డేలెడి కుంభిని వానలు గురియకున్నఁ
గోరి శ్వఫల్కునిఁ గొనిపోయి యతనికిఁ [1]గాందిని యనియెడు కన్య నిచ్చి
కాశీవిభుండు సత్కారంబు సేసిన వానలు గురిసె నా వసుధమీఁద
నాతని పుత్రకుఁ డైన యక్రూరుండు నంతటివాఁడె మహాతపస్వి

ఆ. మరలి వచ్చెనేని మాను నుత్పాతంబు
లెల్ల వాన గురియు నీ స్థలమున
దేవ! యతనిఁదోడితెప్పింపు మన్నింపు
మానవలయు పీడ మానవులకు. 96

వ. అని పలుకు పెద్దలపలుకు లాకర్ణించి, దూతజనులను బంపి, కృష్ణుం డక్రూరుని రావించి, పూజించి, ప్రియకథలు గొన్ని చెప్పి, సకలలోకజ్ఞుఁడు గావున మృదు మధుర భాషణంబుల ని ట్లనియె. 97

సీ. తా నేఁగుతఱి శతధన్వుండు మణిఁ దెచ్చి నీ యింటఁ బెట్టుట నిజము తెలిసి
నాఁడ సత్రాజిత్తునకుఁ బుత్రకులు లేమి నతనికిఁ గార్యంబు లాచరించి
వి త్తంబు ఋణమును విభజించు కొనియెద రతని పుత్రిక లెల్ల నతఁడు పరుల
చేత దుర్మరణంబుఁ జెందినాఁ డతనికై సత్కర్మములు మీఁద జరుపవలయు

ఆ. మణిగ్రహింపు మీవు మాయన్న నను నమ్మఁ
డెలమి బంధుజనుల కెల్లఁ జూపు
మయ్య! నీగృహమున హాటక వేదికా
సహిత మఖము లమరు సంతతమును. 98

వ. అని యిట్లు సామవచనంబులు హరి పలికిన, నక్రూరుండు వస్త్రచ్ఛన్నం బైన మణిఁ దెచ్చి హరి కిచ్చిన. 99

ఉ. సంతస మంది బంధుజన [2]సన్నిధికిన్ హరి దెచ్చి చూపె న
శ్రాంత విభాసమాన ఘృణిజాల పలాయిత భూనభోంతర
ధ్వాంతము హేమభార చయ వర్షణ విస్మిత దేవ మానవ
స్వాంతముఁ గీర్తిపూరిత దిశా వలయాంతము నా స్యమంతమున్. 100

క. చక్రాయుధుఁ డీక్రియఁ దన, యక్రూరత్వంబు జనుల కందఱకును ని
ర్వక్రముగఁ దెలిపి క్రమ్మఱ, నక్రూరున కిచ్చె మణిఁ గృపాకలితుం డై. 101

క. ఘనుఁడు భగవంతుఁ డీశ్వరుఁ, డనఘుఁడు మణిఁ దెచ్చి యిచ్చి నట్టి కథనమున్
వినినఁ బఠించినఁ దలఁచిన, జనులకు దుర్యశముఁ బాపసంఘముఁ దలఁగున్. 102

---

1. గాదిని (క. చ. ట. త. వ.) 2. సంతతికిన్ (హ.)

## అధ్యాయము — ౫౮

## —: శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబున కరుగుదెంచుట :—

వ. అంత నొక్కనాఁడు పాండవులఁ జూడ నిచ్ఛయించి, సాత్యకిప్రముఖ యాదవులు గొలువఁ, బురుషోత్తముం డింద్రప్రస్థపురంబునకుం జనినవారు ప్రాణంబులం గనిన యింద్రియంబులభంగి, సకలేశ్వరుం డైన హరిం గని, కౌఁగిలించికొని, కృష్ణుని దివ్యదేహ సంగమంబున నిర్ధూత కల్మషు లై, యనురాగ హాస విభాసితం బైన ముకుంద ముఖారవిందంబును దర్శించి, యానందంబు నొందిరి. గోవిందుండును, యుధిష్ఠిర భీమసేనుల చరణంబులకు నభివందనంబు చేసి, యర్జును నాలింగనంబున సత్కరించి, నకుల సహదేవులు మ్రొక్కిన గ్రుచ్చియెత్తి, యుత్తమపీఠంబున నాసీనుం డై యుండ, నప్పుడు. 103

క. చంచ ద్ఘనకుచ భారా, కుంచిత యై క్రొత్త పెండ్లికూఁతు రగుట నిం
చించుక సిగ్గు జనింపఁగఁ, బాంచాలతనూజ మ్రొక్కెఁ బద్మాక్షునకున్. 104

వ. అంత సాత్యకి పాండవులచేతం బూజితుం డై, యొక్కపీఠంబున నాసీనుం డయ్యె. తక్కిన యనుచరులున్ వారిచేతఁ బూజితు లై కొలిచి యుండిరి. హరియుం గుంతీదేవికడకుం జని, నమస్కరించి, యి ట్లనియె. 105

క. అత్తా! కొడుకులుఁ గోడలుఁ, జిత్తానందముగఁ బనులు సేయఁగ నాత్మా
యత్తానుగ వై యాజ్ఞా, సత్తాదులు గలిగి మనుదె సమ్మోదమునన్. 106

చ. అనవుడుఁ బ్రేమ విహ్వలత నందుచు గద్గదభాషణంబులన్
గనుఁగవ నశ్రుతోయములు గ్రమ్మగఁ గుంతి సుయోధనుండు చే
సిన యపకారముం [1]దడవి చెందిన దుఃఖములెల్లఁ జెప్పి యా
దనుజవిరోధి కి ట్లనియెఁ దద్దయుఁ బెద్దఱికంబు సేయుచున్. 107

సీ. అన్న! నీ చుట్టాల నరయుదు మఱవవు నీవు పుత్తెంచిన నెమ్మితోడ
[2]మాయన్న యేతెంచి మముఁ జూచిపోయెను నిల్చియున్నారము నీ బలమున
నా పిన్నవాండ్రకు నాకు దిక్కెవ్వరు నేఁడాదిగా నింక నీవెకాక
యఖిలజంతువుల కీ వాత్మవు గావునఁ బరులు నావారని భ్రాంతిసేయ

తే. వయ్య! నాభాగ్య మెట్టిదో యనవరతముఁ
జిత్తమున నుండి కరుణ మా చిక్కులెల్లఁ
బాపుచుందువు గాదె యో పరమపుణ్య!
యదుకుమారవరేణ్య! బుధాగ్రగణ్య! 108

---

1. దలఁచి (తం. వా.) 2. అక్రూరుఁడు (వ్యాఖ్య)

వ. అనిన యుధిష్ఠిరుం డి ట్లనియె. 109

ఉ. పట్టఁగలేరు నిన్నుఁ దమ భావములందు సనందనాదు లే
పట్టున నైన నట్టి గుణభద్ర చరిత్రుఁడ వీవు నేఁడు మా
చుట్టమ వంచు వచ్చెదవు చూచెద వల్పుల మైన మమ్ము నే
మెట్టితపంబు చేసితి మధీశ్వర! పూర్వశరీర వేళలన్. 110

వ. అని ధర్మజుండు దన్నుఁ బ్రార్థించిన, నింద్రప్రస్థపురంబువారలకు నయనానందంబు సేయుచు, హరి గొన్ని నెలలు వసియించి యుండె. అం దొక్కనాఁడు. 111

మ. తురగశ్రేష్ఠము నెక్కి కంకట ధను స్తూణీ శరోపేతుఁ డై
హరితోడన్ వనభూమి కేఁగి విజయుం డాసక్తుఁ డై చంపె శం
బర శార్దూల తరక్షు శల్య చమరీ భల్లూక గంధర్వ కా
సర కంఠీరవ ఖడ్గ కోల హరిణీ సారంగ ముఖ్యంబులన్. 112

క. అచ్చోటఁ బవిత్రము లై, చచ్చిన మృగరాజి నెల్ల జననాథునకుం
[1]దెచ్చిరి పర్వము వచ్చినఁ, జెచ్చెర నరుఁ గొల్చియున్న సేవకు లధిపా! 113

—: సూర్యతనూజ యగు కాళిందిని గృష్ణుండు వరించుట :—

వ. అంత నర్జునుండు, [2]నీరువట్టు గొని డస్సిన, యమునకుం జని, య మ్మహారథు లయిన నరనారాయణు లందు వార్చి, జలంబులు ద్రావి, యొక్క పులిన ప్రదేశంబున నుండుచు. 114

ఉ. ఉపగతు లై నయట్టి పురుషోత్తమపార్థులు గాంచి రాపగా
విపుల విలోల నీలతర వీచికలందు శిరోజభార రు
చ్యపహాసి తాళిమాలిక నుదంచిత బాలశశి ప్రభాలికన్
దపనుని బాలికన్ మదన దర్పణతుల్య కపోలపాలికన్. 115

వ. కని యచ్యుతుండు పంచిన, వివ్వచ్చుండు చని, యా కన్య కి ట్లనియె. 116

మ. సుదతీ! యెవ్వరిదాన వేమి కొఱ కి చ్చోటన్ బ్రవర్తించె దె
య్యది నీ నామము కోర్కె యెట్టిది వివాహోత్కాంతుతోఁ గూడి యీ
నదికిన్ వచ్చినజాడ గానఁబడె ధన్యం బయ్యె నీ రాక నీ
యుదయాది స్థితి నెల్లఁ జెప్పు మబలా! యుద్య త్కురంగేక్షణా! 117

వ. అనిన నర్జునునకుఁ గాళింది యి ట్లనియె. 118

---

1. దెచ్చి యొసంగిరి మెచ్చుగఁ(తం.వా.)"తాన్నిన్యుః కింకరా రాజ్ఞే మేధ్యాన్ పర్వ ణ్యుపాగతే" (58-16) 2. నీరు దప్పిగొని డస్సి యమునకుం జనియె (హ.)

మ. నరవీరోత్తమ! యేను సూర్యునిసుతన్ నా పేరు కాళింది భా
స్కర సంకల్పిత [1]గేహమందు నదిలోఁ గంజాతు విష్ణుం బ్రభున్
వరుగాఁ గోరి తపంబు సేయుదు నొరున్ వాంఛింపఁ గృష్ణుండు వ
న్యరతిన్ వచ్చి వరించు నంచుఁ బలికెన్ నా తండ్రి నాతోడుతన్. 119

వ. అనిన విని, ధనంజయుం డా నీలవేణి పలుకులు హరికిం జెప్పిన, విని, సర్వజ్ఞుం డయిన హరియు, హరిమధ్యను రథంబుమీఁద నిడుకొని, ధర్మరాజుకడకుం జని, వారలు కోరిన విశ్వకర్మను రావించి, వారిపురం బతివిచిత్రంబు సేయించె. 120

క. దేవేంద్రుని ఖాండవ మ, ప్పావకునకు నీఁ దలంచి పార్థుని రథికున్
గావించి సూతుఁ డయ్యెను, గోవిందుఁడు మఱఁదితోడఁ గూరిమి వెలయన్.

వ. ఇట్లు నరనారాయణులు సహాయులుగా, దహనుండు ఖాండవవనంబు దహించి, సంతసించి, విజయునకు నక్షయ తూణీరంబులు, నభేద్య కవచంబును, గాండీవ మనియెడి బాణాసనంబును, దివ్యరథంబును, ధవళ రథ్యంబులను నిచ్చె. అందు.

ఉ. వాసవసూనుచేఁ దనకు వహ్నిశిఖా జనితోగ్రవేదనల్
పాసినఁ జేసి యొక్కసభఁ బార్థున కిచ్చె మయుండు ప్రీతుఁ డై
యా సభలోనఁ గాదె గమనాగమనంబులఁ గౌరవేంద్రుఁ డు
ల్లాసముఁ బాసి యుండుట జల స్థల నిర్ణయ బుద్ధిహీనుఁ డై. 123

శ్రీకృష్ణుండు కాళింది మిత్రవింద నాగ్నజితి భద్ర లక్షణ యనువారలం బెండ్లాడుట.

వ. అంతఁ గృష్ణుండు, ధర్మరాజ ప్రముఖుల వీడుకొని, సాత్యకిప్రముఖ సహచరులు గొలువ, మరలి తన పురంబునకుం జనుదెంచి, బంధుజనంబులకుఁ బరమానందంబు సేయుచు, నొక్క పుణ్యదివసంబున శుభలగ్నంబునం గాళిందినిం బెండ్లాడె. మఱియు, నవంతిదేశాధీశ్వరు లయిన విందానువిందులు దుర్యోధనునకు వశు లై, హరికి మేనత్తయైన రాజాధిదేవి కూఁతు రైన తమ చెలియలిని వివాహంబు సేయ నుద్యోగించి, స్వయంవరంబు చాటించిన. 124

క. భూరమణులు చూడఁగ హరి, వీరతఁ జేకొనియె మిత్రవిందను నిత్యా
పూరిత సుజనానందన్, జారు చికురకాంతి విజిత షట్పదబృందన్. 125

సీ. జననాథ! వినుము కోసలదేశ మేలెడి నగ్నజిత్తను నరనాథుఁ డొకఁడు
సుమతి ధార్మికుఁడు తత్సుత నాగ్న[2]జితి యను కన్యక గుణవతి గలదు దానిఁ
బెండ్లియాడుటకు నై పృథివీశు లేతెంచి వాఁడి కొమ్ములుగలవాని వీర
గంధంబు సోఁకినఁ గాలుఁద్రవ్వెడివాని నతిమదమత్తంబు లైనవాని

1. గేహానిందు (హ.) 2. జిత్తియన్ (హ.)

తే. గోవృషంబుల నేడింటిఁ గూర్చి తిగిచి
బాహుబలముల నెవ్వఁడు పట్టి కట్టు
నతఁడు కన్యకు వల్లభుం డనిన వానిఁ
బట్టఁజాలక పోదురు ప్రజలు బెగడి. 126

వ. ఇట్లు గోవృషంబుల జయించినవాఁ డక్కన్యకకు వరుం డనిన, భగవంతుం డైన హరి విని, సేనాపరివృతుం డై, కోసలపురంబునకుం జనినఁ, గోసలాధీశ్వరుం డును, హరి నెదుర్కొని, యర్ఘ్యపాద్యాది విధులం బూజించి, పీఠంబు సమర్పించి, ప్రతివందితుం డై యున్నయెడ. 127

క. ఆ రాజకన్య ప్రియమున, నా రాజీవాక్షు మోహనాకారుఁ ద్రిలో
కారాధితుఁ మాధవుఁ దన, కారాధ్యుం డైన నాథుఁ డని కోరె నృపా! 128

వ. మఱియు, న క్కన్యకారత్నంబు దన మనంబున. 129

ఆ. విష్ణుఁ డవ్యయుండు విభుఁడు కావలె నని
నోఁచినట్టి తొంటి నోముఫలము
సిద్ధ మయ్యె నేనిఁ జేకొనుఁబో నన్నుఁ
జక్రధరుఁడు వైరిచక్రహరుఁడు. 130

మ. సిరియుం బద్మభవేశదిక్పతులు మున్ సేవించి యెవ్వాని శ్రీ
చరణాంభోజపరాగముల్ శిరములన్ సమ్యగ్గతిం దాల్తు రీ
ధరణీచక్రభరంబు వాపుటకు నుద్యత్కేళి మూర్తుల్ దయా
పరుఁ డై యెవ్వఁడు దాల్చు నట్టి హరి యె బ్భంగిన్ బ్రవర్తించునో. 131

వ. అని యిట్లు నాగ్నజితి విచారించునెడఁ, గృష్ణుఁ డా రాజుం జూచి, మేఘగంభీర నినదంబున ని ట్లనియె. 132

క. అన్యుల యాచింపరు రా, జన్యులు సౌజన్యకాంతుఁ జనుదెంచితి నీ
కన్యక వేఁడెద నిమ్మా, కన్యాశుల్కాదుల మేము గాము నరేంద్రా! 133

వ. అనిన రా జి ట్లనియె. 134

శా. కన్యం జేకొన నిన్నిలోకముల నీకన్నన్ ఘనుం డైన రా
జన్యుం డెవ్వఁడు నీ గుణంబులకు నాశ్చర్యంబునం బొంది తా
నన్యారంభము మాని లక్ష్మి భవదీయాంగంబునన్ నిత్య యై
ధన్యత్వమ్మును జెందియున్నది గదా తాత్పర్యసంయుక్త యై. 135

శా. చంచత్ గోవృష సప్తకంబుఁ గడిమిన్ సైరించి యెవ్వాఁడు భం
జించున్ వానికిఁ గూఁతు నిత్తు నని యేఁ జీరించినన్ వైభవో
దంచత్ గర్వులు వచ్చి రాజతనయుల్ తత్పాద శృంగాహతిన్
గించిత్కాలము నోర్వ కేఁగుదు రనిన్ గేడించి భిన్నాంగు లై. 136

శా. ఉష్ణాంశుండు తమంబుఁ దోలుక్రియ నీ వుగ్రాహవ క్షోణిలోఁ
గృష్ణా! వైరులఁ దోలినాఁడవు రణక్రీడా విశేషంబులన్
నిష్ణాతుండవు సప్త గోవృషములన్ నేఁ డాజి భంజించి రో
చిష్ణుత్వంబున వచ్చి చేకొనుము మా శీతాంశుబింబాననన్. 137

వ. అని నగ్నజిత్తు తనకూఁతు వివాహంబునకుం జేసిన సమయంబు చెప్పిన విని.

చ. కనియె నఘారి వత్స బక కంస విదారి ఖలప్రహారి దా
ఘనతర కిల్బిషంబుల నగణ్య భయంకర పౌరుషంబులన్
సునిశిత శృంగ నిర్దళిత శూరసమూహ ముఖామిషంబులన్
హానన గుణోన్మిషంబుల మహోపరుషంబుల గోవృషంబులన్. 139

ఉ. చేలము చక్కఁ గట్టుకొని చిత్రగతిన్ వడి నేడుమూర్తు లై
బాలుఁడు దారురూపములఁ బట్టెడు కై వడిఁ బట్టి వీరశా
ర్దూలుఁడు గ్రుద్ది నేలఁ బడఁద్రోచి మహోద్ధతిఁ గట్టి యీడ్చె భూ
పాలకు లెల్ల మెచ్చ వృషభంబులఁ బర్వతసన్నిభంబులన్. 140

వ. ఇట్లు వృషభంబుల నన్నింటినిం గట్టి యీడ్చినం జూచి, సంతసించి, హరికి నగ్న
జిత్తు నాగ్నజితి నిచ్చిన, విధివత్ప్రకారంబునం బెండ్లియయ్యె. ఆ [1]రాజసుందరు
లానందంబునుం బొందిరి. ఆ సమయంబున, బ్రాహ్మణాశీర్వాదంబులును, గీత
పటహ శంఖ కాహళ భేరీ మృదంగ నినదంబులును జెలంగె. అంత నా కోసలేం
ద్రుండు, దంపతుల రథారోహణంబు సేయించి, పదివేల ధేనువులును, విచిత్రాం
బరాభరణ భూషిత లైన యువతులు మూఁడువేలును, తొమ్మిదివేల గజంబులును,
గజంబులకు శతగుణంబు లైన రథంబులును, రథంబులకు శతగుణంబు లైన
హయంబులును, హయంబులకు శతగుణాధికం బైన భటసమూహంబును నిచ్చి
పుత్తెంచిన, వచ్చునప్పుడు. 141

ఉ. భూతి యెలర్పఁ గోసలుని పుత్రికకై చనుదెంచి తొల్లి యాఁ
బోతులచేత నోటువడి పోయిన భూపతు లెల్ల మాధవుం
డా తరుణిన్ వరించుట చరావళిచే విని త్రోవ సైన్యసం
ఘాతముతోడఁ దాఁకి రరిగర్వ విమోచనుఁ బద్మలోచనున్. 142

1. రాజపత్న్యః (58-48)

ఉ. [1]దండినిరాజు లెల్ల హరిఁ దాఁకిన నడ్డము వచ్చి వీఁకతో
ఖండనభూమియందుఁ దన బాంధవు లెల్లను సన్నుతింపఁగా
గాండివ చాపముక్త విశిఖంబుల వైరుల నెల్లఁ జంపె నా
ఖండలనందనుండు శశకంబుల సింహము చంపుకైవడిన్. 143

వ. ఇట్లు హరి, నాగ్నజితిం బెండ్లియాడి, యరణంబులు పుచ్చుకొని, ద్వారకానగ
రంబునకు వచ్చి, సత్యభామతోఁ గ్రీడించుచుండె. మఱియును. 144

మ. జనవంద్యన్ †శ్రుతకీర్తినంద్యఁ దరుణిన్ సందర్శన క్షోణిపా
ద్యనుజుల్ మేనమఱందలిన్ విమల లోలాపాంగఁ [2]గైకేయ ని
ర్ధన యోన్నిద్రఁ బ్రపూర్ణ సద్గుణ సముద్రన్ భద్ర నతుద్ర నా
వనజాతాక్షుఁడు పెండ్లియాఁడె నహితవ్రాతంబు భీతిల్లఁగన్. 145

వ. మఱియును. 146

చ. అమరులఁ బాఱఁదోలి భుజగాంతకుఁ డైన ఖగేశ్వరుండు ము
న్నమృతముఁ దెచ్చుకైవడి మదాంధుల రాజుల నుక్కడంచి యా
కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను మద్రకన్యకన్
సమద మృగేక్షణన్ నయవిచక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్. 147

వ. ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయు, కాళిందియు, మిత్ర
విందయు, నాగ్నజితియు, భద్రయు, మద్రరాజనందన యైన లక్షణయును ననఁగ
నెనమండ్రు భార్య లైరి. మఱియు నరకాసురుని వధియించి, తన్నిరుద్ధ కన్యల,
షోడశ సహస్ర సంఖ్యల రోహిణి మొదలయినవారిం బరిగ్రహించె. అనిన విని.

అధ్యాయము – ౫౯

క. ధరకుం బ్రియనందనుఁ డగు, నరకుని హరి యేల చంపె నరకాసురుఁ డా
వరకుంతల లగు చామీ, కర కుంభస్తనుల నేల కారలఁ బెట్టెన్, 149

వ. అనిన నరేంద్రునకు మునీంద్రుఁ డి ట్లనియె. నరకాసురునిచేత నదితి కర్ణకుండల
ములును, వరుణుని ఛత్రంబును, మణిపర్వత మనియెడు నమరాద్రిస్థానముం
గోలుపడుటయును, నింద్రుఁడు వచ్చి, హరికి విన్నవించిన, హరి నరకాసుర
వధార్థంబు గరుడవాహనారూఢుం డయి చను సమయంబున హరికి సత్యభామ
యి ట్లనియె. 150

1. దండిన రాజులెల్ల (తం. వా.)
† "శ్రుతకీర్తేస్సుతాం భద్రాం ముపయేమే పితృష్వసుః,
కైకేయీం భ్రాతృభిర్దత్తాం కృష్ణస్సందర్శనాదిభిః" (58-56)
2. కైకేయి (తం. వా.); నం, దని యోగీంద్ర సమూహ సన్నుతి నముద్రన్ (చ.)

—: శ్రీకృష్ణుఁడు సత్యభామతోఁ గూడి మురాసుర నరకాసురుల వధించుట :—

శా. దేవా! నీవు నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు చూడఁగోరుదుఁ గదా ప్రాణేశ! మన్నించి నన్
నీ వెంటం గొనిపొమ్ము నేఁడు కరుణన్ నేఁ జూచి యేతెంచి నీ
దేవీ[1]సంఘము కెల్లఁ జెప్పుదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్. 151

వ. అనినఁ బ్రాణవల్లభకు వల్లభుం డిట్లనియె. 152

సీ. సమద పుష్పంధయ ఝుంకారములు గావు భీషణ కుంభీంద్ర బృంహితములు
వాయు నిర్గత పద్మవన రేణువులు గావు తురగ రింఖా ముఖోద్ధూత రజము
లాకీర్ణ జలతరం గాసారములు గావు శత్రు ధనుర్ముక్త సాయకములు
కలహంస సారస కాసారములు గావు దనుజేంద్ర సైన్య కదంబకములు

తే. కమల కల్హార కుసుమ సంఘములు గావు
చటులరిపు శూల ఖడ్గాది సాధనములు
కన్య! నీవేడ రణరంగగమన మేడ
వత్తు వేగమ నిలువుము వలదు వలదు. 153

వ. అనినం బ్రియునకుఁ బ్రియంబు జనియింప డగ్గఱి. 154

ఉ. దానవు లైననేమి మఱి దైత్యసమూహము లైన నేమి నీ
మానిత బాహుదుర్గముల మాటున నుండఁగ నేమి శంక నీ
తో నరుదెంతు నంచుఁ గరతోయజముల్ ముకుళించి మ్రొక్కి న
మ్మానిని దన్ను భర్త బహుమాన పురస్సరదృష్టిఁ జూడఁగన్. 155

వ. ఇట్లు తనకు మ్రొక్కిన, సత్యభామను గరకమలంబులం గ్రుచ్చియెత్తి, తోడ్కొని, గరుడారూఢుం డై, హరి, గగనమార్గంబునం జని, గిరి శస్త్ర సలిల దహన పవన [2]దుర్గమం బై, మురాసుర పాశపరివృతం బైన ప్రాగ్జ్యోతిషపురంబు డగ్గఱి. 156

మ. గదచేఁ బర్వతదుర్గముల్ శకలముల్ గావించి సత్తేజిత
ప్రదర శ్రేణుల శస్త్రదుర్గచయముల్ ఖండించి చక్రాహతిన్
చెదరన్ వాయు జలాగ్ని దుర్గముల నిశ్శేషంబులం జేసి ధీ
ప్రదుఁ డై వాలునఁ ద్రుంచెఁ గృష్ణుఁడు మురప్రచ్ఛన్న పాశంబులన్. 157

వ. మఱియును. 158

శా. ప్రాకారంబు గదాప్రహారముల నుత్పాటించి యంత్రంబులన్
నాకారాతుల మానసంబులను భిన్నత్వంబు నొందించి య
స్తోకాకారుఁడు శౌరి యొత్తె విలయోద్ధూతాభ్ర నిర్ఘాత రే
ఖా కాఠిన్యముఁ బాంచజన్యము విముక్త ప్రాణిచైతన్యమున్. 159

వ. అంత లయకాలకాలాభ్ర గర్జనంబుపగిది నొప్పు న మ్మహాధ్వని విని, పంచశిరుం డైన మురాసురుండు, నిదుర సాలించి, యావులించి, నీల్గి, లేచి, జలంబులు వెడలి వచ్చి, హరిం గని, [1]ప్రళయకాల కీలి కైవడి మండుచు, దుర్నిరీక్షుం డై, కరాళించుచుం, దన పంచముఖంబులం బంచభూతమయం బైన లోకంబులు మ్రింగ నప్పళించు చందంబునం గదిసి, యాభీల కీలాజటాలం బగు శూలంబున గరుడని వైచి, భూనభోంతరంబులు నిండ నార్చుచు. 160

క. దురదురఁ బరువిడి బిరుసున, హరి! హరి! నిలు నిలువు మనుచు నసురయుఁ గదిసెన్
ముర ముర దివిజుల హృదయము, మెరమెర యిదె యణఁగు ననుచు మెఱసెన్ హరియున్. 161

వ. అప్పుడు. 162

క. గరుడనిపైఁ బడవచ్చిన, మురశూలము నడుమ నొడిసి ముత్తునియలుగాఁ
గరముల విఱిచి ముకుందుఁడు, మురముఖముల నిశిత విశిఖములు వడిఁ జొనిపెన్.

మ. గద వేసెన్ మురదానవుండు హరిపైఁ గంసారియున్ దద్గదన్
గదచేఁ ద్రుంచి సహస్రభాగములుగాఁ గల్పించె నాలోన వాఁ
డెదు రై హస్తము లెత్తికొంచు వడి రా నీక్షించి లీలాసమ
గ్ర దశన్ వాని శిరంబు లైదును వడిన్ ఖండించెఁ జక్రాహతిన్. 164

వ. ఇట్లు శిరంబులు చక్రి చక్రధారా చ్ఛిన్నంబు లైన, వజ్రి వజ్రధారా దళిత శిఖరం బై కూలెడి శిఖరిచందమున, మురాసురుండు జలంబులందుఁ గూలిన, వాని సూనులు జనకవధ జనిత శోకాతురు లై, జనార్దను మర్దింతు మని, రణకుర్దనంబునఁ దామ్రుండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు నన నేడ్వురు యోధులు సక్రోధు లై, కాలాంతక చోదితం బైన ప్రళయపవన సప్తకంబుభంగి నరకాసుర ప్రేరితు లై, రయంబున [3]పీఠుం డనియెడు దండనాథుం బురస్కరించుకొని, పఱతెంచి, హరిం దాఁకి, శర శక్తి గదా ఖడ్గ కరవాల శూలాది సాధనంబులు ప్రయోగించిన. 165

1. ప్రళయకాల శూలి కైవడి (డ) 2. భూతమయుం డై (హ.) 3. సైరికేయుం డనియెడు (హ)

ఉ. ఆ దనుజేంద్రయోధ వివిధాయుధ సంఘము నెల్ల నుగ్రత౯
మేదినిఁ గూల నేయుచు సమిద్ధ నిరర్గళ మార్గణాళిఁ గ్ర .
వ్యాదకులాంతకుం డసుర హస్త భుజానన కంఠ జాను జం
ఘాదులఁ ద్రుంచివైచెఁ దిలలంతలు ఖండములై యిలం బడ౯. 166

వ. మఱియు హరి శరజాల చక్ర నిహతులై, తనవారలు మడియుటకు వెఱఁగుపడి, రోషించి, గరుడగమనుని దూషించి, తన్ను భూషించుకొని, నరకుసేయక, నరకుండు వర కుండలప్రముఖాభరణ విభూషితుండై, దాన సలిలధారా సిక్త గండంబులును, మహోద్దండ శుండాదండంబులును నైన వేదండంబులు తండతండంబులై నడవ, వెడలి, ఖండనంబునకుం జని. 167

మ. బలవంతుండు ధరాసుతుండు గనె శుంభద్రాజబింబోపరి
స్థల శంపాన్విత మేఘమో యన ఖగేంద్ర స్కంధపీఠంబుపై
లలనారత్నముఁ గూడి సంగర కథాలాపంబులం జేయు ను
జ్జ్వల నీలాంగుఁ గన న్నిషంగుఁ గుహనా[1]చంగు౯ రణాభంగునిన్. 168

వ. కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక, విలోకించి, సంభ్రమంబున. 169

—: సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయుట :—

శా. వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండల మరీచీజాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభయై
యేణీలోచన [2]లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్ర భాగంబున౯. 170

క. జన్యంబున దనుజుల దౌ, ర్జన్యము లుడుపంగఁ గోరి చనుదెంచిన సౌ
జన్యవతిఁ జూచి యదురా, జన్యశ్రేష్ఠుండు సరస సల్లాపముల౯. 171

క. లేమా! దనుజులఁ గెలువఁగ, లేమా నీ వేల గఁగి లేచితి విటు రా
లే మాను మాన వేని౯, లే మా వి ల్లందుకొనుము లీలం గేల౯. 172

వ. అని పలికి. 173

క. హరిణాక్షికి హరి యొసఁగెను, సుర నికరోల్లాసనమును శూర కఠోరా
సుర సైన్య త్రాసనమును, బరగర్వ నిరాసనమును బాణాసనము౯. 174

---

1. సంగు౯ (డ.) 2. లేచివచ్చి (హ.)

శా. ఆవిల్లందిబలంబు నొంది తదగణ్యానంత తేజోవిశే
షావిర్భూత మహాప్రతాపమున వీరాలోక దుర్లోక యై
తా వేగన్ సగుణంబు చేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడా మహోత్కంఠతోన్. 175

క. నారి మొరయించె రిపుసే, నా రింఖణ హేతు వైన నాదము నిగుడన్
నారీమణి బలసంప, న్నారీభాదికము మూర్ఛ నంద నరేంద్రా! 176

సీ. సౌవర్ణ కంకణ ఝణఝణ నినదంబు శింజినీరవముతోఁ జెలిమి సేయఁ
దాటంక మణిగణ ధగధగ దీప్తులు గండమండల రుచుల్ గప్పికొనఁగ
ధవళతరాపాంగ ధళధళ రోచులు బాణజాల ప్రభాపటలి నణఁప
శరపాత ఘుమఘుమ శబ్దంబు పరిపంథి సైనిక కలకల స్వనము లుడుప

తే. వీర శృంగార భయ రౌద్ర విస్మయములు
గలసి భామిని యయ్యెనో కాక యనఁగ
నిషువుఁ దొడుగుట విడుచుట యేయు టెల్ల
నెఱుఁగరాకుండ నని సేసె నిందువదన. 177

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోష రాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపు సొంపు బరఁగన్ జంద్రాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహముల్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్. 178

మ. అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ బ్రత్యాలీఢ [2]పాదంబుతో
నలికస్వేద వికీర్ణ కాలకలతో నాకర్ణి కానీత స
ల్లలిత జ్యా నఖపుంఖ దీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకార ధను ర్విముక్త విశిఖ వ్రాతాహతారాతి యై. 179

సీ. బొమ్మపెండ్లిండ్లకుఁ బో నొల్ల నను బాల రణరంగమున కెట్లు రాఁ దలంచె
మగవారిఁ గనినఁ దా మఱుఁగు కేఁగెడు నింతి పగవారి గెల్వ నేపగిదిఁ [3]జూచెఁ
బసిఁడి యుయ్యాల లెక్క భయమందు భీరువు ఖగపతి స్కంధ మే కడిఁది నెక్కె
సఖుల కోలాహల స్వనము లోర్వని కన్య పటహ భాంకృతుల కె ట్లుంగి నోర్చె

1. శిఖా (క.) 2. మానంబుతో (హ.) 3. ఁజూచె (తం. వా.)

ఆ. నీలకంఠములకు నృత్యంబుఁ గఱపుచు
నలసి తలఁగిపోవు నలరుఁ బోణి
యే విధమున నుండె నెలమి నాలీఢాది
మానములను రిపుల మాన మణఁప. 180

సీ. వీణెఁ జక్కఁగఁ బట్టి వెర వెఱుంగని కొమ్మ బాణాసనం బెట్లు పట్టనేర్చె
[1]మ్రాఁకున దీఁగెఁ గూర్పంగ నేరని లేమ గుణము నే క్రియ [2]ధనుష్కోటిఁ గూర్చె
[3]సరము ముత్యము గ్రువ్వఁజాలని యబల యే నిపుణత సంధించె నిశితశరము
చిలుకకుఁ బద్యంబు చెప్పనేరని తన్వి యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ

ఆ. బలుకు మనినఁ బెక్కు పలుకని ముగుద యే
గతి నొనర్చె సింహగర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామ గుణధామ
[4]చారు చికురసీమ సత్యభామ. 181

శా. జ్యావల్లీ ధ్వని గర్జనంబుగ సురల్ సారంగయూథంబుగా
నా విల్లింద్రశరాసనంబుగ సరోజాతుండు మేఘంబుగాఁ
దా విద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్ని మగ్నంబుగాఁ
బ్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకరశ్రేణి గాన్. 182

సీ. రాకేందుబింబ మై రవిబింబ మై యొప్పు నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతు వై ఘన ధూమకేతు వై యలరుఁ బూఁబోణి చేలాంచలంబు
భావజు పరిధి యై ప్రళయార్కు పరిధి యై మెఱయు నాకృష్ట మై మెలఁత చాప
మమృతప్రవాహ మై యనల సందోహ మై తనరారు నింతి సందర్శనంబు

ఆ. హర్షదాయి యై మహారోష దాయి యై
[5]పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీరరసము లోలి విస్తరిల్ల. 183

వ. ఇ వ్విధంబున. 184

క. శంపాలతాభ బెడిదపు, టంపఱచే ఘోర దానవానీకంబుల్
పెంపటి సన్నాహంబుల, సొం పటి భూసుతుని వెనుకఁ జొచ్చెఁ విచ్చెఁ. 185

---

1. ప్రాకున (క.) 2. ధనుఃకోటి (తం. వా.) 3. సరవి (తం. వా.) 4. చారు సత్యభామ (తం. వా.) 5. పఱచు (హ.)

వ. అ య్యవసరంబునం గంససంహారి, మనోహారిణిం జూచి, సంతోషకారియుం, గరుణా రసావలోకన ప్రసారియు, మధురవచన సుధారస విసారియుఁ, దదీయ సమరసన్నాహ నివారియు నై యి ట్లనియె. 186

క. కొమ్మా! దానవనాథుని, కొ మ్మాహవమునకుఁ దొలఁగె గురువిజయముఁ గై కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ, గొ మ్మాభరణములు నీవు గోరిన వెల్లన్. 187

వ. అని పలికి, సమ్మానరూపంబులును, మోహనదీపంబులును, దూరీకృత చిత్త విక్షేపంబులు నైన సల్లాపంబులం గళావతిం దద్దయుఁ బెద్దఱికంబు చేసి, తత్కర కిసల యోల్లసిత బాణాసనంబు మరల నందుకొనియె. అప్పుడు సురవైరి, మురవైరి కి ట్లనియె. 188

క. మగువ మగవారి ముందఱ, మగతనములు సూప రణము మానుట నీకున్ మగతనము గాదు దనుజులు, మగువల దెసఁ జనరు మగలమగ లగుట హరీ! 189

వ. అనిన హరి యి ట్లనియె. 190

క. నరకా! ఖండించెద మ, త్కర కాండాసన విముక్త ఘనశరముల భీ కరకాయు నిన్ను సుర కి, న్నరకాంతలు సూచి నేఁడు నందముఁ బొందన్. 191

వ. అని పలికి, హరి నరకాసుర యోధులమీఁద శతఘ్ని యను దివ్యాస్త్రంబుఁ బ్రయోగించిన, నొక్క వరుసను వార లందఱు మహావ్యథం జెందిరి, మఱియును.

మ. శరవిచ్ఛిన్న తురంగ మై పటు గదా సంభిన్న మాతంగ మై
యురు చక్రాహత వీర మధ్య పద బాహు స్కంధ ముఖ్యాంగ మై
సురభిత్సైన్యము దైన్యముం బొరయుచున్ శోషించి హైన్యంబుతో
హరి మ్రోలన్ నిలువంగ లేక పఱచెన్ హా హా నినాదంబులన్. 193

వ. అప్పుడు. 194

ఆ. మొనసి దనుజయోధ ముఖ్యులు నిగుడించు
శస్త్రసముదయముల జనవరేణ్య!
మురహరుండు వరుస మూఁడేసి కోలల
ఖండితంబు చేసె [1]గగనమందు. 195

క. వెన్నుని సత్యను మోచుచుఁ, బన్నుగఁ బద నఖర చంచు పక్షాహతులన్ భిన్నములు సేసె గరుడుఁడు, పన్నిన గజసముదయములఁ బౌరవముఖ్యా! 196

---

1. కదనమందు (తం. వా.)

వ. దేవా! నీవు లోకంబులు సృజియించుటకు రజోగుణంబును, రక్షించుటకు సత్త్వగుణంబును, సంహరించుటకుఁ దమోగుణంబును, ధరియించు కాలమూర్తివి. ప్రధానపూరుషుండవు, పరుండవు నీవ. నేనును, వారియు, వహ్నియు, ననిలుఁడు, నాకాశము, భూతతన్మాత్రలును, నింద్రియంబులును, దేవతలును, మనంబును, గర్తయును, మహత్తత్త్వంబును, జరాచరం బయిన విశ్వంబును, నద్వితీయుండ వయిన నీ యంద సంభవింతుము. 203

చ. దయ నిటు చూడుమా! నరకదైత్యుని బిడ్డఁడు వీఁడు నీదెసన్
భయమున నున్నవాఁడు గడు బాలుఁ డనన్యశరణ్యుఁ డార్తుఁ డా
శ్రయరహితుండు తండ్రిక్రియ శౌర్యము నేరఁడు నీ పదాంబుజ
ద్వయిఁ బొడగాంచె భక్తపరతంత్ర సువీక్షణ! దీనరక్షణా! 204

వ. అని యిట్లు భూదేవి భక్తితోడ హరికి నమస్కరించి, వాక్కుసుమంబులఁ బూజించిన, నర్చితుం డై భక్తవత్సలుం డయిన పరమేశ్వరుండు నరకపుత్రుం డయిన భగదత్తున కభయం బిచ్చి, సర్వసంపద లొసంగి, నరకాసుర గృహంబు ప్రవేశించి, యందు. 205

### శ్రీకృష్ణుండు పదాఱువేలకన్నియల వరించి దేవలోకమునకుఁ బోయి పారిజాతమును దెచ్చుట.

ఉ. రాజకులావతంసుఁడు పరాజితకంసుఁడు సొచ్చి కాంచె ఘో
రాజుల రాజులన్ బటుశరాహతి నొంచి ధరాతనూజుఁ డు
త్తేజితశక్తిఁ దొల్లిఁ జెఱ దెచ్చిన వారిఁ బదాఱువేల ధా
త్రీజనమాన్యలన్ గుణవతీ వ్రత ధన్యల రాజకన్యలన్. 206

మ. కని రా రాజకుమారికల్ పరిమళ త్కౌ[1]తూహలాక్రాంత లై
దనుజాధీశ చమూవిదారు నతమందారున్ శుభాకారు నూ
తన శృంగారు వికారదూరు సుగుణాధారున్ మృగీలోచనా
జన చేతోధన చోరు రత్నమకుట స్ఫారున్ మనోహారునిన్. 207

వ. కని యతని సౌందర్య గాంభీర్య చాతుర్యాది గుణంబులకు మోహించి, తమకంబులు జనియింప, ధైర్యంబులు సాలించి, సిగ్గులు వర్జించి, పంచశర సంచలిత హృదయ లై, దైవయోగంబునం బరాయత్తంబు లైన చిత్తంబుల నమ్మత్తకాశినులు తత్తరంబున మనోజుఁ డుత్తలపెట్ట, నతండు దమకుఁ బ్రాణవల్లభుం డని వరియించి. 208

---

1. కౌతూహలక్రాంతలై (క.)

ఉ. పాపపు రక్కసుండు చెఱపట్టె నటంచుఁ దలంతు మెప్పుడున్
[1]బాపుఁడె! వీని ధర్మమునఁ బద్మదళాక్షునిఁ గంటి [2]మమ్మ! ము
న్నీ పురుషోత్తముం గదియ నేమి వ్రతంబులు చేసినారమో
యా పరమేష్ఠి పుణ్యుఁడు గదమ్మ! హరిన్ మముఁ గూర్చె నిచ్చటన్. 209

క. ఉన్నతి నీతఁడు గౌఁగిట, [3]మన్నింపం గనిన బ్రతుకు మానిని మనలో
ము న్నేమి నోము నోఁచెనొ, సన్నుతమార్గముల విపిన జల దుర్గములన్. 210

క. విన్నారమె యీ చెలువము, కన్నారమె యిట్టి శౌర్యగాంభీర్యంబుల్
మన్నారమె యింతకాలము, గొన్నారమె యెన్నఁడైనఁ గూరిమి చిక్కన్. 211

సీ. వనజాక్షి! [4]నేఁగన్క వైజయింతిక నైనఁ గదిసి వ్రేలుదుఁ గదా కంఠమందు
బింబోష్ఠి! [5]నేఁగన్క పీతాంబరమ నైన మెఱసి యుండుదుఁ గదా మేనునిండఁ
గన్నియ! నేఁగన్క కౌస్తుభమణి నైన నొప్పు చూపుదుఁ గదా యురమునందు
బాలిక! నేఁగన్క పాంచజన్యము నైన మొనసి చొక్కుదుఁ గదా మోవిఁగ్రోలి

ఆ. పద్మగంధి! నేను బర్హదామమ నైన
చిత్రరుచుల నుందు శిరమునందు
ననుచుఁ బెక్కుగతుల నాడిరి కన్యలు
గములు గట్టి గరుడగమనుఁ జూచి. 212

శా. భూనాథోత్తమ కన్యకల్ వరుస నంభోజాతనేత్రుండు న
న్నే నవ్వెన్ దగఁ జూచె డగ్గఱియె వర్ణించెన్ వివేకించె స
న్మానించెన్ గరుణించెఁ బే రడిగె సన్మార్గంబుతోఁ బెండ్లియౌ
నేనే చక్రికి దేవి నంచుఁ దమలో [6]నిర్ణీత లై రందఱున్. 213

వ. అని బహువిధంబులం దమతమ మన్ననలకు నువ్విళ్లూరు కన్నియలం, బదాఱు వేల, ధవళాంబ రాభరణ మాల్యానులేపనంబు లొసంగి, యందలంబుల నిడి, వారలను నరకాసుర భాండాగారంబులం గల నానావిధంబు లయిన మహాధనంబులను, రథంబులను, దురంగంబులను, ధవళంబు లై, వేగవంతంబు లై, యైరావతకుల సంభవంబు లైన చతుర్దంత దంతావళంబులను, ద్వారకానగరంబునకుం బనిచి, దేవేంద్రుని పురంబునకుం జని, యదితిదేవి మందిరంబు సొచ్చి, యా పెద్దమ్మకు ముద్దుసూపి, మణికిరణ పటల పరిభావిత భానుమండలంబు

---

1. పాపుఁడుగాఁడు వానికతఁ బద్మదళాక్షుని(హ.); వీనికతఁ బద్మదళాక్షుని(తం.) 2. మిప్పుడున్(హ.)
3. మన్నింపఁగనింక బ్రదుకు (వా.) 4. నేఁగన (చ.); నాలుగుపాదములందును "గన" అని యే పాఠము. 5. నే ఘనపీతాంబరము నైన (హ.) 6. నిర్ణేతలై (హ.)

లైన కుండలంబు లొసంగి, శచీసమేతుం డైన మహేంద్రునిచేత సత్యభామ తోడం బూజితుం డై, పిదప సత్యభామ కోరిన, నందనవనంబు సొచ్చి. 214

మ. హరి కేలం బెకలించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టి సుం
దర గంధానుగత భ్రమత్ భ్రమర నాదవ్రాతముం బల్లవాం
కుర శాఖా ఫల పర్ణ పుష్ప కలికా గుచ్ఛాది కోపేతమున్
గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలోకీ యాచ కాఖ్యాతముఁ. 215

వ. ఇట్లు పారిజాతము హరియించి, యదువల్లభుండు, వల్లభయుం, దానును, విహగవల్లభారూఢుం డై, చనుచున్న సమయంబున. 216

సీ. నరకాసురుని బాధ నలఁగి గోవిందుని కడ కేఁగి తత్పాదకమలములకుఁ
దన కిరీటము సోఁక దండప్రణామముల్ గావింప నా చక్రి కరుణ సేసి
చనుదెంచి భూసుతు సమయించి తనవారిఁ దన్ను రక్షించుటఁ దలఁప మఱచి
యింద్రుండు బృందార కేంద్రత్వ మదమునఁ బద్మలోచన! పోకు పారిజాత

ఆ. తరువు విడువు మనుచుఁ దాఁకె నడ్డమువచ్చి
తఱిమి సురలు నట్లు దాఁకి రకట!
యెఱుక వలదె నిర్జరేంద్రత కాల్పనే,
సురల తామసమును జూడ నరిది. 217

వ. ఇట్లు తనకు నొడ్డారించి, యడ్డంబు వచ్చిన నిర్జరేంద్రాదుల నిర్జించి, తన పురంబునకుం జని, నిరంతర సురభి కుసుమ మకరంద మాధురీవిశేషంబులకుం జొక్కి, చిక్కక, నాకలోకంబున నుండి వెంట నరుగుదెంచు తుమ్మెదలకు నెమ్మి దలంపుచున్న పారిజాతము నాశ్రితపారిజాతుం డైన హరి మహా ప్రేమాభిరామ యగు సత్యభామతోఁ గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి, నరకాసురుని యింటం దెచ్చిన రాజకన్య లెంద అందఱకు నన్ని నివాసంబులు గల్పించి, గృహోపకరణంబులు సమర్పించి. 218

చ. అమితవిహారుఁ డీశ్వరుఁ డనంతుఁడు దా నొకనాఁడు మంచి ల
గ్నమునఁ బదాఱువేల భవనంబులలోనఁ బదాఱువేల రూ
పములఁ బదాఱువేల నృపబాలలఁ బ్రీతిఁ బదాఱువేల చం
దముల విభూతి నొందుచు యథావిధితో వరియించె భూవరా! 219

ఉ. దానములందు సమ్మద విధానములం దవలోక భాషణా
హ్వానములందు నొక్కక్రియ నా లలితాంగుల కన్నిమూర్తు లై
తా ననిశంబుఁ గానఁబడి తక్కువ యెక్కువ లేక యుత్తమ
జ్ఞాన గృహస్థ ధర్మమునఁ జక్రి రమించెఁ బ్రపూర్ణకాముఁ డై. 220

క. తరుణులు పెక్కండ్రైనను, బురుషుఁడు మనలేఁడు సవతిపోరాటమునన్
హరి యా బదాఱువేవురు, తరుణులతో సమత మనియెఁ దక్షత్వమునన్. 221

శా. ఎన్నే భంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదు లీక్షింపుచున్
మున్నే దేవునిఁ జూడఁ గానక తుదిన్ మోహింతు రా మేటి కే
విన్నాణంబుననో సతుల్ గృహిణులై విఖ్యాతి సేవించి ర
చ్ఛిన్నాలోకన హాస భాషణ రతి శ్లేషానురాగంబులన్. 222

సీ. ఇంటికి వచ్చిన నెదు రేఁగుదెంచుచు నానీతవస్తువు లందుకొనుచు
సౌవర్ణ మణిమయాసనములు వెట్టుచుఁ బదములు గడుగుచు భక్తితోడ
సంవాసిత స్నాన జలము లందిచ్చుచు సద్గంధ వస్త్ర భూషణము లొసఁగి
యిష్టపదార్థంబు లిడుచుఁ దాంబూలాదు లొసఁగుచు విసరుచు నోజ మెఱసి

తే. శిరము దువ్వుచు శయ్యపైఁ జెలువుమిగుల
నడుగులొత్తుచు దాసీసహస్ర యుక్త
లయ్యుఁ గొలిచిరి దాసులై హరి నుదారుఁ
దారకాధిప వదనలు దారు దగిలి. 223

శా. నన్నే పాయఁడు రాత్రులం దివములన్ నన్నే కృపం జెందెడిన్
నన్నే [1]దొడ్డగఁ జూచు వల్లభలలో నాథుండు నా యింటనే
యున్నాఁ డంచుఁ బదాఱువేలుఁ దమలో నూహించి సేవించి రా
యన్నుల్ గాఢ పతివ్రతాత్వ పరిచర్యా భక్తి యోగంబులన్. 224

క. ఆ రామలతో నెప్పుడు, పోరాములు చాల నెఱపి పురుషోత్తముఁడున్
గారాముసఁ దిరిగెను సౌ, ధారామ లతా సరో విహారముల నృపా! 225

క. ఏ దేవుఁడు జగముల ను, త్పాదించును మనుచుఁ జెఱుచుఁ బ్రాభవమున మ
ర్యాదా రక్షణమునకై, యా దేవుం డట్ల మెఱసె యాదవులందున్. 226

అధ్యాయము - ౬౦

—: శ్రీకృష్ణుండు కేళీగృహమందు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట :—

వ. అంత నొక్కనాఁడు రుక్మిణీదేవి లోఁగిట, మహేంద్రనీల మరకతాది మణిస్తంభ వలభి విటంకపటల దేహళీ కవాట విరాజమానంబును, శాతకుంభ కుడ్య గవాక్ష వేదికా సోపానంబును, విలంబమాన ముక్తాఫలదామ విచిత్ర కౌశేయ వితానంబును, వివిధ మణి దీపికా విసర విభ్రాజమానంబును, మధుకరకుల కలిత మల్లికా

1. దొడ్డగ (తం. వా.)

కుసుమ మాలికాభిరామంబును, జాలకరంధ్ర నిర్గత కర్పూరాగరుధూప ధూమంబును, వాతాయన విప్రకీర్ణ శిశిరకరకిరణ స్తోమంబును [పారిజాత [1]ప్రసవామోద పరిమళిత పవన సుందరంబును] నైన లోపలిమందిరంబున శర చ్చంద్ర చంద్రికా ధవళ పర్యంక మధ్యంబున, జగదీశ్వరుం డైన హరి, సుఖా సీనుం డై యుండ, సఖీజనంబులుం, దాను డగ్గఱి కొలిచియుండి. 227

సీ. కుచకుంభములమీఁది కుంకుముతో రాయు హారంబు లరుణంబు లగుచు మెఱయఁ
గరపల్లవము సాఁచి కదలింప నంగుళీయక కంకణప్రభ లావరింపఁ
గదలిన బహురత్న కలిత నూపురముల గంభీరనినదంబు గడలుకొనఁగఁ
గాంచన మణికర్ణికా మయూఖంబులు గండపాలికలపై గంతులిడఁగఁ

తే. గురులు నర్తింపఁ బయ్యెద కొంగు తూల
బోటి చేనున్న చామరఁ బుచ్చుకొనుచు
జీవితేశ్వరు రుక్మిణి చేర నరిగి
వేడ్క లిగురొత్త మెల్లన వీవఁ దొణఁగె. 228

వ. అప్పుడు. 229

ఉ. పతి యే రూపము దాల్చినన్ దదనురూపం బైన రూపంబుతో
సతి తా నుండెను [2]నా సురూపవతి నా చంద్రాస్య నా లక్ష్మి నా
సుతనున్ రుక్మిణి నా యనన్యమతి నా శుద్ధాంతరంగం గళా
చతురత్వంబున శౌరి యి ట్లనియెఁ జంచ న్మందహాసంబుతోన్.  230

మ. బలశౌర్యంబుల భోగ మూర్తి కుల రూప త్యాగ సంప ద్గుణం
బుల దిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్ పూర్ణుల్ ఘనుల్ వారికిన్
నెలఁతా! తల్లియుఁ దండ్రియున్ సహజుఁడున్ ని న్నిచ్చినం బోక యీ
బలవ ద్భీరుల వార్ధిలీనుల మముం బాటింప నీ కేటికిన్. 231

సీ. లోకుల నడవడిలోనివారము గాము పరులకు మాజాడ బయలుపడదు
బల మదోపేతులు పగ గొంద్రు మాతోడ రాజపీఠములకు రాము తఱుచు
శరణంబు మాకు నీ జలరాశి సతతంబు నిష్కించనుల మేము నిధులు లేవు
కలవారు చుట్టాలు గారు నిష్కించన జన బంధులము ముక్తసంగ్రహులము

---

1. వనామోద (తం. వా.); "పారిజాతవనామోద వాయు నోద్యాన శాలినా" (60-5)
2. నట్టి (తం.)

ఆ. గూఢవర్తనులము గుణహీనులము భిక్షు
లైనవారిఁ గాని యాశ్రయింప
మిందుముఖులు దగుల రిటువంటి మముబోఁటి
వారి నేల తగుల వారిజాక్షి ! 232

క. సిరియును వంశము రూపును, సరియైన వివాహ సఖ్య సంబంధంబుల్
జరుగును సరిగా కున్నను, జరుగవు లోలాక్షి ! యెట్టి సంసారులకున్. 233

క. తగ దని యెఱుఁగవు మమ్మున్, దగిలితివి మృగాక్షి ! దీనఁ దప్పదు నీకుం
దగిన మనుజేంద్రు నొక్కనిఁ దగులుము గుణహీనజనులఁ దగునే తగులన్. 234

సీ. సాళ్వ జరాసంధ చైద్యాది రాజులు చెలఁగి నిన్ వీక్షింప మలయుచుండు
రది గాక రుక్మి నీ యన్నయు గర్వించి వీర్యమదాంధుఁ డై వెలయుచున్న
వారి గర్వంబులు వారింపఁగా గోరి చెలువ! ని న్నొడిసి తెచ్చితిని గాని
కాంతా తనూ జార్థ కాముకులము గాము కామ మోహాదులఁ గ్రందుకొనము

తే. విను ముదాసీనులము క్రియావిరహితులము
పూర్ణులము మేము నిత్యాత్మబుద్ధితోడ
వెలుఁగుచుందుము గృహదీప విధము మెఱసి
నవలతాతన్వి ! మాతోడ నవయవలదు. 235

వ. అని యిట్లు భగవంతుం డైన హరి తన్నుఁ బాయక సేవించు ప్రియురాలిం బట్టపు దేవి ననియెడి రుక్మిణీదర్పంబును నేర్పున నుపసంహరించి, యూరకుండిన, న మ్మానవతి, యప్రియంబులు నగౌరవంబులు నపూర్వకంబులు నైన మనోవల్లభు మాటలు విని, దురంతం బయిన చింతా భరంబున సంతాపంబు నొందుచు. 236

సీ. *కాటుక నెఱయంగఁ గన్నీరు వఱద లై కుచకుంభ యుగళ కుంకుమము తడియ
విడువక వెడలెడి వేఁడి నిట్టూర్పుల లాలితాధర కిసలయము కందఁ
జెలువంబు నెఱిదప్పి చిన్నఁబోవుచు నున్న వదనారవిందంబు వాడు దోఁప
మారుతాహతిఁ దూలు మహిత కల్పకవల్లి వడువున మేన్ వడ వడ వణంకఁ

తే. జిత్త మెరియంగఁ జెక్కిటఁ జెయ్యి చేర్చి
కౌతుకం బేది పదతలాగ్రమున నేల
వ్రాసి పెంపుచు మో మరవాంచి వగలఁ
బొందె మవ్వంబు గందిన పువ్వుఁబోలె. 237

* బండి గోపాలు వ్రాసిన ప్రతిలో ఈ సీసపద్యపు నాలుగవ పాదమునుండి వెలిగందల నారప రాజు కవిత్వ మని యున్నది.

క. మురహర! దివసాగము [1]దర, దరవిందదళాక్ష! తలఁప [2]నది యట్టి దగుఁ
నిరవధిక విమలతేజో, వరమూర్తివి [3]భక్తలోక వత్సల! యెందుఁ. 246

తే. సంచిత జ్ఞానసుఖ బలైశ్వర్య శక్తు
[4]లాదిగాఁ గల సుగుణంబు లమరు నీకు
నేను దగుదునె సర్వలోకేశ్వరేశ!
లీలమై [5]సచ్చిదానందశాలి వనఘ! 247

సీ. రూఢిమైఁ బ్రకృతి పూరుష కాలములకు నీశ్వరుఁడవై భవదీయ చారు దివ్య
లలితకళా కౌశలమున నభిరతుఁడవై కడఁగు నీ రూప మెక్కడ మహాత్మ!
సత్త్వాది గుణసముచ్చయ యుక్త మూఢాత్మనైన యే నెక్కడ ననఘచరిత!
కోరి నీ మంగళ గుణ [6]భూతి దానంబు సేయంగఁబడు నని చెందుభీతి

ఆ. శంబునిధి మధ్య భాగమం దమృతఫేన
పటల పాండుర నిభమూర్తి పన్నగేంద్ర
భోగశయ్యను [7]బవ్వళింపుచును దనరు
నట్టి యున్నతలీల దివ్యంబు దలఁప. 248

వ. శబ్ద స్పర్శ రూప రస గంధంబు లనియెడు గుణంబులచేతఁ బరిగ్రహింపఁబడిన మంగళ సుందర విగ్రహుండవై, యజ్ఞానాంధకార నివారకంబైన రూపంబు గైకొని, భవదీయులైన సేవకులకు ననుభావ్యుండవైతి. భవత్పాదారవింద మకరంద రసాస్వాద లోలాత్ములైన యోగీంద్రుల కైనను భవన్మార్గంబు స్ఫుటంబు గాదు. అట్లగుటం జేసి, యీ మనుజపశువులకు దుర్విభావ్యం బగుట యేమి చెప్ప. అట్టి యీశ్వరుండవైన నీకు నిచ్ఛ స్వతంత్రంబు. అదియును నా [8]కభిమతంబు గావున నిన్ను నే ననుసరింతు. దేవా! నీ వకించనుండవైతేని బలిభోక్తలైన బ్రహ్మేంద్రాదు లెవ్వరికొఱకు బలిసమర్పణంబు చేసిరి. నీవు సమస్త పురుషార్థమయుండ వనియును, ఫలస్వరూపి వనియును, నీయందలి ప్రేమాతిశయంబులం జేసి, విజ్ఞానదీపాంకురంబున నిరస్త సమస్త దోషాంధకారులై, యిహ సౌఖ్యంబులు విడిచి, భవదీయ దాస సంగమంబె కోరుచుందురు. ఇట్లు సేయనేరక, నిజాధికారాంధకార మగ్నులై, భవత్తత్త్వంబు దెలిసి, బలిప్రక్షేపణంబు సేయంజాలక, మూఢులై, సంసారచక్రంబునం బరిభ్రమింతురు. అదియునుం గాక. 249

---

1. దళదరవింద (క.) 2. యెట్టిదయో (చ.); యట్టిదలే (తం. వా.) 3 నీవ భక్తవత్సల (హ.) 4. భూతిముఖ షడ్గుణంబులఁ బొలుచు నీకు (చ.); పుత్రముఖ....నీకు (క. వ.) 5. లీలను చిదచిదానంద(క.) 6. భూరి(క.చ.ట.ద.) 7. బవళించు పొలుపుదనరు(వ.గ.) 8. నా కధికంబు(హ.)

ఆ. వర మునీంద్ర యోగివర సురకోటిచే
వర్ణిత ప్రభావ వైభవంబు
గలిగి యఖిలచేతనులకు విజ్ఞానప్ర
దుండ వగుదు వభవ! దురితదూర! 250

వ. దేవా! భవదీయ [1]కుటిల భ్రూవిక్షేపోదీరిత కాలవేగంబుచేత విధ్వస్త మంగళు లగు కమలభవ భవ పాకశాసనాదులం దిరస్కరించి నట్టి మదీయ చిత్తంబున. 251

చ. నిను వరియించినన్ బెలుచ నీరజలోచన! శార్ఙ్గసాయకా
సన నినదంబులన్ సకల శత్రుధరాపతులన్ జయించి బో
రన పశుకోటిఁ దోలు మృగరాజు నిజాంశము భూరిశక్తిఁ గై
కొనిన విధంబునన్ నను నకుంఠిత శూరతఁ దెచ్చి తీశ్వరా! 252

ఉ. అట్టి నృపాలకీటముల నాజి నెదుర్పఁగలేని వాని య
ట్లొట్టిన భీతిమై నిటు పయోధి శరణ్యుఁడ వైతి వింతయున్
నెట్టన మాయ గాక యివి నిక్కనులే భవదీయ భక్తు లై
నట్టి నరేంద్ర మౌళిమణు లంచిత రాజఋషుల్ ముదంబునన్. 253

ఆ. వితత రాజ్యగరిమ విడిచి కాననముల
నాత్మలందు మీ పదాబ్జయుగము
వలఁతి గాఁగ నిలిపి వాతాంబు పర్ణాశ
నోగ్ర నియతు లగుచు నుందు రభవ! 254

మ. విమల జ్ఞాన నిరూఢు లైన జనముల్ వీక్షింప నీ పాదకం
[2]జ మరంద స్ఫుట దివ్యసౌరభము నాస్వాదించి నిర్వాణ రూ
పము సత్పూరుష వాగుదీరితము శోభా శ్రీ నివాసంబు నా
మిము సేవింపక మానవాధముని [3]దుర్మేధాత్ము [4]సేవింతునే. 255

వ. మఱియును, దేవా! భూలోకంబునందును, నిత్య నివాసంబునందును, సకల ప్రదేశంబులందును, జగదీశ్వరుండ వైన నిన్ను నభిమతంబు లైన కామ రూపంబులు గైకొని, వరియింతును. భవదీయ చరణారవింద మకరందాస్వాదన చాతుర్య ధుర్య భృంగి యైన కామిని, యతిహేయం బైన త్వక్ శ్మశ్రు రోమ నఖ కేశంబులచేతఁ గప్పంబడి, యంతర్గతం బైన మాంసాస్థి రక్త క్రిమి విట్కఫ

---

1. కుపితభ్రూ (క. చ. గ. జ. డ.) 2. జములన్ బ్రస్ఫుటమైన (క. వ.) 3. దుర్మేధాంధు (వా.) 4. సేవింతురే (తం. వా.)

పిత్త వాతంబులం గల జీవచ్ఛవం బైన నరాధముని మూఢాత్మ యై
కామించునే ? అదియునుం గాక. 256

సీ. నీరదాగమ మేఘ నిర్ముక్త పయఃపాన చాతకం బేగునే చౌటిపడెకుఁ
బరిపక్వ మాకంద ఫలరసంబులు గ్రోలు కీరముల్ చనునె దుత్తూరములకు
ఘన [1]రవాకర్ణ నోత్కలిక మయూరముల్ గోరునే కఠిన ఝిల్లీరవంబుఁ
గరికుంభ పిశిత సద్గ్రాస మోదిత సింహ మరుగునే శునక మాంసాభిలాషఁ

తే. బ్రవిమలాకార ! భవదీయ పాదపద్మ
యుగ సమాశ్రయ నైపుణోద్యోగ చిత్త
మన్యుఁ జేరునె తన కుపాస్యంబు గాఁగ
భక్తమందార ! దుర్భర [2]భవవిదూర ! 257

క. వాసవవందిత [3]పద కమ, లాసన శివ ముఖర దేవతావళి కెల్లన్
నీ సమధిక చారిత్ర క, థా సురుచిర గాన మవితథం బై చెల్లున్. 258

క. ధరణీనాథులు తమతమ, వర వనితామందిరముల వసియింపుచు గో
ఖర మార్జాలంబుల గతి, స్థిరబద్ధు లగుదురు నిన్నుఁ దెలియని కతనన్. 259

ఆ. జలజనాభ ! సకల జగదంతరాత్మ వై
నట్టి దేవ ! నీ పదారవింద
యుగళి సానురాగయుక్త మై నా మదిఁ
గలుగునట్లు గాఁగఁ [4]దలఁపు మనఘ! 260

ఆ. పృథు రజోగుణ ప్రవృద్ధ మైనట్టి నీ
దృష్టిచేత నన్నుఁ దేరకొనఁగఁ
జూచు టెల్లఁ బద్మలోచన నామీఁది
ఘన దయార్ద్ర దృష్టిగాఁ దలంతు. 261

వ. అదియునుం గాక, మధుసూదన ! నీ వాక్యంబులు మిథ్యలు గావు. తల్లివచనంబు కూఁతురి కభిమతంబు గాదె! యౌవనారూఢ మదంబున స్వైరిణి యగు కామిని, పురుషాంత రాసక్త యగుట విచారించి, పరిజ్ఞాని యైనవాఁడు విడుచు. అవివేకి యైన పురుషుం డింద్రియలోలుం డై, రతిం దగిలి, దాని విడువనేరక, పరిగ్రహించి, యుభయలోక చ్యుతుం డగు. అట్లుగావున నీ యెఱుంగని యర్థంబు

1. ఆకర్ణ నోత్కలిత (హ.) 2. భయ (హ.) దుర్భవభయ (తం. వా.) 3. భవకమ, లాసన దివ్య ప్రభావిభాసివి యెపుడున్ (హ); భవకమలాసన దివ్య ప్రభాసభావలి కెపుడున్ (తం. వా ); "యుష్మత్కథాహార విరించి సభాసుగీతా" అని మూలము(60-44) 4. తెలుపు(క.త.జ.); తెలియు(వ.)

గలదే ? అని విన్నవించిన, రుక్మిణీదేవి వచనంబులకుఁ గృష్ణుండు సంతసిల్లి యి ట్లనియె. 262

—: కృష్ణుండు రుక్మిణీదేవి నూఱడించుట :—

చ. అలికులవేణి ! నవ్వులకు నాడిన మాటల కింత నీ మదిం
గలఁగఁగనేల వేటలను గయ్యములన్ రతులందు నొవ్వఁగాఁ
బలికిన మాట లెగ్గు లని పట్టుదురే భవదీయ చిత్తముం
దెలియఁగఁ గోరి యేఁ బలికితిన్ మదిలో [1]నిజపట్ట నేటికిఁ! 263

వ. అదియునుం గాక. 264

ఉ. కింకలు ముద్దుఁ బల్కులును గెంపుఁ గనుంగవ తియ్య మోవియుఁ
జంకెలు తేటిచూపు లెకసక్కెములున్ నెలవంక బొమ్మలుఁ
గొంకక వీడనాడుటలుఁ గూరిమియుం గల కాంతఁ గూడుటల్
అంకిలిలేక జన్మఫల మబ్బుట గాదె కురంగలోచనా! 265

వ. అని, మఱియు ని ట్లనియె. 266

ఉ. నీవు పతివ్రతామణివి నిర్మల ధర్మ వివేక శీల స
ద్భావవు నీ మనోగతులఁ బాయక యెప్పుడు నస్మదీయ సం
సేవయ కాని యన్యము భజింపవు పుట్టిన నాఁటనుండి నీ
భావ మెఱింగియుండియును బల్కిన తప్పు సహింపు మానినీ! 267

వ. అని వెండియు ని ట్లనియె. నీ వాక్యంబులు శ్రవణసుఖంబు గావించె. నీవు వివిధంబు లైన కామంబులు గోరితివేని, నవి యన్నియును, నాయంద యుండుటం జేసి, యేకాంత సేవాచతుర వైన నీకు నవి యన్నియు నిత్యంబు లై యుండు. నీ పాతివ్రత్యంబును, నాయందలి స్నేహంబు, నతివిశదంబు లయ్యె. నా వాక్యంబులచేత భవదీయ చిత్తంబు చంచలంబు గాక నాయందుల బుద్ధి దృఢం బగును. కావున సకల సంపద్విలసితం బైన ద్వారకానగర దివ్యమందిరంబు లందు నీదు భాగ్యంబునం జేసి, సంసారికై వడి నీయంద బద్ధానురాగుండ నై వర్తింతు. తక్కిన ప్రాణేంద్రియ పరవశత్వంబున వికృతశరీరధారిణి యైన సతి నన్నుం జెందుట దుష్కరంబు. అదియునుం గాక మోక్షప్రదుండ నైన నన్నుం గామాతుర లై, యల్పమతు లై, వ్రత తపో మహిమలచేత దాంపత్యయోగం బుకై సేవింతురు. అది యంతయు నా మాయావిజృంభితంబు. దానం జేసి వారు

1. నిటుగుంద (తం. వా. హ.)

మందభాగ్యలై, నిరయంబు నొందుదురు. అట్లు గావున, [1]నీ సమాన యైన కాంత యే కాంతలందైన గలదే? నీ వివాహకాలంబున ననేక రాజన్యవర్యులం గైకొనక, భవదీయ మధురాలాప శ్రవణాత్మకుండ నైన నా సన్నిధికి "నా శరీరం బితర యోగ్యంబు గాదు. నీకు శేషంబ నై యున్న దాన"నని యేకాంతంబునం బ్రాహ్మణుం బుత్తెంచిన, యేనుం జనుదెంచి, నీ పరిణయసమయంబున భవత్సహోదరుం బట్టి విరూపుం గావించిన, నది గనుంగొనియును, నాయందలి [2]విప్రయోగభయంబున నూరకుండితివి. అది గావున బహుప్రకారంబులై వర్తించు నీ సద్గుణంబులకు సంతసింతు. అని యివ్విధంబున దేవకీసుతుండు, నరలోక విడంబనంబుగ, గృహస్థునిభంగి, నిజ గృహకృత్యంబు లాచరించుచుండె. అని శుకుండు మఱియు నిట్లనియె. 260

క. అని యిట్లు కృష్ణుఁ డాడిన, వినయ వివేకానులాప వితతామృత సే
చన ముదితహృదయ యై య, వ్వనితామణి వికచ వదన వనరుహ యగుచున్.

క. నగ వామతించు చూపులు, నగధరు మొగమునను నిలిపి నయమునఁ గరముల్
మొగిచి వినుతించెఁ గృష్ణున్, ఖగవాహున్ రుచిరదేహుఁ గలితోత్సాహున్.

చ. [3]అతుల విరాజమానముఖుఁ డై వివిధాంబర చారు భూషణ
ప్రతతులతోడఁ గోరిన వరంబులు తద్దయు నిచ్చెఁ గృష్ణుఁ డు
న్నతశుభమూర్తి దేవగుణ నందితకీర్తి దయానువర్తి యై
యతి మృదువాణికిం గిసలయారుణ పాణికి నీలవేణికిన్. 271

వ. ఇట్లు సమ్మానించి, కృష్ణుండు, రుక్మిణియుం దానును తదనంతరంబ. 272

చ. ఎలమి ఘటింపఁగాఁ గలసి యాడెల నీడెల మల్లికాలతా
వలి కరవీర జాతి విరవాదుల వీథులఁ గమ్మ దెమ్మెరల్
పొలయు నవీనవాసములఁ బొన్నలఁ దిన్నెలఁ బచ్చరచ్చలన్
గొలఁకుల తేఁ గెలంకులను గోరిక లీరిక లొత్తఁ గ్రొత్తలై. 273

క. ఆరామ భూములందు [4]వి, హారామల సౌఖ్యలీల నతిమోదముతో
నా రామానుజుఁ డుండెను, నా రామామణియుఁ దాను నభిరామముగన్. 274

వ. మఱియు, ననేక వివిధ విచిత్ర మణివితానాభిశోభిత ప్రాసాదోపరి భాగంబులను, లాలిత నీలకంఠ కలకంఠ కలవింక శుక [5]కలాపకలిత తీరంబులను, మకరంద

---

1. నీ సమానంబైన (హ.) 2. ప్రేమాతిశయంబున (హ) 3. అతఁడు (హ.) 4. విహారాధిక (హ.); విహారామల (తం. వా.); విహారాదుల సౌఖ్యలీల నతిమధురముగా (చ.ట.వ.గ.) 5. కలాలాపకలిత మకరంద (తం. వా.)

పాన మదవ దిందిందిర ఝుంకారసంకుల కమల కల్హార సుధాసార నీహారపూరిత కాసారంబులను, ధాతునిర్ఝర రంజిత సానుదేశ గిరి కుంజపుంజంబులను, కృతక శైలంబులను, క్రీడాగృహంబులనుం జెలంగి, నందనందనుండు, విదర్భరాజనందనం దగిలి, కందర్పకేళీ లోలాత్ముం డయ్యె.

### అధ్యాయము - ౬౧

అనంతరంబ యా సుందరీలలామంబువలన ప్రద్యుమ్నుండు, చారుదేష్ణుండు, సుదేష్ణుండు, [1]చారుదేవుండు, సుచారువు, చారుగుప్తుండు, భద్రచారువు, [2]చారుభద్రుండు, విచారువు, చారువు ననియెడు పదుగురు తనయులం బడసె. అట్లు సత్యభామా జాంబవతీ నాగ్నజితీ కాళిందీ మాద్రీ మిత్రవిందా భద్రలకు వేఱువేఱం బదుగుఁజేసి భద్రమూర్తులైన కుమారు లుదయించిరి. ఇవ్విధంబున మఱియును.

చ. అనఘ! పదాఱువేల సతులందు జనించిరి వేఱువేఱ నం
[3]దనదళకంబు తత్సుతవితానముఁ గాంచి రనేక సూనుల
న్ననయఁగ నిట్లు పిల్లచెఱ కీనినకైవడిఁ బుత్త్రి పౌత్త్రివ
ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ముదంబునఁ దామరతంపరై భువిన్. 276

తే. అట్లు [4]యదు వృష్ణి భోజాంధకాది వివిధ
నామధేయాంతరముల నెన్నంగ నూట
యొక్కటై చాల వర్ధిల్లెన కుక్కలంబు
నృపకుమారులఁ జదివించు నేర్పు గలుగు. 277

తే. గురుజనంబులు విను మూఁడుకోట్ల మీఁద
నెనుబ దెనిమిది వేలఁపై నెసఁగ నూర్గు
రన్నఁ దద్బాలకావళి నెన్నఁ దరమె
శూలికైనను దామరచూలి కయిన. 278

వ. అందు గోవిందనందనుం డైన ప్రద్యుమ్ననకు రుక్మి కూఁతురివలన ననిరుద్ధుండు సంభవించె. అనిన, మునివరునకు భూవరుం డి ట్లనియె. 279

### అనిరుద్ధుని వివాహసమయమున బలరాముండు రుక్మి మొదలగువారినిం జంపుట

క. బవరమునఁ గృష్ణుచే ము, న్నవమానము నొంది రుక్మి యచ్యుతు గెలువం దివురుచుఁ దన సుత నరిసం, భవునకు నె ట్లిచ్చె నెఱుఁగఁ బలుకు మునీంద్రా! 280

1. చారుదేవాంుండు (తం.) 2. చారుచంద్రుండు (తం.) 61-10 ; 3. శతకంబు (గ)
4. యాదవవృష్ణి (తం. వా.)

సీ. నావుడు శుకయోగి నరనాయకోత్తమ! నీవు చెప్పినయట్ల నెమ్మనమునఁ
బద్మాయతాక్షుచేఁ బడిన బన్నమునకుఁ గనలుచు నుండియు ననుజతోడి
నెయ్యంబునను భాగినేయున కిచ్చెను గూఁతు నంచిత పుష్పకోమలాంగిఁ
[1]దనపూన్కి దప్పినఁ దగ విదర్భేశుండు విను మెఱింగింతు న వ్విధముఁ దెలియఁ

తే. బరఁగ రుక్మవతీ స్వయంవరము కెలమి
నరుగుదెం డని భీష్మభూవర సుతుండు
వరుస రప్పించె రాజన్యవర కుమార
వరుల నను వార్త కలరి యా హరిసుతుండు. 281

చ. వర మణిభూషణ ప్రభల వర్గ మనర్గళభంగిఁ బర్వఁ బ్ర
స్ఫురిత [2]రథాధిరోహణ విభూతి దలిర్ప మనోహరైక సు
స్థిర శుభలీల నేఁగె యదుసింహ కిశోరము రాజకన్యకా
పరిణయ వైభవాగత నృపాలక కోటికి రుక్మి వీటికిన్. 282

చ. చని పురిఁ జొచ్చి వృష్ణి కులసత్తముఁ డచ్చట మూఁగియున్న య
మ్మనుజవరేణ్య నందనులు మానము దూలి భయాకులాత్ములై
చనఁగ ననేక చండతర సాయకసంపదఁ జూపి రుక్మి నం
దనఁ గొనివచ్చి వేడ్క నిజధామము సొచ్చె నవార్య శౌర్యుఁడై. 283

వ. ఇట్లు తెచ్చి ప్రద్యుమ్నుండు హరిణనయనం బరిణయం బంది, నిఖిలసుఖంబు లనుభవింపుచుండె. అనంతరంబ. 284

క. ధీరుఁడు కృతవర్ముని సుకు, మారుఁడు వరియించె రుచిర మండనయుత నం
భోరుహముఖి రుక్మిణిసుతఁ, జారుమతీ కన్యఁ బ్రకట సజ్జనమాన్యన్. 285

తే. ప్రకట చరితుండు భీష్మభూపతి సుతుండు
మనము మోదింపఁ దన కూర్మి మనుమరాలి
రుక్మలోచన నసమాన రుక్మకాంతిఁ
జెలిమి ననిరుద్ధునకుఁ బెండ్లి సేయునపుడు. 286

క. పొలుపుగ రత్నవిభూషా, జ్జ్వలుఁ డయి శుభవేళ న వ్వివాహార్థము ని
ర్మల బహువైభవ శోభన, కలిత విదర్భావనీశ కటకంబునకున్. 287

చ. హరియును రుక్మిణీసతియు నా బలభద్రుఁడు శంబరారియు
న్నరిమదభేది సాంబుఁడును నాదిగ రాజకుమార కోటి సిం
ధుర రథ వాజి సద్భటులతోఁ జని యందు సమగ్ర వైభవా
చరిత వివాహయుక్త దివసంబులు వేడుకఁ బుచ్చి యంతటన్. 288

1. తన పూఁవు దప్పినఁదగ (తం.) 2. రథావరోహణ (వ్రా. ప్ర. అన్నిట)

క. ఒకనాఁడు యదుకుమారకు, లకలంక సమగ్ర వైభవాటోప మహో
త్సుకులై యుండఁగఁ జూపో, వక యొకసెక్కెమున నవనిపాలురు వరుసన్. 289

ఉ. ఎచ్చరికం గళింగధరణీశుఁడు రుక్మి మొగంబు సూచి నీ
యొచ్చెము దీర్చికో నిదియ యొప్పగు వేళ బలుండు జూదమం
దిచ్చ గలండు గాని పొలుపెక్కిన నేర్పరి గాఁడు గాన నీ
కిచ్చు నవశ్యముఁ జయము నీఁగుము తొల్లిటఁ బడ్డ బన్నముల్ 290

క. అని పురికొల్పిన రుక్మియుఁ, దన చేటుఁ దలంపలేక తాలాంకునితో
డను జూదమాడఁ దివిరెను, వనజాసను కృతము గడచువా రెవ్వ రిలన్. 291

వ. అంత. 292

క. కోరి విదర్భుఁడు కుటిల వి, హారుం డై పిలిచె జూదమాడ జితారిన్
హారిన్, సన్నుత సూరిన్, సీరిన్ రైవతసుతార్ద్రచిత్తవిహారిన్. 293

ఆ. పూని మనము గొంత ప్రొద్దువోకకు రామ!
నెత్తమాడ నీవు నేర్తు వనఁగ
విందు మిపుడు కొంత వెలయొడ్డి యాడుద
మనినఁ బలుఁడు లెస్స యని చెలంగె. 294

క. మదిలోని చలము డింపక, పది యిరువై నూఱు వెయ్యి పదివేలిదె ప
న్నిద మని యొడ్డుచు నాడిరి, మదమున నిద్దఱును దురభిమానము పేర్మిన్. 295

ఉ. ఆడిన యాట లెల్లను హలాయుధుఁ డోడిన రుక్మి గెల్చినన్
దోడి నృపాలకోటి పరితోషముఁ జెందఁ గళింగభూవిభుం
డోడె బలుం డటంచుఁ బ్రహసోక్తుల నెంతయు రాముఁ జుల్కగా
నాడెను దంతపంక్తి వెలి యై కనుపట్టఁగ జాల నవ్వుచున్. 296

తే. బలుఁడు కోపించి యొకలక్ష పణము సేసి
యాడి ప్రకటంబుగా జూద మపుడు గెల్చె;
గెల్చినను రుక్మి యిది యేను గెల్చియుండ
గెలుపు నీ దని కికురింప నలవి యగునె. 297

క. అనవుడు హలధరుఁ డచ్చటి, జనపాలక సుతులఁ జూచి సత్యము పలుకుం
డని యడిగిన వారలు రు, క్మనిహితులై పలుక రైరి మొగమోటమునన్.

ఉ. అప్పటియట్ల యొడ్డి ముసలాయుధు డేపున నాడి జూదముం
జొప్పడ గెల్చి యీ గెలుపు చూడఁగ నాదియొ వానిదో జనుల్
దప్పక చెప్పుఁ డన్న విదిత ధ్వనితో నశరీరవాణి దా
నిప్పటియాట రాముఁడె జయించె విదర్భుఁడె యోడె నావుడున్. 299

వ. అనిన విని, సకలజనంబులు నద్భుతానంద నిమగ్న మానసు లైరి. కుటిలస్వభావు లయిన భూవరులు రుక్మిం గైకొల్పిన, నతండు తన తొల్లింటి పరాభవంబు దలంచి, యెదిరిఁ దన్ను నెఱుంగక, బలాబల వివేకంబు సేయనేరక, విధివశానుగతుం డై, చలంబునం బలునిం గని, యిప్పటి యాటయు నేనే గెల్చియుండ వృథా జల్పకల్పనుండ వై, నీవు గెల్చితి నని పలికెదవు. అక్ష విద్యా నైపుణము గల భూపకుమారులతోఁ బసులకాపరు లెత్తువత్తురే? అని క్రొవ్వున నవ్వుచుం బలికిన, న ప్పలుకులు సెవులకు ములుకుల క్రియం దాఁకినఁ, గోపోద్దీపిత మానసుం డై, పెటపెటం బండ్లు గొఱుకుచుం, గన్నుల నిప్పు లుప్పతిల్లం, గినుకం దోఁక ద్రొక్కిన మహోరగంబు నోజ రోఁజుచు, దండతాడితం బైన పుండరీకంబు లీల హుమ్మని మ్రోయుచుఁ, బ్రచండ బాహుదండంబులు సాఁచి, పరిఘుం బందుకొని, పరిపంథి యైన రుక్మిని నతని కనుకూలం బైన రాజలోకంబును బడలుపడ నడిచె. అ య్యవసరంబున. 300

క. మును దంతపంక్తి వెలిగాఁ, దను నవ్విన య క్కళింగుఁ దల పట్టి రయం
బునఁ బడఁ దిగిచి వదన మే, పునఁ బెడచే వ్రేసి దంతములు వెస డులిచెన్. 301

క. అంతం బోవక రుక్మిని, దంతంబులు మున్ను డులిచి తను వగలింప
న్నంతకపురి కేఁగెను వాఁ, డెంతయు భయ మంది రాజు లెల్లఁ గలంగన్. 302

వ. అట్లు చేసి, య య్యాదవ సింహం బవక్రవిక్రమంబునం జెలంగె నంత. 303

క. భూవర ! పద్మాక్షుఁడు దన, బావ హతుం డగుటఁ గనియుఁ బలుకక యుండెన్
భావమున రుక్మిణీ బల, దేవుల కే మనఁగ నెగ్గు దేరునొ యనుచున్. 304

వ. అంత నా విదర్భనగరంబు నిర్గమించి. 305

క. పరమానురాగ రస సం, భరి తాంతఃకరణు లగుచుఁ బాటించి వధూ
వరులను రథమం దిడి హల, ధర హరి రుక్మిణులఁ గొల్చి తగ యదువీరుల్. 306

ఉ. మంగళతూర్య ఘోషము లమందగతిం జెలఁగంగ మత్తమా
తంగ తురంగ సద్భట కదంబముతోఁ జని కాంచి రంత నా
రంగ లవంగ లుంగ విచర న్మదభృంగ సురంగనాద సం
సంగ తరంగిణీ కలిత సంతత నిర్మల నా కుశస్థలిన్. 307

వ. ఇట్లు పురోపవనోపకంఠంబునకుం జని. 308

క. అందు వసించిరి నందిత, చందన మందార కుంద చంద్ర లసన్మా
కందముల నీడ హృదయా, నందము [1]సంధింప నందనందన ముఖ్యుల్. 309

వ. తదనంతరంబ, పురప్రవేశంబు చేసిరి. అని చెప్పి, శుకయోగీంద్రుండు పరీక్షిన్న
రేంద్రున కిట్లనియె. 310

### అధ్యాయము - ౬౨

### ఉషాపరిణయ కథ

—: బాణాసురుం డీశ్వరప్రసాదము నొందుట :—

తే. అనఘ! బలినందనులు నూర్వు రందులోన
నగ్రజాతుండు బాణుఁ డత్యుగ్రమూర్తి
చిర యశోహారి విహిత పూజిత పురారి
యహిత తిమిరోష్ణకరుఁడు సహస్రకరుఁడు. 311

క. బాణుఁడు విక్రమజిత గీ, ర్వాణుఁడు సని కాంచె భక్తివశుఁడై సగణ
స్థాణున్ నిర్దళితాసమ, బాణుం దాండవధురీణు భక్తత్రాణున్. 312

క. కని యనురాగ వికాసము, దన మనమునఁ గడలుకొనఁగ ధర జాఁగిలి వం
దన మాచరించి మోదము, దనరఁగఁదాండవము సలుపుతఱి నయ్యభవున్. 313

ఉ. సంచిత భూరి బాహుబల సంపద పెంపున నారజంబు వా
యించి యనేకభంగుల నుమేశుఁ ద్రిలోకశరణ్యు నాత్మ మె
చ్చించి ప్రమోది యై నిజ వశీకృతి నిశ్చలి తాంతరంగుఁ గా
వించి తదాననాంబురుహ వీక్షణుఁ డై తగ మ్రొక్కి యిట్లనెన్. 314

ఉ. శంకర! భక్తమానస వశంకర! దుష్ట మదాసురేంద్ర నా
శంకర! పాండు నీల రుచి [2]సంకర వర్ణ నిజాంగ! భోగిరా
ట్కంకణ! పార్వతీ హృదయ కైరవ కైరవమిత్ర! యోగిహృ
త్పంకజ పంకజాప్త! నిజతాండవ ఖేలన! భక్తపాలనా! 315

వ. అని వినుతించి. 316

---

1. సంధిల్ల (వా.) 2. శంకర (తం. వా.)

ఉ. దేవ! మదీయ వాంఛితము తేటపడ న్నిటు విన్నవించెదన్
నీవును నద్రినందనయు నెమ్మిని నా పురి కోటవాకిటన్
గావలి యుండి నన్నుఁ గృపఁ గావుము భక్తఫలప్రదాత! యో
భావభవారి! నీ చరణ పద్మము లెప్పుడు నాశ్రయించెదన్. 317

వ. అని యభ్యర్థించినం, బ్రసన్నుం డై, భక్తవత్సలుం డగు పురాంతకుండు, గౌరీ సమేతుం డై, తారకాంతక గజాననాది భూత గణంబులతోడ బాణనివాసం బగు శోణపురంబు వాకిటం గావుండె. పదంపడి యొక్కనాఁ డబ్బలినందనుండు.

తే. దర్పమునఁ బొంగి రుచిర మార్తాండ [1]దీప్త
మండలముతోడ మార్పడు మహిత శోణ
మణి కిరీటము త్రిపురసంహారుని పాద
వనజములు సోఁక మొక్కి యి ట్లని నుతించె. 319

సీ. దేవ! జగన్నాథ! దేవేంద్రవందిత! వితతచారిత్ర! సంతతపవిత్ర!
హాలాహలాహార! యహిరాజ కేయూర! బాలేందుభూష! సద్భక్తపోష!
సర్వలోకాతీత! సద్గుణసంఘూత! పార్వతీహృదయేశ! భవవినాశ!
రజతాచల స్థాన! గజచర్మ పరిధాన! సురవైరి విధ్వస్త! శూలహస్త!

తే. లోకనాయక! సద్భక్తలోక వరద!
సురుచిరాకార! మునిజన స్తుతివిహార!
భక్తజన మందిరాంగణ పారిజాత!
నిన్ను నెవ్వఁడు నుతిసేయ నేర్చు నభవ! 320

మ. అనిలో నన్ను నెదిర్చి బాహుబల శౌర్యస్ఫూర్తిఁ బోరాడఁ జా
లిన వీరుం డొకఁడై నఁ బందెమునకున్ లేఁడయ్యె భూమండలి
న్ననయంబుం [2]భవదగ్ర్యదత్త కరసాహస్రంబు కండూతి వా
యు నుపాయంబును లేదె యీ భరము నె ట్లోర్తు న్నుమానాయకా! 321

సీ. హుంకార కంకణ క్రేంకార శింజినీ టంకార నిర్ఘోష సంకులంబు
చండ దోర్దండ భాస్వ న్మండలాగ్ర ప్రకాండ ఖండిత రాజమండలంబు
శూలాహత క్షతోద్వేల [3]కీలాల కల్లోలకేళీ సమాలోకనంబు
శుంభ దున్మద కుంభి కుంభస్థల ధ్వంస సంభూత శౌర్య విజృంభణంబు

---

1. దీప్తి (హ.) 2. భవదీయ దత్త (వ్రా. ప్ర. తం.) భవదగ్రదత్త (వా.) 3. కీలకరాళ, కేళీ సమాలోల ఖేలనంబు (హ)

తే. గలుగు నుద్దామ భీమ సంగ్రామకేళి
ఘన పరాక్రమ విక్రమ క్రమము గాఁగఁ
జరప లేనట్టి కరములు గరము దుఃఖ
కరము లగుఁ గాక సంతోషకరము లగునె. 322

ఉ. కాన మదీయ చండ భుజగర్వ పరాక్రమ కేళికిన్ సముం
డీ నిఖిలావనిం గలఁడె యిందుకళాధర! నీవు [1]దక్కఁ నా
నా నిటలాంబకుండు దనుజాధిపుమాటకుఁ జాల రోసి లో
నూనిన రోషవార్ధి గడ లొత్తఁగ నిట్లని పల్కె భూవరా! 323

క. విను మూఢహృదయ! నీకే, తన మెప్పు డకారణంబ ధారుణిపైఁ గూ
లును నపుడ నీ భుజావళి, తునియఁగ నాయంతవానితో నని గల్గున్. 324

వ. అని పలికె. అట్లు సంప్రాప్త మనోరథుం డై, భుజవినాశ కార్యధురీణుం డగు బాణుండు, సంతుష్టాంతరంగుం డగుచు, నిజ నివాసంబునకుం జని, తన ప్రాణ వల్లభల యుల్లంబులు పల్లవింపఁ జేయుచు, నిజధ్వజ నిపాతంబు నిరీక్షింపుచుండె. తదనంతరంబ. 325

సీ. ఆ దానవేశ్వరు [2]ననుఁగుఁగూఁతురు నుషా కన్య సచ్చరిత సౌజన్య ధన్య
రూప విభ్రమకళా రుచిర కోమలదేహ యతను నాఁటవబాణ మనఁగ నొప్పు
సుందరీరత్నంబు నిందునిభానన యలినీలవేణి పద్మాయతాక్షి
యొకనాఁడు రుచిర సౌధోపరి వేదికా స్థలమున మృదుశయ్య నెలమిఁ గూర్కి

తే. మున్ను తన చూల నెన్నఁడు విన్నయతఁడుఁ
గన్నులారంగఁ దాఁ బొడగన్నయతఁడుఁ
గాని యసమాన రూపరేఖా విలాస
కలితు ననిరుద్ధు నర్మిలిఁ [3]గవసి నటులు. 326

చ. కలఁ గని యంత మేలుకని కన్నులఁ బాష్పకణంబు లొల్కఁగాఁ
గలవలెఁ గాక నిశ్చయముగాఁ గమనీయ విలాస విభ్రమా
కలిత తదీయ రూపము ముఖంబున వ్రేలినయట్లు దోఁచినన్
గళవళ మందుచున్ బిగియఁ గౌఁగిటిచే బయ లప్పళించుచున్. 377

వ. మఱియును. 328

---

1. దక్కఁగా (హ. తం. వా.) 2. కూఁతగు (హ) 3. గవయుటయును (హ.)

చ. సరస మృదూక్తులుం గుసుమసాయకు కేళియు శాటికా కచా
కరషణముల్ నఖ క్రియలు గ్రమ్మఁ గపోల లలాట మేఖలా
కర కుచ బాహు మూలములు గైకొని యుండుట లాదిగాఁ దలో
దరి మది గాఢ మై తగిలె దర్పకుఁ డచ్చున నొత్తినట్ల యై. 329

సీ. కలికి చేష్టలు భావగర్భంబు లయినను బ్రియుమీఁది కూరిమి [1]వెగ్గలింపఁ
బిదపిద నై లజ్జ మదిఁ బదనిచ్చినఁ జెలిమేనఁ బులకలు చెక్కులొత్త
మదనాగ్ని సంతప్త మానస యగుటకు గురుకుచ హారవల్లరులు కందఁ
జిత్తంబు నాయకాయత్త మై యుంటకు మఱుమాట లాడంగ మఱపు గదుర

తే. నతివ మనమున సిగ్గు మోహంబు భయముఁ
[2]బొదివె నునుమంచు నెత్తమ్మిఁ బొదువుమాడ్కిఁ
బ్రథమ చింతాభరంబునఁ బద్మనయన
కోరి తలచీర వాటింప నేరదయ్యె. 330

వ. ఇట్లు విరహవేదనా దూయమాన మానస యై యుండె. అంత నెచ్చెలులు డాయం జనుదెంచినం, దన మనంబునఁ బొడము మనోజవికారంబు మఱువెట్టుచు నప్పుడు.

చ. పొరిఁబొరి వచ్చు నూర్పుగమిఁ బుక్కిట నుంచి కుచాగ్రసీమపై
బెరసిన సన్న లేఁజెమట బిందువు లొయ్యన నార్చుఁ గన్నులన్
దొరఁగెడు బాష్పపూరములు దొంగలిఱెప్పల నాని చుక్కలన్
దరుణులు రండు చూత మని తా మొగమెత్తును గూఢరాగ యై. 332

వ. ఇ వ్విధంబునఁ జరియించు చుండె. అట్టి యెడ. 333

తే. అంతకంతకు సంతాప మతిశయించి
వలుఁదచన్నులు గన్నీటివఱదఁ దడియఁ
జెలులదెసఁ జూడఁ జాల లజ్జించి మొగము
వాంచి పలుకకయుండె న వ్వనరుహాక్షి. 334

వ. అంత. 335

తే. బలితనూభవు మంత్రి కుంభాండు తనయ
దన బహిఃప్రాణ మిది యనఁ దనరునట్టి
కామినీమణి ముఖపద్మ కాంతి విజిత
శిశిరకర చారు రుచిరేఖ చిత్రరేఖ. 336

---

1. బయలుపఱుప (వా.) 2. బొడమ (తం. వా.)

వ. కదిసి, య బ్బాల నుపలక్షించి. 337

తే. [1]పడఁతి! నీ విప్డు సొబగుని బయలవెదకు
విధమునను నాత్మవిభుఁ డని వేడ్కఁ బిలిచి
పూని చేతికి లోనైనవానిఁ బాసి
భ్రాంతి బొందిన భావంబు ప్రకట మయ్యె. 338

తే. వనిత! నా కన్న నెనరైన వారు నీకుఁ
గలుగనేర్తురె నీకోర్కెఁ దెలియఁజెప్పు
కున్న మీ యన్నతో డన్నఁ గన్నుఁగవల
నలరు మనుసిగ్గుతో నగ వామతింప. 339

వ. ఇవ్విధంబున చిత్రరేఖం గనుంగొని యి ట్లనియె. 340

చ. చెలి! కలలోన నొక్క సరసీరుహనేత్రుఁడు హార రత్నకుం
డల కట కాంగుళీయక రణ న్మణినూపుర భూషణుండు ని
ర్మల కనకాంబరుండు సుకుమారతనుండు వినీలదేహుఁ డు
జ్జ్వలరుచి నూతన ప్రసవసాయకుఁ డున్నతవక్షుఁ డెంతయున్. 341

చ. నను బిగియారఁ గౌఁగిట మనం బలరారఁగఁ జేర్చి మోదముం
దనుకఁగ నంచి తాధరసుధా రస మిచ్చి మనోజకేళికిన్
బనుపడఁ జేసి మంజు మృదుభాషలఁ దేలిచి యంతలోననే
చనియెను దుఃఖవార్ధిఁ బెలుచన్ ననుఁ ద్రోచి సరోరుహాననా! 342

—: చిత్రరేఖ రాజవరులఁ బటంబున లిఖించి చూపి యనిరుద్ధునిఁ దెచ్చుట :—

వ. అనుచు న మ్మత్తకాశిని చిత్తంబు, చిత్తజాయత్తం బై, తత్తఱంబున విరహా నలం బుత్తలపెట్టఁ, గన్నీరు మున్నీరుగా వగచుచు, విన్ననైన వదనారవిందంబు వాంచి యూరకున్నఁ, జిత్రరేఖ దనమనంబున న య్యింతి సంతాపంబు చింతించి, యి ట్లనియె. 343

చ. సరసిజనేత్ర! యేటికి విచారము నా కుశలత్వ మేర్పడన్
నర సుర యక్ష కింపురుష నాగ నభశ్చర సిద్ధ సాధ్య కి
న్నరవర ముఖ్యులన్ బటమునన్ లిఖియించినఁ జూచి నీ మనో
హరుఁ గని వీఁడె పొమ్మనిన నప్పుడె వానిని నీకుఁ దెచ్చెదన్. 344

---

1. భామినీమణి! సొబగుని బయలవెదకు విధమునను నాత్మవిభుఁ బాసి విహ్వాలించు వగను జేతికి లోనైన వానిఁ బాసి భ్రాంతిఁ బొందిన భావంబు ప్రకటమయ్యె (తం.వా.).

వ. అని యొడంబఱిచి, మిలమిలని మంచుతోడం బురుణించు, ధళధళ మని మెఱుం గులు తుఱుంగలిగొను పటంబు నావటంబు సేసి, వజ్రంబున [1]మెదియించి పంచ వన్నియలు వేఱువేఱ కనక రజత పాత్రంబుల నించి, కేలం దూలిక ధరియించి, యొక్క విజనస్థలంబునకుం జని, ముల్లోకంబులం బేరుగలిగిన వయో రూప సంపన్నులైన పురుషముఖ్యుల నన్వయ గోత్ర నామధేయంబులతోడ వ్రాసి, యాయితం బయిన య ప్పటంబుఁ దన ముందటికిం దెచ్చి పెట్టి, యి ప్పటంబునం దగులనివారు లేరు. వారిం జెప్పెద. సావధానంబున నాకర్ణింపుము. అని యి ట్లనియె. 345

సీ. కమనీయ సంగీతకలిత కోవిదులు కింపురుష గంధర్వ కిన్నరులు వీరె
సతత యౌవనులు నిచ్ఛావిహారులు సిద్ధ సాధ్య చారణ వియచ్చరులు వీరె
ప్రవిమల సౌఖ్యసంపదైవ్వభవులు సుధాశన మరు ద్వ్యతు రాక్షసులు వీరె
నిరుపమ రుచికళాన్విత కామరూపులై పొగడొందునట్టి పన్నగులు వీరె

తే. చూడు మని నేర్పు దీపింపఁ జూపుటయును
జిత్తము నిజ మనోరథసిద్ధి వడయఁ
జాలకుండిన మధ్యమ క్ష్మాతలాధి
పతులఁ జూపుచు వచ్చె న ప్పద్మనయన. 346

ఉ. మాళవ కొంకణ ద్రవిడ మత్స్య పుళింద కళింగ భోజ నే
పాళ విదేహ పాండ్య కురు బర్బర సింధు యుగంధ రాంధ్ర బం
గాళ కరూశ లెంకణ త్రిగర్త సుదేష్ణ మరాట లాట పాం
చాల నిషాద ఘూర్జరక సాల్వ మహీశులు వీరె కోమలీ! 347

ఉ. సింధురవైరి విక్రముఁడు శీతమయూఖ మరాళికా పయ
స్సింధు పటీర నిర్మల విశేష యశోవిభవుండు శౌర్య ద
ర్పాంధు రిపు క్షితీశ నిక రాంధతమః పటలార్కుఁ డీ జరా
సంధునిఁ జూడు మాగధుని సద్బృహదశ్వ సుతుం గృశోదరీ! 348

మ. సకలోర్వీతలనాథ సన్నుతుఁడు శశ్వ ద్భూరి బాహాబలా
ధికుఁ డుగ్రాహవ కోవిదుండు త్రిజగ ద్విఖ్యాత చారిత్రకుం
డకలంకోజ్జ్వల దివ్యభూషుఁడు విదర్భాధీశ్వరుం డైన భీ
ష్మకభూపాల కుమారుఁ జూడు మితనిన్ మత్త ద్విరేఫాలకా! 349

1. మేదించి (తం. వా.)

ఉ. సంగరరంగ నిర్దళిత చండ విరోధవరూథినీశ మా
తంగ తురంగ సద్భట రథ ప్రకరైక భుజా విజృంభణా
భంగ పరాక్రమ ప్రకట భవ్యయశో మహనీయమూర్తి కా
ళింగుఁడు వీఁడె చూడు తరళీకృత చారు కురంగలోచనా! 350

మ. సుగుణాంభోనిధి ఫాలలోచను నుమేశు న్నాత్మ మెప్పించి శ
క్తిగరిష్ఠం బగు శూలముం బడసె నక్షీణ ప్రతాపోన్నతిన్
జగతిన్ మిక్కిలి మేటి వీరుఁడు రణోత్సాహుండు భూపాత్రుఁ డీ
భగదత్తుం గనుఁగొంటె పంకజముఖీ! ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్. 351

మ. వికచాంభోరుహ పత్రనేత్రుఁ డగు గోవిందుండు దాఁ బూను నం
దక చక్రాబ్జ గదాది చిహ్నములచేతన్ వాసుదేవాఖ్య ను
త్సుకుఁడై యెప్పుడు మచ్చరించు మదిఁ గృష్ణుం డన్న నీ మేటి పౌం
డ్రకుఁ గాశీశ సఖుం గనుంగొనుము వేడ్కన్ జంద్ర బింబాననా! 352

మ. ద్విజ శుశ్రూషయు సూనృత వ్రతము నుద్వృత్తిన్ భుజాగర్వమున్
విజయాటోపము చాపనైపుణియు ధీ విస్ఫూర్తి [1]యుం గల్గు నీ
రజనీనాథ కులప్రదీపకులఁ నాలుం జూడు పద్మాక్షి! ధ
ర్మజ భీమార్జున మాద్రినందనుల సంగ్రామైక పారీణులన్. 353

మ. బలిమిన్ సర్వ నృపాలుర న్నదిమి కప్పంబుల్ దగం గొంచు ను
జ్జ్వల తేజో విభవాతిరేకమున భాస్వత్కీర్తి శోభిల్లఁగాఁ
బొలుపొందం దను రాజరాజన మహా భూరి ప్రతాపంబులుం
గల దుర్యోధనుఁ జూడు సోదరయుతుం గంజాత పత్రేక్షణా! 354

వ. అని యి ట్లంగి చప్పన్నదేశాధీశు లగు రాజవరుల నెల్లఁ జూపుచు, యదువంశ సంభవు లైన శూరసేన వసుదేవోద్ధవాదులఁ జూపి, మఱియును. 355

ఉ. శారద నీరదాబ్జ ఘనసార సుధాకర కాశ చంద్రికా
సార పటీర వర్ణు యదు సత్తము నుత్తమనాయకుం బ్రమ
త్తారినృపాల కానన హుతాశనమూర్తిఁ బ్రలంబ దైత్య సం
హారునిఁ గామపాలుని హలాయుధుఁ జూడుము దైత్యనందనా! 356

సీ. కమనీయ శుభగాత్రుఁ గంజాత దళనేత్రుఁ వసుధాకళత్రుఁ బావనచరిత్రు
సత్యసంకల్పు నిశాచరోగ్ర వికల్పు నత పన్నగాకల్పు నాగతల్పుఁ
గౌస్తుభమణి భూషు గంభీర మృదు భాషు శ్రితజన పోషు నంచితవిశేషు
నీలనీరద కాయు నిర్జిత దైతేయు ధృత పీత కౌశేయు నతవిధేయు

1. సత్కీర్తు లీ (వా.)

తే. నఘ మహాగద వైద్యు వేదాంతవేద్యు
దివ్యముని సన్నుతామోదుఁ దీర్ఘపాదు
జిష్ణు వర సద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ
జూడు దైతేయకులబాల! సుభగలీల! 357

చ. స్ఫుర దళిశింజినీ రవ విభూషిత పుష్పధను ర్విముక్త భా
స్వర నవ చూతకోరక నిశాత శిలీముఖ పాత భీత పం
కరుహభవాది చేతననికాయు మనోజ నిజాంశు రుక్మిణీ
వర సుతు రాజకీర పరివారుని మారునిఁ జూడు కోమలీ! 358

వ. ఇవ్విధంబునఁ జూపిన. 359

మ. వనితారత్నము కృష్ణనందనుని భావప్రౌఢిఁ దాఁ జూచి గ్ర
ద్దన దన్నర్థి వరించి చన్న సుగుణోత్తంసంబ కా నాత్మలో
ననుమానించి యనంతరంబ యనిరుద్ధాఖ్యున్ సరోజాక్షు నూ
తన చేతోభవమూర్తిఁ జూచి మది సంతాపించుచు న్నిట్లనున్. 360

ఉ. ఇంతి! మదీయ మానధన మెల్ల హరించిన ప్రముచ్చు ని మ్మెయిం
బంత మెలర్ప వ్రాసి పటభాగ నిరూపితుఁ జేసినట్టి నీ
యంతటి పుణ్యమూర్తిఁ గొనియాడఁగ నేర్తునె నీ చరిత్రముల్
వింతలె నాకు నీ మహితవీరు కులంబు బలంబుఁ జెప్పుమా. 361

చ. అనవుడు చిత్రరేఖ జలజాక్షికి ని ట్లను నీ కుమారకుం
డనఘుఁడు యాదవాన్వయ సుధాంబుధి పూర్ణసుధాకరుండు నాఁ
దనరిన కృష్ణ పౌత్రకుఁ డుదారచరిత్రుఁడు భూరి సింహాసం
హననుఁ డరాతిసైన్య తిమిరార్కుఁడు పేరనిరుద్ధుఁ డంగనా! 362

వ. అనిచెప్పి, యే నతిత్వరితగతిం జని, య క్కుమారరత్నంబుఁ దోడ్కొని వచ్చు నంతకు, సంతాపింప కుండుము. అని [1]య క్షణంబ వియ ద్గమనంబునం జని చని, ముందట. 363

క. సరసిజముఖి కనుఁగొనె శుభ, భరిత విలోకన విధూత భవవేదనమున్
బరసాధనమును సుకృత, స్ఫురణాపాదనముఁ గృష్ణు పుటభేదనమున్. 364

వ. కని, డాయం జని, తదీయ సుషమావిశేషంబులకుం బరితోషంబు నొందుచుఁ, గామినీ చరణ మణినూపుర ఝణఝణ ధ్వనిత మణిగోపురంబును, నతివిభవ విజిత గోపురంబును, నగు ద్వారకానగరంబు నిశాసమయంబునం బ్రచ్ఛన్నవేషంబునం జొచ్చి, కనక కుంభ కలిత సౌధాగ్రంబున, మణిదీప నిచయంబు ప్రకాశింపఁ,

1. యాక్షణంబ (తం. వా.)

జంద్రకాంతశిలా భవనంబున సుధాధామ రుచిర రుచినిచయంబు నపహసించు హంసతూలికా తల్పంబున, నిజాంగనా రతి శ్రమంబున నిద్రాసక్తుం డై యున్న యనిరుద్ధుం జేరి, తన యోగవిద్యా మహత్త్వంబున నతని నెత్తుకొని మనో వేగంబున శోణపురంబునకుం జని, బాణాసుర నందన యగు నుషాసుందరి తల్పంబునం దిడి, యి ట్లనియె. 365

క. వనజాక్షి! చూడు నీ విభు, ననిమిష నగధీరు శూరు నభినవ మారున్
వనధిగభీరు నుదారుని, ననిరుద్ధకుమారు విదళితాహిత వీరున్. 366

క. అనిన నుషాసతి తనమన, మున ననురాగిల్లి మేనఁ బులకాంకురముల్
మొనయఁగ నానందాశ్రులు, గనుఁగవ జడిగురియ ముఖవికాస మెలర్పన్. 367

వ. ఇట్లు మనంబున నుత్సహించి, చిత్రరేఖం గనుఁగొని, య య్యింతి యి ట్లనియె.

సీ. అతివ! నీ సాంగత్య మను భానురుచి నాకుఁ గలుగుటఁ గామాంధకార మడఁగెఁ
దరళాక్షి! నీ సఖిత్వం బను నావచేఁ గడిఁది వియోగాబ్ధిఁ గడవఁగంటి
నబల! నీ యనుబంధ మను సుధావృష్టిచే నంగజసంతాప మార్పఁగంటి
వనిత! నీ చెలితనం బను రసాంజనముచే నా మనోహర నిధానంబుఁ గంటిఁ

తే. గలలఁ దోఁచిన రూపు గ్రక్కున లిఖించు
వారు నౌ నన్నఁ దోడ్తెచ్చువారుఁ గలరె
నీటిలోఁ జాడఁ బుట్టించు నేర్పు నీక
కాక గల్గునె మూఁడు లోకములయందు. 369

వ. అని వినుతించి, చిత్రరేఖను నిజమందిరంబునకుం బోవం బనిచినం జనియె. అనంతరంబ వింతజనుల కెవ్వరికిం బ్రవేశింపరాని యంతఃపుర సౌధాంతరంబున ననిరుద్ధుండు మేల్కని, య య్యింతిం గనుంగొని యప్పుడు. 370

క. సురుచిర మృదుతల్పంబునఁ, బరిరంభణ సరసవచన భావకళా చా
తురి మెఱయ నా కుమారుఁడు, తరుణీమణిఁ బొందె మదన తంత్రజ్ఞుం డై. 371

## ఉషాకన్యకా సంగతుం డగు ననిరుద్ధుని బాణాసురుండు నాగపాశబద్ధునిఁ జేయుట.

వ. ఇ వ్విధంబున నతిమనోహర విభవాభిరామంబు లగు దివ్యాంబ రాభరణమాల్యాను లేపనంబులను, గర్పూర తాంబూలంబులను,వివిధాన్న పానంబులను సురుచిర మణి దీపికా నీరాజనంబులను, సుగంధ బంధుర ధూపంబులను, నాటపాటలను, వీణా వినోదంబులను, బరితుష్టిం బొంది, కన్యా కుమారకు లానంద సాగరాంత ర్నిమగ్నమానసు లై, యుదయాస్తమయ నిరూపణంబు సేయనేరక, ప్రాణంబు

లొక్కటి యైన తలంపులం గదిసి, యిష్టోపభోగంబుల సుఖయించుచుండిరి. అంత. 372

క. ఆలోనన నతిచిర మగు, కాలము సుఖలీల జరుగఁగా వరుసనుషా
బాలాలలామ కొయ్యనఁ, జూ లేర్పడి గర్భ మొదవె సురుచిరభంగిన్. 373

క. [1]ఆ చిన్నె లంగజాలలు, సూచి భయాకులత నొంది గ్రుక్కుచుఁ దమలో
నో చెల్ల! [2]యెట్టులో యీ, రాచూలికిఁ జూలు నిలిచె రా యి బ్భంగిన్. 374

క. అని గుజగుజ వోవుచు ని, ప్పనిఁ దప్పక దనుజలోక పాలునితోడన్
వినుపింపవలయు నని వే, చని బాణుం జేరి మ్రొక్కి సద్వినయమునన్. 375

క. మంతనమున దేవర! క, న్యాంతఃపుర మేము గాచి యరయుచు నుండన్
వింతజనములకుఁ జొరఁగ దు, రంతము విను పోఁతుటీగ కైన సురారీ! 376

తే. ఇట్టిచోఁ గావలున్న మే మెవ్వరమును
నేమి కనుమాయయో కాని యెఱుఁగ మధిప!
నీ కుమారిక గర్భంబు నివ్వటిల్లి
యున్న దన్నను విని రోషయుక్తుఁ డగుచు. 377

వ. అట్టియెడ నా దానవేంద్రుండు, రోషావేశ భీషణాకారుం డై, కటము లదర, బొమలు ముడివడం, గనుంగవల ననలకణంబు లుప్పతిల్ల, సటలు వెఱికినం, జటులగతి నెగయు సింగంబువిధంబున లంఘించుచు, భీకర కరవాలంబు కేలం దాల్చి, సముద్దండగతిం గన్యా సౌధాంతరంగంబునకుం జని. 378

సీ. కనియె శుభోపేతుఁ గందర్పసంజాతు మానితదేహు నాజానుబాహు
మకరకుండల కర్ణు మహిత ప్రభాపూర్ణుఁ జిర [3]యశోల్లాసుఁ గౌశేయవాసుఁ
గస్తూరికా లిప్తు ఘన కాంతి కుముదాప్తు హార శోభిత వక్షు నంబుజాక్షు
యదువంశ తిలకు మత్తాళి నీలాలకు నవపుష్పచాపుఁ బూర్ణప్రతాపు

తే. నభినవాకారు నతువిద్యా విహారు
మహిత గుణవృద్ధు మన్మథ మంత్రసిద్ధుఁ
గలిత పరిశుద్ధు నఖిల లోకప్రసిద్ధుఁ
జతురు ననిరుద్ధు నంగనాజన నిరుద్ధు. 379

---

1. కాచిన కావలివారలు (హ.) 2. యిట్లు దానవరాచూలికి(హ.) 3. వ్రా. ప్ర. లన్నింట నిట్లే యున్నది.

చ. కని కన లగ్గలింప సురకంటకుఁ డుద్ధతి [1]సద్భటావళిం
గనుఁగొని యీ నరాధమునిఁ గట్టుఁడు పట్టుఁడు కొట్టుఁ డన్న వా
రనుపమ హేతిదీధితు లహర్పతితేజము మాయఁ జేయ డా
సిన నృపశేఖరుండు మదిఁ జేవయు లావును నేర్పు దర్పమున్. 380

చ. కలిగి మహోగ్రవృత్తిఁ బరిఘంబుఁ గరంబున లీలఁ దాల్చి దో
ర్బల ఘన విక్రమ ప్రళయభైరవు భంగి విజృంభణక్రియా
కలన నెదిర్చి దానవనికాయముతోఁ దలపాటుఁ బోటునుం
జలము బలంబు ధైర్యమును శౌర్యము వ్రేటును వాటుఁ జూపుచున్. 381

చ. పదములు బాహులుం దలలు ప్రక్కలు చెక్కులు జానుయుగ్మముల్
రదములు కర్ణముల్ మెడ లురంబులు మూఁపులు వీఁపు లూరువుల్
చిదురుప లై ధరం దొఱఁగఁ జిందఱవందఱ సేయ [2]సైనికుల్
కదన పరాఙ్ముఖక్రమము గైకొని పాఱిరి కాందిశీకు లై. 382

వ. ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబు నొందియు, వెఱచియు, బఱచియు, విచ్చియుఁ జచ్చియుం, గలంగియు నలంగియు, విఱిగియు సురిఁగియు, జెదరియు బెదరియుఁ, జేవ దఱిఁగి, నుఱుము లై, తన మఱువు సొచ్చిన, బాణుండు శౌర్య ధురీణుండునుం, గోపోద్దీపిత మానసుండును నై, కదిసి, ఱేసియు, వ్రేసియుఁ, బొడిచియు, నడిచియుఁ బెనంగి. 383

క. క్రుద్ధుం డై యహిపాశ ని, బద్ధుం గావించె నసురపాలుఁడు రణస
న్నద్ధున్ శరవిద్ధు న్నని, రుద్ధున్ మహితప్రబుద్ధు రూపసమృద్ధున్. 384

వ. ఇట్లు కట్టి, త్రోచిన, నుషాసతి, శోక వ్యాకులిత చిత్త యై, యుండె. అంత నక్కడ.* 385

## అధ్యాయము - ౬౩

క. ద్వారకలో ననిరుద్ధ కు, మారుని పోకకును యదుసమాజము వగలం
గూరుచు నొకవార్తయు విన, నేరక చింతింప నాల్గునెల లరిగె నృపా! 386

వ. అ య్యవసరంబున. 387

---

1. సైన్యముల్ (హ.)

* ఈ క్రింది పద్యములు రెండును, తం. వా. ప్రతులలో నున్నవి. "హ"లో లేవు.

క. నీల పటాంచిత మై సువి, శాలం బై వాయు నిహతిఁ జండధ్వని నా
భీల మగు నతని కేతన, మాలోన నకారణంబ యవనిం గూలెన్.

క. అది చూచి దనుజపాలుఁడు, మదనాంతకుఁ డాడినట్టి మాట నిజముగాఁ
గదనంబు గలుగు ననుచును, నెదు రెదురే చూచుచుండె నెంతయుఁ బ్రీతిన్.

## నారదునివలన ననిరుద్ధు వృత్తాంతమును విని కృష్ణుఁడు బాణాసురునిమీఁదికి దండెత్తుట.

క. శారద [1]నిర్మల నీరద, పారద రుచిదేహుఁ డతుల భాగ్యోదయుఁ డా
నారదముని యేతెంచె న, పార దయామతి మురారిభజన ప్రీతిన్. 388

వ. ఇట్లు చనుదెంచిన, న ద్దివ్యమునికి నిర్మల మణినిర్మిత సుధర్మాభ్యంతరంబున యదు వృష్ణి భోజాంధక వీరులు గొలువం, గొలువున్న కమలలోచనుండు, ప్రత్యుత్థానంబు చేసి, యర్ఘ్య పాద్యాది విధులం బూజించి, సముచిత కనకాసనాసీనుం జేసిన, న త్తాపసోత్తముండు పురుషోత్తము నుదాత్త తేజోనిధిం బొగడి, యనిరుద్ధు వృత్తాంతం బంతయుఁ దేటపడ నెఱింగించి, య ప్పుండరీకాక్షుని చేత నామంత్రణంబు వడసి, యంతర్ధానంబు నొందె. తదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబునం దండయాత్రాభిముఖుం డై, ప్రయాణభేరి వ్రేయించి, బలంబుల వెడలింప బ్రద్దలవారిం బనిచి, తానును గట్టాయితం బయ్యె. అంత. 389

సీ. హార కిరీట కేయూర కంకణ కట కాంగుళీయక నూపురాది వివిధ
భూషణప్రతతిచేఁ బొలుపారు కరముల ఘన గదా శంఖ చక్రములు దనర
సురభి చందన లిప్త సురుచి రోరస్స్థలిఁ బ్రవిమల కౌస్తుభ ప్రభలు నిగుడఁ
జెలువారు పీత కౌశేయ చేలము కాసె వలనుగా రింగులువాఱఁ గట్టి

తే. సైన్య సుగ్రీవ మేఘ పుష్పక వలాహ
కములు పూన్చిన తే రాయితముగఁ జేసి
[2]దారుకుఁడు తేర నెక్క మోదంబుతోడ
భానుఁ డుదయాచలం బెక్కువగిది [3]మెఱసి. 190

వ. ఇట్లు రథారోహణంబు చేసి, భూసురాశీర్వచన పూతుండును, మహిత దూర్వాంకురాలంకృతుండును, లలిత పుణ్యాంగనా కరకిసలయ కలిత శుభాక్షత విన్యాస భాసుర మస్తకుండును, మాగధ మంజుల గానానుమోదితుండును, వందిజన సంకీర్తనానందితుండును, బాఠక పఠన రవ వికాసిత హృదయుండును నై, వెడలు నవసరంబున. 391

సీ. బలభద్ర సాత్యకి ప్రద్యుమ్న [4]ముఖ యదు వృష్ణి భోజాంధక వీరవరులు
దుర్వార పరిపంథి గర్వభేదన కళా చతుర బాహాబ లోత్సాహాలీల
వారణ స్యందన వాజి సందోహంబు సవరణ సేయించి సంభ్రమమున
సముచిత ప్రస్థాన చటుల భేరీ భూరి ఘోష మంభోనిధి ఘోష మడఁప

1. కోమల (తం.వా.) 2. దారకుఁడు(తం.) 3. మెఱయ (హ.తం.వా.) 4. యదుముఖ(హ.)

తే. ద్వాదశాక్షౌహిణీ బలోత్కరము లోలి
నడచెఁ గృష్ణుని రథము [1]వెన్నంటి చెలఁగి
పృథులగతి మును భగీరథు రథమువెనుక
ననుగమించు వియన్నది ననుకరించి. 392

వ. ఇవ్విధంబునం గదలి, కతిపయ ప్రయాణంబుల శోణపురంబు చేరంజని, వేలాలంఘనంబు చేసి, యదువీరు లంత. 393

మ. సరి దారామ సరోవ రోపవన యజ్ఞస్థానముల్ మాపి వే
పరిఘల్ పూడిచి యంత్రముల్ దునిమి వప్రవ్రాతముల్ ద్రొబ్బి గో
పురముల్ గూలఁగఁద్రోచి సౌధభవనంబుల్ నూకి ప్రాకారముల్
ధరణిం గూల్చి కవాటముల్ విటిచి రుద్దండ క్రియాలోలు రై. 394

వ. ఇట్లనేకప్రకారంబుల గాసిచేసి, పురంబు నిరోధించి, పేర్చి, యార్చినం, జూచి, యాగ్రహ సమ [2]గ్రోగ్రమూర్తి యై, బాణుండు సమరసన్నాహ సంరంభ విజృంభమాణుం డై, సంగరభేరి వ్రేయించిన. 395

సీ. ఆచక్రవాళాచ లాచక్ర మంతయు [3]భ్రమసి కుమ్మరిసారెపగిదిఁ దిరిగె
ఘన ఘోణి ఖురకోటి [4]ఘట్టిత నదముల కరణి నంభోనిధుల్ గలఁగి పొరలెఁ
గాలరుద్రాఖిల కరశూల హతి రాలు పిడుగులగతి [5]రాలె నుడుగుణంబు
చటు లానిలోద్ధూత శాల్మలీతూలంబు చాడ్పున మేఘముల్ చదలఁ దూలె

తే. గిరులు వడఁకాడె దివి పెల్లగిల్లె సురల
గుండె లవిసె రసాతల క్షోభ మొదవె
దిక్కు [6]లదరె విమానముల్ తెరలి చెదరెఁ
గలఁగి గ్రహరాజ చంద్రుల గతులు దప్పె. 396

వ. అట్టి సమరసన్నాహంబునకుఁ గట్టాయితం బై, మణిఖచిత [7]ఖర్మ వర్మ నిర్మలాంశు జాలంబులును, శిరస్త్రాణ కిరీటకోటి ఘట్టిత వినూత్న రత్నప్రభా పటలంబులును గనక కుండల గ్రైవేయ హార కంకణ తులాకోటి వివిధభూషణ వ్రాత రుచినిచయంబులును, ప్రచండ బాహుదండ సహస్రంబున వెలుంగు శర శరాసన శక్తి ప్రాస తోమర గదా కుంత ముసల ముద్గర [8]భిండివాల కరవాల [9]పట్టిస శూల తురికా పరిఘాది నిశాత హేతివ్రాతాతిదీధితులును, వియచ్చరకోటి నేత్రంబులకు

---

1. వెన్నడిఁ (తం. వా.) 2. మూర్తియుం బోలె (తం. వా.) 3. బరసి (తం.); బలసి (వా.); భ్రమసి (వా.) 4. ఘట్టితోదకముల (వా.); ఘట్టితసన్నదముల (హ.) 5. నుడుగణమురాలె (హ.); నుడు బృంద మెడలె (తం. వా.) 6. లురిసె (తం. వా.) 7. వర్మనిర్మిత (హ.) 8. భిందిపాల (తం. వా.) 9. పట్టసు (హ)

మిఱుమిట్లుగొలుపం, గనకాచల శృంగ సముత్తుంగం బగు రథం బెక్కి, యరాతి వాహినీ సందోహంబునకుం దుల్యం బయిన నిజ సేనాసమూహంబు లిరుగడల నడవ, బాణుం డక్షీణ ప్రతాపంబు దీపింప, ననికి వెడలె. అ య్యవసరంబున.

### బాణాసురునికి సహాయభూతుం డగు శివునికినిఁ గృష్ణునికిని యుద్ధము జరుగుట

చ. వరదుఁ డుదార భక్తజన వత్సలుఁ డైన హరుండు బాణునిం
గర మనురక్తి నాత్మజులకంటె దయామతిఁ జూచుఁ గానఁ దా
దుర మొనరించువేడ్కఁ బ్రమథుల్ గుహుఁడుఁ నిజ భూతకోటియుఁ
[1]సరవి భజింప నుజ్జ్వల నిశాత భయంకర శూలహస్తుఁ డై. 398

సీ. ఖురపుటాహతి రేఁగు ధరణీపరాగంబు పంకేరుహాప్త బింబంబుఁ బొదువ
విపుల వాలాటోప విక్షేప జాత వాతాహతి వారివాహములు విరియఁ
గుఱుచ తిన్నని వాఁడి కొమ్ములఁ జిమ్మిన బ్రహ్మాండ ఖాండ కర్పరము వగుల
[2]నలవోక ఖణిఖణి ల్లని అంకె [3]వేసిన రోదసీకుహరంబు భేదిలంగ

తే. గళ చల ద్ఘర్మఘంటికా ఘణఘణప్ర
ఘోషమున దిక్తటంబు లాకులత నొంద
లీల నడతెంచు కలధౌతశైల మనఁగ
నుక్కుమిగిలిన వృషభేంద్రు నెక్కి వెడలె. 399

వ. ఇట్లు వెడలి, సమరసన్నాహ సముల్లాసంబు మొగంబులకు వికాసంబు సంపాదింపం, బ్రతిపక్షబలంబులతోడం దలపడిన, ద్వంద్వయుద్ధం బయ్యె. అప్పు డప్పురాతన యోధుల యాయోధనంబుఁ జూడ, వేడ్కం జనుదెంచిన, సరసిజసంభవ శక్ర సుర యక్ష సిద్ధ సాధ్య చారణ గంధర్వ కిన్నర కింపురుష గరుడోరగాదులు, నిజ విమానారూఢు లై, వియత్తలంబున నిల్చిరి.అట్టియెడఁ గృష్ణుండును హరుండును, మారుండును గుమారుండును, గూప కర్ణ కుంభాండులును గామపాలుండును, బాణపుత్రుం డగు బలుండును సాంబుండును, సాత్యకియును బాణుండును, రథికులు రథికులును, నాశ్వికులు నాశ్వికులును, గజారోహకులు గజారోహకులును, బదాతులుఁ బదాతులునుం దలపడి, యితరేతర హేతిసంఘట్టనంబుల మిణుఁగురులు చెదరఁ, బరస్పరాహ్వాన బిరుదాంకిత సింహనాద హుంకార శింజినీటంకార వారణ ఘీంకార వాజిహేషారవంబులను, పటహ కాహళ భేరీ మృదంగ శంఖ తూర్య ఘోషంబులను, బ్రహ్మాండకోటరంబు పరిస్ఫోటితం బయ్యె. అ య్యవసరంబున.

---

1. సరస (తం. వా.) 2. అలవోకవలె ఖణిల్లని (తం.వా.) 3. వైచిన (తం.వా.);; వేసిన (హ)

చ. జలరుహనాభుఁ డార్చి నిజ శార్ఙ్గశరాసన ముక్త సాయకా
వలి నిగుడించి నొంచెఁ బురవైరి పురోగములన్ రణక్రియా
కలితుల గుహ్యక ప్రమథ కర్బుర భూత పిశాచ [1]డాకినీ
బలవ దరాతియోధులను బమ్మెరపోయి కలంగి పాఱఁగన్. 401

వ. ఇట్లేసి, యార్చిన, కుంభినీధరు భుజావిజృంభణ సంరంభంబునకు సహింపక, నిటలాంబకుం డనలకణంబు లుమియు నిశితాంబకంబులఁ బీతాంబరుని నేసిన, వాని నన్నింటి నడుమన ప్రతిబాణంబు లేసి, త్రుంచినం, గనుంగొని, మఱియును. 402

మ. అనలాక్షుండు త్రిలోకపూజ్య మగు బ్రహ్మాస్త్రం బరిం బోసి యా
వనజాతేక్షణుమీఁదఁ గ్రోధమహిమ వ్యాకీర్ణుఁ డై యేసె నే
సినఁ దద్దివ్యశరంబుచేతనె మరల్చెన్ గృష్ణుఁ డత్యుద్ధతిన్
జనితాశ్చర్య రసాబ్ధి మగ్ను లచుచున్ శక్రాదు లగ్గింపఁగన్. 403

శా. వాయవ్యాస్త్ర ముపేంద్రుపై నలిగి దుర్వారోద్ధతి న్నేయ డై
తేయధ్వంసియుఁ బార్వతాశుగముచేఁ [2]ద్రెంచెం గ్రతుధ్వంసి యా
గ్నేయాస్త్రం బడరించె [3]నుగ్రగతి లక్ష్మీనాథుపై దాని వే
మాయం జేసెను నైంద్రబాణమునఁ బద్మాక్షుండు లీలాగతిన్. 404

వ. మఱియును. 405

ఉ. పాయని కిన్కతో హరుఁడు పాశుపతాస్త్రము నారిఁ బోసినన్
దోయరుహాయతాక్షుఁడును దోడన లోకభయంక రోగ్ర నా
రాయణ బాణరాజము రయంబున నేసి మరల్చె దానిఁ జ
క్రాయుధుఁ డి ట్లుఱంగునఁ బురారి శరావలి రూపుమాపినన్. 406

క. ఊహ గలంగియు విగతో, త్సాహుం డగు హరునిమీఁద జలజాక్షుఁడు స
మ్మోహన శిలీముఖం బ, వ్యాహత-జయశాలి యగుచు నడరించె నృపా! 407

వ. అ ట్లేసిన. 408

క. జృంభణ శరపాతముచే, శంభుఁడు నిజతనువు పరవశం బై సోలన్
జృంభితుఁ డై ఘన నిద్రా, [4]రంభిత వృషభేంద్రు మూఁపురము పై వ్రాలెన్.

---

1. ఢాకినీ (హ.తం.) 2. ద్రుంచెం (హ) 3. సత్త్వగతి (తం.) 4. రంభమున వృషేంద్రు (తం. వా.)

వ. ఇట్లు వ్రాలినం, జక్రపాణి, పరబలంబుల నిశితబాణపరంపరలఁ దునిమియు, నొక్కయెడం గృపాణంబులం గణికలు చేసియు, నొక్కచో గదాహతులు దుత్తుమురుగా మొత్తియుఁ ని వ్విధంబునఁ బీనుంగుపెంటలఁ గావించె. అంత. 410

చ. తఱిమి మురాంతకాత్మజుఁ [1]డుదాత్తబలంబున బాహులేయుపైఁ
[2]గఱకరిఁ దాఁకి తీవ్ర [3]శరకాండ పరంపర లేసి నొంచిన
[4]న్నెఱఁకులు గాఁడి పైఁ దొరఁగు నెత్తుట [5]జొత్తిలి వైరు లార్వఁగాఁ
బఱచె మయూరవాహనము పైకొని తోలుచు నాజిభీతుఁ డై. 411

ఉ. పంబి రణక్షి[6]తిన్ శర విపాటిత శాత్రవవీరుఁ డైన యా
సాంబుఁడు హేమపుంఖ శితసాయక జాలము లేర్చి భూరి కో
పంబున నేసినం జెదరి బాణతనూభవుఁ డోడి పాఱె శౌ
ర్యంబును బీరముం దగవు [7]నాఱడిఁబోవ బలంబు లార్వఁగన్. 412

మ. వర బాహాబలశాలి యా హలి రణావష్టంభ సంరంభ వి
స్ఫుర దుగ్రాశనితుల్య మైన ముసలంబుం బూన్చి వ్రేసెన్ [8]వడిన్
బోరిఁ గుంభాండక కూపకర్ణుల శిరంబుల్ వ్రస్సి మేదంబు నె
త్తురు కర్ణంబుల వాతనుం దొరఁగ సంధుల్ వీడి వే చావఁగన్. 413

వ. అట్టియెడ సైన్యంబు దైన్యంబు నొంది, యనాథం బై, చెడి, విఱిగి, పాఱినం గని, బాణుండు సాత్యకిం గేడించి, ప్రళయాగ్నియుం బోలి విజృంభించి, చెయి వీచి, బలంబుల మరలం బురికొల్పి, తానును ముంగలి యై నడచె. అప్పు డుభయ సైన్యంబు లన్యోన్య జయకాంక్షలం దలపడి, దక్షిణోత్తర సముద్రంబుల రౌద్రంబున వీఁకం దాఁకినం, బోరు ఘోరం బయ్యె. అట్టియెడ గదల నడిచియుఁ, గుఠారంబులం బొడిచియు, సురియలం గ్రుమ్మియు, శూలంబులం జిమ్మియు, శక్తుల నొంచియుఁ, జక్రంబులం ద్రుంచియు, ముసలంబుల మొత్తియు, ముద్గరంబుల నొత్తియుఁ, గుంతంబులఁ గ్రుచ్చియుఁ, బంతంబు లిచ్చియుఁ, బరిఘంబుల నొంచియుఁ, బట్టిసంబులఁ ద్రుంచియు, శరంబుల నేసియు, గరవాలంబుల వ్రేసియు, సత్రాసు లై పాసియు, విత్రాసు లై డాసియు బెనంగినం, దునిసిన శిరంబులును, దునుక లైన కరంబులును, దెగిన కాళ్ళును, ద్రెస్సిన వ్రేళ్ళును, దుమురు లైన యెముకలును, బ్రోవు లైన ప్రేవులును, నులిసిన మేనులును, నలిసిన జానువులును, నొగిలిన వర్మంబులును, బగిలిన చర్మంబులును, వికలంబు లైన సకలావయవంబులును, వికీర్ణంబు లైన కర్ణంబులును, విచ్ఛిన్నంబు లైన

1. డుదార(హా.) 2. గరకరి (తం.) గరికరి(వా) 3. శిత (తం.వా.) 4. నెఱకలుగాడి పెల్దొరుగు (హా.) 5. ఁజొత్తిలి (హా.తం.) 6. క్షితితల(హా.) 7. నాఱడివోవ (వా.) 8. బోరింబోరిఁ (తం.వా.)

నయనంబులును, వెడలు రుధిరంబులును, బడలుపడు ఖలంబులును, గొండలవడు వునంబడు మాంసఖండంబులును, వాచఱచు కొఱప్రాణంబులును, ప్రాలిన తేరులును, గూలిన కరులును, నొఱగిన గుఱ్ఱంబులును గలిగి, పలలఖాదన కుతూహల జనిత మదాంధీభూత పిశాచ డాకినీ భూత బేతాళ సమాలోల కోలాహల భయంకరారావ బధిరీకృత సకల దిశావకాశంబై సంగరాంగణంబు భీషణంబయ్యె. అ య్యవసరంబున. 414

చ. శర కుముదంబు లుల్లసిత చామర ఫేనము లాతపత్ర భా
సుర నవ పుండరీకములు శోణిత తోయము లస్థి సైకతో
త్కరము భుజా భుజంగమనికాయము కేశకలాప శైవల
స్ఫురణ రణాంగణం బమరెఁ బూరిత శోణనదంబు పోలికన్. 415

వ. అట్టియెడ బాణుండు, కట్టలుకన్ గృష్ణునిపైఁ దన రథంబు బఱపించి, యఖర్వ బాహాసహస్ర దుర్వార గర్వాటోప ప్రదీప్తుం డయి, కదిసి. 416

మ. ఒక యేనూఱు కరంబులన్ ధనువు లత్యుగ్రాకృతిన్ దాల్చి త
క్కక యొక్కొక్కట సాయకద్వయము వీఁకం బూన్చి నాలోన నం
దకహస్తుండు తదుగ్ర చాపచయ విధ్వంసంబు గావించి కొం
జక తత్సారథిఁ గూలనేసి రథముం జక్కాడి శౌర్యోద్ధతిన్. 417

తే. ప్రళయ జీమూతసంఘాత భయద భూరి
భైరవారావముగ నొత్తెఁ బాంచజన్య
మఖిలజనులు భయభ్రాంతు లయి చలింపఁ
గడఁగి నిర్భిన్న రాక్షసీ [1]గర్భముగను. 418

వ. అట్టి యవక్రవిక్రమ పరాక్రమంబున వెగడుపడి, బాణుండు [2]వ్రేలుమొగంబువడి, సేయునది లేక, విన్ననై యున్న. 419

సీ. అ త్తఱిఁ గోటర యను బాణజనయిత్రి సుతుఁ గాచు మతము సన్మతిఁ దలంచి
వీడి శిరోజముల్ వ్రేలంగ నిర్ముక్త పరిధాన యై మురాసురవిభేది
యెదుర నిల్చినఁ జూడ మదిఁ జాల రోసి పరాఙ్ముఖుఁ డై యున్న నను వేచి
తల్లడించుచు బాణుఁ డుల్లంబు గలఁగంగఁ దలచీర వీడ యాదవులు నవ్వ

తే. నవ్య కాంచన మణిభూషణములు రాలఁ
బాదహతి నేల గంపింపఁ బాఱి యాత్మ
పురము వడిఁ జొచ్చె నప్పుడు భూతగణము
లాకులతతోడ [3]నెక్కడే నరుగుటయును. 420

1. గర్భ మగల (హ.) 2. లేటమొగంబువడి (తం.) 3. ఎక్కటి యరుగుటయును (హ.)

క. శిరములు మూఁడును ఘన భీ, కరపదములు మూఁడు గల్గి [1]కఠిన మహేశ
జ్వర మురు ఘోరాకృతితో, నరుదెంచుచు నుండఁ గృష్ణుఁ డల్లన నగుచున్.

—: వైష్ణవజ్వరముచేఁ బరాజితం బై శైవజ్వరము శ్రీకృష్ణుని స్తుతించుట :—

చ. పరువడి వైష్ణవజ్వరముఁ బంపిన న య్యుభయ జ్వరంబులున్
వెరవును లావు చేవయును వీరము బీరము గల్గి ఘోర సం
గర మొనరింప నందు [2]గరకంఠకృత జ్వర ముగ్ర వైష్ణవ
జ్వరమున కోడి పాఱె ననివారణ వైష్ణవి వెంట నంటఁగన్. 422

తే. పాటి యేదిక్కుఁ గానక ప్రాణభీతి
నెనసి యేడ్చుచు నా హృషీకేశు పాద
కంజములఁ బడి నను గావు కావు మనుచు
నిటలతట ఘటి తాంజలిపుటయు నగుచు. 423

వ. ఇట్లు వినుతించె. 424

సీ. అవ్యయు ననఘు ననంతశక్తినిఁ [3]బరు లయినట్టి బ్రహ్మ రుద్రామరేంద్ర
వరుల కీశ్వరుఁ డైనవాని సర్వాత్మకు జ్ఞానస్వరూపు సమానరహితు
వరదుని జగ దుద్భవ స్థితి సంహార హేతుభూతుని హృషీకేశు నభవు
బ్రహ్మచిహ్నంబు లై పరఁగు సుజ్ఞాన శక్త్యాదుల నొప్పు బ్రహ్మంబు నీశు

ఆ. నజు షడూర్మిరహితు నిజ యోగమాయా వి
మోహి తాఖిలాత్మ ముఖ్యచరితు
మహిత తేజు నాది మధ్యాంత హీనునిఁ
జిన్మయాత్ము నిను భజింతుఁ గృష్ణ! 425

వ. అదియునుం గాక, లోకంబున దైవం బనేకప్రకారంబు లై యుండు. అది యెట్టి దనినం, గళా కాష్ఠా ముహూర్తంబులనం గల కాలంబును, సుకృతదుష్కృతాను భవ రూపంబు లైన జీవకర్మంబులును, స్వభావంబును, సత్త్వ రజ స్తమో గుణాత్మకం బైన ప్రకృతియును, సుఖ దుఃఖాశ్రయం బయిన శరీరంబును, జగజ్జంతు నిర్వాహకం బయిన ప్రాణంబును, సకలపదార్థ పరిజ్ఞానకారణం బయిన యంతఃకరణంబును, మహ దహంకార శబ్ద స్పర్శ రూప రస గంధ తన్మాత్ర తత్కార్యభూత గగన పవనానల సలిల ధరాఖ్య లగు పంచభూతంబులు నాదిగాఁ గల ప్రకృతివికారంబులును, నన్నింటి సంఘాతంబును, బీజాంకుర న్యాయంబునం

1. కనలి (తం. వా.) 2. నందుఁ గఱకంఠ (హ) 3. బరమయినట్టి (హ.)

గార్యకారణ రూప [1]ప్రవాహంబును నై, జగత్కారణ శంకితం బై యుండు. అది యంతయు భవదీయ మాయావిడంబనంబు గాని, యున్నయది కాదు. భవదీయ మాయానివర్తకుండ వయిన నీవు, నానావిధ దివ్యావతారాది లీలలం జేసి, దేవగణంబులను, సత్పురుషులను, లోక నిర్మాణచణు లయిన బ్రహ్మాదులను బరిరక్షింపుచు, లోక హింసాప్రవర్తకు లయిన దుష్ట మార్గగతులం, గ్రూరాత్ముల హింసింపుచుందువు. విశ్వ విశ్వంభరా భార నివారణంబు సేయుటకుఁ గదా భవదీయ దివ్యావతార ప్రయోజనంబు. కావున నిన్ను శరణంబు వేఁడెద.

సీ. [2]శాంత మై మహిత తీక్ష్ణ సుదుస్సహం బై యుదార మై వెలుఁగొందు తావకీన
భూరి భాస్వ త్తేజమునఁ దాప మొందితిఁ గడుఁ గృశించితి నన్నుఁ గరుణఁ జూడు
మితర దేవోపాస్తి రతి మాని మీపాద కమలముల్ సేవించు విమలబుద్ధి
యొందాఁక మదిఁ దోఁప దందాఁకనే కదా ప్రాణులు నిఖిలతాపములఁ బడుట

తే. యవిర ళానన్య గతికుల నరసి ప్రోచు
బిరుదుగల నీకు ననుఁ గాచు టరుదె దేవ!
ప్రవిమలాకార! సంసార భయవిదూర!
భక్తజన పోష పరితోష! పరమపురుష! 427

చ. అనినఁ బ్రసన్నుఁ డై హరి యనంతుఁడు దైత్యవిభేది దాని కి
ట్లనియె మదీయ సాధన మనన్యనివారణ మౌట నీ మదిం
గని నను నార్తిఁ జొచ్చితివి గావున మజ్జ్వర తీవ్రదాహ వే
దన నినుఁ బొంద దింకఁ బరితాపము దక్కుము నీ మనంబునన్. 428

వ. అని మఱియు, న ప్పుండరీకాక్షుం డి ట్లను. ఎవ్వరేనియు నీ యుభయజ్వర వివాదంబును, నీవు మత్ప్రపత్తిఁ జొచ్చుటయుఁ జిత్తంబులఁ దలంతు, రట్టి పుణ్యాత్ములు, శీతోష్ణజ్వరాది తాపంబులం బొరయరు. అని యానతిచ్చిన,న మ్మాహేశ్వర జ్వరంబు పరమానంద భరిత హృదయంబున నా రథాంగపాణికి సాష్టాంగ దండ ప్రణామం బాచరించి, నిజేచ్ఛం జనియె. అంత బాణాసురుండు నక్కడ. 429

—: బాణాసురుఁడు రెండవసారి యుద్ధమునకు వచ్చుట :—

సీ. కమనీయ కింకిణీ ఘంటికా సాహస్ర ఘణఘణ ధ్వనిచేత గగన మగల
నన్య జనాలోక నాభీల తరళోగ్ర కాంచన ధ్వజ పతాకలు వెలుంగఁ
బృథు నేమిఘట్టనఁ బృథివి కంపింపంగ వలనొప్పు పటు జవాశ్వములఁ బూన్చి
నట్టి యున్నత రథం బత్యుగ్రగతి నెక్కి కరసహస్రముల భీకరతరాసి

1. ప్రభావంబును (హ.) 2. చండ మైమహిత తీక్ష్ణ దుస్సహం బై (హ);
"తప్తోఽహం తే తేజసాదుస్సహేన శాంతోగ్రేణ" అని మూలము. (63-29)

తే. శర శరాసన ముఖ దివ్యసాధనములు
దనరఁ జలమును బలము నుత్కటము గాఁగ
హర్ష మిగురొత్త కయ్యంపు టాయితమునఁ
బురము వెలువడెఁ బలిపుత్రుఁ డురుజవమున. 430

క. చని రణభూమిని మధ్యం, దిన మార్తాండ ప్రచండ దీప్తాకృతితోఁ
దనరుచుఁ బరిపంథి బలేం, ధన దవశిఖి యైన కృష్ణుఁ దాఁకెం బెలుచన్. 431

ఉ. తాఁకి భుజావిజృంభణము దర్పము నేర్పును నేర్పడంగ నొ
క్కూఁకున వేయిచేతుల మహోగ్ర శరావళి పింజపింజతోఁ
దాఁకఁగ నేసినన్ మురవిదారుఁడు తోడన తచ్ఛరావళి
న్నాఁక [1]గొనాక ద్రుంచె నిశితార్ధశశాంక శిలీముఖంబులన్. 432

వ. అంత. 433

చ. నుత నవపుండరీక నయనుం డన నొప్పు మురారి రోషఘూ
ర్ణిత మహితారుణాబ్జదళనేత్రుడుఁ దా నయి పంచె దైత్యుపై
దితిసుత కాననప్రకర దీపితశుక్రము రక్షితాంచితా
శ్రితజన చక్రమున్ సతత సేవిత [2]శక్రము [3]దివ్యచక్రమున్. 434

వ. అదియునుం, బ్రచండ మార్తాండ మండలప్రభా విడంబితంబును, భీషణ శత సహస్రకోటి దంభోళిత నిబిడ నిశిత నిష్ఠుర ధారాసహస్ర ప్రభూత జ్వలన జ్వాలికాపాస్త సమస్త కుటిల పరిపంథి దుర్వార బాహుగర్వాంధకారంబును, సకల దిక్పాల దేవతాగణ జేగీయమానంబును, సమద దానవజన లోక భయంకర దర్శనంబును, సమంచిత సజ్జనలోక ప్రియంకర స్పర్శనంబును నగు సుదర్శనం బసురాంతక ప్రేరితం బై చని, యారామకారుండు కదళికా కాండంబుల నేర్చు చందంబునం బేర్చి, సమద వేదండ శుండాదండ మండితంబును, గనక మణివలయ కేయూర కంకణాంకితంబు నగు తదీయ బాహాసహస్రంబుఁ గరచతుష్ట యావ శిష్టంబుగాఁ దునుము నవసరంబున. 435

—: శివుఁడు బాణుని రక్షింప శ్రీకృష్ణుని స్తుతించుట :—

తే. కాలకంఠుఁడు బాణుపైఁ గరుణ గలఁడు
గాన నఖిలాండపతి కృష్ణుఁ గదియవచ్చి
పురుషసూక్తంబుఁ జదివి సంపుట కరాబ్జుఁ
డగుచుఁ బద్మాయతాక్షు నిట్లని నుతించె. 436

---

1. గొనంగ (తం. వా.) 2. చక్రము (హ.) 3. దేవచక్రమున్ (త.)

వ. దేవా! నీవు బ్రహ్మస్వరూపం బగు జ్యోతిర్మయుండవు. నిఖిలవేద వేదాంత [1]నిగూఢుండవు. నిర్మలుండవు. సమానాధిక రహితుండవు. సర్వ వ్యాపకుండ వైన నిన్ను నిర్మలాంతఃకరణు లైనవార లాకాశంబుపగిది నవలోకింతురు. అదియునుం గాక, పంచోపనిష న్మయం బయిన భవదీయ దివ్యమంగళ మహా విగ్రహ పరిగ్రహంబు సేయునెడ, నాభియం దాకాశంబును, ముఖంబునం గృశా నుండును, శిరంబున స్వర్గంబును, శ్రోత్రంబుల దిశలును, నేత్రంబుల సూర్యుండును, మనంబునం జంద్రుండును, పాదంబుల వసుంధరయును, నాత్మయం దహంకారం బును, జఠరంబున సప్తసముద్రంబులును, రేతంబున నంబువులును, భుజంబుల నింద్రుండును, రోమంబుల మేఘ మహీరు హౌషధీవ్రాతంబును, శిరోజంబుల బ్రహ్మలును, జ్ఞానంబున సృష్టియు, నవాంతర ప్రజాపతులును, హృదయంబున ధర్మంబునుం గలిగి, మహాపురుషుండ వై, లోకకల్పనంబు కొఱకు నీ యకుంఠిత తేజంబు గుప్తంబు చేసి, జగదుద్భవంబు కొఱకుం గైకొన్న భవదీయ దివ్యావ తార వైభవం బెఱింగి, నుతింప నెంతవారము. నీవు సకల చేతనాచేతన నిచయంబుల కాద్యుండవు. అద్వితీయుండవు. పురాణపురుషుండవు. సకలసృష్టి హేతుభూతుండవు. ఈశ్వరుండవు. దినకరుండు కాదంబినీ కదంబావృతుం డగుచు భిన్నరూపుం డై, బహువిధ చ్ఛాయలం దోఁచువిధంబున, నీ యఘటిత ఘటనా నిర్వాహకం బైన సంకల్పంబునం ద్రిగుణాతీతుండ వయ్యును, సత్త్వాది [2]గుణ వ్యవధానంబుల ననేకరూపుండ వై, గుణవంతులైన సత్పురుషులకుఁ దమో నివారకం బైన దీపంబు రూపంబునం బ్రకాశింపుచుండుదువు. భవదీయ మాయా విమోహితు లైన జీవులు, పుత్ర దార గృహ క్షేత్ర సంసారాది [3]రూపం బయిన పాప పారావార మహావర్త గర్తంబుల మునుంగుచుం, దేలుచుందురు. దేవా! భవదీయ దివ్య రూపానుభవంబు సేయంజాలక, యింద్రియపరతంత్రుం డై, భవత్పాద సరసీరుహంబుల నేర్పునఁ జేర నెఱుంగని మూఢాత్ముం డాత్మవంచకుం డనంబడు. విపరీతబుద్ధిం జేసి, ప్రియుండ వైన నిన్ను నొల్లక, యింద్రియార్థాను భవంబు సేయుట, యమృతంబు మాని హాలాహలంబు సేవించుట కాదె. జగ దుదయ పాలన లయలీలా హేతుండ వై, శాంతుండ వై, సుహృజ్జన భాగధేయుండ వై సమానాధిక వస్తుశూన్యుండ వైన నిన్ను నేనునుం, బ్రహ్మయుం, బరిణ తాంతఃకరణు లైన మునిగణంబులును, భజియింపుచుందుము. మఱియును. 437

1. నిరూఢుండవు (హ.) 2. విధానంబుల (తం.) 3. రూపంబయిన పారావార (హ.)

తే. అవ్యయుండ వనంతుండ [1]వచ్యుతుండ
వాది మధ్యాంత శూన్యుండ వఖిలధృతివి
నిఖిలమం దెల్ల వర్తింతు [2]నీవు దగిలి
నిఖిల మెల్లను నీయంద నెగడుఁ గృష్ణ! 438

సీ. అని సన్నుతించిన హరి యాత్మ మోదించి మొగమునఁ జిఱునవ్వు మొలకలెత్త
లలిత బాలేందుకళామౌళి కిట్లను శంకర! నీ మాట సత్య మరయఁ
నేది నీ కిష్ట మై యొసఁగెదు దానిన వేఁడుము నీ కిత్తు వీఁ డవధ్యుఁ
డది యెట్టి దనినఁ బ్రహ్లాదుండు మద్భక్తుఁ డతనికి వరము నీ యన్వయమున

తే. జనన మందినవారలఁ జంప ననుచుఁ
గడఁగి మన్నించితిని నది కారణమున
విశ్వ విశ్వంభరాభార విపుల భూరి
బల భుజాగర్వ మణఁపంగవలయుఁ గాన. 439

క. కరములు నాలుగు చిక్కఁగ, బరిమార్చితి వీఁడు నీదు భక్తుల కగ్రే
సరుఁ డై పొగడొందె జరా, మరణాది భయంబు దక్కి మను నిట మీఁదన్. 440

వ. అని యానతిచ్చిన, నంబికావరుండు, సంతుష్టాంతరంగుఁ డయ్యె. అ బ్బలినందనుండు రణరంగవేదిం గృష్ణదేవతా సన్నిధిం బ్రజ్వలిత చక్రకృశాను శిఖాజాలంబులందు నిజబాహాసహస్ర శాఖాసమి త్ప్రచయంబును, దత్క్షతోద్వేల కీలాల మహితాజ్య ధారా శతంబులను, బర భయంకర వీరహుంకార మంత్రంబుల తోడ వ్రేల్చి, పరిశుద్ధిం బొంది, విజ్ఞాన దీపాంకురంబున భుజాఖర్వ గర్వాంధకారంబు నివారించినవాఁ డై, [3]యనవరత పూజిత స్థాణుం డగు బాణుండు, భుజవన విచ్ఛేద జనిత విరూపిత స్థాణుం డయ్యును, దదీయ వరదానకలి తానంద హృదయారవిందుం డగుచు, గోవిందునకుఁ బ్రణామంబు లాచరించి, యనంతరంబ. 441

క. పురమున కేఁగి యుషాసుం, దరికిని ననిరుద్ధునకు ముదంబున భూషాం
బర దాస దాసికాజన, వర వస్తువితాన మొసఁగి వారని భక్తిన్. 442

క. కనకరథంబున నిడుకొని, ఘన వైభవ మొప్పఁ గన్యకాయుక్తముగా
ననిరుద్ధుని గోవిందుం, డనుమోదింపంగఁ దెచ్చి యర్పించె నృపా! 443

---

1. అచ్చుతుండ 2. నీవుగలిగి (హ.) 3. కర్తృపదము పునరుక్తము.

ఉ. అంత మురాంతకుండు త్రిపురాంతకు వీడ్కొని బాణు నిల్పి య
త్యంత విభూతిమై నిజ బలావళితోఁ జనుదేర నా యుషా
కాంతుఁడు మున్నుగాఁ బటహ కాహళ తూర్యనినాద పూరి తా
శాంతరుఁ డై వెసం జనియె నాత్మపురీముఖుఁ డై ముదంబునన్. 444

మ. కనియెన్ గోప కుమారశేఖరుఁడు రంగ త్ఫుల్ల రాజీవ కో
కనదోత్తుంగ తరంగ సంగత లస త్కాసారకన్ భూరి శో
భన నిత్యోన్నత సౌఖ్య[1]భారక నుదంచ ద్వైభవోదారకన్
జనసంతాప నివారకన్ సుజన భాస్వ త్తారకన్ ద్వారకన్. 445

వ. కని, డాయంజనఁ, బురలక్ష్మి కృష్ణసందర్శన కుతూహల యై, చేసన్నలం జీరు చందంబున నందంబు నొందు నుద్ధూత తరళ విచిత్ర కేతుపతాకాభిశోభితంబును, మహనీయ మరకత తోరణ మండితంబును, గనకమణి వినిర్మిత గోపుర సౌధ ప్రాసాదవీథికా విలసితంబును, మౌక్తికవితాన విరచిత మంగళ రంగవల్లీ విరాజితంబును, శోభనాకలిత విన్యస్త కదళికాస్తంభ సురభి కుసుమ మాలి కాక్షతాలంకృతంబును, [2]గుంకుమసలిల సిక్త విపణిమార్గంబును, శంఖ దుందుభి భేరీ మృదంగ పటహ కాహళాది మంగళారావ కలితంబును, వంది మాగధ సంగీతప్రసంగంబును నై, యతిమనోహర విభవాభిరామం బైన య ప్పురంబు, సచివ పురోహిత సుహృ ద్బాంధవముఖ్యు లెదురుకొన, భూసురాశీర్వాదంబులును, బుణ్యాంగనా కరకలిత లలితాక్షతలును గైకొనుచుం, గామినీమణులు కర్పూరనీరాంజనంబులు నివాళింప, నిజమందిరంబుఁ బ్రవేశించి, య ప్పుండరీకాక్షుండు పరమానందంబున సుఖంబున నుండె. అంత. 446

క. శ్రీకృష్ణుని విజయం బగు, నీ కథఁ బఠియించువార లెప్పుడు జయమున్
గైకొని యిహ పర సౌఖ్యము, లాకల్పోన్నతి వహింతు రవనీనాథా! 447

క. అని చెప్పిన శుకయోగికి, జననాయకుఁ డనియెఁ గృష్ణచరితము విన నా
మన మెపుడుఁ దనియ దింకను, వినవలతుం గరుణఁ జెప్పవే మునినాథా! 448

వ. అనినఁ, బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డి ట్లనియె. 449

---

1. భారకను శుంభద్వైభవోదారకన్ (క. చ. ట. వ. గ. జ.) 2. కుసుమ సలిలసిక్త (హ.)

## అధ్యాయము - ౬౪

## —: నృగమహారాజు చరిత్రము :—

సీ. ధరణీశ! యొకనాఁడు హరితనూజులు రతీశ్వర సాంబ [1]సారణ చారుభాను
లాదిగా యదుకుమారావళి యుద్యానవనమున కతివైభవమున నేఁగి
వలనొప్ప నిచ్ఛానువర్తులై సుఖలీలఁ జరియించి ఘనపిపాసలను బొంది
నెఱి తప్పి సలిల మన్వేషించుచును వేఁగ వచ్చుచో నొకచోట వారిరహిత

తే. కూపమును నందులో నొక కొండవోలె
విపుల మగు మేని యూసరవెల్లిఁ గాంచి
చిత్తమున విస్మయం బంది తత్తఱమున
దాని వెడలించు వేడుక దగులుటయును. 450

చ. పరువిడి పోయి తెచ్చి ఘన పాశచయంబుల నంటఁగట్టి య
గ్గురుభుజు లందఱుం గదిసి కో యని యార్చుచు దాని నెమ్మెయిన్
దరలఁగఁ దీయలేక [2]వగ దట్టముగా మది [3]దుట్టగిల్ల నొం
డొరుఁ గడవంగ వే చని పయోరుహనాభున కంతఁ జెప్పినన్. 451

చ. విని సరసీరుహాక్షుఁ డతి విస్మితుఁడై జలశూన్య కూప మ
ల్లన కదియంగ నేఁగి కృకలాసము నొక్క తృణంబుఁ బోలె గొ
బ్బున వెడలించె వామ కరపద్మమున న్నది యంతలోనఁ గాం
చనరుచి మేనఁ గల్గు పురుషత్వముతోఁ బొడసూపి నిల్చినన్. 452

వ. చూచి, కృష్ణుం డతనివృత్తాంత మంతయు నెఱింగియు, నక్కడి జనంబులు, కుమారవర్గంబునుం, దెలియుకొఱకు నతనిచేతఁ దద్వృత్తాంతం బంతయు నెఱిం గించు వాఁడై, యి ట్లనియె. 453

చ. కన దురురత్న భూషణనికాయుఁడవై మహనీయమూర్తివై
యనుపమ కీర్తిశోభితుఁడవై విలసిల్లుచు ధాత్రిమీఁదఁ బెం
పొనరిన నీకు నేమిగతి నూసరవెల్లితనంబు చొప్పడెన్
విన నిది చోద్య మయ్యె సువివేకచరిత్ర! యెఱుంగఁ జెప్పుమా. 454

క. అని యడిగిన మురరిపు పద, వనజంబులఁ దన కిరీట వరమణు లొరయన్
వినయమున మ్రొక్కి యి ట్లను, ఘన మోదముతోడ నిటలఘటి తాంజలి యై.

---

1. గదచారు చారుభాను (హ.) 2. దగ (తం. వా.) 3. "దుట్టగిల్ల" అనియే-అన్ని ప్రతు లలోనున్నది. నిఘంటువులలో "దుట్టగిల్లు" లేదు. "తొట్టగిల్లు" కలదు.

తే. విశ్వసంవేద్య ! మహిత ! యీ విశ్వమందుఁ
బ్రకటముగ నీ వెఱుంగని దొకటి కలదె
యైన నాచేత విన నిష్ట మయ్యెనేని
నవధరింపుము వినుపింతు నంబుజాక్ష ! 456

శా. ఏ నిక్ష్వాకు తనూజుఁడన్ నృగుఁడు నా నేపారు భూపాలుఁడన్
దీనవ్రాతము నర్థిఁ బ్రోచుచు ధరిత్రీనాయకుల్ గొల్చి స
మ్మానింపం జతురంత భూభరణ సామర్థ్యుండ నై సంతత
శ్రీ నిండారినవాఁడ నుల్లసిత కీర్తి స్ఫూర్తి శోభిల్లఁగన్. 457

చ. పలుకులఁ దన్నుఁ దాఁ బొగడఁ బాతక మందు రటుండెఁ దారకా
వలి సికతావ్రజంబు హిమవారి కణంబులు లెక్కపెట్టఁగా
నలవడుఁ గాని యేను వసుధామరకోటికి దాన మిచ్చు గో
వుల గణుతింప ధాతయును నోపఁడు మాధవ! యేమి సెప్పుదున్. 458

వ. అదియునుం గాక. 459

చ. పొలుచు సువర్ణ శృంగ ఖురముల్ దనరన్ దొలుచూలు లై సువ
త్సలు గల పాఁడి యావుల నుదాత్త తపోవ్రత వేదపాఠముల్
గలిగి కుటుంబు లై విహితకర్మములం జరియించు వేదవి
ప్రులకు సదక్షిణంబుగ విభూతి దలిర్పఁగ నిత్తు నచ్యుతా! 460

వ. మఱియును, న్యాయసముపార్జిత విత్తము లగు గో భూ హిరణ్య రత్న నివాస రథ హస్తి వాజి కన్యా సరస్వతీ వస్త్ర తిల కాంచన రజత శయ్యాది బహువిధ దానంబు లనూనంబులుగా ననేకంబులు సేసితి. పంచ మహాయజ్ఞంబు లొనరించితి. వాపీ కూప తటాక వన నిర్మాణంబులు సేయించితి. ఇవ్విధంబునఁ జేయుచో నొక్కనాఁడు. 461

క. అనఘాత్మ ! కశ్యపాఖ్యుం, డను విప్రున కే నకల్మషాత్ముఁడ నై యి
చ్చిన గోవు తప్పి నా మం, దను గలసినఁ దెలియలేక తగ నాగోవున్. 462

క. ఒండొక భూమిసుర కుల, మండనునకు దాన మీయ మనలక యా వి
ప్రుం డా గోవుం గొని చను, చుండన్ మును ధారగొన్న యుర్వీసురుఁడున్.

క. మది రోష మొదవ దోవతి, వదలిన బిగియించుకొనుచు వడిఁ గదిసి దా
మొదవు నడివీథి దొంగిలి, వదలక కొనిపోయె దిట్టివాఁడును గలఁడే. 464

చ. అనవుడు నాతఁ డి ట్లనియె, నాతనితో నిపు డేను దీని న
జ్జనపతి చేత ధారగొని సాధుగతిం జన నీది యంట యె
ట్లనిన నతండు నేనును ధరాధిపుచే మును ధారగొన్న యా
వని [1]వినిపింప నిద్దఱకు నయ్యె నపార వివాద మచ్చటన్. 465

వ. ఇట్లు విప్రు లిద్దఱుం దమలో నంతకంతకు మచ్చరంబు పెచ్చుపెరిఁగి, కలహించి, నా యున్నయెడకుఁ జనుదెంచిరి. మున్ను నాచేత గోదానంబు గొన్న బ్రాహ్మణుఁ డి ట్లనియె. 466

సీ. మనుజేంద్ర ! ప్రజ లధర్మప్రవర్తనముల నడవకుండఁగ నాజ్ఞ నడపు దీవు
మనమున నే ధర్మ మని యాచరించితి మును నాకు నిచ్చిన మొదవు తప్పి
వచ్చి నీ మందలోఁ జొచ్చిన నిప్పు డీ భూసురునకు ధారవోసి యిచ్చి
తగవు మాలితి వీవ దాతవు నపహర్త వైన ని న్నేమన నవనినాథ!

తే. యనినమాటలు చెవులు సోఁకినఁ గలంగి
భూసురోత్తమ! యజ్ఞానపూర్వకమున
నిట్టి [2]పాతక మొరసి నే నెఱిఁగి సేయఁ
గొనుము నీ కిత్తు నొకలక్ష గోధనంబు. 467

క. అని మఱియును న వ్విప్రుని, సునయోక్తుల ననునయింపుచును ని ట్లంటిన్
ననుఁ గావు నరకకూపం, బునఁ బడఁగాఁజాల విప్రపుంగవ ! యనినన్. 468

తే. ఎంత వేఁడిన మత్సరం బంత పెరిఁగి
మొదలు నా కిచ్చినట్టి యీ మొదవె కాని
యొనయ నీ రాజ్య మంతయు నిచ్చితేని
నొల్ల నని విప్రుఁ డచ్చట నుండ కరిగె. 469

వ. అ ట్లతం డరిగిన, నా రెండవబ్రాహ్మణునిం బ్రార్థించిన నతండును, జలంబు డింపక, పదివే లేటి కోరిన పాడిమొదవుల నిచ్చిన నయినను, దీనిన కాని యొల్ల నని నిలువక చనియె. అంతఁ గాలపరిపక్వం బైన, నన్ను దండధరు కింకరులు గొనిపోయి, వైవస్వతు ముందటం బెట్టిన, నతండును నన్ను నుద్దేశించి యి ట్లనియె. 470

మ. మనుజేంద్రోత్తమ ! వంశపావన జగన్మాన్య క్రియాచార ! నీ
ఘన దాన క్రతు [3]ధర్మముల్ త్రిభువన ఖ్యాతంబు లై చెల్లెడిన్
మును దుష్కర్మ ఫలంబుఁ బొంది పిదపన్ బుణ్యానుబంధంబు లై
చను సౌఖ్యంబులఁ బొందు పద్మజుని యాజ్ఞం ద్రోవఁగా వచ్చునే. 471

1. విడిపింప (ట. వ.) 2. పాపంబు దొరసె (తం. వా.) 3. కర్మముల్ (వ.)

వ. అని వేగంబున ద్రొబ్బించిన, నే నపుడు పుడమిం బడి, యీ నికృష్టం బైన యూసరవెల్లిరూపంబు గైకొంటి. ఇంతకాలంబును, దద్దోష నిమిత్తంబున ని ద్దురవస్థం బొందవలసె. ప్రాణులకుఁ బుణ్యాపాపంబు లనుభావ్యంబులు గాని, యూరక పోనేరవు. నేఁడు సమస్త దురితనిస్తారకం బైన భవదీయ పాదారవింద సందర్శనంబునం జేసి, యీ ఘోరదుర్దశలం బాసి, నిర్మలాత్మకుండ నైతి. అని పునః పునః ప్రణామంబు లాచరించి, యి ట్లనియె. 472

ఆ. కృష్ణ ! వాసుదేవ ! కేశవ ! పరమాత్మ !
యప్రమేయ ! వరద ! హరి ! ముకుంద !
నిన్నుఁ జూడఁగంటి నీ కృపఁ గనుఁగొంటి
నఖిల సౌఖ్యపదవు లందఁగంటి. 473

వ. అని, యనేకభంగులం గొనియాడి, గోవిందుని పదంబులు దన కిరీటంబు సోఁకం బ్రణమిల్లి, దేవా ! భవదీయ పాదారవిందంబులు నా హృదయారవిందం బునం బాయ కుండు నట్లుగాఁ బ్రసాదింపవే. అని, తదనుజ్ఞాతుం డై, యచ్చటి జనంబులు సూచి, యద్భుతానందంబులం బొంద, నతుల తేజోవిరాజితం బైన దివ్యవిమానమం దాసీనుం డై, దివంబున కరిగె. అంత, నమ్మాధవుండును, నచ్చట నున్న పార్థివోత్తములకు ధర్మబోధంబుగా ని ట్లనియె. 474

సీ. నరనాథకుల కాననము దహించుటకును నవనీసురుల విత్త మగ్నికీల
జననాయకుల నిజైశ్వర్యాబ్ధి నింకింప బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు
పార్థివోత్తముల సంప చ్ఛైలములు గూల్ప భూసురధనము దంభోళిధార
జగతీవరుల కీర్తిచంద్రిక మాయింప సూర్యోదయము ధరాసురుల ధనము

తే. విప్రతతి సొమ్ము మ్రింగెను విషము మేలు
గరళమునకునుఁ బ్రతికృతి కలదు గాని
దాని మాన్పంగ భువి నౌషధములు లేవు
గాన బ్రహ్మస్వములు గొంటఁ గాదు పతికి. 475

క. [1]ఎఱుఁగమి నయినను భూసుర, వరుల ధనం బపహరింప వలవదు పతికిన్
మఱపున ననలము ముట్టిన, దరికొని వెసఁ గాల్పకున్నె తను వెరియంగన్. 476

వ. మఱియును, దన ధనంబు పరులచేతఁ గోల్పడిన విప్రుఁడు దుఃఖమున రోద నంబు సేయ, రాలిన యశ్రుకణంబుల నవనిరేణువు లెన్ని తడియు, నన్ని వే లేండ్లు తదుపేక్షాపరుం డైన పతి దారుణవేదనలు గల కుంభీపాక

1. విరసము (హ.)

నరకంబు నొందు. మఱియు నతనితోడఁ గ్రిందటఁ బది తరంబులవారును, ముందటఁ బది తరంబులవారును మహానరకవేదనలఁ బొందుదురు. స్వదత్తం బయినఁ, బరదత్తం బయిన నర్థంబులోభంబునం జేసి దుశ్శీలుం డై, బ్రాహ్మణ క్షేత్ర సంభూత ధాన్య ధనాదికంబు భుజియించు, న ప్పాపాత్ముం డఱువది వేల సంవత్సరములు మలకూపంబునం గ్రిమిరూపంబునన్ వర్తించు. అ ట్లగుట నెఱింగి, విప్రుం డెంత తప్పు చేసిన, నెన్ని గొట్టిన, నెన్ని దిట్టిన, నతని కెదురు పలుకక, వినయంబున వందనం బాచరించు పుణ్యాత్ములు, నాదుపాలిటివారు. అదియునుం గాక, నేనును బ్రతిదివసంబును, భూసురుల నతివినయంబునఁ నిట్లు సేయక విపరీతవర్తను లయిన తామసుల నేను వెదకి దండింతును. అది గావున, మీరలును బ్రాహ్మణజనంబులవలనఁ బరమభక్తి గలిగి, మెలంగుండు. అని యానతిచ్చి, యాదవప్రకరంబులు సేవింప, నఖిలలోక శరణ్యుం డయిన య ప్పుండరీకాక్షుండు నిజ నివాసంబునకుం జనియె. అని చెప్పి శుకుం డి ట్లనియె.

క. ఈ కథ చదివినవారలు, గై కొని వినువారు విగత కలుషాత్మకు లై
లౌకిక సౌఖ్యము నొందుదు, రా కైవల్యంబుఁ గరతలామలక మగున్. 478

## అధ్యాయము – ౬౫

—: బలరాముండుఁ సుహృ ద్బంధుజన దర్శనార్థమై వ్రేపల్లెకుఁ బోవుట :—

సీ. నరనాథ! విను మొకనాఁడు తాలాంకుండు చుట్టాల బంధులఁ జూచువేడ్క
సుందర కాంచనస్యంద నారూఢుఁ డై భాసిల్లుచున్న [1]రేపల్లె కరిగి
చిరకాల సంగత స్నేహు లై గోప గోపాంగనా నికర మాలింగనములు
సముచిత సత్కృతుల్ సలుపఁ గై కొని మహోత్సుకలీల నందయశోదలకును

తే. వందనం బాచరించిన వారు మోద
మంది బిగియారఁ గౌఁగిళ్ళ నొందఁ జేర్చి
సమత దీవించి యంకపీఠమునఁ జేర్చి
శిరము మూర్కొని చుబుకంబుఁ గరము పుణికి. 479

వ. మఱియు, నానంద బాష్పధారా సిక్త కపోలయుగళంబులతోడం గుశలప్రశ్నం బుల ని ట్లనిరి. అన్నా! నీవును, నీ చిన్న తమ్ముఁ డగు వెన్నుండును లెస్స యున్నవారె? మ మ్మెప్పుడు నరసి రక్షింపవలయు. మాకు నేడుగడయు మీర

---

1. వ్రేపల్లె (తం. వా.); "రేపల్లె" అని వాడుక.

కాక యొరులు గలరే? అని సముచిత సంభాషణంబులం బ్రొద్దుపుచ్చు చుండిరి. అంత. 480

క. గోపాలవరులు ప్రమదం, బాపోవని మది నివర్తి తాఖిల గేహ
వ్యాపారు లగుచు హాలధరు, శ్రీపాదంబులకు నతులు సేసిరి వరుసన్. 481

క. సీరియు వారికిఁ గరుణా, ధారుం డై నడపె సముచితక్రియ లంతం
గోరి తన యీడుగోపకు, మారులఁ జేచఱచి బలుఁడు మందస్మితుఁ డై. 482

క. నిజ సుందర దేహద్యుతి, రజతాచల రుచులు దెగడ రాముఁడు వారల్
భజియింప నేఁగి యొకచో, విజనస్థలమున వసించి విలసిల్లు నెడన్. 483

కవిరాజవిరాజితము:

చరణములం గనక స్ఫుట నూపుర జాలము ఘల్లనుచుం జెలఁగన్
గరములఁ గంకణముల్ మొరయన్ నలి గొ నసియాడఁ గుచాగ్రములన్
సరులు నటింపఁ గురుల్ గునియన్ విలస న్మణికుండల కాంతులు వి
స్ఫురిత కపోలములన్ బెరయన్ వ్రజసుందరు లంద ఱమందగతిన్. 484

కవిరాజవిరాజితము:

చని బలభద్రుని శౌర్యసముద్రుని సంచితపుణ్యు నగణ్యుని జం
దన ఘనసార పటీర తుషార సుధారుచికాయు విధేయు సుధా
శనరిపు ఖండను సన్మణి మండను సారవివేకు నశోకు మహా
త్మునిఁ గని గోపిక లోపిక లేక యదుప్రభు నిట్లని రుత్కలికన్. 485

చ. హాలధర! నీ సహోదరుఁ డుదంచిత కంజవిలోచనుండు స
ల్లలిత పురాంగనాజన విలాస విహార సమగ్ర సౌఖ్యముల్
గలిగి సుఖంచునే మము నొకానొక వేళనయేని బుద్ధిలోఁ
దలఁచునొ నూతనప్రియులఁ దార్కొని యేమియుఁ బల్కకుండునో. 486

క. జననీజనకుల ననుజులఁ, దనుజుల బంధువుల మిత్రతతి విడిచెను నె
మ్మనమున నొండు దలంపక, తను నమ్మినవారి విడువఁ దగునే హరికిన్. 487

సీ. సలలిత యామున సైకతస్థలమున నుండి మ మ్మేమని యూఱడించె
విమల బృందావనవీథి మా చుబుకముల్ బుణుకుచు నేమని బుజ్జగించె
బుష్పవాటికలలోఁ బొల్చు మా కుచయుగ్మ మంటుచు నేమని యాదరించెఁ
గాసారముల పొంతఁ గౌఁగిట మముఁ జేర్చి నయ మొప్ప నేమని నమ్మఁబలికె

తే. నన్నియు మఱచెఁ గాఁబోలు వెన్నుఁ డాత్మఁ
గోరి [1]తా జాయలు నైననవారి విడుచు
నట్టి కృష్ణుఁడు తము రట్టువెట్టు ననక
యేల నమ్మిరి పురసతుల్ బేల లగుచు. 488

మ. అని యి బ్భంగి సరోజలోచనుని నర్మాలాపముల్ నవ్వులుం
[2]ననుబంధుల్ పరిరంభణంబులు రతివ్యాసంగముల్ భావముల్
వినయంబుల్ సరసోక్తులుం దలఁచి యువ్విళ్లూరు చిత్తంబులం
జనితానంగ శరాగ్నిచేత దురవస్థం బొంది శోకించినం. 489

వ. అంత బలభద్రుండు, వారల మనంబుల సంతాపంబులు వారింప నుపాయంబులగు సరస చతుర వచనంబులఁ గృష్ణుని సందేశంబులు చెప్పుచు, విగత ఖేదలం జేసి, యచ్చట మాసద్వయంబు నిలిచి, వసంతవాసరంబులు గడపుచుఁ, గాళిందీ తీరంబున. 490

సీ. మాకంద జంబీర మందార ఖర్జూర ఘనసార శోభిత వనములందు
నేలాలతా లోల మాలతీ మల్లికా వల్లీమతల్లికా వాటికలను
దరళ తరంగ శీకర సాధు శీతల సైకతవేదికా స్థలములందు
మకరందరస పాన మదవ దిందిందిర పుంజ రంజిత మంజు కుంజములను

తే. విమలరుచి గల్గు సానుదేశములయందు
లలిత శశికాంత ఘన శిలాతలములందు
లీల నిచ్ఛావిహార విలోలుఁ డగుచు
సుందరీ జనములు గొల్వఁ జూడ నొప్పె. 491

తే. అట్లు విహరింప వరుణుని యాజ్ఞఁ జేసి
వారుణీదేవి మద్యభావంబు నొంది
నిఖిల తరు కోటరములందు నిర్గమించి
మించు వాసనచేత వాసించె వనము. 492

వ. అట్టి యెడ. 493

మ. కర మొప్పారు నవీన వాసనల నాఘ్రాణించి గోపాలనుం
దరులుం దానును డాయనేఁగి యతి మోదం బొప్ప సేవించి యా
తరళాక్షుల్ మణి హేమ కంకణ ఝణత్కా రాను[3]కారంబు లై
కరతాళంబులు మ్రోయఁ బాడుచును వేడ్కన్నాడుచుం గొలుచుం. 494

1. తాఁ జాయఁగా నైన (వా); తాఁ జేయఁగానైన (తం) 2. "ప్రేమపరిష్వంగం" (౬౫-౧౫) 3. రావంబులై (చ-బ)

సీ. తనమీఁది బిరుదాంకితము లైన గీతముల్ పాడుచు రా బలభద్రుఁ డంత
మహిత కాదంబరీ మధుపాన మదవిహ్వ లాంగుండు లలిత నీలాలకుండు
నాలోల నవ పుష్పమాలి కోరస్థ్సలుఁ డనుపమ మణికుండ లాంచితుండు
ప్రాలేయ సంయుక్త పద్మంబుగతి నొప్పు సలలి తానన ఘర్మ జలకణుండు

తే. నగుచు వనమధ్యమున [1]సలిలావగాహ
శీలుఁ డయి జలకేళికిఁ జేరి యమున
నిందు రమ్మని పిలువఁ గాళింది యతని
మత్తుఁ డని [2]సడసేయక మసలుటయును. 495

చ. ఘన కుపితాత్ముఁ డై యమునఁ గన్గొని రాముఁడు వల్కె డాయఁ జీ
రిన జనుదేక తక్కితి పురే! నిను నిందఱుఁ జూడ మద్భుజా
సునిశిత లాంగలాగ్రమున [3]సొంపఱ నిప్పుడు నూఱుత్రోవ లై
జన వెసఁ జించివైతు నని చండపరాక్రమ మొప్ప నుగ్రుఁ డై. 496

వ. కట్టలుక రాముం డుద్దామం బగు బాహుబలంబున హలంబు సాఁచి, య మ్మహా వాహినిం [4]దగిల్చి, పెకలిరాఁ దిగిచిన, న న్నది భయభ్రాంత యై, సుందరీ రూపంబు గైకొని, యతి రయంబునం జనుదెంచి, య య్యాదువంశ తిలకుండగు హలధరుని పాదారవిందంబులకు వందనం బాచరించి, యి ట్లనియె. 497

మ. బలరామా! ఘనబాహా! నీ యతుల శుంభ ద్విక్రమం బంగనల్
దెలియం జాలెడివారె యీ యఖిల ధాత్రీభార ధౌరేయ ని
శ్చలసత్త్వం డగు కుండలీశ్వరుఁడునుం జర్చింప నీ సత్కళా
కలితాంశ ప్రభవుండు నీ గురు భుజాగర్వంబు సామాన్యమే. 498

చ. అని వినుతించి యేను భవదంఘ్రిసరోజము లాశ్రయించెదన్
ననుఁ గరుణింపు మన్న యదునందనుఁ డ న్నదిఁ బూర్వమార్గ యై
చను మని కామినీనికర సంగతుఁ డై జలకేళి సల్పి నిం
పెనయఁ గరేణుకాయుత మదేభముచాడ్పున న మ్మహానదిఁ. 499

తే. అంత జలకేళి సాలించి సంతసంబు
నందుచుండ వినీల వస్త్రాది రత్న
మండనంబులుఁ గాంచనమాలికయునుఁ
దెచ్చి హాలి కిచ్చి చనియె నదీలలామ. 500

---

1. సలీలానురాగ (హ.) 2. సడ్డసేయక (తం. వా) 3. సొంపరియుంపుడు (హ) 4. గదల్చి (హ)

క. అవి యెల్లఁ దాల్చి హలధరుఁ, డవిరళగతి నొప్పి వల్లవాంగనలును దా
దివిజేంద్రుఁ బోలి మహితో, త్సవమున వర్తింపుచుండె సౌఖ్యోన్నతుఁ డై. 501

క. అవనీశ ! యిట్లు హలమునఁ, దివిసినఁ గాళింది [1]క్రయ్య తెలుపై నేఁడుఁ
భువి నుతికెక్కెను రాముని, ప్రవిమల [3]తర మైన బాహుబల సూచకమై. 502

అధ్యాయము - ౬౬

—: శ్రీకృష్ణుండు పౌండ్రక వాసుదేవునిమీఁద దండెత్తుట :—

వ. అంత బలభద్రుండు, వ్రజసుందరీ సమేతుం డై, నందఘోషంబునం బరితోషంబు నొందుచుండె. అంత నక్కడఁ గరూశాధిపతి యైన పౌండ్రకుండు, తన దూతం బిలిచి, యి ట్లనియె. 503

సీ. మనుజేశ ! బలగర్వమున మదోన్మత్తుఁ డై యవనిపై వాసుదేవాఖ్యఁ డనఁగ
నే నొక్కరుఁడఁ గాక యితరుల కీ నామ మలవడునే యని [4]యదటు మిగిలి
తెగి హరి తా వాసుదేవుండ [5]ననుకొను నఁట పోయి వల దను మనుచు దూతఁ
బద్మాయతాక్షుని పాలికిఁ బో మ్మన్న నరిగి వా డంబుజోదరుఁడు పెద్ద

తే. కొలువు గై కొనియుండ సంకోచపడక
వినుము మా రాజుమాటగా వనజనాభ !
యవని రక్షింప వాసుదేవాఖ్య నొంది
నట్టి యే నుండ [6]సిగ్గు వోఁ దట్టినీవు. 504

క. నా పేరును నా చిహ్నము, లేపున ధరియించి తిరిగె దిది పంత మె యిం
తే పో మదిఁ బరికించిన, నే పంత మెఱుంగుఁ గొల్లఁ డేమిట నై నఁ. 505

ఆ. ఇంతనుండి యైన నెదిరిఁ ద న్నెఱిఁగి నా
చిహ్న లెల్ల విడిచి చేరి కొలిచి
బ్రతుకు మనుము కాక పంతంబు లాడెనా
యెదురు మనుము ఘోర కదనమునను. 506

క. అను దుర్భాషలు సభ్యులు, విని యొండొరు మొగము చూచి విస్మితు లగుచో
జనులార ! యెట్టి క్రొత్తలు, వినఁబడియెడి నిచట లెన్స వింటిరె యనఁగఁ. 507

వ. అట్టియెడఁ గృష్ణుండు వాని కి ట్లనియె. 508

---

1. ద్రవ్వ్య (హా. తం. వా) 2. తెలుపై అని తం. వాలలోను వ్రాఁత ప్రతు లన్నిటిలోను పాఠము 3. గతినొప్పు బాహుబల మల్పంబే (హా) 4. యదురు మిగిలి(హా) 5. ననుకొంట యటఁ బోయి నీవు వల్దనుము దూత ! (హా) 6. సిగ్గువొం దట్టి (హా)

మ. వినరా! మీ నృపుఁ డన్న చిహ్నములు నే [1]వే వచ్చి ఘోరాజిలోఁ
దన మీఁదన్ వెస వైవఁ గంకముఖ గృధ్ర వ్రాతముల్ మూఁగఁగా
ననిలో దర్పము దూలి కూలి వికలం బై సారమేయాళికి
న్ననయంబు [2]న్నశనంబ వయ్యెదను మే నన్నట్లుగా వానితోన్. 509

క. అని యుద్రేకముగా నా, డిన మాటల కులికి వాఁడు డెందము గలఁగన్
జని తన యేలిక కంతయు, వినుపించెను నతనిమదికి విరసము గదురన్. 510

వ. అంతఁ గృష్ణుండు, దండయాత్రోత్సుకుం డై, వివిధాయుధ కలితంబును, విచిత్ర కాంచన పతాకా కేతు విలసితంబును, నగు సుందర స్యందనంబును బటు జవ తురంగంబులం బూన్చి దారుకుండు తెచ్చిన నెక్కి, యతిత్వరితగతిం గాశికా నగరంబున కరిగినం, బౌండ్రకుండును, రణోత్సాహంబు దీపింప, నక్షౌహిణీ ద్వయంబుతోడం బురంబు వెడలె. అప్పు డతని మిత్రుం డయిన కాశికాధిపతి యును, మూఁ డక్షౌహిణులతోడం దోడుపడువాఁ డై వెడలె. ఇట్లాప్త యుతుం డై వచ్చు వాని. 511

సీ. చక్ర గదా శంఖ శార్ఙ్గాది సాధనుఁ గృత్రిమ కౌస్తుభ శ్రీ నివాసు
మకరకుండల హార మంజీర కంకణ మణిముద్రికా వనమాలికాంకుఁ
దరళ విచిత్ర పతంగపుంగవ కేతుఁ జెలువొందు పీత కౌశేయవాసు
జవనాశ్వ కలిత కాంచన రథారూఢుని రణకుతూహలుని సన్మణికిరీటుఁ

తే. నాత్మసమ వేషు రంగవిహార కలిత
నటసమానునిఁ బౌండ్రభూనాథుఁ జూచి
హర్ష మిగురొత్త నవ్వెఁ బద్మాయతాక్షుఁ
డంత వాఁడును నుద్వృత్తుఁ డగుచు నడరి. 512

క. పరిఘా శరాస [3]పట్టిస, శర ముద్గర ముసల కుంత చక్ర గదా తో
మర [4]భిండివాల శక్తి, ఛురికాసి ప్రాస పరశు శూలముల వెసన్. 513

చ. పరువడి వైచినన్ దనుజభంజనుఁ డంత యుగాంతకాల భీ
కర మహితోగ్ర పావకునికై వడి నేచి విరోధి సాధనో
త్కరముల నొక్కటన్ శరనికాయములన్ నిగుడించి త్రుంచి భా
స్వరగతి నొత్తె సంచలిత శాత్రవసైన్యము పాంచజన్యమున్. 514

1. వేంచేసి (త. వ. జ.) 2. శరణంబ వయ్యెదను (తం. వా.) "శయిష్యసే హత స్తత్ర భవితా శరణం శునామ్" (66-9) 3. పట్టిస (హ.) 4. భిండిపాల (వా.)

ఉ. వారని యల్కతోఁ గినిసి వారిజనాభుఁడు వారిసైన్యముల్
మారి మసంగినట్లు నుఱుమాడినఁ బీనుఁగుపెంటలై వెసం
దేరులు వ్రాలె నశ్వములు ద్రెళ్లె గజంబులు [1]ద్రుళ్లె సద్భటుల్
ధారుణిఁ గూలి రిట్లు నెఱి దప్పి చనెన్ హతశేష సైన్యముల్. 515

వ. అట్టియెడ, మేదో మాంస పంకంబులు రుధిరప్రవాహంబులు నై, సంగరాంగణంబు ఘోరం బయ్యె. అయ్యవసరంబునం గయ్యంబునకుం గాలు [2]ద్రవ్వు నప్పౌండ్రకునిం గనుంగొని, హరి సంబోధించి, యిట్లనియె. 516

మ. మనుజేంద్రాధమ! పౌండ్రభూపసుత! నీ మానంబు బీరంబు నేఁ
డనిలో మాపుదు నెద్దు క్రొవ్వి వెలుచ న్నాఁబోతుపై నంకెవై
చిన చందంబున దూతచేత నను నాక్షేపించి వల్దన్న వే
రును చిహ్నంబులు నీపయిన్ విడుతు [3]నర్చుల్ పర్వ నేఁ డాజిలో. 517

క. అదిగాక నీదు శరణము, పదపడి యేఁ జొత్తు నీవు బల విక్రమ సం
పదగల పోటరివేనియుఁ, గదలక నిలు మనుచు నిశితకాండము లంతన్. 518

మ. చల మొప్పన్ నిగుడించి వాని రథమున్ జక్కాడి తత్సారథిన్
దల వే ద్రుంచి హయంబులన్ నఱికి యుద్దండ ప్రతాప క్రియన్
బ్రళయార్క ప్రతిమాన చక్రమున నప్పౌండ్రున్ వెసన్ ద్రుంప వాఁ
డిలఁ గూలెన్ గులిశాహతి న్నొరగు శైలేంద్రాకృతిన్ భూవరా! 519

చ. [1]మడవక కాశికావిభుని మస్తక ముద్ధతిఁ ద్రుంచి బంతికై
వడి నది పింజపింజ గఱవన్ విశిఖాళి నిగుడ్చి వాని యే
లెడి పురిలోన వైచె నవలీల మురాంతకుఁ డిట్లు వైరులన్
గడఁగి జయించి చిత్తమునఁ గౌతుకమున్ జిగురొత్త నత్తఱిన్. 520

క. సుర గంధర్వ నభశ్చర, గరుడోరగ సిద్ధ సాధ్య గణము నుతింపన్
మరలి చనుదెంచి హరి నిజపురమున సుఖ ముండె నతి విభూతి దలిర్పన్. 521

క. వనజోదరు చిహ్నంబులు, గొనకొని ధరియించి పౌండ్రకుఁడు [5]మత్సరి యై
యనవరతము హరి దనతలఁ, పునఁ దగులుటఁ జేసి ముక్తిఁ బొందె నరేంద్రా!

సీ. అక్కడఁ గాశిలో నారాజు మందిరాంగణమునఁ గుండల కలిత మగుచుఁ
బడియున్న తలఁ జూచి పౌరజనంబులు దమరాజు తల యని తగ నెఱింగి
చెప్పిన నా నృపు జీవితేశ్వరులును సుతులు బంధువులును హితులుఁ గూడి
మొనసి హాహాకారముల నేడ్చి రత్తఱిఁ దత్తనూభవుఁడు సుదక్షిణుండు

1. మ్రొగ్గె (తం. వా.) 2. ద్రొవ్వ (హ.) 3. నంచున్ బల్కె నేఁ డాజిలో (హ.)
4. మడవక (హ.) 5. మచ్చరి (తం. వా.)

తే. వెలయఁ దండ్రికిఁ బరలోకవిధు లొనర్చి
జనకు ననిలోన వధించిన చక్రపాణి
నడరి మర్దింపఁ దగు నుపాయంబు దలఁచి
చతురుఁ డగునట్టి తన పురోహితునిఁ బిలిచి. 523

క. అతఁడుం దానును జని పశు, పతి పదసరసిజములకును బ్రమదముతో నా
నతుఁ డయి య ద్దేవుని బహు, గతులం బూజింపఁ నతఁడుఁ గరుణానిత్యుఁ డై.

క. మెచ్చితి వర మే మైనను, నిచ్చెద నను వేఁడు మనిన నీశ్వర! నన్నుఁ
మచ్చిక రక్షింతువు పొర, పొచ్చెము సేయక మహేశ! పురహర! యభవా!

క. దేవా! మజ్జనకుని వసు, దేవాత్మజుఁ డాజిలోన వధించెను నే నా
గోవిందుని ననిలోపల, నేవిధమున గెల్తు నాన తీవె పురారీ! 526

తే. అనిన శంకరుఁ డతనికి ననియె ననఘ!
నీవు ఋత్విజులును భూసురావళియును
బ్రీతి నభిచార మొనరింప భూతయుక్తుఁ
డగుచు ననలుండు దీర్చు నీ యభిమతంబు. 527

తే. అనిన నా చంద్రమౌళి వాక్యములభంగి
భూరి నియమముతో నభిచారహోమ
మొనరఁ గావింప నగ్ని యథోచితముగఁ
జెలఁగి దక్షిణ వలమాన శిఖల వెలిఁగె. 528

వ. అందుఁ దామ్ర శ్మశ్రు కేశ కలాపంబును, నళినిసంకాశంబు లైన నిడుద కోఱలును, నిప్పు లుప్పతిల్లు చూపులును, ముడివడు బొమలును, జేవురించిన మొగంబును గలిగి, యతి రౌద్రాకారంబునఁ బ్రజ్వరిల్లుచుం, గుండంబు వెలువడి,కృత్య యై నందిన నిహన్యమాన ప్రాణరక్తారుణ మృత్యు కరవాలంబులీలం జూపట్టు నాలుకన్ సెలవుల నాకుచు, నగ్నికీలాభీలం బగు శూలంబు కేలం దాల్చి, భువన కోలాహలంబుగా నార్చుచు, నుత్తాల తాలప్రమాణ పాదద్వయ హతులం దూలు పెంధూళి నింగి మ్రింగ, భూతంబులు సేవింప, నగ్నవేష యై, నిజ విలోచన సంజాత సముద్ధూత నిఖిల భయంకర జ్వాలికాజాలంబు లోలిం గ్రేల్చుచు, నుద్వేగగమనంబున నగధరనగరంబున కరుగుదేరఁ బౌరజనంబులు భయాకుల మానసు లై, దావదహనునిం గని పఱచు వనమృగంబుల చాడ్పునం బఱచి, సుధర్మాభ్యంతరంబునం జూదంబాడు దామోదరుం గని, రక్ష రక్షేతి యార్త రవంబులం గృష్ణ! కృష్ణ! పెనుమంటలం బురంబుఁ గాల్పం బ్రళయాగ్ని చను

దెంచె నన, వారిం జూచి, మీ రోడ కుండుం డని, భయంబు నివారించి, సర్వ రక్షకుం డయిన పుండరీకాక్షుండు, జగదంతరాత్ముండు గావునఁ, దద్వృత్తాంతం బంతయుఁ దనచిత్తంబున నెఱింగి, కాశిరాజపుత్ర ప్రేరిత యైన య మ్మహా [1]కృత్యను నిగ్రహింపం దలంచి, నిజ పార్శ్వవర్తి యై యున్న య ద్దివ్యసాధ నంబుఁ గనుంగొని, యప్పుడు. 529

సీ. భీమ మై బహు తీవ్రధామ మై హత రిపు స్తోమ మై సుమహి తోద్దామ మగుచుఁ
జండ మై [2]విజిత మార్తాండ మై పాలితా జాండ మై విజయ ప్రకాండ మగుచు
దివ్య మై నిఖిల గంతవ్య మై సుజన సంభావ్య మై సద్భక్త సేవ్య మగుచు
నిత్య మై నిగమ సంస్తుత్య మై వినమి తాదిత్య మై నిర్జిత దైత్య మగుచు

తే. విలయసమయ సముద్ధూత విపుల భాస్వ
దళికలోచన లోచనానల సహస్ర
ఘటిత పటు సటాజ్వాలికా చటుల సత్వ
భయద చక్రంబు [3]కృత్యపైఁ బంపె శౌరి. 530

వ. అదియును, ప్రళయవేళా సంభూత జీమూతసంఘాత ప్రభూత ఘుమఘు మాటోప నిన దాధరీకృ తాతిదుస్సహ కహకహ నిబిడ నిస్వన నిర్ఘోష పరి పూరిత బ్రహ్మాండ కుహరంబును, నభ్రంలిహ కీలాసముత్కట పటు చిటచిట స్ఫుట ద్విస్ఫులింగ చ్ఛటాభీలంబును, సకల దేవతాగణ జయజయ శబ్దకలితంబును, ననంత తేజోవిరాజితంబును, నగుచుఁ, గదిసినం, బంటింపక, కంటగించు [4]కృత్యను గెంటి, వెంట నంటినఁ, దన తొంటి రౌద్రంబు విడిచి, మరలి, కాశీపురంబు సొచ్చి, పౌరలోకంబు భయాకులతం బొంది వాపోవ, రోష భీషణాకారంబుతో నప్పుడు బుత్త్వి జ్జ్నికాయ యుతంబుగా సుదక్షిణునిం దహించె. అ త్తఱి జక్రంబును, దన్నగరంబు సౌధ ప్రాకార గోపు రాట్టాలకాది వివిధ వస్తు వాహన నికరంబులతో భస్మంబు గావించి, మరలి, యమరులు వెఱ గందఁ గమలలోచను పార్శ్వవర్తి యై, నిజ ప్రభావపుంజంబు వెలుఁగొందఁ గొల్చి యుండె. అని చెప్పి మఱియు ని ట్లనియె. 531

క. మురరిపు విజయాంకిత మగు, చరితము సద్భక్తిఁ దగిలి చదివిన వినినన్
దురితములఁ బాసి జను [illegible] సౌఖ్యము లతనిచేతఁ బడయుదు రధిపా! 532

వ. అనిన శుకయోగికి రా జి ట్లనియె. 533

1. కృత్తిని (హ) 2. పిహిత (హ) 3. కృత్తిపై (హ): "కృత్యాం మాహేశ్వరీం విభుః విజ్ఞాయ తద్విఘాతార్థం పార్శ్వస్థం చక్ర మాదిశత్ (66-38)" 4. కృత్తిని (తం.); కృత్యను (వా) "కృత్యానలః ప్రతిహతః" (66.40)

—: బలరాముండు ద్వివిదుం డను వానరుని సంహరించుట :—

క. బలభద్రుఁ డప్రమేయుం, డలఘుఁ డనంతుండు నతని యద్భుతకర్మం
బులు వినియుఁ దనియ దింకను, దెలియఁగ నా కానతిమ్ము దివ్యమునీంద్రా! 535

వ. అనిన రాజునకు శుకుం డి ట్లనియె.

క. జననాయక! విను సుగ్రీ, వుని సచివుఁడు మైందునకు సహోదరుఁ డనఁగా
వినుతికి నెక్కిన ద్వివిదుం, డను ప్లవగుఁడు నరకసఖ్యుఁ డతిదర్పితుఁ డై. 536

సీ. చెలికాని పగ దీర్పఁ దలఁచి కృష్ణుం డేలు పురములు జనపదంబులు దహించి
సరి దుపవన సరోవరములు [1]గోరాడి మందలఁ గొందలమందఁ జేసి
ప్రాసాదములు ద్రొబ్బి పరిఘలు మాయించి చతురంగబలముల సమయఁ జేసి
పురుషుల సతులను భూధర గుహాలలోఁ బెట్టి వాకిలి గట్టి బిట్టు నొంచి

తే. ఫలిత తరువులఁ ద్రుంచి సాధుల నలంచి
కోట లగలించి పడుచుల నీట ముంచి
ధరణి ని బ్భంగిఁ బెక్కు బాధల [2]నలంచి
పఱవఁ జేయుచు నొకనాఁడు ప్లవగవరుఁడు. 537

క. చతుర మృదు గీతరవ ము,న్నతి వీతెంచినఁ జెలంగి నగచరుఁ డా రై
వతగిరి కందరమున కా,యతగతిఁ జని యందు నెత్త మాడెడు వానిన్. 538

చ. లలిత వినీలవస్త్రుని విలాసవతీయుతుఁ జంద్ర చంద్రికా
కలిత మహోన్నతాంగు మణి కాంచన దివ్యవిభూష ణోన్నతున్
విలసిత వారుణీసమద విహ్వల లోచనుఁ గాంచె సీర ని
ర్దలిత రిపుక్షితీశ నిజధాముని రామునిఁ గామపాలునిన్. 539

సీ. కనుఁగొని తత్పురోగమ భూమిరుహశాఖ లెక్కి యూఁచుచుఁ జాల వెక్కిరించుఁ
[3]గికురింత లిడుఁ బండ్లు గీటుచు నవ్వుచుఁ గొమ్మకొమ్మకు నుఱుకుచు నదల్చుఁ
దోఁక నూరక మేను సోఁకఁగ నులివెట్టు వెడవెడ నాలుక వెళ్లఁబెట్టు
బరుల నఖంబుల గిరగిరఁ గోఁకుచుఁ బోరిఁబోరి ఫలములు గఱచి వైచు

తే. గోళ్ళు తెగఁ గొర్కు యుమియును గుదము సూపు
బలసి మర్కటజాతి య ప్పగిదిఁ [4]జేయు
గోపమున హలధరుం డొక గుండు వైవ
దానిఁ దప్పించుకొని ప్రల్లదమున నతని. 540

1. గొల్లాడి (క) 2. [illegible] (తం. వా.) 3. గికురించుచును బండ్లిగిల్చి చూపుచు (తం. వా.) 4. జూప (తం. వా.)

క. నగి యాసవకలశముఁ గొని, [1]జగతీరుహశాఖ యెక్కి చాపలమున న
జ్జగతిపయి వైచెఁ దద్దృష్టః; మగలఁగ నది చూచి కోప మగ్గల మొదవన్. 541

వ. మఱియును. 542

క. సీరినిఁ దన మనమున నొక, చీరికిఁ గైకొనక కదిసి చీరలు చింపన్
[2]వార కతఁడు భువి జనములఁ, గారించుట మాన్పఁదలఁచి ఘన కుపితుం డై.

వ. ఇట్లు కోపోద్దీపిత మానసుం డై, కనుంగొని, హలాయుధుం డప్పుడు. 544

చ. ముసలముఁ దీవ్ర శాత హలముల్ ధరియించి సమస్త చేతన
గ్రసనమునాఁడు పొంగు లయకాలుని భంగి నదల్చి నిల్వ వాఁ
డసదృశ విక్రమక్రమ విహార మెలర్ప సమీప భూజమున్
వెసఁ బెకలించి మస్తకము వ్రేసెఁ జలంబు బలంబు చొప్పడన్. 545

వ. ఇట్లు వ్రేయ బలుం డప్పుడు. 546

చ. ఉరవడి దండతాడిత మహోరగుభంగిఁ గడంగి వీరసా
గర మన నేర్చి హేమకటకంబుల నొప్పు సునందనామ భీ
కర ముసలంబునన్ ద్వివిదు కంఠము వ్రేసినఁ [3]బొల్చె వాఁడు జే
గురుగల కొండచందమునఁ 'గో' యని యార్చి సురల్ నుతింపఁగన్. 547

మత్తకోకిల. *అంత వాఁ డొకయింత మూర్ఛిలి యంతలోఁ దెలివొంది దు
ర్దాంత భూరి భుజావిజృంభణుఁ డై మహీజము పూని వై
త్యాంతకాగ్రజు వ్రేసె వ్రేసిన నాగ్రహంబున దాని నిం
తింత లై ధర రాలఁజేసె నహీన విక్రమశాలి యై. 548

క. *మఱియును జలముడుగక [4]వెసఁ,దరుచరుఁ డొక తరువు వ్రేయఁదాలాంకుఁ డనా
దరమునఁ దునిమిన వెండియుఁ, దొరఁగించెఁ గుజంబు లతఁడు దోడ్తోఁ దునుమన్.

క. *ఆ చందంబున వనచరుఁ, డేచి మహీరుహచయంబు లెల్లను హలిపై
వైచి తరుశూన్య మగుటయుఁ, జూచి శిలావృష్టి గురిసె సుర లగ్గింపన్. 550

క. బలుఁ డపుడు రాలు తుము రై, యిల రాలఁగఁజేసి యార్చె నే పుడుగక యా
వలిముఖుఁడు [5]తాల సన్నిభ, ము లయిన నిజ బాహు దండముల నుగ్రుం డై.

---

1. శాఖలెక్కి (హ) 2. వారకదా (హ); వారకఁదా (వా) 3. బొల్చి (హ)
4. తరు, చరుఁ డొకతరు వెత్తివ్రేయఁ దాలాంకుఁడు (హ) *ఈ మూడు పద్యములును "ట" ప్రతిలో లేవు. 5. తాల సన్నిభ, ములుగల బాహుయుగ దండముల (హ)

క. వడిఁ బిడుగుఁ బోలు పిడికిటఁ, బొడిచిన వడి సెడక బలుఁడు ముసలము హలముం
విడిచి ప్లవంగుని మెడఁ గడు, వెడవెడ బిగియించె గుడ్లు వెలి కుఱుకంగన్.

క. వదనమునఁ జెవుల రుధిరము, మెదడును దొరఁగంగ వాఁడు మేదినిమీఁదం
జదికలఁబడి యొకయింతయు, మెదలక మిడుకంగ లేక మృతిఁ బొందె నృపా!

తే. వాని పాటున కప్పుడు వనసమేత
మగుచు నా శైలరాజ మల్లల్ల నాడె
సురగణంబులు రాముపై సురభి కుసుమ
వర్షములు గురిసి రతి[1]వైభవము మెఱసి. 554

వ. ఇవ్విధంబున భువన కంటకుం డైన దుష్ట శాఖా మృగేంద్రుని వసుంధరకుం
బలిచేసి, సకలజనంబులు పరమానంద కందళిత హృదయారవిందు లై, తన్ను
నందింప, నయ్యదునందనుండు నిజనగరంబున కరుదెంచె. అని శుకుండు వెండియు
న మ్మనుజపతి కి ట్లనియె. 555

## అధ్యాయము — ౬౮

బలరాముండు దన హలంబున హస్తినా పురమును గంగలోఁ ద్రోయఁ బూనుట.

సీ. కోరి సుయోధను కూఁతురి సర్వలక్షణములు గల్గి లక్షణ యనంగ
మహి నొప్పు కన్యకామణి వివాహంబునఁ జక్రహస్తుని తనూజాతుఁ డైన
సాంబుఁడు బలసాహసమున నెత్తుకపోవఁ గౌరవు లీక్షించి కడఁగి క్రొవ్వి
పడుచువాఁ డొకఁ డదె [2]బాలికఁ గొనిపోవు చున్నాఁడు గై కొన కుక్కు మిగిలి

తే. యిట్టి దుర్మదుఁ గయిముట్టి పట్టి తెచ్చి
జనులు వెఱఁగందఁ [3]జెఱఁబెట్టి యునుతు మేని
[4]యదువులు మనల నేమి సేయంగఁ గలరొ
యనుచుఁ గురు వృద్ధజనముల యనుమతమున. 556

వ. ఇట్లు గడంగి, యుద్ధ సన్నద్ధు లై, బల శౌర్యోపేతు లగు, కర్ణ శల్య [5]భూరి
శ్రవో యజ్ఞకేతు సుయోధనాదులు సమున్నత రథారూఢు లై, కూడ నరిగిన,
వారలఁ గనుంగొని, జాంబవతీ నందనుండు, మందస్మిత వదనారవిందుం డగుచు,
సింగంబు భంగి గర్జింపుచు, మణిదీప్తం బైన చాపంబుఁ బూని, నిల్చిన, వారు
నా సాంబుని నదల్చి, నిలు నిలు మని పలికి. 557

---

1. వైభవముల (హ); వృష్టిఁ గురియించి రతుల సంతుష్టి మెఱసి (తం. వా.) 2. బాలకి
(జ) 3. జెఱవట్టి (తం. వా.) 4. యాదవులు (హ) 5. భూరిశ్రవ యజ్ఞకేతు (హ)

తే. చండ కోదండముక్త నిశాత విశిఖ
జాల మందంద వఱపి యాఖిలముగను
నందనందన నందన స్యందనంబు
ముంచి రచలేంద్రమును ముంచు మంచు పగిది. 558

వ. మఱియును. 559

శా. శౌర్యాటోప విజృంభణంబుల సరోజాతాక్షసూనుఁ డు సురా
హార్యస్థైర్యుని మీఱనేయ నతఁ డుద్య ద్భూరి బాహాబలా
*వార్యుం డై శిత సాయకాలి నవి మాయంజేసినం దేవతా
తూర్యంబుల్ దివి మ్రోసె నంత నతఁ డస్తోక ప్రతాపోన్నతిన్. 560

వ. ఇట్లు గణంగి బాణజాలంబులు పరఁగించి, యందఱకు నన్నిరూపు లై రథ రథ్య సూత ధ్వజ పతా కాతపత్రంబులు చూర్ణంబులు గావించి, విరథులం జేసి, వారల మెయిమఱువు లఱువుల్లు గావించి, యొక్కొక్కనిఁ బెక్కు బాణంబుల నుచ్చిపో నేసిన, వారలు శోణిత దిగ్ధాంగు లై కుసుమిత కింశు కంబులంబోలి యుండిరి. అంత. 561

ఉ. వార లనేకు లయ్యు బల[1]వంతులు నయ్యు మహోగ్ర సంగరో
దార పరాక్రమ ప్రకట [2]దర్పకు లయ్యుఁ గుమారకుం జగ
ద్వీరుని నొక్కనిం జెనకి వ్రేలును వంపఁగలేక సిగ్గునన్
గూరిన చింత నొండొరులఁ గూడుచు విచ్చుచు వెచ్చ నూర్చుచున్. 562

వ. మగుడి సమరసన్నద్ధు లై, సంరంభించి. 563

ఉ. అందఱు నొక్కపెట్ట దనుజాంతక నందనుఁ జుట్టుముట్టి యు
ద్దండ నిశాత సాయకచయంబుల ముంచి రథంబు నుగ్ర లీ
లం దునుమాడి చాపము [3]చలంబునఁ ద్రుంచి హయాళిఁ జంపి సూ
తుం దెగటార్చి యంత విరథుం [4]డగుటన్ వెసఁ జొచ్చి పట్టినన్. 564

తే. బాలకుఁడు చేయునది లేక పట్టువడియెఁ
గౌరవులు తమ మనమునఁ గౌతుకంబు
లొలయ సాంబునిఁ గన్యకాయుక్తముగను
బురమునకుఁ దెచ్చి రతులవిభూతి మెఱసి. 565

---

* ఈ పాదమున యతి భంగము. పాఠాంతరము దొరకలేదు.

1. బలవంతులరయ్యు (హా) 2. దఱులునయ్యు (తం. వా.) 3. రయంబున (హా)
4. డగుచున్ (తం); డగుడున్ (హా)

వ. అంత ద్వారకానగరంబున. 566

ఉ. జాంబవతేయు వార్త యదుజాతులు నారదయోగిచే సమ
స్తంబును విన్నవా రగుచు సంగరకౌతుక ముప్పతిల్లఁ జి
త్తంబులఁ గౌరవాన్వయ కదంబము నొక్కట నుక్కడంచు గో
పంబుల నుగ్రసేన జనపాలు ననుజ్ఞ [1]ననూన సైన్యముల్. 567

తే. కూడి నడవంగఁ గని వారితోడ బలుఁడు
ధార్తరాష్ట్రులు మనకు నెంతయును డాసి
నట్టి బంధులు వారిపై నిట్టియలుక
నెత్తి చనుచుంట యిది నీతియే తలంప. 568

వ. అని వారల వారించి, తత్క్షణంబ బంధుప్రియుం డయిన బలరాముం డనలార్క సంకాశం బగు కాంచనరథం బెక్కి, యనురక్తు లయిన భూసురులును, యుద్ధవాదు లగు కులవృద్ధులును సేవింపం, గరిపురంబునకుం జని, తత్పురోపకంఠ వనంబున సురభి కుసుమ ఫలభరిత తరుచ్ఛాయా విరచిత చంద్రకాంత శిలాతలంబునందు వసియించి, మహిత గ్రహమధ్యగతుం డైన పూర్ణచంద్రు ననుకరించి యుండె. అంతఁ గార్యబోధనంబు సేయుటకై కౌరవ్యులయొద్దకుం ప్రబుద్ధుం డయిన యుద్ధవుం బనిచినం జని, యతం డాంబికేయునకు ధనురాచార్యాపగాతనూభవ సుయోధనులకుం బ్రణమిల్లి, వారిచేత నభినందితుం డై, యి ట్లనియె. 569

సీ. భూరి యశోధనులార! తాలాంకుఁడు చనుదెంచి నగరోపవనమునందు
నున్నవాఁ డనిన వా రుత్సాహమున బలుఁ బొడగను వేడుక బుద్ధిఁ దోఁపఁ
దనరారఁ గానుకల్ గొని చని యర్ఘ్యపాద్యాది సత్కృతులు నెయ్యమునఁ జేసి
ధేనువు నిచ్చి సన్మానించి యందఱు నందంద వందనం బాచరించి

తే. యుచితభంగిని నచటఁ గూర్చున్నయెడను
గుశలమే మీకు మాకునుఁ గుశల మనుచుఁ
బలికి రాముఁడు కురునరపాలుఁ జూచి
యచటి జనములు వినఁగ ని ట్లనియెఁ దెలియ. 570

ఉ. మా నరనాథు నాజ్ఞ నిజమస్తములఁ ధరియించి కౌరవుల్
[2]మానుగఁ జేయు టొప్పగుఁ గుమారకు నొక్కనిఁ బెక్కు [3]యూథముల్
పూనిన లావుమై నెదిరి పోర జయించుట మీఁది తప్పు త
పై ప్రనుఁ గాచె బాంధవ హితాత్ముకుఁ డై మనుజాధినాథుఁడున్. 571

1. నమస్త సైన్యమున్ (హ) 2. మానఁగఁ జేయు టొప్పగు(హ) 3. యూథపుల్ (హ.తం.వా.)

క. అను మాటలు విని కౌరవ, జననాయకుఁ డాత్మఁ గలఁగి చాలుఁ బురే! యే
మనఁగలదు కాలగతి చ, క్కనఁ గాలం దొడుగు పాదుకలు దల కెక్కెన్. 572

ఆ. మనము బంధువరుస మన్నించు మన్ననఁ
గాదె రాజ్య భోగగరిమఁ బొదవి
వసుధఁ బేరు గలిగి వాసికి నెక్కుట
తమకు ననుభవింపఁ దగినయట్టి 573

వ. సిత చ్ఛత్ర చామర శంఖ కిరీట చిత్రశయ్యా సౌధ సింహాసనంబులు గైకొనుట మన మందెమేలంబునఁ గాదె. అట్టిచో సరివారునుంబోలె నూరక గర్వించు యదుకులులతోడి సంబంధ సఖ్యంబులు చాలు. పాములకుం బాలు వోసి పెంచిన, విషంబు దప్పునే. మమ్మఁ దమ పనుపుసేయు మనుట సిగ్గు లేకుంటఁ గాదె. అదియునుం గాక, దివ్యాస్త్రకోవిదు లైన గంగానందన గురు కృపా శ్వత్థామ కర్ణాది యోధవీరులకుఁ లోఁబడ్డవానిని మహేంద్రునికైన విడిపించ వచ్చునే. అహహా! వృథాజల్పంబుల కేమిపని. అని దుర్భాష లాడుచు, దిగ్గన లేచి నిజమందిరంబునకుం జనియె. అప్పుడు హలాయుధుం డమ్మాటల కదిరిపడి.

ఉ. కౌరవు లాడిపోయిన యగౌరవభాషల కాత్మఁ గిన్కయే
పారఁగ నుల్లస త్ప్రళయ భానునికైవడి మండి చండ రో
షారుణి తాంబకుం డగుచు యాదవవృద్ధులఁ జూచి బల్కెఁ బెం
పారిన రాజ్యవైభవ మందాంధుల మాటలు మీరు వింటిరే. 575

తే. శ్రీమదాంధులు సామముచేతఁ జక్కఁ
బడుదురే [1]యెందు బోయఁడు పసులఁ దోలు
పగిది నుగ్ర భుజావిజృంభణ సమగ్ర
సుమహితాటోప మనిలోనఁ జూపకున్న. 576

క. కౌరవుల సమయఁజేయ ను, దారత యదువీరవరులు దామోదరుఁడున్
రా రా వల దని యచ్చట, వారించితిఁ గాదె బంధు వత్సలయుక్తిన్. 577

వ. అదియునుం గాక. 578

సీ. ఏదేవు భృత్యులై యింద్రాది దిక్పాలవరులు భజింతురు వరుసతోడ
నేదేవు మందిరం బేపారి దేవతాతరు సభావిభవ సుందరతఁ జెందు
నేదేవు పదయుగం బేప్రొద్దు సేవించు నఖిల [2]జగన్మాత యైన లక్ష్మి
యేదేవు చారు సమిద్ధ కళాంశ సంభవులము పద్మజభవులు నేను

---

1. యెందుఁబోయెడి (హ) 2. లోకైకమాతైనలక్ష్మి (హ)

తే. నట్టి దేవుండు దుష్టసంహారకుండు
హరి ముకుందుండు పంపుసేయంగ నొప్పు
నుగ్రసేనుని రాజ్య సమగ్రగరిమ
యంతయును దార యిచ్చిన దఁట తలంప. 579

చ. అదియునుఁ గాక యెవ్వని పదాంబుజ చారు రజోవితాన మా
త్రిదివవరాది దిక్పతి కిరీటములందు నలంకరించు భూ
విదితపుఁ దీర్థముం గడు పవిత్రము నయ్యెడు నట్టి కృష్ణుచేఁ
బొదలిన రాజ్యచిహ్నములఁ బొందగ రా దఁట యేమిచోద్యమో, 580

క. తామఁట తలపఁగఁ దల లఁట, యేమఁట పాదుకల మఁట గణింపఁగ రాజ్య
శ్రీ మదమున ని ట్లాడిన, యీ మనుజాధముల మాట లేమనవచ్చున్. 581

వ. అని క్రోధమాన మానసుం డై యప్పుడు. 582

క. ధారుణి నిటమీఁదట ని, ష్కౌరవముగఁ జేయకున్నఁ గా దని యుగ్రా
కారుం డై బలభద్రుఁడు, సీరము వెసఁ బూన్చి లావు చేవయు నెసఁగన్. 583

వ. ఇట్లు పూన్చి, కౌరవరాజధాని యైన కరినగరంబు కడతలఁ గరతల హలాగ్రం
బును జొనిపి, పూని, య ప్పుటభేదన విస్తారం బగు నా భూఖండంబు భుజాబల
గర్వ దుర్వారుం డై, పెకలించి తిగిచి, గంగాప్రవాహంబునం బడ ద్రోయ
గమకించిన నప్పుడు, మహాజలమధ్య విలోలం బగు నావచందంబున, న న్నగ
రంబు వడంకుచు, గోపుర వప్ర ప్రాకార సౌధాట్టాలక తోరణ ధ్వజ కవాట
కుడ్య వీథియుతంబుగా [1]నొడ్డగిలఁబడం బౌరజనంబులు పుడమి నడుగు లిడంగ
రాక, వడవడ వడంకుచు, నార్తు లయి కుయ్యిడుచున్న యట్టియెడ, న మ్మహో
త్పాతంబుఁ గనుంగొని, తాలాంకుండు కినుకవొడమి కావించిన యుపద్రవంబుగా
నెఱింగి, దానికిఁ బ్రతీకారంబు లేమిని గళవళంబున భయాకుల మానసు లయి,
పుత్ర మిత్ర కళత్ర బంధు భృత్య పౌరజన సమేతంబుగా భీష్మ సుయోధనాది
కౌరవ్యులు, వేగంబున నతని చరణంబులు శరణంబులుగాఁ దలంచి, సాంబునిం
గన్యాయుక్తంబుగా ననేక మణిమయ భూషణాంబర జాలంబులతోఁ దోడుక
వచ్చి, దండప్రణామంబు లాచరించి, కరకమలంబులు మోడ్చి, యి ట్లనిరి. 584

క. రామ ! సముంచిత ముక్తా, దామ యశఃకామ ! ఘన సుధాధామ రుచి
స్తోమ ! జయసీమ ! జగ దభి, రామ ! గుణోద్దామ ! నిఖిల రాజలలామా ! 585

---

1. ఒడ్డగిలి పడం (హ); ఒడ్డగెడవైనం (తం. వా.)

క. నీ మహిమ లెఱిఁగి పొగడఁగ, నే మెంతటివార మఖిలనేతవు త్రిజగత్
క్షేమంకరుఁడవు సుమతివి, తామసులము మమ్ముఁ గావఁ దగు హలపాణీ! 586

క. భూచక్ర మెల్లఁ దాల్చిన, యా చక్రీశ్వరుఁడు తావకాంశుఁడు బలదే
వా! చక్రికి నగ్రజుఁడవు, నీచక్రియ లుడుపఁ జెల్లు నీకు జితారీ! 587

క. రక్షింపుము రక్షింపు ము, పేక్షింపక నమిత నిఖిలబృందారక! ఘో
ర క్షణదాచర విష నిట, లాక్ష! భయాతురుల మమ్ము నరయు మనంతా! 588

వ. మఱియును, దేవా! యీ సచరాచరంబు లయిన జగంబుల నీ లీలావినోదంబులం
జేసి దుష్టమర్దనంబును, శిష్టజన రక్షణంబునుం జేయుఁచు, జగ దుత్పత్తి స్థితి లయ
హేతు వైన నీకు నమస్కరింతుము. అని వెండియు ని ట్లనిరి. 589

తే. అవ్యయుండవు సర్వ భూతాత్మకుఁడవు
సర్వ శక్తిధరుండవు శాశ్వతుఁడవు
విశ్వకరుఁడవు గురుఁడవు [1]విపులకీర్తి
వయిన నిన్ను నుతింప బ్రహ్మకునుఁ దరమె. 590

చ. అని వినుతించినన్ బ్రముదితాత్మకుఁ డై హలపాణి వారలం
గనుఁగొని యోడ కోడకుఁడు కార్యగతిం దగి మీరు చే
సిన యవినీతిచేత నిటు సేసితి నింక భయంబు దక్కి పొం
డనిన సుయోధనుండు వినయంబున నల్లునిఁ [2]గూఁతురిం దగన్. 591

క. అనుపుచు నరణము దాసీ, జనముల వేయింటి లక్ష సైంధవములఁ దా
నినుమడి యేనుంగులఁ గాం, చన రథముల నాఱువేల సమ్మతి నిచ్చెన్. 592

వ. ఇ ట్లిచ్చి యనిచినం, బలభద్రుండు గొడుకును, గోడలినిం దోడ్కొనుచుఁ బరమా
నందంబునుం బొందుచు, నక్కడి జనంబులు పదివేలవిధంబులఁ బొగడ, నిజపురం
బున కరిగి, యచ్చటి యాదవులతోడఁ దాఁ గరిపురంబునకుం బోయిన విధం
బును, వార లాడిన దురాలాపంబులును, దా నందుకై యొనర్చిన ప్రతీకారంబును
నెఱింగించి, సుఖంబున నుండె. వారణపురంబు నేఁడును దక్షిణం బెగసి, యుత్తర
భాగం బొకించుక గంగకయి క్రుంగి, బలభద్రు మాహాత్మ్యంబుఁ దెలుపుచున్న
యది. అని య మ్మహాత్ముని భుజవీర్యం బవార్యం బని చెప్పి, శుకయోగీం
ద్రుండు పరీక్షిన్న రేంద్రున కి ట్లనియె. 593

---

1. విమలమూర్తి (తం) 2. కూఁతునుం దగన్ (తం. వా.)

## అధ్యాయము - ౬౯

### షోడశ సహస్ర స్త్రీసంగతుం డైన శ్రీకృష్ణుని మహిమ నారదుండు దెలిసికొనుట

చ. నరవర! యొక్కనాఁడు విను నారదసంయమి మాధవుండు దా
నరకునిఁ ద్రుంచి వాని భవనంబున నున్న బదాఱువేల సుం
దరులను నొక్కనాఁడె ప్రమదంబున నందఱ కన్నిరూపు లై
పరిణయ మయ్యె నా విని శుభస్థితిఁ దద్విభవంబుఁ జూడఁగన్. 594

వ. తలంచి, కృష్ణపరిపాలితం బయిన ద్వారకానగరంబు డాయంజని, ముందట. 595

సీ. శుక శారికా శిఖి పిక కూజిత ప్రసవాంచి తోద్యాన వనౌఘములును
కలహంస సారస కైరవ కమల కల్హార శోభిత కమలాకరములుఁ
గలమాది సస్యసంకుల వరేక్షు క్షేత్ర భూరి లస న్నదీతీరములును
గిరిసాను పతిత నిర్ఝర [1]శరసందోహ సంతత హేమంత సమయములును

తే. గమలసంభవ కాంచనకార రచిత
చిరత రైశ్వర్య నగరలక్ష్మీ కరాబ్జ
ఘటిత నవరత్నమయ హేమకటక మనఁగ
సొబగు మీఱిన కోటయుఁ జూచి మౌని. 596

వ. మఱియు, సముత్తుంగ మణిసౌధ గవాక్షరంధ్ర నిర్గత ఘనసార చందనాగరు ధూపధూమపటల విలోకన సంజనిత పయోధ రాభిశం కాంగీకృత తాండవకేళీ విలోల పురకామినీ జనోపలాలిత నీలకంఠ సముదయంబులును, జంద్రకాంతమణి స్ఫటికస్తంభ సంభృత మరకత పద్మరాగ ఘటిత నవరత్న కాంచన ప్రాసాద శిఖరాగ్ర విన్యస్త బహు సూర్యవిభ్రమకృ దంచిత శాతకుంభ కుంభనిచయంబును, సమస్త వస్తువిస్తార సమర్పిత వైశ్యాగార వీథీ వేదికా కలితంబును, ‡ మహిత తాపనివారణ తరళ విచిత్ర కేతనాబద్ధ మయూర శింజినీ నినదపూరి తాశాంత రితంబును, సరోజనాభ పూతనా చేతనప్రహారాది నూతన విజయసందేశ లిఖిత సువర్ణ వర్ణావళీ విభాసిత గోపుర మణివిటంక ప్రదేశంబులును, యాదవేంద్ర దర్శనోత్స వాహూయమాన సమాగత నానాదేశాధీశ భూరివారణ దానజల ప్రభూతపంక నిరసనైక గతాగత జనసమ్మర్ద కరకంకణ కషణ వికీర్యమాణ రజఃపుంజంబును, వినూత్న రత్నమయ మంగళ రంగవల్లీ విరాజిత ప్రతిగృహ ప్రాంగణంబును, గుంకుమసలిల సిక్త విపణిమార్గంబును, వంది మాగధ సంగీత మంగళారావ విలసితంబును, భేరీ మృదంగ కాహళ శంఖ తూర్యార వాధరీకృత

1. కణ (తం. వా.) ‡ "పత త్పతా కా ధ్వజ వారితాతపమ్" అని మూలము (69-6)

సాగరఘోషంబును నై, యమరావతీ పురంబునుం బోలె వసుదేవనందన నివాసం బై, యనల పుటభేదనంబునుం బోలెఁ గృష్ణ మార్గసంచార పూతం బై, సంయమనీ నగరంబునుం బోలె హరి తనూభ వాభిరామం బై, నైరృతి నిలయంబునుం బోలెఁ బుణ్యజ నాకీర్ణం బై, వరుణ నివాసంబుం బోలె గోత్రరక్షణ భువనప్రశస్తం బై, ప్రభంజన పట్టణంబునుం బోలె మహాబల సమృద్ధం బై, యలకాపురంబునుం బోలె ముకుంద వర శంఖ మకరాంక కలితం బై, రజతాచలంబునుం బోలె నుగ్రసేనాధి పార్యాలంకృతం బై, నిగమంబునుం బోలె వివిధ వర్ణక్రమ [1]వివిక్త సంచారం బై, గ్రహమండలంబునుం బోలె గురు బుధ కవిరాజ మిత్ర విరాజితం బై, సంతత కల్యాణవేదియుం బోలె వైవాహికోపేతం బై, బలిదానవ కరతలం బునుం బోలె సంతత దానవారి యుక్తం బై, యొప్పున ప్పురంబుఁ బ్రవేశించి, యందు విశ్వకర్మ నిర్మితం బైన యంతఃపురంబున నుండు షోడశసహస్ర హర్మ్యంబు లందు. 597

సీ. పటికంపుఁ గంబముల్ పవడంపుఁ బట్టెలు మరకత రచితముల్ [2]మదురు లమర
వైడూర్య [3]మణిగణ వలభులఁ బద్మరాగంబుల మొగడుల కాంతు లొలయ
సజ్జాతి వజ్రాల [4]సజ్జాల రుచులతో భాసిల్లు నీల సోపానములును
గరుడపచ్చల విటంకములును ఘనరుచి వెలసిన శశికాంత వేదికలును

తే. వలలు మౌక్తికఘటిత కవాటములును
బ్రవిమల స్వర్ణమయ సాలభంజికలును
మించు కలరవ మెసఁగఁ గ్రీడించు మిథున
లీల నొప్పు కపోతపాలికలుఁ గలిగి. 598

తే. చేటికానీక పద తులాకోటి మధుర
నినద [5]భరిత మై రుచిర మాణిక్యదీప
మాలికలు గల్గి [6]చూపట్టఁ గ్రాలు నొక్క
జలజలోచన నిజ సౌధతలమునందు. 599

తే. కనక కంకణ ఝుణఝుణత్కార కలిత
చంద్రబింబాననా హస్త జలజ ఘటిత
చామరోద్ధూత మారుత చలిత చికుర
పల్లవునిఁ గృష్ణు వల్లవీ పల్లవునిని. 600

---

1. విధ్యుక్త (తం. వా.) 2. మదిర (హా. తం. వా) 3. మణిగవాక్షులును (హా)
4. సజ్జాత (హా) 5. భరితంబు (హా) 6. చూపట్టిలీల (హా)

వ. మఱియు, హాటక నిష్కంబు లఱ్ఱులందు వెలుఁగొందఁ, గంచుకంబులు, శిరోవేష్ట నంబులు, కనక కుండలంబులు ధరియించి సంచరించు కంచుకులును, సమాన వయో రూప గుణ విలాస విభ్రమ కలితంబు లైన విలాసినీ సహస్రంబులును, గొలువఁ గొలువున్న య ప్పద్మలోచనుం గాంచన సింహాస నాసీనుం గాంచె. అ ప్పుండరీకాక్షుండును నారదునిం గనుంగొని, ప్రత్యుత్థానంబు సేసి, యప్పుడు.

క. మునివరు పాదాంబుజములు, తన చారు కిరీట మణివితానము సోఁకన్
వినమితుఁ డై నిజ సింహా, సనమునఁ గూర్చుండఁ బెట్టి సద్వినయమునన్. 602

క. తన పాదకమల తీర్థ, మ్మున లోకములం బవిత్రముగఁ జేయు పురా
తన మౌనిలోకగురుఁ డ, మ్ముని పదతీర్థంబు మస్తమున ధరియించెన్. 603

వ. ఇట్లు బ్రహ్మణ్యదేవుండును, నరసఖుండును నైన నారాయణుం డశేష తీర్థోప మానం బైన మునీంద్ర పాదతీర్థంబు ధరియించినవాఁ డై, సుధాసారంబు లైన మితభాషణంబుల నారదున కి ట్లనియె. 604

క. ఏ పని పంచినఁ జేయుదుఁ, దాపసవర ! యనుడు నతఁడు దామోదర ! చి
ద్రూపక ! భవదవతార, వ్యాపారము దుష్టనిగ్రహార్థము గాదే. 605

తే. అఖిల లోకైక పతివి దయార్ద్ర మతివి
విశ్వసంరక్షకుండవు శాశ్వతుఁడవు
వెలయ నేపని యైనఁ గావింతు నమట
యార్తబంధుఁడ విది నీకు నద్భుతంబె. 606

తే. అబ్జసంభవ హర దేవ తార్చనీయ !
భూరి సంసార సాగరోత్తారణంబు
నవ్య యానంద మోక్షదాయకము నైన
నీ పదధ్యాన మాత్మలో [1]నిలువ నీవె ? 607

వ. అని యభ్యర్థించి, య ద్దేవునివలనఁ బ్రసన్నత వడసి, తన్మందిరంబు వెడలి, ముని వరుం డ మ్మహాత్ముని యోగమాయా ప్రభావంబుఁ దెలియఁగోరి, వేఱొక చంద్రబింబాననా గేహంబునకుం జని, యందు నెత్తమాడుచున్న పురుషోత్తము నుద్ధవ సహితుం గని, యద్భుతంబు నొందుచు, నచట నతనిచేత సత్కృతుం డై, యచ్చోటు వాసి చని. 608

క. మునివరుఁడు గాంచె నొండొక, వనజాయతనేత్రి నిజనివాసంబున నం
దనయుతు జిష్ణు సహిష్ణున్, వినుత గుణాలంకరిష్ణు విష్ణుం గృష్ణున్. 609

1. నిలువనీవె (హ)

క. నారదుఁ డటఁ జని కనె నొక, వారిజముఖి యింట నున్నవాని మురారిన్
హారిన్ దానవకుల సం,హారిన్ గమలా మనోవిహారిన్ శౌరిన్. 610

వ. ఇట్లు కనుంగొనుచుఁ జనుచుండ నొక్కయెడ న మ్మునీంద్రునకు ముకుందుండు ప్రత్యుత్థానంబు చేసి, మునీంద్రా! సంపూర్ణకాము లైన మిమ్ము, నపూర్ణకాముల మైన యే మేమిటఁ బరితృప్తి నొందఁజేయఁ గలవారము. భవదీయ దర్శనంబున నిఖిల శోభనంబుల నందెదము. అని ప్రియపూర్వకంబుగాఁ బలికిన నా నందనందను మాటలకు నానంద కందళిత హృదయారవిందుండును, మందస్మిత సుందర వదనారవిందుండును నగుచు, నారదుండు వెండియుం జని. 610

క. అనఘాత్ముఁడు గనుఁగొనె నొక, వనితామణి మందిరమున వనకేళీ సం
జని తానందుని ననిమిష, వినమిత చరణారవిందు విభు గోవిందున్. 611

క. పరమేష్ఠి సుతుఁడు గనె నొక, తరుణీ భవనంబునందుఁ దనుఁ దాన మనో
ంబురుహమునఁ దలఁచుచుండెడి, నరకాసుర దమన శూరు నందకుమారున్. 613

వ. మఱియునుం జని చని. 614

సీ. ఒకచోట నుచిత సంధ్యోపాస నాసక్తు నొకచోటఁ బౌరాణి కోక్తి కలితు
నొకచోటఁ బంచయజ్ఞోచిత కర్ముని నొకచోట సమ్మృతోపయోగ లోలు
నొకచోట మజ్జనోద్యో గానుషక్తుని నొకచోట దివ్యభూ షోజ్జ్వలాంగు
నొకచోట ధేనుదానోత్కలి తాత్ముని నొకచోట నిజ సుతప్రకర యుక్తు

తే. నొక్క చోటను గాన వినోద చిత్తు
నొక్క చోటను జలకేళి యుతవిహారు
నొక్క చోటను సన్మంచకోపయుక్తు
[1]నొక్క చోటను బలభద్ర యుక్త చరితు. 615

వ. కని మఱియును. 616

సీ. సకలార్థ సంవేది యొక యింటిలోపలఁ జెలువతో ముచ్చటల్ చెప్పుచుండు
విపుల యశోనిధి వేఱొక్క యింటిలో సరసిజాననఁ గూడి సరసమాడుఁ
బుండరీకాక్షుండు నొండొక యింటిలోఁ దరుణికి హారవల్లరులు గ్రుచ్చుఁ
గరుణా పయోనిధి మఱియొక యింటిలోఁ జెలిఁ గూడి విడియము సేయుచుండు

ఆ. వికచ కమల నయనుఁ డొక యింటిలో నవ్వుఁ
బ్రవిమలాత్ముఁ డొకటఁ బాడుచుండు
యోగిజన విధేయుఁ డొకయింట సుఖగోష్ఠి
సలుపు ననఘుఁ డొకటఁ జెలఁగుచుండు. 617

1. ఒక్కచో బలభద్రునితోఁ జొక్కుచుండు (హ)

వ. ఇట్లు చూచుచుం జని, చని. 618

క. చతురానన నందనుఁ డం, చితమతిఁ జని కాంచె నొక్కచెలి గేహమునన్
గ్రతు కర్మాచరణుని నా, శ్రిత భయహరణుని సురేంద్ర సేవితచరణున్. 619

క. వృత్రారి సుతునిఁ బరమ ప, విత్రుని నారదుఁడు గాంచె వేఱొక యింటన్
బుత్రక పౌత్రక దుహితృ క, ళత్ర సమేతుని ననంతు లక్షణవంతున్. 620

క. సుందర మగు నొక సుందరి, మందిరమునఁ బద్మభవ కుమారుఁడు గాంచెన్
నందిత నందున్ సుజనా, నందున్ గోవిందు నత సనందు ముకుందున్. 621

క. జలజభవ భవుఁడు గనె నొక, నలినాక్షి నివాసమందు నత భద్రేభున్
జలదాభున్ గతలోభు, న్నలకాళి జిత ద్విరేఫు నంబుజ నాభున్. 622

మ. ఒక యింటన్ గజ వాజి రోహకుఁడు నై యొక్కింట భుంజానుఁ డై
సకలాత్ముండు పరుండు షోడశ సహస్ర స్త్రీనివాసంబుల
నొక్క బోటింటను దప్పకుండ నిజమాయోత్సాహుఁ డై యుండ న
య్యకలంకున్ బరమున్ మహాపురుషు బ్రహ్మణ్యున్ నతాబ్జాసనున్. 623

క. అస్తోక చరితు నమిత స, మస్త సుధాహారు వేద మస్తకతల వి
న్యస్త పదాంబుజ యుగళు న, పాస్తాశ్రిత నిఖిలపాపుఁ బరము ననంతున్. 624

ఆ. పరమ భాగవతుఁడు పరమేష్ఠి తనయుండు
మనుజలీలఁ జెంది మహిత సౌఖ్య
చిత్తుఁ డైన యా హృషీకేశు యోగమా
యా ప్రభావమునకు నాత్మ నలరి. 625

క. మాయురె! హరి! హరి! వరద! య, మేయగుణా! యనుచు నాత్మ మెచ్చి మునీంద్రుం
డా యదునాయకు సుజన వి, ధేయుని నిట్లనియె దేవ! త్రిజగములందున్. 626

క. నీమాయఁ దెలియువారలె, తామరసాసన సురేంద్ర తాపసు లైనన్
ధీమంతులు [1]నీభక్తి సు, ధామాధుర్యమునఁ బొదలు ధన్యులు దక్కన్. 627

క. అని హర్షింపుచు నిఁక నేఁ, బనివినియెద నిఖిలలోక పావనమును స
జ్జన [2]హితము నైన నీ కీ, ర్తన మఖిల జగంబులందుఁ దగ నెఱిఁగింతున్. 628

క. అని తద్వచన సుధాసే, చనమున ముదితాత్ముఁ డగుచు సంయమి చిత్తం
బునఁ దన్మూర్తిన్ దగ నిడు, కొని చనియెను హరి నుతైక కోవిదుఁ డగుచున్

---

1. నిజభక్తి (హ). 2. హితమై చను మీ కీర్తన (హ)

క. ఈపగిది లోకహితమతి, నా పరమేశ్వరుఁడు మానవాకృతిఁ ద్రిజగత్
దీపిత చారిత్రుఁడు బహు, రూపములం బొందె సుందరుల నరనాథా! 630

చ. అని హరి యిట్లు షోడశసహస్ర వధూమణులన్ ప్రియంబునన్
మనసిజకేళిఁ దేల్చిన యమానుషలీల సమగ్రభక్తితో
వినినఁ బఠించినన్ గలుగు విష్ణు పదాంబుజ భక్తియున్ మహో
ధన పశు పుత్ర మిత్ర వనితా ముఖ సౌఖ్యములున్ నరేశ్వరా! 631

అధ్యాయము - ౭౦

వ. అని చెప్పి, య ప్పారాశర్యనందనుం డభిమన్యునందనున కి ట్లనియె. ఆ నిశా వసానసమయంబునఁ బద్మబాంధ వాగమనంబు కమలినీలోకంబునకు మునుకలుగ నెఱింగించు చందంబునం,గలహంస సారస రథాంగ ముఖ జలవిహంగంబుల రవం బులు చెలంగ, నరుణోదయంబున మంగళపాఠక సంగీత మృదుమధుర గానవిన దంబును, లలిత మృదంగ వీణా వేణు నినాదంబును వీతేర, మేలుకని, తన చిత్తంబునఁ జిదానందమయుం, బరమాత్ము, నవ్యయు, నవికారు, నద్వితీయు, నజితు, ననంతు , నచ్యుతు, నమేయు, నాద్యంత విహీనుఁ, బరబ్రహ్మంబైన తన్నుఁ దా నొకయించుక చింతించి, యనంతరంబ విరోధిరాజన్య నయనకల్హారం బులు ముకుళింప, భక్తజన నయనకమలంబులు వికసింప, నిరస్త నిఖిలదోషాంధ కారుం డైన గోవిందుండు మొగిచిన లోచనసరోజంబులు వికసింపం జేయుచుఁ దల్పంబు డిగ్గి, చనుదెంచి, యంత. 632

సీ. మలయజ కర్పూర మహిత వాసిత హేమ కలశోదకంబుల జలక మాడి
నవ్య లసన్మృదు దివ్యవస్త్రంబులు వలనొప్ప రింగులు వాఱఁ గట్టి
మకరకుండల హార మంజీర కేయూర వలయాది భూషణావలులు దాల్చి
ఘనసార కస్తూరికా హరిచందన మిళిత పంకము మేన నలర నలఁది

తే. మహిత సౌరభయుత కుసుమములఁ దుఱిమి
పొసఁగ రూపైన శృంగారరస మనంగ
మూర్తిఁ గైకొన్న కరుణాసముద్ర మనఁగ
రమణ నొప్పుచు లలిత దర్పణము చూచి. 633

తే. కడఁగి సారథి దెచ్చిన కనకరథము
[1]సాత్యకి హిత ప్రియోద్ధవ సహితుఁ డగుచు
నెక్కి నిజకాంతి దిక్కులఁ బిక్కటిల్లఁ
బూర్వగిరిఁ దోఁచు భానునిఁ బోలి వెలిఁగె. 634

1. ఆదివసాగమ (హ) 2. సత్యక సుత ప్రియోద్ధవ (తం. వా.)

సీ. అభినవ నిజమూర్తి యంతఃపు రాంగనా నయనాబ్జములకు నానంద మొసఁగ
సలలిత ముఖచంద్ర చంద్రికాతతి పౌరజనచకోరముల కుత్సవము చేయ
మహనీయ కాంచన మణిమయ భూషణ దీప్తులు దిక్కులఁ దేజరిల్ల
నల్లనల్లన వచ్చి యరదంబు వెస డిగ్గి హాల కులి శాంకుశ జలజ కలశ
తే. లలితరేఖలు ధరణి నలంకరింప
నుద్ధవుని కరతలం బూని యొయ్య నడచి
మహితగతి దేవతాసభా [1]మధ్యమునను
రుచిర సింహాసనమునఁ గూర్చుండె నెలమి. 635

చ. అతివిభవంబునం దనరి యాత్మ తనుద్యుతి తేజరిల్లఁగా
హితులు పురోహితుల్ వసుమతీశులు మిత్రులు బాంధవుల్ బుధుల్
సుతులును మాగధుల్ కవులు సూతులు మంత్రులు భృత్యులుం శుభ
స్థితిఁ గొలువంగ నొప్పె నుడుసేవితుఁ డైన సుధాంశుపోలికన్. 636

క. కరుణార్ద్రదృష్టిఁ బ్రజలం, బరిరక్షింపుచు వివేకభావ కళా చా
తురి మెఱసి యిష్టగోష్ఠిం, బరమానందమున రాజ్యభారకుఁ డగుచున్. 637

-: జరాసంధభీతు లైన రాజుల పంపున విప్రుండు కృష్ణునిసన్నిధి కేతెంచుట :-

వ. ఇవ్విధంబునఁ బ్రతిదివసంబును నుండ, నొక్కనాఁ డపూర్వదర్శనుం డయిన భూసురుం డొక్కరుండు చనుదెంచి, సభాస్థానంబునం గొలువున్న ముకుందునిం బొడగని, దండప్రణామం బాచరించి, వినయంబునఁ గరంబులు మొగిచి, యిట్లనియె. 638

క. కంజవిలోచన! దానవ, భంజన! యోగీంద్ర విమల[2]భావన! సద్బో
ధాంజనదృష్టి నిదర్శన, రంజిత శుభమూర్తి! కృష్ణ! రామావరజా! 639

తే. అవధరింపు జరాసంధుఁ డతులబలుఁడు
దనకు మ్రొక్కని ధారుణీధవుల నెల్ల
వెదకి తెప్పించి యిరువదివేల నాఁకఁ
బెట్టినాఁడు గిరివ్రజ పట్టణమున. 640

తే. వారు పుత్తేర వచ్చినవాఁడ నేను
నరవరోత్తమ! నృపుల విన్నపముగాఁగ
విన్నవించెద నామాట వినినమీఁద
ననఘ! నీ దయ వారి భాగ్యంబుకొలఁది. 641

1. సుధర్మాఖ్యాంసభాం (70.18) 2. భావలసత్ (తం. వా.)

వ. అని ధరాధిపుల విన్నపంబుగా నిట్లనియె. 642

ఉ. వారిజనాభ! భక్తజనవత్సల! దుష్టమదాసురేంద్ర సం
హార! సరోరుహాసన పురారి ముఖామర వంద్య పాదపం
కేరుహ! సర్వలోక పరికీర్తిత దివ్యమహాప్రభావ! సం
సారవిదూర! నందతనుజాత! రమాహృదయేశ! మాధవా! 643

ఆ. ఆర్తజనుల మమ్ము నరసి రక్షించు మ
హాత్మ! భక్తజన భయాపహరణ!
నిన్ను మది నుతించి నీకు మ్రొక్కెదము నీ
చరణయుగము మాకు శరణ మనఘ! 644

క. బలియుల దండింపను దు, ర్బలులను రక్షింప జగతిపై నిజలీలా
కలితుఁడ వై యుగయుగమున, నలవడ నుదయింతు కాదె యభవ! యనంతా!

క. నీ మదిఁ దోఁపని యర్థం, బీ మేదినియందుఁ గలదె యీశ్వర! భక్త
స్తోమ సురభూజ! త్రిజగత్, క్షేమంకర! దీనరక్ష సేయు మురారీ! 646

క. నీ పంపు సేయకుండఁగ, నా పద్మభవాది [1]సురుల కయినను వశమే
శ్రీపతి! శరణాగతులం, జేపట్టి నిరోధ ముడుగఁ జేయుము కృష్ణా! 647

క. అభవుఁడ వయ్యును జగతిం, బ్రభవించుట లీల గాక భవమొందుటయే
ప్రభువులకుం బ్రభుఁడవు మము, సభయాత్ముల నరసి కావఁ జను నార్తిహరా!

క. కదనమున నీ భుజావళి, కెదిరింపఁగలేక పాఱఁడే విక్రమ సం
పద చెడఁగ జరాసంధుఁడు, పదునెనిమిది మార్లు ధరణిపాలురు నవ్వన్. 649

వ. అట్లు తన పడిన బన్నములన్ దలంపక, సింహంబు సమద దంతావళంబుల నరికట్టి కారించు చందంబున, మమ్ముం జెఱపట్టి బాధింపుచున్న య ప్పాపాత్ముని మర్దించి, కారాగృహావాస బద్ధుల మగు మా నిర్బంధంబులం బాపి, సుత దార మిత్ర వర్గంబులం గూర్చి, యనన్య శరణ్యుల మయిన మమ్ము రక్షింపుము. అని విన్నవించి రని, బ్రాహ్మణుండు విన్నపంబు సేయు నవసరంబున. 650

### ధర్మజ రాజసూయాధ్వర రక్షణార్థము కృష్ణుం డింద్రప్రస్థమునకుఁ బోవుట

సీ. శారద చంద్రికా సారంగ రుచితోడ జడముడి కెంపు చేసఱచి నవ్వ
శరదంబు దావృత సౌదామనీ లతాశోభఁ గాంచన కటిసూత్ర మలర
లలిత పూర్ణేందు మండల కలంకము గతి మృదు మృగాజినరుచి మించుఁ జూపఁ
గల్ప శాఖాగ్ర సంగత పుష్పగుచ్ఛంబు లీలఁ గేలను నక్షమాల యమర

1. సురల. (హా తం)

తే. భూరి పుణ్యానదీ తోయ పూరణమునఁ
దగు కమండలు వొక్క హ స్తమునఁ దనర
వెల్ల జన్నిద మఱుత శోభిల్ల వచ్చె
నారదుండు వివేక విశారదుండు. 651

క. చనుదెంచె నట్లు ముని నిజ, తనుకాంతుల నఖిల దిగ్వితానము వెలుఁగఁగ
వనజాప్తుఁ బోలి య య్యెదు, జనములుఁ గృష్ణుండు లేచి సంప్రీతి మెయిన్.

క. వినయమున మ్రొక్కి కనకా,సనమునఁ గూర్చుండఁ బెట్టి సముచిత వివిధా
ర్చనములఁ దనిపి మురాంతకుఁ, డనియె వినయంబు దోఁప న మ్మునితోడన్.

తే. ఎందునుం డిప్డు వచ్చితి విందులకును
నఖిల లోకైకసంచారి వగుటఁ జేసి
నీ వెఱుంగని యర్థంబు నిఖిలమందు
నరయ లేదండ్రు ని న్నొక టడుగ వలయు. 654

తే. పాండు నందను లిప్డు దేవగిరి నెచట
నున్నవారలొ యెఱిగింపు మన్న మౌని
కరసరోజాతములు మోడ్చి కడఁకతోడఁ
బలికెఁ గమలాక్షుఁ జూచి సద్భక్తి మెఱసి. 655

వ. దేవా! నీవు విశ్వనిర్మాణక ర్తవై, మాయవై, సకల కార్యోత్పాదనాది శక్తి యుక్తుండవై, పావనుండవై, పావకుండు దారువులందు నంతర్హిత ప్రకాశుం డై యున్న చందంబున వర్తింపుచున్న నీదు దురత్యయం బయిన మాయాశతంబులఁ బెక్కుమార్లు పొడగంటి. అదియును నా కద్భుతంబు గాదు. అట్లుంగాక, నీ సంకల్పంబున జగం బుద్భవం బై, భవత్పరతంత్రం బగు. అట్టి నీ కిష్టం బయిన వస్తువు సాధుతరంబుగాఁ దెలియ నెవ్వఁడు సమర్థుండు? ఏ పదార్థంబు ప్రమాణ మూలంబునం దోఁచు, నదియును లోకవిచక్షణుండ వయిన నీదు రూపంబు. మఱియును, ముక్తిమార్గంబు నెఱుంగక, సంసార పరవశు లయిన జీవుల మాయాంధకారంబు నివర్తింపఁ జేయ సమర్థం బగు నీ దివ్యలీలావతారంబులం గలుగు కీర్తి యను ప్రదీపంబుం బ్రజ్వలింపం జేసి, కృపసేయు నట్టి నీకు నమస్కరించెద. అది గావున, నీ ప్రపంచంబున నీ వెఱుంగని యర్థంబు గలదె? అని కృష్ణునకు నారదుం డి ట్లనియె. 656

సీ. అయినను వినుపింతు నవధరింపుము దేవ! పాండుతనూజుండు పారమేష్ఠ్య
కామానుమోది యై [1]కావింప నున్నాఁడు రాజసూయ మహాధ్వరంబు వేడ్క
శ్రవణింప లోక విడంబనార్థము గాక పరికింపఁ దన కాత్మబాంధవుఁడవు
భక్తవత్సలుఁడవు పరమ పూరుషుఁడవు యజ్ఞరక్షకుఁడవు యజ్ఞభోక్త

తే. వగు భవత్సేవ చాలదె సుగతి వడయ
నయిన నీ మేన బావ ధర్మాత్మజుండు
నతని యజ్ఞంబు రక్షింప నంబుజాక్ష!
వలయు విచ్చేయు మచటికి వలను మెఱసి. 657

క. నీపేరు వినిన నొడివినఁ, బాపంబులు మాసిపోవుఁ బద్మాక్ష! జగ
ద్దీపక! నీ దర్శనమున, నేపారవె భక్తజనుల కిహపర సుఖముల్. 658

మ. భవదీయోజ్జ్వలకీర్తి దిగ్వితతులన్ భాసిల్లు యుష్మత్పదో
ద్భవ నైర్మల్య జలంబు లుత్కలికఁ బాతాళంబునం బాఱు భో
గవతీ నామమునం దనర్చి ధరణిం గంగానదీ రూప మై
దివి మందాకిని యై జగత్త్రియమునం దీపించుఁ గాదే హరీ! 659

క. ఆ మఖవేళ సమస్త ధ,రామండలిఁ గలుగు మేటి రాజులు మౌని
స్తోమంబును భవదీయ మ,హా మహిమము చూచి సత్కృతార్థత పొందన్. 660

క. కలరని చెప్పిన న మ్మునిఁ, పలుకులకున్ ముదము నొంది పంకజనాభుం
డెలనవ్వు మొగమునకుఁ జెలు, వొలయఁగఁ బాటించి యుద్ధవున కి ట్లనియెన్.

క. ఉద్ధవ! మహిత వివేక స,మిద్ధ వచోవిభవ! కార్య మేగతి నడచున్
వృద్ధవ రానుమతంబుగ, బోద్ధవ్యము గాఁగఁ జెప్పు పురుషనిధానా! 662

తే. అనఘ చారిత్ర! నీవు నా యక్షియుగము
వంటి వాఁడవు మనకు నవశ్య మగుచుఁ
జేయఁ దగినట్టి కార్యంబు సెప్పు నీవు
నేమిపంచినఁ గావింతు నిద్ధచరిత! 663

—: శ్రీకృష్ణుం డుద్ధవుని యాలోచన చొప్పున ధర్మరాజు పాలికిఁ బోవుట :—

వ. అని సర్వజ్ఞుం డయిన హరి యజ్ఞుండువోలెఁ దన్ను నడిగినఁ బురుషోత్తముని భాషణంబులకు మనంబున సంతసిల్లి, యతని పాదాంబుజంబులు దన మనంబున నిడికొని, వృద్ధానుమతంబుగా నే నెఱింగిన తెఱంగు విన్నవించెద. అవధరింపుము

---

1. కావింపఁ గలఁడు సద్(హ); కావించుచున్నాఁడు (వ్రాఁతప్రతు లన్నిట)

## అధ్యాయము - ౭౧

దేవా! దేవముని చెప్పినట్లు భవదీయ భక్తుం డయిన యుధిష్ఠిరు యాగపాలనంబు సేయం గైకొనుట కార్యంబు. అదియునుం గాక, నిఖిల దిగ్విజయ మూలం బగు రాజసూయ కృత్యంబునంద జరాసంధ మర్దనంబును, నతనిచేత బద్ధు లయిన రాజుల కారాగృహ విమోచనము గావించుటయును, జేకూరును. అదియునుం గాక, నాగాయుత సత్త్వుండును, శతాక్షౌహిణీ బలాన్వితుండును, నగు మాగధుని వధియింప మన ప్రభంజన నందనుండు గాని యొం డొరులు సమర్థులు గారు. అట్లగుట నతండు భూసురు లేమి గోరిన న య్యర్థంబు [1]వృథాకరించక యిచ్చుం గావునఁ, గపట విప్రవేషంబునం జని, యా జరాసంధుని నాహవభిక్ష వేఁడిన, భవత్సన్నిధానంబున, న ప్పవమానతనయుం డతని వధియించును. అట్టి కార్యంబుచేత బహుళార్థసాధనం బగు. అని పలికిన విని, నారదుండును, యాదవజనంబులును, సభికులును బొగడిరి. అంత. 664

సీ. తరళ [2]విచిత్రక స్థగిత ప్రభావళిఁ దనరారు గరుడకేతనము వెలుఁగఁ
గాంచన చక్రసంగత ఘంటికా ఘణ ఘణ నినాదమున దిక్కరులు బెదర
సలలిత మేఘ పుష్పక వలాహక [3]శైబ్య సుగ్రీవ తురగ విస్ఫురణ దనర
బాలసూర్య ప్రభాభాసమాన ద్యుతి దిగ్వితానంబుల దీటుకొనఁగఁ

తే. ప్రకటరుచి నొప్పు తేరు [4]దారుకుఁడు దేర
నెక్కి వెడలెదు నపుడు పెంపెనయఁ జెలఁగె
శంఖ కాహళ పటహ నిస్సాణ డిండి
మాది రవములు భరిత దిగంతములుగ. 665

క. మనుజేశ్వరునకుఁ దాలాం, కునకును గురు వృద్ధ జనులకును మ్రొక్కి ప్రియం
బున ననుపఁ గాంచనస్యం, దన సామజ వాజి భట కదంబము గొలువన్. 666

తే. వంది మాగధ సూత కైవారరవము
వసుమతీసురకోటి దీవనల మ్రోఁత
లనుగమింపంగ నతులు సౌధాగ్రశిఖర
[5]సీమలం దుండి ముత్యాలసేస లొలుక. 667

క. లీలం జని కృష్ణుఁడు వా, హ్యాళిన్ నవ కుసుమ ఫల భరానత శాఖా
లోల ఘనసార సాల ర, సాల వనస్థలమునందుఁ జతురత విడిసెన్. 668

---

1. వృథసేయక (తం. వా;) 2. విచిత్రిత (క. చ.) 3. సైన్య (హ.) 4. దారకుఁడు (వా.)
5. జాలములనుండి....శానలొలుక (హ.)

వ. అట్టియెడ సరోజనాభు శుద్ధాంతంబున. 669

సీ. వికచ మరంద నవీన సౌరభ లస న్మందారకుసుమ దామములు తుఱిమి
చారు సుగంధ కస్తూరికా ఘనసార మిశ్రిత చందనపంక మెలమి నలఁది
కనకకుండల కన త్కంకణ నూపుర ముద్రికా భూషణములు ధరించి
యంచిత ముక్తాఫలాంచల మృదుల దివ్యాంబరములు చెలువారఁ గట్టి

తే. యర్ధచంద్రుని నెకసక్కె మాడునట్టి
యళికఫలకలఁ దిలకము లలరఁ దీర్చి
పెంపు దీపింప నుడురాజ బింబముఖులు
నవ చతుర్విధ శృంగార మవధరించి. 670

తే. జలజలోచను కడకు నుత్కలికతోడఁ
దనరు శిబికంబులందు నందనులుఁ దాముఁ
[1]గనఁగ నేతేర ఫణిహారజనులు వేత్ర
కలితు లై పౌరులను నెడగలుగ జడియ. 671

క. అసమాస్త్రుఁడు పులు కడిగిన, కుసుమాస్త్రములఁ బోసించి కోమలతనువుల్
మిసమిస మెఱవఁగఁ [2]గాంతా, విసరము దాసీజనంబు విభవ మెలర్పన్. 672

ఆ. హారుల వేసడములఁ గరులను నెక్కి తో
నరుగుదేర బహువి ధాయుధములు
దాల్చి సుభటకోటి తగిలి రా నంతఃపు
రాంగనలు సితాంబుజాతుకడకు. 673

వ. వచ్చిరి. అంత. 674

క. నారదుని మాధవుఁడు స, త్కారంబున [3]వీడుకొని నతండును హృదయాం
భోరుహమునఁ గృష్ణునకును, వారక మ్రొక్కుచును వెస దివంబున కరిగెన్. 675

క. నరవరుల దూతయును ముర, హరుచే నభయప్రదాన మంది ధరిత్రీ
వరులకడ కేఁగి పద్మో, దరు వచనము సెప్పి సమ్మదంబునఁ దేల్చెన్. 676

వ. అంతఁ గృష్ణుండును, నిజ కాంతా తనయ బంధు సుహృజ్జన సమేతుం డై, కదలి
చను నెడ. 677

1. జవము (హ.); కడఁక (తం.) 2. వేశ్యా (తం. వా.) 2. వీడుకొలువ నతఁడును
(తం. వా.)

చ. [1]కటపట రత్నకంబళ నికాయ కుటీరము లుల్లసిల్ల ను
త్కటతర చామర ధ్వజపతాక కిరీట సితాతపత్ర వి
స్ఫుట ఘనహేతి దీధితి నభోమణిఁ గప్పఁగఁ దూర్యఘోషముల్
చటుల తిమింగిలోర్మిరవ సాగరఘోషము నాక్రమింపఁగన్. 678

క. కరి హరి రథ సుభట సము, త్కరములు సేవింప మురవిదారుఁడు గడచెన్
సరి దుపవన దుర్గ సరో, వర జనపద పుర పుళిందవన గోష్ఠములన్. 679

వ. ఇట్లు గడచి చనుచు, నానర్తక సౌవీర మరుదేశంబులు దాఁటి, యిందుమతిని దర్శించి, దృషద్వతి నుత్తరించి, సరస్వతీనది దాఁటి, పాంచాల మత్స్య విషయంబులు లోనుగాఁ గడచి,యింద్రప్రస్థపురంబు డాయంజని, తత్పురోపకంఠ వనంబున విడిసిన. 680

—: పాండవులు శ్రీకృష్ణు నెదుర్కొని తోడ్కొనిపోవుట:—

క. హరిరాక నెఱిఁగి ధర్మజుఁ, డఱలేని ముదంబుతోడ ననుజులు బంధుల్
గురుజన సచివ పురోహిత, పరిచారక కరి రథాశ్వ భట యుతుఁ డగుచున్. 681

క. చిందములు మొరయ గాయక, బృందంబుల నుతులు సెవుల బెరయఁగ భక్తిన్
డెందము దగులఁగఁ బరమా, నందంబున హరి నెదుర్కొనఁగఁ జనుదెంచెన్. 682

వ. అట్లు చనుదెంచి, ధర్మనందనుండు సమాగతుం డైన సరోజనాభునిం బెద్దతడవు గాఢాలింగనంబు చేసి, రోమాంచ కంచుకిత శరీరుం డై, యానంద బాష్పధారా సిక్త కపోలుం డై, నిర్భరానంద కందళిత హృదయుం డై, బాహ్యంబు మఱచి యుండె. అప్పుడు హరిని వాయునందన వాసవతనూభవులుఁ గౌఁగిటం జేర్చి, సమ్మదం బందిరి. మాద్రేయులు దండప్రణామంబు లాచరించిన, సత్కరించి య ప్పుండరీకాక్షుండు విప్ర వృద్ధ జనంబులకు నమస్కారంబులు సేసి, వారలు గావించు వివిధార్చనలం బరితుష్టుం డై, కేకయ సృంజయాది భూవిభుల మన్నించి,సూత మాగధాదుల కనేకపదార్థంబు లొసంగి, చతురంగబల సమేతుం డై, వివిధ మణితోరణాది విచిత్రాలంకృతంబును, అతి వైభవోపేతంబును, నైన పురంబు ప్రవేశించి, రాజమార్గంబునం జనుచుండఁ, బౌరకామిను లట్టియెడ. 683

సీ. కొఱనెలపైఁ దోఁచు నిరులు నాఁ జెలువొందినొసలిపైఁ గురులు తుంపెసలుగునియ
హాటక మణిమయ తాటంక రోచులు గండభాగంబున గంతులిడఁగ
స్ఫురిత విద్రుమని భాధరబింబ రుచితోడ దరహాసచంద్రిక సరసమాడ
నొండొంటితో రాయు నుత్తుంగ కుచకుంభములు మొగంబులకును బుటముతెగయ

1. ఘటపట (హ.)

తే. బడుగునడుములు వడఁకంగ నడుగు లిడఁగ
[1]రవళిమెట్టెలు మణినూపురములు [2]మొరయఁ
[3]బొలుచు కచబంధములు భుజంబుల నటింపఁ
బయ్యెదలు వీడియాడ సంభ్రమముతోడ. 684

వ. అట్లు కృష్ణసందర్శన కుతూహల పరస్పరాహూయమాన లై, గురుపతి సుత బంధు జనంబులు వారింప నతిక్రమించి, సమున్నత కనకహర్మ్య శిఖరాగ్రంబు లెక్కి, కృష్ణుం జూచి, తమలో ని ట్లనిరి. 685

సీ. విశ్వగర్భుండు నా వెలయు [4]మే టిల యశోదానందులకుఁ బ్రియసూనుఁ డయ్యె
బ్రహ్మాది సురులకు భావింపఁగా రాని బ్రహ్మంబు గోపాలబాలుఁ డయ్యె
వేదశాస్త్రంబులు వెదకి కానఁగలేని గట్టి ప్రేతలతోఁ గట్టువడియె
దివిజుల కమృతంబు దివిరి యిచ్చిన భక్త సులభుండు నవనీతచోరుఁ డయ్యె

తే. నెనయఁ గమలాసతికిఁ జిత్తమీని వేల్పు
[5]వల్లవీ మానసంబులు పల్లవింపఁ
జేసె నని కామినులు సౌధశిఖరములను
గూడి తమలోన ముచ్చట లాడి రధిప ! 686

వ. మఱియును. 687

సీ. గోపాలబాలురఁ గూడి యాడెడి నాఁడు ప్రేపల్లెలోపల నేపురేఁగి
చల్లమ్మబోయెడు సతుల కొంగులఁ బట్టి మెఱుఁగు చెక్కిళ్ళపై మీటి మీటి
కలికి యై ముద్దాడి కౌఁగిటఁ జేర్చిన పూఁబోణి కుచములు పుడికి పుడికి
పాయని యనురక్తి డాయఁజేరిన యింతి యధర సుధారసం బాని యాని

తే. యురు సమాధిపరాష్టాంగ యోగయుక్తు
లైన యోగీశ్వరులుఁ గాననట్టి జెట్టి
వల్లవీజన నవకల్పవల్లి యయ్యె
ననుచుఁ బొగడిరి కృష్ణు న య్యబ్జముఖులు. 688

మ. అని యి ట్లంగి సరోజలోచనలు సౌధాగ్రంబు లందుండి య
వ్వనజాతాక్షుని దివ్యమూర్తిఁ దమ భావంబందుఁ గీలించి సం
జని తానంద రసాబ్ధిమగ్న లగుచుం జంప్రీతిఁ దద్భవ్య కీ
ర్తన లై చల్లిరి నవ్యలాజములు మందార ప్రసూనావళుల్. 689

1. రవము మెట్టెలు (వా.) 2. మెఱయ (వా.) 3. బోలుకచబంధములు (వా.)
4. వేల్పుల (తం. వా.) 5. గొల్ల యిల్లాండ్ర యుల్లములు (తం. వా.)

వ. తదనంతరంబున శోభనపదార్థములు గొనివచ్చి, ధరణీసుర క్షత్త్రియ వణిక్పుంగవులు దామోదరునకుఁ గానుకలు దెచ్చి, సమర్పించిరి. పుణ్యాంగనా జనంబులు పసిఁడి పళ్లెరంబులఁ గర్పూర నీరాజనంబులు నివాళింప నంతఃపురంబు సొత్తెంచె. అంతఁ గుంతిభోజ నందనయుం గృష్ణునిం గని, పర్యంకంబు డిగ్గి, కౌఁగిలింప, నా యదువల్లభుండు, మేనత్తకు దండప్రణామం బాచరించె. పాంచాలియు ముకుందునకు నభివందనం బొనరించి, కుంతిపంపున గోవిందు భామిను లగు రుక్మిణి మొదలైన వారికి గంధాక్షత కుసుమ తాంబూలంబు లిడి, లలిత దుకూల మణిభూషణంబులం బూజించె. యుధిష్ఠిరుండును గమలనయనుని వధూజనుల ననుగత బంధు మిత్ర పుత్ర సచివ పురోహిత పరిచారక సముదయంబుల నుచితంబు లగు స్థలంబుల విడియింప నియమించి, దినదినంబును నభినవంబు లగు వివిధోపచారంబులు గావించుచుండె. 690

క. హరియు యుధిష్ఠిరు సముచిత, పరిచర్యల కాత్మ నలరి పార్థుఁడుఁ దానుఁ
సరస విహారక్రియలను, సురుచిరగతిఁ గొన్ని నెలలు సుఖముండె నృపా! 691

అధ్యాయము – ౭౨

వ. అంత. 692

సీ. ధరణీశ! యొకనాఁడు ధర్మతనూజుండు ప్రవిమల నిజ సభాభవనమందు
హితులు మంత్రులు పురోహితులును సుతులును మిత్రులు బంధువుల్ క్షత్త్రవరులు
పరిచారకులు సూత పాఠక కవి బుధవరులును మునులును వరుసఁ గొలువఁ
జిరలీల నవరత్న సింహాసనస్థుఁ డై కొలువుండి వినతుఁ డై నలిననాభు

తే. భువనరక్షణ దక్షు నద్భుతచరిత్రు
యదుకులేశ్వరు మురదైత్య మదవిభేది
నాప్తు నయవేదిఁ జతురుపాయ ప్రవీణుఁ
జూచి యి ట్లని పలికె నస్తోక చరిత! 693

తే. అనఘ చారిత్ర! రాజసూ యాధ్వరంబు
నెమ్మిఁ గావించు వేడుక నెమ్మనమున
నెనయుచున్నది యది నిర్వహింప నీవ
కాక మా కాత్మబంధువుల్ గలరె యొరులు. 694

ఉ. ఎవ్వరు నీ పదాంబుజము లెప్పుడు గొల్తురు భక్తినిష్ఠు లై
యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతియింతురు భూరి వివేకశాలు లై
య వ్విమలాత్ము లందుదు రుదంచిత శోభన నిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగఁ గృష్ణ! నిను నేర్చి భజించిన రిత్తవోవునే. 695

—: ధర్మరాజు దిగ్విజయార్థము భీమాదులఁ బంపుట :—

వ. అనినఁ గృష్ణుండు ధర్మనందనుం గనుంగొని, యి ట్లనియె. 696

చ. నయగుణశాలి ! పాండునృపనందన ! నీ తలఁ పొప్పు నీ క్రతు
క్రియ ముని దేవతా పితృ సుకృత్యము నై నిఖిలోగ్ర శాత్రవ
క్షయమును బాంధవప్రియము సంచితపుణ్యము నిత్యకీర్తియుఁ
జయము నొసంగు దీనిఁ గురుసత్తమ ! వేగ యుపక్రమింపుమా ! 697

క. మనుచరిత ! నీ సహోదరు, లనుపమ దివ్యాస్త్రవేదు లాహవ భూమిన్
జెనకిన వైరి నృపాలురఁ, దునుమఁగఁ జాలుదురు శౌర్య దుర్దమ భంగిన్. 698

క. గెలువుము వినుత నృపాలుర, వెలయుము బుధవినుత మైన విశ్రుత కీర్తిన్
నిలుపుము నిఖిల ధరామం, డలిని భవచ్ఛాసనము దృఢంబుగఁ జెల్లన్. 699

క. నీ పంపు కార్య మొరులం, జూపక యేఁ జేయ [1]నిన్ను జుట్టన వేఁలన్
జూపఁగ వచ్చునె సకల ధ,రాపతులకు నీకుఁ జేయరానిది గలదే. 700

వ. కావున. 701

క. విమలమతి నిట్టి మఖరా,జమునకుఁ దెప్పింపవలయు సంభారంబుల్
సమకూర్చుము నీ యనుజుల, సమదగతిం బంపు నిఖిల శత్రుల గెల్వన్. 702

క. అను మాటలు విని కుంతీ, తనయుఁడు మోదమును బొంది తామరసాక్షున్
వినుతించి శౌర్యకలితుల, యనుజులదెసఁ జూచి, పలికె హర్షముతోడన్. 703

క. సృంజయ భూపాలకులును, గుంజర రథ వాజి సుభట కోటులు నినుఁ గొ
ల్వం జను మని సహదేవుని, నంజక పొమ్మనియె దక్షిణాశ జయింపన్ . 704

క. ప్రకట చతుర్విధ సేనా, ప్రకరంబులు గొలువఁ బంచెఁ బడమటి దిశకున్
నకులున్ విదళిత రిపు [2]భూపకులున్ శౌర్యంబు మెఱసి పార్థివముఖ్యా ! 705

క. దుర్జన భంజను, శౌర్యోపార్జిత విజయ[3]ప్రకాండు నాహవ నిపుణు
న్నర్జున మహిత యశోనిధి, నర్జును నుత్తరపు దిశకు ననిపె నరేంద్రా ! 706

ఆ. మహిత శౌర్యనిధులు మత్స్య కేకయ[4] మద్ర
భూతలేంద్ర బలసమేతముగను
దర్ప మొప్పఁ బంపెఁ దూర్పు దిక్కునకు ను
ద్దామ నిహత వైరిధాముఁ భీము. 707

1. నిన్నుఁజుట్టిన వేలన్ (హ.) 2. భూపకునిన్ (హ.) 3. ప్రతాప (త. గ.) 4 భద్ర (హ)

చ. పనిచిన వార లేఁగి ఘన బాహుపరాక్రమ విక్రమంబుల
న్ననుపమ శౌర్యులై న చతురంత మహీశుల నోర్చి కప్పముల్
గనక వినూత్న రత్న తురగ ప్రముఖాఖిల వస్తుజాతముల్
గొని చనుదెంచి ధర్మజునకుం బ్రణమిల్లి యుదాత్త చిత్తులై. 708

చ. తమతమ పోయివచ్చిన విధంబులు భూపతులం జయించుటల్
క్రమమునఁ జెప్ప నందుల జరాతనయుం డరివెట్టఁ డయ్యె నం
చమరవరేణ్య నందనుఁ డహంకృతి తక్కఁగ విన్నవించినం
యమసుతుఁ డూరకుండె వికలాత్మకుఁ డై విని యంతఁ గృష్ణుడుం. 709

తే. ధర్మనందనుఁ జూచి యుత్కలికతోడఁ
బలికె మాగధుఁ బోరఁ జంపఁగ నుపాయ
మొకటి గల [1]దది దెలిపెద నుద్ధవుండు
నాకుఁ జెప్పినచందంబు నయచరిత్ర! 710

చ. విను మగధేశ్వరుం డెపుడు విప్రజనావలియందు భక్తియున్
వినయము గల్గి [3]యెద్దియును వేఁడినచో వృథసేయ కిచ్చుఁగా
వున [4]విజయుండునుం బవనపుత్రుఁడు నేనును బ్రాహ్మణాకృతిన్
జని రణభిక్ష వేఁడిన వశంవదుఁ డై యతఁ డిచ్చుఁ గోరికల్. 711

వ. అట్టియెడ. 712

—: శ్రీకృష్ణ భీమార్జునులు జరాసంధుని వధింపఁ బోవుట :—

తే. తవిలి యప్పుడు మల్లయుద్ధమున వానిఁ
బిలుకుమార్పింపవచ్చును భీముచేత
ననిన ధర్మజుఁ డిది లెస్స యనిన విప్ర
వేషములు దాల్చి యరిగిరి విశద యశులు. 713

వ. అట్లు కృష్ణ భీమార్జునులు బ్రాహ్మణవేషంబులు దాల్చి, త్రేతాగ్నులుం బోలెఁ దమ శరీర తేజోవిశేషంబులు వెలుంగ, నతిత్వరితగతిం జని, గిరివ్రజపురంబు సొచ్చి, యందు నతిథిపూజలు శ్రద్ధాగరిష్ఠ చిత్తుం డై, కావింపుచున్న జరాసంధునిం గనుంగొని యి ట్లనిరి. 714

క. ధరణీశ! యతిథిపూజా, పరుఁడవు నీ వనుచు దిశలఁ బలుకఁగ విని మే
మరుదెంచితిమి మదీప్సిత, మఱసేయక యిమ్ము సువ్రతాచారనిధీ! 715

---

1. దెలుఁగ (హ.) 2. యుండియును (హ.) 3. సేపున (హ.); కావునఁ దగ నర్జునుండు పవనోద్భవుఁ డేనును (తం.)

క. అతిథి జనంబుల భక్తిఁ, సతతముఁ బూజించి యుచిత సత్కారము లు
న్నతి నడుపు సజ్జనులు శాశ్వత కీర్తులు ధరణిఁ బడయఁ జాలుదు రనఘా! 716

క. పరికింపఁగ దేహం బస్థిర మని నిజబుద్ధిఁ దలఁచి చిరతర కీర్తి
స్ఫురణన్ ప్రస్తుతి కెక్కని, పురుషుఁడు జీవన్మృతుండు భూరివివేకా! 717

క. ధారుణిలోన వదాన్యుల, కీరాని పదార్థ మొక్కటేనియుఁ గలదే
కోరిన [1]తన మే నెముకలు, ధీరుం డై యిచ్చె [2]మును దధీచు విన మే! 718

క. అడిగిన వృథ సేయక తన, యొడ లాకఁలిగొన్న [3]యెలుకు కోగిరముగ నే
ర్పడ నిచ్చి కీర్తి గనె నని, పుడమిన్ ముని వినమె యల కపోతము నసఘా!

క. ఆ యింద్రాగ్నులు శ్యేనక, వాయస రూపములఁ దన్ను [4]వలఁతిగ వేఁడన్
ధీయుతుఁ డై ముని శిబి తన, కాయముఁ గోసిచ్చె నన జగంబుల వినమే. 720

ఆ. ధీరమతులు రంతిదేవ హరిశ్చంద్ర
[5]బలుల నుంఛవృత్తి బ్రాహ్మణునిని
మున్ను చెప్ప వినమె సన్నుత చరితులు
సన్ను లైన నేఁడు నున్నవారు. 721

వ. అనిన విని, జరాసంధుండు వారల రూపంబులును, మేఘగంభీర భాషణంబులును, గుణకిణాంకంబులును, మహాప్రభావంబులునుం జూచి, తన మనంబున వీరలు బ్రాహ్మణవేషధారు లైన [6]రాజేంద్రు లని తలంచి, యి మ్మహాత్ములు గోరిన పదార్థంబె కాదు. ప్రాణం బయిన నిత్తును. అదియునుం గాక, తొల్లి బలీంద్రుండు, విప్రవ్యాజంబున నడిగిన విష్ణుదేవునకు నాత్మపద భ్రష్టుం డగుట నెఱింగియు విచారింపక, జగత్త్రయంబు నిచ్చి, కీర్తిపరుం డయ్యె. క్షత్త్రబంధుం డనువాఁడును, బ్రాహ్మణార్థంబు ప్రాణపరిత్యాగంబు చేసి, నిర్మలంబగు యశంబు వడసె. అది గావున, ననిత్యంబయిన కాయంబు విచారణీయంబు గాదు. కీర్తి వడయుట లెస్స. అని విచారించి, యుదారుం డై, కృష్ణార్జున భీములం గని యి ట్లనియె. 722

క. భూరి గుణులార! మీ మది, కోరిక లెఱిఁగింపుఁ డేమి కోరిన నైనం
ధీరత నొసఁగుటయే కా, దారయ నా శిరముఁ ద్రుంచి యైనను నిత్తున్. 723

---

1. తనమే యెముకలు(తం.వా.) 2. నని దధీచిని వినమే(తం.వా.) 3. యెలుక కోగిరముగ(హ.) 4. వలగతి వేడఁ (హ.) 5. బలిశిలోంఛవృత్తి బ్రాహ్మణులను (తం.) 6. రాజేంద్రులు గానోపుదురని. (తం. వా.)

ఉ. నావుడుఁ గృష్ణుఁ డ మ్మగధనాథున కి ట్లను భూవరేణ్య! నీ
భావము సూనృతవ్రత శుభస్థితిఁ జెందు తెలుంగవచ్చె మా
కీవలె నాజి[1]భిత్తు మితఁ డింద్ర తనూభవుఁ డే నుపేంద్రుఁడన్
బావని వీఁడె యిం దొకనిఁ [2]బై కొని యొక్కటి పోరఁగాఁ దగున్. 724

చ. అన విని వాఁడు నవ్వి యహహా! విన వింతలు పుట్టె మున్ను న
న్నని మొన నోర్వఁజాలక భయంబునఁ [3]జాటితి పెక్కుమార్లు వం
చన మధురాపురిన్ విడిచి సాగరమధ్యమునందు డాఁగవే
వనరుహనాభ! నీ బిరుదు వాఁడితనంబును నాకు వింతయే. 725

క. ఇ న్నేలఁ జెప్ప మాయలఁ, బన్నినఁ బోవిడువ గోపబాలక! బలసం
పన్నుని మాగధభూవరు, న న్నెఱుఁగవె తొల్లి నందనందన! పోరన్. 726

ఉ. కాన రణోర్వి న న్నెదురఁ గష్టము గాన [4]తలంగు గోత్రభిత్
సూనుఁడు భూరి బాహుబల దుర్దముఁ డయ్యును బిన్న యీ మరుత్
సూనుఁడు మామక ప్రకట దోర్బల శక్తికిఁ జూడఁ [5]దుల్యుఁడౌ
వీని నెదుర్తు నంచుఁ జెయి వీచె జరాసుతుఁ డుగ్రమూర్తి యై. 727

శ్రీ కృష్ణ సహాయుం డగు భీముండు జరాసంధునితో యుద్ధము సేయుట.

క. కరువలి సుతునకు నొక భీకర గద నిప్పించి యొక్క గద తన కేలన్
ధరియించి నలువురును [6]గ, చ్చరుఁ బురి వెలికేఁగి యచట సమతల భూమిన్.

సీ. పర్వత ద్వంద్వంబు పాథోధి యుగళంబు మృగపతి ద్వితయంబు వృషభయుగము
పావకద్వయము దంతావళ యుగళంబు దలపడువీఁక నుద్దండలీలఁ
గదిసి యన్యోన్య భీకర గదాహతుల నుగ్రంబుగ విస్ఫులింగములు చెదరఁ
గెరలుచు సవ్య దక్షిణ మండల భ్రమణములను సింహ చంక్రమణములను

తే. గదిసి పాయుచు డాసి డగ్గఱుచు మింటి
కెగసి క్రుంగుచుఁ గ్రుంగి వే యెగసి భూమి
పగుల నార్చి ఛటచ్ఛటోద్భట మహోగ్ర
ఘన గదాఘట్టన ధ్వని గగన మగల. 729

వ. అంత. 730

---

1. భిత్తుయితఁ డింద్ర (తం. వా.) 2. పై గొని (హ.) 3. జారితనేకమార్లు (హ.)
4. గడంగి (హ.) 5. తుల్యమౌ (హ.) 6. మత్సరమున (హ.)

మ. గద సారించి జరాతనూభవుఁడు హుంకార ప్రఘోషంబునన్
జద లల్లాడఁగఁ బాదఘట్టనమునన్ సర్వంసహా భాగమున్
గదలన్ వాయుజు ప్రేసె ప్రేయ నతఁ డుగ్రక్రోధ దీప్తాస్యుఁ డై
యది దప్పించి విరోధి మస్తకము ప్రేయన్ వాఁడు పోఁదట్టుచున్. 731

చ. మడవక భీమసేనుఁడును మాగధరాజుఁ గడంగి బెబ్బులుల్
విడివడు లీల నొండొరుల వీఁపులు మూఁపులునుం బ్రకోష్ఠముల్
నడితల లూరు జాను జఘన ప్రకరంబులు బిట్టు వ్రయ్యఁగాఁ
బిడుగులఁ బోలు పెన్ గదల బెట్టుగ ప్రేయుచుఁ బాయుచున్ వెసన్. 732

లయవిభాతి. బెడగడరు పెన్ గదలు పొడిపొడిగఁ దాఁకఁ బెను
పిడుగు లవనిం దొరఁగ నుడుగణము రాలన్
మిడుఁగుఱులు [1]చెదర నభ మడల హరి దంతములు
[2]వడఁక జడధుల్ గలఁగఁ బుడమి చలియింపన్
వెడచఱువ మొత్తియును దడఁబడఁగ నొత్తియును
నెడమ [3]గుడి లాఁచి తిరుగుడు వడుచు ప్రేయన్
వడవడ వడంకుచును నుడివడక డాసి చల
ముడుగ కపు డొండొరులు వడిచెడక పోరన్. 733

వ. ఇ వ్విధంబునం బోరుచుండ, నొండొరుల గదాదండంబులు [4]దుమురు లై నం, బెండువడక, సమద దిగ్వేదండ శుండాదండ మండిత ప్రచండంబు లగు బాహు దండంబు లప్పళించి, ముష్టి యుద్ధంబునకు డగ్గఱి. 734

లయగ్రాహి. కాల వెస డాఁచియును గే లెడలఁ ద్రోచియును
దాలుములు దూలఁ బెడ కేల వడి ప్రేయన్
ఫాలములుఁ గక్షములుఁ దాలువులు వక్షములు
లీల నెముకల్ మెదడు నేలఁ దుము రై వే
రాల విపుల క్షతవిలోల మగు నెత్తురులు
[5]జాలుకొని యోలిఁ బెను[6]గాలువలుగన్ బే
తాల మద భూతములు [7]ఖేలనలఁ జేతులను
దాళములు దట్టుచు [8]సలీలగతి నాడన్. 735

---

1. పొరిఁజదలనదర (తం. వా.) 2. వెడల (వా.) 3. గుడులొచ్చి (హ.); గుడులాచి (తం.) 4. దురుము (హ.) 5. జాలుగొని (తం. వా.) 6. గాలువలుగొన (హ.) 7. ఖేలనుచు (హ.) 8. సులీలవడి (హ.)

ఉ. ప్రక్కలు చెక్కులున్ మెడలు పాణితలంబులచేఁ బగుల్చుచున్
ముక్కులు [1]నక్కులున్ జెవులు ముష్టిహతిన్ నలియంగ గ్రుద్దుచున్
డొక్కలు బిక్కలున్ ఘన కఠోర పదాహతి నొంచుచున్ నెఱుల్
దక్కక స్రుక్క కొండొరులఁ దార్కొని [2]బేర్కొని పోరి రుగ్రతన్. 736

ఉ. హుమ్మని మ్రోఁగుచున్ బెలుచ హుంకృతు లిచ్చుచుఁ బాసి డాసి కో
కొమ్మనుచు [3]నొండొరుల గిలి గుల్లల తిత్తులుగాఁ బదంబులన్
గ్రుమ్మిచు ముష్టి ఘట్టనల [4]స్రుక్కుచు నూర్పులు సందడింపఁగా
[5]సొమ్మలు వోవుచున్ దెలియుచున్ మదిఁ జేవయు లావుఁ జూపుచున్. 737

వ. ఇవ్విధంబున, వజ్రి వజ్ర సన్నిభంబు లగు నితరేతర ముష్టిఘట్టనల భిన్నాంగు లై, రక్త సిక్త శరీరంబులతోడఁ బుష్పితాశోకంబుల వీఁకను, జేగురుగొండల చందంబునను, జూపట్టి పోరుచుండఁ, గృష్ణుండు జరాసంధుని జన్మ మరణ ప్రకారంబు లాత్మ నెఱుంగుటం జేసి, వాయు తనూభవున కలయిక లేక లావును, జేవయుఁ గల్గునట్లు తద్గాత్రంబునందుఁ దన దివ్యతేజంబు నిల్పి, విరోధి నిరసనోపాయంబు నూహించి, సమీరణ నందనుండు సూచుచుండ, నొక్క శాఖాగ్రంబు రెండుగాఁ [6]జీల్చివైచి, వాని నట్లు చీరి చంపు మని, సంజ్ఞగాఁ జూపి చెప్పిన, నతండు నాకీలు దెలిసి, యవక్ర విక్రమ పరాక్రముం డై మాగధుం బడఁద్రోచి, వాని పదంబు పదంబునఁ ద్రొక్కి, బాహుయుగళంబున రెండవ పదంబు కదలకుండం బట్టి, మస్తక పర్యంతంబు ఫెళఫెళ మనుచుఁ జప్పు ళ్లుప్పతిల్ల, మత్తదంతావళంబు తాళవృక్షంబుఁ జీరుచందంబునఁ, బాద జాను జంఘోరు కటి మధ్యోదరాంస కర్ణ నయనంబులు వేఱువేఱు భాగంబులుగా వ్రయ్యలు [7]వాపి యార్చినఁ, బౌరజనంబులు గనుంగొని, భయాకులు లై, హాహాకారంబులు చేసిరి. అంత 738

క. అనిలజుని దేవపతినం,దనుఁడును బద్మాక్షుఁడును నుదారత నాలిం
గనములు సేసి పరాక్రమ,మున కద్భుతమంది మోదమునఁ బొగడి రొగిన్. 739

—: కారాగృహ విముక్తు లగు రాజులు శ్రీకృష్ణుని స్తుతించుట :—

క. వనజాక్షుఁ డంతఁ గరుణా,వననిధియును భక్తలోక వత్సలుఁడును గా
వున మాగధసుతు సహదే,వునిఁ బట్టముఁ గట్టెఁ [8]దన్నవోన్నత పదవిన్. 740

క. మగధాధినాథునకు ము,న్నగపడి చెఱసాలలను మహాదుఃఖముల
నొంగులుచుఁ దనపాదాంబుజ,యుగళముఁ జింతింపుచున్న యుర్వీశ్వరులన్. 741

---

1. చెక్కులున్(హ.) 2. వేర్కొని(హ.) 3. ఒడళ్ళుఱిగి(హ.); ఒడళ్ళగల(తం.వా.) 4. గ్రుక్కుచు (హ.) 5. సొమ్మిల (హ.) 6. జీరివైచి (తం. వా.) 7. వాసి (హ.) 8. దన్మహోన్నత (తం.)

వ. అ య్యవసరంబునఁ గృష్ణుండు తన దివ్యచిత్తంబున మగధరాజ నిరుద్ధుల మఱవ నవధరింపక చెఱలు విడిపించిన.

అధ్యాయము - ౭౩

వారలు పెద్దకాలంబు కారాగృహంబులఁ బెక్కుబాధలం బడి, కృశీభూతశరీరు లగుటం జేసి, రక్తమాంస శూన్యంబు లై త్వ గస్థి మాత్రావశిష్టంబులును, ధూళి ధూసరంబులు నైన దేహంబులును, గేశపాశంబులు మాసి జటాబంధంబు లైన శిరోజంబులును, మలినవస్త్రంబులునుం గలిగి, చనుదెంచిరి. అప్పుడు. 742

సీ. నవపద్మ లోచను భవబంధ మోచను భరిత శుభాకారు దురితదూరుఁ
గంకణ కేయూరుఁ గాంచన మంజీరు వివిధ శోభిత భూషు విగత దోషుఁ
బన్నగాంతక వాహు భక్త [1]మనోత్సాహు నత చంద్రజూటు నున్నత కిరీటు
హరినీల నిభ కాయు వర పీత కౌశేయుఁ గటిసూత్రధారు జగద్విహారు

తే. హార వనమాలికా మహి తోరువక్షు
శంఖ చక్ర గదా పద్మ శార్ఙ్గ హస్తు
లలిత శ్రీవత్సశోభిత లక్షణాంగు
సుభగచారిత్రు దేవకీసుతునిఁ గాంచి. 743

చ. భరిత ముదాత్ము లై విగత బంధను లై నిజమస్తముల్ మురా
సురరిపు పాదపద్మములు సోఁకఁగఁ జాగిలి మ్రొక్కి నమ్రు లై
కరములు మోడ్చి యో పరమ కారుణికోత్తమ! సజ్జనార్తి సం
హరణ! వివేకశీల! మహితాశ్రిత పోషణ! పాపశోషణా! 744

ఆ. వరద! పద్మనాభ! హరి! కృష్ణ! గోవింద!
దాస దుఃఖనాశ! వాసుదేవ!
యవ్య యాప్రమేయ! యనిశంబుఁ గావింతు
మిందిరేశ! నీకు వందనములు. 745

ఉ. ధీరవిచార! [2]మమ్ము భవదీయ పదాశ్రయులఁ జరాసుతో
దార నిబంధనోగ్ర పరితాపము నీ కరుణావలోక నా
సారముచేత నార్చితివి సజ్జనరక్షయు దుష్టశిక్షయు
న్నారయ నీకుఁ గార్యములు యాదవవంశ పయోధిచంద్రమా! 746

---

1. మహోత్సాహు (తం. వా.) 2. అన్వయము చింత్యము.

సీ. అవధరింపుము మాగధాధీశ్వరుఁడు మాకుఁ బరమబంధుఁడు గాని పగఱ గాఁడు
ప్రకటిత రాజ్యవైభవ మదాంధీభూత చేతస్కులము మమ్ముఁ జెప్పనేల
కమనీయ జలతరంగములకైవడి దీపశిఖవోలెఁ జూడ నస్థిరము లైన
గురుసంపదలు నమ్మి పరసాధనక్రియాగమ మేది తద్బాధకంబు లగుచుఁ

తే. బరఁగ నన్యోన్య వైరానుబంధములను
ప్రజలఁ గారించుచును దుష్టభావ చిత్తు
లగుచు నాసన్న మృత్యుభయంబు దక్కి
మత్తు లై తిరుగుదురు దుర్మనుజు లంత. 747

చ. కడపటిచేత నైహికసుఖంబులఁ గోల్పడి రిత్తకోర్కి వెం
బడిఁ బడిఁ [1]యెండమావులఁ బిపాసువు లై సలిలాశ డాయుచుం
జెడు మనుజుల్ భవాబ్ధి దరి జేరఁగలేక నశింతు రట్టి యా
యిడుములఁ బొందఁజాలము రమేశ! త్రిలోకశరణ్య! మాధవా! 748

ఉ. వేదవధూ శిరో మహితవీథులఁ జాల నలంకరించు మీ
పాద సరోజయుగ్మము శుభస్థితి మా హృదయంబులందు ని
త్యోదిత భక్తిమైఁ దగిలియుండు నుపాయ మెఱుంగఁ బల్కు దా
మోదర! భక్తదుర్భవ మహోదధితారణ! సృష్టికారణా! 749

క. అని తను శరణము వేఁడిన, జననాథులవలను చూచి సదమల భక్తా
వనచరితుఁడు పంకజలోచనుఁ డిట్లను వారితోడ సదయామతి యై. 750

చ. జనపతులార! మీ పలుకు సత్యము రాజ్యమదాంధ చిత్తు లై
ఘనముగ విప్రులం బ్రజలఁ గాఱియఁ బెట్టుటఁ జేసి కాదె [2]వే
న నహుష రావ ణార్జునులు నాశము నొందిరి గాన ధర్మపా
లనమునఁ గాక నిల్చునె కులంబు బలంబు చిరాయు రున్నతుల్. 751

వ. అది గావున, మీ మనంబుల దేహం బనిత్యంబు గాఁ దెలిసి. 752

ఉ. మీరును ధర్మముం దగవు మేరయుఁ దప్పక భూజనాళిఁ బెం
పారుచు సౌఖ్యసంపదల నందఁగఁ బ్రోచుచు భూరి యజ్ఞముల్
గౌరవవృత్తి మత్పరముగా నొనరింపుచు మామకాంఘ్రి పం
కేరుహముల్ భజింపుచు నకిల్బిషు లై చరియింపుఁ డిమ్ములన్. 753

---

1. మావులను జాలికులై (తం. వా) 2. వేగనహుష....గాలము నొందిరి(హ.)

వ. అట్లైన మీరలు బ్రహ్మసాయుజ్యప్రాప్తు లయ్యెదరు. మదీయ పాదారవిందంబు లందుఁ జలింపని భక్తియుఁ గలుగు. అని, యానతిచ్చి, యా రాజవరుల మంగళ స్నానంబులు సేయించి, వివిధ మణిభూషణ మృదులాంబర మాల్యానులేపనంబు లొసంగి, భోజనతాంబూలంబులఁ బరితృప్తులం జేసి, యున్నత రథాశ్వ సామజాధి రూఢులం గావించి, నిజరాజ్యంబులకుఁ బూజ్యులం జేసి, యనిచిన. 754

క. నరవరు లీ చందంబున, మురసంహారుచేత బంధమోక్షణు లై సు
స్థిర హర్షంబులతో నిజ, పురములకుం జనిరి శుభవిభూతి తలిర్పన్. 755

క. హరి మంగళగుణ కీర్తన, నిరతము గావింపుచును వినిర్మలమతు లై
గురు బంధు పుత్ర జాయా, పరిజన మలరంగఁ గృష్ణుఁ బద్మదళాక్షున్. 756

వ. బహుప్రకారంబులం బొగడుచుఁ, దమతమ దేశంబులకుం జని. 757

క. నలినదళ లోచనుఁడు దముఁ, దెలిపిన సద్ధర్మపద్ధతినిఁ దగవరు లై
యిలఁ బరిపాలింపుచు సుఖ,ముల నుండిరి మహిత నిజవిభుత్వము లలరన్. 758

వ. ఇట్లు కృష్ణుండు, జరాసంధవధంబును, రాజలోకంబునకు బంధమోక్షణంబునుం గావించి, వాయునందన వాసవనందనులుం, దానును, జరాసంధతనయుం డగు సహదేవుండు సేయు వివిధంబులగు పూజలు గైకొని, యతని నుండ నియమించి, య చ్చోటు గదలి, కతిపయ ప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకుం జనుదెంచి, తద్ద్వార ప్రదేశంబున విజయశంఖంబులు వూరించినఁ, బ్రతిపక్షభయదంబును, బాంధవప్రమోదంబును నగు నమ్మహాఘోషంబు విని, పౌరజనంబులు జరాతనయు మరణంబు నిశ్చయించి సంతసిల్లిరి. వారిజాక్షుండును, భీమసేనపార్థులతోఁ బురంబుఁ బ్రవేశించి, ధర్మనందనునకు వందనం బాచరించి, తాము పోయినతెఱంగును, నచ్చట జరాసంధుని వధియించిన ప్రకారంబును, సవిస్తరంబుగా నెఱింగించిన, నతండు విస్మయ వికచలోచనంబుల నానందబాష్పంబులు గురియ, న మ్మాధవు మాహాత్మ్యంబునకుం దమయందలి భక్తి స్నేహ దయాది గుణంబులకుం బరితోషంబు నొందుచుఁ, గృష్ణునిం జూచి యి ట్లనియె. 759

## అధ్యాయము - ౭౪

సీ. కమలాక్ష! సర్వలోకములకు గురుఁడ వై తేజరిల్లెడు భవదీయమూర్తి
యంశాంశ సంభవు లగు లోకపాలురు నీ యాజ్ఞఁ దల మోచి నిఖిలభువన
పరిపాలనిపుణు లై భాసిల్లుచున్నార లట్టి నీ కొకనృపు నాజ్ఞ సేయు
టరయ నీ మాయఁ గా కది నిక్కమే యేక మై యద్వితీయమై యవ్యయంబు

తే. నయిన నీతేజమునఁ గొక హాని గలదె
చిన్మయాకార ! నీ పాదసేవకులకు
నాత్మ పర భేదబుద్ధి యెందయినఁ గలదె
పుండరీకాక్ష ! గోవింద ! భువనరక్ష. 759

వ. అని గోవిందునిం బొగడి, య ద్దేవు ననుమతంబునం గుంతీసుతాగ్రజుండు పర తత్త్వవిజ్ఞాను లైన ధరణీసురులను ఋత్విక్కులుగా వరియించి. 760

సీ. సాత్యవతేయ కశ్యప భరద్వా జోపహూతి విశ్వామిత్ర వీతిహోత్ర
మైత్రేయ పైల సుమంతు మధుచ్ఛంద గౌతమ సుమతి భార్గవ వశిష్ఠ
వామదే వాకృతవ్రణ కణ్వ జైమిని ధౌమ్య పరాశ రాథర్వ కవషు
లసిత వైశంపాయ నాసురి [1]కశ్యప క్రతు వీరసేన గర్గ త్రికవ్య

ఆ. ముఖ్యు లైన ఋషుల మునులను గృపుని గాం
గేయ కుంభ జాంబికేయ విదుర
కురుకుమార బంధు కులవృద్ధ ధారుణీ
సుర నరేంద్ర వైశ్య శూద్రవరుల. 761

క. రప్పింప వారు హర్షము, లుప్పతిలఁగ నేఁగుదెంచి యుచితక్రియలం
దప్పక గనుఁగొనుచుండఁగ, నప్పుడు విధ్యుక్తనియతు లై భూమిసురుల్. 762

ఆ. కడఁగి సవనభూమిఁ గనక లాంగలముల
నర్థి దున్ని పాండవాగ్రజునకు
నచట దీక్షచేసి యంచిత స్వర్ణమ
యోపకరణముల నలోపముగను. 763

వ. ఇట్లు నియమంబున సముచిత క్రియాకలాపంబులు నడుపుచుండిరి. అప్పుడు. 764

క. సకలావనీశు లిచ్చిన, యకలంక సువర్ణ రత్న హయ ధన వస్త్ర
ప్రకరంబులు మొదలగు కా, నుక లందుకొనఁగ సుయోధనుని నియమించెన్.

సీ. అర్థిజాతము కోరినట్టి వస్తువు లెల్లఁ దగఁ బంచి యిడఁగ రాధాతనూజు
సర సాన్నపానాది సకలపదార్థముల్ పాకముల్ సేయింపఁ బవనతనయు
బంకజోదరు నొద్దఁ బాయక పరిచర్య దవిలి గావింప వాసవతనూజు
సవననిమిత్త మౌ సంచిత ద్రవ్యముల్ పంపుతో వేగ తెప్పింప నకులు

---

1. భార్గవ (తం. వా.)

తే. దేవ గురు వృద్ధ ధాత్రీసురావళులను
నరసి పూజింప సహదేవు నఖిలజనులఁ
బోలుచు మృష్టాన్నతతులఁ దృప్తులను జేయ
ద్రౌపదిని నియోగించెను ధర్మసుతుఁడు. 767

వ. అ య్యవసరంబున. 768

చ. హరి శిఖి దండపాణి నికషాత్మజ పాశి సమీర గుహ్యకే
శ్వర శశిమౌళి పంకరుహసంభవ చారణ సిద్ధ సాధ్య కి
న్నర గరుడోరగామర గణంబులు వచ్చి మఖంబుఁ జూచి య
చ్చెరువడి తొల్లి యెవ్వరును జేయు మఖంబులు నింత యొప్పునే. 769

క. అదిగాక యిందిరావిభు, పదములు సేవించునట్టి భాగ్యము గలుగన్
దుదిఁ బడయరాని బహుసం, పద లెవ్వియుఁ గలవె యనుచుఁ బ్రస్తుతి సేయన్.

వ. అప్పుడు. 771

చ. అమరసమాను లై తనరు యాజకవర్గము లోలి రాజసూ
య మఖవిధాన మంత్రముల నగ్నిముఖంబుగఁ జేసి ధర్మజుం
గ్రమమున వేలిపింపఁ గ్రతురాజ సమాప్తిదినంబునన్ నృపో
త్తముఁడు గడంగి యాజన సదస్య గురు ద్విజకోటిఁ బెంపునన్. 772

వ. పూజించునప్పు డం దగ్రపూజార్హు లెవ్వ రని యడిగిన, సదస్యులు తమకు దోఁచిన విధంబులం బలుక, వారి భాషణంబులు వారించి, వివేకశీలుండును, జతుర వచన కోవిదుండును నగు సహదేవుండు, భగవంతుండును, యదుకుల సంభవుండును నైన శ్రీకృష్ణుం జూపి, యి మహాత్ముని సంతుష్టుం జేసిన, భువనంబు లన్నియుఁ బరితుష్టిం బొందు. అని చెప్పి ధర్మజుం జూచి యి ట్లనియె.

ఉ. కాలము దేశమున్ గ్రతువుఁ గర్మముఁ గర్తయు భోక్తయున్ జగ
జ్జాలము దైవమున్ గురువు సాంఖ్యము మంత్రము నగ్ని యాహుతుల్
వేళలు విప్రులున్ జనన వృద్ధి లయంబుల హేతుభూతముల్
లీలలఁ దాన యై తగ వెలింగెడి నెక్కటితేజ మీతఁడున్. 774

చ. ఇతఁడె యితండు గన్ను లొకయించుక మోడ్చిన నీ చరాచర
స్థిత భువనంబు లన్నియు నశించు నితం డవి విచ్చి చూచినన్
వితతము లై జనించుఁ బ్రభవిష్ణుఁడు విష్ణుఁడు నైనయట్టి యీ
క్రతుఫలదుండు గా కొరుఁ డొకం డెటు లర్హుఁడు శిష్టపూజకున్. 775

ఉ. ఈ పురుషోత్తముం జగదధీశు ననంతుని సర్వశక్తుఁ జి
ద్రూపకు నగ్రపూజఁ బరితోషితుఁ జేయ సమస్తలోకముల్
వే పరితుష్టిఁ బొందుఁ బృథివీవర ! కావున నీవు కృష్ణునిన్
శ్రీపతిఁ బూజసేయు మెడసేయక మాటలు వేయు నేటికిన్. 776

క. అని సహదేవుఁడు వలికిన, విని యచ్చటి జనులు మనుజవిభులును ఋషులున్
మునుకొని మనమున మోదము, దనుకఁగ నిది లెస్స యనిరి ధర్మజుఁ డంతన్.

క. మునిజన మానస మధుకర, వనజాతము లయిన యట్టి వారిజదళలో
చను పదయుగళ ప్రక్షాళన మొగిఁ గావించి తజ్జలంబులు భక్తిన్. 778

క. తానును గుంతియు ననుజులు, మానుగ ద్రుపదాత్మజయును మస్తకములఁ బెం
పూనిన నియతి ధరించి మ, హానందముఁ బొంది రతిశయ ప్రీతిమెయిన్. 779

క. చంచత్కాంచన రుచిరో, దంచిత వస్త్రముల నూతనార్క ప్రభలన్
మించిన రత్నములం బూజించెన్ ధర్మజుఁడు కృష్ణు జిష్ణు సహిష్ణున్. 780

వ. ఇట్లు పూజించి, యానందబాష్పజల బిందుసందోహ కందళిత నయనారవిందంబులం గోవిందుని సుందరాకారంబు దర్శింపఁ జాలకుండె. అట్లు పూజితుం డయి, తేజ రిల్లు పుండరీకాక్షు నిరీక్షించి, హస్తంబులు నిజమస్తకంబుల ధరియించి, వినుతి సేయుచు, నఖిల జనంబులు జయజయ శబ్దంబు లిచ్చిరి. దేవతలును వివిధ తూర్య ఘోషంబులతోడఁ బుష్పవర్షంబులు గురియించిరి. అ య్యవసరంబున. 781

క. దమఘోష సుతుఁడు తద్విభవముఁ జూచి సహింప కలుక వ్రేలఁగాఁ బీ
ఠము డిగ్గి నిలిచి నిజహస్తము లెత్తి మనోభయంబు దక్కిన వాఁ డై. 782

వ. అప్పు డప్పుండరీకాక్షుండు వినుచుండ, సభాసదులం జూచి యి ట్లనియె. 783

క. చాలుఁ బురే! యహహా ! యీ, కాలము గడవంగ దురవగాహం బగు నీ
తేలా తప్పెను నేఁ డీ, బాలకు వచనములచేతఁ బ్రాజ్ఞుల బుద్ధుల్. 784

వ. ఇట్లు తప్పిన తెఱం గె ట్లన్నను, పాత్రాపాత్ర వివేకంబు సేయనేర్చిన విజ్ఞాన నిపుణులును, నున్నత సత్త్వగుణ గరిష్ఠులును, బహువిధ తపోవ్రత నియమ నిష్ఠులును, ననల్పతేజులును, [1]మహదైశ్వర్య శక్తిధరులును, బరతత్త్వ వేదులును, నఖిలలోక పూజ్యులును, విగతపాపులును, బరమయోగీంద్రులు నుండ, వీరిం గైకొనక, వివేకరహితు లై గోపాలబాలునిం బూజసేయుటకు నెట్లు సమ్మతించిరి. పురోడాశంబు సృగాలంబున కర్హం బగునే ? అదియునుం గాక. 785

1. మహైశ్వర్య (తం. వా.)

సీ. గురు దేవ శూన్యుండు కుల గోత్ర రహితుండు దలిదండ్రు లెవ్వరో తడవఁ గాన
మప్పులఁ బొరలెడు నాది మధ్యావసానంబులం దరయ మానంబులేదు
బహురూపి యై పెక్కుభంగుల వర్తించు వావి వర్తనములు వరుస లేవు
పరికింప విగత సంబంధుండు దలపోయ మా నిమిత్తంబున మాని సయ్యెఁ

తే. బరఁగ మున్ను యయాతి శాపమునఁ జేసి
వాసి కెక్కఁడు యాదవ వంశమెల్ల
బ్రహ్మతేజంబు నెల్లఁ గోల్పడిన యితఁడు
బ్రహ్మ ఋషిసేవ్యుఁ డగునె గోపాలకుండు. 786

క. జారుఁడు జన్మావధియును, జోరుఁడు ము ప్పోకలాఁడు సుమహిత పూజా
చార క్రియలకు నర్హుఁడె, వారక యితఁ డనుచు నశుభ వాక్యస్ఫూర్తిన్. 787

చ. అని తను దూఱ నాడిన మురాంతకుఁ డా శిశుపాలు వాక్యముల్
విని మదిఁ జీరికిం గొనఁడు విశ్రుత [1]ఫేరవరావ మాత్మ గై
కొనని మృగేంద్రురీతి మునికోటియు రాజులుఁ బద్మనాభు నా
డిన యవినీతి భాషలకు డెందమునన్ గడు వంతనొందుచున్. 788

ఉ. వీనులు మూసికొంచు విన విస్మయ మంచు ముకుంద! మాధవా!
శ్రీనిధి! వీని నేగతికిఁ జేర్చెదొ యంచు దురాత్ముఁ దిట్టుచు
న్నా నరనాథులున్ మునులు నచ్చట నిల్వకపోవఁ బాండు సం
తానము లప్రమేయ బల దర్ప మహోద్ధత రోషచిత్తులై. 789

వ. అప్పుడు కేకయ సృంజయ భూపతులుం దామును వివిధాయుధ పాణులై, యదల్చి నిల్చిన, వాఁడునుం బిఱుతివక, యదల్చి పలుకయు, వాలునుం గైకొని, భుజాగర్వ దుర్వారుం డయి, గోవిందునిం, దదనువర్తను లయిన వారలనుం గుపితుం డయి నిందింప, నమ్ముకుందుం డాగ్రహంబున లేచి, తన కట్టెదుర నెదిర్చి యున్న శిశుపాలుని రూక్షేక్షణంబుల నిరీక్షింపుచు, న క్షణంబ తన్మస్తకంబు నిశిత ధారాకరాళం బయిన చక్రంబున నవక్రపరాక్రముం డయి, రుధిరంబు దొరఁగన్ దునుమ, న మ్మహా కలకలం బాకర్ణించి, చైద్యబలంబులునుం, దదీయ పక్షచరు లయిన భూపతులును, భీతులై పఱచిరి. అ య్యవసరంబున.

క. మునివరులును జనపతులును, గనుఁగొని వెఱ గందఁ జైద్యు [2]గాత్రమునందుం
డనుపమ తేజము వెలువడి, వనజోదరు దేహమందు వడిఁ జొచ్చె నృపా! 791

వ. అనిన మునివరునకు భూవరుం డిట్లనియె. 792

---

1. భైరవ (హ.) 2. గాత్రమునందు, న్ననుపమ (హ.)

క. కమలాక్షుని నిందించిన, దమఘోషతనూభవుండు దారుణ మలకూ
పమునుం బొందక యే క్రియ, సుమహితమతిఁ గృష్ణునందుఁ జొచ్చె మునీంద్రా!

వ. అనిన శుకయోగి రాజయోగి కిట్లనియె. 794

మ. మధుదైత్యాంతకు మీఁది మత్సరమునన్ మత్తిల్లి జన్మత్రయా
వధి [1]నేఁ బొద్దుఁ దదీయ రూప గుణ దివ్యధ్యాన పారీణ ధీ
నిధి యౌటన్ శిశుపాల భూవిభుఁడు దా నిర్ధూత సర్వాఘుఁ డై
విధి రుద్రాదుల కందరాని పదవిన్ వే పొందె నుర్వీశ్వరా! 795

వ. అంత ధర్మనందనుండు ఋత్విగ్గణంబులను, సదస్యులనుం బహుదక్షిణలం దనిపి, వివిధార్చనలం బూజించి, యవభృథ స్నానక్రియా పరితోషంబున. 796

సీ. మురజ మృదంగ గోముఖ శంఖ డిండిమ పణవాది రవము లంబరము నిండఁ
గవి సూత మాగధ గాయక వంది వైతాళిక వినుతు లందంద బెరయ
వితత మర్దల వేణు వీణారవంబుల గతులకు నర్తకీ గతులు సెలఁగఁ
దరళ విచిత్రక ధ్వజ పతాకాంకిత స్యందన గజ వాజిచయము లెక్క

తే. సుత సహోదర హిత పురోహిత జనంబు
కటక కేయూర హార కంకణ కిరీట
వస్త్ర మాల్యానులేపన వ్రాతములను
విభవ మొప్పారఁ గై సేసి వెడల నంత. 797

వ. యదు సృంజయ కాంభోజ కేకయ కుకుర కోసల భూపాల ముఖ్యులు చతుర్విధ సేనాసమేతు లై, ధరణి కంపింప వెన్నంటి నడతేర, ఋత్విఙ్నికాయంబులును, సదస్యులునుం బ్రహ్మఘోషంబు లోలయ, మున్నిడికొని, శోభమాన నానూన ప్రభా భాసమాన సువర్ణమయ మాలికా మధ్యగత దివ్యమణి హారంబులు కంఠంబునం దేజరిల్ల, నున్నత జవాశ్వంబులం బూన్చిన పుష్పరథంబుఁ గళత్రసమేతుం డై యెక్కి, యతిమనోహర విభవాభిరాముం డై, చనుదెంచుచుండె. అప్పుడు వారాంగనాజనంబులు దమతమ వారలం గూడుకొని. 798

సీ. కనకాద్రి సానుసంగత కేకినులభాతిఁ గ్రొమ్ముళ్లు వీపుల గునిసియాడఁ
దరళ తాటంక ముక్తాఫ లాంశుద్యుతుల్ చెక్కుటద్దములతోఁ జెలిమి సేయఁ
బొలసి యదృశ్య మై పోని క్రొమ్మెఱుఁగుల గతులఁ గటాక్ష దీధితులు దనర
మంచుపై నెగయ [2]నుంకించు జక్కవ లనఁ జన్నులు జిలుఁగు[3]కంచెలల నటుమ

---

1. యేప్రొద్దు (వా.) 2. నూకించు (తం. వా.) 3. కంచెలను నడుమ (హ.)

తే. మహిత కుచభార కంపిత మధ్య లగుచు
నర్థి మొలనూళ్లు మెఱయఁ బయ్యెదలు [4]జాఱఁ
గరసరోజాత కంకణక్వణనములును
జరణనూపుర ఘోషముల్ సందడింప. 799

వ. మఱియు, న య్యిందువదన లందంద మందగమనంబునం జెందు ఘర్మ జలబిందు సందోహ కందలిత మందహాస చంద్రికా సుందర వదనారవిందంబుల నిందిందిర రుచిర చికురబృందంబులు చిందఱవందఱ లై సందడిగొన, నమందానంద హృదయ లై, సువర్ణశృంగ సంగతంబు లైన సంకుమద మలయజ ముఖ సురభి తోయంబులు సముదాయంబు లై, తమతోయంబుల వారిపయిం జల్లుచుఁ, జెందొవల కెందమ్మివిరుల రచియించిన చిమ్మనఁ గ్రోవులం దావులుగల పూఁదేని యలు నించి, వావులు దెలిపి, తేవలు మీఱఁ, గ్రేవల నుండి, యిమ్ములఁ గవిసి చిమ్ముచు, మృగమద కర్దమంబును, గుంకుమ పంకంబునుం గొంకక, బింకంబులం జంకె లొలయం, బంకజసన్నిభంబు లగు మొగంబుల నేమఱించి [2]చమురుచు, నుల్లంబులు పల్లవింపం బె ల్లడరి, యందియలు ఘల్లుఘ ల్లని మొరయఁ, గ్రేళ్లు దాఁటుచుం, జాఱుచుఁ జారు చంద్రికాధవళ ఘనసార ధూళిమిళిత రజనీపరా గంబు రంజిల్లఁ, గరంబులం బుచ్చికొని, శిరంబులం జల్లుచుఁ, జిత్తంబుల న మ్మత్త కాశినుల వృత్తంబు లగు కుచంబుల కెత్తు[3]వత్తురే యని, బిత్తరించి, పువ్వుగుత్తులం దత్తఱంబున వేయుచుఁ, బరిహాసింపుచు, నన్యోన్య కరకిసలయ కనకకరండ భరితం బగు పన్నీటం జెంగావి జిలుఁగుఁబుట్టంబులు దట్టంబులుగాఁ దోఁగిన, మర్మంబులు బయలుపడిన, నగ్గలంబు లగు సిగ్గులకు నొప్పిదంబు లగు తమ కనుఱెప్పల కడ్డంబు సేయుచుఁ, బురుషులునుం దాము నా రామ లభిరామ లీలా రసోక్తు లెనయ నంతరంగంబుల సంతసంబునం బంతంబు లిచ్చుచు, వసంతంబు లాడిరి. అవ్వేళ నతుల విమానారూఢు లై, యింద్ర పురంధ్రీజనంబులంబోలె హాటకశిబిక లెక్కి, నిజ చేటికాజనంబులు సేవింపం జనుదెంచు భూకాంత కాంతా జనంబులు తమకు సరసంబు లగు నర్మంబు లైన ధరణీపాల వధూలలామంబు లాదరించు చెలులపైఁ దన సఖీజనంబులం బురికొల్పి చల్లింపుచు, భావగర్భితంబు లగు వారి చతుర సరసోక్తుల మందహాస చంద్రికలు ముఖకమల లీలా [4]విలోకన లక్ష్మిం బ్రోదిసేయం జెలు వలరం జనిరి. ఇ వ్విధంబున నిజ సామ్రాజ్యవిభవంబు పూజ్యంబుగా నజాతశత్రుండు గంగాప్రవాహంబున కరిగి, యందు నిజ వధూ

---

1. జీర (తం. వా.) 2. చఱుముచు (తం. వా.) 3. వత్తుమని బి త్తరించు (తం. వా.)
4. విలాస లక్ష్మిం (తం. వా.)

యుక్తుం డై, శాస్త్రోక్త ప్రకారంబున వేదఘోషంబు లెసఁగ, నవభృథస్నానం బాచరించె. ఆ సమయంబున. 800

క. అనిమిష దుందుభి [1]శుభని, స్వనములు వీతెంచెఁ బుష్పవర్షము గురిసెన్
ముని దేవ పితృ మహీసుర, వినుతుల రవ మెసఁగె నపుడు విమలచరిత్రా! 801

క. నరు లెట్టిపాపు లయినను, గర మర్థిని నెద్దిఁ జేసి గతకల్మషు లై
చరియింతు రట్టి యవభృథ, మరుదుగఁ గావించి రెలమి నఖిలజనంబుల్. 802

ఆ. అంత ధర్మతనయుఁ డభినవ మృదుల దు
కూల సురభి కుసుమమాలి కాను
లేపనములు రత్నదీపిత భూషణా
వలులుఁ దాల్చి వైభవమున నొప్పె. 803

వ. అంత నవభృథ స్నానానంతరంబున మరలి చనుదెంచి. 804

ఉ. పాండుతనూభవాగ్రజుఁడు పాండుయశోనిధి [2]భాసమాన మా
ర్తాండనిభుండు యాజక సదస్య మహీసుర యోగి బంధు రా
ణ్మండలిఁ బూజఁ జేసి బుధమాన్య చరిత్రుఁడు వారి కిచ్చె నొం
డొండ దుకూల రత్న కనదుజ్వల భూషణముఖ్య వస్తువుల్ 805

వ. ఇట్లు నారాయణపరాయణు లయి, దేవసమాన ప్రకాశ ప్రభావంబుల సకల నర నారీలోకంబు లనర్ఘ్య రత్నమయ భూషణ మాల్యానులేపనంబుల ధరియించి, పరమానందభరితాత్ము లై, యొప్పియుండిరి. అంత. 806

చ. సునిశితభక్తి తన్మఖముఁ జూడఁగ వచ్చినయట్టి దేవతా
ముని ధరణీసుర ప్రకర భూవర [3]విడ్జన శూద్రకోటి య
జ్ఞనపతిచంద్రుచే నుచితసత్కృతులం బరితోషచిత్తు లై
వినయముతోడ ధర్మజుని వీడ్కొని పోవుచుఁ బెక్కుభంగులన్. 807

చ. హరి చరణాంబుజాత[4]యుగ ళార్చకుఁ డై పెనుపొందు పాండు భూ
వరసుతు రాజసూయమఖ వైభవమున్ నుతియించుచున్ సమా
దరమున నాత్మభూముల కుదారత నేఁగిరి ధర్మసూనుఁడున్
[5]సరసిజనేత్రుని న్ననుపఁజాలక యుండు మటంచు వేఁడినన్. 808

---

1. ఘన (తం. వా.) 2. దానమానమా, ర్తాండ (హ.) 3. వైశ్యజ (హ.) 4. యుగ ళార్చకులై (హ.) 5. సరసిజనేత్రుఁ డా ననుపఁజాలక (తం. వా.)

వ. ఇట్లు పాండవాగ్రజు ప్రార్థనన్ గైకొని, దామోదరుండు సర్వయాదవులనుం గుశస్థలికిం బోవం బనిచి, కతిపయ పరిజనంబులుం, దానును నతనికిం బ్రియంబుగాఁ దన్నగరంబునఁ బ్రమోదంబున నుండె. అని చెప్పి మఱియు ని ట్లనియె. 809

చ. జనవర ! పాండుభూప తనుజాతుఁడు దుస్తర తన్మనోరథా
బ్ధిని సరసీరుహాక్షుఁ డను తెప్పకతంబున దాఁటి భూరిశో
భనయుతుఁ డై మనోరుజలఁ బాసి ముదాత్మకుఁ డై వెలింగె న
వ్వనరుహనాభ దాసజన [1]వర్గముకుం గలవే యసాధ్యముల్. 810

వ. అట్టియెడ. 811

అధ్యాయము – ౭౫

ఆ. రాజసూయకాధ్వర ప్రభావమునకు
నఖిలజనులు మోద మంది రపుడు
కలుషమానసుండు కులపాంసనుఁడు సుయో
ధనుఁ డొకండు దక్క ధరణినాథ ! 812

వ. అనిన విని, శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 813

ఆ. అఖిలజనుల కెల్ల నానందజనక మై
యొనయు మఖము కురుకులేశ్వరునకుఁ
గర మసహ్య మైన కారణ మె ట్లది
యెఱుఁగఁ బలుకు నాకు నిద్ధచరిత! 814

చ. అనిన మునీంద్రుఁ డి ట్లను ధరాధిపుతోఁ గురురాజు పాండునం
దనుల దెస న్ననేక దురితంబులు నిచ్చలు సేయుచుండు నై
నను నొకనాఁడు పంకరుహనాభ దయాపరిలబ్ధ [2]సర్వశో
భన జిత దేవ దైత్య నరపాలక రాజ్యరమా మహత్త్వ మై. 815

చ. వెలయు సమానసంపదల విశ్రుతకీర్తుల మిన్నుముట్టఁ బెం
పలరిన పాండుభూవర సుతాగ్రజుఁ దంతిపురంబులోన ను
జ్జ్వల మణిభూషణాంశు రుచిజాలము పర్వఁ బయోజనాభు ను
త్కలిక భజింపుచున్ ఘన సుఖస్థితి భూరి మనోహరాకృతిన్. 816

వ. ఉండం గనుంగొని, యదియునుం గాక, లలితాష్టమీ శశాంకబింబంబుల విడం బించుచు, నింద్రనీల రుచినిచయంబు నపహసించు కుటిలకుంతలంబులు నటనంబు

1. వర్యులకున్ (తం. వా.) 2. భూరి (తం. వా.)

సలుపం దనరు నిటలఫలకంబులును, [1]బుష్పచాప చాపప్రచారంబుల యేపు చూపు భ్రూయుగోపాంతము లై, సౌదామనీదామ రుచిస్తోమంబు లై, కర్ణాంతసీమంబు లై, యంజనంబులతోడ రంజిల్లు నేత్రకంజంబులును, నవమల్లికా ముకుళ విభాసిత దంతమరీచికా నిచయోద్దీపిత మందహాసచంద్రికా ధవళితంబు లును, ముకురోపమితంబులును నై, కర్ణకుండల మణి మరీచి జాలంబులు బెరసి, బహుప్రకారంబులఁ బర్వం బొలుచు కపోలపాలికలును, విలసిత గ్రైవేయక ముక్తాఫల హారనిచయంబుల కిమ్ము చూపక, మిసమిసని పసగల మెఱుంగులు గిరికొన, మీటినం బగులు ననం బొగడం దగి, మొగంబులకుం బుటంబు లెగయు నుత్తుంగ పీన కుచభారంబుల వ్రేఁగు లాఁగలేకఁ దూఁగాడుచుం, గరతల పరిమే యంబు లగు మధ్యభాగంబులును, ఘన జఘనమండ లావతీర్ణ కాంచన కాంచీ కలాప కింకిణీ కలనిన దోల్లసితంబు లగు కటిప్రదేశంబులును, సల్లలిత హల్లక పల్లవకాంతుల మొల్లంబులఁ గొల్లలుగొని, యభిరామంబు లై శోభిల్లు పద పాణి తలంబులును, నలసగతులం బదంబులం దనరు మణినూపురంబులుం, గోపు రంబులం బ్రతిస్వనము లొలయ మొరయ నలరు చరణారవిందంబులును, రత్న వలయ కంక ణాంగుళీయకాది వివిధ భూషణ మణిద్యుతి నిచయంబు లుష్ణ మరీచి కరనిచయంబుల ధిక్కరింప వెలుంగు కరకంజంబులును, మృగమద ఘనసార హరిచంద నాగరు కుంకుమ పంకంబుల భాసురంబు లగు వాసనలు నాసారంధ్రంబులకు వెక్కసంబు లయి [2]సొలయు సౌభాగ్యంబులుం గలిగి, చైతన్యంబు నొందిన మాణిక్యపు బొమ్మల విధంబునం, గగనమండలంబు నిర్గ మించి వసుధాతలంబున సంచరించు చంద్రరేఖల చెలువున, శృంగారరసంబు మూర్తీభవించి జగంబుల మోహపరచు మోహినీదేవతల చందంబున విలసించు మాధవ వధూసహస్రంబుల సంగతిని, సౌదామినీలతయునుంబోలి యొప్పుచుం డెడు ద్రుపద రాజనందన విభవంబును,రాజసూయ మహాధ్వరోత్సవంబునుం జూచి, చిత్తం బుత్తలపడ, సుయోధనుండు సంతాపానలంబునం గ్రాఁగుచుండె. అంత నొక్కనాఁడు ధర్మనందనుండు నిర్మలం బగు సభాభవనంబునకుం జని. 817

సీ. సుత సహోదర పురోహిత బాంధ వామాత్య పరిచార భటకోటి బలసి కొలువఁ
గలిత మాగధ మంజుగానంబు పాఠక పఠనరవంబును బ్రమద మొసఁగఁ
గంకణ ఝణఝణత్కారంబు శోభిల్ల సరసిజాననలు చామరము లిడఁగ
మయ వినిర్మిత సభామధ్యంబునను భాస మాన సింహాసనాసీనుఁ డగుచు

1. పుష్పచాపుచాపంబు రూపు నేపుమాపు (తం. వా.); ప్రచారంబుల నేపుచూపు (హా.)
2. పొలయు (తం. వా.)

తే. సమరగణములు గొలువఁ బెంపారు ననిమి
షేంద్రుకై వడి మెఱసి యుపేంద్రుఁ డలర
వరుసఁ గొలువున్న య త్తఱి దురభిమాని
క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు. 818

ఉ. కాంచన రత్నభూషణ నికాయముఁ దాల్చి సముజ్జ్వల ప్రభో
దంచిత మూర్తి నొప్పి పణిహారులు ముందటఁ గ్రందువాయ [1]వా
రించ సహోదరుల్ నృపవరేణ్యులు పార్శ్వములన్ భజింప నే
తెంచెను రాజసంబున యుధిష్ఠిరుపాలికి వైభవోన్నతిన్. 819

వ. అట్లు చనుదెంచి, మయమాయామోహితం బయిన సభాస్థలంబునందు. 820

క. సలిలములు లేని తావున, వలువలు వెస నెగయఁ దిగిచి వారక తోయం
బులు గలచోటను జేలం, బులు దడియఁగఁ బడియె నిజవిభుత్వము దఱుఁగన్.

క. ఆ విధ మంతయుఁ గనుఁ గొని, పావని నవ్వుటయు నచటి పార్థివులును గాం
తావళియును యమతనయుఁడు, వావిరి చేసన్నఁ దమ్మి వారింపంగన్. 822

వ. దామోద రానుమోదితు లై మహారావంబుగాఁ బరిహాసంబులు చేసిన, సుయో
ధనుండు చిత్తంబు చిన్నఁబోయి, లజ్జావనత వదనుం డై, కుపితమానసుం
డగుచు, న య్యెడ నిలువక, వెలువడి, నిజపురంబున కరిగె. అ య్యవసరంబున
ధీవిశాలు రైన సభాసదు లగు నచ్చటి జనంబుల కోలాహలంబు సంకులం బైన,
నజాతశత్రుండు చిత్తంబున విన్న నై యుండె. అ ప్పుండరీకాక్షుండు భూభార
నివారణకారణుం డగుటం జేసి, దుర్యోధను నప[2]హాసంబునకుం గాదనఁ డయ్యె.
అ య్యెడ. 823

క. హరి ధర్మసుతుని వీడ్కొని, తరుణీ హిత బంధు జన కదంబము గొలువన్
బరితోషమునఁ గుశస్థల, పురమునకుం జనియె మోదమున నరనాథా! 824

చ. జనవర బంధమోక్షణము చైద్యవధంబును పాండురాజ నం
దను మఖరక్షణంబును నుదారతఁ జేసినయట్టి దేవకీ
తనయు చరిత్ర [3]భాషణ కథాపర నాత్ములు గాంతు రిష్టశో
భన బహుపుత్ర కీర్తులును భవ్యవివేకము విష్ణులోకమున్. 825

1. వారింప (తం. వా.) 2. యశంబునకు (హా.) 3. భాసుర (తం. వా.)

వ. అని యభ్యర్థించినం, బ్రసన్నుం డయి, హరుండు, వాని కోర్కి కనురూపం బైన విమానంబు నిర్మింప మయుని నప్పగించిన, నతండును నట్ల చేసి, కామగమనం బును, నతి విస్తృతంబును గా లోహంబున నిర్మించి, [1]సౌభకం బను నామం బిడి, సాల్వున కిచ్చిన, వాఁడును బరమానందంబునుం బొంది, తద్విమానారూఢుండై, యాదవుల వలని పూర్వవైరంబుఁ దలంచి, దర్పాంధ చేతస్కుం డై, ద్వారకా నగరంబుపైఁ జని, నిజసేనా సమేతంబుగాఁ దత్పురంబు [2]నిరోధించి. 833

సీ. సరి దుపవన సరోవరములు మాయించి బావులు గలఁచి కూపములు చెఱిచి
కోటలు వెస వీటతాటముల్ గావించి పరిఘలు పూడ్చి వప్రములు ద్రొబ్బి
యట్టళ్ళు ధరఁగూల్చి యంత్రముల్ దునుమాడి కాంచన ధ్వజపతాకములు నఱికి
భాసుర గోపుర ప్రాసాద హర్మ్యంబు లందు శాలాంగణములు భస్మములుచేసి

తే. విమల కాంచన రత్నాది వివిధవస్తు
కోటి నెల్లను నందంద గొల్లవుచ్చి
ప్రజలఁ జెఱపట్టి దొరలను భంగపెట్టి
తఱిమి యి బ్భంగిఁ బెక్కు బాధల నలంచి. 834

చ. మదమున నంతఁ బోవక విమానయుతంబుగ నభవీథికిన్
[3]గొదగొని యేపుమై నెగసి కొంకక శక్తి శిలా మహీరుహ
ప్రదరము లోలిమైఁ గురిసి బంధుర భూమిపరాగ శర్కరల్
వదలక చల్లుచున్ [4]వలయ వాయువుచే దిశ లావరింపుచున్. 835

వ. అట్టి యెడ. 836

క. చటుల పురత్రయ దనుజో, త్కట దుస్తర బాధ్యమాన ధారుణిగతి న
వ్వుటభేదన [5]మెంతయు వి,స్ఫుటపీడం జెంది వగల సుడివడుచుండన్. 837

చ. కని భగవంతుఁడున్ రథిశిఖామణియు న్నగు రౌక్మిణేయుఁ డ
జ్జనముల నోడ కుండుఁ డని సంగర కౌతుక మొప్ప దివ్యసా
ధనములఁ బూని సైనిక కదంబము గొల్వ ననూన మీనకే
తనరుచి గ్రాల నున్నత రథస్థితుఁ డై వెడలెన్ రణోర్వికిన్. 838

వ. అ య్యవసరంబున. 839

---

1. సౌంభకంబను (హ.) 2. వేధించి (హ.) 3. గొదకొని (తం.వా.) 4. వలయు (హ.)
5. మంతయతి (హ.)

చ. సమధిక బాహుశౌర్య జిత చండవిరోధులు [1]వెళ్ళి రున్నత
తమ గద భానువింద శుక సాత్యకి సారణ చారుదేష్ణ సాం
బ మకరకేతనాత్మజ శ్వఫల్క తనూభవ తత్సహోదర
ప్రముఖ యదూత్తముల్ వినుతభంజను లై కృతవర్మ మున్నుగన్. 840

క. వారణ వాజి స్యందన, వీరభటుల్ వేగ చనిరి విశ్వము వణఁకన్
ఘోరాకృతి వివిధాయుధ, భూరిద్యుతు లర్కబింబమున్ గబళింపన్. 841

వ. చని, యా గోవింద నందన స్యందనంబునుం, బలసందోహంబునుం దలకడచి, యదు సైన్యంబులు సాల్వబలంబుల తోడం దార్కొని, పెరయునప్పుడు, దేవ దానవ సంకుల సమర విధంబునం దుములం బయ్యె. ఇవ్విధంబున. 842

మ. వితత జ్యాచయ టంకృతుల్ మదజలావిర్భూత శుండాల ఘీం
కృతు లుద్య ద్భట హుంకృతుల్ మహిత భేరీభాంకృతుల్ భీషణో
ద్ధత నిస్సాణ ధణంకృతుల్ ప్రకట యోధవ్రాత సాహంకృతుల్
కుతలంబున్ దివి నిండ మ్రోసె రిపుసంక్షోభంబుగా భూవరా ! 843

మ. హరిరింఖా రథనేమి సద్భట పద వ్యాఘట్ట నోద్ధూత దు
స్తర ధూళీపటల ప్రభూత నిబిడ ధ్వాంత ప్రవిధ్వంస కృ
త్కర శాతాసి గదాది హేతిరుచు లాకాశంబు నిండన్ వియ
చ్చర దృక్కుల్ మిఱుమిట్లు గొల్ప సమరోత్సాహంబు సంధిల్లఁగన్. 844

చ. తలకొని సైనికుల్ గవిసి తార్కొని పేర్కొని పాసి డాసి యం
కిలిగొన కిమ్ము లమ్ములఁ బగిల్చి నొగి ల్చితరేతరుల్ తలల్
నలియఁగ నొత్తి మొత్తి నయనంబుల [2]నిప్పులు రాల లీల నా
దలలు లలాటముల్ ఘన గదాహతి నొంచి కలంచి [3]పోరఁగన్. 845

వ. అ య్యవసరంబునం బ్రద్యుమ్నుండు గనుంగొని. 846

మ. అనయంబున్ గలుషించి సౌభపతి మాయాకోట్లు చంచ చ్ఛరా
సన నిర్ముక్త నిశాత దివ్య మహితాస్త్రశ్రేణిచేఁ దత్క్షణం
బున లీలాగతి నభ్రగుల్ మనములన్ భూషింప మాయించె న
వ్వనజాతాప్తుఁడు భూరి సంతమసమున్ వారించు చందంబునన్. 847

వ. మఱియును. 848

---

1. వెళ్ళునున్నత (హ.) 2. నంబులురాల (హ.) 3. పారఁగన్ (హ.)

చ. అతిరథికోత్తముం [1]డన నుదంచిత కాంచనపుంఖ పంచవిం
శతి విశిఖంబుల న్నతని సైనికపాలుని నొంచి యుగ్రుఁడై
శత శతకోటికోటి నిభ సాయకముల్ పరఁగించి సాల్వ భూ
పతి కకుదంబు నొంచి లయభైరవు కైవడిఁ బేర్చి వెండియున్. 849

చ. పదిపది యమ్ములన్ మనుజపాల వరేణ్యుల నొంచి రోషమున్
గదురఁగ మూఁడుమూఁడు శితకాండములన్ రథ దంతి వాజులన్
[2]జదియఁగ నేసి యొక్కొక నిశాత[3]శరంబున సైనికావళిన్
మదము లడంచి యి ట్లతఁ డమానుషలీలఁ బరాక్రమించినన్. 850

క. దుర్మానవ హారు నద్భుత, కర్మమునకు నుభయ సైనికప్రకరంబుల్
నిర్మలమతి నుతియించిరి, ధర్మాచల ధైర్యు విగతభయుఁ బ్రద్యుమ్నున్. 851

వ. అ య్యవసరంబున. 852

ఉ. సాంబుని సాల్వభూవిభుఁడు సాయకజాలము లేసి నొంచినన్
జాంబవతీ తనూభవుఁడు చాపము సజ్యము చేసి డాసి సా
ల్వుం బదియేను తూపుల నవోన్నతవక్షము గాఁడనేసి తీ
క్ష్ణాంబకవింశతి న్నతని సౌభక మల్లలనాడ నేసినన్. 853

చ. గదుఁడు మహోగ్రవృత్తి నిజకార్ముక నిర్గత విస్ఫుర ద్విధుం
తుద వదనాభ బాణవితతుల్ పరఁగించి విరోధిమస్తముల్
గుదులుగఁ గ్రుచ్చి యెత్తుచు నకుంఠిత విక్రమకేళి లోలుఁడై
చదల సురల్ నుతింప రథిసత్తముఁ డొప్పె నరేంద్రచంద్రమా! 854

ఉ. సాత్యకి చండరోషమున సాల్వమహీవరు భూరి సౌభ సాం
గత్య చతుర్విధోగ్ర బల గాఢతమః పటలంబు భాసురా
దిత్య మయూఖపుంజ రుచి తీవ్రశరంబుల మాపి సైనిక
స్తుత్య పరాక్రమ ప్రకట దోర్బలుఁ డై విలసిల్లె భూవరా! 855

ఉత్సాహ. భానువిందుఁ డుద్ధతిన్ విపక్షపక్ష సైన్య దు
ర్మాన కాననానలోపమాన చండకాండ సం
తాన మూన నేసి చూర్ణితంబు చేసెఁ జూప వి
ద్యానిరూఢి దేవతావితాన మిచ్చ మెచ్చఁగాన్. 856

---

1. డును (హా) 2. గదియఁగ (హా.) 3. శరంబుల (హా.)

ఉత్సాహ. చారుదేష్ణుఁ డాగ్రహించి శత్రుభీష ణోగ్రదో
స్సార దర్ప మేర్పడన్ నిశాత బాణకోటిచే
దారుణ ప్రతాప సాల్వ దండనాథమండలిన్
మారి రేఁగినట్లు పిల్కుమార్చి పేర్చి యార్చినన్. 857

క. శుకుఁ డాయోధన విజయో, త్సుకమతి బాహాబలంబు సొప్పడ విశిఖ
ప్రకరంబులఁ దను శౌర్యా, ధికుఁ డన విద్వేషబలతతిన్ బరిమార్చెన్. 858

ఉ. సారణుఁ డేపుమైఁ గదిసి శాత్రవవీరులు [1]సంచలింప దో
స్సార మెలర్పఁ గుంత శర శక్తి గదా ఛురికాది హేతులన్
వారక వాజి దంతి రథ వర్గములం దునుమాడి కాల్వురన్
వీరముతోడఁ బంపె జముపీటికిఁ గాఁపుర ముగ్రమూర్తి యై. 859

క. అక్రూరుఁడు తదనుజులు న, వక్రపరాక్రమము మెఱసి వైరుల బాహా
విక్రమమున వధియించిరి, చక్ర ప్రాసాది వివిధ సాధనములచేన్. 860

మ. కృతవర్మ క్షితినాయకుండు విశిఖశ్రేణిన్ బ్రమత్తా ర్యధి
శ్రిత వర్మంబులఁ జించి మేనుల శతచ్ఛిద్రంబులం జేయ న
ద్భుతకర్మం బని సైనికుల్ వొగడ శత్రుల్ [2]దూలుచో సంగర
క్షితి ధర్మంబుఁ దలంచి కాచె రథికశ్రేష్ఠుండు భూమీశ్వరా! 861

వ. అత్తఱి సాల్వుండును గోపోద్దీపిత మానసుం డై యుండ, మాయావిడంబక
మయిన సౌభకం బప్పుడు. 862

సీ. ఒకమాటు నభమునఁ బ్రకటంబుగాఁ దోఁచు నొకమాటు ధరణిపై నొనర నిలుచు
నొకమాటు శైలమస్తకమున వర్తించు నొకమఱి చరియించు నుదధినడుమ
నొక్కతోయంబున నొక్కటి యై యుండు నొక్కెడఁ గనుఁగొనఁ బెక్కులగును
నొకమాటు సాల్వసంయుక్త మై పొడసూపు నొకతోయ మన్నియు నుడిగితోఁచు

ఆ. నొక్కతేప కొఱవి యుడుగక త్రిప్పిన
గతి మహోగ్రవృత్తిఁ గానవచ్చు
మఱియుఁ బెక్కుగతుల నరవరుల్ గలఁగంగఁ
దిరిగె సౌభకంబు ధీవరేణ్య! 863

వ. ఇవ్విధంబున సౌభకంబు వర్తించుటంజేసి, యదు సైన్యంబులచేత దైన్యంబు
నొందిన నిజసైన్యంబుల మరలం బురికొల్పి, సాల్వుం డప్పుడు. 864

---

1. సందడింప (హ.) 2. దూరుచో (హ.)

క. స్ఫుర దనలాభ శరంబులు, [1]పొరిఁబొరిఁ బుంఖాను పుంఖములుగా నేయన్
దెరలియు మరలియు మురిసియు, విరిసియుఁ బిఱుతివక పోరె వెస యదు బలమున్.

క. అ య్యేడ మానము వదలక, డయ్యక మగపాడితోఁ దృఢంబుగఁ బోరన్
దయ్యో మెఱుంగును నెక్కటి, కయ్యం బపు డయ్యెఁ బేరుగల యోధులకున్.

క. మును ప్రద్యుమ్న కుమారుని, ఘన నిశితాస్త్రములచేతఁ గడు [2]నొచ్చిన సా
ల్వుని[3]మంతిరి ద్యుమనాముఁడు, సునిశిత గద చే నమర్చి సుమహిత శక్తిన్.

చ. వెరవును లావు చేవయును వీరము బీరము గల్గి డాసి యా
సరసిజనాభ నందను విశాల భుజాంతరమున్ బగిల్చినన్
విరవిరవోయి మేను నిడువెంద్రుక వెట్టఁగఁ జేతి సాధనో
త్కరములు దేరిపై [4]వదలఁ గన్నులు మూయుచు మూర్ఛనొందినన్. 868

ఆ. సమర ధర్మవేది సమధిక నయవాది
[5]దారుకుని సుతుండు ధైర్యయుతుఁడు
రథముఁ దోలికొనుచు రణభూమి వెడలి వే
చనియె మూర్ఛదేఱె శంబరారి. 869

చ. సారథిఁ జూచి యి ట్లనియె శాత్రవవీరులు నూచి నవ్వఁగాఁ
దేరు రణక్షితిన్ వెడలఁ దెచ్చితి తెచ్చితి దుర్యశంబు పం
కేరుహనాభుఁడున్ హలియు [6]గేలిగొనన్ యదువంశ సంభవుల్
బీరము దప్పి యి ప్పగిదిఁ బెల్కుఱిపోవుదురే రణంబునన్. 870

వ. అనిన నతం డతని కి ట్లనియె. 771

క. రథి రిపుచే నొచ్చిన సా,రథియును సారథియు నొవ్వ రథియును గావం
బృథు సమరధర్మ మిఁక న,వ్యథ చిత్తుఁడ వగుచుఁ గడఁగు వైరులఁ గెలువన్. 872

వ. అనిన విని.

అధ్యాయము - ౭౭

ఉ. సంచిత భూరిబాహుబల శౌర్యుఁడు సారథిమాట కాత్మ మో
దించి [7]యుదాత్త కాండరుచి దీపిత చాపముఁ దాల్చి మౌర్వి సా
రించి గుణధ్వనిన్ మహా దరిప్రకరంబుల భీతి ముంచి తో
లించె రథంబు మేదిని చలింపఁగ నా ద్యుముమీఁద నేర్పునన్. 874

---

1. పురిపురి (హ.) 2. నొంచిన (హ.) 3. మంత్రిద్యుమ (హ.) 4. వదలఁగన్నులు (హ.)
5. దారకుని (హ. తం.) 6. ఁగేలుకొనన్ (హ.) 7. రవిప్రకాండ(తం.వా.); సచిత్రకాండ(ట.)

వ. అట్లు డగ్గఱి. 875

చ. అరితను వష్టబాణముల నాగ్రహవృత్తిఁ బగిల్చి నాల్గిటన్
దురగములన్ వధించి యొక తూపున సారథిఁ ద్రుంచి రెంట ని
ష్ఠురతర కేతుచాపములు చూర్ణముచేసి యొకమ్మునన్ భయం
కరముగఁ ద్రుంచె నా ద్యుమ్ముని కంఠ మకుంఠిత విక్రమోద్ధతిన్. 876

మ. కని సాంబప్రముఖాది యోధవరు లుత్కంఠాత్ములై మీనకే
తను నగ్గించి సువర్ణపుంఖ నిశితాస్త్రశ్రేణి సంధించి సా
ల్వుని సైన్యావళి మస్తముల్ వెరవు [1]లావున్ మీఱఁగా నొక్కయె
త్తున వేత్రుంచిరి తాటిపండ్లు ధరఁ దోడ్తో రాల్చు చందంబునన్. 877

వ. అట్టియెడ. 878

స్రగ్ధర. కూలున్ గుఱ్ఱంబు లేనుంగులు ధరఁ దొరఁగున్ గుప్పయై నుగ్గునూచై
వ్రాలున్ దేరుల్ హతంబై వడిఁ బడు సుభట వ్రాతముల్ శోణితంబుల్
గ్రోలున్ మాంసంబు నంజుల్ గొఱుకు నెముకలన్ గుంపులై సోలుచున్ బే
తాళ క్రవ్యాద భూతోత్కరములు జతలై తాళముల్ దట్టి యాడున్.

వ. మఱి యొక్కొక్క యెడ. 880

సీ. ఖండిత శుండాల గండముల్ నక్రముల్ భూరి తుండంబులు భుజగసమితి
పదతలంబులు కచ్ఛపంబులు దంతముల్ శుక్తులు కుంభనిర్ముక్త మౌక్తి
కములు రత్నములు వాలములు జలూకముల్ మెడలు భేకంబులు మెదడురొంపి
ప్రేవులు పవడంపు దీవలు నరములు నాచు మజ్జంబు ఫేనంబు లస్థి

ఆ. సైకతములు రక్తచయము తోయంబులు
[2]నొరగు నెడల నొరలు [4]మొఱలు ఘనత
రంగరవముగా మతంగజాయోధన
స్థలము జలధిఁ బోల్పఁ దగె నరేంద్ర! 881

వ. ఇవ్విధంబున యదు సాల్వ బలంబులు చలంబునం బరస్పర జయకాంక్షలం దల
పడి పోరు పూర్వ పశ్చిమ సముద్రంబుల వడువున, నిరువదియేడు దినంబు లతి
ఘోరంబుగాఁ బోరునెడ, నింద్రప్రస్థ పురంబున నుండి, ద్వారకా నగరంబునకు
నగధరుండు చనుదేర, ముందటం గానవచ్చు దుర్నిమిత్తంబులు గైకొని కృష్ణుండు
[4]దారుకునిఁ జూచి యిట్లనియె. 882

1. తావుల్ నేర్పడ నొక్క (హ.) 2. నొఱలు (హ.) 3. మొఱులు(హ.) 4. దారకుని (హ.)

శా. కంటే [1]దారుక! దుర్నిమిత్తము లనేకంబుల్ మహాఖిలముల్
మింటన్ మేదినిఁ దోఁచుచున్నయవి నెమ్మిన్ ఖాండవప్రస్థ మే
నుంటన్ జైద్యహిత క్షితీశ్వరులు మాయోపాయులై మత్పురిన్
గెంటింపన్ జనుదేరఁ బోలుదురు పోనీ తేరు వేగంబునన్. 883

వ. అని యతి త్వరితగతిం జనుదెంచి, తత్పురంబు డగ్గఱి, మహాబలపరాక్రమంబులం బ్రతిపక్షబలంబులతోడం దలపడి పోరు యదుబలంబులను, నభోవీథి నభేద్య మాయావిడంబనంబునఁ బ్రతివీరు లెంతకాలంబున కే యుపాయంబున సాధింప రాని సౌభకవిమానంబునం దున్న సాల్వునిం గని, తద్విమానంబు డాయం దన తేరు దోల సారథిని నియమించి, కదియం జను మురాంతకుని వీక్షించి, యదు సైన్య ప్రకరంబులు పరమానందంబునుం బొందిరి. మృతప్రాయం బై యున్న సైన్యంబుఁ గనుంగొని, సౌభకపతి విక్రమ క్రియాకలాపుం డగుచు నురవణించి.

చ. మిణుఁగుఱు లెల్లెడం జెదర మింటను మంటలు పర్వ ఘంటికా
ఘణఘణ భూరి నిస్వననికాయమునన్ హరి దంతరాళముల్
వణఁక మహోగ్రశక్తిఁ గొని వారక దారుకు మీఁద వైవ దా
రుణగతి నింగినుండి నిజరోచులతోఁ బడు చుక్కకైవడిన్. 885

క. వడిఁ జనుదేరఁగఁ గని య, ప్పుడు నగధరుఁ డలఁతిలీల వోలెన్ దానిన్
బొడిపొడి యై ధరఁ దొరఁగఁగ, నడుమన వెసఁ ద్రుంచె నొక్క నారాచమునన్.

చ. గురుభుజుఁ డంతఁ బోవక యకుంఠిత శూరత శత్రుసైన్యముల్
చెరలఁగ నుగ్రతన్ గొఱవిఁ ద్రిప్పినకైవడి మింట దిర్దిరన్
దిరుగుచు దుర్నిరీక్ష్య మగు దీపిత[2]సౌభము సాల్వుఁ డండభా
స్కర కిరణాభ షోడశ నిశాతశరంబులఁ గాఁడ నేసినన్. 887

చ. కడువడి నగ్గి వాఁడు నిజకార్ముకమున్ జలదస్వనంబు కై
వడి మొరయింపుచున్ వెడఁదవాతి శరంబులఁ బద్మలోచను
న్నెడమభుజంబు గాఁడ వడి నేసినఁ [3]దెం పటి చేతి శార్ఙ్గమున్
విడిచె రథంబుపై గగనవీథి సురల్ భయమంది చూడఁగన్. 888

క. [4]హా! హా! యని భూతావళి, హాహాకారములు సేయ నంతట దేఱ
న్నా హరిఁ గనుగొని యతఁ డుత్సాహంబునఁ బల్కె బాహు శౌర్యస్ఫూర్తిన్.

---

1. దారక (హా.) 2. సౌభకు (హా.) 3. దెప్పిరి (హా) 4. ఓహో (హా.) 5. భూతావలు, లాహాకారములు సేయ (హా. తం. వా.)

చ. నలినదళాక్ష! మత్సఖుఁడు నాఁ దగు చైద్యుఁడు గోరినట్టి కో
మలి నవినీతి వై తగవుమాలి వరించితి వంతఁ బోక దో
ర్బలమున ధర్మనందను సభాస్థలి నేమఱి యున్నవాని స
చ్ఛలమునఁ [1]జంపి తట్టి కలుషంబున నేఁడు రణాంగణంబునన్. 890

క. తల చెడి పాఱక శాహో, బల మొప్పఁగ నాదు దృష్టిపథమున ధృతితో
నిలిచిన నిష్ఠుర విశిఖా, ర్భుల ముంచి మదీయసఖుని సూ డిటఁ దీర్తున్. 891

చ. అనిన మురాంతకుండు దరహాసము మోమునఁ దొంగలింప సా
ల్వునిఁ గని యోరి! లావు [2]లగువుం గల పోటరివోలెఁ బ్రేలె దే
[3]మని నను జాటు సన్నిహిత మౌట యెఱుంగవు మూఢచిత్త! పొ
మ్మని గద కేలఁ ద్రిప్పి [4]యభియాత్ముని జత్రువు వ్రేసె నుద్ధతిన్. 892

వ. అట్లు వ్రేసిన. 893

క. పెను మూర్ఛ నొంది వెస ము, క్కున వాతను నెత్తు రొల్కఁ గొంత[5]తడవు కొ
య్యన తెలిసి నిలువరింపక, చనె వాఁడు [6]నదృశ్యుఁ డగుచు సౌభముఁ దానున్.

వ. అ య్యవసరంబున. 895

తే. గగనమం దుండి యొకఁ డార్తుఁ డగుచు వచ్చి
నందనందను పాదారవిందములకు
వందనము చేసి యానకదుందుభిని మ
హోగ్రుఁ డై పట్టి తెచ్చె సాల్వుండు గడఁగి. 896

తే. దేవ! మీ కెఱిఁగింపఁగాఁ దివిరి యిటకు
దేవకీదేవి నన్నుఁ బుత్తెంచె ననఁగ
విని సరోరుహనాభుండు ఘన విషాద
మగ్నుఁ డయ్యెను గురుమీఁది మమతఁ జేసి. 897

క. నర గంధర్వ సురాసుర, వరులకు నిర్జింపరానివాఁడు బలుం డే
మఱక రయహీనబలుచేఁ, బరికింపఁగ నెట్లు పట్టువడె నొకో యనుచున్. 898

వ. మఱియును. 899

---

1. చంపినట్టి కలుషంబులు (హ.) 2. బలువున్ (తం.వా.) 3. యేమనినను (వ్రాఁతప్రతులు) 4. యభియాతుని శత్రుని (హ.); యభియాతిని శత్రుని (తం. వా.) 5. వడికి నొయ్యన (తం. వా.) 6. నదృశ్యమగుచు (హ.)

క. భావంబు గలఁగ నహహా!, దైవకృతం బెవ్వరికినిఁ దప్పింపఁగ రా
దే విధి నైన నను నని శో, కానిలమతిఁ బలుకుచున్న న త్తఱి వాఁడుఁ. 900

వ. అప్పుడు దన మాయాబలంబునం గ్రమ్మఱం దోఁచి, కృతకవసుదేవునిం గల్పించి, యతనిం బంధించి, కొనితెచ్చి, పుండరీకాక్ష! నిరీక్షింపు. భవజ్జనకుండు వీఁడె. ఇప్పుడు నీవు గనుంగొన వీనితల ద్రుంతు. ఇంక నెవ్వనికింగా మనియెదు. కావం గల శక్తి గలదేనియుం గావుము. అని దురాలాపంబు లాడుచు, మృత్యుజిహ్వా కరాళం బైన కరవాలంబు కేలం బూని, ఝుళిపించుచు, న మ్మాయావసుదేవుని శిరంబు దునిమి, తన్మస్తకంబుఁ గొని, వియద్వర్తి యై చరియించు సౌభక విమానంబు సొచ్చెను. అంత గోవిందుండు కొంత ప్రొద్దు మనంబున ఘనం బగు శోకంబునం గుందుచుండి, యాత్మ సైనికులు దెలుపం దెలివొంది, యది మాయోద్దీపితం బైన సాల్వుని యుపాయం బని యెఱింగియుండె. అంతం దనకు వసుదేవుండు వట్టువడె నని చెప్పిన దూతయు, న మ్మాయా కళేబరంబును న క్షణంబ విచిత్రంబుగా మాయం బయిపోయె. తదనంతరంబ. 901

క. మును లపుడు గొంద ఱచటికిఁ, జనుదెంచి విమోహి యైన జలజాక్షుఁ
గనుఁగొని సమధికభక్తిని, వినయంబునఁ బలికి రంత విష్ణుఁ జిష్ణుఁ. 902

సీ. కమలాక్ష! సర్వలోకములందు సర్వమానవులు సంసార నానావిధైక
దుఃఖాబ్ధి మగ్ను లై తుదిఁ జేరనేరక వికలత్వమును బొందువేళ నిన్నుఁ
దలఁచి దుఃఖంబులు దరియింతు రట్టి స ద్గుణనిధి వై దేవకోటి కెల్లఁ
బట్టుఁ గొ మ్మయి పరబ్రహ్మాఖ్యఁ బొగడొంది పరమ యోగీశ్వరప్రకర గూఢ

తే. పర చిదానంద దివ్యరూపమున వెలుఁగు
దనఘ! నీవేడ? నీచజన్మాత్మ జనిత
ఘన భయ స్నేహ మోహ శోకంబు లేడ?
ననుచు సంస్తుతి చేసి వా రరిగి రంత. 903

చ. హరి తనమీఁద ఘోర నిశితాశుగజాలము లేయు సాల్వభూ
వరు వధియింపఁగోరి బహు వారిదనిర్గత భూరివృష్టి వి
స్ఫురణ ననూన తీవ్ర శర పుంజములఁ గగనంబుఁ గప్పి క్ర
చ్చఱ రిపు మౌళిరత్నమును జాపము వర్మముఁ ద్రుంచి వెండియుఁ. 904

మ. వితత క్రోధముతోడఁ గృష్ణుఁడు జగద్విఖ్యాత శౌర్యక్రియో
ద్ధత శక్తిన్ వడిఁ ద్రిప్పి మింట మెఱుఁగుల్ దట్టంబుగాఁ బర్వ ను
గ్రత చంచద్గద వైచి త్రుంచె వెసఁ జూర్ణంబై ధరన్ రాల నా
యత భూరి త్రిపురాభమున్ మహిత మాయాశోభమున్ సౌభమున్. 905

వ. ఇట్లు కృష్ణుం డమ్మయనిర్మిత మాయావిమానంబు నిజ గదాహతి నింతింత తునియలై సముద్రమధ్యంబునఁ దొరంగఁ జేసిన, సాల్వుండు కోలుటవెట్టికిన భుజంగంబుభంగి గం డడంగి, విన్ననై, విగత మాయాబలుం డయ్యును, పొలి వోవని బీరంబున వసుధాతలంబునకు డిగ్గి, యాగ్రహంబున. 906

క. కరమున పవినిభ మగు భీ, కర గద ధరియించి కదియఁగాఁ జనుదేరన్
మురహరుఁ డుద్ధతి సాల్వుని, కరము గదాయుక్తముగను ఖండించెన్నృపా! 907

క. అంతం బోవని కినుక న, నంతుఁడు విలయార్క మండలాయతరుచి దు
ర్దాంతం బగు చక్రంబు ని,తాంతంబుగఁ బూన్చి సాల్వధరణిపుమీఁదన్. 908

క. గురుశక్తి వైచి వెస భా, సుర కుండల మకుటరత్న శోభిత మగు త
చ్ఛిరము వడిఁ ద్రుంచె నింద్రుఁడు, వర కులిశముచేత వృత్రు వధియించుక్రియన్.

అధ్యాయము - ౭౮

## —: శ్రీకృష్ణమూర్తి దంతవక్త్రుని సంహరించుట :—

వ. ఇట్లు మాయావి యైన సాల్వుండును, సౌభకంబును గృష్ణుచేతఁ బొలియుట గనుంగొని, నిజసఖు లగు సాల్వ పౌండ్రక శిశుపాల భూపాలకులకుం బరలోక క్రియలు మైత్రిం గావించి, దంతవక్త్రుం డతి భీషణాకారంబుతో నప్పుడు. 910

చ. పెటపెటఁ బండ్లు గీటుచును బెట్టుగ మ్రోయుచుఁ గన్నుఁగ్రేవలన్
జిటచిట విస్ఫులింగములు చింద మహోద్ధత పాదఘట్టన
న్నటయిట యైన ధరిత్రి వణఁకాడ వడిన్ గద కేలఁ ద్రిప్పుచున్
మిటమిట మండు వేసవిని మించు దివాకరుఁ బోలి యుగ్రతన్. 911

చ. వడిఁ జనుదేరఁ జూచి యదువల్లభుఁ డుల్లము పల్లవింప న
ప్పుడు గద కేలఁ బూని రథమున్ రయ మొప్పఁగ డిగ్గి యుగ్రతన్
గడఁగి విరోధికి న్నెదురుగాఁ జన వాఁ డతి నీచవర్తి యై
యడరుచు నట్టహాసముఖుఁ డై వలచే గదఁ ద్రిప్పుచున్ హరిన్. 912

వ. కనుంగొని, పరిహాసోక్తులుగా నిట్లనియె. నీవు మదీయ భాగ్యంబుకతంబున నేఁడు నా దృష్టిపథంబునకు గోచరుండ వైతివి. మిత్రద్రోహి వైన నిన్ను మాతులేయుండ వని మన్నింపక, దేహంబునందు వర్తించు నుగ్రవ్యాధి నౌషధాది క్రియల నివర్తింపం జేయు చికిత్సకుని చందంబున, బంధురూప శాత్రవుండవు గావున దంభోళి సంరంభ గంభీరం బైన మదీయ గదాదండహతిం బరేతనివాసంబున కనిచి, మున్ను నీచేత నిహతు లైన నాదు సఖులఋణంబు దీర్తు. అని దుర్భాష లాడుచుం డగ్గఱి. 913

చ. పెనుగదఁ బూన్చి కృష్ణు తల బెట్టుగ మొత్తిన నంకుశాహతిన్
గనలెడి గంధసింధురము కైవడి [1]దానవభంజనుండు పెం
పున నిజ భాసమానగదఁ బూని బలంబునఁ ద్రిప్పి దంతవ
క్త్రుని యురముం బగిల్చిన గుదుల్కొనుచున్ రుధిరంబు గ్రక్కుచున్. 914

వ. తత్క్షణంబ పర్వతాకారం బగు దేహంబుతో నొఱలుచు నేలం గూలి, కేశపాశంబులు చిక్కులువడం దన్నుకొనుచు, బ్రాణంబువిడిచె. అప్పుడు నిఖిల భూతంబులు నాశ్చర్యము నొందఁ దద్గాత్రంబున నుండి యొక్క యతిసూక్ష్మ తేజంబు వెలువడి, గోవిందుని దేహంబుఁ బ్రవేశించె. అయ్యవసరంబున నగ్రజు మరణంబు గనుంగొని, కుపితుం డై, కనుంగవలన్ నిప్పు లురుల, విదూరథుండు కాలానల జ్వాలాభీల కరాళం బై క్రాలు కరవాలంబునుం, బలకయుం గేలం దాల్చి, దామోదరు దెసం గవయుటం గనుంగొని. 915

చ. జలరుహలోచనుండు నిజసాధన మై తనరారు చక్రమున్
వలనుగఁ బూన్చి వైవ నది వారక వానిశిరంబు ద్రుంచె న
బ్బలియుఁడు సౌభ సాల్వ శిశుపాల సహోదర తత్సహోద రా
వలుల వధించి తత్కులమువారి ననేకులఁ ద్రుంచె నీగతిన్. 916

వ. అయ్యవసరంబున. 917

క. నర ముని యోగి సురాసుర, గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ
శ్చర కిన్నర కింపురుషులు, హరిమహిమ నుతించి రద్భుతానందములన్. 918

వ. మఱియు, నప్సరోజనంబులు నృత్యంబులు సలుప, వేల్పులు కుసుమవర్షంబులు గురియ, దేవతూర్యంబు లవార్యంబు లై మొరయ, యదు వృష్ణి ప్రవరులు సేవింపఁ, బరమానందంబునుం బొంది, నిజ విజయాంకితంబు లయిన గీతంబులు

1. సింధుర (తం. వా.)

వందిజనంబులు సంకీర్తనంబు సేయ, నతిమనోహర విభవాభిరామంబును, నూతనాలంకార యుక్తంబును నయిన ద్వారకానగరంబు శుభముహూర్తంబునం బ్రవేశింపం జను నెడ. 919

క. పురసతులు విరులు లాజలు, గురు సౌధాగ్రములనుండి కురియఁగ వికచాం బురుహాక్షుం డంతఃపుర, వర మర్థిం జొచ్చె వైభవం బలరారన్. 920

వ. అట్లు యోగీశ్వరేశ్వరుండును షడ్గుణైశ్వర్య సంపన్నుండును, నఖిల జగదీశ్వరుండును నైన పురుషోత్తముండు సుఖంబున నుండె నంత. 921

## —: బలరాముండు తీర్థయాత్రకుఁ జనుట :—

క. కౌరవపాండవ పృథు సమ, రారంభ మెఱింగి తీర్థయాత్ర నెపముగా సీరాంకుఁ డుభయకులులకు, నారయ సముఁ డగుటఁ జేసి యరిగె నరేంద్రా!

వ. అట్లు చని, మొదలం బ్రభాసతీర్థంబున నవగాహనంబు చేసి, యందు దేవర్షి పితృతర్పణంబులు సంప్రీతిం గావించి, విమల తేజోధను లగు భూసురప్రవరులు తనతో నరుగుదేరం గదలి చని, క్రమంబున సరస్వతియు, బిందుసరోవరంబును, వజ్రతీర్థంబును, విశాలానదియు, సరయువును, యమునయు, జాహ్నవియును గనుంగొనుచు, నచట నచట నవగాహనంబులును, దేవర్షి పితృ తర్పణంబులును, బ్రాహ్మణసంతర్పణంబులును, భూసుర యుక్తుం డై నడపుచుం జని, సకలలోక స్తుత్యంబును, నిఖిలముని శరణ్యంబు నగు నైమిశారణ్యంబు సొచ్చి, యందు దీర్ఘసత్రంబు నడపుచున్న మునిజనంబులం గనుంగొనిన, వారలు ప్రత్యుత్థానంబు చేసి, రామునకు వినతు లై యాసనార్ఘ్యాది పూజావిధానంబులు గావించిన, నతండును బ్రముదితమానసుం డగుచు, సపరివారంబుగాఁ గూర్చున్న యెడ. 923

క. ఆ నెఱిఁ దనుఁ గని ప్రత్యు, త్థాన నమస్కార విధులు దగ నడపక పెం పూనిన పీఠముపై నా, సీనుం డగు సూతు శేముషీవిఖ్యాతున్. 924

వ. కనుంగొని, యతని సమీపంబున నున్న విప్రవరులం జూచి, రాముండు రోషించి, వీఁడు నన్నుం గని లేవకుండుటకు హేతు వెయ్యదియొకో! ఈ ప్రతిలోమజాతుండు మునిగణ సభాస్థలంబునం దా నొక్కముఖ్యుండువోలె దురభిమానంబున శక్తిమనుమనివలనం గొన్ని కథలు గాథలుగాఁ గఱచి, విద్వద్గణ్యుని విధంబున విఱ్ఱవీఁగెడు. ఇట్టి నీచాత్ముం డభ్యసించు విద్యలెల్లను మనంబున విచారించి చూచిన, మదకారణంబులు గాని, సత్త్వగుణ గరిష్ఠంబులు గావు. ధర్మసంరక్షణంబు సేయ నవతరించిన మాకు నిట్టి దుష్టమర్దనం బవశ్యకర్తవ్యంబు. అని తలంచి

హస్తంబున ధరియించిన కుశాగ్రంబున సూతుని వధియించిన, నక్కడి మునీంద్రు
లెల్ల హాహాకారంబులతోడం దాలాంకునిం జూచి యి ట్లనిరి. 925

క. అనఘా! యితనికి బ్రహ్మా, సన మిచ్చుటఁ జేసి నీవు చనుదే నితఁ డా
సనము దిగఁ డయ్యె నింతయు, మును నీమది నెఱుఁగ నర్థముం గలదె హలీ!

క. ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యా, దురితంబున నీ మనంబు దూకొనెఁ బాపో
త్తరణ ప్రాయశ్చిత్తము, దొరఁకొని కావింపుమయ్య! దుర్జనహరణా! 927

వ. అదియునుం గాక, పరమపావనుండ వైన నీవు ధర్మంబు దప్పిన, నెవ్వరు
మాన్పంగలరు. కావునఁ బ్రాయశ్చిత్తంబు గైకొని నడుపకున్న ధర్మంబు నిలువదు.
అట్లు గావున, దీనికిం బ్రతీకారంబు బుట్టింపుము. అనిన, నతండు వారలం గనుం
గొని, తామసంబున నిట్టి పాపంబు సేయంబడియె. దీనికి ముఖ్యపక్షం బైన
[1]ప్రతికృతి యెఱింగింపుఁడు. వీనికి నాయువును, బహుసత్త్వంబును నొసంగిన
మీ కిష్టం బగునే? అ ట్లైన నా యోగ [2]మహత్త్వంబునం బునర్జీవితుఁ గావింతు.
అనిన న మ్మునులు నీ యస్త్రమాహాత్మ్యంబునకు మృత్యువునకు మాకు నె
వ్విధంబున వైకల్యంబు నొందకుండు, నట్లు గావింపుము. అనిన, నతం డందఱం
జూచి, యప్పుడు. 928

క. ధాత్రీవర! సమధిక చా, రిత్రుఁడు హలపాణి వలికె ధృతి నాత్మా వై
[4]పుత్రక నామాసి యను ప, విత్ర శ్రుతివాక్యసరణి విశదం బగుటన్. 929

క. ఈ సూత [5]సూనుఁ డిపుడు మ, హాసత్త్వము నాయువును ననామయమును వి
ద్యాసామర్థ్యముఁ గలిగి సు, ధీసత్తములార! యీ క్షితిన్ విలసిల్లున్. 930

వ. అని సూతుం బునర్జీవితుంగాఁ జేసి, మునులం జూచి, యి ట్లనియె. 931

తే. ఏ నెఱుంగక చేసిన యీ యవజ్ఞ
శాంతి వొంద నేయది యభీష్టంబు మీకు
దానిఁ గావింతు ననిన మోదంబు నొంది
పలికి ర త్తాపసులు హలపాణిఁ జూచి. 932

---

1. ప్రకృతి (హ. వా.) 2. మాయచేఁగావింతు (తం.వా.) 3. నీ యోగమాహాత్మ్యంబున మాకు నె వ్విధంబున నైన నితండు మృత్యుగతుండు గాకుండు (హ.) 4. పుత్రనామాసి యనెడి పవిత్ర (హ.) 5. సుతునకిపుడు (హ.)

చ. హలధర ! యిల్వలుం డను సురారితనూజుఁడు పల్వలుండు నాఁ
గలఁ డొక దానవుండు బలగర్వములం బ్రతిపర్వమందునన్
జలమున వచ్చి మా సవనశాలల [1]మూత్ర సురాస్ర పూయ వి
ట్పలలము లోలిమైఁ గురిసి పాడఱఁ [2]జేయును యజ్ఞవాటముల్. 933

వ. కావున, నా దుష్టదానవుం ద్రుంచుటయ మాకుం గరంబు సంతసంబగు. అంతమీఁద నీవును, విమల చిత్తుండ వై, భారతవర్షంబునం గల తీర్థంబులు ద్వాదశమాసంబు లవగాహనంబు సేయుము. అట్లైన సర్వపాపనిష్కృతి యగు. అని పలుకు నంతం బర్వసమాగమం బైన. 934

అధ్యాయము - ౭౯

సీ. మునులు యజ్ఞక్రియోన్ముఖులౌట గనుఁగొని పఱతెంచి యసుర తద్భవనములను
రక్త విణ్మూత్ర సురా మాంసజాలంబు నించి హేయంబు గావించి వెలుచఁ
బెంధూళి రాలును పెల్లలు నురలెడి చక్రానిలము వీచి చదల నపుడు
కాటుకకొండ సంగతిఁ బొల్చు మేను తామ్రశ్మశ్రు కేశసమాజములును

తే. నవ్య చర్మాంబరము భూరి నాసికయును
కఱకు మిడిగ్రుడ్లు నిప్పులు గ్రక్కు దృష్టి
వ్రేలు పెదవులు దీర్ఘ కరాళ జిహ్వ
కయును ముడివడ్డ బొమలును గలుగువాని. 935

మహాస్రగ్ధర. కనియెఁ దాలాంకుఁ డుద్యత్ కటచటుల నటత్కాలదండాభ శూలున్
జనరక్తాసిక్త తాలున్ సమధిక సమరోత్సాహ లోలుఁ గఠోరా
శని తుల్యోదగ్ర దంష్ట్రా జనిత శిఖికణాచ్ఛాది తాశాంతరాలున్
హనన వ్యాపార శీలున్నతి దృఢ ఘన మ స్తాస్థి మాలుఁ గరాళున్.

ఉ. వెండియుఁ గ్రొమ్మెఱుంగు లుడువీథి వెలుంగఁగ నుల్లస ద్గదా
దండముఁ గేలఁ ద్రిప్పుచు నుదారత రా బలభద్రుఁ డాసురో
ద్దండ విఘాతులౌ ముసల దారుణ లాంగలముల్ దలంప మా
ర్తాండ నిభంబు లై యెదురఁ దత్క్షణమాత్రనఁ దోఁచినన్ వెసన్. 937

వ. అట్లు సన్నిహితంబు లయిన తనకార్యసాధనంబు లగు నిజసాధనంబులు ధరియించి, యప్పుడు. 938

---

1. పురీషపూయవిట్ (వ్రా. ప్ర.) 2. జేసును (హ.)

చ. గగనమునం జరించు సురకంటకు కంఠము చేతినాఁగటన్
దగిలిచి రోకలెత్తి వెడిదం బడరన్ నడునెత్తి మొత్తినన్
భుగభుగ నెత్తు రొల్క నిల బోరగిలంబడె వజ్రధారచేఁ
దెగి ధరఁ గూలు భూరి జగతీధరమున్ బురుణింప బెట్టుగాన్, 939

వ. అట్లు పల్వలుండు మడిసిన. 940

క. మునివరులు కామపాలుని, వినుతించిరి వేయువేల విధముల వృత్రున్
దునిమిన యింద్రుని నమరులు, వినుతించిన రీతి నపుడు విమలచరిత్రా! 941

తే. అంత నభిషిక్తుఁ జేసి యత్యంత సురభి
మంజు లామ్లాన కంజాత మాలికయును
నంచితాభరణములు దివ్యాంబరములు
నర్థి నిచ్చినఁ దాల్చి యా హలధరుండు. 942

క. దేవేంద్రుఁ బోలి యొప్పెను, ధీవిలసితుఁ డగుచు మునితతిన్ వీడ్కొని తన్
సేవింపుచుఁ గతిపయ విప్రావలి చనుదేరఁ గౌశికాఖ్యంబునకున్. 943

వ. చని, య మ్మహానదిం గృతస్నానుం డై, యచ్చోటు వాసి, సరయువునందుఁ గ్రుంకులిడి, ప్రయాగ నవగాహనంబుచేసి, దేవర్షి పితృతర్పణంబు లాచరించి, పులస్త్యాశ్రమంబు సొచ్చి, గోమతిం దర్శించి, గండకీనది నుత్తరించి, విదళిత భవ పాశ యగు విపాశయందుఁ దోఁగి, శోణనదమున నాప్లావితుం డై, గయ నాడి, గంగాసాగర సంగమంబు దర్శించి, మహేంద్ర నగరంబున కరిగి. 944

క. రాముఁడు గనుఁగొనె భార్గవ, రామున్ రజనీశకుల ధరావరనగ సు
త్రామున్ సన్నుత సుగుణ, స్తోమున్ గారుణ్యసీము సుజనలలామున్. 945

ఆ. కని నమస్కరించి కౌతుకం బలరార
నతని వేఁడుకొని హలాయుధుండు
గోమరు మిగిలి [1]సప్తగోదావరికి నేఁగి
యందుఁ దీర్థమాడి యచటు గదలి. 946

వ. [2]వేణీ పంపాసరస్సులఁ జూచి, భీమనది కేఁగి, యందుఁ గుమారస్వామిని దర్శించి, శ్రీశైలంబునకుం జని, వేంకటాచలంబు దర్శించి, కామకోటి శక్తి నిరీక్షించి, కాంచీపురంబు గాంచి, కావేరికిం జని, య మ్మహావాహిని నవగాహనంబు సేసి.

1. సప్తగోదావరిమ్ (79-12) 2. పెన్నా (వ్రా. ప్ర.)

స్రగ్ధర. సేవించెన్ రంగధామున్ శ్రితనివహ పయస్సింధు సంపూర్ణసోమున్
గావేరీ మధ్యసీమున్ ఘన కలుష మహాకాలకూటోగ్రభీమున్
దేవారి శ్రీవిరామున్ దివిజవినుత సందీపితానంత[1]నామున్
ధీవిజ్ఞానాభిరామున్ ద్రిభువన విలసద్దేవతాసార్వభౌమున్. 948

వ. అచ్చోటు వాసి, వృషభాద్రి నెక్కి, హరిక్షేత్రంబుఁ ద్రొక్కి, మధురా పురంబున కరిగి, సేతుబంధనంబు మెట్టి, యచటం బదివేల పాఁడి మొదవుల భూసురులకిచ్చి రామేశ్వరు దర్శించి, తామ్రపర్ణికిం జని, మలయాచలం బెక్కి, యగస్త్యునిం గని నమస్కరించి, దక్షిణసముద్రంబు దర్శించి, కన్యాకాఖ్య దుర్గాదేవి నుపాసించి, పంచాప్సరసం బను తీర్థంబున నాప్లవనం బాచరించి, గోకర్ణంబున నిందుమౌళిం దర్శించి, ద్వీపవతి యైన కామదేవి నీక్షించి [2]శాపిం, బయోష్ణిని దర్శించి, నిర్వింధ్యఁ గడచి, దండకావనంబున కరిగి, మాహిష్మతీపురంబున వసియించి, మను తీర్థంబునం దాడి, క్రమ్మఱం బ్రభాస తీర్థంబునకు వచ్చి, యచ్చటి బ్రాహ్మణ జనంబులవలనం బాండవ ధార్తరాష్ట్రుల ఖండనంబు, సకల రాజలోకం బులుం బరలోకగతు లగుటయు, వాయునందన సుయోధనులు గదాయుద్ధ సన్నద్ధు లగుటయు నెఱింగి, వారల వారించు తలంపున నచ్చటికిం జని. 949

తే. ధర్మనందనుఁ దనకు వందనము సేయు
[3]కృష్ణు నరు మాద్రిసుతుల నీక్షించి యేమి
పలుక కుగ్ర గదాదండపాణు లగుచుఁ
గ్రోధమునఁ బొంగు భీమ దుర్యోధనులను. 950

వ. చూచి, వారల డాయంజని, యిట్లనియె. 951

సీ. వీరపుంగవులార! వినుఁడు మీలోపల భూరి భుజాసత్త్వమున నొకండు
ప్రకటితాభ్యాస సంపద్విశేషంబున నొక్కఁడు నధికుఁడై యుంటఁ జేసి
సమబలు లటుగాన చర్చింపఁగా నిందు జయ మొక్కనికి లేదు సమరమందుఁ
గాన యూరక పోరఁగానేల మీ కని వారింప నన్యోన్య వైరములను

తే. నడరి తొల్లింటి దుర్భాష లాత్మలందుఁ
దలఁచి తద్భాషణము లపథ్యములు గాఁగ
మొక్కలంబునఁ బోర నా ముష్టికాసు
రారి వీక్షించి వీరి శుభాశుభములు. 952

---

1. రామున్ (తం.) 2. దాఁటి (హ.) 3. కృష్ణులను (హ.)

వ. ఎట్లు గావలయు న ట్లయ్యెడుం గాక యని, యచ్చట నిలువక, యుగ్రసేనాది బంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన, ద్వారకాపురంబు సొచ్చి, యందుండి మగుడ నైమిశారణ్యంబునకుం జని, య మ్మునిపుంగవు లనుమతింప, నచ్చట నొక్కమఖంబు గావించి, బహుదక్షిణ లొసంగి, యంచిత జ్ఞానసంపూర్ణు లగు నట్లుగా వరంబిచ్చి, రేవతియునుం, దానును బంధు జ్ఞాతియుతంబుగా నవభృథస్నానం బాచరించి, యనంతరంబ. 953

చ. విలసిత మాల్య చందన నవీన విభూషణ రత్న వస్త్రముల్
పొలుపుగఁ దాల్చి యంచిత విభూతిఁ దలిర్చెను బూర్ణ చంద్రికా
కలిత సుధాంశురేఖ యొనకం బెసఁగ న్నిజబంధు లోచనో
త్పలచయ ముల్లసిల్లఁ బరిపాండుర చారు యశోవిలాసుఁ డై, 954

వ. ఇవ్విధంబున ననంతుండును, నప్రమేయుండును, మాయామానుష విగ్రహుం డును, ననంత బలశాలియు నైన బలదేవుం డతివిభవంబున నిజపురంబు ప్రవేశించి సుఖంబున నుండె. అని చెప్పి, వెండియు ని ట్లనియె. 955

క. హలధరుఁ డమర్త్య చరితుం, డలఘు భుజాబలుఁ డొనర్చు నద్భుత కర్మం బులు పెక్కు నాల్గు మొగములు, గలమేటియు లెక్కపెట్టఁగలఁడె నరేంద్రా!

అధ్యాయము - ౮౦

—: కుచేలోపాఖ్యానము :—

చ. అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధిపుఁ డి ట్లనుఁ బద్మపత్రలో
చనుని యనంత వీర్య గుణసంపద వేమఱు విన్న నైననుఁ
దనియదు చిత్త మచ్యుత కథావిభవం బొకమాటు వీనులన్
వినిన మనోజ పుష్పశరవిద్ధుఁడు నైన [1]విరామ మొందునే. 957

వ. అదియునుం గాక. 958

చ. హరి భజియించు హస్తములు హస్తము లచ్యుతుఁ గోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ జేరిన చిత్తము చిత్త మిందిరా
వరుఁ గను దృష్టి దృష్టి మురవైరి నుతించిన వాణి వాణి య
ఖరు కథ లాను కర్ణములు కర్ణము లై విలసిల్లుఁ బో భువిన్. 959

1. విరాళినొందఁడే (హ.)

క. హరి పాదతీర్థ సేవాపరుఁ డై విలసిల్లు నట్టి భాగవతుని వి
స్ఫురితాంగము లంగము లా పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకు మునీంద్రా!

సీ. అనుడు వేదవ్యాస తనయుఁ డా యభిమన్యు తనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి
జనవర! గోవింద సఖుఁడు కుచేలుండు నా నొప్పు విప్రుండు మానధనుఁడు
విజ్ఞాన రాగాది విరహిత స్వాంతుండు శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు
విజితేంద్రియుఁడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు బాధింప నొరులఁ గార్పణ్యవృత్తి

తే. నడుగఁ బోవక దనకుఁ దా నబ్బినట్టి
కాసు పదివేల నిష్కముల్ గాఁ దలంచి
యాత్మ మోదించి పుత్రదారాభిరక్ష
యొకవిధంబున నడపుచు నుండునంత. 961

సీ. లలిత పతివ్రతా తిలకంబు వంశాభిజాత్య తద్భార్య దుస్సహ దరిద్ర
పీడచేఁ గడు నొచ్చి పెదవులు దడుపుచు శిశువు లాఁకటి చిచ్చుచేఁ గృశించి
మలమల మాఁడుచు మానసం బెరియంగఁ బట్టెఁ డోరెము మాకుఁ బెట్టు మనుచుఁ
బత్రభాజన ధృతపాణు లై తనుఁ జేరి [1]వేఁడిన వీనులు సూఁడినట్ల

తే. యైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ
జేరి యి ట్లని పలికె నో జీవితేశ!
తట్టు ముట్టాడునట్టి పేదఱిక మిట్లు
నొంప దీని కుపాయ మూహింప వైతి. 962

వ. అని మఱియు ని ట్లనియె. 963

తే. బాల సఖుఁ డైన యప్పద్మ పత్రనేత్రుఁ
గాన నేఁగి దరిద్రాంధకార మగ్ను
లయిన మము నుద్ధరింపుము హరి కృపాక
టాక్ష రవిదీప్తి వడసి మహాత్మ! నీవు. 964

వ. మఱియును. 965

చ. వరదుఁడు సాధుభక్తజన వత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడుఁ దాఁ గుశస్థలీ
పురమున యాదవప్రకరముల్ భజియింపఁగ నున్నవాఁడు నీ
వరిగిన మిమ్ముఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు ననూనసంపదల్. 966

1. వేఁడ వీనులు చురఁజూడినట్ల (హ.)

మ. కలలోనం దను ము న్నెఱుంగని మహాకష్టాత్ముఁ డై నట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోన్
దలఁప న్నంతనె మెచ్చి యార్తిహరుఁ డై తన్నైన నిచ్చున్ సుని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సంప ద్విశేషోన్నతుల్. 967

క. అని పలికిన నమ్మానిని, సునయోక్తుల కలరి భూమిసురుఁ డా కృష్ణున్
గన నేఁగుట యిహ పర సా, ధన మగు నని మదిఁ దలంచి తన సతితోడన్. 968

తే. నీవు చెప్పినయట్ల రాజీవనేత్రు
పాదపద్మంబు లాశ్రయింపంగఁ జనుట
పరమశోభన మా చక్రపాణి కిపుడు
కాను కేమైనఁ గొంపోవఁ గలదె మనకు. 969

తే. అనిన న య్యింతి యౌఁగాక యనుచు విభుని
శిథిల వస్త్రంబు కొంగునఁ బృథుక తండు
లముల నొకకొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ
జనియె గోవింద దర్శనోత్సాహి యగుచు. 970

వ. అట్లు చనుచుం దన మనంబున. 971

సీ. ద్వారకానగరంబు నేరీతిఁ జొత్తును భాసు రాంతఃపురవాసి యైన
య ప్పుండరీకాక్షు నఖిలేశు నె బ్బంగి దర్శింపఁగలను దద్ద్వారపాలు
రెక్కడి విప్రుండ విం దేలవచ్చెద వని యడ్డపెట్టరే నపుడు వారి
కేమైనఁ బరిదానఁ మిచ్చి చొచ్చెద నన్న నూహింప నర్థశూన్యుండ నేను

తే. నయిన నా భాగ్య మతని దయార్ద్రదృష్టి
గాక తలపోయఁ గా నొండుఁ గలదె యాతఁ
డేల నన్ను నుపేక్షించు నేటిమాట
లనుచు నా ద్వారకాపుర మపుడు సొచ్చి. 972

వ. అట్లు ప్రవేశించి, రాజమార్గంబునం జని చని, కక్ష్యాంతరంబు గడచి, చని ముందట. 973

సీ. విశదమై యొప్పు షోడశ సహస్రాంగనా కలిత విశాల సంగతిఁ దనర్చి
మహనీయ తపనీయ మణిమయ గోపుర ప్రాసాద సౌధహర్మ్యములఁ జూచి
మనము బ్రహ్మానందమును బొందఁ గడు నుబ్బి సంతోషబాష్పముల్ జడిగొనంగఁ
బ్రకట మై విలసిల్లు నొక వధూమణి మంది రమున నింతులు చామరములు వీవఁ

తే. దనరు మృదు హంసతూలికా తల్పమందుఁ
దానుఁ బ్రియయును బహువినోదములఁ దనరి
మహిత లావణ్య మన్మథమన్మథుండు
ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు. 974

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభ మధ్యు నఖిలలోకారాధ్యు ఘన చక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిప యానుఁ గౌశేయ పరిధానుఁ బన్నగ శయను నబ్జాతనయను

తే. మకరకుండల సద్భాసు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగర విహారు
భూరి గుణసాంద్రు యదుకులాంభోధి చంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు. 975

మ. కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాక్షుఁ డప్పేదవి
ప్రుని నక్రాంత దరిద్రపీడితుఁ గృశీభూతాంగు జీర్ణాంబరున్
ఘన తృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ ఖండోత్తరీయున్ గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమ విలోలుం డై దిగెన్ దల్పమున్. 976

క. కర మర్థి నెదురుగాఁ జని, పరిరంభణ మాచరించి బంధుస్నేహ
స్ఫురణన్ దోడ్తెచ్చి సమా, దరమునఁ గూర్చుండఁ బెట్టెఁ దన తల్పమునన్. 977

తే. అట్లు గూర్చుండఁబెట్టి నెయ్యమునఁ గనక
కలశ సలిలంబుచేఁ గాళ్లు గడిగి భక్తిఁ
దజ్జలంబులు దనదు మస్తమునఁ దాల్చి
లలిత మృగమద ఘనసార మిళిత మైన. 978

తే. మలయజము మేన జొబ్బిల్ల నలఁది యంత
శ్రమము వాయంగఁ దాళవృంతముల విసరి
బంధు రామోద కలిత ధూపంబు లొసఁగి
మించు మణిదీపముల నివాళించి మఱియు. 979

వ. సురభి కుసుమమాలికలు సిగముడిం దుఱిమి, కర్పూరమిళిత తాంబూలంబు లిడి, ధేనువు నొసంగి, సాదరంబుగా స్వాగతం బడిగిన, నప్పు డవ్విప్రుండు మేనం బులకాంకురంబు లంకురింప, నానందబాష్ప జలబిందు సందోహుం డయ్యె. అట్టి

యెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణి యగు రుక్మిణి కరకంకణంబులు మెఱయఁ జామరలు వీవం, దజ్జాత వాతంబు ఘర్మసలిలంబు నివారింపుచుండం జూచి, శుద్ధాంత కాంతాజనంబులు మనంబున నద్భుతం బంది, యి ట్లనిరి. 980

ఉ. ఏమితపంబు చేసెనొకొ యీ ధరణీదివిజోత్తముండు దొల్
జామున యోగివిస్ఫుర దుపాస్యకుఁ డై తనరారు నీ జగత్
స్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవాఁ
డీ మహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్. 981

వ. అదియునుం గాక. 982

చ. తన మృదుతల్పమందు వనితామణి యైన రమాలలామ పొం
దును నెడగాఁ దలంపక యదుప్రవరుం డెదురేఁగి మోదమున్
దనుకఁగఁ గౌఁగిలించి యుచితక్రియలన్ బరితుష్టుఁ జేయుచున్
వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో. 983

వ. అ య్యవసరంబున. 984

క. మురసంహారుఁడు కుచేలుని, కరము గరంబునఁ దెమల్చి కడక న్మన మా
గురు గృహమున వర్తించిన, చరితము లని కొన్ని తడవి చతురత మఱియున్.

సీ. బ్రాహ్మణోత్తమ! వేదపాఠన లబ్ధ దక్షతఁ గల చారు వంశంబువలనఁ
బరిణయం బైనట్టి భార్య సుశీల వర్తనములఁ దగ భవత్సదృశ యగునె
తలఁప గృహ క్షేత్ర ధన దార పుత్రాదులందు నీ చిత్తంబు చెందకుంట
దోఁచుచున్నది యేనుఁ దుది లోకసంగ్రహార్థంబు కర్మాచరణంబు సేయు

తే. గతి మనంబునఁ గామమోహితులు గాక
యర్థిమై విహితకర్మంబు లాచరించి
ప్రకృతి సంబంధములు భవ్యనిష్ఠఁ
దగిలి యుందురు గొంద ఱుత్తములు భువిని. 986

వ. అని మఱియు ని ట్లనియె. 987

క. [1]ఎఱుఁగుదె గురుమందిరమున, వెఱ వొప్పఁగ మనకు నతఁడు వెలయఁగ దెలుప
న్నెఱుఁగఁగ వలసిన యర్థము, లెఱిఁగి పరిజ్ఞాన మహిమ లెఱుఁగుట లెల్లన్. 988

---

1. ఎఱుఁగుదువె మనము గురుమందిరమున వసియించి యతఁడు దెలుపఁగ వరుసన్ (తం. వా. ప్రా. ప్ర.)

వ. అని మఱియు, గురుప్రశంస సేయం దలంచి, యి ట్లనియె. 989

తే. తివిరి యజ్ఞాన తిమిర ప్రదీప మగుచు
నవ్యయం బైన బ్రహ్మంబు ననుభవించు
భరిత [1]సత్త్వుండు సత్కర్మ నిరతుఁ డతుల
భూసురశ్రేష్ఠుఁ డనఘుండు బుధనుతుండు. 990

వ. అ మ్మహాత్మునివలన సకల వర్ణాశ్రమంబుల వారికి నేను విజ్ఞానప్రదుండ నగు గురుండ నై యుండియు, గురుభజనంబు పరమధర్మం బని యాచరించితి. అది గావున. 991

క. భూసురుల కెల్ల ముఖ్యుఁడ, నై సకల కులాశ్రమంబులందుల నెపుడుఀ
ధీ సుజ్ఞానప్రదుఁ డన, దేశికుఁ డన నొప్పుచుందు ధృతి నెల్లెడలఀ. 992

తే. అట్టి వర్ణాశ్రమంబులయందు నర్థ
కుశలు లగువారు నిఖలైక గురుఁడ నైన
నాదు వాక్యంబుచే భవార్ణవము వెలుచ
దాఁటుదురు మత్పదాంబుజ ధ్యానపరులు. 993

వ. అదియునుం గాక, సకల భూతాత్మకుండ నైన యేను తపో వ్రత యజ్ఞ దాన శమ దమాదులచేత సంతసింపను. గురుజనంబులఁ బరమభక్తి సేవించువారలం బరిణమింతు. అని చెప్పి మఱియును, మనము గురుమందిరంబున నున్న యెడ గురుపత్నీ నియుక్తుల మై, యొక్కనాఁ డింధనార్థం బడవికిం జనిన యవసరంబున. 994

సీ. ఘుమఘుమారావ సంకుల ఘోరజీమూత పటల సంఛ న్నాభ్ర భాగమగుచుఁ
జటుల జంఝానిలోత్కట సముద్ధూత నానావిధ జంతుసంతాన మగుచుఁ
జండ దిగ్వేదండ తుండని భాఖండ వారిధారాపూర్ణ వసుధ మగుచు
విద్యోతమా నోగ్ర ఖద్యోత కిరణ జిత్ విద్యు ద్ద్యుతిచ్ఛటా విభవ మగుచు

తే. నడరి జడి గురియఁగ నినుం డ స్తమింప
భూరి నీరంధ్ర నిబిడాంధకార మేఁచి
సూచికాభేద్య మై వస్తుగోచరంబు
గాని యట్లుండె మనము న వ్వానఁ దడిసి. 995

---

1. చిత్తుండు (వ్రా. ప్ర.)

ఆ. బయలు గొందియుఁ బెనుమిట్టు [1]పల్లమంబు
రహిత సహితస్థలంబు లేర్పఱుపరాక
యున్న య త్తఱి మనము నొండొరుల చేతు
లూఁతగాఁ గొని నడచుచు నుండునంత. 996

క. బిసబిస నప్పుడు నుడుగక, విసరెడి వలిచేత వణకు విడువక మనముల్
బసచెడి మార్గముఁ గానక, మసలితి మంతటను నంశుమంతుఁడుఁ [2]బొడిచెన్. 997

క. తెలతెల వాఱిన వనములఁ, గలకల మని పలికె పక్షిగణ మెల్లెడలన్
మిలమిల లని ప్రొద్దు వొడువున, ధళధళ యను మెఱుఁగు దిగ్వితానము నిండెన్.

క. అప్పుడు సాందీపుఁడు మన, చొ ప్పరయుచు వచ్చి వాన సోఁకునను వలిన్
దెప్పిఱిలుటఁ గని ఖేదం, బుప్పతిలన్ బలికె నకట! యో వటులారా! 999

చ. కటకట! యిట్లు మా కొఱకుఁగా జనుదెంచి మహాటవిన్ సము
త్కట పరిపీడ నొందితిరి గావున శిష్యులు మాఋణంబు నీఁ
గుట కిది కారణంబు సమకూరెడిఁ బో యిటమీఁద మీకు వి
స్ఫుట ధన బంధు దార బహుపుత్ర విభూతి [3]జయాయురున్నతుల్. 1000

క. అని గారవించి యాయన, మనలన్ దోడ్కొనుచు నాత్మమందిరమునకున్
జనుదెంచుట యెల్లను నీ, మనమునఁ దలఁతే యటంచు మఱియును బలికెన్. 1001

వ. అనఘా! మన మధ్యయనంబు సేయుచు, నన్యోన్య స్నేహవాత్సల్యంబులం జేయు కృత్యంబులు మఱవవు గదా! అని యవియెల్లనుం దలంచి యాడు మాధవు మాటలు విని, యతనిం గనుంగొని, కుచేలుం డిట్లనియె. 1002

క. వనజోదర! గురుమందిర, మున మనము వసించునాఁడు ముదమునఁ గావిం
పని పను లెవ్వియుఁ గలవే, విను మవి య ట్లుండనిమ్ము విమలచరిత్రా! 1003

క. గురుమతిఁ దలపఁగఁ ద్విజగ, ద్గురుఁడ వనందగిన నీకు గురుఁ డనఁగా నొం
డొరుఁ డెవ్వఁ డింతయును నీ, కరయంగ విడంబనంబ యగుఁగాదె హరీ! 1004

అధ్యాయము – ౮౧

వ. అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని, సమస్త భావాభిజ్ఞుం డైన పుండరీకాక్షుండు మందస్మిత వదనారవిందుం డగుచు, నతనిం జూచి, నీ విచ్చటికి వచ్చునప్పుడు నాయందుల భక్తిం జేసి, నాకు నుపాయనంబుగా నేమి పదార్థంబు దెచ్చితివి. అ ప్పదార్థంబు లేశమాత్రం బైనఁ బదివేలుగా నంగీకరింతు. అట్లుం

1. పల్లములును (హ.) 2. పొడమెన్ (హ.) 3. చిరాయురున్నతుల్ (చ. ట. త. వ)

గాక, నీచవర్తనుం డై, మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచల తుల్యం బైన పదార్థంబు నొసంగిన, నదియును నా మనంబునకు సమ్మతంబు గాదు. కావున. 1005

క. దళమైన పుష్పమైనను, ఫలమైనను సలిల మైనఁ బాయనిభక్తిన్
గొలిచిన జను లర్పించిన, నెలమిన్ రుచిరాన్నముగ నె యేను భుజింతున్. 1006

క. అని పద్మోదరుఁ డాడిన, వినయోక్తుల కాత్మ నలరి విప్రుఁడు దాఁ దె
చ్చిన [1]యటుకులు దగ నర్పిం, పను నేరక మోము వాంచి పలుకక యున్నన్.

వ. అ విప్రుండు చనుదెంచిన కార్యంబు గృష్ణుండు దన దివ్యచిత్తంబున నెఱింగి, యితఁడు పూర్వభవంబున నైశ్వర్యకాముం డై, నన్ను సేవింపఁడు. ఐనను, ని క్కుచేలుండు నిజకాంతా ముఖోల్లాసంబుకొఱకు నాయొద్దకుం జనుదెంచిన వాఁడు. ఇతనికి నింద్రాదులకుం బడయరాని బహుప్రకారంబు లైన సంపద్విశే షంబు లీ క్షణంబ యొడఁగూర్పవలయు. అని తలంచి, యతండు జీర్ణవస్త్రంబు కొన ముడిచితెచ్చిన య య్యటుకులముడియఁ గని, యిది [2]యేమి యని యొయ్యన న మ్ముడియఁ దన కరకమలంబున విడిచి, య య్యటుకులు గొన్ని పుచ్చికొని, యివియ సకలలోకంబులను నన్నుఁ బరితృప్తిం బొందింపఁజాలు. అని యప్పుడు. 1008

క. మురహరుఁడు పిడికెఁ డటుకులు, గర మొప్పఁగ నారగించి కౌతుకమతి యై
మఱియును పిడిఁకెడు గొనఁ ద, త్కర మప్పుడు వట్టెఁ గమల కరకమలములన్.

క. సొంపారఁగ నితనికి బహు, సంపద లందింప నివియ చాలును నిఁక భ
క్షింపఁగ వలవదు త్రిజగ, త్సంపత్కర ! దేవదేవ ! సర్వాత్మ ! హరీ ! 1010

వ. అని యిట్లు వారించిన, న క్కుచేలుండు నా రాత్రి గోవిందుని మందిరంబునం దనకు హృదయానందకరంబు లగు వివిధపదార్థంబు లనుభవించి, మృదుల శయ్యాతలంబున నిద్రించి, తన మనంబునం దన్ను సమధిక స్వర్గభోగాను భవుంగాఁ దలంచుచు, మఱునాఁ డరుణోదయంబున మేల్కని, కాలోచిత కృత్యంబులు దీర్చి, యిందిరారమణుండు దన్నుఁ గొంతద వ్వనిపి, యామంత్రితుం జేయఁ జనుచు, నందనందన సందర్శనానంద లోలాత్ముం డై, తనమనంబున ని ట్లనియె. 1011

క. నాపుణ్య మరయ నెట్టిదొ, యా పుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకుఁ బ్రహ్మణ్యునిఁ జీ, ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బరుం గనుఁగొంటిన్.

---

1. అడుకులు (తం. వా.) 2. యేడదని (హ.)

సీ. పరికింపఁ గృపణస్వభావుండ నైనట్టి యే నేడ [1]నిఖిలావనీశ్వరైన
యిందిరాదేవికి నెనయంగ నిత్య నివాసుఁ డై యొప్పు న వ్వాసుదేవుఁ
డేడ న న్నర్థిమైఁ దోడఁబుట్టినవాని కైవడిఁ గౌఁగిటఁ గదియఁ జేర్చి
దైవంబుగా నన్ను భావించి నిజతల్పమున నుంచి సత్క్రియల్ పూని నడపి

తే. చారు నిజవధూ కరసరోజాత కలిత
చామరానిలమున గతశ్రమునిఁ జేసి
శ్రీకుచాలిప్త చందనాంచిత కరాబ్జ
తలములను నడ్గు లొత్తె వత్సలత మెఱసి. 1113

వ. కావున, 1014

ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్తమేమియు
న్నీని తెఱంగు గానఁబడె నెన్న దరిద్రుఁడు సంపదంధుఁ డై
కానక తన్నుఁ జేరఁ డని కాక శ్రీ తార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిఁగా నను జేయకుండునే. 1015

వ. అని తనమనంబున వితర్కరింపుచు, నిజపురంబునకుం జని చని, ముందట. 1016

సీ. భానుచంద్ర ప్రభా భాసమాన స్వర్ణ చంద్రకాంతోపల సౌధములును
గలకంఠ శుక నీలకంఠ సముత్కంఠ మానిత కూజితోద్యానములును
ఫుల్లసితాంభోజ హల్లక కల్హార కైరవోల్లసిత కాసారములును
మణిమయ కనకకంకణ ముఖాభరణ విభ్రాజిత దాసదాసీజనంబుఁ

తే. గలిగి చెలువొందు సదనంబుఁ గాంచి విస్మ
యమును బొందుచు నెట్టి పుణ్యాత్ముఁ డుండు
నిలయ మొక్కో యపూర్వ మై నెగడె మహిత
వైభవోన్నత లక్ష్మీనివాస మగుచు. 1517

వ. అని తలపోయుచున్న యవసరంబున. 1018

తే. దివిజవనితలఁ బోలెడు తెఱవ లపుడు
డాయ నేతెంచి యిందు విచ్చేయుఁ డనుచు
విమల సంగీత నృత్యవాద్యములు చెలఁగ
గరిమఁ దోఁకొని చని రంతిపురమునకును. 1019

వ. ఇట్లు చనుదేర నతని భార్య యైన సతీలలామంబు దనమనంబున నానంద రసమగ్న
యగుచు నుండి. 1020

---

1. నీశ్వరియగు (వా.); నిఖిలావనీశుఁ డైన (హ.)

సీ. తన విభు రాక ముందటఁ గని మనమున హర్షించి వైభవం బలర మనుజ
కామినీరూపంబుఁ గైకొన్న యిందిరావనిత చందంబునఁ దనరుచున్న
కలకంఠి తన వాలుఁగన్నుల క్రేవల నానందబాష్పంబు లంకురింప
నతని పాదంబుల కాత్మలో మ్రొక్కి భావంబున నాలింగనంబు చేసె

తే. నా ధరాదేవుఁ డతుల దివ్యాంబరాభ
రణ విభూషిత లై రతిరాజు సాయ
కములగతి నొప్పు పరిచారికలు భజింప
లలిత సౌభాగ్య యగు నిజలలనఁ జూచి 1021

క. ఆ నారీరత్నంబును, దానును ననురాగరసము తళుకొత్తఁగ ని
త్యానందము నొందుచుఁ దెం, పూనిన హరిలబ్ధ వైభవోన్నతి మెఱయన్. 1022

సీ. కమనీయ పద్మరాగ స్తంభకంబులుఁ గొమరారు *పటికంపు కుడ్యములును
మరకత నవరత్నమయ కవాటంబులుఁ గీలిత హరినీల జాలకములు
దీపిత చంద్రకాంతోపల వేదులు నంచిత వివిధ పదార్థములును
దగు హంసతూలికా తల్పంబులును హేమ లాలిత శయనస్థలములఁ దనర

తే. సమధి కోత్తుంగ భద్రపీఠముల సిరులు
మానితోన్నత చతురంతయానములును
వలయు సద్వస్తు పరిపూర్ణ వాటికలును
గలిగి చెలువొందు మందిరం బెలమిఁ జొచ్చి. 1023

వ. సుఖంబున నుండునట్టియెడం, దనకు మనోవికారంబులు వొడమకుండ వర్తించుచు, నిర్మలం బగు తన మనంబున నిట్లను. ఇంతకాలం బత్యంత దురంతం బగు దారిద్ర్య దుఃఖార్ణవంబున మునింగియున్న నాకుం గడపటన్ గలిగిన విభవంబున నిప్పుడు. 1024

ఆ. ఎన్నఁ గ్రొత్త లయిన యిట్టి సంపదలు నా
కబ్బు టెల్ల హరి దయావలోక
నమునఁ జేసి కాదె నలినాక్షుసన్నిధి
నర్థి నగుచు నేను నరుగుటయును. 1025

క. నను నా వృత్తాంతంబును, దన మనమునఁ గనియు నేమి దడవక ననుఁ బో
మ్మని యీ సంపద లెల్లను, నొనరఁగ నొడఁగూర్చి నన్ను నొడయనిఁ జేసెన్.

వ. అట్టి పురుషోత్తముండు భక్తినిష్ఠు లైన సజ్జనులు, లేశమాత్రం బగు పదార్థం బైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన, నది కోటి గుణితంబుగాఁ గైకొని,

మన్నించుటకు నిది దృష్టాంతంబు గాదె. మలినదేహుండును, జీర్ణాంబరుండు నని చిత్తంబున హేయంబుగాఁ దాటింపక, నాచే నున్న యటుకు లాదరంబున నారగించి, నన్నుం గృతార్థునిం జేయుట యతని నిర్హేతుక దయయ కాదె. అట్టి కారుణ్యాసాగరుం డయిన గోవిందుని చరణారవిందంబులయందుల భక్తిప్రాభవంబు గలుగుంగాక ! అని, య ప్పుండరీకాక్షునియందుఁ బూర్వ భక్తితాత్పర్యంబునం దగిలి, పత్నీసమేతుం డయి, నిఖిలభోగంబులయందు నాసక్తిం బొరయక, రాగాది విరహితుండును, నిర్వికారుండును నై, యఖిలక్రియలయందు ననంతుని యనంతధ్యానసుధారసంబునం జొక్కుచు, విగతబంధనుం డై, యపవర్గప్రాప్తి నొందె. మఱియును. 1027

ఆ. దేవదేవుఁ డఖిలభావజ్ఞుఁ డాశ్రిత
వరదుఁ డయిన హరికి ధరణిసురులు
దైవతములు గాన ధారుణీదివిజుల
కంటె దైవ మొకఁడు గలఁడె భువిని. 1028

క. మురహరుఁ డిట్లు కుచేలునిఁ, జరితార్థునిఁ జేసినట్టి చరితము విను స
త్పురుషుల కిహ పర సుఖములు, హరిభక్తియు యశముఁ గలుగు నవనీనాథా !

వ. అని మఱియుం, బరాశరపౌత్రున కర్జున పౌత్రుం డి ట్లనియె. 1030

## అధ్యాయము - ౮౨

—: శ్రీకృష్ణుఁడు సకుటుంబముగా గ్రహణస్నానమునకుఁ బోవుట :—

ఆ. [*దుష్ట శిక్షణంబు దురిత సంహరణంబు
శిష్ట రక్షణంబు సేయఁదలఁచి
భువిని మనుజుఁ డగుచుఁ బుట్టిన శ్రీకృష్ణు
విమలచరిత మెల్ల విస్తరింపు.] 1031

వ. అనిన శుకుం డి ట్లనియె. 1032

సీ. ధరణీశ ! బలుఁడును సరసిజోదరుఁడు నవోన్నత సుఖలీల నుండునంతఁ
జటులోగ్ర కల్పాంత సమయమందును బోలె దృగసహ్యా మై సముద్దీప్త మగుచు
రాజిల్లు సూర్యోపరాగంబు చనుదెంచు టెఱిఁగి [1]భూజను లెల్ల వరుసఁ గదలి
మును జమదగ్ని రాముఁడు పూని ముయ్యేడు మాఱులు ఘన బలోద్ధారుఁ డగుచు

---

* ఈ పద్య మే తాళపత్ర ప్రతులలోను లేదు. 1. భూసురులెల్ల (హ.)

తే. నిజ భుజాదండ మండిత నిబిడ నిశిత
చటుల దంభోళి రుచిర భాస్వ త్కుఠార
మహిత ధారావినిర్భిన్న మనుజపాల
దేహనిర్ముక్త రుధిర ప్రవాహములను. 1033

తే. ఏను మడువులు గావించె నెచట నేని
నట్టి పావన సుక్షేత్ర మగు స్యమంత
పంచకంబున కపుడు సంభ్రమముతోడఁ
జనిరి బలకృష్ణులును సంతసం బెలర్ప. 1034

వ. ఇట్లు నిష్కర్ము లైన రామకృష్ణులు, లోకధర్మానుపాలన ప్రవర్తను లై, ద్వారకానగర రక్షణంబునకుఁ, బ్రద్యుమ్న గద సాంబ సుచంద్ర శుక సారణానిరుద్ధ కృతవర్మాది యోధవరుల నియమించి, యక్రూర వసుదే వోగ్రసేనాది సకల యాదవులుం గాంతాసమేతు లయి, స్రక్చంద నాభరణ వస్త్రాదులు ధరియించి, శోభనాకారంబులతోడం బుష్పకవిమానంబు లనం బోలుచు నరదంబులను, మేఘంబుల ననుకరించు గజంబులను, మనోవేగంబు లయిన తురంగంబులను నెక్కి, వియచ్చరులం బురుణించు పురుషులు దమ్ము సేవింపం జని, యపుణ్యతీర్థంబుల నవగాహనంబు చేసి, యుపవసించి, యనంతరంబ. 1035

క. భూసురవరులకు ననుపమ, వాసోలంకార ధేను వసు రత్న ధరి
త్రీ సుమహిత వస్తువు లు, ల్లాసంబున దానమిచ్చి లాలితు లగుచున్. 1036

క. పున రవగాహనములు పెం, పౌనరం గావించి బంధు [1]బుధయుతు లై భో
జనకృత్యంబులు దీర్చి స, దనురాగము ల్లుల్లసిల్ల న చ్చోటఁ దగన్. 1037

క. ఘన శాఖాకీర్ణము లై, యినరశ్ములుఁ గానరాక యెసకం బెసఁగ
న్ననిచిన పొన్నలనీడల, ననిచిన వేడుకల నందనందనముఖ్యుల్. 1038

క. తనరిన పల్లవరుచిరా, సనముల నాసీను లగుచు సత్సుఖగోష్ఠిన్
బెనుపొందఁగ నట వసియిం, చినచోఁ దత్పుణ్యతీర్థ సేవారతు లై. 1039

వ. మున్ను చనుదెంచియున్న యౌశీనర మత్స్య కురు కోసల విదర్భ సృంజయ కాంభోజ కేకయ మద్ర కుం త్యారట్ట కేరళాది భూపతులును, మఱియుం, దక్కిన రాజవరులును, హితులును, నందగోపాది గోపాలురును, గోపికాజనంబులును, ధర్మరా జానుగతు లై వచ్చిన, భీష్మ ద్రోణ ధృతరాష్ట్ర గాంధారి

1. యుక్తముగా (తం. వా.)

కుంతీ పాండవ తద్దారనివహ సంజయ విదుర కృప కుంతిభోజ విరాట భీష్మక నగ్నజిత్ ద్రుపద శైబ్య ధృష్టకేతు కాశీరాజ దమఘోష విశాలాక్ష మైథిల యుధామన్యు సుశర్మలును, సపుత్రకుం డయిన బాహ్లికుండును, మొదలుగా ననేకులు, నుగ్రసేనాది యాదవప్రకరంబులం బూజలం దృప్తులం జేసి, వారునుం బ్రముదితాత్ము లై రి. అయ్యెడ. 1040

క. ఆరాజులు గాంచిరి నిజ, నారీయుతు లగుచు నంగనాపరివారున్
ధీరుఁ దానవకుల సం, హారున్ గోపీ మనోవిహారు నుదారున్ 1041

వ. కని, య మ్మాధవ బలదేవులు సేయు సముచిత పూజా విధానంబులం బరితృప్తు లై, య మ్ముకుందు సాన్నిధ్యంబు గలిగి, తదీయ సంపద్విభవాభిరామంబుల నభిరాము లై విలసిల్లుచున్న యుగ్రసేనాది యదు వృష్ణిపుంగవులం జూచి, వారలతోడ నా రాజవరులు మాధవుండు విన ని ట్లనిరి. 1042

మ. *మన శాస్త్రంబులు వాక్కులన్ మనములన్ మాంగల్యమున్ [1]బొంది పా
వన మై [2]యొప్పెడి నే రమా విభుని భాస్వ త్పాదపంకేజ సే
చనతోయంబుల నే మహాత్ముని పదాబ్జాతంబు లెందేని సోఁ
కిన చో నెల్లను ముక్తిహేతు వగు నీ కృష్ణుండె పో చూడఁగన్. 1043

చ. సనక సనందనాది మునిసత్తము లంచిత యోగదృష్టిచేఁ
బనివడి యాత్మలన్ వెదకి పట్ట నగోచర మైన మూర్తి యి
ట్లనవరతంబు మాంసనయనాంచల గోచరుఁ డయ్యె [3]నట్టె యే
మన నగు వీరి పుణ్యమున కాదట నెట్టితపంబు చేసిరో. 1044

మ. నిరయ స్వర్గము లాత్మఁ గైకొనక తా నిర్వాణ మూర్తైన యీ
హరిఁ జూడన్ హరితోడఁ బల్క హరి మే నంటన్ హరిం బాడఁగా
హరితో నేఁగ సహాస నా స్తరణ శయ్యా వాసు లై [4]యుండఁగా
హరిబంధుత్వ సఖిత్వముల్ గలుగు భాగ్యం బెట్లు సిద్ధించెనో. 1045

తే. అనుచు యాదవ వృష్ణి భోజాంధకులును
హరి దయాలబ్ధ నిఖిలార్థు లగుచు నున్న
మనికిఁ దమచిత్తములఁ బలుమాఱు పొగడి
[5]పరిణమించిరి యంత న ప్పాండుమహిషి. 1046

వ. అప్పుడు. 1047

1. బొందుఁ బావనమై (హ.) 2. యొప్పుచు (హ.) 3. నట్టిదేమననగు (హ.)
4. యుండుటల్ (హ.) 5. యుపరమించిరి (హ.)

క. తన సుతులకు గాంధారీ, తనయులు గావించు [1]నపకృతంబుల కాత్మన్
ఘనమున నెరియుచు నచ్చటఁ, గనుఁగొనె వసుదేవు విగత కల్మషభావున్. 1048

వ. అట్లు గనుంగొని, యతనితో ని ట్లనియె. 1049

క. ఓ యన్న ! పాండుతనయులు, నీ యల్లుం డడవులందు నెఱి మృగములలోఁ
బాయని యిడుమలఁ బడఁ గరు, ణాయత్తుల రగుచు మీర లరయఁగవలదే. 1050

వ. అని బహుప్రకారంబుల సంతాపించుచు, మఱియు ని ట్లనియె. 1051

క. అతిబలవంతపు విధి దాఁ, బ్రతికూలం బైనఁ గలరె బంధువు లనుచున్
ధృతి గలఁగి బాష్పజల పూ, రిత లోచన యగు సహోదరినిఁ జూచి యనెన్.

సీ. తల్లి ! నీకేల సంతాపింప మనమునఁ దలఁపక విధి నేల నొలసె దింత
యఖిలనియామకుం డగు [2]నీశ్వరుని మాయ యవనికాంతరుఁ డైన [3]యట్టి సూత్ర
ధారుని కై వడిఁ దగిలి నటింపంగ మనుజులు కీలుబొమ్మలు దలంప
గావున విధిసేఁత గడచి వర్తింపంగ దేవతలకు నైన దీఱ దట్లు

తే. క్రోధచిత్తుఁడు కంసుండు బాధపఱుప
నిలయములు దప్పి నే మడవులఁ జరింప
ఘన కృపానిధి యీ హరి గలుగఁ బట్టి
కోరి [4]మా కిండ్లు గ్రమ్మఱఁ జేరఁగలిగె. 1053

వ. అని యీాఱడిలం బలుకు నవసరంబున. 1054

క. నందయశోదలు గోపక, బృందంబులు గోపికలును బిరిగొని పరమా
నందంబులఁ జనుదెంచిరి, మందరధరుఁ జూచువేడ్క మనమునఁ బొడమన్. 1055

వ. అట్లు చనుదెంచిన. 1056

క. అతి చిరకాల సమాగతు, నతని నిరీక్షించి వృష్ణి యాదవ భోజ
ప్రతతులు నెదురేఁగి సమున్నతితో, నాలింగనములు నడపిరి వరుసన్. 1057

క. వసుదేవుఁడు వారికి సం,తసమునఁ గావించె సముచిత క్రియ లంతన్
ముసలియు హరియున్ మ్రొక్కిరి, వెస నందయశోదలకును వినయం బెసఁగన్.

వ. అట్లు నమస్కృతులు చేసి, యాలింగనంబులు గావించి, నయనారవిందంబుల
నానంద బాష్పంబులు దొరఁగ, నఱలేని స్నేహంబులు చిత్తంబుల నత్తమిల్ల,
నేమియుం బలుకకుండిరి. అంత, న య్యశోదాదేవి రామకృష్ణుల నిజాంకపీఠం

1. అపకృతంబులు నాత్మన్; మనమున నెరియఁగ (హ.) 2. నీశ్వరుఁడు (తం. వా.)
3. జవని కాంతరుఁ డైన యవనిసూత్ర (హ.) 4. మా యిండ్లు (హ.)

బున నునిచి, యక్కునం గదియం దిగిచి, చెక్కులు ముద్దుగొని, శిరంబులు మూర్కొని, చుబుకంబులు పుణుకుచుఁ బునఃపున రాలింగనంబులు గావించి, పరమానందంబునుం బొందుచు నున్నంతఁ బదంపడి. 1059

చ. స్థిరమతితోడ రోహిణియు దేవకియుం దగ నందగోప సుం
దరిఁ గని కౌఁగిలించుకొని తత్కృతు లెల్లఁ దలంచి యింతి నీ
వరుఁడును నీవు బంధుజన వత్సలతన్ మును చేయు సత్కృతుల్
మఱవఁగవచ్చునే తలఁప మా కిఁక నెన్నఁటికిం దలోదరీ ! 1060

క.. జననం బందిన మొదలుగ, ఘన మోహముతోడఁ బెంచుకతమునఁ దమకున్
జననీ జనకులు వీ రని, మనములఁ దలపోయలేరు మము నీ తనయుల్. 1061

క. అంటిన ప్రేమను వీరిం, గంటికి ఱెప్పడ్డ మైన గతిఁ బెంపఁగ మా
కంటెక్ నెన రౌటను మీ, యింటన్ వసియించి యుండి రిన్నిదినంబుల్. 1062

వ. అని, యిట్లు ప్రియాలాపంబులు వలుకుచుండు నవసరంబున, గోపాలసుందరు లమందానంద కందళిత హృదయ లై, హృదయేశ్వరుం డైన గోవిందుండు చిర కాల సమాగతుం డగుటం జేసి, యతనిం జూచు తలంపు లుల్లంబుల వెల్లి గొనం జేరి. 1063

చ. నలినదళాక్షుఁ జూచి నయనంబులు మోడ్వఁగఁ జాల కాత్మలన్
వలచి తదీయమూర్తి విభవంబు దలంపుచుఁ గౌఁగిలింపుచున్
బులకలు మేన జాదుకొనఁ బొల్తులు చొక్కిరి బ్రహ్మమున్ మనం
బులఁ గని చొక్కు యోగిజనమున్ బురుణింపఁగ మానవేశ్వరా ! 1064

చ. పొలఁతుల భావ మాత్మఁ గని ఫుల్ల సరోరుహ లోచనుండు వా
రల నపు డేకతంబునకు రమ్మని తోకొని పోయి యందు న
ర్మిలఁ బరిరంభణంబు లొనరించి లస ద్దరహాస చంద్రికా
కలిత కపోలుఁ డై పలికెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్. 1065

చ. వనజదళాక్షులార ! బలవ ద్రిపువర్గములన్ జయింపఁగాఁ
జని తడ వయ్యె దీనికి భృశంబుగ మీ మది నల్గకుండుఁ డీ
యనయము దైవ మిట్లు సచరాచర జాలము నొక్కవేళఁ గూ
ర్చును నొకవేళఁ బాపును మరుద్గతిఁ దూలతృణంబులం బలెన్. 1066

1. దలఁచి (హా.) 2. మరుద్గత తూలతృణంబులుం బలెన్ (తం. వా.)

సీ. తరళాతులార! మద్భక్తి చేతనులకుఁ దనరు మోక్షానంద దాయకంబు
జప తపో వ్రత దాన సత్కర్మముల ముక్తి గలుగంగనేరదు గానఁ దలఁప
విధి శివ సనకాది విమల చిత్తంబులఁ బొడమని భక్తి మీ బుద్ధులందు
జనియించె మీ పూర్వసంచిత సౌభాగ్య మెట్టిదో యది తుదముట్టె నింక

తే. నటమటము గాదు మీకు నెన్నఁటికి నైనఁ
గలుగ నేరవు నిరయ సంగతము లైన
జన్మకర్మము లిటమీఁద మన్మనీష
సుమహిత ధ్యానలార! యో రమణులార! 1067

సీ. అఖిల భూతములకు ననయంబు నాది మధ్యాంత రాంతర్బహిర్ వ్యాప్తి నైన
ఘటపటాదిక భూతకార్యంబులకును ప్రధాన కారణము లై తనరునట్టి
గగ నాని లానల క క్షోణులను భూతపంచకం బైక్యత వడయుఁ గాదె
లోకంబులందుఁ బంచీకరణ వ్యవస్థలచేత నట్టి భూతములరీతి

తే. గగనముఖ భూత తత్కార్యకారణములఁ
దగిలి యాధార హేతుభూతంబ నైన
నాకుఁ [2]బర మన్య మొక్కఁ డెన్నంగ లేదు
విమల మతులార! మాటలు వేయునేల. 1068

తే. అనినఁ దెలివొంది వారు దేహాభిమాన
ములు సమస్తంబు విడిచి యో నలిననాభ!
నిఖిల జగదంతరాత్మ! మానిత చరిత్ర!
భక్తజన మందిరాంగణ పారిజాత! 1069

తే. ఘోర సంసారసాగ రోత్తారణంబు
ధీయుత జ్ఞానయోగి హృద్ధ్యేయ వస్తు
వగుచుఁ జెలువొందు నీ చరణాంబుజాత
యుగళమును మామనంబులఁ దగుల నీవె! 1070

క. అని వేఁడినఁ గృష్ణుఁడు ముని, వినుతుఁడు గరుణించి వల్లవీజనములు గో
రినయట్ల యిచ్చెఁ గరుణా, వననిధి సద్భక్త లోకవత్సలుఁ డంతన్. 1071

---

1. భక్తి (హ) 2. నుపాదానకారణములై (తం.వా.) 3. వరమన్యుఁ డొకఁడు నెన్నంగ లేఁడు (హ)

అధ్యాయము - ౮౭

ఉ. ధర్మతనూభవుం గని పదంబులకున్ నతుఁ డై సపర్యలన్
నిర్మల భక్తి మై నడపి నీవును దమ్ములు బంధుకోటి స
త్కర్మచరిత్రు లై తగు సుఖంబుల నొప్పుచు నున్నవారె నా
నర్మిలిఁ బాండవాగ్రజుఁడు న మ్మధుసూదనుతోడ ని ట్లనున్. 1072

క. సరసిజనాథ! భవత్పద, సరసీరుహ మాశ్రయించు జను లతిసౌఖ్య
స్ఫురణం బొలుపారుచు భువిఁ, జరియింపరె భక్తపారిజాత! మురారీ! 1073

వ. అదియునుం గాక. 1074

సీ. సుమహిత స్వప్న సుషుప్తి [1]జాగ్రత లను మూఁ డవస్థలఁ బాసి వాఁడి మిగిలి
వెలి నుందు లో నుందు విశ్వ మై యుందువు విశ్వంబు నీయందు వెలుఁగుచుండు
భవదీయ మహిమచేఁ బాటిల్లు భువనంబు లుదయించు నొకవేళ నుడిగి మడుఁగు
[2]సచ్చిదానంద సుజ్ఞాని వై యొప్పుచు నవిహత యోగమాయాత్మఁ దనరి

తే. దురితదూరులు నిత్యముక్తులకుఁ జెంద
నలవి యై పెంపు దీపింతు వంబుజాక్ష!
ఘన కృపాకర! నిఖిల వికారదూర!
నీకు మ్రొక్కెద సర్వలోకైకనాథ! 1075

క. అని వినుతించిన నచ్చటి, జనపాలక బంధు మిత్ర సకలజనంబుల్
విని యనురాగిల్లిరి నె, మ్మనముల నానంద జలధి[3]మగ్నులు నగుచున్. 1076

తే. అట్టి యొ ప్పగువేళ నెయ్యంబు మెఱసి
యొక్కచోటను సంతోషయుక్తు లగుచు
దానవాంతక సతులును ద్రౌపదియును
గూడి తమలోన ముచ్చట లాడుచుండి. 1077

లక్షణ యను కృష్ణుని యష్టమభార్య ద్రౌపదీదేవికిఁ
దన వివాహవృత్తాంతముఁ దెలుపుట.

వ. అట్టియెడఁ గృష్ణకథావిశేషంబులు పరితోషంబున నుగ్గడింపుచుఁ, బ్రసంగవశం
బున నా రుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణు భార్యలఁ గనుంగొని, పాంచాలి
యి ట్లనియె. మిమ్మునుం బుండరీకాక్షుండు వివాహం బైన తెఱంగులు

---

1. జాగరము లన్ (తం. వా.) 2, సంచితాఖండసద్ జ్ఞానివై (హ); సంచితాఖండిత జ్ఞానివై (తం. వా.) 3. మగ్నులరగుచున్ (హ)

వినిపింపుఁ డనిన, వారును దమ పరిణయంబుల తెఱంగులు మున్ను నే నీకుం
జెప్పిన విధంబున వినిపించిరి. అందు సవిస్తరంబుగా నేఁ దెలియం బలుకని మద్ర
రాజకన్యకా వృత్తాంతం బా మానిని పాంచాలికిం జెప్పిన విధంబు వినుము. అని
శుకుండు పరీక్షిన్నరేంద్రున కి ట్లనియె. 1078

సీ. పాంచాలితో మద్రపతిసుత యి ట్లను సంగీతవిద్యా విశారదుండు
నారదుచేతి వీణాస్వనకలిత మై నట్టి గోవిందు కథామృతంబుఁ
దవిలి యేఁ గ్రోలి చిత్తము తన్మయత్వంబు నొంది మోదింపుచు నుండు నంత
దుహితృవత్సలుఁడు మద్గురుఁడు దా నది విని సదుపాయ మొక్కటి మదిఁదలంచి

తే. చరల నె బ్భంగి నై న గోచరము గాక
వారిమధ్యములో నభివ్యాప్తిఁ దోఁచు
మత్స్యయంత్రంబుఁ గల్పించి మనుజు లెంత
వారి కై నను దివ్వ మోవంగ రాని. 1079

తే. ధనువుఁ బవిచండ నిష్ఠురాస్త్రంబు నచట
నంచితం బై న గంధ పుష్పాక్షతలను
బూజ గావించి యునిచి యే పురుషుఁ డేని
నిద్ధబలమున నీ చాప మెక్కువెట్టి. 1080

క. ఈ సాయకంబు నారిం, బోసి వెసన్ మత్స్యయంత్రముం ధరఁ గూలన్
వేసిన శౌర్యధురీణుఁడు, నాసుత వరియించు నని జనంబులు వినఁగన్. 1081

క. చాటించిన న వ్వార్తకుఁ, బాటించి ససంభ్రమముల బాణాసన మౌ
ర్వీ టంకార మహారవ, పాటిత శాత్రవులు బాహుబల [1]సామగ్రుల్. 1082

క. సుందరతనులు తదుత్సవ, సందర్శన కుతుకు లమిత సైన్యులు భూభృ
న్నందను లేతెంచిరి జన, నందిత యశు లగుచు మద్రనగరంబునకున్. 1083

క. చనుదెంచిన వారికి మజ్జనకుఁడు వివిధార్చనములు సమ్మతిఁ గావిం
చిన నా బాహుబలాఢ్యులు,ధనువుం జేరంగ నరిగి ధైర్యస్ఫూర్తిన్. 1084

వ. ఇట్లు డగ్గఱి యద్ధనువుం గనుంగొని. 1085

ఉ. కొందఱు పూనలేక చనఁ గొందఱు పూని కదల్పలేక పోఁ
గొంద ఱొకింత యెత్త నొక కొందఱు మోపిడలేక దక్కఁగాఁ
గొంద ఱొకింత యెక్కిడుచుఁ గోరి నృపాలకు లిట్లు సిగ్గునుం
జెంది తలంగిపోవుచును [2]సీ యిట కేఁగుట నీతిత ప్పనన్. 1086

1. సంపన్నుల్ (తం. వా.) 2. ఛీ.

వ. అట్టియెడ. 1087

క. భీముఁడు రాధేయుఁడు ను, ద్దామగతి న్నెక్కు ద్రోచి తగ నమ్మీనం
బేమఱక దిరుగుచుంటయుఁ, దా మేమియు నెఱుఁగలేక తలఁగినపిదపన్. 1088

క. అమరేంద్రతనయుఁ డమ్మ, త్స్యము నేయ నుపాయ మెఱిఁగి తగ నేసియు మీ
నముఁ ద్రుంపలేక సిగ్గున, విముఖుం డై చనియె నంత వికలుం డగుచున్. 1089

వ. ఇట్లు సకల రాజకుమారులుం దమతమ ప్రయత్నంబులు విఫలంబు లైన
ముఖారవిందంబులు ముకుళింప, దైన్యంబున విన్న నై చూచుచున్న సమ
యంబున. 1090

చ. సరసిజపత్రలోచనుఁడు చాపము సజ్యముచేసి యుల్లస
చ్ఛర మరివోసి కార్ముకవిశారదుఁ డై యలవోకవోలె ఖే
చర మగు మీనముం దునిమె సత్వరతన్ సుర సిద్ధ సాధ్య ఖే
చర జయశబ్ద మొప్పఁ జెలుచన్ గురిసెన్ దివిఁ బుష్పవర్షముల్. 1091

వ. అ య్యవసరంబున, నేనుం బరితుష్టాంతరంగ నై, పరమానంద వికచ వదనార
వింద నగుచు, నిందిందిరసన్నిభంబు లగు చికురబృందంబులు విలస దళికఫల
కంబునం దళుకు లొలుకు ఘర్మజలకణంబులం గరంగు మృగమదతిలకంపు
టసలున మసలుకొనినం, గరకిసలయంబున నోసరింపుచు, మిసమిస మను మెఱుంగు
గములు గిరికొన నెఱిగొను వడవడ వడంక, నప్పుడు మందగమనంబున. 1092

చ. లలిత పదాబ్జ నూపుర కలధ్వనితో దరహాస చంద్రికా
కలిత కపోలపాలికలఁ గప్పు సువర్ణ వినూత్న రత్నకుం
డలరుచు లొప్పఁ గంకణ ఝణంకృతు లింపెసలార రంగభూ
తలమున కేఁగుదెంచి ముఖతామరసం బపు డెత్తి చూచుచున్. 1093

చ. నరపతులం గనుంగొని మనంబున వారిఁ దృణీకరించి మ
త్కరజలజాత దివ్య మణికాంచన మాలిక న మ్మురారి కం
ధరమున లీలమై నిడి పదంపడి నవ్య మధూకదామ మా
హారి కబరిం దగిల్చితి నయంబునఁ గన్నుల లజ్జ దేఱఁగన్. 1094

వ. అప్పుడు. 1095

చ. కొలఁదికి మీఱఁగా డమరు గోముఖ డిండిమ మడ్డు శంఖ కా
హళ మురళీ మృదంగ పణ వానకదుందుభి ఢక్క కాంస్య మ
ర్దళ ముర జారజాది వివిధ ధ్వను లేపున భూనభోం తరం
బులఁ జెలఁగెన్ నటీ నటనముల్ దనరారె మనోహరాకృతిన్. 1096

వ. అంత. 1097

చ. అమరగణంబుఁ దోలి యురగారి సుధాకలశంబుఁ గొన్న చం
దమున సమస్త శత్రువసుధావరకోటిఁ దృణీకరించి య
క్కమలవిలోచనుండు ననుఁ గౌఁగిట నొప్పుగఁ జేర్చి సింహాసం
క్రమణ మెలర్పఁ గొంచుఁ జనెఁ గాంచనచారు రథంబు మీఁదికిన్. 1098

వ. అట్లు రథారోహణంబు చేసిన. 1099

చ. తురగచతుష్కమున్ విమతదుర్దమ శూరతఁ బూన్చి దారుకుం
డరదము [1]రొప్ప శత్రునిక రాంధతమః పటల ప్రచండ భా
స్కరరుచి నొప్పునట్టి నిజ కార్ముకయుక్త గుణప్రఘోష సం
భరిత దిగంతరుం డగుచుఁ బద్మదళాక్షుఁడు వోవుచుండఁగన్. 1100

వ. అట్టియెడ సకలరాజలోకంబును గృష్ణుని [2]విభవంబు చూపోపక, యసంఖ్యంబు లగు మూఁకలు గట్టి, య మ్మహాత్ముని మాహాత్మ్యంబు దెలియలేక, దర్పాంధు లై, కణంగి. 1101

ఉ. భావభవ ప్రసూనశర బాధితమానసు లై సమస్త ధా
త్రీవర నందనుల్ [3]బలువుఁ దెంపును బెంపును సొంపు నేర్పడన్
దేవకిరీట రత్నరుచి దీపిత పాదసరోజుఁ డైన రా
జీవదళాక్షుఁ దాఁకిరి విశృంఖలవృత్తి నతిప్రయత్ను లై. 1102

వ. అంత. 1103

చ. సరసిజలోచనుండు నిజ శార్ఙ్గ శరాసన ముక్త హేమ పుం
ఖ రుచిర శాతసాయక నికాయములన్ రిపుకోటి నేసి సిం
ధురరిపు విక్రమ ప్రకటదోర్బలుఁ డై విలసిల్లి యొత్తె దు
స్తరచలి తాన్యసైన్యమును సజ్జనమాన్యముఁ బాంచజన్యమున్. 1104

ఉ. ఆ తటి భూరి బాహుబలు లైన విరోధినరేశ్వరుల్ మృగ
వ్రాతము లొక్కపెట్ట మృగరాజ కిశోరముపై నెదిర్చి న
[4]ట్లాతురు లై చతుర్విధ సమగ్ర బలంబులతోడఁ గూడి ని
ర్ధూతకళంకుఁ డైన నవతోయజనేత్రునిఁ జుట్టుముట్టినన్. 1105

---

1. బొప్ప (తం. వా.)
2. విభవంబునకు (తం. వా) 3. బలుపు (తం. వా.) 4. ప్లేతరులై....సమిద్ధ (తం.వా.)

చ. అలిగి మురాంతకుండు కులిశాభ శరంబుల నూత్న రత్నకుం
డలములతో శిరంబులు రణ న్మణినూపురరాజితోఁ బదం
బులుఁ గటకాంగుళీయక విభూషణ చాపశరాలితోడఁ జే
తులు నిలఁ గూలఁగా విజయదోహలి యై తునుమాడె వెండియున్. 1106

క. హతశేషులు చో క్కాకుల, గతిఁ దూల నిశాత పవనకాండముల సము
ద్ధతి నేసి తోలి విజయో, న్నతుఁ డై నిజనగరి కేఁగె నగధరుఁ డంతన్. 1107

వ. అట్లు మహిత మంగళాలంకృతంబును, నతిమనోహర విభవాభిరామంబును నగు ద్వారకానగరంబున కరుగుదెంచిన, మజ్జనకుండు ప్రియంబునఁ దోడన చనుదెంచి.

చ. రణిత వినూత్న రత్నరుచిర స్ఫుట నూపుర హార కర్ణభూ
షణ కట కాంగుళీయక లస త్పరిధాన కిరీట తల్ప వా
రణ రథ వాజి హేతినికరంబులనుం బరిచారికాతతిన్
బ్రణుత గుణోత్తరుండు నవపద్మదళాక్షున కిచ్చె నెమ్మితోన్. 1109

వ. ఇట్లు మహనీయ తేజోనిధి యైన మాధవ దయాపరిలబ్ధ నిఖిల వస్తువిస్తారుం డయ్యును, నిజాధికార శుద్ధికొఱకు మరలం గన్యారత్నంబును, వినూత్న రత్న వ్రాతంబును సమర్పించె. అని భూసుర గణంబులు వినుతింప, మా తండ్రి యైన బృహత్సేనుండు (నన్నును సమస్త వస్తువులను) గృష్ణునకు సమర్పించి, క్రమంబున సకల యాదవులను బూజించి, మరలి నిజపురంబునకుం జనియె.

## అధ్యాయము — ౮౪

అని చెప్పినఁ గుంతియుఁ, గాంధారియుఁ, గృష్ణయు, నఖిల నృపాలకాంతా జనంబులును, గోపికలుం దమతమ మనంబుల సర్వ భూతాంతర్యామియు, లీలామానుష విగ్రహుండును, నైన పుండరీకాక్షు చరణారవింద స్మరణానంద పరవశ లై, కృష్ణుం బ్రశంసించిరి. అంత. 1110

చ. బలవ దరాతి మర్దనులఁ బాండుర నీలనిభ ప్రభాంగులన్
గలిత నిజాననాంబుజ వికాస జితాంచిత పూర్ణచంద్ర మం
డలులఁ బరేశులన్ నరవిడంబనులన్ గరుణాపయోధులన్
విలస దలంకరిష్ణుల నవీన సహిష్ణుల రామకృష్ణులన్. 1111

### నారదాది ఋషులు శ్రీకృష్ణ దర్శనము చేసికొని వసుదేవునిచేఁ గ్రతువు చేయించుట.

వ. సందర్శించు తలంపుల నందఱుఁ దమ హృదయారవిందంబులం బ్రేమంబు సందడి గొన, నప్పుడు. 1112

ఉ. ధీరమతిన్ ద్వితత్రితక దేవల సాత్యవతేయ కణ్వులున్
నారద గౌతమ చ్యవన నాకుజ గార్గ్య వసిష్ఠ గాల వాం
గీరస కశ్య పాసిత సుకీర్తి మృకండుజ కుంభసంభ వాం
గీరులు యాజ్ఞవల్క్య మృగ శృంగ ముఖాఖిల తాపసోత్తముల్. 1113

వ. చనుదెంచిన, కృష్ణుండు వారలకుఁ బ్రత్యుత్థానంబు లాచరించి, వివిధార్చనలు గావించి, యి ట్లనియె. 1114

సీ. సన్మునీశ్వరులార! జన్మభాక్కుల మైన మాకు నిచ్చోట సమ్మతిని దేవ
నికర [1]దుష్ప్రాపులు నిరుపమ యోగీంద్రు లైన మీ దర్శనం బబ్బెఁ గాదె
ధృతి మందభాగ్యు లింద్రియ పరతంత్రులు నయిన మూఢాత్ముల కనఘులార!
భవదీయ దర్శన స్పర్శన చింతన పాదార్చనలు దుర్లభంబు లయ్యు

తే. నేఁడు మా కిట సులభ మై నెగడెఁ గాదె
జగతిపైఁ దీర్థభూతులు సాధుమతులు
మిమ్ము దర్శించుటయ చాలు నెమ్మితోడ
వేఱ తీర్థంబు లవనిపై వెదక నేల. 1115

వ. అదియునుం గాక, యుదకమయంబు లైన తీర్థంబులును, మృచ్ఛిలా మయంబు లైన దేవగణంబులును, దీర్ఘదేవతా రూపంబులు గాకుండుట లేదు. అయిన, నవి చిరకాల సేవ నార్చనలం గాని పావనంబు సేయవు. సత్పురుషులు దర్శన మాత్రంబునం బావనంబు సేయుదురు. అని, వెండియు, 1116

సీ. ఆదిత్య చంద్రాగ్ని మేదినీ తారాంబు మారు తాకాశ వాఙ్మనము లోలిఁ
బరికింపఁ దత్తదుపాసనంబులఁ [2]బునీతములు చేయఁగ సమర్థములు గావు
సకలార్థ గోచర జ్ఞానంబు గల మహాత్మకులు [3]ముహూర్తమాత్రమున సేవఁ
జేసి పావనములు సేయుదు రదియు నట్లుండె ధాతుత్రయయుక్త మైన

తే. కాయమం దాత్మబుద్ధియుఁ గామినీకు
మారులందు స్వకీ యాభిమానములునుఁ
దివిరి జలమునఁ దీర్థబుద్ధియునుఁ జేయు
నట్టి మూఢుండు పశుమార్గుఁ డనఁగ బరఁగు. 1117

వ. అని, యి వ్విధంబునఁ గృష్ణుం డాడిన, సాభిప్రాయంబు లగు వాక్యంబులు విని, య మ్మునీంద్రులు విభ్రాంత హృదయు లై యూరకుండి, ముహూర్త

1. దృష్టాత్ములు (తం. వా)
2. ఁబూని-తపములచే (వా) 3. తారుముహూర్తమాత్ర సేవఁజేసి (తం. వా.)

మాత్రంబున కమ్మహాత్ముని యనుగ్రహంబు వడసి, మందస్మిత ముఖులై, యప్పుండరీకాక్షున కిట్లనిరి. దేవా! నేమునుం దత్త్వవిదుత్తములైన బ్రహ్మరుద్రాదులును, భవదీయ మాయా విమోహితుల మై యుందుము. నిగూఢం బైన నీ యిచ్ఛచేత మమ్ము ననుగ్రహించితివి. భవదీయ చరిత్రంబులు విచిత్రంబులు. ఇమ్మేదిని యొక్కటియయ్యును బహురూపంబులఁ గానంబడు విధంబున, నీవును మొదలఁ గారణ రూపంబున నేకం బయ్యును, ననేక రూపంబులు గైకొని, జగదుత్పత్తి స్థితిలయంబులకు హేతుభూతం బన నద్భుత కర్మంబులం దగిలి, లీలావతారంబులు గైకొని, దుష్టజన నిగ్రహంబును, శిష్టజనరక్షణంబును, గావించుచుందువు. అదియునుం గాక, వర్ణాశ్రమ ధర్మంబు లంగీకరించి, పురుషరూపంబున వేదమార్గంబు విదితంబు సేసిన బ్రహ్మరూపివి. తపస్స్వాధ్యాయ నియమంబులచేత నీ హృదయంబు పరిశుద్ధంబు గావున, బ్రహ్మస్వరూపంబు లైన వేదంబులందు వ్యక్తావ్యక్త స్వరూపంబు లేర్పడఁగా నుందువు. కావున బ్రాహ్మణకులంబు నెల్ల బ్రహ్మకులాగ్రణి వై రక్షించిన మహానుభావుండవు. [1]మాయాతీతుండ వైన నిన్నును, నీ భూపాల వర్గంబును, నేము దర్శింపం గంటిమి. మా జన్మ విద్యా తపో మహిమలును [2]సాఫల్యంబు లయ్యె. నీకు నమస్కరించెదము. అని, బహువిధంబుల గృష్ణునభినందించి, యమ్మురాంతకుచేత నామంత్రణంబులు వడసి, తమతమ నివాసంబులకుం బోవం దలంచు నవసరంబున.

సీ. ఆ మ్మునీశ్వరులకు నానకదుందుభి యతి భక్తి వందనం బాచరించి
తాపసోత్తములార! ధర్మతత్త్వజ్ఞులు మన్నించి వినుఁడు మా విన్నపంబు
సత్కర్మ వితతిచే సంచిత కర్మచయంబు వాపెడు నుపాయంబు నాకు
ఘన దయామతిఁ జెప్పుఁ డనిన,న మ్మునివరుల్ భూవరుల్ విన వసుదేవుఁ జూచి

తే. యెలమిఁ బలికిరి నిఖిలయజ్ఞేశుఁ డయిన
కమలలోచనుఁ గూర్చి యాగములు సేయు
కర్మమునఁ బాయు నెట్టి దుష్కర్మ మైన
నిదియ ధర్మంబుగాఁగ నీ మదిఁ దలంపు. 1119

వ. అదియునుం గాక. 1120

క. దేవర్షి [3]పితృ ఋణమ్ములు, భూవర మఖ వేదపాఠ పుత్రులచేతన్
వావిరి నీఁగని పురుషుఁడు, పోవు నథోలోకమునకుఁ బుణ్యాచ్యుతుఁ డై. 1121

వ. అ ట్లగుటం జేసి నీవును. 1122

---

1. మాయా జవనికాంతరితుండ వైన నిన్నును (తం. వా.) 2. సఫలంబులయ్యె (తం.వా.)
3. పితృజఋణములు (హ.)

క. వర తన యాధ్యయనంబులఁ, దరియించితి ఋణయుగంబుఁ దడయక ధరణీ
వరదేవ ఋణము సవనా, చరణుఁడ వై యూఁగు టొప్పు సమ్మతితోడన్.1123

క. అనవుడు న వ్వసుదేవుఁడు, మునివరులకు ననియె వినయమున మీరలు చె
ప్పినయట్లు మఖము సేసెద, దినకరనిభులార మీరు దీర్పఁగవలయున్. 1124

వ. అని యభ్యర్థించి, య మ్మునీంద్రుల యాజకులంగా వరించి, య ప్పుణ్యతీ ర్థోపాంతంబున మహేంద్రామిత వైభవంబున, నష్టాదశ భార్యాసమేతుం డై, దీక్షఁ గై గొని, య మ్మహాధ్వరంబు వేదోపదిష్టవిధిం బరిసమాప్తించి ఋత్వి జ్నికాయంబుల బహుదక్షిణలం దనిపి, భార్యాసమేతుం డై, యవభృథస్నానం బాచరించి, వివిధ రత్న మణిమయ భూషణ విచిత్రాంబర సురభికుసు మానులేప నంబులు ధరియించి, నిఖిల భూదేవ ముని బంధు రాజలోకంబుల నుచిత సత్కా రంబులఁ బ్రీతులఁ గావించిన, వారును గృష్ణానుమతి నాత్మనివాసంబులకుం జనిరి. అందు. 1125

ఉ. ఆ తఱి నుగ్రసేన వసుధాధిప పంకజనాభ ముష్టికా
రాతులు దమ్ము నర్థి మధుర ప్రియభాషల నిల్వ వేఁడినన్
గౌతుక మాత్మలన్ వెలయఁగా వసియించిరి గోపగోపికా
వ్రాతముతోడ నచ్చట ధరావర నందయశోద లిమ్ములన్ 1126

క. హరి నయముల హరి ప్రియముల, హరి మధురాలాపములను హరి కథల మనో
హరలీలఁ దగిలి నందుఁడు, నిరుపమగతి నచట మూఁడునెల లుండె నృపా!1127

చ. జలరుహలోచనాది యదుసత్తము లందఱు నన్నిభంగులన్
గలిత విభూషణాంబర నికాయము లిచ్చి బహూకరించి వీ
డ్కొలిపిన నందముఖ్యులు ముకుందపదాబ్జ మరందపాన స
ల్లలిత నిజాత్మ షట్పదములన్ మరలింపుచు నెట్టకేలకున్. 1128

వ. చని చని. 1129

ఆ. మరలి మరలి కృష్ణ ! మాధవ ! గోవింద !
పద్మనాభ ! భక్తపారిజాత !
దేవదేవ! యనుచుఁ దివిరి చూచుచు మధు
రాభిముఖ్యు లగుచు నరిగి రంత. 1130

క. క్రమమున నచ్చటఁ బ్రావృట్, సమయం బగుటయును బంధుజన యాదవ వ
ర్గము లోలిఁ గొలువ సురగుణ, నమితులు బలకృష్ణు లాత్మ నగరంబునకున్.

వ. వచ్చి, సుఖంబున నుండునంత. 1132

## అధ్యాయము - ౮౫

## శ్రీకృష్ణబలభద్రులు మృతులయిన తమ సహోదరులఁ దెచ్చి దేవకీదేవికిఁ గనఁబఱచుట

సీ. అవనీశ! యొక్కనాఁ డానకదుందుభి భార్య పద్మాక్షుండు బలుఁడు దొల్లి
శరధిలోఁ జొచ్చిన గురు తనూభవునిని మరలంగఁ దెచ్చిన మహిమ లెల్ల
జనములు దమలోన సన్నుతుల్ సేయంగ విని తనసుతులు దుర్వృత్తుఁ డైన
కంసుచే నిహతు లై కాలునిపురి నున్నవారి నందఱఁ జూడఁ గోరి కృష్ణ

తే. బలులకడ కేఁగి కన్నుల బాష్పకణము
లొలుక నో రామ! రామ! నిత్యోన్నతాత్మ!
పరమ పావనమూర్తి! యో మురవిభేది!
యిందిరానాథ! యోగీశ్వరేశ! కృష్ణ! 1133

క. ముర కంస చైద్య పౌండ్రక, నరక జరాతనయ యవన నరనాయకులన్
దురితాత్ములఁ బోరిగొని భూ, భర ముడిపినయట్టి మేటిబలులు దలంపన్. 1134

ఆ. జనన వృద్ధి విలయసంగతి నిఖిలంబుఁ
బొందఁజేయఁ బరమపురుషులార!
మీకు లీల లౌట మీ రని నమ్మిన
దాన నేను వినుఁ డుదారులార! 1135

వ. అని యనేకభంగుల వినుతింపుచు ని ట్లనియె. మీరలు మహానుభావులరు. మీరు తొల్లి యనేకకాలంబు చనినక్రిందట, మృతుం డై, దండధరు మందిరంబున నున్న గురుకుమారుని మీ మహాప్రభావంబులు లోకంబులఁ బరిపూర్ణం బై ప్రకాశింప, న క్కాలుని చెంతనుండి మగుడం దెచ్చి, గురుదక్షిణగా నొసంగితిరి. అ వ్విధంబునం గంసునిచేత హతు లైన మత్పుత్రుల నందఱ మరలం దెచ్చి నా మనంబున నున్న దుఃఖంబు నివారింపవలయు. అని దేవకీదేవి ప్రార్థించినం, దమ తల్లి యాడిన మృదువాక్యంబు లత్యాదరంబున నాదరించి, యప్పు డబ్బల కృష్ణులు తమ యోగమాయా మాహాత్మ్యంబున సుతలంబునకున్ జనిరి. అట్టి యెడ. 1136

మ. కనియెన్ దానవుఁ డింద్రసేనుఁడు దశ త్కంజాతులన్ దక్షులన్
ఘనసారాంబుదవర్ణులన్ నిఖల లోకైక ప్రభాపూర్ణులన్
దనరారన్ హలచక్రపాణులను భక్తత్రాణులన్ నిత్యశో
భన వర్ధిష్ణుల రామకృష్ణుల జయ భ్రాజిష్ణులన్ జిష్ణులన్. 1137

చ. కని హితకోటితో నెదురుగాఁ జనుదెంచి మనోనురాగ సం
జనిత కుతూహలుం డగుచుఁ జాఁగిలి మ్రొక్కి సమగ్ర కాంచనా
సనముల నుంచి తచ్చరణ సారససేచన సర్వలోక పా
వన సలిలంబు లౌదల ధ్రువంబుగఁ దాల్చి సుభక్తియుక్తుఁ డై. 1138

సీ. సురభి కాలాగరు హరిచంద నైలాది ధూపంబు లా విశ్వరూపకులకుఁ
గాంచనపాత్ర సంగత రత్న కర్పూర దీపంబు లా జగ ద్దీపకులకుఁ
బాయసాపూప పాన్న పక్వఫలాది నైవేద్యంబు లా వేదవేద్యులకును
దనరు వినూత్న రత్నప్రభా భాసితాభరణంబు లా దైత్యహరణులకును

తే. మిలమిలని మంచుతోఁ బోలువలరు బహు వి
ధాంబరంబుల నీల పీతాంబరులకు
సలలిత కుసుమమాలికా మలయజాను
లేపనంబులు భూరి నిర్లేపులకును. 1139

వ. సమర్పించి, య ప్పుండరీకాక్షుని చరణారవిందంబు లొత్తుచు, నానంద బాష్ప పూరంబు తోరంబుగా రోమాంచ కంచుకిత శరీరుం డగుచుం, దన కరకమలంబులు ఫాలభాగంబునం గదియించి, యి ట్లని స్తుతియించె. 1140

ఉ. ధీయుతుఁ డై నమో భగవతే హరయే పరమాత్మనే ముకుం
దాయ సమస్త భక్తవరదాయ నమః పురుషోత్తమాయ కృ
ష్ణాయ మునీంద్రవంద్య చరణాయ సురారి హరాయ సాంఖ్యయో
గాయ వినీలభాస్వ దలకాయ రథాంగధరాయ వేధసే. 1141

వ. అని యభినుతించి యి ట్లనియె. 1142

ఉ. రాజస తామసాత్ములకు రాదు గదా నినుఁ గాన నవ్యపం
కేజ దళాయతాక్ష! మునిగేయ పవిత్రచరిత్ర! విస్ఫుర
ద్రాజకళాధరాజ సురరాజ ముఖామర మౌళిరత్న వి
భ్రాజిత పాదపీఠ! భవబంధ విమోచన! పద్మలోచనా! 1143

మ. మది నూహింపఁగ యోగివర్యులు భవన్మాయాలతా బద్ధులై
యిది మిథ్యం బనలేరు [1]తామసుల మై యేపారు మాబోఁటి దు
ర్మదు లేరీతి నెఱుంగఁ బోలుదురు [2]సమ్యగ్ధ్యాన ధీయుక్తి నీ
పదముల్ చేరెడి త్రోవఁ జూపి భవకూపంబుఁ దరింపింపవే. 1144

---

1. తామసధృతిన్నేపారు (హ) 2. సమ్యగ్జ్ఞాన (తం. వా.)

ఉ. వైరముచేతఁ జేదిన్నృపవర్గము కామముచేత గోపికల్
మీఱినభక్తి నాశ్రితులు మిమ్ము నహర్నిశముఁ మనంబులఁ
దారఁగ నీక రూప గుణ తత్పరులై మిముఁ బొందుకై వడిఁ
భూరి వివేక సత్త్వగుణముల్ గల దేవత లంద నేర్తురే. 1145

క. కాన భవత్పద పద్మ,ధ్యానంబునఁ గాని శాస్త్రతత్త్వంబులచేఁ
గానరు శ్రుతి సంవేద్యము, నైన భవత్పదము చిన్మయాకార ! హరీ ! 1146

వ. దేవా! యేనరుం డైన నేమి, శ్రద్ధాగరిష్ఠ చిత్తుం డై, మిమ్ము సేవించునట్టి మహా త్ముండు విధిచోదితం బైన ప్రమాణంబువలన విముక్తుం డై వర్తించును. అట్లు గావున యోగీశ్వరుండ వైన నీ వీశితవ్యుల మైన మమ్ము నిష్పాపులం జేయుము. అని నుతియించి, మఱియు నిట్లనియె. 1147

మత్తకోకిల. కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగఁ గంటి ముక్తి నిధానముఁ
గంటి నీ కరుణావలోకము [1]గంటి పాపము వీడ ను
క్కంటి తామర చూలులం బొడఁగాన నట్టి మహాత్మ! నా
యింటికిం జనుదెంచి తీశ్వర ! యేఁ గృతార్థతఁ బొందితిఁ. 1148

వ. దేవా! యేను భవద్దాసుండ. ఏది పంచినం జేయుదు. ఇచ్చటికి మీరలు విజయంబు చేసిన కార్యం బానతీయవలయు. అని, కరంబులు మొగిచి, విన్నవించినం బుండరీ కాక్షుం డతని వాక్యంబులకు సంతసిల్లి, యి ట్లనియె. 1149

సీ. బలిదైత్య ! విను మున్ను ప్రథమయుగంబున నా మరీచికి భార్య యైన వర్ష
యను నింతివలన నందను లార్వు రుద్భవ మైరి వా రొక్కనాఁ డబ్జభవుఁడు
తన పుత్రిపై మోహమునఁ గూడి రతికేళి యొనరింప [2]మీరు నవ్వుటయుఁ గ్రోధ
మంది యాసురయోనియందుఁ బుట్టుం డని ఘనశాప మిచ్చె న వ్వనజజుండు

తే. తన్నిమిత్తమునను వారు తగిలి హేమ
కశిపునకుఁ బుట్టి రంత [3]నాకౌకసార్థ
మొదవ వీరలఁ దెచ్చి య య్యోగమాయ
యడరి దేవకి గర్భంబునందుఁ జొనుప. 1150

క. దొరఁకొని కంసుఁడు దోడ్తోఁ, బొరిగొనెఁ దత్పుత్ర శోకమునఁ దనచిత్తం
బెరియఁగ దేవకి వారల, దరిసింపఁగఁ గోరి పనుపఁ దగ ననురేంద్రా ! 1151

---

1. రూపము వీడ (వా) 2. మీఱి (తం. వా.) 3. నాకౌకసులకు నొదవ (వా)

క. వచ్చితిమి వారిఁ గ్రమ్మఱఁ, దెచ్చెద మని తల్లి కోర్కెఁ దీర్పఁగ నిపు డే
మిచ్చుటకి నీకడం బోర, పొచ్చెము లేకున్నవారె పో వీ రనఘా! 1152

క. వీరలఁ దోకొని యిపు డే, ధారుణి కి న్నేఁగి జనని తాపము వాపన్
వీరలు శాపం బంతటఁ, దీఱి మదీయ ప్రసాద ధీయుతు లగుచున్. 1153

క. పొలుపుగ సుగతిం బొందఁగఁ, గల రని హరి యానతిచ్చి కరుణాన్వితుఁ డై
బలిచే ననుమతిఁ గొని వా, రలఁ దోకొని వచ్చె ని ద్ధరామండలికిన్. 1154

వ. అట్లు వారలం దెచ్చి యి ట్లనియె. 1155

క. కనుఁగొనుము వీరె నీ నం, దను లని జనయిత్రికడ ముదంబున వారి
న్నునిచిన న ద్దేవకియును, ఘనపుత్ర స్నేహ మోహ కలితాత్మక యై. 1156

క. చన్నులు దిగ్గనఁ జేపఁగఁ, గన్నుల నానంద బాష్పకణములు దొరఁగన్
గ్రన్నన గౌఁగిట నిడి నను, గన్నన్నలు వచ్చి రనుచుఁ గౌతుక మొప్పన్. 1157

వ. అట్లు కౌఁగిటం జేర్చి, నిజాంకపీఠంబున నునిచి, శిరంబులు మూర్కొని, చుబుకం బులు పుణుకుచుం, బ్రేమాతిశయంబున మేనం బులక లొలయం జన్నిచ్చిన, వారును వైష్ణవమాయా మోహితు లై, స్తన్యపానంబు సేయుచు, భగవంతుం డైన రథాంగపాణి యంగసంగమంబున విగతకల్మషు లై, విరించి శాపసాగరంబు హరి దయాకటాక్షం బను నావచేతం దరియించి, నిజస్వరూపంబులు ధరియించి, కృష్ణునకుఁ, దల్లిదండ్రులకు వందనం బాచరించి, గగనపథంబున నిజస్థానంబున కరిగిరి. అంత దేవకీదేవి తనమనంబున. 1158

క. చచ్చిన బాలురఁ గ్రమ్మఱఁ, దెచ్చుట గడుఁ జిత్ర మనుచు దేవకి మదిలో
నచ్చెరువడి యది యంతయు, నచ్చపు హరి మాయ గాక యని తలఁచె నృపా!

క. పరమాత్ముఁ డఖిలజగ దీ, శ్వరుఁ డగు కృష్ణుండు సేయు సత్కృత్యంబుల్
పరికింప నెన్నఁ బెక్కులు, ధరణీవర! యనిన రాజు తా ముని కనియెన్. 1160

## అధ్యాయము - ౮౬

### —: సు భ ద్రా ప రి ణ య ము :—

సీ. మునినాథ! పార్థుండు వనజనాభుని సహో దరి సుభద్రను నేవిధమునఁ బెండ్లి
యయ్యె నా విధమంత నొయ్యనఁ గ్రమముతోఁ దెలియంగ నెఱిఁగింపు ధీవిశాల!
యనవుడు నా వ్యాసతనయుఁ డాతనిఁ జూచి వినవయ్య నృప! దేవవిభుని సుతుఁడు
మును దీర్థయాత్రాసముత్సుకుం డగుచును రమణఁ బ్రభాసతీర్థమున నుండి

తే. యా తలోదరితోడి నెయ్యంబు కలిమిఁ
జూడఁగోరుచు రాముండు సుందరాంగిఁ
గౌరవేంద్రున కీ సమకట్టె ననుచుఁ
దనకు నెఱుఁగ రా నా పురందరసుతుండు. 1161

వ. అట్లు సుభద్రాదర్శనోత్సాహంబు దన మనంబున సందడిగొనం, ద్రిదండివేషంబు ధరియించి, ద్వారకాపురంబునకుం జనుదెంచి, య ప్పౌరజనంబులు భక్తిస్నేహంబుల ననిశంబుఁ బూజింపఁ, దన మనోరథసిద్ధి యగు నంతకుం గనిపెట్టుకొని, వానకాలంబు చనునంతకు న ప్పట్టణంబున నుండు సమయంబున. 1162

క. రాముఁడు తత్కపటాకృతిఁ, దా మదిఁ దెలియంగలేక తగ నొకనాఁ డా
భూమీవరతాపసుఁ బో, రామిం గని యాత్మమందిరమునకుఁ దెచ్చెన్. 1163

ఆ. తెచ్చి భిక్షసేయ దేవేంద్రతనయుండు
కుడుచుచుండి యచటఁ గోరి మెలఁగు
నసమబాణు మోహనాస్త్రంబుకైవడి
వీరమోహి నన విహారలీల. 1164

వ. సుభద్ర విహరింపుచున్న సమయంబున. 1165

చ. జలరుహపత్రనేత్రు ననుసంభవ చారు వధూలలామ స
ల్లలిత విహార విభ్రమ విలాసము లాత్మకు విందుసేయ న
బ్బలరిపునందనుండు గని భావజసాయక బాధ్యమాన వి
హ్వల హృదయాబ్జుఁ డై నిలిపె న త్తరుణీమణియందుఁ జిత్తమున్. 1166

ఉ. ఆ తరుణీశిరోమణియు నర్జును నర్జున చారుకీర్తి వి
ఖ్యాతుని నింద్రనందను నకల్మషమానసుఁ గామినీ మనో
జాతునిఁ జూచి పుష్పశరసాయక జర్జరి తాంతరంగ యై
భీతిలియుండె సిగ్గు మురిపెంబును మోహము దేఱు చూపులన్. 1167

వ. అట్లా నృపసత్తమ మత్తకాశిను లొండొరుల చిత్తంబులు చిత్తజాయత్తంబులై, కోర్కులు తత్తఱింపం, దాల్ములు వీడి, సిగ్గునం జిట్టుముట్టాడుచున్న యంత, నొక్కనాఁడు దేవతామహోత్సవ నిమిత్తంబున న త్తలోదరి పురంబు వెలుపలికి నరుగుదెంచిన, నర్జునుండును, కృష్ణ వసుదేవ దేవకీదేవుల యనుమతంబు వడసి, తానునుం దోడన చని, యప్పుడు. 1168

సీ. సాంద్ర శరచ్చంద్ర చంద్రికాస్ఫూర్తిచే రాజిల్లు పూర్ణిమా రజనివోలెఁ
బూర్ణేందుబింబావతీర్ణ మై యిలమీఁద భాసిల్లు హరిణశాబకమువోలెఁ
సులలిత మేఘమండలమును నెడఁబాసి వసుధఁ గ్రుమ్మరు తటిద్వల్లివోలె
మాణిక్యరచిత సన్మహిత చైతన్యంబుఁ బొందిన పుత్తడిబొమ్మవోలె

తే. లలిత విభ్రమ రుచికళా లక్షణములు
పొసఁగ రూపైన శృంగారరసమువోలె
నర్థిఁ జరియించుచున్న పద్మాయతాక్షిఁ
బ్రకట సద్గుణభద్ర సుభద్రఁ జూచి. 1169

వ. అప్పుడు డాయంజని, యరదంబు పై నిడికొని పోవుచుండఁ గనుంగొని, యదు బలంబులు మదంబున నంటందాఁకిన, నప్పు డ య్యాఖండలనందనుండు, ప్రచండ గాండీవ కోదండ నిర్ముక్త కాండంబులం దూలించి, యఖండ బాహాదండ విజయ ప్రకాండుం డై, ఖాండవప్రస్థపురంబున కరిగె. అట బలభద్రుం డ వ్వార్త విని, విలయసమయ సమీరసఖుని కైవడిం, బటు రోషభీషణాకారుం డై, క్రోధించినం గని, కృష్ణుండు మొదలయిన బంధుజనంబు లతని చరణంబులకుం బ్రణమిల్లి, మృదుమధుర భాషణంబుల ననునయించి, యొడంబడునట్లుగా నాడిన, నతండును, సంతుష్టుం డై, మనంబునఁ గలంక దేఱి యప్పుడు. 1170

క. కరులఁ దేరుల నుత్తమ, హరులన్ మణిహేమ భూషణాంబర భృత్యో
త్కర దాసికాజనంబుల, [1]నరణముఁ దగ నిచ్చి పంపె ననుజకుఁ బ్రీతిన్. 1171

వ. ఇట్లు కృష్ణున కభిమతంబుగా నర్జునసుభద్రల కరణం బిచ్చి, పంపె. అని చెప్పి, యోగీంద్రుండు మఱియు ని ట్లనియె. 1172

—: శ్రీకృష్ణుఁడు ఋషిసమేతుఁ డై మిథిలానగరమునకుఁ బోవుట :—

సీ. నరనాథ! విను భువనప్రసిద్ధంబుగ దీపించునట్టి విదేహదేశ
మందు భూకాంతకు నాననదర్పణం బనఁ దనర్చిన మిథి లను పురమునఁ
గలఁడు శ్రీహరి పాదకంజాత భక్తుండు గళిత రాగాది వికారుఁ డమల
చరితుఁ డక్రోధుండు శాంతుండు నిగమార్థ కోవిదుం డగు శ్రుతదేవుఁ డనెడి

తే. [2]భూసురోత్తముఁ డొకఁ డనిచ్ఛాసమాగ
తంబు [3]తుష మైన హేమశైలంబు గాఁగఁ
దలఁచి పరితోష మందుచుఁ దగ గృహస్థ
ధర్మమున నుండి సముచితకర్ముఁ డగుచు. 1173

---

1. అరణంబుగ (తం.వా.) 2. భూసురోత్తముఁ డన యదృచ్ఛా (హ) 3. తృణమైన (త. వ.)

ఉ. ఆ పురి నేలువాఁడు బహుళాశ్వుఁడు నా నుతి కెక్కినట్టి ధా
త్రీపతి యా ధరామరుని రీతిని నిష్కలు షాంతరంగుఁ డై
యే పనులందు ధర్మగతి నేమఱ కర్థిఁ జరించుచుండె ల
క్ష్మీపతి వారిపైఁ గరుణఁజేసి ప్రసన్న ముఖాంబుజాతుఁ డై. 1174

వ. అట్లు కృష్ణుండు వారలం జూచువేడ్క నిజస్యందనారూఢుం డై, నారద వామ దే వాత్రి కృష్ణ రా మాసి తారుణ దివిజగురు కణ్వ మైత్రేయ చ్యవనులు, నేనును మొదలయిన మును లనుగమింపం జనుచుఁ, దత్తద్దేశనివాసు లగు నానర్తక ధన్వ కురు జాంగల వంగ మత్స్య పాంచాల కుంతి మధు కేకయ కోసలాది భూవరులు, వివిధ వస్తుప్రచయంబులుఁ గానుక లిచ్చి సేవింప, గ్రహమధ్యగతుం డై దీపించు సూర్యునింబోలి, య ప్పుండరీకాక్షుండు మందస్మిత వదనారవిందుం డగుచు వారలం గరుణార్ద్రదృష్టిం జూచి, యోగక్షేమంబు లరసి, సాదరం బగు భాషణంబుల నాదరింపుచుం, గతిపయ ప్రయాణంబులం జని, విదేహనగ రంబు డాయుటయు, నా బహుళాశ్వుం డ మ్మాధవు రాక విని, మనంబున హర్షింపుచు, వివిధపదార్థంబులు గానుకలుగాఁ గొని, తానును, శ్రుతదేవుం డను మహీసురుండును, నెదురుగాఁ జనుదెంచి, యప్పుడు. 1175

ఉ. ఆ మునికోటికిన్ వినయ మారఁగ వందన మాచరించి యా
తామరసాక్షలోచనుఁ డుదారచరిత్రుఁడు పాపగోత్ర సు
త్రాముఁడు భక్తలోక శుభదాయకుఁ డైన రమేశు సద్గుణ
స్తోముని పాదపద్మములు సోఁకఁగ మ్రొక్కి వినమ్రు లై తగన్. 1176

చ. కరములు మోడ్చి యో పరమకారుణికోత్తమ! నీవు నీ మునీ
శ్వరులును మద్గృహంబునకు వచ్చి మమున్ గృపచేసి యిచ్చటన్
గర మనురక్తిఁ బూజనలు గైకొనుఁ డంచు నుతించి వేఁడ నా
హరి మనమందు [1]వారి వినయంబుల [2]కెంతొ ప్రమోద మందుచున్. 1177

చ. తిరముగ వారి యిష్టములు దీర్పఁదలంచి మురాసురారి యొం
డొరుల కెఱుంగకుండ మునియూథముఁ దానును నేఁగె వారి మం
దిరముల కేకకాలమున ధీరత నా ధరణీవరుండు వా
రిరుహదళాయతాక్షు మునిబృందములం గనకాసనంబులన్. 1178

1. వారికి ప్రియంబుల (హ) 2. కెంతఁ బ్రమోద (హ. తం. వా.)

సీ. కూర్చుండ నియమించి కొమరారు కాంచన కలధౌత కలశోదకములచేతఁ
బాదముల్ గడిగి తత్పావన జలములు దానును సతియును బాంధవజనంబుఁ
గర మర్థి నిజమస్తకంబుల ధరియించి వివిధార్చనములు సద్విధి నొనర్చి
మణిభూష ణాంబర మాల్యానులేపన రాజిత ధూపనీరాజనములు

తే. భక్తిఁ గావించి పరిమృష్ట బహువిధాన్న
పాయ సాపూప పరిపక్వ ఫలము లోలి
నారగింపఁగఁ జేసి కర్పూరమిళిత
లలిత తాంబూలములు నెయ్య మలర నొసఁగె. 1179

వ. ఇట్లు సమర్పించిన యనంతరంబ, య మ్మిథిలేశ్వరుం డయిన జనకుండు పరమా
నందంబు నొంది. 1180

చ. హరి పదపద్మయుగ్మము నిజాంకతలంబునఁ జేర్చి యొత్తుచుం
బురుషవరేణ్య ! యీ నిఖిలభూతగణావళి యాత్మలందు సు
స్థిరమతిఁ గర్మసాక్షివి సుధీవర ! నీ పదభక్తకోటితో
నరయ [1]రమాహినాథ చతురాస్యులుఁ బోల [2]రటందు వెప్పుడున్. 1181

వ. అట్టి లోకవిదితం బైన భవద్వాక్యంబు నిక్కంబుగా భవదీయ పాదారవిందంబు
లందు నొకానొకవేళ లేశమాత్రధ్యానంబు గల నాగృహంబున కకించనుండ
నని చిత్తంబునం దలంపక, భక్తవాత్సల్యుండ వగుటం జేసి విజయము చేసితివి.
భవత్పాదపంకేరుహ ధ్యానసేవారతిం దగిలిన మహాత్ములు త్వద్ధ్యానంబులు
వదలం జాలుదురే? నిరంతరంబును శాంతచిత్తు లై, నిష్కించను లై, యోగీంద్రు
లై, నీవలనం గోరిక గల వారలకు నిన్నెన్న నిత్తువుగదా ! అని వెండియు
ని ట్లనియె. 1182

తే. కృష్ణ ! పరమాత్మ ! యదుకుల క్షీరవార్ధి
పూర్ణచంద్రమ ! దేవకీపుత్ర ! సుజన
వినుత ! నారాయ ణాచ్యుత ! వేదవేద్య !
భక్తజనపోష పరితోష ! పరమపురుష ! 1183

ఉ. శ్రీపురుషోత్తమాఖ్య ! యదుసింహకిశోరక ! భక్తలోకర
క్షా పరతంత్ర ! నీవు మునిసంఘముఁ గొన్నిదినంబు లుండవే
నీ పదపద్మరేణువులు నెమ్మి మదీయగృహంబు సోఁకినన్
దాపసవంద్య ! యే నిపుడు ధన్యుఁడ నయ్యెదఁ గాదె మాధవా ! 1184

---

1. రమాధినాథ (హ.); ఉమాధినాథ (తం. వా.) 2. రటందు రెప్పుడున్ (హ)

వ. అని యభ్యర్థించినం బ్రసన్నుం డై, య ప్పుండరీకాక్షుండు నిజకులప్రదీపకుం డయిన జనకచక్రవర్తిం గరుణించి, య మ్మిథిలానగరంబునం బౌరజనంబులకు నున్నత శోభనంబులు గావించుచుం, గొన్నిదినంబు లుండె. అంత. 1185

మ. శ్రుతదేవుండును మోది యై మునిజన స్తోమంబుతో నిందిరా
పతిఁ దోకొంచు నిజాలయంబునకు నొప్ప న్నేఁగి య చ్చోట స
మ్మతి దర్భాస్తరణంబుల న్ననిచి సమ్యక్ జ్ఞానపారీణుఁ డై
సతియుం దానుఁ బదాబ్జముల్ గడిగి చంచద్భక్తిఁ దత్తోయముల్. 1186

చ. శిరములఁ దాల్చి నవ్య తులసీదళదామ కుశ ప్రసూన వి
స్ఫుర దరవిందమాలికలఁ బూజ యొనర్చి గృహాంధకూప సం
చరణుఁడ నైన నాకడకుఁ జక్రి దనంతనె వచ్చునట్టి సు
స్థిరమతి నే తపంబు మును చేసితి నంచును సంతసింపుచున్. 1187

తే. మఱియుఁ దశ్పాదతీర్థంబు మందిరమునఁ
గలయఁ జిలికించి సంప్రీతి గడలు కొనఁగఁ
బత్ర ఫల పుష్పతోయముల్ భక్తి నొసఁగి
హరి మురాంతక మూర్తి నిజాత్మ నిలిపి, 1188

తే. మానితంబుగ విశ్వనిధానమూర్తి
యైన కృష్ణుండు తన యింట నారగించెఁ
దన మనోరథసిద్ధియుఁ దనకు నబ్బె
ననుచు బయిపుట్ట మల్లార్చి యాడుచుండె. 1189

చ. తరుణియుఁ దానుఁ బుత్రులుఁ బదంపడి కృష్ణు భజింపుచుండఁ ద
చ్చరణము లంకపీఠమునఁ జాఁచిన మెల్లన యొత్తుచున్ రమా
వరుఁ గని పల్కె భక్తజనవత్సల! మామక భాగ్య మెట్టిదో
హర చతురాస్యులు న్నెఱుఁగ నట్టి నినుం గనుఁగొంటి నెమ్మితోఁ. 1190

క. ముని యోగిమానస స్ఫుట, వనజంబుల నెల్లప్రొద్దు వసియించు భవ
ద్ఘన దివ్యమూర్తి నాలోచన గోచర మయ్యెఁ గాదె సర్వాత్మ! హరీ! 1191

వ. దేవా! నీ సచ్చరిత్రంబులు గర్ణరసాయనంబులుగా నాకర్ణింపుచు, నీకుం బూజ లొనర్చుచు, నీ చరణారవిందంబులకు వందనంబు సేయుచు, నీ దివ్యనామసంకీర్తనంబు చేయుచుం, దమ శరీరంబులు భవదధీనంబులుగ మెలంగు నిర్మల బోధాత్ము లగువారి చిత్తంబులను దర్పణంబులం గానంబడు చుందువు. కర్మ విక్షిప్త చిత్తు లైనవారి హృదయంబుల నుండియు, దూరగుండ వగుదువు. అని మఱియు ని ట్లనియె. 1192

సీ. నీకు మ్రొక్కెదఁ గృష్ణ! నిగమాంత సంవేద్య! లోకరక్షణ! భక్తలోకవరద!
నీ పాదసేవనా నిరతుని నన్ను నేపనిఁ బంపెదు దానతి మ్మనినఁ గృష్ణుఁ
డెలనవ్వు మోమునఁ జెలువొంద నా విప్రు కర మాత్మకరమునఁ గదియఁజేర్చి
పాటించి యతనితోఁ బలికెఁ దపశ్శక్తి వఱలిన యమ్మునివర్యు లెపుడు

తే. తమ పదాంబుజరేణు వితానములను
దగిలి లోకంబులను బవిత్రంబు సేయు
వారు నసుఁ గూడి యెప్పుడు వలయు నెడల
కరుగుదెంతురు నీ భాగ్యగరిమ నిటకు. 1193

వ. చనుదెంచిరి. పుణ్యస్థలంబులును, విప్రులును, దేవతలును, సంస్పర్శన దర్శనార్చనంబులం బ్రాణులను సమస్త కిల్బిషంబులం బాయం జేయుదురు. అదియునుం గాక, బ్రాహ్మణుండు జననమాత్రంబునం జీవకోటియందు ఘనుం డయియుండు. జప తపో ధ్యానాధ్యయ నాధ్యాత్మములం జతురుం డై, మత్కలాశ్రయుం డయ్యె నేని, నతం డుత్తముం డై వెలుంగు. అతనిం జెప్పనేల? అని, మఱియు ని ట్లనియె. 1194

క. నా మది విప్రులపైఁ గల, ప్రేమము నా తనువునందుఁ బెట్టని కతనన్
భూమిసురు లర్హులు నీ, వీ మునులం బూజసేయు మిద్ధచరిత్రా! 1195

క. ఇదియే నా కిష్టము ననుఁ, బదివేలవిధంబు లొలయ భజియించుటగా
మది కిం పగు నటు గావున, వదలని భక్తిన్ భజింపు వసుధామరులన్. 1196

క. అని సర్వలోక గురుఁ డగు, వనజోదరుఁ డానతిచ్చు వాక్యంబుల జా
డనె భూమిసురుఁ డమ్మని, జనులకు సద్భక్తిఁ బూజ సలిపెన్ వరుసన్. 1197

చ. ఎనయఁగఁ గృష్ణుఁ డంత మిథిలేశ్వర భూసురులన్ గృపావలో
కన మొలయ న్ననూన సుఖగస్థితిఁ బొందఁగఁజేసి వారి వీ
డ్కొని రథ మెక్కి దివ్య మునికోటియుఁ దానును వచ్చెఁ గ్రమ్మఱన్
జనవర! మోక్షదం బగు కుశస్థలికిం బ్రముదాంతరంగుఁ డై. 1198

## అధ్యాయము - ౮౭

### —: శ్రుతి గీతలు :—

వ. అని చెప్పిన, బాదరాయణికి నభిమన్యునందనుం డి ట్లనియె. మునీంద్రా! ఘట పటాది వస్తుజాతంబుభంగి నిర్దేశింప నర్హంబు గాక, సత్త్వాది గుణశూన్యం బైన బ్రహ్మంబునందు సత్త్వాది గుణగోచరంబు లైన వేదంబు లే క్రమంబునం

ప్రవర్తించు, నట్టి చందంబు నా కెఱుఁగింపుము. అనిన, భూవరునకు మునివరుం డి ట్లనియె. సకల చేతనాచేత నాంతర్యామి యైన సర్వేశ్వరుండు సర్వశబ్ద వాచ్యుండు గావున, సకల జంతునివహంబులందు బుద్ధీంద్రియ మనః ప్రాణ శరీరంబు లను సృజియించి, చేతనవర్గంబునకు జ్ఞానప్రదుం డగు. కావున, సకల నిగమసమూహంబులును, దత్స్వరూప గుణవైభవ ప్రతిపాదకంబులు గావున ముఖ్యం బై ప్రవర్తించు. శ్రుతిస్తోత్రం బుపనిష త్తుల్యంబు, ననేక పూర్వఋషి పరంపరా యాతంబును నైన దీనిని శ్రద్ధాయుక్తుం డై యెవ్వం డనుసంధించు, నతనికి మోక్షంబు సులభంబు. దీనికి నారాయణాఖ్యాతం బగు నొక్క యుపాఖ్యానంబు గలదు. వినిపింతు, ఆకర్ణింపుము. భగవత్ప్రియుం డైన నారదుం డొక్కనాఁడు నారాయణాశ్రమంబునకుం జని, ఋషిగణసమేతుం డైన నారాయణఋషిం గనుంగొని, నీవు న న్నడిగినట్ల య మ్మహాత్ముని నడిగిన, నతండు ము న్నీ యర్థంబు శ్వేతద్వీపవాసు లయిన [1]యోగీంద్రులు ప్రశ్నచేసిన, వారలకు సనందనుండు సెప్పినప్రకారంబు నీ కెఱింగించెద నని చెప్పఁదొణంగె. శయానుం డైన రాజశ్రేష్ఠునిం దత్పరాక్రమ దక్షతాది చిహ్నంబులు నుతియించు వందిజనంబుల చందంబున, జగదవసానసమయంబున ననేక శక్తియుతుం డై, యోగనిద్రావశుం డైన సర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబుసేయు విధంబు నారాయణుండు నారదునకుం జెప్పిన తెఱంగున వినుము. అని యి ట్లనియె.

సీ. జయ జయ హరిదేవ! సకలజంతువులకు జ్ఞానప్రదుండవు గాన వారి
వలన దోషంబులు గలిగిన సుగుణ సంతా నంబుగాఁ గొని జ్ఞానశక్తి
ముఖ్య షడ్గుణ పరిపూర్ణతఁ జేసి మా[2]యాత్మావశిష్టుఁడ వగుచుఁ గార్య
కారణాత్మకుఁడ వై కణఁగి చరింపుచు నున్న నీయందుఁ బయోరుహాక్ష!

తే. తివిరి యామ్నాయములు ప్రవర్తించుఁ గాన
ప్రకట త్రిగుణాత్మకం బైన ప్రకృతితోడి
యోగ మింతయు మాన్పవే యోగిమాన
సాంబుజాత మధువ్రత! యని నుతించి. 1200

వ. అదియునుం గాక. 1201

సీ. పరమ విజ్ఞానసంపన్ను లైనట్టి యో గీంద్రులు మహిత ని స్తంద్ర లీలఁ
బరిదృశ్యమాన మై భాసిల్లు ని మ్మహీ పర్వతముఖర ప్రపంచ మెల్లఁ
బ్రకట బ్రహ్మస్వరూపము గాఁగఁ దెలియుదు రెలమి నీవును జగద్విలయ వేళ
నవశిష్టుఁడవు గాన ననఘ! నీయందు నీ విపుల విశ్వోదయ విలయము లగు

1. సనకసనందనాది దివ్యయోగీంద్రులు (హ. తం. వా.) 2. యాత్మవిశిష్టుఁడ (తం. వా.)

తే. ఘటశరావాదు లగు మృద్వికారములు మృ
దాత్మకం బైన యట్లు పద్మాయతాక్ష!
తవిలి కారణరూపంబు దాల్చి లీలఁ
గడఁగి నీయందు బుద్ధి వా క్కర్మములను. 1202

క. అలవడఁ జేయుచు [1]నుందురు, బలకొని యిలఁ బెట్టఁబడిన పదవిన్యాసం
బులు పతనకారణము గా, నలవున సేవింపుచును గృతార్థులు నగుచున్. 1203

క. లీలం బ్రాకృతపూరుష, కాలాదిక నిఖల మగు జగంబుల కెల్లన్
మాలిన్య నివారక మగు, నీ లలితకళా సుధాబ్ధినిం గ్రుంకి తగన్. 1204

చ. భరిత నిదాఘతప్తుఁ డగు పాంథుఁడు శీతలవారిఁ గ్రుంకి దు
ష్కర మగు తాపముం దొఱఁగు కైవడి సంసర ణోగ్రతాపమున్
వెరవునఁ బాయుచుండుదురు నిన్ను భజించు మహాత్మకుల్ జరా
మరణ మనోగుణంబులఁ గ్రమంబునఁ బాయుట సెప్ప నేటికిన్. 1205

వ. అదియునుం గాక. 1206

సీ. అనయంబు దేహి నిత్యానిత్య సద్విలక్షణమునఁ బంచకోశ వ్యవస్థ
లను వృద్ధిఁ బొరయుచు నందులోపల నున్న ప్రాణాన్న బుద్ధి విజ్ఞానమయము
లను చతుష్కోశంబు లవ్వల వెలుఁగొందు నానందమయుఁడవు గాన దేవ!
సురుచిర స్వప్రకాశుండవు నీ పరిగ్రహము గల్గుటఁ జేసి గాదె ప్రకృతి

తే. మహదహంకార పంచతన్మాత్ర గగన
పవన తేజోంబు భూ భూతపంచకాది
కలిత తత్త్వముల్ బ్రహ్మాండకార్య కరణ
మందు నెపుడు సమర్థంబు లగుటఁ జేసి. 1207

క. కోరి శరీరులు భవదను, సారంబున నిహపరైక సౌఖ్యంబులఁ బెం
పారఁగ నందుచునుందురు, ధీరజనోత్తము లనంగ దివిజారిహరా! 1208

ఆ. నిన్ను ననుసరింప నేరని కుజనులు
పవనపూర్ణ చర్మభస్త్రి సమితి
యోజఁ జేయుచుందు రుచ్ఛ్వసనంబులు
బలసి యాత్మదేహ భజను లగుచు. 1209

---

1. నుందురు........పదవిన్యాసంబు లపతన కారణములుగ (హ) నందఱు....(వా)

సీ. దేవ! కొందఱు సూక్ష్మదృక్కులై నట్టి మహాత్మకు లుదరస్థులైన వహ్ని
గా మదిఁ దలఁతురు కైకొని మఱికొంద ఱారుణు లను పేర నమరు ఋషులు
లీల సుషుమ్నా నాడీమార్గగతుఁడవై హృత్ప్రదేశమునఁ జరింపుచున్న
రుచి దహరాకాశ రూపిగా భావింతు రట్టి హృత్పద్మంబునందు వెడలి

తే. వితత మూర్ధన్య నాడికాగతుల నోలి
బ్రహ్మరంధ్రంబుఁ బ్రాపించి పరమపురుష!
సుమహితానందమయ పరంజ్యోతి యైన
యీశు నినుఁ బొంది మఱి పుట్ట రిల మహీశ! 1210

వ. మఱియు, వివిధ కాష్ఠాంతర్గతుం డైన వాయుసఖుండు, తద్గత దోషంబునం బొరయక, నిత్యశుద్ధుం డై, తరతమభావంబున వర్తించుచందంబున, స్వసంకల్ప కృతంబు లైన విచిత్రశరీరంబులయందు నంతర్యామి వై ప్రవేశించి, తత్తద్విచిత్ర యోనిగతం బయిన హేయంబులం బొరయక, సకలాత్మసమం బై, బ్రహ్మం బయిన నిన్ను నైహికాముష్మిక ఫలసంగమంబు లేక, విగత రజో గుణంబులం దగిలి, కొందఱు భజియింపుచుండుదురు. అదియునుం గాక, దేవా! భవదీయ సంకల్పాధీనంబు లయిన శరీరంబులనుం బ్రవేశించియున్న జీవసమూహంబు నీకు శేషభూతం బని తెలిసి, కొందఱు భవనివారకం బైన శ్రీమత్త్వచ్చరణారవిందంబులు సేవించి, కృతార్థు లగుదురు, మఱియును. 1211

సీ. అనఘ! దుర్గమ మైన యాత్మతత్త్వంబు ప్రవర్తించుకొఱకు దివ్యంబు లైన
యంచిత రామకృష్ణాద్యవతారముల్ భజియించియున్న నీ భవ్యచరిత
మను సుధాంభోనిధి నవగాహనము చేసి విశ్రాంతచిత్తు లై వెలయుచుండి
మోక్షంబు బుద్ధి నపేక్షింప నొల్లరు మఱియుఁ గొందఱు భవచ్చరణపంక

ఆ. జములఁ దగిలి పుణ్యతము లైన హంసల
వడువు నొంది భాగవతజనముల
నొనరువారు ప్రకట యోగిజన ప్రాప్య
మైన ముక్తిఁ గోర రాత్మలందు. 1212

ఉ. కొందఱు నీ శరీరము లకుంఠితభక్తి భవద్వశంబు లై
చెందఁగ నీ పదాబ్జములు సేరి భజింపుచుఁ దత్సుఖాత్ము లై
యుందురు కొంద ఱీ తనువు లోలి ధరించి భవత్పదాబ్జముల్
పొందుగఁ గొల్వలేక యిలఁ బుట్టుచుఁ జచ్చుచు నుందు రవ్వయా! 1213

చ. యమ నియమాది యోగమహితాత్మకు లైన మునీంద్రులుం విరో
ధమునఁ దలంచు చైద్యవసుధావర ముఖ్య నృపుల్ ఫణీంద్ర భో
గము లన నొప్పు బాహువులు గల్గిన మిమ్ము భజించు గోపికల్
క్రమమున నేమునుం సరియకామె భవత్కృపఁ గంబుజోదరా! 1214

మ. అరవిందాక్ష! భవత్స్వరూప మిలఁ బ్రత్యక్షంబునం గాన నె
వ్వరికిం బోలదు శాస్త్రగోచరుఁడ వై వర్తింతు వీ సృష్టిముం
దర సద్రూపుఁడ వైన నీవలన నే ధాత్రా ద్యమర్త్యుల్ జనిం
చిరి ని న్నంతకు ము న్నెఱుంగఁగలమే చింతింప నే మచ్యుతా! 1215

వ. అట్టి నిన్నుం బరమాణుకారణవాదు లైన కణ్వ గౌతమాదులును, ప్రకృతి కారణవాదు లైన సాంఖ్యులును, దేహాత్మవాదు లైన బౌద్ధులును, వివిధంబు లయిన కుతర్కంబులచేతం బరస్పరావ్యాహతంబు లైన మతంబులు తమతమ కుతర్కవాదంబుల సమర్థింపుచు, నిన్నుం దెలియలేరు. మహాభాగ్యవంతు లైన యోగీంద్రులకు నీవు ప్రత్యక్షుం డైన, నివియన్నియు నసత్యంబు లని కానవచ్చు. వెండియుఁ, గొందఱు సచరాచర వస్తుజాతంబులకు నంతర్యామి వై, సర్వంబు నీవ యగుటం దెలియలేక నిత్యం బనియు, ననిత్యం బనియును, విపరీతబుద్ధిం దెలియుదురు గాని, భవదీయ దివ్యతత్త్వంబు నిక్కంబుగఁ దెలియనేరరు. కొందఱు జగచ్ఛరీరుండవు గాన జగద్రూపకుండ వైన నిన్నుం, గటక మకుట కర్ణికాది వివిధ భూషణభేదంబులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించు చందంబున, జగద్వికారానుగతుండ వయ్యును, నిఖిలహేతు ప్రత్యనీక కళ్యాణ గుణాత్మకుండ వై, యుండుదు వని యాత్మవిదు లైనవారు దెలియుదురు, అదియునుం గాక! 1216

మ. వనజాతాక్ష! భవత్పదాబ్జయుగ సేవాసక్తు లైనట్టి య
జ్జనముల్ మృత్యుశిరంబు దన్ని ఘన సంసారాంబుధిన్ దాఁటి పా
వను లై లోకములుం బునీతములుగా వర్తింపుచున్ నిత్య శో
భన మై యొప్పెడి ముక్తిఁ బొందుదురు శుంభద్ వైభవోపేతు లై. 1217

మ. మిము సద్భక్తి భజింప నొల్లకిల దుర్మేధుల్ ప్రవర్తించు నీ
చ మతివ్రాతము నేర్పునం బసులఁ బాశశ్రేణి బంధించు చం
దమునం బెక్కగు నామరూపములచేతం వారి బంధించి దు
ర్గమ సంసారపయోధిఁ ద్రోతువు దళత్కంజాతపత్రేక్షణా! 1218

వ. దేవా! కర్మమూలంబు లయిన పాణిపాదంబులు లేనివాఁడ వయ్యును, స్వతంత్రుండవు. బ్రహ్మాదులు భవత్పరతంత్రులై యుండుదురు. స్థిర చర రూపంబులుం

లుం గల చేతనకోటికి నీవు సర్వవిధి నియంతవు. కావున నీ కృపావలోకనంబు గలవారికి మోక్షంబు కరస్థితం బై యుండు. భవత్కృపావలోకనంబు లేనివారు కష్టాత్ము లై, దుర్గతిం గూలుదురు. అట్టి జీవులు దేవ తిర్య ఙ్మనుష్య స్థావరాది శరీరంబులు సొచ్చి, యణురూపులై యుందురు. అందును నీ వంతరాత్మ వగుచు నుందువు. మఱియును. 1219

క. మది దలపోయఁగ జలబు, ద్బుదములు ధరఁ బుట్టి పొలియు పోలిక గల యీ
త్రిదశాది దేహములలో, వదలక వర్తించు నాత్మవర్గము నోలిన్. 1220

ఆ. ప్రళయవేళ నీవు భరియింతు వంతకుఁ
గారణంబ వగుటఁ గమలనాథ!
భక్తపారిజాత! భవ భూరి తిమిర ది
నేశ! దుష్ట దైత్యనాశ! కృష్ణ! 1221

చ. అనఘ! జితేంద్రియస్ఫురణు లయ్యుఁ జంచల మైన మానసం
బను తురగంబు బోధమహి తాత్మవివేకపు నూలిత్రాట న
ల్లనఁ గుదియంగఁ బట్టను దలంపుచు ముక్తి కుపాయలాభ మే
యనువున లేమికిన్ వగల నొందెడు నాత్మలు వో తలంపఁగన్. 1222

చ. గురు పదపంకజాతములు గొల్వని వారలు వో మహాబ్ధి ని
స్తరణకుఁ గర్ణధార రహితం బగు నావను సంగ్రహించు బే
హారిగతి భూరి దుస్తర భవాంబుధిలోన మునుంగుచుందు రం
బురుహదళాక్ష! నిత్య పరిపూర్ణుఁడ వై తనరార నీ వొగిన్. 1223

తే. పుత్ర దార గృహ క్షేత్ర భూరివిషయ
ఘన సుఖాసక్తుఁ డగుచు నే మనుజుఁడేని
నర్థిఁ జరియించు వాఁడు భవాబ్ధిలోనఁ
జెంది యెన్నాళ్ళకును దరిఁ జేరలేఁడు. 1224

సీ. జగతిపై బహుతీర్థ సదనంబులనఁ గల్గి పుణ్యానువర్తన స్ఫురితు లగుచుఁ
బాటించి నీయందు బద్ధమత్సరములు లేక భక్తామరానోకహం బ
వగు భవత్పాదాబ్జయుగళంబు సేవించి భవపాశముల నెల్లఁ బాఱఁదోలి
సమమతు లై యదృచ్ఛాలాభతుష్ట మేరుసమముగాఁ గైకొని సాధు లగుచుఁ

తే. బాదతీర్థంబు గల మహాభాగవత జ
నోత్తమోత్తము లైనట్టి యోగివరుల
వార కెప్పుడు సేవించువాఁడు పొందుఁ
బ్రవిమలానంద మయ మోక్షపదము మఱియు. 1225

వ. సత్తైన ప్రకృతివలన నుత్పన్నం బైన యీ జగత్తు సత్తుగావలయును. అది యెట్లనినం, గనకోత్పన్నంబు లయిన భూషణంబులు కనకమయంబు లై కానం బడు చందంబున. అని సాంఖ్యుండు పలికిన విని, యద్వైతవాది యి ట్లను. ఎయ్యది యుత్పన్నంబు గా దదియు సత్తుం గా దను వ్యతిరేకవ్యాప్తి నియమంబు నిత్యసత్యం బైన బ్రహ్మంబునందుఁ దర్కహతం బగు. కావున, ప్రపంచంబు మిథ్య యని నిరూపించిన, నా ప్రపంచంబు బ్రహ్మవిశేషణం బై, కార్యకారణావస్థలం గలిగియున్న, నంతమాత్రంబున మిథ్య కానేరదు. ఆ ప్రపంచంబునకుం గార్యకారణావస్థలు నిత్యంబులు గావున, నవస్థాద్వయయుక్తం బైన ప్రపంచంబు నిత్యంబు. అని, వెండియు నద్వైతి యి ట్లను. బహుగ్రంథప్రతిపాదితం బైన జగన్మిథ్యాత్వము లేమి యెట్లనిన, నదియునుం గర్మవశు లైన జడుల నవిద్యాప్రతిపాదకం బై, కుతర్కసమేతం బైన భారతి యంధపరంపరా వ్యవహారంబునం జేసి భ్రమియింపఁ జేయును. కారణావస్థల యందును బ్రహ్మవిశేషణం బైన సూక్ష్మరూపంబునఁ బ్రపంచంబు సత్తైయుండును. [1]సత్యంబు బాధాయోగ్యంబు గావున, నీకు విశేషణం[2] బై యుండును. నీవు దేహగతుం డైన దేహియం దంతర్యామి వయ్యుం, గర్మఫలంబులం గోరయక, కర్మ ఫలభోక్త యైన జీవునకు సాక్షిభూతంబ వై యుండుదువు. అట్టి నిన్ను నజ్ఞు లైన మానవులు నిజ కంఠలగ్నం బైన కంఠికామణి నిత్యసన్నిహితం బై వెలుంగుచున్ననుం గానక వర్తించు తెఱంగునఁ, దమ హృదయపద్మ మధ్యంబున ననంత తేజోవిరాజమానుండ వై ప్రకాశించు నిన్నుం దెలియలేరు. సకల బ్రహ్మాండనాయకుండ వైన నీయందు శ్రుతులు ముఖ్యవృత్తిం బ్రవర్తించును. అని శ్రుత్యధిదేవతలు నారాయణు నభినందించిన తెఱంగున, సనందనుండు మహర్షుల కెఱింగించిన ప్రకారం బని, నారాయణ ఋషి నారదునకుం జెప్పిన, న మ్మహాత్ముండును, మజ్జనకుం డయిన వేదవ్యాస మునీంద్రునకు నుపన్యసించె. అ య్యర్థంబు నతండు నాకుఁ జెప్పిన విధంబున నీకుఁ జెప్పితిని. ఈ యుపాఖ్యానంబు సకల వేద శాస్త్ర పురాణేతిహాస సారంబు. ఉపని షత్తుల్యంబు. దీనిం బఠించువారును, వినువారును, విగతకల్మషులై, యిహ పర సౌఖ్యంబుల నొంది, వర్తింతురు. అని చెప్పిన, శుకయోగీంద్రునకు రాజేంద్రుం డి ట్లనియె. 1226

1. అసత్యంబు (హ) 2. శేషం బై యుండు (తం. వా.)

అధ్యాయము - ౮౮

—: విష్ణుసేవా ప్రాశస్త్యము :—

మ. మునినాథోత్తమ ! దేవదానవులలో ముక్కంటి సేవించు వా
రనయంబున్ బహు వస్తుసంపదల సౌఖ్యానందులై యుండ న
వ్వనజాతాక్షు రమామనోవిభుని శశ్వద్భక్తి సేవించు [1]స
న్మునివర్యుల్ గడుఁ బేదలౌటకుఁ గతంబున్ నాకెఱింగింపవే. 1227

సీ. నావుడు శుకయోగి నరనాథుఁ గనుఁగొని విను మెఱింగింతుఁ దద్విధము దెలియ
ఘనశక్తిసహితుండు కాలకంధరుఁడు దా వినుత [2]గుణత్రయాన్వితుఁడు గాన
రాగాది యుక్తమై రాగిల్లు సంపద లాతనిఁ గొల్చువా రందుచుందు
రచ్యుతుఁ బరము ననంతు గుణాతీతుఁ బురుషోత్తముని నాదిపురుషు ననఘు

తే. నర్థి భజియించువారు రాగాది రహితు
లగుచు దీపింతు రెంతయు ననఘచరిత !
ధర్మనందనుఁ డశ్వమేధంబు చేసి
పిదప సాత్త్విక కథనముల్ ప్రీతితోడ. 1228

ఉ. నారద సంయమీంద్రువలనన్ వినుచుండి యనంతరంబ పం
కేరుహనాభుఁ జూచి యడిగెన్ దగ నిప్పుడు నీవు నన్ను నిం
డారిన భక్తిమై నడిగినట్ల యతండును మందహాస వి
స్ఫార కపోలుఁడై పలికెఁ బాండుతనూభవుతోడఁ జెచ్చెరన్. 1229

సీ. వసుమతీనాథ ! యెవ్వనిమీఁద నా కనుగ్రహబుద్ధి వొడము నా ఘనుని విత్త
మంతయుఁ గ్రమమున నపహరించిన వాఁడు ధనహీనుఁ డగుచు సంతాప మందు
విడుతురు బంధు లవ్విధమున నొందిలి యై చేయునది లేక యఖిలకార్య
[3]భారంబు లుడిగి మద్భక్తులతో మైత్రి నెఱపుచు విజ్ఞాన నిరతుఁ డగుచుఁ

తే. బిదప వాఁ డవ్య యానంద[4] పదము నాత్మ
నెఱిఁగి సారూప్య సంప్రాప్తి నెలమి నొందుఁ
గాన మత్సేవ మిగుల దుష్కర మటంచు
వదలి భజియింతు రితర దేవతల నెపుడు. 1230

క. సేవింప వారు దమకుం, గావించిన శోభనములు గని నిజములుగా
భావించి [5]వారి మఱతురు, భావములఁ గృతఘ్నవృత్తి పని తమపనిగన్. 1231

1. సద్గుణపుణ్యుల్ ....తా కతను జక్కన్ (తం.) 2. గుణత్రియా (హ) 3. భాగంబు (హ)
4. పదమయాత్మఁ, బరఁగ శ్రీవిష్ణులోక సంప్రాప్తినొందు (తం. వా. హ.) 5. వారు (హ)

క. మెలఁగుచు నుందురు దీనికిఁ, గల దొక యితిహాస మిపుడు గైకొని నీకుం
దెలియఁగఁ జెప్పెద దానన, యలవడు నీ వడుగు ప్రశ్న కగు నుత్తరముం.

— శివద్రోహంబు సేయఁ బూనిన వృకాసురుండు విష్ణుమాయచే మడియుట —

క. [1]శకుని యను దైత్యు తనయుఁడు, వృకుఁ డనువాఁ డొకఁడు దుర్వివేకుఁడు సుజన
ప్రకరముల నలఁపఁ దెరువున, నొకనాఁ డొదిగుండి దివ్యయోగిం గనుచుం.

క. కరములు మోడిచి మౌనీశ్వర ! నారద ! లలిత ధీవిశారద ! నన్నుం
గరుణించి యానతీ శుభ, కరు లగు హరి హర హిరణ్య గర్భులలోనం. 1234

ఆ. కడఁగి కొలువ శీఘ్రకాలంబులోఁ దన
యిష్ట మయిన వరము లిచ్చునట్టి
దైవ మెవ్వఁ డనిన దానవుఁ గనుఁగొని
మునివరుండు పలికె ముదముతోడ. 1235

వ. వినుము. దుర్గుణ సుగుణంబులలో నొక్కటి యెచ్చటం గలుగు, నచ్చట న తుణంబ కోప ప్రసాద ఫలంబులు చూపువాఁ డ మ్ముమ్మూర్తులయందును ఫాలలోచనుండు. ఇ వ్విధంబుఁ దెలిసినవా రై, బాణాసుర దశకంధరులు సమగ్ర భక్తియుక్తులై, సేవించి, యసమాన సామ్రాజ్య వైభవంబుల నొంది, ప్రసిద్ధులైరి. అట్లు గావున నీవును న మ్మహాత్ముని సేవింపుము. అతనివలన నభిమత ఫలంబులు వేగంబ ప్రాప్తం బయ్యెడి. అని చెప్పిన, నతం డతుణంబ. 1236

సీ. దీపించు కేదారతీర్థంబునకు నేఁగి యతి సాహసాత్మకుం డైన యసుర
లోకముల్ వెఱఁ గంద నా కాలకంధరు వరదుని నంబికావరునిఁ గూర్చి
తన మేనికండ లుద్దండుఁ డై ఖండించి యగ్ని కాహుతులుగా నలర వేల్చి
దర్పకారాతి ప్రత్యక్షుంబు గాకున్న జడియక స ప్తవాసరమునందుఁ

తే. బూని త త్తీర్థమునఁ గృతస్నానుఁ డగుచు
వెడలి మృత్యువు కోఱ నా వెలయునట్టి
[2]గండగొడ్డంటఁ దన మ స్తకంబు దునుము
కొనఁగఁ బూనిన న య్యగ్ని[3]గుండమునను. 1237

క. అరుదుగ వెలువడి రుద్రుఁడు, కరుణ దలిర్పంగ వాని కర మాత్మకరాం
బురుహమునఁ బట్టి తెగువకుఁ, జొరవలఁదు మెచ్చువచ్చె సుమహిత చరితా! 1238

---

1. శుకుఁడను దైత్యుని (హా. తం. వా.) 2. గంద్ర (తం. వా.) 3. కుండము (తం. వా.)

క. నీ మదిఁ బొడమిన కోరిక, లే మైనను వేఁడు మిపుడ యిచ్చెద ననినన్
దా మనమున సంతసపడి, యా మనుజాశనుఁడు హరు పదాంబుజములకున్.

తే. వందనం బాచరించి యో యిందుమకుట!
ఫాలలోచన! వరద! మత్పాణితలము
నేను నెవ్వని తలమీఁద నిడిన [1]వాఁడు
మస్తకము నూఱువ్రయ్య లై మడియ నీవె. 1240

క. అని వేఁడిన నమ్మాటలు, విని మదనారాతి నవ్వి విబుధాహితు కో
రిన వరముఁ దడయ కిచ్చిన, దనుజుఁడు తద్వరపరీక్షఁ దాఁ జేయుటకున్. 1241

వ. ఆ క్షణంబ వరదానగర్వంబున నుద్వృత్తుం డై, కడంగి. 1242

క. ఆ హరు మస్తకమునఁ గడు, సాహసమునఁ జేయి వెట్ట జడియక కదియ
న్నోహో! తన మెచ్చులు దన, కాహా! పై వచ్చె ననుచు నభవుఁడు భీతిన్.

క. దనుజుఁడు దను వెనువెంటన్, జనుదే ముల్లోకములును సంత్రాసము పై
కొని పాఱ సురలు మనములఁ, దనికిరి దానికినిఁ బ్రతివిధానము లేమిన్. 1244

వ. అట్లు చని చని. 1245

సీ. నిరుపమానంద మై నిఖిల లోకములకు నవల యై యమృతపదాఖ్యఁ దనరి
దినకర చంద్రదీధితులకుఁ జొరరాక సలలిత సహజతేజమున వెలుఁగు
సమధికం బగు శుద్ధసత్త్వ గరిష్ఠ మై కర మొప్ప యోగీంద్రగమ్య మగుచు
హరి పదధ్యాన పారాయణు లైన తద్దాసుల కలరు నివాస మగుచుఁ

తే. బ్రవిమ లానంత తేజో విరాజమాన
దివ్య మణిహేమ కలిత సందీప్త భవ్య
సౌధ [2]మంటప తోరణ స్తంభ విపుల
గోపురాది [3]భాసురము వై కుంఠపురము. 1246

వ. కనుంగొని, య మ్మహాస్థానంబు డాయం జనుటయు, న ప్పుండరీకాక్షుం డఖండ వైభవమునం గుండలీశ్వర భోగతల్పంబునం బరమానంద కందళిత హృదయారవిందుం డై, యిందిరా నయనచకోరంబుల నిజ మందహాస సాంద్ర చంద్రికా వితతిం దేల్చుచు, నార్త భక్తజన రక్షణంబు పనిగా మెలంగుచు, వివిధ వినోదంబులం దగిలియుండియు, ఫాలలోచనుం డ ద్దనుజ పాలునకుం దలంపక యిచ్చిన వరంబు తన తలమీఁద వచ్చినం గలంగి, చనుదెంచుట తన దివ్య

1. వాని (హ) 2. మండప (తం. వా.) 3. రాకీర్ణ సురము (హ.)

చిత్తంబున నెఱింగి, య క్కాలకంధరుని యవస్థ నివారింపం దలంచి, య
య్యిందిరాదేవితోడి వినోదంబు చాలించి, యప్పుడు. 1247

సీ. తాపింఛ రుచితోడఁ ద్రస్తరించెడు మేను పసిఁడిముంజియుఁ దగు పట్టుగొడుగు
ధవళాంశు రుచి జన్నిదంబును దిన్నని దండంబుఁ జేతఁ [1]గమండలంబుఁ
[2]బసుపు గోఁచియుఁ జిన్ని పట్టెవర్ధనము రాజితం బైన మృగాజినంబుఁ
దూలాడు సిగయును వ్రేలు మాఱట గోఁచి వేలిమి బొట్టును వ్రేళ్ళ దర్భ

తే. దనర సందీప్త హవ్యవాహన సమాన
కాంతిఁ జెలువొంది యద్భుత క్రమ మెలర్పఁ
జతురగతి నప్డు వటుకవేషంబు దాల్చి
వచ్చి యా నీచ దానవ వరునిఁ జేరి. 1248

వ. కైతవంబున నతనికి నమస్కరించి, మృదుమధుర భాషణంబుల ననునయింపుచు, [3]న య్యసురవరున కిట్లనియె. ఇవ్విధంబున మార్గపరిశ్రాంతుండ వై, యింత దూరం బేల చనుదెంచితి? సకల సౌఖ్యకారణం బయిన యీ శరీరంబు నిరర్థకంబు చేసి, వృథాయాసంబున దుఃఖపఱుపం దగునే? ఇయ్యెడఁ గొంత దడవు విశ్రమింపుము. ఈ ప్రయాసంబునకుఁ గతం బెయ్యది? కపటహృదయుండవు గాక నీ యధ్యవసాయం బెఱింగింపం దగునేని నెఱింగింపుము. అని, మృదుమధురంబుగాఁ బలికిన, న మ్మహాత్ముని సుధారస తుల్యంబు లైన వాక్యంబులు విని, సంతసిల్లి, య ప్పిశితాశనుండు తన పూనిన కార్యం బతని కెఱింగించిన. 1249

చ. హరి దరహాస మొప్ప పిశితాశనుఁ గన్గొని పల్కె దానవే
శ్వర! మును దక్షు శాపమునఁ జాలఁ బిశాచప తౌట సూనృత
స్ఫురణము మాని సంతతము బొంకుచునుండు పురారిమాట నీ
వరయక వెంట నేఁగఁ దగ దాతని చేఁతలు మాకు వింతలే. 1250

ఆ. నిజము పలికెనేని నెఱిఁ దన తలమీఁద
నీ కరంబు మోప నీక తలఁగి
వచ్చు నోటు నితని వలనఁ బ్రత్యయమును
దగుల నేమి కలదు దనుజవర్య! 1251

---

1. గమండలువును (తం. వా.) 2. పసిఁడి (చః) 3. నయ్యసురాధమున(హ)

ఆ. † [1]అశుచితోడ నతని నంటఁగఁ బనిగాదు
కాలు చేయి గడిగి కరము వార్చి
యతని వెంట వేడ్క నరుగుదువే నీవు
నవల నంటఁ దగును నసురనాథ! 1252

మ. అతి దుశ్శంకలు మాని పొ మ్మనిన దైత్యారాతి మాయావిమో
హితుఁ డై విస్మృతి నొంది తామసమున న్నేపారి వాఁ డాత్మ పా
ణితలంబుల్ దన నెత్తి మోపికొని తా నేలన్ వెసం గూలె వి
శ్రుత దంభోళిహతిన్ వడిం బడు మహాక్షోణీధరంబో యనన్. 1253

వ. అట్లు తన తల నూఱువ్రయ్య లై నేలం గూలిన యసురం గని, యప్పుడు.

క. సుర లసురాంతకు మీఁదను, వర మందార ప్రసూన వర్షము లోలిన్
గురిసిరి తుములం బై దివి, మొరసెన్ సురదుందుభి ప్రముఖ తూర్యంబుల్.

క. పాడిరి గంధర్వోత్తము, లాడిరి దివి నప్సరసలు నన్యోన్యముగన్
గూడిరి గ్రహములు భయముల, వీడిరి ముని కోటు లంత విమలచరిత్రా! 1256

క. మురహరుఁ డెల న వ్వొలయఁగఁ, బురహరుఁ దగఁ జూచి పలికె భూతేశ్వర! యీ
నరభోజనుండు నీ కి, త్తటి నెగ్గొనరింపఁ దలఁచి తానే పొలిసెన్. 1257

వ. అది యట్టిది కాదె! ఇ జ్జగంబున నధికుం డైన వానికి నపకారంబు గావించిన మానవులకు శుభంబు గలుగునే? అదియునుం గాక, జగద్గురుండ వగు నీ కవజ్ఞ దలంచు కష్టాత్ముండు వొలియుటం జెప్ప నేల? ఇట్టి దుష్టచిత్తులకిట్టి వరంబులిచ్చుట కర్జంబు గాదు. అని, య ప్పురాంతకుని వీడ్కొలిపిన, నతండు మురాంతకుని ననేక విధంబుల నభినందించి, నిజనివాసంబునకుం జనియె. అని చెప్పి యి ట్లనియె.

## అధ్యాయము - ౮౯

క. మానవ నాయక! యీ యాఖ్యానము చదివినను వినిన ఘనపుణ్యులు ని
త్యానంద సౌఖ్యములఁ జెందుదురు రటమీఁద ముక్తిఁ బొందుదు రెలమిన్.

వ. అని చెప్పి, శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కి ట్లనియె. 1260

### —: భృగుమహర్షి త్రిమూర్తుల పారిశస్త్యంబు శోధించుటకుఁ బోవుట :—

క. జననాయక! యింకఁ బురాతనవృత్తం బొకటి నీకుఁ దగ నెఱిఁగింతున్
వినుము తపోమహిమలఁ జెందిన మునిజనములు సరస్వతీనది పొంతన్. 1261

---

† ఈ పద్యము తాళపత్ర ప్రతులలో లేదు. 2. యగుచు (తం. వా.)

క. వితతక్రియ లొప్పఁగ సత్క్రతువుల [1]నొనరించు చచటఁ గైకొని లక్ష్మీ
పతి భవ పితామహులలో, నతులితముగ [2]నెవ్వ రధికు లని తమలోనన్. 1262

వ. ఇట్లు తలపోసి, తన్మహత్త్వం బంతయుం దెలిసి రమ్మని, భృగుమహాముని, న మ్మువ్వురు వేల్పుల కడకుం బంపిన, న త్తాపసోత్తముండు చని ముందట. 1263

క. జలరుహసంజాత సభా, స్థలమునకు న్నేఁగి యతని సత్త్వగుణంబున్
దెలియుటకై నుతివందన, ములు సేయకయున్న నజుఁడు మునమున యనుచున్.

క. మనమునఁ గలఁగుచు భృగుఁ దన, తను జాతుం [3]డనుచు బుద్ధిఁ దలఁచిన వాఁడై
ఘన రోషస్ఫురితాగ్నిని, ననయము శాంతోదకముల నల్లన నార్చెన్. 1265

చ. మహిత తపోధనుండు మునిమండనుఁ డ య్యెడఁ బాసి వెండియు
న్నహిపతిభూషుఁ గాన రజతాద్రికి నేఁగిన న గ్గిరీంద్రుపైఁ
దుహినమయూఖశేఖరుఁడు దుర్గయుఁ దానును విశ్రమింపుచున్
† ద్రుహిణ తనూభవుండు సనుదెంచుట కాత్మఁ బ్రమోద మందుచున్. 1266

క. కనుఁగొని భ్రాతృస్నేహం, బునఁ గౌఁగిటఁ జేర్చ ననుచు ముక్కంటి రయం
బున నెదు రేఁగిన ముని రుద్రుని యందలి [4]సత్త్వగుణము దెలియుట కొఱకై.

వ. అతనిఁ గైకొనక యూరకుండిన. 1268

ఉ. ఆ నిటలాంబకుండు కమలాసననందనుఁ జూచి భూరి కా
లానల రోషవేగ భయదాకృతిఁ దాల్చి పటు స్ఫులింగ సం
తానము లొల్క శూలమునఁ దాపసముఖ్యు నురంబు వ్రేయఁగాఁ
బూనినఁ బార్వతీరమణి ఘోరున నడ్డము సొచ్చి చెచ్చెరన్. 1269

క. తన విభు పాదములకు వం, దనముం గావించి సముచిత ప్రియముల న
య్యనలాక్షుని కోపము మా, న్పిన న మ్మునినాథుఁ డచట నిలువక చనియెన్.

సీ. పొలుపొందు వైకుంఠపురమున కర్థితోఁ జని యందు సమధి కైశ్వర్య మొప్పఁ
గమలాంక పర్యంక గతుఁ డై సుఖించు న క్కౌస్తుభభూషు వక్షస్స్థలంబుఁ
దనపాదమునఁ బిట్టు దన్నెఁ దన్నినఁ బాన్పుడిగి వచ్చి మునిఁ జూచి నగధరుండు
పదముల కెఱఁగి యో పరమ తపోధన! యాగతి నీ వచ్చు టెఱుఁగలేక

---

1. నొనరింప నచట (హ.) 2. నెవ్వఁడధికుఁడని (హ.) 3. డగుట(హ)
† "ద్రుహిణ" యన్ని కవిభావమైయుండును. 4. సత్వగుణమెఱుంగుట (తం.వా.)

తే. యున్న నా తప్పు మన్నించి నన్నుఁ గరుణఁ
జూచి యీ దివ్య మణిమయస్ఫూర్తిఁ దనరు
రుచిర సింహాసనమునఁ గూర్చుండు దివ్య
తాపసోత్తమ ! యభయ ప్రదాననిపుణ ! 1271

క. అలఘు పవిత్ర ! భవత్పద, జలములు నను నస్మదీయ జఠరస్థ జగం
బుల లోకపాలురను బోలు,పలరఁగఁ బుణ్యులనుఁ జేయు ననఘచరిత్రా ! 1272

వ. మునీంద్రా ! భవదీయ పాదాబ్జహాళి మద్భుజాంతరంబునకు భూషణం బయ్యె. భవదాగమనంబు మాబోఁటివారికి శుభావహంబు గాదె ! ఏను ధన్యుండ నైతి. అని మృదుమధు రాలాపంబుల ననునయించిన, న మ్మునివరుండు, లక్ష్మీనాథు సంభాషణంబులకుఁ జిత్తంబునం బరమానందంబు నొంది, య మ్ముకుందు ననంత కల్యాణగుణనిధి, నభినందించి, యానంద బాష్పధారా సిక్త కపోలుం డగుచుఁ, దద్భక్తి పారవశ్యంబున నొండు పలుకనేరక, యతనిచేత నామంత్రణంబు వడసి, మరలి, సరస్వతీ తీరంబున నున్న మునుల సన్నిధికిం జనుదెంచి, వారలం గనుంగొని. 1273

సీ. మునినాయకులతోడఁ దను పోయివచ్చిన తెఱఁగును దనమది దృష్టమైన
మూఁడుమూర్తుల విధంబును నెఱిఁగించిన విని వారు మనముల విస్మయంబు
నంది చిత్తంబుల సందేహములు వాసి [1]చిన్మయాకారుఁడు శ్రీసతీశుఁ
డనుపముఁ డనవద్యుఁ డఖిలకల్యాణగు ణాకరుఁ డాది మధ్యాంత రహితుఁ

తే. డై తనర్చిన పుండరీకాక్షుఁ డొకఁడు
గాక [2]ప్రణుతింప దైవ [3]మెక్కడను వేఱె
కలఁడె [4]యని బుద్ధి విజ్ఞానకలితు లగుచు
హరి పదాబ్జాతయుగళంబు నర్థిఁ గొలిచి. 1274

వ. (అట్లు సేవించి) యవ్యయానందం బైన వైకుంఠధామంబు నొందిరి. అని చెప్పి, వెండియు ని ట్లనియె. 1275

—: శ్రీకృష్ణుండు మృతు లైన విప్రసుతులఁ దెచ్చుట :—

సీ. నరనాథ ! యొకనాఁడు నలినాయతాక్షుండు పొలుచు కుశస్థలీ పురమునందు
సుఖముండ నొక్క భూసురవర్యు భార్యకుఁ బుత్రుండు జన్మించి పుట్టినపుడ
మృతుఁ డైన ఘన శోకవితతిచేఁ గ్రాఁగుచు నా డింభకునిఁ గొంచు నవనిసురుఁడు
చనుదెంచి వెలుచ రాజద్వారమునఁ బెట్టి కన్నుల బాష్పాంబుకణము లొలుకఁ

1. చిన్మయాకారు లక్ష్మీసతీశు (హ.) 2. గణుతింప (తం. వా.) 3. [illegible]రుఁడు వేఱె (తం. వా.) 4. యను బుద్ధి విజ్ఞాన (తం. వా.)

తే. బాపురే! విధి నను దుఃఖపఱుపఁ దగునె
యనుచు దూఱుచుఁ దనుఁ దిట్టుకొనుచు వగల
డెంద మందంద యెరియ నాక్రందనంబు
సేయుచును వచ్చి యా విప్రశేఖరుండు. 1276

సీ. అధికశోకంబున నలమటఁ బొందుచు నచ్చటి జనులతో ననియెఁ బలుచ
బ్రాహ్మణ విద్వేషవంతుఁ డై తగ శాస్త్ర పద్ధతి నడవక పాపవర్తి
యగు క్షత్రబంధువుఁ డగు వాని దురితంబుచేత మత్పుత్రుండు జాత మైన
యప్పుడె మృతుఁ డయ్యె నక్కట హింసకు రోయక యెప్పు డన్యాయకారి

తే. యగుచు విషయానుగత చిత్తుఁ డైన యట్టి
రాజు దేశంబు ప్రజలు నిరాశు లగుచు
దుఃఖములఁ [1]జాల వనటఁ బొందుదు రటంచు
నేడ్చుచును నట నిల్వక యేఁగె నపుడు. 1277

వ. ఇ వ్విధంబున మఱియునుం, దనసుతులు మృతు లైనపు డెల్ల వారలం గొని వచ్చి, య వ్విప్రుండు రాజుమొగసాలం బెట్టి, రోదనంబు సేయుచు, నెప్పటి యట్లు కొన్ని గాథలు చదివి పోవుచుండె. ఇ వ్విధంబున నెనమండ్రు సుతులు మృతు లయిన పిదపం, దొమ్మిదవ కుమారుండు మృతుం డయిన, వాని నెత్తి కొని వచ్చి, యెప్పటివిధంబునఁ బలవరింపుచున్న బ్రాహ్మణుం గని, యర్జునుం డి ట్లనియె. 1278

క. ఈవగిది నీవు వగలన్, వాపోవఁగ జూచి యకట! వారింపంగా
నోపిన విలుకాఁ డొక్కఁ, డీ పురి లేఁడయ్యె నయ్య! యిది పాప మగున్.

సీ. పుత్రులఁ గోల్పోయి భూరి శోకంబున వనటఁ బొందుచు విప్రవరులు చాల
నే రాజు రాజ్యమం దేని వసించుదు రా రాజు దలపోయ నవనిమీఁద
నటునిగా నాత్మ నెన్నందగు నీ పుత్రు నే బ్రతికించెద నిపుడు పూని
యటు సేయనైతినే ననలంబు సొచ్చెద నని భూసురుఁడు వెఱఁ గందఁ బలుక

తే. నతఁడు [3]విని యీ చెడుగుమాట లాడఁ దగునె
భూరి విక్రమశాలి రాముండు మేటి
బలుఁడు హరియును ధైర్యసంపన్ను లనఁగఁ
దనరు ప్రద్యుమ్నుఁ డతనినందనుఁడు మఱియు. 1280

---

1. జాలవొందుచుందురు నటంచు (తం. వా.) 2. చేతజాలిబొందుదు రటంచు (ట.)
3. కడుబ్రేఁగు మాటలిట్లాడ (తం. వా.)

తే. వినుతబలు లైన యాదవ వీరవరులుఁ
గలుగ వారలచేఁ గాని కార్య మీవు
చక్కఁబెట్టుట యెట్లు నీ చనెడి త్రోవఁ
బొమ్ము నావుఁడు న య్యింద్రపుత్రుఁ డపుడు. 1281

క. మనమున దురహంకారము, ఘనముగఁ బొడముటయు నపుడు కవ్వడి విప్రుం
గనుఁగొని యచ్చటి జనములు, వినఁగా ని ట్లనియె రోష విహ్వలమతి యై.

మ. బలుఁడం గాను మురాసురాంతకుఁడఁ గాఁ బ్రద్యుమ్నుఁడం గాను నేఁ
[1]దెలియం దత్తనయుండఁ గా నని విరోధి వ్రాతముల్ భీషణో
జ్జ్వల గాండీవధను ర్విముక్త నిశితాస్త్ర శ్రేణిచేఁ బిస్సుపెం
టలు గావించు పరాక్రమ ప్రకట చండస్ఫూర్తి నేఁ బార్థుఁడన్. 1283

వ. అదియునుం గాక. 1284

చ. బలిమిఁ బురాంతకుం దొడరి బాహువిజృంభణ మొప్ప నెక్కటిన్
దలపడి పోరునట్టి రణధైర్యుని నన్ను నెఱుంగ వక్కటా!
బెలుకుల మృత్యుదేవతను బింక మణంచి భవత్తనూజుల
న్నలవు చలంబు చూపి కొనియాడఁగ నిప్పుడె తెచ్చి యిచ్చెదన్. 1285

వ. అని నమ్మం బలికిన యర్జును ప్రతిజ్ఞకు భూసురుండు మనంబున నూఱడిల్లి, యతని నభినందించుచు, నిజమందిరంబునకుం జని, కొన్నిదినంబు లుండు నంతం, దనభార్యకుఁ బ్రసూతివేదనా సమయం బయినం, జనుదెంచి, విన్వచ్చుం గని, తద్విధం బెఱింగించిన, న య్యింద్రతనయుం డప్పుడు. 1286

చ. లలిత విశిష్ట సంచితజలంబుల నాచమనంబు చేసి సు
స్థలమున నిల్చి రుద్రునకు సమ్మతి మ్రొక్కి మహాస్త్ర శస్త్ర ని
ర్మల శుభ మంత్రదేవతల మానసమందుఁ దలంచి గాండివం
బలవడ నెక్కు ద్రోచి బిగియం గదియించి నిషంగయుగ్మముల్. 1287

వ. ఇ వ్విధంబునఁ గట్టాయితం బై యప్పుడు. 1288

సీ. భూసురు వెంట నిమ్ముల నేఁగి సూతికా భవనంబు చుట్టును బాణవితతి
నరికట్టి దిక్కులు నాకాశపథము ధరాతలం బెల్ల నీరంధ్రముగను
శరపంజరముఁ గట్టి శౌర్యంబు దీపింపఁ గడు నప్రమత్తుఁ డై కాచియున్న
యెడ న మ్మహీసురు నింతికిఁ బుత్రుండు జనియించె నప్పు డచ్చటి జనంబు

1. తలపం దత్తనయుండఁగానని విరుద్ధ (హ)

తే. పోయెఁ బోయెఁ గదే యని బొబ్బ లిడఁగఁ
బొందెతోడన యాకాశమునకు మాయఁ
జెందె నప్పుడ దుఃఖంబు నొంది భూమి
సురుఁడు విలపింపుచును మురహారునికడకు. 1289

వ. చని. 1290

క. ముందట నిల్చి ముకుంద! స, నందనముని వినుత! నందనందన! పరమా
నంద! శరదిందు చందన, కుంద యశస్సాంద్ర! కృష్ణ! గోవింద! హరీ! 1291

వ. అవధరింపుము దేవా! యర్జునుం డనెడి పౌరుషవిహీనుం డాడిన వృథాజల్పంబులు నమ్మి, పుత్రుం గోలుపడి, బేలనైన నన్ను నేమందు? నిఖిల విశ్వోత్పత్తి స్థితి లయంబులకుఁ బ్రధానహేతుభూతుండ వైన నీవు, సమర్థుండ వయ్యు, వారింపం జాలక చూచుచుండ, నొక్క మనుష్యమాత్రుండు దీర్పం జాలెడువాఁడు గలఁడే? అని వెండియు. 1292

క. ఎక్కడి పాండుతనూభవుఁ, డెక్కడి విలుకాఁడు వీని కెక్కడి సత్త్వం
బెక్కడి గాండీవము దన, కెక్కడి దివ్యాస్త్ర సమితి యే మనవచ్చున్. 1293

క. అని తను నోడక నిందిం, చిన న య్యర్జునుఁడు చాలఁ జిడిముడి పడుచున్
దన [1]విద్యమహిమ పెంపునఁ, జని యెన్ వెస దండపాణి సదనంబునకున్ 1294

క. చని యందు ధారుణీసుర, తనయులు లేకుంటఁ దెలిసి తడయక యింద్రా
గ్ని నిరృతి వరుణ సమీరణ, ధన దేశా నాలయములు దగఁ బరికించెన్. 1295

వ. వెండియు. 1296

చ. నర సుర యక్ష కింపురుష నాగ నిశాచర సిద్ధ సాధ్య ఖే
చర విహగేంద్ర గుహ్యక పిశాచ నివాసములందు రోసి భూ
సురసుతు లేఁగినట్టి గతి చొప్పడకుండుటఁ జూచి క్రమ్మఱన్
ధరణికి నేఁగుదెంచి తెడిదంబుగ నగ్ని సొరంగఁ బూనినన్. 1297

వ. ఇ వ్విధం బంతయు నెఱింగి, య మ్మురాంతకుండు విప్రనందనుల నీకుం జూపెద. అని యనలంబు సొరకుండ నతని నివారించి, యప్పుడు. 1298

ఉ. సుందర దివ్య రత్నరుచి శోభిత మై తనరారు కాంచన
స్యందన మంబుజాప్తుఁ డుదయాచల మెక్కువిధంబు దోఁపఁ బౌ
రందరి దాను నెక్కి తనురశ్ములు దిగ్వితతిన్ వెలుంగ గో
విందుఁ డుదారలీలఁ జనె విప్రతనూజ గవేషణార్థి యై. 1299

1. దివ్యమహిమ (హ)

చ. చని పుర గోష్ఠ దుర్గ వన జానప దాచల పట్టణప్రభూ
త నద నదీ సరోవర యుత క్షితి నంతయు దాఁటి సప్తవా
రినిధుల దీవులం గులగిరిప్రకరంబుల నుత్తరించి మే
రునగము నాక్రమించుచు మరుద్గతితో రథ మేఁగె న త్తఱిన్. 1300

చ. మసలక భూరి సంతమస మండలముం దరియంగఁ జొచ్చి సా
హసమునఁ బోవఁ బోవఁగ భయంకర మై మది గోచరింపమిన్
వసమఱి మోఁకరిల్లి రథవాజులు మార్గము దప్పి నిల్చినన్
బిసరుహపత్రలోచనుఁ డభేద్య తమఃపటలంబు వాపఁగన్. 1301

సీ. బాలభాను ప్రభా భాసమానద్యుతిఁ గర మొప్పు నిజరథాంగంబుఁ బనుప
న మ్మహాస్త్రం బేఁగి చిమ్మచీఁకటి నెల్ల నఱిముఱి నందంద నఱికివైచి
యగ్రభాగంబున నతులితగతి నేఁగ నా మార్గమున నిజస్యందనంబుఁ
గడువడిఁ దోలి యా కడిఁది తమోభూమిఁ గడవ ముందఱఁ గడఁ గానరాక

తే. [1]మిక్కుటంబుగ దృష్టు మిర్మిట్లు కొనఁగఁ
జదల వెలుఁగొందు దివ్యతేజంబుఁ జూచి
మొనసి గాండీవి కన్నులు మూసికొనుచు
నాత్మ భయ మంది కొంతద వ్వరిగి యరిగి. 1302

తే. కడఁగి దుర్వార మారుతోత్కట విధూత
చటుల సర్వంకషోర్మి భీషణ గభీర
వారిపూరంబు సొచ్చి తన్నీరమధ్య
భాగమునఁ గోటిసూర్య ప్రభలు వెలుంగ. 1303

వ. అది మఱియునుం, జారు దివ్య మణిసహస్ర స్తంభాభిరామంబును, నాలంబిత కమనీయ నూత్న రత్నమాలికాలంకృతంబును, భాను శశి మయూఖాగమ్యంబును, ననంత తేజోవిరాజితంబును, బునరావృత్తిరహిత మార్గంబును, నిత్యైశ్వర్య దాయకంబును, నవ్యయంబును, నత్యున్నతంబును, ననూనవిభవంబును, బరమయోగీంద్ర గమ్యంబును, బరమభాగవత నివాసంబును నై, యొప్పు న ద్దివ్యధామంబునందు. 1304

సీ. సాంద్ర శరచ్చంద్ర చంద్రికా కర్పూర నీహార హారాభ దేహ మమర
నిందిందిరేందీవ రేంద్రనీలద్యుతిఁ గర మొప్పు మేచక కంఠసమితి
నరుణాంశుబింబ భాసుర పద్మరాగ విన్యస్త సహస్రోరు మస్తకములు
వివృతాననోద్గత విష ధూమరేఖల లీలఁ జూపట్టిన నాలుకలును

1. మిక్కుటం దృష్టులను మిఱిమిట్లు గొలిపి (హ)

తే. కలిత సాయంతన జ్వల జ్జ్వలనకుండ
ముల విడంబించు వేఁడిచూపులును గలిగి
భూరి కలధౌతగిరి నిభాకార మమరఁ
బరఁగు భోగీంద్ర భోగతల్పంబునందు. 1305

వ. సుఖాసీనుం డై యున్న వాని డాయంజని, యప్పుడు. 1306

సీ. సజల నీలాంబుద శ్యామాయమానాంగు సాశ్రితావన ముది తాంతరంగు
సనకాది యోగిహృ ద్వనజ [1]మదాళీంద్రు ముఖపద్మరుచి జిత పూర్ణచంద్రుఁ
గమనీయ నిఖిలజగద్ధిత చారిత్రుఁ బ్రత్యూష సంపుల్ల పద్మనేత్రు
నిందిరా హృదయారవిం దారుణోల్లాసు శ్రీకర పీత కౌశేయవాసు

తే. హార కుండల కటక కేయూర మకుట
కంక ణాంగద మణిముద్రికా వినూత్న
రత్ననూపుర కాంచీ విరాజమాను
భవ మహార్ణవ శోషు సద్భక్త పోషు. 1307

వ. మఱియు, సనందనాది మునిజన సంతతిసేవితు, నానందకందళిత హృదయార విందు, నరవిందవాసినీ వసుంధరాసుందరీ సమేతు, నారదయోగీంద్ర సంకీర్తనా నందితు, నవ్యయు, ననఘు, ననంతు, నప్రమేయు, నజితు, నవికారు, నాది మధ్యాంత రహితు, భవ లయాతీతుఁ, గరుణా సుధాసముద్రు, నచ్యుతు, మహాను భావుఁ, బరమపురుషుఁ, బురుషోత్తము, నిఖిల జగ దుత్పత్తి స్థితి లయకారణుఁ, జిద చి దీశ్వరు, నష్టభుజుఁ, గౌస్తుభ శ్రీవత్సవతు, శంఖ చక్ర గదా పద్మ శార్ఙ్గాది దివ్యసాధను, సర్వ శక్తిసేవితుఁ, బరమేష్ఠి జనకుం డగు నారాయణుం గనుంగొని, దండప్రణామంబులు సేసి, కరకమలంబులు మొగిచి, భక్తిపూర్వ కంబుగా నభినందించిన, న య్యాదిదేవుండును, వారలం గరుణావలోకనంబులు నిగుడ, నవలోకించి, దరహాసపూరంబు తోరంబుగా సాదరంబుగ ని ట్లనియె.

క. ధరణికి బ్రేఁ గగు దైత్యులఁ, బోరిఁబోరి వధియించి ధర్మముఁ నిలుపుటకై
ధర జనియించితి రిరువురు, నరనారాయణు లనంగ నా యంశమునన్. 1309

క. ఆరూఢ నియతితోఁ బెం, పారిన మిము ని మ్మునీంద్రు లందఱుఁ జూడం
గోరిన మీ వచ్చుట కై, ధారుణిసురసుతుల నిటకుఁ దగఁ దేవలసెన్. 1310

క. అని యా డింభకులను దో, కొనిపొం డని యిచ్చి వీడుకొలిపిన వారల్
వినతు లయి పెక్కు విధముల, వినుతింపుచు నచటు వాసి విప్రుని సుతులన్. 1311

1. మరాళీంద్రు (హ.)

వ. తోడ్కొని, సంప్రాప్త మనోరథు లై, య బ్బాలకులం ద త్త ద్వయోరూపంబుల తోడఁ దెచ్చి, యా బ్రాహ్మణునకు సమర్పించిన, నతండును, సంతుష్టాంతరంగుం డయ్యె. అ య్యవసరంబున. 1312

చ. అనిమిషనాథనందనుఁ డహర్పతితేజుఁడు కృష్ణుతోడఁ దాఁ
జని యచటం గనుంగొనిన సర్వశరణ్యుని పుండరీక నే
త్రుని నిజధామ వైభవ [1]సమృద్ధికిఁ దన్మహనీయ [2]మూర్తికిన్
మనమున మోద మంది పలుమాఱును సన్నుతి చేసె భూవరా! 1313

తే. వారిజాక్షుని భక్తమందారు ననఘుఁ
గృష్ణు నఖిలేశుఁ గేశవు జిష్ణుఁ బరము
వినుతి సేయుచుఁ దత్పాదవనజములకు
వందనము లాచరించి యానంద మొందె. 1314

వ. అంత. 1315

మ. హరి సర్వేశుఁ డనంతుఁ డాద్యుఁ డభవుం డామ్నాయసంవేది భూ
సుర ముఖ్యప్రజలన్ సమస్త ధన వస్తుశ్రేణి నొప్పారఁగా
బరిరక్షింపుచు ధర్మమున్ నిలుపుచున్ బాపాత్ములం ద్రుంచుచున్
బర మోత్సాహ మెలర్ప భూరి శుభ విభ్రాజిష్ణుఁ డై ద్వారకన్. 1316

క. జనవినుతముగాఁ బెక్కు స, వనములు దనుఁ దాన గూర్చి వైదికయుక్తి
న్నొనరింపుచు ననురాగము, మనమునఁ దళుకొత్త దైత్యమర్దనుఁ డెలమిన్. 1317

## అధ్యాయము - ౯౦

### —: లీలామానుషవిగ్రహుం డగు శ్రీకృష్ణుని వంశానుక్రమ వర్ణనము :—

వ. అట్లు కృష్ణుండు ద్వారకానగరంబునఁ బూజ్యం బగు రాజ్యంబు సేయుచుఁ, బురందర విభవంబున నిరవొంది, కనక మణిమయ విమాన మంటప గోపుర ప్రాసాద సౌధ చంద్రశాలాంగణాది వివిధ భవనంబులందును, రంగ దుత్తుంగ తరంగడోలా విలోల కలహంస చక్రవాక కారండవ సారస క్రౌంచముఖ జలవిహంగ విలస దుచ్చలిత గరు దనిల దర దమల కమల కుముద కల్హార సందోహ నిష్యంద మకరందరస పాన మదవ దిందిందిరకుల కలగాయక ఝంకార నినదంబులును, నిరంతర వసంతసమయ సముచిత పల్లవిత కోరకిత బాలరసాలజాల

1. సదున్నత తన్మహనీయకీర్తికిన్ (హ.)

లాలిత కిసలయవిసర ఖాదన జాత కుతూహలాయమాన కషాయకంఠ కలకంఠ కలరవ మృదంగఘోషంబులును, నిశిత నిజచంచూపుట నిర్దళిత సకలజన నయనానంద సుందర నందిత మాకంద పరిపక్వ ఫలరంధ్ర విగళిత మధుర రసాస్వాదన ముదిత రాజకీర శారికానికర మృదుమధుర వచనరచనావళ కృత్యంబులు, నమరఁ, బురంధ్రీజన పీన పయోధరమండల విలిప్త లలిత కుంకుమపంక సంకుల సౌగంధ్యానుబంధ బంధుర గంధానుమోదితుండును, జందనాచల సానుదేశ సంజాత మంజుల మాధవీలతా నికుంజపుంజ మంజుల కింజల్కరంజిత నివాసవిసర విహారమాణ శబరికా కబరికా పరిపూర్ణ సురభి కుసుమ మాలికా పరిమళవహుండును, గళిందకన్యకా కల్లోలసందోహ పరిస్పంద కందళిత మందగమనుండును, నగు మందానిల విదూషకునిచేఁ బోషి తాభ్యాసిత లాలిత లగు నేలాలతా వితాన నటుల నటనంబుల విరాజితంబు లగు కాసారతీర భాసు రోద్యానంబులందును, జారు ఘనసార పటీర బాలరసాల సాల నీప తాపింఛ జంబూ జంబీర నింబ కదంబ ప్రముఖ ముఖ్యశాఖ శాఖాకీర్ణ శీతలచ్ఛాయా విరచిత విమల చంద్రకాంతోపల వేదికాస్థలములందును, నుదంచిత పింఛవిభాసిత బాలనీలకంఠ కేకారవాకులీకృత కృతకమహీధరంబు లందును, లలిత మణివాలు కానేక పులినతలంబు లందును, గప్పురపుం దిప్పలను, గురువేరు చప్పరంబులను, విరచిత దారుయంత్ర నిబద్ధ కలశనిర్యత్ పయోధారా శీకరపరంపరా సంపాదిత నిరంతర హేమంత సమయ ప్రదేశంబులను, ఇందిరారమణుండు షోడశసహస్ర వధూయుక్తుం డై, యందఱు కన్నిరూపు లై, లలిత సౌదామినీలతా సమేత నీలనీరదంబు విడంబించుచుఁ, గరేణుకాకలిత దిగ్గజంబునోజ రాజిల్లుచు, సలిలకేళీ విహారంబులు మొద లైన లీలావినోదంబులు సలుపుచు, నంతఃపురంబునఁ గొలువున్న యవసరంబున, వివిధ వేణువీణాది వాద్యవినోదంబులను, మంజుగానంబులను, కవి గాయక సూత వంది మాగధ జనసంకీర్తనంబులను, నట నటీజన నాట్యంబులను, విదూషక పరిహాసోక్తులను, సరససల్లాప మృదుమధుర భాషణంబులను, బ్రొద్దు పుచ్చుచు, నానందరసాబ్ధి నోలలాడుచుండె. అంత. 1318

మ. అరవిందాక్షు పదాంబుజాత యుగళ ధ్యానానురాగ క్రియా
సరసాలాప విలోకనానుగత చంచత్సౌఖ్య కేళీరతిన్
దరుణుల్ నూఱుఁ బదాఱువేలు మహితోత్సాహంబునం జొక్కి త
త్పర లై యొండు దలంప కుండిరి సవిభ్రాంతాత్మ లై భూవరా! 1319

వ. అదియునుం గాక. 1320

మ. హరినామాంకిత మైన గీత మొకమా టాలించి మూఢాత్ములన్
విరతిం బొందఁగఁ [1]జాలి యుందు రఁట యా విశ్వాత్ము నీక్షింపుచున్
బరిరంభింపుచు నంటుచున్ నగుచు సంభాషింపుచు న్నుండు సుం
దరు లానంద నిమగ్న లౌట కిలఁ జోద్యం బేమి భూ వల్లభా ! 1321

వ. అని చెప్పి, మఱియు ని ట్లనియె. 1322

ఉ. వారక కృష్ణుఁ డి ప్పగిది వైదికవృత్తి గృహస్థధర్మ మే
పారఁగఁ బూని ధర్మమును నర్థముఁ గామము నందుఁ జూపుచున్
గోరిక మీఱ సజ్జనులకుం గతి దాన యనంగ నొప్పి సం
సారిగతిన్ మెలంగె నృపసత్తమ ! లోకవిడంబనార్థ మై. 1323

సీ. హరి యిట్లు గృహమేధి యగుచు శతోత్తర షోడశసాహస్ర సుందరులను
మును నీకు నెఱుఁగఁ జెప్పినరీతి నందఱ కన్ని రూపములు దా నర్థిఁ దాల్చి
కైకొని యొక్కొక్క కామినీమణియందు రమణ నమోఘ వీర్యమునఁ జేసి
పదురేసి కొడుకులం బడసె రుక్మిణ్యాది పట్టమహిషులకు నుద్భవులు నైన

తే. నందనులలోన ధరణి నెన్నంగ బాహు
బలపరాక్రమ విజయసంప ద్విశేష
మానితాత్ములు పదునెనమండ్రు వారి
నెఱుఁగ వినుపింతు వినుము రాజేంద్రచంద్ర ! 1324

వ. అని యి ట్లను. వారలు ప్రద్యుమ్న, అనిరుద్ధ, దీప్తిమత్. భాను, సాంబ, [2]మిత్ర, బృహద్భాను, మిత్రవింద, వృక, అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునందన, చిత్రభాను, వరూథ, కవి, న్యగ్రోధు లను నామంబులం బ్రసిద్ధు లైరి. వెండియుం, త్రివక్రయందు సంభవించిన యుపశ్లోకుం డనువాఁడు, తన జనకుం డైన కృష్ణు పాదారవింద సేవారతుం డగుచు, నారదయోగీంద్రునకు శిష్యుం డై, యఖండిత దివ్యజ్ఞాన బోధాత్ముం డై, స్త్రీ శూద్ర దాసజన సంస్కారం బై, స్మరణ మాత్రంబున ముక్తి సంభవించునట్టి సాత్త్వత తంత్రం బను వైష్ణవ స్మృతి గల్పించె. ఇట్లు మధుసూదన నందనులు బహుప్రజలును, నధి కాయు రున్నతులును, ననల్ప వీర్యవంతులును, [3]బ్రహ్మణ్యులు నయి, విఖ్యాతిం బొందిరి.

---

1. జాలకుందురఁట (తం.) 2. ఈ పేరు తం వా. ప్రతులలో లేదు. అందువలన సంఖ్య తగ్గినది. 3. అబ్రహ్మణ్యులు (వా)

వారిని లెక్కవెట్టఁ బదివేల వత్సరంబుల కయినం దీఱదు. మున్ను నీ కెఱింగించి నట్లు, తత్కుమారులకు విద్యావిశేషంబులు నియమించు గురుజనంబులు మూఁడు కోట్లు నెనుబదెనిమిదివేలును నూర్గు రనం గలిగి యుందురు. ఆ కుమారుల లెక్కింప నెవ్వరికిని వశంబుగాదు. అదియునుం గాక.

క. నరవర ! దేవాసుర సం, గరమున మును నిహతు లైన క్రవ్యాద సము
త్కరము నరేశ్వరు లై ద్వా, పరమున జనియించి ప్రజల బాధలఁ బఱుపన్.

క. హరి తద్వధార్థ మై ని, ర్జరులను యదుకులమునందు జనియింపింపం
ధర నూటొక్క కులం బై, పరఁగిరి వారిని గణింప బ్రహ్మకు వశమే !

వ. అట్టి యన్వయంబునందు మాధవునకు రుక్మిణీదేవియందుఁ బితృసముండునుం సమగ్రభుజా విజృంభణుండును నై, ప్రద్యుమ్నుండు జనియించె. అతనికి రుక్మి కూఁతు రగు శుభాంగివలన ననిరుద్ధుం డుదయించె. అతనికి మౌసలావశిష్టుం డైన [1]వజ్రుండు సంభవించె. అతనికిఁ బ్రతిబాహుండు వుట్టె. వానికి సుబాహుండు జన్మించె. అతనికి నుగ్రసేనుండు ప్రభవించె. అతనికి [2]శతసేనుండు గలిగె. ఇట్లు యదు వృష్ణి భోజాంధక వంశంబులు పరమపవిత్రంబు లై, పుండరీకాక్షుని కటాక్షవీక్షణ శయ్యాస నాసుగత సరసాలాప స్నానాశన క్రీడావినోదంబుల ననిశంబునుం జెందుచు, సర్వదేవతార్థంబు సమస్తం బైన క్రతువు లొనరింపుచుఁ, బరమానంద కందళిత చిత్తు లై రి. అని చెప్పి, వెండియు.

మ. పరమోత్సాహముతోడ మాధవుఁడు శుంభల్లీలఁ బూరించు న
మ్మురళీగానము వీనులం జిలికినన్ మోదించి గోపాల సుం
దరు లేతెంతు రరణ్యభూములకుఁ దద్దాస్యంబుఁ గావించి త
త్కరుణావార్ధి భజింపకుందురె బుధుల్ కౌరవ్యవంశాగ్రణీ !

మ. మతి నెవ్వాని యమంగళఘ్న మగు నామం బర్థిఁ జింతించినన్
నుతి గావించిన విన్న మానవులు ధన్యుల్ భూరి సంసార దు
ష్కృతులన్ ద్రోతురు కాలచక్ర [3]మహితాసిం బట్టి యాకృష్ణుఁ డీ
క్షితిభారం బుడుగంగఁ జేయు టిది యే చిత్రంబు భూవల్లభా !

వ. ఇవ్విధంబునం గోపికాజన మనోజాతుం డైన కృష్ణుండు లీలామానుషవిగ్రహుం డై, నిజ రాజధాని యైన ద్వారకాపురంబున నమానుషవిభవంబు లగు సౌఖ్యాం బులను బొదలుచుండె. అని చెప్పి, మఱియు నిట్లనియె.

---

1. ప్రజుఁడు (వా) 2. శ్రుతసేనుఁడు (తం. వా.) 3. మహితాస్త్రం బట్టి యా (తం. వా.)

మ. మనుజేంద్రోత్తమ! యేను నీకుఁ ద్రిజగన్మాంగల్యమై యొప్పఁ జె
ప్పిన యీ కృష్ణకథా సుధారసము సంప్రీతాత్ములై భక్తిఁ గ్రో
లిన పుణ్యాత్ములు గాంతు రిందు సుఖముల్ నిర్ధూత సర్వాఘులై
యనయంబుం దుదిఁ గాంతు రచ్యుతపదం బైనట్టి కైవల్యమున్. 1332

క. అని యిట్లు బాదరాయణి, మనమున రాగిల్ల నాభిమన్యునకుం జె
ప్పినవిధమున సూతుఁడు ముని, జనుల కెఱింగింప వారు సమ్మతితోడన్. 1333

క. సూతుని బహువిధముల సం, ప్రీతునిఁ గావించి మహిమఁ బెంపారుచు వి
ఖ్యాతికి నెక్కిన కృష్ణ క, థాతత్పరులైరి బుద్ధిఁ దఱుఁగని భక్తిన్. 1334

చ. సరసిజపత్రనేత్ర! రఘుసత్తమ! దుష్టమదాసురేంద్ర సం
హరణ! దయాపయోధి! జనకాత్మజ వానన పద్మ మిత్ర! భా
స్కరకుల వార్ధిచంద్ర! మిహికావసుధాధర [1]సూతి సన్నుత
స్ఫురితచరిత్ర! భక్తజనపోషణ భూషణ! పాపశోషణా! 1335

క. మారీచ భూరిమాయా, నీరంధ్ర మహాంధకార నీరేజహితా!
శ్మారమణ వినుత పాదాం, భోరుహమహితావతార! పుణ్యవిచారా! 1336

మాలిని. శరధిమద విరామా! సర్వలోకాభిరామా!
సురరిపు విషభీమా! సుందరీ లోక కామా!
ధరణివర లలామా! తాపస స్తోత్రసీమా!
సురుచిర గుణధామా! సూర్యవంశాబ్ధిసోమా! 1337

గద్య. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన, శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబునందుఁ బ్రద్యుమ్ను జన్మంబును, శంబరోద్యోగంబును, సత్రాజిత్తునకు సూర్యుండు స్యమంతకమణి నిచ్చుటయుఁ, దన్నిమిత్తంబునం బ్రసేనుని సింహంబు వధించుటయు, దాని జాంబవంతుండు దునిమి, మాణిక్యంబుఁ గొని పోవుటయు, గోవిందుండు ప్రసేనునిం దునిమి, మణి గొనిపోయె నని, సత్రాజిత్తుండు కృష్ణునందు నింద నారోపించుటయుఁ, గృష్ణుండు తన్నిమిత్తంబున జాంబవంతునిఁ దొడరి, మణియుక్తంబుగా జాంబవతిం గొనివచ్చి, వివాహం

1. జేశ (హ.)

బగుటయు, సత్రాజిత్తునకు మణి నిచ్చుటయు, సత్యభామా పరిణయంబును, పాండవులు లాక్షా గృహంబున దగ్ధులైరని విని వాసుదేవుండు బలభద్ర సహితుండై హస్తినాపురంబున కరుగుటయు, నక్రూర కృతవర్మానుమతంబున శతధన్వుండు సత్రాజిత్తుం జంపి మణి గొనిపోవుటయుఁ, దదర్థంబా సత్యభామ కరినగరంబున కేఁగి కృష్ణునకు విన్నవించిన నతండు మరలి చనుదెంచి శతధన్వునిం ద్రుంచుటయు, బలభద్రుండు మిథిలానగరంబునకుం జనుటయు, నందు దుర్యోధనుండు రాముని వలనం గదావిద్య నభ్యసించుటయుఁ, గృష్ణుండు సత్రాజిత్తునకుం బరలోకక్రియలు నడపుటయు, స్యమంతక మణి దాఁచినవాఁడై, యక్రూరుండు భయంబునం ద్వారకానగరంబు విడిచి పోయిన నతనిలేమి ననావృష్టి యైనం గృష్ణుం డక్రూరుని మరల రప్పించుటయు, దామోదరుం డింద్రప్రస్థ పురంబున కరుగుటయు, నం దర్జున సమేతుండై మృగయావినోదార్థం బరణ్యంబునకుం జని, కాళిందిం గొని వచ్చుటయు, ఖాండవ దహనంబును, నగ్నిపురుషుం డర్జునునకు నక్షయ తూణీర గాండీవ కవచ రథ రథ్యంబుల నిచ్చుటయు, మయుండు ధర్మరాజునకు సభ గావించి యిచ్చుటయు, నగధరుండు మరలి నిజ నగరంబున కరుగుదెంచి కాళిందిని వివాహం బగుటయు, మిత్రవిందా నాగ్నజితీ భద్రా మద్రరాజ కన్యలం గ్రమంబున వరియించుటయు. నరకాసుర యుద్ధంబును, దద్గృహంబున నున్న రాజకన్యలం బదాఱువేలం దెచ్చుటయు, స్వర్గగమనంబును, నదితికిం గుండలంబుల నిచ్చుటయుఁ, బారిజాతాపహరణంబును, బదాఱువేల రాజ కన్యలం బరిణయం బగుటయు, రుక్మిణీదేవి విప్రలంభంబును, రుక్మిణీ స్తోత్రంబును, గృష్ణకుమారోత్పత్తియుఁ, దద్గురుజన సంఖ్యయుఁ, బ్రద్యుమ్న వివాహంబును, ననిరుద్ధ జన్మంబును, ద ద్వివాహార్థంబు కుండిన పురంబునకుం జనుటయు, రుక్మి బలభద్రుల జూదంబును, రుక్మి వధయును, నుషాకన్య యనిరుద్ధుని స్వప్నంబునం గని మోహించుటయుఁ, దన్నిమిత్తంబునఁ జిత్రరేఖ సకల దేశరాజులను బటంబున లిఖించి చూపి యనిరుద్ధునిఁ దెచ్చుటయు, బాణాసుర యుద్ధంబును, నృగోపాఖ్యానంబును, బలభద్రుని ఘోషయాత్రయు, కాళిందీ భేదనంబును, కృష్ణుండు పౌండ్రక వాసుదేవ కాశీరాజుల వధియించుటయుఁ, గాశీరాజ పుత్రుం డయిన సుదక్షిణుం డభిచారహోమంబు వేల్చి, కృత్యం బడసి, కృష్ణుపాలికిం బుత్తెంచిన, సుదర్శనంబుచేతఁ గృత్యను సుదక్షిణ సహితంబుగాఁ గాశీపురంబును భస్మంబు సేయుటయు, బలభద్రుండు రైవత నగంబునందు ద్వివిదుం డను వనచరుని వధియించుటయు, సాంబుండు దుర్యో

ధను కూఁతు రగు లక్షణ నెత్తికొని వచ్చినఁ, గౌరవు లతనిఁ గొనిపోయి చెఱం బెట్టుటయుఁ, దద్వృత్తాంతం బంతయు నారదువలన విని, బలభద్రుండు నాగనగరంబునకుం జనుటయుఁ, గౌరవు లాడిన యగౌరవ వచనంబులకు బలభద్రుండు కోపించి, హస్తిపురంబు గంగం బడఁద్రోయం గమకించుటయుఁ, గౌరవులు భయంబున నంగనాయుక్తంబుగా సాంబునిం దెచ్చి సమర్పించు టయు, బలభద్రుండు ద్వారకానగరంబునకు వచ్చుటయు, నారదుండు హరి పదాఱువేల కన్యకల నొక ముహూర్తంబున నందఱ కన్నిరూపు లై వివాహం బయ్యెనని విని తత్ప్రభావంబు దెలియం గోరి యరుగుదెంచుటయుఁ, దన్మాహాత్మ్యంబు సూచి మరలి చనుటయు, జరాసంధునిచేత బద్ధు లయిన రాజులు కృష్ణునిపాలికి దూతం బుత్తెంచుటయు, నారదాగమనంబును, బాండవుల ప్రశంసయును, నుద్ధవ కార్యబోధంబును, నింద్రప్రస్థాగమనంబును, ధర్మరాజు సేయు రాజసూయారంభంబును, దిగ్విజయంబును, జరాసంధ వధయును, రాజబంధ మోక్షణంబును, రాజసూయంబు నెఱవేర్చుటయును, శిశుపాల వధయును, నవభృథంబును, రాజసూయ వైభవదర్శ నాసహమాన మానసుం డై, సుయోధనుండు మయనిర్మిత సభామధ్యంబునం గట్టిన పుట్టంబులు దడియం ద్రెళ్ళుటయును, ద న్నిమిత్త పరిభవంబు నొంది రారాజు నిజపురి కరుగుటయుఁ, గృష్ణుండు ధర్మరాజ ప్రార్థితుం డై, యాదవుల నిలిపి, కొన్ని నెలలు ఖాండవ ప్రస్థంబున వసియించుటయు, సాళ్వుండు తపంబుచేసి, హరుని మెప్పించి, సౌభకాఖ్యం బగు విమానంబు వడసి, నిజ సైన్య సమేతుం డయి, ద్వారకానగరంబు నిరోధించుటయు, యాదవ సాళ్వ యుద్ధంబును, గృష్ణుండు మరలి చనుదెంచి, సాల్వుం బరిమార్చుటయు, దంతవక్త్ర వధయును, విదూరథ మరణంబును, గృష్ణుండు యాదవ బలసమేతుం డయి, క్రమ్మఱ నిజపురంబునకుం జనుటయుఁ, గౌరవపాండవులకు యుద్ధం బగు నని బలదేవుండు తీర్థయాత్ర చనుటయు, నందు జాహ్నవీ ప్రముఖ నదులం గృతస్నానుం డై, నైమిశారణ్యంబునకుం జనుటయు, నచ్చటి మునులు పూజింపం బూజితుం డయి, తత్సమీపంబున నున్నతాసనంబున నుండి సూతుండు దన్నుం గని లేవకుండిన, నలిగి, రాముండు కుశాగ్రంబున నతని వధియించుటయు, బ్రహ్మహత్యా దోషంబు గలిగె నని మునులు పలికిన,

సూతుం బునర్జీవితుం జేయుటయు, న మ్మునులకుం బ్రియంబుగా కామపాలుం డిల్వల సుతుం డగు పల్వలుం బరిమార్చుటయు, వారిచేత ననుమతుం డై హాలధరుండు తత్సమీప తీర్థంబుల స్నాతుం డయి గంగాసాగర సంగమంబు నకుం జనుటయు, మహేంద్ర నగ ప్రవేశంబును, బరశురామ దర్శనంబును, సప్తగోదావరిం గ్రుంకుటయును, మఱియు, మధ్యదేశమందుఁ గల తీర్థంబు లాడి, శ్రీశైల వేంకటాచలంబులు దర్శించుటయు, వృషభాద్రి హరిక్షేత్ర సేతుబంధ రామేశ్వరములం గని, తామ్రపర్ణి తీర్థంబు లాడుటయును, గోదా నంబు లొనరించి, మలయ గిరియందు నగస్త్యునిం గనుటయు, సముద్ర కన్యా దుర్గాదేవుల నుపాసించుటయు, నందు బ్రాహ్మణ జనంబువలనం బాండవ ధార్తరాష్ట్ర ఖండనంబున సకల రాజలోకంబును మృతిఁ బొంది రని వినుటయు, వాయునందన సుయోధనులు గదాయుద్ధ సన్నద్ధు లగుట విని, వారి నివారించుట కై రౌహిణేయుం డందుల కరుగుటయు, నచట వారిచేతం బూజితుం డై, వారిని వారింపలేక, మగిడి, ద్వారక కరుగుటయుఁ, గొన్ని వాసరంబులకు మరల నైమిశారణ్యంబునకుం బోయి యచట యజ్ఞంబు నుం జేసి, రేవతియునుం, దానును నవభృథంబాడి నిజపురంబున కేతెంచుటయుఁ, గుచేలోపాఖ్యానంబును, సూర్యోపరాగంబునఁ గృష్ణుండు రామునితోఁ జేరి పురరక్షణంబునకుం బ్రద్యుమ్నాది కుమారుల నిలిపి, షోడశ సహస్రాంగనాపరి వృతుం డై, యక్రూర వసుదే వోగ్రసేనాది యాదవవీరులు దోడరా, శమంత పంచక తీర్థంబున కరిగి, కృతస్నానుం డై, వసించియుండుటయుఁ, బాండవ కౌరవాది సకల రాజలోకంబునుం ద త్తీర్థంబునకు వచ్చుటయుఁ, గుంతీదేవి దుఃఖంబును, నందయశోదా సహితు లై గోప గోపికాజనంబులు చనుదెంచు టయుఁ, గుశల ప్రశ్నాది సంభాషణంబులును, మద్రకన్యా ద్రౌపదీ సంభాష ణంబును, దదనంతరంబ సకల రాజలోకంబును శమంతపంచక తీర్థంబుల స్నాతు లై, రామకృష్ణాది యాదవవీరుల నామంత్రణంబు చేసి, నిజదేశంబులకుం బోవు టయుఁ, గృష్ణుని దర్శించుటకు మునీంద్రు లేతెంచుటయు, వారి యనుమతిని వసుదేవుండు యాగము నెఱవేర్చుటయు, నంద యశోదాది గోపికా నివ హంబుల నిజపురంబున కనిచి, యుగ్రసేనాది యాదవవీరులుం దానును మాధవుండు నిజపురప్రవేశం బగుటయుఁ, దొల్లి కంసునిచేత హతు లై బలి పురంబున నున్న దేవకీదేవి సుతుల రామకృష్ణులు యోగమాయా బలంబునఁ దెచ్చి యామెకు నిచ్చుటయు, నర్జునుండు సుభద్రను వివాహం బగుటయుఁ, గృష్ణుండు మిథిలానగరంబున కరుగుటయు, శ్రుతదేవ జనకుల చరిత్రంబును,

వారలతో బ్రాహ్మణప్రశంస చేయుటయుఁ, గృష్ణుండు మరలి తనపురంబున కరుగుటయు, శ్రుతిగీతలును, హరి హర బ్రహ్మల తారతమ్య చరిత్రంబును, గుశస్థలి నుండు బ్రాహ్మణుని చరిత్రంబును, నతని తనయులు పరలోకంబునకుం బోయినఁ, గృష్ణార్జునులు తమ యోగబలంబున వారిం దెచ్చి, య విప్రున కిచ్చుటయుఁ, గృష్ణుం డర్జును వీడ్కొని, ద్వారక కరుగుటయు, నందు మాధవుం డయ్యా ప్రదేశంబుల సకల భార్యాపరివృతుం డై విహరించుటయు, యాదవ వృష్ణి భోజాంధక వంశచరిత్రంబును, నను కథలు గల దశమస్కంధంబునందు నుత్తరభాగము సంపూర్ణము.

కుర్వంతి కేఽపి కృతినః క్వచిద ప్యనంతే
స్వాంతం విధాయ విషయాంతరశాంతి మేవ
త్వ త్పాదపద్మవిగళ న్మకరందబిందు
మాస్వాద్య మాద్యతి మహు ర్మధుభి న్మనో మే.

వంశీవిభూషితకరా న్నవనీరదాభాత్
పీతాంబరా దరుణబింబఫలాధరోష్ఠాత్
పూర్ణేందుసుందరముఖా దరవిందనేత్రాత్
కృష్ణా త్పరం కి మపి త త్త్వ మహం న జానే.

గూఢార్థదీపిక – మధుసూదనసరస్వతి.

ఓమ్

# శ్రీ మ హా భా గ వ త ము

↔

## ఏ కా ద శ స్కం ధ ము

క. $శ్రీ సీతాపతి! లంకే, శాసురసంహార చతుర! శాశ్వతనుత వా
ణీ సత్యధిభూ భవ వృ, త్రాసురరిపు దేవజాల! రామనృపాలా! 1

వ. మహనీయ గుణగరిష్ఠు లగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం డైన సూతుం డి ట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డయ్యా జన్మ కర్మ వ్యాధి విమోచనంబునకుం గారణం బగు దివ్యౌషధంబు గావున, శ్రీమన్నారాయణ కథామృతంబు గ్రోలు మని యి ట్లనియె. 2

### అధ్యాయము - ౧

—: ఋషిశాపంబున ముసలం బుద్భవించుట :—

మ. బలవత్సైన్యముతోడఁ గృష్ణుఁడు మహా బాహాబలోపేతుఁ డై
కలనన్ రాక్షస వీరవర్యుల వడిన్ *ఖండించి భూభార ము
జ్జ్వల మై యుండఁగ నక్షకేళి కతనన్ [1]గౌరవ్యు తోడ్తోన త
ద్బలముల్ పాండవసైన్యము న్నడచె భూభాగంబు కంపింపఁగన్. 3

వ. అంత. 4

క. మునివరులు సంతసిల్లిరి, యనయము నందాదులకును హర్షం బయ్యెన్
దన నిజ భక్తులు యాదవ, ఘన వీర సమూహ మపుడు గడు నొప్పెసఁగెన్. 5

మ. విదితుం డై సకలామరుల్ గొలువ నుర్వీభారమున్ మాన్పి దు
ర్మదసంయుక్త వసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులన్
దుదిముట్టన్ వధియించి కృష్ణుఁ డతిసంతుష్టాత్ముఁ డై యున్నచో
యదుసైన్యంబులు భూమి మోవఁగ నసహ్యం బయ్యె [2]నత్యుగ్ర మై. 6

---

$ క. శ్రీ సీతావల్లభ! లం, కాసుర సంహార! దేవతారాధిత! వా
ణీపతి కరుణార్చిత! వృ, త్రాసుర మదహరణ! వినుము రామనృపాలా! (క. చ.)

* ఖండించె (?) 1. జావంగఁ గౌరవ్యసత్ (తం. వా.) 2. నత్యున్నతిన్ (హ)

సీ. ఈరీతిఁ గృష్ణుండు నేపారఁ బూతనా శకట తృణావర్త సాల్వ వత్స
చాణూర ముష్టిక ధేను ప్రలంబక ద్వైత్యాఘ శిశుపాల దంతవక్త్ర
కంస పౌండ్రాదిక ఖండనం బొనరించి యటమీఁదఁ గురుబలం బణఁచి మఱియు
ధర్మజు నభిషిక్తుఁ దనరఁగాఁ జేసిన నతఁడు భూపాలనం బమరఁ జేసె.

తే. భక్తు లగు యాదవేంద్రులఁ బరఁగఁ జూచి
యన్యపరిభవ మెఱుఁగ రీ యదువు లనుచు
వీరిఁ బరిమార్ప నేఁ దక్క వే ఱొకండు
దైవ మిఁక లేదు త్రిభువనాంతరమునందు. 7

వ. అని వితర్కించి, జగదీశ్వరుండు, డత్యున్నత వేణుకాననంబు వాయువశంబున నొఱసి కొన, ననలం బుద్భవం బై దహించుచందంబున, యదుబలంబుల కన్యోన్య వైరానుబంధంబులు గల్పించి, హతం బొనర్చెద నని, విప్రశాపంబు మూల కారణంబుగాఁ దలంచి, యదుబలంబుల నడంచె. అని పలికిన, ముని వరునకు రాజేంద్రుం డి ట్లనియె. 8

క. హరి పాదకమల సేవా, పరు లగు యాదవుల కెట్లు బ్రాహ్మణ శాప
స్ఫురణంబు సంభవించెనో, యరయఁగ సంయమివరేణ్య! యానతి యీవే. 9

క. అనిన జనపాలునకు ని, ట్లని సంయమికుల వరేణ్యుఁ డతిమోదముతో
విను మని చెప్పఁగఁ దొణఁగెను, ఘనతర గంభీర వాక్ప్రకాశ స్ఫురణణ. 10

## —:విశ్వామిత్ర వసిష్ఠ నారదాదులు శ్రీకృష్ణ దర్శనమునకు వచ్చుట:—

వ. నిరుపమ సుందరం బైన శరీరంబు ధరియించి, సమస్త కర్మతత్పరుం డై, పరమేశ్వరుండు, యదువుల నడంగింపం దలంచు సమయమున, జటా వల్కల కమండలు ధారులును, రుద్రాక్ష భూతి భూషణముద్రా ముద్రితులును, కృష్ణాజి నాంబరులును, నగు విశ్వామిత్రాసిత కణ్వ దుర్వాసో భృ గ్వాంగిరః కాశ్యప వామదేవ వాలఖి ల్యాత్రి వసిష్ఠ నారదాది మునివరులు స్వేచ్ఛా విహారంబున ద్వారకానగరంబున కరుగుదెంచి, యందు. 11

సీ. ఘనుని శ్రీకృష్ణునిఁ గౌస్తుభాభరణునిఁ గర్ణకుండల యుగ్మ ఘనకపోలుఁ
బుండరీకాక్షు నంభోధరశ్యామునిఁ గలిత నానారత్న ఘన కిరీటు
నాజానుబాహు నిరర్గళాయుధహస్తు శ్రీవత్సుఁ బీత కౌశేయవాసు
రుక్మిణీ నయనసరోజ దివాకరు బ్రహ్మాది సురసేవ్య పాదపద్ము

తే. దుష్టనిగ్రహ శిష్ట సంతోషకరుణుఁ
గోటిమన్మథ లావణ్య కోమలాంగు
నార్తజన రక్షణైక విఖ్యాతచరితుఁ
గనిరి కరుణాసముద్రుని ఘనులు మునులు. 12

క. వచ్చిన మునిసంఘములకు, విచ్చలవిడి నర్ఘ్య పాద్య విధు లొనరింపన్
మెచ్చగు కనకాసనముల, నచ్చుగఁ గూర్చుండి వనరుహాక్షునితోడన్. 13

క. జనములు నిను సేవింపని, దినములు వ్యర్థంబు లగుచుఁ దిరుగుచునుండున్
దనువులు నిలుకడ గా వఁట, వనములలో నున్ననైన వనరుహనాభా! 14

క. తరణంబులు భవజలధికి, హరణంబులు దురితలతల కాగమముల కా
భరణంబు లార్తజనులకు, శరణంబులు నీ పదాబ్జ [1]సంస్మరణంబుల్. 15

మత్తకోకిల. ఒక్కవేళను సూక్ష్మరూపము నొందు దీ వణుమాత్ర మై
యొక్కవేళను స్థూలరూపము నొందు దంతయు నీవ యై
పెక్కు రూపులుఁ దాల్తు నీదగు పెంపు మాకు నుతింపఁగా
నక్కజం బగుచున్న దేమన నంబుజాక్ష! రమాపతీ! 16

క. శ్రీనాయక! నీ నామము, నానా భవరోగ [2]దుఃఖ నాశమునకు వి
న్నాణం బగు నౌషధ మిది, గానరు దుష్టాత్ము లకట! కంజదళాక్షా! 17

వ. అని, యనేకవిధంబులం బ్రస్తుతించిన, మునివరులం గరుణాకటాక్ష వీక్షణంబుల నిరీక్షించి, పుండరీకాక్షుం డి ట్లనియె. మదీయ ధ్యాన నామస్మరణంబులు భవ రోగ హరణంబులును, బ్రహ్మ రుద్రాది శరణంబులును, మంగళ కారణంబు లును నగు. అని మఱియు, నా రూపంబు లయిన మేదినీసురుల పరితాపం బపహరించు పురుషుల నైశ్వర్య సమేతులఁ గాఁ జేయుదు. అని యోగీశ్వరే శ్వరుం డానతిచ్చి, యనంతరంబు మీర లిచ్చటికి వచ్చిన ప్రయోజనం బేమి? అనిన, వారలు భవదీయ పాదారవింద సందర్శనార్థంబు కంటె మిక్కిలి విశేషం బొం డెద్ది? అని, వాసుదేవ వదనాబ్జామృతంబు నిజనేత్రచకోరంబులం గ్రోలి, యథేచ్ఛావిహారు లై, ద్వారకానగరంబున కనతిదూరంబున నుండు పిండారకం బను నొక్క పుణ్యతీర్థంబున కరిగిరి. అంత. 18

క. దర్పించి యాదవులు దమ, నేర్పునఁ గొమరారు సాంబు నెలతుకరూపం
బేర్పడ [3]శృంగారించుక, కర్పూర సుగంధిపోల్కిఁ గావించి రొగిన్. 19

---

1. సేవానిరతుల్ (హ) 2. కర్మ (హ) 3. శృంగారించియు (తం. వా.)

ఉ. మూఁకలుగూడి యాదవులు ముందటఁ బెట్టుక యార్చి నవ్వుచున్
బోకలఁ బోవుచున్ మునిసమూహము కొయ్యన సాఁగి మ్రొక్కుచున్
బ్రాకట మైన యీ సుదతి భారపు గర్భమునందుఁ బుత్రుఁడో
యేకతమందు [1]బాలికయొ యేర్పడఁ జెప్పుఁ డటన్న నుగ్రు లై. 20

క. యదు డింభకులను గనుఁగొని, మదయుతు లై వచ్చి రనుచు మదిలో రోషం
బొదవి కనుఁగొనల నిప్పులు, సెదరఁగ హాస్యంబు చను నె చేయఁగ ననుచున్. 21

క. వాలాయము యదుకుల ని, ర్మూలకరం బయినయట్టి ముసలం బొక టీ
బాలిక కుదయించును బొం, డాలస్యము లే దటంచు [2]నట పల్కుటయున్. 22

వ. మదోద్రేకు లయిన యాదవబాలకులు మునిశాప భీతు లై, వడవడ వడంకుచు, సాంబ కుక్షి నిబద్ధ చేలగ్రంథి విమోచనంబు చేయు సమయంబున, ముసలం బొకటి భూతల పతితం బైన, విస్మయంబు నొంది, దానిం గొని చని, దేవకీ నందను సన్నిధానంబునం బెట్టి, యెఱింగించిన,నతం డాత్మ కల్పిత మాయారూపం బగుట నెఱింగియు, నెఱుంగని విధంబున వారలం జూచి యి ట్లనియె. 23

క. మది చెడి కన్నుం గానక, మదయుతు లై [3]మునులఁ గల్ల మాటలఁ [4]జెనయం
గదిసి కులక్షయ [5]కారణ, విదితం బగు శాప మొందు వెఱ్ఱులుఁ గలరే? 24

క. ధరణీసుర శాపమునకు, హరి హర బ్రహ్మాదు లైన నడ్డము గలరే
నరు లనఁగ నెంతవారలు, కర మరుదుగఁ బూర్వజన్మ కర్మముఁ ద్రోవన్.

వ. అది గావున, యతినిందా పరత్వంబున యదువంశనాశంబగు. సందియంబులేదు. అని పరమేశ్వరుండు వారలం జూచి, సముద్రతీరంబున నొక మహాపర్వతం బున్నది. అందు నుండు నత్యుచ్ఛ్రయ విశాల భీషణం బగు పాషాణంబున మీ భుజాబలంబు చేత నీ ముసలంబుఁ దివిచి, దీని చూర్ణంబు మహార్ణవ కబంధంబులఁ గలిపి రండు. పొండు. అని, జగద్విభుం డైన కృష్ణుం డానతిచ్చిన, వారును నట్ల చేసి, తత్కలితం బైన లోహఖండంబును సరకుగొనక, సాగరంబునం బడవైచిన, నొక్క ఝషకంబు గ్రసించిన, దాని నొక్క లుబ్ధకుండు, జాలమార్గంబునఁ బట్టికొని, తదుదరగతం బైన లోహఖండంబుఁ దెచ్చి, బాణాగ్రంబున ముల్కిగా నొనర్చె. అనియు దత్కథా వృత్తాంతంబు సెప్పినఁ, బాదరాయణిం గనుంగొని, రాజేంద్రుం డి ట్లనియె. 28

---

1. బాలికయొ (తం. వా.) 2. నని పల్కుటయున్ (హ) 3. మీరు (హ)
4. మునులన్ (హ) 5. కారియు (హ)

## వసుదేవునకు నారదుండు విదేహార్షభ సంవాద మను పురాతన పుణ్యకథను దెలుపుట.

క. చిత్తం బే క్రియ నిలుచుం, [1]జిత్తజగురు పాదపద్మ సేవ సదా య
త్యుత్తమ మని వసుదేవుఁడు, చిత్తముఁ దగ నిల్పి యెట్లు చెందె మునీంద్రా!

వ. అని యడిగిన, రాజునకు శుకయోగీంద్రుం డి ట్లనియె. 28

### అధ్యాయము - ౨

క. వినుము నృపాలక చెప్పెద, ఘన మై విలసిల్లు పూర్వకథ గల దదియున్
మును ద్వారక కేతెంచియు, నొనరఁగ నారదుఁడు కృష్ణు నొయ్యనఁ గాంచెన్.

వ. దేవముని కృష్ణ సందర్శనార్థం బరుగుదెంచి, తద్గృహాభ్యంతరమున కరిగిన, వసుదేవుం డమ్మునీంద్రుని నర్ఘ్య పాద్యాది విధులం బూజించి, కనకాసనాసీనుం గాంచి, యుచిత కథా వినోదంబులం బ్రొద్దు పుచ్చుచు ని ట్లనియె. ఏ నరుండు నారాయణ చరణ సరసీరుహ భజన పారాయణత్వంబు నిరంతరంబు నొందఁ డట్టి వానికి మృత్యువు సన్నిహితం బై యుండు. నీ దర్శనంబునం గృతార్థుండ నైతి. అచ్యుతానంత గోవిందాది నామస్మర ణైకాగ్రచిత్తు లైన మీవంటి పుణ్యపురుషుల సమాగమంబున లోకులు సుఖాశ్రయు లై యుండుదురు. దేవతా భజనంబు సేయువారిని గీర్వాణులు ననుగ్రహింతురు. అట్లు సజ్జనులును, దీనవత్సలులు నగువారలు పూజనాది క్రియలచే నా దేవతలను భక్తి సేయుదురు. కావున శ్రీమన్మహాభాగవత కథాసమూహంబులం గల ధర్మంబు లడిగెద. ఏ యే ధర్మంబులు శ్రవణ సుఖంబులుగా వినిన, దండధర కింకర తాడనంబులం బడక, ముకుంద చరణారవింద వందనాభిలాషు లై, పరమపద ప్రాప్తు లగుదు, రా ధర్మంబు లానతిమ్ము. తొల్లి గోవిందునిం బుత్రునిఁ గా గోరి, ముక్తిమార్గం బెఱుంగలేక దేవతామాయం జేసి, చిక్కి, చిత్తవ్యసనాంధకారం బగు సంసారం బునం దగులువడి యున్నవాఁడ. హరికథామృతంబు వెల్లిగొల్పుము. అట్లైన సుఖంబు గల్గు. అనిన, వసుదేవ కృతప్రశ్నుం డైన నారదుండు వాసుదేవ కథా ప్రసంగ సల్లాప హర్ష సమేతుం డై, సంతసం బంద ని ట్లనియె. 30

క. నను నీవు సేయు ప్రశ్నము, జన సన్నుత! వేద శాస్త్ర సారాంశం బై
ఘన మగు హరి గుణకథనము, విను మని వినుపింపఁ దొణఁగె వేడ్కఁ దలిర్పన్.

క. అతి పాపకర్ము లైనను, సతతము నారాయణాఖ్య శబ్దము మదిలో
వితతంబుగఁ బఠియించిన, చతురులఁ గొనియాడఁ గమలసంభవు వశమే. 32

వ. అట్లు గావునఁ బరమేశ్వర భక్తిజనకం బై, కైవల్యపద ప్రాప్తికరం బై, యొప్పు చున్న విదేహార్షభ సంవాదంబు నాఁ బరఁగు నొక పురాతన పుణ్యకథా విశేషం బెఱింగించెద. సావధాన మనస్కుండ వై యాకర్ణింపుము. అని యి ట్లనియె.

తే. వినుము స్వాయంభువుం డను మనువునకును
రమణ నుదయించె నఁట ప్రియవ్రతు డనంగఁ
దనయుఁ డాతని కాగ్నీధ్రుఁ డనఁగ సుతుఁడు
జాతుఁ డయ్యెను భువన విఖ్యాతుఁ డగుచు. 34

వ. ఆ యాగ్నీధ్రునకు నాభి యను ప్రాజ్ఞుం డగు తనూభవుం డుదయించి, బలిచక్రవర్తితో మైత్రిం జేసి, ధరణీభారంబు పూని, యాజ్ఞాపరిపాలనంబున నహిత రాజన్య రాజ్యంబుల స్వవశంబులు గావించుకొని యుండె. అంత నా నాభికి సత్పుత్రుం డైన ఋషభుండు పుట్టె. అతండు హరిదాసుం డై సుతశతకంబు వడసె. అం దగ్రజుం డైన భరతుం డను మహానుభావుండు నారాయణ పరాయణుం డై, యిహలోక సుఖంబులం బరిహరించి, జన్మత్రితయంబున ఘోరతపం బాచరించి, నిర్వాణ సుఖపారవశ్యంబున సకలబంధ విముక్తుం డై, వాసుదేవ పదంబునుం బొందె. అతని పేర భారతవర్షం బను భూఖండ నామ వ్యవహారంబు నెగడి, జగంబులం బ్రసిద్ధం బయ్యె. మఱియు నందుఁ దొమ్మండ్రు కుమారులు బల పరాక్రమ ప్రభావ రూప సంపన్ను లై, నవఖండంబులకు నధిష్ఠాత లైరి. వెండియు, వారలలో నెనుబది[1]యొక్కండ్రు కుమారులు నిత్య కర్మానుష్ఠాన పరతంత్రు లయి, విప్రత్వం బంగీకరించిరి. అందుఁ గొందఱు శేషించిన వారలు, కవి హ ర్యంతరిక్ష ప్రబుద్ధ పిప్పలాయన హవిర్హోత్ర ద్రమీళ చమస కరభాజను లనం బరఁగు తొమ్మండుగు రూర్ధ్వ రేతస్కు లయి, బ్రహ్మవిద్యా విశారదు లగుచు, జగత్త్రయంబునుం బరమాత్మ స్వరూపంబుగాఁ దెలియుచు, ముక్తు లై, యవ్యాహత గమను లగుచు, సుర సిద్ధ సాధ్య యక్ష గంధర్వ కిన్నర కింపురుష నాగలోకంబులందు స్వేచ్ఛావిహారంబు సేయుచు, నిరంతరానందంబు వడసి యుండ, నొక్కనాఁడు. 35

క. జగదేకనాథు గుణముల, మిగులఁగ సంస్మరణతోడ మీఱిన భక్తిన్
బగలును రాత్రియు సంధ్యలు, దగిలి జితేంద్రియులు నయిన తపసులు ధాత్రిన్.

క. ఊహింపఁ బుణ్యుఁ డయిన వి, దేహుని యజ్ఞాంతమందు నేతెంచినచో
గేహము వెడలి యెదుర్కొని, మోహవివర్జితులఁ బుణ్యముని సంఘములన్. 37

తే. అర్ఘ్యపాద్యాది విధులను నర్థితోడఁ
బూజఁ గావించి వారలఁ బొలుపు మిగుల
నుచిత పీఠంబులందుల నునిచి యెలమి
నవ మునిశ్రేష్ఠులను భూమినాయకుండు. 38

1. యొక్కండ్రుగురు (హ.)

క. వారల కి ట్లను మీరలు, గారవమున విష్ణుమూర్తిఁ గయికొన్న మహా
భూరి తపోధన వర్యులు, సారవిహీనంబు లయిన సంసారములన్. 39

క. *ఏరీతిఁ గడవ నేర్తురు, క్రూరులు బహు దుఃఖ రోగ కుత్సితబుద్ధుల్
[1]నీరసులు నరులు గావున, నారయ సుజ్ఞానబుద్ధి నానతి యీరే. 40

—: ఋషభకుమారుం డగు కవి విదేహునకు పరమార్థోపదేశము చేయుట :—

వ. మఱియు, సకల జంతుసంతానంబుకంటె మానుషాకారంబు నొందుట దుర్లభంబు. అంతకంటె నారాయణ చరణయుగళ స్మరణ పరాయణు లగుట దుష్కరంబు. కావున [2]నాత్యంతికం బైన క్షేమం బడుగవలసె. పరమేశ్వరుండు ప్రపత్తినిష్ఠులకు సారూప్యం బెట్లొసంగు న త్తెఱం గానతిండు. అనిన విని, విదేహభూపాలునకు హరికథామృత పానాతిపరవశు లయిన మునిసమాజంబునందుఁ గవి యను మహానుభావుం డి ట్లని చెప్పఁదొణంగె. అరిషడ్వర్గంబునందు నేషణత్రయంబు చేతం దగులువడి, మాత్సర్యయుక్త చిత్తుం డగునట్టి వాని కెవ్విధంబున నచ్యుత పాదారవింద భజనంబు సంభవించు ? విశ్వంబును, నాత్మయు వేఱుగా భావించు వానికి [3]భీరుత్వం బెట్లు లేదు ? అవిద్యాంధకార మగ్నులకు హరిచింతనం బెట్లు సిద్ధించు ? అట్టి నరుండు తొంటి కళేబరంబు విడిచి, పరతత్త్వం బె ట్లంగిఁ జేరు? ముకుళీకృత నేత్రుం డైన నరుండు మార్గభ్రమణంబునఁ దొట్రుపాటువడి చను చందంబున, విజ్ఞాన విమలహృదయ భక్తిభావనా వశంబు లే కున్నఁ బరమ పదంబు వీరి కె వ్విధంబునం గలుగు ? అని యడిగితివి గావునఁ జెప్పెద. సావ ధానుండ వై యాకర్ణింపుము. 41

క. కరణ త్రయంబు చేతను, నరుఁ డే కర్మంబు సేయు న య్యై వేళన్
హరి కర్పణ మని పలుకుట, పరువడి సుజ్ఞానమండ్రు పరమ మునీంద్రుల్. 42

వ. జ్ఞానాజ్ఞానంబులందు సంకలితుం డైన స్మృతివిపర్యంబు నొందు. అట్లు గావున గురుదేవతాత్మకుం డై బుద్ధిమంతుం డైన మర్త్యుండు, శ్రీవల్లభు నుత్త మోత్తమునిఁ గాఁ జిత్తంబునఁ జేర్చి, సేవింపవలయు. స్వప్నమనోరథేచ్ఛా

---

* ఈ పద్యము వెంట - క. వ. ప్రతులలో ఈ క్రింది పద్యమున్నది.
సార విహీనమై దురితజాల మహోర్మి సమగ్రమై కడుం
గ్రూర రుజాజలగ్రహ విఘూర్ణిత మై కడగానరాని సం
సారమహాంబుధిన్ గడవఁ జాలు నుపాయము నంబుజోదర
స్ఫార కృపాసమృద్ధియును చాలగ నెట్లు ఘటించు చెప్పవే.

1. మీరలు సులభులు గావున (గ.) 2. ఆధ్యాత్మిక స్వరూపం బైన (చ. ట. ద. ప-డ.)
3. బరతత్త్వం బెట్లు లేదు (హ.)

ద్వ్యవస్థలయందు సర్వసంకల్ప నాశం బగుటం జేసి, వానిఁ గుదియంబట్టి, నిరంతర హరిధ్యానపరుం డైన వానికిఁ గైవల్యంబు సులభంబునం గరతలామలకం బై యుండు. 43

సీ. సంతతంబును గృష్ణ సంకీర్తనంబులు వీనుల కింపుగా వినఁగవలయు
హరినామ కథనంబు హర్షంబు తోడుతఁ బాటల నాటలఁ బరఁగవలయు
నారాయణుని దివ్య నామాక్షరంబులు హృద్వీథి సతతంబు నెన్నవలయుఁ
గంజాక్షు లీలలు గాంతారముల నైన భక్తియుక్తంబుగాఁ బాడవలయు.

తే. వెఱ్ఱిమాడ్కిని లీలతో విశ్వమయుని
నొడువుచును లోకబాహ్యత నొందవలయు
నింతయును విష్ణుమయ మని యెఱుఁగవలయు
భేద మొనరింపవలవదు మేదినీశ! 44

ఋషభకుమారు లగు హరియు నంతరిక్షుండును సేసెడు
భాగవత స్వరూపోపదేశము.

వ. అనిన విదేహభూపాలుండు, భాగవతధర్మం బెద్ది, యే ప్రకారంబునం బ్రవర్తించు? అట్టి భాగవతచిహ్నంబు లెవ్వి? ఇంతయు నెఱింగింప మీర యర్హు లరు. అనిన, నందులో హరి యను మహాత్ముం డి ట్లనియె. 45

తే. *సర్వభూతమయుం డైన సరసిజాక్షుఁ
డతఁడె తన యాత్మయం దుండు ననెడివాఁడు
[1]శంఖ చక్ర ధరుం డంచుఁ జనెడువాఁడు
భక్తిభావాభిరతుఁడు వో భాగవతుఁడు. 46

క. వర్ణాశ్రమ ధర్మంబుల, నిర్ణయ కర్మములఁ జెడక నిఖిల జగత్సం
పూర్ణుఁడు హరి యను నాతఁడె, వర్ణింపఁగ భాగవతుఁడు వసుధాధీశా! 47

వ. ఇట్లు సర్వసంగపరిత్యక్తుం డై, నిఖిలాంతరాత్మకుం డైన పరమేశ్వరుం డరుణ గభస్తి కిరణ సహస్రంబుల లోకత్రయంబునుం బావనంబు చేయుచందంబున, [2]నందనందనుని చరణారవింద రజఃపుంజంబులచేతం బవిత్రంబు సేయుచు, సురాసుర జేగీయమానం బైన జనార్దన పాదారవిందంబునకు వందనాభిలాషుఁ డై,

---

* "సర్వభూతేషుయః పశ్యేత్ భగవద్భావ మాత్మనః,
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః" (2-45)

1. శంఖ చక్రధరుండగు సాధుజనుఁడు (తం.) 2. తన (తం వా.)

భక్తియు లవమాత్రంబునుం జలింపనీక, సుధాకరోదయంబున దివాకరజనిత తాపంబు నివారణం బైన భంగి, నారాయణాంఘ్రి నఖ మణి చంద్రికా నిరస్త హృదయ తాపుండు, నాత్మీయ భక్తి [1]రచనానుబంధ బంధురుండును నై, వాసుదేవ చరణసరోరుహ ధ్యానానంద పరవశుం డగు నతండు, భాగవత ప్రధానుండు. అని యెఱింగించిన, విని విదేహుం డి ట్లనియె. 48

అధ్యాయము - 3

క. గజరాజ వరదు గుణములు, త్రిజగ త్పావనము లగుటం దేటపడంగా
సుజన మనోరంజకముగ, విజితేంద్రియ ! వినఁగ నాకు వేడుక పుట్టెన్. 49

వ. అనిన విని, యంతరిక్షుం డను ఋషి శ్రేష్ఠుం డి ట్లనియె. 50

క. పరమ బ్రహ్మ మనంగాఁ, బరతత్త్వ మనంగఁ బరమపద మనఁగను నీ
శ్వరుఁ డనఁ గృష్ణుఁ డన జగ, ద్భరితుఁడు నారాయణుండు దా వెలుఁగొందున్.

వ. అవ్యక్త నిర్గుణ పరబ్రహ్మంబునందుఁ దనకు విపర్యయంబుగా జననం బైన జ్ఞానంబె విష్ణుమాయ యనంబడు. పరమేశ్వరుం డట్టి మాయచేత జగంబు నిర్మించి, నిశ్చింతుం డై యుండు. ఇంద్రియార్థ భ్రమణంబు సేసెడు దుర్మతులకు సుషుప్త్యా ద్యవస్థలు వరుసను గలుగుట గాక, పరమేశ్వరునిఁ బొందరామి యను నాలుగవ యవస్థయుఁ గలుగు. స్వప్నంబునందు గ్రాహ్య గ్రాహక [2]గ్రహణంబు లను త్రివిధ భేదంబులుం గలిగియుండు. ఈ చందంబున నవిద్యాంధకార సంవృతం బై, మూఁడు విధంబులఁ బర్యవసించు మనోరథంబు స్వప్నావస్థయం [3]దణఁగిన క్రియఁ, ద్రివిధం బగు మాయయు, నాత్మయందు లీనం బగు. పరమే శ్వరుండు మొదలం బృథివ్యాధి మహాభూతమయం బైన సృష్టినిఁ గలుగఁ జేసి, యందుఁ బంచభూతాత్మకం బైన యాత్మ నేకాదశేంద్రియంబులచేత భేదంబు పుట్టించుచు, గుణంబులచేత గుణంబు లంగీకరించుచు, నాత్మయందుఁ బ్రద్యోతిత గుణంబులవలన గుణానుభావంబు చేయనున్న వాఁ డయి, సృష్టినాత్మీయం బుగా భావించును. దేహి, కర్మమూలంబున నైమిత్తిక కర్మంబు లాచరింపుచుఁ, దత్ఫలం బంగీకరించి, దుఃఖైకవశుం డై వర్తించు. పెక్కు దుఃఖంబులం బడి, యీ దేహి, కర్మఫల ప్రాప్తుం డగుచు, భూతసంప్లవ పర్యంతంబు పరవశుండై, జన్మమరణంబులం బొరలుచుండు. అంత్యకాలం బాసన్నం బైన, ద్రవ్య గుణ స్వరూపం బగు జగంబు ననాదినిధనం బగు కాలంబు ప్రకృతిం బొందించును. అటమీఁద శతవర్షంబులు వర్షంబు లేమిచే నత్యుగ్ర లోకలోచను తేజంబున

1. రశనా (వా.) 2. గ్రాహయితృత్వంబులను (హ); గ్రాహిత్వంబులను (తం.)
3. స్వప్నావస్థం గడఁగిన (హ)

సకలలోకంబులుదహింపఁబడు.అంతనధోలోకంబున నుండిసంకర్షణముఖజనితానలం బూర్ధ్వ శిఖాజాలంబుల వాయు సహాయం బై, దిక్కులయం దెల్లఁ బ్రవర్తించు. అటమీఁద సంవర్తక వలాహక గణంబులు శతసంవత్సరంబులు సలిలధారా పాతంబుగా వర్షంబులు గురియు. అందు విరాడ్రూపంబు లీనం బగు. అంత నీశ్వరుండు [1]నింధనాగ్నిరూపంబున నవ్యక్తంబుఁ బ్రవేశించు. తదనంతరంబ ధరణీ మండలంబు వాయుహృత గంధం బై, కబంధరూపంబు దాల్చు. ఆ జలంబు హృతరసం బై, తేజోరూపంబు నొందు. ఆ తేజంబు తమోనిరస్తం బై, వాయువం దణంగు ఆ గంధవహుండును స్పర్శవిరహితుం డై, యాకాశంబు నందు సంక్రమించు. ఆ విష్ణుపదంబును విగత శబ్దగుణంబు గలది యై, యాత్మ యం దణంగు. ఇంద్రియంబులును, మనంబును, బుద్ధియు, వికారంబులతోడ నహంకారంబుఁ బ్రవేశించు. ఆ యహంకారంబు స్వగుణయుక్తం బై, పరమా త్మనుం జేరు. ఇట్లు త్రివర్ణాత్మక యై, సర్గ స్థితి లయకారిణి యగు మాయ యిట్టిది యని, తత్స్వరూప మాహాత్మ్యంబులు వివరించిన, నరపాలుం డి ట్లనియె.

ఉ. [2]జ్ఞానవిహీన మైన [3]నరసంఘము గానఁగరాని మాయఁ దా
లోన నడంచి యెట్లు హరి లోకముఁ జెందుదు రంతయుం దగ౯
భూనుత! సత్యవాక్య గుణ భూషణ! యి క్కథ వేడ్కతోడుత౯
[4]బూనుక చెప్పు మన్నను బ్రబుద్ధుఁడు ని ట్లను గారవంబున౯. 53

ఋషభకుమారులలోఁ బ్రబుద్ధ పిప్పలాహ్వయులు సెప్పెడు పరమార్థోపదేశము.

వ. సూర్యోదయాస్తమయంబులం బ్రతిదినంబు నాయువు క్షయంబు నొంద, దేహ కళత్ర మిత్ర భ్రాతృ మమత్వ పాశబద్ధు లై విడివడు నుపాయంబు గానక, సంసారాంధకారమగ్ను లై, గతాగతకాలంబుల నెఱుంగక, దివాంధంబు లగు జంతుజాలంబుల భంగి, జన్మ జరా రోగ విపత్తి మరణంబు లందియు, శరీరంబ మే లనుచుఁ బ్రమోద మోహ మదిరాపాన మత్తు లై, విషయాసక్తతం జిక్కి తమ్ముం దా రెఱుంగక యుండి, విరక్తిమార్గంబు దెలియక వర్తించు మూఢు లగు జనంబుల పొంతలం బోవక, కేవల విష్ణుభక్తి భావంబు గల సద్గురులం బ్రతిదినంబును భజియించి, సాత్త్వికంబు, భూతదయయును, హరి కథామృత పానంబును, బ్రహ్మచర్య వ్రతంబును, విషయంబుల మనంబు చేరకుండుటయు, సాధు సంగంబును, సజ్జన మైత్రియు, వినయసంపత్తియు, శుచిత్వంబు, తపంబును,

1. "నిరింధన ఇవానలః" (3-16) 2. విహీనులైన (తం. వా.) 3. సంఘముఁగానఁగరాని మాయఁదాలోన నడంచి (తం. వా.) 4 బూనిక (తం. వా.)

క్షమయు, మౌనవ్రతంబును, వేద శాస్త్రాధ్యయన త దర్థానుష్ఠానంబును, నహింసయు, సుఖదుఃఖాది ద్వంద్వసహిష్ణుతయు, నీశ్వరుని సర్వగతునిఁగా భావించుటయు, ముముక్షుత్వంబును, జనసంగ వర్జనంబును, వల్కలాది ధారణంబును, యదృచ్ఛాలాభ సంతుష్టియు, వేదాంత శాస్త్రార్థ జిజ్ఞాసుత్వంబును, దేవతాంతర నిందా వర్జనంబును, గరణత్రయ శిక్షణంబును, సత్యవాక్యతయు, శమదమాది గుణవిశిష్టత్వంబును, గృహారామ క్షేత్ర కళత్ర పుత్ర విత్తాదుల హరి కర్పణంబు సేయుటయు, నితరదర్శన వర్జనంబు సేయుటయును, భాగవతోత్తమ ధర్మంబులు. అని చెప్పి, యి ట్లనియె. 54

క. హరిదాసుల మిత్రత్వము, మురరిపు కథ లెన్నికొనుచు మోదముతోడన్
[1]హరుషాశ్రు పులకితుం డయి, పురుషుఁడు హరిమాయ గెలుచు భూపవరేణ్యా!

వ. అనిన రాజేంద్రుండు వారల కి ట్లనియె. భాగవతులారా! సకలలోక నాయకుం డగు, నారాయణుం డనం బరఁగిన పరమాత్ముని ప్రభావంబు వినవలతు. ఆనతిండు. అనిన, పిప్పలాహ్వాయుం డి ట్లనియె. 56

సీ. నరవర! విను జగన్నాథుని చారిత్ర మెఱిఁగింతు నీ మది కింపు మిగుల
లస దుద్భవ స్థితి లయ కారణం బయి దేహేంద్రియాదులఁ దిరము గాఁగఁ
జొనుపు నెప్పుడు పరంజ్యోతి స్వరూపంబు [2]జ్వాల లనలునందుఁ జనని పగిది
నింద్రియంబులు నాత్మ నెనయవు శబ్దంబు [3]పొరయక సుషిరంబుఁ బొందు సత్య

తే. మనఁగ సత్త్వ రజ స్తమోమయగుణంబు
మహ దహంకార రూప మై మహిమ వెలయుఁ
జేతనత్వంబు గల దీని జీవమందు
రిదియ సదస త్స్వరూప మై యెన్నఁబడును. 57

వ. దీనికిం బెక్కైనది పరమాత్మగా నెఱింగి, కమలసంభవాదులు నుతియింతురు. ఇట్టి పరమాత్మ, స్థావర జంగమంబుల నధిష్ఠించి, వృద్ధిక్షయంబులం బొందక, నిమిత్తమాత్రంబునం దరు లతాదులందు జీవంబు లేక, తదంతరస్థుం డై వర్తించు. అంత సర్వేంద్రియావృతం బైన యాకారంబు నష్టం బైన, మనంబునుం బాసి, శ్రుతివిరహితుం డై, తిరుగుచుండు. నిర్మల జ్ఞానదృష్టి గలవానికి భాను ప్రభాజాలంబు తోఁచినక్రియను, సుజ్ఞానవంతుండు హరిభక్తిచేత గుణ కర్మార్థంబు లైన చిత్తదోషంబులు భంజించి, భగవత్సదనంబుఁ జేరు. అనిన, విని, రాజి ట్లనియె. 58

---

1. భరితాశ్రు (తం. వా.) 2. జ్వాలల నవలుండు జననివగిది (తం. వా.) 3. చొరకయ (వా.) శబ్దోఽపి బోధక నమేధత యాత్మమూల మర్థోక్త మాహాయ దృతేన నిషేధ సిద్ధిః (3-40.)

క. పురుషుం డే యే కర్మము, పరువడిఁ గావించి పుణ్యపరుఁ డై మనుఁ దా
దురితములఁ దొరఁగి మురరిపు, చరణయుగం బెట్లు చేరు సన్మునివర్యా! 59

—: ఋషభ కుమారులలో నావిర్హోత్రి ద్రమీళులు తెలుపు పరమార్థోపదేశము :—

వ. అనిన విని, [1]యం దావిర్హోత్రుం డి ట్లనియె. కర్మాకర్మ ప్రతిపాదకంబు లగు శ్రుతి వాదంబు ల[2]లౌకిక వర్ణితంబులు. అట్టి యామ్నాయంబులు సర్వేశ్వర స్వరూపంబులు గాన విద్వాంసులు [3]న్నెఱుంగ లేరు. అవి కర్మాచారంబు లనం బడు. మోక్షంబుకొఱకు నారాయణ భజనంబు పరమపావనంబు. వేదోక్తంబుల నాచరింపక, ఫలంబులకు వాంఛ సేయువార లనేక [4]జన్మాయుతంబులం బడయు దురు. మోక్షంబు నపేక్షించువాఁడు విధిచోదిత మార్గంబున హరిం బూజింప వలయు. అట్టి పూజాప్రకారం బెట్లనినఁ, బవిత్ర గాత్రుం డై, జనార్దను సన్నిధిం బూతచిత్తుం డై, విధ్యుక్త ప్రకారంబునఁ జక్రధరుని ధ్యానించి, గంధ పుష్ప ధూప దీప నైవేద్యంబులు సమర్పించి, సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, భక్తిభావనా విశేషుం డగు నతండు హరిం జేరు. అని చెప్పిన విని, విదేహుం డి ట్లనియె. ఈశ్వరుం డేయే కర్మంబుల నాచరించె నంతయు నెఱింగింపుము. అనిన ద్రమీళుం డి ట్లనియె. 60

అధ్యాయము - ౪

క. తారల నెన్నఁగ వచ్చును, భూరేణుల లెక్కపెట్టఁ బోలును ధాత్రిన్
నారాయణ గుణకథనము, లారయ వర్ణింపలేరు హర బ్రహ్మాదుల్. 61

వ. ఇట్లు గావున నాత్మసృష్టం బైన మనంబునఁ, బంచభూత నికరం బను పురం బొన రించి, యందు నిజాంశంబునం బ్రవేశించి, సగుణ నిష్ఠుం డై, నారాయణాభిధానంబునుం గల ఋషీశ్వరుం డగు పరమేశ్వరుండు వెలుఁగొందెను. అతని దశేంద్రియంబులచేతఁ బాలితంబు లైన దేహంబులు ధరియించి, జగద్రక్షకత్వ సంహారకత్వాది గుణంబులు గలుగుటం జేసి, గుణనిష్ఠుం డై, రజ స్సత్త్వ తమో గుణంబుల బ్రహ్మ విష్ణు రుద్రమూర్తు లనం బరఁగి, త్రిగుణాత్మకుం డనంబడు నారాయణాఖ్యుని చరిత్రం బెఱింగించెద. ఆకర్ణింపుము. 62

క. ధర్మునందు దక్షపుత్రిక, నిర్మలమతిఁ బెండ్లియాడి నెఱిఁ బుత్రుని స
త్కర్ముని నారాయణఋషి, నర్మిలిఁ గనె నతఁడు బదరికాశ్రమమందున్. 63

1. యందు హరిర్హోత్రుండు (హ.) 2. లౌకిక (హ. తం. వా.); "కర్మాకర్మ....వేదవాదోన లౌకికః" (8-47) 3. ఎఱుంగుదురు (త. వ. గ. జ.) 4. జన్మాంతరంబులం (తం. వా.)

తే. అట్టి నారాయణాహ్వయుం డైన మౌని
బదరికాశ్రమ మందు నపార నిష్ఠఁ
దపముఁ గావింప బలభేది దలఁకి మదిని
మీనకేతను దివిజకామినులఁ బనిచె. 64

వ. వారు నారాయణాశ్రమంబునకు నతని తపోవిఘ్నంబు సేయ వచ్చునప్పు డ వ్వనంబు, సాల రసాల బిల్వ కదళీ ఖర్జూర జంబు జంబీర చందన పున్నాగ మందారాది వివిధ వృక్ష నిబిడంబును, బుష్ప ఫల భరిత శాఖావనమ్ర తరు లతా బృందంబును, మాధవీ కుంజ మంజరీపుంజ మకరందపాన మత్త మధుకర నికర ఝుంకారరవ ముఖరిత హరిదంతరంబును, గనకకమల కల్హార విలస త్సరో విహారమాణ చక్రవాక బక క్రౌంచ మరాళ దంపతి మండల మండి తంబును, మృణాళభోజ నాసక్త సారసచయ చంచూపుట విపాటిత కమల ముకుళ కేసరవిసర వితత ప్రశస్త సరోవరంబును నై, వెలయు. అ వ్వనంబున నిందువదన లందంద మందగమనంబులం జెందు ఘర్మజలబిందు బృందంబులు నఖాంతంబుల నోసరింపుచు డాయం జనునప్పుడు. 65

చ. మదనుని బాణజాలమున మగ్నతఁ బొందక ధైర్యవంతుఁ డై
ముదితల వాఁడిచూపులకు మోహము నొందక నిశ్చలాత్ముఁ డై
హృదయమునందు నచ్యుతు రమేశు ననంతు జగన్నివాసునిన్
వదలక భక్తి నిల్పుకొని వారికి ని ట్లనె మౌని పెంపునన్. 66

క. జంభారి పంపునను మీ,రంభోరుహ వదనలార! యరుదెంచితి రా
శుంభ ద్విహారవాంఛా,రంభంబునఁ దిరుగుఁ డనిన లజ్జించి వెసన్. 67

సీ. దేవమౌనీశ! నీ దివ్యచారిత్రంబు నెఱిఁగి సన్నుతి సేయ నెవ్వఁ డోపుఁ
బుత్ర మిత్ర కళత్ర భోగాదులను మాని తపము గావించు సద్ధర్మలకును
విఘ్నముల్ చెందునే విశ్వేశుఁ గొల్చిన యతనికి నంతరాయంబు [1]గలదె
కామంబు క్రోధంబు గలిగిన తపములు పల్వలోదకముల భంగిఁ గావె

తే. నిన్ను వర్ణింప నలవియే నిర్మలాత్మ!
రమణ లోఁగొను మా యపరాధ మనుచు
సన్నుతించిన నతఁడు ప్రసన్నుఁ డగుచుఁ
దనదు సామర్థ్య మెఱిఁగింపఁ దలఁచి యపుడు. 68

---

1. వలన (హ.)

వ. అమ్మునీశ్వరుండు పరమాశ్చర్య నిధానంబుగా నిజ తనూరుహంబుల వలనం ద్రికోటి కన్యకా నివహంబుల నుద్భవింపం జేసిన, గంధర్వ విబుధ కామినీ సముదయంబులు పరమాద్భుత భయంబులు మనంబులం బొడమ సన్నుతించి, య వ్విలాసినీ సమూహంబులో నూర్వశి యను దానిం గొని చని, పాకశాసను సభాభవనంబునం బెట్టి, తద్వృత్తాంతం బంతయు విన్నవించిన, నాశ్చర్యయుక్త హృదయుం డై, సునాసీరుం డూరకుండె. ఇట్టి నారాయణ మునీశ్వరు చరిత్రంబు వినువారలు, పరమ కల్యాణగుణవంతు లగుదురు. అని చెప్పిన. 69

తే. ఋషభునకు నాత్మ[1]యోగ మీ రీతిఁ జెప్పి
యచ్యుతుఁడు భూమిభారము నడఁప నంత
సొరిది నవతారములు దాల్చి [2]సొంపుమీఱ
రాత్రిచరులను జంపె నీరసముతోడ. 70

వ. అట్టి పరమేశ్వరుని లీలాగృహీతంబు లగు, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ వామన, రామ, రఘురామ, రామ, బుద్ధ, కల్క్యా ద్యవతారంబు లనేకంబులు గలవు. శేషభాషాపతుల కైన వర్ణింప నలవిగాదు. మఱియును. 71

సర్వలఘు సీసము :

నవ వికచ సరసిరుహ నయనయుగ! నిజచరణ గగనచర నది! [2]నిఖిల నిగమ వినుత !
జలధి[3]సుత కుచకలశ లలిత మృగమద రుచిరపరిమళిత నిజహృదయ! ధరణిభరణ !
ద్రుహిణముఖ సురనికర విహిత నుతికలిత గుణ ! కటిఘటిత రుచిరతర కనకవసన !
భుజగ రిపు వరగమన ! రజతగిరిపతి వినుత! సతత [4]వ్రత జప నియమసరణి చరిత !

తే. తిమి ! కమఠ ! కిటి! నృహరి! [5]ముదిత బలినిహిత పద ! పరశుధర ! [6]దశవదన విదళన !
మురమథన ! కలికలుష [7]సుముదప హరణ !
కరివరద ! ముని [8]నర సుర గరుడ వినుత ! 72

వ. ఇ వ్విధంబునం బ్రవర్తిల్లిన శ్రీమన్నారాయణమూర్తి లీలావిలాసంబు లనంతంబులు గలవు. మనో వాక్కాయ కర్మంబుల హరిపూజనంబు సేయక, విపరీత గతులం దిరుగుచుండు జడుల కె వ్విధంబున గతి గలుగు ? అనిన, న ప్పుడమిఱేఁ

---

1. యోగంబు రూఢిఁ జెప్పి నచ్యుతుఁడు (తం.); యోగమీరీతిఁ జెప్పి నచ్యుతుఁడు (వా.)
2. సొంపునెవఁడు (హ.) 2. జనిత (తం. వా.) 3. జని (హ.) 4. జపరత(ర్వా.ప్ర.) 5. నమిత(హ.)
6. దనకరవిదళన (హ.) 7. ముదపహృతి నిపుణ (హ.) 8. మనుజసుర (హ.)

డ పృరమపురుషులం జూచి, యట్టి జడులు ము క్తినొందు నుపాయం బెట్టులు. అంతయు నెఱింగింపుము. అనిన, [1]చమసుం డి ట్లనియె. 73

అధ్యాయము - ౫

—: ఋషభకుమారు లగు చమస కరభాజనులు సేసెడు పరమార్థోపదేశము :—

సీ. హరి ముఖ బాహూరు వర పదాబ్జములందు వరుసఁ జతుర్వర్ణ వర్గసమితి
జనియించె నందులో సతులును శూద్రులు హరిఁ దలంతురు కలిహాయనముల
వేద శాస్త్ర పురాణ విఖ్యాతు లయి కర్మకర్త లై విప్రులు గర్వ మెసఁగి
హరిభక్తిపరులను హాస్యంబు సేయుచు నిరయంబు నొందుట నిజము గాదె

తే. [2]మృదుల పక్వాన్నములను దా మెసఁగఁగోరి
జీవహింసకుఁ జనువానిఁ జెందు నఘము
హరి నుతింపక స్త్రీలోలుఁ డైనవాఁడు
నరకవాసుండు నగుచుండు ననవరతము. 74

వ. అట్లు గావున, గృహ క్షేత్ర పుత్ర కళత్ర ధన ధాన్యాదులందు మోహితుం డయి, ముక్తి మార్గంబు లప్రత్యక్షంబు లని, నిందించువాఁడును, హరిభక్తి విరహితుండును, దుర్గతిం గూలుదురు. అని మునివరుం డానతిచ్చిన, విదేహుం డి ట్లనియె. 75

ఆ. ఏ యుగంబునందు నేరీతి వర్తించు
నెట్టి రూపువాఁడు నె వ్విధమున
మును నుతింపఁబడెను ముని దేవ గణముచే
విష్ణుఁ డవ్యయుండు విశ్వవిభుఁడు ? 76

వ. అనిన విని, యందుఁ గరభాజనుం డి ట్లనియె. నానావతారంబులును, నానా రూపంబులును, బహువిధ వర్ణంబులునుం గలిగి, రాక్షసులను సంహరించి, దుష్టజన నిగ్రహంబును, శిష్టజన పరిపాలనంబును జేయుచుం, గృతయుగంబున శుక్లవర్ణుం డై, చతుర్బాహుం డై, జటా వల్కలకృష్ణాజినోత్తరీయ జపమాలికా దండ కమండలు ధరుం డై, హరి, నిర్మల తపో ధ్యానానుష్ఠాన గరిష్ఠు లైన పురుష శ్రేష్ఠులచేత హంసుండు, [3]సుపర్ణుండు, వైకుంఠుండు, ధర్ముండు, అమలుండు, యోగీశ్వరుండు, ఈశ్వరుండు, పురుషుండు, అవ్యక్తుండు, పరమాత్ముండు అను దివ్యనామంబులం బ్రసిద్ధి వహించి, మొదటియుగంబున గణుతింపంబడు.

---

1. చ్యవనుం డి ట్లనియె (క. చ. గ. జ. డ.) 2. మృదుల పక్వాన్న భోజనములను మాని (తం. వా.) 3. సువర్ణుండు (తం. వా.)

త్రేతాయుగంబున రక్తవర్ణుం డై, బాహుచతుష్క మేఖలాత్రయ విశిష్టుం డై, హిరణ్యకేశుండును, వేదత్రయ స్వరూపుండును, స్రుక్ స్రువా ద్యుపలక్షణ శోభితుండును నై, విష్ణు యజ్ఞ పృశ్నిగర్భ సర్వదే వోరుక్రమ వృషాకపి జయం తోరుగాయాఖ్యల బ్రహ్మవాదులచేత నుతియింపంబడు. ద్వాపరంబున శ్యామల దేహుండును, పీతాంబర ధరుండును, బాహుద్వ యోపశోభితుండును, దివ్యా యుధ ధరుండును, శ్రీవత్స కౌస్తుభ వనమాలికా విరాజమానుండును, మహారా జోపలక్షణుండును నై, జనార్దన వాసుదేవ సంకర్షణ ప్రద్యు మ్నానిరుద్ధ [1]ఋషి [2]పురుష [3]మహాత్మ విశ్వ నారాయణ విశ్వరూప సర్వభూతాత్మకాది నామంబుల వెలసి, మూర్ధాభిషిక్తులచేత సన్నుతింపంబడు. కలియుగంబునఁ గృష్ణ వర్ణుండును, గృష్ణనామకుండు నై, భక్త సంరక్షణార్థంబు పుండరీకాక్షుండు, వివిధ యజ్ఞంబులచే సంకీర్తనాదులచేతం బ్రస్తుతింపంబడు. హరిరామ నారాయణ నృసింహ కంసారి నళినోదరాది బహువిధ నామములచే బ్రహ్మవాదులును, మునీంద్రులును, నుతియింపుదురు. మఱియును. 77

తే. ద్రవిడదేశంబునందులఁ దామ్రపర్ణి
[4]సహ్యజా కృతమాలాది సకలనదుల
నెవ్వఁడేనియు భక్తితో నేఁగి యచటఁ
బొదలి తర్పణ మొగిఁ జేయఁ బుణ్య మొదవు. 78

వ. ఇ వ్విధంబునం బ్రశంసింపం దగిన కావేర్యాది మహానదీ పావన జలస్నాన పాన దానంబులను, విష్ణుధ్యాన కథా సుధార సానుభవంబుల న్నిరూఢు లగు భాగవ తోత్తములు గలిగిరేనియుం, జెడనిపదంబు బొందుదురు. అని, ఋషభకుమారులు భగవత్ ప్రతిబింబంబు లయిన, పరమపురుషులువోలె, విదేహ జనపాలునకు నిశ్శ్రేయస పదప్రాప్తికరంబు లయిన, భగవద్భక్తిధర్మంబు లుపదేశించి, యంత ర్ధానంబు నొందిరి. మిథిలేశ్వరుండును సుజ్ఞానయోగం బంగీకరించి, నిర్వాణ పదంబు నొందె. ఈ యుపాఖ్యానంబు వ్రాసినఁ, బఠించిన, వినిన, నాయు రారో గ్యైశ్వర్యంబులు గలిగి, పుత్ర పౌత్రవంతు లయి, సకల కలికల్మష రహితు లై, విష్ణులోక నివాసు లగుదురు. అని, నారదుండు వసుదేవునకుం జెప్పి, మఱియు.

సీ. కమలాక్షు పదభక్తి కథనముల్ వసుదేవ! విని యఘంబులఁ బాసి వెలసి తీవు
భువనప్రసిద్ధిగాఁ బొలుపొందు సత్కీర్తి కైవల్యలక్ష్మియుఁ గలుగు మీఁద
నారాయణుండు నీ నందనుం డను మోహమెడలించి విష్ణుఁగా నెఱిఁగి కొలువు
మతఁడు నీ తనయుఁ డై యవతరించుటఁ జేసి సిద్ధించె దేహసంశుద్ధి నీకు

1, 2, 3 తం. వా. లలో లేవు. 4. యిలనుగావేరియై ప్రవహించె గాన (అన్ని వ్రా ప్ర.)

తే. సరస సల్లాప సౌహార్ద సౌష్ఠవమునఁ
బావనం బైతి శిశుపాల పౌండ్రక నరక
ముర జరాసంధ యవనులు ముదముతోడ
వాసుదేవునిఁ జెందిరి వైరు లయ్యు. 80

క. దుష్టజన నిగ్రహంబును, శిష్ట ప్రతిపాలనంబు సేయఁగ హరి దా
సృష్టి నవతార మొందెను, స్రష్టృముఖానేక దివిజసంఘము వొగడఁగ. 81

—: బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకుఁ బిలువ వచ్చుట :—

వ. అట్లు గావున లోకరక్షణార్థంబు కృష్ణుం డవతార మెత్తె. అని, హరి భక్తిపరంబు లగు నుపాఖ్యానంబులు నారదుం డుపన్యసించిన విని, విస్మితచిత్తులై, దేవకీ వసుదేవులు కృష్ణునిం బరమాత్మునింగా విచారించిరి. అని, శుకుండు రాజునకుం జెప్పిన, నతండును, "మునీంద్రా! యదువుల నే ప్రకారంబున హరి హరి యించె. సపరివారు లగు బ్రహ్మ రుద్రేంద్ర దిక్పాలక మునీంద్రులు ద్వారకా నగరప్రవేశం బెట్లు చేసిరి. ఏమయ్యె. మఱియుం బరమేశ్వర కథామృతంబు వీను లలరం జవిగొనియు నింకం దనివి సనదు. భక్తరక్షకుం డగు హరి చారిత్రం బే రీతిం జాఁగె. తద్వ్యాతివృత్తాంతం బంతయు నెఱింగింపుము. అనిన శుకుం డి ట్లనియె. 82

అధ్యాయము - ౬

క. సుర గరుడ ఖచర విద్యాధర హర పరమేష్ఠిముఖ సుధాశనులు మునుల్
సరసిజనయనుని గనుఁగొన, నరుదెంచిరి ద్వారవతికి నతిమోదమునన్. 83

క. కని పరమేశుని యాదవ, వనశోభిత పారిజాతు వనరుహనేత్రుం
జనకామిత ఫలదాయకు, వినుతించిరి దివిజు లపుడు వేదోక్తులతోన్. 84

తే. అఖిలలోకేశ! సర్వేశ! యభవ! నీవు
నుదయ మందుట భూభార ముడుపు కొఱకుఁ
బంచ వింశోత్తర శతాబ్ద [1]పరిమితంబు
[2]నయ్యె విచ్చేయు వైకుంఠ హర్మ్యమునకు. 85

వ. అనినఁ గమలభవ భవముఖ నిఖిల సురగణంబుల వచనంబు లి య్యకొని, కృష్ణుండు వారలతోడ యాదవుల కన్యోన్య వైరానుబంధంబులు గల్పించి, వారల హతంబు గావించి, భూభారం బడంచి, యిదె వచ్చెదం బొం డని చెప్పి, వీడ్కొలిపినఁ గమలాసనాది బృందారకులు నిజస్థానంబులకుం జనిరి. అంత. 86

1. పరిమితయ్యెఁ (హ.) 2. గోరివిచ్చేయుమయ్య వైకుంఠమునకు (హ.)

శ్రీకృష్ణుండు దుర్నిమిత్తంబులం గని యాదవులను బ్రభాసతీర్థమునకుఁ బంపుట.

సీ. కాక ఘూకంబులు కనక సౌధములలోఁ బగలు వాపోయెడి బహువిధముల
నశ్వవాలంబుల ననల ముద్భవ మయ్యె నన్నంబు మొలిచె మహాద్భుతముగ
శుకశారికలు రాత్రి సొగసె విస్వరముల జంతువు వేఱొక్క జంతుఁ గనియె
నొగిఁ బౌరగృహముల నుల్కలు నుదయించె బెరసెఁ గావిరి రవిబింబ మపుడు

తే. గాన నుత్పాతములు చాలఁ గానఁబడియె
నరయ నిం దుండవలవదు యదువులార !
తడయ కిపుడ ప్రభాస తీర్థమున కరుగుఁ
డనుచు శ్రీకృష్ణుఁ డెంతయు నానతిచ్చె. 87

క. నారాయణు వచనముల క,పారం బగు సమ్మదమున బలములతోడన్
దార సుత మిత్రయుతు లై, వారణ హయ సమితితోడ వడి నేఁగి రొగిన్. 88

—: శ్రీ కృష్ణమూర్తి యుద్ధవునికి పరమార్థోపదేశము చేయుట :—

వ. అంత. 89

క. జ్ఞానమున నుద్ధవుఁడు దన, మానసమున నెఱిఁగి శ్రీరమాధిప ! హరి ! యో
దీనజన కల్పభూజమ !, శ్రీనాయక ! [2]దిక్కు నీవె శ్రితభయహరణా ! 90

వ. ఇట్లు నుతియించి, దేవా ! నీవు యదుక్షయంబు గావించి, చన నే మే విధంబున నిర్వహింతుము. నీ సహచరుల మై, గడపిన మజ్జన భోజన శయనాసనాది కృత్యంబులు మఱవ వచ్చునే. అని యుద్ధవుం డాడిన వాసుదేవుం డి ట్లనియె.

అధ్యాయము - ౭

బ్రహ్మాదిదేవతా ప్రార్థనంబునం జేసి, ధాత్రీభారంబు నివారించితి. ఇంక ద్వారకా నగరంబు నిందుకు సప్తమ దివసంబున సముద్రుండు ముంపంగలవాఁడు. యదు క్షయంబునుం గాగలయది. అంతటం గలియుగంబు ప్రాప్తం బయ్యెడి. అందు మానవులు ధర్మవిరహితులును, నాచారహీనులును, నన్యాయపరులును, నతిరోషులును, [1]మందమతులును, నల్పతరాయువులును, బహురోగ పీడితులును, నిష్ఫలారంభులును, నాస్తికులు నై, యొండొరుల మెచ్చక యుందురు. కావున నీవు సుహృ ద్బాంధవ స్నేహంబు వర్జించి, యింద్రియ సౌఖ్యంబులఁ గోరయక, క్షోణితలంబునం గల పుణ్యతీ ర్థావగాహనంబు సేయుచు, మానస వా గక్షి శ్రోత్ర ఘ్రాణేంద్రియ గృహ్యమాణం బగు వస్తుజాతంబు నశ్వరంబుగా నెఱుం

---

1. నుల్కములుదయించె (తం.); నుత్పల ఉదయించె (హా.) 2. మాకు నీవెదిక్కని పొగడెన్ (హా.)

గుము. పురుషుండు నానార్థ కామంబుల నంగీకరించి, నిజ గుణదోషంబుల మోహితుం డై యుండు. కావున హస్తిపకుండు గంధనాగంబులను బంధించు చందంబున, నింద్రియంబులను మనోవికారంబులను నిగ్రహించి, యీషణ త్రయంబును వర్జించి, మోదఖేదంబుల సముండవుగా వర్తింపుచు, నీ జగం బంతయు నాత్మాధిష్ఠితంబుగా నెఱింగి, మాయాదుల నాత్మ తత్త్వాధీనంబులుగఁ దెలియుచు, జ్ఞానవిజ్ఞాన యుక్తుండ వై, యాత్మానుభవ సంతుష్టుండ వై, విశ్వంబును నన్నుగా భావించి, వర్తింపవలయు. అని, వాసుదేవుం డానతిచ్చిన, నుద్ధవుండు భక్తివినయంబులం గరంబులు మొగిడ్చి, *మహాత్మా! సన్న్యస్త లక్షణంబు దుష్కరంబు. పామరు లగువా రాచరింపలేరు. నీ మాయచేత భ్రాంతు లై, చేయునది తెలియని సాంసారికులు భవాబ్ధిం గడచి, యెట్లుముక్తి వడయుదురు. భృత్యుండ నైన నామీఁది యనుగ్రహంబునం జేసి యానతిమ్మ. బ్రహ్మాది దేవతా సముదయంబును బాహ్య వస్తువుల భ్రాంతు లై, పర్యటనంబు సేయుదురు. నీ భక్తు లైన పరమభాగవతులు న మ్మాయావిరసనంబు సేయు దురు. గృహిణీ గృహస్థుల కైన, యతుల కైనను, నిత్యంబును నీ నామ స్మర ణంబు మోక్ష సామ్రాజ్యప్రదంబు. కావునఁ బరమేశ్వర! నీదు చరణంబుల శరణంబు నొందెద. కృపారసంబు నాపై నిగుడింపుము. అని, ప్రియసేవకుం డైన యుద్ధవుండు వలికిన, నతనికిఁ గంసమర్దనుం డి ట్లనియె. అట్లు పురుషున కాత్మకు నాత్మయె గురు వని యెఱుంగుము. కుపథంబులకుం జనక, సన్మార్గవర్తి యై, పరమం బయిన మన్నివాసంబునకుం జనుము. సర్వ మూలశక్తి సంపన్నుండ నైన నన్ను సాంఖ్యయోగపరులు నిరంతర భావంబులందుఁ బురుషభావంబుగా భావించి, తలంపుచుండుదురు. మఱియు, నేక ద్వి త్రి చతుష్పాద బహు పా దాపాదంబులు నై యుండు జీవజాలంబులలోన ద్విపాదంబులు గల మను ష్యులు మేలు. వారలలోన నిరంతర ధ్యానగరిష్ఠు లైన యోగీంద్రు లుత్తములు. వారలలో సందేహపరులచే నగ్రాహ్యుండగు నన్ను, సత్త్వగుణ గ్రాహ్యునిఁగా నెఱింగి, నిజ చేతః పంకజంబునందు జీవాత్మ పరమాత్మల నేకంబుగాఁ జేసి, శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గ కౌమోదకీ కౌస్తుభాభరణ యుక్తుంగాఁ దలంపుచు నుండు వారలు, పరమ యోగీంద్రు లనియును, పరమ జ్ఞాను లనియును జెప్పి

---

* ఈ వచన భాగమునకు "వ" ప్రతిలో ఈ క్రింది కందములున్నవి.

"నరులు సన్న్యస్తులై? భువి, బరగుట దుష్కరము దాని బరికించితగఁ
నిరుపమ నిష్కాముఖులై, చరియింపగలేరు చక్రి చెపు మేర్పడగఁ"

"నీ మాయా భ్రాంతులు నై, సామాదిగుణంబులేక సంసారికులై
కామాది గుణము జెందక, భూమిని నెట్లుండవచ్చు పుణ్యచరిత్రా!"

మఱియు, నవధూత యదు సంవాదం బను పురాతనేతి హాసంబు గలదు. చెప్పెద నాకర్ణింపుము. 91

—: అవధూత యదు సంవాదము :—

ఉ. పంకజనాభుఁ డుద్ధవుని పైఁ గల కూర్మినిఁ జెప్పె నొప్ప [1]నెం
దంకిలి లేక యన్ని దిశలందుఁ జరింపుచు నిత్యతృప్తుఁ డై
శంకర వేషధారి [2]యొక సంయమి యా యదురాజుఁ జేర నే
వంకను నుండి [3]వచ్చి తన వానికి ని ట్లనె నర్థి నేర్పడన్. 92

క. అవధూత వల్కె నంతటఁ, బ్రవిమల విజ్ఞాననిపుణ భవ్యులు గురువుల్
తవిలిన నిరువది నలువురు, నవనిన్ విజ్ఞాని నైతి నని పల్కుటయున్. 93

వ. అంత యదుప్రవరుం డిట్లనియె. దేహి లోభమోహాదుల వర్జించి, జనార్దనుని నేవిధంబునఁ జేరవచ్చు? నెఱింగింపుము. అనిన, నతం డిట్లనియె. 94

సీ. పరధన పరదార పరదూషణాదులఁ బరవస్తు చింతఁ దాఁ బరిహరించి
ముదిమిచే రోగము లుదయింప కట మున్న తనువు చంచలతను దగులకుండ
బుద్ధి సంచలతచేఁ బొదలక యటమున్న శ్లేష్మంబు గళమునఁ జేరకుండ
శక్తియుక్తులు మది [4]సన్నగిల్లకమున్న భక్తిభావనచేతఁ బ్రౌఢుఁ డగుచు

తే. దైత్యభంజను దివ్యపాదారవింద
భజన నిజ భక్తిభావనఁ బ్రాజ్ఞుఁ డగుచు
నవ్యయానందమును బొందు ననుదినంబు
[5]నతఁడు గర్మవిముక్తుఁ డౌ ననఘచరిత! 95

ఉ. దారలయందుఁ బుత్ర ధన ధాన్యములందు ననేకభంగులం
గూరిమిచేయు మర్త్యుఁ డతిఘోర వియోగజ దుఃఖమగ్నుఁ డై
నేరుపు దక్కి చిక్కువడి నీతి వివేకవిహీనుఁ డై మనో
భారముతోఁ గపోతపతిభంగి నిజంబుగఁ బోవు నష్టమై. 69

1. నా, తంకములేక నన్నిదిశలందు (హా.); నా, తంకుఁడు మత్పితామహుఁడు దాఁ బొలు నాల్గవ తాత యున్నచో (తం.) 2. యగు సంయమి యొక్కరుఁ డేఁగుదేర (తం.) 3. వచ్చితని వానితో ని ట్లనె (హా.); వచ్చితని వానికి ని ట్లనె (తం.)

" అవధూతం ద్విజం కంచి చ్చరంత మకుతోభయం, కవిం నిరీక్ష్యతరుణం యదుః పప్రచ్ఛ ధర్మవిత్ " (7-25) 4. చేవదీయకమున్న (హా.) 5. నరుఁడు (హా.)

వ. ఇందు నొక్క యితిహాసంబు గలదు. మహారణ్యంబున నొక్క కపోతంబు దార సమేతంబుగా నొక్క నికేతనంబు నిర్మించి, యన్యోన్య మోహాతిరేకంబునఁ గొంతకాలంబునకు సంతానసమృద్ధిగలది యై, యపరిమితంబు లైన పిల్లలు దిరుగాడుచుండఁ, గొన్ని మాసంబులు భోగానుభవంబునం బొరలుచుండం, గాల వశంబున నొక్క లుబ్ధకుం డురులొడ్డిన, నందు దారాపత్యంబులు దగులుపడిన, ధైర్యంబు వదలి, మోహాతిరేకంబునం గపోతంబు గళత్ర పుత్ర స్నేహంబునం దాను నందుఁ జొచ్చియు, నధిక చింతాభరంబునం గృశీభూతం బయ్యె. కావున నతితీవ్రం బైన మోహంబు గొఱగాదు. అట్లుగాన, నిరంతర హరి ధ్యాన పరుం డై, భూమి పవన గగన జల కృపీటభవ సోమ సూర్య కపోత [1]తిలిత్స జలధి శలభ ద్విరేఫ గజ మధుమక్షికా హరిణ పాఠీన పింగళా కురర డింభక కుమారికా శరకృ త్సర్ప లూతా సుపేశకృత్తుల సముదయంబు నుండి వాని గుణంబు లెఱింగికొని, యోగీంద్రులు మెలంగుదురు. అనిన. 97

అధ్యాయము - ౮

క. ఇవి దెలియవలయు నాకును, [2]బవిమలమతి వానిఁ దెలియఁబలుకు మనంగన్
[3]వివరము విను మని కృష్ణుఁడు, సవినయుఁ డగు నుద్ధవునికిఁ జయ్యన చెప్పెన్. 98

వ. ఇ వ్విధంబున, భూమివలన సైరణయు, గంధవహునివలన బంధురం బగు పరోప కారంబును, విష్ణుపదంబువలనఁ [4]గాలసృష్ట గుణసాంగత్యంబు లేమియు, నుద కంబు వలన నిత్యశుచిత్వంబును, నగ్నివలన నిర్మలత్వంబును, నిశాకర ప్రభా కరులవలన నధికాల్ప సమత్వ జీవగ్రహణ మోక్షణంబులును, గపోతంబువలనఁ గళత్ర పుత్ర స్నేహంబును, నజగరంబువలన స్వేచ్ఛాసమాగ తాహారంబును, వననిధివలన నుత్సాహ [5]శోషణంబులును, శలభంబువలన శ క్త్యనుకూల కర్మా చరణంబును, భృంగంబువలన సార మాత్రగ్రహణ విశేషంబును, స్తంబేర మంబువలనం గాంతా వైముఖ్యంబును, సరఘువలన నిరంతర సారసంగ్రహ గుణంబును, హరిణంబువలనఁ జింతాపరత్వంబును, జలచరంబువలన జిహ్వాచాప ల్యంబును, బింగళవలన యథాలాభ సంతుష్టియుఁ, గురరంబువలన మోహ పరిత్యాగంబును, డింభకువలన విచారపరిత్యాగంబును, కుమారికవలన సంగ త్యాగంబును, శరకారునివలనం దదేకనిష్ఠయు, దందశూకంబువలనం బరగృహ వాసంబును, నూర్ణనాభివలన సంసారపరిత్యాగంబును, కణుందురువలన లత్యాగత జ్ఞానంబు విడువకుండుటయు, ననంగల వీని గుణంబు లెఱింగి, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబు లను నరిషడ్వర్గంబుల జయించి జరామరణ

1. తిలిప్స (హ. తం. వా.) 2. గ్రమమున (హ.) 3. సృష్టి (హ.) 4. స్వేచ్ఛా విహార సమాగతాహారంబును (తం. వా.) 5. రోషణంబులు(తం. వా.)

విరహితంబుగా వాయువు వశంబు చేసి, గాత్ర [1]పవిత్రత్వంబు కొఱకు షట్కర్మ నిరతుం డై, పుర నగర గ్రామంబులు పరిత్యజించి, పర్వతారణ్యంబుల సంచ రింపుచు, శరీర ధారణార్థంబు నియమిత స్వల్పభోజనుం డై, ఖేదమోదంబులు సరియకా భావించి, లోభమోహంబులు వర్జించి, నిర్జితేంద్రియుం డై నన్నె కాని యొం డెఱుంగక, యాత్మనిష్ఠచేఁ బవిత్రాంతఃకరణుం డైన యోగి నాయందుఁ గలయు. కావున. 99

క. మోహితుఁ డై వసుకాంక్షా, వాహినిలోఁ జిక్కి క్రూరవశుఁ డై యెవ్వం డూహాపోహ లెఱుంగక, దేహము నలఁగంగఁ జేయు దీనత నొందున్. 100

వ. ఇందుకుఁ బురాతనవృత్తాంతంబు గలదు. సావధానచిత్తుండ వై వినుము. మిథిలా నగరంబునఁ బింగళ యను గణికారత్నంబు గలదు. దానివలనఁ గొంత పరిజ్ఞా నంబు గొంటి. అ దె ట్లనిన, న మ్మానిని వసుకాంక్షం జేసి, యాత్మసఖుని మొఱంగి, ధనం బిచ్చువానినిం జేకొని, నిజ నికేతనాభ్యంతరంబునకుం గొని, చని, రాత్రి నిద్ర లే కుండుచుం, బుటభేదన విపణి మార్గంబులఁ బర్యటనంబు సలుపుచు, నిద్రాలస్య భావంబున జడను వడి, యర్థాపేక్షం దగిలి, తిరిగి, యలసి, యాత్మసుఖంబు సేయు నాతండే భర్త యని చింతించి, నారాయణు నిట్లు చింతింప, నతని కైవల్యంబు చేరవచ్చు నని విచారించి, నిజ శయనాది స్థానంబులు వర్జించి, [2]వేగిన వాసుదేవ చరణారవింద [3]వందనాభిలాషిణి యై, దేహంబు విద్యుత్ప్రకారం బని చింతించి, పరమతత్త్వంబునందుఁ జిత్తంబు గీలుకొలిపి, ముక్తురా లయ్యె. అని యెఱింగించి. 101

అధ్యాయము - ౯ - ౧౬

క. దేహము నిత్యము గా దని, మోహముఁ దెగఁగోసి శుద్ధ మునివర్తనుఁ డై గేహము వెలువడి [4]నరుఁ డు,త్సాహమునం బొందు ముక్తిసంపద ననఘా! 102

వ. మఱియు, నొక్క పురాతన పుణ్యకథ వినుము. కనకావతీపురంబున నొక్క ధరా సురుని గన్యకారత్నంబు గలదు. అ వ్వధూతిలకంబు రత్నసమేతంబు లగు కంక ణంబులు ధరియించి, బంధుజనంబులకు నాతిథ్యంబు గావించుకొఱకు, శాలితండు లంబులను రహస్యంబుగా ముసలంబుఁ జేకొని దంచునప్పుడు, కంకణంబు లతి రావంబుగా మ్రోయుచుండ, న వ్వరమపతివ్రత యందుకు [5]నసహ్యాపడి, యన్నియు డులిచి, యొక్కటి నిలిపె. అ ట్లేకచిత్తంబునం దత్తఱపడక భగవ దాయత్తం బైన యేక చిత్తంబునం బ్రసన్నచిత్తు లై, నరులు ముక్తు లగుదురు.

---

1. పవిత్రత్వంబున కరుగుచు (హ.) 2. వేగిరంబ (తం. వా.) 3. వందనాభిలాష యై(హ.) 4. జన, ను (హ.) 5. నసహ్యయై (హ.)

అట్లు గాన, నవిద్యావిద్యలు నా మాయగా విచారించి, కేవల పశుమార్గులుగాక షడ్గుణైశ్వర్య సంపన్ను లైన యోగీంద్రుల పగిది, సుఖంబు గోరక యుండు వారలు ముక్తులగుదురు. సర్వంబును విష్ణుమాయఁగాఁ దెలియుము. అని, యుద్ధవునికిం జెప్పిన, నతండు, దేవా! నీ రూపం బేలాగునం గానవచ్చు. అనిన, నతం డి ట్లనియె. భక్తి భావనా పరాయణుం డై, కృపాపరతంత్రుం డై, మిత భాషణుం డై, బొంకక, కర్మంబుల మదర్పణంబుగాఁ జేసిన యతండు భాగవతుండు. మత్కథలును మజ్జన్మకర్మంబులును వినుచు, మత్సేవకు లయిన భాగవతులం జూచి, తన గృహంబునకుం గొనిపోయి, మజ్జన పూజన భోజన శయన వినయ ధ్యానంబులం బరితుష్టులం జేసిన యతండును భాగవతుం డనంబడు. ఇ ట్లెంతకాలంబు జీవించు నంతకాలము నడపు నతండు మద్రూపమున వైకుంఠనిలయంబు నొందు. అదియునుం గాక, గంధ పుష్ప ధూప దీప నైవేద్యంబుల లక్ష్మీసమేతుండ నై, శంఖ చక్ర గదా శార్ఙ్గాది యుక్తుండ నైన నన్ను శుక సనకాది యోగీంద్రులు, నంబరీష విభీషణ రుక్మాంగదులు మొదలు గాఁగల భాగవతులు, శాస్త్రాచార చోదితులు గాక, భక్తి భావనా విశేషంబున న న్నెఱుక, నిత్యంబును జింతనాయుక్తు లై న న్నెఱింగిరి. మధురానగరంబునకు హలాయుధ సమేతుండ నై యే నరుగుచో గోపిక లోపికలు లేక భక్తి యోగంబునం జింతించి, ముక్త లైరి. ఇది భక్తియోగ ప్రకారంబు. అని యుద్ధవునికిం జెప్పిన. 103

క. ధ్యానం బే క్రియ నిలుచును, ధ్యానం [1]బే రీతి దగు నుదాత్తచరిత్రా!
ధ్యాన ప్రకార మంతయు, నూనంబుగఁ జెప్పుమయ్య! యుర్వీరమణా! 104

వ. అని యడిగిన, న య్యాదవేంద్రుం డి ట్లని పలుకం దొణంగె. దారు మధ్య భాగంబున ననలంబు సూక్ష్మరూపమున వర్తించుచందంబున, నందం బై, సకల శరీరులయందు నచ్ఛేద్యుండును, నదాహ్యుండును, నశోష్యుండును నైన జీవుండు వసియించియుండు. అనిన, నుద్ధవుం డి ట్లనియె. సనక సనందనాది యోగీంద్రులకు యోగమార్గం బే రీతి నానతిచ్చితివి. అది యే విధం బానతీవే. అని, యభ్యర్థించిన, నతం డి ట్లనియె. వారలు చతుర్ముఖు నడిగిన, నతండు నేనును దెలియనేర ననిన, వారలు విస్మయం బందుచుండ, నే నాసమయంబున హంస స్వరూపుండ నై, వారల కెఱింగించిన తెఱంగు వినుము. పంచేంద్రియంబులకు దృష్టం బై న పదార్థం బనిత్యంబు. నిత్యదృష్టి బ్రహ్మం బని తెలియ

1. పరికిఁదగు (తం. వా.)

వలయు. దేహి కర్మార్జిత దేహుం డై, సంసార మమతల నిరసించి, నిశ్చల జ్ఞాన యుక్తుం డై, మత్పద ప్రాప్తుం డగు. స్వప్నలబ్ధ పదార్థంబు నిజముగాని క్రియఁ గర్మానుభవ పర్యంతంబు కళేబరంబు వర్తించు. అని, సాంఖ్యయోగంబున సనకాదులకు నెఱింగించిన విని, బ్రహ్మ మొదలైన దేవత లెఱింగిరి. వారల వలన భూలోకంబునందుఁ బ్రసిద్ధం బయ్యె. అది గావున నీవును నెఱింగి కొని పుణ్యాశ్రమంబులకుం జనుము. అస్మదీయ భక్తియుక్తు లను హరిపరాయణులను నిరసింపక, యట్టి భాగవతుల చరణ రజఃపుంజంబు తన శరీరంబు సోఁకఁ జేయు నతండును, ముద్రాధారణ పరులకును హరి దివ్యనామంబును ధరియించు వారలకును నన్నోదకంబులు నిడు నతండును, వాసుదేవభక్తులం గని హర్షించు వాఁడును, భాగవతులు. అని చెప్పి, మఱియు, సర్వసంగ పరిత్యాగంబుచేసి, యొండెఱుంగక, నన్నే తలంచు మానవునకు భుక్తి ముక్తి ప్రదాయకుండ నై, యుండుదు. అని యానతిచ్చిన నుద్ధవుండు, జ్ఞానమార్గం బేరీతి యానతీవలయు. అనిన, హరి యి ట్లనియె. ఏకాంతమానసుం డై, హస్తాబ్జం బూరుద్వయంబున సంధించి, నాసాగ్రంబున నీక్షణంబు నిలిపి, ప్రాణాయామంబున నన్ను హృదయ గతుంగాఁ దలంచి, యష్టాదశ ధారణాయోగ సిద్ధు లెఱింగి, యందు నణిమాదులు ప్రధానసిద్ధులుగాఁ దెలిసి, యింద్రియంబుల బంధించి, మనం బాత్మయందుఁ జేర్చి, యాత్మ నాత్మతోఁ గిలించిన బ్రహ్మపదంబుఁ బొందు భాగవతశ్రేష్ఠు లితరధర్మంబులు మాని, నన్నుం గాంతురు. తొల్లి పాండునందనుం డగు నర్జునుండు యుద్ధరంగంబున విషాదంబు నొంది, యిట్లు యడిగిన, నతనికి నేఁ జెప్పిన తెఱంగు నెఱింగించెద. [1]భూతంబులందు నాధారభూతంబును, సూక్ష్మంబుల యందు జీవుండును, దుర్జయంబులయందు మనంబును, దేవతలయందుఁ బద్మగర్భుండును వసువులయందు హవ్యవాహుండును, నాదిత్యులయందు విష్ణువును, రుద్రులందు నీలలోహితుండును, బ్రహ్మలయందు భృగువును, ఋషులలోన నారదుండును, ధేనువులయందుఁ గామధేనువును, సిద్ధులలోనం గపిలుండును, దైత్యులలోఁ బ్రహ్లాదుండును, గ్రహంబులలోఁ గళానిధియును, గజంబులలో నైరావతంబును, హయంబులలో నుచ్చైశ్శ్రవంబును, నాగంబులలోన వాసుకియును, మృగంబుల లోనఁ గేసరియును, నాశ్రమంబులందు గృహస్థాశ్రమంబును, వర్ణంబులలోన నోంకారంబును, నదులయందు గంగయును, సాగరంబులలో దుగ్ధసాగరంబును, నాయుధంబులలోఁ గార్ముకంబును, గిరులయందు మేరువును, వృక్షంబులలో

---

1. "వా" ప్రతిలో ఈ క్రిందిభాగ మధికముగానున్నది.
చరాచరభూతం బైన జగంబంతయు మదాకారంబుగా భావించి.

నశ్వత్థంబును, నోషధులలోన యవలును, యజ్ఞంబులయందు బ్రహ్మయజ్ఞంబును, వ్రతంబులం దహింసయు, యోగంబులందు నాత్మయోగంబును, స్త్రీలలోన శతరూపయును, భాషణంబులలోన సత్యభాషణంబును, ఋతువులందు వసంతాగమంబును, మాసంబులలో మార్గశీర్షంబును, నక్షత్రంబులలో నభిజిత్తును, యుగంబులయందుఁ గృతయుగంబును, భగవదాకారంబులందు వాసుదేవుండును, యక్షులలోఁ గుబేరుండును, వానరులయం దాంజనేయుండును, రత్నంబులయందుఁ బద్మరాగంబును, దానంబులలో నన్నదానంబును, దిథులయం దేకాదశియు, నరులయందు వైష్ణవుం డై భాగవతప్రవర్తనం బ్రవర్తించు వాఁడును, నివి యన్నియు మద్విభూతులుగా నెఱుంగుము. అని, కృష్ణుం డుద్ధవున కుపన్యసించిన, వెండియు నతం డిట్లనియె. 105

అధ్యాయము - ౧౭ - ౨౮

క. వర్ణాశ్రమ ధర్మంబులు, నిర్ణయముగ నానతిమ్ము నీరజనాభా !
కర్ణ రసాయనముగ నవి, వర్ణింపుము వినెద నేఁడు వనరుహనేత్రా ! 106

వ. అనినఁ గృష్ణుండు నాలుగువర్ణంబుల యుత్పత్తియు, నాలుగాశ్రమంబుల కిట్టిట్టి వర్ణంబు లనియును, నాలుగువేదంబులం జెప్పిన ధర్మంబులును, బ్రవృత్తి నివృత్తి హేతువు లగు పురాణేతిహాస ధర్మశాస్త్రంబులును, వైరాగ్య విజ్ఞానంబులును, నివి మొదలుగాఁగల వన్నియు నెఱింగించి, "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" అను నుపనిషత్తుల్యం బగు గీతావచన ప్రకారంబున, నెవ్వఁడేనియు నాయందుల మతిఁ దగిలి వర్తించు వాఁడు నే నని పలుకంబడు. పెక్కు విధంబుల వాదంబు లేల? ఎందునుం దగులువడక నామీఁద తలంపు గలిగి వర్తింపుము. అనిన, నుద్ధవుం డిట్లనియె. 107

క. తెలియనివి కొన్ని చెప్పితి, తెలియఁగఁగల వెల్ల నింకఁ దెలుపుము కృష్ణా !
వల నెఱిఁగి తెలియవలయును, నలినాసనజనక ! భక్తనతపదయుగళా ! 108

వ. అని యుద్ధవుం డడిగినఁ, బుండరీకాక్షుండు నీ ప్రశ్నంబులు దుర్లభంబు లైనను, వినుము. నియమ శమ దమాదులు తపంబు లనంబడు. సుఖదుఃఖంబులు స్వర్గనరకంబు లనంబడు. అవి యెవ్వి యనిన, మౌనవ్రత బ్రహ్మచర్య క్షమా జపతపంబులును, నతిథి సత్కారంబులును, నరహితంబును, నివి మొదలయినవి నియమంబులు. ఇంద్రియనిగ్రహంబును, శత్రు మిత్ర సమత్వంబును, శమం బనఁ బరఁగు. మూఢజనులకు జ్ఞానోపదేశార్థంబుగఁ గామ్యత్యాగంబును, సమదర్శనంబును, వైష్ణవసమూహంబులందు భక్తియుఁ, బ్రాణాయామంబునఁ జిత్తశుద్ధి నొంది, నిత్యతృప్తుఁ డౌటయు దమంబు, ఇట్టి నియమాది గుణసహితత్వంబును, మద్భక్తి

సాహిత్యంబును, ననునదియె సుఖంబు. న న్నెఱుంగక తమోగుణంబునం బరఁగు టయే దుఃఖం బనంబడు. బంధు గురు జనంబు లనియెడు భేదబుద్ధి నొంది, శరీరంబు నిజ గృహంబుగా భావించినవాఁడె దరిద్రుండు. ఇంద్రియ నిరసనుండును, గృపణ గుణ విరక్తుండు నైన వాఁడే యీశ్వరుండు. నాయందుఁ దలంపు నిలిపి, కర్మ యోగంబునందును, భక్తియోగంబునందును, వాత్సల్యంబు గలిగి, జనకాదులు కైవల్యంబుఁ జెందిరి. భక్తియోగంబునం జేసి, [1]శబరీ ప్రహ్లాద ముచుకుందాదులు పరమపద ప్రాప్తులైరి. అది గావున, నిది యెఱింగి, నిరంతర భక్తియోగం బధికంబుగా మనంబున నిలుపుము. మృణ్మయం బైన ఘటంబున జలంబులు జాలుగొను తెఱంగున, దినదినంబునకు నాయువు క్షయం బై, మృత్యువు సన్నిహితం బై వచ్చు. కావున, నిది యెఱింగి, నిరంతరంబును న న్నేమఱక తలంచు నతండు నాకుం బ్రియుండు. 109

క. గర్భమునఁ బరిజ్ఞానము, నిర్భర మై యుండు జీవునికిఁ దుది నతఁ డా
విర్భూతుఁ డైనఁ జెడు నం, తర్భావంబునను బోధ మంతయు ననఘా! 110

వ. అట్లు గావున, జనుండు బాల్య కైశోర కౌమార వయోవిశేషంబుల వెనుకనైన న న్నెఱింగెనేనిఁ, గృతకృత్యుం డగు. సంప ద్గర్వాంధుఁ డైన, నంధకార కూపంబునం బడు. వానిని దరిద్రునిఁగాఁ జేసిన జ్ఞాని యై, యస్మత్పాదారవింద వందనాభి[2]లాషి యై ముక్తుం డగు. అట్లు గావున దేహాభిమానంబు వర్జించి, యైహికాముష్మిక సుఖంబులం గోరక, మనంబుఁ గుదియించి, యేప్రొద్దు న్నన్నుఁ దలంచువాఁడు వైకుంఠపద ప్రాప్తుం డగు. నేను నతని విడువం జాలక, వెంట నరుగుదు. నారదాది మునులు భక్తిభావంబునం జేసి, నాస్వరూపం బై మనిరి. అని యుద్ధవునకుం జెప్పిన, నుద్ధవుం డి ట్లనియె. 111

క. అయ్యా! దేవ! జనార్దన!, యెయ్యంబున సృష్టికర్త నేర్పరి యై తా
నొయ్యన నడపును నెవ్వఁడు, చయ్యన నెఱిఁగింపు నాకు సర్వజ్ఞనిధీ! 112

వ. అనుటయు, హరి యుద్ధవునకుం జెప్పె. ఇట్లు మత్ప్రేరితంబు లై, మహదాది గుణంబులు కూడి, యండం బై, యుద్భవించె. ఆ యండంబువలన నే నుద్భవించితిని. అంత నా నాభివివరంబున బ్రహ్మ యుదయించె. అంత సాగరారణ్య నదీ నద సంఘంబులు మొదలుగాఁగల జగన్నిర్మాణంబు నతనివలనం గల్పించితిని. అంత శతానందునకు, శతాబ్దంబులు పరిపూర్ణం బయిన, ధాత్రి గంధంబం దడంగును. ఆ గంధం బుదకంబునం గలయును. ఉదకంబు రసంబున లీనం బగును.

1. బలి శబరీ (తం. వా.) 2. లాషుఁడై (హ.)

ఆ రసంబు తేజోరూపం బగును. ఆ తేజంబు రూపంబున సంక్రమించును. ఆ రూపంబు వాయువందుం గలయు. వాయువు స్పర్శ గుణ సంగ్రాహ్యం బైన, నా స్పర్శగుణం బాకాశంబున లయం బగును. ఆ యాకాశంబు శబ్దతన్మాత్రలచే గ్రసియింపఁబడిన, నింద్రియంబులు మనో వైకారిక గుణంబులం గూడి, యీశ్వరునిం బొంది, యీశ్వరరూపంబుఁ దాల్చుఁ. పను రజ స్సత్త్వ తమోగుణ సహితుండ నై, త్రిమూర్తులు వహించి, జగ దుత్పత్తి స్థితి లయ కారణుండ నై వర్తించుదు. కావున నీ రహస్యంబు నీకు నుపదేశించితి. పరమ పావనుండవుఁ బరమభక్తి యుతుండవుఁ గమ్మని చెప్పెఁ. అంత. 113

అధ్యాయము - ౨౭

తే. రూపు లేని నీకు రూఢిగా యోగులు
రూపు నిల్పి నిన్ను రుచిర భక్తిఁ
గొల్చి యుండ వారి కోర్కెల నిచ్చెద
వేమిలాగు మాకు నెఱుఁగఁ బలుకు. 114

వ. అని యుద్ధవుం డడిగిన, నారాయణుం డి ట్లనియె. నేను సర్వవర్ణంబులకు సమం బయిన పూజాప్రకారం బెఱింగించెద. ఆచారంబునం జేసి, యొక్క స్వరూపంబును, బాషాణ మృణ్మయ దారువులం గల్పించి, [1]నారూపంబుగా నిల్పికొని, కొందఱు పూజింతురు. కాంస్య, త్రపు, రజత, కాంచన, ప్రతిమా విశేషంబు లుత్తమంబులు. ఇట్లు నా రూపంబులందు మద్భావం బుంచి, కొల్చిన వారలకు నేఁ బ్రసన్నుండ నగుదును. ఈ లోకంబున మనుష్యులకు ధ్యానంబు నిలువనేరదు. కావునం బ్రతిమా విశేషంబు లనేకంబులు గలవు. వానియందు సౌందర్య సారంబులును, మనోహరంబులును నైన రూపంబుల నే నుందు. కావున దుగ్ధార్ణవ శాయిగా భావించి, ధౌతాంబరాభరణ మాల్యానులేపనంబులను, దివ్యాన్నపానంబులను, షోడశోపచార పూజా ప్రకారంబులను, రాజోపచారంబులను, బాహ్యపూజా విధానంబులను నాచరించి, మనస్సంకల్పితంబు లయిన పదార్థంబులు సమర్పించి, నిత్యంబును నాభ్యంతర పూజావిధానంబులఁ బరితుష్టునిం జేసి, దివ్యాంబరాభరణ మాల్యాను శోభితుండును, శంఖ చక్ర కిరీటాద్యలంకార భూషితుండును, దివ్యమంగళ విగ్రహుండునుం గాఁ దలంచి, ధ్యాన పరవశుం డయిన యతండు నాయందులం గలయు. ఉద్ధవా! నీవు నీ ప్రకారంబు గరిష్ఠనిష్ఠాతిశయంబున యోగనిష్ఠుండ వై, బదరికాశ్రమంబుఁ జేరి మత్కథితం బైన సాంఖ్యయోగం బంతరంగంబున నిలుపుకొని, కలియుగావ

1. యందు వారూపంబు (హ.)

సాన పర్యంతంబు వర్తింపుము. అని య ప్పరమేశ్వరుం డానతిచ్చిన, నుద్ధవుండు నానందభరి తాంతరంగుం డై, తత్పాదారవిందంబులు హృదయంబునం జేర్చి కొని, పావనం బయిన బదరికాశ్రమంబునకు నరిగె. అని, శుకుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పుటయును. 115

క. చెప్పిన విని రాజేంద్రుఁడు, చొప్పడ శ్రీకృష్ణుకథలు చోద్యము గాఁగన్
జెప్పినఁ దనియదు చిత్తం, బొప్పుగ మునిచంద్ర! నాకు [1]నుత్తము లొప్పన్.

## అధ్యాయము-౩౦

## యాదవు లన్యోన్య కలహంబున మడియ శ్రీకృష్ణ బలరాములు వైకుంఠంబున కరుగుట.

తే. అంతట ను గృష్ణుఁ డేమయ్యె నరసిచూడ
యదువు లెట్టులు వర్తించి రేర్పడంగ
ద్వారకా పట్టణం బె వ్విధమున నుండె
మునిజనశ్రేష్ఠ! యానతీ ముదముతోడ. 117

వ. అనిన రాజునకు శుకుం డి ట్లనియె. వాసుదేవుం, డన్యాయ ప్రవర్తకు లగు దుష్టుల సంహరించి, న్యాయప్రవర్తకు లగు శిష్టులఁ బరిపాలనంబు చేసి, బలరామ సమేతంబుగా ద్వారకానగరంబు వెడలినం గని, యాదవులు దమలోఁ దాము మదిరాపాన మత్తు లై, మత్సరంబున నుత్సాహకలహంబునకుం గమకించి, కరి తురగ రథ పదాతి బలంబులతో ననర్గళంబుగా యుద్ధసన్నద్ధు లై యుద్ధంబునకుం జొచ్చి, మునిశాప కారణంబున నుత్తుంగంబు లైన [2]తుంగ సమూహంబులం బడలు వడం బొడుచుచునుం [3]దాఁకు నప్పుడు, నవియును వజ్రాయుధ [4]సమానంబు లై తాఁకిన, ఖండనంబునం గడికండంబు లై [5]యొరగు కబంధంబులును, వికలంబు లైన యంగంబులును, విభ్రష్టంబు లైన రథంబులును, వికటంబు లైన శకటంబులును, వ్రాలెడి యశ్వంబులును, మ్రొగ్గెడి గజంబులు నై, య య్యాయోధనంబున నందఱుం బొలియుటకు నగి, నగధరుండును రాముండునుం జని చని, యంత నీలాంబరుండు వేఱొక త్రోవం బోయి, యోగమార్గంబున ననంతునిం గలసె. అ ప్పరమేశ్వరుండును మఱియొక మార్గంబునం జని, యొక్క నికుంజపుంజంబు చాటున విశ్రమించుటం జేసి, చరణంబు వేఱొక చరణంబుమీఁద సంఘటించి, చంచలంబుగా వినోదంబులు

1. యోగులు చెప్పన్ (క.); యోగులు మెచ్చన్ (తం. వా.) 2. తురంగ(హ. తం. వా.) 3. తాఁక నవియును వజ్రాయుధ (హ.); తాఁకునప్పుడు వజ్రాయుధ (తం. వా.) 4. సమానంబులై యొండొరులం దాఁకి (హ. తం. వా.) 5. యొఱలు (హ. తం. వా.)

సలుపు సమయంబున, నొక్క లుబ్ధకుండు మృగవధార్థంబుగా వచ్చి, దిక్కులు నిక్కి నిరీక్షింపుచుండ, వృక్షంబు చాటున న ప్పరమపురుషుని చరణంబు హరిణ కర్ణంబు గాఁబోలు నని, దానిఁ గని, శరంబు శరాసనంబునందు సంధానంబుచేసి, యేసిన, నతండు హాహారవంబునం గదలుచుండ న ప్పరమేశ్వరుని సన్నిధానంబు నకు వచ్చి, జగన్నాథుంగాఁ దెలిసి, భయంబున, మహాపరాధుండను, బాపచిత్తుం డను, గుటిలప్రచారుండ నని, యనేకవిధ దీనాలాపంబులం బలుకుచు, బాష్పజల ధారాసిక్త వదనుం డైన, సరోజనేత్రుండు వానిం గరుణించి, యి ట్లనియె. నీ వేల జాలింబడెదు. పూర్వజన్మ కర్మంబు లెంతవారికి నైన ననుభావ్యంబులు గాని, యూరకపోవనేరవు. నీవు నిమిత్తమాత్రుండ [1]వింతియ. అని వానికిం దెలిపిన, వాఁడు మహాపరాధు లైన వా రూరక పోవరు. దేవ బ్రాహ్మణ గురు ద్రోహులకు నిలువ నెట్లగు? అని పవిత్రాంతఃకరణుం డై, ప్రాయోపవేశంబునం బ్రాణంబులు వర్జించి, వైకుంఠ పదప్రాప్తుం డయ్యె. అప్పుడు. 118

క. దారుకుఁడు గనియె నంతటఁ, జారు నిరూఢావధాను సర్వజ్ఞు హరిన్
మేరుసమధీరు దనుజవి, దారుని నేకాంతపరునిఁ దద్దయు వేడ్కన్. 119

వ. కని, యత్యంత భయ భక్తి తాత్పర్యంబుల ముకుళిత కరకమలుం డై, యి ట్లనియె. 120

తే. నిన్నుఁ జూడని కన్నులు నిష్ఫలములు
నిన్ను నొడువని జిహ్వ దా నీరసంబు
నిన్నుఁ గానని దినములు నింద్యము లగుఁ
గన్నులను జూచి మమ్మును గారవింపు. 121

వ. అనుచు, నా దారుకుండు నిర్వేదనపరుం డై, యి ట్లని విన్నవించె. యాదవ సముద్రం బడంగె. బంధు గురు మిత్ర జనంబు లక్కడక్కడం బోయిరి. ద్వార కకుం బోయి, సుహృజ్జనంబులం గూడి, యే నుందు. అని పలుకు నవసరంబున, దివ్యాయుధంబులును, దివ్యరథ రథ్యంబులును, నంతర్ధానంబు నొందె. నారాయ ణుండును వానితో, అక్రూర విదురులకు నీ వృత్తాంతం బంతయుఁ జెప్పుము. సవ్యసాచిం గని, స్త్రీ బాల గురు వృద్ధజనంబులఁ గరిపురంబునకుఁ గొని చను మనుము. పొమ్ము. అనిన, వాఁడును మరలి చని, కృష్ణుని వాక్యంబులు సవిస్త రంబుగాఁ జెప్పె. అట్లు చేయ, నక్షణంబ ద్వారకానగరంబు పరిపూర్ణజలం బై మునింగె. అంత, నెవ్వరికిం జనరాక యుండె.

1. ఇంతియకాని (హ. తం. వా.)

అధ్యాయము - ౩౧

అప్పరమేశ్వరుండును శతకోటి సూర్య దివ్యతేజో విభాసితుం డై వెడలి, నార దాది మునిగణంబులును, బ్రహ్మరుద్రాది దేవతలును, జయ జయ శబ్దంబులతోడం గదలి రా నిజపదంబున కరిగె. నారాయణ విగ్రహంబు జలధిప్రాంతంబున జగన్నాథస్వరూపం బై యుండె. అని శుకుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పె. అని చెప్పి. 122

క. ఈ కథ విన్నను వ్రాసినఁ, బ్రాకటముగ లక్ష్మి యశము భాగ్యము గలుగుం
జేకొని యాయువు ఘనుఁ డై, లోకములో నుండు నరుఁడు లోకులు వొగడన్.

క. రాజీవసదృశనయన ! వి, రాజిత [1]శుభదాభిధేయ ! రాజవినుత ! వి
భ్రాజితకీర్తి [2]లతావృత ! రాజీవభవాది జనక ! రఘుకుల తిలకా! 124

మాలిని. ధరణిదుహితృ రంతా ! ధర్మమా ర్గావగంతా !
నిరుపమ నయవంతా ! నిర్జరారాతి హంతా !
గురు బుధ సుఖకర్తా ! [2]కోసల క్షోణిభర్తా !
సురభయ పరిహర్తా ! సూరి చేతోవిహర్తా ! 125

గద్య. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారాయణాఖ్య ప్రణీతం బైన, శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబునందుఁ గృష్ణుండు భూభా రంబు వాపి, యాదవుల కన్యోన్య వైరానుబంధంబు గల్పించి, వారల హతంబు గావించుటయు, విదేహర్షభ సంవాదంబును, నారాయణముని చరిత్రంబును, నాల్గుయుగంబుల హరి నాల్గు వర్ణంబు లై వర్తించుటయు, బ్రహ్మాదిదేవతలు ద్వారకానగరంబునకుం జని, కృష్ణుం బ్రార్థించి, నిజపదంబు నకు రమ్మనుటయు, నవధూత యదు సంవాదంబును, నుద్ధవునకుఁ గృష్ణుండు నానావిధంబు లైన యుపాఖ్యానంబు లెఱింగించుటయు, నారాయణప్రకారం బంతయు దారుకుం డెఱింగి వచ్చి, ద్వారకావాసులకుం జెప్పుటయుఁ, గృష్ణుండు దన దివ్యతేజంబుతోఁ బరమాత్మం గూడుటయు నను కథలు గల యేకాదశస్కంధము సంపూర్ణము.

---

1. సుగుణా ! విదేహా. (వ్రా. ప్ర.) 2. సుధావృత, రాజీవ భవాండభాండ (తం. వా.)
3. క్రూరమారీచ హర్తా (క.)

ఓమ్

# శ్రీ మ హా భా గ వ త ము

## ద్వా ద శ స్కం ధ ము

—: భవిష్య న్నరపాలరాజ్య పరిపాలన కాలనిర్ణయానువర్ణనము :—

క. శ్రీమరుదశనపతి శయన!, కామిత ముని రాజయోగి కల్పద్రుమ! [1]భూ
కామ! ఘన జనక వరనృప, జామాతృవరేశ! రామచంద్రమహీశా! 1

వ. మహనీయ గుణగరిష్ఠు లగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుం డయిన సూతుం డి ట్లనియె. అట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వాసుదేవ నిర్యాణపర్యంతంబు తజ్జన్మకర్మంబులు సెప్పిన విని, సంతసం బంది, య న్నరపాల పుంగవుండు, మహాత్మా! నారాయణ కథాప్రపంచంబును, దద్గుణంబులును, నాచారవిధియును, జీవాత్మ భేదంబును, హరిపూజా విధానంబును, జ్ఞానయోగ ప్రకారంబును, మొదలయినవి యెఱింగించి, జ్ఞానవంతుంగాఁ జేసి, మన్నించితివి. ఇంక భావికార్యంబు లన్నియు నెఱింగింపుము. అనిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 2

అధ్యాయము - ౧

క. నరవర! యీ ప్రశ్నమునకు, సరి చెప్పఁగరాదు నాదు సామర్థ్యముచేఁ
బరికించి నీకుఁ జెప్పెదఁ, గర మొప్పఁగ భావి కాలగతులన్ వరుసన్. 3

వ. అందు రాజులప్రకారం బెఱింగించెద. బృహద్రథునకుం బురంజయుండు పుట్టును. వానికి శునకుం డనెడువాఁడు మంత్రి యై, పురంజయునిం జంపి, తాను రాజ్యంబేలుచుండ, నంతఁ గొంతకాలంబున కతనికిం గుమారుఁ డుదయించిన, వానికిం బ్రద్యోతననామం బిడి, యతనికిం బట్టంబు గట్టును. ఆభూభుజునకు[2]విశాఖయూపుం డుదయించఁగలఁడు. ఆతనికి [3]నందివర్ధనుండు జనియించు. ఈ యేవురు నూట ముప్పదియెనిమిది సంవత్సరంబులు వసుంధరాపరిపాలనంబునం బెంపు వడయుదురు. తదనంతరంబ, [4]శిశునాథుం డను పార్థివుం డుదయించు. ఆ మూర్ధాభిషిక్తు

1. ఉద్దామ (తం. వా.) 2. విశ్వరూపుండు (హ.); విశాఖరూపుండు (తం. వా.)
3. "నందివర్ధః" (మూ 1-3) 4. శిశునాగుండను (తం. వా.)

నకుఁ [1]గాకవర్ణుండు జనియించు. ఆ రాజన్యునకు [2]క్షేమవర్ముఁ డుదయించఁ గలఁడు. ఆ పృథ్వీపతికి [3]క్షేత్రజ్ఞుఁడును, నతనికి విధిసారుండును, విధిసారున కజాత శత్రుండును, నా భూపాలునకు దర్భకుండును, దర్భకునికి నజయుండును, నతనికి [4]నందివర్ధనుండును, నతనికి మహానందియు ననంగల శైశునాభులు పదుగురు నర పాలకు లుద్భవించి, షష్ట్యుత్తర త్రిశతహాయనంబులు కలికాలమందు ధరాతలం బేలెదరు. అంతట మహానందికి శూద్రస్త్రీ గర్భంబున నతిబలశాలి యైన మహా పద్మపతి యను నందుం డుదయించు. అతనితో క్షత్త్రియవంశం బణఁగిపోఁగలదు. ఆ సమయంబున నరపతులు శూద్రప్రాయు లై, ధర్మవిరహితు లై, తిరుగు చుండ, మహాపద్మునకు సుమాల్యుండు మొద లయిన యెనమండ్రు కుమారు లుదయించెదరు. వారు నూఱు సంవత్సరంబులు క్షోణీతలం బేలెదరు. అంతటఁ గార్ముకుండు మొదలుగా రాజనవకంబు నందాఖ్యలం జనియించు. ఆ నవనందుల నొక భూసురోత్తముం డున్మూలనంబు సేయు. అప్పుడు వారు లేమిని మౌర్యులు గొంతకాలం బీ జగతీతలంబు నేలుదురు. అత్తఱి నా భూదే వుండు చంద్రగుప్తుం డను వాని నందరాజ్యమునందు నభిషిక్తునిఁగాఁ జేయఁ గలఁడు. అంత నా చంద్రగుప్తునకు [5]వారిసారుండును, వానికి నశోకవర్ధనుం డును, నతనికి సుయశస్సును, వానికి సంయతుండును, న మ్మహానీయునకు శాలిశూకుండును, నతనికి సోమశర్ముండును, వానికి శతధన్వుండును, న వ్వీరు నకు బృహద్రథుండు నుదయించెదరు. మౌర్యులతోఁ జేరిన యీ పదుగురును, సప్తత్రింశ దుత్తరశతాబ్దంబులు నిష్కంటకంబుగా భూపరిపాలనంబు సేసెదరు. [6]ఆ సమయంబున బృహద్రథుని సేనాపతి యగు పుష్యమిత్రుఁడు, శుంగాన్వయుఁ డతని వధించి, రాజ్యంబు గైకొను. అతనికి నగ్నిమిత్రుం డను నరపతి పుట్టఁ గలవాఁడు. వానికి సుజ్యేష్ఠుండును, సుజ్యేష్ఠునకు వసుమిత్రుండును, నతనికి భద్రకుండును,భద్రకునకుఁ [7]బుళిందుండును, నాశూరునకు [8]ఘోషుండును, వానికి [9]వజ్రమిత్రుండును, అతనికి భాగవతుండును, వానికి [10]దేవహూతియు, జనించెదరు. ఈ శుంగులు పదుగురును [11]ద్వాదశోత్తరశత హాయనంబు లుర్వీపతు లయ్యెదరు. అంతమీఁదట [12]నల్పగుణు లైన కణ్వులు భూమినిఁ బాలింతురు. శుంగకుల కంజాతుం డయిన దేవహూతిని [13]గణ్వుఁడును, నమాత్యుండు నగు వసుదేవుం

---

1. "కాంకవతః" (మూ.) 2. "క్షేమధన్వా" (మూ.) 3. "క్షేత్రజక్షత్ర ధర్మజః" (1-4) 4. శైశునాగుండును (హ.) 5. వారిసాఖుండును (హ.) 6. "పుష్యమిత్రస్తు శుంగాహ్వ స్స్వయం రాజ్యం కరిష్యతి" (1-16) 7. కళిందుఁడు (మూ1-17) 8. యోగుఁడు (మూ.) 9. ధ్వజమిత్రుఁడు (మూ.) 10. దేవభూతి(తం.వా.) 11. "వర్ష శతాధికమ్"అని మూలము. 12. చూ. మూ. (1-19) 13. చూ. మూ. (1-20)

డనువాఁడు వధియించి, రాజ్యం బేలు. వానికి భూమిత్రుండును, నా మహానుభావు
నకు నారాయణుండును గలిగెదరు. కణ్వవంశజు లయిన వీరలు మున్నూట
నలువదేను సంవత్సరంబులు మేదినీతలం బేలుదురు. మఱియును. 4

క. చతురత నీ క్షితి నేలియు, మతి మోహము విడువలేక మానవనాథుల్
సతతముఁ దమ కీ కాలం, బతిచంచల మగుట నెఱుఁగరయ్యా! మహాత్మా! 5

క. నరపతుల మహిమ నంతను, నురగాధిపుఁ డైన నొడువ నోపఁడు ధాత్రిం
జిరకాల మేలి యుండే, పరువడి నణఁగుదురు వారు భ్రాంతులు నగుచున్. 6

క. గజతురగాది శ్రీలను, నిజ మని నమ్మంగరాదు నిత్యమును హరిన్
గజగిజ లేక తలంచిన, సుజనులకును నతనియందుఁ జొరఁగావచ్చున్. 7

వ. మఱియును, గణ్వవంశజుఁ డగు సుశర్మం డను రా జుదయించిన, వాని
హింసించి, తద్భృత్యుం డంధ్రజాతీయుం డయిన వృషలుం డధర్మమార్గవర్తియై,
వసుమతీచక్రం బవక్రుం డై యేలు. అంత వాని యనుజుండు [1]కృష్ణుం డను
వాఁడు రాజై, నిలుచు. ఆ మహామూర్తికి శాతకర్ణుండును, వానికి పౌర్ణమా
సుండును, నతనికి లంబోదరుండును, వానికి [2]శిబిలకుండును, నతనికి మేఘ
[3]స్వాతియును, వానికి దండమానుఁడును, వానికి హాలేయుం డగు నరిష్ట
కర్మయు, నతనికిఁ దిలకుండును, నతనికిఁ [4]బురీషసేతుండును, వానికి [5]సునంద
నుండును, నా రాజశేఖరునకు [7]వృకుండును, వృకునకు జటాపుండును, జటాపు
నకు [7]శివస్వాతియును, వానికి నరిందముండును, నా భూమీశునకు గోమతియును
వానికిఁ [8]బురీమంతుండును, [9]నతనికి దేవశీర్షుండును, వానికి శివస్కందుండును,
నతనికి యజ్ఞ[10]శీలుండును, నా భవ్యునకు శ్రుతస్కందుండును, వానికి యజ్ఞ
శత్రుఁడును, వానికి విజయుండును, విజయునకుఁ జంద్రబీజుండును, నతనికి
సులోమధియును, నిట్లు పెక్కం డ్రుదయించి, నన్నూట యేఁబదియాఱు సంవ
త్సరంబులు ధాత్రిం బాలించెదరు. అంతట నాభీరు లేడుగురు, [11]గర్దభులు పదుం
డ్రును, గంకవంశజులు పదార్గురు, యవను లెనమండ్రు, బర్బరులు పదునలుగురు
దేశాధీశు లై యేలెదరు. మఱియున్ [12]మురుండులు పదుముగ్గురును, బదునలు
గురు [13]మౌనులును, [14]వెయ్యిన్ని తొమ్మనూట తొమ్మిది హాయనంబులు

---

1 కృష్ణనాథుండనువాఁడు (హా.) 2. జిబిలకుండు (హా.); ‹జిబిలకుండు (తం. వా.); "శిబిలకః" అని మూలము. 3. "స్వాది" (మూ.) 4. బురుషసేనుండును (హా) 5. "సుదర్శనః" (అని మూ.) 6. చకోరుఁడు (మూ.) 7. శివస్వామి (హా.); "శివస్వాతి రరిందమః" (మూ. 1-26) 8. పూతిమంతుఁడు (హా.) మూ. (1-26) 9. "వీరోవేద శ్శివస్కందః" మూ. (1-27) 10. శీర్షుండును (హా.) 11. బర్బరులు....పదునలుగురు (హా.) 12. గరుండులు (హా.); గురుండులు (తం.వా.) 13. మౌలులు (హా.) 14. వేయుం దొమ్మ (తం. వా.)

గర్వాంధు లై, యేలెదరు. అటమీఁద నా మౌలివంశజు లగు పదునొకండు మంది త్రిశతయుతం బైన వత్సరంబులు మత్సరంబున నేలెదరు. ఆ సమయం బునఁ గై లికిలు లను యవనులు భూపతు లగుదురు. అందు [1]భూతనందుండును; [2]యవభంగిరుండును, శిశునందుండును, దద్భ్రాత యగు యశోనందుండును, ప్రవీరకుండును, వీరలు వీరు లై, షడుత్తరశత హాయనంబు లేలెదరు. అంత నా రాజులకుఁ బదుముగ్గురు కుమారు లుదయించి, యందు నార్గురు బాహ్లిక దేశాధిపతు లయ్యెదరు. కడమ యేడ్గురును కోసలాధిపతు లయ్యెదరు. అంత వైదూర్యపతులు నిషధాధిపతు లై యుండెదరు. పురంజయుండు మగధదేశాధి పతి యై పుట్టు. అంత నతండు పుళింద యదు మద్రదేశ వాసు లగు హీనజాతి జనులు బ్రహ్మజ్ఞాన హీను లై, హరిభక్తి విరహితు లై యుండ, వారికి ధర్మోపదేశంబు చేసి, నారాయణభక్తి నిత్యంబు నుండునట్లుగాఁ జేసి, బల పరాక్రమవంతుం డై, క్షత్త్రియవంశంబు లడంచి, [3]పద్మావతీ నగర పరిపాలకుం డై, గంగానది మొదలు ప్రయాగవఱకుఁ గల భూమి నేలఁగలఁడు. సౌరాష్ట్ర, అవంతి, ఆభీర, అర్బుద మాళవదేశాధిపతులు వ్రాత్యబ్రాహ్మణు లయి, శూద్ర ప్రాయు లై, యుండఁగలరు. వారు సింధుతీరంబులను, జంద్రభాగా ప్రాంతం బులను, గాంచీ కాశ్మీర మండలంబు నేలెదరు. మఱియు నత్తఱి శూద్రులును, మ్లేచ్ఛులును, బ్రహ్మతేజో హీను లయిన బ్రాహ్మణులును, భూభాగంబులం బరిపాలింతురు. మఱియు, వీరలు రాజరూపు లయిన మ్లేచ్ఛు లై, ధర్మ సత్య దయా హీను లై, క్రోధ మాత్సర్యంబుల, స్త్రీ బాల గో ద్విజాతుల వధి యింప రోయక, పరధన పరస్త్రీ పరు లై, రజ స్తమో గుణరతు లై, యల్ప జీవు లై, యల్పబలు లై, హరి చరణారవింద మకరంద రసాస్వాదులు గాక, తమలో నన్యోన్య వై రానుబంధు లై, సంగ్రామరంగంబుల హతు లయ్యెదరు. ఆ సమయంబునం బ్రజలు తచ్ఛీల వేష భాషాదుల ననుసరించి యుండెదరు. కావున. 8

అధ్యాయము - ౨

క. దినదినమును ధర్మంబులు, ననయము ధర నడఁగిపోవు నాశ్చర్యముగా
విను వర్ణచతుష్కములో, నెనయఁగ ధనవంతుఁ డైన [4]నేలు ధరిత్రిన్. 9

క. బలవంతుఁ డైనవాఁడే, కులహీనుం డైన దొడ్డ గుణవంతుఁ డగున్
గలిమియు బలిమియుఁ గలిగిన, నిలలోపల రా జతండె యే మనవచ్చున్. 10

1. అంత (హా. వా.) 2. అవభంగిరుండు (హా. వా.); వంగిరుండు (తం.) 3. "పద్మ వతి" (మూ.) 4. నెగడు (హా.)

వ. అట్లుగాన, జనంబులు లోభు లై, జారత్వ చోరత్వాదులచేత దరిద్రహీను లై, వన్యశాక మూల ఫలంబులను భుజింపుచు, వన గిరి దుర్గంబులం గృశీభూతు లై, దుర్భిక్ష శీతవాతాతప క్షుధాతాపంబుల చేత భయపడి, ధైర్యహీను లై, యల్పాయుష్కులు, నల్పతర శరీరులు నై యుండ, రాజులు చోరు లై, సంచరింపుచు, నధర్మ ప్రవర్తను లై, వర్ణాశ్రమ ధర్మంబులు వదలి, శూద్రప్రాయు లై, యుండెదరు. అంత నోషధు లల్పఫలదంబులు, మేఘంబులు జలశూన్యంబులు, సస్యంబులు నిస్సారంబులు నగును. ఇట్లు ధర్మ మార్గంబు లేకయున్న యెడ, ముకుందుండు దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబు కొఱకు, శంబలగ్రామంబున విష్ణుయశుం డను విప్రునకుఁ బుత్రత్వంబు నొంది, కల్క్యవతారుం డై, దేవతాబృందంబులు నిరీక్షింప, దేవదత్త ఘోటకారూఢుం డై, దుష్ట మ్లేచ్ఛ జనంబులఁ దన మండలాగ్రంబున ఖండీభూతులం జేయు. అప్పుడు, ధాత్రీ మండలంబు విగత క్రూరజన మండలం బై, తేజరిల్లును. అంత నరులు విష్ణుధ్యాన వందన పూజాది విధానాసక్తు లై నారాయణపరాయణు లై, వర్తిల్లెదరు. ఇట్టులా కల్క్యవతారంబున నిఖిల జనులు ధన్యు లయ్యెదరు. అంతటఁ గృతయుగ ధర్మం బై నడచుచుండు. చంద్ర భాస్కర శుక్ర గురువు లేకరాశిగతు లయినం, గృతయుగం బై తోఁచు. రాజా! గత వర్తమాన భావికాలంబులు, భవజ్జన్మంబు మొదలు పంచదశాధికోత్తర శతసహస్ర హాయనంబు లై, నందాభిషేక పర్యంతంబు నుండు. అంత నారాయణుం డఖిల దుష్టరాజధ్వంసంబు గావించి ధర్మంబు నిలిపి, వైకుంఠ నిలయుం డగు. అని చెప్పిన. 11

క. మునినాథ! యే విధంబున, ఘనతరముగఁ జంద్రసూర్య గ్రహముల జాడల్
[1]చనుఁ గాల వర్తన క్రమ, మొనరఁగ నెఱిఁగింపవయ్య! ముదము దలిర్పన్.

వ. అనిన, నట్లకాక యని చెప్పఁ దొడంగె. వినుము. సప్తర్షి మండలాంతర్గతంబు లయిన, పూర్వబుక్షద్వయ సమ మధ్యంబునందు, నిశాసమయంబున, నొక్క నక్షత్రంబు గానుపించిన, నా కాలంబు మనుష్య మానంబున శతసంవత్సర పరిమితం బయ్యె నేని, నా సమయంబున జనార్దనుండు నిజపదంబునం బొదలు. ఆవేళనె ధాత్రీమండలంబు కలిసమాక్రాంతం బగు. కృష్ణుం డెంతకాలంబు భూమి యందుఁ బ్రవర్తించు, నంతకాలంబు కలి సమాక్రాంతంబు గాదు. మఘా నక్షత్రంబందు సప్తర్షులు నేఘస్రంబున జరియింతు రా ఘస్రంబునఁ గలి ప్రవేశించి వేయు నిన్నూరు వర్షంబు లుండు. అంత నా ఋషిసంఘంబు పూర్వాషాఢ

1. విను (హ.)

కరిగినం, గలి ప్రవృద్ధంబు నొందు. ఏ దివసంబున హరి పరమపద ప్రాప్తుం డయ్యె నా దివసంబునందె కలి ప్రవేశించి, దివ్యాబ్ద సహస్రంబులు చనిన యనంతరంబ, నాలుగవ పాదంబునం గృతయుగ ధర్మంబు ప్రాప్తం బగు. 13

చ. నరవర ! తొంటి భూపతుల నామ గుణంబులు వృత్త చిహ్నముల్
సిరియును రూపసంపదలు చెన్నగు రాజ్యము లాత్మ విత్తముల్
వరుస నణంగెఁ గాని యట వారల కీర్తులు నిర్మలంబు లై
యురవడి భూమిలో నిలిచి యున్నవి నేఁడును రాజశేఖరా! 14

వ. శంతను ననుజుం డగు దేవాపియు, నిక్ష్వాకువంశజుం డగు [1]మరుత్తును, యోగ యుక్తు లై, కలాపగ్రామ నిలయు లై, కలియుగాంతంబునందు వాసుదేవ ప్రేరితు లై, ప్రజల నాశ్రమాచారంబులు దప్పకుండ నడపుచు, నారాయణ స్మరణంబు నిత్యంబునుం జేసి కైవల్య పదప్రాప్తు లగుదురు. ఇవ్విధంబున నాలుగు యుగంబుల రాజులును, నే నెఱింగించిన పూర్వరాజన్యులును, వీ రందఱును సమస్త వస్తు సందోహంబులయందును మమతం బొంది, యుత్సాహ వంతు లై యుండి పిదప, నీ భూతలంబు వదలి, నిధనంబు నొందుదురు. కావునఁ గాలంబుజాడ యెవ్వరికిం గానరాదు. (కీర్తి సుకృత దుష్కృతంబులు వెంట నంటం గలయవి.) ఇదియునుం గాక మత్పూర్వులు హరి ధ్యానపరవశు లై, దయా సత్య శౌచ శమ దమాదిక ప్రశస్తగుణంబులం బ్రసిద్ధు లై నడచిరి. అట్లు గావున. 15

క. ధర్మము సత్యముఁ గీర్తియు, నిర్మలదయ విష్ణుభక్తి నిరుపమ ఘన స
త్కర్మ మహింసావ్రతము, న్నర్మిలి గలవారె పుణ్యు లవనీనాథా ! 16

తే. ఈ జగం బేలు తొల్లిటి రాజవరులు
కాలవశమున నాయువుల్ గోలుపోయి
నామమాత్రావశిష్టు లై నారు కాన
[2]సలుపవలవదు మమత నెచ్చట నృపాల ! 17

## అధ్యాయము - ౩

వ. గర్వాంధు లైన నరపతులం జూచి, భూదేవి హాస్యంబు సేయు. శత్రుజయంబు చేసి యెవ్వరికి నీక, తామె యేలుచుండెద మనియెడి మోహంబునం బితృ పుత్ర భ్రాతలకు భ్రాంతి గల్పించి, యన్యోన్య వైరానుబంధంబులం గలహంబు చేసి, రణరంగంబులం దృణప్రాయంబులుగా దేహాదులు వర్జించి, నిర్జరలోక ప్రాప్తు లయిన పృథు యయాతి గాధి నహుష భరత కార్తవీర్యార్జున మాంధాతృ సగర

1. మరుత్తువున్ను (హ.) 2. సంపవలవదు మమతను పెంపుతోడ (హ.)

రామ ఖట్వాంగ దుందుమార రఘు తృణబిందు పురూరవశ్శంతను గయ భగీరథ కువలయాశ్వ కకుత్స్థ నిషధాదు లగు రాజులును, హిరణ్యకశిపు వృత్ర రావణ నముచి శంబర భౌమ హిరణ్యాక్ష తారకాదు లయిన దైత్యులును, ధరణి మమత్వంబునం జేసికదా కాలవశంబున నాశంబు నొందిరి. ఇది యెంతయు మిథ్య గాన సర్వంబునుం బరిత్యజించి, జనార్దన వైకుంఠ వాసుదేవ నృసింహాది హరినా మామృతపానంబు నిరంతరంబు చేసి, జరారోగ వికృతులం బాసి, హరి పదంబు నొందుము. అని చెప్పి. 18

తే. ఉత్తమశ్లోకుఁ డన నెవ్వఁ డున్నవాఁడు
సన్నుతుం డగు నెవ్వఁడు సకలదిశల
నట్టి పరమేశ్వరునిఁ జిత్తమందు నిలిపి
తద్గుణంబులు వర్ణింపు ధరణినాథ! 19

### —: యుగధర్మ ప్రాకృతాది ప్రళయచతుష్టయ వివేచనము :—

వ. అనిన, శుకయోగీంద్రునకు రాజేంద్రుం డిట్లనియె. కలియుగం బతిపాప సమ్మిళితంబు గాన దురితంబు లేలాగున నరు లొందకుండెదరు. కాలం బే క్రమంబున నడచు. గాలస్వరూపకుం డయిన హరిప్రభావం బేలాగునం గానంబడు. ఈ జగజ్జాలం బె వ్విధంబున నిలుచు. అని యడిగిన, రాజునకు శుకయోగీంద్రుం డిట్లనియె. కృత త్రేతా ద్వాపర కలియుగంబు లను యుగచతుష్టయంబును, క్రమముగాఁ బ్రవర్తించు. ధర్మంబునకు సత్య దయా తపో దానంబులు నాలుగు పాదంబు లై నడచు. శాంతి దాంతి వర్ణాశ్రమాచారంబులు మొదలయినవి కలిగి, ధర్మంబు మొదటియుగంబున నాలుగు పాదంబులం బరిపూర్ణం బై ప్రవర్తిల్లు. శాంతి దాంతి కర్మాచరణాది రూపం బగు ధర్మంబు మూఁడు పాదంబుల రెండవ యుగంబునం బ్రవర్తిల్లు. విప్రార్చనా హింసా వ్రత జపానుష్ఠానాది లక్షణంబులు గలిగి ధర్మంబు రెండు పాదంబుల మూఁడవ యుగంబునం దేజరిల్లు. మఱియు, జనులు కలియుగంబున ధర్మరహితులును, అన్యాయకారులును, క్రోధ మాత్సర్య లోభ మోహాది దుర్గుణ విశిష్టులును, వర్ణాశ్రమాచార రహితులును, దురాచారులును, దురన్న భక్షకులును, శూద్రసేవా రతులును, నిర్దయులును, నిష్కారణ వైరులును, దయా సత్య శౌచాది విహీనులును, నన్నృతవాదులును, మాయోపాయులును, ధనవిహీనులును, దోషైక దృక్కులును నై, పాపచరితు లగు రాజుల సేవించి, జననీ జనక సుత సోదర బంధు దాయాద సుహృజ్జనులం బరిత్యజించి, సురతాపేక్షు లై, కులంబులం జెఱుపుచుండెదరు.

మఱియు, ఠామ డాంబరంబులం బ్రజాతుయం బగు. బ్రాహ్మణులు దుష్ప్రతి గ్రహ విహారులై యజ్ఞాదికర్మంబులు బరార్థపరు లై చేయుచు, హీను లై నశించె దరు. అట్లు గాన, నీ కలియుగంబున నొక్క ముహూర్త మాత్రం బయిన నారాయణస్మరణ పరాయణు లై, మనంబున శ్రీ నృసింహ వాసుదేవ సంకర్షణాది నామంబుల నచంచలభక్తిఁ దలంచెడు వారలకుఁ గ్రతుశత ఫలంబు గలుగు. అట్లుగావున రాజశేఖరా! నీ మది ననవరతంబు హరిఁ దలంపుము. కలి యనేక దురితాలయంబు గాన, నొక్క నిమిషమాత్రంబు ధ్యానంబు చేసినం, బరమ పావనత్వంబు నొంది, కృతార్థుండ వగుదువు. అని పలికి, మఱియును. 20

క. మూఁడవ యుగమున [1]నెంతయు, వేడుక హరికీర్తనంబు వెలయఁగ లెస్సన్
ఙాడుచుఁ గృష్ణా! యనుచుం, గ్రీడింతురు కలినిఁ దలఁచి కృతమతు లగుచున్.21

అధ్యాయము – ౪

వ. అంతఁ గల్ప ప్రళయప్రకారం బెట్లనిన, నతం డిట్లనియె. చతుర్యుగ సహస్రం బులు చనిన, నది బ్రహ్మకు నొక్క పగ లగును. అదే క్రమంబున రాత్రియు వర్తిల్లును. అంత బ్రహ్మకు నొక్కదినం బగుటవలన, నది నైమిత్తిక ప్రళయం బనంబడును. అందు విధాత సమస్తలోకంబులం దన యాత్మయందు నిలిపి శయనింపం, బ్రకృతి వినష్టం బయిన, నది ప్రాకృతప్రళయం బని చెప్పంబడును. ఆ ప్రళయప్రకారంబు వినుము. ఇట్లు పగలు నైమిత్తిక ప్రళయంబును, రాత్రి ప్రాకృతప్రళయంబును, నగుట గలిగిన నజునకు నది దినప్రమాణంబు. అట్టి దినప్రమాణంబున మున్నూట యఱువది దినంబు లయిన, నలువకు నొక్క సంవత్సరంబు పరిపూర్ణం బగును. తద్వత్సరంబులు శతపరిమితంబు లయిన. 22

సీ. అంత లోకేశున కవసానకాలంబు వచ్చిన నూఱేండ్లు వసుధలోన
వర్షంబు లుడిగిన వడి దప్పి మానవుల్ దప్పి నాఁకటఁ జిక్కి నొప్పినొంది
యన్యోన్యభక్షకు లై యా కాలవశమున నాశ మొందెద రంత నలినసఖుఁడు
సాముద్ర భౌతిక దేహజాత రసములఁ జాతురిఁ గిరణాళిచేతఁ గాల్ప

తే. నంతఁ గాలాగ్ని సంకర్షణాఖ్య మగుచు
మిన్నుఁ గలయఁగ నది యాక్రమించు నట్టి
యెడను శతవర్షములు దడఁబడక గూడి
వీఁకతోడుత వాయువుల్ వీచు నవుడు. 23

వ. ఇట్లు వర్షశతంబు వర్షశూన్యం బగును. అంత శతవర్షంబులు ద్వాదశభాస్కర ప్రచండకిరణ తాండవం బగును. పిదప శతవర్షంబులు ప్రళయాగ్ని దందహ్యమానం బగును. పిమ్మట సప్తమారుత ఝంఝానిల వేగతాడితం బగును. అందు

1. చేయుచు (వా.) 2. యెడ నూఱు వర్షంబు లాడుకొనఁగ (తం. వా.)

మీఁద శతహాయనంబులు నవధారాధరంబులు మహాఘోషంబులతోడం గరికరోప
మానంబు లయిన నీరధారల నిఖిలజగంబును శంబరమయంబు చేసిన, బ్రహ్మాండం
బెల్ల జలమయం బగుటం జేసి, భూమి హృత గంధగుణం బై కబంధంబున లీనం
బగును. అ న్నీరంబును జీర్ణ రసగుణం బై తేజంబున నణంగును. ఆ తేజంబు
వాయువందు నష్టరూపం బై కలయును. ఆ పవనుండు గత స్పర్శగుణుం డయి
నభంబున సంక్రమించును. ఆ యాకాశంబు విగతశబ్దం బయి, భూతాది ప్రకృతి
యందు నణంగును. ఆ ప్రకృతియు ననాది యై, వా జ్మానస గోచరంబు గాక
సత్త్వ రజ స్తమోగుణ రహితం బై, మహదాది సన్నివేశంబు లేక, స్వప్నా
ద్యవస్థారహితం బై, యప్రతర్క్యం బగు నాత్మయందు లయం బగు. అదియె
సర్వాధారభూతం బయిన పదం బని చెప్పంబడు. కాలవిపర్యయం బయి పురుషా
వ్యక్తులు లీనంబగును. అది ప్రాకృతప్రళయం బనం బరఁగు. అని చెప్పి, మఱియు
నొక్క విశేషంబు వినుము. బుద్ధీంద్రియార్థ రూపంబులచే జ్ఞానంబు తదాశ్రయం
బయి, వెలుంగు. దృశ్యత్వా వ్యతిరేకంబులచే నది యాంద్యంతములు గలదై
యుండు. తేజంబు దీపచక్షుస్స్వరూపంబులకు వేఱు గానియట్లు, బుద్ధీంద్రియార్థం
బులు పరార్థమూర్తికి నన్యంబులు గావు. జాగ్ర త్స్వప్న సుషుప్త్యవస్థలు బుద్ధి
ధర్మంబు లగు. ప్రత్యగాత్మయందు నానాప్రకారంబులం దోఁచు, నీదృశ్యప్రపంచం
బంతయు, మిథ్య యని తెలియుము. ఒక్క తేజంబు బహురంధ్రంబులఁ గానంబడు
తెఱంగున, నొక్కయాత్మ పెక్కు[1]దేహంబులఁ దోఁచఁబడు. హాటకంబు పెక్కురూ
పంబులు గలదై యనేకం బయిన తెఱంగునఁ, బరమాత్మ వివిధచేతనాచేతన శరీర
ముల యందుఁ బెక్కువిధంబులఁ గనఁబడిన న్నేకంబుగా భావింపవలయు. నేత్రంబు
లకు [2]మేఘావరణంబు దలంగినప్పుడు భాస్కరమండలంబు గనుపించుతెఱం
గున, బంధహేతు వయిన యహంకారం బాత్మజ్ఞానంబునఁ దిరస్కృతం బయిన
యప్పుడే పరమాత్మ నిర్మలం బయి తోఁచు. ఆ పరమాత్మను నిరంతరంబును
దలంచుచు, యోగులు తదేకాయత్తచిత్తు లై యుండుదురు. కాలంబును వేగంబు
నఁ సర్వప్రపంచమునకు నవస్థాంతరంబులం గల్పించుచుండు. పరమేశ్వరమూర్తి
యైన కాలంబు, నభంబునం గలుగు తారకంబులు గానరానికరణిం గానఁబడక,
కల్పావస్థలం జరించు. నిత్య నైమిత్తిక ప్రాకృతి కాత్యంతికంబు లను ప్రళయం
బులు చతుర్విధంబు లయి పరఁగు. అందుఁ గల నారాయణు లీలావతారంబులఁ
గమలభవ భవాదు లయినను వచింపలేరు. నే నెఱింగి నంతయుం జెప్పితి. సంసార

---

1. విధంబుల భావింపఁబడు (తం. వా.) 2. నిర్మలాంబువులయందు (హా.)

సాగరంబుదాఁట హరికథ యనెడి నావయె సహాయంబు గాని, వేఱొకటి లేదని చెప్పి. 24

అధ్యాయము - ౫

ఉ. ఏను మృతుండ నౌదు నని యింత భయంబు మనంబులోపలన్
మానుము సంభవంబు గల మానవకోట్లకుఁ జావు నిత్య మౌఁ
గాన హరిం దలంపు మిఁకఁ గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! పొందెదవు మాధవలోక నివాససౌఖ్యముల్. 25

పరీక్షిత్తు తక్షకునిచే దష్టుం డై మృతి నొంద నతని
పుత్త్రుండు సర్పయాగము చేయుట

వ. జరా మరణ హేతుకం బయిన శరీరంబున నుండు జీవుండు, ఘటంబులలోఁ గనఁబడెడు నాకాశంబు ఘటనాశం బయిన మహాకాశంబునం జేరుచందంబున, నీశ్వరుం గలయు. తైలనాశనపర్యంతంబు వర్తి తేజంబుతోడ వెలుంగుకరణి, దేహాకృతం బగు భవంబు రజ స్సత్త్వ తమోగుణంబులచేతఁ బ్రవర్తించు. ఆత్మ నభంబుమాడ్కి ధ్రువం బై, యనంతం బై, వ్యక్తావ్యక్తంబులకుఁ బరం బై యుండు. ఇ ట్లాత్మ స్వరూపినిఁగా హరిని నిరంతరంబు భావించుచుండుట విశేషంబు. నిన్నుఁదక్షకుండు [1]గఱచు నను భయంబు నొందవలదు. హరిం దలంపుము. ధన గృహ దారాపత్య క్షేత్ర పశుప్రకరంబుల వర్జించి, సమస్తంబును నారాయణార్పణంబు చేసి, విగత శోకుండ వై, నిత్యంబును హరిధ్యానంబు సేయుము. అని వినిపించిన, రాజేంద్రుండును, కుశాసనాసీనుం డై, జనార్దనుం జింతింపుచుండెను. అంత శుకుండును, యథేచ్ఛావిహారుం డై చనియె.

అధ్యాయము - ౬

ఇటు క్రుద్ధుం డయిన బ్రాహ్మణోత్తమునిచేఁ బ్రేరితుం డయిన తక్షకుండు, ద్విజ రూపంబు దాల్చి, పరీక్షి ద్వధార్థంబుగా నేతెంచుచుండి, మధ్యమార్గంబునఁ గాశ్యపుం డను సర్పవిష హరణసమర్థుం డగు వేఱొక విప్రునిం గని, యతని నపరిమిత ధనప్రదానంబునఁ దృప్తుం గావించి, పరీక్షి న్నికటంబునకు రాకుండు నట్లు నొనర్చి, [2]యంతటఁ బరీక్షిన్మహారాజు చెంతకుం జని, కామరూపుం డగుటం జేసి, యురగం బై, రాజుం గఱచిన, నతండు నా క్షణంబ విషాగ్నిచే భస్మీ భూతుం డయ్యె. అట్టి యవసరంబున భూమ్యంతరిక్షంబుల నుండు నిఖిలప్రాణు లాశ్చర్యకరం బగు తన్మరణంబు గని, హాహారవంబులు సేసిరి. అంత, నీ యర్థంబు

---

1. కఱవసమర్థుండుగాఁడు (తం. వా.); న త్వాం ధక్ష్యతి తక్షకః (5-10)

2. అంతటఁ బరీక్షిన్మహారాజు చెంతనున్న వారలచేతి కొక్క ఫలం బిచ్చి చనిన వారాఫలంబు రాజున కిచ్చిన నతం డా ఫలంబు నాస్వాదించినం గ్రిమిరూపంబున నందుండి వెడలి మహాభయంకర రూపంబునఁ గాకోదరం బై రాజుం గఱచిన (తం. వా.)

నతని తనయుండై న జనమేజయుండు విని, క్రోధావేశంబున సర్పప్రళయం బగు నట్లు యజ్ఞంబు సేయుచుండ, సహస్రసంఖ్యలంగల సర్పంబులు హతంబు లయ్యె. ఆ సమయంబునఁ, దక్షకుండు రాకుండుట నెఱింగి "సహేంద్ర తక్షకా యాను బ్రూహి" అను ప్రేషవాక్యము నొడువ, నంత తక్షక సహితుం డయి విమాన ముతో నింద్రుండు స్థాన భ్రంశంబు నొంది పడుచుండ, నత్తఱి బృహస్పతి యేతెంచి, పరీక్షిత్తనయునిం గీర్తింపఁ దొణంగె. 26

చ. మృతియును జీవనంబు నివి మేదినిలోపల జీవకోటికిన్
సతతము సంభవించు సహజం బిది చోర హుతాశ సర్పసం
హతులను దప్పి యాఁకటను బంచత నొందెడు నట్టి [1]జీవుఁడున్
వెతలను బూర్వకర్మభవ వేదన లొందుచుఁ గుందు నెప్పుడున్. 27

వ. అట్లు గావున, నసంఖ్యంబు లయిన దందశూకంబులు హతంబులయ్యె. శాంతమాన సుండ వై క్రోధంబు వర్జింపుము. అనఁ గురూపదిష్టప్రకారంబున సర్పయాగంబు మానియుండె. అంత దేవతలు కుసుమవృష్టి గురియించిరి. ఆ రాజన్యుండును మంత్రిసమేతుం డై, నగరప్రవేశంబు సేసె. బాధ్యబాధక లక్షణంబులు గల విష్ణు మాయా గుణవ్యాపారంబుల నాత్మ మోహింపంబడుం గావున, నట్టి మాయా వికారంబులం బరిత్యజించి, నిర్మలమానసుం డై వర్తించువాఁడును, బరనింద సేయక, వైరంబు వర్జించి, భగవ త్పదాంభోజభక్తి సంయుక్తుం డై తిరుగు నతండును, హరిపదంబుఁ జేరు. అని చెప్పి, మఱియు సూతుండు పరమ హర్ష సమేతుం డై, శౌనకున కిట్లనియె. 28

—: వ్యాసుఁడు వేదములం బురాణములను లోకమందుఁ బ్రవర్తింపఁ జేయుట :—

క. ధారుణిఁ బారాశర్యున, కార్యులు పైలుఁడు సుమంతు జైమిని మునులున్
ధీరుఁడు వైశంపాయనుఁ, డారయ నలువురును శిష్యు లై యుండి రిలన్. 29

వ. వారలు ఋ గ్యజు స్సామాథర్వణంబు లనియెడు నాలుగువేదంబులును, వ్యాసో పదిష్ట క్రమంబున లోకంబులం బ్రవర్తింపఁజేసిరి. అని చెప్పిన, నాక్రమం బెట్లని శౌనకుం డడిగిన, సూతుండు సెప్పం దొణంగె. ఆదియందు చతుర్ముఖుని హృద యంబున నొకనాదం బుద్భవించె. అది వృత్తినిరోధంబువలన మూర్తీభవించి వ్యక్తంబుగాఁ గనఁబడె. అట్టి నాదోపాసనవలన యోగిజనంబులు నిష్పాపు లై ముక్తి నొందుదురు. అందున నోంకారంబు జనియించె. అదియె సర్వమంత్రోపనిష

[1] జీవుఁ డా, వదలనుగుంది పూర్వమగు పాపఫలంబు భుజించు నెప్పుడున్ (వా.)

న్మూలభూత యగు వేదమాత యని చెప్పఁబడు. ఆ యోంకారంబు త్రిగుణాత్మకం బై, అకార ఉకార మకారంబు లనెడు త్రివర్ణరూపం బయి ప్రకాశింపుచుండె. అంత భగవంతుం డగు నజుం డా ప్రణవంబువలన స్వర స్పర్శాంతస్థోష్మాది లక్షణలక్షితం బగు నక్షరసమామ్నాయంబుఁ గల్పించి, తత్సహాయంబుననే తన వదనచతుష్టయంబువలన వేదచతుష్టయంబు గలుగఁజేసె. అంత నతని పుత్రు లగు బ్రహ్మవాదు లా వేదంబులం దదుపదిష్ట ప్రకారంబుగా నభ్యసించి, యాక్రమంబునఁ దాము దమ శిష్యపరంపరలకు నుపదేశించిరి. ఇట్లు వేదంబులు సమగ్రంబులుగాఁ బ్రతియుగంబునను మహర్షులచే నభ్యసింపంబడును. అట్టి వేదంబుల సమగ్రంబుగఁ బఠియింప నశక్తు లగువారలకు సహాయంబు సేయుటకై ద్వాపరయుగాదియందు భగవంతుండు సత్యవతీదేవియందుఁ బరాశరమహర్షికి సుతుఁడుగా నవతరించి, యా వేదరాశిం గ్రమమున, ఋక్కు యజుస్సు సామము అథర్వణము అను నాలుగు విధంబులుగ విభజించి, పైల వైశంపాయన జైమిని సుమంతు లనియెడు శిష్యవరులకుఁ గ్రమంబుగ నా ఋగాదివేదంబుల నుపదేశించె. అందుఁ బైలమహర్షి చేకొన్న ఋగ్వేదం బనంతంబు లగు ఋక్కులతోఁ జేరియుండుటంజేసి, బహ్వృచశాఖ యని చెప్పంబడు. అంత నా పైలుండు ఇంద్రప్రమితికి బాష్కలునకు నుపదేశించె. అతం డా సంహితం జతుర్విధంబులు గావించి, బోధ్యుఁడు యాజ్ఞవల్క్యుఁడు పరాశరుఁడు అగ్నిమిత్రుఁడు ననువారికి నుపదేశించె. ఇంద్రప్రమితి తన సంహిత మాండూకేయున కుపదేశించె. మాండూకేయుఁడు దేవమిత్రుండను వానికిం జెప్పె. అతనికి సౌభర్యాది శిష్యు లనేకు లై ప్రవర్తిల్లిరి. అందు సౌభరిసుతుం డగు శాకల్యుఁడు తా నభ్యసించిన శాఖ నైదు తెఱఁగులుగ విభజించి, వాత్స్యుఁడు మౌద్గల్యుఁడు శాలీయుఁడు[1] గోముఖుఁడు శిశిరుఁడు ననెడు శిష్యుల కుపదేశించె. అంత జాతుకర్ణి యనువానికి వా రుపదేశింప, నతఁడు బలాకుఁడు పైంగుఁడు వైతాళుండు విరజుండు ననువారి కుపదేశించె. ఇదియునుం గాక ముందు చెప్పిన బాష్కలుని కుమారుఁ డయిన బాష్కలి వాలఖిల్యాఖ్య సంహితం బాలాయని, గార్గ్యుఁడు, కాసారుం డను వారలకుం జెప్పె. ఇ త్తెఱంగున బహ్వృచసంహిత లనేక ప్రకారంబులం బూర్వోక్త బ్రహ్మర్షులచే ధరియింపంబడె. అంత యజుర్వేదధరుం డగు వైశంపాయనుని శిష్యసంఘంబు నిఖిలక్రతువుల [2]నాధ్వర్యవకృత్యంబుచేఁ దేజరిల్లిరి. మఱియు నతని శిష్యుం డగు యాజ్ఞవల్క్యుఁడు గుర్వపరాధంబు చేసిన, నా గురువు కుపితుం డై, యధీతవేదంబుల మరలం దన కిచ్చిపొ మ్మనిన, నతండుఁ దాను జదివిన యజు

1. "గోఖిల్యః" (మూ) 2. ఆధ్వర్య (హా. తం.)

ర్గణంబును, దదుక్తక్రమంబునఁ గ్రక్క, నవి రుధిరాక్తం బగు రూపంబుఁ దాల్చిన, నా యజుర్గణాధిష్ఠిత శాఖాధిదేవతలు తిత్తిరిపక్షు లయి, [1]వాటిని భుజియించిరి. దానం జేసి యా శాఖలు తైత్తిరీయంబు లయ్యె. అంత నిర్వేది యగు నా యాజ్ఞవల్క్యుఁ డపరిమిత నిర్వేదంబు నొంది, యుగ్రతపంబున సూర్యుని సంతుష్టుం గావింప, నతండు సంతసిల్లి, హయరూపంబు దాల్చి, యజుర్గణంబు నతని కుపదేశించె. కాన నవి వాజసనేయశాఖ యని చెప్పంబడె. అంత నా యజుర్గణంబు కాణ్వ మాధ్యందినాదులచే నభ్యసింపఁబడె. ఇట్లు యజుర్వేదంబు లోకంబునం బ్రవర్తిల్లె. సామవేదాధ్యేత యగు జైమినిమహర్షి తన సుతుం డగు సుమంతుని కుపదేశించె. అతండును సుకర్ముఁ డను తన కుమారునికిఁ దెలిపె. అతం డా వేదమును సహస్రశాఖలుగా విభజించి, కోసలుని కుమారుఁ డయిన హిరణ్యనాభునికిం దన కుమారుం డగు [2]పౌష్పింజి యనువానికి నుపదేశించె. అంతట వా [3]రిరువురును బ్రహ్మవేత్త లగు నావంత్యులు, నుదీచ్యులు నను నేనూర్గురికి నుపదేశించి, వారిని సామవేదపారగులుగాఁ జేసిరి. ఇట్లు సామవేదంబు లోకంబున వినుతి నొందె.

## అధ్యాయము - ౭

మఱియు నథర్వవేత్త యగు సుమంతు మహర్షి దానిఁ దన శిష్యున కుపదేశింప నతండు [4]పథ్యుఁడు వేదదర్శుఁడు నను శిష్యుల కుపదేశించె. అందు వేదదర్శుఁ డనువాఁడు శౌల్కాయని బ్రహ్మబలి నిర్దోషుండు పిప్పలాయనుండు అనువారలకును, బభ్యుం డనువాఁడు కుముదుఁడు శునకుఁడు జాబాలి బభ్రువు అంగిరసుఁడు సైంధవాయనుఁడు అను వారలకును నుపదేశించి, ప్రకాశంబు నొందించిరి. ఇత్తెఱంగున నథర్వవేదంబు వృద్ధి నొందె. ఇట్లఖిలవేదంబుల యుత్పత్తి ప్రచారక్రమం బెఱింగించితి. ఇంకఁ బురాణక్రమం బెట్టు లనిన, వినిపింతు నని, చెప్పఁదొణంగె. లోకంబునఁ బురాణ ప్రవర్తకు లనం బ్రసిద్ధు లగు త్రయ్యారుణి, కశ్యపుఁడు, సావర్ణి, అకృతవ్రణుఁడు వైశంపాయనుఁడు, హారీతుఁడు నను నార్గురు మజ్జనకుండును వ్యాస శిష్యుండు నగు రోమహర్షణుని వలన గ్రహించిరి. అట్టి పురాణంబు సర్గాది దశలక్షణ లక్షితంబుగా నుండు. మఱియుఁ, గొంద ఱా పురాణంబు పంచలక్షణ లక్షితం బనియు నొడువుదురు. అట్టి పురాణ నామానుక్రమంబుఁ బురాణవిదు లగు ఋషులు సెప్పెడు తెఱంగున నే నెఱింగింతు వినుము. బ్రాహ్మము పాద్మము వైష్ణవము

1. వానిని (తం. వా.) 2. పౌష్పంజి (హ. తం. వా.) 3. ఇరువరులు (హ)
4. అవథ్యుఁడు (హ)

శైవము భాగవతము భవిష్యోత్తరము నారదీయము మార్కండేయము ఆగ్నే యము బ్రహ్మకైవర్తము లైంగము వారాహము స్కాందము వామనము కౌర్మము మాత్స్యము బ్రహ్మాండము గారుడము అను పదునెనిమిదియు మహా పురాణంబులు. మఱియు నుపపురాణంబులుం గలవు. [1]వీటిని లిఖియించినం, జదివిన, వినిన దురితంబు లణంగు. అని సూతుండు శౌనకాదులకుం జెప్పిన, వారును నారాయణ గుణవర్ణనంబును, దత్కథలును జెప్పితివి. ఇంక దోషకా రులును, బాపరతులు న్నె వ్విధంబునం భవాబ్ధిం దరింతు, రా క్రమంబు చెప్పవే. అని యడిగిన, నెఱింగింపం దలంచి, యి ట్లనియె. 30

క. తొల్లిటి యుగమునఁ దపముల, బల్లిదు లగు ఋషులు మహిమ భాషింపఁగ రం జిల్లెడు మార్కండేయుం, డుల్లంబున హరిని నిలిపి [2]యుడుగక బ్రతికెన్. 31

అధ్యాయము - ౮

— మార్కండేయోపాఖ్యానము —

వ. లోకంబులు కల్పాంతసమయంబునం, గబంధమయంబు లై, యంధకారబంధు రంబు లై, యున్నయెడ, నేకాకి యై చరింపుచుం, బాలార్కకోటి తేజుం డయిన బాలుని హృదయంబునం బ్రవేశించి, యనేక సహస్ర వర్షంబులు తిరిగి, వటపత్రశాయి యయిన య బ్బాలునిఁ గ్రమ్మఱం గనియె. అని చెప్పిన, శౌనకా దులు సూతుని సన్నుతించి, యా మునీంద్రునకు నీ ప్రభావం బెట్లు గలిగె? అని యడిగిన, నతం డి ట్లనియె. 32

క. భూవినుత బ్రహ్మచర్యము, వే వదలక నిష్ఠచేత విశదము గాఁగన్ భావించి హరిఁ దలంపుచుఁ, గోవిదనుతుఁ డై మృకండు గుణముల వెలసెన్.

వ. ఇట్లు తపంబు సేయు నతనికి, హరిహరులు ప్రత్యక్షం బయి, వరం బడుగు మనిన, గుణగణాఢ్యుం డయిన కుమారు నడిగిన, నట్లకాక యని, యతండు కోరినవరం బిచ్చి, యంతర్ధానంబు నొందిరి. అనంతరంబ య మ్మునికి మార్కండేయుం డుదయించి, నియమ నిష్ఠాగరిష్ఠుం డై యుండ, మృత్యువు వానిం బాశబద్ధుం జేసిన నెదిర్చి, య మ్మృత్యుని ధిక్కరించి, పదివేల హాయనంబులు తపంబు సలుప, నింద్రుండు భయపడి, య మ్మునివరుని యుగ్రతపంబు భంగపఱుచుటకు దేవతాంగనలం బంప, వా రేతెంచునెడఁ బుష్ప ఫల భరితంబును, మత్తమధుకర

1. వీని (తం. వా.) 2. యూర్జిత శక్తిన్ (క. చ.)

శుకపికాది శకుంతారవ నిరంతర దిగంతరంబును, జాతివైర రహిత మృగ పక్షికుల సంకులంబును, సారస చక్రవాక బక క్రౌంచ కారండవ కోయష్టికాది జలవిహంగ మాకులిత సరోవరసహస్ర సందర్శనీయంబు నగు నా తపోవనంబున జటావల్కల ధారి యై హవ్యవాహనుండునుం బోలి, తపంబు సేయు న మ్మునీంద్రునిం గని, యంగనలు వీణా వేణు వినోదగానంబుల నలవరింప, మెచ్చక, ధీరోదాత్తుం డగు న మ్మునీంద్రుని గెల్వనోపక, యింద్రునికడకుం జనిరి.

## అధ్యాయము - ౯

అంత హరి యతని తపంబునకుం బ్రసన్నుం డై యావిర్భవించినం గనుంగొని, దేవా! నీ దివ్యనామ స్మరణంబునం జేసి యీ శరీరంబుతోడన యనేకయుగంబులు బ్రతుకునట్లుగాఁ జేయవే. అనినం, గరుణించి యిచ్చుటయును. 34

తే. జగము రక్షింప జీవులఁ జంప మనుపఁ
గర్త వయి సర్వమయుఁడ వై కానుపింతు
వెచట నీ మాయఁ దెలియంగ నెవ్వఁ డోపు
విశ్వసన్నుత! విశ్వేశ! వేదరూప! 35

మ. బలభిన్ముఖ్య దిశాధినాథ వరులున్ ఫాలాక్ష బ్రహ్మేంద్రులున్
జలజాతాక్ష పురందరాది సురులున్ జర్చించి నీ మాయలన్
దెలియన్ లేరఁట నా వశంబె తెలియన్ దీనార్తి నిర్మూల! యు
జ్జ్వల [1]తేజోవిభ వాతిసన్నుత! గదా చక్రాంబుజా ద్యంకితా! 36

వ. అని వినుతించి, దేవా! నీ మాయం జేసి జగంబు భ్రాంతం బై యున్నయది. అది తెలియ నానతీయవలయు. అని యడిగిన, నతండు నెఱింగించి చనియె. మునియును శివపూజ సేయుచు, హరిస్మరణంబు సేయ మఱచి, శతవర్షంబులు ధారాధరంబులు ధారావర్షంబుచే ధరాతలంబు నింప జలమయం బై, యేకార్ణవం బై, యంధకార బంధురం బయిన, నంత మార్కండేయుండు, నా తిమిరంబునం గానక భయపడి యున్నయెడ, నా జలమధ్యంబున నొక వటపత్రంబునం బద్మరాగ కిరణపుంజంబుల రంజిల్లు పాదపద్మంబులు గల బాలునిం గని, మ్రొక్కి, యతని శరీరంబు ప్రవేశించి, యనేకకాలం బనంతం బగు జఠరాంతరంబునం దిరిగి, యతని చరణారవింద సంస్మరణంబునం జేసి వెలువడి, కౌఁగిలింపంబోయిన, మాయ గై కొని, యంతర్ధానంబు నొంద, మునియు నెప్పటియట్ల స్వాశ్రమంబు చేరి, తపంబు సేయుచున్న సమయంబున. 37

1. పంకేరుహ పత్రలోచన (తం. వా.)

## అధ్యాయము - ౧౦

చ. నిలిచిన శంకరుం గనియు నిత్యసుఖంబుల నిచ్చు గౌరి యి
మ్ముల హార! భూతిభూషణ! సముజ్జ్వల గాత్రునిఁ గంటె యెంతయున్
వలనుగ వానితోడ నొక వాటపుమాటను బల్కఁగాఁ దగున్
సలలిత మైన యీ తపసిజాడ వినం గడు వేడ్క యయ్యెడిన్. 38

వ. అనిన, శంకరుండును, శాంకరితోఁగూడ, నభంబుననుండి ధరణీతలంబునకు నేతెంచి, నిర్గుణ బ్రహ్మాత్మైక్యాను సంధానంబు చేసి, శుద్ధ చైతన్య స్వరూపుం డై, యితరంబుఁ గానక యేకాగ్రచిత్తుం డగు న మ్మునిం గని, తన దివ్య యోగ మాయా ప్రభావంబుచే నతని హృదయంబు ప్రవేశించి, చతుర్బాహుండును, విభూతి రుద్రాక్షమాలికా ధరుండును, త్రిశూల డమరుకాది దివ్యసాధన సమేతుండును, వృషభవాహ నారూఢుండును, నుమాసమేతుండు నై, తన స్వరూపంబు గనఁబఱిచిన, విస్మయంబు నొంది, య మ్ముని యా పరమేశ్వరుని ననేక ప్రకారంబుల స్తుతియించిన, నప్పు డమ్ముని తపః ప్రభావంబునకు మెచ్చి, మహాత్మా! పరమ శైవుండ వని పరమేశ్వరుం డానతిచ్చిన, మార్కండేయుం డును శంకరు నిరీక్షించి, దేవా! హరి మాయా ప్రభావంబు దుర్లభంబు. భవత్సం దర్శనంబునం గంటి. ఇంతియ చాలు. ఐన నొక్క వరంబు గోరెద. నారాయణ చరణాంబుజ ధ్యానంబును, మృత్యుంజయంబునుం గలుగునట్లుగాఁ గృపసేయవే. అని, ప్రార్థించినఁ, గృపాసముద్రుం డై, యట్ల కాక యని, జరా రోగ వికృతులు లేక కల్పకోటి పర్యంతంబు నాయువుం, బురుషోత్తముని యనుగ్రహ ముం గలుగు నని, యానతిచ్చి, య మ్మహాదేవుం డంతర్ధానంబు నొందె. అని చెప్పి, యీ మార్కండే యోపాఖ్యానంబు వ్రాసిన, విన్నం, జదివినను, మృత్యువు దొలంగు నని, మఱియు, హరిపరాయణుం డగు భాగవతుండు దేవ తాంతర మంత్రాంతర సాధనాంతరంబులు వర్జించి, దుర్జనులం గూడక, నిరంత రంబు నారాయణ గోవిందాది నామస్మరణంబు సేయుచుండె నేని, నట్టి పుణ్య పురుషుండు వైకుంఠంబున వసించు. మఱియు, హరి విశ్వరూపంబును, జతుర్విధ వ్యూహభేదంబులును, జతుర్మూర్తులును, లీలావతారంబులునుం జెప్ప నగోచ రంబులు. అన మును లిట్లనిరి. 39

## అధ్యాయము - ౧౧

క. హరికథలు హరి చరిత్రము, హరి లీలావర్తనములు నంచిత రీతిన్
బరువడి నెఱిఁగితి నంతయు, సురనుత! యనుమాన మొకటి చొప్పడెడి మదిన్.

—: చైత్రాది మాసంబుల సంచరించెడు ద్వాదశాదిత్యుల క్రమమును దెలుపుట :—

వ. అది యెయ్యది యనిన, లోకచక్షువు చైత్రమాసంబు మొదలుగా నేయే మాసంబున నే యే నామంబునఁ బ్రవర్తించు. చెప్పవే. అని యడిగినఁ, జైత్రము మొదలగు ద్వాదశమాసంబుల సౌరగణ సప్తకం బీశ్వర నియుక్తం బై, నానా ప్రకారంబుల సంచరించెడు క్రమము తొల్లి శుకుండు విష్ణురాతునికిఁ దెలిపిన చందంబునఁ జెప్పెద. అని సూతుం డి ట్లనియె. శ్రీమన్నారాయణ స్వరూపుం డగు మార్తాండుం డేకస్వరూపుం డైన, నతనిం గాల దేశ క్రియాది భేదంబులం బట్టి, ఋషు లనేక క్రమంబుల నభివర్ణించి భావింపుచున్నారు. ఆ ప్రకారం బె ట్లనినఁ, జైత్రంబున సూర్యుండు ధాత యను నామంబు దాల్చి, కృతస్థలి హేతి వాసుకి రథకృత్తు పులస్త్యుఁడు తుంబురుఁడు అనెడు పరిజనులతోఁ జేరికొని, సంచరింపుచుండు. వైశాఖంబున అర్యముం డను పేరు వహించి, పులహుఁడు ఓజుఁడు ప్రహేతి పుంజికస్థలి నారదుండు కంజనీరుం డను ననుచర సహితుం డై, కాలంబు గడుపుచుండు. జ్యేష్ఠంబున మిత్రుం డను నభిధేయధరుం డై, అత్రి పౌరుషేయుఁడు తక్షకుండు మేనక హాహా రథస్వనుఁడు అనెడు వారితోఁ జేరి, కాలయాపనము సేయుచునుండు. ఆషాఢంబున వరుణుం డను నాహ్వయంబు నొంది, వసిష్ఠుండు రంభ సహజన్యుండు హూహువు, శుక్రుండు, చిత్రస్వనుండు అను సహచర సహితుం డై, కాలక్షేపణము సేయుచుండును. శ్రావణంబున ఇంద్రుం డను నామముచే వ్యవహృతుఁ డై, విశ్వావసువు శ్రోత యేలాపుత్రుండు అంగిరస్సు ప్రమ్లోచ రాక్షసుఁడు చర్యుఁడుఅను సఖికులతోఁ జేరి కాలంబు నడుపుచుండు. భాద్రపదంబున వివస్వంతుండను నామంబు దాల్చి ఉగ్రసేనుండు వ్యాఘ్రుండు అసారణుండు భృగువు అనుమ్లోచ శంఖపాలుండు అను పరిజనావృతుం డై కాలయాపనంబు సేయుచుండు. 41

క. ధరలోఁ ద్వష్ట్రాహ్వాయమును, బిరుదుగ ధరియించి యెపుడుఁ బెంపు దలిర్పన్
జరియించుచు నభమందును, సరసిజహితుఁ డాశ్వయుజము చయ్యన గడపున్.

వ. ఈ మాసంబున, ఋచీకతనయుండు కంబళాశ్వుండు తిలోత్తమ బ్రహ్మోపేతుండు శతజిత్తు ధృతరాష్ట్రుండు ఇషంభరుఁడు అను సఖ్యులతోఁ జేరికొని, కాలంబు నడుపుచుండు. కార్తిక మాసంబునందు విష్ణువని వ్యవహరింపఁబడి, అశ్వతరుఁడు రంభ సూర్యవర్చసు) సత్యజిత్తు విశ్వామిత్రుండు మఘాపేతుఁడు అను పరిజన వర్గముతోఁగూడి కాలంబు నడుపుచుండు. మార్గశిరంబునందు

అర్యము నామ వ్యవహృతుఁ డై, కశ్యపుండు తార్క్ష్యుండు ఋతసేనుండు ఊర్వశి విద్యుచ్ఛత్రుండు మహాశంఖుండు అనెడు ననుచరులం గూడి, చరింపుచునుండు. పుష్యమాసంబున భగుం డనునామంబుఁ దాల్చి, స్ఫూర్జుండు అరిష్టనేమి ఊర్ణుండు ఆయువు కర్కోటకుండు పూర్వచిత్తి అనెడు సభ్యజన పరివృతుం డై కాలక్షేపణము సేయుచుండు. మాఘమాసంబునందు పూషాహ్వయము వహించి ధనంజయుండు వాతుండు సుషేణుండు సురుచి ఘృతాచి గౌతముండు అను పరిజన పరివృతుం డై చరియింపుచుండు. 43

క. క్రతునామంబు ధరించియుఁ, జతురతఁ జాలింపుచుండుఁ జాతుర్యకళా
రతుఁ డై సహస్రకిరణుఁడు, మఱియుతు లౌ ననఁ దపస్యమాసము లీలన్. 44

వ. అందు వర్చసుండు భరద్వాజుండు పర్జన్యుండు సేనజిత్తు విశ్వేదేవతలు ఐరావతుండు అను వారలతోఁ జేరుకొని, కాలయాపనంబు సేయుచుండు. ఇట్లు ద్వాదశ మాసంబుల నపరిమేయ విభూతులచేఁ దేజరిల్లుచు, నుభయ సంధ్యల నుపాసించు జనుల పాపసంఘంబుల నున్మూలంబు సేయుచుఁ, బ్రతిమాసంబును బూర్వోక్త పరిజన షట్కంబు వెంటనంట, నుభయలోక నివాసు లగు జనంబుల కైహికా ముష్మిక ఫలంబుల నొసంగుచు, ఋ గ్యజు స్సామాథర్వ మంత్రంబులఁ బఠియింపుచు ఋషిసంఘంబులు స్తుతియింపఁ, బురోభాగంబున నప్సరస లాడ, గంధర్వులు పాడ, బ్రహ్మవేత్త లగు నఱువదివేల వాలఖిల్య మహర్షు లభిముఖు లై స్తుతియింపుచు నరుగ, నధిక బల వేగ రాజమానంబు లగు నాగరాజంబులు రథోన్నయనంబులు సలుప, బాహాబల ప్రతిష్ఠా గరిష్ఠు లగు నైరృతశ్రేష్ఠులు రథ పృష్ఠభాగంబు మోచి త్రోయుచుండ, ననాది నిధనుం డగు నాదిత్యుండు ప్రతికల్పంబున నిట్లు కాలయాపనంబు సేయుచుఁ దేజరిల్లుచుండు. అట్లు గావున నివి యన్నియు వాసుదేవ మయంబులుగాఁ దెలియుము. అని పౌరాణికోత్తముం డగు సూతుండు, శుకయోగీంద్రుండు ప్రాయోపవిష్టుం డగు పరీక్షిన్నరపాలున కుపదేశించిన తెఱంగున, నైమిశారణ్యవాసు లగు శౌనకాది ఋషిశ్రేష్ఠులకుఁ దెలిపి, మఱియు నిట్టి పురాణ రత్నంబగు భాగవతంబు వినువారును, జఠియించు వారును, లిఖియించువారును, నాయురారోగ్యైశ్వర్యంబులు గలిగి, విష్ణు సాయుజ్యంబు నొందుదురు. అదియునుం గాక. 45

తే. పుష్కరంబందు ద్వారకా పురమునందు
మథురయందును రవిదినమందు నెవఁడు
పఠనసేయును రమణతో భాగవతము
వాఁడు దరియించు సంసారవార్ధి నపుడ. 46

క. శ్రీరమణీ రమణకథా, పారాయణ చిత్తునకును బతికిఁ బరీక్షి
ద్భూరమణున కెఱిఁగించెను, [1]సారమతిన్ శుకుఁడు ద్వాదశస్కంధములన్. 47*

వ. మఱియు నష్టాదశపురాణంబు లందలి గ్రంథ సంఖ్య లెట్లనిన బ్రాహ్మపురాణంబు దశసహస్ర గ్రంథంబు. పాద్మం బేఁబది యైదువేలు. విష్ణుపురాణం బిరువది మూఁడు సహస్రంబులు. శైవంబు చతుర్వింశతి సహస్రంబులు. శ్రీభాగవతం బష్టాదశ సహస్రంబులు. నారదంబు పంచవింశతి సహస్రంబులు. మార్కండేయంబు నవసహస్రంబులు. ఆగ్నేయంబు పదియేనువేల నన్నూఱు. భవిష్యోత్తరంబు పంచశతాధిక చతుర్దశ సహస్రంబులు. బ్రహ్మకైవర్తం బష్టాదశసహస్రంబులు. లైంగం బేకాదశ సహస్రంబులు. వారాహంబు చతుర్వింశతి సహస్రంబులు. స్కాందం బెనుబదివేల నూఱు. వామనంబు దశసహస్రంబులు. కౌర్మంబు దశసహస్రంబులు. మాత్స్యంబు చతుర్దశ సహస్రంబులు. గారుడంబు పందొమ్మిది సహస్రంబులు. బ్రహ్మాండంబు ద్వాదశ సహస్రంబులు. ఇట్లు పురాణగ్రంథ సంఖ్యా ప్రమాణంబులు ప్రవర్తిల్లు. ఈ పదునెనిమిది పురాణంబుల మధ్యంబున [2](నదులయందు భాగీరథి విధంబున దేవతలయందుఁ బద్మగర్భుని మాడ్కిఁ దారకలందుఁ గళానిధిగరిమ సాగరంబులందు దుగ్ధార్ణవంబు చందంబున నగంబులను హేమనగంబు భాతి గ్రహంబుల విభావసుకరణి దైత్యులందుఁ బ్రహ్లాదుని భంగి మణులయందుఁ బద్మరాగంబు రేఖ వృక్షంబులందు హరిచందన తరువు రీతి ఋషులందుఁ నారదుమాడ్కి ధేనువులందుఁ గామధేనువు పోల్కి సూక్ష్మంబులందు జీవుని తెఱంగున దుర్జయంబులందు మనంబు చొప్పున వసువులందు హవ్యవాహనుని పోఁడిమి నాదిత్యులందు విష్ణువు కరణి రుద్రులయందు నీలలోహితునిరీతిని బ్రహ్మలయందు భృగువు సొబగున సిద్ధులయందుఁ గపిలుని లీల నశ్వంబులందు నుచ్చైశ్శ్రవంబు లాగున దర్వీకరంబులందు వాసుకి రూపున మృగములందుఁ గేసరి చెలువున నాశ్రమంబులందు గృహస్థాశ్రమంబు క్రియ

1. గారవమొప్పార (హ.)

* 47 వ పద్యము తరువాత తం వా. ప్రతులలో 48-51. గద్య పద్యములున్నవి. ఇవి మూలమునందలి ౧౨, ౧౩ అధ్యాయములందలి విషయమును దెల్పుచున్నవి. పెక్కు వ్రాఁత ప్రతులలో నివి లేవు.

వర్ణంబులలో నోంకారంబు నిరవున నాయుధంబులఁ గార్ముకంబు నోయగంబున యజ్ఞంబులలో జపయజ్ఞంబు చాడ్పున వ్రతంబులం దహింస కరణి యోగంబులం దాత్మయోగంబు రమణ నోషధులయందు యవల సొబగున భాషణంబులందు సత్యంబు తేవ ఋతువులందు వసంతంబు ప్రౌఢి మాసంబులందు మార్గశీర్షంబు మహిమ యుగంబులందుఁ గృతయుగంబు నోజ) దేజరిల్లు. ఇట్టి భాగవత పురాణంబు పఠియించి విష్ణు సాయుజ్యంబుఁ జెందుదురు. అని మఱియు నిట్లనియె.

క. సకలాగమార్థపారగుఁ, డకలంక గుణాభిరాముఁ డంచిత బృందా
రక వంద్య పాదయుగుఁ డగు శుకయోగికి వందనంబు సొరిది నొనర్తున్. 49

సీ. సకలగుణాతీతు సర్వజ్ఞు సర్వేశు నఖిలలోకాధారు నాదిదేవుఁ
బరమదయారసో ద్భాసితుఁ ద్రిదశాభి వందిత పాదాబ్జు వనధిశయను
నాశ్రితమందారు నాద్యంత శూన్యుని వేదాంత వేద్యుని విశ్వమయునిఁ
గౌస్తుభ శ్రీవత్స కమనీయవక్షుని శంఖ చక్ర గదాసి శార్ఙ్గధరుని

తే. శోభనాకారుఁ బీతాంబ రాభిరాము
రత్నరాజిత మకుట వి భ్రాజమానుఁ
బుండరీకాక్షు మహనీయ పుణ్యదేహుఁ
దలఁతు నుతియింతు దేవకీ తనయు నెపుడు. 50

మ. అని యీరీతి నుతించి భాగవత మా ద్యంతంబు సూతుండు సె
ప్పిన సంతుష్ట మనస్కులై విని మునుల్ ప్రేమంబునం బద్మనా
భునిఁ జిత్తంబున నిల్పి తద్గుణములన్ భూషించుచున్ ధన్యులై
చని రాత్మీయ నికేతనంబులకు నుత్సాహంబు వర్ధిల్లఁగన్. 51

క. జనకసుతా హృచ్చోరా!, జనక[1]వచః పాలనాత్త శైలవిహారా!
జనకామిత మందారా!, [3]జననాదిక నిత్యదుఃఖచయసంహారా! 48

మాలిని. జగదవన విహారీ! శత్రులోక ప్రహారీ!
సుగుణవన విహారీ! సుందరీ మానహారీ!
విగత కలుష పోషీ! వీరవర్యాభిలాషీ!
స్వగురు హృదయ పోషీ! సర్వదా సత్యభాషీ. 49

---

1. వచోలబ్ధ విపినశైల (హ) 2. జనకాదిక (హ) జనకాది మహీశ్వరాతిచయ సంచారా(తం.)

గద్య. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర, కేసనమంత్రిపుత్ర, సహజ పాండిత్య, పోతనామాత్య ప్రియశిష్య, వెలిగందల నారాయణాఖ్య ప్రణీతంబైన, శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు రాజులయుత్పత్తియు, వాసుదేవ లీలావతార ప్రకారంబును, గలియుగ ధర్మప్రకారంబును, బ్రహ్మ ప్రళయ ప్రకారంబును, ప్రళయవిశేషంబులును, దక్షకునిచే దష్టుండై పరీక్షిన్మహారాజు మృతినొందుటయు, సర్పయాగంబును, వేదవిభాగ క్రమంబును, బురాణానుక్రమణికయు, మార్కండేయోపాఖ్యానంబును, సూర్యుండు ప్రతి మాసంబును వేర్వేఱు నామంబుల వేర్వేఱు పరిజనులతోఁ జేరుకొని సంచరించు క్రమంబును, తత్తత్పురాణగ్రంథ సంఖ్యలు నను కథలు గల ద్వాదశస్కంధము సంపూర్ణము.



శ్రీమహాభాగవతము సంపూర్ణము.